సంకలన గ్రంథాలు - 1

# ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ

సంపాదకులు

శ్రీ వాడాలి ఆంజనేయులు

తెలుగు అకాడమి
హైదరాబాద్
1978

# ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ పర్యటన
## విషయ సేకరణ, సంకలన సమితి

అధ్యక్షులు — డా॥ బూర్గుల రామకృష్ణారావు
(16.4 1946 నుండి 15 9 1967 వరకు)
స్వామి రామానందతీర్థ
(25 1 1968 నుండి 22 1.1972 వరకు)

సభ్యులు — శ్రీ రామకృష్ణ సూరి
స్వామి రామానందతీర్థ
శ్రీ లోచన్ దాస్
శ్రీ కల్లూరి సుబ్బారావు
శ్రీ గోరా
శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య
శ్రీ క్రొవ్విడి లింగరాజు
శ్రీ మాగంటి బాపినీడు

కార్యదర్శులు — శ్రీ కృష్ణాచార్య జోషి
(10.8 1964 నుండి 10 10 1966 వరకు)
శ్రీ ప్రభాకర్జీ
శ్రీ కోదాటి నారాయణరావు
(17 11 1966 నుండి చివరి వరకు)

### సంపాదక సమితి

అధ్యక్షులు — శ్రీ మందుముల నర్సింగరావు
సభ్యులు : — స్వామీ రామానందతీర్థ
శ్రీ క్రొవ్విడి లింగరాజు
శ్రీ గోరా
శ్రీ ప్రభాకర్జీ
సంపాదకులు : — శ్రీ కోదాటి ఆంజనేయులు
కార్యదర్శి — శ్రీ కోదాటి నారాయణరావు

"ఆంధ్ర ప్రదేశ్ లో గాంధీజీ" గ్రంథావిష్కరణ

ముఖ్యమంత్రి డా॥ మర్రి చెన్నారెడ్డిగారిచే

తే॥ 16-6-1978



ఎడమ నుండి శ్రీ ఎన్. వెంకటస్వామి, డైరక్టర్, శ్రీ భవనం వెంకట్రామ్‌రెడ్డి, తెలుగు అకాడమి అధ్యక్షులు, విద్యాశాఖామాత్యులు, [illegible] డా॥ మర్రి చెన్నారెడ్డి

# పీఠిక

భారతజాతిపిత మహాత్మాగాంధీ శతజయంతి సందర్భంగా భారతజాతి కృతజ్ఞతాపూర్వకమైన శ్రద్ధాంజలిని ఆయనకు సమర్పించడానికి సిద్ధమైన అనేక ప్రణాళికలలో భారతదేశంలోని ప్రతి రాష్ట్రంలోను గాంధీజీ చేసిన పర్యటన విశేషాలను ప్రచురించాలనే నిర్ణయము విశిష్టమైనది. గాంధీ స్మారక కేంద్ర వాఙ్మయం బోర్డు, గాంధీ స్మారక నిధి సంయుక్తంగా తయారుచేసిన ఈ పథకానికి కేంద్ర ప్రభుత్వంవారు హర్షామోదాలు ప్రకటించి వారు వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు ఆయా విశేషాలు సేకరించి ప్రచురించవలసిందిగా సూచించడం ఈ కార్యక్రమ ప్రారంభానికి నాంది.

ఈ సూచనను అనుసరించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గాంధీజీతో ఆయన జీవితకాలంలో విశేషమైన సంబంధం ఉన్న ప్రముఖ వ్యక్తులతో ఒక కమిటీ ఏర్పాటు చేసింది. రాజకీయ నాయకులు, సంఘ సేవకులు, విద్వాంసులు, పరిశోధకులు, పత్రికా రచయితలు మొదలైనవారితో ఏర్పాటైన ఈ కమిటీ నిర్దిష్టమైన సిబ్బందితో పని ప్రారంభించి సచివాలయంలోని రికార్డులు, జైలు రికార్డులు, వార్తాపత్రికలు, వివిధ సంస్థలలో ఉన్న విషయసామగ్రి పరిశీలించి విషయసేకరణ చేసింది. ప్రముఖ వ్యక్తులను కలుసుకొని వారి అనుభవాలు, అభిప్రాయాలు కూడా సేకరించింది. 1964 లో ప్రారంభమైన ఈ పని గురుతరమైనది కనుక కొంత నెమ్మదిగా జరిగినా 1972 నాటికి ఒక బృహద్గ్రంథంగా తయారైంది. పని సుదీర్ఘకాలం కొనసాగడంవల్ల ప్రారంభంలో దీనితో సంబంధం ఉన్న పెద్దలు కొందరు దివంగతులు కావడం, ఇతర ప్రముఖులు వారి స్థానాలు ఆక్రమించడం జరిగింది.

శ్రీ కోడాలి ఆంజనేయులుగారి సంపాదకత్వంలో విషయవిశ్లేషణ, సంకలనం జరిగి గ్రంథం అచ్చుకు సిద్ధమైంది. ఈ విషయంలో సమితి కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారు కూడా చాలా శ్రమించినారు.

ఈ బృహద్గ్రంథాన్ని ప్రభుత్వ ఆర్థిక సహాయంతో సమితి పక్షాన ప్రచురించాలని చేసిన ప్రయత్నాలన్నీ నేటివరకు కొనసాగలేదు. అప్పుడు నాటి విద్యా, సాంస్కృతిక శాఖా మంత్రి సమితి విజ్ఞప్తి నంగీకరించి దీని ప్రచురణ బాధ్యతను తెలుగు అకాడమి వారికి అప్పజెప్పినారు. విషయసేకరణ కార్యక్రమానికి, ముద్రణకు అయిన ఖర్చులో కొంతభాగం ప్రభుత్వం భరించింది.

ఈ ప్రజా యుగంలో ప్రజల మనిషి అయిన గాంధీజీని గురించి వెలువడే ఏ పుస్తకమైనా ప్రజాదరణాన్ని చూరగొంటుందనటంలో సంశయం లేదు. ఆ పరిస్థితులలో మొదట తెలుగుగడ్డ మీద పర్యటించిన గాంధీమహాత్ముని పర్యటనలకు సంబంధించిన గ్రంథాన్ని ప్రజలు ఆమోదించి ఆదరిస్తారనడంలో రెండు అభిప్రాయాలకు తావులేదు. అదిగాక,

# ప్రస్తావన

'శ్రేయాంసి బహువిఘ్నాని' అని నానుడి 1964 వ సంవత్సరంలో సంకల్పించిన "గాంధీమహాత్ముని ఆంధ్రప్రదేశ్ పర్యటన విశేషాలు" ఒకటిన్నర దశాబ్దాల కాలం తర్వాత పాఠకులకు అందించగలిగినందుకు ఒకవంక సంకల్పం నెరవేరిన సంతోషమూ, మరోవంక కాలవిలంబనకు విచారమూ కలుగుతున్నవి ఏది ఎట్లయినప్పటికీ, ఆలస్యంగానైనా కార్యసాఫల్యత చేకూరినందుకు సంతోషిస్తున్నాము ఈ కార్యం సంకల్పించిన నాటినుండి నెరవేరిన నేటివరకు ఈ కృషిలో భాగస్వాములైన అనేకమంది పెద్దలు మనలను వీడిపోయారు ప్రభుత్వం ఏర్పరచిన యీ సమితి ప్రథమాధ్యక్షులు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారూ, తర్వాత ఆ స్థానాన్ని అలంకరించిన పూజ్యశ్రీస్వామి రామానంద తీర్థగారూ, మన మధ్య లేరు ప్రథమ కార్యదర్శి శ్రీ 'కృష్ణాచార్యజోషి', సభ్యులు సర్వశ్రీ మాగంటి బాపినీడు అల్లూరి సుబ్బారావు, గోరాలు దివంగతులైనారు ఈ కృషిలో సహకరించిన ప్రముఖులలో శ్రీ శరణు రామస్వామిచౌదరి మొదలైనవారు స్వర్గీయులవుట సంభవించింది వారు, కార్యరూపం ధరించిన ఈ కృషిని చూచియుంటే ఎంతో సంతోషించేవారు ఈనాడు వ్యాకులహృదయభారంతో వారికి శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము

1964 సంవత్సరంలో గాంధీ శతజయంతి ఉత్సవాల ప్రారంభం జరిగింది. ఈ ఉత్సవాలు గాంధీ శతజయంతివరకు అనగా 1969 అక్టోబరు 2 వరకు అయిదేళ్ళపాటు కొనసాగించాలనుకున్నారు భారత జాతి తన కృతజ్ఞతాపూర్వకమైన శ్రద్ధాంజలి జాతిపితకు అర్పించడానికై అనేక ప్రణాళికలు సిద్ధపరచింది అందులో ఒకటి ప్రతి రాష్ట్రంలోనూ గాంధీజీ పర్యటన విశేషాలను ప్రచురించాలని గాంధీ స్మారక సంగ్రహాలయ బోర్డు, గాంధీ స్మారక నిధి సంయుక్తంగా తయారుచేసిన ఈ పథకాన్ని కేంద్రప్రభుత్వం ఆమోదించి అన్ని రాష్ట్రప్రభుత్వాలకు తమతమ విశేషాలు సేకరించి ప్రచురించవలసిందిగా సూచించింది ఆ సూచనప్రకారం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నెం 1077 16 4 64 తేదీగల G O జారీ చేసింది అందులో ఈ విధంగా ఉన్నది

"భారత ప్రభుత్వం నం 13/44/62, 13 2 1964 తేదీన వ్రాసిన లేఖ ననుసరించి గాంధీ స్మారక సంగ్రహాలయం బోర్డు సూచన ప్రకారం ప్రతి రాష్ట్రంలో గాంధీజీకి సంబంధించిన భోగట్టాను సమకూర్చి ధారావాహికంగా అస్సాంలో గాంధీజీ', "పశ్చిమ బెంగాల్‌లో గాంధీజీ' అనే విధంగా ప్రచురించాలని సూచించింది ఇదేవిధంగా 'ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ' భోగట్టాను సమకూర్చవలెనని సలహా ఇవ్వడం జరిగింది ఆయన పర్యటనకు సంబంధించిన చరిత్రాత్మక విషయాలు, వార్తాపత్రికలలో వచ్చిన వార్తలు, వార్తా ఛాయాచిత్రాలు, ప్రభుత్వ రికార్డులు ఆయారాష్ట్రాల ప్రజలను గురించి గాంధీజీ రచనలు, ప్రసంగాలు ఆయారాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహించే ప్రముఖులు

గాంధీజీకి సమర్పించిన అభినందనలు గాంధీజీ [illegible] సంబంధించిన వివిధ చి[illegible] [illegible] చిత్రించిన చిత్రాలు, ఫొటోలు, మొదలైన [illegible] [illegible] [illegible] [illegible] రించ వచ్చును

1. సచివాలయంలోని రికార్డులు
2. జైలు రికార్డులు
3. వార్తాపత్రికలు
4. వివిధ సంస్థలు
5. వ్యక్తులు

ఈ ప్రతిపాదనను బాగుగా పరిశీలించిన సర్కారు గాంధీజీతో ఆయన [illegible] కాలంలో సంబంధం కల్గిన ఈ దిగువ వ్యక్తులతో ఒక కమిటీని ఏర్పాటు చేశారు ఈ కమిటీకి శ్రీ డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు అధ్యక్షులు శ్రీ రామకృష్ణధూత్, శ్రీ స్వామి రామానందతీర్థ, గోసేవా మండలి గౌరవ కార్యదర్శి శ్రీ లోచన్ దాస్, శ్రీ శ్రీ కల్లూరి సుబ్బారావు, శ్రీ ప్రభాకర్జీ, శ్రీ గోరా, శ్రీ గద్దెపాటి [illegible]య్య, శ్రీ క్రొవ్విడి లింగరాజు సభ్యులు ఈ సభ్యులకు ఇద్దరికి మించకుండా కో-ఆప్ట్ చేసుకొనే అధికారం ఇచ్చారు ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీకి సంబంధించిన [illegible]గట్టాను సేకరించి సంకలనం చేయుటకు అట్టి సమాచారాన్ని ఆరు నెలలలో సమర్పించుటకు నిర్ణయించటం జరిగింది

ఈ కమిటీ 10-8-1964 తేదీన సమావేశమై శ్రీ కృష్ణాచార్యశర్మగారిని, శ్రీ మాగంటి బాపినీడుగారిని, సభ్యులుగా కోఆప్ట్ చేసుకున్నారు శ్రీ కృష్ణాచార్యశర్మ, శ్రీ ప్రభాకర్జీలను ఈ కమిటీకి కార్యదర్శులుగా ఎన్నుకున్నారు ఈ విధంగా కమిటీ ఏర్పడిన తర్వాత విషయ సేకరణకై సహాయపడానికిగాను ఈ దిగువ సిబ్బందిని ఏర్పాటు చేయడం జరిగింది

1. శ్రీ యస్ ఆర్ మూర్తి, Office Secretary Cum-Steno
2. శ్రీ పి క్రిష్ణంరాజు - Research Asst
3. శ్రీ వెండ్యాల వెంకట్రామారావు - Research Asst
4. శ్రీ పి మల్లికార్జునశాస్త్రి-Steno-cum - Translator, worked till 12-10-65
5. శ్రీ పి పూర్ణ సిద్ధాంతి - Steno Typist from 12 10 65
6. శ్రీ కె శ్రీనివాసాచార్ - Attender
7. శ్రీ కిష్టయ్య - Attender

అయితే ఈ సిబ్బంది స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న వ్యక్తుల జీవిత విశేషాలను సేకరించే కార్యాలయంలోనూ ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ కార్యాలయంలోనూ కూడా పని చేయవలెనని నిర్ణయం జరిగింది కొంత సమాచారాన్ని సేకరించిన తరువాత శ్రీ పూర్ణ సిద్ధాంతి జాడ తెలియకుండా ఎక్కడికో వెళ్ళారు వారితోపాటు వారివద్దనున్న సమాచారం కూడా లభ్యం కాకుండా పోయింది గాంధీజీ పర్యటనకు సంబంధించిన

సమాచార సేకరణ అనుకున్నంత సులభం కాకపోయింది ఆరు నెలలలో పూర్తి కావడం అసంభవం అని తేలింది ప్రభుత్వం ఎప్పటికప్పుడు ఈ వ్యవధిని పెంచుతూ రాక తప్పలేదు 1966 అక్టోబర్ 10 వ తేదీన కార్యదర్శి శ్రీ కృష్ణాచార్య జోషి స్వర్గస్థులయ్యారు వారివద్దగల ఫోటోగ్రాఫ్‌లు కూడా సంపూర్ణంగా లభ్యం కాకపోయింది ఈ విధంగా సమాచార సేకరణలో అనేక అవరోధాలు కల్గినవి

17 11 1966 న జరిగిన కమిటీ సమావేశములో స్వ॥ శ్రీ కృష్ణాచార్య జోషి స్థానంలో నన్ను సభ్యునిగా కోఆప్ట్ చేసుకున్నారు కమిటీకి కార్యదర్శిగా ఏర్పాటు చేయడం జరిగింది ఈ విధంగా నాకీ బృహత్ కృషిలో పనిచేసే అవకాశం కలిగింది ఈ కృషి కొనసాగుతుండగానే 16 9-1967 తేదీన కమిటీ అధ్యక్షులు డా॥ బూర్గుల రామకృష్ణారావుగారు అస్తమించారు వారి స్థానంలో స్వామి రామానందతీర్థగారిని కమిటీ సిఫార్సు చేసి ప్రభుత్వానికి పంపగా ప్రభుత్వం సరు G O Ms No 163/25 1 68 ద్వారా అంగీకరించింది ఈ విధంగా స్వామి రామానందతీర్థగారి నాయకత్వంలో కమిటీ పనిచేయడం కొనసాగింది

ఈ కార్యాలయ సిబ్బందిని విభజించి స్వాతంత్ర్యయోధుల జీవిత విశేషాల సేకరణ కార్యాలయానికి కొంతమందిని ఈ కార్యాలయానికి కొంతమందిని ప్రభుత్వం G O Ms No 786 Education Dt 28 3 1968 ద్వారా కేటాయించారు ఈ కార్యాలయంలో శ్రీ పెండ్యాల వెంకట్రామారావుగారు పరిశోధనా సహాయకుడుగా పని చేయుటకు నియుక్తులైనారు శ్రీ రామక్రిష్ణారావుగారి నిర్యాణానంతరం కార్యాలయం ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారక నిధి కార్యాలయం ఆవరణ లోనికి మార్చబడినది ఈ అవరోధాలన్నిటినీ అధిగమించిన తర్వాత సమాచార సేకరణ త్వరిత గతిని సాగించి పూర్తి చేయాలన్న ఉద్దేశంతో కమిటీ ఒక సంపాదక సమితిని కూడా ఏర్పాటు చేసి ప్రభుత్వానికి సిఫారసు చేసింది ఆ సంపాదక సమితికి శ్రీ మందుముల నర్సింగరావుగారిని అధ్యక్షుడిగా నియమించి, శ్రీ కోడాలి ఆంజనేయులుగారిని సంపాదకుడుగా నియుక్తులను చేయవలసిందిగా ప్రభుత్వాన్ని అర్థించారు ప్రభుత్వం ఈ సూచనను అంగీకరించి G O Ms 1851/27 6 68 ద్వారా జారీ చేసింది కమిటీ పని త్వరగా సాగించుటకు హైదరాబాదులో జరిగిన సమాచార సేకరణతోపాటు మద్రాసులోని ఆంధ్రపత్రిక, హిందూ, స్వరాజ్య, మెయిలు, Archives కార్యాలయాలలోనూ ఫోటోగ్రాఫ్ సేకరించుటకు ప్రభుత్వ రికార్డుల కార్యాలయంలో, అహమ్మదాబాదులో Young India, Harijan, Indian Opinion Navajeevan పత్రికల నుండి ఫోటోగ్రాఫ్‌లను సేకరించుటకూ, ఢిల్లీలోని Hindustan Times, Central Govt Archives లో ప్రభుత్వ రికార్డులు, బొంబాయి క్రానికల్ రికార్డులలోనూ, సంస్థాన ప్రజా మహాసభ రికార్డులలోను ఫోటోగ్రాఫ్ సేకరించడానికి శ్రీ పెండ్యాల వెంకటరామారావుగారిని ఆయా స్థలాలకు పంపించటం జరిగింది వారు శ్రమించి ఫోటోగ్రాఫ్‌లను సంపాదించారు తర్వాత హైదరాబాదులో గల బ్లాక్ సెక్రటేరియట్‌లో, State Archives లోనూ సమాచారాన్ని కూడా సేకరించవలసిందిగా శ్రీ వెంకటరామారావుగారిని కోరగా వారు ఆ సమాచారాన్ని

కూడా సేకరించారు ఇది ఇలా జరుగుతుండగా శ్రీ కోడాలి ఆంజనేయులుగారి ... ఆధ్వర్యంలో ఎమయి ఎస్టిమేట రివించుటకును, ఎంపిక చేయుటకును ఏర్పాట్లు ... నవి ఈ విధంగా పని కొంత చురుకుగా సాగిపోవటం మొదలుపెట్టింది ఈ పని 1972 ఫిబ్రవరి వరకు పూర్తిచేయటం జరిగింది జనవరి 1972 లో స్వామి రామానందతీర్థగారు దివంగతులైనారు ఫిబ్రవరి 1972 లో పని ముగించి ... ర్యాలయు న్ని ... యడం జరిగింది

ఈ సమాచారమంతా ఒక బృహద్ గ్రంథంగా తయారయింది దీనిని ప్రభుత్వ సహాయంతో ఈ కమిటీ ఎజానసే ప్రచురించవలెనని కమిటీ తలపెట్టి అనేకసార్లు ప్రభుత్వాన్ని కోరింది ప్రభుత్వం మొదట అంగీకరించి దీనికి కావలసిన అంచనాలు వగైరాలు సిద్ధపరపించినారు తర్వాత ఏ కారణమువలననో ఈ గ్రంథాన్ని ప్రభుత్వానికి ... ర్పించవలసిందిగా కోరారు ఆ విధంగానే సమర్పించడం జరిగింది తర్వాత ప్రచురణ పని అనుకున్నట్టుగా సాగలేదు ఎట్టకేలకు అప్పటి విద్యాసాంస్కృతిక శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఈ పనిని తెలుగు అకాడమీవారికి అప్పగించారు తెలుగు అకాడమీవారి ఆధ్వర్యంలో ప్రచురణ ... పూర్తి ... జరిగినందుకు సంతోషిస్తున్నాము

ఇతర అన్ని రాష్ట్రాలలో జరిగిన సేకరణకన్నా మన ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన సేకరణ చాలావరకు విపులంగానూ, వివరంగానూ ఉన్నది అని చెప్పుట అతిశయోక్తి కాదు అయితే సమగ్రంగా ఉన్నదని చెప్పుట సాహసం కావచ్చును విషయి సేకరణలో అధికారికంగా లేని భోగట్టాను ప్రచురించడం ఉచితం కాదని Editorial Board నిర్ణయించింది అట్లే కొంత సమాచారాన్ని ప్రచురించటం అప్రస్తుతమని కూడా భావించింది వీటన్నిటికీ తోడు అప్పుడప్పుడు వ్యక్తులు మారినప్పుడు లభించవలసిన సామగ్రి లుప్తమైపోవటం కూడా సంభవించింది అనేకమంది ప్రముఖుల ఫోటోలను, లేఖలను పూర్వం శ్రీ క్రొవ్విడి లింగరాజుగారి ఆధ్వర్యంలో ప్రభుత్వం ఏర్పరచిన కార్యాలయానికి పంపినట్టు తెలుస్తున్నది తర్వాత ఎం... ప్రయత్నించినా వాటి ... తెలియలేదు కొన్ని అమూల్యమయిన జాబులు చేతికి చిక్కకుండా పోయినవి

గాంధీజీ పర్యటన సాగించిన చాల రోజులలో ఫోటోగ్రఫీ అంతగా అభివృద్ధి చెందలేదు చిత్రాల సేకరణకట్ల ఇప్పుడున్న శ్రద్ధగానీ, ఆసక్తిగానీ అవకాశాలుగానీ, పూర్వం లేవు అందువల్ల ఫోటోలు అంతగా తీసినట్లు కనిపించలేదు తీసిన ఫోటోలు కూడా చాలాకాలం గతించినందువల్ల సరిఅయిన స్థితిలో లేవు అందువల్ల గ్రంథానికి తగినన్ని చిత్రాలు ఇందులో కనిపించకపోవచ్చును అట్లే జాబుల విషయంలో కూడా అందువల్ల చాలామంది ప్రముఖులకు, ప్రజానాయకులకు వ్రాసిన లేఖలు ఈ గ్రంథంలో ... న్పించకపోవచ్చును

ఈ సందర్భంలో మాతో సహకరించిన హిందూ, ఆంధ్ర పత్రిక, మద్రాసు మెయిలు, స్వరాజ్య, హైద్రాబాదు బులెటిన్, దక్కన్ క్రానికల్, రయ్యత్, ఇండియన్ ఒపీనియన్, హరిజన్, హిందూస్తాన్ టైమ్స్, కృష్ణాపత్రిక మొదలైన పత్రికాధిపతులకు

ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ శాఖ అధ్యక్షులు శ్రీ కె. పి. ఆర్. ఎం. ప్రసాద్‌గారికి, ప్రస్తుత సంపాదకులు శ్రీ రాంధ గుప్తగారికి ప్రత్యేకంగా కృతజ్ఞతాభివందనాలు సమర్పిస్తున్నాము సవ వన్ కార్యాలయంవారికి, హిందూస్తాన్ టైమ్స్ పత్రికాధిపతులకూ ప్రత్యేకంగా కృతజ్ఞత చెప్పవలసి ఉన్నది. మవద్దగల ఫోటోగ్రాఫులను పంపించిన వారిని పేరుపేరునా పేర్కొనటం సాధ్యం కాదు కాబట్టి వారందరికీ మా నమోవాకాలు అందచేస్తున్నాము అట్లాగే చిత్రాలు పంపిన పెద్దలకు కూడా ఎందరి సహకారం ఉంటేనో తప్ప ఈ బృహత్ కార్యం కొమాత్రం విజయవంతం కావటం కష్టం వారందరికీ మా కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నాను

ఈ గ్రంథానికి సంపాదకులుగా చాలా శ్రమించి పనిచేసిన పెద్దలు శ్రీ కోడాలి ఆంజనేయులుగారికి హృదయపూర్వక అభినందనలు విషయ సేకరణలో శ్రమించిన యువపరిశోధకుడు, స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ పెండ్యాల వెంకటరామారావు గారికి మా ప్రశంసలు వ్రాత ప్రతిని సిద్ధపరచడంలో తోడ్పడిన శ్రీ జి చంద్రయ్యకు మా ఆశీస్సులు

ముగించుటకు ముందు ఈ కమిటీలో సభ్యులుగా ఉండి అనేక విధాలుగా కృషి చేసిన పెద్దలకు సంపాదక మండలిలో సభ్యులుగా ఉన్న పెద్దలకూ వారి కృషికి మా కృతజ్ఞత – ఈ సదవకాశాన్ని కల్గించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, దీని ప్రచురణకు పూనుకున్న తెలుగు అకాడమీవారికి, ముద్రాపకులు చారీ అండ్ కంపెనీ వారికి మా కృతజ్ఞత ముఖ్యంగా రాష్ట్రప్రభుత్వానికి అప్పటి విద్యామంత్రిగా ఉన్న శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు పై కొన్న శ్రద్ధకూ మా హృదయపూర్వక అభినందనలు

అక్టోబరు 1966 వ సంవత్సరం నుండి ఈ కమిటీకి సంపాదక సమితికి కార్యదర్శులుగా ఉండి పెద్దలందరి ఆశీస్సులను సహకారాన్ని పొందుతూ పని చేయ గల్గినభాగ్యం మాకు కల్గుట జీవితంలో ఒకవిశేషంగా భావిస్తున్నాము

ఆంధ్రప్రదేశ్‌లో 1915 నుండి 1946 వరకు జరిగిన గాంధీ ఉద్యమం, ఆ సందర్భంలో వారు చేసిన పర్యటనలు ఆంధ్రదేశాన్ని ఉత్తేజపరచి బ్రహ్మాండమైన పరివర్తనను కల్గించింది ఆ ఉద్యమంలో వేలాది దేశభక్తులు త్యాగధనులు ముందుకు వచ్చి రాజకీయోద్యమంలోనూ ఇతర సాంఘిక ఆర్థిక నిర్మాణ రంగంలోనూ ఎనలేని సేవ చేశారు వారి త్యాగము, కృషి చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించతగినవి ఈ తరం యువకులు ఆ యుగంలో జరిగిన విశేషాలు తెలుసుకొని ఎంతో స్ఫూర్తిని ఉత్తేజాన్ని పొంది దేశ నిర్మాణ రంగంలో భాగస్వాములు కాగలరని మా విశ్వాసం

ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ పర్యటన
విషయ సేకరణ, సంకలన సమితి పక్షాన
ప్రభాకర్
కోడాటి నారాయణరావు
కార్యదర్శులు

హైదరాబాదు,
15 4 1978

# విషయసూచిక

# 1
# పూర్వగాథ

తాత్కాలికంగా చెడుగా కనిపించే చిన్నచిన్న సన్నివేశాలు కొన్ని (పర్యవసానానికి) పరమోత్కృష్టాలయిన ఫలితాలకు దారితీయడం సహజము కైకేయి మనస్సును కలుషితంచేసిన మంథర సలహా వాల్మీకి రామాయణ మహాకావ్యానికి బీజప్రాయంగా రూపొందింది మంథర లేనట్లయితే వాల్మీకి వంటి మహాకవినీ, రామాయణం వంటి ఉత్తమకావ్యాన్ని ప్రపంచం ఎరిగి ఉండేదికాదేమో ?

అట్లాగే సీమలో బార్ ఎట్ లా పరీక్షలో ఉత్తీర్ణుడయి వచ్చిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ బొంబాయిలో లాయరు వృత్తిలో బాగా రాణించి ఉన్నట్లయితేనూ, తలవని తలంపుగా ఆయన పోరుబందరులోని పొలిటికల్ ఏజంట్‌చే అవమానింపబడక ఉండినట్లయితేనూ,* దాదా అబ్దుల్లా కంపెనీ పక్షంలో దక్షిణాఫ్రికాకు పోవలసిన అవసరం ఆయనకు కలగకపోయి ఉండవచ్చు అప్పుడు సత్యాహింసల సందేశాన్ని ప్రపంచానికందించి లక్షలాది ప్రజలచే ఆచరణలో పెట్టించగలిగిన ఒక "మహాత్ముడు" మనకు లభించి ఉండేవాడుకాడు భారత స్వాతంత్ర్య సంపాదనానికి సాధన భూతమయిన "సత్యాగ్రహం" వంటి సునిశిత ఆయుధాన్ని మానవ జాతి ఊహించనైనా ఊహించగలిగి ఉండేదికాదు

దక్షిణాఫ్రికాలో భారతీయు లనుభవిస్తూండిన దుర్భర సాంఘిక, రాజకీయ పరిస్థితులు, అక్కడి తెల్లవారి జాతి దురహంకారాలు గాంధీజీ సత్యాగ్రహ సిద్ధాంతానికి పునాదులయినాయి ముందు ముందు "మహాత్ముడు" గా పరిణతి పొందనున్న మోహన్‌దాస్ కరంచంద్ గాంధీకి తెలుగు ప్రజలతో పరిచయం కలగడం, వారి పట్ల ఆయనకు ఎడతెగని ఆదరాభిమానాలు కలగడం కూడా దక్షిణాఫ్రికాలోనే ప్రారంభమయింది కనక మనమీ సందర్భంలో దక్షిణాఫ్రికా ఉదంతాలను సంగ్రహంగానైనా తెలుసుకొనడం సముచితంగా కనిపిస్తుంది

---

* పోరుబందరులోని పొలిటికల్ ఏజెంట్ వల్ల తనకు, [illegible]వమానాన్ని గురించి గాంధీజీ ఇట్లా వ్రాసినారు

"పరలోక గతుడయిన పోర్‌బందరు రాణాసాహెబు సింహాసనాసీనుడు కాకమునుపు మా అన్న ఆయనకు సలహాదారుగా ఉం[illegible] ఆ కాలంలో

అన్నాడు బంట్రోతు లోనికివచ్చినా నేనింకా సంశయిస్తూ నిలబడేవున్నాను బంట్రోతు నా భుజాలమీద చేతులువేసి గదినుంచి బయటకు పంపినాడు తరవాత దొరగారు (Sahib) బంట్రోతూ కూడా వెళ్ళిపోయినారు నేను పట్టరాని కోపంతో వెళ్లిపోయి దొరగారికి "మీరు నన్ను అవమానపరిచినారు- మీ ఆజ్ఞతో మీ బంట్రోతు నాపై చేయిచేసుకొన్నాడు అందుకు తగిన పరిహారం మీరు చేయకపోతే నేను మీపై చర్యతీసుకోవలసి ఉంటుంది" అని నేను ఆయనకు ఒక చీటీ వ్రాసినాను

వెంటనే అతడు తన బంట్రోతుద్వారా నాకిజవాబు పంపించినాడు

"నీవు నాపట్ల మొరటుగా ప్రవర్తించినావు నిన్ను పొమ్మన్నాను నీవు పోలేదు గత్యంతరంలేక నా బంట్రోతుతో నిన్ను పంపించివేయమన్నాను వాడు నిన్ను పొమ్మనిచెప్పినా నీవు పోలేదు కాబట్టి వానికి నిన్ను బయటకు పంపించడానికి తగినంత బలప్రయోగం చేయక తప్పలేదు కనుక నీ యిష్టం వచ్చిన చర్య నీవు తీసుకోవచ్చు"

ఈ జవాబు జేబులో పెట్టుకొని నిరుత్సాహంతో ఇంటికిపోయి మా అన్నకు జరిగినదంతా చెప్పినాను కాని నన్నెట్లా ఓదార్చవలెనో తెలియక ఆయన చాలా విచారపడినాడు . సర్ ఫిరోజిషామెహతా అప్పుడు రాజకోటలో ఉన్నారు నేను నా కాగితాలను ఆయనను యేర్పాటుచేసుకొనిన ఒక వకీలుద్వారా పంపి ఆయన సలహా కోరినాను

సర్ మెహతా ఇట్లా కబురుపంపినారు "ఇటువంటివి చాలమంది వకీళ్లకు, బారిష్టరులకూ సర్వసామాన్యమయిన అనుభవాలు ఆయన ఇంగ్లాండ్ నుంచి కొత్తగా వచ్చినాడు ఉడుకునెత్తురతో ఉన్నాడు బ్రిటిష్ ఉద్యోగస్థులంటే యేమిటో నీకు తెలియదు

ఇక్కడ ఏదో కొంత సంపాదించుకొంటూ కాలక్షేపం చేయవలెనంటే, ఆ చీటి చింపివేసి జరిగిన అవమానాన్ని దాచిపెట్టుకోమను ఆ దొరగారి (Sahib)పై చర్య తీసుకొన్నందువల్ల ఏమీ ప్రయోజనంలేదు పైపెచ్చు తనను తాను పాడుచేసుకోవడం జరుగుతుంది జీవితంలో ఇంకా అనుభవం సంపాదించవలసి వుంటుందని గాంధీకి చెప్పండి "

ఈ సలహా నాకు విషప్రాయంగా తోచింది కాని నేను దానిని మ్రింగి ఊరుకొన్నాను అవమానాన్ని భరించినాను దానివలన లాభం పొందినాను కూడా ఇక ఎన్నడూ ఇటువంటి దురవస్థలో పడకూడదనుకొన్నాను స్నేహాన్ని ఈ విధంగా ఉపయోగించుకోకూడదనికూడా అనుకొన్నాను తరవాత ఈ నిశ్చయానికి భిన్నంగా ఎప్పుడూ నేను ప్రవర్తించలేదు విద్యుద్ఘాతం (Shock) వంటి ఈ సంఘటన నా జీవయాత్రను మరొక మలుపుకు తిప్పింది "

రాజకోటలో గాంధీజీ బారిస్టరు వృత్తికిసంబంధించిన పని చాలావరకు పొలిటికల్ ఏజెంటు కోర్టులోనే ఉన్నందుకు తన వృత్తి అక్కడ జయప్రదంగా సాగదని ఆయన భావించినారు అందువల్లనే ఆయన దక్షిణాఫ్రికాకు పోయేటందుకు వచ్చిన మొదటి అవకాశాన్ని ఉపయోగించుకొన్నారు ఆయన దక్షిణాఫ్రికాయాత్ర ఆయన చరిత్రను మార్చడమేగాక దాదాపు ప్రపంచ చరిత్రనే మార్చివేసింది

# 2
# దక్షిణాఫ్రికాలో గాంధీజీ

గాంధీజీ దక్షిణాఫ్రికాలో అడుగుపెట్టినది మొదలు అక్కడి భారతీయులు తెల్లవారిచేత ఎంత హీనంగా అవమానింపబడుతూన్నారో అనుభవపూర్వకంగా ఆయనకు అర్థమయింది ఈనాడు ఎవరిని లోకోత్తర పురుషునిగా ప్రపంచప్రజానీకం పూజిస్తున్నదో, ఎవని శతజయంత్యుత్సవాలను మహదానందంగా జరుపుకోవడానికి సన్నాహాలు చేసుకొంటున్నదో ఆ మహాత్మునికి కూడా అక్కడ తిట్లూ, అవమానాలు తుదకు తన్నులు కూడా తప్పలేదు ఇందుకు కారణం దక్షిణాఫ్రికాలోని భారతీయులందరూ తెల్లవారి దృష్టిలో కూలీలుగా కనబడటమే

## దక్షిణాఫ్రికాలో "కూలీల" కథ

దక్షిణాఫ్రికాలోని "ఆరెంజిఫ్రీస్టేట్" లోనూ ట్రాన్స్‌వాల్‌లోనూ భారతీయుల స్థితిని గురించి ఈ సందర్భంలో సంగ్రహంగా తెలుసుకోవలసిన అవసరం ఉంది 1888 లోనో అంతకు పూర్వమో "ఆరెంజిఫ్రీస్టేట్" లో చేసిన ఒక ప్రత్యేక చట్టాన్ని అనుసరించి అక్కడి భారతీయులు హోటళ్లలో క్లీనర్లుగాగానీ, అంతకంటే నీచమయిన వృత్తులలోగానీ మాత్రమే పనిచేయవలసి ఉన్నది అక్కడ ఇదివరకుండిన భారతీయ వర్తకులందరూ నామమాత్రపు పరిహారంతో అక్కడనుంచి స్వదేశానికి బలవంతంగా తోలివేయబడినారు తమ కష్టాలనుగురించి అధికారులకు వారెన్ని విజ్ఞప్తులు పంపుకొన్నప్పటికీ ప్రయోజనం లేకపోయింది

ఇక ట్రాన్స్‌వాల్‌లో భారతీయులకు సంబంధించి 1885 లో ఒక అత్యంత కఠిన శాసనం చేయబడింది 1886 లో ఆ శాసనంలో కొంత మార్పు జరిగింది ఆ మార్పుప్రకారం ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించే ప్రతి భారతీయుడూ ఏడాదికి మూడు పౌనులు పోల్‌టాక్స్ చెల్లించవలసి ఉన్నది తమకు ప్రత్యేకింపబడిన ప్రదేశాలలో తప్ప భారతీయులెవ్వరూ భూములను సంపాదించుకో కూడదు ఆ ప్రత్యేక ప్రదేశాలలో సంపాదించుకొన్న భూములపైన కూడా ఆచరణలో భారతీయులకు సొంత హక్కులు అంటూ లేవు వారికి వోటింగ్ అధికారంకూడా లేదు ఆసియా ఖండవాసులకు ప్రత్యేకం ఏర్పాటుచేయబడిన ఈ ప్రత్యేక చట్టాన్నేగాక రంగు జాతులకు వర్తింపచేయబడే మరికొన్ని చట్టా

లనుకూడా భారతీయులు అనుసరించవలసి ఉన్నది రంగుజాతులకు సంబంధించిన శాసనాల ప్రకారం, భారతీయులు పబ్లిక్ బాటలలో (Public foot paths) నడవకూడదు వారు రాత్రి 9 గంటలు దాటిన తరవాత అనుమతి (పర్మిట్) లేకుండా బయట తిరగకూడదు అయితే "అరబ్బులు"గా వ్యవహరింపబడు తూఉండిన భారతీయులకు మాత్రం, ఈ చివరి నియమం విషయంలో కొంత మినహాయింపు ఉంది కాని ఆ మినహాయింపు కూడా సాధారణంగా పోలీసు వారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడి ఉంటుంది భారతీయులెవరైనా రాత్రి 9 గంటల తరవాత బయటకు పోవలసి ఉంటే వారు తమ తెల్ల యజమానుల ద్వారా ఒక అనుమతి పత్రాన్ని పొందవలసి ఉంటుంది గాంధీజీ అటువంటి అనుమతి పత్రాన్ని పొందవలసిన అవసరం చట్టరీత్యా ఉన్నందుకు విచార పడుతూ ఆయనతోపాటు బారిస్టర్ పరీక్ష చదువుకొన్న డాక్టర్ క్రాజ్ (Dr Krause) గాంధీజీ రాత్రి 9 గంటల తరవాత బయటకు పోయినప్పటికీ పోలీసులు జోక్యం కలిగించుకోకూడదని ఒక ఉత్తరం వ్రాసి గాంధీజీ చేతికిచ్చినారు డాక్టర్ క్రాజ్ ట్రాన్స్‌వాల్‌లో స్టేట్ అటర్నీగా ఉండటంచేత ఆయన మాట బాగా చలామణీ అయ్యేది ఆరోజులలో కాని అదృష్టవశాత్తు గాంధీజీ రాత్రులు 9 గంటల తరవాత బయటకు పోతూఉండినప్పటికీ, పోలీసు వారికి ఉత్తరం చూపవలసిన అవసరం ఎప్పుడూ కలగలేదు

అయితే కాలిబాటలను ఉపయోగించుకోరాదనే నియమంమాత్రం గాంధీజీని చిక్కులలోకి తెచ్చింది శరీరవ్యాయామంకోసం కొంతదూరం నడవడం గాంధీజీకి అలవాటు ఆయన ట్రాన్స్‌వాల్‌లోని ప్రెసిడెంట్ క్రూజర్ వీథినుంచి బయటి విశాలమైదానంవరకూ ప్రతిరోజూ నడిచిపోయి తిరిగి నడిచి వస్తూండేవారు ప్రెసిడెంట్ క్రూజర్ చాలా నిరాడంబరమయినవ్యక్తి, ఆయన భవన కూడా అంత నిరాడంబరంగానే వుండేది ఆ గేటుముందు నిలబడివుండే పోలీసువానినిబట్టి మాత్రమే అది ప్రెసిడెంట్ ఇల్లని అనుకోవటానికి అవకాశం ఉంది ఆ పోలీసువాడు మాత్రం రోజురోజుకూ మారుతూ ఉంటాడు ఒక రోజున గాంధీజీ ఆ కాలి తోవను వస్తూవుంటే ప్రెసిడెంట్ ఇంటిముందు వున్న పోలీసువాడు హఠాత్తుగా ఆయనను ఒక్కతోపున్న తన్ని వీథిలోకి నెట్టినాడు ఒక్క మాటయినా మాట్లాడకుండా పోలీసువాడు ఇట్లా చేసినందుకు గాంధీజీ నిర్ఘాంతపోయి చూస్తూన్నాడు అప్పుడా తోవను గుఱ్ఱంమీద పోతూ ఉండిన కోట్స్ ఈ సంఘటన కళ్లారా చూసి కోపోద్రిక్తుడై, ఆ పోలీసు వానిపైన కోర్టులో చర్యతీసుకొనవలసిందనీ తాను సాక్షిగా ఉంటాననీ ఇటువంటి వానిని క్షమించరాదనీ గాంధీతో అన్నారు కాని గాంధీజీ "పాపం! ఆ పోలీసువానికేమి తెలుసు? వానికి రంగుజాతులవారందరూ సమానమే! వాడు నాపట్ల ప్రవర్తించినట్లుగానే నీగ్రోల అందరిపట్ల ప్రవర్తిస్తాడు నా సొంత విషయంలో నేను కోర్టుకు పోనని ఒక నియమం పెట్టుకొన్నాను కాబట్టి నేను వాని విషయంలో ఏ విధమయిన చర్యా తీసుకోదలచుకోలేదు" అన్నారు "గాంధీజీ,

ఇది నీకే ఎరిపోయింది!" అన్నాడు కోట్స్. ఈ కోట్స్ అనే ఆసామితో దక్షిణ ఆఫ్రికాలో గాంధీజీకి కలిగిన పరిచయం సన్నిహితమైత్రిగా రూపొందింది. ఆ తరవాత కోట్స్ ఆ పోలీసువాని గట్టిగా చివాట్లుపెట్టి గాంధీజీకి క్షమాపణ చెప్పించినాడు. కాని గాంధీజీ అంతకు పూర్వమే అతనిని క్షమించడం జరిగింది.

ఈ ఉదంతాలనుబట్టి ట్రాన్స్‌వాల్‌లోని భారతీయుల దుస్థితి చదువరులకు బాగా అర్థమై ఉంటుంది.

ఇక గాంధీజీ బారిస్టర్ వృత్తినవలంబించిన నేటాలులోని భారతీయుల పరిస్థితులను బాగుచేసేటందుకు నేటాల్ ఇండియన్ కాంగ్రెసను 1894 మే 22 వ తేదీన స్థాపించినారు. అదే సంవత్సరంలో నేటాల్ ప్రభుత్వం ఇండెంచర్డ్ భారతీయులపైన ఏడాదికి తల 1 కి పౌ 25 (పౌనులు) పన్ను విధించడం జరిగింది. ఇందుకు గాంధీజీ ఆశ్చర్యచకితుడైనాడు. ఈ విషయం నేటాల్ కాంగ్రెస్ దృష్టికి తెచ్చి దానిని ప్రతిఘటించేటందుకు ఆయన ఏర్పాట్లు చేసినారు.

ఈ సందర్భంలో ఈ పన్నును గురించిన పుట్టుపూర్వోత్తరాలు మనం కొంతవరకు తెలుసుకోవలసిఉన్నది. నేటాల్‌లోని భారతీయులు ఎటువంటి అనర్థాలకు గురిఅవుతూ ఉండిరో మనకు అర్థంకాదు.

1860 ప్రాంతాలలో నేటాల్‌లోని యూరోపియన్‌లకు అక్కడి భూములు చెఱకు పంటకు బాగా ఉపయోగించగలవని తోచింది. అయితే అందుకు తగిన కూలిజనం కావలె. నేటాల్‌లోని "జూలూలు" (దక్షిణాఫ్రికాలోని ఆటవిక జాతివారు) ఆ పనికి బొత్తిగా పనికిరారు. చెఱకు పండించేటందుకు, పంచదార తయారు చేసేటందుకు కూడా బయటనుంచి కూలీలను తెప్పించుకొంటేనే గాని ఆ పనులు సక్రమంగా జరగవని తెలుసుకొని వారు నేటాల్ ప్రభుత్వంద్వారా ఇండియా నుంచి కూలిజనాన్ని తెప్పించుకొనేటందుకు ఇండియా ప్రభుత్వం అనుమతిని పొందగలిగినారు. ఇట్లా నేటాల్‌కు వచ్చిన కూలీలు అయిదు సంవత్సరాలు నేటాల్‌లో ఉండి పనిచేసేటందుకు ఒక ఒడంబడిక పత్రం వ్రాసి ఇవ్వవలె. ఇటువంటి ఒడంబడిక పత్రాన్ని వ్రాసియిచ్చినవారికే ఇండెంచర్డ్ కూలిజనం అని పేరు. ఈ అయిదు సంవత్సరాల తరవాత వారు నేటాల్‌లో ఉండదలిస్తే ఉండిపోవచ్చు. వారు సంపూర్ణ హక్కులతో భూములనుకూడా సంపాదించుకోవచ్చు. ఈ షరతులు ఇండియాలోని వ్యవసాయ కూలీలకు కొంత ఆకర్షవంతాలుగా కనపడినాయి. ఈ అయిదు సంవత్సరాల తరవాత, భారతీయ వ్యవసాయ కార్మికుల శ్రమఫలితంగా తమ భూములను ఇంకా ఎక్కువగా అభివృద్ధిచేసుకోవచ్చునని నేటాల్ యూరోపియన్‌లు ఆశపడినారు. కాని భారతీయులు, యూరోపియన్ లాశించిన దానికంటెకూడా ఎక్కువ ప్రయోజనాలను సాధించగలిగినారు. వారు కావలసినన్ని కూరగాయలను పండించినారు. ఇండియాలో పండుతూ ఉండిన వివిధ రకాల కూరగాయలను ఉత్పత్తి చేసినారు. నేటాల్‌లో అంతకు పూర్వం పెరుగుతూ ఉండిన కూరగాయల ఉత్పత్తిని పెంపొందించి అక్కడ ఆ కూరలను చౌకగా అమ్మే

ట్లు చేయగలిగినారు కొత్తగా మామిడితోటలు పెంచినారు వారి కృషి అంతటితో ఆగలేదు వర్తకం ప్రారంభించినారు ఇళ్లు కట్టుకొనటానికి నివేశన స్థలాలు కొనుక్కోవడం మొదలుపెట్టినారు వారి స్థితి క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది కూలీలుగా వచ్చినవారు భూకామందులుగా, గృహయజమానులుగా తయారవుతూ వచ్చినారు వారినిచూసి ఇండియానుంచి వణిక్ ప్రముఖులు కొందరు నేటాల్‌కు పోయి వాణిజ్యం సాగించినారు వారిలో మొట్టమొదటివాడు కీ॥ శే॥ సేట్ అబూబకర్ అహమద్ ఆయన కొద్ది కాలంలోనే నేటాల్‌లో చాలా హెచ్చుస్థాయిలో వ్యాపారాన్ని ఆకట్టుకోగలిగినాడు

ఇదంతాచూసి తెల్ల వ్యాపారస్థులు భయభ్రాంతులయినారు వారు ఇండియానుంచి కూలిజనాన్ని ఆహ్వానించినప్పుడు వారికి వ్యాపార నైపుణ్యం ఉంటుందని ఊహించలేదు భారతీయ వ్యవసాయ కూలీలు స్వతంత్రంగా వ్యవసాయం చేసుకొని బ్రతకడం తెల్లవారు సహించ గలిగినప్పటికీ, వ్యాపారంలో తమకు భారతీయులు పోటీపడటంమాత్రం వారు ఓర్చుకోలేకపోయినారు తెల్లవారికి ఇండియానుంచి వచ్చిన కూలీలపైన ద్వేషం కలిగేటందుకిది ముఖ్య కారణంగా పరిణమించింది దానికి తోడు మతభేదాలు, ఉభయవర్గాల వివిధ విధానాలలోని వ్యత్యాసాలుకూడా ఆ ద్వేషభావానికి మరింత దోహదం చేసినాయి అందువల్ల శాసనంద్వారా భారతీయులకు పోటీకి అవకాశం లేకుండా చేయడమేగాక, వారిని ఇండియాకు తిరిగి పంపేటందుకు వీలుగా మరికొన్ని సూచనలుకూడా చేయడం జరిగింది ఇండెంచర్డ్ కూలీలను వారి ఒడంబడిక కాలం పూర్తికాకముందే బలవంతంగా ఇండియాకు పంపివేయవలెనని మొదటి సూచన ఈ సూచనను ఇండియా ప్రభుత్వంవారు అంగీకరించరని తోచినందువల్ల -

1 ఇండెంచర్డ్ కూలీ ఒడంబడిక కాలం పరిసమాప్తి కాగానే ఇండియాకు తిరిగి వెళ్ళవలెననీ- లేదా

2 అతడు ఆ తరవాత ప్రతి రెండు సంవత్సరాలకు ఒక కొత్త ఒడంబడిక పత్రంపైన సంతకం పెట్టవలసి ఉంటుందనీ ఆ సందర్భంలో ఆయనకు కొంత అధిక వేతనమివ్వవచ్చుననీ- ఒకవేళ

3 అతడు ఇండియాకు తిరిగి పోయేటందుకుగానీ కొత్త ఒడంబడిక పత్రంపైన సంతకం పెట్టేటందుకుగానీ అంగీకరించనట్లయితే, 25 పౌన్‌లు పన్నుగా చెల్లించవలసి ఉంటుందనీ సూచించడం జరిగింది

ఈ సూచనలను ఇండియా ప్రభుత్వం వారిచే అంగీకరింప చేసేటందుకు తెల్లవారి పక్షాన ఒక రాయబారం పంపడం జరిగింది అనాటి రాజప్రతినిధి లార్డ్ ఎల్గిన్ (Lord Elgin) పౌ 25 పన్నుకు అంగీకరించలేదు కాని మూడు పౌన్‌ల పోల్‌టాక్స్ (తలపన్ను) కు మాత్రం తన ఆమోదాన్ని వెల్లడించినాడు నేటాల్ కాంగ్రెస్ పౌ 25 పన్నుకు ప్రతికూలంగా తీవ్రాందోళనను సాగిం

చకపోతే రాజప్రతినిధి పౌ 25 పన్నునే అంగీకరించి ఉండేవాడని గాంధీజీ అభిప్రాయము అయితే ఈ మూడు పౌన్‌ల పోల్‌టాక్స్ పదునారేండ్లకు మించిన మగపిల్లవానిపైనను, 13 ఏండ్లు మించిన ఆడపిల్లపైనను కూడా విధింపబడి ఉండటంచేత, మూడునాలుగేళ్ళలో భార్యాభర్తా ఇద్దరు పిల్లలూ ఉన్న ఒక ఇండెంచర్డ్ కూలీ కుటుంబము ఏడాదికి 12 పౌన్‌ల పన్ను చెల్లించవలసి ఉంటుంది ఇండెంచర్డ్ కూలీగా ఉన్న ఒక మగవాని సగటుఆదాయం నెలకు 14 షిల్లింగ్‌లు మించి ఎప్పుడూ లేదు అందువల్ల ఇటువంటి దురాగతమైన పన్ను ప్రపంచంలో మరెక్కడా విధింపబడి ఉండదని భావించడం తప్పు కాదు ఈ పన్నును రద్దుచేయించడానికి 20 యేండ్లు నేటాల్ కాంగ్రెస్ ద్వారా తీవ్ర ఆందోళన జరిగింది ఈ సాత్విక నిరోధోద్యమంలో కేవలం నేటాల్‌లోని భారతీయులేకాక దక్షిణాఫ్రికాలోని భారతీయులందరూ ప్రత్యక్షంగానో పరోక్షంగానో పాల్గొన్నవారే ఇందులో ఇండెంచర్డ్ భారతీయులు సంపూర్తిగా పాల్గొన్నారు వారిలో కొందరు తుపాకిగుండ్లకుగురియై ప్రాణాలు కోల్పోయినారు పదివేలమందికి పైగా కారాగృహ శిక్ష విధింపబడింది దక్షిణాఫ్రికాలో గాంధీజీ నడిపిన 'సాత్విక నిరోధోద్యమా'నికే తరవాత "సత్యాగ్రహ"మనే పేరు పెట్టబడింది 'సత్యాగ్రహం' అంటే సత్యంలో పట్టుదల అని అర్థము తన ఉద్యమాన్ని 'సాత్విక నిరోధం' (Passive Resistance) అని పిలవడంకంటె సత్యాగ్రహమని పేర్కొనడం సముచితంగా ఉంటుందని గాంధీజీ అభిప్రాయము కనక గాంధీజీ 'సత్యాగ్రహోద్యమానికి దక్షిణాఫ్రికా జన్మస్థానమని చెప్పవచ్చు' ఈ సత్యాగ్రహంలో పాల్గొన్నవారెక్కువమంది దక్షిణభారతీయులు- అందులో ముఖ్యంగా తమిళులు, ఆంధ్రులు అందువల్లనే గాంధీజీకి 1894 నుంచి తమిళులయందు ఆంధ్రులయందూ ఆదరాభిమానాలు పెంపొందుతూ వచ్చినాయి

# 3
# మద్రాసులో గాంధీజీ - 1896

దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఇక్కట్లు అన్నిటికంటె మూడుపౌన్ల తలపన్ను గాంధీజీకి ఎక్కువ బాధాకరంగా తోచింది ఆయన తన భార్యనూ బిడ్డలను ఇండియానుంచి తీసుకొనివచ్చి దక్షిణాఫ్రికాలో నే స్థిరనివాసం ఏర్పరచుకొని, మూడుపౌన్ల తలపన్నును రద్దుచేయించడానికి నిరంతరాయంగా కృషిచేయవచ్చునని భావించినారు అందువల్ల 1896 మధ్యలో ఆయన ఇండియాకు ప్రయాణమయినారు ఆయన ఇండియాలో ఉన్నకాలంలో దక్షిణాఫ్రికాలోని భారతీయుల కష్టాలను గురించి భారత నాయకులకూ, ప్రజానీకానికీ తెలియజెప్పి వారి సహాయ సానుభూతులను పొందవచ్చునని కూడా ఉద్దేశించినారు ఆయన దక్షిణాఫ్రికానుంచి నౌకలో నేరుగా కలకత్తాకు వచ్చి కలకత్తానుంచి రైలులో బొంబాయికి పోతూ మధ్యలో అలహాబాదులో ఆగినందువల్ల, రైలు తప్పిపోగా సమయం చూసుకొని పయొనీర్ పత్రికాసంపాదకునకు దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితిని గురించి వివరించినారు 'పయొనీర్' పత్రికలో దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యను గురించి చర్చించి న్యాయం చేయమని మాత్రమే గాంధీజీ ఆ సంపాదకుని అర్థించినారు

తరవాత ఆయన అలహాబాదునుంచి బొంబాయిలో ఆగకుండానే సరాసరి రాజకోటకుపోయి దక్షిణాఫ్రికా పరిస్థితులను గురించి వివరిస్తూ ఒక కరపత్రం తయారుచేసినారు ఆ కరపత్రానికి ఆకుపచ్చ అట్ట ఉండటంచేత దానికి 'ఆకుపచ్చ కరపత్రం' అని పేరు వచ్చింది ఆ కరపత్రానికి పదివేల ప్రతులు అచ్చొత్తించి ఇండియాలోని పత్రికలకూ, ప్రజానాయకులకూ పంపించినారు ఈ కరపత్రాలను పోస్టులో పంపించేటందుకు చిరునామాలు వ్రాసిన బాగి తాలకు పోస్టుబిళ్ళలను అంటించేపని, పాఠశాలల విరామకాలంలో చిన్నపిల్లలకు అప్పగించి వారుచేసిన పనికి బహుమానంగా గాంధీజీ తనకు వచ్చిన ఉత్తరాల పైన ఉన్న పాత పోస్టుబిళ్ళలను వారికిచ్చి వారిని దీవించి సంతోషపెట్టినారు ఆవిధంగా స్వచ్ఛంద సేవచేసిన బాలురలో ఇద్దరు పెద్దవారయిన తరవాత తనకు సహచరులయినట్లు గాంధీజీ తన 'ఆత్మకథ'లో వ్రాసుకొన్నారు

బొంబాయి, పూనా నగరాల బహిరంగసభలలో ప్రసంగించిన తరవాత గాంధీజీ మద్రాసు చేరుకొన్నారు

## మద్రాసులో బహిరంగసభ

ఆనాడు మద్రాసు ఆంధ్ర, తమిళ, కన్నడ, మలయాళీలకు సమష్టి రాజధాని నగరంగా ఉండింది మద్రాసులో వివిధ రాష్ట్రాల ప్రజలు, వివిధ భాషల వారు నివసిస్తూఉండినప్పటికి ఆ నగరంలో అధిక సంఖ్యాకులు తమిళులు, తెలుగు వారు మద్రాసులో ప్రజలు గాంధీజీ రాకకు అత్యుత్సాహం ప్రకటించినారు గాంధీజీ 1896 అక్టోబరు 26 తేదిని మద్రాసులోని పచ్చయప్ప హాలులో జరిగిన బహిరంగసభలో దక్షిణాఫ్రికా భారతీయుల దురవస్థలను గురించి సుదీర్ఘంగా ప్రసంగించినారు తమిళ ఇండించర్డ్ కూలీ బాలసుందరంపైన తెల్ల అధికారిచేసిన దౌర్జన్యాన్ని గురించి గాంధీజీ ముచ్చటించినప్పుడు సభాసదులలో ఎనలేని సంచలనం కలిగింది గాంధీజీ తన ఉపన్యాసాన్ని ముందుగానే అచ్చువేయించి చదివినప్పటికి శ్రోతలు ప్రతివాక్యమూ చాలా శ్రద్ధగా వింటూ నిశ్శబ్దంగా ఉన్నారు గాంధీజీ ముద్రించితెచ్చిన 10,000 "ఆకుపచ్చ" కరపత్రాలు క్షణంలో అమ్ముడుపోయినాయి ఆనాటి సభకు హాజరయిన వేలాది ప్రజాసమూహంలో జస్టిస్ సుబ్రహ్మణ్య అయ్యర్, గౌ॥ శ్రీ పి ఆనందాచార్యులు, గౌ॥ శ్రీ శంకరన్నాయర్, యస్ సుబ్రహ్మణ్యం, జె ఆదామ్‌గార్లు కూడా ఉన్నారు గౌ॥ శ్రీ ఆనందాచార్యులవారు (తెలుగువారు) ఆ సభకు అధ్యక్షత వహించినారు గాంధీజీ దక్షిణాఫ్రికాలోని భారతీయుల నీచస్థితిని ఆమూలాగ్రంగా అభివర్ణిస్తూ ప్రసంగించిన తరవాత శ్రీ జె ఆదామ్ కింది తీర్మానాన్ని ప్రతిపాదించినారు

"దక్షిణాఫ్రికాలో బ్రిటిష్ ఇండియా ప్రజలు అనుభవిస్తూఉండిన ఇక్కట్లను గురించి యం కె గాంధీజీచేసిన ప్రసంగాన్ని ఈ సభవారు విన్నారు దక్షిణాఫ్రికాకు వలసపోయిన భారతీయులపట్ల ఈ సభవారు తమ సంపూర్ణసానుభూతిని వెల్లడిస్తున్నారు వారి ఇక్కట్లను ఇంగ్లాండ్ ఇండియా ప్రభుత్వాల దృష్టికితెచ్చి వాటిని తక్షణం తొలగించేటందుకనుగుణంగా విజ్ఞాపనపత్రాలను తయారుచేసేటందుకు గౌరవనీయులు శ్రీ శంకరన్నాయర్, శ్రీ సుబ్రహ్మణ్య అయ్యర్, శ్రీ యస్ సుబ్రహ్మణ్యం, శ్రీ జె ఆదామ్, శ్రీ హాజీబాపాసాహెబుగార్లకు అధికారమీయడమైంది ఈ విజ్ఞాపనపత్రాలు చైర్మన్ సంతకంతో పంపవలె" ఈ తీర్మానాన్ని గురించి శ్రీ ఆదామ్ వివరంగా మాట్లాడిన తరవాత "ఈ తీర్మానంవల్ల ఇక్కడి ప్రజానీకం దక్షిణాఫ్రికా భారతీయులపట్ల సంపూర్ణసానుభూతి కలిగిఉన్నారని వారికి అర్థమవుతుంది అందువల్ల వారికిది ఉత్సాహజనకంగా ఉంటుంది నేటాల్ అధికారులకుకూడా ఇది కనువిప్పుగాఉండి అక్కడి భారతీయులపట్ల వారు ఎక్కువ జాగరూకతతోనూ ఎక్కువ మర్యాదగాను ప్రవర్తించడానికి దోహదం చేస్తుంది" అన్నారు తరవాత ఈ తీర్మానాన్ని బలపరుస్తూ శ్రీ ఏ సి పార్థసారథి నాయుడుగారు తెలుగులో ఉత్తేజకరమయిన ఉప

న్యాసం చేసినారు. చివరికి తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరింపబడింది.

తరవాత శ్రీ జి. పరమేశ్వరన్‌పిళ్ళై ఈ దిగువ తీర్మానాన్ని ప్రతిపాదించినారు. "నిరుడు నేటాల్ పార్లమెంటులో అంగీకరింపబడిన "ఇండియన్ ఇమిగ్రేషన్‌లా అమెండ్‌మెంట్ బిల్ ఆఫ్ 1895'ను (1895 నాటి భారతీయ వలస చట్టం సవరణ) బిల్లును బ్రిటిష్ ప్రభుత్వంవారు, ఇండియా ప్రభుత్వం వారు ఆమోదించినందుకు ఈ సభవారు తమ విచారం వెల్లడిస్తున్నారు. ఆ సవరణ చట్టాన్ని ప్రభుత్వంవారు రద్దుచేయజాలనట్లయితే నేటాల్ కు ఇండెంచర్డ్ కూలీల వలస పద్ధతిని తాత్కాలికంగా నిలుపు చేయవలెనని ఈ సభవారు అభిప్రాయపడుతున్నారు." ఈ తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ జి. పరమేశ్వరన్ పిళ్ళై భారతీయుల క్షేమానికి ప్రత్యక్షంగా బాధ్యత వహించవలసిన ఇండియా ప్రభుత్వంవారు ఆ చట్టాన్ని ఆమోదించడంలో ఇండియా ప్రజలపట్ల తమ ధర్మాన్ని సరిగా నిర్వర్తించలేదని అంటూ సవిస్తరంగా ప్రసంగించినారు.

పచ్చయప్పహాలులోని సమావేశం "మద్రాసు మహాజనసభ" వారి ఆధ్వర్యంలో జరిగింది. ఈ ప్రముఖ ప్రజాసంస్థను స్థాపించడంలో గాజుల లక్ష్మినరసింహచెట్టి రంగయ్యనాయుడు వంటి తెలుగువారు చాలా కృషి చేసినారు.

ఈ సమావేశంలో రెండో తీర్మానాన్ని ప్రతిపాదించిన శ్రీ జి. పరమేశ్వరన్ పిళ్లై "మద్రాస్ స్టాండర్డ్" పత్రికకు సంపాదకుడు. ఆయన దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యను ఎంతో జాగ్రత్తతో పరిశీలించడమేగాక గాంధీజీని తరచు తన కార్యాలయానికి ఆహ్వానించి ఆయనతో ఆ సమస్యను గురించి సుదీర్ఘంగా చర్చిస్తూండేవారు. "మద్రాసు స్టాండర్డ్" పత్రికలో ఆనాటి దక్షిణాఫ్రికాను గురించిన గాంధీజీ వ్యాసాలు నిశ్శేషంగా ప్రచురించబడుతూండినాయి. 'హిందూ' పత్రికా సంపాదకుడు జి. సుబ్రహ్మణ్యం, డాక్టర్ సుబ్రహ్మణ్యం గార్లుగూడా దక్షిణాఫ్రికా భారతీయుల పట్ల సంపూర్ణ సానుభూతి చూపించినారు. "మద్రాసులో నేను కలుసుకొనిన స్నేహితులందరితో నేను ఇంగ్లీషులోనే ప్రసంగించవలసి వచ్చింది. అయినప్పటికీ వారు నాపట్ల అత్యంతాదరాభిమానాలను కనపరిచినారు. మద్రాసులో ఉన్నప్పుడు నేను నా స్వజనంలో ఉండినట్లు తోచింది. ప్రేమను ఏ అడ్డుకట్టలైనా ఆపగలవా?" అని గాంధీజీ 'ఆత్మకథ'లో తన మద్రాసు పర్యటన గురించి వ్రాసినారు.

## "హిందూ" పత్రిక వ్యాఖ్య

గాంధీజీ మద్రాసు పర్యటన గురించి హిందూపత్రిక 1896 అక్టోబరు 27న వ్రాసిన ప్రధాన వ్యాసమే ఆయన కృషిపట్ల మద్రాసు పౌరుల సంపూర్ణ సానుభూతికి ప్రబల నిదర్శనము. అందులోని కొన్ని భాగాలీ కింద ఉదాహరించడం జరిగింది.

"దక్షిణాఫ్రికాలో అనేక ఇక్కట్లకు గురిఅవుతూఉండిన మన దేశీయు

లను గురించి ఇండియాలో ప్రజాభిప్రాయం సమీకరించేటందుకు గాంధీజీ చేస్తూఉండిన కృషి ఫలితంగా దక్షిణాఫ్రికా భారతీయులపట్ల ఇక్కడి ప్రజలకు కొంత సానుభూతి ఏర్పడగలదని ఆశిస్తున్నాము గాంధీజీ నేటాల్‌లో పని చేస్తూఉండిన ఒక హిందూ బారిస్టర్ అక్కడ తన దేశీయులు అనుభవిస్తూఉండిన బాధలను వెల్లడించి ఇండియా ప్రభుత్వపు మహోన్నత వహించిన బ్రిటిష్ రాణి సానుభూతితో వాటిని నివారించవలెననే దేశభక్తియుత మయిన కర్తవ్యాన్ని తనంతట తాను పైనవేసుకొన్నాడు మా పత్రికా పాఠకులకు ఆ బాధలు తెలియనివికావు మేము అనేక పర్యాయాలా విష యాలను మా పత్రికలో ముచ్చటించి ఉన్నాము తమ నిత్యావసర వస్తు వులకు, సౌఖ్యాలకూ ఎంతగానో తోడ్పడిన కోటి రంగుజాతులవారి పట్ల దక్షిణాఫ్రికాలోని తెల్లజాతి ఉన్నత వర్గాలవారు యెంత మొరటుగా ప్రవ ర్తిస్తున్నారో మా పత్రికలో అనేక పర్యాయాలు సోదాహరణంగా నిరూపించి నాము ఈ విషయాలను గురించి నిన్నటిరోజున గాంధీజీ సుదీర్ఘంగా ప్రసం గించినారు కొంచం మెరుగయిన జీవనాధారంకోసం భారతయులు, ఇతర దేశా లకు వలసపోవడం ప్రోత్సహించేవారందరూ గాంధీజీ ఉపన్యాసాన్ని జాగ్ర త్తగా పరిశీలించవలెనని కోరుతున్నాము ”

* * *

దక్షిణాఫ్రికాలోని యూరోపియన్‌లు భారతీయులను రోడ్లపైన, రైల్వేబండ్లలో ఇంకా అనేకచోట్ల ఎప్పుడుపడితేఅప్పుడు ఎక్కడపడితేఅక్కడ అవమానిస్తున్నారు ఇందుకు ప్రతీకారంగా బలప్రయోగంతప్ప మరొక ప్రత్యామ్నాయం కనిపించడంలేదు కొంత కాలానికి భారతీయులసంఖ్య పెరిగి ఐశ్వర్యవంతులుగా రూపొంది సమాజంలో వారుకూడా పలుకుబడిని సంపాదించగలిగినట్లయితే బహుశా అప్పుడు యూరోపియన్‌లు వారిపట్ల ఎక్కువ మర్యాదగా ప్రవర్తించగలరేమో! గాంధీజీ ఈ రకపు ఇబ్బందులను తీర్చుకొనేటందుకు ఇండియా ప్రభుత్వం వారి జోక్యాన్ని అర్థించవలసిందని భారతప్రజానీకాన్ని కోరడంలేదు ఆయన కోరుతూన్నది తెల్లవలసజాతులతో పాటు తమ పరిశ్రమలద్వారాను, వర్తకవ్యాపారాల మూలంగాను వలస రాజ్యాభివృద్ధికి తోడ్పడుతూ రాజకీయాధికారంలోనైతం సమానభాగ స్వాములుగా ఉండేటందుకు భారతీయులకు ఆటంకంగా వలసప్రభుత్వాలు పక్షపాతదృష్టితో చేస్తూఉండిన శాసనాలు రద్దుచేయబడవలెననిమాత్రమే

* * *

భారతీయు లనుభవిస్తూఉండిన ఈ కష్టాలనివారణకు తగిన ప్రత్యక్షాధి కారం బ్రిటిష్ ప్రభుత్వానికి ఉన్నదనీ, లేదా వారు ఆయా వలసదేశాలలోని తమ

రాయబారపర్గాలద్వారా కూడా ఈ స్థితిని నివారించగలుగనీ గాంధీజీ నిరూపించినారు

* * *

గాంధీజీ ప్రారంభించిన ఈ మహోదారోద్యమంపట్ల ... ప్రజానీకానికి ఉత్కృష్టమయిన సానుభూతి ఉన్నదని ...మాయిన ప్రత్యేకం చెప్పనక్కరలేదు ఈ ఉద్యమంగురించి ఆయన ఈ దేశంలో పర్యటిస్తున్నంత వరకూ ఈ దేశంలోని ప్రజానాయకులందరూ ఆయనకు నిండుమనస్సులతో అన్ని విధాలా తోడ్పడగలరు "

దక్షిణాఫ్రికా భారతీయుల దుస్థితిని గురించి 1896 అక్టోబరు 26 తేదీని గాంధీజీ మద్రాసులో చేసిన ప్రసంగంపైన హిందూ పత్రిక వ్రాసిన సంపాదకీయ భాగాలుపైవి

**తెలుగులపై తమిళులపై గాంధీజీ అనురాగము**

దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమంలో సంపూర్ణంగా పాల్గొన్నందుకు తెలుగువారిపైననూ తమిళులపైననూ గాంధీజీకి ఎనలేని అనురాగము ఉండేది వారి భాషలను తాను చక్కగా అభ్యసించలేకపోయినందుకు పశ్చాత్తాపం వెల్లడిస్తూ గాంధీజీ 'ఆత్మకథ'లో ఇట్లా వ్రాసినారు

"తమిళంగానీ, తెలుగుగానీ తెలియకపోవడం నాకు ఇప్పటికీ చాలా లోపంగానే కనబడుతూఉన్నది దక్షిణాఫ్రికాలోని ద్రావిడులు నాపై వర్షింపజేసిన ప్రేమామృతం నా మధుర స్మృతులలో నిరంతరం చల్లగా జాలువారుతూనే ఉంటుంది నాకు ఎవరయిన ఒక తమిళ మిత్రుడుకానీ తెలుగు మిత్రుడు కానీ కనబడినప్పుడు, దక్షిణాఫ్రికాలోని తెలుగు, తమిళ స్నేహితుల విశ్వాసము, పట్టుదల, స్వార్థరహిత త్యాగము ఈ అన్నీ ఒక్కసారి గుమిగూడి నా స్మృతిపథంలోకి వస్తాయి వారిలో అత్యధిక సంఖ్యాకులు నిరక్షరాస్యులు ఆ విషయంలో పురుషులు సైతం స్త్రీలు తీసిపోరు దక్షిణాఫ్రికాలో జరిగిన పోరాటం అటువంటివారికోసమే ఆ నిరక్షరాస్యులయిన యోధుల సహాయంతోనే ఆ సంగ్రామం కొనసాగింది అది పేదలకోసం జరిగిన పోరాటమే అందులో పేదలే సంపూర్ణంగా పాలుపంచుకొన్నారు ఆడంబరమెరుగని ఆ సజ్జన హృదయాలను చూరగొనడానికి వారి భాష నాకు రాకపోవడం ఎంత మాత్రం ఆటంకం కాలేదు వారు వచ్చీరాని హిందుస్థానీలోనో ఇంగ్లీషులోనో మాట్లాడుతూఉండేవారు కాని మాపనికది ఎంతమాత్రం ఆటంకంగా లేదు అయితేనేమి వారి ప్రేమానుబంధాల కనుగుణంగా నాకు తెలుగు, తమిళ భాషలను నేర్చుకోవలెననే కోరిక కలిగింది తమిళం కొద్దిగా నేర్చుకోగలిగినాను ఇండియాలో తెలుగు నేర్చుకోవలెనని ప్రయత్నించినానుగాని అక్షరాలు దాటి అవతలకు పోలేకపోయినాను ఈ భాషలను నేనెన్నడూ నేర్వజాలననేభయం నాకిప్పుడుకలుగుతూన్నది అందువల్ల ద్రావిడ భాషలవారు

హిందుస్థానీ నేర్చుకోవలెనని ఆశిస్తున్నాను దక్షిణాఫ్రికాలో ఇంగ్లీషు మాట్లాడలేని ద్రావిడులు తడబడుతూ తప్పులతోనైనా హిందీ లేదా హిందూస్థానీని మాట్లాడగలుగుతున్నారు ఇంగ్లీషు మాట్లాడేవారు మాత్రమే ఆ భాషను నేర్చుకోవడంలేదు ఇందువల్ల ఇంగ్లీషు తెలిసిఉండటం మన భాషలను నేర్చుకోనేటందుకొక ఆటంకమేమో అన్నట్లు తోస్తున్నది" అని వ్రాసినారు

ఇదిగాక గాంధీజీ రౌలట్ చట్టం సందర్భంలో మద్రాసు వచ్చినప్పుడు కూడా దక్షిణాఫ్రికాలోని తమ తమిళ, తెలుగు మిత్రులను జ్ఞాపకంచేసుకొంటూ ఇట్లా అన్నారు

"నాకు దక్షిణదేశం సొంత ఇల్లువలె ఉంటుంది అందుకు కారణం నా దక్షిణాఫ్రికా ఉద్యమము తెలుగులపైననూ తమిళులపైననూ నాకొక ప్రత్యేక హక్కు ఉన్నట్లు భావిస్తాను దక్షిణ భారతంలోని ఆ సజ్జనులెన్నడూ నా ఈ నమ్మకానికి భంగం కలిగించలేదు"

గాంధీజీ దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం నడుపుతూన్న రోజులలో మద్రాసునుంచి సుబ్రహ్మణ్య భారతి (సుప్రసిద్ధ తమిళ జాతీయకవి), శ్రీ ఓ పి రామస్వామిరెడ్డియార్లు ఆ ధర్మయుద్ధానికి కావలసిన ధనం వసూలుచేసి పంపినారు శ్రీ ఓ పి రామస్వామిరెడ్డియారు తెలుగువారే వారి పూర్వులు తమిళనాడులో స్థిరనివాసమేర్పరచుకొని తమిళ సోదరుల సుహృద్భావాన్ని చూరగొన్నారు అందువల్లనే వారు సంయుక్త మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఎన్నుకోబడగలిగినారు

### దివ్యజ్ఞాన సమాజసంస్థ

గాంధీజీ 1896 అక్టోబర్ 26 తేదీని మద్రాసులోని దివ్యజ్ఞానసంస్థను దర్శించినారు ఆ సంస్థలోని విశేషాలను శ్రీ సర్ సి పి రామస్వామి అయ్యరుగారు గాంధీజీకి చూపెట్టినారు గాంధీజీ విజిటర్స్ పుస్తకంలో ఇట్లా వ్రాసినారు "ఈ ఉత్తమసంస్థను దర్శించగలభాగ్యం నాకు లభించింది అందుకు నాకు చాలా సంతోషంగా ఉంది నేను గుజరాతీ హిందువును మా గుజరాతీ పెద్దమనిషియే దీని సంస్థాపకుడయినందుకు నేను గర్విస్తున్నాను ఈ సంస్థ ఉద్దేశాలకు తగినట్లు దీనికి ఉజ్జ్వలభవిష్యత్తు ఉండవలెనని నా కోరిక ఇటువంటి సంస్థలు భారతదేశమంతటా ఉద్భవించి నిష్కళంకమయిన ఆర్య మత సిద్ధాంతాన్ని సుప్రతిష్ఠితం చేయవలెననిమాత్రమే నా ఆకాంక్ష"

### గాంధీజీ కృతజ్ఞత

మద్రాసులో జరిగిన మహాసభానంతరం గాంధీజీ మద్రాసు పౌరులకు కృతజ్ఞత తెలుపుతూ ఇట్లా వ్రాసినారు

"అయ్యా!

దక్షిణాఫ్రికాలోని బ్రిటిష్ ఇండియన్ల ఉద్యమం ప్రోత్సహిస్తూ నిన్న సాయంకాలం మద్రాసు పౌరులు అత్యంత శ్లాఘనీయంగా జరిపిన సమా

వేశానికి నేను వారికి కృతజ్ఞత తెలుపకపోయినట్లయితే కృతఘ్నుత దోషానికి పాల్పడినవాడను కాగలను ఆ సమావేశాన్ని ఎంతో జయప్రదంగా నిర్వహించు టందుకు మద్రాసు పౌరులందరూ సమైక్యంగా తోడ్పడినారని నా అభిప్రాయము మేము తలపెట్టిన ఉద్యమం పట్ల మీరు ప్రదర్శించిన సుహృద్భావానికి నా వినయ పూర్వక కృతజ్ఞతాభివందనలు ఇందువల్ల మా కష్టాలు నిజమైనవనీ మా ఉద్యమం పూర్తిగా న్యాయమయినదనీ కూడా నిరూపితమయింది ఈ ఉద్యమం తమదే అన్నట్లుగా అవిరళ కృషితో ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసిన సౌజన్యమూర్తులు మద్రాసు మహాజన సభా కార్యదర్శులకు నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపవలసి ఉన్నది ఇంతవరకు మా ఎట్ల చూపిన సానుభూతి సహకారాలు నిరంతరాయంగా కొనసాగగలవనీ మాకు న్యాయం త్వరలోనే లభించగలదనీ నేను ఆశిస్తున్నాను గడిచిన రాత్రి సమావేశంలోని విషయాలు దక్షిణాఫ్రికాలో తెలియగానే అక్కడి భారతీయుల హృదయాలు సంతోషంతో, ఆనందంతో, కృతజ్ఞతతో ఉప్పొంగిపోగలవని నేను మీకు నిశ్చయంగా హామీ యిస్తున్నాను విషాద మేఘావలంబితమయిన మా ఆకాశంలో ఇటువంటి సమావేశాలు మెరుపుతీగలవంటివి నిన్న సాయంకాలం వ్యవధి లేకపోయి నందువల్ల నా ఈ మనోభావాలను వెల్లడించటంయుకు వీలుకాలేదు కనక ఈ ఉత్తరం వ్రాయవలసివచ్చింది

నా కరపత్రంకోసం ప్రజలు తొక్కిసలాడిన దృశ్యాన్ని నేనెన్నటికి మరువజాలను ఆ కరపత్రాన్ని నేను మరొక పర్యాయం ప్రచురిస్తాను అది తయారుకాగానే సహృదయులయిన మద్రాసు మహాజనసభ కార్యదర్శుల ద్వారా ప్రజలు వాటిని అందుకోగలరు "

మద్రాసు
27 అక్టోబర్ - 1896

యం కె గాంధీ

మద్రాసు పచ్చయప్ప కళాశాలలో 26-10-1896 న గాంధీజీ చేసిన ప్రసంగంగురించి ఆంగ్లో ఇండియన్ పత్రిక మద్రాసు మెయిల్ ఆ మరునాడు "దక్షిణాఫ్రికాలోని బ్రిటిష్ ఇండియన్‌లు" అనే శీర్షికతో వ్రాసిన వ్యాఖ్య గమనించదగి ఉన్నది

"నిన్న సాయంకాలం పచ్చయప్ప హాలులో జరిగిన బహిరంగసభలో గాంధీజీ చేసిన ప్రసంగం సహజంగా ఆయన కరపత్రం అనుసరించియే ఉన్నది. దక్షిణాఫ్రికాలోని బ్రిటిష్ ఇండియన్‌లు కొన్ని కష్టాలకూ అవమానాలకూ గురిఅవుతున్నారని చెబుతూ ఆయన అందుకు తార్కాణంగా దక్షిణాఫ్రికా పత్రికలనుంచే అనేక ఉదంతాలను ఉదాహరించినారు గాంధీజీ దక్షిణాఫ్రికాలోని తన సోదర దేశీయుల స్థితిగతులను అభివర్ణించటంలో ఎంత మాత్రం అతిశయోక్తులు లేవనీ, వాస్తవిక పరిస్థితులను సంగ్రహంగా స్పష్టంగా

వెల్లడించినారని మా అభిప్రాయాన్ని మేమిదివరకే ప్రకటించి ఉన్నాము భారతీయులను గురించి సరిగా అర్థంచేసికోనందువల్ల నే ఈ ద్వేషభావాలకు కారణమని గాంధీజీ విశ్వాసము చాలావరకిది నిజంకావచ్చు

* * * *

"గాంధీజీ నిన్న ఇట్లా ప్రసంగించినారు దక్షిణాఫ్రికాలోని తెల్ల వారి చేతులలో మేము పొందుతూన్న అవమానాలుగాని పరాభవాలుకానీ ఇంగ్లాండ్ ప్రభుత్వం ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకొన్నందువల్ల తొలగి పోగలవని మేము భావించడంలేదు వారు జోక్యం కలిగించుకోవలెనని కూడా మేము కోరడంలేదు మేము వాటిని ప్రజల దృష్టికి తేవలెనని మాత్రమే కోరు తున్నాము అప్పుడు సమాజంలో న్యాయబుద్ధిగల అన్ని తెగలవారూ అన్ని పత్రికలూకూడా అక్కడ జరుగుతున్న అన్యాయాల పట్ల తమ అసమ్మతిని వెల్లడించడంవల్ల మా కష్టాలు కొంతవరకు తగ్గి చివరికి నిర్మూలింపబడగలవని ఆశిస్తున్నాము శాసనబద్ధమయిన ద్వేషభావం పునరావృత్తం కాకుండా ఉండే టందుకు మేము బ్రిటిష్ ప్రభుత్వాన్ని అర్థించేమాట నిశ్చయమే ఆ మా కోరిక వ్యర్థం కాదనికూడా మా ఆశ"

"ఈ విషయంలో ఈ వక్తకు ఈ దేశంలోని అందరి సానుభూతి సంపూ ర్ణంగా ఉంటుంది వలసరాజ్యాలలోని జాతి విద్వేషం బ్రిటిష్ సామ్రాజ్య పౌరునికి సంబంధించినంతవరకు శాసనబద్ధం చేయబడటానికి బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించినట్లయితే అది ధర్మాన్ని తాను సక్రమంగా నిర్వర్తించలేక పోయిన దని అర్థమవుతుంది" అని మద్రాసు "మెయిల్" పత్రిక వ్యాఖ్యానించింది

ఇంతటితో ఆగక 'మద్రాసు స్టాండర్డ్" పత్రికా సంపాదకుడు శ్రీ జి పరమేశ్వరన్ పిళ్లై సుస్పష్టంగా చేసిన ప్రసంగంలోని ముఖ్యభాగాన్ని "మద్రాసు మెయిల్" తన సంపాదకీయంలో ఇట్లా ఉదాహరించింది

"ఇక్కడ మన దేశంలో కనీసం శాసనసభల సభ్యులుగానైనా (లెజిస్లే టివ్ కౌన్సిల్) తలయెత్తుకొని తిరగవచ్చు, ఇంగ్లండ్‌లో సైతం మనం పార్ల మెంట్ సభ్యులం కావచ్చు వలసరాజ్యాలలో మాత్రం మనకేమీ హక్కులుగానీ అధికారాలుగానీ లేవు"

చివర "మద్రాసు మెయిల్" గాంధీజీకి త్వరలోనే అమోఘవిజయం కలగవలెనని ఆకాంక్షించింది ఇండియాలోని ఇతర ఆంగ్లో ఇండియన్ పత్రికలు కూడా అదేధోరణిలో వ్రాసినాయి దీనినిబట్టి గాంధీజీ మద్రాసులో చేసిన ప్రసంగం ప్రజలపైన ఎట్లాంటి ప్రభావం కలిగించిందో వ్యక్తమవుతున్నది

# 4
# గాంధీ దంపతుల మద్రాసు రాక - 1915

గాంధీ దంపతులు హరిద్వారంనుంచి మద్రాసుకు 1915 ఏప్రిల్ 17 న వచ్చినారు మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో వారికి అత్యుత్సాహకరమయిన స్వాగతమియ్యడం జరిగింది విద్యార్థులు గుంపులు గుంపులుగా చేరి రైలుదిగగానే వారిని హర్షధ్వానాలతో ఆహ్వానించినారు "వందేమాతర" నినాదాలతో గాంధీ దంపతులను ప్రజలు పూలదండలతో ముంచెత్తినారు ప్రజలందరికీ వారి దర్శనభాగ్యం లభించేటందుకు వీలుగా వారి నొక రిక్షాలో- ఎక్కించి కూర్చుండబెట్టి విద్యార్థులు ఆ రిక్షాను లాగ ప్రారంభించినారు రావుబహదూర్ గా బి యన్ శర్మ (బయ్యా నరసింహేశ్వరశర్మ) దివాన్ బహదూర్ సి కరుణాకర మీనన్, ఖాన్ బహదూర్ గులాబ్ మహమ్మద్ మొహిగీర్, శ్రీ యస్ శ్రీనివాస అయ్యంగార్, లాడ్ గోవిందదాస్, శ్రీ సి ఆర్ తిరువెంకటాచారి, రెవరెండ్ విట్‌మన్, యాకూబ్ హుస్సేన్ సేట్, శ్రీమతి బిసెంట్, శ్రీ టి రంగాచారి, శ్రీ హమీద్ హుస్సేన్, శ్రీ జె వైద్యరామన్, శ్రీ గురుస్వామిచెట్టి, రావు సాహెబ్ భవానందం పిళ్లై, జి ఎ నటేశన్‌లు రిక్షా వెనక ఉన్నారు సెంట్రల్ స్టేషన్ దాటిన తరవాత ఆ దంపతులను ఒక బండిలో ఎక్కించి కూర్చోబెట్టినారు ఆ బండి నెమ్మదిగా గాంధీ దంపతులు బసచేయనున్న ఇండియన్ రివ్యూ కార్యాలయానికి నడిచింది గాంధీజీ రైలు దిగగానే రైల్వే ప్లాట్‌ఫారంమీద ఆయనను ఆహ్వానించేటందుకు అనేకమంది మహిళామణులు కూడా హాజరయినారు వారందరికీ గాంధీ దంపతులు పూలదండలను, పుష్ప గుచ్ఛాలను బహూకరించినారు

గాంధీ దంపతులకు స్వాగతంచెబుతూ ఆంధ్రపత్రిక ఇట్లా వ్రాసింది

"వారి (గాంధీ దంపతుల) ముఖవీక్షణంచేత, వారి వాగమృతపానం చేత, వారి ఉదాత్త సహవాసంచేత ఈ నగరపౌరులు ధన్యులు కావడం అట్లాఉండగా ఈ రాజధానీనగరం ముఖ్యస్థానంగాగల ప్రదేశమంతా మహాసంతోషంగా ఉందనడంలో సందేహం లేదు కాబట్టి ఈ సుప్రసిద్ధ దంపతులకు ఆంధ్రమండలి ప్రతినిధులంగా హృదయపూర్వక స్వాగతమిస్తున్నాము "

ఈ స్వాగతవాక్యాలకు తోడు గాంధీజీ మద్రాసు పర్యటనకు సంబంధించిన కార్యక్రమం అంతా సవిస్తరంగా ప్రకటించి ఆంధ్రపత్రిక తెలుగు జాతిని ఉత్తేజపరిచింది

గాంధీ దంపతుల రాకను పురస్కరించుకొని గణేశ్ కంపెనీవారు ఆయన జీవిత చరిత్రను ఆంగ్ల, ఆంధ్ర, తమిళభాషలలో సంగ్రహంగా ముద్రించి పంచి పెట్టించినారు

"ఇండియన్ రివ్యూ" పత్రికా కార్యాలయం మేడపై రెండో అంత స్థులో రెండు గదులు గాంధీ దంపతులు ఉండటానికి, ఆ పత్రికా సంపాదకులు నటేశన్‌గారు ఏర్పాటు చేసినారు గాంధీజీ ఒక ధోవతి కట్టుకొని ఒక తెల్లని కుడతాను తొడుగుకొని ఉన్నారు దానికి బొత్తాములున్నవి గాని ఆయన పెట్టుకొనలేదు ఆయన గదిలో సోఫాలు కుర్చీలు ఉన్నప్పటికీ ఆయన కిందనే పద్మాసనస్థుడయి కూర్చున్నారు గాంధీగారికి స్టేషన్‌దగ్గర గౌరవపురస్సరంగా సమర్పింపబడిన కంఠహారం ఆయన గదిలోఉన్న గోఖ్లేగారి చిత్రపటానికి అలంకరింపబడి ఉన్నది

గాంధీ దంపతుల దర్శనానికి విద్యార్థులు గుంపులుగుంపులుగా వచ్చి గాంధీజీ సందేశాలను వినగోరుతున్నందువల్ల మద్రాసులో ఆయన ఉన్న అన్ని రోజులూ ప్రతిసాయంకాలమూ మూడు నాలుగు గంటలమధ్య విద్యావిషయా లను గురించి విద్యార్థులతో ముచ్చటించడాని కాయన సంతోషంతో అంగీక రించినారు

## దేశభాషలు - గాంధీజీ

మద్రాసులో గాంధీజీ 1915 ఏప్రిల్ 21 తేదీని ఆంధ్ర పత్రికా విలేఖకు నితో సంభాషిస్తూ దేశభాషలను గురించి చెప్పిన విషయాలు భారతదేశానికి నేటికీ వర్తించేవిగానే ఉన్నవి ఆ సంభాషణ వివరాలివి

ప్ర ప్రథమ అనుభవంలో దక్షిణాఫ్రికాలో హైందవ దేశభాషలను వాడే అందరితోనూ సంబంధం కలిగిఉన్నారు గదా ? అందులో దాక్షిణాత్యు లైన అరవలు, తెలుగులు, కన్నడులు, మళయాళీలు ఉన్నారుగదా?

జ నాతో అన్ని భాషలవారు ఉన్నారు అందులో ద్రావిడభాషలు మాట్లాడే వారుకూడా ఉన్నారు

ప్ర హైందవభూమి అంతటికీ ఏకభాష సాధ్యమని మీరు భావిస్తారా ? అయితే అది ఏ భాష అని మీ అభిప్రాయము?

జ ఒక్కభాష తప్పక సాధ్యం కాగలదు అది హిందీ భాష అని నా మతము

ప్ర దాక్షిణాత్యులు హిందీ భాషను చక్కగానే నేర్చుకోగలరా? అందులో ఎవ్వరు త్వరగా నేర్చుకోగలుగుతున్నారు?

జ అద్భుతంగా నేర్చుకొంటారు కన్నడులు మలయాళుల మాట నేను విమర్శగా గమనించలేదుగాని అరవలలో, తెలుగులలో హిందీ నేర్చు కొనే సామర్థ్యంలో తారతమ్య మెంచటానికి రాదు మా ఫోనిక్స్

ఆశ్రమంలోగల గోవిందస్వామిగారి భార్య ఆంధ్రస్త్రీ ఆమె ఇతర భాషలను నేర్వడంలో అసమాన ప్రతిభను కనబరచింది తెలుగు, అరవము, హిందీ, ఇంగ్లీషు, జూలూ భాషల నామె అవలీలగా మాట్లాడ గలదు ఆమె పుత్రికలకు కూడా తెలుగు, అరవము, జూలూ, హిందీ భాష లలవడినాయి

ప్ర మీరిచ్చిన ఉదాహరణ విశేషాఖ్యానము కావచ్చు కాదా?

జ కాదు భాషలు మనవారికి సామాన్యంగా పట్టుపడగలవు నేను చూపిన దృష్టాంతాలవంటి దృష్టాంతాలనేకం చూపవచ్చు నా బిడ్డలు సాధారణ జనులతో కలసిమెలసి ఉండటంచేత ఎన్నో భాషలను నేర్చుకో గలిగినారు

ప్ర ఆ ఫలితం పరిస్థితులవల్ల కదా గలిగింది? అట్లాంటి స్థితులు అన్నిచోట్లా ఉండవు గదా?

జ బాలుర విద్యాపద్ధతులలో అట్లాంటి పరిస్థితులను కల్పించడం నా ఆశయము

ప్ర దక్షిణ ఇండియాలో హిందీభాషయే లేదు ఇప్పటికి దేశమంతా కూడా ఆంగ్లభాష వ్యాపించి యున్నదే, హిందీకంటే ఆంగ్లభాషయే సామాన్య భాషగా ఉండకూడదా?

జ ఇప్పటి స్థితినిబట్టి చూస్తే ఇంగ్లీషుకే ప్రాబల్యం ఉండటం నిజము మనము దేశభాషల నలక్ష్యం చేసి దురవస్థలపాలు జేసినంత కాలం ఈ ప్రాబల్యం హెచ్చవచ్చు ఈ స్థితి గౌరవప్రదం కాదు, ఉండతగినది కాదు పరజాతి ప్రభుత్వాన్ని మనం సహిస్తాము కాని మన లోపాలను మనము సహించడం తప్పు మొగల్ ప్రభుత్వంలో ఆ జాతి భాష నంగీక రించినాము అనేది ఇప్పుడు ఇంగ్లీషు నంగీకరించడానికి కారణం కాజా లదు ఇది ఎట్లాంటి లోపమో అదికూడా అట్లాంటి లోపమే దేశభాష లను నేర్చుకోవడం విద్యావంతులవిధి నేను అరవమూ తెలుగూ నేర్చుకొని మీతో అరవంలోనూ తెలుగులోనూ ఉత్తర ప్రత్యుత్తరాలను నడప గలను మీరుకూడా హిందీ నేర్చుకొని నాతో హిందీలోనే వ్యవహరిస్తే సంతోషిస్తాను ఇట్లా మనం దేశభాషల నభివృద్ధిపరచటంలో అరవమే దేశమంతటికీ అనుకూలించే భాషయితే కానివ్వండు! నాకేమీ అభ్యం తరం లేదు

ప్ర అయితే ఇన్ని భాషలు నేర్చుకోవడం అందరకీ సాధ్యమా?

జ సాధ్యం కాకేమి? విద్యావంతులయిన హైందవులు కేవలం ఒక్క భాష కాక పెక్కు భాషలు మాట్లాడవలసిఉంది సామాన్య ప్రజకు ఆయా దేశభాష తప్పదు ఇప్పటి ఆంగ్ల పత్రికా పరనాభ్యాసంకూడ అదృశ్యం కావలసి ఉన్నది.

ప్ర పెక్కు భాష లెట్లాఅబ్బుతాయంటారు? మార్గం సూచిస్తారా?

జ దానికి ఇప్పటి విద్యా విధానం తగినదిగా లేదు. పది సంవత్సరాలలో

మాతృభాష, సంస్కృతము, హిందీ, ఒక్క ద్రావిడభాష, ఇంగ్లీషును అన్నింటినీ నేర్చుకోవచ్చు

ప్ర ఇన్ని భాషలును, ప్రకృతి శాస్త్రిలును, చరిత్రాంశాలును బాలురకు భారం కావా ?

జ అన్ని విషయాలును మాతృభాషలోనే నేర్పవలె భాషా పాఠాలలోనే చరిత్రాదికం ఇమిడి ఉంటాయి ప్రకృతి శాస్త్రాలను ఆటల రీతిగా నేర్పవలె ఇట్లా చేసినట్లయితే తక్కిన భాషలలవడటం ఎక్కువ కష్టం కాదు ఆ భాషలలో సంపూర్ణ పాండిత్య మవసరంకాదు ఉదాహరణార్థం ఆంగ్లభాష తీసుకొంటే అందులో ఆంగ్లేయులతో మనం సాధారణంగా వ్యవహరించేటంతమాత్రం జ్ఞానం కలిగితే చాలు అప్పటి మన విద్యావంతుడు ఇప్పుడు కలెక్టరులు మొదలయినవారు నేర్చుకొన్న దేశభాషలలో కంటె ఎక్కువ బాగానే ఇంగ్లీషులో వ్యవహరించగలడు అంతేచాలు

ప్ర సరియేగాని మనకిప్పుడు ప్రకృతి శాస్త్రవిజ్ఞానమంతా పాశ్చాత్య భూములనుంచి ఇంగ్లీషు మూలంగా కదా వస్తున్నది మన వారికి ఆంగ్ల భాషాజ్ఞానం తగినంత లేకుంటే ఆ జ్ఞానం మనం సంపాదించడం ఎట్లా ?

జ అందుకు ప్రత్యేకాధికారు లేర్పడతారు, వారు ఆ జ్ఞానం అంతా గడించి దేశభాషలలో ప్రచురిస్తారు ఆ ప్రచురణలే మన వాఙ్మయం కాగలదు ఈ పద్ధతి కొనసాగితే ఇప్పటి వృథా నష్టాలుండవు దీనిని నేను కార్యక్రమంలో ఉంచదలచినాను

ప్ర ఏకలిపినిగురించి తమ అభిప్రాయమేమి ? అది సాధ్యమవుతుందా ?

జ అన్ని లిపులను అభ్యసించక ఏ ఒక్క లిపినీ ప్రశంసించే వీలులేదు ఏక లిపి రావచ్చు, రాకపోవచ్చు సామాన్య ప్రజలు తమ లిపినీ తమ మాతృభాషనూ నిల్పుకోక మానరు దానిని బలపరచడం ఉత్తమము ఈ ఉద్యమం మూడు విధాల శ్రేయోదాయకము ఇది మతోద్దీపకము, జాతీయోద్దీపకము, వ్యక్త్యుద్దీపకము

ప్ర ప్రత్యేకాధికారులు ప్రకృతి శాస్త్రిదిక విజ్ఞానం దేశభాషలలోకి తేవలెనన్నారుకదా, సాంకేతిక పదాలు సృష్టింపబడవలెనా? ఆంగ్లంనుంచి తీసుకోవలెనా ? మీ అభిప్రాయమేమిటి ?

జ అది ఆయా నిర్ణేతల శక్తి సామర్థ్యాలను బట్టి ఉండగలదు సృష్టించవలసిన అవసరంఉంది ఆంగ్లంనుంచి తీసుకోవలసిన అవసరమూ ఉంది ఇందులో ఇష్టానిష్టాల ననుసరించరాదు ప్రాణవాయువనటానికి 'ఆక్సిజన్' అనటం సమంజసం కాదు ఇది మొదటి పక్షము, రెండో పక్షంగా మరొకదృష్టాంతం విన్నాను దక్షిణాఫ్రికాకు వలసపోయేవారికి ఇండించర్డ్ పద్ధతి అనే నిర్బంధ పద్ధతి ఉంది దానికిగాను "ఎగ్రి

మెంట్" అనే పత్రం వ్రాసి ఇవ్వటం వారి విధి. ఇండించర్డ్ అధికారులు ఎప్పుడూ 'ఎగ్రిమెంటు' అంటూ ఉంటారు. అందుచేత అట్లాంటి పద్ధతి కిందనున్న వాళ్ళము అని సూచించటానికి వారు 'గిర్మిటియా' లం అని చెప్పుకొంటుంటారు. ఈ పదాన్ని తీసివేసి వేరే పదం సృష్టించడం తగదు. ఇదే విధంగా స్టీమరును మా ప్రాంతంలో 'ఆగ్బోటు' అంటారు. 'ఆగ్' అంటే 'అగ్గి', 'బోట్' ఆంగ్లపదము. ఈ సమాసం ఉపయోగించుకోవడం ధర్మమే. మొత్తంమీద అనవసరమయిన దీర్ఘ సృష్టులను చేయక లఘుపద్ధతి ఉన్నదానిని అవలంబిస్తూ లేకుంటే ఏ విదేశపదాన్నో వాడటం లాభకరము."

ఈనాడు హిందీ భాషను గురించి అన్ని భారతీయ భాషలకూ ఒకే లిపి ఉండవలెననే ప్రతిపాదనను గురించి, ప్రకృతి శాస్త్రాలు దేశభాషలలో నేర్పడం వీలవుతుందా అనే విషయాన్ని గురించి జరుగుతూ ఉండిన వాదోపవాదాలకు 1915 లోనే గాంధీజీ సరియైన సమాధానాలు ఇచ్చినట్లు ఆంధ్ర పత్రికా విలేఖకునితో ఆనాడు ఆయనకు జరిగిన ఈ సంభాషణవల్ల తేటతెల్లమవుతూ ఉన్నది.

## మద్రాసులో బహిరంగసభ

1915 ఏప్రిల్ 21 సాయంకాలం ఇండియన్ సౌత్ ఆఫ్రికన్ లీగ్ (భారతీయ దక్షిణాఫ్రికా సమితి) యాజమాన్యంలో మద్రాసులో విక్టోరియా పుర మందిరం ఆవరణలో గాంధీ దంపతులకు సన్మాన పత్రాలు సమర్పించటానికొక గొప్ప బహిరంగ సభ జరిగింది. ఆ సమితి కార్యదర్శులలో ఒకరయిన యాకూబ్ హుస్సేన్ సేట్‌గారు, డాక్టర్ సర్ సుబ్రహ్మణ్యఅయ్యరుగారిని ఆ సభకు అధ్యక్షులుగా ఉండమని కోరినారు. రెవరెండ్ జె పీటరుగారు ప్రతిపాదనను బలపరిచినారు. మద్రాసులోని క్రైస్తవ మత పీఠాధిపతులు గోమాంతరంలో ఉన్నందువల్ల వారు తమ సంఘం పక్షంలో గాంధీ దంపతులకు సమర్పించుకొనేటందుకొక సన్మాన పత్రాన్ని వ్రాసి పంపినారు. దానిని భారతీయ దక్షిణాఫ్రికా సమితి సంఘ కార్యదర్శులలో ఒకరయిన జి. ఎ. నటేశన్‌గారు సభలో చదివి గాంధీ దంపతులకు సమర్పించినారు.

## అధ్యక్ష ప్రసంగము

అధ్యక్షులు సుబ్రహ్మణ్య అయ్యరుగారిట్లా ప్రసంగించినారు. "నాకిప్పటికి 78 సంవత్సరాలు వచ్చినాయి. ఇంతటి సుదిన మిదివరకెప్పుడు నా జీవితంలో కలగలేదు. నేనీ అధ్యక్షస్థానాన్ని ఎంతో గౌరవంగా భావిస్తున్నాను.

గాంధీజీ భారతీయులలో అగ్రగణ్యుడు. యావత్ప్రపంచ దృష్టిలోను మన మాతృదేశాన్ని అత్యున్నతస్థాయిలో ప్రదర్శించగలిగిన మహనీయుడితడు

ఇంతపని ఇదివర కెవ్వరునూ చేసిఉండలేదు భారతీయులను నీచంగా చూడకుండా వారిపట్ల తగినంత గౌరవ మర్యాదలతో ప్రపంచం ప్రవర్తించేటట్లు చేయగలిగిన ధీయనయే ఈ దేశంలో ఆసేతు హిమాచలము ప్రతియింటా ఈయన పేరు ప్రతిధ్వనిస్తూండటం మనకు తెలియని విషయం కాదు ఆయనను సన్మానించేటందుకే ఈ సభ యేర్పాటు చేయబడింది ఆయనతోపాటు ఆయన కష్టాలలో, పోరాటాలలో, దుఃఖాలలో, బాధలలో, జయాపజయాలలో సమభాగస్వామినిగా ఉండి భారత నారీరత్నాలకు దీప్తిని ప్రసాదించిన ఆయన అర్ధాంగి కస్తూరీబా గాంధీని కూడా మనమిక్కడ సన్మానించదలచుకొన్నాము ఇక్కడ చేరిన వారందరు గాంధీజీ జీవితం గురించి బాగా తెలిసినవారే ఆయన జీవిత చరిత్రను దేశభాషలన్నిటిలోనూ మనోజ్ఞంగా మనస్సునకు హత్తుకొనేటట్లు వ్రాయించి అచ్చొత్తించి బహుళంగా పంచిపెట్టవలసి ఉన్నది అందువల్ల ఉత్తేజకరమయిన ఆయన చరిత్ర భారతదేశంలోని ప్రతి పురుషునికి ప్రతి స్త్రీకి ప్రతి బిడ్డకూ అందుబాటులో ఉండగలదు ఆయన ఇంతవరకు చేసిన పని భవిష్యత్తులో ఆయన చేయనున్న పనికి కేవలం నాందీ మాత్రమే ఆయన, ఆత్మశక్తికి అపరావతారము లాయరులోని సూక్ష్మబుద్ధి, యోగిపుంగవునిలోని సౌశీల్యమూ ఆయన రాజకీయ నైపుణ్యంలో సమ్మిళితాలయి ఉన్నవి ఆయన ఉన్నతమయిన ఆత్మశక్తిముందు సామ్రాజ్యం భౌతికశక్తి సయితం పాదాక్రాంతం కావలసిందే

భారతదేశ పరిస్థితులను గురించి ఆయన నేడు అంతశ్శుద్ధిగా చేస్తున్న పరిశీలన కొంత కాలంలో పరిపూర్తి కావచ్చు అప్పుడాయన తన కార్యక్రమం నిస్సంకోచంగా కొనసాగించగలరు ఆయన తన చుట్టునూ తనవలెనే సర్వసంగ పరిత్యాగులయిన వారిని చేర్చుకొని మన దేశ స్వాతంత్ర్య సంపాదనకు పూనుకోగలరు గాంధీజీ చేయనున్న పని ఏ విద్యాశాఖకు సంబంధించినవారు గానీ చేయగలిగినది కాదు గాంధీ పని రాజకీయ నాయకులవలె ఉపన్యాసాలివ్వడం గానీ సంఘ సంస్కర్తలవలె వితంతూద్వాహాలను గురించి బాల్య వివాహాలను గురించి ప్రసంగించడంకానీ కాదు

మన దేశ క్షేమంకోసం మనం కోరుతున్న కోరికలకు వ్యతిరేకంగా నిరంకుశాధికార వర్గంవారి ప్రతిఘటనను తొలగించుకొనేటందుకు మన సిపాయిలు యూరోపులో చేస్తూండిన కృషికంటె కూడా గాంధీజీ చేయనున్న పని ఎక్కువ ఘనమయినది నిరంకుశాధికార వర్గంవారు తమ ప్రతిఘటనను కొనసాగించడం అసంభవమని వారికి తోచేటంతవరకూ 'ఆత్మశక్తి' పెంపొందింపబడితేనేగాని వారు లొంగిరారు " అని సంతోషధ్వానాల మధ్య అధ్యక్షుడు తన ఉపన్యాసం ముగించినారు

తరవాత జి ఎ నటేశన్ ఈ సన్మానపత్రం చదివినారు

"గౌరవనీయ ప్రేమమూర్తీ! మిమ్ము ఈ నగరానికి రాజధానికీ నిండు హృదయంతో ఆహ్వానిస్తున్నాము దక్షిణాఫ్రికాలో మీకు చేదోడువాదోడుగా

ఉండిన వారనేకులు- ముఖ్యంగా వారిలో మంచి శక్తిసామర్థ్యాలూ సత్గుణాలూ గలవారు ఇక్కడ ఉన్నందుకు మేము గర్విస్తున్నాము మన ఈ మాతృదేశాన్ని సేవించినవారిలో మిమ్మల్ని మించినవారు లేరు సరికదా మీతో సమానులు సైతం లేరు మన ఈ మాతృదేశ సేవలో మీరు సాధించిన ఘనకార్యాలను మరెవ్వరూ సాధించలేదు

మీరు సంపూర్తిగా ఒక తరంవరకు అతి నిష్ఠురమూ కఠోరమూ అయిన పోరాటం నడిపినారు ముఖ్యంగా ఆ పోరాటం నిరుపేదతనంతో క్రుంగిపోతూఉండిన అట్టడుగు ప్రజల పక్షాన నడపబడింది ఆ ప్రజలు న్యాయం ధర్మం తెలిసిన ప్రపంచదృష్టిలో విదేశీయులుగా ఎన్నబడతగినవారు కారు అందులో పాల్గొనిన వారొక రక్తబిందువునైనా చిందింపకుండటం, ఎన్ని కష్టాలు వచ్చినా తాము ప్రారంభించిన ఉద్యమంపట్ల ఎడతెగని విశ్వాసంతో ప్రవర్తించగలగటం అత్యంత ప్రశంసార్హము ఆ ధర్మ సంగ్రామంలో మీ విజయంకంటే కూడా ఎక్కువగా శ్లాఘించదగినది మీ అవలంబించిన విధానము రాజనీతి చాతుర్యంతోపాటు జతచేయబడిన పశుబలప్రయోగం ఎదుర్కొనేటందుకు ఇతరులదృష్టిలో పనికిమాలినవారుగా భావింపబడుతూఉండిన స్త్రీ పురుషులను అండచేసుకొని ఆత్మబలంతో మీరు పురోగమించగలిగినారు అది ఎట్లాసాధ్యమయిందో ఇప్పటికీ నమ్మశక్యం గాకున్నది మిమ్మల్ని అనుగ్రహించిన ఆ ప్రజ దేవునియందు, న్యాయంనందు మీ సదసద్వివేకంనందు విశ్వాసం గలిగి వీరోచితంగా ముందుకు నడిచినారు వారు తిట్లనూ, దోపిడీలను, కారాగారవాసాలను, లాఠీ దెబ్బలనూ ఇంకా అనేక నిర్బంధాలను సైతం సహించినారు తీవ్రములయిన అనేక అన్యాయాలకు సాత్వికనిరోధం నివారణోపాయంగా పనికివస్తుందని ప్రపంచ చరిత్రలో ప్రప్రథమంగా రుజువు అయింది ఇక భారతీయుడనే పేరు దక్షిణాఫ్రికాలోగాని, బ్రిటిష్ సామ్రాజ్యంలోగాని మరెక్కడగాని నీచంగా, అవమానకరంగా భావింపబడదు మీరు సంపూర్ణమయిన ఆత్మనిగ్రహం కలవారు స్వార్థత్యాగులు, నిరాడంబర జీవులు, ఆదర్శమానవులు మీ ఆదర్శాలను ఆచరణలో పెట్టేటందుకు మీకు అనంతమయిన ఇచ్ఛాశక్తి (సంకల్పబలం) ఉన్నది మానవజాతిపట్ల మీకుగల ప్రేమా, గౌరవమూ, మృదుత్వాలు జాతిమత (రంగు) రూప లింగవయోభేదాలనుగాని, ధనిక దరిద్ర భేదాలనుగాని గుర్తించవు అందువల్ల ఈ తరంవారు మీలో సుఖదుఃఖాలలో పేదలపాలిటి పెన్నిధియైన దైవత్వాన్ని చూడగలుగుతున్నారు ఈ సందర్భంలో మీ కుమారులను గురించి సైతం మేము కొంత స్మరించక తప్పదు వారు ఐశ్వర్యంకోసం పదవులకోసం జన్మించలేదు సదాచారము, దేశభక్తి, మానవసేవ అనే పదాలకు ప్రత్యామ్నాయంగా పేరొందిన మహాపురుషునికి వారసులుగా పుట్టినారు దేవుడు వారిని మిమ్మల్ని చిరకాలం దయతో చూడగలడు

ప్రేమమూర్తీ! మిమ్మల్ని మద్రాసుకు మరోమారు ప్రేమాభి

మానపురస్సరంగా ఆహ్వానిస్తున్నాము " ఈ సన్మానపత్రం అందుకొని గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

"మద్రాసులో- ఒక్క మద్రాసులోనేమిటి? మద్రాసు రాజధానిలోని మీరంతా నన్నూ నా సహధర్మచారిణినీ గౌరవించి మాపై మీ ప్రేమామృతాన్ని వర్షింపజేసినందుకు మేమత్యంత కృతజ్ఞులము మద్రాసు ఎంతో చైతన్యవంతమయిన గొప్ప రాష్ట్రము సంతోషకరమయిన మీ సన్మానపత్రంలో మీరు పేర్కొన్న విషయాలకు మేమేమయినా అర్హులమయిఉంటే ఆ అర్హతకు కారణం మా గురువుగారు (గోఖ్లే) ఆయన చరణసన్నిధిని పొందిన స్ఫూర్తి వలననే దక్షిణాఫ్రికావంటి దూరదేశంలో యింతకాలంగా నేను పని చేయ గలుగుతున్నాను మీ సన్మానపత్రంలో మీరు ప్రకటించిన భావాలు కేవలం భవిష్యత్సూచకాలయిన ఆశీర్వాదవాక్యాలని మా తలంపు ఈ మహోపథ కారణంగా మేము పొందిన శక్త్యుత్సాహాలనూ ఈ పవిత్రభూమినుంచి మాలో ప్రబోధితమయిన మనోవికాసాన్ని మాతృదేశసేవకోసం వినియోగించగలము మా మద్రాసు రాకలో కొత్త(వింత) ఏమీలేదు మేము ఎంతకాలంక్రితమో మద్రాసు రావలసిఉండినందువల్ల మద్రాసును మేము నిర్లక్ష్యం చేసినామనీ మా మిత్రుడు నటేశన్ మీకు చెప్పివుండవచ్చు కాని మేమెన్నడూ అట్లాచేసి ఉండలేదు మీ హృదయాలలో మాకొక స్థానం ఉన్నదని మాకు తెలుసు ఇతర రాష్ట్రాలకూ ఇతర పట్టణాలకూ పోక ముసుపు మేము తొందరపడి మద్రాసు రాగంతమాత్రంతో మీరు మమ్మొలను తప్పుగా ( ర్థం చేసుకోరని కూడా మాకు తెలుసు

1896 లో గోఖ్లేను నేను నా రాజకీయగురువుగా గ్రహించి నాను ఇక్కడనే నాకు గంభీరమయిన మతప్రబోధం కలిగింది అదే నన్ను అన్ని కష్టాలనుంచి బయటపడవేసింది 1896 లో నేను ఏదో ఒక దూరస్థ విషయం గురించి అర్థంచేటందుకు వచ్చిన ఒక నూతనవ్యక్తివలె మీ యెదుట ప్రత్యక్షమయినాను ఒక విషయంలోని మంచిచెడ్డలను గుర్తించగల సహజ ధార్మికశక్తి మద్రాసు రాష్ట్రీయులకుఉందని అనాడే నేను కనిపెట్టగలిగినాను అనాడు యావద్భారతదేశంలోని ప్రజానీకానికి ఏ క్లిష్టపరిస్థితులను తెలియ చెప్పేటందుకు నేను ప్రయత్నిస్తూ ఉండినానో దానిని మీరు సంపూర్ణంగా అర్థంచేసుకోగలిగినారు 1896 లో ఇక్కడ నాకు కలిగిన అభిప్రాయాలు దక్షిణాఫ్రికాలోని నా అనుభవాలకు పూర్తిగా అనుగుణంగా ఉన్నవి ఈ సంతోషదాయకమైన సన్మానపత్రాన్ని రచించినవారు, దక్షిణాఫ్రికాలో నేను నిర్వర్తించగలిగిన చిన్నపనిని గోరంతలు కొండంతలు చేసి అతిశయోక్తులతో అభివర్ణించినారని చెప్ప సాహసిస్తున్నాను ఆ రాజకీయ (రాజర్షి) మహర్షి గోఖ్లే ప్రభావానికి భారతదేశం సమ్మోహితమయి ఇప్పటికీ తేరుకో లేకున్నదని నేను అనేక వేదికలనుంచి ప్రసంగించిఉన్నాను ఆయన నాకొక యోగ్యతాపత్రాన్ని ప్రసాదించినారు- దానిని 'తు' 'చ' తప్పకుండా మీరు

గ్రహించినారు- ఆ యోగ్యతాపత్రము ఇప్పుడు నన్ను ఎంతో చికాకు పరుస్తున్నది ఈ దేశంలో మున్ముందు సేవచేయవలసిన ఎన్ని ఆకాంక్షలకు తగినట్లు నిర్వర్తించగలనో లేదో మాకు తెలియడం లేదు

మీ ఈ సన్మాన పత్రంలో ప్రయోగించిన భాషలో ఎదవ వంతు కు పేరు తగి ఉన్నట్లయితే దక్షిణాఫ్రికాలోని మీ దేశస్థుల బాధానివారణార్థం ప్రాణాలను సమర్పించటంతో తమ కర్తవ్యాన్ని సంపూర్ణంగా నిర్వహించిన వారిని గురించి మీరేతరహా భాషను ఉపయోగించగలరో తెలియడం లేదు మాతృదేశ గౌరవ సంరక్షణార్థం కల్లాకపటం ఎరుగని విశ్వాసంతో పదునేడు పద్దెనిమిది సంవత్సరాల వయస్సుగల నాగప్పన్, నారాయణస్వామి అనే బాలురు ఎన్నెన్నో కష్టాలను, బాధలను, అవమానాలను ఎదుర్కొన్నారు వారిని గురించి మీ రెటువంటి భాషను ఉపయోగించగలరు ? మారిట్జ్ బర్గ్ చెరసాలనుంచి విడుదల చేయ బడిన ఆ బోమికల ప్రోగు వల్లియమ్మ అనే పదునేడేండ్ల వయస్సుగల ముద్దు బిడ్డ, ఒక నెల రోజులలో మృత్యువు వాతబడినది ఆమెను గురించి మీరే భాషలో అభివర్ణించనున్నారు? భారతీయులందరిలోకి మద్రాసీలనే ఈ మహాత్కార్యానికి భగవంతుడు ప్రత్యేకించినట్లు కనిపిస్తుంది కడచిన ఎనిమిదేళ్ళ దీర్ఘకాలంలో దక్షిణాఫ్రికాలోని భయంకర సంకట పరిస్థితులను ఎదుర్కొని ఒకసారిగాని రెండుసార్లు గాని జైలుకు పోని మద్రాసీని జోహాన్సుబర్గ్‌లోని మద్రాసీలు చులకనగా చూస్తారన్న విషయం మీకు తెలియదేమో ? ఆ మహోదార స్త్రీ పురుషులకు స్ఫూర్తి నిచ్చినది నేనని మీరు చెప్పిన మాటలను నే నంగీకరించ లేను ఆడంబరమంటే ఏమో ఎరుగని ఆ అమాయిక ప్రజలే కించిత్తు ప్రతిఫలం కూడా అపేక్షించక నాకు స్ఫూర్తినిచ్చి నన్ను సగర్వం నిలబెట్టి వారి మహోత్తర త్యాగాలతోనూ వారికి దేవునియందుండిన అపూర్వ విశ్వాసంతోనూ నన్ను జతచేసి నా చేతనయిన పనిని నాచే చేయించినారు నేనూ నా అర్ధాంగి పది మందికీ వెల్లడి అయ్యేటట్లు పనిచేయవలసి వచ్చింది అది నా దురదృష్టము మేము చేసిన ఈ చిన్నపనిని మీరు గోరంతలు కొండంతలుచేసి వర్ణించినారు మేముకూడా మీతో సమానులమయిన వారమే సామాన్య మానవమాత్రులము ఇండియాలోకానీ దక్షిణాఫ్రికాలోగానీ మీ సహాయంతో మేము చేయగలిగిన పనిని,మీరు చేయకుండానే మేము చేయ సంసిద్ధులంగా ఉన్నామని మీరు భావిస్తే మీరూ మేమూ కూడా అపజయం పొందే మాట నిజమే మేము చేసిన పని సైతం వ్యర్థమయిపోయేమాట వాస్తవము మావల్ల స్ఫూర్తి లభించినదనే మాట ఒక్క క్షణం కూడా మేము నమ్మబోవడం లేదు

ప్రజలవల్ల మాకు స్ఫూర్తి లభించింది కష్టనివారణం కోసం తహతహలాడే ప్రజలకు ప్రభువుల మనుకొనే అధికారులకు మధ్య మేము దుబాసీలుగా (వ్యాఖ్యాతలుగా) పని చేయగలిగినాము ఆ ఇరుకక్షుల మధ్యా మేము మధ్యవర్తులం మాత్రమే అంతకంటె ఎక్కువకాదు నా తలిదండ్రులు నాకు చెప్పించిన చదువుకు ప్రతిఫలంగా మన మధ్య జరుగుతూండిన సంఘటనలను ఆ

అమాయిక ప్రజలకు తెలియజెప్పడం నా విధి వారుకూడా అవసరానికి అను గుణంగా ప్రవర్తించినారు ఇండియాలో జన్మించిన ప్రాముఖ్యాన్ని గుర్తించి నారు ఆధ్యాత్మిక శక్తికి గల ప్రభావాన్ని కూడా వారు గ్రహించినారు అందువల్ల వారే మాకు స్ఫూర్తి కలిగించినారు మీ కోసం నా కోసం మర ణించి తమ కర్తవ్యం పూర్తిగా నిర్వర్తించుకొన్న ఆ మహనీయులు మనకు ఉత్సాహజనకులుగా ఉంటారు గాక! ఈనాడు మనం బ్రతికి బాగున్నాము కాని రేపు మనమే దుర్దశలకు లోనయి భ్రష్టులం కానున్నామో ఎవ్వరికి తెలుసు? కాని ఈ ముగ్గురూ మాత్రం శాశ్వతంగా ఈ లోకాన్ని విడిచినారు డెబ్బది సంవత్సరాల వయస్సుగల వృద్ధుడు హర్బత్‌సింగు కూడా దక్షిణాఫ్రికా జైలులో మరణించినాడు మీరు నా తలపైన బలవంతంగా పెట్టనున్న ఆ కిరీటానికి ఆయన అర్హుడు మీకు నాపట్ల ప్రేమవల్ల కలిగిన అంధవిశ్వాసంతో నాపై వర్షింపజేసిన విశేషాలన్నిటికి నేనింతకు పూర్వం పేర్కొన్న ఆ యువకులే తగినవారు ఈ పోరాటంలో కేవలం హిందువులే పాల్గొనలేదు మహమ్మదీయులు, పార్సీలు, క్రైస్తవులూ కూడా పాల్గొన్నారు ఈ పోరాటంలో ఇండియాలోని ప్రతిభాగమూ ప్రాతినిధ్యం వహించింది తమ అందరినీ సమానంగా ఎదుర్కొంటూన్న అపాయం వారు గ్రహించినారు భారతీయులుగా తమ భవితవ్యంకూడా వారు గుర్తించినారు కాబట్టి వారు-వారు మాత్రమే భౌతిక శక్తులను ఆత్మశక్తితో ఎదరించగలిగినవారు

## మద్రాసు కాస్మోపాలిటన్ క్లబ్‌లో గాంధీజీ - 1915

1915 ఏప్రిల్ 22 సాయంకాలం గాంధీజీని మద్రాసు కాస్మోపాలిటన్ క్లబ్‌వారు ఆహ్వానించినారు ఇష్టాగోష్ఠిలో ఒక గంటకాలం ఆనందంతో గడిపిన తరవాత క్లబ్ కార్యదర్శి (శ్రీ) రంగాచారి అక్కడకు హాజరైన వారిలో చాలా మందిని గాంధీజీకి పరిచయం చేసినారు క్లబ్ అధ్యక్షుడు గౌ. (శ్రీ) జస్టిస్ శంకరనాయరుగారు కూడా హాజరైనారు కొంతకాలం సంగీతం మొదలయిన వినోద కార్యకలాపాలు జరిగినాయి గాంధీజీ చిన్న ఉపన్యాసం చేసినారు గాంధీజీని అక్కడి వారందరూ అభినందించినారు క్లబ్ ఉపాధ్యక్షుడు త్యాగరాయ చెట్టిగారు గాంధీజీకి పుష్పమాలవేసి సత్కరించినారు

## లాయర్ల విందులో గాంధీజీ

1915 ఏప్రిల్ 24 న మద్రాసు లాయర్లు గాంధీజీకి విందుచేసినారు ఆ సభకు అడ్వొకేట్ జనరల్ అధ్యక్షత వహించినారు అది ఏటేటా జరిగే సమావేశము అందులో బ్రిటిష్ సామ్రాజ్య సంక్షేమంకోసం 'టోస్ట్' ప్రతిపాదించవలసిందిగా ప్రత్యేకం గాంధీజీని లాయర్లు కోరినారు "గాంధీజీ ఒక సుప్రసిద్ధ నూతనవ్యక్తి- అంటే మన మాయనను చిరకాలంనుంచి ఎరిగి ఉండ లేదని కాదు ఆయన మన వృత్తికలవారిలో ఒకరయినప్పటికీ ఆ వృత్తికి ఇటీ

వల దూరంగా ఉన్నారని చెప్పడం మాత్రమే నా ఉద్దేశము గాంధీజీ బ్రిటిష్ సామ్రాజ్యం ఐక్యంకోసం సుంతరా మునుగ ఐత్యంత శ్రద్ధాసక్తులతో కృషి చేసినవారు వారిప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యానికి 'టోర్ట్స్' ప్రతిపాదించ మన్నారు" అని అడ్వొకేట్ జనరల్ ప్రకటించినారు

గాంధీజీ ఆ సభలో

"ప్రధాన న్యాయమూర్తి మహాశయా! అధ్యక్షా! పెద్దల రా! ఆధునిక సభ్యతకు తీరని ప్రత్యర్థిగానూ అశేష దేశభక్తుడుగా ఉన్న నాకు భారత దేశం బ్రిటిష్ సామ్రాజ్యంలో ఎంతో పెద్ద భాగంగా ఉన్నప్పటికీ, బ్రిటిష్ సామ్రాజ్యంపై విశ్వాసంగలిగి ఉండటం ఎట్లాసాధ్యపడుతుందనిఇంగ్లాండ్ లోనే కాక ఈ దేశంలో పర్యటిస్తున్న ఈ మూడు నెలలలోనూ అనేకమంది నన్ను ప్రశ్నిస్తున్నారు ఇంగ్లాండ్, భారతదేశాలు రెండూ పరస్పర ప్రయోజనాల నిమిత్తం కలసి పనిచేయగలవని అనుకోవడం నాకెట్లా సాధ్యపడుతుందని కూడా చాలామంది శంకిస్తున్నారు అత్యంత ప్రాముఖ్యమైయిన ఈ మహా సభలో బ్రిటిష్ సామ్రాజ్యంలో నా విశ్వాసం ప్రకటిస్తున్నందుకు నాకు ఎంతో సంతోషంగా ఉన్నది ఈ నా విశ్వాసం కేవలం స్వార్థపరత్వంపైన ఆధారపడి వున్నది సాత్వికనిరోధకుడయినవాడు, అన్ని పరిస్థితులలోను సాత్విక నిరోధానికి తగిన హక్కులను సంపాదించవలెనని నేను గ్రహించినాను బ్రిటిష్ సామ్రాజ్యానికి కొన్ని ఆదర్శాలు ఉన్నాయని నా అభిప్రాయము ఆ ఆదర్శాల పట్ల నాకు ప్రీతి వున్నది బ్రిటిష్ సామ్రాజ్యంలోని ప్రతి పౌరుని తన శక్తిసామర్థ్యాలను పూర్తిగా వినియోగించుకొనేటందుకు సంపూర్ణావకాశం వుంది అంతేకాదు ప్రతి పౌరుని ఆలోచన తన అంతరాత్మకు అనుగుణంగా ఉండవచ్చు ఇది ఒక బ్రిటిష్ సామ్రాజ్యంలోనే సాధ్యంకాని, మనకు తెలిసిఉన్న ఇంకే ప్రభుత్వంలోనూ సాధ్యంకాదు నాకు ఏ ప్రభుత్వంమీదను అభిమానం లేదు ఆ సంగతి బహుశా మీకుకూడా తెలిసి ఉంటుంది ప్రభుత్వమనేది ఎంత తక్కువ అధికారం చలాయిస్తే అంత మంచిప్రభుత్వం అని నేననేకసార్లు చెప్పినాను బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వము సాధ్యమయినంత తక్కువ అధికారం చలాయించి పరిపాలించగలదని నా అభిప్రాయము బ్రిటిష్ సింహాసనంపట్ల నా విశ్వాసానికి కదే కారణము" అని ఉపన్యసించినారు

## విద్యార్థులతో గాంధీజీ

గాంధీజీ మద్రాసులో ఉండగా ఆయన అనేక సభలలో పాల్గొని ప్రసంగించినారు. ముఖ్యంగా గాంధీజీకి విద్యార్థులతో కలసిమెలసి ఉండటం చాలా ఇష్టము అందువల్ల గాంధీజీని ఆహ్వానించడంలో మద్రాసు విద్యార్థులు అత్యుత్సాహం చూపించినారు 1919 ఏప్రిల్ 27 న వై యం సి. ఏ ఆవరణలో విద్యార్థు లత్యధిక సంఖ్యాకులుగా గుమిగూడి గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు సభా ప్రారంభంలో కొంతమంది బెంగాలీలు కలిసి వందేమాతరం

గీతం ఏకకంఠంతో గానంచేసినారు గా॥ శ్రీ వి యస్ శ్రీనివాసశాస్త్రి సభాధ్యక్షులుగా ఉన్నారు ఆయన గాంధీ దంపతులను గురించి ప్రశంసిస్తూ గంభీరోపన్యాసం చేసినారు విద్యార్థుల సన్మానపత్రాన్ని పరిగ్రహిస్తూ గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

"అధ్యక్షా ! స్నేహితులారా ! నన్నూ నా సహధర్మచారిణినీ గురించి స్తుతించడంలో మద్రాసు ఇంగ్లీషు భాషలోని విశేషణాలన్నిటినీ కొదవలేకుండా ఉపయోగించింది దయా దాక్షిణ్య గౌరవ ప్రేమాభిమానాలతో నీకు ఊపిరి తిరగకుండా చేసిన చోటు ఏదని ఎవరయినా నన్ను ప్రశ్నిస్తే తక్షణం నేను మద్రాసు అని చెప్పివేస్తాను మద్రాసుమీద నా కటువంటి విశ్వాసం కలదని నే ననేకచోట్ల అనేక పర్యాయాలు చెప్పినాను అందువల్ల మీరు నాపైన వర్షింప జేస్తూండిన ఈ నిరుపమాన ఉదార దయాదాక్షిణ్యాలు నా కాశ్చర్య జనకాలుగా లేవు నేను కొంతకాలం శిక్షణ పొందదలచుకొన్న "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ" కి (భారత సేవక సమాజము) అధ్యక్షుడయిన నేటి అగ్రాసనాధిపతి చేసిన ప్రసంగం వాటన్నిటికీ మకుటాయమానంగా ఉన్నది ఈ ప్రశంసలన్నిటికీ నేనర్హుడనా ? "కాను" అని నా హృదయాంతరాళం నుంచి నొక్కి వక్కాణించగలను కాని మీరు నన్ను గురించి వాడదలచుకొన్న అన్ని విశేషణాలకు తగినట్లుగా ఉండవలెననే తలంపుతోనే నే నిండియాకు వచ్చినాను మీరు ప్రయోగించిన విశేషణాలకు తగిన సేవకుడనని నేను రుజువు చేయదలచుకొన్నట్లయితే అందులో నా జీవిత సర్వస్వాన్ని సమర్పించవలసి ఉంటుంది మనోహరమయిన మన జాతీయగీతం (వందేమాతరం) లో భారత మాతను అభివర్ణించడంలో కవి ఆయనకు తెలిసిన అన్ని విశేషణాలను కురిపించి వేసినాడు ఆ గీతం ఆలాపించేటందుకు మనకు అర్హత ఉందా ?

భారతమాత స్వరూపం మనకు తెలిసేటందుకు కవి చిత్రించిన మాట వాస్తవమే కాని ఆ మాటలు భావ్యర్థసూచకాలు మాత్రమే మన మాతృదేశంను వర్ణించడంలో కవి ప్రయోగించిన ప్రతి మాటనూ యథార్థ చేయవలసిన బాధ్యత మీమైన ఉన్నదని భారతదేశం ఆశిస్తూన్నది మన మాతృదేశాన్ని చిత్రిస్తూ కవి ఉపయోగించిన విశేషణాలన్నీ ఈనాడు సముచితాలుగా లేవని నా అభిప్రాయము

మీ మద్రాసు విద్యార్థులుగాని తదితర భారతీయ విద్యార్థులుగానీ నేడు అభ్యసిస్తున్న విద్య ఆ (కవి ఉద్దేశించిన) ఆదర్శాలను అందుకొనేటందుకు గానీ, మీలోని ఉత్తమ లక్షణాలను ఉత్తేజపరచేటందుకుగానీ ఉపయోగపడుతూన్నదా? లేక మీ విద్యా సంస్థలు ప్రభుత్వోద్యోగులను, వాణిజ్య కార్యాలయాలలో గుమాస్తాలను తయారుజేసే యంత్రాగారాలు గా ఉన్నవా ? మీరు నేర్చుకొంటూన్న చదువు ప్రభుత్వ శాఖలలోగానీ తదితర శాఖలలోగానీ ఉద్యోగాలు చేయడానికేనా? మీ చదువుకు సార్థకం అదే అయితే మీ ఆదర్శం కూడా అంతకు మించి లేకుంటే, ఆ కవి తనకు తాను చిత్రించుకొన్న ఆ భారత

మాత మనోహర దృశ్యాన్ని మీరు ప్రత్యక్షంగా చూడగలగడం దుర్లభమని నా భయం నేను ఆధునిక నాగరికతను ప్రత్యక్ష శత్రువునని మీరు విని అయినా ఉంటారు, లేదా చదివి అయినా ఉంటారు ఈనాడు ఐరోపాఖండంలో ఏమి జరుగుతూన్నదో తెలుసుకొనేటందు కొక్కసారి మీ దృష్టినటు మరల్చండి ఈనాడు యూరపు ఆధునిక నాగరికత ఇనప మడమల కింద నలిగిపోతున్నదని మీరు గ్రహించగలిగితే మీరు మీ పెద్దవాండ్లు మన మాతృభూమి ఆధునిక నాగరికతను అనుకరించేటందుకు ఆతురపడరని భావిస్తున్నాను అయితే "మన పరిపాలకులు మన మాతృదేశానికా సంస్కృతిని తెచ్చిపెట్టినప్పుడు మనం చేయగలిగిన దేమున్నది ?" అని చాలామంది అంటారు దీని విషయంలో మీరెవరూ ఏ విధమయిన పొరపాటూ పడనక్కరలేదు మన పరిపాలకులు ఆ సంస్కృతి నిక్కడకు తీసుకొని వచ్చినారని ఒక్కక్షణంకూడా నేను నమ్మను మీ రా సంస్కృతిని ఆమోదించకపోతే మన పరిపాలకులు దాని నిక్కడకు తీసుకొనిరాగలిగి ఉండేవారు కారు ఒకవేళ ఆ సంస్కృతిని వారిక్కడికి తెచ్చి నప్పటికీ, పరిపాలకులను తిరస్కరించనవసరం లేకుండానే వారి సంస్కృతిని తిరస్కరించగల శక్తిసామర్థ్యాలు మనకు కలవని నా అభిప్రాయము బ్రిటిష్‌జాతి మనతో ఉన్నదని నేననేక వేదికలపైన చెప్పినాను అందుకు కారణాలను నేను వివరించదలచుకోలేదు పూజ్యులయిన మన అధ్యక్షులు చెప్పినట్లు మనం మన మహర్షుల సత్సంప్రదాయాలను అనుసరించగలిగితే భారతజాతి ప్రపంచాని కొక సందేశం ప్రసాదించగలదు అది భౌతికబల సందేశం కాదు, ప్రేమ సందేశము అప్పుడు ఆ విజేతలను జయించగల హక్కు కలుగుతుంది ఆ విజయం రక్తపాతంవల్ల కాక, కేవలం ఆధ్యాత్మికా త్యాగంవల్ల మాత్రమే లభించ గలదు ఇండియాలో నేటి స్థితిగతులను గురించి ఆలోచించినప్పుడు రాజకీయ హత్యలను గురించి రాజకీయపు దోపిడీలను గురించి మన అభిప్రాయం చెప్ప వలసిన అవసరం ఉందని భావిస్తున్నాను ఇవి కేవలం విదేశాలనుంచి దిగుమతి యైనవని భావిస్తున్నాను ఈ దేశంలో వీటికి స్థానం లేదు ఈ రకమయిన బీభత్సస్థితికి విద్యార్థులయిన మీరు మానసికంగా గాని నైతికంగా గాని ఏ విధ మయిన ఆమోదమూ చూపరాదు దానికి ప్రతిగా సాత్త్విక నిరోధన డనైన నేను మరొక శక్తిమంతమయిన ఉపాయం చూపగలను మిమ్ములను మీరు అదుపులో పెట్టుకొనండి! ఆత్మపరీక్ష చేసుకొనండి! ప్రతి నిరంకుశత్వాన్ని మీరు అన్ని విధాలా అరికట్టండి ! మీ స్వాతంత్ర్యానికి భంగం కలిగించే ప్రతి పరిస్థితిని మీరు ప్రతిఘటించి తీరండి ! కాని అందుకు కారకుడయిన ఆ దుష్టులుని రక్తం చిందించనక్కరలేదు అది మన మతధర్మం కాదు మన మతానికి మూలము అహింస ఆచరణలో అది ప్రేమగా పరిణమిస్తుంది నీవు నీ ఇరుగుపొరుగు వారినీ నీ స్నేహితులనూ ప్రేమించడమే ప్రేమగాదు నీ శత్రువులను సైతం ప్రేమించగలిగి ఉండటమే నిజమయిన ప్రేమ

ఈ విషయాన్ని గురించి మరోమాట చెప్పవలసి ఉన్నది మనము సత్యా

హింసలను ఆచరణలో పెట్టవలసొస్తే వెంటనే నిర్భయతను అభయాన్ని కూడా ఆచరణలో పెట్టక తప్పదు మన పరిపాలకులు తప్పుచేస్తున్నారని మనకు తోచేటట్లయితే, వారు మన సలహాను పాటించేటట్లు చేయదలచుకొన్నట్లయితే రాజద్రోహంగా పరిగణింపబడే విషయాలను గూడా మీరు మాట్లాడవచ్చు కాని అందువల్ల కలిగే కష్టనష్టాలను భరించేటందుకు మాత్రం మీరు తయారుగా ఉండవలె మీరు అట్లా ప్రవర్తిస్తూ అధర్మానికి దిగకుండా ఉన్నప్పుడే ప్రభుత్వంవారిచేత కూడా మీ సలహాను అంగీకరించేటట్టు చేయడానికి మీకు వాక్కేర్పడుతుంది

బ్రిటిష్ సామ్రాజ్యంలోని ప్రతి పౌరునితోనూ సమానప్రతిపత్తితో వ్యవహరించేటందుకు నాకు అవకాశం ఉందని నమ్ముతూన్నందుననే నేను బ్రిటిష్ ప్రభుత్వానికి మిత్రుడుగా ఉంటున్నాను నాకీ రోజున అసమాన ప్రతిపత్తి ఉన్నట్లు భావిస్తున్నాను నేను పరాధీనజాతికి చెందినవాణ్ణి కాను నన్ను నేను పరాధీన జాతివానిగా భావించడంలేదు స్వాతంత్ర్యం మీకు బ్రిటిష్ పరిపాలకులు ప్రసాదించేది కాదు మీ అంతట మీరు సంపాదించుకో గలిగినది మన ధర్మాలను మనం నిర్వర్తించినందువల్లనే అందుకు మనము అర్హులం కాగలము మాక్స్‌ముల్లర్ చెప్పినట్లు- మన మతం గురించి వ్యాఖ్యా నించేటందుకు మనం మాక్స్‌ముల్లర్ వరకూ పోనక్కరలేదు- కాని ఆయన మన మతానికి ప్రధానాశయం 'ధర్మము' కాని 'హక్కు' కాదన్నాడు కాబట్టి మీరు మన ధర్మనిర్వహణవల్లనే మన కోరిక పూర్తిగా ఫలించగలదని మీరు విశ్వసిస్తే మీరు నిరంతరం మీ కర్తవ్యం గురించి మాత్రమే ఆలోచించండి! మీ పోరాటం ఈ విధానంలో సాగిస్తే మీరు దేవునికి తప్ప మానవమాత్రున కెవ్వరికీ భయపడనక్కరలేదు మా గురువు గోఖ్లేగారు మా కిచ్చిన సందేశం కూడా అదే ఆ సందేశం సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ (భారత సేవక సమాజము) నియమావళిలో ఉన్నది నా జీవితంలో నాకా సందేశమే మార్గ దర్శకంగా ఉంటున్నది రాజకీయసంస్థలుగానీ, రాజకీయజీవితంగానీ ఆధ్యా త్మిక దృష్టితో నడపబడవలెననేదే ఆ సందేశము దానిని మనము తక్షణం ఆచ రణలో పెట్టవలసి ఉన్నది అప్పుడు విద్యార్థులు రాజకీయానికి దూరంగా ఉండరు వారికి మతమెంత ముఖ్యమో రాజకీయం కూడా అంతే ముఖ్యము. మతంనుంచి రాజకీయాలను విడదీయజాలము

ఈ నా అభిప్రాయాలు మీకు అంగీకారం కాకపోవచ్చు అయినప్ప టికి నాహృదయాంతరాళంలో కలవరపెడుతున్నవాటిని మీ ముందు ఉంచి నాను దక్షిణాఫ్రికాలోని నా అనుభవాలనుబట్టి ఆధునికసంస్కృతి అంటే ఏమో తెలియక పోయినప్పటికి ఇంగ్లీషు భాషా జ్ఞానం బొత్తిగా లేక పోయినప్పటికి, పూర్వ ఋషుల తపశ్చర్యవల్ల సంక్రమించిన బలంతో మీ దేశీయులు అతి క్లిష్టపరిస్థితులను ఎదుర్కొనేటందు కనుగుణంగా ప్రవర్తించగలిగినారు విద్యా విహీనులు, అక్షరజ్ఞాన శూన్యులు అయిన దక్షిణాఫ్రికాలోని మన దేశీయులకు

సాధ్యమై పదికి పదిరెట్లు పని మీకూ నాకూ కూడా మన పవిత్ర మాతృ భూమిలో సాధ్యంకాగలదని నా విశ్వాసము ఈ ప్రత్యేక భాగ్యం మీకు, నాకు కూడా లభిస్తుందిగాక"

## గోఖ్లే క్లబ్‌లో గాంధీ

ఈ సందర్భంలో గోఖ్లే క్లబ్ సభ్యులకు గాంధీజీ 1915 ఏప్రిల్ 20న జరిగిన సంభాషణ వివరాలను కూడా విద్యార్థులు తెలుసుకోవడం సముచితము గాంధీజీ రాకకు పూర్వం అరుసలల క్రిందట కొంతమంది యువకులు ప్రజాసమస్యలను గురించి పెద్దలనుండి తెలుసుకొనేటందుకు ఈ గోఖ్లే క్లబ్‌ను స్థాపించినారు ఆ క్లబ్బు సభ్యులు సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ భవనంలో ఏప్రిల్ 20 సాయంకాలం సమావేశమై గాంధీజీతో సంభాషించినారు ఆ సంభాషణ సుమారు 75 నిమిషాలు జరిగింది గాంధీజీ ఫీనిక్స్ అధినివేశ ప్రణాళికను (ఫీనిక్స్ సెటిల్‌మెంటు స్కీమ్) గురించి వివరిస్తూ, అది మాతృ దేశసేవకోసం ప్రజలకు శిక్షణ ఇచ్చేటందుకు ఉద్దేశింపబడినదన్నారు. ముఖ్యంగా అక్కడ శిక్షణపొందేవారిని సౌశీల్యవంతులుగా రూపొందించేటందుకు ప్రత్యేక శ్రద్ధ తీసుకోబడుతుందనీ, వారికి నేక దేశభాషలు బోధింపబడగలవనీ కూడా అన్నారు జాతీయ సేవకులుగా ఉండతలచినవారు ముఖ్యంగా బ్రహ్మచర్యవ్రతం పూనవలసి ఉంటుందనీ ఫీనిక్స్ అధినివేశంలో ప్రవేశించడానికది ఒక ముఖ్యమయిన షరతు అనీ కూడా వారు సెలవిచ్చినారు అక్కడ ప్రవేశం పొందిన ప్రతివారూ విధిగా శరీర కష్టంతో చేసే పనిని దేనినైనా ఎన్నుకొనవలెను ముఖ్యంగా వ్యవసాయ సంబంధమయిన పని ఎన్నుకొని చేస్తూ ఉండవలె ఆ ఫీనిక్స్ సెటిల్‌మెంట్‌లో వివాహితులు అవివాహితులు అయిన స్త్రీ పురుషులందరూ ఉండవచ్చు బ్రహ్మచర్యం, పేదరికం - ఈ రెంటినీ జాతి యావత్తూ అవలంబించవలెనని మీ అభిప్రాయమా అని అక్కడివారు కొందరు గాంధీజీని ప్రశ్నించగా, 'నిస్సందేహంగా' అని వారన్నారు కాని జాతియావత్తూ ఆ రెంటినీ అవలంబించడం మతదృష్ట్యా సాధ్యంకాని పని అన్నారు జీవితవిధానంలో అన్నిటికంటెనూ ముఖ్యంగా సత్యాహింసలను అవలంబించి తీరవలెననీ, అహింస అన్నప్పుడు మానవుని శరీరానికిగానీ మనస్సుకుగానీ బాధ కలిగించకుండటమే గాక ఏ ప్రాణికీ నొప్పి కలిగించకూడదని అన్వయించుకోవాలనీ అన్నారు గాంధీజీ సాత్త్విక నిరోధ సిద్ధాంతాన్ని రాజకీయాలకు వర్తింపచేయడం విషయంలో అది అతి క్లిష్టమయిన ఆయుధంగా గుర్తుంచుకోవలెనని ఆయన శ్రోతలను మందలించినారు దానిని చులకనగా వాడకూడదనీ గత్యంతరం లేనప్పుడే వాడవలసి ఉంటుందనీ అప్పుడుకూడా జాతీయ గౌరవ సంరక్షణవంటి అత్యంత ప్రియతమాలయిన సందర్భాలలో మాత్రమే వాడవలసి ఉంటుందనీ గాంధీ

అన్నారు గాంధీజీని పుష్పమాలాలంకృతునిగా చేసిన అనంతరం సభ ముగింపబడింది

## మద్రాస్ మెయిల్ ప్రతినిధితో గాంధీజీ సంభాషణ

ఏప్రిల్ 21 న గాంధీజీని మద్రాస్ మెయిల్ ప్రతినిధి కలుసుకొన్నారు వారిద్దరికీ జరిగిన సంభాషణ ఇది

ప్ర గాంధీజీ! మీరు దక్షిణాఫ్రికాలో ప్రారంభించిన పని అక్కడి భారతీయులకు సంతృప్తికరంగా పరిష్కరింపబడింది కదా ? ఇక ఇప్పుడు ఇండియాలో మీ రేమిచేయ తలపెట్టినారు ?

జ ఇప్పటికి ఈ సంవత్సరంలో మూడు నెలలు గడవనే గడచినాయి నేనే పనినైనా నిర్విరామంగా నిర్వహించదలచుకొనే టట్లయితే దేశమంతా పర్యటనచేసి, దేశంలోని ప్రజలనూ సంస్థలనూ బాగా పరిశీలించి అర్థం చేసుకొని ఒక నిర్ధారణకు వచ్చిన తరవాతనే పనిలోకి దిగవలెనని గోఖ్లేమహాశయులు నన్నాదేశించినారు ఈ పరీక్షాకాలంలో వివాదగ్రస్తాలయిన విషయాలను గురించి నేను బహిరంగసభలో ప్రసంగించరాదని కూడా నిశ్చయించుకొన్నాను ఈ సంవత్సరాంతానికి ఏయే విషయాలపై నా దృష్టిని కేంద్రీకరించి పనిచేయగలనో నేను నిర్ణయించుకొంటాను గోఖ్లేమహాశయుడు ఫోనిక్స్ సంస్థను నేను కొనసాగించవలెననే విషయంలో మాత్రం పూర్తిగా నాతో ఏకీభవిస్తున్నారు టాల్‌స్టాయి ఫారంలోను, నేటాల్‌కు ఉత్తర కోస్తాలో ఉన్న ఫోనిక్స్‌లోను, నేను ప్రారంభించిన ప్రయోగ కార్యకలాపాలను గోఖ్లేగారు కళ్లారా చూసినారు యువతీ యువకులు, బాలురు నిరంతర మాతృదేశ సేవా పరాయణులుగా తయారుచేయ్యటందుకు తగిన శిక్షణ కుద్దేశించబడిన ప్రయోగమది ఆ సంస్థకు చెందిన ప్రతిఒక్కరూ ఏదో ఒక శరీరశ్రమ చేసితీరవలెననే నిబంధన దాని ప్రత్యేక లక్షణము శరీరశ్రమలన్నిటిలోకీ వ్యవసాయపు పని ఎంతో ప్రాముఖ్యమయినది కావడంచేత ప్రతివారూ విధిగా ప్రతిరోజూ కొన్ని గంటలు పొలంపని చేసితీరవలె నేతపనిని ప్రవేశపెట్టవలెననే ఆలోచనకూడా ఉన్నది ఆ సంస్థలోని సభ్యులందరూ దేశభాషలను నేర్చుకోవలె అందువల్ల వారికి ఇండియాలోని వివిధ ప్రదేశాలలోఉన్న ప్రజాసామాన్యంతో తేలికగా కలసిమెలసి వ్యవహరించడానికి వీలు కలుగుతుంది తమలోతాము మాట్లాడుకొనేటందుకు దేశభాషలనే వాడుకోవలె సాధ్యమయినంతవరకు ఇంగ్లీషును బ్రిటిష్‌వారితోగానీ, ముఖ్యమయిన దేశభాష లేవీ తెలియని వారితోగానీ మాత్రమే వాడవలె ఆ సంస్థలోనున్న వారందరూ తప్పనిసరిగా బ్రహ్మచర్యవ్రతులై పేదరికం వరించవలె ఈ నా ప్రయోగం జయప్రదమై అధిక సంఖ్యాక యువకులు ఈ షరతులకు అను

గుణంగా ప్రవర్తించేటట్లు చేసే మనలను నేడు కలవరపరుస్తూన్న అనేక సమస్యలు వాటంతటవి పరిష్కారం కాగలవని నా అభిప్రాయము

ప్ర అ సంస్థలో జరగవలసిన కార్యవిధానాలను, అక్కడి సేవాస్వభావాన్ని, కొంతవరకు నాకు చెప్పగలరా?

జ ఆ సేవ ఏ రూపం తీసుకొంటుందో చెప్పడం నాకు సాధ్యం కాదు ఈ పరీక్షణకాలంలో (ప్రొబేషన్ పీరియడ్) నా పరిశీలనా ఫలితాలపైన చాలావరకది ఆధారపడి ఉంటుంది అయితే నేను రూపొందించిన శిక్షణ చిత్రంలోనే, ఆ సేవలోని ప్రధాన భాగం ఇమిడి ఉన్నదని తేలికగా గ్రహించవచ్చు ఈ సందర్భంలో వివిధ మార్గాలలో మా సేవా కార్యక్రమం ఉండగలదని తేలికగా తెలుసుకోవచ్చు కాని నా సహచరుల దృష్టి నా దృష్టి ఎట్లాంటి సేవాకార్యకలాపాలపై పురుమరల్చడం జరుగుతుందో నేనిప్పుడు బహిరంగంగా చర్చించదలచుకోలేదు కారణ మేమంటే, గోఖ్లేగారు చెప్పినట్లు ముందుగా అన్ని సమస్యలను నేను సరిగా పరిశీలించి అర్థంచేసుకోవలసి ఉన్నది నేనాయనకు అట్లా వాగ్దానం చేసినాను నా కర్ణధారి అయిన ఆయన లేకపోవడంతో, అ వాగ్దానాన్ని నిర్వర్తించవలసిన బాధ్యత నాకు మరింత ఎక్కువయింది కాబట్టి నేను నా ఉచితజ్ఞతపైననే ఆధారపడవలసి ఉన్నది నేటి క్లిష్టసమస్య లన్నిటిగురించి నేను సాధ్యమయినంత జాగ్రత్తతో వ్యవహరించవలసి ఉంది

ప్ర మీరు చాలాసంవత్సరాలనుంచి ఇండయాలో లేకపోవడంవలన నేనా గోఖ్లే గారు మీకి పరీక్షణ కాలం నిర్ణయించింది?

జ అవును, ఆయన చెప్పిన ముఖ్య కారణమదే నేను ఇండియాకు వెలుపల దాదాపు 28 ఏళ్ళు ఉన్నాను నా అభిప్రాయాలన్నీ ఇండియాకు వెలుపల కలిగినవే కాబట్టి నేటి పరిస్థితులతో ప్రత్యక్ష సంబంధం కల్పించుకొని నా అభిప్రాయాలను సరిదిద్దుకోవడం అత్యంతావశ్యకమని ఆయన భావము

ప్ర కిందటి పర్యాయం మీరీ దేశాన్ని సందర్శించినప్పటికీ, ఇప్పటికీ ఈ దేశ పరిస్థితులలో గమనించతగిన మార్పులేమైనా ఉన్నట్లు మీరు భావిస్తున్నారా ?

జ 1902 లో నేను ఇండియాకు వచ్చి ఉండిన కొద్ది కాలం నాటికీ నేటికీ పరిస్థితులను నేను పోల్చి పరిశీలించి చూడగలిగినంతవరకు, ఈనాటి యువతరం వారిలో మాతృదేశానికి సేవచేయవలెననే ఆసక్తి ఎక్కువగా కనబడుతూన్నది అంతేకాదు, స్వార్థత్యాగానికి అవసరమయిన కార్యక్రమాన్ని నిర్వర్తించడానికి వారు ఎక్కువ ఇష్టపడుతున్నారు కూడా.

ఈ సంభాషణానంతరం మద్రాసు మెయిల్ పత్రికా విలేఖకు డడిగిన

మరికొన్ని ప్రశ్నలకు సమాధానంగా తాను ఇండియాలో రాజకీయ సౌకర్యాల కోసం ప్రస్తుతం ఆందోళన చేయదలచుకొనలేదనీ, తన దేశీయుల నైతిక, భౌతిక, ఆర్థిక జీవనానికి మాత్రమే కృషిచేయదలచుకొన్నాననీ అన్నారు ప్రజలు తమ సౌశీల్యంవల్లను శక్తి సామర్థ్యంవల్లను అర్హత గలవారయినప్పుడు రాజకీయ హక్కులు వాటంతటవే లభించగలవని కూడా ఆయన అన్నారు

**గాంధీజీకి తోటవిందు**

గాంధీ దంపతుల గౌరవార్థం 1915 ఏప్రిల్ 28 సాయంకాలం గౌ॥ నవాబు సయ్యద్ మహమ్మద్ గారి గృహం "హుమాయూన్ మంజిల్" లో మహాజన సభ్యులు, మద్రాసు రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులూ కలిసి తోటవిందు ఏర్పాటుచేసినారు ఆ విందుకు చాలామంది వచ్చినారు గాంధీ దంపతులను మేళతాళాలతో ఆహ్వానించినారు వచ్చిన అతిథులు గాంధీజీతో అనేక విషయాలు మాట్లాడినారు

గౌ॥ శ్రీ నవాబ్ సయ్యద్ మహమ్మద్ గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు అందులోని ముఖ్యభాగాలివి

"దక్షిణాఫ్రికాలోని భారతీయుల ప్రతిపత్తి ప్రజల దృష్టిని ఆకర్షించింది మొదలు మద్రాసు మహాజన సభవారు, 1908 లో మద్రాసు రాష్ట్ర కాంగ్రెసు సభానిర్మాణం జరిగినది మొదలు ఆ కాంగ్రెసు సభవారు, దక్షిణాఫ్రికాలోని భారతీయులు అనుభవిస్తూండిన అంతులేని అవమానాలను ప్రతిఘటిస్తూ బహిరంగ సభలను జరపడమేగాక, ఇండియా ప్రభుత్వానికి ఇంగ్లాండ్ ప్రభుత్వానికి అనేక విజ్ఞప్తులను పంపిఉన్నారు ఈ రెండు సంస్థలు ఆ దేశంలో జరుగుతూఉండిన సంఘటనలను ఆందోళనతో గమనించడమే గాక, మీ ఉత్తేజకరమయిన నాయకత్వం కింద, అక్కడి మా సోదరులు బ్రిటిష్ పౌరులుగా తమ హక్కులను రక్షించుకొనేటందుకు చేస్తూఉండిన వీరోచిత పోరాటమును సైతం సగర్వంగా పరికిస్తున్నారు ఇంతవరకు మీ కృషి ఫలితంగా కలిగిన విజయానికి మా సంతృప్తిని వెల్లడిస్తున్నాము చాలావరకు దక్షిణాఫ్రికాలో నివసిస్తూఉండిన భారతీయుల కష్టాలు నిస్సందేహంగా తొలగిపోయినాయి ఈ రాజధానికి ఎంతో సంతోషప్రదమయిన మీ రాక మా సంతృప్తిని ఇనుమడింపజేసింది మీరే ప్రజకోసం శ్రమచేసినారో మీతోపాటు యే ప్రజలు మీ పోరాటంలో పాల్గొన్నారో ఆ ప్రజలకు నివాసభూమి ఈ రాజధాని మిమ్ములను ఇక్కడకు ఆహ్వానించే అవకాశం కలిగినందుకు మేము గర్వపడుతున్నాము మేము మిమ్మలను ఆహ్వానించడంలో, భారతదేశంలో పౌరాణిక కాలంనుంచి అతి పవిత్రాలుగా భావింపబడుతూండిన వ్యక్తిగత పరిశ్రమ, ఉదార స్వార్థత్యాగము, ధర్మ తత్పరతలవంటి సుగుణాలు మూర్తిభవించిన మహా పురుషుని మేము ఆహ్వానిస్తూన్నట్లు భావిస్తున్నాము బ్రిటిష్ సామ్రాజ్య పౌరులుగాను, భారతీయులుగాను తమ గౌరవ మర్యాదలను స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనేటందుకు దక్షిణాఫ్రికా భారతీయుల పోరాటంలో మీరు చేసినంత పని యే

భారతీయుడుకూడా చేసివుండలేదు "

గాంధీజీ ఇందుకు ప్రత్యుత్తరంగా తనను గురించి చెప్పిన స్తుతివాక్యాలకు తానర్హుడు గాడనీ, దూరంగా ఉన్న దక్షిణాఫ్రికాలో తాను చేసిన పని గోరంతలు కొండంతలుగా వర్ణింపబడుతూండటం సహజమనీ అన్నారు. ఈనాడు భారతదేశంలో తన సోదర దేశీయులమధ్య తాను చేయనున్న పనిని స్నేహితులు పరిశీలించడానికి వీలుందనీ ఇంతవరకూ తనపట్ల చూపుతూండిన ప్రేమానురాగాలను ఇకముందు కూడా తన దేశీయులు తనపట్ల చూపగలరని ఆశిస్తున్నాననీ అన్నారు. అంతటితో ఆ సమావేశం ముగిసింది.

**గాంధీజీకి ముస్లింలీగ్ విందు**

1915 ఏప్రిల్ 24 న మౌంట్ రోడ్ లోని లాలీహాలులో గాంధీ దంపతులకు ముస్లింలీగ్ సభ్యులు విందుచేసినారు. చాలామంది పౌరులూ విందులో పాల్గొన్నారు. వారిలో అత్యధిక సంఖ్యాకులు మహమ్మదీయులు. ముఖ్య అతిథులను లీగ్ ఉపాధ్యక్ష కార్యదర్శులు గౌరవ పురస్సరంగా ఆహ్వానించి సమావేశ భవనానికి తీసుకొనిపోయి, లీగ్ లోని ప్రముఖ సభ్యులను వారికి పరిచయం చేసినారు. గాంధీ దంపతులు వారితో కొంతసేపు ఇష్టాగోష్ఠి జరిపిన తరవాత అల్పాహారవిందు జరిగింది. తరవాత గాంధీదంపతులకు సభ్యులు పుష్పమాలలు వేసినారు. శ్రీ యాకూబ్ హుస్సేన్, లీగ్ సభ్యుల పక్షాన మాట్లాడుతూ గాంధీ దంపతుల మాతృదేశ సేవకు కృతజ్ఞతను తెలపడంలో తమ మహమ్మదీయ సోదరులెవరికీ తీసిపోరని అన్నారు. దక్షిణాఫ్రికాలోని భారతీయుల ఉనికిని గురించిన తగాదా సమయంలో హిందువులతోపాటు నిర్నిద్రమయిన ఉత్సాహంతోను, అత్యంత ఆసక్తితోను మహమ్మదీయులు సైతం పాల్గొన్నందుకు తమ సంతోషం వెలిబుచ్చినారు. వివిధ కులాలకు మతాలకూ సంబంధించిన ఆ సాత్త్విక నిరోధకుల అన్యోన్య సహకార ఐక్యాలు, వారి ఉదార సౌశీల్యానికి లక్ష్యభూతాలుగా ఉన్నాయి. భారతదేశాన్ని ప్రపంచ జాతుల గౌరవ మర్యాదలకు తగిన ఉన్నతస్థితికి తెచ్చేటందుకవి ఆదర్శప్రాయాలు కాగలవని ఆశిస్తున్నాము. భారతదేశ క్షేమంకోసం గాంధీజీ ఏ ఉద్యమం ప్రారంభించినప్పటికీ మహమ్మదీయులందులో పాల్గొనగలరని శ్రీ యాకూబ్ హుస్సేన్ వాగ్దానం చేసినారు.

గాంధీజీ ఆ సమావేశం ఏర్పాటుచేసినవారికి కృతజ్ఞత తెలుపుతూ దక్షిణాఫ్రికాలోని శీలగుణసంపన్నులయిన ముసల్మానులు ఇండియా గౌరవం కాపాడేటందుకు హృదయపూర్వకమయిన త్యాగాలు చేసినారనీ, వారికి నిర్ణయింపబడిన పనిని వారు సక్రమంగా నిర్వర్తించగలరనీ అన్నారు.

**స్త్రీలసభ - కస్తూరిబా గాంధీకి స్వాగతము**

జార్జిటవున్ లో, అన్నపిళ్ల వీధిలోఉన్న బ్రహ్మసమాజ మందిరంలో ఏప్రిల్ 24 శనివారం సాయంకాలం 4 గంటలకు స్త్రీల సమావేశం జరిగింది. మొదట నిర్దేశించిన సమయం మార్చకుండా ఉండినట్లయితే ఇంకా ఎక్కువమంది

స్త్రీలువచ్చి ఉండేవారు అయినప్పటికీ ఆనాడు వచ్చినంతమంది స్త్రీలు అంతకు
పూర్వ మే సమావేశానికి రాలేదు శ్రీమతి ఆదినారాయణ అయ్యర్ ఆ సమా
వేశానికి "గ్రాసనాధిపతిగా" ఉన్నారు శ్రీమతి సూరమ్మ ప్రార్థన చేసినారు
సమాజ కార్యదర్శిని శ్రీమతి అలమేలు మంగమ్మ గాంధీ దంపతులు దక్షిణా
ఫ్రికాలో చేసిన సేవను గురించి తమిళభాషలో ప్రశంసిస్తూ ఉపన్యసించినారు
తరవాత కస్తూరీబా కీ దిగువ స్వాగతపత్రం సమర్పించడం జరిగింది

"మీకు స్వాగతమిచ్చే భాగ్యం పొందగలిగినందుకు అమితానందం
పొందిన చెన్నపురి సోదరీమణుల ప్రణామాలను తామంగీకరించవలసిందని ప్రార్థి
స్తున్నాము సర్వజగజ్జనకుడు తండ్రి పేరటను ఈ నగరంలో ఉన్న సర్వ జాతి
మత సంబంధులైన పుత్రికల పక్షానా మేము మీకీ స్వాగత మొసంగు
తున్నాము దక్షిణాఫ్రికాలోని వివిధమతస్థులగు భారతీయులందరికీ ఐకమత్యం
చేకూర్చి తెల్లనల్లరంగుల విభేదం రూపుమాపి మానవులందరూ సమానులని
స్థిరపరచడానికి మీరు, మీభర్తకు సహకారిణులై ఎన్నో శ్రమలకోర్చి దేశసేవ
చేసినారు సర్వేశ్వరుడు ఎట్లాంటి అల్పుని హృదయకమలమందైనా ఆశీనుడై
మేటిమగలమనుకొనేవారి ఆలోచనలను కూడా విఫలం చేయగలడని మీరు
సాత్త్వికనిరోధంతో దౌర్జన్యం తృణీకరించి నిరూపించగలిగినారు మీరు ఎన్నో
బాధలను సహించినారు సోదరీ! ఉత్తమాదర్శాలగు సర్వేశ్వరుని విశ్వజనకత్వం
మానవుని విశ్వసౌభ్రాత్వం మీరు చక్కగా గమనించినారు దక్షిణాఫ్రికాలోని
దొరతనంవారు భారత స్త్రీల వివాహ సంబంధం శాస్త్రీయంకాదని ఆక్షే
పించటానికి సైతం సిద్ధపడినపుడు మీరు, భారతమహిళామణులు భర్తృ సహధర్మ
చారిణులని వారి స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడానికి పాతివ్రత్య మహామహిమ
వల్ల నిలువబడి సర్వభారతాంగనాసంస్తూయమానులైనారు భారతమాతగర్భంలో
జనించిన సీత, సావిత్రి, ద్రౌపది, దమయంతి మొదలయిన పతివ్రతలవంటి నారీ
మణులు అంతరించిపోలేదని మీరు ప్రపంచానికి వెల్లడించినారు వీరమాత, వీర
పత్ని, వీరమూర్తియనే కీర్తి గడించిన మహిళామణీ! నీవు ధన్యురాలవు నిన్ను
కన్న భారతమాత ధన్యతమ నీవు జన్మించిన భారతజాతి ధన్యతమ దైవమును
గురించి సంశయిస్తున్నవాడు మీ దర్శనంవల్ల నిస్సంశయుడవుతాడు భారత
భవితవ్యం గురించి సంశయాస్పదుడయినవాడు సంశయనివృత్తుడవుతాడు విద్యా
వతి అయిన మా పాశ్చాత్య విదుషీమణి మీకు కృతజ్ఞురాలుగాఉండే రీతిని మీరు
పతివ్రతామాహాత్మ్యాన్ని జగద్విదితం చేసినారు నూతనము, అధికోత్సాహ
వర్ధకముఅయిన సంగ్రామవిధానము అవలంబించి జయప్రదంగా నెరవేర్చినారు
మీ పాతివ్రత్యమువలనను,మీ ఆత్మవిశ్వాసమువల్లను ప్రవర్తితోత్సాహులమై
మేము మీరెటువంటి భక్తితో సేవిస్తున్నారో అట్లాంటి భక్తితో, అటువంటి నిరం
తర సంకల్పబలంతో మా భర్తలనూ, మాతృదేశాన్ని మేము సేవించగలిగేటట్లు
మీరు మమ్మాశీర్వదించండి మీరు మా కోసం సర్వేశ్వరుని ప్రార్థించండి

మీరడుగుపెట్టిన ప్రదేశాలలో అంతా నక్షత్రాలు ప్రజ్వలితాలై వెలుగు

గాక! మీకు మార్గదర్శిలయి, జ్యోతి దివ్యతేజస్సుతో తేజరిల్లును గాక, మనో హారము, స్మరణ మాత్ర సౌఖ్యదము అయి, సశ్రుతి సంవర్ధకమయి, దివ్యదర్శన మగుగాక!

ఈ సన్మాన పత్రానికి ఉచితరీతిని కస్తూరిబాయి ప్రత్యుత్తర మిచ్చి నారు తరవాత స్త్రీలు ఆమెకు పుష్పమాలలు, పుష్పగుచ్ఛాలు సమర్పించి నారు అతిథులకు ఫలపుష్ప తాంబూలాదులిచ్చి గౌరవించినారు

**భారతీయ క్రైస్తవుల స్వాగతము**

వెస్లీయన్ మిషన్‌కు చెందిన రివరెండ్ టాండ్, శ్రీమతి సుబ్రహ్మణ్యం రాయపేటలోని వారి స్వగృహానికి గాంధీ దంపతుల నాహ్వానించినారు అనేక మంది యూరపియన్ క్రైస్తవమత ప్రచారకులు, భారతీయ క్రైస్తవులుకూడ సమావేశానికి వచ్చినారు గాంధీ దంపతులతో పూర్వపరిచయం ఉన్న సుబ్రహ్మణ్యం వారితో కొంత సేపు ఇష్టాగోష్ఠి జరిపిన తరవాత వారికి ఆయన స్వాగతం చెప్పినారు వారు దక్షిణాఫ్రికాలో భారతీయులకు చేసిన సేవ గురించి, వారి స్వార్థత్యాగం గురించి ఎంతో ప్రశంసించినారు శ్రీ ఎమ్ డి దేవదాసు బార్ ఎట్ లా, శ్రీ వి చక్రయ్య చెట్టి,పీరిగ్గరూ మద్రాసులోని భారతీయ క్రైస్తవ సంఘ పక్షాన గాంధీ దంపతులకు స్వాగతం చెబుతూ గాంధీజీ క్రైస్తవుడు కాకపోయినప్పటికి పరోపకార తత్పరత్వం లోను, ప్రజోపయోగకర కార్యకలాపాలలోను వారితో తమకు సన్నిహిత సంబంధం కలదని అన్నారు గాంధీజీ దానికి సమాధానమిస్తూ తాను దక్షి ణాఫ్రికాలో ఉండగా కాననబూత్, తదితర యూరోపియన్ మత ప్రచారకులు భారతీయ క్రైస్తవులు మొదలైనవారి హృదయపూర్వక సహకారం పొంద గలిగినామని అన్నారు తరవాత ఆయన తమకు ఆతిథ్యమిచ్చిన గృహిణీ గృహస్థులకు కృతజ్ఞతలు తెలిపినారు అంతటితో ఆ సమావేశం ముగిసింది

**గాంధీ దంపతులకు భోరా తెగవారి ఆతిథ్యము**

మహమ్మదీయులలో భోరా తెగవారొక శాఖ వారు ఏప్రిల్ 25 ఉదయం జార్జి టవున్‌లోఉన్న మహమ్మదలీ మందిరంలో గాంధీ దంపతుల కాతిథ్యమిచ్చినారు గుజరాతీభాషలో ఉపన్యాసాలు జరిగినాయి ఈ రాజధానిలో హిందూ మహమ్మదీయులు పరస్పరానురాగంతో పనిచేస్తూన్నారని వారు తెలియజేసినారు తరవాత గాంధీ గుజరాతీ, ఆంగ్ల భాషలలో ఉపన్యసిస్తూ "చిరకాలంనుంచీ నాకు భోరా తెగవారితో స్నేహం ఉంది దక్షిణాఫ్రికాలో ఒక భోరా వ్యాపారస్థుడొక వర్తక సంస్థను స్థాపించినాడు సాత్త్విక నిరోధకుల కాయన చాలా సహాయం చేసినాడు దక్షిణాఫ్రికాలోని దిక్కులేని భారతీయు లను గురించి నేను 1896 లో బొంబాయి నగరంలో ఉపన్యసించినప్పుడు ఆ ఉద్యమ ప్రాముఖ్యం న్యాయమూర్తి బదురుద్దీన్ తయాబ్జీగారు ఆమూలా గ్రంగా అర్థం చేసుకొని చాలా సహాయం చేసినారు. భారతదేశంలోని హిందూ

మహమ్మదీయుల ఆశయ ఆకాంక్షలు భిన్నంగావు కాబట్టి వారికి వివాదాలు కూడదని గాంధీజీ చివరి మాటగా చెప్పినారు

## కస్తూరీబా గాంధీతో పాశ్చాత్య విదుషీమణి

కస్తూరీబా గాంధీని చూడవచ్చిన పాశ్చాత్యవనిత ఆమెను చూడకమునుపు వేషభాషలను గురించి, ఆచార సంప్రదాయాల గురించి ఎట్లా ఊహించిందో ఆ పాశ్చాత్య స్త్రీ మాటలలోనే చెబితే బాగుంటుంది

"నేను శ్రీమతి కస్తూరీబాగారిని చూసి మాట్లాడ తలపెట్టినాను టెలిఫోన్‌లో తెలియచేయడానికి నా కవకాశం లేకపోయింది చివరకి యేమయినా కానీ అని సాహసించి బండిఎక్కి జార్జి టవున్‌కు వెళ్లినాను నా పేరుగల చీటిని (విజిటింగ్ కార్డు) శ్రీమతి కస్తూరీబాకు పంపగా ఆమె పరిజనుడొకడు వచ్చి కస్తూరీబా ఫలహారం చేస్తున్నారని చెప్పినాడు నేనొకగంట తాళివస్తే బాగుంటుందేమో అనుకొని, జార్జి టవున్‌కు మా యిల్లు చాలాదూరం కావడం చేత, వేసవి వేడిమి ఎక్కువగా ఉండటంచేతనూ, ఇంటికిపోయి మళ్లీ రావడం కష్టమనుకొని సాహసించి మళ్ళా కబురు పంపినాను వెంటనే పరిజనుడు వచ్చి మీరు మేడపైకి దయచేయండి! అన్నాడు కస్తూరీబా ఫలహారమయ్యేటంత వరకూ మేడపైన ఒక గదిలో కూర్చుండవలసి ఉంటుందనుకొంటూ మేడపైకి వెళ్లినాను కాని ఆ పరిజనుడు గాంధీ దంపతులు ఫలహారం చేస్తున్న గదిలోకి తిన్నగా తీసుకొని పోయినాడు నా కాశ్చర్యం కలిగింది నేను కస్తూరీబాను చూడకమునుపు ఆమె ఎట్లా ఉంటుందో అని పరిపరి విధాల ఊహించుకోవడం ప్రారంభించినాను ఆమె పాశ్చాత్య స్త్రీలవలె గౌను కట్టుకొని ఉంటుందో, లేక స్త్రీల క్లబ్బులకు విహారమందిరాలకూ వచ్చే బ్రాహ్మణ స్త్రీలవలె గులాబి రంగు చెక్కిళ్లతో, వంటినిండా నగలతో పట్టుచీర పట్టురవికా తొడుక్కొని ఉంటుందో అని ఆలోచించుకొంటూ వచ్చినాను కాని ఆమె ఆ ఇద్దరినీ పోలి ఉండలేదు

"ఆమె నా ఎదుట తన భర్త ప్రక్క నేలమీద కూర్చుండి భర్తతోను, మరొక మిత్రునితోనూ కలసి పళ్ళు తీసుకొంటున్నది ఆమె పొట్టిగా, బక్కగా ఉన్నది ముఖం పసిడివలె ఉంది కన్నులలో తేజస్సు ఉట్టిపడుతూన్నది చూపులు ప్రశాంతంగా దాక్షిణ్యం వెల్లడిస్తూన్నాయి మెడవరకూ ముంజేతుల వరకూ ఉన్న ఒక తెల్లని చొక్కా తొడుక్కొని తెల్లని బట్ట మేలిముసుగు వేసుకొని ఉన్నది ఆమె ఆమె పాదాలమీదా చేతులమీదా 'పచ్చ' బొట్లు కనబడుతూన్నాయి ఆమెకు రెండు గాజులు తప్ప నగలేవీ లేవు "కథియవార్‌లోని స్త్రీలందరి దుస్తులూ అట్లాగే ఉంటాయని ఆమె నాతో అన్నది "

శ్రీమతి కస్తూరీబా ఆ పాశ్చాత్య విదుషీమణితో "దక్షిణాఫ్రికాలో ఉన్న భారత స్త్రీలందరు తమతమ దేశాచారాల ననుసరించే దుస్తులు వేసుకొంటూరు దక్షిణాఫ్రికాలోని దక్షిణభారత స్త్రీలు చీరలు కట్టుకొని రవికలు

తొడుక్కొంటారు పాశ్చాత్యులుగు నేనుగూడ కొందరు మేజోళ్ళు, బూట్లు తొడుగుకోవడం కూడా ఉంది నా భర్తగారితో ఆఫ్రికా ప్రాంతంలో దేశంలో ఉన్న 5 మాసాలు దక్షిణాఫ్రికాలో ఉన్న అన్ని రోజులూ గూడా మేజోళ్ళు బూట్లు వేసుకొన్నాను' అన్నది అంతట ఆ పాశ్చాత్యవనిత "మీకు స్వస్థతి అనుగుణంగా నున్నదా?" అని ప్రశ్నించగా "లేదు, మా భారత దేశంలోని స్త్రీల వలెనే వట్టికాళ్ళతో నడవడమే నా అభీష్టము" అని కస్తూరీబా చెప్పింది మామిడిపండ్లు, ఎర్ర ఆపిల్ పండ్లు, తెల్ల ద్రాక్షపండ్లు వగైరాలను చూపి ఇదేనా మీ ఆహారమని ఆ పాశ్చాత్య స్త్రీ అడగగా "నేను నా భర్త మూడేండ్ల నుంచి పండ్లనూ, పండ్ల గింజలలోని పప్పులను మాత్రమే తింటున్నామ"ని చెబుతూ కొన్ని పళ్ళ ముక్కలను కస్తూరీబా ఆమెకిచ్చింది తరవాత ఆమె కస్తూరీబానిట్లా ప్రశ్నించింది

ప్ర మీరు ఫలహారంచేసే సమయంలో నన్ను రానివ్వడమే గాక నాకు గూడా ఫలహారమిచ్చి నన్ను మీ సహపంక్తిని కూర్చుండటానికెట్లా ఒప్పుకొన్నారో నా కాశ్చర్యంగా ఉంది !

జ నేను దక్షిణాఫ్రికాలు పోకముందే ఇటువంటి మతసంబంధాలయిన మూఢాచారాల నన్నిటినీ మానివేసినాను

ప్ర అట్లా వదిలివేయడం మీకు కష్టంగా లేదా ?

జ అవును ! 'నాకు మొదట, చాలా కష్టంగానే ఉండేది' అని పూర్వస్మృతి వల్ల కలిగిన చిరునవ్వుతో కస్తూరీబా గాంధీజీవంక చూసింది

ప్ర మీరు మళ్ళా ఇంత కాలానికి దేశానికి రావడంవల్ల మీకు కొత్తగా లేదా?

జ లేదు! లేదు! నేను ఆఫ్రికాలో ఉన్నప్పుడు కూడా భారతీయ ఆచారం ప్రకారమే ప్రవర్తిస్తూ వచ్చినాను దక్షిణాఫ్రికాలో సైతం నా గృహ కృత్యాలను నేనే నిర్వర్తించుకొంటూ ఉండేదానిని దక్షిణాఫ్రికాలో ఉన్న భారత స్త్రీ లెవరో కొందరు మాత్రం ఉపాధ్యాయినులుగాను పరిచారకులుగానూ పనిచేస్తున్నారు తక్కినవారు చాలామంది తమ ఇంటిపనులు తామే చూసుకొంటున్నారు. ఆ దేశంలో శిక్షణరక్షణాకు జీతం మంచిదే ఉంటుంది, కాని బ్రతకడానికి ఖర్చుకూడా ఎక్కువగానే ఉంటుంది మేమక్కడ ఫోనిక్స్ అనే గ్రామాన్ని ఏర్పాటు చేసినాము. అక్కడ ఫలవృక్షాలను, కాయగూరల తోటలనూ వేసి పెంచినాము వాటిని వదిలిరావడం మాకు చాలా కష్టంగా ఉంది ఆ తోటలో పెద్ద పెద్ద దోసపండ్లు, అనాసపండ్లు పండుతున్నాయి

ప్ర మీ భర్తగారు జైలులో ఉన్నప్పుడు మీరేమి చేసినారు?

జ నాకు తెలీదు, నేను ముందుగా నే జైలుకు వెళ్ళినాను. ఈ మాట వినగానే ఆ పాశ్చాత్యవనిత ఆ వివరాలను తెలుసుకోగోరింది కస్తూరీబా ఆంగ్లభాషలో సంభాషించగలిగినప్పటికీ రాజకీయ విషయాలను వేగంగా

వివరింపజాలనందువల్ల గాంధీజీ అందుకొని, "దక్షిణాఫ్రికా దొరతనంవారు హిందూధర్మశాస్త్రాల ప్రకారం హిందూదేశంలో జరిగిన వివాహాలను సక్రమవివాహాలుగా అంగీకరించకపోవడంవల్ల 1911 న కస్తూరీబా మరి 30 మంది భారతాంగనలు సాత్విక నిరోధకులుగా జైళ్లకు పోవలసి వచ్చింది కారాగారంలో ఆమెచేత కుట్టుపని, నీళ్లుతోడే పని, గచ్చు నేల శుభ్రంచేసే పని మొదలయిన పనులను జైలు అధికారులు చేయించినారు" అని చెప్పినారు తనకు జైలు ఆహారంవల్ల ఆరోగ్యం చెడిందని కస్తూరీబా అన్నది ఆ మాట విని ఆ పాశ్చాత్య స్త్రీ తన విచారాన్ని వెలిబుచ్చింది తరవాత కస్తూరీబా ఇట్లా చెప్పింది

నాకు పన్నెండేళ్ళ ప్రాయంలో వివాహమయింది నలభైపేళ్ల కుటుంబినై ఉన్న నన్ను దక్షిణాఫ్రికా ప్రభుత్వంవారు 'నీవు మళ్ళా వివాహోద్యోగి యెదుట నీ వివాహం సక్రమంగా రిజిస్టర్ చేయించుకొంటేనే తప్ప నీ వివాహం శాస్త్రీయం కాదనీ నీ పుత్రులకు వారసత్వపు హక్కు లుండవనీ' అన్నారు అది నాకు అవమానం కాదా! ఆ అవమానం ఏ ఉత్తమస్త్రీ భరించగలదు? ఆ అవమానం కంటె జైలుబాధ లెక్కవ కాదు చివరికి సాత్విక నిరోధకులకే విజయం కలిగింది 1914 న ఆ శాసనం రద్దుచేయబడింది నేనీ భరతఖండానికి రాగలిగినందుకు నాకు సంతోషంగానే ఉన్నది నాకీ దేశం కొత్తగా లేదు నా తలిదండ్రులు చనిపోయినారు కాని నా బంధువులు చాలామంది కథియవాడ్‌లో ఉన్నారు నా నలుగురు పుత్రులలో ఇద్దరు దక్షిణాఫ్రికాలో పుట్టిన వారే నేను మొదట 17 యేండ్ల కిందట దక్షిణాఫ్రికాకు పోయినాను కాని మధ్యలో ఈ దేశం వచ్చి ఒక యేడాది ఉన్నాను నా భర్త నన్ను విడిచి మూడేండ్లు ఇంగ్లండ్‌లోనూ మూడేండ్లు జోహన్స్‌బర్గ్‌లోనూ ఉన్నారు ఆ ఆరేండ్లు తప్ప నేను ఎన్నడూ నా భర్తను విడిచి ఉండలేదు ఆయన మళ్ళా ప్రయాణమైనప్పుడు నే నొంటరిగ ఉండలేనని నా స్నేహితులకు చెప్పి నేను ఆయనతో నే వెళ్లినాను

కస్తూరీబాతో ఈ ఇష్టాగోష్ఠి ప్రసంగం ముగిసిన తరవాత ఆ పాశ్చాత్య వనిత తనదగ్గర సెలవుదీసికొని పోతూండగా కస్తూరీబా భారతీయ సంప్రదాయం ప్రకార మామెకు నమస్కరించి పంపినది

## ఉపాధ్యాయులు - గాంధీజీ

పచ్చయప్ప ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు ఏప్రిల్ 28 (1915) ఉదయం గాంధీజీని ఆహ్వానించి విద్య, మతము, సమాజము మొదలయిన విషయాలలో ఇష్టాగోష్ఠి చర్చలు జరిపి ఆయన సంగతులు తెలుసుకొన్నారు.

**డాక్టర్ బిసెంట్ తోట విందు**

డాక్టర్ బిసెంట్ దివ్యజ్ఞానసమాజ ప్రధానావరణంలో గాంధీ దంపతుల తోటవిందు చేసింది ఫలహారానంతరం అతిథులతో ఫోటోగ్రాఫ్ తీసుకొన్న తరవాత డాక్టర్ బిసెంట్ దివ్యజ్ఞానసిద్ధాంతాలను పఠించింది గాంధీ దంపతుల గౌరవార్థం సంగీత కచేరీ జరిగింది తరవాత గాంధీ దంపతులను గురించిన విజయనినాదాలతో కార్యక్రమం ముగిసింది

**మద్రాసు రాష్ట్రీయ మహాసభ గాంధీజీ**

21 వ మద్రాసు రాష్ట్రీయ మహాసభను 1915 మే 4 న సాయంకాలం రెండున్నర గంటలకు నెల్లూరులో లక్ష్మీనరసారెడ్డి పురమందిరంలో ప్రారంభించడంజరిగింది అ సభకు అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన రావుబహదూర్ బయ్యా నరసింహేశ్వర శర్మగారు మే 4 రాత్రికే మద్రాసు నుంచి రైలులో నెల్లూరు చేరుకొన్నారు ఆ రైలులోనే గాంధీ దంపతులు, డాక్టర్ బిసెంట్ మరికొంత మంది ప్రతినిధులూ కూడా నెల్లూరుకు వచ్చినారు ఆ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉన్న ఆమంచర్ల సుబ్బుకృష్ణారావుగారూ అయనకార్యదర్శులూ ఊరేగింపుతో గాంధీ దంపతులను సభాధ్యక్షుని వసలి మందిరానికి ఆహ్వానించి తీసుకొని వెళ్ళినారు

సభా ప్రారంభ సమయానికి పురమందిరం సభాసదులతో పూర్తిగా నిండిపోయింది ముఖ్యమయిన అన్ని జిల్లాలనుంచీ ప్రతినిధులు వచ్చినారు రాజధాని నగరమయిన మద్రాసునుంచి ఎక్కువ మంది ప్రతినిధులు వచ్చినారు. దేశభక్తి గీతాలతో సభ ప్రారంభమయింది సభ జరుగుతూవుండగా గాంధీ దంపతులు, వారికి ఆతిథ్య మిచ్చిన అప్పటి జిల్లా కలెక్టరు శ్రీ అర్ రామచంద్రరావు (కలెక్టరు) దంపతులతో కలసి వచ్చినారు శ్రీ జి ఎ నటేశన్ వారి రాకను ప్రకటించడంతో సభలో హర్ష ధ్వానాలు చెలరేగినాయి ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ ఆమంచర్ల సుబ్బుకృష్ణారావుగారు సభ్యులను ఆహ్వానిస్తూ సుదీర్ఘమయిన గంభీరోపన్యాసం చేసినారు ఆయన నెల్లూరు పట్టణ ప్రాముఖ్యం, దాని పూర్వచరిత్రనూ అభివర్ణిస్తూ కొంతసేపు ప్రసంగించి, ఆ సభకు గాంధీ దంపతుల రాకను పురస్కరించుకొని తమ ఆనందం వెలిబుచ్చుతూ ఇట్లా అన్నారు

"ఆంగ్లసామ్రాజ్యాధీనాలయిన అధినివేశాలలోని భారతీయులస్థితి ఇది వరకు చాల సంతాపకరంగా ఉండినది దుఃఖము, ఆపద, బాధ, శ్రమ, నింద, అపకారము, నైచ్యము, దాస్యము మొదలైన సర్వబాధలకు దక్షిణాఫ్రికా భారతీయులు పాల్పడుతున్నారని ఈ దేశీయులందరు ఆగ్రహావేశపరవశు లయి నారు

"ఏ మహనీయులు జాతీయ గౌరవంకోసం సాహసోదారసంగ్రామంలో నాయకత్వం వహించి సామ్రాజ్య పౌరసత్వ స్వాతంత్ర్యాల కన్నిటికి భార

తీయులు తక్కిన అధినివేశాలవారితోపాటు సమానాధికారులని నిరూపించి నారో, ఏ దంపతులు స్వసుఖపరిత్యాగం చేసినారో, భారతీయసంఘం కొంచమైనా కించపరచడాని కే మాన్యులు సహింపకుండాఉన్నారో, దక్షిణాఫ్రికా ప్రభుత్వం వారి అక్రమ అన్యాయ శాసనాలకులొంగి విదేశీయులు కావడానికి అంగీకరించక ఏ పూజ్యులు సాత్త్వికనిరోధపద్ధతిని వాటిని ప్రతిఘటించినారో, స్వార్థత్యాగానికి స్వసుఖవర్జనానికి, అహంకార నిరసనానికి ఎవ్వరు ఉదాహరణగా ఉన్నారో, ఎవరికి తమ మాతృదేశంలో అద్వితీయమయిన అసదృశానురాగం ఉన్నదో అట్లాంటి మహాత్ములు దక్షిణాఫ్రికా మహారథులూ అయిన శ్రీ మోహనదాసు కరంచంద్ కస్తూరీగా గాంధీలు నేడీ మహాసభకు రావడం మన అదృష్టము

"గోపాలకృష్ణ గోఖ్లేగారి అకాల మరణానికి ఆసేతు హిమవన్నగపర్యం తంగల భారతభూమిలోని ఆబాలగోపాలం కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తున్న సమయంలో మాతృదేశాన్ని సేవించేటందుకూ, మన జాతీయ ప్రతిష్ఠాపనాలను నడిపించేటందుకూ దక్షిణాఫ్రికానుంచి ఈ దేశానికి గాంధీమహాశయుల రాక మన పుణ్యఫలమని నేను భావిస్తున్నాను భక్తి ప్రేమ ప్రధానమయిన దేశసేవను కల కాలం జయప్రదంగా చేయటానికి తగిన ఆరోగ్యం, బలం ఈ పుణ్యదంపతులకు చేకూర్చవలెనని నేను భగవంతుని ప్రార్థిస్తున్నాను "

గాంధీ దంపతుల రాకను పురస్కరించుకొని అధినివేశరాజ్యాల ప్రస్తావనలో ఆహ్వానసంఘాధ్యక్షులింకా ఇట్లా అన్నారు

"హార్డింజ్ ప్రభువు ఇండియా దొరతనంవారు సర్ బెంజిమన్ రాబర్ట్సు గారు, కీ॥ శే॥ గోఖ్లేగారు చాలా శ్రద్ధ పూనినందువల్ల దక్షిణాఫ్రికా సమస్య చాలావరకు అనుకూలంగా పరిష్కారమయింది దక్షిణాఫ్రికా ప్రభుత్వం వారు ఇండియన్ రిలీఫ్ బిల్లును ఆమోదించడంచేత చాలా లాభం కలిగింది అయినా ఈ సమస్య పూర్తిగా పరిష్కారమయినదనేటందుకు వీలులేదు అధినివేశ రాజ్యాలలో భారతీయుల స్థితిని గురించిన సమస్యలన్నీ ఇంకా పరిష్కారం కాలేదు అన్ని అధినివేశాలలోను భారతీయులకు తక్కినవారితోపాటు సమాన స్వాతంత్ర్యాలు ఇవ్వవలెనని మనం కోరుతున్నాము ఆ విషయాన్ని వారిక ఎంతమాత్రమూ ఆలసించడానికి వీలులేదు

వలసవారియెడవారివట్ల అధినివేశాలవారికి సహకారభావం ఉన్నట్లయితే ఈ కార్యం సాధ్యమవుతుందనీ హార్డింజ్ ప్రభువు అందుకు అనుగుణమయిన సమాన స్వాతంత్ర్యాల విషయం మాత్రం విస్మరించరాదనీ విన్నవిస్తున్నాను అధినివేశాలకు, ఇండియాకు సంబంధించి ఎటువంటి అధికారాలుంటాయో అటువంటి అధికారాలే అధినివేశాలవట్ల ఇండియాకు కూడ ఉండవలె భారతీయులకు తగిన గౌరవం స్వదేశంలో మాదిరిగా అధినివేశాలలో కూడా ఉండవలె "

ఆహ్వాన సంఘాధ్యక్షులు ఇంకా అనేక సమస్యలను గురించి సమగ్రంగా ముచ్చటించి ముగించిన తరవాత గా॥ రావుబహదూర్ వి కె రామానుజానుజాచార్యులవారు, గా॥ శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారిని ఆ మహా

సభకు అధ్యక్షులుగా ఉండగోరుతూ లాంఛనప్రాయంగా తీర్మానం ప్రతిపాదించినారు శ్రీ టి వి వెంకటరామయ్య దానిని ఆమోదించినారు దివాన్ బహదూర్ సి కరుణాకర మీనన్ (మద్రాసు), రావుబహదూర్ యస్ వి నరసింహం (కర్నూలు), సయ్యద్ ముస్తాఫా (నెల్లూరు), బి పట్టాభిరామిరెడ్డి (నెల్లూరు) ఆ తీర్మానాన్ని బలపరిచినారు ఈ చివరి వారిద్దరూ తెలుగులో ప్రసంగించినారు

తరవాత ఆహ్వాన సంఘాధ్యక్షులు ఆమంచర్ల సుబ్బకృష్ణారావుగారు అధ్యక్షుని పుష్పమాలాలంకృతుని చేసినారు ఎంతో హర్షధ్వానాలమధ్య అధ్యక్షులు అగ్రాసనాసీనులయినారు అధ్యక్షుని ఉపన్యాసం తరవాత ఆ రోజు సభ చాలించినారు

## నెల్లూరు సభ - రెండోరోజు

మద్రాసు రాష్ట్రీయసభ మరునాడు మధ్యాహ్నం 12-30 గంటలకు మళ్ళా సమావేశమయింది అధ్యక్షులు శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారు, గోఖ్లేగారి మరణం గురించి సానుభూతి తీర్మానం అధ్యక్షస్థానంనుంచి ప్రవేశ పెడుతూ ఇట్లా ప్రసంగించినారు

“ఈ తీర్మానాన్ని అంగీకరించవలసిందని నేను విశేషంగా మాట్లాడ నవసరం లేదు ఒక సత్పురుషుడు మనల నందరినీ దుఃఖసముద్రంలో ముంచి పరలోకగతుడయినాడు ఇది మనకు తీరని లోపం (లోటు) ధర్మతత్పరు లయిన ఉత్సాహవంతుల హృదయాలలో ఆయన ఉదాహరణం ప్రతినినదిస్తూ న్నంతవరకూ ఆయన జీవితం వ్యర్థమయినట్లు కాదు ఈ సందర్భంలో మీలో చాలామందికి తెలియని ఒక సంఘటన నాకు స్ఫురణకు వస్తున్నది ఇండియా కౌన్సిల్ బిల్లు సందర్భంలో నిరుటిసంవత్సరం మేమందరం లార్డ్ క్రూ కడకు రాయబారులుగా వెళ్ళినప్పుడు, ఆయన ముందుగా గోఖ్లే మహాశయుని గురించిన ప్రస్తావనయే చేసినాడు గోఖ్లేగారు ఇంగ్లండ్‌లో లేనందుకు మేము చాలా విచారపడినాము ఆయన ఆరోగ్యం కోల్పోయి చికిత్సకోసం ఫ్రాన్సులో ఉన్నారప్పుడు పబ్లిక్ సర్వీస్ కమిషన్‌కు సంబంధించిన కార్యరంగంలో ఆయన లేకపోవడం చాలా లోపమనిపించింది మేము చిక్కులలో నున్నప్పుడు మాకు సహాయంకోసం కొన్ని సమయాలలో ఆయనను ఇంగ్లాండ్‌కు రప్పించుకోందా మనిపించేది ఆయన జబ్బుగా ఉండగా ఆయనను ఇంగ్లండ్‌కు రమ్మని కోరడం క్రూరంగా ఉంటుందని తలంచి మిన్నకుండే వాళ్ళము అంతేగాక ఆరోగ్యం కుదిరేవరకు గోఖ్లేగారిని ఫ్రాన్సులోనే ఉండవలసిందని మా పక్షాన చెప్పమని మేము సర్ విలియం వెడ్డర్ బరన్‌ను ప్రార్థించినాము ఆయన ఫ్రాన్స్‌కు వెళ్ళినప్పుడు ఆయన ఆరోగ్యం విషాదకరంగా, నిరాశాజనకంగా ఉన్నది ఒక డాక్టర్ ఆయన జీవించడని చెప్పినాడు కాని అదృష్టవశాత్తు ఆయన మళ్ళా తేరుకొన్నారు కొంచెం బలం పట్టగానే ఫ్రాన్సునుంచి ఇంగ్లండ్‌కు వచ్చి

వెంటనే పబ్లిక్ సర్విస్ కమిషన్ సమావేశంలో పాల్గొన్నారు డాక్టర్లు మాట్లాడవద్దని సలహా యిచ్చినప్పటికీ ఆయన ధర్మతత్పరత ఆయనను ఊర కుండనీయలేదు ఆ మహామహుని కర్తవ్యనిష్ఠ అంత ఉన్నతమయినది ఆయన ఈనాడు మనమధ్య లేరు కాని ఇక్కడ చేరినవారిలో కొందరయినా ఆయన ఉన్నతాదర్శాలను ఉదాహరణంగా తీసుకొని అనుకరించగలిగినట్లయితే ఆయన జీవితం వ్యర్థం కాలేదని అనుకోవచ్చు ఆయన చేసిన పని సనాతన సభ్యతా సంస్కృతులకు ఆలవాలమయిన ఈ దేశంలో స్వాతంత్ర్య బీజాలను నాట డానికి తగిన వసతులను (అవకాశాలను) కల్పించింది

గోఖ్లే మహాశయునికి ప్రియతమమయిన "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ" (భారత సేవక సమాజం) కార్యకలాపాలను కొనసాగించడమే మన మాయనపట్ల చూపతగిన కృతజ్ఞతకు ప్రబల నిదర్శనము ఆయన కార్య తత్పరత కది ప్రచారసాధకము"

అధ్యక్షుని ఈ మాటలతో సభ్యులందరూ లేచి ఆ సానుభూతి తీర్మానం నిశ్శబ్దంగా ఆమోదించినారు

హార్డింజ్ ప్రభువును హిందూదేశ రాజ ప్రతినిధిగా మరికొంత కాలం కొన సాగించవలసిందని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానం అధ్యక్షుడు ప్రతిపాదించగా దానిని ఏకగ్రీవంగా ఆమోదించడం జరిగింది

గాంధీ దంపతులు చేసిన ప్రజాసేవను గౌరవపురస్సరంగా కొనియాడుతూ మూడో తీర్మానం ప్రవేశపెట్టబడింది ఆ తీర్మానం ప్రతిపాదిస్తూ శ్రీ జి ఎ నటేశన్ ఇట్లా అన్నారు

"గొప్ప వ్యక్తులు కొందరు పూర్ణ పురుషులుగా రూపొందినట్లు మనం గ్రంథాలలో చదివినాము కాని దాని అర్థమేమిటో మనకింతకు పూర్వం తెలి యదు ఈనాడు పూర్ణ పురుషుడంటే ఏమో మనం గాంధీలో చూడగలుగు తున్నాము ఆయన దక్షిణాఫ్రికాలో ప్రదర్శించిన వీరోచిత కార్యకలాపాల వల్లనే ఆయన పూర్ణ పురుషుడుగా రూపొందగలిగినాడు శ్రీమతి గాంధీ కూడా స్త్రీత్వానికి మకుటాయమానంగా వర్ధిల్లినది ఈ దంపతు లిద్దరూ ఇండియాకు ప్రతిష్ఠ ఉన్నదనీ, ఆ ప్రతిష్ఠకు తగినట్లుగా ఇండియా ప్రవర్తించ గలదనీ ప్రపంచానికి వెల్లడిచేసినారు దక్షిణాఫ్రికాలోని తమ దేశీయుల ఆత్మ గౌరవం ప్రతిష్ఠించేటందుకు పోరాడిన గాంధీజీని ఆయనతోపాటు అన్ని దశల లోనూ కష్టాలనుభవించిన ఆయన అనుచరులను వేనోళ్ల కొనియాడవలసి ఉన్నది వారు పోరాటంలో ప్రయోగించిన ఆయుధం హత్యకు సంబంధించినది కానీ, అభ్యంతరకరమైనదిగానీ, శౌర్యహీనమైనదికానీ కాదు. అది సాత్త్విక నిరోధమనే ఆయుధము ఈ ఆయుధంతో ప్రపంచ విఖ్యాతమయిన విజయం సాధించినాడు"

ఈ తీర్మానం శ్రీ శివషణ్ముఖంగారు ఆమోదిస్తూ తెలుగులో ప్రసంగించి నారు

డాక్టర్ బిసెంట్ గారు ఈ తీర్మానాన్ని బలపరుస్తూ ఇట్లు ప్రసంగించినారు

"సాత్త్వీక నిరోధమనే ఆయుధం దక్షిణాఫ్రికాలో ఎంతో విజయంతో అత్యంత ప్రయోజనకరంగా ప్రయోగించబడింది ఇంగ్లండ్‌లో ఈ ఆయుధం ఒకటి రెండు చారిత్రక సమయాలలో ప్రయోగించబడింది ఇది క్వాకర్స్‌చే ఒకప్పుడు, చర్చి రేట్ల నిరోధకులచే మరొకప్పుడు ప్రయోగింపబడింది కాని నేడిది భారతీయ పోరాటంలో ప్రప్రథమంగా ప్రయోగింపబడింది ఈ ఆయుధ ప్రయోగంలో గాంధీ వెనక, ఒక స్పష్టమయిన అన్యాయాన్ని, బాధనూ అనుభవిస్తూండిన ప్రజాసమూహం యావత్తు ఉన్నది ప్రభుత్వం ఒక ప్రజలను పీడించదలచుకొన్నప్పుడు దానినెదుర్కొనేటందుకు సాత్త్వీక నిరోధం కంటె ప్రబలమయిన ఆయుధం లేదు సాత్త్వీక నిరోధం అనే ఆయుధం చేపట్ట దలచుకొన్నవారు మృత్యువును సైతం ఎదుర్కొనేటందుకు సంసిద్ధంగా ఉండవలె

అయితే ఇండియాలోని విభిన్న పరిస్థితులనుబట్టి ఆ సాత్త్వీక నిరోధమనే ఆయుధం ప్రయోజనకారి కాలేదు కాబట్టి ఇక్కడివారు గాంధీగారి ఆత్మ శక్తినీ స్వార్థత్యాగాన్ని అనుకరించవచ్చుగాని ఆయన ప్రతిఘటన పద్ధతులను అనుసరించరాదు" అంటూ ఆమె ఇంకా ఇట్లా అన్నారు

"నేను మీ అందరి పక్షాన ఈ తీర్మానరూపంలో గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల ఆత్మగౌరవమేగాక, ప్రపంచంలోని అందరి భారతీయుల ఆత్మగౌరవం కాపాడేటందుకు చేసిన కృషికి ఆయనకు కృతజ్ఞత తెలుపుతున్నాను ఒక దేశంలోని భారతీయులకు అవమానం జరిగిందంటే, భారతజాతి అంతటికీ అవమానం జరిగినట్లే సహించరాని అవమానానికి లొంగిపోనందుకు మనమాయనకు కృతజ్ఞులంగా ఉండవలె దక్షిణాఫ్రికాలో జయప్రదంగా జరిగిన పోరాటం భారత భూమిపైన జరిగే స్వాతంత్ర్య సమరానికి నాంది కనక ఆయన ఇంతకుపూర్వం చేసిన పనికేగాక, అందువల్ల భవిష్యత్తులో భారతజాతికి కలుగనున్న శక్తి సామర్థ్యాలకు కూడా మనమాయనకు కృతజ్ఞులంగా ఉండవలె గాంధీజీ మనకు చేసిన ఉపకారాలలోకెల్లా గొప్ప ఉపకారం స్వార్థత్యాగానికి ఆయన మనకందజేసిన ప్రోత్సాహము న్యాయంకోసం, ధర్మంకోసం, అనుభవించే కష్టాలలో అవమానం లేదనీ, శరీరం ఖైదులో ఉన్నప్పటికీ ఆత్మ స్వతంత్రంగా ఉన్నంతవరకు ఖైదును అవమానంగా భావించనక్కరలేదనీ, మన స్వాతంత్ర్యానికి మనం చెల్లించవలసిన మూల్యాలలో ఒకటి ఖైలుశిక్షను అనుభవించడమేననీ ఆయన మనకు బోధించినారు ఆ గొప్ప ఆదర్శాన్ని అనుసరించడం మన విధి.

ఈ సందర్భంలో మనం శ్రీమతి కస్తూరిబాయి గాంధీకి కూడా మన కృతజ్ఞతలను తెలుపవలసిఉంది ఆమె తన భర్తను అనుసరించడమేగాక, దక్షిణాఫ్రికాలోని భారతీయ గృహిణులు తమ భర్తలకు భార్యలుగానేగాక ఉంపుడు

క_ర్తెలుగా ఉండవలసిన సహించరాని అత్యాచారం అమోఘంగా ప్రతిఘటించింది ఆ సందర్భంలో ఆమె భారతస్త్రీల ప్రతిష్ఠనేగాక ప్రపంచంలోని యావత్తు స్త్రీజాతి ప్రతిష్ఠనూ ఇనుమడింపచేసిందని చెప్పవచ్చు ఆమె ప్రపంచంలో భర్తలకు సహధర్మచారిణులుగా ఉన్న భార్యల గౌరవమేగాక వివాహ సంస్కారంలో పవిత్రతను సైతం కాపాడింది "

డాక్టర్ బిసెంట్ గారు ఇట్లా ప్రసంగించిన తరవాత అధ్యక్షులు ఈ తీర్మానం వోటుకుపెట్టగా సభ్యులందరూ నిలబడి విజయ నినాదాలతో తీర్మానాన్ని యేకకంఠంగా ఆమోదించినారు

గాంధీజీ ఈ తీర్మానానికి ప్రత్యుత్తరమిస్తూ ఇట్లా అన్నారు

"మొదటి రెండు తీర్మానాలకు పిమ్మట మమ్ములను ప్రశంసిస్తూ చేసిన మూడో తీర్మానం యదృచ్ఛాపూర్వకము మొదటిది పూజ్యులయిన మా గురువుగారిని గురించినది రెండోది ఉదార పురుషుడయిన రాజ ప్రతినిధిని గురించినది ఆయనను గురించి అధ్యక్షులు చెప్పిన ప్రశంసా వాక్యాలు బహు సమంజసంగా ఉన్నాయి రాజ ప్రతినిధికి మన దేశీయుల కృతజ్ఞతను నేనిక్కడ స్వేచ్ఛగా తెలుపుకొంటున్నాను ఈ వేదికపైనను ఇంకా అనేక వేదికల పైనను నన్నూ నా సహధర్మచారిణినీగురించి చెప్పిన ప్రశంసా వాక్యాలకు మాకేమయినా అర్హతఉంటే అందుకు కారణం భారతదేశంనుంచి మాకు లభించిన ప్రోత్సాహమే మా గురువుగారైన గోఖ్లేగారి ప్రేమ, ఆయన సందేశాలు మాకు మార్గదర్శకాలుగా ఉన్నవి చిరకాలం మాకవి మార్గదర్శకాలుగా ఉండగలవు ఈ విషయం నేననేకసారులు చెప్పినాను తిరిగి ఇక్కడ చెబుతున్నాను మమ్ములను మీరు ఎక్కువగా ప్రశంసించి మేము చేయవలసిన సేవను మేము విస్మరించేటట్లు చేయవద్దని మిమ్ములను ప్రార్థిస్తున్నాను నేనూ నా భార్యా దక్షిణాఫ్రికాలో చేసిన సేవనుగురించి మరిచిపొండి ఇది నా వినయ పూర్వకమయిన మనవి దక్షిణాఫ్రికాలో మేముచేసిన పనిని అక్కడివారు గుర్తిస్తారు గాక! దక్షిణాఫ్రికాలో గడించిన ప్రతిష్ఠను ఆధారంగా చేసుకొని మేముగాని, మరెవ్వరుగాని ఎల్లకాలం పొగడుకుంటూండటం మంచిదికాదు మీరు నన్ను ఎక్కువగా పొగిడినందువల్ల నాకడనుంచి ఇంకేవో ఘనకార్యాలను ఆశిస్తున్నట్లు తోస్తూన్నది ఈ సందర్భంలో చివరికి మీరు ఆశాభంగం పొందవచ్చుకూడా

"మరొకమాట చెప్పవలసిఉన్నది నిన్నటి అగ్రాసనాధిపతిగారి ఉపన్యాసం సభలో చదవడంచేత ఎక్కువకాలం గడిచింది అందువల్ల కాలం వ్యర్థమయింది పైగా అంత ఉపన్యాసం అచ్చువేసినందుకు డబ్బుకూడా ఎక్కువ ఖర్చు అవుతూంది. ఇకముందైనా సభలలో పెద్ద ఉపన్యాసాలను చదవడం, వాటికోసం ధనవ్యయం చేయడం మానుకొంటారని భావిస్తున్నాను నేనీ విషయం ఒంటరిగా చెబుదామనుకొన్నాను కాని ఎందువల్లనో ఇప్పుడు బహిరంగంగా చెప్పదలచినందుకు నన్ను మన్నిస్తారుగాక! నేనెవరినీ - అగౌరవపరిచే

వాణ్ణి కాను అందుకు నా మనస్సు ఒప్పుకోదు" అని గాంధీజీ తన ఉపన్యాసాన్ని ముగించినారు

**చెన్నరాష్ట్రీయసభ - గాంధీ దంపతులకు ఆహ్వానసంఘాధ్యక్షుని విందు**

గాంధీ దంపతుల గౌరవార్థం మద్రాసు రాష్ట్రీ రాజకీయ మహాసభా సంఘాధ్యక్షులు గౌ॥ వి యస్ కృష్ణారావుగారు విందు చేసినారు ఆ సభకు వచ్చిన ప్రతినిధులందరినీ విందుకు ఆహ్వానించినారు ఇది నెల్లూరు పురమందిర ఆవరణలో జరిగింది విందుకు దయచేసిన వారందరినీ గాంధీ దంపతులకు పరిచయం చేసినారు ఈ సందర్భంలో నెల్లూరు పట్టణ విద్యార్థులు గాంధీ దంపతులకు తమ కృతజ్ఞతను తెలుపుతూ సన్మానపత్రం సమర్పించినారు

గాంధీగారు సన్మానపత్రాలకు కృతజ్ఞత తెలుపుతు కడచిన మూడు దినాలనుంచి తాము గమనిస్తూండిన సభా విషయాలను గురించి తమ అభిప్రాయం వెల్లడించినారు విద్యార్థులకు కొన్ని ఉపదేశవాక్యాలు వారు చెప్పిన తరవాత సమావేశం వందేమాతర నినాదాలతో ముగిసింది

నెల్లూరులో జరిగిన చెన్నరాష్ట్రీయ సంస్కరణసభ, [illegible] కూడా గాంధీ దంపతులు హాజరయినారు ఈ రెండు సభలలోను తెలుగుదేశపు ప్రముఖు లనేకులు పాల్గొన్నారు గాంధీ దంపతులు సభలలో ప్రత్యక్షం కాగానే సంతోషధ్వానాలు చెలరేగుచూ వచ్చినాయి శ్రీ గాంధీ దంపతులు సనాతన ధర్మసభలో కుర్చీలమీద కూర్చుండక చాపలమీదనే కూర్చున్నారు గాంధీజీ మద్రాసులోను, నెల్లూరులోను ఉన్నప్పుడు వివిధ సంస్థలను చూసినారు వివిధ వర్గాలవారితో ఇష్టాగోష్ఠి జరిపినారు విభిన్న దృక్పథాలు [illegible] అయినాయి తద్వారా వారు ఆనాటి ఆంధ్రదేశంలోని రాజకీయ సాంఘిక ఆర్థిక సమస్యలను సమగ్రంగా అర్థంచేసుకోనేటందుకు ప్రయత్నించి[illegible] గాంధీ దంపతులు ఆనాడు ఆంధ్రదేశంలోని ఏ రెండు పట్ట[illegible] నప్పటికి గాంధీజీ ప్రభావం ఆంధ్ర ప్రజాహృదయాలలో గాఢంగా ముద్రితమయినట్లు కొన్ని తార్కాణాలు కనబడుతున్నాయి

**చేబ్రోలు గ్రంథ భాండాగారము**

1915 మే నెలలో గాంధీ దంపతులు నెల్లూరులోని మద్రాసు రాష్ట్రీయ రాజకీయ మహాసభకు, సంఘసంస్కరణసభ, సనాతన సభలకు వచ్చివెళ్ళిన తరవాత 1915 జూన్ ఒకటవ తేదీని గుంటూరుజిల్లా చేబ్రోలులో "గాంధీ సరస్వతీనిలయ"మనే పేరుతో ఒక గ్రంథాలయము స్థాపించబడింది ఆ గ్రంథాలయ ప్రారంభోత్సవ సభకు శ్రీ వింజమూరి భావనాచార్యులవారు అగ్రాసనాధిపత్యం వహించి తమ ఉపన్యాసం ముగిస్తూ ఇట్లా ప్రసంగించినారు

"కోటి మాటలను చెప్పవచ్చు ఉపన్యాసవేదికలపై నెక్కి గంభీరోపన్యాసాలు చేయవచ్చు శాసననిర్మాణ సభలలో చర్చలు చేయవచ్చు, కాంగ్రెసు నాయకులుగా గణన కెక్కవచ్చు కాని పరదేశంలో పరదేశీయుల నడుమ

స్వదేశీయుల ఆత్మగౌరవంకోసం పరదేశ ప్రభుత్వాన్ని ఎదిరించి నిలచి సాత్త్విక నిరోధ మహాస్త్రం పూని కారాగృహబద్ధుడై ఒక్కడయినా చివరివరకొక ప్రభుత్వంతో పోరాడి జయించి స్వదేశీయులచేతనే గాక ప్రపంచ ప్రజలందరి చేతనూ పొగడ్తలనుగన్న గాంధీగారి జీవితం పరమ పవిత్రము, నిరంతరం పారాయణం చేయతగినది, భాగవతంనందెల్ల సప్తమస్కంధ మందరికీ ప్రీతికరము నాటి ప్రహ్లాదుడే నేటి గాంధీ అవతారమైనని చెప్పవచ్చు బారిష్టరయినా సకల భోగాలను త్యజించి వానప్రస్థాశ్రమం నడుపుకొంటూ న్యాయం కోసం ధనము ,సౌఖ్యము సర్వస్వాన్ని పరిత్యజించిన గాంధీగారికంటె మహనీయుడెవ్వడు? ఆయన చరిత్రమిప్పుడే ఇక్కడ చదువగలరు కాబట్టి ఈ గ్రంథ భాండాగారము "శ్రీ గాంధీ సరస్వతీనిలయము" అను పేరుతో దినదిన ప్రవర్ధమానమై నిత్యభాగ్యాభివృద్ధి పొందుచూ అవిద్యను తొలగించి విద్యాదీపం వెలిగించి దేశభక్తియుతులయిన వారి కాకరమై వర్ధిల్లునుగాక!" ఈ ఉపన్యాసము గాంధీ ప్రభావ ముద్రితమయిన ఆంధ్రప్రజాహృదయం ప్రతిబింబింపచేస్తున్నది

## ఆంధ్ర ప్రముఖులకు గాంధీజీ ప్రథమ దర్శనం

గాంధీ దంపతులు నెల్లూరులోని మద్రాసు రాష్ట్రీయ సభకు, సంఘ సంస్కరణ సభకు సనాతన సభకు హాజరయినందువల్ల 1915 లో ఆ సభలలో ప్రముఖ పాత్ర వహించిన అనేకమంది ఆంధ్రనాయకులు ఆయనను మొట్టమొదట చూసిఉంటారు గా॥ న్యాపతి సుబ్బారావు, గా॥ మోచర్ల రామచంద్రరావు పంతులు, డి పట్టాభి రామిరెడ్డి, వల్లూరి సూర్యనారాయణరావు, వరాహగిరి వెంకటజోగయ్య పంతులు కాశీనాథుని నాగేశ్వర రావు పంతులు, దేశపాండ్య సుబ్బారావు, న్యాపతి హనుమంతరావు, వింజమూరి భావనాచార్యులుగార్లు చెన్న రాష్ట్రీయ మహాసభలో పాల్గొన్న ప్రముఖులు ఆ రాష్ట్రీయ సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు ఎ యస్ కృష్ణారావుగారు సభాధ్యక్షులు బయ్యా నరసింహేశ్వరశర్మగారు ఆ సభా ప్రారంభంలో వందేమాతర గీతం ఆలపించిన వారు కోతా శ్రీరామశాస్త్రిగారు వీరుగాక శ్రీయుతులు కొండ వెంకటప్పయ్య పంతులు చల్లా శేషగిరిరావు దేశిరాజు హనుమంతరావు, వెలగపూడి సుబ్బారావు, న్యాపతి నారాయణరావు, ముట్నూరి కృష్ణరావు, ఒంగోలు వెంకటరంగయ్య దాదాపు వీరందరూ - ఏ ఒకరిద్దరో తప్ప చెన్న రాష్ట్రీయ మహాసభలో ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకతను బలపరచినవారు వీరిలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, న్యాపతి సుబ్బారావు, మోచర్ల రామచంద్రరావు, వరాహగిరి వెంకటజోగయ్య పంతులుగార్ల వంటివారు మద్రాసులోనే గాంధీజీని మొదటి పర్యాయం దర్శించి ఉంటారు

నెల్లూరులో జరిగిన చెన్నరాష్ట్ర సంఘ సంస్కరణ సభకు పండిత అల్లాడి మహాదేవశాస్త్రిగారు అధ్యక్షులు చెన్నరాష్ట్ర రాజకీయ మహాసభలో పాల్గొన్న పై నుదాహరించిన ప్రముఖులనేకులు సంఘసంస్కరణ సభలో పాల్గొని,

రజస్వలానంతర వివాహాలు, వితంతు పునర్వివాహాలు మొదలయిన వాటిని సమర్థిస్తూ తీర్మానములు చేసినారు ఈ సభలో కూడా గాంధీ దంపతులు ప్రేక్షకులుగా ఉన్నారు

నెల్లూరులో జరిగిన సనాతన ధర్మసభ వింజమూరి భావనాచార్యులు, మిట్టదొడ్డి వెంకట సుబ్బారావు (వకీలు-ఒంగోలు) గోవిందరాజుల వెంకట శ్రీనివాసరావు, పుష్పగిరి మఠాధిపతులు, నెమలి పట్టాభి రామారావు, శివపురపు వీరభద్ర పాకయాజి గార్లు పాల్గొన్నారు కందాడై గంగమన్నారు అయ్యంగారు ఆ సభకు స్వాగత సంఘాధ్యక్షులు, కె సుందర రామయ్యగారు అగ్రాసనాధిపతులుగా ఉండినారు శతావధాని పిసుపాటి చిదంబరశాస్త్రిగారు ఆశుధారతో సభాధ్యక్షులను, సనాతన ధర్మాన్ని ప్రశంసిస్తూ పద్యాలు చదివినారు కనుపర్తి మార్కండేయశర్మ (గుంటూరు) యస్ పార్థసారథి అయ్యంగారు (నెల్లూరు), రావుసాహెబు ధారామార్కండేయ శాస్త్రి, వేదం వెంకటరాయ శాస్త్రి, కరంచర్ల శ్రీనివాసనాయుడు, స్వయంపాకుల సూర్యనారాయణ శాస్త్రి, పంచాగ్నుల సుబ్రహ్మణ్యం (కావలి), మోతునాదం వేణుగోపాలరావు గార్లు సనాతనధర్మ తీర్మానాల చర్చలలో పాల్గొన్నారు గాంధీ దంపతులు సనాతన ధర్మసభలో సైతం ప్రత్యక్షమయినందువల్ల వీరందరికీ కూడా అక్కడ గాంధీజీ ప్రథమ దర్శనభాగ్యం లభించింది

## గాంధీ - నెల్లూరు కలెక్టరుకు అతిథి

1915 లో గాంధీజీ నెల్లూరు వచ్చినప్పుడు ఆయన నెల్లూరు జిల్లా కలెక్టరు దివాన్ బహద్దూర్ ఆర్ రామచంద్రరావుగారి ఇంట్లో బస చేసినారు అతిథిగా ఉన్నారు రామచంద్రరావుగారు ఉదార భావాలుగల దేశభక్తుడు గాంధీజీ వంటి తిరుగుబాటుదారుకు ఆయన ఆతిథ్యమిచ్చినందు , ప్రభుత్వం వారు ఆయనను సంజాయిషీ అడిగినారు అప్పుడాయన గాంధీజీని చూడవచ్చిన వారినీ, చూసినవారినీ సన్నిహితంగా ఉండి గమనించేటందుకూ, గాంధీజీ కార్యక్రమం దగ్గరగా ఉండి పరిశీలించేటందుకూ వీలవుతుందనే ఉద్దేశంతో ఆయనకు తన బంగళాలోనే వసతి ఏర్పరిచి ఆయనను తనకు అతిథిగా ఉంచుకొన్నట్లు ప్రత్యుత్తరం వ్రాసినారు

చెన్నరాష్ట్ర రాజకీయ మహాసభ, నెల్లూరుజిల్లా సభలు, నెల్లూరులోని లక్ష్మీ నర్సారెడ్డి టౌన్ హాలులో జరిగినాయి నెల్లూరు టౌన్ హాల్ కు విరాళమిచ్చిన లక్ష్మీ నర్సారెడ్డి, మద్రాసులోని "ఇండియన్ రివ్యూ" పత్రికా సంపాదకుడు జి ఏ నటేశన్, సంఘ సేవా పరాయణుడయిన ప్రధానోపాధ్యాయుడు కె ఏ వీరరాఘవాచార్యులుగారు గాంధీజీతో కలసి ఫోటో తీయించుకొన్నారు

## కొండ వెంకటప్పయ్యగారికి గాంధీజీతో పరిచయం

కొండ వెంకటప్పయ్యగారికి గాంధీగారితో కలిగిన ప్రథమ పరిచయం

లను గురించి వారిట్లా వ్రాసినారు

"నేను గాంధీగారిని ప్రప్రథమంగా 1915లో నెల్లూరులో కలుసుకొన్నాను. ఆయన దక్షిణాఫ్రికానుంచి వచ్చి మొదటిసారిగా ఇండియా పర్యటనంలో దక్షిణ భారతదేశానికి కూడా దయచేసినారు. ఆయన ఇండియాలోని పరిస్థితులను, ప్రజాజీవితం బహిరంగోపన్యాసాలు చేయకుండా పరిశీలిస్తూండిన రోజులవి. ఆయన నెల్లూరుకు మద్రాసునుంచి వచ్చి అక్కడి జిల్లా కలెక్టరుకు అతిథిగా ఉన్నారు. నేనూ కొంతమంది స్నేహితులమూ కలిసి ఒకనాటి ఉదయం ఆయనను చూడటానికి వెళ్ళినాము. అప్పుడాయన కాలినడకను బయటకు వెళ్లి ఉన్నారు. కొన్ని నిమిషాలకు బసకు వచ్చినారు. ఆయన ఒక అంగవస్త్రము, కురుచ చేతులుగల ఒక బనియనూ మాత్రం ధరించి ఉన్నారు. తలపైన యేమీ లేదు. ఆయన చేతిలో ఒక చిన్న కర్ర ఉన్నది. అది నాగరకులు పుచ్చుకొనే అందమయిన కర్రకాదు. ఒక సన్నని వెదురుకర్ర. ఆ రూపంలో ఆయనను చూసి ఆశ్చర్యచకితులమయినాము. ఆయన జీవితం అత్యంత నిరాడంబరమయినదని ఆ ప్రథమ వీక్షణంలోనే మాకు తెలిసివచ్చింది. మన పరిపాలకుల వేషభాషల ననుసరిస్తూ చాలా అందచందాలుగల దుస్తులు వేసుకొని మురియడం ఆనాటి ఆంగ్లవిద్యావంతుల అలవాటు.

పరస్పర ప్రణామాల అనంతరం ఆయన చుట్టూ చూసి మమ్మిలను కూర్చోమనేటందుకు తగిన ఆసనం లేక "భూదేవి మనలను అందరినీ నేలమీద కూర్చోమని ఆహ్వానిస్తూన్నది" అని ఆయనే ముందుగా వట్టినేలమీద కూర్చున్నారు. మేమందరము ఆయనతోపాటు నేలమీదనే చతికిలపడినాము. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గురించి ఆయనతో ప్రసంగం ప్రారంభించినాము. ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమం కేవలం తమిళులుపైన అసూయతో ప్రారంభమయినదని మద్రాసులో తమకు కొందరు తెలిపినట్లు మా మాటలు అడ్డంపచ్చి ఆయన అన్నారు. కాని మా ఆంధ్రోద్యమము, ఇండియాలోని ప్రస్తుత రాష్ట్రాలు భాషా, సంస్కృతి, చరిత్రలను అనుసరించి తిరిగి విభజించవలసి ఉంటుందనే విశాలదృక్పథంతో ప్రారంభింపబడిందనీ ఆ సిద్ధాంతం పైననే మేమొక ప్రత్యేక రాష్ట్రం కోరుతున్నామనీ ఆయనకు నచ్చజెప్పడానికి మా కెంతో కాలం పట్టలేదు." ఇది మొదటిపర్యాయం శ్రీ కొండ వెంకటప్పయ్యగారు గాంధీజీని నెల్లూరులో కలుసుకొన్నప్పుడు జరిగిన ఉదంతము.

గాంధీజీని కొండ వెంకటప్పయ్యగారు 1917లో ఢిల్లీలో కలుసుకొన్నారు. ఆ సమావేశంగురించి వెంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్రలో ఇట్లాఉంది.

"అనీబిసెంట్‌గారి హోమ్‌రూల్ సమితిలో తిలక్ మహాశయులు సహితం చేరి ప్రచారం సాగిస్తున్నారు. ఈ సమితి పక్షంలో మాంటేగ్ చమ్స్‌ఫర్డులకొక నివేదిక ఇవ్వడం ఉపసంఘం ఏర్పరిచి అందు నన్నుకూడ సభ్యునిగ చేర్చిన కారణంచేత నేను ఢిల్లీకిపోయినాను. అక్కడికి తిలక్ మొదలయిన ప్రముఖులుకూడ

విచ్చేసినారు. అనీ బీసెంట్‌గారే నివేదిక తయారుచేసి ఉదయం మనందరికీ చదివి వినిపించినారు. ఆమె హోంరూల్ లీగుకు అధ్యక్షురాలుగను, తిలక్‌గారు ఉపాధ్యక్షులుగ ఆ నివేదికను వినిపించిన తరువాత దానిని ఎవరు సమర్పించడమనే ప్రశ్న వచ్చినప్పుడు తానే చదివి అందిస్తాననీ ఆమె చెప్పినారు. ఆ సమయంలో నేను తిలక్‌గారి ప్రక్కనే ఉంటినిగాబట్టి, ఈ ముఖ్యప్రదేశ ప్రముఖులు కాబట్టి తామే చదివి వారికందివ్వడం యుక్తమని నేను మెల్లగ వారితో అన్నాను. కాని ఆమె ఉత్సాహపడుతూవున్నదికాబట్టి ఆమె కోర్కెయే నెరవేరనిమ్మని వారు నాకు సమాధానమిచ్చినారు.

"ఆ మధ్యాహ్నం మేము మాంటేగ్ చెమ్స్‌ఫర్డ్‌లను కలుసుకోబోగా అక్కడికి గాంధీమహాత్ములుకూడ వచ్చినారు. వారు ధరించిన ముతుక దుస్తులు చూసినవారికి కొంత విపరీతంగ కనబడింది. పెద్ద ఖద్దరు తలగుడ్డ, రైతులు చుట్టుకొన్నట్లు చుట్టుకొని కోరా ఖద్దరు దుప్పటి కప్పుకొని కాళ్ళకు ఎల్లెటూరి చెప్పులు తొడుగుకొన్నారు. మేమందరం లాగులు కోట్లు తొడుగుకొని జరీ పాగలు చుట్టుకొన్నాము. మేము తొడుక్కొన్న కోట్లు ఇంగ్లీష్ ట్వీడ్ అల్పాకాకీతో చేసినవి. తిలక్ మహాశయుడు గుడ్డ బొందులుగల తెల్ల అంగరఖాయును జల్తారు కుచ్చుగల ఎర్రని పగిడీని ధరించియున్నాడు."
ఇవి వెంకటప్పయ్య పంతులుగారు స్వీయచరిత్రలో వ్రాసుకొన్న మాటలు. తరవాత మరొక సందర్భంలో ఢిల్లీ ఉదంతంగురించి ఆయన ఇంకా ఇట్లా వ్రాసినారు.

"అందంకోసం వేసుకొన్న నా విదేశీ దుస్తులలో ఢిల్లీలో నేనాయన ఎదుట నిలబడేటందుకు [illegible] సిగ్గుపడినాను. హోంరూల్ లీగ్ పక్షాన చెమ్స్‌ఫర్డ్ మాంటేగులకు విజ్ఞాపన పత్రాలను సమర్పించడం తప్ప మేము చేసిన పని యేమీ లేదు. మా సభ్యులలో ఎవ్వరమూ ఏమీ ప్రసంగం చేయలేదు. అధ్యక్షురాలు మమ్ములనందరిని ఒక్కొక్కరినే లార్డ్ చెమ్స్‌ఫర్డ్ మాంటేగులకు పరిచయంచేసింది. మహాత్మాగాంధీ దుస్తులు కొంత విమర్శకు కారణభూతాలయినాయి. అది ఆయనకు తెలుసుకూడా. సాధారణంగా అప్రాముఖ్యంగా భావించే సూక్ష్మవిషయాలలోకూడా ఆయన నియమనిష్ఠలుగల సత్యసంధుడుగా వ్యవహరిస్తారు." ఇవి వెంకటప్పయ్య పంతులుగారికి 1917 లో గాంధీజీని ఢిల్లీలో రెండోసారిగా చూసినప్పుడు కలిగిన అభిప్రాయాలు.

## విద్యార్థులకు గాంధీజీ సందేశం

నెల్లూరు విద్యార్థులు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించిన తరవాత వారు నెల్లూరు సభలో స్వచ్ఛంద సేవకులుగా ఉండి ఉత్సాహంగా పనిచేసినందుకు వారిని ఆయన అభినందించినారు. వేదికలమీద జరిగే ప్రసంగాలు ఆచరణలోనికి వచ్చి ఆ ఉత్సాహం తుదివరకూ ఉంటేనే తప్ప గాంధీజీ సభలవల్ల ప్రయోజనం లేదన్నారు. వేదికపైన పరిశ్రమలను గురించి ఎంతో బాగా ఉపన్యసించడంజరిగింది. కాని గాంధీజీ, చిత్తూరు జిల్లాలోని నారాయణవనంనుంచి

మరమగ్గాలమీద నేసిన వస్త్రాల ప్రదర్శనశాలకు పోయి ఆ అంగడి యజమానిని "ఎంత ఖరీదుగల బట్ట మీరు తెచ్చినారు ఎంత ఖరీదుగలది అమ్మినారు?" అని అడిగినప్పుడు ఆయన వేయి రూపాయిల ఖరీదుగల బట్టను తెచ్చినట్లూ అందులో ఒక యేభై, లేదా అరవై రూపాయిల విలువగల బట్టను మాత్రమే అమ్మగలిగినట్లునూ చెప్పినారు "ఆ బట్టలు చాలా బాగున్నవి అయినప్పటికి విద్యార్థికులు సైతం ఆ స్వదేశీ పరిశ్రమను ప్రోత్సహించేటందుకైనా కొంత పైకం వెచ్చించి కొన్ని వస్త్రాలను కొనేటందుకు కుతూహలపడలేదు స్థానిక స్వదేశీ పరిశ్రమలకు ఆ మాత్రం ప్రోత్సాహమయినా లేనప్పుడు ఇక మన ప్రగతికి ఆశలేదు" అంటూ విద్యార్థులను ఉపన్యాసాలు చేయడంతో సంతృప్తి పడక తాము చెప్పేది ఆచరణలోపెట్టి ఆదర్శప్రాయులుగా ఉండవలెనని గాంధీజీ హెచ్చరించినారు

## కస్తూరిబా గాంధి-సరోజినీదేవి

గాంధీజీకి సహధర్మచారిణిగా ఉండిన కస్తూరిబాగాంధీ దక్షిణాఫ్రికా నుంచి మాతృదేశానికి వచ్చినప్పుడు బొంబాయిలో ఆమెకు మహిళామండలి వారు సన్మాన పత్రం సమర్పించనున్న సందర్భంలో శ్రీమతి సరోజినీదేవి లేడీ మెహతాకు వ్రాసిన లేఖ భారత నారీ ప్రపంచానికి నూతనో త్తేజం కల్పించేదిగా ఉన్నది ఆ లేఖ ఇది

"నా స్నేహితురాలు శ్రీమతి గాంధీని ఆహ్వానించేటందుకు మీరు ప్రముఖ పాత్ర వహించనున్నారని పత్రికలద్వారా తెలుసుకొని నేనీ లేఖ మీకు వ్రాయడానికి సాహసిస్తున్నాను వ్యక్తిగతంగా ఆమెను ఆహ్వానించడం ప్రశంసించడం బొంబాయి మహిళల ప్రత్యేక భాగ్యం కావచ్చు అయినప్పటికీ, స్వార్థత్యాగము, దేశభక్తి, ధైర్యసాహసాలవంటి ఉత్తమగుణాలతో భారత స్త్రీల ఉన్నత సంప్రదాయాలను తీర్చిదిద్దిన ఆ పుణ్యవతి సన్మానంలో ప్రత్యక్షంగా కాకపోయినా మానసికంగానైనా యావద్భారత నారీలోకం పాల్గొనడంకోసం వాంఛిస్తూన్నది

విదేశాలనుంచి ఇండియాకు తిరిగివచ్చిన కొద్దిమందిలో, గాంధీ దంపతులు ఇంగ్లండ్‌లో ఉండినప్పుడు వారి కుటుంబ జీవితంతో సన్నిహిత సంబంధంగల అదృష్టం నాకు లభించింది దయాదాక్షిణ్య శాంతస్వభావాలుగల కస్తూరిబాతో నేను సన్నిహితంగాఉన్న కొద్దికాలంలో నాకు మరపురాని మనోజ్ఞ విషయాలు ఒకటిరెండున్నాయి మేము ఎల్లప్పుడూ ఆమెను మా కుటుంబ సభ్యురాలుగా తలచుకొంటూండేవాళ్ళము ఆమె అనారోగ్యవంతురాలయినా మొక్కవోని ధైర్యంకలది ఆమె పసిబిడ్డవలె బక్కచిక్కిన శరీరం కలదైనా స్వధర్మ రక్షణార్థం ప్రాణాలను త్యజించడానికి సైతం వెనుదీయని ఆత్మబల సంపన్నురాలు నిరుడు ఆగస్టు నెలలో వర్షిస్తూన్న ఒక అపరాహ్ణ సమయాన లండన్‌లోని ఒక సామాన్య నివాసగృహం మెట్లెక్కుతూండగా,

నిరాడంబరత్వమూ ఉజ్జ్వల తేజస్సూగల యోగినులకు సంబంధించినట్టి 'వల్లెపాట' వలె నా యెదుట ప్రత్యక్షమయింది. ఆమె అభివర్ణించినట్లు రేగడ మట్టి నుంచి వీరులను తయారుచేసిన దక్షిణాఫ్రికా మహోద్యమంలో ఉత్తమ స్త్రీ గానూ, నాయకురాలుగానూ ఉండి నేలమీద కూర్చొని కొన్ని కొన్ని పండ్లూ తింటూన్నారు. అందులో కొన్ని నాకు కూడా ఇచ్చారు. ఆయన భార్య గృహకార్య నిర్వహణంలో నిమగ్నురాలై మందలాగి చిల్లర పనులు చక్కబెట్టుకొని సాధారణ కుటుంబినివలె కనిపించినప్పటికీ జాతీయోద్యమంలో అనేక కష్టనష్టాల ననుభవించి ప్రపంచప్రఖ్యాతి గడించిన వీరాంగనవలె అగపడ లేదు "నిజమయిన గొప్పదనం విశ్వమానవకంఠంతో కీర్తింపబడి విశ్వజనీన గౌరవాన్ని ఆకర్షిస్తుంది." అనే సత్యానికి సాక్ష్యంగా ప్రాచ్య పాశ్చాత్య దేశాల స్త్రీపురుషులు వారిని అభినందించడానికి వచ్చినప్పటి దృశ్యం కన్నులారా చూసినవారు పులకాంకితశరీరులు కాక మానరు. అది నా స్మృతిపథంలో ఎన్నటికీ చెరిగిపోని సంఘటనలు జయం కలిగినప్పుడామె తన భర్త పక్కన ఎంతనిరాడంబరంగా ఎంతప్రశాంతంగా ఎంతహుందాగా కూర్చుని ఉండేదో అపజయంవచ్చి విషాదకర కష్టపరిస్థితులలో ఉన్నప్పుడు కూడా ఆమె తన భర్త పక్క అంత నిరాడంబరంగానూ, అంత నిరాకులంగానూ, అంత నిర్భయంగానూ కూర్చొనిఉండేది

గాయపడిన సిపాయిలకు దుస్తులను అమర్చడంలో, ఓర్పుగా సేవచేస్తూ పక్క చిక్కిన ఆమె చేతి సాహసం ఆమె పట్ల గౌరవాన్ని ఉద్దీపింపచేసింది

తన భర్తకు ఆదర్శప్రాయమయిన సఖి, సహధర్మచారిణి అయి ఆమెను రూపొందించిన చిత్తాకర్షక సుగుణాలన్నిటికీ పునాదిగా ఉన్న హృదయంగమమయిన అమూల్యవిషయమొకటి, నా స్మృతి పథంలో నటిస్తున్నది దానిని నేనిక్కడ పేర్కొనకతప్పదు యుద్ధప్రారంభసమయంలో ఆమె ఇంగ్లండు వచ్చినప్పుడు,ఆమెకాలాన్ని దూరాన్నికూడా గణించకుండా ఇండియాకు ఎగిరి పోవలెననే ఆసక్తితో రెక్కలు విప్పుకొని ఉన్నపక్షివలె కనిపించింది ఆమె ఇండియాకు విమానంలో వచ్చేటందుకు మధ్యలో కలిగిన అవసరమయిన కొద్ది అంతరాయాన్ని కూడా ఓర్చుకొనలేనిస్థితిలో అగపడింది తన మాతృభూమికి తనకు చిరపరిచితాలయిన దృశ్యాలు నినాదాలు ఆమె హృదయంలో ప్రతిబింబించినాయి,ప్రతిధ్వనించినాయి,తన ప్రేమాస్పదులయిన బిడ్డల ముఖవీక్షణం కోసం ఆమె స్త్రీహృదయం సంక్షుభితమయింది అయినప్పటికీ ఆమె భర్త,సామ్రాజ్యానికి తన సేవ అత్యవసరమని గట్టిగా భావించి క్షతగాత్రుల ఉపచారంకోసం స్వచ్ఛందసేవకదళ నిర్మాణానికి పూనుకొన్నపుడామె తన భర్తపట్ల సంపూర్ణ విశ్వాసంతో అమోఘమయినసేవ చేసింది ఆమెకు అంతకుపూర్వంగల కోరిక లన్నిటినీ త్యజించి భర్త నిర్ణయానికి అనుగుణంగా హృదయపూర్వకంగా ఆయనతో సహకరించింది "సతి" అనే పదానికి సరియైన అర్థం ఇదేనని నా అభిప్రాయము స్వార్థత్యాగానికి తక్షణం సంసిద్ధంగాగల ఈ శక్తిని గమనించి

నప్పుడు నేనొక క్రొత్తవిషయం గ్రహించగలిగినాను ఒక దేశం గొప్పతనం ఆ దేశంలోని ప్రజల మేధాసంపత్తిలోగాని భౌతిక ఐశ్వర్యంలోగానీ లేదనీ, ప్రేమ, త్యాగము, సేవలవంటి శాశ్వతాలయిన ఆధ్యాత్మిక ఆదర్శాలున్న తల్లుల ప్రభావంలో ఉన్నదనీ నాకు తెలిసి వచ్చింది

భారతదేశంలోని పురుషుల సుగుణంవల్లను, సౌశీల్యంవల్లను, ఔదార్యంవల్లను మాత్రమే స్త్రీలమైనమేము, శ్రీమతి కస్తూరీబాగాంధీవలె మా సతీత్వానికి అనుగుణమయిన సత్కార్యాచరణానికి పూనుకోగలమని మేము వారిని ఇతోధికంగా గ్రహింపకోరుతున్నాము "

మీ విశ్వసనీయురాలు,
సరోజినీదేవి

## 5
# మద్రాసుకు గాంధీజీ రాక - 1916

గాంధీజీ, సౌరాబ్జీ రుస్తుంజీగారు 1916 ఫిబ్రవరి 13 సాయంకాలం 2½ గంటలకు ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసుకు వచ్చినారు. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ (హిందూదేశ సేవాసంఘము) సభ్యులు శ్రీ దిగుమర్తి హనుమంతరావుగారు, శ్రీ వి యస్ శ్రీనివాసశాస్త్రిగారలు రైలుస్టేషనువద్ద గాంధీజీని కలుసుకొని వారిని బండిలో ఎక్కించుకొని వేసంపేట ఫాదరీగారి భవనానికి తీసుకొని వెళ్ళినారు. వారికి లేడీ వైట్‌హెడ్ ఆతిథ్యమిచ్చినారు. గాంధీజీ అక్కడే బసచేసినారు. గాంధీజీ ఏ రైలులో వచ్చేది స్పష్టంగా తెలియనందువల్ల ఉదయము, మధ్యాహ్నము రైలుస్టేషన్ దగ్గర జనం గుంపులు గుంపులుగా మూగి చాలసేపు వేచిఉండి వెళ్లిపోయినారు. అందువల్ల [illegible] ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌లో దిగేసరికి రైలు ప్లాట్‌ఫారంమీద ఎక్కువమంది జనం లేరు. గాంధీజీ మద్రాసు చేరిన సాయంకాలమే శ్రీ యస్ శ్రీనివాస అయ్యంగారు, జి ఏ నటేశన్ మొదలయిన వారాయనను సందర్శించిరి.

### సోషల్ సర్వీస్ లీగ్ వార్షిక సమావేశము

మద్రాసు సోషల్ సర్వీస్ లీగ్ వార్షిక సమావేశం 1916 ఫిబ్రవరి 16 సాయంకాలం యాండర్సన్ హాలులో జరిపేటందుకు మొట్టమొదట నిర్ణయించడం జరిగింది. ఆ సభలో గాంధీజీ ఉపన్యసించగలరని ప్రకటించడంతోనే ఆనాటి మధ్యాహ్నంనుంచి ఆ హాలు దగ్గరికి జనం గుంపులు గుంపులుగా రావడం మొదలుపెట్టినారు. అందువల్ల ఆ జనసమూహానికి ఆ హాలు సరిపోదనే అభిప్రాయంతో ఆ సభ క్రైస్తవ కళాశాలా చతురస్ర ప్రాంగణానికి మార్చబడింది. సభకు శ్రీమతి వైట్‌హెడ్ అధ్యక్షత వహించినారు. బిషప్ వైట్‌హెడ్ కూడా సభకు హాజరయినారు. అధ్యక్షురాలు, గాంధీజీ మాటలలోకంటె క్రియలో శక్తిసామర్థ్యాలను చూపిన మహాపురుషుడని పరిచయంచేస్తూ ఆయనను ఉపన్యసించవలసిందని కోరిన తరవాత ఆయన ఇట్లా ప్రసంగించినారు.

"ఈ ప్రపంచంలో సాంఘికసేవ అనండి, మరో సేవ అనండి! ఏ సేవ చేయడానికయినా ఒక్క షరతుమాత్రం అవసరము. అది ఏమంటే, ఆ సేవ చేసేవారు అందుకు తగిన అర్హతగలిగి ఉండవలె. అందువల్ల ఈ రోజున ఇక్కడ

ప్రశ్నించుకోవడం మంచిది ఎందువల్లనంటే సంఘసేవకులు మంచీ చేయగలరు చెడూచేయగలరు ఒకప్పుడు మనమెంత సదుద్దేశంతో సంఘసేవ తలపెట్టినా మనకందుకు కావలసిన అర్హతలు లేనట్లయితే మనం సమాజానికి ఉపకారం చేసేబదులు అపకారంచేసినవాళ్ళమవుతాము

## సంఘసేవకుడు

సంఘసేవకు కావలసిన అర్హతలేమిటి? నేనీ ఉదయం వై యం సి ఎ హాలులో విద్యార్థులకిచ్చిన ఉపన్యాసంలో పేర్కొన్న అర్హతలను తిరిగీ ఇక్కడ పునరుద్ఘాటించదలచుకొన్నాను అవి అన్ని వేళలా అందరు సంఘసేవ కులకూ వర్తించగలవు ఏ తీరు సంఘసేవకయినా అవి అవసరమే ముఖ్యంగా మన మాతృదేశంలోని నేటి మన జాతీయజీవితంలో ఇంకా ఎక్కువ అవసరము మనకు ముఖ్యంగా రెండు అర్హతలు అవసరము ఒకవైపున సత్యసంధత, రెండో వైపున నిర్భీతి సత్యసంధత అనే కాగడా మనచేతులలో లేకుంటే మనముందేమి ఉన్నదో మనకు తెలియదు నిర్భీతి అనే సుగుణం మనలో లేకుంటే సరియైన సమయంలో మనమీయవలసిన సందేశాన్ని ఇవ్వజాలము అటువంటి సమయం మనకు తరచుగారాదు ఎప్పుడో క్వచిత్‌గా మనలను పరీక్షించడానికి వస్తుంది అటువంటి సమయాలను మనం ప్రత్యేక అవకాశాలుగా భావించవలె అటువంటి అవకాశాలకు తగినట్లు మనం ప్రవర్తించగలిగి ఉండవలె భయమనేది లేకుం టేనే మనమట్లా ప్రవర్తించగలము ఈనాడు ఈ సేవలో నిమగ్నులయినవారు, ముందిటువంటి సేవ చేయదలచుకొన్నవారూ మీలో ఉండిఉంటారు మీ అంద రికీ ఈ రెండు అర్హతలు ఉన్నవో లేవో మీరే ఆలోచించుకోండి! అయితే ఈ రెండు అర్హతలనూ సంపాదించేటందుకు పొందే శిక్షణ మనకూ మనతో సంబంధం కలిగించుకొన్నవారికీ కూడా వినాశకరంగా పరిణమించవచ్చు రామాయణ మహాకావ్యంలోని రావణ శ్రీరామచంద్రులను, లక్ష్మణ ఇంద్ర జిత్తులనూ ఈ తరుణంలో మనం జ్ఞాపకం చేసుకోవడం మంచిది లక్ష్మణ ఇంద్ర జిత్తులిద్దరూ ఒకేతరహా అర్హతలున్నవారు ఉభయులు తపస్సుచేసినారు ఉభ యులు కొంతవరకు ఆత్మనిగ్రహం పొందగలిగినారు కాబట్టి ఇంద్రజిత్తును జయించడం దుర్భరమైపోయింది అయితే ఇంద్రజిత్తు శక్తి వట్టి మాయ అని మనం తెలుసుకొన్నాము లక్ష్మణుని శక్తి తనకూ తన పక్షంవారికే గాక మనకు కూడా ఉపకరించింది ఆయనను గురించిన కథ మనం విస్మరించరాని అమూల్య వస్తువుగా మనం భావిస్తున్నాము అయితే లక్ష్మణునకు అధికంగా ఉండిన ఆ శుభలక్షణమేమిటి? లక్ష్మణునిది దైవలక్షణం ఆయనకు ధార్మిక దృష్టి ఉన్నది ఆయన జీవితం ఒక నియమంపైనా ఒక ధార్మిక దృక్పథంపైనా ఆధారపడి ఉంది ఇంద్రజిత్తు జీవితం అధార్మికమయినది ఇంద్రజిత్తు ఎటుపోతున్నాడో అతనికి తెలియదు ధార్మిక దృష్టిలేని జీవితము నీతి నియమాలు లేని జీవితము నీతి నియమాలు లేని జీవితం చుక్కాని లేని పడవవంటిది చుక్కానీ నావికుడూ

లేని పడవ ఇటూ అటూ ఊగుతూ ఎటయినా పోవచ్చు కాని అది నిర్దిష్ట ప్రం శానికి మాత్రం చేరుకోదు అట్లాగే ధార్మికనిష్ఠలేని మనిషి మతమనగా నేమో గట్టిగా అర్థంచేసుకోని మనిషి ఈ సంసార మహాసముద్రంలో అటూ ఇటూ ఊగు లాడుతూ ఉంటాడేగాని ఎప్పటికీ ఏన గమ్యస్థానం చేరకోనలేదు కాబట్టి నేనింతవరకూ చెప్పిన రెండు అర్హతలూ ధార్మిక దృష్టివల్ల దైవప్రేరితంవల్ల పునీతాలు కానిదే మనం మన సోదర సోదరులకు సేవించగలమనుకోవడం వట్టి భ్రమ అని ప్రతి సంఘ సేవకుడూ గ్రహించవలసి ఉంది ఈ రెండు సుగుణాలు మనకు లభించిననాడు మన తప్పులుగాండా మనకు అపకీర్తి తెచ్చి పెట్టేవిగానీ మన ఉద్యమానికి మనం సేవించదలచుకొన్న మానవ సమాజానికి హాని కలిగిం చేవిగాగానీ ఉండవు

నేటి మన అధ్యక్షులురాలు, బిషప్‌గారి ఇంటి ఆవరణకు వెనుక ఉన్న పంచ ముల పల్లెకు నన్ను దయతో తీసుకొనిపోయి, సాంఘిక సేవాసమితి సభ్యు కార్యకలాపాలను అక్కడ సాగించక పూర్వం ఆ పల్లె పరిస్థితులెట్లుండేవో వర్ణించి చెప్పినారు నేనా గ్రామం చూసిన తరవాత పరిశుభ్రతకు తీరు తెన్ను లకూ అది ఆదర్శప్రాయంగా ఉన్నదని నేను ధైర్యంగా చెప్పగలుగుతున్నాను మద్రాసులోని జనసంకీర్ణాలయిన ముఖ్య ప్రదేశాలు కొన్నిటికంటెనూ అది ఎక్కువ పరిశుభ్రంగా ఉంది. ఈ సాంఘిక సేవాసమితి వారక్కడ చేసిన పని ఎంతో కీర్తిప్రదమయినదని చెప్పక తప్పదు మద్రాసులోని మిక్కిలి ప్రదేశాల లోకి కూడా ఈ సమితి చొరబడి అటువంటి పని చేయగలిగినట్లయితే, ఈ మహా నగరం నేను మళ్ళీ దర్శించేనాటికి ఈనాడు నేను చూసిన దృశ్యాలు నాడు నాకు కనబడకపోవడం నాకే ఆశ్చర్యంగా తోచవచ్చు ఈ దృశ్యాలు కొన్ని కొట్టవచ్చినట్లు కనబడుతూ ఉంటాయి వాటిని మనం సరిచేసి తీరవలె మన పంచమ సోదరులు హేతువాదాన్ని మంచి మాటలను ఆలకించగలిగినప్పుడు పెద్దకులాలవార మనుకొనేవారు వాటిని వినరనిగానీ, నగర జీవితానికి అత్యవసర మయిన ఆరోగ్యసూత్రాలను పాటించరనిగానీ అనుకొనేటందుకు ఆస్కారం లేదు మద్రాసులోని కేంద్ర ప్రదేశాలలోనేగాక ఇండియాలోని ప్రతి నగరం లోనూ ఉన్న ఈ పరిస్థితికి మున్సిపాలిటీలపైన బాధ్యత వేసి నిందమోపినందువల్ల ప్రయోజనంలేదు తరతరాలనుంచి వస్తూన్న ప్రజల అలవాట్లను మించి వ్యవహ రించగలగడం ప్రపంచంలోని ఏ మున్సిపాలిటీకీ సాధ్యం కానిపనీ ఇది ఎంతో ఓర్పుతోను దైవప్రేరణతోను చేయదగినపని ఈ మన చేతులలో మొక్కవోని ఈ రెండు పరికరాలను ఉంచుకొని సంఘసేవా సమితులవంటి సంస్థలద్వారా మాత్రమే మనమీ పనిని నిర్వహించగలము మన పురోగమనానికి ఉత్కర్షను చేకూర్చే నవీన దృక్పథం నూతనోత్సాహం మనలో స్పందిస్తూన్నాయి స్వచ్ఛంద సేవకుల సహాయం లేకుండా పెద్దపెద్ద నగరాలలో పారిశుద్ధ్య కార్య క్రమం కేవలం మున్సిపాలిటీలద్వారా సంస్కరింపబడుతుందనుకోవడం వట్టి పొర పాటు అయితే మున్సిపాలిటీలకు ఈ బాధ్యత లేదని చెప్పడం నా అభిప్రాయం

కాదు వారు ఈ విషయంలో చేయగలిగిన పని చాలా ఉంది ప్రజలు నగరాల బాగుకోసం మున్సిపాలిటీలను ఒత్తిడి చేస్తేనేగాని మున్సిపాలిటీలు మరింత శ్రద్ధగా పనిచేయజాలవు ఇండియాలోని ఒకానొక ఆదర్శ సంస్థానంలోపనిచేస్తూ ఉండిన ప్రభుత్వోద్యోగులు, తామెంత జాగ్రత్తతో ఉన్నప్పటికీ ఎంత శ్రద్ధ తీసు కొంటూన్నప్పటికీ ప్రజలను వారి సహజమయిన అలవాట్లనుంచి తప్పించడం సాధ్యంకావడంలేదని నాతో అన్నారు అయినప్పటికీ ఆ సంస్థానంలో జరిగిన అభివృద్ధి కనబడుతూనే ఉంది సంఘసేవాసమితి వారి సహకారం లేకపోయి నట్లయితే ప్రజలు ఇప్పుడు చేసిన పనిలో సగంపనికూడా చేసి ఉండేవారు కారని ఆ సంస్థానపు దివాన్ నాతో స్పష్టంగా చెప్పినారు ఉద్యోగస్థులు భయపెట్టినందు వల్ల యేమీ ప్రయోజనంలేదు "కత్తినిచూసి భయపడి తాగడం మానడంకంటె ప్రజలు తాగుబోతులుగా ఉండటమే ఉత్తమ"మని ఒకానొక సాధుపుంగవు డన్నాడు దుర్మార్గుడయిన మనిషికి నచ్చచెప్పి అతనిని ఆ చెడుమార్గంనుంచి తప్పించినప్పటికీ, అతడింకా చచ్చేటంతవరకూ తాగితీరవలెననే కోరికతో ఉండి నట్లయితే, అతనిదారిన అతనిని పోనివ్వడమే మంచిదేమో అనిపిస్తుంది నాకు మనమిక ఆ విషయంలో ఏమీ చేయజాలము చెడును చెడుతో మాన్పించలేము అతనికి శారీరక బాధ కలిగించి ప్రయోజనంలేదు తాత్కాలికంగా అతడు తాగడం మానినప్పటికీ తిరిగి తాగడం మొదలుపెట్టి తీరతాడు మానసిక సహకారంలేని భౌతిక తిరస్కారంవల్ల ప్రయోజనంలేదు హిందువుల పరమ పవిత్రక్షేత్రమయిన కాశీనగరంలోని వీధులు మురికిగా ఉంటాయి కాశీ దేవాలయంలో కూడా ఆ మురికి కనబడుతుంది అక్కడ చప్పుడూ గోలకూడా చాలా ఎక్కువే అటువంటి పుణ్యక్షేత్రాలలో ఒక క్రమపద్ధతి, శాంతి, నిశ్శబ్దము, మర్యాద, వినయమూ ఉండవలె వీటిలో ఒక్కటి కూడా అక్కడ కనబడదు అదీ ఆశ్చర్యము! భక్తులనుంచి అర్చకులు ఒక రూపాయికి తక్కువ పుచ్చుకోరు తరతరాల కిందట కాశీ విశ్వనాథుని స్థితి అట్లా ఉండిఉండదు లక్షలాది ప్రజలు ఎక్స్‌ప్రెస్ రైళ్లలో కాశీకి వెడుతున్న ప్పుడు, ఆ పరిసరాలలో కలుగుతున్న మార్పుల కనుగుణంగా క్రమాభివృద్ధి జరగవలెనంటే ప్రజలు ఆ నూతన పరిస్థితులకు తగినట్లు ప్రవర్తించవలసి ఉంటుంది కాశీ విశ్వనాథుని దేవాలయంలో ఏ పరిస్థితు లున్నాయో అవే పరిస్థితులు మన పుణ్యక్షేత్రాలలోని అధికసంఖ్యాక దేవాలయాలలో కనబడుతూ ఉన్నాయి సంఘసేవా సమితివారికిది ఒక సమస్య ఇది ప్రభుత్వంవారి సమస్యకానీ, మున్సి పాలిటీవారి సమస్యకానీ కాదు మీరు పాఠశాలలకు పోవడం మొదలుపెట్టడం తడవుగా దేవాలయాలకీగతి పట్టింది దేవాలయాల పరిశుభ్రతకు మనం అర్హులం కావలెనంటే మన విద్యావిధానంలో తీవ్రమయిన మార్పులు రావలె మన మిప్పుడొక ప్రమాదస్థితిలో పడినాము మన ముందు ప్రదర్శితమవుతున్న ఈ విషాదస్థితికి మన భావితరంవారు మనలను తిట్టిపోస్తారు దీనిని గురించి ఆలో చించి తగిన పరిహారం చేసితీరవలె. ఈ పని కష్టమయినదికావచ్చు కాని ఈ

పనికి తగిన ఫలితంకూడా లభించేటూట నిజము

"మూడోతరగతిబండల ప్రయాణంచేసే విద్యార్థుల మరొక ఎలహా! మీ దుస్తులను చూసి మీకంటె తక్కువవాళ్లమనుకొనే వారిమీద అధికారం చలాయించబోకండి! అట్లాచేసినట్లయితే మీరు సంఘసేవ అనర్హులవుతారు" ఈ ఉపన్యాసానంతరం అధ్యక్షురాలయిన వైట్ హెడ్ గాంధీజీకి కృతజ్ఞత చెప్పింది

రావు బహదూర్ శ్రీ టి విజయరాఘవాచారిగారు అధ్యక్షురాలికి కృతజ్ఞతాభివందనాలు చెప్పడంతో సభ ముగిసింది

## గాంధీజీ-మద్రాసు విద్యార్థులు

మద్రాసులోని క్రైస్తవ యువజన సంఘంవారి (వై యమ్ సి ఎ) యాజమాన్యంకింద 1916 ఫిబ్రవరి 16న ఉదయం 8 గంటలకు గాంధీజీ 'బ్రహ్మచర్య నియమావళి'ని గురించి ఎంతో ఉత్సాహపూరితమయిన ఉపన్యాసం చేశారు ఆ సభకు చాలామంది పెద్దలూ విద్యార్థులూ హాజరయినారు రెవ శ్రీ రెవ రెండ్ పిట్టర్ డ్రిగ్ అధ్యక్షత వహించినారు ఆయన, గాంధీజీని శ్రోతలకు పరిచయం చేయవలసిన అవసరంలేదనీ, ఆయనను ఉపన్యసించవలసిందని కోరడంగల అదృష్టం తనకు లభించినందుకు ఆనందిస్తున్నాననీ అన్నారు

గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు "నా కంఠస్వరం నేను వినవలెననే ఆసక్తి నాకు లేదని నే ననేక పర్యాయాలు చెప్పిఉన్నాను ఈ ఉదయంకూడా నేనదేస్థితిలో ఉన్నాను విద్యార్థులంటే నాకు చాల ప్రేమ, గౌరవము వారిని భారత భవితవ్యానికి ఆశాజ్యోతులుగా నేను భావిస్తున్నాను నా యీ మాటలు మీరు యథాతథంగా నమ్మవచ్చు అందువల్లనే నేనీఉదయం ఇక్కడ ఉపన్యసించడానికి సంతోషంతో అంగీకరించినాను ఏవిషయాన్ని గురించి నేను ప్రసంగించవలెనో నాకు తోచలేదు కాశీసంఘటనను గురించి మీకు తెలియ జెప్పగలరా అని ఒక మిత్రుడు ఇప్పుడే నాకొక చీటి పంపించినాడు నేనా మిత్రునికి ఆయనతోపాటు కోరేవారికి ఆశాభంగం కలిగించవలసివచ్చినందుకు విచారపడుతున్నాను ఆ ఘటనను గురించి అంతగా ఆలోచించవలసినపనిలేదు ఇవన్నీ మామూలుగా వస్తూపోతూఉండే అలలవంటివి నేను ప్రపంచంలోని అన్నివిషయాలకంటె ఎక్కువ ప్రీతికరమయిన పెన్నిధిగా దేనిని భావిస్తున్నానో దానిని గురించి నా మనస్సులో ఉన్నది యావత్తూ మీకు చెప్పగలనా అని నేనిప్పుడు ఆందోళనపడుతున్నాను కడచిన రాత్రి నా దగ్గరికివచ్చిన విద్యార్థులందరితో నేను ఇండియాలో ఏదో ఒకచోట ఒక ఆశ్రమం స్థాపించ బోతున్నాననీ, దానిని గురించి మీ ఎదుట నేనీఉదయం మాట్లాడబోతున్నాననీ చెప్పినాను మనకుకాని – మనకేకాదు ప్రపంచంలో ఏ జాతికిజాని,– ముఖ్యంగా ప్రస్తుతం ప్రపంచంలోని తక్కిన అన్నిజాతులకంటేనూ ఎక్కువగా మన భారతజాతికి కావలసినది సౌశీల్యసంపద ఒక్కటే మన దేశభక్తాగ్రగణ్యు

డయిన గోఖ్లేగారి అభిప్రాయంకూడా ఇదే "మనం శీలవంతులమయితేనేగాని మనమేపనీ సాధించలేము, దేనికీ మనము అర్హులం కాము, మన కోరికలెన్నటికీ ఫలించవు" అని పదేపదే చెబుతూఉండేవారు గోఖ్లేగారు భారత సేవాసంఘ (సర్వెంట్స్ అఫ్ ఇండియా సొసైటీ) కార్యప్రణాళికలో మన దేశంలోని రాజకీయజీవితాన్ని ఆధ్యాత్మికదృష్టితో రూపొందించుకోవడం అవసరమని గోఖ్లే గారు కచ్చితంగా వ్రాసిపెట్టినారు అనేక యూరోపియన్ జాతులలోఉన్న సౌశీల్యవంతులతో పోల్చిచూసినప్పుడు మన జాతిలోని సౌశీల్యవంతుల శాతం చాలా తక్కువ అనికూడా ఆయన అంటూఉండేవారు ఆయనను నా రాజకీయ గురువుగా సగర్వంగా భావిస్తుంటాను ఆయన అన్న ఈ మాటలకు నిజమయిన ఆధారం ఉన్నదో లేదో నాకు తెలియదు కాని భారతీయ విద్యావంతులకు సంబంధించినంతవరకు ఆయన మాటలను సమర్థించేటందుకు తగిన అవకాశం మాత్రం ఉందని నా అభిప్రాయము దీనినిబట్టి ఆ దుర్గుణం విద్యావంతులవల్ల మనకు సంక్రమించినట్లు భావించకూడదు పరిస్థితులు మనలను అట్లాచేస్తున్నాయి "అది అట్లాఉండగా మరొకమాట

ధార్మిక తత్వరుడుగాని వ్యక్తి ఎంత గొప్పవాడయినాసరే ఏపని ప్రారంభించినప్పటికీ అది సానుకూలంకాదు నా జీవితంలో నేను విశ్వసిస్తూన్న ప్రధానసూత్రమిది ధర్మమంటే మతము మతము అంటే ప్రపంచంలోని శ్రుతి, స్మృతి గ్రంథాలను పఠించినందువల్ల లభించేదని మీరు అనుకోకండి అది మెదడువల్ల గ్రహించదగినదికాదు హృదయంవల్ల గ్రహించదగినది అది మనలోనుంచి పరిణతి పొందదగినది మనలో అది అంతర్లీనంగా ఉన్నది కొందరు దాని ఉనికిని ఎరుగుదురు కొందరు ఎరగరు మనమేదయినా ఒక నిలకడగల మంచిపనిని సక్రమంగా చేయదలుచుకొంటే మనలోఉన్న ఆ ధార్మిక తత్త్వం బాహ్యసహాయంవల్లగానీ, ఆంతరంగికసంస్కారంవల్లగానీ, చైతన్యవంతంగా చేసుకొనవలె మన శ్రుతి స్మృతులు జీవితానికి ముఖ్యసిద్ధాంతాలుగా కొన్ని నియమాలను చేసిఉన్నాయి వాటిని మనం మారుమాట లేకుండా పాటించవలె నేనాసిద్ధాంతాలలో చిరకాలంనుంచి నమ్మకం కలిగిఉండటమేగాక వాటిని ఆచరణలలో పెట్టడానికి ప్రయత్నించినవాణ్ణి నేనింతకు పూర్వం చెప్పిన ఆశ్రమ స్థాపన విషయంలో నా అభిప్రాయాలతో ఏకీభవించేవారితో కలసి పని చేయడం అవసరమని నేను భావిస్తున్నాను నేను నిర్మించనున్న ఆశ్రమంలో సభ్యులుగా ఉండగోరేవారు పాటించవలసిన నియమావళిని గురించి మీకు నేనిప్పుడు చెప్పడానికి సాహసిస్తున్నాను అవి అన్నీ - కనీసం వాటిలో అయిదు- మరకత మణులవంటివి

అన్నిట్లోకి ప్రప్రథమంగా పాటించవలసింది సత్యము సత్యం అంటే మీరందరూ మామూలుగా అనుకొనే సత్యంకాదు "నిజాయితీగా ఉండటం ఉత్తమమయిన ఉపాయము" (Honesty is the Best Policy) అనే లోకోక్తికి సన్నిహితంగా ఉండే సత్యంకాదు దానికి అర్థమేమంటే అది ఏ ఒక్క-

సందర్భంలోనైనా మంచి ఉపాయంగా కనపడకపోయినట్లయితే దానిని వదిలి వేయవచ్చునని కాని ఇక్కడ "సత్యము" అనే పదానికి అర్థాలు ఎటువంటి క్లిష్టపరిస్థితిలోకూడా మన జీవితానికి సత్యమే మార్గదర్శకంగా ఉండవలె అని సత్యం తుదకు విజయం పొందితీరుతుందని నిరూపించేటందుకు గాంధీ ప్రహ్లాదుడు జీవితంలో అనుభవించిన బాధలను గురించి వివరించినారు

"ఇక అహింసా సిద్ధాంతం గురించి బాషనుబట్టి ఆ మాటకు అర్థం మాత్రం చేయకుండటం కాని ఆ మాటలో నాకు ప్రపంచ విస్తృతమయిన [illegible] ఖడుతుంది దానిని గురించిన నా ఊహలు అత్యున్నతస్థాయిలో [illegible] లకు పరుగులుపెడుతున్నాయి అహింసా సిద్ధాంతాన్ని అనుసరించేవానికి శత్రువు లేడు అతడు అజాతశత్రువు కాని కొందరు మనలను తాము శత్రువుల మని అనుకోవచ్చు అందుకు మనమేమీ చేయలేము కాని వారి [illegible]లో కూడా మన మనస్సులలో చెడు తలంపు ఉండకూడదు దెబ్బకు దెబ్బ కొట్టి టట్లయితే మనం అహింసను విడనాడినట్లే

ఈ నియమం ప్రకారం సంవిధాన (Organised) హత్యాకాండకు గాని పట్టపగటి ఖూనీలకుగానీ తావులేదు మీ దేశంకోసంకానీ మీ రక్షణకింద [illegible] మీ అత్యంత ప్రేమాస్పదులయినవారి గౌరవ సంరక్షణకోసం కూడా మీరు హింసావిధానం అవలంబించకూడదు ఈ అహింసా సిద్ధాంత ప్రకారం మీ అధీనంలో ఉన్న వారి గౌరవ రక్షణకోసం, మీరు స్వయంగా ఆ అవమానం పొందేటందుకు సంసిద్ధం కావలె దెబ్బకు దెబ్బ కొట్టడంకంటె ఎందుకు ఎక్కువ శారీరక బలము, మానసిక బలమూ కూడా అవసరము మీకు కొంత శారీరక శక్తి ఉండవచ్చు నేను దానిని ధైర్యం అని చెప్పను ఆశా లేదు శక్తిని మీకు ఉపయోగించవచ్చు కాని ఆ శారీరకబలం [illegible] అయిపోగా ఆయాసంవచ్చినప్పుడేమి జరుగుతుంది? అంతకు పూర్వము కోపంలో [illegible]డయి వున్నవాడు నీ ప్రతిహింసవల్ల ఇనుమడించిన కోపంతో మరింత ఉగ్రుడవు తాడు అప్పుడతడు నిన్ను చంపి, కసి తీరక నీ రక్షణ ఉండదగ్గ మనిషిని కూడా చంపుతాడు అట్లాకాక నీవు వానిపైన ప్రతి హింసచేయక, నీ రక్షణ క్రింద నున్న మనిషికి తగలవలసిన దెబ్బలన్నీ నీవే భరించడానికి తయారైనప్పుడేమి జరుగుతుంది? అవతలిమనిషి చేయదలచుకొన్న దౌర్జన్యం చూపవలసినది ఒక్క నిమీదనే పూర్తి అయిపోతుంది, నీ రక్షణకిందఉన్న మనిషి[illegible] తాకి [illegible] తాకలేదు! ఇది నేను ప్రతిజ్ఞాపూర్వకంగా చెబుతూన్నమాట!

"ఇక బ్రహ్మచర్యవ్రతం గురించి జాతీయ సేవాతత్పరులయినవారు గానీ, లేదా ధార్మిక జీతం నడపదలచుకొన్నవారుగానీ, వివాహితులు అవివాహితులూ కూడా బ్రహ్మచర్యవ్రతమవలంబించవలె వివాహంవల్ల స్త్రీ పురుషులు సన్నిహితులవుతారు ఒక విధంగా వారు స్నేహితులు అవుతారని [illegible] అన వచ్చు వారికి ఈ జీవితంలోకాని, భావిజీవితాలలోగాని ఎడబాటు ఉండదు కాని మన జీవితరంగంలో మోహ లాలసత్వానికి తావుండకూడదని నా అభి

ప్రాయము మనకు మన రుచుల విషయంలోకూడా నిగ్రహం ఉండవలె మానవుడు తన జంతుస్వభావోద్వేగాలను నిగ్రహించుకోవలెనని కోరుకొనే టట్లయితే అతనికి తెలియకుండనేలవి నిగ్రహింపబడగలవు మానవుడుజిహ్వేంద్రియమునకు దాసుడు కాకుండా నిగ్రహం గలిగి ఉండవలె ఈ నియమం తక్కిన అన్ని నియమాలలోకి దుష్కరమయినది నేను విక్టోరియా హోస్టల్ కు పోయి పరిశీలన చేసి ఇప్పుడే వస్తున్నాను ఆ దృశ్యం నాకు ఆశ్చర్యం కలిగించింది అక్కడ అనేక వంటశాలలు ఉన్నాయి ఆ వంటశాలలు కులభేదాలను బట్టి కాక రుచిభేదాలనుబట్టి యేర్పడినవి ఆయాదేశాలలోను, రాష్ట్రాల లోను ప్రత్యేక ప్రదేశాలలోనూ నివసించే వారి రుచులకు తగినట్లుగా వివిధ రకాల వ్యంజనాలు - వివిధ విధాలగు తూకాలతోసైతం ప్రత్యేక వంటశాలలు ఏర్పాటయినాయి బ్రాహ్మణులలోని వివిధ శాఖలకు సంబంధించిన వివిధ రకాలైన బ్రాహ్మణ వంటశాలలు కూడా ఏర్పడినాయి దీనిని నేను కేవలం జిహ్వేంద్రియ నిగ్రహానికి బదులు వారందరు జిహ్వేంద్రియానికి దాసులై ఈ వస్తువులనుంచి మన మనస్సులను మరలింపచేయనంతవరకు మిఠాయి దుకాణాల నుంచి, తేనీటి అంగళ్లనుంచి కాఫీ గృహాలనుంచి, మరి ఇతర వంటశాలలనుంచి మన దృష్టిని మరలింపజాలనంతవరకు, మనకు జిహ్వేంద్రియనిగ్రహం సాధ్యంకాదు మనము సరిగా ఆరోగ్యంగా జీవించేటందుకవసరమయిన పదార్థాలతో మనం సంతృప్తి పడవలె ఉద్వేగం, ఉడుకు, ఉద్రేకం కలిగించే మసాలాలను మనం తినడం మానవేస్తేనేగాని అవసరమయిన ఉద్రకం ఉత్సాహం మనలో రేకెత్తవు తినడం త్రాగడం కామలాలసత్వం-ఇవన్నీ మనకూ జంతువులకూ సమాన లక్షణాలే కాని అవుగాని, గుర్రంకాని రుచికోసం మనవలె వాటికి కావలసినదానికంటె ఎక్కువగా తినడం మీరెప్పుడైనా చూసినారా కామలాలసులం కావడంవల్ల మనం జంతువులకంటె హీనులమైపోతున్నాము జిహ్వేంద్రియ లాలసత్వం నాగరక లక్షణమని మీరు భావిస్తున్నారా? మన భోజన పదార్థాల సంఖ్యను పెంచుకొన్నకొద్దీ మనం దైవసమానులమయి పోగలమని మీ అభిప్రాయమా? పళ్లేలకొద్దీ పదార్థాలను తెప్పించుకొని భుజించి నందువల్ల మీరు పనికిమాలిన అశక్తులుగా తయారయి వార్తాపత్రికలలోని మందుల ప్రకటనలకోసం తడవులాడుకోవడం ధర్మమా? కాదు, కాబట్టి మనకు జిహ్వేంద్రియ నిగ్రహం ఉండవలె ఇది ప్రకృతి సిద్ధమయిన ప్రధాన సిద్ధాంత మని నా నిశ్చయము ఈ ప్రకృతి సూత్రానికి భిన్నంకానివిధంగా ప్రతిరోజూ మనకు అవసరమయినంత ఆహారాన్నే మనం భుజిస్తూ, ప్రతి మనిషీ ప్రతి దినమూ ఆ నియమాన్ని పాటిస్తూ ఉన్నట్లయితే ఈ ప్రపంచంలో పేదరిక మనేది ఉండదు. ఈ లోకంలో ఆకలితో మరణించేవాడంటూ ఉండడు ఇండియాలో ఒక్క పూటమాత్రమే భోజనంచేసి జీవించేవారు ముప్పయి లక్షల మంది ఉన్నారు ఆ భోజనంలోకూడా ఒక చపాతీ, కొంచెం ఉప్పూ తప్ప ఇంకేమీ ఉండవు కొవ్వుపదార్థాలేవీ ఉండవు మసాలా వస్తువులు ఉండవు ఇక

మనకు కావలసినదానికంటె ఎక్కువ ఉంచుకోకుండగానే నియమాన్ని మనం సహజంగా పాటించవలె

మనకు తాత్కాలికావసరాలు కాని వస్తువులను మన దగ్గర పెట్టుకోవడం వల్ల అవి అవసరమైన వారికి వాటిని లభించకుండా చేసి ఒక విధంగా మనం దొంగలవుతున్నాము అటువంటి దొంగతనం కూడదు.

"ఇక స్వదేశీ వ్రతం గురించి, స్వదేశీ జీవితాన్ని గురించి, స్వదేశీ [illegible] గురించి మీ అందరికీ తెలిసిన విషయమే మన కోరికలను నెరవేర్చుకోవటంలో మన పక్కన ఉన్న వారిని విడిచి ఎక్కడికో పోవడం ప్రధానమయినది ఒక ప్రకృతి నియమాన్ని ఉల్లంఘించడం ఇంకా కొంచెం విశదంగా చెప్తాను బొంబాయి నుంచి ఒక వర్తకుడు వచ్చి మీరు కొన్ని [illegible] అమ్మగలను కొనేటట్లయితే, మద్రాసులో పుట్టి పెరిగిన మీదగ్గరి వర్తకుని [illegible] బొంబాయి వర్తకుని ప్రోత్సహించడం న్యాయం కాదు స్వదేశిని గురించిన నా అభిప్రాయమిది మీ గ్రామంలో మీరు మంగలి ఉండగా మద్రాసులో ఎంతో బాగా పనిచేయగల మంగలి ఉన్నాడని వానిని పిలిచి క్షురకర్మ చేయించుకోవడం సరికాదు అవసరమయితే మీ గ్రామంలోని మంగలిని మద్రాసు మంగలివాని పనితనం నేర్చుకొనేటట్లు చేయవలె మీ ఊరి మంగలిని మద్రాసుకు పంపి మంగలిపనిలో శిక్షణ ఇప్పించవచ్చు [illegible] మీ ఊరి మంగలినే ప్రోత్సహించవలెగాని మద్రాసు మంగలిని ప్రోత్సహించరాదు - స్వదేశీకి అర్థమదే ఆ అర్థంలో స్వదేశీ వ్రతం అవలంబించవలసి ఉంటే మనకు లభ్యంకాని వస్తువులు లేకుండా మనమెట్లాగో ఎలా గడుపుకుంటున్నాము గదా! మీ కా మనో నిశ్చయం ఉన్నట్లయితే "జాన్ [illegible]" వ్రాసిన "పిలిగ్రిమ్స్ ప్రోగ్రెస్" అనే ఉత్కృష్ట గ్రంథంలోని [illegible] తొలగించుకొన్నట్లు మీ భారాన్ని సైతం మీరు [illegible] తొలగించుకోగల.

ఇక అభయం గురించి విద్యావంతులయిన భారతీయులందరి [illegible] మయిన భీతితో పక్షపాత వ్యాధిగ్రస్తులయినట్లు ఇండియాలోని నా పర్యటన [illegible] నాకు తెలిసింది మన నిశ్చితాభిప్రాయాలను మనం బహిరంగంగా ప్రకటించలేకపోవచ్చు, మనకు కొన్ని అభిప్రాయాలు ఉండవచ్చు వాటిని గురించి మనం రహస్యంగా మాట్లాడుకోవచ్చు మన ఇంట్లో నాలుగు గోడల మధ్య మనమేమయినా చేయవచ్చు ఆ అభిప్రాయాలు [illegible] తెలుసుకోవలసిన అవసరంలేదు మనం మౌనవ్రతం అవలంబిస్తే నేను చెప్పదగినది [illegible] లేదు [illegible] బహిరంగంగా మనం మాట్లాడేటప్పుడు మనం నిజంగా నమ్మని సంగతులు చెబుతూంటాము దాదాపు బహిరంగ సభలలో మాట్లాడే వారి అందరి అనుభవమూ ఇది అవునో కాదో నాకు తెలియదు మనం భయపడవలసింది ఒక్కనికే - ఒక్కనికే అనే పదం సరియైనదవునో కాదో తెలియదు - ఆ ఒక్కడూ దేవుడు మీరు సత్యవ్రతులుగా ఉండదలచుకొంటే నిర్భయులుగా ఉండక తప్పదు మనము దేవునికి భయపడేటట్లయితే ఎంత గొప్ప వాడైనా మనిషికి భయపడ

వలసిన అవసరం ఉండదు బ్రాహ్మణునికి ఉండవలసిన ప్రధాన గుణాలలో ముఖ్యమయినది అభయం ఈ విషయం భగవద్గీత ప్రథమాధ్యాయంలోనే ఉన్నది ఇక అస్పృశ్యులను గురించి అస్పృశ్యతను పాటించకూడదనేది ఇంకొక నియమము ఈనాడు హిందూ మతంలో చెరిగిపోని కళంక మొకటి కనిపిస్తూన్నది అది ఎప్పటి నుంచో-పౌరాణిక కాలంనుంచే - వస్తూన్నదనే విషయం నేను నమ్మజాలను అస్పృశ్యత అనే ఈదురదృష్టకరమయిన, కుత్సిత మయిన దాస్యభావం మన జీవిత పరిణామ నికృష్టదశలోనుంచి పరంపరగా వస్తూ ఉండవచ్చు దీనిని నే నొక పాతకంగా భావిస్తున్నాను మనము అస్పృశ్యతను పాటిస్తూన్నంత వరకూ, ఈ పవిత్ర భారత భూమికి ఏ ఆపద వచ్చినప్పటికీ దానిని మనం అస్పృశ్యతను పాటిస్తూండిన పాప ఫలితంగా భావించి తీరవలె

ఒకడు అవలంబించే వృత్తిని బట్టి అతనిని అస్పృశ్యునిగా భావించడం నాకు అర్థంకాని విషయము ఆధునికవిద్యను అభ్యసిస్తూండిన విద్యార్థులు మీరు మీరు కూడా ఈ పాపంలో భాగస్వాములుగా ఉండేటట్లయితే మీరు చదువుకో కుండా ఉంటమే మంచిది మనలో ఒక పెద్ద లోపం ఉన్నది దాని వల్ల బాధ పడుతున్నాము ఈ ప్రపంచంలో ఏ ఒక్కడూ అస్పృశ్యుడుగా భావింపబడ కూడదనీ మీరు గ్రహించినప్పటికీ, మీ ప్రభావం మీ కుటుంబ సభ్యుల మీదగాని ఇతర పరిసరాలలోగానీ ప్రసరింపచేయలేకపోతున్నారు మీరు ప్రతి విషయమూ విదేశీభాషలో ఊహిస్తూండడమే అందుకు కారణము అందువల్ల మా ఆశ్రమంలో దేశభాషలలోనే విద్యాభ్యాసం జరగవలెనని ఒక నియమం చేసినాము ఇండియా లోని భాషల సమస్యను పరిష్కారం చేసేటందుకు మేము మా ఆశ్రమంలో సాధ్యమయినన్ని భారతీయ భాషలను నేర్చుకొనేందుకు వీలు కల్పించినాము ఇంగ్లీషు భాషను నేర్చుకోవడంలో ఉన్నంత కష్టం ఈభాషలన్నిటినీ నేర్వడంలో లేదని నా నిశ్చితాభిప్రాయము ఇంగ్లీషు భాషను మనమెంత కష్టపడి చదువు కొన్నప్పటికీ మన మాతృ భాషలో మనం మాట్లాడగలిగినంత సులువుగా ఇంగ్లీషులో మాట్లాడలేని మాట మాత్రం వాస్తవము చదువుకొన్నందు వల్లనే మనం అస్పృశ్యులనబడే వారిపట్ల చేస్తూన్న ఘోరమయిన అపరాధం గ్రహించగలినాము కాని భయము, మూఢ విశ్వాసము, మన కుటుంబ సంప్రదాయాల పట్ల మనకున్న పూజ్యభావం మనలను పట్టుకొని వదలడంలేదు

చేతితో చేసే పనులు నీచమయినవని మన అభిప్రాయము ప్రతి పనీ గౌరవనీయమయినదేనని నా నమ్మకము డాక్టరు పని ఎంత గౌరవనీయమయి నదో మంగలి వాని పని కూడా అంత గౌరవనీయమయినదే

**రాజకీయాలు**

ఈ నియమాల నన్నిటినీ మీరు పాటించినట్లయితే అప్పుడు మీరు రాజ కీయాలలో జోక్యం కల్పించుకొని మీ యిష్టం వచ్చినట్లు వాటిలో మునిగి తేల

వచ్చు అంత వరకూ మీరు వాటి జోలికి పోకూడదు మతంతో సంబంధం లేని రాజకీయాలు అనర్థదాయకం విద్యార్థులు రాజకీయ వేదికలపైన మూగడం జాతీయాభ్యుదయానికి శ్రేయస్కరం కాదని నా అభిప్రాయం అంత మాత్రంతో మనం విద్యార్థి జీవితంలో రాజకీయాలను అభ్యసించకుండదని నా అభిప్రాయంకాదు రాజకీయాలు మన జీవితంలో ఒక భాగము మనకు మన జాతీయ సంస్థల గురించి మన జాతీయాభ్యుదయం గురించి ఎరిగిన ఉయ వలసిందే ఇవన్నీ మన శాల్యంనుంచీ చేయవలసిన పనులే అందువల్ల ఆశ్రమం లోని ప్రతి బిడ్డా ఈ రాజకీయ సంస్థలను గురించి తెలుసుకొనడమే గాక ఈ దేశం నూతన ఆశయాలతో, నూతన వాంఛలతో, నూతన జీవంతో ఎట్లా స్పందిస్తున్నదో తెలుసుకోవడం కూడా అవసరము మత విశ్వాసం నుంచి జనించిన స్వచ్ఛమయిన వెలుగు కూడా మనకు కావలె మత విశ్వాసమంటే తెలివి తేటలవల్ల కలిగిన విశ్వాసం కాదు హృదయంలో ముద్రితమై ఎన్నటికీ చెరిగిపోని విశ్వాసము ఈనాటి విద్యార్థులు చదువు ముగించడంతోనే వట్టి అనామకులుగా తయారయి పనికి మాలిన ఉద్యోగాలకోసం పరిభ్రమిస్తున్నారు వారికి వచ్చే రాబడి కూడా అంతంత మాత్రమే వారికి దైవం గురించి ఏమీ తెలియదు నూతన వాయు ప్రసార, తేజః ప్రసారాలను వారు ఎరుగనే ఎరు గరు నేను మీ ముందు ఉంచిన నియమావళిని విధేయతతో అనుసరించిన దు వల్ల వాస్తవికమూ పటిష్ఠమూ అయిన స్వాతంత్ర్యం లభించగలదని కూడా వారికి తెలియదు

**ముగింపు**

"నేనిప్పుడు మిమ్ములను ఒక్కసారిగా ఆశ్రమంలో చేరమని చెప్పడం లేదు అక్కడ చోటు లేదు కూడా అయితే మీరందరూ వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ కూడా ఆశ్రమ జీవితాన్ని అవలంబించవలెనని మాత్రం నేను మిమ్ములను కోరుతున్నాను ఈ నియమావళిలో దేనిని మీరు అనుస రించదలచుకొన్నప్పటికీ నేను సంతృప్తిపడగలను అట్లాకాక ఇవన్నీ ఏవో పిచ్చివాని ప్రలాపాలుగా మీరు భావిస్తే ఆ విషయమిప్పుడు మీరు నిస్సంకో చంగా చెప్పివేయవచ్చు మీ తుదినిర్ణయాన్ని నేను నిరాక్షేపణంగా గ్రహించ గలను"

ఈ ఉపన్యాసానంతరం సభాధ్యక్షులు సభను ముగిస్తూ ఇట్లా ప్రసం గించినారు

"నేడు గాంధీగారి అత్యుత్సాహకరమయిన ఉపన్యాసం మనం ఎంతో శ్రద్ధగా విన్నాము తన ఉపన్యాసంలో ఆయన అనేక విషయాలను గురించి మాట్లాడినారు ఆ ప్రసంగంలోని ప్రధాన సూత్రాలను మనం జాగ్రత్తగా పరిశీలించగలమని ఆయన విశ్వాసము ఆయన అనేక ఉత్కృష్ట సిద్ధాంతాలను మనకు వినిపించినారు అందులో కొన్ని ఆచరణలో పెట్టడం కష్టమనికూడా

ఆయనకు తెలుసు ఆయన మనకిచ్చిన సలహాలలో ప్రధానమయిన సలహా మతం గురించినది ధార్మిక తత్పరత్వం సౌశీల్యగుణస పన్నతను కలిగి ఉండటం అత్యంతఅవసరమనికూడా ఆయన ప్రబోధ చే నారు మనకు నచ్చని విషయాలను మనం గ్రహించవలసిన అవసరం లేదని ఆయన అనడం చాలా విశిష్టమయిన విషయము" అధ్యక్షుడు మాటలతో ఉపన్యాసకునికి కృతజ్ఞతాభివందనాలు చెప్పిన తరవాత అధ్యక్షుని అభినందించడంతో సభ ముగిసింది

## విక్టోరియా హాస్టల్‌లో గాంధీజీ

దక్షిణాఫ్రికా భారతీయుల విషయంలో చేసిన కృషిని గురించి గాంధీజీకి కృతజ్ఞత తెలిపేటందుకు మద్రాసు విక్టోరియా హాస్టల్‌లోని విద్యార్థులు ఆయనను ఆహ్వానించి సన్మానపత్రం సమర్పించిన తరవాత తమ జీవితచరిత్రలో అత్యంత ప్రాముఖ్యమున్న సమయంలో తాము సత్పథ వర్తనులుగా ఉండేటందుకు తగిన సలహా ఇవ్వవలసిందని వారాయనను ప్రార్థించినారు

గాంధీజీ వారి సన్మాన పత్రానికి కృతజ్ఞత తెలుపుతూ "విద్యార్థులు ధర్మ తత్పరులు, సత్పథ వర్తనులూ అయిన స్వర్గరాజ్యము ననుభవింపగలరు" అన్నారు విక్టోరియా హాస్టల్‌లోని విద్యార్థుల గదులను గాంధీజీ పరిశీలించినారు హాస్టల్ వార్డెన్ విద్యార్థుల పరుపులను, పక్కలను మంచాలనూ గాంధీజీకి చూపినారు తరవాత గాంధీజీ భోజనశాలను చూసిన విషయము, అక్కడి వంటశాలను గురించి గాంధీజీ అభిప్రాయాలు ఇంతకు పూర్వం కొంత వివరించడం జరిగింది గాంధీజీ హాస్టల్‌లోని ఆంధ్రుల భోజనశాలను చూసి వారు భుజించే పదార్థాలను వివరంగా అడిగి తెలుసుకొని పప్పు, పులుసు, చారు మొదలయిన మాటలు నేర్చుకొన్నారు బ్రాహ్మణేతరుల వంటశాలకు పోయి వారు తినే పదార్థాల నన్నిటిని తెలుసుకొన్న తరవాత బ్రాహ్మణవంటశాలకు పోయినారు ఒకచోట వంట బ్రాహ్మణుడు గంటె వార్చటం చూసి, "ఈగంటెతో నేనెంత కాలమయినా జీవించగలను" అన్నారు గాంధీజీ నాకు వంట చేతనవును ఇంత కంటె బాగానే వంట చేయగలను' అని గాంధీజీ అన్నప్పుడు వారి పెదవులపైన చిరునవ్వు చిందులాడింది ఆంధ్రుల భోజనశాలకు వచ్చి, 'మీరు ఎన్ని గరిటల నెయ్యి వేసుకొంటారు" అని అడిగినారు 'అర గరిటె' అన్నారు ఒకరు గరిట చూపించమన్నారు గాంధీజీ - గరిటతో నెయ్యి తీసి చూసి "మా తెలుగు స్నేహితులు అపరిమితంగా నెయ్యి తాగుతారని విన్నానే నేను" అని నవ్వినారు మలయాళీలతో మీరు భోజనం చేస్తారా? అని అడిగి తెలుసుకొన్నారు తరవాత గాంధీజీ క్షౌరశాలను చూసి, పాకీ దొడ్లను సైతం లోపలికి పోయి పరిశుభ్రంగా ఉన్నవో లేవో గమనించి వచ్చినారు

విక్టోరియా హాస్టల్ విద్యార్థులు గాంధీజీ రాక వల్ల తాము పరమ పవిత్రులమయినట్లు భావిస్తూ వందేమాతర నినాదాలతో ఆయనకు వీడ్కోలు చెప్పినారు

**గాంధీజీ సందేశము (సి రాజగోపాలాచారి)**

గాంధీజీ చేసిన మహత్కార్యం గురించి భారతదేశంలో తెలియని వారులేరు ఆయన అనేక కష్టనష్టాలను లోనయి స్వార్థత్యాగంతో ఎంత మాత్ర దేశ గౌరవం కాపాడి నిలబెట్టినాడు ఆయన నాయకత్వంకింద దక్షిణాఫ్రికా లోని మన భారత సోదరీసోదరులు తమ అవమానాలను విస్మరించి ప్రపంచంలో తల ఎత్తుకొని తిరిగేటట్లు చేయగలిగినారు ఆయనకు అనుకూలవతియైన సహధర్మచారిణి లభించడం భగవంతుని ప్రత్యేకానుగ్రహం గలిగిందని చెప్పక తప్పదు ఆమెను మనం మనమధ్య ప్రత్యక్షంగా చూడకపోయినట్లయితే భారతీయ ఆదర్శ సతీతత్వాన్ని వాల్మీకి స్వప్నగతవృత్తాంతంగా గావించి ఉండే వాళ్లము ఆమె జీవితంలోని అన్ని సుఖాలను త్యజించినది అనారోగ్యమయిన ఆమె దుర్బలశరీరం ప్రకృతిని జయించింది కారాగారాన్ని దుర్భర కష్టాలను అనుభవిస్తూ అవ్యవస్థస్థితిలో భర్తను అనుగమించింది గాంధీ దంపతుల జీవితం గురించి దక్షిణాఫ్రికాలో వారు సాధించిన పనిని గురించి మనం తెలుసుకొన్నప్పుడు దృఢనిశ్చయమూ, త్యాగము గల మానవుని సౌశీల్యానికి అనంతమయిన శక్తి ఉంటుందని అర్థమవుతుంది గాంధీగారి సాధారణ అభిప్రాయాలను కొన్నిటిని ఇక్కడ వివరించవలసి ఉన్నది భారత జాతీయ మహాసభ సంబంధించినంతవరకు మనం పూర్వ నాయకులకు కృతజ్ఞులముగా ఉండవలెనని గాంధీజీ అభిప్రాయము హ్యూమ్, ర్యాబ్లీ, వెడ్డర్‌బరన్, దాదాభాయిలవంటివారు కాంగ్రెస్ క్షేత్రాన్ని దున్ని,పదును చేసి గింజ నాటినారు భారతజాతీయత వారి కృషివల్ల పెరిగి పెద్దదయినది వారి కాలంనాటి బాల్యదశనుంచి పటిష్ఠమయిన యౌవనదశకు వచ్చినదినాడు మన దేశభక్తి మనం మన బాల్యాన్ని తృణీకార దృష్టితో చూడకూడదు

కల్లకపటాలు తెలియని ఆ స్థితిని అనురాగంలో జ్ఞాపకం చేసుకోవలె మన పూర్వ నిర్మాతలు వేసిన పునాదులపైన ఎవరమేదో ఇంకా కొంత నిర్మించినంత మాత్రాన వారిని చులకనగా చూడరాదు వివిధ వర్గాలకు చెందిన ప్రజలను కాంగ్రెస్ ఒక వేదిక పైకి తీసుకొని వచ్చి వారిలో ఐక్యభావం కలగజేసింది అది భారత జాతికి దేశ ఆదాయ వ్యయాలపైన అధికారం ఉండవలెనని కాంగ్రెస్ మొదటి నుంచి ఉద్ఘాటిస్తూన్నది అది కెనడియన్ పద్ధతి మీద స్వపరిపాలనం వాంఛిస్తున్న మాట కూడా నిజమే మనం దానిని కోరకపోవచ్చు వాంఛనీయాలయిన ఇతర విధాలయిన స్వపరిపాలన లుండవచ్చు అవి మనకు లభించకపోవచ్చు ఆ విషయం వేరు స్వపరిపాలనతో మనకు అభిరుచిని కలిగించిన గౌరవం కాంగ్రెస్‌దే నన్న విషయం మనం కాదనకూడదు వంగ రాష్ట్ర విభజనం తరవాతనే భారత దేశంలో నిజమయిన రాజకీయ చైతన్యం కలిగింది అందుకు మనం కర్జన్ ప్రభువుకు కృతజ్ఞులంగా ఉండవలె అంత వరకు మనం మన కష్టాలను తొలగించుకొనేటందుకు బ్రిటిష్ సింహాసనాధీశునికి అర్జీలు పెట్టుకొంటూఉండే వాళ్లము ఆ తరవాత అర్జీలతో

పాటు ప్రజలు బాధలకు సైతం పాల్పడవలసి వస్తుందని తెలుసుకొన్నాము వంగ రాష్ట్ర విభజన మనలో ఒక నూతన ధైర్యం బాధానుభవశక్తినీ కలిగించింది ఇంగ్లీషు వాళ్ల మొగాలు చూసి ఈనాడు బాలురూ వృద్ధులు కూడా భయపడటంలేదు వారు పోరాటానికి గాని, శిక్షకుగాని ఖైదుకుగాని, ఉరి శిక్షకుగాని భయపడడంలేదు వంగ రాష్ట్ర విభజన బ్రిటిష్ సామ్రాజ్య నౌకలో ఒక చిల్లిగా తయారయింది వంగ రాష్ట్ర విభజన రద్దుచేయబడి, ఇండియా రాజధాని ఢిల్లీకి మార్చబడినప్పటికి ఆ చిల్లి పూడలేదు ఇక ఇండియాను పూర్వంవలె పరిపాలించడం సాధ్యంకాదు - స్వపరిపాలన (హోమ్ రూల్) వచ్చి తీరవలె ఇంగ్లీషు నౌకలో చిల్లిపడటమే కాదు మనలో కూడా చీలిక యేర్పడింది మన నాయకులు మితవాదులుగానూ అతివాదులుగానూ చీలిపోయినారు కొందరు సహనంగా ఉండాలంటే కొందరు త్వరపడాలంటున్నారు కొందరిని పిరికివారనీ మరి కొందరిని సాహసవంతులనీ తమ తమ రాగ ద్వేషాలను బట్టి పిలుస్తున్నారు అయితే ఈ విభేదాలు చాలా కాలం ఉండవు గాంధీజీ నిష్కళంకమయిన రాజ భక్తుడే కాని ఆయన రాజభక్తి ప్రస్తుత పరిపాలనలోని అన్యాయాన్ని సహించగలిగినది కాదు ఆయన పరిపాలనతోను ప్రభుత్వంతోను సంబంధం కలిగి ఉంటాడు కాని ఆయన భారత దేశంలోని బ్రిటిష్ సామ్రాజ్య సుస్థిరత్వం కంటే భారత దేశ పూర్వ నాగరకతలోని సుస్థిరతను గురించి ఎక్కువ శ్రద్ధ తీసుకొంటారు ప్రపంచమంతటిలోకి పురాతన భారతీయ సభ్యత ఉత్కృష్టమయినదని ఆయన అభిప్రాయము అసలు చెడుగు బ్రిటిష్ ప్రభుత్వంలోగాని బ్రిటిష్ ప్రజలలోగానీ లేదు, ఆధునిక సభ్యతలో ఉన్నది ఆధునిక నాగరకతను మనం అవలంబించడానికి కారణం బ్రిటిష్ ప్రజలని మనలో కొందరి అభిప్రాయము "అందువల్ల బ్రిటిష్‌వారు చెడ్డవారని వారి తలంపు కాని బ్రిటిష్ వారి మీద ఉన్న చెడు అభిప్రాయం వారికి ఆధునిక నాగరకత మీద లేదు అందువల్ల ఆధునిక నాగరక పద్ధతులద్వారానే దౌర్జన్యంతో బ్రిటిష్ వారిని వెడల నడపవలెనని వారి ఆలోచన అది ఆత్మ హాత్యా విధానమని గాంధీజీ అభిప్రాయము ఆయన ఇంగ్లీషు వారితో మనకు తగవులేదనీ వారు తెచ్చి పెట్టిన ఆధునిక నాగరికతతోనే మన తగవు అనే అంటారు మన ప్రఖ్యాత పూర్వ నాగరకతను మనం పునరుద్ధరించుకోవలె అప్పుడు మనకు విజయం లభిస్తుంది బ్రిటిష్‌వారి నాగరకతను అవలంబిస్తూ వారిని వెళ్లగొట్టవలెననే రాజకీయ సిద్ధాంతంలో గాంధీకి నమ్మకంలేదు ఆధునిక నాగరకత ఒక జాడ్యం వంటిది తీవ్రమయిన ఆ జాడ్యంతో బాధపడుతూఉండిన జాతుల పట్ల మనకు సానూభూతి ఉండవలె అది మనలను దాసులుగా చేసినది శరీరసుఖాలనుభవించడమే దాని ఆశయము అందులో కూడా అది పూర్తిగా నిరుపయోగంగా తయారయింది మంచి ఇళ్లు కట్టుకోవడం, రకరకాల దుస్తులు వేసుకోవడం, తుపాకులు ఉపయోగించడం అభ్యుదయ చిహ్నాలు కాజాలవు ఆవిరి యంత్రము, విద్యుచ్ఛక్తి మానవుడు పని చేయ

వలసిన అవసరం లేకుండా చేస్తున్నవి పురాతన ఆయుధాల కంటె ఆధునికా లయిన మరఫిరంగులు ఎక్కువ మంది మనుష్యులను చంపగలుగుతున్నాయి మనుష్యులు బానిసలుగా తయారవుతున్నారు పూర్వంవలె శారీరకబలప్రయోగం వల్ల కాదు, డబ్బు మీద, డబ్బుకొని తెచ్చే భోగపదార్థాల మీద ఉన్న మోజు వల్ల వారట్లా తయారవుతున్నారు ఈ నాగరకతలో మతానికి తావు లేదు అది ఒక మూఢ విశ్వాసంగా భావింపబడుతున్నది కొందరు మతమనే తొడుగు వేసుకొని నీతిని గురించి మాట్లాడుతూ ఉంటారు ఈ నాగరకతయే పాశ్చాత్య దేశాలను నశింపజేస్తూన్నది భారత దేశం ఆధునిక నాగరకతవల్ల ప్రయోజనం పొందలేదు అది మతాన్ని నాశనం చేసింది మన మతం ప్రాపంచిక విషయాలను గురించి పట్టించుకో నక్కరలేదనీ దైవిక విషయాలపై శ్రద్ధ వహించవలసిందనీ ప్రబోధిస్తుంది అందువల్ల మనలను సోమరులంటున్నారు అది మనం అంగీకరిస్తూ మన ప్రస్తుత స్థితిని మనం మార్చుకోవలె

**మతం** పేరుతో ఎంతో రక్తపాతం జరిగినమాట వాస్తవమే ఆధునిక నాగరకత, థగ్గులు, పిండారీలు, భిల్లులు, తోడేళ్లు, పెద్దపులులవల్ల కలిగిన భయాన్ని తొలగించినమాట నిజమే కాని అంగ్లేయులవారు రాక పూర్వం ఆ భయంకర పరిస్థితులనుంచి మనమెట్లా జీవించగలిగినాము? ఇతరుల రక్షణకింద పౌరుషహీనులంగా బ్రతుకుతూ శాశ్వతంగా ఆత్మరక్షణకు అశక్తులమైపోయే కంటె పిండారీలు మొదలయినవారివల్ల బాధపడుతూఉండడం మనకు ఎక్కువ శ్రేయస్కరం కాదా

బ్రిటిష్ ప్రభుత్వానికి పూర్వం మనలో చీలికలు ఉన్నట్లు గాంధీ నమ్మడంలేదు బ్రిటిష్‌వారు రాక మునుపు మనం ఒకే జాతిగా వర్ధిల్లుతున్నామని ఆయన నిశ్చితాభిప్రాయము మనం ఒక జాతిగా ఉండగలిగినాము కనకనే వారు ఇండియాను ఒకే రాజ్యంగా స్థాపించగలిగినారు రైళ్లులేని రోజులలో కూడా మన పుణ్యక్షేత్రాలు ఇండియాలోని వివిధ ప్రదేశాలలో నిలిచి ఉండటమే ఇండియా ఏకత్వానికి ప్రత్యక్షనిదర్శనము

విదేశీయుల రాక ఇండియా ఐక్యతకు భంగం కలిగించలేదు ఎందరైనా తనలో ఇముడ్చుకోగలిగిన శక్తి ఇండియాకు ఉన్నది ఇండియావారు ఇతరులను ఇముడ్చుకోగలిగిన శక్తి లేదనిగానీ, ఇండియాలో తామొక్కరే ఉండవలెననిగానీ హిందువులు భావిస్తూండినట్లయితే వారు స్వప్నప్రపంచంలో విహరిస్తున్నారని చెప్పవలసి ఉంటుంది హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, క్రైస్తవులూ ఇండియాను మాతృదేశంగా చేసుకొన్నారు వారందరూ కలసి మెలసి ఉండక తప్పదు బ్రిటిష్ ఆక్రమణకు ముందు హిందువులు, మహమ్మదీయులు నిస్సందేహంగా కలసి మెలసి ఉన్నారు హిందువులు మహమ్మదీయ చక్రవర్తుల పరిపాలనకింద, మహమ్మదీయులు హిందూప్రభువులకింద అభివృద్ధి పొందుతూ వచ్చినారు

ఇద్దరు సోదరులూ కలసి మెలసి ప్రశాంతంగా బ్రతకవలెనని అనుకొనే

ట్లయితే పరాయివారికి వారిని చీలదీయడం సాధ్యంకాని పని మట్టికుండ ఒక రాతితో పగలకపోయినా పది రాళ్లతోనైనా పగిలి తీరుతుంది కనుక ఆ కుండను రాళ్లకు దూరంగా ఉంచడంకాదు మనం చేయవలసిన పని దానిని ఏ రాయికీ పగలకుండా ఉండేటంతగట్టిగా తయారుచేయవలె కాబట్టి మన మనస్సులు ఎన్ని రాళ్లకూ చీలిపోని తగట్టిగా కలసిపోవలె ఎక్కువ విద్యావంతులమనుకొంటూ అధికసంఖ్యాకులుగా ఉన్న హిందువులు ప్రతిఘటనను తట్టుకోగలిగి ఉండవలె అది ప్రత్యేక సౌకర్యాలను కోరేవారి కోరికలను తిరస్కరించడంద్వారా గాక వారిలో తమ పట్ల విశ్వాసం పెంపొందించుకోవడం మూలంగానే ఎక్కువగా సాధ్యమవుతుంది న్యాయంగా ఎదిరించతగి ఉన్న ప్రత్యేక సౌకర్యాలనుసైతం ఎదిరించనందువల్లనే హిందువులు ఎదుటి వారిలో తమ పట్ల విశ్వాసం పెంపొందించుకోగలరు

ఇండియా ఆయుధబలంచే జయించబడనూలేదు, బ్రిటిష్‌వారు దానిని ఆయుధబలంచేత తమ అధీనంలో ఉంచుకొనడమూలేదు మనం వారి నాగరకతను అవలంబించడంవల్ల దాని ఫలితంగా వారి వ్యాపారం ప్రోత్సహిస్తూండటంవల్ల వారినిక్కడ నిలుపుకొంటున్నాము వారి వ్యాపారం ఇక్కడ కొనసాగకపోయినప్పుడు ఈ దేశంలో మనం వారిని ఉండవలసిందని బ్రతిమాలుకొన్నా వారు ఉండరు ఆధునిక నాగరకతా ఫలితాలన్నింటిని గురించి గాంధీ చాలా కఠినంగా ఉంటున్నారు ఆయన ముఖ్యంగా లాయర్లకు ప్రతికూలంగా ఉన్నారు లాయర్లు ఇండియా దాస్యం పటిష్ఠం చేసినారని ఆయన అభిప్రాయము లాయర్లు సాధారణంగా వివాదాలను నిర్మూలించే బదులు పెంచుతారని ఆయన నమ్మకము వారు ఇతరులను పెడమార్గాలనుంచి తప్పించడానికిగాక, తాము భాగ్యవంతులు కావడానికి మాత్రమే తమ వృత్తిని వినియోగిస్తారు చిన్నచిన్న ప్లీడర్లు వివాదాలను సృష్టించడమే పనిగా పెట్టుకొంటారుకూడా వారి మాట అట్లా ఉండగా పెద్దపెద్ద లాయర్లకు కూడా ఇతరులకు వివాదాలు రావడం సంతోషంగా ఉంటుంది తక్కువ పనితో ఎక్కువ భోగాలను అనుభవించవలెనని కోరేవారి సోమరితనం ఇటువంటి వృత్తులను అవలంబించడానికి ప్రోత్సహిస్తూన్నది తమవృత్తి చాలా గౌరవమయినదని కనిపెట్టినవారు లాయర్లే వారు ఇతరులను కూడా అట్లా నమ్మేటట్లు చేస్తున్నారు లాయర్లకు, జడ్జీలకు, పోలీసువారికీ తమ తమ వృత్తులలో పరస్పర సన్నిహితసంబంధం ఉన్నది వారు లేనట్లయితే పరాయి ప్రభుత్వానికి నిలువనీడ ఉండదు లాకోర్టులు లేకపోయినట్లయితే విదేశీప్రభుత్వం రాజ్యం చేయలేదు దేశీయులయిన లాయర్లు లేనట్లయితే కోర్టులు స్థాపించడానికి అవి కొనసాగడానికి కూడా వీలులేదు

లాయర్లనూ, ఆధునిక వైద్యులను, రైళ్లనూ, యంత్రాలను కూడ గాంధీజీ నిరసిస్తున్నారు భారత దేశంలో క్రమ పరిణామం పొందుతూ వచ్చిన నాగరకతతో ప్రపంచంలోని ఏ నాగరకతా పోటీ చేయలేదని గాంధీజీ

విశ్వాసము

మనస్సు విశ్రాంతి ఎరుగని పక్షి వంటిది దానికి వచ్చిన కొద్దీ ఇంకా ఎక్కువ రావాలనే కోరిక ఉంటుంది దానికి తృప్తి అనేది లేదు మనం భోగాలలో ఓలలాడుతూన్న కొద్దీ భోగలాలసత్వం ఎక్కువవుతుంది మనసుకు కళ్ళేలు లేవు మనిషి భాగ్యవంతుడయిన మాత్రంతో సంతోషంగా ఉంటాడని కానీ, పేదవాడయినంత మాత్రంతో దుఃఖంగా ఉంటాడని కానీ అనుకొనే టందుకు వీలులేదు సౌఖ్యాలకు భోగాలకూ దూరమై లక్షలాది ప్రజలు ఎప్పుడూ నిరు పేదలుగానే ఉంటారు దీనిలో కొత్త ఏమీ లేదు ఇది మన నాగరకతలో ప్రధాన విషయము

బాల్య వివాహాలు, చిన్న బాలికలు తల్లులు కావడం, బాలవితంతువులు, బహు భార్యా భర్తృత్వాలు, కులభేదాలు వ్యభిచారము మతంలో భాగాలుగా గాంధీజీ అంగీకరించరు జంతు బలి మన సభ్యతకు విరుద్ధమని ఆయన అభిప్రాయము

మానవుని నైతిక ప్రవృత్తిని పెంపొందించడం భారతీయ నాగరకతా లక్షణం పాశ్చాత్య నాగరకత లక్షణం స్వార్థపరత్వాన్ని ప్రచారం చేయడం ఈ విధంగా అర్థం చేసుకొని, పసిబిడ్డ తల్లిని కౌగలించుకొని ఉన్నట్టు, ఇండియాను ప్రేమించే ప్రతి వ్యక్తి పురాతన భారతీయ నాగరకతను అంటి పట్టుకొని ఉండవలె

ఇండియాకు నిజమయిన స్వాతంత్ర్యం సంపాదించేటందుకు ఇంగ్లీషు వారిని వెళ్ళగొట్టవలసిన అవసరం లేదు పాశ్చాత్య నాగరికతను వెళ్ళగొట్టండి! మనం మనకున్న చిన్న కొలబద్దతో విశ్వాన్ని కొలత చేస్తాము మనం బానిసల మయితే లోకమంతా బానిసత్వంలో ఉన్నట్లే భావిస్తాంటాము ఆధునిక నాగరకత ప్రవేశించని చోట్ల ఇండియా పూర్వముండినట్లే ఉన్నది భ్రష్టులుకాని జనులు నిజమయిన స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూనే ఉన్నారు మనను పరిపాలించే ఇంగ్లీషువారు మనకు స్వపరిపాలనను (హోమ్ రూల్‌ను) స్థాపించకోవడం లేదు బానిసలుగా చేయబడిన వారే స్వాతంత్ర్యం సంపాదించుకో వలె మనను మనం పరిపాలించ కోవడం నేర్చుకొన్నప్పుడు మనకు స్వరాజ్యం వచ్చి తీరుతుంది కనక స్వరాజ్యం మన అర చేతులలోనే ఉన్నది మునిగిపోయే మనిషి ఇతరులను మునగ కుండా రక్షించ లేడు బానిసలమయిన మనం ఇతరులకు స్వాతంత్ర్య మిప్పించగలమనేది వట్టి కల్ల

ఎటువంటి హక్కులను సంపాదించుకొనేటందుకైనా పశు బలం ప్రయోగించరాదు పశు బలంవల్ల లభించిన దానిని భయంతో నిలబెట్టుకోవలసి వస్తుంది బలం కలిగినవాడు పంపుకొన్న విజ్ఞాపనం సమానుని దగ్గర నుంచి వచ్చిన విజ్ఞాపనం వంటిది

అయితే విజ్ఞాపనలకు వెనక రెండు రకాలయిన బలం ఉండవచ్చు. 'ఇది మాకు ఇవ్వకపోతే మీ పని పట్టిస్తాము అని బెదిరించడం' ఒక రకం

బలం - ఇది పశుబలం ఇది మంచిది కాదు 'మీరు మా కోరికను అంగీకరించక పోయినట్లయితే ఇక ఎప్పుడు మీకు మేము విజ్ఞాపనలు పంపుకొనే ప్రసక్తి ఉండదు మీతో మేము ఏ విధమయిన సంబంధమూ పెట్టుకోము దాని వల్ల కూడా శాసన బద్ధమయిన కష్టాలను భరించేటందుకు మేము సంసిద్ధులమై ఉన్నాము' అనడం కూడ ఒక విధమయిన బలప్రదర్శనమే కాని ఇది పశు బలం కాదు, ఆత్మ బలము ఆచరణలో ఇది 'సాత్విక నిరోధం గా ప్రశస్తి వహించింది ఈ సాత్త్విక నిరోధమనే 'ఆత్మ బలం'తో గాంధీ పేరు ఎప్పుడూ జత చేయబడి ఉంటుంది

వ్యక్తి బాధానుభవంవల్ల హక్కులను పొందేటందుకు సాత్త్విక నిరోధ మొక పద్ధతి అది ఆయుధ బల నిరోధానికే విరుద్ధమయినది నీ అంతరాత్మకు విరుద్ధంగా ఉన్న ఏదైనా చట్టం చేయబడినట్లయితే ఆ చట్టం ఉల్లంఘించి అందుకు తగిన శిక్షను అనుభవించగల నీ హక్కును ఎవ్వరూ తొలగించజాలరు అందులో స్వార్థత్యాగము ఉన్నది రాజులు కానీ వారితో సమానాధికారాలు గల వారు గానీ ఎల్లప్పుడూ వారి ఆయుధాలను ఉపయోగిస్తూనే ఉంటారు బలప్రయోగం వారి స్వభావము ఎవరికయితే అధికారం లేదో, ఎవరైతే అధికారానికి విధేయులుగా ఉండవలెనో వారికి తుపాకులు అక్కరలేదు ప్రపంచ మంతటా వారు అధిక సంఖ్యాకులుగా ఉంటారు. వారందరూ ఆత్మ బల ప్రయోగం గురించి తెలుసుకొన్నట్లయితే పరిపాలకుల ఆజ్ఞలు వారి కత్తి మొనలను దాటి చెల్లుబడి కావు నిజాయితీగల మనుష్యులు అన్యాయాలయిన ఆదేశాలను లెక్కపెట్టరు కృషీవలులు కత్తికి ఎన్నడూ లొంగలేదు,ముందులొంగ బోరు

సాత్విక నిరోధమంటే ఆత్మ బలప్రయోగమనే మాట వాస్తవమే అది భౌతిక బల ప్రయోగానికి విరుద్ధమయినదనేమాట కూడా నిజమే కాని శరీరం సుశిక్షితంకాని పక్షంలో సాత్విక నిరోధకుడుగా తయారుకావడం దుస్తరము దేశసేవ చేయదలచుకొన్నవారు జితేంద్రియులుగా ఉండవలెననీ, పేదరికాన్ని స్వీకరించవలెననీ, సత్యసంధులు కావలెననీ నిర్భయత్వం పెంపొందించుకోవలెననీ గాంధిగారి సలహా ఇవి చాలా కష్టమయిన విషయాలని వాటిని విడనాడకూడదు మనిషికి రానున్న కష్టాలను బాధలనూ భరించగల శక్తిని ప్రకృతియే ప్రసాదించింది అదీకాక భౌతిక బలప్రయోగంవల్ల దేశసేవ చేయ దలచుకొన్నవారికి కూడా ఇవన్నీ ఉండితీరవలసిన లక్షణాలే ఈనాడు విదేశాలలో పోరాటం చేస్తూండిన సామాన్యసిపాయిసైతం బ్రహ్మచర్యం అవలంబిస్తున్నాడు ధనసేకరణపట్ల కోరికను వదులుకొన్నాడు నిర్భయత్వం, సత్య సంధతను అలవాటు చేసుకొంటున్నాడు భౌతికసంగ్రామానికే అటువంటి ప్రజలు లక్షలాదిగా లభించినప్పుడు ఆత్మబలంతో కూడ అత్యుత్కృష్టమయిన పోరాటానికి మనకు అటువంటివారు ఎందుకు లభించరు? ఈనాడు యావత్తు విద్యా ఇంగ్లీషులో బోధింపబడడంకూడా గాంధిగారి రాజకీయసిద్ధాంతానికి

ప్రతికూలము

లక్షలాది ప్రజలకు ఆంగ్లభాష నేర్పడం వారిని బానిసలుగా తయారు చేయడమేనని గాంధీ అభిప్రాయము ఇంగ్లీషు నేర్పడం దుర్భరమయిన బానిస లక్షణం అంటారాయన ఎందువల్లనంటే, మీరు న్యాయస్థానానికి పోయే పక్షంలో ఇంగ్లీషులోనే మాట్లాడవలె మీరు బారిస్టరయినట్లయితే మీరు మీ మాతృభాషలో మాట్లాడరు మీ మాతృభాషలోనుంచి ఇంకొకరు ఆంగ్లభాష లోకి అనువాదం చేసి పెట్టవలె

ప్రతి భారతీయుడు తన మాతృభాషద్వారా విద్యనభ్యసించవలెననీ, తన మాతృభాషకు తోడు మరొక భారతీయభాషను కూడా అభ్యసించవలెననీ గాంధీ అభిప్రాయము హిందువయినట్లయితే సంస్కృతం కూడా నేర్చుకోవలె ఉత్తర హిందూస్థానంవారుకానీ పశ్చిమ హిందూస్థానంవారుకానీ అయితే వారిలో ఎక్కువమంది తమిళం నేర్చుకోవలె ఇండియాలో సార్వజనీనభాషగా హిందీ ఉండవలె మన నాగరకతలో పురోగమన తిరోగమనాలు, సంస్కరణలు సంస్కరణ నిరోధాలూ తటస్థిస్తూండడం సహజము కాని ఐకమత్యసంఘటనతో మనం పాశ్చాత్యసభ్యతను తరిమివేయవలె తరవాత తక్కినదంతా తనంత తానే లభిస్తుంది ఇండియాలో యంత్రాలను యంత్రాగారాలను ప్రవేశపెట్టడం, మాంచెస్టర్ వస్తువులకోసం సొమ్మును విదేశానికి పంపడంకంటె గాడా ఎక్కువ చెడుగు అని గాంధీజీ స్వదేశీ-విదేశీ వస్తుబహిష్కారాలను గురించిన ప్రసక్తిలో అన్నారు యంత్రాలయాలలో తయారయిన వస్తువులన్నిటినీ బహిష్కరించవలెనని ఇండియా ప్రకటించి ఉండినట్లయితే ఎంతో బాగుండి ఉండేది అని ఆయన అభిప్రాయము మన దేశంలో యంత్రాల పిచ్చి ఎక్కువ అయితే అది మన దురదృష్టమని చెప్పవలె మాంచెస్టర్ వస్త్రాలను ఉపయోగించడంవల్ల మన డబ్బును మాత్రమే వృధాచేసుకొన్నాము మనం మన దేశంలోనే మరొక మాంచెస్టర్‌ను సృజించినట్లయితే మన రక్తాన్ని ధారపోసి డబ్బును కూడ పెట్టుకోవడమవుతుంది ఎందువల్లనంటే అట్లాంటి అనుకరణం వల్ల మన నైతికశక్తి క్షీణించిపోతుంది ఫ్యాక్టరీలద్వారా ఐశ్వర్యవంతులయిన మన దేశస్థులునైతం విదేశాలలోని పెట్టుబడిదారులకంటె ఉత్తములుగా ఉండరు ఇండియాకు కావలసిన యావత్తు సామగ్రినీ విదేశ యంత్రాలయాల నుంచి తెప్పించుకొన్నప్పటికీ, ఇక్కడివారు ఫ్యాక్టరీలలో బానిసలు కారు అందువల్ల ఇండియాకు పేదరికం రావచ్చు ఇండియా పేదరికంనుంచి తేరుకోడానికి అవకాశం ఉండవచ్చు పెట్టుబడిదారుల బానిసత్వానికి లోనైన ఇండియా తేరుకొనేటందు కాస్కారమే లేదు

గాంధీజీ అభిప్రాయాల ప్రకారం తేలిన సారాంశమిది

1 స్వపరిపాలనమే నిజమయిన 'హోమ్‌రూల్'

2 దానికి మార్గం 'సాత్వికనిరోధము'-అంటే 'ఆత్మశక్తి'

3 ఈ బలసంపాదనకు అన్నిసందర్భాలలోను స్వదేశీ అవలంబనము.

4 మనం చేయదలచుకొన్న కార్యక్రమం చేసితీరవలసిందే అది ఇంగ్లీషు వారిపై వ్యతిరేక భావంవల్లకానీ వారిపై కసిదీర్చుకొనేటందుకుకానీ కాకూడదు అది మన ధర్మం కనక మనం చేయవలె ఇంగ్లీషువారు ఉప్పుపన్ను తొలగిస్తారనుకోండి, మనసొమ్ము మళ్ళీ మనకు ఇచ్చివేస్తారనుకోండి, భారతీయులకు అత్యున్నతోద్యోగాలను ఇస్తామనుకోండి! మనదేశంనుంచి ఇంగ్లీషు సైన్యాలను ఉపసంహరిస్తారనుకోండి!-ఇన్ని చేసినప్పటికీ వారి యంత్రాలయాలలో తయారయిన వస్తువులనుగానీ, వారి భాషనుగానీ, వారి పరిశ్రమలనుగానీ మనం ఉపయోగించకపోవడం లేదు ఇంగ్లీషువారితో మనకు శత్రుత్వం లేదు వారి నాగరకతను మాత్రం మనం అనుసరించకూడదు

ఇంగ్లీషువారిని మనం నిందించి ప్రయోజనం లేదు వారు మన అల సత్వంవల్ల ఇక్కడకువచ్చి తిష్ఠవేసుకొని ఉన్నారు అయితే యిప్పుడు మన సౌమ్యస్వభావానికి విచారపడనవసరం లేదు ఇంతకుపూర్వం మనం చేసిన పాపాలకు పశ్చాత్తాపంతో దుఃఖించవలసిన తరుణమిది కపటంతో మనకు పని లేదు మన ప్రజలపట్ల మన కర్తవ్యం నిర్వహించడంలోనూ, మనను మనం రక్షించుకోవడంలోనూ కపటవర్తనం అవసరమనుకోవడం వట్టి మూఢవిశ్వాసమే వట్టి మాటలకంటె పనిచేసి చూపడం శ్రేయస్కరమని మనం గ్రహించవలె కష్టాలు అనుభవించకుండా యే జాతీ హక్కులను సంపాదించుకోలేదు అనే విషయం మనం గ్రహించవలె భౌతిక సంగ్రామంలోకూడా చంపగలిగిన సామర్థ్యం కలిగిఉండడం బలానికి నిజమయిన ప్రమాణం యేపనైనా ఇతరులు చేసిన తరవాత మనం చేద్దామనుకోవడం అలసత్వ లక్షణము ఎవరికివారు తాము మంచిది అనుకొన్న పనిని చేయడం ధర్మము

ఇవి గాంధీ అభిప్రాయాలు- ఇవి అన్నీ ఒకశరీరంలోని అంగాలవంటివి వీటిని విడగొట్టి ఒక్కొక్క విషయాన్ని విమర్శించడం పొరపాటు " రాజగోపాలచార్యులవారి ఈ వ్యాసం 1916 నాటి రాజకీయ పరిస్థితులనూ, మద్రాసు రాష్ట్ర పౌరులపైన-మేధావుల మనస్సులపైనకూడా గాంధీజీ ప్రసంగాల ప్రభావాన్ని వ్యక్తంచేస్తూన్నది ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, సాత్విక నిరోధ సమస్యలపైన గాంధీజీ ప్రకటించిన భావాలు ఈ వ్యాసంలో స్పష్టంగా ప్రతిబింబిస్తూఉన్నాయి గాంధీజీకి అత్యంత సన్నిహితంగాఉండి ఎప్పటికప్పుడు ఆయన అభిప్రాయాలను పూసగుచ్చినట్లు వెల్లడించగల నేర్పులో రాజాజీని మించినవారు అరుదు

## 'నా సమకాలికులు'

ఇండియన్ రివ్యూ పత్రికా సంపాదకులు 'నా సమకాలికులు' అనే శీర్షికకింద వ్రాసిన వ్యాసాలలో ఇది ఒకటి ఈ వ్యాసం గాంధీజీ సబర్మతీ ఆశ్రమాన్ని గురించి, గాంధీజీతో ఆయనకున్న పరిచయాన్ని గురించి

వ్రాయడం జరిగింది ఇందులో గాంధీజీ వ్యక్తిగత స్వభావం, ఆయన హాస్య ప్రవృత్తి, తనను చూడవచ్చిన వారిపట్ల ఆయన చూపే దాక్షిణ్యము ఆయన పట్ల కొందరికి గల చనువు- ఇవన్నీ అత్యంత మనోహరంగా అభివర్ణించడం జరిగింది

"గుజరాత్‌లో 'సబర్మతి' ఒక నది చారిత్రక నగరమైన అహమ్మదాబాద్ ఈ నదిఒడ్డున ఉన్నది ఈ నదిపైన చాలా ఇనుపవంతెనలున్నాయి అక స్మికంగా వరదలురావడం అది ప్రమాదకరంగా పరిణమించడం ఈ నది స్వభావము ఈ నది కుడిఒడ్డున మిల్లు యజమానుల రాజప్రాసాదాలవంటి భవనాలును షాహీబాగ్ ఉద్యానవనాలు ఉన్నాయి ఎడమగట్టున ఒకానొక పురాతన మశీదు శిథిలాలు, సెంట్రల్ జైలు ఎత్తయిన గోడలు అహింసాప్రవక్త మహాత్మాగాంధీగారి ఆడంబర రహితమూ ప్రశాంతమూ అయిన ఆశ్రమం ఉన్నాయి ఈ ఆశ్రమం కొద్దిఎకరాల స్థలంలో కొన్ని కుటీరాలతో నిర్మింపబడింది అక్కడ నివసిస్తూఉండిన ఆ లోకోత్తర పురుషుడు తప్ప ఇతర ఆకర్షణీయాలయిన విషయాలేవీ అక్కడ లేవు చూడదగిన మందిరాలుకానీ, మనోహరాలయిన ఉద్యానవనాలుగానీ, మంచి గ్రంథాలయంగానీ, సౌఖ్యంగా బ్రతకడానికి తగిన వసతులుగానీ అక్కడ లేవు ఎక్కడచూసినా కఠిన నియమాలతోకూడిన సర్వసంగ పరిత్యాగజీవితం మాత్రమే ప్రత్యక్షమవుతుంది అక్కడ నివసిస్తూండిన మహర్షి ప్రశాంత జీవితానికది ప్రతిశ్రుతి చల్లని చెట్ల నీడలుకానీ, రాలిన పూలతోనిండిన పచ్చిక నేలకానీ, మనోహరాలయిన పక్షుల కూజితాలు గానీ, నదిలోకి పోయేటందుకు సమతలాలయిన మెట్లుగానీ లేవు సరికదా గుడిగంటలుగానీ, చివరికి పసిబిడ్డల నవ్వులుగానీ వినబడవక్కడ

"ఆకర్షణీయమయినదేదీ కనబడదిక్కడ, ఇదంతా ఒక మరంవలె కనుపిస్తుంది, దీనికింత ప్రపంచ ప్రఖ్యాతి ఎట్లావచ్చింది? ఇది ఒక పుణ్యక్షేత్రంవలె ఎందుకింతమంది యాత్రికులు వస్తూఉంటారు?" అని ఒక తీవ్రమయిన ఆలోచన కలుగుతుంది ఈ ప్రదేశానికి మొట్టమొదట వచ్చినవారికి ఒక్కరోజు ఈ ఆవరణలో ఉన్నతరవాత ఇది ఇంతమందికి ఆకర్షణీయంగా ఉండడానికి కారణమేమో తెలిసిపోతుంది బయటకు ప్రశాంతంగానూ మొరటుగానూ కనబడే ఈచోట, లోపలకు పోయినకొద్దీ ఎక్కడలేని కార్యోత్సాహమూ చూడగలము

లోకోత్తరుడయిన ఆ వామనమూర్తి "స్వచ్ఛమయిన సత్యకవాటము" ముందు నిలబడి విశ్వమానవ కళ్యాణంకోసం తన తోడివారిని సేవాత్యాగాలకు సంసిద్ధం కండనడానికి గుర్తుగా జండాఊపుతూన్నట్లు కనబడతాడు ఆ చిన్ని ఆశ్రమం ఆయన ఉనికివల్ల ఆకర్షవంతము, ఉత్సాహజనకమూఅయింది పసిబిడ్డ చిరునవ్వువంటి చక్కని అమాయికపు చిరునవ్వుతో నిరాడంబరంగా ఆయన మనలను ఆహ్వానించడంతోనే మనము 'స్వగృహంలో' ఉన్నామనే అనుకొంటాము మానవ సమాజంలో సాధారణంగా కనబడని ఆయన సౌజ

న్యము, నిష్కాపట్యము, నిరాడంబరత్వాలు మనలను ముగ్ధులనుగా చేయ గలవు ఆయన కన్నులలోని ఆనందంలో ఆయన బోసినోటి నవ్వులో, ఒక విశ్వాసపాత్రుడయిన మిత్రుని, ఒక నమ్మికమయిన సహచరుణ్ణి, ఒక సహోయ కుణ్ణి చూడగలము అయన రుజువర్తనంలో, మాయమర్మం ఎరుగని మధుర మందస్మితంతో, హృదయపూర్వక సానుభూతిలో, పరేంగిత జ్ఞానంలో ఆయన గొప్పతనం మనకు బాగా కనబడుతుంది గొప్పతనంవల్ల ఆయన ఎవ్వరికీ దూర స్థుడుకాడు, ఆయన ఎవ్వరికీ సమీపించడానికి సాధ్యంకానివాడుకూడా కాడు

ఆయన వైద్యుడు నిజమే! మనుష్యులను, విషయాలను తేలికగా గ్రహించగలవాడనే మాటకూడా వాస్తవమే ఆయన సువిశిత బుద్ధిగలవాడనే సంగతి స్పష్టంగా తెలిసినదే ఆయన ఆదేశికుడని ఆయన హావభావ విలాసాల వలన తెలుసుకోవచ్చు ఆయన చండశాసనుడు అది ఆయన ప్రకృతి అయి నప్పటికీ తన అంతరాత్మకు భిన్నంగా ఆయన ఎప్పుడూ వ్యవహరించడు అందు వల్లనే ఆయన మహాపురుషుడు ఆయనతో కొద్ది నిమిషాలు సంభాషించినట్ల యితే ఆయన మేధాశక్తి నైతికబలమూ మనకు విశదమవుతుంది ఆయన బుద్ధి హేతువాద సముంచితమయినది అందువల్ల ఆయన మాటలు అసందిగ్ధంగా స్పష్టంగా అర్థమవుతాయి ఆయన అభిప్రాయాలు నిశ్చితాలయినవి అందు వల్ల సూటిగా మాట్లాడడం,సూటిగా వ్రాయడం ఆయనకు కష్టంకాదు దాప రికమనేమాట ఆయన నిఘంటువులోలేదు మిథ్యాడంబరమంటే ఆయనకు రోత ఆయన ఒక ఋషి కాని ఏదోఒక మఠంలోచేరి ఎవరితోనూ సంబంధంలేకుండా ముక్కుమూసుకొని కూర్చొనేరకం మనిషికాదు ఆయన కార్యశూరుడు ఋషికుండవలసిన బాహ్యలక్షణాలతో ఆయనకు ప్రసక్తిలేదు ఆయన అంత రంగిక జీవితంవల్లను, మానవ సేవాతత్పరతవల్ల ఆయన సిద్ధపురుషుడని తెలుసుకొనవచ్చు

ధార్మిక కర్మకాండలు, పూజా పురస్కారాలు, మతసంబంధమయిన లాంఛనాలు, సంప్రదాయాలు ఆయనను బంధించవు ఆయన మతసంబంధా లయిన హద్దులన్నిటినీ అతిక్రమించిన ఆధ్యాత్మిక తత్త్వవేత్త తోడివారికి సేవచేయడమే ఆయన మతము, సత్యంగురించి ఆయన చేస్తూఉండిన ప్రయో గాలే ఆయన పూజా పురస్కారాలు

"తనుతాను తెలుసుకొనేటందుకు" ఆయన జరిపిన అంతరంగిక సంగ్రామ స్వరూపమే ఆయన రచించిన 'సత్యాన్నిగురించిన నా ప్రయోగాలు' (మై ఎక్స్పెరిమెంట్స్ విత్ ట్రూత్) అనే గ్రంథం మానవసంబంధాలయిన వ్యవహారాలలో 'అహింస' అనే ఆదర్శాన్ని ఆచరణలోపెట్టడమే ఆయన రాజకీయ కార్యక్రమం ప్రపంచంలో అహింసను సుప్రతిష్ఠితం చేయడంలో ఆయనకుగల పట్టుదల తన మాతృదేశ స్వరాజ్య సంపాదనలో లేదు

బలవత్తర పరిస్థితులాయనను రాజకీయాలలోకి దింపినాయి అందు కాయన కసూయగానీ విచారంగానీ లేదు ఆయన ఆదర్శమూర్తి ఆయన

సర్వమానవశ్రేయోభిలాషి అంతేకాని ఏదో ఒక్క వర్గంపైగాని ఆయనకు ప్రత్యేకాభిమానం లేదు ఆయనను రాజకీయాలలోకి లాగినది కేవలం మాతృదేశప్రేమకాదు, భారతదేశపు పేదరికము ఆయన కేవలం ఒక వ్యక్తి కాదు ఒక శక్తి పీడితప్రజానీకంలోని ఆశలూ ఆదర్శాలూ అయినలో మూర్తీభవించినాయి రాజకీయ సమస్యల సమన్వయంకోసం సాంఘిక దురాచారాల నిర్మూలనకోసం ఆయన ఒక కొత్త ఉపాయం రూపొందించినారు అది ప్రపంచ సమస్యలను పరిష్కరించడానికెంతవరకు ప్రయోజనకారి కాగలదో కాలమే నిర్ణయించవలె

ఆయన మానవాతీతుడుకాడు, అవతారపురుషుడూకాడు "జీవిత రహస్యాలను" తెలుసుకొన్న నిగూఢతత్వజ్ఞుడుకూడా కాడు తన జీవితవ్యాన్ని తాను నిర్మించుకోగలిగిన ఇచ్ఛాశక్తి దూరదృష్టిగల మానవ మాత్రుడు ఆయన ఈశ్వరప్రేరితుడయిన సందేశహరుడు కాడు, నూతనయుగ ప్రవక్తయుండా కాడు ఆయన మానవత్వం మూర్తీభవించిన ఒక వ్యక్తి మాత్రమే మానవులందరిలోనూ ఉన్న లోపాలు, ఆయనలోనూ ఉన్నాయి మానవులలో లేని అసాధారణ లక్షణాలుకూడా ఆయనలో ఉన్నాయి తన బలాబలములను ఎప్పటికప్పుడు అంచనా వేసుకోగలిగిన బుద్ధిశాలి ఆయన తన తప్పులను తాను ఒప్పుకోగలడు తన జీవిత తీవ్రసంగ్రామంలో కష్టాలనుంచి బయటపడేటందుకు ఆయన చేసిన ప్రబలప్రయత్నాల పర్యవసానాలే ఆయన "హిమాలయమంతటి ప్రమాదాల" ఒప్పికోళ్లు గాంధీ మానవుడుగా ప్రేమించతగిన మిత్రుడు ఆయనను విశ్వసించినవారే ఆయనను తెలుసుకోగలరు

1921లో నేను సబర్మతీ ఆశ్రమాన్ని ప్రప్రథమంగా దర్శించినాను, అది పూర్తిగా ఆశాభంగకరం కాకపోయినప్పటికీ నిరుత్సాహకరంగా మాత్రమున్నది అవి మొట్టమొదటి అసహాయోద్యమం ప్రారంభమయిన రోజులు ఆ రోజులలో గాంధీజీ తన ఆశ్రమంలో తప్ప ఇండియాలో ఎక్కడయినా కనబడేవారు ఆ యేడాదిలో ఒకనెలలోనే, దక్షిణాదిని సేలంలో ఆయనను చూసినాను పశ్చిమాన బొంబాయిలో ఆయన కనబడినారు ఉత్తరాదిని లక్నోలో ఆయన ఉపన్యాసం విన్నాను ఆయన విశ్రాంతియెరగని యాత్రికుడు ఆశ్రమానికి అతిథులు వచ్చినప్పుడు కస్తూరీబా వారికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసేవారు ఆమెకూడా ఆశ్రమంలో లేరప్పుడు ఆరోజులలో గాంధీజీకి కార్యదర్శులుగా పనిచేసేటందుకు ఆక్స్‌ఫర్డ్ పండితులుగానీ, పురాతనపద్ధతిలో నూలువడికేటందుకు, దూది ఏకేటందుకు అడ్మిరల్‌ల కుమార్తెలుగానీ, అక్కడ లేరు కొద్దిమంది విద్యార్థులు, సహాయకులూ ఉన్నారు అంతా నిరుత్సాహంగాను, మందకొడిగాను కనిపించిందక్కడ

రెండోపర్యాయం 1924 లో అక్కడికి వెళ్ళినాను అప్పటి పరిస్థితులు చాలా ఆనందదాయకంగా ఉన్నవి నేనప్పుడు అఖిలభారిత సంగీత మహాసభకు లక్నో వెడుతున్నాను నాతోకూడా మంచి చిత్రపటాలను కొన్నిటిని తీసు

కొని వెడుతున్నాను లక్నోకు వెళ్లేటప్పుడు మధ్యలో కొన్నాళ్లు ఆశ్రమంలో ఉండిపోవలసిందని నన్ను దేవదాసు గాంధీ ఆహ్వానించినాడు నా అదృష్ట వశాత్తు మహాత్మాజీకూడా అక్కడ ఉన్నారు వారి కుటుంబంలో ఒకరుగా అక్కడ ఒక వారంరోజులు ఉండగల భాగ్యం కలిగింది నాకు కస్తూరీబాయే మాకు భోజనపదార్థాలు తల్లివలె వండి వడ్డించేవారు తనకు వ్రాతపని లేన ప్పుడు తనయెదుట తనను చూడవచ్చినవారు లేనప్పుడు గాంధీజీ నూలు వడుకుతూండేవారు ఆయన కోరికమీద ఆయన ఎదుట ఒక చిన్న చిత్రపట ప్రదర్శనం యేర్పాటుచేసినాము ఆయన ఎంతగానో ఆనందించినారు ఆయన సౌందర్యాన్ని చక్కగా గ్రహించి విమర్శించగలరు కాని సంగరాహిత్యమనే కవచంకింద ఆయన రసగ్రహణ పారీణత మరుగుపడింది

కళనుగురించి గాంధీజీ అభిప్రాయాలు టాల్స్టాయ్ అభిప్రాయాలకు అనుగుణంగాఉంటాయి ఆయన మానవనిర్మితాలయిన వస్తుచయంకంటె ప్రకృతిసౌందర్యాన్ని ఎక్కువగా ఆనందిస్తారు నక్షత్రాలతోనిండిన ఆకాశం, పచ్చికబయళ్లు, తెల్లని మబ్బులు, రంగురంగుల పూవులు ఆయనను ఆకర్షించి న తగా ఎంతమంచి శిల్పకళా ఆయనను ఆకర్షించదు "దీనివల్ల మీరేమి సాధించబోతున్నారు? ఇందువల్ల కలిగే ప్రయోజనమేమిటి? ప్రజాసామా న్యాన్ని ఇది ఉద్ధరించగలదా? దిక్కులేని కుటుంబాలకిది ఉత్సాహంగా ఉంటుందా? బాధతో కుంగిపోతూన్న మనిషికిది శాంతిచేకూర్చగలదా?" అన్నారాయన నాతో నా చిత్రలేఖనలన్నిటిని చూసిన తరవాత నిజమయిన కళాకౌశలానికీ ఈ అభిప్రాయానికీ ఏమీ సంబంధంలేదు కాని నేనాయనను కాదనలేదు కాని ఆయన కళానైపుణ్యాన్ని బాగా గ్రహించగలరని నేను అర్థంచేసుకొన్నాను ఆయన కళను గ్రహించగలగడమేకాదు, స్వతస్సిద్ధమైన కళాకారుడుకూడా గుజరాతీలోను ఇంగ్లీషులోను ఆయన వచన రచనలు మనోహరాలయిన శిల్పఖండాలని చెప్పకతప్పదు ఆయన కళాకౌశలం పదాల కూర్పులో ప్రతిబింబిస్తూఉంటుంది అందువల్లనే ఆయన వ్రాతలు నిత్యనూత నాలుగా ఉండగలవు మైసూరు చిత్రకారుడు వెంకటప్ప నీటిరంగులతో వ్రాసిన ప్రాదేశిక దృశ్య చిత్రాలను చూసి ఆయన పులకాంకితగాత్రుడై ఆ చిత్రకారునితో ఎంతోసేపు ముచ్చటించినారు "వర్షఋతువులో ఉదక మండలం" అనే చిత్రంలో మంచుతో కప్పబడి వానలో తడిసిన ఆ గిరి దృశ్యాన్ని చూసి, వోర్వలేని చలితో వణికిపోతూన్నట్లు ఆయన శరీరమంతా చలించడం ప్రారంభించింది

ఆయన పైకి అందంగా కనబడకపోవచ్చు. కాని ఆయనలో కొన్ని ఆకర్షవంతాలయిన లక్షణాలు ఉన్నాయి ముఖ్యంగా ఆయన పెదవులనుంచి తనంతతాను స్వతస్సిద్ధంగా వెలువడే చిరునవ్వులో విశ్వాసం ఉట్టిపడుతుంటుంది ఆయన ఇతరులతో హాస్యమాడేటప్పుడు ఆయన చూపులోకూడా ఒకవిధ మయిన నవ్వులాట కనబడుతూంటుంది ఆది చూసితీరవలె ఆయనపైకి ఎంత

కరిశంగా ఉంటారో ఆయన మనస్సు అంతమార్ద్రవము అయి ప్రస్ఫుత్వన్నమతి మాటకుమాట బదులు అనడంలో ఆయనకు ఆయనే సాటి ఈన జీవిత యాత్రలో తన హాస్యప్రవృత్తియే తనకు ఆనందం చేకూరుస్తూన్నదన్నా రాయన ఒకప్పుడు ఆయన హాస్యప్రవృత్తిని గురించి అనేక విషయాలు నాకు స్ఫురణకు వస్తూన్నాయి

ఒక పర్యాయం నేను అహమ్మదాబాద్ వెళ్లినప్పుడు నా మిత్రుడు మిల్లుయజమాని సర్ చినూభాయి ఇంట్లో దిగినాను ఆయన నన్ను "ఈ అర్ధదిగంబర్ ఫకీర్" దర్శనానికి తీసుకొని వెళ్లినారు నా స్నేహితునితో ఆయన కొంత సేపు మాట్లాడిన తరవాత నావైపు తిరిగి "నీవెక్కడ ఉన్నావు" అని నన్నడిగినారు నదికి ఆవలిఒడ్డున, ఆశ్రమానికి ఎదురుగా ఉన్న ఎత్తయిన తెల్లని రాజప్రాసాదంవంటి సర్ చినూభాయి భవనం చూపించాను

"ఏమయ్యా ఇది! ఇంత పతనమా! ప్రాసాదంనుంచి పాకలోవచ్చి పడడమా!" అని నవ్వినారాయన

మరోసారి నాగపూరు కాంగ్రెస్‌లో ముందుగా ఆయనను కలిసి, నేను, పాల్ రిచర్డ్‌గారు గాంధీజీని ఆయన డేరాలో కలుసుకొన్నాము వారిద్దరూ అనేక ముఖ్యసమస్యలనుగురించి కొంతసేపు చర్చించుకొన్న తరవాత, సంభాషణ మధ్యలో "గాంధీజీ! మీరు అత్యంత బలసంపన్నమయిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుర్బలమైన మీ 'అహింస' అనే ఆయుధంతో జయించగలమని నిజంగానమ్ముతున్నారా?" అని ఆ ఫ్రెంచి పెద్దమనిషి అతిలేలివిగా ప్రశ్నించినాడు గాంధీజీని "లేదు! కన్నులను మిరుమిట్లుగొలిపే సత్యమనే తీక్ష్ణమయిన ఖడ్గంతో జయించదలచుకొన్నాను అన్నారాయన

గాంధీజీ జబ్బుపడి విశ్రాంతి తీసుకొనేటందుకు మైసూరు మహారాజాగారి అతిథిగా బెంగుళూరులోని కుమారోద్యాన వనంలో ఉండగా, డాక్టర్ జేమ్స్ కజిన్స్ కమలాదేవి, ఫ్రెడ్‌వార్వే, నేనూ కలిసి ఆయన దర్శనానికి వెళ్లినాము ఆయన మామూలుగా రాటంపైన నూలు తీసుకొంటున్నారు డాక్టర్ కజిన్స్ ఆయనదగ్గరికిపోయి, "మహాత్మాజీ! ఇట్లా చూడండి! నేను చేతితో వడికిన నూలుతో చేతితోనేసిన బట్టను ధరిస్తున్నాను" అని గొప్పగా చెప్పుకొన్నారు ఆయన వెంటనే "ఇండియాలోనేనా? ఐర్లండ్‌లో కూడనా?" అన్నారు మేమక్కడ ఉండగానే గాంధీజీదగ్గర ఆయన ఏకులు ఉంచుకొన్న ఒక మామూలు సిగరెట్టుపెట్టెను కమలాదేవి చూసింది మరునటి రోజు మళ్ళా మేమాయనను దర్శించపోయినప్పుడు మేమొక నగిషీచేసిన చందనపు పెట్టె తీసుకొనిపోయి, నెమ్మదిగా ఆ సిగరెట్టుపెట్టెను తీసివేసి ఆ స్థలంలో ఈ చందనపు పెట్టె ఉంచినాము ఆయన అదిచూసి "అహా! ఇండియాలోని ప్రతివస్తువు ఇంత నెమ్మదిగా ఇంతచక్కగా మారిపోతే ఎంత బాగుంటుంది" అంటూ మావైపుతిరిగి "అవును! నాకు తెలుసు మీరేదో తమాషా చేయదలచుకొన్నారని" అన్నారు

ఒకనాడు గాంధీజీని బొంబాయిలోని గామ్‌దేవిలో హరీంద్రనాథ్, కమలాదేవి, నేనూ కలుసుకొని, చటోపాధ్యాయ రచించిన నూతన నాటకాలలో ఒక నాటక ప్రదర్శన ప్రారంభోత్సవానికి ఆరాత్రి దయచేయవలసిందని కోరినాము మేము ఆ నాటకాన్ని గురించి దాని ప్రదర్శనగురించి ఎంతో ఉత్సాహంగా వివరించి చెప్పినాము ఆయన చాలా ఓర్పుగా అంతసేపూవిని తలపైకెత్తి చిరునవ్వుతో "నేను దయచేయను" అన్నారు!

మహాత్మాగాంధీ కార్యదక్షుడయిన ఆదర్శవాది, హృదయపూర్వక ప్రజాస్వామ్య సామ్యవాది (సోషల్ డెమాక్రాట్), నిత్యజీవితంలో ఆచరణ యోగ్యాలయిన అభిప్రాయాలకుమాత్రమే ఆయన విలువయిస్తారు సంస్కరణల విషయంలోకూడా ఆయనది అదేఅభిప్రాయం మానవజాతి కష్టాలను తగ్గించి మానవుని సంపూర్ణాభ్యుదయానికి తోడ్పడగలిగినప్పుడే సంస్కరణలు ప్రయోజనకరాలు కాగలవని ఆయన విశ్వాసము సత్యంమీద ఆయనకు అపూర్వమయిన ప్రేమ యువతీయువకుల పరస్పర ప్రేమోద్వేగంలోవలెనే ఆయన సత్యప్రియత్వం ఆయన అనుచరుల విషయంలో గుడ్డిగా ప్రవర్తిస్తుంది ఇక ఆయన నైతిక నిరంకుశత్వం కొంత ఆశ్చర్యంగా కనబడుతుంది ఆయన తండ్రివలె మృదువుగాను కఠినంగానూ ఉంటారు డాక్టరువలె దయగాను క్రూరంగానూ ఉంటారు మానవునిలోని దైవత్వంలోను, అతని భావ్యున్నత భవితవ్యంలోను ఆయనకు నమ్మకము అందువల్లనే మానవుని ఆత్మవినాశకరమయిన యంత్రాలన్నా భౌతిక వాదమన్నా ఆయనకు అసహ్యం కొందరు అవివేకులు అనుకొంటూన్నట్లు ఆయన అభివృద్ధినిరోధకుడుకానీ అభ్యుదయ ప్రతికూలుడుగానీ కారు ఆయన తన యుగాన్ని అతిక్రమించి చూడగల అభ్యుదయవాది ఆయన ఉన్నతశ్రేణికి చెందిన పురోగామి (ప్రగతిశీలుడు) ఆయన సుదూర భవిష్యత్తును గురించి ఎన్నో మంచికలలు కంటున్నారు ఆత్మవినాశకరమయిన ఆధునిక యాంత్రిక నాగరకతనూ గురించి ఆయనకుగల ప్రత్యేకానుభవజ్ఞానంమీదనే ఆయన చర్ఖా అర్థశాస్త్రం, గ్రామపునరుద్ధరణలు ఆధారపడి ఉన్నాయి మానవసమాజం భవిష్యత్తులో తమకు తటస్థించే ఆపదను గుర్తించక గుడ్డిగా నిస్సహాయంగా పాతాళంలో పడబోతూన్నదని ఆయన మనలను వేలు చూపి మందలిస్తున్నారు మానవునిలోని సుస్వభావాన్ని ప్రకోపింపచేసి, మానవజాతిని సాధ్యమయినంతవరకు సంరక్షించడానికి సన్నాహం చేస్తున్నారాయన

ఆయన అభిప్రాయాలు, ఆదర్శాలు, ఆశయాలు ఉదాత్తాలు హృద్యాలూ కావచ్చు కాని ఇవన్నీ ఆయన దేశీయులను అంతగా ఆకర్షించలేదు నిష్ఠ, నిరాడంబరత్వం, నిర్భయత్వం, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలున్న ఆయన ఋషిజీవితమే ఆయన దేశీయులను ఎక్కువగా ఆకర్షించింది

ఆయన అంగవస్త్రము, ఆయన మితాహారము, సామాన్య దరిద్రమానవులతో సాహచర్యము, కొనితెచ్చుకొన్న పేదరికం, నిమ్నజాతికి చెందిన బిడ్డను సొంతకూతురుగా పెంచుకోవడం, మూడవతరగతిరైలులో ప్రయాణం,

స్వార్థత్యాగం, మాతృదేశపు పిలుపునందుకొని ఆయనచేసిన ఆత్మార్పణం-వీటన్నిటివలనా కోట్లాది ప్రజల ప్రేమామృతం చూరగొనగలిగినారాయన ఆయన భారతీయులలో ఉత్తమోత్తముడు ప్రపంచంలోని అమరజీవులలో (అమృతమూర్తులలో) ఆయన ఒకరు

# 6
# గోఖ్లే హాలులో గాంధీజీ చిత్రపటము (1917)

1915-16 లలో గాంధీజీ సంయుక్త మద్రాసు రాష్ట్రంలో పర్యటన చేసిన ఉదంతా లింతకు పూర్వం వివరించి ఉన్నాము ఆ పర్యటన ప్రభావం వల్ల గాంధీజీ జీవితం గురించి, ఆయన ఆదర్శాలు ఆశయాలు గురించి దక్షిణ భారతదేశంలోని ప్రజలకు ఆసక్తి హెచ్చింది ఆ కారణంగా 1917 అక్టోబరు 2 వ తేదీని మద్రాసు పౌరులు గాంధీజీ జన్మదినోత్సవం మొదటి పర్యాయం జరిపినారు

ఆ సందర్భంలో ఇండియన్ రివ్యూ పత్రికా సంపాదకులు జి ఏ నటేశన్ గారు గాంధీ చిత్రపటం వ్రాయించి గోఖ్లే హాలుకు బహూకరించినారు దాని ఆవిష్కరణసభ జరిగింది ఆ సభకు డాక్టర్ బెసెంట్ అధ్యక్షత వహించినారు పురప్రముఖు లనేకు లా సభకు దయచేసినారు సర్ యస్ సుబ్రహ్మణ్య అయ్యర్, యల్ ఏ గోవిందరాజయ్యర్, యాకుబ్ హుస్సేన్, జినరంజన్ దాస్, ఆయన సతి, అరండేల్, వాడియా, ఆంధ్రపత్రికా సంపాదకులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగార్ల వంటి ప్రముఖు లా సభలో ఉన్నారు అనేక మంది స్త్రీలు కుండా ఆ సభకు హాజరయినారు

గాంధీజీ చిత్రపట బహూకరణం అంగీకరింప కోరుతూ శ్రీ నటేశన్ ఇట్లా ప్రసంగించినారు

"గాంధీజీ జన్మదినోత్సవం చెన్నపురిలో జరపడం ఇది మొదటిసారి భారతదేశంలో రామకృష్ణునివంటి సర్వసంగపరిత్యాగులు, గోఖలేవంటి దేశ భక్తులు, సాలార్ జంగ్ వంటి రాజనీతి చతురులు జన్మించినారు గాంధీజీలో ఈ మూర్తిత్రయంలోని మూడు గుణాలూ ఉన్నవి ఈయన వట్టి నిరాడంబ రుడు సర్వం త్యజించి మానవసేవకు పూనుకొన్న మహనీయుడు ఈయనకు జాతి, మత, కుల, వర్ణ భేదాలు లేవు సర్వమానవ సౌభ్రాత్రం ఈయన ఆద ర్శము ఈ మహామహుని గురించి గోఖ్లేగారు, ఈయన పరమపవిత్రుడనీ, నిరాడంబరజీవి అనీ, ఈయన సంసర్గంవల్ల మానవులలో మంచి మార్పు రాగల దనీ, ఈయన దేశభక్తాగ్రగణ్యుడనీ అన్నారు అట్లాంటి మహాపురుషుని చిత్రపట బహూకరణం అంగీకరింపవలెనని బెసెంటమ్మగారిని కోరినాను". తరవాత బెసెం టమ్మగారిట్లా అన్నారు "గాంధీగారి పేరు ప్రతివాని హృదయంలోనూ ప్రతి ధ్వనిస్తున్నది ఈ సభను గురించి ఆయనకు తెలిసి ఉండినట్లయితే ఆయన

అంగీకరించి ఉండేవారు కారు గాంధీగారి జీవితం ఎంతో పవిత్రమయినది ఉన్నతాశయాలు కలది ఆయన దేశం అంతటూ చెందిన మనిషి అందువల్ల ఆయనకు తనపై ఎట్లాంటి స్వాతంత్ర్యమూ లేదు ఇటువంటి మహాపురుషుని చిత్రపటాన్ని గోఖ్లే భవనంలో ఉంచడంవల్ల అది యువకుల కాదర్శప్రాయంగా ఉండి వారి ఆశయాలను పెంపొందించగలదు గాంధీగారు పేరుప్రతిష్ఠలకోసం పెనుగులాడే మనిషి కాదు అయితేనేమి? ఉజ్జ్వలమయిన ఆయన కీర్తి దేశం నలుమూలలా వ్యాపించింది తన వ్యక్తిగతాభిప్రాయాలను గాంధీ వెల్లడించి నపుడెల్ల భారతీయ లక్షణా లాయనలో మూర్తీభవించినట్లు [illegible] కాగ లవు ఆయన సర్వసంగపరిత్యాగి మానవసేవయే ఆయన లక్ష్యము అనుభవ జ్ఞానము, ధైర్యము, దేశభక్తి - ఇవన్నీ గాంధీలో పరిణతి పొందినాయి గోఖ్లే పేరుతో ఉండిన ఈ భవనంలో గాంధీజీ చిత్రపటం ఉంచడం బంగారానికి తావి అబ్బినట్లు సముచితంగా ఉన్నది" అని డాక్టర్ అనీబిసెంట్ గాంధీజీ చిత్రపటం ఆవిష్కరించినారు

తరవాత సర్ యస్ సుబ్రహ్మణ్యయ్యర్ గారు, "గాంధీజీ మూర్తీభవించిన ఆత్మశక్తి ఆయన ఆత్మశక్తికి లొంగని ప్రతిశక్తి లేదని చెప్పవచ్చు అన్ని నిరోధాలను ఆయన ఆత్మశక్తితో తొలగించుకోగలరు ఈ చిత్రపటం బహూకరించిన నటేశన్ గారికి మా వందనాలు గాంధీజీ మూాశో వరగతి ప్రయాణీకుల కష్టనివారణార్థం ప్రయత్నిస్తున్నారు వారి ప్రయత్నానికి విజయం కలుగు గాక" అని తమ ప్రసంగం ముగించినారు తరవాత యల్ ఎ గోవిందరాఘ అయ్యర్ గారు దిగువ తీర్మానం ఉపపాదించినారు

"చెన్నపురి పౌరులీ ఉదయం గోఖ్లే భవనంలో సమావేశమై గాంధీగారి 49వ జన్మదినాన వారి నభినందిస్తూ వారు మాతృదేశసేవ చేసేటందుకు పరమేశ్వరుడు వారికి ఆయురారోగ్య మొసగుగాక అని ప్రార్థిస్తున్నారు"

ఈ తీర్మానం ప్రతిపాదిస్తూ "గాంధీజీ జీవితంలో నాల్గైదు ముఖ్య విషయాలను గమనించవలసి ఉన్నది ఆయన ప్రాచీన భారతీయ ధర్మానికి అనుగుణంగా నడచుకొంటున్నారు ఆయన సత్యసంధుడు అందువల్ల ప్రపంచంలో అందరికంటె ఎక్కువగా ప్రజలీయన యందే విశ్వాసంతో ప్రవర్తిస్తారు కలహాలు కల్లోలాలు ఉన్నచోట్లకు గాంధీజీ వెళ్లి అ ల్లగలను పగిలేగాక ప్రేమతో జయించడానికి ప్రయత్నిస్తారు అదే ఆయనలోని విశిష్టత దక్షిణాఫ్రికా సాత్త్వికనిరోధోద్యమంలో ఆయనకు కలిగిన విజయం ఆయన సౌశీల్యానికీ, సత్యనిరతికీ తార్కాణాలు ఈ మహనీయుడు జనసామాన్యంతో కలిసి మెలసి ఉంటూ వారి కష్టనష్టాలలో పాల్గొనడంవల్ల వారికీయన ప్రేమపాత్రుడవుతున్నాడు సామాన్య మానవుని కంటె గొప్పవాడననే అహంకారమీయన కెంతమాత్రం లేదు ఈయన సంసర్గంవల్ల సామాన్య మానవులు సైతం కొన్ని సుగుణాలను అలవాటు చేసుకోగలరు ఈ మహనీయుడు గొప్ప ఉదార స్వభావుడు దక్షిణాఫ్రికా భారతీయులు ప్రభుత్వం వారి నెదుర్కొను సంసిద్ధులై

ఉండగా ప్రభుత్వానికి భారతీయులకూ రాజీ చేయడానికి ప్రయత్నించిన దీయ నయే దక్షిణాఫ్రికలోని ఒక యూరపియన్ జాతివారు ప్రభుత్వంవారి నెదిరించి పోరాడనున్నప్పుడాయన సామ్రాజ్యానికి చక్రవర్తికి సేవచేయడానికి భారతీయులు బద్ధకంకణులై ఉన్నట్లు తెలియజేసినారు గాంధీజీ నిరంతరమానవ సేవాతత్పరుడు మూడో తరగతి రైలు ప్రయాణీకుల దురవస్థను తొలగించే టందుకాయన ప్రయత్నిస్తున్నాడు ఆయన ప్రయత్నము జయప్రదం కాగలదని నాకు గట్టి నమ్మకం ఉన్నది ఈయనకు పరమేశ్వరుడు చిరాయురారోగ్యాల నిచ్చి ఇతోధికంగా దేశసేవకు తోడ్పడునుగాక అని నా ప్రార్థన

తీర్మానాన్ని బలపరుస్తూ యాకూబ్ హుస్సేన్‌గారు, గాంధీజీ మన జాతీయాత్మగౌరవం పునరుద్ధరించిన పునీతుడనీ జాతి మత కులభేదాలు జాతీయాత్మగౌరవ వినాశకరాలుగా భావించి వాటిని పాటించవలదని ప్రబోధిస్తూన్న వర మోత్కృష్ట పురుషుడనీ అన్నారు భారతదేశంలో సకల రాజ్యసుఖాలను విడనాడి సర్వసంగపరిత్యాగులయిన మహారాజులున్నారు ప్రజాస్వామ్య సిద్ధాంతాలు ప్రబలుతూండిన కాలంలో పరిపాలకులుగా ఉండగోరేవారు గాంధీజీ జీవితాన్ని ఒరవడిగా ఉంచుకోవలెననీ, నిమ్నజాత్యుద్ధరణకోసం పాటుబడుతున్న మహనీయులలో గాంధీజీ ఒకరనీ చెప్పి ఆయన తన ఉపన్యాసం ముగించినారు

తరవాత పి కె తెలాంగ్‌గారు మాట్లాడుతూ, 'గోఖ్లే, బెసెంట్, గాంధీగార్లు త్రిమూర్తులవంటివారు ఈ ముగ్గురి శక్తులును సమ్మేళనమైనప్పుడే దేశానికి విజయం కలుగుతుంది గాంధీజీకి ఆత్మశక్తి ఎక్కువ. ఆయనకు మానవులందరూ సమానులే ఆయన ఆశ్రమంలో ఈ ఐక్యభావం గమనించవచ్చు సాత్త్వికనిరోధావలంబనానికి జనబాహుళ్యంతో పనిలేదనీ, అందుకు కావలసిన ముగ్గురూ- తానూ, తన సహధర్మచారిణి, తన కుమారుడూ సంసిద్ధంగా ఉన్నారని గాంధీజీ చెప్పిన మాటలను వెల్లడించి తన ఉపన్యాసం ముగించినారు

తరవాత డి కృష్ణమూర్తి బి ఏ, బి యల్, గారు తెలుగులో మాట్లాడుతూ, గాంధీజీ, ప్రభుత్వంపట్లకంటె తన మాతృదేశంపట్ల ఎక్కువ భక్తి చూపవలసి ఉంటుందన్నారనీ, గాంధీజీవంటి నాయకులు పదిమంది ఉంటే మన దేశం ఇతోధికంగా అభివృద్ధి పొంది ఉండేదనీ అన్నారు ఆయన ఇంకా ఇట్లా అన్నారు "నేను బ్రాహ్మణేతరుణ్ణి దేశంలో రాజకీయసమస్యాపరిష్కారమత్యవసరమయిన ఈ తరుణంలో బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదాలను పరిగణించడం సుమార్గం కాదు మనము మొట్టమొదట భారతీయులమనీ తరవాత బ్రాహ్మణేతరులమనీ భావించవలెనని నా బ్రాహ్మణేతర సోదరులను నేను ప్రార్థిస్తున్నాను గాంధీజీ బ్రాహ్మణేతరుడయినా ఆయన సద్గుణాలవల్ల అందరిచేతను పూజింపబడుతున్నారు" ఈ ఉపన్యాసానంతరం అధ్యక్షురాలయిన బెసెంట్‌గారు తమతీర్మానం తంతీవార్తద్వారా గాంధీజీకి తెలియచేయగోరినారు స్వపరిపాలనం గురించి గాంధీగారు బ్రిటిష్ పరిపాలకులకు పంపుతూ ఉండిన మహజర్ అర్జీపయిన అందరూ సంతకాలు చేసి ఇతరులచేత సంతకాలు చేయించ

వలెనని సభ్యులకు సలహా ఇచ్చినారు

తరవాత లాడ్ గోవిందదాసుగారు, వాడేశన్‌గారు, అధ్యక్షత వహించిన బెసెంట్‌గారికి కృతజ్ఞత చెప్పడంతో సభ ముగిసింది

**రాజకీయ సంస్కరణోద్యమము**

భారతదేశానికి హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి మాంటేగ్ రానున్న తరుణంలో కాంగ్రెస్ ముస్లిమ్‌లీగ్‌లవారు ఒక రాజ్యాంగసంస్కరణ ప్రణాళికను తయారు చేసినారు దానిని వయస్సువచ్చిన భారతీయ స్త్రీ పురుషుల సంతకాలతో మాంటేగ్‌కు సమర్పింపవలెనని నిర్ణయించినారు ఈ సంతక సేకరణోద్యమాన్ని గురించి గాంధీజీ చేసిన విజ్ఞప్తి ఇంగ్లీషులోనేగాక దేశభాష లన్నిటిలోనూ ప్రకటించబడింది ఈ సంతకాలు చేయించే స్వచ్ఛంద కార్య నిరతులు, ఆ ప్రణాళికను వివరంగా తెలిపిన తరవాతనే వ్యక్తులచేత సంతకాలు చేయించవలెనని గాంధీజీ తన విజ్ఞప్తిలో స్పష్టంగా తెలియచేసినారు అంతేగాక ఆయన, స్వచ్ఛంద సేవాకార్యకర్త ఏయే పరిస్థితులలో ఎట్లా ప్రవర్తింపవలెనో కూడ వివరించినారు కాంగ్రెస్ ముస్లిమ్‌లీగు లంగీకరించిన రాజ్యాంగ సంస్కరణ ప్రణాళికను, గాంధీజీ విజ్ఞప్తినీ కూడా చెన్న రాజధాని హోమ్‌రూల్ లీగ్ వారు కూడ ఆమోదించినారు ఆంధ్రదేశ "హోమ్‌రూల్ లీగ్" (స్వరాజ్య సంఘ) కార్యదర్శి శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఆంధ్ర జిల్లాలలో సంతక సేకరణకార్యం 1917 నవంబరు 10 లోగా ముగించి మద్రాసులోని రాష్ట్రీయ కార్యాలయానికి పంపవలసిందిగా క్రిందుగా దిగువ నుదాహరించిన వీరిని నియమించినారు

1 గంజాం జిల్లా శ్రీ ఎ అప్పలనరసయ్యగారు - బరంపురం
2 విశాఖపట్టణం జిల్లా గా॥ శ్రీ భూపతిరాజు వెంకటపతిరాజుగారు - విశాఖపట్టణము
3 గోదావరి జిల్లా గా॥ శ్రీ కొచ్చర్లకోట వెంకటకృష్ణారావు బహద్దరుగారు బి ఏ,- పోలవరం జమీందార్
4 కృష్ణాజిల్లా శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు, బి ఏ, యం బి సి యం - బందరు
5 గుంటూరు జిల్లా శ్రీ కొండ వెంకటప్పయ్యపంతులుగారు - గుంటూరు
6 నెల్లూరు జిల్లా శ్రీ ఒరుగంటి వెంకటసుబ్బయ్యగారు, బి ఏ, బి యల్ , - నెల్లూరు
7 కర్నూలు జిల్లా రావుబహదూర్ యస్ వి నరసింహారావుగారు - కర్నూలు
8 కడప జిల్లా ఎ నంజుండప్పగారు - వకీలు - కడప
9 బళ్లారి జిల్లా : రావుబహదూర్ సి వి. సుబ్రహ్మణ్యంగారు - బళ్లారి. ,

10 అనంతపురం జిల్లా (శ్రీ) హట్టి శంకరరావుగారు, బి ఏ -అనంతపురం
11 చిత్తూరు (శ్రీ) సి ఆర్ పార్థసారధి అయ్యంగార్, బి ఏ బి యల్, చిత్తూరు
12 మద్రాసు (శ్రీ) సి పి రామస్వామి అయ్యర్

ఆంధ్రదేశ హోమ్‌రూల్ లీగ్ కార్యదర్శి (శ్రీ) హరి సర్వోత్తమరావు గారి ఈ పై ఏర్పాట్లను బట్టి మాంటేగ్‌కు సమర్పించేటందుకు తయారుచేయ బడిన రాజ్యాంగసంస్కరణ ప్రణాళికపైన సంతకాల సేకరణకు 1917 లో గాంధీజీకి తోడ్పడిన తెలుగుపెద్దల పేర్లు తెలుసుకోవచ్చు

సహకారోద్యమం గురించి గాంధీజీ వ్యాసమొకటి 1917 అక్టోబరు 18 ఆంధ్రపత్రికలో ప్రకటించబడింది గాంధీజీ ఆనాడు ఆ వ్యాసంలో వెల్ల డించిన భావాలు నేటికీ అవలంబించతగినవిగా ఉన్నందున అవి కింద ఉదాహరింప బడినవి ఈ వ్యాసం 1917 లో బొంబాయిలో జరిగిన సహకార మహా సభలో గాంధీజీ చదివినది

## సహకారోద్యమము, నైతికాధారాలు (యం. కె గాంధీ)

"యూాబాంక్‌గారు కొద్దిమాసాలకిందట యంత్రాలలో పనిచేసే కూలీల సభకుపోయి వారికి సహకారోద్యమసూత్రాలు బోధించదలచినారు వారితో కూడ నేనాసభకు పోయినాను ఆ యంత్రకారులుండేశాల ఎంత అసహ్యంగ ఉండగలదో అంత అసహ్యంగా ఉన్నది ఇటీవలివర్షాలవల్ల అది మరింత అసహ్య కరమయింది ఆ పని తమ సొంతపనిగా భావించి యూాబాంక్‌గారు పట్టుదల చూపకుండినట్లయితే నేనక్కడనుంచి వెంటనే లేచిపోయేవాడిని శిథిలమై చిని గిన ఒక పెద్ద చాపమీద ఆ యంత్రకారులు భార్యాబిడ్డలతో కూర్చున్నారు ముందుకూర్చున్నవానితో యూాబాంక్‌గారు సరసంగా మాట్లాడినారు అత డంతగా అమాయకునివలె కన్పించలేదు వానితోడను తక్కినవారితోను యూాబాంక్‌గారు కొంతసేపు గుజరాతీలో మాట్లాడి నన్నుకూడా మాట్లాడ మన్నారు మొట్టమొదటి అతని చూపులు అనుమానాస్పదంగా కనబడినాయి అందువల్ల నేను సహకారోద్యమ నైతికాదర్శాలు అతని మనస్సునకు నాటే టట్లు చెప్పినాను నేనా అంశం బోధించిన పద్ధతిని చూసి యూాబాంక్‌గారు సంతోషించినారని నా అభిప్రాయము అందువల్లనే సహకారోద్యమం నైతిక దృక్పథంనుంచి ఆలోచించేటందుకు నన్ను వారు ఆహ్వానించి ఉండవచ్చు

నాకు సహకారోద్యమం గురించిన సాంకేతికజ్ఞానం లేదు సహకా రోద్యమజ్ఞానము కేవలం నా సోదరుడు దేవధర్‌గారి సొత్తు అతడేమిచేసి నప్పటికీ అది నా దృష్టిని సహజంగా ఆకర్షిస్తుంది అతడు చేసిన ప్రతిపనిలోనూ ఏదో మంచి ఉంటుందని దానిని గ్రహించడం కొంత కష్టమనీ నా అభిప్రా యము. సహకారోద్యమం గురించి కొంత విశదంగా తెలుసుకొనేటందుకు వీలుగా యూాబాంక్‌గారు నాకు కొన్ని పుస్తకాలనుకూడా ఇచ్చినారు చాంప

రాన్‌లో కొన్ని సహకారోద్యమ ప్రయత్నాలను నేను చూడటం తటస్థించింది

యూశాంకుగారి పది ఉపదేశాలను, కాలిస్ (బీహారుస్స) గారి ఎన్నెండు అభిప్రాయములనూకూడా నేను చూసినాను చాంపరాన్‌లో వ్యవసాయ బాంకులనేవి కొన్ని ఉన్నాయి కాని అవి సహకారోద్యమ సాఫల్యానికి శుష్కప్రయత్నాలుగా తోచినాయి ఆ విషయంలో హాడ్జిగారుకూడా సేవధానంగా కొన్ని ప్రయత్నాలు చేసినారు అతని ప్రయత్నాలతని సహచరులు కూడా అనుసరిస్తున్నారు హాడ్జిగారికి సహకారోద్యమంపై అత్యంతోత్సాహం ఉంది తన ప్రయత్నంవల్ల కలిగిన లాభాలన్నీ సహకారోద్యమంవల్లనే కలిగినట్లే బహుశా అతడు భావిస్తూండవచ్చు నేను రెండుచోట్లనూ జరిగిన ప్రయత్నాలను చూసిఉండడంచేత, ఒకచోట విజయం మరొకచోట అపజయం కలగడానికి కారణం వ్యక్తి ప్రయత్నబలమేనని నాకు తోస్తుంది నేనూ ఉత్సాహవంతుడనే కాని ఈ విషయంలో నాకు ఇరవై అయిదేండ్ల అనుభవం ఉండటంచేత వెనకముందులాలోచించే స్వభావంకూడా నాలో ఏర్పడింది ఏ ఉద్యమంలోకూడా అత్యుత్సాహం చూపేవారు ఉద్దేశపూర్వకంగా కాకపోయినా ఆ ఉద్యమంపట్ల ఉన్న అభిమానంచేత దాని ప్రయోజనాలను గురించి ఎక్కువగా శ్లాఘించడం సహజము అంతేకాదు, వారు ఆ ఉద్యమంలోని నష్టాలను సైతం లాభాలుగా వర్ణించడంకూడా ఉంది నాకీ అనుభవం ఉన్నప్పటికీ నేను అహమ్మదాబాదులో స్థాపించిన చిన్న పరపతిసంఘం ప్రపంచంలోకంతా అత్యుత్తమమయినదని నేననుకొంటూ ఉంటాను అందువల్ల నాకెంతో ఉత్సాహం కలుగుతూఉన్నది కాని, దానినిగురించి కఠిన విమర్శలు లేకపోలేదు

తమతమ బుద్ధి కుశలతకు తగినట్లు స్త్రీపురుషులు సంపూర్ణ స్వాతంత్ర్యంతో తమ ప్రవర్తనను సరిదిద్దుకొనడానికి వీలుగా నేనాశ్రమం స్థాపించాను ఆశ్రమాధికారులు సభ్యుల సత్ప్రవర్తనను రూపొందించేటందుకు తగిన శ్రద్ధ తీసుకోకపోతే నా శ్రమ అంతా వృథాఅయినట్లే అందువల్ల సహకారోద్యమోత్సాహపరులు, ఆ ఉద్యమ విజయం దానిని నడిపేవారి సౌశీల్యంపైన ఆధారపడి ఉంటుందని నమ్మడంకంటె వేరే ఆశలు పెట్టుకోవద్దని నా సలహా!

సర్ దానియల్ హామిల్టన్ దానికొక మతంగా భావిస్తున్నారు అయన కిందటి జనవరి 18 న స్కాటిష్ చర్చి కాలేజి విద్యార్థుల నుద్దేశించి ఉపన్యసిస్తూ 200 ఏండ్ల కిందట ఎంతో పేదరికంలోఉండిన స్కాట్లండ్ దేశమిప్పుడభివృద్ధిలో ఉండడానికి ప్రధాన శక్తులను పేర్కొన్నారు

"ఒకటి స్కాట్లండ్ చర్చి, రెండు స్కాట్లండ్ బాంకులు చర్చి మనుష్యులను తయారుచేసింది బ్యాంకులు ఆ మనుష్యుల జీవిత ప్రారంభానికి ధనం చేకూర్చినాయి చర్చి దేవునికి వెరిచి ప్రవర్తించేటట్లు జాతికి బోధించింది దేవునికి వెరచి ప్రవర్తించడం జ్ఞానాభివృద్ధికి మొదటిమెట్టు మానవుని పరమావధి దేవుని కీర్తించడం, అతనివల్ల సుఖంపొందడం అని చర్చికి సంబంధించిన

పాఠశాలలో పిల్లలు నేర్చుకొన్న పాఠాలు దైవాన్ని తమ ఆత్మలనూ నమ్మకోవలెనని పెద్దవారికి బోధించడం జరిగింది ఈ బోధల ఫలితంగా రూపొందిన మనుష్యుల ప్రవర్తనంమీద స్కాట్లండ్ బాంకింగ్ విధాన మాధారపడిఉన్నది" సర్ డానియల్ గారి ఈ అభిప్రాయంతో పూర్తిగా ఏకీభవించవచ్చు మంచి ప్రవర్తనలేని మనుష్యులతో సహకారం సాగనేరదని ఈ మాటల సారాంశము కాని ఆయన అంతటితో ఆగక ఇంకా ఇట్లా అన్నారు 'హిందూదేశ భవిష్యదభివృద్ధిని గురించి మీ రెటువంటి ఆశలు పెట్టుకొన్నప్పటికీ, హిందూదేశాన్నంతా ఒకటిగాచేసి తద్వారా ప్రపంచంలో హిందూదేశానికి అర్హస్థానం కల్పించే టందుకు బ్రిటిష్ దొరతనం వారిక్కడ ఉన్నారనే మాటమాత్రం మరవవద్దు, జనుల నందరినీ ఏకంచేయడానికి దొరతనం వారికి సహకారోద్యమమే ఆయుధము " దీనినిబట్టి హిందూదేశానికి ప్రస్తుతం హానికరాలయిన బాధల నివారణకు సహకారోద్యమమే పరమౌషధమని ఆయన అభిప్రాయ గా కనబడుతుంది విశాలదృష్టితో ఆలోచించినట్లయితే ఈ అభిప్రాయ మొకవిధంగా సమర్థనీయమే అయినప్పటికీ, డేనియల్ గారుపయోగించిన భాషనుబట్టి అది అత్యుత్సాహవంతుని అతిశయోక్తి అని నేను చెప్పడానికి సాహసిస్తున్నాను

దక్షిణాఫ్రికా బాంకులలో ఖాతాలు గలవారితో నాకు ఇరవై ఏళ్ళ అనుభవమున్నది మనుష్యుడెంత "లుచ్ఛా" యైనా అతనికి బాంకులలో పరపతి లభిస్తున్నదని ఎందరో నాతో చెప్పినారు ఆమాటలు నా మనసులో బాగా నాటుకొన్నవి బాంకులు వ్యక్తి నైతిక ప్రవర్తనం పరిశీలించవు వాటికి బాకీదారు వ్రాసిన దస్తావేజుగా సరిగా ఉంటేచాలు ఈ పరపతి విధానం పెద్ద పాముపలె మన ప్రపంచం అంతా చుట్టుకొన్నది మనము జాగ్రత్తగా ఉండకపోతే అది మనలను ఊపిరి తిరగకుండా చేయగలదు దానివల్ల ఎన్నో కుటుంబాలు నాశనమైనాయి

పరపతి సహకారోద్యమంవల్ల కలిగినదా మరి ఇతరంగా కలిగిందా అని వారు ఆలోచించలేదు ఆ భేదం వారికి తెలియదు ఈ పరపతి యూరప్‌లో మహానర్థదాయకంగా పరిణమించింది ఆ దృశ్యాన్ని మనం నిస్సహాయులమై చూడవలసివస్తూన్నది న్యాయశాఖలోవలె యుద్ధంలో ఎక్కువ ధనవంతులే విజయం పొందగలరన్న సత్యం ఇప్పుడు చూస్తున్నంత స్పష్టంగా నిదివరకెన్నడూ ఎవ్వరు చూసిఉండకపోవచ్చు ధార్మికదృష్టితో, నిష్కర్షగాను నైతికంగానూ నడిపింపబడేటంతవరకు మాత్రమే సహకారోద్యమం హిందూదేశానికి లాభదాయకంగా ఉండగలదని నా నమ్మకము అందువల్ల పరపతిసహాయం నైతికంగా న్యాయంగా జీవించేవారికీ, దారిద్ర్యబాధనుంచి వడ్డీవ్యాపారస్థుని పిడికిలినుంచి తప్పించుకొనగోరేవారికీ మాత్రమే అందజేయవలె తక్కువవడ్డీలకు ఋణాలిచ్చినంతమాత్రంతో దుర్నీతిపరులు నీతిపరులు కానేరరు సన్మార్గవర్తనులై కష్టాలుపడుతూన్నవారి అభ్యున్నతికి తోడ్పడడం ప్రభుత్వ ధర్మము, ప్రజాసేవకుల ధర్మమూ కూడా

ఖాతికాభివృద్ధివల్ల నైతికాభివృద్ధి కలుగుతుందని చాలామంది నమ్ము తున్నారు చౌకవడ్డీలకు అప్పులిచ్చినందువల్ల హిందూదేశానికి మేలు కలుగు తుందనే అభిప్రాయంతో ఈ సంస్థలు పనిచేయరాదు సహకారంతోని నైతికా దర్శం గుర్తించిన యథార్థపు సహకారోద్యమం మాత్రమే సామాన్య జనానికి తరుణోపాయంగా ఉండగలదు సహకారోద్యమ సూత్రాలను ఎంతమాత్రమూ గుర్తించక సహకారోద్యమమనే పేరుతో నిర్మింపబడిన కపట సహకార మహా సౌధం ఎంత గొప్పగా కనబడినప్పటికి దానివల్ల ప్రజలకు ఇసుమంత ప్రయోజన మయినా కలగదని దొరతనం వారెంతత్వరగా గ్రహిస్తే అంత మంచిది సహకారోద్యమవిజయం పరపతిసంఘాల సంఖ్యవల్లగాక సంఘాలనుంచి ఋణాలు తీర్చుకొనేవారి నైతిక ప్రవర్తనబట్టి నిర్ణయింపవలసిఉన్నది సహ కారసంఘాల సంఖ్యను పెంచడంకంటె ఇప్పుడున్న సంఘాల నైతికస్థితిని పెంపొందించడం ఎక్కువ మంచిది దీనిని గురించి సహకారసంఘాల రిజిస్ట్రార్ లు జాగ్రత్తతో పరిశీలించవలసిఉన్నది రిజిస్టర్ అయిన సంఘాల సంఖ్యనుబట్టిగాక ప్రస్తుతమున్న సంఘాల నైతికాభివృద్ధినిబట్టి దొరతనంవారు ఆయా విభాగాల నభివృద్ధిచేయవలెనని హిందూదేశ సహకారోద్యమసంఘంవారు తమ నివేదికలో తెలిపినందుకు నాకు సంతోషంగా ఉన్నది పైపలదగ్గరనుంచిబు డబ్బు సరిగా చెల్లింపబడుతూన్నదో లేదో జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుందని దీని అర్థము పరపతిసంఘాల పడపడికి బాధ్యులయినవారు ఆయాసంఘాలు బదులు యిచ్చిన సొమ్ము కల్లుదుకాణాలకూ జూదపుటిండ్లకూ పోకుండ జాగ్రత్తతో చూడవలె మహాజనుడు (వడ్డీవ్యాపారస్థుడు - షావుకారు) తానిచ్చిన అప్పు జూదగృహానికిగానీ, కల్లుదుకాణానికిగానీ పోకుండ జాగ్రత్త తీసుకొన్న ట్లయితే ఆయన ఎంత ఆతురతతో ఎంత ఎక్కువవడ్డీకి అప్పు ఇచ్చినా తుంగపుట్టదే నని నా అభిప్రాయము

మహాజనునిగురించి ఒకటి రెండు మాటలను చెప్పదలచుకొన్నాను కోతులూ, పతులూ తమ పంటలను పాడుచేయకుండా ఉంచేటందుకు రైతులు పరస్పరం సహకరించుకోవడం మనకు తెలుసు ధాన్యంనూర్చుకొనేటందుకు వారు ఒకేచోట కళ్ళాలుచేసుకోవడంకూడా మనమెరుగుదుము తమభూములలో అతిసారవంతమయినవాటిని సైతం పశుగ్రాసంకోసం సామాజిక భూమిగా వదలి వేయడం నేనెరుగుదును అత్యాశాపరుడైన మహాజనుని (ఋణదాత) మీద కట్టుకట్టడానికి ఋణస్థులందరూ సహకారం చేసుకోవడంకూడా చూస్తు న్నాము కాని రైతులకు మహాజనుని అవసరం ఎక్కువగా ఉండడంవల్ల వారి కట్టులు సఫలమైనవో లేదో నేను చెప్పజాలను ఎంతటి కఠినుడయిన మహా జనుడైనా నైతికాదర్శంగల సహకారోద్యమానికి లొంగితీరవలె 'హస్తం వేస్తే భస్మం' అవుతుందని మహాజనుని అందులో ఆరోపించడం జరిగింది

ఆఅభిప్రాయం చాంపరాన్‌లో నాకు కలిగిన కొద్ది అనుభవంబట్టి మార్చు కొనవలసిఉన్నది. అతడెప్పుడూ క్రూరుడుగా ఉంటాడనిగానీ పైపలతోసహా

వడ్డీతోఅసలుసొమ్మునను వసూలుచేస్తాడనిగానీ నేను చెప్పలేకుండా ఉన్నాను అత
డొక్కొక్కప్పుడు తన ఖాతాదారుల కనేకవిధాల సహాయంచేయడంకూడా
ఉంది వారు దుస్థితిలో ఉన్నప్పుడు సంరక్షించడంకూడా ఉంది నాకు తెలి
సిన సంగతులు చాలా తక్కువ కాబట్టి వాటినిగురించి నేను నిర్ధారణగా చెప్ప
లేను అయినప్పటికీ మహాజనునిలో మంచిఉంటే దానిని గ్రహించడానికి, అత
నిని చెడుగునుంచి తప్పించడానికి నేను గౌరవపూర్వకంగా ప్రయత్నంచేస్తాను
అతడు సహకారోద్యమంలో చేరగలడా, లేక ఆ ఉద్యమాన్ని వ్యతిరేకిస్తాడా
అని అనుభవంవల్ల తెలుసుకోవలె

ఈ ఉద్యమం దేశీయ పరిశ్రమలకు ఏకాధిపత్యం వహిస్తున్నట్లు నాకు
కనబడుతుంది నేతగాండ్ర దురవస్థను ఇసుమంత తగ్గించడానికి నేను చేసే
కొద్ది ప్రయత్నంలో నాకు దొరతనం వారు తోడ్పడుతూన్నందుకు కృతజ్ఞు
డను నా పరిశ్రమను కొనసాగించడానికి మంచి అవకాశముంది సాలెవాని
మగ్గాలను ధ్వంసముచేయనున్న మహానర్థకాన్ని దేశాభిమాని అయినవాడెవ్వడూ
సహించడు పరిశ్రమలవల్ల వ్యవసాయదారునికి లాభంవస్తూందనీ, అందువల్ల
అతనికి కరువు ఉండదనీ మాన్‌గారు అన్న మాటలో ఎంతయినా అర్థ
మున్నది సున్నితమూ అతిప్రాముఖ్యమూ అయిన ఈపరిశ్రమను పునరుజ్జీవింప
చేయగల ప్రతి మహానుభావుడు భారతీయుల కృతజ్ఞతకు పాత్రుడు కాగలడు

చేనేత పరిశ్రమాభివృద్ధికి నేను మూడువిధాల ప్రయత్నిస్తున్నాను
అవి

1 సంప్రదాయంగా చేనేతవారు ఉపయోగించే మగ్గాల అభివృద్ధికి ఎటు వంటి సామాన్య సంస్కరణలు అవసరమో వాటినిగురించి పరిశోధిస్తు న్నాను

2 ప్రభుత్వోద్యోగాలనుగాని, ఇతర ఉద్యోగాలనుగానీ ఆశించక, బారిస్టర్, డాక్టర్ వృత్తులతో సమానగౌరవానికి అర్హమయ్యే నేతను తమ వృత్తిగా యువకులు అవలంబించేటట్లు వారికి బోధిస్తున్నాను

3 ఈ మూడోవిషయంగురించి కొంత విపులంగా చెప్పవలసిఉన్నది దీనికీ మన ప్రస్తుతాంశమయిన సహకారోద్యమానికి పరస్పర సంబంధం ఉంది నేనీపనిలో ఆరుమాసాల కిందటనే ప్రవేశించినాను ఇంతకుపూర్వం ఈ నేతపనిని విడిచిపెట్టిన ఐదు కుటుంబాలవారిని మళ్ళా ఈ పనిలో ప్రవేశపెట్టినాను

వారిప్పుడాపనిని లాభప్రదంగా నిర్వహించుకొంటున్నారు వారికి
కావలసిన దారాన్ని మా ఆశ్రమం, వడికి వారి ఇండ్లకు పంపుతున్నది ఆ
చేనేత బట్టలను ఆశ్రమవాసులు బజారు ధరలప్రకారం సొమ్ముచెల్లించి తీసు
కొంటారు దారం సరఫరా చేసినందువల్ల దారం ధరపైన రాదగిన వడ్డీ ఆశ్రమ
వాసులకు రానిమాట నిజమే అయినప్పటికి ఇంతవరకు వారికేమీ నష్టం
రాలేదు మితంగానే అప్పియడంచేత సాధ్యమయినంత తక్కువ నష్టం

మాత్రమే వస్తుంది. బాకీదారులు ఇచ్చిన బట్టలను వేము వెంటనే అమ్మివేయ
గలుగుతున్నాము. అందువల్ల వడ్డీ నష్టమెంత గణింపదగినంతగా లేదు. దీనినిబట్టి
మా ఉద్యమంలోని నైతిక ప్రవర్తనం గురించి ఆమూలాగ్రంగా సభ్యులు
గ్రహించగలరు. మా ఉద్యమం ఆశ్రమంపై అభిమానంగలవారిచ్చే విరాళాల
పైన ఆధారపడిఉన్నది. అందువల్ల వడ్డీలో మాకు ప్రసక్తిలేదు. నేతగాండ్ర
నెత్తిని వడ్డీభారం వేయవలసిన అవసరంకూడా మాకు లేదు. విడిపోయిన పెద్ద
కుటుంబాలు మళ్ళా ఒకేచోట చేరుకొంటూన్నాయి. ఋణధనం వినియోగం
ముందే నిర్ణయింపబడుతుంది. మధ్యవర్తులంగా మావంటివారు ఋణస్థుల
కుటుంబజీవనం గురించి తెలుసుకొంటూఉంటాము. ఇందువల్ల వారికీ మాకూ
కూడా ప్రయోజనముంది. మేము మా ప్రయోజనం చూసుకొంటూ వారి
ప్రయోజనాన్నికూడా చూస్తూఉంటాము. ఈ పరస్పర ప్రయోజన ప్రయత్న
మింకా అభివృద్ధికావలసిఉంది. అయినప్పటికీ వేము ఈ వృత్తివారి చదువుకు
కూడా ప్రయత్నించగలము. ప్రతి విషయంలోను వారికి కొంత ప్రవేశం కల్పిం
చనిదే మాకు సంతృప్తిలేదు. ఇదికూడా మేము కంటూన్న గొప్ప కోరికల
కలలలో ఒక కలకావచ్చు. ఈ కల దైవానుగ్రహంవల్ల కొద్దికాలంలో నిజం
కాగలదు. ఈ చిన్ని ప్రయత్నం ఇతరులు అనుకరించేటందుకు వీలుగా
సహకారోద్యమాన్ని నేను విశదీకరించడానికి సాహసించినాను. మన ఆదర్శం
గురించి మనం పట్టుదలగలిగి ఉందుముగాక! మనమెన్ని పర్యాయాలు పరా
జయం పొందినా మన ప్రయత్నం మనం మానకూడదు.

# 7
# గాంధీజీ - మద్రాసు రాకకుముందు (1919)

1919 లో రౌలట్ చట్టాలకు ప్రతికూలంగా సత్యాగ్రహోద్యమం నడపనుద్దేశించి గాంధీజీ మద్రాసు రానున్న సందర్భంలో మార్చి 17 తేదీ సాయంకాలం సముద్రం ఒడ్డున బహిరంగసభ జరిగింది ఆ సభకు దాదాపు 15,000 మంది శ్రోతలు వచ్చినారు శ్రీమతి సరోజినీదేవి, శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు, శ్రీ కస్తూరి రంగయ్యంగారు, శ్రీ ఎ రంగసామయ్యంగారు, శ్రీ యస్ సత్యమూర్తి మొదలయిన ప్రముఖులు ఆ సభలో పాల్గొన్నారు

శ్రీ కస్తూరి రంగయ్యంగారి ప్రతిపాదనపైన టంగుటూరి ప్రకాశం పంతులుగారధ్యక్షత వహించినారు

"గాంధీజీ రేపు మన నగరానికి రానున్నారు వారు మనకు పంపిన సందేశం శ్రీమతి సరోజినీదేవిగారిప్పుడు చదవగలరు" అని ప్రకటించి, "స్వాతంత్ర్య న్యాయసూత్రాలను వ్యక్తి స్వాతంత్ర్యాన్నే రౌలట్ బిల్లులు నాశనం చేయగలవని మనఃపూర్వకంగా నమ్ముతున్నాము ఈ బిల్లులు శాసన రూపం తాల్చితే ఈ శాసనాలను, సంఘంవారు నిర్ణయించిన తదితర శాసనాలను తిరస్కరించగలమని నిష్కర్షగాను దృఢంగాను ఉద్ఘాటిస్తున్నాము ఈ పోరాటంలో ప్రాణానికిగానీ, వ్యక్తికిగానీ, ఆస్తికిగానీ హానిచేయకుండా ప్రవర్తించగలము" అనే ప్రమాణపత్రం చదివి వినిపించి వారింకా ఇట్లా ప్రసంగించినారు

"సత్యాగ్రహవ్రతం అవలంబించడంలో గాంధీజీ తొందరపడినారని రాజప్రతినిధిగారంటున్నారు ఇతర విధాలయిన ప్రయత్నాలన్నీ చేయక పూర్వమే గాంధీజీ సత్యాగ్రహవ్రతం పూనినట్లయితే ఆయన తొందరపడినట్లు భావించవచ్చు మనం బాగా ఆలోచిస్తే రాజప్రతినిధియే తొందరపడినట్లు తెలుస్తుంది ఇట్లాంటి శాసనాలకిప్పుడేమి అవసరంవచ్చింది? దేశమంతా విప్లవాలతో అల్లకల్లోలంగా ఉంటే ఇటువంటి శాసనాలను చేయడం న్యాయం కావచ్చు కానీ ప్రశాంతంగాఉన్న దేశంలో ఇటువంటి కఠిన శాసనాలు అనవసరము ఊరకే ఉలుసుపోక ఇటువంటి కఠిన శాసనాలను అమలు జరపదలచినట్లయితే ప్రజలు తమ స్వేచ్ఛను కోల్పోవడానికి ఇష్టపడరు వీటిని ఎదిరించడానికి ప్రజలు సత్యాగ్రహం అవలంబించవచ్చునని న్యాయశాస్త్రవేత్తలంగీకరిస్తున్నారు సత్యాగ్రహము, న్యాయసమ్మతమయినదనే వారి అభిప్రాయము,

శాసనసభలో మన ప్రతినిధులెంత ప్రయాసపడినప్పటికీ ప్రయోజనం లేక పోయింది దొరతనంవారు ప్రజాభిప్రాయం లెక్క-చేయలేదు వారు ప్రజాభి ప్రాయం మన్నించేటట్లు మనం త్వరలోనే చేయగలమని నా విశ్వాసము"

ప్రకాశంపంతులుగారి ఉపన్యాసం తరవాత శ్రీమతి సరోజినీదేవిగారు, ఈ చట్టాలు అన్యాయమయినవనీ, వ్యక్తి స్వాతంత్ర్య భంగకరాలనీ శ్రీ రాజ ప్రతినిధిగారు ఇప్పుడయినా ఈ చట్టాలను ఉపసంహరించుకోవడం ఈ సభవారి అభిప్రాయమనీ, రేపు రానున్న గాంధీమహాత్ముని సంతోషపూర్వకంగా ఈ సభవారు ఆహ్వానించగలరనీ, గాంధీజీ సత్యాగ్రహోద్యమాన్ని తాము బలపరు స్తూన్నామనీ, ఇతరులుకూడ బలపరచవలెననీ కోరుతూ ఒక తీర్మానం ప్రతి పాదించినారు

సరోజినీదేవిగారు ఆ తీర్మానం ప్రతిపాదిస్తూ ఇంకా ఇట్లా అన్నారు

"ఆయుధాలు లేనివారికి 'సత్యాగ్రహం' తప్ప గత్యంతరం లేదు దీనిని "ఆత్మశక్తి" అంటాము ఈ తరుణంలో మనం మన సర్వస్వం దేశంకోసం సమ ర్పించేటందుకు సంసిద్ధులం కావలె అందుకు మేము కొందరం అహమ్మదా బాదులో నిశ్చయించుకొన్నాము ఇతర ప్రదేశాలలో ఉన్న కొందరు సంఘస్థు కులతో మేమీవిషయం యోచించలేదని వారు నిష్ఠురాలాడుతున్నారు కాని సత్యాగ్రహోద్యమము కేవలంఒక సంఘానికి సంబంధించింది కాదు అది మన సాంఘిక జీవితంలో లీనమై ఉంది ఈ ఉద్యమానికి గాంధీజీయే గురువు ఇది గాంధీజీ ఆశ్రమంలోనే ప్రతిష్ఠింపబడింది స్వాతంత్ర్యాన్ని న్యాయాన్ని నిలకొల్పే టందుకు ఆధ్యాత్మిక శక్తిసంపన్నులు తమ ప్రాణాలను సైతం సమర్పించ నున్నారు సత్యాగ్రహ వ్రతావలంబనంవల్ల దేశానికి కీడు కలుగుతుందనీ, ఇంతవరకు లభించిన రాజకీయాభివృద్ధి సైతం కుంటుపడుతుందనీ కొందరుమంది బెదిరిస్తున్నారు ఎవరి నిరంకుశాధికారం మనం సహించజాలమో వారిపైనసే ఈ ఆయుధం ప్రయోగించగలము దీనిని ఈ తరుణంలో ఉపయోగించనట్ల యితే మన జాతీయ జీవనానికి ప్రమాదం రాగలదు ఆత్మసంరక్షణార్థమే ఈ ఆయుధం ఉపయోగించగలము, విదేశీయ పరిపాలనంవల్ల మన స్వాతంత్ర్యం కోల్పోయి మన జాతీయ జీవనమే రూపుమాయనున్న సమయంలో ప్రయో గింపదగిన ఆయుధమిది ఒక్కసారి తమ స్వాతంత్ర్య గౌరవాలకు భంగం రానున్నప్పుడు రాజపుత్ర స్త్రీలు అగ్నిగుండాలలో తమ ప్రాణాలను ఆహుతి చేసిన విషయం మనమిప్పుడు విస్మరించకూడదు ఆ సంఘటన మనకు ఆద ర్శంగా ఉండవలె ఈ నిరంకుశత్వానికి మనం లోబడితే మన ఆత్మగౌరవం నశించిపోయేమాట వాస్తవము అందువల్లనే సత్యాగ్రహం పూనవలసి ఉన్నది తాముచేసిన వాగ్దానాలనన్నిటినీ భంగంచేసి చివరికి ఇటువంటి దుర్భర శాస నాలను ప్రవేశపెట్టనున్న దొరతనంవారికి మన ప్రతిఘటనను ప్రకటించే టందుకిదేమార్గము

మ్యాజినీ, గారిబాల్డీ, క్రోపాట్కిన్ మొదలయిన దేశభక్తులు రాజ

ద్రోహులుగా పేర్కొ-బడ తమ దేశాలనుంచి తరిమివేయబడిన తరవాత వారిని ఇంగ్లాండ్ దేశ మాదరించింది ఆ ఇంగ్లాండ్ దేశీయులే ఇండియాలో ఇట్లా ప్రవర్తిస్తున్నారు ఇది పరస్పర విరుద్ధంగాఉన్నది ఆంగ్లేయుల స్వార్థపరత్వానికిది ప్రబల తార్కాణము, స్వాతంత్ర్యం కోల్పోయిన బెల్జియంవంటి దేశాలను కాపాడేటందుకు తాము యుద్ధంలో ప్రవేశించినట్లు చెప్పుకొనే ఆంగ్లేయులు మనదేశంపట్ల ఇట్లా ప్రవర్తించడం ఎంత న్యాయమో ఆలోచించండి!

ఇండియాలో అరాజకులున్నారట, భారతీయాశయాలకు ప్రతికూలంగా స్వాతంత్ర్యం నిరోధిస్తూండడంవల్లనే అరాజకులు బయలుదేరుతూన్నారు ఆశాభంగమే ఇందుకు కారణము ఈ సమయంలో మనం సత్యాగ్రహం పూని నిరంకుశత్వాన్ని నిరోధించకపోతే భావిసంతతివారు మనలను కోపంతో తిట్టి పోయగలరు కాబట్టి శక్తిగలవారే ఈ ప్రతిజ్ఞలకు పూనుకోవలె"

సరోజినీదేవి చేసిన ఈహెచ్చరిక తరవాత సత్యమూర్తిగారు తీర్మానాన్ని బలపరుస్తూ ఈ సందిగ్ధ సమయంలో అందరూ ఐకమత్యంతో గాంధీజీ ఆదేశానుసారం ప్రవర్తించవలెనని చెప్పినారు ఆతరవాత తీర్మానం అంగీకరించడం జరిగింది అధ్యక్షునికి వందనాలర్పించిన తరవాత సభ ముగిసింది

## మద్రాసుకు గాంధీజీ రాక (1919)

గాంధీజీ మద్రాసు వచ్చిన సందర్భంలో ఆయనను ఆహ్వానించడానికి, రౌలట్ బిల్లుల ప్రతిఘటనకు సత్యాగ్రహమొక్కటే మిగిలిన ఆయుధమని పునరుద్ఘాటించేటందుకూ, ప్రెసిడెన్సీ కళాశాలకు ఎదురుగాఉన్న సముద్ర తీరంలో 1919 మార్చి 18 న బ్రహ్మాండమయిన సభ జరిగింది

ఆ సభకు శ్రీ యస్ కస్తూరి రంగయ్యంగార్, డాక్టర్ యం సి నంజుండరావు, ఆర్ శరగోపాచారియార్, టి వి గోపాలస్వామి మొదలియార్, ఎ రంగసామయ్యంగార్, విద్యాసాగరపాండ్య, శ్రీమతి సరోజినీదేవి, జార్జి జోసెఫ్, యస్ సత్యమూర్తి, సి రాజగోపాలాచారి, టి ఏ ఆదినారాయణచెట్టి, కాశీనాథుని నాగేశ్వరరావు, పురాణం నాగభూషణం, యస్ సౌందరరాజయ్యంగార్, ఆర్ యన్ అయ్యంగార్, మహాదేవదేశాయ్ ఇ వి శ్రీనివాసాచారి, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, డాక్టర్ వరాంజ్ పి.చిదంబరంపిళ్లె మొదలైనవారు వచ్చినారు కొంతమంది స్త్రీలు కూడా ఆ సభలో ఉన్నారు డాక్టర్ గిల్‌బర్ట్‌స్లేటర్ మొదలయిన ఐరోపియన్‌లు కూడా ఉన్నారు శ్రీ కస్తూరి రంగయ్యంగార్ ఆ సభకు అధ్యక్షత వహించి ఇట్లా ప్రసంగించినారు

"గాంధీగారికి ఆరోగ్యం సరిగా లేకున్నా మన కోరిక అనుసరించి ఇంత శ్రమపడి ఇక్కడికి వచ్చి మనలను ఉత్సాహపూరితులుగా చేస్తున్నందుకు మనం వారికి కృతజ్ఞులము రౌలట్‌బిల్లువంటి అన్యాయ శాసనాలను దొరతనంవారు అమలుపరచదలచుకొన్నారు కాబట్టి మన ప్రతిఘటనను మనం సత్యాగ్రహం

వల్ల తెలుపవలసి ఉంది మన రాజధానిలో అనేకులీ సత్యాగ్రహవ్రతాన్ని అవలంబిస్తూన్నారు అందువల్ల వారు తమ దేశంపట్ల, "చక్రవర్తిపట్ల, తమ కుటుంబాలపట్ల ఉన్న బాధ్యతను గ్రహించి ఉన్నారనడానికి కొంతమాత్రం సందేహం లేదు యావద్భారతదేశంలో ఈ ఉద్యమం వ్యాపించినట్లయితే మన స్వాతంత్ర్యం చేరువకు రాగలదని నా అభిప్రాయము మన అభిప్రాయం దొరతనంవారు తృణీకరించడంవల్ల మన శక్తిని ప్రదర్శించడానికి తగిన తరుణం లభించింది ఈ రాజధానిలో కొందరు ప్రముఖులు ఒకవంక ఈ శాసనాలను గట్టిగా ఆమోదిస్తూ మరోవంక సత్యాగ్రహవ్రతానికిది సమయం కాదని సలహా ఇస్తున్నారు శాసనాలను ఆక్షేపించే ఆందోళనంలో వారు ఐక్యం కలిగించుకోలేకపోయినప్పటికీ, సత్యాగ్రహాన్ని మాత్రం తిరస్కరిస్తున్నారు ఇటువంటివారు మన ఉద్యమానికి ప్రతికూలురుగా ఉన్నంత మాత్రంతో మనం లోటురాదు మనం కార్యశూరత్వంతో మన యావచ్ఛక్తిని వినియోగించినట్లయితే శీఘ్రకాలంలో జయం చేకూరగలదు" తరవాత వారు దిగువ తీర్మానం ఉపపాదించినారు

"మద్రాసు పౌరుల బహిరంగసభ మహాత్మాగాంధీని హృదయపూర్వకమైన గౌరవ సత్కారాలతో ఆహ్వానిస్తూన్నది రౌలట్ బిల్లులను ప్రతిఘటించేటందుకు సత్యాగ్రహమొక్కటే మిగిలిఉన్న ఆయుధం కనుక ఈ ఉద్యమవ్యాప్తికి ఆయన ఉనికి ప్రోత్సాహకరంగానూ, శక్తిప్రబోధకంగానూ ఉండగలదని ఈ సభవారు విశ్వసిస్తున్నారు" ఈ తీర్మానానంతరం అధ్యక్షులు మహాత్మాగాంధీని మాట్లాడవలసిందని కోరినారు

మహాత్మాగాంధీ అస్వస్థతగా ఉన్న కారణాన చాలా మెల్లిగా మాట్లాడినారు ఆ ప్రసంగం యస్ సత్యమూర్తిగారు బిగ్గరగా శ్రోతలకు వినబడేటట్లు అనువదించినారు శ్రోతలు నిశ్శబ్దంగా విన్నారు

## గాంధీజీ ప్రసంగము

"స్నేహితులారా! నేను చెప్పదలచుకొన్న కొద్ది మాటలు ఈ కుర్చీలో కూర్చుండి చెబుతున్నందుకు నన్ను మన్నించండి! నేను లేచి ఆయాసపడరాదని నాకు వైద్యులు గట్టిగా సలహా ఇచ్చినారు బలహీనంగా ఉన్నందువల్ల నేను మరొకరి సహాయం అభిలషించక తప్పింది కాదు అందువల్ల నా అభిప్రాయాలను మీకు మరొకరు చదివి వినిపించవలసి వచ్చింది నా అభిప్రాయాలను మీరు వినిపించడానికి నేను దేశాయిని కోరేముందు మీకొక మాట నేను చెప్పదలచుకొన్నాను మీరు సత్యాగ్రహ ప్రమాణపత్రంమైన సంతకంచేసేముందు జాగ్రత్తగా ఆలోచించుకోండి ఒకసారి మీరు సంతకంచేసిన తరవాత ఆ ప్రమాణం మీరెన్నడూ భంగం చేయరాదు ఈ ప్రమాణం సక్రమంగా అనుసరించేటందుకు భగవంతుడు మీకూ నాకూ తోడ్పడుగాక!"

## గాంధిజీ సందేశము

తరవాత మహాదేవదేశాయి గాంధీగారి దిగువసందేశం చదివి వినిపించి నారు

"నా హృదయం బలహీనంగా ఉన్నందువల్ల నేను స్వయంగా మీతో మాట్లాడలేకపోతున్నాను మీరు చాలా సమావేశాలకు హాజరయి ఉంటారు కాని ఇటీవల మీరు హాజరవుతున్న సమావేశాలకు ఆ వెనకటి సమావేశాలకూ చాలా భేదముంది ఈ సమావేశాలలో రౌలట్ బిల్లుల రూపంలో మనపై వచ్చి పడిన ఒక గొప్ప ఆపదనుంచి తప్పించుకొనేటందుకు తక్షణం మీరొక నిర్దుష్టమయిన చర్య తీసుకోవలెననీ అందుకోసం మీరు నిశ్చితమయిన త్యాగానికి వెంటనే సంసిద్ధంగా ఉండవలెననీ కోరుతున్నాను రౌలట్ బిల్లులలో ఒకటో నంబరుబిల్లులో చాలా పెద్దమార్పులే చేయడంజరిగింది కాని దానిని గురించి ఇంకా చేయవలసిన విచారణ ప్రస్తుతం నిలిపివేయబడింది ఆ బిల్లు ఎంత మార్పు చేయబడినప్పటికీ దానిని ప్రతిఘటించేటందుకవసరమయిన చెడుదానిలో ఇంకా చాలాఉంది ఇక రెండో బిల్లు సామ్రాజ్య శాసనసభవారిచే బహుశా ఇప్పటికి తుదిఅంగీకారం పొందినట్లే ఎందువల్లనంటే ఆ గౌరవనీయమైన సభలోని అనధికార సభ్యులందరూ ఏకగ్రీవంగా అత్యంతకఠినమయిన భాషలో దానిని ప్రతిఘటించినప్పుడు, ఆ బిల్లు వాస్తవంగా అంగీకరింపబడినట్లు చెప్పడానికి వీలు లేదు ఆ బిల్లులు కేవలం చెడ్డవయినందువల్ల నేకాక ఆ బిల్లులను ప్రవేశపెట్టిన ప్రభుత్వంవారు ప్రజాభిప్రాయాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేసినందుకుకూడా వాటిని మనం ప్రతిఘటించి తీరవలసివచ్చింది ప్రభుత్వసభ్యులలో కొందరి ప్రజాభిప్రాయ తృణీకరణకు గర్వపడుతున్నారు దేశంలోని విభిన్నాభిప్రాయవర్గాలవారందరికీ ఈ ప్రతిఘటన సమానధర్మమే అయినప్పటికీ నేను ధార్మికదృష్టితో సుదీర్ఘంగా ఆలోచించి ప్రభుత్వంవారి దృక్పథంనుంచికూడా బాగా పరిశీలించినతరవాతనే ఈ బిల్లులకు ప్రతికూలంగా సత్యాగ్రహాన్ని చేయవలెనని ప్రతిజ్ఞ పూనినాను నావలె ఆలోచించేవారినందరినీ కూడా అట్లా చేయవలసిందని కోరుతున్నాను మన దేశంలో కొందరు, మన నాయకాగ్రగణ్యులలో కొందరుకూడా సత్యాగ్రహం కూడదని మందలించడమేకాక అది దేశక్షేమానికి భంగకరమనికూడా అంటున్నారు నాకు సహజంగా వారిపట్ల వారి అభిప్రాయాలపట్ల చాలా గౌరవమున్నది వారిలో కొందరివద్ద నేను పని చేసినాను సర్ దిన్షావాచా, సర్ సురేంద్రనాథ బెనర్జీగార్లు భారత ప్రజాభిప్రాయానికి ప్రతిబింబాలుగా అందరిచేతా అంగీకరింపబడుతున్న రోజుల్లో నేను కేవలం పసివాడిని తన సర్వస్వం దేశశ్రేయస్సుకోసం సమర్పించినవారు శ్రీనివాసశాస్త్రిగారు శ్రద్ధకూ సత్యనిష్ఠకూ ఆయనకు ఆయనే సాటి దేశభక్తిలో ఆయన ఎవ్వరికీ తీసిపోరు ఆయనకూ నాకూ ఉన్న సంబంధం పవిత్రమైనదీ, ఎన్నటికీ విడిపోయేటందుకు వీలుకానిది నా యీ శిక్షణవల్ల ఆ రెండు ప్రకటనలూ నన్ను ఆకర్షిస్తూన్నవి వారి కోరికలకు భిన్నంగా నేను ప్రవర్తించ

వలసి రావడం నాకు చాలా విచారంగానే ఉన్నది కాని కొన్ని విషయాలలో అందరి ఆదేశం అతిక్రమించి అందరికంటెనూ మిన్నయైన అంతరాత్మ ఆజ్ఞను పాలించవలసివస్తుంది అందువల్ల చాలామందికి దుఃఖం కలుగవచ్చు అంతే కాక స్నేహితులతో, కుటుంబంతో, ప్రభుత్వంతో, ఇవిగాక ప్రాణసమాన మయిన ప్రతిదానితోనూ ఎడబాటు కలగవచ్చు అయినప్పటికీ అంతరాత్మకు అనుగుణంగా ప్రవర్తించడం మన జీవితధర్మము నా ప్రవర్తనను గురించి నేను సమర్థించుకోగలకారణం ఇంతకంటె మరొకటిలేదు ఇందువల్ల ఆ ప్రకటనల పైన సంతకాలు చేసినవారిపట్ల నా గౌరవమెంతమాత్రమూ తరిగిపోలేదు సత్యాగ్రహప్రమాణం తీసుకొన్నవారు నిజాయితీగా ఉండనట్లయితే సత్యాగ్రహ పోరాటం ముగించబడినతరవాత ఆ దస్కతుదారులకు ఇంతకు పూర్వం కలిగిన భయానికిగానీ అపోహకుగానీ కారణంలేదని వారు గ్రహించేటట్టు చేయగలమని నా నమ్మకం సత్యాగ్రహశక్తిలో నాకంత గట్టి విశ్వాసం ఉన్నది ఈ ప్రకటనలను గురించి కొంతమంది సత్యాగ్రహులకు కోపం కలిగిందనికూడా నాకు తెలుసు ఆ కోపం సత్యాగ్రహతత్వానికి ప్రతికూలమని నేను వారిని మందలిస్తున్నాను ఏ వైపునుంచి నిజమయిన భేదాభిప్రాయం ప్రకటింపబడినప్పటికీ దానిని నేను వ్యక్తిగతంగా ఆహ్వానిస్తాను ముఖ్యంగా స్నేహితుల నుంచి అయితే అది మరీ ఆదరణీయము అది మనలను జాగ్రత్తతో ప్రవర్తింపచేస్తుంది మన ప్రజాజీవితం ఆరోపణలు, ప్రత్యారోపణలు, అభియోగాలు, పరోక్షోక్తులతో నిండిఉన్నది మన సత్యాగ్రహోద్యమం తొలగించవలసిన పెద్ద లోపాలలో ఇది ఒకటి దీనిని సత్యాగ్రహోద్యమం నిర్మూలించగలిగితే మరొక వాంఛనీయమైన ఫలితం లభించినట్లు మనం భావించవచ్చు ఆ రెండు ప్రకటనలను గురించి సత్యాగ్రహులకు ఏ మాత్రం కోపంకలిగినప్పటికీ అది మన దౌర్బల్యాన్ని మాత్రమే సూచిస్తుంది ప్రతి ఉద్యమమూ ముఖ్యంగా సత్యాగ్రహోద్యమం దాని అంతశ్శక్తిమీదనే అది ఆధారపడి ఉండవలెనే గాని దాని విమర్శకుల మూకీభావంపైనగాని, దౌర్బల్యంపైనగానీ ఆధారపడి ఉండకూడదు

అందువల్ల సత్యాగ్రహబలం ఎందులో ఉన్నదో మనం గ్రహించవలె సత్యంలో పట్టుదలగలిగి ఉండడమనే అర్థం దాని పేరులోనే ఇమిడిఉంది దానిని ఇంకా పటిష్ఠంగా చెప్పవలెనంటే ప్రేమ అని చెప్పవలె ప్రేమ సూత్ర ప్రకారం ద్వేషానికి ప్రతిద్వేషం, హింసకు ప్రతిహింస పనికిరాదు అపకారికి ఉపకారం చేయడమే దాని లక్ష్యము నిన్న శ్రీమతి సరోజినీదేవి చెప్పినట్లు నిజమయిన ఆధ్యాత్మిక తత్వంలోనూ దానికనుగుణమయిన చర్యలోనూ మాత్రమే మన బలం ఇమిడిఉన్నది రాజకీయాలలో ఒక్కసారి ధార్మిక తత్వం ప్రవేశ పెట్టినట్లయితే మీ రాజకీయ దృక్పథంలో ఆశ్చర్యకరమైన మార్పు వస్తుంది అప్పుడు మీరు కావలెనన్న సంస్కరణకు ప్రతికూలురైనవారిని బాధించవలసిన అవసరం ఉండదు మీ సొంత బాధానుభవంవల్లనే ఆ సంస్కరణలను సంపా

దించగలరు కాబట్టి ఈ ఉద్యమంలో మనంపడే దుర్భర బాధలవలననే ఈ అభ్యంతరకరమయిన బిల్లుల ఉపసంహారణానికి ప్రతికూలంగా ఉన్న ప్రభుత్వం వారి నిర్ణయాన్ని మనం మార్చగలమని ఆశించవలె ప్రభుత్వంవారు వేళ్ళ మీద లెక్క పెట్టదగిన సత్యాగ్రహులజోలికి పోనేపోరనీ వారిని మృతవీరులుగా చేయడం ప్రభుత్వంవారి విధానం కానేకాదనీ కొంతమంది సూచిస్తున్నారు ఇది సరియైన హేతువాదం కాదనీ, వాస్తవానికి భిన్నమయిన అనవసరపు టూహ అనీ నా మనవి సత్యాగ్రహుల జోలికి ప్రభుత్వం పోకపోయినట్లయితే వారికి అఖండ విజయం లభించినట్లేకదా! ఎందువల్లనంటారా, రౌలట్ బిల్లులనూ ఇతర శాసనాలనూకూడా ధిక్కరించడంలో వారు విజయం పొందడమే గాక ప్రభుత్వానికి ప్రతికూలమయిన సాత్విక నిరోధావలంబనం (సివిల్ డిజ్ ఒబీడియన్స్) నిరపాయకరమనికూడా రుజువుచేసినట్లు కాగలదు ఈ సూచన నిర్హేతుకమయిన ఊహ అనడానికి మరొక కారణంకూడా ఉన్నది ఎందువల్లనంటే ఈ ఉద్యమం ఏ కొద్దిమందికే పరిమితమయి ఉంటుందనికూడా వారు భావిస్తున్నారు సత్యాగ్రహం ఒక్కమారు ప్రారంభించిన తరవాత సమాజంలో అది అత్యంత ప్రబలమైన శక్తిగా వ్యాపించగలదనీ, అప్పుడు ఏప్రభుత్వమూ దానిని నిర్లక్ష్యం చేయజాలదనీ సత్యాగ్రహోద్యమం గురించిన నా అనుభవం నన్ను ప్రబోధిస్తూన్నది ప్రభుత్వం సత్యాగ్రహోద్యమానికి లొంగనైనా లొంగవలె లేదా సత్యాగ్రహులను నిర్బంధించనైనా నిర్బంధించవలె నాకీ విషయంలో వాదించవలెననే కోరిక లేదు "కుడువబోతూ కూరరుచి అడగనేల" అనే సామెత ననుసరించి వేచిఉండండి! మంచికో చెడ్డకో మనమూ ఉద్యమాన్ని ఎట్లాగూ ప్రారంభించినాము మనము మన మాటలవల్లగాక క్రియలవల్ల ప్రజలు గ్రహించగలరు కాబట్టి మనము ప్రమాణ పత్రంపైన సంతకాలు పెట్టినంతమాత్రంతో చాలదు మన సంతకాలు మనమూ ప్రమాణాన్ని క్రియారూపంలో నిర్వర్తించదలచుకొన్నామనడానికి చిహ్నాలు మాత్రమే సంతకాలు చేసిన మనమందరం అందు కనుగుణంగా ప్రవర్తిస్తే ఆ రెండు బిల్లులను ప్రభుత్వంవారు ఉపసంహరించుకోక తప్పదని నేను ధైర్యంగా చెప్పగలను అప్పుడు ప్రభుత్వంవారుకానీ, మనలను విమర్శించినవారుకానీ మనకు ప్రతికూలంగా ఏమీ మాట్లాడలేరు మనం పూనుకొన్న కార్యం చాలా గొప్పది దాని ఫలితంకూడా గొప్పదే ఈ రెంటికీ మనం అర్హులమనిపించుకొందుముగాక!" గాంధీగారి ఈ సందేశం మహాదేవదేశాయి వినిపించిన తరవాత సరోజినీదేవిగారు ఇట్లా ప్రసంగించినారు

"సత్యాగ్రహం అనే పదానికి అర్థం సత్య వాక్పరిపాలనము సత్యాగ్రహులు రాజకీయచతురులు కారనీ వారు వైరివారితో సమానులనీ కొందరంటున్నారు పూర్వకాలంలో బుద్ధుడు,మహమ్మదు మొదలయిన మహనీయులుకూడ వైరివారుగనే సామాన్యులు భావిస్తూ ఉండినారు ఈనాడు సత్యాగ్రహులు తమ ధన మాన ప్రాణాలను దేశానికి సమర్పించడానికి సంసిద్ధులుగా ఉండవలె.

సుమారు పబది సంవత్సరాలక్రితం జపాన్ చక్రవర్తి తన ప్రజల కోరికలకు ప్రతి కూలంగా శాసనాలను చేయడానికి పూనుకొన్నప్పుడు కొందరు పౌరులు చక్రవర్తి దగ్గరికిపోయి ఆ శాసనాలకు తమ ప్రతిఘటనను వెల్లడించినప్పటికీ చక్రవర్తి పౌరుల విజ్ఞప్తిని అంగీకరించలేదు అప్పుడు వారు ఆత్మహత్య చేసుకొన్నారు అంతట చక్రవర్తి మనస్సు కరిగి ఆ శాసనాలను రద్దు చేసినాడు కాబట్టి సత్యాగ్రహుల నైతికబల మెట్లంటి కార్యాలనైనా సాధించగలదు కనక గాంధీమహాత్ముని ఆజ్ఞలను శిరసావహించడంకంటె మనకు గత్యంతరం లేదు"

సరోజినీదేవిగారి ఈ ప్రసంగం తరవాత ఇద్దరు మాట్లాడినారు

హరిసర్వోత్తమరావుగారు గాంధీజీ ఆజ్ఞను ప్రజలందరూ శిరసావహించవలెననీ, ప్రజాబలం దొరతనం వారికి వెల్లడించగల అవకాశం జారవిడువవద్దనీ అన్నారు సభాధ్యక్షునికి గాంధీమహాత్మునికి కృతజ్ఞతాభివందనలతో సభ ముగిసింది

## రౌలట్ బిల్లు - రాజప్రతినిధికి విజ్ఞాపన

1919 మార్చి 20 న మద్రాసులో ప్రెసిడెన్సీ కాలేజీకి ఎదురుగా ఉన్న సముద్రపు ఒడ్డున బహిరంగసభ జరిగింది ఆ సభ రౌలట్ చట్టాన్ని ఉపసంహరించుకోవలసిందని రాజప్రతినిధిని కోరేటందుకు, రౌలట్ శాసనానికి ప్రతిఘటనగా భారత శాసన సభ్యత్వానికి రాజీనామాయిచ్చిన సర్ బి ఎన్ శర్మగారి స్వార్థత్యాగ స్ఫూర్తి దేశభక్తిని కొనియాడడానికి, సత్యాగ్రహోద్యమాన్ని బలపరిచే నిమిత్తం, శ్రమపడి మద్రాసుకు దయచేసిన మహాత్మాగాంధీకి గౌరవ పురస్సరంగా హృదయపూర్వక ధన్యవాదాలర్పించుకొనేటంగుకూ ఏర్పాటు అయింది ఆ సభకు వేలకొద్ది జనులు వచ్చినారు శ్రీమతి సరోజినీదేవి, సి విజయరాఘవాచారి, యస్ కస్తూరి రంగయ్యంగారు, టి వి గోపాలస్వామి మొదలియార్ గారు, యస్ సత్యమూర్తి కె భాష్యం అయ్యంగార్, రంగస్వామి అయ్యంగార్, యస్ యస్ భారతి, యస్ రాధాకృష్ణ, టి యం రామస్వామి అయ్యర్, యస్ సౌందరరాజ అయ్యంగార్, దేశాయి, మీర్ సుల్తాన్ మొహిద్దీన్ గార్లుకు డా ఆ సభకుహాజరైనారు గాంధీజీ అస్వస్థతగా ఉన్నందున సభకు రాలేదు

చక్రవర్తి విజయరాఘవాచారిగారు సభకధ్యక్షత వహించినారు గాంధీజీ సందేశం దేశాయిగారు చదివినారు

## గాంధీజీ సందేశము

స్నేహితులారా! ఈనాడు నేను, సత్యాగ్రహానికి ప్రతికూలంగా చేసిన కొన్ని విమర్శలను గురించి ప్రసంగించదలచుకొన్నాను నావంటివారు ఈ ఉద్యమాన్ని ప్రారంభించ పూనడం విచారకరమని చెప్పి, సర్ విలియం విన్సెంట్

రెండో మెంబరు. రౌలట్ బిల్లుపై చర్చ ముగిస్తూ "సత్యాగ్రహోద్యమం ఆచరణ లోకి రాదని మనమాశించవచ్చు గాంధీగారు చాలా ఆత్మనిగ్రహంతో వ్యవహ రించగలరు కాని ఉడుకునెత్తురుతో ఉన్న యువజనులు దౌర్జన్యంలోకి దిగ వచ్చు దాని పర్యవసానం అనర్థదాయకం కాగలదు ఈ బెదిరింపుకు లొంగి పోయినట్లయితే గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ వారు తమ అధికారం పూర్తిగా విడిచిపెట్టుకొన్నట్లే అవుతుంది' అన్నారు సర్ విలియం భయపడినట్లుగా దౌర్జన్యమే జరిగినట్లయితే నిస్సందేహంగా అది అనర్థదాయకమే అవుతుంది అటువంటి ప్రమాదం జరగకుండా ప్రతి సత్యాగ్రహి జాగ్రత్త వహించ వలె నాకుమాత్రం అటువంటి భయంలేదు మనసిద్ధాంతం ఏ విధమయిన దౌర్జన్యానికీ తావీయకూడదని కదా! మన అమ్ములపొదిలో ఉన్న ఆయుధాలు, సత్యము, స్వీయబాధానుభవాలు మాత్రమే తమ తమ కష్టనివారణల నిమిత్తం దౌర్జన్యచర్యలలో విశ్వాసంగలవారిని సైతం మనతో కలిసి మన వర్గాలతోపాటు మన విధానాలను అవలంబించవలెనని ఆహ్వా నించడమే నిజానికి మన సత్యాగ్రహోద్దేశం రౌలట్ బిల్లులు చేయనుద్దేశించిన పనిని అవి చేయజాలవని ఆ పనిని చేయడానికి సర్వసమర్థమయినది సత్యాగ్రహో ద్యమమేననీ నా దృఢవిశ్వాసం హింసావాద పక్షంవారికి సత్యాగ్రహంలోని అప్రతిహతశక్తిని ప్రదర్శించి, అలసట యెరుగని వారి శక్తిసామర్థ్యాలకు కావలసినంత అవకాశం కల్పించి, ఆత్మహత్యాసదృశమయిన హింసాకాండనుంచి వారిని మరలించగలమని కూడా మా ఆశ సంస్కరణలను సంపాదించుకొనే టందుకు దౌర్జన్యం ఎంతమాత్రమూ అవసరంలేదని స్పష్టమయిన భాషలో చెప్పి అందుకనుగుణంగా వ్యవహరించడంకంటె బలమయిన ప్రత్యక్షసాక్ష్య మింకేమి కావలె సత్యాగ్రహోద్యమంలో దుష్టశక్తులకు, చాలా తావుందని సర్ విలియం అంటే, గౌరవనీయులయిన పండిత మదనమోహన మాలవ్యాగారు "మంచికి కూడా" ఉన్నదని జవాబు చెప్పినారట మాలవ్యాకంటె నేనింకొక అడుగు ముందుకుపోయి 'మంచికి మాత్రమే' తావుందని అంటాను రాజకీయాలలో తీవ్రమయిన మార్పు తీసుకొనివచ్చి నైతికశక్తిని దాని యథాస్థానంలో పునరుద్ధరించడమే సత్యాగ్రహాశయము ఇంతకూ పూర్తియైన దౌర్జన్య రాహిత్యంమీద ప్రభుత్వంవారికి నమ్మకంలేదు "అంతర్జాతీయసమితి నియమా వళిని" (లీగ్ ఆఫ్ నేషన్స్ కావినెంట్‌ను) ప్రవేశపెడుతూ ప్రెసిడెంట్ విల్సన్ "ఈ కార్యక్రమానికి వెనక సైనికబలమున్నది, -అయితే అది వెనకమాత్రమే ఉంది అది ప్రపంచంలోని నైతికబలం చాలక ప్రపంచంలోని శారీరకబలం సరిపోయితీరుతుంది"అని సంగ్రహంగా చెప్పినారు పాశ్చాత్యదేశాల సందేశమిదే ఆ సందేశానికే మన ఇండియా ప్రభుత్వం ప్రాతినిధ్యం వహిస్తున్నదని నేను ఊహిస్తున్నాను మన మా విధానాన్ని తలకిందులు చేయబోతున్నాము మన్న చర్యవల్ల భౌతికబలం, నైతికబలం ఎంతమాత్రం పోలికతగినది కాదనీ, నైతిక బలం ఎన్నడూ అపజయం పొందదనీ నిరూపించబోతున్నాము, ఆధునిక

సభ్యతకూ సనాతనసభ్యతకూ ఉన్న ప్రధానభేదమిదే ? భారతదేశం నేడు పతనావస్థలో ఉన్నప్పటికీ సనాతనసభ్యతకది చైతన్యవంతమయిన పెన్నిధి అని నా దృఢవిశ్వాసము అత్యుత్కృష్టమయిన ఈ జీవిత దర్శనంలో విద్యావంతులమయిన మనం విశ్వాసం కోల్పోయినట్లు కనిపిస్తున్నది. పైశాచిక బలాధిక్యతలో మన విశ్వాసం పునరుద్ధరించుకొంటే బ్రిటిష్‌సామ్రాజ్యానికి మనం ఎనలేని సేవచేసినవారం కావడమేగాక మన నాయకులు వాంఛిస్తూండిన సంస్కరణలనుసైతం పొందగలము. ఈ అభిప్రాయాలుగల నేను, 'గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిల్ తన అధికారం పూర్తిగా విడిచిపెట్టినట్టవుతుంది'ని సర్ విలియం వెల్లడించిన రెండో భయంగూడా తేలికగా తొలగించగలను. పర్యవసానానికి ప్రభుత్వాధికారం ఆయుధబలంమీదకాక ప్రజల ఇష్టంపైన-ముఖ్యంగా సత్యాగ్రహం ద్వారా వెల్లడియైన ప్రజల ఇష్టంపైన - ఆధారపడి ఉన్నదని నిరూపించడమే ఈ ఉద్యమోద్దేశము నిష్కళంకమయిన నైతికశక్తికి లొంగినందున, లొంగినవారి గౌరవప్రతిష్ఠలకెంతమాత్రమూ భంగం రాదు.

అటువంటి ఉద్యమంలో పాల్గొనడానికే ఈ దేశంలోని స్త్రీ పురుషులందరూ ఆహ్వానింపబడుతున్నారు. విస్తృత ఫలితాలకోసం ఉద్దేశింపబడిన ఈ ఉద్యమంలో బాధలకు సంసిద్ధులయిన పవిత్రహృదయాలు మాత్రమే చేరవలె. వారు కూడా దైవప్రార్థనతో కూడిన ఆత్మపరిశోధన చేసుకొని చేరవలె. ఈ విషయం నేను పదేపదే చెప్పనక్కరలేదు. సత్యాగ్రహంలో చేరబోయే ప్రతి మనిషీ చేరడానికి ముందు వేయిసార్లు ఆలోచించుకొని చేరవలె. చేరిన తరవాత ఏమయినాసరే తిరుగుమొగం పట్టకూడదు. కొంతమంది సత్యాగ్రహ మిత్రుల సమావేశంలో వివరించినదంతా అనుసరించవలసి ఉంటుందని తాననుకోలేదనీ అందువల్ల తాను తన ప్రతిజ్ఞను ఉపసంహరింపదలచుకొన్నాననీ నిన్న నాతో ఒక మిత్రుడు చెప్పినాడు. ప్రమాణపత్రం వలన ఫలితాల నన్నిటినీ తాను అర్థం చేసుకోకుండా సంతకం పెట్టినట్లయితే నిస్సంశయంగా దానిని ఉపసంహరించుకోవచ్చునని నేనాయనకు చెప్పినాను. అనేక సమావేశాలలో వివరింపబడిన ప్రమాణపత్రంలోని అర్థం గ్రహించనివారందరూ ఆయనను అనుకరించవచ్చు. మాకు కావలసింది గుణం కాని సంఖ్యలు కావు. కాబట్టి సత్యాగ్రహికి ఉండవలసిన లక్షణాలను ఇప్పుడు చెప్పదలచుకొన్నాను. సత్యాగ్రహి ఎట్టి పరిస్థితులలోనైనా సరే, ఏమి తటస్థించినా సరే సత్యాన్ని అనుసరించితీరవలె. తన ప్రతిపక్షులను ప్రేమించడానికే నిరంతరం ప్రయత్నించవలె. ఏ ప్రత్యర్థిపైన తాను సాత్త్విక నిరోధం అవలంబిస్తున్నాడో ఆ ప్రభుత్వంకాని, ప్రతిపక్షం వారు కానీ తనను పెట్టే బాధలన్నిటిని ఓర్చుకోవలె. కాబట్టి ఈ ఉద్యమమును ఒక విధంగా పవిత్రమయిన తపశ్చర్యగా భావించవచ్చు. ఈ ఉద్యమ తత్త్వాన్ని గ్రహించి దీనిని మనం సక్రమంగా నడపగలిగితే ప్రభుత్వంవారు కాని, మన ఇతర స్నేహితులు కాని వెల్లడించిన భయాలు నిరాధారాలని నిరూపింపగలగడమే గాక, రౌలట్ బిల్లుల ఉపసంహరణ కూడా జరుగుతుంది. న్యాయమయిన మన

కష్టాలను తొలగించుకొనేటందుకు, సంస్కరణలను పొందేటందుకు సత్యాగ్రహ మొక శక్తిమంతమయిన ఆయుధమని కూడా దేశం గుర్తించగలదు '

గాంధీగారి ఈ సందేశం శ్రీ దేశాయి సభ్యులకు చదివి వినిపించిన తర వాత సభవారు మూడు తీర్మానాలను అంగీకరించినారు

## మొదటి తీర్మానము

"రౌలట్ బిల్లులను భారతదేశం ఏకగ్రీవంగా ప్రతిఘటిస్తూన్నందువల్ల ఆ బిల్లు అంగీకారానికి అనధికార సభ్యులలో ఒక్కరుకూడా తమ వోటును, ప్రభుత్వానికి ఇవ్వనందువల్ల ఈబహిరంగసభవారు ఆబిల్లుకు తమ అంగీకారం ఇవ్వద్దని రాజ ప్రతినిధిని కోరుతున్నారు అట్లా కాకపోతే ఇండియా ప్రభుత్వ శాసనం (ఇండియా గవర్నమెంట్ ఆక్ట్) 68 వ సెక్షన్ ననుసరించి చక్రవర్తి గారి ఆమోదముద్ర కోసం దానిని నిలిపి ఉంచవలెనని కోరుతున్నారు " ఈ తీర్మానం అధ్యక్షులు ప్రతిపాదించగా మహాసభ ఏకగ్రీవంగా అంగీకరించింది

## రెండో తీర్మానము

"రౌలట్ బిల్లులు శాసనంగా రూపొంగడాన్ని ప్రతిఘటిస్తూ, భారత శాసనసభా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చిన శ్రీ బి యన్ శర్మ (బయ్యా నరసింహేశ్వర శర్మ)గారి స్వార్థత్యాగం దేశభక్తినీ ఎంతో కొనియాడుతూ, ఈ మద్రాసు పౌర మహాసభ వారిని హృదయపూర్వకంగా అభినందిస్తూ ఉన్నది "

ఈ తీర్మానం శ్రీమతి సరోజినీదేవి ప్రతిపాదిస్తూ సుదీర్ఘమయిన ఉప న్యాసం చేసినారు ఆమె తన ప్రసంగంలో గాంధీజీ ఆదేశం ప్రకారం దేశీయులు సత్యాగ్రహం పూనవలసిన అవసరాన్ని వివరంగా చెప్పి, మితవాది అయిన శ్రీ బి యన్ శర్మగారు ఈ సందర్భంలో ముఖ్యంగా ఈ సమయంలో రాజీ నామా ఇవ్వడం ఎంతో ప్రశంసించదగిన విషయమని అన్నారు భారత శాసన సభా సభ్యులలో ప్రభుత్వంవారు భయపడేది ఒక్క శర్మగారికేననీ, ఆయన ఇప్పుడు చేసిన త్యాగంవల్ల ఆయన కీర్తి ఇనుమడించగలదనీ, తాను అనుకో కుండానే రాజీనామావల్ల ఆయన మొట్టమొదటి సత్యాగ్రహిగా రూపొంది నారనీ అన్నారు తన భర్తగారి జన్మభూమియైన ఆంధ్రదేశానికి శర్మగారు చెంది ఉన్నందుకు తామెంతో గర్విస్తున్నామని కూడా అన్నారామె

ఈ తీర్మానం బలపరుస్తూ, గోపాలస్వామి మొదలియారు, సోమసుందర భారతి, మీర్ సుల్తాన్ మొహిద్దీన్‌గార్లు మాట్లాడారు శ్రీ దంటు సుబ్బావ ధాని తెలుగులో ఈ తీర్మానం బలపరిచినారు

## మూడో తీర్మానం

"గాంధీ మహాత్ముడనారోగ్యంగా ఉండికూడా,అసౌకర్యం లెక్క చేయక

స్వార్థత్యాగంతో ఈ నగరానికి వచ్చి సత్యాగ్రహోద్యమంను ప్రోత్సహించినందుకు ఈ సభవారు గాంధీజీకి అనేక హృదయపూర్వక నమస్కారాలు సమర్పిస్తున్నారు"

ఈ తీర్మానం సత్యమూర్తిగారు ప్రతిపాదించగా, గసిని టి నారాయణ చెట్టిగారనువదించిన తరవాత అందరూ ఏకగ్రీవంగా అంగీకరించినారు తరవాత అధ్యక్షునికి వందనాలతో సభ ముగిసింది

## సత్యాగ్రహ వ్రతము

గాంధీజీ మద్రాసులో ఉండి 1919 మార్చి 23 న సత్యాగ్రహ వ్రతం గురించి ఇట్లా ప్రకటించినారు

"నేను సత్యాగ్రహం గురించి అనేక సభలలో వివరించి ఉన్నాను అది ముఖ్యంగా ధార్మికోద్యమము అది ఒక విధంగా సనో నై ర్మల్యానికి ప్రానుకో వలసిన తపశ్చర్య స్వీయబాధానుభవంవల్ల కష్టాలను తొలగించుకొనేటందుకు, సంస్కరణలను పొందేటందుకూ ఆ ఉద్యమం ఉద్దేశింపబడింది 1919 వ నెని రెండో నెంబరు బిల్లు వైస్రాయి అంగీకారంతో ప్రచురింపబడిన రెండో ఆది వారం, మనకు అవమానం జరిగిన దినంగా భావించి ప్రార్థనలు చేయవలెనని నేను చెప్పడానికి సాహసిస్తున్నాను ఈ ప్రార్థనదిన ప్రాముఖ్యానికి అనుగుణంగా గొప్ప బహిరంగ ప్రదర్శనలు కూడ ఉండవలె

(1) గడిచిన రాత్రి భోజనం చేసిన తరవాత 24 గంటలు, వయస్సు వచ్చిన వారందరూ ఉపవాసం చేయవలె మత సంబంధమయిన అభ్యంతరాలు కలవారు, అనారోగ్యవంతులు ఈ నియమం పాటించనక్కరలేదు ఈ ఉపవాసం ఏ పద్ధతిలోనూ, ఏ రూపంలోనూ కూడా ఆకలి సమ్మెగా భావించకూడదు ప్రభుత్వంపైన ఒత్తిడి తేచ్చేటందు కుద్దేశింపబడినట్లుగా కూడా తలంచకూడదు తమ ప్రమాణ పత్రంలో నిర్దేశించిన క్రమ శిక్షణతో తాము శాసనోల్లంఘనకు అర్హులు కావడానికి మాత్రమే ఇది ఉద్దేశింపబడినట్లు సత్యాగ్రహులందరూ గ్రహించవలె తక్కిన వారందరు తమ మానసిక వ్యథకు ఒక చిహ్నంగా దీనిని అర్థం చేసుకో వలె

(2) ఆ రోజున ప్రజా క్షేమానికి అవసరమయినంత వరకు తప్ప తక్కిన పని అంతా నిలిపి వేయవలె మార్కెట్లు తదితర వ్యాపార కేంద్రాలూ అన్నీ మూసి వేయవలె ఆదివారాలలో సైతం పని చేయవలసి ఉన్న వారు, ముందుగా సెలవు పుచ్చుకొన్న తరవాతనే పని ఆపి వేయవలె

ఈ రెండు సూచనలను ప్రభుత్వోద్యోగులు కూడా నిర్వర్తించవలెనని కోరడంలో నేనెంత మాత్రమూ వెనుదీయడంలేదు వారు రాజకీయ చర్చలలోగాని రాజకీయ సమావేశాలలోగాని పాల్గొనకపోవడం మంచిదే. అందులో ఏమీ సందేహంలేదు అయితే ముఖ్య విషయాలలో తమ అభిప్రాయాలను నేను

సూచించిన పరిమితిలో ప్రకటించే హక్కుకూడా వారి కున్నది అందులో ఏమీ సందేహం లేదు

(8) భారత దేశంలోని అన్ని చోట్లా, గ్రామాలలో సహా ఆనాడు బహిరంగ సభలు జరపవలె ఆ సభలలో రౌలట్ బిల్లులు రెంటినీ ఉపసంహరించుకోవలెనని ప్రభుత్వం వారిని ప్రార్థిస్తూ తీర్మానించవలె

ఈ నా సలహా అంగీకారయోగ్యమని భావించినట్లయితే, ఇందులో తగిన ఏర్పాట్లను చేసేటందుకు ప్రధానంగా వివిధ ప్రదేశాలలో సత్యాగ్రహ సంఘాలు బాధ్యత వహించి తీరవలె తక్కిన సంఘాలన్నీ ఈ ప్రదర్శన కార్యక్రమం విజయవంతమయ్యేటందుకు సహకరించగలవని ఆశిస్తున్నాను"

**మహాత్మాగాంధీ-కార్మిక సంఘము**

1919 మార్చి 19 న మహాత్మా గాంధీ మద్రాసు లేబర్ యూనియన్ (మద్రాసు కార్మిక సంఘము) వెళ్లినారు గాంధీగారి మద్రాసు కార్యక్రమం అస్తవ్యస్తంగా ఉండడం చేత ఆయన రాక ముందుగా కార్మిక సంఘము వారికి తెలియలేదు, తమ మిల్లులనుంచి వారు బయటకు వచ్చే సమయంలో హఠాత్తుగా వారికి గాంధీ రాక తెలిసి ఆయనను దర్శించే భాగ్యం కలిగింది సరిగా సాయంకాలం 6-20 నిమిషాలకు బి పి వాడియాతో కలసి గాంధీజీ కార్మిక సంఘ కార్యాలయానికి చేరుకొన్నారు ఆయనను యూనియన్ సభ్యులు మహదానందంతో గుంపులు గుంపులుగా ఆహ్వానించినారు కార్యాలయంలో పెద్ద ఆవరణ అంతా జనసమూహంతో నిండి పోయింది చోటు చాలక చాలా మంది బయట నిలబడవలసి వచ్చింది వాడియా, ఆ పుణ్యశ్లోకుడు గాంధీజీని కొద్ది మాటలతో పరిచయం చేసినాడు తరవాత గాంధీజీ ఇంగ్లీషులో సలహా పూర్వకంగా చిన్న ప్రసంగం చేసినారు దండపాణి పిళ్లేగారు దానిని అనువదించినారు ఆ కార్మికుల ముఖవర్చస్సులు తన దక్షిణాఫ్రికా పోరాటాలను స్ఫురణకు తెస్తున్నవని గాంధీజీ అన్నారు తరవాత కార్మికుల బాధ్యతలను గురించి కర్తవ్యాలను గురించి చెప్పి వాటిని సరిగా నిర్వర్తించవలెనన్నారు కార్మికులలో ముసలివాళ్లుకూడా చదువుకోవలసిందని ప్రబోధించినారు తరవాత కార్మికులు గాంధీజీపైన పూలవర్షం కురిపించి ఆయన మెడలో పూలదండలు వేసినారు

**కస్తూరి రంగయ్యంగారికి గాంధీజీ తంతి**

సత్యాగ్రహోద్యమం ప్రారంభించక పూర్వమే 1919 మార్చినెలలో ఢిల్లీలో కొన్ని అల్లరులు జరిగినాయి వాటిని పురస్కరించుకొని గాంధీజీ మద్రాసు సత్యాగ్రహసభ ఉపాధ్యక్షుడు శ్రీ కస్తూరి రంగయ్యంగారికి బొంబాయినుంచి ఏప్రిల్ 8 న ఈ తంతివార్త పంపినారు

"సికిందరాబాదునుంచి బొంబాయికివచ్చే రైలు తప్పిపోయినందువల్ల

ఇప్పుడే బెజవాడనుంచి బొంబాయి చేరినాను ఢిల్లీలో అఖిల భారత సత్యాగ్రహ సభ జరపవలెననే సూచనను గురించి ఆలోచిస్తున్నాను ఢిల్లీలోని విషాద సంఘటన సత్యాగ్రహుల హృదయములను ఉద్రిక్తులుగా చేయగలవని నా ఆశ ఇంకా అనిశ్చితస్థితిలో ఉన్నవారు ఈ పరిస్థితిని గురించి పునరాలోచన చేసుకోవలె మన ప్రయత్నానికి అనుగుణంగా మనం నిలబడితే రౌలట్ బిల్లులు ఉపసంహరించబడడమేగాక, దాని వెనకఉన్న బీభత్సస్థితినికూడ నిర్మూలించగలమని నా దృఢవిశ్వాసము

ఆదివారంనాడు జరగబోయె ఉపన్యాసాలతో కోపంగాని కూడని ఉద్రేకంగానీ ప్రదర్శించకూడదని కోరుతున్నాను మనం పూనుకొన్నపని చాలా గొప్పది, పవిత్రమైనది అందువల్ల ఉగ్రతను ప్రదర్శించి దానికి హాని చేయకూడదు రావలెనని కోరి తెచ్చుకొన్న బాధలను గురించి అల్లరిపెట్టే అధికారం మనకు లేదు వ్యాపారం నిలిపివేయుమనికాని, ఉపవాసం చేయుమని కాని ఎవ్వరినీ ఎవ్వరూ నిర్బంధించరాదు

## ట్రాం పనివాళ్ల సమ్మె – గాంధీజీ సలహా

సమ్మెకట్టిన అనేకమంది ట్రాం పనివాళ్ళు 1919 మార్చి 21 న గాంధీజీని కలుసుకొన్నారు ఈ సమ్మెవల్ల మీరు విసుగుచెందినారా అని గాంధీజీ వారినడుగగా లేదని జవాబు చెప్పినారు ఈ సమ్మెను మీరెన్నాళ్లు కొనసాగించగలరని గాంధీజీ వారిని మళ్ళీ ప్రశ్నించినారు ఇంకా పది పదేను రోజులవరకూ పట్టుదలతో ఉండగలమని వారిలో ఒకరు జవాబు చెప్పినారు

తరవాత గాంధీజీ వారితో ఇట్లా అన్నారు "మీ సమ్మెను గురించి నేను కొంతవరకు వినిఉన్నాను మీ కోర్కెలేవో నాకు కొంతవరకు తెలుసు కాని పూర్తిగా తెలియదు కంపెనీవారి ఉద్దేశాలు కూడా నాకు తెలియవు కాబట్టి మీ కోరికలన్నీ సంపూర్ణంగా న్యాయమైనవో కావో నేను చెప్పలేను మీ కోర్కెలు న్యాయమయినవయితే మీరు చేసిన సమ్మె న్యాయసమ్మతమేనని నేను దృఢంగా నమ్మగలను మీ బాధలను యజమానులతో చెప్పుకొన్నప్పుడు యజమానులు వినకపోయినట్లయితే వారికి వినిపించేటందుకు సమ్మెయే మంచి ఆయుధము మీ కోరికలు ధర్మసమ్మతమయినట్లయితే మీ సమ్మె జయప్రదంగా కొనసాగగలదు సమ్మెదారులు దుండుడుకుగా ప్రవర్తించకూడదు మీ యజమానులనుగానీ మీ సమ్మెలో కలియనివారినిగాని ఏ విధంగానూ బాధించకూడదు ఎన్నిబాధలు కలిగినను సరే మీరు సత్యం విడనాడరాదు సమ్మె కట్టినప్పుడు ఎటువంటి శ్రమలకైనా కష్టాలకైనా సంసిద్ధంగా ఉండవలె అట్లాంటిది ధార్మిక సంబంధమయిన సమ్మెవంటిది అది తప్పక జయం పొందగలదు మీరు చేస్తున్న సమ్మె అటువంటిదని నా అభిప్రాయము మీరందరూ సంఘీభావంతో పనిచేస్తూ మీలో ఒక్కరుకూడా పనిలోకి చేరనందుకు నేను చాలా సంతోషిస్తున్నాను మీరు శాంతంగా ఉన్నందుకుకూడా నేనానందిస్తు

గ్నాను ఇంతవరకూ మీరు సమ్మె చేస్తున్నారు కాబట్టి మీ కోరికలు నెరవేరే వరకూ మీరు సమ్మెను విరమించకూడదు మీ కోరికలను మీరు వ్రాత మూలంగా తెలుపవలె. అప్పుడే మీ అందరికీ స్పష్టంగ తెలియవలె అవి పరిష్కరింపబడనున్న తరుణంలో మీరు కోరికలను హెచ్చించరాదు అప్పటికప్పుడు మీ కోర్కెలను మార్చడంకానీ హెచ్చించడంగానీ చేస్తే మీరు పెడదారులు పడుతున్నట్లు తోస్తుంది మీకు నమ్మకంగలవారు మధ్యవర్తులుగా ఉంటే వారి తీర్పుకు మీరు కట్టుబడి ఉండవలె మధ్యవర్తులుగా ఉండేవారు, మీకు మీ యజమానులకు ప్రజలకూ కూడా మీ కోర్కెలలోని న్యాయాన్యాయాలను చెప్ప గలరు మీ కోరికలు న్యాయంకావచ్చు, నేను చెప్పిన ప్రకారమే మీరు నడుచు కొంటూ ఉండవచ్చు, అప్పటికీ మీ సమస్య పరిష్కారం కాక మీరు సమ్మె కొన సాగించవలసివస్తే మీరేమి చెయదలచుకొన్నారు? చాలా కాలం సమ్మె చేసే టందుకు కావలసిన డబ్బు మీ దగ్గర లేదుగదా! మీరందరు దృఢకాయులు కాబట్టి మీ మనుగడకు యితరులపై ఆధారపడరాదని నా సలహా దృఢకాయు లయినవారు తమ మనుగడ కితరులపై ఆధారపడడం ఆత్మగౌరవానికి భంగ కరము కాబట్టి తాత్కాలికంగా ఎదయిన పనిలోకి మీరు పోవలెనని నా సలహా న్యాయమయిన పనిచేయడం ఎవరికీ అగౌరవంకాదు నేనే మీ స్థితిలో ఉన్న ట్లయితే పారపని దొరికితే ఆ పనిచేసి ఎంతకాలమయినా సమ్మె సాగించగలను అహమ్మదాబాదులో 28 రోజులు సమ్మె జరిగింది ఆ చరిత్రనంతనూ చెప్ప డానికి వేళచాలదు ఆ సమ్మెను గురించి మీ స్నేహితుల నెవరినైనా అడగ వచ్చు అ సమ్మెదారులలో నెలకు రు 40 లు జీతం పుచ్చుకొనేవారుకూడా పారపని చేసి ఒక చోటునుంచి మరొక చోటుకు మట్టి మోసినారు ఆ ప్రకారం రోజుకు నాలుగణాలు కూలి తెచ్చుకొని కుటుంబాలను పోషించుకొన్నారు ఆ విధంగ 10 వేలమంది సమ్మెదారులు సంపూర్ణవిజయం సంపాదించినారు మీ కోరికలు న్యాయమయినవనీ, నేను చెప్పినట్లు మీరు నడచుకోగలరనీ నేను నమ్ముతున్నాను అట్లాచేస్తే మీకు జయంనిశ్చయము మీరు నన్ను చూడడానికి ప్రత్యేకం ఇంతదూరం వచ్చినందుకు మీకు వందనాలర్పిస్తున్నాను ”

సత్యాగ్రహోద్యమ సందర్భంలో గాంధీజీ మద్రాసులో ఉన్నప్పుడు ట్రాంవే కార్మికుల సమ్మెను గురించి గాంధీజీ ఇచ్చిన సలహా ఇది

## సత్యాగ్రహోద్యమం గురించి మద్రాసులో సభ - గాంధీజీ సందేశము

1919 మార్చి 30 తేదీని సత్యాగ్రహోద్యమం గురించి మద్రాసు సముద్రతీరంలో మరొక సభ జరిగింది ఆ సభకు కే వి రంగస్వామి అయ్యంగారు అధ్యక్షత వహించినారు ఆ సభలో గాంధీజీ సత్యాగ్రహోద్యమం గురించి పంపిన మరో సందేశం సత్యమూర్తిగారు చదివి వినిపించినారు దానిలో సత్యాగ్రహ వ్రతావలంబన దినం అనుసరించవలసిన విధానం సూచించబడింది ఆ సందేశమిది

"నేను నా ఆంధ్రమిత్రులకు వాగ్దానం చేసినప్రకారం [illegible] వెళ్ళవలసి ఉన్నది కనుక నేను సాయంకాలం జరిగే సమావేశానికి మద్రాసులో [illegible] ఉన్నాను ఈ రాజధాని దక్షిణప్రాంతాలలో [illegible] సంచారం చేస్తూ [illegible] చినాను అక్కడే నా అనుభవాలను గురించి కొంతమంది స్నేహితుల ప్రశ్నలకు సందేహాలకూ జవాబుగాను కొన్ని సంగతులు వ్రాయదలచినాను.

నేను తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, [illegible], నాగపట్నాల బహిరంగసభలలో ప్రసంగించినాను ఎంత తక్కువగా అంచనా వేసుకొన్నప్పటికీ ముప్పయి వేలమంది ప్రజలయినా నా సభలకు హాజరయి ఉంటారు మన మెంత దేశభక్తులమని అనుకొంటున్నామో అంత దేశభక్తులుగానూ ఉన్నవారు కొంతమంది కొన్ని అపోహాలను వెల్లడించి మనలను మందలిస్తున్నారు వారి కా హక్కు ఉంది మన మెంత సదుద్దేశంతో ఈ ఉద్యమం ప్రారంభించి నప్పటికి ఇందులో అపాయం ఉన్నదనీ, మనం దౌర్జన్యం [illegible] చూడవలె నని ఎంత ప్రయత్నించినప్పటికీ ఈ ఉద్యమంలో చేరిన వారు [illegible] ఉద్రేకంతో తగినంత ఆత్మనిగ్రహంతో వర్తించజాలక దౌర్జన్యానికి దిగగలరనీ అందువల్ల అనవసరమయిన ప్రాణనష్టం కలగడమేగాక మన [illegible] సైతం హాని కలగవచ్చుననీ వారంటున్నారు ఈ ఉద్యమం తల పెట్టిన తరవాత నా ఉపన్యాసాలను ఢిల్లీనగరంలో ప్రారంభించినాను తరువాత లక్నో, అలహాబాదు, బొంబాయిలకు పోయి మద్రాసు వచ్చినాను సత్యాగ్రహ ఉద్యమ సమావేశాలకు వచ్చినవారందరి భావాలలోను మార్పు వచ్చిందని ఆ సభలలో నాకు కలిగిన అనుభవము. మన ఉద్యమాన్ని ప్రతికూలిస్తూ కొంతమంది [illegible] శాసన సభ్యులు ప్రకటించిన విజ్ఞాపనపత్రం గురించి [illegible] ఒక నిరపాయకరమయిన మాటకు శ్రోతలు "సిగ్గు" "సిగ్గు" అని అరిచినారు సత్యాగ్రహులుకాని సత్యాగ్రహ సభలకు హాజరయ్యేవారు గాని అటువంటి మాటలు అనకూడదని నేను మందలించినాను సత్యాగ్రహోపన్యాసాల సందర్భాలలో, ఆమోదసూచకాలుగా గాని ప్రతికూల సూచకాలుగా గాని ఎవరూ ఏ విధంగానూ ప్రదర్శించకూడదు నా యీ మందలింపును శ్రోతలు శీఘ్రముగా గ్రహించినారు ఆ తరవాత వారెన్నడూ అట్లా ప్రదర్శించలేదు ఇతర [illegible]వలెనే ఈ రాజధానిలోని పట్టణాలలో కూడా నా అనారోగ్యం గుర్తించి ప్రదర్శనలతో సందడిచేయకుండా నిశ్శబ్దంగా ఉన్నారు అంతకంటె కూడా ఉన్నతాదర్శంతో నిగ్రహంగా ఉండవలసిన అవసరం వారు పూర్తిగా గ్రహించినారు ఉద్యమ నాయకులు కూడా ఆత్మనిగ్రహంతో పరిష్కరించవలసిన అవసరం పూర్తిగా గ్రహించినారు ఈ నాఅనుభవాలు భవిష్యత్కార్యక్రమానికి ఎంతో ఆశాజనకాలుగా ఉన్నాయి మన మిత్రులు భయపడినట్లు ఏదో అపాయం రానున్నట్లు నే నెంతమాత్రమూ భయపడడం లేదు నేను ఉపన్యసించిన అనేక సభలు నా యీ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి అయినప్పటికీ మిత్రులు భయపడుతున్న అపాయానికి ఆస్కారం లేకుండేటట్లు నేను అన్ని విధాల ముందు జాగ్రత్తలు

తీసుకొంటున్నాను అందువల్లనే సత్యాగ్రహ సంఘంవారు నిర్ణయించిన శాసనాలను మాత్రమే ధిక్కరించవలెనని, సత్యాగ్రహ ప్రమాణపత్రాలపైన సంతకాలు చేసినవారు ఆదేశింపబడుతున్నారు మన సింధు స్నేహితులు ఆ ప్రమాణాన్ని సరిగా గ్రహించగలిగినారు కనుకనే ప్రమాదరహితమయిన వారి ఉత్సవం నిషేధిస్తూ హైదరాబాదు (సింధు) పోలీసు కమిషనర్ జారీచేసిన ఉత్తరువులను ఉల్లంఘించడానికి పూనుకోలేదు అట్లా ఉల్లంఘించడం మన ఉద్యమంలో భాగంకాదు మన ప్రమాణపత్రానికి విరుద్ధంగా ఉండనంతమాత్రాన ప్రతిచట్టాన్ని ధిక్కరించవలెనని మన ప్రస్తుతోద్యమ ఉద్దేశంకాదు స్వతస్సిద్ధంగా శాసనబద్ధుడు కానివాడు సత్యాగ్రహి కాలేడు శాసనబద్ధుడుగా ఉండే అతని సహజ స్వభావమే, తక్కిన శాసనాలన్నింటినీ అతిక్రమించి, అతని అంతరాత్మ చెప్పినట్లు చేయగల శక్తిని కలిగిస్తుంది కొన్ని శాసనాలను ఆయన ధిక్కరించడంకూడా, నామమాత్రమయిన ధిక్కారమే ప్రతి శాసనానికి విధేయత చూపడంలో పౌరుడు రెండు విధాలుగా ఆలోచించవచ్చు మొదటిది శాసనం ఉన్నది కనక దానికి విధేయుడుగా ఉండడమే విధి అనుకోవచ్చు రెండోది తన అంతరాత్మకు అనుకూలంగా ఉన్నది కనక దానికి విధేయుడుగా ఉండవలసినదే లని అనుకోవచ్చు సత్యాగ్రహి రెండో పద్ధతికి చెందిన వాడుగా ఉంటాడు సత్యాగ్రహి ఎన్నడు మామూలు నేరస్తునివంటి వాడు కాడు మామూలు నేరస్థుడు మంచి చట్టాన్నీ చెడుచట్టాన్నీ కూడా ధిక్కరించి అందువల్ల వచ్చే శిక్షను తప్పించుకొనేటందుకు ప్రయత్నిస్తాడు ఈ సందర్భంలో దుష్ఫలితాలు కలగకుండేటందుకు చేయవలసిన ప్రయత్నాలన్నీ ఊహకందినంత వరకు చేసినాను కొంతమంది స్నేహితులు "రౌలట్ శాసనం నిరాకరించడమనే విషయాన్ని మేము అర్థంచేసుకోగలము కాని సత్యాగ్రహిగా మీరు ధిక్కరించవలసిన విషయంలో ఏమీ లేదు ఇక ఇంతవరకూ మీరు విధేయులుగాఉంటే ఇతర మంచి చట్టాలను నై అం మీ రెట్లా ధిక్కరించగలరు" అని నన్ను అడుగుతున్నారు మంచి చట్టాలను నైతిక బంధనలను గురించిన చట్టాలను సత్యాగ్రహి ధిక్కరించడు సత్యాగ్రహి ప్రమాణపత్రం కింద ఆ చట్టాలను ధిక్కరించే ప్రసక్తి లేనే లేదు ఇక ఇతర శాసనాలు మంచివీ కావు, చెడ్డవీ కావు నీతికరాలూ కావు అవినీతికరాలూ కావు అవి ఉపయోగకరాలు కావచ్చు, అపాయకరాలూ కావచ్చు దేశంలో మంచిప్రభుత్వము ఉండవలెననుకొని పౌరులు ఆ చట్టాలకు విధేయులుగా ఉంటారు ఆ చట్టాలు ప్రభుత్వాదాయంకోసంగాని, రాజకీయంగా కొన్నిటిని నేరాలుగా పరిగణించడానికి గానీ చేయబడి ఉండవచ్చు అటువంటి శాసనాలు అను అధికారం కొనసాగించేటందుకు ప్రభుత్వానికి ఉపయోగకరాలుగా ఉంటాయి కాబట్టి రౌలట్ శాసనంవలె జాతీయ సౌష్ఠవానికి హానికలిగించే చట్టాన్ని ధిక్కరించడం ప్రతి పౌరుని హక్కు హక్కే కాదు ధర్మం కూడా ప్రభుత్వంవారు జాతీయాభిప్రాయానికి లొంగిపోయేటంతవరకూ అటువంటి చట్టాలను ధిక్కరించవలసిందే

ధిక్కరించవలసిన చట్టాల నిర్ణయం ఒక సంఘం చేయటంలో ఉండడంలోని ఔచిత్యం గురించి నా పర్యటనలో కొందరు మిత్రులు సందేహం [illegible] నాయి కొందరు ఉత్తరాలు కూడా వ్రాసినారు. ఆ నిర్ణయం సత్యాగ్రహికి గాక ఇతరులకు వదలివేయడంలో సత్యాగ్రహి అంతరాత్మకు [illegible] కాదా అని వారి శంక. సత్యాగ్రహ ప్రమాణం తప్పుగా [illegible] పడటంవల్ల ఈ శంకకలుగుతూన్నది. అవసరమయితే సత్యాగ్రహి [illegible] ధిక్కరించ తగిన అన్ని చట్టాలను తానే ధిక్కరించడానికి ఒప్పుకొని [illegible] ప్రమాణ పత్రంపైన సంతకం పెట్టినాడు. కాని అటువంటి చట్టాలన్నిటిని [illegible] ధిక్కరించటమే తన పని అనే నిర్బంధం మాత్రం లేదు. తాను ధిక్కరించవలసిన [illegible] ఎన్నికను అనుభవజ్ఞుల నిర్ణయానికి సత్యాగ్రహి స్వచ్ఛందంగా వదలివేయ వచ్చు. అయితే ఆ అనుభవజ్ఞులు కూడా [illegible] నియమాలకు లోబడియే నిర్ణయించగలరు. ప్రమాణ పత్రం [illegible] చేసినవానికి కలిగే పెద్ద ఇబ్బంది ఒక్కటే. ఉల్లంఘించటానికి నిర్ణయించబడిన [illegible] అతడు కోరుకొన్నన్ని లేకపోవచ్చు.

రాముని సంస్కరణలను గురించిన ఒకేఒక [illegible] దేశీయుల దృష్టిని మరలిస్తున్నారనికూడా నాతో కొందరు [illegible] బిల్లులలో కొన్ని మార్పులు చేసినప్పటికి సెలెక్ట్ [illegible] అభిప్రాయం ప్రకారం దాని ముఖోద్దేశానికి భంగం రాలేదన్నమాట [illegible] వల్ల అది దేశాభ్యుదయానికి ప్రయోజనకరాలయిన [illegible] కూడా ప్రతిబంధకంగా ఉన్నది. స్పష్టంగా వెల్లడింపబడిన [illegible] హృదయంతో పూర్తిగా గుర్తించవలసిన నియమం ప్రభుత్వం పాటించి తీరవలెనని మనం పట్టుపట్టవలె. అదే అన్నిటికంటేకూడా [illegible] మనం చేయవలసినపని. ఒకే ప్రభుత్వం ఒకేసమయంలో ప్రజలను నమ్మనూ నమ్మక పోవడం, స్వాతంత్ర్యం ప్రసాదించడం, నిర్బంధం ప్రయోగించడం జరుగుతుందని నేను విశ్వసించలేకుండా ఉన్నాను. రౌలట్ [illegible] వచ్చే సంస్కరణలు ఎట్లాఉంటాయో వ్యాఖ్యానించే [illegible] రౌలట్ శాసనమనే ప్రతిబంధకాన్ని తొలగించుకొనేటందుకు తగినంత [illegible] మనం సంపాదించుకోజాలకపోతే మనకు వచ్చే సంస్కరణలు [illegible] సొలగిచ్చుచేసిన సమాధివంటిది కాగలదని నేను ధైర్యంగా చెప్పగలను. [illegible] ఇంకొక భయాన్నికూడా ప్రకటిస్తున్నారు "మీ సత్యాగ్రహోద్యమం బోల్షివిజం ప్రవాహానికి దోహదం చేయడానికి మాత్రమే ఉపకరిస్తుందని మా భయం" అంటున్నారు వారు. బోల్షివిజమనే విషాద సంఘటనను మనం బలికాకుండేటందుకు సత్యాగ్రహమొక్కటే సరియైన ఉపాయం. ఆధునిక భౌతిక సభ్యతకు నిస్సందేహమయిన ఫలితం బోల్షివిజము. భౌతిక సంపదను గురించిన మూఢారాధనవల్ల భౌతికాభ్యుదయమే మన ఆదర్శమనే ఒక వర్గం తయారయింది. అందువల్ల జీవితంలోని ఉత్తమ విషయాలతో సంబంధం లేక

పోయింది ఆ వర్గానికి, బోల్షివిజంలోని సిద్ధాంతం భోగలాలసత్వము ఆత్మ నిగ్రహం సత్యాగ్రహ సిద్ధాంతం సాంఘిక, రాజకీయ జీవితాలలో సత్యాగ్రహానికి అగ్రస్థాన మిచ్చేటట్లు నేను భారతజాతిని ఒప్పించగలిగినట్లయితే, బోల్షివిజ ప్రచారానికి మనం భయపడవలసిన అవసరం లేదు సత్యాగ్రహాన్ని అంగీకరించమని కోరడంలో వాస్తవానికి నేనేమీ కొత్తసంగతి కోరడం లేదు ఇంతవరకూ మన జీవితాలను నడిపిన ఒక పురాతన స్మృతికి నేనొక కొత్త పదం సృష్టించినాను భౌతికతత్వం కంటె ఆధ్యాత్మిక తత్వము, పశుబలం కంటె ప్రేమా స్వాతంత్ర్యాలు మిన్నలనే ధర్మం గనుక మనం పాటించక పోతే, ఒకప్పుడు పరమ పవిత్రంగా ఉండి ఈ భారతభూమిలో బోల్షివిజం విచ్చలవిడిగా విహరించ గలదని నేను జోస్యం చెబుతున్నాను"

సత్యమూర్తిగారి సందేశం చదివి వినిపించిన తరవాత అధ్యక్షులు రంగ స్వామయ్యంగారు, సత్యమూర్తి, ఆదిశేషాచల నాయుడు, సుబ్రహ్మణ్యశివ గార్లు ఉపన్యాసాలు చేసినారు శ్రీ సి రాజగోపాలాచార్యులవారు "గాంధీ మహాత్ముని ఆదేశానుసారం 6 వ తేదీ ఆదివారం అందరూ ఉపవాసదినంగా భావించి, అన్ని పనులనూ మానివేసి దైవప్రార్థనలు చేయవలెననీ, వర్తకులు తమ దుకాణాలను కార్యాలయాలను ఆనాడు మూసివేయవలెననీ ఈ సభవారు సూచిస్తున్నారు" అనే తీర్మానం ప్రతిపాదిస్తూ మనం ఆత్మశక్తిని ఉపయోగించినందువల్ల మన కోరికలు నెరవేరగలవని అన్నారు

ఈ తీర్మానం కల్యాణ సుందరం మొదల్యార్, డాక్టర్ రాజన్, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగార్లు బలపరిచిన తరవాత అధ్యక్షునికి వందన సమర్పణతో సభ ముగిసింది

## మద్రాసు నాయకుల అనిశ్చిత స్థితి

రౌలట్ బిల్లులు శాసనరూపం దాల్చకుండ నిరోధింపవలెనని సార్వభౌమునికి విన్నవించేటందుకు భారత రాజ్యాంగ మంత్రికి తంతివార్త పంపుతూ, సత్యాగ్రహం దేశానర్థదాయకమనికూడ ఆ తంతిలో వివరించిన మద్రాసు రాష్ట్రీయ నాయకులు వీరు

సర్ యస్ శివస్వామి అయ్యర్, ఖాన్ బహదర్ ఖుద్దుస్ బాదుషా సాహెబ్, దివాన్ బహద్దర్ కేశవపిళ్లె, న్యాపతి సుబ్బారావు, దివాన్ బహద్దర్ గోవిందదాస్ చతుర్భుజదాస్, కె శ్రీనివాసయ్యంగార్, ఖాన్ బహద్దర్ వాల్‌జీ లాల్‌జీ, ది.బ రామచంద్రరావులారి డాక్టర్ లాజరస్, వెంకటపతి రాజు, ఎస్ కృష్ణారావు, అబ్దుల్ హకీం, యం ఏ సూర్యనారాయణరావు, టి రంగాచారి, పి శివరావు సి వి యస్ నరసింహరాజు, యన్ ముత్తయ మొదలియార్ రా బ టి సుబ్రహ్మణ్య అయ్యర్, టి ఆర్ వెంకటరామశాస్త్రి, జి ఏ నటేశన్, డాక్టర్, కృష్ణస్వామి అయ్యర్, పండిత గోపాలాచార్యులు, యం కోలందవేలు మొదల్యార్, పి ఎ సుబ్రహ్మణ్య అయ్యర్, కె వి

కృష్ణస్వామి, కౌతా సూర్యనారాయణ, కె వి వీరరాఘవాచారి, రావు బ
కె వి రామనాథం

## గాంధీజీ విజయవాడ రాక - 1919

గాంధీమహాత్ముడు విజయవాడ వచ్చేసరికి రైలుప్రయాణంవల్ల అలసట చెందినారు అసలే అస్వస్థతగానున్న ఆ మహనీయుడు ప్రయాణపు బడలికతో ఉన్నప్పటికి విజయవాడ పరిసర గ్రామాలనుంచి తనను చూడవచ్చిన వారందరితో కలసి మాట్లాడి సత్యాగ్రహ వ్రతావలంబనానికి కావలసిన కార్యవిధానం వివరంగా తెలియచేసినారు కృష్ణా మండల రైతుసంఘంవారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పిస్తూ తమ కష్టాలన్నిటినీ చెప్పుకొన్నతరవాత ఆయన వాటి నివారణానికి తగిన కృషిని చేయ ప్రయత్నిస్తానన్నారు గాంధీమహాత్ముని దేశసేవా తత్పరత కొనియాడుతూ ఆయనకు కృతజ్ఞత తెలుపుకొనేటందుకు 1919 మార్చి 31 తేదీని శ్రీ రామమోహన గ్రంథాలయపు ఆవరణలో ఒక బహిరంగసభ బెజవాడ డివిజనల్ కాంగ్రెసు సంఘంవారి యాజమాన్యంలో జరిగింది కృష్ణా మండలవాసులు తన పట్ల చూపిన గౌరవానికి గాంధీజీ కృతజ్ఞత తెలుపుతూ, సత్యాగ్రహ తత్వం ప్రబోధించినారు అనాడే బొంబాయిలోని క్లిష్టపరిస్థితులనుబట్టి గాంధీజీ బొంబాయిలో ఉండడం అత్యవసరమని తంతివార్త రావడంతో ఆ రాత్రి రైలులోనే ఆయన బొంబాయి వెళ్ళినారు

### గాంధీజీకి కృష్ణా రైతుల సన్మానపత్రము

"కరుణాసాంద్రా స్వాగతం, గాంధీమహాశయా! సుస్వాగతం మీ పాదస్పర్శవల్ల మా కృష్ణామండలం పవిత్రమయింది మీ దర్శనము మా పాపాలనంత మొందించినది మీ వాక్యామృతం గ్రోలడానికి శ్రవణపుటాలు తహతహపడుతున్నవి

దక్షిణాఫ్రికాలోని భారతీయ సోదరుల దాస్యవిముక్తి కాపాడానికి సకల కష్టాలనుభవించిన ప్రహ్లాదమూర్తీ! దేశీయుల కష్టాల నివారణకోసం సర్వసమర్పణ మొనరించిన భ్రాతృవత్సలా! ఇతరుల పాపాలకోసం స్వీయరక్తంధార పోయుచున్న యేసు మహనీయుడా! మీకు మా మండల రైతుల పక్షాన హృదయపూర్వక స్వాగతమర్పిస్తున్నాము

అజాతశత్రవా! మా ఆనందాశ్రువులతోనూ దుఃఖాశ్రువులతోనూ మీ పాదాలు కడుగుతున్నాము మీ అనారోగ్యంగా లేనందుకు మేము పరిపరి విధాల దుఃఖిస్తున్నాము మీ ఆరోగ్యం కాపాడటానికి భగవంతుని భక్తిపూర్వకంగ ప్రార్థిస్తున్నాము

తండ్రీ! మా కష్టసుఖాలు వినడంకోసం మీ రాతురపడుతున్నట్లున్నారు మీరు కైరాజిల్లాలోని రైతులకోసం నానా అగచాట్లు పడినారు ఈ మిల్లు కూలీల కష్టాల నివారణకోసం శుష్కోపవాసాలు చేసినారు రౌలట్

సంఘంవారిచే నిర్మింపబడి దేశీయ నాయకులచేతను ప్రజలచేతనూ కంటగింపబడి, భారతీయ స్వతంత్ర్యాలను తొలగించడానికితలపెట్టినటువంటి భారత జాతీయ గౌరవానికి భంగకరంగా ఉన్నటువంటి రౌలట్ చట్టం ప్రవేశపెట్టిన అధికార వర్గం వారి చర్యలకు విసిగి వేసారియున్న మీకు రైతుల కష్టాలను నివేదించి మరింత దుఃఖంవచేయడానికి మా కిష్టంలేదు అయినా కొన్ని విషయాలను మీకు తప్పనిసరిగా మనవి చేయవలసి వచ్చింది

మా కష్టాల కొక సంఖ్య, మా నష్టాలకొక అంతము, మా దుఃఖాలకొక పారమూలేదు ఏ బి క్లాసులు, పీనల్ శిస్తులు, మెరక మార్పిడులు, తీరువల దరఖాస్తు రద్దులు, హెచ్చు తీరువుల యోచన, నిష్కారణపు తీరువలు,జనుము, మినుము పైరులకు సైతం నీటి తీరువకట్టు ఆలోచనలు, మేము పండించే పంటలకు ప్రోత్సాహం లేకపోవడం, మేము పండించిన పంటలపైన పెత్తనం చేయడానికి కంట్రోల్ ఆఫీసర్ల నియామకము, నిలకడలేని సెటిల్మెంట్ లు, సంస్కరణ శూన్యాలైన డెల్టాలు, విచారణ శూన్యాలయిన కమిటీలు - ఇంకా ఎన్నో కష్టాలకు రైతులు గురిఅవుతున్నారు

సైనిక సహాయమీరిచ్చినారు సైనిక విరాళాలను యుద్ధపు టప్పులను వీ రిప్పించినారు ప్రజల కాహారం ప్రభువులకు పన్ను వీ రిస్తున్నారు కూలి జనానికి కూలి ఇస్తున్నారు రెండు మాసాలయినా తన పంటతో కడుపు నింపుకో లేని ఇతర దేశాలు కూడ ఈ దేశంపై ఆధారపడి ఉండేది ప్రభుత్వానికి పునాది ప్రజలకు జీవనాధారం వీరే వీరికి ప్రారంభోచిత విద్య లేదు వీరిచ్చిన పన్నులతో వేసిన రోడ్లపై వీరి బండ్లకు పన్ను విధించబడుతున్నది రైతుల కుపయోగపడే డెల్టాను వదలి వర్తకుల ఉపయోగం నిమిత్తం షుమారు నూటికి సంవత్సరానికి 4½ మాత్రమే వడ్డీ గిట్టుబాటయ్యే రైళ్లపైన కోటానుకోట్ల రూపాయలు వెచ్చించడం జరుగుతున్నది ఆందోళనచేస్తే అల్లరివాడంటారు ఊరకుంటే సంతృప్తిగా ఉన్నారని వ్యాఖ్యానిస్తారు అధికారవర్గంవారి స్థితి ఇట్లా ఉన్నది! మేమేమి చేయవలెనో తోచకుండాఉంది

ఈ జిల్లాలో మా మీద మీకు అప్పీలు చేసే సంఘమొకటి ఉంది ఆ సంఘం పంచమసంఘము వారి అభివృద్ధికోసం ఉదాసీనంగా మే ముండిన మాట కొంతవరకు సత్యమే కాని వారికి కూడు, గుడ్డ లేకుండ హింసించేవారు మాత్రం మేము కాదు వారికి పూర్తి అయిన కూలి పూర్తి అయిన జీతం మాకు వచ్చే ఆదాయంలో ఇస్తూనేఉన్నాము కాని మే మిచ్చే ధన ధాన్యాలన్నీ నిమ్న జాతులవారు అబ్కారీ డిపార్ట్ మెంట్ కే చెల్లిస్తున్నారు అబ్కారీవారు ఈ జిల్లాలో వసూలుచేసే లక్షలకొద్దీ ద్రవ్యం నిమ్నజాతులది కాదా! ఈ కష్ట కాలంలో సైతం ఒక కల్లు అంగడిని సారాయి అంగడిని దయచేసి చూడండి ఎట్లా కనక వర్షం కురుస్తుందో కాటక సంవత్సరంలో ఇదివరకు రు 2/గా ఉన్న తాడిపన్ను రు 8/ల వరకూ పెంచినపుడు దేశంలోని కాటకం తగ్గించే ప్రయత్నాలను చేస్తున్నామని చెప్పటం సరిఅయిన యోచనయేనా? ప్రతియేటా

తెలియజేయడంతోపాటు వారి ఆర్థిక రాజకీయ సాంఘిక చైతన్యం నైతం ప్రతిబింబింపచేస్తూన్నది. గాంధీజీలో ఆయన సత్యాగ్రహోద్యమంలో వారి భక్తి విశ్వాసాలను వెల్లడిస్తూన్నది ఆనాడు ఉచిత ప్రారంభ విద్యకు అవకాశాలు లేకపోయినప్పటికీ ప్రభుత్వాదాయం కోసం ప్రచారంలో నుంచిన కల్లు సారా దుకాణాలవల్ల అట్టడుగు ప్రజానీకంగా పరిగణించబడుచూండిన కష్టజీవులు కూటికీ గుడ్డకూ దూరమవుతూఉండిన విషయాన్ని వివరించడం జరిగింది మత్తు పదార్థాలద్వారా వచ్చే ప్రభుత్వాదాయం పాపపు ద్రవ్యమని ఘంటాపథంగా చెప్పిన గాంధీ శతజయంత్యుత్సవాలు జరుగుతూఉన్న ఈనాడు ఒకవంక సోషలిస్టు సమాజ వ్యవస్థా నిర్మాణానికి పూనుకొన్నట్లు చెబుతూ మరొకవంక మద్యనిషేధ శాసనాన్ని ఒక్క కలం గీటుతో రద్దుచేసి కష్టజీవుల కడుపుగొట్టిన కొన్ని రాష్ట్ర ప్రభుత్వాల రాజనీతి నైపుణ్యం ఏమనవలెనో తోచకుండా ఉంది

## గాంధీజీతో కాశేశ్వరరావుగారు (1919)

రౌలట్‌చట్టాలకు ప్రతికూలంగా జరుపనున్న సత్యాగ్రహోద్యమ సందర్భంలో గాంధీజీ విజయవాడ వచ్చినప్పటి ఉదంతం శ్రీ కాశేశ్వరరావుగారు 'నా జీవితము నవ్యాంధ్రము' అనే గ్రంథంలో ఇట్లా వ్రాసినారు

'మహాత్మాగాంధీ సికిందరాబాదు వచ్చి అక్కడ ఉపన్యసించినారు అక్కడనుంచి విజయవాడకు వచ్చినారు వారు వస్తున్నారని సికిందరాబాదులోని మిత్రులనుంచి నాకు టెలిగ్రాం వచ్చింది నేనా మహాపురుషుని ఉదయం రైలుస్టేషనులో కలిసి తీసుకొనిపోయి నా కతిథిగా ఉంచుకొన్నాను అది నా మహాద్భాగ్యము ఆయన శుద్ధఖద్దరు వస్త్రాలను ధరించినారు బొందుల అంగరఖా ధరించి మార్వాడీ తలగడ్డ చుట్టుకొన్నారు ఆ సాయంత్రం రామమోహన గ్రంథాలయపు ఆవరణలో సత్యాగ్రహాన్ని ప్రబోధిస్తూ ఇంగ్లీషులో ఉపన్యసించగా నేను తెలుగులోకి అనువదించినాను ఆయన కపుడు హృదయం చాల బలహీనంగా ఉండటంవల్ల ఒక కుర్చీలో రెండు మెత్తని దిండ్లమీద కూర్చొని ఉపన్యసించినాడు ఆయన బిగ్గరగా మాట్లాడలేదు అపుడు దూర శ్రవణ యంత్రాలు లేవు వచ్చిన రెండువేల మంది జనానికి నేను బిగ్గరగా తెలుగులో చెప్పినాను ఆయన నోటినుంచి వచ్చిన మాటలు ప్రవక్త మాటలుగా ఉండేవి నన్ను తన సత్యాగ్రహోద్యమంలో చేరవలెనని కోరినాడు నేను సంతోషంతో ఎట్లాంటి సంకోచం చూపకుండ చేరినాను విజయవాడలో ఇంకెవరూ చేరలేదు ఆయన 1906 నుంచి దక్షిణాఫ్రికాలో భారతీయుల కష్టాల నివారణకు చేస్తున్న సత్యాగ్రహోద్యమం గురించి జాగ్రత్తగా చదువుతున్నాను అపుడే తన యావదాస్తిని త్యజించి బ్రహ్మచర్యం స్వీకరించి ఆశ్రమవాసియై మానవోద్ధరణకు తన జీవితం అంకితం జేసినారు తరవాత హిందూదేశంలో కైరాలోను, చాంపరాన్‌లోను జరిగిన సత్యాగ్రహోద్యమాలను గురించి కూడ

చదివినాను ఆయన సర్వమతాలను సమానంగా ఆదరించి కులమత భేదాలను
పాటించక అస్పృశ్యతను రూపుమాపి మానవ సమానత్వం నిర్మలత్వం స్థాపించ
డానికి కంకణం కట్టుకొన్న ఆధ్యాత్మిక సంపన్నుడని నా ఎరుకకే తెలుసు
ఆయనయే భారతదేశ రక్షకుడనీ స్వాతంత్ర్యం తేగల మహాపురుషుడని నాకు
దృఢవిశ్వాస ముండింది కాబట్టి ఆయన నావద్దకే వచ్చినప్పుడు ఆయన శిష్యులలో
ఒకనిగా చేర్చుకోవడం పూర్వజన్మ సుకృతంగా భావించినాను నేను వారికి
సర్వవిధాల శిష్యుడనైనాను నా జీవితకాలమంతటిలోను వారున్నచోటుకు
వెళ్లినపుడు తప్పకుండ వారి దర్శనంచేసి సలహాలను పొందివస్తున్నాను వారు
నన్ను ఎంతో దయతో ఆదరించినారు ఆయన నాకు ప్రియతముడైన బాపు
నేను వారికి అల్లుడనైన శిష్యుణ్ణి

గాంధీగారు విజయవాడకు వచ్చిన కొంతటిరోజులకు పాత మిత్రులైన
బిపిన్‌చంద్రపాల్‌గారు తన భార్య, కూతురుతో గుంటూరు నుంచి బెజవాడ
వచ్చి నా అతిథులుగా ఉన్నారు నాటి రాజకీయ పరిస్థితులగురించి ఆయన
ఆ సాయంత్రం గొప్ప ఉపన్యాస మిచ్చినారు ఆయన సుప్రసిద్ధ వక్త గాంధీజీ
మరునాడు విజయవాడ వస్తున్నారని తెలిసి బందరు వెళ్లినారు గాంధీజీ వెళ్లిన
మరునాడు మళ్లీ విజయవాడ వచ్చి రెండు ఉపన్యాసాలు మిచ్చినారు గాంధీగారి
సత్యాగ్రహాన్ని ఖండిస్తూ మాట్లాడినాడు ఆయన ఉపన్యాసాలలో భాషా చమ
త్కృతి మాత్రమే బాగున్నది కాని కార్యక్రమమేమీ లేదు అది ఎవ్వరికీ
రుచించలేదు బిపిన్‌చంద్రపాల్‌గారు బ్రిటిష్‌వారికి [illegible] పత్రం వ్రాసి
ఇచ్చి ఆంగ్లేయ పత్రికలలో వ్యాసాలు వ్రాస్తున్నందువల్ల ఆయన తనకే నైతిక
బలాన్ని, పలుకుబడినీ కోల్పోయినాడు మహాత్మాగాంధీ మాటలు ఋషి
వాక్కులై ప్రజల హృదయాలలో చొచ్చుకొన్నవని నేను గాంధీ శిష్యుడనైనా
నని సత్యాగ్రహం చేయబోతున్నానని ఆయనతో ఏమాత్రం సహించననీ
బిపిన్‌చంద్రపాల్‌గారితో నిష్కర్షగా చెప్పినాను ఆ రాత్రి వారిని కుటుంబ
సమేతంగా రైలు ఎక్కించి రాజమహేంద్రవరం పంపినాను

మహాత్మాగాంధీ మద్రాసు వెళ్ళి రౌలట్ బిల్లుకు వ్యతిరేకంగా దేశ
వ్యాప్తంగా సాగించవలసిఉన్న సత్యాగ్రహం గురించి ఉపన్యసించినారు
హిందూ పత్రిక సంపాదకులైన కస్తూరి రంగయ్యగారు, ఆంధ్ర న్యాయవాద
ప్రముఖులయిన బారిష్టరు టంగుటూరి ప్రకాశంపంతులుగారు, మరికొంతమంది
జాతీయవాదులు గాంధీగారి సత్యాగ్రహంలో చేరినారు అప్పటినుంచీ ముందుకు
వచ్చి టంగుటూరు ప్రకాశంపంతులుగారు ఆంధ్ర కాంగ్రెస్ రాజకీయాలలో
నాయకత్వం వహించినారు

## గాంధీజీ పర్యటన ప్రభావము (1919)

'మహాత్మాగాంధీ మాటలు ఋషివాక్కులై ప్రజల హృదయాలలో
నాటుకొనిపోయినాయి' అని శ్రీ కాశేశ్వరరావుగారు తమ స్వీయచరిత్రలో

వ్రాసిన విషయం అక్షరాలా అనుభవంలోకి వచ్చినట్లు 1919 ఏప్రిల్ 6 వ తేదీని మద్రాసులోనూ తదితర ఆంధ్రప్రాంతంలోనూ సత్యాగ్రహ వ్రతావలంబనానికి ప్రజానీకం సామూహికంగా జరిపిన ధార్మిక కార్యకలాపాలవల్ల, ఉత్సవాలవల్ల, ప్రదర్శనలవల్ల, బహిరంగసభలవల్ల ప్రకటితమయింది

## చెన్నపురిలో సత్యాగ్రహ వ్రతావలంబనము

చెన్నపురిలోని పలుప్రాంతాలలో భజనలు, సంకీర్తనలు కాలక్షేపాల కేర్పాట్లు జరిగినాయి మైలాపురంలో దుకాణాలన్నీ మూసినారు ఒక కూరగాయలనమ్మే దుకాణంగానీ కాఫీ దుకాణంగాని తెరవలేదు మాంసపు దుకాణాలుకూడామూయబడినాయి మైలాపూర్ వాసులు ఉదయాన్నే కోనేరులలోనూ, సముద్రంలోనూ స్నానంచేసి గుళ్లకు వెళ్ళినారు కపాలేశ్వరాలయం ఆవరణ వేలకొద్దీ ప్రజలతో నిండిపోయింది డాక్టర్ నంజుండరావు నాయకత్వంలో భజన సంకీర్తనాలు జరిగినాయి సంకీర్తనంలో వకీళ్ళు చాలామంది పాల్గొన్నారు భజన సమూహం ఉదయం 8 గంటలనుంచి కపాలేశ్వర దేవాలయం నుంచి బయలుదేరింది బాలురు సత్యాగ్రహ తోరణాలతోను (banners) పతాకాలతోను ముందు నడిచినారు భజన సమూహం మాడవీధులలో ప్రదక్షిణం జేసి మాధవస్వామి, చక్రపాణి కోవెలలలోని దేవుళ్లను దర్శించి 11 గంటలకు మళ్ళా కపాలేశ్వర దేవాలయానికి చేరింది తోవలో పోలీసులు లాటీలు పట్టుకొని నిలబడడం చూసినప్పుడు నవ్వువచ్చింది మసీదులవద్ద మేళతాళాలనాపి భజనపరులు భగవన్నామస్మరణ చేయడంచూసి మహమ్మదీయులు సుప్రీతులై నారు అల్లా హో అక్బర్ నినాదాలు సైతం చేయడం జరిగింది కపాలేశ్వరాలయంలో 11 మొదలు ఒంటిగంటవరకు రుద్రాభిషేకం జరిగింది సత్యాగ్రహార్చన చేయడం జరిగింది ఒంటిగంటనుంచి మూడుగంటలవరకు ఆంధ్ర మహా భాగవతంలోని ప్రహ్లాద చరిత్ర పురాణకాలక్షేపం జరిగింది తిరిగి భజనపరులు 4 గంటలకు కపాలేశ్వ రాలయంనుంచి బయలుదేరి సంకీర్తనంచేస్తూ 5-40 లకు సముద్రతీరాన నిర్ణీత స్థలానికి చేరినారు షుమారీ ఉత్సవంలో మూడువేలమంది ప్రజలు ప్రశాంతంగా పాల్గొన్నారు వీరిలో అన్ని కులాలవారు, అన్ని శాఖలవారూ ఉన్నారు కొందరు గృహస్థులానాడు పూర్తిగా ఉపవాసం చేసినారు నాలుగేళ్ళ పిల్లలుకూడా కొంతమంది ఉపవాసం చేసినారు మైలాపురం సముద్రతీరంలో లక్షమంది ప్రజలు ప్రశాంతంగా సమావేశమయినారు మూడు వేదికలమీద ఉపన్యాసాలు జరిగినాయి

రాయపేటలో రాయపేట పౌరులు ఉదయం సుస్నాతులై పేటలో ఊరేగి చివరికి సముద్రతీరంలో చేరినారు రాయపేటలోని అంగళ్లన్నీ మూసివేసినారు బ్రాహ్మణేతరులీ వ్రత దీక్షయం దెక్కువ శ్రద్ధ వహించినారు, మహమ్మదీయులు దుకాణాలు మూసివేసినారు మధ్యాహ్నం కస్తూరి రంగయ్యగారి ఇంట్లో ఆర్ శ్రీనివాసయ్యంగారి హరికథా కాలక్షేపం జరి

గింది కస్తూరి రంగయ్యగారు, రంగస్వామి అయ్యంగారు సుబ్రహ్మణ్య భారతి, సంజీవకామత్, చల్లా శేషగిరిరావుగారు మొదలగువారు వారందులో పాల్గొన్నారు పోలీసు కమిషనర్ శాంతిభంగం కలుగుతుందేమోనని భయపడి కస్తూరి రంగయ్యగారితో సంప్రదించగా శాంతికి భంగం రాదని రంగయ్యగారు వారికి హామీ ఇచ్చినారు ఆ విధంగానే [illegible] ప్రశాంతంగా జరిగింది

*తిరువలిక్కేణిలో* ఉదయం అయిదు గంటలకే వారులు సముద్ర స్నానాలుచేసి మంగళవాద్య పురస్సరంగా పుష్పమాల అలంకృతమయిన గాంధీ ఛాయా పటంతో వీధులలో ఊరేగుతూ దేవాలయాలకేగి అభిషేకాలను అర్చనలను చేసినారు కూరగాయల అంగళ్లు [illegible] చిల్లర సామాను దుకాణాలు సైతం మూసిఉన్నాయి ప్రతిగృహంలో సంతోషం [illegible] మ్రోగింది సత్యాగ్రహ పతాకాలు ఇండ్లపై ఎగిరినాయి పిల్లలు పెద్దలూ కూడా శుష్కోపవాసాలు చేసినారు పార్థసారథి గుడి, [illegible] వీధిలోని పాండురంగ మందిరము, అక్బరు సాహేబు వీధిలోని [illegible], పై క్రాఫ్ట్సు వీధిలోని వెంకన్నశాస్త్రి సంస్కృత పాఠశాల మధ్వ సంఘం మొదలయిన ప్రదేశాలలో అర్చనా, గానాలు, హరికథా కాలక్షేపాలు, మహాన్యాస రుద్రాభిషేకాలు ఉపన్యాసాలు మొదలైనవి జరిగినాయి [illegible]రిష్టాలు తొలగి శుభాలు చేకూరవలెననే ప్రార్థనల అనంతరం ప్రసాదాలు స్వీకరించడం జరిగింది

*జార్జిటౌన్‌లో* ఆబాలగోపాలం ప్రాతఃకాలానికి ముందే మంగళ వాయిద్యాలతో గాంధీగారి ఛాయాపటం ఊరేగిస్తూ సముద్రతీరానికి చేరి స్నానంచేసి, దేవాలయాలలో ప్రార్థనలు పూజలూ చేసినారు బ్రాడ్వే, చైనా బజారు, టంకశాల వీధులలో ఊరేగింపు జరిగింది మధ్యాహ్నం నుంచీ సముద్రపు ఒడ్డుకు ప్రజలు చేరడంచేత నగరమంతా నిర్మానుష్యంగా [illegible] ఎనిమిది తొమ్మిది గంటలకు సమావేశం ముగిసింది ఆ ప్రదేశంలోని పెద్ద బజారు, కొత్వాల్ మార్కెట్ మొదలుకొని చిన్నచిన్న తమలపాకుల దుకాణాలు కూడా మూతపడినాయి అమరకళా విలాసినీ సభవారి యాజమాన్యంలో తంబుచెట్టి వీధిలో శాంతాశ్రమంలో గొప్ప సభ జరిగింది సత్యాగ్రహ ప్ర[illegible]లంబనం గురించి ఉపన్యాసాలు జరిగినాయి సాయంకాలం వారందరూ సముద్ర తీరానికి చేరినారు

*చూళైలో* అవధాన పాపయ్యర్ వీధిలోని ప్రజలు మేళతాళాలతో చిదంబరాలయానికి పోయి సహస్రనామార్చనలు చేసినారు తులసీదాసు భక్తజన సభవారు, తమిళవేద పారాయణ సభవారు, సర్వోదయ భక్తజనసభ వారు భజనలు చేసి సాయంకాలానికి "మహాత్మాగాంధీకి జై" నినాదాలతో సముద్రం ఒడ్డుకు చేరుకొన్నారు

*విల్లివాకంలో* విల్లివాకంలో సత్యాగ్రహదినం విష్ణ్వాలయంలో అర్చనలు జరిగినాయి భజనలు జరిగినాయి శివాలయంలో రాత్రి అభిషేకాలు

జరిగినాయి రౌలట్ శాసనం సభలో ఖండింపబడింది

*మాంబళంలో* ఆంజనేయస్వామి ఆలయంలోను, కోదండరామస్వామి కోవెలలోను ప్రార్థనలు జరిగినాయి ప్రజలందరూ ఉపవాసం చేసినారు సాయం కాలం సముద్రపుటొడ్డు సభకు వెళ్లి రాత్రి 8 గంటలకు వచ్చి స్వామికి అభి షేకాలు, అర్చనలూ చేసినారు

సముద్రం ఒడ్డున జరిగిన సభకు మద్రాసులోని పలు ప్రాంతాలనుంచి వచ్చిన ప్రజలు ఒక లక్షన్నరకు పైగా ఉన్నట్లు తోచింది ఈ సభ ఇంత జయ ప్రదంగా జరిగేటందుకు శనివారం ఉదయము (1919 ఏప్రిల్ 5) నుంచి ప్రయ త్నాలు ప్రారంభమయినాయి నేషనలిస్ట్ పత్రికా సంపాదకులును, ఆంధ్రదేశ సత్యాగ్రహ సభాకార్యదర్శులు, సుప్రసిద్ధ దేశాభిమానులు అయిన గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు టంగుటూరి ప్రకాశంగారు చెన్నపురిలోని పలు ప్రదేశాలకు పోయి సత్యాగ్రహ వ్రతదీక్షను గురించి ప్రబోధించడమేగాక, ఆదివారంనాడు నిర్వర్తించవలసిన కార్యక్రమానికి కట్టుదిట్టాలను చేసినారు గాంధీజీ ఆదేశానుసారం శనివారం రాత్రి సత్యాగ్రహ వ్రతులు ఉపవాసం ప్రారంభించినారు

ఆరవ తేదీ (ఏప్రిల్ 1919) సాయంకాలం 4 గంటలకే బీచి రోడ్డునుంచి బండ్లు పోవడానికి వీలులేనంతగా జనం క్రిక్కిరిసి పోయినారు దాదాపు రెండు లక్షల మంది జనం ఉన్నట్లు కనబడింది తమిళులు, ఆంధ్రులు, పారశీకులు, మహారాష్ట్రులు, కన్నడులు, మళయాళీలు మొదలైన వారంతా ఈ సభకు వచ్చినారు కర్ణాటక మిల్లుపనివాళ్ళు కూడా వేయిమంది వచ్చినారు బ్రాహ్మ ణులు వేదపారాయణం చేసినారు కస్తూరి రంగయ్యగారు అధ్యక్షత వహించి నారు బ్రాహ్మణులు గాంధీ మహాశయుని కుమారుడు దేవదాసు గాంధీని వేదపారాయణంతో పూర్ణకుంభంతో ఆహ్వానించినారు జనబాహుళ్యంవల్ల ఐదు సభా వేదికలు ఏర్పాటుచేయడం జరిగింది మొదటి వేదికపైన శ్రీ బి వి నరసింహాయ్యరు గాంధీ మహాత్ముని సందేశం తమిళభాషలో చదివినారు "దక్షి ణాఫ్రికాలో సత్యాగ్రహం ప్రారంభించినప్పుడు ప్రాణాలను సమర్పించిన నారాయణస్వామి ప్రదేశానికి చెందిన మీకు నా సందేశం పంపడానికి ఆనందిస్తూ న్నాను అని గాంధీజీ పంపిన సందేశం విని ప్రజలు ఉత్సాహంతో ఉద్రూత లూగినారు

తరవాత కృష్ణస్వామి అయ్యర్, సత్యమూర్తి, జి వి ఎన్ రాఘవన్ గార్లు ఉపన్యసించినారు అందరు రౌలట్ చట్టాలను నిరసించి వాటిని ఉపసంహ రించుకోవలెనని ప్రభుత్వాన్ని కోరుతూ ప్రసంగించినారు ప్రభుత్వంవారు రౌలట్ శాసనం ఉపసంహరించుకోనట్లయితే సామ్రాజ్య శాసనసభలోని భారతీయ సభ్యులు రాజీనామా ఇయవలెనని కూడా వారు చెప్పినారు

తరవాత అధ్యక్షులు కస్తూరి రంగయ్యగారు మీ రింతమంది ఇక్కడకు రావడం, శాంతంగా ఉండడం నాకు చాలా సంతోషంగా ఉంది ఈ సభ

విషయమై పోలీసు కమిషనర్ గారితో మాట్లాడినారు ప్రశాంతంగా ఉంటుం దని నేను హామీ ఇచ్చినాను అట్లాగే జరిగింది ఈ సభ అసాధారణంగా ఉండవలసింది దురదృష్టవశాత్తు ఈ రౌలట్ చట్టంవల్ల విచారకరంగా మన మిక్కడ సమావేశం కావలసి వచ్చింది నేను యూరపు ఖండానికి పోయినప్పుడు ఇంగ్లండ్ వెళ్ళినాను మన చక్రవర్తి చక్రవర్తినులతో మాట్లాడినాను వారు భారతీయులపట్ల భారతీయ సమస్యలపట్ల సానుభూతితో ఉన్నారు కాని చక్ర వర్తిగారి ఏజెంట్లు కొందరీ శాసనానికి కారకులు కనుక చక్రవర్తిగారికి మన బాధలను తెలియచెప్పడం మన కర్తవ్యం అన్నారు

టి వి గోపాలస్వామిగారు అధ్యక్షులకు వందనములు సమర్పించినారు గాంధీ మహాత్ముని కుమారుడు దేవదాసుగాంధీ జాతీయగీతం పాడగా సభ సమాప్తమయింది

## రెండో వేదిక

శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారి అధ్యక్షత క్రింద సభ జరిగింది వేలకొద్దీ ప్రజలు పాల్గొన్నారు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మొద లయినవారు, సత్యాగ్రహ వ్రతదీక్షను గురించి ప్రసంగించినారు గాంధీ, డాక్టర్ సుబ్రహ్మణ్యయ్యర్ గార్ల సందేశాలు సభలో వినిపించినారు

మూడో వేదికకు టి వి వెంకటరామయ్యర్ గారు అధ్యక్షత వహించి నారు

నాలుగో వేదికకు చిదంబరం పిళ్లెగారు అధ్యక్షులు ఐదవ వేదికలో స్త్రీలు సమావేశమయినారు శ్రీ గద్దె రంగయ్యనాయుడు మొదలయినవారు ఉపన్యసించినారు ఈ సత్యాగ్రహ సభ రాత్రి 7-30 కు పూర్తి అయింది సత్యాగ్రహ దినంలో అన్ని దుకాణాలు కాఫీ హోటళ్లు మూతపడ్డప్పటికి బెసెంటమ్మగారి యాజమాన్యంలో నడుస్తూండిన వై యం సి ఎ కాఫీ హోటలు మాత్రం తెరిచిఉంది (అది మెంబర్లకోసమట)

## బెజవాడలో

1919 ఏప్రిల్ 6 న బెజవాడ పౌరులు అత్యుత్సాహంతో సత్యాగ్రహ వ్రతం అవలంబించినారు హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, క్రైస్త వులు, వర్తకులు, కూలీలు మొదలయిన అన్ని వర్గాలవారూ ఈ వ్రతంలో పాల్గొ న్నారు ఫ్యాక్టరీలు, కాఫీ హోటళ్లు, సోడాకొట్లు, తమలపాకు దుకాణాలు అన్నిటిని మూసివేసినారు ఉదయం మేళతాళాలతో అన్ని వీధులలోనూ ఊరే గింపు జరిగింది జనులత్యంతోత్సాహంతో గుంపులు గుంపులుగా ఉత్సవంలో పాల్గొన్నారు వేలకొద్దీ జనం కృష్ణానదిలో స్నానంచేసి రౌలట్ శాసనాలు రద్దు కావలెననీ హిందూదేశం దిన దినాభివృద్ధి పొందవలెననీ కోరుతూ అత్యంత భక్తి పురస్సరంగా దేవాలయాలలో మసీదులలో దైవ ప్రార్థనలు చేసినారు

మహమ్మదీయ వర్తకులు మధ్యాహ్నం 12 గంటలకు, పెద్ద సభ జేసి రౌలట్ శాసనం రద్దు కావలెనని తీర్మానించినారు వేలకొద్దీ కుటుంబాలు దినమంతా ఉపవాసాలు చేసినారు నగరంలో యావత్తు వ్యాపారం ఆగిపోయింది సాయంకాలం మిషన్ హైస్కూలుకు ఎదురుగా ఉన్న మైదానంలో పెద్ద సభ జరిగింది షుమారు 5,000 మంది సభకు హాజరైనారు (శ్రీ) సుందరరామశాస్త్రి గారు సభాధిపత్యం వహించినారు పండితులు, వర్తకులు, రైతులు, ప్లీడర్లు అందరూ ఉపన్యాసాలిచ్చినారు సభ మూడు గంటలు జరిగింది రౌలట్ శాసనం రద్దు చేయవలసిందని జార్జి సార్వభౌమునికి విన్నవించ కోరుతూ ప్రధాన మంత్రిగారికి తంతివార్త పంపడానికి సభవారు తీర్మానించినారు బెజవాడలోని సత్యాగ్రహ సమావేశాలు ప్రదర్శనలు, ఉత్సవాలు ఎంతో ప్రశాంతంగా జరిగినాయి

## గుంటూరులో

సత్యాగ్రహ వ్రతం ప్రశాంతంగా జరిగింది వందలకొద్దీ ప్రజలు ఉపవాసం చేసినారు దుకాణాలన్నీ మూతపడినాయి హోమ్‌రూల్ లీగ్ నుంచి పెద్ద ఊరేగింపు బయలుదేర వీధులన్నీ తిరిగింది రౌలట్ శాసనాల నుపసంహరించవలసిందిగా కోరుతూ అనేక దేవాలయాలలో ప్రజలు ప్రార్థనలు చేసినారు సాయంకాలం పెద్ద బహిరంగసభ జరిగింది కొండ వెంకటప్పయ్య పంతులుగారు సభాధిపత్యం వహించినారు రౌలట్ శాసనం రద్దు చేయగోరుతూ చక్రవర్తిగారికి తంతివార్త పంపించినారు

## పెదపాలెంలో (గుంటూరుజిల్లా)

హోమ్ రూల్ లీగ్ వారి ప్రాపున తెనాలి తాలూకా పెదపాలెం గ్రామంలో సత్యాగ్రహ వ్రత సందర్భంలో ప్రజలు మహాత్మాగాంధీగారి పటాన్ని వీధులవెంట ఉత్సాహంతో ఊరేగించినారు చాలామంది ఉపవాసాలు చేసినారు రౌలట్ శాసనాలవల్ల ప్రజలు కోపోద్రిక్తులవుతున్నారు కాబట్టి వాటిని రద్దుచేయవలసిందని చక్రవర్తికి విన్నవించవలసిందని ప్రధానమంత్రిని కోరుతూ తంతివార్త పంపడానికి తీర్మానించినారు

## నారాయణవనంలో

చిత్తూరుజిల్లా నారాయణవనంలో కొంతమంది ఉపవాసముండి, సాయంత్రం 6 గంటలకు సభ జేసి రౌలట్ బిల్లులను రద్దుచేయవలసిందని తీర్మానించినారు

## విశాఖపట్టణంలో

సత్యాగ్రహ వ్రతం ఇక్కడ అతి పవిత్రంగా జరిగింది దుకాణాలన్నీ

మూతబడినాయి వాణిజ్యాలు ఎని ఆగిపోయింది [illegible] చేసినారు దేవాలయాలలో మసీదులలో ప్రార్థ[illegible] లీలా కమిటీవారన్ని మందిరాలలోనూ [illegible] కాలం సముద్రాని కెదురుగా ఉన్న టౌన్ హాలులో [illegible] అన్ని వర్గాలవారూ దాదాపు మూడువేలమంది [illegible] పంతులుగారు సభాధ్యక్షత వహించిన[illegible] [illegible] మయింది అధ్యక్షోపన్యాసాంతంలో రౌలట్ [illegible] చక్రవర్తిగారిని కోరుతూ తీర్మాని [illegible] తీర్మానం చేసినారు కార్యక్రమమం[illegible] తెలుగులో [illegible] పల్లి రామచంద్రశాస్త్రిగారు, వసంత [illegible] [illegible]గ్రహ శిక్షాక్రమం గురించి ఉపన్యాసాలు చేసినారు [illegible] జరిగింది

## ఏలూరులో (ప॥ గోదావరి)

ఏలూరు పురవాసులు కొంతమంది ఉపవా[illegible] వకీళ్ల సంతకాలతో ఒక బహిరంగ [illegible] టౌన్ హాలులో జరిగిన ఆ సభకు [illegible] సూర్య[illegible] వహించినారు అధ్యక్షులు రౌలట్ [illegible]నికి తమ [illegible] ప్రసంగించిన తరవాత దానిని రద్దు చేయవలసిందని కో[illegible] నించినారు వకీలు మాధవరావుగా[illegible] తీర్మా[illegible] [illegible] 'హిత కారిణి' పత్రికా సంపాదకులు మున్నంగి [illegible]

## బరంపురంలో (గంజాం)

నేటి ఉదయం బరంపురంపౌరు[illegible] సత్యాగ్రహ ప్రత[illegible]లో [illegible] నిర్వర్తించినారు ఉదయాన్నే ఓఢ్ర బ్రాహ్మణులు [illegible] బ్రాహ్మణులను కలిసి నగర సంకీర్తనం చేసినారు హిందువు[illegible] [illegible] దుకాణా లను మూసివేసినారు కసాయి దుకాణాలు కూడా మూ[illegible] [illegible] బళ్ళు ఆగిపోయనాయి సాయం సమయంలో మైదానంలో పెద్ద స[illegible]గింది చాలామంది ప్రజలు సభకు వచ్చినారు పురప[illegible] ఉపాధ్య[illegible] [illegible]మూసు స్వామిగారు సభాధిపత్యం వహించినారు ఒరియా పత్రిక '[illegible]' [illegible]కులు రౌలట్ శాసనంను ఖండించి దానిని రద్దు చేయ[illegible] [illegible] మంత్రిని కోరుతూ తీర్మానం ప్రతిపాదించగా జిల్లాబోర్డు ఉపాధ్య[illegible] రావుబహద్దూర్ వెంకటకృష్ణయ్య పంతులుగారు, రావుసాహెబ్ పాత్రోగారు, సుప్రసిద్ధ న్యాయ వాదులు వేంకటేశ్వరులుగారు, పట్టాభి రామయ్యగారు తీర్మానం బలపరిచి నారు సత్యాగ్రహ ప్రతావలంబకులేగాక ఇతరులు కూడా ఉపవాసాలు చేసి

నారు దుకాణాలన్నీ మూతబడినాయి ఇదివరకెప్పుడూ ఇట్లా జరగలేదు

**రాజమహేంద్రవరంలో** (తూ॥ గోదావరి)

రాజమహేంద్రవర పౌరు లనేకమంది అతి పవిత్రమగు సత్యాగ్రహ వ్రతాన్ని అవలంబించినారు ఉదయాన్నే వేలకొద్దీ ప్రజలు గోదావరిలో స్నానం చేసి దేవాలయాలకు పోయి ప్రార్థనలూ అర్చనలూ అభిషేకాలూ చేసినారు మసీదులలో మహమ్మదీయుల ప్రార్థనలు జరిగినాయి మార్కండేయస్వామి కోవెలలో వందలకొద్దీ జనులు పూజా పురస్కారాలు జరిపిన తరవాత జాతీయ గీతాలతోను వేదపారాయణంతోనూ నగర సంకీర్తనం చేసినారు బజారులు మూతబడినాయి కొట్లను కట్టివేయడం జరిగింది కూలివాళ్లూ బండ్లవాళ్లూ కూడా తమ పనులను నిలిపివేసినారు ఐదువేల పై చిలుసు కరపత్రాలను సత్యాగ్రహ వ్రతం ప్రోత్సహిస్తూ పంచిపెట్టినారు నగరమంతా విచారం వెల్లడించింది సాయంకాలం బహిరంగసభ జరిగింది సుమారు ఆరువేలమంది సభకు వచ్చినారు బారిస్టర్ కందుల వీరరాఘవస్వామిగారు సభాధిపత్యం వహించి "ఐరోపా యుద్ధంలో ఇండియా బ్రిటిష్ ప్రభుత్వానికి చేసిన గొప్ప సహాయానికి ప్రతిఫలంగా మనకీ రౌలట్ చట్టం ప్రసాదించినారు చూసినారా బ్రిటిష్‌వారి న్యాయం!" అన్నారు బాబూ బిపిన్‌చంద్ర పాల్‌గారు విప్లవోద్యమ చరిత్రను సంగ్రహంగా చెప్పి "ఇట్లాంటి అత్యంత నిరంకుశాధికారయుతాలయిన శాసనాలు ప్రజలకు పిచ్చెత్తించి ఆత్మహత్యకు మార్గదర్శకాలు కాగలవు రౌలట్ శాసనం బ్రిటిష్ న్యాయవృక్షాన్ని మూలచ్ఛేదం చేస్తున్నది నాగరకతా శిరోమణులైన విదేశీయ నిరంకుశాధికారుల పాలబడిన హిందూదేశంవంటి దేశాలలో సత్యాగ్రహ వ్రతం బాగా సాధ్యం కాగలదు" అన్నారు ఆ సభలో రౌలట్ శాసనాలను ఖండించి వాటిని రద్దుచేయవలసిందని చక్రవర్తిగారిని కోరుతూ తీర్మానించినారు ఈ తీర్మానము మాంటేగుగారికి పంపడానికి అధ్యక్షునికి అధికార మిచ్చినారు సత్యాగ్రహాన్ని ప్రోత్సహిస్తూ మరో తీర్మానము జరిగింది మహమ్మదాలీజిన్నా రాజీనామా ఇచ్చినందుకు అభినందిస్తూను, మహాత్మా మున్షీరామ్‌కు సానుభూతి తెలుపుతూ తీర్మానాలు చేయడం జరిగింది చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, ఉమర్ అలీషా కవిగారు, నారాయణయ్యగారు తెలుగులో గంభీరోపన్యాసాలు చేసినారు అప్పన్నశాస్త్రి, కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గార్లు సంస్కృత శ్లోకాలను చదివినారు సభాధ్యక్షులకూ, బిపిన్ చంద్రపాల్ గారికీ వందనాలు చెప్పిన తరవాత సభ ముగిసింది సభ ప్రశాంతంగా జరిగింది

**చిరివాడ (కృష్ణాజిల్లా)**

చిరివాడ గ్రామస్థులు శివాలయంలో సభచేసి రౌలట్ శాసనం పౌరుల స్వాతంత్ర్యానికి భంగకరంగా ఉన్నది కాబట్టి దానిని రద్దుచేయవలసిందని తీర్మానించినారు

## గంపలగూడెం (కృష్ణాజిల్లా)

ఏప్రిల్ 6 వ గంపలగూడెంలో కుమార రాజా శ్రీ కోటగిరి వెంకట కృష్ణారావు బహద్దర్ గారు, వారి అనుచర వర్గము, నౌకరులు, జనులతో దేవాలయానికి పోయి సత్యాగ్రహ వ్రతాన్ని స్వీకరించినారు యువతులు కూడా ఈ వ్రతం అవలంబించినారు గ్రామంలో దుకాణాలు మూసినారు సాయంత్రం 6 గంటలకు పాతదివాణంలో గంపలగూడెం రాజా శ్రీ కోటగిరి జగన్నాథ రాయణంగారి యాజమాన్యంలో బహిరంగసభ జరిగింది 200 మంది జనులు సభకు వచ్చినారు రౌలట్ బిల్లును శ్రీ [illegible] లక్ష్మీకాంతకవిగారు, శేషాద్రి రమణకవులు తీవ్రంగా ఖండించినారు శ్రీ కోట బాపయ్యగారు గాంధీ మహాత్ముని జీవితచరిత్ర సంగ్రహంగా ఉపన్యసించినారు

## సంగంలో (నెల్లూరుజిల్లా)

స్వరాజ్య సమితివారు ఆదివారము (6-4-1919) న సత్యాగ్రహోపవాస వ్రతం శ్రద్ధాభక్తులతో నిర్వర్తించినారు ప్రాతఃకాలంలో పినాకినీ నిర్మల జలాలలో సుస్నాతులయిన తరవాత వ్రతనియమాలను గురించి అక్కడక్కడా బహిరంగోపన్యాసాలు చేసినారు మధ్యాహ్నం ప్రారంభించిన దేవార్చనలు సాయంకాలం 7-30 వరకూ జరిగినాయి

రాత్రి 9 గంటలకు ఈశ్వరోత్సవం ప్రారంభించి రౌలట్ బిల్లుల గురించి బహిరంగోపన్యాసాలు చేసినారు ప్రజలందరు లౌకిక వ్యాపారాలను వదలి వ్రత దీక్షా నిమగ్నులయి ఉన్నారే కాని గ్రామాధికారి ప్రతిఘటనకు లొంగలేదు

## ఘంటశాలలో (కృష్ణాజిల్లా) (6-4-1919)

గాంధీ మహాత్ముని ఆదేశం ప్రకారం ఘంటశాల గ్రామస్థులు కొందరు సత్యాగ్రహ వ్రతం అవలంబించి ఉపవాసం చేసినారు సాయంకాలం నాలుగు గంటలకు ఘంటశాల యూనియన్ పంచాయతీ అధ్యక్షులు శ్రీ వేమూరి వెంకయ్యగారి అధిపత్యంలో సభ సమావేశమయింది పెక్కుమంది ప్రజలు సభలో పాల్గొన్నారు శ్రీ వేమూరి రత్నయ్యగారు సత్యాగ్రహం గురించి సహేతుకంగా ఉపన్యసించినారు సభవారు "ఇండియా గవర్నమెంట్ వారిచే ఆమోదింపబడిన రౌలట్ బిల్లులు ప్రజల జన్మస్వాతంత్ర్యం నిర్మూలిస్తుంది కనక ఈ సభవారు ఆ చట్టాలను తీవ్రంగా ఖండిస్తున్నారు" అని తీర్మానించినారు

## గుడివాడలో (కృష్ణాజిల్లా)

గాంధీ మహాత్ముని ఆదేశప్రకారం సత్యాగ్రహ వ్రతాన్ని అనుష్ఠించడం జరిగింది. ఉదయం 9 గంటలవరకు భజనలతో నగర సంకీర్తనం, అప్పటినుంచి 12 గంటలవరకు దేవాలయాలలో పూజలు అభిషేకాలు సహస్ర నామార్చనలు

జరిగినాయి మధ్యాహ్నం 1, 3, 5 గంటల వేళలలో మసీదులలో నమాజులు జరిగినాయి వర్తకులు దినమంతా దుకాణాలు కట్టివేసినారు పురవాసులలో కొందరు ఉపవాసాలు చేసినారు రాత్రి 8½ నుంచి 1 గంటవరకు మార్కండేయోపాఖ్యానం హరికథా కాలక్షేపం జరిగింది సుమారు వేయిమంది సమావేశమయినారు రౌలట్ శృంఖలాబంధిత అయిన భారతమాతా, గాంధీ మహాత్ముని ప్రత్యేక చిత్రలేఖన పటాల ప్రదర్శనం దినమంతా జరిగింది

## కొవ్వూరులో (ప॥ గోదావరి)

ఏప్రిల్ 6 న ఈ గ్రామంలో చిత్రకూట ప్రదేశంలో సాయంత్రం 6 గంటలకు రౌలట్ బిల్లులకు అసమ్మతిని ప్రకటించేటందుకు గూడ వెంకటరామయ్యగారి ఆధిపత్యంకింద బహిరంగసభ జరిగింది శ్రీ వేమూరి లక్ష్మయ్యగారు జాతీయగీతం చదివినారు అగ్రాసనాధిపతి రౌలట్ చర్చలనూ ఆ బిల్లులనూ గురించి ఉపన్యసించిన తరవాత మహాత్మాగాంధీని గురించి రామసుబ్బయ్యగారు ఉపన్యసించినారు వేమూరి లక్ష్మయ్యగారు సత్యాగ్రహం గురించి గంభీరంగా ఉపన్యసించినారు "రౌలట్ బిల్లులు ప్రజల వ్యక్తిస్వాతంత్ర్యాలకు స్వయం నిర్ణయసూత్రాలకు భంగకరాలుగా ఉన్నాయి ఇట్లాంటి శాంతిసమయాలందిటువంటి కఠిన శాసనప్రయోగం ఆందోళనకారణం కాబట్టి దీనిని ప్రజల అభిమతం ప్రకారం ఉపసంహరించుకోవలెనని మాంఛేగు ప్రభువును, రాజప్రతినిధినీ ఈ సభవారు కోరుతున్నారు" అను తీర్మానం అంగీకరింపబడింది

## సుబ్బారెడ్డి పాలెంలో

మహాత్మాగాంధీగారి ఆదేశప్రకారం ఏప్రిల్ 6 న సుబ్బారెడ్డి పాలెంలోని యువకులందరూ హరిభజనలతో గ్రామంచుట్టూ తిరిగివచ్చినారు ఒక నారీరత్నం భజంత్రీలకు ఫలాలను, పానీయాలను ఇచ్చి శ్రమనివారణ జేసింది మా శర్మగారు గీతమాలిక వ్రాసి చదివినారు చెన్నపురి నివాసులు సుబ్బారావుగారు సత్యాగ్రహ వ్రతావలంబనం గురించి ఉపన్యసించిన తరవాత శ్రీ నారసింహులుగారు ఉపవాస విశేషం ప్రజాసమూహానికి తెలిసేటట్లు వివరించినారు మధ్యాహ్నము 2 గంటలకు ప్రహ్లాద చరిత్రార్థం చెబుతూ శ్రోతలనానందింపచేసినారు రాత్రి 8½ గంటలకు కార్యక్రమం పూర్తిఅయింది

## కోలవెన్నులో (కృష్ణాజిల్లా)

మహాత్మాగాంధీగారి ఆదేశానుసారం సత్యాగ్రహ దీక్షావలంబనకు రౌలట్ చట్టాన్ని ఖండించడానికి ఏప్రిల్ 6 న ఆదివారం ఉపవాసం చేయడానికి బెజవాడ తాలూకా ప్రజల సభ పిన్నమనేని నరసయ్యగారి ఆధిపత్యం కింద జరిగింది కంకిపాడు, పునాదిపాడు, ప్రొద్దుటూరు, కుందేరు, నెప్పల్లి, పెనమ

లూరు ఈడుపుగల్లు, రొయ్యూరు, బెజవాడ, గోపాడు, [illegible], [illegible]స్నరు మొదలయిన గ్రామాలనుంచి అనేకులు ఆ సభకు హాజరైనారు [illegible] కోల వెన్ను గ్రామంలో శ్రీయుత యర్లగడ్డ వెంకటసుబ్బయ్యగారి [illegible] చావడిలో జరిగింది సభలో 600 మంది ప్రతినిధులున్నారు ఈశ్వరప్రార్థన తరవాత అగ్రాసనాధిపతి ఉపన్యాసం జరిగింది

(1) ప్రభుత్వంవారు చేసిన రౌలట్ చట్టం భారతీయుల [illegible] హక్కులకు భంగకరంగా ఉన్నందువల్ల, నాగరక దేశాలలో ఇట్టి చట్టాలు [illegible] లేనందువల్ల, ఈ ఆక్ట్‌ను రద్దు చేయవలసిందిగా చక్రవర్తిగారిని ఈ సభవారు కోరుతున్నారు

(2) రౌలట్ అక్ట్ రద్దు పడేవరకూ ప్రజల [illegible] కాపాడుకోవడానికి శ్రీ మహాత్మాగాంధీ మహాశయుల ఆదేశాలను [illegible] సత్యాగ్రహవ్రతం అవలంబించడం న్యాయమూ ధర్మమూ" అనే ఈ రెండు తీర్మానాలు సభవారంగీకరించినారు

## గుంటూరులో

సత్యాగ్రహవ్రతం గురించి రౌలట్ చట్టం గురించి [illegible] చేయడానికి ఏప్రిల్ 4 వ తేదీని ఏలూరు బజారులో బహిరంగసభ జరిగింది వర్తకులు, పురప్రముఖులు, కార్మికులూ సభలో ఉన్నారు కొండ వెంకటప్పయ్య పంతులుగారు మృదుమధురంగా సభ్యుల మనస్సులు కరిగేటట్టు ఉపన్యసించినారు ప్రథమంగా గాంధీజీ జీవితం గురించి, ఆయన సాధించిన [illegible] కార్యాలను గురించి ముచ్చటించి రౌలట్ చట్టపు కీడులను విప్పి చెప్పినారు మరునాడు సంగటిగుంట బజారులో మరొక సభ జరిపినారు [illegible] ఆదివారంనాడుపవాసంచేసి సత్యాగ్రహవ్రతం అవలంబించవలసిందని శ్రీ [illegible]ండి సుబ్బారావు పంతులుగారు, శ్రీ రామస్వామిగుప్తగారు ఉపన్యసించినారు ఆనాడు దుకాణాలను మూసి ఉపవాసం ఉండి భజనలతో [illegible] తిరిగి దేవాలయాలలో అభిషేకాలు చేయించవలెనని ప్రబోధించినారు ఏప్రిల్ 6 న శ్రీ కొండ వెంకటప్పయ్యపంతులుగారిమీదను మద్ది[illegible] రాధాకృష్ణయ్యగారి మీదను ప్రభుత్వాధికారులు నోటీసులు జారీచేసినారు వారిద్దరూ కచ్చేరికి పోయి ఆరో తేదీ అల్లరికి తావుండదని హామీ ఇచ్చిన తరవాత ఆ ఉత్తరువు ఉపసంహరించబడింది కాని 6 వ తేదీని ఉత్సవం శ్రీ ఆంజనేయదేవాలయం దగ్గర ఉండగా పోలీసువారు తిరిగి మరొక ఉత్తరువును జారీచేసినారు ఉత్సవం మాత్రం ప్రశాంతంగా జరిగింది వర్తకులు క్రితం రోజున చేసుకొన్న తీర్మానం ప్రకారం దుకాణాలను మూసివేసినారు ప్రభుత్వంవారు దుకాణాలు తెరవవలసిందని చాటింపు వేసినారు కొందరు ప్రభుత్వాధికారులు దుకాణాలు మూయవద్దని వర్తకులను బెదిరించినారు అయినప్పటికీ వర్తకులందరూ దుకాణాలను మూసివేసినారు సాయంత్రం 6 గంటలకు జమీందారువారి హై[illegible]

నంలో బహిరంగసభ జరిగింది సుమారు మూడువేలమంది సభకు హాజరైనారు వర్తకులు ప్లీడర్లు డాక్టర్లు మొదలయినవారు సభలో ఉన్నారు కొండ వెంకటప్పయ్యపంతులుగారు అధ్యక్షులుగా ఉన్నారు శ్రీ దేశిరాజు హనుమంతరావు, మాధవపెద్ది కాళిదాసు, కనగిపల్లి రామస్వామిగుప్త, ఏకా లక్ష్మీనరసింహం, పాటిబండ్ల సూర్యనారాయణగార్లు రౌలట్ చట్టం గురించి సత్యాగ్రహం గురించి ఉపన్యసించిన తరువాత రౌలట్ శాసనాన్ని నిరసిస్తూ తీర్మానం జరిగింది ఆ తీర్మానం అధ్యక్షులు రాజప్రతినిధికి పంపినారు

ఈమనిలో

దుగ్గిరాలఫిర్కా రైతు మహాజనసభ తెనాలి తాలూకా ఈమనిలో ప్రత్యేకం నిర్మించబడిన పందిరిలో జరిగింది అది తెనాలి వకీలు కొండముది శ్రీరాములు పంతులుగారి యాజమాన్యంలో సమావేశమయింది వివిధ గ్రామాలనుంచి ప్రతినిధులు హాజరైనారు ఆహ్వాన సంఘాధ్యక్షులు పెద్దిరాజు కృష్ణయ్యగారు స్వాగతోపన్యాసం చదివినారు అంచె శివయ్యగారు, పులిపాక వేంకటరామారావుగార్లు కొండముది శ్రీరాములుగారిని అధ్యక్షులుగా ఉండమని కోరగా సభవారు ఏకగ్రీవంగా అంగీకరించినారు ముదిగొండ కోటయ్యగారు "మాతృదేవత"ను గురించి పద్యాలు చదివినారు చింతపల్లి రామకృష్ణయ్యగారు స్వాగతపద్యాలు చదివినారు అధ్యక్షులు ఉపన్యాసం ముగించిన తరవాత సభవారి కింది తీర్మానాలు చేసినారు

"కేవలం అనవసరాలును ప్రజా స్వాతంత్ర్య భంగకరాలును పాలక పాలితులకు ఉపద్రవకరాలును అయిన రౌలట్ బిల్లులు ప్రజాప్రతినిధులందరూనిరోధించినా లెక్కచేయకుండా అధికారవర్గం వారామోదించడం శ్రేయోదాయకం కాలేదు కనక ఇకనైనా ఆ బిల్లులు ఉపసంహరించుకొనడానికి ప్రయత్నించవలెనని ఈ సభవారు దృఢ నిశ్చయంతో ప్రభుత్వంవారికి నివేదిస్తున్నారు

"రౌలట్ శాసనాలు ప్రజల జన్మ స్వాతంత్ర్యానికి భంగకరాలనీ పాలక, పాలితుల శ్రేయస్సుకు ఉపద్రవకరాలనీ మేము విశ్వసించడం వల్ల వాటి ఉపసంహారణకు సత్యాగ్రహ వ్రతం అవలంబిస్తున్నాము"

తుళ్లూరులో

ఈ గ్రామంలో కొంతమంది సత్యాగ్రహ వ్రతం తీసుకొని ఏప్రిల్ 6 న ఉపవాసాలుచేసి రౌలట్ చట్టాన్ని ప్రతిఘటిస్తూ తీర్మానం చేసినారు

కోడూరులో

జ్ఞానోదయ నిలయ సభ్యుల ప్రోత్సాహంతో (8-4-19) శ్రీరామనవమి శుభదినాన సత్యాగ్రహ వ్రతం జయప్రదంగా జరపబడింది దుకాణాలన్నీ మూసినారు పౌరులందరూ ఉదయం పురసమీపాన ఉన్న నదిలో స్నానంచేసి

రౌలట్ శాసన నిర్మూలానికి దైవప్రార్థనలు చేసినారు కొందరు ఉపవాసాలు చేసినారు దాదాపు 11 గంటలకు మహాత్మాగాంధీ పటంతో ఊరేగింపు జరిపినారు

సాయంకాలం 6 గంటలకు అంకాళమ్మ దేవాలయంలో శ్రీ దుగ్గు గురవయ్య శ్రేష్ఠిగారి అధ్యక్షతకింద గొప్ప సభ జరిగింది రౌలట్ బిల్లును రద్దు చేయవలసిన అవసరం గురించి వేదం వేంకటకృష్ణ శర్మగారు ఉపన్యసించినారు సభ జయజయ ధ్వానాలతో ముగిసింది

**విశాఖపట్టణంలో**

ఈ పట్టణంలో వసంతరావు బుచ్చి సుందరరావుగారు సత్యాగ్రహావలంబన వ్రతం జయప్రదంగా నడిపించినారు పట్టణంలోని అన్ని సంఘాలతో సహా దండోరా మొదలయిన ప్రకటనల ద్వారా రౌలట్ బిల్లులను గురించి, సత్యాగ్రహ వ్రతం గురించి ప్రజలకు బాగా తెలిసేటట్లు చేసినారు నగరంలోని అంగళ్లు, కాఫీ క్లబ్బులు, కసాయి దుకాణాలతో సహా మూసివేసినారు సుమారు మూడువేలమంది ఉపవాసం చేసినారు సాయంత్రం సముద్రపు ఒడ్డున 5½ గంటలకు మల్లిమడుగుల బంగారయ్యగారి అగ్రాసనాధిపత్యంలో సభ జరిగింది పులిగడ్డ సత్యనారాయణగారూ బుచ్చిసుందరరావుగారూ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఉపన్యాసాలిచ్చినారు సభ ప్రశాంతంగా, విజయవంతంగా జరిగింది

**నెల్లూరులో**

పురజనులు, హోంరూల్ సభవారు ఏప్రిల్ 6వ తేదీని సత్యాగ్రహ వ్రతం నిర్వర్తించినారు ఉదయం 6 గంటలకు పినాకినీ నదిలో రంగనాయకస్వామి దేవళంవద్ద స్నానాలుచేసి, భజనలతో హరి సంకీర్తనతో ఆంజనేయస్వామి దేవళంవద్దకు పౌరులు ఊరేగుతూ వచ్చినారు అనేకమంది ఉపవాసాలు చేసినారు సాయంత్రం టౌన్ హాలులో బహిరంగసభ జరిగింది సభలో రౌలట్ శాసనాన్ని ఖండిస్తూ సత్యాగ్రహ వ్రతానికి పూనుకోవలెనని తీర్మానం చేసినారు

**హైదరాబాదులో గాంధీజీ**

1919 ఏప్రిల్ 1వ తేదీన గాంధీజీ సికిందరాబాదు రైల్వేస్టేషన్‌లో దిగి హైదరాబాదులోని ప్రముఖులైన (శ్రీమతి సరోజినీనాయుడుగారి భర్త) డాక్టర్ ముత్యాల గోవిందరాజులనాయుడుగారి ఇంటికి పోయినారు అక్కడ ఆయనను శ్రీ వామన్‌నాయక్ కలుసుకొన్నారు శ్రీమతి సరోజినీదేవి సోదరుడు భూపేంద్రనాథ చటోపాధ్యాయ కూడా అక్కడ ఉన్నాడు మరునాడు శ్రీ అక్బర్ హైదరీ గాంధీజీ దగ్గరికి పోయి తన మోటారులో ఆయనకు నగరమంతా చూపించినారు

తరవాత గాంధీజీ బొంబాయికి వెళ్లినారు. ఆయసను డాక్టర్ నాయుడు, ఆయ కుమార్తె సాగనంపినారు

ఈ విషయం ఘనత చెందిన నిజాం ప్రభువుకు ఉన్నతోద్యోగుల ద్వారా తెలిసింది

## రామచంద్రపురంలో (తూర్పుగోదావరిజిల్లా)

తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురంలో శ్రీ గాంధీమహాత్ముని సందేశం శిరసావహించి కొందరు ప్రముఖులు ఉదయం గౌతమీజలాలలో సుస్నాతులై సత్యాగ్రహ విధానాన్ని పురజనులకు బోధిస్తూ వీధులలో తిరిగి దేవాలయాలలో ప్రార్థనలు చేసినారు తరవాత దినమంతా నిష్ఠాగరిష్ఠులై ఉపవాసం చేసి ప్రహ్లాద చరిత్రను పఠించినారు సాయంకాలం పురమందిరంలో పెద్ద సభ జరిగింది రిటైర్డ్ పోలీస్ ఇన్స్పెక్టర్ వాడ్రేవు కామరాజుపంతులు గారు అగ్రాసనాధిపత్యం వహించినారు శ్రీ వెన్నేటి సత్యనారాయణ రేకపల్లి వరుఖులుగార్లు రౌలట్ శాసనం గురించి, జోశ్యుల రామచంద్రరావుగారు సత్యాగ్రహవ్రతం గురించి విపులంగా మాట్లాడినారు రౌలట్ శాసనం రద్దు చేయవలెనని శ్రీ జార్జి సార్వభౌముని వేడుకొంటూ, దానిని రద్దు చేయించేటందుకు గాంధీమహాత్ముడు పూనుకొన్న సత్యాగ్రహ విధానంపట్ల తమకు సంపూర్ణ సానుభూతి ఉందని సభవారు తీర్మానించినారు

రౌలట్ శాసన సందర్భంలో అవలంబించవలసిన సత్యాగ్రహవ్రతాన్ని గురించి మహాత్మాగాంధీ ఆంధ్రదేశంలో, మద్రాసు, విజయవాడలవంటి ఒకటి రెండు ముఖ్య ప్రదేశాలలోనే ప్రసంగించినప్పటికీ ఆ ప్రసంగాల ప్రభావం ఆంధ్రదేశమంతటా విద్యుద్వేగంతో వ్యాపించింది ఆంధ్రలోని పల్లెలలోను పట్టణాలలోనూ కూడా రౌలట్ శాసనాల ఉపసంహారానికి సభలు జరిగినాయి 1919 ఏప్రిల్ 6 న అనేకమంది గాంధీజీ ఆదేశానుసారం ఉపవాసాలు చేసి సత్యాగ్రహ దీక్షావలంబనులయినారు తెలుగుదేశపు పత్రికలు సత్యాగ్రహం సమర్థిస్తూ సంపాదకీయాలు వ్రాసినాయి

రౌలట్ బిల్లులను గురించి ఆంధ్రపత్రిక ఇట్లా వ్రాసింది

'ఈ కొత్తబిల్లులు చట్టంగా రూపొందించినట్లయితే ఇంతవరకు నామమాత్రంగా ఉన్న వ్యక్తిస్వాతంత్ర్యం కూడా ఇకముందు పూర్తిగా అదృశ్యమవుతుంది పాలిత పాలకుల మధ్య పరస్పరసంబంధం దృఢతరం కావలసిఉన్న ఈ సమయంలో కొత్త నిర్బంధ శాసనాలు తయారు అవుతూఉండటం ఎంతో విచారకరము అధికారులు తలచుకొంటే పని కాక తప్పదు అయినప్పటికీ, అటువంటి చట్టాలకింద భారతదేశ భావిపరిస్థితులను దూరదృష్టితో గమనించవలసిన విధి ప్రభుత్వానికున్నది కనీసం ఇప్పటికైనా ప్రభుత్వం వారా బిల్లులను ఉపసంహరించుకోవడం ఉత్తమము

కృష్ణా పత్రిక ఇట్లా వ్రాసింది

"రౌలట్ కమిటీవారి సిఫారసులను గట్టిగా రూపొందించడానికి ఇండియా ప్రభుత్వంవారు నిర్ణయించుకొన్నారు. ఇంత పూర్వం వారు ఒక చేతితో మింటోమార్లే సంస్కరణలను ఇచ్చి ఇంకొక చేతితో పత్రికా శాసనం ప్రవేశపెట్టినారు ఇండియాయు స్వపరిపాలన ప్రణాళిక ను తయారుచేసే పనిలో నిమగ్నులై ఇంగ్లాండ్ దేశంలో మాంటేగు ఉండగా, ఇండియ ప్రభుత్వంవారు, మానవ ప్రాథమికహక్కులను నిర్మూలించే నిర్బంధశాసనములను చేయడానికి ఇక్కడ ప్రయత్నిస్తున్నారు"

ఇంకా ఇతర పత్రికలు కూడా ఇదే ధోరణిలో వ్రాసినాయి గాంధీజీ సత్యాగ్రహోద్యమం గురించి ప్రయాగలోని "ప్రచారిణి" పత్రిక ఇట్లా వ్రాసింది

"రౌలట్ బిల్లులను గురించి ప్రజల హృదయాలలో ఆవరించిన ఆందోళన, మహాత్మాగాంధీ అవలంబించిన సత్యాగ్రహవ్రతం ఆ బిల్లుల ఉపసంహరణకు మార్గదర్శకం కాగలదనే విశ్వాసానికి చోటిచ్చింది ఈ మహోత్కృష్టమయిన శాంతిప్రతిజ్ఞ, ఈ సత్యవ్రతాగ్నిజ్వాలలు ఒక రాష్ట్రంనుంచి మరొక రాష్ట్రానికి ఇదివరకే వ్యాపించింది సౌధాంతర్గతులయిన మహారాజులు, వానప్రస్థులయిన యోగులూ కూడా ఈ ప్రమాణపత్రంమీద సంతకాలు చేయడానికి ఆసక్తి చూపుతున్నారు సత్యానికి, న్యాయానికి ప్రపంచంలో ఓటమి అనేది ఉండదు మహాత్మాగాంధీగారి సాత్వికనిరోధ ప్రతిజ్ఞ గృహాంతరాలలోని సంహాగర్జనను సైతం అతిక్రమించింది అది బాంబుకంటెకూడా శక్తిమంతమయినది"

## స్వదేశీ (యంగ్ఇండియానుంచి)

1916 లో మద్రాసులో జరిగిన క్రైస్తవ మిషనరీ మహాసభలో మహాత్మాగాంధీ ఇచ్చిన ఉపన్యాసము

'మీ ముందు ప్రసంగించడానికి నేను చాలా సంకోచిస్తున్నాను పైగా నేను మాట్లాడవలసిన విషయాన్ని గురించి కూడా నేను బహుజాగ్రత్తగా ఆలోచించుకోవలసి వచ్చింది అయినా ఎంతో సున్నితము, కష్టము అయిన విషయం గురించి మాట్లాడవలెనని నా తుదినిర్ణయము స్వదేశీని గురించి నాకు కొన్ని చిత్రమయిన అభిప్రాయాలు ఉన్నాయి. అందువల్ల అది సున్నితమయిన విషయంగా భావిస్తున్నాను ఇక నా అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటించడానికి తగినంత భాషాజ్ఞానం నాకు లేకపోవడంచేత అది కష్టమయిన విషయంగాకూడా నేను భావించవలసివచ్చింది నా శక్తివంచన లేకుండా నేను చేయనిదికానీ చేయడానికి సంసిద్ధంగా లేనిదికానీ మీకు నేను చెప్పబోవడంలేదు అందువల్ల నా ఉపన్యాసంలోని అనేక లోపాలను మీరంతగా పాటించరనే విశ్వాసంతో నేను మీ ముందు మాట్లాడవూనుకొన్నాను గడచిన నెలలో మీరు ఒక వారం ఉపన్యాసానికి బదులుగా ప్రార్థనకు వినియోగించడం నా

కిక్కడ మాట్లాడేటందుకు ప్రోత్సాహకరంగా ఉంది నేనిక్కడ మాట్లాడబోయే విషయం ఫలప్రదం కావలెనని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను మీరు కూడా నా ప్రసంగం కార్యరూపం దాల్చవలెనని ప్రార్థన పూర్వకంగా ఆశీర్వదించవలసినదిగా కోరుతున్నాను

బాగా ఆలోచించి స్వదేశీకి ఒక నిర్వచనం చేసినాను బహుశా అది నా అర్థం స్పష్టంగా వ్యక్తీకరించగలదు మనకు దూరంగా ఉన్న ప్రదేశాలనుకాక మన కత్యంతసమీపంలో ఉన్న పరిసరాలను సేవించడమే స్వదేశీ తత్వమని నా అభిప్రాయము అదేవిధంగా మతసందర్భంలోకూడా నా నిర్వచనానికి అనుగుణంగా నేను నా పూర్వీకుల మతధర్మానికే కట్టుబడవలసి ఉంటుంది అంటే నా కత్యంత సన్నిహితమైన మతధర్మాలను పాటించడమే నా విధి అందులో నాకు లోపాలు కనబడినట్లయితే ఆ లోపాలను తొలగించవలసిన ధర్మం నాది రాజకీయ క్షేత్రంలో నేను దేశీయ సంస్థలనే ఉపయోగించుకొంటాను వాటిలో యేవైనా లోపాలున్నట్లు ధ్రువపడినట్లయితే వాటిని సరిదిద్దుకొంటాను ఆర్థికవిషయాలలో నాకు అత్యంతసన్నిహితులుగా ఉన్న ఇరుగుపొరుగువారు తయారుచేసిన వస్తువులనే వాడుకొంటాను వాటిలో లోట్లు ఉన్నట్లయితే వాటిని తొలగించి ఆ వస్తువులను ప్రయోజనకరంగా పరిణతస్థితికి తెచ్చేటందుకు ప్రయత్నిస్తాను అటువంటి స్వదేశీవ్రతం కార్యరూపం దాల్చడానికి వేయిసంవత్సరాలు పట్టవచ్చునని కొందరంటారు కావచ్చు కాని మనం ప్రజాభ్యుదయంకోసం ప్రయత్నిస్తున్నప్పుడు, మన జీవితకాలంలో అది సఫలం కాకపోయినప్పటికీ మనమా ప్రయత్నాన్ని మానబోవడంలేదు అదేవిధంగా స్వదేశీ మన తరంలో పరిపక్వస్థితికి రాకపోయినప్పటికీ మనమా ప్రయత్నం మానకూడదు

పైన సూచించిన ప్రకారం మూడు శాఖలకు సంబంధించిన స్వదేశీని గురించి సంగ్రహంగా పరిశీలించవలసిఉంది హిందూమతం పూర్వాచారపరాయణమతంగా రూపొందింది దానిలో లీనమైయున్న స్వదేశీ తత్వంబట్టి అది అత్యంతశక్తిమంతంగా తయారయింది తనలో ఇతర మతాలవారిని కలుపుకొనే ప్రసక్తి హిందూ మతానికి లేనందువల్ల మతసహనం అందులో ఎక్కువగా ఉంది పూర్వంవలె విస్తృతమయ్యేశక్తి హిందూమతానికి ఇప్పటికీ ఉన్నది బౌద్ధమతాన్ని అది వెళ్లగొట్టగలిగిందని కొందరు తప్పు అభిప్రాయపడుతున్నారు నిజానికి బౌద్ధమతాన్ని అది జీర్ణించుకొన్నది స్వదేశీ తత్వావలంబనం వల్ల హిందువు ఇతర మతాలను అవలంబించకపోవడం, హిందూమతం తక్కిన మతాలన్నింటిలోకీ అత్యుత్తమయినదనే అభిప్రాయంవల్ల కాదు దానిలో కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టి దాని పరిపూర్ణతకు ప్రయత్నించవచ్చునని అతని అభిప్రాయము నేను హిందూమతం గురించి చెప్పిన ఈ అభిప్రాయం ప్రపంచంలోని ఇతర సుప్రసిద్ధ మతాలన్నిటికీ వర్తిస్తుందనే నా విశ్వాసము- ముఖ్యంగా హిందూమతానికి వర్తిస్తుంది నేను చెప్పినదానిలో ఏమయినా

యథార్థం ఉన్నట్లయితే, ఇండియాలోని గొప్ప క్రైస్తవమత ప్రచారకసంస్థల వారు తమ మతంలో ఇతరులను కలుపుకోవడమనే లక్ష్యం విడనాడి, పరోపకార కార్యక్రమాన్నే ఎందుకు నిర్వర్తించకూడదు? నిజానికి ఇండియాకు వారు చేసిన సేవలు, ఇకముందు వారు చేయనున్న ఉపకారానికి కూడా ఇండియా వారికెంతో ఋణపడి ఉంది అందుకు ఇండియా నిరంతరం కృతజ్ఞత చూపవలసి ఉంది ఇతరులను తమ మతంలో కలుపుకొనే ప్రసక్తిని విడనాడనట్లయితే క్రైస్తవమత ప్రచారకులు, ఇండియాకే కాక క్రైస్తవ మతానికి సహితం మరింత ఉపకారం చేసినవారవుతారు ఈ మాట మీకు నేను చెప్పడం అవినయంగా భావించరని నా తలంపు ఇది నా హృదయపూర్వకమయిన మనవి అదిగాక నేను చెప్పేది మీరు శ్రద్ధగా గమనించవలెనని కోరే హక్కు కూడా నాకు ఉన్నది నేను బైబిలు శ్రద్ధగా చదవడానికి కృషి చేశాను అది మా మతగ్రంథాలలో ఒక భాగంగా భావిస్తున్నాను నా హృదయాన్ని భగవద్గీత ఎంత చక్కగా ఆకర్షించిందో "శర్మన్ ఆన్ ది మౌంట్" కూడా అంత చక్కగా ఆకర్షించింది "లీడ్ కైండ్లీ లైట్" (తమసో మా జ్యోతిర్గమయ) అనే గీతాన్ని, అటువంటి అనేక ఇతర సూక్తులను భక్తితో పఠించడంలో నేనే క్రైస్తవునికీ తీసిపోను వివిధ శాఖలుగా వ్యవహరింపబడుతూ ఉండిన క్రైస్తవమతంలోని సుప్రసిద్ధ ప్రచారకుల ప్రభావానికి నేను లోనైనవాడినే వారిలో కొందరితో నాకు ఈనాటివరకూ స్నేహం ఉంది అది ఒక మహాభాగ్యంగా భావిస్తున్నాను కాబట్టి నేను పైన చేసిన సూచన ద్వేషపూరితుడైన హిందువు చేసిన సూచనగా భావించకండి క్రైస్తవ మతమన్నట్లు గొప్ప అభిమానంగల ధార్మిక తత్వ విద్యార్థి నిష్పక్షపాతబుద్ధితో చేసిన మనవిగా భావించండి ప్రపంచమంతటా విహరించు అనే సందేశాన్ని సంకుచితంగా వ్యాఖ్యానించి, దాని నిజతత్వాన్ని మరుగపడేటట్లు చేయకండి! ఒక మతంలోని వాడు మరొక మతంలో కలియడమనేది చాలా సందర్భాలలో నామమాత్రమేనని నాకు అనుభవపూర్వకంగా తెలిసిన విషయం కొన్ని సందర్భాలలో ఆ మతం మార్పు హృదయపూర్వకంగా కాదు [illegible] జరుగుతూన్నది అంతేకాదు, మతం మార్పు జరిగిన ప్రతి సందర్భానికి వెనక ఒక అశాంతి ఉంటూనే ఉంది అటువంటిదానికి ఆస్కారం లేకుండా చేయవచ్చునని నేను భావిస్తున్నాను అది సాహసమే కావచ్చు నా అనుభవం బట్టి పునర్జన్మ, అంటే హృదయ పరివర్తనం, ప్రపంచంలోని ఉత్కృష్ట మతాలన్నిటిలోనూ పూర్తిగా సాధ్యం కాగలదని నా అభిప్రాయము ఈ మాటలు చెప్పడంలో నేను కత్తిపైన సాము చేస్తున్నాననే సంగతి నాకు తెలుసు ఈనాడు ఐరోపా ఖండంలో జరుగుతూన్న భయంకర అత్యాచారాలను గమనించినప్పుడు, శాంతిదూత జీసస్ ప్రవక్త సందేశం ఆ దేశాలలోనివారు ఎంత మాత్రమూ అర్థం చేసుకోలేదని చెప్పి ఇందుకు సంబంధించిన ప్రసంగం ముగిసున్నందుకు నేను క్షమాపణ చెప్పనక్కరలేదు. దీనినిబట్టి తూర్పునుంచే

పశ్చిమానికి వెలుగు ప్రసరించవలెననేది నిర్వివాదాంశము

ధార్మిక విషయాలలో ప్రత్యేకం మీ సహాయం నేను అర్థించినాను రాజకీయ విషయాలలో మీ సహాయాన్ని నేను ధైర్యంగా అభిలషిస్తున్నాను మతానికి రాజకీయాలతో సంబంధం లేదనే విషయాన్ని నేను విశ్వసించడం లేదు ధార్మిక సంబంధంలేని రాజకీయం మృతకళేబరం వంటిది అది పాతి వేయడానికి తప్ప మరెందుకు పనికిరాదు నిజానికి మీరు మూకీభావంగా ఉన్నట్లే ఉండి రాజకీయాలపైన మీ ప్రభావం ఎంతగానో ప్రసరింపజేస్తున్నారు మతమునుంచి రాజకీయాలను విడదీసే యత్నం లేకపోయినట్లయితే ఈనాడు కూడా ఆ ప్రభుత్వం కొనసాగుతూ ఉండకపోయినట్లయితే, అవి నేడు మనం చూస్తూన్నంత పతనావస్థకు లోనయి ఉండేవి కావు దేశంలోని రాజకీయి జీవితం సరళంగా ఉన్నదని ఎవ్వరూ అనుకోవడం లేదు స్వదేశీ తత్వంతోపాటు పంచాయతీ రాజ్యంవంటి దేశీయసంస్థలు నన్ను ఆకర్షిస్తూన్నవి ఇండియా నిజమయిన ప్రజాసత్తాక రాజ్యం కనకనే అది ఇంతవరకూ ఎన్నో సంఘర్షణలను తట్టుకోగలిగింది సంస్థానాదీశులు కానీ, ప్రభువులు కానీవారు భారతీయులైనా విదేశీయులయినా వారికి రెవిన్యూ వసూలుచేయడంలోతప్ప తదితర విషయాలలో ప్రజాబాహుళ్యంతో యేమీ సంబంధం ఉండేదికాదు కాని ప్రజలు మాత్రం ప్రభుత్వాని కీయవలసింది ఇచ్చి మిగిలిన పనులు చాలావరకు వారి ఇష్టంవచ్చినట్లు చేసుకొంటుండినట్లు కనబడుతుంది విస్తృతమయిన కులవ్యవస్థ సమాజం ధార్మికావసరాలనే గాక రాజకీయావసరాలను కూడ తీరుస్తూఉండేది కుల వ్యవస్థ ద్వారానే గ్రామస్థులు తమ ఆంతరంగిక వ్యవహారాలను నిర్వర్తించుకొంటూ ఉండేవారు వారు ఆనాటి పరిపాలకుల నిరంకుశత్వం కూడ కులవ్యవస్థల మూలాన్నే తట్టుకోగలిగినారు కుల వ్యవస్థను నిర్మించిన జాతికి అద్భుతమయిన నిర్మాణశక్తి ఉండితీరవలె లేదనడానికి వీలులేదు నిరుడు హరిద్వారంలో జరిగిన కుంభమేళాను చూసినవారికి అంత తెలివితేటలతో ఆ ఏర్పాట్లు ఎట్లా జరిగినవా అని ఆశ్చర్యం వేస్తుంది పది లక్షల మంది యాత్రికులకు అవసరమయిన వసతులు కల్పించబడినాయి అయినప్పటికీ మనకు నిర్మాణశక్తి లేదని అనడం ఒక ఆచారమయిపోయింది నూతన సంప్రదాయాలలో పెరిగిన వారి సందర్భంలో ఇది కొంత నిజం కావచ్చు స్వదేశీ తత్వంనుంచి దురదృష్టవశాత్తు దాదాపు దూరంకావడమే ఈ మన లోపానికి కారణము విద్యావంతుల మనుకొనే మనం విదేశభాష ద్వారా విద్యాభ్యాసం చేసినాము కాబట్టి మన ప్రభావం ప్రజాసామాన్యం వైపు ప్రసరింప జేయలేకపోయినాము ప్రజలకు ప్రాతినిధ్యం వహించవలెననే కోరిక మనకు ఉన్నప్పటికీ అది మనకు చేతకావడం లేదు ప్రజలు ఆంగ్ల ఉద్యోగులను చూసినట్లుగానే మనలను చూస్తున్నారు వారి మనస్సులను ఆంగ్ల ఉద్యోగులవలెనే మనమూ అర్థంచేసుకోలేకుండా ఉన్నాము వారి కోరికలకు మన కోరికలకూ ఏమీ సంబంధం లేదు అందువల్ల మనకూ వారికీ కలయిక లేకుండాపోయింది కాబట్టి ప్రతినిధుల మనుకొనే

తమకూ ఎవరి పక్షాన తాము ప్రాతినిధ్యం వహిస్తున్నామనుకొంటున్నారో వారికీ పొత్తు కలవడంలేదు అదే నిరంకుశశక్తిలో లోపంవలె కనిపిస్తున్నది గడచిన యాభై సంవత్సరాలనుంచి మనం దేశభాషలలో చదువు నేర్చి ఉన్నట్లయితే మన పెద్దవాళ్లు, మన నౌకరులు, మన ఇరుగు పొరుగు వారు మన జ్ఞానంలో భాగస్వాములై ఉండేవారు సర్ జగదీశ చంద్రబోస్ సర్ ప్రఫుల్ల చంద్రరాయ్‌లు కనిపెట్టిన వైజ్ఞానిక విశేషాలు ప్రతి గ్రామస్థునికీ రామాయణ మహాభారతాలవలె కుటుంబ సౌభాగ్యాలుగా ఉండేవి ఈ విజ్ఞాన శాస్త్రజ్ఞులు కనిపెట్టిన నూతన విషయాలను, జనసామాన్యము, విదేశీయులు కనిపెట్టినట్లే భావిస్తున్నారు వివిధ శాఖలకు సంబంధించిన విషయాలన్నీ దేశభాషలలోనే బోధింపబడి ఉన్నట్లయితే, అవి అద్భుతంగా అభివృద్ధి అయి ఉండేవని నేను ధైర్యంగా చెప్పగలను గ్రామ ఆరోగ్యరక్షణ సమస్య చిరకాలం క్రితమే పరిష్కృతమయి ఉండేది గ్రామపంచాయతీలు ఈపాటికొక ప్రత్యేక విధానంలో శక్తిమంతాలయిన సజీవ సంస్థలుగా పెంపొంది ఉండేవి భారత దేశం తన అవసరాలకు తగినట్లుగా స్వపరిపాలనం అనుభవిస్తూండేది ఈ పవిత్ర భూమిలో సువ్యవస్థిత హత్యాకాండకు సంబంధించిన అవమానకర దృశ్యాలు తావుండేది కాదు ఇప్పటికీ మించి పోయినదేమీ లేదు ఈ పరిస్థితిని మీరు మార్చగలిగినంతగా ఇంకెవ్వరూ మార్చలేరు ఈ సందర్భంలో మీ సహాయం కావలె

ఇక స్వదేశీని గురించిన తుది విషయం ఆర్థిక పారిశ్రామిక జీవితంలో స్వదేశీని వినాశకరంగా విడనాడమే ప్రజాసామాన్యపు నిత్యదారిద్ర్యానికి ముఖ్యకారణము వాణిజ్య వస్తువులను ఇతర దేశాలనుంచి మనం దిగుమతి చేసుకోనట పోతే ఈనాడు మన దేశం అష్టైశ్వర్యాలతో, తులతూగుతూ ఈనాడు ఉండేది అయితే నేమి? అట్లా జరగడంలేదు మనము ఇంగ్లాండ్ కూడా పేరాసతో పీడింపబడుతున్నాము ఇంగ్లాండ్ ఇండియాల సంబంధం పొరపాటున ఏర్పడింది కాని ఇంగ్లాండ్ మాత్రం ఇండియాలో పొరపాటున తిష్ఠవేసుకొని ఉండడంలేదు భారత ప్రజల క్షేమంకోసం ఇండియాకు తాము ధర్మకర్తలుగా ఉండడమే తమ నిర్ణీత విధానమయినట్లు ఇంగ్లీషువారు ప్రకటిస్తున్నారు అదే నిజమయితే లాంక్‌షైర్‌కు ఇండియాతో ఏవిధమయిన ప్రసక్తి ఉండకూడదు స్వదేశీసిద్ధాంతం సరియయిన సిద్ధాంతమే అయినట్లతే, లాంక్‌షైర్‌కు తాత్కాలికంగా నష్టం వచ్చినప్పటికీ, తాను ఇతరులకు అపకారి కాకుండా దూరంగా ఉండవచ్చు స్వదేశీ ఉద్యమం, ప్రతీకార చర్యగా ప్రారంభించిన బహిష్కరణోద్యమంకాదు అది అందరూ పాటించవలసిన ఒక మత నియమమని నా అభిప్రాయము నేను ఆర్థిక వేత్తను కాను తనకు కావలసిన అన్ని వస్తువులను తేలికగా ఉత్పత్తి చేసుకోగలిగిన స్వయం సంపూర్ణ దేశం ఇంగ్లండ్ అని నేను కొన్ని వ్యాసాలు చదివినాను ఇది చాలా హాస్యాస్పదమయిన సిద్ధాంతము. ఎందువల్లనంటే ప్రపంచ వస్తువులను అన్ని దేశాలలోకీ, ఎక్కువగా దిగుమతి

చేసుకొంటూన్న దేశం ఇంగ్లాండ్ దేశమే తనంతటతాను బ్రతకగల స్థితికి వచ్చే వరకూ ఇండియా లాంకషైర్ కోసంగాని మరే దేశం కోసంగాని జీవించి ఉండ లేదు తనకు కావలసిన వస్తువులను తన సరిహద్దులలోనే తాను ఉత్పత్తి చేసుకో గల స్థితికి వచ్చే వరకు ఇండియా తనంతట తాను జీవించలేదు అయితే అందు కోసం సోదర మానవుల హత్యకు, అసూయకు తదితర ద్వేషాలకు దారితీసే వినాశకరమయిన పోటీ అనే సుడిగుండంలో అది పడనవసరం లేదు, పడకూడదు కూడా కాని ప్రపంచ వ్యాపారంతో పోటీపడకుండా ఇండియాలోని కోటీశ్వరు లను అపగలిగిన వారెవ్వరు? శాసనం ద్వారా ఆ పని జరగదు ప్రజాభిప్రాయ ప్రాబల్యం వల్లగానీ, సరియైన ప్రబోధం వల్లకానీ చాలా వరకు ఆ పని సాధ్యం కావచ్చు చేనేత పరిశ్రమ పతనావస్థలో ఉన్నది కడచిన సంవత్సరం నా పర్యటనలో ప్రత్యేక శ్రద్ధ వహించి సాధ్యమయినంత మంది చేనేత వారిని చూడగలిగినాను అభివృద్ధి కరము, గౌరవనీయమూ అయిన ఆవృత్తి ఎట్లా నాశనమయిందో, ఆ వృత్తిగలవారు దానినెందుకు విడనాడవలసి వచ్చినదో తెలుసుకొన్నప్పుడు నాకు హృదయ వేదన కలిగింది మనం స్వదేశీ సిద్ధాంతం అనుసరించదలచుకొంటే మనకు కావలసిన సామగ్రిని అందచేయగల ఇరుగు పొరుగు వారిని సంపాదించుకోవలె ఒక వేళ అటువంటివారు సమీపంలో లేక పోయినట్లైతే, సమీపంలో ఉన్నవారికి మనకు కావలసిన పరికరాలను తయారు చేయడం నేర్పవలె అందువల్ల ఒక సద్వృత్తిని అవలంబించవలెననే కోరిక గల వారికి సహాయపడినట్లు కూడా అవుతుంది అప్పుడు ఇండియాలోని ప్రతి గ్రామం స్వయం సహాయకము స్వయంసంపూర్ణమూ కాగలదు ఒక గ్రామంలో తయారు కాని వస్తువులను మరో గ్రామంనుంచి తెప్పించుకొంటూ ఇండియాలోని గ్రామాలన్నీ పరస్పర సహాయకాలు కాగలవు కొందరికిదంతా అర్థరహితంగా తోచవచ్చు ఒక విధంగా చూస్తే ఇండియాయే అర్థరహిత మయిన దేశము దాహంతో అల్లాడుతూన్న సమయంలో, దయార్ద్ర హృదయు డైన మహమ్మదీయుడు నిర్మలమయిన నీరు తాగడానికి ఇచ్చినప్పటికీ తాగక గొంతెండ పెట్టుకొనే వేల కొద్దీ హిందువులుగల దేశం అర్థరహితమయిన దేశం కాక మరేమిటి? ఈ అర్థరహితమయిన మానవాళికి "మీ మతం ఇండియాలో తయారైన బట్టలనే ధరించవలెననీ, ఇండియాలో ఉత్పత్తియైన ఆహారాన్నే భుజించవలెననీ బోధిస్తూన్నద"ని చెప్పి వారిని ఒప్పించినప్పుడు వారు ఇతర దేశపు బట్టను కట్టరు, ఇతర దేశపు ఆహారధాన్యాలను స్వీకరించరు కర్జన్ ప్రభువు తేనీరు తాగడం ఒక సంప్రదాయం చేసినారు ఆ అపాయకరమయిన ఆకు జాతిని ఆవరించుకొన్నది అది ఇప్పటికే వేల కొద్దీ స్త్రీ పురుషుల జీర్ణ కోశంను పాడు చేయడమే కాక, అసలే చాలీ చాలని ఆదాయంగల వారిపైన అదనపు పన్ను విధింపుకు కారణమయింది హార్డింజ్ ప్రభువు స్వదేశీని సం ప్రదాయంగా చేయవచ్చు అప్పుడు దాదాపు ఇండియా యావత్తూ విదేశీ సరుకు లను విడనాడగలదు. గొప్పవారు ఏది చేస్తే దానిని జన బాహుళ్యం అనుసరి

స్తుందని భగవద్గీతలోని ఒక శ్లోకం ప్రబోధిస్తున్నది. సమాజంలోని మేధావులయినవారు స్వదేశీ వ్రతం అవలంబించేటట్లయితే వారు క్షణికంగా కొంత కష్టం కలిగినప్పటికీ ప్రస్తుతపు చెడుగును తేలికగా తొలగించుకోగలరు. ... ఏ శాఖలోనూ విద్వేషరూపమయిన బహిష్కారాన్ని నేను సహించజాలను. దానిని కీడుతో మేలుగా మాత్రం భావించవచ్చు. స్వదేశీ సరకుల రక్షణ కోసం విదేశీ సరకుపైన పన్ను విధించడం నేను సహిస్తాను, ఆమోదిస్తాను, వాదిస్తాను కూడా. బ్రిటిష్ వలస రాష్ట్రమయిన నేటాలు తన పంచదార పరిశ్రమ రక్షణ కోసం మరొక బ్రిటిష్ వలస రాజ్యమయిన మారిషస్ నుండి దిగుమతి అయ్యే పంచదార పైన పన్ను విధించింది. ఇండియాపైన స్వేచ్ఛా వ్యాపార విధానం రుద్ది ఇంగ్లండ్ పాపం కట్టుకొంది. ఇంగ్లండ్‌కది లాభం కావచ్చు. ఇండియాకు మాత్రమది నష్టము. ఆర్థిక విషయంలో మాత్రం ఇండియా స్వదేశీని అవలంబించజాలదని కొందరి వాదము. ఈ వాదం చేసేవారు స్వదేశీ, ఒక జీవిత నియమమనే సంగతి గ్రహించినట్లులేదు. అది ఒక దేశభక్తి యుతమయిన ప్రయత్నమని, అందు కోసం స్వార్థత్యాగం అవసరమయినట్లయితే, ఆ ప్రయత్నం విరమించవలసి ఉంటుందని కూడా వారి అభిప్రాయము. స్వదేశీ ఒక విధమయిన మత శిక్షణ అని నా నిర్వచనం. వ్యక్తుల భౌతిక సౌఖ్యాలకు కొంత భంగం కలిగినప్పటికీ ఆ శిక్షణలో అందరూ అరితేర వలెనని నా అభిప్రాయము. స్వదేశీపై ప్రేమ గలవారు మన దేశంలో ఒక గుండు సూది కాని తయారు కావడం లేదని భీతి చెంద నక్కరలేదు. స్వదేశీ అభిమానులయిన వారు తమకిది వరకు అవసరమని భావిస్తూ ఉండిన అనేక వస్తువులు లేకుండానే గడుపుకొనడం నేర్చుకొంటారు. ఇక స్వదేశీ అసాధ్యమని వాదించేవారు, నిరంతర ప్రయత్నం వల్ల స్వదేశీని సాధించడమే మన ధ్యేయమనే మాట విస్మరిస్తున్నారు. కొన్ని వస్తువుల విషయంలో మాత్రమే స్వదేశీని అవలంబిస్తూ మన దేశంలో తయారు కాని అవసర వస్తువులను తాత్కాలికంగా ఉపయోగించుకొంటూ మనం మన స్వదేశీ లక్ష్యాన్ని చేరుకొనేటందుకు ప్రయత్నించవలె.

స్వదేశీకి ప్రతికూల వాదం మరొకటి కూడా ఉంది. అది అత్యంత స్వార్థపరత్వమయిన సిద్ధాంతమనీ సభ్యతా ప్రపంచంలోని నైతిక సూత్రాలకు విరుద్ధమయినదనీ కొందరంటారు. అంతేకాదు, స్వదేశీ అవలంబనము అనాగరకతను అవలంబించడమని కూడా వారి అభిప్రాయము. ఈ అభిప్రాయానికి సంబంధించిన వివరాలలోకి నేనిప్పుడు పోదలచలేదు. నమ్రతకు, ప్రేమకూ అనుగుణమయిన సిద్ధాంతం స్వదేశీ ఒక్కటేనని నేను చెప్పదలచుకొన్నాను. నేను నా కుటుంబానికే మేలు చేసుకోలేని స్థితిలో నుంచి యావద్భారత దేశానికి సేవ చేయ పూనుకోవడం అహంకార లక్షణం తప్ప మరొకటి కాదు. ముందు నా కుటుంబానికి మేలు చేకూర్చడంతో నా కృషిని ప్రారంభించి, తరవాత వారి ద్వారా యావద్భారత దేశానికి వీలయితే ప్రపంచ మానవాళిని సేవించడానికి పూనుకోవడం ఉత్తమమని నా ఉద్దేశము. ఇది నమ్రతకు

ప్రేమకూ తార్కాణం మన పనిలోని సుగుణాన్ని మన ఉద్దేశం నిర్ణయిస్తుంది. నా పని వల్ల ఇతరులకు కలిగే కష్టాలను గమనించక నా కుటుంబానికి నేను మేలు చేకూర్చవచ్చు ఉదాహరణానికి, ఇతరుల దగ్గరనుంచి డబ్బు గుంజుకొనేటందుకు ఉద్యోగాన్ని నే సంపాదించి నామట్టుకు నేను భాగ్యవంతుడనై నా కుటుంబ సభ్యులను భోగలాలసులనుగా చేయవచ్చు అందువల్ల నేను నా కుటుంబానికిగానీ, నా రాష్ట్రానికిగానీ మేలు చేసిన వాడను కాబోను అట్లా కాక దేవుడు నేను జీవించడానికీ, నాపైన ఆధారపడి ఉన్న వాళ్లను బ్రతికించడానికి నాకు కాళ్లూ చేతులూ ఇచ్చినట్లు భావించి, కేవలం నేను నా వాళ్లు జీవించడానికే వాటిని ఉపయోగించవచ్చు అందువల్ల ఇతరులకు కీడు చేయక నా కుటుంబానికి మాత్రమే మేలు చేసిన వాడనవుతాను ప్రతి ఒక్కరూ అదే ఒకమాదిరి జీవిత విధానాన్ని అవలంబించినట్లయితే తక్షణం మనది ఒక ఆదర్శ దేశం కాగలదు ఒకవేళ అందరూ ఆ స్థితికి రాలేదు కాని మనలో ఈ వాస్తవిక విషయం అర్థం చేసుకొన్నవారు, దీనిని ఆచరణలో పెట్టినట్లయితే ఆ శుభ దినం త్వరగాలో రాగలదని నిరీక్షించవచ్చు ఈ జీవిత విధానం ప్రకారం తదితర దేశాలన్నిటినీ మినహాయించి, ఒక్క భారత దేశక్షేమం కోరుతూన్నట్లు కనపడినప్పటికి ఏ యితర దేశానికి నేను కీడు చేయడం లేదు కనక నా దేశభక్తిలో నా దేశము ఇతర దేశాలూకూడా ఇమిడి ఉన్నాయి నా సేవ నా జన్మభూమికి ఒక్కదానికే పరిమితమై ఉన్నప్పటికీ, తక్కిన దేశాలతో నాకు స్పర్థగానీ, ప్రాతికూల్యంగాని లేదు ఇతరులకు హాని చేయకపోయినంత వరకు నీ స్వాతంత్ర్యాన్ని నీవు చలాయించుకోవచ్చు అనేది కేవలం న్యాయ సూత్రమే కాదు, ఉత్కృష్ట జీవిత విధానం కూడా అహింసా సూత్రంగాని ప్రేమ సూత్రంగాని ఆచరణలో పెట్టడానికిది కీలకం మీరు ఒక గొప్పమతానికి పీఠాధిపతులు "ద్వేష పూరిత దేశభక్తి నాశనకరం", "ప్రేమ పూరిత దేశభక్తి ప్రాణ ప్రదము" అనే సిద్ధాంతాన్ని పవిత్రతమమయిన ఆచరణ పూర్వకంగా ప్రబోధించి మార్గ దర్శకులు కాగలరని ఆశిస్తున్నాను "

ఇది 1916 లో, మద్రాసులో జరిగిన క్రైస్తవ మత ప్రచారకుల మహాసభలో గాంధీజీ ఇచ్చిన ఉపన్యాసం అయినప్పటికీ ఇందులో శాశ్వత సత్యాలు ఇమిడి ఉండటంచేత 1919 జూన్ 21 తేదీ 'యంగ్ ఇండియా'లో పునర్ముద్రితమయింది 'స్వదేశీ'కి గాంధీజీ చేసిన ఈ నిర్వచనం ఈ నాటికీ భారత దేశం అనుసరించతగినదిగా ఉన్నదని ఈ ఉపన్యాసం చదివిన వారందరూ గ్రహించగలరు

## సత్యాగ్రహ దీక్షానంతరం

ఆంధ్ర దేశంలో సత్యాగ్రహ వ్రత దినం ప్రశాంతంగా జరిగిపోయింది కాని ఢిల్లీ, పంజాబు, అహమ్మదాబాద్ మొదలైన ప్రదేశాలలో విషాద సంఘటనలు కొన్ని జరిగినాయి. ఒక్క ఢిల్లీలో తప్ప తక్కిన చోట్ల జరిగిన సంఘ

టనలకు సత్యాగ్రహం నాటి హర్తాళ్‌తో ప్రత్యక్ష సంబంధం లేదు ఢిల్లీలో అనాటి హిందూ మహమ్మదీయ భ్రాతృభావప్రదర్శనం ప్రభుత్వం సహించలేక పోయింది లక్షలాది ప్రజల ఊరేగింపుపైన పోలీసులు సైనికులు, తుపాకులు కాల్చినారు, అనేక మంది ఆ కాల్పులలో మరణించినారు పంజాబులో కూడా హర్తాళ్ శాంతి ప్రదంగానే జరిగింది కాని అంత ప్రశాంతంగా అది జరగడం అక్కడి లెఫ్టినెంట్ గవర్నర్ సర్ మైకేల్ ఒ డయ్యర్‌కు కన్ను కుట్టింది కడచిన యుద్ధంలో ఇంగ్లండ్‌కు సైనికులను ఎక్కువగా పంపిన రాష్ట్రం పంజాబ్ పంజాబులోని వీర జాతులు కాంగ్రెస్ చిత్త వృత్తిగలవారుగా రూపొంది సైన్యంలో చేరేట్లయితే అంతటితో ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వం అంత రించినట్లేనని అయన అభిప్రాయపడినాడు దానికి తోడు ఢిల్లీ కాంగ్రెస్‌లో మరుసటి కాంగ్రెస్ మహాసభ అమృతసర్‌లో జరగవలెనని తీర్మానం చేసినారు ఆ తీర్మానం ప్రకారం అమృతసర్‌లోనే కాంగ్రెస్ మహాసభ జరిగితే పంజాబు రాష్ట్ర ప్రజలలో కాంగ్రెస్ ప్రచారం మరింత ఎక్కువగా జరుగుతుందని అది ప్రభుత్వానికి ఇంకా అపాయకరం కాగలదనీ అనుకొన్నాడాయన ఆ అపాయం అరికట్టేటందుకతడు తీసుకొన్న చర్యలే పంజాబులోని అత్యంత విషాదకర సంఘటనలకు కారణభూతా లయినాయి

రానున్న కాంగ్రెస్ మహాసభకు ఏర్పాట్లు చేస్తూ ఉండిన డాక్టర్ కిచ్లూ, డాక్టర్ సత్యపాల్‌లను ప్రభుత్వంవారు ఏప్రిల్ 10 (1919) న ప్రవాసానికి పంపినారు అంతకు పూర్వం రెండు రోజుల కిందనే, ఢిల్లీలోనూ పంజాబులోనూ జరిగిన దుస్సంఘటనలను విని ఆ ప్రదేశాలలో ప్రశాంత పరిస్థితులను నెలకొల్పేటందుకు గాంధీజీ వెళ్లుతూండగా దారిలో ఆయనను అధికారులు నిర్బంధించి బొంబాయికి తీసుకొనిపోయి అక్కడ నుంచి కదలకూడదని ఉత్తరువులు జారీ చేసినారు ప్రభుత్వం వారి ఈ చర్యలు అమృతసర్ ప్రజలను కోపోద్రిక్తులను చేసి రెచ్చగొట్టినాయి మార్చి 10 వ తేదీని ప్రవాసానికి పంపిన నాయకులను విడుదల చేయవలసిందని కోరుతు డిప్యూటీ కమిషనర్ నివాసాని కొక బ్రహ్మాండమయిన ఊరేగింపు బయలు దేరిపోయింది పోలీసులు వారిని వెనకకు మళ్ళ గొట్టడంలో తుపాకులు కాల్చినారు చాలా మంది చనిపోయినారు ప్రజలు మరింత కోపోద్రిక్తులై, కచ్చేరీలలో ఉన్న అయిదారుగురు ఇంగ్లీషు వాండ్లను హత్య చేసినారు టౌన్ హాలును మరి కొన్ని భవనాలను తగల బెట్టినారు తరవాత మరి కొంత మంది సైనికులు వచ్చి ప్రజలను చెదరగొట్టినారు జనరల్ డయ్యర్ లమృతసర్‌లోని సైనికులందరికీ ఆధిపత్యం వహించినాడు అప్పటికా నగరంలో సైనిక శాసనం లేకపోయినప్పటికీ డయ్యర్ సేనాని మాత్రం అది సైనిక శాసన కింద పరిపాలింపబడుతూండినట్లు వ్యవహరించినాడు ఏప్రిల్ 13 వ తేదీని బహిరంగ సభ జరుగుతుందని 12 వ తేదీనే నాయకులు ప్రకటన చేసినారు ఆ సభ జరగకూడదని అధికారులు నిషేధాజ్ఞలు జారీచేయలేదు కనక నాయకుల ప్రకటన ప్రకారం ఏప్రిల్

13 న జలియన్‌వాలాబాగ్‌లో దాదాపు 20,000 మంది ప్రజలు సమావేశ మయినారు సభ ప్రారంభమయిన కొద్దికాలంలోనే జనరల్ డయ్యర్ మర ఫిరంగిశకటాలతోను, సైనిక దళాలతోను సభ జరుగుతూ ఉండిన చోటుకు వచ్చి ఏ విధమయిన హెచ్చరికా చేయకుండానే సరాసరి మందుగుండు సామగ్రి అయి పోయేటంతవరకూ ప్రజలపైన మర ఫిరంగులను కాల్చినాడు జలియన్‌వాలా బాగ్‌కు ఒకేఒక ద్వారం ఉంది ద్వారం దగ్గర సైనికులు కావలా కాస్తూం డడంచేత ప్రజలు బయటకు పోయేటందుకు వీలుకాలేదు ప్రభుత్వంవారు 400 మంది హతులయినట్లు 200 మంది గాయపడినట్లూ ప్రకటించినారు ఆ నాటి పత్రికలు 1400 మందికిపైగా మరణించినట్లు ప్రకటించినాయి మందు గుండు సామగ్రి అలా పోకపోయినట్లయితే ఇంకా ఎంతమందినో కాల్చి ఉండే వాడనని జనరల్ డయ్యర్, పంజాబు హత్యల విచారణకమిటీ ఎదుట చెప్పిన సాక్ష్యం బట్టి బోధపడుతూన్నది కాల్పులు జరిగిన తరవాత డయ్యర్ సేనాని చనిపోయినవారిని గురించి గానీ, గాయపడినవారిని గురించి గానీ ఏమీ పట్టించు కోకుండా తన దారిన తాను వెళ్లిపోయినాడు

బ్రిటిష్‌వారు ఇండియాలో చేసిన అత్యాచారాలలో ఇది అగ్రస్థానం వహిస్తూన్నది కాని అది అంతటితో ఆగలేదు జలియన్‌వాలాబాగ్ హత్యల కారణంగా ప్రబలిన అశాంతిని అణచడమనే పేరుతో ఏప్రిల్ 15 న పంజాబు రాష్ట్రంలో సైనిక శాసనం ప్రకటించబడింది ఆ తరవాత రెండు నెలలు పంజాబులోని వివిధ ప్రదేశాలలో సైనిక నిరంకుశాధికారం పలయతాండవం చేసింది పంజాబు ప్రజలు అనేక బాధలకు, అవమానాలకూ గురియైనారు

## గాంధీజీ నిర్బంధము - బహిరంగసభలు

గాంధీజీ బొంబాయి దాటి పోకూడదని ప్రభుత్వంవారు ఉత్తరువులను జారీచేసిన తరవాత ఆ ఉత్తరువులను నిరసిస్తూ అనేకచోట్ల బహిరంగసభలు జరిగినాయి ఏప్రిల్ 12 తేదీని మద్రాసులో తిరువళిక్కేణి సముద్రం ఒడ్డున జరిగిన పౌరసభకు హిందూపత్రికా సంపాదకులు యస్ కస్తూరి రంగయ్యం గారు అధ్యక్షత వహించినారు శ్రీ సి రాజగోపాలాచార్యులు, టంగుటూరి ప్రకాశం, రంగస్వామయ్యంగార్, రాఘవన్, కొండ వెంకటప్పయ్యపంతులు, యస్ సత్యమూర్తి, టి ఆదినారాయణచెట్టి, గోపాలస్వామి మొదలియార్, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, టి వి వెంకటరామయ్యర్, రాకూరు వర్మ, దేవదాసు గాంధిగార్లవంటి ప్రముఖులనేకులు ఆ సభలో పాల్గొన్నారు

"గాంధీమహాత్ముని నిర్బంధం గురించి అధ్యక్షులు శ్రీ కస్తూరి రంగయ్యంగారు" ప్రసంగిస్తూ "ఈ మహాశయుని పట్ల రాతిగోడలు చెరసాల కానేరదు, ఇనపచువ్వలు కారాగృహం కానేరదు ' అయినప్పటికీ ఈ మహర్షి పట్ల హిందూదేశ రక్షకశాసనం వర్తింపచేసి వారి స్వేచ్ఛకు భంగం కలిగించ డానికి ప్రభుత్వంవారు ఎంతమాత్రమూ శంకించలేదు దీనినిబట్టి భారతదేశం

లోని సామాన్యమాగవుని స్వేచ్ఛా స్వాతంత్ర్య పెట్టా కాపాడగలుగుతు న్నాదో వ్యక్తం కాగలదు రౌలట్ శాసనం దుర్వినియోగం చేయుమని సామ్రాజ్య శాసనసభలో ప్రభుత్వంవారు చేసిన ప్రమాణాలన్ని వట్టి గల్లలని ఇందువల్ల తెలిపోయింద అన్నారు

తరవాత టి వి వెంకటరామయ్యర్ గారు దిగువతీర్మానం ప్రతి పాదించినారు

"హిందూదేశ ప్రభుత్వంవారు, పంజాబు ఢిల్లీ ప్రభుత్వంవారు హిందూదేశ రక్షణశాసనంకింద గాంధీమహాశయునిపైన బహిష్కారాజ్ఞను విధించి ఢిల్లీ, పంజాబు దేశాలకు వారు రాకూడదని బొంబాయి రాష్ట్రం విడువకూడదని ఆజ్ఞాపించినారు పై ప్రభుత్వాలవారి చర్యను మద్రాసు పౌరులు ఆక్షేపిస్తు న్నారు" టి వి వెంకటరామయ్యర్ గారు ప్రభుత్వంవారి నిర్బంధ విధానానికి సత్యాగ్రహులందరూ సంసిద్ధంగా ఉండవలెనని ప్రబోధిస్తూ ప్రసంగించిన తర వాత శ్రీ అల్లాడి కృష్ణస్వామిఅయ్యర్ గారు ఈ తీర్మానం బలపరుస్తూ మన మందరమూ, చరిత్రాత్మకమయిన స్థితిలో సమావేశమయినాము న్యాయబద్ధ మయిన ప్రతి మనుష్యుడును అమృతసర్ లో జరిగిన దారుణచర్యలను ఖేదం చెందక మానడు దక్షిణాఫ్రికాలోని భారతీయులకోసం గాంధీమహాత్ము డెట్లాంటి బాధలు పడినది మీకు తెలియనిదికాదు ఆ మహానీయునే ఇండియా ప్రభుత్వంవారిప్పుడు నిర్బంధంలో ఉంచినారు ప్రభుత్వంవారి వివేకహీనమయిన పరిపాలనంవల్ల అమృతసర్ లో విషమమైన దారుణచర్యలు సంభవించినాయని నా అభిప్రాయం" అన్నారు ఏ రంగస్వామిఅయ్యంగారు, కల్యాణసుందరం మొదలియారు, టి యమ్ కృష్ణస్వామిఅయ్యంగార్లుుండా తీర్మానం బల పరుస్తూ తమిళంలో ప్రసంగించినారు

తరవాత శ్రీ కొండ వెంకటప్పయ్యపంతులుగారు తెలుగులో ప్రసం గిస్తూ "గాంధీమహాశయుని చరిత్రను రాబోవు తరాలవారు మహానందంతో కొనియాడగలరు ఇట్లాంటివారు ప్రపంచంలో అరుదుగా జన్మిస్తారు వారు ఋషితుల్యులు ఋషి చరిత్రగలవారు పూర్వచరిత్రలలో కొద్దిమంది మహా మహులను మాత్రం మనమెరిగి ఉన్నాము గాంధీమహాత్ముడు నూతనోద్యమం ప్రజలకు ప్రబోధించినారు తన శాంతిస్వభావం లోకానికి ప్రదర్శించినారు ఇట్లాంటివారిపట్ల దేశ రక్షకశాసనం వర్తింపచేయడం న్యాయమా? ఢిల్లీలో జరిగిన విషాదసంఘటనను తెలుసుకొని సత్యాగ్రహతత్వం ఆ ప్రజలకు తెలియ చెప్పడానికి వెళ్లనున్న మహాత్ముని నిర్బంధించడం ప్రభుత్వానికే నష్టదాయ కము. సత్యాగ్రహులు ఎవ్వరినీ దూషించరు ఇతరులు తమ పట్ల అక్రమంగా ప్రవర్తించినా కోపపడరు ప్రభుత్వానికి సత్యాగ్రహులే నిజమయిన మిత్రులు ప్రభుత్వంవారికి దూరదృష్టి ఉంటే రౌలట్ శాసనం గురించి పునరాలోచన చేసి ఉండేవారు" అన్నారు తరవాత పై తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరింపబడింది

శ్రీ సి రాజగోపాలాచార్యుల వారి దిగువ తీర్మానం ప్రతిపాదిస్తూ

ప్రసంగించినారు.

"పై తీర్మానంలో ఉదాహరించిన ప్రసుత్వాలు గాంధీమహాత్మునికి వర్తింపజేసిన కఠిన శాసనం దేశంలో న్యాయబద్ధం శాంతిప్రదాలూ అయిన ఉద్యమాలను అణిచివేయ నుద్దేశిస్తూన్నందుకు తార్కాణంగా ఉన్నది. దేశంలో దౌర్జన్యం అక్రమం ఆపేటందుకు పట్టుదలతో ప్రయత్నిస్తున్న పూజ్యుడైన గాంధీమహాశయునిపట్ల వివేకహీనమైన చర్య తీసుకొన్నందుకు దేశంలో తప్పక అశాంతి ప్రజలలో కోపాగ్ని ప్రజ్వరిల్లగలదని ఈ సభవారి అభిప్రాయము." "గాంధీమహాత్ముని మాటలను సలహాలను ఢిల్లీ, అమృత సర్ నగరాలలోని ప్రజలు వినడానికి ప్రభుత్వంవారు అవకాశం ఇచ్చిఉంటే ఆ ప్రదేశాలలో ఇటీవల జరిగిన విషాదకరచర్యలు జరిగి ఉండేవికావు. ప్రభుత్వంవారు దూర దృష్టి లేక తెలివి తక్కువగా ఢిల్లీ నగరానికి వెళ్ళనున్న గాంధీమహాత్ముని బొంబాయికి తీసుకొనివచ్చి అక్కడనుంచి కదలకూడదన్నారు. ఢిల్లీ అమృత సర్‌కు గాంధీజీ వెళ్లితే అక్కడ శాంతి చేకూరి ఉండేది. బొంబాయి ప్రభుత్వంవారు వివేకమైన మార్గం అవలంబించి గాంధీజీ తన అనుచరులకు తగిన సలహాలిచ్చేటందుకు ఆమోదించినారు. అందువల్ల బొంబాయిలో శాంతి చేకూరింది. (గాన్నయు ం ? గోపాలాచారిగారు ఈ తీర్మానం టి వి గోపాల స్వామి మొదలియారుగారు ఆమోదించగా ఏకగ్రీవంగా అంగీకరింపబడింది.

యస్ సత్యమూర్తిగారి దిగువతీర్మానం ప్రవేశపెట్టినారు. "నిరాయుధులు, నిరపరాధులు అయిన ప్రజలను అనవసరంగానూ విచక్షణ జ్ఞాన శూన్యంగాను రుపాకులలో చంపి దేశంలోని ప్రజలను భయవిహ్వలులుగా చేసే ప్రభుత్వ విధానాన్ని ఈ సభవారు నిరసిస్తున్నారు. ఈ తీర్మానాన్ని ప్రతి పాదిస్తూ, ఢిల్లీ మొదలయిన స్థలాలలో ఏర్పడిన ప్రభుత్వ చర్యలవల్ల దేశంలో భీతిని కలిగించడం వారి ఉద్దేశమయినట్లు కనబడుతున్నది. ప్రభుత్వంవారి ఈ విధానం ఎన్నటికీ జయం పొందనేరదు" అన్నారు. ఈ తీర్మానాన్ని టంగుటూరి ప్రకాశంపంతులుగారు, టి ఆదినారాయణచెట్టిగార్లు బలపరచడంతో తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

## పంజాబ్ సైనిక శాసనము - ప్రభుత్వ దురంతాలు

పైన ఉదాహరించిన తీర్మానాలు చదివిన తరవాత జలియన్ వాలా బాగ్ హత్యాకాండ తరవాత పంజాబ్ సైనికశాసనం విలయతాండవం చేసిన ఆ రోజులలో ప్రభుత్వ దురంతాలను సంగ్రహంగానైనా తెలుసుకోవలెననే కోరిక చదవరులకు కలుగుతుంది. వాటిని గురించి అతివాదులుకాని, లేదా సత్యాగ్రహం సమర్థించే కాంగ్రెస్ వాదులుకాని చెప్పే మాటలకంటె మిత వాదులు చెప్పిన వాక్యాలను ఉదాహరించడం సముచితంగా ఉంటుంది. అందువల్ల అఖిలభారత మితవాద మహాసభకు అధ్యక్షత వహించిన సర్ పి యస్ శివస్వామి అయ్యర్‌గారు ఆ సందర్భంలో చెప్పిన మాటలిదిగువ ఉదాహరిస్తు

న్యాము

"గుంపులు చెదిరిపోయేందుకు అవకాశమివ్వకుండా వందలకొద్ది జనాన్ని తుపాకులతో కాల్చిచంపడం, చెదిరిపోయిన జనంపైన సైతం ఫిరంగులు పేల్చి గాయపడినవారి దిక్కయినా చూడకుండా జనరల్ డయ్యర్ నిర్లక్ష్యంగా వెళ్లిపోవడం, బహిరంగంగా ప్రజలను కొరడాలతో కొట్టించడం, హాజరుపట్టీ వేయించుకొనేటందుకు వేలకొద్దీ విద్యార్థులను, ప్రతిరోజూ పదహారు మైళ్లు నడిపించడం, 500 మంది విద్యార్థులను అధ్యాపకులను (ప్రొఫెసర్లు) నిర్బంధంలో ఉంచడం, ఐదేళ్ళు మొదలు ఏడేళ్ళ వయస్సుగల పిల్లలందరినీ బాలురుగా చేర్చి వారిచే యూనియన్ జాక్ జెండాకు వందనం చేయించడం, మార్షల్‌లా కాగితాలు అంటించబడిన ఇళ్ల యజమానులను వాటిని యెవ్వరూ చింపకుండే బాధ్యత వహించవలసినదిగా నిర్బంధించడం, వివాహకార్యం నిర్వర్తించుకొంటూండిన పెండ్లివారిని కొరడాలతో కొట్టించడం వ్యక్తుల ఉత్తరాలను చింపి పరిశీలించడం, బాద్‌షాహీ మశీదును ఆరువారాలవరకు మూసివేయించడం తగినంత కారణం లేకుండా ప్రజలను - ముఖ్యంగా ప్రభుత్వానికి సేవచేసిన ప్రజలను- నిర్బంధంలో ఉంచడం, ఇస్లామిక్ పాఠశాలలో అందరిలోకి పెద్దవాళ్ళుగా ఉన్న ఆరుగురు బాలురను నిష్కారణంగా - కేవలం పెద్దవాళ్ళుగా ఉన్న పాఠశాల బాలురయిన కారణాన - కొరడాలతో కొట్టించడం, అరెస్టు చేయబడిన వారిని ఉంచేటందుకొరకు తెరిచిఉన్న బోనును తయారుచేయించడం, నేలపైన పాకించడం మొదలయిన క్రొత్తరకాలయిన శిక్షలు కనిపెట్టడం, ఒకచోటనుంచి ఇంకొకచోటకు మనుష్యులను ఉరికించడం, కొత్తమంటికి అరదండాలు వేసి, వారందరిని ఒక తాడుగట్టి కప్పులేని మోటారు ట్రక్కులలో పదిహేను గంటలపాటు నిలబెట్టడం నిరాయుధులయిన ప్రజలపై వాయువిమానాలతో మెషిన్ తుపాకులు ప్రయోగించడం, గైరుహాజరయినవారిని హాజరు పెట్టేటందుకు వారి బంధువులను నిర్బంధించడం, వారి ఆస్తులను స్వాధీనం చేసుకోవడం, పాడుచేయడం, హిందూ ముస్లిమ్ ఐకమత్యఫలితాన్ని ప్రదర్శించేటందుకు ఒక హిందువును ఒక ముస్లిమ్‌ను జతగా అరదండాలు వేసి వీధులలో త్రిప్పడం, భారతీయుల ఇండ్లకు నీరు, విద్యుచ్ఛక్తి (ఎలెక్ట్రిసిటీ) నిలిపివేయడం, భారతీయుల ఇండ్లలోని విద్యుత్ పంఖాలను (Electric Fans) తీసివేసి యూరోపియన్ ఇళ్ళలో ఉంచడం, భారతీయుల దగ్గరఉన్న కారులను ఇతర శకటాలను స్వాధీనం చేసుకొని యూరోపియన్‌లకిచ్చివేయడం, మార్షల్‌లాను రద్దుచేసేముందు ఆదరాబాదరాగా మార్షల్‌లా కింద కేసులను విచారించి శిక్షలువేయడం, మొదలయినవి మార్షల్‌లా కింద జరిగిన అనేక ఘోరాలయిన అత్యాచారాలలో కొన్నిమాత్రమే" *పంజాబ్ హత్యలు 1919ఏప్రిల్ 6-ఏప్రిల్ 18 తేదీల మధ్యజరిగి

* D G Tandulkar, Mahatma Vol I pp 313-15 Freedom Struggle in A P (Andhra) Vol I pp 187 & 188

నవి ఆనాటినుంచే ఏప్రిల్ 6 మొదలు 13 తేదివరకు జాతీయవారంగా పేర్కొన బడుతూన్నది

## పంజాబ్ దురంతాలు - ఆంధ్రలో కలవరము

ప్రజల ప్రతిఘటనలను లెక్క-చేయకుండా అంగీకరించిన రౌలట్ చట్టం కంటె కూడా పంజాబు దురంతాలు ఆంధ్రదేశంలో ఎక్కువ కలవరానికి కారణ భూతాలయినవి గోదావరి జిల్లా మహాసభ, పంజాబ్‌లోని సైనికశాసనాన్ని నిరసించడమేగాక, గాంధీజీని పంజాబు, ఢిల్లీప్రాంతాలకు పోనివ్వనందుకు ప్రతిఘటిస్తూ తీర్మానం చేసింది గాంధీజీ ప్రారంభించిన సత్యాగ్రహోద్యమానికి సానుభూతిని ప్రకటించింది ఏప్రిల్ 24 న సమావేశమయిన కృష్ణాజిల్లా మహాసభ మూకల దౌర్జన్యానికి విచారణం వెల్లడించి సైనిక శాసనాన్ని, నాయకుల ప్రవాసశిక్షలను ప్రతిఘటిస్తూ తీర్మానించింది

మద్రాసు నగరంలో జరిగిన పౌర మహాసభలో టంగుటూరి ప్రకాశం పంతులుగారు మాట్లాడుతూ, మనోవాక్కాయ కర్మలలో హింసకూడదని బోధిస్తూన్న సత్యాగ్రహం పంజాబ్ కల్లోలాలకు కారణం కాజాలదనీ ప్రభుత్వంవారి దుష్టచర్యలే అందుకు కారణాలయినవనీ అన్నారు రాజమహేంద్రవరంలో డిసెంబర్ కాంగ్రెసు,హోంరూల్ లీగ్‌ల సమష్టిసమావేశానికి అధ్యక్షత వహించిన కందుల వీరరాఘవస్వామిగారు, సత్యాగ్రహంవంటి సాత్త్వికోద్యమం ప్రజా కల్లోలాలకు కారణం కాదనీ, రౌలట్ చట్టనిర్మాణము, మహాత్ముని నిర్బంధము, ఢిల్లీలోను పంజాబులోనూ ప్రభుత్వంవారు అకారణంగా అవలంబించిన నిర్బంధ విధానాలే కారణాలని అన్నారు ప్రభుత్వం రౌలట్ చట్టం రద్దుచేసి నిర్బంధ విధానం విరమించుకొన్నట్లయితే శాంతి వాతావరణం యేర్పడగలదని ఆయన ప్రభుత్వానికి సలహా ఇచ్చినారు తరవాత సమావేశమయిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం మార్షల్‌లా కైదీలపై విధించిన శిక్షలను అమలు జరపకుండా ఆపివేయవలెనని తీర్మానించింది గంటూరుజిల్లా సంఘం రాజ ప్రతినిధి చెమ్స్‌ఫర్డ్ ప్రభువును ఇండియా నుంచి ఇంగ్లండ్‌కు పంపవలసిందని కోరుతూ అత్యవసర సమావేశంలో సుదీర్ఘంగా చర్చించింది అనేక సభలలో, సైనికశాసనం కింద హింసింపబడిన వారి కుటుంబాల సహాయార్థం నిధిని సేకరించేటందుకు తీర్మానాలు చేసినారు

## తెలుగు పత్రికల వ్యాఖ్యలు

ఆనాటి ఘటనలను గురించి ఆంధ్రపత్రిక ఇట్లా వ్యాఖ్యానించింది "ధర్మబలాన్ని అధికారులు, మితవాదులు, జాతీయవాదులుసైతం గ్రహింపజాలనందుకు సత్యాగ్రహ నాయకుడు గాంధీ మహాత్ముడు విషాదం పొందుతున్నాడు అస్త్రాలు, శస్త్రాలు,ప్రవాసాలు,దండనలు,శిక్షలు,చెరసాలలు ధర్మాన్ని బంధించలేవు మహాత్ముని శరీరాన్ని బంధించి ఆత్మను బంధించలేదు మానవకల్యాణానికి

ధర్మమే శరణ్యము ఆమ్మ్మహాత్మ్యం లోకానికి వెల్ల్లడి చేయడానికే సత్యాగ్రహ వ్రతం ప్రతిష్ఠింపబడింది ప్రజలందరు మతభేదాలను విడనాడి ధర్మస్వరూపిణి అయిన సత్యాగ్రహ వ్రతాచరణానికి పూనుకోవలె "

గాంధీజీపై విధించిన నిషేధాజ్ఞలను గురించి 1919 ఏప్రిల్ 18 న ఆంధ్రపత్రిక ఇంకా ఇట్లా వ్రాసింది

"మహాత్మాగాంధీగారే ప్రదేశానికి వెళ్ళితే అక్కడ శాంతి సుస్థాపితమవు తున్నది భావోద్రేకం ఆత్మనిగ్రహానికి ఎడమిస్తున్నది దురాగ్రహం తొలగి సాత్త్విక భావం ప్రబలుచున్నది గాంధీగారి ప్రయాణం నిరోధించక పూర్వం జరిగిన ఢిల్లీ పంజాబ్ రాష్ట్రాలలో వారిని వెడలనిచ్చిన యెడల ఆపరికి శాంతి ప్రబలి ఉండేది గాంధీమహాత్ముని అరెస్టువల్లనే ఇంతటి కలవరం ప్రబలిందని స్పష్ట మవుతున్నది అధికారులు గాంధీగారి తోడ్పాటు తీసుకొన్నట్లయితే ఎట్లాంటి కల్లోలాలనైనా సులభంగ తొలగి చకలిగి ఉండేవారు " ఈ అభిప్రాయానికి తార్కాణంగా గాంధీజీ అహమ్మదాబాదులో ప్రజాశాంతి పాలనపరచిన నిర్వహణ ఉదంతం పేర్కొంటూ ఆంధ్రపత్రిక ఇంకా ఇట్లా ప్రకటించింది "అహమ్మదా బాదు కల్లోలాలు పంజాబు సంఘటనంతో పోల్చినప్పుడు దూరంగాగల వొంటాయి నిరోధించలేదు గాంధీగారు అహమ్మదాబాదు పోయి కల్లోల పరిస్థితులను స్వయంగా చూసినారు సత్యాగ్రహులు, గాంధీగారి పేరుతో శాంతిని కాపాడవలెనని ప్రజలను ప్రార్థించుకొన్నారు గాంధీగారు అనసూయా బాయి ఆదివారంనాడు అహమ్మదాబాదులో దిగినారు వారికి ఎదురేగి ఆహ్వా నించడానికి కమిషనర్, కలెక్టర్, పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ గారు రైలుస్టేషన్ వద్ద సిద్ధంగా ఉన్నారు కాని రైలు ఆలస్యంగా వస్తుందని తెలియడంతో స్టేషన్‌నుంచి వెళ్ళిపోయినారు గాంధీగారు రైలు దిగి వెంటనే అధికారులను చూడటానికి వెళ్ళి జరిగిన పరిస్థితిని తమ విచారం వెలిబుచ్చి ప్రజలను శాంతింపచేయడానికి తాము కృషి సలుపుతామని వాగ్దానం చేసి వచ్చినారు ప్రాట్టుగారు గాంధీగారికి చేయదగిన సౌకర్యాలు నగరంలో విధించబడి ఉండేది గాంధీగారు వెంటనే అనసూయాబాయి అరెస్ట్ అయిన మాట అసత్య మని తాను అపుడు నిర్బంధంలో లేదనీ, నిర్బంధంలో ఉన్న కాలంలో తాను పరమ సౌఖ్యం అనుభవిస్తూ ఉంటిననీ పట్టణంలో జరిగిన అల్లరులలో తన మనస్సు ఎక్కువ బాధపడుతూ ఉండేదని సైనిక శాసనం తొలగింపబడవలెనని ప్రజలు వాంఛిస్తుంటే సైనికులు లేనిమార్గంలో ప్రయాణం వహించి తమ ఆశ్రమానికి రావలెననీ హిందూదేశంలో అల్లరులు లేకపోతే రౌలట్ చట్టం ఈపరికి రద్దుచేయ బడిఉండేదనీ ప్రకటిస్తూ అచ్చువేసిన కరపత్రాలను పంచిపెట్టించినారు

గాంధీగారి హితం అనుసరించి ప్రజలనేకులు సత్యాగ్రహాశ్రమానికి చేరు కొన్నారు ఆ సమయంలో గాంధీ మహాశయుడు పలికిన వాక్యం ఎట్లాంటివారి మనసులనైనా కరిగించి ఉండవలె " ఇది ఆనాటి ఆంధ్రపత్రిక సంపాదకీయ వ్యాసము

ఇక అహమ్మదాబాదు ప్రజలకు గాంధీజీ ఇచ్చిన సందేశం బట్టి శాంతిని నెలకొల్పటందు కాయన పూనిన ఉపవాస వ్రతం బట్టి, సత్యాగ్రహోద్యమ నిజతత్వమేకాక దాని ఫలితంకూడా నిరూపితమయింది ఆయన సందేశమిది

అహమ్మదాబాద్ నగరంలో కడచిన రెండుమూడు దినాలనుంచి జరిగిన అల్లరులు పురానికి అవమానం తెచ్చినవి ఇందుకు నాకు సిగ్గవుతున్నది అల్లరులలో పాల్గొన్నవారు నన్ను గౌరవించటానికి మారుగా అవమాన పరిచినారు ఇంతకంటే నన్నొక బాకుతో పొడిచినా నాకంత విచారం కలిగేదికాదు సత్యాగ్రహంలో పోరాటంగానీ దౌర్జన్యంగానీ జరగగూడదనీ ఆస్తికి నష్టం కలగకూడదనీ నేను వందమార్లు చెప్పినాను ఇక్కడ జరిగిన దేమి? గృహాలను కాల్చడంజరిగింది ఆయుధాలను బలవంతంగ తీసుకొన్నారు అంగడులు గృహాలు లూటీ చేయబడినాయి బండ్లు ఆపివేయబడినాయి ఇట్లాంటి కార్యాలవల్ల నన్ను ఉరినుంచిగాని చెరసాలనుంచిగాని విడిపింపదలచిన నా కట్లాంటి విమోచనమవసరంలేదు నే నట్లాంటి కార్యాల మూలాన విడిపింపబడలేను అనసూయ బాయి అరెస్టు అయిందని అబద్ధపువార్త వ్యాపింప చేయబడింది ప్రజలందువల్ల మరింత కోపావేశులయినారు కాని ఇందుమూలంగా అనసూయాబాయికి అవమానం కలిగింది రక్తపాతంవల్ల నే పట్టణానికి సైనిక శాసనం విధింపబడింది అహమ్మదాబాదు నగరం కిందుమూలంగా కలిగిన లాభమేదీలేదు కాని సాత్విక నిరోధోద్యమానికి మాత్రం ప్రబలనష్టం గలిగింది నా అరెస్టు తరవాత ప్రజలు శాంతిని కొనసాగించి ఉంటే రౌలట్ బిల్లులీపాటికి రద్దు కావింపబడి ఉండేవి లేకుంటే ఫలితం చేరువలోనైన ఉండిఉండేది రౌలట్ బిల్లు రద్దుకావటానికింకా కొంతకాలం పడుతుందన్నా ఆశ్చర్యం ఉండదు శుక్రవారం నాడు నేను నిర్బంధంనుంచి విడువబడిన పిమ్మట ఆదివారంనాడు నేను తిరిగి ఢిల్లీకి వెళ్ళి అరెస్ట్ కావడానికి ఉద్దేశించినాను ఇందువలన సత్యాగ్రహోద్యమానికెంతో బలం కలిగేది ఢిల్లీకి వెళ్ళకుండ ప్రజలపైననే నేను సాత్వికనిరోధమిపుడు పూనవలసివచ్చింది రౌలట్ బిల్లు రద్దగువరకు సత్యాగ్రహం ఎట్లా పూనదలచినానో రక్తపాతం ఆపడానికి కూడ అట్లే సత్యాగ్రహం పూనదలచినాను శాంతిని కాపాడి ఆస్తికిగాని ప్రాణానికిగాని ప్రజలకపాయం కలిగించడం మానివేసేవరకు స్వయంగ శరీర బాధల ననుభవిస్తాను అహమ్మదాబాదు ప్రజలు పొరపాట్లు చేయరని నిశ్చయమేర్పడేవరకు నేను కారాగృహంలో ఉండను సాత్విక నిరోధం అవలంబించేవారుగాని దానికి సానుభూతి చూపేవారుగాని ఎంతమాత్రం దౌర్జన్యం చేయరాదు నేను తిరిగి అరెస్టు అయితే ఉద్యమావలంబకులెవరూ ఆస్తికిగాని ప్రాణాలకుగాని ఎట్లాంటి అపాయం కలిగించరాదు సత్యాగ్రహోద్యమ మారంభించి దూరాలోచన లేకుండ వేలకువేల నా ఉద్యమంలో దింపినాననీ ఇట్లాంటి ఉద్యమమే లేకుంటే రక్తపాతం జరిగేది కాదనీ కొందరనవచ్చు ఇట్లాంటి తప్పుకొక గొప్ప ప్రాయశ్చిత్తం నేను ఢిల్లీకి తిరిగి పోకుండటమే అది నావంటివానికి ఎంతో దుస్సహ

మయిన శిక్ష. కాని ఆ శిక్ష చాలదని భావించి 7న గం॥ వరకు ఉపవాసం ఉండటానికి నిశ్చయించినాను. ప్రజలు 24 గంటల ఉపవాసంకంటె ఎక్కువ మూడు రోజుల ఉపవాసమంత కఠినంగా ఉండదు. ఈ నా బాధవల్ల [illegible] గలిగితే అహమ్మదాబాదు పౌరులెవ్వరూ దుష్కార్యానికి పూనుకోగూడదని నా మనవి"

గాంధీగారి ఈ సందేశంవల్ల అనుకోని ఫలితం కలిగింది. 'ప్రశాంత వాతావరణ మేర్పడింది. సైనిక శాసనం తొలగింపబడింది. అంగళ్ళు తెరవబడి నాయి. వ్యాపారం యథేచ్ఛగా సాగుతున్నది' అని ప్రభుత్వంవారు ప్రకటించి నారు. బొంబాయి ప్రభుత్వం వారవలంబించిన ఈ విధానం ఢిల్లీ, పంజాబ్ ప్రభుత్వాలవారుకూడా అవలంబించి గాంధీజీని ఆ ప్రదేశాలకు పోనిచ్చినట్ల యితే, అక్కడ రక్తపాతం, అల్లకల్లోలాలు జరిగి ఉండేవి కావని ఆంధ్ర పత్రిక అనేక పర్యాయాలు తన సంపాదకీయాలలో వ్రాసింది. ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, హితకారిణి మొదలయిన తెలుగు పత్రికలు సత్యాగ్రహోద్యమాన్ని అనవరతమూ సమర్థించినాయి.

'ఇంగ్లండ్ భయంకర మహాసంగ్రామంలో చిక్కుకొని ఉన్నప్పుడు, ప్రపంచ స్వాతంత్ర్యంకోసం రక్తం వరదలుగా ప్రవహింపజేసి, బంగారం వర్షింపజేసి ప్రపంచం ఆశ్చర్యచకితమయ్యేటట్లు తమ రాజభక్తిని ప్రదర్శించిన భారతీయులపైన అమానుషాలయిన నిర్బంధ చర్యలను ప్రయోగించిన ప్రభుత్వాన్ని" విమర్శిస్తూ 'దేశాభిమాని' పత్రిక సంపాదకీయం వ్రాసింది.

గాంధీజీని ఢిల్లీ, పంజాబులకు పోనీయకుండా ప్రభుత్వంవారు ఆయనను బొంబాయిలో నిర్బంధించినప్పుడు అక్కడకూడా కొన్ని అల్లరులు జరిగినాయి. వాటిని ఆపేటందుకు సత్యాగ్రహులకు సత్యాగ్రహ సూత్రాలను గురించి ఆయన చేసిన ప్రకటన ముఖ్యంగా నేటి పరిస్థితులలో సైతం ప్రతి ఒక్కరమూ మననం చేసుకోదగి ఉంది. ఆ ప్రకటన ఇది:

## సత్యాగ్రహమా ! దురాగ్రహమా !

"నా పర్యటనను నిరోధించినంతమాత్రంతో ప్రజలలో ఇంత ఉద్రేకము, ఇంత అశాంతి ప్రజ్వరిల్లవలసిన పనిలేదు. ఇది సత్యాగ్రహా[illegible], దురాగ్రహంకంటేకూడా నీచమయినది. సత్యాగ్రహ ప్రదర్శనలలో పాల్గొనే వారందరు దౌర్జన్యానికి దిగకూడదు. రాళ్లు వేయడం, ఇతరులను హాని చేయడం పనికిరాదు. బొంబాయిలో నన్ను డిటెన్షన్‌లో ఉంచినందుకు రాళ్లు విసరడం, ట్రాం బండ్లు నడవకుండా గాలిబండలు అడ్డం పెట్టడం జరుగుతూన్నది. ఇది సత్యాగ్రహం కాదు. దౌర్జన్యం చేసినవారిని 50 మందిని ఖైదు నుంచి విడిచిపెట్టమని కోరడం మంచిదికాదు. అటువంటి వాళ్లను ఖైదుకు పట్టి ఇవ్వడమే మన ధర్మము. దుండగులను ఖైదునుంచి వదిలివేయమనడం మతధర్మానికి విరుద్ధం. సత్యాగ్రహోద్యమ దినాలలో జరిగే దుండగాలకు సత్యాగ్రహులు బాధ్యులవుతారా? అని కొందరు ప్రశ్నిస్తున్నారు. "అయితే మీరు

తారు" అని నా సమాధానము సత్యాగ్రహోద్యమాన్ని కించిత్తు దౌర్జన్యం కూడా లేకుండ మనం నడపగలిగితే సరే! లేనట్లయితే దానిని పూర్తిగా ఆపివేయవలసి ఉంటుంది లేకుంటే దానిని మరికొన్ని కఠిన నిర్బంధాలతో మరో రూపంలోనైనా సాగించవలె అట్లా జరగనట్లయితే 'సత్యాగ్రహం' అనే పేరుతో జరిగే అనుచిత కార్యకలాపాలకు ప్రతిగా నేను సత్యాగ్రహం చేయవలసి ఉంటుంది మనం చనిపోవడం అవమానకరం కాదు సత్యాగ్రహి యెవరయినా చనిపోవడం నాకు దుఃఖకరమేకాని అతడు ప్రారంభించిన ధర్మయుద్ధానికి తగిన త్యాగమునే నేను భావించక తప్పదు సత్యాగ్రహులు కానివారికి గాని సత్యాగ్రహంలో చేరడానికి వీలులేనివారికిగాని ఏ మాత్రం హాని కలిగినప్పటికీ ప్రతి సత్యాగ్రహి అందుకు బాధ్యుడుకాక తప్పదు అందులో నా బాధ్యత కోటిరెట్లు ఉంటుందని నమ్మండి!

బొంబాయిలోని కొంతమంది ఆంగ్లేయులు గాయపడినారని నాకిప్పుడే తెలిసింది ఆ గాయాలవల్ల కొందరు చనిపోవచ్చు కూడా అది సత్యాగ్రహానికి తీరని కళంకము వారిమీద మన కోపం ఉండవలసిన పనిలేదు ఆ వార్తలు నేను భరించలేకుండా ఉన్నాను ఇట్లా ప్రవర్తిస్తూన్న మన సత్యాగ్రహులకు ప్రతిఫలంగా సనెట్లా సత్యాగ్రహం చేయాలో నాకు తెలుసు ఇందుకు ప్రాయశ్చిత్తంగా నేను చేయవలసిన పని ఒక్కటే ఉన్నది ఉపవాసంచేసి ఈ శరీరాన్ని విడిచివేయుడమే తగిన ప్రాయశ్చిత్తంగా నాకు కనబడుతూన్నది అప్పుడు సత్యాగ్రహంలోని సత్యసంధత రుజువు కాగలదు"

ఈ ప్రకటనతో బొంబాయి నగరంలో ప్రశాంత వాతావరణ మేర్పడింది ప్రజలు సత్యాగ్రహ దురాగ్రహాలకుగల భేదం తెలుసుకోగలిగినారు

గాంధీజీ సత్యాగ్రహ సందర్భంలో దేశంలో జరిగిన అల్లరుల కారణంగా శాసనోల్లంఘనం ఆపివేస్తూ ఇట్లా ప్రకటించినారు

"శాసనాతిక్రమణం తాత్కాలికంగా ఆపివేయవలెనని హితం చెప్పవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను దాని శక్తిపై నా విశ్వాసం తొలగిపోయినందువల్ల నేనా సలహా ఇవ్వడంలేదు దానిమీద నా విశ్వాసం ఎక్కువకావడం చేతనే నేని సలహా ఇవ్వవలసివచ్చింది సత్యాగ్రహసూత్రం అనుసరించే నిలువుడల కోరుచునా ను నేనీ ప్రతిఘోద్యమం తలపెట్టినప్పుడు దుష్టశక్తుల ఉనికిని బాగా గుర్తింపలేకపోయినాను ఇప్పుడు కొంచెమాగి పరిస్థితులను ఎట్లా ఎదుర్కొనవలెనో ఆలోచించగలను

సత్య, అహింస, ధర్మాలను మనం నిర్భయంగా వ్యాపింప చేయవలె అపుడు గాని ప్రజలలో తిరిగి ఉద్యమం ప్రవేశపెట్టడానికి వీలుండదు రౌలట్ శాసనం విషయంలో నా అభిప్రాయంలో ఏమీ మార్పులేదు రౌలట్ శాసన మీ ప్రస్తుతపు అశాంతికి కారణమని నేను నమ్ముతున్నాను శాసనాతిక్రమణం తాత్కాలికంగా నిలిపివేసి, శాంతిస్థాపనానికి ప్రభుత్వంవారికి తోడ్పడుతూ, సత్యం, అహింస, ధర్మాలను స్వీయాచరణంవల్ల ఉపదేశాలవల్ల ప్రజ

వళ్లిక్కేణి సముద్రం ఒడ్డున 1919 సెప్టెంబరు 1 న సభ జరిగింది. సభకు పదివేల మంది వచ్చినారు. మద్రాసు లేబరు యూనియను కంపెని కార్మిక సంఘాలవారు, అచ్చుపనివాళ్ళ సంఘంవారు మొదలయిన కార్మిక సంఘాలవారుకూడా ఆ సభలో పాల్గొన్నారు. డాక్టర్ సుబ్రహ్మణ్య అయ్యర్, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, ఎస్ కస్తూరి రంగయ్యంగారు, టి వి వెంకటరామయ్యర్, జి యస్ అరండేల్, సి రాజగోపాలచారి, టి గోపాలస్వామి మొదలియార్, టి యమ్ కృష్ణస్వామి అయ్యర్, గాడిచర్ల హరిసర్వోత్తమరావుగార్లు వంటి ప్రముఖులనేకులు ఆ సభలో ఉన్నారు. సభకు సుబ్రహ్మణ్య అయ్యర్ అధ్యక్షత వహించినారు.

సి రాజగోపాలాచార్యులవారి సభలో ప్రసంగిస్తూ "మద్రాసులో బ్రాహ్మణ బ్రాహ్మణేతర ఐక్యతనాన్ని హిందూమహమ్మదీయ సంఘీభావం సాధించగలమని మాత్రమే మహాత్మునకు పంపదగిన సందేశము. అదే ఆయనను సంతృప్తిపరచగలదు" అన్నారు. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మాట్లాడుతూ 'గాంధీమహాత్ముడు ప్రాచీన భారత నాగరిక ప్రతిభను తన జీవితంలో సుస్పష్టం చేసినారు. ఆయన మూర్తీభవించిన భారత సభ్యత అవతారపురుషుడు. ధర్మం నశించినప్పుడు ధర్మసంస్థాపనార్థం అవతరించగలనని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పినట్లు వీరుకూడా ధర్మసంస్థాపనార్థం అవతారమెత్తినారు. పాశ్చాత్య భౌతిక నాగరికతవల్ల ప్రపంచం కల్లోలితమయింది. నైతికదృష్టి నశించింది. మనలను పాశ్చాత్య దృక్పథంనుంచి తప్పించడానికి గాంధీజీ జన్మించినారు. ప్రేమ, దేశభక్తి, స్వదేశీవ్రతము వీరి ఉపదేశాలు. విషయలంపటత్వంనుంచి ప్రజలు విముఖులు కావలెనని వీరి సందేశం" అన్నారు. మరికొందరు ప్రసంగించిన తరవాత, డాక్టర్ జి యస్ అరండేలుగారు గాంధీ మహాత్ముని 51 వ జన్మదినోత్సవ సందర్భంలో మనం పంజాబ్ దురంతాలకు లోనైనవారి కుటుంబాల సహాయార్థం ధనసేకరణ చేయవలెనన్నారు. వెంటనే డాక్టర్ సుబ్రహ్మణ్య అయ్యర్ తన పై ఉత్తరీయం తీసి పంజాబ్ సహాయనిధికి సమర్పించినారు. ఆ ఉత్తరీయం వేలంవేస్తే సింధురాష్ట్రీయ ప్లీడర్ హిరదారామసింగ్ గారు రూ 115 లకు కొన్నారు. ఒకరు దంతపు వినాయక ప్రతిమను దానంచేసినారు. అది రూ 82 లకు విక్రయింపబడింది. కరిమ్‌సాహెబ్ గారిచ్చిన చెవిపోగు విక్రయించగా రూ 120 లు వచ్చింది. సభ్యులలో అనేకులు పంజాబ్ నిధికి శక్తికొద్దీ ధనసహాయం చేసినారు.

తరవాత అరండేలుగారు పంజాబు సహాయ నిధి నిమిత్తం గోఖ్లే హాలులో సెప్టెంబరు 24 న సరస్వతీబాయిగారి హరికథ జరుగుతుందనీ, 25 న రాయల్ థియేటరులో పాంచాలీ మానసంరక్షణ నాటకం ప్రదర్శింపబడుతుందనీ ప్రకటించినారు. ఆ రోజులలో పాంచాల రాష్ట్రానికి జరిగిన అవమానం మనస్సులో ఉంచుకొని, 'పాంచాలీ మానసంరక్షణ'మనే పేరుతో నాటకప్రదర్శనాలనేకాలు జరుగుతూండేవి. "పాంచాలి సాంత్వన" మనే శీర్షికతో

చర్యలను తీసుకోవలసిందిగా ఈ కాంగ్రెస్ పార్లమెంట్‌ను కోరుతూవున్నది (4) సత్వరసంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకు వీలుగా, సాధ్యమయినంతవరకు సంస్కరణలను ప్రజలు ఆచరణలో పెట్టగలరని ఈ కాంగ్రెస్ విశ్వసిస్తూన్నది (5) ఈ సంస్కరణల విషయంలో రైట్ ఆనరబుల్ మాంటేగ్ గారు చేసిన కృషికి ఈ కాంగ్రెస్ ఆయనకు కృతజ్ఞతను తెలుపుతున్నది

**సంస్కరణల చట్టము - ఆంధ్రలో పరిస్థితి**

రాజ్యాంగ సంస్కరణలకు గురించి మాంటేగ్ ఛెమ్స్‌ఫర్డ్ నివేదిక ప్రాతిపదికగ నూతన రాజ్యాంగచట్టం పార్లమెంట్ అంగీకరించింది అది దేశంలో రాజకీయ చైతన్యంకలవారి కనేకమందికి ఆశాభంగం కలిగించింది ఆంధ్రుల అభిప్రాయాలకు ముఖ్యంగా ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికలు ఆ రోజులలో ప్రతిబింబాలుగా ఉండేవి నూతన రాజ్యాంగ సంస్కరణలనుగురించి కృష్ణాపత్రిక 1919 డిశంబరు 20 న ఇట్లా వ్రాసింది

"మా ద్రణాశాసనంగాని రౌలట్ చట్టంగాని ఈ సంస్కరణలు రద్దుచేయగలవా? ఇవి ప్రజలను సాయుధులుగా చేయగలవా? వీటివల్ల పౌర సైనిక దళాలను నిర్మించడానికి వీలుకలుగుతుందా? బ్రిటిష్ పెట్టుబడిదారీ వర్గంనుంచి తప్పించుకొని ఇండియా ఆర్థిక వ్యవహారాలు స్వతంత్రంగా జరగడానికి అవకాశం ఉంటుందా? ఈ ద్వంద్వ ప్రభుత్వవిధానాన్ని అంగీకరించి భారతదేశాన్ని నోరుమూసుకొని పడిఉండమని కోరడం కేవలం వెర్రితనము"

తెలుగుపత్రికలు ఈవిధంగా సంస్కరణలకు ప్రతికూలంగా వ్రాసినప్పటికీ అమృత్‌సర్ కాంగ్రెస్ తీర్మానం అనుసరించి కాంగ్రెస్ నాయకుల ఆదేశానుసారం ప్రజలు సంస్కరణలను హృదయపూర్వకంగా ఆచరణలో పెట్టవలెననే అభిలషించినారు

ఆంధ్రనాయకులు నూతన సంస్కరణల ప్రకారం రానున్న శాసనసభల ఎన్నికలకు సర్వ సన్నాహాలు చేయడానికి పూనుకొన్నారు ఆంధ్ర మహాసభ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘంకూడా "సంయుక్త మద్రాసురాష్ట్రంలో ఆంధ్రుల హక్కులకు భంగంరాకుండే టందుకు మెలకువతో వ్యవహరించదలచుకొన్నారు ఎన్నికలను గురించి ప్రజలను చైతన్యవంతులుగా చేయడానికి కొండ వెంకటప్పయ్యపంతులు, కాశీశ్వరరావుగార్ల వంటి నాయకులు ఆంధ్రదేశంలో సంచారం ప్రారంభించినారు

ఇది ఇట్లా ఉండగా పంజాబు దురంతాలను గురించి విచారించేటందుకు ప్రభుత్వంవారు నియమించిన హంటర్ కమిటీలో స్వతంత్రులయిన భారతీయులెవ్వరూ లేనందున కాంగ్రెసువారా కమిటీ ఎదుట సాక్ష్యమీయడానికి నిరాకరించినారు కాంగ్రెస్ సంఘంవారు మహాత్మాగాంధీ, చిత్తరంజనదాస్, మోతీలాల్ నెహ్రూ, స్వామీ శ్రద్ధానంద్, పండిత మదనమోహనమాలవ్యా మొదలైన నాయకులతో మరొక విచారణసంఘం నియమించినారు హంటర్ కమిటీముందు డయ్యర్ సేనాని సాక్ష్యమిస్తూ, తాను చేసినపని బ్రిటిష్‌సామ్రాజ్య సంరక్షణకోసం

చేయవలసివచ్చిందని చెప్పినాడు అంతేకాక తన దగ్గరఉన్న మందుగుండు సామగ్రి అప్పటికి అయిపోకపోయినట్లయితే ఇంకా కాల్చేవాడినని అన్నాడు ఇంత దురహంకారియైన డయ్యర్ సేనానినీ తదితర దుండగీయులైన సైనికాధికారులను సమర్థిస్తూ 1920 మే 28వ తేదని హంటర్ కమిటీవారు నివేదికను ప్రకటించినారు జనరల్ డయ్యర్ సామ్రాజ్య సంరక్షుడని బ్రిటిష్ ప్రభుత్వం మెచ్చుకొన్నది డయ్యర్ సేనాని చేసిన ఈ 'మహాత్కార్యానికి' ఆంగ్లేయులు మెచ్చుకొని ఒక బంగారు కత్తిని, మూడు లక్షల రూపాయిల నగదును బహుమతిగా ఇచ్చినారు

ఇంతకుపూర్వం 1920 ఏప్రిల్ నెలలో కాంగ్రెస్‌వారు నియమించిన విచారణసంఘం నివేదికను ప్రకటించింది ఆ నివేదికలో పంజాబ్ ప్రభుత్వోద్యోగులు చేసిన దుండగాలు వివరంగా ఉన్నాయి వారి చర్యలు తీవ్రవిమర్శనకు గురియైనాయి ఆ నివేదిక నిష్పాక్షికమయినదని అన్ని పక్షాలవారూ కొనియాడినారు

పంజాబ్ దురంతాలకు పాల్పడిన ఉద్యోగులు కాంగ్రెస్ విచారణకమిటీవారు నివేదికను ప్రకటించిన తరవాత కూడా పంజాబ్‌లో తమ అధికారం చలాయిస్తూనే ఉన్నారు ఆ ఉద్యోగస్థులు పదవులనుంచి తొలగింపబడేవరకూ భారతదేశం నూతన సంస్కరణకింద రానున్న ఎన్నికలను బహిష్కరించవలసి ఉంటుందని లాలా లజపతిరాయ్ ప్రచారం ప్రారంభించినారు 1919 చివరి భాగంలోనే ఖిలాఫత్ సమస్యను గురించి వివిధ విధాలయిన సహాయ నిరాకరణ కార్యక్రమాలను నడిపింపవలెనని నిశ్చయించుకొన్న మహాత్మాగాంధీ లాలాజీతో చేతులు కలిపి 1920 జులైలో ఇట్లా ప్రకటించినారు

"నూతన సంస్కరణ విధానంకింద రానున్న శాసనసభలను బహిష్కరించే విషయంలో నేను లాలాలజపత్‌రాయితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను నేను ఖిలాఫత్ సమస్య విషయంలో ఎంత తీవ్రంగా ఆలోచిస్తున్నానో, పంజాబ్ విషయంలో కూడా అంత తీవ్రంగానూ ఆలోచిస్తున్నాను శాసనసభల బహిష్కరణ నా సహాయ నిరాకరణంలో ఒక మెట్టు మాత్రమే లాలాలజపత్‌రాయ్ సూచన నా ఉత్సాహాన్ని ద్విగుణీకృతం చేసింది ఎన్నికల కార్యక్రమం పూర్తి అయిన తరవాత సహాయనిరాకరణోద్యమం ప్రారంభించడం బాగా ఉంటుందని నాకు అనేకచోట్లనుంచి సలహాలు వస్తున్నాయి మనం శాసనసభా కార్యక్రమంలో పాల్గొనడానికి సంసిద్ధంగా లేనప్పుడు ఎన్నికలలో పాల్గొవటం పొరపాటని నా అభిప్రాయం అంతేకాక ప్రజలలో ప్రచారంచేసి వారిని చైతన్యవంతులుగా చేయవలసిన పని చాలా ఉన్నది అందువల్ల దేశంలోని శక్తిసామర్థ్యాలను ఎన్నికల ప్రచారంలో వ్యర్థం చేయడం నా కిష్టం లేదు. మనం ఎన్నికలలోకి దిగినట్లయితే ప్రజానీకం అసహాయోద్యమంలోని అంచాన్ని గ్రహించలేదు పంజాబ్ ఖిలాఫత్ సమస్యలు ప్రజలకు తృప్తికరంగా పరిష్కారం కానంతవరకు ఎవరు ఎన్నికలకు నిలబడ్డప్పటికీ వారు ప్రజాప్రతినిధులు

కారని ప్రజానీకం ఏకగ్రీవంగా ప్రకటించేటట్లు వారికి మనం బోధించవలె ఎన్నికలలో ఎవరికి వోటు ఇవ్వకూడదని మనం వారికి నచ్చచెప్పవలె లాలా లజపత్‌రాయ్ శాసనసభా బహిష్కారంతో ఆగిపోవాలని నేను అనుకోవడం లేదు మనది ఆత్మగౌరవంగల జాతి అనే భావం మనకు ఉన్నట్లయితే చతుర్విధ సహాయనిరాకరణ సూత్రాలను మనం అమలుపరచి తీరవలె ఖిలాఫత్ విషయంలో కాని పంజాబ్ సందర్భంలోకాని సామ్రాజ్య శాసనసభలలో భారతీయుల అభిప్రాయాలకు కించిత్తు గౌరవంకూడా లేదని తేలిపోయింది ఈ స్థితి మనకు ఎంతో అవమానకరము ఈ అవమానాన్ని మనం మాట్లాడకుండా దిగమింగి ఊరుకొన్నట్లయితే ఈ సంస్కరణలవల్ల మనకేమీ ప్రయోజనం ఉండదు మనకు నిజమయిన అభివృద్ధి జరగవలెనంటే ఈ రెండు సమస్యలూ పరిష్కారమయి తీరవలె మన కార్యవిధానంలో సహాయనిరాకరణోద్యమం కంటె ఉత్తమమైన విధానం మరొకటి కనిపెట్టబడేవరకూ సహాయనిరాకరణమే రంగంలో నిలిచి ఉంటుంది "

మహాత్మగాంధీచేసిన ఈ ప్రకటననుబట్టి 1920 నాటి అసహాయోద్యమానికి పునాది ఎట్లా ఏర్పరచటం జరిగిందో చదువరులకు బాగా బోధపడ గలదు

## 8

# గాంధీజీ మద్రాసు రాక (1920) - సహాయ నిరాకరణోద్యమ ప్రచారము

1920 ఆగష్టు 12 వ తేదీ ఉదయం 9-40 గంటలకు బొంబాయి మెయిల్ మదరాసు సెంట్రల్ స్టేషన్‌కు వచ్చి నిలచింది ఆ రైలులోనే మహాత్మ గాంధీ, డాక్టర్ కిచ్లూ, మౌలానా షౌకతాలీగార్లు మద్రాసుకు వస్తున్నారని తెలియడంచేత ప్రజలు స్టేషన్ ప్లాట్‌ఫారాలమీద గుమిగూడినారు సెంట్రల్ స్టేషన్‌లోని మూడు ప్లాటుఫారాలలో, స్టేషన్ ఆవరణలో, స్టేషన్ వెలుపలా ప్రజాసమూహం మూగి ఉంది ఉదయం 6 గంటలనుంచి సెంట్రల్ స్టేషన్‌వద్ద పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయబడింది ఖిలాఫత్ స్వచ్ఛంద సేవకులు కాంగ్రెస్ స్వచ్ఛందసేవకులు ప్రజలు ప్రశాంతంగా ఉండేటందుకు కావలసిన జాగ్రత్తలు తీసుకొన్నారు కార్మికసంఘాలవారు జెండాలతోను, గీతాలతోను స్టేషన్‌కు చేరుకొన్నారు

యస్ కస్తూరి రంగయ్యంగారు, యాకుబ్ హుస్సేన్, టి వెంకట రామయ్యర్, ఎ రంగస్వామి అయ్యంగారు, దొరస్వామి అయ్యర్, మునగాల రాజా నాయని వెంకటరంగారావు, చల్లా గురుస్వామి శ్రేష్ఠి, కొమ్మరాజు లక్ష్మణరావు, కొండూరు శ్రీరాములు, గద్దె రంగయ్యనాయుడు మొదలయిన వారు కూడ స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఉన్నారు మెయిల్ ఆగగానే, కాంగ్రెస్ ఖిలాఫత్ నాయకులు మహాత్మాగాంధీ షౌకతాలీగార్ల మెడలలో పూలదండలు వేసినారు జనం మూగి ఉండడంచేత జనసమూహంనుంచి తప్పించుకొని ఈ నాయకులు మోటారుబండిలో ఎక్కడానికి ఇరవై నిమిషాలు పట్టింది వారి మార్గమధ్యంలో ట్రాంబండ్లు, మోటారులు తదితర శకటాలు ఎక్కడివక్కడ జనం గుంపులుగా మూగి ఉండడంతో ఆగిపోయినాయి 'మహాత్మాగాంధీకి జై' 'అల్లా హో అక్బర్' అనే కేకలు మిన్నుముట్టినాయి

సాయంకాలం 6 గంటలకు తిరువళ్లిక్కేణి సముద్రం ఒడ్డున బహిరంగ సభ జరిగింది మధ్యాహ్నం 3½ గంటలనుంచి ప్రజలు సముద్రంఒడ్డుకు చేరుకొన్నారు దాదాపు 30 వేల మంది ప్రజలు సమావేశమయినారు యస్. కస్తూరి రంగయ్యంగార్, టి వెంకట్రామయ్యర్, ఎ రంగస్వామి అయ్యంగార్, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, పురాణం నాగభూషణం,

చల్లా శేషగిరిరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, వావిళ్ల వెంకటేశ్వర్లుగార్లు, యాకూబ్ హుస్సేన్, డాక్టర్ లతీఫ్, సయ్యద్ సాహెబ్, ఖాన్ బహదూర్ ఖుద్దూస్‌గార్లు మొదలైన పురప్రముఖులు సభలో ఉన్నారు ఖాన్‌బహదూర్ ఖుద్దూస్ బాదుషా సాహెబు సభాధిపత్యం వహించినారు

గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

'ఇంతకుముందెన్నడూ పరిష్కారంకాని సమస్యలను దూరదృష్టితో ఆలోచించి వాటి పరిష్కార మార్గాలను నిశ్చయించడానికి మనమిక్కడ సమావేశమయినాము కీ॥ శే॥ తిలక్‌గారి నిర్యాణానికి మనం చింతిస్తున్నాము తిలక్ మహాశయుడు భారతదేశోద్ధరణకు జన్మించినారు భారతదేశానికి స్వరాజ్యం సంపాదించడమే ఆయన ఆశయము అందుకోసం ఆయన తనశక్తినంతా ధారపోసినారు ఆయన భార్యాపుత్రాదులను సైతం విడనాడి దేశంకోసం అపూర్వ త్యాగంచేసిన మహామహుడు ప్రజలాయనను దైవసమానుడుగా భావించి గౌరవించినారు ఆమరణాంతం ఆయన స్వార్థ త్యాగం తప్ప మరొకటి ఎరుగనే ఎరుగరు ఆయన దేశసేవ 1879 లోనే ప్రారంభమయింది ముప్పైకోట్లన్నర భారతీయులకు ఆయనపట్ల గల పూజ్యభావానికదే కారణము స్వార్థ త్యాగంవల్ల తప్ప మరోమార్గంలో మనం దేశసేవ చేయజాలమని ఆయన పవిత్ర జీవితచరిత్ర మనకొక గుణపాఠంగా నిలచిపోయింది వట్టి ఉపన్యాసాలు, శుష్కప్రలాపాలని తేలిపోయింది మనము మన దేశగౌరవం, ఆత్మగౌరవం కాపాడుకొనేటందుకు, మన మతం రక్షించుకొనేటందుకు మనకు శక్తి ఉన్నదని నాకు తెలుసు 1893 లో నేను దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడు మొట్టమొదటగా నాకు ద్రావిడ సోదరులతో పరిచయం కలిగింది వారితో నేను కలసిమెలసి తిరిగినాను వారి స్వార్థత్యాగాన్ని అక్కడ కళ్లారా చూసినవాణ్ణి స్వార్థ త్యాగంలో మదరాసు ఇతర ప్రదేశాలకు ఎంతమాత్రమూ తీసిపోదని నా అభిప్రాయము మద్రాసు సహాయ నిరాకరణం త్రికరణశుద్ధిగా ఆచరణలోకి తీసుకొనిరాగలదని విశ్వసిస్తున్నాను

## సహాయ నిరాకరణోద్దేశము

"మనము రెండు విషయాలను గమనించవలసి ఉన్నది మొదటిది ఖిలాఫత్ విషయము బ్రిటిష్ ప్రభుత్వంవారు దైవసాక్షిగా మహమ్మదీయ మతం రక్షిస్తామని మహమ్మదీయుల కోర్కెలను మన్నిస్తామనీ ప్రమాణంచేసి వారి సహాయాన్ని పూర్తిగా తీసుకొని అవసరం తీరినతరవాత ఆ చేసిన వాగ్దానాలలో ఒకదానినైనా నెరవేర్చకుండా ఇండియాలోని ముస్లిమ్‌లకు సంకటం తెచ్చిపెట్టినారు బ్రిటిష్ ప్రభుత్వంవారి వాగ్దానభంగంవల్ల వారెంత రాజనీతి చతురులయినా ముసల్మానుల సహకారం ఇకముందు పొందలేరు బ్రిటిష్ ప్రభుత్వంవారు ఎంతకాలమయితే మహమ్మదీయులకు చేసిన వాగ్దానాలను నెరవేర్చరో అంతకాలమూ వారు ప్రభుశక్తి పరాయణులై ఉండలేరు అది

నిశ్చయము బ్రిటిష్‌వారు [illegible] ముసల్మానుల [illegible] [illegible] వారికి చేసిన వాగ్దానాలను చెల్లించి వారిని సోదరంగ చూడవలె హిందువులు [illegible] బ్రిటిష్ సంబంధంకంటె మహమ్మదీయ సంబంధం [illegible] [illegible] కోర్కెలు న్యాయసమ్మతాలుగా ఉన్నంతవరకు మనం [illegible] తోడ్పడక తప్పదు భారతీయులు ఆత్మగౌరవం కోల్పోలేరని ఆత్మగౌరవ [illegible] వారెంత త్యాగానికైనా చేయగలరనీ బ్రిటిష్‌వారికి [illegible] ఆత్మగౌరవం కోసం మతపోషణకోసం భారతీయులు ప్రాణాలు [illegible] సమర్పింపగలరని బ్రిటిష్‌వారికి క్రియారూపకంగా తెలియచేయవలె [illegible] లట్ బిల్లును ప్రవేశ పెట్టడానికి యత్నించింది మొగలుకొని అది [illegible] [illegible], [illegible] తరవాత బ్రిటిష్‌వారు భారతీయులను పెట్టిన బాధలు, వారికి చే[illegible] [illegible] చెప్ప నలవికాదు ఇంతటి ఘోరాలు[illegible] చేయడానికి [illegible] [illegible] రాష్ట్రంలో రక్తపాతం చేసిన దోషులను [illegible] [illegible] [illegible] కాని, మాంటేగ్, రాజప్రతినిధులుకాని, ఖిలాఫత్ అన్యాయం[illegible] [illegible] తాలను గురించి భారతీయుల మనస్తాపం [illegible] [illegible]డానికి ప్రయత్నించ లేదు భారతీయులకి విషయాలలో [illegible] చేయవలె[illegible] కోరిక [illegible] లేనట్లుతోస్తుంది కాబట్టి ఈకష్టసమయంలో మనం[illegible] మనం న్యాయం పొంద టానికి ప్రయత్నించవలె మన ఆత్మగౌరవంకోసం మనం ప్రభుత్వానికి ప్రతి కూలంగా సహాయ నిరాకరణం ప్రారంభించవలెనని సూచిస్తున్నాను ఇది ఎంత మాత్రం శాస్త్రవిరుద్ధమైనదిగాదు, మతాచార సంప్రదాయ సిద్ధమైనది దీనిని అవలంబించటానికి ప్రతి మానవునికి అధికారం ఉంది ఇది సంపూర్ణంగా శాస్త్ర సమ్మతమైన సాధనము మనకు దౌర్జన్యం ఎంతమాత్రం [illegible]పడదు అది భార తీయ సంప్రదాయంకాదు అది ఇంగ్లాండ్‌కే చెల్లుగాక మా మిత్రుడు షౌక తాలికి దండోపాయంలో విశ్వాసమెక్కువ అయన బ్రిటిష్ సామ్రాజ్యంపై కత్తిదూసి పోరాడగల ధైర్యశాలి అయన నాతో కలిసి ఉన్నంతవరకు, సహాయ నిరాకరణాన్ని విశ్వసిస్తున్నంతవరకు ఆయన ఎట్లాంటి దౌర్జన్యానికి పూనుకోడు ఆంగ్లేయులపైగాని తదితరులపైనకాని దండోపాయం వినియో గించడు తన మత సంప్రదాయాన్ని అనుసరించి అన్నమాటను ఆయన తప్పడు ఆయన అసహాయ వ్రతం అసిధారావ్రతంగా ఆచరిస్తున్నాడు హిందూదేశమంతా దీనిని అవలంబించవలెనని కోరుతున్నాను సమయం వచ్చి నప్పుడు కత్తి దూసేటందుకు కూడా షౌకతాలి సంసిద్ధమే ఒకవేళ అతడు దౌర్జన్యం చేయడానికి ప్రయత్నిస్తే నేను సన్యసించి ఈ ప్రపంచం విసర్జించి అడవికిపోయి అక్కడే మరణించగలను మానవునికి స్వార్థత్యాగమే పరమావధి నేను దానినే అవలంబిస్తాను షౌకతాలికూడ స్వార్థత్యాగమే అవలంబించి నాడు అదే మనకు శరణోపాయము సహాయ నిరాకరణం మనకు అమోఘ మైన అస్త్రము కాబట్టి మనమందరము దానికి పూనుకొనవలెనని హెచ్చరిస్తు న్నాను. మన సభాధ్యక్షులు తన బిరుదును విసర్జించవలె న్యాయవాదులు ప్రభు

త్వానికి సహాయం చేయకూడదు ప్రజల కోరికలను మన్నించని నీతిబాహ్యమయిన అన్యాయానికి వొడిగట్టినటువంటి ప్రభుత్వంలో ఎవ్వరూ ఉద్యోగాలు చేయ కూడదు తన జాతివారిని ప్రభుత్వంవారు అవమానిస్తూన్నారని తెలిసినప్పుడు పోలీస్ ఉద్యోగి, సైనికుడుకూడా తమ ఉద్యోగం చాలించుకోవలసి ఉంటుంది పన్నులు చెల్లించకూడదని చెప్పదలచుకొన్నాను వీటినన్నిటిని ఇదివరకు చేసిన వాడనే ఎవ్వరూ నన్ను ఆక్షేపించలేదు పైపెచ్చు అందరూ నాతో ఏకీభ వించినారు నేను చేసినది శాస్త్రవిరుద్ధమని ఎవ్వరూ సాహసించి చెప్పలేదు పంజాబు రాష్ట్రంలో రక్తపాతంచేసి 'ముసల్మాను' మతానికి ముప్పుతెచ్చి పెట్టి నటువంటి ప్రభుత్వంతో, పంజాబులో ప్రజలను పొట్టలమీద పాకేటట్లుచేసి, ప్రతి నిమిషం ప్రజలను అవమానపరచిన దొరతనంతో సహకరించడం శాస్త్రసమ్మతం కాదు అది శాస్త్ర విరుద్ధంకూడా మనకు ఆత్మగౌరవం ఉంటే మనం ఈ ప్రభు త్వంతో సహకరించరాదు నాకు ఆంగ్లేయులు శత్రువులుకారు నాకు దగా, మోసం ఇటువంటివి ఎంతమాత్రం గిట్టవు అసత్యమంటే అసలే సరిపడదు మన దొరతనం వారు నన్ను గర్భశత్రువుగా భావించిన భావింతురుగాక

మనము దొరతనంవారికి సహాయపడితే పంజాబు దురాగతాల విష యంలో న్యాయం చేస్తారని, ముసల్మానుల మతభావాలను మన్నిస్తారని భావించి వారికి తోడ్పడవలెనని 'అమృత్‌సర్' కాంగ్రెస్‌లో ప్రజలను ప్రోత్స హిస్తూ ఉపన్యసించినాను సామ్రాట్టుల ప్రకటనవల్ల న్యాయం కలగగలదని విశ్వసించినాను కాని అదంతా వ్యర్థమయింది 'మాంటేగ్'గారి ఉపన్యాసాలు మనలను ఆశాభంగకు లిగించినాయి ప్రభుత్వంవారు మనఆత్మగౌరవాన్ని మన్నించి మనకు న్యాయం చేయనంతవరకు వారికి మనం తోడ్పడకూడదు పాలకులు పాలితులకు అన్యాయం చేసినప్పుడు, పాలితులు పాలకులకు తోడ్పడడానికి మన శాస్త్రాలు అంగీకరించవు ప్రభుత్వంవారు మన మానవ సత్వాలు చూర గొన్నప్పుడు మనము సహాయ నిరాకరణం అవలంబించి తీరవలె ప్రత్యేక దేశీయ మహాజనసభ జరిగేనరకు సహాయ నిరాకరణాన్ని ఆపవలెనని కొంతమంది అభిప్రాయము వ్యక్తిగతంగా నాకిది ఇష్టమే కాని నేను 'ముసల్మాను'లకు పవిత్రమైన ధర్మకర్తృత్వం వహించినాను వారు నన్ను నమ్ముకొని ఉన్నారు తమ జీవితాశయాలకు వారు నాపై ఆధారపడి ఉన్నారు అందు వల్ల వారిని ప్రత్యేక దేశీయ మహాసభా తీర్మానంవరకు వేచియుండవలసిందని చెప్పజాలకున్నాను మన అందరి అభిప్రాయాలను బట్టియే దేశీయ మహాసభ తీర్మానిస్తుంది కనక భిన్నాభిప్రాయాలకు తావీయక అందరూ సహాయ నిరా కరణం అవలంబించవలె ఒకవేళ ప్రత్యేక జాతీయ మహాసభలో సహాయ నిరా కరణం కూడదని నిర్ణయిస్తే 'ముసల్మానులు' ఏ ఇతర సహాయంలేక పోరాడ వలసి వస్తుంది కాబట్టి మనమంతవరకూ వేచిఉండనవసరం లేదు

## సహాయ నిరాకరణ విధానము

"రానున్న నూతన శాసనసభలను బహిష్కరించవలె. ఆ సభలకు ఎవ్వరూ అభ్యర్థులుగా ఉండకూడదు. ప్రజలకు చక్కని మార్గం చూపడం నాయకుల ధర్మము. ఎన్నికల్లో అభ్యర్థులుగా ఉండి సహాయ నిరాకరణం చేయ ప్రయత్నించగలమనడంలో అర్థంలేదు. నేను చెప్పినట్లు సహాయ నిరాకరణం చేయనట్లయితే నాయకులు తాము ఎన్నిన వలలో తామే చిక్కుకొంటారు. శాసనసభలను చూసి వ్యామోహితులు కావద్దు. మితవాదులుగానీ జాతీయవాదులుగానీ ఆ సభలకు పోతే పోనీయండి. మంచివాళ్లూ చెడ్డవాళ్లూ అన్నివర్గాలలోనూ ఉంటారు. జాతీయవాదులు సభలను ఎక్కంటే మితవాదులు పోతారేమోనని భయపడనక్కరలేదు. ధర్మపథంలో ప్రయోజనాలను లెక్కపెట్టకూడదు. నా నిర్ణయం నాకున్నది. ఇతరులు వేరేమార్గాలు అవలంబిస్తే అవలంబించనివ్వండి! నేను నా వాక్కును కోల్పోవడంకంటె మరణమే శ్రేయస్కరమని నా అభిప్రాయము. శాసనసభలకు పోకూడదు. పైనుంచి మనం విత్తు నాటితే అది సహకారానికి దారితీయగలదు. సర్వాధికారపు ప్రభుత్వ వ్యవస్థ గతమయినప్పుడు ప్లీడర్లు తమ వృత్తిని మానుకోవలె. [illegible] లను విడిచిపెట్టండి! మన న్యాయవాదులే మనకు సత్రమ పద్ధతులను శాంతినీ ఏర్పాటుచేయగలరు. ప్రభుత్వ పాఠశాలలకు పిల్లలను చదువుకోసం పంపవద్దు. ఈ కళాశాలలు మనను గుమస్తాలుగాను, నౌకర్లుగాను తయారుచేయడానికి ఏర్పాటయినవి. బిరుదాంకితులయినవారు బిరుదులను వదిలివేయండి! బ్రిటిష్ ప్రభుత్వంవారి బిరుదులు పొందడంతో మన జాతీయ గౌరవం నశించింది. అవి మనకు అమర్యాదను న్యూనతను తెచ్చిపెట్టినాయి. [illegible] ఉద్ధరించవలెననంటే సహాయ నిరాకరణం అవలంబించగలిగినవారు మహమ్మదీయులందరు తక్షణం తమ బిరుదులు విడిచివేయవలె. ప్రజలు ప్రశాంత విప్లవకాలంలో వలె పనిచేయవలె. కాని మనకు దౌర్జన్యపద్ధతి పనికిరాదు. మనం ప్రస్తుతం కల్లోల పరిస్థితినుంచి శాంతిని నెలకొల్పవలసిఉంది. మనకు విప్లవం అవసరంలేదు. అన్యాయం తొలగించుకొని న్యాయం సాధించడమే మన ఆదర్శము. అందుకు శాంతియుత సహాయ నిరాకరణమే సాధనము. మనకు పరుషవాక్యాలు ప్రసంగం అవసరంలేదు. ఇతరులపై చిటికెనవేలుకూడా ఎత్తవలసిన పనిలేదు. మన ప్రభుత్వం వారి చర్యలు నీతిబాహ్యాలుగా ఉన్నాయి. నేను సహాయ నిరాకరణంద్వారా బ్రిటిష్‌సామ్రాజ్యానికి చేసిన మేలు 'మాంటేగ్' తరువాత వచ్చేవారు గమనించగలరు. మన జాతీయ గౌరవానికి భంగకరమైన 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్' రాకను నేను అంగీకరించను. మోటుపదం మనము వినియోగించకూడదు. ఎంతసేపు మతాచార సంప్రదాయాల ననుసరించే మతం విజయం పొందవలె. నేను వైష్ణవ సంభూతుణ్ణి కాను. [illegible] నాలో లోపాలున్నాయి. ప్రపంచంలోని కష్టాలనేకం అనుభవించాను. నేను చూసినాను. వాటిలో నాకెక్కువ అనుభవమున్నది. నేను చాలా కష్టాలను భరించినవాణ్ణి

సన్యాసి మొదలు ఎంసారివరకు సహాయ నిరాకరణం చేయవలసిఉంది యూరో పియన్‌లకు కత్తి ప్రధానము ఋషి సంప్రదాయకులమైన మనకు స్వార్థ త్యాగం ప్రధాన దౌర్జన్యవాదుల సిద్ధాంతాలు భిన్నాలైనప్పటికి అందరూ స్వార్థత్యాగులు కావలె ధైర్యంతో సరియైన న్యాయమార్గం, సహాయ నిరాకరణం అవలంబించేటందుకు మీకా దయామయుడైన భగవంతుడు తోడ్పడుగాక మహాత్మాగాంధీ ఇట్లా మాట్లాడిన తరవాత షౌకతాలి ఉర్దూభాషలో ఉపన్యసిస్తూ గాంధీగారి వాక్యాలనే బలపరచినారు 'యాకుబ్ హుస్సేన్'గారు తిరునల్వేలి, తంజావూరు మండలి సభలోను ఆంధ్రరాష్ట్రీయ సభలోను సహాయ నిరాకరణం అంగీకరించబడింది కాబట్టి అందరూ దానిని అవలంబించవలె నన్నారు అంతటితో సభ ముగిసింది

## మహాత్మాగాంధీ బెజవాడ రాక

మహాత్మాగాంధీగారి బెజవాడ రాకను గురించి శ్రీ అయ్యదేవర కాళేశ్వర రావు గారికి ముందుగానే తెలియచేయడం జరిగింది ఆయన గాంధీజీ దర్శనానికి ఆంధ్రులందరు బెజవాడ రావలసిందిగా కోరుతూ 1920 ఆగష్టు 20 వ తేదీ 'ఆంధ్రపత్రిక'లో ఇట్లా ప్రకటించినారు "మహాత్మాగాంధీ, మౌలానా షౌకతాలిగారు ఈ 28 వ తేదీ, తెల్లవారుజామున 8 గంటలకు బెజవాడ వస్తారు ఆంధ్ర ప్రముఖులందరిని కలుసుకొనేటందుకు వారు వస్తున్నారు పొద్దున కార్మికుల సభ కొత్తపేటలో జరుగుతుంది సాయంకాలం 5గం, లకు ఒడ్డివద్ద మైదానంలో బహిరంగసభ ఉంటుంది ఆంధ్రదేశంలో వారొక్క రోజే ఉంటారు 28 వ తేదీ రాత్రికే వారు బొంబాయికి బయలుదేరి వెడతారు" అని ప్రకటనచేసిన కాళేశ్వరరావు పంతులుగారు విజయవాడకు ఆనాటి గాంధీజీ రాకనుగురించి "నా జీవితకథ నవ్యాంధ్రము" అనే గ్రంథంలో ఇట్లా వ్రాసినారు

"మహాత్మాగాంధీ, షౌకతాలిగార్లు విజయవాడకు వచ్చి నాకు అతిథులుగా ఉన్నారు వారిద్దరూ చెన్నపట్టనంనుంచి సెప్టెంబర్ 4 వ తేదినుంచి జరగబోతున్న ప్రత్యేక కాంగ్రెస్ మహాసభకుపోతూ దారిలో విజయవాడలో ఆగుతున్నామని నాకదివరకే తెలిపినారు నేను వారిని విజయవాడ రైలు స్టేషన్‌లో ఐదిన్నిక ఇటులతో వెళ్ళి స్వాగతమిచ్చి తీసుకొనివచ్చి మున్సిపల్ రహదారి బంగళాలో బసచేయించినాను ఆ రహదారి బంగళా అప్పుడు పాత బస్తీలో 'టెలిగ్రాఫ్ ఆఫీస్'కు పడమటివైపున దరిమిలా పెద్ద మార్కెట్ కట్టబడి ఉన్నచోట ఉన్నది అందులో ఆ మహానాయకులిద్దరు బసచేసినారు శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులుకూడ మద్రాసునుంచి వారితో వచ్చినారు కాని ఆయన ఆ రహదారి బంగళాలో బసచేయక బెజవాడ రైలు స్టేషన్‌లో విశ్రాంతిగదిలో బసచేసినారు మహాత్మాగాంధీగారు బెజవాడ వస్తున్నారను వార్త ఉత్తరాలద్వారా, టెలిగ్రాములద్వారా ఆంధ్రదేశంలోని

వివిధ పట్టణాలలోఉన్న నాయకులకు, ప్రముఖులకు నేను తెలియపరచినాను బరంపురం మొదలుకొని నెల్లూరువరకూ ఇతర జిల్లాలనుంచి చాలామంది వచ్చినారు అయిదువేలమంది జనం ఆ సాయంత్రం జరిగిన బహిరంగసభలో పాల్గొన్నారు అది రహాంబంరి బంగళా పెద్ద ఆవరణలోని జమ్మిచెట్టుక్రింద జరిగింది కొద్దిగా చినుకులు పడినాయి అయినను సభ చాలా జయప్రదంగా జరిగింది బందరునుంచి 'ముట్నూరు కృష్ణారావుగారు', 'చెరకువాడ నరసింహం' గారూ వచ్చినారు కాని 'భోగరాజు పట్టాభిసీతారామయ్య'గారు రాలేదు గుంటూరు నుంచి 'కొండా వెంకటప్పయ్య పంతులు'గారు 'గొల్లపూడి సీతారామశాస్త్రి' గారు రాలేదు 'పున్నప లక్ష్మీనారాయణ'గారు వచ్చినారు 'టంగుటూరి ప్రకాశం' పంతులుగారు చెన్నపట్టణంలో గాంధీగారిని దర్శించి బెజవాడకు రాలేదు ఆ మహాసభలో మహాత్మాగాంధీగారు భావోద్రేకపూరితమైన ఉపన్యాసంలో పంజాబు దురంతాలవల్ల కలిగిన జాతీయావమానం బాపుకోవడానికి, మనతోడి 'ఆసియా' ఖండ దేశమైన తురుష్క దేశానికి జరిగిన అన్యాయానికి ప్రతిఘటన చేయడానికి, భారతదేశానికి స్వరాజ్యసంపాదనంకోసం తాను కలకత్తాలో జరుగబోయున్న ప్రత్యేక మహాసభలో దౌర్జన్యరాహిత్య సహాయ నిరాకరణం ప్రతిపాదించబోతున్నానని చెప్పి ఆ సహాయ నిరాకరణోద్యమం యొక్క తప్సీళ్ళను సెలవిచ్చినారు బిరుదులను గౌరవోద్యోగాలను విసర్జించటం, శాసనసభలను బహిష్కరించటం, ప్రభుత్వ పాఠశాలలను, కళాశాలలను విద్యార్థులు వదలిపెట్టడం, లాయర్లు కోర్టులను బహిష్కరించడం, ప్రభుత్వోద్యోగానికి, సైనికోద్యోగానికి రాజీనామా లివ్వడం, బిరుదాలను ధిక్కరించడం చివరకు పన్నుల నిరాకరణము అనే పనులను కొన్ని మెట్లుగా ప్రజలు చేయవలసి ఉన్నారు ఇవి సత్యాహింసాయుతంగానే చేయవలెనని వారు వివరించినారు మహాజనానికంతకును చాల ఉత్సాహంఉంది గారి ఉపన్యాసం ముగిసిన తరువాత మహాత్మాజీ నన్ను దగ్గరకు పిలిచి "మీరు నేను చెప్పిన దానితో ఏకీభవిస్తున్నారా ? అట్లయినట్లయితే మీరు కృష్ణామండలంనుంచి మద్రాసు శాసనసభకు సభ్యులుగ పోదలచి ప్రచారం చేస్తున్న అభ్యర్థిత్వాన్ని వదలుకొంటారా అని నన్ను ప్రశ్నించినారు నేను మారు మాటాడకుండ "నా అభ్యర్థిత్వం తమ పాదాలదగ్గిర విసర్జించినాను తమతో నేను పూర్తిగ ఏకీభవిస్తున్నాను తమ శిష్యత్వాన్ని మనసారా అంగీకరిస్తున్నాను నేను నా మిత్రులు వచ్చి కలకత్తా కాంగ్రెస్ మహాసభలో తమపక్షాన బలం కలగ జేస్తాము" అని మనవి చేసినాను నా ముఖ్యమిత్రులైన 'మహమ్మద్ గులాం మొహిద్దీన్' సాహెబ్ మొదటి తరగతి గౌరవ మెజిస్ట్రేట్‌గా ఉండేవారు నాతోపాటు తాము కూడా గౌరవోద్యోగం వదలుకొందుమని ప్రకటించినారు అప్పుడు శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచారిగారు కూడ అక్కడనే ఉండినారు ఆంధ్రదేశంలో మహాత్మాగాంధీగారి దౌర్జన్యరాహిత్య సహాయ నిరాకరణోద్యమం అనుసరించి శాసనసభ అభ్యర్థిత్వం మొదటి తరగతి గౌరవ

మేజిస్ట్రేట్ పదవిని వదలుకొన్నవారు అప్పటికి మేమిద్దరమే. ఈ సంగతి మహాత్మాగాంధీగారు ఆ సభలో గుమికూడిన వేలాది ప్రజల కరతాళధ్వనుల మధ్య ప్రకటించినారు. తమ 'యంగ్ ఇండియా' పత్రికలో కూడ వ్రాసినారు. అంతటితో నేను శాసనసభ పోయే ప్రయత్నం విరమించుకొన్నాను. మహాత్మాగాంధీగారి సహాయనిరాకరణోద్యమంలో చేరిపోయినాను. ఆ తెల్లవారుజామున మద్రాసునుంచి కలకత్తాకు పోయే మెయిల్ బండిలో ఆ ముగ్గురు మహానాయకులను ఎక్కించి సెలవులీసుకొని ఇంటికి వచ్చినాను. ఆ మరునాడే నేను గులాం మొహిద్దీన్ సాహెబ్‌గారు, కొంతమంది మిత్రులము బయలుదేరి కలకత్తా వెళ్ళినాము. అదివరకే బెజవాడలో కాంగ్రెస్ కమిటీతోపాటు ఖిలాఫత్ కమిటీకూడ స్థాపించబడి ఉండేది. దానికి గులాం మొహిద్దీన్ సాహెబుగారు అధ్యక్షులుగా ఉన్నారు.

నన్ను కలకత్తాలో దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులుగారు కలవడంతోనే "నాతో సంప్రదించకుండగానే, నాతో చెప్పకుండగానే మీరు మీ శాసనసభ అభ్యర్థిత్వం విసర్జించినారేమి?" అని నన్ను అడిగినారు. వేంకటప్పయ్య పంతులుగారికి యావజ్జీవితం సీతారామశాస్త్రిగారిపై ఎక్కువ నమ్మకము, ప్రేమ ఉండేది. సాధారణంగా అన్ని విషయాలను సంప్రదించుకొనియే చేసేవాణ్ణి. కాని ఇది అటువంటి మామూలు విషయం కాదు కాబట్టి, నూతనోద్యమం సాగించదలచి నన్నందులో చేరవలెనని మహాత్ములవారే కోరినప్పుడు మిమ్ము సంప్రదించడానికి అవకాశం లేకపోయింది. తాము కూడా వెంటనే సంకోచం పెట్టుకోక ఈ మహోద్యమంలో చేరండి అని జవాబు చెప్పినాను. కాని వారందుకు వ్యతిరేకంగా ఉన్నారు."

## అసహాయోద్యమము - ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ సమావేశము 1920 ఆగష్టు 21 వ తేది సాయంకాలం 6 గంటలకు ఆంధ్రపత్రిక కార్యాలయంలో ఏర్పాటుచేయబడింది. సభకు పురాణం నాగభూషణం పంతులు, వేమవరపు రామదాసు పంతులు, హరోతా సూర్యనారాయణరావు, ఎల్లేపెద్ది వెంకట్రామశాస్త్రి, కౌతా సూర్యనారాయణరావు, వారణాసి సూర్యారావు, గద్దె రంగయ్యనాయుడు, చల్లా శేషగిరిరావు, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి, దేవిడి జమీందారు, కడప మున్సిపల్ చేర్మెన్ వి పిచ్చయ్యగారు హాజరైనారు. ప్రేక్షకులు కూడా చాలామంది వచ్చినారు.

వేమవరపు రామదాసు పంతులుగారు అధ్యక్షత వహించి మహానంది సభలో 'ఖిలాఫత్' విషయంలో సహాయనిరాకరణ విధానం అంగీకరించబడిందని పంజాబు మొదలైన విషయాలలో ఇంకా అది నిశ్చయం కాలేదని తెలియజేసినారు. బొంబాయి, బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలవారు సహాయ నిరాకరణం గురించి చేసిన తీర్మానాలను సభ్యులకు చదివి వినిపించినారు. ఆంధ్రరాష్ట్ర

కాంగ్రెస్ సంఘంవారి అభిప్రాయం తెలియజేసేటందుకు ఈ సభ ఏర్పాటయిం దన్నారు అంతట సహాయ నిరాకరణం చర్చ ప్రారంభమయింది రామదాసు పంతులుగారు ఇంకా ఇట్లా అన్నారు "యస్ శ్రీనివాసయ్యంగారు సహాయ నిరాకరణము న్యాయానుక్రమం కాదంటున్నారు కస్తూరి రంగయ్యంగారు న్యాయానుసరణమయినదే అంటున్నారు నేను కూడా న్యాయమయినదేనని నమ్ముతున్నాను సాత్త్వికనిరోధం దక్షిణాఫ్రికాలో శాస్త్రసమ్మతమని అందరూ అంగీకరించినారు హార్డింజ్ ప్రభువు కూడా అదే అభిప్రాయమిచ్చినారు ఇండియా ప్రభుత్వంవారు అది న్యాయవిరుద్ధమని ఎప్పుడూ అనలేదు కాబట్టి మనమిప్పుడు సహాయ నిరాకరణ సిద్ధాంతం గురించి, దాని కార్యక్రమాలను గురించి చర్చించవలసి ఉన్న దన్నారు "

ప్రస్తుత పరిస్థితులు దుర్భరంగా ఉన్నందువల్ల 'ఖిలాఫత్', ఆఫ్రికా విష యాలలో సహాయ నిరాకరణ సిద్ధాంతం అంగీకరించవలె"నని కొండా సూర్య నారాయణ రావుగారు ఒక తీర్మానం ప్రతిపాదించినారు గద్దె రంగయ్య నాయుడుగారు "పంజాబు, ఖిలాఫత్, ఆఫ్రికా సమస్యలను గురించి మనం సహాయ నిరాకరణం అంగీకరించి తీరవలె ఎట్లాగయినా మనం అవసర దేశీయ మహాజన సభ తీర్మానానికి వేచియున్నాము గదా! కాబట్టి సహాయ నిరాకరణ కార్యక్రమం సహితం అంగీకరించవచ్చు ఇక బిరుదుల విషయము బిరుదల కోసం మనవాళ్ళు ఎంతో ఆరాటపడినారు, ఇంకా పడుతున్నారు అటువంటి వారు తమ బిరుదులను తేలికగా విడిచిపెడతారనే నమ్మకం లేదు ఏది ఎట్లా ఉన్నా సహాయ నిరాకరణ సిద్ధాంతం మాత్రం మన మంగీకరించి తీరవలె '

తరవాత కొండ వేంకటప్పయ్య పంతులుగారు మాట్లాడుచు "సహాయ నిరాకరణంను అంగీకరించకూడదని చెప్పవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను నాకుకూడా ఈ విషయంలో ఉత్సాహముంది! కాని ఈ సిద్ధాంతాన్ని అంగీక రించడమా? లేదా? అనే సందేహం మాత్రం లేకపోలేదు దీనిని అవలంబించ కూడదని మహానందిలో చెప్పినాను నాకీ సిద్ధాంతంలో సానుభూతి ఉంది కాని మనం ప్రజలకు చేసి చూపించలేని సిద్ధాంతాన్ని అంగీకరించి ప్రయోజనం లేదని నా అభిప్రాయము అదీకాక మనకు ఆంధ్రరాష్ట్రం కొద్ది కాలంలో రానున్నది మనమీ సిద్ధాంతం అవలంబించి శాసనసభలకు పోవడం మానుకొన్న ట్లయితే, రానున్న ఆంధ్రరాష్ట్రం ఫలోన్ముఖం కాకపోవచ్చు అందువల్ల ఈ సిద్ధాంతం అంగీకరించకూడదని నా అభిప్రాయము ' అన్నారు

టి వి వెంకట్రామయ్యర్ గారు మాట్లాడుతూ, "కొండ వేంకటప్పయ్య పంతులుగారితో నేనేకీభవించజాలను ఎందువల్లనంటే నేటి సామ్రాజ్య సభలో మన రాజ ప్రతినిధి సహాయ నిరాకరణ వాదులు శుద్ధ మూర్ఖులు, అవివేకులు అన్నారు మాంటేగ్ గారు వారిపైన కఠిన చర్య తీసుకోవలె అన్నారు సినాహా ప్రభువు అన్న మాటలుకూడా మనకు తెలుసు ఇటువంటి పరిస్థితుల్లో సహాయ నిరాకరణం కూడదనటం అసమంజసమని నా అభిప్రాయం సహాయ నిరాకరణం

కూడదనేవారు ఇంకొక మార్గం సూచించడం లేదు దొరతనంవారు మనకు చేస్తూండిన అపకారానికి మరొక ప్రతీకారమైనా చూపించడం లేదు క్రియాశూన్యాలైన సభలు నిష్ప్రయోజనాలు మనకు ఆత్మగౌరవ మున్నట్లయితే ఏదో ఒక ప్రతీకార చర్య తీసికొని తీరవలె కాబట్టి సహాయ నిరాకరణం గురించి ప్రజలను చైతన్యవంతులనుగా చేయడం మన ధర్మము సహాయ నిరాకరణాన్ని ఏ కొద్దిమంది అవలంబించినప్పటికీ అది ప్రయోజనకరమే ఈ సందర్భంలో గాంధీ మహాత్ముడు మనకు మార్గదర్శిగా ఉన్నారు మనకు ఆత్మగౌరవం ఉంటే సహాయ నిరాకరణ సిద్ధాంతాన్ని అంగీకరించి తీరవలె స్వరాజ్యం తక్షణం కావలెనంటే సహాయ నిరాకరణమే శరణ్యము ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము కూడా ఇందు మూలంగా ఆలస్యం కాదు' అన్నారు

వి యల్ శాస్త్రిగారు ఆ తీర్మానం బలపరిచినారు తరవాత గా॥ సి యస్ నరసింహరాజుగారు ప్రసంగిస్తూ 'నేనుకూడా వేంకటప్పయ్య పంతులుగారితో ఏకీభవిస్తున్నాను సహాయ నిరాకరణం శాస్త్ర సమ్మతమనే నా అభిప్రాయము కాని ప్రస్తుతం అది ప్రయోజనకరంగా ఉంటుందా, సాగుతుందా అని నా సందేహం జనసామాన్యంలో తగినంత ప్రబోధం కలిగిస్తేనే కాని ఈ సిద్ధాంతాన్ని అంగీకరించకూడదు హిందూ, మహమ్మదీయ సమ్మేళనం కృత్రిమము ఏదట్లా ఉన్నప్పటికీ ప్రజల అభిప్రాయంపైన మన నిర్ణయం ఆధారపడి ఉండవలెనన్నారు'

తరవాత తీర్మానం ఉపపాదించిన సూర్యనారాయణరావుగారు సమాధాన మిస్తూ 'వేంకటప్పయ్య పంతులుగారు, నరసింహరాజుగారు చెప్పిన మాటల్లో స్వరాజ్యానికి మనమింకా అర్హులము కాదన్నట్లు అర్థమవుతున్నది అందువల్ల వారితో నేనేకీభవించజాలను కాబట్టి మా తీర్మానాన్ని మీ రంగీకరించ ప్రార్థన' అన్నారు అంతట తీర్మానం బహుళ సంఖ్యాకులచే అంగీకరింపబడింది'

తరవాత చల్లా శేషగిరిరావుగారు "ఆంధ్రరాష్ట్రీయ మహాసభలో అంగీకరించబడిన తీర్మానం ఈ సంఘము వారంగీకరించినట్లు కలకత్తాలో జరగబోయే ప్రత్యేక కాంగ్రెస్ కు తెలపవలె"నని తీర్మానం ఉపపాదిస్తూ "సహాయ నిరాకరణం అంగీకరించిన తరవాత గాంధీజీ సూచించిన మార్గాలనే దేశం అవలంబించడం కావ్యము గాంధీమహాత్మునిపై జనానికిగల విశ్వాసము ప్రస్తుతం హిందూదేశంలో ఏ ఇతర నాయకులపైనా లేదు ధర్మానుసరణ సమయంలో తాత్కాలిక ప్రయోజనాలను ఆశించకూడదు ప్రహ్లాదుని అచంచల భక్తివల్ల భగవంతుడవతరించినట్లే ధర్మం నిష్కర్షగా అవలంబించినట్లయితే అధర్మము నిర్మూలం కాగలదని గాంధీమహాత్ముని గాఢవిశ్వాసము మహాత్ముడు విద్యార్థికుల త్యాగం పరీక్షించదలచుకొన్నారు విద్యార్థికులు సహాయ నిరాకరణం అవలంబిస్తే దౌర్జన్యభయం ఉండదు ప్రజాసామాన్యం కూడా వారి అడుగుజాడల్లో నడవగలరు విద్యార్థికులు వెనకంజ వేస్తే ప్రజాసామాన్యము వంకకే గాంధీ దృష్టి మళ్ళగలదు ప్రజాసామాన్యమునకి వుద్య

మము అర్థంగాదని మనము భయపడనక్కరలేదు విద్యార్థిరులలోనే ముందు ప్రబోధం కావలసి ఉన్నది కాంగ్రెస్ శాసనసభను బహిష్కరించినందువల్ల మితవాదులుకాని ఇతరులుకాని వాటిలో ప్రవేశించగలరనే భయము మన కక్కరలేదు శాసనసభా బహిష్కారంవల్ల మనము మన ఆత్మగౌరవం కాపాడు కొన్నవారం కాగలము కాబట్టి మనము గాంధీమహాత్ముని సూచనలను అంగీకరించి తీరవలె" అన్నారు ఈ తీర్మానాన్ని కొండాలి శివరామకృష్ణారావు గారు బలపరిచినారు ఇదే సమయంలో వేమవరపు రామదాసుగారు "మహా నంది సమావేశంలో సహాయ నిరాకరణం అంగీకరించిన మాట నిజమే కాని జాతీయవాదులను నూతన శాసనసభలకు పంపవలెనని కూడా తీర్మానించు కొన్నాము అటువంటి సందర్భంలో గాంధీగారి కార్యక్రమం అంగీకరించి నట్లయితే శాసనసభలను బహిష్కరించవలసి వస్తుంది అది పరస్పర విరుద్ధం కాదా? అని ప్రశ్నించినారు వెంటనే వెంకట్రామయ్యర్ గారు గాంధీగారి విధానం మహానందికి తరవాత వచ్చిందని, అందువల్ల మన ఇప్పటి తీర్మానం పరస్పర విరుద్ధమని శంకించనవసరం లేదని, కాబట్టి శాసనసభా బహిష్కారము 'నిరాక్షేపణీయ'మని చెప్పి తీర్మానం బలపరిచినారు వి యల్ శాస్త్రిగారు గాంధీగారి కార్యక్రమం అంగీకరించడానికి వీలు లేదన్నారు కాని తీర్మా నాన్ని అంగీకరించడం జరిగింది

1920 ఆగష్టు 28 వ తేదిని గుంటూరు మండల రాజకీయ సభ చల్లా శేషగిరిరావుగారి అధ్యక్షతన సమావేశమయింది శేషగిరిరావుగారు ఆ సభలో రాజకీయ విషయాన్ని గురించి సమగ్రంగా దీర్ఘోపన్యాసం చేసినారు ఆ సభలో సహితం అసహాయోద్యమ తీర్మానాన్ని అంగీకరించినారు

## గాంధీజీతో ఆంధ్రపత్రిక విలేఖకుని సంభాషణ (బెజవాడలో) (1920 ఆగష్టు 31)

ప్ర మహాత్మాజీ శాసనసభల బహిష్కారంకంటె బ్రిటిష్ వస్తువులను బహిష్క రించడం ఎక్కువ ప్రయోజనకారి కాదా ?

ఉ బ్రిటిష్ వర్తకులకు నష్టం కలిగిస్తే ప్రభుత్వంవారు మనం చెప్పినట్లు నడచుకొంటారని మీ అభిప్రాయము అది నిజమే కావచ్చు కాని బ్రిటిష్ వస్తువులను వెంటనే నిరాకరించడం సాధ్యం కానిపని అదీకాక బ్రిటిష్ వస్తువులను దిగుమతి చేసే కోటీశ్వరులను ఇందుకు ఒప్పించడం కూడా కఠినమైన పనే వారందుకు వొప్పుకొనేటట్లు చేయడానికి వారిని మరొక విధంగా సంతృప్తి పరచవలసి ఉంటుంది వారు బ్రిటిష్ వస్తువులను దిగుమతి చేయకుండాఉండటానికి వొప్పుకోకపోతే మనం వారిని భయపెట్టవలసి ఉంటుంది వారి గిడ్డంగులను తగలబెట్టవలసి ఉంటుంది కోటీశ్వరుల తలలు పగలగొడతామని బెదిరించవలసి ఉంటుంది మనమంత దౌర్జన్యానికి దిగితేగాని కోటీశ్వరులు దిగుమతి వ్యాపారం

మానరు అప్పుడుగాని బ్రిటిష్ వ్యాపారానికి తగినంత నష్టం వాటిల్లదు
కాబట్టి బ్రిటిష్ వస్తు బహిష్కారం దౌర్జన్యానికి దారి తీసి తీరుతుంది
వంగదేశ విభాగ సందర్భంలో విదేశ వస్తు బహిష్కారము జయం
పొందలేదు రౌలట్ చట్టాన్ని మూడునెలల్లో రద్దు చేయకపోతే తాము
బ్రిటిష్ దిగుమతులను ఆపివేస్తామని దేశపాండ్య బాప్టిస్టాగార్లు దొర
తనంవారికి చివరి సందేశం పంపినారు మూడునెలలు గతించినాయి
ప్రభుత్వంవారు ఆ చట్టం రద్దు చేయలేదు బాప్టిస్టా, దేశపాండ్య
గార్లు బహిష్కారం అమలు జరపడానికి సర్వవిధాలా ప్రయత్నించి
పూర్తిగా నిష్ఫలులైనారు, ఆ విషయం వారంగీకరిస్తున్నారుకూడా
దౌర్జన్యంలో విశ్వాసం కలవారు బ్రిటిష్ సరకుల దిగుమతిని బహిష్క
రించడానికి పూనుకోవచ్చు కాని నేను మాత్రం ఆ దరికి పోలేను

ప్ర శాసన సభలకు పోకూడదని మీరు బోధిస్తున్నారు దానికంటె శాసన
సభలకు పోయి ప్రభుత్వంవారి చర్యలను ఆటంక పరచడం ఎక్కువ
ప్రయోజనకారి కాదా?

ఉ కాదు, ముమ్మాటికీ కాదు ఆత్మగౌరవం కలవారు శాసనసభలకు
పోయినట్లయితే వాటికి గౌరవం వస్తుంది అది లేనివారు పోయినా
శాసనసభలకు ఏమీ గౌరవము ఉండదు ప్రస్తుతం శాసనసభలు కల్లు
దుకాణాలవంటివి ప్రస్తుతం నేను వాటిలోకి పోయినట్లయితే వాటికి
గౌరవము వస్తుంది ప్రజలకు వాటి పట్ల గౌరవం పెరుగుతుందికూడా
కాబట్టి మనమే ఉద్రేకంతో శాసనసభలకు పోయినా వాటి గౌరవం
పెరిగే మాట వాస్తవము ప్రస్తుతం పరిపాలకులు అక్రమ మార్గాలను
అవలంబిస్తూండడంచేత వారేర్పరచిన శాసనసభలకు పోక మనం మన
ఆత్మగౌరవాన్ని కాపాడుకోవలె పండిత మాలవ్యాజీ పట్ల నాకు
ఎంతో పూజ్యభావమున్నది కాని నేనెవ్వరిని అంధప్రాయంగా పూజిం
చను వారు రౌలట్ చట్టం సందర్భంలో శాసన సభ్యత్వాన్ని ఒకసారి
వదిలివేసి తిరిగి శాసనసభ్యులయినారు అందువల్ల వారికి కలిగిన ఫలిత
మేమిటి? పంజాబు విషయమై శాసనసభలో ఒక మహోపన్యాసం చేసి
థాంసన్‌గారి దూషణలకు గురి అయినారు వారే శాసనసభకు పోక
బయటనుంచే వారా ఉపన్యాసం చేసి పంజాబు అత్యాచారాలను
వెల్లడించి ఉండినట్లయితే థాంసన్‌గారి దూషణలకు వారు గురియై
ఉండేవారుకారు మాలవ్యాగారు ఆ సభలో మహోపకారం చేసినట్లు
మనం వారిని శ్లాఘిస్తున్నాము అది వట్టి పొరపాటు వారు బయటనే
ఎక్కువ ఉపకారం చేయగలిగి ఉండేవారు లోకమాన్యతిలక్‌గారు
శాసనసభలకు పోకుండా చేసిన మహోపకారాలలో శాసనసభ్యులు
చేసిన సేవ ఎన్నోవంతు? నీవు శాసనసభకు పోతావా లేక కల్లు అంగ
డికి పోతావా అని నన్నెవరయినా అడిగితే, నేను కల్లు అంగడికి పోవ

డానికే ఇష్టపడతానని చెబుతాను ఆత్మగౌరవం లేనివారు శాసనసభలకు పోతే పోనీయండి ప్రతి గ్రామంలోను వోటర్లు సభ చేసి ఆ సభ్యులు తమ ప్రతినిధులు కారని తీర్మానించి ప్రకటిస్తారు అప్పుడు ఏ మొగం పెట్టుకొని వారు ప్రజా ప్రతినిధులమని అంటారో చూడవలసి ఉంది అప్పుడు శాసనసభలకు ఏమి గౌరవముంటుంది! పంజాబ్ విషయంలో 'ఖిలాఫత్' సందర్భంలో మీ హృదయాలు నిజంగా పరితపిస్తున్నట్లయితే మీ దేశభక్తి యథార్థమైనట్లయితే, మీకు ఆత్మగౌరవ మున్నట్లయితే మీరు శాసనసభలను బహిష్కరించి తీరవలె జాతీయవాదుల్లోను మిత వాదుల్లోను మంచివారు, చెడ్డవారు కూడా ఉన్నారు స్వార్థప్రేరిత లైనవారు స్వప్రయోజనాలు పొందనీయండి సదుద్దేశం ఉన్న మిత వాదులు మొదట శాసనసభలకు పోయినప్పటికీ కొంత కాలంకైనా తాము మోసపోతిమని తెలుసుకొని పశ్చాత్తాప పడతారు

ప్ర వోటర్లకు మీరు చెప్పినంత విచక్షణ ఉంటుందా ?

ఉ వోటర్లు తెలివితక్కువవారు కారు వారిపైన నాకు చాలా విశ్వాస మున్నది విద్యాధికులకంటె కూడా వారెక్కువ వివేకం కలవారు గ్రామాలకు పోయి మనం సరిగా బోధిస్తే వారు ఎన్నికలకు పోరు ఏ స్వల్పసంఖ్యాక ఒకోసమో ఎన్నుకొనబడినవారు తమ ప్రతినిధులు కారని పెద్ద సభలుచేసి తీర్మానించి వారా సభ్యత్వం వదులుకొనేటట్లు చేయ గలరు ఈ పని చేయడానికి ఒక మాసం చాలు మీ రందుకై కృషి చేయవలె

ప్ర పరిపాలకులు అక్రమ మార్గం అవలంబిస్తున్నారని మీ రిప్పుడైనా తెలుసు కొన్నారు మొదటినుంచీ వారు మనకు అన్యాయం చేయడం లేదా ?

ఉ మనకు అన్యాయం జరుగుతూన్నమాట నిజమే అందుకై మన అసమ్మ తిని తెలుపుతూనే ఉన్నాము కాని మన నాయకులు పంజాబ్‌లో అగౌరవింపబడినప్పుడు సోదర దేశీయులు పొట్టలపై పాకింపబడినప్పుడు మహమ్మదీయుల మత విశ్వాసానికే భంగం వాటిల్లినప్పుడు నా సహనము మేరదాటింది ఆత్మగౌరవానికి భంగం కలిగినప్పుడు సహ నానికి తావులేదు ఈ అధర్మాన్ని నిగ్రహించడానికి ప్రయత్నించే టప్పుడు మన కపూర్వమైన బలం కలుగుతుంది ఆ బలంతో తక్కిన కష్టాలను కూడ నివారించుకొగలుగుతాము

ప్ర మీరు దక్షిణ దేశమంతా తిరిగి వచ్చినారు మీ ఉద్యమానికి ఎటువంటి ప్రోత్సాహం వచ్చింది?

ఉ నాకు నిరుత్సాహం కలగలేదు బిరుదులను, గౌరవ పదవులను విడిచి పెట్టడానికి కొందరు తయారుగా ఉన్నారు కొందరు న్యాయవాదులు కూడా తమ వృత్తిని వదలివేయడానికి సంకల్పించుకొన్నారు త్వరలో వారి పేర్లు ప్రకటించగలము.

ప్ర రేపు కలకత్తా కాంగ్రెస్ మీ ఉద్యమం అంగీకరించనట్లయితే మీరు ఏమి చేయదలుచుకొన్నారు? కాంగ్రెస్ తీర్మానానికి మీరు లోబడరా?

ఉ నా అంతర్వాణికి తప్ప నేను దేనికి లోబడను, కాంగ్రెస్ ఉద్దేశం ప్రజా బాహుళ్యం ఉద్దేశాలను ఏకేటా వ్యక్తీకరించడమే కాని దేశీయుల భావ స్వాతంత్ర్యాన్ని నిరోధించడం కాదు ఈ యేటి కాంగ్రెస్ నా ఉద్యమాన్ని అంగీకరించనట్లయితే ప్రజలలో దాని నింకా వ్యాపింపజేసి ప్రతిపక్షులను నా వైపుకు త్రిప్పుకొనేటందుకు ప్రయత్నిస్తాను పై సంవత్సరమైనా నా కార్యక్రమం కాంగ్రెస్‌చే అంగీకరించేటట్లు చేయగలను కాంగ్రెస్ తీర్మానం అంటే ఆ ఏడు సమావేశమైన ప్రతినిధులలో ఎక్కువమంది అభిప్రాయమని కాని భిన్నాభిప్రాయాలు ఉన్నవారు కాంగ్రెస్‌లో ఉండకూడదని కాదు నేను కాంగ్రెస్ అభిమానిని అయినా నా వాదం నాదే నా వాదం కాంగ్రెస్ అంగీకరించేటట్లు చేయడమే నా కర్తవ్యము లోకమాన్యుని అభిప్రాయాలను మొదట కాంగ్రెస్ అంగీకరించలేదు తరవాత అవి సర్వజనాంగీకారాలైనాయి అట్లాగే నా పక్షం రేపు కాంగ్రెస్‌లో గెలువకపోయినా భయంలేదు పై సంవత్సరమైనా నా పక్షం గెలిచి తీరుతుందని నా నమ్మకం కాంగ్రెస్‌లో అధిక సంఖ్యాకులు అంగీకరించిన తీర్మానానికి విరుద్ధంగా కాంగ్రెస్ అభిమానులెవ్వరూ ప్రవర్తించకూడదనే వాదంకంటె వెర్రి వాదం ఇంకొకటి లేదు నిమ్నజాతులను ఉద్ధరించవలెననే తీర్మానం కాంగ్రెస్ రెండు సంవత్సరాల కిందటనే ఆమోదించింది అంతకు పూర్వం ఎవ్వరూ ఆ ఉద్యమంలో పాల్గొనకూడదని ఎవరయినా చెప్పడానికి సాహసించినారా? కాంగ్రెస్ ఉద్దేశమెప్పుడూ ఆత్మ స్వాతంత్ర్యానికి ప్రతికూలమయింది కాదు

ప్ర శాసన సభ్యత్వం మాదిరి బోర్డులు, మున్సిపాలిటి సభ్యత్వం కూడ వదిలి వేయవలెనని మీ అభిప్రాయమా?

ఉ నేను కేవలం ఆచరణ సాధ్యం కాని ఆదర్శాలను వాదించేవాణ్ణి కాను ఆదర్శాలు ఎంతవరకు ఆచరణయోగ్యమో ఆలోచించే ఈ కార్య విధానాన్ని నిశ్చయించినాను బోర్డులు, మున్సిపాలిటిలోని సభ్యత్వాలను వదిలివేయకూడదు అందువల్ల మన గ్రామాల, పట్టణాల ఆరోగ్యరక్షణకు భంగం కలుగుతుంది ఆ సంఘాలకు ప్రజలు ఎన్నుకొన్నవారు కాక ప్రభుత్వం నియమించినవారు మాత్రమే సభ్యత్వం వదలివేయవలె

ప్ర ఈ కార్యవిధానం నిశ్చయించడంలో మీ ప్రధాన లక్ష్యమేమిటి?

ఉ భారతదేశానికి ప్రత్యేక జాతీయ దృష్టి ఉందని నా అభిప్రాయము మనము చేసే ప్రతి పని దాని కనుగుణంగా ఉండవలె నా కార్యక్రమం వల్ల ఆత్మశక్తి బాహుబలంకంటె బలవత్తరమయినదని రుజువు కాగ

లదు దేశీయులలో నిద్రాణమయి ఉన్న సంకల్పశక్తి వప్రకారిన్యం పొందగలదు కోర్టులను బహిష్కరించడంవల్ల పంచాయతీ వ్యవస్థలు వృద్ధి పొందగలవు ప్రభుత్వ పాఠశాలలను విడనాడటంవల్ల జాతీయ విశ్వవిద్యాలయాలు పెంపొందగలవు జనంలో ఉత్సాహం వర్ధిల్లగలదు హిందూ మహమ్మదీయ సఖ్యత విలసిల్లగలదు, వేయేల స్వరాజ్యలక్ష్మికి అధికారులం కాగలము

ప్ర బ్రాహ్మణ, బ్రాహ్మణేతర కతల గురించి మీరేమనుకొంటున్నారు?

ఉ హిందూ, మహమ్మదీయ సఖ్యత కుదురుతున్నప్పుడు హిందువులలోని అంతర్భేదాలు వాటంతటవే తొలగిపోగలవు ఒక జాతి ఆధిపత్యాన్ని గానీ ఒక వర్ణంవారి ఆధిపత్యాన్ని నేను అంగీకరించను బ్రాహ్మణులు శాసనసభ్యత్వ పదవుల నన్నిటినీ బ్రాహ్మణేతరుల కెందుకు వదలివేయకూడదు నా ఉద్యమానికి సంబంధించినంతవరకు శాసనసభలకు పోయి మతిహీనులు కాకూడదని నా ప్రార్థన

ప్ర మహాత్మాజీ! మీకీ కార్యవిధానం తప్ప ఏ ఇతర పథకం కనపడలేదా?

ఉ కనపడకపోవటమే కాదు కనుక్కోవడానికి ప్రయత్నించాను కూడ కాని నాకు గోచరం కాలేదు

## గాంధీజీ - సికిందరాబాదు రాక

సహాయ నిరాకరణోద్యమం గురించి చర్చించి తీర్మానించేటందుకు కలకత్తాలో 1920 సెప్టెంబర్ 4 వ తేదీని జరగనున్న ప్రత్యేక కాంగ్రెస్ మహాసభకు ముందు గాంధీజీ మౌలానా షౌకతాలీతోను తన ఇద్దరు కుమారులతోనూ 1920 ఆగస్టు 24వ తేదీని సికిందరాబాదు రైలుస్టేషనులో కొంతసేపు ఆగినారు స్టేషన్ ప్లాటుఫారంమీద సుమారు నాలుగువేలమంది ప్రజలు గుమిగూడి వారిని దర్శించినారు తరవాత వారు బొంబాయికి రైలులో వెళ్లిపోయినారు

## సహాయ నిరాకరణోద్యమము - తెలుగు పత్రికలు

పంజాబు దురంతం గురించిన హంటర్ కమిటీ నివేదిక దేశంలో ఆశాభంగానికి, అసంతృప్తికి కారణమయింది 'సర్ మైకేల్ ఒ డయ్యర్'ను నిరపరాధని ప్రభుత్వం వారనడం, ప్రభుత్వోద్యోగులు చేసిన అమానుష దుష్కృత్యాలను తేలికగా తోసిపుచ్చడం, బ్రిటన్‌లోని ప్రభువుల సభవారు భారత ప్రజల మానసిక వ్యధను గమనించక జనరల్ డయ్యర్‌ను శ్లాఘించడం గాంధీజీకి కోపకారణాలైనాయి అందువల్ల ఆయన ప్రభుత్వ సంబంధం అవినీతికరమని భావించినారు ఖిలాఫత్ పంజాబ్ సమస్యలు పరిష్కరింపబడవలెనంటే సహాయ నిరాకరణోద్యమం ఒకటే శరణ్యమని ఆయన అభిప్రాయము

ఈ విషయము 1920 మే 30 వ తేదీని అఖిలభారత కాంగ్రెస్ సంఘంలో చర్చకు వచ్చింది సహాయ నిరాకరణోద్యమంవంటి పెద్ద సమస్యను

ఒక నిష్ణ కమిటీ నిర్ణయించడంకంటె ప్రత్యేక కాంగ్రెస్ నిర్ణయించడం బాగుంటుందని [illegible] సంఘంవారు అభిప్రాయ పడినారు ప్రత్యేక కాంగ్రెస్ సెప్టెంబర్‌లో జరుపవలెనని నిర్ణయించినారు కాంగ్రెస్ నిర్ణయం కోసం వేచి ఉండకుండానే అసహాయోద్యమం ప్రారంభించవలెనని గాంధీజీ, ఖిలాఫత్ నాయకులు నిర్ణయించుకొన్నారు అందుకనుగుణంగా 1920 ఆగస్టు 1న గాంధీగారు తన పతకాలను, బిరుదాలను రాజ ప్రతినిధికి పంపివేసినారు ఆనాటినుంచి అసహాయోద్యమం ప్రారంభమయిందని చెప్పవచ్చు

హంటర్ కమిటీ నివేదిక వెలువడిన నాటినుంచి తెలుగు పత్రికలు గాంధీజీ ప్రతిపాదించిన సహాయ నిరాకరణోద్యమాన్ని సమర్థిస్తూ వచ్చినాయి వివిధ దృక్పథాలనుంచి ప్రజాభిప్రాయం అసహాయోద్యమానికి అనుకూలంగా సమీకరించినాయి! అయితే గాంధీజీ ఖిలాఫత్ పంజాబు సమస్యల పరిష్కారానికి మాత్రమే అసహాయోద్యమం ప్రారంభించవలెనంటే 'ఆంధ్ర పత్రిక' 'కృష్ణా పత్రిక' 'దేశాభిమాని' 'హితకారిణి' 'బాలభారతి' 'సుదర్శిని' 'గోదావరీ పత్రిక', 'నెల్లూరు పత్రిక'లు స్వరాజ్య సంపాదనకు సహితం అసహాయోద్యమం అవసరమని వ్రాసినాయి స్వరాజ్యం చేకూరినట్లయితే 'ఖిలాఫత్' పంజాబు సమస్యలవంటివి, తేలికగా పరిష్కారం కాగలవని అవి అభిప్రాయం వెల్లడించినాయి ఈ పత్రికలు సహాయ నిరాకరణోద్యమానికి అనుకూలంగా ప్రజాభిప్రాయం రూపొందించడంలో ఎంతో తోడ్పడినాయి

**ప్రత్యేక కాంగ్రెస్**

1920 సెప్టెంబర్ 4 వ తేదిని కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెస్ సమావేశమయి వరుసగా 5 రోజులు కొనసాగింది ఆనాడు కాంగ్రెస్‌లో ప్రతినిధుల సంఖ్యకు మేరలేదు ప్రతినిధులు ప్రేక్షకులు కలసి ఆ సభకు 20 వేల మంది హాజరయినారు పంజాబు ఖిలాఫత్ సమస్యలను గురించి సభ్యులు క్రోధావేశపూరితులై నారు కార్యవర్గ సభలో మహాత్ముడు ప్రవేశపెట్టిన అసహాయోద్యమ తీర్మానం గురించి తీవ్రంగా వాదోపవాదాలు జరిగినాయి మహాసభలో గాంధీజీ అసహాయోద్యమ తీర్మానం ఉపపాదించినారు అధిక సంఖ్యాకులు ఆ తీర్మానం అంగీకరించినారు కలకత్తా ప్రత్యేక మహాసభలకు అయ్యదేవర కాళేశ్వరరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బులుసు సాంబమూర్తి, గొల్లపూడి సీతారామశాస్త్రి, దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు, పేట బాపయ్య, కోటగిరి వేంకటకృష్ణారావు, కొండ వేంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్యగారలవంటి ప్రముఖులు హాజరయినారు వీరిలో చివరి ఇద్దరూ తప్ప తక్కిన వారందరు గాంధీగారి తీర్మానాని కనుకూలంగా వోటు చేసినారు కొండ వెంకటప్పయ్యగారితో మరి 29 మంది గాంధీజీ తీర్మానం ప్రతిఘటించినారు పట్టాభి సీతారామయ్యగారు విషయ నిర్ధారణ సభలో తటస్థంగా ఉండి మహాసభలో తీర్మానం వోటుకు రాకముందే కలకత్తా నుంచి వెళ్లిపోయినారు.

అసహాయోద్యమ కార్యక్రమం ప్రకారం 1 భారతీయులు ప్రభుత్వం వారిచ్చిన బిరుదాలు గౌరవోద్యోగాలను స్థానిక సంస్థలలో ప్రభుత్వం వారిచ్చిన స్థానాలను విడిచివేయవలె

2 గవర్నమెంట్ ఉద్యోగస్తులు ఏర్పాటుచేసిన దర్బారులయిగాని ఇతర కార్యక్రమాలకుగాని హాజరు కాకూడదు

3 గవర్నమెంట్ పాఠశాలలను, కళాశాలలను విద్యార్థులు బహిష్కరించవలె తల్లిదండ్రులు వారికోసం జాతీయ పాఠశాలలను జాతీయ కళాశాలలను స్థాపించేటందుకు కృషి చేయవలె

4 లాయర్లు, కక్షిదారులు బ్రిటిష్ కోర్టులను క్రమక్రమంగా బహిష్కరించవలె బ్రిటిష్ కోర్టుల స్థానంలో పంచాయతీ కోర్టులను స్థాపించుకొని వివాదాలు పరిష్కరించుకోవలె

5 సైనిక సంస్థలలో గుమాస్తాలుగా, సిపాయిలుగా, కార్మికులుగా పనిచేసేటందుకు ఎవ్వరూ అంగీకరించకూడదు

6 శాసనసభలకు నిలబడిన వారు తమ అభ్యర్థిత్వం ఉపసంహరించుకోవలె కాంగ్రెస్ తీర్మానానికి ప్రతికూలంగా నిలబడినవారికి వోటర్లెవ్వరూ తమ వోట్లు నివ్వకూడదు

ఇది అసహాయోద్యమానికి సంబంధించిన ముఖ్యకార్యక్రమము అసహాయోద్యమం ప్రజలలో ఒక విధమయిన క్రమశిక్షణను, స్వార్థత్యాగాన్ని పెంపొందించేటందుకు ఉద్దేశింపబడింది కాబట్టి ఈ ఉద్యమంలో ప్రజలందరూ- అంటే స్త్రీలు, పురుషులు, పిల్లలు సహితం పాల్గొనేటందుకు వీలుగా అందరూ స్వదేశీ వస్త్రాలనే వాడవలెనని తీర్మానించడం జరిగింది ప్రస్తుతమున్న బట్టల మిల్లులు దేశంలో ఉన్న ప్రజలందరికి కావలసిన బట్టను తయారుచేసి ఇవ్వగల్గే స్థితిలో లేనందువల్ల రాట్నంపై వడికిన నూలుతో చేమగ్గాలమీద నేసిన బట్టను అందరూ ధరించవలెనని సలహా ఇవ్వడం జరిగింది అందుకనుగుణంగా ప్రతి ఇంట్లోను నూలు వడకడాన్ని నేతపనివారు ఆ నూలును నేసి బట్టగా తయారు చేయడాన్ని ప్రోత్సహించవలెనని కూడా ప్రత్యేక కాంగ్రెస్ తీర్మానించింది

## ఆంధ్రలో ప్రత్యేక కాంగ్రెస్ ప్రభావము

ప్రత్యేక కాంగ్రెస్‌కు పూర్వమే గాంధీజీ మద్రాసునుంచి కలకత్తాకు పోతూ విజయవాడలో దిగినప్పుడు ఆయన సలహా ప్రకారం అయ్యదేవర కాళేశ్వరరావు, మహమ్మద్ గులాం మొహిద్దీన్‌గార్లు తమ శాసనసభా అభ్యర్థిత్వాలను వదలుకొన్నట్లు ఇదివరకే వ్రాసినాము

అఖిలభారత ప్రత్యేక మహాసభలో ప్రతికూలంగా ఉన్న వివిధ రాష్ట్రాల ప్రతినిధులు ఒక వారం రోజులలోనే తమ ప్రతిఘటనను మాని అసహాయోద్యమానికి అనుకూలంగా ఉన్నట్లు పత్రికలలో ప్రకటింపబడుతూ వచ్చినాయి ఆంధ్రదేశంలో అసహాయోద్యమం ప్రతిఘటించిన ప్రముఖ నాయకుడు దేశభక్త

వేంకటప్పయ్యపంతులుగారు సహితం కొద్ది రోజులలోనే అసహాయోద్యమానికి అనుకూలురయినారు ఆ ఉదంతం గురించి తమ స్వీయచరిత్రలో ఇట్లా వ్రాసినారు

"నేను కలకత్తా నుంచి వస్తూంటే దారిలోనే శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైన మిత్రులు నన్ను ఉద్యమంలో చేరవలసిందని బలవంతపెట్టసాగినారు గుంటూరు చేరినతరవాత కూడా పలుమారు మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు, ఉన్నవ లక్ష్మీనారాయణ మొదలయిన వారు రోజూ మా యింటికి వచ్చి ఉద్యమంలో ఎందుకు చేరరాదని ప్రశ్నించి, చేరవలసినదని ప్రోత్సహిస్తూ ఉండినారు నేను మాత్రం వారి సలహాల నంగీకరించలేదు ఉద్యమంలో చేరకుంటే ప్రాణాపాయం కలుగుతుందని బెదరింపులతో ఉత్తరాలుకూడ వస్తూఉండినాయి నేను వాటిని లెక్కచేయలేదు ఆ ఉత్తరాల సంగతి మరెవ్వరికీ చెప్పనూ లేదు కాని మిత్రులు పలుమారు బలవంతపెడుతున్నందువల్ల నేను వారితో ఇట్లన్నాను 'నేనిదివరకే న్యాయవాద వృత్తిని వదలివేసినాను కళాశాలలలో చదివే బిడ్డలు నాకెవ్వరు లేరు కాబట్టి అసహాయ తీర్మానాన్ననుసరించి నేను త్యజించవలసింది శాసన సభా సభ్యత్వ మొక్కటి మాత్రమే మిగిలిఉంది ఆ సభలో నుంచి ఇంకా చేతనైన దేశసేవ చేయవలెనని ఉన్నది దానిని త్యజించి ఇంట్లో కూర్చుంటే మాత్రం ప్రయోజనం లేదు కాని మన గుంటూరు జిల్లాలో తొమ్మిది తాలూకాలున్నాయి తాలూకా కొకరి చొప్పున తొమ్మిది మంది త్యాగమూర్తులు తమ వృత్తులు మాని ప్రాణాలర్పించడంకోసం సిద్ధపడి నిష్కల్మష హృదయులై పనిచేస్తే నేనును వారితో కలిసి పనిచేస్తాను "నేను చెప్పినది సమంజసంగా ఉన్నదని మారుపలికి, వెడలిపోయినారు మరునాడే శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, శ్రీ మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు, శ్రీ నడింపల్లి లక్ష్మీనరసింహారావు, శ్రీ పోలిశెట్టి హనుమయ్యగుప్త మొదలైన న్యాయవాదులు తమ వృత్తులను విసర్జించినారు ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఆరితేరిన సంఘ సంస్కర్త బారిష్టరీ పరీక్షలో కృతార్థులై హైకోర్టులో కూడ కొంతకాలం న్యాయవాదిగా పనిచేసి అప్పటిలో గుంటూరులోనే పని చేస్తూ ఉండేవారు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి మంచి ఆదాయం ఆర్జిస్తూ వృత్తిలో పైకివస్తున్నారు శ్రీ నరసింహాచార్యులు అప్పుడప్పుడే వృద్ధిలోకి వస్తున్నాను లక్ష్మీనరసింహారావుగారు, గుప్తగారు కొత్తగా బారష్టరయిన యువకులు అట్లాంటి వారు తమ వృత్తులను త్యజించి దీక్షావంతులై పనిచేయడానికి సంసిద్ధులైన తరవాత నేను కూడా నా శాసన సభా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చినాను శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజు, శ్రీ నరసింహారాజుగారు, శ్రీ నరసింహాయ్యర్ మొదలయినవారు పలువురు తమ శాసనసభా సభ్యత్వాలకు రాజీనామా లిచ్చినారు"

ఈ విధంగా ఆంధ్రదేశంలో అసహాయోద్యమం ముందుగా గుంటూరు

నగరంనుంచి విస్తరించసాగిందని చెప్పవచ్చు. కొండ వెంకటప్పయ్యపంతులు గారు తమ శాసన సభాభ్యర్థిత్వానికి రాజీనామా ఇచ్చిన తరవాత అనేకమంది శాసన సభాభ్యర్థులు తమ అభ్యర్థిత్వం వదులుకొన్నారు. వారిలో కందుల వీర రాఘవస్వామి, గంటి సుబ్బారాయుడు, వేమవరపు రామదాసు పంతులు, విస్సా రాజగోపాల్, వింజమూరి భవనాచారి, యస్. రామస్వామి గుప్తగార్లు ఉన్నారు. గౌరవోద్యోగాలను, బిరుదులను త్యజించినవారిలో గంటి సుబ్బారాయుడు, చీమకుర్తి రామస్వామి, గోనుగుంట్ల వెంకటరావు, ఖాజీ అహ్మదుల్లా ఖాన్ సాహెబు, అన్వార్ జమఖాన్ సాహెబు, బుల్బుల్ వగైరాలున్నారు.
బ్రిటిష్ కోర్టులు బహిష్కరించడంలో గుంటూరు న్యాయవాదుల సంఘం ముందంజ వేసింది. వారు 1920 సెప్టెంబర్ 28వ తేదీని సమావేశమయి కోర్టుల బహిష్కార సందర్భంలో సామూహిక చర్య తీసుకొనే నిమిత్తం [illegible] న్యాయవాదుల సహకారంతో 1921 జనవరి 15 నుండి 3 నెలలు తమ వృత్తిని మానివేయడానికి నిర్ణయించుకొన్నారు.

అసహాయోద్యమాన్ని ప్రజలలో తీవ్రంగా ప్రచారం చేయడానికి ఆంధ్ర దేశంలో బహిరంగ సభలు సాగినాయి. 1920 నవంబర్ నెలలో జరగనున్న శాసన సభల ఎన్నికలను బహిష్కరించేటందుకు ప్రజాభిప్రాయం రూపొందించబడింది. శాసన సభా బహిష్కారానికి జరిగిన మొట్టమొదటి సమావేశంలో రాజమహేంద్రవరపు పట్టభద్రుల సమావేశమొకటి. అది సెప్టెంబర్ 20వ తేదీన జరిగింది. పట్టభద్రులైన వోటర్లైవరు తమ ఎన్నిక హక్కును వినియోగించరాదని వారు తీర్మానించుకొన్నారు. ఆ సభలో వెలువల అచ్యుతలింగం, సోలసు బాపనయ్య, బులుసు సాంబమూర్తి, కర్రా సోమేశ్వరావు, సి. వి. కృష్ణారావు గారలు పాల్గొన్నారు. గజవల్లి రామచంద్రరావుగారు ఆ సభకు అధ్యక్షత వహించినారు.

రాజమహేంద్రవరంలోని వర్తక ప్రముఖులు కూడా సమావేశమయి అసహాయోద్యమం బలపరిచినారు. ఆ సభలో కందుల వీరరాఘవస్వామి, డా॥ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం, చిలకమర్తి లక్ష్మీనరసింహం, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారలు ఉపన్యసించినారు. రానున్న శాసన సభల ఎన్నికల్లో పాల్గొనరాదని వర్తకులు తీర్మానించుకొన్నారు. ఆ విధంగానే గుంటూరులోని ఆర్యవైశ్య మహాసభ వారుకూడా అసహాయోద్యమం బలపరుస్తూ తీర్మానించినారు.

అసహాయోద్యమ కార్యక్రమంలో శాసనసభా బహిష్కారానికి ప్రాముఖ్యమిస్తూ 1920 అక్టోబర్ 3వ తేదీని పెద్దాపురంలో జరిగిన గోదావరి జిల్లా జాతీయ వాదుల మహాసభ తీర్మానించింది. ఆ సభకు అధ్యక్షులు గంపలగూడెం కుమారరాజా శ్రీ కోటగిరి వేంకటకృష్ణారావు బహదూర్‌గారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు చావలి లక్ష్మీనారాయణగారు. అక్టోబర్ 23వ తేదీని నెల్లూరుజిల్లా జాతీయవాదుల మహాసభ జరిగింది. తిక్కవరపు రామిరెడ్డిగారు

ఆ సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులు నెల్లూరుజిల్లాలోని ప్రముఖ భూస్వాములు, వర్తకులు, లాయర్లు కూడా ఆ సభకు హాజరయినారు

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారి అధ్యక్షతకింద విశాఖపట్నంజిల్లా మహాసభ జరిగింది గోదావరిజిల్లా ప్రత్యేక మహాసభ గోదావరి ఖిలాఫత్ మహాసభ, గంజాంజిల్లా మహాసభ, ఏలూరు నర్సాపురం రాజమహేంద్రవరం కొవ్వూరు తాలూకా సభలు జరిగినాయి ఆంధ్రదేశంలో నాయకులు అనేక మంది ప్రతి దేశానికి స్వాతంత్ర్యం పొందేటందుకు స్వతస్సిద్ధమయిన హక్కు ఉందని స్వాతంత్ర్య సంపాదనకు అసహాయోద్యమం ప్రబలమయిన ఆయుధమనీ ఉద్ఘాటించినారు అన్ని సభలలోను ప్రజలు ఎన్నికలలో పాల్గొరాదని నాయకులు ఉద్బోధించినారు తాము ఎన్నికలలో వోటు చేయబోమని అనేకమంది ప్రమాణపత్రాలమీద సంతకాలు చేసినారు ఎన్నికల బహిష్కరణకు ప్రచారం చేసేనిమిత్తం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కొండ వేంకటప్పయ్యపంతులుగారు వివిధ జిల్లాలలో పర్యటించినారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఎన్నికల బహిష్కార ప్రచారంకోసం గ్రామాలలో పర్యటించేటందుకు కొన్ని ఉపసంఘాలను నియమించింది

చిత్తూరుజిల్లా కాంగ్రెస్ కమిటీ అసహాయోద్యమాన్ని ప్రచారం చేయడమేగాక ఇతరులకు ఆదర్శప్రాయంగా ఉండేటందుకు ఒక పంచాయతీ కోర్టును కూడా స్థాపించింది ఆ విధంగా పంచాయతీ కోర్టులు అనేక గ్రామాలలో స్థాపింపబడినాయి

ఎన్నికలను బహిష్కరించవలసిందని దాదాపు తెలుగు పత్రికలన్నీ సంపాదకీయాలు వ్రాసినాయి ఆంధ్ర పత్రిక "రేపు జరగనున్న ఎన్నికలను ప్రజలు బహిష్కరించవలసి ఉన్నది ఏ విధంగా ఆలోచించినప్పటికి ప్రజలు సంస్కరణలను అంగీకరించరాదని స్పష్టంగా తెలియువస్తున్నది గాంధీజీ అసహాయోద్యమ సందేశం ఇవ్వకముందునుంచి కూడా చిన్నచిన్న సంస్కరణలు అంగీకరించడం స్వరాజ్య సాధనకు ప్రతిబంధకమని ప్రజలు గుర్తించే ఉన్నారు రేపు ప్రజలకు పరీక్షా సమయము శాసనసభా బహిష్కారం స్వరాజ్య సౌధానికి మొదటి మెట్టు . రేపటిరోజు భారతదేశ చరిత్రలో మరవకూడని రోజు స్వరాజ్య సౌధానికి రేపు శంకుస్థాపన జరగగలదు" అని ఎన్నికలకు ముందు రోజున వ్రాసింది

ఈ విధంగా 4 నెలలు ఎడతెగకుండా జరిగిన శాసనసభా బహిష్కార ప్రచార ఫలితంగా అత్యధిక సంఖ్యాకులైన వోటర్లు వోటు చేయడానికి పోలింగ్ స్టేషన్లకు వెళ్ళనేలేదు గుంటూరులో నూటికి 15 మంది మాత్రమే వోట్లు ఇచ్చినారు రాజమహేంద్రవరంలో 120 మంది మహమ్మదీయ వోటర్లలో ఒక్కరు మాత్రమే వోటు ఇచ్చినారు ఆయన ప్రభుత్వ ఉద్యోగి కావడంచేత వోటు ఇవ్వక తప్పలేదు రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోని 1850 మంది వోటర్లలో 270 మంది మాత్రమే తమ వోటు హక్కు వినియోగించి

నారు నెల్లూరులో నూటికి 17 మంది మాత్రమే వోటు చేసినారు చిత్తూరు లోని క్రిమ్స్‌పేట నియోజకవర్గంలో 60 మంది మాత్రమే వోటు చేసినారు. అన్ని జిల్లాలలోను అనేక పోలింగ్ స్టేషన్‌లలో పోలింగ్ పెట్టెలు ఖాళీగా పోయినాయి కృష్ణాజిల్లా దివి తాలూకాలోని ఘంటశాల పోలింగ్ స్టేషన్ వాటిలో ఒకటి.

## నాగపురం కాంగ్రెస్

1920 చివరి వారంలో సేలం విజయరాఘవాచారి అధ్యక్షతకింద నాగపురం కాంగ్రెస్ మహాసభ జరిగింది ఆ సభకు 16 వేలమంది ప్రతినిధులు హాజరయినారు ఆ సభలో గాంధీజీ ఆదేశానుసారం కోర్టులను బహిష్కరించిన లాయర్లు, కళాశాలలను బహిష్కరించిన విద్యార్థులు కూడా చాలామంది ఉన్నారు దాదాపు అందరు ఖద్దరు దుస్తులు ధరించినవారే అత్యధిక సంఖ్యాకులు గాంధీ టోపీలు ధరించినవారు ఉన్నారు గాంధీ టోపి మొదటిసారిగా ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది ఆ కాంగ్రెస్‌లోనే కలకత్తా కాంగ్రెస్‌లో జరిగిన అసహాయోద్యమ తీర్మానం ప్రకారం వోటర్లలో అత్యధిక సంఖ్యాకులు శాసనసభ ఎన్నికలలో పాల్గొనకపోవడంచేత అసహాయోద్యమంలో వారికి ఉన్న విశ్వాసం వెల్లడి అయింది ఇందువల్ల గాంధీజీ ద్విగుణీకృతోత్సాహంతో నాగపురం కాంగ్రెస్‌లో అసహాయోద్యమాన్ని విస్తృతం చేయడానికి వీలు కలిగింది నాగపురం కాంగ్రెస్ మరొక విధంగా కూడా ప్రాముఖ్యం వహించింది కాంగ్రెస్ ఆశయం స్వరాజ్య సంపాదనమని మొట్టమొదటగా నాగపురం కాంగ్రెస్‌లోనే నిర్వచనం చేయబడింది కాంగ్రెస్ ప్రధాన సూత్రం, "న్యాయమైన శాంతియుతమైన సకల పద్ధతుల ద్వారా స్వరాజ్య సంపాదనం కాంగ్రెస్ ఆశయంగా" మార్పు చేయబడింది కలకత్తా ప్రత్యేక కాంగ్రెస్‌లో కంటె కూడా నాగపురం కాంగ్రెస్‌లో సహాయ నిరాకరణ కార్యక్రమం పన్నుల నిరాకరణంవరకుకూడా విస్తృతం చేయబడింది నాగపురం కాంగ్రెస్ నుంచి కాంగ్రెస్‌పైన గాంధీజీ పలుకుబడి అప్రతిహతమయినదని చెప్పవచ్చు

## గాంధీజీ - హిందీ మద్రాసువారి కొరకు విజ్ఞప్తి

'ఇక్కడ నేను మద్రాసు అనేమాట అందరు అనుకొనే అర్థంలో వాడి నాను మద్రాసువారు అంటె, ద్రవిడ భాషలను మాట్లాడే మద్రాసు రాజధాని లోని ప్రజలందరూ అని అర్థము కాంగ్రెస్ వ్యవహారాలన్నీ చాలావరకు హిందూస్థానీ భాషలో జరుగుతూండడంవల్ల కాంగ్రెస్ ఒక జాతీయ మహాసభగాగాక, రాష్ట్రీయసభగా మారిపోతున్నదని డాక్టర్ బెసెంట్‌కు ఆశాభంగం కలిగినట్లు తెలియవస్తున్నది డాక్టర్ బెసెంట్ భారత దేశానికి చేసిన సేవవల్ల ఆమె పట్ల నాకు చాలా గౌరవం ఉన్నది భారతదేశ స్వపరిపాలనం గురించి ఆమె ప్రజలలో ఎక్కువ ప్రచారం చేసింది ఆమెకంటె వయసులో చిన్న

వారుగా ఉన్న మనలో అనేకమంది ఆమె ఇండియాకు చేసిన సేవలో ఆమె శక్తి సామర్థ్యాలకుగాని, పరిశ్రమకుగాని తులతూగలేరు ఆమె పరిణత వయస్కురాలైన తరవాత తన జీవితంలోని ప్రధాన ఉత్తమ భాగం భారతదేశ సేవకే వినియోగించింది భారతదేశానికి అత్యుత్తమ సేవ చేసిన వారిలో లోకమాన్య తిలక్ తరవాత ఆమెను పేర్కొవచ్చు భారతదేశంలో ఆమెకున్న ప్రజానురంజకత్వానికి ఆమె పూర్తిగా అర్హురాలు కాని నేటి ఆమె అభిప్రాయాలు విద్యావంతులైన భారతీయుల కనేకమందికి అంగీకార యోగ్యాలుగా లేవు అందువల్ల ఆమె కొంతవరకు ప్రజానురంజకత్వం కోల్పోయింది హిందుస్తానీ భాష కాంగ్రెస్‌ను రాష్ట్రీయ సంస్థగా మారుస్తూన్నదనే ఆమె అభిప్రాయంతో నేను ఏకీభవింపజాలనని బహిరంగంగా చెప్పవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను ఈ సందర్భంలో ఆమె కేవలం పొరపాటు పడిందని నేను చెప్పక తప్పదు నేను 1915 లో తప్ప తక్కిన అన్ని కాంగ్రెస్‌లకు హాజరయినాను కాంగ్రెస్ వ్యవహార నిర్వహణలో ఇంగ్లీషు, హిందుస్తానీ భాషలమధ్య యేది ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుందా అని ప్రత్యేక పరిశీలనా దృష్టితో ఆలోచించినాను వందలకొద్దీ ప్రతినిధులతోను, వేలకొద్దీ ప్రేక్షకులతోను దీనిని గురించి మాట్లాడినాను ప్రజలతో సంబంధంగల నాయకులు లోకమాన్య తిలక్, డాక్టర్ బెసెంట్‌లతో సహా అనేక మందికంటె ఎక్కువమంది ప్రజలను, విద్యావంతులను, అవిద్యావంతులను కూడా చూసినాను అంతేగాదు ఎక్కువ చోట్ల కూడా పర్యటన చేసినాను ఈ నా సంచార ఫలితంగా హిందుస్థానీ భాష తప్ప మరొక భాష జాతీయ వ్యవహార నిర్వహణకు అనుకూలమైనది లేదని మన స్ఫూర్తియైన నిర్ణయానికి వచ్చినాను హిందుస్థానీ అంటే హిందీ, ఉర్దూ భాషల కలయిక హిందుస్థానీయే భారతదేశంలో వివిధ భాషలు గలవారు తమ అభిప్రాయాలు పరస్పరం తెలుపుకొనేటందుకు వీలయిన జాతీయ భాషగా రూపొందగలదని నా అభిప్రాయము

కడచిన రెండు సంవత్సరాలలో తప్ప అంతకు పూర్వము అన్ని కాంగ్రెస్‌లలోను ఇంగ్లీషు భాష ఉపయోగింపబడుతూండినందువల్ల భారత జాతికి ఎనలేని నష్టం కలిగిందని నా విస్తృతమైన అనుభవంవల్ల కలిగిన అభిప్రాయము అంతేకాదు ఒక్క మద్రాసు రాజధానివారు తప్ప భారత జాతీయ మహాసభకు వచ్చిన ప్రేక్షకుల్లోను, ప్రతినిధుల్లోను అత్యధిక సంఖ్యాకులు ఇంగ్లీషు భాషకంటె హిందుస్థానీ భాషనే ఎక్కువగా అర్థం చేసుకోగలరు అందువల్ల ఇంతకు పూర్వం జరిగిన కాంగ్రెస్‌లు జాతీయ దృక్పథం కలిగివున్నప్పటికీ అవి కేవలం ప్రదర్శన సభలుగానే ఉండిపోయినాయి వాటివల్ల తగినంత రాజకీయ జ్ఞానం కలగలేదు ప్రపంచంలోని ఇంకే ఇతర దేశంలో అయినప్పటికీ, ఏటేట మరింత ప్రజానురంజకత్వం పొందవలసిన ఇటువంటి మహాసభలు కడచిన ఈ 34 సంవత్సరాలలో ప్రతిఇంటా రాజకీయ జ్ఞానం కలిగించిఉండేవి ప్రతివారూ తమ భాషలో అనేక విషయాలను చర్చించి, పరిష్కరించుకొనగలిగి ఉండేవారు గడ

చిన కాంగ్రెస్‌లోని లోపాలు ఏవయినప్పటికీ, పూర్వపు కాంగ్రెస్ లన్నిటికంటె అది పూర్తిగా జాతీయ దృక్పథంతో నడిచిందని చెప్పవచ్చు అందుకు కారణం అధిక సంఖ్యాకులైన ప్రతినిధులు, ప్రేక్షకులు ఆ కాంగ్రెస్ కార్యవిధానాన్ని సరిగా అర్థం చేసుకోగలగడమే శ్రోతలు బెసెంట్ గారు మాట్లాడుతున్నప్పుడు విసుగుదల చూపడం ఆమెపట్ల అగౌరవంవల్లగాని, అలక్ష్యంవల్లగాని కాదు ఆమె ప్రసంగం మనోరంజకంగానూ, సమర్థవంతంగానూ ఉన్నప్పటికీ ఆమె ఇంగ్లీషులో మాట్లాడడంవల్ల వినేవారికి అర్థంకాలేదు జాతీయ చైతన్యం అభివృద్ధియై ప్రజల్లో విద్యాభ్యాసానికి, రాజకీయ విజ్ఞానానికి కోరిక హెచ్చినకొద్దీ వక్తలు ఇంగ్లీషులో ఎంత చక్కగా మాట్లాడినప్పటికి శ్రోతల్ల ప్రజాసామాన్య దృష్టిని ఆకర్షించడం అంతకంత ఎక్కువ కష్టతరమవుతుంది కాబట్టి ప్రజానాయకులైనవారు హిందుస్థానీ నేర్చవలసిన అవసరం గుర్తించవలసిందని మద్రాసు రాజధానిలోని ప్రజలకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను మద్రాసు వెలుపల ఉన్నవారు హిందుస్థానీ భాషను కష్టం లేకుండా దాదాపు అర్థం చేసుకోగలరు దయానంద సరస్వతి ఉత్తర హిందుస్థానానికి వెలుపల ఉన్నవారిని సైతం తన హిందుస్థానీ ప్రసంగాలతో ముగ్ధులను చేయగలిగినారు ఆయన భాషను సామాన్య ప్రజలు సైతం తేలికగా అర్థం చేసుకోగలిగినారు దీనినిబట్టి ఇండియాలోని 35 కోట్ల జనసంఖ్యలో మద్రాసు రాజధానికి చెందిన 3 కోట్ల 80 లక్షల మంది మాత్రమే హిందుస్థానీ భాషను అర్థంచేసుకోలేరని తెలుసుకోవచ్చు మద్రాసు రాజధానిలోని మహమ్మదీయుల్లో అధిక సంఖ్యాకులు హిందుస్థానీని అర్థం చేసుకోగలరన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే కాబట్టి మద్రాసు రాజధానిలోని 3 కోట్ల 80 లక్షల ప్రజల కర్తవ్యమేమో మనం ఆలోచించవలసి ఉన్నది మద్రాసు రాజధానిలోని ప్రజలకోసం ఇండియాలోని 27 కోట్ల 70 లక్షలమంది ప్రజలు ఇంగ్లీషు నేర్చుకోవలెనా, లేదా మద్రాసు రాజధానిలోని 3 కోట్ల 80 లక్షల మంది హిందుస్థానీ నేర్చుకోవలెనా? అన్న విషయం ఆలోచించదగి ఉంది

కీ శే జస్టిస్ కృష్ణస్వామిగారు ఇండియాలోని వివిధ ప్రదేశాల ప్రజలు పరస్పరం అర్థం చేసుకోనేటందుకు వీలయిన భాష హిందుస్థానీయే అని దూరదృష్టితో గుర్తించగలిగినారు ఆ సిద్ధాంతం గట్టిగా కాదన్న వారెవరూ ఇంతవరకు నాకు కనిపించలేదు వేలకొద్దీ జనం ఇంగ్లీషులో వ్యవహరించుకోవడం సాధ్యమయిన పని కాదు ఉన్నత సాంకేతిక విద్యలు ఇంగ్లీషులో నేర్వడం సాధ్యమయినప్పటికీ అవి సొంత భాషల్లో నేర్చుకోవడమంత తేలిక మాత్రం కాదు ప్రజాసామాన్యానికి ఇంగ్లీషు భాష సామాన్య భాష కాజాలదు హాక్సీ వ్రాతలను ఇంగ్లీషులోనుంచి గుజరాతీలోకి అనువాదం చేయడంకంటె సర్ జగదీశ్ చంద్రబోస్ వ్రాతలను బెంగాలీనుంచి గుజరాతీలోకి అనువాదం చేయడం ఎక్కువ తేలిక మద్రాసువారు తక్కిన భారతదేశంకోసం హిందుస్థానీ నేర్చుకోవటంలో గల అర్థం ఏమిటి? మద్రాసులోని ప్రజాసేవకులు దక్షిణ

ఇండియాకు వెలుపల పనిచేయదలచుకొంటె మద్రాసు రాజధానికి వెలుపలి జాతీయ సమావేశాలలో పాల్గొనదలచుకొంటే రోజుకు ఒక గంట చొప్పున ఒక సంవత్సరంపాటు హిందూస్థానీ భాషను నేర్చుకోనవలసి ఉన్నది అట్లా చేస్తే మద్రాసులోని నేటికొద్ది జనానికి ఒక్క సంవత్సరంలో హిందూస్థానీ భాషలో నడిచే కాంగ్రెస్ వ్యవహారాలన్నిటినీ కనీసం అర్థం చేసుకోగలిగే జ్ఞానం లభిస్తుంది ఆ రాష్ట్రంలోని అనేక ప్రదేశాలలో హిందీ ప్రచార కార్యాలయాలు ఉన్నాయి హిందూస్థానీ నేర్చుకోదలచిన వారందరు అక్కడ ఆ భాష ఉచితంగా నేర్వవచ్చు

హిందూస్థానీ భాషను నేర్చుకోవడం గురించి బెసెంట్‌గారు అప్పుడప్పుడు 'న్యూఇండియా'లో వ్రాస్తునే ఉన్నారు ఆమె ఈ నా విజ్ఞప్తిని బలపరుస్తారనుకుంటున్నాను

(1919 లోని అమృత్‌సర్ కాంగ్రెస్ తరవాత డాక్టర్ బెసెంట్ కాంగ్రెస్ మహాసభలో హిందూస్థానీ భాషను ఉపయోగించడం గురించి వెల్లడించిన అభిప్రాయాలపైన గాంధీజీ 21-1-1920 'యంగ్ ఇండియా'లో వ్రాసిన వ్యాసం ఇది )

## మద్రాసులో హిందీ (మహాత్మా గాంధీ)

ద్రావిడ సోదరులు ఎప్పుడో ఒకప్పుడు హిందీ భాషను అభ్యసించడానికి శ్రద్ధ తీసుకోగలరని నేను పూర్తిగా విశ్వసిస్తున్నాను వారు ఇంగ్లీషు భాషను సరిగ్గా నేర్చుకోనేటందుకు చేసే ప్రయత్నంలో ఎనిమిదో వంతు కృషి హిందీ నేర్చుకోనేటందుకు చేస్తే వారు మాకు మినహాయింపుకంటె ఎక్కువ సన్నిహితులు కాగలరు వారికి హిందీ రాకపోయినందువల్ల తక్కిన భారతదేశ వ్యవహారాలు తెలుసుకోనేటందుకు వీలుండదు కొందరు ఈ వాదం రెండు విధాల అన్యాయమనుకుంటారని నాకు తెలుసు ద్రావిడ దేశీయులు అల్పసంఖ్యాకులుగా ఉండడంచేత ఇండియాలోని ద్రావిడ భాషేతరులు తమిళము, కన్నడము, మళయాళము, తెలుగు భాషలను నేర్చుకోవడంకంటె ద్రావిడులు హిందీ నేర్చుకోవడం జాతీయ ఆర్థిక విధాన దృష్ట్యా ఎక్కువ శ్రేయస్కరంగా కనబడుతుంది అందువల్లనే అలహాబాద్ హిందీ సాహిత్య సమ్మేళనంవారి యాజమాన్యంకింద గడచిన 18 మాసాలనుంచి మద్రాసు రాజధానిలో హిందీ ప్రచారం తీవ్రంగా జరుగుతున్నది

గడచిన వారం బొంబాయిలో జరిగిన 'అగర్వాల్ మార్వాడి' సమ్మేళనానికి నేను చేసిన విజ్ఞప్తి కనుగుణంగా కలకత్తా, బొంబాయి నగరాలలోని భాగ్యవంతులైన మార్వాడీలు మద్రాసు రాజధానిలో 5 సంవత్సరాలపాటు హిందీ ప్రచారం కొనసాగించడానికి 50 వేల రూపాయల నగదును అప్పటికప్పుడు చందాగా ఇచ్చినారు ఇండియాలోని ఈ వణిగ్వర్గంవారు హిందీ భాషా ప్రచారం తమ ప్రత్యేక కార్యకలాపాలలో ఒకటని, మరొకసారి క్రియారూపవ

కంగా ప్రదర్శించినారు జాతీయోద్యమ విస్తృతికి నావలె హిందీ అవసరమని నమ్మే ద్రవిడ భాషలవారి బాధ్యత, అలహాబాదు హిందీ సాహిత్య సమ్మేళనంవారి బాధ్యత మార్వాడీ వర్తకుల ఈ ఔదార్యంవల్ల మరింత ఎక్కువైంది ద్రావిడులెవరూ హిందీ నేర్వడం ఎంతమాత్రం కష్టం కాదని తెలుసుకోవలసి ఉంది ప్రతిరోజ తీరిక సమయంలో ఒకగంట సక్రమంగా హిందీకి వినియోగించినట్లయితే సామాన్యమయిన మనిషి ఒక్క సంవత్సరంలో హిందీ నేర్చుకో గలడు మున్సిపల్ పాఠశాలల్లో హిందీని ఐచ్ఛిక భాషగా ప్రవేశపెట్టవలెనని కూడా పెద్దపెద్ద మున్సిపాలిటీలకు నేను సూచించడానికి సాహసిస్తున్నాను ద్రావిడుల పిల్లలు హిందీ భాషను ప్రశంసింపదగినంత తేలికగా నేర్చుకోగలరని నేను అనుభవ పూర్వకంగా చెప్పగలను దక్షిణాఫ్రికాలోని తమిళులు, తెలుగు వారూ కూడా హిందీలో చక్కగా సంభాషించగలరనే సంగతి ఇక్కడ చాలా మందికి తెలియదు జీతం చెల్లించవలసిన అవసరం లేకుండా హిందీ నేర్చుకొనే టందుకు అవకాశం కల్పించిన మార్వాడీ వర్తకుల ఔదార్యం చక్కగా వినియోగించుకొని మద్రాసులోని యువతీ, యువకులు హిందీ భాషను నేర్చుకోగలరని నే నాశిస్తున్నాను

యంగ్ ఇండియా
16 జూన్ 1920

# 9
# గాంధీ మహాత్ముని ఆంధ్రదేశ పర్యటన (1921)

1921 మార్చి 31 వ తేదీని విజయవాడలో అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం ఏర్పాటు చేయబడింది ఆ సమావేశానికి అఖిలభారత ప్రముఖ కాంగ్రెసు నాయకులందరు హాజరయినారు భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఆ సమావేశం చిరస్మరణీయమైనది ఆ సభలో చేసిన తీర్మానాలే స్వాతంత్ర్య సంపాదనకు దోహదాలు పునాదులైనాయని చెప్పవచ్చు భారత స్వాతంత్ర్య సంగ్రామంలో అతిరథ మహారథులుగా పేర్కొనబడిన నాయక శిఖామణుల దర్శన భాగ్యం ఆనాటి ఆంధ్ర ప్రజానీకానికి దక్కింది ఆ దృశ్యం మరపురానిది భారత స్వాతంత్ర్యానికి సర్వసంగ పరిత్యాగాలు చేసిన పుణ్య పురుషుల పదాంకాలతో కృష్ణవేణీ తీరానఉన్న విజయవాడ నగరం పునీత మయిన రోజులవి

గాంధీజీ విజయవాడలో జరగనున్న ఆ అఖిలభారత కాంగ్రెస్ సమావేశానికి కలకత్తా నుంచి వస్తూ తెలుగు దేశంలోని అనేక పట్టణాలలో ప్రసంగించినారు గాంధీ దంపతులను శ్రీ కొండ వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రిగారు పూరీలో కలుసుకొని బెజవాడకు తీసుకొని వచ్చినారు కొండ వెంకటప్పయ్యగారు పూరీలో గాంధీజీని కలుసుకొన్నప్పుడు, తన దగ్గర ఉన్న రాజేంద్రప్రసాదులో "ఇదుగో జయిలరు వచ్చినాడు పాత జైలరునుంచి ఒప్పగించుకొనేటందుకు' అని వెంకటప్పయ్యగారిని హాస్యమాడుతూ పలకరించినారు

**బరంపురంలో**

గాంధీజీ 1921 మార్చి 28 వ తేదీ ఉదయం కలకత్తా మెయిల్‌లో బరంపురం రైలు స్టేషన్‌లో దిగినారు పౌరులు వారిని ఊరేగింపుతో పట్టణంలోకి తీసుకొని వెళ్ళినారు మున్సిపల్ కౌన్సిల్ వారు, స్థానికంగా తయారైన పట్టు చేతిరుమాలుపై ముద్రించిన సన్మానపత్రాలు సమర్పించినారు గాంధీజీ ఆ సన్మాన పత్రానికి ప్రత్యుత్తర మిస్తూ ఇంగ్లీష్‌లో సన్మానపత్రం సమర్పిస్తారని తామనుకోలేదన్నారు ఇంగ్లీష్ భాష అంతర్జాతీయ రాజకీయ వ్యవహారాలకు, వాణిజ్య సంబంధాలకు ఉపయోగపడవచ్చు కాని మన జాతీయ పరిణామ దశలో దానికి స్థానంలేదు సూరత్, నడియాడ్, అహమదాబాద్ మున్సిపాలిటీలు ఆదర్శప్రాయాలైన మున్సిపాలిటీలని, చక్కగా నడపబడుతున్న మున్సి

పాలిటీలు స్వరాజ్య సాధనాలు కాగలవని అన్నారు. జాతీయ పాఠశాలలను గురించి ముచ్చటిస్తూ అవి ప్రభుత్వంవారి యాజమాన్యం, వారి గ్రాంటులను తృణీకరించినంత మాత్రంతో సరిపోదని, జాతీయ విద్యావిధానం ఏర్పాటు చేయవలెనని, నూలు వడకడంతో పాటు హిందుస్థాని భాషను కూడ ఆ పాఠశాలలో బోధించవలసి ఉందని అన్నారు. గోఖలేగారి ఉత్తమ సంప్రదాయాలను ఒరవడిగా ఉంచుకోవలెనని ఆయనవలె దేశంలోని రాజకీయాలను ఆధ్యాత్మిక తత్వంతో మేళవించవలెనని అన్నారు. మనం ఈనాడు మన జాతీయ వ్యవహారా లన్నిటిని తాత్వికదృష్టితో ఆలోచించవలసి ఉన్నది. ఆయన గోఖ్లేగారి నిరంతర పరిశ్రమను ఉదాహరణంగా పేర్కొంటూ, మనం ఒక క్షణంకూడా వృధా చేయకూడదని ప్రబోధించినారు. బరంపురం మున్సిపాలిటి అభ్యుదయ పరంపరలతో వర్ధిల్లవలెనని, జాతీయోన్నత్యానికి శక్తికొద్దీ తోడ్పడవలెనని ఆశీర్వదించినారు. తరవాత డెలిగేట్ ఛైర్మన్ ఏ వి సుబ్బారావుగారు మున్సిపల్ కౌన్సిలర్లందరిని గాంధీజీకి పరిచయం చేసినారు. 'వందేమాతరం' గీతంతో సభ ముగిసింది. గాంధీ దంపతులకు స్థానికంగా తయారుచేసిన కర్పూరపు దండలు వేసినారు.

మధ్యాహ్నం బరంపురం జిల్లాలోని ఆంధ్ర ఒరియా నాయకులు జిల్లా సమస్యను గురించి గాంధీజీతో చర్చించినారు. ఆయన ప్రజాభిప్రాయ సేకరణ ద్వారా ఆ సమస్యను పరిష్కరించుకోదగునని సలహా ఇచ్చినారు. తరవాత ఆయన ఖిలాఫత్ కార్యకర్తలను కలుసుకొని మాట్లాడినారు. తరువాత టౌన్ హాల్‌లో మహిళాసభలో ప్రసంగించినారు.

సాయంకాలం మైదానంలో 20 వేలమంది ప్రజలున్న సభలో హిందీలో ఉపన్యసించినారు. హిందీలో ప్రాథమిక జ్ఞానం సంపాదించడం ఎంతో కష్టం కాకపోయినప్పటికి మద్రాసు రాష్ట్రీయులు హిందుస్థానీని అర్థం చేసుకోలేకపోవడం విచారకరం అన్నారు. హిందుస్థానీ భాష పై తరగతుల నుండి కింది తరగతులలోకి వ్యాపించవలెననీ ఆంధ్రుల మధ్య ఒరియాల మధ్యగల జిల్లా సమస్య రాజకీయ నైపుణ్యంతోనూ, జాతీయ దృక్పథంతోనూ పరిష్కరించుకొనవలెనని ఈ సమస్యతో ప్రజాసామాన్యానికి సంబంధం లేదనీ విస్పష్టం చేసినారు. తాను భాషా ప్రయుక్త రాష్ట్రవిభజనకు, రాష్ట్రీయాభివృద్ధికి అనుకూలుడై నప్పటికి అవి జాతీయాభ్యుదయానికి భంగకరంగా ఉన్నట్లయితే వాటికి తాను వ్యతిరేకినని స్పష్టీకరించినారు. ప్రపంచంలో అత్యంత బలిష్ఠులైనవారితో న్యాయసమ్మతమైన సమానత్వానికి జరిపే పోరాటమే స్వాతంత్ర్య పోరాటమని వ్యాఖ్యానించినారు. స్వరాజ్య సంపాదన సందర్భంలో మనలను ఎదుర్కొంటున్న కష్టాలను తాను గుర్తించి ఉన్నామని, ఇప్పుడు మనం పొందుతూన్న కొద్ది నెలల శిక్షణవల్ల మనలోని అవిశ్వాసం పూర్తిగా తొలగిపోగలదని అన్నారు. భారత దేశానికి జరుగుతూన్న అవమానం కళ్ళారా చూస్తూ బ్రతకగల శక్తి కంటె భారతదేశం కోసం చావగల శక్తి మనకు ఎక్కువ కావాలన్నారు. జిల్లా

సమస్యలవంటి సమస్యలను మన మొక కనురెప్ప పాటులో సరిచేసుకొని మన ఇంటిని మనం చక్కపెట్టుకోవలసిన తరుణం వచ్చిందని, మనం కేవలం మన కోసం కాక ఇతరుల కోసం కూడా జీవించవలెనని అన్నారు మనం తక్షణం స్వరాజ్యం సంపాదించవలెనని అన్నారు ఖిలాఫత్ సమస్యను గురించి ప్రసంగిస్తూ ఇన్ని ఏండ్లనుంచి మనం అనిర్దిష్ట విధానమే ఈ అపాయానికి దారి తీసిందని చెప్పినారు పంజాబ్ దురంతాలకు తగిన పరిహారం లభించవలెననిన జాతీయ చైతన్యం మనకొక నూతన ధైర్యం కల్పించినందుకు మరొక పర్యాయం సైనిక శాసనం ప్రవేశపెట్టబడినప్పటికీ భారతీయుడెవ్వడూ పొట్టమీద పాకే ప్రసక్తి ఉండదని ఘంటాపథంగా చెప్పినారు అసహాయోద్యమం స్వరాజ్య సంపాదనకు సాధకమనీ, స్వరాజ్య ప్రణాళిక స్వరూపం నిర్వచించవలసిన అవసరం ఇప్పుడు లేదనీ అన్నారు ఇటీవల తమ ఒరిస్సా పర్యటనలో అక్కడి సామాన్య ప్రజలు అన్నంకోసం అలమటిస్తున్నట్లు కనుకొన్నానని వారు స్వరాజ్యం ప్రయోజనం అనుభవించవలెననీ చెప్పినారు ఇంగ్లీషువారు వారికి ఉచితంగా బియ్యం సప్లయ్ చేసినట్లయితే వారు మనలను గుర్తించనుకూడా గుర్తించరన్నారు గవర్నమెంట్ తమ చర్యలకు పశ్చాత్తాప పడేటంతవరకు, మనం స్వరాజ్యం వచ్చేవరకు లాయర్లు తమ వృత్తులను మానవలెనని ప్రబోధించినారు నిరపరాధులైన పంజాబ్ ప్రజలను అండమానుకు పంపడం అన్యాయమనీ, ఈ సందర్భంలో మనం బ్రిటిష్ వస్తువులను జయప్రదంగా బహిష్కరించలేమంటే మనకు గొప్ప అవకాశం కోల్పోయినవారం కాగలమనీ ఉద్ఘాటించినారు ఈస్టిండియా కంపెనీవారు ఎన్నిన ఎన్నుగడను కూడా పేర్కొన్నారు ప్రజలపట్ల సానుభూతిలేని ఈ పాపపు ప్రభుత్వంనుంచి తప్పించుకొనేటందుకు మనం పాపులం కానక్కరలేదనీ తాను క్రియా తత్పరుడయిన ఆదర్శవాదిననీ, ఇండియాదేశం కాంగ్రెస్ కంటె కూడా ముందుగా తాగుడు దురభ్యాసానికి ప్రతికూలంగా ప్రబలమయిన పోరాటం సాగిస్తూన్నందుకు సంతోషిస్తున్నాననీ అన్నారు మనం పునీతుల మయ్యేటందుకు యూనివర్సిటీ విద్య అవసరంలేదనీ, హిందూ ముస్లిమ్ ఐకమత్యం సుస్థిరమయిందనీ, నిమ్నజాతుల అభ్యున్నతికి మనం పనిచేయవలెనని, స్వరాజ్య సంపాదనకు తిలక్ స్వరాజ్య నిధి అనే పేరుతో ధనసేకరణ చేయవలెనని, అది ఇండియాను చైతన్యవంతంగా చేయగలదనీ ఉద్బోధించినారు

తరవాత 'ఆస్కా' కాపురస్థుడైన కూరాడ పూణరాజు 10 వేల రూపాయల విలువగల తన ఆస్తి నంతను గాంధీ స్వాధీనంచేసి ఆయన ఇచ్చే మను వృత్తి పైన తాను జీవించగలనని ప్రకటించినారు ఇంకా కొంతమంది కూడా తిలక్ స్వరాజ్య నిధికి విరాళాలు ప్రకటించినారు గాంధీగారు బరంపురంనుంచి రాత్రి రైలులో దక్షిణాదికి వెళ్ళినారు గాంధీజీ బరంపురం వచ్చినప్పుడు అసంఖ్యాక ప్రజానీకం ఆయనను అవతారపురుషునిగా భావించి దర్శించినారు జిల్లాలోని అసహాయవాదులందరూ ఋషితుల్యుడైన ఆ మహాపురుషుని రాకవల్ల

ద్విగుణీకృతోత్సాహంతో తమ ప్రచారం సాగించడానికి పూనుకొన్నారు గాంధీగారు ఆయన సహచరులు, మధుసూదన్‌గారికి అభిమానులుగా ఉన్నారు ఆయనకు కావలసిన సౌకర్యాలను చేకూర్చేటందుకు అనేకమంది యువకులు సర్వవిధాలా కృషిచేసినారు ఈ సందర్భంలో ముఖ్యంగా జిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంట్ మారెళ్ళ గంగరాజు, జాయింట్ కార్యదర్శి న్యాపతి నారాయణ మూర్తిగార్లను కొనియాడవలసి ఉన్నది గాంధీగారి రాక ప్రశాంతంగా జరిగినందుకు స్థానిక ప్రభుత్వోద్యోగులను పోలీసువారిని కూడ అభినందించవలసి వున్నది వారందరూ గాంధీజీ సభలు జయప్రదంగా జరగడానికి తోడ్పడినారు

**విజయనగరంలో**

గాంధీజీ బరంపురం నుంచి బెజవాడ పోతూ, 1921 మార్చి 30 వ తేదీ ఉదయం విజయనగరంలో దిగినారు రైలుస్టేషన్‌లో అనేకమంది ప్రజలు ఆయనను ఆహ్వానిస్తూ గుమిగూడినారు గాంధీజీ కూర్చుండిన బండిని ప్రజలు సొంతంగా లాగవలెనని పట్టుబట్టినారు కాని గాంధీజీ అందుకు అంగీకరించ లేదు ఆయన పట్టణంలోకి పోయే దోవలో వేలాది జనం బారులు తీర్చి ఆయన రాకను నిరీక్షిస్తూ నిలబడివున్నారు తోవ పొడుగునా గృహాలు తోరణాలతోను పూల దండలతోను అలంకరింపబడిఉన్నాయి.పట్టణమంతా ఒక మహోత్సవంలో పాల్గొంటున్నట్లు కనిపించింది తోవ పొడవునా గృహిణులు ఆయనకు హారతులిచ్చినారు వీధులన్నిటిలో పొడుగునా స్వచ్ఛంద సేవకులు నిలబడి సలక్షణంగా ఉత్సవం జరగడానికి తగిన ఏర్పాట్లు చేసినారు

ఉదయం 7 గంటలకు 'పీపుల్స్‌పార్క్' లో ఒక పెద్ద సభ జరిగింది దాదాపు 10 వేలమంది జనం వచ్చినారు ఉన్నత వర్గాలకూ, గౌరవ కుటుంబాలకూ చెందిన మహిళామణు లనేకమంది కూడా ఆ సభకు హాజరయినారు గాంధీగారికి ఆ సభలో సన్మానపత్రం సమర్పించబడింది గాంధీజీ సన్మానపత్రానికి ప్రత్యుత్తరమిస్తూ ఉత్తేజకరమయిన ఉపన్యాసం చేసినారు ఆయన తన ఉపన్యాసంలో ఆధునిక వైజ్ఞానిక శాస్త్రాలలో పరిజ్ఞానం సంపాదించడానికి అంతర్జాతీయ వాణిజ్యంలో పాల్గొనటానికి తప్ప మనకు ఇంగ్లీషు భాష అంతగా అవసరం లేదన్నారు మన దేశంలో జాతీయ భ్రాతృభావాన్ని పెంపొందించేటందుకు హిందీ భాషాభ్యాసం అత్యవసరమని అది భారత జాతీయ భాషగా ఉండదగినదనీ అన్నారు "కాశీ విశ్వనాథుని భాషయైన హిందీ భాష సామాన్య ప్రజల భాషగా ఉండవలె భారత ప్రజలు సంఘీభావంతో ఒకే జాతిగా ఉండాలని కోరుతున్నారు అందువల్ల వారు రాష్ట్రాభిమానం విడిచివేయవలె హిందీ 8 నెలలలో నేర్చుకొనవచ్చు" అని చెప్పినారు తనను అత్యధికంగా శ్లాఘించడం తనకు సమ్మతం కాదని తన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడమే తన కోరికనీ స్పష్టం చేసినారాయన రాట్నం మర ఫిరంగులంత పటిష్ఠమయిన ఆయుధమని కూడా వివరీకరించినారు ఈస్టిండియా కంపెనీవారు ఇండియాకు రాగానే

రాట్నం నిర్మూలించినారనీ ఆనాటి నుంచి భారతదేశానికి ఆర్థిక, నైతిక, పతనావస్థ ప్రారంభమైనదనీ తెలియచేసినారు పాశ్చాత్య దేశాలలో తయారై మెరసిపోతూన్న ఆడంబర దుస్తులను వదిలివేసి ఇళ్ళలో వడికిన నూలుతో చేతిమగ్గాల మీద తయారైన బట్టలనే కట్టుకోవలెనని సలహా ఇచ్చినారు వడుకు నూలు బట్టలు ముతకగా ఉన్నప్పటికీ వాటి వెనక ఒక ఉజ్జ్వల చరిత్ర ఉందనీ, వాటికి ఆత్మ ఉ దనీ, ఒక సౌందర్యముందనీ వివరించినారు తరవాత కొంతసేపు ఒరిస్సాలోని దుర్భర పరిస్థితులను అభివర్ణించినారు విద్యార్థులను, వకీళ్లను, పాఠశాలలను, కోర్టులను బహిష్కరించవలసిందని కోరినారు తన సలహాను అంగీకరించకపోయినట్లయితే, వారు తమపట్ల, దేశంపట్ల కూడా నిర్వర్తించవలసిన కర్తవ్యం నిర్వహించని అపరాధానికి లోను కాగలరన్నారు ఇండియాలో తాగుడు దురభ్యాసం తొలగిపోవలెనని- ముఖ్యంగా మన మందరం శారీరకంగాను, మానసికంగాను పరిశుద్ధులంగా ఉండవలెననీ, హిందూ ముస్లిమ్ ఐక్యతకు పాటుపడవలెననీ, స్వదేశీ వస్తువులనే ఉపయోగించవలెననీ కోరినారు స్వరాజ్య సిద్ధికి ఇవి కారణాలు కాగలవని అభిప్రాయం వెల్లడిస్తూ గాంధీజీ తన ఉపన్యాసం ముగించినారు

**రాజమహేంద్రవరంలో**

మార్చి 30 రాత్రి మెయిల్‌లో బెజవాడకు పోతూ మహాత్మాగాంధీ, లాలా లజపత్‌రాయ్, అలీ సోదరులు, చిత్తరంజన్ దాస్ మొదలైన జాతీయ నాయకులు రాజమహేంద్రవరం రైల్వే ప్లాట్‌ఫారం మీద దిగినారు వారిని ఆహ్వానించేటందుకు రాజమహేంద్రవరంలో పెద్ద సభ జరిగింది చుట్టుపట్ల గ్రామాలనుంచి, దూరపు ప్రదేశాలనుంచి కూడ అనేకమంది ప్రజలు వచ్చినారు దాదాపు 20 వేలమంది ప్రజలు చేరినారు రైలుస్టేషన్ నుంచి సభాస్థలంవరకూ గల ప్రదేశం యావత్తూ ప్రజా సమూహంతో నిండిపోయింది గాంధీ, చిత్తరంజన్‌దాస్, మహమ్మదాలీ, షౌకతాలీలు సభకు దయచేసినారు నాయకులు వచ్చేలోగా డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారు సహాయ నిరాకరణోద్యమాన్ని గురించి ఉపన్యసించినారు గజవల్లి రామచంద్రరావు గాంధీజీ తదితర నాయకులను ఆహ్వానిస్తూ ప్రజలకు పరిచయం చేసినారు

గాంధీ నూలు వడకవలసిందనీ, జూదం మొదలయిన దురభ్యాసాలు మానవలసిందనీ, స్వదేశీ వస్తువులనే వాడవలసిందనీ, ప్రభుత్వంతో ఏ విధమయిన సంబంధం పెట్టుకోరాదనీ, తిలక్ స్వరాజ్య నిధికి ధనం సేకరించవలెననీ ఉపన్యసించినారు సభకు అన్ని వర్గాలవారు అన్ని మతాలవారు స్త్రీలు, పురుషులూ కూడా హాజరయినారు సభ ప్రశాంతంగా జరిగింది సభ జరుగుతుండగా స్థానిక పోలీసు ఇన్‌స్పెక్టర్ సభ చుట్టూ గుఱ్ఱంమీద ప్రదక్షిణచేయడం చూసి మహమ్మదాలీ సభనుంచి వెళ్లుతూ ఆయన మెడలో ఒక పూలదండ వేసిపోయినారు

**మహాత్మాగాంధీ - బరంపురంలో**

మహాత్మాగాంధీ మార్చి 28, 29 తేదీలలో బరంపురం నికి వచ్చినప్పుడు భాషా ప్రాతిపదిక మీద బరంపురం జిల్లా సరిహద్దుల ఏర్పాటును గురించి వారి సలహా తీసుకొనేటందుకు, ఆంధ్రులు ఓఢ్రులూ కలసి ఒక రాయబారివర్గం వారు ఆయనను దర్శించినారు ఈ సరిహద్దు సమస్య విషయంలో చాలా కాలం నుంచి ఆందోళన జరుగుతూ నానాటికి ఇరుతెగల ప్రజలలోనూ ఉద్రేకము పెచ్చుపెరిగిపోతున్నది గాంధీజీ ఈ విషయంలో సౌఖ్యం లభించుకొని ఇరు పక్షాలవారి వాదననూ వినగోరినారు ప్రస్తుతం ఆనాడు భాషా ప్రాతిపదిక మీద కాంగ్రెస్ సంస్థల నిర్మాణ సమస్య ఉత్పన్నమయినది ఆంధ్రుల రాయబార వర్గంలో శ్రీయుతులు వరాహగిరి వెంకటజోగయ్య, ప వెంకటేశ్వర్లు, మల్లాది కృష్ణమూర్తి, ఎ వి సుబ్బారావు, హెచ్ పంబురగాధం, ఎ సూర్యనారాయణమూర్తి మొదలయినవారు ఉన్నారు ఒరియా ప్రతినిధులు మిశ్రే, పాణిగ్రాహిగార్లు మాత్రమే కొండ వెంకటప్పయ్యగారు గాంధీజీతో ఉన్నారు ఆంధ్ర ప్రతినిధులు ఒరియావారి వాదాన్ని ప్రతిఘటిస్తూ, జనాభా లెక్కలతో సహా వివరాలను చూపి ఓఢ్రుల జనాభాకంటె ఆ ప్రాంతంలో తమ జనాభా ఎక్కువ ఉన్నట్లు సహేతుకంగా రుజువు చేసినారు "ఏ ప్రదేశంలో ఏ భాష మాట్లాడేవారు ఎక్కువమంది ఉంటే ఆ ప్రదేశం ఆ భాషా రాష్ట్రంలోకి చేర్చడం ఉభయ భాషలవారికి శ్రేయోదాయకంగా ఉంటుంది కాని ఇటువంటి సందర్భాలలో అతిసంకుచితంగాను అతిసూక్ష్మంగాను ఆలోచించకూడదు స్వరాజ్యం లభించగానే, భాషల ప్రాతిపదికను రాష్ట్రాలను నిర్మించి ఇండియా పటం పునరుల్లేఖించడం ముట్టమొదటగా జరగవలసిన పని ఈ విషయంలో ఉభయ వర్గాలవారు పరస్పర సుహృద్భావంతో వ్యవహరిస్తే ఈ పని సులభంగా జరుగుతుంది జనాభా లెక్కలలో తప్పు ఉన్నదని భావిస్తే ఈ సమస్యను జనాభిప్రాయ సేకరణ ప్రకారం పరిష్కరించుకోవచ్చు అయితే ఆ సందర్భంలో రెండు ముఖ్య సూత్రాలను మనస్సులో పెట్టుకొని వ్యవహరించవలె ఈ ఉభయ భాషలవారిలో ఏ భాషవారుగానీ ఎక్కువ మంది ఉన్న ప్రాంతం ఆ భాషా రాష్ట్రంలో చేర్చివేయవలె ఆ ప్రాంతానికి ఆ భాషా రాష్ట్రానికి కలయిక ఉండవలె" అని సలహా ఇచ్చినారు గాంధీజీ ఈ సలహాను ఉభయ వర్గాలవారు అంగీకరించి కృతజ్ఞతాభివందనాలతో గాంధీజీ దగ్గర సెలవు తీసుకొన్నారు

**అనకాపల్లిలో గాంధీజీ**

మార్చి 30 న గాంధీజీ బెజవాడకు పోతున్నారని తెలిసి అనకాపల్లి ప్రజలు రైలు స్టేషను దగ్గరికి వచ్చినారు తిలక్ స్వరాజ్య నిధికి కొంతమంది మహమ్మదీయులు, వైశ్యులు కలసి రు 200/లు వసూలుచేసినారు ఈ పనిలో వెల్లీ మహమ్మద్, కె బుచ్చిరాజు, పెద్ది నూకయ్యచెట్టిగార్లు ప్రముఖ పాత్ర

వహించినారు రైలు దగ్గర చేరిన మూడువేలమందిలో 40 మంది స్త్రీలు కూడా ఉన్నారు వారందరు "మహాత్మగాంధీకి జై" అనే నినాదాలతో ఊరేగింపుగా వచ్చినారు గాంధీజీని ఆయనతో వచ్చిన నాయకులనూ దర్శించే టందుకు పలయి పరగణాలనుం కొంతమంది విద్యార్థులుకూడా వచ్చినారు రైల్వుస్టేషన్ గేట్లు తెరవగానే ప్లాటుఫారం పైకి రైలు వచ్చింది గాంధీజీని పుష్పమాల లంకృతునిగా చేసి పౌరులు రు 200 లను తిలక్ స్వరాజ్య నిధికి సమర్పించినారు అయన హిందీలో రెండు నిమిషాలు మాట్లాడిన తరవాత మౌలానా షౌకత్ అలీ వచ్చి, ప్రజలకు నమస్కారం చేసినారు చిత్తరంజన్ దాస్‌గారు అక్కడ చేరిన ప్రజలకు కొన్ని మిఠాయిలను పంచిపెట్టినారు తరవాత రైలు కదలిపోయింది

## బెజవాడలో అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం

నాగపురం కాంగ్రెసు మహాసభ తరవాత మొదటి అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం 1921 ఏప్రిల్ 31, ఏప్రిల్ 1 వ తేదీలలో బెజవాడలో జరిగింది అది ఎంతో ప్రాముఖ్యమైన సమావేశమని ఇంతకు పూర్వమే చెప్పి ఉన్నాము ఆ సభ బెజవాడలో జరగటానికి గల కారణాలను, ఆనాటి ఆంధ్రదేశ రాజకీయ సాంఘిక పరిస్థితులను, ఆ సభకు ముందు అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యులను కాంగ్రెస్ ప్రముఖ నాయకులను ఆహ్వానించి వారికి కావలసిన సౌకర్యాలు చేకూర్చేటందుకు జరిగిన ప్రయత్నాలను శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు 'నా జీవిత కథ నవ్యాంధ్రము' అనే గ్రంథంలో ఇట్లా మనోహరంగా అభివర్ణించినారు

'అఖిలభారత కాంగ్రెస్ కమిటీలన్నీ ఉత్తర హిందూ దేశంలోనే జరుగుతున్నవనీ ఈ సమావేశాన్ని ఆంధ్రదేశంలోని కూడలిస్థానమైన బెజవాడలో జరపవలసినదనీ నేను మహాత్మాగాంధీగారితోనూ, దేశబంధు చిత్తరంజన్ దాస్ గారితోనూ, అధ్యక్షులైన సేలం విజయరాఘవాచారిగారితోను మనవి చేసి వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి 'వర్కింగ్ కమిటీ' సభ్యులందరికీ 'టెలిగ్రామ్' లిచ్చి బెజవాడలో ఆ సమావేశం జరిగేటట్లు నిర్ణయింపజేసినాను ఆ సభ జరగడానికి ఏర్పాట్లన్నీ బెజవాడవారమే చేసినాము బందరువారుకానీ, గుంటూరు వారుకానీ, మరి ఏ ఇతర చోట్ల ఉన్న నాయకులుకాని మాకు సహాయపడలేదు మేము వారిని సహాయం చేయమని అడగనూలేదు బెజవాడలో బహిరంగసభలు జరిపి అఖిలభారత కాంగ్రెస్ కమిటీ బెజవాడకు వస్తున్నదని మహాత్మాగాంధీ మొదలయిన నాయకులు వస్తున్నారని ప్రజలకు చెప్పినాము ఒక బలవత్తరమైన ఆహ్వాన సంఘం ఏర్పాటు చేసినాము కావలసిన ద్రవ్యం వసూలైంది కాని ఆ కాలంలో మహాసభలు జరపడానికి తగిన పరికరాలు బెజవాడలో లేవు, విద్యుద్దీపాలు లేవు బెజవాడకు విద్యుచ్ఛక్తి 1930 లో నేను చైర్మన్‌గా ఉన్న కాలంలో వచ్చినది 1921 లో బెజ

వాడలో 'పెట్రొమాక్స్' దీపాల మీదనే ఆధారపడవలసి వచ్చింది అప్పుడు దూరశ్రవణ యంత్రాలును లేవు ఎన్ని వేలమంది జనము సమావేశమైనా వక్తలు బిగ్గరగా ఉపన్యాసాలు ఇవ్వవలసిఉండేది బస్సులుకూడా లేవు మోటారు కార్లు కూడా ఒకటి రెండు మాత్రమే ఉండేవి నా వద్ద ఒక పెద్ద గుఱ్ఱపు బగ్గీ మాత్రం ఉండేది దానిని ఆహ్వాన సంఘంవారి అధీనంలో ఆనాడు ఉంచినాను లాయర్ శ్రీ సి రాజగోపాలాచారి వద్దకూడ పెద్ద గుఱ్ఱపు బగ్గీ ఉండింది కాని ఆయన అప్పుడు గవర్నమెంట్ ప్లీడర్ కావడంవల్ల దానిని మాకివ్వ డానికి భయపడినాడు మునిసిపల్ చైర్మన్ దినవహి హనుమంతరావుగారు కాంగ్రెస్‌కు అపుడు వ్యతిరేకంగా ఉన్నా మంచి నీటి సప్లయ్, పరిశుభ్రత మొదలయిన విషయాలలో ఆయన మాకు పూర్తిగా తోడ్పడినారు

మార్చి 31 వ తేదీన అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి బెజవాడ పుర పాలక సంఘం పక్షాన ఆయన సన్మానపత్రంకూడా సమర్పించినారు నాయకులు వస్తామని మాకు తెలుపడంతోనే వారి ఆగమనం గురించి పత్రికల్లోనూ, బెజ వాడలో జరిగిన బహిరంగసభలలోను ప్రకటిస్తూ ఉండినాము అప్పుడు సిని మాలు కూడా లేవు అందువల్ల అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశం గవర్నర్‌పేటలో మ్యూజియం హాలులో ఏర్పాటుచేసినారు పందిళ్ళు అమర్చి నాము మ్యూజియం హాలు చుట్టు పెద్ద ఆవరణం ఉన్నది చెట్లు కూడా బాగానే ఉన్నాయి మధ్యాహ్నం నాయకులందరు ఆ దొడ్డిలోనే సంభాషణలు చేయడానికి డేరాలు వేయించినారు వివిధ రాష్ట్రాల నుంచి వచ్చిన సభ్యులను ఒకచోటనే ఉంచదగిన పెద్దభవనాలు లేవు మామూలు కాంగ్రెస్ మహాసభ అయితే కొన్నివందల ఎకరాల స్థలం ఊరిబయట తీసుకొని ఆరునెలలు ఉండనగా ఏర్పాట్లు మొదలుపెట్టి లక్షల ధనం వసూలుచేసి సభలకు గొప్పగొప్ప పాకలు, పందిళ్ళు, ప్రతినిధులుగా, ప్రేక్షకులుగా వేలకొద్దీ వచ్చేవారికి బసలు, భోజన వసతులు చాలా పెద్దపెట్టున ఏర్పాట్లుచేసేవాళ్ళము అప్పుడు బెజవాడలో జరిగింది కాంగ్రెస్ మహాసభ కాదు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమా వేశమే 200 మందికంటె ఎక్కువ సభ్యులు రారు వారికి మాత్రమే బసలు, భోజనాలు ఏర్పాటుచేయవలసి ఉండేది అందువల్ల ఒక్కొక్క రాష్ట్రం నుంచి వచ్చిన అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులకు ఒక్కొక్క ప్రముఖుని ఇంటిలో బస ఏర్పాటుచేసినాము మా మేడమీద దేశబంధు చిత్తరంజన్‌దాస్ వారితో వచ్చే బెంగాలీనాయకులకు బస ఏర్పాటుచేసినాము ఇట్లానే దాసు మధుసూదన రావుగారి ఇంటిలో మోతీలాల్ నెహ్రూగారికి, వారితోగూడా వచ్చేవారికి, సింగరాజు వెంకటసుబ్బారావుగారి ఇంటిలో లాలా లజపత్‌రాయ్‌గారికి వారితో వచ్చేవారికి, చింతకింది సూర్యనారాయణగారి ఇంటిలో యన్ సి కేల్‌కర్ గారికి వారితో వచ్చేవారికి, పెద్దిభొట్ల వీరయ్యగారి మేడమీద బాబు రాజేంద్ర ప్రసాదుగారికి వారితో వచ్చేవారికి, ముస్లిమ్ నాయకులకు పాతబస్తీలోని కొన్ని భవనాలను - ఈ విధంగా తలా ఒకచోట విడుదులను ఏర్పరిచినాము గవర్నర్

పేటలో బసగల సభ్యులందరు సింగరాజు వేంకటసుబ్బారావుగారి ఇంటి కేవచ్చి అక్కడ భోజనాలు చేయవలె చిత్తరంజన్ దాస్‌గారు మాత్రం మా మేడ మీదనే భోజనంచేసినారు. అధ్యక్షులైన సేలం విజయరాఘవాచారిగారికి వారితో వచ్చిన తమిళ ప్రతినిధులకు పాటిబండ్ల వేంకటరమణయ్యగారి ఇంటిలో బస ఏర్పాటుచేసి వారే వారి భోజనం ఏర్పాట్లుకూడా చేసేటట్లు చేసినాము పాత బస్తీలోని ముస్లిమ్ నాయకుల భోజన ఏర్పాట్లు బెజవాడ ముస్లిమ్ ప్రముఖులే తమ మీద పెట్టుకొన్నారు ఆంధ్రజిల్లాల నుంచి వచ్చిన నాయకులు బెజవాడ లోని తమతమ స్నేహితుల ఇండ్లలో దిగినారు కొండ వేంకటప్పయ్య పంతులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రిగార్లు, ఇంకా కొంతమంది ఆంధ్ర ప్రముఖులు మాఇంట్లో బసచేసినారు మహాత్మాగాంధీగారిని వారితో వచ్చిన మాతా కస్తూరిబాయి విఠల్‌భాయ్ పటేల్, సర్దార్ వల్లభాయ్ పటేల్, మహాదేవ దేశాయ్, శంకర్‌లాల్ బ్యాంకర్ మొదలయిన ప్రముఖులను వర్తకులు తమకు అప్పగించవలసిందని కోరినందువల్ల వారిలో ఎక్కువ చందాలిచ్చిన గోళ్ళ నారాయణరావుగారి మేడలో ఉంచినాము భోజనపు ఏర్పాట్లను కూడ వారే చేసినారు మొత్తంమీద అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యుల బసలు, భోజనాలు సంతృప్తికరంగానే ఏర్పాటుచేయడం జరిగింది ఇప్పుడు బెజవాడలో గాంధీనగరమని పిలవబడే యావత్ ప్రదేశంలో ఆకాలాన ఇళ్ళేమీ లేవు అంతా ఒక మైదానంగా ఉండేది ఆ మైదానంలోనే బహిరంగసభలు జరగడానికి కొంత ఎత్తయిన వేదిక అమర్చినాము కీ శే అద్దేపల్లి రామశేషయ్య శ్రేష్ఠిగారు ఆహ్వాన సంఘానికి అధ్యక్షులు అయన ప్రముఖ పాత్ర వహించినారు కీ శే కావలి శంకరరావుగారి యాజమాన్యంలో అయ్యంకి వేంకటరమణయ్యగారి మద్దతుతో ఒక పెద్ద బచ్చిక భటదళం బాగా పనిచేసింది రాయలసీమ నుంచి ఒక యువకుడు కల్లూరి సుబ్బారావు ఇక్కడికి ఉత్సాహంతో వచ్చి వారికింద పనిచేసినారు కీ శే విస్సంసెట్టి వేంకటరత్నం శ్రేష్ఠిగారితో చెప్పి వచ్చే ప్రేక్షకులకు ప్రత్యేక పూటకూటి బస ఏర్పాటు చేయించినాము దానివల్ల వచ్చే నష్టం తీర్చడానికి 6 వేల రూపాయలను వసూలుచేసినాము ఇదిగాక బెజవాడ బస్తీలో ఆ సమయానికి ఇతర పూట కూటి ఇళ్లుకూడ నెలకొల్పబడినాయి సభ ప్రారంభానికి క్రితంరోజున అబ్బాస్ తయాబ్‌జీగారు వారితో వచ్చిన ఇద్దరు సభ్యులు మా ఇంటికి వచ్చినారు

బెజవాడ అఖిలభారత కాంగ్రెస్ కమిటీమూడు ప్రత్యేకలక్షణాలు అప్పటికి జీవించి పేరుప్రతిష్ఠలుగల దాదాపుగా అందరు నాయకులును ఆ సభలకు దయచేసినారు మహాత్మాగాంధీ, కస్తూరిబాగాంధీ, దేవదాసుగాంధీ, మహాదేవ దేశాయ్, వల్లభాయ్ పటేల్, విఠల్‌భాయ్ పటేల్, జమన్‌లాల్ బజాజ్, శంకర్‌లాల్ బ్యాంకర్, సరళాదేవి, పండిత మోతీలాల్ నెహ్రూ, పండిత జవహర్‌లాల్ నెహ్రూ, లాలా లజపత్‌రాయ్, చిత్తరంజన్ దాసు, బాబు రాజేంద్రప్రసాదు, యన్ సి కేల్‌కార్, సరోజినీదేవి, మహ్మదాలీ,

షౌకతాలీ, అబ్బాస్ తియాబ్జీ హకీం అజ్మల్ ఖాన్ డాక్టర్ అన్సారి, అబుల్ కలామ్ ఆజాద్ డాక్టర్ సత్యపాల్, డాక్టర్ కిచ్లూ, కాకా సాహెబ్ కలేల్ కర్, శ్రీమన్నారాయణ అగర్వాల్ పురుషోత్తమదాస్ టాండన్ డాక్టర్ సుందర్ లాల్ శ్యామసుందర చక్రవర్తి, ప్రొఫెసర్ గిద్వానీ సేన్ గుప్త మొదలయిన ఉత్తర హిందూస్థానంలోని మహానాయకులందరు దక్షిణ హిందూ దేశంలోని సి రాజగోపాలాచారి, టంగుటూరి ప్రకాశం, కొండ వెంకట ప్పయ్య, పట్టాభి సీతారామయ్య, బులుసు సాంబమూర్తి, డాక్టర్ బ్రహ్మ జోశ్యుల సుబ్రహ్మణ్యం, ఉన్నవ లక్ష్మీనారాయణ వి వి గిరి, దేశ బాంధవి దువ్వూరి సుబ్బమ్మ, గద్దె రంగయ్యనాయుడు, అల్లూరి సీతారామశాస్త్రి, డాక్టర్ వరదరాజులు నాయుడు రామస్వామి నాయకర్ షఫీఅహ్మద్, గంగా ధరరావు దేశ పాండ్యా, కె సంతానం, కృపలాని మొదలయిన నాయకులు అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో పాల్గొన్నారు తెలంగాణమునుంచి మాడపాటి హనుమంతరావు పంతులుగారు మొదలయిన నాయకులు ప్రేక్షకులుగా వచ్చి నారు భారత కాంగ్రెస్ నాయకులందరు అత్యుత్సాహంతో ఎట్లాంటి త్యాగాల నైనా చేసి దేశ స్వాతంత్ర్య పోరాటం సాగించే దృఢనిశ్చయంతో, ఏకాభి ప్రాయంతో అక్కడ సమావేశమైనట్లు స్పష్టమైంది

రెండో ప్రత్యేక లక్షణ మేమంటే అఖిలభారత కాంగ్రెస్ కమిటీ మహాత్మగాంధీజీ ఏకైక నాయకత్వంలో స్వాతంత్ర్య పోరాటం సాగించడానికి" బెజవాడకు వస్తున్నందున అఖిలభారత మహానాయకులందరూ అందులో పాల్గొంటున్నందుకు ఈ విషయము నానా రోజూరోజూ పత్రికల్లో ప్రకటింపబడు తున్నందువల్ల ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాలలోని ఉజ్జ్వలమైన నూతన చైతన్యం, ఉత్సాహం, దేశాభిమానం ప్రజ్వరిల్లింది అన్ని వైపులనుంచి ఆంధ్ర యువకులు తండోపతండాలుగా భజనలు చేసుకొంటూ కాలి నడకన వస్తూ న్నారు ఆగిన గ్రామాలలో సభలు చేసి స్వాతంత్ర్యోద్యమం గురించి బోధిస్తూ బెజవాడకు చేరినారు రైలులో దిగిన జనానికి మేరయే లేదు ఆంధ్రుల ఆశ యాలకు, ఆదర్శాలకు బెజవాడ కేంద్ర మయింది పురుషులు, స్త్రీలు హిందు వులు, ముసల్మానులు, హరిజనులు అందరూ స్వాతంత్రేచ్ఛతో దేశాభిమానంతో ఉత్సాహంతో 2 లక్షల మంది ప్రేక్షకులు ఆ బెజవాడ సభలకు హాజరయినారు "మహాత్మాగాంధీకి జై' 'కాంగ్రెస్‌కూ జై" అనే నినాదాలు ఆంధ్రదేశ మంతట మారు మ్రోగినాయి ఆ మహాసభలకు వచ్చిన ప్రేక్షకులందరిలో ప్రత్యే కంగా అందరి దృష్టిని ఆకర్షించినవారు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు ఆయన చీరాల, పేరాలనుంచి తీసుకొని వచ్చిన ఎర్రచొక్కాలు ధరించిన 5 వందల మంది (రామదండు) రామభట సంఘం వారంతా టిక్కెట్ కొన కుండానే రైలులో ఎక్కి బెజవాడలో దిగినారు వారిని టిక్కెట్ అడగడానికి రైలు ఉద్యోగస్థులకు ధైర్యం లేదు వారి నందరిని ఊరకనే రైళ్లలో ఎక్క నిచ్చినారు వారి నందరిని రైళ్లనుంచి ఊరకనే దిగనిచ్చినారు సముద్ర తరంగాల

వలె ఉత్సాహంగా వచ్చిన ఈ జనసమూహాన్ని చూసి ఎవ్వరూ, వారందరు ఏమి చేస్తారో ఏమి ఉపద్రవం కలుగుతుందో అని కృష్ణాజిల్లా మేజిస్ట్రేట్, రాజమండ్రి జిల్లా పోలీసు అధికారులు పై వాటి రైల్వేస్టేషన్లలోని విశ్రాంతి గదుల్లో మకాం చేసి తగిన ప్రత్యేక పోలీసు బలగాలతో హెచ్చరికలు వేయిస్తున్నారు ఈ వచ్చిన మహాజనం ఎంతవరకు వేము చేసి ఏర్పాట్లు సరిపోలేదు అది మాకు తెలుసు కాని వారందరు భోజనాలకోసం సౌకర్యాలకోసం రాలేదు భోజనం దొరికినంత దొరికింది, నిద్రించటానికి దొరికినంత దొరికింది దానిని వారు లక్ష్య పెట్టలేదు సాలావరకు భోజన సదుపాయం విశ్రాంతి వసతులు బాగానే ఉన్నాయి బస్తీ ప్రజలందరు వచ్చిన ప్రేక్షకులను అతిధులుగానే ఆదరించినారు

మూడో ప్రత్యేక ఆకర్షణము బెజవాడ అఖిలభారత కాంగ్రెస్ కమిటీ తీర్మానాలు కాంగ్రెసు స్వాతంత్ర్య పోరాట చరిత్రలో చాలా ముఖ్యమైనవిగా పరిగణింపబడుతున్నవి వాటికి బెజవాడ కార్యక్రమమని పేరు అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యులంతా 2 రోజులు శాంతంగా బెజవాడ మ్యూజియం హాల్‌లో సమావేశం జరిపి కొన్ని అత్యంత ముఖ్యమైన తీర్మానాలను చేసినారు

ఆ ముఖ్య తీర్మానాలన్నిటిని సుగ్రీవంగా అఖిలభారత కాంగ్రెస్ కమిటీవారు చేసినారు అదివరకే మూడు రంగుల జండా ఉండేది పింగళి వెంకయ్యగారు జాతీయ జండా నమూనాను గాంధీగారికి తయారుచేసి ఇవ్వగా దానిపైన రాట్నం చక్రం చిత్రించి జాతీయ జండా గాంధీగారు స్థిరపరిచినారు దానిలో ఎరుపు రంగు హిందువులకు ఆకుపచ్చ రంగు ముస్లిములను, తెల్లరంగు క్రైస్తవాది మతాలను తెలుపుతాయి తెల్లరంగుమీద రాట్నం చక్రం ముద్రించబడింది దేశంలో ప్రతిచోట జాతీయ కీర్తనలు వెల్లివిరిసినాయి

బెజవాడ ప్రజలందరు తమ వాకిళ్ళల ఎందుళ్ళు వేసి తోరణాలు కట్టడంవల్ల ముఖ్యంగా కొత్తపేట సికోని బజారులన్నీ ఒకే పందిరిగా ఏర్పడినాయి మార్చి 31 వ తేది ఉదయాన మహాత్మాగాంధీ కస్తూరిబాగాంధీ, వల్లభభాయ్ పటేలుగార్లు తమ బసనుంచి ఒక కారులో బయలుదేరినారు ఆ కారులో ముందు భాగంలో నేను కూర్చుని త్రోవ చూపిస్తూ ఉండినాను వారు వచ్చిన మార్గమంతా పందిరిగా తోరణాలతో జాతీయ పతాకాలతో అలంకరింపబడి శోభాయమానంగా ఉన్నది ప్రజలు మార్గంలో బారులు తీర్చి ఉన్నారు జై జై ధ్వానాలు చేసినారు మహాత్మాగాంధీగారి దర్శనంవల్ల ధన్యులమైనామని ఉప్పొంగినారు "మహాత్మాగాంధీ దర్శనమే పావనము" అనే కీర్తన మమ్మ్ము బ్రోవ మహిని వెలసితివి మహాత్మాగాంధీ" అనే కీర్తన వీధుల్లో ప్రజలు గుంపులుగుంపులుగా చేరి పాడుతూఉండినారు ఆ దృశ్యం శ్రీరామచంద్రుడు పట్టాభిషేకంకోసం అయోధ్యానగరం వీధుల ద్వారా ఊరేగినట్లు తోచింది ఈ జనం ద్వారా గవర్నర్‌పేటలోని మ్యూజియం హాలుకు తీసుకొనిపోయి

నాము ఈ విధంగా బస్తీలోని అన్ని రోడ్డుల మీద జనులు బారులు తీరి నిలబడి నాయకులు వస్తూ పోతూ ఉంచే జయ జయ ధ్వానాలు చేసినారు ఈ జన మంతా వచ్చినది నాయకుల దర్శనం కోసమే మొదటి రోజు సాయంత్రం నాయకులను తీసుకొని గాంధీ మైదానంలోని వేదిక వద్దకు వచ్చినాము కాని జనంలోనుంచి రాకపోకలు అసాధ్యంగా ఉన్నాయి చివరికి ఏదో ఒక వైపున కొంతమంది నాయకులు ఉపన్యసించవలసివచ్చింది ఆ రాత్రి సభ తృప్తికరంగా లేదు నా గుర్రపు బగ్గీ మీద చిత్తరంజన్ దాస్‌గారిని 'యంగ్ ఇండియా' పత్రికాధిపతి జోసఫ్‌గారిని ఆ జనంలోకి తీసుకొని వచ్చినారు ఆ మహాజనంలో ఒక చోటనుంచి ముందుకు పోవడానికి వీలు లేకపోయింది అక్కడ దాసుగారు ఉపన్యసిస్తూ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, చీరాల పేరాలలో చేస్తున్న ధీరోదాత్తమయిన మహాత్కార్యాలను గురించి ఎక్కువగా ప్రశంసించినారు నేను దానిని తెలుగులోకి తర్జుమా చేసినాను "అక్కడ మద్రాసు గవర్నరు అధికారం పోయింది గోపాలకృష్ణయ్య ప్రభుత్వాన్ని వశపరచుకొన్నాడు" అని దేశబంధు దాసుగారు చెప్పినారు మీ ఆంధ్రులకు ఆంధ్రాభిమాన మెక్కువగదా అని దాసుగారు నన్నడిగినారు బెంగాలీలకున్నంత రాష్ట్రాభిమానం మాకు లేదని బదులు చెప్పగా పకపక నవ్వినారు గుంటూరు లాయరు కొంపల్లి కోటిలింగంపంతులుగారు ఇంకా కొంతమంది మిత్రులు మాకు తమ మోటారు కారులను ఎరువిచ్చి సాయపడినారు వాటితో కొంతవరకు పని జరిగింది

ఆ రాత్రి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారితో మాట్లాడి తెల్లవారేసరికి ఆ మైదానంలో దడులు కట్టి, తోవల నేర్పరిచి ప్రజలందరూ కొంతంగా కూర్చునేటట్లు చేసి ఈ బాటలమీద నాయకులందరిని త్రిప్పి, ప్రజలకు నా సందేశాలిచ్చి ఎట్లాంటి తోపిడీ, గల్లంతు లేకుండా అన్ని ఏర్పాట్లు చక్కగా జరపమని నేను గోపాలకృష్ణ య్యగారిని కోరితే, వారు తమ రామదండుచేత ఆరాత్రంతా పనిచేయించి మర్నాడు ఉదయం సభకు, సాయంత్రం సభకు కూడ ఎక్కడ వారక్కడ కూర్చునేటట్లు ఏర్పాట్లు, నాయకుల దర్శనంచేసి వారి సందేశాలు చక్కగా వినేటట్లు ఏర్పాటుచేసినారు రెండోరోజు ఉదయము, సాయంత్రంకూడ బహిరంగసభలు తృప్తికరంగా జరిగినాయి ఉదయాన మహాత్మా గాంధీగారితో సహా నాయకులందరూవచ్చి కారుల వెంట తిరిగి, ప్రజల నుద్బోధించి నారు మహాత్మాగాంధీ అక్కడికి రాగానే ఖద్దరు ధరించి వచ్చిన ఆంధ్రయువతి మాగంటి అన్నపూర్ణాదేవి తన విలువగల పట్టుచీరలను విదేశీ చీరలను అన్నిటిని ఆయన ఎదుట కుప్పబెట్టి తగులబెట్టి తన ఆభరణాలన్నిటిని ఆయనకు తిలక్ స్వరాజ్య నిధికిచ్చింది ఆమె భర్త మాగంటి బాపినీడు అప్పుడు అమెరికాలో యమ్ ఎస్‌సి, చదువుతూ ఉండినాడు మాగంటివారి కుటుంబం ఎల్లప్పుడు జాతీయవాద తత్వంగల కుటుంబమై జస్టిస్ పార్టీని తీవ్రంగా ఎదిరించి ఉన్నది అన్నపూర్ణాదేవి గాంధీగారి సందేశం బోధిస్తూ ఆంధ్ర జిల్లాలలో సంచారం చేసి

పలూరులో ఖద్దరు సంస్థను కొంత కాలం నడిపి క్షయరోగానికి గురియై భర్త అమెరికానుంచి వచ్చిన కొద్ది నెలలకు, తేబ్రాయంలోనే 1926 లో స్వర్గస్తురాలైనది ఏప్రిల్ 1 సాయంత్రం పని ఎక్కువగా ఉన్నందున మహాత్మాగాంధీ, చిత్తరంజన్‌దాస్‌గార్లు బహిరంగసభకు రాలేకపోయినారు ఆ సభకు రమ్మని దాస్‌గారిని కోరగా జాతీయ విద్యా ఉపసంఘానికి అధ్యక్షులుగా ఉండి విద్యావిధానం తయారుచేస్తున్నందువల్ల రానడానికి వీలు లేదని చెప్పినారు ఆయన వద్ద నాకు చాలా చనువు ఉండేది గాంధీగారు తొందర పనిలో ఉన్నందున రమ్మని అడగటానికి నాకు సాహసం లేకపోయింది అందువల్ల కొందరికి అసంతృప్తి కలిగిందని తెలిసినది మా ఊరి వర్తకులు విస్సంశెట్టి వెంకటరత్నం శ్రేష్ఠి, అద్దేపల్లి వెంకటగురునాథరామయ్యశ్రేష్ఠి మొదలయిన కొంతమంది కొంత సొమ్ము కానుకగా తీసుకొని వచ్చినారనీ, మహాత్మాగాంధీగారు రాక పోవటంవల్ల దానిని మళ్ళా తీసుకొనివెళ్ళి బసలోనే వారికి సమర్పించినారనీ తెలిసింది మిగిలిన నాయకులందరు ఆ సాయంత్రం బహిరంగసభలో తమ సందేశాల నిచ్చినారు

ఒక విచారకరమైన విషయమేమంటే, మహాత్మాగాంధీగారు గాంధీ మైదానంలోని మహాసభలో ఆ సాయంత్రం ప్రజలకు సందేశమిస్తారని ప్రకటించినందువల్ల కస్తూర్బా గాంధీగారు, దేవదాసుగాంధీగారు, మహాత్మాగాంధీగారు సాయంత్రం పుచ్చుకొనే రొట్టెపైరాలనుఆమహాసభవద్దకు తీసుకొనివచ్చి వేచియుండినారు మహాత్మాగాంధీగారు రాలేదు సాయంత్రం 8 గంటలైన తరవాత వారు భోజనంచేయరు అందువల్ల ఆ రాత్రి మహాత్మాగాంధీగారు ఉపవాసం చేసినారు మా ఇంటిలో అతిథిగా ఉన్న కొండ వేంకటప్పయ్యగారు కూడ విచారంపొందినారు ఏర్పాట్లలో లోపం జరిగినదని చెప్పినారు నేను కూడ అట్లానే తలచినాను కాని దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు నన్ను కౌగలించుకొని అన్ని ఏర్పాట్లు మీరు బాగా చేసినారు ఇటువంటి చిన్నచిన్న తప్పులు జరుగక మానవని ప్రోత్సాహమిచ్చి వేంకటప్పయ్యగారిని శాంతింపజేసినారు దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు వలంటీర్లలో మల్లాది యజ్ఞనారాయణ మొదలయిన కొంతమందికి భోజనం కావలసివచ్చి ఆయన మా ఇంటిలోపలికి పోయి అక్కడ ఉన్న భోజనం స్వయంగా వలంటీర్లకు వడ్డించినారు రెండోనాడు నాయకులందరు ఎక్కడి వారక్కడ రైళ్లలో వెళ్ళిపోయినారు నేను మహాత్మాగాంధీగారి దగ్గర సెలవు తీసుకోవడానికిపోయి గతరాత్రి జరిగిన అపచారం మన్నించమని వేడుతూ వారి పాదాలకు మొక్కినాను ఆయన నన్ను పైకి లేవనెత్తి, ఇది నాకు సామాన్య విషయమే నేను తరచుగా నా సంచారంలో ఉపవాసాలు చేస్తూన్నాను ఇందువల్ల నాకు అనారోగ్యం కాని, అలసటకాని కలగలేదు అని సెలవివ్వటంవల్ల మనశ్శాంతి కలిగింది " ఇవి అయ్యదేవర కాళేశ్వరరావుగారు విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశ సందర్భంలోని కొన్ని సంఘటనలను గురించి

వ్రాసిన విషయాలు

**అఖిల భారత కాంగ్రెస్ కమిటీ తీర్మానాలు**

1921 మార్చి 31 వ విజయవాడలో జరిగిన అ భా కాం ల లో దిగువ తీర్మానాలు చేయడం జరిగింది

మొదటి తీర్మానము - దేశంలోని అన్ని కాంగ్రెస్ సంస్థ అందరు కాంగ్రెస్ కార్యకర్తలు దిగువ కార్యక్రమంపై అమ వ్యక్తిని కేంద్రీకరించ వలెనని అ భా కాం క వారు అభిప్రాయపడుతున్నారు

(ఎ) రానున్న జూన్ 30 వ తేదీలోగా ఒక కోటి రూపాయలు అ భా తిలక్ స్వరాజ్య నిధికి వసూలు చేయవలె ప్రతి కాంగ్రెస్ రాష్ట్రం తన జనాభా నిష్పత్తిలో ఆ సొమ్ము వసూలు చేయవలసి ఉన్నది

(బి) తిలక్ స్వరాజ్య నిధి వసూలుతోపాటు 30 జూన్ లోగా కోటి మంది దేశంలో కాంగ్రెస్ సభ్యులను కూడా చేర్పించవలె ఆయా రాష్ట్రాల లోని కాంగ్రెస్ సభ్యుల సంఖ్య అక్కడ జనాభా బట్టి ఆ నిష్పత్తిలో ఉండ వలె

(సి) జూన్ 30 వ తేదీలోగా గ్రామాల్లోను, ఇండ్లలోను దక్కగా పని చేయగల 20 లక్షల రాట్నాలను ప్రవేశపెట్టవలె ఆయా రాష్ట్రాలలోని రాట్నాల సంఖ్య అక్కడి జనాభాను బట్టి ఆ నిష్పత్తిలో ఉండవలె

రెండో తీర్మానము - (ఎ) ప్రభుత్వం వారి నిర్బంధ విధానానికి అను గుణంగా వివిధ రాష్ట్రాలలోని ప్రభుత్వోద్యోగులు సహాయ నిరాకరణవాదుల పైన జారీ చేస్తూండిన ఉత్తరువు [illegible] దేశంలోని ప్రస్తుత [illegible] లని ఈ సభవారు అభిప్రాయపడుతున్నారు [illegible] న్యాయ విరుద్ధమని కూడ ఉన్నత న్యాయశాస్త్రజ్ఞుల అభిప్రాయము

(బి) ఖిలాఫత్ పంజాబ్ సమస్యల పరిష్కారంకోసం [illegible] నిమిత్తం భారత దేశం చేస్తూండిన కృషిని [illegible] వారెన్ని రెచ్చగొట్టినా కూడ కాంగ్రెస్ ఆదేశానుసారం ప్రజలు అహింసా సిద్ధాంతం అవలంబించి ఆశ్చర్యకరంగా ప్రవర్తించినారని ఈ కమిటీ వారు విశ్వసిస్తు న్నారు

(సి) అసహాయోద్యమానికి సంబంధించిన తీర్మానమంతటి శాసనోల్లం ఘనము ఇమిడి ఉండినప్పటికీ, తక్షణం శాసనోల్లంఘనం ప్రారంభించడానికి తగి నంత క్రమశిక్షణగాని, స్థైర్యంగాని, పరిపక్వతగాని దేశంలో లేదని ఈ కమిటీ వారు అభిప్రాయపడుతున్నారు

(డి) నిషేధపు టుత్తరువులు జారీ చేయబడినా [illegible] వాటిని ఉల్లంఘించ కూడదు నిషేధపు టుత్తరువులవల్ల పనిచేయడానికి వీలులేని వారి స్థానంలో కొత్తవారు పని ప్రారంభించవలె ప్రభుత్వం వారి ఉత్తరువుల వల్ల ప్రజలు

ధైర్యం కోల్పోవడంగానీ, భయపడడంగానీ కూడదు కాంగ్రెస్ తీర్మానాన్ననుసరించి కాంగ్రెస్ సంస్థలు బలపరుస్తూ నిర్మాణ యుతంగా పని చేయవలె ఇది దేశం సంసిద్ధం కావడానికి ఉపాయమని ఈ కమిటీ వారు సలహా ఇస్తున్నారు

*మూడో తీర్మానము* - పంచాయతీల నిర్మాణం చురుకుగా జరుగుతున్నందుకు ఈ కి పి టీ వారు అభినందిస్తూ, ప్రభుత్వన్యాయస్థానాలు బహిష్కరించేటందుకు ప్రజలింకా హెచ్చు శ్రద్ధ తీసుకోగలరని విశ్వసిస్తున్నారు

*నాలుగో తీర్మానము* - అహింసా యుత సహాయ నిరాకరణోద్యమంలో అంతర్లీనంగా ఉన్న ఆత్మ పరిశుద్ధిని సిద్ధాంతాని కనుగుణంగాను, తాగుడు దురాచారానికి ప్రతికూలంగాను జరుగుతూ ఉండిన ప్రచారానికి ఈ సభవారు ప్రజలను అభినందిస్తున్నారు అంతేకాక స్వార్థత్యాగులైన కార్యకర్తల నిరంతర పరిశ్రమల మూలాన తాగుడు మొదలైన మత్తు పదార్థాలను సేవించే దురభ్యాసం నిర్మూలమవుతుందని ఈ సభవారు విశ్వసిస్తున్నారు

మొదటి తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ప్రస్తుత పరిస్థితులను గురించి గాంధీజీ స్పష్టంగా వివరించినారు బిరుదులను నిరాకరించటం, కోర్టులను, శాసనసభలను, విద్యాసంస్థలను బహిష్కరించడంలో తగినంత ప్రచారం జరిగిందనీ అందుకు తగిన ఫలితాలు సంతృప్తికరంగా చేకూరినవనీ ఇంక వాటిపై మన దృష్టిని కేంద్రీకరించవలసిన అవసరం లేదనీ అన్నారు 'కళాలశాలలను విడిచిన విద్యార్థులు కాని, న్యాయస్థానాలను బహిష్కరించిన లాయర్లు కానీ ఎందరున్నప్పటికీ మన ప్రచారం వల్ల ఆ ప్రభుత్వసంస్థల ప్రతిష్ఠ పడిపోయిందని చెప్పక తప్పదు కొంత మంది అనేక కారణాలవల్ల కాంగ్రెస్ తీర్మానాలఅనుసారంగా పాఠశాలలను, కోర్టులను బహిష్కరించలేక పోయినప్పటికీ కాంగ్రెస్ సిద్ధాంతం లోని యథార్థం వారు గ్రహించిన మాట మాత్రం నాస్తిమము కాబట్టి ఉద్యమం నకాలంలో పరిణత స్థితిని పొందగలదని కాంగ్రెస్ పూర్తిగా విశ్వసించవచ్చు కనక నాగపూర్ తీర్మానంలో పేర్కొన్న ప్రకారం వాయిదాలోగా స్వరాజ్య కార్యక్రమం నిర్వర్తించడానికి ప్రజాసామాన్యంలో ఆయా భాగాలను గురించి ప్రత్యక్షంగా ప్రచారం చేయవలసి ఉన్నది ప్రజలప్పుడే స్వరాజ్యోద్యమంలో పాల్గొగలరు

ప్రజాసామాన్యంలో అత్యద్భుత చైతన్యం కనిపిస్తున్నది ప్రజలు స్వరాజ్యం సాధ్యమైనంత తొందరలో పొందగోరుతున్నారు కాని నాయకులే వెనకబడి ఉన్నారు కాబట్టి ప్రజల ఆశయాలకు రూపు రేఖలు దిద్దవలసిన అవసరం ఎంతైనా ఉన్నది స్వరాజ్యం లేనిదే వారి స్థితి అభివృద్ధికాదనే విషయం వారికి స్పష్టంగా తెలిసింది వారి స్థితి అభివృద్ధి కావడానికి వారికి కావలసిన ఉన్నవస్త్రాలను వారు తయారు చేసుకోగలిగిన శక్తి వారికి గలిగించవలె అందువల్లనే స్వరాజ్య సంపాదనంలో చర్కా కార్యక్రమం అత్యంత శక్తిమంతమైనదని నా అభిప్రాయ"మన్నారు గాంధీజీ ఈ విషయం ప్రజలు తెలుసుకో

నేటట్లు చేస్తే వారు తమ ఇండ్లలో రాట్నం పెట్టుకొని సాధ్యమైనంత ఎక్కువ నూలు ఉత్పత్తి చేసి తమకు కావలసిన అన్న వస్త్రాలు వారు సంపాదించుకోగలరు అప్పుడు వారు తమ జీవనానికి, అభివృద్ధికి విదేశీయుల మీద ఆధారపడవలసిన అవసరం లేదని గ్రహించగలరు ఇందువల్ల ఈ దేశంలోకి దిగుమతి అవుతున్న పరదేశ వస్త్రాల బహిష్కరణ జయప్రదంగా జరగగలదు అది జరిగినట్లయితే మనకు స్వరాజ్యం లభించినట్లే భావించవచ్చు అందువల్లనే "నేను చర్ఖాను ప్రోత్సహిస్తూన్నాను" అన్నారు

"మన ప్రచారం జయప్రదమవడానికి కార్యకర్తలు అవసరము కాంగ్రెస్ సంస్థలు పూర్తిగా చైతన్యవంతాలు కావలె ఈ తీర్మానం ప్రకారం 30 జూన్ లోగా కోటి రూపాయలు వసూలు చేయగలిగినట్లైతే, కోటి మంది స్త్రీ పురుషులను కాంగ్రెస్ సభ్యులుగా చేర్పించగలిగినట్లైతే ప్రజలు స్వరాజ్య సంపాదనకు సంసిద్ధులుగా ఉన్నారని చెప్పడానికి సందేహించనవసరంలేదు ఈ తీర్మానోద్దేశాలను వారు నిర్వర్తించగలరని నా ఉద్దేశం" అని గాంధీజీ ఉపన్యసించినారు

రెండో తీర్మానంలోని శాసనోల్లంఘనానికి సంబంధించిన విషయంలో తీవ్రమైన చర్చలు జరిగినాయి ప్రభుత్వం వారి నిర్బంధ విధానంవల్ల శాసనోల్లంఘనంలోని ఔచిత్యం గురించి, అవసరం గురించి తీవ్రంగా చర్చించినారు నాగపూర్ తీర్మానంలో శాసనోల్లంఘనం గురించి స్పష్టంగా సిఫారసు చేయడం జరగలేదని అధ్యక్షుడిచ్చిన రూలింగ్ ననుసరించి గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

"నాగపూర్ కాంగ్రెస్ తీర్మానంలో శాసనోల్లంఘనం సిఫారసు చేయలేదనీ, అందువల్ల దానిని సహాయ నిరాకరణోద్యమ పరిధిలో చేర్చరాదనీ అధ్యక్షుడిచ్చిన ఆదేశానుసారం ఈ అఖిలభారత కాంగ్రెస్ సంఘం సలహా రూపంలో ఈ తీర్మానం చేస్తూన్నది ప్రజలు ఈ సలహాను మార్గదర్శకంగా గుర్తించగలరు సహాయ నిరాకరణవాదులకు ప్రతికూలంగా అనేకచోట్ల ప్రభుత్వంవారు తీసుకొంటూన్న చర్యలను బట్టి శాసనోల్లంఘన సమస్య తలయెత్తింది అనేక రాష్ట్రాలలో అధికారులు పూర్తిగా అన్యాయ చర్యలకు దిగినారు ప్రభుత్వంవారి చర్యలు ఎంత రెచ్చగొట్టినప్పటికీ ప్రజ లత్యంత నిగ్రహంతో అద్భుతంగా అహింసాయుతులై ప్రవర్తించినారు అయినప్పటికీ శాసనోల్లంఘనం కావలెనని చెప్పేవారు ఉద్దేశించిన రూపంలో శాసనోల్లంఘనం ఈ కమిటీ సిఫార్సు చేయరాదు కాంగ్రెస్ తీర్మానంలో ఉద్దేశించిన శాసనోల్లంఘనంలో పన్నుల నిరాకరణం ఒక భాగమైనప్పటికీ గవర్నమెంట్ వారి ఉత్తరువులకు ప్రతికూలంగాగానీ, కొన్ని ప్రత్యేక చట్టాలకు ప్రతికూలంగాగానీ పన్నుల నిరాకరణం శాసన ధిక్కారంలో ఒక భాగంగా ఉద్దేశింపబడలేదు దక్షిణాఫ్రికాలో నేను ఆచరణలో పెట్టినప్పటినుంచి నా మనస్సులో పరిణతి పొందుతూ వచ్చిన శాసనోల్లంఘనం ఇక్కడ అమలుపరచడానికి ఇంకా తరుణం

రాలేదు దేశీయులకు తగినంత ధైర్య స్థైర్యాలు నిగ్రహం కలిగినప్పుడుకాని దాని నాచరణలో పెట్టడానికి వీలులేదు ప్రజల్లో అహింసాతత్త్వం చాలా వరకు వ్యాపించిన మాట వాస్తవమే గాని తమ అత్యంత ప్రియతమమైన కోరికలు తృణీకరింపబడినప్పుడు కాని, తమ ప్రియతమ నాయకులు ఖైదులో బంధింపబడినప్పుడు కాని తదితర ఉద్రిక్త పరిస్థితులలోగాని వారు క్రమశిక్షణకు బద్ధులై పూర్తిగా నిగ్రహం కలిగిఉంటారనే నమ్మకం నా కింకా కలగటం లేదు కాబట్టి ప్రజలు పూర్తిగా ఆత్మనిగ్రహం అలవర్చుకొనేవరకూ శాసనోల్లంఘనం ప్రారంభించకూడదు ప్రజలు ఆత్మ నిగ్రహం అలవర్చుకొనే ప్రయత్నంలో ఉన్నందుకు నేను సంతోషిస్తున్నాను అయితే ఏవయినా కొన్ని ప్రత్యేక ఉత్తరువులకు గాని చట్టాలకు గాని విధేయత చూపటం తన అంతరాత్మకు విరోధమని ఎవరయినా భావించి ఉన్నట్లయితే వారా ఉత్తరువులను కాంగ్రెస్ పేరుమీద కాక సొంత బాధ్యతమీద ఉల్లంఘించవచ్చు" ఇది అఖిల భారత కాంగ్రెస్ సంఘంలోని రెండో తీర్మానంపై గాంధీజీ చేసిన ప్రసంగము ఈ అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభకు హాజరయిన తెలుగువారిలో వేమవరపు రామదాసుపంతులుగారు, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కూడా ఉన్నారు

## ప్రజల ఉత్సాహము

అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశంలో పాల్గొనటానికి మహాత్మా గాంధీ తదితర అఖిలభారత నాయకులు బెజవాడకు వస్తున్నారని తెలిసినందున ఆంధ్ర దేశంలోని పలు ప్రాంతాలనుంచి - ముఖ్యంగా బెజవాడకు చుట్టుపట్ల 25 మైళ్ళ దూరంలో ఉన్న పట్టణాలు, గ్రామాలనుంచి స్త్రీ పురుషులు జాతీయ గీతాలను పాడుకొంటూ బెజవాడ పట్టణానికి ఇసకవేస్తే రాలనంతగా గుంపులు గుంపులుగా వచ్చినారు అ భా కాం సమావేశానికి ఇంతమంది జనం రావడం ఇదే మొదటిసారి ఆ దృశ్యం ప్రత్యేక కాంగ్రెస్ జరుగుతున్నదా అన్నట్లున్నది ఆనాటి జనాభా లెక్కలను బట్టి బెజవాడ జనసంఖ్య 45 వేలు పైనుంచి వచ్చిన వారి సంఖ్య దాదాపు 2 లక్షల వరకు ఉంటుంది గృహాలన్నీ పుష్పదండలతోనూ, వీధులన్నీ ఆహ్వాన తోరణాలతోనూ అలంకరింపబడినాయి 'గాంధీకి జై' 'హిందు ముసల్మాన్‌కి జై' 'గుప్తాకి జై' అనే నినాదాలు ప్రతిచోటా మిన్నుముట్టినాయి (ఈ గుప్త అనేవారు మురం బాలసుబ్రహ్మణ్యం గుప్తగారు ఈయన రాజకీయోపన్యాసాలు చేసినందుకు అంతకు పూర్వం శిక్షింపబడి ఖైదులో ఉన్నారు)

మార్చి 31 వ తేదీ సాయంకాలం మైదానంలో మహాత్మాగాంధీ మొదలయిన నాయకులు ఉపన్యసిస్తారని తెలిసి మధ్యాహ్నం 2 గంటల నుంచి జనం అక్కడ చేరడం ప్రారంభించినారు ఆ సాయంకాలం 6 గంటలకు మునిసిపల్

కౌన్సిల్ వారు తెలుగు జిల్లాలవారు ఆ చోటనే సన్మాన పత్రము సమర్పింపదలచుకొన్నారు

సాయంకాలం అయిదున్నరకు మహాత్మాగాంధీ, లజపత్ రాయ్, మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాసుగార్లు చాలా కష్టంతో గుంపుల్లో నుంచి వేదికపైకి రాగలిగినారు వేదిక చుట్టూ జనం మూగి ప్రతిఒక్కరూ గాంధీజీని దర్శించి ఆయన ఉపన్యాసం వినాలనే కుతూహలంతో ఉన్నారు గుంపుల నాపటం సాధ్యం కాకపోయింది ప్రజలను ప్రశాంతంగా ఉంచేటందుకు వేల కొద్దీ స్వచ్ఛంద సేవకులు శ్రమచేసినారు వేదిక ముందున్న సుమారు 1 చదరపు ఫర్లాంగ్ వరకు జనం క్రిక్కిరిసి ఉన్నారు దానిని బట్టి జన సమూహం ఎంత ఉన్నదో అంచనా వేసుకోవచ్చు ఆనాడు గాంధీజీ ఉపన్యసించటానికి సాధ్యం గాకపోయింది మరునాడు నాలుగైదు ప్రత్యేక వేదికలపైన మహాత్మాగాంధీ, చిత్తరంజన్‌దాస్, అలీ సోదరులు ఉపన్యసించినారు వీరి ఉపన్యాసాలను దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, చెరుకువాడ వెంకటనరసింహం, డాక్టర్ ధన్వాడ రామచంద్రరావు, కాశీనాథుని నాగేశ్వరరావు, టంగుటూరి ప్రకాశం పంతులుగారు, శేషాచార్యులు, కాళేశ్వరరావుగార్లు అనువదించినారు

### బెజవాడ మునిసిపల్ సన్మానపత్రము

ఏప్రిల్ 1 ఉదయం 11 గంటలకు మ్యూజియం హాల్‌లో అఖిల భారత కాంగ్రెస్ సంఘం సమావేశమైనప్పుడు విజయవాడ మునిసిపల్ కౌన్సిల్ వారు మహాత్మాగాంధీకి సన్మానపత్రం సమర్పించేటందుకు కొంచెం వ్యవధి ఇవ్వబడింది మునిసిపల్ కౌన్సిల్ ప్రధాన చైర్మన్ దివాన్ హనుమంతరావుగారు మహాత్మాగాంధీకి లాంఛనప్రాయంగా పరిచయం చేయబడిన తరువాత వారు సన్మానపత్రం చదివి గాంధీజీకి సమర్పించినారు గాంధీజీ ప్రత్యుత్తరమిస్తూ స్వరాజ్య సంపాదనకోసం మునిసిపల్ కౌన్సిళ్లు కాంగ్రెస్ విధానం చేపట్టవలెనని అన్నారు స్వరాజ్య కార్యకలాపాలలో మున్సిపల్ కౌన్సిళ్ళు పాల్గొని నిర్వర్తించవలసిన పనిని గురించి వివరించినారు అందుకు ఉదాహరణంగా నడియాడ్, అహమదాబాద్, సూరత్ మునిసిపాలిటీలను పేర్కొన్నారు కాంగ్రెస్ కమిటీల నిర్మాణంలోను తిలక్ స్వరాజ్య నిధి వసూళ్ళలోను మునిసిపాలిటీలు తోడ్పడవలెనని కోరినారు కార్మిక సంఘంవారు మరొక సన్మానపత్రం సమర్పించగా గాంధీజీ వారికికూడ ఇదే సమాధానమిచ్చినారు

### అ భా కాం సం - కాంగ్రెస్ సభలను గురించిన చర్చ

నూతన కాంగ్రెస్ నియమావళి ప్రకారం అసహాయోద్యమ తీర్మానంలో ప్రత్యేకము తమకు సంబంధించిన భాగం ఆచరణలో పెట్టనివారెవరూ కాంగ్రెస్ కమిటీలలో సభ్యులుగా ఉండకూడదనే తీర్మానం ప్రతిపాదిస్తూ గాంధీజీ ఇట్లా అన్నారు

ఈ తీర్మానం అమలులో పెట్టడం కొందరి మనసులో కష్టంగా ఉండవచ్చు కాని కొత్త నియమ వళిని అమలుపరచదలచుకొన్నప్పుడు మనం అటువంటి అభ్యంతరాలను ఎదుర్కొనక తప్పదు ప్రస్తుత అత్యధిక సంఖ్యాకులయిన కాంగ్రెస్ వాదులు సహాయ నిరాకరణోద్యమానికి అనుకూలంగా ఉన్నప్పుడు దానిని తమ వ్యక్తిగత విషయాల్లోను, ప్రవర్తనలోను ఆచరణలో పెట్టలేనివారిని కాంగ్రెస్ సంస్థలకు నాయకత్వం వహించవలసిందని కోరకూడదు" అన్నారు

వేమవరపు రామదాసుపంతులుగారు ఈ తీర్మానం కాంగ్రెస్ నియమావళికి విరుద్ధమని, అఖిలభారత కాంగ్రెస్ సంఘానికి ఈ తీర్మానం చేసేటందుకు అధికారం లేదని సహేతుకంగా వాదించినారు తరువాత పండిత మోతీలాల్ నెహ్రూగారు ఈ తీర్మానం కేవలం సిఫార్సు మాత్రమేననీ కాంగ్రెస్ కమిటీలలో ఎన్నుకోబడినవారి ఎన్నికకు ఇందువల్ల రద్దు కాదనీ అన్నారు ఆ తరవాత కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు మహాత్మాగాంధీతో నూ తదితరులతోనూ సంప్రదించి ఆ తీర్మానం గురించిన చర్చను అప్పటికి నిలిపివేసినారు

## విజయవాడలో మరికొన్ని సభలు

ఏప్రిల్ 1 తేదీ ఉదయం మైదానంలో బహిరంగ సభ జరిగింది అప్పుడు విశ్వబ్రాహ్మణ సంఘం పక్షాన శ్రీ గు నాల రామమూర్తిగారు మహాత్మా గాంధీకి సన్మానపత్రం సమర్పిస్తూ తమ పనితనం, శిల్పకళా కౌశలం పునరుద్ధరింపచేసి తమ అభివృద్ధికి తోడ్పడవలసిందని అఖిల భారత కాంగ్రెస్ సంఘాన్ని అర్థించినారు ఆ సన్మాన పత్రానికి గాంధీజీ హిందూస్థానీలో ప్రత్యుత్తరమీయగా తెలుగులోకి అనువదింపబడింది ఆయన భారతదేశంలో ధర్మ రాజ్యాన్ని (స్వరాజ్యాన్ని) ప్రతిష్ఠించేటందుకు తిలక్ స్వరాజ్యనిధికి తగినంత ధన సహాయం చేయవలసిందని కోరినారు

స్వరాజ్యం వచ్చేవరకు విశ్రాంతి కూడదని జితేంద్రనాథ్ అన్నారు ప్రజలు, లాలా లజపతిరాయ్, మోతీలాల్ నెహ్రూ, సరళాదేవి చౌధరాణి, అలీ సోదరులు ప్రసంగించగా వినవలెనని పట్టుబట్టినారు వారందరూ మాట్లాడుతూ తిలక్ స్వరాజ్యనిధికి తగినంత సొమ్ము ఈయవలసిందనీ, అందరూ నూలు వడకవలసిందనీ ప్రబోధించినారు సరళాదేవి చౌధరాణి స్త్రీల నుద్దేశించి ప్రసంగిస్తూ, స్త్రీలు తమ భర్తలకు, సోదరులకు ఆహారం ఎట్లా తయారుచేస్తున్నారో అట్లాగే వారికి ఖద్దరు వస్త్రాలను కూడా తయారుచేసి, ఈయవలెనని ఉద్బోధించినారు ఈ ఉదయం సభలో ప్రజలు తమతమ నిర్ణీత స్థలాలలో నిశ్శబ్దంగా కూర్చున్నారు గాంధీ, లజపత్‌రాయ్, నెహ్రూ, అలీ సోదరులను, ఆంధ్ర నాయకులు ప్రజలు కూర్చున్న ఆయా ఆవరణలలోకి తీసుకొనిపోయి వారిని ప్రజలకు పరిచయం చేసినారు అయితే కడచిన సాయంకాలం ఉండిన ప్రజలలో సగం మంది మాత్రమే ఉన్నారు ఈ సభలో

ఏప్రిల్ 1 సాయంకాలం 4 గంటలకు మైలవరం నాటకశాలలో స్త్రీల సభ జరిగింది గాంధీజీ అక్కడ ఉపన్యసించినారు ఆ తరవాత ఆంధ్ర నాయకులు మైదానంలో ఉపన్యసిస్తూ స్వరాజ్యనిధికి ధన మీయవలెనని ప్రార్థించగా అనేక మంది విరాళాలిచ్చి కృతార్థులయినట్లు భావించినారు గంపలగూడెం కుమార రాజా (శ్రీ) కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరుగారు తమ చేతి ఉంగరాలను గడియారాన్ని స్వరాజ్య నిధికి సమర్పించినారు బెజవాడలో జరిగిన బహిరంగసభ అన్నిటిలో ఒక ముఖ్య విశేష మేమంటే పోలీసువారి స్వరూపం ఎక్కడా కనబడలేదు లక్షలాది ప్రజలు గల సభలు ప్రశాంతంగా జరిగినవి ఆనాటి కృష్ణాజిల్లా కలెక్టరు కార్యదక్షత ఇందుకు కారణం

**మహాత్మాగాంధీ - రాజమహేంద్రవరంలో**

మహాత్మాగాంధీ దంపతులు కాకినాడనుంచి రాజమహేంద్రవరం వచ్చినారు పాల్ స్క్వేరులో బహిరంగసభ జరిగింది పదివేల మందికి పై చిలుకు జనం మూగినారు బహిరంగ సభ కోసం ప్రత్యేకం ఒక పందిరి వేసినారు రెండువేల మందికి పైగా స్త్రీలే ఉన్నారు పక్క తాలూకాలనుంచి, గ్రామాలనుంచి కూడా జనం వచ్చినారు కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులు సభ ప్రశాంతంగా జరిగేటందుకు మంచి ఏర్పాట్లు చేసినారు పోలీసులు జోక్యం కలిగించుకోలేదు మహాత్ముని ఉత్తేజకరమూ ఉత్సాహజనకమూ అయిన ఉపన్యాసంలోని ప్రతి వాక్యం టంగుటూరి ప్రకాశంగారు తెలుగులోకి అనువదించి చెప్పినారు మహాత్ముని ఉపన్యాసం ప్రజానీకంలో అత్యద్భుతమయిన చైతన్యం కలిగించింది మహాత్ముడు స్త్రీలు ఉన్నచోటికి పోయి స్వరాజ్యనిధికి సొమ్ము కావలెనని అడిగినప్పుడు ఆయన వడిలో బంగారు నగల వర్షం కురిసింది ఒక్క అరగంటలో సుమారు రు 8 000 నగదు, చాలా నగలు లభించినాయి మహాత్ముడు చాల సంతోషంతో పూనా స్త్రీల తరవాత రాజమహేంద్రవరపు స్త్రీలే ఔదార్యంలో అగ్రగణ్యులని ప్రశంసించినారు బారిస్టర్ కందుల వీరరాఘవస్వామి తన వృత్తిని వదులుకొంటున్నానని మహాత్మాజీ సముఖంలో ప్రకటన చేసినారు మహాత్ముని రాక సందర్భంలో రాజమహేంద్రవర పట్టణం యావత్తూ తోరణాలతోను, పుష్పమాలలతోను అలంకరింపబడింది బహిరంగ సభకోసం నిర్మించిన పందిరి జాతీయ నాయకుల ఛాయా పటాలతో ప్రకాశించింది

**మహాత్మాగాంధీ - మచిలీపట్టణంలో**

ఏప్రిల్ 4న (సోమవారము) మహాత్మాగాంధీ మోటారుకారులో మచిలీపట్టణం దయచేసినారు నాడు గాంధీజీ మౌనవ్రత మవలంబించి ఉండడంచేత ఆయనకిచ్చిన పౌర స్వాగతం సైతం మౌనంగానే జరిగింది పట్టణం శోభాయమానంగా అలంకరింపబడింది ఏప్రిల్ 5 న మహాత్ముని ఊరేగింపుకూడా ప్రశాంతంగా నిశ్శబ్దంగా మౌనంగానే జరిగింది ఆ దృశ్యం చూసినవారికి

(శ్రీ)రామచంద్రుడు లంకా విజయానంతరం అయోధ్యానగరం ప్రవేశించిన నాటి చరిత్ర స్ఫురణకు వచ్చింది మహాత్ముడు ఆంధ్ర జాతీయ కళాశాలలో విడిది చేసినారు ఆయన రెండు గంటలసేపు కళాశాలను పరిశీలిస్తూ కళాశాల ఆత్మను (అంతర్యాన్ని) స్వాయత్తం చేసుకొనేటందుకు ప్రయత్నిస్తున్నా నన్నారు ఆయన మచిలీపట్టణం చేరిన రోజున మార్గాయాసంవల్లనూ విశ్రాంతి లేనందువల్లనూ కొంచెం జ్వరంతో ఉన్నారు మరునాడు కొంతవరకు కోలు కొన్నారు

ఏప్రిల్ 5 న బజారులో ఆయనకు మూడు సన్మాన పత్రాలు సమ ర్పించడం జరిగింది వైశ్యులు, ఖిలాఫత్ సభ్యులు, వర్తకులు వేరువేరుగా సన్మానపత్రాలు సమర్పించినారు నూరు సంవత్సరాల కిందట దేశాన్ని విదే శీయుల చేతులలోకి పోనిచ్చినది వైశ్యులేనన్న విషాదకరమయిన విషయం మహాత్ముడు వారికి జ్ఞాపకం చేసినారు వైశ్యుడు తన ధర్మం సరిగా నిర్వ హించకపోవడమే దానికి కారణమన్నారు కల్లు, సారా, సీమమందు, గంజాయి లాటి మత్తు పదార్థాలనుంచిగాని, తన దేశీయుల రక్తంనుంచిగాని, ప్రాణం పోయినప్పటికీ ఒక్క రూపాయియైనా వైశ్యుడు సంపాదించకూడదని, తన చేతిలోనుంచి పోయే ప్రతి రూపాయీ విదేశీ అంగళ్లను ఐశ్వర్యవంతాలుగా చేసేటందు కుపయోగపడరాదని ప్రతి వైశ్యుడు పట్టుదలగలిగి ఉండవలె అన్నారు విదేశాలు అన్నమాట, జపాన్, అమెరికా, ఫ్రాన్స్ ఇంగ్లండ్‌వంటి అన్ని దేశాలకూ వర్తిస్తుంది అన్నారు ఏప్రిల్ 5 ఉదయాన బందరు మున్సి పల్ కౌన్సిల్ ప్రత్యేక సమావేశానికి మొత్తం 28 సభ్యులలో 21 మంది హాజరై గాంధీజీకి ఉత్తేజకరమయిన సన్మానపత్రం సమర్పించడానికి తీర్మానించి నారు

## పురపాలకసంఘ స్వాగతపత్రం

మచిలీపట్టణం ఆంధ్ర జాతీయ కళాశాలా ఆవరణలో ఏప్రిల్ 5 సాయం కాలం పురపాలక సంఘంవారు మహాత్మాగాంధీగారికి దిగువ స్వాగతపత్రం సమర్పించినారు

"మహాత్మా! మీరు మా పురాతన పట్టణానికి విచ్చేసి మా పురజనులు చిరకాలంనుంచి అత్యాతురతతో అభిలషిస్తున్న మీ దర్శనభాగ్యం కలగజేసి నందుకు వందన సహస్రాల నర్పిస్తున్నాము "

"మీ అసమాన నాయకత్వం హిందూ, మహమ్మదీయ సమ్మేళనం సుసాధ్యం చేసి భావిభారత జాతీయ నిర్మాణానికి గట్టి పునాది వేస్తున్నదనటం నిస్సంశయము మీ నిష్కళంక జీవితము, మీ నిరంతర కార్యదీక్ష, మీ అపూర్వ త్యాగశీలము, మీ భూతదయ భారతభూమి నంతను పవిత్రంగాను చైతన్య వంతంగాను చేసి తరతరాల వారి కాదర్శప్రాయమవుతున్నది "

"మీ పావననామం ఆబాల గోపాలానికి సంస్మరణీయమై జాతీయ ఫల

సిద్ధికి కారక మంత్రమై తనరారుచున్నది '

'భారత జాతీయోద్యమం అచిరకాలంలో ఫలప్రదమగుగాక అని భగవంతుని ప్రార్థిస్తూ ఈ సన్మానపత్రం మీకు సమర్పిస్తున్నాము ' ఈ సన్మానపత్రం మచిలీపట్టణం మునిసిపల్ వైస్ చైర్మన్ శ్రీ ...... గారు చదివినారు

## బందరులో గాంధీజీ ఉపన్యాసం

ఏప్రిల్ 5 వ తేదీ సాయంకాలం ఆంధ్ర జాతీయ కళాశాల ఆవరణలో గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు ।

"హిందూ మహమ్మదీయ సోదరీ సోదరులారా,

దేహదార్ఢ్యం లేమి నిలుచుండి ఉపన్యసించలేనందుకు నన్ను మీరు మన్నింతురుగాక ! ఈ సందర్భంలో మీరు చేసే గౌరవాల నందుకొనేటందుకు నాతోపాటు మౌలానా షౌకత్ ఆలీ యిక్కడ లేడని ఎంతో విచారపడుతున్నాను పురపాలక సంఘంవారు నా కిచ్చిన అభినందన పత్రం, దానిలో వారు వెల్లడించిన కోమల భావాలకు వారికి నేనెంతో కృతజ్ఞుడను

వీలయినంత త్వరలో బందరు వచ్చి ఆంధ్ర జాతీయ కళాశాలను దర్శించగలనని నా స్నేహితులకు నేను చేసిన వాగ్దానం నేడు చెల్లించగలిగినందుకు నాకు ఎంతో సంతోషంగానూ ఆనందంగా ఉన్నది కారణాంతరాల వల్ల నేనిదివరకు రెండు పర్యాయాలు విజయవాడకు వచ్చికూడా యిక్కడకు రాలేకపోయినాను కాని ఆ భాగ్యము నా కింత ఆలస్యంగా లభించినందుకు నాకు మరింత సంతోషంగా ఉన్నది ఎందువల్లనంటే నా వాగ్దానం నాటికి అసహాయోద్యమం అవతరించలేదు ఈ జాతీయ కళాశాలా మహాసంస్థలోని పవిత్రస్థలంలో ప్రశాంతంగా రెండురోజులు గడిపినాను అవి రెండూ నాకు పర్వదినాలవంటివి వాటిని నేను మరువజాలను నాకు ఇదివరకు ఈ కళాశాలనుగురించి ఎటువంటి భావాలు ఉన్నావో అవి అన్నీ నాకీ రెండు రోజులలో ప్రత్యక్షంగా నా అనుభూతికి వచ్చినవని తమకు విన్నవించుకొంటున్నాను ఈ కళాశాలా పుణ్యక్షేత్రం నందెక్కడ చూచినా క్రమపద్ధతి, నిర్మాణ కౌశలము, త్యాగనిరతి, సౌశీల్యాలు మూర్తీభవించినట్లు కనబడుతూన్నవి భారతీయుడనైన నేను దీనిని చూసి ఎంతో గర్వపడుతున్నాను ఆంధ్రరాష్ట్ర వాసులైన నా ఆంధ్రమిత్రులు కూడా ఇట్లాగే గర్వపడతారని నా అభిప్రాయము త్యాగమూర్తులయినవారిచే నిర్వహింపబడుతున్న ఈ విద్యాలయం తమ పట్టణంలో ప్రతిష్ఠితం కావడం బందరు పురవాసుల పురాకృత పుణ్యఫలమని భావిస్తున్నాను నే నే సంస్థనూ తొందరపడి అభినందించేవాడనుకాదు కాని ఈ రెండు నాళ్లలో నా మనస్సులో కలిగిన భావాలను మీకు తెలుపకుంటే నేను మీ పట్ల నా పట్ల కూడా అసత్యంగా ప్రవర్తించినవాణ్ణి అవుతాను ఈ సంస్థలో ఎక్కడైనా లోపాలుంటే మీరు వాటిని సవరించి బాగుచేయండి గుణాలుంటే వాటిని

మరింత గుణవంతంగా చేయండి ఇది ఒక ఉత్తమ ఆశయంగా భావించి విద్యాలయాన్ని అభివృద్ధిచేసి మీ ఆశయాలను దీనిద్వారా నెరవేర్చుకోవలెనని కోరుతున్నాను ఈ నగరంలో రెండు పెద్ద విద్యాలయాలు ఇప్పటికీ వాటిలో ఒక దీనికి తోడ్పడలేకపోవడం నాకు ఆశ్చర్యకరంగాను, విచారకరంగానూ ఉన్నది మన ప్రస్తుత ప్రభుత్వం వారి ఉద్దేశాల ప్రకారం పరిపాలింపబడుతూండిన విద్యాలయాలతో విసిగివేసారి అసంతృప్తి చెందిన భారతదేశంలోని ఇతర విద్యార్థులవలెనే బందరు విద్యార్థులు కూడా అసంతృప్తులై ఉంటారనీ వారంతా అసహాయోద్యమావలంబకులై ఈ కళాశాలలో చేరి ఉంటారనీ భావించినాను ఇతర రాష్ట్రాలలోని విద్యార్థులు తమకు జాతీయ విద్యాలయం లేనందువల్ల తామెక్కడ విద్యాభ్యాసం చేయవలెనో చెప్పమని నన్ను అడుగుతున్నారు పదిహేను సంవత్సరాలనుంచి తమ కళ్ల ఎదుట ఈ విద్యాలయాన్ని చూస్తుండిన బందరు విద్యార్థి అటువంటి సాకు చెప్పడానికి వీలులేదు బందరు విద్యార్థులను గురించి నేనేమనుకోవలె? వీరు అసహాయోద్యమావలంబకులు కారా? దేశీయ మహాసభా తీర్మానాలపట్ల అనాదరణమా వీరికి? ప్రభుత్వంవారు సైనిక చండ శాసనాలను ప్రయోగించి పంజాబు విద్యార్థులను పైశాచిక బాధలకు గురిచేసి యావద్భారత దేశానికి చేసినన అవమానము వీరి నంటదా? లేదా వీరు, ఆ ఏప్రిల్, మే నెలల నడివేసవి మండు టెండలలో పంజాబు రాష్ట్రంలో తమ సోదర విద్యార్థులను పదునెనిమిది మైళ్లు నడిపించి బలవంతంగా బ్రిటిష్ బావుటాకు సలాము చేయించిన ఉదంతం తెలుసుకోజాలనంత మూఢులా? లేదా ఈ కళాశాలను గురించి నాకు తెలియని లోపాలు వారికి తెలిసిఉండడమా ఈ ఉపేక్షకు కారణం? ఈ రెండు దినాలలో ఇందులోని లోపాలను నేను కనుక్కోలేని రీతిగా ఈ కళాశాల పాలక వర్గంవారు కప్పిపుచ్చగల్గినట్లైతే అకస్మాత్తుగా వారు దీనిని జాతీయ భావ లక్షణ విలసితంగా చేయగలిగితే మనం భగ్నం చేయదలచుకొన్న బ్రిటిష్ ప్రభుత్వ భావాల కనుగుణంగా నిర్మింపబడిన విద్యాసంస్థ లన్నిటికంటెనూ ఇది ఎక్కువ పవిత్రమయినదని నేను గట్టిగా చెప్పగలను

విద్యార్థులారా! మీకు ధైర్యమున్నట్లయితే నా సలహాను గమనించగలరు ప్రభుత్వ పాఠశాలలలో చదువుకోవడం పాపమని మీరు నమ్మినట్లయితే ఈ కళాశాలలో ప్రవేశించండి! ఇక్కడి విద్యావిధానం మనస్సుకూ బుద్ధికీ తృప్తికరంగా లేకపోయినట్లయితే ఆ లోపాలను సవరించేటందుకు మీ ఉపాధ్యాయులను కోరండి! మీరు కోరినంత దోషరహితంగా ఈ సంస్థ లేకపోవచ్చు కాని మానవ నిర్మితాలయిన ఏ సంస్థలూ దోషరహితాలుగా ఉండవు దూరం నుంచి విమర్శించడం విద్యార్థులయిన మీకు భావ్యం కాదు. కాబట్టి ఈ కళాశాలలో ప్రవేశించండి! తరవాత దోషాలను నివారించడానికి పూనుకోండి! బందరు వర్తక సంఘంవారికి, ఈ కళాశాలను [illegible]లించి పోషించవలసిందని నా మనవి ఇట్లాంటి విద్యాలయం బందరు పౌరుల [illegible]పించ లేకపోవడం [illegible]

కరము నేనే బందరు పురవాసినై ఉండి ఈ విద్యాలయ పద్ధతి నాకు నచ్చిన ట్లయితే ఇది దోషభూయిష్ఠమై ఉన్నదని నేను నమ్మినట్లయితే నేను దీనిని నిర్మూలించగలను లేదా ఇది నిజంగా జాతీయ భావ పూరితంగా ఉన్నదని నేను తృప్తి పడినట్లయితే ఇట్లాంటి విద్యాలయం నడిపేటందుకు ఒక గవ్వ బయటి నుంచి వచ్చినా నేనది చాలా అవమానకరంగా భావించి ఉండేవాణ్ణి ఇక నేను ఈ విషయం ముగించి మరొక పవిత్రమైన అంశం గురించి చెప్పవలసిఉన్నది

రేపటినుంచి జాతీయ చరిత్రలో అతి పవిత్రమైన వారం ప్రారంభం కాగలదు 1919 ఏప్రిల్ 6వ తేదీనాడు భారత వర్షం మేల్కొన్నది ఆనాడే హిందూ మహమ్మదీయులు ఏకం కావలెనని నిర్ణయించుకొన్నారు ఆ రోజుననే నిష్కళంకమైన స్వదేశీ భావం కూడ మొలకెత్తింది ప్రభుత్వాధికారులు ఈ జాతీయావబోధం చూసి తమ ఉనికికి భంగం కలుగుతుందని భయపడిన రోజది అందువల్ల వారు ప్రజల్లో కలిగిన ఈ చైతన్యం నిరంకుశంగా అరికట్టడానికి ప్రయత్నించి నిష్ఫలులైనారు ఆనాటినుంచి ఒక వారం రోజులలో అంటే 13 ఏప్రిల్ నాటి ఆదివారం దుర్దినంగా పరిణమించింది దాదాపు 1500 మంది నిరపరాధులైనవారు 'జలియన్‌వాలాబాగ్'లో చిత్రవధ కావించబడినారు ఆ హత్యాకాండకు కారకులైనవారు చనిపోయినవారి గోడు ఆలోచించకుండానే ఇంటిమొగం పట్టినారు జనరల్ డయ్యర్ ఆజ్ఞను నిర్భయంగా తిరస్కరించి ఆ ప్రదేశానికి వచ్చి అందులో విగత జీవుడై పడిఉన్న తన భర్త శవాన్ని చూసి మంచువలె చల్లనై యున్న ప్రియుని మస్తకం వొడిలో ఉంచుకొని ఆ నిశీధ సమయంలో వంటరిగా ఏడుస్తున్న సాహసౌదార్యశీలయగు రతన్‌దేవి మూర్తిని ఒక్కమారు ఇక్కడ ఉన్న విద్యార్థులూ, న్యాయవాదులూ నా చుట్టూ ఉన్న సోదరీమణులూ తమ మనసులలో ఊహింప కోరుతున్నాను రతన్‌దేవి మన అందరికీ సోదరి మీరు ఆ భయంకర నిశీధిలో 'జలియన్‌వాలాబాగ్'లోని నిరామయ ప్రదేశాన రతన్‌దేవి స్థానంలో ఉంటే మీ మనోభావాలెట్లా ఉంటాయో ఒకసారి ఊహించుకోండి మీరు ఇంగ్లీషువారి పట్ల కోపం చెందవలెనని నా అభిప్రాయం కాదు మీరు ఆత్మపరిశోధన చేసుకోండి 6 వ ఏప్రిల్‌నాడు ప్రారంభమైన ఉద్యమం ధర్మబద్ధమైనది అట్లాంటి ధర్మబద్ధమైన ఉద్యమం బలవంతంగా అణిచివేయడానికి ఈ ప్రభుత్వం ప్రయత్నించినందుకు నేను దీనిని సైతాన్ ప్రభుత్వమని అంటున్నాను కాని సైతాన్ దుఃఖాలును, ఈశ్వరోన్ముఖులైన మానవుల దుఃఖాలును కూడ భగవత్ప్రేరితాలే ఈశ్వరాజ్ఞను ఎవ్వరుల్లంఘించగలరు? మనకి ప్రపంచంలో కలిగే దుఃఖపరంపరలకు కారణం మన పాపమే మనం పౌరుషహీనులమై మానుషం కోల్పోయినాము కనకనే మన వారట్లా వధింపబడినారు మృత్యువును ఎదుర్కొనే విద్యను మనం మరచిపోయినాము కాబట్టే మనం చావవలసివచ్చింది ధర్మం ఆశ్రయించడమే మృతువును జయించడం ఉత్తమ క్షత్రియునికి మరణించడం తెలుసుగానీ హత్య చేయటం తెలియదు అట్లా కాదని అసహాయ

అయిన తన భార్యను నిరంతరం బాధించే ప్రతి అధమ ధముడును క్షత్రియ వీరుడే కాగలడు మనం కడచిన సంవత్సరం ఏప్రిల్ 6 మొదలు 13 వరకు పవిత్ర దినాలుగా ఎంచి ఉపవాసాలతో భజనలతో హరితాళాలతో ప్రార్థనలతో గడిపినాము బందరు పౌరులందరూ రేపు ఈ నియమాలను పాటించవలెనని కోరుతున్నాను ఉపవాసం చేయడం చిరకాలంనుంచి మనకు సంప్రదాయ సిద్ధమైన విషయము మన పవిత్రతకోసం ఉపవాసం చేస్తూ ఉంటాము పాపపరిహారార్థం ఉపవాసం చేసి మనకు ప్రజ్ఞాబలాలను ప్రసాదింపవలెనని దైవాన్ని ప్రార్థిస్తూ ఉంటాము మన పాపపరిహారార్థం భగవత్ప్రార్థన చేయడం మనకు సంప్రదాయ సిద్ధంగా వస్తున్న ఆచారము కాబట్టి ఈ సభకు వచ్చిన వారందరూ ఉపవాస ప్రార్థనలు రెంటినీ మరచిపోరని విశ్వసిస్తున్నాను ఏప్రిల్ 6-13 తేదీలు హరతాళం చేయడం కూడ మన కర్తవ్యమని భావిస్తున్నాను హరతాళమును రాజకీయ చిహ్నంగా భావించరాదు ఆత్మజ్ఞానంకోసం భరత ఖండము పూనిన ప్రతిజ్ఞా చిహ్నంగా భావించవలె ఈ వారమంతా ప్రభుత్వ వర్గంలో ఉన్న ఎవ్వరిపైనా ఈర్ష్య, కుట్ర, చెడుతలంపులు కలిగి ఉండరాదని నేను మిమ్ములను కోరుతున్నాను ప్రభుత్వ వర్గంలో ఉన్నవారు ఆంగ్లేయులు కావచ్చు, భారతీయులు కావచ్చు, వారిని మనం ద్వేషించకూడదు

మనము ముఖ్యంగా నాలుగు మహాపాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవలసి ఉన్నది నేనిప్పుడు ఆ పాపాలను వరసగా చెప్పదలచుకొన్నాను అన్నిటికంటె ప్రధానమైన పాపము మనలను ఆవహించిన భయము ఇంగ్లీషువారన్నా జపానువారన్నా మనకు భయం దైవం తప్ప మనకు ఎవరి పేరు చెప్పినా భయమే ఏ మానవునికి ఈశ్వర భక్తి లేదో అతడే తోటి మానవుని చూసి భయపడతాడు ఇది మీరు గట్టిగా నమ్మండి మహమ్మదీయులను చూస్తే హిందువులకు భయము, హిందువులను చూస్తే మహమ్మదీయులకు భయము ఈ విధంగా పరస్పరం అవిశ్వాసం పెరిగిపోతూన్నది ఇది మన మొట్టమొదటి పాపము

ఇక భారతభూమి పట్ల, మానవకోటి పట్ల, భగవంతుని పట్ల మనం చేసిన మహాపాతకం రాట్నముల నిర్మూలనము భారత జాతి నేడు బానిసగా హీన దశలో ఉండటానికి కారణం మనం మన జాతికి చేసిన ఈ మహాపాతకమే ఆ సంగతి మన దేశీయులకు నచ్చచెప్పడం నా విధిగా భావిస్తున్నాను హిందూ దేశంలో కొంత భాగము మహమ్మదీయులు జయించిన మాట వాస్తవమే

కాని మొగలాయి చక్రవర్తులు కూడ భారతదేశంలో ఏ భాగాన్ని నిశ్చయంగా దాస్యాన ఉంచలేకపోయినారు ఆనాడు మనం మన పౌరుషాన్ని, ధైర్యాన్ని ఈనాటివలె కోల్పోయి ఉండలేదు మనమింత దరిద్రులము కూడా కాలేదు మొత్తంమీద నేటి కంటె నాడే భారతభూమి భోగభాగ్యాలతో తులతూగుతున్నదని చెప్పవచ్చు ఒకలక్షమంది ఆంగ్లేయులు యావద్భారత వర్షాన్ని దాస్యం నందుంచినప్పుడు దానిని తొలగించటానికి ఒక్కడు కూడా లేని అతి

నీచమైన ఈ దురవస్థను ప్రపంచ చరిత్రలో ఎవ్వరూ కనివినీ ఉండరు

ఈస్టిండియా కంపెనీవారు మనపై ప్రయోగించిన ఎరలకు లోనై కంపెనీ ఉద్యోగస్తుల దౌర్జన్యాలకు భయపడి రాట్నాలను వదలడంచేతనే మనకీ దురవస్థ ప్రాప్తించింది కాబట్టి ఇప్పుడు అందరూ తమ సర్వశక్తులను వినియోగించి నూలు వడికితే ఈ ఘోర పాపానికి ఈషణ్మాత్రం ప్రాయశ్చిత్తం కాగలదని నేను భావిస్తున్నాను విదేశ వస్త్రం ఒక అంగుళమైన మన వద్ద లేకుండా చేయడం ఈ ప్రాయశ్చిత్త చిహ్నానికి తగిన సూచన కాబట్టి ఈ పురవాసులందరూ రేపటినుంచి విదేశ వస్త్రాలను ధరించబోమని గట్టిగా ప్రతిజ్ఞ పూనకోరుతున్నాను

మన మూడో పాపం స్వార్థపరత్వం, జాతి క్షేమం గురించి ఆలోచించక ఎప్పుడూ మన బాగును గురించి ఆలోచించకొంటూ ఉంటాము ఒకవేళ మన భావం కుటుంబక్షేమాన్ని అతిక్రమించినప్పటికీ అది మన గ్రామం వరకో లేదా పట్టణం వరకో పరిమితమై ఉంటుంది మన దృష్టి ఎన్నడూ యావద్భారత భూమిపైన ప్రసరించనే ప్రసరించటం లేదు కాబట్టి మనం స్వార్థపరత్వం మాని భారతభూమికోసం జీవించవలెననుకోవడమే స్వార్థపరత్వానికి సరియైన ప్రాయశ్చిత్తము

మన నాల్గవ పాపము హిందూ, మహమ్మదీయ స్పర్ధ మహమ్మదీయులను చూసి హిందువులు భయపడటానికి కొంత కారణం ఉంది హిందువులు వారిని విశ్వసించలేకుండా ఉన్నారు అందుచేత హిందూ మహమ్మదీయుల మధ్య స్పర్ధ హెచ్చిపోయింది అదృష్టవశాత్తు హిందువుల ఈ భయం క్రమక్రమంగా తొలగిపోతున్నది హిమాలయం నుంచి రామేశ్వరం వరకూ, వంగరాష్ట్రం నుంచి సింధుభూమి వరకూ మన దృష్టి ప్రసరింపసాగింది హిందూ మహమ్మదీయ సమ్మేళన మీపాడు స్థిరపడిపోయినది కాబట్టి మనమంతా రాట్నాలను చేపట్టడమే ముఖ్య కర్తవ్యము

ఇక అఖిలభారత కాంగ్రెస్ సంఘంవారు మీ పూనికకోసం నివేదించిన నియమాలను గమనించకోరుతున్నాను తిలక్ స్వరాజ్య నిధికి కోటి రూపాయలు కావలె ఆంధ్రదేశపు వంతు 7½ లక్షల రూపాయలు బందరు పౌరులు ఈ నిధికి విలువగల వస్తువులు సమర్పించగలరని భావిస్తున్నాను ఇప్పుడే స్వచ్ఛందసేవకులు మీ దగ్గరకు రాగలరు. అనేకచోట్ల తమ నగలను తిలక్ స్వరాజ్య నిధికి ఇచ్చివేసినారు ఈ ఊరి సోదరీమణులు ఈ వరకే నాకడకు వచ్చి కొంత రొక్కము, కొన్ని నగలు ఇచ్చివెళ్ళినారు నా మాటలను మీరు ఓపికతో విన్నందుకు నేను కృతజ్ఞుణ్ణి రెండు దినాలుగా నన్ను శాంతంగా ఉండనిచ్చినందుకు కూడ మీకు వందనాలు నేను కళాశాలకు వచ్చేటప్పుడు మీరు ప్రదర్శించిన వాతావరణానికి కూడ నేను మిమ్ములను అభినందిస్తున్నాను ఖిలాఫత్, పంజాబు దుర్న్యాయాలను తొలగించటానికి స్వరాజ్య సంపాదనకు ప్రారంభించిన సహాయనిరాకరణ మహోద్యమంలో సంపూర్ణంగా

పాల్గొనేటందుకు ఈ పురవాసులకు తగిన సామర్థ్యం, విజ్ఞానము, ధైర్యము ఈశ్వరుడు ప్రసాదించునుగాక గాంధీజీ ఉపన్యాసాన్ని శ్రీ చెరుకువాడ నరసింహంగారు తెలుగులోకి అనువదించినారు ఈ ఉపన్యాసానంతరం తాడేపల్లి నాగభూషణంగారు 1001 రూపాయలు తిలక్ స్వరాజ్య నిధికి సమర్పించినారు ఆ తరవాత ఇంకా అనేకమంది విరాళాలీయగా మొత్తం 6 వేల రూపాయలైనవి ఇది రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి కాంగ్రెస్ నియమావళి ప్రకారం వెచ్చించడానికి పంపబడింది ఏప్రిల్ 5 మధ్యాహ్నం గాంధీగారు కళాశాల ఉపాధ్యాయులకు గాంధీజీ దర్శనమిచ్చి విద్యా విధానంగరించి చాలాసేపు ముచ్చటించినారు తరవాత కొత్తవరము, అంగలూరు మొదలయిన గ్రామములనుంచి వచ్చిన యువకులు నూలువడికి దూదిపకీ గాంధీజీకి చూపగా ఆయన చాలా సంతోషించినారు గాంధీజీకి వారు సన్నని వడుకునూలు బట్టలను బహూకరించినారు అవి తమ ప్రాంతంలో తయారయ్యే వాటికంటే ఎక్కువ బాగున్నవని చెబుతూ ఆయన సంతోషించినారు ఈ ప్రాంతాలలో తయారై తనకు బహూకరించిన వడుకునూలు బట్టలు సన్నగానూ, సొగసుగానూ ఉన్నందువల్ల వాటిని బొంబాయి ప్రాంతపు స్నేహితులకిచ్చి నాజూకు తనానికి పరితపించే వారికి ధైర్యం చెప్పగలననీ తాను మాత్రం స్వరాజ్యం లభించి భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో సన్నని బట్టలు తిరిగి తయారయ్యేవరకూ ముతకబట్టలు తప్ప కట్టననీ ఇది నాజూకుతనానికి ఆతురపడే కాలం గాదని అన్నారు

## ఉయ్యూరులో

గాంధీగారపతులూ, డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారూ బెజవాడ నుంచి మచిలీపట్నానికి మోటారుకారులో పోతూఉండగా తోవలో ఉయ్యూరు గ్రామస్తుల కోరికపైన వారు కొంచెంసేపు ఆగినారు అక్కడ ఒకవేయి మంది స్త్రీపురుషులు సమావేశమై తిలక్ స్వరాజ్య నిధికి ఒకవంద రూపాయలు సమర్పించినారు ప్రతి ఇంటింట రాట్నాలు పెట్టవలెనని, స్వదేశీ ఉద్యమం బలపరచవలెననీ గాంధీజీ ఉపదేశించినారు

## పామర్రులో

విజయవాడ నుంచి బందరుకు పోతూ తోవలో పామర్రు గ్రామంలో గాంధీదంపతులు వారితో కలిసి వస్తూన్న డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు పామర్రులో 10 నిమిషాలు ఆగినారు గ్రామంలోని స్త్రీపురుషాదులు యావన్మంది దాదాపు 3 వేలకుపైగా 'జయ, జయ' ధ్వానాలతోనూ భజనలతోనూ మహాత్ముని సందర్శించి స్వరాజ్య నిధికి విరివిగా కానుకలు సమర్పించినారు

పంచాయతీ సంఘంవారు మహాత్మునికి సన్మాన పత్రం సమర్పించటానికి తీర్మానించినప్పటికీ చైర్మన్‌గారు అందుకు అంగీకరించకపోవటంవల్ల ఆ సన్మాన పత్రాన్ని పంచాయితీ సభ్యులు శ్రీ తుర్లపాటి శేషాచలశర్మగారు చదివినారు

**వర్తకసంఘంవారి అభినందన పత్రము**

ఏప్రిల్ 6 వ తేదీన మహాత్మాగాంధీకి బందరు వర్తక సంఘంవారు ఈ అభినందన పత్రం సమర్పించినారు

ఏ మహాపురుషుని నామమంత్రం సర్వఖండాలలో రామకృష్ణాది నామ ప్రాయమై మోగుతున్నదో ఏ మహాశయుని ఉపదేశం ఈ జగత్తరుణోపాయ మని వైదేశికులచే కూడా కొనియాడబడుతుందో అట్లాంటి లోకోద్ధారునికి స్వాగతమివ్వటంకంటె మా భాగ్యమేమి ఉంటుంది? అన్ని సంఘాలకంటే అధో గతినిపడి ఐశ్వర్యవాహీనిని విదేశాలకు కాల్వలుగట్టి పంపుతూ ఇహాముతప్ప పరమెరగని మమ్ము ఉద్ధరించడానికి మీ రొనర్చే ప్రయత్నా లమేయాలు వణిజ్మాత్రులమే అనే మమ్ము లక్ష్మీపుత్రులుగా ప్రబోధించి మా ఔన్నత్యాన్ని మేల్కొల్పిన మహాశయునికి మే మేమని మనవిచేసుకోగలము? మీ అవతార గౌరవం వణిగ్జాతికి ప్రసాదించిన పరాత్పరుడు ఇట్లాగే యావల్లోకము మీ మూలంగా ఉద్ధరింపజేసి మీకు దీర్ఘాయురారోగ్యాల నిచ్చి అందరినీ అనుగ్రహించును గాక !"

**వైశ్యుల వినతి పత్రము**

బందరులో ఏప్రిల్ 6 వ తేదీని బందరులోని వైశ్యులు మహాత్మాగాంధీకి ఈ వినతిపత్రం సమర్పించినారు

"చిరకాలంగా తమ పుణ్య సందర్శనంకోసం నిరీక్షిస్తున్న మా బృందా వన పౌరుల మహద్భాగ్యవశాన నేడు మా పురమధ్యకు విచ్చేసి, మా నగర లక్ష్మినీ మున్మనూ ధన్యుల్ని చేసినందుకు వందనశతంబు లర్పిస్తున్నాము. తొల్లి జగన్మోహనావతారుడగు శ్రీకృష్ణునకు బృందావనా విహారంలో గోపగోపికా జనులవలె నేడు విశ్వమోహనమూర్తి అయిన తమకు ఈ బృందావన వాసుల మైన మేమందరమూ ప్రేమపూర్వకంగా స్వాగతమిస్తూన్నాము మహాత్మా! నేడు కాలవశాన లక్ష్మీకటాక్షానికి దూరమై మొదటి ఔన్నత్యం కోల్పోయి రూపు చెడియున్న ఈ వైశ్య సంఘంలో క్షామదృవించడంవల్ల మా ప్రత్యేకానందానికి పారము లేకుండా ఉన్నది తమ పావన సంస్పర్శచే నేడు భారత వైశ్యసంఘం విద్యుత్ స్పర్శనొందినట్లు చైతన్య పూరితమై నవభావాలతోను, నవోత్సాహంతోను, నూతన శక్తి విలాసాలతోను, విరాజిల్లుతున్నది తమ అమోఘ సంకల్ప బలంచే నేడు వైశ్యసంఘం మళ్ళీ నియతితో లక్ష్మి సమారాధనకు పూజా ప్రసూన మాలిక అర్పిస్తూ ఆ దేవిని భారత మందిరంలో సుస్థిరంగా ప్రతిష్ఠించడంకోసం ఉంకిస్తున్నది తమ అనవరతోద్యమంతో భారత వర్షము అచిరకాలంలో స్వరాజ్య లక్ష్మిని చేకొని తన ప్రాక్తన వైభవం మరపించే ప్రోజ్వల వైభవంతో తులతూగుతు లోక కళ్యాణానికి తోడ్పడుతుందిగాక భగవానుడు తమకు చిరాయురారోగ్యా లను గ్రహించును గాక "

## ప్లీడర్లతో మహాత్ముని సంభాషణ

1921 ఏప్రిల్ 5 వ తేదీన సాయంకాలం ఆంధ్రజాతీయ కళాశాల తోటలో గాంధీ కుటీరంలో బందరులోని ప్లీడర్లు కొందరు మహాత్మునితో జరిపిన సంభాషణ ఇది

మహాత్ముని దర్శనార్థం వచ్చిన ప్లీడర్లను ఒకరు మహాత్మునికి పరిచయం చేసినారు తరవాత గాంధీజీ చిరునవ్వుతో ఇట్లా అన్నారు

గాంధీ - మీరింకా ప్లీడరు వృత్తిని ఎందుకు విడిచిపెట్టలేదో కారణం తెల్పవలసిందని కోర్టు భాషలో అడుగుతున్నాను

(అందరూ కొంతసేపు మౌనంగా ఉన్నారు)

గాంధీ - (మెల్లగా) సత్యాగ్రహ ధర్మం నేను 30 సంవత్సరాలనుంచి అనుష్ఠిస్తున్నాను ఎప్పుడూ విఫల మనోరథుడను కాలేను కొన్ని సందర్భాలలో నా భార్యతోకూడ సహాయ నిరాకరణం అవలంబించవలసి వచ్చింది నా అన్నగారితోను నా కుమారునితో కూడా సహాయ నిరాకరణం చేసినాను దక్షిణాఫ్రికా ప్రభుత్వంతో నేను సహాయ నిరాకరణం చేసిన సంగతి మీకు తెలిసే ఉంటుంది ధర్మ సంస్థాపనకు సత్యాగ్రహం కంటె ఉత్తమ సాధనం లేదు సత్యాగ్రహం మనలో గర్భితమైన శక్తులను ఉద్దీపింపచేయగలదు ధర్మ నిష్ఠను బలపరచగలదు సంకల్పసిద్ధికది హేతువు కాగలదు రాజ్యాంగాన్ని సత్పథంలో పెట్టగలదు సంఘాన్ని పరిశుద్ధం చేయగలదు నా మాటలతోనే కాలహరణమైపోతూన్నది మీ మనసును తెలుసుకోగోరుతున్నాను దయచేసి మీ అభిప్రాయాలను చెప్పండి

ఒక లాయరు - మహాత్మా! ఒక్క మనవి, మీ సిద్ధాంతాలను మాలో చాలా మంది మనఃపూర్వకంగా అంగీకరిస్తున్నారు మీరు చెప్పినదంతా నిజమే కాని ప్లీడర్లమైన మేమందరమూ ఎందుచేత వెనకాడుతున్నామంటే మాలో చాలా మందికి మరొక వృత్తి చేతకాదు జీవనోపాయంకోసం మార్గాంతరం లేదు వేషభాషలలోనూ, ఆహార విహారాలలోనూ మేమూ, మా కుటుంబ సభ్యులు కొన్ని అలవాట్లకు లోనై ఉన్నాము ఏదో ఒక తరహా జీవితంతో కాలం గడుపుకొంటున్నాము ఇప్పుడు ఒక్క మారుగా వాటి నన్నిటినీ మార్చుకోవలెనంటే మాకు సాధ్యం కాకున్నది మేము దుర్బలులమని మనవి చేసుకొంటున్నాము

గాంధీజీ - అవును మీరు చెప్పింది నిజమే నాకాసంగతి తెలుసు ఇట్లాంటి కష్ట విషయాలు సాధించటంలోనే మనకు చిత్తశుద్ధి, ఆత్మబలము లభించగలవు అప్పుడే మన సంకల్పం బలపడుతుంది మన స్వరాజ్య ప్రయత్నాలన్నీ ఈ సాధనలోనే ఇమిడి ఉన్నాయి చూడండి! మోతీలాల్ నెహ్రూ ఏంచేసినారో! ఆయన మహా భోగి రాజరీవి అనుభవించినాడు ఎప్పుడూ భోగభాగ్యాలతో తులతూగిన మనిషి ఆయన

కుటుంబమంతా ఆటువంటి జీవితానికే అలవాటు పడుతున్నది అట్లాంటి వారు ఒక్కసారిగా భాగ్యభోగాల నన్నిటినీ విసర్జించి సామాన్యుని వలె సంసారం గడుపుకొంటున్నాడు రేపు నే నెలలో ఆయన కుమార్తె వివాహం జరగనున్నది అది వెనక నే జరిగిఉంటే ఆ ఓస్యాటు కొన్ని లక్షలు స్త్రీ ధనంగా ఇచ్చిఉండేవాడు ఇప్పుడు ఒక నిరుపేదవలె కన్యాదానం చేయబోతున్నాడు మీరు కొద్ది రోజుల్లో ఈ వార్తను పత్రికలలో చదువగలరు చిత్తరంజన్ దాస్ గారిని చూడండి! ఆయనకూడ మహా భోగి, ఆయన పెద్ద కుమార్తె వివాహానికి లక్ష రూపాయలు ఖర్చు పెట్టినాడు రేపు జరగబోయే రెండో పిల్ల వివాహానికి దానిలో నూరో వంతుకూడా ఖర్చు పెట్టలేడు ఇంకా ఇట్లాంటి త్యాగ లను చేసిన వారెందరో ఉన్నారు మీ కొండ వేంకటప్పయ్యగారిని చూడండి! ఆయన త్యాగం మూలాననే కదా ఆంధ్రోద్యమం కొనసాగినది?

ఒక ప్లీడరు - మహాత్మా! ఇదివరకు ప్లీడరీలో బాగా సంపాదించినవారు ఇప్పుడా వృత్తిని మానుకోవచ్చు కానీ దినగండం నూరేళ్ళాయుస్సుగా బ్రతుకుతున్న మావంటి పేదవాళ్లను బలవంత పెట్టి ప్రయోజనం లేదు మేమీ వృత్తిని మానుకోకుండా చేయదగిన సహాయం లేదా? వృత్తి మానని ప్లీడర్లు తమ సంపాదనలో కొంత భాగం స్వరాజ్య నిధికి ఇవ్వవచ్చునని మీరు 'యంగ్ ఇండియా' పత్రికలో వ్రాసినారుకదా?

గాంధీజీ - భాగ్యవంతులకంటె బీదలకే మోహం తక్కువగా ఉంటుంది భాగ్యవంతుడు, పేదవాడు అనే భేదం అక్కరలేదు ఎవరు త్యాగం చేయగలరో వారే ధన్యులు ప్లీడరు పని మానజాలనివారు తమ సంపాదనలో కొంత భాగము స్వరాజ్య నిధికివ్వవచ్చు

ఒక ప్లీడరు - దేశంలో అనేక వృత్తులుండగా మా వృత్తినే మానుకొనమని మీ రెందుకింత పట్టుదలగా ఉన్నారు? ప్లీడరు వృత్తియే త్యాగమని మీ అభిప్రాయమా?

గాంధీజీ - ప్లీడరు వృత్తి గౌరవదాయకమైనది కాదనే నా స్వకీయాభిప్రాయము కనకనే నేనా వృత్తిని పూర్తిగా విసర్జించినాను కాని నేను మిమ్ముల ను మీ వృత్తిని పూర్తిగా విడిచిపెట్టవలసిందని కోరటం లేదు వృత్తిని శాశ్వతంగా వదిలివేయవలెనని నేను కోరితే 'సస్పెండ్' అనే మాటను ఉపయోగించి ఉండేవాడిని కాను 'సస్పెండ్' అంటే కొంతకాలంవరకనేగా అర్థము మీ కిష్టమైతే సంవత్సరాంతం తిరిగి మీ వృత్తిలో చేరవచ్చు కాంగ్రెస్ మిమ్ముల ను కోరుతూన్నది ఒక్క సంవత్సరం మాను కొనమని మాత్రమే

ఒక ప్లీడరు - మేము మానుకొంటే గవర్న మెంట్ స్తంభించి పోతుందనా? లేక దేశంలో ప్రచారకులు తక్కువగా ఉన్నారనా? ఏ కారణంచేత మేము మా వృత్తిని తాత్కాలికంగా చాలించుకోవలె?

గాంధీజీ - మీరు మానుకోవడం వల్ల గవర్నమెంటు స్తంభించిపోతుందా పోదా అని మనం ప్రశ్నించుకోనక్కరలేదు ప్రభుత్వం అధర్మ భూయిష్టమైనది అట్లాంటి ప్రభుత్వంతో సంబంధం కలిగిఉండటం అధర్మము మనం మైల పడకుండా ఉండవలెనంటే ఈ రాజ్యాంగ యంత్రంనుంచి బయటపడి తీరవలె ఆత్మశుద్ధి కోసం కోర్టులను బహిష్కరించటం మన విధి మన భోజన పదార్థాలు సహితం ప్రభుత్వం వారి రక్షణకు లోబడి ఉండటం చేత మన ఆహారం కూడా మలినమౌతూన్నది నిజంగా మనం భోజనం గూడ చేయకూడదు కానీ అంత తీవ్రమైన సాధనను మనం అవలంబించ పోవటం లేదు సులభసాధ్యమైన విషయాలలోనే మనం సహాయ నిరాకరణానికి పూనుకొంటున్నాము కోర్టులు ప్రభుత్వంలో ప్రధాన భాగాలు ప్రభుత్వం ధర్మభ్రష్టమైనందువల్ల మీరు వాటినుంచి బయటకు రావలె ఈ ఆత్మశుద్ధిలో మీకు నమ్మకం లేకుంటే దేశసేవా తత్పరత్వంతోనైనను మీరు మీ వృత్తిని ప్రస్తుతం మానవలసిఉంది నేనొకప్పుడు బారిష్టరునై ఉండటంచేత నా సోదర ప్లీడర్లనే నే నెక్కువగా అర్థిస్తున్నాను అదీగాక ప్లీడర్లే ఇంతకాలం రాజ్యాంగ విషయాలలో ప్రముఖులుగా ఉన్నారు వారే ఉపన్యాస వేదికలపై నిలబడి స్వార్థ త్యాగము, దేశసేవా మొదలయిన పదాలను ప్రయోగిస్తూండేవారు సమయం వచ్చినప్పుడైనా తాము చేసిన బోధల కనుగుణంగా వారు ప్రవర్తించవద్దా? రైతులకు ముఖ్యంగా ప్లీడర్ల పైన ఎక్కువ గౌరవము ఎప్పుడు ప్లీడరు తన వృత్తిని మానుకొని దేశహిత కార్యానికి పూనుకొంటాడో అప్పుడు ఆయనను గౌరవిస్తున్న రైతులు, గ్రామవాసులు స్వరాజ్య సాధనకు ఎక్కువగా తోడ్పడగలరు దేశ క్షేమం కోసం మీరు 6 మాసాలు వృత్తి మానుకొని కష్టపడలేరా? లేనట్లయితే మీకు స్వరాజ్య మెట్లా లభిస్తుంది?

ప్లీడరు - మహాత్మాజీ! స్వరాజ్యం నిజంగా 6 మాసాలలో వస్తుందా?

గాంధీ - అయితే ఒక సంగతి వినండి! కాంగ్రెస్ కమిటీ తీర్మానం ప్రకారం ఒక కోటిమంది సభ్యులను, ఒక కోటి రూపాయల నిధిని, 20 లక్షల రాటాలను మనమందరమూ కష్టపడితే 3 నెలల్లో సమకూర్చలేమా!

ప్లీడరు - సమకూర్చగలము

గాంధీజీ - ఈ పని చేయటంలో స్వరాజ్య సిద్ధికి కావలసిన గుణాలు మనలో వికసించవా? స్వరాజ్యానికి కావలసిందేమిటి? ఏకీభావము, త్యాగము, పట్టుదల, ధైర్యము, కార్యకౌశలమూ, ఇవేకదా! మన దేశంలో బుద్ధి ఉన్నది, ధైర్యం ఉన్నది కార్యకౌశలం, సేవాతత్పరత ఉంది కాని ఇవి వేటికవి విడిగా ఉన్నాయి ఇవన్నీ ఒక్కచోట కేంద్రీకృతమై లేవు నాకు స్వరాజ్యం సిద్ధించింది కాని దానిని జాతిలో ప్రతిష్ఠించే టందుకు ప్రయత్నిస్తున్నాను ప్రజలలో వ్యాజ్యాలాడే వ్యసనం,

తాగుబోతుతనం మాన్పించటం శ్రేయస్కరమవుతుందా? కాదా? 20 లక్షల రాటాలను స్థాపించి పని చేస్తూన్నట్లయితే కలిగే ఫలితమేమిటో మీ రూహించినారా? ఇంగ్లాండ్ నుంచి ఒక్క అంగుళం గుడ్డగానీ దారంగానీ తెప్పించకుంటే ఏమి జరుగుతుందో ఆలోచించండి లాంక్ షైరులోకి పోయే 60 కోట్ల రూపాయలు ఇక్కడ నిలచిపోతుంది అప్పుడు ఒక లాంక్ షైర్, ఒక ఇంగ్లాండ్ దేశమే కాక ప్రపంచమంతా ఆశ్చర్యంతో మనవంక చూడగలదు అప్పుడు మన ఘోష నిరర్థకం కాదు అప్పుడు మనం కేవలం వట్టి వాక్శూరులం కామనీ, కార్యదీక్షా తత్పరులమైన పౌరుషవంతులమనీ లోకం మనలను గుర్తించక తప్పదు

ప్లీడరు - యాం ప్తిల్ ప్రభువు ఇంగ్లాండ్‌లో అప్పుడే గోల పెడుతున్నాడు

గాంధీజీ - వెనక నేను 1904 లో అనుకొంటాను దక్షిణాఫ్రికా వ్యవహారంలో ఇంగ్లాండ్ వెళ్ళినప్పుడు అక్కడ చాలామంది ప్రముఖులతో కలసి మాట్లాడినాను అప్పుడు నేను ఈ రాటాల సంగతి చెప్పగానే ఇండియాలో ఈ ప్రయత్నం కొనసాగినట్లైతే ఇంగ్లాండ్‌కు విపత్తు తప్పదని వారిలో చాలామంది ఒప్పుకున్నారు కాని ఇది జయప్రదంగా సాగటం మాత్రం కష్టసాధ్యమని వారి అభిప్రాయము అప్పుడు ఈ విషయమై పూర్వాపర సంబంధాలు బాగా తెలుసుకొనిఉన్న యాం ప్తిల్‌గారు దూరదృష్టితో మన రాటమంటే ఏమిటో అర్థం చేసుకొని ఆరాటంతో అందరికంటె ముందుగా తహతహలాడుతున్నారు మనమిప్పు డసాధారణ పరిస్థితుల్లో ఉన్నాము అంటే యుద్ధంలో ఉన్నాము ఇది సత్య యుద్ధము కనక మీకు ఫిరంగి మ్రోతలు వినపడడంలేదు అసాధారణ కాలంలో సాధారణ ధర్మాలన్నిటినీ కట్టి పెట్టవలె మనకిపుడు పాఠ శాలలు, చదువులు, కోర్టులు, న్యాయనిర్ణయాలేమీ అక్కరలేదు ఈ 6 మాసాలు గడచి బ్రతికి బాగుంటే శాంతి సమయంలో వాటిని తిరిగి స్థాపించుకోవచ్చు ఇప్పుడు మన సర్వశక్తులను ఏకోన్ముఖం చేసి కేంద్రీక రించుకోవలె దేశీయులంతా తమ తమ వృత్తులను చాలించుకొని ఏకాగ్రచిత్తంతో తదేక దీక్షతో ఈ 8 మాసాలు కాంగ్రెసు కమిటీ తీర్మానాలను ఆచరింపచేస్తే పై 8 మాసాలలో స్వరాజ్యం సిద్ధించి తీరుతుంది "

## గాంధీజీ - కొత్తవరంలో

ఏప్రిల్ 6 వ తేది ఉదయం $4\frac{1}{2}$ గంటలకు మహాత్మాగాంధీ దంపతులు పట్టాభి సీతారామయ్యగారితో కలసి మోటారు కారులో కొత్తవరం వచ్చినారు మహాత్ముని ఆగమన వార్త రూఢిగా గడచిన రాత్రి 10 గంటలవరకూ తెలియకపోయినప్పటికీ గ్రామస్తులు స్వల్పకాలంలోనే ఆయనను ఆహ్వానించే

టందుకు అన్ని ఏర్పాట్లు చేసినారు గ్రామమంతా తోరణాలతో అలంకరింప బడింది మహాత్మునికి సన్మానపత్రం సమర్పించడానికి తాత్కాలికంగా ఒక వేదిక కూడా నిర్మింపబడింది

మహాత్ముడు గ్రామంలో కాలు పెట్టగానే 'జయ జయ' ధ్వానాలు చెలరేగినాయి భజనలతో మహాత్ముని వేదిక దగ్గరికి తీసుకొనివచ్చి వేదికపైన కూర్చోబెట్టిన తరువాత గ్రామస్థుల పక్షాన 116 రూపాయలు కానుకగా సమర్పింపబడింది తాంబూల హారతులతో నూటపదహార్లు బహూకరిస్తూ మహాత్ముడు పూనిన మహాయజ్ఞానికి తాము సమర్పించే ఈ అల్పపారితోషికం గ్రహించి తమను కృతార్థుల్ని చేయవలెనని ప్రార్థిస్తూ గ్రామస్థులు సన్మాన పత్రాన్ని చదివినారు మహాత్మాజీ గ్రామస్థులిచ్చిన కానుకలను గ్రహించి స్వరాజ్య ప్రాప్తికి స్వార్థత్యాగం అవసరమనీ, 21 సంవత్సరాలకు పైబడిన స్త్రీ పురుషు లందరూ కాంగ్రెస్ సంఘంలో చేరవలెననీ, రాటమే మనకు శరణ్యమనీ, రాటం మూలబడడం చేతనే మనము స్వాతంత్ర్యం కోల్పోయినామనీ, రాటమును మళ్ళీ చేబట్టి స్వరాజ్యసిద్ధికి ఆబాల గోపాలం తోడ్పడవలెననీ ఉద్బోధించి నారు

శ్రీ కానూరు చినవెంకట దాసయ్యగారు స్వరాజ్య నిధికి వెయ్యినూట పదహార్లు సమర్పించగలరని ఆ సభలో ప్రకటించినారు ఈయన రాటాల పున రుద్ధరణ విషయమై చేస్తూన్న కృషి అత్యంత శ్లాఘనీయమని గ్రామస్థులాయ నను ప్రశంసించినారు

(కొతవరం బందరు, గుడివాడల మధ్య రోడ్డుమీదనున్న గ్రామం)

## గుడివాడలో

శ్రీ గాంధీ దంపతులు ఏప్రిల్ 6వ తేదీ తెల్లవారుజామున బందరు నుంచి మోటారులో డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారితో బయలుదేరి కొత వరం అంగలూరు గ్రామాలలో దిగి అక్కడ పని చేస్తూవుండిన సుమారు 800 రాట్నాలను, 25 మగ్గాలను చూసి ఉదయం 6½ గంటలకు గుడివాడ చేరు కొన్నారు సుమారు 8 వేల మంది మహాత్ముని రాకకు ఎదురుచూస్తూ వేచి ఉన్నారు అయనను పుష్పమాలాలంకృతులనుగా చేయడాని కవకాశం పొందిన వారాయనకు 70 రూపాయలు సమర్పించి నమస్కరించినారు. మహాత్ముని దర్శన భాగ్యం అందరికీ లభించే లాగున గాంధీ దంపతులను ఉన్నతాసీనులను చేసిన వెంటనే మహాత్ముడు, పంచముల నిమిత్తం వచ్చినానని ఆ సభలో ఎందరు పంచములున్నారో చూడవలెననీ,పంచములందరూ లేచి చేతులెత్తి తమ కగపడ వలెననీ అన్నారు. చాలా మంది పంచములు సభకు వెలుపల ఉన్నప్పటికీ సభలో కూడ మధ్యమధ్య దాదాపు 100 మంది పంచములుండటం చూసి అస్పృశ్యతను పాటింపకుండా అందరూ కలసి కూర్చున్నందుకు ఆయన సంతోషించినారు ఆదిమాంధ్రుల పక్షాన సుంద్రు వెంకయ్యగారు, పురపాలక సంఘు పక్షాన

నందివాడ రాజగోపాలంగారు, ఖిలాఫత్ సంఘం పక్షాన షేక్ మహమ్మద్ సాహెబ్‌గారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు వారి పుగ్గురికి కృతజ్ఞత తెలుపుతూ గాంధీజీ ఇట్లా ప్రత్యుత్తర మిచ్చినారు

"నేను ఇక్కడకు ముఖ్యంగా ఆదిమాంధ్రుల నిమిత్తమై వచ్చినాను తక్కిన కార్యక్రమానికి సంసిద్ధుడనై రాలేదు అస్పృశ్యతా పాపానికి లోను కాక అందరూ కలసి కూర్చున్నందుకు అపరిమితానందం పొందుతున్నాను తోడిమానవుని అంటరానివానిగా చూడడంకంటె మహాపాతకము, ఈశ్వర ద్రోహమైనది మరొకటి ఉండబోదు నేను సనాతన ధర్మానుష్ఠాన పరుణ్ణి వర్ణాశ్రమ ధర్మబద్ధుడైన హిందూ వైశ్యుణ్ణి హిందూ ధర్మ శాస్త్రాలను కొంత వరకు పరిశోధించిన వాణ్ణి మానవుణ్ని అస్పృశ్యునిగా చూడమని ఎక్కడా విధింపబడి ఉండలేదు గోమాంస భక్షణం హిందూ ధర్మశాస్త్రం విధిస్తున్నదని చెప్పటం ఎంత నిజమో తోడి మానవుని అస్పృశ్యునిగా పరిగణింప విధిస్తున్నదని చెప్పటంలో కూడా అంతే నిజం ఉన్నది మత ధర్మాల పేరుతో జరిగే మహా దుష్టకార్యాల నన్నిటినీ సమర్థించటానికి ఏ మూలనో ఒక శ్లోకం వెదకి పట్టుకోవడం మనకు ఆచారమై పోయింది నేను నా చిన్నతనంలో సంస్కృతం చదువుకొనేటప్పుడు ఒక చిన్న శ్లోకం బోధింపబడింది అందులో గోమాంస భక్షణం విధింపబడి ఉన్నది అంతమాత్రాన గోమాంస భక్షణం హిందూ ధర్మ శాస్త్ర సమ్మతమని ఎవరు చెప్పగలరు? అహంకార పూరితమై అస్పృశ్యతా పాపానికి లోనైన అగ్రకులంలో పుట్టడం కంటె కుష్ఠురోగిగా పుట్టడానికి నే నిష్టపడతాను నాకు మోక్షం సిద్ధించటానికి పూర్వం తిరిగి జన్మ మెత్తవలసి ఉంటే - మరొక జన్మ నాకు తప్పదని నే నెరుగుదును - పంచమునిగా జన్మింప చేయమని నేను పరమేశ్వరుని ప్రార్థిస్తాను

ఈ వారమంతా ఆత్మ సంస్కారంకోసం వినియోగం చేయవలసిన కాలమని మీకు తెలిసే ఉంటుంది 1919 ఏప్రిల్ 6వ తేదీన యావద్భారత దేశంలో ఒక నూతన ప్రబోధం కలిగింది అందుచేత ఆరోజు మన కందరకూ మహా పర్వదినము 13వ తేదీ కూడ ఇట్లాంటి పర్వదినమే ఈ రెండు రోజులు ఉపవాసం చేసి దేశ విముక్తికోసం పాటుపడేటందుకు కావలసిన ధైర్య బల లకోసం ఈశ్వరుని ఆరాధించి మీ రందరూ మాతృ పూజా తత్పరులు కాగోరుతున్నాను అఖిలభారత జాతీయోపసంఘం మొన్న బెజవాడలో తీర్మానించిన ప్రకారం తిలక్ స్వరాజ్య నిధికి ఆంధ్రదేశం వంతు 7½ లక్షల ద్రవ్యాన్ని 7½ లక్షల కాంగ్రెస్ సభ్యులను 3 మాసాలలో అంటే జూన్ ఆఖరు లోపుగా సమకూర్చి కొత్తగా సుమారు 1½, 2 లక్షల రాటాలను ఈకాలంలోనే స్థాపించి మీరు మీ విధిని నెరవేర్చమని కోరుతున్నాను విదేశాల నుంచి ఒక అంగుళము గుడ్డనైన రానీయవద్దు పిచ్చి అభిప్రాయాలను మాని వైశ్యులు కూడ రాటాలు పెట్టి నూలు వడికి ఒక్క అంగుళమైనా విదేశవస్త్రం రానీయక అందరూ రాటంమీద వడికిననూలుతో మగ్గంపైన నేసిన వస్త్రాలనే ఉపయోగించవలె అహమదాబాద్,

బొంబాయి యంత్రాలమీద తయారైన వస్త్రాలను కూడా విదేశ వస్త్రాలుగనే పరిగణించవలె మహ్మదీయ సోదరులకొక మనవి మౌలానా షౌకతాలి ఈ రోజు ఇక్కడ లేనందువల్ల విచారపడుతున్నాను మీ రందరూ మహమ్మదీయ మతం కోసం, ఖిలాఫత్ ఉద్ధరణకోసం మీ సర్వస్వము సమర్పించి షౌకతాలీగారి ఆజ్ఞానువర్తనులై ఉండటానికి మీ రిష్టపడుతున్నట్లు మీ సన్మానపత్రం వల్ల గ్రహించగలిగినాను ఆ సంశేశం నే నా మహా వీరునికి నివేదించగలను

నేను మనవి చేసినట్లు ఈ మహా పర్వ సమయాన స్వదేశీ వ్రతం పూని అస్పృశ్యతా మహా పాప విముక్తికై ఈశ్వరుని ఆరాధింప కోరుతున్నాను అట్లా చేస్తే 6 మాసాలలో స్వరాజ్యం సిద్ధించగలదు ఇది ముమ్మాటికి సత్యము మీకు పరమేశ్వరుడు తోడ్పడుగాక " తరవాత వేయి రూపాయలు మహాత్మునికి కానుకగా సమర్పించ బడింది

## శ్రీ గూడూరి రామచంద్రుడు _ గాంధీజీ సందేశము

కృష్ణాజిల్లా గుడివాడలో హరిజన సేవ నిమిత్తం సేవాశ్రమం స్థాపించి హరిజన సేవలో తమ జీవితం సమర్పించిన శ్రీ గూడూరి రామచంద్రుడుగారికి 1921 వ సంవత్సరం జూన్ నెలలో గాంధీజీ ఈ దిగువ సందేశం తమ స్వదస్తూరిలో ఇంగ్లీషులో ఇట్లా వ్రాసినారు

'హిందూ ధర్మంలో అస్పృశ్యత ఘోర పైశాచిక కృత్యము అది పోయినట్లయితే స్వరాజ్యం సుసాధ్యము అస్పృశ్యతా పాప విమోచన విషయంలో మనలను ఉపేక్షాభావం ఆవహించి ఉన్నది అందుచేత ఆ పాప విమోచనకు స్వాతంత్ర్యోద్యమంలో అగ్రస్థానం ఇచ్చినాను ఈ మహాసంస్కారోద్యమం ఈశ్వరానుగ్రహాన్ని కోరే మనము ఆయన సృష్టిలో అత్యంతం అర్హులయినవారికి మానవ హక్కులను నిరాకరిస్తున్నాము మానవత్వాన్ని కోల్పోయిన మానలను ఇతరుల అమానుష కృత్యాలనుంచి విముక్తులను చేయవలసిందని భగవంతుని సింహాసనం ముందు వాదించే హక్కు మనకు లేదు అస్పృశ్యులనే వారి దుఃఖభాజనమైన జీవితంలో పాల్గొని నాతోపాటు వారినికూడా దుఃఖకరమయిన ఆ దీనావస్థనుంచి విముక్తులను చేయడానికి నాకు పునర్జన్మ తప్పనట్లయితే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో కాక పంచములలో జన్మింపచేయకోరుతూ ఈశ్వరుని ప్రార్థిస్తాను

అస్పృశ్యత ఈ సంవత్సరంలోనే అదృశ్యం కావలె అస్పృశ్యతా పాప విమోచనము, గోరక్షణ అనే రెండు కాంక్షలే నా ఈ దేహధారణ, దేహయాత్రలకు ముఖ్యకారణాలు ఈ వాంఛాద్వయ ప్రాప్తియే స్వరాజ్యము, అదే నా మోక్షము "

## అఖిలభారత విశ్వకర్మ మహాసభ

1921 ఏప్రిల్ 1 వ తేదీన ఉదయం 8½ గం॥ బెజవాడలోని బహిరంగ

సభా ప్రదేశంలో మహాత్మాగాంధీ అధ్యక్షత కింద అఖిలభారత విశ్వకర్మ పునరుద్ధరణ మహాసభ జరిగింది లాలా లజపత్‌రాయ్, చిత్తరంజన్‌దాస్, అలీ సోదరులు, పండిత్ మోతీలాల్ నెహ్రూ, విజయరాఘవాచారి, హకీం అజ్మల్‌ఖాన్, యన్ సి కేల్కార్, కొండ వెంకటప్పయ్య, రాజా మంత్రిప్రగడ భుజంగరావు, శ్రీమతి సరళాదేవి చౌధ్‌రాణి కస్తూరిబాగాంధీ మొదలయిన సుప్రసిద్ధ కాంగ్రెస్ నాయకులు ఆ సభలో ప్రేక్షకులుగా ఉన్నారు

గాంధీజీని ప్రశంసిస్తూ ఇంగ్లీషు, తెలుగు భాషల్లో పద్యాలు పఠించిన తరవాత ఆహ్వాన సంఘాధ్యక్షుడు గానాల రామమూర్తిగారు ఆహ్వాన పత్రం చదినారు తరవాత గాంధీజీ దేశ స్వాతంత్ర్యోద్యమంలో విశ్వకర్మ సంఘంవారు సహకరించవలెనని కోరుతూ హిందీలో ఉపన్యసించినారు ఆ సభలో భారతదేశపు చేతివనులను ప్రోత్సహించి విశ్వకర్మ సంఘంవారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడవలెనని కాంగ్రెస్‌ను కోరుతూ తీర్మానించడం జరిగింది ఆ సభకు విశ్వకర్మ ప్రతినిధులు 800 మంది హాజరయినారు తదితరులు 2 వేలమంది ప్రేక్షకులుగా వచ్చినారు (శ్రీ) వి కళ్యాణసుందరాచారి తమిళ రాష్ట్ర ప్రతినిధిగా వచ్చినారు

ఆ సభలో చిత్తరంజన్‌దాస్, లజపత్‌రాయ్, మోతీలాల్ నెహ్రూ,షౌకతాలీ, సరళాదేవిగార్లు స్వరాజ్యోద్యమాన్ని గురించి ప్రసంగించినారు

## గాంధీజీ - కాకినాడలో

ఏప్రిల్ 3 వ తేదీన ఉదయం 10 గంటలకు మహాత్మాగాంధీ కాకినాడలో రైలు దిగినారు అప్పటికప్పడే జనం క్రిక్కిరిసిపోయి ఆయన గుఱ్ఱపు బండి కదలడానికి వీలులేకుండా చుట్టూ మూగినారు కాంగ్రెస్ స్వచ్ఛంద సేవకులు ఎంతో జాగ్రత్తతో జనంలోనుంచి గాంధీజీ కూర్చున్న గుఱ్ఱపు బండి పోయేటందుకు తోవ చేయగలిగినారు ఈ పని వారికి దాదాపు ఒక గంట పట్టింది గాంధీగారు పెద్ద బజారు గుండా జగన్నాయకపురంలోని పైడా వెంకటనారాయణ ఇంటికి చేరుకున్నారు గాంధీగారి వెంట కొండ వెంకటప్పయ్యపంతులుగారు, గంటి సుబ్బారాయుడుగారు, బులుసు సాంబమూర్తిగారు మొదలయిన పెద్దలు ఉన్నారు ఆ రోజున వడగాడ్పులు సాగినాయి అందువల్ల ఊరేగింపుగానీ, మధ్యలో గాంధీజీ బండిని ఆపడంకానీ జరగలేదు ఆనాటి సాయంకాలంవరకూ తన బసలోనే గాంధీజీ అనేకమందికి దర్శనమిచ్చినారు సాయంకాలం 6-45 నిమిషాలకు ఎల్విన్ పేటలోని పార్కు స్థలంలో జరిగిన బహిరంగ సమావేశానికి గాంధీజీ ఊరేగింపుతో మోటారులో వచ్చినారు సభా స్థలంలో ఎత్తయిన వేదికపైన గాంధీ దంపతులు,వారి నాలుగో కుమారుడు కూర్చున్నారు సభా స్థలంలో ఏ విధమైన విదేశీ అలంకారాలు చేయలేదు ఎక్కడ చూసినా పచ్చ తోరణాలతో స్వదేశీ బట్టపైన కాంగ్రెస్ నినాదాలు వ్రాయడం జరిగింది మైదానమంతా 200 వాషింగ్‌టన్ దీపాల వెలుగుతో

పట్టపగలువలే కనబడింగి 40 వేల మంది జనం హాజరైనారు వారిలో 500 మంది స్త్రీలు గూడా ఉన్నారు అందరూ ఎంతో ప్రశాంతంగా ఉన్నారు అందువల్ల మహాత్ముని మాటలు 80 గజాల దూరం వరకూ వినిపించి గాయి మునిసిపల్ వైస్ చైర్మన్ ఎల్లాజోస్యుల వెంకటేశ్వర్లు గారు మునిసిపల్ సంఘం పక్షాన గాంధీజీకి స్వాగత పత్రం చదివి సమర్పించినారు దాని తెనుగను వాదము స్థానిక కళాశాలా తెలుగు పండితుడు కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు చదివినారు

## స్వాగత పత్రము

"మహాత్మాజీ! కాకినాడ పౌరుల పక్షాన కాకినాడ పురపాలక సభ్యులమైన మేము తమకు హృదయపూర్వక స్వాగతం ఇస్తున్నాము 25 సంవత్సరాలకు పైగా తామీ దేశంలోను, పరదేశంలోను స్వాతంత్ర్య సంగ్రామానికి జరుపుతున్న సంఘర్షణ వల్ల తాము పడిన బాధలవల, తాము ప్రతి భారతీయునికి ప్రియతములైనారు

ఈ దేశంలో నివసిస్తున్న ప్రసిద్ధ జాతుల వారిరువురిలో సంపూర్ణ ఐకమత్యం సమకూర్చడానికి చిరకాలంనుంచి మీ నాయకత్వంలోనే సిద్ధించింది

తమ జీవితాశయం ప్రతి హైందవునికి ప్రోత్సాహజనకంగా ఉన్నది ఈ దేశంలో యావన్మంది ప్రజలలో వ్యాపించిన జాతీయ భావోదయాలకు తాము కారకులు మన దేశ చరిత్రేతిహాసానుగుణంగా రాజకీయ సమస్యలను ఆధ్యాత్మికంగా సమన్వయించినందుకు తమ కెంతో కృతజ్ఞులము

తమ ప్రయత్నాలు జయప్రదాలై భరత వర్షం స్వరాజ్యం పొందేటట్లు భగవంతుని ప్రార్థిస్తున్నాము మన మాతృభూమి కోసం తాము పూనిన మహత్కార్యం నిర్విఘ్నంగా కొనసాగడానికి భగవంతుడు తమకు దీర్ఘాయురారోగ్యాల నిచ్చుగాక "

## మహాత్ముని ప్రత్యుత్తరము

'హిందూ మహమ్మదీయ సోదరులారా ! కాకినాడ మునిసిపల్ సభ్యులారా! నేను బలహీనంగా ఉన్న సంగతి భారత దేశంలోని అన్ని ప్రాంతాలతో పాటు మీ కందరికీ కూడా ఇదివరకే తెలిసి ఉంటుంది అందువల్ల నేను నిలబడి మాట్లాడలేనందుకు మన్నింప ప్రార్థన నాతో నా సోదరుడు మౌలానా షౌకతాలిని తీసుకొని రాలేనందుకు కూడ క్షమాపణ చెప్పుకొంటున్నాను నిజమైన హిందూ మహమ్మదీయ సంఘీభావమంటే ఏమిటో ఇండియాకు తెలియ చెప్పడానికి నేనూ మౌలానా షౌకతాలీ సుమారు ఒక సంవత్సరం యావద్భారత దేశంలో పర్యటించినాము ఇటీవల కొంతకాలం నుంచి ఇద్దరమూ కలసి ప్రయాణం చేయటానికి అవకాశం కుదరటంలేదు మన మందరం ఈ సంవత్సరంలోనే పంజాబ్, ఖిలాఫత్ అన్యాయాలకు తగిన పరిహారం పొందేటందుకు కూడా

కుతూహాలులమై ఉన్నాము కాబట్టి మే మిద్దరం ఒక సంవత్సరం పాటు కలసి తిరిగిన తరవాత దేశంలోని వివిధ ప్రదేశాలలో విడివిడిగా తిరిగి ప్రచారం చేయడానికి మా శక్తి సామర్థ్యాలను ప్రత్యేకంగా వినియోగించదలచుకొన్నాము హిందూ మహమ్మదీయ ఐక్యాన్ని గురించిన ముఖ్యావసరం మీకు కడచిన సంవత్సరంలో మే మిద్దరము నచ్చచెప్పలేకపోతే ఈ సంవత్సరంలో హిందూ మహమ్మదీయ సంఘీభావంవల్ల భారతీయులకు కలిగిన సుఖశాంతులు మిమ్ములను సంతృప్తి పరచలేకపోతే హిందూ మహమ్మదీయ సఖ్యం అవసరం గురించి నేనింక ఎన్నటికీ మీకు నచ్చచెప్పలేనని అభిప్రాయపడుతున్నాను మౌలానా షౌకతాలీ నిజమైన మహమ్మదీయుడు నేను సిక్కచ్చియైన సనాతన హిందువును మా మతాల గురించిన అభిప్రాయాలు మా కున్నాయి కాని మే మిద్దరము ఒక్క తల్లి కడుపున పుట్టిన అన్నదమ్ముల కంటె కూడా ఎక్కువ సన్నిహితంగా ఉండగలుగుతున్నాము భారత జాతికి ఆహార, పానీయ, నిద్రాదు లెంత అవసరమో, హిందూ మహమ్మదీయ సఖ్యతకూడ అంత అవసరమన్న సంగతి ఈ పాటికి ప్రజలు గ్రహించే ఉంటారు అంతేకాదు కొన్ని షరతులను నిర్వర్తిస్తే ఒక్క సంవత్సరంలో స్వరాజ్య సంపాదన సాధ్యమని కూడ మీరు గ్రహించి ఉంటారని నా అభిప్రాయము

మన స్వరాజ్య పురోగమనానికి మార్గదర్శకమైన ఈ మునిసిపల్ సన్మానపత్రం నేను అంగీకరిస్తున్నాను ఇంతకు పూర్వం గవర్నర్లను, రాజ ప్రతినిధులను ఆహ్వానించి సన్మానపత్రాలను సమర్పించడం మునిసిపల్ కౌన్సిర్లకు అలవాటు ఇప్పుడు నా వంటి సామాన్య ప్రజా సేవకులను సైతం ఆహ్వానించి గౌరవిస్తూ ఉండడం వల్ల మునిసిపాలిటీలు స్వరాజ్య సంపాదనకు చేదోడు వాదోడుగా ఉంటున్నవని నేను భావిస్తున్నాను మనకు భయము, ఆత్మ విశ్వాసం లేకపోవటము, స్వరాజ్య సంపాదనకు నిజమైన అభ్యంతరాలు మునిసిపాలిటీ వారిచ్చిన ఈ సన్మానపత్రం నా వ్యక్తిగత యోగ్యతను బట్టి యిచ్చినదిగా నేను భావించటం లేదు భారత జాతీయ ప్రతినిధిగా ఈనాడు నేను ప్రతిపాదిస్తున్న ఆదర్శాన్ని ఈ సన్మానపత్రం ఆమోదిస్తూన్నదని నేను నమ్ముతున్నాను ఇంతకుపూర్వం మునిసిపాలిటీలకున్న భయం ఈనాడు కనబడడం లేదు అవి ఇంతవరకూ నమ్ముతున్నట్లుగా తాము ప్రభుత్వంతో బంధింపబడి ఉన్నట్లు కూడ భావించటం లేదు ఈ మునిసిపాలిటీవారు యింకొక అడుగు ముందుకుపోయి అహమ్మదాబాద్, సూరత్, నడియాడ్ మునిసిపాలిటీల ఉదాహరణలను ఒరవడిగా ఉంచుకోవలెనని కోరుతున్నాను ఈ మునిసిపాలిటీ పరిధిలో విద్యను జాతీయం చేయవలెనని కోరుతున్నాను భారతదేశంలోని మునిసిపాలిటీలన్నీ తమ అధికారాన్ని గుర్తించి తమ కర్తవ్యాన్ని తాము నిర్వర్తించగలిగినట్లయితే అవి స్వరాజ్యానికి ముఖ్య సాధనాలు కాగలవని నేను చెప్పడానికి సాహసిస్తున్నాను ఇంతకూ స్వరాజ్యమంటే మునిసిపల్ పరిపాలన విస్తృతం కావటంకంటె మరొకటి కాదు ఇండియాలోని ప్రతి గ్రామము,

ప్రతి పట్టణము తమ వ్యవహారాలను తాము చక్కపెట్టుకోగలిగినట్లైతే భారత దేశంలోని అన్ని గ్రామాలూ, అన్ని పట్టణాలూ భారత జాతీయ వ్యవహారాలను సలక్షణంగా చక్కబెట్టుకోగల వనటంలో ఎంత మాత్రం సందేహం లేదు అఖిల భారత కాంగ్రెస్ సంఘం భారతదేశ మంతటికీ నాయకత్వం వహించి ఒక చిన్న కార్యక్రమం సూచించింది కాంగ్రెస్ మనకు జాతీయ సంస్థగా ఉండవలె నంటే, స్వరాజ్య సంపాదనకది సాధనంగా ఉపయోగపడవలెనంటే భారతదేశంలో పుట్టిన ప్రతి పురుషుడూ, స్త్రీ హిందువుకానీ, ముసల్‌మాన్‌కానీ, పార్శీకానీ, యూదులుకానీ అందరూ కాంగ్రెస్ సభ్యులుగా చేరవలె కనక నే అ భా కాం సం జూన్ 30వ తేది నాటికి కోటిమంది కాంగ్రెస్ సభ్యులుగా చేరవలెనని ఆదేశించింది కొన్ని మాసాలనుంచి భారత జాతి ఒక అద్భుతమైన శక్తిని, ఆశ్చర్యకరమైన ఐక్యతను ప్రదర్శిస్తూన్నది కనక భారత జనసంఖ్యలో జూన్ 30 వ తేదీలోగా కనీసం నూటికి ఐదు మంది అయినా కాంగ్రెస్ సభ్యులుగా చేరటం ఏ మాత్రం గొప్ప విషయం కాదు

మీరు పూజ్యుడైన లోకమాన్య బాలగంగాధర్ తిలక్‌ను నిత్యమూ స్మరిస్తూ ఉంటారు నే నెక్కడికి పోయినప్పటికీ ఆయన బొమ్మ ప్రతియింట్లోను, ప్రతిద్వారం దగ్గర, ప్రతి బహిరంగ సభలోను కనిపిస్తూవుంటుంది ఆ ఉత్తమ దేశభక్తుని గౌరవార్థం ఆయన పేరుతో ఒక కోటి రూపాయల నిధిని సేకరించి ఆయనపట్ల మీకు ఉన్న పూజ్య భావం ప్రకటింపవలెనని కాంగ్రెస్ మిమ్ములను అర్థించింది ఈ కోటి రూపాయలు ఆయన చలువరాతి విగ్రహాలు నిర్మించ టానికి గాని, స్మారక మందిరాలు కట్టించటానికి గాని, కాంగ్రెస్ ఉపయోగించ బోవటం లేదు స్వరాజ్య సంపాదనకది పెట్టుబడి సాధనంగా మాత్రమే ఉప యోగింపబడుతుంది ఆంధ్ర దేశంలోని స్త్రీ పురుషులు ధరిస్తూండిన ఆభరణా లలో కొన్ని వారు త్యాగం చేయగలిగితే ఆంధ్రదేశము చెల్లింపవలసిన స్వరాజ్య నిధి ఒక్క వారంలో పూర్తికాగలదని నా నమ్మకము ఈ సంవత్సరంలో ఖిలా ఫత్, పంజాబు దుర్నయాలకు తగిన పరిహారం పొందేటందుకూ స్వరాజ్యం సంపాదించేటందుకు మీరు దృఢ నిశ్చయులై ఉన్నట్లయితే మనం సకల త్యాగా లకూ సంసిద్ధులమై ఉండవలె కాంగ్రెస్ రానున్న జూన్ నెలాఖరుకు ఇండి యాలో 20 లక్షల రాట్నాలకు తక్కువ లేకుండ స్థాపించవలెనని మనకు సూచిం చింది సోదరీమణులారా! నా ఎదుట కనిపిస్తూండిన మీలో చాలామంది ధరిస్తూండిన విదేశీ వస్త్రాలు మన హానిసత్వానికి చిహ్నాలు మాత్రమే విదేశీ వస్త్రాలు ధరించిన స్త్రీ పురుషులు సౌందర్యవంతులుగా కనపడరు సరిగదా, పై పెచ్చు కురూపులుగా కనిపిస్తారు హానిసత్వాన్ని స్వాతంత్ర్యంగా భావిస్తు న్నప్పుడు కురూపత సౌందర్యంగా కూడా కనిపిస్తుంది ఇండియాలోని ప్రతి గృహంలో రాట్నం స్వతంత్ర గీతాలను ఆలాపించిన రోజున భారత దేశం స్వతంత్రమై అష్టైశ్వర్యాలతో తులతూగగలదు రాట్నం భాగ్యచిహ్నమని తమ తల్లులు అంటూండడం తమకు జ్ఞాపకం వస్తూన్నదని యావద్భారత దేశం

లోని వేలకొద్ది స్త్రీలు చెప్పగా నేను విన్నాను రాట్నం పవిత్రతకు, నిరాడంబ రానికి, స్వాతంత్ర్యానికి చిహ్నము యావత్ప్రపంచానికి అది శాంతిస్వరూపము పాశ్చాత్య దేశాల హత్యాకాండలో మనం జోక్యం కల్పించుకోపోవటం లేదని మన రాట్నం ప్రపంచానికి ఋజువు చేసినట్లు నిన్న చిత్తరంజన్‌దాస్ చెప్పిన మాటలు యథార్థాలు హిందూదేశ మిక ఇంగ్లాండ్, ఫ్రాన్స్, అమెరికా, జపాన్ మొదలయిన దేశాల దోపిడీ విధానానికి గురి కాజాలదని ఆయా దేశాల వారికి మన రాట్నం ఈనాడు స్పష్టంగా తెలియచేస్తున్నది ఒక ఎండు రొట్టె, ఒక చిటికెడు ఉప్పుతో రోజుకు ఒక్కపూట తిని జీవించే ముప్పయికోట్ల జనా భాకు రాట్నము ఈనాడు ఒక సుహృద్భావ సందేశాన్ని అందజేస్తూంది హిందూ దేశాన్ని ఒకే జాతిగా రూపొందించటానికి రాట్నం ఒక సంధానంగా ఉపయోగపడుతూన్నది రాట్నమనే ఈ సంధానాన్ని తొలగించినట్లయితే స్వరాజ్య సౌధం కూలిపోగలదు ఈస్టిండియా కంపెనీవారి దౌర్జన్యానికో, లేదా వారి రూపాయకో ఇండియా లొంగిపోయిననాడే భారతదేశం తన స్వాతం త్ర్యాన్ని దాదాపు తన జాతీయతను కూడా పోగొట్టుకొన్నదని జ్ఞాపకం పెట్టుకోండి కాబట్టి ఈ కాకినాడవంటి పెద్ద పట్టణంలో ప్రతి ఇంట్లోను ఒక రాట్నం స్థాపించేటంతవరకూ కార్య తత్పరులైన ఈ కాకినాడ పౌరులు విశ్ర మించరని నేను విశ్వసిస్తున్నాను ప్రతిరోజు కొన్ని గంటలు నూలు వడకటం తమ ప్రతిష్ఠకు లోపంగా కాకినాడలోని బాలబాలికలు స్త్రీ పురుషులూ భావించ రని నా అభిప్రాయము ప్రతిరోజూ నూలు వడకడం మనమొక ప్రాయశ్చిత్త కర్మగా భావించవలె నన్ను పర్యాయం ఎవరైనా ఇక్కడికి ఆహ్వానించినప్పుడు ఇక్కడ విదేశీ వస్త్రాలు ధరించిన యువతీ యువకులు, స్త్రీ పురుషులు ఉండరని నాకు మీ రీనాడు హామీ ఇవ్వవలె భారత దేశం యావత్తు జూన్ నెలాఖరు లోగా ఈ చిన్న పరీక్షలో ఉత్తీర్ణులైతే - నేను దీనిని చిన్న పరీక్ష అని బుద్ధి పూర్వకంగా అంటున్నాను - జూలై 1వ తేదీ నాటికి భారత దేశం యావత్తు ఒక నూతన జీవంతో ప్రతిస్పందించగలదు

మనం పరమ పవిత్రంగా భావిస్తూన్న జాతీయ వారం ఇక రెండు మూడు నాళ్ళలో రానున్నది 1919 ఏప్రిల్ 6 వ తేది ఇండియాను నిద్ర నుంచి మేల్కొల్పింది ఆనాటి ఏప్రిల్ 13 న ఆధునిక కాలంలో కని విని ఎర గని హత్యాకాండను ఇండియా ప్రత్యక్షంగా చూసింది ఆ వారం భారతీయుడు విస్మరించడం కేవలం అపరాధము అపరాధమేకాదు పాపం కూడా ఏప్రిల్ 6, 13 తేదిలలో భారతదేశమంతట కేవలం స్వచ్ఛందంగా సంపూర్ణ హరతాళం జరగవలె హరతాళం జరపడంలో ఏ విధమైన బలవంతం కూడదు ఎవరైనా ఒకరు తన అంగడిని తెరవదలచుకొన్నట్లయితే ఆయనకేమీ హాని జరగకుండా మనం రక్షణ ఇవ్వవలె పవిత్రత అన్నది స్వచ్ఛందంగా జరిగినప్పుడే పవిత్రత అవుతుంది బలవంతమెప్పుడూ స్వాతంత్ర్యానికి మార్గంకాదు వినయము, సమ న్వయము, ఓర్పు, సరళత్వం స్వాతంత్ర్యానికి మార్గాలు వీలైనవారు ఈ రెండు

రోజులు ప్రత్యేకం ఉపవాసంతో, ప్రార్థనతో కాలక్షేపం చేయటం మంచిది ఇది స్వాతంత్ర్య సమరమనే మాట మరచి పోకండి దీనిలో మనకు తుపాకు లక్కరలేదు ద్రవ్యసహాయం కావలె ఆ వారంలో మీరు ఆత్మపరిశోధన చేసుకో వలె శక్తివంచన లేకుండా మద్యపాన పిశాచంతో పోరాడవలె

మనం పవిత్రులుగా ఉండటానికి తప్పని సరిగా మరొక సంగతిని కూడా ఆదర్శంగా పెట్టుకోవలె ప్రతి పురుషుడు ప్రతి స్త్రీని తన తల్లిగానో, సోదరి గానో భావించవలె ప్రతి స్త్రీ ప్రతి పురుషుణ్ని తన తండ్రిగానో, సోదరుని గానో భావించవలె నేనొక సంస్థాన నగరంలో పుట్టిన వాణ్ణి సంస్థాన ప్రజలు ఎటువంటి ప్రలోభాలకు గురి అవుతుంటారో నాకు బాగా తెలుసు నిన్ననే ఒక స్నేహితుడు రంగూన్ ప్రజల జీవితం గురించి ముచ్చటించినాడు రంగూన్‌కు పోయేవారు చాలా మంది అవాంఛనీయాలైన అభ్యాసాలకు గురౌతున్నారు మనము ధర్మరాజ్యాన్ని, రామరాజ్యాన్ని కోరుతున్నట్లయితే జాతీయ పవిత్రతతోపాటు వ్యక్తిగత పవిత్రత కూడా అవసరము మన రాజ్యానికి పునాది ఆత్మనిగ్రహం కాని స్వీయభోగలాలసత్వం కాదు ఈ జాతీయ వారంలో అ భా కాం సం వారు సూచించిన కార్యక్రమం నిర్వహించేటం దుకు వినియోగించగలరని ఆశిస్తున్నాను ఆ వారంలో హిందూ మహ్మదీయ ఐక్యభావం మరింత పటిష్ఠం చేసేటందుకు మీరు ప్రయత్నించగలరని విశ్వసి స్తున్నాను ఆ వారంలో మీలో ప్రతి ఒక్కరూ భారత దేశస్వాతంత్ర్యం కేవలం అహింసపైన ఆధారపడి ఉన్నదని అందరినీ ఒప్పించగలరని ఆశిస్తున్నాను మనతో ఏకీభవించని మన దేశీయులపైన కోపంతో ఒక మాట అన్నప్పటికి, ఒక ఆంగ్లేయుని దూషించినప్పటికీ, మనకు హాని చేసిన వారిపైన నొక కర్రవిసిరినా కాంగ్రెసు ఆదేశ ప్రకారం అది హింస అవుతుందని మీరందరూ గ్రహించవలెనని నా కోరిక మన మధ్య నివసిస్తూండిన విదేశీయుల్లో అధమాధమునికిగానీ, మన దేశీయుల్లో అట్టడుగు మనిషికిగానీ మనం దౌర్జన్యం చేస్తామనే భయం ఉండ రాదు అప్పుడే మనం ప్రజాస్వామ్య జాతిగా పేరుపొందడానికి అర్హులం కాగలము ఏ వొక్క మనిషినైనా మనం అంటరానివానిగా భావించినట్లైతే మనం అహింసను దుర్మార్గంగా ఉల్లంఘించిన వారమవుతాము కుష్ఠురోగై నప్పటికీ, పరయా (మాల) అయినప్పటికీ వానిని తాకినంత మాత్రంతో, వాని నీడ సోకినంత మాత్రంతో వైష్ణవ, శైవ మతస్థులు మైలపడతారని భావించటం అహింసాతత్త్వాన్ని నిరాకరించడమే అవుతుంది ఈ విషయంలో భగవద్గీత స్పష్ట మైన ఆదేశమిచ్చింది బ్రాహ్మణునిపట్ల చండాలునిపట్ల కూడా సమానమైన ప్రేమతో, సమానమైన సోదర భావంతో ప్రవర్తించవలసిందని భగవద్గీత మన లను ఆదేశించింది. ఏవొక్క మనిషినైనా తనకన్న హీనుడని భావించే బ్రాహ్మ ణుడు అతని బ్రాహ్మణత్వాన్ని కోల్పోతున్నాడు భగవంతుని నామాలలో అత్యంత మనోహరమైన దాసానుదాస అనే పేరు దేవునికి లోకోత్తర పురుషు డెవడో కనిపెట్టినట్లు తోస్తుంది. కాబట్టి ఇండియా 'అస్పృశ్యత' అనే పాపం

నుంచి విముక్తి కావలసిన సమయం ఆసన్నమైంది

ఇక్కడ సమావేశమైన నా సోదరీమణులు ఒక ప్రత్యేకమైన మనవి నేను సంచారం చేసిన అన్ని ప్రదేశాలలోను భారత నారీమణులు నాపట్ల చాల ప్రేమ చూపుతున్నారు నేను వెళ్ళిన చోటు లన్నిటిలో నన్నూ, మౌలానా షౌకతాలీని ఆశీర్వదించవలసిందని నా సోదరీమణులను నేను అర్థిస్తున్నాను ఇతర సోదరీమణులవలెనే మీరు కూడా నన్నాశీర్వదించవలె నే నీ ఆశీర్వాదం కోరుతూన్నది ఎందుకో మీకు తెలిసే ఉంటుంది మేము భారత స్వాతంత్ర్యం కోసం భారతదేశ మత ధర్మాలకోసం పోరాడు తున్నాము రావణ రాజ్యానికి బదులుగా రామ రాజ్యం స్థాపించ ప్రయత్నిస్తున్నాము ఆ అశోక వాటికలో ఆ పుణ్యావతి సీత తన ఆభరణాలను త్యజించింది, రావణుడు పంపించిన రుచికరాలైన ఆహారాలను నిరాకరించింది అశోకవనంలోని చెట్ల పండ్లతో సంతృప్తిపడి ఆమె జీవించింది మీరందరూ ఆ సీతాదేవి వంశీయులు కనక ఆమె అడుగు జాడలను అనుసరించవలెనని నేను మిమ్ములను అర్థిస్తున్నాను పవిత్రురాలైన నారీమణి ఆశీర్వాదాలు వ్యర్థంకావని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి మీరు సీత వంటి అంతశ్శుద్ధితో ధైర్యవంతులుగా ఉండవలెనని నా అభిలాష సీతాదేవికి ఉండిన స్థైర్యం మీలో ఉంటే మీ ఆనందంకోసం ఈ ఆభరణాలు మీరు అక్కర లేదని, కోర్టులలో వాదించటం ప్రభుత్వోద్యోగాలను చేయటం కూడదనీ మీరు మీ భర్తలకూ, తండ్రులకూ చెప్పగలరు మీ బలమైన చేతుల, గెలువైన వేళ్ళతో నూలువడకగలమని కూడా చెప్పగలరు అందువల్ల మీ భర్తలు, తండ్రులు, సోదరుల సంపాదనకు తోడు మీరు మీ కుటుంబానికి మరికొంత ఆదాయం చేకూర్చగలమని కూడా చెప్పవచ్చు మీ బిడ్డలను నేటి రావణ రాజ్య పాఠశాలలకు పంపడానికి నిరాకరించండి మీ పవిత్రమైన హృదయాలతో విదేశీ బట్టలవల్ల కళంకితాలుగాని మీ శరీరాలతో మీరు మమ్ములను ఆశీర్వదించమని కోరుతున్నాను అప్పుడు ఈ ఏడాదిలో మనం ధర్మరాజ్యం స్థాపించగలమని నా విశ్వాసము మీరు మీ ఆభరణాలను నిండుమనసుతో సమర్పించండి మొగమోటపడి యివ్వవద్దు మీరు నాకు నగదు కూడా ఇవ్వవచ్చు మీరిచ్చిన సొమ్ము పేదలకు రాట్నాలు ఇచ్చేటందుకు, పేదపిల్లలను చదివించేటందుకు ఉపయోగపడుతుంది ఇండియాలోని ఒక స్త్రీగాని, పురుషుడుగాని అన్నవస్త్రాలకు అల్లాడుతూన్నంత వరకు మీకూ, నాకూ ఆభరణాలతోను, అందమైన దుస్తులతోనూ ఆనందించే హక్కులేదు మీరు నా మాటలను ఓరిమితో విన్నందుకు నేను కృతజ్ఞుడను

ఈనాడు మన ఉపన్యాసాలుగానీ తీర్మానాలుగానీ మన కోసం ఉద్దేశింపబడిన వన్నమాట మీరు మరవకూడదు ఇంతకు పూర్వం మన ఉపన్యాసాలూ, మన తీర్మానాలూ కూడ గవర్నమెంట్‌వారు చేయవలసిన పనులను గురించి ఉండేవి ఇప్పుడట్లాకాదు! మన కర్తవ్యం గురించే మన ఉపన్యాసాలుగానీ,

తీర్మానాలుగానీ ప్రబోధిస్తూన్నాయి స్వరాజ్య సంపాదనలో మీకందరికి ఉత్సాహ మున్నదని నిరూపించేటందుకు కనీసం ఒక ప్రత్యక్ష నిదర్శనం నేను అపేక్షిస్తున్నాను మీ మధ్యకిప్పుడే స్వచ్ఛంద సేవకులు వస్తారు మీరు వారికి ఒక పైసాయో, ఒక రూపాయో, ఒక బంగారు గాజో, ఒక ఆభరణమో ఏదో ఒకటి హృదయ పూర్వకంగా ఇవ్వండి స్వరాజ్య సంపాదనకు మీ ఈ నిశ్చయమే మనకు స్వరాజ్యం తెచ్చి పెట్టగలదు కోట్ల కొలది రూపాయలు నన్నెంత సంతృప్తి పరచగలవో మీరిచ్చిన పైసా కూడ నన్నంత సంతృప్తి పరచగలదు ఈ ఏడాదిలో మీరు ఎంతో క్రమశిక్షణతో ప్రవర్తించవలె దేవుడు మీకందుకు తగిన ధైర్యాన్ని సమర్థతను ఇవ్వగలడని విశ్వసిస్తున్నాను" మహాత్ముని ఈ ఉపన్యాసం బులుసు సాంబమూర్తిగారు వాక్యం వెంట వాక్యం తెలుగులోకి అనువదించి చెప్పినారు

గాంధీజీ ఉపన్యాసానంతరం వలంటీర్లు సొమ్ము, నగలు మొదలయినవి వసూలు చేసేటందుకు జనంలోకి వెళ్ళినారు 4 వేల రూపాయల విలువగల సొమ్ము వసూలైనట్లు అంచనా వేయబడింది తరవాత సమావేశం ముగిసింది ఆ రాత్రి 11 గంటల వేళ కొందరు వకీళ్ళు తదితరులు గాంధీజీని దర్శించి సంభాషించినారు

## గాంధీజీ మళ్ళా రాజమహేంద్రవరంలో

ఏప్రిల్ 6 వ తేదీన, మహాత్మాగాంధీ కాకినాడనుంచి రాజమహేంద్రవరం వచ్చినారు రాజమహేంద్రవరంలోని బహిరంగసభలో ఇట్లా ఉపన్యసించినారు

'ఉపన్యాసాలు చేస్తూండే కాలం, వింటూండే కాలం దాటిపోయిందని మీరు గ్రహించవలె భారత జాతికోసం ఒక కోటి రూపాయలు జూన్ 30 వ తేదీలోగా మన దేశంలో సేకరింపబడవలెనని అ భా కాం సం తీర్మానించింది కాంగ్రెస్ సభ్యులుగా ఒక కోటిమంది స్త్రీ, పురుషులను చేర్పించవలెననీ భారతీయ గృహాలలో 20 లక్షల రాట్నాలను స్థాపించవలెననీ కూడ అ భా కాం సం ఆదేశించింది మీ వంతురు సంబంధించినంతవరకు మీ పనిని మీరు జయప్రదంగా నిర్వహించగలిగితే స్వరాజ్యం మనకు అనతికాలంలో లభించగలదు ఈ పని హిందూ మహమ్మదీయులు కలసి మెలసి ఉంటేనేగాని సాధ్యం కాదు జీవితానికి ప్రాణవాయువు ఎంత అవసరమో జాతీయాభివృద్ధికి హిందూ ముస్లిం సంఘీభావం అంత అవసరము హిందూ ముస్లిం సఖ్యత అంటే నేమో నేను, మౌలానా షౌకతాలీ భారత ప్రజానీకానికి విశదం చేస్తున్నాము మేమిద్దరము మా మతాలలో నిష్ఠగలవారమే నేను హిందూ సనాతన ధర్మవాదిని, ఆయన ఇస్లాం మతస్థుడు స్వరాజ్య సంపాదనకు ఖిలాఫత్, పంజాబు దురంతాల పరిహారానికి హిందూ ముస్లిం ఐక్యము ఎంత అవసరమో అహింసాయుత ప్రవర్తనకూడ అంత అవసరము హిందూ ముస్లిం సఖ్యత, అహింస అంటే

అరిషడ్వర్గాలను అదుపులో ఉంచుకోవడం మనసులను, హృదయాలను పరిశుద్ధంగా వుంచుకొని నీచమైన అసూయా ద్వేషాలకు తావీయకుండా ఉండటం అందువల్ల నేను నీ ఉద్యమాన్ని ఆత్మనిగ్రహోద్యమమనీ, ఆత్మపరిశుద్ధోద్యమమనీ అంటున్నాను మీరు తాగకూడదు, తాగినవారు మనుష్యులుగా మన జాలరు

తాగుబోతు అలవాట్లను తక్షణం మానిపించటానికి ఇండియా చేసే పవిత్రమైన ప్రయత్నంకంటె నాకు ఎక్కువ ఆనందాన్ని సంతోషాన్ని కలిగించేది మరొకటి లేదు' ఈ ప్రసంగానంతరం అక్కడ చేరిన స్త్రీలను గురించి గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు,

"ప్రియ సోదరీమణులారా! నేను మీకు ఒక మతసంబంధమైన కర్తవ్యం గురించి చెప్పబోతున్నాను మీలో ఎవరైనా ఒక వేశ్య ఉంటే ఆమె లజ్జాకరమైన జీవితం గడపకుండేటట్లు చేయండి రాట్నం చేపట్టి ఏ కొద్ది పైసలో సంపాదించుకోండి అది మీకు పైసలనీయడమేకాక మీ గృహాంలో దేవుని సైతం ప్రతిష్ఠించగలదు మగవారి మోహప్రలోభాన్ని తృప్తిపరచేటందుకో పొట్ట కూటికోసమో ఏ స్త్రీ అయినా తన సౌశీల్యం విక్రయించడం సీతారాములు ఒక్క క్షణం సహించగలిగి ఉండేవారా! ఈ వేశ్యాంగనల రక్షణకోసమైనా మీరందరూ మీ నాజూకు బట్టలను, నగలనూ విసర్జించవలెనని కోరుతున్నాను భారతదేశంకోసం కాకపోయినా కనీసం ఆ వేశ్యాంగనలకోసమైనా రాట్నం మీద పనిచేయండి భారతదేశ పవిత్రతకోసం మీరు రాట్నం చేపట్టండి మీ చర్ఖా ప్రసాదించిన చీరనే మీరు ధరించండి ఇండియాలో తయారైన పరిశుభ్రమైన వస్త్రాలు భారతదేశ స్త్రీ పురుషుల సౌశీల్యం కాపాడగలవు నాజూకైన విదేశీ బట్టలు కట్టుకోవడం పాపంగా భావించండి

మీలోనుంచి అస్పృశ్యతా మహాపాపం తొలగించుకోండి ఆంధ్రదేశంలోని నాయకులందరికీ నా యీ ప్రసంగం అందవలెనని కోరుతున్నాను స్వతంత్రజాతిని అధోగతికి తీసుకొనిపోవద్దు మీరందరూ భగవత్‌చింతకలవారని విశ్వసిస్తున్నాను ఇండియాకోసం మీరు సర్వస్వం త్యాగం చేయగల శక్తి మీకు ఉన్నదని నా నమ్మకము మీరందరూ సేవాతత్పరులని కూడా నేను భావిస్తున్నాను మీలో ప్రతి ఒక్కరూ ఆత్మపరిశోధన చేసుకొని ఈ ఉద్యమ ఆంతర్యం గ్రహించవలెనని కోరుతున్నాను ఇంతేకాని వట్టి ప్రగల్భాలు పలకవలదని నా అభిలాష ఈ ఉద్యమ విజయానికి వాగాడంబరం అనవసరము వ్యక్తిగత పరిశుద్ధత, వినయము, పరస్పరావగాహన, నిరంతర కార్యదీక్ష, స్వరాజ్య సంపాదనకు, ఖిలాఫత్, పంజాబు దురంతాల పరిహారానికి అవసరాలు ఇందుకు తగినంత వివేకము, ధైర్యము, విచక్షణ జ్ఞానము, సేవాశక్తి, భగవంతుడు మీకు ప్రసాదించు గాక'

ఈ ఉపన్యాసంలో గాంధీజీ వేశ్యలను గురించి చెప్పిన మాటలకు కారణం ఆయన కాకినాడలో సభనుంచి వస్తూండగా కొందరు వేశ్యలు ఆయ

నను చూడవచ్చినప్పుడు ఆయనకు కలిగిన విచారము

### గాంధీజీ - పెద్దాపురంలో

గాంధీ దంపతులు కాకినాడనుంచి రాజమహేంద్రవరం వెళ్ళుతూ తోవలో పెద్దాపురంలో దిగినారు ఉదయం 6 గంటలకు బహిరంగసభ జరిగింది సుమారు 7, 8 వేలమంది సభలో ఉన్నారు వారి రాక అవ్యవధిగా తెలియడం చేత ఇంక చాలామంది రాలేక ఆశాభంగం పొందవలసివచ్చింది మహాత్ముడు స్వరాజ్యం గురించి నిషాపదార్థ నిషేధము గురించి తిలక్ స్వరాజ్య నిధిని గురించి ఉపన్యసించినారు ప్రజలు ఉత్సాహంతో స్వరాజ్యనిధికి కానుకలు సమర్పించినారు స్త్రీలు కొన్ని నగలుకూడా ఇచ్చినారు

### గాంధీజీ - నెల్లూరులో

గాంధీ దంపతులు వారి సహచరులు కొండ వేంకటప్పయ్య, చెరుకువాడ వెంకటనరసింహంగార్లతో కలసి 7 వ తేది ఉదయం నెల్లూరుకు దయచేసినారు నెల్లూరు రైల్వేస్టేషన్‌లో వారికి ఘనమైన స్వాగతమివ్వడం జరిగింది అక్కడ నుంచి వారు పల్లెపాడు వెళ్ళినారు పల్లెపాడులో దిగుమర్తి హనుమంతరావుగారి సత్యాగ్రహాశ్రమ సంస్థాపన సందర్భంలో గాంధీజీ ఉత్తేజకరమైన ఉపన్యాసం చేసినారు నెల్లూరులో తిక్కవరపు రామిరెడ్డి, పోరుగంటి వెంకటసుబ్బయ్య గార్లు స్థాపించిన తిలక్ విద్యాలయానికి ప్రారంభోత్సవం చేసినారు రేబాల లక్ష్మీనరసారెడ్డి టౌన్ హాల్‌నందు మహిళా సభలో ఉపన్యసించినారు 5 వేల మంది స్త్రీలు ఆ సభకు వచ్చినారు వారు నగలూ, నగదూ తిలక్ స్వరాజ్య నిధికి సమర్పించినారు ఆరుగురు బాలికలు ఆరు పళ్లాలలో గాంధీజీకి ఆరు హారతులు పట్టినారు

వెంకటగిరి రాజా కళాశాల ఆవరణలో బహిరంగ సభ జరిగింది సుమారు 10 వేల మంది హాజరైనారు మహాత్మాజీ హిందూ మహమ్మదీయ ఐకమత్యం గురించి ప్రసంగిస్తూ ఆ రెండు సంఘాల మధ్య ఏర్పడిన స్థానిక వివాదాలను సామ్యంగా పరిష్కరించుకోవలెనని సలహా ఇచ్చినారు హిందూ మహమ్మదీయుల్లోని స్త్రీ పురుషు లందరూ కాంగ్రెస్ సభ్యులుగా చేరవలసిందని, తిలక్ స్వరాజ్య నిధికి విరాళం ఇవ్వవలెనని, ప్రతి ఇంటా రాట్నం పెట్టుకోవలెనని జాతీయ వారం జరపవలెననీ శ్రోతలకు ఉద్బోధించినారు అభ్యుదయ సమాజ పక్షాన 'లోకమాన్యుని' చిత్రం ఆవిష్కరించినారు ఈ అన్నిచోట్లా చెరుకు వాడ వేంకట నరసింహంగారు గాంధీజీ ఉపన్యాసం తెలుగులోకి అనువదించినారు

తిలక్ స్వరాజ్య నిధికి నగదు రూపంగా గానీ, నగల రూపంగా గానీ 8 వేల రూపాయల పైచిలుకు వసూలైంది స్థానిక భేదాలు ఉన్నప్పటికీ గాంధీజీ కార్యక్రమంలో హిందువులు మహమ్మదీయులు సమైక్యంగా సహకరించినారు

మహాత్మాజీ ఆ రాత్రి శ్రీ రంగనాయకస్వామి దేవాలయానికి పోయి స్వామిని దర్శించినారు దేవాలయ ట్రస్టీలు ఆయనను దేవాలయ సంప్రదాయాల ప్రకారం గౌరవించినారు

**గాంధీ మహాత్ముని ఉపన్యాసము - నెల్లూరు**

నా ప్రియమైన హిందూ మహమ్మదీయ సోదరులారా!

నేను లేచి నిలుచుని మాట్లాడజాలనందుకు మీ క్షమాపణ వేడుకొంటున్నాను సకాలంలో ఇక్కడికి రానందుకు కూడ నన్ను మన్నించవలె కాని అది నా తప్పుకాదు నేను మొదట అనుకొన్న దానికంటె ఎక్కువ కాలం మన సోదరీమణులవద్దనే గడచిపోయింది స్త్రీల సభనుంచి సాయంకాలం భోజనం చేయకుండానే ఈ సభకు సరాసరి వచ్చి ఉండవచ్చు కాని అది మీరు ఇష్టపడరని భావించి నేనట్లా చేయలేదు నెల్లూరుకు ఇంతకు ముందుగా రాలేనందుకు కూడ నన్ను క్షమించండి

నెల్లూరులోని హిందూ మహమ్మదీయులు తమలో తాము కలహించుకొంటున్న వార్త నాకు తెలియగానే నేనిక్కడికి రావలెనని అనుకొన్నాను తమలో తాము కలహించుకొంటూ స్వరాజ్య సంపాదనకు, ఖిలాఫత్ పంజాబు సమస్యల పరిష్కారానికి ఆటంకంగా ఉన్న ఆ హిందూ మహమ్మదీయులెవరో ప్రత్యక్షంగా చూడవలెనని నేననుకొన్నాను మీ పట్టణం చాల పురాతనమైనదని మీరు సగర్వంగా చెప్పుకోవడం నాకు తెలుసు అటువంటి ఈ పట్టణంలో హిందూ మహమ్మదీయులు ఏకోదరులవలె నివసించజాలకుండా ఉన్నారనే అపనిందకు పాలుకావడానికి మీ రిష్టపడరనే నాయభిప్రాయము ఇంతకంటె ముందుగా ఈ పురానికి రావడానికి నాకనేక ఇబ్బందులు కలిగినాయి ఆలోచిస్తే ఇక్కడ ఈ రెండు సంఘాల మధ్య పాటించదగిన వివాదకారణం లేదని తెలిసి వచ్చింది తమ మసీదుల సమీపంలో హిందువుల మేళతాళాలకు, మహమ్మదీయుల్లోని అధిక సంఖ్యాకులు అభ్యంతరం పెడుతున్నట్లు నాకు తెలిసింది కొన్ని సంవత్సరాల క్రితం వరకూ హిందువులు ఇటువంటి పట్టుదలను చూపలేదని మహమ్మదీయులంటున్నారు హిందువుల వాదమేమో నాకు తెలియలేదు నా హిందూ మహమ్మదీయ సోదరుల మధ్య తీర్పు చెప్పటానికి నేనిక్కడకు రాలేదు అందరూకలిసి ఒకే హారతి పట్టినట్లయితే మీ ఐకమత్యానికి సహకారానికి చిహ్నంగా ఉండేది కదా!" అన్నారు గాంధీజీ నెల్లూరులో గాంధీగారు తిక్కవరపు రామిరెడ్డిగారి మేడలో బసచేసినారు నెల్లూరు మునిసిపల్ సంఘంవారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు హిందూ మహమ్మదీయ సమ్మేళన కార్యక్రమంలో అనుభవం కలవాణ్ణి అయినందువల్ల వారి మైత్రి చిరస్థాయిగా ఉండడానికి కొన్ని ముఖ్య సూత్రాలను సవినయంగా తమకు మనవి చేయగలను వాటిని తామాలోచించి అంగీకరించగలరని భావిస్తున్నాను నేను సనాతన ధర్మ హిందువును నా మతానికి ముప్పు రాగలదని

నేనభిప్రాయ పడినవుడు సనాతన హిందువుగా నా మతం నిలుపుకొనేటందుకు ప్రాణాలనుసైతం అర్పించగలను

మొదట నా హిందూ సోదరుల నుద్దేశించి మాట్లాడదలుచుకొన్నాను మీరు మహమ్మదీయులతో సఖ్యంగా ఉండదలచుకొంటే వారి మత విశ్వాసానికి ఏ విధంగాను అడ్డు తగలరాదు వారి విశ్వాసంలోని న్యాయాన్యాయాలను గురించిన తర్కం మీ కనవసరము వారి విశ్వాసం అక్రమంగా ఉన్నప్పటికి మీ మత ప్రధాన సిద్ధాంతాలకు అభ్యంతరం లేనంతవరకు మీరు వాటిని పాటించడం మంచిది ఇందుకు తార్కాణంగా ఒక మాట చెబుతాను నా ముసల్‌మాన్ దేశీయులు నన్ను నా దేవాలయానికి వెళ్ళకూడదని వారభ్యంతరం పెడితే వారి మైత్రికోసం వారి కోరికను మన్నించటంకంటె ప్రాణత్యాగం చేయటం ఎక్కువ మంచిదని భావిస్తాను గోసంరక్షణం ఆత్మ సమానమని నా విశ్వాసము గోసంరక్షణం విడనాడమని నా ముసల్‌మాన్ సోదరులు నన్ను కోరితే గోవధ చేసి వారి స్నేహాన్ని సంపాదించడంకంటె నా ప్రాణాన్నే అర్పించగలనని విన్నవించుకొంటున్నాను అయితే మసీదుల సమీపంలో మేళతాళాలు పనికి రావని వారు తెలిపినారు నేను వారితో వివాదాలు పెట్టుకోక తక్షణమే అంగీకరిస్తాము పండుగలలో మేళతాళాలు వాయించవలెనని హిందూ మతంలో ఒక ప్రధాన సూత్రంగా వ్రాసి ఉండలేదని నేను నిష్కర్షగా చెప్పగలను. మసీదుల సమీపంలో మేళాలు వాయించవలెనని హిందూ మతంలో ఎక్కడా లేదని నేనింకా గట్టిగా చెప్పగలను నా ముసల్‌మాన్ సోదరుల కోరికలకు, భావాలకు, వాదాలకూ మారాడక నేను లొంగిపోగలనని మనవి చేస్తున్నాను నేను నెల్లూరులో నివసించే హిందువునే అయివుంటే ఇటువంటి విషయాలను మధ్యవర్తివద్దకు తీసుకొనిపోను మహమ్మదీయులతో చిరుకయ్యాలు పెట్టుకోక వారి మత విశ్వాసాలను మన్నించటం మూలాన మనము వారి మైత్రిని అనవరతం కాపాడుకోగలము స్నేహానికి బేరాలు పనికిరావు ప్రాణాలు త్యజించి అయినా ప్రపంచంలో ఋజువర్తనం కలిగి ఉండవలెనని నా మతం నన్నాదేశిస్తూన్నది అందువల్ల అప్రధాన విషయాల పట్ల మూర్ఖపు పట్టు ఉండడం అస్వాభావికం కనక నేను నా ముసల్మాన్ సోదరుల భావాలను ఆదరించగలను ముసల్మాన్ సోదరుల కోరికలు అహేతుకాలు, అన్యాయాలూ అయితే ఏమి చేయవలెనని ఇక్కడి హిందువులు నన్ను ప్రశ్నిస్తే ఆ 'అహేతుకాలు, అన్యాయాలూ అయిన కోరికలకు లొంగవలె, వారింపవలదు' అని అంటాను ఈ చిరు జగడాలలో మనము కాలం వ్యర్థం చేస్తే స్వవిషయాలను పరిష్కరించుకోజాలని అవివేకులమని ప్రపంచం మనలను నిందిస్తుంది కాబట్టి హిందువులటువంటి అపకీర్తికి తావివ్వక మసీదుల వద్ద మేళతాళాలు కావలెనని పట్టు పట్టవద్దని నా మనవి మత జీవితంలో ఇవి అనుసరించవలసిన సూత్రాలని నా అభిప్రాయము. నెల్లూరులో సుమారు 42 వేలమంది హిందువులున్నారు ముసల్‌మానులు 7 వేలు మాత్రమే ఉన్నారు కాబట్టి హిందువులు

మహమ్మదీయులకు అన్నలవంటివారు ముసల్మానుల ధర్మం మన్నించడం హిందువుల విధి హిందువులకు సుహృద్భావం, స్వరాజ్యార్హత ఉన్నట్లయితే దుర్బలులను సంరక్షించే బాధ్యత వారు వహించవలె

ఇక నా ముసల్మాన్ సోదరుల కొక మనవి మీరు కోరుతున్న విషయాల పట్ల మీకు సహనం ఉండవలె మసీదులలో మీరు ప్రార్థన చేసుకొంటున్నప్పుడు సంగీతంవలన మీ ఏకాగ్రతకు కొంత భంగం కలుగుతుండవచ్చు అందుకు భగవంతుడు విచారణకాలంలో మిమ్ములను తప్పక మన్నిస్తాడని నేను చెప్పగలను ఒకరి లోపాలను, మరొకరు సహించి సవరించుకోవటం లోనే స్నేహం కలుస్తుంది విచారణ దినం, ఒకపక్షంవారు ఈ విధంగా మరొక పక్షంవారి పట్ల ప్రవర్తిస్తూ అప్రధాన విషయాల పట్ల ఎవ్వరు లొంగిపోతారో వారే భగవంతుని కృపాకటాక్షవీక్షణాలకు పాత్రులవుతారు మీ మత ప్రవక్త జీవితంవలననే అప్రధాన విషయాలలో లొంగిపోవచ్చునని మీరు తెలుసుకో గలరు ఆయన జీవితం మీకు తార్కాణంగా ఉండవలె గదా!

నెల్లూరులోని హిందూమహమ్మదీయ సోదరులు గమనించవలసిన విషయం మరొకటుంది మీ వివాదాలను మీరు పరిష్కరించుకోలేకున్నా ఒకరి లోపాలు మరొకరు సవరించగలిగినా సవరించలేకున్నా ప్రధానమైనగాని, అప్రధానమైనగాని విషయాలలో మీలో మీకు సమాధానం కుదురకున్నా హిందూ మహమ్మదీయులు పరస్పరం హింసించుకోకూడదు ఒకరి మీద ఒకరు దౌర్జన్యం చేయకూడదు రెండు సంఘాల నాయకులు పంచాయతీని ఏర్పరచుకొని వారి తీర్పులను అనుసరించి మీమీ వివాదాలను పరిష్కరించుకోవడం మంచిది ఆ పంచాయతీ సంఘం వారివల్ల న్యాయం కలగలేదని తోస్తే కాంగ్రెస్ సంఘం గాని, ఖిలాఫత్ సంఘంగాని తీర్పు చెప్పవలెనని మీరు కోరవచ్చు హిందూ ముసల్మాన్‌లకు మౌలానా షౌకత్ ఆలీ పలుమారు చేసిన ఉపదేశమే నేను మళ్ళా మీకు నివేదిస్తున్నాను ఒక మహమ్మదీయుడు తన ఇరుగు పొరుగు హిందువులమీద ఆగ్రహించి అతనిని ఏ విధానమైనా శిక్షించవలెనని పట్టు పడితే ఆ మహమ్మదీయుడు గాంధీ వద్దకు పోయి గాంధీ శిరం ఛేదించవచ్చు అదేవిధంగా ఒక హిందువు తన పొరుగున ఉన్న మహమ్మదీయునిపై కోపగించుకొని అతనిని ఖండించవలెనని నిశ్చయించుకొంటే షౌకత్ ఆలీ తల నరకవచ్చు స్వరాజ్య సౌధానికి, భారత స్వాతంత్ర్యానికి పునాది హిందూ మహమ్మదీయ సమ్మేళనమని ఉభయులు గ్రహించటం మంచిది మన జీవితంలో ఈ సమ్మేళనం సుస్థిరమైతేనేగాని ఖిలాఫత్‌కు బలము చేకూరదని గ్రహించవలె ఇస్లాం సంరక్షణార్థం తాము మనఃపూర్వకంగాను, బేషరతుగాను చేసే సేవ లోనే హిందూ మత సంరక్షణ ఉందని హిందువులు గ్రహించవలె కాబట్టి నెల్లూరులోని హిందూ మహమ్మదీయులు తమతమ వివాదాలను మరచిపోయి మళ్ళీ తగవు లాడుకొనక ఈ పవిత్ర వారంలో దృఢ ప్రతిజ్ఞ తీసుకొని భారత విముక్తికి, ఇస్లాం స్వాతంత్ర్యానికి పాటు పడవలసిందని నేను వేడుకొంటు

న్నాను ఈ అసహ్యపు చిన్న జగడం వల్లనే సహాయ నిరాకరణోద్యమంలో నెల్లూరు చేయదగినంతపని చేయజాలకపోయిందని, ఈ దినం హిందువులు, మహమ్మదీయులు కూడా నాకు అనారు కాబట్టి రేపు సూర్యోదయమయ్యే లోగా మీ వివాదాలను పరిష్కరించుకొని ఉదయంనుంచి యావద్భారత కాంగ్రెస్ సంఘంవారు తీర్మానించిన ప్రకారం తిలక్ స్వరాజ్య నిధికి ద్రవ్యం వసూలు చేయగలరనీ, హిందూ మహమ్మదీయుల్లో వయసు వచ్చిన వారందరూ కాంగ్రెస్ సభ్యులుగా చేరగలరనీ నేను విశ్వసిస్తున్నాను

విదేశ వస్త్రాలు ధరించటం పాపమనీ, అది మన దాస్యచిహ్నమనీ అందరూ గ్రహించవలె వస్త్రాలకోసం అహమ్మదాబాద్, బొంబాయిలపై ఆధార పడకూడదు మీరు నిత్యావసరాలకు తగినట్లు మీరు మీ బట్టలను తయారు చేసుకోవలె నూలు వడకటంలోను, నేయటంలోనూ నాకు అనుభవం ఉన్నది నెల్లూరులోని 42 వేలమంది జనాభాకు కావలసిన బట్టలను ఒక్క మాసంలో తయారుచేయవచ్చు ఒక గుడ్డ పొడవునా కావలసిన బట్టలను ఒక నేతమనిషి ఒక్కరాత్రిలో తయారుచేసి ఇచ్చినాడు ఆ పవిత్రవస్త్రం ప్రస్తుతం నా దగ్గరనే ఉన్నది అందుకు నేను గర్వపడుతున్నాను కాబట్టి, మీరు కలహాలతో కాలయాపనచేయక దేశానికి అవసరమైన ముఖ్య విషయములపై మీ శక్తి సామర్థ్యాలను వినియోగించండి తాగుడు, జూదము మొదలయిన దుర్వ్యసనాలను పారదోలి మన అందరి పేరిట జరుగుతున్న సహాయ నిరాకరణోద్యమం ఆత్మ పరిశుద్ధికోసం జరుగుతున్న ఉద్యమమనీ గ్రహించి సత్ప్రవర్తనకలిగి ఉండవలెనని కోరుతున్నాను జాతీయ కార్యక్రమం పూర్తి కాలేదు, ఇప్పటికి రెండు దినాలుమాత్రమే ముగిసినాయి ఈ అయిదుదినాలూ మనం చక్కగా ఉపయోగించవలసిఉన్నది ఈ 5 దినాలలో హిందూ మహమ్మదీయులు మైత్రిని పెంపొందించుకొనవలెననీ మళ్ళీ కోరుతున్నాను ఒక హిందువు, ముసల్మాన్ సోదరుని కలుసుకొన్నప్పుడు అతనిని సమీపించి హృదయ పూర్వకంగా చిరునవ్వుతో, సలాం చేయవలె అదే విధంగా ప్రతి మహమ్మదీయుడు హిందువును కలుసుకొన్నప్పుడు అతనిని చిరునవ్వుతో ఆదరించి 'సలాం' అనిగానీ 'వందేమాతరం' అనిగానీ పలకరించవలె ఈ 5, 6 దినాలలో మీరు మీ వివేకం వినియోగించి హిందూ మహమ్మదీయుల మధ్య అన్యోన్య సందేహాలు, అవిశ్వాసాలు నిర్మూలించడానికి ప్రయత్నించుకొని, స్వరాజ్యానికి ఖిలాఫత్ సంరక్షణకు, పంజాబు గౌరవ పునరుద్ధరణకూ ఇతోధికోత్సాహంతో పనిచేయవలెనని మిమ్ము హెచ్చరిస్తున్నాను "

## గాంధీజీ - ఏలూరులో

గాంధీజీ ఏలూరుకు వస్తారని తెలిసి చుట్టుపక్క పల్లెలనుంచి రమారమి 50 వేలకు పైచిలుకు ప్రజలు వచ్చినారు పురమంతా మామిడి తోరణాలతో, కొబ్బరి ఆకుల పందిళ్ళతో, అరటి కంబాలతో అలంకరింపబడింది సాయంకాలం

4 గంటలకు రాజమహేంద్రవరం నుంచి గాంధీజీ, అయన సహచరవర్గం ఏలూరు స్టేషన్‌కు వచ్చేసరికి. ఏలూరుస్టేషన్ ప్లాట్‌ఫారంనుంచి ఇనుపవంతెన వరకూ జనం క్రిక్కిరిసిపోయివారు ప్లాట్‌ఫారంమీద మోతే గంగరాజు,సోమంచి సీతారామయ్య, వల్లూరి రామారావు, ఎట్టమల్లి మంగయ్య, వారణాసి రామ మూర్తి, బడేటి వెంకటరామయ్యనాయుడుగార్లు వంటి ప్రముఖులనేకులు వేచి ఉన్నారు మహాత్ముడురాగానే యీ పెద్దలాయనకు పూలదండలు వేసినారు బ్యాండు, సన్నాయి మొదలయిన వాయిద్యాలతోనూ, భజనలతోనూ రెండు గుర్రాలబగ్గిపై అయనను ఊరేగించినారు తరవాత టౌన్‌హాల్‌లో స్త్రీల సభ జరిగింది 10 వేలమంది స్త్రీలు హాజరైనారు గాంధీజీ ఆ సభలో ఉపన్య సించినారు ఆ తరవాత శ్రీమతి సత్తిరాజు వెంకటరత్నమ్మగారి స్త్రీ సమాజ భవనానికి గాంధీజీ శంకుస్థాపన చేసినారు స్త్రీ ప్రార్థనా సమాజపక్షాన గాంధీ దంపతులకు వినతిపత్రం సమర్పింపబడింది శనివారపుపేట రోడ్డుపై ఉన్న (జాతీయ విద్యాలయము) వరదా రామస్వామిగారి పొలంలో ఏర్పాటు చేసిన పౌరసభలో నేషనల్ కాలేజీని తెరిచి గాంధీజీ ఉత్తేజకరమైన ఉప న్యాసం చేసినారు లోకమాన్య బాలగంగాధర్ తిలక్‌గారి పటం ఆవిష్కరిస్తూ గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

**మహాత్ముని ఉపన్యాసము**

"నన్ను మీరు లోకమాన్య తిలక్ మహారాజుగారి పటం ఆవిష్కరించ మన్నారు ఆ మహానుభావుడు స్వరాజ్యం తన జన్మ స్వత్వంగా భావించి తన సర్వస్వం ధారపోసి అందుకోసం యావజ్జీవం కృషి చేసినారు వారు మరణ కాలంలోకూడా స్వరాజ్యమంత్రమే స్మరించినారు అట్లాంటి దేశబంధువుని రూపం మన ఎదుట ఉన్నది స్వరాజ్యతత్వం మీరు చక్కగా గ్రహించే ఈ మహామ హుని చిత్రపటం నన్ను ఆవిష్కరించవలసిందని కోరిఉంటారు

గడచిన ఏడాదినుంచి నేనూ, నా సోదరుడు మౌలానా షౌకత్ అలీ కలసి దేశంలో తిరుగుతున్నాము కాని ఇప్పుడు స్వరాజ్య సంపాదనకు కాల వ్యవధి సమీపిస్తున్నందువల్ల మేము కలిసి తిరిగేటందుకు వీలులేకపోతున్నది నేను వర్ణాశ్రమ ధర్మాలనుపాటించే హిందువును,ఆయన స్వచ్ఛమైన మహమ్మ దీయుడు అయినప్పటికీ మేమిద్దరమూ కలిసి తిరగటానికి మాకేమి అభ్యంతరం కలగలేదు దీనినిబట్టి హిందూ మహమ్మదీయ సమ్మేళనం సులభసాధ్యమని మీరు గ్రహించవచ్చు ఈ సమ్మేళనంమీదనే మన భవిష్యత్తు ఆధారపడిఉంది

వర్ణాశ్రమ ధర్మాలు అయాకులాల ఎక్కువ, తక్కువలను నిర్ణయించ టానికి ఏర్పడలేదు ఏకులానికి ఆ కులమే గొప్పదని చెప్పవచ్చు బ్రాహ్మణులు సర్వసంగ పరిత్యాగులై తమ ధర్మాలను పాటిస్తూ పూర్వకాలంలో చాలా మేలు చేకూర్చినారన్నమాట ఒప్పుకోకతప్పదు కాని ఆ బ్రాహ్మణులే మాల మాదిగలు మొదలయినవారిని తాకకూడదని నిర్ణయించి చాలా ఉపద్రవం

తెచ్చిపెట్టినారు ఈ అస్పృశ్యతాదోషం నివారింపని ఘోరపాతకం మనలను ఆవరించి ఉన్నది భగవద్గీతలో ఎక్కడా చండాలుని తాకకూడదని చెప్పలేదు కనక దీనిని నివారించవలెనని హిందువులనందరినీ కోరుతున్నాను పంచమాది నిమ్న జాతుల వారిని కొంత ఓపికతో ఉండవలసిందనికూడా ప్రార్థిస్తున్నాను ఆంధ్రదేశంలో నాకొక గొప్పలోపం కనిపిస్తున్నది నేను కాకినాడలో ఉండగా కొందరు వేశ్యలు నన్ను చూడటానికి వచ్చినారు వారి వృత్తి విన పుడు నా పాదం కింది భూమి కుంగిపోవనారంభించింది ప్రతిస్త్రీ మన సోదరీమణియే, ప్రతిస్త్రీ మన మాతయే అని భావించకుండా మన కామతృప్తికోసం కొందరిని నీచవృత్తికి ప్రత్యేకించి ఉంచి వారిని అధోగతిపాలు చేస్తున్నాము మన సహాయ నిరాకరణోద్యమం అతి పవిత్రమైనది అందులో అధర్మకృత్యాలకు, అసత్యానికి, హింసకు తావులేదు కాబట్టి ప్రస్తుతప్రభుత్వం సైతాన్ ప్రభుత్వమని మనం అంటున్నాము ప్రస్తుతప్రభుత్వం రావణప్రభుత్వంతో పోలుస్తున్నాము ఇటువంటి మనం భోగస్త్రీలనే ఒకజాతిని నిలిపి ఉంచటం ఎంతో విచారకరము ఆంధ్ర నాయకులందరూ ఈ అపచారాన్ని తుడిచివేయడానికి సంసిద్ధంకావలె స్త్రీ సంగాభివృద్ధికోసం పాటుపడే దేశ సేవకురాండ్రందరూ ముందంజ వేయవలె వారు ఇంటింటికి తిరిగి ఈ నీచవృత్తిని విసర్జించేటట్లు చేయవలె ఇట్లాచేసి మీ ఆంధ్రదేశంలో వేశ్య సంఘమనేది అదృశ్యమైనదని నాకు తెలిపితే నేను ఎంతో సంతోషిస్తాను

సోదరులారా! మన కార్మికుల దుస్థితికి నేననేక సంవత్సరాలు అనేక ప్రయత్నాలు చేసి దారీ, తెన్నూ కానక చివరికి రాట్నమే శరణ్యమని నమ్ముతున్నాను మన రాట్నాలు ఎప్పుడు మూలబడినాయో మన భాగ్యలక్ష్మి అప్పుడే అంతరించింది కాబట్టి దానిని మీరందరూ పునరుద్ధరించవలెనని కోరుతున్నాను ఇది మన ఆర్థిక స్థితిని పెంపొందించటమే కాక స్వరాజ్య సంపాదనకు ముఖ్య సూత్రమనీ కూడ నా అభిప్రాయము మనము స్వరాజ్యం 6 మాసాలలో రావలెనని కోరుతున్నాము అందుకు అ.భా.కాం.సం వారు మూడు విషయాలను నిర్ణయించినారు అవేవంటే (1) జూన్‌లోగా కోటి రూపాయలను తిలక్ స్వరాజ్యనిధికి సేకరించడం (2) కోటి మంది కాంగ్రెస్ సభ్యులను చేర్పించడం (3) ప్రతి ఇంటా రాట్నము తిరుగుతూండేటట్లు చేయడం - కనీసం దేశంలో 20 లక్షల రాట్నాలనైనా స్థాపించటం ఈమూడు విషయాలను ఈ రెండు మాసాలలో పూర్తిగా మీరు నెరవేర్చవలసి ఉంది మీరు ఒక్క గజం విదేశీ వస్త్రం ధరించినా మహాపాతకానికి ఒడి గట్టినవారవుతారు మీ ప్రాంతంలో తయారు చేయబడుతున్న నూలు చాలా ప్రశస్తంగా ఉన్నది ఇక్కడ నేస్తున్న బట్టలు చాలా సున్నితంగా ఉన్నాయి ఇటువంటివి మా వైపున తయారు కావడంలేదు మీరు విజ్ఞానంలో పట్టుదలలో, కార్యాసక్తిలో చాలా ముందంజ వేస్తున్నట్లు తోస్తూన్నది దక్షిణాఫ్రికాలో నా ఉద్యమంలో నాతో కూడా ప్రారంభంనుంచి ఊతగా

చేరి పని చేసిన వారుకూడా మీరే కట్టకడపటి వకూ నాతో ఏగిలిన వారు కూడా మీరే ఇది నాకు బాగా జ్ఞాపకం ఉన్నది

సోదరులారా! ఆంగ్లభాష తెలియని వేలకు వేలమందిగల ఈ సభలో నేను ఇంగ్లీషులో మాట్లాడ వలసివచ్చినందుకూ నేను మాట్లాడే అతిసులువైన చిన్న చిన్న హిందుస్థానీ మాటలను తెలుగు లో చెప్పగలవారొక్కరైనా ఇక్కడ లేనందుకూ నేను ఎంతో సిగ్గుపడుతున్నాను కాబట్టి ఇంతకు ముందు తెరిచిన జాతీయ విద్యాలయంలోని ఉపాధ్యాయులు తప్పకుండా ఈ పట్టణం లోని ఈ పెద్దలోపం సరిదిద్దగలరనీ ఆశిస్తున్నాను మీ పారశాలలో ఈ సంవత్సరం రాట్నంపై నూలు తీయడం హిందీ భాష నేర్పడం ముఖ్యకార్య క్రమాలుగా పెట్టుకొని దేశోద్ధరణకు పూనుకోవలెనని ప్రార్థిస్తున్నాను

మరొక్క విషయం మాత్రం చెప్పి నా ఉపన్యాసం ముగిస్తాను అది పీడర్లను గురించినది నా ఉద్యమంలో ఇంకా చేరక వెనకబడి వున్న పీడర్లకు త్యాగాన్ని, దూరదృష్టినీ, దేశసేవాసక్తినీ భగవంతుడనుగ్రహించుగాక అని ప్రార్థించటమే నేను చెప్పదలచిన విషయము'

ఈ ఉపన్యాసానంతరం వెంటనే స్వరాజ్యనిధికి చందాలు వసూలు చేయడం ప్రారంభమైనది సభలో ఉన్న వారిలో అనేకులు పదులు, ఐదులు, రూపాయిలు, అర్థలు, పావలాలు, బేడలు, అణాలు కూడా ఇచ్చినారు శ్రీమతి కలగర రామమ్మగారు 10 కాసులు, బంగారపు కడ్డీ, ఒక మురుగు మహాత్మునకు సమర్పించినారు మురుగును వేలంపాటలో 200 రూపాయలు వచ్చినాయి బిరుకూరు నరసింహారావుగారు సమర్పించిన చేతికర్రను మహాత్ముడు వేలం వేయగా మోతే గంగరాజుగారు 200 రూపాయలకు కొన్నారు ఒక నూలు కండువాను గ్రంథి రామమూర్తిగారు 25 రూపాయలకు వేలం పాడి తీసుకున్నారు మహాత్ముని మెడలోని పుష్పహారం కందుల రామయ్యగారు వేలంలో 300 రూపాయలకు కొన్నారు. మరో పూలహారం ఒక బ్రాహ్మణుడు 45 రూపాయలకు కొన్నారు చేతి గడియారాలు, గొలుసులు, ఉంగరాలు మొదలయిన నగలెన్నో మహాత్మునకు సమర్పించడం జరిగింది కాని వేలం పాడటానికి కాలం లేనందువల్ల మహాత్ముడు సభ ముగించినారు స్త్రీల సభలో కూడ మహాత్మునికి నగదు, నగలూ సమర్పించినారు

**హేలాపురి (ఏలూరు)**

దీక్షా సంఘంవారి స్వాగత పత్రము

"మహాత్మా! లోకంలో పాపభారానికి లోనై ఐహిక సౌఖ్యాంధ కారంలో మునిగినపుడంతా భగవదాంశ సంభూతులైన అవతార పురుషులు జన్మిస్తూ ఉంటారు అట్లాంటి వారిలో నీ వొకడవు నేటికి భవదీయ దర్శన స్పర్శాదులతో మావ్రదేశం పావనమైంది మన భారత వర్షము ప్రాచీన విధానా లను మరచి పాశ్చాత్య నాగరకత అనే మహా సముద్రంలో మునిగిపోనున్న

ఈ సమయంలో నీ వవతరించి ఋషి ప్రోక్తాలైన సత్య, శౌచాది గుణాలు ప్రజల మనసులలో నెలకొల్పి అహింసా విధానంతో భారత పుత్రులకు స్వరాజ్యాన్ని ప్రదానం చేయడానికి సమకట్టి తన్మూలాన లోక విజయము చేయ నెంచినారు దానికి ప్రథమ సోపానంగ హిందూ మహమ్మదీయ సోదర సమ్మేళనం సమకూర్చినావు భారత వర్షాన్ని కష్ట పరంపరలతో పీడిస్తున్న దాస్యాన్ని దౌర్జన్యరహిత సహాయనిరాకరణంతో నిర్మూలం చేయడానికి పూను కొన్నారు నీ పాద పద్మాలను అనుసరించి కార్యనిర్వహణం చేయడానికి ప్రయత్నిస్తున్న మమ్ములను ఆశీర్వదించి మా పురంలో జాతీయ విద్యాపీఠం స్థాపించడానికి ప్రార్థిస్తున్నాము భారత వర్షానికి సత్వర స్వరాజ్యం సమ కూర్చడానికి లోకంలో అంతా శాంతిని నెలకొల్పడానికి పరాత్పరుడు నీకు చిరాయురారోగ్యాల ఇచ్చి నీ కుటుంబం సాగునుగాక అని ఎంతో వేడుకొం టున్నాము "

సం॥ భవదీయ భక్తులు
హేలాపురి దీక్షా సంఘము

గాంధీజీకి సన్మానపత్రం సమర్పించేనాటికి ఏలూరు జాతీయ విద్యా లయానికి 62,483 రూపాయల విరాళాలు వచ్చినవనీ త్వరలో లక్ష రూపాయలు పూర్తి కాగలవనీ జాతీయ విద్యాలయ స్థాపక వర్గంవారు తెలియజేసినారు

## మహాత్ముడు - గుంటూరు జిల్లాలో

ఏప్రిల్ 6 వ తేదీ మధ్యాహ్నం మహాత్ముడు గుంటూరు చేరినారు గొప్ప సభ జరిగింది సభకు సుమారు లక్షమంది వచ్చినారు స్వరాజ్య నిధికి నగలూ, నగదూ మొత్తం 2 వేల 6 వందల రూపాయలు చేరినాయి

గాంధీజీ గుంటూరు సంచారం గురించి దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారు తమ స్వీయచరిత్రలో ఇట్లా వ్రాసినారు

'బెజవాడనుంచి బందరుకు మహాత్ములు పయనమైనారు శ్రీ పట్టాభి సీతారామయ్యగారికి వారిని అప్పగించి నేను గుంటూరులో ఏర్పాట్లు ఆలో చించడంకోసం వచ్చినాను ఇక్కడ శ్రీ మద్ది వేంకటసుబ్బయ్యగారి ఇంటిలో వారికి బస నిర్ణయించినారు బందరునుంచి ఉదయాన్నే గుంటూరుకు మహా త్ముడు వచ్చేటట్లు నిర్ణయమయింది ఉదయం 7 గంటలకే మేము ఊరి గుమ్మంలో వేచి ఉన్నాము ఎంత వేచినా రాలేదు 10 గంటలు దాటింది మహాత్మాజీ రాలేదు అందువల్ల సభకు వచ్చిన స్త్రీ పురుషులు భోజనాల నిమిత్తం వారివారి ఇండ్లకు పోయినారు పరగ్రామాలనుంచి వచ్చినవారు పుర వీధుల్లో మద్ది వేంకటసుబ్బయ్యగారి ఇంటి సమీపంలో తిరుగులాడుతున్నారు

సుమారు 11 గంటలకు మహాత్మాజీ గుంటూరులో ప్రవేశించినారు,

వారు స్నానం చేసిన తరవాత భోజనానికి కావలసిన పదార్థాలనుమరిచి వారి ఎదుట ఉంచబోయినపుడు ఆ రోజు వారు ఉపవాస దీక్ష వహించినామని చెప్పి ఏమీ స్వీకరించలేదు వేంకటసుబ్బయ్యగారికి మహాత్మునిపై ఎంతో భక్తి గాంధీగారు వైశ్యులుకావడంవల్ల ఆంధ్రదేశంలోని వైశ్యులు వారిని గురించి ఎంతో గర్వపడుతున్నారు కాని అస్పృశ్యతా నివారణ ప్రయత్నాలు గాంధీగారిలో గొప్ప లోపంగ వారు పరిగణిస్తున్నారు వేంకట సుబ్బయ్యగారికి కూడ అట్లాంటి విరోధాభిప్రాయము ఉన్నా మహాత్ముని దైవ సమానుడని పూజించే వారు వారు తమ గడప తొక్కిన మాత్రానసే తమకు సర్వమంగళాలు సమకూరుతాయని వారికి విశ్వాసము మహాత్ముడేమీ భుజించకుండా నిరాహారులుగా ఉండటం వారు సహించ లేక పోయినారు చాలాసార్లు" ఒక పండునైన పుచ్చుకోవలసినదని" ఎంతో ప్రాధేయపడినారు ఉదకం తప్ప మరేదీ వారు పుచ్చుకోలేదు వెంకట సుబ్బయ్యగారితో, ఇంటిలోని ఆడవారితో, ఇతర బంధువులతో కుశల ప్రశ్నలు సలిపి, ముచ్చటించి, పిల్లలను దగ్గరకు దీసి బుజ్జగించి ఇట్లాంటి ఉదారకృత్యాలచేత వారికి హృదయానందం కలిగించి తరవాత నన్ను పిలిచి, ఆలస్యంగా వచ్చినందుకు చింతస్తూ, వెంటనే సమావేశం జరపవలసినదని కోరినారు ప్రజలు చాల వేచిఉండి ఇళ్ళకు పోయినారనీ తాము కూడా అస్వస్థులై నిరాహారులుగా ఉన్నారు కాబట్టి నేడు విశ్రాంతి పొంది మరునాడు సభ జరిపించడం యుక్తమని తెలిపినాను కార్యక్రమం సాధ్యమైనంత వరకు నిర్ణయ ప్రకారం నడపడం ఆవశ్యం కనక గుంటూరులో పని నేడు పూర్తి చేసుకొని, మరునాడు నిర్ణీత స్థానం చేరక తప్పదనీ, సేనాధిపతియైన వాడొక్క చోట తాను పన్నిన వ్యూహంలో లోపం వచ్చినంత మాత్రాన ఆ స్థానంకోసం వ్యూహంలోని తక్కిన స్థానాలను తారుమారు చేస్తాడా అని నాకు సమాధానం చెప్పినారు వెంటనే సభ జరుగుతుందని ప్రచారకులు నలుదెసల చాటగనే సభాస్థలం జనంతో క్రిక్కిరిసి పోయింది గాంధీజీ ప్రసంగం నేనే తెలుగున ప్రేక్షకులకు శ్రుతపరచినాను పౌరులు కానుకలు ఇచ్చినారు స్త్రీలు ఆభరణాలను దక్షిణగా సమర్పించినారు

సాయంకాలానికి బాపట్లలో సభ జరపవలసి ఉంది మహాత్ముడు, నేను ఒక మోటారు నెక్కినాము శ్రీమతి కస్తూరి బాయి, గాంధీగారి కార్యదర్శి మొదలయినవారు మరి రెండు మోటారుల నెక్కి వెనక వస్తున్నారు మహాత్మాజీ నిమిత్తం రొట్టె పాలును కస్తూరిబాయి తమ కారులో తెస్తూ ఉన్నారు రొట్టెను కాగితంలో చుట్టి ఆమె చేతి కీయవచ్చినపుడు కాగితంలో చుట్టిపెట్టినందుకు వారు అసహ్యించుకొన్నారు కాగితం ఎట్లు చేస్తారో పాపం వీరెరుగరు మురికి గుడ్డపీలికలు మొదయిన అపరిశుద్ధ వస్తువులతో చేసే కాగితాలలో భోజనం ఉంచడం తగదని వారి అభిప్రాయము కావచ్చు మేము చేబ్రోలు సమీపించేనప్పటికి గొప్ప ప్రజా సమూహాము మాకెదురుగ తప్పెట్లతోను, డోలు సన్నాయి మేళాలతోను వచ్చినారు వారిలో పలువురు అజాను

బాహులు, దృఢ శరీరులు, నల్లని నేరేడు పండువలె నిగనిగ లాడే దేహ చ్ఛాయగలవారు ఖద్దరు దోవతులనుకట్టకొని, ఖద్దరు ఉత్తరీయాలు వల్లెవాటుగా ధరించి, వైష్ణవ నామాలు పెట్టుకొని, ఆవేళపూరితులై పెద్ద ఇత్తడి పళ్ళెంలో పసుపు గుడ్డతో గట్టిన రూపాయల మూట బెట్టుకొని కర్పూరహారతులు తెస్తూ మా మోటారు వద్దకు వచ్చి ఆ పసుపు గుడ్డ మూటను కానుకగా సమర్పించినారు అందులో ఏడు వందల రూపాయలున్నవి ఇట్లా భక్తి ప్రేమ లతో ఆవేశపూరితులైన పల్లెప్రజలను చూసి ఈ దృశ్యం అపూర్వమని గాంధీజీ మెచ్చుకొన్నారు ఈ ఊరి వారింత వరకు చాలా భాగం జస్టిస్ పార్టీ వారని మహాత్మాజీకి తెలిపి, ఇప్పుడు వీరు కాంగ్రెస్ ఉద్యమాభిమానులు కావటం శుభ సూచకమని మనవి చేసినాను

అక్కడ సభ ముగించుకొని, ప్రయాణమై పోతూ రోడ్డు పక్కన పందిళ్ళు వేసుకొని సభలు తీర్చి మహాత్ముని రాక కెదురుచూస్తున్న మునిపల్లె, పొన్నూరు మొదలయిన చోట్ల ఆగినాము పొన్నూరు దాటిన కొంత సేపటికి సూర్యుడు కుంకు తున్నాడు మహాత్మాజీ తన నియమ ప్రకారం సూర్యాస్త మయం లోపల ఆహారం పుచ్చుకోవలసినది అంత వరకు ఉపవాసం చేస్తూ మధ్య మధ్య ఎన్నో చోట్ల ఉపన్యాసాలిస్తూ ఎంతో అలసట చెందిన దేహం అహారం కోరుతున్నది వెనక వస్తున్నదనుకొన్న మోటారు లేపి కనబడలేదు మార్గ మధ్యంలో లభించిన పండ్లను ఎప్పటి కప్పుడే మోటారు దగ్గర చేరిన పిల్లలకు పంచిపెట్టినారు కాబట్టి బండిలో ఫలం లేవి లేక పోయినాయి పక్క గ్రామాలకు బోయి పాలు తెస్తామని మహాత్మాజీకి చెప్పినాను. వారందుకు అంగీకరించలేదు బాపట్లకు వెంటనే చేరవలెనని తొందర పడుతూఉండినారు మోటారు సాగుతూనే ఉండినది వారికి ఇట్లాంటి సమ యంలో నేనేమీ చేయలేకపోయినానని ఎంతగానో చింతించినాను మోటారులో ఒక నారింజ మిగిలిఉంటే అది వొలిచి ఒక బద్ద నోట పెట్టుకొని "ఇది తినదగిన ఫలమేనా" అని నన్ను మహాత్మాజీ ప్రశ్నించినారు అది నారదబ్బకాయ, వూరగాయలకేగాని తినడాని కుపయుక్తమైందిగాదు" అని తెలిపి ఆ ఫలాన్ని తినటాని కెట్లాఉందని ప్రశ్నించినాను "ఆకలి రుచెరుగదుగదా" అని నవ్వుతూ సమాధానమిచ్చినారు బాపట్ల 10 మైళ్ళ దూరంలో ఉండగా భట్టిప్రోలు సూర్యప్రకాశరావుగారు బైసికిల్ నెక్కి మా కెదురుపడినారు మహాత్మాజీ వస్తున్నారు కాబట్టి వారి నిమిత్తం ఫలహారం సిద్ధం చేయవలసినదని అక్కడి వారితో చెప్పమని తెలుగులో ఆయనతో చెప్పి పరుగిడవలసినదని ఆయనను తొందరపెట్టినారు. మేము బాపట్ల చేరేప్పటికి చీకటి పడుతూఉండింది వెంటనే దేశిరాజు బావయ్యగారింటికి తీసుకొని పోయినారు అక్కడ కారు దిగిన వెంటనే కాళ్ళు, చేతులు, మొగం కడుగుకొని మహాత్మాజీ లోపలికి పోయి నారు తివాచీమీద వారు కూర్చున్న తరవాత పెద్ద వెండి పళ్ళెంనిండ, బత్తాయి, నారింజ పండ్ల బద్దలు మహాత్మాజీ ఎదుటనుంచి తినమని బావయ్య

గారి కుమారుడు లక్ష్మీనారాయణగారు కోరినారు తిలక్ స్వరాజ్య నిధికి కట్నం చెల్లించినగాని తాను తిననని మహాత్మాజీ స్పష్టపరిచినారు అంతట 1000 రూపాయలను వెండి పళ్ళెంలో పెట్టి కానుక సమర్పించినారు వారంతట కొన్ని పండ్ల బద్దలను పుచ్చుకొని ఆకలిని మాన్చుకొని మహాత్ముడు పోయినారు నేను మాత్రం వెనుక నిలవ వలసివచ్చినది గుంటూరునుంచి వచ్చే మార్గంలో గ్రామాల వారిచ్చిన కానుకల ద్రవ్యం ఎప్పటికప్పుడు లెక్కపెట్టకుండానే నా ఉత్తరీయంలో మూటగట్టుకొంటున్నాను బాపయ్యగారింటిలో ఇచ్చిన వెయ్యి రూపాయలతో మూట బరువెక్కింది లెక్కపెట్టడానికి అవకాశం లేకపోయింది ఆ రోజుల్లో కానుకలు విశేష భాగం రొక్కరూపంలోనే ఉండేవి ఇచ్చినవారి మాటనుబట్టి ఇంత మొత్తం వచ్చినదనుకోవడమే సంభవించింది అంతవరకు వచ్చిన సొమ్మును బాపట్లలో ప్లీడర్లు వసూలు పరిచిన 7 వేల రూపాయలతో కలిపి అంతా నా ఉత్తరీయంలోనే మూటగట్టి దేశిరాజు కృష్ణయ్య పరంగా ఇచ్చి వారి ఇంటిలో భద్రపరిచినాను బాపట్లలో పౌరసభ ముగిసిన తరవాత చీరాలకు పయనమైనాము సొమ్ము ఏమిచేసితివని మహాత్మాజీ నన్నడగలేదు, నేను వారితో చెప్పనూలేదు చీరాలకు పోయే లోపలనే చీరాల సమీపంలో ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారు రామనగరం స్థాపించినారు ఆ రామ నగరంలో చుట్టుప్రక్కల పల్లెలలోని ప్రజలు కొన్ని వేలు చేరినారు మహాత్మాజీ మోటారును ఒండ్రు ఇసుకలో ప్రజలు తోసుకొంటూ తీసుకొని పోయినారు నేను వారు త్వరలోనే ముగించుకొని రాగలరని రోడ్డుమీదనే నిలచిపోయినాను కాని చాలా పొద్దుపోయే వరకూ రామనగరులోనే కాలం గడిచిపోయింది మేము చీరాల పోయేటప్పటికి రాత్రి 10 గంటలు సమీపిస్తున్నది చీరాలలో వైశ్య వర్తకులు పలువురు ధనవంతులున్నారు కాబట్టి మహాత్మాజీని ఎక్కువ మొత్తం కానుకగా ఇచ్చిన వారింటికి తీసుకొని పోయేటట్లు ఏర్పాటుచేసుకొని, వారు పాటపాడి 18 వందల రూపాయలు పాట పాడిన వర్తకుని యింటికి తీసుకొని పోయినారు ఇప్పుడు ఆ రూపాయలు తీసుకొని పురమధ్యంలో సమావేశమైన మహాసభకు వచ్చినాము

ఆ దినాలలో చెన్నరాష్ట్రంలో జస్టిస్ పార్టీ ప్రభావం ఎక్కువగా సాగుతుండేది ఆ పార్టీవారి ప్రేరణచే చీరాల పేరాల గ్రామాన్ని ఆ గ్రామవాసులు వద్దు మొర్రో అంటున్నప్పటికీ పట్టుబట్టి మునిసిపాలిటిగా ప్రభుత్వం వారు మార్చినారు ప్రజలెంత ప్రయత్నంచేసినా ప్రభుత్వంవారు వారి మొర నిరాకరించినారు శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు చీరాల పేరాల పౌరుల పక్షం పూని చాలాసార్లు సభలు జరిపి పురపాలక సంఘం రద్దుపరచవలసిందని తీర్మానాలు చేయించి ప్రతిఘటించినా ఉపయోగం జరగలేదు అంతటితో వారు సహాయ నిరాకరణాన్ని ప్రవేశపెట్టే పద్ధతిని మెలమెల్లగా ప్రజల్లో ప్రయత్నాలు సాగించడం జరిగింది వీధులపక్క చిన్నచిన్న చిల్లర దుకాణాలు పెట్టుకొనేవారు సైతం సుంకం చెల్లించవలెనని మునిసిపాలిటి నిర్బంధించగా

గోపాలకృష్ణయ్యగారి ప్రేరణతో కొందరు సుంకం చెల్లించడానికి నిరాకరించినారు వారిపై మాజిస్ట్రేటు కోర్టులో కేసులు పెట్టినందువల్ల మాజిస్ట్రేటు వారికి ఖైదు శిక్ష విధిస్తూఉండినాడు విచారణ సమయంలో నేరస్థులు హాజరు కాకుంటే వారంట్లమీద పోలీసువారు పట్టుకొని బలవంతంగా కోర్టుకు తీసుకొని వెళ్ళేప్పుడు ప్రజలు వందలాది వెంట పోతూఉండినారు నేనూ ఆ వాయిదాలకు కొన్నిటికి హాజరవుతూ ఉండినాను ఈ కేసుల్లో ఎవ్వరూ ప్రతివాదం చేయక కాంగ్రెస్ నియమం చక్కగా పాటిస్తూఉండినారు ఇట్లా శిక్షింపబడిన పేదవారిలో వృద్ధురాలైన ఒక స్త్రీకి కూడ జైలు శిక్ష విధించినారు గాంధీగారు చీరాల వచ్చేనాటికి ఆమె శిక్ష ననుభవించి అప్పటికి వచ్చిఉంటుంది ఆమెను గాంధీ వద్దకు తీసుకొని వచ్చి పూలదండ వేయించి సన్మానింపజేసి ఆమె చరిత్రను వారికి శ్రుతపరిచినారు ఆమె ధైర్యం, దేశభక్తిని గాంధీజీ మెచ్చుకొని ఆదరించినారు

ఆ సభలో మహాత్మాజీ ఉపన్యాసం ముగించిన తరవాత పురపాలక సంఘం గురించి సాగిస్తున్న సహాయ నిరాకరణ చర్యలను వివరించి పురంనుంచి ప్రజలను మునిసిపల్ మేరలు దాటించి పురం వెలపల కాపురాలు పెట్టించవలెననే తన ఉద్యమంగురించి మహాత్మాజీ అభిప్రాయం గోపాలకృష్ణయ్యగారు కోరినారు "మీరు చేసే కార్యం జయప్రదమైతే కాంగ్రెస్ మిమ్ములను అభినందిస్తుంది కాని మీరు అపజయం పొందితే ఆ బాధ్యత కాంగ్రెస్ తనపై పెట్టుకోదు" అని జవాబు చెప్పినారు ఈ ప్రయత్నం సాగినా తగినంతకాలం గ్రామంనుంచి వలసపోవడం సాగదని నేను అభిప్రాయపడుతున్నాను పలుమారు చీరాల పోయి సభలలోను, ఉత్సవాలలోను పాల్గొంటుఉన్నాను చీరాలలో సభ ముగించుకొని మహాత్మాజీ నెల్లూరుకు పోనుద్దేశించినారు కాని ప్యాసింజర్ రైలు అప్పటికే చీరాల వచ్చి వెళ్ళిపోయింది మెయిలు బండి వేటపాలెంలో ఆగుతుంది కాబట్టి అచ్చటికి ప్రయాణం సాగించినాము వేటపాలెం మహాత్మాజీ కార్యక్రమంలో చేర్చబడింది కాదు మేము వేటపాలెం సమీపించేటప్పటికి దివిటీలతో, మేళతాళాలతో పౌరు లెదురుగా వచ్చినారు అనుకోని ఈ స్వాగతానికి మేము ఆశ్చర్యం పొందినాము గ్రామంలో ఉత్సవంతో ప్రవేశించి ఒక్కొక్క యింటి ఎదటనే వేసియున్న పందిళ్ళలో 116 రూపాయల చొప్పున కానుకలు అందుకొన్నాము తరవాత రైలు స్టేషన్‌కు వెళ్ళి కొంత సేపు విశ్రమించి మెయిల్‌లో మూడో తరగతిలోనే ప్రయాణంచేసి తెల్లవారేప్పటికి నెల్లూరు చేరినాము

నెల్లూరులో శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారి మేడలో మహాత్మునికి బస ఏర్పాటు చేసినారు రామిరెడ్డిగారును, శ్రీమతి పొణకా కనకమ్మగారును కాంగ్రెస్ ఉద్యమంలో దీక్షతో సేవ చేస్తూఉండినారు శ్రీ ఒరుగంటి వెంకటసుబ్బయ్యగారు కావలిలో ప్లీడరు పనిచేస్తూ సంఘసంస్కరణ క్రియలుగా ఉండి కాంగ్రెస్ ఉద్యమ ప్రచారంలో దిగి వృత్తిని మాని ఖద్దరు, జాతీయ

విద్యను ప్రోత్సహించడమేకాక తాటిచెట్ల గీత మాన్పడంకోసం తాటి గెలలను అనేక గ్రామాలలో నరికించి ప్రభుత్వం వారితో తీరని పోరు సాగిస్తూఉండినారు ఈ విషయంలో నెల్లూరులో జరిగిన ప్రయత్నంగాని, ధ్యేయంగాని భారతదేశంలో మరెక్కడ జరగలేదు దీనికి ముఖ్య కారకుడు శ్రీ వెంకటసుబ్బయ్య శ్రీ వెన్నెలగంటి రాఘవయ్యగారనే వకీలు కూడ వృత్తి మాని కాంగ్రెస్‌లో తీవ్ర దీక్షతో పనిచేస్తూ అక్కడి ఏనాదుల అభివృద్ధి నిమిత్తం కృషి చేస్తూఉండినారు నెల్లూరులో మహాసభ జరిగింది తగినట్లు సన్మానం చేసి కానుక లిచ్చినారు ఉదయంలో చెన్నపట్టణం నుంచి హిందూ పత్రికాధిపతి శ్రీ కస్తూరి రంగయ్యంగారు మరికొందరు మహాత్మాజీని పట్టణానికి తీసుకొని వెళ్ళడానికి నెల్లూరుకు వచ్చి ఉండినారు గాంధీ మహాత్ముడు వారితో చెన్నపురికి వెళ్ళిన తరవాత నేను గుంటూరు వచ్చినాను చీరాలలోను ఆ తరవాత వసూలైన సొమ్ము గాంధీ మహాత్ముల కిచ్చివేసినాను దేశరాజు కృష్ణయ్యగారి వద్ద ఉంచిన మొత్తాన్ని చెక్కుద్వారా మహాత్మునికి పంపివేసినాను గుంటూరులో స్త్రీలు సమర్పించిన ఆభరణాలు ఇక్కడి బంగారు వర్తకులను పిలిపించి మిత్రుల ఎదుటనే వేలం వేసి వచ్చిన సొమ్మును గాంధీ మహాత్మునికి పంపివేసినాను ' ఇది వెంకటప్పయ్య పంతులుగారి స్వీయ చరిత్రలోని భాగము గుంటూరులో ఆర్యవైశ్య యువసాహితీ సంఘంవారు కూడా గాంధీజీకి ఒక సన్మానపత్రం సమర్పించినారు

**చేబ్రోలులో**

మహాత్మాగాంధీ గుంటూరునుంచి చేబ్రోలు మీదుగా చీరాల వెళ్ళుతున్నారని తెలిసి కాలవ్యవధి లేకున్నా చేబ్రోలువారు గ్రామం అంతా ఆర్చిలతో, తోరణాలతో అలంకరించినారు ప్రతి ఇంటి ముందు ఎవరికివారు పందిళ్ళు వేసి తోరణాలు కట్టుకొన్నారు ఏప్రిల్ 6 వ తేది సాయంత్రం చుట్టుపట్ల ఉన్న గ్రామస్తులు, గ్రామాలలోని స్త్రీ పురుషులు సుమారు 15 వేలమందికి పైగా గాంధీజీ రాకకోసం ఎదురు చూస్తూ వేచిఉండినారు సాయంకాలం 4 గంటలకు కొండ వేంకటప్పయ్యపంతులుగారితో మోటారుపై మహాత్ముడు చీరాలకు చేరినారు గ్రామస్తులు వారి నెదుర్కొని శ్రీ గాంధీ సరస్వతీ నిలయం వద్దకు తోడ్కొనిపోయి కర్పూర హారతితో 813 రూపాయలను, ఉంగరాలను, బంగారపు బిళ్ళలను సమర్పించి మహాత్మునిపై పూల వర్షం కురిపించినారు విద్యా జ్ఞానం కొంచెమైనా లేని వాసిరెడ్డి వేంకటప్పయ్య అనే యువకుడు ఖద్దరు ధోవతులను గాంధీజీకి గంధ పుష్పాలతో బహూకరించినాడు శ్రీ కొమ్మరాజు లక్ష్మీకాంతరావుగారు హిందీలో రచించిన పిష్వానారాయణరావు వధను వారికి కృతి ఇచ్చినారు కిందటి రోజు గాంధీజీకి ఉపవాస దినం కావటంచేత వారు వెంటనే బయలుదేరి చీరాల వైపుకు వెళ్ళినారు.

**బాపట్లలో**

బాపట్ల పౌరులు గాంధీజీకి దిగువ సన్మాన పత్రం సమర్పించినారు

"శ్రీమద్భారత దాస్య ముక్తికోసం చిత్తంబు సద్భక్తియున్
ప్రేమావేశము నాత్మరాజ్య విభవత్ శ్రీనొందు త్యాగంబు, ని
స్సీమాత్మిక బలంబు జూపి విజయోత్సేకంబు రూపించు నో
స్వామీ! గాంధిమహాత్మ! స్వాగతమిదే సద్భక్తి నర్పించగన్"

నిర్మల దేశభక్తిచేతను విశుద్ధ ప్రవర్తనచేతనూ, స్వరూప స్వభావాల చేతనూ, నిరుపమాన స్వార్థత్యాగంచేతనూ, ఆత్మ సమర్పణంచేతనూ, సమస్త భారతీయ హృదయాంతరాళాల విజ్ఞానతేజః పుంజాలు ప్రసరింపజేసి పట్టణ జానపదాలలో సమంగా 'జయ జయ' ధ్వానాలు ఉద్భవింపచేసి మాతృ సేవా సక్తి నెలకొల్పి మహర్షి సంప్రదాయం నెలకొల్పి సత్య, ధర్మ, శాంతిపూతమైన అసహాయ యోగంలో భారత వర్ష మోక్షప్రాప్తికను దీక్షా కంకణం ధరించి జగజ్జేగీయమానులై దిగంత కీర్తివిస్తారులగు తమరిక్కడకు దయచేయడం మా భాగ్యవశం మీ దర్శన ప్రభాకరోదయంలోనే మా చిత్త మాలిన్యతమోరాసి విరియజొచ్చుచున్న దనడానికి సందేహం లేదు మా పట్ల దయతో తామిక్కడ ఒకింతసేపు నిలచి దర్శన భాగ్యం కలిగిస్తే మీకెంతో కృతజ్ఞులమైనమో వాకముల నర్పిస్తున్నాము స్వరాజ్య స్థాపనా కార్యనిర్వహణ కావించడానికి తమకు దయామయుడగు భగవంతుడు దీర్ఘాయురారోగ్య సంపత్తి నిచ్చి భారత దేశ మోక్ష ఫలసిద్ధి కావించడం కొరకు భక్తిపూర్వకంగా వేడుతున్నాము

ఇట్లు
బాపట్ల పురవాసులు

ఈ సన్మాన పత్రము 1921 ఏప్రిల్ 6 వ తేది సాయంకాలం 6-30 గంటలకు దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారితో గాంధీ దంపతులు బాపట్లకు వచ్చినప్పుడు బాపట్ల పౌరులు చదివినది

ఈ సన్మాన పత్ర సమర్పణ సమయంలో దాదాపు 10 వేల మంది జనులు సమావేశమైనారు గాంధీజీ ఈ సన్మాన పత్రానికి సమాధానమిస్తూ ఇట్లా అన్నారు,

"మనం అంటరానితనం రూపుమాపినాము అది హిందూ సనాతనధర్మా నికి విరుద్ధము ఆ పాపానికే మనం సదా దాస్యం అనుభవిస్తున్నాము తాగుడు ఇతర మత్తు పదార్థాలనుకూడ సేవించకూడదు మనము ఇంద్రియనిగ్రహంతో ఉండవలె న్యాయవాదులు వారి వృత్తిని మానవలె విద్యార్థులు ప్రభుత్వ పాఠశాలలను వదలి జాతీయ పాఠశాలలో మానవలె జాతీయ విద్యాలయాలు లేని చోట్ల రాట్నంపై నూలు వడకటమే వారి పరమ ధర్మము రాట్నం మనకు స్వరాజ్యం చేకూర్చగలదు 21 సంవత్సరాలకు పై బడిన స్త్రీ పురుషు లందరూ కాంగ్రెస్ సభ్యులుగా చేరవలె తిలక్ స్వరాజ్యనిధికి సొమ్ము విరి విగా ఇవ్వవలె" ఈ ఉపన్యాసానంతరం 2 వేల రూపాయల నగదు తిలక్

స్వరాజ్యనిధికి సమర్పించబడింది దేశిరాజు లక్ష్మీనారాయణరావుగారు గాంధీజీకి ఎమ ఇంట్లో తిలక్ స్వరాజ్యనిధికిగాను 1000 రూపాయలు సమర్పించినట్లు ఇంతకు పూర్వము దేశభక్త వెంకటప్పయ్యగారి స్వీయ చరిత్రనుంచి ఉదాహరించడం జరిగింది

**పొన్నూరులో**

గాంధీ మహాత్ముడు గుంటూరు నుంచి బాపట్ల, చీరాల మొదలయిన గ్రామాలకు పోతున్నట్లుగా తెలిసి తోవలో పొన్నూరు గ్రామస్థులు, గ్రామమంతటినీ పచ్చని తోరణాలతోనూ, స్వరాజ్య పతాకాలతోనూ, దేశనాయకుల ఛాయాపటాలతోనూ అత్యంత శృంగారంగా అలంకరించినారు వీధుల్లో నీళ్లు చల్లి స్వాగత తోరణాలు కట్టినారు ఊరికి తూర్పున సభామంటపం ఏర్పాటు చేసినారు అది పచ్చని తోరణాలతోనూ జాతీయ పతాకాలతోనూ చూసే వారికి ముచ్చటగా ఉంది 10 వేల జనం సభామంటపం చుట్టూ చేరినారు గాంధీజీ ఏప్రిల్ 6 న సాయంకాలం 5 గంటలకు పొన్నూరు వచ్చినారు వారు మోటారు మీద కూర్చొని ఉండగా స్త్రీ పురుషులందరూ వారిని భక్తిపూర్వకంగా సందర్శించినారు గ్రామంలోని ఆహ్వాన సంఘంవారు స్వరాజ్య నిధికి 280 రూపాయలు సమర్పించినారు

**రామనగరంలో**

చీరాలకు దగ్గరగా శ్రీ దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారు ఏర్పాటు చేసిన రామనగరాశ్రమానికి మహాత్మా గాంధీ ఏప్రిల్ 6 రాత్రి 8 గంటలకు వచ్చినారు ఆశ్రమ పరిసర విశాల ప్రదేశంలో వేలకొద్దీ ప్రజలు సమావేశమై మహాత్ముని రాకకోసం వేచి ఉన్నారు

ఆంధ్ర విద్యాపీఠ గోష్ఠివారు, చీరాల పేరాల గ్రామాలవారు, జాతీయ పాఠశాల వారు విడివిడిగా 4 సన్మాన పత్రాలను తాటి ఆకులపై వ్రాసి చదివి గాంధీజీకి సమర్పించినారు వడుకు నూలుతో తయారు చేసిన ఒక అందమైన రుమాలును జాతీయ పాఠశాల ఉపాధ్యాయులు మహాత్మునికి కానుకగా ఇచ్చినారు మహాత్ముడు సంగ్రహంగా ఉపన్యసించి మోటారు బండిలో చీరాలకు వెళ్ళినారు

**చీరాలలో**

చీరాలలో విశాలమైన ప్రత్యేక వేదిక ఏర్పాటు చేయబడింది ఇంతకు పూర్వం కొండ వేంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్రనుంచి ఉదహరించినట్లుగా చీరాల మున్సిపల్ పన్నులను ఇవ్వక నిరాకరించినందుకూ "చెరసాలకు పంపబడి తిరిగి వచ్చిన" ముగ్గురు సోదరులను ఒక సోదరీమణిని గాంధీజీ స్వయంగా పుష్పమాలాలంకృతుల చేసినారు అప్పుడు సమావేశమైన ప్రజ

లందరూ సంతోషపరవశులైనారు తరువాత గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

"భారత దేశంలో అన్ని చోట్ల నన్ను ఎంతో ఆదరిస్తున్నందుకు నే నపరిమితానందం పొందుచున్నాను నేను దక్షిణాఫ్రికాలో చాలా సార్లు చెరసాలకు వెళ్ళి ఉన్నాను మానవుని పౌరుషాన్ని, శక్తిని నాశనం చేసి సామాన్య స్వాతంత్ర్యాలకుకూడ భంగం కలిగించిన ప్రభుత్వం కింద స్వేచ్ఛగా ఉన్నప్పటి కంటే నిర్బంధితుడిగా, చెరసాలలో ఉన్నప్పుడే నేను ఎక్కువ స్వాతంత్ర్యం అనుభవించగలిగినాను కాబట్టి ఈ ప్రభుత్వం కింద వెలుపల ఉన్న వారికంటె చెరసాలలో ఉన్నవారే అదృష్టవంతులు చెరసాలనుంచి నన్ను వదలినప్పుడంతా ప్రభుత్వంవారు నన్నెందుకు వదలిపెట్టినారా అని చింతిస్తుండే వాణ్ణి చీరాలలో తమ సోదరీమణులలో ఒక భక్తురాలు చెరసాలకు పోయే టంతటి సాహసం వెల్లడించినందుకు చీరాలలోని నారీమణులందరూ ధన్యా రాండ్రని నేను వారిని ప్రశంసించకతప్పదు చీరాలవారు దౌర్జన్యం పూర్తిగా త్యజించి మరింత ప్రశంసనీయులైనారు చీరాల మునిసిపాలిటీని గురించి పత్రికలో ప్రకటించిన సర్వవిషయాలను సాకల్యంగా చదివినాను ప్రజల అభిప్రాయానికి ప్రతికూలంగా మునిసిపాలిటీని ఏర్పరచడంతో ప్రభుత్వంవారు అనుచితంగా ప్రవర్తించినారు ఈ సందర్భంలో ఆత్మగౌరవం నిలుపుకో కోరే స్త్రీ పురుషులకు రెండు మార్గాలు మాత్రమే ఉన్నాయి మీ కష్టాలు ఇప్పుడే ప్రారంభమైనాయి అసహాయోద్యమాన్ని అవలంబించి సివిల్ చట్టాలను ఉల్లంఘించటం ఒకటి, తులసీదాసు చెప్పినట్లు, మహ్మదీయులాచరించినట్లు పట్టణం వదలిపోవడం వేరొకటి ఈ రెండు సమాన శక్తి కలవేననీ నా అభిప్రాయము మీరు కాంగ్రెస్‌పై ఆధారపడవద్దు కష్టాలకు సంసిద్ధులై ఆత్మవిశ్వాసంపై ఆధారపడి ఉండటం మంచిది మీ కత్యంత విశ్వాసపాత్రుడైన నాయకుడు దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారిని నేను ఎంతో ప్రశంసిస్తున్నాను దౌర్జన్యం పూర్తిగా వదలిపెట్టయితే మన ఉద్యమానికి శోభ వస్తుంది రాట్నమే హిందూ దేశాన్ని రక్షించగల సాధనము నేను అత్యంత శ్రద్ధతో చీరాలలోని సోదర సోదరీ మణుల భావి చర్యలను గమనిస్తూ ఉంటాను హిందూ దేశంలో నూతన శకం ప్రారంభం కానున్నది దేశీయులందరూ మీ వంక చూస్తున్నారు మీరిప్పుడు వెనకంజ వేయరాదు దౌర్జన్యం పూర్తిగా వదలి సర్వేశ్వరుడే మార్గదర్శియై మిమ్మల్ని నడిపిస్తున్నట్లు విశ్వసించి ఎవ్వరినీ లెక్కచేయక న్యాయమార్గంలో ముందుకు నడువ గోరుతున్నాను మిమ్ములను సర్వేశ్వరుడు రక్షించుగాక" గాంధీజీ చేసిన ఈ ఉపన్యాసం తెలుగులోకి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు అనువదించినారు నగలుగానీ, నగదుగానీ మొత్తం 5 వేల రూపాయలు తిలక్ స్వరాజ్యనిధికి సమర్పించడం జరిగింది

రామదండువారి నైపుణ్యంవల్ల చీమ చిటుక్కు మన కుండ నిశ్శబ్దంగా సభవారందరు మహాత్ముని ఉపన్యాసం వినగలిగినారు

చీరాలనుంచి గాంధీ దంపతులను, కొండ వేంకటప్పయ్యపంతులుగారును

నెల్లూరుకు పోతూ తోవలో వేట పాలెంలో ఆగి తిలక్ స్వరాజ్యనిధికి కానుక లందుకొన్న విషయాన్ని, నెల్లూరు చేరిన తరవాత జరిగిన ఉదంతాన్ని (శ్రీ) వేంక టప్పయ్యపంతులుగారి స్వీయచరిత్రనుంచి వెనకటి పుటలలో ఉదాహరించడం జరిగింది నెల్లూరులో గాంధీజీ యిచ్చిన ఉపన్యాసం కూడా వివరంగా వెనకనే ఉదాహరించడం జరిగింది

గాంధీజీ నెల్లూరునుంచి మద్రాస్‌కు పోతుండగా తోవలో గూడూరు పురవాసులు స్వరాజ్యనిధికి కొంత సొమ్ము సమర్పించినారు

## ఆంధ్రలో తిలక్ స్వరాజ్యనిధి వసూళ్ళు

ఆంధ్రదేశంలో తిలక్ స్వరాజ్యనిధి వసూళ్ళ వివరాలను గురించి దేశ భక్త కొండ వేంకటప్పయ్యపంతులుగారు 17-4-1921 న ఆంధ్ర పత్రికలో ఇట్లా ప్రకటించినారు

| | | |
|---|---|---|
| ·గుంటూరు జిల్లా | | రూ 7868-4-9 |
| | రూ అ పై | |
| గుంటూరు | 727 - 15 - 05 | |
| చేబ్రోలు | 818 - 0 - 08 | |
| మంచాల, పచ్చలతాటిపర్రు మునిపల్లె, పొన్నూరు, అప్పికట్ల వగైరా గ్రామాలు | 825 - 6 - 04 | |
| | రూ అ పై | |
| బాపట్ల | 825 - 0 - 0 | |
| (దేరాజు) బ్రహ్మాండం లక్ష్మీనారా యణగారు బాపట్ల | 1116 - 0 - 0 | |
| చీరాల | 2828 - 14 - 9 | |
| చినగంజాం | 232 - 0 - 0 | |
| | 7868 - 4 - 9 | |
| నెల్లూరు జిల్లా, నెల్లూరు | | రూ అ పై |
| | | 2411 - 2 - 7 |
| విశాఖపట్టణం జిల్లా, | | 916 - 10 - 0 |

| | రూ అ పై | |
|---|---|---|
| విజయనగరం | 458 - 8 - 0 | |
| అనకాపల్లి | 200 - 0 - 0 | |
| పొట్నూరి స్వామి బాబుగారు, నరసన్నపేట | 200 - 0 - 0 | |
| ఇతర చిల్లర | 57 - 2 - 9 | |
| | 916 - 10 - 9 | |
| కృష్ణాజిల్లా | | 8394 - 4 - 6 |
| బందరు (కానూరి చిన్న వేంకట దాసయ్య గారిచ్చిన 1116 - 0 - 0 తో సహా) | 7372 - 6 - 0 | |
| ఏలూరు (నిడుదవోలు వగైరా గ్రామాడులు సహా) | 1021 - 14 - 4½ | |
| | 8394 - 4 - 4½ | |
| బెజవాడ | | 2812 - 6 - 9 |
| పెద్ద సభ | 1542 - 12 - 0 | |
| గిడ్డాని సభ | 88 - 10 - 0 | |
| స్త్రీల సభ | 899 - 13 - 0 | |
| రహదారి బంగాళా వద్ద | 94 - 10 - 0 | |
| దాసు విష్ణురావు ద్వార | 13 - 9 - 9 | |
| మధుసూదనరావు ద్వారా | 92 - 0 - 0 | |
| బందరునుంచి మహాత్ముడు వచ్చేటప్పుడు | 91 - 0 - 0 | |
| | 2812 - 6 - 9 | |
| | | 21992 - 13 2½ |

వసూలైన ఆభరణాలు, వస్తువులనూ ప్రతి దానికి షరాబులచేత తూనికలు వేయించి కవుటీ కట్టించి జాబితాలు వ్రాయించి కింద ఉదహరించిన వారికి పంపించినాను

| | |
|---|---|
| విజయనగరం | 1 జోశ్యుల అప్పల రామమూర్తిగారు |
| | 2 ప్లీడరు సోమసుందరరావుగారు |
| ఏలూరు | దండు నారాయణరాజుగారు |
| బెజవాడ | దాసు విష్ణురావుగారు |
| బాపట్ల | నండూరి శేషాచార్యులు గారు |

ఆయా గ్రామాలవారు పైన చెప్పిన వారి వద్ద వాటిని చూసుకో వచ్చు వాటి ప్రకటనకు ఇంతకంటె మార్గం కనిపించలేదు ఏ గ్రామంలో వచ్చిన నగలను ఆ గ్రామంలో వేలం వేయించవలెనని కొందరి అభిప్రాయంగా ఉన్నది కాబట్టి ఆ ప్రకారం చేయగలను

ఇట్లు
కొండ వెంకటప్పయ్య

## మద్రాసులో గాంధీజీకి ఘనసన్మానము

1921 ఏప్రిల్ 8 వ తేదిన గాంధీజీ మద్రాసు వచ్చి ఆ సాయంకాలం సముద్రతీరంలో ఉపన్యసింప బోతున్నారని తెలిసినందున 3 గంటలనుంచి ప్రెసిడెన్సీ కళాశాలకు ఎదురుగా ఉన్న సముద్రతీరమంతా జన సమూహంతో నిండి పోయింది మద్రాసు నగరం నుంచే కాక చుట్టుపట్ల అనేక జిల్లాలనుంచి స్త్రీ పురుషులు వేలకొద్దీ సముద్రతీరానికి చేరుకొన్నారు ఆ జన సమూహంలో సుప్రసిద్ధులైన ప్రముఖులు కూడా ఉన్నారు అక్కడ అమర్చబడిన వేదిక చుట్టూ ఇసక మీద వేలాది జనం కూర్చున్నారు గాంధీజీని దర్శించ వచ్చిన స్త్రీలకు ప్రత్యేక స్థలం ఏర్పాటు చేయబడింది సాయంకాలం 6 గంటలయ్యే సరికి స్త్రీ పురుషులతో నిండిన ఆ జన సమూహం దేవతలకు సైతం చూడ ముచ్చటగా ఉన్నది మెరీనా నుంచి సముద్రం వరకున్న 'మత్స్య ప్రదర్శన శాల' (ఎక్వేరియం) నుంచి పాత ఇంజనీరింగ్ కళాశాల భవనం వరకూ ఇసక వేసిన రాలనంతగా జన సమూహంతో నిండిపోయింది అగస్త్యుడు ఏవైపునకు పోతే ఆ వైపునకు భూమి ఒరిగి పోతుందేదని పురాణాలలో చెప్పిన మాట అనాడు గాంధీజీ విషయంలో అక్షరాలా యథార్థమైనట్లు కనిపించింది గాంధీ సముద్రపువొడ్డుకు రాగానే జన సమూహంతో నేల అంతా ఆ వైపు ఒరిగినట్లు కనిపించింది చాలా మంది ప్రభుత్వోన్నతోద్యోగులు కూడ దూరంనుంచి ఆ దృశ్యం ఆశ్చర్యచకితులై చూస్తు ఉండినారు ఆ జన సమూహంలో కొంత మంది యూరోపియన్‌లు కూడా ఉన్నారు గాంధీజీ మోటారు కారులో సెనేట్ హౌస్ వద్దకు వచ్చేసరికి అందరి దృష్టి ఆయన వైపునకే మరలింది. గాంధీజీ కారు ఎక్వేరియంకు ఎదురుగా ఆగింది ఆయన కారులో నుంచి దిగి సభా స్థలానికి వచ్చేసరికి "మహాత్మా గాంధీకి జై" అనే నినాదాలు మిన్ను

ముట్టినాయి గాంధీ దంపతులను సేలం విజయరాఘవాచారి గారు మొద లయిన నాయకులు వేదిక దగ్గరికి తీసుకొని వచ్చినారు గాంధీజీ వేదికపైన ఆసీనులు కాగానే కస్తూరిబా గాంధీని తమ మధ్య కూర్చుండ వలసిందిగా అక్కడ చేరిన స్త్రీలు కోరగా ఆమె వారి మధ్యలో చేరి కూర్చున్నారు ఆ సాయంత్రపు కార్యక్రమం ప్రారంభించక ముందు 'తిరువళిక్కేణి' వైదిక బ్రాహ్మణోత్తములు మహాత్మాజీని పూర్ణ కుంభంతో వేదస్వరనాలతో చిరా యుష్మంతుడుగా స్వరాజ్య సంపాదనా ప్రయత్నంలో సంపూర్ణ విజయం పొంది చిరంతన కీర్తిమంతుడు కావలెనని ఆశీర్వదించినారు గాంధీ దంపతుల పైన మంత్రతీర్థంతో మంత్రాక్షతలు చల్లినారు వారికి పుష్పహారాలు వేసి నారు బ్రాహ్మణులు మహాత్మాజీకి ప్రదక్షిణ, ప్రణామాలు చేసి తమ తమ స్థానాలకు పోయి ఆసీనులైనారు 50 వేల మంది జనులున్నప్పటికి సభ నిశ్శబ్దంగా ఉంది ప్రతి ఒక్కరూ మహాత్మాజీ మాటను విని చైతన్యవంతులు కావలెననే కోరికతో ఉన్నారు ఆ సభకు హాజరైన వారిలో సేలం విజయ రాఘవాచారి, యస్ కస్తూరి రంగయ్యంగారు, యస్ శ్రీనివాసయ్యంగారు, టి వి శేషగిరయ్యర్, టంగుటూరి ప్రకాశం, టి వి వెంకట్రామయ్యర్, సి రాజగోపాలాచారి, వలియుల్ల ఖాద్షా సాహెబు, నాదర్ సాహెబు, ఎ రంగ స్వామయ్యంగారు, యస్ సత్యమూర్తి, టి వి గోపాలస్వామి మొదలి యార్, కె పి కేశవమీనన్, జోసఫ్ అయప్పన్, ఆర్ శ్రీనివాసయ్యంగారు, డాక్టర్ వెంకప్ప, టి ఎ నర్సింహాచార్య, వేమవరపు రామదాసు, వి చక్రయ్య, సి వెంకటరంగం నాయుడు మొదలయినవారు ఉన్నారు

ఆ బహిరంగసభకు కస్తూరిరంగయ్యంగారు అధ్యక్షతవహించవలసిందని ప్రకాశంగారుప్రతిపాదించగా రాజగోపాలాచారిగారు ఆమోదించినారు

అంతట కస్తూరి రంగయ్యంగారు మహాత్మాగాంధీని ఉపన్యసించవల సిందని కోరుతూ తనకుకూడా గాంధీజీ ఉపన్యాసం వినవలెననే కుతూహలం ఎక్కువ ఉండటంచేత తాను ప్రస్తుతమేమీ మాట్లాడదలచుకోలేదని గాంధీజీనే ఉపన్యసించవలసిందనీ కోరినారు

## గాంధీజీ ఉపన్యాసము

గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"అధ్యక్షా! స్నేహితులారా! నేను నిలుచుని మాట్లాడజాలనందుకు మామూలు ప్రకారం నన్ను క్షమిస్తారని భావిస్తున్నాను ఇంతకు పూర్వమే మీరు పూర్ణకుంభము ఏర్పాటును చూసినారు హిందూదేశం ప్రారంభించిన ఉద్యమం జయప్రదం కావలెనని పూర్ణకుంభం పేరు మీదుగా ఆశీర్వదిస్తూ ప్రార్థించడం జరిగింది ఈ విధి, సంస్కారం ఊహించి చక్కగా నెరవేర్చిన మిత్రులకు నా కృతజ్ఞతాభివందనాలు మన ఈ పోరాటంలో ఈ దేశం తమదే నమకొనే హిందువులు, మహమ్మదీయులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు,

క్రైస్తవులు, పార్శీలు, యూదులు మొదలయిన వారందరూ ఐక్యంగాఉండడం గమనించదగిన విషయము అయితే నేనొక్క విషయం మాత్రం ఈ సమావేశం ఏర్పాటు చేసినవారి దృష్టికి తేవలసి ఉన్నది ఈ పూర్ణకుంభానికి చుట్టిన పూవుల అద్దకం గల బట్ట, విదేశీ వస్త్రము విదేశీ వస్త్రం మన బానిసత్వానికి చిహ్నమని భారతదేశం గమనించవలసిన తరుణం ఆసన్నమైనది అంతేగాదు అది ఇండియాలోని ఇస్లాం మతానికి, ఇండియా దేశపు ఆర్థిక, రాజకీయ, నైతిక, ధార్మిక తత్వాలకు అవమానకరమని కూడ నా అభిప్రాయము నేను భారతదేశంలోని హిందూ మహమ్మదీయుల ద్వారా ఖిలాఫత్ సమస్యా పరిష్కారం గురించి ఆలోచించినకొద్దీ మన మాతృదేశమైన ఇండియాలో మనం ఎంత త్యాగమైనా చేసి విదేశీ వస్త్రాలను విసర్జించవలసిందని నా తలంపు మౌలానా మహమ్మదాలీ ఇటీవల కలకత్తాలో ప్రసంగిస్తూ "ఒక శతాబ్దం కిందటనో ఇంకా అంతకు ముందో మనము రాట్నం అమ్మివేసి బానిసత్వం కొనుక్కొన్నాము" అన్నారు ఆ మాటలో ఎంతయినా యథార్థమున్నది కాబట్టి సహాయ నిరాకరణోద్యమం కొన్ని నెలలపాటుఆచరణలో పెట్టిన తరవాత అ. భా. కా. సం ఆమోదించిన తీర్మానంలోని అత్యంత శక్తిమంతమైన భాగం మీ దృష్టికి తీసుకురావలెనని నేనిపుడు ్రాంఛిస్తున్నాను

30 వ జూన్‌లోగా కోటి రూపాయలను సేకరించవలెనని కోరడం ఇంగ్లాండ్, అమెరికాలకుగాని, ప్రపంచంలోని మరే ఇతర దేశాలకుగాని రాయబారాలు పంపేటందుకు కాదు, పరదేశాలలో ప్రచారం చేసేటందురు కాదు ఆ సొమ్ము ఇండియాలోని ప్రతి ఇంటా రాట్నములను ప్రవేశపెట్టడానికి మాత్రమే ఎక్కువగా ఉపయోగపడుతుంది రాట్నాల వ్యాప్తికోసం యావద్ద్రావిడ రాష్ట్రంలో పని చేస్తూండిన వారి కేవల భృతికి కూడా కొంత సొమ్ము వెచ్చించ కోరుతున్నాను ఇటీవలనే నేను మచిలీపట్టణానికి పోయినప్పుడు కొన్ని గ్రామాలను దర్శించే భాగ్యం కలిగింది అక్కడ మన సోదరీమణులు అందమైన సన్నని నూలు ఇప్పుడు కూడా వడుకుతున్నారు వారా పని చేస్తున్నది డబ్బుకోసం కాదు, ప్రేమతో చేస్తున్నారు (హర్ష ధ్వనులు) కాబట్టి ఈ సంవత్సరంలో మీరు స్వరాజ్య సంపాదనకూ ఖిలాఫత్ పంజాబు దురంతాల పరిష్కారానికి సహకరించదలచుకొన్నట్లైతే ఈ పవిత్ర జాతీయ వారంలో మీ దగ్గరున్న విదేశ వస్త్రాల నన్నిటినీ విసర్జించగలరని నే నాశిస్తున్నాను మన దేవాలయాలలోగాని మన మసీదుల్లోగాని ఒక అంగుళం విదేశీ బట్ట ఉన్నప్పటికి నేనది పాపంగా భావిస్తాను ఇంక ఈ విషయం ముగించి ఇతర విషయాలను ముచ్చటించదలుచుకొన్నాను

**అహింస**

మన ఉద్యమం కొనసాగుతూన్నకొద్దీ మన ఉద్యమ విజయం పూర్తిగా కాకపోయినా చాలావరకు అహింసపైననే ఆధారపడి ఉన్నదని ప్రజలకు నచ్చ

నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది అసహాయోద్యమంలో అత్యధిక భాగం అహింస అని నా అభిప్రాయము అయితే మన అహింసాచరణలో చాలా కష్టనిష్ఠురాలు కలవనే మాట మనం గ్రహించవలె మలబారులో ఒకానొక చోట అసహాయోద్యమావలంబియైన తండ్రి తన కొడుకుపైన పోలీసు వాడొకడు అకారణంగా దౌర్జన్యం చేయడం తాను కనులారా చూడవలసి వచ్చిందని ఇప్పుడే నేను విన్నాను ఈ వార్త తెచ్చిన స్నేహితులు సేకరించిన సాక్ష్యంలో ఏదో ఒక తప్పో, లోపమో ఉంటుందనీ ఈ కథ అబద్ధమై ఉండవచ్చుననీ ఇంకా నాకు ఆశగా ఉంది ఈ ప్రభుత్వంలోగాని తుదకింకే ప్రభుత్వంలోగాని ఇటువంటి ఘటనలు అసంభవ మనుకోవడానికి మాత్రం వీలు లేదు రెండేండ్ల కిందట పంజాబులోని సైనికశాసన కాలంలో ఇటువంటివి చాలా జరిగినాయి ఆటువంటి దౌర్జన్యాలకు ప్రతీకారం చేయకుండా నిగ్రహంతో నిలువగలిగినప్పుడే మనకు అమోఘమైన జయం లభించినట్లు భావించవలసి ఉంటుంది ఈ ప్రభుత్వం ఇండియా పట్ల తాను చేసిన దౌర్జన్యయుత దురాగతాలకు పశ్చాత్తాపమైనా పడవలె లేదా ఇండియాను చండ శాసనంతో అణిచిపెట్టనైనా అణిచిపెట్టవలె డయ్యర్ అవలంబించిన విధానం ఏదో ఒక ప్రత్యేక అసామాన్య విషయంగా నేను భావించటంలేదు ఇండియాను ఎట్లాగైనాసరే శాశ్వతంగా తమ అధీనంలో ఉంచుకోవడానికి ప్రభుత్వంవారు బుద్ధిపూర్వకంగా అవలంబించిన ఒక సుస్థిర విధానమని నేను భావిస్తున్నాను అందువల్లనే నేను దీనిని సైతాన్ ప్రభుత్వమని అన్నాను అయితే సహాయ నిరాకరణవాదులు అవలంబించవలసినది ఒకే ఒక విధానము వారు ఎప్పటికప్పుడు తమ అంతరాత్మలను పరీక్షించుకోవలె ఎటువంటి కోపకారణం ఉన్నప్పటికీ అత్యంత నిగ్రహం కలిగి పవిత్రహృదయాలతో ప్రవర్తించవలె కాబట్టి అసహాయోద్యమ కార్యక్రమం నిర్వర్తిస్తూండిన తండ్రులున్నూ, అసహాయోద్యమ ప్రచారంలో నిమగ్నులైన ఇతరులున్నూ, తమ కార్యక్రమాన్ని కొనసాగించే విషయంలో తాము ప్రభుత్వంవారి దౌర్జన్యానికి సంసిద్ధులుగా ఉండవలెననీ, తాము ప్రతీకార దౌర్జన్యం చేయకూడదనీ కోరుతున్నాను ఈ శిక్షణ సంవత్సరంలో ఇండియా ఆత్మ పరిశుద్ధతతో, ఆత్మ నిగ్రహము కలిగి ఉన్నట్లయితే ఈ సంవత్సరంలోనే భారత స్వాతంత్ర్య సంపాదనలో మన పురోగమనం నిరోధించగల శక్తి ఏదీ ఉండదని నేను నిశ్చయంగా చెప్పగలను త్యాగానికి, పరిశుద్ధతకు, ప్రార్థనకూ నిర్ణీతమయిన ఈ వారంలో - మీకు దేవునిలో నమ్మకం ఉంటే - దేవునిలో నమ్మకంలేని సహాయ నిరకరణవాది నిజమైన సహాయ నిరాకరణవాది కాడు - మీరు ఈ వారమంతా మీ మనస్సులను ప్రార్థనలో కేంద్రీకరించండి, అప్పుడు దేవుడు మనకు - అంటే యావద్భారత దేశానికి - ప్రభుత్వంవారు మనపై చేసే దౌర్జన్యానికి తాళగల శక్తి సామర్థ్యాలను ప్రసాదించగలడు

**ప్రభుత్వ బలం**

అసహాయవాదులమయిన మనం మన ప్రసంగాలను, మన చర్యలను అదుపులో పెట్టుకోవడం అత్యంతావసరము ఏ కోశానా దౌర్జన్యమనే మాట ఉండకూడదు. మాటలోనూ వ్రాతలోనూ కూడా ఎక్కడా హింస కనబడకూడదు ఈ విధమయిన పవిత్ర మార్గంలో మనం పురోగమిస్తే ప్రెసిడెంట్ 'క్రూజర్' చెప్పినట్లుగా ఈ యేడాదిలో మనం మానవ ప్రపంచాన్ని గజగజలాడించగలము మద్రాసు రాజధానిలోనేగాక, మధ్య రాష్ట్రాలలో, సంయుక్త రాష్ట్రాలలో, భారతదేశపు తదితర ప్రదేశంలో జరుగుతూన్న నిర్బంధ విధానంలో మనం గమనిస్తూండిన విషయమేమిటి ? సర్ విలియం విన్సెంట్ కాదంటున్నప్పటికీ, మధ్య రాష్ట్రాలలో మద్యనిషేధ ప్రచారం నేరంగా పరిణమించిందని నేను చెప్పగలను సర్వశక్తులూ వినియోగించి అసహాయోద్యమాన్ని అణివివేస్తామని ప్రభుత్వం వారు అనడం వడుకునూలు ఉద్యమాన్ని, మద్యనిషేధోద్యమాన్ని నిర్మూలిస్తామని అనడమే ప్రభుత్వంవారు ఆబ్కారీ ఆదాయంద్వారాను లాంక్షైరు దోపిడీ విధానం ద్వారాను స్వార్థమే ఇండియాను నిరంతరాయంగా తమ స్వాధీనంలో ఉంచుకోగలరని మన ఆత్మశుద్ధి వల్ల క్రమక్రమంగా ప్రపంచానికి నిరూపించగలుగుతున్నాము ప్రభుత్వంవారిలోగాని, వారు ప్రవేశపెట్టనున్న నిర్బంధ విధానంతోగాని సహకరించడమంటే, అసహాయవాదులు మద్యనిషేధ ప్రచారం చేయకూడదని, సుహృద్భావ సందేశం వినిపించకూడదని, రాట్నంవల్ల కాపాడబడే స్త్రీల సౌభాగ్య సౌశీల్యాలకు తోడ్పడకూడదని చెప్పినట్లేనని ఇండియాలోని మితవాద (లిబరల్) పక్షాల వారికి తదితరులకు నచ్చచెప్పవలె ఈ ప్రభుత్వానికి స్వతస్సిద్ధమయిన శక్తి సామర్థ్యాలు లేవని ఆరోజు కారోజు మనం కళ్లారా చూడగల్గుతున్నాము మన దౌర్బల్యం పైననే ప్రభుత్వబలం ఆధారపడిఉంది మన పరస్పర చర్చల మూలంగా అది బ్రతుకుతూన్నది ఇకముందు హిందూ మహమ్మదీయుల అనైకమత్యంగానీ వారి వివాదాలుకానీ ప్రభుత్వానికి పుష్టినీయజాలవు బ్రాహ్మణ, బ్రాహ్మణేతర చర్చలపైన అది వ్యాపారం సాగిస్తూన్నట్లు నేను అర్థం చేసుకొంటున్నాను ఈ అసహాయోద్యమం బ్రాహ్మణోద్యమమే యినట్లయితే-బ్రాహ్మణోద్యమం కావాలనే నా ఆశ - దానికి పరిహారం బహుసులువైనదే ఎందువల్లనంటే బ్రాహ్మణులు అసహాయవాదు లయినట్లయితే వాళ్లకేమీ ఉద్యోగాల వాంఛా అధికారవాంఛా ఉండకూడదుగదా! కాబట్టి హిందూ ముస్లిం వివాదాలను పరిష్కరించుకొన్నట్లే అతిత్వరలో మనం బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదాలను కూడా పరిష్కరించుకోవలసి ఉన్నది కొంతకాలం కిందట మద్రాసులోని కొంతమంది లాయర్లకు చెప్పిన మాటనే మళ్ళీ నే నిప్పుడు చెప్పబోతున్నాను బ్రాహ్మణులు హిందూ మతానికి ప్రసాదించిన సత్సంప్రదాయాలకు హిందూమతం, వారికి సర్వస్వమూ ఋణపడిఉంది ఆ విషయంలో నా కెంతమాత్రమూ సందేహం లేదు ఇండియాకు వారొక వారసత్వం సంక్రమింపచేసినారు అందు

వల్ల ప్రతి భారతీయుడూ - అతడే వర్ణస్థుడైనప్పటికి బ్రాహ్మణునికి ఎంతో కృతజ్ఞుడై ఉండవలె ప్రపంచంలోని దాదాపు అన్ని మతాల చరిత్రనూ పరిశీలించిన తరవాత బ్రాహ్మణజాతివలె పేదరికమును, అడకువను (Self effacements) వరించిన వర్గము ఈ ప్రపంచంలో మరొకటి లేదని నా నిశ్చితాభిప్రాయము కాబట్టి బ్రాహ్మణేతరుడనైన నేను, ఈ సభలో ఉన్న బ్రాహ్మణేతరులకు నా మాట వినబడడానికి అవకాశంగల ఇదితర బ్రాహ్మణేతర వర్గాలకు, బ్రాహ్మణత్వం కించపరచడంవల్ల తమ స్థితికి ఔన్నత్యం కలుగుతుందని నమ్మడంలో వారు గొప్ప ప్రమాదానికి లోనవుతున్నారని చెప్పదలచుకొన్నాను ఈ కలికాలంలో (Black age) సైతం, ఈ విశాల భారతదేశంలో సంచారం చేసిన నేను, స్వార్థత్యాగంలో, తనకుతాను మరుగున పడిపోవడంలో, (Self effacement) బ్రాహ్మణునకు మించినవాడు మరొకడు లేడని నా అనుభవము భారతదేశంలోని వివిధ వర్గాలవారికి తమతమ హక్కులను విశేషాధికారాలను మౌనంగాను, నిశ్చయంగాను తెలుపుతూన్నవారు బ్రాహ్మణులే ఇదంతా ఇట్లా ఉండగా భారతదేశంలోని తదితరులతోపాటు వారు సైతం బాధలు అనుభవిస్తున్నారని కూడా మనం ఒప్పుకొని తీరవలె మానవ బుద్ధి ఎంత ఉన్నతంగా ఆలోచించగలదో అంత ఉన్నతమైన ప్రమాణాలను బ్రాహ్మణులు మనం కోరకుండా నిండు మనస్సుతో మనముందు ఉంచినారు అందువల్ల భారత ప్రజానీకం, బ్రాహ్మణులు సైతం ఆ ప్రమాణాలకు అనుగుణంగా ప్రవర్తించవలెనని భావించడంలో ఆశ్చర్యం లేదు బ్రాహ్మణులు మన పవిత్ర జీవితానికి సంరక్షకులమని చెప్పుకొంటున్నారు వారట్లా ఉండవలెననే నా కోరిక మద్రాసులోని బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులకు ప్రతికూలంగా అనేక సంగతులు చెబుతారని నాకు తెలుసు అందుకు కారణం లేకపోలేదు కాని బ్రాహ్మణులతో కయ్యం పెట్టుకొన్నందువల్ల అసూయతో వారిని అవనిందలపాలు చేసినందువల్లను బ్రాహ్మణేతరులు తమ స్థితిని బాగుచేసుకోలేకపోగా పై పెచ్చు హిందూ మతాన్ని కించపరిచిన వారవుతున్నారు

బ్రాహ్మణేతరులు దూరదృష్టిగలవారై ఈ ఉద్యమ రహస్యం, ఉద్యమ తత్త్వం గ్రహించగలరని నా అభిప్రాయము ఈ ఉద్యమం ముఖ్యంగా అధికార గర్వం సింహాసనంనుంచి దింపివేయడానికి ఉద్దేశింపబడింది ఇండియాలో ఇప్పుడు జరుగుతున్న సంఘటనల బట్టి ఈ ఉద్యమం పై వర్గాల వారిని కిందికి లాగటానికి కాక దిగువ ఉన్నవారిని పైకి లేవనెత్తటానికి ఉద్దేశింపబడినదని కన్నులున్నవారందరు కనుకోగలరు కాబట్టి బ్రాహ్మణేతరులు హృదయపూర్వకంగా ఈ ఉద్యమంలో ఉరికి ఆత్మార్పణ చేయలేకపోయినప్పటికి కనీసం ప్రభుత్వంవారి కుట్రతో ఏకమై దీనికి అంతరాయాలు కల్పించవద్దని వారిని ప్రార్థిస్తున్నాను హిందూ మతంపైన అది ద్రావిడులకు, పంచములకు ఉన్న అసంతృప్తితో పోల్చి చూసినప్పుడు (బ్రాహ్మణులపైన) బ్రాహ్మణేతరులకు ఉండవలసిన అసంతృప్తి ఎంతమాత్రమూ గణనీయం కాదు హిందూ మతం పంచ

ములను ఒకరకమైన కుష్ఠురోగులుగా చేసింది మన దురహంకారంవల్ల మన సహోదరులైన వారిని అస్పృశ్యులుగా భావిస్తున్నాము నేను సనాతన హిందువుడ ననుకొంటున్నాను నా శక్తివంచన లేకుండా మన శాస్త్రాలను చదివాననే నా తలంపు నేను హృదయపూర్వకంగా సనాతన హిందువుగానే 30 సంవత్సరాల నుంచి జీవిస్తున్నాను కాబట్టి ఈ దేశంలో ఏ హిందువు ఏమి చెప్పినప్పటికి ఎవనినీ అస్పృశ్యుడుగా పరిగణించటానికి మన శాస్త్రాలు అనుమతించటం లేదని నా అనుభవపూర్వకమైన అధికారంతో చెలుతున్నాను దానిని మీరు అంగీకరించి తీరవలెనని నా కోరిక నేను హిందువుగానే మరణించవలెనని నా ఆశ కాని ఏ వొక్క మనిషినైనా తాకడం పాపమని హిందూమతం చెప్పినట్లు నాకు నమ్మకం కలిగితే తక్షణం నేను హిందువును కానని ప్రకటిస్తాను కాబట్టి ఈ రాజధానిలోని బ్రాహ్మణ బ్రాహ్మణేతరులందరూ అస్పృశ్యతా పాపానికి ప్రతికూలంగా పోరాడి దానిని నిర్మూలం చేయ కోరుతున్నాను అస్పృశ్యతతో అంతర్వర్ణ భోజనాలనుగాని, అంతర్వర్ణ వివాహాలను గాని జత చేయకూడదు హిందూ మహమ్మదీయ సమ్మేళనం జరిగి, హిందువులలోని అన్ని వర్గాలవారు కలసిమెలసి ఉండి భగవద్గీతా వాక్యాలకు అనుగుణంగా బ్రాహ్మణునీ, చండాలుని సమభావంతో చూడగలిగితే ఆ తక్షణమే బ్రాహ్మణేతర సమస్య దానంతటదే పరిష్కారం కాగలదు అసహాయోద్యమం రోగ నివారణకు కాక రోగ నిరోధానికి చేసే వైద్యం వంటిది మురికి పేరుకొన్నప్పుడు దాని నిర్మూలానికి శరీరంలోకి కొన్ని సూక్ష్మజీవులు ప్రవేశపెట్టబడతాయి ప్రభుత్వంతో మనం నేడు అవలబించిన అసహాయోద్యమం అటువంటిది గాదు అది మురికినీ, అపరిశుభ్రతనూ పూర్తిగా తొలగించగలదు చీకటిని అంతకంటె ఎక్కువ చీకటితో తొలగించగలమని నటించడంవల్ల ప్రయోజనం లేదు అందువల్లనే ప్రభుత్వం వారి దౌర్జన్యాన్ని మనం అంతకంటె ఎక్కువ దౌర్జన్యం చేసి తొలగించగలమని భావించడంలేదు మన స్వరాజ్యానికి ప్రపంచంలోని ఏ మానవుణ్ణి మన స్వార్థంకోసం ఉపయోగించుకోవలెననే కోరిక లేదు కాబట్టి అ భా కాం సం వారు ఆదేశించిన విషయాలపైన మీ దృష్టిని కేంద్రీకరించవలెనని కోరుతున్నాను మనం ఉపన్యాసాలను ఆధారంగా చేసుకొని మనలను నిర్బంధించటానికి ప్రభుత్వం వారికి ఎంత మాత్రం అవకాశ మివ్వకూడదని కూడ నేను మీకు సలహా ఇస్తున్నాను రాట్నాలను పెట్టుకొన్నందు వల్ల భారతదేశంలోని స్త్రీలందరూ ఖైదులకు పంపబడితే నా కంటినుంచి ఒక్క కన్నీటి చుక్క కూడా వెలువడదు పైపెచ్చు కారాగార ద్వారాలు అంత విశాలంగా తెరవబడి నందుకు సంతోషిస్తాను కూడ ఈనాడు మనలను ప్రతిరోధిస్తూండిన ప్రభుత్వం గురించేగాని, తదితర మిత్రులను గురించి కాని మనం సహనం కోల్పోకూడదు మన తీర్మానాలూ మన ఉపన్యాసాలూ, మనకు సంబంధించి మాత్రమే ఉండవలె కేవలం కాంగ్రెస్, ఖిలాఫత్ కమిటీ, ముస్లింలీగులు నిర్ణయించిన కార్య విధానాలను

అనుసరించే ఈ సంవత్సరంలోనే ఖిలాఫత్ పంజాబు సమస్యలు పరిష్కారమై స్వరాజ్యం చేకూరగలదని నేను నా విశ్వాసం పునరుద్ఘాటిస్తున్నాను

మద్రాసులోని విద్యార్థికులకు మరో విషయం మాత్రం చెప్పి నా ఉపన్యాసం ముగించగలను భారతదేశంలోని ప్రజాసామాన్యమున్నూ భారత మహిళామణులున్నూ పూర్తిగా మనతో ఉన్నారని నా సుదీర్ఘ పర్యటనలలో నేను గ్రహించగలిగినాను నా అనుభవాన్ని మీరు ఆమోదించ కోరుతున్నాను భారత ప్రజలు మనం అనుకొనేటంత తెలివి తక్కువ వారుగానీ, కుసంస్కారులుగానీ కారు వివిధాభిప్రాయాలతో నిబిడీకృతమై మరుగుపడి ఉన్న భారతీయ విద్యావంతుల మేధస్సుతోకంటే సామాన్య ప్రజలు తమస్వతస్సిద్ధమయిన వివేకంవల్ల ప్రతి విషయం దూరదృష్టితో ఆలోచించగలరు భారత దేశంలోని సామాన్య ప్రజానీకం ప్రపంచంలోని తదితరులకంటె ఎక్కువగా నిజమైన సంస్కారం కలవారని సర్ థామస్ మన్రో ఇచ్చిన యోగ్యతా పత్రం మీరు అంగీకరించవలెనని కోరుతున్నాను

నేను నా సమావేశం ముగించే ముందు తిలక్ స్వరాజ్యనిధికి సొమ్ము సేకరించటం ఈ రోజుల్లో ఒక ఆచారంగా పరిణమించిన సంగతి మీకు తెలిసే ఉంటుంది స్వచ్ఛంద సేవకులు మీ దగ్గరికి వచ్చినప్పుడు మీరు వారికి మీ శక్తి కొద్దీ స్వరాజ్యనిధికి చందాలివ్వకోరుతున్నాను నా మాటలు మీరింత ఓరిమితో విన్నందుకు మీకు నా కృతజ్ఞతాభివందనాలు మీ కర్తవ్యాన్ని మీరు నిర్వహించేటందుకు తగిన వివేకాన్ని, ధైర్యాన్ని భగవంతుడు మీకు ప్రసాదించు గాక " ఈ ఉపన్యాసానంతరం అధ్యక్షులుగా ఉండిన కస్తూరి రంగయ్యంగారు గాంధీజీకి కృతజ్ఞతాభివందనాలర్పిస్తూ ఆయన ఉపన్యాసంలోని వాక్యాలను శక్తి వంచన లేకుండా అనుసరించవలెనని పక్షులను కోరినారు మన మాతృదేశ సేవలో నిమగ్నులైన మహాత్మునికి ఆయురారోగ్యాలు ప్రసాదించవలెనని భగవంతుని ప్రార్థిస్తూ సమావేశం ముగించినారు

స్వచ్ఛంద సేవకులు స్వరాజ్యనిధి వసూళ్ళకు ప్రజల మధ్యకు పోగా స్త్రీలు కొంత మంది బంగారు గాజులను, చెవుల పోగులను సమర్పించినారు కొంత మంది నగదు కూడ ఇచ్చినారు

## హైద్రాబాద్ సంస్థానము - గాంధీ ప్రభావము (1921)

1920 నాగపూర్ కాంగ్రెస్ అనంతరం గాంధీజీ బ్రిటిష్ ఇండియాలో ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమ ప్రభావం హైదరాబాద్ సంస్థానంలోకి క్రమక్రమంగా వ్యాపిస్తూన్నట్లు సంస్థానోద్యోగులు అభిప్రాయపడినందువల్ల దాని వ్యాప్తిని నిరోధించటానికి సంస్థానోన్నతాధికారులలో కలిగిన అలజడి ఈ దిగువ ఉత్తర ప్రత్యుత్తరాలను బట్టి తెలియగలదు

ఆ రోజులలో సర్ అలీ ఇమామ్ హైదరాబాద్ కార్యనిర్వాహక సంఘాధ్యక్షుడు జుల్ ఖదర్ జంగ్ న్యాయ పోలీసు శాఖా కార్యదర్శి పోలీసు శాఖా

కార్యదర్శి కార్యనిర్వాహక సంఘాధ్యక్షునికి ఇట్లా వ్రాసినారు ఘనత వెందిన హైదరాబాద్ సంస్థానంలో అనేక విధాలుగా, అనేక రూపాలలో రాజకీయాందోళన పెచ్చు పెరుగుతున్న విషయం వెంటనే ప్రభుత్వ దృష్టికి తీసుకొని రావలసిన అవసరం కలిగింది దానిని గురించి పూర్తిగా నాకు తెలియచేసిన గాడ్ గారికి నేను కృతజ్ఞుడను 1920 వసంతకాలంలో ఖిలఫత్ ఉగ్యమంతో ప్రారంభమయిన ఆందోళన అంతకంతకు అపాయకరంగా పరిణమిస్తూన్నది హైదరాబాద్ ప్రజలలో కింది విషయాల ద్వారా ఒక నూతన రాజకీయోద్యమం ప్రబలుతూన్నది

1 ఖిలాఫత్ విషయము
2 రాజకీయోపన్యాసాలు
3 మహాత్మాగాంధీ, అలీ సోదరుల చిత్రపటాలు
4 గాంధీ టోపీలు
5 స్వరాజ్య చర్చలు
6 కల్లు, సారా అంగడుల బహిష్కరణ
7 విదేశీవస్తు బహిష్కారం
8 జాతీయ పాఠశాలలు
9 తిలక్ స్వరాజ్యనిధి
10 గో సంరక్షణ
11. సహాయ నిరాకరణోద్యమము

వీటిలో చాలా విషయాలు మామూలు సమయాలలో మనం పూర్తిగా సహకరించ దగినవే కాని ప్రస్తుత రాజకీయ వాతావరణంబట్టి ఇవి చాలా ప్రమాదకరంగా పరిణమించినాయి

అయితేసంస్థానంలోను,సంస్థానానికి వెలుపలగల రాజకీయపరిస్థితులను పరిశీలించిఈఉద్యమం చేయిదాటిపోకుండా వెంటనే చర్యతీసుకోవడం అవసరమా లేదా అని నిర్ణయించవలసిన పని ప్రభుత్వం వారిది ఈ ఉద్యమం బ్రిటిష్ ఇండియాలో ప్రారంభమయినప్పటి నుంచి ఇండియా ప్రభుత్వం దీనిని వెంటనే అదుపులో పెట్టడానికి ప్రయత్నించక ముందేమి జరుగుతుందో చూద్దాము అనే ఆలోచనతో నిరీక్షిస్తున్నట్లు కనిపిస్తుంది ముందుగా తొందరపడి చర్య తీసుకోవటం వల్ల క్లిష్టపరిస్థితిని కోరితెచ్చుకొన్నట్లవు తుందేమోనని కూడా వారు భయపడుతున్నారు ఈ పరిస్థితిని ఎదుర్కోవడంలో సంస్థానానికి వెలుపల జరుగుతున్న సంఘటనలను బట్టి గుణపాఠం నేర్చుకోవలసి ఉన్నది ఏమయినప్పటికీ ఈ దుష్ట వాతావరణం క్రమ క్రమంగా రాజధాని నగరంలోకి కూడా ప్రాకుతూన్నది. కొత్వాల్, ఇన్‌స్పెక్టర్ జనరల్ వెంటనే అనుమానితుల చర్యలను కనిపెట్టి ఉండవలసిందని వారి జాబితా ఒకటి తయారుచేసి ప్రతివారమూ ప్రభుత్వానికి పంపేటట్లు ఉత్తరువులు జారీ చేయవసిందనీ కోరుతున్నాను

ఇటీవల రెసిడెన్సీ పరిధిలో జరిగిన తీవ్రమయిన అల్లర్లు ప్రభుత్వం

వారికి తెలియనివి కావు ఈ అల్లర్లకు బాధ్యుడయిన షఫీ యీ సంస్థానము నుంచి వెళ్ళగొట్టబడినప్పటికీ ముందేమి జరగనున్నదో ఊహించడానికి దాని నొక సూచనగా తీసుకోక తప్పదు నిజానికి గాంధీ తత్వం ఇక్కడ స్థిరపడింది ఒక తీవ్రవాదిని మనం సంస్థానంనుంచి వెళ్ళగొడుతూన్న కొద్దీ మరొకడు అంత కంటే ఎక్కువ తీవ్రవాదిగా తయారవుతున్నాడు

ఈ విషయాలన్నీ సర్కారువారి దృష్టికి తీసుకొని రావడంలో వెంటనే తీవ్రమయిన చర్యలు తీసుకోవలెనని చెప్పడానికి కాదు సందర్భాన్ని బట్టి కాలానుగుణంగా తగు చర్యలు తీసుకోవలెనని నా అభిప్రాయము ప్రస్తుతం నే కోరేది ఇంతకు పూర్వం జరిగిన దుస్సంఘటనల వంటివి జరగకుండా చూడ వలెననియే ఈ నా అభిప్రాయం కార్యనిర్వాహక వర్గంవారు చర్చించేటందుకు మీకు పంపేటప్పుడు నాకు మిస్టర్ గాడ్ మహబూబ్‌నగర్ జిల్లా పోలీసు సూపరింటెండెంట్ నివేదికలు అందజేసినాడు ఆ నివేదికలో మహబూబ్‌నగర్, గాంధీ ప్రచారానికి కేంద్రమయినదనీ, ఆ జిల్లాకు అవాంఛనీయులయినవారు చాలా మంది సంస్థానానికి వెలుపలనుంచి వస్తున్నారనీ ఉన్నది ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ తనకు చేరిన ఉత్తరువులకు భిన్నంగా బయటనుంచి వచ్చినవారిని వెంటాడి వారి చర్యలను గమనించకుండా విడిచిపెడుతున్నాడని తెలియ వస్తున్నది ఇది చాలా ప్రమాదకరమయిన విషయము "

పోలీసు కార్యదర్శి నవాబ్ జుల్ ఖదర్ జంగ్ బహదూర్ వ్రాసిన వ్రాతపైన సర్ అలీఇమాం తన అభిప్రాయమిట్లా వ్రాసినారు

"పోలీసు శాఖా కార్యదర్శి సంస్థానాన్ని ఎదుర్కొంటూన్న రాజకీయ సమస్యను నిశితంగాను శ్లాఘనీయంగానూ సమీక్షించినారు ఇండియా గవర్న మెంట్ వారు చర్య తీసుకోకుండా ఉన్నందువల్ల మనం నేర్చుకొనవలసిన గుణ పాఠం, మనం కూడా వారికే చేతులు ముడుచుకొని కూర్చుండ కూడదని గాంధీ ఉద్యమానికి ఎటువంటి ఆధ్యాత్మికత ఆపాదింపబడి నప్పటికీ దానిని ప్రచారం చేసేవారివల్ల వివిధరకాలైన అరాచకత్వము ప్రబలటానికి వీలున్నది దాని వెనక మత ప్రసక్తి ఉండటంవల్ల అది మరింత అపాయకరంగా పరిణ మిస్తుంది భారతదేశ రాజకీయాందోళనలో అసంతృప్తులయిన వివిధ మతస్థు లందరూ ఏకంగా ప్రవర్తించడం ఒక అత్యద్భుత సంఘటన సంస్థానం సురక్షితంగా ఉండవలె నంటే ఇక ఎంత మాత్రం అలసత పనికి రాదు జుల్ ఖదర్ జంగ్ బహదూర్ వ్రాసినట్లు తక్షణం తీవ్రచర్య తీసుకోక పోయినప్ప టికి ప్రభుత్వ కార్య నిర్వాహక వర్గం ఉద్యమనిరోధానికి తగిన చర్య తీసుకోక పోవటం క్షమార్హంకాదు. రోగం వచ్చిన తరవాత చికిత్సకు ప్రయత్నించడం కంటె రోగం రాకుండా చూసుకోవటం మంచిది కాబట్టి పోలీసు పరిపాలనను పటిష్ఠంగా చేయడానికి తగిన చర్యలను వెంటనే తీసుకోవలె" అని వ్రాసి 1921 అగష్టు 28 తేదిని సర్ అలీ ఇమాం తన అధ్యక్షత కింద ఉన్నత ప్రభుత్వోద్యోగుల సమావేశం ఏర్పాటు చేసి వారితో ఈ విషయం చర్చించి

నారు వారు గాంధీ ఉద్యమం సంస్థానంలో వ్యాపించడంవల్ల శాంతి క్రమాలకు అపాయం కలుగుతుందని భావించి దానిని ప్రథమంలోనే నిరోధించటానికి తగిన చర్య తీసుకోనేటందుకు ప్రత్యేకపు ఏర్పాట్లు చేసినారు

వాటి ప్రకారం సమావేశాలను నిషేధించడం గురించి పోలీసు అధికారుల విచక్షణకు వదిలి వేయబడింది విదేశాలనుంచి గానీ, బ్రిటిష్ ఇండియా నుంచి గానీ సంస్థానంలోకి వచ్చే తీవ్రవాద పత్రికలను నిషేధించడానికి కొన్ని సూచనలు చేయడం జరిగింది జాతీయ పాఠశాలలపైన పోలీసు వారు కన్ను వేసి ఉంచవలసిందనీ, ఆ పాఠశాలలను స్థాపించే వ్యక్తుల పూర్వ చరిత్రను తెలుసుకోవలసిందనీ ఉత్తరువులు పంపడం జరిగింది స్థానికులుగానీ, ఇతరులు గానీ ప్రజలను ఉద్రేక పరిచే రాజకీయోపన్యాసాలు చేయనీయరాదని నిర్ణయించడం జరిగింది బహిరంగ సమావేశం జరపడానికి ముందుగా జిల్లా మేజిస్ట్రేట్ ఉత్తరువులు పొందివలెనని, ఆయన నిర్ణయం పోలీసు నివేదికలపై ఆధారపడి ఉండవలెనని కూడా ప్రభుత్వం వారు ఉత్తరువులు చేసినారు క్రైస్తవ మత బోధకులు కొందరు తమ మతంలో కలిసిన వారికి అవిధేయతను బోధిస్తున్నారని తెలిసినందువల్ల తమ మత బోధకులను ఎన్నుకొనే విషయంలో జాగ్రత్త వహించవలెనని వారికి రహస్యపు ఉత్తరువులు జారీ చేసినారు

హైదరాబాద్ సంస్థానంలోని పోలీసువారు వ్రాసిన కింది విషయాలను బట్టి కూడా గాంధీ ఉద్యమ ప్రభావం అక్కడి ప్రభుత్వోద్యోగులలో ఎట్లాంటి అలజడి కలిగించిందో తెలియగలదు

గాంధీ సిద్ధాంతాలను బోధించడానికి మహబూబ్ నగర్‌కు ముగ్గురు వ్యక్తులు వచ్చినారు వారు ముగ్గురు ఖాదీ పర్టులతో, గాంధీ టోపీలతో ఉన్నారు వారిలో ఇద్దరు హిందువులు, ఒకడు మహమ్మదీయుడు వారు ముగ్గురు పోలీసుసబ్ ఇన్‌స్పెక్టర్ దృష్టిని ఆకర్షించలేదు కాని ఆయన పై ఉద్యోగి మహబూబ్‌నగర్‌కు పోయినప్పుడు వారు ఖిలాఫత్ ఏజంట్లనీ, స్వరాజ్య సంఘాలను ఏర్పాటు చేయడానికి వచ్చినారనీ తెలుసుకొన్నారు వారు ప్రజలలో చర్ఖాను గురించి, మద్య నిషేధం గురించి ప్రచారం చేసినారు హైదరాబాద్‌లో చర్ఖాలు అనేకుల ఇండ్లలో స్థాపించబడినాయి మస్లేకరు అనే వ్యక్తి స్థాపించిన అంగడిలో చర్ఖాలు అమ్ముతున్నారు ఈ విషయాన్ని గురించి పోలీస్ ఉద్యోగస్థులు గాంధీ ఉద్యమ వ్యాప్తికోసమిది ఒక ప్రమాదకరమయిన పన్నాగమని కార్య నిర్వాహక సంఘాధ్యక్షునికి నివేదించినారు ఆయన "నిజమే చర్ఖాల, ఉపయోగం దానంతటది అభ్యంతరం కాకపోవచ్చు కాని అది పర్యవసానంగా, గాంధీ ఉద్యమ వ్యాప్తికి కారణభూతం కావచ్చు కాబట్టి జాగ్రత్తగా ఉండవలె" అని వ్రాసినాడు

గవర్నమెంట్ కేంద్రముద్రణాలయం సూపరింటెండెంట్ ఆర్ పి పిళ్ళె గారి వితంతు సోదరి తన ఇంట్లో ఒక వడుకు నూలు కర్మాగారం స్థాపించినట్లు, అందులో చాలా చర్ఖాలు, రెండు మగ్గాలూ పని చేస్తున్నట్లు, రెసిడెన్సీ

ప్రదేశంలో ఉన్న పాఠశాలలోని బాలికలకు ఆమె కొన్ని చర్ఖాలను పంచిపెట్టి నట్లు సి ఐ డి ఉద్యోగులు తమ నివేదికలలో వ్రాసినారు ఆ విషయం కార్య నిర్వాహక సంఘాధ్యక్షునకు కూడా పంపబడింది ఆయన 'చూసినాను చర్ఖా పని తన తోవను తాను నడుస్తూన్నంత వరకు ఏమీ ప్రమాదం లేదు" అని వ్రాసినారు వైద్యశాఖలో ఉద్యోగిగా ఉన్న సరోజినీ నూలు వడుకు కార్ఖా నాను స్థాపించినాడు భీమారావు, భుజంగరావు అనే వారు హైదరాబాదులో వడుకు నూలును విక్రయిస్తున్నారు సహాయ నిరాకరణోద్యమం వల్ల వారు తమ ప్రభుత్వోద్యోగాలకు రాజీనామా ఇచ్చి సరోజినీ స్థాపించిన కార్ఖానాలో పని చేస్తున్నారు మహాత్మాజీ ఉద్యమంలో ఆసక్తితో లక్ష్మీ నారాయణ అనే వ్యక్తి ఒక బాలికా పాఠశాలను స్థాపించి నూలు వడకడం నేర్పించడానికి ప్రయత్నిస్తున్నాడు బదిరుల్ హసన్ బొంబాయిలో రాట్నాలు కొని హైదరాబాదుకు తెచ్చినట్లు తెలుస్తున్నది గోషామహల్‌లోని వకీలు మహ్మద్ జహూర్ అహ్మద్ సిద్ధికి చర్ఖామీద వ్యాసాలు వ్రాసి "మదీనా" "ముషీరే దక్కన్" అనే పత్రికలకు ప్రచురణార్థం పంపించినారు వకీల్ కేశవరావు స్వరాజ్యనిధికి చాలా డబ్బు పంపించినట్లూ, రెసిడెన్సీ హద్దులలో కమిటీలు స్థాపించినట్లూ తెలుస్తున్నది ఈ రిపోర్టు లన్నిటిని గురించి కార్యనిర్వాహక సంఘాధ్యక్షుడు "సహాయ నిరాకరణోద్యమ విషయంలో వీరందరి కార్యకలాపా లను జాగ్రత్తగా కనిపెట్టి ఉండవలసి ఉంటుంది" అని వ్రాసినారు కట్టెల మండిలోని ఒక కలప వర్తకుడు లాల్‌జీ మేగజీ రాట్నాలు చేయడానికి చాలా మంది పనివాళ్ళను నియమించినట్లు తెలుస్తున్నది అట్లాగే అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో పనిచేస్తూన్న కన్నయాలాల్, ఆయనతోపాటు బాల ప్రసాదు అనేవారు పెట్టిన రెండు రాటపు కార్ఖానాలలో స్త్రీలు పనిచేస్తూ న్నట్లు సి ఐ డీలు వ్రాసినారు

తుల్జాపూర్ కాపురస్థుడు రంగనాథ్ కొడుకు విష్ణునాథ్ వైరన్‌లో ఒక జాతీయ పాఠశాలను స్థాపించినాడు అది ఔరంగాబాద్ జిల్లాలోనిది ప్రభుత్వ పాఠశాలలోని పిల్లలను ఆ జాతీయ పాఠశాలలో చేరవలసిందిగా ఆయన ప్రోత్స హించినాడు మహాత్మాగాంధీ, ఆయనను మరి కొంత మందినీ సంస్థానంలోని వివిధ ప్రదేశాలకు పంపినట్లు తెలుస్తూన్నది ఈ విషయాలు కార్యనిర్వాహకా ధ్యక్షునికి తెలియపరచగా ఆయన వీరిచర్యలను జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుందని వ్రాసినారు ఈ ఉత్తరువుపైన ఔరంగాబాద్ జిల్లా పోలీసు సూపరింటెండెంట్ విష్ణునాథ్‌ను రాజకీయ అనుమానితుల జాబితాలో చేర్చి అతని చర్యలను జాగ్రత్తగా రహస్యంగా కనిపెట్టి ఉండవలసిందని కింది ఉద్యో గస్థులకు తాకీదులు పంపినారు

సంస్థానపు సి ఐ డీలు ఇంకా ఇట్లా వ్రాసినారు

"ఘనత వహించిన నిజాం దొరతనంవారి విద్యాశాఖలో (రాయచూర్) పనిచేస్తూండిన తారానాథ్ అనే ఆయన "అమ్‌దర్ద్" అనే పేరుతో ఒక జాతీయ

పాఠశాలను స్థాపించినాడు అందులో 80 మంది విద్యార్థులున్నారు రాజకీయ కారణాలవల్ల ఈ తారానాథ్ సంస్థానంనుంచి వెళ్ళగొట్టబడినాడు తరవాత ఆ పాఠశాలను ఆయన సోదరుడు అమృతరావు నడుపుతున్నాడు దానికి రాయచూర్‌లోని కొందరు వకీళ్ళు, షాహుకార్లు సహాయం చేస్తున్నారు ఈ తారానాధ్ ఇటీవల మద్రాసు రాజధానిలోని సహాయ నిరాకరణోద్యమంలో తీవ్రంగా పనిచేస్తున్నట్లు తెలిసింది ఈయన 'అగ్నిబరాటా' వంటి తీవ్రవాది

అటవీ శాఖలోని వర్ల నరసింహసాహు అనే ఆయన వరంగల్లులో ఉన్న తన కార్ఖానాలో చర్ఖాలు విరివిగా తయారుచేసి బెజవాడకు పంపుతూన్నట్లు తెలిసింది కృష్ణాజిల్లానుంచి గంధం లక్ష్మీనరసింహారావు అనే ఆయన గాంధీ ప్రభావానికి లోనై కరీంనగరుకు వచ్చి స్వరాజ్యనిధికి ధనం సేకరించుకొని వెళ్ళినట్లు తెలుస్తూన్నది వామన్ నాయక్, రాఘవేంద్రరావుశర్మ, పద్మజా నాయుడు (సరోజినీదేవి కుమార్తె) సహాయంతో తిలక్ స్వరాజ్యనిధికి వసూళ్ళు చేసినట్లు తెలుస్తూన్నది ఈ వసూళ్ళకోసం రెసిడెన్సీ ఏరియాలో ఒక రహస్య సంఘం పని చేస్తున్నట్లు తెలుస్తూన్నది స్వరాజ్యనిధికి 23 వేల రూపాయలు వసూలు చేసుకొని బదరుల్ హసన్ బొంబాయికి పోయినట్లు తెలుస్తూన్నది

ప్రభుత్వంవారి అనుమతి లేకుండానే హైదరాబాద్‌లో 1921 అక్టోబర్ 2 వ తేదీని మహాత్మాగాంధీ 53 వ జన్మదినోత్సవం జరిగింది దీనిని గురించి ఒక ఉన్నత ప్రభుత్వోద్యోగి "నా అభిప్రాయంలో ఇది ఘనత వహించిన నిజాం ప్రభువుగారి సంస్థానంలో గాంధీ తత్వం ప్రవేశపెట్టటానికి, సహాయ నిరాకరణ వాదులు, తీవ్రవాదులు బుద్ధిపూర్వకంగా చేస్తూండిన ప్రయత్నం" అని వ్రాసినారు గాంధీ జన్మదినోత్సవ సందర్భంలో పండిత కేశవరావు హైదరాబాద్ ప్రజలు దక్కన్‌లో తయారయిన వస్తువులనే ఉపయోగించవలెనని చెప్పినారు ఆ మాట ఎక్కువ ఉత్సాహ జనకంగా ఉన్నది కాని రాజకీయాలలోకి చేరదని ప్రభుత్వాధికారులు అభిప్రాయపడినారు అబ్దుల్ అలీ, మహాత్మాజీ జన్మోత్సవ దినాన్ని ఆదం జన్మోత్సవ దినంతో పోల్చినారు వామన్ నాయక్ మహాత్మాజీని ఎక్కువగా శ్లాఘించి అస్పృశ్యతా నిర్మూలనావసరం గురించి చాలాసేపు ప్రసంగించినారు అయితే ఈ అన్ని ఉపన్యాసాలలోను బ్రిటిష్ ప్రతికూల భావము, సహాయ నిరాకరణ తత్వము అంతర్లీనమయి ఉన్నట్లు తెలివితేటలు గల వ్యక్తి తేలికగా గ్రహించగలడు

మరొక సభ చుడీ బజారులోని జగన్నాథాలయ సమీపంలో హిందీ సభ పక్షాన హిందీ ప్రచారం నిమిత్తం జరిగింది దానికి రాజాగోవింద ప్రసాద్ బహద్దూర్ అధ్యక్షత వహించినారు ఆ సభలో హైకోర్ట్ ప్లీడర్ రాయ్ విశ్వేశ్వర నాథ్, ఇంగ్లీషు విద్య బ్రతుకు తెరువుకు ఉపయోగిస్తుందనీ, హిందీ హిందూ మతం చక్కగా అర్థం చేసుకోవడానికి ఉపయోగిస్తుందనీ అన్నారు. మాడపాటి హనుమంతరావుగారు కూడా అదే అభిప్రాయం వెల్లడించినారు ఆ సభలోనే బారిష్టర్ శ్రీ కిషన్ రాఘవేంద్రరావుశర్మ, వామన్ నాయక్‌లు పాల్గొన్నారు.

ఫతేఅలీ ఇండియాపైన రాజ్యం చేయడానికి విదేశీయులు సముద్రాలు దాటి వచ్చినారనే భావంగల పద్యం పాడినారు కాని అధ్యక్షులు దానిని పాడకుండా ఆపివేసినారు

హైదరాబాదులో వకీళ్లు తమ వృత్తిని మానివేసినట్లు ప్రత్యక్ష నిదర్శనాలేమీ లేవు కాని హైదరాబాద్ వాస్తవ్యులుగా ఉండి పూనా, బొంబాయి, అలీగఢ్ వంటి ప్రదేశాలలో విద్యాభ్యాసం చేస్తూండినవారు కొందరు తమ పాఠశాలలను, కళాశాలలను బహిష్కరించినారు బొంబాయిలోని గ్రాంట్ మెడికల్ కాలేజీలో 1921 లో విద్యాభ్యాసం చేస్తూండిన డాక్టర్ జయసూర్య (సరోజినీదేవి కుమారుడు) ఆ కళాశాలను వదిలి వేసినాడు

అలీగఢ్ లోని మహ్మదీయ ఆంగ్లో ఓరియంటల్ కాలేజీలో చదువుకుంటూండిన హైదరాబాద్ విద్యార్థులు కొందరు ఆ కళాశాలను విడిచిపెట్టి మహ్మద్ అలీ స్థాపించిన జాతీయ విశ్వవిద్యాలయ కళాశాలలో (National University College) చేరినారు గౌస్ మోహిద్దీన్ అనే ఒక తాలుకుదార్ ఆ జాతీయ కళాశాలా ప్రధానోపాధ్యాయునికి "జాతీయ విశ్వవిద్యాలయ స్థాపనకు అభినందిస్తున్నాను అది జయప్రద మవుగాక నా కుమారులు త్వరలోనే వస్తున్నారు" అని తంతీ వార్త పంపించినారు

సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొనే వారందరికీ వామన్ నాయక్ ఆతిథ్యమిస్తూన్నట్లు తెలియవచ్చింది అసహాయోద్యమం పెంపొందించవలెననే తలంపుతో ఆయన తన బంగళాలో వారందరినీ ఆహ్వానించి ఆతిథ్యమిస్తున్నారు ఈ విషయం కార్యనిర్వాహక సంఘాధ్యక్షునికి తెలియపరచగా ఆయన (1921 ఏప్రిల్ 4 న) "కొన్ని అత్యవసర పరిస్థితులనుబట్టి ఈ విషయం నిలిపి ఉంచవలె అటువంటి వ్యక్తుల నడకలను పరిశీలిస్తూ రిపోర్ట్ పంపుతుండవలె" అని వ్రాసినారు రాయచూర్ ప్రభుత్వ పాఠశాలలోని విద్యార్థి సయ్యద్ అహమదుల్లా హుసేనీ పాఠశాల వార్షికోత్సవ సమావేశంలో సహాయ నిరాకరణం గురించి మాట్లాడినారు ఔరంగాబాద్ వకీళ్లు దిగంబరదాసు, పన్నాలాలుగార్లు బీదర్ నుంచి ఇద్దరిని ఆహ్వానించినారు వారు పన్నుల నిరాకరణం గురించి ఉపన్యసించినారు హైదరాబాద్ లో పాన్ వర్తకుడు మోహన్ సింగ్ లోధా రాజకీయ చర్చలకోసం ఒక సభను స్థాపించినాడు నిజాం కాలేజీ విద్యార్థి గౌసుద్దీన్ హిందూ ముస్లిం ఐకమత్యం గురించి ఒక పుస్తకం ప్రకటించినాడు దాని అమ్మకంవల్ల వచ్చిన సొమ్ము తిలక్ స్వరాజ్యనిధికి పంపించనున్నట్లు తెలుస్తున్నది

హైదరాబాద్ లో మహ్మద్ ఉస్మాన్ అనే వ్యక్తి తన పరిశ్రమలలో ఉన్న విదేశీ బట్టలను పోగుచేసి తగలబెట్టినట్లు తెలుస్తూన్నది సహాయ నిరాకరణోద్యమంలో ఉత్సాహంగా పనిచేస్తూన్న బదరుల్ హసన్ అతని సోదరుడు జాఫర్ హుసేన్, డాక్టర్ యం జి నాయుడుగారి కుమారులు, కుమార్తెలు- ఈ అందరూ ఖద్దరు వ్యాప్తికి కృషి చేస్తున్నారు జాఫర్ హుస్సేను ఖద్దరు

దుస్తులు, గాంధీ టోపి ధరించినందుకు నిజాం కాలేజి ప్రిన్సిపాల్ అభ్యంతర పెట్టినట్లు తెలిసింది బదరుల్ హసన్, జాఫర్ హుస్సేన్ సోదరులు పై జామాలకు బదులుగా ధోవతులు ధరిస్తున్నట్లు కూడా తెలిసింది త్రూప్ బజారులోని వేలంపాటదారు రామకిృష్ణన్ విదేశీ వస్తు బహిష్కార ప్రచారం చేస్తూ ఖద్దరు అమ్ముతున్నాడు

మద్యనిషేధాన్ని గురించిన ప్రచారం తీవ్రంగా జరుగుతున్నది అబ్కారి కాంట్రాక్టర్ పెస్టోన్‌జీ దుడుకుతనంవల్ల హైదరాబాద్ ప్రజల దృష్టి మద్యనిషేధం వంకకు మళ్ళుతున్నది వీటి ప్రభావం చాందా మొదలయిన సరిహద్దు జిల్లాలకు కూడా వ్యాపిస్తూన్నది బారువంచా గ్రామంలోని జాగీరుదార్లు కుమేష్ సాహెబు, బుర్హాన్ సాహెబులు కలాలీలను కల్లు సారాలను అమ్మవద్దని ప్రోత్సహించినట్లు తెలిసింది వరంగల్లు జిల్లాలోని పూలుపాడు గ్రామస్థులు తాగకూడదని ప్రమాణం చేసుకొన్నారు పట్వారి చిత్తపూరు నారాయణప్ప, ఆయన కుమారులు, కల్లు సారాల అమ్మకం నిలిపివేయడానికి గట్టిగా కృషి చేస్తున్నారు

మహాత్మాగాంధీ, షౌకతలీ, మహమదలీల చిత్రపటాలను ఔరంగాబాదులో రహస్యంగా అమ్మడం జరుగుతూఉంది చౌక్‌లోని వర్తకుడు శ్రీనివాస్‌దాసు, ధులీఖాన్‌లు అటువంటి వస్తువులను అమ్ముతున్నారు ఒకటి, పది, నూరు రూపాయల ఖిలాఫత్ నోట్లు ఔరంగాబాద్, ఉస్మానాబాద్, పర్భని, వరంగల్లు పట్టణాలలో అమ్మబడుతున్నాయి వివేకవర్ధనీ థియేటర్‌లో మహమ్మద్ అధ్యక్షత కింద ఉత్సాహజనకమయిన సమావేశమొకటి జరిగింది అందులో రామచంద్రనాయక్, వామన్‌నాయక్, శ్రీ కిషన్ గిరిరావులు ప్రసంగించినారు. ఉగాది పండుగనాడు వివేకవర్ధనీ ఆవరణలో సనాతన ధర్మసభ పక్షాన ఒక బహిరంగసభ జరిగింది ఆ సభకు ఉస్మానాబాద్ జిల్లా వాస్తవ్యుడు బాల గోవిందదాస్ అధ్యక్షత వహించినారు హిందువులు ముసల్మానులు కూడా ఆ సభలో పాల్గొన్నారు ఆనాటి మత ప్రాముఖ్యం గురించి పండిత కేశవరావు వివరించినారు పండిత రాఘవేంద్రరావు శర్మ "మనము పూర్వపు ఉన్నత స్థితి నుంచి ఎంత అధఃపతితులమయినామో ఉగాది మనకు జ్ఞాపకం చేస్తున్నదని తన ఉపన్యాసాన్ని రాజకీయ భావాలతో మేళవించి ప్రసంగించినారు ఆ పవిత్ర దినము మొదలుకొని అందరూ వడుకునూలుతో నేసిన బట్టలనే ధరించవలెనని బలుసునూరు రామాసాహెబు వివరించి చెప్పినారు సనాతన ధర్మసభ కార్యదర్శి రామచంద్రరావు సభలో పాల్గొన్నవారికి కృతజ్ఞతలు తెలియజేసినారు ఇటువంటి సమావేశాలు పైకి మత సాంఘికాలుగా కనవడుతూన్నప్పటికీ వీటిలో రాజకీయోద్దేశం ఉందనే విషయం మరువతగినది కాదని పోలీసు కమిషనర్ వ్రాసినాడు

మరొక సమావేశం 1922 అగష్టు వివేకవర్ధనీ థియేటరులో రాఖి పున్నమి పండగ రోజున జరిగింది వామన్ నాయక్ ఆ సభలో ప్రసంగిస్తూ

ప్రభుత్వంవారు మహాత్మా గాంధీని, అలీ సోదరులను మన దేశ క్షేమంకోసం పోరాడుతూ ఉండుటకు నాయకులగా రబ్బగులగా చేయుటకు ఏమి విచారం వెల్లడిం చినారు ఆ తరువాత ఒక రెండు రోజులకు సికింద్రాబాద్ థియేటర్‌లో గిరిరావు అధ్యక్షత కింద ఒక సభ జరిగింది ప్రొఫెసర్ జ్ఞాన చంద్రజీ ఆ సభలో ముఖ్యోపన్యాసకులు అయిన సాంఘిక, సాంస్కృతిక రాజకీయరంగా లలో అభ్యున్నతిని సాధించవలసిన అవసరం గురించి ప్రసంగించినారు పొదుపరి తనం అవసరమనీ, ప్రతి వ్యక్తి స్వావలంబనకు లోబడి జీవించవలెనని ఉద్బో ధించినారు మన మాతృభూమి అభివృద్ధికి ఖాదీధారణ అత్యవసరమని కూడా ఆయన అన్నారు

ఈ విధాలయిన సమావేశాలను నిరోధించవలెననే ఉద్దేశంతో 1330 ఫసలీ అబాన్ 9 వ తేదీని ప్రత్యేక గవర్నమెంట్ గెజెట్ 52 నెం ప్రకారం ప్రభుత్వ కార్యనిర్వాహకాధ్యక్షులు దిగువ ఉత్తరువులు చేసినారు

"రాజకీయ ఉద్దేశ్యాలు స్వభావాలుగల సాంఘిక, రాజకీయ సమావేశా లేవీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అనుమతి లేనిది జరగకూడదు ప్రధాన కార్యదర్శి ఆ అనుమతి ఇవ్వనున్నందు నా అనుజ్ఞనుపొందవలె ఇందుకు భిన్నంగా జరిగిన సభల సమావేశకర్తలు అంగుళల్ల కలిగే ఫలితాలకు ముఖ్యంగా బాధ్యులు కాగలరు ఇంతేగాక ఆ సభల ఎజెండా ముందుగా తెలియడంకోసం ప్రధాన కార్యదర్శి కార్యాలయానికి పంపవలె ప్రధాన కార్యదర్శి కార్యా లయం వారు ఆ ఎజెండాను ఆమోదించేటంతవరకు సమావేశ కర్తలు ఏ విధ మయిన చర్యా తీసుకోకూడదు ఖిలాఫత్ ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్న వారి, శిక్షల ననుభవించిన వారి, వెడలగొట్టబడిన వారి లిస్టును ఇందులో పొంద పరచవలె "

పైన ఉదాహరించిన విషయాలను బట్టి 1921 లో బ్రిటిష్ ఇండి యాలో నడుస్తూండిన గాంధీజీ ఉద్యమ ప్రభావం హైదరాబాద్ ప్రజలపైన ఎట్లా ప్రసరించిందో తెలియడమే కాక హైదరాబాద్ ప్రభుత్వం దానిని నిరో ధించడానికి తీసుకొన్న చర్యలు కూడా విదితం కాగలవు

## ఒరిస్సా – ఆంధ్ర

ఈ శీర్షిక కింద మహాత్మా గాంధీ 18-4-1921 న ఆంధ్రదేశ సంచారం ముగించిన తరువాత 'యంగ్ ఇండియా'లో ఇట్లా వ్రాసినారు

"1916 లో నేను బెజవాడ, నెల్లూరు పట్టణాలకు పోవడం తప్ప ఆంధ్ర దేశానికి గానీ, ఒరిస్సాకుగానీ పోవడం ఇదే మొదటి పర్యాయము రాష్ట్రా లలో నేను ప్రస్తుతం రాని కొన్ని విషయాలను నా మనస్సులో మాసిపోని కొన్ని దృశ్యాలను ఇక్కడ వ్రాయదలను కొన్నాను అనాటి నా కార్య క్రమం ఎంతో సంకీర్ణమైనది కావడం చేత కొన్ని ముఖ్య ప్రదేశాలను గురించి మాత్రమే త్వరిత్వగా ఇందులో ఉదాహరించదలచుకొన్నాను ఒరిస్సాలో

నేను అస్థిపంజరాలను చూడగలనని అనుకొన్నానుగాని ఇంత బహుళంగా చూస్తానని అనుకోలేదు ఆ మార్చి 26 వ తేది నేను మరవరాని రోజు ఆనాడు పూరీ పుణ్యక్షేత్రం రోడ్డు పైన బారులు తీర్చి నిలబడివున్న స్త్రీలు, పురుషులు పిల్లలు కేవలం వట్టి బొమికలపైన చర్మం కప్పబడి ఉన్నట్లు కనపడినారు అటువంటి వారికి స్వరాజ్యం అంటే అర్థం ఏమవుతుంది? వారు ఒకరూ, ఇద్దరూ కారు, చాలా మంది ఆ వస్తువులు పడుకొనే వారిలో చాలా దూరం నడువగల ఎంతో శక్తిమంతులైన వారు కూడా ఉన్నారు వారు తమకు బియ్యం పంపించిన ఒక వ్యక్తిని చూడవచ్చినారు ఆ వ్యక్తి దగ్గర నుంచి మరికొన్ని బియ్యపు గింజలు లభించగలవని ఆశ "అన్నం అన్న" మని వారు జాలికరంగా అరవడం మొదలుపెట్టినారు కొందరు ధరలెప్పుడు తగ్గిపోతాయి అంటున్నారు చాలా మందికి స్వరాజ్యం అంటే చౌకగా అన్న వస్త్రాలు లభించటమేనని వారనుకొంటూన్నట్లు నాకర్థమయింది అయితే వస్త్రం అన్నమంత అవసరం కాదు వారి సిగ్గు దాచుకోవడానికి ఒక చిన్న గుడ్డ పేలిక చాలు కాని ఆహారం మట్టుకు ఉండి తీరవలె

నేను ఐశ్వర్యవంతులుండే ప్రదేశంలో ఒక పెద్ద బంగాళాలో ఉన్నాను అక్కడ నుంచి నేనీ స్థలానికి వెళ్ళినాను జగన్నాథస్వామి దేవాలయం నుంచి నేను అటూ ఇటూ పోవడం జరిగింది తోవలో నాకు తృప్తిగా భుజించిన మహంతులు, పండాలు, వందలకొద్దీ యాత్రికులూ కనపడినారు వారు కొన్ని వందల రూపాయలు వెచ్చించగల స్థితి గలవారు

ఈ వ్యత్యాసం నేను చూసినప్పుడు నా విచారం మరింత తీవ్రమయింది

కొందరు మిత్రులు నన్ను ఒక అనాథశరణాలయానికి (తల్లి, దండ్రులు లేని బిడ్డల శరణాలయము) తీసుకొని వెళ్ళినారు దానిని కరుణామయుడైన ఒక పోలీసు సూపరింటెండెంట్ స్థాపించినాడు అక్కడ బాల బాలికలు చక్కగా ఉన్నారు వారిలో కొందరు నూలు వడుకు తున్నారు కొందరు చాప అల్లుతున్నారు ఆ బక్క చిక్కిన మనుష్యులందరూ ఇట్లా ఎందుకు చేయకూడదు? అట్లా చేస్తే వారికి ఇల్లు విడిచి పట్టవలసిన అవసరంగాని, బిచ్చమెత్తుకొనవలసిన అవసరంగాని, గుప్పెడు మెతుకులతోనే జీవించవలసిన అవసరంగాని ఉండదు వారు వడక గలిగినట్లైతే వారి పొట్ట వారు నింపుకో గలరు. అయితే వారికి రాట్నాలు ఎవరిస్తారు? తప్పకుండా కాంగ్రెసు కమిటీ ఇవ్వవలె నూలు వడకటంవల్ల స్వరాజ్యం లభిస్తుందని, కాంగ్రెస్ వారికి బోధించగలదు లక్షలాది ప్రజలు అవలంబించగల వృత్తి నూలు వడకటం ఒక్కటే చాపలల్లడం కూడా కాదు ఎందువల్లనంటే లక్షలాది చాపలు అమ్మకం కావలె ఆహార పదార్థాల తరవాత తేలికగా అమ్ముడు పోయే సరుకు నూలు ఒక్కటే తరవాత నేను కాంగ్రెస్ నాయకులను కలుసుకొని ఈ కథంతా వారికి చెప్పినాను వారిలో కొందరు నేను వర్ణించిన ఈ దృశ్యాలను నాతో కూడా కలిసి చూసిన వారే ముఖ్యంగా కాంగ్రెస్ నిధులను

రాష్ట్రాల వ్యాప్తి కోసమే ఉపయోగించవలెనని వారు నాతో ఏకీభవించినారు అందుకు కావలసిన సొమ్ము యాత్రికుల నుంచి, మహంతులనుంచి వారు తేలికగా సేకరించగలరు ఒరిస్సా వంటి పేద రాష్ట్రంలో కూడా కాంగ్రెస్ కమిటీ స్వయం సహాయంతో నిలబడి క్షుధార్తులైన వారికి కడుపులను నింపి స్వరాజ్యాన్ని చేరువకు తీసుకొని రాగలదు వారికి కార్యకర్తలు కూడా ఉన్నారు మాజీ ప్లీడరు, మాజీ యం ఎల్ సి అయిన పండిత గోపబంధుదాస్ అనేక సుగుణాలు కలిగిన స్వార్థరహిత నాయకుడు ఆయన, ఆయన సహచరులు అన్నం, పప్పు తిని బ్రతుకు తున్నారు వారికి ఈ రోజుల్లో నెయ్యి దొరకటం దుర్లభము సహాయ నిరాకరణోద్యమం ప్రారంభింపబడిన తరవాత కాంగ్రెస్ కార్యకర్తలు అత్యల్పమైన గౌరవవేతనం పైన-అంటే నెలకు 10 రూపాయలతో జీవిస్తున్నారు

అటువంటి శ్రద్ధా భక్తులు గల మనుష్యులతో సంవత్సరంలో స్వరాజ్యం సంపాదించగలమని నమ్మడం ఆశ్చర్యం కాదు

పూరీకి 12 మైళ్ళ దూరంలో ఉన్న సాక్షి గోపాలం వద్ద ఉద్యాన వనంలో పండిత గోప బంధు గారి పాఠశాల ఉన్నది అది చూడదగినది అందులోని ఉపాధ్యాయులు బాలుర మధ్య నేనొక రోజు ఆనందంగా గడిపినాను బహిరంగ ప్రదేశంలో పిల్లలకు చదువు చెప్పటం ఒక ఉత్కృష్టమైన ప్రయోగం ఆ పిల్లలలో కొందరు శక్తిమంతులైన పహిల్వాన్‌లు కూడ ఉన్నారు

ఒరిస్సా గొప్ప విచారం పట్టుకొన్నది సమర్థవంతుడైన ఒక రచయిత ఒరియా ఉద్యమమనే గ్రంథంలో, ఒరిస్సా రాజకీయ కారణాలవల్ల ఛిన్నాభిన్నమయిందని వ్రాసినారు కొంత భాగం బెంగాలుకు, మరికొంత బీహారుకు, ఇంకాకొంత మధ్యరాష్ట్రాలకు కొంత ఆంధ్రాకు పోయిందన్నారు ఒరిస్సాకేమీ మిగలలేదన్నారు ఒరియా మాట్లాడే ప్రజలుగల ప్రదేశమంతా ఒక రాష్ట్రంగా కాంగ్రెస్ గుర్తించింది బీహార్, బెంగాల్, మధ్య రాష్ట్రాలకు ఆ విషయంలో తగాదా లేదు కాని బరంపురం విషయంలో ఒరియాలకు ఆంధ్రులకు తగాదా ఉంది వారి వివాద పరిష్కారానికి ఒక చిన్న సూత్రం నేను సూచించినాను నేడు మనం జరుపుతూండిన పోరాటం వల్ల మనం గ్రహించవలసిన అత్యుత్తమమైన సూత్రం ఒకటి ఉన్నది అది బలవంతులైనవారు బలహీనులకు లొంగిపోవటమే సందేహాస్పద విషయాలలో దుర్బలులదే చివరి మాటగా ఉండవలె

సాక్షి గోపాలంలో బహిరంగ సభకు వచ్చిన వేలకొద్దీ నిరుపేదలు తమ మూటలు విప్పి స్వరాజ్య నిధికి దమ్మిడీలను పైసాలను సమర్పించిన దృశ్యాలను స్మరిస్తూ ఒరిస్సాను గురించిన అనుభవాలను ఇంతటితో ముగిస్తున్నాను వారు ఆ పైసల నీయడానికి ఒకరినొకరు ప్రోత్సహిస్తూండడం చూసినప్పుడు నా విశ్వాసం మరింత పటుతరమయింది

ఆంధ్రదేశం, ఉత్కళదేశంవలె లేదు ఇది సంపూర్ణ శక్తిమంతంగా

ఉన్నది అక్కడ మాంసంలేని బొమికల పోగులు లేవు అక్కడి ప్రజలు బలంగా, శక్తిమంతంగా, పట్టుదలగా, ఔదార్యంగా ప్రియముగా ఉంటున్నారు వారికి తమ రాష్ట్ర భవిష్యత్తులోను, భారత భవిష్యత్తులోనూ దృఢ పూర్తి అయిన విశ్వాసమున్నది అక్కడి స్త్రీ పురుషులంతా బంగారు నగలతో తులతూగుతున్నారు ఈ నగలు వారు నాకు చూపడం వారికి అపాయకరంగా పరిణమించింది అవన్నీ తిలక్ మహారాజు జ్ఞాపకార్థం స్వరాజ్యంకోసం నాకు కావాలని నా మనస్సులో మాట వారికి దాచకుండా చెప్పేసినాను స్త్రీలు, పురుషులూ కూడా వాటిని నాకు సంతోషంగా ఇచ్చినారు ఆ రోజుల్లో 50 వేల రూపాయలు వచ్చినాయి ఇంకా ఎక్కువ వాగ్దానాలు కూడా ఉన్నాయి వారు తలుచుకొంటే కోటి రూపాయల మొత్తం వారి నగలనుంచే స్వరాజ్య నిధికి ఇవ్వగలరు

నిష్కాపట్యంలో, సహనంలో, వినయంలో కూడిన స్వేచ్ఛలో ఆంధ్ర స్త్రీలు మహారాష్ట్ర స్త్రీలను స్మరింపజేస్తున్నారని నేను వారితో అన్నాను ఇది ఒక గొప్ప ప్రశంసావాక్యం కలకత్తాలో చదువుకొని ఇటీవలనే వివాహితయై ఏలూరులో నివసిస్తూండిన అన్నపూర్ణాదేవి అనే బాలిక వివాహ చిహ్నాలుగా ఉండదగిన వస్తువులను తప్ప తక్కిన అన్ని ఆభరణాలను స్వరాజ్య నిధికి సమర్పించింది ఆమె ఆపాదమస్తకం ఖద్దరు ధారిణియై కనిపించింది ఆంధ్రదేశంలోని స్త్రీ పురుషుల ఔదార్యం నా మనస్సును ఆకర్షించింది

సన్నని నూలు వడకడంలో పంజాబీ సోదరీమణులు ఆంధ్ర సోదరీమణుల తరవాతివారని చెప్పక తప్పదు ఇంతకు పూర్వం పంజాబీ స్త్రీలకంటె మనోహరంగా వడకగలవారు లేరని భావించినాను కాని ఆంధ్ర స్త్రీలు నూరో (100) నెంబరు నూలును కూడా వడకగలరు వారు తమంతటతాము పత్తిని పరిశుభ్రం చేసుకొని ఏకులు తయారుచేసుకోగలరు వారు వడికిన సన్నని నూలు నమూనాలు కొన్ని నేను తీసుకొని వచ్చినాను అవి జపాను, ఫ్రాన్స్, లాంక్‌షైర్ నూలుతో పోటీచేసి మెరుగనిపించుకొనగలవు ఈ కళ, స్వదేశీ ఉద్యమం వచ్చి దానిని రక్షించేముందు చావడానికి సిద్ధంగా ఉంది మచిలీపట్నంలో కొంత మంది స్త్రీలు వారి శక్తి సామర్థ్యాలను ప్రదర్శించి నా కృతజ్ఞతకు పాత్రులైనారు ఆ పర్ణకుటీరంలో ఆ దృశ్యం ఆశ్చర్యకరంగా ఉంది వారు పత్తిని శుభ్రంచేసి ఏకులు తయారుచేసి నూలు వడికినారు ఆ రాటపు నాదం నాకు విశ్వ విలీనగానంవలె వినిపించింది

ఇక ఆత్మానందదాయకాలైన ఆ విషయాలనుంచి నేనక్కడ కనుగొన్న ఆత్మవినాశకరాలైన విషయాలను గురించి చెప్పవలసి ఉంది కాకినాడలో బహిరంగ సభను ముగించుకొని రాత్రి తొమ్మిది గంటలకు నేను బంగళా చేరేసరికి కొంతమంది స్త్రీలు, బాలికలు నన్ను చూడవలెనని వేచియున్నారు లోపల దీపం మసకమసకగా వుంది వారి చూపులు, వారి వైఖరులు నాకు కొంత వింతగా కనిపించినయి ఎందువల్లనో నా మామూలు

ప్రకారం "మీరు నా గలరా? తిలక్ స్వరాజ్యనిధికి మీరు ఏమి ఇస్తారు?" అనే మాటలు నా నోటినుంచి వెలువడలేదు పైగా నా గృహ యజమానిని ఈ స్త్రీలు ఎవరని అడిగినప్పుడు ఆయనకు తెలియలేదు విచారించగా వారు సందేహిస్తూ 'మేము భోగంవాండ్లు' మన్నారు నేను పాతాళంలోకి పోతూన్నట్లు తోచింది నాకు మా గృహ యజమాని ఆ స్త్రీలు తమ వృత్తిని ప్రారంభించే ముందు ఒక కర్మకాండ జరుగుతుందని నాతో చెప్పి నన్నోదార్చడానికి ప్రయత్నించినాడు ఆ మాట నాకు మరింతదారుణంగా కనిపించింది ఆ కర్మకాండ ఒక దుర్వృత్తికి గౌరవాన్ని ఆపాదిస్తున్నట్లు తోచింది నేను గుచ్చి గుచ్చి ప్రశ్నించినాను వారు నా దర్శనం కోసం వచ్చామని సవినయంగా అన్నారు 'మీ రింకొక వృత్తిని అవలంబిస్తారా?' అన్నాను ఆ" "అందువల్ల మాకు జీవనం గడిస్తే సరి" అన్నారు ఇంక ఆ విషయాన్ని గురించి అప్పుడక్కడ ప్రస్తావించి ముగించగానికి నాకు గుండె లేక పోయింది నా పురుషత్వం గురించి సిగ్గుపడినాను మరు ఉదయం రాజమహేంద్రవరంలో ఈ విషయాన్ని గురించి మనసు విప్పి మాట్లాడినాను ఆంధ్రలో నాకు కలిగిన అత్యంత బాధాకరమైన అనుభవమిది ఈ పాపం ఏదో ఒక రూపంలో భారతదేశమంతటా ఉన్నదనే నా ఊహ మనం ఆత్మ పరిశుద్ధతద్వారా స్వరాజ్యం సంపాదించ దలచినట్లయితే స్త్రీలను మన భోగ లాలసత్వానికి ఆహుతి చేయకూడదని నా నిశ్చయము అబలులను రక్షించవలెననే ధర్మసూత్రం ఈ సందర్భంలో మరింత అద్భుతంగా వర్తిస్తుంది గోసంరక్షణ అని నేను చెప్పినప్పుడు స్త్రీల శీల సంరక్షణ కూడ అందులో ఇమిడి ఉన్నదని అందరూ అర్థం చేసుకోవలె మనం మన తల్లులను, తోబుట్టువులను, కమార్తెలను ఎట్లా గౌరవిస్తున్నామో అట్లాగే అందరు స్త్రీలను గౌరవించటం నేర్చుకోనట్లయితే ఇండియాను మనం పునరుజ్జీవింపచేయలేము మనలోని మానవత్వాన్ని చంపి మనలను పశువులుగా తయారు చేస్తూండిన పాపాలనుంచి మనం విముక్తులం కావలె

మరికొన్ని సంతోషకరాలైన విషయాలు నేను మచిలీపట్టణం సందర్శించినపుడు నాకు శ్ఛనుంచి సంతోషాశ్రువులు జాలువారినాయి అది నా మౌనపు రోజ నేను మచిలీపట్టణం చేరగానే చప్పుడూ, సందడీ, ప్రదర్శనలు లేకుండా నన్ను స్వేచ్ఛగా ఉండనీయవలసిందని డాక్టరు పట్టాభి సీతారామయ్యను నేను కోరినాను అందువల్ల వారు ముందుగానే ప్రజల కాసంగతి తెలియచేసినారు నేను బందరు చేరేసరికి తెల్లవారుతూన్నది వీధులు చక్కగా అలంకరింపబడిఉన్నాయి జనం బారులు తీరి నిలబడినారు అంతా నిశ్శబ్దంగా ఉంది ఎవరి స్థలాలలో వారు నిశ్శబ్దంగా నిలబడి ఉన్నారు నేను జాతీయ కళాశాల ఆవరణలోకి చేరేసరికి వేణునాద సమన్వితమైన మనోహర సారంగీ వాయిద్యం ఒక ఉపనిషద్గీతంతో నన్నాహ్వానించింది అంతకు తప్ప వేరే శబ్దం లేదు వారు నా పట్ల చూపిన కుసుమ కోమలమైన ఆ ప్రేమకు నేను ముగ్ధుడనైనాను ఆ ప్రజలు కనపరిచిన క్రమశిక్షణకు నా హృదయ వీణ ప్రతినిన

దించింది వారి దేశభక్తియుత భావాలకు అనుగుణంగా వారు ప్రవర్తించినారు దైవం నాకీ దృశ్యం అనుగ్రహించినందుకు ఆయనను హర్ష బాష్పాశ్రువులతో అభిషేకించినాను

నన్ను నామ మాత్రమైన పర్ణకుటీకి కాక అతిరాలా నిజమైన పర్ణకుటీకి తీసుకు వెళ్ళినారు నేను వారి పద్ధతిని వారి కళలను వారి పరిశ్రమలను చూసి కళాశాలోపాధ్యాయులను పరిపాలకులను అభినందించవలసి ఉన్నప్పటికీ కళాశాల లోని ఉపాధ్యాయులు, విద్యార్థులు పూర్తిగా తమ యావత్కాలాన్ని నూలు వడికేటందుకు, నేసేటందుకూ శ్రద్ధపూనినట్లయితే జాతీయత పరిపూర్ణత వహించినట్లు కాదని వారికి నేను చెప్పక తప్పేది కాదు నేనీ సిద్ధాంతాన్ని విపులీకరిస్తూండగా శ్రీ ముట్నూరి కృష్ణారావు ఎన్నో శ్రద్ధగా వింటూ అప్పుడప్పుడు చర్చలలో పాల్గొంటున్నారు కొంత సేపు ఇట్లా ఉన్న తర్వాతుంది ఆయన "అయితే మీరు నూలు వడకడాన్ని ఒక యజ్ఞంగా భావిస్తున్నారన్న మాట" అన్నారు అప్పుడాయన కళ్ళలో ఆధ్యాత్మిక జ్యోతి విద్యుల్లత మాదిరి ప్రకాశించింది వెంటనే "మీరందించిన ఈ భావానికి నేను చాలా కృతజ్ఞుడను" అన్నాను అప్పటి నుంచి నూలు వడికే సందర్భం వచ్చినప్పుడంతా నేనీ ప్రయోగం (సూత్రయజ్ఞం) చేస్తూనే ఉన్నాను నూలు వడకటం జాతీయ పరిశుద్ధతకూ, బలానికీ, అభ్యుదయానికీ కన్నులకు ప్రత్యక్షంగా కనిపించే పవిత్ర చిహ్నము ఇది అందరూ - హిందువులు, ముస్లింలు, క్రిష్టియన్‌లు, పార్శీలు విధిగా నిర్వర్తించవలసిన ధర్మము ఆంధ్ర జాతీయ కళాశాల, ఆంధ్రులు న్యాయంగా గర్వించదగిన పురాతన సంస్థ ఇది 1907 లో బెంగాల్‌లోని రాజకీయ చైతన్యానికి అనుగుణంగా ఉద్భవించిన సంస్థ ఇది అనేక తుపానులను తట్టుకొని నిల్వగలిగింది నేటి నూతన చైతన్యంనుంచి ఇది మరింత పరిశుద్ధంగా, మరింత బలంగా వర్ధిల్లగలదని ఆశిస్తున్నాను నేటి జాతీయతత్త్వానికి అనుగుణంగా అతి పవిత్రమైన కార్యకలాపాలను దేశమంతటా ప్రసరింపజేస్తూ స్వాతంత్ర్యోద్యమానికి కేంద్రంగా ఉండదగిన శక్తి ఈ సంస్థకు ఉందని నేను నిశ్చయంగా చెప్పగలను ఆంధ్ర దేశంలోని నిమ్నజాత్యోద్ధరణకు కంకణం కట్టుకొన్న ఉత్తేజకరుడైన సంఘ సంస్కర్త ఒకరున్నారు ఆయన గూడూరు రామచంద్రరావు ఆయన బ్రాహ్మణుడు పవిత్రమైన ఆయన ఆత్మ అస్పృశ్యతా పాపాన్ని సహించలేకపోయింది తాను ప్రాతినిధ్యం వహిస్తున్నవారికి ఆయన నిరంతరం సేవ చేస్తున్నాడు. తన పెరయా సోదరుని దాస్యాన్ని సహించలేక అతనిని హిందువులతో సహాయ నిరాకరణాన్ని అవలంబించవలసిందని సంతోష పూర్వకంగా సలహాయిస్తున్నాడు నేను కూడా ఆ దళితవర్గాలపట్ల ఉద్రేకంగానూ వున్నాను పంచములలోనుంచి స్వార్థత్యాగియైన పవిత్రాత్ముడు లభించేటంత వరకు "కులీనుల" పట్ల అసహాయోద్యమం ప్రారంభించకూడదని నేనాయనను మందలించినాను ఎందువల్లనంటే సహాయ నిరాకరణకు ఆత్మ పరిశుద్ధత, స్వయం సహాయము, స్వయం శక్తి అవసరాలు అప్పుడే సహాయ

నిరాకరణం సరియైన వారి సహకారం పొందగలదు

ఆంధ్రులు నన్ను సమ్మోహితుని చేసినారు బీహారు రాష్ట్రం చాలా కాలంనుంచి నాకు అభిమాన పాత్రమైనది అసహాయోద్యమం పుట్టక ముందు నుంచి బీహారును గురించి నాకు విశ్వాసం కలిగింది ఆంధ్ర దేశం బీహారుతో పోటీ చేయలేక పోయినా బీహారు తరవాత రెండోదిగా నిలిచి తీరుతుంది ఆంధ్ర దేశంలో తనను గురించి తాను ఆలోచించుకొనని నాయకుడున్నాడు (Self-effacing leader) కష్టపడి పని చేసే కార్యకర్తలు కూడా ఉన్నారు తగిన శక్తి సంపదలున్నాయి అక్కడ కవిత్వమున్నది, ధర్మమున్నది, త్యాగ బుద్ధి ఉన్నది జాతీయ పాఠశాలలు చాలా ఉన్నాయి చాలా మంది లాయర్లు ఉద్యమంలోకి వచ్చినారు నూలు వడకడానికి, నేయడానికి మంచి ప త్తి పం డించడానికి కావలసినన్ని అవకాశాలున్నాయి భూదేవిని సస్యశ్యామలంగా చేయ డానికి బ్రహ్మాండమైన నదులు రెండున్నాయి ఆంధ్రదేశంలో కొన్ని భాగాలు ఒకప్పుడు చాలా ప్రసిద్ధి వహించినాయి ఆ రాష్ట్రం తేలికగా నాయకత్వం వహించగలదు లేదా కనీసం బీహారుతో పోటీ చేయగలదు ప్రభుత్వం వారి చండ శాసనం ప్రారంభమైనప్పుడు పెద్ద రాష్ట్రాలుగా పరిగణించబడేవి తాళ లేక పోయినప్పటికి బీహారు, ఆంధ్ర రాష్ట్రాలు మాత్రం పరిస్థితిని కాపాడ గలవని నా నిశ్చితాభిప్రాయం ఆ రెండూ ఆత్మ బలంలో సిక్కులను సైతం ఓడించగలవని నా నమ్మకము నా అంచనా తప్పు కావచ్చు మన మందరం తక్కిన వారికంటె మిన్నగా ఉండవలెనని ప్రయత్నించవలసి ఉంటుంది ఈ పందెంలో పోటీ ఉత్తమమే కాదు కర్తవ్యం కూడ

రెండు చక్కని గ్రామాలలో వాటి నాయకుడు తప్పని సరిగా శాసనోల్లంఘన ప్రయోగాలను చేయవలసి వచ్చిన పరిస్థితిని గురించి మరొ కప్పుడు వ్రాయగలను నెల్లూరులో హిందూ ముస్లిం సమస్యను గురించి కూడా ఇంకొక పర్యాయం వ్రాస్తాను

శ్రీ దిగుమర్తి హనుమంతరావు ఆయన సహచరులు నడుపుతున్న వడుకు నూలు, చేనేత ఆశ్రమానికి దగ్గరగా ఉన్న ఒక గ్రామంలో జరిగిన సంఘటనను గురించి కృతజ్ఞత తెలుపుతూ ఇక నీ విషయం ముగించదలచు కొన్నాను ఆ గ్రామంలోని బ్రాహ్మణుడు నా పంచమ సహచరులతో కలసి నన్నా గ్రామానికి రావలసిందని ఆహ్వానించినారు నేను నా పంచమ సోదరు లతో ఆ గ్రామం వెళ్ళినాము ఆ గ్రామంలోని ఆ బ్రాహ్మణ వీధిలో అంతకు పూర్వం పంచము లెవ్వరూ నడిచి ఎరుగరు "

యంగ్ ఇండియా
13-4-1921

## ఆంధ్ర దేశం - సన్నని వడుకు నూలు

గాంధీజీ 1921 ఏప్రిల్ లో జరిపిన ఆంధ్ర దేశ సంచారంలో ఆయనకు

చేతితో వడికిన సన్నని నూలుతో చేతిమగ్గాల మీద నేసిన చక్కని బట్టల నమూ
నాలు చూపడం జరిగింది. వాటిని ఆయన [illegible] ఆయనకు
అంతకు పూర్వముండిన అనుభవం బట్టి [illegible] నూలు
తీయడం వాటిని చేతి మగ్గాల మీద [illegible] సాధ్యమా! అని
సందేహం కలిగింది. అందువల్ల ఆయన [illegible] ఆంధ్ర దేశపు
సన్నని వడుకు నూలు వస్త్రాల పరిశ్రమల పరిశీలన [illegible] పంపి
నారు. ఆయన పరిశీలన చేసి 1921 మే 18 న 'యంగ్ ఇండియా' పత్రికలో
ఇట్లా వ్రాసినారు.

'ఇటీవల ఆంధ్ర దేశ సంచారంలో గాంధీజీ చేతితో వడికిన నూలుతో
చేతిమగ్గాల మీద తయారైన చక్కని వస్త్రాల నమూనాలు చూపడం జరిగింది.
ప్రస్తుతం గుజరాతులో తదితర ప్రాంతాలలో [illegible] నూలు పరిశ్రమను
అభివృద్ధి చేయడంలోగల కష్టాలు స్వానుభవంవల్ల గ్రహించినవారు
కావడంచే ఆయనకు సహజంగా, ఆంధ్ర దేశంలోని సన్నని నూలు పరిశ్రమను
గురించి విన్న విషయాలపైన సందేహం కలిగింది. అందువల్ల నన్ను
ప్రత్యక్షంగా పరిశీలించిరావలసిందని గంజాం జిల్లాలో ని శ్రీకాకుళానికి ఆయన
పంపినారు. చేనేత పరిశ్రమలోను వడుకు నూలు పరిశ్రమలోను ప్రసిద్ధి వహిం
చిన కొన్ని పరిసర గ్రామాలను కూడా నేను చూసినాను. అక్కడ నేను చూసిన
దానిని బట్టి నూలు వడకటం, నేయటం అనే ఈ రెండు కళలూ పరమావధికి
చేరినవని నాకు గట్టి నమ్మకం కలిగింది. తూర్పు కోస్తాలో గంజాం, విశాఖ
పట్టణం, నెల్లూరు జిల్లాలు వస్త్ర పరిశ్రమ లో [illegible] ప్రాధాన్యాన్ని
ఇంత వరకూ నిజంగా కాపాడుకొంటూనే ఉన్నవి. [illegible]
యింది. ఇందువల్ల నాకు చాలా సంతోషం కలిగింది. 'యంగ్ ఇండియా'
పాఠకులలో అత్యధిక సంఖ్యాకులకు కూడ ఇది ఆసక్తికరంగానే ఉంటుంది.
మరణావస్థలో ఉన్న పరిశ్రమను రక్షించడానికి [illegible] సరియైన
కాలంలో ప్రారంభింపబడిందా లేదా [illegible] నేను శ్రీకాకుళానికి ఏప్రిల్ 3న
చేరినాను. అక్కడ దేశ శంకర శాస్త్రిగారి అతిథిగా ఉన్నాను. నేనక్కడ ఉన్న
రోజుల్లో శ్రీకాకుళానికి చుట్టుపట్ల 20 మైళ్ళ దూరంలో ఉన్న నాలుగు
గ్రామాలను చూసినాను. శంకర శాస్త్రి తమ్ముడు దేవేంద్ర నాథ శాస్త్రి ఈ అన్ని
గ్రామాలకు నాతో వచ్చినారు.

నేను చూసిన గ్రామాలలో [illegible] ఒకటి. [illegible] నని గ్రామాన్ని గురించి
విని ఉండటం చేత ఇక్కడ ఎంతో నాజూకుగా వడక [illegible] చూడగలనని ఎంతో
ఆశతో ఉన్నాను. మేమక్కడికి పోవడంతోనే [illegible] నా ఆశ
పూర్తిగా ఫలించింది. ఆ గ్రామంలో [illegible] కొంత మంది కష్టపడి పని చేసే
అసహాయోద్యమ విద్యార్థులతో కలిసివచ్చి సన్నని నూలు వడుకుతూండిన
ఇళ్ళలో ఒక ఇంటికి తీసుకొని వెళ్ళినారు. నేను సన్నని నూలు వడకవలెనని
ప్రయత్నించి విఫలుడనయినాను. నా వలె విఫలులైన వారిని అనేక మందిని

చూసినాను [illegible] ముసలమ్మ సాలెగూటి దారంవలె సన్నగా [illegible] సంతోషాశ్చర్యాలు కలిగినాయి ఆమె [illegible] ఎంత సుళువుగా ఉపయోగించిందో, అంత సుళువుగా ఆమె చర్ఖాను తిప్పుతూన్నది ఆమె వడికే నూలు 80, 100 వ నెంబరు వరకు ఉంటుంది కొన్ని నిమిషాలపాటు మౌనం వహించి ఆశ్చర్యంగా చూసినాను చరిత్రలో ఉదాహరింపబడిన ఢక్కా మస్లిన్ [illegible] కౌశలము [illegible] సాధ్యమైనదేనని నాకప్పుడు స్పష్టంగా తోచింది ఆ రాట్నపు నాదం ఆనాడు నా హృదయాన్ని స్పందింపజేసినట్లు ఇంత పూర్వం ఎన్నడూ స్పందించలేదు నేను నా కళ్ళు మూసుకొని [illegible] తుమ్మెదల ఝుంకారానికీ, దానికీ ఏమీ భేదం కనిపెట్టలేకపోయినాను అని నేను నమ్మకంగా చెప్పగలను ఇది అతిశయోక్తి కాదు [illegible] రాట్నంతో నన్ను కూడా కొంచెం వడకనిస్తావా అని ఆ ముసలమ్మను [illegible] అడిగాను ఆమె వెంటనే తన పీట నుంచి లేవడం నాకు కొంత ఆశ్చర్యం కలిగించింది ఆమె మనందరివలే ఎదురు మొనకు పిడికీ మధ్య నేలపై కూర్చుండక పిడకి దగ్గరగా పీటపైన కూర్చుని వడుకుతూన్నది [illegible] తీయగల్గుతూన్నది నేను కూడ అదే రీతిగా కూర్చున్నాను నేను రాట్నాన్ని ఉపయోగిస్తున్నప్పుడు ఆ ముసలమ్మ ఉపయోగిస్తుండగా చూసిన దానికంటె నూరురెట్లెక్కువ సంతోషం కలిగింది నా ప్రయత్నంలో నేను జయం పొందుతానని అనుకోలేదు నా పనిని చూసి ముసలమ్మ కూడా చాలా సంతోషించింది అయితే నేనొక్క విషయం చెప్పితీరవలె నేనక్కడ అంత బాగా వడకడానికి కారణం నా చేతి నైపుణ్యం కాదు, చక్కని ఏకులు, మృదువుగా తిరిగే రాట్నం, నేను మంచిదారం తీయటానికి ఉపయోగించినాయి జాతీయ ముక్తికోసం రాట్నంలో ఉన్న నా విశ్వాసమప్పుడు అధికమైనందువల్ల వెంటనే నేను ఆ వృద్ధ స్త్రీకి గాంధీగారి సందేశాన్ని వినిపించినాను శాస్త్రిగారు దాని నామెకు తెలుగులో చెప్పినారు నూలు వడకటం కంటె [illegible] గౌరవమూ పవిత్రమూ అయిన వృత్తి మరొకటి లేదని గాంధీగారి నిశ్చితాభిప్రాయమని ఆమెకు చెప్పినాను భగవంతుడు సృజించిన మానవులకు వస్త్రాలను ఉత్పత్తి చేయడం కంటె ఉత్కృష్టమైన సేవ మరొకటి లేదని కూడా గాంధీజీ అభిప్రాయమని ఆమెతో అన్నాను రాట్నం వడకటం వంటి గృహకృత్యాలను అపహాస్యం చేయటం అలవాటైన ప్రస్తుత కాలంలో ఈ పురాతన కుటుంబ ధర్మాన్ని శ్రద్ధగా నిర్వర్తిస్తూండిన ఆమె పట్ల నాకు గౌరవమర్యాదలు ఏర్పడినాయి భారత దేశ శాంత్యభ్యుదయాలు రాట్నంలోనే ఇమిడి ఉన్నాయి గాబట్టి ఆమె అత్యంత క్లిష్టపరిస్థితులలో కూడా రాట్నం విడనాడ కూడదని ప్రార్థిస్తున్నానని అన్నాను నా మాటలను ఆమె ఆశ్చర్యంతో గ్రహించింది ఆమె గ్రహించగలిగిన దానికంటె నా మాటల్లో ఎక్కువ అర్థం ఉన్న మాట వాస్తవమే ఆమె శ్రద్ధాభక్తులతో

చేస్తున్న పనిని గురించి ఇంత ఉత్సాహం చూపిన వారిని ఆమె చూడగలగటం ఇదే ప్రథమ పర్యాయ మనుకొంటాను అందువల్ల ఆమె "నేను వడుకుతూనే ఉంటాను తరతరాలనుంచి అది మా కుటుంబ సంప్రదాయంగా వస్తూనే వున్నది దానిని విడనాడే టందుకు నన్ను ప్రోత్సహించగలిగింది ఏది లేదు అన్నది ఆమె దగ్గర నేను సెలవు తీసుకొంటూ కొన్ని పరికరాలు నాకు కావాలని కోరినాను ఆమె వెంటనే అంగీకరించింది అప్పుడు నేనొక కదురును అరటి పొత్తితో చుట్టబడిన ఒక ఏకున్ను వివిధ దశలలో తయారైన ప్రత్తి నమోనాలు, ప్రత్తిని పరిశుభ్రం చేసి ఏకేటందుకు ఒక కమాన్, ఒక చిక్కంటిని తీసుకొని వెళ్ళినాను

ఆ గ్రామంలోనే నేను ఇంకా అనేకమందిని వడికే వారిని చూసినాను దాదాపు నేను చూసిన ప్రతి రాట్నము 20 సంవత్సరాల నుండో, అంతకు పైగానో పని చేస్తున రాట్నమే ఈ రాట్నానికి మామూలు చరఖాలకు భేదం కదుళ్ళలో మాత్రమే మామూలు రాట్నపు కదుళ్ళను గొడుగు బెత్తాలతో తయారు చేయడం జరుగుతుంది

సామాన్యంగా వడగకల మనిషి ఒకటిన్నర రెండు తులాల దారం 80 మొదలు 100 నెంబర్ల వరకు 8 లేదా 10 గంటలలో తీయగల్గుతుంది అది 12 అణాల ఖరీదు ఉంటుంది ప్రతి స్త్రీ ప్రత్తిలో గింజలు తీయడం, ఏకడం, ఏకులు చేయడం మొదలైన పనులు ఎంతో జాగ్రత్తగా నైపుణ్యంతో తనకు తానే చేసుకొంటుంది ముడి ప్రత్తి నుంచి పీలుగా ఉండే చిట్ట చివరి దశ వరకు ఏకులు తయారు చేయడానికి మధ్యలో అనేక పనులు చేయవలసి వుంది మనం ఇది వరకు బాగా ఎరిగి ఉన్న వాటి కంటె భిన్నంగాను ఎక్కువగాను ఉన్నాయి ఆ అంపోల్‌లోని ముసలమ్మ ఆ కార్యక్రమమంతా ప్రదర్శించి చూపింది ముడి ప్రత్తిలోనుంచి గింజలు తీసేముందు ప్రత్తి పింజలను చక్కగా తీసి వాటిని దువ్వెనతో పరిశుభ్రం చేయవలె ప్రత్తిని మొట్ట మొదట పరిశుభ్రం చేయడంలోనే చాలా వరకు వడకటంలో నేర్పరితనం ఇమిడివుంది పైన చెప్పిన మొత్తం నూలు వడకటానికి 15 తులాల ప్రత్తి కావలె దాని ఖరీదు సుమారు ఒక అణా ప్రత్తి నుంచి గింజలు తీయటం ఏకడం మొదలయిన పనులు జరిగినతరవాత ఈ 15 తులాల ప్రత్తి రెండు,మూడు తులాలు దూగి అవుతుంది ఈ తరుగు సన్నని నూలు వడికేటందుకు చాలా అవసరము ఒక్క రోజు వడకడానికి సరిపోయిన ప్రత్తిని తయారు చేసేటందుకు 3, 4 గంటలు పడుతుందని అక్కడి వాళ్ళు చెప్పినారు ఇట్లా తయారు చేయడానికి పిల్లలు తోడ్పడతారని వారన్నారు ప్రత్తిని ఎంత శుభ్రంగా బాగుచేసినప్పటికి దూది పింజగల (Long staple cotton) ప్రత్తి అయితేనే తప్ప ఈ సన్నని నూలు తీయటానికి సాధ్యంకాదు నేను చూసిన రెండు గ్రామాలలో ప్రత్యేక రకపు ప్రత్తి పండుతుందని వడికేవారు నాకు చెప్పినారు ఆ ప్రత్తి అమెరికా, ఉగాండా దేశాల నుంచి వచ్చే ప్రత్తి కంటె శ్రేష్ఠమైనదని కూడా అన్నారు అయితే ఆ నమో

నాలతో పోల్చి చూడడానికి నేను పత్తి పంటదారుని దగ్గరికి పోలేక పోయి నాను

ఇక్కడ ఎంత నిపుణంగా వడుకుతారో అంత నిపుణంగా నేస్తారు కూడ ఇక్కడ సాలీలు ధోవతులు నేస్తాయి ఆ నేత చాలా బాగుంటుంది ఆ ధోవతులు మిల్లులో తయారైన ధోవతుల కంటె నాలుగురెట్లెక్కువ మన్నిక కలిగి ఉంటాయని ఇక్కడి వారు చెబుతున్నారు దూరంనుంచి చూస్తే ఆ బట్ట పట్టువలె కనిపిస్తుంది పట్టుకొని చూస్తే అట్లాగే ఉంటుంది నేతలో నైపుణ్యంతోపాటు కట్టుకోవడానికి ఆరోగ్యంగా ఉంటుంది 7 గజాల పొడుగు, 50 అంగుళాల వెడల్పుగల జత ధోవతులను నేయడానికి 3, 4 రోజులు పడుతుంది ఆ జతకు 33 తులాల నూలు కావలె దాని ఖరీదు 11 రూపాయలు దానిని తయారు చేసిన నూలు నెంబరు 80 మొదలు 120 వరకు ఉంటుంది ఆ జత ధోవతులు 15 లేదా 17 రూపాయల ఖరీదు ఉంటుంది అందువల్ల ఒక్కొక్క నేత మనిషి రోజుకు రూపాయికి పై చిలుకు సంపాదిస్తాడు ఇక్కడ ఉపయోగంలో ఉన్నది గుంట మగ్గం బహుశా అదే సన్నని నూలు నేయడానికి ఎక్కువ ఉపయోగకరంగా ఉండవచ్చు అనేక గ్రామాలలో ఉన్న నేతగాళ్ళతో నేను మాట్లాడినాను నేను చూసిన మరి రెండు గ్రామాలలోను నా అనుభవం అంపోలు అనుభవానికి సరి పోయింది అయితే ఈ పరిశ్రమను గురించి అత్యంత విషాదకరం విషయం ఏమంటే చాలా మంది నేతగాళ్ళు చౌకైన జపాను నూలు నేయడం ప్రారంభించినారు అది జాతీయ భావానికి వినాశకరంగా పరిణమిస్తుంది ఇందువల్ల ఒకప్పుడు ఎంతో అభివృద్ధిలోనున్న వడకు పరిశ్రమ కూడ నాశన మవుతూన్నది ఈ నూలును వడకటం, నేయడం మానివేసిన వార సంఖ్యతో పోల్చి చూసినట్లయితే ఇప్పుడు వడుకుతూన్న వారి సంఖ్య చాలా నిరుత్సాహంగా కనిపిస్తున్నది గంజాం, విశాఖపట్టణం జిల్లాలలో ఈ పరిశ్రమలలో ప్రసిద్ధి గాంచిన సుమారు 40 గ్రామాలలో ఏ రెండు, మూడు గ్రామాలలో మాత్రమే అధిక సంఖ్యాకులు ఈ నూలు వడికి, ఈ నేత నేస్తున్నారు కొన్ని గ్రామాలను విదేశీ నూలు పూర్తిగా ముట్టడించింది పేరుకొక్క రాట్నంగానీ చేతి మగ్గంగానీ అక్కడ లేనేలేదు నేను మొదటి రోజున చూసిన గ్రామంలో చేతి నూలు నేసే మగ్గం వొక్కటే ఉన్నది

విదేశీ నూలు నేయడం నేత గాండ్రకు లాభదాయకంగా ఉన్నప్పటికీ వారు ఉత్పత్తి చేసే బట్ట వాణ్యంలో చాలా తీసికట్టు మన్నికనుబట్టి స్వదేశీ సరుకు కంటె కూడా అది ఎక్కువ ప్రియమయ్యే మాట వాస్తవము కాని ప్రజలకు ఈ సంగతి తెలియదు అందువల్ల నేత గాండ్ర ఈ దురదృష్టవైఖరిని వారు ప్రోత్సహిస్తున్నారు

ఇందుకు తగిన ప్రతి క్రియ ఆంధ్రుల చేతిలోనే ఉన్నది ఈ స్వదేశీ బట్టను, నూలును కోరికతో కొనే వతందార్ల కంటె కూడ ఈ పురాతన

కళను పునరుద్ధరించగలిగితే ఆనాడు ఉత్కృష్టమైన వర్గాలవారు వాడిన పడుకు నూలుతో చేనేత మగ్గాలపై నేసిన నాజూకు బట్టలకు ఎక్కువ ఖరీదు పెట్టి కొనడానికి కూడా ఎన్నదగిన సంఖ్యలో జనం ఉన్నారని నాకు తెలుసు. ఈ ప్రాంతాలనుంచి సన్నని నూలు బట్టల సంప్రదాయం తొలగించరాదు. అద్దరు పువ్వువట్టుని కూడా పాఠకులకు సలహా ఇస్తున్నాను. ఎందుకంటే కావలసిన సరుకును పంపించడంలో ఊహించనంత ఆలస్యం అవుతుంది. అందువల్ల ప్రస్తుత వర్తకం దార్లకు చాలా ఇబ్బంది కలుగుతుంది. కాబట్టి ప్రస్తుతం మన రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే ముతక బట్టతోనే జనం సంతృప్తిపడి ఉండడం మంచిది. అయితే ఈ పద్ధతి ని కొద్ది మంది వ్యక్తులకో వర్తించకపోవచ్చు. ఎందువల్లనంటే ఈ నాజూకు బట్టలు కొద్ది మొత్తంగా సప్లయ్ చేయగలగానికి కొంత వీలున్నది. ఈలోగా మరింత అపాయస్థితిలో ఉన్న ఈ పరిశ్రమను పోషించడం ఆంధ్రుల ధర్మము."

యంగ్ ఇండియా
19-5-1921 — రామానుజ్

**జాతీయ పతాకము**

1921 మార్చి చివరి రోజుల్లో అఖిల భారత కాంగ్రెసు సమావేశం బెజవాడలో జరుగుతూండగా శ్రీ పింగళి వెంకయ్యగారు గాంధీజీ కోర్కెపైన జాతీయ పతాకం నమూనాను తయారు చేసి ఇచ్చినట్లు ఇంతకు ముందు పుటలలో ఉదాహరించడం జరిగింది.

గాంధీజీ 13-4-1921 యంగ్ ఇండియా పత్రికలో 'జాతీయ పతాకము' అనే శీర్షిక కింద దానిని వివరించిన వివరాలు ఇట్లా వ్రాసినారు:

"అన్ని జాతులకు ఒక జెండా ఉండడం అవసరము. లక్షలాది జనులు దాని కోసం బలి అయినారు. అది ఒక విధమయిన విగ్రహారాధన అనే మాట నిజమే కాని దానిని ధ్వంసం చేయడం మాత్రం పాపమే. ఎందువల్లనంటే అది ఒక ఆదర్శాన్ని ప్రతిబింబింపచేస్తుంది. 'యూనియన్ జాక్' ఆవిష్కరణ ఇంగ్లీషు వారి హృదయాలలో ఉద్వేగభరితమైన భావాలను రేకెత్తిస్తుంది. ఆ భావాల బలాన్ని అంచనా వేయడం చాల కష్టం. "నక్షత్రం-గీతలు" గల జెండా అమెరికన్‌లకు ఒక ప్రపంచం వంటిది. "చుక్క-అర్ధచంద్రుల్లి" ఇస్లాం మతస్థులకు అత్యంత సాహసవంతులుగా చేస్తుంది.

హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, యూదులు, పార్శీలు మొదలయిన వారనేకులకు ఇండియా మాతృదేశం. వారందరికీ ప్రాణ సమానమయిన ఒక జెండా ఉండవలె.

మచిలీపట్టణంలోని ఆంధ్ర జాతీయ కళాశాలకుచెందిన శ్రీ పింగళి (పి) వెంకయ్య ఇతర దేశాల పతాకాలను గురించి వివరాలతోపాటు భారత జాతీయ పతాకంగా ఉండడానికి కొన్ని నమూనాలను సూచిస్తూ ఒక చిన్న పుస్తకాన్ని ప్రచురించి ఏండ్ల నుంచి ప్రచారం సాగించినారు. గడచిన నాలుగు సంవత్సరాల

నుంచి ప్రతి కాంగ్రెస్ మహాసభలోనూ పట్టుదలగా జాతీయ జెండాను గురించి ఆయన చేసిన కృషిని నేను శ్లాఘించ, అప్పుడు దానిని ఆయన నన్ను అంతగా ఉత్సాహపరచలేకపోయినారు అలా వారు జాతిని అట్టడుగునుంచి సంచరింపచేయగలిగిన దేదనా కగపడదు పంజాబీకి ఆ గౌరవం దక్కింది ఆయన చేసిన సూచన తక్షణం నా దృష్టిని ఆకర్షించగలిగింది ఆయన లాలా హంసరాజ్ ఆయనది జలంధర్ ఆయన నాతో రాట్నం వివిధావకాశాలను చర్చిస్తూ మన స్వరాజ్య పతాకంపైన అది ఉండటగిన చిహ్నము సూచించి నారు మొట్టమొదటగా ఇయన ఈ సూచన చేసినందుకు నేను అభినందించక తప్పదు బెజవాడలో ఎరుపు (హిందూరంగు) ఆకుపచ్చ (ముస్లింరంగు) గల పటంపైన రాట్నాన్ని చిత్రించి తీసుకొనిరమ్మని నేను శ్రీ వెంకయ్యను అడిగినాను ఆయన ఉత్సుకత్వాహంలో మూడు గంటలలో నాకా జండాను అందించినాడు కాని కొద్దిగా ఆలస్యమయినందువల్ల నేను దానిని ఆ ఖా కా సం ముందు ప్రదర్శింపలేకపోయినాను ఇది కూడా మంచిదే అయింది మరి కొంత బాగా ఆలోచించిన తరువాత దానిని మరికొన్ని మతాలకు చిహ్నంగా ఉండేటట్లు చేయడం మంచిదనిపించింది హిందూ మహమ్మదీయ సఖ్యమనేది కేవలం హిందువులకూ మహమ్మదీయులకూ మాత్రమే వర్తించదు ఇండి యాలో నివసించే అన్ని మతాలవారి సంఘీభావాన్ని వర్తిస్తుంది హిందువులు, మహమ్మదీయులు పరస్పరం సహాభావంగలిగి ప్రవర్తించగలిగేటట్లయితే వారు ఇండియాలోని తక్కిన మతస్థులందరితోడనే కాక ప్రపంచంలోని అన్ని మతాల వారితోకూడా ఓర్పుతో వ్యవహరించగలరు కాబట్టి జాతీయ పతాక చిత్రానికి వెనకభాగం తెలుపు, ఆకుపచ్చ, ఎరుపురంగులతో ఉండవలె అత్యల్ప సంఖ్యాకులయినవారి చిహ్నం మొదట ఉండవలె ఇస్లాం మతస్థుల రంగు తరవాతనూ, హిందువుల రంగు కట్టకడపటనూ ఉండవలె బలిష్ఠులయినవారు అత్యంత దుర్బలులయినవారికి రక్షణగా ఉండవలెనని దీని అంతరార్థం తెల్లరంగు పవిత్రతకు, శాంతికీ చిహ్నం మన జాతీయ పతాకం నాటికి చిహ్నంగా ఉండక పోయినట్లయితే దానికి అర్థం లేదు అన్ని మతాలవారూ సమానులే అనడా నికి గుర్తుగా మూడు రంగులూ సమానంగానే ఉండవలె

ఇండియా ఒక జాతిగా బ్రతక వలెనంటే రాటం ఉండి తీరవలె రాటం అదృశ్యమయిన తరవాతనే భారత దేశంలో సుఖసంతోషాలు మృగ్యమైనా యని ఇండియాలోని ప్రతి స్త్రీ చెప్పగలదు రాట్నపు పిలుపుకు భారత నారీ మణులలోనేగాక భారత ప్రజాసామాన్యంలో సైతం ఎన్నడూ లేని చైతన్యం కలిగింది ప్రజలు దానిని ప్రాణదాతగా గ్రహించినారు స్త్రీలు దానిని తమ సౌశీల్యాన్ని రక్షించేదిగా భావిస్తున్నారు ప్రతి వితంతువూ రాట్నమును తానిది వరకు మరిచి పోయిన ప్రియ మిత్రాన్ని తిరిగి గుర్తు పట్టినట్లుగా భావి స్తూన్నది దాని పునరుజ్జీవనమే ఆకలిగొన్న లక్షలాది జనులకు అన్నం పెట్ట గలదు 19 వందల మైళ్ళ పొడవూ, 15 వందల మైళ్ళ వెడల్పూగల యావ

ద్భారత దేశంలో అంతకంతకు పెరిగిపోతూన్న కృషీవలుల దారిద్ర్య సమస్యను పారిశ్రామిక ప్రణాళిక లేవీ పరిష్కరించలేవు ఇండియా కేవలం ఒక చిన్న ద్వీపంకాదు అది ఒక పెద్ద ఖండం ఇంగ్లండ్ వలె దాని నొక పారిశ్రామిక దేశంగా మార్చడం సాధ్యం కాని పని ప్రపంచాన్ని దోచుకొని తినే ప్రణాళి కను దేనినైనా మనము మనస్ఫూర్తిగా నిరాకరించవలె మనం వ్యర్థంచేసే కాలాన్ని స్వదేశీనియోగం చేసి మన దేశైశ్వర్యాన్ని పెంపొందించడమే మన ఆశయంగా ఉండవలె మన కుటీరాలలో పత్తిని బట్టగా తయారు చేయడం వల్లనే ఆ ఆశయం నెరవేరుతుంది మనం జీవించడానికి గాలి నీరు ఎంత అవ సరమో, రాట్నంకూడ అంత అవసరము

అదీకాక హిందువులు దానిపట్ల ఎంత శ్రద్ధ వహిస్తున్నారో ముస్లిమ్‌లు కూడ అంత శ్రద్ధగా ఉన్నారు నిజం చెప్పవలసి వస్తే హిందువుల కంటే ముస్లిమ్‌లే దానిని ఎక్కువ త్వరగా చేబడుతున్నారు ఎందువల్లనంటే ముస్లిమ్ లోని గోషా స్త్రీలు రాట్నం మూలంగా తమ కుటుంబానికి తమ భర్తలు తెచ్చే ఆదాయానికి తోడు మరి కొన్ని పైసలను ఎక్కువగా సంపాదించగలుగు తున్నారు కాబట్టి భారత జాతీయ జీవనానికి రాట్నం ఎంత సహజమైనదో అంత ముఖ్యమైనది కూడా మన అన్న వస్త్రాలకు సంబంధించినంత వరకు మనం సంపూర్ణ స్వతంత్రులమనీ, ఇతరులపైన ఆధారపడవలసిన అవసరం లేదనీ దాని ద్వారా మనం ప్రపంచానికి ప్రకటించడానికి నిశ్చయించుకొన్నాము కాబట్టి నా మాదిరి ఆలోచించే వారందరూ వారి ఇండ్లలో రాట్నం వెంటనే పెట్టుకొనవలెనని సూచించిన విధంగా జాతీయ జెండాను రూపొందించుకో వలెనని కోరుతున్నాను

భారత దేశం తనకు కావలసిన బట్టకు విదేశపు అంగళ్ళపైన ఆధారపడక తన ముతక బట్టద్వారా స్వతంత్రంగా ఉండవలెనని కోరుతున్నది కనక మన జండా ఖద్దరులో ఉండవలెననే విషయం ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు నా ఈ అభిప్రాయంతో ఏకీభవించే మతస్థుల వారందరూ తమ తమ మత సంబంధ మైన జండాపైన - ఉదాహరణానికి ఖిలాఫత్ జండాపైన ఎడమ వైపుమూలలో చిన్న జాతీయ జండాను చిత్రించవలెనని కోరుతున్నాను నియమిత ప్రమాణం ప్రకారం తయారు చేసిన జండాలో పూర్తి రాట్నాన్ని చిత్రించ వలె

యంగ్ ఇండియా
13-4-1921

## గాంధీజీ - ఆంధ్రదేశ సంచార ప్రభావము

ఈ విషయం గురించి అయ్యదేవర కాళేశ్వరరావుగారు "నా జీవిత కథ నవ్యాంధ్రము" అనే గ్రంథంలో ఇట్లా వ్రాసినారు

మహాత్మాగాంధీగారు కొండ వెంకటప్పయ్య పంతులుగారితో కలిసి

చేసిన ఆంధ్రదేశ సంచారం ఆయనకు సంతృప్తిని కలుగజేసింది ఆంధ్రదేశంలోని మారుమూల లన్నింటిలో దేశాభిమానము, స్వరాజ్య సంపాదనా దీక్ష బాగా కనపడినాయి ఎక్కడికిపోయినా ఖద్దరు ధరించినవా రెక్కువగా కనిపించినారు అస్పృశ్యతా నివారణ ప్రయత్నాలు జయప్రదంగా జరుగుతున్నవి హిందీ భాషను ఆంధ్రప్రజలు శ్రద్ధగా చగువుకొనసాగినారు తిలక్ స్వరాజ్యనిధికి ద్రవ్యాన్ని, ఆభరణాలను ఇచ్చినారు లాయర్లు, విద్యార్థులు మాత్రమే కాక వందలకొద్దీ గ్రామోద్యోగులు రాజీనామాలు ఇస్తూ ఉండినారు హిందూ ముస్లిమ్‌ల ఐక్యత బాగా ఉండింది ఆ కాలంలో అలీఘర్‌లో ముస్లిమ్ విశ్వ విద్యాలయము కాంగ్రెస్ ఖిలాఫత్ ఉద్యమాలకు, అసహాయోద్యమానికి గొప్ప కేంద్ర మయింది విద్యార్థులు చాలామంది కళాశాలలను వదిలి జాతీయ విద్య నభ్యసించసాగినారు కళాశాలలను వదిలి సహాయ నిరాకరణం చేసిన (ఆంధ్ర ముస్లిమ్‌లలో)వారిలో (1) మక్బూల్ అలీ (వీరు తరవాత సివిల్ సర్జన్‌గ ఉద్యోగం చాలించినారు) (2) మహమ్మద్ హుస్సేన్ (వీరు తర వాత రాజగోపాలాచారితో కలసి రాయవేలూరు జైలులో ఉండినారు పబ్లిక్ రికార్డ్స్ డైరక్టర్‌గా పనిచేసి పింఛన్ పొందినారు) (3) యూసపుద్దీన్ (తరవాత రైల్వే డిప్యూటీ ఆడిటర్ జనరల్‌గా రిటైర్ అయినారు), (4) అక్బర్ అలీ ఖాన్ (తరవాత బ్యారిస్టరు పాసై ఇప్పుడు పార్లమెంట్ సభ్యుడుగ ఉన్నారు) (5) హమీదుద్దీన్ మహమూదు (ఇనాం కమిషనర్‌గ ఉన్నారు) (6) ఫక్రుద్దీన్ మసూదు (అల్లాఉద్దీన్ పరిశ్రమల మేనేజరుగా ఉన్నారు) (7) సయ్యద్ మహమద్ అన్సారీ (బి ఎ యల్ యల్ బి ప్యాసై అడ్వొకేట్‌గా ఉన్నారు) మొదలైన హైదరాబాదు ఆంధ్ర ముస్లిం విద్యార్థులున్నారు వీరందరు, తర వాత హైదరాబాదు స్టేట్‌లో పైన చెప్పిన పెద్దఉద్యోగాలు చేసఉన్నారు అఖిలభారత కమిటీసమావేశంముగియగానే బెజవాడలో దాసు మధుసూదన్‌రావు గారు ఒక ఖద్దరు కేంద్రం స్థాపించి విరివిగా ఖద్దరును ఇతర రాష్ట్రాలకు ఎగు మతి చేయించినారు శ్రీకాకుళం జిల్లాలోని పొందూరులో తయారయ్యే అతి సన్నని చేనూలు ఖద్దరు వస్త్రాలు నాజూకు తననానికి ప్రసిద్ధిచెంది, ఆంధ్ర ఖద్దరు యావద్భారత దేశంలో ప్రథమ స్థానం ఆక్రమించింది 1921 సంవత్సరాంతంలో మధు సూదన్‌రావు గారు మళ్ళీ ప్లీడరీ వృత్తిలో ప్రవేశించినందున నేను, అద్దే పల్లి వేంకట గురునాధ రామశేషయ్య శ్రేష్ఠిగారు ఆ ఖద్దరు కేంద్రాన్ని తీసు కొని మేమిద్దరం నోట్లు రాసి అఖిల భారత చర్ఖా సంఘంవద్ద 2 వేల 5 వందల రూపాయలు అప్పు తెచ్చి దానిని నడిపినాము మా పశ్చిమ కృష్ణా జిల్లాలో ఖద్దరు ఉత్పత్తి, ఖద్దరు వ్యాపకం జయప్రదంగా జరిపినాము ఆంధ్ర దేశంలో కంతా విజయవాడయే ఖద్దరు నిలయాన్ని జయప్రదంగా నడిపింది బందరులో డాక్టర్ పట్టాభి సీతారామయ్య, దుగ్గిరాల రాఘవ చంద్రయ్యగార్లు తూర్పు కృష్ణా జిల్లాలో సంచారం చేసి ఖద్దరు ఉత్పత్తి కేంద్రాలను నెలకొల్పినారు ఇట్లాగే గుంటూరు జిల్లాలో కొండ వేంకటప్పయ్య, గొల్లపూడి సీతారామ

శాస్త్రిగార్ల నాయకత్వంలో జరిగింది [illegible] జాతీయ
పరిశ్రమాలయమనే పేరుతో [illegible] సర్వశ్రీ [illegible] దుగ్గిరాల రాఘవ
చంద్రయ్య, అరికపూడి రామశాస్త్రి, [illegible] బ్రహ్మాన్నంగారలు
స్థాపించి 1946 వరకు [illegible] వాడలలోని
జాతీయ విద్యాలయాలుగాక గుంటూరు జిల్లాలో ఒక జాతీయ విద్యా కమిటీ
ఏర్పడింది దానికి [illegible] కొండ వెంకటప్పయ్యగారు అధ్యక్షులుగాను, బ్రహ్మాండం
నరసింహంగారు కార్యదర్శిగాను పనిచేసి 10 జాతీయ పాఠశాలలను ఆ జిల్లాలో
స్థాపించినారు అవి కొన్ని సంవత్సరాలు పనిచేసినాయి ఆంధ్ర రాష్ట్రం సర్వ
విధాల గాంధీగారిపట్ల ఎక్కువ భక్తిగల రాష్ట్రంగా [illegible]

మహాత్మా గాంధీగారు జాతీయ స్వాతంత్ర్య పోరాటానికి నాయకత్వం
వహించినప్పటినుంచి భారత దేశంలోని వివిధ రాష్ట్రాలలో ఆయా రాష్ట్ర
భాషలు వృద్ధి చేయబడవలసి ఉన్నప్పటికీ [illegible] జాతీయ భాష
ఉండవలెనని భారతీయులలో అధిక సంఖ్యాకులు [illegible] భాషయే
జాతీయ భాష కావలెనని [illegible], దక్షిణ హిందూదేశంలో హిందీ భాషను వ్యాపింప
చేయడంకోసం 1918 నుంచి ప్రయత్నాలు చేయ[illegible] ఆ సంవత్సరం మే
నెలలో హోమ్‌రూలు లీగ్ కార్యస్థానమైన [illegible] గోఖలే
హాలులో డాక్టర్ అనిబిసెంటమ్మగారి అధ్యక్షతన హిందీ సాహిత్య సమ్మేళన
ప్రచార కార్యాలయం స్థాపించబడింది అప్పటి నుంచి ఆ పేరుతనే 1927 సం॥
వరకు పని చేసింది ఆంధ్ర, అరవ, కర్ణాటక, మళయాళ రాష్ట్రాలలో హిందీని
బాగా వ్యాపింపచేసింది [illegible]హరశర్మగారు, మోటూరి సత్యనారాయణగారు
ఈ హిందీ ప్రచారానికి నాయకత్వం వహించి నడిపినారు ఆంధ్రలో కృష్ణా,
గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, [illegible], కడప మొదలైన
జిల్లాల అన్నిటిలో జిల్లా శాఖలు పెట్టి, హిందీని [illegible] విధాల వ్యాపింప చేయ
డానికి పాఠశాలలను స్థాపించినారు బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలోను,
1921 వ సంవత్సరంనుంచి ఆంధ్ర దేశంలో స్థాపించబడిన [illegible], గుంటూరు,
ఏలూరు మొదలయిన చోట్ల అన్ని జాతీయ పాఠశాలలోను హిందీ నిర్బంధ
భాషగా నేర్పబడుతూవచ్చింది ఆంధ్ర దేశంలో ప్రథమ హిందీ ప్రచారకుడుగ
1922 నుంచి ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు పనిచేసినారు 1925 లో
కృష్ణా జిల్లాలో స్థాపించిన జిల్లా హిందీ ప్రచారమండలికి నన్ను అధ్యక్షునిగా
ఎన్నుకొన్నారు 1923 లో కాకినాడలో కాంగ్రెస్ మహాసభ జరిగినపుడు
హిందీ సమ్మేళనం కూడ జమునాలాల్ బజాజ్‌గారి అధ్యక్షత కింద జరిగింది
దాని వల్ల ఆంధ్ర జిల్లాలలో హిందీ వ్యాపకానికి గొప్ప దోహదం కలిగింది
1924 నుంచి విజయవాడ, గుంటూరు, నెల్లూరు మునిసిపల్ పాఠశాలలలో
హిందీని ప్రవేశపెట్టి నేర్పించ సాగినారు అప్పుడున్న జస్టిస్ పార్టీవారు
అభ్యంతర పెట్టినారు కాని 1927 లో వచ్చిన జాతీయ పార్టీ నాయకుడూ,
ముఖ్యమంత్రీ అయిన డాక్టర్ సుబ్బరాయన్‌గారు హిందీని పాఠశాలలో నేర్ప

డానికి అనుజ్ఞ ఇచ్చినారు 1927 లో దక్షిణ భారత హిందీ ప్రచార సంఘం మద్రాసులో స్థాపింపబడినప్పటి నుంచి విశేషంగా పని చేస్తున్నది 1936 లో ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘాన్ని రిజిష్టర్ చేయించడం జరిగింది కొన్ని రోజులు దానిని ఆంధ్ర రత్న భవనంలో ఉంచి తరవాత సొంత భవనం నిర్మించు కొన్నది నేను కొంత కాలం ఆ సంఘానికి ఉపాధ్యక్షునిగా ఉన్నాను కొండ వేంకటప్పయ్య పంతులుగారు చాల సంవత్సరాలు అధ్యక్షునిగా ఉన్నారు వారు మరణించిన తరవాత టంగుటూరి ప్రకాశం పంతులుగారు తరవాత డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిగారు అధ్యక్షులుగా ఉన్నారు తమిళ దేశంలో హిందీకి వ్యతిరేకంగా రామస్వామి నాయకర్ పార్టీయైన ద్రావిడ కజగం తీవ్రంగా ప్రతిఘటిస్తున్నప్పటికీ ఆంధ్ర దేశంలో హిందీ పట్ల ఏకగ్రీవమైన అభిలాష,అభిమానం ఉన్నాయి మహాత్మా గాంధీగారు ఆంధ్ర దేశసంచారంలో ఆంధ్ర దేశీయులు జాతీయ భాషయైన హిందీ పట్ల చూపుతున్న అభిలాషకు చాలా సంతోషించినారు హిందూస్థానీని తేలిక భాషగా చేసి దేవనాగరి అక్షరం లోను, ఉర్దూ (అరబీ) అక్షరాలలోను నేర్చుకొనటం - యుక్తమమని ఆయన ఉద్దేశము రాజగోపాలాచారి ప్రధానిత్వంలో మేమందరము 1937 లో మద్రాసు కాంగ్రెస్ ప్రభుత్వంలో ఉన్నప్పుడు 1, 2, 3 ఫారాలను హిందీని నిర్బంధంచేసి జాకిర్ హుస్సేన్, మోటూరి సత్యనారాయణగార్ల సహాయంతో దేవనాగరి లిపిలోను, ఉర్దూ లిపిలోను ఉండేటట్లు పుస్తకాలను ప్రచురింపించి పాఠశాలలలో అర్పించినాము 1952 మొదలు 1952 వరకు 5 సంవత్సరాలలో మొత్తం మీద 4,85,692 మంది ఆంధ్ర దేశంనుంచి హిందీ పరీక్షలో ఉత్తీర్ణులై నారు

## ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నివేదిక
(1921 జూన్ 21 వరకు)

విజయవాడలో అ భా కాం పం సమావేశమై సహాయ నిరాకరణో ద్యమ కార్యక్రమం నిర్ణయించిన తరవాత ఆయా విషయాలలో ఆంధ్రదేశం లోని ఉద్యమ వ్యాప్తిని ఈ నివేదిక తెలియచేయగలదు

| | |
|---|---|
| వృత్తి మానిన లాయర్లు | 108 |
| ప్రభుత్వంవారు గుర్తించిన పాఠశాలలనుంచి గాని, వారి సహాయం పొందుతున్న పాఠశాలల నుంచి గానీ రాజీనామా ఇచ్చిన ఉపాధ్యాయులు | 17 |
| ఉద్యోగాలు మానిన ప్రభుత్వ సేవకులు | 44 |
| జాతీయ పాఠశాలలు | 44 |
| జాతీయ పాఠశాలలలో చదువుతున్న విద్యార్థులు | 2759 |

| | |
|---|---|
| గ్రామ కాంగ్రెస్ కమిటీలు | 2204 |
| గ్రామ కాంగ్రెస్ కమిటీ సభ్యులు | 77038 |
| రాట్నములు | 44092 |
| తిలక్ స్వరాజ్య నిధి | రు 48123-10-3 |
| వేతన కార్యకర్తలు | 176 |
| గౌరవ కార్యకర్తలు | 292 |
| పంచాయతి కోర్టులు | 37 |
| మద్యపానం మానిన గ్రామాలు | 111 |
| గ్రామ కాంగ్రెస్ కమిటీలో ముస్లిం సభ్యులు | 175 |
| గ్రామ కాంగ్రెస్ కమిటీలో స్త్రీ సభ్యురాండ్రు | 471 |

**పల్నాటి పుల్లరి ఉదంతము**

గుంటూరు జిల్లా పల్నాడులో అడవి పుల్లరిని గురించి అటవీ శాఖాధికారులు ప్రజలను పీడిస్తున్నందువల్ల ప్రజలు రోష పూరితులై పుల్లరిని అసలే చెల్లించక తిరుగుబాటు చేయ నారంభించినారు 1921 జూలై లో నెల్లూరి జిల్లాలోని వెంకటగిరిలో కటికనేని వెంకట రమణారావు, కల్యాణరావుగార్ల ఇంట్లో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం ఈ విషయం గురించి విచారించి నివేదిక ప పరానికి శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారిని, శ్రీ మాడభూషి వేదాంతం లక్ష్మీనరసింహాచార్యుల వారిని ఉపసంఘంగా నియమిస్తూ తీర్మానం చేసింది ఆ తీర్మానం ప్రకారం వారు పల్నాడులోని మాచర్లకు సమీప గ్రామాలకు పోయి విచారించినారు అంతకు పూర్వమే కొండ వెంకటప్పయ్య పంతులుగారు మాచర్లకు పోయి కాంగ్రెస్ పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ఇంకా అమలులో పెట్టలేదు కనుక పుల్లరి చెల్లించవలసిందని అక్కడి ప్రజలకు చెప్పి వచ్చినారు కాని ప్రయోజనం లేక పోయింది శ్రీ లక్ష్మీనారాయణగారు, నరసింహాచారిగారు పల్నాడు వెళ్ళేసరికే ప్రజలలో ఆందోళన హెచ్చి పోయింది ప్రభుత్వాధికారుల కెవ్వరికీ పూటకూళ్ళ బసల్లో అన్నం పెట్టకూడదని ప్రజలు నిశ్చయించు కొన్నారు ఈ బహిష్కారాన్ని ఇంత తీవ్రంగా సాగించడానికి గట్టిగా ప్రయత్నించిన మనిషి శ్రీ రంగా చెంచయ్య ఆయన వైశ్యుడు, వర్తకుడు. ఈ బహిష్కారోద్యమంవల్ల మాచర్ల డిప్యూటీ తహసీలుదారు ఇంట్లో పసిపిల్లలకు పాలు కూడ దొరక లేదు ఈ స్థితిలో గుంటూరు జిల్లా కలెక్టర్ 'ఫీల్డ్' మాచర్ల ఊరి వెలుపల తోపులో డేరా వేయించుకొని మకాం పెట్టినాడు ఆయనకు కావలసిన కోడి గుడ్లు కూడ మాచర్లలో దొరకక గుంటూరునుంచి తెప్పించుకోవలసి వచ్చింది.

ఈ ఆందోళనకు కారకులు శ్రీ లక్ష్మీ నారాయణ, నరసింహాచార్యులుగార్లని భావించి వారిద్దరు "శాంతికి భంగం కలిగించకుండడానికి జామీను ఎందుకు ఇవ్వకూడదో సమాధానం చెప్పడానికి తన వద్దకు హాజరు కావలసిందని" కలెక్టర్ 'షీల్డ్' వారికి నోటీసులు పంపించినారు

మాచర్లలో దండోరా వేయించడానికి కలెక్టర్ గ్రామ మునసబును పిలిపించి తప్పెట తెప్పించ మన్నాడు గ్రామమునసబు సరేనని వెళ్ళి కొంత సేపటికి కలెక్టర్ దగ్గరకు వచ్చి "డప్పుల వాళ్ళు డప్పులు చినిగి పోయిన వంటున్నారు, కాబట్టి డప్పు దొరక లేదండి!" అను మనవి చేసినాడట కాని లక్ష్మీనారాయణ పంతులుగారు హాజరయిన నాడు అయనను గజ్జెల గుఱ్ఱంమీద ఎక్కించుకొని, తప్పెటలు మ్రోగిస్తూ, ఊరేగింపుతో ప్రజలు కలెక్టర్ గారి డేరా వద్ద దింపినారు ఆ ప్రజల ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని చూసి 'నేను కావలె నంటే ఒక డప్పు కూడా దొరక లేదు ఇప్పుడు ఇన్ని డప్పులెట్లా వచ్చినాయి" అని తనలో తాను అనుకొంటూ పట్టలేక "ఎప్పుడో స్వరాజ్యం వస్తుందంటారు, ఇదుగో! ఇప్పుడే నాచుట్టూ స్వరాజ్యం కనిపిస్తూ ఉన్నదని' బిగ్గరగా అన్నాడట

తరవాత లక్ష్మీ నారాయణగారిని, నరసింహాచార్యులుగారిని శాంతికి భంగం చేయ తలపెట్టబోమని చెరొక సంవత్సరానికి పూచీకత్తు ఈయవలసిందని కలెక్టర్ కోరగా వారందుకు అంగీకరించలేదు అందువల్ల వారికి చెరొక సంవత్సరం విడి ఖైదు విధించడంజరిగింది ప్రభుత్వం వారి ఈ చర్యను నిరసిస్తూ గుంటూరు ప్రజలు ఒక బహిరంగ సభ చేసినారు ఆ సభకు అధ్యక్షులుగా ఉన్న కొండ వేంకటప్పయ్య పంతులుగారు, శ్రీ లక్ష్మీ నారాయణ, నరసింహాచార్యులుగార్లను ప్రభుత్వం వారు నిర్బంధించి నందుకు గుంటూరు పట్టణంలోని వర్తకులు తమ దుకాణాలన్నిటినీ కట్టివేసి, వారం రోజుల హర్తాల్ జరపవలసిందని ప్రబోధించినారు ఆ ప్రకారం వర్తకులు ఒక బియ్యపు దుకాణం, ఒక ఉప్పు, మెరపకాయ చింత పండు మొదలయిన చిల్లర సరుకుల దుకాణం మాత్రం తెరిచి ఉంచి తక్కినవి మూసి వేసినారు ఈ హర్తాల్ జయప్రదంగా నిర్వహించడానికి మద్ది వేంకట సుబ్బయ్య, చీమకుర్తి బసవయ్య, గొల్లపూడి సీతారామ శాస్త్రి, దుగ్గిరాల గోపాల కృష్ణయ్య ఆయన రామదండు, చట్టి నరసింహారావు, నడింపల్లి లక్ష్మీ నరసింహారావు, బారిస్టర్ గుప్త, కొండ వేంకటప్పయ్య పంతులుగారలు ప్రతి దినం ఉదయం సాయంకాలం బజారుల వెంట తిరిగి దుకాణాలు తీయకుండా ఉండేటట్లు వర్తకులను ప్రోత్సహించినారు ఫ్యాక్టరీలను కట్టివేసి నందువల్ల కార్మికులు బజారుల వెంట తిరిగినట్లయితే శాంతికి భంగం కలగ వచ్చుననే భయంవల్ల వారిని వీధుల వెంట తిరగకుండా ఉండేటట్లు ఈ నాయకులు ఏర్పాటు చేసినారు

ఈ విధంగా 5 రోజులు గడించింది 6 వ రోజు ఉదయం భట్టిప్రోలు సూర్య ప్రకాశరావు అనే ఒక కాంగ్రెస్ ప్రచారకుడు హైస్కూలు గేటు

దగ్గర నిలచి స్కూల్లో ఉన్న బాలురను స్కూలు వదలి రండని కేకలు వేస్తూం డగా పోలీసు వచ్చి ఆయనను పట్టుకొని పోయినారు తరవాత పిల్లలు పోలీసు స్టేషన్ పైన రాళ్ళు వేయడం ప్రారంభించినారు, గుండురావుగారనే ఒక డిప్యూటీ కలెక్టర్ జట్కా బండి ఎక్కి హై స్కూలు వైపుకు వచ్చేసరికి ఎవరో కొందరు రోడ్డు వైపున కుప్పగా పోసివున్న కంకరరాళ్ళను బండిపైన విసరడం ప్రారంభించినారు అప్పుడు ఆ తోవనే పోతూఉండిన కొండ వేంక టప్పయ్య పంతులుగారు రాళ్ళు రువ్వవద్దని ఎంత అరిచినా రాళ్ళు పడడం మానలేదు గుండురావు గారెక్కిన బండిని వెంటనే తోలుకు పొమ్మని పంతులు గారు బిగ్గరగా అరవడం ప్రారంభించనారు పంతులుగారి వ్రేళ్ళకు రాళ్ళు తగిలి గాయాలు తగిలినాయి పంతులుగారే రాళ్ళు వేయిస్తున్నారనీ గుండురావు గారన్నారు కొంత సేపటికి గుండురావుగారి జట్కా బండి వెళ్ళి పోయింది ప్రజలను శాంతింప జేసి, పంతులుగారు ఇంటికి వెళ్ళినారు ఆ మర్నాడు ఆబ్కారీ దుకాణాల పాటలు గుండురావుగారి కచ్చేరీలోనే ప్రారంభమయి నాయి కాంగ్రెస్ ప్రచారకుల నెవ్వరినీ లోనికి పోనివ్వలేదు సహాయ నిరా కరణోద్యమం ప్రారంభమైన తరవాత ఆబ్కారీ పాటలు పెట్టడం అదే మొదటి పర్యాయం డిప్యూటీ కలెక్టర్ కచ్చేరీ మేడ మీద పాటలు జరుగుతున్నాయి ఈ సంగతి కొండ వేంకటప్పయ్య పంతులు గారికి తెలిసి పాటలను ఆపించ డానికి పోక తప్పదని భావించి వారు గుండురావుగారి కచేరికి పోయినారు ఆ నాటి ఉదంతాలను గురించి వేంకటప్పయ్య పంతులుగారు తమ స్వీయ చరిత్రలో ఇట్లా వ్రాసినారు

మిత్రులు చాల మంది కచ్చేరిదగ్గర నిలచి ఉన్నారుగాని వారిని మేడ మీదికి పోనివ్వడంలేదు నేను త్వరగ పోయినాను నన్నాటంకపరచలేదు నాతో మిత్రులలొకరిద్దరు కూడ పైకి వచ్చినారు గుండురావుగారు నన్ను చూడటం తోడనే 'రండు రండని' తన దగ్గరగా ఒక కుర్చీ వేయించి కూర్చుండమని కోరినారు కాని నేనటు పోక ఆయన కెదురుగా హాలులో ఒక బల్ల మీద కూర్చున్నాను నాతో వచ్చిన మిత్రులునూ నా పక్కనే కూర్చున్నారు పాటలు పాడ వచ్చిన వారు హాలంతా నిండిఉన్నారు పోలీస్ సబ్ఇన్స్పెక్టర్సు మరి కొందరు పోలీసు జవాన్లు కూడా హాల్ లో ఉన్నారు నేనక్కడ కూర్చోవడం వారికి అందరికీ కొంత అనుమానం కల్పించింది నేను కూర్చోనే పాటదారులను సంబోధించి నీతి వాక్యాలను చెప్పుతూ పాటలు పాడవద్దని ప్రబోధంచేసి హెచ్చరించినారు ఇంత నిర్భయంగా, ఫస్ట్ క్లాస్ మేజిస్ట్రేటు ఎదుట కూర్చుండి ప్రభుత్వాధికారం తృణీకరించి అట్లాంటి ప్రసంగం చేయడం వారికాశ్చర్యంగా ఉంది నేను ప్రసంగిస్తున్నప్పుడు మధ్య మధ్య గుండురావు గారు ఆ ప్రకారం చెప్పకూడదని, అది సర్కారు కచేరీగాని ఉపన్యాసాలిచ్చే తావు కాదనీ నన్నడ్డగిస్తూ వచ్చినారు వారి మాటలు బహిరంగంగా పాడు తున్నందువల్ల బహిరంగ స్థలమే యనీ అక్కడి ప్రజలను ప్రబోధించడానికి

నాకు హక్కు ఉందని నేను ప్రతి వాదనలు చేస్తూ నా ప్రసంగం సాగిస్తున్నాను నన్ను వెలపలకు వెళ్ళవలసినదని చెప్పమని ఒక పోలీసు జవాను నావద్దకు పంపించినారు ఆ జవాన్ వచ్చి "అయ్యగారు వెలుపలికి వెళ్లమంటున్నార"ని చెప్పి నేను వెళ్లనని బిగ్గరగా జవాబు చెప్పినాను అక్రమం జరుగుతున్నప్పుడు దానిని ఆపివేయడానికి వారికి గల అధికారం నాకు ఉందని మొండి వాదన చేసినాను అంతట నన్ను నెట్టి వేయవలసిందని జవానుతో మేజిస్ట్రేటుగారు చెప్పినారు జవాను నా దగ్గరకు రాగానే నా మీద నీవు చేయి వేయకూడదని నేను బిగ్గరగా గదమాయించినాను అంతట మేజిస్ట్రేట్ గారే స్వయంగా నా వద్దకు వచ్చి నా చేయి పట్టుకొన్నాడు నేనా పట్టు వదలించుకొన్నా మళ్ళా ఆయన నన్ను పట్టుకోవడానికి వస్తూ ఉంటే ఆయనను తోసి వేసినాను ఆయన పెద్ద లావైన జవాను నేను సన్నని పీల మనిషిని కాబట్టి ఆ సమయంలో నాకున్న బలం సింహానికి కూడ లేదన్నట్లు తోచింది ఈ దృశ్యం చూసినవారందరు నిశ్చేష్టులయినారు గుండురావుగారు మళ్ళా బల్లదగ్గరపోయి కాగితాల మీద నేదో వ్రాస్తు "మీ మీద ప్రొసీడింగ్స్ వ్రాస్తున్నా"నని నన్ను హెచ్చరించినారు వ్రాసుకొమ్మని తృణీకరించినాను ఏమేమో వ్రాసి రెండు మూడు సార్లు వ్రాసిన కాగితాలను చింపివేసినాడు ఆయన చాల కలవరం చెందినాడు సహజంగ మంచివాడు కావడంవల్ల జరిగిన విచిత్ర చర్యచూసి ఏమి చేయడానికి తోచక మనసు చీకాకు నొందడంతో వ్రాయదలచుకొన్నది చక్కగా వ్రాయలేక కాబోలు మానుకొని మళ్ళా పాటలు ప్రారంభించడానికి నారంభించినాడు ఒక్కొక్క దుకాణం పేరు చదివి పాటలు పెట్టవలసిందని కోరగా ఎవ్వరూ పాట పెట్టడానికి సాహసించలేదు ఒకటి రెండు దుకాణాలెవరో బహు స్వల్ప మొత్తాలకు పాడటంవల్ల పాట నిలిపి వేయవలసి వచ్చింది మేజిస్ట్రేట్ గారు పోలీసు అధికారులు పాట దారులను ప్రోత్సహించినారు కాని ఎవ్వరూ పాట పెట్టలేదు నేను మధ్య మధ్య పాడవలదని కేకలు వేసి గట్టిగ హెచ్చరిస్తూ ఉండినాను ఇట్లా కొంత దూరం నడిచిన తరవాత పోలీసు ఇన్స్పెక్టర్ పాట దారులను సంబోధించి 'మీరు పాటలు పాడదలిస్తే ఇక్కడ ఉండండి లేనట్లయితే లేచిపోం"డన్నాడు ఇదే సందని అందరు ఒక్కుమ్మడిగా లేచి పోయినారు నేను నా మిత్రులు, అధికారులు మాత్రమే చివరి వరకు నిలచి ఉన్నాము 'ఈ నాడు మీరు జరిపిన చర్య చాల దుండగంగా ఉన్నదన్ని గుండురావుగారు హెచ్చరించినారు నాకు ధర్మమని తోచిన కార్యం చేసినానని బదులు చెప్పినాను అంతట నా మిత్రులు, నేను కిందికి దిగి వచ్చినాము ఆనాటి చిత్ర కథ అంతా ఊరిలో పాకి పోయింది కాని అందుకు నామీద ఏవిధమైన చర్య తీసుకోలేదు

గుండురావుగారు తన బండిమీద రాళ్లు రువ్వడం ఆధారంచేసుకొని నేనే ప్రజలను ప్రేరేపించి రాళ్లు రువ్వించి పట్టణంలో శాంతికి భంగం కలగచేయడానికి ముఖ్యకారణభూతుడనైనానని ఆనాడు ఇంటికి వెళ్ళటంతోనే కలెక్టర్ కు

రిపోర్టు వ్రాసినాడు

ఆ సాయంకాలమో, మరునాటి సాయంకాలమో నన్ను, మద్ది వెంకట సుబ్బయ్య, చీమకుర్తి కుమారస్వామి, బారిష్టర్ గుప్త మరి ఇద్దరి నెవ్వరినో ఒకేపర్యాయం పట్టుకొని తాలూకా జైలులో పెట్టినారు ఈ వార్త పట్టణంలో వెంటనే పాకిపోయింది జనం గుంపులుగుంపులుగా జైలు దగ్గర, బజారులో గుమిగూడి, ఆశ్చర్యంతో చెప్పుకొంటున్నారు ఈ వార్త చుట్టుపట్ల గ్రామాలకు తెలిసిన వెంటనే వందలాదిగా ప్రజలు రైళ్ళెక్కి గుంటూరు చేరినారు మహా సభ ఒకటి మిషన్ కాలేజీ మైదానంలో సమావేశమయింది గొల్లపూడి సీతారామశాస్త్రిగారు ఉద్రేకపూరితులై ప్రభుత్వ చర్యను తీవ్రంగా ఖండిస్తూ ఉపన్యాసం చేసినారు మరికొందరు మిత్రులు కూడా భాషించినారు మమ్ము జైల్లో ఉంచిన రోజు శుక్రవారమని జ్ఞాపకము మమ్మల్ని జైలుకు తీసుకొని వెళ్ళిన తరవాత కొద్దిసేపటికే జిల్లా కలెక్టర్ తాలూకా కచ్చేరిలోనే మామీద విచారణసభ ప్రారంభం చేసినారు గుండురావుగారే ప్రథమ సాక్షి. నేను నా మిత్రులు సమ్మె చేయించి, దౌర్జన్యం ప్రోత్సహించి, శాంతి భంగకారులమైనామని సాక్ష్యం చెప్పినారు కాంగ్రెస్ నిర్ణయ ప్రకారం నేము సాక్షులను అడ్డు సవాళ్లు వేయలేదు . ...

గుండురావుగారి సాక్ష్యమైన తరవాత ఒకరిద్దరి పోలీసు ఉద్యోగులను విచారించి ఆ రోజుకు విచారణ ముగించినారు మా విచారణ జరుగుతూండగానే పట్టణంలో కొన్ని విశేషాలు జరుగుతూ ఉండినాయి నన్ను పోలీసులు పట్టుకొనిపోయినారన్న వార్త విన్నతోడనే మాకు దూరపుబంధువయిన శ్రీ దిగుమర్తి రామస్వామిగారు తమ సబ్‌కోర్టు సిరస్తాదారు పనికి రాజీనామా ఇచ్చినారు కలెక్టర్ కచ్చేరి గుమాస్తాలను చాలామందిని చేర్చి తనవలెనే ఉద్యోగాలకు రాజీనామాలీయవలసిందని ప్రబోధించినారు వారందుకు సమ్మతించి సుమారు నూరుగురు తీర్మానం చేసికొన్నారు ఆనాడు నెలలో ఆకరు దినము మధ్య ఆదివార మొచ్చింది కాబట్టి సోమవారంనాడు జీతాలు తీసుకొని రాజీనామాలు దాఖలు చేయాలని నిర్ణయించుకొన్నారు ఇదిగాక కోర్టులో న్యాయవాదు లందరు సభకూడి 6 మాసాలు తమ వృత్తికార్యాలు కట్టిపెట్టడానికి నిర్ణయించి గట్టిగా సమ్మె ప్రారంభించినారు ఈ సంఘటనలు పట్టణంలోనే కాక దేశమంతటా మితిలేని కలవరం కలగజేసింది ప్రజలలో ఆవేశం ప్రబలమయింది వర్తకులు దుకాణాలను ఆనాటితో తెరవవలసి ఉన్నా మా నాయకులను జైలు నుంచి విడుదల చేసేవరకు కొట్లను కట్టి ఉంటామని ప్రభుత్వోద్యోగులకు తెలిపినారు ఈ వార్తలు పత్రికలలో ఆసేతుహిమాచలం ప్రకటితమయింది

ఈ అలజడినంతా ఆలోచించే కాబోలు మరునాడు ఆదివారం ఉదయముననే మళ్ళా కలెక్టర్ విచారణ ప్రారంభించి ముందుగా నేరం చేసితివా లేదా అని నన్నడిగి నా వాఙ్మూలం వ్రాసుకొన్నాడు నేను కొట్లు మూసి

వేయించడం మొదలు విశేషాలన్నిటినీ జరిగినవి జరిగినట్లు వివరించినాను నేను చెప్పినదంతా నిదానంగ వ్రాసుకొని నేనుచెప్పిన వాక్యాలు నిజమని తాను నమ్మినట్లు, పట్టణంలో శాంతికి భంగం కలగచేసినట్లు చెప్పడం న్యాయంకాదనీ, శాంతికిభంగం కలగకుండా ఉండేటట్లు చేసిందికాబట్టి విడుదల చేస్తూన్నానని తీర్పువ్రాసి వినిపించినాడు

కలెక్టర్ తన కచ్చేరీలో దాదాపు నూరుగురు గుమాస్తాలు రాజీనామా లివ్వడానికి సిద్ధంగా ఉండటం తెలుసుకొని ఆలజడిని తగ్గించవలెనని ఉద్దేశంతో నన్ను విడుదల చేసినాడని ఊహించినాను తరవాత నా మిత్రులమీద విచారణ సాగించినాడు . విచారణ పూర్తిచేసి మేజిస్ట్రేట్ నా మిత్రులనుకూడా ఆ సాయంకాలం వదలివేసినాడు " కొండ వేంకటప్పయ్య పంతులుగారి స్వీయ చరిత్రలో ఉదాహరింపబడిన సంఘటనలను తెలుసుకొన్న తరవాత గాంధీజీ 'ఆంధ్రుల ఔన్నత్యము' అనే శీర్షికకింద 'యంగ్ ఇండియా'లో ఒక వ్యాసం వ్రాసినారు

## ఆంధ్రుల ఔన్నత్యము

"ఎట్లాగయితేనేమి కొండ వేంకటప్పయ్య, ఆయన బారిష్టర్ వకీలు మిత్రులు అరెస్టు చేయబడినారు సుప్రసిద్ధుడైన బారిష్టర్, వకీలు (ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, మాడభూషి వెంకటనరసింహాచార్యులుగారు) అరెస్టు చేయబడినారన్న మొదటివార్త నాకు రాగానే - (శ్రీ) వేంకటప్పయ్య కాల్చి చంపబడ్డారనే వార్త వినడానికి నేను తయారుగా ఉన్నాను ఆ అరెస్టులకు ప్రతిఘటనగా కమిటీ తీర్మానానికి లోబడి ఒకవారం హర్తాల్ చేయవలసిందని ఆయన ప్రకటించినారు హర్తాల్ చేయడం చెడ్డపనని నేను భావించినాను ఇప్పటికీ నేనట్లాగే అనుకొంటున్నాను ఆయన తరవాతి తంతివార్తలో హర్తాల్ శాంతంగా జరుగుతున్నదని తెలియపరిచినారు తర త న్ ౦ ౦ మరొక టెలిగ్రాంలో తామూ, తన అనుచరులు నలుగురు రెం యినటు తెలియజేసినారు (శ్రీ) కొండ వేంకటప్పయ్య ఆంధ్రుల ఔన్నత్యానికి చిహ్నమని నా అభిప్రాయము ఆ ప్రాంతంలో అందరూ నిద్రపోతూండిన సమయంలో ఆయన మేలుకొన్నారు ఆయన గొప్ప శీలవంతుడు ఆయన అహింసను మతధర్మంగా స్వీకరించినారు ఆయన పూర్తిగా అహింసావాది ఆయన ఇంకా మరికొంతమంది మిత్రులతో కలసి సంవత్సరాలకొద్దీ తన జీవితాన్ని దేశసేవకు అంకితం చేసినవారు ఆయన నిర్బంధం ప్రభుత్వంవారి సంపూర్ణోన్మాదానికి నిశ్చయమైన తార్కాణం అంతేకాదు మన విజయం సమీపిస్తున్నదనటానికికూడా ఒక గుర్తు ఆంధ్రమిత్రులు కలవరపడకుండా ప్రశాంతంగా ఉండటమే ఇపుడు చేయవలసిన పని వారు ధైర్యవంతులు, ఆధ్యాత్మిక చింత కలవారు వారు ఎంతో దృఢనిశ్చయం కలవారు వారికి మంచి కార్యకర్తలున్నారు కష్టపడి పని చేయవలసిఉన్న ఈ కొద్ది నెలలలో వారు తమ కార్య

దీనిని ఆచరణలో చూపగలరు చెరసాలలో నిర్బంధింపబడిన నాయకుల స్థానంలో తాము ప్రవేశించి స్వదేశీకార్యక్రమం నిర్వర్తిస్తూ, తమ నాయకులను మరింత ఎక్కువగా గౌరవించగలరు వారు విదేశీ వస్త్రాలను విసర్జించవలె మనసిగ్గు దాచుకొనటానికి తగినంత వస్త్రం మన మీదేశంలో కాలక్షేపం చేయవచ్చు. భారతదేశంలోకంతా ఎక్కువ నాజూకైన వడుకునూలను తయారు చేయగల నైపుణ్యం ఆంధ్రులలో ఇంకా మిగిలివున్నది కాబట్టి ఎవరికి ఏమి జరిగినప్పటికి ఈ రెండు నెలలలో ఆంధ్ర స్త్రీ, పురుషులు ఈ మహాకార్యంలో నిమగ్నులు కావాలని నా కోరిక మనలోని ఉత్తమోత్తాలను ఖైదు చేసినంత మాత్రంతో మనపని ఆగకూడదు పైపెచ్చు మరింత వేగంగా జరగవలె

యంగ్ ఇండియా

**ఆంధ్రుల అసహాయోద్యమము**

ఈ శీర్షిక కింద గాంధీజీ ఇట్లా వ్రాసినారు

"పాట్నాలో గంగానది తీరంలో ఉన్న మౌలానా మజ్‌హరుల్ హక్ గారి సదాకత్ ఆశ్రమంనుంచి నేనీ విషయాలు వ్రాస్తున్నాను అసహాయోద్యమంలో ముందంజ వేస్తున్నది బీహారని చిరకాలంనుంచి నా అభిప్రాయము ఆంధ్ర బీహారు తరవాతని నేననుకొంటుండేవాణ్ణి కాని ఇప్పుడు ఏది అగ్రస్థానం వహిస్తున్నదో చెప్పడం కష్టంగా ఉంది ఎట్లా అయినప్పటికి ప్రజల క్రమశిక్షణను నిజానికి స్థానిక ప్రభుత్వాలు తోడ్పడుతున్నాయ శ్రీ కొండ వేంకటప్పయ్య ఇటీవల ఉత్తరంలో నాకిట్లా వ్రాసినారు

"కిందటి ఉత్తరంలో నేనూ నా మిత్రులు ముగ్గురు వర్తకులూ అరెస్టు చేయబడిన తరవాత మా గుంటూరు నగరంలో ప్లీడర్లు, బాపట్లలోని ప్లీడర్ల సంఘంవారు 31వ డిశంబర్ వరకు కోర్టులను బహిష్కరించవలెనని తీర్మానించు కొన్నారు నేనూ ప్రకాశంగారు ఈ జిల్లాలోని ఇతర స్థలాలలోని ప్లీడర్లుకూడా ఇదే విధంగా కోర్టులను బహిష్కరించేటట్లు చేయడానికి ఆయా ప్రాంతాలకు పోతున్నాము గుంటూరులో ఒక జిల్లా కోర్టు, రెండు సబ్ కోర్టులు, రెండు డిస్ట్రిక్టు మున్సిఫ్ కోర్టులు అనేక మెజిస్ట్రేట్ కోర్టులు ఉన్నాయి బాపట్లలో ఒక సబ్ కోర్టు, రెండు డిస్ట్రిక్ట్ మునిసిఫ్ కోర్టులు ఉన్నాయి ప్రస్తుతం వీటిలో ఏకొద్ది కోర్టులోతప్ప తక్కినవన్నీ నిర్జనంగా ఉన్నాయి ఈ జిల్లాలోని తదితర ప్రదేశాలలోకూడా ఈ విధంగానే కోర్టులను బహిష్కరింప చేయగలమని ఆశిస్తున్నాము అసలు దావాలను వాటిపై వచ్చిన అప్పీళ్ళనూ విని విచారణచేసి పరిష్కరించడానికి పంచాయతీ కోర్టులు నియమింప బడినాయి ఈ కోర్టులలో విచారణలు ఎల్లుండి సోమవారంనుంచి (8వ తేది) ప్రారంభంకాగలవు ఇప్పుడు కోర్టులలో విచారణలోఉన్న అన్ని దావాలను, అప్పీళ్ళను బ్రిటిష్ కోర్టుల నుంచి ఉపసంహరించుకొనేటట్లుచేసి పంచాయతీ కోర్టులలో విచారణకు తెప్పించ వలెనని మా అభిప్రాయము ఈ జిల్లాలోని బ్రిటిష్ కోర్టుల న్యాయ పరిపాలనను

స్తంభింపజేసి వాటికి ప్రతిన్యాయస్థానాలను క్రమంగా నిర్మించిన తరవాత ఈ పద్ధతిని తక్కిన జిల్లాలుకూడా వెంటనే అనుసరించగలవని నా దృఢ విశ్వాసము మా జిల్లాలో ఈ పనిని పూర్తిచేసుకొని ఇతర జిల్లాలవారు తమంతట తామే ఈ పనికి పూనుకొన్నట్లయితే మేమక్కడికి పోదలచుకొన్నాము

మా జిల్లాలోని వర్తకసంఘంలో, ముఖ్యంగా ఈ పట్టణంలోని వర్తకసంఘంలో అద్భుతమైన చైతన్యం కలిగింది లోకమాన్యతిలక్ వర్ధంతిరోజున దాదాపు వర్తకులలో ప్రతి ఒక్కరూ నూతన స్వదేశీవస్త్రం ధరించి ఉత్సవంలోనూ, సమావేశంలోనూ పాల్గొన్నారు ఇక్కడి బట్టల వర్తకులు స్వదేశీ వస్త్రవ్యాపారం చేయడానికి అనుకూలంగా ఉన్నారు అయితే వారిదగ్గర నిల్వవున్న విదేశీ సరుకు విడుదలయ్యేటందుకు మరొకమార్గం చూపించవలెనని వారు కోరుతున్నారు ఈ జిల్లా మొత్తంమీద 29 లక్షల రూపాయల విలువగల విదేశీ బట్టగానీ, నూలుగానీ ఉన్నది ఇందులో సగం ఇండియాలోని మిల్లులసరుకు ఈ గుంటూరు పట్టణంలోని వర్తకుల దగ్గర 3 లక్షల విలువగల విదేశీబట్టగానీ, నూలుగానీ ఉంది ఇండియాకు వెలుపల ఏ చోటకైనా వారా సరుకును తిరిగి ఎగుమతి చేయడానికి, ఆ తరవాత స్వదేశీ బట్టలవ్యాపారం, నూలు వ్యాపారం మాత్రమే చేయడానికి వారు అనుకూలంగా ఉన్నారు

కాబట్టి బొంబాయి వర్తకులు వారి విదేశీ సరుకులను ఎట్లా విడుదల చేయదలచుకున్నారో మాకు తెలియచేయటానికి కొన్ని కంపెనీల పేర్లను దయజేసి మాకు తెలుపవలసిందని మిమ్ములను కోరుతున్నాను అందువల్ల ఇక్కడి వర్తకులకు నష్టం లేకుండా వారి విదేశీ సరుకును ఇండియాకు వెలుపల మరొకచోటికి ఎగుమతి చేసుకొనేటందుకు మార్గం లభించగలదేమోనని ఆశిస్తున్నాను వెంకటప్పయ్య పంతులుగారి ఈ జాబుకు గాంధీజీ ఇట్లా వ్రాసినారు

ప్లీడర్ల ఉత్సాహం నిలకడగా ఉండవలెననీ, కొనసాగాలనీ ఆశిస్తున్నాను ప్రతిఘటన రూపంలో లా కోర్టులను బహిష్కరించడం వారికీ, దేశానికీ కూడ శ్రేయస్కరం ఇక వర్తకుల విషయంలో వారి సరుకులను టోకు వ్యాపారస్థుల ద్వారా బయటకు పంపడానికి ఏదో ఒక ఉపాయం ఆలోచించుకోవడం మంచదని నా సలహా బొంబాయి వర్తకులు ఇండియాలోని అందరు వర్తకులకు తోడ్పడి సాధ్యమైనంత ఎక్కువ సరకును ఎగుమతిచేయడానికి ప్రయత్నించగలరని నా ఆశ ఒకవేళ ఇటువంటి ఏర్పాట్లు జరగకపోయినట్లయితే సరుకును బలవంతంగా ఎవ్వరికీ అంటకట్టక విదేశీ బట్ట కావలెనని పట్టుబట్టే వతనుదారులకు మాత్రమే దానిని అమ్మవలె భారతదేశం యావత్తు విదేశీబట్టను విసర్జించడం కర్తవ్యమని భావించినప్పటికీ తక్షణం ఆ పని నిర్వర్తిస్తుందని నేననుకోవడం లేదు. ఇంకా ఒక నెలకు పైగా వ్యవధి ఉన్నది ఈ వ్యవధిలో మరికొంత విదేశ

బట్టను గాని నూలుగాని కొ , న్నట్లయితే ఈలోగా చాలా పనిని సాధించ వచ్చు"

25 ఆగష్టు 1921 యంగ్ ఇండియా

పల్నాటి పుల్లరి నిరాకరణ సందర్భంతో అరెస్టుచేయబడిన ఉన్నవ లక్ష్మీ నారాయణ, మాడభూషి వేదాంతాచార్యుల విడుదలను కోరుతూ గుంటూరులో జరిపిన హర్తాళ్ గురించి గాంధీజీ 'యంగ్ ఇండియా'లో వ్రాసిన వాక్యం పురస్కరించుకొని కొండ వెంకటప్పయ్యగారు గాంధీజీకి మరొక ఉత్తరం వ్రాసినారు దానికి జవాబుగా 1921 సెప్టెంబర్ 15వ తేదీన యంగ్ ఇండియా లో 'హర్తాళ్ వల్ల ఫలితం' అనే శీర్షికతో ఇట్లా వ్రాసినారు

**హర్తాళ్ వల్ల ఫలితము**

'శ్రీ కొండ వెంకటప్పయ్యగారు గుంటూరులోని హర్తాళ్‌ను సమర్థిస్తూ మరి కొంత విలువగల వృత్తాంతంతో ఒక ఉత్తరం వ్రాసినారు అది ఇప్పుడే అందింది పదువరుల ప్రయోజనంకోసం దానిని క్రింద పొందుపరుస్తున్నాను

హర్తాళ్ అయుక్తమయిన చర్య అని మీరన్నారు ఈ విషయంలో నే నొక సంగతి చెప్పదలచుకొన్నాను ఆ హర్తాళ్ జరిగిన రోజునుంచి గుంటూరు ప్రజలలో కలిగిన చైతన్యం మనం కొన్ని సంవత్సరాల కొద్దీ పట్టు దలగా ప్రచారం చేసినప్పటికీ కలగదని నా అభిప్రాయము ఈ కొద్ది కాలంలో వారలవాటు చేసుకొన్న క్రమ శిక్షణ, ఆత్మ నిగ్రహం ఎంతో కొనియాడ దగినవి హర్తాళ్ ప్రారంభమయిన 5 వ రోజున కొంత కల్లోలం కలిగిన మాట వాస్తవమే కాని అది కొన్ని అవాంతర కారణాలవల్ల కలిగింది ఒక హై స్కూల్‌లోని పిల్లలను బయటకు రండని ఒక కార్యకర్త పిలిచి నందుకు ఆయనను ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్ అరెస్టు చేసి పోలీసు స్టేషన్ తీసు కొని పోతూండగ కొందరు విద్యార్థులు, యువకులు ఆయన వెంట వెళ్లినారు స్టేషన్ చుట్టూ జనం గుంపులుగా చేరినారు ఉద్రేకంతో దౌర్జన్యానికి దిగినారు ఈ లోగా రాష్ట్రీ కాంగ్రెస్ కార్యదర్శితో సహా కొంత మంది కార్యకర్తలు అక్కడకు పోయి ప్రజలను శాంతింప చేయగావా రెక్కడి వారక్కడ వెళ్ళి పోయినారు ఇంతలో సబ్ ఇన్‌స్పెక్టరు తన కొరడాతో నెత్తురు కారేటట్లు పిల్లలను ఇష్టం వచ్చినట్లు కొట్టడం మొదలు పెట్టినాడు దీనితో ఇక్కడి ప్రజలు రెచ్చి పోయినారు కాని మన కార్యకర్తలు పోయి, అది మన ఉద్యమానికి నష్టదాయకమని తెలిపిన తరవాత వారు శాంతించి ఊరుకొన్నారు ఈ అల్లరిని శాంతింప చేయటానికి ప్రముఖ పాత్ర వహించిన వారు మద్ది వెంకట సుబ్బయ్యగారు ఆయన వైశ్యకులానికి చెందిన వర్తకుడు మీరు గుంటూరు వచ్చినప్పుడు వారి ఇంట్లోనే కొన్ని గంటలు గడిపినారు. ఇందుకు అసహాయోద్యమంలో ఆయన జరిపిన ఇతర కార్యకలాపాలకు ప్రతి ఫలంగా నాతో పాటు అరెస్టు చేయబడి 'లాకప్పు'లో ఉండవలసి వచ్చింది. నాతోపాటు

తోడి ఖైదీలుగా ఉన్న మరి ఇద్దరు కూడ వైశ్యులే అందులో ఒకరు మీ సంచారంలో చీరాలవరకు కారులో మీతో వచ్చినారు గుంటూరులో మిమ్ములను ఆహ్వానించటానికి ఏర్పడిన సన్మాన సంఘానికి ఆయన కార్యదర్శి రెండవవారు ఇంగ్లండ్ నుంచి తిరిగిరాగానే సహాయ నిరాకరణోద్యమంలో కలసిపోయిన యువక బారిష్టరు ఆయన ఎన్నడూ బారిష్టరు వృత్తిలో చేరనేలేదు ఆయన గుంటూరుజిల్లా కాంగ్రెస్ కమిటీకి కార్యదర్శి నాకు ప్రతికూలంగా వచ్చిన సాక్ష్యంలో మమ్ములను ఆ నేరంలో ఇరికించడానికి తగిన వృత్తాంతమేమీలేదు అడవి పుల్లరి సందర్భంలో మాచర్ల నుంచి తీసుకొని రాబడిన ఆ ఇద్దరు ఖైదీలు (ఒకరు బారిష్టరు, ఒకరు వకీలు) వచ్చినరోజున పట్టణంలో జరిగిన ఊరేగింపులో కొంత దౌర్జన్యం జరిగినట్లు రుజువు చేయడానికి జరిగిన ప్రయత్నం పూర్తిగా విఫలమయింది నాకు ప్రతికూలంగా డిప్యూటీ మేజిస్ట్రేట్ చాలా గట్టిగా సాక్ష్యం చెప్పినాడు ఆయన నేను ఒక గుంపుకు నాయకత్వం వహించినట్లు, అది ఆయన మీద రాళ్ళు రువ్వి నట్లు, ఆ పని జరిగిన వెంటనే ఆయన పోలీసు సూపరింటెండెంట్‌కు రిపోర్టుచేసి నట్లూ సాక్ష్యంచెప్పి అయన పంపిన రిపోర్టును దాఖల్ చేసినారు ఆ కోర్టువిచారణను గుర్తించడానికి నిరాకరించి నేనుగానీ నా బారిష్టర్ మిత్రుడుగానీ సాక్షులను క్రాస్ పరీక్ష చేయలేదు మాలో ఎవ్వరూ ఉత్తరసాక్ష్యం పెట్టుకోలేదు వట్టి వాఙ్మూలంమాత్రం ఇచ్చినాము సాక్ష్యంకాదని ఎవరూ చెప్పనందున అది అట్లా నిలచివున్నది నాకు శిక్షపడి తీరుతుందనీ నేననుకొన్నాను కాని నేను కోర్టులో చెప్పిన మాటలు 'చాలా వరకు' యథార్థాలనీ, నేను శాంతిని కాపాడటానికే ప్రయత్నించినాననీ జిల్లా మెజిస్ట్రేట్ కోర్టులో బహిరంగంగా చెప్పి నన్ను మొట్టమొదటగా విడుదలచేయడం నాకు ఎంతో ఆశాభంగం కలిగించింది వెంటనే. నేనిచ్చిన వాఙ్మూలంలో నిజము, న్యాయము ఉన్నదని ఆయన విశ్వసించినట్లయితే నా స్నేహితులుకూడ నావలె శాంతిని కాపాడటానికి ప్రయత్నించారని విశ్వసించి వారిని విడుదల చేయవలసిందని నేను జిల్లా మెజిస్ట్రేటును కోరినాను ఆ విషయంలో ఇంకా నిజం తెలుసుకోవలసి ఉందని ఆయన అన్నారు ఆ సాయంకాలమే ఆయన నా మిత్రులనుకూడ విడిచిపెట్టినారు ఆయన మమ్ములను విడిచిపెట్టడానికి కారణం మాకు ప్రతికూలంగా ఇచ్చిన సాక్ష్యంలోని లోపాలను కనిపెట్టినందువల్ల కాదు ప్రజావాణి ఆయనకు ప్రతికూలంగా ఉన్నందువల్లనే వర్తకులు అంగళ్లు మూసి వేసినారు ప్లీడరు కోర్టులను బహిష్కరించినారు ఈ అన్నిటినీ మించి ప్రతి రోజూ బ్రహ్మాండమయిన సభలుచేసి ప్రజలు ప్రభుత్వం వారి చర్యను తీవ్రంగా నిరసించడం మొదలుపెట్టినారు ప్రభుత్వ కచ్చేరీలలోని గుమాస్తాలకు రాజీనామా ఇవ్వవలెననే భావంకూడా ప్రబలింది, దాదాపు పట్టణంలోని ప్రతి మనిషీ ఈ అన్యాయ చర్యకు అసమ్మతి చూపించినారు ఇవన్నీ మా విడుదలకు కారణాలయినాయి ఈ పరిస్థితులన్నిటిని బట్టి

హర్తాళ్ ప్రాముఖ్యం, ఉపయోగాన్ని ఎక్కువగా అంచనా వేశామనడానికి వీలులేదు ప్రజలలో అటువంటి ఐకమత్యం కలిగడానికి కారణం చాలావరకు హర్తాళేనని నా అభిప్రాయము వర్తకులే హర్తాళ్‌ను తమంతట తాము స్వచ్ఛందంగా ప్రారంభించినారు ప్రజలు దానిని హృదయపూర్వకంగా ఆమోదించినారు దినుల అవసరాలను తీర్చేటందుకు కొన్ని అంగళ్ళు తెరిచి ఉంచేటట్లు చేసినాము ఫ్యాక్టరీలలోను, అంగళ్ళలోను, రైల్వే గుడ్స్ షెడ్డులలోనూ పనిచేసే కార్మికులలో నిరుపేదలయినవారికి సహాయంచేస్తామని చెప్పగా వారందుకు ఒప్పుకోలేదు తాము ఇతరుల నుంచి సహాయం పొందటానికి బదులు ఉద్యమాన్ని బలపరిచేటందుకు ఎన్ని కష్టాలనైనా ఓర్చుకోగలమని వారు అన్నారు

'ఈ పై విషయాలు కొన్ని నాటి అవాంతర పరిస్థితులను వెల్లడించగలవని నేను అభిప్రాయపడుతున్నాను

నేను మూకలచేత రాళ్లు వేయించినానని డిప్యూటీ మేజిస్ట్రేట్ ఇచ్చిన సాక్ష్యం గురించి కొంత చెప్పవలసి ఉంది హైస్కూలు నుంచి పిల్లలను బయటకు రావలసిందని పిలిచినందుకు కార్యకర్త అరెస్టు చేయబడగానే పోలీసు స్టేషన్ వద్ద అల్లరి జరిగింది నేను భోజనంచేస్తూండగా ఒకరు నాదగ్గరికి పరుగెత్తుకొని వచ్చి ఆ సంగతి చెప్పినారు వెంటనే నేను బయలుదేరి వెళ్ళినాను నేను వెళ్లుతూండగా త్రోవలో హైస్కూలు ముందు కొంతదూరంగా ఉండిన ఒక బహిరంగ ప్రదేశం ప్రక్కనుంచి కొంతమంది యువకులు, విద్యార్థులు ఒకరి వెంట ఒకరు నడచివస్తున్నారు, వారిని చూసి నేను నా బండిలోనుంచి దిగి ఎందుకక్కడ ఉన్నారని అడిగినాను, మీటింగ్ ఉందని వారు వస్తామన్నారు ఈ మిట్టమధ్యాహ్నంలో మీటింగేమిటి ? మీటింగూ లేదు, ఏమీ లేదు మీరు మీ ఇండ్లకు వెళ్ళిపోండి అన్నాను నేనా మాటలు అంటూండగానే నా ఎదురుగా ఒక జట్కాబండి వస్తూన్నది ఈ గుంపులో కొందరు దానివైపుకు పరుగెత్తినారు ఏదో అల్లరి జరుగుతుందని భయపడినాను ఈలోగా జట్కా నా దగ్గరకు రానేవచ్చింది అప్పుడు ఆ గుంపులో కొంతమంది జట్కామీద రాళ్లు రువ్వడం చూసినాను (అవి ఎండు మట్టి గడ్డలని నేనను కొన్నాను ) అప్పుడు నేను జట్కా దగ్గరికి పోయి రాళ్లు రువ్వ వద్దనీ అల్లరి చేయవద్దని గొంతెత్తి బిగ్గరగా అరిచినాను ఆ జట్కాలో ఉన్నవారు హెడ్ క్వార్టర్స్ డిప్యూటీ మేజిస్ట్రేటని నాకు తెలిసింది కాని రాళ్లు పడుతూనే ఉన్నాయి గుఱ్ఱం వెను తిరిగింది, బండీ కదలడం లేదు సాధ్యమయినంత వరకు మేజిస్ట్రేటుకు దెబ్బలు తగులకుండేటట్లు నేను బండీ వెనక రెండు చేతులూ ఎత్తి నిలబడినాను నాకు మాత్రం రెండు చిన్న రాళ్లు తగిలి నందువల్ల వ్రేళ్లకు గాయాలయినాయి మేజిస్ట్రేట్‌కు రాయి తగలనే లేదు ఆయన దీనికంతకూ నేనే కారణమన్నట్లు కేకలు వేసినారు నే నాయనను కాపాడడానికి అక్కడ ఉన్నానని బండీ తోలించుకొని పొమ్మని అన్నాను ఆయన నా మీద చర్య తీసుకొంటూ

నన్నాడు ఇదంతా రెండు మూడు నిమిషాలలో జరిగి పోయింది దాదాపు నేను జట్కా ముందు నిలబడగానే రాళ్లు రువ్వడం ఆగి పోయింది అంతా ప్రశాంతంగా ఉంది మేజిస్ట్రేట్ ఇంటికి వెళ్లగానే పోలీసు సూపరింటెండెంట్ కు రిపోర్టు వ్రాసినట్లు కనబడుతుంది నా మీద విచారణలో ఆయన దాఖలు చేసిన రిపోర్టు ఇదే జరిగిన రెండో రోజుననే నన్ను - నా వైశ్య మిత్రుణ్ణి అరెస్టు చేయడం జరిగింది

"బారిస్టర్ లక్ష్మీ నారాయణకు 107 క్రిమినల్ ప్రొసీజరు కోడ్ కింద ఒక సంవత్సరం జైలు శిక్ష విధించబడింది ఆయనను పోలీసులు గుంటూరు మీదుగా వేలూరు జైలుకు తీసుకొని పోతున్నారు ఆ రోజున ఆయన భార్యా (లక్ష్మీ బాయమ్మగారు) ఆయనను గుంటూరు రైలు స్టేషనులో కలుసుకొని మెడలో పూలదండవేసి, ఆయన జైలు నుంచి తిరిగి వచ్చేవరకు సహాయ నిరాకరణోద్యమ ప్రచారం చేయడానికి తనకు అనుజ్ఞ ఇవ్వవలసిందని కోరింది ఆయన అనుజ్ఞ ఇచ్చినారు అప్పటి నుంచి ఆమె తీవ్రంగా పనిచేస్తున్నది సభలలో ప్రజలను ఉద్బోధిస్తూన్నది నిధులు వసూలు చేస్తూన్నది ఇంటింటికి పోయి, నూలు వడికి స్వదేశీ వస్త్రాలను నేయించడం ద్వారా అసహాయోద్యమానికి, తోడ్పడవలసిందని స్త్రీలకు నచ్చచెబుతూన్నది అట్లాగే మరొక స్త్రీ ఇటువంటి మంచి పని చేస్తున్నది తాను వేశ్యాంగన ఆమె పేరుయామినీ పూర్ణతిలక ఆమె వి.మ్మల్ని నెల్లూరులోచూడవచ్చిన సంగతి మీకు జ్ఞాపకం ఉండవచ్చు తన బాలికలకు కులస్థురాండ్రయిన బాలికలకు విద్యాబుద్ధులు నేర్పేటందుకు ఒక శరణాలయ నిర్మాణంకోసం సహాయంకోరగా ప్రస్తుతం నూలు వడకడం నేర్చుకొనవలసిందని మీ రామెకు సలహా ఇచ్చినారు అప్పటినుంచే ఆమె గుంటూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ పక్షాన కార్యకర్తగా పనిచేస్తూన్నది ఆమె ఎంతో శక్తిమంతురాలయిన వక్తగా తయారయింది సహాయ నిరాకరణోద్యమంలో నిష్ఠగా పనిచేస్తూన్నది వేంకటప్పయ్యపంతులుగారి ఈ లేఖలు గురించి గాంధీజీ ఇట్లా వ్రాసినారు

"వర్కింగ్ కమిటీ అనుమతి లేకుండా హర్తాలు జరపకూడదనే ఇప్పటికీ నా అభిప్రాయము గుంటూరులో జరిగిన హర్తాలు వలన సత్ఫలితాలు కలగడం గుంటూరుకు ఆపట్టణ కార్యకర్తలకూ కీర్తిదాయకమయిన విషయము అయితే శ్రీ వెంకటప్పయ్యగారు ఇచ్చిన వివరాలను బట్టియే, అది అపాయకరమయిదనీ, అటువంటి సందర్భాలతో చాలా చాకచక్యంగా వ్యవహరించవలసి ఉంటుందనీ అర్థమవుతున్నది హర్తాళ్ కు పూర్వం జరిగిన అరెస్టులు గుంటూరు వాస్తవ్యులను విద్యుచ్ఛక్తివలె కార్యాచరణాసక్తులనుగాచేసిందని నా అభిప్రాయం హర్తాళ్ నాయకులను విడుదల చేసేటంతగా ప్రభుత్వాన్ని భయపెట్టడం కూడా మంచిదికాదని నేను సూచిస్తున్నాను ప్లీడర్లు కోర్టులను బహిష్కరించడం గుమాస్తాలు రాజీనామా లిస్తామని బెదిరించడం నాయకుల విడుదలకు కారణమని నా అభిప్రాయము హర్తాళ్ వల్లనే ప్లీడర్లు త్యాగం

చేయపూనుకొన్నట్లయితే నిశ్చయంగా అదిమంచిపనే సహాయనిరాకరణోద్యమంవల్ల నిర్మాణకార్యక్రమానికి ఎక్కువ ప్రోత్సాహం లభించడమే ప్రస్తుతం మనకు కావలసింది ఆ పని హర్తాళ్ వల్ల జరిగేటట్లయితే నేనుకూడా ఎల్లప్పుడు వాటికి అనుకూలంగానే ఉంటాను"

యంగ్ ఇండియా యం కె గాంధీ

**చీరాల-పేరాల**

1921 ఏప్రిల్ నెలలో గాంధీజీ చీరాలకు పోయినట్లూ, చీరాలను మున్సిపాలిటీగా చేసిన ప్రభుత్వ విధానాన్ని ప్రతిఘటిస్తూ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి నాయకత్వంలో చీరాలలోని ఆబాల గోపాలమూ లేచి పోయి, కుటీరాలు నిర్మించదలచుకొన్న చోటు 'రామనగరు'ను కూడా గాంధీజీ సందర్శించి శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ప్రతిభను కొనియాడినట్లు ఇంతకు పూర్వం వ్రాసిఉన్నాము తరవాత గాంధీజీ 'చీరాల-పేరాల' అనే శీర్షిక కింద ఇట్లా వ్రాసినారు

చీరాల పేరాల-నిజానికి ఒకటే గ్రామం సముద్రానికి అనతి దూరంలో ఉంది చక్కని శీతోష్ణస్థితిగల గ్రామం 15000 జనసంఖ్యతో నిండి ఉన్న గ్రామమది అది ఆంధ్రరాష్ట్రంలోది స్వార్థత్యాగము, సమర్థతాగల దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఆ గ్రామానికి నాయకత్వం వహించి మంచి పట్టుదలతో వారందరినీ తేలికగా కూడగట్టగలిగినారు మున్సిపల్ పరిపాలన ప్రజాపరం చేయబడింది ఆ శాఖకు యాజమాన్యం వహిస్తూండిన మంత్రి ఈ గ్రామంలోని ధైర్య సాహసోపేతులయిన ప్రజలకు తన ఉనికిని తెలియచేయాలని తలచుకొన్నాడు ఆ గ్రామస్థులు లైసెన్సు ఉంటేనేగాని వర్తకం చేయకూడదని ఆయన నియమంచేసినాడు అందుకు ప్రతీకారంగా ఆ గ్రామస్థులు లైసెన్సు లేకుండానే వర్తకం చేయడం మొదలుపెట్టినారు అందువలన వారిపైన కేసులు పెట్టడం, శిక్షలు వేయడం జరిగింది ఆసందర్భంలో ఒక ముసలమ్మ కూడా జైలుకు పోయింది ప్రభుత్వంవారు చీరాలను బలవంతంగా మున్సిపాలిటీని చేయాలని ప్రయత్నించినారు ప్రజలు దానిని ప్రతిఘటించినారు ప్రజలు ప్రతికూలిస్తూన్నప్పటికి అధికారం స్వీకరించిన మంత్రి, ప్రజలు తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించవలెనని వారిని బలవంతపెట్టక యేంచేస్తాడుమరి!?

ఆ గ్రామస్థులకు మునిసిపాలిటీ ఎందుకో మనమాలోచించవలె ఆరోగ్య రక్షణకా అంటే అందుకుకాదు ప్రజలే గ్రామాన్ని ఎంతో పరిశుభ్రంగా ఉంచుకొంటున్నారు ఇక ఎక్కువ విద్యకా అంటే అదీకాదు! అచ్చటి ప్రజలందరూ సహాయనిరాకరణ వాదులు, ఇక అది ఎక్కువ పన్నులకోసం, ప్రజల స్వాతంత్ర్యంలో ఎక్కువ జోక్యం కల్గించుకోవడం కోసం కాబట్టి ప్రజలకది సహింపరాని కీడుగా తయారయింది

కనక వారు మున్సిపల్ ఆవరణకు వెలుపలగా ఉన్న ఒక మైదానం

లోకి పోవడానికి నిశ్చయించుకొని గడచిన మే నెల ప్రాంతాలలో చీరాల-పేరాలను కాళీచేసినారు ఆమైదానంలో ఉండడానికి పాకలువేసుకొన్నారు ఆ పాకలు గవర్నమెంట్ బంజరు భూములలో ఉన్నవనే కారణం వలన రెవిన్యూడిపార్ట్ మెంట్ వారు ఆభూములలో అపరాధపుపన్నులు వేసేటట్లు చేసినారు మంత్రిగారు పాకఖరీదు రు25/లు అయితే అపరాధపు పన్ను రు 10-2-6 అయింది ఈపన్ను చెల్లించకపోయినట్లయితే పాకలు కాళీచేయవలె ఇవి మనసంస్కారిణలకు, మన బాధ్యతాయుత ప్రభుత్వానికి ప్రత్యక్ష తార్కాణం మంత్రి గారుచేస్తూండిన పని ప్రజల మంచికోసమేనని నమ్ముతున్నాడనరాలో నాకేమీ సందేహంలేదు ఆంగ్లేయోద్యోగులు కూడా బలవంతంగా మనపైన ఏమి యద్దినప్పటికీ-రౌలట్ చట్టంతోసహా- ప్రజలమంచికోసమే తామాపనిచేసినట్లు సమర్ధించుకొంటూండటం మనమెరిగిన విషయమేకదా'

సహాయనిరాకరణం తదితర విషయాలతోపాటు ఇతరులు మనను అనుగ్రహిస్తూన్నట్లు నటించే విధానంకూడా ప్రతిఘటిస్తున్నది మనం మంచి చేయడం నేర్చుకోనేముందు చెడు చేయడానికకూడా మనకు హక్కు ఉండవలె స్వాతంత్ర్యాన్నికూడా మనపైన బలవంతంగా రుద్దకూడదు అత్యంత నిరంకుశుడైన మంత్రిసైతం ప్రజాభిప్రాయానికి లొంగనైనా లొంగవలె లేదా రాజీనామానైనా ఇవ్వవలెనని ప్రజాస్వామ్యసిద్ధాంతం మనకు బోధిస్తూన్నది ఎంత గొప్ప ప్రజాశ్రేయస్కరమయిన చర్య అయినప్పటికీ చైతన్యవంతమయిన ప్రజాభిప్రాయసమ్మతంగా ఉండవలె అందుకోసం ఆయన ఓపిక పట్టవలె

చీరాల పేరాలలోని ధైర్యశాలురైన ప్రజలు ప్రభుత్వంవారి నిరంకుశత్వం లెక్కపెట్టక మున్సిపాలిటీని ప్రతిఘటించినారు వారు అట్లా చేసి ఉండనవసరంలేదు స్వరాజ్యం వచ్చేవరకూ ఆగి ఉండవలసింది కాని వారు అన్యథానిశ్చయించుకొన్నారు అందుకు పూర్తిబాధ్యత వారిమీదనేఉంది వారు ఇక ఎటువంటి పరిస్థితులలోనూ లొంగకుండురుగాక! వారెట్లాంటి ఉద్రిక్త సమయాలలోనూ పిచ్చిగా వ్యవహరించకూడదు ప్రభుత్వంవారు తమపైనెట్టి అపరాధపు పన్ను విధించినా వారు సంతోషంతో ఉండవలె వారు లొంగిపోకుండా వినయంతో బాధలను అనుభవించంవల్ల ఇండియాకు తమకూ కూడ కీర్తి సంపాదించిపెట్టిన వారవుతారు అంతేకాదు అహింసలో భారతదేశానికి ఆదర్శప్రాయులుకూడా అవుతారు "

యంగ్ ఇండియా
25-8-1921

ఈ వ్యాసం తరవాత శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు 1921 సెప్టెంబరులో బరంపురం ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ మహాసభకు వెళ్ళినారు అప్పుడు గంజాంజిల్లా మేజిస్ట్రేటు, డాక్టరు పట్టాభిసీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, చెలుకువాడ వేంకటనరసింహం, వి వి గిరి, దుగ్గిరాల

గోపాలకృష్ణయ్య మొదలయిన ఆంధ్ర నాయకులు బహిరంగసభలలో ప్రసంగించ కూడదని నిషేధాజ్ఞలు జారీచేసినారు అప్పటికి అటువంటి ఉత్తరువులను ధిక్కరించ వలెనని కాంగ్రెస్ ఆదేశించలేదు అందువల్ల తక్కిన వారెవ్వరూ ఆ ఉత్తరువులను ఉల్లంఘించలేదు శ్రీదుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు మాత్రం ఆ ఉత్తరువులను ఉల్లంఘించి ప్రభుత్వంవారి కారాగారశిక్షకు గురిఅయినారు గోపాలకృష్ణయ్యగారు జైలులో ఉండగా గాంధీజీ చీరాల-పేరాల ఉదంతం గురించి మరిఒకసారి ఇట్లా వ్రాసినారు

చీరాల-పేరాల ఈ చిన్న గ్రామాలలోని సాహసోపేతులయిన ప్రజలు తమ పోరాటం ఇంకాసాగిస్తూనే ఉన్నారు వారి నాయకుడు శ్రీ గోపాలకృష్ణయ్య జైలులో ఉన్నారు కాని వారు మాత్రం ధైర్యం కోల్పోలేదు వారింకా ఆపాకలలోనే ఉన్నారు నాకు వచ్చిన ఉత్తరం బట్టి వారు గట్టిగా ఉన్నట్లే తెలుస్తూన్నది ఆ గ్రామంలోని ప్రముఖులైన నాయకులు పన్నులు చెల్లించనందు వల్ల వారిపైన కేసులు పెట్టడం జరిగింది వారందరు సంతోషంగా జైలుకు వెళ్ళినారు అందువలన వారు తిరిగి తమ గ్రామానికి పోకూడదని మరింత పట్టుదలగా ఉన్నారు, నిరాశ్రయులై ఇళ్ళువిడిచి పోయినందువల్ల కలిగిన కష్టనష్టాలన్నిటినీ భరిస్తూ ఆ రెండుగ్రామాలవారు దృఢనిశ్చయంతో తాము పట్టిన పట్టువిడువకుండా బ్రతుకుతున్నారు కొందరి పేదవాండ్ల పాకలు కూలిపోయినాయి మరి కొందరు కొత్తపాకలు వేసుకోవలసి వచ్చింది ఇటువంటి వారివల్లనే స్వరాజ్యం రూపొందుతుంది నాయకులు జైళ్లకు పోయినంత మాత్రంతో ప్రజలు గుండెజారి కూర్చోకూడదు అగ్ని వర్షం కురుస్తూన్నప్పటికీ లొంగుబాటుకూడదు

**ఆంధ్రులు - అసహాయోద్యమము**

**తిలక్ స్వరాజ్యనిధి వసూళ్ళు**

మద్రాసులో తిలక్ స్వరాజ్యనికి టంగుటూరి ప్రకాశంగారు 500 రూపాయలు, కాశీనాథుని నాగేశ్వరరావు గారు 1000 రూపాయలు, గద్దెరంగయ్య నాయుడుగారు 100 రూపాయలు, జే నారాయణమూర్తిగారు 300 రూ వేమవరపు రామదాసుగారు 200 రూ పప్పు సోమసుందరంగారు 50 రూ ,బి సోమయ్యగారు రూ 50, అల్లాడి కృష్ణస్వామయ్యగారు రూ 1000 నేతి వెంకటసుబ్రహ్మణ్యంగారు 200 రూ ఆంధ్రపత్రిక ఆఫీసువారు 116 రూ ఒక బాలిక రూ 40 ఖరీదుగల బంగారుగాజు, ఒకవైశ్య అభిమాని 70 రూ విలువగల చేతి గడియారాన్ని ఇంకా అనేక మంది తమ శక్తి కొలది విరాళాలు సమర్పించినారు

1971 జులై 1 వ తేదీ నాటికి ఆంధ్రదేశంలో 3 తిలక్ స్వరాజ్యనిధికి 3 లక్షల రూపాయలు వసూలైనట్లు కొండ వేంకటప్పయ్య పంతులుగారు పత్రికలకు తెలియచేసినారు

తూర్పు కృష్ణాజిల్లాలో జులై 1వ తేదీ నాటికి 18780 రూపాయలు నగదు వసూలైనట్లు, ఇంకా చేరవలసిన మొత్తాలున్నట్లు, ఆ జిల్లాకు నిర్ణయించిన 21 వేలకంటె ఎక్కువే వసూలు కాగలదని డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు తెలియచేసినారు

చిత్తూరు జిల్లాలో సి వి రంగం, రంగాసాయి శ్రేష్ఠిగార్లు తిలక్ స్వరాజ్యనిధికి 2వేల రూపాయలిచ్చినారు తిరుపతిలో 15వేల రూపాయలు వసూలైనవి చిత్తూరు పట్టణంలో రూ 750 మంగళంపేటలో రూ 180 వసూలైనట్లు ఆ జిల్లా నాయకులు తెలియచేసినారు

ఏలూరులో లక్షరూపాయలు వసూలైనవి ఆ పట్టణంలో స్థాపింపబోయే జాతీయ విద్యాలయానికి 60వేలు తీసుకొన్న తరవాత మిగిలిన 40వేలు తిలక్ స్వరాజ్యనిధికి సమర్పించడంజరిగింది

తాడిపత్రిలో రూ 650 తిలక్ స్వరాజ్యనిధికి వసూలైనవి ఒక మంగలి కూడా జూన్ 30వ తేదీన వృత్తివల్ల తనకు వచ్చిన 1రూ 6పైసలను భక్తి పూర్వకంగా తిలక్ స్వరాజ్యనిధికి సమర్పించినాడు స్త్రీలు కూడ తమశక్తి కొద్ది విరాళాలిచ్చినారు, గాంధీజీ ఈ ప్రాంతాలకు వచ్చేసరికి తాడిపత్రికి నిర్ణయించిన మొత్తం వసూలు కాగలదని గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు తెలియచేసినారు తాడిపత్రిలో 400 మంది కాంగ్రెస్ సభ్యులు చేరినారని తాలూకాలో 3వేలరాట్నాలపై చిలుకు పనిచేస్తున్నాయని నూటికి80 మంది శుద్ధ స్వదేశీ బట్టలనే ధరిస్తున్నారని కూడా హరి సర్వోత్తమరావుగారు జులై 1న పత్రికలకు తెలియచేసినారు

ఆంధ్రదేశంలో అసహాయోద్యమ వ్యాప్తిని గురించి 1921 ఆగష్టు 17వ తేది ఆంధ్రపత్రిక ఇట్లా వ్రాసింది

'జాతీయ మహాసభ నిర్ణయించిన దీక్షను ఆంధ్రదేశం అత్యుత్సాహంతో నిర్వహిస్తున్నది ఆంధ్రదేశంలో రాట్నాలమధురగానం ఇంటింట వినబడుతూ ఉంది ప్రజలు శుభకార్యాలకు వలె ముతుక బట్టలు కడుతూ స్వరాజ్య దీక్షను ప్రదర్శిస్తున్నారు ఆంధ్ర దేశము ఖద్దరు బట్టలను ఇతర భాగాలకు అంద జేయడంలోను ప్రాముఖ్యం వహిస్తూన్నది బొంబాయి వర్తకులు లక్షల రూపాయల బట్టలను ఆంధ్ర దేశంనుంచి కొంటున్నారు గాంధీ మహాత్ముడు ఆంధ్రులు గోచి పాతలైనా ధరించి శుద్ధ స్వదేశీ వస్త్రాలను ఇతర ప్రాంతాలకు పంపవలెనని కోరుతున్నారు ఆంధ్రులు యావద్భారత దేశాన్ని దృష్టిలో ఉంచుకొని వారి గౌరం, ప్రతిభను కాపాడుకొనడానికి శుభ సమయం సంప్రాప్తమైనది ఈ శుభ సమయం ఆంధ్రనాయకులు, వర్తకులు, పనివాళ్ళు, ప్రజలు సద్వినియోగంచేసి ఆంధ్ర గౌరం కాపాడుదురు గాక

శుద్ధ స్వదేశీ వస్త్ర దీక్షవలె మద్యపాన నిరోధంలో, అస్పృశ్యతను తొలగించడంలో ఆంధ్రుల కార్య దీక్షను దేశ వ్యవహారాలు నిత్యం తెలియ చేస్తున్నట్లు, కల్లు, సారాయి దుకాణాల వేలంపాటలు అనేక ప్రదేశాలలో

నిలచి పోయినాయి పాడిన చోటనైనా, పాటమొత్తాలు తగ్గిపోయినాయి గూడూరు, గుంటూరు, ఏలూరు, నూజివీడు, గుడివాడ, కాకినాడ, మొదలయిన ప్రదేశాల్లో జరిగిన పాటలు ప్రజాశక్తిని తెలుపుతున్నాయి పాట సందర్భంలో నూజివీడు గన్నవరం మొదలయిన ప్రదేశాలు చూపుతున్న మహోద్యోగం [illegible] ధర్మశక్తి వ్యక్తంచేస్తున్నది కలాశీలు కుల వృత్తిసిమాని పాటలను మానుకొంటున్నారు ప్రజలు వందలు, వేలు శ్రీకృష్ణజన్మస్థానాలకు మహా భక్తులవలె పరమోత్సాహంతో నివాసాలు తీసుకొంటున్నప్పుడు పరాధీన భావ బంధాలు విడిపోయినవని అధికారులు సైతం గ్రహిస్తున్నారని ఆంధ్ర వ్యవహారాలు విశదం చేస్తున్నాయి కాకినాడ కలెక్టర్ బ్రాకెన్‌గారు, గుంటూరు కలెక్టర్ ఫీల్డ్‌గారు బురదలో కాలువేసి కడుగుకోవలసి వచ్చింది పల్నాటి సీమలో సామాన్యులైన మహ్మదీయులు దండన స్వీకరించినారు చీరాల, పేరాల ప్రజలు స్వస్థలంవదలి పరమానందంతో వనవాసం చేస్తున్నారు గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణగారి సతీమణి, లక్ష్మీనారాయణగారి బంధనను అభినందించినపుడు, దేశభక్త వెంకటప్పయ్యగారి ధర్మపత్ని ఆంధ్ర సింహాబంధంను అభినందించినపుడు, వందల స్త్రీలు స్వరాజ్య రథం వారి కోమల హస్తాలతో నడిపించినపుడు, న్యాయవాదులు న్యాయస్థానాల వ్యామోహం వదలి నపుడు, వేలమంది ప్రజలు స్వరాజోత్సవం దౌర్జన్య, ద్వేషాసూయాభావాలను వదలి జరిపినపుడు ప్రజాశక్తి అనర్గళంగా ప్రవహిస్తున్న విధం కన్నులు గలవారు చూడగలరు ప్రజాశక్తిని చూసి దాని బలం అధికారులు ఇంకా గ్రహించక, పూర్వ భావనలను విడవలేక,నిర్బంధవిధానమే న [illegible] గుంటూరంతా గతమాసాంతంలో ఆయుధ పాణులతో నిండినా, ప్రజల నిగ్రహము, దైవానుగ్రహం దేశాన్ని మహా సంక్షోభంనుంచి రక్షించినాయి స్వరాజ్య సంపాదనా దీక్షలో ఆంధ్రదేశం ధర్మోత్సాహం చూపిస్తున్నది

## మహమ్మదలీ అరెస్టు

గాంధీ మహాత్ముడు, మౌలానా మహ్మదలీ, ఆయన భార్య, మౌలానా ఆజాద్ సుభానీగారు 1921 సెప్టెంబర్ 18 సాయంకాలం కలకత్తా మెయిల్‌లో కలకత్తానుంచి బయలుదేరి 14వ తేదీమధ్యాహ్నం 2 గంటలకు వాల్తేరు స్టేషనకు వచ్చినారు అప్పుడు స్టేషన్ ప్లాట్‌ఫారమ్ అంతటా మిలిటరీవారు వేచి ఉన్నారు వారు మహమ్మదలీని అరెస్టు చేయడానికి నిలచిఉన్నట్లు ప్రజలు ఊహించినారు రైలుబండిలో నిద్రపోతున్న మహమ్మదలీని వారి సహచరులలో ఒకరు నిద్రలేపి వేళాకోళంగా మీ సమయం ఇప్పుడు వచ్చిందని ఆయనకు చెప్పినారు ఈలోగా విశాఖపట్టణం జిల్లా కాంగ్రెస్ నాయకులు మహాత్ముడు మౌలానా సాహెబువున్న బండని సమీపించి స్టేషన్ వెలుపల చిన్న ఉపన్యాసం ఇవ్వవలసిం దని ప్రార్థించినారు వారి ప్రార్థన నంగీకరించి ఇద్దరు బండినుంచి ప్లాట్‌ఫాంమ్ మీదికి వచ్చినారు ప్లాట్‌ఫారం మీద అడుగు పెట్టడంతోనే విశాఖ పట్టణం

జిల్లా పోలీసు సూపరింటెండెంట్ మౌలానాను ఆపి అరెస్ట్ వారంట్ చూపించగా మౌలానా ఆ వారంట్‌ను గాంధీకి చదివి వినిపించినారు శిక్షా స్మృతి 107, 108 సెక్షన్ల కింద సత్ప్రవర్తనకు జామీను పుచ్చుకొనే నిమిత్తం ఆయన అరెస్టు చేయబడుతున్నట్లు వారంట్ ఉంది అప్పుడే మౌలానా ఆ ఉద్యోగస్తునితో కూడా నడిచినా కొంతసేపయిన తరవాత మహమ్మదలీ భార్య, ఆయన అంతరంగిక కార్యదర్శి మహమ్మదలీతో కొన్ని నిమిషాలు మాట్లాడి మళ్ళీవచ్చి మెయిల్‌లో కూర్చున్నారు (మహమ్మదలీ అరెస్టు, ఆయన సైనికులను తిరుగుబాటు చేసే టందుకు ప్రోత్సహించినాడనే నేరారోపణపైన జరిగింది)

## మహాత్ముని ఉపన్యాసము

వాల్తేరు స్టేషన్ వెలుపల గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

'ఇది దుఃఖానికీ విషాదానికీగాక అభినందనకు సమయము మౌలానా అరెస్టును గురించి వినగానే ప్రజల మనోభావాలు తటాలున మారినాయి నిట్టూర్పులకిది సమయంకాదు మౌలానాను అరెస్టు చేసినందుకు వారికి విచారం కలిగితే స్వదేశీ కార్యక్రమం పూర్తి చేయడంమంచి బజారులో తమరు కావలసినంత స్వదేశీ బట్ట లేకపోతే లంగోటీకి తగినంత బట్ట తీసుకొని తృప్తిపడిఉండటం మేలు విజయానికి ఇంక రెండు సాధనాలు ఉన్నాయి అవి హిందూ ముస్లిం సఖ్యత, అహింసావ్రతము "

ఈ ఉపన్యాసం ముగించిన తరవాత గాంధీమహాత్ముడు వాల్తేరు నుంచి బొంబాయికి దిగువ సందేశం పంపినారు

"ఒక సంవత్సర కాలం మంచి ప్రవర్తన కలిగి ఉండవలెనని శిక్షా స్మృతి 107, 108 సెక్షనుల కింద జామీనిచ్చేటందుకు వాల్తేరులో మౌలానా మహమ్మదలీ, నిర్బంధింపబడినారు ఎప్పుడువిచారణ జరిగేది తెలియదు మహమ్మదలీ అరెస్టు అయిన తరవాత వారిని చూడడానికి బేగం సాహెబాగారికి, వారి కార్యదర్శి సయ్యద్ గారికి అనుజ్ఞ ఇవ్వడం జరిగింది

మౌలానా మహమ్మదలీ, నేను స్టేషను వెలుపల ఉపన్యాసం ఇవ్వడానికి రైలుదిగినాము ఆయన అరెస్టు చేయబడినారు నేను సభకు వెళ్ళి ఉపన్యాస మిచ్చినాను ఇది అభినందలకేగాని దుఃఖానికి సమయంగాదు హింసచేయకూడదు శాంతిగా, నిశ్శబ్దంగా ఉండవలె కొంతమంది మాప్లాల పిచ్చి చర్యలెట్లా ఉండినప్పటికీ మనం మాత్రం దౌర్జన్యరహితంగావుండి హిందూ ముసల్మాన్ సఖ్యతను కాపాడుకొని స్వదేశీ కార్యక్రమం జయప్రదంగా నిర్వహించ గలిగితే ఈ అరెస్టు స్వరాజ్యసంపాదనకు ఖిలాఫత్ పంజాబ్ అక్రమాల పరిష్కారానికి ఉపక్రమణమని నేను భావిస్తున్నాను

తీరుబడిగా ఉన్న ప్రతి నిమిషము, నూలు వడకడానికి, బట్టలు నేయడానికి వినియోగించి భారతీయ స్త్రీ, పురుషులందరూ సంపూర్ణంగా విదేశీ వస్త్రాలను బహిష్కరించవలెనని నేను కోరుతున్నాను

మౌలానా వలె మత జాతీయ ధర్మాలను అనుష్ఠించడంలో పట్టుదలతో ఉండండి

మనము చెరసాలయు చేపట్టవలసివుంది మౌలానా నిరపరాధుడని నాకు తెలుసు నిరపరాధులను చెరసాలలలో పెట్టడంవల్ల కలిగే పరమార్థం దేశీయులు పొందగలరని నా దృఢవిశ్వాసము

మౌలానా మహమ్మదలీ శాంతంగా ఉన్నారు బేగం సాహెబాకూడా అట్లాగే ఉన్నారు ఈ పర్యటనలో ఆమె, మౌలానా అజాద్ సుభాని నాతో వస్తున్నారు "

వాల్తేరులో మౌలానా అరెస్టు చేయబడిన తరవాత గాంధీజీ సభలో మాట్లాడి వస్తూ మౌలానాను చూడడానికి అవకాశమివ్వవలసిందనికోరగా పోలీసు అధికారి ఆకోరికను నిరాకరించినాడు బేగం సాహెబాకు, మౌలానా గారి అంతరంగిక కార్యదర్శికి మాత్రం మహమ్మదలితో మాట్లాడడానికి అనుమతించినాడు

మహమ్మదలీ అరెస్టు ఫలితంగా ఆంధ్రదేశం నలుమూలల సహాయ నిరాకరణోద్యమం తీవ్రరూపం దాల్చింది ప్రజలు ద్విగుణీకృతోత్సాహంతో కాంగ్రెస్ కార్యక్రమం నిర్వర్తించటం మొదలుపెట్టినారు

## గాంధీ మహాత్ముని మద్రాసురాక

మహమ్మదలీని అరెస్టు చేసిన తరవాత ఆమెయిల్ లోనే గాంధీజీ మద్రాసు వెళ్ళినారు 1921 సెప్టెంబరు 15వ తేదిన సాయంకాలం 5½ గంటలకు, తిరువళిక్కేణి సముద్ర తీరంలో బహిరంగ సభ జరిగింది గాంధీజీ ఆ సభలో ఉపన్యసించ బోతున్నారని తెలిసినందుకు ఆ ప్రదేశమంతా ఇసక వేస్తే రాలనంతగా జనంతో నిండి పోయింది చాలామంది స్త్రీలు కూడా సభకు హాజరైనారు ఖద్దరు వస్త్రధారులు కానివారు ఉపన్యాస వేదికపై ఉండటానికి అర్హులుకారని ఖద్దరు వస్త్రాలు లేనివారు ఉపన్యాస వేదికను వదలి పోవలెనని వ్రాసినారు పతాకాలు సభలో కనపడినవి గాంధీమహాత్ముడు సభాంగణకు వచ్చునప్పటికి మంగళవాయిద్యాలు మ్రోగినాయి సభకు యాకూబ్ హుస్సేను సాహెబ్ అధ్యక్షత వహించి ఇట్లామాట్లాడినారు

"నేడుమీరంతా మహమ్మదలీ ఉపన్యాసంవిని ఆనందించవలెనని ఇక్కడకు వచ్చినారు కాని మద్రాసు ప్రభుత్వంవారు ఆయనకు ఆతిథ్యమిచ్చి వాల్తేరులో ఆయనను పట్టుకొన్నారు అలీసోదరులను నిర్బంధించిన ఖ్యాతి మద్రాసు ప్రభుత్వానికి దక్కింది ఈ గౌరవం ఈ రాజధానికి దక్కుతుందని మనం అనుకోలేదు సదా ప్రజాప్రతికూలులైన ఇంగ్లండ్ ప్రభువస్థానం వెలింగ్టన్ ఆక్రమించి మన పురోభివృద్ధి నరికట్టడానికి చూస్తున్నాడు మహమ్మదలీగారి నిర్బంధానికి మనం వారిని అభినందించవలసి ఉన్నది మహమ్మదలీగారి నిర్బంధం వల్ల అసహాయోద్యమ సంగ్రామంలో మనం మొదటి విజయం పొందినాము

ఇంతవరకు అసహాయోద్యమంనుంచి తప్పించుకొని తిరిగేవారు కూడా ఇక నిజపరిస్థితులను తెలుసుకొని భారతవర్షమంతటా తమ విమోచనానికి నిరంతరోత్సాహంతో కృషిచేయగలరని దృఢంగా నమ్ముతున్నాను ఇందువల్ల మన మనుకొన్నదానికంటే శీఘ్రంగానే మన గమ్యస్థానం చేరగలము "

అధ్యక్షుని ఈ ప్రసంగం తరవాత గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు నేను నిలుచుండి మాట్లాడటానికి ఓపిక లేనందుకు కూర్చుని మాట్లాడుతున్నందుకు క్షమించండి నా సలహాను మీరు ఆమోదించ తలచుకొన్నట్లయితే మీరంతా నిశ్శబ్దంగా ఉండి, మీ ఆమోదాన్ని కరతాళ ధ్వనులతోగాని, మీ అసమ్మతిని విషాదాన్ని "సిగ్గు" "సిగ్గు" అనే కేకలతోగాని - తెలియ చేయక సావధాంగా విన కోరుతున్నాను అఖిల కాంగ్రెసు నిర్ణయించిన కార్యక్రమాన్ని త్రికరణ శుద్ధిగా అమలులో పెట్ట తలచుకొంటే నిశ్శబ్దంగా ఉండ కోరుతున్నాను కార్యాచరణమే ప్రధానంగా వర్తించ గోరుతున్నాను మీ మీద ఉన్న మహా భారం నిర్వహించడం ఎట్లాగో ఆలోచించుకో కోరుతున్నాను మన కార్యక్రమం పూర్తి చేయడానికి కొద్ది మాసాలు వ్యవధి మాత్రమే ఉన్నది ఖిలాఫత్, పంజాబు దురంతాల గాయాలను మాన్పుకొనేటందుకు మనకు తగినంత గడువు లేదు వ్యవధి అతి స్వల్పంగా ఉన్నది కాని ఆ దయామయుడైన భగవంతుడు మనలోనే ఉన్నాడు మనం బలహీనులంగా కనిపిస్తున్నప్పటికీ మనకు విజయం చేకూర్చటానికి ఆయన మనకు తప్పక తోడ్పడగలడని విశ్వసిస్తున్నాను వాల్తేరులో అలీ సోదరుడు నిర్బంధించబడడం దైవ ప్రసాదమని నా అభిప్రాయము ఇట్లా జరగటం ఆ లోకకల్యాణ ప్రభుని కరుణా కటాక్ష వీక్షణాలు మనపై ప్రసరింపచేయటానికేనని తోస్తున్నది చెరసాలకు పోకుండ అసహాయోద్యమ సిద్ధాంతాలన్నిటిని అలీ సోదరులు త్రికరణ శుద్ధిగా నిర్వర్తించిన సంగతి ఆ పరమాత్మునికి తెలుసు నేను ఖిలాఫత్ విషయమై చేసిన కృషి కూడా ఆయనకు తెలియనిది కాదు ఎన్ని కష్టాలకు లోనైనప్పటికీ తాము పట్టిన పట్టును విడవకుండా ధీరనాయకుల వలె అలీ సోదరులు తమ కార్యక్రమం కొనసాగించినారు ఎన్ని కష్టాలు వచ్చినప్పటికీ, ఎన్ని కష్టాలు కలిగినప్పటికీ వారు ధైర్యంతో ప్రవర్తించినారు అన్ని సందర్భాలలోను అలీ సోదరులు సన్మార్గాన్నే అవలంబించినారు ఇప్పుడు మహమ్మదలీని బంధించవలసినంత అవసరం ఏమి కలిగింది? దీనికి రాజ ప్రతినిధి ఉత్తర వాది ఇందుకు తగిన సమాధానం ఆయన చెప్పవలసి ఉన్నది ఆ భారమంతా ఆయనదే అలీ సోదరుడు సదుద్దేశంతో శాంతిని స్థాపించటానికి కృషి చేస్తూన్న సమయంలో, ఆయనను బంధించేటందుకు ఏమి అవసరం కలిగింది? అలీ సోదరులు ప్రభుత్వంవారికి సమాధానం ఇచ్చిన నాటి నుంచి వారు నాతోనే ఉన్నారు వారు తమ సమాధానంలో తెలియజేసిన దానికి ప్రతికూలంగా ఈషణ్మాత్రమైన వ్యవహరించలేదు నేనిందుకు సాక్షిని భారత దేశంలోని మీరందరూ నామాట నమ్మండి మహమ్మదలీ సర్వకాలాలలో త్రికరణ

శుద్ధిగా భారతీయులు అహింసాయుత అసహాయోద్యమం అవలంబించవలెనని ప్రబోధిస్తూ వచ్చినారు అంతరంగిక మిత్రులతో గాని, బహిరంగసభలలో గానీ, అదే మాట చెప్పినారు ఖిలాఫత్ పంజాబ్ సమస్యల పరిష్కారానికి గాని స్వరాజ్య సంస్థాపనకు గాని దౌర్జన్యరహిత సహాయ నిరాకరణమే శరణ్యమని ఘంటాపథంగా తన మిత్రులకు, అనుచరులకూ కూడా చెప్తూ వచ్చినారు అలీ సోదరులు ధీరువులుగారు వారి భాషలో గాని వైఖరిలో గాని మార్పు వచ్చినట్లు ఎవరైనా అనుకొంటే అది కేవలం పొరపాటు వారెన్నడూ తమ భావం మార్చుకొనలేదు ఇంతవరకు అలీసోదరులకంటే ఎక్కువ ధైర్యవంతులను పరిశుద్ధాత్ములను సందర్శించే భాగ్యం నాకు లభించలేదు వీరిద్దరికీ మనోవాక్కాయ కర్మలలో పాపపు చింత ఎన్నడూ లేదు చెప్పేది ఒకటీ, చేసేది మరి ఒకటీ అన్న అపనిందకు వీరెన్నడూ పాల్పడలేదు ఆపద్ధతి వీరిలో కించు కాగడా వేసి వెతికినా కానరాదు నామాట మీరు నమ్మండి! అయితే వారు నల్లని వన్నీ నీళ్ళ, తెల్లని వన్నీ పాలు అని నమ్మే అమాయకులు ఉన్నది ఉన్నట్లు చెప్పే స్వభావం వారిది యథార్థ వాది బంధువిరోధి అన్నమాట వారిపట్ల అక్షరాలా నిజం తమ ధైర్యాన్ని, క్రమశిక్షణ పరిశుద్ధాత్మలను ప్రజలలో వ్యాపింప చేయడానికి వీరు శ్రమపడి నంతగా ఇతరులెవ్వరు శ్రమపడి ఉండలేరు నేను త్రికరణ శుద్ధిగా చెప్పగలను అహింసాయుత అసహాయోద్యమ భావనలను ప్రజల మనసులో నాటుకొనేటట్లు వీరికంటె ఎక్కువగా ఇతర ముసల్మానులెవ్వరూ ప్రయత్నించి ఉండలేదు ఉండరు కూడా అటువంటి సందర్భంలో అన్యాయంగా ప్రభుత్వ వారు మహమ్మదలీని బంధించి పాపం గట్టుకొన్నారని నేను ప్రభుత్వంవారిపై నేరం ఆరోపించినప్పటికి వారు ఆశ్చర్యపడ నక్కరలేదు ప్రభుత్వంవారు బలాఢ్యులు, సాధన సంపన్నులు అల్లర్లు జరిగిన మలబారు ప్రాంతానికి ప్రభుత్వంవారు నన్నూ, అలీ సోదరులను ఆహ్వానించి పంపి ఉన్నట్లయితే క్షేమాక్షణంలో అక్కడికిపోయి వారి కోర్కెను నెరవేర్చి ఉండేవాళ్ళము అట్టాంటి అవకాశం మాకిస్తే అన్యాయంగా నిరపరాధులు, నిర్దోషులు అయినవారు మరణించవలసిన అవసరం ఉండేదికాదు హిందువుల గృహాలు ధ్వంసమై ఉండేవి కావు కాని ప్రభుత్వంవారు అనవసరంగా ప్రజలను ఉద్రేకపరిచినారని నిందిస్తే సన్ను మన్నింతురు గాక ధీరులకు, బలాఢ్యులకు ఈ ప్రభుత్వ విధానంలో స్థానంలేదు వారికి చెరసాలలయే శరణ్యము మలబారులో బాధల పాలైన వారిని తలచు కొన్నంత మాత్రాన నా హృదయం ద్రవిస్తున్నది మాప్లాలు ఖిలాఫత్ కు, తమ దేశానికి గొప్ప అపకారం చేసి పాపం ఒడిగట్టుకొన్నారని నాకు తెలుసు మన కెటువంటి ఇక్కట్లు ప్రాప్తమైనప్పటికీ కావలెనని మనకు కష్టాలు కలగ జేసి ఒత్తిడి తెచ్చిపెట్టినప్పటికీ మేరువు వలె చలించక దౌర్జన్యరహితంగా ఉండ వలె ఇది ఆసేతు హిమాచలంలోని భారతీయులందరూ గమనించ వలసిన సంగతి. ఇది వారి విధ్యుక్త ధర్మము దీనిని జవదాటరాదు హిందూ గృహాలు విధ్వంసం చేయబడినందువల్ల మన పవిత్రోద్యమం మాప్లాలకు ఎంత మాత్రం

తెలియలేదని నాకు తోస్తున్నది మాప్లాలు పిచ్చిగా ప్రవర్తించినారని నాకు తెలుసు గిసి కంతయూ అహింసా యుత అసహాయోద్యమంలోని పవిత్రత వారికి తెలియక పోవటమే కారణము అహింసా ప్రచారకులను మలబారుకు పోకుండా ప్రభుత్వంవారు అడ్డు తగిలినారు ఇప్పుడు హిందూ సోదరులు కొందరు పడక శాంతంగా ఉండవలెనని కోరుతున్నాను మాపాలు బలాత్కారంగా హిందువులను మహమ్మదీయ మతం స్వీకరించేటట్లు చేసినారని ప్రభుత్వంవారు ప్రకటించినారు కాని అది సత్యం కాదని నా అభిప్రాయము ఒక వేళ నిజమను కొన్నప్పటికీ ఇందువల్ల హిందూ ముస్లిమ్ ఐకమత్యానికి భంగం కలుగడానికి మనము అవకాశమీయరాదు బలాత్కారంగంగామహమ్మదీయ మతం అవలంబించిన వారిని రహస్యంగా గాని, బహిరంగంగా గాని మహమ్మదీయులుగా వివేకవంతులైన ముసల్మానులు లెవ్వరు అంగీకరించరు అటువంటి పద్ధతులను వారు సహించరు ఇది నాకు తెలుసు కాని పతితులైనారని చెప్పబడే సోదరుల స్థితిని గురించి అధైర్యపడ నవసరంలేదు ఏ మానవుడైన తన అంతరాత్మకు ఇష్టంలేని పనిని బలాత్కారంగ చేయవచ్చు కాని అప్పుడు ఆయనకు పాప పరిహారార్థం ప్రాయశ్చిత్తం అవసరంలేదు నేను జ్ఞాన శాస్త్రంబట్టి చెబుతున్నాను బలాత్కారంగా ముసల్మానుమతం స్వీకరించిన వారిని మహమ్మదీయులుగా నిజమైన ముసల్మానులు ఎంచరని యాకుబ్ హుస్సేన్‌గారు మీకు తెలియజేసినారు కాబట్టి ఈ హైందవ సోదరులకు హిందూ మతంలో ఉండవలసిన అన్ని హక్కులూ ఉన్నాయి కష్టము కాలేదు అల్లర్లు జరిగిన ప్రాంతంలోని వారికి సహాయం చేయడానికి పోయిన కాంగ్రెస్ ఖిలాఫత్ ప్రచారకులను ప్రభుత్వం వారు ఆటంక పరిచినట్లు వింటున్నాను వారిని అభ్యంతర పెట్టడమే కాక ప్రభుత్వంవారు ఆ బాధితులకు ఏ విధమైన సహాయం చేయలేదని లుస్తున్నది ప్రభుత్వంవారికి ఇష్టమున్నా లేక పోయినా ధనం వసూలు చేసి బాధపడుతున్న వారికి అందేటట్లు చేసే భారం మనది కాంగ్రెస్ వారిదివరకే వారి నిమిత్తం కొంత సొమ్ము ఇవ్వడానికి నిశ్చయించుకొన్నారు ఖిలాఫత్‌వారు కూడ కొంత సహాయం చేయ ప్రయత్నిస్తున్నారని విన్నాను మద్రాస్ ముసల్మానులు ఇంటింటికి పోయి దమ్మిడీలనుంచి వసూలు చేసి వారికి పంపి ధన్యులు కావలెనని హెచ్చరిస్తున్నాను

ఇండియా అంతటిలోకి నేడీరాజధాని ఎక్కువ కష్టంలో ఉన్నదని నేనెరుగుదును ప్రజలభావాలను, సంకల్పాలను, ఆశయాలను అణగ ద్రొక్కడానికి ప్రభుత్వంవారి దేశంలో ఇంకా ఎటువంటి కఠిన శాసనాలను ప్రయోగించ దలుచుకొన్నారో మనకు తెలియదు చాలామంది విద్యావంతులైన మలబారు యువకులు ఖద్దరు ధరించినందుకు అక్కడి ప్రభుత్వాధికారులు వారిని పరాభవించి, వారి బట్టలను తగలబెట్టినట్లు నేటి ఉదయం నాకు తెలిసింది దానిని నేను నమ్ముతున్నాను పంజాబ్‌లోకూడా తెలియని కొత్తపద్ధతులను ప్రవేశపెట్టి మలబారు ప్రజలను పరిభవిస్తున్నారంట!

మన సంస్కరణ మంత్రులు ఆంధ్రదేశంలో వద్దు మొర్రో అని వినిపిస్తున్న ప్రజలపై మునిసిపాలిటీని కట్టిపెట్టినారు. ఆంధ్రదేశం తదితర ప్రాంతాలలో ప్రజలు ఇవ్వలేమని ఏకగ్రీవ గా ఘోషిస్తూన్నప్పటికీ అడవి, మన్యం బీడులలో పశువులను మేపుకుంటున్నందుకు పుల్లరి పన్ను విధించినారు. దాని కెంత మాత్రం ప్రజలు అంగీకరించలేదు. నోరులేని ఆవులను దూడలనుంచి విడతీసి బందెల దొడ్డిలో పెట్టి, గడ్డీ నీరూ లేకుండా పస్తులు పెడుతున్నారు. ఇటువంటి కఠిన చర్యలు జరుగుతున్నప్పుడు మన కర్తవ్యమేమిటో ఆలోచించుకోవలె. ఆంగ్లాధికారుల కఠిన చర్యలమాట అట్లాఉండగా బాధ్యతాయుతులైన మన మంత్రులే ఇట్లాప్రవర్తించటం విచారకరము. మంత్రుల చర్యకు మనము దౌర్జన్య ప్రయోగం చేయకూడదు. దౌర్జన్యం మనకు వినాశకరము. నిజంగా మీరు మహమ్మదలీని విడిపించవలెనని కోరితే మలబారులో మళ్ళా కల్లోలాలు కలుగ కుండా చేయడానికి ప్రయత్నిస్తే చీరాల, పేరాల వారిపైన మునిసిపాలిటీని బలవంతంగా కట్టిపెట్టకుండా చేయవలెనంటే మీరు సంపూర్ణంగా అహింసా వ్రతం అవలంబించవలె. అందువల్లనే మనము ఆత్మగౌరవం కాపాడుకొనగలము."

(ఈ ఉపన్యాసంలో గాంధీజీ మాపాలను గురించి చెప్పిన మాటలు మలబారులో మాప్లాల తిరుగుబాటు సందర్భంలో, జరిగిన అత్యాచారాలకు సంబంధించినవి)

మహమ్మదలీని అరెస్టు చేసిన సంగతి కాకినాడ పౌరులకు తెలిసింది, గాంధీజీ వాల్తేరునుంచి ఆ రైలులోనే మద్రాసు పోతున్నారని తెలుసుకొని సుమారు 3, 4 వేలమంది ప్రజలు సామర్లకోట స్టేషన్‌లో వారి రాకకోసం ప్లాట్‌ఫారమ్ మీద కూర్చుని ఉన్నారు. వారందరూ, నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉన్నారు. రైలురాగానే గాంధీజీ వారిని చూసి దిగివచ్చి ఒక బెంచిపై ఎక్కి ప్రజలందరూ తనను దర్శించే అవకాశం కలిగించినారు. అంతకు పూర్వమే కుప్పగా ఉన్న విదేశీ వస్త్రాలన్నీ మహాత్ముని ఎదుట తగలబెట్టడం జరిగింది. ప్రప్రథమంగా మౌలానా మహమ్మదలీ వాల్టేరు స్టేషన్‌లో అరెస్టు చేసినట్లు గాంధీజీ చెప్పినారు. "ఇదొక సంతోష వార్త. దీనిని గురించి మనం దుఃఖపడకూడదు. మనమందరం అహింసావ్రతులమై హిందూముసల్మానులమై ఐకమత్యభంగం లేకుండా జాగ్రత్తగా ఉండవలె. హర్తాళ్‌లు చేయకూడదు. ప్రతివారు నూలువడకవలె. వడుకు నూలుతో చేమగ్గాలపైన నేసిన బట్టనే ధరించవలె. మనకు స్వరాజ్యంరాగానే మన స్వరాజ్య ప్రతినిధుల మహాసభ ఖైదులలో ఉన్న మన సోదరులందరిని విడుదల చేస్తుంది" అని గాంధీజీ ఉపన్యసించినారు.

**విశాఖపట్టణం జైలులో మహమ్మదలీ**

మౌలానా మహమ్మదలీపైన అరెస్టు వారెంట్ జారీచేసేటప్పుడు పోలీసు ఉద్యోగి గడగడా వణకి పోయినాడు. ఆయన విశాఖపట్టణం సెంట్రల్ జైలులోకి వెళ్ళిన తరవాత అక్కడ అధికారులు ఆయనను గౌరవంగానే చూసినారు.

పి సి వెంకటపతిరాజుగారు, విశాఖపట్టణం జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు వసంత రావు బుచ్చి సుందరరావుగారు చెగసాలలో మహమ్మదలీని దర్శించినారు మహమ్మదలీ మహాత్మాజీకి తమకృతజ్ఞతను తెలుపుతూ దేశీయులకు శాంతి సందేశం పంపించినారు విశాఖపట్టణంలోని కళాశాలలను, పాఠశాలలను విద్యార్థులు బహిష్కరించటంవల్ల అని ఖాళీఅయినాయి కాంగ్రెస్ ప్రచారకులు బండ్లనిండా విదేశ వస్త్రాలను పోగుచేసుకొని ఊరేగింపుతోపాటు సాయంత్రం సముద్రవు టొడ్డున బహిరంగ సభచేసినారు మహమ్మదలీని అభినందిస్తూ తీర్మానాలు చేసినారు విదేశీ వస్త్రాలను కుప్పగాపెట్టి దహనం చేసినారు విదేశీ పట్టుబట్టలు సైతం కొన్ని గంటలసేపు తగుల బడినాయి ముసల్మాన్ మతస్థులు ఆంధ్రకవి అయిన ఉమర్ అలీషాగారు గంభీరోపన్యాసం చేసినారు

సెప్టెంబరు 17 వ తేది ఉదయం 5-40 నిముషాలకు రిజర్వ్ పోలీసులు మౌలానా మహమ్మదలీని విశాఖపట్టణం జైలు నుంచి మోటారెక్కించి రైలు స్టేషన్‌కు తీసుకొని పోతూవుండగా వేలకొద్ది ప్రజలు వీధులలో బారులు తీర్చి ఆయనను అభినందించినారు తరవాత పోలీసులు ఆయనను రైల్లో ఎక్కించి కరాచికి తీసుకొని పోయినారు

## గాంధీజీ - రాయలసీమ సంచారము

1921 సెప్టెంబరు 28 వ తేదీన మహాత్మా గాంధీ తిరుపతికి వస్తారనే వార్త ముందుగానే వెల్లడి అయింది అందువల్ల చుట్టుపట్ల గ్రామాలనుంచి అనేక మంది ప్రజలు తిరుపతికి వచ్చినారు తిరుపతిలోని రోడ్లన్నీ పరిశుభ్రంగా మామిడాకులతోరణాలతోనూ అరటి కంబాలతోనూ అలంకారుతున్నాయి వీధులన్నీ ఖద్దరు వస్త్రధారులైన జన సమూహాలతో నిండినాయి

ఉదయం 9 గంటలకు మహాత్ముడు తిరుపతి చేరినారు 10 గంటలకు ధన లక్ష్మీ నాటకశాలలో గాంధీజీకి మునిసిపల్ సంఘంవారు సన్మాన పత్రం సమర్పించినారు మునిసిపల్ సంఘాధ్యక్షులు నగరం వేంకట కృష్ణమాచార్యులు గారు సన్మాన పత్రం చదివి దానిని వెండి పెట్టెలో ఉంచి మహాత్మునికి ఇచ్చినారు

## సన్మాన పత్రం

"పుణ్యక్షేత్రమనీ పరమ పావనమనీ పరమభక్తుల చేతను, పురాణాల చేతను కొనియాడే తిరుపతికి వచ్చిన మహాత్ముడు లోకరక్షా దీక్షా పరుడు (శ్రీ) మోహనదాసు కరంచంద్ గాంధిగారి సముఖానికి మహాత్మా! ఆసేతు హిమాచలం 'కలౌ వేంకటనాయకః' యని కొనియాడబడే ఈ తిరుపతి పురవాసుల ప్రతినిధులమైన మేము మీకు స్వాగతమిస్తున్నాము మహావంశ జాతుడవయ్యు లోకంలో జనులు పడే శ్రమకు ఓర్వలేక భోగాల విడనాడి జాతి మత భేదాలు పరిగణించక సర్వజన సామాన్యుడవై అందరికీ మేలుచేయ కోరి

దేశాన్ని ఉన్నతస్థితికి తీసుకొని రావటానికి ఇంతవరకు మీకు చేసిన మహోపకారశ్రిత కృత్యాలు లోకి విగిపలు దక్షిణాఫ్రికాలోను బంగాళా రాష్ట్రంలోని చాంపరాన్‌లోను, బొంబాయి రాజధానిలోని కైరా మండలంలోను తాము శ్రమకోర్చి దుఃఖసాగరంలో మునిగి ఉండిన జనులకు తేపయై (తెప్ప) వారిని దరిచేర్చి సౌఖ్యాలు ఒనగూర్చిన అంశం ఆబాలవృద్ధులకు తెలిసినదే

శాంతి స్వరూపులైన మీ కల్పనేగదా మత ద్వేషాలు నాశంచెంది విశేషంగా దేశం క్షేమం పొందిందయింది బ్రాహ్మణుడనీ, బ్రాహ్మణేతరుడనీ, పండితుడనీ, పామరుడనీ, దరిద్రుడనీ భేదమే ఉంటే భూమిమీద శాంతికి స్థానమే ఉండదు అహింసయే పరమ ధర్మమని మన శాస్త్రాలు కొనియాడుతూ ఉండటం మీరు వ్రతంగా బూని జనులందరికీ బోధించి లోకంలోని వైరాలను తొలగొట్టి, హిందూ మహమ్మదీయ సంఘాల నొకటిగా చేర్చి శాశ్వత యశస్కులైనారు కీర్తిశేషులైన పుణ్యశ్లోకుడు లోకమాన్య తిలక్ పేర నిధిని స్థాపించి అచిరకాలంలోనే దానికోసం 125 లక్షల ధనం చందా రూపంగా సేకరించి దేశానికి మేలుచేయ బూని, దేశమంతటా మగ్గాలను, రాట్నాలను స్థాపించి జనుల పేదరికాన్ని పోగొట్టి ఆత్మగౌరవ స్వాతంత్ర్యాలు జన సామాన్యానికి సాధ్యం చేసిన మీరు ఈశ్వరాంశ సంభూతులు కావడం నిశ్చయము

అటువంటి మహామహులయిన మీకు నిరుపమాన యశస్సును, సంపూర్ణాయువును ఇచ్చి మీ ఉద్యమాలన్నీ జయప్రదంగా నెరవేర్చ సర్వేశ్వరుని ప్రార్థిస్తూ వినయపూర్వకంగా విన్నవిస్తున్నాము "

తిరుపతి పుర ప్రతినిధులు

దుర్మతి, భాద్రపద కృష్ణద్వాదశి బుధవారం

ఈ సన్మాన పత్రానికి గాంధీజీ ప్రత్యుత్తర మిస్తూ ఇట్లా అన్నారు
"మీరు ప్రేమపూర్వకంగా ఇచ్చిన సన్మానపత్రానికి నా వందనాలు మీరు చెప్పే సుగుణాలన్నీ నావద్ద ఉన్నవో లేవో నాకు తెలియదు బంగారము, వెండీ దాయటానికి నాదగ్గర చోటు లేదు కాబట్టి ఈ వెండి పెట్టె విక్రయించి ఆ ధనం కరువుతో బాధపడుతున్నవారి కష్టనివారణకోసం ఉపయోగించ వలెనని కాంగ్రెస్ కార్యదర్శిని కోరుతున్నాను

చట్టం అతిక్రమించకుండానే మునిసిపల్ సభ్యులు సహాయ నిరాకరణ వాదులకు తోడ్పడవచ్చు మద్యపాన నిషేధం గురించి మీరు పనిచేయవచ్చు విదేశ వస్త్రాలను సంపూర్ణంగా పరిత్యజించి ఖద్దరు వస్త్రాలను మీరు ధరించటమే కాక మీ కుటుంబంవారు మునిసిపల్ పాఠశాలా విద్యార్థులు మొదలైన మీకు సంబంధించిన వారంతా ఖద్దరు వస్త్రమే ధరించేటట్లు మీరు ప్రయత్నించవచ్చు రాట్నాలను బీదవారికి పంచిపెట్ట వచ్చు స్వదేశీ అంటే స్వదేశీయ వస్త్రాలను ధరించటం మాత్రమేకాదు తనకు కావలసిన వస్త్రాలకు తగినంత నూలు

ప్రతిమనిషి స్వయంగా వడుక్కోవలె ఇదే సంపూర్ణ స్వదేశీ వ్రతము మునిసిపల్ సంఘంవారు అస్పృశ్యతను తొలగించటానికి ప్రయత్నించవచ్చు పంచమ సోదరుడు ఈ కొండ ఎక్కి వెంకటేశ్వరస్వామిని దర్శించటానికి వీలులేదని విన్న తోడనే నాకు చాల విచారం కలిగింది నేను సనాతన ధర్మవాదినైన హిందువును, మన శాస్త్రాలందెక్కడ చూసినా పంచములకు వైదికునికి ఎట్లాంటి భేదం కనబడడంలేదు సదాచారుడై దైవభక్తిగల పంచముడు పరాత్పరుని సాన్నిధ్యం చేరగలడు కృత్రిముడు, దురాచారపరాయణుడు అయిన వైదికునికి నరకమే ప్రాప్తిస్తుంది భగవద్గీత ఈ రహస్యాన్ని విపులగా వెల్లడించింది కాబట్టి పంచమ సోదరులను అస్పృశ్యులుగా పరిగణించే వారందరు దైవాన్ని మతాన్ని పరిత్యజిస్తున్నారని గ్రహించండి మునిసిపాలిటీవారు ఈ విషయాలలో చట్టాల నతిక్రమించకుండానే సహాయ నిరాకరణవాదులకు తోడ్పడవచ్చు

ఈ ప్రాంతాలందు క్షామమున్నదని తెలిసింది మొదలు నామనస్సు ఎంతో కలవర పడుతూన్నది నేను కొందరు ధనవంతులను చూసినాను వారు నాకు ధనము, ఆభరణాలు కాటక నివారణకు ఇచ్చినారు ఇటువంటి స్థితిలో ఈ సభలో ఉన్న ప్రతి మనిషి కాటకంతో బాధపడుతూన్న సోదరుల కోసం కొంత సహాయం చేయవలెనని కోరుతున్నాను తగిన ధనంతో నేను దత్తమండలం పోజాలక పోతినని చింతిస్తున్నాను '

ఈ ఉపన్యాసం తరవాత తిరుపతిలో మరొక బహిరంగ సభ జరిగింది సభకు రాదాపు 20 వేలమంది హాజరయినారు పురజనుల పక్షాన గాంధీజీకి మరొక సన్మాన పత్రం సమర్పించడం జరిగింది మహాత్ముడు స్వదేశీ గురించి, దౌర్జన్య రాహిత్యం గురించి చెప్పి కరువుతో బాధపడు వారికి సహాయం చేయవలెనని కోరగా కొంత ధనం వసూలైంది తరవాత స్పెషల్ బండిలో మహాత్ముడు రేణిగుంట నుంచి బయలుదేరి 2 గంటలకు రాజంపేట చేరి అక్కడ కూడా ఇదే తీరుగా ఉపన్యసించినారు స్పెషల్ బండి తిరిగి 3½ గంటలకు బయలు దేరి 4½ గంటలకు కడపచేరింది

**రాజంపేటలో**

ఇంతకు ముందు పుటలలో గాంధీజీ తిరుపతి నుంచి సెప్టెంబరు 28 వ తేదిని రాజంపేటకు వెళ్ళినట్లు వ్రాసి ఉన్నాము అప్పుడు రాజంపేటలో జవుళి వర్తకులు గాంధీజీకి ఈ దిగువ సన్మాన పత్రం సమర్పించినారు

**సన్మాన పత్రము**

"మోహన్‌దాస్ కరంచంద్ గాంధీగారికి!

మహాత్మా!

రాజంపేట భాగ్యం నేడు పండింది మీ రాకతో మేము ధన్యులమైనాము ఉత్సాహంతో ఏనాడు ఎవరికీ ఏ మాత్రం కొరవడమని తమకు నివే

దించుకో నివ్వండి

తాము పట్టుబట్ట నేడు సాధించదలచిన స్వరాజ్యానికి స్వదేశీ మూల మంత్రంగా నేర్పరిచినారు ఆ మంత్రం నిరంతరం స్మరణచేసి అభ్యాసం చేయడం భారత పుత్రులందరికి నేడు ధర్మమైనది

ఆ ధర్మ సంరక్షణలో మా భాగం మేము నిర్వహించదలచి విదేశీనూలును గానీ, వస్త్రాలనుగానీ తెప్పించడంమానివేస్తామని దృఢసంకల్పం చేసుకొన్నాము

ఈ సంకల్పార్థం రాజంపేట పక్షాన మేము సమర్పించే స్వాగతం స్వీకరింతురు గాక

ఇట్లు
తమ అనుంగు సోదరులు
రాజంపేట జవుళి వర్తకులు

**కడపలో**

కడపలో సన్మాన సంఘ వారు మంచి ఏర్పాట్లుచేసిఉన్నారు దాదాపు 40వేలమంది సభకు హాజరైనారు దాదాపు ఒక గంటసేపు గందరగోళం జరిగింది ఆ సందడి జరుగుతుండగానే గాంధీజీ మాట్లాడుతూ కరువుతో బాధ పడుతున్న జిల్లావారికి సహాయం చేయవలసిందని సభ్యులను కోరినారు సభలోని వారు కొన్ని ఉంగరాలను గాంధీజీకి సమర్పించినారు గాంధీజీతో వచ్చిన ఆజాదుసుభానిగారు స్వదేశీని గురించి మాట్లాడిన తరవాత విదేశ వస్త్రాలు, టోపీలు కుప్పలుగా వేయడం,తగుబెట్టడంజరిగింది ఆతరవాత గాంధీజీ కొంతసేపు ఉర్దూలోను, మరికొంతసేపు ఇంగ్లీషులోనూ మాట్లాడినారు గాంధీజీతో కలిసి ప్రయాణం చేస్తూండిన గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు ఆయన ఉపన్యాసాలను తెలుగులో చెప్పినారు సభలో గలభా చేయడం యుక్తంగాదని స్వరాజ్యానికిప్రయత్నించేవారు ఎక్కువ శాంతంగాఉండవలెనని గాంధీజీ సలహా ఇచ్చినారు కడపలో వెయ్యినూటపదహారులు తిలక్ స్వరాజ్యనిధికి సమర్పించడం జరిగింది

**కడప మండల సంఘంవారి సన్మాన పత్రము**

శ్రీ మోహను దాస్ కరుణాసాంద్ర గాంధీ మహాత్ముని పాదసరోజ సన్నిధికి

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

"మహాత్మా!

మామండల సంఘ పక్షంలో తమకు హృదయ పూర్వక స్వాగత పత్రం సమర్పించగల మహాభాగ్యమిచ్చినందుకు ప్రేమైక స్వరూపియగు విశ్వేశ్వరునకు వందన సహస్రాలర్పిస్తున్నాము

మీ ధర్మ ప్రసార తత్త్వం పురస్కరించుకొని మేము ఆత్మోద్ధరణ సమస్య

లో విశ్వమానవ కల్యాణం లక్ష్యంగా కృతకృత్యులమై ఆధ్యాత్మిక తేజో విరాజితయు, మహాజన సంతానవతియు అయిన భారతమాత విశిష్టాశీర్వచనాలకు పాత్రులమగుదుమనే మా అభీష్టము, అమోఘ విశ్వాస సంపన్నము జాతీయ మహాసభాశ్రయ పరంపరను సక్రమమార్గంలో ధర్మబద్ధంగా సంస్కరించి ఫలాభిముఖం చేసిన మీ అనిర్వచనీయ సాత్త్విక ప్రతిభకు మాలో రూపొందిన ఆత్మ విశ్వాసమే ప్రబల ప్రమాణము దౌర్జన్య రహిత సహాయనిరాకరణ తత్త్వంలోని పవిత్రత మాతృభూమిలోన, ఖండాంతరాలలోను సూకృత ప్రియులచే సంకీర్తింప బడుతున్న వార్తలు ప్రకృతి నుద్బోధిస్తున్నాయి మామండలం ప్రత్తి పంటకు సుప్రసిద్ధమై జనసామాన్యమంతా ఖద్దరు వస్త్రాలనే ధరిస్తూ, వేసవిలో ప్రతి రైతు ఇంట రాట్నం మంజుల గానం శ్రవణోత్సవం చేస్తూన్నను ఇతర ప్రాంతాలను చూసి కొంతవరకు నవనాగరకతా వ్యామోహంలోపడి ఇంకా అధఃపతితం కాకమునుపే మీ పవిత్ర సందేశం మాకు అమూల్య ప్రబోధం కలిగించింది

మహాత్ముని శ్రవణాలకు, మా అంతఃకరణాలకు సంతృప్తికరంగా ఉద్యమంలో ఇప్పటికి కృతకృత్యులం కాలేకపోయినప్పటికీ తమ ప్రత్యక్ష సందర్శన పుణ్యలాభాన రేపటినుంచి ప్రజలందరమూ ద్విగుణీకృతోత్సాహంతో దౌర్జన్య రహిత సహాయ నిరాకరణోద్యమం చేస్తున్నాము దేశీయ సోదర ప్రముఖులు నిర్బంధితులవుతున్నా మరింత ఉత్సాహ సంతోషాలతో మన పవిత్రోద్యమాన్ని దౌర్జన్య రహితంగ నడిపిస్తామని మీ పాద సరోజసన్నిధిలో మరొక మారు ప్రమాణం చేస్తున్నాము

మీతో పాటు అలీ సోదరులకు స్వాగతంచెప్పగల మా భాగ్యానికి ప్రభుత్వం వారు వాల్తేరులో అంతరాయం కలిగించినందుకు చింతిస్తూ నిర్బంధితులైన అలీ సోదరుల కుటుంబానికి, మా రాజంపేట నిర్బంధిత కుటుంబాలకు, నిర్బంధితులయిన ఇతర సోదరుల కుటుంబాలకు మీ సంపూర్ణ సానుభూతి ఉందని విశ్వసిస్తున్నాము ముఖస్తోత్రాలకు ఏమాత్రం ఇచ్చగించని మహావ్యక్తులకు స్వాగత పత్రం అర్పించడంలో అనివార్యంగా నేదేని స్తోత్రాక్షరం కనబడుతూంటే క్షమించవలసిందిగా ప్రార్థిస్తున్నాము

ఇట్లు
విధేయ సోదరులు
మాకల వెంకట సుబ్బయ్య
ఆహ్వానమండల సంఘాధ్యక్షుడు
భూతపురి నారాయణస్వామి
ఆహ్వానమండల కార్యదర్శి

కడప మండల సహోదర బృందంవారు మహాత్మాగాంధీకి దిగువ సన్మానపత్రం సమర్పించినారు

సన్మాన పత్రము

"భవదాగమనంతో మా మండలం పవిత్రమయింది తేజోరాశి అయిన మార్తాండు డుదయించి నశించు తమఃపుంజమట్లు మా మండలము బావగించు ఉన్న అజ్ఞాన మిమిమిషంనుంచి తమరాకతో మాసిపోయినన ట అలికనేమో కిరా ాలదు

అలీ సోదరులు రాలేకపోయినందుకు దుఃఖం తప్పదుకాని ఎన్న దగు సర్వమర్పించు వారి సౌశీల్యం దేశానికి ఉత్తేజకరమని మాత్రం చెప్ప ప్పుడు తున్నది

విదేశవస్తు బహిష్కారము, మద్యపాన నిరసనము, ప్రస్తుత న్యాయ స్థానాల విద్యాలయాల దూరీకరణం అనే నివృత్తి మార్గాలు స్వదేశీ పంచాయతీ, జాతీయ విద్య, పవిత్ర జీవితం అనే నిర్మాణ మార్గాలను స్వరాజ్యం సంపాదించ వలసినదని మీరు చేసిన హిత బోధ ఇదివర కెన్నడు వ్యాపించని రీతిని గ్రామాల కన్నిటికీ ఇప్పుడు వ్యాపించినాయి

భరతభూమి యందలి ఒక్కొక్కరును ఇదివరలో ఎవ్వరి నామాలను ఉచ్చరింపని మహోత్తమ గౌరవంతో మీ నామం ఉచ్చరిస్తున్నారు మీ ఆదేశాలను అనుసరించ లేకున్నా అంగీకరిస్తున్నారు శత్రువులు కూడా మురుక్కవై వ్రేలువేసుకొన గలిగినంత శాంతం, సాత్వికం మీరు సాధించుటం భారతఋషులకు నైజమై ఉండి భారత నాగరకత బీజమై ఉండిన సుద్ధ సత్వగుణ పోరాటంలో సింగాలనుపోలిన మా మండల వీర ప్రజలకు కూడా వ్యాపించింది

బహు శీఘ్రకాలంలో మా మండలం తావకీన ఆశయాలన్నింటను ఆశా హితమై బలవత్తమ రీతిని తమ ఉద్యమానికి తోడ్పడగలదని మేము మందిరమూ విశ్వసిస్తున్నాము

వాక్యజాలం పెంచనక్కరలేదు ఉప్పొంగే హృదయాలతో మేము సమర్పించే స్వాగత సపర్యలను అందుకొని మా మండలాన్ని అనుగ్రహింతు గాక యని ప్రార్థిస్తున్నాము

ఇట్లు
కడపమండల సహోదర బృంద పక్షమున
మండల కాంగ్రెసు సంఘాధ్యక్షుడు
నూకల వెంకట సుబ్బయ్య

గాంధీజీకి కడప వైశ్య సంఘంవారు ఈ దిగువ సన్మానపత్రం సమర్పించినారు

సన్మానపత్రము

"మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ గారికి !

మహాత్మా !

లోకోత్తర చరిత్రుడవగు మీవంటి మహానుభావులు మానవజాతికి దొరకడమే దుర్లభము అట్లాంటప్పుడు ఆ ఈశ్వరుడు భారత భూమిలోని

వైశ్య సంఘం మీదగల అపార కృపచే మాకు మిమ్ము ప్రసాదించినందులకు అతని నెన్ని నోళ్ళ పొగిడను తనివితీరదు

దూరమునుంచియే ఉన్నీళకు ఫిరుకుండ రమారమి ఊసర క్షేత్ర మనదగిన ఈ కడప మండలానికి తామరుదెంచుట మా కెంత ఆనందం కలిగిందో వర్ణింప తరంగాదు హృదయం నిండిన పెదవులు ఆడవందురు' మీ శుద్ధ సందేశం మా మనో పీఠలను నిరంతరం ఉడి మా శక్తివంచన లేకుండా దానిని కార్యరూపంలో నెరవేర్చుకొనే ఉత్సాహం పరమేశ్వరుడిచ్చుగాక అని తమ ఆశీర్వాద వాంఛగలవారమై ఇదే హృదయపూర్వకంగా స్వాగతమిస్తున్నాము

ఇట్లు
భవద్విధేయ సహోదరులు
కడప వైశ్యసంఘ పక్షమున
రామారి సుబ్బరాయుడు "

ఈ సన్మాన పత్రంతో పాటు మహాత్ముని ప్రశంసిస్తూ కొందరు కవులు కొన్ని పద్యాలుకూడ చదివినారు ఇందుకు ప్రత్యుత్తరంగా మహాత్ముడు కొంత సేపు ఉర్దూలోను, మరికొంతసేపు ఇంగ్లీషులోను మాట్లాడినారు

**మహాత్ముని ఉపన్యాసము**

"సన్మాన పత్రాలతో కాలహరణం చేయడం మనకు ఎక్కువగా అభ్యాసమై పోయింది ఈ సంవత్సరం ముగిసే లోపల పంజాబ్, ఖిలాఫత్ల సమస్యా పరిష్కారం, స్వరాజ్య సంపాదనం, అలీ సోదరులు మొదలయిన మన మిత్రుల విడుదల జరగాలని మనం తీర్మానించుకొన్నట్లయితే మనం చాలా కట్టుదిట్టంగా వ్యవహరించ వలసి ఉన్నది

ఈ సభ మన కార్యాచరణలోని లోపం తెలియచేస్తున్నది ఒక గంట కాలం మనమంతా వృథా చేసినాము అట్లాచేయకుండా మన మందరం ఈ గంటసేపు నూలు వడికి ఉంటే కొన్నివేల రూపాయలు సంపాదించి కరువు ప్రదేశాలలో ఆకలితో బాధపడుతున్న మన సోదరుల కెంతో సహాయం చేయ గలిగి ఉండేవారము ఇటువంటి కార్యాసక్తి లేకపోతే స్వరాజ్యం సంపాదించటం చాలా కష్టము ఇక్కడివారు స్వరాజ్య సంపాదన కోసం పాటుపడటం లేదు స్వదేశీకి మీరు చేయగలిగినంత సహాయం చేయడం లేదు ఇది దుఃఖకరమైన విషయము

ఆంధ్ర దేశంలో నాయకులు ప్రజాశక్తిని కేంద్రీకరించి జన సమూహాలను శాంతంగా ఉండేటట్లు చేయవలె ఆంధ్రదేశ ప్రజలపై నాకెంతో అభిమాన మున్నది ఆ సంగతి నేనెన్ని పర్యాయాలో వ్రాసినాను ఇప్పుడు కూడా అటువంటి అభిమానమే ఉన్నదని తిరిగి నేను చెబుతున్నాను మనస్సును, తదితర శక్తులను మన స్వాధీనంలో ఉంచుకోక పోతే దౌర్జన్యంను మనం

ఎదుర్కోలేము ఈ సన్మాన సంఘం వారు, ఇక్కడి స్వచ్ఛంద సేవకులు, ఈ ప్రజా సమూహం శాసనోల్లంఘనకు వర్కింగ్ కమిటీ గారి అనుజ్ఞ కోరితే మీ కోరికను అంగీకరించ కూడదని నేను గట్టిగా వాదిస్తాను ఈ జన సమూహంలో ఐదారుగురు దురుద్దేశంతో దౌర్జన్యానికి పూనిఉంటే ఇక్కడ రక్తం ప్రవహించి ఉండేది వెంటనే వార్తా పత్రికల విలేఖరులు ఈ విషయం పత్రికల్లో వ్రాసి మనం స్వరాజ్యనిధికి అనర్హులమని నిరూపించి ఉండేవారు ఇంత చిన్న జన సమూహంలోనే శాంతిని చేకూర్చలేక పోయినప్పుడు ఇండియాలో 30 కోట్ల జనసమూహాన్ను ఎట్లా శాంతంగా ఉంచగలము

అయినా దేవుడు మన పక్షాన ఉన్నాడు దైవసహాయం వల్లనే ఇంత పనినైనా చేయగలిగినాము కాని మనం దైవాన్ని నమ్మి పురుష ప్రయత్నం చేయకుంటే బుద్ధిహీనులము, కృతఘ్నులము అవుతాము కాబట్టి మనం మన శక్తులను కేంద్రీకరించుకోవలసి ఉంది దౌర్జన్య రాహిత్యము, స్వదేశీ, హిందూ మహమ్మదీయ సఖ్యము మొదలయిన విషయాలను గురించి నా అభిప్రాయాలు పత్రికలలో ప్రకటించడం జరిగింది ఇక ముందుకూడా ప్రకటించడం జరుగుతుంది అని చెప్పి గాంధీజీ స్త్రీలను ఉద్బోధిస్తూ ఇట్లా మాట్లాడినారు

"సోదరీమణులారా! మీ సోదర సోదరీమణులు మీ జిల్లా సమీపంలోనే క్షామంవల్ల బాధపడుతున్నారు మీ రందరూ నూలు వడకడం బాగా నేర్చుకొని రాట్నాలను క్షామ ప్రదేశాల్లో పంచిపెట్టండి

మీరు ఆభరణాలను, ధనాన్ని కరువుతో బాధపడేవారి సహాయం కోసం ఇవ్వవలెనని తిరిగి కోరుతున్నాను"

తరవాత స్వచ్ఛంద సేవకులు నగదు, నగలూ వసూలుచేయడం మొదలు పెట్టినారు అనేకమంది ఉంగరాలు, మురుగులు మొదలయినవి సమర్పించినారు

**తాడిపత్రిలో (అనంతపురంజిల్లా)**

1921 సెప్టెంబరు 29 వ తేది ఉదయం 5 గంటలకు మహాత్ముడు తాడిపత్రికి వెళ్ళినారు పురపాలక సంఘంవారు, కాంగ్రెస్ సంఘంవారు వారికి సన్మాన పత్రాలను సమర్పించినారు శ్రీమాన్ కలచవీడు వెంకట రమణాచార్యుల వారు గాంధీజీని స్తుతిస్తూ చక్కని పద్యాలు చదివినారు

మహాత్మా గాంధీగారికి వారి పశ్చిమాంధ్ర పర్యటన సమయంలో తాడిపత్రి స్థానిక జాతీయ సంఘంవారు దిగువ సన్మాన పత్రం సమర్పించినారు

**సన్మాన పత్రము**

"మహాత్మా!

మీ సందర్శనకు చంద్ర చకోరన్యాయంలో ఉవ్విళ్ళూరుచున్న మేము మౌలానా మహమ్మదలీ బేగం సాహెబా ప్రముఖులతో కూడిన మిమ్ము పవిత్ర పినాకిని తీరస్థమయ్యే ఈ తాడిపత్రిపురానికి ఆహ్వానించి స్వాగత మిచ్చే భాగ్యం

లభించడంతో కృతకృత్యులమైనాము

భారత పితామహ స్థాపిత స్వరాజ్యోద్యమ వ్యాప్తికి అనన్య సామాన్యంగ, అహింసా మార్గంగ దీక్షా బద్ధులై తాము చరించడమేగాక త్రింశత్కోటి భారతీయులు సక్రమ పద్ధతి ననుసరించి ప్రపంచ మద్భుత పడేట్లు నడిపించే మీ శక్తి, దక్షిణాఫ్రికా విషమ పరిస్థితులలో మీరు చూపిన త్యాగం సువ్యక్తాలు ఈ సమయంలో మా గ్రామానికి మీరు రావటం మా భాగ్యము కాని అలిసోదరుల దర్శన భాగ్యం లభించక పోయినందుకు చింతించ వలసి ఉన్నది

మా దత్తమండలిని గర్భితాలైన వివిధ శక్తులును, పలువిధ పరిశ్రమలకు కావలసిన సాధన సంపత్తి, దానిని సమయానుకూలంగ ఉపయోగించటానికి కావలసిన శక్తి సామర్థ్యాలు ఉన్నాయి ప్రజలు కరువులతో మాడుతున్నారు గాని సహజంగ దృఢకాయులు, పట్టుదల గలవారు జన సామాన్యం అక్షరాలు రాని విద్వాంసులు పాశ్చాత్య నాగరకత తిన్నగా వంట బట్టినదికాదు పూర్వాచార పద్ధతులలో ఎక్కువభిమానం గలవారు

అసత్య భీరువులు, విశాలహృదయులు స్వరాజ్యోద్యమ వ్యాప్తికి మూలాధార సూత్రాలలో ఒకటి అయిన ఐకమత్యానికి మా ప్రాంతంలో క్షీరనీరన్యాయంగా ఉండే హిందూ మహమ్మదీయులే తార్కాణము

స్వరాజ్య సాధనలో అగ్రగణ్యమైన స్వదేశవస్త్రనిర్మాణానికి కావలసినంత పత్తి మా మండలాలలో సహజంగా పండుతుంది నేతపనివాండ్ర కౌశలం కూడా కొరవడదనే సంగతి మీరీనాటి ప్రదర్శనంలోనే గ్రహించగలరు నవనాగరకం ముదిరినవారు తక్కిన జన సామాన్యం సహజంగా ఖాదీ వస్త్రాలనే ధరించే అలవాటు ఉన్నవారు ఇదిగాక నీలిమందు, వేరుశనగ, మెట్ట ధాన్యాలు సారవంతాలైన నల్లరేగడులలో పండుతాయి మా మండలంలో వజ్రకరూరులో వజ్రాలు దొరుకుతాయి, రామగిరి ప్రాంతాలలో బంగారం గనులున్నాయి ప్రాచీన శిల్పకళా నైపుణ్యం చాటడానికి మా ఊరి దేవాలయాలే చాలు ఇక్కడి కొద్ది దూరంలో ఉన్న రంగనాయకుల కోన ఎంతో మనోజ్ఞమైనది

అప్పుడప్పుడు వచ్చి ఉద్బోధించే ఉపన్యాసకుల, నాయకుల, నిరంతర పరిశ్రమవల్ల మా ప్రాంతాల సహాయ నిరాకరణోద్యమం కొంతవ్యాపించి మా ఊళ్ళో బలపడింది సంపూర్ణ దార్ఢ్యం పొందడానికి వలసిన మీ సందర్శనం కూడా కలగటంతో మా మండలం ఉత్తమోత్తమం కాగలదని నమ్ముతున్నాము

మహాత్మా! ఈ చిన్న పలుకుల సత్కారాల కాంగీకరించి మా స్వాగతం లోకొంటారని హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాము "

ఇట్లు
భక్తి తత్పరులయిన తాడిపత్రి
పౌరుల పక్షమున
ఆహ్వాన సంఘాధ్యక్షుడు
ముక్కపట్నం నరసింహాచార్యులు

తాడిపత్రి పురపాలక సంఘంవారు మహాత్మునికి కింది సన్మాన పత్రం మునిసిపల్ కార్యాలయంలో సమర్పించినారు

**సన్మాన పత్రము**

' మోహన్‌దాస్ కరంచంద్ గాంధీగారికి,

**మహాత్మా!**

తాడిపత్రి పౌరుల పక్షాన పురపాలక వర్గం తమకు నివేదించే ఈ సన్మాన పత్రం తాము దయామయులై స్వీకరిస్తారు గాక అని ప్రార్థిస్తున్నాము

అప్రతిమాన శీలము, అసామాన్యత్యాగము, అనన్యదుర్లభ శాంత తేజము మీలో మూర్తీభవించినాయి విదేశీయులైనవారు వేనోళ్ళ శ్లాఘిస్తూ ఉంటే మిమ్మల్ని వర్ణించడానికి పూనుకోవడం మా బోటి వాళ్ళ విషయంలో సాహసమే అవుతుంది మిమ్మల్ని ఊరక పొగడ నారంభించినామని అసంతృప్తిపడవద్దు మీ గుణ వర్ణన మా శ్రేయం కోరి చేసుకొంటున్నది కాని మరేమి కాదు ఆధ్యాత్మికస్వరూపం మానవుడు కనుకొనుటయే విస్మృతి చెంది పశుబలమే సర్వ సాధకమని మహామోహంగా మునిగి విషయ వాంఛయే ముక్తియని ప్రభులు ప్రమత్తులై లోకోపద్రవకరంగా కరి కరియు గిరి గిరియు పోరు మాదిరి పోరాడిన ఈ యుగంలో వరప్రసాదంతో భారత మాతకు జన్మించి మీరు లోక కళ్యాణ ప్రదమయ్యే ఋషి మార్గాన్నే మనోవాక్కాయ కర్మలనే చాటడం వల్ల అమెరికా దేశ ప్రముఖ మతాచార్యుడు మిమ్మల్ని ఆ క్రీస్తు మహాపురుషునకు ఈడుగా వర్ణించడంలో విపరీతోక్తి ఏమీలేదు

అట్లాంటి మీరు ప్రపంచ జీవితాన్నే పరిశుద్ధపరచడానికి ఉద్దేశించిన విశుద్ధ సందేశాన్ని ముందుంచుకొని మా పట్టణానికి రావడంవల్ల మేము ధన్యుల మైనాము ఈశ్వరుడు మీకు అనంత ఆరోగ్యబలము ఇచ్చి మిమ్ము రక్షించుగాక అని నిరంతరం ప్రార్థిస్తూ హృదయ పూర్వక స్వాగత మిస్తున్నాము"

ఇట్లు
భవద్విధేయ సోదరులు
తాడిపత్రి పురపాలక సంఘ పక్షాన
తాత్కాలికాధ్యక్షుడు
ఎ డి మాగి

ఈ సన్మాన పత్రానికి మహాత్ముడు ఈవిధంగా సమాధానమిచ్చినారు

"ఈ దినం ఎక్కువ కాలహరణమైనది కాబట్టి ముఖ్యమైన విషయాలను గురించి కొంచెంసేపు మాట్లాడతాను ఖిలాఫత్ సమస్య పరిష్కారానికి, జైలుపడిన నాయకుల విముక్తికి, స్వరాజ్య సంస్థాపనకు మీరు కొన్ని పనులు నిర్వర్తించవలసి ఉన్నది జిల్లా కాంగ్రెస్ సంఘానికి మీకూ ఉన్న భేదం వరిచి రాజీ కుదుర్చుకోవలె ఇక్కడ ద్వేషం అధికంగా ఉన్నందువల్ల దాని నివారణార్థమై మీ సర్వశక్తులను వినియోగించవలసి ఉన్నది హిందూ, మహమ్మదీయులు ఏకమత్యంతో ప్రవర్తించవలసిందిగా కోరుతున్నాను విదేశీ వస్త్రాలను అగ్నిహోత్రునికి ఆహుతి చేయకోరుతున్నాను మీలో ముసలివారు యువకులు, దరిద్రులు, వకీళ్ళు, గుమాస్తాలు, స్త్రీలు పురుషులూ అందరూ వడకటకం విధ్యుక్తధర్మంగా భావించవలె స్వదేశీ వ్రతం అవలంబించి, జూదము, తాగుడు, వ్యభిచారము మొదలైన వ్యసనాలనుంచి వైదొలగవలె పంచమ సోదరులను అవమానపరిచే బ్రాహ్మణులు ప్రాయశ్చిత్తం చేసుకోవలె బ్రాహ్మణులు లోకానికి సేవ చేయటానికి పుట్టిన వారు బ్రాహ్మణులకు సేవాధికారం మాత్రమే ఉన్నది పవిత్రమైన ఈ పినాకినీ నదీతీరంనుంచి నేనీ మాటలు చెబుతున్నాను ఈ మాట నిజము నేను చెప్పినట్లు మీరు చేస్తే మనం ఈ సంవత్సరం ముగిసే లోపల స్వరాజ్యం స్థాపించి ఖిలాఫత్ సమస్యను పరిష్కరించి మన మిత్రులను జైలునుంచి విముక్తులను చేయగలము"

మహాత్ముని ఉపన్యాసం తరవాత ఆజాద్ సుభానీగారు ఉపన్యసించినారు

ఆ తరవాత మహాత్ముడు స్త్రీల సభకు వెళ్ళినారు స్త్రీలు మహాత్మునికి స్వాగత పత్రం సమర్పించినారు

**స్త్రీల సన్మాన పత్రము**

"మోహన్ దాస్ కరంచంద్ మహాత్మాగాంధీగారికి వారి పశ్చిమాంధ్ర పర్యటన సమయంలో తాడిపత్రిపుర మహిళా బృందంవారు సమర్పించిన సన్మాన పత్రము

మహాత్మాజీ!

తమరు మా గ్రామానికి దయచేసి తమ దర్శనంచే మమ్ము పావనుల జేసినందుకు మా హృదయపూర్వక వందనాల సెర్పిస్తూ తమకు భక్తి ప్రేరితమైన స్వాగత మిస్తున్నాము శాంత భూమిలో పాశ్చాత్య నాగరక సంపర్కంతో హైందవ సంఘం ఉన్నతిని కోల్పోయి నానాటికి క్షీణించే విషమ సమయంలో ప్రాచ్యమైన ఆధ్యాత్మిక నాగరకతచే హైందవ సంఘాన్ని పునరుద్ధరించడానికి కంకణబద్ధులైన తమరు మేమెంతో కృతజ్ఞులము

మహాత్మా!

హిందూ దేశానికి రాజకీయాలు స్వాతంత్ర్యం సంపాదించే దీక్షతో

పురుషులు పనిచేస్తూ ఉండగా, ఆ స్వాతంత్ర్యానికి నూలు వడికే పరిశ్రమకు సంబంధం కల్పించి వారి అర్ధాంగులమైన మాకు సర్వ విధాల మాన సంరక్షణకు మార్గం చూపినందుకు మేము మిమ్మల్ని తో ప్రశంసించవలసి ఉన్నది మా మండలంలో స్త్రీలకు ఈనాట ప్రబోధం అక్కున్నా సర్వ సామాన్యంగ అల వాటుగా మేము స్వదేశీ వస్త్రాలనే ధరిస్తున్నాము

మద్యపాన నిషేధం విషయంలో మీ పరిశ్రమ వల్ల నిరంతర దుఃఖ మనుభవించే మా సోదరీమణులలో ఎందరో ఈనాడు సౌఖ్యమనుభవిస్తున్నారని సంతసిస్తున్నాము

ఈ నాలుగు మాటలను పలుకగలిగే శక్తి, అవకాశాలు భగవంతుడు మాకు కల్పించినందుకు కృతజ్ఞులము "

సర్వదా తము సంకల్పసిద్ధినికోరే
తాడిపత్రి మహిళాబృందము
28-9-1921

ఈ సన్మాన పత్రం స్వీకరించిన తరవాత మహాత్ముడు స్వదేశీ వ్రతం గురించి మాట్లాడ, క్షామనివారణకు ఆభరణాలను కోరగా అనేకులు తమ ఆభర ణాలను మహాత్మునకు సమర్పించినారు 1500 రూపాయల నగదు తిలక్ స్వరాజ్య నిధికి వసూలైంది తాడిపత్రిలో ఖద్దరు బట్టల ప్రదర్శనం జరిగింది 50 వేల మంది అన్నదానం చేయడానికి ఏర్పాట్లు జరిగినాయి

**మహాత్ముని కర్నూలు ప్రయాణము**

సెప్టెంబరు 29 వ తేదీ మధ్యాహ్నం 3 గంటలకు గాంధీజీ తన అనుచరు లతో తాడిపత్రి నుంచి కర్నూలుకు రైలులో ప్రయాణమై పోతూ ఉండగా మధ్య ప్రజలనేకచోట్ల స్టేషన్‌లలో వారి దర్శనార్థం గుంపులు గుంపులుగా చేరినారు గుత్తి స్టేషన్‌వద్ద గాంధీజీ, మౌలనా ఆజాద్ సుభానీగార్లు స్వదేశీ వ్రతం, దౌర్జన్యరాహిత్యం గురించి మాట్లాడినారు

రాత్రి 8 గంటలకు గుంటకల్లు చేరినారు ఆ స్టేషన్‌వద్ద చేరిన ప్రజలను సంబోధిస్తూ మహాత్ముడు, మౌలానాగార్లు స్వరాజ్య సంపాదనం గురించి మాట్లాడినారు

రాత్రి 12 గంటలకు ద్రోణాచలం చేరినారు గాంధీజీ నిద్రిస్తున్నారు ద్రోణాచలం స్టేషన్‌లో దాదాపు వేయిమంది జనం మహాత్ముని దర్శనార్థం వేచి ఉన్నారు అప్పుడు గాంధీజీతో కలసి సంచారం చేస్తున్న దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారు జనసమూహాన్ని సంబోధిస్తూ "గాంధీ మహాత్ముడు నిద్రలో ఉన్నారు వారికి నిద్రాభంగం కలిగించటం ఎంతమాత్రం ధర్మంకాదు మీరందరూ స్వరాజ్య సంపాదనకు మూలాధారమైన స్వదేశీ వ్రతం సంపూర్ణంగా అవలంబించి వడుకు నూలు బట్టలనే ధరించవలె ఉత్సవాలు, ఆర్భాటాలు, కరతాళ ధ్వనులు చేయకూడదు ఇదే గాంధీజీ సందేశం" అని చెప్పినారు.

గాంధీజీ కర్నూలుకు ప్రయాణం చేస్తున్న రైలుబండి అరటి కంబాలు మల్లెపూల తోరణాలు పతాకాలతో రమ్యంగా అలంకరింప బడవుంది ప్రతి స్టేషన్ వద్ద అనేకమంది ఆయనను దర్శిస్తూ వచ్చినారు

సెప్టెంబరు 30, 10 గంటలకు గాంధీజీ ఉన్న రైలు కర్నూలుకు చేరింది కర్నూలు స్టేషన్‌లో ప్రజలు వారికి అత్యద్భుతమైన స్వాగత మిచ్చినారు కర్నూలుపురమంతా శోభాయమానంగ అలంకరింపబడింది కర్నూలులో ఏర్పాట్లు చేసిన వారు మేడం వెంకయ్య శ్రేష్ఠిగారు నగరం వచ్చని తోరణాలతో ప్రకాశించినది ఆర్చీలపైన "మహాత్మాగాంధీకిజై, 'దేశనాయకులకు స్వాగతము", రాట్నమే స్వరాజ్యసాధనము" అనే వాక్యాలు వ్రాసినారు 10 గజాలకు ఒకరు చొప్పున స్వచ్ఛంద సేవకులు స్టేషన్ నుంచి ఊరివరకు నిలబడినారు మేడం వెంకయ్యగారు మహాత్ముని తమ గృహాని తీసుకొనిపోయి పూజించి స్వరాజ్య నిధికి 1116 రూపాయలు సమర్పించినారు

## బహిరంగసభ

తుంగభద్ర ఇసుక తిన్నెలపైన మధ్యాహ్నం 11 గంటలకు బహిరంగసభ జరిగింది ఎండ ఎక్కువగా ఉన్నప్పటికీ 26వేల మంది జనులు సభకు వచ్చినారు ఆనాడు గాంధీజీ పుట్టినరోజు వేదాధ్యయనంతో సభప్రారంభమయింది హిందువులు, మహ్మదీయులు ప్రార్థనలు చేసినారు వారి సర్వోత్తమ రావుగారు గాంధీజీకి నూతన ఖద్దరువస్త్రాలు సమర్పించినారు తరవాత కర్నూలు మునిసిపాలిటీవారు స్వాగత పత్రం చదివినారు

## మునిసిపల్ స్వాగత పత్రం

"కర్నూలు పురపాలక సంఘ సభ్యులు మీకు హృదయ పూర్వక స్వాగతం పలుకుతున్నారు సామాన్యమైన వస్త్రాలు ధరిస్తూ, సామాన్యమైన భోజనం చేస్తూ ప్రజానాయకుడెట్లుండ వలెనో మీరు ప్రపంచానికి చూపుతున్నారు బీదవారి కష్టాలు మీవిగా భావించుకొని ఆ సౌఖ్యాలను, ఆరోగ్యాన్ని పాటించక భారతీయుల అభివృద్ధికోసం పాటుపడు తున్నారు నిమ్నజాతి ఉద్ధరణకోసం మీరు ఎంతో కష్టపడుతున్నారు స్వదేశీఉద్యమం మీరు ప్రారంభించిన తరవాత నశిస్తున్న పరిశ్రమలను పునరుద్ధరించినారు మీరు మద్యపాన నిషేధం గురించి ఉత్సాహంతో పనిచేయడంవల్ల ఆకలితో దుర్భర కష్టాలు అనుభవించే అనేక కుటుంబాలు సుఖపడినాయి పరమపావనమైన మీ ఆగమనంవల్ల ఈ జిల్లాలో ప్రబోధం కలిగి సాంఘిక ఆర్థిక అభివృద్ధికి ప్రజానాయకులు పాటుపడినారని నమ్ముతున్నాము ధర్మం సత్యం నిరంతరం తమ దృష్టిపథంలో ఉండటంచే మీరు లోకోత్తర పురుషులని కీర్తి గాంచినారు

ఇట్లు

కర్నూలు పురపాలక సంఘ సభ్యులు,

తరువాత కర్నూలు మండల పౌరులు మహాత్మాగాంధీ, ఆజాద్ సుభాని మౌలానా గార్లకు మరొక స్వాగత పత్రం సమర్పించారు

**కర్నూలు మండలంవారి స్వాగత పత్రము**

"శ్రీయుత మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ మహాత్ములకు, మౌలానా అబ్దుల్‌ఖాదర్ ఆజాద్ సుభాని గారికి కర్నూలుమండల వాస్తవ్యుల స్వాగత పత్రము

మహాత్ములారా!

ఈ కర్నూలు మండల వాసుల పరంగా మేము మనఃపూర్వక స్వాగతం మిస్తున్నాము చంద్ర దర్శనానికి చకోరాలవలె తమ దర్శనం కోసం వేచి నిరీక్షిస్తున్నాము తమ ఆగమనం మమ్మల్ని సంతోషాబ్ధిలో ముంచింది

తాము నిర్వహిస్తున్న హిందూ మహమ్మదీయుల ఐకమత్యోద్యమం చేత, మద్యపానాది దుర్వ్యసన నిర్మూలనం చేయడంచేత, దేశంలో క్షీణించిన శిల్పాలను కళలను పునరుద్ధారణం చేయడం, దేశ భారతీయుల గౌరవం కాపాడటానికి చేసే అనిర్వచనీయ ప్రయత్నాలచేత, జాతీయ స్వరాజ్య సంపాదనార్థమై తాము పూని ఉండే సత్యాగ్రహ దీక్షచేత తమకీర్తి లోకమంతట వ్యాపించి ఉంది తాము పూనిన దౌర్జన్య రహిత సహాయనిరాకరణ మహోద్యమం అవలంబించడంలో మాయున్న ఆసక్తి తమ దర్శనం చేసుకోవడానికి మమ్ము ఉత్సాహపరిచింది తమ బోధనలను వినే భాగ్యం లభించడం చేత మాకు స్వధర్మాచరణంలో ఉత్సాహము, మనోదార్ఢ్యం కలుగుగాక

మా జిల్లాలో ఇంతవరకు జరిగి ఉండే కార్యం తెలుసుకోవడానికి తమకు సంతోషాలం ఉండవచ్చు కాంగ్రెస్ సభలు, కాంగ్రెస్ సభ్యులు, తిలక్ స్వరాజ్య నిధి పంచాయతీ కోర్టులు రాట్నాలు, మద్యపాన నిరోధము, ప్రచారకులు - వీటిలో మా మండలంలో కొందరు ఉత్సాహవంతులు స్వాతంత్ర్యపడికి పరిశ్రమను వృద్ధిచేయడంలో, మద్యపానం మాన్పుటలో పంచాయతీ కోర్టులు స్థాపించడంలో శ్రద్ధగా పనిచేస్తున్నారు కాని జరుపని కేవలం స్వల్పము, చేయవలసినంత పని చేయలేదని ఎంతో చింతిస్తున్నాము

"తాము పూనిన ఉద్యమం త్వరలో సఫలం చేయవలెనని జగత్కర్త అయిన పరమేశ్వరుని సర్వదా ధ్యానిస్తున్నాము

"భగవంతుడు తమకు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి హిందూదేశానికి స్వరాజ్యం ప్రసాదించుగాక

ఇట్లు
కర్నూలు మండల పౌరులు

కర్నూలు దుర్మతి భాద్రపద బ॥ ౧౪

ఈ స్వాగత పత్రం ఒక పెట్టెలో ఉంచి మహాత్మునికి సమర్పించినారు ఆ పెట్టెపైన వెండితో రాట్నాలు చిత్రించబడి ఉన్నాయి ఆ పెట్టె వేలం వేయగా 450 రూపాయలు వచ్చినాయి

ఈ సన్మాన పత్రానికి సమాధానంగా గాంధీజీ ఉర్దూ భాషలో ఇట్లా మాట్లాడినారు

'మీరిచ్చిన స్వాగతానికి నా వందనాలు ఈ ప్రాంతాలలో క్షామం మెక్కువగా ఉన్నది కష్టపడుతూన్న మీ సోదరుల సహాయంకోసం మీరందరూ నగలూ ధనమూ ఇవ్వవలెనని కోరుతున్నాను మనము చేయవలసిన పని చాలా ఉంది వ్యవధిలేదు ఉత్సాహంతో, ఆర్భాటాలతో కాలం వృథాపుచ్చ కూడదు సంపూర్ణ స్వదేశీ వ్రతం అవలంబించండి స్వదేశీ ఉద్యమంలో మనం విజయం పొందితే అన్ని సమస్యలు పరిష్కారం కాగలవు ప్రభుత్వం వాగు రెచ్చగొట్టినా మనం శాంతంగా ఉండటం ఆవశ్యకము మీరు మద్యపానం చేయకూడదు జూదము వ్యభిచారాలవంటి వ్యసనాలు కూడదు ఇట్లా మనం ప్రయత్నంచేస్తే ఈ సంవత్సరమే ఖిలాఫత్, పంజాబు సమస్యలు పరిష్కరింప బడగలవని, స్వాతంత్ర్యం లభించగలదని ఖండితంగా చెబుతున్నాను

గాంధీగారి ఈ ఉపన్యాసానంతరం ఆజాద్ సుభానీగారు హిందూ మహమ్మదీయ ఐక్యం గురించి విపులంగా ప్రసగించినారు

సభ ముగిసే ముందు మద్యపానము, జూదము, వ్యభిచారము మొదలైన దుర్వ్యసనాలను వదలి వేయవలెనని గాంధీజీ ప్రజలను మరోసారి హెచ్చరించి నారు

## మహాత్ముని బళ్ళారి ప్రయాణము

మొట్టమొదటి కార్యక్రమం ప్రకారం గాంధీజీ ఆయన సహచరులు కర్నూలు నుంచి మోటారు మీద బళ్ళారికి వెళ్ళవలెనని నిర్ణయించడం జరిగింది కాని బళ్ళారినుంచి వారికి కావలసినన్ని మోటారు కార్లు రానందువల్ల రోడ్లు బాగుండనందువల్ల మోటారు ప్రయాణం కూడదని వారు భావించినారు బళ్ళారి ప్రయాణం మానివేయవలెనని కొందరు సలహా ఇచ్చినారు కాని మహాత్ముడు బళ్ళారి పౌరులకు ఆశాభంగం కలిగించటానికి ఇష్టపడలేదు ఎంత అసౌకర్యమైనా, ఎంత కష్టమైనా బళ్ళారికి పోయితీరవలసిందేనని పట్టు బట్టి నారు అందువల్ల వారు మధ్యాహ్నం 2 గంటలకు కర్నూలులో బయలుదేరి రాత్రి 7 గంటలకు గుంటకల్లు చేరి రాత్రి 12 గంటలకు బళ్ళారిలో దిగినారు

అర్ధరాత్రి అయినప్పటికీ వేల కొద్దీ జనం మహాత్ముని దర్శనంకోసం కాచుకొని ఉన్నారు ఉత్సాహపూరితులైన పౌరులు స్వాగతం చెబుతూ ఉండగా మహాత్ముడు ధర్మవరం గోపాలాచారి గారింటికి వెళ్ళినారు గోపాలా చారిగారి భవనానికి ఎదట ఉన్న పెద్ద మైదానంలో పెద్ద సభ జరిగింది బళ్ళారి మునిసిపల్ సంఘంవారు, కాంగ్రెస్ సంఘాలవారు మహాత్మునికి

స్వాగత పత్రాలు సమర్పించినారు ఆయన ఇట్లా ప్రత్యుత్తర మిచ్చినారు

"మీ స్వాగతాలకు వందనాలు ఈ జిల్లాలో ఆంధ్ర కర్ణాటక సమస్య ఎంతో తీవ్రంగా ఉన్నదని తెలుస్తున్నది ఆంధ్రదేశంలో ఇట్లాంటి సమస్యలే మరి కొన్ని ఉన్నాయి అయినా ఇట్లాంటి సమస్యలను ఆధారంగా తీసుకొని మన లక్ష్యం మరిచి పోవడం అనర్థదాయకము ఈ మూడు మాసాల కాలము ఈ సమస్యలను మరిచిపొండి! స్వరాజ్యం స్థాపింపబడిన తరవాత ఈ సమస్యలను తృప్తికరంగా పరిష్కరించుకోవచ్చు"

గాంధీజీ ఇచ్చిన ఈ ఉపన్యాసానంతరం అజాద్ సుభానీగారు హిందూ మహమ్మదీయ ఐకమత్యం గురించి, స్వదేశీ ఉద్యమం గురించి చాలా సేపు మాట్లాడినారు

మహాత్ముడు, ఆయన సిబ్బందీ అదే రాత్రి బయలుదేరి ఉదయం 5 గంటలకు గుంటకల్లు చేరి, 8-15 గంటలకు బొంబాయి మెయిలులో కొండ వేంకటప్పయ్య పంతులు, హరిసర్వోత్తమరావుగార్లతో సహా బొంబాయి వెళ్ళినారు

**గాంధీజీ సందేశము**

పశ్చిమాంధ్ర మండలాల పర్యటనను ముగిస్తూ గాంధీజీ ఆంధ్రులకు ఇట్లా సందేశం పంపినారు,

"ఆంధ్ర దేశంలోని ఇతర భాగాలలో నేను వెనక తిరిగి నపుడు కనిపించిన నిర్మాణ సామర్థ్యంగాని, నాయకత్వం గాని దత్త మండలాలలో నాకు కనిపించ లేదు స్వరాజ్యం ఈ సంవత్సరంలో సాధించటానికి ఆంధ్రులకు శక్తి ఉన్నది వారా ప్రయత్నంలో అగ్రస్థానం అలంకరించగలరని నా నమ్మకము ఇంకా నేనట్లాగే నమ్ముతున్నాను ఎందువల్లనంటే ఆంధ్రప్రజా సామాన్యం చైతన్య వంతమైనట్టుగా నేను భావిస్తున్నాను వారిలో కలిగిన ప్రబోధం సరిగా ఉపయోగించుకోగలిగితే వారు స్వరాజ్య సంపాదనకు సంసిద్ధులు కాగలరు దత్త మండలంలో న్యాయవాదుల నడవడి ఏమీ బాగాలేదు వారిలో చలనం కలగవలెనని కోరుతున్నాను వైశ్య సంఘం వారు క్రమ క్రమంగా ముందుకు వచ్చి స్వదేశీ ఉద్యమం చేపడుతున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది ఆ పనికి వారే తగినవారు ప్రస్తుత పోరాటం ఈ సంవత్సరంలో జయప్రదం కావాలంటే ఆంధ్ర నాయకులింకా ఎక్కువ శ్రద్ధతో పనిచేయవలసి ఉన్నది మన బలాలు చెల్లాచెదరై అశిక్షితులుగా ఉన్నాయి ఏమి చేయాలో తెలియక ప్రజలు తమ శక్తిని వట్టి కేకలతోను, అనవసరపు ఆడంబరాలతోను దుర్వినియోగం చేస్తుంటారు ఆంధ్రులు నూలువడికే నేర్పును మరిచిపోనందుకు నా హృదయం ఎంతో ఉప్పొంగినది నాయకులు తలపెడితే ఆంధ్రులకు, తదితరులకు సరిపోయే ఖద్దరు వస్త్రం నంతా ఆంధ్రులే తయారు చేయగలరు అంతే గాక ఆంధ్ర దేశంలో కరువు లేకుండా చేయగలరు మన ఇళ్ళలో రాట్నమున్నప్పటికీ కరువును నిర్మూలించగల దాని శక్తిని మన మింత కాలం ఎందుకు తెలుసుకోజాలక పోయినామని మనలో మనకే ఆశ్చర్యం కలుగుతుంది

స్థానికమైన ఇబ్బందులను గురించి ఆంధ్ర మిత్రులు కొంతవరకు ఓరిమిగా ఉండలేక పోతున్నారని నేను గ్రహించినాను వారిలో కొందరికి ఈ విషయమై చాలాపట్టుదల ఉందని కూడా నాకు తెలుసు వారికెంత పట్టుదల ఉన్నప్పటికీ మనకు మిగిలిన 3 మాసాల లోపల ఒక్క నిమిషంకూడా పట్టుదలతో కాలం వృథా చేయటం ఆత్మ హత్యకు కారణ మవుతుంది ప్రతి పురుషుడు ప్రతి స్త్రీ విదేశీ వస్త్ర బహిష్కారానికి, ఖద్దరు వస్త్రం తయారు చేయడానికి తమ దృష్టిని మరల్చ వలసి ఉంటుంది మిల్లునూలు, చేతినూలు మధ్య ఎంత మాత్రం రాజీ కూడదు హిందూ దేశమంతటిలో ఆంధ్రస్త్రీలు నూలువడికినట్లు మరొకరు వడకరు వారు వడికేనూలు ఎంతో నాజూకుగా ఉండడమేకాక గట్టిగా కూడా ఉంటుంది కాబట్టి ఆంధ్ర దేశంలో నేత నేసేవారెవ్వరైనా విదేశీ నూలును గానీ, మిల్లు నూలునుగాని, తాకడం తప్పుగా భావించవలసి ఉంటుంది ఆంధ్రులీపని చేస్తే ఆంధ్రదేశంలో ఉన్న సంపద హిందూ మహమ్మదీయ సఖ్యము, అహింసా, ప్రవర్తిల్లి, అస్పృశ్యత తొలగి పోగలదు స్వదేశీ ఉద్యమం సఫలంకావడానికి కడపటి మూడు విషయాలు ముఖ్యావసరాలు

## బళ్ళారిలో మరికొన్ని ఉదంతాలు - (1921)

1921 సెప్టెంబరు 29 వ తేది గాంధీగారు తాడిపత్రిలో ఉన్నారు 29 సాయంత్రం కర్నూలు వెళ్ళి 30 కి బళ్ళారికి చేరవలెనని ఆయన కార్య క్రమము బళ్ళారి పట్టణం గురించి ఆంధ్రులకు కర్ణాటకులకు అప్పటికే వివాద మున్నది ఆంధ్రుల ఆహ్వానంపై బళ్ళారికి రాకూడదని కర్ణాటకులు గాంధీజీకి టెలిగ్రామ్‌లు పంపినారు వాటిని లెక్కచేయకుండా మహాత్ముడు నిర్ణీత కార్య క్రమం ప్రకారం కర్నూలు నుంచి రాత్రి 10 గంటలకు బళ్ళారి చేరినారు ఆ సాయంకాలం మూడు గంటలకు బళ్ళారిలో మూడు దుక్కుల వర్షం కురిసింది మహాత్ముని రాకకు శుభ సూచకమని ప్రజలు వర్షంలో చిందులు తొక్కినారు మహాత్మునితో శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, శ్రీ కొండ వేంక టప్పయ్య పంతులుగారు ఉన్నారు

గాంధీజీ బళ్ళారిలో 'ఆంధ్ర నాటక పితామహ' ధర్మ వరం కృష్ణమా చార్యులు గారియింట్లో 10 నిమిషాలు ఉండి సభా వేదికకు చేరే సరికి రాత్రి 10-30 గంటలయింది వేలకొద్దీ ప్రజలు మహాత్ముని దర్శనార్థం వేచి ఉన్నారు

సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నందుకు శ్రీ కల్లూరి సుబ్బా రావుగారు 1921 ఆగష్టు 29 నుంచి నెల రోజులు కారాగార శిక్ష ననుభవించి సెప్టెంబరు 28 నాడు విడుదలై 30 వ తేదీని మహాత్ముని దర్శనార్థం బళ్ళారి చేరి గాంధీజీ బళ్ళారిలో వేదిక ఎక్కగానే ఆశువుగా ఆయనను గురించి కొన్ని పద్యాలు చెప్పి మహాత్ముని సమీప దర్శనం పొంది వారికి నమస్కరించి కృతార్థులయినారు

గాంధీజీ ఆ రాత్రి బళ్ళారి సభలో ఉపన్యసించి తెల్లవారు ఝామున

ఐదు గంటలకు వెళ్ళవలసిన రైలు గుంటకల్లు స్టేషన్కు వెళ్లి ప్లాటుఫారంపైననే విశ్రమించి రైలు ఐదు నిమిషాలకు వస్తుందనగా నిద్ర లేచినారు రైలులో కూర్చున్న తరవాతనే ఆయుష్కర్మ చేసుకొన్నారు గాంధీని, అలీ సోదరులను గుంతకల్లు స్టేషన్లో పోలీసులు అరెస్టు చేస్తారని వదంతి బయలు దేరింది అందువల్ల గాంధీ బృందంతో పాటు శ్రీ కల్లూరి సుబ్బారావు కూడా ఆ రైలులోనే గుంటకల్లు వరకు ప్రయాణంచేసినారు ఆ ప్రాదు సుబ్బారావుగారు గాంధీజీతో 'మీరు సంవత్సరంలో స్వరాజ్యం వస్తుందన్నారు అదే మాదిరిగా మేమూ చెబుతున్నాం వస్తుందా?" అని గాంధీజీని అడిగినారు "ఈ సంవత్సరంలో ప్రజలు తాము పరాధీనులమని తెలుసుకొని స్వరాజ్యకాంక్ష కలిగి ఉండేటట్లు చేయడమే నా సంకల్పము" అన్నారు గాంధీ గుంతకల్లు నుంచి గాంధీజీ బొంబాయి వెళ్ళినారు

## గాంధీ జన్మదినోత్సవాలు

ఆంధ్రదేశంలో పలుచోట్ల సెప్టెంబరు 30 వ తేది నుంచి వారం రోజుల పాటు గాంధీజీ జన్మదినోత్సవాలు జరిగినాయి పిఠాపురము, కాకినాడ, వసంతవాడ, పోలేరు, చీరాల, పాలకొండ, కొల్లూరు, పెద్దాపురము, అనకాపల్లి మొదలయిన అనేకచోట్ల జరిగిన గాంధీ జన్మదినోత్సవాలలో బహిరంగసభలలో విదేశీ బట్టలు కుప్పలు కుప్పలుగా తగులబెట్టబడినాయి సభకు వచ్చిన వారిలో అత్యధిక సంఖ్యాకులు ఖాదీ వస్త్రధారులైనారు బహిరంగ సభలలో నాయకులు స్వదేశీ గురించి స్వరాజ్య సంపాదన గురించి ఉపన్యాసాలు చేసినారు కొన్నిచోట్ల ప్రత్యేకంగా స్త్రీల సభలు జరిగినాయి స్త్రీల సభలలో దువ్వూరి సుబ్బమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మగార్లు స్త్రీలను నిత్యం నూలు వడకవలసిందని హెచ్చరించినారు

## బొంబాయినుంచి గాంధీజీ సందేశము

పశ్చిమాంధ్ర జిల్లాల పర్యటనను ముగించుకొని గాంధీజీ బొంబాయి చేరిన తరవాత రాయలసీమ వారికి గాంధీజీ ఈ దిగువ సందేశం పంపినారు

'స్వదేశీ వ్రతమును దీక్షతో పూనండి విదేశీ బట్టలను పూర్తిగా త్యజించండి సభలలో శాంతంగా ఉండండి ఉత్సవాలు మొదలయిన ఆడంబరాలనన్నిటినీ మానండి కర్రలు పట్టుకో వద్దని వాలంటీర్లకు ముఖ్యంగా బోధించండి దౌర్జన్యం పూర్తిగా తొలగి పోయి గంభీర ప్రశాంతం నెలకొనేటందుకు క్రమ శిక్షణ ముఖ్యావసరము " ఈ సందేశం గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారి ద్వారా పంపినారు

## క్షామ నివారణము

గాంధీజీ రాయలసీమ సంచారం ముగించుకొని వెళ్ళిన తరవాత 'యంగ్

ఇండియా' పత్రికలో 1921 అక్టోబరు 6 వ తేదీన 'క్షామ నివారణము' అనే శీర్షిక కింద ఇట్లా వ్రాసినారు

నా రాయలసీమ యాత్రలో రాట్నం క్షామానికి ప్రతికూలంగా ఒక ఉత్కృష్టమైన 'బీమా'అని క్షామ నివారణకు అత్యుత్తమైన సాధనమనీ పూర్తిగా రుజువైయింది ఈ జిల్లాలోని కొన్ని భాగాలలో తీవ్రమైన కరువు చెలరేగింది ఒకానొక స్త్రీ తనను తన బిడ్డలను పోషించుకోలేక ఆమె ఆమె బిడ్డలు కూడా నీళ్ళలో పడి చనిపోయినట్లు ఒక కార్యకర్త నాకు చెప్పినాడు లక్షలాది ప్రజలకు కొన్ని పైసలో కొంచెం బియ్యమో ఇచ్చి బ్రతికించటం సాధ్యం కానిపని ఇతరుల దాతృత్వం మీద జీవించే వారు ఆత్మ గౌరవాన్ని పోగొట్టుకొంటారు కరువు ప్రాంతల్లో ధాన్యం లేనందువల్ల ప్రజలు బాధ పడుతున్నారనడానికి వీలులేదు వారికి పని లేకపోవడంవల్ల డబ్బులేకుండా పోయింది ప్రభుత్వం వారు రాళ్ళు మోయడం, రాళ్ళు పగలగొట్టడం వంటి పనులు చెప్పి వారి కష్ట నివారణకు చర్యలు తీసుకొంటున్నారు ప్రభుత్వం వారు రోడ్లు పగలగొట్టించి తిరిగి ఆరోడ్లను మరమ్మతు చేయించడంద్వారా తిండిలేక బాధ పడుతూండిన స్త్రీ పురుషులకు పని కల్పిస్తున్నారని ఒక స్నేహితుడు నాతో అన్నాడు రోడ్లు పగలగొట్టినా, పగలగొట్టకపోయినా రోడ్లు మరమత్తు చేయడం అనే పనినే క్షామనివారణోపాయంగా ప్రభుత్వం వారు భావిస్తున్నారు ఇందువల్ల ఒక స్త్రీకి సరిగా 6పైసలో, అణాయో లభిస్తుందని మగవానికి 10పైసలకంటె ఎక్కువ రాదని నేను వింటున్నాను ఇది ఇట్లా ఉండగా పంచమ స్త్రీలు రోజుకు 8గంటలకు రాట్నం మీద పనిచేస్తే కాంగ్రెస్ కమిటీవారు ఒక్కొక్కరికి రోజుకు 3 అణాలు ఇస్తూన్నట్లు కూడ నాకు తెలిసింది పంచమ స్త్రీల విషయంలో ఎట్లా జరుగుతున్నదో క్షామ పీడితులైన వేలకొద్దీ స్త్రీ పురుషుల విషయంలో కూడా అట్లా జరిగవచ్చు ఈ జిల్లాలో పురుషులకు కూడా ఒక్కొక్కరికి రోజుకు 3 అణాల సంపాదన నిజానికి ఎంతో ఉపకారంగా ఉంటుంది ప్రవృత్తికిలోటు లేని అవకాశాలు రాట్నపు వృత్తిలో ఉన్నవి ఎందువల్ల నంటే రాట్నం మీద నూలు వడకడానికి ముందు పత్తిలో గింజలు తీయడం, ఏకడం, ఏకులు చేయడం మొదలయిన పనులు టాయి నూలువడికిన తరవాత నేతపని ఉంటుంది దత్త మండలాలలో ఎక్కువ కష్టం లేకుండా నేత నేర్పవచ్చు ఈ విధంగా మొదటినుంచి చివరివరకూ వస్త్రోత్పత్తి వృత్తిని ఏర్పాటు చేస్తే వేలకొద్దీ జనులు వారి ఇళ్ళలోనే శాశ్వతమైన పనిని కల్పించుకోగలరు కార్యకర్తలు క్షామ పీడితులైన ప్రజలుకూడా రాట్నం వల్ల అవకాశాలను గుర్తిస్తూ ఉన్నట్లు ప్రతి కార్యకర్తా స్వేచ్ఛగా ఒప్పుకొంటున్నాడు ప్రజలు రాట్నంవల్ల ఆశాపూరితులైనారని కార్యకర్తలు నూలు వడకటం నేయటం వంటి పనులకు ఏర్పాట్లు చేస్తూన్నారని తెలుస్తూన్నది

రాట్నం క్షామ నివారణకు ఉత్తమమైన బీమా వంటిదని నేను చెప్పి

నప్పుడు నన్విన వారు కూడా స్వానుభవంవల్ల అందులోని సత్యం గ్రహిస్తారనట్లు కొంతమంది ద్వారా నాకు తెలుస్తున్నది

ఇది కేవలం మార్పుకు ప్రారంభదశ అని మాత్రమే నాకు తెలుసు అయితే ఇది పరిపక్వ దశకు వచ్చిన నాడు చేతులలో బలంగల స్త్రీ పురుషు లెవ్వరూ బిచ్చమెత్తు కోవలసిన అవసరంగాని, ఉపవాసం చేయవలసిన అవసరం గానీ ఉండదు ఈ నాడు కరువు వచ్చిన సంవత్సరంలో బాగా పనిచేయ గలిగిన వేలకొద్దీ జనులు సైతం చేయతగిన పనిలేక అర్ధాకలితో ఉండడమో బిచ్చ మెత్తుకోవడమో జరుగుతున్నది ఇది అవమానకరమూ, నీచమూ అయిన దృశ్యము "

యంగ్ ఇండియా
6 అక్టోబరు 1921

## ధైర్యశాలురైన విద్యార్థులు

"అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం జరుగుతూవుండగా ఖాదీ ధరించిన అపరాధానికి కళాశాలనుంచి తొలగించబడిన ధైర్యశాలురైన వైద్య విద్యార్థుల నుంచి ఉత్సాహ జనకమైన దిగువ తంతి వార్త చేరింది "

"డిశంబరులో స్వరాజ్య సమస్యను పరిష్కారం చేయటానికి క్లిష్ట సమయంలో సమావేశమైన కాంగ్రెస్ కమిటీకి ఇటీవల ఖాదీ టోపీలు ధరించి నందుకు కళాశాలనుంచి తొలగించిన 89 మంది వైద్య విద్యార్థులు గౌరవ పురస్సరంగా ప్రణామాలు సమర్పిస్తున్నారు మాతృదేశ సందేశాన్ని ఆలకించి స్వరాజ్య సమరకాలంలో చదువుమాని జాతీయ సేవలో పాల్గొనేటందుకు నిశ్చయించుకొన్నాము అందువల్ల మేము సేవాసమితిగానూ, రామదండుగానూ పర్చడి ఇంటింటికి స్వదేశీ ప్రచారం చేయదలచుకొన్నాము మా నిధుల విషయంలో స్వయం శక్తి మీద ఆధారపడుతున్నాము స్వరాజ్య సంపాదన విషయంలో కాంగ్రెస్ కమిటీకి విధేయులముగా ఉండి చేతనైన సేవ చేయ డానికి నిశ్చయించుకొన్నాము భావి పోరాటంలో మా వంతు కష్టాలను భరించ దలుచుకొన్నాము మీ సలహా కోసం ఎదురు చూస్తున్నాము మాకు ప్రెసిడెంట్ సుందరరావుగారి ద్వారాకానీ బారిష్టరు ప్రకాశంగారి ద్వారా గానీ ఈ ఉద్యమం కొనసాగడానికి సహాయం చేయకోరుతున్నాము

"ఈ తంతివార్తలోని విషయాన్ని ప్రతి విద్యార్థి గమనించ వలసిందిగా కోరుతున్నాను ఈ యువకులు ఖాదీ టోపీలను ధరించి ఆత్మగౌరవం ప్రదర్శించడమేకాక తమ ఆత్మగౌరవానికి, దేశభక్తికి అనుగుణంగా తమకు తటస్థించిన కష్టాలను ధైర్యంగా ఎదుర్కొంటూ తమకాలాన్ని జాతీయసేవలో సద్వినియోగం చేస్తున్నారు ఈ దేశం బానిసత్వమనే దీర్ఘవ్యాధివల్ల బాధపడు తూన్నది ఆరోగ్యానికి తగిన చికిత్సచేయదలుచు కొన్నవారు నిజాయితీగా ఉన్నట్లయితే తక్కిన రోగాలన్నీ చాలావరకు చికిత్సతో అవసరం లేకుండానే

వాటంతటవి నిర్మూలం కాగలవు ఇప్పుడు వైద్యవిద్యార్థులు తీసుకొన్న చర్య వల్ల ఉత్తమ శ్రేణికిచెందిన వైద్య విద్యార్థిని విద్యార్థులు ప్రజా సేవకు తయారు కాగలరు

యంగ్ ఇండియా

**విశాఖ పట్టణ వైద్య విద్యార్థులు**

ఖాదీ టోపీలు ధరించి వైద్య పాఠశాలకు పోయినందుకు ఆ పాఠశాల నుంచి తొలగింపబడిన వైద్య విద్యార్థులను అభినందిస్తూ గాంధీజీ 'యంగ్ ఇండియా' పత్రికలో వ్యాసం వ్రాసినారు అట్లా తొలగింపబడిన విద్యార్థులను గురించి సంగ్రహంగా దిగువ ఉదాహరిస్తున్నాము

1 డాక్టరు ఏ బి నాగేశ్వరరావు, రాజమహేంద్రవరం ఈయన కొంత కాలం రాజమహేంద్రవరం మున్సిపల్ చైర్మనుగా పనిచేసినారు ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వంలో కొంతకాలం మంత్రిగా కూడా ఉన్నారు
2 కీ శే డాక్టరు వంగవేటి దీక్షితులు సీతానగర ఆశ్రమంలో ఉండేవారు
3 కీ శే డాక్టరు కె యల్ నరసింహారావు కొన్నాళ్లు రాజ్యసభ సభ్యుడుగా ఉన్నారు
4 కీ శే డాక్టరు చెన్నూరి వెంకట సాంబశివరావు, పొన్నూరు ఈయన దామెర్ల పుండరీకాక్షుడు గారు వ్రాసిన "గాంధీ విజయం" నాటకంలో గాంధీవేషం వేసేవారు
5 జి నారాయణమూర్తి ఈయన "గాంధీ విజయం"లో షౌకతాలీ వేషం వేసేవారు
6 డాక్టరు తణికెళ్ల సత్యనారాయణ, పిఠాపురం
7 గంటి సూర్యనారాయణ, విశాఖ పట్టణం
8 కీ శే రాచకొండ వెంకటేశ్వర్లు
9 డాక్టరు చుడిమెళ్ల శ్యామలరావు (బొందూరు, గంజాంజిల్లా)
10 డాక్టరు జి బుచ్చిరాజు
11 డాక్టరు భారతం సూర్యనారాయణ
12 ఖండవల్లి నరసింహం
13 మిస్సుల సత్యనారాయణ
14 డాక్టరు యం ఎస్ వెంకటేశ్వర్లు (విజయనగరం)
15 డాక్టరు పోతరాజు శోభనా చలపతిరావు (మచిలీపట్టణం)

వీరంతా ఆరోజులలో విరివిగా ఖాదీ ప్రచారం చేసినారు ఖాదీ బుజాన వేసుకొని ఇంటింటా తిరిగి ఖాదీ విక్రయించినారు వీరికి గవర్నమెంటు డాక్టరు అలవా సింగరీ, వసంతరావు బుచ్చి సుందరరావుగార్లు బాగా తోడ్పడినారు

విశాఖపట్నం వైద్యపాఠశాలనుంచి విద్యార్థులు తొలగింప బడిన ఉదంతం వసంతరావు బుచ్చిసుందరరావుగారు 'యంగ్ ఇండియా' పత్రికకు

సైనికులుగా జాతీయ కార్యక్రమం నిర్వహిస్తున్నారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలు ఇట్లా జరుగుతుండగా తాత్కాలికంగా పాఠశాలలనుంచి తొలగించబడిన విద్యార్థులలో కొందరు విశాఖపట్నం విడచి తమ ఇళ్ళకు పోవడానికి ఉద్దేశించినట్లు అధికారులకు తెలపగా వారందుకు సమ్మతించక వారిని అన్యాయంగా నిరోధించినారు. ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను బట్టి గవర్నమెంట్ వారు ఖాదీ మీద యుద్ధం సాగించినారని విద్యార్థులు తెల్లటోపీలను నలుపుచేసి పెట్టుకోవడానికి కూడా వారంగీకరించలేదని తెలుస్తూన్నది.

విద్యార్థులకు, అధికారులకు మధ్య నడిచిన ఉత్తర ప్రత్యుత్తరాల నకళ్ళను ఇందుతో పంపుతున్నాను. వాటిని బట్టి ఈ విషయంలో మీకు సరియైన భోగట్టా తెలియగలదు.

| | |
|---|---|
| శ్రీరామాశ్రమం | మీ |
| విశాఖ పట్టణం | వి బి సుందరరావు |
| 9-11-1921 | (వసంతరావు బుచ్చిసుందరరావు) |

మద్యనిషేధం-గాంధీజీ

## డాక్టర్ జాన్సన్ ప్రశంస

అమెరికాలో మద్యపాన నిషేధోద్యమానికి మూలకారకుడైన జాన్‌సన్ ప్రపంచ పర్యటన చేస్తూ ఇటీవల-హిందూ దేశానికి వచ్చినారు. వారు హిందూ దేశంలోని అధికారులతో విశేషంగా కలిసిమెలిసి ఉండటం తటస్థించింది. కాని జాతీయ నాయకులతో కలవలేక పోయినారు. గాంధీమహాత్ముని సైతం కలుసుకోలేక ఇండియా విడిచి వెళ్ళినారు. కాబట్టి మద్యపాన నిషేధం గురించి ఆయనకు ఇండియాలో తెలిసిన భోగట్టా ప్రభుత్వాధికారులనుంచి అని గ్రహించవలసి ఉంటుంది. సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించిన తరవాత మద్య నిషేధోద్యమం విజయవంతంగా కొనసాగిందనే అభిప్రాయం వెల్లడిస్తూ ఆయన గాంధీజీకి ఇట్లా వ్రాసినారు.

"మీ దేశం నుంచి వస్తూన్నప్పుడు ఇండియాలోని మద్యపాన నిషేధోద్యమం తద్వారా ప్రపంచానికి మీరు చేస్తున్న అద్భుత సేవను గురించి నేను ఆలోచిస్తున్నాను. మీరు రెండు సంవత్సరాలలో మద్యనిషేధ విషయంలో చేసిన పని ప్రపంచ చరిత్రలో ఏ ఒక్క మానవుడూ ఆ కాలంలో చేయగలిగిన దానికంటే అత్యధికమైనదని చెప్పవచ్చు. ఈ విషయం నేను మీకు స్వయంగా చెప్పలేక పోయినందుకు ఎంతో చింతిస్తున్నాను." ఇందుకు ప్రత్యుత్తరంగా గాంధీజీ ఈ పని చేయడానికి రెండు సంవత్సరాలైనా పట్టలేదని అనేకమంది

ప్రచారకులు నిరాకరణోద్యమ పవిత్ర స్వభావంవల్ల ప్రేరేపితులై ఈ పని నెరవేర్చినారనీ దీనిని నిర్వహించిన గౌరవం వారికి చెందుతుందని గాంధీ మహాత్ముడు 'యంగ్ ఇండియా' పత్రికలో వ్రాసినారు

దీనిని బట్టి మద్యనిషేధోద్యమం ఈనాడు ఇండియాలో జయప్రదంగా కొనసాగదనే వారి వాదనలో ఎంత పటుత్వమున్నదో తెలుస్తుంది

# 10
# ఆంధ్ర రాష్ట్రము-1922

ఆంధ్రరాష్ట్రంలో సహాయ నిరాకరణోద్యమం రోజు రోజుకు విజృంభించ సాగింది అందు కనుగుణంగా ప్రభుత్వ నిర్బంధ విధానం కూడ పెచ్చు పెరిగి పోతూ వచ్చింది కొన్ని పట్టణాలలోను, గ్రామాలలోను సభలు చేయకూడదని క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144వ సెక్షన్‌ను ప్రయోగించడం జరిగింది 1921 డిశంబరు 25వ తేదిని వాడూరి సుబ్బరామయ్య, ఆయన సతి బాల సరస్వతమ్మ గార్లు నెల్లూరి జిల్లా ముత్తుకూరు గ్రామంలో స్త్రీల సభలో ఉపన్యసిస్తూండగా క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 144 కింద సభ చేయరాదని వారిపైన నోటీసు జారీ చేయడం జరిగింది బాల సరస్వతమ్మగారు నోటీసుపైన తాను తన భర్తకు, దైవానికి తప్ప మరొకరి ఆజ్ఞకు బద్ధురాలిని కానని నోటీసుపైన వ్రాసి మాజిస్ట్రేటుకు తిరిగి పంపినారు తరవాత ఆ స్త్రీల సభ నిర్విఘ్నంగా జరిగింది

తూర్పు గోదావరిజిల్లాలో సాంబమూర్తి మొదలయిన వారికి కారాగార శిక్షలు విధించడంజరిగినవి డాక్టర్ సుబ్రహ్మణ్యంగారికి 108 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ కింద సెక్యూరిటీ నోటీస్ ఇచ్చినారు వారిపై ఆ నోటీస్ జారీ చేయడం జరిగిందని తెలిసిన వెంటనే తూర్పు గోదావరి జిల్లాలో 15గురు గ్రామోద్యోగులు రాజీనామా లిచ్చినారు పలుకుబడిగల కనుపర్తి శ్రీరాములుగారు తమ వృత్తిని మానివేసినారు

కర్నూలు జిల్లాలో కాంగ్రెస్ ప్రచారకులు ఊరే సుబ్బారావుగారికి 6 మాసాల కఠిన శిక్ష, రామచంద్రయ్య, గోపాలరావుగార్లకు చెరి 4 మాసాలు విడిఖైదు విధించడం జరిగింది

నెల్లూరు జిల్లాలో కల్లు, సారా దుకాణాల వద్ద నీతి బోధచేసినందుకు దేశిరెడ్డి శేషిరెడ్డిగారు, మరి 4గురి మీద కేసులుపెట్టి శిక్షలు విధించినారు చాలా మంది కాంగ్రెస్ ప్రచారకులు మాజిస్ట్రేటు పంపిన నోటీసులను పుచ్చు కోక తిరస్కరించి నందుకు వారిపైన కోర్టు ధిక్కారం కింద కేసులు పెట్టడం జరిగింది

శ్రీకాకుళం జిల్లాలో బరంపురం కాంగ్రెస్ ప్రచారకులు జయంతి వెంకట నారాయణ, వారి సోదరుడు వెంకట కృష్ణారావు గార్లను 108 కింద అరెస్టుచేసి ఛత్రపురం మాజిస్ట్రేటు దగ్గరకు తీసుకొని పోయినారు

విశాఖ పట్టణంలో 107 కింద సెక్యూరిటీ ఇవ్వడానికి నిరాకరించినందుకు

వసంతరావు బుచ్చి సుందరరావు గారికి 6 మాసాలు విడిఖైదు విధించినారు గోదావరి జిల్లాలో డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారికి ఒక సంవత్సరం కఠిన శిక్ష విధించడం జరిగింది

గోదావరి జిల్లా రాజమండ్రి తాలూకాలో మాలిని సుబ్బారావు నిడుకొండ వెంకటరత్నం వామాస్వామి, కొత్తవిశ్వనాథం, శ్రీపాద వెంకట్రామయ్య, కంద్రు వీరన్న చాపరాల సుబ్బయ్య, కనగల్ల నరసింహం గార్లపైన కేసులు పెట్టడం జరిగింది వారందరికీ ఇండియన్ పీనల్‌కోడ్ సెక్షన్‌ల కింద 6 మాసాల కఠినఖైదు విధించినారు 108 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ కింద మరొక సంవత్సరం అదనంగా ఖైదు విధించబడింది రాజమండ్రి తాలూకా గ్రామోద్యోగులలో నూటికి 60 మంది తమ ఉద్యోగాలకు రాజీనామా లిచ్చినారు

ఈవిధంగా నిర్బంధవిధానం సాగుతూన్నప్పుడు పురుషులను అరెస్టుచేయగానే స్త్రీలు వారిస్థానాలను ఆక్రమించి ప్రభుత్వంవారి నిషేధపు టుత్తరువులు ధిక్కరించి కారాగారానికి పోవడం జరిగింది

## పన్నుల నిరాకరణోద్యమము

ప్రభుత్వ నిర్బంధ విధానం పెచ్చు పెరిగిన కొద్దీ ప్రజల్లో సహాయ నిరాకరణ మందలి ఉత్సాహం మందగించడానికి బదులు అంతకంతకూ ఎక్కువవుతూ వచ్చింది కొన్నిజిల్లాలలోని రైతులు పన్నుల నిరాకరణం ప్రారంభించవలెనని కాంగ్రెస్ నాయకులను వొత్తిడి చేయడం ప్రారంభించినారు ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ సంఘం ఆవిషయాన్ని చర్చించి తగిన నిర్ణయం తీసుకొనడానికి జనవరి 7వ తేదిన విజయవాడలో సమావేశమయ్యేటందుకు నిర్ణయించుకొన్నారు ఈలోగా రైతుల అభిప్రాయాలు కనుక్కొనేటందుకు జనవరి 7వ తేదికి ముందు విజయవాడలో ఆంధ్రరాష్ట్ర రైతుల సభ జరిగింది ఆసభకు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు అధ్యక్షత వహించినారు ఆ సభకు వివిధ జిల్లాలనుంచి రైతులు వచ్చినారు పన్నుల నిరాకరణగురించి వివిధ జిల్లలనుంచి వచ్చిన రైతు ప్రతినిధులు తమతమ అభిప్రాయాలను వెల్లడించినారు దాదాపు అన్ని జిల్లాల ప్రతినిధులును పన్నుల నిరాకరణకు సంసిద్ధంగా ఉన్నామని సర్వకష్టాలకు ఓర్వగలమని చెప్పినారు నెల్లూరి జిల్లావారు "మాజిల్లాలోని తాటిచెట్లు, ఈతచెట్లే ఇందుకు తగిన సమాధాన మిస్తున్నాయి ఇంక మావంటి మనుష్యులు చెప్పేదేముంటుద"న్నారు (నెల్లూరి జిల్లాలో కల్లుపాటలను నిరోధించటానికి తాటిగెలలు, ఈతచెట్లగెలలు కాంగ్రెస్ వలంటీర్లు రైతుల తోడ్పాటుతో నరికి వేయడం జరిగింది పన్నుల నిరాకరణ గురించి తాటిచెట్లూ ఈతచెట్లూ చెబుతూన్న వనడానికి అర్థం వారి జిల్లాలో సహాయ నిరాకరణోద్యమ విజృంభణకవి తార్కాణ మని)

గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకావారు కాంగ్రెసు వారు

తీర్మానించినా తీర్మానించక పోయినా పన్ను లెగబెట్టి తీరతామన్నారు గుంటూరు జిల్లా నుంచి వచ్చినవారిలో ఎక్కువమంది పన్నులు ఎగబెట్టడమే కర్తవ్యమన్నారు పన్నుల నిరాకరణ ప్రారంభించనట్లయితే ఖైదుకు పోయిన వారికి అన్యాయము చేసినట్లవుతుందని చీరాల-పేరాల ఉద్యమం పూర్తిగా చెడి పోతుంగని అన్నారు కృష్ణా జిల్లావారు కూడా తమ జిల్లాలో కొన్ని తాలూకాలు పన్నుల నిరాకరణకు తయారుగా ఉన్నవన్నారు గోదావరి జిల్లావారుకూడా తయారుగానే ఉన్నామన్నారు ఒక్క గంజాం జిల్లా వారు మాత్రం సిద్ధంగా లేమన్నారు

అగ్రాసనాధిపతియైన డాక్టర్ పట్టాభిగారు రైతుల ఉత్సాహానికి ఎంతో ఆశ్చర్యం వెల్లడిస్తూ 1921 నవంబరు 4వ తేదిన ఢిల్లీలో సమావేశమయిన అఖిల భారత కాం సంఘం వారి తీర్మానం రైతులకు చదివి వినిపించినారు పట్టాభిగారు ఆ తీర్మానం గురించి ఇంకా ఇట్లా వివరించినారు

"ఎక్కడయితే సంపూర్ణ శాసనోల్లంఘనం చేయదలచుకున్నారో ఆ చోటుల్లో తయారయ్యే ఖద్దరు బట్ట ఆ ప్రాంతానికి సరిపోయేటట్టుగా ఉండవలె కాంగ్రెసు నిర్ణయించిన సహాయనిరాకరణ సూత్రాలన్నీ సంపూర్ణంగా అక్కడ అమలు జరగవలె పన్నుల నిరాకరణం ఒకగొప్ప హక్కు ఆహక్కును పొందటానికి ఆశించేవారు అందుకు తగిన అర్హతలను కూడా సంపాదించాలని గాంధీజీ అభిప్రాయము పన్నులు ఎగబెట్టటానికి ముందు దానిఫలితాలను కూడా పూర్తిగా గ్రహించవలె పన్నుతీయనందువల్ల డబ్బు మిగులుతుందని ఆలోచించకూడదు పన్నుల నిరాకరణ స్వరాజ్య ప్రతిష్ఠాపనకు అవసరమైన ఈ ప్రభుత్వాన్ని నిర్మూలించడానికేనని అర్థం చేసుకోవలె స్వరాజ్య స్థాపనార్థం ఈ పన్నులన్నీ తిరిగి ఇవ్వవలసి ఉంటుంది ఒకవేళ గవర్నమెంట్ తో మనకు రాజీ కుదిరి నప్పుడు కూడ మన మీ పన్నుల నీయక తప్పదు ఇవ్వవద్దని కాంగ్రెసు ఆదేశించి నప్పుడంతా మాని వేయవలె వ్వండి అని చెప్పగానే అట్లా ఇవ్వవలసి ఉంటుంది మీరందరూ మీ అభిప్రాయాలను చెప్పినారు సాధక బాధకాలను ఆలోచించి జాతీయోపసంఘంవారు తీర్మానం చేస్తారు అధ్యక్షుని ఈ ఉపన్యాసంతో ఈ సభ ముగిసింది జనవరి 7వ తేదిన ఈ విషయాన్ని ఆలోచించడానికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం బెజవాడలో సమావేశమయింది

**ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘ తీర్మానము**

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం జనవరి 7వ తేదిన విజయవాడలో సమావేశమై భూమిశిస్తూ, క్విట్ రెంట్, నీటిపన్ను, ఆదాయపు పన్ను మొదలయిన వాటిని 1922 జనవరి 20వ తేది వరకుగానీ మండల కాంగ్రెస్ సంఘాలు తీర్మానించిన కాలపరిమితి వరకు గానీ పన్నులు చెల్లించకుండా నిలిపి ఉంచవలెనని తీర్మానించింది ఆ తీర్మానంలో జిల్లాలలోని కొన్ని ప్రదేశాలందైనా పన్ను నిరాకరించే విషయమై తీర్మానించడానికి ఆయా

జిల్లా కాంగ్రెస్ కమిటీలకు అధికార మీయడం జరిగింది రాజీనామాలిచ్చిన గ్రామోద్యోగస్తులను ప్రశంసిస్తూ మిగిలిన వారిని కూడా రాజీనామా ఇవ్వవలసిందని రాష్ట్రకాంగ్రెస్ సంఘం కోరింది జనవరి 15వ తేదీ లోగా జిల్లా కాంగ్రెస్ సంఘాలన్నీ అవసర సభలను సమావేశ పరిచి పన్నుల నిరాకరణ విషయమై తగిన తీర్మానాలు చేయవలెనని రాష్ట్ర సంఘంవారు ఆదేశించినారు ఆ ప్రకారం ఆయా జిల్లాలవారు జిల్లా కాంగ్రెస్ కమిటీలను, తాలూకా కాంగ్రెస్ కమిటీలను సమావేశపరిచి తేదీలను నిర్ణయించి ఆయా తేదీల లోపుగా తాము తిరిగి మరొక నిర్ణయం చేసేటంతవరకు పన్నుల నీయవద్దని వైతుల నాదేశించినారు

1921 డిశంబర్‌లో అహమదాబాద్ కాంగ్రెస్‌లోని పన్నుల నిరాకరణ తీర్మానానికి అనుగుణంగా ఆంధ్రదేశంలోని రాష్ట్ర జిల్లా, తాలూకా కాంగ్రెస్ కమిటీలు పై విధంగా తీర్మానించినాయి ఈ పన్నుల నిరాకరణోద్యమము తక్కిన అన్ని జిల్లాలకంటె గుంటూరు జిల్లాలలో ఎక్కువ తీవ్రంగా సాగింది పెదనందిపాడు ఫిర్కాలో ఈ ఉద్యమం మరింత తీవ్రతమయినది పెదనందిపాడు ఫిర్కాలోని కరణాలు దాదాపు అందరూ తమ ఉద్యోగాలకు రాజీనామాలిచ్చినారు. ఈ ఉద్యమంలో మొట్ట మొదట నిర్బంధింపబడిన వారు గుంటూరు జిల్లా నాయకులు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్దూరి అన్నపూర్ణయ్య మొదలయినవారు. పన్నులు నిరాకరింప బడిన ప్రదేశంలోని [illegible] ల ఆస్తులనూ పశువులనూ ప్రభుత్వంవారు జప్తుచేయడం మొదలు పెట్టినారు ఆ వార్త తెలిసిన తరవాత గాంధీజీ 'యంగ్ ఇండియా' పత్రికలో ఇట్లు వ్రాసినారు

"ప్రజలు జైలుకు పోయేటందుకున్నంత సంసిద్ధత ఆస్తులు పోగొట్టుకొనేటందుకు ఉండదు ఈ వ్యత్యాసాన్ని గ్రహించడం మొట్ట మొదట కష్టంగానే ఉంటుంది తరవాత సులభంగా తెలుస్తుంది మన ఆస్తిపైన మనకు మమకారం ఎక్కువ ఉంటుంది జైలుకు పోవడం అవమానకరం కాదని మనము కొన్నప్పుడు మనం మన ఆస్తిని పోగొట్టుకోవడం కంటె జైలుకు పోవడానికే ఎక్కువ ఇష్టపడతాము శరీర సౌఖ్యాన్ని కోల్పోవడానికి ఎంత సంసిద్ధంగా ఉంటున్నామో ఆస్తిని పోగొట్టుకోవడానికి కూడా అంత సంసిద్ధంగా ఉండవలె అట్లా కానిపక్షంలో మనం ఓడి పోతాము దుష్పరిపాలనతో సంగ్రామంలో అంతరాత్మకు బద్ధులైనవారు తమ ధనం, ఆస్తిని, శరీరంను గూడా లెక్క చేయక తమ అంతరాత్మకు తోచినట్లుగా వ్యవహరిస్తారు కాబట్టి ప్రభుత్వం తమ ఇష్టం వచ్చినట్లు ప్రజలను లొంగదీయాలనిచేసే ప్రయత్నాలన్నిటిని ప్రజలు లక్ష్యపెట్టనప్పుడే ఈ పోరాటంలో మనకు విజయం కలుగుతుంది మన ఆస్తిని, భూములను కోల్పోవడానికి మనం తయారుగా ఉండవలె కారాగృహానికి పోవటానికి ఎంత సంతోషంగా ఉంటామో ఆస్తిని కోల్పోవటానికి కూడా అంత సంతోషంగానే ఉండవలె మన శరీరాలను స్వాధీనపరచుకొనేటప్పటికంటె మన ఆస్తులను వేలం వేసేటప్పుడు ప్రభుత్వంవారికి ఎక్కువ త్వరగా విసుగు వస్తుంది ఇది

మీరు గట్టిగా నమ్మండి స్వరాజ్యం మనకు త్వరలో రావడం నిశ్చయమై నట్లయితే మా నుంచి ప్రభుత్వంవారు తీసుకొన్న భూమి మాత్రమే కాక డబ్బుకూడా మనకు తిరిగి త్వరలో వస్తుందని విశ్వసించవలసి ఉంటుంది. . .. తాత్కాలిక మయినప్పటికి మనం పేదరికం బుద్ధిపూర్వకంగా స్వీకరించవలె దేశ దారిద్ర్యాన్ని, దైన్యాన్ని రూపుమాపేటందు కిదే మార్గము పవిత్ర మైన ఆర్యావర్తము తన గౌరవ సంపదలను పునరుద్ధరించు కొనగలదు మనకు రానున్న ఈ భాగ్యంతో పోల్చిచూసుకొన్నప్పుడు మనం చేయవలసిన ఈ త్యాగం అత్యల్పమని గ్రహించవచ్చు"

ఈ పన్నుల నిరాకరణోద్యమం గురించి దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారు తమ స్వీయచరిత్రలో ఇట్లా వ్రాసినారు

"అహమదాబాద్ కాంగ్రెస్ మహాసభ చేసిన పన్నుల నిరాకరణ తీర్మానాన్ని అమలులో పెట్టడానికి తగిన ప్రదేశాలను నిర్ణయించే అధికారం రాష్ట్రాలకే ఇవ్వడం జరిగింది ఆంధ్ర రాష్ట్ర సంఘం బెజవాడలో సమావేశమై గుంటూరు తూర్పుగోదావరి జిల్లాలలోఎక్కడ కాంగ్రెస్ విధించిన షరతులన్నీ పరిపూర్తిచెందినాయో అట్లాంటిచోట్ల పన్నుల నిరాకరణ సాగించ వచ్చునని తీర్మానించినారు దాని ననుసరించి గుంటూరులో పెదనందిపాడును మరి కొన్ని చోట్లును నిర్దేశించడం జరిగింది తూర్పుగోదావరిలో సీతానగరపు ప్రాంతంలో జరుపునట్లు ఆ జిల్లా సంఘం నిర్ణయించింది గుంటూరు జిల్లా సంఘం జిల్లాలో ఏ ప్రాంతంలో పన్నుల నిరాకరణ సాగించవలెనో యోచించ డానికి పొన్నూరులో సభ జరపడానికి ప్రయత్నాలు చేస్తుండగాజిల్లా మేజిస్ట్రేట్ పొన్నూరు సరిహద్దుల మధ్య ఎక్కడా సభ జరపకూడదని నిషేధిస్తూ ఉత్తరు వును ప్రకటించి దండోరా వేయించినాడు. ఆ ఉత్తరువును ధిక్కరించి జిల్లా సంఘ సభ్యులు పలువురు పొన్నూరులోనే సమావేశమై, పెదనందిపాడు ఫిర్కా గ్రామాలలోను మరికొన్ని స్థలాలలోను పన్నుల నిరాకరణ చేయవలెనని తీర్మానించినారు పట్టణ ప్రదేశాలు ఆ ఉద్యమానికి తగినవి కావని ఎంచి వాటిని తొలగించినారు ఆ సభలో పాల్గొన్నవారు పలువురు వీరావేశ పూరితులై ప్రసంగాలు చేసినారు నేను జాడ్యగ్రస్తుడనై ఉండటంచేత సభకు పోలేక పోయినాను సభ పొన్నూరు సరిహద్దులో మాని సమీపంలో మరొకచోట జరప వలసిందని సలహా ఇచ్చినాను కాని నా సలహా ఎవ్వరికీ రుచించలేదు వ్యర్థంగా ప్రభుత్వాధికారుల చేతులలో పట్టుబడకుండ వీలయినంతవరకు మన కార్యం నెరవేర్చుకోవచ్చునని, ఎంతో బాధ్యతతోకూడిన ఉద్యమం ప్రారంభిస్తూ మొట్టమొదటనే ముఖ్యులైన కాంగ్రెస్‌వారు జైలులో కూర్చోవడం ఉద్యమవ్యాప్తి కది భంజకమనీ నేను యోచించినాను కాని వారికది యుక్తంగా తోచలేదు మంచంమీద పడిన నా మాటలు ఉద్రేకపూరితులై ఉన్నవారికి లెక్కకు రాకున్నవి పొన్నూరులో సభపూర్తియైన వెంటనే పోలీసులు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, మద్ది రాధాకృష్ణయ్య మొదలయిన

ముఖ్యులను బంధించి వెంటనే విచారణ చేసి, శిక్షలు విధించి వేలూరు జైలుకు తీసుకొని పోయినారు

పెదనందిపాడులో పన్నుల నిరాకరణకు పూర్వమే సహాయ నిరాకరణోద్యమం అనుసరించి గుంటూరు తూర్పు పశ్చిమ గోదావరులలో గ్రామోద్యోగులు మునసబు కర్ణాలు, కొందరు వెట్టివారు సైతం తమ పదవులకు రాజీనామా లిచ్చినారు అందులో శ్రీ మాచిరాజు రామమూర్తి అనే యువకులొకరు బాపట్ల తాలూకా చంద్రవోలు కరణము ఆయన ఎంతో ఉత్సాహంతో తన ఉద్యోగం మానుకోవడమేగాక తక్కిన గ్రామోద్యోగులను ప్రోత్సహించి, సభలు చేసి ప్రచారంచేసి ఆందోళన సాగించినారు పుసులూరులో ఇట్లాంటి సభ ఒకటి జరిపినపుడు కొందరు కరణాలు రాజీనామా లిచ్చినారు పెదనందిపాడు మొదలయిన గ్రామాలలోని ఉద్యోగులను పురికొల్పడానికి శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరిగారు భారం వహించి ఊళ్లలో తీవ్రంగా ప్రచారం చేసినారు ఈ ఇద్దరు ప్రేరణతో పెదనందిపాడు ఫిర్కా గ్రామాలలోను, మరికొన్ని పరిసర గ్రామాలలోను కరణాలును, మునసబులును ఉద్యోగాలకు రాజీనామాలిచ్చి వేసినారు కాబట్టి ఆ గ్రామాలలో పన్నుల నిరాకరణోద్యమం సుకరంగా సాగించడానికి అవకాశం ఎక్కువగా ఉండేది ఈ ఉద్యమం మొదలుపెట్టి సాగించడానికి ముఖ్యసాధకుడు శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరిగారు,

పొన్నూరులో జరిగిన సభా ఫలితంగా సీతారామ శాస్త్రిగారు ఖైదు చేయబడినారు ఈయన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి ఇట్లానే నాయక ప్రముఖులైన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, మాడభూషి వేదాంతం నరసింహాచారి గారు అదివరకే సత్యాగ్రహంలో దండితులై జైలుకు పోయినారు ఆంధ్ర రత్న గోపాలకృష్ణయ్యగారు చీరాల పేరాల సత్యాగ్రహం నడుపుతున్న ఏకైక వీరుడు

ఇట్లాంటి నాయక శిరోమణి గూడ పన్నుల నిరాకరణకు పూర్వమే జైలులో ఇరుక్కబడిఉన్నాడు పేరుపొందిన నాయకులు ఎవ్వరూలేనిసమయంలో ఈ ఉద్యమం మేర మీర పెరిగి పోయినది అంతవరకు నాయకులు చేసిన కృషికి గాంధీజీ ప్రబోధ ప్రభావం ప్రజలనంపలె తోడ్పడుతున్నది అన్నిటికంటె ముఖ్యంగా స్థానిక నాయకుడైన శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరిగారి అద్భుత దీక్షా కౌశలమే దానికి పట్టుగొమ్మ అయి నిలిచినది ఈయన పల్లెటూరిలో పెరిగి, పల్లెటూరి చదువు మాత్రం చదివినవాడైనా కాంగ్రెస్‌లో పూర్ణ విశ్వాసం ఉన్న ఉత్సాహశీలి కావడంతో పెదనందిపాడు ఫిర్కా ప్రతి గ్రామంలో ప్రచారం చేసి పన్నులు చెల్లించకుండా ప్రజలను దిట్టపరిచి ఊరూర వందలకొద్దీ శాంతి సైనికలను సిద్ధపరిచినారు మిన్నులు మీద పడినా తొణకక ఎవ్వరేమి చేసినా చలించక ప్రభుత్వోద్యోగులకు గానీ పోలీసులకు గానీ, సైనికులకు గానీ భయపడక వారేమి చేసినా కోపించక మారు చేయడానికి యత్నించక

తన ఆజ్ఞప్రకారం నడచుకోవలసిందని కట్టుదిట్టం చేసినారు ప్రతి దినం గ్రామాలలో జరిగిన వృత్తాంతాలను తనకు తెలుపడంకోసం శాంతి సైనికులలో కొందరిని వార్తాహారులుగ నియమించినాడు గ్రామోద్యోగులు రాజీనామా లిచ్చినందువల్ల పన్నులు వసూలు చేయడం ప్రభుత్వాధికారులకు సాధ్యం కాకుండా ఉండింది ఎవరివల్ల ఎంతపన్ను వసూలు కావలసింది తేల్చేవారెవ్వరూ లేరు పన్ను లెగబెట్టడం సులభమేగాని దానివల్ల కలిగే కష్టాలు భరించడం కష్టము రైతులు అట్లాంటి భయం విడనాడి పన్నులు చెల్లించడానికి నిరాకరించినారు జప్తు చేయడానికి వీలు లేకుండా విలువగల వస్తువులను భద్రం చేసుకొన్నారు ధాన్యంగాని తలుపులు మంచాలు మొదలయిన సామానులు గాని జప్తుచేసినా వాటిని వేలం వేయడంకోసం తాలూకా కచ్చేరికి మోసుకొని పోయేవారు దొరకలేదు పెదనందిపాడు ఫిర్కా మాత్రమే గాక చుట్టు పట్ల గ్రామాలవారు పన్నులను చెల్లించలేదు ప్రజలను భయపెట్టినారు దౌర్జన్యం చేసి పన్నులు వసూలు చేయవలెనని ఉద్దేశించి చెన్నపట్టణం నుంచి సైనికదళం మందు గుండు సామానులతోను, మరఫిరంగులతోను గుంటూరు పట్టణానికి రప్పించినారు కొంత సేన పెదనందిపాడుకు వెలపలి చింతల తోపులలో విడిసి ఉండి గ్రామాలవెంట తిరుగుతున్నారు తాము వచ్చేటప్పటికి ప్రతిగ్రామం లోను వీధులవెంట శాంతి సైనికభటులు వరసలు తీర్చి ఉండటంలో సైనికులు వారిపై ఉమిసి తిట్టి అవమానపరచినారు కాని శాంతిసైనికులు శాంతంతో భరిస్తూ ఉండినారు జిల్లా కలెక్టర్ వచ్చి 'మునసబు ఇల్లు ఎక్కడ ఉన్నద'ని అడిగితే ముందుకుపోయి విచారించకొమ్మని చెప్పేవారేగాని సమాధానం చెప్పేవారు లేరు ఆ ఊళ్ళలో తిరుగుతున్న సర్కారు ఉద్యోగులకు మంచి నీళ్ళు కూడా పుట్టలేదు కోమటిండ్లలో ఉప్పు చింతపండైనా నమ్మడంలేదు కనక ఉద్యోగులు ఆ గ్రామములో ఉండడానికి నీడ లేక తినడానికి తిండిలేక వెంటనే ఊరు విడిచి పోవలసి వచ్చేది కాజనూరు గ్రామంలో ఒక ఆసామి ఎద్దులను మరొక ఆసామి బండిని ఉద్యోగులు జప్తు చేసినారు బండిని ఎద్దులను నలభై మంది సైనికుల సహాయంతో తోలుకొని పోవడంకోసం యత్నించినారు ఆ ఊరి ప్రజలు గుంపుగా చేరి ఎద్దులను బండిని తోలుకొని పోనీవ్వకుండా అడ్డు పడినారు సైనికులు దౌర్జన్యం చేయడానికి సిద్ధమైనందువల్ల ప్రజలు కోపా విష్టులైనారు సైనికులు తుపాకులు పేల్చడానికి సిద్ధమవుతూ ఉండినారు ఇట్లాంటి స్థితిలో ఎక్కడ నుంచో వీరయ్యచౌదరి గారు గుఱ్ఱం మీద పరుగెత్తుతూ వచ్చి చేరినారు ఐదారు వందలమంది గ్రామవాసులు తుపాకులు కాలనున్న సిపాయిల మీద కఱ్ఱలు తీసుకొని దుముక బోతుంటే వీరయ్యగారు చేయెత్తి ఆగు డాగుడని కేకవేసేటప్పటికి ప్రజలు వెనకకు తగ్గి శాంతించినారు సిపాయిలు ఎద్దులను బండిని తోలుకొని పోయినారు ఇట్లా వీరయ్యచౌదరిగారు గొప్ప దళాధిపతివలె అశ్వారూఢుడై గ్రామాల వెంట తిరుగుతూ ప్రజ లెక్కడా దౌర్జన్యం జరుపకుండా భద్రపరుస్తూ ఉండినాడు.

సత్తెనపల్లి తాలూకా గ్రామాలనుంచి కొన్ని దినాలలో అర్ధరాత్రి మా ఇంటికి వచ్చి వయసుమీరిన పెద్ద రైతులు, డిప్యూటీ కలెక్టర్ పోలీసులతో తమ గ్రామాలకు వచ్చి ఇళ్ళలో ప్రవేశించి దౌర్జన్యంగా ధాన్యపు బస్తాలు బయట వేయించి, పశువులను కట్టు తాళ్ళను విప్పి తోలివేసి, బండ బూతులు తిట్టి భయపెట్టి, అవమానపరచి, కొందరిని కొట్టి దురంతాలు జరుపుతూన్నారు కనక మాకేమి సలహా చెబుతారని నన్నడుగుతుండేవారు మనము స్వరాజ్యం నిమిత్తం చేసే శాంతి సంగ్రామంకనక ఇట్లాంటి కుచేష్టలను, దౌర్జన్యాన్ని ప్రభుత్వం చేయడం సహజము పన్ను తీయనందుకు, భూములు వేలం పాడిస్తారు బీదలయిన హరిజనులు మొదలైన వారికి స్వల్ప వెలలకు కట్టిపెడతారు అందువల్ల పూళ్ళు మాలపల్లెలుగా, మాలపల్లెలు ఊళ్ళుగా మారతాయి మన మీ కష్టనష్టాలు భరించవలె అని నేను వారికి చెప్పుతూ ఉండినాను వారు పరమోత్సాహంతో మిన్ను మీదపడినా మేము వెనుదీయమని దృఢవాక్యాలు పలికి వెళ్ళి పోయినారు

ఇట్లా నడుస్తున్న మహా యజ్ఞం గురించి వార్తలు పత్రికలలో పడటంవల్ల దేశమంతటా వ్యాపిస్తూ ఉండేవి ఇతర జిల్లాలవారు ఈ ఉద్యమ చర్యలను చూడటంకోసం వస్తూ ఉండినారు

ఈ సమయంలోనే మహాత్ముడు బార్డోలిలో పన్నుల నిరాకరణోద్యమం సాగించి దానిని గురించి గవర్నర్ జనరల్ గారికి లేఖ వ్రాస్తూ అందులో, గుంటూరు జిల్లాలో కూడా ఇట్లాంటి ఉద్యమం నడుస్తున్నదని, అవసరమైన అక్కడికి తాము పోగలమనీ వివరించినారు ఈ లేఖతో గుంటూరులోని ఉద్యమ విషయం మరింత ప్రాముఖ్యం వహించింది . . ..

ఇట్లా ఉండగా ఉద్యమం ఎంతో తీవ్రరూపం దాల్చింది పెదనందిపాడు గ్రామాలలో మాత్రమేగాక గుంటూరులో కూడా ప్రభుత్వం సేనను మర ఫిరంగులతో నిలిపి ప్రతి దినం పూట పూట వీధులలో ఆయుధాలతో తిప్పసాగింది పన్నులు వసూలు కానందువల్ల తమ సిబ్బందికి జీతాలు చెల్లించడానికి బొక్కసంలో రొక్కం లేక ప్రభుత్వం చిక్కులు పడుతున్న సమయంలో, ఉద్యమం ఆపి వేయవలసిందని మహాత్ముడు ఉత్తరం వ్రాసినా దానిని లెక్క చేయకుండా నేను మూర్ఖంతో ఉద్యమం అక్రమంగా నడిపిస్తున్నట్లు కరపత్రాలలో అచ్చు వేయించి ఉద్యోగులు జిల్లా అంతటా పంచి పెడుతున్నారని నాకు తెలియవచ్చింది ఉత్తరమేదీ నాకు మహాత్ముని వద్దనుంచి రాలేదు దానిని గురించి విచారణ చేయగా శ్రీ భోగరాజ పట్టాభి సీతారామయ్యగారు మహాత్ముని వద్దకు పోయి ఇక్కడ ఉద్యమం షరతులకు భిన్నంగా నడిపింపబడుతున్నదని చెప్పినందువల్ల వారి మాట నమ్మి, మహాత్ముడు నాకు ఉద్యమం ఆపి వేయవలసిందని ఉత్తరం వ్రాసి దానిని నాకందచేయవలసిందని సీతారామయ్యగారి చేతికే ఇచ్చినట్లు, ఆయన మరెవ్వరి చేతికో నాకిమ్మని దానిని పంపగా అది అధికారుల చేత చిక్కినందువల్ల వారు కరపత్రాలు అచ్చొత్తించి ప్రకటించి

నారని తెలిపింది

నేను పెదనందిపాడుకు మనుష్యులను పంపి పరిస్థితులను మళ్ళీ రూఢి చేసుకొని ఒక తంతి వార్త మహాత్మునకు పంపినాను ఉద్యమమప్పటికి బహు దూరం సాగినదనీ అప్పుడు ఆపివేయడమే సంభవిస్తే ఆంధ్రదేశాన్ని కాంగ్రెస్ నుంచి బొత్తిగా తొలగించవచ్చుననీ ఖండితంగా తెలిపినాను .. మహాత్మునికి తంతితోపాటు ఇక్కడి పరిస్థితులు తెలుపుతూ ఒక జాబు వ్రాసి నడింపల్లి నరసింహారావుగారిని పంపినాను వారు దానికి బదులు వ్రాస్తూ ఇక్కడి స్థితిగతులు స్థానికులైన మీకు తెలిసినట్లు నాకు తెలియవు కాబట్టి ఆ బాధ్యతంతా మీదేనని స్పష్టపరిచినారు అప్పుడు చెన్నపట్టణంలో గవర్నర్‌గా ఉన్న లార్డ్ వెల్లింగ్టన్ తరవాత కొంత కాలానికి ఇంగ్లాండ్ వెళ్ళినప్పుడు పెదనందిపాడు ఫిర్కాలోని పన్నుల నిరాకరణోద్యమం బ్రిటిష్ ప్రభుత్వాన్ని పూకటివేళ్ళతో కదలించిందని పార్లమెంట్‌లో అన్నాడు .. . .

గాంధీగారు వ్రాసిన లేఖను బట్టే కాబోలు మా ఇంట్లోనే ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్య నిర్వాహకవర్గం సమావేశమై, పెదనందిపాడు ఫిర్కాలో జరుగుతున్న ఉద్యమ పరిస్థితులను బాగా పరిశీలన చేసి, నివేదిక పంపడానికి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, టంగుటూరి ప్రకాశం పంతులు, శ్రీ దండు నారాయణ రాజుగార్లను ఉపసంఘంగా నియమించింది వారా గ్రామాలలో సంచారంచేసి, కాంగ్రెస్ షరతులన్నీ ప్రజలు చక్కగా పాటించి, ఉద్యమం ఎంతో దీక్షతో జరుపుతున్నందుకు వారిని ప్రస్తుతిస్తూ ప్రభుత్వం ప్రజలపై దౌర్జన్యం ప్రయోగించినప్పుడు తట్టుకొనేటంత నిబ్బరం వారితో ఉందని విశ్వసించలేకున్నామనీ, అందువల్ల ఉద్యమం నిలిపి వేయడమే ఉత్తమమనీ నివేదికను సిద్ధం చేసినారు జిల్లా కాంగ్రెస్ కార్యవర్గం మా ఇంట్లోనే సమావేశమై ఆ నివేదిక విషయమై విమర్శచేసే సమయంలోనే మహాత్ముడు వ్రాసిన చిన్న కాగితపు ముక్క ఒకటి ఎవ్వరో అందిచ్చినారు అందులో తాము బార్డోలిలో ఉద్యమం ఆ కాలంలోనే సాగిస్తున్నందువల్ల గుంటూరు ఉద్యమమెట్లా సాగుతున్నదో అనే యోచన సైతం ఎప్పుడూ మనస్సును కలత నొందిస్తూ ఉంటుంది కాబట్టి అక్కడ ఉద్యమం ఆపి వేయవల సిందని వ్రాయడం జరిగింది .. .. అంత చక్కగా సాగుతున్న ఉద్యమం బుద్ధి పూర్వకంగా ఆపివేయడం నా కిష్టం లేకపోయినా గాంధీగారే తాము చేసే ఉద్యమానికి అడ్డం వస్తున్నదన్న భావం వెలిబుచ్చినప్పుడు నేనింకా ముందుకు సాగించడం అవ్యక్తమని నాకు తోచింది సభ్యులుకూడా ఆపి వేయ డమే సమంజసమని అభిప్రాయపడినారు కాబట్టి ఆపివేయక తప్పింది కాదు

ఉద్యమం ఆపివేయబడినదన్న వార్త తెలియడం తోడనే కాంగ్రెస్ వారి ఆజ్ఞ అయినది కాబట్టి పన్నులు పూర్తిగ చెల్లించినారు జప్తు చేసిన తర వాత వేలానికి ఇస్తేహారు వ్రాసి నెల రోజుల వాయిదాతో వేలం వేయిస్తా

మని దండోరా వేయడం విధియైనా పెదనందిపాడులో ఉద్యమం తీవ్రంగా సాగించిన తరవాత నెల వాయిదాతో నిమిత్తం లేకుండా జప్తు చేయడం తోనే వేలం వేయించడానికి అధికారం కల్పిస్తూ చట్టంలో మార్పు చేయడం జరిగింది రైతులు దానికి భయపడక కాంగ్రెస్ ఆజ్ఞను శిరసావహించి పన్నుల నీయడానికి నిరాకరించినారు కాంగ్రెస్ ఆజ్ఞాపించటంతో పన్నులు చెల్లించడం కాంగ్రెస్‌లో ప్రజలకు గల అభిమానమెంతో వేటతెల్లమయింది

## గాంధీజీకి డాక్టర్ పట్టాభి లేఖ

"వేంకటప్పయ్య గారికి మీ సందేశం తీసుకొని మీవద్ద సెలవు పుచ్చుకొని బొంబాయి నుంచి 17వ తేదీన బయలుదేరి వచ్చిన వెంటనే మీకు జాబు వ్రాయవలెనని అనుకొన్నాను నేను స్వయంగా గుంటూరు పోయి మీ సందేశం వెంకటప్పయ్యగారి కీయవలెననుకొన్నాను కాని నా స్నేహితుడు శ్రీ (కోసల్లె) హనుమంతరావుకు చాల జబ్బుగా ఉన్నదని 16వ తేదీన నాకు తంతి వచ్చింది బెజవాడలో ఆయనను గురించిన వార్త లేమీ తెలియనందువల్ల యకాయకి బందరు పోతూ మీ సందేశమొక పెద్దమనిషి చేత గుంటూరు పంపించినాము హనుమంతరావుకు చాలా జబ్బుగా ఉన్నది ఆయన చాలా కాలం బ్రతకడని అనుకొంటూ ఉన్నాము మీతో కూడా ఒకటి రెండు పర్యాయాలు ఆ సంగతి చెప్పినాను ఈ విషయమై 17వ తేదీన మీతో చెప్పడానికి వీలు కాలేదు నా స్నేహితుని కళ్ళతో చూడగలుగుతానా అని భయపడుతూ బొంబాయి నుంచి బయలు దేరినాను చివరికి ఆయనను చూడగలిగినాను అప్పటి నుంచి నే నాయనకు చికిత్స చేసినాను చివరికి నిన్న మధ్యాహ్నం 1 గంటకు నా చేతుల్లోనే ఆయన పరలోకగతుడైనాడు స్వభావ సిద్ధంగా నేను కఠిన హృదయుడనైనప్పటికీ, వృత్తివల్ల దుఃఖించడం అలవాటు లేకపోయినప్పటికీ తత్త్వవేత్త, మార్గదర్శకుడు, 16 సంవత్సరాల నుంచి కలసి పని చేసిన మిత్రుడు-అయనని కోల్పోవడమే గాక జాతీయ కళాశాలకు మూలాధారం పోగొట్టుకొన్నామనే దుఃఖం నన్ను వర్ణనాతీతంగా బాధిస్తూన్నది దుఃఖభారంచేత ఇంతకు మీకు వ్రాయ జాలకున్నాను ఆయన కళాశాలకు తన జీవితాన్ని, తన ధనాన్ని, చివరికి దేశ మాతకు ప్రాణాన్ని సమర్పించినాడు అట్టి వారి వల్లనే ప్రజలు గౌరవముంచి కళాశాలలను నిలువబెడతారనే ధైర్యంతో నేను నిలిచి ఉన్నాను అయన 16 సంవత్సరాలనుంచి స్నేహితులతో కలసి చేసిన కష్టాల ఉద్దేశాలు ఇప్పుడు దేశంలో అందరి ఆమోదం పొందగలిగి నందుకు ఆనందించవలసిన విషయము 1907లో సూరత్ కాంగ్రెస్ సమయంలో నేను చెప్పగా ఆయన ప్లీడరు పట్టాను చించి వేసినారు కళాశాల ఆవరణలోకి తాటి చెట్లు గీత చేస్తే ఏడాదికి 500 రూపాయల ఆదాయంవచ్చి ఉండేది 1908 నుంచి ఆ ఆదాయం వదులుకొన్నాము 1910 లగాయతు పంచమ బాలురు బ్రాహ్మణ బాలురతో కలసి కూర్చుండి పని చేస్తున్నారు 1912 లగాయతు గృహపరిశ్రమలు

పునరుద్ధరించడానికి ప్రయత్నిస్తున్నాము యంత్రాలు అవసరమయిన చోట ఉపయోగిస్తున్నాము కళాశాలలో ఈ రోజున 110 చేతిమగ్గాలున్నాయి భారతదేశంలోని సంస్కృతులను కేంద్రీకరించడమే ఆంధ్రోద్యమ ఉద్దేశము హనుమంతరావు ఈ ఉద్దేశం కార్యరూపంలో అత్యున్నత స్థితికి తీసుకొని వచ్చింది జాతీయ విద్యలో జాతీయతకు మంచి పునాది, దూరదృష్టి గలిగి ధైర్యంతో పని చేసిన నా స్నేహితుని జాతీయ నిర్మాణ కర్తగా నేనెప్పుడూ స్మరిస్తూ ఉంటాను

పట్టాభి సీతారామయ్యగారి ఈ లేఖను గాంధీజీ 'యంగ్ ఇండియా'లో ఉదాహరిస్తూ ఇట్లా వ్రాసినారు

"ఆడంబరం లేక శ్రమచేస్తూన్న అగ్రగణ్యులొకరిని ఆంధ్ర దేశం కోల్పోయింది ఆంధ్ర దేశం చూసి మురిసి పోతున్న బందరులోని గొప్ప విద్యాలయంకోసం శ్రీ హనుమంతరావు శ్రమ చేసినారు ఆయన దానికోసమే బ్రతికి దానికోసమే తుదకు ప్రాణాలు విడిచినారు పట్టాభి సీతారామయ్యగారి జాబు హృదయ విదారకంగా ఉన్నది

హనుమంతరావుగారి జ్ఞాపక చిహ్నం ఏమైనా చేయడానికి ఒక లక్ష రూపాయలు వసూలు చేయదలచి ఆయన స్నేహితులు జాబితా ప్రారంభించినారు ఈ ధనం ఆర్భాటంకోసం ఖర్చు పెట్టడం జరగదు ఆయన ఆజన్మాంతం అహోరాత్రులు రక్తమొలికించిన కళాశాల ఆర్థిక స్థితి చక్కజేయడానికి ఉపయోగపడుతుంది ఆంధ్ర దేశాభిమానులేగాక హనుమంతరావు గారిని గానీ, కళాశాలనుగానీ, చూసిన వారందరూ ఇందుకు సహాయం చేయవలెనని కోరుతున్నాను "

డాక్టర్ పట్టాభిగారు గాంధీజీకి వ్రాసిన పై లేఖవల్ల గాంధీజీ వేంకటప్పయ్యగారికి పన్నుల నిరాకరణ సందర్భంగా పంపిన సందేశం తాను స్వయంగా పంతులుగారికి అందించలేక మరొకరి ద్వారా ఆ లేఖను పంపవలసి వచ్చిన పరిస్థితిని స్పష్టంగా తెలియజేస్తున్నది శ్రీ వేంకటప్పయ్యపంతులుగారు స్వీయ చరిత్రలో పైన సూచించినట్లు పన్నుల నిరాకరణం నిలుపు చేయడం విషయంలో ఆయనకు ప్రకాశంగారికి గాంధీజీ ఈ దిగువ ఉత్తరాలు వ్రాసినారు

## పన్నుల నిరాకరణ

### ఆంధ్ర నాయకులకు గాంధీజీ ఉత్తరాలు

గుంటూరులో పన్నుల నిరాకరణ విషయంలో కొండ వేంకటప్పయ్య పంతులుగారికి గాంధీజీ ఇట్లు వ్రాసినారు

"శ్రీయుత వేంకటప్పయ్యగారికి,

అక్కడ జరుగుతూన్న పన్నుల నిరాకరణం గురించి నేను చాలా ఆదుర్దాతో ఆలోచిస్తున్నాను ఎప్పటికైనా రౌండ్ టేబుల్ సమావేశం జరిగి

సార్వజనీన శాసనోల్లంఘనం ఆపివేయవలసి వస్తే మాట అట్లా ఉండగా పన్నుల నిరాకరణకు మీరింకా సంసిద్ధంగా లేరని కనిపిస్తున్నాను. ఇప్పుడు మీరు పన్నులు నిరాకరించదలచిన ప్రదేశంలో సగం మంది అస్పృశ్యతను విడనాడలేదు. ఆ సగం మందికి అహింస అంటే ఏమో కూడా తెలియదు. ఖద్దరు బాగా ప్రచారం కాలేదు. జాత్యాంతర మైత్రి ఎట్లా ఉన్నప్పటికీ ఈ పరిస్థితులలో జను లంతా సుశిక్షితులై ఆత్మ సాహసుద్ధత్వం పొందేవరకు మనం సార్వజనీన శాస నోల్లంఘన ఆపివేయడం భద్రము. ఇట్లా కానట్లయితే శాసనోల్లంఘనం శాంతి యుత మయినది కాక నేరంగా పరిణమించగలదు. అందువల్ల మన వ్యవహారం నాగరక దేశంలోవలె సక్రమంగా చక్కబెట్టుకోవడం కష్టమవుతుంది. కాబట్టి అన్ని జిల్లాలలోను రైతులు మొదటి కిస్తీని చెల్లింపవలసిందిగాను, కాలం అంతా తాము పన్నుల నిరాకరణము అర్హతను పొందేటందుకు వినియోగించవలెనని సలహానివ్వండి. ఈ నా అభిప్రాయంవల్ల ఉత్సాహంతో ఉన్నవారికి దుఃఖం కలుగ వచ్చు. అయితే దుఃఖం వల్లనే విజయం చేకూరగలదు. ఎందువల్లనంటే ప్రజలకు నిజంగా స్వరాజ్యోత్సాహం ఉన్నట్లయితే, శాసనోల్లంఘనను ఇష్టపడుతుంటే వారు కాలానుగుణంగా మనస్సు మార్చుకోగలరు. ఆంధ్ర నారీమణులు అమో ఘంగా దారం వడకగలరు. ఆంధ్ర సాలీలు చక్కగా నేయగలరు. ఇందువల్ల ఖద్దరు వస్త్రాలు ఎక్కువగా తయారు కావడం సులభం.

ఈ గుణాలన్నీ ఉండటం సులభమయినా కష్టమయినా మనం వాటిని అలవరుచుకోక తప్పదు. వాటిని తప్పించుకొంటే మన వాంఛితాదర్శాన్ని ఉప ద్రవ స్థితికి తెచ్చినవారం కాగలము.'

బొంబాయి
17-1-1922

ఇట్లు
మీ విధేయుడు
మో. క. గాంధీ

(ఈ లేఖ 19-1-22 జన్మభూమి లో ప్రకటితమయింది.)

మహాత్మాగాంధీ ఈ సందర్భంలో మరొక లేఖ ప్రకాశంగారికి కూడా వ్రాసినారు. ఆ లేఖ ఇది

"నేనుండి నా కళ్ళఎదుట ఒక నిర్ణీత ప్రదేశంలో సార్వజనీన శాసనో ల్లంఘన ఆచరణలో పెట్టి చూసే వరకు భారతదేశంలో మరెక్కడా దానిని ప్రారంభించకూడదని ఇదివరకు తెలిపిన అభిప్రాయానుసారం ఆంధ్ర మిత్రులు తమ జిల్లాలలో ఎక్కడగాని పన్నులు నిరాకరించవద్దని నేను కోరుతున్నాను. ఇంతేగాక ప్రతి కాంగ్రెసు ప్రచారకుడు ఢిల్లీ తీర్మానంలోని షరతులను గమ నించి సార్వజనీన శాసనోల్లంఘన చేయడానికిగాని పన్నుల నిరాకరణకు గాని ఆ షరతులకు బద్ధులై ఉండవలెనని తెలుసుకో గోరుతున్నాను"

## గాంధీజీకి వేంకటప్పయ్యగారి తంతి

మహాత్మాగాంధీ బొంబాయి నుంచి గుంటూరు పన్నుల నిరాకరణ విషయంలో 1922 జనవరి 17వ తేదిన పంపిన ఉత్తరానికి జవాబుగా శ్రీ వేంకటప్పయ్య పంతులుగారు, నడింపల్లి నరసింహారావుగారు, పోలిశెట్టి హనుమయ్య గుప్తగార్లు కింది తంతి వార్తను పంపినారు

"మీరు నాయకుల ద్వారా పంపిన లేఖ చూచినాము దానిపైన కింది విషయాలు వ్రాయవలసి వచ్చింది గుంటూరుజిల్లా ప్రదేశాలలో ఉద్యమం బాగా వ్యాపించింది గ్రామోద్యోగులు, పంచములు, క్రైస్తవులు, వెట్టివాళ్ళు చాలా మంది రాజీనామాలు పెడుతున్నారు ప్రచారకులు అనేక చోట్ల జట్టులుజట్టులుగా అరెస్టవుతున్నారు సహకారవాదులు సహాయ నిరాకరణవాదు లవుతున్నారు చాలా గ్రామాలలో పంచమలు, క్రైస్తవులు కూడా స్వచ్ఛంద సేవకులుగా చేరుతున్నారు బాపల ముంటుకోవడం తప్ప అస్పృశ్యత తొలగిపోయింది ఆస్తులను జప్తుచేసి కొందుపెల్లా ఆగ్రహకారణం కలుగుతున్నప్పటికి ప్రజలు శాంతంగా క్రైస్తవోద్యోగులైనా వంట ఇళ్ళలోనికి నిరాక్షేపణంగా రానిచ్చి, అన్నం వండిన పాత్రలను తీసుకొని పోని స్తున్నారు ఇప్పుడు పన్ను లెగబెట్టిన తాలూకాలలో ఖద్దరు కావలసినంత వుంది 100 కి 60 మంది, స్త్రీలతో సహా గ్రామాలలో ఖద్దరు ధరిస్తున్నారు ఢిల్లీ షరతులు పూర్తయినవని మేము విన్నవించుకొంటున్నాము గుంటూరుకు మిలటరీవారు సాయుధ శకటాలతోను, మోటారు లారీలతోను వచ్చి విడిసి ఉన్నారు ఇట్లాంటి పరిస్థితులలో పన్నులు మళ్ళీ ఇవ్వమన్నటయితే మా జిల్లాలో ఉద్యమం తోసి పుచ్చడమే అవుతుంది అప్పుడు చాలా ఘోరంగా ఉంటుంది ఇతర జిల్లాలవారు కూడా మీ అంగీకారంకోసం ఎదురుచూస్తున్నారు"

ఈ తంతివార్త చేరిన తరవాత గాంధీజీ వేంకటప్పయ్య పంతులుగారికి "పరిస్థితులు మీకే బాగా తెలుసు ఢిల్లీ షరతులు తృప్తికరంగా నిర్వర్తింపబడినాయని మీకు సమ్మకం కలిగితే నేనేమీ జోక్యం కలిగించుకోను భగవంతు డనుగ్రహించునుగాక! ఆయన సద్భావంతో సవినయంగా చేసే ప్రయత్నాలు ఆశీర్వదించగలడు సంగతులు నాకు నిత్యం తెలుపుతూండవలె" అని తంతి పంపినారు

గాంధీజీ పంపిన ఈ తంతి తరవాత గుంటూరులో కొంత కాలం పన్నుల నిరాకరణోద్యమం సాగింది ఆ తరుణంలో ఆంధ్రలోని పన్నుల నిరాకరణోద్యమం గురించి ఒక మిత్రుడు ప్రశ్నించగా 'ఆంధ్ర సంగతేమిటి' అనే శీర్షికతో 'యంగ్ ఇండియా'లో గాంధీజీ ఇట్లా వ్రాసినారు

"పన్నుల నిరాకరణకు అనుకూలంగా మీరు ఆంధ్రులకు ఎందుకు సలహా ఇచ్చినారు జనవరి 31 వ తేది వరకు సమష్టి సత్యాగ్రహం ప్రారంభించకుండటానికి మాలవ్యా సభతో మీ సంబంధం మీరు వదులుకోవడం కాదా అది?" అని నన్నొక మిత్రుడు ప్రశ్నిస్తున్నాడు

'నేను ఆంధ్రులకు సమష్టి శాసనోల్లంఘనం చేయవలసిందిగా సలహా ఇవ్వలేదు వారందుకు సంసిద్ధం కావడాన్ని నేను కాదనలేను వారి శక్తిని పరిశీలించుకొని నేటందుకు ఒక నిర్ణీత కాలం వరకు మాత్రమే వారు పన్నులను ఆపుచేసినారు ప్రభుత్వంవారు తొందరపడి వ్యవహారం మించిపోయేటట్లు చేసినారు ఆంధ్రులు తెలివిగలనారు సమ్రత అనే కళలో వారు నిపుణులు గవర్నమెంట్ వారు ఎంత రెచ్చగొట్టినప్పటికి కాంగ్రెస్ వారు నిర్ణయించిన షరతులన్నిటిని పూర్తిచేసి సంపూర్ణంగా సంసిద్ధం అయ్యేటంతవరకు వారు సమష్టి శాసనోల్లంఘనరకు దిగని వినయ సంపన్నులని నేను గట్టిగా నమ్ముతున్నాను కాంగ్రెస్ షరతులలో అతి ముఖ్యమైనది అహింస అనికూడా వారికి తెలుసును నా ప్రయోగ ఫలితం పూర్తిగా తెలిసేటంతవరకు ఆంధ్రులుగాని మరెవ్వరుగానీ ఆ ప్రయత్నానికి పూనకుండా ఉంటే నేను చాలా సంతోషిస్తాను

యంగ్ ఇండియా
2-2-1922

ఆంధ్రలో పన్నుల నిరాకరణం సాగుతూండగా గాంధీజీ 'యంగ్ ఇండియా' పత్రికలో ఇట్లా వ్రాసినారు

**ఆంధ్రదేశంలో చైతన్యము**
(యం కె గాంధీ)

"మనం ఊహించినట్లుగానే గవర్నమెంట్ వారు జాగ్రత్తతో ముందుగా కొన్ని చర్యలు తీసుకోవడం న్యాయమేనని నా అభిప్రాయము శిస్తులు నిలిపి వేయటానికి సైతం ప్రారంభించిన ఉద్యమ సందర్భంలో మామూలు శాసనాన్ని తాత్కాలికంగా నిలుపుచేయటానికి ప్రభుత్వంవారికి హక్కు ఉన్నది అయితే పన్నులను నిరాకరించే స్థితికి ప్రజలను రెచ్చగొట్టేటంతవరకు ప్రభుత్వం పోవడం తెలివిగల పని కాదనే మాటకూడా నిజమే ప్రజాభిప్రాయాన్ని తృణీకరించి నిరంకుశాధికారం చలాయించే ప్రభుత్వం తనంతట తాను అదృశ్యమవుతుందను కోవడం వట్టి పొరపాటు ఆ ప్రభుత్వం తన పన్నులనైనా వసూలు చేసుకొని తనను తాను రక్షించుకోక తప్పదు ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొన్న ఆస్తులను నిమ్న జాతులవారికి ఇచ్చివేస్తున్నారని నిందించటం కూడా మంచిదికాదు ఆ పద్ధతి ఉభయ తారకంగా ఉంటుంది అసహాయవాదులు అహింసాయుతంగా ఉంటామని ప్రమాణం చేసినారు వారనుకొన్నపని సానుకూల మయ్యేటందుకు ఎన్ని కష్టనష్టాలకైన ఓర్చుకొంటామన్నారు కాబట్టి వారు ఆస్తులు వేలం పెడుతూంటే ఒప్పుకోవలసిందే గవర్నమెంట్ వారు కూడా పన్నుల నిరాకరణోద్యమాన్ని భగ్నం చేయటానికి ప్రయత్నించవలసిందే పన్నులను వసూలు చేసేటందుకు మాత్రం కావలసిన అన్ని ఉపాయాలను వారనుసరించవలసిందే ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొన్న పొలాలను నిమ్న జాతులచే వేలంపాటలో

కొనసనీయడమనే సూచన మంచి ఆదర్శము. మనం ఉద్ధరించదలచుకొన్న నిమ్న జాతులవారు, ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొన్న మన పొలాలను తాత్కాలికంగా ఆక్రమించుకోగలగడం కంటె మనకు కావలసిందేముంది ?

“నేను ‘తాత్కాలికంగా’ అనే మాటను బుద్ధిపూర్వకంగా వాడినాను ఎందువల్లనంటే ప్రస్తుతం ఆ భూముల్లో ఉన్నవారు స్వరాజ్యం వస్తుందని స్వరాజ్య ప్రభుత్వం కింద తిరిగి వారి పొలాలు వారికి సగౌరవంగా ఇవ్వబడతాయనీ నమ్మకం కలిగి ఉండవలె ఇక ప్రభుత్వం వారిచేత ఆట వస్తువులుగా ఉపయోగపడిన నిమ్న జాతులవారు కూడా ఇప్పుడు పొలాలనుంచి తొలగింపబడినందుకు నష్టానికి గురికారు ఎందువల్లనంటే నిమ్నజాతులవారిని సుస్థిరంగా సంతోషంగా సంతృప్తికరంగా జీవించేటట్లు చేయడం స్వరాజ్య ప్రభుత్వంవారి ప్రాథమిక కర్తవ్యము.

ఇది ప్రభుత్వ చర్యలకు సంబంధించినంతవరకు, ప్రభుత్వంవారికి కలిగిన ఈ భయానికి కారణం తాము పాపం చేసినట్లు వారి అంతరాత్మ చెబుతూండడమే పన్నులు వసూలు చేసుకొనేటందుకు వారు ప్రజల అభిమానం పైన ఆధారపడి లేరు తమ ఆయుధబలంతో ప్రజలను పీడించడంపైన ఆధారపడి ఉన్నారు ప్రజలకు అభిమాన పాత్రులైన నాయకులను నిర్బంధించి ప్రజలు దౌర్జన్యం చేసేటంతవరకు వారిని రెచ్చగొట్టి తాము చేయబోయే రక్తపాత యుతమైన చర్యలను సమర్థించుకొనేటందుకు వారు ప్రయత్నిస్తున్నారు

ఇదే ఆంధ్రులకు పరీక్షా సమయము ఇంతవరకు వారు ధైర్యవంతులని, త్యాగశీలురని రుజువు చేసుకొన్నారు వారి అభిమానపాత్రులైన నాయకులిప్పుడు జైళ్లలో ఉన్నారు వారి పశువులను ప్రభుత్వం వారు తోలుకొనిపోయినప్పటికీ వారు ప్రశాంతంగానే ఉన్నారు ఇంకా చెప్పరాని కష్టాలు వారు అనుభవించ వలసి ఉంది ప్రభుత్వ సైనికులు వారిపైన తుపాకి గుండ్లను పేల్చనున్నప్పుడు వారు హృదయపూర్వకంగా తమ ఛాతీలను ఎదురొడ్డవలె అంతేకాని అయిష్టంగా వాటికి వెన్నియరాదు అప్పుడుకూడా వారి మనస్సులలో కసిగానీ ద్వేషంకానీ ఉండకూడదు వారి పాత్ర సామగ్రిని, ఇతర చరాస్తులను ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకొంటే చేసుకోనివ్వవలె ఆ సందర్భంలో వారు ద్రౌపదులవలె, ప్రహ్లాదులవలె భగవంతుని ప్రార్థిస్తూ ఆయనపట్ల విశ్వాసంతో ఉండవలె

పన్నుల నిరాకరణం ఒక ప్రత్యేక హక్కు అది నిరాకరణ వాదుల భాగ్యంకోసం ఉద్దేశింపబడలేదు కాని వారు స్వచ్ఛందంగా స్వీకరించిన పేదరికం వల్ల జాతిని సౌభాగ్యవంతంగా చేయడానికి ఉద్దిష్టమైంది తమను తాము పరిశుద్ధులుగా చేసుకోగలిగిన వారు హిందువులైతే అస్పృశ్యతను పాటించే కళంకం నుంచి విముక్తులు కావలె అస్పృశ్యులను తమ సోదరుల కంటె ఎక్కువగా వారు చూడగలిగి ఉండవలె తప్పని సరి అయినందువల్ల అస్పృశ్యులను వారు తాకుతున్నట్లు భావించకూడదు వారు ప్రేమతో

అస్పృశ్యులను ఆలింగనం చేసుకొని వారిని సేవించవలె అస్పృశ్యులను తాకడం నిజమైన పశ్చాత్తాపానికి చిహ్నంమాత్రమే ప్రభుత్వం వారు మన పట్ల చేసిన అనేక పాపాలకు పశ్చాత్తాప పడవలెనని మనం భావిస్తున్నట్టే అస్పృశ్యుల పట్ల చేసిన పాపానికి మనం కూడా పశ్చాత్తాప పడవలె తప్పని సరి అయిన వాటిని అంగీకరించినందువల్ల దేవుడు సంతోషించడు మనహృదయంలలో సంపూర్ణమైన మార్పు కలగవలె మన పాఠశాలలను ఇతర బహిరంగ స్థలాలను ఉపయోగించుకొనేటందుకు మనతోపాటు వారికి కూడా సమానమయిన హక్కులు ఉండవలె జబ్బుగా ఉన్న మన సోదరునికి మనం ఉపచారం చేసినట్లు [illegible] గా ఉన్న అస్పృశ్యులకు కూడా మనం ఉపచారం చేయవలె మనం చేసేదేదో వారి పట్ల అనుగ్రహంతో చేస్తున్నట్లు ఉండకూడదు మన మత గ్రంథాలలో వారికి ప్రతికూలంగా వక్ర భాష్యం చేయరాదు వారి మానవ హక్కులకు వ్యతిరేకంగా వ్యాఖ్యానించటానికి వీలయినటువంటి అనుమానాస్పదమైన భాగాలను తొలగించవలె మన మత గ్రంథాలనుంచి మన మనస్సు బోధించే ధర్మానికి, న్యాయానికి, తర్కానికి వ్యతిరేకమైన ఆచారం మనం పూర్తిగా సంతోషంగా వదలి వేయవలె అజ్ఞానం వల్ల, మూఢ విశ్వాసం వల్ల చెడు ఆచారాన్ని పట్టుకొని ఉండకూడదు దానిని విడవవలసి వచ్చినప్పుడు బుద్ధి పూర్వకంగా విడిచి వేయవలె గాని, లోభివాడు అన్యాయంగా కూడ బెట్టిన ఆస్తిని నిర్బంధంవల్ల తప్పని సరియై విడిచి పెట్టినట్లు విడువకూడదు

అస్పృశ్యతను గురించిన కాంగ్రెస్ షరతు పూర్తిచేయబడునని సంతోషకరమైన ధైర్యయుతాలైన వార్తలను విశ్వసించ కూడదని [illegible] ఉత్తరాలు తంతులు వస్తూన్నందువల్ల నేను అస్పృశ్యతను గురించి ఇంత దూరం చెప్పవలసి వచ్చింది అస్పృశ్యతను విడనాడేటందుకు ఆంధ్రులు [illegible] లేరని వాటి వల్ల నాకు తెలుస్తూన్నది కాబట్టి ఈ విషయంలో [illegible] జాగ్రత్త వహించవలసిందని కోరుతున్నాను సరియైన మార్గం [illegible] ఏమాత్రం [illegible] నప్పటికీ మన ఉద్యమానికి తీరని హాని కలుగుతుంది [illegible] అత్యంత పరిశుద్ధమయిన త్యాగం కోరుతుంటాడు ఇస్లాం, క్రైస్తవ మతాలతో పాటు హిందూ మతానికి కూడా ఇది పరీక్షా సమయము ఉపనిషత్తుల ప్రకారం గుణం ప్రధానం గాని వేరొకటి ప్రధానం కాదు హృదయానికి తర్కానికి నచ్చని దేదీ ఉపనిషన్మతము అంగీకరించదు ఇందుకు భిన్నంగా నడిచే హిందువులు ఆ మతానికి తగిన ప్రతినిధులు కారు

తమ సత్సంప్రదాయానుగుణంగా ఆంధ్రులు వీరోచిత పురుషులు వారు ధర్మం పట్ల ఆసక్తి కలవారు త్యాగ శీలురు దేశం వారిపైన ఎంతో ఆశ పెట్టుకొని ఉంది వారా విషయంలో ఏమాత్రం లోటు చేయరని నా హృదయ పూర్వక విశ్వాసం అన్ని షరతులను పరిపూర్తి చేయడానికి వారింకా సంసిద్ధంగా లేనట్లయితే కొంచెం వేచి ఉన్నందువల్ల వారికి ఏ [illegible] దేమీ లేదు. కాని పూర్తిగా సంసిద్ధంకానిదే యుద్ధంలోకి దిగడంవల్ల వారు సర్వమూ పోగొట్టు

కోవడమే గాక దేశానికి సైతం కీడుచేసిన వారవుతారు "

యంగ్ ఇండియా
2, ఫిబ్రవరి, 1922

ఈ వ్యాసాల తరవాత గుంటూరు జిల్లాలో పన్నుల నిరాకరణం ఆపివేసిన పరిస్థితులు ఇంతకు పూర్వం ఉదాహరించిన శ్రీ వెంకటప్పయ్యగారి స్వీయ చరిత్రలో విపులంగా వివరించడం జరిగింది గుంటూరు జిల్లాలో పన్నుల నిరాకరణం ఆపివేసి నప్పటికీ ప్రభుత్వంవారి తీవ్ర నిర్బంధ విధానం సాగుతూనే వచ్చింది దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారు కూడా నిర్బంధితులైనారు ఆ వార్త చేరిన వెంటనే గాంధీజీ 'యంగ్ ఇండియా'లో ఇట్లా వ్రాసినారు

## దేశభక్తుని నిర్బంధము

"ఈ సంచిక సరిగా అచ్చుకు పోతూన్న సమయంలోనే దేశభక్త కొండ వేంకటప్పయ్య నిర్బంధింపబడినట్లు తంతివార్త వచ్చింది ఆయన ఆంధ్రులలో ఉత్తమోత్తముడైన మహానాయకుడు స్వీయసౌఖ్యంకంటె దేశాన్ని ఎక్కువగా ప్రేమించడమే ఆయన చేసిన అపరాధము ఆంధ్రులను, దేశభక్తుణ్ణి నేను అభినందిస్తున్నాను ఈ ఉత్తమ దేశసేవకునికి లభించిన విశ్రాంతి ఆయన పడిన శ్రమకు తగినదే ఆయన మనలోలేకపోయి నప్పటికి ఆయన తలపెట్టిన ఉద్యమం అభివృద్ధి పొంది తీరుతుంది ప్రభుత్వంవారు ఆయన శరీరం బంధింప గలిగినారు కాని మనలోనుంచి ఆయన ఆత్మను తీసుకొని పోజాలరు "

యం కె గాంధీ
9 మార్చి, 1922
యంగ్ ఇండియా

గుంటూరులోని పెదనందిపాడుఫిర్కాలో పన్నుల నిరాకరణం ఆపివేయక ముందే ఆంధ్ర దేశంలోని వివిధ జిల్లాలలో గాంధీజీ ఆదేశానుసారం ఆయా జిల్లాల కాంగ్రెస్ కమిటీల నిర్ణయంప్రకారం పన్నుల నిరాకరణోద్యమం నిలిపి వేయబడింది కాని ఆ ఉద్యమ ప్రచార సందర్భంలోను కల్లు, సారా దుకాణాల వేలం పాటల నిరోధ సందర్భంలోను అన్ని జిల్లాలలోను అనేక మంది కాంగ్రెస్ నాయకులు, కాంగ్రెస్ ప్రచారకులు, కాంగ్రెస్ స్వచ్ఛంద సైనికులు అరెస్టు అయి కారాగార శిక్షలకు గురి అయినారు, ఆంధ్ర దేశంలో జరుగుతున్న ఈ నిర్బంధ విధానం గురించి గాంధీజీ అనేక పర్యాయాలు ఆంధ్రుల ధైర్య సాహసాలను, కార్యనిరతిని, త్యాగశీలాన్ని కొనియాడినారు ఆంధ్ర దేశంలో యింతకుముందు పేర్కొన్నవారు కాక తరవాత అరెస్టయిన ప్రముఖులు, అయ్యదేవర కాళేశ్వరరావు, చెలకువాడ వెంకట నరసింహం, గరిమెళ్ల

సత్యనారాయణ, తిక్కవరపు రామిరెడ్డి, ఒరుగంటి వెంకట సుబ్బయ్య, వేమూరి లక్ష్మయ్య, అక్బర్ సాహెబ్, అద్దేపల్లి వెంకటగురునాథరామ శేషయ్య బారిష్టర్ కందుల వీరరాఘవస్వామి నాయుడు, చట్టి నరసింహారావు, ఖమిడిపాటి సత్యనారాయణ, డాక్టర్ పాలకోడేటి గురుమూర్తి, మానికొండ సత్యనారాయణ శాస్త్రి, కందాళం సర్వేశ్వరశాస్త్రి, గరిమెళ్ల కుమారస్వామి, నిష్ఠల సోమయాజులు, కంభంపాటి సాంబయ్య, వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాదరావు, బ్రహ్మాండం నరసింహం, వోగిరాల వెంకట్రామ దీక్షితులు, ఉన్నవ రామలింగం, న్యాయపతి నారాయణమూర్తి, మల్లాది కృష్ణమూర్తి, పోతాప్రగడ సుబ్బారాయుడు నాళం మట్టపల్లి, పెరుమాళ్ళ శాయన్న గోలి మల్లికార్జున శాస్త్రి, వి వి గిరి, నాభి రామకృష్ణారావు పుల్లెల శ్యామసుందరరావు, గోపాలం రామలింగయ్య, కె నారాయణప్ప, సడింపల్లి వెంకటలక్ష్మినరసింహారావు మొదలయినవారు పన్నుల నిరాకరణ సందర్భంలో గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాలోని పోరొంగిపల్లి కరణాన్ని దుర్భగోదావరిజిల్లా కలెక్టరు నడివీధిలో కొరడాలతో కొట్టించినాడు పల్నాడు పుల్లరి సత్యాగ్రహ సందర్భంలో కన్నెగంటి హనుమంతు మరి ఇద్దరిని పోలీసులు తుపాకులతో కాల్చి చంపినారు ఆంధ్రదేశంలో జరిగిన దేవాలయాల రథోత్సవంలో రథం పైన గాంధీజీ మొదలైన దేశనాయకుల పటాలను పెట్టించినందుకు పోలీసులు ఆటంకపరచడం, లాటీచార్జీలు చేయడంవల్ల కొన్నిచోట్ల ఉత్సవాలు ఆగి పోవడం తటస్థించింది ఈ సందర్భంలో పోలీసులు కొన్ని చోట్ల తుపాకులు కూడా కాల్చినారు

## శాసనోల్లంఘనం నిలుపుదల

యావద్భారత దేశంలో అసహాయోద్యమం విజృంభించి అనేక విధాల శాసనోల్లంఘనం జరుగుతూండగా పోలీసు అత్యాచారాలకు మేరలేకపోయింది అందువల్ల ప్రజలు కొన్నిచోట్ల ఉద్రేకం పట్టలేక పోలీసులపై తిరుగుబాటు చేయడం జరిగింది ఉత్తర ప్రదేశ్‌లోని చౌరి చౌరాలో మూకలు పోలీస్టేషన్‌పై దాడిచేసి స్టేషన్‌ను తగులబెట్టినారు పోలీస్ వారు కొందరు ఆమంటలలో తగుల బడినారు ఈ దురాగతాలకు గాంధీజీ ఎంతో దుఃఖించి బార్డోలిలో సాగింపనున్న సమష్టి శాసనోల్లంఘనం తాత్కాలికంగా నిలిపివేయడమేగాక తాను హిమాలయ మంత గొప్ప తప్పు చేసినట్లు భావించి అందుకు ప్రాయశ్చిత్తంగా 5 రోజులు ఉపవాసం చేసినాకు

ఆ తరవాత 1922 ఫిబ్రవరి 2 న బార్డోలిలో అఖిలభారత కాంగ్రెస్ కార్య నిర్వాహక సంఘం సమావేశమై దేశమంతటా సమష్టి శాసనోల్లంఘనం తాత్కాలికంగా నిలిపి వేయవలసిందని తీర్మానించినారు కాంగ్రెస్‌వాదు లందరూ నిర్మాణ కార్యక్రమానికి పూనుకొని ఒక కోటి మంది కాంగ్రెసు సభ్యులను చేర్పించ వలెనని, రాట్న పరిశ్రమకు, జాతీయ పాఠశాలల, పంచాయతీల

నిర్మాణానికి, మద్య నిషేధ ప్రచారానికి కృషి చేయవలసిందని కూడా తీర్మానించడం జరిగింది ఈ నిర్మాణ కార్యక్రమం శాసనోల్లంఘనకు ప్రజలు సంసిద్ధమయ్యేటందుకు ఎక్కువగా తోడ్పడ గలదని కూడా కాంగ్రెస్ కార్యవర్గంవారు అభిప్రాయపడినారు 1922 మార్చి 18 న ప్రభుత్వంవారు గాంధీజీని అరెస్టు చేసినారు ఆయనకు 6 ఏండ్లు కారాగార శిక్ష విధించడం జరిగింది ఆయన శిక్షకు కారణం యంగ్ ఇండియాలోని కొన్ని ప్రభుత్వ ప్రతికూల వ్యాసాలు

గాంధీజీ నిర్బంధానికి ముందు శాసనోల్లంఘనం నిలిపి వేయడం గురించి ఆయన 'యంగ్ ఇండియా'లో ఇట్లా వ్రాసినారు "చౌరి చౌరావల్ల అసహాయవాదులకు కొత్త విధి ఏర్పడింది వ్యష్టి, సమష్టి శాసనోల్లంఘన కార్యాల నన్నిటిని నిలుపు చేయవలెనని కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గ తీర్మానం కోరుతున్నది అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశ మయ్యేటంతవరకు స్వరక్షణార్థం గాని, సహాయ నిరాకరణోద్దేశంతో గాని, శాసనోల్లంఘం నిలిపివేయవలె కార్య నిర్వాహక సంఘ తీర్మానాన్ని అఖిల భారత కాంగ్రెస్ కమిటీవారు ఖాయం చేస్తారని నమ్ముతున్నాను సమష్టి శాసనోల్లంఘనం చాలా కాలం వరకు-కనీసం సంవత్సరాంతం వరకైనా-నిలిపివేయవలెనని నా అభిప్రాయము జన సామాన్యం మనం చెప్పినట్లు పూర్తిగా నడుచు కోవడం లేదని తెలిసింది కేవలం సహాయ నిరాకరణోద్దేశంతో చేసే వ్యక్తి శాసనోల్లంఘనం కూడా కొంత కాలం ఆగవలె కాని మనకు అవసరమైన మామూలు కాంగ్రెస్ ప్రచారాలను కార్య నిర్వాహక సంఘం నిషేధించలేదు ప్రభుత్వంవారు ఆక్షేపించినప్పటికీ ఇవి జరుగుకూండ వలసిందే ప్రకటనల కోసం కాక కాంగ్రెస్ ప్రచారార్థం సరిగా కావలసిన వలంటీర్లను ఒక ప్రమాణంలో చేర్చుకోవచ్చు విదేశీ వస్త్ర దుకాణాల వద్ద బోధించడం కొంత కాలం ఆపవలెనని కార్య నిర్వాహక సంఘం వారన్నారు కాబట్టి కల్లు దుకాణాల విషయమై మాత్రం బోధ చేయవలె ఇది కూడా ప్రజలకు బాగా తెలిసిన పెద్ద మనుష్యులు మాత్రమే చేయవలె కాంగ్రెస్ ప్రచారకు లందరూ కార్య నిర్వాహక సంఘంవారు నిర్ణయించిన నిర్మాణ విధానం ప్రకారం నడచుకోగలరని నమ్ముతున్నాను ఈ నిర్మాణ కార్యక్రమం ద్వారా ఖిలాఫత్, పంజాబు స్వరాజ్యాల విషయంలో అన్ని పక్షాలవారు ఏకీభవించి పని చేయవలె "

యంగ్ ఇండియా

## జైలులో గాంధీజీ

గాంధీజీని సి రాజగోపాలాచార్యులవారు యరవాడ జైలులో సందర్శించి ఆ ఉదంతం పత్రికలకు తెలియజేసినారు

"రాజగోపాలాచార్యుల వారి వృత్తాంత ప్రకారం జైలు సూపరింటెం

డెంట్ కుర్చీలో సుఖంగా కూర్చొని ఉండగా రాజగోపాలాచారి గారితో గాంధీజీ సంభాషణ ముగించేటంత వరకు ఆయన (గాంధీజీ) నిలుచుని ఉండవలసి వచ్చింది గాంధీజీ మామూలుగా భుజించే పదార్థాలను కారాగృహాధికారులు ఆయనకు ఇవ్వడంలేదు ఆ జైలులోనే ఖైదీగా ఉన్న శంకర్‌లాల్ బ్యాంకర్‌ను గాని మరి ఇతర ఖైదీలను గానీ చూడడానికి మహాత్మునికి వీలు లేదు ఏకాంత నిర్బంధానికి ప్రత్యేకించిన గదిలో గాంధీజీని ఉంచినారు రాత్రులు గదికి తాళం వేస్తున్నారు వెలుపల నుంచి ఏ వస్తువులు గాంధీజీకి పంపడానికి వీలు లేదు సొంత పరుపు తెప్పించుకొనేటందుకు వీలులేదు రెండు దుప్పట్లు మాత్రం ఆయన కిచ్చినారు దిండు అనవసరమన్నాడట సూపరింటెండెంట్ గారు మహాత్ముడు జైలు పాత్రలనే ఉపయోగించవలె ఆయన ఆరోగ్యం కూడా తిన్నగా ఉన్నట్లు కనిపించలేదు '

ఈ వార్తను 1922 ఏప్రిల్ 3 వ తేదీ ఆంధ్రపత్రిక ప్రకటించింది దీనిని బట్టి లోకోత్తర పురుషుడని కొనియాడబడుతున్న గాంధీజీ పట్లనే జైలు అధికారుల ప్రవర్తన ఇట్లా ఉండగా అసహాయోద్యమంలో శిక్షింపబడిన సాధారణ నాయకుల పట్ల, సామాన్య స్వచ్ఛంద సేవకుల పట్ల జైలు అధికారుల ప్రవర్తన ఆనాడు ఎట్లా ఉన్నదో తేలికగా ఊహించవచ్చు

## ప్రభుత్వంవారి అసంగతమైన ఉత్తరువు

సహాయ నిరాకరణోద్యమ సందర్భంలో ప్రభుత్వంవారి నిర్బంధ విధానం సభలను నిషేధించటం, వ్యక్తులపైన ఉపన్యాసాలియకూడదని నిషేధపు టుత్తరువులు జారీ చేయడం, నాయకులను, ప్రచారకలను అరెస్టుచేసి శిక్షించి కారాగారానికి పంపించడం సభలను చెదరగొట్టడానికి లాఠీలు ప్రయోగించడం, తుపాకులు పేల్చడం మొదలయిన చర్యలేగాక ఇంకా కొన్ని విచిత్రమైన పెడదారులను పట్టింది వరాహగిరి వెంకట జోగయ్య పంతులుగారిని ప్రభుత్వ న్యాయవాది పదవికి రాజీనామా ఇవ్వవలసిందని నిర్బంధించటం అందులో ఒకటి

వరాహగిరి వెంకట జోగయ్య పంతులుగారు గంజాం జిల్లా బరంపురంలో ప్రభుత్వ న్యాయవాదిగాను, పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గాను పని చేస్తూ ఉండేవారు ఆయన కుమారుడు బారిష్టర్ వి వి గిరిగారు (మాజీ రాష్ట్రపతి), అసహాయవాది కాబట్టి ఆయనను ఇంటి నుంచి పంపి వేయవలసిందని లేదా తమ ప్రభుత్వ న్యాయవాది పదవికి రాజీనామా ఈయవలసిందని గంజాం జిల్లా మేజిస్ట్రేట్, జోగయ్య పంతులు గారికి నోటీసు పంపించినారు ఆ సందర్భంలో జోగయ్య పంతులుగారు 1922 ఏప్రిల్ 6 వ తేదిన, గంజాం జిల్లా మేజిస్ట్రేటు ద్వారా మద్రాసు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి తమ రాజీనామా ఉత్తరాన్ని ఈ విధంగా వ్రాసి పంపినారు

'1914 జూలై నుంచి నేటి వరకు నేను బరంపురంలో ప్రభుత్వ న్యాయవాదిగా పని చేస్తున్నాను నేడు రాజీనామాను పంపడానికి కారణా

లను ఇక్కడ సగౌరవంగా విన్నవించుకొంటున్నాను 'మీ ఇంటిలో మీరు అసహాయవాదులకు ఆశ్రయమిస్తున్నారని, అక్కడ అసహాయవాదుల సభలు జరుగుతున్నవని నాకు తెలిసింది మీ కుమారుడు అసహాయవాదిగా పని చేస్తు న్నాడు మీరు ప్రభుత్వ న్యాయవాదిగా ఉండదలచుకొంటే మీరతని పట్ల దాక్షిణ్యం వదలి అతనిని మీ ఇంటినుంచి వెళ్ళగొట్టి తీరవలె' అని జిల్లా మేజి స్ట్రేట్ ఫిబ్రవరి నెల మొదటి వారంలో నాతో చెప్పినారు

'మా ఇంటిలో అసహాయవాదుల సభలు జరుగుతున్నవనే సంగతి కేవలం అబద్ధం నా మిత్రులలో అన్ని రాజకీయ పక్షాల వారున్నారు మిత వాదులు, అసహాయవాదులు మొదలయిన రాజకీయ పక్షాలకు చేరిన మిత్రులం దరూ మా ఇంటికి వస్తుంటారు రాజకీయాలలో నాకూ నా కుమారునికి భేదాభి ప్రాయాలున్నాయి నా కుమారుడు అసహాయవాది అతడు నా ఇంటిలో ఉంటున్నాడనే కారణం చేత నేను రాజీనామా ఇవ్వవలెనని కోరడం అను చితము' అని నేను జిల్లా మేజిస్ట్రేటుతో చెప్పినాను 'మీరు త్వరలో ఏదో ఒకటి చేయక తప్పదని ఆయన మళ్లీ నాతో అన్నాడు ఈ సంగతులను ఫిబ్ర వరి 10 వ తేదిన జిల్లా జడ్జికి తెలిపినాను మార్చి 21 వ తేదిన మీరు (ప్రభుత్వ కార్యదర్శికి) కూడా ఒక డెమీ అఫిషియల్ ఉత్తరం వ్రాసినాను

ఆ ఉత్తరంలో '1919 వరకు నేను కాంగ్రెస్‌లో సభ్యుడనుగా ఉన్నాను చాలా శ్రద్ధతో పని చేసినాను నేను మితవాదిని అందువల్ల నాకు హిందూదేశంలో చాలా మంది స్నేహితులు ఉన్నారు వారిలో మితవాదులు జాతీయ వాదులు కూడా ఉన్నారు కొందరు అసహాయోద్యమంలో చేరినారు రాజకీయంగా నాకూ, నా మిత్రులకూ అభిప్రాయ భేదం కలిగినప్పటికీ మా మైత్రికి ఏమీ భంగం కలగలేదు ఆ మిత్రులు బరంపురం మీదుగా ప్రయాణం చేసేటప్పుడు బరంపురంలో దిగి మా ఇంటికి వచ్చి బసచేసి ఒకటి, రెండు రోజులు ఉండి పోతూ ఉంటారు నా కుమారుడు బారిష్టర్ వి వి గిరి తన న్యాయవాద వృత్తిని మానివేసి అసహాయోద్యమంలో చేరినాడు అంతకుపూర్వం అసహాయోద్యమం గురించి నేనూ, నా కుమారుడు చర్చించినాము అసహాయో ద్యమంలోని ప్రధాన నియమాలు నేనంగీకరించలేనందుకు ఉన్న కారణాలను నా కుమారునికి తెలిపినాను నేను మితవాదిగాను, అతడు అసహాయవాదిగాను ఉండటానికి మేమిద్దరము అంగీకరించినాము మా ఇంటిలో అసహాయవాదుల సభలు జరిగినవన్న సంగతి కేవలం అబద్ధము అసహాయోద్యమం గురించి నేను నా మిత్రులందరితోను చర్చిస్తూ ఉంటాను అసహాయోద్యమంలోని హానికర విధానాలను గురించి నా మిత్రులైన అసహాయవాదులకు కూడా తెలుపుతూ ఉంటాను, నేను అసహాయవాదిని కాదనడానికి అనేక నిదర్శనాలున్నాయి, నేను నా వృత్తిని మానలేదు ప్రభుత్వ న్యాయవాది పదవికి రాజీనామా ఇవ్వలేదు బరంపురంలోని కళాశాలా (సెకండ్ గ్రేడ్ కాలేజి) సంఘానికి ఉపాధ్యక్షునిగా ఇప్పటికీ పని చేస్తున్నాను, ఆ కళాశాల నుంచి విద్యార్థులను పూనిపించడానికి

అసహాయవాదులు ప్రయత్నించినప్పుడు నేను ప్రతిఘటించినాను ఆ కళాశాల బాగా సాగటానికి భూరి విరాళాలు ఇవ్వవలెనని ప్రభుత్వం వారికి వ్రాసినాను ఈ కాలంలో రాజకీయంలో తండ్రి కొడుకులకు భిన్నాభిప్రాయాలు కలుగడం మా ఒక్క కుటుంబంలోనే జరగలేదు వంగ సంయుక్తాది వివిధ రాష్ట్రాలలో అనేక కుటుంబాలలో జరుగుతూన్నది అసహాయోద్యమానికి గల నియమాలలో న్యాయవాద వృత్తిని, విద్యార్థులు పాఠశాలలను వదిలివేయవలెననే నియమాలు నాకు రుచించలేదు ఖద్దరు ప్రచారం వల్ల దేశానికి లాభముందని నాకు తోచింది కాబట్టి నేను ఖద్దరు బట్టలనే వాడుతున్నాను విదేశీ బట్టలను తగుల బెట్టడంవల్ల ధన నష్టం కలుగుతున్నది కాబట్టి దానికి నేను ఎంత మాత్రం అంగీకారంగా లేను ఖద్దరు బట్టలు కట్టుకోడానికి ఆక్షేపణ లేదని ప్రభుత్వం వారు, మద్రాస్ హైకోర్టువారు, ప్రచురణ సంఘం వారు కూడా వెల్లడించినట్లు నాకు జ్ఞాపకము రాజకీయాలను గురించి నా అభిప్రాయాలు నేను మరుగు పరచలేదు దేశంలో అందరికీ నా అభిప్రాయాలు స్పష్టంగా తెలిపినాను ఎట్లాగైనా నేనీ ప్రభుత్వన్యాయవాద పదవిని నిలుపుకోవడంకోసం మీకింత దూరం వ్రాయలేదు నన్ను రాజీనామా ఇమ్మనడం అక్రమమని తెలిపేటందుకే ఇంత దూరం వ్రాయవలసి వచ్చింది నన్ను రాజీనామా ఇమ్మని కోరడానికి ఇంకేమయినా కారణాలు ఉంటే తెలుపుమని కూడా మీకు ఆ ఉత్తరంలో వ్రాసినాను కాని మీరు నాకు తెలపలేదు రాజకీయాలను గురించి నా అభిప్రాయాలు జిల్లా జడ్జికి నేను తెలిపిన సంగతులను మీకు తెలిపినానని, జిల్లా జడ్జి నా పనిని గురించి చాలా ప్రశంసిస్తానని, మీకు వ్రాసినట్లు, కళాశాలనుంచి విద్యార్థులను మానిపించడానికి అసహాయవాదులు చేసిన ప్రయత్నాలను నేను ప్రతిఘటించినానని మీకు తెలిపినట్లు, నా ఇంటిలో రాజకీయ సభలేవి జరగలేదని నేను స్పష్టంగా చెప్పిన సంగతి కూడా మీకు వ్రాసినట్లు జిల్లా మేజిస్ట్రేట్ నాకు తెలియజేసినారు

నేను మీకు మార్చి 21 వ తేదీన వ్రాసిన పై ఉత్తరానికి నేను రాజీనామా నీయవలెననే మీరు నిర్ధారణ చేసినట్లు ఈ నెల 5 వ తేదీన జిల్లా మేజిస్ట్రేట్ నాకు వ్రాసినాడు

అసహాయోద్యమం అవలంబించినమిత్రులతో మైత్రిని వదలుకోవలెనని, పుత్రులను ఇళ్ళలో నుంచి వెళ్ళగొట్టవలెనని ప్రభుత్వంవారు నిర్బంధించటం చాలా అక్రమము, అసంభవము అని నేనీ సందర్భంలో దాపరికం లేకుండా తెలుపుకొంటున్నాను ప్రభుత్వోద్యోగులలో చాలా మంది అసహాయోద్యమం లాభకరం గాదని మనఃపూర్వకంగా నమ్ముతున్నారు అట్లాగే వారి బంధుమిత్రులనేక మంది అసహాయోద్యమం అత్యుత్తమ మయినదని మనఃపూర్వకంగా నమ్ముతున్నారు రాజకీయాలలో అభిప్రాయ భేదాలు కలిగినంత మాత్రాన బంధుమిత్రులను పరిత్యజించటం భారతీయుల అభిప్రాయానుసారం కేవలం అసంభవము ప్రభుత్వోద్యోగులు తమ విధులను చక్కగా నెరవేర్చడానికి అసహాయ

వాదులతోటి మైత్రిగాని, ఖద్దరు బట్టలు కట్టుకోవడంగాని ఎటువంటి ఆటంకం కలిగించలేవు ప్రభుత్వంవారు ఇటువంటి ఉత్తరువులను జారీ చేయడంవల్ల తమకునష్టం కలగకుండా చూసుకొనేటందుకు ప్రభుత్వోద్యోగులు రుజువర్తనం వదలి కపట మార్గాలను అవలంబించవలసి వస్తుంది ఇటువంటి ఉత్తరువులవల్ల ప్రభుత్వ సంకల్పం ఈడేరదు నేను నావిధులను నెరవేర్చడంలో ఏ విధమయిన లోపం కలగలేదని జిల్లాలోని ఉన్నతోద్యోగులు తెలిపినప్పటికీ కూడా నన్ను రాజీనామా ఇవ్వమనడం అనుచితము, అక్రమము అని నేను నమ్ముతున్నాను నాకీ పదవిని ఇచ్చినప్పుడు దీని నుంచి మేమెప్పుడైనా మీ ఇష్టానుసారం కారణాలు తెలపకుండా తొలగించగలమని మీరు వివరించి ఉండలేదు కాబట్టి మరి 14 నెలల వరకు నేను మానివేయనని మీకు తెలపడం బాగానే ఉంటుంది అయినప్పటికీ కక్షిదారు అంగీకరించనప్పుడు బలవంతంగా నేను అతని పక్షాన వాదిస్తాననడం నా ఆత్మ గౌరవానికి, ప్రతిష్ఠకు భంగకరము కాబట్టి నేనీ రాజీనామాను పంపుతున్నాను "

ఆ రోజుల్లో ప్రభుత్వంవారు తమ ఉద్యోగులపట్ల అవలబించిన నిర్బంధ విధానానికి జోగయ్య పంతులుగారి రాజీనామా లేఖ ఒక మచ్చు తునక మాత్రమే కాంగ్రెస్ ప్రచారకులు గ్రామాలలోకి పోయినప్పుడు వారికాతిథ్య మిచ్చిన గ్రామోద్యోగులనేక మందిని ప్రభుత్వంవారు ఉద్యోగాలనుంచి తొలగించినారు ప్రభుత్వోద్యోగుల బిడ్డలు అసహాయవాదులైనప్పుడు వారిని ఇంటికి రానివ్వవద్దని తల్లి తండ్రులను బెదరించగా అనేక మంది యువకులు తల్లి తండ్రులను వదిలి ప్రభుత్వంవారి ఇతర నిర్బంధ విధానాలకు సైతం గురి అయినారు దీనికి అంతకూ ఆనాటి యువజనులకు దేశంపట్ల, గాంధీ మాటలపట్ల గల భక్తి ప్రపత్తులే కారణము

## శాసనోల్లంఘన విచారణ సంఘము

అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ 1922 ఫిబ్రవరి 12వ తేదీన బార్డోలిలో సమావేశమై శాసనోల్లంఘన తాత్కాలికంగా విరమింప జేసిన తరవాత కూడా ప్రభుత్వంవారి నిర్బంధ విధానం వివిధ రూపాలలో విజృంభించటం చూసి 1922 జూన్‌లో అఖిల భారత కాంగ్రెస్ సంఘం సమావేశమై ఇట్లా తీర్మానించింది

"శాసనోల్లంఘన కార్యకలాపాలన్నీ తాత్కాలికంగా నిలిపివేయబడినప్పటికీ అనేక రాష్ట్రాలలో ప్రభుత్వంవారు తీవ్ర నిర్బంధ విధానం కొనసాగిస్తూన్నందున దేశం తన కోర్కెలను నెరవేర్చుకొనేటందుకు శాసనోల్లంఘనం సాగించవలెనని ఈ కమిటీ అభిప్రాయపడుతున్నది అందుకనుగుణంగా రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలు 1922 సెప్టెంబర్ 30 లోగా నిర్మాణకార్యక్రమం మరింత ఉత్సాహంతో కొనసాగించవలెనని ఆ తరవాత ఈ కమిటీవారు అప్పటి పరిస్థితులను ఆలోచించి శాసనోల్లంఘనం గురించి తుది నిర్ణయం తీసుకోగలరని

తీర్మానిస్తున్నారు "

ఈ తీర్మానంతోపాటు వారు శాసనోల్లంఘన విచారణసంఘం నొకదానిని నియమించినారు ఆ కమిటీలో పండిత్ మోతీలాల్ నెహ్రూ, డాక్టర్ అన్సారీ, హకీం అజ్మల్ ఖాన్, రాజగోపాలాచారి విఠల్ భాయిపటేల్, కస్తూరి రంగయ్యంగారు సభ్యులుగా ఉన్నారు వారు దేశమంతటా తిరిగి దేశంలోని సాధారణ పరిస్థితులు గమనించి, శాసనోల్లంఘనాన్ని తిరిగి ప్రారంభించే విషయం గురించి నివేదిక పంపవలెనని నిర్ణయించడం జరిగింది వారు 1922 ఆగష్టు 1వ తేదీన గుంటూరు వచ్చినారు వారిని కలుసుకొని శాసనోల్లంఘనం తిరిగి ప్రారంభించటం వాంఛనీయమా, కాదా అనే విషయం గురించి తమ అభిప్రాయాలు చెప్పేటందుకు ఆంధ్రదేశ ప్రముఖ నాయకులందరూ ఆహ్వానింపబడినారు జిల్లా కాంగ్రెస్ కమిటీలన్నీ తమ అభిప్రాయాలను ఆ కమిటీ ముందు నివేదించేటందుకు ప్రతినిధులను పంపినారు ఖద్దరు దుస్తులతో గాంధీ టోపీలతోను వివిధ ప్రదేశాల నుంచి కాంగ్రెస్ స్వచ్ఛంద సైనికులు శాసనోల్లంఘన విచారణ సంఘ సభ్యుల ఊరేగింపులను సమావేశాలను సక్రమంగా నడిపేటందుకు గుంటూరు చేరుకొన్నారు కమిటీ సభ్యులను సగౌరవంగా ఆహ్వానించడానికి గుంటూరు పౌరులు బ్రహ్మాండమయిన ఏర్పాట్లు చేసినారు కమిటీ సభ్యులకు సన్మాన పత్రం సమర్పించడానికి మునిసిపల్ కౌన్సిల్ తీర్మానించింది వీధులు చక్కగా అలంకరింపబడినాయి గృహస్థులు తమ ఇండ్లకు సున్నం కొట్టించుకొన్నారు బహిరంగసభకు విశాలమయిన పందిరి నిర్మించబడింది ఈ ఉత్సాహకర దృశ్యాలన్నీ చూసినవారికి అసహాయోద్యమపు రోజులు తిరిగి వస్తున్నవా అనిపించింది కమిటీ సభ్యులు మద్రాసు నుంచి గుంటూరుకు రైలులో వస్తూండగా నెల్లూరు, చీరాల బాపట్ల, తెనాలి మొదలైన ముఖ్యమయిన స్టేషన్లలో ప్రజలు వారిని అత్యంతోత్సాహంతో సత్కరించినారు

ముఖ్యంగా గుంటూరు పౌరులు చేసిన ఏర్పాట్లను గమనించి నప్పుడు ప్రభుత్వంవారికి కన్ను కుట్టింది గుంటూరు మునిసిపల్ కౌన్సిల్ శాసనోల్లంఘన విచారణ సంఘం వారికి సన్మాన పత్రం సమర్పించవలెనని తీర్మానించడం ప్రభుత్వాధికారులకు బొత్తిగా గిట్టలేదు అందువల్ల వారు కమిటీ వారి కార్యక్రమానికి సాధ్యమయినన్ని అభ్యంతరాలు కలిగించ దలచుకొన్నారు

కమిటీవారు గుంటూరు రావడానికి కిందటి రోజునే వారి సన్మానానికి సంబంధించిన ఊరేగింపులో గాని, సమావేశంలోగాని, కాంగ్రెస్, ఖిలాఫత్ స్వచ్ఛంద సైనికులెవ్వరూ పాల్గొరాదని 144వ సెక్షను క్రింద సబ్ డివిజనల్ మేజిస్ట్రేట్ నిషేధపు ఉత్తరువులు జారీచేసినాడు ఆగస్టు 1వ తారీఖున కమిటీ వారు ప్రయాణం చేస్తున్న రైలు గుంటూరుకు చేరేముందు 250 మందిని 144 ఉత్తరువును ఉల్లంఘించినారనే నెపంతో విచక్షణలేకుండా అరెస్టుచేసినారు పోలీసులు అరెస్టుచేసిన, అట్లా అరెస్టయిన వారిలో ఉన్నవ లక్ష్మీనారాయణ,

దండు నారాయణరాజు, వేదాంతం నరసింహాచార్యులు మొదలయిన నాయకులు యింకా అనేకమంది స్వచ్ఛంద సైనికులు కానివారు ఉన్నారు పోలీసువారు అంతటితో ఆగలేదు వారు మైదానానికి పోయి సన్మానానికి నిర్మించిన పందిరిని కూలతోసినారు

పోలీస్ వారు ఇన్ని పనులు చేసినప్పటికి ప్రజలేమీ కంగారు పడలేదు పోలీస్ చర్య వారికేమీ ఆశ్చర్యం కలిగించలేదు బహిరంగ సభ డాక్ బంగాళా ఆవరణలో జరిగింది పౌరుల పక్షాన కమిటీ సభ్యులకు సన్మానపత్రం సమర్పించడం జరిగింది మునిసిపల్ కౌన్సిల్ వారు సమర్పించదలుచుకున్న సన్మాన పత్రం కలెక్టర్ నిరాకరించినప్పటికీ కౌన్సిల్ సభ్యులలో ఒకరయిన నడింపల్లి వేంకటలక్ష్మీ నరసింహారావుగారు సన్మాన పత్రం చదివినారు

గుంటూరులో తమ పని ముగించుకొని కలకత్తాకు పోతూ కమిటీ సభ్యులు బెజవాడలో కొన్ని గంటలాగినారు బెజవాడ మునిసిపల్ కౌన్సిల్ వారు వారికి సన్మాన పత్రం సమర్పించినారు తోవలో రైలు నిలిచిన చోట్లల్లా ప్రజలు వారిని హృదయపూర్వకంగా ఆహ్వానించినారు సామర్లకోట స్టేషన్‌లో కాకినాడ మహిళా సమాజంవారు తాలూకా కాంగ్రెస్ కమిటీవారు వారిని గౌరవించిన పద్ధతిలో ఒక విశిష్టత కనిపించింది

కమిటీవారి ఆంధ్రదేశ పర్యటన వల్ల సహాయ నిరాకరణోద్యమం గురించి ప్రజల్లో నూతనోత్సాహం కలిగింది వారితోపాటు ప్రభుత్వ నిర్బంధ విధానం కూడా మరోసారి తల ఎత్తింది

శాసనోల్లంఘన విచారణ సంఘంవారు దేశమంతా తిరిగి విచారణ చేసి అక్టోబరులో శాసనోల్లంఘనకు దేశం తయారుగా లేదని, దానిని విరమించవలసిందని నివేదిక పంపినారు వారిలో ముగ్గురు - మోతీలాల్ నెహ్రూ, హకీం అజ్మల్ ఖాన్, విఠల్ భాయి పటేల్ గార్లు శాసన సభా ప్రవేశానికి అనుకూలంగా ఇట్లు వ్రాసినారు

"కాలం మారింది, పరిస్థితులుకూడా మారినాయి పోరాటం అంతులేకండా సాగుతున్నది ప్రతి సంవత్సరం శాసన సభలో ప్రజల నిత్యజీవితానికి సంబంధించిన అనేకచట్టాలు చేయబడుతూనాన్నాయి ప్రజాప్రతినిధులని పిలవబడుతున్నవారి పేరు మీద వారి తోడ్పాటుతోను కొత్త పన్నులు, కొత్త బాధ్యతలు ప్రజలమీద రుద్దడం జరుగుతూ ఉంది ప్రజలకు ఇష్టమున్నా లేకపోయినా వాటికి వారు లోబడక తప్పడం లేదు ఇటువంటి పరిస్థితులలో ప్రజలపైన కాంగ్రెస్ పలుకబడి ఎంతకాలం నిలిచి ఉండగలదనేది ఆలోచించవలసిన విషయం కాంగ్రెస్ ఇప్పటివలెనే శాసన సభలను బహిష్కరించవలెనని పట్టు బట్టేటట్లు వోటర్లలో ఎక్కువ మంది ఎన్నికలలో వోట్లు ఇచ్చేటట్లు ప్రజలలో మనకు ఎక్కువ పలుకుబడి ఉందని మనం చెప్పుకొనే మాటకు విలువ పోతుంది అంతేగాక బహిష్కారంపైన ఉన్న మోజు పోయిందని కూడా మా నమ్మకము రానున్న ఎన్నికల్లో ఎక్కువమంది వోటర్లు వోటు చేయడం అసంభవంకాదు,

అందువల్ల కిందటి ఎన్నికల్లోని మన విజయం గత చరిత్ర అవుతుంది అప్పుడు మన ఉద్యమ మంతా దెబ్బతింటుంది" ఈ నివేదికను నవంబరు 20వ తేది కలకత్తాలో సమావేశమైన అ ఖా కాం సం, 5 రోజులపాటు తీవ్రంగా చర్చించి దేశం సమష్టి శాసనోల్లంఘనకు తయారుగా లేదని తీర్మానించింది, శాసన సభా ప్రవేశం గురించిన సమస్య 22 డిశంబరు చివరి వారంలో జరుగనున్న గయా కాంగ్రెస్ నిర్ణయానికి వదలి వేయడం జరిగింది

గయా కాంగ్రెస్ అధ్యక్షుడు చిత్తరంజన్‌దాసు ఆయన శాసన సభా ప్రవేశం గట్టిగా సమర్థిస్తూ ఉపన్యసించినారు కాని కాంగ్రెస్ ప్రతినిధులలో అధిక సంఖ్యాకులు అందుకు ప్రతికూలంగా తమ అభిప్రాయాలను వెల్లడించటం చేత తన అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చి స్వరాజ్య పార్టీని నిర్మించి శాసన సభా ప్రవేశానికి అనుకూలంగా ప్రచారం సాగించినారు కాని కాంగ్రెస్ నుంచి స్వరాజ్యపార్టీవారు ఎవ్వరు చీలిపోలేదు అనాటి నుంచి కాంగ్రెస్‌లో స్వరాజ్య పక్షమని, 'నోఛేంజర్స్' పక్షమని రెండు చీలికలు ఏర్పడినాయి 'నోఛేంజర్స్' అనే వారు దేశాన్ని శాసనోల్లంఘనకు తయారు చేయడానికి నిర్మాణ కార్యక్రమం సాగిస్తూ శాసనసభా బహిష్కారోద్యమం కూడా కొనసాగించ వలెననేవారు ఈ వివాదం ఇట్లా ఉండగానే 1923 డిశంబరులో కాకినాడలో కాంగ్రెస్ జరిగింది అంతకు పూర్వమే శాసన సభలకు ఎన్నికలు జరిగినాయి అందులో స్వరాజ్య పక్షంవారు ఎక్కువ మంది విజయం పొందినారు ఆ తరవాత ఇరుపక్షాలవారు ఒక విధమయిన రాజీకి వచ్చినారు కాకినాడ కాంగ్రెస్‌లో నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగిస్తూ దేశాన్ని శాసనోల్లంఘనకు తయారు చేయవలసిందని తీర్మానించడం జరిగింది 1924 జనవరిలో గాంధీజీ విడుదల అయినారు 'నోఛేంజర్స్' గాంధీజీ విడుదలతో తమకు బలం చేకూరుతుందను కొన్నారు కాని గాంధీజీ శాసనసభా ప్రవేశవిధానం ప్రయత్నించి చూసేటందుకు స్వరాజ్య పక్షం వారికి అవకాశమివ్వవలసిందని 'నోఛేంజర్స్' స్వరాజ్య పక్షంవారి కార్యక్రమానికి ఎట్లాంటి అభ్యంతరం కలిగించకుండా వారి కార్యక్రమం స్వేచ్ఛగా కొనసాగ నివ్వవలసిందనీ సలహా ఇచ్చినారు

## ఆంధ్రలో ఖాదీ ప్రచారము

ఆంధ్ర దేశంలో పన్నుల నిరాకరణ ఆపివేసిన తరవాత ఆంధ్ర నాయకులు నిర్మాణ కార్యక్రమంలో ఎక్కువ శ్రద్ధ తీసుకొంటూ వచ్చినారు ముఖ్యంగా 1922 మార్చిలో గాంధీజీ నిర్బంధింపబడిన తరవాత దేశమంతటా ద్విగుణీకృతోత్సాహంతో నిర్మాణ కార్యక్రమంకొనసాగించవలెనని నిశ్చయించు కొన్నారు అంతకుపూర్వం గాంధీ జన్మదినోత్సవ సందర్భంలోను, జాతీయ వారో త్సవాలలోను నూలు వడకటం ప్రధాన కార్యక్రమంగా కాంగ్రెస్‌వాదులు నిర్వ హిస్తూ ఉండేవారు ముఖ్యంగా స్త్రీలు సామూహికంగా ఒక చోట కలసి ఆ రోజులల్లో నూలు వడికేవారు, గాంధీజీ నిర్బంధం తరవాత ఆయన నిర్బం

ధింపబడిన మార్చి 18 వ తేదీ నుంచి ప్రతి నెలా 18 వ తేదీని ఒక పవిత్ర దినంగా భావించి, ఆనాడు నాయకులు బహిరంగ సభలలో గాంధీ సిద్ధాంతాల గురించి ఉపన్యసించడమేగాక సామూహిక సూత్ర యజ్ఞంకూడా జరుపుతుండే వారు అ భా కాం సం ఖద్దరుశాఖ ఖద్దరు ఉత్పత్తికి ప్రధాన స్థానమిచ్చి అందుకు తగిన అవకాశాన్ని పరిశీలించడానికి ఖద్దరు విచారణ సంఘం నియమించింది ఆ విచారణ సంఘంవారు 1922 జూన్, జూలై నెలలలో ఆంధ్ర దేశంలో పర్యటన చేసి "ఒక్క పంజాబు మినహా ఇండియాలోని తక్కిన అన్ని రాష్ట్రాల్లోకి ఖద్దరు ఉత్పత్తిలో ఆంధ్ర దాదాపు అగ్రస్థానం వహిస్తుంది నాజూకు ఖద్దరు తయారు చేయడంలో గొప్ప ప్రతిష్ఠ సంపాదించిన రాష్ట్రము ఆంధ్ర రాష్ట్రము ఆంధ్ర దేశంలోని ఖద్దరు ఉత్పత్తికి ఎక్కువగా వ్యక్తిగత శక్తిసామర్థ్యాలు కారణము ఖద్దరు ఉత్పత్తిలో ఆంధ్ర దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉన్నది ఆంధ్రుల శక్తి సామర్థ్యాలను ద్విగుణీకృత శక్తితో ఖద్దరుమీద కేంద్రీకరించేట్లయితే తేలికగా ఆ రాష్ట్రం ఇండియాలో కెల్ల ఖద్దరు ఉత్పత్తిలో ప్రముఖ స్థానం వహించ గలదు" అని వారు తమ నివేదికలో వ్రాస్తూ ఖద్దరు ఉత్పత్తికి 1 లక్ష 50 వేలు అప్పు ఇవ్వవలసిందని అ భా కాం సం నకు సిఫార్సు చేసినారు

ఖద్దరు విచారణ సంఘంవారు ఆంధ్ర దేశంలో పర్యటన ముగించిన వెంటనే ఆంధ్రప్రదేశ కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గం రాజమహేంద్రవరంలో సమావేశమై ఖద్దరును రాజకీయ కార్యక్రమంనుంచి విడదీయవలెనని తీర్మానించింది తరవాత ఖద్దరు పనికోసం ఆంధ్ర దేశంను 5 భాగాలుగా విభజించి 5 గురు డైరక్టరతో ప్రత్యేక ఖద్దరు బోర్డును ఏర్పాటు చేసినారు దానికి ప్రెసిడెంట్ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ విధంగానే జిల్లా తాలూకా కాంగ్రెస్ కమిటీలు ప్రత్యేక ఖద్దరు ఉపసంఘాలను నియమించినారు ఈ విధానం ఖద్దరు ఉత్పత్తికి మరికొంత ప్రోత్సాహం కల్పించింది కొంత మంది కార్య కర్తలు ఈ పనిలో ప్రత్యేక శిక్షణ పొందటానికి సబర్మతి ఆశ్రమానికి వెళ్ళినారు కొన్ని జిల్లా కమిటీలవారు మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళా శాలలో రంగులు వేయడం, అద్దకం, కలంకారీ పనులను నేర్చుకొనేటందుకు కార్యకర్తలను పంపినారు

1923 ఫిబ్రవరి 16 న జరిగిన ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సమావేశంలో డాక్టర్ పట్టాభిసీతారామయ్యగారి యాజమాన్యం కింద ఒక ఖద్దరు సెంట్రల్ బ్యాంక్‌ను స్థాపించేటందుకు కొన్ని చర్యలు తీసుకొన్నారు ఈ విధంగా ఖద్దరు ఉత్పత్తి ఆంధ్రలో ఎక్కువకావటానికి మంచి అవకాశాలు కలిగినాయి.

# 11
# శాసూన్ ఆసుపత్రిలో గాంధీజీ (1924)

**వేంకటప్పయ్య పంతులుగారు దర్శించటం**

1924 జనవరి చివరి రోజులలో బొంబాయి నగరంలో కాంగ్రెస్ కార్యనిర్వాహక సంఘం ఖద్దరు బోర్డు సమావేశాలు జరిగినాయి ఆ సమావేశాలు ముగిసిన తరవాత వేంకటప్పయ్య పంతులుగారు ఫిబ్రవరి 3వ తేదిన గాంధీజీని చూడడానికి పూనా వెళ్ళినారు అప్పుడు గాంధీజీ శాసూన్ ఆసుపత్రిలో 'ఎపెండిసైటిస్'కు శస్త్ర చికిత్సపొంది స్వస్థత చేకూర్చుకొంటున్నారు ఆసుపత్రిలో గాంధీజీని చూసేటందుకు అధికారు లెవ్వరినీ ఆటంక పరచడం లేదు నిరాటంకంగా అందరూ గాంధీజీని చూడటానికి అవకాశం కలిగించినారు ఉదయం 7 మొదలు 9 గంటల వరకు, సాయంకాలం 3 మొదలు 5 వరకు ఎవరైనా మహాత్ముని దర్శించటానికి అభ్యంతరం లేకుండినది వేంకటప్పయ్య పంతులుగారు ఆసుపత్రిలో గాంధీజీని దర్శించినప్పుడు ఆయన మంచం మీద ఆనుకొని కూర్చుండి ఫలహారం చేస్తున్నారు శ్రీమతి కస్తూరిబాయిగారు పక్కన నిలుచున్నారు అనసూయాబాయి, శంకర్‌లాల్‌గార్లు కొంచెం దూరంగా నిలుచున్నారు దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారిని మహాత్ముడు మందహాసంతో పలకరించినారు 'నేను నేడే ఇతరుల సహాయంతో 100 గజాలు నడువగలిగాను నేను ఆరోగ్యం పొందుతున్నాను సౌఖ్యంగానే ఉన్నాను' అన్నారు పంతులుగారితో గాంధీజీ "మిమ్ములను ఆరోగ్యంకోసం ఉండాలాకు మారుస్తారని బొంబాయి క్రానికల్‌లో ఉన్నది" అన్నారు వేంకటప్పయ్య పంతులుగారు గాంధీజీతో "నిజంలేని నీలివార్తలు చాలావస్తాయి" అన్నారు మహాత్మాజీ

తరవాత మహాత్ముడు మచిలీపట్టణంలోని ఆంధ్రజాతీయ కళాశాలస్థితి గతులను గురించి ప్రశ్నించి అది బాగున్నదని విని సంతోషించినారు ఆంధ్ర దేశంలో జాతీయ విద్యాలయాలు పోషణలేక క్షీణిస్తున్నవని విని విచారపడినారు దత్త మండలంలో కరువు విశేషంగా ఉన్నదని పంతులుగారు చెప్పినప్పుడు గాంధీజీ చాలా బాధపడినట్లు కనిపించింది నాగలాపురంలో ఖద్దరు పనులు బాగా సాగుతున్నవని విని ఆయన ఆనందించినారు అఖిల భారత ఖద్దరు బోర్డు వారు ఆంధ్ర ఖద్దరు బోర్డుకు 90 వేల రూపాయలు ఋణం ఇచ్చిన సంగతి దేశభక్తుడు మహాత్మునకు తెలియజేసినారు ఈ సంభాషణ అంతా గాంధీజీ

సహజ మందహాసంతో ఆలకించినారు వేంకటప్పయ్యగారు గాంధీజీనుంచి సెలవు తీసుకొనేటప్పుడు గద్గదస్వరంతో, కన్నీటితో మళ్ళా తమ సందర్శనం ఎప్పుడు కలుగునని అన్నారు కావలసినప్పుడే కలుగుతుంది అన్నారు గాంధీజీ

## కాంగ్రెస్ నూలు చందా

1924 డిశంబరులో జరిగిన బెల్గాం కాంగ్రెస్‌కు గాంధీజీ అధ్యక్షత వహించినారు ఆయన ఉపన్యాసంలో ఖద్దరు ఉత్పత్తికి ఎక్కువ ప్రాముఖ్యమిస్తు కాంగ్రెసు సభ్యులందరూ దక్షగా నూలు వడకవలెనని చెప్పినారు ఆ కాంగ్రెస్‌లో కాంగ్రెస్ సభ్యులగా ఉండకోరేవారు నెలకు 2 వేల గజాల నూలును స్వయంగా వడికి సభ్యత్వ చందా క్రింద రాష్ట్ర కాంగ్రెస్ సంఘానికి పంపవలెనని తీర్మానించడం జరిగింది ఆ తీర్మానం ప్రకారం నూలు చందా పంపనివారు కాంగ్రెస్ సభ్యులుగా ఉండజాలరనే నిర్ణయం తీసుకోవడం జరిగింది కాంగ్రెస్ సభ్యులుగ నుండకోరేవారు ఈ పద్ధతిని అవలంబించినట్లయితే ఎక్కువ మందికి నూలువడకటంలో ప్రోత్సాహం కలగుతుందని, అందువల్ల ఖాదీ ఉత్పత్తి ఎక్కువ కాగలదనీ గాంధీజీ అభిప్రాయపడినారు బెల్గాం కాంగ్రెస్ విషయ నిర్ధారణ సభలో గాంధీజీ చర్ఖాను గురించి సుదీర్ఘంగా ఉపన్యసించిన తరవాత డాక్టర్ మూంజీ చర్ఖాను గురించి చెప్పినంతగా శాసనసభా ప్రవేశం గురించి గాని, స్వరాజ్య పక్షం గురించిగానీ ఎందుకు చెప్పలేదని గాంధీజీని ప్రశ్నించినారు అప్పుడు గాంధీజీ 'నేను చర్ఖాలో దేవుని చూస్తున్నాను' అన్నారు ఆవాక్యం చాలామంది ప్రతినిధుల హృదయాలలో నాటుకొని పోయింది అనాటినుంచి తిరిగీ ఖద్దరు ప్రచారోత్పత్తులకు ఆంధ్రదేశంలో ఎక్కువ ప్రోత్సాహం కలిగింది

డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారు 1925 ప్రారంభదశలో గోదావరి జిల్లా రాజమహేంద్రవరానికి సమీపంగా ఉన్న సీతానగరంలో 'గౌతమీ సత్యాగ్రహ' ఆశ్రమం స్థాపించినారు ఆ ఆశ్రమం దేశభక్త వేంకటప్పయ్య, బులుసు సాంబమూర్తి, గొల్లపూడి సీతారామ శాస్త్రి, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగార్ల వంటి ప్రముఖుల ఆశీర్వాదం పొందింది ఆ ఆశ్రమం పరిసర గ్రామాల్లో కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంలోని ఖద్దరు ఉత్పత్తి మొదలయిన కుటీర పరిశ్రమలను స్థాపించేటందుకు, అస్పృశ్యతా నివారణం మొదలయిన కార్యకలాపాలను నిర్వర్తించేటందుకు ఉద్దిష్టమైంది 1925 లో ఆంధ్రదేశంలో జరిగిన ఒక ముఖ్య సంఘటన ఇది

# 12

# మహాత్ముని మద్రాస్‌రాక (1925)

కేరళలో అస్పృశ్యత అతిక్రూరమయిన ఆచారంగా పరిణమించింది నిమ్న జాతులను (మాలమాదిగలు) ఉన్నత కులాల వారమనుకొనేవారు తాకక పోవడమే గాక దగ్గరకు రానీయరు సరిగదా, రాజవీధులలో సైతం నడువనీయని రోజులవి తిరువాన్కూరు సంస్థానాధీశులుకూడా ఇట్లాంటి ఘోరదురాచారాలను తొలగించేటందుకు ప్రయత్నించి ఉండలేదు అందువల్ల అక్కడ 'వైకం'లో అస్పృశ్యతను ప్రతిఘటిస్తూ సత్యాగ్రహం ప్రారంభించినారు వైకంలో ప్రారంభించిన సత్యాగ్రహం భారత దేశంలో అందరి దృష్టిని పూర్తిగా అకర్షించింది గాంధీజీ సూచించిన నియమంప్రకారం వైకం సత్యాగ్రహులు 'తు 'చ' తప్పకుండా నడుచుకొంటున్నారు వారు బయటివారి సహాయం ఎంతమాత్రం అపేక్షించ కుండా స్వయం శక్తిమీద ఆధారపడి తీవ్ర బాధలకు లోనవుతూన్నప్పటి, నిశ్చలంగా సత్యాగ్రహ సమరం సాగిస్తున్నారు

బెల్గాం కాంగ్రెస్ జరిగిన నాటినుంచి అనేక రాష్ట్రాల నుంచి గాంధీజీకి ఆహ్వానాలు వస్తూన్నప్పటికీ అస్పృశ్యతను ప్రతిఘటిస్తూ ధైర్యంగా పోరాడుతూన్న సత్యాగ్రహులను ప్రోత్సహించటం తమ ప్రధాన ధర్మంగా భావించి ఆయన అన్ని రాష్ట్రాలలోకీ ముందుగా 'వైకం'నకు ప్రయాణమయినారు

ఆయన వైకం పోతూ 1925 మార్చి 7వ తేదీనాడు మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో దిగినారు మహాత్ముని దర్శనార్థమై స్టేషన్ వద్ద దాదాపు లక్షమంది ప్రజలు చేరినారు స్టేషన్‌లోపల, వెలుపలా కూడా ప్రజలు గుంపులు గుంపులుగా కూడినారు ట్రాం బండ్లు ఆగిపోయినాయి సెంట్రల్ స్టేషన్ మొదలుకొని రిప్పన్ భవనంవరకు మార్గం ప్రజలతో క్రిక్కిరిసి పోయింది కాంగ్రెస్ స్వచ్ఛంద సైనికులును, నగరంలోని పోలీసువారు, ప్రభుత్వంవారి అశ్విక దళంవారు శాంతి సంరక్షణకు కావలసిన ఏర్పాట్లను చక్కగా చేసినారు

స్టేషన్ ప్లాటుఫారం మీద బొంబాయి మెయిల్ నుంచి గాంధీజీ దిగగానే శ్రీయుతులు యస్ శ్రీనివాసయ్యంగారు, కె వి రంగస్వామయ్యంగారు, టి వి శేషగిరిఅయ్యర్, అల్లాడి కృష్ణాస్వామి, కాశీనాథుని నాగేశ్వరరావు, కట్టమంచి రామలింగారెడ్డి, చక్రయ్యచెట్టి, ఆదినారాయణచెట్టి, సామి వెంకటాచలంచెట్టి, డాక్టర్ పి వరదరాజులునాయుడు, అమీదుఖాన్, మహ్మద్ షాఫి, గద్దె రంగయ్యనాయుడు, బుఱ్ఱా సత్యనారాయణ, అబ్దుల్ లతీఫ్ ఫారూకీ,

శ్రీమతి యామినీ పూర్ణతిలకమ్మ, కె శ్రీరాములునాయుడు, పి ఆదికేశవులు నాయకర్ మొదలైన ప్రముఖులు మహాత్ముని పుష్పమాలాలంకృతుని చేసి గౌర వించినారు మహాత్ముడు చిరునవ్వుతో వారిని సవినయంగా స్వీకరించినారు 'మహాత్మాజీకి జై' అనే నినాదముతో రైలుప్లాటుఫారం ప్రతిధ్వనించింది యస్ శ్రీనివాసయ్యంగారి మందిరానికి మోటారు కారులో పోతూండగా మేడలపైన,చెట్లమీద, ట్రాం బండ్లమీద నిలచి ప్రజలు మహాత్ముని దర్శించినారు

ప్రజల ఉత్సాహం చూసి మహాత్ముడు కారులో నిలబడినప్పుడు ప్రజల హర్ష ధ్వానాలు మిన్నుముట్టినాయి చింతాద్రిపేట నుంచి మహాత్ముడు పోయే దారి యావత్తు ఆకు తోరణాలతోను, స్వాగత పతాకాలతోను అలంక రింప బడింది

## కార్పొరేషన్ సన్మానము

మద్రాసు కార్పొరేషన్‌వారు 1925 మార్చి 7వ తేది సాయంకాలం 4 గంటలకు రిప్పన్ భవనంలో జరిగిన సభలో గాంధీజీకి కింది సన్మానపత్రం సమర్పించినారు

"మహాత్మా మోహన్‌దాసు కరంచంద్ గాంధీజీ!

మీకు నిరుడు తటస్థించిన ప్రబల వ్యాధినుంచి విముక్తులైన తరవాత మీరు మద్రాసు రావడం ఇదే తొలిసారికావడం చేత ఈ నగర వాసుల పక్షాన మనఃపూర్వక స్వాగతం సమర్పించేటందుకు పురపాలక సంఘాధ్యక్షుడు, సభ్యులు ఈ అవకాశం ఉపయోగించుకొంటున్నారు

మీ జీవితం స్వార్థరహితము, భక్తిభరితము, నిర్విరామ సేవాసక్తము, మహోదారం అయి ఒప్పుతూన్నది అటువంటి మీ జీవితం దేశీయులందరూ పెన్నిధివలె భావిస్తున్నారు

మీ దేశీయుల కృతజ్ఞతను విశాల ప్రపంచంలోని ప్రజల ప్రశంసను మీరు చూరగొన్నారు సుస్థిరమయిన జాతీయతకు, అంతర్జాతీయతకు, అంతర్వైక్యానికి, శాంతికి మూలాధారాలు, నిత్య సత్య ధర్మాలేనని మీరు ప్రపంచ మంతటికి చాటి చెప్పినారు

భారత దేశంలోని నిమ్నజాత్యభివృద్ధికి మీరు చేస్తూన్న సేవ, ప్రేమ సందేశహారునివలె వివిధ మత వర్గాల వారిలో ఐకమత్యం చేకూర్చేటందుకు మీరు చేస్తూన్న ఘన ప్రయత్నము-ముఖ్యంగా మీరు జరుపుతున్న పవిత్ర జీవితం, మీరు బోధిస్తూన్న ఉన్నతాదర్శాలు సర్వేశ్వరుని కటాక్షంవల్ల అచిర కాలంలోనే అపార ఫలప్రదాలు కాగలవని మాకు గట్టి నమ్మకమున్నది

భారత దేశంలో వర్ణసంబంధమయిన నిరంకుశ దౌర్జన్యం ప్రబలంగా ఉన్నందుకు దానిని సత్యధైర్య సాధనాలతో నిర్మూలించడానికి మీరు ప్రత్యేక కృషి చేస్తున్నారు ఆ దౌర్జన్యం పూర్తిగా అంతరించక పోయినప్పటికీ మీరు నైతికవిజయం సాధించగలిగినారు.

దేశంలో మత కలహాలు ప్రబలినప్పుడు గాఢ సంతాపంతోను, అత్యంత వినమ్రభావంతోను మీరు అవలంబించిన ఉపవాస వ్రతం భారతీయులెవ్వరూ ఎన్నటికీ మరవజాలరు

అనంతకాల విఖ్యాతమయిన భారత భూమిలోని సదాచారాలలో విమలతమము, శ్రేష్ఠతమము అయినవన్నీ మీలో మూర్తీభవించిన వనడానికి ఎట్లాంటి సందేహం లేదు

మీరీ నగరానికి రావడానికి ముఖ్యకారణం అస్పృశ్యతా నివారణ మహత్కార్యము మీకృషి ఫలవంతం కావలెనని మేము కోరుతున్నాము మా కాదర్శప్రాయంగా మీరు మా ముందు నిలచి మమ్మునడిపించడానికి, ఈ విశాల పృథివీ మండలంలోని అన్ని దేశాలలో భారత దేశానికి అఖండ గౌరవం సమకూర్చేటందుకు మీకు నిరంతర ఆయురారోగ్యాలను, శక్తిసామర్థ్యాలను సకలాభీష్ట ప్రదాత అయిన సర్వేశ్వరుడు అనుగ్రహించుగాక "

ఇట్లు
భవద్దేశీయ సోదరులు
మద్రాసు పురపాలక సంఘం వారు

గాంధీజీ కార్పొరేషన్‌వారి సన్మాన పత్రం స్వీకరించడానికి ముందు మద్రాసులోని యామినీ పూర్ణతిలకమ్మగారి హిందూ యువతి శరణాలయం చూసివచ్చినారు

గాంధీజీ మద్రాస్‌లో ఉండగా దేశభక్త కొండ వేంకటప్పయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, కాశీనాథుని నాగేశ్వరరావు, మద్ది రాధాకృష్ణయ్య మొదలైన ఆంధ్ర నాయకులు ఆయనను దర్శించి వైకంనుంచి ఆంధ్ర దేశానికి దయచేయవలెనని కోరగా గాంధీజీ వారితో ఇట్లా అన్నారు "ప్రస్తుతం వైకంలో వారం రోజులుంటాను తరవాత ద్రవిడ, కేరళ రాష్ట్రాలలో సంచారం చేయవలె మార్చి 29కి అహమదాబాదు పోవలసి ఉంది అక్కడనుంచి కథవాడ్‌లో సంచారం చేయవలసి ఉంది అక్కడ ఖద్దరు ప్రచారం భాగా జరుగుతున్నట్లున్నది వారిని నేనింకా ప్రోత్సాహపరచవలె తరవాత వంగ రాష్ట్రీయ సభకు అధ్యక్షత వహించవలసి ఉన్నది కాబట్టి వీలయితే ఏప్రిల్‌లో ఆంధ్ర రాష్ట్రానికి రాగలను కాని నిర్ధారణగా ఇప్పుడేమి చెప్పజాలకున్నాను ఆంధ్ర రాష్ట్రంపై నాకు ప్రత్యేకాభిమానమున్నది ఆంధ్ర దేశానికి ముఖ్యంగా వచ్చి తీరుతాను జూన్ నెలలో వీలుకావచ్చు" అని మహాత్ముడు చెప్పగా జూన్ నెలలో వర్షాలు ఎక్కువగా ఉంటాయి రైతులకు వ్యవసాయపు పనుల తొందర కూడా ఉంటుంది" అని ఆంధ్ర నాయకులు విన్నవించినారు "వీలయితే ఏప్రిల్‌లోనే రావటానికి ప్రయత్నిస్తాను" అని గాంధీజీ చెప్పినారు

తరవాత కొన్నాళ్ళకు ఏప్రిల్‌లో ఆంధ్ర దేశానికి రాజాలనని గాంధీజీ వేంకటప్పయ్య పంతులు గారికి తెలిపినారు

## గాంధీజీ–నాగేశ్వరరావు పంతులుగారి కుమార్తె

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తమ కుమార్తె చిరంజీవి కామాక్షమ్మను వెంట బెట్టుకొని 1925 మార్చి 7వ తేదీని శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారి బసకు వెళ్ళినారు అప్పుడు ఆ పిల్ల ఎవరని గాంధీజీ అడుగగా, 'నాకుమార్తె'అని నాగేశ్వరరావుగారు తెలిపినారు అంతట ఆ బాలిక చేతులకున్న బంగారు గాజులజతలను చూసి మహాత్ముడు తన కిమ్మని అడిగినాడు ఆమె కొంచెమయినా సంశయించకుండా ఒక జత తీసి యిచ్చింది తక్కిన వాటిని ఇవ్వవా అని మహాత్ముడు అడుగగా అన్నిటిని తీసి యిచ్చింది తరవాత గాంధీజీ ఆమె మెడలో ఉన్న హారం అడిగినారు దానినికూడా తీసియిచ్చింది పట్టెడ తీయటానికిరాక ఆమె ఆలోచిస్తూండగా ఒకరు శ్రవణం తెచ్చి ఇచ్చినారు దానితో సీలను తిప్పి దానినికూడా తీసియిచ్చింది 'వీటిని మనఃపూర్వకంగా ఇస్తున్నావా? కాకపోతే నేను పుచ్చుకోను' అన్నారు గాంధీజీ 'మనఃపూర్వకంగానే ఇస్తున్నాను' అన్నది ఆ బాలిక ధైర్యంగా ఇంకమీద బంగారు నగలను ఆ పిల్లచేత ధరింప చేయమని నా ఎదుట ప్రమాణం చేయవలసిందని మహాత్ముడు నాగేశ్వరరావు గారిని అడిగినారు "స్త్రీలు అందుకు సమ్మతించరు కాబట్టి ఆ ప్రకారం ప్రమాణం చేయజాలను"అన్నారు నాగేశ్వరరావుగారు "అట్లా అయితే నేను వీటిని పుచ్చుకోను మీరు ధనవంతులు మళ్ళా ఇట్లాంటి ఆభరణాలనే చేయించి పెడతారు" అని మహాత్ముడు నగలన్నిటిని అక్కడనే విడిచి అనిబిసెంట్‌ను చూడడానికి అడయారు వెళ్ళినారు అప్పుడు ఆ నగలు భద్రపరిచే వారెవ్వరు లేనందువల్ల నాగేశ్వరరావు గారే మళ్ళా తీసుకొని వాటికి సరియైన విలువకట్టి ఆ సొమ్మును మహాత్మునకు అంటే 'ఆంధ్ర కాంగ్రెస్ నిధికి' సమర్పించినారు

## గాంధీజీకి మరొక సన్మాన పత్రము

ఈనాడు (1925 మార్చి 7) చెన్నపురి మండల ఆంధ్రకాంగ్రెస్ సంఘ సభ్యులు దిగువ సన్మాన పత్రం సమర్పించినారు

"మహాత్మా మోహన్ దాస్ కరంచంద్ గాంధీగారి పాదారవింద సన్నిధికి స్వాగత సన్మాన పత్రము

నాయకాగ్రేసరా!

ఎంతకాలం భారతీయులుస్వదేశంలో స్వాతంత్ర్యవ్యక్తిత్వాలనుసాష్టాంగ ప్రణామాలతో ఎరులకు సమర్పించి దాస్యశృంఖలా బద్ధులై స్రుక్కుతుంటారో అంతవరకు వారి కన్యదేశాలలో ఆత్మగౌరవ వ్యక్తిత్వాలు కళ విహీనాలను తత్త్వం ఎరింగి వెంటనే ఆఫ్రికా దేశం నుంచి భారత భూమిని దుమికి దేశీయ మహోన్నత పర్వత శిఖరారోహణంచేసి ఆ రామానుజుల తిరుమంత్రోపదేశంవలె అసహాయయోగ మహామంత్రోపదేశంతో ప్రజలను ప్రబోధించి దాస్యాజ్ఞాన

నిద్రాపారవశ్యం నుంచి మేల్కొల్పి అచిర కాలంలోనే తమరిచ్చిన మాతృదేశ భక్తిజ్ఞాన వైరాగ్యాలు ఈ భారత ప్రజకు 35 సంవత్సరాల కాలం భారత జాతీయ మహాసభా వేదికల నుంచి నాయకులెవ్వరూ ఇవ్వలేదనడం లోక ప్రసిద్ధము

భారత ప్రజలు సత్వర స్వరాజ్య సౌధారోహణ సౌఖ్యం పొందడానికి ప్రధానోపాంగాలుగా శాంత శమ దమాది అంతరింద్రియ నిగ్రహ విధానం స్వదేశీ ఖద్దరు వస్త్ర ధారణావశ్యకతను, హిందూ మహ్మదీయాది సర్వమత సమైక్యం, అస్పృశ్యతా దోష నివారణ దీక్షను బోధించి శిష్యకోటుల చిత్త వృత్తులను అణుమాత్రం చలింపనీయక తదేక దీక్షా బద్ధ కంకణులచేసే గురుకార్య భారం వహించిన మీవంటి దేశికుడు మాకు ముల్లోకాలు వెదికినా దొరకడనడం కల్ల కాదు

"త్యాగేనైకేన అమృతత్వ మానసః అనే శ్రుత్యర్థం అనుసరించి త్యాగశీలుడుకాని మానవుడు ఏకార్యం తెంపుతో చేయజాలడనే సూక్ష్మం నెరిగియే సర్వైహిక సంఘపరిత్యాగం చేసి తాము ప్రారంభించినమాతృదేశోద్ధరణ యజ్ఞకుండంలో ఆత్మత్యాగ శీలానికి ఆ గాంగేయుని త్యాగం కూడా ఈడు కాదని దృఢంగా చెప్పగలము

పతితపావనా! మన పూర్వుల అమానుష నిరంకుశాధికారాలచే సాంఘిక, నైతిక, ఆర్థిక, రాజకీయాది మానవ సామాన్య సత్వములకు దూరులై దుఃఖ పరంపరల దూలుచు చతుష్పాద పశువులకంటే నీచంగా పరిగణింపబడుతూ పతితులై గతిగానక పలువరించే పంచమ సోదరుల నుద్ధరించడానికి మీరు పూనిన దీక్షను మాసినట్లయితే పతితపావన నామాంకితుడగు ఆ సర్వేశ్వరుడు భారతదేశ పతితుల నుద్ధరింప మిమ్మంపి ఉంటాడని మేము తలుస్తున్నాము ఏ తత్కార్య నిర్వహణలో వైకమున మీకు పరాత్పరుడు దిగ్విజయం ప్రసాదించుగాక

మహాత్మా! భారతదేశోద్ధరణ కార్యభారం పరిపూర్ణంగా వహించిన తమపైననే భారత ప్రజా భావిభాగ్యం ఆధారపడి ఉన్నందువల్ల కారణాంతరాలచే వారియందెన్ని విభేదాలు పొడముతున్నను విసుగు చెందక ఆశ్రితావన దక్షమగు మీ మహత్తర లక్ష్యార్థం అవలీలగా సాధించవలెనని మేము మరిమరి ప్రార్థిస్తున్నాము చంద్రునకొక నూలు పోగన్నట్లు సర్వమానవసన్మానార్హమైన తమ పాద సన్నిధిని మనఃపూర్వకంగా మేమర్పించే ఈ స్వాగత సన్మాన పత్రం దయతో స్వీకరించి మమ్మాదరించవలెనని వినమ్రులమై ప్రార్థిస్తున్నాము'

ఇట్లు
విధేయులు
చెన్నపురి మండల ఆంధ్రకాంగ్రెస్
సంఘ సభ్యులు

చెన్నపురి
7-8-1925

మద్రాసులో పచ్చయప్ప కళాశాల ఆంధ్ర విద్యార్థులు కూడా మహాత్మునకు ఈ పద్యరూపంలో స్వాగత పత్రాలను సమర్పించినారు

తనకెంత కష్టము తగుల నిచ్చిన దాని
నిసుమంతయును ఆత్మ నెన్నడెవడు
తన ద్రవ్య మంతయు తన దేశమే యని
సేవ దేశమునకు చేయు నెవడు,
జాతి భేదము ద్వేషహేతు వటంచును
దాని వీడగ బోధ బూనె నెవడు,
ఎల్లర భావంబు నేకంబుగా చేయ
పూని ధన్యుండైన పురుషుడెవడు,
రాటమే ముక్తిప్రదమంచు చాటెనెవ్వ
డట్టి శాంతుడు త్యాగి అద్వైతి గాంధి
మద్రపురమున కరుదెంచె మనదు భాగ్య
మునను కావున నిదియే సుదినము సుమ్ము

పచ్చయప్ప కళాశాల
ఆంధ్ర విద్యార్థులు

**గాంధీజీ-గుంటకల్లులో**

గాంధీజీ 'వైకం' సత్యాగ్రహ ప్రదేశానికి పోవనుద్దేశించి బొంబాయి మెయిల్‌లో మద్రాస్‌కు వెళ్ళేటప్పుడు మధ్య ఉన్న గుంటకల్లు స్టేషన్‌లో వారి సందర్శనం కోసం అనేకులు రైల్వే ప్లాటుఫారం మీద వేచిఉన్నారు గుంటకల్లు కాంగ్రెస్ కమిటీవారు మహాత్ముని రాట్నపు నూలు దండలతోనూ, జాతీయ పతాకాలతోనూ ఆహ్వానించి సత్కరించిన తరవాత గాంధీజీకి పండ్లు పాలు సమర్పించినారు గుంటకల్లు స్టేషన్‌లో 'గాంధీకిజై' అనే నినాదాలు మిన్ను ముట్టినాయి గుంటకల్లు అధ్యక్ష కార్యదర్శులు ఏ రామప్ప, టి కృష్ణారావు గార్లు కాంగ్రెస్ కమిటీ పక్షాన, పురజనుల పక్షాన గాంధీజీ శ్రీకృష్ణ జన్మస్థానంనుంచి విడుదలయిన తరవాత మొదటిసారి అక్కడకు వచ్చినందుకు ఆయనకు కృతజ్ఞత తెలుపుతూ అక్కడ చేరిన జనసమూహానికి సందేశ మివ్వ వలసిందని ఆయనను కోరినారు

గాంధీజీ, మార్గాయాసం చేతను, అవసరమయిన కొన్ని జాబులు అప్పుడు వ్రాస్తూండటం చేతను ఉపన్యాస మివ్వడానికి వీలులేదని అన్నారు, తరవాత జనం మహాత్ముని సందర్శించి నమస్కరించి పోసాగినారు

ఒక విశ్వబ్రాహ్మణుడు భారతమాతను గురించి మహాత్ముని గురించి కీర్తనలు పాడడానికి మహాత్ముని సెలవు కోరినాడు ఆయన విదేశీ బట్టలను కట్టుకొని ఉన్నాడు స్వదేశీహితకరమైన కార్యాచరణ ఏమీ ఆయనలో కనపడనందు వల్ల వట్టి ముఖస్తుతులతో ప్రయోజనంలేదని గాంధీజీ అంగీకరించకపోగా ఆయన ధరించిన విదేశీ వస్త్రాలక్కడ కాల్చివేసిన తాము తృప్తి పడగలమని

కూడా అన్నారు ఆయన ప్రియ శిష్యుడు కావడంచేత ఏమీ తోచక ఇక మీద ఖద్దరు ధరించగలనని చెప్పి సెలవు తీసుకొని వెళ్ళినాడు

ఈ సంఘటనవల్ల పురజనులకు మహాత్మాజీ మహోత్కృష్టమయిన సందేశ మిచ్చినట్లయి, వారిని ఖద్దరు ధారణకు ఎక్కువగా పురికొల్పింది

**గాంధీజీ పునరాగమనము (మద్రాసు)**

1925 మార్చి 21వ తేదీ ఉదయం 7½ గంటలకు మహాత్ముడు వైకం నుంచి మెట్టుపాలెం మెయిల్‌లో సి రాజగోపాలాచారి గారితో కలసి సెంట్రల్ స్టేషన్‌లో దిగినారు ఈ పర్యాయం వెనకటివలె అసంఖ్యాక ప్రజానీకం గుమి కూడనప్పటికీ వచ్చిన జనం 10 వేలకు మించి ఉన్నారు యస్ శ్రీనివాసయ్యం గారు, టంగుటూరి ప్రకాశం, కాశీనాథుని నాగేశ్వరరావు, యాకూబ్ హుస్సేన్ అబ్దుల్ హామీదుఖాన్, అబ్దుల్ లతీఫ్ ఫారూకి టి ఆదినారాయణచెట్టి, గద్దె రంగయ్యనాయుడు బుర్రా సత్యనారాయణ, సి వి రంగం శ్రేష్టి (చిత్తూరు), శ్రీమతి యామినీ పూర్ణ తిలకమ్మ, షాఫ్ మహమ్మద్, టి పి మీనాక్షి సుందరం పిళ్ళై మొదలయిన ప్రముఖులు సెంట్రల్ స్టేషన్‌కు వచ్చి మహాత్ముడు దిగగానే ఆయనను ఖద్దరు పుష్పమాలాలంకృతునిగా చేసినారు గాంధీజీ శ్రీనివాసయ్యం గారు, యాకుబ్ హుస్సేన్, రాజగోపాలాచార్యుల గారలతో కలసి మోటారులో మైలాపూర్‌లోని శ్రీనివాసయ్యంగారింటికి వెళ్ళినారు

ఉదయం 10 గంటలకు రత్నవేల్ చెట్టియార్ ఉచిత వరన మందిరంలో (వైట్ హైడ్ హాల్) జాతీయ సంఘసేవా సమితి పక్షాన గాంధీజీ ఉపన్యసిస్తారని తెలిసి ఆదిద్రవిడ విద్యార్థులును, కొంతమంది ఆదిద్రవిడులును శుభ్రంగా స్నానం చేసి తెల్లని బట్టలను కట్టుకొని, బొట్లు పెట్టుకొని కలకలలాడే మొగాలతో సుస్వరంగా, సుమనోజ్ఞంగా దైవసంకీర్తనం ప్రారంభించినారు మహాత్ముడు సరిగా 10 గంటలకు సభాస్థలం చేరినారు శ్రీనివాసయ్యంగారి యాజమాన్యంలో సభ ప్రారంభమయింది సేవాసమితి పక్షాన తమిళంలో సన్మాన పత్రం గాంధీజీకి సమర్పించినారు మహాత్ముడు మాట్లాడుతూ ఇట్లా అన్నారు "చెన్నపట్టణం వంటి నగరంలో అస్పృశ్యతా నివారణ గురించి పాటు పడటం అంత ఘన కార్యం కాదు అస్పృశ్యులతో సహా అందరూ కలసి ఉండటం ఇక్కడ కొత్త కాదు అది ప్రతిరోజు సాధారణంగా జరుగుతూండేదనే పత్రికలు చదవక లోకంలో ఏమి జరుగుతున్నదో తెలియక ప్రపంచ పరిస్థితులు ఏ మాత్రం తెలుసుకొనని కుగ్రామ వాసులకు అస్పృశ్యులు లక్షలకొద్దీ ఉన్నారు అట్లాంటి వారి క్షేమంకోసం కృషి చేసేవారు ధన్యులు చేనేతపనుల వృద్ధికి ముఖ్యాధార మయిన వడకు నూలు బట్టలను అందరూ కడితే అదే ఇట్లాంటి జనం అభివృద్ధికి కొంత మేలు కాగలదు"

**స్త్రీల నూలు వడుకు పోటీ**

1925 మార్చి 22వ తిరువళిక్కేణిలో స్త్రీల నూలు వడుకు పోటీ

జరిగింది రాజగోపాలాచారిగారు అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శి బరూచ గారు వచ్చిన తరవాత నూల వడకడం ప్రారంభమయింది పోటీలో 25 మంది స్త్రీలు పాల్గొన్నారు వారిలో తమిళ, ఆంధ్ర, గుజరాతీ స్త్రీలు ఉన్నారు నూలు వడకటం 75 నిమిషాలు జరిగింది అతి సన్నగా వడికిన వారికి ఒక బహుమానం, నూలు ఎక్కువగా వడికిన వారికి మరొక బహుమానం ఇవ్వడానికి నిర్ణయం జరిగింది

గాంధీజీ శ్రీనివాసయ్యంగారితో కలసి వచ్చి నూలువడికే ప్రదర్శన చూసినారు గాంధీజీకి స్త్రీలు పండ్లు కానుకగా ఇచ్చి సాష్టాంగా దండ ప్రణామాలు చేసినారు గాంధీగారు చిరునవ్వుతో తన కిచ్చిన పండ్లను పక్కనున్న బాలికలకు ఇచ్చినారు తరువాత స్త్రీల సభలో ఉపన్యాసం చేసినారు సభలో 800 మంది స్త్రీలు ఉన్నారు వారిలో మలయాళ విద్యార్థినులు కూడా చాలా మంది ఉన్నారు వీరందరిలో ఖద్దరు కట్టినవారి సంఖ్య అతిస్వల్పం, దాదాపు లేనే లేదని చెప్పవచ్చు

గాంధీ మహాత్మునకు స్త్రీల సభలో సన్మాన పత్రం సమర్పించడం జరిగింది ఆయన ఇంగ్లీష్‌లో ఇట్లా ఉపన్యసించినారు

'సోదరీమణులారా! మిత్రులారా!

కన్నుల పండువుగా సభ నలంకరించిన మీ అందరికీ నా వందనాలు భారత దేశపు భావిదశ మీ చేతుల్లో ఉన్నది నే నిన్నేండ్లనుంచి కలలు కంటున్న స్వరాజ్యం, మీరు పురుషులతో సహకరించకుంటే దుర్లభం కాగలదు నేను స్త్రీలనుద్దేశించి ఉపన్యసించినప్పుడు స్వరాజ్యమంటే రామరాజ్యమని చెబుతుంటాను సీతాదేవి వంటి స్త్రీరత్నాలు ఎన్నో వేలమంది ఉంటేనేగాని రామరాజ్యం లభించదు శ్రీరాముని కాలంలో సీతారాములిద్దరు తమ దేశంలో తయారయిన ప్రశస్త ఖద్దరు వస్త్రంతప్ప వేరొకటి ధరించలేదని నేను నమ్మకంగా చెప్పగలను సీతాదేవి భారతదేశమంతా కాలినడకతో తిరిగినపుడు మీ వలె ఆమె రంగుల విదేశ వస్త్రాలు ధరించలేదు ఆమె ఖద్దరునే ధరించింది సీతాదేవికి అలంకారానికి వాడుకకు తన దేశంలో తయారయిన బట్టలు, ఆభరణాలే సరిపోయినాయి కాని ఇప్పటి స్త్రీలు ఖద్దరు మోటుగా ఉంటుందని నిరసిస్తున్నారు మీరు ఖద్దరును విడిచిపెట్టడంవల్ల మీ సోదర సోదరీమణులు అనేక వేలమంది నిర్భాగ్యులవుతున్నారు దరిద్రదేవతనుకొలుస్తున్నారు ధనవంతులయిన మీరు 18 మూరల ఖరీదు గల రంగు బట్టలను కట్టుకొని సభలకు రావడం మీకు కష్టంగా ఉండదు, మీకేమీ బాధగా కనపడదు కాని గ్రామాల్లో మీ సోదరీమణులు ఎంత మంది కట్టుకోవడానికి చీరలు లేకపోగా, తినడానికి తిండి అయినాలేక మాడుతున్నారో మీకు తెలుసునా? వందలు వేలాదిగా ఉన్న పేదవాళ్ళకు కట్టుకొనేటందుకు చింపి గుడ్డ తప్ప వేరే బట్టలు లేవని నేను చెప్పే ఈ మాటలు అమోఘమయిన సత్యమని నమ్మండి కాబట్టి వారి శ్రేయంకోసం మీ మతాన్ని మీ దైవాన్ని గుర్తించి అయినా ఈ మీవిదేశీ వస్త్రాలను విసర్జించి పరిలి ఖద్దరు

చీరలు లభించినా వాటినే ధరించవలెనని కోరుతున్నాను

ఖద్దరు బట్ట చౌక చేయడానికి మీరందరూ దినానికి ఒక అర గంటకాలం నూలువడికి ఆ నూలును దేశానికి కానుకగా అర్పించవలెనని కోరుతున్నాను అప్పుడు ఖద్దరు చౌక కావడానికి వీలుంటుంది

ఈ ప్రదర్శనలో మీ సోదరీమణులు నూలువడకటం మీరు చూసే ఉంటారు మీరుకూడా ఆరీతిగా వడకవలె భారత దేశంలో కొన్ని ఏళ్ళ క్రితం వరకు ప్రతి ఇంట్లో ఇప్పుడు వంటపొయ్యి తప్పని సరిగా ఉన్నట్లే ఆ రోజులలో రాట్నాలు కూడా ఉండేవి మీరందరు నూలు వడకటం మాని ఆ రాట్నాలను అంతరింప చేసినారు వాటిని విడిచిపెట్టడంవల్ల ఇంటికి వచ్చేరాబడిలో నాలుగోవంతు తగ్గిపోయింది మళ్ళా ఆ రాట్నలక్ష్మిని యథాస్థానానికి తెచ్చి పెట్టవలెనని మిమ్ములను కోరుతున్నాను మీరందరు సమావేశమయిన ఈ దృశ్యం అత్యానంద దాయకమేగాని నా సోదరీమణులు ఈ రీతిగా విదేశ వస్త్రాలతోనే సభలకు రావడంచూసినప్పుడు త్వరలోనే ఆనందం దుఃఖంగా మారుతున్నది ప్రతిసభలోను నా మాటలు నేనే వింటూండడం నాకోరిక కాదు నామాటలు కొందరి మనసుల్లో నయినా దృఢంగా నాటి ఆచరణలోకి రాగలవనే నమ్మకంతోనే నేను సభలలో ఉపన్యసిస్తున్నాను ఈ మధ్యాహ్నం ఇక్కడ మాట్లాడిన మాటలుకూడా అట్లాంటి ఫలాన్నే చేకూర్చుగాక"

## విద్యార్థులకు సందేశము

మార్చి 24వ తేదీన గాంధీజీ ఉదయాన్నే రామకృష్ణ విద్యార్థి మందిరం దర్శించినారు విద్యాలయంలోని బాలురందరూ సంపూర్ణ ఖద్దరు ధారులై మహాత్ముని సంతోష పెట్టినారు గాంధీజీతో శ్రీమాన్ యస్ శ్రీనివాసయ్యం గారు, అల్లాడి కృష్ణస్వామిగార్లు ఉన్నారు మహాత్ముడు పాదచారియై విద్యార్థులతో కలసి ప్రత్యేకంగా భవనాలన్నిటిని చూసినారు పరిశ్రమా గారంలో మగ్గాలపై బాలురు నేత నేయడం చూసి చాలా సతోషించినారు తరవాత మహాత్ముడు ఇట్లా ఉపన్యసించినారు

"మీ మఠం చూసినందువల్ల నాకు కలిగిన సంతోషానికి మేరలేదు ఈ ఆశ్రమం బయటకు ఎంత రమణీయంగా కనపడుతున్నదో మీ అంతరంగాలు కూడా అంత అకళంకంగా ఉన్నవని నమ్ముతున్నాను మీ రందరూ ఖద్దరు ధరించడం నాకు సంతోషంగా ఉంది మీకు నా అభినందనాలు దీనిని మీరు పరిత్యజించరని నా విశ్వాసము మీ అసంఖ్యాక వ్యాసంగాలలో నూలు వడకటం మరిచి పోవద్దు, అది కేవలం జీవనోపాధికి ఒక సాధనంగా భావించండి దీనినొక తపస్సుగా మీరు భావిస్తే భారత దేశానికి, ప్రపంచంలోని మానవకోటికి మీరు మేలు చేకూర్చిన వారు కాగలరు సర్వేశ్వరుడు మిమ్మును అనుగ్రహించు గాక."

తరవాత గాంధీజీ సంస్కృత కళాశాలకు వెళ్ళినారు. మహాత్మునికి

అక్కడివారు సంస్కృతంలో సన్మాన పత్రం సమర్పించిన తరవాత మహాత్ముడు విద్యార్థులకు హితోపదేశం చేసినారు

## ఆయుర్వేద ఫార్మసీలో మహాత్ముని ఉపన్యాసము

మహాత్ముడు మదరాసు ఆయుర్వేద ఫార్మసీవారి ఆహ్వానం అందుకొని అక్కడకు వెళ్ళినారు డాక్టర్ ఆచంట లక్ష్మీపతి, యస్ సత్యమూర్తి, గద్దె రంగయ్యనాయుడు మొదలయిన అనేక మంది ప్రముఖులు ఆ సభలో ఉన్నారు మహాత్మునితో యస్ శ్రీనివాసయ్యంగారు కూడా ఉన్నారు ఫార్మసీవారి పక్షాన విదేశీ వస్త్రధారులొకరు మహాత్ముని ఆహ్వానిస్తూ మహాత్ముడు మానవాతీతు'డన్నారు అదివిని మహాత్ముడు మందహాసంతో 'మానవాతీతుడని నన్ను మానవ ప్రపంచంనుంచి వేరు చేయకండి" అన్నారు తరవాత ఆ విదేశ వస్త్రధారి "సమస్తమానవ హృత్కమలములపై మహాత్ముని దివ్య స్వరూపము చిత్రింపబడి ఉన్నదని, 'ఆత్మవత్ సర్వభూతాని' అనే సిద్ధాంతం ఆచరణలో పెట్టి ప్రపంచోద్ధరణకు పూనుకొన్న కర్మయోగి అని" వర్ణించినారు తరవాత విదేశీ వస్త్రధారిణి అయిన ఒక బాలిక మహాత్మునికి విదేశీ పట్టు సంచిలో ఒక బంగారు నాణెంఉంచి సమర్పించబోగా మహాత్ముడు ఆ బాలిక వస్త్రాలు చింపివేయుదునా అని ప్రేమ పూర్వకంగా అంటూ తన జీవితంలో విషాద చరిత్ర అదే నన్నారు

ఫార్మసీ అధ్యక్షుడు శ్రీరామాచారి సన్మాన పత్రం సమర్పిస్తూ మహాత్ముడు భారతదేశాన్ని ఉద్ధరించడానికి కంకణ బద్ధుడయిన కర్మిష్ఠి అని మానవసేవే పరమార్థంగా కలవాడని ఆయుర్వేదం అటువంటి మానవ సేవకు కొంత సహాయకారి కాగలదని చెప్పి, కొంత నగదుతో ఒక వెండి పెట్టెను గాంధీజీకి సమర్పించినారు తరవాత ఖద్దరుపై ముద్రించిన సన్మాన పత్రం సమర్పించి ప్రతులను సభ్యులకు పంచిపెట్టినారు మహాత్ముడు ఇట్లా ప్రత్యుత్తర మిచ్చినారు

'మిత్రులారా!

తాము దయతో నాకిచ్చిన సన్మాన పత్రానికి నన్ను గురించి చేసిన స్తోత్రపాఠాలకు మీకెంతో కృతజ్ఞుడను కాని మీసన్మాన పత్రంలో పేర్కొన్న విషయాలతో నేనెంత మాత్రం ఏకీభవించలేను హాకీం అజ్మల్ ఖాన్‌గారి యూనాని కళాశాలను తెరిచిన సందర్భంలో కూడా అట్లాగే చెప్పినాను యుక్తాయుక్త విచక్షణలేని ఔషధ ప్రయోగానికి నేను ప్రతికూలుణ్ణి కాబట్టి మీరు మీ మందులను 2 లక్షల మందికి పంచిపెట్టినా 20 లక్షల మందికి పంచి పెట్టినా నేను సంతోషించను

మీ మకరధ్వజ ఔషధం మీరు జయప్రదంగా ప్రకటిస్తున్నందుకు మిమ్ము నేను అభినందించలేను వైద్యులలో ముఖ్యంగా కావలసింది నమ్రత నేనెప్పుడు వైద్యమిత్రులను ఎక్కువగా గౌరవించేవాడినని మీకు తెలుసు, ఆయుర్వేద,

యునాని ఆంగ్లేయ వైద్యులసేకులు నాకు మిత్రులు మందులకు నేను వ్యతి రేకినని వారందరికి తెలుసు ప్రస్తుత యుగపు వైద్యులు సనాతన వైద్యుల ఆదర్శం అవలంబించ గలరని ఆశిస్తున్నాను సనాతన భిషగ్వరులు తమ జీవిత కాలంలో పరిశోధనలు చేసి ఒకకాసైనా పుచ్చుకోక ప్రజలకు ఔషధాలిచ్చే వారు కాని నేటి ఆయుర్వేద వైద్యులు ఆయుర్వేదపు పూర్వయశస్సును ఆధారం చేసుకొని జీవించవలెనని చూస్తున్నారు

రోగ పరిశోధనా విధానం ఇంకా పరిపక్వ దశకు రాలేదు పాశ్చాత్య రోగపరిశోధనా విధానంతో పోల్చిచూస్తే ఇది దానితో తులతూగలేదు పాశ్చాత్య విధానం గురించి ఏమి చెప్పి నప్పటికీ దానిలో సమగ్ర పరిశోధన కలదని చెప్పక తప్పదు అనేకమంది వైద్యులు శస్త్ర చికిత్సకులు ప్రపంచానికి తెలియ కయే తమకాల మంతా ఈ పనికి వినియోగిస్తున్నారు ఆయుర్వేద వైద్యులు కూడా అట్లాంటి పనికి పూనుకొనగలరని ఆశిస్తున్నాను అందరూ అన్ని చోట్ల కీర్తి కోసం, పేరు ప్రతిష్ఠలకోసం మితిలేని దాహంతో ఉన్నారు ఆయుర్వేదం సేవించడానికది మార్గంకాదు ఆయుర్వేదంలో అమోఘశక్తియుతాలైన ఔషధాలు ఉన్నాయని నాకు తెలుసు కాని నేడు మీరా కళను మరిచి పోయి నందున వాటి ప్రయోగానికి అపరిచితులై ఉన్నారు నేనీ విషయం పలువురు వైద్యులతో చర్చించినాను వారంతా నే చెప్పింది అంగీకరించినారు

మీరు నన్ను ప్రత్యేకంగా ఇక్కడకు ఆహ్వానించినపుడు నామనోభావా లను నిష్కల్మషంగా వెల్లడించకపోతే నన్ను మీ నిజ మిత్రునిగా పరిగణించరు ఈ నా అభిప్రాయం ఆలోచన లేకుండా హఠాత్తుగా చెప్పింది కాదు 40 సంవత్సరాల అనుభవంతో ఆరోగ్యచికిత్సా శాస్త్ర పరిశోధనలు ఫలితంగా నేను తెలుసుకొన్న విషయమేమంటే ఎంతో తక్కువ సంఖ్యగల ఔషధాలను ఉప యోగించినవాడే మంచి వైద్యుడని - సప్తమ ఎడ్వర్డ్ చక్రవర్తికి చికిత్సచేసిన ఘన వైద్యుడు తన చికిత్సా విధానంలో తాను ఉపయోగించే ఔషధాలు రెండు లేదా మూడు మాత్రమేనని అవి తప్ప తక్కిన చికిత్సా విధానమంతా ప్రకృతి పరమని చెప్పి ఉన్నారు

ప్రకృతియే సర్వోత్తమము, అతి శీఘ్రము అయిన ఆరోగ్య సాధనమని మన వైద్యులంతా గ్రహించగలరని విశ్వసిస్తున్నాను కాని మానవుని నీచత మోసగించే పురికొల్పే వైద్య ప్రకటనలు అనేకం నేను చూస్తున్నాను ఈ ప్రకటనలు నాకు చాలా కష్టంగా ఉంటాయి మందులను ఉపయోగించే వైద్యులు ఏమీ మానవసేవ చేయటంలేదని నా అభిప్రాయము మీదు మిక్కిలి ప్రతి ఔషధం ఇతర ఔషధాలకంటే గొప్పదని ప్రకటించుకొంటూ దేశానికి చాలా చెడుపు చేస్తున్నారు నమ్రతను, నిరాడంబరతను అలవర్చుకోవలెనని నేను వాంఛిస్తున్నాను "

మహాత్ముని ఈ ఉపన్యాసానంతరం సభ ముగిసింది జయధ్వానాలు చెల రేగినాయి

## హిందీ విద్యాలయము – గాంధీజీ రాక

గాంధీగారి రాక సందర్భంలో విద్యాలయం చక్కగా అలంకరించబడింది గాంధీజీతో బరూచాగారు నాగేశ్వరరావు పంతులుగారు, గద్దె రంగయ్య నాయుడు, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి, సి రాజగోపాలాచారి, అల్లాడి కృష్ణస్వామి, శ్రీనివాసయ్యంగారు, టంగుటూరి ప్రకాశం, వేమవరపు రామదాసు పంతులు గార్లు హిందీ విద్యాలయానికి వచ్చినారు హరిహర శర్మ వారి కెదురేగి సన్మానించి లోపలకు తీసుకొని వెళ్ళినారు హిందీ భాషలో విద్యాలయోపాధ్యాయులు బాలురు ప్రార్థన జరిపిన తరవాత మహాత్ముని ప్రశంసిస్తూ సన్మాన పత్రం సమర్పించినారు

## గాంధీజీ ప్రత్యుత్తరము

గాంధీజీ ప్రత్యుత్తరమిస్తూ "హిందీ విద్యాలయంవారు సన్మానిస్తూన్నప్పుడు ఇంగ్లీషులో ప్రత్యుత్తర మీయవలసి రావడం వింతగా కనిపిస్తుంది కాని నా మాటలు అందరికీ బోధపడవలెననే ఉద్దేశంతో అక్కడ చేరిఉన్న అనేక మందికి హిందీ రానందువల్ల ఆంగ్లభాషలో మాట్లాడవలసి వచ్చింది

నిజమయిన జాతీయాభివృద్ధి కావలెనంటే హిందీ ప్రచారం అత్యావసరము జాతీయాభివృద్ధి అంటే సామాన్య ప్రజల్లో కలిగే అభివృద్ధి దానికి హిందీ ప్రచారం ఉండి తీరవలె 5 ఏళ్ళ క్రితం హిందువులలో హిందీ ప్రచారోద్యమం ప్రారంభమయింది అప్పుడు అందుకు కావలసిన ద్రవ్యం యావత్తు ఉత్తర దేశంలోనే సేకరించబడింది అందులో కొన్ని వేలు ఈ దక్షిణ దేశానికి వినియోగించడం జరిగింది 5 ఏండ్లు గడిచిన తరవాత కూడా దక్షిణ దేశంలో ఈ ప్రచారానికి తగిన ధన సహాయం రావడం లేదు ప్రచారక సంఘాలు స్వయంగా పోషించుకోజాలకుండా ఉన్నాయి అన్నిటికంటె ఎంతో విచారకరమైన విషయమేమంటే ఈ తమిళ దేశంలో హిందీ చదువుకొనే ఆసక్తి కలవారి సంఖ్య చాలా తక్కువ కాంగ్రెస్‌పైన ఉత్సాహంతోనైనా యువకులందరూ వచ్చి హిందీ బడులలో నిండిపోతారని నేను అనుకొన్నాను కాని ఆశాభంగమయింది హిందీ ప్రచారకులకు ప్రోత్సాహం లేకున్నది కాని ఈ విద్యాలయం మాత్రం అందరు విద్యార్థులు విడిచిపెట్టి ఒక్కరు మిగిలి ఉన్నప్పటికీ కూడా ఇంకా పని చేస్తూనే ఉంటుంది కాని విడిచిపెట్టదు ఇక్కడి ప్రచారకులంతా పట్టుదల కలవారు హిందీ భక్తులు, ఏనాటికైనా తమిళ దేశపు తలుపులు తెరిచి హిందీ భాషను విరివిగా వ్యాపింపజేస్తారే కాని విడిచిపెట్టరు"

ఈ ఉపన్యాసాంతరం హిందీ భాషలో గాంధీజీకి వందనాలు అర్పించడం జరిగింది అప్పటికి సభ ముగిసింది

## మద్యపాన నిషేధము – గోఖ్లే హాల్‌లో సభ

మార్చి 24 ఉదయం 9 గంటలకు గోఖ్లే హాల్‌లో మద్యపాన నిషేధం

గురించి సభ జరిగింది ఆ సభలో గాంధీగారు మాట్లాడతారని తెలిసి చాలా మంది వచ్చినారు న్యాయమూర్తి సదాశివయ్యర్ యస్ సత్యమూర్తి, రాజగోపాలాచారి మొదలయిన ప్రముఖులు కూడా సభలో ఉన్నారు డాక్టర్ బెసెంట్ సభకు అధ్యక్షత వహించినారు గాంధీగారా సభలో ఇట్లా ప్రసంగించినారు

మిత్రులారా !

ఇంత ప్రాముఖ్యమయిన విషయం గురించి ఉపన్యసించడానికి సమయం లభించినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది నేను మద్యనిషేధ ప్రచారానికి పూని 30 సంవత్సరాలయి ఉంటుంది నాకు దీనిలో ఎట్లా ప్రవేశం కలిగిందో తెలుసుకోవాలనే కుతూహలం మీకు ఉండవచ్చు నేను మొట్టమొదట ఇంగ్లాండ్‌కు పోయే నాడు నా తల్లి నావద్ద మూడు ప్రమాణాలను తీసుకొన్నది అంటే మూడు షరతులు విధించింది అందులో మద్యం తాగకూడదనే షరతు ఒకటి అప్పటిలో నేను పుట్టి పెరిగిన గ్రామంలో తాగుడంతగా వ్యాపించ లేదు అయినా మా అమ్మ ఆవ్యసనం చాలా ప్రమాదకరంగా భావించింది నేను స్టీమరెక్కి పోతూ ఉన్నపుడు నాతో వచ్చిన వాడొకడు నేను మద్యం తాగకుండా ఉండటం దుర్ఘటమని నాతో చెబుతూ వచ్చినాడు మొదట్లో తాగకున్నా కొంతదూరం పోయిన తరవాత బలవంతంగా తాగ వలసి వస్తుందని బెదిరించినాడు కాని నేను నమ్మలేదు సగం దూరం దాటిన తరవాత డాక్టర్లు మద్యం తాగవలెనని సలహా ఇస్తే ఏమి చేస్తావని నన్నడిగి నాడు అంత తప్పని సరిఅయితే అదిలేదే దుర్భరమని వారంటే నేను ప్రాణాలే విడుస్తానన్నాను కాని అంతపని జరగలేదు నేను లండన్‌లో ప్రవేశించినాను బహునీచపు దృశ్యాలను చూసినాను రాజమందిరాలవలె ఉండే తాగుడు గృహాలలో ప్రజలు గుంపులు గుంపులుగా అతి నీతిమంతుల వలెపోయి తప్ప తాగి మైమరచి వస్తూండడం చూసినాను వారిలో చాలా మంది తాగుడు ఎంత ప్రమాదకర మయినదో తెలియకుండానే విలాసార్థం తాగుతున్నారు అదంతా చూసినందువల్ల నాకు మద్యనిషేధానికి పనిచేయవలెననే కోరిక కలిగింది కాని ఇంగ్లాండ్‌లో నేనేమీ పని చేయలేక పోయినాను

## దక్షిణాఫ్రికా అనుభవము

ఇంగ్లాండ్ నుంచి తిరిగి వచ్చిన త్వరలోనే నేను వేలకొద్దీ మన దేశీయులు కడు నిరుపేదల మధ్య ఉండవలసి వస్తుందని అనుకోలేదు అక్కడి పేద ప్రజలు అనవసరంగా తాగుడుకు అలవాటు పడినారు. కూలీలుగా వెళ్ళిన వారు స్త్రీలు, పురుషులుకూడా తాగి పాడై పోతున్నారు వారికి అనేక విధాల నేను బోధ చేసినాను ఆ రోజులలో నేను ప్రభుత్వం వారితో అనేక విధాల పోరాడుతున్నప్పటికీ అసహాయవాదిని కాదు వారు నా సహకారం అంగీక రించే విషయంలో సహాయం చేస్తూండేవాణ్ణి ఈ విషయంలో పని చేయవలసిందని

ప్రభుత్వంవారిని కోరుతూ వచ్చినాను కాని నా ప్రచారంలో నాకు మన దేశీయులే ఎక్కువ అడ్డు తగులుతూ వచ్చినారు తాగడం హక్కుగా వారు పరిగణించినారు ఆంగ్లేయులు ఇతర యిరోపియన్లు తాగుతుంటే మమ్మెందుకు మీరు అడ్డుపెడతారని ప్రశ్నించడం మొదలు పెట్టినారు దక్షిణాఫ్రికాలో 20 ఏండ్లు ఉన్నప్పటికి కూడా వారిలో ఎక్కువమంది బుద్ధి మరల్చలేక పోయినానని చెప్పవలసి వచ్చినందుకు నాకు సిగ్గువేస్తుంది ఆంగ్లేయులు తాగటం అనుకూలమని హక్కని అనుకోవడం లేదని చెప్పినాను

సముద్రయానం చేస్తూన్నప్పుడు అనేకమంది స్టీమరు కెప్టెన్లు చావ తాగినవారిని నేను చూసినాను వారు స్టీమర్లలో ప్రయాణం చేయటం భయంగా ఉంటుంది వారి దురభ్యాసం వారికే కాక వారిపై ఆధారపడి ఉన్న నావికులకు కూడా ఎంత ప్రమాదకరమో ఎంత నీచమో నేను నచ్చచెప్పినాను మనం తాగడుమాని ఇతరులను మానేటట్లు చేసి పాడై పోతూన్న అనేక కుటుంబాలకు సహాయం చేయగలము అప్పటినుంచి మద్యనిషేధ ప్రచారంలో నాకూ నా మిత్రులకు ఎక్కువ శ్రద్ధ కలిగింది కొందరు తాగేవారిని ఆటంకపెట్టకూడదని వారికి బోధ చేయడంవలననే కార్యసాఫల్యం కాగలదనీ అంటారు కాని బోధచేసిన మాత్రాన తాగుడు తగ్గిపోతుందని నేను నమ్మను తాగుతున్నవారికి తామెంత చెడ్డపని చేస్తున్నారో తెలియదు

నేనీ రాష్ట్రానికి రాకముందు కతైవాడులో పర్యటించినాను అక్కడ అనేకమంది రాజాలున్నారు అనేక కుటుంబాలవారు తమను ఈ దురభ్యాసాల నుంచి తప్పించి రక్షించవలసిందని కోరినారు ఔషధరీత్యా అవసరమయిన దానిని తప్ప మిగిలిన మద్య పదార్థం రానీయకుండటం చేతనే వారి అలవాటును మాన్పించగలము అంతకు తప్ప వేరే విధంగా వీలులేదు అమెరికాలో నల్లమందు నిషేధ సంఘాలవారు ఏ పద్ధతులను అవలంబిస్తున్నారో ఇక్కడ మద్యం విషయంలో కూడా ఆ పద్ధతులనే అవలంబించవలసి ఉంటుంది నల్లమందు తాగుడుకంటే ఎక్కువ హానికరమేమో నాకు తెలియదు కాని ఈ రెంటిలో ఎంచుకోవలసిన దేమీలేదు తాము మితంగా తాగుతామని చెప్పుకోవడమేగాని అమితంగా తాగి అందులో మునిగిపోయినవారు వేలకొద్దీ ఉన్నారు తాగుబోతులు మైమరచి తల్లి ఎవరో భార్య ఎవరో తెలుసుకోలేరు

ఆస్ట్రేలియానుంచి వచ్చిన పేటర్‌సన్ అనే ఆంగ్ల మిత్రుని నే నెరుగుదును ఆయన ఇంజనీరు ఆయన జీతం నెలకు 40 సవరనులు దివ్యజ్ఞాన సమాజకుడని కూడా బిసెంట్‌గారికి చెబుతున్నాను నేను సంస్కార వాదిననీ, భోజనము, పానీయ విషయాలలో నిష్ఠగలవాడనని తెలుసుకొని నాతో స్నేహం జేసి తనను తాగుడు దురభ్యాసంనుంచి మాన్పించవలెనని కోరినాడు నేను ఆయన దగ్గర ఉన్నప్పుడు పేటర్‌సన్‌గారు తాగుడు మాని కట్టుదిట్టాలలో ఉండేవారు కాని నేను ఆయనకు దూరమయిన వెంటనే తాను మళ్ళా దానికి లోనై పోతినని వెంటనే రావలసిందని నా పేర తంతికొడుతుండేవారు. తాగుడుకు

మనిషిపై అంత అధికారం మరింగిన్ని మాట ఎల్లమందు మనిషిని మతి తప్పించి స్తంభీభూతుని చేస్తుంది అది అంతగా హానికరమయింది కాదు కాని తాగుడు అలా కాక అనేక నీచ లకు అపాయాలకు లోబడ చేస్తుంది అది దైవసాన్నిధ్యం నుంచి దయ్యం ఎదట పారవేస్తూంది నాకే అధికారం ఉంటే శాసనసభల వారిని ఈ మద్యపాన రాబడి విడిచిపెట్టవలసిందని బలవంతం చేస్తాను మద్యంవల్ల వచ్చే రాబడి లేనిది మన పిల్లలకు విద్య నేర్పడం దుర్లభమయితే విద్యాసంస్థలన్నీ మూయించివేస్తాను

మద్యనిషేధంకోసం అటువంటి త్యాగంకూడా భరించవచ్చు కాని ఈ రాబడి వుండదు కాని నేను శాసన సభలను గురించి ఈ రాబడిని గురించి అంతగా చెప్పదలుచుకోలేదు శాసనసభల ద్వారా నిషేధం జరిపే అవకాశం అందరికీ లేదు తాగుబోతుల ఇళ్ళకు పోయి తగు బోధ చేయడం మనందరమూ చేయగల పని బోధ చేసినంత మాత్రాన చాలదు వారి ఇళ్ళకుపోయి పరిస్థితులను తెలుసుకొని ఈ దురభ్యాసానికి గల కారణం గుర్తించవలె మన దేశీయులు కులాసాకు తాగరు అలవాటు పడినవారే కొందరు మద్యం రుచిగా ఉండదని చెప్పినారు వందా, రెండువందల ఏళ్ళనుంచి కుళ్ళివున్న వాటిలో ఏమి రుచి వుంటుంది కాని వేలకొద్దీ ప్రజలు ఆ విదేశ సారాలను తాగుతారు వారు ఒక క్షణకాలం ఒళ్ళుమరిచి ఉండటంకోసం తాగుతారు వారి దురభ్యాసం పోగొట్టదలస్తే మనము ఉన్నత స్థానాలనుంచి కాక వారి ఇండ్లకు పోయి బోధ చేయవలె మనం తాగకున్నంత మాత్రాన దేవతలమని అనుకోరాదు కష్టపడి పని చేయడం చేత తాగక తప్పదని వారు చెబుతూ ఉంటారు బొంబాయిలో చాలా మంది పనివాళ్ళు గాలిలేని చిన్న గదులలో అనారోగ్య స్థలాలలో అద్దెకు ఉంటారు వారి పిల్లలు తిండిలేక మాడుతూ ఉంటారు వారు తాగుడుకు, జూదానికి డబ్బు తగలేస్తూ ఉంటారు మనం వారి కొట్లకు పోతే అసహ్యించుకొంటారు రోజుకు 8 లేదా 10 గంటలు పనిచేస్తారు జబ్బులతో బాధపడుతూ ఉంటారు దేవుడు లేడనే వారి నమ్మకం ఉంటే తమను ఎట్లా విడిచిపెడతారని ప్రశ్నిస్తారు బొంబాయి నగరంలో జనసంఖ్య ఎక్కువ కావడంచేత వారికెక్కడా తావుండదు ఇట్లాంటి చోట్లకు మనం పోయి కొంతకాలం చూడవలె బోయర్ యుద్ధంలో నేను సైనికులతో ఉండినప్పుడు కాలినడకను ప్రయాణం చేసినాను సైనికులు చాలా డస్సి కల్లుఇవ్వక తప్పదన్నారు వారు చాలా కష్టపడినారు కనక ఆహారంతోపాటు కల్లుకూడా యివ్వవలెనని ఆర్డరు ఉంది కాని నేనుకూడా మీతో నడిచినవాడినే కదా నా కవసరం లేనప్పుడు మీ కెందుకది అవసరమయిందని నేను వారిని ప్రశ్నించినాను ఒకరోజయినా ఇవ్వక తప్పదని, ఇవ్వకపోతే మరునాడు పని చేయజాలమన్నారు అందుచేత నేనీయక తప్పింది కాదు. మనం దురభ్యాసం కలవారిని దానినుంచి మాన్పించవలెనన్నట్లయితే వారికి లొంగిపోయి సాధించవలె వారి కష్టాలను బోధపరుచుకొని వారితో కలిసిమెలిసి తిరగవలె మనసు తాగకుండా ఉండి, అప్పటికీ వారితో

కలిసిమెలిసి ఉంటే మనం గెలవగలం తాగుడు నిషేధపు పని ఒక్కడు చేయ తగినది కాదు అమోఘమయిన కార్యం, అపారమయిన సముద్రం వంటింది ఆ సముద్రంలో ఒక నీటి బిందువువలె ఉండవలె మనవంటివారు అనేకులు కలిసి పని చేస్తూంటే ఈ కార్యం సాధించగలము" అని గాంధీగారు తమ ఉపన్యాసం ముగించినారు అధ్యక్షత వహించిన డాక్టర్ బిసెంట్ మద్యనిషేధం సమర్థిస్తూ కొన్ని మాటలు చెప్పిన తరవాత సభ ముగిసింది

## గాంధీజీ - ఆంధ్ర పత్రికా కార్యాలయము

మార్చి 24వ తేదీ సాయంకాలం 4 గంటలకు గాంధీజీ ఆంధ్రపత్రికా కార్యాలయానికి వెళ్ళినారు వారివెంట యస్ శ్రీనివాసయ్యంగారు, సి రాజ గోపాలాచార్యులు, ధర్మానందస్వామి, చక్రయ్యచెట్టి మొదలయిన ప్రముఖులు ఉన్నారు అప్పుడు ఆంధ్రపత్రికా కార్యాలయంలో ఉన్న నూలు వడికే సంఘంలోని కార్యాలయ సభ్యులు, ఇతరులు నూలు వడుకుతున్నారు మహాత్ముడది చూసి చాలా సంతోషించినారు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు తాము సన్నని నూలు వడికే పెద్ద రాట్నం చూపెట్టినారు అక్కడ ఉన్న చక్కని ఏకులను చూసి గాంధీజీ ఇవెక్కడివని అడిగినారు 'పొందూరుఏకుల'ని పంతులుగారు చెప్పినారు తరవాత ఆంధ్రపత్రికా సంపాద కులు శ్రీ చల్లా శేషగిరిరావుగారిని నాగేశ్వరరావు పంతులుగారు గాంధీజీకి పరిచయం చేసినారు గాంధీజీ సంతోషించినారు తరవాత శేషగిరిరావుగారు హిందీలో సన్మాన పత్రం చదివి గాంధీజీకి సమర్పించినారు నాగేశ్వరరావు పంతులుగారు మహాత్ముని ఖద్దరు పుష్పమాలాలంకృతుని చేసినారు అందరూ చాలా ఆనందించినారు పండ్లు, తాంబూలము గాంధీజీకి, తదితరులకు ఇచ్చి నారు తరవాత గాంధీజీ స్వరాజ్య పత్రికా కార్యాలయానికి వెళ్ళినారు

## సన్మాన పత్రము

ఆంధ్ర పత్రికా కార్యాలయ సభ్యులు గాంధీజీకి సమర్పించిన సన్మాన పత్రము

"పూజ్యులగు గాంధీ మహాత్మునికి నమస్కారం

**మహాత్మా!**

తమ పవిత్ర శుభాగమనంవల్ల ఆంధ్ర పత్రికా కార్యాలయ సభ్యులమైన మేము కృతార్థులమయినాము

నిరంతరం మానవసేవా పరాయణులైన తమరు మా ప్రార్థన సంగీకరించి విచ్చేసినందుకు మేము మనఃపూర్వకమైన కృతజ్ఞతను తెల్పుతున్నాము

త్యాగమూర్తులైన తమ దివ్య సందర్శనం మూలాన తమ పవిత్ర

మార్గం అనుసరించడానికి మాకు శక్తి నొసంగమని పరమేశ్వరుని వేడుతున్నాము

ఇట్లు
విధేయులు

ఆంధ్ర పత్రిక కార్యాలయం ఆంధ్ర పత్రిక కార్యాలయ సభ్యులు

రక్తాక్షి సంవత్సర ఫాల్గుణ బహుళ అమావాశ్య

(హిందీ సన్మాన పత్రానికి ఇది అనువాదము)

**గాంధీజీ 'స్వరాజ్య' పత్రికా కార్యాలయం దర్శించడం**

గాంధీజీ ఆంధ్ర పత్రికా కార్యాలయంనుంచి స్వరాజ్య పత్రికా కార్యాలయానికి వెళ్ళినారు పత్రికాధిపతి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు గాంధీజీని ఆహ్వానించి అతిథులు వేచి ఉన్న మేడ మీది హాలులోకి తీసుకొని పోయినారు పత్రికా కార్యాలయమంతా చక్కగా అలంకృతమై ఉంది యాకూబ్ హుస్సేన్, యస్ శ్రీనివాసయ్యంగారు, సి రాజగోపాలాచారి, రంగస్వామయ్యంగారు, వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి, డాక్టర్ పి వరదరాజులు నాయుడు మొదలయిన వారు ఆ సమావేశంలో ఉన్నారు అతిథులందరికి పండ్లు, తాంబూలాలు ఇచ్చిన తరవాత ప్రకాశం పంతులుగారు 'సన్మాన పత్రం' చదివినారు అందులో మహాత్ముని ఖద్దరు కార్యక్రమం ప్రశంసిస్తూ తాము స్వరాజ్య పత్రిక ద్వారా అన్ని ప్రాంతాలకు గాంధీగారి సందేశం అందచేస్తూన్నట్లు తెలియ పరిచినారు బార్డోలి తీర్మానంవల్ల బహిష్కరణలను విరమించినందువల్ల కొందరికి ఆశాభంగం కలిగిందని, అహింస లేనిది శాసనోల్లంఘన జరగ నేరదని ఇప్పటికి గ్రహించినామని శాసనోల్లంఘునకు తయారయ్యేవరకు భారత దేశం రాట్న పరిశ్రమలో నిమగ్నమయి ఉండటం ముఖ్యమని తెలుసుకొన్నామని అన్నారు రాట్న పరిశ్రమకు ఆంధ్ర, తమిళ దేశాలలో తగిన సాధన సంపత్తి ఉన్నది కాని, వాటిని సరిగా ఉపయోగించగల సామర్థ్యం కలవారు గాంధీగారేనని సన్మాన పత్రంలో తెలిపినారు

సన్మాన పత్రం చదివిన తరవాత గాంధీగారి మెడలో ప్రకాశంగారు పూలదండ వేసినారు గాంధీజీ తన సంతోషం తెలుపుతూ ఇట్లా ప్రత్యుత్తరమిచ్చినారు

"ప్రస్తుతం నా ఆశయం మీరు బాగా గుర్తించినారు సర్వకాల సర్వావస్థలలో నేను ఖద్దరు, అస్పృశ్యతా నివారణ, వివిధ జాతుల ఏకీభావం గురించి ఆలోచిస్తూ ఉంటాను చివరి రెండు విషయాలు నెరవేర్చడంలో మన సమర్థతకు కొంత మితి ఉన్నది అస్పృశ్యతా నివారణను గురించిగాని అన్ని జాతుల ఐక్యంపట్లగాని, హిందూ మహమ్మదీయ ఐక్యం లేదా కొత్తగా ఇప్పుడు నాకు కనబడుతూన్న బ్రాహ్మణా బ్రాహ్మణుల భేదభావాలుతొలగించడంపట్లగాని

అందరూ ఒక్కరీతిగ పని చేయలేరు ఈ పనులలో ప్రతివారు సహకరించలేరు కాని నూలు వడకటం, ఖద్దరు కట్టటం అటువంటివి కావు ఈ విషయంలో యువకులు, ముసలివారు వికలాంగులు కూడా శక్తి కొద్దీ పాటు పడవచ్చు ఒక పంచమ బాలుడు నూలు వడకటంలో ప్రకాశంగారిని వోడించవచ్చు అంతే కాదు వీధిలో పోయేవాడు కూడా ఖద్దరు ధరించడంలో శ్రీనివాసయ్యంగారికి సలహా ఇవ్వవచ్చు

స్వరాజ్య పత్రిక ఖద్దరు సందేశం మారుమూల గ్రామాలకు కూడా ప్రచారం చేయగలదని నమ్మకంగా పలికినందుకు కృతజ్ఞుణ్ణి కాని ప్రజలు స్వరాజ్య పత్రిక చదవరు గదా! మారుమూల గ్రామాలకది ఎట్లా ప్రచారం చేయగలదో నాకు తెలియడం లేదు దేశంలో అందరూ పాల్గోదగిన స్వల్ప కార్యమిది ఒక్కటేనని నాకు తెలుసు కాని స్వల్ప సున్నిత కార్యాలకే ఎక్కువ శిక్షణ కావలసి ఉంటుంది నేనీ సందేశం తప్ప మరొక సందేశం ఇవ్వలేనటువంటి దుస్థితి మన దేశానికి వచ్చింది కళాశాలా బాలికలతో ముచ్చటించినప్పుడు మన దేశంలో నిరక్షరుల సంఖ్య ఎక్కువగా ఉన్నదని తెలిపినాను వ్రాయనూ, చదవనూ నేర్చినవారు చాలా తక్కువ ఇక వారు వార్తా పత్రికల ద్వారా ఏమి తెలుసుకోగలరు! అందుచేత నే ప్రకాశం గారిని 'నడువ నేర్చిన వార్తా పత్రిక'గా మారిపోయి పని చేయమని పూనాలో చెప్పినాను మనం తక్కిన మాటలు తక్కువ చేసి రాట్నం గురించి మాట్లాడుతూ ఉంటే రాట్న సందేశం బాగా వ్యాపించి తీరుతుంది రాట్నం చేబూని ఒక గ్రామంలో స్థిర నివాసమేర్పర్చుకొని పని చేస్తూ ఉంటే ఆ గ్రామస్థులు వారి బిడ్డలు కూడా రాట్నం తిప్పటం ప్రారంభిస్తారు

యూరప్ ఖండంలో యుద్ధకాలంలో, తదనంతరం కూడా ప్రతి ఇంట్లో యుద్ధంవల్ల నష్టాలను గురించి తప్ప మరే విషయం మాట్లాడుకోలేదు ఆ రీతిగా మన వార్తా పత్రికలన్నీ కూడా రాట్నం గురించి తప్ప మరొకటి ప్రసంగించకూడదని నా కోరిక దేశంలో అనుసరించదగిన కార్యక్రమం వేరే ఏదీ లేనప్పుడు మనం కూడా రాట్నపు పనే ఎందుకు చేయకూడదు? కాబట్టి ఈ సందేశం ఈ కార్యాలయం నుంచి దక్షిణ దేశంలో అన్ని గ్రామాలలోకి చొరబడవలె "

ఉపన్యాసానంతరం మహాత్ముడు కార్యాలయం చూసినారు

## గాంధీజీకి పాకీవారి ఆహ్వానము

కుప్ప దొడ్డి మైదానంలో నివసించే పాకీవారు మార్చి 24 న గాంధీజీని ఆహ్వానించినారు సభాప్రదేశంను వారు తోరణాలతో అలంకరించినారు భజనలతో గాంధీజీకి ఎదురు వెళ్ళినారు చాలా సంవత్సరాలనుంచి రాత్రి పాఠశాలలు మొదలయినవి నిర్మించి విద్యా ప్రచారం చేస్తూ పాకీ వారి అభివృద్ధికి పాటు పడుతున్న శ్రీ గద్దె రంగయ్య నాయుడు గారిని గాంధీజీకి పరిచయం

చేసినారు పాకీ వారిలో ఒకరు తెలుగులో సన్మాన పత్రం చదివిన తరవాత గాంధీజీ హిందీలో ఇట్లా ఉపన్యసించినారు

మీరు దయతో ఇచ్చిన సన్మానపత్రానికి హృదయపూర్వక వందనాలు నేను పాకీ పని వాడను అందుచేత మీకు రెండు మాటలు చెప్పదలచు కొన్నాను పాకీ పని వాళ్లంటే ప్రజలు ఎంతో హీనంగా భావిస్తున్నారు మన లోని ఆ హైన్యతను నీచత్వంను తీసి వేంప వలె వేడుకునే భగవంతుని ప్రార్థన చేయవలె ఇతరుల అపరిశుభ్రతను తీసివేయడం నీచం కాదు సర్వోత్కృష్ట మయిన పని ఆ పనిని పూర్తిచేసి గృహాలకు మరలి తరవాత పరిశుభ్రంగా స్నానం చేయవలె ఇక్కడ చేరిన స్త్రీ పురుషులు వస్త్రాలను శుభ్రంగా ఉతు క్కొని ధరించవలె వెంట్రుకలకు నూనె రాచి కొని శుభ్రంగా దువ్వుకోవలె

మీ అందరి శరీరాల మీద విదేశీ బట్టలు తప్ప స్వదేశీ దుస్తులు నాకు కన పడడం లేదు వెంటనే మీరందరు ఖద్దరు బట్టలను కట్టవలె స్త్రీలు కూడా ఖద్దరులోనే రంగుబట్టలనైన కట్టవచ్చు వీలు చిక్కినప్పుడల్లా నూలు వడక వలె మన పనులను మనం చేసుకొంటూనే వుండి రోజుకు కనీసం ఒక గంట కాలం నూలు వడికి ఆ నూలును కాంగ్రెస్ కిచ్చి దేశాభ్యుదయమునకు పాటు పడ వలె తాగుడును పూర్తిగా మానవలె అది గొప్ప దురభ్యాసము జూదం ఆడ కూడదు అసత్యం ఆడకూడదు చనిపోయిన జంతువుల మాంసం తినరాదు నేను మీతో సమానమయిన పాకీవాడనైనను మాంసభక్షకుడను కాదు రొట్టె, పాలు, ఫలాలనే భుజిస్తాను ఈ విధులన్నీ మీరు సక్రమంగా నెరవేర్చితే హిందూ సంఘంలో అంటరాని వాడని పిలువబడేవాడు ఉండడు మీ అందరికీ నాపట్ల నిశ్చయమయిన ప్రేమ ఉంటే నేను చెప్పినట్లు ప్రవర్తించగలరు సర్వేశ్వరుడు మీకు మేలు చేయుగాక "

ఈ సభ ముగిసిన తరవాత మహాత్ముడు రాయపురానికి పోయినాడు రాయపురం పలకల దొడ్డిలోని ఆంధ్ర పంచములు మహాత్మాగాంధీగారికి సన్మాన పత్రం సమర్పించినాడు

## సన్మాన పత్రము

"మహాత్మా!

భారతదేశంలోని మాల మాదిగలు మొదలయిన మాబోటి తక్కువ జాతులు గొప్ప కులాలవారని చెప్పబడే ఇతర హిందువుల వదో ఒక రూపంగా వేదసమానమైన హిందూ మతాన్నే అనాదిగా అనుసరిస్తూ, వర్ణాశ్రమాలకు తగిన ధర్మాలను నెరవేర్చడమే గాక స్వలాభ స్వసుఖాలనైన గమనించక తెలివి తక్కువ, బీదరికాలనే తమ కుల దేవతలుగా పూజిస్తూ ఎప్పుడు గొప్ప కులాల వారి సుఖ లాభాలను ఎవ్వరు కాదన లేదు

అట్లా మా కులాలకు, మానవులందరికి సమానంగా దేవుడు నిర్మించిన దేవుని తెలుసుకొనే తెలివి, లోకం తెలుసుకొనే జ్ఞానం కలగ జేసే విద్యను

చెప్పించి మమ్ముద్ధరింపవూనే వారెవ్వరులేకున్నా, మా సామాన్య జీవనాలకోసం సరిపడే భూవసతులుగాని, వ్యాపార సౌకర్యాలుగాని కలిగించి మా దారిద్ర్యం పోగొట్టే ధర్మబుద్ధిగల పుణ్యపురుషుడు ఒక్కనినైన మేమింత వరకు చూసి ఎరగము. మేము ఇందుకు అంతగా చింతించము కాని మాపై అంటరాని తనమనే ఒక పెద్ద దయ్యాన్ని ఉసిగొల్పి చాకలి, మంగలి, కుమ్మరి, ఎరుకుల, ఏనాదులు మొదలైన చాకిరీ చేసే కులాల వారి కంటె, వీధులలోని పెంటలను తినే కుక్కలు, పందులు, కోళ్ళు మొదలయిన నీచ జంతువుల కంటె అతి నీచంగ చూడ బడుతూ హిందూ జాతిలో తల ఎత్తుకొని రాజ వీధుల్లో సైతం తిరిగే భాగ్యానికి నోచుకోమైతిమే అని చింతిస్తున్నాము

సాటి మానవులలో సాంఘికంగా సమాన గౌరవం లేని మహారాజు కైనా సుఖం లేదు ఆది కాలం నుంచి హిందూ సంఘంలో నీచాతి నీచంగా చూడబడుతూ మానవ సమాన హక్కులకు దూరులమై దిక్కుగానక కష్టపడు తున్న మా నీచత్వం బాపి సంఘంలో సమాన మర్యాదను కలిగించినప్పుడే మేము సుఖించి సంతోషిస్తాము కాని అది లేక మీరు మా ఎదుట బంగారు కొండను తెచ్చి పెట్టినా సుఖం కలగబోదు సంఘంలో నీచంగా పడిఉన్న మేము పైకి లేచినప్పుడు భోగభాగ్యాలు మా అదృష్టం బట్టి దేవుని దయచేత కలుగుతాయి అందుకు మేమెవ్వరినీ నిందించను

పతిత రక్షకా!

మా పై ఆరోపింపబడిన ఈ అంటరానితనం మొదలయిన నీచత్వాలు శాస్త్ర సమ్మతాలా కావా, క్రమమా అక్రమమా అని ఆలోచించకుండా కొందరు, అక్రమమని తెలుసుకొని పూర్వాచార పరాయణుల భయంచే గుడ్డి ఎద్దులవలె పెద్దలు తొక్కిన దారినే తొక్కుతున్నారు గాని స్వతంత్రించి కొత్త మార్గం బట్టి ఈ దీనుల కాపాడ బూనిన వారెవ్వరు ఇంత వరకు లేరు మాపట్ల పూర్వులు కల్పించిన నిర్బంధాలు అన్యాయమని గ్రహించి పాతదారులు తొక్కేవారు ఎందరు అడ్డు పడినా భయపడక మమ్ముద్ధరించి హిందూ సంఘంలో గౌరవంగా నిలువడానికి తమరు చేస్తున్న అన్ని ప్రయత్నా లకు ఈశ్వరుడు తోడ్పడుతూ తమకు దీర్ఘాయువును దయచేయగలందులకు ప్రార్థిస్తున్నాము మా ఈ నీచత్వం బాపడానికి చెన్నపురి ఆంధ్ర కాంగ్రెస్ సంఘం వారు చేస్తున్న కృషి మాకెంతో అనుకూలంగా ఉన్నది వారిని దేవుడు కాపాడుగాక"

ఇట్లు
చెన్నపట్టణం - రాయపురం,
పలకలదొడ్డిలోని ఆంధ్ర పంచములు

## గాంధీజీకి శ్రీనివాసయ్యంగారి విందు

మహాత్ముని గౌరవార్థం శ్రీమాన్ యస్ శ్రీనివాసయ్యంగారు తమ

ఇంటి 'అజ్మత్ బాగ్' లో విందు చేసినారు తోట చక్కగా అలంకరించి ఉంది మదరాసులోని అన్ని పక్షాలకు అన్ని సంఘాలకూ చెందిన సుప్రసిద్ధ నాయకులు సుమారు 500 పైగా వచ్చినారు ప్రభుత్వాధికారులలో న్యాయ మూర్తి వేపా రామేశం, ఆర్ రామచంద్రరావు (మదరాసు కలెక్టర్) మొద లయిన వారు ఉన్నారు మద్రాసు శాసన సభా అధ్యక్షులు, శాసన సభ్యులు అనేకులు వచ్చినారు టంగుటూరి ప్రకాశం, డాక్టర్ బెసెంట్, వి యస్ శ్రీని వాస శాస్త్రి, యాకూబ్ హుస్సేన్, టి వి శేషగిరి అయ్యర్, కాశీనాథుని నాగేశ్వరరావు, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి మొదలైన ప్రముఖులు అనేకులు వచ్చినారు కార్పొరేషన్ సభ్యులు కూడా అనేక మంది వచ్చినారు

గాంధీజీని తోవలో ప్రజలు ప్రతి చోట ఆపడం చేత ఆయన నిర్ణీత కాలానికి ఒక గంట ఆలస్యంగా వచ్చినారు ఈలోగా శర్మ సోదరులు తమ గాన కళాకౌశలం ప్రకటించి అతిథులను ఆనంద సాగర నిమగ్నులను చేసి నారు మహాత్ముడు చేరిన తరవాత అతిథులకు అల్పాహార విందు జరిగింది

శ్రీనివాసయ్యంగారు ప్రముఖులైన అతిథులను మహాత్మునికి పరి చయం చేసినారు డాక్టర్ బెసెంట్ మహాత్ముని సేవా పరాయణత్వాన్ని కొనియాడుతూ దేశంలోని నానా సంఘాలకు సమన్వయం కుదర్చడంలో మహాత్ముని శక్తి అసాధారణమని చెప్పినారు సర్ టి సదాసివయ్యర్ గారు మహాత్ముడు రాజకీయవేత్తకంటె కూడా తపస్సంపన్నుడైన ఋషి సత్తముడని అన్నారు

మహాత్ముడు ప్రత్యుత్తర మిస్తూ తనను గురించి చెప్పిన వాక్యాలకు కృతజ్ఞత తెలిపినారు తాను విద్యాధికులలోని వాడయినా జన సామాన్యాన్ని అభివృద్ధికి తెచ్చే ధనాధికులతో సమానస్థితిని వారు పొందేటందుకు యథాశక్తిగా ప్రయత్నిస్తున్నానని చెప్పినారు అతిథులు సంతోషంతో మహాత్ముని దగ్గర సెలవు తీసుకొన్నారు అంతటితో ఆ సమావేశం ముగిసింది

## గుజరాతీ సభ

మార్చి 24 వ తేది రాత్రి 7-45 గంటలకు సాహుకారు పేటలో గుజ రాతి, మార్వాడి, ముల్తానీ సంఘాల వారిని ఉద్దేశించి గాంధీజీ ఉపన్యసించి నారు ఏకాంబరేశ్వర దేవాలయం వెనక ఉన్న విశాల స్థలంలో సభ జరిగింది లాడ్ గోవింద దాసుగారు గుజరాతి భాషలో సన్మాన పత్రం చదివి 1300 రూపాయల నగదు సంచీని గాంధీజీకి సమర్పించినారు మహాత్ముడు దానిని స్వీకరిస్తూ సంతోషంతో, వారందరూ నూలు వడకవలెనని, ఖద్దరు ధరించవలెనని, ఇతర సంఘాలతో మైత్రి కలిగి ఉండవలెనని హిందీభాషలో ఉపన్యసించినారు

ఉత్తర దేశంలో హిందువులు, మహ్మదీయులు తగవులాడుకొంటారు ఇక్కడ అట్లాలేనందుకు గాంధీజీ సంతృప్తిని వెలిబుచ్చినారు గుజరాతి నారీ మణులు, కొందరు పురుషులు కూడా ఇంకా ఖద్దరు ధరించకున్నందుకు ఆయన

విచారించినారు ఈసారి తాను వచ్చినందుకు ఫలితంగా ఇక ముందయినా వారు ఖద్దరు విషయంలో కొంత వరకు కృషి చేయగలరని ఆశిస్తున్నాను అన్నారు తరవాత అస్పృశ్యతా నివారణ గురించి తెలిపి హిందీ ప్రచారకులకు సహాయం చేయవలసిందని కోరినారు

**పెద్దనాయక పేట సభ**

పెద్దనాయక పేట బహిరంగ సభకు 25 వేలు పైగా ప్రజలు నియమిత కాలానికి పూర్వమే మహాత్ముని రాక కోసం వేచి ఉన్నారు అందులో 5, 6 వేల మంది స్త్రీలు ఉన్నారు అంత పెద్ద సభ ఆ చోట ఇది వరకు ఎన్నడూ జరిగి ఉండలేదు రాత్రి 8 గంటలకు మహాత్ముడు, శ్రీనివాసయ్యంగారు, శ్రీ సి రాజ గోపాలచార్యులుగారు మొదలయిన వారు డివిజనల్ కార్పొరేషన్ సంఘ సభ్యులు శ్రీ గోనుగుంట్ల వెంకట సుబ్రహ్మణ్యంగారి వెంట సభకు వచ్చినారు సభలో హర్ష ధ్వనులు చెలరేగినాయి

గోనుగుంట్ల సుబ్రహ్మణ్యంగారు ఆ పేట ప్రజల పక్షంలో గాంధీజీకి స్వాగత పత్రం సమర్పించినారు

**స్వాగతపత్రము**

"శ్రీ మహాత్మా మోహన్‌దాస్ కరంచంద్ గాంధీగారికి

మహాత్మా!

చెన్న నగరానికి తమ ప్రస్తుత ఆగమన సందర్భంలో పెద్దనాయక పేట వాస్తవ్యులమైన మేము మా సంతోషాన్ని, ప్రేమను వెలిబుచ్చుతూ ఘనమయిన స్వాగతం చెబుతున్నాము

తమ స్వార్థరహిత నిరంతర సేవ, సర్వత్యాగము, పాశ్చాత్య ప్రాగ్దేశాలలో కోట్లకొద్దీ జనులను ఆకర్షించింది

నిమ్న జాతులను ఉద్ధరించడానికి, అంతర్జాతీయ పోరాటాలును కులకక్షలును లేకుండా జాతీయైక్యానికై మీ రొనరిస్తున్న ప్రయత్నాలను, హైందవ జాతి ఆర్థిక స్వాతంత్ర్యానికి చిహ్నమైన రాట్నాలను పునరుద్ధరించడానికి మీ కృషి చాలావరకు ఫలవంతమవుతున్నదని విన్నవించడానికి సంతోషిస్తున్నాము

హిందూ సంఘమునుంచి అంటరానితనమనే మహా పాపాన్ని రూపుమాపడానికి తాము చేస్తున్న ప్రయత్నాలు రానురాను ఫలవంతాలవుతున్నాయి మన సంఘంలోని వ్యభిచారమే వృత్తి గాగల కులాలను ఉద్ధరించటానికి సైతం ప్రయత్నాలు చేస్తారని విన్నవిస్తున్నాము

నిరంకుశ పరిపాలనకు లోబడి సంపూర్ణంగా ఆర్థిక రాజకీయ విషయాలలో విచ్ఛిన్నమై ఉన్న జాతివారు ఆత్మత్యాగము ప్రేమ, ధైర్యము మొదలైన అస్త్రాలతో పోరాటం చేయడానికి బహు చక్కని మార్గం చూపినారు బార్డోలిలో మీరు స్వరాజ్య సంగ్రామం ఆపివేసినారు మళ్ళా రణరంగంలో మమ్ము దౌర్జన్య రాహిత్య సార్వజనిక శాసనోల్లంఘనమనే యుద్ధంలో నాయ

కత్వం వహించి స్వరాజ్య సంపాదనకోసం ముందంజ వేస్తారని నమ్ముతున్నాము ఉత్యాశతో పీడింపబడుతూ సామ్రాజ్య తత్త్వంలో మునిగి భారతదేశం క్రొల్ల గొనటమే ముఖ్యోద్దేశంగా ఉంచుకొని ఉన్న మన రాజ్యాంగం వారినుంచి స్వరాజ్యం సంపాదించడానికి వేరే మార్గం లేదని నమ్ముతున్నాము

ఈశ్వరుడు తమకు ఆయురారోగ్యాల నిచ్చి ప్రపంచ సేవకు మిమ్ము నియమించును గాక "

24 మార్చి 1925 మదరాసు

మీ ఆశీర్వాదములందు
పెద్దినాయక పేట నివాసస్థులు

**మహాత్ముని ప్రత్యుత్తరము**

"స్నేహితులారా! మీరు నా కిచ్చిన స్వాగతానికి వందనాలు స్వరాజ్య సంపాదనకు నా మార్గం మీకు తెలుసు అందుకోసం మనమందరమూ ప్రతి రోజూ కనీసం ఒక అరగంటసేపైనా రాట్నంపై నూలు వడకడం మన ప్రథమ కర్తవ్యము మన మందరమూ సదా రాట్నం నూలుతో నేసిన ఖద్దరు వస్త్రాలనే ధరించవలె నేను మీకు చెప్పే విషయాలను మీరు గమనించకుంటే మీరు వేలకొద్దీ సమావేశమయినప్పటికి లాభంలేదు మీరందరూ విదేశ వస్త్రాలు త్యజించి సంపూర్ణంగ ఖద్దరునే ధరించవలె అంటరానితనం మహా పాపమని ఘోరమయిన నేరమనీ హిందువులంతా గమనించవలె హిందూ, మహమ్మదీయ, జైన, పారసీక, క్రైస్తవులందరూ సదా ఐకమత్యంతోను సోదరభావంతో మెలగవలె మనమందరం తాగుడు, జూదం మానవలె ప్రతిదినం ప్రాతఃకాల కృత్యాలు తీర్చుకొని నిర్మలమైన మనసుతో భగవంతుని స్మరించి ఎప్పుడూ మనకు ఆయన సహాయం చేయవలెనని మనలను సన్మార్గ వర్తనులుగా చేయవల సిందనీ కోరవలె మన విధ్యుక్త ధర్మమయిన దేశసేవ చేయడానికి మనకు తగిన బలము నీయవలసిందని భగవంతుని ప్రార్థించవలె ఇతరులను దూషించటానికి గాని, ఇతరులకు హాని చేయటానికిగాని మనం పూనకూడదు ఇవన్నీ మీరు చేస్తే అచిరకాలంలో మనం స్వాతంత్ర్యం పొందగలము మన మీ పనులు చేయడంలో చక్కని కట్టుదిట్టాలకు లోబడి ఉండవలె నన్ను గురించి గాని మరి ఎవ్వరిని గురించి గాని మీరు వేసే కేకలన్నీ నిష్ప్రయోజనాలు

మనము మన జాతీయ నినాదాలతో జాతీయ గీతాన్ని పాడదలిస్తే దానిని చక్కగా జరపవలె అట్లా చేయటంలో దానిలోని సమంజసం అనురాగం పోగొట్టకూడదు అది మీరందరు కలిసి పాడేటప్పుడు ఐక్యకంఠంతో ఉండవలె మీలో ఒకరు పాడుతుంటే తక్కినవారు ఐక్యకంఠంతో అంటూండవలె ఈనాడు సభా ప్రారంభంలో చాలా చప్పుడు జరిగింది అది చాలా విచారకరమయిన విషయము మనం మన జాతీయ సైనికులవలె ప్రవర్తించవలె అందువల్ల మనం చేసే పనులు లయబద్ధాలై ఉండవలె లక్షలకొద్దీ సమావేశమయినా ప్రశాంతంగా సభ జరిపేటందుకు వీలుగా ఉండవలె నా పాదాలు

స్పృశించడంగాని నాపై పుష్పవర్షం కురిపించటంగానీ శుభప్రదాలు కావు అటువంటి అంధ ప్రేమానురాగాలచేత ఏరీనాడు స్వరాజ్య సంపాదనకు ఎంత అర్థాస్థితిలో ఉన్నారో ముందుకూడా ఆ స్థితిలోనే ఉంటారు ఇంతవరకు నేను మీకు చెప్పిన విషయాలు మీకు నచ్చినవా, వాటిని మీరు అనుసరించగలరా అనే విషయం ఇప్పుడే పరిశీలించగలను నా ఉపన్యాసం ముగిస్తున్నాను నేను వెళ్ళేటప్పుడు మీరెవ్వరు నా పాదాలను స్పృశించటంలో ఆసక్తి చూపక నాకు తోవ ఇస్తారో లేదో ఇప్పుడే చూడగలను మీకు నాపై గల అనురాగాలు నాకు ఇబ్బంది కలిగించేవిగా ఉండకూడదు నా చుట్టూ శాంతి రక్షకులు ఉండి వారి చేతులతో నాకు తోవ చేసి నన్ను ఆవలికి ప్రయాసతో తీసుకొని పోయేటంతటి ఆవశ్యకతను కల్పించకూడదు మీరెవ్వరూ నేను వెళ్ళేనంతవరకు జయ జయ ధ్వనులు చేయరాదు ఈ విధంగా నేను మిమ్ము పరీక్షించటానికి పూర్వం ఈ నా ప్రసంగం ముగించదలుచుకొన్నాను మీరు చేయవలసిన కార్యక్రమం 1920 నుంచి నిర్ణయింపబడి ఉంది 8 మాసాల తరవాత నేను మళ్ళా చెన్న నగరానికి వస్తాను అప్పుడు మీరందరూ ఆపాదమస్తకం ఖద్దరు వస్త్రాలను ధరించి నాకానందం కలగచేతురుగాక మీరందరూ కాంగ్రెస్ కార్యస్థానాలకు పోయి రాట్నాలకు, ఏకులకు మితిలేని ఆతురత చూపుదురుగాక నే నింతవరకు మీకు చెప్పినది చేసేటందుకు భగవంతుడు మీకు ధైర్య సాహసాలను, బలం ఇవ్వమని ప్రార్థిస్తున్నాను ఇంత సహనంగా నా ఉపన్యాసం విన్న మీకు నా వందనాలు పరీక్షా సమయం ఆసన్నమయినది ఈ వైపున ఉన్న వారందరు నాకు తోవ ఇస్తారేమో చూడవలసి ఉన్నది నేను మోటారుబండి ఎక్కేవరకు మీరు కదలకూడదు మీరీపని చేస్తే భావిభాగ్యోదయం ఆసన్నమయినదనే సంతోషంతో వెళ్ళగలను భగవంతుడు మిమ్ము ఆశీర్వదించుగాక

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ మోటారుకారు దగ్గరికి వెళ్ళేటందుకు ఎట్లాంటి ఆటంకం కలగలేదు మహాత్ముడు సంతోషంతో రైలు స్టేషన్‌కు వెళ్ళినాడు

## మహాత్మునికి వీడుకోలు

మహాత్ముడు బొంబాయికి వెడతారని తెలిసినందువల్ల మద్రాస్ సెంట్రల్ స్టేషన్ జనసమూహంతో నిండిపోయింది యాకూబ్ హుస్సేన్, చక్రయ్యచెట్టి, వరదరాజులునాయుడు, హమీదుఖాన్, గద్దె రంగయ్యనాయుడు మొదలయిన వారు మహాత్మునికి వీడుకోలు చెప్పటానికి వచ్చినారు రైలు స్టేషన్‌కు గాంధీజీతో కలిసి శ్రీనివాసయ్యంగారు వచ్చినారు రాత్రి 9 15 నిమిషాలకు రైలు సెంట్రల్ స్టేషన్ విడిచింది టంగుటూరి ప్రకాశం మొదలైనవారు మహాత్మునితో ఆర్కోణంవరకు వెళ్ళి తిరిగి వచ్చినారు

**ఆంధ్రలో ఖద్దరు వ్యాప్తి**

ఆంధ్రలో ఖద్దరు వ్యాప్తిని నెల్లూరు, ఒంగోలు మండలాల రిపోర్టునుంచి కొన్ని వివరాలను 1925 ఏప్రిల్ 23 వ తేది 'యంగ్ ఇండియా'లో గాంధీజీ ఇట్లా ప్రకటించినారు

**నెల్లూరు నివేదిక**

1924 జూలై మొదలు నెల్లూరు మండలంలో 12 గ్రామాలలో ఖద్దరు నేయడం ప్రారంభించినారు 'వీరన్నకానపురం' అనే గ్రామం ప్రధాన స్థానంగా ఉంది ఈ గ్రామం నెల్లూరుకు దక్షిణాన 12 మైళ్ళ దూరంలో ఉన్నది 12 గ్రామాలు కానుపూరుకు (కందుకూరు) రెండు మైళ్ళకు తగ్గని 7 మైళ్ళకు మించని దూరంలో ఉన్నవి ఆ గ్రామాలలో 400 రాట్నాలు మండల ఖద్దరు సంఘం పక్షాన తిరుగుతున్నాయి ఈ గ్రామంలోనివారి ప్రధాన వృత్తి వ్యవసాయము అక్కడ మెట్ట పల్లపు భూములు కూడా ఉన్నాయి తరతరాల నుంచి ఈ గ్రామంలోని కుటుంబాలవారు నూలు వడికి అమ్మడం ఆచారంగా వస్తూన్నది కాని ఆ గ్రామస్తులు మాత్రం విదేశీ బట్టలనే కట్టుకొంటారు వారందరు స్థితి మంతులే కొద్దిగానో గొప్పగానో భూమిలేని కుటుంబం లేదు ఊడ్పులు కోతలు జరిగేటప్పుడు తప్ప తక్కిన అన్ని కాలాలలోను స్త్రీలు నూలు వడికి అమ్ముకొంటూ ఉంటారు వారు అదనపు ఆదాయం కోసమే ఈ పని చేస్తున్నారు వారు వడికే నూలు 15 నంబరుకు తగ్గదు, 30 నెంబరుకు హెచ్చదు పురి బాగా ఉంటుంది ఒక్కొక్కరు రోజుకు 2500 - 3000 గజాల నూలు వడకగలరు, సుమారు రోజుకు ఒక్కొక్కరికి 2 అణాల ఆదాయం వస్తుంది ప్రతి ఏటా మార్చి మొదలు అక్టోబరు వరకు రాట్నాలు బాగా పని చేస్తూంటాయి ముఖ్యంగా చవుట పాలెం అనే గ్రామంలో 200 రాట్నాలు ఉన్నాయి అక్కడ రాత్రింబగళ్లు నూలు వడకుతూంటారు ఒక్కొక్కరికి నూలు అమ్మడంవల్ల నెలకు 5 రూపాయలు తక్కువలేని ఆదాయం వస్తుంది

మండల ఖద్దరు సంఘంవారు 1924లో నెల్లూరు జిల్లా కనిగిరి గ్రామంలో ఒక పుట్టి 395 రూపాయల వంతున 21 పుట్లు ప్రత్తికొని దానిలో 15 పుట్లు కానుపూరు (కందుకూరు) కార్యాలయానికి పంపించినారు గ్రామాలలో నూలు వడికే వారందరు ప్రత్తికొని దూదేకులవారి చేత ఏకించి తమ ఎదుటనే ఏకులు చేయిస్తారు కాబట్టి ఏకులు చాలా బాగా ఉంటాయి తరుగు విరుగుల నష్టం కూడా నూలు వడికే వారే భరిస్తారు తక్కిన మండలాలలో నూలు వడికే వారి నష్టం భరించరు దూదేకులవారికి మనిషికి ఒక వీశప్రత్తికి 5 అణాలు ఏకినందుకు కూలి ఇవ్వడమే కాక వారు పని చేసిన రోజులలో రోజుకు ఒక పూట భోజనం కూడా పెడతారు దూదేకులవారు 4, 5 గ్రామాలలో ఉన్నారు. పని ఉన్నప్పుడు వారే ఇతర గ్రామాలకు కూడా పోతూ ఉంటారు. వారు రోజుకు

3, 4 పీళల దూదిని ఏకగలరు

మండల ఖద్దరు సంఘంవారు పి గోవిందరావుగారిని నెలకు 30 రూపాయల జీతం మీద నియమించినారు ఆయన చాలా యోగ్యుడు కానుపూరాలోనే కాపురం ఉంటారు నూలు వడికే వారికి ప త్తి అమ్మి వారు తెచ్చిన నూలును కొంటాడు ఆయన కానుపూరలో ఉన్న నేత పని వారు ఖద్దరు బట్టలనే నేసేటందుకు కూడా ప్రోత్సహించినారు 10 మందిలో 8 మంది అట్లా చేయగలమని వ్రాసి ఇచ్చినారు 6 నెలలలో పీళకు రెండు రూపాయల 5 అణాలు చొప్పున 4,600 రూ వెలగల ప త్తిని నూలు వడికేవారికి ఆయన అమ్మగలిగినాడు 18 మూళ్ల పొడుగును 7 పుంజాలుగల ఒక వారం నూలు వెల ఏ నెంబరయినా సరే 12 అణాల 6 పైసలు (ఒక పెద్ద పడుగు నూలు 4 వారలు) 18 మూళ్ల పొడుగును 28 పుంజాలుగల ఒక పెద్ద పడుగు నూలు వెల 3 రూపాయల 2 అణాలు ఈ 6 నెలలలోను ఆ గ్రామాల వారి దగ్గర ఆయన 3623 రూపాయల వెలగల నూలు కొన్నాడు 1924 జూలైలో 2 మగ్గాలు మీద వడుకు నూలు నేత ప్రారంభించినారు 1925 మార్చి నెల నుంచి గోవిందరావు పరిశీలన కింద 8 మగ్గాల మీద ప్రత్యేకంగా ఖద్దరు బట్టల నేత జరుగుతున్నది

1924 డిశంబరు నెలాఖరుకు 2 మగ్గాల మీద 150 రూపాయల వెలగల బట్టలు మాత్రమే నేయగలిగినారు కనిగిరి మొదలైన గ్రామాలలో 475 రూపాయల వెలగల ఖద్దరు నెల్లూరు మండల ఖద్దరు సంఘం వారు కొన్నారు 625 రూపాయల వెలగల ఖద్దరు నెల్లూరు, కావలి, బుచ్చిరెడ్డి పాలెం — ఈ మూడు గ్రామాలలోనే విక్రయమయింది నెల్లూరు స్త్రీలు ఏకుల విషయంలో చాలా శ్రద్ధ తీసుకొంటున్నారు దూదిని బాగా ఏకి, ఏకులు బాగా చేస్తే వడకటంలో సగం కష్టం తీరిపోతుందని నెల్లూరు మండల సంఘంవారు తమ నివేదికలో వ్రాసినారు

## ఒంగోలు నివేదిక

భారత ఖద్దరు బోర్డు వారి వద్ద జాతీయ విద్యాలయంవారు బదులు పుచ్చుకొన్న సొమ్ముతో ఖద్దరు నిర్మాణ విక్రయాలను సాగించినారు 1924 జూలై మొదలు డిశంబరు వరకు 6 నెలలలో జరిగిన పని ఇది

గుంటూరు మండలంలో 9 తాలూకాలు ఉన్నవి వాటిలో ఒంగోలు తాలూకా ఖద్దరు నిర్మాణం అధికంగా జరిగే తాలూకాలలో ఒకటి చౌక ధరలకు ఖద్దరు నేయించటానికి ఈ తాలూకాలో సహజమయిన అవకాశాలు ఉన్నాయి

ఈ తాలూకాలో 1096 గ్రామాలు ఉన్నాయి ప్రతి గ్రామంలోను ఎర్రప త్తి విస్తారంగా పండుతుంది ఒక్కొక్క గ్రామంలో జనసంఖ్య 1000-3000 ఉంటుంది గ్రామస్థుల ప్రధాన వృ త్తి వ్యవసాయము ప్రాచీనకాలం

నుంచి ఈ గ్రామాలలో బ్రాహ్మణులు, వైశ్యులు తప్ప తక్కిన కులాల వారందరూ వారు వడికిన నూలుతోనే బట్టలు నేయించి కట్టుకొంటారు ఇప్పటికీ వారట్లాగే చేస్తున్నారు మేమీనెల రెండో వారంలో ఆ గ్రామాలన్నిటిని చూసినాము వారు పాశ్చాత్య నాగరకతను విదేశీ బట్టలను పూర్తిగా నిరాకరించినారని స్పష్టంగా చెప్పగలము

ఈ గ్రామాలలో రైతులు పండించిన పత్తి అంతటిని వారే ఉపయోగించుకొంటారు కొద్దిగా ఏమైనా మిగిలిఉంటే చిల్లర వర్తకులకు గానీ ఒంగోలులో ఉన్న 'ర్యాలి బ్రదర్స్ కంపెనీ' ఏజెంట్లకుగానీ అమ్ముతారు

పత్తి గింజలను తీసే మరల మీద వ్యవసాయదారులే గింజలను తీసివేసి దూదేకుల సాయిబులకు ఇస్తారు వారు దూగి ఏకి ఏకులు చేస్తారు దూదేకుల వారు ఏకులు సరిగా చేయరని వారిచేత పత్తిని ఏకించి వ్యవసాయదారులే ఏకులు చేసుకోవటం కూడా ఉంది

ప్రతి గ్రామంలోను సగటున 50 రాట్నాలకు తక్కువ లేకుండా పని చేస్తూంటాయి ఒకరిద్దరు దూదేకులవారు కూడా ఉంటారు ఒంగోలులోను పరిసర గ్రామాలలోను తప్ప తక్కిన అన్ని గ్రామాలలోను ఏప్రిల్ నెల మొదలు అక్టోబరు నెలవరకు 7 నెలలు విడువకుండా నూలు వడుకుతూంటారు అక్టోబరు నెలలో ఊడ్పులు ప్రారంభమవుతాయి బీదవారు కూలికి నూలు వడుకుతారు గాని ధనికులు అట్లా వడకరు వారు వడికిన నూలును అమ్ముతారు ఒక్కొక్కరు 10-15 నెంబరు గల నూలును రోజుకు 2000-2500 గజాల మంచి పురిగల నూలును వడకగలరు రోజుకు 2 అణాల ఆదాయం గిడుతుంది

ప్రతి గ్రామంలోను బట్టలు నేయగల పంచములున్నారు వారు రైతులకోసం ఖద్దరు బట్టలే నేస్తారు అందుకు ప్రతిఫలంగా రైతులు ఊడ్పుల రోజులలోను, కోతల రోజులలోను ధాన్యం ఇస్తారు

జాతీయ విద్యాలయ సంఘంవారు 5 ముఖ్య గ్రామాలను ఏర్పాటు చేసినారు అక్కడ పత్తిపంట నూలు వడకటం బాగా జరుగుతున్నది వాటిలో 3 గ్రామాలు ఒంగోలుకు 10 మైళ్ళ దూరంలోను మిగిలిన 2 గ్రామాలు 15-20 మైళ్ళ దూరంలోను ఉన్నాయి ఈ 5 గ్రామాలలోను విశ్వాసపాత్రులైనవారిని కమిషన్ ఏజెంట్లుగా నియమించినారు వారా గ్రామాలలోనే పని జరిగే నెలలో ఉండి పని చేయిస్తారు అని ఒంగోలు రిపోర్టులో ఉన్నది

మా కార్యాలయానికి వచ్చిన రిపోర్టులో వివరాలు పూర్తిగానే ఉన్నాయి కాని ఇక్కడ సంగ్రహంగా వివరించినాను 6 నెలలలో 18522 గజాల ఖద్దరు బట్ట నేయడం జరిగింది 18452 రూపాయల 12 అణాల 1 పైన వెలగల ఖద్దరు బట్ట అమ్మకమయింది

యం కె గాంధీ

28 ఏప్రిల్ 1925

## గాంధీజీకి డాక్టర్ పట్టాభిగారి లేఖ

గాంధీజీ ఒక విద్యార్థిని ఆంధ్ర జాతీయ కళాశాల కార్ఖానాలో చేర్చుకొని పని నేర్పించవలసిందిగా డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారికి ఒక కార్డు వ్రాసినారు దానికి జవాబుగా డాక్టర్ పట్టాభిగారు దిగువ ఉత్తరం వ్రాసినారు

ఆంధ్రజాతీయ కళాశాల
మచిలీ పట్టణం,
16-6-1926

పూజ్య గాంధీజీకి !

మీరు దయతో పంపిన పోస్టుకార్డు అందింది మీరు కోరినట్లుగా మా కళాశాల సిలబస్ ఇందుతో పంపుతున్నాను 22, 28 పుటలలో వసతిగృహము, భోజనవ్యయాలకు సంబంధించిన భోగట్టా కూడా ఉన్నది ఆ పిల్లవాని భృతికి నెలకు 15 రూపాయలు సరిపోతుంది

నాకు మీరు పంపిన పోస్టుకార్డుకు మీరు సంతకం చేయవలసిన అవసరం ఏం కలిగిందో నాకు అర్థం కాలేదు చాలా మందికి మీరు చాలా గొప్పవారు నాకు మగన్‌లాల్‌జీ మీ అంత గొప్పవాడూను మగన్‌లాల్‌జీ లేనట్లయితే మీ ఖద్దరు ఎక్కడ ఉండేది ? మీ సంతకం, ఆ పిల్లవానిపట్ల మీకుగల అత్యధికమయిన ఆసక్తిని, ఆ పిల్లవాని తెలితేటలలో మీకున్న అభిమానం తెలియ జేస్తూన్నది ఆ పిల్లవాడు ఇక్కడకు వచ్చి ఆ కార్ఖానా తనదేననుకొని పనులు చేస్తూ నేర్చుకోవచ్చు

నేనింతకు పూర్వం ఆశ్రమానికి వస్తానని మీతో అన్నాను కానీ రాలేక పోయినాను మా కుటుంబంలో ఒక విషాదకరమయిన సంగతి జరిగింది అది మీకు నేను ఇదివరకే తెలిపి ఉండవలసింది కాని మీ కార్య భారానికి తోడు మా విచారం తెలపడం ఇష్టం లేకపోయింది 8 సంవత్సరాల వయసుగల నా ప్రియ పుత్రిక సుదక్షిణ ఆకస్మికంగా జబ్బుచేసి మూడు రోజులలో మమ్మల్నూ, ఈ ప్రపంచాన్నీ విడిచి వెళ్ళిపోయింది ఆ అమ్మాయికి సుదక్షిణ అనే పేరు కావ్యాలలో నుంచి పరిశోధించి పెట్టుకొన్నాను ఆమె సంపెంగమొగ్గ వంటిది కళాశాలలో జరిగిన బహిరంగసభలో మూడేండ్ల లోపు వయసుగల ఆ బిడ్డ తన బంగారు గాజులను మీకు సమర్పించింది నెలల తరబడి నూలు వడికి ఇచ్చింది తరవాత మానివేసింది నా జీవితంలో కలిగిన ఈ మొదటి వియోగానికి నేను చాలా దుఃఖిస్తున్నాను ఎంత తత్వశాస్త్రవేత్త అయినప్ప

టికి దానిని సమయానికి ఆచరణలో పెట్టడం కష్టమనిపిస్తూన్నది మీతో ఇంతకు పూర్వం చెప్పిన ప్రకారం నేను సబర్మతికి రాగాలనందుకు క్షమాపణగా ఇదంతా వ్రాయవలసి వచ్చింది త్వరలోనే ఏదో సమయం చూసుకొని రాగల నని అనుకొంటున్నాను

మీ విశ్వాసపాత్రుడు

బి పట్టాభి సీతారామయ్య

# 13
# గాంధీ మహాత్ముడు-
# ఆంధ్ర రాష్ట్ర సంచారము (1927)

1924 గాంధీజీ యర్రవాడ జైలునుంచి విడుదలైనప్పటి నుంచి ఆంధ్ర దేశనాయకులు ఆయనను తమ రాష్ట్రానికి రావలసిందని ఆహ్వానిస్తూ వచ్చినారు కాని ఆయన ఏవో కొన్ని అవాంతర కారణాలవల్ల ఆంధ్ర దేశానికి రాలేక పోవడం తటస్థించింది ఆంధ్ర నాయకులలో కొన్ని భేద భావాలు కలగటం ఆంధ్రులలో బహు నాయకత్వం ఉందని గాంధీజీ విమర్శించటం కూడా జరిగింది ఇందువల్ల గాంధీజీ ఆంధ్ర రాష్ట్రాన్ని బహిష్కరించినారా అన్న అపోహ కూడా కొంత మంది ఆంధ్రులలో కలిగింది ఆ భావం తొలగించేటందుకు గాంధీజీ 1927 జూన్ 16 వ తేది 'యంగ్ ఇండియా'లో ఇట్లా వ్రాసినారు

## నేను ఆంధ్ర రాష్ట్రం బహిష్కరించినానా?

"దేశభక్త కొండ వేంకటప్పయ్య గారు మొదట నందికొండలకు తరవాత బెంగుళూరుకు వచ్చి నాతో మాట్లాడినారు 'మీసంచార కార్యక్రమంలో ఆంధ్రరాష్ట్రం సంగతి ఏమీ కనపడకుండటం చేత మీరాంధ్ర రాష్ట్రం బహిష్కరించినారా' అని చాలా మంది నన్ను అడుగుతున్నారు అని వేంకటప్పయ్యగారు నాతో చెప్పినారు నాకు ఆంధ్రులపైన గల చిరకాల ప్రేమ వల్ల వారికి నాకు ఉన్న సంబంధంను నే నెన్నటికీ మరవలేను కాబట్టి ఆంధ్రులు సరియైన దారికి వచ్చేవరకు ఆంధ్ర రాష్ట్రం బహిష్కరించటమే కర్తవ్యమనే అభిప్రాయం కూడా కలిగేటంత తీవ్రంగా కొంత మంది ఆంధ్రులు విసిగిస్తూన్నప్పటికీ నేను ఆంధ్రదేశం బహిష్కరించవలెనని కోరినా బహిష్కరించలేను ఆంధ్రులు చాలా మంచివారు వారికి దేశాభిమానం ఉంది కాని వారిలోని దేశ సేవకులలో కొందరు మాత్రం పేరుకు మాత్రమే దేశ సేవకులుగా ఉన్నారు ఆంధ్రులలో అందరూ నాయకులే అందరూ నాయకులైతే అనుచరులు ఎవరుంటారు? అందువల్ల విధేయత లేదు పని చేసేవారు లేరు ఇట్లాంటి నిరర్థకమైన వ్యక్తి స్వాతంత్ర్య భావంవల్ల ప్రజల విషయంలో శ్రద్ధ తీసుకొనేవారు లేకుండా పోయినారు తక్కిన రాష్ట్రాలలో మాత్రం దేశసేవకలు ఇంతకంటె బాగా

పని చేస్తున్నారా అని ఆంధ్రులు ఈ వ్యాసం చదివిన తరవాత అడగవచ్చు అట్లా అడగడం సరియైన పద్ధతి కాదు ఒక సారి సాత్విక నిరోధానికి ముందంజ వేసిన ఆంధ్ర సోదరీ సోదరులు తక్కిన వారివలెనే తాము ఉన్నామని గాని అంతకంటె పాడుగా లేమనిగాని మనసుకు సమాధాన పరచుకోవడం మంచిది కాదు సాత్విక నిరోధానికి పోటీ చేసేవారు నిరుపమానమయిన విధేయతను ఇంద్రియ నిగ్రహం, కట్టుబాటు ఉండేటందుకు తమకు శక్తి ఉన్నదని ధ్రువ పరచుకోవలసి ఉన్నది ఖద్దరుకు సంబంధించిన అన్ని శాఖలలోను సులభంగా అగ్రస్థానం వహించగలిగిన ఆంధ్రులు ఆ స్థానం ఇంతవరకు పొంది ఉండలేదు కాని నేను నేడే వారి లోపాలన్నిటిని ఏకరువు పెట్టదలుచుకోలేదు నా ఆంధ్ర రాష్ట్ర సంచారంలో వాటిని గురించి చెప్పేటందుకు నిలువ ఉంచుకొంటున్నాను ఆంధ్ర రాష్ట్రంలో సంచారం చేయవలెననే అభిప్రాయం నేనెన్నడూ మార్చుకోలేదు 1927 లో తగిన నెల కుదుర లేదు కనక నా ఆలోచన ప్రకారం డిశంబరు నెలలో 1 వ తేది మొదలు 15 వ తేది వరకు వీలయితే ఆంధ్రరాష్ట్రంలో సంచారం చేయవలసి ఉంటుంది అది సాధ్యం కాన ట్లయితే 1928 లో ఆంధ్ర రాష్ట్రానికి రావచ్చునని అనుకొన్నాను కాని నాకు దైవికంగా జబ్బు చేయడం చేత (1927 జూలై) మొదట డిశంబరు వరకు నిర్ణయించుకొన్న సంచారక్రమం యావత్తు వ్యత్యస్తమయింది ఆటుపైన నాకు ఆరోగ్యం సరిగా ఉంటె మళ్ళా ప్రమాదమేమీకలగకుంటే నేను 1928లో కొద్ది రోజులు గాక ఒకటి రెండు నెలల పాటు సంచారం చేయవలెననే కోరుతున్నాను నేను తమ రాష్ట్రానికి రావలెననియే ఆంధ్రులు నిజంగా కోరుతుంటే 1928 ఆరంభంలోనే రాగలననీ పని చేయడంతోబాటు విశ్రాంతి కూడా తీసుకోగలననీ నేను వేంకటప్పయ్యగారితో చెప్పినాను వెనకటివలె నేను అతి చురుకుగా పనిచేయ జాలను ఆంధ్ర రాష్ట్రంలో ఖద్దరు విషయంలో మాత్రమే పని చేస్తాననికూడా వారు తెలుసుకోవలె అస్పృశ్యతా నివారణ కూడా నాకు ముఖ్యమయినదే కాని అదికూడా ఖద్దరు పనిలోనే చేరిపోయింది కొద్దివారు గొప్పవారు అనే భేదం తొలగించి సర్వ సమత్వం కలిగించటమే ఖద్దరువల్ల కలిగే ముఖ్య ప్రయోజనము నూలు దారము పేదల గుడిశెలలో నుంచి ధనికుల మేడలలోకి వ్యాపించి ధనికులును పేదలును విడిపోకుండా బంధించగలదు ఆంధ్ర దేశ సేవకులకు గొప్ప గొప్ప ఆశలు ఉన్నాయని నాకు తెలుసు. ఆ ఆశలు సంఘంలోని అట్టడుగు తెగలకుకూడా వ్యాపిస్తే సర్వజన శ్రేయస్కరంగా ఉండగలదు"

యంగ్ ఇండియా
16-6-1927

## గాంధీజీ మద్రాసు రాక (1927)

మహాత్మాగాంధీ దంపతులు సి రాజగోపాలాచారి మొదలయిన వారితో

కలసి 1927 సెప్టెంబర్ 3 వ తేదీ ఉదయం మద్రాసు వచ్చినారు

వారు మైలాపూర్‌లోని యస్ శ్రీనివాసయ్యంగారి గృహంలో బస చేసినారు శ్రీమతి శ్రీనివాసయ్యంగారు వారి కుటుంబంలోనివారు గాంధీజీని ఆహ్వానించినారు శ్రీనివాసయ్యంగారి మనుమడు గాంధీజీకి పూలదండ వేసినాడు సుప్రసిద్ధ కాంగ్రెస్‌వాదులు అనేకులు శ్రీనివాసయ్యంగారి ఇంట్లో గాంధీజీని సందర్శించి అభివందనలు చేసినారు శ్రీనివాసయ్యంగారి ఇంటినుండు గాంధీజీ రాకకు వేచిఉన్న వందలాది జనసమూహాలకు ఆయన దర్శనమిచ్చి బహిరంగ సభలో తనను మళ్ళా చూడవచ్చునని చెప్పడంతో ఎక్కడివా రక్కడనే నిశ్శబ్దంగా వెళ్ళిపోయినారు

గాంధీజీని చూడవచ్చినవారిలో సి యఫ్ ఆండ్రూస్ ఉన్నారు ఆయన, కెన్యా లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో సర్ ఎడ్వర్డ్ గ్రిగ్గ్ చేసిన ప్రకటన ఫలితంగా తటస్థించిన తూర్పు ఆఫ్రికా పరిస్థితిని గురించి గాంధీజీతో సుదీర్ఘంగా చర్చించినట్లు తెలిసింది

శ్రీనివాసయ్యంగారి గృహం మనోహరంగా అలంకరింపబడింది గాంధీజీ రాకను తెలిపేటందుకు గృహావరణంలో జాతీయపతాకం నెలకొల్పినారు గాంధీజీ వచ్చిననాటి మధ్యాహ్నం అనేకమంది సుప్రసిద్ధులు ఆయనను చూడ వచ్చినారు వారిలో ఒకరు దివాన్ బహదూర్ ఆర్ రామచంద్రరావుగారు

సెప్టెంబరు 4వ తేది ఉదయం వై యం సి ఏ కు వెళ్లి అక్కడ వివిధ మతస్థులతోకూడిన మహాసభలో గాంధీజీ ఉత్తేజకరమయిన ఉపన్యాసం చేసినారు వై యం సి ఏ చైర్మన్ కోరికమీద మహాత్మాజీ ఒక ధార్మిక ప్రవచనం ప్రబోధిస్తూ ఖాదీ ఉద్యమ ధార్మిక ప్రాతిపదికను గురించి విస్తరించి చెప్పినారు "చర్ఖా సందేశం ఒక ఉత్కృష్టమైన తాత్విక సందేశము అందువల్ల నే ఈ దేశంలోని ఆర్థిక రాజకీయ ఫలితాలపైన దాని ప్రభావం అమోఘంగా ఉంటుంది అంటూ 'నేను దేవునిలో సంపూర్ణ విశ్వాసంతో పేదలందరిలోకి పేదలవారికోసం ఈ సందేశం అందిస్తున్నాను అందుకు మీరు నన్ను చూసి నవ్వవచ్చు ఇది కుహానా రాజకీయ చాతుర్యమని కూడా అనుకొని నన్ను విశ్వసించకపోవచ్చు, నన్ను తప్పుగా వ్యాఖ్యానించవచ్చు కాని నాకు మీలో ఉన్న విశ్వాసంపోదు ఎందువల్లనంటే దేవునిలో విశ్వాసం నాకు పోదు గనం అట్లాగే రాట్నంలో కూడా నా విశ్వాసంపోదు" అని కన్నీళ్ళతో చెప్పినారు

తిరువళిక్కేణిలోని సింగరాచారి హాల్‌లో పూర్వ విద్యార్థుల సమావేశంలో మాట్లాడుతూ "మీరు హిందువులమని చెప్పుకొంటారు మీలో ఎంత మంది భగవద్గీత చదివి గీతలోని సందేశాన్ని అర్థం చేసుకొన్నారు?" అని జాలికరంగా అడిగినారు అక్కడ సమావేశమయిన దాదాపు 1000 మంది లోను ఒక్క ఆరుగురు కూడా గీత చదివినామని చెప్పినవారులేరు వెంటనే గాంధీజీ ప్రతిహిందువు సంస్కృతం చదవవలసిన అవసరం గురించి గీతా పఠన ప్రాముఖ్యం గురించి వివరంగా చెప్పడం అవసరమనుకొన్నారు అక్కడచేరిన

సభ్యులు భగవద్గీతను పూజ్యభావంతో పఠించవలెనని బ్రహ్మచర్యము, సత్యము, అహింసా, అభయము మొదలయిన శుభలక్షణాలను అలవాటు చేసుకోవలెనని ఆయన ప్రబోధించినారు శ్రీ యస్ యస్ వరదాచారిగారు ఆ సంఘ కార్య కలాపాలను గురించి వివరించినారు ముత్తుకృష్ణయ్యర్ సన్మానపత్రం చదివి నారు రు 150 విరాళం ఖద్దరు నిధికింద గాంధీజీకి సమర్పించినారు

4వ తేదీ సాయంకాలం మద్రాసులో ఒక పెద్ద బహిరంగసభ జరిగింది గాంధీజీని దర్శించేటందుకు, ఆయన సందేశం వినేటందుకు సముద్రతీరంలో 30 వేల మంది ప్రజలుచేరినారు ఆయన ఉపన్యాసం ప్రజలందరికి వినబడేటట్లు దూర శ్రవణయంత్రం అమర్చినారు గాంధీజీ సందేశం ఇరువై పుల రాజగోపాలా చారి, సత్యమూర్తిగార్లు తమిళంలోకి అనువాదం చేసినారు మద్రాసు పౌరుల పక్షాన 18వేల రూపాయల మొత్తం గాంధీజీకి సమర్పించినారు ఆ మహాసభకు హాజరైనవారు అందరూ ఒక్కొక్క అర్ధరూపాయి ఇచ్చినప్పటికీ గాంధీజీకి మద్రాసు పౌరుల పక్షాన ఇచ్చిన మొత్తానికి రెట్టింపు అయిఉండేది

బహిరంగసభ

సాయంత్రం 6-15 గంటలకు ట్రిప్లికేన్ సముద్రతీరంలో బహిరంగసభ జరిగింది నగరంలోని వివిధ ప్రాంతాలనుంచి మధ్యాహ్నం 3[1] గంటలనుంచి జనం సముద్రతీరానికి రావడం ప్రారంభించినారు ఎత్తయిన బల్లలతో ఒకగట్టి వేదిక ఏర్పరచబడింది మెరీనా రోడ్డునుంచి ప్రెసిడెన్సీ కాలేజీకి ఎదురుగా ఉపన్యాసవేదికవరకు పొడుగునా దోవ ఏర్పాటు చేసినారు పత్రికా విలేఖరు లకు, గాంధీజీకి సన్మానపత్రాలను, విరాళాలను సమర్పించనున్న ప్రముఖులకు, స్త్రీలకు కూర్చునేటందుకు ప్రత్యేక ఏర్పాట్లు చేసినారు దూరశ్రవణ యంత్రాలు ఏర్పాటు చేసినారు ఎక్వేరియంనుంచి చీఫ్ ఇంజనీరు ఆఫీసువరకు గల సముద్రతీరమంతా ప్రజలతో నిండిపోయింది చాలామంది భారత స్త్రీలు, యూరోపియన్ స్త్రీలు కూడా వచ్చినారు గుజరాతీ స్వచ్ఛంద సైనికులు బారులుతీర్చి క్రమబద్ధంగా నిలబడినారు జాతీయపతాకం ఆరోహింపబడింది సభకు వచ్చినవారిలో శ్రీమతి కస్తూరిబాగాంధీ, శ్రీమతి శ్రీనివాసయ్యం గారు, సి రాజగోపాలాచారి, కుమారి రాజగోపాలచారి, మహదేవ్‌దేశాయ్, ముత్తురంగ మొదలియార్, సత్యమూర్తి, స్వామివెంకటాలంచెట్టి మొదలయిన వారు ఉన్నారు మహాత్మాగాంధీ 6-30 గంటలకు సభాస్థలానికి వచ్చినారు సభ్యులు ఆయనకు హృదయపూర్వకమయిన స్వాగతమిచ్చినారు సభకు ముత్తురంగ మొదలియార్ అధ్యక్షత వహించినారు

సభాధ్యక్షులు ఆయా సంఘాల పక్షాన కింది విరాళాలు గాంధీజీకి సమ ర్పించినారు

18,285-2-6 మద్రాసు పౌరుల విరాళం
100-0-0 పర్సువాకం కార్మికుల విరాళం

52-0-11 ఇండియన్ ఇండస్ట్రియల్ కంపని సిబ్బంది విరాళం
18-0-0 విద్యార్థులు మొదలయినవారి విరాళం
13-0-0 జాం బజారు వాస్తవ్యుల విరాళం

ఈ సందర్భంలో అధ్యక్షత వహించిన ముత్తురంగ మొదలియార్ గాంధీజీని ఆహ్వానిస్తూ ఇట్లా అన్నారు మహాత్మాజీ తమిళనాడులోను, తదితర ప్రదేశాలలోను ఎందుకు పర్యటిస్తున్నారో అది అందరికి తెలిసిన విషయమే గాంధీజీ తన ఖద్దరు కార్యక్రమం పూర్తి అయ్యేటంతవరకు ఏ ఇతర పనిని చేయదలుచుకోలేదు మీరందరు ఖద్దరు ధరించి ఖద్దరు నిధికి ఉదారంగా విరాళాలిస్తే ఆయన చాలాసంతోషించగలరు మీరు గాంధీజీ ఖద్దరు కార్యక్రమానికి సంతృప్తికరంగా తోడ్పడితే ఇతర రాజకీయ కార్యక్రమానికి ఆయన పూనుకోగలరు మీరందరు మహాత్మాజీ సందేశం వినడానికి నిశ్శబ్దంగా ఉండవలెనని కోరుతున్నాను' అధ్యక్షుని ఈ ఉపన్యాసానంతరం పర్సువాకం కార్మికులు ఆది ద్రావిడులు ఇంకా అనేక సంస్థలవారు మహాత్మునికి సన్మానపత్రం సమర్పించినారు సన్మానపత్రాలు చదివినట్లు భావించడం జరిగింది వారందరూ మహాత్మాజీకి దండలు వేసినారు

## మహాత్మాజీ ఉపన్యాస భాగాలు

గాంధీజీ ఇంగ్లిషులో మాట్లాడినారు ఆయన ఉపన్యాసాన్ని సి రాజగోపాలాచారి, సత్యమూర్తిగార్లు చెరియొక చోట నిలబడి తమిళంలోకి అనువదించినారు గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

'నాకు ఇదివరకు వలెనే యిప్పటికి అహింసాయుత సహాయ నిరాకరణోద్యమంలో నమ్మకం ఉన్నది దౌర్జన్యానికి బదులుగా అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం తప్ప మరొకటేదీ నాకింతవరకు గోచరించటం లేదు హిందూ ముస్లిం సఖ్యతలోని అవసరం గురించిగానీ, అవకాశం గురించి గానీ నా విశ్వాసం పూర్వం వలెనె నిశ్చలంగా ఉన్నది నా మట్టుకు నేను అది త్వరలో సాధ్యపడవలెనని హృదయ పూర్వకంగా ప్రార్థిస్తున్నాను ఈ 6 వ తేదీన, ఆ తరవాత సిమ్లాలోను జరగనున్న హిందూ ముసల్మాన్ సమాలోచనలు జయప్రదం కావలెనని ఈ మహాసభలోని సభ్యులు ప్రార్థించవలెనని కోరుతున్నాను అస్పృశ్యతా నివారణావసరం గురించిన నా విశ్వాసం పూర్వం వలెనే దృఢంగా ఉన్నది అస్పృశ్యత హిందూ మతానికి ఒక కళంకము

## సీల్ విగ్రహాందోళన

సీల్ విగ్రహాన్ని తొలగించడం గురించి కొంతమంది యువకులు ఈ నగరంలో చేస్తున్న ఆందోళనను నేను చాలా ఆసక్తితో గమనిస్తున్నాను అది ప్రస్తుతం మానవుని బొటన వ్రేలితో సమానమయిన మేఘంవలె ఉన్నది అయితే అది ఇతర మేఘాలవలెనే భారతాకాశమంతటా వ్యాపించగలంత పెద్దదిగా

కూడా పెరగవచ్చు ప్రస్తుతం ఈ ఉద్యమం చాలా చులకనగా కనపడవచ్చు కాని ఈ విగ్రహ యజమానులు ఈ ఉద్యమంలోని ఆంతర్యం అర్థం చేసుకోగల రని ఆశిస్తున్నాను ఈ ఉద్యమానికి వెనక ఉన్న యువకులను నేనెంత మాత్రం ఎరగక పోయినప్పటికీ వారి అనాలోచితమయిన ఒక దుందుడుకు చర్యవల్ల మంచి ఉద్యమాన్ని పాడుచేయ కుండుటుగాక అని కోరుతున్నాను

## ఇక రానున్న కాంగ్రెస్

మీరు ఈ సంవత్సరం ఈ నగరంలో జాతీయమహాసభా సమావేశం జరపడా నికి ఆహ్వానం చినారు మద్రాసురాష్ట్రంలో జన్మించిన ఒక సుప్రసిద్ధుని ఆ మహా సభకు అధ్యక్షుడుగా పొందగల మహాభాగ్యం మద్రాసు పౌరులకు దక్కింది ఆయన ఈనాడు ఇక్కడ లేనందుకు చాలా విచారపడు తున్నాను రానున్న కాంగ్రెస్ మహాసభ అమోఘమయిన విజయంసాధించేటందుకు మీరు-మద్రాస్ లోని ప్రతి పౌరుడూ కృషిచేయవలసి ఉంది దురదృష్టవశాత్తు మీ కిక్కడ బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదా లున్నాయని నేనెరుగుదును జరగనున్న జాతీయ మహాసభా విజయానికి మీ ప్రయత్నాలు నిరభ్యంతరంగా కొనసాగే టందుకు మీ వివాదాలు సాధ్యమయినంతవరకు తొలగించుకోవలెనని మిమ్ము లను నేను ప్రార్థిస్తున్నాను హిందువులని, ముసల్మానులని, క్రైస్తవులని, యూదులని, పార్శీలని, బ్రాహ్మణులని బ్రాహ్మణేతరులని, అస్పృశ్యులని వ్యత్యాసాలు పాటించని రోజుకోసం నేను ఎదురు చూస్తున్నాను అయితే ఈ వ్యత్యాసాలు కొనసాగుతున్నంతకాలం ఇవన్నీ అవిభాజ్యమయిన భారత జాతీయ మహావృక్ష శాఖలుగా మనం భావించే సమయం కోసం నేను ఎదురు చూస్తు ఉంటాను వివాదాంధకార బంధురంగా పేర్కొన బడుతున్న ఈ రాజ ధానిలోని ఈ నగరం ఈ నా కోరికను నెరవేర్చుగాక" అని ఆశిస్తున్నాను

"ఇక ఈ నగరానికి నేను ఎందుకు వచ్చినానో ఈ రాజధానిలోని దక్షి ణపు కొనకు నేను ఎందుకు పోతున్నానో ఆ పనిని గురించి చెప్పవలసి ఉంది మనల నందరిని అనుసంధించగల పరికరం ఖాదీ ఒక్కటేనని నా నిశ్చితాభి ప్రాయము ఆ విషయంలో మిమ్ములను నేను ఒప్పించగలనని భావిస్తున్నాను అంతేగాక మన చిల్లర వివాదాల మూలాన నోరులేని ప్రజలను మనం మరిచి పోతున్నామని, వారి కష్టాలను సరిగా గ్రహించటం లేదని భావిస్తున్నాను అది కూడా మీరు గమనించవలసిన సంగతి" అని మరికొన్ని సంగతులుకూడాచెప్పి మహాత్మాజీ తన ఉపన్యాసం ముగించినారు అంతటితో మహాసభ సమాప్త మయింది

## స్కౌట్ నివాసము

వెన్‌లాక్ పార్కులోని బాలభట సంఘంవారి నివాస స్థలానికి (సెప్టెం బరు 4) సాయంకాలం గాంధీజీ వెళ్ళినారు 200 మంది బాలభటులు బాలభట

దళాధిపతులు గాంధీజీని ఆహ్వానించినారు టి యస్ రామస్వామి అయ్యర్ గాంధీజీకి ఎదురేగి బాలభట శిబిరానికి తీసుకొనివెళ్ళినారు జాతీయ గీతంతో కార్యక్రమము ప్రారంభమయింది తరవాత బాలభటుల వివిధ కార్యకలాపాలను గాంధీజీ చూసి ఆనందించినారు

## రైల్వే యూనియన్ భవనము

### గాంధీజీ పునాదిరాయి వేసినారు

మద్రాసు అండ్ సదరన్ మహారాటా రైల్వే కార్మిక సంఘం వారు పెరంబూరు హై రోడ్డులోని స్థలంలో వారు నిర్మించనున్న భవనానికి గాంధీజీ సెప్టెంబరు 8వ తేదీ సాయంకాలం పునాదిరాయి వేసినారు గాంధీజీ మద్రాస్ చేరిన తరవాత ఆయన బహిరంగాంగా పాల్గొన్న మొట్టమొదటి కార్యక్రమం అదే అది కొన్ని నిమిషాలలోనే పూర్తి అవుతుందని, గాంధీజీ ఆ సమా వేశంలో ఉపన్యసించరని తెలిసి ఉన్నప్పటికీ అక్కడకు చాలామంది ప్రజలు ఆయన దర్శనార్థం వచ్చినారు కార్మికులకు- తాగుడు జూదము మొదలయిన దుర్వ్యసనాలు మానవలెనని, విదేశీ బట్టలుకాని, మిల్లు బట్టలనుకాని కట్టవద్దని, అన్నంలేక అల్లాడుతూన్న ప్రజల క్షేమం కోసం ఖద్దరు ధరించవలెనని గాంధీజీ చెప్పినారు

### విద్యార్థుల విరాళము

శనివారం సాయంకాలం (సెప్టెంబరు 8) గాంధీజీ మౌంటు రోడ్డు స్టేబుల్ కంపెని ఆవరణలో విద్యార్థి సభలో ఉపన్యసించినారు విద్యార్థుల పక్షాన వి సి రంగస్వామిగారు మహాత్ముని ఆహ్వానించి 1611-10-8 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు లా కాలేజీ విద్యార్థిని శ్రీమతి ఆనందబాయి స్వయంగా 158 రూపాయలు వసూలు చేసి మహాత్ముని ప్రత్యేక ప్రశంసకు పాత్రురాలైంది విద్యార్థులు మహాత్మునికి పూలదండలు, ఖద్దరు దండలు వేసినారు గాంధీ మహాత్ముడు, తాను ఆలస్యంగా వచ్చినందుకు క్షమింప గోరి తాము బిగ్గరగా ఎలుగెత్తి మాట్లాడిన తన ఆరోగ్యానికి భంగం కలుగు తుందని చెప్పి మెల్లగా ప్రసంగించినారు మొట్టమొదట కొన్ని వాక్యాలు ఇంగ్లీషులోనే వాక్యానికి వాక్యం అందుకొని ఒకరు చెప్పడం ప్రారంభించినారు తరవాత అదికష్టంగా తోచినందువల్ల మహాత్ముని ఉపన్యాసం తమిళ భాషలోకి అనువదించినారు జాతీయ యువజన సంఘంవారు హిందీలో పాడిన జాతీయ గీతంతో సభ ప్రారంభమయింది

### గాంధీజీ ప్రసంగము

"మీరు అనుకొన్న దానికంటే తక్కువ డబ్బు వసూలు చేయగలిగినట్లు మీరు చెప్పినారు చెన్నపురి విద్యార్థులు నాకిచ్చిన ఈ మొత్తం చాలా

తక్కువని నేను భావిస్తున్నాను ఎందుకీ ధనము? కాలర్లు నెక్ టైలు కొని
ఆధునిక విద్యార్థులకు పంచిపెట్టటానికి కాదు ఈ ధనం అటువంటి అల్ప
కార్యాలకు వినియోగపడదు 7 లక్షల గ్రామాలలో నివసిస్తున్న కోట్లకొద్దీ
అన్నవస్త్రాలులేని పేదలకోసమే ఉపయోగపడుతుంది విద్యార్థులయిన మీరు
ఈ కోట్లకొద్దీ నిర్భాగ్యుల దారిద్ర్యం గమనించ గలిగి ఉంటే ఇంతకంటే
ఎక్కువ మొత్తం వసూలుచేసి ఉండేవారని నా నమ్మకం నిత్యోపవాసాలు
చేసే కోట్లకొద్దీ ప్రజల స్థితి గతులను మీరు తెలుసుకోవలెనని నా కోరిక అట్లా
తెలుసుకొని ఉంటే ఇంకా ఎక్కువ ధనం నాకిచ్చి ఉండేవారు అయినప్పటికీ
ఇతర చోట్లలోని విద్యార్థుల కంటే మీరు వెనకబడి ఉండలేదు అంతేగాక
నేను సాగిస్తున్న ఈ ఖద్దరు ఉద్యమంలో మీ సానుభూతికి చిహ్నంగా ఈ సొమ్ము
మీరు నాకిచ్చినట్లు మీ అధ్యక్షులు చెప్పినారు మీరు ఈ నా ఉద్యమంలో సహాక
రించేటందుకు వాగ్దానంచేస్తూ ఇచ్చిన ఈ సొమ్ము ఎంతో అమూల్యమయినదని
నా అభిప్రాయము పైపెచ్చు మీరు ఒక్కరొక్కరుగా వసూలు చేసిన
మొత్తంలో ఎక్కువ మొత్తం ఒక విద్యార్థిని వసూలు చేసినదని తెలిపి నందుకు
నా సంతోషము ఇనుమడించింది భారతదేశంలోని యువతులు భారతదేశపు
యువకులను మాతృదేశారాధన పోటీలో ఓడించగలరని ఆశిస్తున్నాను మీరు
నా కిచ్చిన ఈ ధనం నాకు మీకు ఒక గుణపాఠం నేర్పుతున్నది నాకీ ధనము
నిత్యోపవాసాలతో కృశిస్తున్న లక్షలకొద్దీ ప్రజలకు మరింత ఎక్కువగా సేవ
చేయవలెననే గుణపాఠం నేర్పుతున్నది అట్లాగే మీరు వారి స్థితి గతులను
మరింత ఎక్కువగా తెలుసుకోవలెననే గుణపాఠం నేర్చుకోవలసి ఉన్నది
అప్పుడు మీ విద్యాలయంలో మీరు నేర్చుకొనే విద్య మీ దేశీయులు రక్తం
ఓడ్చి సంపాదించిన డబ్బు నుంచి మీకు లభిస్తూన్నదనే విషాదకర రహస్యం
మీరు తెలుసుకోగలరు మీరు చెల్లించే జీతాలవల్ల మాత్రమే మీకీ విద్య
లభించటం లేదని మీలోని ప్రతి విద్యార్థి తెలుసుకోవలెనని కోరుతున్నాను
మద్యపానంవల్ల మత్తు పదార్థాలవల్ల వచ్చే ఆదాయం నుంచి మీకు విద్య
లభిస్తూన్నదనే విషయం మీరందరు తెలుసుకో కోరుతున్నాను

ఇక ఈ ప్రజలు మీ విద్యను గురించి ఏమనుకోవాలో ఆలోచించండి
నిర్భాగ్య ప్రజలు నిరంతరం సేవచేయటం, ఈ దేశంనుంచి దారిద్ర్య దేవతను
వెడల గొట్టేవరకు నిద్రాహారాలు లేకుండ పని చేయటం మీ విద్యుక్త ధర్మంగా
భావించవలె మీ దేశీయుల కోసం మీరు ఖద్దరు ధరించవలె ఖద్దరు ధరించటమే
దేశీయులను సేవించటం ఆధునిక యంత్రాలపైగల వ్యామోహంచేత
రాట్నానికి ఖద్దరుకు ప్రతికూలంగా చేసే వితండవాదనలకు మీ మనసులలో
చోటివ్వకూడదు రాట్నమును, ఖాదీ ఉద్యమాన్ని గురించిన వ్రాతలను
నేనిప్పుడు చర్చించ దలచుకొనలేదు యస్ యస్ వరదాచారి రచించి అఖిల
భారత చరఖా సంఘంవారు ముద్రించిన చిన్న పుస్తకం మీరందరు చదువ
వలెనని కోరుతున్నాను ఖద్దరు ఒక్కటే ఈ దేశంలోని దారిద్ర్యం తక్షణం

తొలగించ గల సాధనమని ఆ గ్రంథంనుంచి మీరు తెలుసుకోగలరు ఖద్దరు సందేశం మీరు గ్రహిస్తే మీ ఒంటి మీద ఒక్క అంగుళం విదేశఫు బట్టకూడ ఉండనీయరు చేతితో వడికి చేతితో నేసిన పవిత్రమయిన ఖద్దరును ధరించి నందు వల్లనే మీరు సంతృప్తి చె దగలరు ఖద్దరు ధారణ మీరు నిర్వర్తించవలసిన కనీస ధర్మము మీ సేవకు అది ప్రారంభ దశ, వేరు వేరు శాఖలలోని మీ మీ సేవా కార్యాలకు ఖద్దరే కేంద్రం ఈ విషయం గురించి మీరు ఆలోచించేటప్పుడు భారత దేశంలోని గ్రామస్థుల దుర్భల జీవితం మీరు మరవరాదు మీలో ప్రేమ పాశమని చెప్పతగు ఈ సత్వగుణం లేనట్లయితే సంఘంలో విచ్ఛిన్నమయిన విభిన్న శక్తులను ఏకం చేయడం సాధ్యం కాదు

గుజరాతులో అధిక వర్షపాతంలో కలిగిన వరదలవల్ల పాడుపడిన ప్రదేశాలలో విద్యార్థులు చేస్తూన్న సేవ వింటే మీకు మంచి బుద్ధి కలగగలదని నేను భావిస్తున్నాను బాధలను అనుభవిస్తున్న ప్రజలపైన అవ్యాజానురాగం లేని వారు ప్రజలకు ఏవిధమయిన ఉపకారం చేయజాలరు గుజరాతులోని కొందరు విద్యార్థులు తమ చదువులను కట్టిపెట్టి గునపాలు పట్టుకొని, చచ్చిన పశువుల కళేబరాలతోను, క్రుళ్ళిన పైరు పంటలతోను దుర్గంధ భూయిష్ఠాలై అనారోగ్యకరాలై నివాస యోగ్యం కాని గ్రామాలకు పోయి పనిచేసినారు. కళేబరాలను గ్రామాల నుంచి తొలగించడానికి వారు పంచమ సోదరుల తోడ్పాటు కోసం వేచి ఉండక తమకు తామే వాటిని తొలగించి వేసినారు గుజరాతు విద్యార్థులకు సాధ్యమయిన పని అవసరం కలిగినప్పుడు మీకు కూడా సాధ్యం కాగలదని నేనెరుగుదును

ఇంకా మీకు చెప్పవలసిన విషయాలు చాలా ఉన్నాయి వాటిని గురించి చెప్పటానికి నాకు తగినంత వ్యవధి ఉంటే బాగుండేది నెల్లూరులో నేను చేసిన ప్రసంగం హిందూ పత్రికలో చదువకోరుతున్నాను మీలో కొందరు దానిని ఇదివరకే చదివి ఉండవచ్చు ఇది వరకు చదివి నప్పటికీ మరొక్కమారు ఆ పత్రికను అరువు తీసుకొని అయినా, కొని అయినా చదవ వలసిందని కోరుతున్నాను భవిష్యత్తు మీ పైన ఆధారపడి ఉన్నది మీ రే దేశంలో పుట్టినారో, ఏ దేశీయుల కష్టార్జితంవల్ల మీకు విద్యలభిస్తున్నదో అట్లాంటి భూమిపట్ల మీ పవిత్ర ధర్మం నిర్వర్తించి నట్లయితే నేను సంతోషించగలను ఇది భారత దేశంలోని విద్యార్థులందరూ గమనించ తగిన విషయము ఎప్పుడు మీ మనసులలో భ్రమ పిశాచము ఆవరించి దేశాన్ని మరచిపోయేటంత స్వార్థచింత రేకెత్తుతుందో అప్పుడు నేనీ సాయంకాలం మీకు తెలిపిన విషయాలను గురించి ఆలోచన చేయండి మీరు మీ విద్యను ముగించే లోపల ఎందరికో ఋణగ్రస్తు లవుతున్నారన్న విషయం మరచి పోకండి ఋణగ్రస్తులమనే జ్ఞానం మిమ్ములను ఎట్లాంటి ఆశలకు, ఆకర్షణలకు లోబడనీయకుండుగాక" ఈ ఉపన్యాసానంతరం సభ ముగిసింది.

ప్రత్యేక సమావేశం

మహాత్మా ఆ రోజు సెప్టెంబరు 6 ఉదయం 8 గంటలకు తిరువళిక్కేణిలోని మణి అయ్యర్ హాల్‌లో కొంత మంది యూరోపియన్‌లు, స్త్రీలు, పురుషులు ఉన్న ప్రత్యేక సభలో ఉపన్యసించినారు అక్కడ స్త్రీలు, పురుషులు అందరూ 500 మంది ఉన్నారు వారిలో టి సదాశివయ్యర్, సి రాజగోపాలాచారి దివాన్ బహదూర్ రామచంద్రరావు, డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డి, యస్ సత్య మూర్తి, కె భాష్యం, మహాదేవ్ దేశాయ్, ఎ సి ముఖర్జీ, టి వరదరాజులు నాయుడు, రెవరెండ్ విట్‌మన్, శ్రీ భక్తవత్సల నాయుడు మొదలయినవారు ఉన్నారు

గాంధీజీ ఆర్థిక విషయాలను గూర్చి మాట్లాడుతూ మద్య నిషేధం క్రమక్రమంగా అమలు పరచడంలో తమకు నమ్మకం లేదని, పూర్తిగా అమలు పరచవలసిందని అమెరికాలో మద్య నిషేధోద్యమం అపజయం పొందలేదని, మద్య నిషేధం అమలు పరచడానికి ఆర్థికమయిన ఇబ్బందులను తొలగించు కొనవలెనని, మద్య నిషేధానికి ఇండియా పరిస్థితులు అనుకూలంగా ఉన్నవనీ ఉపన్యసించినారు

హిందీ ప్రచార కార్యాలయానికి గాంధీజీ రాక

సెప్టెంబరు 6వ తేదీ ఉదయం 9 గంటలకు గాంధీజీ, సి రాజగోపాలా చారి, మహాదేవ దేశాయ్, కాకాకాలేల్‌కర్ మొదలయినవారితో హిందీప్రచార కార్యాలయానికి వెళ్ళినారు ఆయనకు హిందీ ప్రేమీ మండలివారు ఒక సన్మాన పత్రం హిందీ ప్రచార ముద్రణాలయంలోని కార్మికులు సిబ్బంది మరొక సన్మాన పత్రం సమర్పించినారు గాంధీజీ వారికి కృతజ్ఞతలర్పిస్తూ, తనదే అనుకొంటూన్న ఒక సంస్థ నుంచి తాను సన్మాన పత్రం స్వీకరించడంలో ఔచిత్యంలేదని అన్నారు అయినప్పటికీ "నేను ఈ విషయంలో మీ అభిప్రాయం లను అర్థంచేసుకొన్నాను ఇంతవరకు ఇది పసిబిడ్డవలెఉండి ఉత్తరాదివారి ఔదార్యంవల్ల పోషింపబడి పెరుగుతూ వచ్చింది ఇప్పుడు దీనికి యౌవనదశ వచ్చింది కాబట్టి ఇది స్వయం శక్తితో తనంతట తాను పోషించుకోవలసిఉంది అంటే ఇప్పటి నుంచి దక్షిణాదివారు తగినంత ధనం వసూలుచేసి ఈ సంస్థను స్వయం పోషకంగా చేసుకోవలె

ఇక్కడ నివసిస్తూండిన మార్వారీలు, గుజరాతీలు ఇతర ఉత్తర దేశీ యులు ఈ సంస్థను తమదిగా భావించి ఈ పనికి ఎక్కువ శ్రద్ధతో అన్నివిధాలా సహాయం చేయవలెనని కోరుతున్నాను మార్వారీలు సహజంగా వ్యాపార దక్షులు వారు ఈ సంస్థలోని కార్యకర్తలకుకూడా ఆ వ్యాపార సరళిని నేర్పి ఈ సంస్థ జయప్రదంగా అభివృద్ధి పొందేటందుకు సహకరించవలెనని కోరుతు న్నాను వారు ఈ సంస్థ లెక్కలను పరిశీలించి వాటి అభివృద్ధికి అవసరమయిన సలహాలను ఇవ్వవలసిందని కోరుతున్నాను

ప్రచారకులకు చివరిమాటగా నేనొకటి చెప్పదలచు కొన్నాను ఈ

పనిని గాని ఇంకా ఇటువంటి ఇతర పనులనుగాని వారు చక్కగా నిర్వర్తించ దలచుకొంటే వారు మంచి సౌశీల్యం కలిగి ఆదర్శ జీవితాలను గడపవలెనని కోరుచున్నాను ఇటువంటి పనుల పూనుకొనేవారు నిశ్చలంగా ఉండి నిశ్చిత మయిన బుద్ధితో జయప్రదంగా ఈ పనులను నిర్వహించవలె ఈ పనిని నిర్వహించుటమే వారి జీవిత పరమావధిగా ఇదివరకు భావించకున్నట్లయితే ఇక ముందయినా అట్లా భావించవలెనని నేనుకోరుచున్నాను" ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ హిందీ పరీక్షలలో విజయం పొందిన వారికి 'సర్టిఫికేట్ల'ను, బహుమతులను పంచిపెట్టినారు కడచిన రాష్ట్రభాషా పరీక్షలో తమిళనాడులో ప్రప్రథముడుగా ఉత్తీర్ణుడయిన వి పార్థసారథి అయ్యంగారికి 20 రూపాయలు బహుమతి లభించింది

## గాంధీజీ-పచ్చయప్ప కాలేజీ విద్యార్థులు

సెప్టెంబరు 7, ఉదయం 8 గంటలకు గాంధీజీ పచ్చయప్ప కళాశాలకు వెళ్లినారు కళాశాలలో తాత్కాలిక ప్రిన్సిపాల్ చిన్నతంబుపిళ్లె, కళాశాల సిబ్బంది, కళాశాల విద్యార్థులూ గాంధీజీ రాకకు వేచిఉన్నారు గాంధీజీ రాగానే ద్వారందగ్గర చిన్నతంబుపిళ్లె, ప్రొఫెసర్ సి సుబ్రహ్మణ్యం గాంధీజీని ఆహ్వానించి లోనికి తీసుకొని వెళ్లినారు

సమావేశం హిందీ ప్రార్థనతో ప్రారంభమయింది పచ్చయప్ప కళాశాల విద్యార్థుల పక్షాన మహాత్మునకు ఖద్దరువస్త్రంపై ముద్రించిన సన్మాన పత్రాన్ని వి సి గోపాలన్ సమర్పించినారు చిన్నతంబి విద్యార్థులపక్షాన 200 రూ విరాళం సమర్పించినాడు సభ్యులు మహాత్మాజీకి హర్ష ధ్వానాలమధ్య ఫూలదండలు వేసినారు జార్జిటౌన్ వెంకటేశనాయక్ వీధిలోని మురుగేశన్ అనే అతడు 100 రూపాయలను గాంధీజీకి సమర్పించినాడు హుండీ వసూళ్లు ద్వారందగ్గర టికెట్టు వసూళ్లు కూడా గాంధీజీకి సమర్పింపబడినాయి

అరుణాచలం అనే బాలుడు మహాత్మునికి ఖద్దరుశాలువ బహూకరించినాడు మహాత్ముడు తన ఉపన్యాసం మామూలుకంటే కొంచెం బిగ్గరగా ప్రారంభించినారు "దరిద్రనారాయణునికై మీరు నాకిచ్చిన ధనానికి నేను మీకు వందనాలర్పిస్తున్నాను నేనీ భవనానికి రావడం ఇది ప్రథమ పర్యాయం కాదు దక్షిణాఫ్రికా భారతీయ సమస్య సందర్భంలో 1896లో ఒకమారు ఇక్కడికి వచ్చినాను కీ శే డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు నాటిసభకు అధ్యక్షత వహించినారు ఆనాడే భారతవర్షమందలి విద్యార్థి ప్రపంచంతో నాకు ప్రథమ పరిచయం కలిగింది అందువల్లనే ఆ సభా విషయం నాకిప్పుడు జ్ఞాపకం వస్తున్నది నేను సామాన్యమయిన మెట్రిక్యులేషన్ పరీక్షవరకే చదువుకొన్నట్లు మీకు తెలిసివుండవచ్చు భారతదేశంలో కళాశాల విద్య అని పిలువ దగిన విద్యను నేను అభ్యసించి ఉండలేదు అయినా నాడు నా ఉపన్యాసం ముగించి నేను భవనం వెలుపలికి వెళ్లేసరికి నాకోసం వేచిఉన్న విద్యార్థులు

నా సాహసాన్ని ప్రశంసిస్తూ నేను దక్షిణాఫ్రికా గురించి వ్రాసిన వచ్చ ప్రకటన పత్రాలు నాదగ్గర ఉన్నంతవరకు వారు తీసుకొని వెళ్లిపోయినారు నా ఉద్యమాన్ని, నన్నూ అందరికంటే ఎక్కువగా బలపరిచిన కీ శే పర మేశ్వరన్ పిళ్లెగారు నాకోరికపై విద్యార్థులకుగాను ఆ ప్రకటనపత్రాలు 10వేలు ముద్రింపించి ఇచ్చినారు ఆ కాలపు విద్యార్థులు దక్షిణాఫ్రికా సమస్యను తెలుసుకోనేటందుకు ఎంతో ఉత్సాహం చూపెట్టినారు ఆ సందర్భంలోనే నాకు విద్యార్థులతో మొదటి పరిచయం కలిగింది భారతమాత తన సంతతిని గురించి సంతసింపగలదని తన ఆశయాలన్నిటినీ వారిద్వారా నెరవేర్చుకోగలదని నాలో నేను అప్పుడే అనుకొన్నాను ఆనాటినుంచి విద్యార్థులతో నాపరిచయం దిన దిన ప్రవర్ధమానమవుతూ వచ్చింది అయితే నాకు ఎవ్వరు ఇస్తూఉంటారో వారినే నేను మళ్లా అడుగుతూఉంటాను నేనిదివరలో బెంగుళూరులో చెప్పినట్లు మీరు నాకు ఎక్కువగా ఇచ్చినకొద్దీ ఇంకా ఎక్కువగా అడిగే హక్కు నాకు ఏర్పడిందని మీరు భావించవలసి ఉంటుంది మీరెంత ఎక్కువగా ఇచ్చినా సంతృప్తిపడే గుణం నాకు లేదు నా భాగ్యవశాన నా సేవను, నా కృషిని మీరు కొనియాడినారు భక్తిప్రేమలతో మీరిచ్చిన సన్మానపత్రంలో దరిద్రనారాయ ణుని పేరు సూచించినారు కళాశాలాధ్యక్షా! మీరు రాట్నం గురించిన నాఅభిప్రాయం నిష్కపటంగా, హృదయపూర్వకంగా బలపరిచినారని నేను నమ్ముతున్నాను సుప్రసిద్ధులు విజ్ఞానవంతులూ అయిన నా దేశీయులనేకులు ఈ రాట్నం తృణీకరించినారని నాకు తెలుసు మన అక్కచెల్లెండ్రూ మన తమ్ముళ్లూ తీసిమూలపారవేసిన రాట్నపుకొయ్యవల్ల స్వరాజ్యమెన్నటికీ చేకూరబోదని వారట్లా తృణీకరించి ఉంటారు అయినా మీరు నాఅభిప్రాయా లను బలపరిచినందుకు నాసంతోషం వెలిబుచ్చటానికి నా భాష చాలదు విద్యార్థులారా! మీరు మీసన్మానపత్రంలో రాట్నాలను గురించి చెప్పవలసినంత బాగా చెప్పకపోయినప్పటికీ మీరు మీ హృదయాలలో రాట్నానికి అర్హస్థానా లను ఇచ్చినట్లు నేను నమ్మటానికి వీలయినంతవరకు చెప్పిఉన్నారు రాట్నంపై మీఅవ్యాజానురాగం ప్రకటించినంతమాత్రాన మీపని పూర్తి అయినట్లు భావించకూడదు అట్లా మీరు భావించడం నాకు దుఃఖకారణం కాగలదు మీరు నాకిచ్చిన డబ్బుతో వస్తులు పడుకొంటూ కృశించిపోతూన్న లక్షలాది నిరుపేదలైన దేశీయులకు కట్టుకోవడానికిచ్చే ఖద్దరును మీరే ఉప యోగించినట్లయితే ధనం నాకక్కరలేదు నోటితో రాట్నంపట్ల ప్రేమను ప్రకటిస్తూ అభిమానంతో నాదోసిలిలో కొన్ని రూపాయలు విసిరిపారవేసినంత మాత్రాన స్వరాజ్యం లభించదు నానాటికి తీవ్రతరమవుతున్న లక్షలకొద్దీ కష్ట జీవుల పేదరికపు సమస్య పరిష్కారంకాదు కష్టజీవులనే పదం నేను వాడి నాను అది నిజమయిన వర్ణన అయితే నేను సంతోషించదగినదే కాని దురదృష్టవశాన మనం ధరించే వస్త్రాల విషయంలో మన అభిరుచులు మారి నందున ఆకలితో అలమటిస్తూన్న మన దేశస్థులకు సంవత్సరంలో చాలా భాగం

పని లేకుండా చేసివేసినాము ఏడాదిలో నాలుగు నెలలు వారికి పనిఉండదు ఈ పనిలేనితనం మనం వారిపైన బలవంతంగా విధిస్తున్నాము ఇది నా భ్రమ కాదు జనసామాన్యంతో కలసిమెలసి తిరిగి తమ అనుభవం తెలిపిన మన దేశీయుల మాటను త్రోసివేసినప్పటికీ ఆంగ్లేయ పరిపాలకులనేకులు పెక్కుమారులు ప్రకటించిన సత్యమిది ఇక మీరు నాకిచ్చిన ధనాన్ని ఆ లితో నకనకలాడే సోదరీమణులకు పంచి ఇచ్చినంతమాత్రాన ఈ సమస్య పరిష్కారం కాదు మీదుమిక్కిలి వారిని ఇది మరింత బలహీనులనుగా చేయగలదు ఇది వారిని యాచకురాండ్రుగా మార్చివేయగలదు బిచ్చమెత్తి జీవించే జాతిని అటువంటి దుస్సంఘటననుంచి భగవంతుడు రక్షించుగాక తమ ఇళ్ళలో తాము నిస్సహాయులై పడిఉండే సోదరీ సోదరులకు పని చూపటమే మీరు, నేను నిర్వర్తించవలసిన పరమధర్మము వారికి మనము చూపదగినపని ఇది ఒక్కటే ఇది గౌరవప్రదమైన పని ఒక అణా అంటే మీకు చులకనగా [illegible]చ వచ్చు రెండు, మూడు మైళ్లు నడిచేటందుకు బద్ధకించి గ్రామంలో ఎక్కటానికి ఆ అణాకాసును మీరు నిర్లక్ష్యంగా ఖర్చు చేయవచ్చు అణా అంటే మీకు విలువలేదు కాని ఆ అణాకాసును మీరు నాకిచ్చినపక్షంలో మీరు నాపట్ల కనపరిచిన విశ్వాసం నేను సక్రమంగా కార్యరూపానికి తేగలను అప్పుడు ఆ అణాకాసే ఒక దిక్కుమాలిన సోదరికి సహాయకారియై సార్థకం కాగలదు ఆమె తనచేతితో వడికిన అందమయిన నూలును, చరిత్ర, కవిత్వం లీనమయి ఉన్న నూలును నాకివ్వగలదు ఆ దారము రాచబిడ్డలకు దుస్తులను తయారు చేయదగినదని నాఅభిప్రాయము మిల్లునుంచి తయారయిన క్యాలికోగుడ్డకు అటువంటి చరిత్ర ఉందా ! మీరింతకు పూర్వమే ఖద్దరు తప్ప మరో వస్త్రం ఉపయోగించమని సంకల్పించుకొని ఉండని పక్షంలో ఇప్పుడైనా అటువంటి సంకల్పం కలిగి ఉండవలెనని కోరుతున్నాను అందుకు భిన్నంగా నాకిధనం మీరిచ్చి ఉంటే నాకది సహాయకారిగా ఉండకపోగా అది ప్రతిబంధకమవుతుంది మీధనంతోగాని, మీసన్మానపత్రంతోగాని, మీహర్షధ్వనులతో గాని ఖద్దరు సందేశంలో మీకు విశ్వాసంకలదని నేను నమ్మటతున్నాననుకోకండి మీరు చేసిన ప్రకటన ప్రకారం మీరాచరించవలెనని కోరుతున్నాను

తమిళనాడులో ఒక సుప్రసిద్ధుడు చెప్పిన జోక్యం యథార్థం చేయకండి ! ఆ జోక్యమేమంటే 'నేను మరణించిన తరవాత నా శవం బూడిద చేయటానికి రాట్నపు కొయ్యలు తప్ప వేరే కట్టెపుల్లల అవసరముండదని'అన్నారు వారు నాకు స్నేహితులు వారికి రాట్నంపట్ల విశ్వాసం లేదు రాట్నము, రాట్నమని వాపోయే వారందరూ నాపైన ఉన్న గౌరవంవల్ల అట్లా అంటున్నారని వారు నాకు చెప్పినారు వారి ఈ అభిప్రాయమే నిజమయినట్లయితే అంతకంటె విషాదకరమయిన విషయం మరొకటి మనజాతికి ఉండబోదు అట్లాంటి విషాదానికి మీరు ప్రత్యక్షంగా తోడ్పడినవారవుతారు ఇంతకంటె మన జాతికి ఆత్మ వినాశకరమయినది వేరొకటి ఉండదు రాట్నంలో నిక్బల

మయిన ప్రాణం లేనట్లయితే మీరు దానిని నిరాకరించవచ్చు అప్పుడు మీరు యథార్థం చెప్పినవారవుతారు ఈనాడు మీరు రాట్నం పరిత్యజించినట్లయితే దరిద్రనారాయణునే పరిత్యజించినట్లవుతుంది నా యీ మాటలను అరణ్యరోదనంగా అయినా చెప్పే అవకాశం నాకు కలిగినందుకు సంతోషము మన ఉభయులను అవమానంనుంచి, పరాభవంనుంచి సంరక్షించేటందుకిది గమనించదగిన విషయము ఇంకా అనేక విషయాలున్నాయి

**బాల్యవివాహాలు - బాలవితంతువులు**

బాల్యవివాహాలు, బాలవితంతువులను గురించి మీరు పేర్కొని ఉన్నారు నేనీ మద్రాస్ రాజధానికి వచ్చేముందు తమిళనాడునుంచి ఒక ప్రముఖుడు ఒక లేఖ వ్రాసినాడు విద్యార్థులకు ఉపన్యసించేటప్పుడు బాల వితంతువుల భీకర కష్టపరంపరలను గురించి నేను గట్టిగా చెప్పటంలేదని, ఇతర రాజధానులు అన్నిటికన్నా చెన్న రాజధానిలో బాల వితంతువుల కష్టాలు ఎక్కువగా ఉన్నాయని ఆ లేఖలో ఆయన వ్రాసినారు ఇందులోని నిజం నాకు తెలియదు నాకంటె ఈ విషయం మీకే బాగా తెలిసిఉంటుంది మీయువకులు ఉదారంగా ఉండవలెనని కోరుతున్నాను మీలో అధిక సంఖ్యాకులు అవివాహితులని నా అభిప్రాయము మీలో కొందరు బ్రహ్మచారులని కూడా నా నమ్మకం విద్యార్థులను నేనెరుగుదును కాబట్టి కొందరు అని చెప్పటానికి నేను విచారపడుతున్నాను అక్కచెల్లెండ్లవలె చూడతగిన యువతులపై కామ ప్రేరితమ లయిన దృక్కులను ప్రసరింపజేసిన విద్యార్థులు బ్రహ్మచారులు కాలేరు మీ హృదయాలపై చేయివేసుకొని మీరు బ్రహ్మచారులమని చెప్పకోలేరు కాబట్టి మీలో కొందరు బ్రహ్మచారులని చెప్పవలసివచ్చింది 'వితంతువులు కాని బాలికలను మేము పెండ్లి ఆడము బాల వితంతువులను వెదికి పెండ్లాడతాము అట్లా బాల వితంతువులు లభించకుంటే వివాహమే చేసుకోము' అని సంకల్పించి ఆ ప్రకారం మీనిశ్చయం ప్రకటించవలె మీ యీ నిశ్చయం తలిదండ్రులకు తెలపవలె 10, 15 ఏండ్ల వయసుగలిగి వివాహమంటే ఏమో ఎరుగని, వివాహానికి తన సమ్మతంలేని ముక్కుపచ్చలారని బిడ్డ భర్త జీవించి ఉండో లేదో తెలియని పసికూన హఠాత్తుగా వితంతువయిందని ప్రకటించటం సత్యదూషణము, ఘోరపాతకము అవుతుంది

హిందూమతంలో వితంతువను పదానికి ఎంతో పవిత్రభావం ఉంది రమాబాయి రానడేవంటి నిజమైన వితంతువును నేను గౌరవిస్తాను వితంతువుగా మెలగడం ఆమెకు తెలిసింది కాని 10, 15 ఏండ్ల ప్రాయంగల బాలిక భర్త అంటే ఎవరో ఎరుగజాలని యువతి 'విధవ' అనటం సత్యహాని ఈ రాజధానిలో బాల వితంతువులు లేనట్లయితే నావాదన నిస్సారమే అవుతుంది బాల వితంతువులు ఉన్నపక్షాన ఈ అన్యాయం తొలగించటానికి మీరు దృఢ సంకల్పులు కావలె ఇటువంటి పాపాలకు తగిన ప్రతిఫలం మనం అనుభవించి

తీరవలెనని విశ్వసించే అంతటి ఛాందసుణ్ణి నేను కాబట్టి ఈ పాపాలన్నీ పెరిగి మనలను ఈ దాస్యస్థితికి తెచ్చినవని నేను నమ్ముతున్నాను ఎక్కడో కనీవినీ ఎరుగని అత్యుత్తమ స్వపరిపాలనా విధానం కామన్స్ సభవారు మీచేతుల్లో పడవేయవచ్చు కాని దానిని నిర్వహించడానికి అర్హులైన స్త్రీ పురుషులు లేకుంటే అది నిరుపయోగమయి తీరుతుంది తన ప్రధానావసరాలను తీర్చుకోనెంచిన ఒక్క వితంతువునయినా బలాత్కారంగా నిరోధింప తలపెట్టిన మతము, మతంకాలేదు అది మతం అభావము హిందూ మతావలంబిగా నేనిది చెబుతున్నాను పాశ్చాత్య భావోన్మాదంలో నేనిట్లా అనడంలేదు పాశ్చాత్యులనుంచి అనేక విషయాలను నేను గ్రహించినాను కాని దీనిని మాత్రంకాదు ఎంతో దుర్భరమయిన అనుభవంవల్ల దుస్సహాస్థితివల్ల నేనీ అభిప్రాయానికి రాగలిగినాను హిందూమతంలో ఇట్లాంటి వైధవ్యానికి అవశ్యకమేలేదు ' అని ఉపన్యసించి సిగరెట్టు, కాఫీ, టీ మొదలయిన దురభ్యాసాలను వదలవలెనని, హిందీ భాషను అభ్యసించవలెనని విద్యార్థులకు చెప్పి, పచ్చయప్ప కళాశాలలో పంచములకు, మహమ్మదీయులకు ప్రవేశం కలిగించవలెనని పచ్చయప్ప ప్రతిష్ఠాపనా ధర్మకర్తలకు విజ్ఞప్తి చేసినారు

తరవాత బాల వితంతువులను గురించి తాము చెప్పినదంతా బాల్య వివాహాలకు కూడా వర్తిస్తుందన్నారు

## వివాహ వయో నిర్ణయము

తరవాత విద్యార్థులను సంబోధిస్తూ గాంధీ మహాత్ము ఇట్లా ప్రసంగించి నారు "16 ఏళ్ళ వయసుకు లోబడిన బాలికలను వివాహ మాడకుండాఉండే అంతవరకయినా మీరు ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండవలె నాకు అధికారం ఉంటే బాలికలకు 20 సంవత్సరాల వయస్సు లోపుగా వివాహం చేయకూడదని శాసిస్తాను అంతవరకు వారు అవివాహితలుగా ఉండటం అసాధ్యంకాదు మన బాలురు మన బాలికలు ఇంత చిన్న వయస్సులో వివాహ మాడడానికి కారణం మనమే కాని మన శీతోష్ణ స్థితులు కావు ఎందువల్ల నంటే 20 సంవత్సరాల వయస్సు వరకు అవివాహితలయిన బాలికలు సీతా మహాదేవి వలె నిర్మల మనస్కులై నిష్కలంక చరిత్రలై ఉన్నట్లు నేనెరుగుదును వారు బాహ్యాంతర సంక్షోభాలకు చలించక తమ పవిత్రతను కాపాడుకోగలరు కానీ మన సాహచర్యం మన సంభాషణలు మొదలయినవి మన సమాజాన్ని ఇట్లాంటి హీన స్థితికి తెచ్చినాయి 'నేను బ్రాహ్మణుడను, 16 సంవత్సరాల వయసుకు పైబడిన బ్రాహ్మణ బాలికలు వివాహ మాడటానికి నాకు దొరకరు' అని కొందరు విద్యార్థులు విడివిడిగా నాకు చెప్పినారు బ్రాహ్మణ బాలికలకు 13, 12, 10 ఏళ్ళ లోపుననే పెండ్లి చేస్తారు అని నాకు వారు చెప్పినారు అటువంటి బ్రాహ్మణ బాలురు బ్రాహ్మణ సంఘం నుంచి వెలి కావలెనని నేను సలహా ఇస్తాను. అంతేగాక 16 సంవత్సరాల వరకైనను అవివాహితగాని బాలిక తనకు

లభించక పోతే తన ఇష్టం వచ్చిన బాలికను పెండ్లాడమనికూడా ఆ బ్రాహ్మణ బాలురకు సలహా ఇస్తాను భగవంతుడు అట్లాంటి బాలురను క్షమించగలడని నా నమ్మకము

## నిజమయిన విద్య

హృదయం నిర్మలంగా లేని విద్య, ఇంద్రియ నిగ్రహం లేని విద్య, విద్యకాదు ఈ ప్రాచీన హిందూ విద్యా సంస్థ సత్స్వభావంగల విద్యార్థులను తయారు చేయవలె సత్స్వభావం లేని విద్య విద్యకాదు నే నిటువంటి విద్యను గురించి తలపోసి నప్పుడు నాకు చాలా విచారం కలుగుతూంటుంది

## బ్రాహ్మణ మతము

నేను బ్రాహ్మణ మతాన్ని పూజిస్తాను వర్ణాశ్రమ ధర్మం బలపరుస్తాను కాని అస్పృశ్యతను బాల్య వివాహాలను నే నంగీకరించను అవి బ్రాహ్మణ మత ధర్మాలు కావని నా అభిప్రాయము అటువంటి మతంలో బ్రహ్మజ్ఞాన మనేది ఉండదు వేదాల యథార్థ నిర్వచనమదికాదు

ఈ నా మాటలు మీ హృదయాలలోకి చొచ్చుకొని పోవలెనని నా కోరిక మీ హృదయాలకు విజ్ఞప్తియేగాని మీ హేతువాద బుద్ధికికాదు

## టీ, కాఫీలు వద్దు

కల్లికోట నుంచి ఒక ఉపాధ్యాయుడు నాకొక లేఖ వ్రాసినాడు విద్యార్థులకు కాఫీ, టీ, పొగ మొదలయినవి తాగవద్దని బోధించ వలసిందని ఆయన నన్ను కోరినాడు నిజానికి మీకు అపాయం చేసేది మీరు తాగే తేనీరు కాదు, తేనీరు తాగవలెనని మీకు కలిగే కోరిక కాఫీ, టీ లు మన జీవితం నిలిపేటందుకు అవసరమయినవికావు రోజుకు 10 కప్పుల కాఫీ పుచ్చుకొనే వారినికూడా నే నెరుగుదును చదువుకొనేటందుకు మేల్కొని ఉండటానికి తేనీరు, కాఫీ అవసరమయినట్లయితే మీరు మేల్కొని ఉండకండి శుభ్రంగా నిద్రపొండి చదవవలసిన కాలమంతా వృథాచేసి ఆరోగ్యం, బుద్ధిని చెడగొట్టు కొని రాత్రులు మేల్కొని చదవ బోకండి సనాతన భారతీయ విద్యార్థులు చదివిన పద్ధతి ఇదికాదు మనం తేనీటికి, కాఫీకి బానిసలంకా కూడదు

చుట్టలు సిగరెట్లతో ఏ విద్యార్థి అయినా తన నోటిని పొగ గొట్టంగా తయారుచేసి మలినం చేసుకోవడం నాకుఆశ్చర్యంగా ఉంటుంది మీరు లెక్కలు వ్రాస్తే ఈ చుట్టలు, సిగరెట్ల కింద ఎంత ఖర్చవుతుందో బాగా తెలిసివస్తుంది తాను విదేశీ చుట్టలను కాల్చనని మదరాసు చుట్టలనే కాలుస్తానని ఒకవిద్యార్థి నాతో అన్నాడు చెడ్డవస్తువులు హిందూదేశంలో తయారయినా, అమెరికాలో తయారయినా ఏమీ భేదంలేదు చుట్టలు, సిగరెట్లు హిందూ దేశంలో తయారు కావడం చాలా విచారకరము ఈ పరిశ్రమవల్ల కొందరు వేలకొద్దీ ధనం గడిస్తు

న్నారు కాని ఈ చుట్టా, సిగరెట్ల పరిశ్రమ దేశారిష్టకరము సిగరెట్లలో నల్ల మందు గుణంకూడా కొంత ఉన్నది ఆ పదార్థం మీ దేహంలో ప్రవేశిస్తే మీరు సిగరెట్లను ఎన్నటికీ విడువ జాలరు సిగరెట్లుత్రాగటం గురించి కింగ్స్లీ చెప్పిన మాటలు ప్రమాణాలు కావు అవి భారతీయులకు బొత్తిగా పనికిరావు మీరీ దురభ్యాసం వదలివేయవలె అందువల్ల మీకెంతో డబ్బు ఆదా అవుతుంది టాల్‌స్టాయి తన అనుభవంబట్టి సిగరెట్టు తాగడంవల్ల కలిగే కీడును వర్ణించి నారు చుట్టలు, సిగరెట్లు కాల్చడం తాగుడు కంటెకూడా ఎక్కువ ప్రమాద మని ఆయన వ్రాసినారు

## హిందీ భాష

దక్షిణ దేశంలోని మీరు హిందీని నేర్చుకొంటారనే నమ్మకంతో ఉత్తర హిందూస్థానంవారు లక్ష రూపాయలు వెచ్చించి ఈ నగరంలో ఈ హిందీ ప్రచార సంఘం స్థాపించినారు కొంత అభివృద్ధి జరిగినమాట నిజమేకాని జరగ వలసినంత జరగలేదు హిందీ భాష నేర్వడంలో ఆంగ్ల భాష నేర్వడంలో ఉన్న 10 వ వంతు కష్టంకూడా ఉండదు ఇంగ్లీషు 10, 15 పండ్లు చదివి నప్పటికీ అందులో ప్రావీణ్యం అలవడదు హిందీ భాషను ఒక సంవత్సరంలో చక్కగా అభ్యసించవచ్చు ఏమీ ఖర్చు లేకుండా ఆరుమాసాలలో హిందీ మీకు నేర్పగల ఉపాధ్యాయులు ఉన్నారు దక్షిణ భారత దేశంలోని విద్యార్థులకు నేను నా వచ్చీరాని హిందీ భాషలోనే మాట్లాడవలెనని నా కోరిక విదేశీ భాషలో మాట్లాడవలసి రావడం విచారకరము

## భగవద్గీతా పఠనము

మీరు హిందూ ప్రతిష్ఠాపన విద్యాలయంలో చదువుతున్నామని చెప్పి నారుకదా! మీలో ఎందరు భగవద్గీతను చదివినారో చేతులెత్తండి (ఒక్కరు) ఒక్కరేనా! అయితే మీ కళాశాలాధ్యక్షుని పైనను మీ ఉపాధ్యాయుల పైనను అభిశంసన తీర్మానం ప్రతిపాదిస్తున్నాను - (నవ్వు) ఈ కళాశాలా ధర్మకర్తల పట్ల ఈ తీర్మానం ద్విగుణీకృతంగా వర్తిస్తుంది హిందూ విద్యాలయంలో భగ వద్గీతను ప్రతి విద్యార్థి అర్థంతో సహా చదవవలెనని నా అభిప్రాయము మహా మ్మదీయ విద్యార్థులుకూడా చదవవలసి ఉన్నది

## పచ్చయప్ప కళాశాల - పంచములు

'మహమ్మదీయ విద్యార్థులకు ఈ విద్యా సంస్థలో ప్రవేశంలేదు" అని గాంధీ అంటే 'పంచములకుకూడా లేదు' అని మరొకరు అన్నారు "మంచిది! పంచములను, మహమ్మదీయులను, అన్ని సంఘాలవారిని ఈ విద్యాసంస్థ చేర్చు కోవలెనని మీ ధర్మకర్తలకు నేను విజ్ఞప్తి చేస్తున్నాను హిందూ సంస్థ అయి నంత మాత్రాన మహమ్మదీయులను, పంచములను చేర్చుకోక పోవడానికి

నా కేమీ కారణం కనిపించటంలేదు పంచములు హిందూ సంఘంలో చేరిన వారే వారికి ఈ కళాశాలలో ప్రవేశం లేనట్లయితే ఈ సంస్థను హిందూ సంస్థ అని పిలుచుకోడానికి హక్కులేదు నేనీ విషయం ఇంతవరకు తెలుసుకోజాల నందుకు విచార పడుతున్నాను మొదట విషంగా తోచే వస్తువులే చివరికి అమృతోపమానాలుగా పరిణమించగలవు నా దేశీయులకు ఆదిలోనే అమృతోప మానాలయిన వస్తువులను ప్రసాదించే భాగ్యం నా కింతవరకు లభించలేదు ఈ సంస్థకు సంబంధించిన ధర్మకర్తలు ఉపాధ్యాయులు విద్యార్థులు తమ అభి ప్రాయాలను ఎంత త్వరలో మార్చుకొని హిందూ మతేతరులకు ప్రవేశం ఎంత వేగంగా కలగచేస్తే అంత మంచిది పాశ్చాత్య వ్యామోహంవల్ల కాని సంస్కరణోన్మాదం వల్లకాని నేనీ విజ్ఞప్తి చేయడంలేదు నేదాలు విశ్వసించే సనాతన హిందువుడననే నమ్మకంతోనే ఈ విజ్ఞప్తిచేస్తున్నాను నా ఈ విజ్ఞప్తి మీచే సహృదయంతో అంగీకరింప చేయవలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను'

ఈ ఉపన్యాసానంతరం కళాశాల అధ్యక్షుడు శ్రీ చిన్న తంబు పిళ్ళె ఆ కళా శాలలో హిందూ మతేతరులను చేర్చుకొనే ఏర్పాట్లు జరుగుతున్నవనీ ఆ విష యం హైకోర్టులో ఉన్నదనీ తెలిపి గాంధీజీకి వందనాలు సమర్పించినారు అందుకు గాంధీజీ సంతోషించినారు సభ ముగిసింది

## ట్రాంవే యూనియన్ సమావేశము

పీపుల్సు పార్కులోని యస్ ఐ ఏ ఏ ఆవరణలో సెప్టెంబరు 7 వ తేదిని ట్రాంవే యూనియన్ సభ్యుల సమావేశం జరిగింది గాంధీజీని ఆహ్వా నించటానికి చాలా మంది యూనియన్ సభ్యులు ఆ సమావేశానికి వచ్చినారు మహాత్మాజీ ఆ సభలో ఆసీనులైన తరవాత యూనియన్ అధ్యక్షుడు యస్ ఏ షఫీ మహమ్మద్ ఆయనను పుష్పమాలాలంకృతునిచేసి 107 రూపాయల మొత్తం ఖాదీ ఉద్యమానికి విరాళంగా ఆయనకు సమర్పించినారు

## రాయపురంలో బహిరంగ సభ

సెప్టెంబరు 7వ తేదీ సాయంకాలం 6 గంటలకు రాయపురం పౌరుల బహిరంగ సభ జరిగింది గాంధీజీ దర్శనం కోసం ఆయన సందేశం వినేటందుకు 8 వేల మందికి పైగా జనం చేరినారు గాంధీజీ సరిగా 6 గంటలకు సి రాజ గోపాలాచారి, కే భాష్యం గార్లతో సభా స్థలానికి వచ్చినారు సభను కళా మండపం మైదానంలో ఏర్పాటు చేయడం జరిగింది గాంధీజీ ఉపన్యసించ డానికి వీలుగా మనోహరంగా అలంకరించిన ఒక ఎత్తయిన వేదికను నిర్మించి నారు ఆయన రానున్న కాంగ్రెస్, నీల్ విగ్రహ సత్యాగ్రహం,ఖాదీ ఉద్యమము అనే మూడు ముఖ్య విషయాలు గురించి ప్రసంగించినారు ఆయన ఉపన్యాసం శ్రీ సి రాజగోపాలాచారిగారు తమిళం లోకి అనువాదం చేసినారు మహాత్మాజీ ఆసీనులైన తరవాత పౌరులు తమ సన్మాన పత్రం చదివి ఆయనకు సమర్పించి

నారు సన్మాన పత్రంలో మహాత్ముని అగణిత సేవలను కొనియాడుతూ రాబోయే కాంగ్రెస్ సభ జయప్రదంగా నిర్వహించడానికి ఖద్దరు ఉద్యమాభి వృద్ధికి తాము శక్తి వంచన లేకుండా కృషి చేయగలమని పౌరులు వాగ్దానం చేసినారు తరవాత ఖద్దరు నిధికిగాను రాయపురం పౌరులు 1000 రూపాయలకు పైగా విరాళం ఇచ్చినారు అదిగాక తండియారు పేట గ్రామస్థుడు జానకిరాం నాయుడు కొన్ని విలువగల మణులతో సహా మరికొంత సొమ్మును ఖద్దరు నిధికి సమర్పించినారు తరవాత గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

"మిత్రులారా! ఖద్దరు నిధికై మీరిచ్చిన విరాళాలకు నా వందనాలు కాంగ్రెస్ వ్యవహారాలలో శ్రద్ధ తీసుకొంటామని రానున్న కాంగ్రెస్‌ను జయప్రదంగా నిర్వహించడానికి యథాశక్తి తోడ్పడ గలమని మీరు సంకల్పించు కొన్నందుకు కూడా నేను సంతోషిస్తున్నాను

కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించటానికి దేశసేవలో అగ్రగణ్యు డయిన భారత పుత్రుని ఆహ్వాన సంఘంవారు ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు మీ సత్సంకల్పంవల్ల వారి పదవిని నిర్వహించడానికి ఇక్కడకు రానున్నారు భారత దేశంలోని ఉత్తమ శస్త్ర చికిత్సా ప్రవీణులలో డాక్టర్ అన్సారీగారు ఒకరు వారు హిందూ మహమ్మదీయుల మధ్యఉన్న వ్రణానికి చికిత్సచేయ సమకట్టి ఉన్నారు అన్సారీగారు కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించినందున హిందూ మహమ్మదీయుల ఐకమత్యానికి దోహదం చేయగలరని గొప్ప ఆశతో అనేక రాష్ట్ర సంఘాలవారు ఆయనను అధ్యక్షునిగా పేర్కొన్నారు కాని అన్సారీగా రిని ఎన్నుకొన్నంత మాత్రంతో మన పని నెరవేరినట్లు తలంచడం పొరపాటు రోగి అయినవాడు ఎంతో నిపుణుడయిన శస్త్ర వైద్యుని పిలిపించినంత మాత్రంతో రోగం నివారణకాదు రోగి వైద్యునితో శారీరకం గాను, మానసికంగానూ కూడ సహకరించక పోతే ఆలోపం మనది కాని వారిది కాదు మద్రాసులో ఉన్న కాంగ్రెస్‌వారి మీద దక్షిణ దేశం నుంచి వచ్చే అధిక సంఖ్యాక ప్రతినిధుల మీదనూ ఈ కాంగ్రెస్‌కు సంబంధించిన యావత్తు కార్యభారం ఉన్నది మీరీ కాంగ్రెస్‌ను నిర్విఘ్నంగా కొనసాగింప కృత నిశ్చయులైనందుకు నాకు పరమ సంతోషము మీ భుజాలపై బడిన ఈ బాధ్యత సామాన్యమయినదికాదు శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారు ప్రతి నిత్యం కాంగ్రెస్ సభా ప్రయత్నాలు గురించి కార్యదర్శితో తంతీ వార్తలు నడుపు తూండటం చూసి నప్పుడు కాంగ్రెస్ సభను గురించి వారికి ఉన్న శ్రద్ధ విదిత మవుతున్నది వారి కష్టం తగ్గించి వారి ప్రయత్నాలను జయప్రదంగా చేయ వలసిన బాధ్యత చెన్నపురిలోని స్త్రీ పురుషులపైన ఉంది మన నాయకులే సర్వమూ చేయగలరని మనం ఊరకుండకూడదు నాయకులను అనుసరించే మనవంటి సామాన్య ప్రజలు నాయకుల కృషికి తోడ్పడటం లేదని అపవాదు ఒకటి ఉన్నది అట్లాంటి అపవాదును చెన్నపురి పౌరులు తొలగించ గలరని ఆశిస్తున్నాను

రాట్నంలోను ఖద్దరు లోనూ మీకు విశ్వాసం ఉందని ప్రకటించినారు మీకు ప త్తిని సరఫరా చేసి తయారయిన నూలును కొనడానికి ఏర్పాట్లు చేసి నట్లయితే నూలు వడకటానికి, బట్టలు నేయడానికి, మీరు విరివిగా పూనుకో గలరని మీ సన్మాన పత్రంలో పేర్కొన్నారు మీకు నిజంగా ఈ విషయంలో శ్రద్ధ ఉంటే మీరు చేయవలసిన పని మరొకటి ఉన్నది అది ఏమంటే మీరే స్వయంగా ఒక సంఘం స్థాపించుకొని ప త్తి సంపాదించి తెచ్చుకొని వడికేవారిని కూడా జత చేసుకొని మీరే ఏకులు చేయటం, కండెలు చుట్టడం మొదలయిన పనుల నన్నిటినీ నేర్చుకోవలె ఇక్కడ తయారయ్యే నూలు నంతనూ నేసేటం దుకు కూడా మీరే ప్రయత్నం చేయవలె ఖద్దరు తయారు చేయటానికి ఇంత కంటే ఉ త్తమము చౌక అయిన మార్గం మరొకటిలేదు స్వయంగా మీరు నేయ జాలని పక్షాన మంచి పురిగల నూలును మీరు తయారు చే స్తే అఖిలభారత చర్ఖా సంఘంవారు దాని నంతటిని తప్పక తీసుకోగలరు

## తాగుడు దురభ్యాసాలు

ఈ పేటలో కార్మికులు ఎక్కువగా ఉన్నారని నేను విన్నాను కార్మిక సోదరులకు ఒక్కమాట మీరు త్రాగుడు జూదం మొదలయిన దురభ్యాసాలను వెంటనే మానివేయవలె మీ జీవితాన్ని, మీ నీతిని మీ బుద్ధిని పాడుచేస్తూన్న తాగుడు పిశాచంను విడిచిపెట్టడం పెద్ద కష్టంకాదు భారత కార్మికులు స్వయం సహాయానికి సంసిద్ధులయితే వారికి మున్ముందు మంచి రోజులు రాగలవు స్వయం సహాయానికి ప్రథమ సూత్రం ఆత్మ పరిశుద్ధత ఆర్థిక స్థితికి సంబంధించి నంతవరకు తమ కంటె కూడా ఎక్కువ పేదరికమనుభవిస్తూ అతులాది సోదరులు బాధ పడుతున్నారని భారత కార్మిక సోదరుడు గ్రహించ వలసి ఉంటుంది అటువంటి గర్భదరిద్రులయిన సోదరీ సోదరులను గురించి అయినా కార్మికు లందరూ ఖద్దరు ధరించక తప్పదు ఇక్కడ చేరిన సోదరీ సోదరు లందరు ఈ ఖద్దరు నిధికి ధనం ఇవ్వలేదని నేనెరుగుదును స్వచ్ఛంద సేవకులిప్పుడే మీ దగ్గరికి రాగలరు మీ కిష్టమయినట్లయితే ఈ నిధికి యథాశ క్తి విరాళమీయవలె ఖద్దరులో నమ్మకంలేని స్త్రీ పురుషు లెవ్వరూ ఒక్కపై సాకూడా ఇవ్వ నక్కరలేదు మనః పూర్వకంగా దరిద్రులిచ్చిన పై సలు ధనికులిచ్చే రూపాయలకు సమానము

## నీల్ సత్యాగ్రహము

నీల్ విగ్రహ సత్యాగ్రహం గురించి ముచ్చటించ వలసిందిగా నన్ను కొందరు కోరినారు ఈ విషయంలో నా అభిప్రాయం సముద్ర తీరం వద్ద జరిగిన సభలో చెప్పినాను నాతో ఈ విషయమై సంప్రదించడానికి వచ్చిన స్వచ్ఛంద సేవకులతో నిన్నా నేడు కూడా ఒక్కొక్క గంట కాలం మాట్లాడినాను వారికీ నాటును జరిగిన సంభాషణ సంగ్రహంగా నేను సరిచూసుకొన్న తరవాత ఒకటి రెండు రోజులలో వార్తా పత్రికలలో ప్రకటించగలము ఈ ఉద్యమం

పట్ల నాకు సంపూర్ణ సానుభూతి ఉంది ప్రస్తుతం ఉన్న స్థలంనుంచి ఆ విగ్రహాన్ని తొలగించవలెననే విషయమై నా మనసులో ఎట్లాంటి సందేహం లేదు ఆ విగ్రహంపై చెక్కిన వాక్యాలను నేను చూసినాను ఆ వ్రాసిన చరిత్ర అసత్యము ఆ స్థలంలో ఆ విగ్రహం ఉండటం మన జాతి అంతకూ చాలా అవమానకరము స్వచ్ఛంద సేవకులు తాము కష్టాలను అనుభవించటం ద్వారా తమ త్యాగంవల్ల ఆ విగ్రహోదంతమును ప్రజలకు తెలియజేసి నందుకు వారిని మనం అభినందించ వలసి ఉన్నది కాని ఈ ప్రపంచంలో ఉత్తమములైన ఉద్యమాలు అనేకాలు సరిగా నిర్వహించనందువల్ల పాడయి పోయినాయి స్వచ్ఛంద సైనికులు ఈ పోరాటం సాగించడానికి సంకల్పిస్తే తమ ఉద్యమమెంత మాత్రం కలుషీభూతం కాకుండేటట్లు జాగ్రత్త వహించవలె

ఇటువంటి పనులను సాధించేటందుకు సత్యాగ్రహం ఉత్తమ సాధనమే కాక అపాయకరమయిన సాధనము ఏమాత్రం కలుషీభూత మయినప్పటికీ సత్యాగ్రహం ఎంతో అపాయకరంగా పరిణమించగలదు ఒక్క విషపుచుక్క స్వచ్ఛమయినపాలనుమానవులు తాగేటందుకు ఎట్లా పనికిరాకుండా చేయగలదో,అట్లాగే ఒకచిన్న కళంకం సత్యాగ్రహసమరాన్ని దానితో సంబంధం కలవారిని కూడా పాడుచేయగలదు సత్యాగ్రహులు ఏ మాత్రం దౌర్జన్యం చేసినా సత్యదూరంగా ప్రవర్తించినా తమ ఉద్యమాన్ని పాపపంకిలంగా చేయడమేగాక తాముకూడా చెడిపోయే మాట వాస్తవము సత్యాగ్రహంలో రహస్యానికి తావులేదు నేను కనీ, వినీ ఎరిగిన పోరాటాలన్నిటిలో సత్యాగ్రహం ప్రత్యక్ష సమరంలో సత్యాగ్రహంలో పిరికితనానికి తావులేదు స్వార్థ చింతతో సత్యాగ్రహం ప్రబోధించడం తన గోతిని తాను తవ్వుకోవటం సత్యాగ్రహ రహస్యమంతా కష్టానుభవంలో ఇమిడి ఉన్నది కాబట్టి ఏమీ ఆర్థిక సహాయం లేకపోయినప్పటికీ సత్యాగ్రహోద్యమం నడపవచ్చు సత్యాగ్రహోద్యమంలో స్వయంగా, ఐచ్ఛికంగా ఎంత ఎక్కువ మంది ఎన్ని ఎక్కువ కష్టాలను అనుభవిస్తారో అంత త్వరలో జయం చేకూరుతుంది

సత్యాగ్రహులు ఈ షరతులను తెలుసుకొని వీటినన్నిటినీ ఆచరణలో పెడితే వారికి జయం నిశ్చయమని నిస్సంశయంగా చెప్పగలను కాని నేను చెప్పిన షరతులలో వారికి విశ్వాసం లేకుంటే సత్యాగ్రహం విడిచివేయడం మేలు ఈ నా షరతులను నిర్వర్తింపజాలక వారు సత్యాగ్రహం విరమిస్తే అది ధీరలక్షణమనే నేను ప్రశంసిస్తాను తన తప్పులను తన పరిమితశక్తిని తాను తెలుసుకొని తాను చేస్తున్న పనినుంచి వెనకకు మళ్ళడానికి కొంత ధైర్యం కావలసి ఉంటుంది కాని నేనిప్పుడు విధించిన షరతులనన్నిటిని వారు నిర్వర్తించడానికి నిశ్చయించుకొంటే వారిని నేను ఆశీర్వదించగలను అంతే కాదు వారు ఈదేశంలోని ప్రతి దేశభక్తుని ఆశీస్సులను, ప్రోత్సాహాన్ని పొందగలరు ' ఈ ఉపన్యాసానంతరం మహాత్ముని పుష్పమాలాలంకృతునిచేయడంతో సభ ముగిసింది

### దేశబంధు చిత్రపటావిష్కరణ

సెప్టెంబరు 9 సాయంకాలం మద్రాసు మహాజనసభలో శ్రీ యస్ సత్యమూర్తి బహూకరించిన దేశబంధు చిత్తరంజనదాసు చిత్రపటాన్ని మహాత్మాగాంధీ ఆవిష్కరించినారు ఆ సభకు చాలామంది హాజరయినారు

### స్త్రీలకు గాంధీజీ సలహా

సెప్టెంబరు 9 సాయంకాలం హిందూ హైస్కూల్ సింగరాచారిహాలు వివిధ తెగలకు చెందిన స్త్రీలతో పూర్తిగా నిండిపోయింది వారు మద్రాసు మహిళలపక్షాన గాంధీజీకి సన్మానపత్రం, ఖద్దరునిధికి విరాళం సమర్పించ దలుచుకొని అక్కడ సమావేశమయినారు

మహాత్మాజీ సరిగా 4 గంటలకు శ్రీమతి కస్తూరిబాయి గాంధీతో సమావేశ స్థలానికి చేరుకొన్నారు ఆసమావేశం ఏర్పాటు చేసిన డాక్టర్ ముత్తులక్ష్మి రెడ్డి, శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ, శ్రీమతి యిం ఇ కజిన్స్ వారికి ఎదురేగి ఆహ్వానించినారు సభ బాలికల జాతీయగీతాలతో ప్రారంభమయింది శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ ఖద్దరునిధికి గాంధీజీకి 550 రూపాయల విరాళం సమర్పించినారు

### గుజరాతీల విరాళం

గాంధీజీకి సన్మానపత్రం ఖద్దరునిధికి విరాళం సమర్పించేటందుకు మద్రాస్ నగరంలోని గుజరాతీలు, మార్వారీలు చాలా మంది ఏకాంబరేశ్వర అగ్రహారంలో సెప్టెంబరు 9వ తేదీ ఉదయం సమావేశమయినారు శ్రీమతి కస్తూరిబాతోసహా మహాత్మాజీ అక్కడకు వచ్చినారు ఆయన రాగానే సుప్రసిద్ధులైన గుజరాతీలు వారిని ఆహ్వానించి తాము ప్రత్యేకం నిర్మించిన వేదిక దగ్గరికి తీసుకొనివెళ్ళినారు మహాత్మునికి హిందీ సన్మానపత్రంతోసహా 1701 రూపాయలు విరాళం సమర్పించినారు గాంధీజీ గుజరాతీలో సంగ్రహంగా మాట్లాడినారు

### సెంట్ థామస్ మౌంట్ సన్మానపత్రం

సెప్టెంబరు 9 రాత్రి గాంధీజీ మద్రాస్ పదలివెళ్ళేముందు ఆయన తుదిసారిగా సెంట్ థామస్ మౌంట్ వద్ద బహిరంగసభలో పాల్గొన్నారు సెంట్ థామస్ మౌంట్ దగ్గర ఉన్న ఆడంబాకంపల్లెలో ఈ సమావేశం జరిగింది మహాత్మాజీ ఈ సమావేశ స్థలానికి రాకముందే ఆయన దర్శనంకోసం ఆయన సందేశం వినేటందుకు 8 వేల మందికిపైగా జనం అక్కడ చేరినారు వారిలో చాలామంది స్త్రీలు కూడా ఉన్నారు గాంధీజీకి ఆయన నిర్వహిస్తున్న కార్యాలను ప్రశంసిస్తూ 1158 రూపాయల 8 అణాల 10 పైసలు ఆ సమా

వేశకర్తలు ఖద్దరునిధికి విరాళంగా సమర్పించినారు ఆ ప్రదేశంలోని పౌరులు, జైనసంఘంవారు, 'పొడుజన ఉఝియా' సంఘంవారు (Podujana oozhia Sangham) విడివిడిగా సన్మానపత్రాలను సమర్పించినారు తరవాత జన సమూహంలోకిపోయి విరాళాలు వసూలుచేసినారు అంతటితో సభ ముగిసింది

## గాంధీజీ వీడ్కోలు సందేశము

సెప్టెంబరు 9 రాత్రి గాంధీజీ మద్రాస్ వదలి కడలూరుకు పోతూ మద్రాసు పౌరులకి సందేశమిచ్చినారు

"నేను మద్రాసులో మాట్లాడిన అన్ని సభలలోను ముఖ్యంగా ఖాదీని గురించే మాట్లాడినాను అయినప్పటికీ శ్రోతలలో ఉత్సాహం తగ్గినట్లుగానీ, వారికి విసుగు వచ్చినట్లుగానీ నేను గమనించలేదు ఈ విషయంలో నేను మోసపోవడం లేదనుకొంటున్నాను అంతేకాదు ఖాదీ దుస్తులలోలేని ప్రతి ఒక్కరూ తప్పకుండా క్షమాపణ చెప్పుకొన్నారు ఆర్థిక సహాయం కూడా సంతృప్తికరంగానే ఉన్నది ఖాదీ అమ్మకాలు ప్రోత్సాహకరంగా ఉన్నాయి నామీద మద్రాసు పౌరులు చాలా వ్యక్తిగతప్రేమ కనబరిచినారు నేనెప్పుడో 1896లో మద్రాసు వచ్చినప్పుడే నామీద ప్రేమామృతం వర్షింపచేసినారు అట్లా చేస్తారని అప్పుడు నేను అనుకోలేదు అప్పుడందుకు అర్హుణ్ణి కాను కూడా నేను మద్రాస్‌కు రావడం అదే మొదట అప్పుడు నేను మద్రాస్‌లో వ్యక్తిగతంగా ఎవ్వరినీ ఎరుగను అప్పుడు కేవలం మద్రాసు నన్ను నమ్మింది" అని అంటూ "రాబోయే కాంగ్రెస్‌కు చేయవలసిన సన్నాహాలు చివరి నిమిషం వరకు వాయిదా వేయవద్దని నేను మద్రాసు పౌరులను కోరుతున్నాను శ్రీ ద్విజేంద్రనాథ్ సేన్ ఇచ్చిన సలహాను మద్రాస్ పౌరులు కార్యరూపంలో చూపగలరని నాఆశ కాంగ్రెస్ సభ జరిగేలోగా మద్రాస్‌లో బ్రాహ్మణ, బ్రాహ్మణేతర వివాదాలు చెలరేగనట్లయితే మద్రాసు పౌరులు కాంగ్రెస్ సభ వారంలో ఖాదీ ఉత్పత్తిని గురించి ప్రశంసాపాత్రంగా ప్రదర్శించగలరని కూడా విశ్వసిస్తున్నాను"

## ఉత్తమ సేవకురాలి నిర్యాణము

శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి అకాల మరణం గురించి మహాత్మా గాంధీ పై శీర్షిక కింద ఇట్లా వ్రాసినారు

"1921లో బెజవాడలో ఒక మహిళా మహాసభ జరిగింది అక్కడ ఖద్దరు ధరించిన ఒకే ఒక బాలికను చూసినాను ఆమె ఆ సభలో అటూ ఇటూ చురుకుగా తిరుగుతూ శ్రద్ధ వహించి సభలో శాంతిని నెలకొల్పుతూన్నదే నాకు జ్ఞాపకమున్నంత వరకు ఆమె విలువగల తమ ఆభరణాలను అన్నిటినీ గాజులను బరువుగల బంగారు గొలుసుతో సహా నాకు సమర్పించిన వారిలో మొట్టమొదటి ఆమె 'నీవు నీ తల్లిదండ్రుల అనుజ్ఞ తీసుకొన్నావా?' అని ఆమె నాకా నగలు

ఇస్తుండగా అడిగినాను నా తల్లిదండ్రులు నన్ను కాదనరు నా యిష్టం వచ్చినట్లు చేయనిస్తారు అని అన్నది ఆమె ఆమె ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడింది ఆమె కలకత్తాలోని బెతూన్ కళాశాలలో విద్యాభ్యాసం చేసింది ఆమె ఆస్త్రీల సమూహంలోకి వెళ్ళి ధనము, నగలు వసూలుచేసి తెచ్చి ఇచ్చింది ఆమె ఆనాటి నుంచి ఉద్యమంతో సంబంధం పెట్టుకొన్నది అంతేకాదు ఆమె ఆ ఉద్యమానికి తన జీవితాన్ని అంకితం చేసుకొన్నది ఆమె కాకినాడ కాంగ్రెస్ నాడు స్త్రీల స్వచ్ఛంద సైనిక దళాధిపతిగా పనిచేసింది ఆమె ఆనాడు చేసిన అద్భుత సేవకు అనేకమంది ఆమెను ఉత్తేజకరమైన భాషలో కొనియాడినారు దురదృష్ట వశాత్తు ఆమె ఆరోగ్యమప్పటికే సరిగా లేరు ఆమె శ్రీ మాగంటి బాపినీడు గారిని వివాహమాడింది నేను కోయంబత్తూరులో ఉండగా ఆమె చనిపోయిన కొన్నాళ్ళకు ఆ వార్తను గూర్చి హఠాత్తుగా నాకొక టెలిగ్రాం వచ్చింది తర వాత బాపినీడుగారు నాకొక ఉత్తరం వ్రాసినారు నన్ను అతురాలా ఎనుసరించే వారిని అనేకమందిని నేను పోగొట్టుకొన్న మాట వాస్తవమే కాని భారత దేశంలో అదృష్టవశాత్తు నేను అనేక మందిని నా కుమార్తెలుగా భావిస్తున్నాను ఇప్పుడు నేను నాకుమార్తెలలో ఒకామెను పోగొట్టుకున్నట్లు చింతిస్తున్నాను ఈమె నా బిడ్డలలోకెల్ల ఉత్తమురాలు ఆమె నిశ్చలమయిన విశ్వాసం కలది ఆమె ఎన్నడూ కీర్తినిగాని, మెప్పును గానీ ఆశించలేదు ఆమె పవిత్రత వల్లను శ్రద్ధా భక్తుల వల్లన, వినమ్రతవల్లను తన భర్తను వశంవదునిగా చేసుకొన్నట్లే భారత దేశంలోని అనేక మంది సతీతిలకాలు తమ సుగుణ సంపదతో తమ భర్తలను వశపరచు కోగలరని ఆశిస్తున్నాను మాతృదేశ సేవా తత్పరత్వంలో అన్నపూర్ణాదేవి చిక్కి, చివికి జీర్ణమయినందుకు ఆమె భర్త నన్ను మృదువుగా మందలించడం నేను అర్థం చేసుకోగలను భారత దేశం లక్షలాది ప్రజలు నమ్ము తున్నట్లు పురాతన కాలంలో వలె మరొక పర్యాయం స్వాతంత్ర్యంతో, ద్విగుణీకృత పవిత్ర భావంతో వర్ధిల్ల వలెనంటే అనేకమంది యువతీ యువకులు ఈ సాధ్వీమణిని పూర్తిగా అనుకరించ వలసి ఉంటుంది అందుకేమీ సందేహం లేదు

ఆమెకు స్మారక చిహ్నం నిర్మించడానికి ఏర్పడనున్న కమిటీలో నేను సభ్యుడుగా ఉండజాలను నాకు లెక్కలేనన్ని పనులున్నవి వందల కొద్దీ కమిటీలలో సభ్యుడుగా ఉండే భారం నేను వహించజాలను ఏ కమిటీలోను కేవలం అలంకారప్రాయంగా నేను సభ్యుడుగా ఉండజాలను నా పేరు కమిటీ సభ్యుడుగా అరువీయడంకూడా నాకు ఇష్టంలేదు. అన్నపూర్ణాదేవివంటి ధైర్యవంతురాలు, పవిత్రురాలు అయిన స్త్రీకి శాశ్వత మయిన స్థానిక స్మృతి చిహ్నం ఉండవలె ననడంలో నాకెంత మాత్రం సందేహంలేదు అయితే, ఆమె సుగుణాలకు తగిన భర్తయే ఆమెకు ఉత్తమోత్తమయిన స్మృతి చిహ్నము ఆయన తన అర్ధాంగి అడుగు జాడలలో నడచుకొని దేశ సేవా తత్పరుడు కావలె ఎందువల్లనంటే అన్నపూర్ణాదేవి దేశసేవలోనే తనువు విడిచినట్లు

ఆయన మాటలలోనే వ్యక్తమవుతున్నది "

యంగ్ ఇండియా — యం కె గాంధీ
27-10-1927

## సీల్ సత్యాగ్రహము -
## సాంబమూర్తిగారికి గాంధీజీ సలహా

బులుసు సాంబమూర్తిగారు డిశంబరు 1వ తేదిని (1927) చెంగల్పట్టు రైల్వేస్టేషన్‌లో గాంధీగారిని కలుసుకొని వారితో రైలులో మద్రాసుకు వచ్చినారు సీల్‌విగ్రహ సత్యాగ్రహం గురించి గాంధీజీ సలహాను వారు కోరినారు గాంధీజీ చాలా పనిలో ఉండినప్పటికీ సాంబమూర్తిగారి మాటలు సావధానంగా విని దిగువ సూచనలు చేసినారు

1 సీల్ సత్యాగ్రహంలో అనేక ప్రశ్నవిషయాలు ఇమిడిఉన్నాయి ఈ ఉద్యమ ప్రభావం చెడిపోకుండా దీనిని సజీవంగా ఉంచవలె
2 సత్యాగ్రహోద్యమ జయాపజయాలు స్థానిక ప్రజాభిమానాన్ని బట్టి, ఉత్సాహాన్ని బట్టీ ఉంటాయి
3 మద్రాసు నగరమునుంచి తగినంతమంది సత్యాగ్రహులు ఈ ఉద్యమంలో పాల్గొనేవరకు ఆంధ్రదేశంనుంచి, తమిళనాడునుంచి రాదలుచుకొన్న సత్యాగ్రహులు ఆగిపోవడం మంచిది
4 ఆంధ్ర తమిళనాడులనుంచి మద్రాసుకు రాదలిచిన సత్యాగ్రహులు కేవలం నడిచి రావలె
5 చాలా దూరస్థలాలనుంచి వచ్చే సత్యాగ్రహులు తమ రైలు ఖర్చులను ఎవరినయినా అడిగి తెచ్చుకోవచ్చు
6 ఇదివరలోవలె సుత్తెలు, సమ్మెటలు పుచ్చుకొని సత్యాగ్రహానికి పోకూడదు ఇకముందునుంచి రేగడిమన్ను ఉండలను విగ్రహంమీద విసిరికొట్టవలె
7 ఈ సీల్‌విగ్రహం తీసివేయవలసిందని, బహిరంగవీధులలో ఉంచవద్దని కోరుతూ వీలయినంత త్వరలో ఒక పెద్ద మహజరును, వేలకొద్దీ మద్రాసు పౌరుల సంతకాలతో పంపవలె
8 నగర సంకీర్తనలను, భజన సంఘాలను ఏర్పాటుచేసి మద్రాసు వీధులలో ఊరేగవలె
9 సీలువేసిన డబ్బాలను నమ్మకమయిన వలంటీర్లకు ఇచ్చి నగరమంతటా చందాలు వసూలు చేయవలె
10 పత్రికలలోను, సభలలోను, కరపత్రాల ద్వారానూ ఈ విషయమై నిరంతరాందోళనచేస్తూ ప్రచారం సాగించవలె

## మహాత్ముని గంజాం జిల్లా సంచారం

గాంధీమహాత్ముడు డిశంబరు 2వ తేదినుంచి 7 వ తేదీ వరకు గంజాం

జిల్లాలో సంచారం చేసినారు వారు మద్రాస్ నుంచి గంజాం జిల్లాకుపోతూ ఉండగా మధ్యలో బెజవాడ మొదలుకొని ప్రతిస్టేషనువద్ద వేలకొద్దీ జనం ఆయన దర్శనానికి వేచిఉన్నారు ఆయనకు వారు ప్రతిస్టేషనులోను పూల హారాలు, పండ్లు సమర్పించినారు బెజవాడ, ఏలూరు, తాడేపల్లిగూడెం, నిడుదవోలు, కొవ్వూరు, గోదావరి, రాజమహేంద్రవరం, సామర్లకోట, తుని, అనకాపల్లి, వాల్తేరు, విజయనగరం మొదలయిన స్టేషనులన్నిట్లో వేల కొద్దీ జనం మహాత్ముని దర్శనం చేసుకొన్నారు ఏలూరులో 10 వేల మందికి పైగా రైలుస్టేషనుకు వచ్చి గాంధీజీకి ఖద్దరునిధికి కానుకలను సమర్పించు కొన్నారు ఆయాస్టేషన్ లలో చిల్లరగా ప్రజలు సమర్పించిన ధనం సుమారు 600 రూపాయలవరకూ అయింది శ్రీకాకుళంస్టేషన్‌కు ఒకగంట ఆలస్యంగా రైలు చేరింది వేలాది జనం ఆయన దర్శనంకోసం వేచిఉన్నారు డిశంబరు 2వ తేది ఉదయం శ్రీకాకుళంలో స్త్రీలసభ, మునిసిపల్ సన్మానసభ, ఖద్దరు కార్య కర్తలసభ మొదలయినవి జరిగినాయి శ్రీకాకుళంలోని వివిధ సంఘాలవారు ఖద్దరునిధికి 2వేల రూపాయలు సమర్పించినారు పర్లాకిమిడిలో 10వేల మంది జనం సమావేశమయి సన్మానపత్రాలను ఖద్దరునిధికి ధనం సమర్పించినారు

ఈ సంచారంలో గాంధీజీతో మీరాబాయి (స్లేడ్ కన్య), కాకాకలేల్ కర్, ప్యారేలాల్, దేశభక్త వేంకటప్పయ్యగార్లు ఉన్నారు గంజాం జిల్లాలో ఖద్దరునిధికి మొత్తం 28వేల రూపాయలు లభించినాయి

బరంపురంలో 2400 రూపాయలు, ఛత్రపురంలో 2 వేలు, శ్రీకాకుళంలో 2వేలు, కల్లికోటలో 1500 రూపాయలు లభించినాయి

## హైదరాబాదు సంస్థానంలో ఖాదీ

'జాతీయ ఆర్థిక విధానంలో ఖాదీకిగల స్థానం గురించి భారత సంస్థా నాధీశులు గుర్తిస్తున్నందుకు చాలా సంతోషము అట్లా గుర్తించిన వారిలో మరీ ఇటీవలి వారు హైదరాబాద్ సంస్థానంవారు నిజాం రాష్ట్రంలోని పారి శ్రామిక శాఖవారు ఇటీవల ఖాదీ పరిశ్రమలోని నైపుణ్యం గురించి పరిశీలించ డానికి సత్యాగ్రహాశ్రమానికి ఒక ఇన్‌స్పెక్టర్‌తోపాటు ఖాదీ పరిశ్రమలోని వివిధ దశలను నేర్చుకునేటందుకు ఇద్దరు యువకులను కూడా పంపినారు ఆ యువకులకు ఆశ్రమ జీవితం, బహుశా అక్కడి శీతోష్ణస్థితి సరిపడనందువల్ల వారు పూర్తిగా శిక్షణ పొందలేక వెళ్ళిపోయినారు అసలు విషయం ఏమంటే ఖాదీని గురించి సంస్థానాధిపతులు ఆలోచించడం ప్రారంభించినారు ఇన్‌స్పెక్టర్ మౌల్వీ మహమ్మదాలీ అత్యుత్సాహంతో రాట్నపు ప్రాముఖ్యం పూర్వంకంటే ఎక్కువగా గుర్తించినట్లు కనిపిస్తుంది హైద్రాబాద్ పారిశ్రామిక శాఖవారు అఖిల భారత ఖాదీ సంఘంవారితో సన్నిహిత సంబంధం కలిగి హైదరాబాద్‌లో ఖాదీ పనిని సరియైన వ్యాపార సరళిలో నడపగలరని ఆశిస్తున్నాను, ఇటీవల

మైసూరు దివాన్ శ్రీ మీర్జా మహమ్మద్ ఇస్మాయిల్ నిమ్న జాతుల ద్వారా జరుగుతున్న ఖాదీ పనిని స్వయంగా పరీక్షించినారు. దివాన్‌తో కలసి ఖాదీ పరిశ్రమ చూడటానికి వెళ్ళిన శ్రీయుత పూజారి, దివాన్ ఖాదీ పనిని ఎక్కువగా శ్లాఘించినాడని, రాట్నము రైతులకు అదనపు వృత్తిగా ఉండటమే కాక దళిత జాతుల అభివృద్ధికి దోహదకరంగా ఉంటుందనికూడా ఆయన అన్నట్లు నాతో చెప్పినాడు

యంగ్ ఇండియా యం కె గాంధీ
17-5-1928

## (2) హైదరాబాద్ సంస్థానంలో ఖాదీ
(యం కె గాంధీ)

"ఇటీవల హైద్రాబాద్ సంస్థానంలో జరిగిన సహకార మహాసభలో ఆ సంస్థానపు ఆర్థిక మంత్రి సర్ హైదర్ నవాజ్ జంగ్ బహద్దుర్ ప్రసంగవశంలో రాట్నంగురించి ఇచ్చిన ఉపన్యాసం ఒక స్నేహితుడు ఇంగ్లీషులోకి అనువదించి నాకు పంపినాడు దాని సారాంశం ఇది

"నేను మీ దృష్టికి తేదలచుకొన్న అత్యంత ప్రాముఖ్యమయిన విషయం మన గృహ పరిశ్రమలను గురించినది వాటిని సుస్థిరంగా చేసి వాటికి సహాయం చేయడం సహకార సంఘాల ప్రధాన కర్తవ్యము సహకార సంఘాలు గృహ పరిశ్రమలకు కావలసిన పరికరాలను, ముడి పదార్థాలను ప్రజలకు సరఫరా చేయగలిగితే దేశానికి ఎంతో మేలు చేసినట్లవుతుంది అందుకు ఉదాహరణంగా నూలు తీయడం, నేయడం పనులను నేను పేర్కొంటాను మన పట్టణాలలోను గ్రామాలలోను ఆ రెంటినీ పునరుద్ధరించితే మనం చాలా గొప్పపని సాధించినట్లే మొన్న మొన్నటి వరకూ మన ఇండ్లలో వడకటం, నేయటం సాధారణంగా జరుగుతూనే ఉండేది ఇట్లా జరగడం పేదల గుడిసెలలోనే కాదు భాగ్యవంతులు, భోగులూ అయినవారి ఇళ్ళలోకూడా జరుగుతూండేది ఖాళీ కలు వారి తల్లులు తమ విశ్రాంతి కాలం నూలు వడకటానికి ఉపయోగించే వారు ఇండ్లలో వాడుకునేందుకు కావలసిన తివాచీలు, దుప్పట్లు, పరదాలు, మేజు (Table) బట్టలు మొదలయినవన్నీ కుటుంబ స్త్రీలే తయారు చేసుకొనే వారు బ్రతుకు తెరువుకు మరొక వృత్తిలేని మర్యాదగల వితంతువు లందరూ తమను, తమ బిడ్డలనూ వడుకు నూలువల్లను, కుట్టుపని వల్లనూ పోషించుకొనే వారు ఈ వృత్తిని మీరు ప్రజలలో వ్యాపింపజేసి నందువల్ల పేదలకు అదనపు ఆదాయం చేకూర్చడానికి ఉపయోగ కరమయిన పని చూపించడమేగాక ఇతర వ్యసనాలకు బలి కాకుండా కూడా రక్షించిన వారవుతారు ఈ శాఖలోని ఉత్సాహవంతులైన మన ఉద్యోగస్థులు ఈ సంవత్సరమే ఈ పని ప్రారంభించ వలసి ఉంటుంది మరుసంవత్సరపు నివేదికలో ఈ మంచిపని ఎంతవరకు సాగిందో నేను జాగ్రత్తగా పరిశీలించగలను.....

సమాజానికి వెలిగాఉన్న మనిషి పశుతుల్యుడనే మాట మనం మరిచి పోకూడదు తన ఇరుగు పొరుగు వారితో పరస్పర సహకార, సానుభూతులు కలవాడే దాదాపు దేవతలతో తులతూగగలడని నిర్వచింప బడింది మన మంద రమూ విడివిడిగా ఎవరికివారు తమ పొట్ట తాము పోసుకొంటూ, నీవు నీవే, నేను నేనే అనుకొంటూ బ్రతుకుతూన్నంతవరకు మనం మనుషుల మనే పేరుతో ఉండే పెద్ద జంతువులము మాత్రమే నేనూ, నీవూ కలసి మనము అనే స్థితికి వచ్చినప్పుడు మనమొక దైవశక్తిని పెంపొందించుకోగలము ఇట్లా పెంపొందిన దైవశక్తికే సహకారమని పేరు "

ఈ ఉపన్యాసానికి హైదరాబాద్ మంత్రిని నేనభినందిస్తున్నాను హైద్రాబాద్ సంస్థానం రాట్నం వ్యాపకం చేయడంలో మైసూర్ సంస్థానంతో పోటీ చేయగలదని విశ్వసిస్తున్నాను నూలు వడకటంలో సహకారం తేలిక ఖాదీని సుస్థిరంగా చేయవలెనంటే సహకారం తప్పనిసరి నూలు వడుకు సహకార సంఘానికి పత్తి డిపో ప్రాతిపదికగా ఉండవలె మిల్లులో బంగీలుగా తయారు చేయబడిన పత్తికాక మామూలు సంచులలో ఉన్న పత్తి ఆ అంగడిలో ఉండవలె అదే ఏకడానికి పనికివస్తుంది ప్రారంభదశలో వడికే వారికి ఏకటం చేతకానప్పుడు ప్రత్యేకం ఏకేవారు కూడా ఉండవలె ఈ డిపోలో పత్తి నుంచి గింజలు తీసే పని ముట్లు, ఏకే కమానులు, రాట్నాలు వాటికి కావలసిన ఇతర పరికరాలు, వాటిని మరమత్తు చేయటానికి కూడా తగిన అవకాశాలు ఉండవలె ఆ డిపో వస్తువును తీసుకునేదిగా, అమ్మేదిగా, పంచిపెట్టేదిగా కూడా ఉండవలె కావలసిన ఏకులను గానీ పత్తినిగానీ సరఫరా చేయగలిగి ఉండవలె వడికిన నూలును సభ్యుల నుంచి నగదు ఇచ్చి కొనవలె సభ్యులకు వారు వడికి తెచ్చే నూలు నుంచి కాని కొని తెచ్చే నూలునుంచి కానీ బట్టనేసి అమ్మగలిగి ఉండవలె నూలువడికే సభ్యులకు ఖద్దరు వస్త్రాలు ప్రత్యేక ధరలకు అమ్మవలె ఇతరులకు మామూలు ధరలకు అమ్మవలె అటువంటి సంఘాలు పూర్తిగా గానీ కొంతగా గానీ ప్రభుత్వ ప్రోత్సాహంతోనో, ప్రభుత్వ సహాయంతోనో నడుస్తూంది నట్లయితే సామాన్య ప్రజల సహకారావకాశాలకు మేర ఉండదు ఇది నిజము ఇదంతా ఉద్యోగస్థులలో ఖాదీ చిత్తవృత్తి ఉన్నప్పుడు మాత్రమే జరుగుతుంది అంటే ఉద్యోగస్థులు సామాన్య ప్రజానీకానికి ట్రస్టీలుగా ప్రేమాస్పదులుగా ఉండి వారిలో కలసి పోవలె అంతేకాని చాలీచాలని కూలి డబ్బులతో చెమట వోడ్చి పనిచేసే సామాన్య ప్రజానీకానికి తాము ప్రభువులమనో, యజమానులమనో

భావించకూడదు హైదరాబాద్ ఆర్థిక మంత్రి తన ఉపన్యాసంలో చూసిన అసక్తిని తన ఉద్యోగులలో వ్యాపింప జేయగలిగితే సంస్థాన ప్రజలకు ఉజ్జ్వల భవిష్యత్తు ఉందని నమ్మవచ్చు మైసూరువలెకాక హైదరాబాద్‌లో పత్తి పండించేభూమి విస్తారంగా ఉన్నది

యంగ్ ఇండియా

1928 [illegible] 20

# 14
# గాంధీమహాత్ముని ఆంధ్రదేశ సంచారము (1929)

1929 ఏప్రిల్‌లో జరగనున్న తన ఆంధ్రదేశ పర్యటన గురించి గాంధీజీ 'యంగ్ ఇండియా'లో ఇట్లు వ్రాసినారు

"నా అధీనంలో లేని అనేక పరిస్థితులవల్ల ఆంధ్రదేశ మిత్రులకు నేను పదేపదే ఆశాభంగం కలిగించవలసివచ్చింది అందుకు నన్నువారు క్షమించవలె నాకు వీలయినట్లయితే ఇంతకుముందే నేను ఆంధ్రదేశానికి వచ్చిఉండేవాణ్ణి. నేను ఏప్రిల్ నెల ప్రారంభంలో ఆంధ్రదేశానికి రాగలనని అనుకొంటున్నాను అంటే బొంబాయినుంచి ఆంధ్రదేశానికి ఏప్రిల్ 5, 6 తేదీలలో బయలుదేరగలను మే 14వ తేదీని అలహాబాద్‌లో జరిగే అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి వెళ్ళితీరవలె కాబట్టి ఆంధ్రదేశంలో ఒక నెలపైచిలుకు మాత్రమే ఉండగలను నేనింకా ఎక్కువకాలమే ఆంధ్రలో ఉండవలెనని కోరిక వున్నది కాని వీలు పడడంలేదు కాని మంచి ఏర్పాట్లుచేస్తే నేను ఉండే ఆ నెలలోనే ఎక్కువ పని జరగగలదు

నేను పూర్తిగా ఖాదీకోసమే ఈ పర్యటనం చేస్తున్నాను కాని లాలా లజపతిరాయ్ స్మారకనిధికి కూడా విరాళాలను నేను అంగీకరిస్తాను ఈ యాచన మాట అట్లా ఉండగా కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమాలను తీర్మానం-ముఖ్యంగా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారిచే పేర్కొబడిన బహిష్కార ప్రణాళికను గురించి తీవ్రమయిన ప్రచారం చేయవలెనని అనుకొంటున్నాను ఆంధ్రదేశం బహిష్కార ప్రచారానికి ఎంతో దోహదంచేసి ప్రోత్సహించనట్లయితే నావిచారానికి మేరఉండదు సన్న నూలును గురించి వారెక్కువగా కృషి చేయవలె ముతకనూలునుగానీ, సన్ననూలునుగానీ ఉత్పత్తి చేయడానికి వారికి అంతులేని శక్తిసామర్థ్యమున్నది వారికి కావలసినంత పత్తి పండుతుంది వారికి సమర్థులైన కార్యకర్తలుఉన్నారు వారు దేశభక్తిలో పరరాష్ట్రీలవారికి తీసిపోరు అయితే, వారిలో నాయకులు చాలా ఎక్కువమంది అనుచరులు మాత్రం చాలా తక్కువ వారి సర్వతోముఖ శక్తి సామర్థ్యాలు చిన్నచిన్న అసూయలను, చిల్లర తగాదాలనూ ప్రేరేపిస్తున్నాయి నేను ఆంధ్రదేశానికి వచ్చేలోగా వారందరూ ఎవరికివారు నాయకుల

మనుకోకుండా అందిరూ కలిసిమెలసి ఉండి అణకువగల అనుచరులుగా ఉండ కలగడం వారి శక్తికి మించినపని అని నేను అనుకోను ఇక విరాళాలను సమర్పించడం గురించి ఒకమాట ప్రత్యేక పనులకోసం ఇచ్చే విరాళాల గురించి నేనిదివరకే కొన్ని సూచనలు చేసినాను స్థానిక కార్యాలకు నా పేరు ఉపయోగించకూడదు స్థానిక కార్యాలు వాటి గుణగణాలమీదనే ఆధారపడి ఉండవలె స్థానిక కార్యాలకు కావలసిన ఆర్థిక సహాయం స్థానిక కార్యకర్తల సౌశీల్యంపైన, నమ్మకంపైన, శక్తిసామర్థ్యాలపైన ఆధారపడి ఉండవలె ఇది నాఅభిప్రాయము నేను ఖాదీకి వసూలుచేసే సొమ్ములో ఎక్కువభాగం ఆ రాష్ట్రం ఖాదీ ఉత్పత్తికి కేంద్రం అయినట్లయితే ఆ రాష్ట్రంలోనే వెచ్చింప బడుతుంది స్థానికంగా ఖాదీ ఉత్పత్తికాని సింహళం, బర్మావంటి రాష్ట్రాలలో నేను వసూలుచేసిన సొమ్ము యావత్తు ఆ రాష్ట్రాలకు వెలుపలనే ఉపయో గించడం జరుగుతుంది ఆంధ్ర దేశానికి సంబంధించినంతవరకు నాపర్యటన ముఖ్యంగా ఆంధ్రలో ఖాదీ ఉత్పత్తికోసం విరాళాలు పోగుచేసేటందుకు మాత్రమే వినియోగించటానికి ఉద్దేశించినాను ఇప్పటికీ అదే నిర్ణయము అయితే ఈ విరాళాలలో కొంతభాగం కేంద్ర కార్యాలయం నడిపేటందుకు ఉపయోగ పడుతుంది కార్యకర్తలు ముందుగా నాఅంగీకారం పొందిగాని ప్రత్యేక కార్యాలకోసం విరాళాలు ఇచ్చే పద్ధతిని అనుసరించకూడదు అటువంటి సూచనలన్నీ ఈ కార్యక్రమానికి యాజమాన్యం వహిస్తున్న దేశభక్త వేంకటప్పయ్యగారి ద్వారా ఆయన సిఫారసుతో నాకు రావలె

ఉత్సాహవంతులయిన కార్యకర్తలందరూ నాపట్ల దయకలిగి ఉండవలె నాశరీరాన్ని సరియైనస్థితిలో ఉంచేభారం పూర్తిగా కాకపోతే నాతోపాటు వారు కూడా వహించవలె నాశరీరం జాతిసొత్తు అనీ, నేను దానికి బాధ్యత వహించవలసినపనిలేదనీ చాలామంది నాతో అంటూ వచ్చినారు నేనాసంగతి పూర్తిగా అంగీకరించలేకుండా ఉన్నాను ఆంధ్ర జాతీయ నాయకులు నాకు అటువంటి విశ్వాసాన్ని కలిగించగలరని ఆశిస్తున్నాను

కూడని పనులు కొన్ని కింద సూచిస్తున్నాను

నా శరీరానికి 6 గంటల కంటే ఎక్కువ శ్రమ ఇవ్వవద్దు

సభలలోగాని, మరొకచోటగాని గందరగోళం చేయకూడదు

ఈ రేగింపులు పనికిరావు

పెద్ద పెద్ద ప్రదర్శనలు వద్దు

ఒక్కరోజులో లెక్కలేనన్ని పనులు పెట్టకూడదు.

నా పర్యటనకు సంబంధించని చోట్లకుగాని, విరాళాలురాని చోట్లకుగానీ నన్ను తీసుకొని పోవద్దు

వ్యక్తుల గొప్పతనాన్ని, వారికోరికలనూ సంతృప్తిపరిచేటందుకు నన్ను తీసుకొని పోవద్దు

నన్ను అంతులేని స్థలాలకు తీసుకొని వెళ్ళవద్దు

నా శరీరం కేవలం ఒక మట్టిముద్ద అని భ్రమపడకండి అది మట్టిముద్ద అయిన మాట నిజమేగానీ దానిలో అత్యంత సున్నిత విషయాలను గ్రహించ గలిగిన ఒక సూక్ష్మ జీవమున్నది అది ఈ మట్టిగూడుకు తటస్థించే ప్రతి సంఘట నను పరిశీలిస్తూంటుంది "

యంగ్ ఇండియా
1929 మార్చి 7

## మహాత్ముని రాక - హైదరాబాద్

మహాత్ముని ఆంధ్రదేశ పర్యటన హైద్రాబాద్‌లో ప్రారంభమయినదని చెప్పవచ్చు గాంధీజీని హైద్రాబాద్ నివాసి డాక్టరు లతీఫ్ వాడీ జంక్షన్‌లో కలుసుకొని గాంధీజీతో వచ్చినవారి అందరి సౌకర్యాలను ఆడంబరం చేయ కుండా చూస్తూవచ్చినారు హైద్రాబాద్ స్టేషన్‌లో ఏప్రిల్ 6 సాయంకాలం దిగే సరికి వేలకొలది ప్రజలు అత్యుత్సాహంతో గాంధీజీని ఆహ్వానించినారు గాంధీ జీతో శ్రీమతి కస్తూరిబా గాంధీ కూడా ఉన్నారు హైద్రాబాద్ ప్లాట్‌ఫారం మీద జనం ఒత్తిడి ఎక్కువగా ఉండటంచేత ఆయన రైలు వెనకనుంచి దిగవలసి వచ్చింది అక్కడకూడా జనం ఇసకవేస్తే రాలనంత క్రిక్కిరిసి ఉండటంచేత గాంధీజీని మోటారు కారు దగ్గరికి తీసుకొని పోవడానికి 45 నిమిషాలు పట్టింది ఆయన సరోజినీదేవిగారి గోల్డెన్ త్రెషోల్డులో బసచేసినారు డాక్టర్ నాయుడు, పద్మజా నాయుడు వారికి అన్ని సౌకర్యాలూ చేకూర్చడంచేత, వారు తమ సొంత ఇంట్లో ఉన్నట్లు కులాసాగా కాలం గడిపినారు అక్కడి సమావేశా లన్నీ వామన్‌రావు నాయక్ యాజమాన్యం కింద జరిగినాయి ఆయనగారి స్వచ్ఛంద సైనికులు చాలా సమర్థతతో పని చేసినారు వారి సహకారం హైదరాబాద్ పోలీసువారు హృదయపూర్వకంగా అంగీకరించినారు అయినప్పటికి ప్రతి సమావేశంలోను గుంపులను అదుపులో పెట్టడం అసాధ్య మయింది

మహాత్ముడు హైదరాబాద్‌లో దిగిన తరవాత మోటారుపై ఎక్కించి గౌలిగూడెంలోని వివేక వర్ధనీ థియేటరుకు ఊరేగింపుతో తీసుకొని వెళ్ళినారు ఆ ఊరేగింపుకు ముందు ఆది ఆంధ్రులు బ్యాండ్ మేళాలతో నడిచినారు వివిధ దళాలకు చెందిన స్వచ్ఛంద సైనికులు ఆ వెనక బారులు తీర్చి మహాత్ముని పరివే ష్టించబడినారు ఆ వెనక ప్రముఖులు ఎక్కిన మోటారు కార్లు వరసగా వెంబడించి నాయి వివేకవర్ధనీ థియేటరులో హైద్రాబాద్, సికింద్రాబాద్ పౌరులు సన్మాన పత్రాలు హిందీలో సమర్పించినారు శ్రీ వామన్ నాయక్ సన్మాన పత్రాలు చదివి గాంధీజీకి సుమారు 15 వేల రూపాయలు కానుకగా ఇచ్చినారు ఆ సభలో గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"రాట్నము కామధేనువు, హిందూ దేశానికి రాట్నం సర్వ వర ప్రదాయిని ఖద్దరు ఉత్పత్తికి హైదరాబాద్‌లో మంచి అవకాశం ఉంది

హైదరాబాద్ వారు తమ సంస్థానికేకాక బ్రిటిష్ ఇండియాకు కూడా ఖద్దరులో సహాయం చేయగలరు తమ ప్రాంతంలో మేలి రకపు ఖద్దరు ఉత్పత్తి అవుతున్నదని సరోజినిదేవి నాతో చెబుతూ వచ్చింది అది యథార్థమని తెలుసుకొని నేను చాలా సంతోషిస్తున్నాను ఈ సంస్థానంలో మద్యపాన పిశాచం నశింపచేయవలె అస్పృశ్యత శాస్త్రసమ్మతంకాదు అందుచేత హిందువులు ఆదోషాన్ని నివారింపవలె ' ఈ ఉపన్యాసానంతరం రాజా ధనరాజ గిర్జిగారు ఒక్కరే గాంధీజీకి 2 వేల రూపాయిల కానుక సమర్పించినారు రాజా ముకుంద దాసు 100 రూపాయలిచ్చినారు 7వ తేదీ నాడంత గ ంధీజీకి వివేకవర్ధని పాఠశాల, హిందూ అనాథశరణాలయం, నిమ్నజాతుల పాఠశాలలు, ఖాదీ భాండారాలు, నేత ఫ్యాక్టరీని చూసి వచ్చినారు గాంధీజీ వెళ్ళిన చోట్లన్నిటిలోనూ ఆయనకు కానుకలు చేకూరినాయి ప్రేమ థియేటర్ లో 3 వేల మంది స్త్రీలకు గాంధీజీ గంభీరోపన్యాసం చేసినారు 7 ఏప్రిల్ రాత్రి 9 15 గంటలకు మహాత్ముడు శ్రీ వేంకటప్పయ్య పంతులుగారితో కలసి హైదరాబాద్ నుంచి వెళ్ళినారు మహాత్మునకు హైదరాబాద్ పౌరుల పక్షాన కింది విరాళాలు లభించినాయి *

| | |
|---|---|
| హైదరాబాద్ పౌరుల నుంచి | 5025-00 |
| సికింద్రాబాదు నుంచి | 2557-1-1 |
| వివిధసభలలో వసూళ్ళు | 825-10-0 |
| సేడం వ్యాపార మండలి | 108-0-0 |
| తాండూరు వ్యాపార మండలి | 101-0-0 |
| వికారాబాద్ | 10-0-0 |
| శంకర్ పల్లి | 50-0-0 |
| వివిధములు | 60-0-0 |
| ఆది హిందూ హైస్కూలు (హైద్రాబాద్) | 101-0-0 |
| పి బి పి సికింద్రాబాద్ | 15-0-0 |
| సికింద్రాబాద్ వర్తకుల నుంచి | 116-0-0 |
| హైద్రాబాద్ స్త్రీల సభలో వసూళ్లు | 639-14-2 |

మహాత్మాగాంధీ హైదరాబాద్ స్టేషన్ లో దిగినప్పుడు వారికి స్వాగతమిచ్చిన ప్రముఖులలో దేశభక్త కొండ వేంకటప్పయ్యగారు, రాయ్ శ్రీకిషన్ గారు, శివలాల్ మోతిలాల్, డాక్టర్ యం జి నాయుడు, రాజా ధన్ రాజ్

* ఈ వసూళ్ళు "గోలకొండ పత్రిక" నుంచి గ్రహించినవి

గిర్జీ, దేశభక్త వామన్ నాయక్, రామచంద్ర నాయక్, రాజా ముకుందదాస్, రాజా బన్సీలాల్, మాడపాటి హనుమంతరావు, రైయ్యతు పత్రికా సంపాదకులు మందుముల నరసింగరావు, మొదలయిన వారున్నారు మహాత్మునకు వివేకవర్ధనీ మైదానంలో సన్మానసభ జరిగింది వారు సుఖాసీనులుకాగానే వారి మెడలో సమావేశ కర్తలు పూలదండలు వేసినారు హైదరాబాద్, సికిందరాబాద్, బొల్లారం పౌరుల పక్షాన దేశభక్త వామన్ నాయక్ గారు గాంధీజీకి కింది వినతి పత్రం సమర్పించినారు

వినతి పత్రం

* "పూజనీయులైన మహాత్మాజీ !

భారత వర్షంలోని స్వదేశీ సంస్థానాలలోకెల్ల గొప్పది అయి మహాఘనత వహించిన నిజాం ప్రభువు నవాబ్ సర్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహద్దుర్, జె సి యస్ ఐ జి సి బి ఇ గారి రాజధాని నగరం, ఏ నగరం యథార్థనామము భాగ్యనగరమో, అట్లాంటి చారిత్రక ప్రతీతిగల హైదరాబాద్ పట్టణంలో చిరస్మరణీయమయి ఉండే ఈ 6 వ ఏప్రిల్ న మీకు స్వాగతం ఇవ్వటానికి మేము గర్విస్తున్నాము పరమేశ్వరుడు తన అపార కృపా మహిమతో అజ్ఞానాంధకార కూపమున అల్లాడుతున్న దీన మానవులకు స్వార్థత్యాగము, ప్రపంచసేవ మొదలయిన ఉత్కృష్టాదర్శాలను సజీవంగా ప్రదర్శించడానికి భారత వర్షకీర్తి ప్రచారక, వర్తమాన యుగ లోకోత్తర పురుషుడు అయిన మీకు స్వాగతం చెప్పడానికి బహుకాలంనుంచి తత్తరపడు చున్నాము మా ప్రార్థన నంగీకరించి ఇట్లాంటి శుభ సమయమును లభింప చేసినందుకు మేము మా సౌభాగ్యమని తలుస్తున్నాము ఈ రాష్ట్రం సస్యవంతంగా చేసే కృష్ణా, గోదావరి వంటి పవిత్ర నదులతో ఉచ్ఛ భూభాగంలో సుస్థాపిత మయినది శ్రీరామచంద్రుడు తన వనవాస కాలంలో పావనం చేసిన దండకారణ్యం ఈ రాష్ట్రంలోనిదే జ్ఞానదేవుడు, జనార్దన స్వామి, ఏకనాథుడు, రామదాసు, మాణిక్యప్రభు, ఖాజా బందెనవాజ్ మొదలయిన సాధు సంతతి ఈ పవిత్రభూమి పుత్రులే

బంగారు, ఇనుము, రాగి, బొగ్గు మొదలయిన ఖనిజాలు, మానవ జీవితానికి ముఖ్యమైన వడ్లు, గోదుమలు, జొన్నలు, ప్రత్తి, తైలధాన్యాలు విరివిగా ఈ రాజ్యంలో లభ్యమవుతున్నాయి ఇంతేగాక మారాష్ట్రంలో గొప్ప గొప్ప అడవులు, కంచెలు శోభ గొల్పుతున్నాయి ఇంకాఅభివృద్ధి కానున్నాయి

నూలు వడకడం, నేయటం ఈ పట్టణంలో అధికంగా లేకున్నా ఈ రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను మా ఆది హిందూ సోదరులు, సాలెవారు, కృషీవలులకు ఈ వృత్తియే జీవనోపాయంగా ఉన్నది ఈ విషయం మిమ్మెంతో హర్షింప చేస్తుంది

* గోలకొండ పత్రిక

పసూత్రమాల మీకంఠాన్ని అలంకరించి ఉన్నదో దానినూలంతా ఆది హిందూ సోదరులు వడికినదే అంగళ్ళలో పీరు వడికిన నూలుకు గట్టితనంలో, పనితనంలో, సన్నదనంలో చాల ప్రఖ్యాతి ఉంది

ఈ శుభసమయంలో తమ కేయే సంస్థలతో పరిచయం కలిగింప నున్నామో వాటివల్ల అంత్యజోద్ధరణకు, అస్పృశ్యతా నివారణకు ఎట్లా కృషి జరుగుతూన్నదో తమకు విశదం కాగలదు కాని ప్రజలలో ప్రబలిఉన్న అజ్ఞానంవల్ల ఈ కార్యం చాలా మందగమనంతో జరుగుతున్నదని తెలుపడానికి దుఃఖిస్తున్నాము

గోరక్షణ సంస్థలు ఈ రాష్ట్రమంతటా ప్రబలిఉన్నాయి నిజాం ప్రభువుగారు బక్రీదుపండగ సమయంలో గోవధను ఫర్మానుమూలంగా నిషేధించి ఈ విషయంలో ఎంతో సాయం చేయటమేగాక హిందూ మహమ్మదీయ మతవైషమ్యాలకయ్యే ముఖ్య కారణమొకటి నిర్మూలించివేసినారు

కార్మిక సంస్థలను కూడా ఇక్కడ ఒకటి, రెండు మొన్నమొన్ననే స్థాపించడం జరిగింది. వాటిమూలంగా ధనికులకు, కార్మికులకు చక్కని సంబంధాలు కలుగుతున్నాయని తెలపడానికి చాలా సంతసిస్తున్నాము ఒకటి రెండు సమ్మెలవల్ల దేశంలో ప్రబలిన సంచలనం వీటిమూలంగా అణిచివేయడం జరిగింది

దేనిని మీరు జీవితంకంటె ఎక్కువగా ప్రేమిస్తున్నారో దానికి పత్రం పుష్పం ఫలతోయం అనే పద్ధతిననుసరించి మేమర్పిస్తున్న ఈ స్వల్పమును ప్రేమచిహ్నంగా అంగీకరించి మమ్మొకసారి మీకు స్వాగత మొనర్చడానికి అనుజ్ఞ ప్రసాదించండి

మన భారతమాతకు స్వాతంత్ర్యం లభించడానికి మీరు హృదయ పూర్వకంగా కృషి సలుపుతున్నారు పరమేశ్వరుడు మీ అభిమతం నెరవేర్చడానికి మీకు దీర్ఘాయువు ప్రసాదించడానికి మేమందరమూ మనస్ఫూర్తిగా ప్రార్థిస్తున్నాము

మహాత్మాజీ !

గోస్వామి తులసీదాస్ గారి శబ్దాలలో మేమిట్లా ప్రార్థిస్తున్నాము

తమ ప్రియ పారిటన్ వన పగు ధారే
సేవా యోగన భాగ్య హమారే
దేవ కహా హమ్ తుమగు సాఁయి
ఇంధన పాత కిరాత మిటాయి "

హైద్రాబాద్
6-4-1929

మీ కృపాభిలాషులు
హైద్రాబాద్, సికింద్రాబాద్,
బొల్లారం పౌరులు

**మహాత్ముని ప్రత్యుత్తరము**

"సోదరీ సోదరులారా!

నేడు మీరు నన్నిక్కడికి రప్పించినందులకేగాక మానవుని కోస -అంటే దరిద్ర నారాయణుని కోసం, మీరిచ్చిన పైకంకోసం కూడా కృతజ్ఞుణ్ణి మీ రందరూ ఎంతో శ్రమకోర్చి ఈ జన సమ్మర్దంలో ఇక్కడకు వచ్చి నన్ను నేడు గౌరవించిన విషయం నేనెప్పటికీ మరవజాలను నేను హైదరాబాద్ రావటం ఇది మొదటి పర్యాయం కాదు కాని నేను మీ దగ్గర ధనంకోరే ఉద్దేశంతో రావడం ఇదే మొదటిసారి మీరీ పైకం ఏపనికోసం ఇచ్చినారో ఆపనికి ఇది చాలా తక్కువని చెప్పడానికి సాహిసిస్తున్నాను ఇంత పెద్ద సమూహంలో కష్టపడి మీరు వచ్చినందుకు మీ వల్ల ఎంతో పైకం వసూలు కాగలదని నా ఆశ

**రాట్నము కామ ధేనువు**

హిందూ దేశం చాల దరిద్ర దేశమని మీరు కలలోకూడా భావించి ఉండరేమో ప్రపంచంలో మన దేశాన్ని మించిన దరిద్రదేశ మింకొకటి లేదు మన దేశంలో దాదాపు 8 కోట్ల జనానికి రోజు కొక్క పూట అయినా తినడానికి తిండి సరిగా దొరకటంలేదు అట్లాంటి వారికి ఈ రాట్నం తప్ప వేరే గత్యంతరంలేదు ఈ రాష్ట్రంలో రాట్నంవల్ల చాలా ప్రయోజనము పొందుతూన్న బీద లనేకులున్నారని నాకు తెలుసు వారికి రాట్నము కామ ధేనువు హిందూస్థానంలోని కోట్ల కొద్దీ వ్యవసాయకులకు ఏడాదిలో 4,5 మాసాలు చేయడానికేమీ పనిఉండదు వారికి రాట్నం చాలా సహాయకారి కాగలదు చర్ఖావల్ల నేడు దాదాపు 1 లక్ష స్త్రీలకు సహాయం జరుగు తూన్నది మన సోదరీమణులు 4, 5 మైళ్ళ దూరం నుంచి కూడా కాలి నడకనువచ్చి మా దగ్గర దూది తీసుకొని తాము వడికిన నూలిచ్చి దానికి తగిన పైకం తీసుకొని వెళ్ళుతున్నారు వారి కొద్ది పైసల కోసమే 5, 6 మైళ్ళ నడిచి రావడమెందుకో మీరు తెలుసుకొనగలరా? ఏ గ్రామాలలో ఈ వడికే పని జరుగుతున్నదో అక్కడకు పోయి చూస్తే మీరీసంగతి తెలుసుకోగలరు ఇందుకోసమే నేను హిందూదేశమంతటా సంచారం చేస్తున్నాను ఇందు కోసమే బర్మాలోకూడా నేను సంచారం చేసివచ్చినాను మీ రాష్ట్రములలో కూడా మీ వలన చాలా పైకం లభిస్తుందని ఆశిస్తున్నాను,

**బ్రిటిష్ ఇండియాకు ఆదర్శము**

నిజాం సర్కార్ రాష్ట్రంలో హిందూ ముసల్మానులు కలసి మెలసి ఉన్నారని వినడానికి ఎంతో సంతోషంగా ఉన్నది నిజాంగారు హిందువుల హృదయాలను రంజింప చేయడానికి గోహత్యను అపివేసినందుకు సంతోషం బ్రిటిష్ ఇండియాలో హిందూ ముసల్మానుల పరస్పర అవిశ్వాసంవల్ల భేదాలు పొడచూపినాయి మీరు ఐకమత్యంతో ఉన్నందుకు సంతోషము 1920,21 సంవ

త్సరాలలో ఏ విధంగా హిందూ ముసల్మానులు కలసి ఉన్నారో అట్లాగే మునుముందు కలసి ఉండవలె కాని మా వంటివారు మీ వంటివారికి ఇటువంటి పనులలోనే సహాయం చేయవలసి ఉన్నది అన్ని రాష్ట్రాలలో ఈ రాష్ట్రం పెద్దది అంతేకాదు, ప్రకృతి తన సహస్రహస్తాలతో మీకు కావలసిన వస్తువులను అనుగ్రహించి ఉన్నది ఈ రాష్ట్రంలో అనేక వస్తువులు ఉత్పత్తి అవుతున్నాయి మీరు మంచి హృదయాలతో మీ పనులు చేసుకొంటే మీరితరులకు ఆదర్శప్రాయులు కాగలరు

## ఖద్దరు మంత్రము

మేము బ్రిటిష్ హిందుస్థానంలో చేసే పనుల నన్నిటినీ స్వదేశ సంస్థానాలలో చేయలేము కాని కొన్ని పనులలో మీరు మీ విధిని నెరవేరిస్తే మీరు కూడా బ్రిటిష్ ఇండియాలోని ప్రజలతో సాటిగా అభివృద్ధికి రాగలరు ఆ విధులలో రాట్నం ఒకటి మీరిక్కడ ఖద్దరు తయారు చేసి హిందూస్థాన మంతటికీ సప్లయ్ చేయగలరు మీరందరూ కలసి పనిచేస్తే ఒక్క యేడాదిలో కావలసినంత ఖద్దరు ఉత్పత్తి అవుతుంది మీరింకొకపని కూడా చేయగలరు మీకు విదేశీ బట్టల మీద సన్నబట్టల మీద మోజు ఉన్నదని నాకు తెలుసు మీరు హిందూస్థానంలోని బీదలను తలచుకొని కొంచెం ఓర్పుతో మోటు బట్టలను ధరించి విదేశీ బట్టలను విసర్జిస్తే మీరు వారికి చాలా సహాయం చేసినవారవుతారు

ఇట్లాగే మీరు మద్యపానం విసర్జించవచ్చు ఈ విషయాన్ని నేను మీకు ప్రత్యేకం చెప్పనక్కరలేదు హిందూ ముసల్మానుల మతాలలో ఎక్కడ మద్యపానం మంచిదని చెప్పలేదు అది హరామ్ (నిషేధం)గా ఎంచబడింది దేశీయ సంస్థానాలకది సిగ్గుచేటు బ్రిటిష్ హిందుస్థానంలో మద్యపానంవల్ల గడించిన పైకంతో పిల్లలకు చదువుచెప్పటం ఎంతో లజ్జాకరము దీనిని రూపుమాపటానికి మీరు ప్రయత్నం చేయవలె మీరందరూ గట్టిగా పట్టుపడితే నిజాం ప్రభువుగారు కూడా ఈ అబ్కారి లాభం వదలివేయగలరు

## అస్పృశ్యతా నివారణ

అది హిందువులను మీరు అంటరానివారుగా చూడటం హిందూ మతానికి ఒక గొప్ప కళంకమే నేను సనాతన ధర్మావలంబకుణ్ణి ఈ అస్పృశ్యతా దోషానికి హిందూమతంలో ఎక్కడా స్థానంలేదని నేను ఘంటాపథంగా చెప్పగలను మీరు ఆదిహిందూజనుల నుద్ధరించి మీకళంకం నిర్మూలించుకోవలె ఇది హిందూధర్మానికి నిజమయినశుద్ధి ఈ దోషం తొలగించుకొండని నేను హిందువులను సవినయంగా వేడుకొంటున్నాను మీసన్మానపత్రంలో నామెడలో వేసిన నూలుదండ ఆదిహిందూసోదరులు తయారుచేసినదని మీరు అన్నారు ఇది నిజమయితే నేను వారిని అభినందిస్తున్నాను నేనింత

వరకు ఇటువంటి సన్నని దారం వారు వడకగా చూడలేదు కాని శ్రీమతి సరోజినీదేవి నాతో ఎన్నిమారులో ఈ రాష్ట్రంలోనివారు సన్నని నూలువడక గలరని చెప్పినారు అనేకమారులు ఆమె నాకు సన్నని అందమయిన బట్టలను కూడా చూపించినారు

మీరింతవరకు నామాటలను శాంతంగా విన్నందుకు కృతజ్ఞుణ్ణి మీరిదే విధంగా విరాళాలను కూడా ఇవ్వవలె మీరు గవ్వలు, పైసలు, రూపాయలు, నోట్లు కూడా ఇవ్వవచ్చు మీరిచ్చినదంతా బీదల సహాయంకోసమే ఉపయోగ పడుతుంది నేడు స్టేషన్‌దగ్గర జనసమ్మర్దంవల్ల ఒకగంట కాలం వ్యర్థమయింది మీరు శాంతంగా ఉండి నన్ను పోనీయవలె నేను వయసువాణ్ణికాను ముసలి వాణ్ణి మృత్యువు ఆసన్నంగా ఉన్నది ఎప్పుడు దేవుడు నన్ను పిలిపించు కొంటాడో చెప్పలేను కాని నేను మాత్రం సిద్ధంగా ఉన్నాను ఇష్టం వచ్చి నప్పుడు ఆయన నన్ను పిలిపించుకొనగలడు కాని మీరు మాత్రం దానికి కారకులుగా ఉండకూడదు మీరు మీ ప్రేమవల్ల నన్ను జనసమూహంలో నిలిపి వేయకూడదు ఈ సభ ముగిసిన తరవాత నన్ను సురక్షితంగా పోనీయండి "

ఈ ఉపన్యాసం ముగించిన తరవాత 12 వేల రూపాయల చందాలు వసూలయినాయి

## గాంధీ వివేకవర్ధనీ పాఠశాల దర్శించడం

వివేకవర్ధనీ పాఠశాల మైదానానికి 7 ఏప్రిల్ ఉదయం 7 గంటలకు దేశభక్త వామన్ నాయక్, మహాత్మా గాంధీని, వారి పరిజనాన్ని తీసుకొని వచ్చినారు ఆ మహా సభలో అనేక మంది విద్యాధికులు, విద్యార్థినీ - విద్యా ర్థులూ ఉన్నారు దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారు మరికొందరు పెద్దలుకూడా ఉన్నారు తరవాత వారు పాఠశాల భవనం చూసినారు వామన్ నాయక్ గారు సభ్యులలో ప్రముఖులను మహాత్మునకు పరిచయం చేసినారు బాలురు డ్రిల్లు చేసి కట్టిసాము మొదలయిన పనులను ప్రదర్శించినారు అనాథ విద్యార్థి గృహానికి అనాథాలయానికి సంబంధించిన విద్యార్థులు కూడా గుమికూడి ఉన్నారు వారిని ఉద్దేశించి మహాత్ముడిట్లా ఉపన్యసించినారు

"అనాథ బాలురను చూసినాను వారి చదువు ఏర్పాట్లను కూడా చూసి నాను సంతోషం కాని వీరికంటే కూడా అనాథస్థితిలో ఉండి తినటానికి తిండి, కట్టుకొనేటందుకు బట్టా, చదువు అవకాశాలూ లేక ఎందరో అనాథులు దేశంలో ఉన్నారు ఇక్కడి అనాథ బాలబాలికలు, మీరందరూ వారి కష్టాలను దృష్టిలో పెట్టుకోవలె, అటువంటి వారికోసం రాట్నం చాలా ఉపయోగకర మయినది ఉపాధ్యాయులు మంచి యోగ్యులయినట్లయితే విద్యార్థులలో ఉన్నత భావం కలిగించగలరు ఖద్దరు ఉపయోగం హిందూ మహమ్మదీయు లందరూ గ్రహించవలె దాని ద్వారా హైదరాబాద్‌లోని బీదలకు జీవనోపాధి కలిగేటట్లు చేయవలె వ్యాయామం చేయటం నాకిష్టమే వ్యాయామశాలలో

హనుమంతుడిని ఆదర్శంగా పెట్టుకొంటున్నారు వాల్మీకిగానీ, తులసీ దాసు గానీ హనుమంతుని గొప్పతనం శరీరవ్యాయామం వల్ల కలిగినట్లు చెప్ప లేదు ఆయన పవిత్రత బ్రహ్మచర్యం వల్ల కలిగింది బ్రహ్మచర్యం మానవుని బలిష్టునిగా చేయగలదు కొందరు వ్యభిచారులు కూడా లావుగా వుండటం నేను చూసినాను కాని నిజమయిన శరీరశక్తికి బ్రహ్మచర్యం చాలా అవసరము ఈ విషయం నా సోదరులు గ్రహించవలె ఈ ఉపన్యాసానంతరం మహాత్ముడు పరిజనులతో ఆది హిందూ సాంఘిక సేవా మందిరానికి వెళ్ళినారు అక్కడి స్వచ్ఛంద సేవకులు, వేలకొద్ది జనం గుమిగూడి నప్పటికీ చక్కగా శాంతిని కాపాడినారు ఆది హిందువుల 9 పాఠశాలలలోని బాల బాలికలు 400 మంది అక్కడకు హాజరయినారు ఆయా పాఠశాలల బాల బాలికలను గుర్తించేటందుకు వీలుగా ప్రత్యేక పతాకాలు ఆయా ప్రదేశాలలో ఉంచడం జరిగింది దేశభక్త వామన్ నాయిక్ గారు పాఠశాల విషయాలను మహాత్మునకు నివేదించినారు తెలుగు సన్మాన పత్ర ఉర్దూ అనువాదం కేంద్ర పాఠశాలా ఉపాధ్యాయుడు సేవక దాసుగారు చదివి మహాత్మునకు సమర్పించినారు ఆ సన్మాన పత్రమిది

**సన్మాన పత్రము**

'మహాత్మా మోహన్ దాస్ కరంచంద్ గాంధీగారికి

ఆది హిందూ సాంఘిక సేవా సమితి సభ్యులర్పించుకొన్న స్వాగత పత్రము

విశ్వవిఖ్యాతుడయిన ఓ మహాత్మా!

"నవ్యభారత వర్షం నిర్మించడానికి బద్ధకంకణుడవై పతితులను పాలించే దీక్ష బూని ఆసేతు హిమాచలమే కాక ఖండాంతరాలను పవిత్రమొనరుస్తున్న నీకు హైదరాబాద్‌లోని ఆది హిందూ సాంఘిక సేవా సమితి సభ్యులమై మేము కృతజ్ఞతా పూర్వకంగా స్వాగతమిచ్చే భాగ్యం నేడు పొంది నందుకు ఎంతో గర్విస్తున్నాము

**కరుణా సాంద్రా!**

"నిన్ను నీ ఎదుట పొగడటం నీకు ఏ మాత్రం సంతోషంగా ఉండదని మేమెరుగుదుము కాని జీవితం అంతా నీ స్వీయ సంతోషంకోసం గాక పరుల సంతోషం కోసం అర్పించి ఉన్న నీవు మా మానసాలలోని ఆనంద తరంగ ప్రభావ బలంవల్ల మా నోటి నుంచి వెడలే ప్రశంసా వాక్యాలను మా సంతోషం కోసం గదా అని సహించగలవని నమ్ముతున్నాను

**దీనబంధూ!**

పవిత్రమయిన భారత భూమి గాఢమైన అజ్ఞానంలో పడి అస్పృశ్యతా దోషపంకంలో చిక్కుకొని అధోగతి పాలవుతున్న నేటి కాలంలో కోట్ల కొద్ది

మానవులు పశువులకంటేకూడా హీనంగా చూడబడుతూన్న ఈ దుష్కాలమున వారి ముఖాలపైన కాంతిని వారి హృదయాలలో ఆశాంకురం ఉద్భవింపజేసి తోడి మానవులతో మేము సమానులమే అనే ఆత్మగౌరవాన్ని వారిలో సృష్టిస్తున్న నీవు దేశంలోని అస్పృశ్యుల పాలిటి కల్ప వృక్షంగా భావింప బడుతున్నావు

పతిత జాతుల నుద్ధరించి తన్మూలంగా మాతృదేశం మొదటి గౌరవ పదవికి తెచ్చే మహాత్కార్యం సాధించడంకోసం ఈశ్వరుడు నీకు చిరాయువును సంపూర్ణారోగ్యం ప్రసాదించునుగాక"

ఇట్లు
విన్నవించుకొను విధేయులు
ఆది హిందూ సాంఘిక సేవాసమితి
సభ్యులు

హైదరాబాద్
7-4-1929

ఈ సన్మాన పత్రం చదివిన తరవాత మిరియాల రామలింగయ్య మొదలయిన కొందరి పక్షాన గాంధీజీకి 161 రూపాయలు కానుక సమర్పించడం జరిగింది తరవాత గాంధీజీ ఇట్లా అన్నారు

"ఆది హిందువుల విషయంలో జరుగుతూన్న పనికి సంతోషించినాను నాకు మీరిచ్చిన ఈ విరాళాలకు వందనాలు అస్పృశ్యతా నివారణ విషయంలో హిందూ దేశంలో దినదినాభివృద్ధిగా పని జరుగు తున్నది నేనింతకంటే ఎక్కువగా ఉపన్యసించ దలచుకోలేదు ఈశ్వరుడు మిమ్ములను రక్షించుగాక" అన్నారు

**గాంధీజీ-హిందూ బాలికా పాఠశాల**
**(చుడీ బజారు)**

ఏప్రిల్ 7వ తేది సాయంకాలం 5 గంటలకు గాంధీజీ పరిజన సహితంగా చుడీ బజారులోని హిందూ బాలికా పాఠశాలకు వెళ్ళినారు పాఠశాలలో స్త్రీలు, బాలికలు సమావేశమయినారు మహాత్ముడు రాగానే బాలికలు స్వాగత గీతాలు పాడినారు కార్యదర్శి శ్రీ కృష్ణస్వామి ముదిరాజుగారు హిందీభాషలో అనర్గళంగా పాఠశాలా నివేదికను చదివినారు దేశభక్త వామన్ నాయక్‌గారు, అంతూ రామచంద్రరావుగారు మహాత్మునితో ఉన్నారు అక్కడి ఏర్పాట్లు స్వచ్ఛంద సేవకులు ప్రశంసనీయంగా చేసినారు గాంధీజీ పాఠశాలను గురించి ఇట్లా ఉపన్యసించినారు

"ఇంత మంది బాలికలు ఇక్కడ హిందీ నేర్చుకోవటం చూసి నాకు సంతోషంగా ఉన్నది కొందరు బాలికలు తెలుగు మాత్రమే చదువుకొంటున్నారని విన్నాను వారు హిందీకూడ నేర్చుకోవడం అవసరం ఎందుకంటే ఆంధ్రులు హిందీ నేర్చుకోకుండా ఉంటే ఇతర ప్రాంతాల కార్యకలాపాలలో

భాగస్వాములు కా. డానికి వీలుండదు ఈ పాఠశాలలో టొట్నాలు ప్రవేశపెట్ట గలమని తెలిపినందుకు సంతోషము అది చాలా అవసరము ఈశ్వరుడీ పాఠశాలను సుస్థిరంగా రక్షించును,గా' " ఈ ఉపన్యాసానంతరం కృష్ణస్వామిగారు మహాత్ము నికి ధనపు సంచిని సమర్పించినారు

## ప్రేమ థియేటర్‌లో స్త్రీల సభ

ఏప్రిల్ 7 సాయంకాలం ప్రేమ థియేటర్‌లో స్త్రీల సభ జరిగింది సభకు స్త్రీలు చాలామంది వచ్చినారు సభా ప్రారంభంలో మిస్ మేనింగ్ గరల్స్ స్కూల్ బాలికలు పాటలు పాడినారు శ్రీమతి ముక్తాబాయి (దేశ భక్త వామన్ నాయక్‌గారి భార్య) గాంధీజీకి 100 రూపాయలు విరాళమిచ్చి పూవులదండ వేసినారు తరవాత గాంధీజీ, నోటరీమణులలో మతభేదంవలదని, హిందూ మహమ్మదీయు . సఖ్యంగా ఉండవలెనని, ఖద్దరు ఎక్కువగా వాడవలె ననీ, దేశ దారిద్ర్య నిర్మూలననకు తాను పూనుకొన్న పనికి ద్రవ్య సహాయం చేయవలెననీ ఉపన్యసించినారు

స్త్రీలు ,గాంధీజీకి 1700 రూపాయల విరాళం భక్తి పూర్వకంగా సమ ర్పించినారు ఆ సభ 6-45 గంటలకు ముగిసింది గాంధీజీ ఆ రాత్రి 9-15 గంట లకు సికింద్రాబాద్ స్టేషన్‌లో రైలెక్కి బెజవాడ వైపుకు వెళ్ళినారు వారితో కొండ వేంకటప్పయ్య పంతులుగారుకూడా ఉన్నారు శ్రీ వెంకటప్పయ పంతులుగారి భార్య పక్షవాతంతో మంచం పట్టి ఉన్నప్పటికి ఈ ఆంధ్రదేశ్య పర్యటనలో గాంధీజీతో మొదటినుంచి తుది వరకూ ఉన్నారు

## జయంతిపురంలో

మహాత్మా గాంధీ, శ్రీమతి కస్తూరిబా, ఇమామ్ సాహెబ్, ప్యారీలాల్ మొదలయిన వారు హైదరాబాద్ నుంచి బొమ్మకల్లు స్టేషన్‌కు రాగానే స్టేషన్‌లో అయ్యదేవర కాళేశ్వరరావుగారు, జయంతిపురం రాజా శ్రీ వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్‌గారు, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కమిటీ కార్య దర్శి వచ్చి మహాత్మునికి పూల దండలువేసి జయంతిపురానికి ఆహ్వానించి తీసుకొని వెళ్ళినారు తోవలో లింగాల గ్రామస్థులు 20 రూపాయలను, మక్క పేట వారు 40 రూపాయలను గాంధీజీకి ఖద్దరు నిధికి విరాళంగా సమర్పించి నారు జయంతిపురానికి 8వ తేది ఉదయం 8 గంటలకు చేరుకొన్నారు

మునగాల జమీందార్ శ్రీ రాజా నాయని వెంకట రంగారావు బహా దూర్ గారు 1500 రూపాయలు మహాత్మునికి ఖద్దరు నిధికి విరాళంగా ఇచ్చి ఆ సొమ్మును పశ్చిమ కృష్ణాజిల్లాలో వసూలైన సొమ్ముతోపాటు ఖద్దరు ఉత్ప త్తికి అవసరమయిన పరికరాలు మొదలయిన వాటికి వినియోగించ వలెనని కోరి నారు ఆ రోజులలో మునగాల రాజాగారు హైదరాబాద్‌లో ఉన్నారు

గాంధీజీ జయంతిపురం జమీందారుగారికి అతిథిగా ఉన్నారు ఆ సాయం

కాలం 7 గంటలవరకు జయంతిపురంలో గాంధీజీ మౌనవ్రతం అవలంబించి నారు జయంతిపురం రాజాగారు ఖద్దరు నిధికి 500 రూపాయలు విరాళమిచ్చి నారు అక్కడి నుంచి మోటారులో రాత్రి 7 గంటలకు జగ్గయ్యపేటకు వెళ్ళి నారు

జగ్గయ్యపేటలో

జగ్గయ్యపేటలో ధనంకోట కొండకు ఎదురుగా పౌరులు చక్కగా నిర్మించి అలంకరించిన పందిరిలో మహాత్ముడు ఉపన్యసించినారు మహాత్ముడు, మాతా కస్తూరిబాయి సభా వేదికకు వస్తూండగా ప్రాచీన సంప్రదాయ ప్రకారం లాజలు (పేలాలు) చల్లినారు పూర్ణకుంభ లతోనూ, కర్పూర హారతుల తోను స్వాగతం యిచ్చినారు వేదపారాయణం జరిగింది ఆ సభకు సుమారు 8 వేల మంది ప్రజలు హాజరయినారు జగ్గయ్యపేట యూనియన్ బోర్డ్‌వారు, జగ్గయ్యపేట పౌరులు ఖద్దరు వస్త్రంపై ముద్రింపబడిన సన్మాన పత్రం సమర్పించినారు తరవాత మహాత్ముడు ఉత్తేజకరమయిన ఉపన్యాసంచేస్తూ ఇట్లా అన్నారు

"మీరు నాకీ సన్మాన పత్రం సమర్పించినందుకు కృతజ్ఞుణ్ణి వాటిలో మీరు రాట్నాన్ని ఖద్దరును స్తుతించినారు చాలా మంచిదే ఇంతవరకు ఖద్దరు ధరించనివారు ముందయినా ఖద్దరు ధరించవలె మీ ప్రాంతాలలో ఖద్దరు ఉత్పత్తి జరుగుతున్నదని నాకు తెలిసి ది దానిని అభివృద్ధి చెయటానికి మీకు అవకాశాలున్నాయి ఖద్దరు వ్యాపారం కోసం నేను భారతదేశమంతా పర్యటిస్తున్నాను అందుకోసం నాకు ధనము స్వచ్ఛంద సేవకులూ కావలె మీకు తోచినది ఇవ్వమని అడగటానికి నేనిప్పుడు ఇక్కడికి వచ్చినాను నా స్వరాజ్య సంపాదనకు ఖద్దరు ఒక్కటే కావలె అంతకన్న నేనింకొకటి చెప్పేదిలేదు

మన స్వరాజ్యానికి మరొక మార్గం కూడా ఉన్నది అది అస్పృశ్యతా నివారణం ఫలానా మనిషి అస్పృశ్యుడని అనడం న్యాయం కాదు పేదవాళ్ళు అని హిందువులు మహమ్మదీయులు అనీ ఏవిధమయిన భేదం ఉండకూడదని నా అభిప్రాయము మానవులందరూ దేవుని బిడ్డలే కనక విశ్వమానవ సౌభ్రాత్ర భావంతో మెలగవలెనని నా అభిప్రాయము ఇంతకన్న నేను ఎక్కువ కాలం ఇక్కడ ఉండ జాలను మిమ్ములను దేవుడు ఆశీర్వదించును గాక "

ఈ ఉపన్యాసానంతరం మహాత్మునికి 516 రూపాయలు ఖద్దరు నిధికి లభించినాయి తరవాత వారు నందిగామకు ప్రయాణ మయినారు జగ్గయ్యపేటను విడిచిన తరవాత గాంధీగారు 2 మైళ్ళు నందిగామ వైపు నడిచినారు తోవలో కొణకంచివారు ఆయనకు 116 రూపాయలు సమర్పించినారు కొణకంచి గ్రామ కాంగ్రెస్ పక్షాన అనమల రామగోవింద శర్మగారు గాంధీ దంపతులకు వినతి పత్రము, ఖద్దరునిధీ, ఖద్దరు వస్త్రాలను సమర్పించినారు

## నందిగామలో

నందిగామలో గాంధీజీ ఒక పెద్ద సభలో ఉపన్యసించినారు తాలూకా బోర్డువారు, నందిగామ పౌరులు, మహాత్ముని కు సన్మాన పత్రాలను సమర్పించినారు మహాత్మాజీ ప్రశాంతంగా వింటూ 1920 నుంచి కూడా ఇక్కడి సభలలో ప్రశాంత వాతావరణం ప్రదర్శిస్తున్నందుకు చాలా సంతోషించినారు స్వరాజ్యానికి అర్థం 'మహాశాంతి' 'ప్రజాశాంతి' అని తమ అభిప్రాయమన్నారు పెద్ద నగరాలలోని ప్రజలను సంస్కరించడం చాలా కష్టమని గ్రామాలలో సిద్ధుల ప్రదేశాలతోపాటు అపరిశుభ్రత కూడా కనబడుతూన్నది కాబట్టి గ్రామాలను అభివృద్ధి చేయటానికి చాలా అవకాశాలు ఉన్నవన్నారు గ్రామాల ఆరోగ్యానికి, పరిశుభ్రతకు జవాబుదారీ వహించవలసిన వారు ఈ విషయంలో ఎందుకు శ్రద్ధ తీసుకోవటం లేదో తెలియదన్నారు. తన ఈ ఆశ వ్యర్థం కాదని ఆశిస్తున్నానని, తన ఎదుట కనపడుతూన్న యువకులందరూ ఈ పనికి పూనుకోవలెనని హెచ్చరిస్తూ గాంధీజీ ఇంకా ఇట్లా చెప్పినారు

మీ ప్రదేశంలో స్త్రీలు మీ సన్మాన పత్రాలలో అందరూ ఖాదీ ధరించవలెనని కోరినారు మీరందరూ ఆపని చేయగలిగితే నేను చాలా సంతోషిస్తాను ఇక్కడ ఉన్న సోదరీమణులలో కొందరు ఖాదీ ధరించి ఉన్నారు కొందరే ఎందుకు ఉండవలె? పురుషులవలెనే స్త్రీలు కూడా ఆత్మ పరిశుద్ధతలోను, స్వరాజ్య సంపాదనలోను సమానభాగస్వాములు కావలె నేను స్వరాజ్యం గురించి మాట్లాడడం లేదు రామ రాజ్యం గురించి మాట్లాడుతున్నాను సీత లేని రామరాజ్యం లేదు మీరు రామరాజ్యమనికోరే పక్షంలో సీతాదేవులు కావలె సీత ఖద్దరునే ధరించేదని, జాతీయవస్తువులనే ఉపయోగించేదనీ చరిత్ర చెబుతూన్నది అటువంటి పవిత్రత వల్లనే సీతాదేవిని రావణుడు స్పృశించలేకపోయినాడు సీత అగ్నిప్రవేశం చేసింది కాని సురక్షితంగా పైకి వచ్చింది హిందూ స్త్రీలు ప్రయత్నిస్తే సతులవలె పవిత్రులుగా ఉండగలరు"

ఇట్లా స్త్రీలను ఉద్బోధించి గాంధీజీ

"కల్లు త్రాగటం ఒక దురభ్యాసము తాగుబోతు, భార్య ఎవరో తల్లి ఎవరో గుర్తించలేడు మనం పరిశుద్ధాత్ములం కావలెనంటే తాగుడు మానివేయవలె అస్పృశ్యత మహాపాపం అది స్వరాజ్యంలో ఉండకూడదు, మీరు నాకు 1170 రూపాయలు విరాళమిచ్చినారు మీరింకా ఎక్కువ ఇవ్వగలరని నాకు తెలుసు ఆంధ్ర దేశంలో స్త్రీ వలెనే పురుషులు కూడా నగలు పెట్టుకొంటారు స్త్రీలు సభకు వస్తే నా చూపు వారి నగలపై పడుతుందని వారు రావడానికి భయపడుతున్నారు వాళ్ళ నగలను నేను చాలా చోట్ల తీసుకొన్నాను కొట్లాది జనం వస్తువులు పడకొంటూంటే కొంత మంది మాత్రం నగలు పెట్టుకోనేటందుకు హక్కు లేదు వారి ఆభరణాలన్నీ దరిద్రనారాయణునికి ఇచ్చివేయవలె" అని చెబుతూ ఈ సందర్భంలో చాటపర్రు నివాసిని అయిన మాగంటి అన్నపూర్ణాదేవి త్యాగం గురించి స్మరించి

ప్రశంసించిన తరువాత గాంధీజీ ఉపన్యాసానంతరం సభలో కొందరు ఖద్దరునిధికి విరాళాలుసమర్పించినారు అయ్యదేవర లక్ష్మీనరసింహారావుగారి భార్య (బాలాత్రిపుర సుందరమ్మ) గాజుల జతను గాంధీజీకి ఇచ్చినారు ఒక ఉంగరానికి 5 రూపాయలు వచ్చినాయి సుంకర నరసింహంగారి భార్య మరొక గాజుల జత ఇచ్చింది బసవ లింగయ్యగారి భార్య మరొక గాజు ఇచ్చింది చతుర్వేదుల అన్నపూర్ణమ్మ, యడవల్లి సీతారామమ్మగార్లు చెరొక పావు నవరసు ఇచ్చినారు

తరవాత మహాత్మాజీ, ఆయనతో వచ్చినవారు ఆ దిగామ నుంచి బెజవాడకు బయలుదేరినారు త్రోవలో ఇబ్రాహింపట్నంలో శ్రీమతి మల్లెల రత్నమ్మగారు సన్మానపత్రంతోపాటు 500 రూపాయలు గాంధీజీకి సమర్పించినారు విదేశీ వస్త్రాలను విడనాడవలెనని, ఖద్దరు ధరించవలెనని, పురుషులందరూ స్త్రీలను తల్లులుగా భావించవలెనని, స్త్రీలు సీతాదేవివలె ఉండవలెనని, తాగుడు, వ్యభిచారాలు కూడవని గాంధీజీ సంగ్రహంగా ఉపన్యసించినారు

గుంటుపల్లిలో గ్రామస్థులు గాంధీజీకి 116 రూపాయలు సమర్పించినారు 9వ తేది ఉదయం 9 గంటలకు మహాత్ముడు బెజవాడకు చేరినారు

## నూజివీడు

ఏప్రిల్ 9 సాయంకాలం మహాత్ముడు బెజవాడ నుంచి నూజివీడుకు 6-30 నిమిషాలకు చేరినారు ఆయన అక్కడ ఒక పెద్దసభలో ఉపన్యసించినారు నూజివీడు పౌరులు, టౌన్‌హాల్ కమిటీవారు, సేనాభివర్ధనీ సంఘంవారు ఆయనకు సన్మానపత్రం సమర్పించినారు వాటిని వేలం వేయగా 60 రూపాయలు వచ్చినాయి సభలో 1000 రూపాయలు విరాళాలు వచ్చినాయి గాంధీజీ సన్మానపత్రాలలో తమను స్తుతించడంకంటె స్థానిక పరిస్థితులను తెలియచేయడం మంచిదని సలహా ఇచ్చినారు ఆయన ఖద్దరు ధరించవలెనని తాగుడు, వ్యభిచారము, అస్పృశ్యతా దోషాలను రూపుమాపుకోవలెననీ ఉద్బోధించినారు తరవాత గాంధీజీ స్త్రీల సభలో ఉపన్యసించగా స్త్రీలు ఆయనకు నగలు సమర్పించినారు

ఆ రాత్రి ఆయన నందనవనంలో ఉయ్యూరి రాజాగారి అతిథిగా వున్నారు అక్కడ జనానా స్త్రీలు 500 రూపాయలు విరాళమిచ్చినారు

ఏప్రిల్ 10 ఉదయం గాంధీజీ గొల్లపల్లి, ఆరుగొలను, వీరవల్లి, పొట్టిపాడు, అత్కూరుగ్రామాలు దర్శించినారు ఆ గ్రామాలలో వరసగా 300 రూ 1116 రూ 116 రూ 40 రూ 160 రూపాయలు లభించినాయి ఆరుగొలనులో నండూరి లక్ష్మీనారాయణ అనే 7 ఏండ్ల బాలుడు తనంతట తాను గాంధీజీకి 3 ఉంగరాలు సమర్పించినాడు. అందరూ తాగుడు మానవలెనని, ఖాదిని ధరించవలెనని, అస్పృశ్యతనుపాటించవలెననీ గాంధీజీ ఉద్బోధించినారు

ఆయన ఉదయం 9-30 కు బెజవాడ తిరిగి చేరుకొని దుర్గావిలాసంలో కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి అతిథిగా ఉన్నారు నూజివీడు నుంచి బెజవాడకు పోయే తోవలో వేలకొలది ప్రజలు గాంధీజీని దర్శించినారు గాంధీజీ పశ్చిమకృష్ణా సంచారంలో సేవాదళానికి గారపాటి సుబ్రహ్మణ్యం గారు నాయకత్వం వహించి నైపుణ్యంతో నిర్వహించినారు

**బెజవాడలో**

బెజవాడలో ఏప్రిల్ 10 సాయంకాలం 5-30 గంటలవరకు నాగేశ్వర రావుపంతులుగారి భవనంలోనే గాంధీగారు ఉన్నారు ఆ రోజున ఆంధ్ర విశ్వ విద్యాలయోపాధ్యాయుడు కట్టమంచి రామలింగారెడ్డిగారు 100 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించి అది చిత్తూరు జిల్లా మొత్తంలో చేర్చవలెనని కోరి నారు

సాయంకాలం 5-30 గంటలకు ప్రత్యేకంగా ఏర్పాటయిన పెద్ద పంది రిలో స్త్రీల సభ జరిగింది దాదాపు 2వేల మంది స్త్రీలు సభకు వచ్చినారు గాంధీజీ సుమారు అరగంటసేపు హిందీలో ఉపన్యసించినారు కొండా వేంకటప్పయ్యపంతులుగారు దానిని తెలుగులోకి అనువదించినారు ఆ సంద ర్భంలో కీ శే మాగంటి అన్నపూర్ణాదేవి ఉత్తమ సౌశీల్యం ఉదాహరిస్తూ ఆమె జాతీయోద్యమానికి తన ఆభరణాలనన్నిటినీ వలిచి ఇచ్చి విదేశీ బట్టలను దగ్ధం చేసిన ఉదంతం జ్ఞాపకం చేసినారు స్త్రీలందరూ ఖద్దరు ధరించి అన్న పూర్ణాదేవి ఆదర్శాలను అనుసరించవలెనని ఆయన వారికి నచ్చజెప్పినారు ఆంధ్రదేశ స్త్రీలు తమ బిడ్డలకు మంచి శిక్షణ ఇచ్చి బాల్య వివాహాలవంటి సాంఘిక దురాచారాలను తొలగించుకోవలెనని కోరినారు ఆయన ఖద్దరు నిధికి కానుకలు సమర్పించవలెనని కోరినంతనే స్త్రీలు తమ నగలను వలిచి ఇవ్వడమే కాక కొంత పైకం కూడా ఇచ్చినారు చిన్న చిన్న బాలికలు తమంత తాముగా ముందుకు వచ్చి తమ వేలి ఉంగరాలను గాంధీజీకి సమర్పించి నప్పుడు ప్రేక్షకుల ఒడలు పులకరించింది గాంధీజీ వారిని ఆశీర్వదించినారు

సాయంత్రం 6 30 గంటలకు గాంధీనగరు మైదానంలో పెద్ద బహిరంగ సభ జరిగింది ఆ సభకు 10వేల మంది హాజరయినారు సభా స్థలాన్ని అంతా జాతీయ పతాకాలతో చక్కగా అలంకరించినారు సభా మధ్యంలో వేదిక నిర్మించినారు

మామూలు పరిచయాలు జరిగిన తరవాత మునిసిపల్ కౌన్సిల్ పక్షాన అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బెజవాడ తాలూకా బోర్డు పక్షాన నూతక్కి రామశేషయ్య చౌదరిగారు, పారిశ్రామిక సంస్థపక్షాన అద్దేపల్లి వేంకట గురునాథ రామశేషయ్యగారు బెజవాడ పౌరుల పక్షాన కాకుమాను లక్ష్మయ్య చౌదరిగారు, శ్రీకృష్ణదేవరాయ కమిటీ పక్షాన దుర్గా ప్రసాద శర్మగారు గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు

గాంధీజీ ఉపన్యాసము

అందుకు ప్రత్యుత్తరంగా గాంధీజీ హిందీలో గంభీరార్థ ప్రతిపాదకమయిన ఉపన్యాసం చేసినారు

'సోదరీ సోదరులారా! మీరు నిశ్శబ్దంగా ఉండ లెనని కోరుతున్నాను. మీరు, నాకు సన్మాన పత్రాలు సమర్పించిన వారికి నా కృతజ్ఞతాభివందనలు అన్ని సన్మాన పత్రాలూ మాతృభాషలో ఉన్నందుకు మిమ్ముల్ను నేనభినందిస్తున్నాను ఎందుకంటె అది మహారాష్ట్ర భాష అయినా హిందీకి సమానంగా ఉన్నది ఈ సన్మాన పత్రాలన్నీ చదివి నట్లుగా నే భావించవలెనను నా కోరికను మీరు మన్నించినందుకు సంతోషము నాకు ఆంధ్ర దేశంపైన ఉన్న ప్రేమ అపారము మీ సన్మాన ఆశ్చర్యం కలిగించలేదు సరికదా ఆనందం కలిగించింది మీరు నాకు సన్మాన పత్రాలను సమర్పించడంలో ఎంచుకునే మంచి పద్ధతిని సూచించ దలుచుకొన్నాను నేను మీ ముందుకు నిరుపేదలయిన దళిత వర్గాల ప్రతినిధిగా వచ్చినాను నేను పేదల ప్రతినిధిగా వచ్చినప్పుడు మీరు మీ సన్మాన పత్రాలను ఏర్పాటుచేయటానికి ఇంత వ్యయం చేయడం నాకు కష్టంగా ఉంది మీ సన్మాన పత్రాలు వ్రాతలోగాని, ఖాదీ యాకులపైనిగాని ఉన్నట్లయితే నేను ఇంకా ఎక్కువ సంతోషపడేవాణ్ణి మీరు నా పట్ల అపారమయిన ప్రేమ చూపినారు అది నేను భరించ జాలకుండా ఉన్నాను మీ సన్మాన పత్రాల అనువాదం నేను విన్నాను దానిలో చాలా ఎక్కువ స్తుతి వున్నది మీ కష్టాల గురించి గానీ, మీ ముఖ్యావసరాలను గురించి గానీ, తెలుసుకోవడం నాకిష్టము మీకు సహాయం చేయగలిగినవారి నుంచి ఏ సహాయం మీరు పొందుతున్నారో అదికూడా తెలుసుకోవలెనని నాకోరిక

ఇది మన జాతీయవారం ఇప్పటికప్పుడే 4 రోజులుగడిచి పోయినది ఇది మన ఆత్మ పరిశుద్ధత కోసం జాతీయాభ్యుదయంకోసం వినియోగించవలసిన వారం ఈ 13వ తేది వరకు మనం ఎంతో ఉత్సాహంతో జాతీయ కార్యక్రమం నిర్వహించవలసి ఉన్నది ఏప్రిల్ 13వ తేది జనరల్ డయ్యర్ అత్యాచారం మనకు జ్ఞాపకం చేస్తున్నరోజు మనం ఈనాడు వివేక జ్ఞానము, అనుభవజ్ఞానం కలిగి ప్రవర్తించవలసి ఉన్నది మీరందరూ మన దేశానికి చేతనయిన సేవచేయవలెనని కాంగ్రెస్ ఆదేశించింది విదేశీ వస్త్రాలను విసర్జించడం, ఖద్దరును ధరించడం అనే ఈ రెండు విషయ లను కాంగ్రెస్ ఆదేశించింది ప్రతి భారతీయుడు అంతకంటె ఇప్పుడు చేయగలిగినపని ఏదీలేదు జాతీయోద్యమంలో పాల్గొనడానికి భారతీయులందరికీ ఇది మంచి అవకాశము ఖద్దరుధారణ ప్రతి మనిషికి తేలికయిన పని ఆంధ్రదేశం ఖద్దరుకు ప్రోత్సాహిగా నిలబడి ఖద్దరు పని చేస్తే ఆంధ్రులు ఉత్కృష్టమయిన జాతీయ సేవచేసినట్లే 1921లో జాతీయ కార్యక్రమము మొట్టమొదటగా బెజవాడలో నిర్ణయించడంజరిగింది యావద్భారత దృష్టిని ఆకర్షించింది బెజవాడ కది గర్వకారణం కాగలదు 1921 నుంచి మీరు చేసిన పని ఏమి అని నేను అడుగుతున్నాను మీకు ధైర్యం ఉంది, తెలివి

తేటలున్నాయి కాని సంఘీభావం లేదు మీరు పరిస్పర సహకారంతో పని చేయటం నేర్చుకోలేదు మిమ్ములను నేను కలసి మెలసి పనిచేస్తూ విదేశీ బట్టకు ప్రతికూలంగాను, ఖద్దరుకు అనుకూలంగానూ ప్రచారం చేయవలెనని కోరుతున్నాను . . మీరు నాకు ఖద్దరు నిధికి 2500 రూపాయ లిచ్చినారు అది చాలా తక్కువ మొత్తం బెజవాడకు ఇంకా ఎక్కువ ఇచ్చే శక్తికూడా వున్నది ఈనాడు నా కోసం ఏర్పాటయిన ఆనంద దాయక కార్యకలాపాలను కొన్నిటిని నిర్వహించి ఈ కార్యక్రమం జరిగింపబడుచున్నాను శ్రీకృష్ణ దేవరాయల చిత్ర పటం ఆవిష్కరించడం నాకు సంతోషంగా ఉన్నది హైలెవల్ రిజర్వాయర్ కూడా నేను ప్రారంభోత్సవం చేస్తున్నాను దీనిని తెరిచేటందుకు మునిసిపాలిటీవారు నేను అంతదూరం పోవలసిన అవసరం లేకుండా దానిని ప్రారంభించినట్లు ప్రకటించడానికి నాకు ఇక్కడే అవకాశ మిచ్చినందుకు నేను వారికి కృతజ్ఞుడను నేను 5 లేదా 10 సంవత్సరాల కిందట చేయకలిగి ఉన్న పనులను ఇప్పుడు చేయలేకుండా ఉన్నాను

ఆ రోజులలో నేను చేసిన పనిలో ఏదో కొద్దిభాగం మాత్రమే ఇప్పుడు చేయగల్గుతున్నాను ఈ నా అసమర్థతను మునిసిపల్ కౌన్సిల్ వారు మన్నించినందుకు నేను వారికి కృతజ్ఞుడను మీరందరూ నా ప్రసంగ ఓర్పుగా విన్నందుకు నావందనాలు ఈ ప్రాంతాలలో హిందీప్రచారం దాదాపు సమర్థవంతంగా జరుగుతూన్నందుకు నేను సంతోషిస్తున్నాను ఆ విషయంలో ఇంకా ఎక్కువ ప్రచారం జరగవలెనని నా కోరిక హిందీ ఉపన్యాసము ను మీకు అనువదించవలసిన అవసరం లేకుండా అది అభివృద్ధి కావలె ఇప్పుడు మీరు మీ శక్తివంచన లేకుండా ఖాదీ నిధికి డబ్బు సమర్పించవలెనని కోరుతున్నాను సన్మాన వస్త్రాలను వేలం వేయడం అలవాటు నాకు ఈ లోగా నేను వికలాంగులయిన పేదల కోసం పారిశ్రామిక గృహం తెరిచినట్లు ప్రకటిస్తున్నాను ఇది నాకు చాలా సంతోషకరమయిన పని '

ఈ ఉపన్యాసానంతరం సన్మాన వస్త్రాలు వేలం వేయగా టి లక్ష్మీనారాయణగారు 116 రూపాయలకు ఒక దానిని కొన్నారు, ఇంకొక దానిని 25 రూపాయలకు సి హెచ్ సీతారామయ్యగారు ఇంకొక దానిని 30 రూపాయలకు ఏ కుటుంబరావు కొన్నారు తరవాత స్వచ్ఛందసైనికులు విరాళాలు వసూలు చేసినారు సభ రాత్రి 7 30 గంటలకు ముగిసింది

## విజయవాడ పరిసర గ్రామాలలో

మహాత్మాజీ ఆయన పరిజనము, కాశీ , ధుని నాగేశ్వరరావు, అయ్యదేవర కాళేశ్వరరావుగార్లతో కలసి గుణదల ఖద్దరు ఆశ్రమము, మొగల్ రాజపురము, పటమట గ్రామాలకు వెళ్ళినారు ఆశ్రమంలో మహాత్మాజీని ఉప్పులూరి వెంకట కృష్ణయ్యగారు ఆహ్వానించి 1116 రూపాయలు నగదును, 500 రూపాయలు విలువగల నగలను సమర్పించినారు మహాత్మాజీ వారితో "ఇంతకన్నా ఇంకా

ఎక్కువ శ్రద్ధగా పనిచేయవలెనని కోరుతున్నాను మీ శక్తి యావత్తు దేశాభ్యుదయానికే వినియోగించవలె నన్ను ఆశ్రమానికి తీసుకొని వచ్చినందుకు చాలా సంతోషము మీ పత్తిని మీరే పండించుకోవలె అట్లా చేయగలిగేటంతవరకు మీరు బాగా నూలు వడికే వారిలో చేరరు మీరు హిందీ చదువుకోండి మీ నగలు నాకిచ్చి వేయండి. వాటిని నేనింకా ఎక్కువ బాగా ఉపయోగిస్తాను అవి మీరు నాకివ్వటానికి ధైర్యంలేని పక్షంలో దానిని నగదుక్రింద మార్చి బాంకులో వేయండి అవసరమయినప్పుడు ఉపయోగించుకోవచ్చు నగలు గ్రామాలలోను, పట్టణాలలోను ధరించవచ్చు కాని ఇటువంటి ఆశ్రమంలో కాదు" అన్నారు

వెంకట కృష్ణయ్యగారి పినతండ్రి భార్య తనంతట తాను ఆమె నగలన్నీ మహాత్మునకు ఇచ్చివేసింది

తరవాత వారందరూ మొగలురాజపురం వెళ్ళినారు గ్రామస్థులు వారి ఆహ్వానానికి ఒక పందిరి వేసినారు ఆ గ్రామంలోనివారు గాంధీజీకి 1350 రూపాయల నగదుఇచ్చినారు దానిలో చాలాఎక్కువమొత్తం జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి కాట్రగడ్డ మధుసూదనరావు వారి సోదరులు ఇచ్చినదే గాంధీజీకి సమర్పించిన 8 వెండి పళ్ళాలు వేలం వేయగా 75 రూపాయలు వచ్చినాయి గ్రామస్థులు మహాత్మునకు సన్మాన పత్రంను సమర్పించినారు అప్పుడాయన వారితో "మీరు చాలా సంపన్నులవలె ఉన్నారు ఆ సొమ్మును సరిగా వినియోగించండి నగలకోసం ఖర్చుపెట్ట వద్దు పవిత్రమయిన శీలమే నిజమయిన అలంకారము" అన్నారు

తరవాత మహాత్మాజీ మొదలయినవారందరూ అక్కడకు సమీపంలోనే ఉన్న పటమట గ్రామానికి వెళ్ళినారు అక్కడ నల్లూరి పాపయ్యగారు వారిని ఆహ్వానించినారు ఖాదీనిధికి 1118 రూపాయలు, లాలాజీ స్మారకనిధికి 200 రూపాయలను సమర్పించినారు గాంధీజీకి వేసిన రెండు దండలను వేలంపెట్టగా అందులో ఒకదండను కాట్రగడ్డ మధుసూదనరావు 58 రూపాయలకు, రెండవ దండను కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు 45 రూపాయలకు కొన్నారు గాంధీజీకి సమర్పించిన గులాబిపువ్వు వేలం వేయగా 6 రూపాయలు వచ్చింది కాట్రగడ్డ రఘురామయ్యగారు ఈ రెండు గ్రామాలలోను చాలా సొమ్ము గాంధీజీకి సమర్పించినారు

గాంధీజీ వారితో "నేను సొమ్ముతో సంతృప్తి పడజాలను, దీనివెనక హృదయ సంస్కారం కావలె అది ఉంటే తక్షణమే మానవుల హృదయాలను దహింపజేసే మద్యపానం మాన్పించవలె మద్యం తయారుచేసే వృత్తిగలవారు ఆ వృత్తిని వెంటనేమానవలె ఈ మద్యపిశాచంను తరిమివేయడానికి మీరందరూ ఏకం కావలె అప్పుడే మీరిచ్చిన ద్రవ్యం సార్థకమవుతుంది నేను వ్యభిచార స్త్రీలనుంచి మద్యపు ఇజారాదారులనుంచి కూడా సొమ్ము తీసుకొను వారు తమ దురభ్యాసాలకు పశ్చాత్తాపపడి వాటిని మానివేస్తారనే ఆశతో నేను

దానిని గ్రహించినారు. మీరు విదేశ వస్తువులను మాని ఖద్దరు ధరించవలె" అని అన్నారు. ఆ తరవాత గాంధీజీ ఆయనతో వచ్చినవారు ఉదయం 9 గంటలకు తిరిగి బెజవాడ చేరుకొన్నారు.

మహాత్మాజీ సందర్శించిన గ్రామాలన్నిటిలోను స్వచ్ఛంద సైనికులు మంచి ఏర్పాట్లు చేసినారు. బెజవాడలో సాయంకాలం 3 గంటలకు పశ్చిమకృష్ణాలోని ప్రముఖ కార్యకర్తల సమావేశానికి మహాత్మాజీ హాజరయినారు. వారంతా కాంగ్రెస్ కార్యక్రమం జయప్రదంగా నిర్వర్తించడానికిగల ఉపాయాంశాలను గురించి చర్చించినారు. తిరిగి ఆ చర్చ కపిలేశ్వరంలో సాయంకాలం 3 గంటలకు కొనసాగవలెనని నిశ్చయించుకొన్నారు. అంతేకాక వసూలయిన మొత్తమంతా ఏమీ మినహాయింపులు లేకుండా గాంధీజీకి సమర్పించవలెననీ విరాళాలు వసూలు చేయడానికి అయిన ఖర్చులు వివరంగా వ్రాసి గాంధీజీకి పంపి ఆయన ఆమోదం పొందవలెననీ తీర్మానించుకొన్నారు.

కూనల పున్నయ్యగారి కుమారుడు పూర్ణచంద్రరావుకు ఇటీవలనే వివాహమయింది. ఆయన తన వధువుతో కలసి గాంధీజీకి నమస్కరించి ఖాదీ నిధికి 1000 రూపాయలు విరాళమిచ్చినాడు. ఆ నూతన దంపతులను గాంధీజీ ఆశీర్వదించినారు.

తరవాత గాంధీజీ, కస్తూరిబా ఇద్దరూ కలసి పూర్ణచంద్రరావు ఇంటికి వెళ్ళినారు. అప్పుడు వారు మరొక 116 రూపాయలు గాంధీజీకి సమర్పించినారు.

## ఉయ్యూరు ప్రయాణంలో

మహాత్మాజీ ఆయన పరిజనము ఏప్రిల్ 11వ తేది సాయంకాలం బెజవాడ నుంచి ఉయ్యూరుకుపోతూ తోవలో పోరంకి, ఈడుపుగల్లు, పునాదిపాడు, నెప్పల్లి, ఆకునూరు గ్రామాలను దర్శించినారు. ఆ గ్రామాలలో వరసగా 40, 887, 680 440, 485 రూపాయలు లభించినాయి.

ఆకునూరు గ్రామస్థులు లాలాజీ స్మారకనిధికి 100 రూపాయలు సమర్పించినారు. ఈ అన్నిచోట్ల గాంధీజీ విదేశవస్త్ర విసర్జనం, ఖాదీధారణము, అస్పృశ్యతా నివారణము, విశ్వమానవ సౌభ్రాత్రాలను గురించి ఉపన్యసించినారు.

## ఉయ్యూరులో

ఏప్రిల్ 11 రాత్రి 8 గంటలకు గాంధీజీ వారి సహచరులు, కాశీనాథుని నాగేశ్వరరావు, కాశేశ్వరరావు తదితర స్థానిక నాయకులతో కలసి ఉయ్యూరు చేరినారు.

గాంధీజీకి వారి పరిజనులకు రహదారి బంగళాలో వసతి ఏర్పాటు చేయడం జరిగింది. ఆ ప్రాంతాలలో అంత వసతిగల రహదారి బంగళా మరొకటి

లేదు గాంధీజీ రాత్రి అంతా అక్కడ గడిపినారు

12 ఉదయం పెందలకడనే లేచి గాంధీజీ మామూలు ప్రకారం కొంత తడవు నూలువడికి ప్రయాణానికి సంసిద్ధులయినారు

ఉదయం 6-30 గంటలకు గాంధీజీతో సహా అందరూ ఉయ్యూరుకు 2 మైళ్ళ దూరంలో ఉన్న కొమ్మమూరుకు వెళ్ళినారు ఆగ్రామస్థులు 400 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు ముఖ్యంగా ఆ గ్రామంలోని ఆది ఆంధ్రులను సంబోధిస్తూ గాంధీజీ పరిశుభ్రమయిన అలవాట్లు చేసుకోవలసిందని తాగుడు మానవలెనని ఖద్దరు ధరించవలెనని చెప్పినారు

అక్కడి నుంచి తిరిగి ఉయ్యూరుకు వెళ్ళినారు ఉయ్యూరులో స్థానిక మిషన్ పాఠశాల ఆవరణలో గాంధీజీకి అద్భుతమయిన ఆహ్వానం జరిగింది ఆ ఆవరణం యావత్తు తోరణాలతోను, ఆర్చిలతోను మనోహరంగా అలంకరింపబడి ఉన్నది

గాంధీజీకి ఉయ్యూరు యూనియన్ బోర్డు వారొక సన్మాన పత్రం ఉయ్యూరు పౌరులు ఇంకొక సన్మాన పత్రం సమర్పించినారు పౌరులు మహాత్ముని ఉత్తేజకరమయిన నాయకత్వానికి ఎంతో స్తుతిస్తూ ఆయన చేతులలో భారతదేశ ప్రయోజనాలు సురక్షితంగా ఉండగలవని తమ విశ్వాసాన్ని ప్రకటించినారు

అంతేకాక మహాత్ముడు రాజకీయాలను ధార్మిక సిద్ధాంతాలతో పెనవేసి ప్రపంచ మంతటిలోను విశ్వ శాంతి ప్రదాతగాను, సుహృద్భావ సంపన్నుడుగాను గుర్తింపబడినందుకాయనను ప్రశంసించినారు

ఆయన అహింసా సిద్ధాంతం ఒక నూతన వ్యవస్థగా రూపొంది భారత దేశాన్నత్యానికి తోడ్పడుతూ ప్రపంచ దృష్టిలో భారత దేశాన్ని ఒక ఉచ్చ స్థితికి తేగలిందని వారు తమ సన్మాన పత్రంలో విశదీకరించినారు

గాంధీజీ ఆ సన్మాన పత్రానికి ప్రత్యుత్తర మిస్తూ వారందరూ ఖద్దరు ధరించవలెనని తదితర విషయాలలో భిన్నాభిప్రాయాలున్నప్పటికీ ఖద్దరు విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉండాలని ఆయన అన్నారు

రాజకీయాలలో కుల, మత తత్వాలను విడనాడవలెనని అస్పృశ్యతా నివారణకు తోడ్పడవలెననీ చెప్పినారు స్థానిక క్రైస్తవ మత బోధకులు గాంధీజీని దర్శించి సంఘ సంస్కరణాలను గురించి ప్రజలకు బోధించవలెనని కోరగా ఆయన బాల్య వివాహాల వలన కలిగే కీడును గురించి చెప్పి జాతీయ పునర్నిర్మాణంతోపాటు సంఘ సంస్కరణ కూడా జరుగవలెనని ఆదేశించినారు ఈ ఉపన్యాసానంతరం గాంధీజీకి స్థానిక ప్రజలు విజయ నినాదాల మధ్య 667 రూపాయల నగదు సంచిని ఖద్దరు నిధికి బహూకరించినారు

### పశ్చిమ కృష్ణాజిల్లా (1929)

గాంధీజీ పశ్చిమ కృష్ణాజిల్లాలో పర్యటన చేసేటప్పుడు కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఖద్దరు నిధికి అయిదు వేల రూపాయలను సమర్పించి ఆ

జిల్లాలో వారి సంచారం పూర్తిఅయ్యేవరకు వారు కాంగ్రెసు మహాత్ముని స్వాధీనంలో ఉంచినారు ఉయ్యూరులో మహాత్ముని కార్యక్రమానికి పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సభ్యులు శ్రీ వల్లభనేని వెంకటరావు గబ్బిట మృత్యుంజయశాస్త్రి, గాయత్రి అనంతరామయ్యగార్లు ముఖ్యంగా తోడ్పడినారు మహాత్ముని బృందంతో శ్రీ గాదిరాజు వెంకటేశ్వరరావు మద్దూరి సుబ్బారావుగార్లు స్వచ్ఛంద సేవకుల దుస్తులలో పశ్చిమ కృష్ణా పర్యటనలో వెంట వెళ్ళినారు

పశ్చిమ కృష్ణా జిల్లా పర్యటన ముగించుకొన్న తరవాత తూర్పు కృష్ణా జిల్లా నాయకులు డాక్టర్ పట్టాభి సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, చెరుకువాడ వెంకట నరసింహంగార్లు గాంధీజీని ఆయన బృందాన్ని తూర్పు కృష్ణా జిల్లాలోని కపిలేశ్వరపురం గ్రామానికి తీసుకొని వెళ్ళినారు అక్కడ కొల్లిపర సూరయ్యగారు వారికందరికీ ఆతిథ్యమిచ్చి సమావేశపు ఏర్పాట్లు చేసినారు

## కపిలేశ్వరపురంలో

ఉయ్యూరు నుంచి 12వ తేది ఉదయం 7-30 గంటలకు బయలుదేరి తాడంకి మీదుగా కురుమద్దాలి వెళ్లినారు తోవలో కనుమూరులో గాంధీజీకి 100 రూపాయలు సమర్పించడం జరిగింది కురుమద్దాలిలో వెంపుగట్టున మఱ్ఱి చెట్టుకింద సభామంటపం రమ్యంగా అలంకరించబడింది సభ నిశ్శబ్దంగా జరిగింది అక్కడ సుమారు 800 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు గాంధీజీ ఖద్దరు ధారణ గురించి హెచ్చరించినారు అక్కడ నుంచి పామర్రు చేరుకొన్నారు అక్కడి రైసుమిల్లుల వెనక బాలంలో సుమారు 600 మంది సమావేశమయి 800 రూపాయలు సమర్పించినారు

తరవాత పామర్రునుంచి వీరంకిలాకుకు వెళ్ళగా అక్కడ రెండువేల మంది సమావేశమయినారు ఆ సభలో పెనుమచ్చ గ్రామస్థులు ఎక్కువ మంది ఉన్నారు సభలో 800 రూపాయలు గాంధీజీకి కానుకగా సమర్పించినారు

అస్పృశ్యతా నివారణ గురించి విదేశవస్త్ర బహిష్కారాన్ని గురించి గాంధీజీ హెచ్చరించినారు సుమారు 10 గంటలకు కపిలేశ్వరపురానికిచేరి గాంధీజీ అక్కడే బసచేసినారు ఆయన దర్శనానికి వేలకొద్దీ యాత్రికులు చుట్టుపట్ల గ్రామాలనుంచి అక్కడకు వచ్చినారు గ్రామస్థులు ఊరిబయట సభామంటపం నిర్మించినారు మహాత్ముడు సభామంటపానికి రాకపూర్వం అయ్యదేవర కాళేశ్వరరావు, డాక్టర్ పట్టాభి సీతారామయ్యగార్లు మహాత్ముని సంచార ప్రయోజనం గురించి ప్రసంగించినారు కాళేశ్వరరావుగారు స్వరాజ్య పతాకం ఆవిష్కరించినారు సరిగా 5 గంటలకు గాంధీజీ సభకు వచ్చినారు గ్రామస్థులు సన్మాన పత్రంతోపాటు గాంధీజీకి 1500 రూపాయల కానుక సమర్పించినారు మహాత్ముని హెచ్చరిక మూలంగా 200 రూపాయల విలువగల ఆభరణాలు కూడా

ఆయనకు లభించినాయి గాంధీజీ కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంగురించి గంభీ రోపన్యాసం చేసినారు మహాత్ముని సముఖంలో విదేశీ వస్త్రాలను దహించడం జరిగింది

**మహాత్మునికి సన్మాన పత్రము**

"శ్రీ మోహన్ దాస్ కరంచంద్ గాంధీ మహాత్ముల వారికి జయమగు గాక!

మహాత్మాజీ!

ఈనాడు మీ పాదకమలాలు సోకి ముదంకుర పులకితమయి మా ఆవాస లక్ష్మి మీకు స్వాగత నిరాజనం పడుతున్నది బాపుజీ, 4 యేండ్ల నుంచి మీ దర్శన భాగ్యమెప్పుడెప్పుడని ఉవ్విళ్ళూరు తున్నాము ఇంకనూ దుర్బల శరీరు లయ్యూ తేజోరూపిణి అయిన భారత మాత శక్తిచే దరిద్ర నారాయణ సేవా పరాయణత్వంతో నిర్నిద్ర మనస్కులై ఉన్న మీ సందర్శన భాగ్యం కలగ చేసినందున కృతజ్ఞులము

పురుషవర్యా!

ఇంతకు పూర్వం ఎర్రవాడ కారా గృహంనుంచి భారత భాగ్య విధాత అనుగ్రహంచే మృత్యువునుంచి వెలువడి కట్టుకంబం వీడి రొంపిలో దిగబడిన స్వరాజ్య ధేనువును ఉద్ధరించడానికి సమకట్టటం వల్ల ఈ మహా యజ్ఞంలో అధ్వర్య భారం స్థిత ప్రజ్ఞులగు తమ భుజాల మీదనే ఉన్నదని వ్యక్తమవుతున్నది

నాయకాగ్రణీ!

ఈ అయిదారు వత్సరాలనుంచి శాసనసభా వ్యామోహపరీతమై స్థానిక సంస్థాభిలాషాలంపటమై ప్రజల దృష్టి పెడతరిగి నిర్మాణ కార్యక్రమం నిద్రాణమై ఉన్నది తత్ఫలితంగా ప్రజలలో స్వరాజ్య కాంక్ష మందగించింది ఇంతలో పౌరుష ప్రబోధకులయిన తాము కాశీపట్టక్షేత్రంలో దేశీయ మహాసభా రథసారథ్యోన్ముఖులవుతు చేసిన శంఖధ్వానము మండు టెండల వల్ల ఎండిఉన్న పచ్చిక బయళ్ళకు ప్రావృడ్కాల జలధర గర్జనల వోలె ప్రబోధం గావించి జీవం పోసినది ఇక మిమ్మనుసరిస్తాము దండనాధుని సైనికులవలె గోపకుని గోవులవలె మిమ్ము వెన్నాడుతాము మళ్ళా మీ ఉప దేశానుసారం కాంగ్రెస్ కార్యక్రమం సుప్రయుక్తంగా నిర్వహించవలెననే ఆసక్తి కుతూహలాలు కలిగినాయి

సత్యాగ్రహవ్రతీ!

మా గ్రామము పురాతనమై చరిత్ర ప్రసిద్ధి చెందింది దేశీయ మహాసభా ఆజ్ఞానుసారం మేము యథాశక్తిని స్వరాజ్యానికోసం పాటుపడతాము ఈ

గ్రామంలో 5500 జనులు నివసిస్తున్నారు తమరు కార్యరంగంలో అవతరించిన నాటి నుంచే దీక్షతో ఖద్దరును ధరిస్తున్న వారిందున్నారు మా కాంగ్రెస్ సంఘంలో 50 మంది సభ్యులే ఉన్నారు త్రికరణశుద్ధిగా కాంగ్రెస్ ఆజ్ఞలను నిర్వర్తించడానికి ప్రతిజ్ఞ చేసినారు ఈ గ్రామంలో ఒక సంవత్సరం కింద హిందీ పాఠశాలను స్థాపించి రాష్ట్రభాషావ్యాపనకు ఓపినంత పాటు పడుతున్నాము మా ఊరి పాఠశాలలో అస్పృశ్యబాలురను ఆదరపూర్వకంగా చేర్చుకొంటున్నాము

భారతీయ ప్రియా !

ఈ గ్రామంలో పంచాయతీ సంస్థను స్థాపించి గ్రామ పారిశుద్ధ్య విషయంలో జాగ్రత్త తీసుకొంటున్నాము దేశబంధు చిత్తరంజన్‌దాసుగారి కార్యక్రమానుసారంగా ఈ పంచాయితీని తీర్చిదిద్ద ప్రయత్నిస్తున్నాము మా ఊరిలో గ్రంథాలయాలు బెట్టి గ్రామస్థుల విద్యాభివృద్ధికి తోడ్పడుతున్నాము

ధర్మమూర్తీ !

మీ రాకవలన మేము ధన్యతనొందినాము భారతీయ స్వధర్మోపదేష్టలయిన తమ ఆదేశం అనుసరించి మా స్వధర్మంను నిర్వహించటంలో నిధనమునయినా పొందడానికి సంసిద్ధులమై ఉన్నాము స్వధర్మ నిర్వహణలో ఈ గ్రామం చెక్కుచెదరక నిలచి కీర్తివంతమయ్యేటట్లు తమరాశీర్వదించవలెనని ప్రార్థిస్తున్నాము దరిద్రనారాయణ భక్తులయిన మీకు మేమిచ్చే ధనం చంద్రునకు నూలు పోగువంటిదని ఎరిగి ఇది భక్తిపూర్వకమైన కానుకగనే అర్పిస్తున్నాము

ఇట్లు
కపిలేశ్వరపుర వాసులు
కాంగ్రెస్ సంఘ సభ్యులు
గ్రామ పంచాయతీ సభ్యులు

ఎలకుర్రు తోవలో

మహాత్ముడు 12 వ తేది సాయంకాలం సరిగా 5-30 గంటలకు కపిలేశ్వర పురం నుంచి ఎలకుర్రుకు ప్రయాణమయినారు దారిలో పసుమర్రులో చెరువు గట్టున సభా మంటపము చక్కగా నిర్మించబడింది సుమారు 1000 సమావేశమయినారు స్త్రీలు కూర్చుండటానికి ప్రత్యేకమైన ఏర్పాట్లు చేసినారు పసుమర్రు గ్రామస్థులు గాంధీజీకి 500 రూపాయలు సమర్పించినారు పరిసేపల్లి గ్రామస్థులు 200 రూపాయలు సమర్పించినారు

**ఎలకుర్రులో**

గాంధీజీ, ఆయనతో ఉన్నవారు రాత్రి 7 గంటలకు ఎలకుర్రు చేరినారు ఆ ఊరు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు పుట్టిన గ్రామము.

గాంధీజీ అక్కడ ఆయన అతిథిగా వున్నారు అక్కడ పాఠశాలముందు ఆవరణలో గొప్ప సభ జరిగింది పంచమ బాలురు భగవద్గీతా శ్లోకాలు చదివినారు మహాత్ముడందుకు సంతోషించి అస్పృశ్యతానివారణ గురించి హెచ్చరించినారు నాగేశ్వరరావు పంతులుగారు పుట్టిన ఎలకుర్రులో ఇంకా చాలా మంది విదేశీ బట్టలను ధరించి ఉండటం విచారకరమన్నారు అక్కడ గ్రామస్థులు సుమారు 1250 రూపాయలు సమర్పించినారు 18 వ తేది ఉదయం నాగేశ్వరరావు పంతులు గారు పంచములకు ప్రత్యేకంగా నిర్మించిన పాలపల్లెను చూడడానికి గాంధీజీని తోడ్కొని పోయినారు అక్కడి పంచములు గాంధీజీకి సమస్కరించి 25 రూపాయలు కానుకగా ఇచ్చినారు పట్టణస్తులిచ్చిన వేలకంటె ఆ మాలలిచ్చిన ఆ స్వల్పమొత్తం ఎక్కువ విలువగలదని గాంధీజీ అన్నారు తోవలో కొరిమెర్లలో చెరువు గట్టున గాంధీజీకి 150 రూపాయలు విరాళాలు లభించినాయి

## గుడివాడలో

గాంధీజీ, ఆయన బృందం గుడివాడ 18 వ తేది రాత్రి 7-45 గంటలకు చేరినారు చెరువు గట్టు మీద జనం కిటకిటలాడుతూ మూగి ఉన్నారు సుమారు 5 వేల మంది ప్రజలు ఉన్నట్లు అంచనా వెయడం జరిగింది 1200 రూపాయలు కానుకలర్పించడం జరిగింది గుడివాడ తాలూకా బోర్డువారు గాంధీజీకి వినతి పత్రం సమర్పించినారు పంచములు ఒక అభినందన పత్రం సమర్పిస్తూ తమ బాధలను అందులో వర్ణించినారు మహాత్ముడు ఉపన్యసించబోయే సరికి జనంలో గోల ఎక్కువయింది తాలూకా బోర్డువారు తను వినతి పత్రంలో సూచించిన ఆక్షేపణలకు వేరొక చోట సమాధానం ఇస్తానని గాంధీజీ అన్నారు గుడివాడ నుంచి సేరికల్వపూడికి వెళ్ళుచూండగా తోవలో బొమ్ములూరివారు ఖద్దరు నిధికి 120 రూపాయలు విరాళమిచ్చినారు

## గుడివాడ ఆదిమాంధ్రుల స్వాగతపత్రము

"లోకోత్తరులయిన శ్రీమహాత్మునికి సాష్టాంగ ప్రణామాలు

మహాత్మా!

"కిందటి పర్యాయం సుమారు 8 సంవత్సరాలకిందట తాము ఇక్కడికి వచ్చినప్పుడు మాఆదిమాంధ్రులైన నిమ్నజాతులు మాఅభ్యుదయానికి కృషి సలిపే స్థానిక ప్రయత్నం తమ ఆశీర్వాదంవల్ల ధన్యత గాంచింది అప్పుడు తమకు వినుతిసలిపిన మాసంఘ ప్రముఖులు తమకు స్వాగతమిచ్చినందువల్ల ఆ మహాత్కార్యం వచ్చిరాని మాటలతో మేము విన్నవించడానికి సాహసిస్తున్నాము

మీరెంత నెత్తిన నోరుపెట్టుకొని మొరపెట్టినను మాదుర్గతి దుర్గతిగనే ఉన్నది పై జాతులను అస్పృశ్యతా పాపం వీడలేదు ప్రతిదేశంలోను హెచ్చు

తిగ్గులు, తెలుపు నలుపులు మొదలయిన వ్యత్యాసాలున్నా అవి అన్నీ సాంఘిక, ఆర్థిక తరాలనుబట్టి ఉన్నాయి కాని సుఖం చేరిట ఇట్లాంటి దుర న్యాయం జగగడం మేమెరుగము అత్మగౌరవంవల్ల, స్వయంసహాయ సాధన వల్ల మాదుర్గతి పోతుందని బోధిస్తారు కాని ఒకపూట అయినా పొట్టనిండ కూడు ఎరగని, వంటినిండ బట్టలేని, పశుప్రాయులకంటె హీనదశ తల వ్రాతగా కలిగిన మా దౌర్భాగ్యజాతికి అట్లా స్వాతంత్ర్యగుణాలు ఎట్లా సాధ్యమవుతాయి ఇతరుల మాట ఎట్లా ఉన్నా జాతీయ నాయకులయిన తమ అనుచరులలోనైనా ఎందరు అస్పృశ్యతా పాపవిమోచనను తమ స్వవిష యమునసైతం ఎంతవరకు సాధించగలిగినారో తాము తెలుసుకొని ఉన్నారు ఎప్పటికైనా అది సాధ్యంకానిచో దేశ స్వాతంత్ర్యమనేమాట ఆకాశ కుసుమంగాక ఉంటుందా ! మేడలపక్కను సగం ఎగిరిపోయిన పూరిగుడి సెలును, జిలుగు వస్త్రాలంకారాలొకవంక చీకమొలలు ఇంకొకవంకనూ, ఇంకొక వైపు పాయసాన్నాలతో[3] తులతూగుతూ ఉంటే ఆ వైపునే గంజిలోకి ఉప్పు లేక మలమల మాడటం-ఇట్లాంటి విపరీత పరిస్థితులు సాంఘిక, నైతిక, ఆర్థిక ధర్మాలుగా పరిగణింపబడే ఈ కాలంలో పేదలకు, నిమ్నజాతులకు అస్పృశ్యు లకు, చెమటోడ్చి పొట్టపోసుకొనేవారికి స్థానమెక్కడ తమబోటి మహాత్ములు మాటోటి దీనుల స్వత్వసాధనకు పరిపూర్ణంగా ఏకదీక్షనిష్ఠతో నడుముకట్టిక పోవడం కొంత మా దౌర్భాగ్యమని పరితపిస్తాము మాదుర్గతి బాపటానికి అందులో ముఖ్యంగా అస్పృశ్యతా పాపవిమోచన సత్యసాధన తమ మహా ప్రయత్నంవల్ల సాధ్యమయ్యేటట్లు అనుగ్రహించుగాక అని శ్రీ పరమేశ్వరుని సదా ఆరాధిస్తాము.

తోడి మానవులతో చేరి మంచినీళ్ళు తోడుకోవడానికి గాని దేవునికి దేశీయులతో మొక్కటానికిగానీ నోచుకొనని మా దౌర్భాగ్యానికి ఓ పర మేశ్వరా నీవే శరణ్యంగా సాష్టాంగ ప్రణామాలు

ఇట్లు దూరమునుంచి విన్నవించసాహించే

ఆదిమాంధ్రులు

ఆదిమాంధ్రుల పక్షాన

ఈరా వెంకయ్య

## సేరికల్వపూడిలో

ఈ గ్రామంలోని రైతులు ఆ వెనకటి రాత్రి అంతా మేల్కొని మాగాణిగట్లను తెగగొట్టి మహాత్ముని మోటారు పోయేటందుకు అనువుగా బాట ఏర్పాటు చేసినారు కల్వపూడి చెరువుకు సమీపంలో సభ జరిపినారు కడచిన 8 యేండ్లనుంచి ఈ గ్రామంలో రాట్నములు పనిచేస్తుండినాయి సుమారు 20 మంది స్త్రీలు సభలో కూర్చుండి నూలువడకటంలో తమ హస్త నైపుణ్యంను ప్రదర్శించినారు ఏకులు చేయడానికి ఇతరులపై ఆధారపడక

తమంతా తామే పనులు చేసుకోవడం మంచిదని మహాత్ముడు చెప్పగా పనులను తమకు తామే చేసుకొంటున్నామని ఆ స్త్రీలు సమాధానమిచ్చినారు సుమారు 500 రూపాయలు ఖద్దరునిధికి సమర్పించినారు ఒక స్త్రీ తన మెడలోని బంగారపు గొలుసును తీసిఇచ్చింది

ఈ గ్రామం మొదటి కార్యక్రమంలోలేదు కాని గ్రామవాసుల అత్యాసక్తిని చూసి మహాత్ముడు ఈ గ్రామానికి పోయేటందుకు సమ్మతించి నారు

### నూజెళ్ళలో

గాంధీజీ నూజెళ్ళ చేరేసరికి రాత్రి 9 గంటలయింది పర్వతనేని భూషయ్యగారి ఇంటిఎదుట పందిట్లో మహాత్ముని కారు నిలిచింది భూషయ్య గారు గురుపూజా విధానం ప్రకారం మహాత్ముని పుష్పమాలాలంకృతునిచేసి, నూతన వస్త్రాలిచ్చి, 500 రూపాయల కానుక సమర్పించినారు వారి బంధువులు 800 రూపాయలవరకు విరాళాలు ఇచ్చినారు

### అంగలూరులో

అంగలూరుకు రాత్రి 9 45 గంటలకు చేరినారు అక్కడ సుమారు 4వేల మంది సమావేశమయినారు 500 మంది స్త్రీలు మహాత్ముని సందర్శ నార్థం వచ్చినారు కాలాతీత మయినందువల్ల గాంధీజీ అక్కడ ఎక్కువ కాలం ఉండలేక పోయినారు ఎర్నేని సుబ్రహ్మణ్యంగారి స్వయం కృషివల్ల గాంధీజీకి 800 రూపాయలు ఖద్దరు నిధికి లభించింది

### కవుతవరంలో

గాంధీజీ, వారి బృందం కవుతవరం చేరేటప్పటికి 10 గంటలయింది దారిలో గుడ్లవల్లేరులాకు దగ్గర గాంధీజీకి 116 రూపాయలు చేకూరినాయి ఈ గ్రామంలో ఆగకుండానే గాంధీజీ సరాసరి కవుతవరం వెళ్ళినారు

చెరువు గట్టున పెద్ద మండపం నిర్మింప బడింది సుమారు 2 వేల మంది సమావేశమయినారు చిరకాలం నుంచి ఆ గ్రామం స్వదేశీ ఉద్యమానికి పట్టు కొమ్మ ఆగ్రామంలో గాంధీజీకి 1116 రూపాయలు కానుకగా సమర్పించినారు 1921 లోనే ఆవూరి కాపురస్థులు కానూరు చినవెంకట దాసయ్యగారు ఒకరే గాంధీజీకి రు 1116లు ఇచ్చిఉనారు గాంధీజీ కవుతవరం చేరేటప్పటికి కాలం మించిపోవడంచేత అక్కడ 2 నిమిషాలకు మించి ఉండలేకపోయినారు తరవాత వడ్లమన్నాడు వెళ్ళినారు ఆ గ్రామస్థులు 250 రూపాయలు గాంధీజీకి ఖద్దరు నిధికి ఇచ్చినారు వారు సభా మంటపం నిర్మించినప్పటికీ రోడ్డు మీదనే ఉండి గాంధీజీ వారి విరాళం స్వీకరించినారు తరవాత పెడనమీదుగా బందరుకు

ప్రయాణమయినారు పెడనలో ఒక బ్రాహ్మణ గృహస్థుడు ఖద్దరు నిధికి 116 రూపాయలు విరాళమిచ్చినారు

## దివి తాలూకాలో

గాంధీజీ, ఆయన బృందము 13వ ఏప్రిల్ రాత్రి 11 గంటలకు బందరు చేరినారు వీధులలో మంచి పోలీసు బందోబస్తు చేయడం జరిగింది పౌరుల జయజయధ్వానాల మధ్య మహాత్ముడు బసకు చేరుకొన్నారు

మరునాడు ఉదయం (14-4-1929) గాంధీజీ బందరు నుంచి బయలు దేరి చినముత్తేవి, పెదపూడి, కూచిపూడి నరసన్న పాలెం, మొవ్వ, కొడాలి, తాడేపల్లి, ఘంటసాల, సాలెం పాలెం చూసుకొని 9 గంటలకు ఘంటసాల చేరి నారు ఘంటసాల ఘోటకంలోని పెద్దపందిరిలో సుమారు 2 వేల మంది సమా వేశ మయినారు పురుషు లొకపక్క స్త్రీలొకపక్క కూర్చొన్నారు మహాత్ముని మోటారు సరిగా సభా మధ్యకు వచ్చి నిలబడింది గ్రామస్తులు వినతి పత్రంతో 500 రూపాయల కానుక సమర్పించినారు

అందరూ ఖద్దరు ధరించవలెనని, విదేశీబట్టలను బహిష్కరించవలెనని, తాగుడును మానవలెనని, అస్పృశ్యతను పాటించరాదనీ గాంధీజీ ప్రబోధించి నారు అక్కడి స్త్రీలు నూలువడకడం చూసి మహాత్ముడు చాలా సంతోషిం నారు ఈశ్వరుని నామం దాసానదాసు అయినప్పుడు బ్రాహ్మణుడు జాత్యా హంకారానికి వశంకాక వినమ్రుడై సంఘ సేవాతత్పరుడై ఉండవలెనని గాంధీజీ బ్రాహ్మణులను హెచ్చరించినారు స్త్రీలు గాంధీజీకి ఆభరణం సమ ర్పించినారు ఒక ముసలమ్మ తన పట్టెడను ఇచ్చింది ఘంటసాలలో ఒక స్త్రీ, కుటుంబకలహాలవల్ల తన భర్త తనను విడనాడి మరొక యువతిని పెండ్లి చేను కొన్నట్లు మహాత్మునికి నివేదించగా, ఆయన ఆమెకు దైవ భక్తి కలిగి నూలు వడకుకొంటూ బ్రహ్మచారిణిగా జీవించమని సలహా ఇచ్చినారు

తరవాత దేవరకోట మీదుగా గాంధీజీ చల్లపల్లి చేరుకొన్నారు చల్ల పల్లి రహదారి బంగాళాలో సాయంకాలం వరకూ ఉన్నారు సాయంకాలం 5 గంటలకు చల్లపల్లిలో బహిరంగ సభ జరిగింది అక్కడ గాంధీజీ ఖద్దరు ధారణ గురించి అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు చల్లపల్లిలో 150 రూపాయలు విరాళం సమర్పించడం జరిగింది

## కొడాలిలో

ఏప్రిల్ 14 ఉదయం సుమారు 8-30 గంటలకు గాంధీజీ ఆయన బృందం కొడాలి చేరినారు కొడాలి నుంచి చల్లపల్లి పోయే రోడ్డు ప్రక్కన పొలంలో ఒక పందిరి వేసి దానిని చక్కగా అలంకరించి కొడాలి గ్రామస్థులు ఒక వేదిక ఏర్పాటు చేసినారు. గాంధీజీ కారు సరాసరి ఆ వేదిక దగ్గరికి వచ్చింది. ప్రజలు నిశ్శబ్దంగా ఎక్కడివారక్కడ కూర్చున్నారు కొడాలిగ్రామం

లోని చాదాపు స్త్రీ పురుషులందరూ అక్కడ ఉన్నారు అప్పుడు శ్రీ తుమ్మల వెంకట్రామయ్య (కొడాలి గ్రామమునసబుగారి కుమారుడు) గ్రామస్తుల పక్షాన రూ॥ 381-6-0 లు సమర్పించినారు గాంధీజీ ఖద్దరు ఆవశ్యకతను గురించి, మద్యపాన నిషేధం గురించి, అస్పృశ్యతా నివారణ గురించి 5 నిమిషాలు ఉపన్యసించి సమీపంలో ఉన్న తాడేపల్లి గ్రామానికి వెళ్ళినారు

**పురిటిగడ్డలో**

గాంధీజీ, వారి బృందము పురిటిగడ్డ వెళ్ళినారు అక్కడ ఒక చెట్టుకింద స్త్రీలు నూలు వడకడం చూసినారు పురిటిగడ్డలో అనుదినం 60 రాట్నాలు పనిచేస్తూవుండినట్లు తెలుసు కొన్నారు పురిటిగడ్డ వాస్తవ్యులు 150 రూపాయలు, కొన్ని ఉంగరాలు కానుకగా సమర్పించినారు పురిటిగడ్డ నుంచి కప్తాను పాలెం, పెదప్రోలు, మోపిదేవి, నాగాయతిప్ప గ్రామాలకు వెళ్ళినారు ఒక్కొక్క గ్రామంలో 150 రూపాయల వంతున మొత్తం 600 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు

వారు నాగాయితిప్ప దగ్గర కృష్ణానదిని దాటి అవనిగడ్డ వెళ్ళినారు అవనిగడ్డ నుంచి నాగాయలంక పోయేసరికి 8 గంటలయింది నాగాయలంకలో 500 రూపాయల మొత్తం ఖద్దరు నిధికి సమర్పింప బడింది అక్కడ నుంచి అవనిగడ్డ చేరేసరికి 8 20 నిమిషములయింది అంతట పట్టాభి సీతారామయ్యగారు గాంధీజీని బసలో చేర్చినారు కాని వారి దర్శనార్థం కోడూరులో కొన్ని వేల మంది నిరీక్షిస్తున్నారని, ఆ సెంటరు ఇదివరకే గాంధీజీ కార్యక్రమంలో చేర్చబడి వుండిందని తెలుసుకొని గాంధీజీ వెంటనే తన పక్కను ఎత్తించి మోటారు ఎక్కినారు కోడూరు చూసుకొని వచ్చేసరికి రాత్రి 10 గంటలయింది అప్పటి కింకా అవనిగడ్డలో సుమారు 3, 4 వేల మంది సభలో నిరీక్షిస్తూన్నారు ఈ సంగతి తెలిస్తే గాంధీజీ ఆ సభకు పోయి ఇంకా ఎక్కువ శ్రమపడతారని తలచి వారితో ఈ విషయమై ఎవ్వరు చెప్పలేదు కొండ వెంకటప్పయ్యపంతులు గారు, డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఆ సభకు పోయి ప్రజలను క్షమాపణ కోరినారు మరుసటిదినం సోమవారం మహాత్మునికి మౌనవ్రతపు రోజు ఏప్రిల్ 15 ఉదయం 6 గంటలకే అవనిగడ్డ నుంచి కొత్త పేట రేవు దగ్గర కృష్ణానదిని దాటినారు గాంధీజీ కృష్ణదాటి మోటారు ఎక్కబోతూండగా కోసూరివారి పాలెం వాస్తవ్యులు రేపల్లె వెంకటకృష్ణయ్యగారు మహాత్మునకు ఖద్దరు నిధికి రూ 116 లు సమర్పించినారు ఆ దినమంతా గాంధీజీ బందరులోనే విశ్రాంతి తీసుకొన్నారు

**మచిలీపట్టణంలో**

గాంధీజీ, ఆయన బృందము ఏప్రిల్ 18 ఉదయం గుడివాడ, అంగ

లూరు, నూజెళ్ల మొదలయిన గ్రామాలను చూసుకొన్న తరవాత 10-45 నిమిషాలకు అందరు చేరనారు 'గాంధీజీకీజై' అనే నినాదాలతో అయనను బందరు వారులు ఆహ్వానించినారు సాయంకాలం 5 గంటలకు మినర్వా సినిమాహాల్‌లో మచిలీపట్టణం మహిళా సంఘువారు ఏర్పాటు చేసిన స్త్రీల సభలో గాంధీజీ ఉపన్యసించినారు ఆ సభకు 5వేల మంది స్త్రీలు వచ్చినారు

మహిళా సంఘ కార్యదర్శిని శ్రీమతి మాదిరెడ్డి రాజాబాయమ్మగారు స్థానిక మహిళా సంఘంపక్షాన గాంధీజీని పుష్పమాలాలంకృతుని చేసినారు గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"ఇక్కడ నాసోదరీమణులను అనేకమందిని చూసినందుకు చాలా సంతోషంగా వుంది కాని వారిలో చాలామంది విదేశీ బట్టలలో ఉండటంచేత నాకు విచారం కలుగుతున్నది మీరందరూ విదేశీ బట్టలను విడనాడి ఖాదీ ధరించవలెనని నా ప్రార్థన ఇండియాలో మరొక పర్యాయం రామరాజ్యం స్థాపింపబడవలెనని నా అభిలాష సీతలేని రామరాజ్యం ఉండదు అందువల్ల మీఅందరిలో సీత మూర్తీభవించవలెనని నాకోరిక

మీరు ఎవ్వరినీ అస్పృశ్యులుగా భావించకూడదు మీబాలబాలికలను మన పూర్వీకుల అత్యుత్తమ సంప్రదాయంలో పెంచి పెద్దచేసి వారికి శిక్షణ ఇవ్వవలెనని కోరుతున్నాను బాల్య వివాహాలను నిరుత్సాహపరిచి నిరోధించవలెనని, మీపిల్లలకు ఉత్తమమయిన విద్య నేర్పించవలెనని ఆకాంక్షిస్తున్నాను మీవిలువగల వస్తువులను, నగలను అన్నిటినీ ఖద్దరుకోసం ఇచ్చివేయవలె ఎందువల్లనంటె సాంఘికము, ఆర్థికము అయిన అన్ని చిక్కులను ఖద్దరు ఉద్యమము పరిష్కారం చేయగలదు అందువలన మీనగలకంటె ఖద్దరు ఎక్కువ ప్రాముఖ్యమయినదని గ్రహించవలె ఈ సందర్భంలో అనేకమంది సోదరీమణులు ఆశ్చర్యకరమయిన త్యాగాలుచేసి తక్కినవారికి మార్గదర్శకులు కాగలిగినారు ఖద్దరుపట్ల ఆసక్తిలో మీరు వారికి ఎంతమాత్రం తీసిపోకూడదని నాకోరిక" ఈ ఉపన్యాసానంతరం స్వచ్ఛంద సైనికులు సభలోకిపోయి నగదూ, నగలూ, బంగారము, ఉంగరాలవంటి వస్తువులను సేకరించినారు వాటి మూల్యం దాదాపు 500 రూపాయలు వుండవచ్చునని అంచనా

## అరుంధతీ ఆశ్రమము

తరవాత గాంధీజీ, వారి బృందము శ్రీ వేమూరి రాంజీరావుగారి పంచమ బాలుర పాఠశాలకుపోయి పంచమ బాలికల నిమిత్తం అరుంధతీ ఆశ్రమ స్థాపన జరిపినారు రాంజీరావుగారు తమ జీవితం పంచమోద్ధరణకోసం ధారపోస్తున్నందుకు మహాత్మాజీ సంతోషం వెలిబుచ్చి "నన్ను ఇటువంటి సంస్థలకు ఆహ్వానించడం నేను గౌరవంగా భావిస్తాను పంచమ బాలుర విద్యాభివృద్ధులకోసం ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడిన సంస్థలను దర్శించడంలో నాకు అంతులేని ఆసక్తి వున్నది" అన్నారు

అక్కడనుంచి గాంధీజీ ఆంధ్ర జాతీయ కళాశాలకుపోతూ త్రోవలో కన్యకాపరమేశ్వరి గుడిలోని వైశ్యసంఘంవారి గ్రంథాలయం దర్శించినారు వైశ్యసమాజంవారు ఖద్దరునిధికి రూ 116లు సమర్పించినారు

## ఆంధ్ర జాతీయ కళాశాల

మహాత్ముడు సరిగా సాయంకాలం 6-30 గంటలకు ఆంధ్ర జాతీయ కళాశాలకు వెళ్లినారు అక్కడివారు మహాత్ముని మెడలో విజయధ్వానాలు మధ్య పూలదండ వేసినారు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ఖాదీనిధికి బందరులో వసూలైన మొత్తం 5194 రూపాయలని, కళాశాల సిబ్బందివారి 45 రూపాయల 1 అణా, పి సత్యనారాయణగారి 116 రూపాయలు, గుడ్లవల్లేరులో యం కృష్ణారావుగారి ద్వారా మరొక 116 రూపాయలు చేరినట్లు ఆ సభలో ప్రకటించినారు సభకు సుమారు 5వేల మంది వచ్చినారు బందరు మునిసిపాలిటీపక్షాన చైర్మన్ శ్రీ జగన్నాథరావునాయుడుగారు, బందరు తాలూకా బోర్డుపక్షాన అధ్యక్షుడు శ్రీ కొల్లిపర వెంకటరమణయ్యనాయుడుగారు గాంధీజీకి అభినందనపత్రాలు సమర్పించినారు

## మహాత్ముని ఉపన్యాసము

"సోదరీ సోదరులారా!

మీ రిచ్చిన విరాళాలకు నేను మిమ్ములను అభినందిస్తున్నాను బందరు మునిసిపాలిటీ వారు బందరు తాలూకా బోర్డువారు పంపిన అభినందన పత్రాలు చేరినాయి 8 యేండ్ల కిందట నేని పట్టణానికి వచ్చినప్పుడు ఈ ప్రదేశంలోనే ఉపన్యసించినాను ఈ కళాశాల సంస్థాపకులైన కీ శే శ్రీ కోపల్లె హనుమంతరావుగారు ఈ సంస్థకు ఆత్మవంటివారు వారి నీనాడు చూడలేనందుకు దుఃఖిస్తున్నాను కోపల్లె హనుమంతరావు గారిని నేనెక్కువ కాలం ఎరగను కాని వారి ప్రతిభను, త్యాగాన్ని, దేశభక్తిని తెలుసుకోవడానికి నాకెంతో కాలం పట్టలేదు ఇక నేను ఇతర విషయాలను గురించి ముచ్చటించే ముందు ఒక్క విషయం గురించి చెప్పి నా హృదయ భారం తొలగించుకొన దలచుకొన్నాను ఈ కళాశాలా పరిపాలకులలో అంతఃకలహాలు ఏర్పడిన వన్న సంగతి బహిరంగ రహస్యము అందువల్లన ఈ ఉత్తమ సంస్థ సముద్రంలో పడిపోయే ఆపత్తు కనిపిస్తున్నది ఈ కళాశాల పరిపాలనను గురించి కొంతకాలం కిందట నాకొక పెద్ద లేఖ వచ్చింది నాకిప్పుడు తగిన వ్యవధి లేదుగాని ఉన్నట్లయితే ఈ కళాశాలలోని విద్యా విధానం గురించి కళాశాల పరిపాలనలోని వివిధ దోషాలను గురించి పాలకవర్గం వారితో సమగ్రంగా చర్చించి ఉండేవాణ్ణి నేనీ కళాశాల క్షేమాభివృద్ధులతో అత్యంత సన్నిహితమయిన ఆసక్తి ఉన్నవాణ్ణి ప్రస్తుతం ఈ కళాశాల భవితవ్యం ఎవరి చేతుల్లో ఉన్నదో వారికి నేనొక మాట చెప్పదలచుకొన్నాను ఏమి తటస్థించి నప్పటికీ ఈ సంస్థలోని నిర్దుష్టమయిన జాతీయ

స్వరూపాన్ని నిలబెట్ట వలసిందని వారికి నా సలహా ఈ దేశంలోని విద్యాసంస్థలలో ఇది ఎడారిలోని జలాశయంవలె ఉన్నదని నేను సగర్వంగా భావిస్తున్నాను

ఇటువంటి విద్యాసంస్థలు చక్కని వాతావరణంలో మాత్రమే అభివృద్ధి కాగలవు అవి ఒక్కొక్కప్పుడు అంతులేని కష్టనిష్ఠురాలను ఎదుర్కోవలసి వస్తుంది జాతీయ పాఠశాలల విజయం విద్యార్థుల సంఖ్యను బట్టి నిర్ణయించ కూడదు జాతీయ విద్యాసంస్థలలో సంఖ్యకాదు ప్రధానం, గుణం ప్రధానం మీకు ఆత్మ విశ్వాసమున్నట్లయితే మీ పాఠశాలలో ఒక్క బాలుడు ఉన్నప్పటికీ మీరు సంతృప్తి పడగలరు మీ విరాళాలకు, మీ అభినందన పత్రానికు మరొక సారి కృతజ్ఞత తెలుపుతున్నాను వాటిలోని సున్నితాలయిన ఉదార భావాలను నేను గమనించినాను

## విదేశ వస్త్ర దహనము

మున్సిపాలిటీ వారిచ్చిన పత్రంలో విదేశీ వస్త్ర దహనం గురించి ఆక్షే పించినారు ఈ విమర్శ కొత్తదికాదు నా మిత్రులలో చాలామంది ఇటువంటి సందేహాలనే వెల్లడించినారు వారి వాదాలు నా అభిప్రాయాలను మార్చలేక పోయినాయి

నేను మిమ్ములను ఒక ప్రశ్న అడుగదలుచుకొన్నాను మీ బట్టలకు మహామారివంటి అంటువ్యాధి బీజాలు అంటినవనుకొనండి అప్పుడు వాటిని తగుల బెట్టడానికి సందేహిస్తారా? దక్షిణాఫ్రికాలోని జోహన్స్‌బర్గ్ పట్టణంలోని బట్టల దుకాణంలోని బట్టలకు ప్లేగు బీజాలు అంటుకొని నట్లు మునిసిపాలిటీ వారు అనుమాన పడి ఆ బజారు నంత తగుల బెట్టించినారు అట్లా చేయని పక్షంలో ప్లేగు వ్యాపించి పట్టణవాసులందరు మరణించే వారు జోహన్స్ బర్గ్ మునిసి పాలిటీవారు సుమారు 16 వేల పౌనుల విలువగల బట్టల బేళ్ళను తగుల బెట్టించి పట్టణస్థుల ప్రాణాలను సంరక్షించినారు విదేశ వస్త్రాలు మన దేశాన్ని దరిద్ర ంతంగా చేయడమేకాక దేశీయుల మానాభిమానాలను మైలపరుస్తూన్నాయి నేను వైష్ణవ మతస్థుడను మా వైష్ణవ సంప్రదాయం ప్రకారం మా తల్లి దండ్రులు మైలపడిన వస్తువులను ఏమి చేస్తూండేవారో నాకు జ్ఞాపకం ఉన్నది మైలపడిన పచ్చళ్ళనూ, కూరలనూ గోతుల్లో పార వేస్తుండేవారు విదేశ వస్త్ర దహనం ఎంత మాత్రం దౌర్జన్యంతో కూడినది కాదు విదేశీ బట్టలను తగుల బెట్టడం అహింసాత్మకమయిన ధర్మమని నేను నిశ్చయంగా చెప్పగలను మన పౌరుషానికి, మన ఆత్మ విశ్వాసానికి విదేశీ బట్ట కళంకము కలిగిస్తున్నదని నా నమ్మకం మనకు హృదయ దౌర్బల్యం ఏర్పడింది మన పాపాలకు ప్రాయ శ్చిత్తంగా మనం నిర్వర్తించవలసిన కనీస ధర్మం విదేశీ వస్త్ర బహిష్కారమే

## ఖద్దరు ఉత్పత్తి

మీ బోర్డువారి అభినందన పత్రంలో మరొక ఆక్షేపణ చేసినారు ఎవ

రికి వారు పత్తిని పండించుకొని రాట్నం మీద నూలు వడుకుకొని స్వయంగా
బట్ట నేసుకొని ధరించవలెనే యుక్తం కాని ఖద్దరు కూడా బజారు వస్తువువలె
డబ్బిచ్చి కొనుక్కొని ధరించటం దోషమని వారు సూచించినారు. ఎంత
గొప్ప సలహా! కాని నేత పరిశ్రమలోని లోతుపాతులు వారికి ఎరిగి ఉన్నట్లయితే
వారిటువంటి సలహా ఇచ్చి ఉండేవారు కాదు. ఇది ఎంత మాత్రం ఆచరణీయ
మయిన సలహా కాదు. ఎవరికి వారు స్వయంగా పొలం దున్నుకొని పండించు
కొని, ఆ పంట ధాన్యం స్వయంగా దంచుకొని, స్వయంగా వండుకొనిగాని,
భోజనం చేయమని చెప్పటం ఎంత సమంజసంగా ఉంటుందో ప్రతివారు
స్వయంగా బట్ట నేసుకోవలెనని చెప్పటం కూడా అంత సమంజసంగా ఉంటుంది.
పూర్వకాలంలో కూడా ఈ దేశంలో ప్రతివారు మగ్గము పెట్టుకొని స్వయంగా
బట్ట నేసుకోలేదు. ప్రతి మనిషీ తనకు కావలసిన వాటి నన్నిటిని స్వయంగా
నిర్మించుకోలేడు. మానవుడు సంఘజీవి. పరస్పర సహాయం లేనిదే సంసారం
నడవదు. వివిధ వృత్తులు అందుకే ఏర్పడి ఉన్నాయి. ప్రతి గ్రామం తనకు
కావలసిన బట్టను ఆ గ్రామంలోనే తయారు చేసుకోవడం సాధ్యం కావచ్చు.
కాని ప్రతి ఇల్లు సంపూర్ణంగా స్వతంత్రమై ఉండగలగటం అసంభవము. ప్రతి
వారు స్వయంగా ఖద్దరు ఉత్పత్తి చేసుకొనవలెనని సలహా చెప్పేవారు తాము
విదేశీ వస్త్రాన్ని ధరించటంలో గల ఆర్థిక నీతి నాకు బోధపడడంలేదు.

### మద్య నిషేధము

మద్యపాన నిషేధం గురించి తీవ్రమయిన ప్రయత్నాలు చేయవలసి
ఉన్నది. తాగుడుకు అలవాటు పడినవారి వద్దకు పోయి హితబోధ చేసి ఆ దుర
భ్యాసంనుంచి వారిని మరలింపవలె. తాగుడు వలన మన దేశమెంత పాడవు
తున్నదో మీకు తెలిసే ఉంది. మనం నివరించవలసిన విషయాలలో అస్పృ
శ్యతా దోషం ఒకటి.

### శాసన సభలో

అసెంబ్లీలో పబ్లిక్ సేఫ్టీ బిల్లు ప్రస్తుతం చర్చింప దగదని సభాపతి
విఠల్‌భాయి పటేల్ చేసిన నిర్ణయమును వైస్రాయిగారు ఒక మాటలో ఎట్లా
తోసి వేసినది మీకు తెలిసే ఉన్నది. సుప్రసిద్ధ న్యాయవాదులెందరో పటేలు
గారి రూలింగ్ సరి అయిందని చెప్పినారు. శాసన సభల ద్వారా స్వరాజ్యం
సాధ్యం కాదని తెలుసుకొనడానికి ఇంతకంటె వేరే నిదర్శన మక్కరలేదు.
గవర్నమెంటువారు బాంబులను చూసి భయపడరు. ప్రజా ప్రతినిధుల వెనక
ప్రజలందరూ ఒక్కకట్టుగా నిలబడి ఉంటే వారి మాటలను పెడ చెవిని పెట్ట
డానికి గవర్నమెంట్ భయపడుతుంది. సంఘీభావం కార్యదీక్ష ఉంటేనే కాని
మన ప్రజా ప్రతినిధుల సభ్యత్వానికి అధికారం చేకూరదు. కాంగ్రెస్ నిర్ణయిం
చిన నిర్మాణ కార్యక్రమాన్ని నిర్వర్తించడమే మన అవశ్యకర్తవ్యము.

మీరు నా మాటలను సహనంతో శాంతంగా ఆలకించినందుకు మిమ్ములను అభినందిస్తున్నాను నేనొక విషయం చెప్పటం మరిచి పోయినాను ఇది జాతీయ వారపు తుది దినము ఈ నెల 6 వ తేదీన ఉపవాసంతో దీనిని ప్రారంభించినాము తిరిగి ఉపవాసముతో ఈ రోజున ముగిస్తున్నాము ఈ సంవత్సరం ముగిసే లోపల చాలా పని చేయవలసి ఉన్నది కాంగ్రెస్ ఆశయాన్ని సఫలం చేయటానికి మీరందరూ తోడ్పడవలె ఈశ్వరుడు మీకు శుభం చేకూర్చవలెనని ప్రార్థిస్తున్నాను ఖద్దరు నిధికి ఇది వరకు ఏమీ ఇవ్వని వారు, తక్కువ ఇచ్చినవారూ ఇప్పుడు ధన సహాయం చేయవలెనని కోరుతున్నాను"

16వ తేగి ఉదయం గాంధీజీ 6-30 గంటలకు బందరులో బయలుదేరి తోవలో గూడూరువారు సమర్పించిన 200 రూపాయలను స్వీకరించి గొల్వేపల్లికి వెళ్లినారు

## గొల్వేపల్లిలో

గ్రామస్థులు తమ గ్రామ ముఖద్వారం స్వాగత తోరణాలతో అందమయిన కాంగ్రెస్ జాతీయ పతాకాలతో అలంకరించినారు వందలకొద్దీ సేవకులు జాతీయ పతాకాలను ధరించి కారులో నిద్రిస్తున్న గాంధీజీని గ్రామంలోని కూడలిస్థలానికి జయజయ ధ్వానాలతో తీసుకొనిపోయినారు గ్రామమంతా పచ్చని తోరణాలతోను, జాతీయ పతాకాలతోను అలంకరించినారు వేదికవద్దకు వెళ్లి కారు ఆగగానే గాంధీజీ నిద్రనుంచి మేలుకొని సీటు పైభాగంలో కూర్చొని ఉపన్యసించడం ప్రారంభించినారు ఆ సభలో చాలా మంది స్త్రీలు, బాలురు, బాలికలు కూడా ఉన్నారు కాని చీమ చిటుక్కుమన్నట్టు కూడా లేదు సభఅంతా నిశ్శబ్దంగా ఉంది గాంధీజీ మనోహరమయిన ఉపన్యాసం చేసినారు శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారు గ్రామస్థులపక్షాన 1209-10-3 రూపాయలు ఖద్దరునిధికి విరాళం సమర్పించినారు గాంధీజీ గ్రామస్థుల శ్రద్ధ, శేశభక్తికి చాలా సంతోషించినారు

కృష్ణాజిల్లాలో గాంధీజీ సందర్శించవలసిన గ్రామాలు సరిఅయిన సమయానికి చేరుకోవలసి రావడం కష్టంతో కూడుకొన్నపని అయింది శ్రీ వల్లభనేని రామబ్రహ్మంగారు క్రొత్తగాకొన్న ప్లిమత్ కారులో గాంధీజీని ఇతర గ్రామాలకు కూడా తీసుకొని వెళ్లినారు రామబ్రహ్మంగారు ఒక్కొక్కసారి గంటకు 60 మైళ్ళ వేగంతో కూడా కారు నడపవలసివచ్చేది అట్లాంటి సమయాలలో వెన్నంటి వచ్చే కార్లు, పోలీసువారి వ్యాన్‌లు కొంతసమయం గడిచిన తరవాతగాని నిర్ణీత గ్రామం చేరుకోలేకపోయేవి పోలీసువారు రామబ్రహ్మంగారు కారునడుపుతూన్న నేర్పునుచూసి ఆశ్చర్యపోయినారు.

## కైకలూరు

గాంధీజీ బృందము గోల్వేపల్లినుంచి తోవలో పెద్యేరుకు వెళ్ళినారు అక్కడ శ్రీ పోలవరపు నాగేశ్వరరావుగారి యాజమాన్యంలో మహాత్మునికి ఖద్దరునిధికిగాను 500 రూపాయల కానుక సమర్పించడం జరిగింది దాకరంలో 116 రూపాయలు ఆ గ్రామస్థులిచ్చినారు ఆ తరవాత కైకలూరు వెళ్ళినారు కైకలూరులో సాయంకాలం రైలుస్టేషన్‌లో సభ జరిగింది శ్రీ ఉప్పలూరి ముత్తంరాజుగారి కృషివల్ల ఖద్దరునిధికి 500 రూపాయలు విరాళము లభించింది కైకలూరులో జనం గాంధీజీ కారుచుట్టూ మూగినారు సభలో కూడా కొంత సందడి జరిగింది ఆ జనంలోనుంచి కారు నడపడం చాల కష్టసాధ్యమయింది రామబ్రహ్మంగారి చాకచక్యంవల్ల కారు ఆ మూకలను తప్పించుకొంటూ కారులో ఉన్న పూజ్యులకు ఎట్లాంటి అపాయం కలగకుండా సుఖంగా కారు ఊరి వెలపలకు చేరింది అప్పుడు గాంధీజీ ఆశ్చర్యంతో "ఇంత గుంపులోనుంచి ఎవరికీ అపాయం లేకుండా ఎట్లా తప్పించుకొని వచ్చింది ఈ కారు" అన్నారు డాక్టర్ పట్టాభితో "అదంతా మా రామబ్రహ్మం నేర్పు అందుకనే మీకు సారథిగా ఈయనను అప్పగించినాను" అని నవ్వురూ జవాబు చెప్పినారు డాక్టర్ పట్టాభి గాంధీజీసైతం రామబ్రహ్మంగారి నేర్పును కొనియాడినారు.

## ఇతర గ్రామాలలో

కైకలూరునుంచి తిరిగివస్తూండగా భైరవపట్టణ కాపురస్తులు గాంధీజీ కారుఆపి 150 రూపాయలు విరాళమిచ్చినారు ఆ తరవాత వడాలిలో గొప్ప సభ జరిగింది సుమారు 2వేల మంది వచ్చినారు అక్కడనుంచి సరాసరి వెంట్రప్రగడకు వెళ్ళినారు తోవలో పెదపారుపూడి యువకులు కొందరు 150 రూపాయలు సమర్పించినారు

## వెంట్రప్రగడలో

వెంట్రప్రగడలో యువకుల ప్రోత్సాహంవల్లనే గొప్ప సభ జరిగింది సుమారు 3, 4వేల మంది సమావేశమయినారు గాంధీజీ వెంట్రప్రగడ గ్రామంలోకి ప్రవేశించేటప్పుడు స్వచ్ఛంద సేవకులు జాతీయ పతాకాలతో వీధులలో నిలబడి గాంధీజీ ఉపన్యసించవలసిన వేదికకు దారి చూపినారు ఆ దారి చూపడంలోనే గాంధీజీని దాదాపు గ్రామమంతా ఊరేగించినట్లయింది ఇది ఆ గ్రామ యువకుల నేర్పరితనానికి క్రమశిక్షణకు తార్కాణము గాంధీజీ మద్యనిషేధం, ఖద్దరు, అంటరానితనాలను గురించి ఉపన్యసించినారు ఖద్దరునిధికి గ్రామస్తులు 850 రూపాయలు సమర్పించినారు వానపాముల గ్రామస్తులు 150 రూపాయలిచ్చినారు ఉపన్యాసానంతరం మహాత్ముడు హెచ్చరిక చేయగా సుమారు 100 రూపాయలు వచ్చింది ఒక కెంపు ఉంగరం కూడా వచ్చింది మొత్తం

మీద ఈ కేంద్రంలో 1100 రూపాయలు లభించినాయి ఇది తూర్పు కృష్ణాలో తుది కేంద్రం ఇంత ఆనురభావంతో గౌరవించిన తూర్పు జిల్లాను విడిచిపోవడం తమకు విచారంగా ఉన్నదని గుహోర్మాజీ అన్నారు

తూర్పు కృష్ణా జిల్లా సంచారంలో గాంధీజీతో శ్రీమతి కస్తూరి బాయి, శ్రీ జయప్రకాశ్ నారాయణ్, ఆయన భార్య శ్రీమతి ప్రభావతీ దేవి, (ఆశ్రమవాసి) వారంతా ఒక కారులో ఉన్నారు సర్వశ్రీ డాక్టర్ పట్టాభిసీతా రామయ్య, నెరుకునాడ వెంకట నరసింహం, కొడాలి ఆంజనేయులు, గొట్టిపాటి బ్రహ్మయ్య (తూర్పు కృష్ణా జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు) గార్లు మరొక కారులో గాంధీజీ కారుకు ముందు వెళ్లుతూ ఉండేవారు

గాంధీజీ దివి తాలూకాలో పర్యటిస్తున్నప్పుడు డాక్టర్ పట్టాభిగారి ఆదేశానుసారం శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు గాంధీజీ కారులో ప్రయాణం చేసినారు గాంధీజీ బ్రహ్మయ్యగారి సాంఘిక స్థితిని గురించి ఇంకా అనేక విషయాలను గురించి తెలుసుకొన్నారు బ్రహ్మయ్యగారు, జిల్లా కాంగ్రెసు కమిటీ ప్రెసిడెంట్ననీ బందరు తాలూకా బోర్డు ప్రెసిడెంటుగా ఉంటిననీ గాంధీజీతో చెప్పినప్పుడు, 'నీవు సొంత వ్యవసాయం చేసే రైతువు కావా?" అని గాంధీజీ ప్రశ్నించినారు "నేను ఒంటరివాణ్ణి కావడం చేతను, మీ ఆదేశానుసారం రాజకీయ కలాపాలలో ఉండి పోవడం చేతను నేను సొంత వ్యవసాయం చేయలేక పోతున్నా"నని సమాధానం చెప్పినారు

ప్రతి గ్రామంలోను ప్రవేశించే ముందు కారులో గాంధీజీ ఆయా గ్రామాలలోని సాంఘిక, ఆర్థికపరిస్థితులను గురించి ప్రజల జీవిత విధానంగురించి బ్రహ్మయ్యగారిని అడిగి తెలుసుకొంటూ వచ్చినారు

ఘంటసాలలో అసహాయోద్యమ సందర్భంలో శాసన సభల ఎన్నికలలో ఖాళీ పోలింగు పెట్టెలు పంపినట్లు విని గాంధీజీ నిర్ణీతకాలం కంటె ఎక్కువ సేపు ఉపన్యసించినారు జనం నిశ్శబ్దంగా ఉండటం, అనేక మంది స్త్రీలు నూలు చక్కగా వడుకుతూండటం చూసి ఆయన చాలా సంతోషించినారు

## మహాత్ముని పర్యటన ప్రభావము

(కృష్ణాజిల్లా)

కొన్ని చిత్తాకర్షక దృశ్యాలుగురించి, మహాత్ముని కృష్ణాజిల్లా పర్యటన ప్రభావం గురించి ఈ దిగువ ఉదాహరించబడిన కృష్ణాపత్రిక సంపాదకీయంలో మనోహరంగా చిత్రించడం జరిగింది

## కృష్ణాపత్రిక సంపాదకీయము

'గాంధీమహాత్ముని కృష్ణాజిల్లా సంచారం పూర్తిఅయింది పూర్వపశ్చిమ భాగాలు రెండింటిలో వీరు సంచారం చేసినది 8 రోజులు 8 రోజులలోను వీరు సుమారు 80 సెంటర్లకుపైగా చూసినారు ఈ సంచారం వారి

ప్రస్తుత ఆరోగ్యస్థితినిబట్టి చాల శ్రమతోకూడినదనడానికి సందేహంలేదు ఒక తోటూరు ఎలమర్రులో 6-30 గంటలకు ఉయ్యూరుచేరి 5, 6 సెంటర్లను చూసుకొని బందరు చేరేటప్పటికి 11 గంటలయింది ఒక సాయంకాలం 5 గంటలకు చల్లపల్లి బయలుదేరి 5, 6 సెంటర్లు చూసుకొని కృష్ణచెంటి నాగాయలంక, కోడూరు గ్రామాలకుపోయి తిరిగి అవనిగడ్డ చేరేసరికి రాత్రి 10 గంటలయింది వారి ప్రస్తుత ఆరోగ్యస్థితిలో ఈ కార్యక్రమం ఎంత హింసాకరమైనదో తెలుపడానికి రెండు నిదర్శనలు చాలు ప్రతిగ్రామంవారు మహాత్ముని తమ గ్రామానికి రప్పించవలెననే ఆతృతతో ఉండటంచేతనే ఈ కార్యక్రమమింత దీర్ఘమైంది మహాత్ముడు రాక పూర్వమెట్లాంటి ఉత్సాహం చూపని ఎన్ని గ్రామాలో చివరికి ఆవేశపూరితులై మహాత్ముని రప్పించడానికి సర్వప్రయత్నాలు చేసినాయి మొదట కార్యక్రమంలో చేరని గ్రామాలెన్నో చివరి దినం చేరినాయి మహాత్ముడు పోతున్నపుడు తలవనితలంపుగా మార్గమరికట్టి కానుకలర్పించిన గ్రామాలెన్నో ఉన్నాయి పశ్చిమ కృష్ణావారు ఖద్దరునిధికి ఇచ్చిన మొత్తము 23,400 రూపాయలు పూర్వకృష్ణా 29 300 రూపాయిలు వీటి వివరాలు వేరేచోట ప్రకటించినాము ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ వారు ఈ రెండు వారాలకు విధించిన తఖరీకు 30 వేలయినా 50వేల రూపాయలు దాటడం సంతోషదాయకము జనులలోగల పూజ్యభావం కేవలం విరాళాలబట్టి వ్యక్తం కావడంలేదు ఒకమాసం కిందటివరకు ఖద్దరు డిపోలలో సరుకు నిల్వ ఉండిపోయింది ఖద్దరు మగ్గాలవారు సరుకు విడుదలకాక నిరుత్సాహం చెంది ఉండినారు వడికిన నూలు కూడా మిగిలిపోతూండటంవల్ల కొన్ని గ్రామాలలో రాట్నాలు తిరిగి వెలిసెలకెక్కినాయి ఇట్లాంటి మాంద్యంలోఉన్న సమయంలో మహాత్మునిరాక శంఖారావంవలె ప్రతిగ్రామంలో మేల్కొల్పింది ప్రతివారు మహాత్ముని దర్శించేటప్పుడైనా ఖద్దరు ధరించవలెననే కోరిక కలిగింది ఒక్క నెలరోజులలో ఖద్దరు డిపోలన్నీ ఖాళీ అయినాయి ఖద్దరులోగాని, మహాత్ముని దర్శించకూడదనే భావంలో విశేషం ఉంది ఇది కేవలం కపట నాటకమని చెప్పటానికి వీలులేదు ఈ ఆవేశం తాత్కాలికం కావచ్చు కాని ఖద్దరు తత్వం సర్వజనాదరణీయమనే మాట ధ్రువమయింది ప్రజలు ఖద్దరును దీక్షగా కట్టకపోవడం హృదయ దౌర్బల్య సూచకంకాని ఖద్దరుద్యమంలో నిరాదరణచేత కాదనడం నిశ్చయము ఖద్దరు ధారణమే దీక్షగా పరిణమిస్తే ఇక చెప్పవలసినదేమి! అప్పుడు మహాత్ముని సంచారం విజయప్రదమైనదని అందరూ అంగీకరించవలసి ఉంటుంది జనులలో మహాత్మునిపట్లగల పూజ్యభావం వర్ణనాతీతము

మహాత్ముడు పోయిన చోట్లలో అంతా భూదేవి ఒక్కమారుగ జనుల నీన్నట్లయింది ఆ గుంపులకు లెక్కలేదు ఒక్క కులంగాదు, ఒక్కజాతిగాదు స్త్రీలు, పురుషులు ఆ ఉత్సాహ తరంగిణిలో ఓలలాడినారు మహాత్ముడెవరో తెలియదు స్వరాజ్య పతాకంగల ప్రతి మోటారును చూసి దండాలు పెడు

తున్నారు అలనాడు నెమలి పింఛం ధరించిన ప్రతి గోపబాలుని శ్రీకృష్ణునిగను
కొన్నట్లు గాంధీ టోపీని ధరించిన ప్రతి వానిని మహాత్ముడని భావించటం
మొదలుపెట్టినారు స్వరాజ్య పతాకం ఎగిరి పరుగిడుతున్న మోటార్లను
చూడటంతోనే పొలంలో దున్నుకొంటున్న కృషీవలురు నాగళ్ళను
వదిలివేసి, రోడ్డు ప్రక్కకు పరుగెత్తి వస్తున్నారు ఇండ్లవాళ్ళు కాడిని దింపి
మార్గం ప్రక్కకు బారులు తీరినారు చాకలి స్త్రీలు బట్టల మూటలను కింద
పడవైచి దండం పెట్టుకొంటు మోటర్లను సమీపించినారు స్త్రీలు జుట్టు
దువ్వుకొంటు వాకిళ్ళనుండు నిలబడి అట్లాగే చూస్తూఉండినారు పిల్లలు
అన్నం తింటు కంచాయి చేతిలో పట్టుకొని పరుగెతున్నారు ఆ ఉత్సాహానికి
ఆ ఆవేశానికి మితిలేదు ఏ నిమిషం దాటితే మహాత్ముని దర్శనం తప్పిపోతుందో
అనే ఆతురతను తెలుపుతూ నిమిషాలను లెక్క పెడుతున్నారు కొన్ని గ్రామాల
వారు ఇళ్ళకు తాళాలు వేసి సభలు జరిగే ప్రదేశాలకు పోతున్నారు
శ్రీకృష్ణుని మురళి వినడంతోడనే బృందావనంలో గోపసుందరు లందరూ తమ
సంసారాలను విడిచి శ్రీకృష్ణుని చెంత చేరినట్లు శ్రీమద్భాగవతంలో వర్ణితమైన
విషయంలో అతిశయోక్తి లేదని నేడు మహాత్ముని సంచారంలో గోచరించిన
దృశ్యాలు రుజువు చేస్తున్నాయి అవనిగడ్డ వద్ద ఏరు దాటుతున్నప్పుడు కని
పించిన దృశ్యం వర్ణనాతీతము సుమారు 10 వేల జనం ఇరుగట్లుల మీదను
నిలబడి మహాత్ముని రాకకోసం నిర్నిమేష నయనాలతో నిరీక్షిస్తున్నారు
మహాత్ముని మోటారు దృక్పథంలో పడటంతోడనే ఆ జనంలో కలిగిన కోలా
హలం వర్ణింప నలవికాదు సూర్యుడస్తమిస్తున్నాడు ఆ సంధ్యారాగం
కనులపండువుగా ఉండేది ఆ సమయంలో ఏరుపాటులో ఉండటంతో మహాత్ముని
నావతోపాటు జనులెల్లరు అన్నివైపుల నుంచి నీటిలో నడవ సాగినారు నదీ
గర్భమంతా జన సంకీర్ణమయింది నీరు కనపడలేదు కృష్ణానది జనరూపందాల్చి
ఒకగట్టునుంచి ఇంకొకగట్టుకు ప్రవహిస్తున్నదో అన్నట్లు తోచింది ఆ మహా
త్ముని హృదయాంతరాళంలో ఆ ముహూర్తంలో ఎట్లాంటి భావాలు ఉత్తుంగ
తరంగితా లవుతుండెనో తెలీదు మహాత్ముడు తన నయన జ్యోతులను
పైకెత్తి సంధ్యాదేవికి నీరాజనాలర్పిస్తున్నట్లు తోచింది మహాత్ముని
దర్శన భాగ్యంకోసం ఉవ్విళ్లూరుతున్న ఆ మహాజనం సంతోషాంతరంగులై
జయధ్వానాలు చేసినారు వెనక శ్రీరామచంద్రుడు అయోధ్యాపురి నుంచి
దండకారణ్యానికి పోయేటప్పుడు సరయూనదిని దాటటాన్ని గురించి వాల్మీకి
వర్ణించిన దృశ్యం అందరికీ జ్ఞప్తికి వచ్చింది

స్త్రీలు సహజంగ కోమల హృదయులు మహాత్ముని పట్ల వారు చూపిన
భక్తి విశ్వాసాలు అసదృశాలు దరిద్రనారాయణునివలె దీనార్థియై చేయిచాచి
నప్పుడెల్ల తల్లులు కానుకలర్పించినారు చేతి కంకణం తీసి వారి హస్తాంజలిలో
పడవేసినారు మెడలలోని వత్తెడలను ఊడబెరకి ఇస్తుండినారు దాత
పరిగ్రహీత సమంగా ఒక్క భావపాశంలో బంధితులైనారు చల్లపల్లిలో ఒక

కమ్మవనిత తన చేతి కంకణాలు మహాత్మునికి సమర్పించి వెక్కి వెక్కి ఏడ్వడం మొదలిడింది అది ఆనందమో దుఃఖమో తెలియదు లోకోత్తర పురుషుని సందర్శన భాగ్యం లభించినందుకు ఆనందభరితయై ఉండవచ్చు లేదా లోకోద్ధరణం కోసం తనువును కృశింపజేసుకొని కౌపీనధారియై దరిద్ర నారాయణునివలె గోచరించిన మహాత్ముని శల్యపంజరం చూసి నప్పుడు ఆమె హృదయంలో విశ్వదుఃఖము పొంగిపొరలి ఉంటుంది ఘంటసాలలో ఒక వృద్ధురాలు తనమెడలోని పట్టెడ ఊడ బెరికి సమర్పించినప్పుడు మహాత్ముడాయలంకారం తన కనులనద్దుకొని అశ్రుపూరిత లోచనుడయినాడు ఆ ప్రజలకు ఈ ప్రభువుకు గల అనురాగ బంధమెట్టిదో ఎవరు చెప్పగలరు! అందరూ ఈ మహనీయుని చూసినప్పుడు ఒక మానవుని చూసినట్లుగా చూడలేదు కేవలం ఈశ్వర సాక్షాత్కారమైనట్లుగా అబాలగోపాలం భావించినారు మహాత్ముని రూపం సుందరమైనదికాదు జీర్ణ శరీరి బట్టతల, బోసినోరు, కేవలం శల్య పంజరము, గొప్ప వక్త కాదు వారి ఉపదేశమంతా నాలుగు పొడి మాటలలో ఉండేది 'విదేశీ వస్త్రాలు విసర్జించండి ఖద్దరును ధరించండి తాగుడు మాన్పించండి, ఎవరినీ అంటరానివారిగా తలపకండి', ఎక్కడకుపోయినా ఈ నాలుగు మాటలు తప్ప ఇంకనేమీ లేవు, ఆ బక్క మనిషిని చూడటానికి, ఈ నాలుగు మాటలను వినడానికి గ్రామాలన్నీ విరగబడటానికి కారణమేమి? కేవలం ఒక విచిత్ర జంతువును చూడడానికా ఇన్ని వేలమంది దండాలు పెట్టుకొంటు వీధి చుట్టును మూగింది! ఆక్షణంలోనైనా వారా మహనీయుని కేవలం చర్మచక్షువులతో చూస్తున్నారని ఎవ్వరు అనజాలరు ప్రతివారి నయనాలలో భక్తి విశ్వాసాలు ప్రజ్వలిస్తున్న మాట వాస్తవము పుష్పాలు జల్లినారు, హారతులిచ్చినారు గాంధీ దేవుడని పాటలు పాడినారు కానుక లిచ్చినారు వారిని దర్శించడంచే తమ జన్మ పావనమైనట్టుగ ఎంచుకొన్నారు ఒక ఆరేండ్ల బాలిక తన చేతి గాజులను మహాత్మునకెందుకిచ్చితివని ప్రశ్నించినప్పుడు, మహాత్ముడంతటివాడు అడిగినప్పుడు ఇవ్వకుండ ఎట్లా ఉండగలనని సమాధానం చెప్పింది అయ్యో! మహాత్ముని సన్నిధానానికి రిక్తహస్తాలతో ఎందుకు వచ్చినానని విలపిస్తూ ఏమీ చేయజాలక ఒక ఆమె తన కాలిమట్టెలను లాగి నివేదించి కొంత సంతుష్టి చెందింది దివి తాలుకాలోని తాడేపల్లి గ్రామమంతా అలంకారం చేసికోవడం జరిగింది ప్రతి ఇంటికి పచ్చని తోరణాలు గట్టుకొన్నారు వీధుల నూడ్చి నీళ్ళుచల్లి ముగ్గులు వేసినారు స్త్రీ పురుషు లందరూ ఖద్దరు ధారులై మహాత్ముని రాకకోసం నిరీక్షించినారు ఇదంతా ఒక క్షణకాలపు సందర్శన భాగ్యం అనుభవించడానికి నూజెళ్ళలో వీధుల్లో సైతం తివాచీలను పరిచినారు మహాత్ముడు వాటిపై కాలుపెట్టకపోయినా వారి మోటార్లైనా వాటిపై పోయిన చాలునని సంతృప్తి చెందినారు మహాత్ముడు పందిరిలో చేరడంతోనే పూలవర్షం కురిపించినారు జనాన్ని అంతా పన్నీటితో తడిపినారు గాంధీదంపతులకు నూతన ఖద్దరు వస్త్రాల నిచ్చినారు. సేరికల్వపూడి, పురిటిగడ్డలో స్త్రీలు రాటపు లక్ష్మిని

నెలకొల్పి శ్రీనాథుడు వర్ణించిన కదురు శుకభృంగ ఆత్మ నినాదాలను వినిపించి ధన్యులైనారు

ఈ దరిద్ర నారాయణునిపై ప్రజలకింత భక్తి భావం ఎందుకు గలగవలె అతని త్యాగ శీలమా, అతని దేశభక్తా, అతని అహింసా సంప్రదాయమా ఇదమిత్థమని చెప్పడం కష్టము సంసారం వదలి సన్యాసాశ్రమం స్వీకరించిన స్వాములెందరో ఉన్నారు దేశంకోసం సర్వం అర్పించి చెరసాలల కెళ్ళిన దేశ భక్తులెందరో ఉన్నారు మాంసాహారం విసర్జించి, సర్వభూతహితరతిని అభ్యసించే కరుణా స్వభావులెందరో ఉన్నారు కాని వారెట్లాంటి గౌరవ సత్కారాలు పొందుతున్నా మహాత్మునివలె పూజింపబడలేదు మహాత్ముని సందర్శనంలోగల భావ మతిగంభీరము అది రాజకీయంకాదు సాంఘికంకాదు, సామాన్య మత విశేషంకాదు వీటికన్నిటికీ అతీతమైనా అలౌకికం కాదు విశ్వ మానవ రూపం విమలమై దరిద్ర నారాయణరూపంలో ప్రత్యక్షమైనట్లు అందరికీ గోచరించడం లేదా? నేడొక్క సోదర భారతీయులకే కాక సకల ఖండాంతరులకు మహాత్ముని రూపం ఒక దివ్య జ్యోతి వలె ఒక స్వర్గవాణి వలె ప్రకాశిస్తున్నది వాని సమ్ముఖంలో సకల జాతులు, సకల రాజ్యాలు, సకల మతాలు మద మాత్సర్యాలు వీడి సాత్త్విక తేజంతో నిండిన విశుద్ధ మానవలీలామృతంలో క్షీర ఖండాలవలె కరగిపోతున్నాయి మానవుడింత కాలం కృత్రిమాలంకారాలతో, కాల్పనిక భేదాలతో, కుటిలవర్తనాలతో, జాతీయ దురహంకారాలతో తన ఈశ్వరత్వం మరుగుచేసుకొని ప్రపంచాన్ని దుఃఖభాజనంగచేసి వేసినాడు మానవత్వ మెంత కాలమిట్లా హింసారూపం దాల్చి పరాకృతిని నిరోధించగలదు ప్రపంచం తన భారం చేతనే తాను క్రుంగిపోతున్నది మానవుడు కరాలివలె తన కంఠం తాను ఖండించుకొని తన రక్తం తానే పానం చేసుకొంటున్నాడు ప్రేమ నిలయమైన నరలోకం రాక్షస భూమియైంది దుర్భరము, దుఃఖ తరంగిణి వెల్లువవలె లోకం అంతా ముంచి వేస్తున్నది ఆ దుఃఖ సముద్ర మథనం నుంచి కరుణా స్వరూపుడైన దరిద్ర నారాయణుడు సత్యాహింసా యుగళుడై వెలసినాడు ఆ దివ్యరూపం దర్శిస్తే ఎవ్వరి హృదయం జలదరించదు! ఏ జాతి, ఏ రాజ్యాంగం ఏ మతము, ఏ ఆచారము తన అల్పత్వమును గ్రహించి సర్వమానవ కల్యాణాన్ని ఆరాధింపదు

ఓ గ్రామ వాసులారా! మీకు మహాత్ముని సందర్శన భాగ్యం లభించినది మహాత్మునికి కానుక అర్పించిన పుణ్యం చేకూరినది అంతటితో సంతుష్టి చెంది మీ జీవితం వెనకటి వలెనే కులకక్షలతో, క్షణిక భోగాలతో మైల బట్టలతో గడిపి మహాత్ముని సంచారం నిరర్థకమైనదనే అపవాదం తీసుకొని వస్తారా లేక మీ హృదయ పీఠికకలపై ఆ దరిద్ర నారాయణుని విగ్రహం ప్రతిష్ఠించి అనవరతం దేశకల్యాణోత్సవంలో పాల్గొని సంకల్పిస్తారా! "సాధూనామ్ హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" ఆరాధకుల హితంకోసం నిరాకారుడైన ఈశ్వరుడు సాకారుడుగ ప్రత్యక్షమవుతాడని ఆర్య ఋషులు చెప్పినారు.

నేడు ఈశ్వరరూపం దరిద్ర నారాయణునిగ భావించడం కంటె ఆత్మోన్నతికి, లోకకల్యాణానికి సాధన భూతమైనది మరొకటి లేదని మీ శాంత సమాహిత చిత్తాలకు బోధపడగలదు "

కృష్ణా పత్రిక
20-4-1929

## మహాత్ముని ఖద్దరునిధికి కానుకలు

### పశ్చిమ కృష్ణాజిల్లా

| | | |
|---|---|---|
| 7-4-1929 | మునగాల రాజాగారు 2 నవరసులు 2 ఉంగరాలు | |
| | (హైద్రాబాద్‌లో) | 1500-0-0 |
| | బోనకల్లు త్రోవలో | 7-0-0 |
| 8-4-29 | లింగాల | 22-11-9 |
| | మక్కపేట | 40-13-9 |
| | జగ్గయ్యపేట | 622-0-3½ |
| | కొణకంచి | 116-0-0 |
| | జయంతిపురం | 500-7-0 |
| 9-4-29 | నందిగామ | 1232-8-0 |
| | (3 గాజులు, 1 ఉంగరము ముక్కుపుడక, చేమంతిపూవు లక్ష్మికాసు) | |
| | గుంటుపల్లి | 130-0-0 |
| | ఇబ్రాహీమ్‌పట్నం | 601-0-0 |
| 10-4-29 | నూజివీడు (1 ఉంగరము) | 1075 9-4 |
| | గొల్లపల్లి | 280-5-0 |
| | ఆరుగొలను (ఉంగరాలు 4) | 1196-0-0 |
| | కానుమోలు (గాజులు 2, ఉంగరములు 3) | 58-8-3 |
| | వీరపల్లి | 140-0-0 |
| | పొట్టిపాడు (ఫ్రెంచికాసు 1, ఉంగరము 1) | 41-0-0 |
| | ఆత్కూరు (ఉంగరములు 2) | 184-1-9 |
| | బెజవాడ | 4,735-3-1½ |

(4 జతల గాజులు, 2 ఉంగరాలు, ఫ్రెంచికానులు 6, పతకంతో వున్న చెవిపువ్వులు, 2 చెవిపోగులు లాలాజీ నిధికి రూ 50-0-0)

| | | |
|---|---|---|
| 11-4-1929 | గుణదల | 1,220-4-8 |
| | (ఖద్దరు సంస్థానము) (ఖద్దరు సంస్థ 8 జతల గాజులు, నాను, చేతిగొలుసుల జత) | |
| | మొగల్రాజపురం | 1,211-0-9 |
| | (ఉంగరాలు 8, చేమంతిపూవు 1) | |
| | పటమట (ఉంగరము 1) | 1,484-0-0 |
| | (లాలాజీ నిధికి రూ 201 ) | |
| | పోరంకి | 141-10-0 |
| | ఈడుపుగల్లు | 887-8-1 |
| | పునాదిపాడు | 629-12-0 |
| | గొడవర్రు | 440-0-9 |
| | నెప్పల్లి | 517-1-0 |
| | ఆకునూరు (లాలాజీ నిధికి రూ 20 ) | 208-0-0 |
| | బెజవాడ నుంచి గండిగుంట త్రోవలో | 401-0-0 |
| | (ఉంగరాలు 8) | |
| 12-4-1929 | కొమ్మమూరు | 695-0-0 |
| | ఉయ్యూరు (ఉంగరం 1) | |
| | (చిల్లర నైజాం నాణెములు) | 8-8-10 |
| | చిరివాడ | 50-0-0 |
| 15-4-1929 | పునాదిపాడు | 20-0-0 |
| | (దండలు అమ్మినబాపతు) | |
| | యల్లంరాజుశాస్త్రిలు | 9-14-0 |
| 16-4-1929 | కాటూరు | 316-0-0 |
| | నందమూరు | 116-0-0 |
| | కల్వపాముల | 658-0-6 |
| | మానికొండ | 185-0-0 |
| | ముదునూరు | 116-0-0 |

| | | |
|---|---|---|
| | జవర్గ ప్రూడి | 1370-14-½ |
| | | 23 711-10-11½ |
| | | 100-0-0 |
| | చిత్తూరు మినహాయింపు | 23,611-14-11½ |
| | | 23 611-14-11½ |
| | అదనపు జమబాపతు మినహాయింపు | 50-0-0 |
| | | 23,561-14-11½ |
| | నగలు సుమారు | 1,000-0-0 |
| | మొత్తం | 24,561-14-11½ |

**తూర్పు కృష్ణాజిల్లా**

| | | |
|---|---|---|
| 12-4-1929 | కనుమూరు | 116-1-0 |
| | ఉరుమద్దాలి | 707-12-8 |
| | పామర్రు | 837-1-3 |
| | వీరంకి | 796-0-0 |
| | వీరవల్లి (లాలా ఏ నిధి 19 రూ) | 120-0-0 |
| | పసుమర్రు | 715-15-10 |
| | కపిలేశ్వరపురం | 1,627-6-9 |
| | జరర్కంచర్ల | 20-0-0 |
| | యలమర్రు | 1 200-4-6 |
| 13-4-1929 | కవుతవరం | 1,116-0-0 |
| | కల్వపూడి | 411-0-6 |
| | గుడ్లవల్లేరు (ఐ వెంకటనారాయణ) | 116-0-0 |
| | వడ్లమన్నాడు | 230-0-0 |
| | పెడన | 116 0-0 |
| | అంగలూరు | 417 8 0 |
| | గుడివాడ | 1,186 1-0 |
| | నూజెళ్ళ | 684 7-8 |

| | | |
|---|---|---|
| | కొరిమెర్ల | 168-8-0 |
| | బొమ్మలూరు | 167-14-6 |
| | యలమర్రు మాలపల్లి | 19-14-3 |
| | బందరు | 6,065-6-4 |
| 14-4-1929 | నర్సన్నపాలెం | 116-0-0 |
| | ఘంటసాల | 501-0-0 |
| | ఘంటసాలపాలెం | 200 0-8 |
| | చార్లపూడి | 116-0-0 |
| | తాడేపల్లి | 116-0-0 |
| | గూడపాడు | 168-0-0 |
| | కొడాలి | 881-5-0 |
| | మొవ్వ | 425-0-0 |
| | పెద్దముత్తేవి | 116-0-0 |
| | కూచిపూడి | 40-0 8 |
| | చినముత్తేవి | 210-8-0 |
| | అయ్యంకి | 116 0-0 |
| | పెదపూడి | 116-0-0 |
| | శ్రీకాకుళం | 20-12-0 |
| | కొత్తపల్లి | 50 0-0 |
| | కాజ | 60-0-0 |
| | కోసూరు | 116-0-0 |
| | దేవరకోట | 116-0-0 |
| | మార్గమధ్యమున వసూలు | 22-2-0 |
| | చల్లపల్లి | 231-0-0 |
| | పురిటిగడ్డ | 162-4-3 |
| | కప్తానుపాలెం | 142-8-0 |
| | పెద్దప్రోలు | 123-0 0 |
| | మోపిదేవి | 116-0-0 |

| | | |
|---|---|---|
| | నాగాయతిప్ప | 151-0-0 |
| | నాగాయలంక | 505-14-1 |
| | కోడూరు | 506-0-0 |
| | అవనిగడ్డ | 846-0-0 |
| 15-4-1929 | కోసూరువారిపాలెం | 116-0-0 |
| 16-4-1929 | గూడూరు | 85-8-0 |
| | చిట్టిగూడూరు | 50-0-0 |
| | తరకటూరు | 31-0-0 |
| | జమీగొల్వేపల్లి | 1209-10-1 |
| | కొమరవోలు | 140-0-0 |
| | (లాలాజీ నిధికి 200 రూ) | |
| | పెయ్యేరు | 528-0-0 |
| | దాకవరం | 116-0-0 |
| | శోభనాద్రి అగ్రహారం | 101-0-0 |
| | మార్గంలో | 5-0-0 |
| | భైరవపట్నం | 116-0-0 |
| | పెదపారుపూడి | 116-15-0 |
| | వెంట్రప్రగడ | 906-0-6 |
| | కైకలూరు | 550-0-0 |
| | వానపాముల | 150-0-0 |
| | అప్పికట్ల | 116-0-0 |
| | అన్నవరం | 221-0-0 |
| | గురజ | 128-0-0 |
| | వడాలి | 135-0-0 |
| | దాకరం | 5-0-0 |
| | చేవం | 100-0-0 |
| | ముదినేపల్లి | 116-0-0 |
| | చిల్లర | 88-4-1 |

| | | |
|---|---|---|
| 17-4-1929 | బందరు నుంచి వెళ్ళిన తరవాత బెజవాడలో వసూలైంది (పట్టాభిగారి ద్వార) | 60-0-0 |
| | ఒక నగ వాపను చేయటంవల్ల | 100-0-0 |
| | వచ్చిన నగలవిలువ | 2000-0-0 |
| | | 29,860-1-8 |

## గాంధీజీ సంచారానుభవాలు

1929 ఏప్రిల్ 7వ తేదీని హైదరాబాద్ వీడిన తరవాత 16వ ఏప్రిల్ వరకు తన సంచారంలో గాంధీజీకి కలిగిన అనుభవాలను గురించి ఏప్రిల్ 18వ 'యంగ్ ఇండియా'లో ఇట్లా వ్రాసినారు

"ఇంతకు ముందు ఏర్పాట్లకు భిన్నంగా ఏప్రిల్ 7న హైదరాబాదు విడిచి కాలహరణం కాకుండేటందుకు దేశభక్త వేంకటప్పయ్యగారు నన్ను కొనకల్లు స్టేషన్‌లో తెల్లవారుజామున 3 గంటలకు దింపి కారులో లోపలి గ్రామాలకు తీసుకొని పోయినారు విరాళాలివ్వదలచుకొన్న గ్రామాల నుంచి నన్ను తీసుకొని పోవలెనని ఏర్పాటు ఇది అవసరంబట్టి చేసుకొన్న నియమమేగాని స్వయం నిగ్రహంతో చేసుకొన్నది మాత్రంకాదు సామాన్యజనంలో పెంపొందిన చైతన్యంవల్ల తమ ప్రాధాన్యం వారు గుర్తించ గలగడంచేత ఈ పర్యాయం వారు షరతులు విధించటం ప్రారంభించినారు 'మీకు మా విరాళాలు కావలసి ఉంటే మీరు గాంధీజీని ఇక్కడకు తీసుకొనిరావలె' అన్నట్లు కనిపించింది వారి వైఖరి అయితే వారు 'గాంధీజీని ఇక్కడకు తీసుకురావలె' అనడానికి బదులు 'మాకు గాంధీ దర్శనం కావలె' అని మృదువుగా చెప్పటం ప్రారంభించినారు గ్రామస్థులు అమాయకులు, వారి హృదయం చాలా మంచిది అందువల్ల వారు ఈ దుర్బలుడయిన వృద్ధుడు ఒకచోట నుంచి మరొకచోటికి సందడిలోనూ గందరగోళలోనూ అనేక మంది స్త్రీ పురుషుల గౌరవ సత్కారాలకు ఓర్చుకొంటూ గుంపులలో ఎట్లారాగలడా అని వారికి తోచలేదు అయితే, నేను కొన్ని చోట్లకు వెళ్ళక తప్పక పోవటంవల్ల నాకు మంచి అనుభవం కూడా కలిగింది. ఆంధ్ర దేశంలోని గ్రామస్థుల జీవిత విధానంలో ఆంతర్యం నాకు కొద్దిగానైనా తెలియటానికి వీలయింది నేనా గ్రామాలలోని జన సమూహం ముందు కనిపించడం, విరాళాలు తీసుకోవడం మాత్రమే అయినందుకు నాకు కలిగిన అనుభం తక్కువే సంచారం ఏర్పాటుచేసిన కార్యనిర్వాహకవర్గంవారు గ్రామాలలో తిప్పి గ్రామస్థులతో మాట్లాడాటానికి వీలుకలిగించినట్లయితే అందుకు నేను ఎక్కువ సంతోషించేవాణ్ణి అందువల్ల నాకింకా ఎక్కువ విషయాలు తెలిసేవి కాని అట్లా జరగలేదు

అయినప్పటికి చిరస్మరణీయాలుగా ఉండ తగిన కొన్ని ఉదంతాలను

ముందు ముందు వ్రాయగలను ఇప్పటికి తొందరలో ఇది ముగిస్తున్నాను

18 ఏప్రిల్ 1929
యంగ్ ఇండియా

**గుంటూరు జిల్లా**

మహాత్మా గాంధీ, ఆయన బృందము ఏప్రిల్ 17 ఉదయం సరిగా 7 15 నిముషాలకు గుంటూరు చేరి సరాసరి సమావేశ స్థలానికి వెళ్ళినారు సభలో దాదాపు 10 వేల మంది ఉన్నారు ఆహ్వాన సంఘం వారు పెద్ద పందిరి వేసి గొప్ప ఏర్పాట్లు చేసినారు సభలో స్థానిక మునిసిపల్ కౌన్సిల్ పక్షాన, గుంటూరులోని శ్రీ కృష్ణాశ్రమం పక్షాన, గుంటూరు పౌరుల పక్షాన, వైశ్య సంఘం పక్షాన సన్మాన పత్రాలు సమర్పించినారు

**మహాత్ముని ప్రత్యుత్తరము**

మునిసిపల్ సన్మాన పత్రానికి సమాధానమిస్తూ కీ శే దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి పనిని గురించి ప్రశంసిస్తూ వారిని స్మరించి అభివందనం చేసినారు నాయకులు స్వర్గస్థులయినప్పుడు ప్రజలింకా ఎక్కువ భారం వహించవలసి వస్తుందన్నారు మైదానాలను, బహిరంగ స్థలాలను దుర్వినియోగం చేసే ప్రజల చెడు అలవాట్లను మాన్పించడానికి మునిసిపాలిటీ ఇంకా ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది నేను కృష్ణా నదిని దాటేటప్పుడు ఒక అసహ్యాకర మయిన దృశ్యం చూసినానని, పవిత్రమయిన కృష్ణా నది నీరం ఉపయోగించ తగిన రీతి అదికాదనీ అన్నారు చాలా మంది ఆ పవిత్ర నదిలోని ఇసుక తిన్నెలను పాడు చేస్తున్నారని, ఇటువంటి దురభ్యాసాలను నిర్మూలించేటందుకు ప్రజలు, మునిసిపాలిటీ కూడా శ్రద్ధ తీసుకోవలసి ఉంటుందన్నారు ప్రజల ఆరోగ్యం గురించి పరిసరాల పరిశుభ్రతను గురించి మునిసిపాలిటీ ఏమి పని చేస్తున్నదని తాను ప్రశ్నించదలుచుకొన్నానన్నారు గాంధీజీ ఇంకా ఇట్లా అన్నారు 'ఈ ప్రాంతాలలో కాంగ్రెస్ కార్యక్రమం ఎంతవరకు జరిగిందో తెలుసుకో కోరుతున్నాను ఈ ప్రశ్న మిమ్ములనందరినీ అడుగుతున్నాను మన దేశంలోని పేదల పక్షాన, ఆకలితో అల్లాడుతూన్న కోట్ల కొద్దీ ప్రజల పక్షాన మీరందరూ ఖద్దరు ఉత్పత్తిని ప్రోత్సహిస్తూ ఖద్దరునే ఉపయోగించవలెనని హృదయ పూర్వకంగా కోరుతున్నాను నిస్సహాయులైన స్త్రీల కుద్బాధలను, బిడ్డల ఆకలిని మీరు గుర్తిస్తే నిజమయిన భారతీయులుగా మీరు వారికి సహాయం చేయ పూనుకోవలె ఆ సందర్భంలో మీరు అస్పృశ్యతను గానీ, కుల భేదాలను గానీ పాటించ కూడదు కుద్బాధా పీడితులైన ఈ జనానికి సేవ చేయవలెననే కోరిక, వీరి పట్ల సానుభూతి మీకు నిజంగా ఉన్నట్లయితే మీరందరూ నడుం కట్టి అస్పృశ్యతా పాపం నిర్మూలించటానికి వారిలోని తాగుడు దురభ్యాసం

మాన్పించడానికి కృషి చేయవలసి ఉంటుంది ఈ సందర్భంలో మీరు త్రికరణ శుద్ధిగా పని చేయ తలచుకొన్నారా? అని నేను మిమ్ము ప్రశ్నిస్తున్నాను"

**సంస్థల సందర్శనము**

గాంధీజీ కృష్ణాశ్రమంను సందర్శించి అటువంటి ప్రయోజనకరమయిన సంస్థ ఆర్థిక సహాయం లేక క్రుంగిపోతూ ఉన్నందుకు తన హృదయ పూర్వక సానుభూతిని వెల్లడించినారు ఆ ఆశ్రమం గవర్నమెంట్ గ్రాంట్ పొందుతున్నందుకు విచారపడినారు ఆ ఆశ్రమానికి ఉజ్జ్వల భవిష్యత్తు ఉండగలదని ఆశీర్వదించినారు అడ్వకేట్ల సంఘం పక్షాన గాంధీజీకి 116 రూపాయలు ఖద్దరు నిధికి విరాళం సమర్పించడం జరిగింది డబ్బు సంచీని తీసుకొంటూ ఇదేమీ అంత బరువుగా లేదే అన్నారు గాంధీజీ నవ్వుతూ స్త్రీలు కొంత మంది బంగారు గాజలను సమర్పించినారు దేశభక్త వేంకటప్పయ్యగారిచ్చిన వెండి పళ్ళెం వేలం వేయగా 85 రూపాయలు వచ్చాయి గుంటూరు పౌరులు 3,500 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు ఘంటు శేషయ్యగారు 116 రూపాయలిచ్చినారు

ఆ తరవాత గాంధీజీ శారదా నికేతన్‌కు వెళ్ళి అక్కడి వివిధ సంస్థలను దర్శించినారు ఆ శారదా నికేతన్‌లో విదేశీ బట్టలను చూసి అవి అక్కడ ఎందుకు ఉన్నవని గాంధీజీ ప్రశ్నించినారు ఆ సంస్థ సంచాలకుడు అని నగిషీ పనికోసం ఉపయోగించడానికి అని చెప్పినారు అక్కడ 116 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు ఒక బాలిక తాను వ్రాసిన చిత్ర పటంతోపాటు తాను వడికిన నూలును కూడా గాంధీజీకి ఇచ్చింది తరవాత ఆయన వైశ్య గురు కులానికి పోయి 116 రూపాయలు విరాళం తీసుకొన్నారు తరవాత బజారుకు పోగా బట్టల వర్తకులు 1000 రూపాయలు ఖద్దరు నిధికి విరాళమిచ్చినారు మద్ది సోదరులు (మద్ది వెంకటరంగయ్య, వెంకట సుబ్బయ్యగార్లు) ఖాదీ ధోవతుల జతతో సహా రూ 1116 లు సమర్పించినారు ఈ విధంగా గుంటూరులో దాదాపు 8 వేల రూపాయలు విరాళం చేకూరింది ఆయన మునిసిపల్ రహదారి బంగళాలో బస చేసినారు ఇంత సొమ్ము వసూలు కావడానికి శ్రీ నడింపల్లి వెంకట లక్ష్మీ నరసింహా రావు గారి కృషియే కారణము

సాయంకాలం గాంధీజీ కాంగ్రెస్ కార్యకర్తలతో సంభాషించినారు గుంటూరుజిల్లాలో బార్డోలి అని పేరు పొందిన పెద్దనందిపాడుకు సాయంకాలం 5-30 గంటలకు బయలుదేరి వెళ్ళినారు పెద్దనందిపాడుకు పోయే ముందు గుంటూరులో 'ఆంధ్ర రత్న' రోడ్డును తెరిచినారు

**గ్రామాలలో**

ఆయన పెదనందిపాడు పోతూ చంపాడులో అంటే, 116 రూపాయలు ఖద్దరు నిధికి చేకూరింది, వల్లూరు గ్రామస్థులు 600 రూపాయలిచ్చినారు,

మధ్యలో కారు చెడిపోయి మరమత్తు చేయవలసి రావడంచేత పెదనంది పాడుకు గాంధీజీ అనుకొన్న సమయంకంటె ఆలస్యంగా చేరినారు చాల మంది గ్రామస్థులు ఆయన నాహ్వానించడానికి వేచి ఉన్నారు గాంధీజీ వారిని సంబోధిస్తూ 1921లో శాసనోల్లంఘనం ప్రారంభించినప్పుడు వారు చూపిన ధైర్య సాహసాలను తిరిగి ప్రదర్శించవలెనని కోరినారు వారిలో కనీసం 100కి 50మంది ఖద్దరుధారులైనా ఉండవలెనని, కిందటి ఉద్యమంలో తమ అపజయానికి కారణాలైన లోపాలను సవరించుకోవలెనని సలహా ఇచ్చినారు అస్పృశ్యతను నిర్మూలించవలెనని, విదేశీ వస్త్రాలను బహిష్కరించవలెనని, ఐకమత్యం సాధించవలెననీ ఉద్బోధించినారు గ్రామస్థులు గాంధీజీ ఖద్దరు నిధికి కొన్ని ఆభరణాలతో పాటు రూ 1116 లు నగదు సమర్పించినారు

తరవాత గాంధీజీ కారంచేడు వెళ్ళి పెద్ద సభలో ఉపన్యసించినారు అక్కడ వారికి నగలతో సహా 2,200 రూపాయలు లభించినాయి గాంధీజీ ఆ రాత్రి కారంచేడులో ఉండి మరునాడు ఉదయం చీరాలకు బయలుదేరి తోవలో తిమ్మసముద్రంలో రూ 1116 లు, వేటపాలెంలో 500 రూపాయు ఖద్దరు నిధికి విరాళాలు స్వీకరించినారు వేటపాలెంలో 18-4-1929 వ తేదీన గాంధీజీ సారస్వత నికేతన నూతన భవనానికి పునాదిరాయి వేసి స్వదస్తూరిలో "ఈ గ్రంథాలయము ఈ నిర్మింపబడనున్న నూతన భవనంలో అభివృద్ధి పొందగలదని ఆశిస్తున్నాను" అని వ్రాసినారు

మహాత్మాజీ ఉదయం 8-30 గంటలకు చీరాల వెళ్ళినారు అక్కడ ఖద్దరు నిధికి రూ 1,116 లు సమర్పించడం జరిగింది అక్కడ బ్రహ్మాండమయిన సభలో, కీ శే ఆంధ్రరత్న గోపాల కృష్ణయ్యగారు అగ్రనాయకులలో ఒకరనీ, ఆయన చరిత్రను ప్రశంసిస్తూ ఆయన జాడలలో నడిచి కాంగ్రెస్ నిర్ణయించిన నిర్మాణ కార్యక్రమం నిర్వర్తించ వలసిందనీ గాంధీజీ ప్రజలను హెచ్చరించినారు

గాంధీజీ భట్టిప్రోలు పోతూ తోవలో ఓగీసుపేటలో నిమ్నజాతులు ఖద్దరు నిధికిచ్చిన 10 రూపాయలు స్వీకరించి, ఖాదీ ధరించవలెననీ, తాగుడు మానవలెననీ సలహా ఇచ్చినారు భట్టిప్రోలులో మద్దుల వెంకటగిరిరావు ఆయన కుటుంబమూ కలసి 500 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు అక్కడే మరొక 400 రూపాయలు కూడా ఖద్దరు నిధికి వచ్చింది

మహాత్మాజీ తరవాత గోవాడకు వెళ్ళినారు అక్కడ ఆలపాటి శివరామకృష్ణ, ఆయన కుటుంబము రూ 1116 లు సమర్పించినారు తరవాత రాత్రి 10-30 గంటలకు మోపర్రు వెళ్ళినారు అంత రాత్రి వేళకూడా స్థానిక ప్రజలు గాంధీజీ రాకకోసం నిరీక్షిస్తూ ఉన్నారు వారు గాంధీజీకి రూ 1116 లు సమర్పించినారు ఆయన ఖద్దరు ధరించవలెననీ, తాగుడు మానవలెనని, అస్పృశ్యతను తొలగించవలెననీ ఉద్బోధించినారు

ఏప్రిల్ 20 ఉదయం గాంధీజీ ఆయన బృందము తురిమెళ్ల చేరు

కొన్నారు అక్కడ ఖద్దరు నిధికి 692 రూపాయలు విరాళం వచ్చింది

తరవాత అమృతలూరు వెళ్ళినారు అక్కడ ఖాదీ ఉత్పత్తి కేంద్రం స్థాపించడానికి అఖిలభారత చర్ఖా సంఘం వారు నిర్ణయించినారు అమృతలూరు గ్రామస్తులు మహాత్మాజీకి గొప్ప స్వాగత మిచ్చినారు లాలాజీ స్మారక నిధికి 116 రూపాయలతో సహా మహాత్మాజీకి 1300 రూపాయలు లభించినాయి ఈ మొత్తానికి తోడు ఆ సభకు వచ్చిన స్త్రీలు ఆయనకు కోరకుండానే కొన్ని నగలను ఇచ్చినారు జిల్లాలోని ఉత్తమ కాంగ్రెస్ కార్యకర్త శరణు రామస్వామి చౌదరిగారు అక్కడి ఏర్పాట్లన్నీ చక్కగా చేసినారు

గాంధీజీ తరవాత పెదపూడికి పోయి అక్కడ ఉపన్యసించి గ్రామస్థులు ఖద్దరు నిధికి ఇచ్చిన 1130 రూపాయల మొత్తం స్వీకరించినారు

అక్కడ నుంచి తెనాలి పోతూండగా తోవలో పెదరావూరులో 432 రూపాయలు, జంపనిలో 776 రూపాయలు, వేమూరులో 116 రూపాయలు, కాపలో 116 రూపాయలు, పీపూరులో 116 రూపాయలు, అనంతవరంలో 1187 రూపాయలు, ఇమ్ముడిలూరులో 116 రూపాయలు ఆయనకు ఖద్దరు నిధికి లభించినాయి ఈ అన్ని చోట్ల ఆయన ఖాదీ ధరించవలెనని ప్రజలకు ఉద్బోధించినారు

## తెనాలిలో

గాంధీజీ ఉదయం 10-30 గంటలకు తెనాలి చేరినారు ఆయన ఆనాటి యం ఎల్ సి పిల్లలమర్రి ఆంజనేయులు గారికి అతిథిగా ఉన్నారు జాతీయ పాఠశాల ఆవరణలోని బహిరంగ సభలో గాంధీజీ ఉపన్యసించినారు అక్కడ స్వరాజ్య పతాకాన్ని అత్యుత్సాహంతో ఆవిష్కరించడం జరిగింది ఆయనకు సన్మాన పత్రాలతో పాటు రూ 2,312-6-11 లు విరాళం సమర్పించినారు అందులో 116 రూపాయలు లాలాజీ స్మారక నిధికి ప్రత్యేకింపబడింది చాలా మంది వ్యక్తులు కూడా ఖద్దరు నిధికి విరాళాలిచ్చినారు గాంధీజీ ఆ మహా సభలో ఉపన్యసిస్తూ కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమం నిర్వర్తించ వలసిందని ఉద్బోధించినారు

అక్కడ నుంచి మహాత్మాజీ ఆయన వర్గం ఈమని గ్రామానికి పోయి 116 రూపాయలు ఖద్దరు నిధికి స్వీకరించినారు తరవాత చేబ్రోలులో 644 రూపాయల మొత్తం ఖద్దరు నిధికి చేరింది గుంటూరు రాత్రి 10 గంటలకు చేరి మునిసిపల్ రహదారి బంగాళాలో విశ్రాంతి తీసుకొన్నారు

21 ఏప్రిల్ ఉదయం గాంధీజీ ఆయన బృందం రెంటచింతలకు పోతూ నరసారావు పేట వెళ్ళినారు నరసారావుపేట నుంచి సాయంత్రం ముప్పాళ వెళ్లి అక్కడ ఆ రాత్రి, ఆ మరునాడు (మౌనవ్రతపు రోజు సోమవారం) ఉన్నారు సాయంకాలం ముప్పాళ నుంచి బయలు దేరి సంతమాగులూరులో రైలెక్కి 23 వ తారీకు ఉదయం బెజవాడ చేరుకొని అక్కడ నుంచి ఏలూరుకు

మోటారులో వెళ్ళినారు గుంటూరు జిల్లాలో ఆనాటిక నగలు కాక నగదుగా 42,000 రూపాయల మొత్తం ఖద్దరు నిధికి లభించింది

## గుంటూరు జిల్లా (1929)

1929లో గాంధీజీ గుంటూరు జిల్లాకు ఖద్దరు యాత్రా సందర్భంలో వచ్చినపుడు వారు గుంటూరు, బాపట్ల రేపల్లె తెనాలి తాలూకాలలో సంచారం చేసినారు శ్రీ శీలం సుబ్బారావు, మాచిరాజు రామమూర్తి, శరణు రామస్వామిచౌదరిగార్లు పైలెట్ కారులో ఉన్నారు వల్లూరులో వి బి రాజుగారి తండ్రి సభా మొదలయిన అన్ని ఏర్పాట్లు చేసినారు వల్లూరినుంచి పెదనందిపాడు, కారంచేడు మొదలయిన గ్రామాలకు వెళ్ళినారు పెదనందిపాడులో పర్వతనేని వీరయ్యచౌదరిగారు ఏర్పాట్లు చేసినారు కారంచేడులో జాగర్లమూడి రామయ్య, దగ్గుపాటి రాఘవయ్య మొదలయినవారు ఖద్దరునిధి సమర్పణకు సభలకు ఏర్పాట్లు చేసినారు వేటపాలెం, తిమ్మ సముద్రం, చీరాల, బాపట్ల, కాజీపాలెం, మంతెనవారిపాలెం, కావూరు, గోవాడ, మోపర్రు, అమృతలూరు, పెదపూడి, జంపని, అనంతవరం, తెనాలి, అక్కడినుంచి నర్సారావుపేట, ముప్పాళ మొదలయిన గ్రామాలకు వెళ్ళినారు ముప్పాళలో రామలింగయ్యగారు గాంధీజీ తూకానికి సరిపోయే వెండి సమర్పించినారు గాంధీజీ ఆగిన ప్రతిచోట రూ 1116లు ఖద్దరునిధికి సమర్పించడం జరిగింది రూ 1116లు ఇచ్చినచోటనే సభ ఏర్పాటు చేయడం జరిగింది తోవలో కొందరు గాంధీజీ కారును ఆపి కానుకలు సమర్పించుకొన్నారు

## గుంటూరులో కొన్ని ఉపాఖ్యానాలు (Anecdotes)

1929లో గాంధీజీ గుంటూరు వచ్చినప్పుడు ఆయనను కలుసుకొని ఆయనను గురించి తనకు తోచిన అభిప్రాయాలు వ్రాయవలసిందని గుంటూరులోని ఆంధ్రా క్రిష్టియన్ కాలేజి ప్రిన్సిపాల్ రెవరెన్ సైమ్స్‌కు అమెరికానుంచి ఆయన భార్య ఉత్తరం వ్రాసింది సైమ్స్ గాంధీజీని కలుసుకొని తాను ఆంధ్రా క్రిష్టియన్ కాలేజి ప్రిన్సిపాల్‌నని పరిచయం చేసుకొన్నారు

గాంధీ - మీరు అన్ క్రిష్టియన్ కాలేజి ప్రిన్సిపాలా ? మీరేం బోధ చేస్తారు?

రెవరెన్ సైమ్స్ రాజకీయాలు

గాంధీ - అమెరికన్ రాజకీయాలు ఇండియాలో బోధిస్తారా? లేదా ఇండియన్ రాజకీయాలు అమెరికాలో బోధిస్తారా?

ఈ సంభాషణతోనే గాంధీ హాస్యప్రవృత్తి, ఆయన అంతర్దృష్టి సైమ్స్‌కు అర్థమయి భార్యకు పెద్ద ఉత్తరం వ్రాసినాడు

## గుంటూరు జిల్లా కావూరులో (1929)

1929 ఏప్రిల్‌లో గాంధీగారు కావూరు వచ్చినారు గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, తుమ్మల బసవయ్యగారు మొదలయిన స్నేహితుల సహాయంతో రూ 1116లు వసూలుచేసి ఖద్దరునిధికి ఒక ఉత్తముడైన నిరుపేదవ్యక్తి ద్వారా గాంధీజీకి సమర్పింపచేసినారు ఇతర వ్యక్తుల ద్వారా 500 రూపాయలు కొన్ని నగలు లభించినాయి అక్కడ బ్రహ్మాండమయిన సూత్రయజ్ఞం జరిగింది 1923లో స్థాపించిన తిలక్ జాతీయ పాఠశాల ఉపాధ్యాయుల వసతి గృహానికి శంకుస్థాపన చేయవలసిందని గాంధీజీని కోరగా, ఆయన, అక్కడకు వెళ్ళనవసరంలేదనీ, ఐదుమైళ్ల దూరంవరకు వెళ్ళకుండానే తాము శంకుస్థాపన చేయగలమని చెప్పి శంకుస్థాపన చేసినట్లు ప్రకటించినారు అప్పుడు పెద్దవాళ్లు,యువతులను,పిల్లలను నగలతో గాంధీగారిని చూడనిచ్చేవారుకారు గాంధీగారివద్ద ఏదో మంత్రశక్తి వారిని ఆకర్షించడంవల్ల వారు నగలను గాంధీగారికి ఇచ్చివేస్తారని పెద్దవాళ్లకు భయం ఉండేది ఆ విధంగానే తుమ్మల బసవయ్యగారి భార్య దుర్గాంబపట్ల జరిగింది

1929 అక్టోబరు 2న గాంధీగారి షష్టిపూర్తి ఉత్సవం కావూరులో జరిగింది గ్రామస్థులు గాంధీగారి ఎత్తు ఖద్దరును పేదలకు భోజనంపెట్టి పంచిపెట్టినారు అప్పటినుంచి విధిగా గాంధీ జయంత్యుత్సవాలు కావూరిలో జరుగుతున్నాయి

## గుంటూరుజిల్లా మంతెనవారి పాలెం (1929)

గాంధీగారు 1929లో ఖద్దరు యాత్రా పర్యటన సందర్భంలో మంతెనవారిపాలెం వచ్చినారు బాపట్లనుంచి మంతెనవారిపాలెం రావలె అప్పుడు మంతెనవారిపాలెం పరిసర గ్రామాలకు రోడ్డు సౌకర్యంగానీ, బాట సౌకర్యంగానీలేదు గాంధీగారి కారు ఇసుకలో కొంతదూరం నడవకపోతే శ్రీ మంతెన వెంకట్రాజు మొదలయిన కాంగ్రెస్ కార్యకర్తలు నెట్టుకొంటూ పోయినారు గాంధీజీ, కారును కార్యకర్తలు నెడుతూన్నప్పుడు తాను కారులో కూర్చోవడం మానవత్వం కాదని చెబుతూ దిగి నడిచినారు

మంతెనవారిపాలెంలో ఒక డాబాలో గాంధీగారికి బస ఏర్పాటు చేయబడింది రాత్రి అంతా వారు అక్కడే ఉన్నారు రాత్రి డాబామీద పడుకొనేటందుకు అందరికీ మంచాలు వేసినారు కస్తూరిబా మంచము,గాంధీజీ మంచము వరసగా వేసిఉన్నవి ఆ రెండు మంచాల మధ్య దర్భకట్టలు వేసిఉండడం శ్రీ మంతెన వెంకట్రాజుగారు చూసినారు అవి ఎందుకు వేసినారో ఆయనకు అర్థం కాలేదు అడిగే సాహసం కూడా లేకపోయింది మంతెన వెంకట్రాజుగారి స్వగ్రామం మంతెనవారిపాలెమే

ఆ ఉదయాన బహిరంగసభ జరిగింది పరిసర గ్రామాలనుంచి విపరీతంగా

జనం వచ్చినారు అందరు నిశ్శబ్దంగా కూర్చున్నారు ఇల్లువిడిచి బయటకు రాని గోషా స్త్రీలంతా సాహసంగా నడిచివచ్చి సభలో బహిరంగంగా పాల్గొన్నారు గ్రామస్థులు ఖద్దరునిధికి రూ 116లు సమర్పించినారు స్త్రీలు బాపూజీ అడగగానే నగలుతీసి ఇచ్చినారు వాటి ఖరీదు మూడు వేల రూపాయలు మించి ఉంటుందని అంచనా

**గుంటూరు జిల్లాలో ఖద్దరునిధి వసూళ్ళు**

(25-4-1929 యంగ్ ఇండియా)

| | | రూ అ పై |
|---|---|---|
| 17-4-1929 | గుంటూరు | 7802-0-9 |
| | నౌపాడు | 116-0-0 |
| | కొల్లూరు | 575-0-0 |
| | పుసులూరు | 65-0-0 |
| | పెదనందిపాడు | 1178-13-8 |
| | (లాలాజీనిధి 420 రూ) | |
| | కారంచేడు | 1952-9-1 |
| 18-4-1929 | తిమ్మసముద్రం | 1127-14-1 |
| | వేటపాలెం | 514-0-0 |
| | చింతలపాడు | 75-0-0 |
| | పొన్నూరు | 850-0-0 |
| | నిడుబ్రోలు | 130-0-0 |
| | మర్రిపూడి | 121-0-0 |
| | అప్పికట్ల | 34-14-0 |
| | కట్టెంపూడి | 50-0-0 |
| | బాపట్ల | 1123-8-0 |
| | ఖాజీపాలెం | 1018-0-0 |
| | మైనేనివారిపాలెం | 899-5-6 |
| | | 18,868-6-8 |

**పశ్చిమగోదావరి జిల్లా**

ఏప్రిల్ 29వ తేదిన గాంధీజీ ఆయన బృందము బెజవాడనుంచి పశ్చిమ

గోదావరి జిల్లాకు బయలుదేరినారు సరిగా ఉదయం 7-30 గంటలకు పశ్చిమ గోదావరి జన్‌క్షన్ రోడ్డుకు చేరినారు అక్కడ జిల్లా బోర్డు ప్రెసిడెంట్ (పెనుమచ్చ) పెద్దిరాజుగారు వారిని కలుసుకొని ఆహ్వానించినారు

పెరకేడులో మహాత్మాజీకి కొన్ని రూపాయలు నగదును, 100 రూపాయలు విలువగల నగలునూ సమర్పించినారు వసంతవాడలో సన్మానపత్రంతో పాటు 602 రూపాయల నగదు ఖద్దరునిధికి చేకూరింది గాంధీజీ అందరు ఖాదీ ధరించవలెననీ, కొక్కిరిపాడులోని 40 చేనేత మగ్గాలు ఖద్దరునే నేయవలెననీ, అందరూ ఐకమత్యంగా ఉండి తాగుడు మానవలెననీ ఉపన్యసించినారు

## ఒక వితంతువు ఔదార్యము

తరవాత గాంధీజీ నాయుడు గూడెం వెళ్ళినారు అక్కడ గారపాటి సాంబయ్యగారి కుమార్తె 21 సంవత్సరాల వయస్సుగల బాల వితంతువు శ్రీమతి ఎలమంచలి సత్యవతమ్మ 1400 రూపాయల విలువగల తన నగలను అన్నిటినీ సమర్పించి గాంధీజీ ఆశ్రమంలో ఉండటానికి అనుమతి ఇవ్వవలసిందని ఆయనను ప్రార్థించింది గాంధీజీ అందుకు వెంటనే అంగీకరించినారు గాంధీజీ సంచారం పూర్తి కాగానే ఆమెను ఆశ్రమానికి పంపగలమని ఆమె తల్లితండ్రులు చెప్పినారు

తరవాత గాంధీజీ పెదపూళ్ళ వెళ్ళి ఆ గ్రామస్థుల సన్మానపత్రంతో పాటు రూ 1116 లు ఖద్దరు నిధికి స్వీకరించినారు ఇక్కడ గాంధీజీ ఒక పెద్ద సభలో ఉపన్యసించినారు ఆయన ఉపన్యాసాన్ని ప్రజలు చాలా శ్రద్ధతో విన్నారు ఆ బాల వితంతువిచ్చిన నగల బహూకరణ గురించి జాలికరంగా మాట్లాడుతూ, ఆమె ఇప్పుడు గోషాలో ఉన్నట్లు తెలుస్తున్నది అన్నారు అది నిజమయితే, ఆమె తల్లితండ్రులు ఆ గోషాను తొలగించవలెనని కోరుతున్నాను గోషావంటి ఆచారంవల్ల కలిగే ఫలితం ఆ తల్లితండ్రులకు తెలుసునో తెలియదో, అది అన్యాయము ఏ స్త్రీని గోషాలో ఉంచి దేవుని వెలుతురును, సూర్యుణ్ణి చూడనీయకుండడానికి ఎవరికీ హక్కులేదు ఎవరినయినా బలవంతంగా గోషాలో ఉంచడం చాలా అన్యాయము ఈ ప్రత్యేక సమయం గురించి మరి కొంతసేపు మాట్లాడుతూ ఆమెకు ఇష్టమయితే ఆమె తిరిగి వివాహం చేసుకొనేటందుకు ఎందుకు అంగీకరించకూడదు? అని ప్రశ్నించినారు ఇటువంటి విషయాలలో ప్రజాభిప్రాయం ఘనీభవింప చేయటానికి ఈ దేశపు ప్రజలు కృషి చేయవలె అన్నారు భార్యలు చనిపోయిన పురుషునివలెనే భర్తలు చనిపోయిన వితంతువులుకూడా తిరిగి వివాహం చేసుకోవలెనని తన అభిప్రాయమన్నారు వితంతువుగా ఉండి బ్రహ్మచర్యం అవలంబిస్తే చాలా మంచిదే కానీ నిర్బంధ బ్రహ్మచర్యం ఎంత మాత్రం కూడదన్నారు ఖద్దరును గురించి విదేశ వస్త్ర బహిష్కారం గురించీ ఎక్కువసేపు మాట్లాడి దండు నారాయణరాజుగారిని విదేశీ వస్త్రాలను పోగు చేయమన్నారు విలువగల విదేశీ వస్త్రాలు పట్టు బట్ట

లతో సహా పోగుపడినవి వాటిని దగ్ధం చేయడం జరిగింది

గాంధీజీ అక్కడినుంచి పాలకొల్లు వెళ్ళినారు అక్కడ 100 రూపాయలు ఖద్దరు నిధికి వచ్చింది

కలపల్లులో గాంధీజీ 140 రూపాయలు స్వీకరించినారు 10 గంటలకు వట్లూరు వెళ్ళినారు అక్కడ 516 రూపాయలు విరాళం వచ్చింది ఖద్దరు దండ వేలం వేయగా 16 రూపాయలకు ఒకరు కొన్నారు

10 30కి గాంధీజీ ఆయన బృందం ఉండటానికి 'గాంధీ జాతీయ పాఠశాల'లో మంచి ఏర్పాట్లు చేసినారు గాంధీజీ ఆ పాఠశాల ద్వారాల దగ్గరికి రాగానే 2వేల మంది ప్రజలు ఆయనకు అభివాదం చెప్పినారు ఏలూరు మధ్య గ్రామాలన్నిటిలో వేలకొద్దీ ప్రజలు ఉత్సాహకరంగా ఆయనను ఆహ్వానించినారు కొన్నిచోట్ల గాంధీజీని కస్తూరిబా గాంధీని పూజించినారు ఈ అన్ని గ్రామాలలో దేశభక్త కొండ వేంకటప్పయ్యగారు గాంధీజీ కారులో ఉండి ఆయనకు అనువాదకుడుగా ఉన్నారు సర్వశ్రీ దేశోద్ధారక నాగేశ్వర రావు పంతులు, దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచారి, పెద్దిరాజు గార్లు గాంధీజీ కారుకు తోవ చూపడానికి ముందు కారులో ఈ అన్ని ఊళ్ళకు వెళ్ళినారు

## ఏలూరులో

ఏప్రిల్ 23వ తేది సాయంకాలం ఏలూరులోని గాంధీజీ కార్యక్రమం ఎంతో ఒత్తిడి అయింది మధ్యాహ్నం 3 గంటలనుంచి గాంధీజీ బసదగ్గర జనం చేరడం ప్రారంభించినారు సాయంకాలం 5 గంటలయ్యేసరికి జనం క్రిక్కిరిసి పోయి గాంధీజీ కారు కదలటమే కష్టమై పోయింది కాలవరోడ్డు మీద ఫర్లాంగు దూరం వరకు జనం ఇసకవేస్తే రాలకుండా ఉన్నారు 5 30 గంటలకు గాంధీజీ ఆయన బృందము శ్రీ అన్నపూర్ణాదేవి బాలికా పాఠశాలకు వెళ్ళినారు తరవాత వారు పురమందిరానికి వెళ్ళినారు గాంధీజీ అక్కడ సమావేశమయిన రెండువేలమంది స్త్రీలనుద్దేశించి ఉపన్యసిస్తూ నిరుపేదలయిన తమ సోదరీమణుల కోసం అన్నపూర్ణాదేవిని ఉదాహరణంగా తీసుకొని ఖాదీ నిధికి తమనగలను అలంకారాలనూ, అన్నిటినీ సమర్పించ వలసిందని ఉద్బోధించినారు ఈ సందర్భంలో ఆ ఉదయం జరిగిన నాయుడు గూడెంలోని సత్యవతమ్మ ఉదంతం కూడా ఉదాహరణంగా గ్రహించ వలసిందన్నారు సమావేశంలో సందడి ఎక్కువ కావడంవల్ల గాంధీజీ తన ఉపన్యాసాన్ని సంగ్రహించేసి డబ్బు నగలు వసూలు చేయించినారు

## బహిరంగ సభ

సాయంకాలం 6-35 నిమిషాలకు మైదానంలో సమావేశమయిన పెద్ద బహిరంగ సభలో గాంధీజీ సంగ్రహంగా ఉపన్యసించినారు స్వరాజ్య సంపాదనకు

కావలసిన యావద్భారత కార్యక్రమానికి నాయకులు, ప్రజలు సంసిద్ధం కావలె నన్నట్లయితే ప్రజాసామాన్యాన్ని పుసరు క్రమశిక్షలుగా చేయడం అత్యవసరమని ఆయన సూచించినారు విదేశీవస్త్ర బహిష్కారము, ఖద్దరు కార్యక్రమం ఈ పనిని ఎంతవరకు చేయగలిగిందో ఆయన చెప్పినారు మహాత్మాజీ ఏలూరు తాలూకా బోర్డు నుంచి రూ 1116 లు, పశ్చిమ గోదావరిజిల్లాబోర్డునుంచి 116 రూపాయలు, ఏలూరు కౌన్సిలునుంచి 3 000 రూపాయలు, ఏలూరు తాలూకా విద్యాసంఘంనుంచి 191 రూపాయిలు ఖద్దరు నిధికి విరాళాలను స్వీకరించినారు స్థానిక సంఘాలవారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు రాజా మంత్రి ప్రగడ భుజంగరావుగారు గాంధీజీకి వడుకు నూలుకండెలు సమర్పించినారు తరవాత గాంధీజీ సాయంకాలం 7 గంటలకు ఏలూరుకు 1 మైలు దూరంలో ఉన్న చాటపర్రు గ్రామానికి వెళ్ళినారు అక్కడ 900 రూపాయల డబ్బు సంచి గ్రామస్థులిచ్చినారు గాంధీజీ చిరునవ్వుతో అది వెయ్యినూటపదహార్లు మొత్తం చేయక పోయినట్లయితే తానిక్కడ సత్యాగ్రహం చేస్తానన్నారు వెంటనే ఆ మొత్తం 1116లై ఊరుకొంది ఆ తరవాత గాంధీజీ కొన్ని నిమిషాలు మాట్లాడుతూ అందరూ ఖద్దరు ధరించవలెననీ, తాగుడును నిరోధించవలెనని చెప్పినారు రాత్రి 8 గంటలకు తిరిగి ఏలూరు చేరుకొన్నారు

ఏప్రిల్ 23 సాయంకాలం జరిగిన మహిళా సభలో 297 రూపాయలు పైచిలుకునగదు, 400రూపాయల విలువగల నగలూ గాంధీజీకి స్త్రీలు సమర్పించి నారు 23వ, తేది వసూలైన మొత్తం నగదు 8,999 రూపాయలు గాక, సుమారు రెండువేల రూపాయల విలువగల నగలుకూడా లభించినాయి శ్రీ మాగంటి బాపినీడుగారు, ఆయన ధర్మపత్ని కీ శే అన్నపూర్ణాదేవి వివాహంనాడు తన వ్రేలికి అలంకరించిన ఉంగరం మహాత్మాజీకి సమర్పించినారు ఏప్రిల్ 24వ తేదీ ఉదయం చక్కని చల్లగాలిలో ఏలూరుకు 16 మైళ్ళ దూరంలో ఉన్న చింతలపూడి తాలూకాలోని ధర్మాజీగూడానికి గాంధీజీ ఆయన బృందమూ వెళ్ళినారు అక్కడ గాంధీజీకి పరిసర గ్రామస్థులు, స్థానిక కో-ఆపరేటివ్ యూనియన్‌వారు సన్మానపత్రం సమర్పించినారు చట్రాలలో బిగించిఉన్న సన్మానపత్రాలను వేలంవేయగా 8 రూపాయలు వచ్చినాయి ఒక స్త్రీ తన 30 రూపాయల నాగరం ఇచ్చినది ఖద్దరునిధికి ఆ సభలో గాంధీజీ రూ 1116లు స్వీకరించి, ఖద్దరు, వివిధ వర్గాలవారి ఐకమత్యము, అస్పృశ్యతా నివారణము, మద్యపాన నిషేధము మొదలయిన విషయాలు గురించి ఉపన్యసించినారు ఏలూరినుంచి ధర్మాజీగూడెంపోయే తోవలో సంబరుపేట గ్రామస్థులు సన్మానపత్రంతోసహా ఖద్దరునిధికి 154 రూపాయలు విరాళమిచ్చినారు విజయరాయిలో 119 రూపాయలు, మాదుపల్లిలో 816 రూపాయలు విరాళం లభించింది ధర్మాజీగూడెంలో మంచి ఏర్పాట్లు జరిగి నాయి ధర్మాజీగూడెం నుంచి సరాసరి ఏలూరుకు తిరిగి వచ్చినారు ఈ మధ్య గ్రామాలన్నిట్లోను గ్రామస్థులు గాంధీజీకి సంతోషపూర్వక స్వాగతం చెప్పి

నారు సాయంకాలం 3 గంటలవరకూ పలూరులోని 'గాంధీ జాతీయ పాఠశాల'లో బసచేసి విశ్రాంతి తీసుకొన్నారు తరవాత ఒకగంటవరకు తనను చూడవచ్చిన దివాన్ బహదూర్ మోచర్ల రామచంద్రరావుపంతులు మొదలయిన పెద్దలతోను, ఖాదీ కార్యకర్తలు, జాతీయ విద్యా కార్యకర్తలతోను సంభాషించినారు

సాయంకాలం 5 గంటలకు పాకీవారి పిల్లలు కొందరు తమ ఉపాధ్యాయునితో సహా గాంధీజీని దర్శించడానికి వచ్చినారు వారందరూ చక్కగా పరిశుభ్రంగా ఉన్నారు గాంధీజీ ప్రేమతో వారిని పలకరించి కష్టసుఖాలు తెలుసుకొని వారికి మిఠాయీలు పంచిపెట్టినారు గాంధీజీ పలూరు వచ్చిన తరవాత ఒక చిన్న సంఘటన జరిగింది అయన ఆయుష్కర్మ (క్షురకర్మ)కు ఖద్దరు కట్టిన మంగలి కావలెనన్నారు 36 గంటల తరవాత కూడా అటువంటి మంగలి లభించలేదు అప్పుడాయన "మీరు ఖద్దరు ధరించిన మంగలివారికి ఎక్కువ గిరాకీ ఉండేటట్లు చేయవలె అట్లాగే వడ్రంగులూ, చాకళ్ళూ, ఇతర పనివాళ్ళ విషయంలో కూడా ఖద్దరు కట్టినవారికే ఎక్కువ గిరాకీ ఉండేటట్లు ఏర్పాటుచేసి ఆ విధంగా ప్రజల్లో విరివిగా ఖద్దరు వ్యాపకం చేయవలె అని కార్యకర్తలకు సలహా ఇచ్చినారు

**పోతునూరులో**

గాంధీజీ ఆయన సహచరులు పలూరుకు 10 మైళ్ళ దూరంలో ఉన్న పోతునూరు గ్రామానికి బయలుదేరినారు పలూరు రోడ్లన్నీ ప్రజలతో క్రిక్కిరిసి పోయినాయి 'మహాత్మాజీకీజై' 'వందేమాతరం' అనే నినాదాలు మిన్నుముట్టినాయి

పోతునూరు పశ్చిమ గోదావరి జిల్లాలో చాలా భాగ్యవంతమయిన గ్రామాలలో ఒకటి గాంధీజీని ఆహ్వానించడానికి గ్రామస్థులు మనోహరమయిన ఏర్పాట్లు చేసినారు పలూరు, పోతునూరు మధ్యఉన్న గ్రామాలను కూడా మనోజ్ఞంగా అలంకరించినారు పోతునూరులో గాంధీజీ ఆహ్వానానికి నిర్మించిన ప్రత్యేక పందిరిలో నాలుగువేల మంది సమావేశమయినారు అక్కడ ఒక మహిళామణి వివేకానంద గ్రంథాలయానికి కావలసిన ధనము ఈయగలనని వాగ్దానంచేసినందువల్ల దానికి పునాదిరాయి వేయడానికి ఆ గ్రామస్థులు గాంధీజీని ప్రార్థించినారు గాంధీజీ కూర్చున్న కారులోకి ఒక బొక్కెన సున్నము, ఒకరాయి తీసుకొనివచ్చి ఆయనకు అందించినారు గాంధీజీ వెండి తాపీతో సున్నం తీసి పునాది రాయివేసినట్టు ప్రకటించినారు గాంధీజీకి రెండువేల రూపాయలు సమర్పించినారు అందులో 190 రూపాయలు లాలాజీ నిధికి ప్రత్యేకించ బడింది

గాంధీజీ హిందీలో ఉపన్యసిస్తూ "మీరు నాకు ఖద్దరు నిధికి కొంత నగదు, కొన్ని నగలూ ఇచ్చినారు బాగానే ఉందికాని మీరందరూ విదేశీ బట్టలను

విసర్జించి ఖద్దరు కట్టండి మీరిట్లా చేసినట్లయితే ఈ డబ్బు వసూలు చేయవలసిన అవసరమేఉండదు ఇక్కడ తాగుబోతులు లేరని నమ్ముతున్నాను కల్లు, బ్రాందీ వంటి తాగుడులు దయ్యాల భూతాల వంటివి ఇక్కడ పంచములలో తాగినట్లు తెలిసినవానికి పెద్దలు 5 రూపాయలు జరిమానా విధిస్తారని ఇప్పుడే విన్నాను ఇది శుభసూచకమని" అన్నారు ఆ తరువాత ఆయన అస్పృశ్యతా పాపం తొలగించవలెనని, బాల్య వివాహాలు కూడదని, స్వరాజ్య సంపాదనకు మీరు కృతనిశ్చయులై ఉన్నట్లయితే కాంగ్రెస్ కార్యక్రమం 'తు' 'చ' తప్పకుండా నిర్వర్తించవలసి ఉంటుందని ఉద్బోధించినారు తరవాత ఆ వెండి తాపీని వేలం పెట్టగా 30 రూపాయలు వచ్చినాయి

## కొవ్వలి, దెందులూరు గ్రామాలలో

తరవాత మహాత్మాజీతో అందరూ పోతునూరుకు 8 మైళ్ళ దూరంలో ఉన్న మరొక భాగ్యవంతమయిన గ్రామం కొవ్వలి వెళ్ళినారు గ్రామస్థులు గాంధీజీని అత్యుత్సాహంతో ఆహ్వానించి సన్మానపత్రంతోసహా 1200 రూపాయలు ఖద్దరునిధికి సమర్పించినారు గాంధీజీ విదేశీవస్త్ర బహిష్కరణ ఖాదీ ధారణ గురించి ప్రత్యేకంగా పేర్కొంటూ కాంగ్రెస్ కార్యక్రమం సక్రమంగా నిర్వర్తించవలసిందని ఉద్బోధించినారు రాత్రి 7-15 నిమిషాలకు కొవ్వలిలో బయలుదేరి దెందులూరుకు రాత్రి 7-45కు చేరినారు ఆ గ్రామస్థులు సుమారు, 1000 రూపాయలు, కొన్ని నగలూ, మరికొన్ని చిన్న చిన్న మొత్తాలు ఖద్దరునిధికి సమర్పించినారు సహకార సంఘంవారి సన్మాన పత్రం స్వీకరిస్తూ గాంధీజీ ఖద్దరు ఉత్పత్తి ఎక్కువ కావడానికి, ఖద్దరును ఎక్కువగా సప్లయ్ చేయడానికి సహకారోద్యమం తోడ్పడవలెనని ఉపన్యసించినారు

ఆ గ్రామంలోని స్వచ్ఛంద సేవకులు సభలో శాంతిక్రమాలను చక్కగా కాపాడుతూ ఏలూరు పట్టణానికి ఆదర్శప్రాయంగా ఉండేటంత బాగా చక్కని ఏర్పాట్లు చేసినారు

## గుండుగొలనులో

సాయంకాలం 6-15 నిమిషాలకు తన అనుచరులతోసహా గాంధీజీ గుండుగొలను వెళ్ళినారు ఆ గ్రామస్థులాయనను ఎంతో ఉత్సాహంతో ఆహ్వానించినారు గాంధీజీ కార్యక్రమం ఆనాడు చాలా ఒత్తిడిగా ఉంది ప్రయాణబడలికవల్ల మాట్లాడలేకుండా ఉన్నారు కాని గ్రామస్థులు ఒకటి రెండు మాటలయినా చెప్పవలసిందని పదేపదే కోరినందున ఆయన ఖద్దరు ధారణ, విదేశవస్త్ర బహిష్కారం గురించి మాట్లాడినారు అప్పుడు శ్రోతలలో ఒకరు "ఖద్దరు చాలా ప్రియంగా ఉన్నది అందువలన కట్టలేకుండా ఉన్నాము" అన్నారు దానికి జవాబు చెబుతూ "ఖద్దరు ఎంత ఖరీదయినా ప్రియంకాదు మీకు సన్నిహితులు, ప్రేమపాత్రులు అయినవారు ఎవరయినా

ఖైదులో బంధింపబడినప్పుడు ఎంత ఖర్చయినప్పటికీ వారిని విడిపించడానికి సర్వప్రయత్నాలు చేస్తారుగదా అట్లాగే పరప్రభుత్వ బంధనంనుంచి స్వరాజ్యం సంపాదించవలెనని మీరు కోరితే ఎంత త్యాగమయినా చేయడం అవసరము త్యాగబుద్ధితో ఖద్దరు ధరించవలె ఖద్దరు ప్రియమయిందని మీరనడం ఏమీ త్యాగం లేకుండా స్వరాజ్యం సంపాదించవలెనని మీ అభిప్రాయమయి నట్లు కనబడుతుంది విదేశీబట్ట చౌక అంటారు మీరు అది ఊరకే వచ్చినప్పటికీ దానిని స్వీకరించకూడదు దాని వెనక మీ పరతంత్రమనే కీడు, మీ దౌర్బ ల్యమూ దాగి ఉన్నాయి దానిని విసర్జించండి మీ వస్త్రాలకోసం మీరు స్వయం కృషిమీద ఆధారపడండి ఏ సందర్భంలో కూడా మీ మాతృదేశంనుంచి మీ సొమ్ము పరాయి దేశాలలో పారవేయకండి" అని ఉద్వేగంతో ఉపన్యసించి నారు అంతటితో సమావేశం ముగిసింది

**తాడేపల్లిగూడెంలో**

ఏప్రిల్ 25 ఉదయం తాడేపల్లిగూడెం తాలూకా బోర్డు ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంట్లు కలిదిండి గంగరాజు, శేషగిరిరావుగార్లున్నూ, జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రెసిడెంట్ నజీర్ అహమదున్నూ, శనివారపు సుబ్బారావుగారితోసహా గుండుగొలనులో గాంధీజీని ఉదయం 6 గంటలకు కలుసుకొన్నారు గాంధీజీ ఆయన అనుచరవర్గంతోసహా తాడేపల్లిగూడెం 7 గంటలకు చేరినారు దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మగారు రాజమహేంద్రవరమునుంచి మహాత్మాజీకి అభినందనలు సమర్పించేటందుకు కొంతమంది విద్యార్థినులతో తాడేపల్లిగూడెం వచ్చినారు మహాత్మాజీని సన్మానించేటందుకు యేర్పాటయిన ప్రత్యేక మండ పంలో ఆయనకు ఈ బాలికలు హారతిపట్టినారు తరవాత రాజమహేంద్ర వరంనుంచి వచ్చిన బాలికలు, బోర్డుస్కూల్ బాలికలు పాడిన పాటలతో సభ ప్రారంభమయింది తాలూకా బోర్డువారు, వర్తక సంఘంవారు, పంచాయతీ సంఘంవారు, కేసరి నాటక కంపెనీవారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించి నారు వర్తక సంఘంవారు రూ 1116లు ఇచ్చినారు తాలూకా బోర్డువారు తప్ప తక్కినవారు చెరిఒక 1116 రూపాయలు సమర్పించినారు గంగరాజు గారి కుమార్తె కొన్ని బంగారు గాజులను సమర్పించింది చాలామంది స్త్రీలు డబ్బుతెచ్చి మహాత్ముని చేతుల్లో ఉంచినారు వారందరినీ విదేశీ వస్త్రాలను విసర్జించి, ఖాదీ ధరించి తమ పేద తోబుట్టువులకు తోడ్పడండని అన్నారు గాంధీజీ ఎల్లమెల్లి కాపురస్థుడు వెలగలేటి సుబ్బారాయుడు అనే ఖాదీనేసే మనిషి మహాత్మాజీకి పాదాభివందనంచేసి 80 వ నెంబరు నూలుతో చేసిన ఒక జత ఖాదీ ధోవతులను ఆయనకు బహూకరించినారు గాంధీజీకి సమర్పించిన చట్రపు సన్మానపత్రాలు వేలంవేయగా ఎక్కువ పాటపాడిన రామేశ్వర లాల్ కు 200 రూపాయలకవి లభించినాయి తరవాత గాంధీజీ రామేశ్వర లాల్ తో కొంతసేపు సంతోషంగా ముచ్చటించి విదేశీ వస్త్రాలను ధరించిన

మహిళలవైపు చూసి విదేశబట్టల బహిష్కారము, ఖద్దరు ధారణలను గురించి వారికి ఉపదేశించినారు గాంధీజీ హిందీ ఉపన్యాసం దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారు అనువదించినారు మహాత్మాజీ ఉపన్యాసం పరిసర గ్రామాలనుంచి వచ్చిన సుమారు 5 వేల మంది విన్నారు 8 గంటలకు గాంధీజీ ాలకలపాడు వెళ్ళి 116 రూపాయల విరాళం స్వీకరించినారు ఈ గ్రామాలలో చక్కని ఏర్పాట్లు జరిగినాయి కడచిన రాత్రి వానతుంపరలు పడటంచేత ఉండికిపోయే రోడ్డు గాంధీజీ రాక తెలిసి మేఘాలు నీళ్ళుచల్లినట్లు కనిపించింది ఉదయం గాంధీజీ రహదారి బంగాళానుంచి బయలుదేరి దాదాపు 8 వేల మందికి హిందీలో ఉపన్యసించినారు ఖద్దరునిధికి 350 రూపాయల విరాళం లభించింది తరవాత ఆకివీడు వెళ్ళినారు ఆకివీడులో 1433 రూపాయలు ఖద్దరునిధికి విరాళం చేకూరింది తరవాత ఉండికి 8 మైళ్ళ దూరంలోఉన్న భీమవరం వెళ్ళి నారు

### భీమవరంలో

భీమవరంలో 30వేల మంది ప్రజలు నిరుపమానమైన ఉత్సాహంతో గాంధీజీని ఆహ్వానించినారు రెండు ఫర్లాంగుల పొడుగున మనోహరంగా అలంకరించిన పందిరిలో ప్రజలు సమావేశమయినారు మహాత్ముని కారు ఆ జనసమూహంలోనుంచి నెమ్మదిగా భీమవరం తాలూకా బోర్డు ఆఫీసుకు పోయింది గాంధీజీ ఎత్తయిన వేదికమీద ఆసీనుడయిన తరవాత తాలూకా బోర్డువారు ఇతరులు ఆయనకు సన్మానపత్రాలు సమర్పించినారు వారు 2,400 రూపాయలు ఖద్దరునిధికి ఇచ్చినారు ఒక యువకుడు గాంధీజీ చిత్ర పటం వ్రాసి ఆయనకు బహూకరించినాడు అది వేలంవేయగా 116 రూపా యలు వచ్చింది తరవాత గాంధీజీ ఉపన్యసించినారు ఆ తరవాత గాంధీ అనుచరులతో కలసి 16 మైళ్ళ దూరంలో ఉన్న పెనుమంట్ర వెళ్లినారు వీర వాసరం, పాలనూరు గ్రామాలలో చేరి 116 రూపాయలు ఖద్దరు నిధికి వసూ లయినది

### పెనుమంట్రలో

పెనుమంట్ర రాత్రి 8-30 గంటలకు చేరుకున్నారు డాక్టర్ దాట్ల నీలాద్రిరాజు, ఆయన కుటుంబం ఇచ్చిన మూడువేల రూపాయలు కాక మరి కొంత సొమ్ముకూడా ఖద్దరు నిధికి వసూలైంది అక్కడ సమావేశమయిన ప్రజాసమూహానికి ఖద్దరు భారత జాతి ఆత్మగౌరవం, పౌరుషం కాపాడగలదని చెబుతూ గాంధీజీ సంగ్రహంగా ఉపన్యసించి, ఆ రాత్రి అక్కడ విశ్రాంతి తీసు కొన్నారు 25 ఏప్రిల్, రాత్రివరకు ఆంధ్రదేశంలో వసూలైన ఖద్దరు నిధికి నగలతో సహా 1,28,000 రూపాయలు

ఏప్రిల్ 26 ఉదయం 6 గంటలకు గాంధీజీ, ఆయన బృందం పెనుమంట్రకు

20 మైళ్ళ దూరంలో ఉన్న మట్లపాలెము బయలు దేరినారు తోవలో అల మూరు కొవ్వూరు పోలూరు గ్రామాలవారు ఒక్కొక్క గ్రామంలో 116 రూపాయ గా గీకి ఇచ్చినారు వెలగలూరులో డాక్టర్ వి రాఘవ రావు గారు 300 రూపాయలిచ్చినారు రాఘవ రావు గారి భార్య గాంధీకి ఒక ఉంగరం గాజులు సమర్పించి ది

## మట్లపాలెము

మట్ల పాలెంలో స్త్రీల సభలోను తరవాత బహిరంగ సభలోనూ గాంధీజీ ఉపన్యసించినారు రెండువేల రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించబడింది అయన అక్కడి జాతీయ పాఠశాలను కూడా దర్శించినారు ఖద్దరు కట్టడం అలవాటు చేసికోవడం ... తీయ పాఠశాలకు చెందిన వారంతా నిరంతరం ఖద్దరు ధరిస్తూ నూలు వడక వలెననీ ఉద్బోధించినారు ఎలమంచిలి గ్రామస్తులు సన్మాన పత్రంతో పాటు 150 రూపాయలు ఖద్దరు నిధికి ఇచ్చినారు ఎల మంచి గోపాలకృష్ణయ్యగారు 150 రూపాయలు ఖరీదు చేసే చేతిగడియారం గాంధీజీకి సమర్పించినారు 8 30 గంటలకు గాంధీజీ విశ్రాంతి కోసం పాలకొల్లు వెళ్ళినారు ఆయన చాలా అలసిపోయినారు

మట్లపాలెంలో పెనుమంట్ర కాపురస్థులైన డాక్టర్ నీలాద్రిరాజుగారు మట్లపాలెం జాతీయ పాఠశాలకు సుక్షేత్రమయిన 10 ఎకరాల భూమిని గాంధీజీ సమక్షంలో దానం చేసినారు ఇంకా చాలామంది నీలాద్రిరాజుగారి ఇంటి దగ్గర 600 రూపాయల విరాళం ఖద్దరు నిధికి ఇచ్చినారు

## పాలకొల్లులో

ఏప్రిల్ 26 సాయంకాలం 5 30 గంటలకు పాలకొల్లులో బహిరంగసభ జరిగింది సభకు 8 వేల మంది ప్రజలు వచ్చినారు గాంధీజీకి మునిసిపల్ కౌన్సిల్ వారు, తాలూకా బోర్డువారు, వైశ్య, క్షత్రియ, వర్తక సంఘాలవారు సన్మాన పత్రాలను సమర్పించి 1500 రూపాయల వరకు ఖద్దరు నిధికి విరాళం ఇచ్చినారు గాంధీజీ ప్రత్యుత్తర మిస్తూ పాలకొల్లు విదేశీ వస్త్ర వ్యాపారానికి కేంద్రం కావడం తనకు విచారకరంగా ఉన్నదనీ, ఇంతటి నుంచి వారు విదేశీ వస్త్రాల అంగళ్ళను బహిష్కరించవలెననీ అన్నారు మాల మాదిగలు ఇక్కడ హింసింపబడుతున్నట్లు విన్నాననీ, అది కూడదనీ వారి బిడ్డలను పాఠ శాల లన్నిటిలోను చేర్చుకొని ఉచితంగా చదువు చెప్పవలెనని కూడా ఉద్బో ధించినాడు పంచములను అంగళ్ళలోనికి కూడా రానీయడం లేదని తాను విన్నందుకు, అది పంచములలో నిరాశకు కారణమవుతుందనీ, కులీనుల మను కొనే వారు పంచములను తమ సోదరులుగా భావించవలెననీ ప్రబోధించినారు.

**ఆచంటలో**

ఆచంటలో మహాత్మునికి ఒక చిక్కు వచ్చింది ఆయన కాలు ఊబిలో దిగబడడంవల్ల ఆయన మందుకెండలో సభాస్థలానికి నడవవ సివచ్చి ది ఇక్కడ దారి చాల ఒడిదుడుకులుగా ఉంది అన్నాడు ఒక కాంగ్రెస్ కార్యకర్త "అవునవును, మన జీవితమంతా వడుదుడుకులుగానే ఉన్నది" అన్నారు గాంధీజీ అందుకు బదులుగా నరసాపురం తాలూకా బోర్డు ప్రెసిడెంటు నెక్కంటి దొరయ్యగారు ఆచంట పౌరులపక్షాన 200 రూపాయలు సమర్పించినారు కోడమంచిలివారు 68 రూపాయలు విరాళం దేవ వారు 179 రూపాయలు విరాళం ఇచ్చినారు కొంతమంది డబ్బు వసలటానికి సంకోచిస్తున్నట్లు గాంధీజీ చూసి, ఖాదీ ఉద్యమం విషయంలో లుబ్ధత్వం పనికి రాదు భాగ్యవంతులు ఎంత ఇచ్చినా తక్కువ ఇచ్చినట్లే కాబట్టి వారి కా ఎక్కువ ఇవ్వాలన్నారు గాంధీజీ "ఆచంటలో కొన్ని సంవత్సరాల క్రితం వరకు చాలా రాట్నాలు పనిచేస్తూండినవని ఆ ప్రాంతాలలో పండిన పత్తి అంతా అవి వినియోగిస్తూండేవనీ విన్నాను అవి ఇప్పుడు ఎందుకు అగిపోయి నవో తెలియదు ఆ నూలువడుకు పనిని పునరుద్ధరించవలెనని కోరుతున్నాను ఖద్దరును ప్రేమిస్తున్న నేటి యువకులు అందుకోసం గట్టిగా కృషి చేయవలె వారు మద్యపాన నిషేధం, విదేశీవస్త్ర బహిష్కారం, అస్పృశ్యతా నివారణ, ఖద్దరు ప్రచారం విరివిగా సాగించి కాంగ్రెస్ కార్యక్రమం సక్రమంగా నిర్వహిస్తే 1929 సంవత్సరాంతంలో స్వరాజ్య సంపాదనకు జరుగనున్న మహత్తర ప్రయత్నానికి సంసిద్ధులు కాగలరని ఆశిస్తున్నాను" అని గాంధీజీ ఉపన్యసించినారు

ఆ రాత్రి దొరయ్యగారు గాంధీజీని కలుసుకొని మరొక 400 రూపాయలు వాగ్దానంచేసి నిరంతరం ఖద్దరుధారిగా ఉండగలనని ప్రమాణం చేసినారు

గాంధీజీకి ఆచంటకు పోయేటప్పుడు తోవలో ఒక బ్రాహ్మణ వితంతు య వతి 116 రూపాయలు సమర్పించింది

గాంధీజీ పిప్పరకు ప్రయాణమై వెళ్ళినారు త్రోవలో అర్ధవరంలో 114 రూపాయలు, గణపవరం పరిసర గ్రామాలలో 570 రూపాయలు, చెరుకుమిల్లి అగ్రహారంలో 100 రూపాయలు, మందలపర్రులో 116 రూపాయలు, పాండువ్వలో శ్రైబరీవారు 50 రూపాయలు, ఆ గ్రామస్థులు 93 రూపాయలు ఖద్దరు నిధికోసం గాంధీజీకి సమర్పించినారు

**తణుకులో**

ఏప్రిల్ 27 ఉదయం గాంధీజీ తణుకుకు ప్రయాణమయినారు దారిలో పెనుగొండలో 500 రూపాయలు, పలేటిపాడులో మరొక 500 రూపాయలు ఆయా గ్రామస్థులు ఖద్దరు నిధికి ఇచ్చినారు తణుకులో ఉదయం బహిరంగ సభ జరిగింది ఖద్దరు నిధికి 1000 రూపాయలు చేకూరినవి, సాయంకాలం

3 గంటలకు మహాత్మాజీ బసలోనే పశ్చిమ గోదావరి జిల్లా కార్యకర్తల సమావేశం జరిగింది అందులో ఖద్దరు ఉత్పత్తిని గురించి కార్యకర్తల పోషణ గురించి ఒక గంటకాలం చర్చ జరిగిన తర్వాత సభ్యులు కొన్ని నిర్ణయాలు చేసుకొన్నారు

సాయంకాలం 5 గంటలకు మహాత్మాజీ మహిళా సభలో ఉపన్యసించినారు స్త్రీలు ఆయనకు కొన్ని నగలూ, కొంత నగదూ ఇచ్చినారు ఆయన దర్శనంకోసం చాలాసేపటినుంచి వేచిఉన్న జనుల ఉత్సాహ ధ్వానాల మధ్య గాంధీజీ తణుకు నుంచి బయలుదేరుతూండగా చిల్లరగా ఒకి 30 రూపాయలు మొత్తం స్వరాజ్య నిధికి సమర్పించినారు నిడుదవోలుకు పోయే త్రోవలో బ్రాహ్మణ కోడూరులో 116 రూపాయలు ఖద్దరు నిధికి చేకూరింది నిడుదవోలులో ఒక పెద్ద సభలో గాంధీజీ కొన్ని మాటలు చెప్పి 250 రూపాయలు ఖద్దరు నిధికి స్వీకరించినారు అందులో 19 రూపాయలు లాలాజీ నిధికి ప్రత్యేకించబడింది తణుకులో జరిగిన కాంగ్రెస్ కార్యకర్తల సభలో శ్రీ ఎర్రమెల్లి రామనాధం, కొవ్వలి గోపాలరావు, ముదిగంటి జగ్గన్నశాస్త్రి, మంగిపూడి పురుషోత్తమశర్మ, బందా వియ్యన్న, శనివారపు సుబ్బారావు మొదలయినవారు ఉన్నారు

## చాగల్లు ఆశ్రమంలో

మహాత్మాజీ తరవాత చాగల్లుకు వెళ్ళినారు అక్కడ కొందరు 170 రూపాయలున్నూ, మరికొందరు 81 రూపాయలున్నూ ఖద్దరు నిధికోసం ఇచ్చినారు అక్కడ సంగ్రహంగా ఉపన్యసించి ఆ ఊరికి 3 మైళ్ళ దూరంలో ఉన్న 'ఆనంద నికేతన్' ఆశ్రమానికి వెళ్ళినారు ఆ ఆశ్రమం చాగల్లు రైలు స్టేషన్‌కు ఎదురుగా ఉంది ఆశ్రమ కార్యకర్తలు, నిమ్నజాతుల పిల్లలుకూడా ఆశ్రమంలోనే ఉంటున్నారు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు, నరసింహశర్మ గార్లు ఆత్మ వంటివారు ఆశ్రమానికి

మహాత్ముని కారు ఆశ్రమ ద్వారం వద్దనే ఆగింది ద్వారానికి ఎదురుగా ఆశ్రమవాసులు పరిసర గ్రామస్థులు కూర్చున్నారు గాంధీజీ కారులోని వెనక సీటుపై భాగంలో కూర్చుండి బాలురను ఉద్దేశిస్తూ కొన్ని మాటలు చెప్పినారు బాలురు ఆయనను ఆహ్వానిస్తూ పాటలు పాడి ఆయన ఆశీర్వాదాలను అభిలషిస్తూ ఆయన మెడలో దండ వేసినారు

గాంధీజీ ఆశ్రమంలోకి వెళ్ళి స్నానాద్యనుష్ఠానాలు పూర్తిచేసుకొని ఆశ్రమ భవనానికి ముందుండిన ఆవరణలో పిల్లల మధ్య కూర్చొని వారిని తాను చేయబోయే దైవ ప్రార్థనలో పాల్గొనమని ఆదేశించినారు చాలామంది ఇతరులు కూడా తదేకనిష్ఠతో ప్రశాంతంగా కూర్చున్నారు ఆ దృశ్యం చిత్తాకర్షకంగా ఉంది ప్రకాశరాయుడుగారు తన ఛాత్రవర్గంతో కలసి ప్రార్థన గీతం పాడినారు. ప్రార్థనలు, దైవారాధన గేయాలు పఠించిన తరవాత

మహాత్మాజీకి ఎం్లి సమర్పించడం జరిగింది ఆశ్రమ వాసులు కొందరు కొంత సొమ్మును కొన్ని వస్తువులనూ గాంధీజీకి సమర్పించినారు ప్రకాశరాయుడుగారి వృద్ధురాలైన మాతృదేవి గాంధీజీకి నూరు రూపాయలతో ఒక వెండి గిన్నె సమర్పించినారు అక్కడ రూ 82-11-6లు కూడా ఖద్దరు నిధికి వసూలైనాయి చాగల్లు రైల్వేస్టేషన్ మాస్టర్ ద్రాక్ష మొదలయిన కొన్ని పండ్లతోపాటు కొంత సొమ్ము కూడా మహాత్మునికి సమర్పించినారు వెంటనే గాంధీజీ 'నా బిడ్డలెక్కడ' అని ఆశ్రమ పిల్లలకోసం అటూయిటూ చూసినారు వారురావడం తోనే వారికి ఆ పండ్లు పంచిపెట్టినారు

9 30 గంటలకు గాంధీజీ విశ్రమించినారు

చాగల్లు ఆశ్రమానికి గాంధీజీతో వచ్చినవారు మోతే నారాయణరావు, కనివారపు సుబ్బారావు, మంగిపూడి పురుషోత్తమశర్మ, కోడేటి వెంకటరాజు, డాక్టర్ యం వి కృష్ణారావు, కాకినాడ కళాశాల సోదరసమితివారు ఉన్నారు ఆత్మకూరి గోవిందాచార్యులుగారు కూడా ఉన్నారు

## కొవ్వూరులో

ఏప్రిల్ 28 వ తేది మహాత్మాజీ, ఆయన వర్గం చాగల్లులో ఉదయం 4 గంటలకే నిద్ర మేల్కొని ప్రాతఃకాలకృత్యాలు తీర్చుకొని 4-30 వరకు ఆశ్రమ వాసులతోను తదితరులతోను ప్రార్థన చేసుకొని భగవద్గీత పారాయణం జరిపిన తరవాత 5-45 గంటలకు దేవరపల్లి మీదుగా కొవ్వూరుకు ప్రయాణమై వెళ్ళినారు 27 వ తేది రాత్రి తూర్పు గోదావరి జిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంట్ వెన్నేటి సత్యనారాయణగారు గాంధీజీని కలుసుకొని తూర్పు గోదావరి జిల్లాలో గాంధీజీ పర్యటన గురించిన మార్పులను నిర్ణయించుకొన్నారు గాంధీజీకి దేవరపల్లిలో ఒక 500 రూపాయలు సమర్పించడం జరిగింది దొమ్మేరులో కొవ్వూరు తాలూకా బోర్డు ప్రెసిడెంటు రాయుడిగారి కుమారుడు ముళ్ళపూడి తిమ్మరాజు గారు గాంధీజీకి ఖద్దరు నిధికై 500 రూపాయలిచ్చినారు గాంధీజీ సరిగా ఉదయం 7-30 లకు కొవ్వూరు చేరుకొన్నారు శివుడు శివరావుగారు గాంధీజీకి 116 రూపాయలు సమర్పించినారు బహిరంగ సభలో పౌరులు ఖద్దరు నిధికి 400 రూపాయలు లిచ్చినారు లజపతిరాయ నిధికి మరొక 300 రూపాయలు వచ్చినాయి లాలాజీ పేరుతో కట్టిన లజపతిరాయ్ పేటను మహాత్మాజీ విధ్యుక్తంగా ఆవిష్కరించినారు

తణుకులో గాంధీజీకి సమర్పించిన వెండి పళ్ళాన్ని 85 రూపాయలకు వేలం వేసినారు ఖద్దరు ధోవతుల జతకు 9 రూపాయలు వచ్చినవి 4 వేల గజాల ఖద్దరు నూలు 10 రూపాయలకు విక్రయించినారు మహాత్మాజీ కొవ్వూరు నుంచి రైలులో రాత్రి 9 గంటలకు విశాఖపట్టణం వైపుకు వెళ్ళినారు దారిలో గోదావరి, రాజమండ్రి, ద్వారపూడి సామర్లకోట స్టేషన్లలో గాంధీజీ దర్శనంకోసం వేలకొద్ది జనం వేచి ఉన్నారు రైలు ఆగిన ప్రతి

చోటా ప్రజలు తమ దగ్గర ఉన్నంత వరకు గాంధీ నిధికి వైళం సమర్పించినారు ఇంతటితో పశ్చిమ గోదావరి జిల్లాకు సంబంధించినంతవరకు గాంధీజీ పర్యటన పూర్తి అయింది మహాత్మాజీ ఏప్రిల్ 23 మొదలుకొని 28 ఉదయం వరకూ పశ్చిమ గోదావరి జిల్లాలో 250 మైళ్ళ ప్రయాణం చేసినారు నగలూ, అలంకారాలు తదితర వస్తువులు సుమారు 2,500 రూపాయల విలువలుగలవి లభించినాయి 40,000 రూపాయల రొక్కం ఖద్దరు నిధికి సమకూరింది ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ వారు జిల్లాకు నిర్ణయించిన మొత్తం 25 వేల రూపాయలు మాత్రమే గాంధీజీ దర్శించిన ప్రదేశాలలో ప్రతి ఒక్కరూ ఆయన పట్ల అపూర్వ గౌరవం చూపించినారు మండుటెండలలో మాగాణి గట్ల వెంబడి బయలుదేరి పుణ్య క్షేత్రాలకు పోతూ ఉన్నట్లు గాంధీజీని అత్యంత భక్తితో అనుసరించి ఆయన నోటి నుంచి వెలువడిన ప్రతిమాట వేద వాక్కుగా ప్రజలు విన్నారు అందువల్ల పశ్చిమ గోదావరిలోని ఆయన సంచారం సంపూర్ణ విజయం సాధించిందనడానికి ఏ మాత్రమూ సందేహం లేదు

పశ్చిమ గోదావరి జిల్లా పర్యటన ముగించిన తరవాత గాంధీజీ సంచారంలోని కొన్ని సంఘటనలను మనోహరంగా అభివర్ణిస్తూ శ్రీ మంగిపూడి పురుషోత్తమశర్మగారు కృష్ణాపత్రికలో 'పూజాంజలి' అనే శీర్షికతో వ్రాసిన వ్యాసం దిగువ ఉదాహరిస్తున్నాము

శ్రీ శర్మగారు కాంగ్రెస్ కార్యకర్తయేగాక సంఘ సేవాతత్పరుడు, మంచి రచయిత, కవికూడా నిరుద్ధభారతము రచించిన మంగిపూడి వెంకట శర్మగారి సోదరుడు

## పూజాంజలి

(శ్రీ మంగిపూడి పురుషోత్తమశర్మ)

ధన్యమైనది పశ్చిమ గోదావరి అదెని పవిత్ర గోదావరిచేత అవల శ్రీ సీతారాములవలన ధన్యమైన ఈ గడ్డ నేడు మహాత్ముని పాద స్పర్శతో మున్నాటికి శాశ్వతంగా ధన్యమైంది 'అహో! భాగ్యమహోభాగ్యం'

మండలంలో మహాత్మునకు ముందుగా స్వాగతం సమర్పింప నోచుకొన్నది ఏలూరు తాలూకా ఏలూరు ముఖ్య స్థానమగుటవల్ల మండలము కెల్లా శిరస్సు కనక మహాత్ముని ప్రథమ స్పర్శ సౌఖ్యం ఈ తాలూకాకే లభించడంలో ఆశ్చర్యంలేదు "అవెన్ శ్రీపతి రెప్పపై " అన్నాడుగదా భాగవత గ్రంథకర్త... ..

• ప్రెసిడెంటు మెను మెచ్చ పెద్దిరాజు మహాత్మునికి ఎక్కడ ఎవ్వరూ జరుపనిరీతిగా రాజమర్యాదలతో ఆహ్వానం జంపినారు ముందుగా తన ఏజంటు ద్వారా జిల్లా అవలకు మహాత్మునికి ఆహ్వానపత్రిక పంపినారు తరవాత సరిగా సరిహద్దుగీతలో సపరివారంగా నిలచి "మహాత్మా నా ఆవరణలోనికి హృదయపూర్వక స్వాగతం నా భూమిలో మీకు సర్వసుఖయానం" అని

హెచ్చరించినారు తరువాత రెండు 116 రూపాయలు మంత్రపుష్పం సమర్పించి పాద పూజలు చేసినారు ఏమైనా రాచబిడ్డ!

.. ముందుగా వసంతవాడలో కానుకలందుకొని మహాత్ముడు పెదపాడు గ్రామంలో ఉడుగు పెట్టినాడు అక్కడ పెద్ద స్వాగితోత్సవము, పెద్ద సభ, పెద్ద పిదేశీ ట్టల మంట, గొప్ప కానుకలు, పెద్ద ఆభరణాలు కాని ఆయనకు అక్కడ దొరికిన అన్ని ఆభరణాలలోకి పెద్దది, అమూల్యమైనది ఆ జీవరత్నం, ఆ చింతారత్నం, ఆ బాలిక సత్యవతమ్మ

•

పాపం సంఘ దౌర్జన్యానికి అకారణంగా బలియైన ఆ అనాథ సత్యవతమ్మను చూడగానే మహాత్ముని కోమల హృదయం కరిగికాలువలు కట్టింది అబ్బా! ఆ దృశ్యం! ఒకప్పుడు ఆ యోగి కవికోకిలయై సంఘ నిషాదుని

"మా నిషాద! ప్రతిష్ఠాం త్వమగమ శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేకమవధీః కామమోహితం"

అని రుద్రావతారం దాల్చి శపించినాడు ఆవల సభలలో అశేష భారత వర్షంలోని అనాథ బాలికల పక్షాన విశ్వహృదయను భేదకమైన కరుణగీతం ఆలపించినాడు "కన్నులు పెరువని ఈ నిరపరాధలగు కన్యలపై అయ్యో! యేమి ఈ క్రౌర్యము"

"నఖలు నఖలు బాణ స్సన్నిపాత్యోయ మస్మిన్
మృదుని మృగ శరీరే పుష్పరాశా విహాః"

"అయ్యో! పువ్వుల రాసిపై నిప్పుల వానా?" అని విలపించేసరికి నిజంగా పాషాణాలు కరిగాయి విశ్వమంతా ఏడ్చింది పైనుంచి ఈ దృశ్యమంతా చూస్తూన్న సూర్య భగవానుని తీక్షణ ముఖం కూడా విన్నవోయి బాష్పకళికమైంది కాకుంటే రెండు, మూడు రోజుల దాకా ఈ వసంతంలో అకాల మేఘం యెక్కడిది

ఒడలంతా ఊడ్చి ఇచ్చింది 1500 రూపాయల నగలు సత్యవతమ్మ సంతోషంతో కాని ఆ సంతోషం వెనక దాగిన వాడి ముల్లును ఎవరు కప్పి పుచ్చగలరు! ఇన్ని దానాలు పట్టినాడు కాని మహాత్ముడు ఇంతటి బాధాకరమైన దానం ఎన్నడూ, ఎక్కడా పట్టలేదు అది స్వచ్ఛమైన సువర్ణ దానమే కాని ఒక అనాథ బాలిక హృదయ రక్తంతో ధారపోసిన దానం ఆ ఘోరమైన అరకూట దానం స్వీకరించడానికి ఈ జగత్తులో ఎవ్వరికున్నది హక్కు, ఎవ్వడికుంది అర్హత లోకరక్షణార్థం కాలకూటం తాగిన ఆ పరమ పావన మూర్తి శివమహాదేవుడికి 'ఆయన తేజోమూర్తి'కి తప్ప! ఆ మహాత్మ ఆ దుఃఖ దుర్దానం పుచ్చుకోవడానికి ఎంత ఏడ్చిందో కాకుంటే ఆయన తరవాత సభా సమక్షంలో కన్నీటి

తోను, గాద్గద్యంతోను "నేను నా ఆంధ్రదేశ సంచారంలో ఈ రీతిగా శ్రాద్ధకర్మ ఒకటి చేయవలసి వస్తుందని కలలోను అనుకోలేదు అని ఉద్రోశించినారు

ముళ్ళు తాను మిగుల్చుకొని రేకులన్నీ వలిచి మహాత్ముని పాద పూజ చేసి ధన్యమైన గులాబి పువ్వు నీవు సత్యవతీ! నీ జీవ కుసుమం ఇంక శ్రీకృష్ణుని వనమాలికలో చేరినది నీరేకులింక దేవతకు శిరోలంకారాలు నీకివే నమస్సులు

•

"మహాత్మా! ప్రత్యేక వ్యక్తులు ఎంతవాళ్ళయినా ఏమి ఇచ్చినా ఇళ్ళకు వెళ్ళేది లేదని నియమం పెట్టుకొంటిరే మీరే ఈ రీతిగా మొదటిలోనే నియమ భంగం చేస్తే ముందు సాగేదెట్లా? దారి పొడుగునా ఇటువంటి ఆహ్వానాలు వస్తూనే ఉంటాయి" అని సభ తరవాత సానునయంతో మహాత్ముణ్ణి మందలించి నాడు వేంకటప్పయ్య పంతులు "అయ్యా! ధనికురాలని కాదు ఆ బాలిక ఇంటికి వెళ్ళినది నగల మూటకోసమూ కాదు అనాథయని ఆర్తయని ఆపుకో లేక వెళ్ళినాను" అని పసిపిల్లవాడులా జాలితో క్షమాపణ వేడుకొన్నాడు ఆ కరుణా సముద్రుడు ఎవ్వరికయ్యా నియమాలు, ఎందుకయ్యా మనుషులకి దేవుళ్ళుగా మారడానికి అవన్నీ అంతే కానీ దేవుళ్ళకు అశృంఖలాల అవసర మెక్కడ

•

మహాత్ముని దర్శనంకోసం ఏలూరు గాంధీ విద్యాలయానికి అనేకులు శ్రీమంతులు వచ్చినారు, నిరుపేదలు వచ్చినారు, బ్రాహ్మణులు వచ్చినారు, మాలలు వచ్చినారు పెద్దలూ వచ్చినారు, పిన్నలూ వచ్చినారు కాని ఆ వచ్చిన అందరిలోను ఆయన ఆశ్రమునకు, ఆదరణనకు ఎక్కువ పాత్రమైనది ఒక మాల పంతులు వెంట వచ్చిన అంటరానివాళ్ళకు కూడా అంటరాని పాకీ బాల బాలికలు అమృతపు చూపులు వారికేసి పరికిస్తూ 'వీళ్ళే నాకు ప్రియులు" అన్నాడు ఆ దీన బాంధవుడు తేనెలూరే మాటలతో అందరి వద్ద కానుకలు స్వీకరించే ఆ యజ్ఞభోక్త ఆ దీన బాలురకు తన వద్ద ఉన్న పండ్ల కానుకలన్నీ దులిపి పంచి పెట్టి దరిద్రనారాయణ పూజ చేసి ధన్యుడైనట్లు సంతోషించినాడు

• •

వాయు దేవుడి బ్రాడ్ కాస్టింగ్ సర్వీసుద్వారా సత్యవతమ్మ ఆత్మ సమర్పణ కథ మొదలు, చివరా మట్టుకువిన్న ఒక భక్తుడు మరునటి ఉదయమే

మహాత్ముని రాకకు ముందుగా విద్యాలయంలో స్త్రీల ఎదుట ఆయన లీలా ప్రసంగం చేస్తూ సత్యవతి ఉపాఖ్యానం విలక్షణ శైలితో ఆ పోషణ చేసుకొంటూ తోచినట్లల్లా ఉపన్యసించినారు. ఆ దృశ్యానికి సాక్షిగాను ప్రసంగానికి శ్రోతగాను ఉన్న బందా విద్యాసాగర్ కాంతి లు, "మీరు ఆ రంగం చూడక పోయినా ఆ కథ వినక పోయినా అంతా చూసినట్లూ జరిగినట్లు వర్ణించినారు" అన్నాడు ఆశ్చర్యంతో రసోపాసకుడైన ఆ కథకుడు అనుకొన్నాడు తనలో సుందరం సత్యం ఒక్కటే గదా అందును బట్టి రససిద్ధుడైన వాల్మీకి సత్య సందర్శనుడై ముందుగానే రామ కావ్యం గానం చేసినాడనటంలో ఆశ్చర్యం లేదు ఆత్మగానానికి దేశకాలాలు అడ్డురావు కదా" 'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః'

•

సొగసైన సన్మానపత్రాలు అందమైన చిత్రాలలో అమర్చి సమర్పించినారు మహాత్మునికి అన్నిచోట్లా ధర్మాజీగూడెం సభలో "ఈ అందమైన ఫ్రేములతో అలంకరించడానికి ఇల్లెక్కడిది? నేను దరిద్రనారాయణుల ప్రతినిధిని మీరే వేలంవేసి డబ్బు ఇవ్వండి దరిద్రనారాయణులకోసం వినియోగిస్తాను" అన్నాడు అనికేతనుడైన ఆ విశ్వమందిరుడు

• • •

పండువెన్నెల నిండుసభ అఖండ (విదేశీవస్త్ర) జ్యోతి ఆకొండ సాధ్వీమతల్లి ఆ జపదండకం గుండుసూది జారినా వినబడు ప్రశాంతి, ఆ గుండుగొలను రంగం నిజంగా కన్నులపండుగే ఆ శాంతాత్మే ఆ వాయుదీపాల వెలుగున నాటి సభలో వెల్లివిరిసిన నిభృతశాంతిని చూసి మోహితమై ధన్యవాదాలర్పించింది "ఓం నమశ్శాంతాయ తేజసే' అని

శాంతివననం చీల్చుకొంటూ చరఖాయోగి ప్రసన్న వదనంనుంచి "ఖద్దరు పెహెనో" అనే పల్లవి చల్లగా వెలువడసాగిందో లేదో ఒక కుయ్యి వినబడింది 'అయ్యా ఖద్దరుప్రియం, కట్టలేము' అని తోడనే గంభీరవాణితో 'ఖద్దరులో మంగళభాష ఉండటంచే ఎంత ప్రియమైనా ప్రియంకాదు విలాయితీ గుడ్డలో అమాంగల్యముండుటచే యెంత చౌకైనా చౌకకాదు" అని ఆత్మగౌరవగీతం గర్జించింది గాంధీ సింహం !

మాట బిరుసు నిలువెల్ల బిరుసు ఆ కారు సాహుకారు పులవర్తి లక్ష్మణస్వామి కాని ఆ హృదయంలో ఎంత మార్దవం ! ఎంత మాధుర్యం ! ఎంత భక్తి ! హోరాహోరిగా పోరాడి తీసుకువెళ్ళినాడు తనఊరికి ఇష్టదేవుణ్ణి 'యథాశక్తి తుభ్యం నమః' అని రూ 1116లు ధారపోసి అంతతో ధన్యుడు

కావాలసి కొంటున్నాడు కాని అబ్బో ఆ వచ్చిన జగజ్జెట్టి మటుకు ట్యూబ్‌లో శెట్టికాడు బేరాలపై బేరాలు సారాలపై సారాలు చలోక్తులపై చలోక్తులు వాడి రొక్కంగా రొక్కంగా లాగినాడు మహాత్ముని ఒక వెండి, బంగారు పదార్థాలు, సువర్ణాలంకారాలు, ...

• •

మహాత్ముని స్వాగతోత్సవం అన్నిచోట్ల ఒకఎత్తు, భీమవరంలో ఒక ఎత్తు వెంకటేశవద్దనుంచి సభామంటపంవరకు ఒకే పంక్తిగా తోరణాలు, జెండాలు అలంకారాలు ఆ రేయి భీమవరం నిజంగా కలియుగ వైకుంఠమే ఆ విశాల మైదానం అలలు చల్లారిన జనసముద్రం ఊపిరి కూడా స్తంభించిన గంభీర నిశ్శబ్దం! ఎంత శిక్షణ! ఎంత నిగ్రహం! ఈ తూరి భీమవరం రెండో బార్డోలి కావడానికి మహాత్ముని సన్నిధిని ప్రథమ పరీక్షలో ఉత్తీర్ణమైనదనడానికి సందేహం లేదు కాని ఆ ఉన్నత సింహాసనం మహాత్ముడింకా అధిష్ఠించనే లేదే! ఆ మోహన ముఖచంద్ర సందర్శనానికి రెప్పలు విప్పుకొని తదేక దృష్టితో చూస్తున్నవి ఆ 60 వేల కళ్ళూనూ ఏవో గుసగుసలు వద్దని, అవునని ఒరి వారంలో అబ్బా! ఎంత సేపు ఈ జాప్యం కాని అడుగో మహాత్ముడు మోటారులో నుంచి మేక పిల్లలాగే గంతు వేసినాడు సింహాసనం మీగి చిరునవ్వు వెన్నెల వెదజల్లుతూ సుధర్మయందు ఇంద్రుడు లాగే ఏర్పాటు తీర్చినాడు ఒక భక్తుడు సమర్పించిన తన పటం వేలానికి పెట్టినాడు మీ మహాత్ముని విలువ ఇప్పుడు తేలవలెనన్నాడు తొలి పాట 100 రూపాయలు "అయ్యో! సిగ్గు! సిగ్గు! ఇంతేనా మీ మహాత్ముని విలువ ఒక్క 100 రూపాయలేనా ఇంతేనా నా విలువ సిగ్గు సిగ్గు' తన్ను గురించి తాను చలోక్తులాడినారు శ్రీకృష్ణతులాభారం ఎదుర్కులకు జ్ఞప్తికి తెచ్చి భగవంతుడిక్కడ స్వయంగా అమ్ముడు పోతున్నాడు భలే మంచి బేరం, కొనండి ధన్యులు కండి! అని హెచ్చరించినాడు ఒక భక్తుడు 116 రూపాయలన్నారు యింకొకరు "సరే ఒకసారి రెండు సార్లు, మూడు సార్లు" అని ఈ ప్రయాణంలో నేర్చుకున్న ఈ మూడు తెలుగు ముక్కలు ఆ ముద్దుల బోసి నోటితో ఉచ్చరిస్తూ పాట కొట్టి వేసినాడు లీలా మానుష విగ్రహుడు

• •

ధన్యమైనది దాట్ల నీల మేఘం కూడబెట్టింది జీవితమంతా ఒక్క కాసైనా వీసర పోకుండా, చిక్కబట్టింది ఇంతదాకా ఒక్క క్షణమైనా జారి పోకుండా, దిబ్బాటుగా ఒక్కమాటు అభిషేకం చేసింది, సాక్షాత్తు మహాదేవుణ్ణి రూపాయల వర్షంతో లోకంలో దాతలు ఉన్నారు దానాలు జరుగుతున్నాయి కానీ మీలాగు ఇంత ఉత్తమ పాత్ర దానం చేయడానికి పెట్టి

పుట్టిన పుణ్యాత్ములు కడు అరుదు సుమా ఓ నీలాద్రి రాజా ఇది నీ అదృష్టము

•

'మహాత్మాగాంధీ నేడిక్కడకు ... గారి ఇంగలేదు ఎగుడు దిగుడు కాలు వెళ్ళడం కష్టం' అని అనలేక ఉన్నారు అనుచరవర్గం అసంతలో వెంటనే "జీవిత మార్గమే ఎగుడు దిగుడు ... మెట్టగా ... నడిచి రాగలను" అంటూ గాంధీజీ మోటారు కారు నుంచి ఉరికి పాదరక్షలతో ... నడిచినాడు 68 ఏండ్లు చెల్లిన ఆ వృద్ధ తపస్వి- నెరియల్లోన, బురదలోన, ... లను దాటుతూ, ... లేస్తూ

సభ ప్రారంభమైంది ఇంతలోనే కలకలం 'పాము పాము' 'కొట్టకండి, 'కొట్టకండి' ఎవరూ కొట్ట సాహసించలేదు ఆ అభినవ ప్రియదర్శి ఎన్నిధిని "మీ అహింసా సందేశం వినవచ్చింది-మహాత్మాజీ' అని ఒక భక్తుడు, 'ఆహా వాహ్' అని మహాశ్చర్యపడు

•

ఆ భవనం ఎంత విశాలమో ఆ గృహమేధి విశాలమనసు ఆ అతిథి పూజ ఇప్పటి పాశ్చాత్య మానస పుత్రులకు వెర్రి చేదస్తము కాని తరతరాలుగా ఉగ్గుపాలతో 'అతిథిదేవోభవ' అని వైదిక శిక్షణలో పెరిగిన ఈ ఆర్యావర్తంలో కాక భూలోకంలో మరెక్కడ సాధ్యమవుతుంది ఇంట్లో పెండ్లిలాగే చేసినాడు ఎట్టమిల్లి రామనాథం తణుకులో గాంధీ సమారాధనము కొత్త ఆవకాయి, దోసవూరగాయి, గోంగూర పచ్చడి, బోయగా గూనలతో పెట్టించినాడు తంతి ఇచ్చి ఎక్కడో కన్యాకుమారి ప్రాంతం నుంచి పెద్ద కొడుకును రప్పించినాడు అశేష బంధు మిత్రుల్ని ఆనందంతో ఆహ్వానించాడు ఈ వైభవంలో పాల్గొనటానికి మహాత్ముని ఉనికిచే ఆనాడు ఆ ఇల్లు జగన్నాథాలయంగా మారింది సర్వవర్ణ భోజనం మొందుగా వేంకటప్పయ్య పంతులే తయారు ఇంక ఇతరుల లెక్కఏమిటి ఆమహా సమారాధనలో ఎవ్వరు బ్రాహ్మణుడు, ఎవరు శూద్రుడు, ఎవరు తురక-అంతా గాంధీస్వరూపము ఆ శ్రోత్రియ దుర్గంలో ఆ వృద్ధగంగా భాగీరథులు పళ్ళాలు పట్టుకొని హర్షంతో కూరా, అన్నాలు వడ్డించడం చూస్తే నవ్య భారత చిహ్నాలు అప్పుడే అవతరిస్తున్నట్లు గోచరించింది ఆ ఘట్టాన జరిగిన అపూర్వ భరద్వాజుని విందు ఈ జన్మలో మరపురాదు అన్నీ మరచిన ఆర్యసంతతి అన్నపూర్ణను మట్టుకు మరపలేదు, మరపురాదు

... • ..

"మహాత్మా ఇది నేను స్వయంగా నేసినాను తాము స్వయంగా వాడు

కోవలె ఎవ్వరికి ఇవ్వరాదు' అని ఖచ్చితమైన షరతుతో విధించి ఒక సొగ
సైన, ప్రియమైన ఇంష ఖాదీని ఆ కౌపీనప్రియుని చేతిలో పెట్టినాడు మాల
పిల్లకాయ చిగురుపాటి భీమయ్య చాగల్లు నికేతనంలో ఆ నేతపని ఎవరూ
వాడుకోరాదా, నేచనిపోతే నాతోనే తగులబెట్టవలెనా, లేక మళ్లీ నీకు
కావలెనా" అని వాత్సల్యంతో పరిహాసాలాడుతూ మహాప్రసాదమని కళ్ళకద్దు
కొన్నాడు, భక్తితో ఇచ్చిన నూలుపోగు చంద్రుడు గ్రహించినట్లే

... .. .

ఇది 'గోపాల క్షేత్రము పూర్వం గౌతమాది మహాత్ముల ఆశ్రమ
స్థానం. ఇక్కడ అఖండగౌతమీ స్నానం చేయడం బాగు మహాత్మాజీ" అని
సభక్తికంగా, సప్రియంగా విన్నవించుకొన్నాడు ఒక తీర్థవాసుడు "నాకు
కావలసింది ఖద్దరునదీ స్నానం, అందరూ నా ఖద్దరు తీర్థంలో ఓలలాడండి
అందాక ఈ దరిద్రనారాయణులకు ముక్తిలేదు" అన్నాడు ఆ తీర్థకారుడు

. ..

మండలంలో మహాత్ముని విజయ భిక్షా యాత్ర ముగిసింది శివగణా
లొక్కొక్కటే వదలలేక, వలదలేక తమ స్వామివద్ద తమ దేవునివద్ద కష్టంతో
సెలవు పుచ్చుకొన్నాయి ఒక ప్రమథునితో అన్నాడు హృదయంచీల్చే
చూపులతో "అణకువ నేర్చుకో, అహం చంపుకో, దేశసేవకు దారికొద్ది ప్రానులు
కాని పెద్దవికాదు" ఎంత అమూల్యమైన హితోపదేశం మొత్తంమీద దేశసేవా
పరాయణులందరికీ ఇది!

మైల్ బండి, 3వ క్లాసు పెట్టె, మురికి ఇరకాటం, నిలబడినాడు మహా
త్ముడు, స్వీకృత సర్వదరిద్రలోకశోకుడు, వశీకృత విశ్వభారత హృదయుడు,
నిఖిలభూత చేతోమయుడు, శ్రీ శుకయోగి సదృశుడు, గాంధీభగవానుడు
గింగురుమంటున్నాయి చెవులు చుట్టూముసురుకొన్న జనుల జయజయ
ధ్వనులతో ప్రతినిత్యం లక్షలాది భక్తిపూర్వకరాంగుళులు తనకు కానట్లు
పరిగ్రహించే ఆ పరమపురుషుడు ఒక్కమారు వినీతుడై నిమీలితనేత్రుడై
కరకమలాలు ముకుళించి అణువుకంటె అణువై "ఓమ్ నమో నారాయణాయ"
అంటూ తనచుట్టూ సహస్రశీర్షుడై, సహస్రాక్షుడై, సహస్రపాదుడై అవతరించి
ఇష్టదైవాన్ని మానసికోపాసనచేస్తూ భక్తిరసామృత సింధుగర్భంలో మునకలు
వేస్తూ మహాసమాధి నిమగ్నుడైనాడు

ఓహో! మహాత్ముని ఇన్ని సుందరాకృతులు చూసి ముగ్ధుడనైనాను
కాని ఇట్లాంటి నిర్భర దివ్య సౌందర్యరూపం ఎన్నడూ ఎక్కడా చూడలేదు
వర్చస్వంతమైన ఆ విశాలఫాల పట్టికపై "దేహబుద్ధ్యాస్మి దాసోహం జీవ బుద్ధ్యా

త్వదంశకం ఆత్మ బుద్ధ్యాత్వమేవాహం 'అన్న పూర్ణసత్యం యొక్క వివిధకళలు ద్రుత గతితో ప్రజ్వలించి అన్నిట్లయింది "ధనోస్యస్మి! మోహన్‌దాస్ ధనోస్యస్మి" అనుకొంటూండగా రైలు రాజమండ్రి ప్లాటుఫారం మీద కదలింది ఆ మంగళ మోహన్ దాస్ స్వరూపం ఇంకా అల్లే ఆంజనేయ ప్రతిమ మాదిరి నిలబడి ఉండగానే రైలు ఈల వేసుకొంటూ పరుగెత్తి మరుగు చేసింది

"ప్రభూ! నీ పాదకమలంబు నెమ్మిడగ్గరగాని తరలి పోవంగ పాదాలు రావు" ఈ స్వల్పకాలంలో "మామనంబులెల్ల మరపి దొంగిలి తెట్లు బ్రతుకు వారమేలాగు మేలాగు, ఏమి చేయువారమిక మహాత్మా అని శ్రీకృష్ణు డంతర్ధానమైన తరవాత గోపికలనుభవించిన అవస్థలనుభవిస్తూ ఆ అమృత మూర్తిని హృదయ పేటికలో బంధించుకొని ధ్యానించుకొంటూ విధి లేక మళ్ళలేక అంతలో వెనక్కి మళ్ళినాను

"స్థానే హృషీకేశ! తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్య త్యను రజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే సమస్యంతి చ సిద్ధ సంఘాః
కస్మాచ్చ తేన సమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణో ప్యాది కర్త్రే"

మహాత్మా నీవు నరుడవు కాని విశ్వరూపుడవు నీ రూపం భూమి అంతా నిండినది పైగా 10 అంగుళాలు మిగిలినది "అత్యతిష్ఠ ద్దశాంగులమ్" అజ్ఞులు నిన్ను మానవ మాత్రునిగా గ్రహిస్తారు కాని తత్త్వజ్ఞులు అసామాన్యుడ వైన మాహాత్ముడ వంటారు నివు కేవలం గాంధీవి కావు సమస్తభూత చేతో మయ మూర్తివి, సమవర్తివి, అణువులోను, మహత్తునందు, పుణ్యునందు, పాపి యందు, శునియందు శ్వపాకునియందు సర్వసమంగా అలుముకొని ఉన్నావు నీకంటే మాకితర దైవాలెందుకు, ఇతర లక్ష్యాలెందుకు, ఇతర ప్రేమలెందుకు, ఇతర వాంఛలెందుకు, ముమ్మాటికి మేము నిన్నే వరిస్తాం, నిన్నే స్మరిస్తాం నిన్నే కీర్తిస్తాం అవును నీ కీర్తంటే జగత్తుకు ఆనందము నీ కీర్తంటే జగత్తు కనురాగము రాక్షసులు నిన్నుగని భీతిల్లి దిగ్దిగంతాలకు పారి పోతున్నారు దేవతలు, సిద్ధులు నీకు జోహార్లు చేస్తున్నారు ఎందుకు మ్రొక్కరు-మహాత్మా నీకు! ఆది కర్త అయిన బ్రహ్మకంటె కూడా అధికుడవు - ఎందుకు మ్రొక్కరు నీకు "కస్మాచ్చతేన నమేరన్ మహాత్మన్"

## ఖద్దరునిధి వసూళ్ళు

### పశ్చిమ గోదావరి

(9-5-1929, యంగ్ ఇండియా)

| | | రూ అ పై |
|---|---|---|
| 24-4-1929 | పోతునూరు | 1809-10-0 |
| | (లాలా జీ నిధి 78 రూ ) | |
| | దోసపాడు | 50-0 0 |
| | కొవ్వలి | 1077-13-1 |
| | పాలెగూడెం | 50-0-0 |
| | దెందులూరు | 751-10-0 |
| | గుండుగొలను | 1173-0-9 |
| 25-4-29 | కోలమూరు | 128-0-0 |
| | అర్ధవరం | 116-0-0 |
| | గణపవరం | 401-0-0 |
| | సిరిపల్లి | 18-0-0 |
| | జవ్వనపల్లి | 51-0-0 |
| | నిడమర్రు | 15-0-0 |
| | కొత్తపల్లి | 25-0-0 |
| | చెరుకుగదేశాగ్రహారం | 100-0-0 |
| | తాడేపల్లిగూడెం | 1924-4-0 |
| | మందలపర్రు | 116-0-0 |
| | పాందువ్వ | 162-0-0 |
| | (లాలాజీ నిధి 20 రూ ) | |
| | పిప్పర | 201-6-1 |
| | పోలమూరు | 116-0-0 |
| | భీమవరం | 2567-0-6 |
| | వీరవాసరం | 116-1-0 |
| | ఉండి | 329-0-0 |
| | ఆకివీడు | 1888-13-4 |

| | | |
|---|---|---|
| 26-4-29 | పెనుమంత్ర | 3319-6-6 |
| | ఆంమూరు | 110-0-0 |
| | వెలగలేరు | 310-0-0 |
| | కండూరు | 248-8-1 |
| | జిన్నూరు | 127-0-6 |
| | బ్రాండీపేట (పాలకొల్లు) | 240-8-0 |
| | బ్రాడీపేట (పాలకొల్లు) | 67-4-0 |
| | తోవలో | 7-0-0 |
| | మట్లపాలెం (లాలాజీ నిధి రూ 100) | 2,103-4-9 |
| | యలమంచిలి | 152-0-3 |
| | గుమ్ములూరు | 77-0-0 |
| | నర్సాపూరు (బార్ అసోసియేషన్) | 116-0-0 |
| | పాలకొల్లు | 2459-3-0 |
| | పండితవెల్లూరు | 61-0-0 |
| 27-4-1929 | ఆచంట (లాలాజీ నిధి రూ 50) | 1118-5-8½ |
| | దేవ | 179-0-0 |
| | పెనుమంచిలి | 42-9-0 |
| | కొడమంచిలి | 63-0-0 |
| | ఆచంటవేమవరం | 90-0-0 |
| | పెనుగొండ | 505-0-0 |
| | ఏలేటిపాడు | 459-5-4 |
| | తణుకు (లాలాజీ నిధి రూ 3) | 1577-4-8½ |
| | దువ్వ | 282-0-0 |

| | | |
|---|---|---|
| | తాడిపర్రు | 40-0-0 |
| | వద్దూరు | 116-0-0 |
| | తేతలి | 35-8-0 |
| | బ్రాహ్మణగూడెం | 116 0-0 |
| | నిడుదవోలు | 251-0-0 |
| | నేలటూరు | 81-0-0 |
| 28-4-1929 | చాగల్లు | 397-15-6 |
| | దేవరపల్లి | 506-5-1 |
| | దుమ్మేరు | 500-0-0 |
| | కొవ్వూరు | 943-13-6 |
| | (రూ 310 లాలాజీ నిధి) | |
| | ఇసుకపల్లి పైగోడి | 4-11-3 |
| | తోవలో | 5-2-0 |
| | (తూర్పు కృష్ణా తర్వాతి వసూళ్లు) | 20-0-0 |
| | తూర్పు గోదావరి | 90-3-5 |
| | (తోవలో వసూళ్లు) | |

## ఆంధ్ర దేశంలో (యం కె గాంధీ)

నా ఆంధ్ర దేశ సంచారంలో రెండో వారంలో వసూలైన ఖద్దరు నిధిని గురించి మరొక చోట ప్రచురించినాను నేను అంత కంత కెక్కువగా తెలుగు దేశ గ్రామాలను చూస్తూన్న కొద్దీ తిరిగిన ఊరే తిరుగుతూన్నట్లు కనిపించింది నేను గ్రామాలను చూస్తూనే ఉన్నాను కాని ప్రజలు చుట్టూ ఊరికే మూగడం మూలాన వాటిని సరిగా గ్రహించ లేకుండా పోతున్నాను సొమ్ము బాగానే వసూలవుతున్న మాట నిజమే కాని సొమ్ము వసూళ్ళే చేసుకొంటూ గ్రామాల అనుభవాన్ని గురించి తెలుసుకోక పోవటం మంచిదిగా తోచటం లేదు అయితే నా ఏడు వారాల సంచారంలో సాధ్యమయినన్ని ఎక్కువ గ్రామాలుచూసి నా ఖద్దరు సందేశం ఎక్కువ మందికి అందచేయడానికి, నా పర్యటన ఆర్థికంగా విజయవంతం చేయడానికి అత్యంత శ్రద్ధా భక్తులతో శరీర శ్రమకు ఓర్చి కృషి చేస్తూన్న నా సహచర కార్యకర్తల నిర్ణయం గురించి నేనిప్పుడు సణగుకో వటం అవివేకంగా ఉంటుంది నేను గ్రామాల్లో ఇచ్చిన ఉపన్యాసాలలో కీ శే సర్ సురేంద్రనాథ్ బెనర్జీని అనుకరిస్తున్నాను ఆయన 1890 లో ఇంగ్లండ్‌కు పోయినప్పుడు అన్ని చోట్లా ఒకే మోస్తరు ఉపన్యాసం ఇచ్చినారు 'ఎందు

వల్ల అట్లా చేసినారు' అని అడిగితే 'అందరికీ నేను ఇవ్వగలిగినంత అత్యుత్తమ మైన ఉపన్యాసము నీయదలచు కొన్నాను కనక కొందరికి అంతకంటె తక్కువ ఉపన్యాసమీయదలచుకో లేదు గనక' అన్నాడు కాబట్టి నేను గ్రామస్థులకు ఇచ్చిన సందేశమంతా ఒక్కటే మోస్తరుగా ఉన్నది

1 విదేశీ వస్త్ర బహిష్కరణ
2 మీ గ్రామాలలో తయారైన ఖాదీనే ధరించండి
3 అస్పృశ్యతను తొలగించండి
4 హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు మొదలయిన వివిధ మతస్థులలో ఐకమత్యం పెంపొందించండి
5 తాగుబోతుతనం మాన్పించండి గ్రామపెద్దలు తాగుబోతుల దగ్గరికి పోయి తాగుడు మానవలెనని బోధించవలె
6 అంతఃకలహాలు పెట్టుకోకండి ఒక వేళ అటువంటివి వస్తే గ్రామ పంచాయతీల ద్వారా స్వయంగా పరిష్కరించుకోండి

రాజకీయ వేత్తలు గల పెద్ద కేంద్రాలలో మాత్రమే నేను చర్చలలోకి దిగి ఇతర విషయాలను గురించి ముచ్చటిస్తున్నాను

అందువల్ల మచిలీపట్టణంలో అనేక వివాదగ్రస్త విషయాలు గురించి నా సన్మాన పత్రాలలోని విషయాలను గురించి కూడా చర్చించ వలసిన అవ సరం కలిగింది అయితే నా సన్మాన పత్రాలలో అధిక సంఖ్యాకాలు నన్ను గురించిన స్తుతి పూర్వక విశేషణాలతో మాత్రమే నిండి ఉంటున్నవి అటు వంటి పొగడ్త ఆ సన్మాన పత్రాలు చదివిన వారికి మేలు చేయదు సరిగదా అందులోని విషయాలన్నీ వాటిని స్వీకరించిన వారు నిజమని నమ్మినట్లయితే వారికి కీడు చేయటానికి కూడా అవకాశమన్నది కాబట్టి నన్ను స్తుతించే వారందరు వారి సన్మాన పత్రాలలో అతిశయోక్తులను మానవలెనని మంద లిస్తున్నాను ఒక మనిషిలో పొగడదగిన సుగుణం ఉన్నదని మరొక మనిషి నమ్మినట్లయితే ఆ సుగుణాన్ని అతడు అనుసరించడమే నిజమయిన స్తుతి అని నేను వారికి నచ్చ చెప్పినాను ఆంధ్ర కార్యకర్తలు చాలా వరకు ఈ విషయం గుర్తించినారు ఈ సూచన వారు తక్షణం గ్రహించినారు. అందు వల్లనే గుంటూరు జిల్లాలోని సన్మాన పత్రాలు నిరాడంబరంగా ఉన్నాయి వారింకొక అడుగు ముందు వేయవలె ఏమంటే వారి సన్మాన పత్రాలలో కింది వివరాలు తెలియచేయవలె ప్రతి గ్రామంలోని స్త్రీ పురుషుల సంఖ్యగాని లేదా వారి సన్మాన పత్రానికి సంబంధించిన స్త్రీ పురుషుల సంఖ్యగాని చూప వలె అస్పృశ్యులసంఖ్య, వారిస్థితి, కాంగ్రెస్ సభ్యుల సంఖ్య, (స్త్రీలు పురుషులు వివరంగా) తాగుడుకు అలవాటయినవారి సంఖ్య, నూలు వడికే వారి సంఖ్య, వారు పనిచేసే గంటలు, అక్కడ ప్రత్తి పండేటట్లయితే దాని పరి మాణం, వడికేవారు తమ ఏకులు తామే చేసుకుంటారా, వడుకు నూలు మాత్రమే నేసే మగ్గాల సంఖ్య, వడుకు నూలు, మిల్లు నూలూ కూడా నేసే

మగ్గాల సంఖ్య, మిల్లు నూలును మాత్రమే నేసే మగ్గాల సంఖ్య, నెలలో ఉత్పత్తి అయిన ఖాదీ తూకం, ఖాదీ ఉత్పత్తిలోని ఆయా పనులకు చెల్లించే మజ్జూరీలు, జాతీయ పాఠశాలల సంఖ్య-వాటిలో హాజరయ్యే పిల్లల సంఖ్య, జాతీయ దృక్పథం నుంచి ఉపయోగకరమైన ఇతర ఫోటోగ్రాఫ్ కాంగ్రెస్ కార్యకర్తలు ఈ విషయం గురించిన వివరాలు ఇచ్చినట్లయితే దానినొక నిధిగా స్వీకరించి ఉంచుకోగలను అది నాకు విలువగలిగిన విషయజ్ఞాన ప్రాతిపదికగా ఉంటుంది

ఇక ఇంతకు పూర్వం ఉదహరించినట్లు మచిలీపట్టణంలో నాకిచ్చిన సన్మాన పత్రం గురించి అతి సంగ్రహంగా వివరిస్తాను ఆ సన్మాన పత్రం జలియన్‌వాలాబాగ్ రోజున ఇచ్చినారు

## విశ్వాసం కోల్పోకండి
(ఆంధ్ర జాతీయ కళాశాలలో)

ముఖ్యంగా ఈ పవిత్రమైన జాతీయ సంస్థ ఆవరణలో మీతోగల నా పూర్వ పరిచయం పునరుద్ధరించుకొంటున్నందుకు నాకుచాలా సంతోషంగా ఉన్నది అయితే, ఆ ఆనందంలో విచారమూ, బాధ కూడా లేకపోలేదు ఈ జాతీయ కళాశాలకు మూలపురుషుడు ఆత్మఅయిన హనుమంతరావుగారి చిర పరిచిత స్వరూపము నా ఎదుట లేకపోవడమే నాకు కలుగుతున్న విచారానికి కారణము ఈ సంస్థను గురించి నా హృదయంలో మెదలుతున్న ఆలోచనలను బయటపెట్టి నా హృదయభారం తీర్చుకొన్న తరవాతనే ఈ సన్మానపత్రంలోని ఇతర విషయాలను గురించి నేను ప్రస్తావించగలను ప్రస్తుతస్థితిలో ఈ సంస్థ అంతఃకలహాలతో ఉన్నదన్న సంగతి బహిరంగ రహస్యం అందువలన మీ కోసం హనుమంతరావు విడిచివెళ్ళిన ఈ ఉత్తమ సంస్థ అపాయస్థితిలోపడి సముద్రంలో కలిసిపోవనున్నది ఈ సంస్థ భవితవ్యానికి బాధ్యులైన అందరికి నేనిప్పుడొక్క సలహా ఇవ్వదలచుకొన్నాను ఎన్ని కష్టాలు వచ్చినప్పటికీ అకలంకమయిన దాని జాతీయ స్వభావం నిలబెట్టవలెనని నా కోరిక మనం ప్రేమిస్తున్న మన మాతృభూమిని ఆవరించి ఉన్న ప్రస్తుతస్థితిలో ఈ సంస్థ ఎడారిలోని సస్య శ్యామల క్షేత్రాలలో ఒకటిగా భారతదేశంలోని నా పర్యటనలలో సగర్వంగా పేర్కొంటూ వచ్చినాను ఈ సందిగ్ధ సమయంలో మీరు ఆత్మవిశ్వాసం కోల్పో కూడదు అన్ని పరిస్థితులు బాగాఉన్నప్పుడు విశ్వాసం కలిగిఉండటంలో విలువ లేదు అత్యంత క్లిష్టపరిస్థితుల్లో ఆత్మవిశ్వాసం కోల్పోకుండా ఉండటంలోనే విలువఉంది ప్రపంచమంతా నిందించినప్పటికి మీ విశ్వాసం నిశ్చలంగా ఉండక పోతే అది పట్టిసున్నంవేసిన సమాధివంటిది కాబట్టి ఈ సంస్థ విజయం ఇక్కడి చేరే పిల్లలసంఖ్యనుబట్టి తూకం వేయకండి ఈ జాతీయసంస్థ భవితవ్యం గుణం మీద ఆధారపడి ఉన్నదికాని సంఖ్యమీద ఆధారపడిలేదు మీకు ఆత్మవిశ్వాసం ఉన్నట్లయితే ఈ సంస్థలో ఒక్క పిల్లవాడు చేరినప్పటికి వానికి బోధించ

టంతో మీరు సంతృప్తిపడవచ్చు ఒక వేయిమంది పిల్లలు చేరడానికి సంసిద్ధంగా ఉన్నప్పటికీకూడా మీరు మీ స్వరూపంను ప్రభుత్వ విశ్వవిద్యాలయ సంయోగం మీరు అంగీకరి స్తే తప్ప మార్చుకోకూడదు

## విదేశీ వస్త్ర దహనం

మీరు నాకు సమర్పించిన సన్మాన పత్రాలకు, విరాళాలకు నేను కృతజ్ఞుడను ఈ సన్మాన పత్రాలన్నిటికీ వివరంగా సమాధానం చెప్పటానికి నాకు వ్యవధి చాలా తక్కువగా ఉన్నది కాని రెండు సన్మాన పత్రాలకు మాత్రం నేను సమాధానం చెప్పవలసి ఉంది ఒకటి బందరు తాలూకాబోర్డు, రెండవది బందరు మునిసిపాలిటీవారి సన్మాన పత్రాలలో కొంత విమర్శ చేసినారు అందువల్ల వాటికి విలువ ఇస్తున్నాను నాకు విమర్శవల్ల ప్రయోజనం కలదుగాని పొగడ్తవల్లకాదు ఈ సన్మాన పత్రాలలో విదేశీ వస్త్ర దహనం గురించి విమర్శ ఉన్నది వారి విమర్శ మౌలికమయినది కాదు, కొత్తదీగాదు ఆ సన్మాన పత్రాలలోని విమర్శ నాముఖ్య స్నేహితులలో కొందరిదివరకు చేసినదే ఈ అభ్యంతరాలను గురించి నేను జాగ్రత్తగా ఆలోచించిన తరవాత కూడా ఈ విషయంలో నా అభిప్రాయాలను మార్చుకొనేటందుకు తగిన అవసరం కనబడడంలేదు మనవాళ్ళు విదేశీ వస్త్రాలను విడిచి వాటిని అగ్నికి ఆహుతి చేయడం పవిత్ర ధర్మమని నా అభిప్రాయము అంతేకాదు విదేశీ వస్త్రాలను దహించటం అహింసా సిద్ధాంతానికి ప్రతికూలం కాకపోవటమే గాక అహింసా సిద్ధాంతం సరిఅయిన దృక్పథంలో అర్థంచేసుకోవడమే అవుతుంది ఒక ముఖ్య విషయం మనం జ్ఞాపకం పెట్టుకోవలె ఏమంటే విదేశీ బట్టల యజమానిదే బుద్ధిపూర్వకంగా తన బట్టలను తగులబెట్టవలెనని మనం కోరుతున్నాము నా బట్టల్లో దేనికైనా ప్లేగు క్రిములు ఉన్నట్లయితే దానిని తగులబెట్టడం నావిధి నేను దక్షిణ ఆఫ్రికాలో ఉన్నప్పుడు ఒక అంగడిని (14 వేల పౌనుల విలువగల దానిని) ప్లేగు క్రిములు ఉన్నవనే అనుమానంతో జోహాన్స్ బర్గ్ మున్సిపాలిటీ వారు పూర్తిగా దగ్ధం చేసినారు జోహాన్స్‌బర్గ్ మునిసిపాలిటీవారు చేసిన ఈ చర్యకు నేను అభినందించినాను అంతేగాదు, అట్లా వారు చేసినందువల్ల ఘోరమైన ఆ ప్లేగు వ్యాధి నుంచి జోహాన్స్‌బర్గ్‌ను రక్షించిన వారయినారు వైష్ణవ మతస్థునిగా నా జీవితంలోను, నా స్నేహితుల జీవితాలలోను కొన్ని అనుభవాలను మీకు చెప్పగలను అతి రుచ్యాలయిన పదార్థాలు వైష్ణవాచారాలనుబట్టి మైలపడటంచేత మావారు వాటిని మురుగు గుంటలో పారవేసిన తార్కాణాలు అనేకాలు ఉన్నాయి ఇక విదేశీ బట్టల విషయంలో- అవి భారతదేశ క్షేమానికి సంబంధించినంతవరకు రాజకీయంగా, ఆర్థికంగా, నైతికంగా హానికరాలయిన క్రిములతో ఆవృతములై అత్యంత కళంకితాలై నవని నా అభిప్రాయము మీ మచిలీపట్టణ పౌరులు మీ ఓడరేవుకు విదేశీబట్ట వచ్చి మీ పట్టణ వాణిజ్యాభివృద్ధిని, నిరుపమానమయిన మీ కళా నైపుణ్యంను ఎట్లా

ధ్వంసం చేసినదో నాకిప్పుడు జ్ఞాపకం చేయనక్కరలేదు మనము రాట్నం విడిచిపెట్టి భారత దేశపు ఆర్థిక స్వాతంత్ర్యం విదేశీ బట్టకు కుదువ బెట్టిన నాడే భారత జాతి పట్ల మనము గొప్ప అపరాధం చేసినామని నా అభిప్రాయము ఈ రోజున మనం మన స్తబ్ధతవల్ల కూడా ఆ అపరాధం కొనసాగిస్తున్నాము భారత దేశాన్ని ఇప్పుడు ఆ స్తబ్ధతనుంచి మేల్కొల్పడం నా పరమ ధర్మంగా భావిస్తున్నాను విదేశీ బట్టల కోసం ఇతర దేశాలకు పంపుతూన్న 60 కోట్ల రూపాయలు మన దేశంలో ఆకలితో అల్లాడుతున్న ప్రజలకు చెందేటట్లు చేయగలిగినట్లయితే వారు ఉపవాసం చేయవలసిన అవసరం లేదని తెలుసుకోనే టందుకు మీకు అంతగా అర్థశాస్త్ర జ్ఞానమక్కరలేదు అంతేకాదు మనకు కావలసిన బట్టను మన దేశంలోనే తయారు చేసుకుంటే విదేశాలకు పోయే 60 కోట్ల రూపాయలను పోకుండా ఆపగలమని తెలుసుకోనేటందుకు కూడా మీకు గణిత శాస్త్రంలో పాండిత్యమక్కరలేదు ఈ పని మనం 100 ఏళ్ళ క్రితమే చేస్తుండేవాళ్ళం శక్తిమంతులైన కోట్లాది స్త్రీ పురుషుల చేతులలో మనకు కావలసినంత శక్తి సిద్ధంగా ఉన్నది ఆశక్తి ఈనాడు భారతదేశంలోని పూరి గుడిశెలలో పనిలేక తుప్పుపట్టి పోతున్నది ఇండియాలోని యేడు లక్షల గ్రామాలలోని కుటీరాలలో పనిలేని కోట్ల కొద్దీ జనుల చేతులు కోట్లాది కదుళ్ళ పైన ఎందుకు పనిచేయరాదో నాకు తోచడం లేదు ఇంగ్లడ్ దేశంలో ప త్తి పండదు కాని ఇండియాలో పండిన ప త్తిని ఇండియా నుంచి లాంక్ షైర్ మిల్లులలోకి తీసుకొనిపోయి దానిని బట్టల రూపంలో తయారుచేసి మనకు తిరిగి పంప గలుగుతున్నది అటువంటప్పుడు మన దేశంలో పండే ప త్తిని మన దేశం లోనే కావలసిన చోట్లకు పంపి బట్టగా ఎందుకు తయారు చేయించుకో కూడదు? ఇంత ఉదాసీనతలోను, ఇంత ప్రాతికూల్యంలోను కూడా ఈ రోజున ఇండియాలో రెండువేల గ్రామాలలో ఈ పని జరుగు తున్నది నిరుపేదలయిన మన సోదరీ మణులు తమ సున్నితమైన వ్రేళ్ళతో వడికిన నూలుకు తగిన ప త్తినిగానీ, డబ్బునుగానీ తెచ్చుకొనేటందుకు ప్రతిరోజో, ప్రతివారమో, కొన్ని మైళ్ళ దూరం నడవడానికి కూడా సంశయించడంలేదు కాబట్టి మన ఈ నిరుపేద తోబుట్టువుల పట్ల భారత దేశంలో ఆకలితో అల్లాడుతూన్న లక్షలాది ప్రజల పట్ల మనకు ఏ మాత్రం జాలివున్నప్పటికీ మీ విదేశీ వస్త్రాలను విసర్జించి ఒక్క అంగుళం కూడా లేకుండా వాటిని అగ్నికి ఆహుతి చేయడం మన మిదివరకు చేసిన పాపానికి తగిన ప్రాయశ్చిత్తం కాగలదని నా మనవి ఇంగ్లీషు పరిపాలకుల లెక్కల ప్రకారమే భారతదేశ జనసంఖ్యలో పదవ వంతుకు సంవత్సరం పొడుగునా తినటానికి తిండిలేదని మనం గ్రహించవలసి ఉంటుంది వారి కొరకే ఈ విదేశీ వస్త్ర దహనము, ఈ ఖద్దరు ఉత్పత్తి

**మహోపదేశము**

ఈ సన్మానపత్రంలో ఒకదానిలో ఖాదీ మధ్య దళారీలనుంచి కోరడం

కంటె స్వయంగా ఎవరికివారు ఉత్పత్తి చేసుకోవడం ఉత్తమమయిన పద్ధతి అని సూచించడం జరిగి ది ఈ మహోపదేశం నాకిష్టమే కాని ఖాదీ ఉత్పత్తిని గురించిన అసలు విషయాల అజ్ఞానాన్ని ఈ సన్మానపత్రం వెల్లడిస్తున్నది ఖాదీ ఉత్పత్తికి కావలసిన శాస్త్రజ్ఞానం ఈ సన్మానపత్ర రచయితలకు బొత్తిగా లేదని చెప్పవలసి వచ్చినందుకు మన్నించ ప్రార్థన ప్రతిఒక్కరూ తనకు కావలసిన ధాన్యం తానే పండించుకోవడం ఎంత అసాధ్యమో ప్రతి ఒక్కరూ తనకు కావలసిన బట్టను తాను ఉత్పత్తి చేసుకోవడం కూడా అంత అసాధ్యము

నగరాలలో ఉన్నవారు తమకు కావలసిన ఖాదీని ఉత్పత్తి చేసుకోవలెనని తలచినప్పటికీ వారికది సాధ్యంకాని పని నాకు తెలిసినంతవరకు ఇండియాదేశపు చరిత్రలో ప్రతివారు తమకు కావలసిన ఖాదీబట్టను తాము ఉత్పత్తి చేసుకొన్నట్లు ఎక్కడా కనిపించదు అంతేగాక "మీరు తయారు చేసుకొన్న ఖద్దరుబట్టను మీరు కట్టండి లేదా విదేశీ బట్టనే కట్టండి' అనే సిద్ధాంతం నాకేమీ అర్థం కావటంలేదు ఈనాడు రాట్నంమీద రోజుకు 8 గంటలు పనిచేయగలవారు కోట్లాది ప్రజలున్నారు వారు తయారుచేసిన నూలంతా వారే ఉపయోగించుకోగలగటం అసంభవము అందువల్ల ఈ సోదరీ సోదరులు తయారుచేసిన అదనపు నూలును తీసుకోవడం సజ్జనులైన ఇండియా పౌరుల ప్రధాన కర్తవ్యము మనిషిలోని సాంఘిక స్వభావమే వారికి పశు పునకూ గల వ్యత్యాసం గుర్తింపచేయగలది మనిషికి స్వతంత్రంగా ఉండటానికి ఎంత హక్కు ఉందో పరస్పరం ఒకరిపైన ఒకరు ఆధారపడి ఉండటం కూడా అంత అవసరము అహంకృతుడైన మానవుడు మాత్రమే సర్వస్వతంత్రుడననీ, ఇతరుల అవసరం తనకు లేదనీ అనుకొంటాడు ఇండియాలోని అనేక ప్రదేశాలలో 'స్వయంసంపూర్ణ' ఖాదీ ఉత్పత్తి విధానం కొనసాగుతూనే ఉన్నదని ఈ సన్మానపత్రాల రచయితలకు నేను సవినయంగా మనవి చేస్తున్నాను ఈ దేశంలోని మునిసిపాలిటీలు, తాలూకా బోర్డులు, జిల్లా బోర్డులు తమ ప్రాథమిక కర్తవ్యం గుర్తించి ఈ ఖాదీ ఉత్పత్తికి సహకరిస్తే మన గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమం అవిచ్ఛిన్నంగా కొనసాగగలదని నేను వారికి సవినయంగా మనవి చేస్తున్నాను అప్పుడు వస్త్రాలకు సంబంధించినంతవరకు గ్రామస్థులు వ్యక్తిగతంగా కాక గ్రామాలు సామూహికంగా స్వయం సంపూర్ణాలు కాగలవు ఈ సన్మానపత్రాలు వ్రాసినవారు అఖిల భారత చర్ఖా సంఘంవారు అప్పుడప్పుడు ప్రచురిస్తూన్న ఖద్దరు సాహిత్యం శ్రమ తీసుకొని చదివినట్లయితే ఈ సందర్భంలో జరుగుతున్న కృషిని వారు తెలుసుకోగలరు అందువల్లనే ఇండియాలో ఖద్దరు బాగా చలామణిలోకివస్తే విదేశీబట్టల పోటీకి గానీ, ఇండియాలోని మిల్లుబట్టల పోటీకిగాని అది జంకవలసిన పనిలేదని నేను పదేపదే చెబుతూ వస్తున్నాను కొంచెం ఆలోచించినట్లయితే ఈ విషయం తనకు తానే మనకు స్పష్టంగా స్ఫురించగలదు

**తాగుడు పిశాచం**

ఈ విషయం ఇట్లా ఉండగా ఇటువంటి మరికొన్ని ముఖ్య విషయాలను గురించి ప్రస్తావించ దలుచుకొన్నాను భారత దేశ స్వాతంత్ర్యం కోరే ప్రతి వ్యక్తి విదేశ వస్త్ర బహిష్కారంతో పాటు ఇండియాలో తాగుడును నిర్మూలం చేయవలెనని కాంగ్రెస్ కార్యవర్గం నిరీక్షిస్తున్నది మద్యపాన దురభ్యాసం భారతీయ సమాజంలోని నెత్తురును పీల్చి పిప్పి చేస్తున్నది తాగుడు దురభ్యాసానికి లోనైన మన మిల్లులోని కార్మిక వర్గం అంతకంతకు పతన స్థితికి దిగజారుతున్నది కాబట్టి మద్యపాన నిషేధోద్యమం సంపూర్ణంగా విజయవంతం చేయడానికి మచిలీపట్టణంలోని వివేకవంతుడైన ప్రతిపౌరుడు శక్తివంచన లేకుండా కృషి చేయవలెనని కోరుతున్నాను మనం మన కర్తవ్యం నిర్వర్తించగలిగితే విదేశీ ప్రభుత్వం సైతం మద్య నిషేధ శాసనం ప్రవేశ పెట్టేటట్లు చేయగలము

**జాతీయ ద్రవ్యం దుబారా**

ఈ దేశమంతటా జాతీయ ద్రవ్యం ఎక్కువ దుబారాగా వెచ్చింప బడుతున్నది ఖాదీ ఉత్పత్తికోసం అస్పృశ్యతా నివారణకోసం ఎంత సొమ్ము ఆంధ్రదేశానికి ఇవ్వబడిందో మీకు తెలియక పోవచ్చు ఈ సొమ్ము అనేక మంది కార్యకర్తల చేతులలో వెచ్చింపబడిన విధానం నా అనుభవంలో సంతోషదాయకంగా లేదు మనం స్వప్న ప్రపంచంలో నుంచి మేలుకోవలసిన కాలం ఆసన్నమయింది మన సొంత సొమ్మువలెనే జాతీయ ద్రవ్యాల విషయంలో కూడా శ్రద్ధ తీసుకొంటూ జాతీయ ప్రతిష్ఠను కాపాడుకొన్నప్పుడే మనం స్వరాజ్యం పొందగలము మనం జాతీయ సేవకులమనే పేరును సార్థకం చేసుకోవలెనంటే మన జాతీయతని ఎవ్వరూ శంకించడానికి వీలు లేనంత జాగరూకతతో ప్రవర్తించవలె మన కార్యకర్తలు ఆ సొమ్మును తమ సొంతం కోసం ఉపయోగించుకోకపోవచ్చు అంతమాత్రంతో సరిపోదు వారు సొమ్ము జాగ్రత్తగా వినియోగించవలె అంతేగాదు ఏ పనికోసం అది ఉద్దిష్టమయిందో ఆ పనికే వినియోగించవలె

**ఆంధ్రలో అవకాశాలు**

ఆంధ్ర దేశానికి అంతులేనన్ని అవకాశాలున్నాయి అక్కడ వీర్యవంతులైన మనుషులున్నారు ఆంధ్ర స్త్రీలను దక్షిణాఫ్రికాలో సైతం నేనెరుగుదును వారు శక్తి కలవారు, కష్టపడి పని చేసేవారు మీకు (ఆంధ్రులకు) వుండకూడనంత ఔదార్యం ఉంది మిమ్ములను సరిగా నడిపించే వారుంటే మీరు ఎంతటి ఆశ్చర్యకరాలయిన త్యాగాలనైనా చేయగలరు ప్రశ్నించటానికి వీలులేని ధైర్యం మీది కాని దురదృష్టవశాత్తు జాతికి ఎంతో మంచి సేవ చేయ తగినస్థితిలో ఉన్నవారు సేవచేయడంకంటె నాయకత్వం వహించడానికి ఎక్కువ

ఆతురత చూపిస్తున్నారు విమర్శ అవసరమైన చోట్ల విమర్శించడానికి జంకు తున్నారు, సందేహిస్తున్నారు ప్రతి తప్పును ఏదో ఒక విధంగా కప్పి పుచ్చ డానికి ప్రయత్నిస్తున్నారు ఈ మన సామాన్య జాతీయ దౌర్బల్యంలో మీరు కూడా భాగస్వాము లవుతున్నారు ఈ క్రమ శిక్షణకు, పరీక్షణకు ఏర్పడిన ఈ సంవత్సర కాలంలో ఈ తప్పులను గురించి నేను మీకు తెలియ జెప్పి వాటిని మీరు మీ శక్తి కొద్దీ తొలగించుకోవలెనని ప్రబోధించకుంటే నేను మీ పట్ల అపచారం చేసినవాడనవుతాను

ప్రభుత్వాన్ని ఎట్లా లొంగదీయటం

మన కేంద్రశాసన సభ స్పీకరు మనము పొందగలిగిన స్పీకర్లు అందరి లోకి ఎక్కువ సమర్థుడు ఆయన చాలా ఉత్తేజకరను ఉపయోగకరమూ అయిన కార్యాలు సాధించగలవాడు అయినప్పటికీ అత్యంత ప్రబలుడైన రాజప్రతినిధి పెదవుల నుంచి వెలువడిన మాట ఒక్క నిమిషంలో ఆయన పనినంతా వ్యర్థం చేసింది మీరు చేయవలసిన పని ఎంత గొప్పదో మీకు నిరూపించే టందుకు నేనీ ఉదంతంను మీ దృష్టికి తెస్తున్నాను నేటికిగానీ, మరికొన్ని ఏళ్ళకుగానీ భారతదేశ స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు శాసనసభలుగా పేర్కొన బడు తున్న సంస్థల ద్వారా లభించవు అవి కాంగ్రెస్ సూచించిన ప్రకారం గ్రామాలలోని పనిని బట్టియే మనం నాటిని పొందగలము రాజప్రతినిధి మన స్పీకరును చైతన్యవంతం కార్యశూరత్వమూ గల జాతికి ప్రతినిధిగా గుర్తించి ఉండినట్లయితే విఠల్ భాయి పటేల్ ఇచ్చిన రూలింగుకు తలఒగ్గి ఉండేవాడు రాజప్రతినిధికిగానీ, ఆయన యాజమాన్యం వహిస్తున్న ప్రభుత్వానికిగానీ నచ్చజెప్ప వలెనంటే బాంబు విసిరేవాని ఉన్మాదచర్య ఎంత మాత్రం ఉపయోగ పడదు కోట్ల కొద్దీ ప్రజలు ఏకీభావంతో ప్రశాంతంగా కుంటువడని శక్తి సామర్థ్యాలతో చేయగల పనియే వారిని సరియైన తోవలో పెట్టగలదు కాబట్టి అకలంకమయిన ద్రవ్య సంపత్తిలో ఉన్న ఐక్య కాంగ్రెస్, అఖిలాది గ్రామస్థులు సభ్యులుగా ఉన్న కాంగ్రెస్, ప్రతి గ్రామంలోను ఖాదీ డిపోలు ఉన్న కాంగ్రెస్, ప్రతివ్యక్తి గౌరవం పట్ల శ్రద్ధ వహించగల కాంగ్రెస్, హిందూ, మహమ్మదీయ, పార్సీ, క్రైస్తవ, సిక్కు, యూదుల సంఘీభావం సాధించిన కాంగ్రెస్ నాకు కావలె అప్పుడు దేశ ప్రతినిధుల స్పీకరు అధికారం ఎంతటి వైస్రాయీ తృణీకరించడానికి ధైర్యం చేయలేదు

యంగ్ ఇండియా — యం కె గాంధీ
25 ఏప్రిల్ 1929

**విశాఖపట్టణం జిల్లా**

గాంధీజీ ఏప్రిల్ 28 మధ్యాహ్నం కొవ్వూరునుంచి బయలుదేరి వాల్తేరు రైల్వేప్లాటుఫారంమీద రైలు దిగినారు మద్రాసునుంచి వాల్తేరుకు మధ్యాహ్నం

2-20 గంటలకు రావలసిన మేయిల్ బండి ఆనాడు అరగంట ఆలస్యంగా వచ్చింది గాంధీజీ రైలుదిగేసరికి ప్లాటుఫారమంతా జనంతో క్రిక్కిరిసిపోయింది కొంతమంది వాలంటీర్లు అక్కడ గుమికూడిన జనాన్ని సందడి లేకుండా సరిగా సర్దుతున్నారు ఆహ్వాన సంఘంవారు గాంధీజీ రైలుదిగగానే పూలదండవేసి సత్కరించి స్టేషన్‌నుంచి అల్లిపురం పెద్దవీధి ద్వారా గాంధీజీని కారులో అంకితం వెంకటభానోజీరావుగారి డాబా తోటలోకి తీసుకొని వెళ్ళినారు సాయంకాలం 6 గంటలకు గాంధీజీ, ఆయన అనుచరవర్గము టౌన్‌హాలు ప్రక్కన సముద్రం ఒడ్డునఉన్న మున్సిపల్ మైదానానికి వెళ్ళినారు అక్కడ గాంధీజీ రాకను నిరీక్షిస్తూ జనులు బ్రహ్మాండంగా గుమిగూడి ఉన్నారు

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి (కవిగారు) సంస్కృత ప్రార్థన తోనూ, మహిళల జాతీయ గీతాలతోనూ, పండితుల స్వస్తివాక్యాలతోను సభ ప్రారంభమయింది

తరవాత విశాఖపట్నం మునిసిపాలిటీవారు, విశాఖపట్టణం జిల్లా బోర్డు, విశాఖపట్టణం మహిళలు, విశాఖపట్టణం జిల్లా కాంగ్రెస్ కమిటీవారు గాంధీజీని ఆహ్వానిస్తూ సన్మానపత్రాలు సమర్పించినారు

ఆ తరవాత గాంధీజీకి విరాళాలు, దంతపుపెట్టెలు, ఖద్దరుదండలు, వస్త్రాలు ఇంకా అనేకాలైన చిన్న చిన్న అలంకారాలు సమర్పించినారు ఒక బంగాళా స్త్రీ విలువగల మణులతో పొదిగిన గాజులజత గాంధీజీకి సమర్పించింది తరవాత గాంధీజీకి వివిధ సంఘాలవారు దండలు వేసినారు ఆంధ్ర మహిళా సమితివారు 300 రూపాయలను, విశాఖపట్టణం పౌరులు 2,236 రూపాయలను ఖద్దరునిధికి సమర్పించినారు గాంధీజీ అన్ని సన్మానపత్రాలకు కలసి ఏకంగా ఒకేఒక సమాధానం హిందీలో చెప్పినారు దేశభక్త కొండ వేంకటప్పయ్యగారు దానిని తెలుగులోకి అనువదించినారు

ఆ సభకు హాజరయిన కొంతమంది స్త్రీలు గాంధీజీని ప్రశంసించినారు గాంధీజీకి సమర్పించిన నగదూ మొదలయిన వాటిని వేలం పెట్టగా 450 రూపాయలు వచ్చినాయి

ఏప్రిల్ 29 వ తేది సోమవారం, గాంధీజీకి మౌనవ్రతపు రోజు కాబట్టి ఆనాడు ఆయన గౌరవార్థం ఏ బహిరంగసభ జరగలేదు కాని సాయంకాలం 3-30 గంటలకు విశాఖపట్టణంలో ఉన్న వేలకొద్దీ స్త్రీలు స్థానిక పురమందిరంలో శ్రీమతి కస్తూరిబాయి గాంధీకి సన్మానపత్రం సమర్పించడానికి సమావేశమయినారు ఆ స్త్రీల సభ కొందరు యువతుల జాతీయగీతాలతోను, ప్రార్థనలతోనూ ప్రారంభమైంది

ఆ సాయంకాలం గాంధీజీ మౌనవ్రతం చాలించి 7 మొదలు 8 గంటల వరకు కాంగ్రెస్ కార్యకర్తలతో కాంగ్రెస్ కార్యక్రమం గురించి చర్చించినారు.

**విజయనగరంలో**

ఏప్రిల్ 30 ఉదయం 6-30 గంటలకు మహాత్మాగాంధీ దేశభక్త వేంకటప్పయ్య పంతులు గారితోను స్థానిక కాంగ్రెస్ నాయకులతోనూ కలసి మోటారులో విశాఖపట్టణం నుంచి విజయనగరానికి బయలు దేరినారు దారిలో భీముని పట్నంలోని స్థానిక ప్రజలు గాంధీజీని ఆహ్వానించి ఖద్దరు నిధికి 116 రూపాయలు సమర్పించినారు రెడ్డిపల్లి అగ్రహారం వారు మరొక 116 రూపాయలు ఇచ్చినారు అక్కడి ప్రజలకు గాంధీజీ, రాట్నంపై నూలు వడకవలెనని, ఖద్దరు ధరించవలెనని, అస్పృశ్యతను నిర్మూలించ వలెనని, వివిధ మతాల మధ్య ఐకమత్యం ప్రోత్సహించ వలెననీ ఉద్బోధించినారు తరవాత జొన్నవలసలో 558 రూపాయల ఖద్దరు నిధితో సహా గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించడం జరిగింది జొన్నవలస ఫిర్కా కాంగ్రెస్ కమిటీవారు ప్రత్యేకంగా 164 రూపాయలు ఖద్దరు నిధికి ఇచ్చినారు గాంధీజీకి ఖద్దరు ప్రచారానికి తోడ్పడవలసిందని చెప్పినారు తరవాత వారు విజయనగరానికి ఉదయం 8-30 వరకు చేరుకొన్నారు

విజయనగరంలోని బాంకు మైదానంలో అనేక మంది జనం సమావేశమై గాంధీని ఆహ్వానించినారు గాంధీజీ ఆయన సహచరవర్గం కోసం ఆ మైదానం మధ్యలో చిన్న పందిరి వేసినారు గాంధీజీ రాగానే బహిరంగ సభ ప్రారంభమైంది విజయనగరం మునిసిపాలిటీవారు, విజయనగరం తాలూకా బోర్డు, విజయనగరం వడుకు నూలు ఖాదీ నేత సహకార సంఘంవారు గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు

వడుకు నూలు ఖాదీ నేత సంఘంవారు గాంధీజీకి ఒక మేజోళ్ల జత కూడా ఇచ్చినారు దాని ప్రత్యేకత ఏమంటే దానికి ఎక్కడా కుట్లు అనేది లేకుండా కేవలం మేజోళ్ల రూపంలోనే నేసినారు దానితో పాటు 2½ గజాల వెడల్పు, 3 గజాల పొడవుగల ఒక జంపుకానా గాంధీజీకి బహూకరించినారు ఈ రెండు వస్తువులు అపూర్వమైన హస్త నైపుణ్యం తెలియచేస్తూన్నందు వల్ల వాటిని తమ ఆశ్రమంలోనే ప్రదర్శన నిమిత్తం ఉంచుకోవలసిందని గాంధీజీని ఆ సహకార సంఘం వారు కోరినారు

**గాంధీజీ ప్రత్యుత్తరము**

తమకు సమర్పించిన సన్మానపత్రాలకు ప్రత్యుత్తరమిస్తూ గాంధీజీ "మీరిచ్చినఖాదీ నిధికి నేను కృతజ్ఞుణ్ణి మీ సన్మానపత్రంలో మీరు చెప్పిన అన్ని విషయాలను మీరు చిత్తశుద్ధితో ఆచరణలో పెట్టవలెనని మీరు జ్ఞాపకముంచుకోవలె "వడుకు నేత సహకార సంఘం" వారి సన్మాన పత్రానికి నేను అత్యంతానందం పొందినాను ఈ సంస్థ అత్యుత్కృష్టమైన ఆదర్శ సంస్థ మైసూరులోవలె చాలా చోట్ల సహకార సంస్థలు ఉన్న మాట వాస్తవమే కాని ఈ సహకార సంస్థలో ఒక ప్రత్యేకత ఉన్నది దీనిలో అన్నితరహాల కార్యకర్తలు ఉన్నారు

ఇందులోని లాభాలను అందరు కార్యకర్తలు పంచుకొంటారు మీ సన్మాన పత్రం మన దేశంలోని వివిధ భాషలలోకి అనువదింప జేసి ప్రతి చోటా దానిని ప్రచారం చేసేటట్లు చేస్తాము ఈ సంఘం ఈ విధంగానే పని చేస్తూ, ఆ పనిని ఇంకా విస్తృతం చేస్తే మన దేశపు ఆర్థిక పురోభివృద్ధికి ఎక్కువగా తోడ్పడ గలదని నేను విశ్వసిస్తున్నాను మీరిప్పుడు కట్టికొన్న విదేశీ వస్త్రాలను పూర్తిగా విసర్జించి వేయవలెనని నా మనవి భారత దేశానికి మరొక లజ్జాకరమయిన విషయం తాగుడు దానిని తప్పక మాన్పించవలె అస్పృశ్య తను పూర్తిగా తొలగించవలె హిందువులు మహమ్మదీయులు ఒకే ఆశయంకోసం పని చేస్తున్నారు కనక వారు సోదరుల లాగా మెలగవలె వివిధ మతస్థులలో ఐకమత్యం ప్రబలవలె భారత స్వాతంత్ర్య సంపాదనకు పురుషులెటువంటి బాధ్యత వహిస్తున్నారో స్త్రీలుకూడా అటువంటి బాధ్యత వహించవలె పురుషుల కంటే స్త్రీలు ఎక్కువగా ఖద్దరు ప్రచారం చేయగలరని నా దృఢ విశ్వాసము మీరు సరియైనపథంలో నడవడానికి తగిన జ్ఞానం మీకు దేవుడు ప్రసాదించి భారతదేశ విముక్తికి తోడ్పడ వలెనని నేను భ గ వం తు ని ప్రార్థిస్తున్నాను " అని చెప్పినారు

ఈ ఉపన్యాసానంతరం ఖద్దరు నిధికి 12,694 రూపాయలు సమర్పించి నారు స్త్రీలు ప్రత్యేకంగా 125 రూపాయలిచ్చినారు తాలూకాబోర్డు సభ్యులు వారి సిబ్బంది 96 రూపాయలు, విజయనగరం నూలు వడుకు నేత సహకార సంఘంవారు 72 రూపాయలు సమర్పించినారు భీమసింగ్‌గారు గాంధీజీ కారును ఆపి ఆయనకు 116 రూపాయలు ఇచ్చినారు మొత్తం 2, 694 రూపాయలు మాత్రమే అయిందని తెలుసుకొని కనీసం 3వేల రూపాయలైనా కాకపోయినట్లయితే తాను సత్యాగ్రహం చేయదలుచు కొన్నానని గాంధీజీ హాస్యంగా అన్నారు అప్పుడు సభలోనుంచి కొంతమంది లేచి ఆ లోటును పూర్తిచేయడానికి మరికొంత సొమ్ము ఇచ్చినారు మహాసభ ముగిసిన తరవాత వడుకునేత సహకార సంఘ కార్యాలయాన్ని గాంధీజీ సందర్శించినారు అక్కడ నూలు వడికే విధానం పరిశీలించినారు నేత మేస్త్రీని ఆయన పని తనానికి కొనియాడి ఆయన మెడలో దండ వేసినారు అక్కడ నుంచి గాంధీజీ ఆయన సహచర వర్గం ఉదయం 9 30 గంటలకు తిరిగి విశాఖపట్టణానికి ప్రయాణమయినారు తోవలో కొత్తవలసలోను, మరొక పల్లెలోను ఖద్దరు నిధికి చిన్న చిన్న విరాళాలు చేకూరినాయి

సాయంకాలం విశాఖపట్నంలో శ్రీ బి వెంకటపతిరాజు, శ్రీ పి యల్ నరసింహంగార్ల వంటి ప్రముఖులు చాలా మంది గాంధీజీని దర్శించి భారతీయుల కోరికలను బ్రిటిష్ ప్రభుత్వంవారు మన్నించ నట్లయితే బ్రిటిష్ వస్తు బహిష్కారం ఆచరణలో పెట్టడాన్ని గురించి ఆయనతో చర్చించినారు గాంధీజీ బ్రిటిష్ వస్తు బహిష్కార విషయం చాలా కాలంనుంచి చర్చ జరుగు తూనే ఉన్నదని దానివల్ల తగినంత ప్రయోజనం కలగలేదని కాబట్టి అంతకంటే

విదేశీవస్తు బహిష్కారంపై మొత్తం శక్తి సామర్థ్యాల నన్నిటినీ కేంద్రీకరించడం ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుందని అన్నారు అందుకనుగుణంగా విదేశ వస్తు బహిష్కారంతో పాటు ఖద్దరు ధారణ కూడా అత్యవసరమని చెప్పినారు

## ఇద్దరు ఇటలీ దేశస్థులు

గాంధీజీని విశాఖపట్నంలో ఇద్దరు ఇటలీ దేశస్థులు సందర్శించినారు వారిలో ఒకరు ఇంజనీయరు, మరొకరు యాత్రికుడు ఆ సందర్భంలో తాను 40 సంవత్సరాలక్రితం మాల్టాకు వెళ్ళినప్పుడు జరిగిన కొన్ని సంఘటనలను గురించి ప్రస్తావిస్తూ గాంధీజీ వారితో మాట్లాడినారు భారతదేశ విషయాలలో ఆసక్తి కలిగిన అనేకమంది ఇటలీ మిత్రులను తాను ఎరుగుదునని కూడా గాంధీజీ అన్నారు ముస్సోలినీగురించి తమ అభిప్రాయమేమని ఇటాలియన్‌లు గాంధీజీని అడుగగా, అంత తొందరగా ఆయనను గురించి నిర్ణయించడానికి వీలులేదన్నారు

మే 1న 6 గంటలకు గాంధీజీ విశాఖపట్టణమునుంచి ప్రయాణమై 7-30 గంటలకు చోడవరం చేరుకొన్నారు అక్కడ బహిరంగసభ జరిగింది చోడవరం నుంచి అనకాపల్లి ఉదయం 8-30 గంటలకు వెళ్ళినారు అక్కడ వారు సాయంకాలంవరకు విశ్రాంతి తీసుకొన్నారు

## అనకాపల్లిలో

ఆ మధ్యాహ్నం అనకాపల్లిలో గాంధీజీని అనేకమంది సందర్శించినారు ఒక వర్తకుడు ఖాదీ పరిశ్రమాభివృద్ధికి తాను 10వేల రూపాయలు పెట్టుబడిపెట్టడానికి సంసిద్ధంగా ఉన్నట్లు చెప్పి గాంధీజీ సలహాను అర్థించినాడు గాంధీజీ కేవలం పెట్టుబడి పెట్టడంవరకేనా లేదా అందుకు తగిన శారీరక కృషి చేయడానికి కూడా సంసిద్ధంగా ఉన్నావా అని ఆయనను అడిగినారు ఆయన అప్పుడు అందుకు కావలసిన సహాయమును చేతనైనంతవరకు చేస్తానని వాగ్దానం చేసినారు అంతట గాంధీజీ ఖాదీ ఉత్పత్తికోసం నాగపురంలో కొంత పెట్టుబడిపెట్టిన ఠక్కర్‌గారి సాదృశం చెప్పి, నాగపూర్‌లో అంతకు పూర్వం 500 రూపాయల వెలగల ఖద్దరును అమ్మడం ఎంతో కష్టంగా వుండేది ఠక్కర్ చేసిన సహాయంవల్ల ఇప్పుడు 10వేల రూపాయల ఖద్దరు తేలికగా అమ్మకమవుతున్నదని చెప్పినారు

•

తరవాత కొంతమంది పౌరులు గాంధీ దగ్గరికి రాయబారంవచ్చి అక్కడ ఉన్న పెద్దబజారు చౌకుకు (big market square)గాంధీపేరు పెట్టడానికి అంగీకరించవలసిందని ఒక విజ్ఞాపనపత్రం సమర్పించినారు గాంధీజీ "పేరులో ఏమున్నది" అని కొందరు పెద్దలు చెప్పినమాటలను జ్ఞాపకంచేస్తూ కొంతసేపు హాస్యప్రసంగం

చేసి చివరికి పేరుపెట్టడానికి అంగీకరించినారు ఆ బజారుకు తన పేరుపెట్టడానికి అంగీకరించినట్లయితే కొన్ని ప్రదేశాలలో గాంధీ సిగరెట్లు అమ్మబడుతున్నట్లు అక్కడ గాంధీ విస్కీ', 'గాంధీ కల్లు' అమ్మరు గదా అని హాస్యంగా అన్నారు గాంధీజీ తన పేరును ఉపయోగించుకునే ఆ బజారులో సరుకులను విపరీత మయిన ధరలకు అమ్మవద్దని కూడా ఆయన మందలించినారు విశాఖపట్టణం క్రైస్తవ మత ప్రచారకుడు శ్రీ యాండ్రిల్, శ్రీ పార్థసారథి శర్మగార్లు గాంధీని సందర్శించినారు

సాయంకాలం బజారులో బ్రహ్మాండమయిన సభ జరిగింది 20 వేల మంది జనానికిపైగా సమావేశమయినారు విశాఖపట్నం జిల్లాలో గాంధీజీ సందర్శించిన ప్రదేశాలన్నిటిలోకి పెద్ద సభ ఇదే ఇంతకుపూర్వం ఎన్నడూ అంత పెద్ద సభ జరగలేదు సభ చాలా నిశ్శబ్దంగా ఉంది సాయంకాలం సరిగా 6 గంటలకు గాంధీజీ సభాస్థలికి చేరినారు అనకాపల్లి కాంగ్రెస్ కమిటీ, శ్రీ కన్యకాపరమేశ్వరి వైశ్య వ్యాయామ సంఘం గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు కొంతమంది స్త్రీలు జాతీయగీతాలతోనూ, ప్రార్థనలతోనూ గాంధీజీని ఆహ్వానించినారు ఖద్దరు నిధికి 2 వేల రూపాయల విరాళం సమర్పించ బడింది చాలామంది స్త్రీలు కొంత నగదు, కొన్ని నగలూ ఇచ్చినారు తన ఉపన్యాసానంతరం గాంధీజీ నిప్పుపుల్ల వెలిగించి అంటించటంతో విదేశీ వస్త్ర దహనం జరిగింది గాంధీజీకి సమర్పించిన వస్తువులన్నీ వేలం వేసినందువల్ల ఖద్దరు నిధికి మరికొంత సొమ్ము చేరింది ఆ సమావేశంలోనే ఆబజారుకు 'గాంధీ బజార్' అని నామకరణం చేసినారు

గాంధీజీ ఆయన బృందం అనకాపల్లి నుంచి ఏటికొప్పాకకు బయలుదేరి నారు ఏటికొప్పాకలో గాంధీజీ ఆహ్వానానికి కొన్ని ఏర్పాట్లు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ సి వి యస్ నరసింహరాజుగారు చేసినారు

## ఏటికొప్పాకలో

మహాత్మాగాంధీ ఏటికొప్పాకలో సి వి యస్ నరసింహ రాజుగారి ఇంట్లో మే 1 రాత్రి విశ్రాంతి తీసుకొన్నారు మే 2 ఉదయం నరసింహ రాజుగారు, ఆ వూరి పనివారు చక్కగా నగిషీ చేసి వార్నిష్ వేసిన చక్కని చిన్న కొయ్య పెట్టెలో రూ 1116 ఖద్దరు నిధికి సమర్పించినారు వెంటనే ఆ పెట్టెను గాంధీజీ సంతోషధ్వానాల మధ్య 82 రూపాయలకు ఆ గృహస్థు నికి అమ్మి వేసినారు

తరవాత గాంధీజీ ఆ ప్రాంతాలలో ఎక్కువగా ఖద్దరు ఉత్పత్తి చేసే కేంద్రాలలో ఒకటైన కైలాసపట్నానికి వెళ్ళినారు అక్కడ గాంధీజీకి ఏటి కొప్పాకలో తయారైన ఒక కొయ్య పెట్టెలో సన్మాన పత్రం సమర్పించ బడింది అది వేలం వేయగా 14 రూపాయలు వచ్చినాయి తరవాత బహిరంగ సభలో పౌరులు ఖద్దరు నిధికి రూ 1116 ఇచ్చినారు అందులో 500 రూపా

యలు (శ్రీ) సూర్యనారాయణగారు ఇచ్చినారు ఆయన కుటుంబంలో స్త్రీలు కొన్ని నగలు కూడా ఇచ్చినారు

తరవాత గాంధీజీ ఆయన బృందము తునికి బయలుదేరి వెళ్ళినారు తోవలో నక్కపల్లిలో 116 రూపాయలు ఖద్దరు నిధికి లభించినది

ఇంతటితో గాంధీజీ విశాఖపట్టణం జిల్లా పర్యటనం ముగిసింది ఉదయం 8-30 గంటలకు తుని చేరినారు తునిలో జోగయ్యశాస్త్రి గారింట్లో బసచేసినారు విశాఖపట్టణం జిల్లాపర్యటనలో ఖద్దరు నిధికి 700 రూపాయల విలువగల నగలతో సహా 14,110 రూపాయల మొత్తం లభించింది ఈనాటి వరకు (మే 2) ఆంధ్ర దేశంలో ఖద్దరు నిధికి నగల విలువలతో సహా 1,54,960 రూపాయలు చేకూరింది

## విశాఖపట్టణం జిల్లాలో
### (ఖద్దరునిధి వసూళ్ళు)

| | | |
|---|---|---|
| 28-4-1929 | విశాఖపట్టణం | 3,081-6-9 |
| 30-4-29 | భిములీపట్నం | 1,156-0-0 |
| | రెడ్డిపల్లి అగ్రహారం | 116-0-0 |
| | జొన్నవలస | 722-0-0 |
| | విజయనగరం | 2,986-14-4 |
| | భీమసింగ్ జీ | 116-0-0 |
| | కొట్టవలస | 29-0-0 |
| | భిమలి | 10-0-0 |
| | సింహాచలం | 123-12-0 |
| | సబ్బవరం | 10-9-0 |
| | చోడవరం | 1142-5-0 |
| 1-5-1929 | అనకాపల్లి | 2,262-7-9 |
| | విశాఖపట్నం (తరువాతి వసూళ్ళు) | 52-4-0 |
| | కొక్కిరాజుపల్లి | 13-2-3 |
| | ఎలమంచిలి | 180-0-0 |

| | | |
|---|---|---|
| 2-5-1929 | పటికోప్పాక | 1167-11-3 |
| | కైలాసపట్నం | 1127-0-3 |
| | నక్కపల్లి | 116-0-0 |
| | గోడిచర్ల | 36-5-10 |
| | విశాఖపట్నంలో (ఇచ్చిన నగల ఖరీదు అంచనా) | 700-0-0 |
| | పశ్చిమ గోదావరి జిల్లా (తరువాతి వసూళ్లు) | 0-4-0 |
| | గుంటూరు జిల్లా (తరువాతి వసూళ్ళు) | 46-8-0 |
| | ఇంతవరకు ఆంధ్రదేశంలో వసూలైన | |
| | మొత్తం | 1,54,961-15-½ |

## తూర్పు గోదావరి జిల్లా

### (తునిలో)

మే 2వ తేది సాయంకాలం గాంధీజీ తన బసలో చర్ఖాపైన నూలు తీస్తూ స్థానిక ఖాది కార్యకర్తలతో మాట్లాడినారు ఆ తరవాత 116 రూపాయల విరాళమొకటి, మరొక 58 రూపాయల విరాళం గాంధీజీకి సమర్పించినారు శ్రీ వి జోగయ్యశాస్త్రి, ఆయని భార్య, ఆయన కుమార్తె గాంధీ దంపతులకు గౌరవ పురస్సరంగా నమస్కరించి దండలువేసి ఒక వెండిపళ్లెంలో 500 రూపాయల నగదు సమర్పించినారు మహాత్మాజీ చాలా సంతోషించి తనకు ఆతిథ్యమిచ్చిన గృహస్థు జోగయ్యశాస్త్రిని ఆయన కుటుంబంను అభినందిస్తూ వారిని దీర్ఘాయుష్మంతులుగా దీవించినారు సాయంకాలం స్త్రీలసభ జరిగింది నిత్యము ఖద్దరు ధరించవలెనని గాంధీజీ స్త్రీలకు ఉద్బోధించినారు స్త్రీలు 150 రూపాయల నగదు, కొన్ని నగలనూ గాంధీజీకి సమర్పించినారు తరవాత గాంధీజీ బజారుమైదానంలో సుమారు 6వేల మందిగల బహిరంగ సభలో ఉపన్యసించినారు యూనియన్ బోర్డువారు గాంధీజీకి వెండి పళ్లెంలో ఆహ్వానపత్రం సమర్పించినారు పౌరులు సన్మానపత్రంతోపాటు 1148 రూపాయల నగదు ఖద్దరునిధికి ఇచ్చినారు తునిలో వసూలైన మొత్తం స్త్రీల సమావేశంలో వచ్చిన నగలతోసహా 2,230 రూపాయలు మే 3వ తేది ఉదయం మహాత్మాజీ తునికి 69 మైళ్ళ దూరంలో ఉన్న కాకినాడకు పత్తిపాడు, కిర్లం

త్రాడి రోడ్డుమీదుగా ప్రయాణం సాగించినారు. దోవలో కిర్లంపూడివద్ద గ్రామాలు మహాత్మాజీని ఒపి 13[illegible] రూపాయి ఖద్దరునిధికి కానుకగ ఇచ్చినారు.

**పిఠాపురంలో**

మహాత్మాజీ ఉదయం (మే 3) 8-30 గంటలకు పిఠాపురం చేరినారు. అక్కడ పెద్ద బహిరంగసభ పిఠాపురం రాజాగారి హైస్కూల్ మైదానంలో జరిగింది. అ సభలో [illegible] ఉన్నారు. మహాత్మాజీ వేదిపైన ఆసీనులైన తరువాత పిఠాపురం పౌరుల, యూనియన్ బోర్డువారు ఆయనకు సన్మానపత్రాలను సమర్పించినారు. ఖద్దరు నిధికి స్థానిక విద్యార్థులిచ్చిన 116 రూపాయలతో సహా 1169 రూపాయల కానుక సమకూరింది. పిఠాపురంలోని భారతీయ సంఘంవారు 48 రూపాయలిచ్చినారు. సన్నని స్వదేశి నూలుతో జరీబట్టలు తయారుచేసే ముఖ్యమయిన నేత కేంద్రం ఉప్పాడ. ఆ వూరి ప్రజలు 203 రూపాయల విరాళం ఇచ్చినారు. గాంధీజీ ఉపన్యాసం ఇచ్చిన తరవాత తిరిగి కాకినాడకు ప్రయాణం కొనసాగించినారు.

**కాకినాడలో**

మే 3 వ తేది సాయంకాలం 3, 4 గంటల మధ్య కాకినాడలో గాంధీజీ ఉన్న బంగళాలో అనేక మంది స్త్రీలు, పురుషులు, ఆయనను సందర్శించినారు. బులుసు సాంబమూర్తి గారి భార్య, కుమార్తె, మనుమరాలు, వారి బంధువులు గాంధీజీకి అభివందనం అర్పించినారు. సాంబమూర్తిగారి గృహిణి తన గట్టి వెండి అందెలను గాంధీజీకి సమర్పించింది. అవే ఆమె వొంటి మీద ఉన్న చివరి ఆభరణాలు. గాంధీజీ వాటిని స్వీకరిస్తూ, దేశసేవలో తన భర్త అడుగు జాడలను అనుసరిస్తూ గ్రామ గ్రామానికీ ఇంటింటికీ చర్ఖా సందేశం తీసుకొని పోవలసిందని ఆమెకు సలహా ఇచ్చినారు. 'అవసరమయితే మీ భర్తగారి వలెనే మీరు కూడా జైలుకు పోవచ్చు" అని చిరునవ్వుతో అన్నారు.

సాయంకాలం 5 30 కు మహాత్మాజీ బసనుంచి జనసమూహంలో ప్రతిధ్వనించిన 'మహాత్మాగాంధీకి జై' అను ఉత్సాహ పూరిత నినాదాల మధ్య 'ఆనంద సమాజ'పు ఆవరణలోకి కారులో వెళ్ళినారు. అంతకు పూర్వమే అక్కడ మూడువేల మంది స్త్రీలు సమావేశమై ఉన్నారు. కాకినాడ మహిళల పక్షాన, హిందూ బాలికా పాఠశాల విద్యార్థినుల పక్షాన శ్రీమతి దుర్గాబాయి మరికొంత మంది గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు. 600 రూపాయల నగదు, కొన్ని నగలూ మరికొన్ని చిల్లర మొత్తాలు ఆ సమావేశంలో ఖద్దరు నిధికి చేకూరినాయి. గాంధీజీ, తమ మగవారిని ఖద్దరు ధారణ వల్లనూ, సంఘ సంస్కరణ వల్లనూ మరింత పౌరుషవంతులుగా చేయవలెనని స్త్రీలను హెచ్చరించినారు. శ్రీమతి దుర్గాబాయి ఆయన ఉపన్యాసం అను

వదించినారు

ఆ తరవాత మునిసిపల్ ఆఫీసు ఆవరణలో మరొక మహాసభ జరిగింది సభకు అయిదు పౌరసంఘాలు విద్యార్థులు పురపాలక సంఘము జిల్లా బోర్డు హిందీ ప్రచార సమితి, వైశ్య సంఘము అంతర్జాతీయ సౌభ్రాత్ర సంఘాల (International Fellowship Assosiation) పక్షాన సన్మాన పత్రాలు సమర్పించినారు పెద్ద ముత్తాయి పిల్లర మొత్తాని కలిసి అక్కడ ఖద్దరు నిధికి 4 వేల రూపాయల విరాళం సమకూరింది గాంధీజీ తనకు సమర్పించిన సన్మాన పత్రాలకు కృతజ్ఞత తెలుపుతూ ఆపట్టణంలోని భాగ్యవంతులు ఖద్దరు ఉద్యమానికి సహాయం చేయవలసినంతగా చేయడం లేదని అన్నారు ఇందువల్ల వారు తమ దేశీయులు తమ వస్త్రాలను తాము ఉత్పత్తి చేసుకొనే టందుకు తగినంత శక్తిమంతుల య్యేటందుకుగానీ, ఆకలితో అల్లాడుతూన్న తమ సోదరులకు సహాయం చేయడానికిగానీ యిష్టపడడం లేదని అనుకోవలసి వస్తుందని, 'దరిద్రనారాయణ సహాయార్థం భాగ్యవంతులు ఉదారంగా సహాయం చేయవలెనని గాంధీజీ ఉత్తేజకరమైన ఉపన్యాసం చేసినారు

మే 6 వ తేది ఉదయం 7 45 గంటలకు మధ్యగోదావరి డెల్టా కాంగ్రెస్ నాయకులు శ్రీ నడింపల్లి సుబ్బరాజు, కళా వెంకట్రావుగార్లు గాంధీజీని కలుసుకొని ఆహ్వానించినారు వారు ఆటపూడి క్రాసింగ్ నుంచి 8 మైళ్ళు లంక భూముల్లో కారులో ప్రయాణం సాగించినారు

కొత్తపేట వద్ద కంకరరోడ్డు మీదకు కార్లు చేరేసరికి అక్కడ గుమి గూడిన జనం మహాత్మాజీని ఉద్దేశించి 'జయజయ' ధ్వానాలు చేసినారు పలివెలలో పెద్ద బహిరంగ సభ జరిగింది అక్కడ ఖద్దరునిధికి 1,117 రూపా యలు సమర్పించినారు సభకు వెలుపల కొంత మంది పంచములు నిలబడి ఉండటం చూసి పంచములకు కూడా తక్కిన వారితో సమానంగా సభలో కూర్చుండే హక్కు ఉందని గాంధీజీ అన్నారు తరవాత వారు సభలోకి వచ్చి కూర్చున్నారు సభలో ఒక్క ఒక వృద్ధ బ్రాహ్మణుడు "వర్ణాశ్రమ ధర్మాలు పాడయితే స్వరాజ్యం ఎందుకు" అని ప్రశ్నించినారు "వర్ణాశ్రమ ధర్మమంటే ఏమిటో మీకు తెలియదు" అన్నారు మహాత్మాజీ తరవాత ఆయన అస్పృ శ్యతా నిర్మూలనను గురించి ఖద్దరు ధారణ గురించి, కొన్ని మాటలు చెప్పి నారు

తరవాత మహాత్మాజీ అమలాపురానికి ప్రయాణం సాగించినారు తోవలో ముక్కామలలో 314 రూపాయలు, పుల్లేటికుర్రులో రూ 118-8-0, గంగాల కుర్రులో రూ 116-6-9, అంబాజిపేటలో రూ 115-8-3, పెదపూడిలో 64 రూపాయలు ఖద్దరు నిధికి చేకూరినాయి ముక్కామల నుంచి అమలాపురం వరకు ఉన్న 11 మైళ్ళలోను అనేకమంది రోడ్డు ప్రక్కల ఆయనను ఆహ్వానిస్తూ నిలబడినారు పుల్లేటికుర్రు, అంబాజీ పేటలలో గాంధీజీ కారు నెమ్మదిగా నడుస్తుండగా ప్రజలు ఖద్దరు నిధికి కానుకలు సమర్పించినారు

**అమలాపురంలో**

గాంధీజీ అమలాపురానికి చేరుతూవున్నప్పుడు తగిలిన మధ్య గ్రామాలలో తోవంతా స్వాగత తోరణాలతోను, నీతి వాక్యాలతోను, స్వరాజ్య జండాల దండలతోను చూడ ముచ్చటగా ఉన్నది మహాత్మాజీ ఆయన బృందం అమలాపురం రహదారి బంగాళాలో బస చేసినారు

సాయంకాలం గాంధీజీ బయటకు బయలుదేరే ముందు నడింపల్లి సుబ్బరాజుగారి కుటుంబం ఆయనకు అభివందనలు సమర్పించి, 118 రూపాయలు నగదు, 400 రూపాయల విలువగల నగలు ఖద్దరు నిధికి కానుకగా ఇచ్చినారు సుబ్బరాజుగారు ప్రత్యేకంగా 555 రూపాయల నగదు, 5 బంగారు ఉంగరాలు సమర్పించినారు మరొక విలువగల వజ్రపు టుంగరం గాంధీజీకి భక్తిపురస్సరంగా దువ్వూరి సోమయాజులు (వకీలు)గారు 90 రూపాయల విలువగల బంగారు చేతి గడియారం 120 రూపాయల విలువగల బంగారు గొలుసుతో సహా ఖద్దరు నిధికి విరాళంగా యిచ్చినారు మరొక పెద్ద మనిషి 800 రూపాయల విలువగల బంగారు గొలుసుతో సహా మరొక ఖరీదయిన వెండి గడియారం కూడా ఇచ్చినారు సాయంకాలం 5 30 గంటలకు గాంధీజీ కారు రహదారి బంగాళానుంచి బయలుదేరింది ఆయన కారు పెద్ద బజారు వీధిగుండా నడుస్తున్న కొద్దీ జన సమూహం అంతకంతకు మితిమీరి పోయింది అందువల్ల ఆయన కారు సహకార ఖద్దరు భాండారం దగ్గర ఆగడం దుర్లభ మయింది ప్రజలు ఒక ఏర్పాటులో ఆయన చేతిలో సన్మాన పత్రం సమర్పించినారు వెంటనే ఆయన తిన్నగా పసఫ్ నాటకశాలలోని మహిళా సభకు వెళ్ళినారు సభ నిశ్శబ్దంగా ఉంది స్త్రీలు ప్రదర్శించిన క్రమ శిక్షణకు మహాత్మాజి వారిని అభినందించినారు కాకినాడ వాస్తవ్యురాలు శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయిగారు గాంధీజీ ఉపన్యాసం చక్కగా అనువదించినారు ఆ సమావేశంలో 408 రూపాయల నగదు, 800 రూపాయల విలువగల నగలు గాంధీజీకి సమర్పించినారు

బోర్డు హైస్కూల్ ఆవరణలో బహిరంగ సభ జరిగింది సభలో పదివేల మంది ప్రజలు ఉన్నారు మహాత్మాజీ ఎత్తయిన వేదిక మీద ఆసీనులై యూనియన్ బోర్డునుంచి వైశ్యసంఘంనుంచి ఆహ్వాన పత్రాలతో సహా 2,887 రూపాయల ఖద్దరు నిధిని స్వీకరించినారు వైశ్యసంఘం 1116 రూపాయలు ఇచ్చినారు మహాత్మాజీ వారికి కృతజ్ఞత తెలుపుతూ వారిచ్చిన మొత్తం చాలదని, తనకు సమర్పించిన చేతి గడియారాలు మొదలయిన వస్తువులనుకొని మరికొంత సొమ్ము ఈయవలసిందని సభ్యులను కోరినారు

ఆయన ఉపన్యాసానంతరం చట్రాలలో బిగించిన సన్మాన పత్రాలను వేలం వేయగా శ్రీ వి అచ్యుతలింగం ఒకదానిని 15 రూపాయలకు కొన్నారు కోఆపరేటివ్ స్టోర్స్ వారిచ్చిన సహకార పత్రం యన్ వి రత్నం 10 రూపాయలకు కొన్నారు చెన్నా వీరరాజుగారు, అల్లూరు సీతారామరాజు ఛాయా

ఎంనం 6 రూపాయలను కొన్నారు. సాయంకాలం 6 30 గంటలకు మహాత్మాజీ ఆయన బృందము నడవ ప్రయాణం పడవల దగ్గరకు వెళ్ళి... మహాదేవుడు ఇచ్చిన 116 రూపాయలతో సహా 191 రూపాయల మొత్తం ఖద్దరు నిధికి వచ్చినది. ఇక్కడ పి. రామస్వామి, వకీలు శ్రీరామమూర్తిగారు మహాత్ముని రాజోలుకు ఆహ్వానించినారు.

మహాత్మాజీ రాజోలు చేరేసరికి రాత్రి 8 గంటలయింది. త్రోవలో ప్రజల గుంపులు ఆయనను అత్యుత్సాహంతో అభినందించినారు. నగరంలో 168 రూపాయలు, జగ్గన్నపేటలో 100 రూపాయలు గ్రామస్థులు ఖద్దరు నిధికి ఇచ్చినారు. రాజోలులో బొన్నాడ సూర్యారావుగారి భవనంలో గాంధీజీ ఆయన బృందం విడిది చేసినారు.

రాజోలు నుంచి ఆ రాత్రే తాటిపాక వెళ్ళినారు. అక్కడ స్త్రీలు 750 రూపాయల విరాళం, గ్రామస్తులు మరొక 250 రూపాయలు విరాళం ఖద్దరు నిధికి సమర్పించినారు. చాలామంది స్త్రీలు బంగారు నగలను వెండి ఉంగరాలను, బంగారు గాజులను, ఇంకా ఇతర నగలను గాంధీజీకి భక్తి పూర్వకంగా సమర్పించినారు. వాటి విలువ 250 రూపాయలని అంచనా వేయబడింది. ఆ రాత్రి గన్నవరంలో విశ్రాంతి తీసుకొని మరునాడు ఉదయం కొబ్బర్లంక మీదుగా వారు రాజమహేంద్రవరానికి వెళ్ళినారు. త్రోవలో ముంగండలోను, రావులపాలెంలోనూ చెరి 116 రూపాయలున్నూ, ర్యాలిలో 850 రూపాయలు, పేరవరంలో 250 రూపాయలు ఖద్దరు నిధికి చేకూరినాయి. గాంధీజీ ఉదయం 10 45 గంటలకు రాజమహేంద్రవరం చేరినారు.

**రాజమహేంద్రవరంలో**

గోదావరి సెంట్రల్ డెల్టాలోని ఒక కొననుంచి రాజమహేంద్రవరం వరకూ చేసిన ఈ ప్రాంతాల ప్రయాణం గాంధీజీకి చాలా ఆనందదాయకంగా నడిచింది. సాయంకాలం ఆయన రాజమహేంద్రవరంనుంచి దోసకాయలపల్లికి వెళ్ళినారు. అక్కడ సభ శాంతంగా జరిగింది. సన్మానపత్రంతోసహా 800 రూపాయల ధనపు సంచి ఆయనకు కానుకగా సమర్పించినారు. అదిగాక మరొక 150 రూపాయలు మొత్తం కూడా ఆయన స్వీకరించినారు. బహిరంగ సభలో పాలువంచుకుతో నిమిత్తం లేకుండా అన్ని కులాలవారు ఏకంగా కలిసి కూర్చున్నందుకు ఆయన సభ్యులను అభినందించినారు. నేటాల్‌లో జన్మించిన 18 ఏండ్ల బాలకుడు గాంధీజీ ఎదుటబడి తనను సబర్మతీ ఆశ్రమానికి తీసుకొని పొమ్మని ప్రార్థించగా గాంధీజీ అతని కోరికకు ఆనందించి మరునాడు తనను సీతానగరంలో కలుసుకొమ్మని అతనిని ఆదేశించినారు. మహాత్మాజీ రాజమహేంద్రవరానికి తిరిగివచ్చి పురమందిరానికిపోయి అక్కడ స్త్రీ సమాజం వారి సన్మానపత్రంతోసహా 800 రూపాయల విరాళం స్వీకరించినారు. అవికాక నగలూ కొన్ని చిల్లర మొత్తాలు కలిసి 200 రూపాయలు ఖద్దరునిధికి సమ

ఆరోజు రాత్రి 7-50 నిమిషాలకు పాల్‌చౌక్‌లోని బహిరంగసభకు గాంధీజీ చేరుకొన్నారు. అక్కడ దాదాపు 20వేల మంది ప్రజలు సమావేశమయినారు. రాజమండ్రి స్త్రీల సంఘం, తాలూకా బోర్డు, యువజన సమితి, గోరక్షణ సభ మొదలయిన సంస్థలవారు గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు. సన్మాన సంఘంవారు 1183 రూపాయిలున్నూ, వర్తక సంఘంవారు లజపతి రాయినిధికి ప్రత్యేకించిన 120 రూపాయలతో సహా 2,060 రూపాయలు గాంధీజీకి సమర్పించినారు. జర్మన్‌సిల్వరు వర్తకులు 1403 రూపాయలున్నూ, రంధి సుబ్బారావుస్వామిగారు 216 రూపాయలున్నూ, మరొక దేశభక్తుడు 116 రూపాయలున్నూ గాంధీజీకి భక్తిపూర్వకంగా ఇచ్చినారు.

గాంధీజీ మునిసిపల్ సన్మానపత్రం గురించి ప్రసంగిస్తూ మద్యనిషేధము అస్పృశ్యతా నివారణల భారం తనపైన పెట్టినందుకు సంతోషించినా మునిసిపల్ సభ్యులు తమ బాధ్యత తీరినట్లు భావించడం పొరపాటు. ఆ రెంటి సందర్భంలోను అందరూ సమాన బాధ్యత వహించవలెనని అన్నారు. మునిసిపల్ సభ్యులు మద్యనిషేధ ప్రచారం చేయడమేకాక దానిని శాసనరూపంలో తీసుకొని రావడానికి సర్వవిధాలా ప్రయత్నించవలెనని కూడా అన్నారు. నగర పారిశుద్ధ్యం అభివృద్ధిచేసి దానిని ఆదర్శ మునిసిపాలిటీగా చేయవలెనని, ముఖ్యంగా యాత్రాస్థానాలుగా ఉన్న పుణ్యక్షేత్రాలలో ఆ పని అత్యావసరమనీ అన్నారు. ఇతర సన్మానపత్రాలను గురించి ఉదాహరిస్తూ విద్యావంతులైన యువకులు ఇండియన్ మిల్లుబట్టలను ప్రోత్సహించకూడదని ఖద్దరునే వాడవలెనని, విదేశ వస్త్ర బహిష్కారం జయప్రదంగా జరగవలెనంటే ఖద్దరు తప్ప మరొకటి ధరించకూడదనీ ఉద్బోధించినారు. అంతటితో సభ ముగిసింది.

## సీతానగరం తోవలో

గాంధీజీ రాజమహేంద్రవరం నుంచి (మే 8) ఉదయం 5 45 గంటలకు సీతానగరానికి ప్రయాణమయినారు. తోవలో దామెర్ల చిత్రకళా మందిరం చూసినారు. గాంధీజీ చిత్రకళా మందిరం చూసిన తరవాత శ్రీమతి సత్యవతి ఆమె చిత్రించిన పటం గాంధీజీకి కానుకగా సమర్పించగా గాంధీజీ దానిని తరవాత పంపమన్నారు.

అక్కడ నుంచి కాతేరు వెళ్ళినారు. అక్కడ 116 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు.

కటరంలో ఒక నవరసు, రాజంపేట, వెదుళ్లపల్లి గ్రామాలలో చెరి 116 రూపాయలు చొప్పున ఆయా గ్రామస్థులు ఖద్దరు నిధికి ఇచ్చినారు. ఉదయం 7 20కి గాంధీజీ ఇనుగంటివారిపేట చేరినారు. అక్కడ జాతీయ పాఠశాల దగ్గర ఆగి లోపలకుపోయి పిల్లల క్షేమసమాచారాలు అడుక్కొన్నారు. పిల్లలను మీరు వడక గలరా అని ప్రశ్నిస్తూ వెంటఉన్న డాక్టరు సుబ్రహ్మణ్యంగారిని చూసి "నేను ఎప్పుడూ అటువంటి ప్రమాదకరాలయిన ప్రశ్నలు వేస్తుంటాను"

అన్నారు. అక్కడి వారు ఖద్దరు నిధికి 300 రూపాయలిచ్చినారు. రాసేదారు 3 రామశేషగిరిరావుగారు, వెంకటరత్నంగారునూ చెరి 100 రూపాయలు గాంధీజీ కారు వారి ఇళ్ళముందునుంచి వెళుతున్నప్పుడు సమర్పించినారు.

ముగ్గులలో శ్రీపాద వెంకటరమణయ్యగారు 50 రూపాయలు, ఆయన సోదరి 12 రూపాయలు రుద్రంవీరాస్వామి తదితరులు 116 రూపాయలు, 282 రూపాయలు సమష్టిగా గ్రామవాసులునూ ఖద్దరు నిధికిగాను గాంధీజీకి ఇచ్చినారు. ఆ గ్రామంలో నుంచి గాంధీజీ కారు పోతుండగా పత్తిపాటు సుబ్బమ్మగారు ఒక నవరసు, మరిముగ్గురు మూడు నవరసులు ఇచ్చినారు.

బతాపురంలో రాయులయ్య గారింట్లోని స్త్రీలు 10 మంది రాట్నాల మీద నూలు వడుకుతున్న ప్రదర్శన చూసినారు. రాయలయ్యగారి తల్లిగారు గాంధీజీకి 58 రూపాయల ఇచ్చినారు. ఇంకా 600 రూపాయలు మొత్తం వసూలైనది.

తగాపాతి రాపాక వెళ్ళినారు అక్కడ ఒక అసహాయవాది 66 రూపాయలిచ్చినారు. శ్రీ గామేని బ్రహ్మన్న 116 రూపాయలు, మరి ఇద్దరు చెరి 10 రూపాయలు ఇచ్చినారు. గాంధీజీ ఆయన బృందం సీతానగరము నిర్ణీత సమయంకంటె కొంచెం ముందుగా వెళ్ళినారు. పానుగంటి సూర్యనారాయణ పంతులుగారి ఇంటి ముందు కార్లు ఆగినాయి. గాంధీజీ దేశభక్తునితోను తనతోవచ్చిన స్త్రీలతోను పంతులుగారి ఇంటిలోకిపోయి ఆయన భార్య బంధువులు నూలువడుకుతూండగా చూసినారు. వారు లేచి గాంధీజీకి నమస్కరించినారు. డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు ఆ ఇంటిలోని స్త్రీలను గాంధీజీకి పరిచయం చేసినారు. సూర్యనారాయణరావుగారు 116 రూపాయలు, ఆయన భార్య ఒకనవరసు విలువగల బంగారు గాజుల జతతోసహా ఒక రూపాయి, ఆయన సోదరి 10 రూపాయలు ఖద్దరు నిధికి ఇచ్చినారు.

## గౌతమీ సత్యాగ్రహాశ్రమంలో

మహాత్మాజీ ఆయన బృందం గౌతమీ సత్యాగ్రహాశ్రమానికి చేరిన తరవాత అక్కడి విడిది వారికి హాయిగా ఉత్సాహజనకంగా ఉన్నది. ఆశ్రమ మందిరాలన్నీ స్వరాజ్య జండాలతో ఆనంద దాయకంగా ఉన్నవి. సమావేశ భవనం ఖద్దరుతో ఆచ్ఛాదింపబడింది. ద్వారాలకు పట్టివేళ్ళ తడికెలు వ్రేలాడుతున్నవి.

మహాత్మాజీ ఉన్న హాలులో సాయంకాలం 3 గంటలు మొదలు 4 40 వరకు ఆంధ్రదేశంలోని ఖాదీ కార్యకర్తల సభ జరిగింది. 100 మందికిపైగా ఖాదీ కార్యకర్తలు సమావేశమయినారు. వారిలో దేశభక్త వేంకటప్పయ్యపంతులు, డాక్టర్ పట్టాభి సీతారామయ్య, మాగంటి బాపినీడు, బందావియ్యన్న, గొల్లపూడి సీతారామశాస్త్రి, చిక్కిన వెంకటరత్నం, మోతే నారాయణరావు, దుర్గాబాయి, వేదాంతం కమలాదేవి, పాపాయమ్మ, బి యల్ నరసింహం, తెన్నేటి విశ్వ

నాథం దిగుమర్తి వెంకటరామస్వామి మొదలయినవారు ఉన్నారు ఖాదీ పరిశ్రమకు ధనసహాయము, ఖాదీ ఉత్పత్తి, ఖాదీ కేంద్రాల అభివృద్ధిని, ఖాదీ డిపోల స్థాపనములను, ఖద్దరు నిధి వసూళ్ళను గురించి చర్చ జరిగింది

సాయంకాలం 5-30 గంటలకు మహాత్మాజీ తన వసతి గృహం నుంచి వెలుపలకు వచ్చి తన దర్శనం కోసం అప్పటికే చాలా సేపటి నుండి వేచిఉన్న రెండువేల మంది ప్రజలకు కనిపించినారు తరువాత ఆశ్రమమంతా చూసి అందులోని వివిధ కార్యక్రమములను గురించి తెలుసుకొన్నారు ఆశ్రమ సంస్థాపకుడు డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు ఆయనను మొట్టమొదటగా రాష్ట్రభాషా కుటీరానికి తీసుకొని వెళ్ళినారు అక్కడ 40 మంది విద్యార్థులు హిందీ నేర్చుకొంటున్నారు గాంధీజీని చూడగానే వారందరూ లేచి ఆయనకు నమస్కరించినారు హిందీలో వారందరూ ఎట్లా మాట్లాడగలరో పరీక్షించడానికి గాంధీజీ చిరునవ్వుతో హాస్యమాడుతూ వారిని అనేక ప్రశ్నలు వేసినారు తరవాత గాంధీజీని డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు, తాను నడుపుతున్న అల్లోపతి ఉచిత వైద్యశాలకు తీసుకొని వెళ్ళినారు మహాత్మాజీ అదిచూసి దానికి దగ్గరగా రోగులు ఉన్న వార్డులను కూడా చూసినారు ఆశ్రమమంతా పరిశుభ్రంగా ఉన్నది ప్రతి వస్తువు సక్రమంగా ఉండవలసినచోట ఉన్నది అప్పుడు గూటాల శాంపురిస్తుడు నాయుడు బ తిరుమల చారిగారు మహాత్మాజీకి 116 రూపాయలిచ్చినారు అక్కడ నేత పరిశ్రమాలయంలో 6 మరమగ్గాలు పనిచేస్తూండటం గాంధీజీ చూసినారు తరవాత ఆయన "కాంగ్రెస్" ముద్రణాలయం చూసినారు అక్కడ 'కాంగ్రెస్' పత్రికా సంపాదకులుగా ఉన్న మద్దూరి అన్నపూర్ణయ్య, రామచంద్రుని వెంకటప్ప క్రొవ్విడి లింగరాజు గార్లు గాంధీజీని ఆహ్వానించినారు ఆముద్రణాలయంలో ఆంధ్రపత్రికా సంపాదకులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు బహూకరించినది గాంధీజీ, ఒక్క ట్రెడిల్ తో ఇంతపని ఎట్లా చేస్తున్నారని ఆశ్చర్య పడినారు రామచంద్రుని వెంకటప్పగారిని డాక్టరు సుబ్రహ్మణ్యంగారు మహాత్మాజీకి పరిచయం చేస్తూ ఆయన మద్రాసులో నీల్ సత్యాగ్రహ ఉద్యమం నడిపినవాడనీ, బులుసు సాంబమూర్తిగారికి జైలులో సహచరులుగా ఉన్నవారనీ చెప్పినారు అక్కడ ప్రచురిత మవుతున్న తెలుగు వారపత్రిక "కాంగ్రెస్" సంచిక ఒకటి గాంధీజీకి ఇచ్చినారు పత్రిక స్వయం పోషకంగా ఉందని, 900 మంది చందాదారులు ఉన్నారని డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు గాంధీజీకి చెప్పినారు

తరవాత వారు ఖాదీభండారమున్న భవనానికి వెళ్ళినారు అక్కడ ఇంకా కొంతసొమ్ము ఖద్దరునిధికి సమకూరింది ఆభండారములో ఆశ్రమంలోతయారయిన నూలు ఖద్దరే కాక మాగాలపల్లి తదితర ప్రదేశాలలో ఉత్పత్తి అయిన ఖద్దరు కూడా ఉన్నది (శ్రీ) కె శేషగిరిరావుగారు గాంధీజీకి పట్టు లేసు అంచులు గల ఒక జత చద్దర్లు కానుకగా ఇచ్చినారు ఒక నేత మనిషి తాను సొంతంగా ప్రత్యేకం గాంధీకోసం నేసిన ఎర్ర అంచులు గల రెండు అంగవస్త్రాల జతను

కూడా గాంధీజీకి సమర్పించినాడు వాటిని గాంధీజీ సొంతానికి వాడుకోవలెనని ఆయన అర్థించినాడు శ్రీమతి కస్తూరిబాయికి అగురున నేసిన చీరలు సమర్పింప బడినాయి ఈ బట్టలను తాను వాడుకొనజాలనని మహాత్మాజీ డాక్టర్ సుబ్రహ్మణ్యం గారికి చెప్పి వాటిని డబ్బులోకి మార్చమని కోరినాడు ఆ తరవాత గాంధీజీ వారి బృందం గాలిలో ఎత్తుగా రెపరెపలాడుతూన్న జాతీయ జండా గల ఆశ్రమ మధ్య ప్రదేశానికి వచ్చి అక్కడ నుంచి మోటారులో సీతానగర గ్రామంలోకి వెళ్ళినారు ఆ గ్రామస్థులు గాంధీజీని హృదయానందకరంగా ఆహ్వానించినారు

ఆ గ్రామస్థులు సమిష్టిగా 300 రూపాయలు, షావుకార్లు మొత్తంగా 280 రూపాయలు ఖద్దరు నిధికి ఇచ్చినారు కొంగరవారి కుటుంబము, కొత్త వారి కుటుంబం చెరి 116 రూపాయలు ఇచ్చినారు రాజపాలెం కొండేపూడి గ్రామాలలో 558 రూపాయలు ఖద్దరు నిధికి లభించినాయి రహితాపురం పాఠశాలలోని పంచమ విద్యార్థులు మహాత్మాజీకి రూ 8-10-0 లు భక్తి పూర్వకంగా సమర్పించినారు గాంధీజీ తిరిగి సీతానగర ఆశ్రమానికి రాత్రి 7-30 లకు చేరినారు

ఆశ్రమంలో సమావేశమయిన పెద్ద సభలో గాంధీజీ ఉపన్యసించినారు ఉపన్యాసానంతరం మలగడ చంద్రయ్యగారు ఆశ్రమానికి నాలుగువేల రూపాయల విలువగల ఎనిమిది ఎకరాల భూమిని ఉదారంగా దానం చేసినట్లు గాంధీజీ సంతోషంతో ప్రకటించినారు తరవాత ఆయన హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులయిన వారికి సర్టిఫికెట్లను పంచిపెట్టినారు ఆ సర్టిఫికెట్లు పొందిన వారిలో శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య గారొకరు రాత్రి 8 గంటలకు మహాత్మాజీ విశ్రాంతి తీసుకొన్నారు

మే 9 ఉదయం 5-50కి గాంధీజీ, దేశభక్త కొండ వేంకటప్పయ్య, డాక్టర్ బి సుబ్రహ్మణ్యం, కస్తూరిబాయి, జనాబ్ ఖమూమ్‌సాహెబ్‌గార్లతో కలిసి మోటారులో సీతానగరానికి 8 మైళ్ల దూరంలో ఉన్న వంగలపూడికి వెళ్ళినారు అక్కడ నిరుకొండ వెంకటరత్నంగారు 500 రూపాయలు, సూరిరెడ్డి కృష్ణమూర్తిగారు 116 రూపాయలు, ముంగు సూర్యారావుగారు 50 రూపాయలు ఖద్దరునిధికి విరాళంగా ఇచ్చినారు 200 రూపాయల విలువగల కొన్ని నగలు, కొన్ని నవసులూ కూడా లభించినాయి ఈ ప్రాంతంలో ఈ ఆశ్రమ ప్రత్యక్ష యాజమాన్యంకింద 12 గ్రామాలవారు నూలువడకటం, నేతపనులు నిర్వర్తిస్తున్నారు

గాంధీజీ ఉదయం 6-20కి సీతానగరం తిరిగి వచ్చినారు వంగలపూడి నుంచి పురుషోత్తమపట్నానికిపోయి అక్కడ గోదావరినిదాటి పోలవరానికి చేరవలెనని మొట్టమొదటి ఏర్పాటు కాని అక్కడ గాంధీజీని ఆయన బృందాన్ని గోదావరిని దాటించడానికి పోలీసు వారి భయం వల్ల పడవసరంగులు వెనక్కు తగ్గినారు అందువల్ల అక్కడ స్టీమ్‌లాంచీలుగానీ, బోట్లుగానీ లేక పోయినాయి

ఆకారణంగా వారు సీతానగరంనుంచి ప్రత్యేక స్టీమ్ లాంచీలో పోలవరం పోవలె నని నిర్ణయించుకొన్నారు. కాని తీరా వారు బయలుదేరే ముందు నది ఒడ్డుకు పోవడానికి సౌఖ్యం లేక బురదలో మోటారు కారు సరిగా నడవదేమోనని భయపడినందువల్ల గాంధీజీతో సహా అందరూ అరగంటలో ఒడ్డుకు నడచి వెళ్ళినారు. తరువాత స్టీమ్‌లాంచీలో ఒక గంటలో పోలవరం చేరుకొన్నారు.

## పోలవరంలో

గాంధీజీ స్టీమ్‌లాంచిలో ఉన్నంత సేపు అయిన పని అయినదనుకొంటు న్నారు. స్టీమర్ పోలవరం చేరేసరికి ఆనది ఒడ్డు పెద్దకోట గోడవలె ఉండి దాని పునాదులు నదిగర్భంలో ఉన్నట్లు కనిపించింది. అది నిలువుగా సూటిగా అరవై అడుగుల ఎత్తుంది. మహాత్మాజీ ధైర్యంగా ఎక్కినారు. 200 మంది ప్రజలు ఆ ఒడ్డున ఉన్నారు. అక్కడ నుంచి గాంధీజీ ఆయన బృందం మోటారు కారులో గాక రెండెడ్ల బండిలో సభాస్థలానికి వెళ్ళినారు. అక్కడ వారం మూగి ఉన్నారు. మహాత్మాజీ ఆ సందడికి, ఆరేగిన ధూళికి, ఆ గందరగోళా నికి విసుగు చెందినట్లు కనపడలేదు. పైపెచ్చు ఆయన సంభాషణాలోనూ, మాటలలోనూ, సంతోషము, హాస్యమూ కనిపించింది.

## గాంధీజీ ఉపన్యాసము

"పోలీసువారు భయపెట్టటం వల్ల పుష్కర పోత్తమువట్నం దగ్గర ఉన్న నది దాటించడానికి మొట్టమొదట ఒక సుకొన్న పడవ వాళ్లు రాలేదని తెలిసింది. పోలీసువారి బెదరింపులకు దౌర్జన్యానికి లొంగక స్టీమ్‌లాంచి యజమాని శ్రీ చెరుకువాడ రామస్వామి నన్ను దయతో ఇక్కడకు తీసుకొని వచ్చినారు. ఇంతా అయితే ఒకటి మానవ ప్రభుత్వము. ఈ ప్రభుత్వంవారు, వారి నాస్తా హారులూ, మనకు అత్యంతరాలు కలిగించడానికి అనేక పన్నాగాలు పన్నవచ్చు. కాని ఈ సమస్త విశ్వం పాలించే ప్రభువు వాటినన్నిటిని విఘ్నం చేయగలడు" అని ఉపన్యసించిన తరవాత గాంధీజీ ఖాదీనిధి కోసం అర్థించగా ప్రజలు ఆనం దోత్సాహాలతో 800 రూపాయలు సమర్పించినారు. తరవాత గాంధీజీ ఆయన బృందం రాజమహేంద్రవరానికి తిరిగి వచ్చినారు.

రాజమహేంద్రవరంలో గోదావరిలోనే 5 గంటలకు స్టీమ్‌లాంచి చేరింది. అక్కడ దానికి లంగరు వేసినారు. గాంధీజీ 6 45 వరకు స్టీమర్‌లోనే ఉండి తమ పని చూసుకొని ఆ తరవాత రాజమహేంద్రవరం రైలుస్టేషనుకు చేరి మద్రాసు మెయిలులో 3 వ తరగతి బండిలో శ్రీమతి కస్తూరిబాయి, ప్రభా వతి, దుర్గాబాయి గార్లతో నెల్లూరుకు వెళ్ళినారు.

## నెల్లూరు జిల్లా

మహాత్మాగాంధీ ఆయన బృందం మే 10 వ, తేది ఉదయం 5 గంటలకు

కలకత్తా మెయిలు నుంచి నెల్లూరులో దిగినారు. అప్పటికప్పుడే చాలా మంది జనం గాంధీజీని దర్శించడానికి రైలు ప్లాట్‌ఫారం మీద ఉన్నారు. అక్కడ నుంచి ఆయనను వారు బుచ్చిరెడ్డిపాలెం తీసుకొని వెళ్ళినారు.

## బుచ్చిరెడ్డిపాలెంలో

గాంధీజీ ఆయన బృందం 5.45 నిమిషాలకు బుచ్చిరెడ్డిపాలెం చేరినారు. ఒక గంట తరువాత గాంధీజీ ఆపూరి సమావేశ స్థలానికి వెళ్ళినారు. అక్కడ పరిసర గ్రామాల జనం ఆ తెల్లవారు జామునుంచీ గుమిగూడి క్రిక్కిరిసి పోయినారు. సభలో గాంధీజీకి యేడువేల రూపాయల నగదు సమర్పించినారు. తరవాత గాంధీజీ ఉపన్యసిస్తూ "ఆంధ్రదేశమంతటిలోకి బుచ్చిరెడ్డి పాలెం అత్యంత భాగ్యవంతమయిన గ్రామమని నేను విన్నాను. ప్రభుత్వంవారికి ఉన్నట్లే నాకు కూడా నా గూఢచారులు ఉన్నారు. ప్రభుత్వంవారి సుగుణాలేమయినా ఉంటే వాటిని నేను అనుకరించలేకపోయి నప్పటికీ కనీసం ఈ సందర్భంలో వారి దుర్గుణాలనైనా నేను అనుకరించగలను. నా గూఢచారులు ఇక్కడ కనీసం 10 వేల రూపాయలయినా తీసుకోవలెనని నాకు నమ్మకంగా చెప్పినారు. కాబట్టి మిగతా సొమ్ము మీరు పూర్తిచేసి తీరవలె. ఇండియాలోని లక్షలాది బిచ్చగాండ్ర పక్షాన నేనొక బిచ్చకత్తెను. దరిద్రనారాయణుల కోసం నేను యాచిస్తున్నాను. మీరు ఇవ్వగలిగినంతవరకు ఇవ్వకుంటే వారు సంతృప్తిపడజాలరు. ఈ ప్రదేశం నేను విడిచివెళ్లేలోపుగా నాకు మీరు పదివేల రూపాయలు పూర్తి చేయగలని ఆశిస్తున్నాను." ఈ ఉపన్యాసానంతరం బుచ్చిరెడ్డిపాలానికి 6 మైళ్ళ దూరాన ఉన్న ఎల్లాయిపాలానికి గాంధీజీ వెళ్ళినారు. అక్కడ గాంధీజీని ఆహ్వానించడానికి చేసిన ఏర్పాట్లు అద్భుతంగా ఉన్నాయి. తోవలో రాజుపాలెంలో కోవూర్వారు కోపరేటివ్ యూనియన్ వారు, గండవరం గ్రామస్థులు తదితరులు గాంధీజీకి మొత్తం 800 రూపాయలు ఖాదీనిధికై ఇచ్చినారు. తరవాత వారంతా పార్లపల్లి వెళ్ళినారు. పార్లపల్లి, విడవలూరు గ్రామాలలో ఖద్దరునిధికి 600 రూపాయలు స్వీకరించడం జరిగింది. ఊటుకూరులో రూ॥ 1116 లు వచ్చినాయి. గాంధీజీని చూడవలెననే ఆసక్తితో నిరీక్షిస్తూ ఊటుకూరులో చాలా మంది జనం కూడినారు. అక్కడ ఒత్తిడి ఎక్కువగా ఉండటం చేత గాంధీజీ చాలా డస్సిపోయినారు.

తరవాత గాంధీ బృందమంతా మోపూరు వెళ్ళినారు. ఆ రాత్రి అక్కడ ఉన్నారు.

మే 10వ తేదీని గాంధీజీ ఆయన సహచరులతో సహా నెల్లూరునుంచి మోపూరు వెళ్ళినారు. సాయంకాలం ఆయన విడిదిచేసిన ఇంటికి ఎదురుగా అనేకమంది జనం ఆయన దర్శనంకోసం నిరీక్షిస్తున్నారు. సాయంకాలం 5-30 గంటలకు ఆయన బహిరంగసభకుపోయి రేబాల సుందరరామిరెడ్డిగారు ఖద్దరునిధికి సమర్పించిన రూ 1116లు స్వీకరించినారు. అక్కడి సన్మాన

పత్రానికి సముచితమయిన ప్రత్యుత్తరమిచ్చి మోపూరునుంచి అల్లూరుకు వెళ్లి నారు అక్కడ పదివేల మంది జనం బహిరంగసభకు వచ్చినారు అక్కడి ఏర్పాట్లు చాలా బాగున్నాయి గాంధీజీని ఆ ప్రజలు ఉత్సాహకరంగా ఆహ్వానించినారు మహాత్మాజీ వేదికపై ఆసీనులు కాగానే మారంరెడ్డి రామిరెడ్డి గారి గృహిణి ఆయనకు 116 రూపాయలు సమర్పించినారు గ్రామస్థులు ఖద్దరునిధికి రూ 1116లు ఇచ్చినారు తాగుడు మానవలెననీ, ఖద్దరు ధరించవలెననీ, హిందువులు, ముస్లింలు, క్రైస్తవులు అందరూ ఐక్యంగా ఉండవలెననీ అస్పృశ్యతను నిర్మూలించవలెననీ ఇవన్నీ భారత స్వాతంత్ర్యానికి అవసరాలనీ ఉపన్యసించినారు

## కావలిలో

తరవాత గాంధీజీ ఆయన సహచరవర్గం కావలికి వెళ్ళినారు ఆ తెల్లవారుఝామునుంచి కావలిలోని బోర్డుస్కూలు కాంపౌండులో గాంధీజీ దర్శనంకోసం జనం చేరటం ప్రారంభించినారు గాంధీజీ సభాస్థలికి పోయేవరకి సభలో పదివేల మంది ఉన్నారు గాంధీజీ సభావేదికపై ఆసీనులు కాగానే దేశభక్త రంగయ్యగారి ఐదేండ్ల వయసుగల బాలుడు తాను వడికిన కొంత నూలును గాంధీజీకి కానుకగా ఇచ్చినాడు గాంధీజీ చాలా సంతోషించి తన అనురాగ సూచకంగా తనకు బహూకరించిన ఒకదండను ఆ పిల్లవాని మెడలో వేసినారు లజపతిరాయ్ ఖాదీ భండారం పక్షాన, పౌరులపక్షాన రూ 1116లు ఖద్దరునిధికి సమర్పించినారు ఆ ఖాదీ భండారాధిపతులు ప్రత్యేకంగా మరొక 50 రూపాయలున్నూ, తాము నేయించిన బట్టలజతలు గాంధీజీకి సమర్పించినారు శ్రీమతి కస్తూరిబాకు ఒకచీర కూడా ఇచ్చి సత్కరించినారు గాంధీకిచ్చిన ధోవతులు వేలంపెట్టగా తాలూకా ప్రెసిడెంట్ మేనకూర సీతారామిరెడ్డిగారు 116 రూపాయలకు కొన్నారు తరవాత చిత్రాలలో అమర్చిన సన్మానపత్రాలను వేలంపెట్టగా 30 రూపాయలు వచ్చినాయి కావలిలో మొత్తంమీద 1800 రూపాయలు చేకూరింది చింతలపాలెం, సిద్ధన్నకొండూరు ప్రజలవల్ల 116 రూపాయలు లభించినాయి మహాత్మాజీ ఆయన అనుచరులు ఆ రాత్రి కావలి హైస్కూలులో విశ్రాంతి తీసుకొన్నారు

మే 11 ఉదయం కావలినుంచి గాంధీజీ ఉలవపాడుకు బయలుదేరి వెళ్ళినారు అక్కడ సన్మానపత్రంతోపాటు ఖద్దరునిధికి 600 రూపాయలు స్వీకరించినారు తరవాత కందుకూరు వెళ్ళినారు కందుకూరు తాలూకా బోర్డువారు సన్మానపత్రంతోపాటు 1100 రూపాయలు ఖద్దరునిధికి సమర్పించినారు సన్మానపత్రానికి జవాబిస్తూ, గాంధీజీ, తాలూకా బోర్డువారు, తదితర స్థానిక సంస్థలవారు ఖద్దరు ప్రచారం చేయవలసిందనీ, అంటరానితనం రూపుమాపవలసిందనీ, హిందూ మహమ్మదీయ ఐక్యం పెంపొందించవలెననీ, హిందీ భాషను ప్రోత్సహించవలసిందనీ ఉపన్యసించినారు గాంధీజీకి బహూకరించిన

ఖద్దరుబట్టను 65 రూపాయలకు, రెండు ఉంగరాలు 50 రూపాయలకు వేలం వేసినారు. గాంధీజీ ఆ రాత్రి నెల్లూరులో ఉండిపోయినారు.

శ్రీమతి కస్తూరిబా, దుర్గాబాయి, కొండ వేంకటప్పయ్యగార్లతో కలసి గాంధీజీ పాటూరు వెళ్ళినారు తోవలో వారికి ఖద్దరునిధికై 160 రూపాయలు ఇచ్చినారు కస్తూరిబా కొన్ని నిమిషాలు ఉపన్యసించినారు

మహాత్మాజీ ఆయన వర్గంలోని కొందరు కందుకూరులో 11 మే సాయంకాలం బయలుదేరి పినాకినీ సత్యాగ్రహాశ్రమానికి రాత్రి 8 గంటలకు చేరినారు

## నెల్లూరు జిల్లా కందుకూరులో 1929

1929లో గాంధీజీ ఖద్దరునిధి సేకరణ నిమిత్తం నెల్లూరు జిల్లాలో పర్యటన చేసినప్పుడు అప్పటి కేంద్ర శాసనసభ (ఢిల్లీ)లో సభ్యుడుగా ఉన్న శ్రీ బత్తిని పెరుమాళ్ళనాయుడుగారు కందుకూరు తాలూకా కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడుగాను, ఖాదీ కార్యకర్త శ్రీ ఆచంట లక్ష్మీనరసింహంగారు కార్యదర్శిగాను ఉన్నారు నెల్లూరు జిల్లాలో 30 లేదా 40వేల రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించవలసి ఉన్నది వ్యవధి తక్కువ ఉండటంచేత ఈ నిధిని వసూలు చేసే పద్ధతిని గురించి విచారించడానికి జిల్లా కాంగ్రెస్ కమిటీ సమావేశమయింది ఆ సమావేశంలో కందుకూరు తాలూకా వెనకబడిన తాలూకా కావడంచేత రూ 1116లకంటె ఎక్కువ వసూలు చేయలేమని తాలూకా అధ్యక్షులు, కార్యదర్శులు చెప్పినమీదట నెల్లూరుకు 100 మైళ్ళ దూరంలో ఉన్న కందుకూరు చేరడానికి పూర్తిగా ఒకరోజు కేటాయించవలసి ఉంటుంది కనక నిధుల వసూళ్ళకోసం ఏర్పడిన ఈ సంచారంలో కందుకూరు చేర్చడం లాభదాయకం కాదని జిల్లా కాంగ్రెస్ కమిటీలో కొంతమంది వాదించినారు

అప్పుడు కందుకూరు తాలూకా కార్యదర్శి ఆచంట లక్ష్మీనరసింహం గారు "గాంధీగారు ఖద్దరు నిధికోసం వస్తున్న మాట నిజమే ఖద్దరుపని ఎట్లా జరుగుతున్నదో చూడవలెనంటే ఆయన కందుకూరుకు రావలసిందే" అని వాదించినారు దానితో గాంధీగారి కందుకూరు రాక కార్యక్రమంలో చేర్చడం జరిగింది కందుకూరులో అంకమ్మదేవళం ఎదుట విశాలస్థలంలో సభ ఏర్పాటు చేసినారు గాంధీజీ 1929 మే 11 ఉదయం 9 గంటలకు సభాస్థలానికిచేరి ఉపన్యసించినారు సభ సక్రమంగా జరిగేటందుకు శాంతిక్రమాలను కాపాడేటందుకు స్వచ్ఛంద సేనకులను ఆచంట లక్ష్మీనరసింహంగారు తోడ్పడినారు

గాంధీజీ కందుకూరులో ఉండగా ఒకచిన్న సంఘటన జరిగింది గాంధీజీ పి డబ్ల్యు డి బంగాళాలో బసచేసి ఆయుష్కర్మకోసం మంగలిని పిలవమన్నారు ఆ పనిలో ప్రసిద్ధివహించిన గోవిందు అనే మంగలి వచ్చినాడు. (అతడు ఆయుష్కర్మకు వెండికత్తి వాడేవాడు) ఆ మంగలి విదేశీ బట్టలతో ఉన్నాడు. గాంధీజీ అతనిచేత ఆయుష్కర్మకు ఇష్టపడక ఖాదీ ధరించిన మంగలి

వి...ప్పం... తాను ఎ...యింగుకొనిన్నారు. ఈ వార్త ఊరంతా పాకింది గాంధీజీకి ... కాలు కనుగు ... చాలా తంతట ... నే ఖద్దరు ధరించినప్పుడు గాంధీజీ బట్టలు ... సుకొని వెళ్ళినాడు అది అందరికీ ఆశ్చర్యం కలిగించింది

మధ్యాహ్నం 12 గంటల ప్రాంతంలో ... అనే యోధుడయిన రైతు గాంధీజీ దగ్గరకు వచ్చి, ఆయన దర్శనం చెసుకోవడానికి తాను ముప్పయి ఏలభై మైళ్ళ దూరంనుంచి నడిచి వచ్చినానని అలాగే ... చూడనిద చల్దిఅన్నం కూడా తినవలసి ఉకోలేదని చెప్పి చల్దిమూటను ... గా, ఆ రాత్రికి గాంధీజీకి అక్కడి ఉన్నవారు చెప్పినారు గాంధీజీ వెంటనే బయటకు రాగా రైతు నమస్కారంచేసి సంతోషంతో వెళ్ళిపోయినాడు

## ఖాదీ కార్యకర్తల సమావేశము

మధ్యాహ్నం 2 గంటలనుంచి 3 గంటలవరకు తమ బసలో రాట్నం వడుకుకొంటూ గాంధీజీ ఖాదీ కార్యకర్తల సమావేశం జరపినారు ఆయన కిరువైపుల కొండ వేంకటప్పయ్య పంతులుగారు, శ్రీ వేమూరి నారాయణ మూర్తిగారు కూర్చున్నారు ఆ సమావేశంలో అచంట లక్ష్మీనరసింహంగారు మొదలయిన 25 మంది కార్యకర్తలున్నారు కందుకూరి ఏరియాలో ఖాదీ విస్తరణకుగల అవకాశాలను గురించి చర్చ జరిగింది కందుకూరు, కనిగిరి, దర్శి, పొదిలి తాలూకాలు నెల్లూరు జిల్లాలో వెనకబడిన మెట్ట ప్రాంతాలు ఆ ప్రాంతాలలో అటకలమీదగాని, వాకిటలోగాని ఇరవయిఅయిదువేల చర్ఖాలున్నాయని, పనియిస్తే అటకలమీది రాట్నాలు కూడా కిందికి దింపి నూలు వడికేవారు ఉన్నారని, నేతవారు రెండు వేలమంది ఉన్నారనీ వారిలో చాలామంది పారిజనులని, ఆ ప్రాంతంలో పత్తి సమృద్ధిగా పండుతుందనీ, ప్రతి గ్రామంలోను పత్తిగిరకలతోపాటు దూదేకులవారుకూడా ఉన్నారనీ, రైతులు ఖాదీ ఉత్పత్తి చేసికొని ఖాదీని ధరించే అలవాటు ఇంకా పోలేదనీ తమ అన్నగారు శ్రీ సత్యనారాయణ చేసిన విచారణవల్ల ధ్రువపడినట్లు లక్ష్మీనరసింహంగారు గాంధీగారికి విన్నవించినారు అంతేగాక పేదరికంవల్ల పరిసర గ్రామాల నుంచి స్త్రీలు కందుకూరికి ఎనిమిది పదిమైళ్ళ దూరం నడిచివచ్చి వారు కనీసం పదిరోజులు వడికిన 18 వారల నూలును అమ్మిపోసి ఇచ్చి ఒక రూపాయి మజూరి తీసుకొంటున్నారని లక్ష్మీనరసింహంగారు గాంధీజీకి చెప్పినారు అప్పుడు గాంధీజీ 'ఇది నిజమే? సంయుక్త రాష్ట్రాలలోకంటే ఇక్కడ చౌకా?" అని ప్రశ్నించినాగ "అవును" అని అన్నారు లక్ష్మీనరసింహం గారు, వేంకటప్పయ్య పంతులుగారు "లక్ష్మీనరసింహంగారు చెప్పినది నమ్మ వచ్చు" అన్నారు అప్పటికి మధ్యాహ్నం మూడు గంటలయింది గాంధీజీ లక్ష్మీనరసింహంగారితో ప్యారేలాల్‌ను పంపి తాము అక్కడినుంచి బయలు దేరేలోగా అక్కడి యథార్థ పరిస్థితులను సాధ్యమయినంత వివరంగా తెలుసు

కొని రమ్మన్నారు

ప్యారీలాల్, లక్ష్మీనరసింహంగారితో పోయి త్వరత్వరగా వివరాలు వ్రాసుకొని వచ్చేటప్పటికి సాయంకాలం 5-5 నిమిషాలయింది నిర్ణీత కార్య క్రమం ప్రకారం గాంధీజీ 5 గంటలకే ఆయన బసనుంచి వెళ్ళిపోయినారు వెనక కారులో శంకర్ లాల్ బ్యాంకర్ వెళ్ళినారు

గాంధీజీ కందుకూరు వచ్చి వెళ్ళిన నెలరోజులలోనే అఖిలభారత చర్ఖా సంఘ కార్యదర్శి శ్రీ శంకర్ లాల్ బ్యాంకర్ కందుకూరులో చర్ఖా సంఘ ఉత్పత్తి కేంద్రం ప్రారంభం చేసినారు అది ఆంధ్ర ఖాదీ కేంద్రాలలో లాంక్ షైర్ వంటిదని ప్రస్తుతింపబడింది సాలుకు 8 లేదా 10 లక్షల రూపాయల ఖాదిని ఉత్పత్తి చేసిన ఆ కేంద్రం ఇప్పటికి కృషి చేస్తూన్నది

శ్రీమతి కస్తూరిబా గాంధీ, దేశభక్త వేంకటప్పయ్యగార్లు తదితరులు కలసి 11 మే సాయంకాలం బయలుదేరి పూనూరుకు రాత్రి 8 గంటలకు చేరు కొన్నారు

వల్లెపాడులో మహాత్మాజీకి ఖద్దరు నిధికై రూ 714-9-0 సమర్పించడం జరిగింది ఆ రాత్రి అక్కడ విశ్రమించి మరునాడు ఉదయం (12 మే) 7 గంటలకు గంగపట్నానికి, మైపాడుకు వెళ్ళినారు

ఈ గ్రామాలకు బయలుదేరేముందు గాంధీజీ ఆశ్రమంలో బహిరంగ సభలో ఉపన్యసించి 640 రూపాయలు పై చిలుకు ఖద్దరు నిధికి స్వీకరించినారు ఉదయం 8-30 వరకు మైపాడు చేరినారు మైపాడులో చుట్టుపట్ల ఉన్న వెంకన్నపాలెం, కోడూరు, కొరటూరు మొదలయిన గ్రామాలవారు వేరు వేరుగా 30, 57, 47, 30, 5, 7-11-0 రూపాయలు విరాళాలు ఇచ్చినారు గ్రామస్థులు సమష్టిగా 340 రూపాయలిచ్చినారు ఇద్దరు స్త్రీలు 366 రూపాయ లిచ్చినారు మొత్తం ఆ కేంద్రంలో 880 రూపాయలున్నూ, మరికొన్ని నగలూ లభించినాయి అక్కడ కొన్ని నిమిషాలు ఉపన్యసించిన తరవాత అక్కడనుంచి బయలుదేరినారు తోవలో కొంతమంది స్త్రీలు గాంధీజీని ఆపి కొన్ని ఆభరణాలు బహూకరించినారు

## నెల్లూరులో

మే 12 ఉదయం గాంధీజీ ఆయన వర్గం కలిసి మోటారులో సంగం పోయి ఖద్దరు నిధికి 116 రూపాయలు స్వీకరించి తిరిగి నెల్లూరు చేరుకొన్నారు సాయంకాలం కస్తూరిదేవి బాలికా పాఠశాలకు గాంధీజీ పునాదిరాయి వేసినారు 290 రూపాయలు విరాళం ఖద్దరు నిధికి సమర్పించడం జరిగింది ఆ తరవాత వెంకటగిరిరాజాగారి కళాశాల ఆవరణలో సమావేశమయిన బహిరంగ సభకు వెళ్ళినారు అక్కడ గాంధీజీకి నెల్లూరు పురపాలక సంఘం, నెల్లూరు జిల్లాబోర్డు, నెల్లూరు తాలూకా బోర్డు, పాకీవాళ్ళ సంఘంవారు సన్మానపత్రాలు చదివి నారు. ఆరువేల రూపాయలు ఖద్దరు నిధికి సమకూరింది,

సన్మాన పత్రానికి జవాబిస్తూ అస్పృశ్యతా నివారణ, హిందూ, ముస్లిం ఐకమత్యం, ఖద్దరు ధారణలను గురించి గాంధీజీ ప్రసంగించినారు తరివాత ఆయిన స్థానిక అనాథ శరణాలయానికి వెళ్ళి ఒక నాటక ప్రదర్శన చూసినారు

ఇందుకూరు పేట మీదుగా గాంధీజీ నెల్లూరుకు వచ్చినారు ఇందుకూరు పేట కోఆపరేటివ్ యూనియన్ వారు 25 రూపాయలు పౌరులు సమష్టిగా 151 రూపాయలు మహాత్మునికి సమర్పించినారు

Y M C A వారు Y (you) M (must) C (come) A (again) (మీరు మరొకసారి రావలె) అని ఆహ్వానించి 5 రూపాయలు సమర్పించినారు మహాత్మాజీ వారిని అభినందించి తమ నివాసానికి చేరుకొన్నారు అక్కడ సంగమునుంచి శ్రీమతి కస్తూరిబాయిగాంధీ ఆమె వర్గం తిరిగి గాంధీజీని కలుసుకొన్నారు గాంధీజీ సాయంకాలం 6 గంటలకు ఆయన బసచేసిన శ్రీ రేబాల పట్టాభి రామిరెడ్డిగారు బంగళానుంచి బయలుదేరి గోరక్షణ సంఘానికి వెళ్ళినారు

ఆ సంఘ సంస్థాపకుడు నాగరాజు పిచ్చిరాజు 5 రూపాయల 2 అణాల కానీతో ఒక సన్మాన పత్రం ఇచ్చినారు

ఈ తరవాత గాంధీజీ బజారు వీధిగుండా పోతూ ఉండగా ఒక నిష్ఠాగరిష్ఠుడయిన కాంగ్రెస్ కార్యకర్త 116 రూపాయలు సమర్పించినారు ఆయనరే మరొక 287 రూపాయలు ఖద్దరు నిధికి ఇస్తూ 20 రూపాయలు లాలాజీ నిధికి కూడా ఇచ్చినారు

బజారువీధి చక్కగా అలంకరింప బడిఉంది హిందీభాషాభ్యాసకులు కొందరు 50 రూపాయలు ఖద్దరు నిధికి ఇచ్చినారు నెల్లూరు మునిసిపాలిటీవారు వెంకటగిరిరాజాగారి కళాశాలా హాలులో వడుకు నూలు ప్రదర్శనం ఏర్పాటు చేసినారు పాఠశాలలో నూలువడకటం నేర్చుకొనేవారిలో 25 మంది ఉపాధ్యాయులు, 75 మంది విద్యార్థినులు ఉన్నారు 30 మంది బాలికలు హాలులో నూలువడుకుతున్నారు వారిలో ముగ్గురు పంచమ బాలికలు గూడా ఉన్నారు గాంధీజీని ఆయన బృందాన్ని మునిసిపల్ అధ్యక్షుడు,సభ్యులు ఆహ్వానించినారు గాంధీజీ కూడేకలు పనికూడా ప్రవేశపెట్టవలసిందని మునిసిపాలిటీకి సలహా ఇస్తూ నూలువడికేవారు తామూవని ఎందుకు చేస్తున్నారో వారికి తెలియచెప్పవలసిన బాధ్యతకూడా మునిసిపాలిటీకి ఉన్నదన్నారు

## కస్తూరీబా విద్యాలయము

కస్తూరిబా విద్యాసంస్థ నడుస్తున్న చోటనే దాని భవన నిర్మాణానికి గాంధీజీ పునాదిరాయి వేసినారు ఆ సందర్భంలో సమావేశమయినవారి ఎదుట గాంధీజీ ఉపన్యసించినారు ఆ విద్యాలయ సంస్థాపకురాలైన శ్రీమతి పొణకా కనకమ్మగారిని గాంధీజీ అభినందిస్తూ సంస్థ చిరస్థాయిగా వర్ధిల్లవలెనని ఆశీర్వదించినారు గాంధీజీకి సంస్థ పక్షాన 281 రూపాయలనిధి సమర్పించినారు

అదిగాక 162 రూపాయలు అదనంగా వసూలయింది తరవాత ఆయన వెంకట గిరి రాజాగారి కళాశాలా ఆవరణలోని బహిరంగ సభకు వెళ్ళినారు

బహిరంగ సమావేశము

బహిరంగ సభలో నెల్లూరు వకీళ్ళ సంఘంవారు 1708 రూపాయలు తిక్కవరపు రామిరెడ్డి, సిద్ధవరపు రామలింగారెడ్డిగార్లు 560 రూపాయలు, తిక్కవరపు వెంకటరామిరెడ్డి 1000 రూపాయలు, పొట్టిపాళెంవారు 16 రూపాయలు, సంగం పౌరులు 790 రూపాయలు సమర్పించినారు నెల్లూరులో మొత్తం రూ 5,498-1-0 వసూలు అయింది ఎలమెంటరీ స్కూలు విద్యార్థులు 10 రూపాయలు, మునిసిపల్ పాకీవారు సన్మాన పత్రంతో సహా 4-6-2లు ఇచ్చినారు నెల్లూరు కోఆపరేటివ్ బాంకింగ్ యూనియన్ 83 రూపాయలు, చిల్లర్లుగా ఇతరులు 19 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు చత్రాలలోని సన్మాన పత్రాలు వేలంవేయగా 85 రూపాయలు వచ్చినాయి శ్రీముకుంద రావుగారు, విస్తృతం చేసిన మహాత్మజీ చిత్రపటం ఆయనకు బహూకరించగా ఆయన దానిని వేలంవెడుతూ "నన్ను నేను అమ్ముకొంటున్నాను" అన్నారు హాస్యంగా దానిని రేబాల పట్టాభిరామిరెడ్డిగారు 80 రూపాయలకు కొన్నారు నెల్లూరు జిల్లాబోర్డువారు, నెల్లూరు మితపాన సమితి, నెల్లూరు మున్సిపల్ కౌన్సిల్ వారు, నెల్లూరు వకీళ్ళసంఘంవారు, నెల్లూరు కోఆపరేటివ్ బాంక్ వారు, నెల్లూరు మున్సిపల్ పాకీవారు మహాత్మాజీకి సన్మానపత్రాలు సమర్పించినారు మితపాన సమితివారి సన్మానపత్రం స్వీకరిస్తూ "ఈ సమితి ఖద్దరు నిధికి విరాళం ఇవ్వకుండటంలో కూడా తగినంత నిగ్రహాన్ని ప్రదర్శించింది" అన్నారు గాంధీజీ

సన్మాన పత్ర స్వీకరణానంతరం గాంధీజీ 10 వేల మందివున్న మహాసభలో హిందీభాషలో ఉపన్యసించినారు తనకు సన్మాన పత్రాలు సమర్పించిన వారందరికీ మహాత్మాజీ కృతజ్ఞతాభివందనలు తెలిపినారు గాంధీగారి హిందీ ఉపన్యాసాన్ని దేశభక్త కొండ వేంకటప్పయ్యపంతులుగారు అనువదించినారు

ఈ రోజంతా గాంధీజీ మౌనవ్రతం అవలంబించినారు రేబాల పట్టాభి రామిరెడ్డిగారి ఇంట్లో పినాకిని ఆశ్రమ భవిష్యత్తును గురించి ఖద్దరు అభివృద్ధి ప్రణాళికలను గురించి నెల్లూరు జిల్లా కమిటీ కార్యకర్తలు చర్చించినారు మహాత్మాజీ రాత్రి 7 గంటలకు మౌనవ్రతం విరమించినారు. అప్పుడు రేబాల పట్టాభి రామిరెడ్డిగారు రూ 116లు, వారి నాయనమ్మగారు 500 రూపాయలు ఖద్దరు నిధికోసం గాంధీజీ చేతులలో ఉంచినారు

ఇంతటితో నెల్లూరు జిల్లా సంచారం ముగిసింది నెల్లూరులో ఖద్దరు నిధికి సుమారు 28 వేల రూపాయలు, లాలాజీ నిధికి 700 పైచిలుకు వసూలైనట్లు బెజవాడ సుందర రామిరెడ్డిగారు ప్రకటించినారు. ఈ సందర్భంలో పినాకిని

సత్యాగ్రహాశ్రమం గురించిన చరిత్ర సంగ్రహంగా వ్రాయడం సమంజసంగా ఉండగలదని భావిస్తున్నాము

## పినాకిని సత్యాగ్రహ ఆశ్రమము

ఆంధ్ర దేశంలో స్థాపించిన సత్యాగ్రహాశ్రమాలలో పినాకిని సత్యాగ్రహాశ్రమం మొట్టమొదటిదని చెప్పవచ్చు ఇది సబర్మతి ఆశ్రమ పద్ధతుల మీద స్థాపితమైంది ఆ ఆశ్రమం పినాకిని నది ఒడ్డున పల్లెపాడువద్ద ఉన్నది పల్లెపాడు, నెల్లూరుకు 6 మైళ్ళ దూరంలో ఉన్న ఒక శ్రోత్రియ గ్రామము

1915 లో దక్షిణాఫ్రికానుంచి మహాత్మాజీ ఇండియాకు వచ్చినప్పుడు ఆయనను మద్రాసులో 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా' సొసైటీ సభ్యుడు శ్రీ దిగుమర్తి హనుమంతరావుగారు కలుసుకొన్నారు 'సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ' వారికి గాంధీజీకి సత్యాగ్రహ సిద్ధాంతంలోను ఆచరణలోను భిన్నాభిప్రాయాలు కలిగినాయి కాని హనుమంతరావుగారికి మాత్రం సత్యాగ్రహ సిద్ధాంతంలోనూ, ఆచరణలోనూ కూడా నమ్మకం ఉండటం చేత ఆయన సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి సబర్మతీ సత్యాగ్రహాశ్రమంలో చేరినారు ఆయన అక్కడ ఉండగా పల్లెపాడు కాపురస్థుడు చతుర్వేదుల వెంకట కృష్ణయ్యగారు కూడా ఆ ఆశ్రమంలో చేరినారు గాంధీజీ 'రౌలట్ ఆక్టు'కు ప్రతికూలంగా సాగించిన ప్రప్రథమ సత్యాగ్రహోద్యమం పురస్కరించుకొని ఈ ఉభయులు సత్యాగ్రహ సందేశం దేశంలో ప్రచారం చేయవలెనని ప్రారంభించినారు అందుకోసం సబర్మతీ ఆశ్రమ పద్ధతులపై ఆంధ్ర దేశంలో ఒక ఆశ్రమం స్థాపించవలెనని గాంధీజీ వారికి సలహా ఇచ్చినారు అప్పుడు వారుభయులు వెంకటకృష్ణయ్యగారి సొంత ఊరయిన పల్లెపాడు (నెల్లూరుకు 6 మైళ్ళ దూరం)లో నిరంతరం ప్రవహించే పినాకిని నది ఒడ్డున ఆ ఆశ్రమాన్ని స్థాపించడం బాగుంటుదని భావించినారు పల్లెపాడు, జిల్లా ముఖ్య స్థానమయిన నెల్లూరుకు సమీపంలో ఉండటంచేత అక్కడ అన్ని సౌకర్యాలు చేకూరగలవనీ ప్రజల నైతిక, ఆర్థిక సహాయంకూడా ఉంటుందనీ వారభిప్రాయపడినారు అది పల్లెటూరు కావటంచేత అస్పృశ్యతా సమస్య తీవ్రరూపంలో ఉన్నందున సర్వోదయ సిద్ధాంతాలను అక్కడ ఆచరణలో పెట్టడం అత్యవసరమని కూడా వారు తలంచినారు

హనుమంతరావుగారితో పరిచయంగల కొంతమంది గుజరాతీ స్నేహితులు ఆయన నిరాడంబరతను, నమ్రతను, శ్రద్ధా భక్తులను గుర్తించి ఆశ్రమ నిర్మాణానికి కావలసిన ఆర్థిక సహాయానికి అంగీకరించినారు మహాత్మాజీ కూడా ఆశ్రమంలో పాకలువేసి నూలువడికేటందుకు, బట్టలు నేసేటందుకు తగిన వసతులు కల్పించడానికి భారత జాతీయ కాంగ్రెస్ ద్వారా 10 వేల రూపాయల విరాళం ఆశ్రమ సంస్థాపకులకు ఇప్పించినారు ఈ సొమ్ముతో 10 ఎకరాల భూమి పినాకిని నది ఒడ్డున కొనడం, పాకలువేయడం,

ఖాదీ పరిశ్రమ సాగించడం జరిగింది ఆ తరవాత మహాత్మాజీ ఆంధ్రదేశ సంచారంలో 7-2-1921 న ఆశ్రమానికి ప్రారంభోత్సవం చేసినారు

ఆశ్రమానికి భూమి పాకలు, మగ్గలు, చర్ఖాలు, పుస్తక భండారం మొదలయిన ఆస్తులు ఉండటంచేత వాటి రక్షణకోసం నలుగురు ఆ జన్మాంత ట్రస్టీలతో 25-11-1921న ట్రస్టు దస్తావేజు రిజిష్టర్ చేయబడింది గాంధీజీ ఆశ్రమ నియమావళిననుసరించి సత్యము, అహింస, అస్తేయము బ్రహ్మచర్యము మొదలయిన 11 నియమాలను ఆశ్రమవాసులు పాటించవలెనని నిబంధింపబడింది

ఆశ్రమంలో ఖాదీ ఉత్పత్తి, అస్పృశ్యతా నివారణము, వ్యవసాయము హిందీ ప్రచారము, వయోజన విద్య, మత సామరస్యము, ప్రకృతి వైద్యం మొదలయిన నిర్మాణ కార్యక్రమాలను నిర్వర్తించడం ఆశ్రమవాసుల కర్తవ్యంగా నిర్ణయించబడింది

ఆశ్రమవాసులు నదిఒడ్డున ఉన్న పాకలలోను, పర్ణకుటీరాలలోను ఉండటంచేత పినాకిని నది వరదల భయంవల్లనూ, ఆశ్రమంలో గ్రంథ భాండారం మొదలయిన విలువగల వస్తువులు ఉండటంచేత మండువేసంగిలో అగ్ని భయంవల్లనూ తగిన రక్షణ లేకున్నందున అటువంటి రక్షణకు వీలుగా ఎత్తయిన పునాది గోడలపైన కొంత డాబా కొంత పెంకుటిల్లూ వేసి విశాల మయిన హాలు, గదులూ వరండాలతో భవనం నిర్మించడానికి దక్షిణాఫ్రికాలో గాంధీజీ అనుచరుడుగా ఉన్న శ్రీ రుస్తుంజీగారు విరాళమిచ్చి సహాయ పడినారు అందువల్ల దానికి రుస్తుంజీ భవనం అని పేరు పెట్టినారు

1926 సంవత్సరం మార్చి నెలలో దిగుమర్తి హనుమంతరావుగారు చిన్న వయసులోనే స్వర్గస్థులయినారు వెంకట కృష్ణయ్యగారు పుదుచ్చేరిలోని అరవిందాశ్రమానికి వెళ్ళినారు ఆశ్రమంలోని కార్యకర్తలు ఇతర ధర్మకర్తలు కూడా ప్రధాన వ్యక్తులు లేనందుకు ఎక్కడివారక్కడ వెళ్లిపోయినారు కాని ఖాదీపని మాత్రం జరుగుతూనే ఉండినది హనుమంతరావుగారి భార్య బుచ్చికృష్ణమ్మగారు యావజ్జీవ ధర్మకర్త అయినప్పటికి ఆమె చిన్న వయసులో ఒంటరిగా అక్కడ ఉండి పనిచేయలేకపోయినారు మహాత్మాగాంధీ దంపతులు 1929 మే నెలలో ఆంధ్రదేశ సంచారానికి వచ్చినప్పుడు వారు పినాకినీ సత్యాగ్రహాశ్రమంలో ఒకరోజు ఉండి ఆ సంస్థకు సంబంధించిన కాగితాలన్నిటినీ దేశభక్త కొండ వేంకటప్పయ్యగారికిచ్చి ఆ సంస్థ వ్యవహారాలను తాత్కాలికంగా ఆయన చూడవలెనని చెప్పినారు వేంకటప్పయ్యగారి ఆదేశానుసారం సుప్రసిద్ధ ఆంధ్ర కాంగ్రెస్‌వాది, దేశభక్తుడు అయిన శ్రీ ఒరుగంటి వెంకటసుబ్బయ్యగారు ఖాదీ కార్యక్రమం పర్యవేక్షిస్తూ, ఆయుర్వేద ప్రకృతి వైద్యశాలను కూడా నడుపుతూ వచ్చినారు తరవాత వేంకటప్పయ్యగారి కోరిక ప్రకారం వెంకటసుబ్బయ్యగారినుంచి 1951 ఆగస్టులో బుచ్చికృష్ణమ్మగారు ఆశ్రమ పరిపాలన స్వీకరించినారు అప్పుడావిడ కస్తూరిబా

గాంధీ స్మారకనిధికి ఆంధ్ర రాష్ట్రీయపథాన ఏజంటు ఆ నిధిపథాన 1952లో ఆ ఆశ్రమంలో పరిసర గ్రామాలలోని స్త్రీలకు బాలురకు సేవ చేసేటందుకు గ్రామసేవా, ఆరోగ్యసేవా కేంద్రాలను స్థాపించినారు బాల్వాడి, ప్రసూతి గృహం, బాలుర సంక్షేమ కేంద్రాలు ఆశ్రమభవనంలో ఏర్పాటు చేయడం జరిగింది ప్రయోజన విద్య, హింద బోధన, కుట్టుపని, నగిషీ, ఎంబ్రాయిడరిపని (Embroidary), తేనెపరిశ్రమ కొంతకాలం నడపబడినాయి ప్రస్తుతం బాల్వాడీకి సంబంధించిన ఒక గ్రామసేవా కేంద్రం మాత్రం పనిచేస్తూన్నది

పినాకిని సత్యాగ్రహాశ్రమానికి యావజ్జీవ ట్రస్టీలు శ్రీ దిగుమర్తి హానుమంతరావుగారు, వారి సతిమణి శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారు, చతుర్వేదుల వెంకటకృష్ణయ్యగారు, శ్రీ కొండిపర్తి పున్నయ్యగారు

ఆశ్రమ సభ్యులనుంచి ప్రతిసంవత్సరం ఎన్నుకోబడే ప్రతిఇద్దరు ట్రస్టీలతో ట్రస్టుబోర్డు ఏర్పాటయింది ట్రిస్టుబోర్డుల సంఖ్య 6గురికి మించ రాదని నియమమున్నది

శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు ఆయన భార్య సుదర్శనమ్మగారు, బెజవాడవారు, మేనకూరవారు, శ్రీమతి పొణకా కనకమ్మగారు మొదలయిన వారంతా ఆశ్రమ కార్యక్రమంలో ఆదరాభిమానాలు చూపి దాని అభివృద్ధికి తోడ్పడినారు

## ఆశ్రమ సేవకులు

ఆశ్రమ కార్యక్రమాలలో సహాయం చేయడానికి ఆశ్రమ సభ్యులుగా కాక సేవకులుగా శ్రీ దిగుమర్తి వెంకటరామస్వామి, శ్రీ కాసా సుబ్బారావు, శ్రీ ఇసుకా చెంచయ్య, శ్రీ కాళ్లకూరి వెంకట్రావుగార్లు వారి కుటుంబాలతో సహా అక్కడ నివాస మేర్పరచుకొని పని చేస్తూండేవారు శ్రీ గుమ్మడిదల సుబ్బారావు, శ్రీ మాసకొండ సత్యనారాయణశాస్త్రి, శ్రీ వాడ్రేవు జగ్గరాజు, శ్రీ తిరుపతిరాయుడు మొదలయిన వారనేకముంద ఆశ్రమ జీవితంలో పాల్గొన్నారు

## బందిపోటు ఉదంతము

ఆశ్రమ వాసులను పరీక్షించడానికో అన్నట్లు ఒక బందిపోటు ముఠా ఆశ్రమంలో జొరబడి దానిని కొల్లగొట్టినారు ఆ దొంగలు ఆశ్రమంలోని స్త్రీలను కూడా కొట్టినారు చాలా మందికి దెబ్బలు తగిలినాయి అయినప్పటికీ ఆశ్రమవాసులు పోలీసులకు రిపోర్టు చేయలేదు తిండికి లేనివారు చేసిన పని అని సమాధానపడి ఊరుకొన్నారు కాని ఈ ఉదంతం ప్రజలలో సంచలనం కలిగించింది అందువల్ల ఫిర్యాదు లేనప్పటికీ పోలీసులు ఈ దొంగలను పట్టుకోవటానికి ప్రయత్నం చేసినారు ఈ దొంగలకు వెనక అండగా ఉన్న ఘరానా పెద్దమనుషులు కూడా వారిని విడనాడినారు దొంగలు పట్టుపడినారు ఈ

నిందితులకు వ్యతిరేకంగా సాక్ష్యం ఇవ్వడానికి ఆశ్రమవాసులు అంగీకరించలేదు దొంగల దగ్గర దొరికిన కొన్ని బంగారు నగలను గుర్తుపట్టడానికి శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారిని పిలువగా ఆమె వాటిని చూసి అవి తమ నగలవలెనే ఉన్నవి కాని అవి తమవే అని నిర్ధారణగా చెప్పజాలమన్నారు అంతేకాని సాక్ష్య మివ్వటానికి అంగీకరించలేదు ఆమె ప్రవర్తన చూసి దొంగలు విస్మయం చెంది తమ నేరాలను ఒప్పుకొని యావద్వృత్తాంతం సవివరంగా చెప్పినారు దానివల్ల కేసు రుజువై దొంగలు శిక్షింపబడినారు ఈ విషయం గాంధీజీకి తెలిసినప్పుడు ఆయన ఆశ్రమవాసుల ధైర్యం ముఖ్యంగా బుచ్చికృష్ణమ్మగారి ధైర్యం, ప్రవర్తనను మెచ్చుకొని అది ఆశ్రమవాసులకొక గుణపాఠమనీ, అపరిగ్రహము, అస్తేయం ఆదర్శంగాగల ఆశ్రమ సభ్యులు దొంగల నాకర్షించే ఆభరణాలను ధరించడంగానీ ధనం దాచుకోవడంగానీ కూడదన్న విషయం గ్రహించగలరని విశ్వసిస్తున్నానని తెలిపినారు

## పినాకినీ సత్యాగ్రహాశ్రమము-ప్రకృతిచికిత్స

శ్రీ ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు పల్లెపాడులోని పినాకినీ సత్యాగ్రహాశ్రమానికి నాలుగు సంవత్సరాలు మేనేజర్‌గా పని చేసినారు అప్పుడాయన ఒక ఆయుర్వేద ఆసుపత్రిని నడిపినారు దానిని గురించిన నివేదికలను గాంధీజీకి అప్పుడప్పుడూ ఆయన పంపుతుండేవారు అందులో పనిచేస్తూండిన ఆయుర్వేద వైద్యుడు ఉపేంద్రశర్మ గొప్ప ప్రజాసేవా తత్పరుడు ఆయనకు క్షయవ్యాధి వచ్చి ఆశ్రమం విడిచి పోవలసి వచ్చింది అంతట వెంకటసుబ్బయ్యగారు ఆ ఆసుపత్రిని పూర్తిగా ప్రకృతి చికిత్సాలయంగా మార్చవలెనని సూచిస్తూ సేవాగ్రామ్‌కు తెలియజేసినారు ఆ సందర్భంలో గాంధీజీ వెంకటసుబ్బయ్యగారిని ప్రకృతి వైద్యుడుగా పని చేయగలరా అని అడిగినారు తాను పూర్తిగా ఆ బాధ్యతను వహించేటందుకు ఇష్టంలేక రేపల్లెకు దగ్గరగా ఉన్న మూరుతోటలోని రాఘవేంద్రయోగి పేరును సూచించినారు ఆ యోగి పేరు గొల్లపూడి సీతారామశాస్త్రిగారు వెంకటసుబ్బయ్యగారికి సిఫార్సు చేసినారు

గాంధీజీ మద్రాసులో దక్షిణ భారత భవనంలో ఉండగా వెంకటసుబ్బయ్యగారు ఆ యోగిని తీసుకొనిపోయి గాంధీజీకి పరిచయం చేసినారు గాంధీజీకి ఆయన నచ్చలేదు వెంకటసుబ్బయ్యగారిని "మీరు ఆ యోగిని స్వయంగా ఎరుగుదురా?" అని గాంధీజీ ప్రశ్నించగా, తనకు ఆయనను సీతారామశాస్త్రిగారు పరిచయం చేసినట్లు వెంకటసుబ్బయ్యగారు చెప్పినారు వెంటనే గాంధీజీ "సీతారామశాస్త్రిగారు మనుషులను సరిగా గ్రహించగలరనే నమ్మకం నాకులేదు" అన్నారు

అయినా ఆ యోగిని పల్లెపాడుకు పోయేముందు తాను బెంగాలు నుంచి వచ్చేసరికి సేవాగ్రామ్‌కు శిక్షణ నిమిత్తం పంపించవలసిందని గాంధీజీ అన్నారు తరవాత గాంధీజీ బెంగాల్‌కు, నవకాళీకి వెళ్ళి ఢిల్లీకి వచ్చి ఒక హిందూ

మతోన్మాది తుపాకీ గుండుకు గురైనారు. అంతటితో ఆ కథ ముగిసింది గాంధీజీ, వెంకటసుబ్బయ్యగారికి ఒకప్పుడు ఒక ఉత్తరంలో "ప్రకృతి వైద్యము జబ్బునయం చేస్తూంది ఇంగ్లీషు వైద్యం పేరు సంపాదిస్తూంది" (Naturopathy cures but Allopathy succeeds)" అని వ్రాసినారు

## నెల్లూరు జిల్లా

### ఖద్దరునిధి వసూళ్ళు

| | | యంగ్ ఇండియా<br>23-5-1929 |
|---|---|---|
| 10-5-1929 | బుచ్చిరెడ్డి పాలెం | 4,506-0-5 |
| | (570 లాలాజీనిధి) | |
| | వంగల్లు | 126-0-0 |
| | అన్నారెడ్డిపాలెం | 146-0-0 |
| | పల్లెపల్లి<br>ఇసకపాలెం | 348-0-0 |
| | రేబాల | 386-0-0 |
| | ముక్తాపురం | 75-0-0 |
| | మింగల్లు | 56-0-0 |
| | దామరమడుగు | 10-0-0 |
| | పెనుబల్లి | 15-0-0 |
| | కలయకగుళ్లు | 250-0-0 |
| | పవ్వేరు | 116-0-0 |
| | కొత్తవంగెల్లు | 116-0-0 |
| | వెల్లాయపాలెం | 1,246-0-0 |
| | (116 లాలాజీ నిధి) | |
| | రాజుపాలెం | 116-0-0 |
| | గండవరం | 300-0-0 |

| | | |
|---|---|---|
| | పెదపుట్టేడు | 208-0-0 |
| | కోవూరు | 116-0-0 |
| | (కోఆపరేటివ్ యూనియన్ సొసైటీ) | |
| | పర్లపల్లి | 296-6-8 |
| | విడవలూరు | 400-0-0 |
| | ఉటుకూరు | 1,127-14-6 |
| | మోపర్రు | 1,186-0-0 |
| | అల్లూరు | 1 296-8-0 |
| 10-5-1929 | కావలి | 1,706-9-8 |
| | (మరియు యితర గ్రామములు) | |
| | (రూ 1 లాలాజీ నిధి) | |
| 11-5-1929 | ఉలవపాడు | 558-0-0 |
| | కందుకూరు | 1,848-2-8 |
| | కొట్లగూడూరు<br>పామూరు | 717-0-6 |
| | సీతారాంపురం | 15-12-0 |
| | ఎలమర్రు | 1-0-0 |
| 12-5-1929 | పెరమన | 116-0-0 |
| | సంగం | 776-0-0 |
| | వల్లెపాడు<br>(రూ॥ లాలాజీనిధి) | 781-14-9 |
| | గంగపట్నం | 640-0-1 |
| | మైపాడు | 752-8-9 |
| | వెంకోజీపాలెం | 80-0-0 |
| | కోడూరు | 50-0-0 |
| | కొరుటూరు | 47-0-0 |
| | ఇందుకూరుపేట | 176-2-0 |

| | | |
|---|---|---|
| | కొత్తవు రు YMCA | 5-0-0 |
| | నెల్లూరు | 5 178-12-6 |
| | (రూ 20 లాలాజీనిధి) | |
| | పొట్టిపాలెం | 1 116-0-0 |
| | పొట్లపూడి | 70-0-0 |
| | గూడురు | 734-0-0 |
| | తుంబూరు | 50-0-0 |
| 14-5-1929 | నాయుడు పేట | 655-6-8 |
| | అత్తనగం | 116-0-0 |
| | నిడ ఘుసిలి | 50-0-0 |

**చిత్తూరు జిల్లా**

గాంధీజీ ఆయన సహచరవర్గం తిరుపతిలో 1100 రూపాయలు ఖాదీ నిధికి స్వీకరించి మే 15 ఉదయం 10-30 వరకు చిత్తూరు చేరుకొన్నారు చిత్తూరు సంక పేటలో పూర్ణకుంభంతో రెండు దేవాలయ ఛత్రాలతో దండలతో ఒక పెద్ద జనసమూహం వారి రాకకై వేచిఉన్నది గాంధీజీ నాగస్వరము బ్యాండ్లు, సంగీత వాయిద్యాల మధ్య సి దొరస్వామయ్యంగారి ఇంటికి వెళ్లినారు దొరస్వామయ్యగార తిరుపతిలో అంతకు పూర్వమే ఖద్దరునిధికి 116 రూపాయలు సమర్పించి ఉన్నారు తిరుత్తనినుంచి మరొక 116 రూపాయలు మహాత్మాజీకి చేరినాయి సాయంకాలం 5-30 లకు దివ్యజ్ఞాన సమాజ భవనం ఆవరణలో ఐదువేలమంది ఎమూవేశమయిన మహాసభలో గాంధీజీ ఉపన్యసించినారు

గ ంధీజీ ఆ ఉపన్యాసంలో విదేశీవస్త్ర బహిష్కారం గురించి ఖాదీ ఉద్యమ ఆర్థిక ప్రాముఖ్యం గురించి ప్రసంగించినారు "దేశక్షేమము మనసులో పెట్టుకున్న ప్రతిభారతీయుడు ఖద్దరు ధారణ తమ విధిగా భావించవలె అందువల్ల అన్ని వర్గాలలోను ఐకమత్యం ఏర్పడగలదు కాబట్టి అందరూ వారి శక్తిసామర్థ్యాలను ఖద్దరు ఉద్యమాన్ని బలపరిచడంలో వినియోగించవలె" అన్నారు ఈ ఉపన్యాసానంతరం వారు ఉదయం 6 గంటలకు పుంగనూరు వెళ్ళినారు పుంగనూరు వాస్తవ్యులు రూ 526-11-6 ఖద్దరునిధికై గాంధీజీకి సమర్పించినారు

గాంధీజీ పుత్తూరు సభలో ఉపన్యసించి అక్కడినుంచి తిరుపతికి మే 16 ఉదయం తిరిగి చేరినారు మహాత్మాజీ కారు కనపడగానే ప్రజలు సమావేశానికి ఏర్పడిన పందిరివైపుకు వారాత్తుగా పరుగిడ సాగినందున ఆ గందరగోళంలో

గాంధీజీ కారునుంచి దిగటానికి సాధ్యపడలేదు కారులోనే కూర్చొని ఆయన కొన్ని మాటలు చెప్పి విరాళం స్వీకరించి సభనుంచి వెళ్ళిపోయినారు అంతకు పూర్వం నిర్ణయించుకొన్న ప్రకారం మునిసిపల్ సన్మానపత్ర సమర్పణగానీ, లజపతిరాయ్ చిత్రపట ఆవిష్కరణగానీ జరగలేదు బహుశా మున్సిపల్ కౌన్సిల్ తీర్మానాలు మహాత్ముని దృష్టికి రాలేదు తిరుపతినుంచి ఆయన చిత్తూరుకు వచ్చిన తరవాత ఆ విషయాలను గురించి ప్రశ్నించగా తిరుపతిలో ఆ కార్యక్రమం ఏర్పాటు చేయబడినవా అని ఆయన ఆశ్చర్యం వెల్లడించినారు చిత్తూరులో కార్యక్రమం మార్పు జరిగినందున కేవలం ఖద్దరు నిధికి విరాళం స్వీకరించడమే పనిగా తిరుపతిలో అయిదు నిమిషాల వ్యవధియే నిర్ణయించడం జరిగింది తిరుపతి కార్యక్రమంలో కూడా మార్పు జరిగినందున గాంధీజీ రాకకు నిరీక్షిస్తూండిన అనేకమందికి ఆశాభంగం కలిగింది

**మదనపల్లిలో**

మొదటి నిర్ణయం ప్రకారం మహాత్మాజీ మదనపల్లికి మే 17 ఉదయమే వచ్చి సాయంకాలం బహిరంగసభలో ఉపన్యసించవలసి ఉన్నది కాని ఆయన 16 ఉదయానికే మదనపల్లికి వెళ్లినారు అయినప్పటికీ పెద్దసభ జరిగింది రెండు వేల రూపాయలు ఖద్దరునిధికి సమర్పింపబడి చిత్తూరు జిల్లాలోని ఇతర ప్రదేశాల లోటును మదనపల్లి పూర్తి చేసిందని మహాత్మాజీ సంతృప్తిపడినారు పుత్తూరు, తిరుపతి పౌరులు చిత్తూరులో తమ విరాళాలను సమర్పించినారు పుంగనూరు,పలమనేరు గ్రామాలు కూడా గాంధీజీని గౌరవించడంలో తక్కిన గ్రామాలకెంతమాత్రం తీసిపోలేదు

కదిరిలో, చిత్తూరులో వచ్చిన ఖద్దరునిధి విరాళాలు లెక్కింపగా మొత్తం 7,814-13-0 అని తేలింది

**చిత్తూరు జిల్లా**

**ఖద్దరు నిధి వసూళ్ళు**

| | | యంగ్ ఇండియా 23-5-1929 |
|---|---|---|
| 14-5-1929 | కాళహస్తి | 1,116-0-0 |
| | బెల్లామెటల్ కంపెని | 316-0-0 |
| 15-5-1929 | తిరుపతి | 1099-7-0 |
| | రేణిగుంట | 67-0-0 |
| | చిల్లర | 60-0-0 |

| | | |
|---|---|---|
| | పాపనాయనిపేట | 12-0-1 |
| | పుత్తూరు | 806-0-0 |
| | తిరుత్తని | 115-12-0 |
| | చిత్తూరు | 511-0-0 |
| | పలమనేరు | 188-12-0 |
| | పుంగనూరు | 536-15-11 |
| 16-5-1929 | మదనపల్లి | 2475-14-0 |

## అనంతపురం జిల్లా

### కదిరి

మదనపల్లి నుంచి మహాత్ముడు అనంతపురంజిల్లాలోని నాగిరెడ్డిపల్లి చేరినారు శ్రీ మాచిరెడ్డి వెంకటస్వామిరెడ్డిగారు గాంధీ దంపతులను పుష్పమాలాలంకృతులను చేసినారు గాంధీజీకి పురవాసులు స్వాగత పత్రం 116 రూపాయలను సమర్పించినారు వేదిక ముందు తిరుగుతున్న 20 రాట్నాలను చూసి నవ్వుతూ "ఇవి ఎల్లకాలము తిరుగుతూంటవనే అనుకొంటాను" అన్నారు గాంధీజీ వెంటనే "అవున" న్నారు వెంకటస్వామిరెడ్డిగారు సభ్యులలో చాలా మంది ఖద్దరు ధరించిన వారుండటం చూసి గాంధీజీ సంతోషించినారు

మే 16 వ తేది ఉదయం మహాత్ముడు కదిరికి వచ్చినారు పురవాసులు 1,210 రూపాయలు, యూనియన్ బోర్డువారు 50 రూపాయలను ఖద్దరు నిధికి సమర్పించినారు ప్రజలు సమర్పించిన సన్మాన పత్రం వేలం వేయగా శ్రీ కురుమాల వెంకటరెడ్డిగారు దానిని 25 రూపాయలకు కొన్నారు

మహాత్ముడు మధ్యాహ్నమంతా కదిరిలో గడిపినాడు వేలకొద్దీ పల్లెల వారు వచ్చి మహాత్ముడు విశ్రాంతి తీసుకొంటూన్నప్పటికీ ఆయన దర్శనానికి వేచిఉన్నారు ముఖ్యంగా స్త్రీలు గాంధీజీని చూసేటంత వరకూ పోమని వాకిలిముందు కూర్చొని సత్యాగ్రహం చేసినందువల్ల మహాత్ముడు బయటకు వచ్చి వారికి కనపడి ఆ స్త్రీలవద్ద పైసాపైసా వంతున పదిరూపాయల వరకు ఖద్దరు నిధికి సంపాదించినారు

కదిరి నుంచి కూటగుళ్ళ, ముదిగుబ్బ, దంప్పెట్ల గ్రామాలకు పోయి రాత్రి 8½ కు ధర్మవరం చేరినారు కూటగుళ్ళలో వై. నారాయణరెడ్డిగారు, దంప్పెట్ల, ముదిగుబ్బ వారునూ చేరి 116 రూపాయలు ఖద్దరు నిధికి సమర్పించినారు దంప్పెట్ల వద్ద చిత్రావతి నది ఇసుకలో గాంధీజీ కారును ఆపి వేలాది ప్రజలు ఆయన దర్శనం చేసుకొన్నారు తరవాత వారు చిత్రావతినది ఇసుక నుంచి కారు దాటించినారు

ధర్మవరం

ధర్మవరంలో ఇరవై వేలమంది ప్రజలు మహాత్ముని గాశకై వేచి ఉన్నారు పురప్రముఖులు చక్కని ఏర్పాట్లు చేసినారు సభ హైస్కూల్ మైదానంలో యేర్పాటు చేయబడింది మహాత్ముని చక్కగా భాగ్యమందరికీ లభించడానికి వీలుగా మైదానమంతా గ్యాసు లైట్లతో నిండిపోయింది మహాత్ముడు ఆలస్యంగా వచ్చినందున పటసిఎపాల కంటె ఎక్కువ అక్కడ నిలువ లేదు ముందు కార్యక్రమానికి హరిసర్వోత్తమరావుగారు తొందర పెట్టినందున ప్రజలలో చాలా మందికి నిరుత్సాహం కలిగింది ధర్మవరంవారు సమర్పించిన 1148-8-0 తీసుకొని గాంధీజీ రాత్రి 10 గంటలకు అనంతపురం చేరినారు శ్రీ హట్టి శంకరరావుగారు కూడా గాంధీజీతో ఉన్నారు

అనంతపురం

అనంతపురంలో గాంధీజీ రాకను గురించిన ఏర్పాట్లు చక్కగా జరిగినాయి పురపాలక సంఘాధ్యక్షుడు జనాబ్ అమీరుద్దీన్‌సాహెబ్‌గారు సభకు కావలసిన అన్ని ఏర్పాట్లను శ్రద్ధగా చేయించినారు ఉదయం (17) తలంత్రాలు మంటపంవద్ద సభ జరిగింది మహాత్ముడు సన్మాన స్థలానికి వచ్చే తోవలో శ్రీ సుబ్బయ్య మహాత్ముని తమ ఇంటివద్ద నిలిపి 116 రూపాయలు సమర్పించినారు అక్కడనే దురిదగుంట ఘంటా దోణప్ప రూ 1116లు సమర్పించినారు

మహాత్ముడు సభక చేరి సన్మానపత్రాలను స్వీకరించినారు సభ నిశ్శబ్దంగా ఉండటం చూసి ఆయన చాలా సంతోషించినారు ఆయన చెప్పవలసిన తత్వత్రయం ఖద్దరు కట్టండి, త్రాగుడు మానండి, అస్పృశ్యత మరచిపొండి అని ఉపదేశించి వెంటనే తాడిపత్రికి పయనమైనారు

అనంతపురంవారు గాంధీజీకి 1015-4-0 రూపాయలు సమర్పించినారు అనంతపురంలోని స్త్రీలు కూడా కొంత సొమ్ము వసూలు చేసినారు కాని గాంధీగారికి స్వయముగా సమర్పించటానికి వీలుకానందున వారాసొమ్మును మరునాడు గాంధీజీకి మనియార్డర్ ద్వారా పంపినారు

తాడిపత్రి

మహాత్ముడు తాడిపత్రి చేరగానే స్వరాజ్య ధ్వజ ప్రతిష్ఠ జరిగింది ఆ తరవాత బహిరంగ సభలో ఆయనకు సన్మాన పత్రం సమర్పించ బడింది పురజనులు 1128-8-0 రూపాయలు కానుకగా ఇచ్చినారు మహాత్ముడువస్త్ర సిస్తూ పతాకధ్వజ స్తంభానికి స్వదేశీ వస్తువును ఉపయోగించక సీమలో తయారయిన ఇనుపకంబమును ఉపయోగించినందుకు మందలిస్తూ తమ తత్వత్రయోపదేశం చేసినారు సన్మానపత్రం, ఒక ఖద్దరు ధోవతి వేలంవేయగా 11-8-0 రూపాయలు వచ్చింది. ఒక బియ్యపుగింజపై 107 అక్షరములు తాడి

పత్రి హైస్కూలు డ్రాయింగ్ మాస్టరు వ్రాసి ఇచ్చిందానిని వేలంలో 5 రూపాయలొచ్చింది తాడిపత్రి స్త్రీలు ఖద్దరునిధికి 116 రూపాయలు ఇచ్చినారు నాటి సాయంత్రం మహాత్ముడు ప్రొద్దుటూరుకు వెళ్ళినారు

### అనంతపురం జిల్లా

### ఖద్దరునిధి వసూళ్లు

యంగ్ ఇండియా

28-5-1929

| | | |
|---|---|---|
| 16-5-1929 | నాగిరెడ్డిపల్లి | 116-0-0 |
| | కదిరి | 1,808-8-11 |
| | కూటగుళ్ల | 116-0-0 |
| | ముదిగుబ్బ | 116-0-0 |
| | దంప్పెట్ల | 116-0-0 |
| | ధర్మవరం | 1148-8-0 |
| | అనంతపురం | 1247-4-0 |
| | తాడిపత్రి | 1160-5-8 |

**కడప జిల్లాలో**

గాంధీజీ మే 17వ తారీకున కడప జిల్లాలో ప్రవేశించి కొండాపురం, మంగపట్నం, మారెడ్డిపల్లి, ముద్దనూరు, చిలమకూరు, నిర్జివి, ఎర్రగుంట్ల గ్రామాలను చూసి ప్రొద్దుటూరు రాత్రి 11 గంటలకు చేరినారు ఈ అన్ని చోట్లా గాంధీజీని అత్యంతోత్సాహంతో ఆదరించి సన్మానించినారు

**ముద్దనూరులో**

గాంధీజీ రాత్రి 9 గంటలకు ముద్దనూరు చేరినారు ముద్దనూరులో మహాత్మాజీ దర్శనార్థం అక్కడకు 12 మైళ్ళ దూరములో ఉన్న జమ్మల మడుగునుంచి 100 మంది వచ్చినారు జమ్మలమడుగు తాలూకా బోర్డ్ ప్రెసిడెంట్ శ్రీయుతులు టి నరసారెడ్డి, (వకీల్) కె పి శ్యామయ్యర్, వంకదారి వెంకటసుబ్బయ్యశెట్టి జమ్మలమడుగులో 226 రూపాయలు సేకరించి గాంధీజీకి సమర్పించినారు

మహాత్ముడు విదేశవస్త్ర బహిష్కారము, మద్యపాన నిషేధము,

అస్పృశ్యతా నివారణము, హిందూ మహమ్మదీయ సఖ్యము గురించి సక్రమంగా ముచ్చటించి చిలమకూరుకు వెళ్ళినారు

**చిలమకూరులో**

చిలమకూరులో మహాత్ముని రాకకై స్త్రీలతోసహా 800 మంది వేచి ఉన్నారు మహాత్ముని మోటారు రాత్రి 9-40 గంటలకు చిలమకూరు చేరింది ప్రజలు ఆయనను పుష్పమాలాలంకృతునిగాచేసి 848 రూపాయలు ఖద్దరునిధికి సమర్పించినారు మహాత్మాజీ విదేశవస్త్ర బహిష్కారము, మద్యపాన నిషేధము, అస్పృశ్యతా నివారణము, హిందూ ముస్లిం ఐకమత్యములను గురించి ముచ్చటించి తరవాత నిర్జివి అనే గ్రామానికి వెళ్ళినారు

**నిర్జివిలో**

నిర్జివికి చేరేసరికి రాత్రి 10 గంటలయింది అక్కడ 500 మంది ప్రజలు మహాత్ముని రాకకై నిరీక్షిస్తున్నారు గాంధీజీ రాగానే ఆయనను సత్కరించి శ్రీ భూతపురి నారాయణస్వామిగారు ఖాదీనిధికి రూ 116 సమర్పించినారు

**ఎర్రగుంట్లలో**

తరవాత గాంధీజీ ఎర్రగుంట్లకు రాత్రి 10-15లకు చేరినారు ఐదువేల మంది ప్రజలు ఎర్రగుంట్ల మైదానంలో సమావేశమయినారు గాంధీజీ కారు చేరగానే ప్రజలు ఆయనపై పుష్పవర్షం కురిపించినారు మహాత్మాజీ చిరునవ్వుతో ప్రజలు ఎంతో ప్రశాంతంగా ఉన్నందుకు సంతృప్తిని వెల్లడించినారు ఆయనను, కస్తూరిబాగాంధీని ప్రజలు పుష్పమాలాలంకృతులను చేసిన తరవాత కేతి వెంకటరెడ్డిగారు 1116 రూపాయలు ఖద్దరునిధికి సమర్పించినారు

తరవాత గాంధీగారు మాట్లాడుతూ ఈ దేశంలోని లక్షలాది నిరుపేదలకు సహాయం నిమిత్తం అందరూ ఖద్దరే ధరించడానికి ప్రమాణం చేయవలెననీ, అస్పృశ్యతా నివారణకోసం కృషిచేయవలెనని సలహాయిచ్చినారు హిందూ ముస్లిం ఐకమత్యంగురించి, మద్యపానమువలని కీడునుగురించి ఉపన్యసించిన తరవాత తాను ప్రొద్దుటూరు వెళ్ళడానికి ప్రజలనుంచి అనుమతి కోరినారు కాని వారు హరిసర్వోత్తమరావుగారిద్వారా మరి ఐదునిమిషాలు ఎర్రగుంట్లలో నిలువవలెనని అర్థించినందువల్ల ఆ కోరికను గాంధీజీమన్నించి, తరవాత ప్రొద్దుటూరుకు వెళ్ళినారు

**ప్రొద్దుటూరులో**

ఎర్రగుంట్లనుంచి ప్రొద్దుటూరు పోయేతోవలోనే మహాత్మాజీ కొంతసేపు నిద్రించినారు, కడప కోటిరెడ్డిగారితోసహా మహాత్మాజీ, ఆయన బృందం ప్రొద్దుటూరుకు 11 గంటలకు చేరుకొన్నారు ప్రొద్దుటూరు ఊరిముందు

ప్రజలు చాలామంది గుమిగూడి మహాత్మునిరాకకై నిరీక్షిస్తూండగా స్వచ్ఛంద సైనికులు ప్రజలను సర్దుతూ శాంతిని కాపాడుతున్నారు జాతీయ స్వచ్ఛంద సైనికులు, పోలీసువారు పట్టణంలో చక్కని ఏర్పాట్లు చేసినారు మహాత్ముని కారు కన్యకాపరమేశ్వరిగుడివద్ద రెండు నిమిషాలకాలము నిలువగానే జిల్లాలోని పలు ప్రాంతములనుంచి వచ్చిన ప్రజలు సంతోషోత్సాహాలతో ఆయన దర్శనం చేసుకొన్నారు అంతట మహాత్ముని విడిదికై శ్రీయుత శెట్టిపల్లి కొండారెడ్డి గారి భవనానికి ఆయన కారు వెళ్ళింది ఆయన ఆ విడిదిలో కొంతసేపు విశ్రాంతి తీసుకొని సుమారు ఒక అరగంట కాలం నూలు వడికినారు గాంధీజీ ఆ రాత్రి అక్కడనే శయనించినారు

వసంతపేటలోని స్థానిక మునిసిపల్ కార్యాలయందగ్గర గాంధీమహాత్మునికి సన్మానపత్రాలను విరాళాలను సమర్పించడానికి 18వ తేదీ ఉదయం ఏర్పాటు చేయడం జరిగింది గాంధీజీ ఉదయం 6 గంటలకే కస్తూరిబాయితో సహా ఆ ప్రదేశానికి వెళ్ళినారు ప్రొద్దుటూరు పౌరులు అత్యుత్సాహంతో గౌరవ పురస్సరంగా వారిని ఆహ్వానించినారు ఆర్యవైశ్య సమాజంవారు, తాలూకా బోర్డువారు, మున్సిపాలిటీవారు వారికి సన్మానపత్రాలు సమర్పించినారు ప్రొద్దుటూరు పురపాలకసంఘంవారు 50 రూపాయలు తాలూకా బోర్డువారు 58 రూపాయలు ఖద్దరునిధికి విరాళమిచ్చినారు కడప మితపాన సమితివారి పక్షాన కృష్ణమునిగారు 116 రూపాయలు విలువగల బంగారు కాసులను ఖద్దరునిధికి సమర్పించినారు గాంధీజీ దరిద్రనారాయణుని పక్షాన విజ్ఞప్తిచేయగా ప్రజలు 1780 రూపాయలు మొత్తం సమర్పించినారు కృష్ణ మునిగారు సీలుచేసిన గంగాజలపాత్రను మహాత్మాజీకి కానుకగా ఇవ్వగా ఆయన దానిని వేలం పెట్టినారు కృష్ణమునిగారే దానిని 10 రూపాయలకు కొన్నారు తరవాత మహాత్మాజీ కొన్ని మాటలు హిందీలో చెప్పి దరిద్రనారాయణుని సేవార్థం ప్రజలు అత్యుదారంగా ప్రవర్తించేటట్లు వారి హృదయాలు మారవలెనని సూచించినారు ఆర్యవైశ్య సమాజంవారు 316 రూపాయల విలువగల బంగారు కాసులను మాత్రమే సమర్పించినందుకు తనకు ఆశాభంగం కలిగిందని, ఈరోజు ఉదయం ఆశాభంగంతోనే ప్రారంభంకావటంచేత రోజంతా ఆశాభంగమే కల్గుతుందో ఏమోనని భావిస్తున్నానని అన్నారు ప్రజలందరూ విదేశీవస్త్రాలను బహిష్కరించవలెనని, అస్పృశ్యతను రూపుమాపవలెనని, హిందూ ముస్లిములు ఐకమత్యంతో ఉండవలెనని ఉద్బోధించినారు ఉదయం 6-30 గంటలకు శ్రీయుత కడప కోటిరెడ్డిగారితో కలసి గాంధీజీ ఆయన సహచరవర్గం చాగలమర్రి వెళ్ళినారు.

## ప త్తికొండలో

మే 21 వ తేది ఉదయం మహాత్ముడు ప త్తికొండ వెళ్ళినారు ప త్తి కొండ తాలూకాబోర్డు ప్రెసిడెంట్ డి సంజీవరెడ్డిగారు మహాత్ముని మెడలో

పూవులదండ వేసినారు ఇంద్రావతి పత్రికాసంపాదకులు శ్రీ వనం శంకరశర్మ గారు ఖద్దరునిధికి పౌరులపక్షాన రూ 1116 లు సమర్పించినారు పత్తికొండ తాలూకాబోర్డు ప్రెసిడెంట్, పత్తికొండ యూనియన్‌బోర్డు ప్రెసిడెంటు గాంధీజీకి స్వాగతపత్రాలు చదివినారు గాంధీజీ అందరూ ఖద్దరు ధరించవలెననీ మద్యపానం నిషేధించవలెననీ వివిధ మతస్థులు సంఘీభావంతో ప్రవర్తించవలె ననీ ముఖ్యంగా మూడువాక్యాలు చెప్పినారు స్వాగతపత్రాలు చట్రాలలో ఉండ డంచేత వాటిని మోసుకొనిపోవటం కష్టమనిచెబుతూ వేలం పెట్టినారు తాలూకా బోర్డు స్వాగితపత్రం తాలూకాబోర్డు అధ్యక్షులే 20 రూపాయలకు కొన్నారు యూనియన్‌బోర్డు అధ్యక్షులుకూడా తమ స్వాగతపత్రం 20 రూపాయలకు కొన్నారు వనం శంకరశర్మగారు గాంధీజీకి సమర్పించిన ఖాదీవస్త్రాలను వేలం పెట్టగా తిమ్మంౡ వెంకటనరసయ్యగారు 20 రూపాయలకు కొన్నారు శ్రీ పి బజార్ రెడ్డిగారు తులం బంగారం మహాత్మునికి సమర్పించగా దానిని వేలంలో అగ్రహారం నరసింహారెడ్డిగారు 22 రూపాయలకు కొన్నారు హెచ్ మాణిక్యరావుగారు ఒక ఉంగరం మహాత్మునికి సమర్పించి వేలంలో 15 రూపాయలకు వారే కొనుక్కున్నారు పెండెకల్లుకాపు లక్ష్మమ్మగారు ఒక ఉంగరము మహాత్మునకిచ్చి వేలంలో 21 రూపాయలకు ఆమే కొన్నది ఈ వేలములద్వారా మొత్తం 118 రూపాయలు గాంధీజీకి ఖద్దరు నిధికి వచ్చింది ఆపైన గాంధీజీ విడిదికి వెళ్ళినారు పత్తికొండ గ్రామమంతా ప్రజలతోనిండి మహదానందంగా ఉన్నది. సాయంకాలం 6 గంటలకు గాంధీజీ ఆదోనికి వెళ్ళినారు అక్కడనుంచి గాంధీజీ ఆరాత్రే బొంబాయికి బయలుదేరి వెళ్ళినారు

## రాయలసీమ సంచారము (1929)

గాంధీజీ కదిరిలో ఉపన్యసించి ధర్మవరం వెళ్ళుతూండగా మధ్య చిత్రా వతినది దాటవలసి వచ్చింది ఆయన మోటారు ఇసకలో నడవటం కష్టమయింది అందువల్ల అందరితోపాటు ఆయనకూడా దిగి మూడు ఫర్లాంగులు ఇసుకలో నడిచినారు అప్పుడు ప్రజలు ఆనందభరితులై దూరమునుంచి దగ్గరనుంచి దండ ప్రణామాలుచేసినారు ఆయన నెమ్మదిగా వారందరినీ ఆశీర్వదించి తరవాత కారులో ధర్మవరం వెళ్ళి అక్కడ పది నిమిషాలు ఉపన్యసించినారు వారి ఉప న్యాసమును గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు తెలుగులో చెప్పినారు కల్లూరు సుబ్బారావుగారప్పుడు హిందూపురం కాంగ్రెస్ కార్యదర్శిగా ఉన్నారు ఖద్దరునిధికి ఎక్కువ వసూలు కాకపోయినప్పటికీ ప్రజలలో గాంధీ పట్ల భక్తిభావం ఇనుమడించిన మాటమాత్రం వాస్తవము ఆ రాత్రి అనంత పురంలో ఉపన్యసించి మరునాడు తాడిపత్రి వెళ్ళినారు

## గాంధీజీ ఆంధ్రప్రదేశ్ పర్యటన ముగింపు (1929)

### కొండ వేంకటప్పయ్యగారి ప్రకటన

"మహాత్మాగాంధీ ఆంధ్రదేశ పర్యటన ఈ నెల 21తో ముగిసింది ఈ నాటి రాత్రి ఆయన ఆదోనినుండి బొంబాయి వెడుతున్నారు ఆంధ్ర దేశంలో హైదరాబాద్‌లో వసూలైన 10 వేల రూపాయలు కాక 2 లక్షల 52 వేల రూపాయలు వసూలైనాయి అంగీకారం ఈ వసూళ్ళలో ఏ రాష్ట్రానికి వెనకబడలేదు అందుకు మనం తృప్తి పడవలసిఉంది ఆంధ్రదేశ సంచారంలో సగటున రోజుకు 6 వేల రూపాయలు వసూలైనాయి

### సంచార ఫలితము

దేశంలో మంచి రాజకీయ చైతన్యం కలిగింది ఇంతవరకు ఏ ప్రముఖ జాతీయ నాయకుడు ఎప్పుడూ కాలుపెట్టి ఎరుగని గ్రామాలకు, పట్టణానికి ఎంతో దూరంగా ఉన్న గ్రామాలకు కూడా గాంధీజీ పర్యటన భాగ్యం లభించింది మహాత్ముని పట్ల ప్రజలకుగల భక్తివిశ్వాసాలు అపూర్వాలని వేరుగా చెప్పనవసరంలేదు అదే ఈ సంచారం ఇంత జయప్రదంగా జరగడానికి కారణము ఆయన ఈ జాతీయాభ్యుదయ మహాకార్యం కొనసాగించడానికి చిరకాలం జీవించుగాక అన్ని సందర్భాలలోను ఆయన అడుగులను అనుసరించగల బుద్ధిని, శక్తిని భగవంతుడు ప్రజలకు ప్రసాదించుగాక "

## ఆంధ్రదేశ సంచారము (1929)

### గాంధీజీ అభిప్రాయము

యంగ్ ఇండియా నుంచి

(23-5-1929)

ఈ సంచారం చాలా శ్రమతో కూడిన మాట వాస్తవమే కాని ఎంత శ్రమపడినా మో అంత చక్కగా కూడా జరిగింది గ్రామస్థులు అత్యద్భుతంగా తోడ్పడినారు అది నాకు చాలా సంతోషం కలిగించింది ముఖ్యంగా ప్రభుత్వోద్యోగం మానుకొని కాంగ్రెస్ సేవలోనే తన కాలం గడుపుతున్న ప్రముఖ స్వచ్ఛంద సేవకుడు సుబ్బరామయ్య హృదయపూర్వకంగా, శ్రద్ధా భక్తులతో, నిరంతర దీక్షతో సంచార కార్యక్రమం నిర్వర్తించినందుకు మాకది అంతగా శ్రమ అనిపించలేదు అయితే కేవలం నా సౌకర్యానికి ఎక్కువగా బాధ్యత వహించిన వ్యక్తి దేశభక్త కొండ వేంకటప్పయ్య నా ఆంధ్రదేశ సంచారం ఈ ఋతువులో ఏర్పాటు చేసినందుకు ఇంతపెద్ద కార్యక్రమం నిర్ణయించినందుకు ఆయనను కొందరు తప్పుపట్టినారు కూడా అయితే ఈ రెంటికీ కూడా ఆయన పూర్తిగా బాధ్యుడుకాడు ఆంధ్రదేశమంతటా ఈ కార్యక్రమం నిర్వర్తించవలసి ఉన్నది ఆయనకు కేటాయించిన కాలంలో ఇంతకంటే తేలికైన కార్యక్రమం నిర్ణయించడానికి వీలులేకపోయింది ఆంధ్ర

నాయకులు నా పర్యటనకు ఫిబ్రవరి నెలలో వీలుకాదన్నారు మార్చిలో నేను బర్మాకు పోవలసి ఉన్నందున ఏప్రిల్, మే నెలలలో ఆంధ్ర దేశానికి వెళ్ళవన్నా వెళ్ళాలి లేకపోతే ఈ సంవత్సరానికి (1929) మాన వయినా మానవలె ఆంధ్రదేశపర్యటనం విషయంలో ఇదివరకే చాలా వాయిదాలు వేయడం జరిగింది ఇంకొక వాయిదా వేయడం అసంభవము దేశభక్త వేంకటప్పయ్యగారు తప్ప మరొకరెవ్వరూ ఇంత తక్కువ శ్రమతో నా పర్యటన సాగించకలిగి ఉండేవారు కారు సమయపాలనలో సందడి లేకుండా చేయడంలో నాకు సౌకర్యమయిన వసతులు ఏర్పాటు చేయడంలో ఆయన చిక్కిచివికి నవసిపోయినాడు చాలా నెమ్మదయిన మనుష్యులలో ఆయన ఒకరు ఆయనతో కలసిఉండటం నా అదృష్టము అయినప్పటికీ ఆయన నా సంచారంలో కఠినంగానూ, నిక్కచ్చిగానూ తన అనుచరులతో కాలవ్యవధిని గురించి పట్టుదలగా ఉండేవారు అది ఆయనకు స్వభావంకాదు, అప్పుడాయన అట్లా ఉండటం ఆయన అనుచరులకు కొంత హాస్యంగా ఉండేది ఎంతమంచి ఏర్పాట్లు చేసినప్పటికీ ఒక్కొక్కప్పుడు ప్రమాదాలు జరుగుతూండటం సహజము అప్పుడు ఆయన కోపం చూపించేవారు అందువల్ల నాకు పాడు రోడ్లపైన ప్రయాణం చేసినందువల్ల కలిగిన విసుగు కూడా కొంత తగ్గిపోతుండేది దేశభక్తునివంటి నిర్వాహకుని పర్యవేక్షణకింద ఆంధ్రదేశంలోని ప్రజలవంటి ప్రజలమధ్య మరి నూరు పర్యాయాలయినా విసుగు లేకుండా నేను పర్యటించగలను

**విశ్వదాత**

దేశభక్త కొండ వేంకటప్పయ్యగారిని గురించి వ్రాస్తూ దేశోద్ధారక నాగేశ్వరరావుగారిని గురించి వ్రాయకుండ ఉండరాదు నేనాయనను ఏదో ఒక మంచి పేరుపెట్టి ఒక తైలాన్ని అమ్మి డబ్బు చేసుకుంటున్నందుకు ఎప్పుడూ హేళన చేస్తుండేవాణ్ణి ఆయన నవ్వుతూ "అవును అది చెడ్డపనే, నేనేం చేయగలనుమరి దానినుంచి వచ్చే సొమ్ముతో నేను దేశానికి సేవ చేయాలని ప్రయత్నిస్తున్నాను అది ఏమీ ప్రమాదకరమయిన తైలంకాదు" అనేవారు ఆయన తైలమును గురించి నేనెంత అలక్ష్యంగా హాస్యమాడేవాడ్నో ఆయన సమాధానం కూడా అంత అలక్ష్యంగా అలకిస్తుండేవాణ్ణి ఈ నా పర్యటనలో, ఆయన అమృతాంజనం డిపో ఆంధ్రదేశంలోని అనేక ప్రజాహిత కార్యాలకు విశ్వప్రదాతగా తోడ్పడుతూన్నదనే సంగతి తెలియవచ్చినందుకు నాకు సంతోషాశ్చర్యాలుకలిగినాయి ఆయన దాతృత్వ మందిరంనుంచి అర్హుడైన యాచకుడెవడూ వట్టిచేతులతో వెళ్లలేదు నేను వెళ్లిన చోటులన్నిట్లోనూ, అన్ని సన్మానపత్రాలలోనూ ఆయన దాతృత్వ ప్రశంస లేకుండాపోలేదు అస్పృశ్యులకోసం ఏర్పడిన ఆనందాశ్రమానికి అవసరమయిన భవనాలు నాగేశ్వరరావు కట్టించినవే ఏదైనా పాఠశాలకు ధనసహాయం కావలసివస్తే

అది నాగేశ్వరరావునుంచి లభించవలసిందే డాక్టర్ సుబ్రహ్మణ్యం ఆశ్రమానికి అచ్చు యంత్రం కావలసివస్తే నాగేశ్వరరావుగారే దానికి శరణ్యం గావలె ఆయనకు ఇవ్వడంలో ఉన్న ఆనందం ఎందులోనూలేదు నాకు తెలిసినంతవరకు ఆయన కుడిచేతితో ఇచ్చేది ఎడమచేతికి తెలియదు ఆయన "బహిరంగ దోపిడీ"ని గురించి నేను హాస్యమాడినప్పుడు ఒక కార్యకర్త "ఆయన ఇంత కంటె ఇంకా ఎక్కువగా దోపిడీ చేయగలగాలని నా కోరిక అది ప్రజోపయోగ కార్యకలాపాలకు వినియోగపడుతుంది" అన్నాడు ఆ మాట నాకు ఆశ్చర్యంగా తోచలేదు జాతీయ సేవకులకు బిరుదులు ఇవ్వడంలో ఆంధ్రులు చాలా ఉదారంగా ఉంటారని నేను నిగూఢంగా విమర్శిస్తూ ఉంటాను కాని నాగేశ్వరరావుగారి "దేశోద్ధారక" బిరుదము ఆయనకు అర్హమయినదే అని నేను సరిపెట్టుకోక తప్పిందికాదు. .

... ...

## ప్రశస్తమయిన సన్మానపత్రము

కొన్ని ముఖ్య విషయాలను మరుసంచికకు ఉంచి నెల్లూరు జిల్లా ఉలవపాడులో నాకు సమర్పించిన ప్రశస్తమయిన సన్మానపత్రికను గురించి ప్రస్తావించదలచుకొన్నాను అది తెలుగులోను, హిందీలోనూ కూడా ఉన్నది అది ఆ చిన్న గ్రామంలోని స్థానిక కళాకారునిచే చిత్రితమయిన వగిపీ అంచులుగల మామూలు కాగితంపైన వ్రాయబడింది. హిందీ సన్మానపత్రంలోని భాష ప్రామాణిక హిందీభాష అందులో సంస్కృత పదాలుగానీ, పారసీ పదాలుగానీ ప్రయోగించవలెననే ప్రయత్నమే జరగలేదు అందులో ప్రయోగింపబడిన భాష ఉత్తరప్రదేశ్‌లో హిందీకి వ్యతిరేకులు కానివారు ముస్లిం విద్వేషులు కానివారు అందరూ మాట్లాడే భాష, అందరూ వినే భాష అందులోని మొదటి పేరాలో నా రాకను గురించి మర్యాదగా కొన్ని మాటలు చేర్చడం జరిగింది అంతేగాని భాషా ప్రావీణ్యంగాని, ఆకర్షవంతాలైన విశేషణలుగానీ అందులో లేవు

అది కాంగ్రెస్ పనిలో పురోగమించిన గ్రామమయినప్పటికీ ఆ గ్రామ జీవితం గురించి సన్మానపత్రంలో అంత సంపూర్ణంగా వివరించడం సాధ్యం కాదు ఆ గ్రామంలో కాంగ్రెస్ కమిటీలేదు సరిగదా, అఖిల భారత చర్ఖా సంఘం కార్యకర్త కూడా లేడు ఆ గ్రామానికి నేను వెళ్ళింది ఉదయంపూట వారి సన్మానపత్రం నకలు ముందుగా నాకు పంపలేదు అది గ్రామస్థుల తప్పుగాదు అందులో ఉన్న ముఖ్య విషయాలను గురించి నాకు ముందుగా తెలియనందున ఆ సన్మానపత్ర రచయితలకు తగిన సూచనలు నేనీయజాలకపోయినాను. కాబట్టి ఇప్పుడా సూచనలు చేస్తున్నాను.

1. ఆ గ్రామ పెద్దలు వెంటనే కాంగ్రెస్ కమిటీని స్థాపించవలె. అందులో, వయసు వచ్చిన స్త్రీ పురుషులందరూ సభ్యులుగా ఉండేటట్లు

చూడవలె

2 అస్పృశ్యులనబడే వారితో స్నేహం చేయవలె మృతజంతువుల మాంసాహారం, మద్యపానం వారు నిషేధించేటట్లుచేసి వారిని గ్రామస్థులకు సన్నిహితులుగా చేయవలె ఇందుకోసం వారి ప్రదేశాలకు జిల్లా నాయకులను ఆహ్వానిస్తూ ఉండవలె

3 గ్రామ పెద్దలు సమావేశమై తమ జిల్లాలో పరోపకార బుద్ధిగల ఇంజనీయరు సహాయంతో మంచినీటికి కావలసిన పథకం తయారుచేయించుకోవలె

4 వడుకు నూలుపనిని ప్రతిఇంట్లోనూ క్రమబద్ధంగా ప్రవేశపెట్టవలె కనీసం ఎవరికి కావలసిన ఖాదీ వారే ఉత్పత్తి చేసుకోవటం ఆదర్శంగా పెట్టుకోవలె,

5 వారి గ్రంథాలయానికి గవర్నమెంట్ వారు సహాయం నిరాకరించడం కీడులో మేలుగా భావించి దానిని పూర్తిగా జాతీయతకనుగుణంగా నడుపుతూ పయోజన విద్యా కేంద్రంగా చేయవలె

యంగ్ ఇండియా యం కె గాంధీ
28 మే 1929

## యంగ్ఇండియా వ్యాసాలు-1929

1929 ఏప్రిల్, మే నెలలలో గాంధీజీ ఆంధ్రదేశంలో పర్యటనచేసినప్పుడు ప్రతివారం తన అనుభవాలనుగురించి 'యంగ్ ఇండియా' పత్రికలో ఆయన వ్యాసాలు వ్రాస్తుండేవారు ఇంతకుపూర్వం ఆ సందర్భంలో మార్చి 7, ఏప్రిల్ 18,25 తేదీలలో గాంధీజీవ్రాసిన వ్యాసాలను ఉదాహరించడం జరిగింది అదే సందర్భంలోని మరికొన్ని వ్యాసాలుకూడా 'యంగ్ ఇండియా' నుంచి ఉదాహరించడం సమంజసంగా ఉంటుందని భావిస్తున్నాము

### ఆంధ్రదేశంలో
(యం కె. గాంధీ)

దాదాపు 30 వేల రూపాయలు వసూలుచేయటానికి రూ 1684-12-0 ఖర్చయింది అంటే 5 శాతం పైన ఖర్చయిందన్నమాట ఇంతకుపూర్వం పర్యటనలలో ఇంతకంటే ఎక్కువ అయినవని నాకు తెలుసు అయితే వాటిలో నా సహచరుల భోజనం ఖర్చులుకూడా చేరిఉన్నాయి ఈ బిల్లులో అవి చేరలేదు పర్యటనక్రమం ఈ రోజున నిర్ణయించవలసిఉన్నది ఈ ఖర్చును ఇంకా తగ్గించటానికి వీలున్నదని నా అభిప్రాయము డాక్టర్ పట్టాభి వ్యాపార సరళికలిగి చురుకుగా పనిచేయగలిగిన కార్యకర్తలలో ఒకరు. అనవసరమయిన ఖర్చులనన్నిటినీ తగ్గించ గలిగినారాయన కాని ప్రయాణంలో కావలసిన స్వచ్ఛంద సేవకులసంఖ్య ఇంకా కొంత తగ్గించవచ్చుననీ, తగ్గించి తీరవలెనని నా

అభిప్రాయము ఇటువంటి విషయాలలో చాలా కచ్చితంగా ఉండవలె సంచారబృందంలో ఎవరు ఎంతవరకు అవసరమో అంతవరకే ఉండవలె గ్రామాలలో ఇటువంటి పర్యటన కార్యక్రమాన్ని ఏర్పాటుచేయడం తేలికయిన పని కాదని నాకు తెలుసు అది ఒక నూతన కార్యరంగం దీనికి ముందుగా ప్రజలలో కావలసినంత ప్రచారం జరగవలె ఎక్కడయితే ఈ ప్రచారపుటేర్పాట్లు సరిగా జరిగినవో అక్కడ వేలకొద్దీ జనంచేరినప్పటికీ ప్రజలు నిగ్రహంతో ఆదర్శప్రాయంగా ప్రవర్తించినారు ఎక్కడ ముందుగా ఈ ప్రచారం జరగలేదో అక్కడ 'మహాత్మాగాంధీకిజై' అన్న కేకలు మిన్నుముట్టి,కొన్ని సమయాలలో నేను భరించలేనంతగాఉండి నా చెవులలో వ్రేళ్ళు పెట్టుకోవలసివచ్చింది తరచుగా ఆ కేకలు నాకు అర్థరహితంగా కనబడినాయి అవి ఏవిధంగామా ప్రజల ఉత్సాహాన్ని ఇనుమడింపచేసినట్లు తోచలేదు ఇట్లా కేకలు వేయవలెననే కోరికను ప్రజలు నిగ్రహించుకొన్నచోటనే వారి ఉత్సాహం కార్యరూపంలో ద్విగుణీకృతంగా ప్రదర్శితమయింది తిలక్ స్వరాజ్యనిధికంటే ఈ పర్యాయం ఖద్దరునిధికి తన జిల్లాలో ఎక్కువసొమ్ము వసూలైనట్లు డాక్టర్ పట్టాభి వాతో అన్నారు

## ఖాదీనిగురించిన సంభాషణలు

నేను సంచారంచేసిన వివిధ జిల్లాలలోనూ, కార్యకర్తలతో ఖాదీ, మద్యపాన నిషేధము, జాతీయవిద్య మొదలయిన విషయాలగురించి సంభాషిస్తూ వచ్చినాను తక్కిన అన్ని విషయాలలోకంటె వారికి ఖాదీలోనే ఎక్కువ విశ్వాసంఉన్నట్లు నాకుతోచింది ఖాదీ నిర్మాణాన్ని సరిఅయిన పద్ధతులలో నడిపినట్లయితే ఖాదీఉత్పత్తి అనంతంగా అభివృద్ధికాగలదని డాక్టర్ పట్టాభి నిశ్చితాభిప్రాయము సీతారామశాస్త్రిగారుకూడా అదే అభిప్రాయంతో ఉన్నారు అయితే ఆంధ్రదేశంలో ఈ విషయంగురించి శాస్త్రీయపరిశోధన చేయగల కార్యతత్పరత కనబడనందువల్ల నేను విచారపడుతున్నాను మగన్‌లాల్ గాంధీ, లక్ష్మీదాస్, సతీష్‌బాబువంటి నిపుణులు ఇతరరాష్ట్రాలలో కనిపించినట్లు ఆంధ్రదేశంలో ఒక్కరుకూడా నాకు కనబడలేదు నూలువడికే వారిలోనే ఏకుడు పనినికూడా ప్రవేశపెట్టేటందుకు ఏమీ ప్రయత్నంజరగలేదు నూలువడికేవారే సొంతంగా ఏకడం నేర్చుకోకుంటే ఎంతోకాలం నూలువడకడం సాగదని, వడుకునూలు నాణ్యంకూడా అభివృద్ధికాదనీ అనుభవజ్ఞులయిన అనేకమంది కార్యకర్తల అభిప్రాయము నా అభిప్రాయంకూడా అదే తమ భుక్తికి అవసరమయిన అదనపు సంపాదనకోసం ఖాదీఉత్పత్తి చేయవలసిన అవసరంలేనివారు నూలు వడకినందువల్ల ఖాదీప్రతిపత్తి పెరుగుతుందనికూడా ఆంధ్రులు గట్టిగా గ్రహించినట్లులేదు నూలువడకడమొక్కటే అదనపు వృత్తిగా అవలంబించవలసిన అవసరంలేని ప్రజలులేనప్పుడు 'దరిద్రనారాయణ' కోసం ఖాదీనిధి సేకరింపబడుతున్నదని చెప్పడం మోసం అవుతుంది కాబట్టి

ఆకలితో అలమటిస్తూన్న ప్రజలుగల ఏ యే ప్రదేశాలలో ఖాదీఉద్యమం బాగా ప్రచారంలోకి రాగలదో, ఆ యా ప్రదేశాలను చూపగల ఆంధ్రదేశపటమొకటి తయారుకావలె మన కార్యకర్తలు, మనం సేకరించిన ధనము అక్కడ ఉప యోగపడవలె కాబట్టి కార్యకర్తలకు కింది సూచనలను చేస్తున్నాను

1 ఏ గ్రామాలలోని ప్రజలకు వ్యవసాయం వల్ల భుక్తి జరగక ఎక్కువ విశ్రాంతి ఉంటుందో ఆ గ్రామాలలోని నిరుపేదలలో ఈ నూలు వడికే పనిని ప్రవేశ పెట్టవలె కొనుగోలు ఖరీదు ఎక్కువకాకుండేటట్లు వారికి కొంతవిరాళం కూడా ఇవ్వవలె

2 పేదరికంతో నిమిత్తం లేకుండా అన్ని గ్రామాలలోను ఎవరికి కావ లసిన ఖాదీ వారే ఉత్పత్తి చేసుకొనేటట్లు చూడవలె అటువంటి వారికి పత్తి గింజలు తీయడం, ఏకులు చేయడం మొదలయిన విషయాలను నేర్పడంతోపాటు వారికి కావలసిన పత్తి మొదలయిన పరికరాలను గిట్టుబాటు ధరకు సప్లయ్‌చేసి వారు వడికిన నూలును మామూలు ధరలకు కొనే ఏర్పాటు చేయవలె ఈ ఏర్పాట్లకయిన ఖర్చులు ఖాదీ సంస్థ భరించవలె

3 అవసరమయిన చోట్ల విధికృతంగా నూలువడికే పద్ధతిని ప్రోత్స హించ వలె ఈ రెండో పేరాలో ఉదాహరించిన ప్రకారం కార్యకర్తలు అన్ని సహాయాలు చేయవచ్చు కాని ఈ ఖర్చు ప్రధాన కార్యాలయం మీద పడ కూడదు ప్రధాన కార్యాలయం నష్టపడుతూ మత ధర్మంగానూ, విధి కృతం గాను చేయవలసిన నూలు వడికే పనిని ప్రోత్సహించడం వల్ల దాని ఉత్కృష్టతకే భంగం కలుగుతుంది ఈ తరగతి వడికేపనిలో కూడా సొంతంగా దూది ఏకు కొనే పద్ధతిని పట్టుదలతో అవలంబించేటట్లు చేయవలె పత్తిగింజలు తీయడం దూది ఏకడం వంటి పనులతో నూలువడుకు పారాలు ప్రారంభించడం వివేక మైన పద్ధతి అని నా నమ్మకం నిజానికి తెలివిగల కార్యకర్త ఈ మూడు విధా నాలను ఒక్కరోజులో నేర్చుకోగలడు

వీటన్నిటినీబట్టి ఆంధ్రదేశమంతటిలోను 12 వ నెంబరుకంటే తక్కువ నంబరుగల నూలు వడికినందుకు ఒక ప్రమాణవేతనం నిర్ణయింప బడవలెనని తేలుతున్నది సన్న నూలుకు మోహాదృష్టిని రేట్లు నిర్ణయించ వచ్చు దానిని బట్టి బట్ట విలువను నిర్ణయించవలె ఈ సందర్భంలో మునగాల జమీందారు రాజా నాయని వెంకట రంగారావు బహదర్‌గారు ఆంధ్రదేశంలో ఖాదీ అభి వృద్ధి కోసం ఒక శాస్త్రీయ శాఖా నిర్మాణంకోసం ఉదారంగా ఇచ్చిన 1500 రూపాయల విరాళం పేర్కొనవలసి ఉన్నది ఆంధ్రలో అటువంటి అవసరం ఉన్నదని ఆయన సహజంగా గుర్తించినట్లు నేను అనుకోవడంలేదు ఆంధ్ర దేశంలో చర్ఖాకు ఉన్న ప్రచారం బట్టి అదే సొమ్ముతో అఖిలభారత దేశంలో అటువంటి శాఖను ఒకదానిని ఎందుకు స్థాపించకూడదో నాకర్థం కావడంలేదు అయితే ఆపనికి చర్ఖాలో సంపూర్ణ విశ్వాసం కలిగి ఆ శాస్త్రంలో ప్రవీణుడు కావలెననే దృఢనిశ్చయం కలిగిన మనిషి కావలె ఇటువంటి శాస్త్రీయ శాఖ

ప్రారంభింప బడవలెనంటే కొంతమంది ఉత్సాహవంతులైన యువకులను శిక్షణ కోసం సబర్మతికో, సోదేపూరుకో మరి ఏ ఇతర ప్రదేశాలకో పంపడం అవసరము

**బాల వితంతువు**

మేము బెజవాడ నుంచి ఏలూరుకు పోయేటప్పుడు కొద్ది రోజుల కిందటనే వితంతువైన బాలిక 1400 రూపాయల విలువగల ఆమె ఆభరణాల నన్నిటినీ నాకు సమర్పింప నున్నదని తెలిసినది ఆమె గ్రామం మేము పోనున్న పెదపాడు గ్రామానికి దాదాపు రెండు మైళ్ళలో ఉన్నది ఆమె తన ఇంట్లో నన్ను చూడగోరినట్లు తెలిసింది ఆమె కులస్థులలో గోషా ఆచారం ఉన్నది ఏసందర్భంలోను కొద్దినాళ్ళ కిందట వితంతువయిన బాలిక బయటక రావడానికి ముఖ్యంగా బహిరంగ సభలకు రావడానికి సాహసించ జాలదు ఆమె నగల వాగ్దానం నన్నెంత మాత్రం ఆకర్షించ లేదు నిజానికి ఆ బాలవితంతువు తనవిలువగల వస్తువులన్నీ నాకు సమర్పించ నున్నదన్న వార్త కూడా నేను నమ్మలేదు ఆమె చిన్న వయసులో ఇటివలనే (మగనితో కాపురమనగానేమో ఎరుగకనే) వితంతువు కావడం వల్లనే నేను ఆమె యింటికి పోక తీరదనిపించింది నేను వెళ్ళడం మంచిదే అయింది ఆమె పేరు సత్యవతీదేవి ఆమెవయసు ఇరవై సంవత్సరాలలోపు ఆమె భర్త మంచి విద్యావంతుడయిన జాతీయవాది ఆమెకు తెలుగు తెలుసు ఆమె ధైర్యవంతురాలని నిర్ణయ శక్తి కలదని నాకు తోచింది ఆమె తల్లిదండ్రులు జీవించి ఉన్నారు నాకు తెలిసినంత వరకు ఆమె నగలన్నీ నా చేతులలో పెట్టింది వాటి ఖరీదు పూర్తిగా 1400 రూపాయలని నేను అభిప్రాయపడినాను తనను నా ఆశ్రమానికి తీసుకొని పోవలసిందని ఒక చీటి కూడా ఆమె నాచేతులలో పెట్టింది సత్యవతీదేవితో నేను మాట్లాడే టప్పుడు ఆమె తల్లిదండ్రులు అక్కడ ఉన్నారు ఆమె నాకా నగలను సమర్పించడం వారంగీకరించినారు కూడా ఆమెను ఇంటిలోనుంచి కదలకుండా ఉంచకూడదనీ, కుటుంబంలోని తక్కిన బాలికలవలనే ఆమెను కూడా చూడ వలసిందనీ నేనా తల్లిదండ్రులకు సలహా ఇచ్చినాను ఆమె వితంతువు కనక ఆమె నగలన్నిటినీ విసర్జించవలసినవనిలేదనీకూడా నేనా బాలికకు చెప్పినాను కాని ఆమె పట్టుదలగా ఉన్నది ఆమెకానగలతో ఏమీ ప్రయోజనం లేదన్నది ఆమె తల్లిదండ్రులు అంగీకరించినట్లయితే ఆమెను ఆశ్రమానికి సంతోషంగా తీసుకొని పోగలనని ఆమెతో నేను అన్నాను తల్లిదండ్రులు ఆవిషయం ఆలోచించ గలమని నాతో చెబుతూ నా పర్యటనానంతరం ఆమెను నా ఆశ్రమానికి పంపించగలమని ఆమెకు ధైర్యం చెప్పినారు తండ్రికొంత నిదానంగానూ మూఢభావంగానూ ఉన్నప్పటికీ తనకుమార్తె పట్ల ఉదారంగా ప్రవర్తిస్తున్నట్లే తోచింది ఆమెను నేను ఇంతకంటె మిన్నగా ఓదార్చ జాలనందుకు విచార పడుతున్నాను విచార భారంతోనే నేనామె దగ్గర సెలవు తీసుకొన్నాను

కాబట్టి పెదపాడులో నా ఉపన్యాసమంతా సత్యవతీదేవిని గురించే నడి

చింది గోషా పద్ధతిని తొలగించడం ప్రజల కర్తవ్యమని ఆ బాలవితంతువు పునర్వివాహానికి ఇష్టపడితే ఆమె తల్లిదండ్రులు అందుకు సహకరించవలెనని వారికి చెప్పినాను 18 యేండ్ల వయస్సుగల యువకుడు భార్యపోతే వానికి పునర్వివాహం చేసుకొనే హక్కు ఉన్నప్పుడు అటువంటి హక్కు అదే వయస్సుగల యువతికి ఎందుకుండకూడదు ఆ సభలోని వారందరూ గౌరవం తోనూ ఏకాగ్ర చిత్తంతోనూ ఆలకించినారు ఆ బాలిక తండ్రి కూడా ఆ సభలో ఉన్నాడు ఆమె ఆ నగలను నాకు ఇవ్వడం ఆమె సొంత నిర్ణయమే నని, ఆమెకు తిరిగి వివాహం చేసుకొనే కోరిక లేదని తరవాత నాకు తెలిసింది ఆమె చదువుకొని ఆమె జీవితం జాతీయ సేవకే అంకితం చేసుకోవడానికి కోరిక కలిగి ఉన్నట్లు కూడా నేను విన్నాను ఆమె ఈ నిర్ణయం బాగా ఆలోచించి చేసుకొంటే ఆమెకు నా అభివందనలు అటువంటి వితంతువులకు వారి ఇష్టంవచ్చి నప్పుడు పునర్వివాహం చేసుకొనేటందుకు హిందూ సంఘం స్వాతంత్ర్యమీయ వలె సత్యవతీదేవి కథనం వంటి కథనం ప్రతిరోజు వందలకొద్దీ హిందూ గృహా లలో ప్రదర్శితమవుతూన్నదే వితంతువులను క్షమించరాని నిర్బంధాలలో ఉంచుతున్నంతవరకు పునర్వివాహం చేసుకోవాలని కోరికగల ప్రతి వితంతువు హిందూసమాజంలో దానికి సంప్రదాయ సిద్ధంగా వస్తున్న క్రూరమయిన ఆచా రానికి భయపడి క్రుంగి కృశించి పోవలసిందే

యంగ్ ఇండియా
2-5-1929

### ఆంధ్రదేశంలో

నా ఆంధ్రదేశ సంచారంలో సహచర కార్యకర్తలు నిర్ణీత కార్యక్రమం నిర్వహించడంలో సమయాన్ని అతి సూక్ష్మంగా పాటిస్తున్నారు నిర్ణీత కాలానికి కార్యక్రమం కొనసాగించడంలో కార్యకర్తలు పోటీపడడం గమనించి నప్పుడు నాకు చాలా సంతోషం కలుగుతుంది అందువలన మా ప్రయాణాలు కానీ సమావేశాలుకానీ ఎక్స్‌ప్రెస్ రైలుబండివలె నక్రమంగా సాగుతున్నాయి ఉదయం సాయంకాలం కూడా దేశభక్త వెంకటప్పయ్యగారు స్థానిక సహచరులతో కలసి పెదవుల మీద చిరునవ్వులు చిందులాడుతూ నా ఎదుట ప్రత్యక్ష మవుతున్నారు సభలు సక్రమంగా సరియైన వేళకు జరుగుతున్నందుకు అంత వేసవి వేడిని నేను సహించగలగడమేగాక నాకది ఆనంద దాయకంగా కూడా ఉన్నది స్త్రీ పురుషులు ఆత్యాసక్తితో ఇస్తూండిన రూపాయలు, పైసలూ కూడా నాకు అలసటా ఆనందాన్నీ కల్పిస్తున్నాయి. తునిలో జరిగిన స్త్రీల సమావేశానంతరం నేనీ విషయాలు వ్రాస్తున్నాను పేదరికంతో నేగాక జరాభారంతో సైతం కుంగిపోయిన 75 ఏండ్ల వృద్ధురాలు ప్రసన్న వదనంతోనూ మెరుస్తూన్న కనుచూపులతోను నాచేతిలో నాలుగణాలు పెట్టింది అప్పుడామె కళ్లలో ఏవిధమయిన దైన్యమూ కనిపించలేదు అది ఎప్పటికీ మరపురాని

దృశ్యము ఆ తరవాత వెంటనే ఖాదీ ధరించిన ఒక మధ్యవయస్కురాలయిన స్త్రీ నాచేతిలో ఐదు రూపాయిలకానీ ఉంచింది నేనామెను నీ విచ్చిన విరాళం గొప్పదా ఆ వృద్ధ సోదరి ఇచ్చిన విరాళం గొప్పదా అని సూటిగా ప్రశ్నించినాను కాని ఆమె "మా ఇద్దరిదీ సమానమే" అని ధైర్యంగాను దృఢంగాను జవాబు చెప్పింది ఆ జవాబు నాకు అంతులేని ఆనందాన్ని కలిగించింది దానికి నేను నిరుత్తరుడ నయినందుకు కూడా నాకు సంతోషంగానే ఉంది ఆమె దగ్గరనుంచి తెలివిగా హృదయంలోకి చొచ్చుకొనిపోయే జవాబు వస్తుందని నేను అనుకోలేదు "నాకు చిరకాలంనుంచి జాతీయోద్యమంలో ఆసక్తి ఉన్నది నా శక్తి వంచన లేకుండా నేను జాతీయోద్యమానికి తోడ్పడుతూనే ఉన్నాను నాకు ఖాదీలో నమ్మక మున్నది నేను ఎల్లప్పుడు ఖాదీయే ధరిస్తున్నాను" అన్నది ఆమె నాకు అంతులేని ఆనందానుభవాలలో ఇది ఒక్క ఉదాహరణం మాత్రమే ఇక ఇతర విషయాలను గురించి చెప్పవలసి ఉంది.

## కార్యక ర్తల సమావేశము

ప్రతి జిల్లాలోనూ ఒకచోట ముఖ్యంగా ఆ జిల్లా పర్యటనం ముగించిన తరవాత నేను కార్యకర్తల సమావేశంలో పాల్గోవడం మామూలయింది అట్లాగే తణుకులో కార్యకర్తల సమావేశం జరిగింది అందులో దాదాపు నూరుగురు కార్యకర్తలున్నారు అనేక విషయాలు చర్చించడం జరిగింది ప్రతి సమావేశంలో, కాంగ్రెస్ కార్యకర్తలు తాలూకా బోర్డులు, జిల్లా బోర్డులు, పురపాలక సంఘాలు, శాసనసభలు మొదలయిన సంస్థల ఎన్నికలలో పోటీకి నిలబడడంవల్ల ఖద్దరు పనికి తదితర నిర్మాణ కార్యకలాపాలకూ విఘాతం కలగడం లేదా అనే ప్రశ్న లేకెత్తుతూ వచ్చింది ఈ సమావేశంలో ఆ ప్రశ్న మరింత పట్టుదలతో ప్రారంభమయింది ఈ సంస్థలు మంచి కార్యకర్తల శక్తి సామర్థ్యాలను అవసరమయిన దానికంటె ఎక్కువగా హరిస్తూన్నాయని నా అభిప్రాయము ఉత్తములయిన కార్యకర్తలు కొందరు ఏదైనా ప్రయోజన కరమయిన పని చేయవలెననే అభిప్రాయంతో మున్సిపాలిటీలను వదిలేసి వచ్చినారు ఆ సంస్థలలో కావలసినంత కీచులాట, అసూయ, కుట్ర, స్వార్థపరత ఉండడంవల్ల అక్కడ నిజాయతీగల కార్యకర్తలు చాలాకాలం నిలవలేరు అయితే వాటిలో ఆసక్తిగల కాంగ్రెస్‌వాదుల విధానం సమర్థిస్తూ ప్రసంగించిన ఒక కాంగ్రెస్ కార్యకర్త, ఆ సంస్థలలో కాంగ్రెస్ వాదులుండడంవల్ల అక్కడి చెడుగులకు లొంగిపోయే చిత్తవృత్తికంటె వాటిని నిరోధించే చిత్తవృత్తి ప్రబలుతున్నదని అన్నాడు ఏమయినప్పటికీ ఆసంస్థలలో చేరడంవల్ల నిర్మాణ కార్యక్రమానికి విఘాతం కలిగే పక్షంలో, ఆ కాంగ్రెస్ కార్యకర్త చెప్పిన నిరోధక చిత్తవృత్తికి మనం చాలా నష్టపడవలసి వస్తుందని నా అభిప్రాయము ఆ సంస్థలలోగాని వాటి ఎన్నికలలోగాని ఆసక్తి కలిగించుకొన్నందువల్ల ప్రయోజనకరమయిన పనియేమీ జరగదని తోచినప్పుడు వాటిలో ఐక్యం

కల్గించుకొనేవారితో ఏ విధమయిన ప్రసక్తి కలిగి ఉండకూడదని నేను తణుకులోని కార్యకర్తలకు సలహా ఇచ్చినాను పైన పేర్కొన్న సంస్థలలో పని చేయడమా లేక నిర్మాణ కార్యక్రమంలో పనిచేయడమా అనే ప్రశ్న వచ్చినప్పుడు నిస్సంశయంగా నిర్మాణ కార్యక్రమమే ఎప్పటికైనా ఉత్తమమయినదని చెప్పక తప్పదు ఇంతా అయితే మనకు వేలకొద్దీ కాంగ్రెస్ కార్యకర్తలున్నప్పుడు, ఎన్నిక సంస్థలని చెప్పబడే వాటిలో ప్రవేశించగలవారు ప్రతి జిల్లాలోను పకొద్ది మందో ఉండవచ్చు వాటిలో నమ్మకమున్న వారిని అందులో చేరనీయండి వాటిలో నమ్మకం లేనివారు వాటిలో చేరిన వారిపైన అసూయ, అసహనం మాత్రం చూపవద్దు!

వడుకునూలు బాగా ఉత్పత్తి అయిన జిల్లాల నుంచి పేదరికం లేక నూలు వడకడం అవసరంలేని ప్రజలుగల జిల్లాలకు ఆ నూలును పంపవలెననీ అట్లా పంపినచోట్ల వడుకు నూలు నేయగలవారు కూడా ఉండాలనీ మరొక సూచన చేయడం జరిగింది అయితే వడుకు నూలు తయారయిన చోట్లనే అది పూర్తిగా ఉపయోగపడడానికి అవకాశమున్నప్పుడు దానిని మరొకచోటికి పంపకూడదు నూలువడికినచోటనే నేయడం కూడా జరగడంలోనే వడుకు నూలు పని విజయవంతంగా సాగడానికి వీలున్నది ఆ రహస్యం మనం గ్రహించవలె వడుకు నూలు తగినంత లేనిచోట్ల, మిల్లునూలుగాని విదేశీ నూలు గాని నేసే స్థానికులను వడుకునూలు నేయమని తొందరపడి ప్రోత్సహించ కూడదు ఆ విషయంలో కొంత ఓర్పు అవసరము సాధ్యమయినంతవరకు స్వయంగా వడకడం మతధర్మంగా వడకడం ప్రోత్సహించవలె అట్లా ఉత్పత్తి అయిన నూలు పెరిగిన కొద్దీ మనకు లభించిన నేతగాండ్రందరికీ పని చూపించడానికి వీలు కలుగుతుంది.

## ఆదర్శ సహకారసంఘము

విజయనగరంలో నేనొక ఖద్దరు సహకారసంఘం కనుక్కొన్నాను అది ఎంతో జయప్రదంగా పనిచేస్తూన్నది యావద్భారతదేశంలో, దానితో తుల తూగేసంస్థ మరొకటిలేదు! ఆ సంఘంవారు సమర్పించిన సన్మాన పత్రంనుంచి కింది భాగం ముద్రిస్తున్నందుకు నేను క్షమాపణ చెప్పుకోవలసిన పనిలేదు

"మాఅంగడిలోని బట్ట అంతా మేము తయారు చేసినదే! ఇతరచోట్లనుంచి మేము ఏమీ దిగుమతి చేసుకోలేదు మేము ఇతర రాష్ట్రాలనుంచికాని మా రాష్ట్రంలోని ఇతర జిల్లాలనుంచిగాని ఖద్దరు దిగుమతి చేసుకో కూడదని నిర్ణయించుకొన్నాము విదేశీ బట్టల దిగుమతివలెనే, ఖద్దరు దిగుమతికూడా స్థానిక ఖద్దరు ఉత్పత్తికి అన్యాయం చేస్తుందని మా అభిప్రాయము

ఖద్దరు ఉద్యమంలోని ఆశయం, ప్రతిచోటా స్థానికంగా నూలు వడకడం నేయడం సాధ్యమయినంత విస్తృతంగా వ్యాపింపచేసి సాధ్యమయినంత ఎక్కువ మందికి జీవనాధారం కలుగ చేయడమని మా తలంపు

ఈ కారణంవల్లనే మా బట్టలకు కావలసిన రంగులూ అద్దకాలు మేమే వేసుకొంటున్నాము ఆ పనులకోసం వాటిని ఇతర చోట్లకు పంపడంలేదు

అఖిల భారత ఖద్దరు సంఘమువారి సమ్మతి పత్రాలతో కుప్పడం బట్టల అంచులకు మిల్లునూలు ఉపయోగించడం జరుగుతున్నదని మేము వింటున్నాము కాని మా సంఘం మాత్రం అటువంటి మిశ్రమం అంగీకరించ జాలదు

"సంఘంలో సభ్యులుగా చేరిన కార్మికులకోసం సంఘానికి సంవత్సరంలో లభించిన నికరాదాయంలో ఒక భాగం ప్రత్యేకించ బడుతుంది ఆ మొత్తం ఆయా కార్మికులు చేసిన పనిని బట్టి దామాషాగా పంచిపెట్టబడుతుంది అందువల్ల ఎక్కువమంది పనివాళ్ళు ఈ సంఘంలో సభ్యులుగా చేరినారు

ఈ సంఘాన్ని 22-7-1927న స్థాపించడం జరిగింది అప్పుడిందులో 20 మంది సభ్యులు మాత్రమే ఉన్నారు ఇప్పుడా సభ్యత్వం 101కి పెరిగింది వారిలో 45 మంది నూలువడికే స్త్రీలు 20మంది నేతగాళ్ళు గత సంవత్సరం ఈ సంఘం కింద 90 మంది నూలువడికేవారు, 15 మంది నేతవాండ్రు ఉన్నారు ఇప్పుడు 200 మంది వడికేవారు, 20 మంది నేసేవారూ ఉన్నారు వీరుగాక ముగ్గురు రంగులు వేసేవారు ముగ్గురు చాకళ్ళుకూడా మాదగ్గర పనిచేస్తున్నారు

కడచిన 6 నెలలలో ప్రతివడికే మనిషి సగటున నెలకు రూ 2-0-1 యున్నూ, ప్రతి నేతమనిషి రూ 10-8-5 యున్నూ మజ్జూరీ సంపాదించినారు అయితే రొంగాలి చిన్నమణి నూలువడికి నెల ఒక్కొంటికి 6 రూపాయలు సంపాదించింది నేత మనిషి పప్పు జగన్నాయకులు రూ 20-2-8 నెల ఒక్కిం టికి సంపాదించినారు

పనివానికి అవసరమయిన పనిముట్లు మేమే సప్లయ్ చేస్తున్నాము ఒకవేళ వాటిని పనివారే కొంటే వాయిదాల ప్రకారం చిన్న చిన్న మొత్తాలలో ఆ బాకీ తీర్చుకొనే ఏర్పాట్లు చేస్తున్నాము

| వడికిన నూలు | చెల్లించిన మజ్జూరి | పౌను వడుకు నూలుకు మజ్జూరి |
|---|---|---|
| 7289 పౌనులు | రూ 2280-6-6 | రూ 0-5-4 |

ఉత్పత్తయిన బట్ట 18 847 గజాలు అందుకు చెల్లించిన మజ్జూరి 1489 రూపాయలు

మేము తయారుచేసిన బట్ట అమ్మకం ఖరీదులో అద్దెలు, జీతాలుకూడా చేరుస్తున్నాము ఈ ఖర్చులు ఏదయినా ప్రత్యేక నిధినుంచి వెచ్చించడానికి వీలయితే మాబట్టల ధర ఇంకా చౌక చేయడానికి వీలుంటుంది మా కింతవరకు అటువంటి నిధి లభించే భాగ్యం కలగలేదు

కొన్ని సందర్భాలలో అఖిలభారతచర్ఖా సంఘంవారి ఖరీదుల కంటె మా ఖరీదులు గజానికి 6 పైసలు ఎక్కువవుతాయి మేము ఒక మేజోళ్ళజత, రెండున్నర గజాలు వెడల్పు, మూడు గజాలపొడవుగల ఒక జంబుకానా మీకు

సవినయంగా సమర్పించుకొంటున్నాము ఇవి పప్పు జగన్నాయకులు తయారు చేసినవి ఆయన మా నేత మనిషి, మా సంఘానికి డైరెక్టర్ కూడా

ఇవి మీ ఆశ్రమంలో ప్రదర్శిత వస్తువులుగా ఉంచవలెనని సవినియంగా ప్రార్థిస్తున్నాము "

పప్పు జగన్నాయకులు తయారుచేసిన వీటిని ఆశ్రమంలో తప్పకుండా ప్రదర్శన వస్తువులుగా ఉంచగలను ఇటువంటి వస్తువులు అద్వితీయాలు వాటికవే సాటి విశాఖపట్టణంలో మా గృహస్థు శ్రీ ఖానోజీరావు తన జమీందారీ గ్రామం బొంతల కోడూరులో తయారయిన సన్నని ఖద్దరు బట్టల జత నాకిచ్చినారు ఈ రెండు బట్టలలో ఒకటి 58 సంవత్సరాల కిందట, మరొకటి 66 సంవత్సరాలకిందట తయారయినవి

ఈ ఆదర్శ సహకార సంఘ నియమావళి నా దగ్గర ఉన్నది అది చాలా ప్రయోజనకరంగా ఉన్నది ఆ నియమావళి ప్రకారం నూలువడికేవారు నేసే వారు కూడా ఆ సంఘంలో సభ్యులవుతారు అందులోని సభ్యులందరూ సంఘంలో తయారయిన ఖాదీనే కొనాలనీ సభ్యులు తయారుచేసిన నూలును గానీ, ఖాదీనిగానీ సంఘానికే అమ్మవలెననీ నియమం ఉంది

ఆ సంఘం చేస్తున్న మంచి ఉపయోగకరమయిన పనికి నేను దానిని అభినందిస్తున్నాను అది దినదినాభివృద్ధి పొంది విజయవంతంగా పనిచేయవలెనని ఆశిస్తున్నాను

యంగ్ ఇండియా          యం కె గాంధీ
9-5-1929

**ఆంధ్రలో కొన్ని దైవఘటనలు**

అనేక విషయాలలో ప్రస్తుతం ఆంధ్ర సంచారం అపూర్వంగా పరిణమిస్తూన్నది. మారు మూల గ్రామాలలోకి దూరాన్ని పరిగణించకుండా పోవడం ఒక అపూర్వవిషయము విద్యుద్వేగంతో దిక్కు తెలియకుండా ఒకరాత్రి మోటార్లు పరుగెత్తడంవంటి దుస్సాహసము మరో అపూర్వ సంఘటన

తులనాత్మక దృష్టితో చూసినట్టయితే తూర్పుపశ్చిమ కృష్ణా జిల్లాలలోని పర్యటన సవ్యంగానే జరిగింది దేశభక్త కొండ వేంకటప్పయ్యపంతులుగారి గుంటూరు జిల్లాలో లోపలికి చొచ్చుకొని పోయినప్పుడు మా కార్యక్రమంలో కొన్ని చిక్కులు ప్రారంభమయినాయి ప్రయాణం చేయవలసిన దూరాలు ఎక్కువగా ఉన్నాయి ఆ జిల్లా పర్యటన ముగిసే రోజున 100 మైళ్ళకుపైగా ప్రయాణం చేయవలసి వచ్చింది రోడ్లు బాగున్నట్లయితే మోటారులో ఇంత దూరం ప్రయాణం చేయటం కష్టమయిన పనికాదు కాని మా మోటార్లు ఒడిదుడుకు రోడ్ల మీద ప్రయాణించడంవల్ల, డ్రైవర్లకు, లోనివారికి కూడా సహనం పోతూ వచ్చింది నిర్ణీతకాలాలు విపరీతంగా దాటిపోతూ వచ్చినాయి. కార్లు చెడిపోవడం తోవలు చూపేవారే చీకట్లో తోవ తప్పిపోవడం, అన్ని

ఏర్పాట్లు తలకిందులు గావడం తటస్థించింది

మేము చూసిన గ్రామాలలో కారంచేడు ఒకటి పైన పేర్కొన్న అనేక దుస్సంఘటనలవల్ల మేమూ గ్రామం 8 గంటలకు వెళ్ళవలసి ఉండగా 11 30 గంటలకు చేరుకొన్నాము ఐదు వేలమంది ప్రజలు సాయంకాలం 5 30 గంటల నుంచి మా కోసం వేచి ఉన్నట్లు తెలిసింది అందువల్ల ఆ అర్ధరాత్రే ఆ సభా కార్యక్రమం జరపక తప్పింది కాదు అకాలంలో కార్యక్రమాలు జరపడం అక్కడ నిత్యవిధిగా తయారయింది

ఈ అనుభవాలు ఇందుకు సంబంధించిన వారందరికీ బాధాకరంగా ఉన్న మాట నిజమేకాని, పక్షవాతంతో మంచం పట్టిన భార్యను, జబ్బుచేసి అప్పుడే కొంచెం కొంచెం తేరుకొంటూన్న కుమార్తెను విడిచి వచ్చిన దేశభక్త వెంకటప్పయ్యగారికి మరింత విచారకరంగానూ, బాధాకరంగానూ తయారయినాయి ఆయన సౌమ్యుడు, సున్నితమయిన మనస్సుగలవాడు ఆయనను చీకాకు పరుస్తూన్న ఈగను తోలితే కూడా ఆయన మనస్సు నొచ్చుకొంటుందని నా అభిప్రాయము ప్రతిరోజూ జరుగుతూ ఉండిన ఈ అడ్డంకులు ఆయన ఓర్పును పరీక్షిస్తున్నవా అన్నట్లు తోచింది ప్రతిరోజూ సాయంకాలం గాంధీజీ ఆయన కలుసుకొనేవారు గాంధీజీ విసిగి వేసారి ఉన్నప్పటికీ ఆయనను చూసి 'సైనిక దండన (Court Martial) విధించవలె అనేవారు వేంకటప్పయ్యగారు "నిజమే మీరు చెప్పినమాట ఆంధ్ర బేతయార్ (Andhra the unready)" అనేవారు ఆ దేశ భక్తుడు పట్టి పసిబిడ్డ మాదిరి చిన్నబుచ్చుకొని మాట్లాడడంతో ఆయనను ఏమనడానికి ఎవ్వరికీ బుద్ధి పుట్టేదికాదు ఎట్లాంటి భయంకర సైనిక విచారణా లేకుండానే వారిద్దరు కొంచం సేపు నవ్వులాడుకొని మళ్ళా మరునాటి సాహసాలకు, దుర్ఘటనలకు తయారయి విడి పోయేవారు

ఏప్రిల్ 21వ తేదిని పూర్వపు వాటిన్నిటికీ మకుటాయమానంగా ఉండతగిన సంగతి ఒకటి జరిగింది గాంధీజీ మోటారులో ఎడతెగని ప్రయాణం చేసి పగలు 11 గంటలకు మిన్నులు పడినచోట ఉన్న పల్నాడు తాలూకాలో రెంటచింతల అనే గ్రామం చేరుకొన్నారు అక్కడ 1000 రాట్నాలపైన నూలువడకు ప్రదర్శన ఉంటుదని గాంధీజీకి చెప్పినారు తీరా ఆ ఊరు చేరకొనే సరికి ఒక్క రాట్నం కూడాలేదు జిన్నింగ్ ఫ్యాక్టరీ గోడకు ఎదురుగా ఒక తాటాకుల పాక గాంధీజీ ఉండడానికి ఏర్పాటు చేసినారు ఆ మైదానంలో వడగాలి విసిరి కొడుతున్నది గాంధీజీ ఆ పాకలోపల ప్రవేశిస్తూ "ఈ గుంపులు మన శాంతికి భంగం చేయకుండా వెళ్ళిపోయినట్లయితే మాత్రం ఈ ఏర్పాట్లు ఆదర్శ ప్రాయమయినవే" అన్నారు కాని ఇది గొంతెమ్మ కోరిక అయింది ఒక పావుగంటలోపునే తాలూకాలోని పలుప్రాంతాలనుంచి ఆతాటాకు పాకను ముట్టడించి ఆ దడులకు చిల్లులుచేసి వాటిలోనుంచి వేలకొద్దీ కళ్ళతో పాకలోకి తొంగి చూడడం ప్రారంభించినారు స్నానాల గదినికూడా వారు విడువలేదు చివరికి గాంధీజీ తనకు తనతో ఉన్నవారికి కూడా కొంత శాంతిని కలిగించే

టందుకు ఒక ఉపాయం కనిపెట్టినారు వెంటనే ఆయన సభకు ఏర్పాటుచేసిన పందిరిలోని వేదికపైకి ఎక్కి కూర్చుండి తన చుట్టూ ఎవరూ లేనట్లుగానే ఉత్తరాలు వ్రాసుకోవడం ప్రారంభించినారు అప్పుడా జనసమూహం చక్కగా ఏమీ చప్పుడు చేయకుండా ఆ ఎండలో మాడుతూ నిశ్శబ్దంగా కూర్చున్నారు తరవాత దేశభక్తునికి కబురుపంపి ఆయన దగ్గరనుంచి విరామం తీసుకొని సభ జరిపినారు ఈ లోగా గాంధీ బృందంవారు జిన్నింగ్ ఫ్యాక్టరీలోని వసారాలోకి సర్దుకొన్నారు హఠాత్తుగా వంటశాల, స్నానాలగది మొదలయినవి తిరిగి నిర్మించుకోవలసి వచ్చింది అది మా సంచారంలో ఒక నూతనానుభవము రెంటచింతలకు 48 మైళ్ళ దూరంలో ఉన్న మేము రాత్రి 8 గంటలకు చేరవలసి ఉండగా 10 గంటలకు చేరి ఆ రాత్రి అక్కడ ఉండవలసి వచ్చింది అక్కడకు అవసరమయిన సామానులు తేవలసిన మోటారుకారు తోవలో చెడి పోయింది దాని సహాయంకోసం పంపిన మరొక కారుకూడా అట్లాగేచెడిపోయింది దానికితోడు పెట్రోలు అయిపోయింది అందువల్ల మేము ఆ మారుమూల గ్రామంలో ఉండి పోవలసి వచ్చింది చెడిపోకుండా మిగిలిన కారులో తొనిమిది మైళ్ళకు మాత్రమే సరిపోయే పెట్రోలు ఉంది ఆ గ్రామానికి చుట్టూ 28 మైళ్ళ దూరంలో ఎక్కడా ఒకచుక్క పెట్రోలు కూడా దొరికే అవకాశం లేదు మేము రైలులో ఆ రాత్రి బెజవాడకు పోవలెననుకుంటే మాకు పన్రెండు మైళ్ళకు తక్కువ దూరంలో ఎక్కడా రైల్వేస్టేషన్ లేదు కాని గాంధీజీ మాత్రం కంగారు పడకుండా ప్రశాంతంగా ఉన్నారు "మనం సాయంకాలం రెండు గంటలు ముందుగా బయలుదేరవలె మనకు పెట్రోలు సరిపోయినంతవరకు మోటారులో పోదాము, తక్కిన దూరం నడిచిపోదాము" అని చెప్పి తిరిగి తనపని తాను చూసుకోవటం ప్రారంభించినారు కాని పెట్రోలు వచ్చింది సామానూ వచ్చింది అందువల్ల అంతకు పూర్వపు ఇబ్బందులను మరిచిపోయినాము సంతమాగులూరు రైలుస్టేషన్‌కు రైలు రాత్రి 11 45 గంటలకు వచ్చింది చిన్న రైలుపెట్టెనంతనూ మా సామానుతో సహా ఆక్రమించినాము అందులో మాకు పడుకునేటందుకు చోటుంది మూడవతరగతి ప్రయాణీకులకు నిజంగా అది ఒక అపూర్వమయిన భోగమని చెప్పవచ్చు

యంగ్ ఇండియా — ప్యారేలాల్
9-5-1929

## ఆంధ్ర దేశంలో

ఒక దాని తరవాత ఒకటి అనేక సంఘటనలు వెంట వెంటనే జరుగుతూ వచ్చినాయి అందువల్ల అవన్నీ వ్రాయడంగానీ, వాటిలో ఏవి వ్రాయాలని నిర్ణయించుకోవడంగానీ కష్టమయిన పని కాబట్టి అత్యంత ప్రాముఖ్యమున్న విషయాలను కొన్నిటిని అతి సంక్షిప్తంగా వ్రాసి పంతృప్తిపడ దలుచు కొన్నాను

## అస్పృశ్యత

'అస్పృశ్యతా విష సర్పం చివికిపోయిందిగానీ పూర్తిగా నాశనం కాలేదు దాని విషచరితాలు ఉంటాయని అనుకోనని చోట్ల కూడా అని కనిపిస్తూనే ఉన్నాయి కింద ఉదాహరింప బడిన ఉత్తరం వంటిది నేనెన్నడూ చూస్తానని అనుకో లేదు

"22వ తేది తణుకులో స్త్రీల మహాసభ ముగిసిన తక్షణం జరిగిన కింది ఉదంతం తమ దృష్టికి తీసుకురావలసి వచ్చినందుకు చాలా విచార పడుతున్నాను. సాయంకాలం ఐదు గంటలకు మూడు నాలుగు వందల మంది స్త్రీలు సమావేశమయినారు వారిలో కొందరు మీ ప్రక్కన కూర్చున్న యువతి పంచమ బాలిక అని గుసగుసలాడుకోవడం ప్రారంభించినారు

"సభ ముగియడంతోనే స్త్రీలందరూ, స్వేచ్ఛగా పరస్పరం తాకుతూ కూర్చున్న పాప పరిహారార్థం తిన్నగా కాలువకుపోయి ఆ నీళ్లలో మునిగి వచ్చినారు చిన్న పిల్లలపైనా పాలుతాగే బిడ్డలపైనా కూడా ఈ పాప విమోచనంకోసం పవిత్రమైన నీరు చల్లడం నాకళ్ళతో నేను స్వయంగా చూసినాను మేము మిమ్ము గౌరవిస్తున్నాము, మోసం చేస్తున్నాము ఇది మతం పేరుతో పూర్వంనుంచి జరుగుతున్న మోసం

ప్రజలు అజ్ఞానంలోను, మూఢవిశ్వాసంలోనూ మునిగిఉన్నారు వీటికితోడు ఉన్నత కులాలవారమనే గర్వం కూడా తోడయింది అవన్నీ కలసి మనలను నాశనం చేయడంలో ప్రస్తుత ప్రభుత్వంకంటె కూడా ఎక్కువ శక్తిమంతులైనట్లు కనబడుతున్నాయి

నాపక్కన కూర్చున్న యువతి బీహార్ సుప్రసిద్ధ నాయకుడు ప్రజకిశోర్ కుమార్తె ప్రభావతీదేవి ఆమె ఆశ్రమంలో కొంత కాలంనుంచి ఉంటూ ఆంధ్రదేశంలో నాతోపాటు పర్యటిస్తున్నది ప్రజలలో చాలామంది ఆమెను నా కుమార్తెయే అనుకొంటున్నారు కొందరు నా కోడలనుకొంటున్నారు తణుకు స్త్రీలు మాత్రం ఆమెను లక్ష్మి అనుకొని పొరపడి ఉంటారు లక్ష్మి అంతిమజాతి బాలిక ఆమెను నేను కుమార్తెవలె పెంచుకొంటున్నాను వారు అంత్యజ బాలికగా ఊహించిన ఆమె నన్ను స్పృశించినందువల్ల నా ద్వారా వారికి సంక్రమించిన కళంకానికి ఆ మహిళావతంసలు పరిశుభ్రంగా స్నానం చేసి తాము పాప విముక్తిని పొందడమేగాక నీళ్లుచల్లి తమ బిడ్డలను కూడా పవిత్రవంతులుగా చేసినారు ఈ విషాదపూరితమయిన హాస్యనాటకం మనకొక పాఠాన్ని నేర్పుతున్నది పురుషులే మూఢవిశ్వాసంగలవారు స్త్రీలు అసలే అలక్ష్యంగా చూడబడుతూన్నందువల్ల వారి మూఢవిశ్వాసం మరింత అంధకార బంధురమయింది నాకీఉత్తరం వచ్చిన తరవాత నేను పునరాలోచన చేసుకొని అప్రమత్తుడనై తరవాతి సభలలోని మనుష్యుల కలయికనుగురించి పరీక్షించడం ప్రారంభించినాను. నేను చాలా సభలలో అస్పృశ్యులు స్పృశ్యులతో కలసి ఉండటమే గమనించినాను అస్పృశ్యులతో కలసి కూర్చోవడానికి అభ్యంతర

మేమయినా ఉన్నదా అని సభ్యులను సూటిగా ప్రశ్నిస్తూ వచ్చినాను వారు తమకేమీ అభ్యంతరం లేదన్నారు రాజమహేంద్రవరం దగ్గర ఒక గ్రామంలో చక్కని ఏర్పాట్లుచేసిన ఒక సభలో స్వచ్ఛంద సేవకులు స్పృశ్యులకు, అస్పృశ్యులకు స్త్రీలకు, వారు కూర్చుండవలసిన ప్రత్యేకస్థలాలను సగర్వంగా చూపుతూండటం గమనించినాను "మీరు అస్పృశ్యులను వేరుగా ఉంచటానికి ప్రత్యేకపు ఏర్పాట్లు చేసినారని అనుకొంటున్నాను" అని యుక్తిగా అన్నాను పాపం ఆ స్వచ్ఛంద సేవకుడు నా యుక్తిలో పడిపోయి "అవునండి" అన్నాడు తక్షణమే తరవాత నేను ఆయనకు ఇంగ్లీషు సరిగా రాదని నా ప్రశ్న అర్థం చేసుకోలేదనీ గ్రహించినాను అప్పుడు తమ మధ్యలో అస్పృశ్యులు కలిసి కూర్చోనడానికి ఏమయినా అభ్యంతరం ఉందా అని సభ్యులను సూటిగా ప్రశ్నించినాను వారు "లేదని" ఒక్కుమ్మడిగా చేతులెత్తినారు అప్పటికి నేను సంతృప్తిపడక మీ మధ్యకు అస్పృశ్యులను పంపించమంటారా అని తిరిగి వారిని ప్రశ్నించినాను తిరిగి వారు తమ అంగీకారం తెలుపుతూ చేతులెత్తినారు అయితే ఆ మాట నోటితో చెప్పండి అన్నాను వారు మొట్టమొదట నెమ్మదిగా నోటితో సరేనన్నారు మీరు బిగ్గరగా అందరికీ వినబడేటట్లు చెప్పాలన్నాను అప్పుడు అందరూ బిగ్గరగా సరే, సరే అని నినాదాలు చేసినారు అప్పుడు అస్పృశ్యులను వారి మధ్య కూర్చోమని పిలిచినాను వారు నిర్భయంగా నిస్సందేహంగా వచ్చి కూర్చున్నారు అనంతరం నా ఉపన్యాసాన్ని అస్పృశ్యతను ప్రాతిపదికగా తీసుకొని ప్రారంభించినాను వారి మధ్యలో అస్పృశ్య సోదరులను కూర్చుండనీయడంలో ఒక మహాత్కార్యం చేసినట్లు వారికి నచ్చచెప్పినాను ఏ మనిషినిగాని అస్పృశ్యుడుగా భావించడం పాపమన్నాను ఈ నా వ్యాఖ్యానం పాటించినందువల్ల ప్రత్యక్షంగా ప్రదర్శితమయిన ఆ దృశ్యం చూసిన తరవాత కూడా ఎవరయినా పాపవిముక్తికోసం స్నానంచేసి ఉండి ఉంటే అందుకు తగిన కారణం విచారించి తెలుసుకొనగలవారు మానసిక శాస్త్రజ్ఞులు మాత్రమే ఆ అస్పృశ్యులతో కలసి కూర్చోడానికి అంగీకరించిన వారిలో స్త్రీలుకూడా ఉన్నారనిచెప్పి ఈకథ ఇంతటితో ముగిస్తున్నాను ఈ అస్పృశ్యులనబడే వారు కులస్త్రీలతోను, పురుషులతోను కలసి కూర్చున్నప్పుడు అస్పృశ్యులను తాకకుండా వుండేటందుకు కులస్థులు ప్రయత్నం చేయలేదనే విషయం కూడా వారి అవయవ సంచలనం బట్టి నేను గ్రహించగలిగినాను అక్కడకు దగ్గరగా ఉన్న గ్రామంలో ఒక పాఠశాల నడుస్తున్నది అక్కడ అస్పృశ్యుల బాలురు, కులస్థుల బాలురు ఏవిధమయిన భేదంలేకుండా కలసి కూర్చుంటున్నారు కాబట్టి తణుకులో జరిగిన సంఘటనకు నేను విచారిస్తూన్నప్పటికీ అస్పృశ్యత కృశించి మరణావస్థలో ఉన్నదన్నమాట మాత్రం సత్యదూరంకాదు.

## ఒక మహా సంస్థ

డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారు 1924 లో స్థాపించిన సత్యాగ్రహాశ్రమ కార్య కలాపాలకు లోనయిన ప్రదేశంలోకి ప్రవేశించడానికి ముందుగా మేమొక చిన్న గ్రామంకు చేరుకొన్నాము సుబ్రహ్మణ్యంగారు చాలా లాభదాయకంగా ఉన్న తన వైద్యవృత్తిని మానుకొని జాతీయ సేవకు తన జీవితం అంకితం చేసినవారు తాను గ్రామస్థులమధ్య నివసించి, వారితో సన్నిహిత సంబంధం కలిగి ఉంటేనేగానీ వారి కవసరమయిన సేవ చేయడానికి వీలులేదని ఆయన తక్షణం తెలుసుకున్నారు అందువల్ల ఆయన రాజమహేంద్ర వరానికి పదునాల్గు మైళ్ళ దూరంలో ఉన్న సీతానగరంలో స్థిరనివాస మేర్పరచుకొన్నారు సీతానగరానికి చుట్టూ 14 గ్రామాలు దగ్గర దగ్గరగా ఉన్నాయి వారు సహాయనిరాకరణోద్యమం ఉధృతంగా కొనసాగుతున్న రోజులలో ప్రభుత్వంతో ధైర్యంగా పోరాడినారు అక్కడ అనేకమంది గ్రామోద్యోగులు తమ పదవులకు రాజీనామాలిచ్చినారు ప్రభుత్వ ధిక్కారానికి ఫలితంగా దాదాపు ఐదువేల రూపాయలు శిక్షార్థపు పన్ను వారిపైన విధించడం జరిగింది

సత్యాగ్రహాశ్రమం దాదాపు పది ఎకరాల భూమిలో నిర్మించినారు ఖాదీ దాని ప్రధాన కార్యక్రమం దానితోబాటు ఉచిత వైద్యసహాయం, హిందీ ప్రచారం, గ్రంథాలయాభివృద్ధి, తెలుగు పత్రికా ప్రచురణ, నిమ్న జాతుల సంక్షేమము, మామూలు కాంగ్రెస్ పని మొదలయినవన్నీ జరుగుతాయి నా దగ్గర ఉన్న ప్రకటనను బట్టి ఆశ్రమానికి చుట్టూ ఐదుమైళ్ళ దూరంలో ఉన్న అన్ని గ్రామాలలోను నూలువడికే పని జరుగుతూన్నది అందువల్ల ప్రతి కార్యకర్త వారానికొక తూరి ఇంటింటికీ పోయి ఆ పనిని పరీక్షించడానికి వీలు కలుగుతూన్నది పత్తి ఏకేవారు ఆరుగురు ఏకులు తీసే నిమిత్తం శాశ్వతంగా నియమింపబడినారు వారికి మూడు పౌనులకు ఐదు అణాల మజూరి ఇవ్వబడుతూంది నూలు వడకటం వృత్తిగా పెట్టుకొన్నవారు ఆశ్రమ లెక్కల ప్రకారం నూటతొంభై మూడు మంది ఉన్నారు ఏకేవారు ఇప్పటికి 795 రూపాయలున్నూ, వడికేవారు 2036 రూపాయలున్నూ సంపాదించినారు నూలువడికే వారిలో ఒక్కొక్కరు నెలకు 6 మొదలు 9 పౌనుల వరకు నూలు వడకగలరు వారికి ఒక్కొక్కరికి అందువల్ల రూపాయిన్నర మొదలు రెండుంపావలా వరకూ వస్తుంది వడికిన నూలు నెంబరు 8 మొదలు 15 వరకూ ఉంటుంది మూడు పౌనుల తూకంగల ఏకులను వడికినందుకు 12 అణాల మొదలు 14 అణాలవరకు లభిస్తుంది స్థానికంగా ఉన్న 18 మంది నేతగాండ్రు ఈ నూలును తువాలలుగా, అంగవస్త్రాలుగా, ధోవతులుగా, చొక్కా గుడ్డలుగా మరి ఇతర రకాలుగా నేయగలరు నేతవానికి నెలకు సగటున 15 రూపాయలు వస్తుంది. ఈ ఆశ్రమంలో ప్రత్యేక సున్నితమయిన నేతగూడా జరుగుతూన్నది నేతవారు ఈ పనివల్ల 8114 రూపాయలు సంపాదించినారు.

కోరాబట్టలను తెలుపు చేయటం, వాటికి రంగులు వేయడం ద్వారా ఆ పని వాళ్ళకు 1217 రూపాయలు ముట్టినాయి ఈ ఫిర్కాలోని స్త్రీలు, పురుషులు, పిల్లలూ మొత్తం 285 మంది 12,164 రూపాయలు సంపాదించుకొన్నారు ఈ ఆశ్రమానికి పిఠాపురంలో ఒక శాఖ ఉన్నది అక్కడ 450 రాట్నాలు, 12 మగ్గాలు ఉన్నాయి ఆశ్రమవాసుల పరిశీలన ప్రకారం తగినంత పెట్టుబడి ఉన్నట్లయితే మరి 800 రాట్నాలు పనిచేయడానికి తయారుగా ఉన్నాయని తెలుస్తూన్నది ఈ కేంద్రంలో తయారయిన కోరాబట్ట 1927 బెంగుళూరు ప్రదర్శనంలో ఉత్తమోత్తమ మయినదిగా పేరొంది బంగారు పతకం సంపాదించింది ఈ ఆశ్రమానికి అమ్మకపు కేంద్రాలు కూడా ఉన్నాయి పరిసర గ్రామాలలో తిరిగి ఖాదీ అమ్మేవారు నలుగురు ఈ ఆశ్రమం కింద పనిచేస్తున్నారు అటువంటి వారిలో అగ్రస్థానం అలంకరించిన వారు డాక్టర్ సుబ్రహ్మణ్యంగారి వృద్ధురాలయిన తల్లి ఆమె వారందరిలోకి ఎక్కువ ఆసక్తితో పనిచేస్తున్నారు విశ్రాంతి ఎరుగని ఆమె పనివల్ల అత్యధిక సంఖ్యాకులయిన వతనుదార్లు లభిస్తున్నారు అర్హులయిన పంచములకు ఖాదీ సగం వెలకే లభిస్తూన్నది

ఆర్థిక కారణాలవల్ల గాక ఆనందంకోసం స్వయంగా నూలు వడుకొంటున్న కుటుంబాలుగల అనేక ప్రదేశాలకు నన్ను ఆశ్రమవాసులు తీసుకొని వెళ్ళినారు. వారిలో నూలు వడకట మొక్కుబడి వృత్తిగా పెట్టుకొన్న ఇద్దరు వితంతువులను చూసినాను డాక్టర్ సుబ్రహ్మణ్యం అందులో ఒక బాల వితంతువును నాకు పరిచయంచేస్తూ ఆమెకు చర్ఖావట్లగల అభిమానాన్ని అభివర్ణిస్తున్నప్పుడు తన కన్నీటిని ఆపుకోలేకపోయినారు.

చీరాల పేరాల విషయంలో ప్రసిద్ధికెక్కిన కీ॥ శే॥ ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య తాను సేకరించిన గ్రంథాల నన్నిటినీ ఆశ్రమ గ్రంథాలయానికి బహూకరించినారు ఆ గ్రంథాలయమును ననుసరించి ఒక పఠన మందిరం కూడా ఉన్నది అందులో అఖిల భారత దేశంలోని పత్రికలూ, సంచికలూ చక్కగా అమర్చి ఉన్నాయి

ఇక్కడ హిందీ ప్రచార కార్యక్రమం కూడా ఒక ప్రత్యేక లక్షణము దాని యాజమాన్యం శ్రీ పీసపాటి వెంకటసుబ్బయ్యగారు వహిస్తున్నారు 1925 సెప్టెంబరు నుంచి కిందటి సంవత్సరాంతం వరకు 145 మంది హిందీ నేర్చుకొన్నారు హిందీ నేర్చుకోదలుచుకొన్న వారికి ఆశ్రమంలో ఒక తరగతి సక్రమంగా నడపబడుతూన్నది. ఈ హిందీ కార్యక్రమానికి ఉపాధ్యాయుల కిచ్చిన 1495 రూపాయలతో సహా 1528 రూపాయలు వెచ్చింప బడింది

నిమ్న జాతుల అభివృద్ధికి కూడా కృషి జరుగుతున్నది వారి కోసం ఒక ఉచిత రాత్రి పాఠశాల కూడా ఉన్నది కులీనులు, అస్పృశ్యులు కలసి విద్యాభ్యాసం చేయడానికి మరొక పాఠశాల సైతం ఉన్నది వారిలో భజన సంఘాలు కూడా ఏర్పాటు చేయడం జరిగింది.

ఆశ్రమం కింద మూడు ఉచిత వైద్యాలయాలు ఉన్నాయి ఆసుపత్రిలో ఉండి చికిత్స పొందేటందుకు ఐదుగురు రోగులకు శుభ్రమయిన వసతి ఉన్నది ఇంతవరకు ఆసుపత్రికి వెలుపల చికిత్సపొందిన రోగుల సంఖ్య 62,498, ఆసుపత్రిలో ఉండి చికిత్స పొందినవారు 300

ఆఫిర్కాలో 716 మంది కాంగ్రెస్ సభ్యులు చేరినారు అందులో 9 మంది మహ్మదీయులు, 1 క్రైస్తవుడు ఉన్నాడు వారుగాక 61 మంది స్త్రీలు 51 మంది అస్పృశ్యులు ఉన్నారు

"కాంగ్రెసు" అనే పేరుతో ఒక తెలుగు వారపత్రిక ఆశ్రమంలోనే ప్రచురింప బడుతున్నది అది ఇప్పుడు దాదాపు స్వయం పోషకంగా ఉన్నది దాని సంపాదకుడు శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యకు రాజద్రోహం కింద నిర్బంధితుడై ఖైదుకుపోయిన గౌరవం దక్కింది అయినప్పటికీ పత్రిక సజీవంగానే ఉన్నది అన్నపూర్ణయ్య స్థానం రామచంద్రరావుగారు తీసుకొని ఆయనకూడా అరెస్టయినారు తరవాత ఆయన స్థానంలో డాక్టర్ సుబ్రహ్మణ్యం గారు ప్రవేశించినారు ఆయన శ్రీ అన్నపూర్ణయ్య విడుదలై తిరిగి సంపాదకత్వం స్వీకరించేటంతవరకు ఆయన స్థానంలో పనిచేసినారు 'మొట్టమొదట ఆ పత్రిక ఒక ఫూల్‌స్కేప్ కాగితంపైన సైక్లోస్టైల్‌తో వెలువడుతుండేది

ఇప్పుడది రాయల్ సైజులో 14 పుటలతో వస్తున్నది అది కొన్ని నిర్ణీత ప్రకటనలు మాత్రమే ప్రచురిస్తుంది విదేశీ బట్టలు, బ్రిటిష్ వస్తువులు, మత్తు పదార్థాలు మొదలయిన ప్రకటనలను ముద్రించదు ఆ పత్రిక అధినివేశ ప్రతిపత్తికి ప్రతికూలంగా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ప్రతిపాదిస్తుంది ' అని వారి నివేదికలో సగర్వంగా చెప్పుకొన్నారు తెలుగు అక్షరాలలో హిందీ పాఠాలను క్రమబద్ధంగా ప్రచురించటం దాని ప్రత్యేక లక్షణము ఈ ఆశ్రమానికి నిరుటి సంవత్సరం విరాళాల ద్వారా 32,491 రూపాయలు నగదు, 3,747 రూపాయల ధాన్యము, 1256 రూపాయలు రోగులు తమంతట తాము ఇచ్ఛాపూర్వకంగ ఇచ్చిన విరాళము, నాలుగువేల రూపాయల విలువగల కలప లభించినాయి ఈ ఆశ్రమ వాసులు ఉండటానికి తగిన భవనాలు కూడా ఉన్నాయి వాటి పోషణకు 10,580 రూపాయలు వెచ్చించడం జరిగింది ఆశ్రమంలో 12 మంది సభ్యులున్నారు ఒక్క మనిషికి 20 రూపాయలు భృతికి ఇస్తున్నారు ఇద్దరు మనుష్యులు గల కుటుంబానికి 30 రూపాయలు, ఆ తరవాత ప్రతి అదనపు సభ్యునకు 5 రూపాయలు ఉన్నది ఆశ్రమంలోని 31 కుటుంబాలకు అయ్యే ఖర్చు సగటున మనిషికి నెలకు 7 రూపాయలు

ఈ సంగ్రహ వివరణవల్ల ఈ గొప్ప సంస్థను గురించిన స్థితిగతులు సరిగా బోధపడడం కష్టము నా ఈ విస్తృత సంచారంలో ఈ ఆశ్రమానికి సంబంధించిన గ్రామాలలో గల చైతన్యం ఇంకెక్కడా చూసి ఉండలేదు ఈ ఆశ్రమంలోనివారు తమ పద్ధతిని తాము బ్రతుకుతూన్నప్పటికీ వారు

గ్రామస్థులలో ఒకరుగా ఉన్నారు కాబట్టి వారికి గ్రామాలలో మంచి పలుకుబడి వచ్చింది ఈ గ్రామాలు ఆంధ్రలోని ఇతర గ్రామలతో పోల్చిచూసినప్పుడు పేదవయినప్పటికీ ఇక్కడ ఖద్దరు నిధికి ఎసూమైన విరాళం ఐదువేల రూపాయలు ఆంధ్రలో ఏ ఒక్కచోటా ఇంత విరాళం లభించలేదు నేను ఉపన్యసించిన సభలో ఐదు ఎకరాల భూమి ఆశ్రమానికి విరాళ మిచ్చినారు దీనిని బట్టే ఆ ఆశ్రమ మెంత ప్రజానురంజకత్వం పొందినదో గ్రహించవచ్చు

గ్రామ పునర్నిర్మాణ విషయంలో ఈ ఆశ్రమం ఆదర్శప్రాయంగా ఉన్నది గ్రామస్థుల మధ్య నివసించి, వారి నిత్య వ్యవహారాలలో సాధ్యమయినంతవరకు ఆత్మవిశ్వాసంతో సహకరిస్తూండటంవల్ల గ్రామపునర్నిర్మాణ కార్యక్రమం అవిచ్ఛిన్నంగా కొనసాగగలదు డాక్టర్ సుబ్రహ్మణ్యం ఈ విషయంలో బహు జాగరూకతతో వ్యవహరించడం నేను గమనించినాను "మేము మామూలు గృహస్థజీవితం నడుపుకొంటున్నాము ఆశ్రమవాసులకు కొద్దిగా సొంత ఆస్తులున్నప్పటికీ వాటిని ఆశ్రమానికి దానం చేయలేదు ఆశ్రమవాసుల కుటుంబాలలో జరిగే పెండ్లిండ్లకుగానీ, ఇతర కార్యక్రమాలకుగానీ ఆశ్రమ ధనమేమీ వెచ్చించము ఆశ్రమ సభ్యులెవరూ జీవితభీమా చేయలేదు మేమందరం అతి సామాన్య జాతీయ కార్యకర్తలమని అనుకొంటున్నాము" అన్నారు డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు నాతో వారు సామాన్య కార్యకర్తలుగా వ్యవహరిస్తున్నందుకు నాకు చాలా సంతోషము భారతదేశంలోని గ్రామాలలో నివసించే విద్యావంతుడయిన భారతీయుడు, తాను తక్కిన గ్రామస్థులకంటే అధికుడనని ఎందుకనుకోవలె ? అసలు ఆశ్చర్యమేమంటే మనలను గ్రామాలలో నివసించి గ్రామస్థులతో కలసి పనిచేయుటానికి అనర్హులుగా చేసిన విద్య మనపైన బలవంతంగా రుద్దడమే

## పోలీసు దృష్టి

మేము సీతానగరం ఆశ్రమంనుంచి ఆరుమైళ్ళ దూరంలోఉన్న పోలవరం గ్రామానికి వెళ్ళవలసి ఉంది పోలవరం గోదావరికి ఆవలివొడ్డున ఉంది కాబట్టి మేము పడవలో ఏరు దాటవలె పోలవరం ఏజన్సీ ప్రదేశంలోనిది అక్కడ పోలీసువారు పడవమనిషిని భయపెట్టినందువల్ల మమ్ములను ఆయన అవతలి వొడ్డుకు చేరవేయటానికి ఇష్టపడలేదు అప్పుడు మేము క్లిష్టపరిస్థితిలో పడినాము పోలీసువారివల్ల మా ప్రయత్నం భంగంకావటం నాకు చిన్నతనంగా కనిపించింది మేము ముందు నిర్వర్తించవలసిన కార్యక్రమం ఎక్కువగాఉంది కూడా ఒక గంటలో నిర్వర్తించవలసిన కార్యక్రమం ఈ అడ్డంకువల్ల గం॥ 4-80 లు ఆలస్యమయ్యేట్లు కనిపించింది కాని నేను ఆలస్యాన్ని పరిగణించలేదు ఆ గ్రామానికి వెళ్ళడమే నా కర్తవ్యమనుకున్నాను పోలవరం గ్రామం ముందువరకు కారుమీదపోయి అక్కడ ఏరు దాటి పోలవరం చేరడానికి బదులు పోలవరంనుంచి సీతానగరం వరకు నేరుగా నదిలో ప్రయాణం చేసేటందుకు

మరొక లాంచిని కాంగ్రెస్ కార్యకర్తలు సంపాదించగలిగినారు అంత దూరం లాంచిలో ప్రయాణం చేయడంవల్ల అదనపు శ్రమ కొంత ఎక్కువకాలము తీసుకోవలసి వచ్చింది అయినప్పటికీ మేము నిరభ్యంతరంగా పోలవరం చేరగలిగి నాము మానవుడు దురహంకారంతోను, గర్వంతోను చేసినపనిని సర్వశక్తి మంతుడయిన భగవంతుడు కించపరచి భగ్నంచేసినందుకు నాకు మహదానందం కలిగింది

పోలవరంలో శ్రీయుతులు పునులూరి కోదండరామయ్య, ఏ వెంక ట్రామయ్యగార్లు ఒక చిన్న ఆశ్రమం నడుపుతున్నారు వారు కొంతమంది వన్యజాతుల బిడ్డలను పెంచి పైకితీసుకొని వస్తున్నారు వారిద్దరు వన్యజాతు లలో పనిచేస్తున్నారు వారే ఈ ఆశ్రమం నేను చూడటానికి ఆహ్వానించినవారు ఈ మా సంచారంలో ఆదినుంచి తుదివరకు పోలీసువారు మమ్ములను వెంటాడు తూనే ఉన్నారు వారు రిపోర్టర్లుగాను, ఇంకా అనేక రీతులుగానూ వస్తున్నారు సహజంగా వారు మాకేమీ చిక్కులు కల్పించడంలేదు పైపెచ్చు మర్యాదగా ఉన్నారు కనీసం నా విషయంలో, ఒకచోట మా కారు చెడిపోతే వారి కారు మా ప్రయాణానికి ఇచ్చినారు ఇందుకు వారిని అభినందించి తీరవలె అయితే అప్పుడప్పుడు వారు కొంచెం అధికారం చెలా యించడానికి తయారుగా ఉన్నట్లే కనిపించింది మా కార్యకర్తల పనిలో జోక్యం కల్పించుకోవటానికి కూడా వారు సందేహించలేదు సీతానగరంలో కార్యకర్తలు గట్టిగా నిలబడక పోయినట్లయితే మమ్ములను సీతానగరం నుంచి పోలవరానికి తీసుకొనిపోయే చిన్న లాంచిని పోలీసువారే ఆక్రమించి ఉండేవారు దీనినిబట్టి ఈపోలీసువారే వెనుకటిలోటు మనిషిని భయపెట్టినవారని చదువరులు తలంచకూడదు దౌర్జన్య భావాలతో ఏమాత్రం సంబంధంలేని నన్ను అనుమానించి పోలీసువారు నా అడుగుజాడలలో వెంబడించవలసిన పని లేదు అయినప్పటికీ నా వంటి వారి నీడనే పోలీసులు వెంటాడుతున్నప్పుడు అనుమానస్తులుగా పరిగణింపబడి పోలీసు పర్యవేక్షణను సహించలేనివారికి తమ వెంట పోలీసువారు పడడం ఎంత దుర్భరంగా ఉంటుందో ఊహించవచ్చు నా జీవితంలో ఎన్నడూ పోలీసువారిని తప్పించుకొని తిరగడం అవసరమని నేను భావించడంలేదు సరిగదా పైపెచ్చు నా కార్యకలాపాలన్నీ వారు తెలుసుకోనేటందుకు సహాయపడినానుకూడా పోలీసు పర్యవేక్షణను నేను నిర్లక్ష్యం చేయడంవల్లనే నా జీవితమూ, నా పనీ సుఖప్రదంగా నడుస్తూ వచ్చింది పోలీసు పర్యవేక్షణ పట్ల ఈ నా నిర్లక్ష్యంవల్ల, వారిపట్ల నేను చూపు తున్న దాక్షిణ్యంవల్ల వారిలో చాలామంది క్రమంగా హృదయపరివర్తనం చెందుతూ వచ్చినారు అయితే, ఈ నా నిర్లక్ష్యం కేవలం నాకు మాత్రమే సంబంధించినది పోలీసు వారిని వెంటాడించే పద్ధతి ప్రభుత్వానికి మంచి లక్షణం కాదు అది సహించ తగిందికూడా కాదు అసలే పన్నులభారంతో క్రుంగి పోతూన్న జనులపైన ఇది అదనపు భారము ఈ అధిక వ్యయం భరించేవారు

లక్షలకొద్దీ కష్టజీవులనేమాట మనం మరిచిపోకూడదు

యం కె గాంధీ

యంగ్ ఇండియా 16-5-1929

బాధాకరమైన దుస్సంఘటన

మా సంచారంలో జరిగిన ఒక చిన్న దుస్సంఘటనను ఇక్కడ ఉదాహ రించక తప్పదు విశాఖపట్టణం బహిరంగసభలో గాంధీజీకి ఒక సన్నని ఖాదీ వస్త్రం బహూకరించినారు దానిని డాక్టర్ సి మల్లిక్, ఆయన భార్య, ఆయన కుమార్తె గాంధీజీ విశాఖపట్టణ పర్యటనకు ముందు నాలుగు రోజుల క్రితం తయారు చేసినారు వారి సన్నని నూలు వడకటం ఒక లలితకళగా అభ్యసించి నారు ఆ వస్త్రాన్ని వారు బహూకరించేటప్పుడు గాంధీజీ దానిని స్వయంగా ఉపయోగించుకోవలెనని భక్తిపూర్వకంగా ప్రార్థించినారు గాంధీజీ అందుకు సంతోషంగా అంగీకరించినారు దురదృష్టవశాత్తు ఆ అమూల్యమయిన బహూ కరణం అక్కడ సమావేశమయిన గుంపులో మా సహచరులలోని ఒకరి అజాగ్రతవల్ల పోయింది గాంధీజీ ఆ విషాదకర వార్తను ఆ డాక్టర్‌కు అంద చేసినారు ఈ విషాదకర సంఘటన మల్లిక్‌కు, ఆయన కుటుంబానికి ఎంతో బాధకలిగించి ఉండవచ్చు కాని గాంధీజీకి కలిగిన బాధ వారి అందరి బాధకంటే కూడా మించి ఉంటుంది యావత్ప్రపంచంలోని గనులలో లభించే అమూల్య రత్నాల కంటేకూడా ఎక్కువ విలువగలిగిన ప్రేమపూర్వక శ్రమదానం పోగొట్టుకొన్నందుకు ఆయన ఎంతగా చింతించి ఉంటారో!

యంగ్ ఇండియా ప్యారేలాల్
16 మే 1929

ఆంధ్ర దేశంలో

ఈ వారంలో శీర్షిక సరి అయిందికాదు ఈ విషయాలు నేను ఉద్యోగ మందిరంనుంచి వ్రాస్తున్నాను, ఆంధ్రానుంచికాదు అయినప్పటికి నేనింకా నా హెడ్ జైలర్ కొండ వేంకటప్పయ్య వంటి మిత్రులతో సహా ఆంధ్ర వాతా వరణంలోనే మెలగుతున్నాను ఇప్పటికీ ఆంధ్ర దేశపు పనిలోనే ఉన్నాను అఖిల భారత చర్ఖా సంఘ పరిషత్ సభ్యులతోనూ తదితర ఆంధ్ర మిత్రులతోనూ ఖాదీనిధిని అత్యంత శ్రేయోదాయకంగా ఎట్లా వినియోగించడమా అని ఆలోచిస్తున్నాను

నేనింతవరకు చేసిన సంచారాలన్నిటిలోకి ఇది అత్యంత దీర్ఘమయినది, అత్యంత ప్రగాఢమయినదీకూడా ఇంతవరకు ఇటువంటి పర్యటన ఏరాష్ట్రంలోను చేసి ఉండలేదు ఒక్క 1921లో తప్ప ఏ రాష్ట్రంలోను నాకు జ్ఞాపకమున్నంత వరకు ఆంధ్రలో వసూలైనంత మొత్తం వసూలుకాలేదు ఈ విషయం నేను ఆంధ్రదేశ పర్యటనను ముగించుకొని ఆదోని వచ్చేటప్పుడు చెప్పి ఉన్నాను

నేను ఆంధ్రదేశంలో 6 ఏప్రిల్న ప్రవేశించి, మే 21వ తేదీన నా సంచారం ముగించి వచ్చినాను అక్కడ మొత్తం 46 రోజులు పర్యటించినాను 319 గ్రామాలు చూసినాను గుంటూరు, తూర్పు కృష్ణాజిల్లాలలో చేరి 52 గ్రామాలను, తూర్పు గోదావరిలో 50, పశ్చిమ గోదావరిలో 48 గ్రామాలను చూసినాను

## గుణపాఠము

ఈ పర్యటన నాకు పరిశీలనకు మంచి అవకాశమిచ్చింది ఆంధ్రలో ఖాదీ ఉత్పత్తికి అంతులేనన్ని అవకాశాలున్నాయి ఇతర కాంగ్రెస్ కార్యక్రమం కంటెకూడా ఖాదీని తేలికగా నిర్మాణం చేయవచ్చు అక్కడ కార్యకర్తలున్నారు వారిని మంచి క్రమశిక్షణలో పెట్టవలె అందుకు కార్యకర్తలతో సానుభూతిగల దృఢమయిన నాయకత్వం కావలె వారికి త్యాగబుద్ధికూడా ఉన్నది కాని కార్యకర్తలకు ఏంచేయవలె, ఎట్లా చేయవలెనో తెలియదు వారిలో వారికి విభేదాలు, చీలికలు ఉన్నాయి తరుచు పరస్పర విరుద్ధాలయిన కార్యక్రమాలు, విధానాలవల్ల పనిలో చికాకు ఎక్కువగా కనబడుతూన్నది ఖాదీ కార్యక్రమం వారిని క్రమక్రమంగా సన్నిహితులనుచేసి క్రమశిక్షణకు లోబడేటట్లు చేస్తున్నది సబర్మతికి నా వెంటవచ్చిన కార్యకర్తల సమావేశంవల్ల నేను చాలా ఎక్కువ ఫలితాలను ఆశిస్తున్నాను

## కార్యకర్తలకు ఒక సలహా

నేను కనిపెట్టిన "కదులుతున్న వేదిక" గురించి కార్యకర్తలు శ్రద్ధ వహించవలసి ఉన్నది అది నేను తెలివి తేటలవల్లగాక అవసరంబట్టి కనిపెట్టగలిగినాను కొత్తగా కనిపెట్టబడే అన్ని విషయాలకు మూలం అవసరమే నాది దుర్బల శరీరము అందువల్ల చెప్పినట్లల్లా నుంచోడానికి, కూరోచ్చడానికి నాకు సాధ్యంకాదు కారులలో నుంచి దిగడం, కేకలువేసే గుంపుల మధ్యనుంచి తోసుకొనిపోవడం, ఒక్కొక్కప్పుడు కూలడానికి సిద్ధంగా ఉన్న వేదికలు ఎక్కడం, మళ్లీ దిగడం, మళ్లీ గుంపులలో తోసుకొని నడవడం, ఎంతో కష్టం మీద తిరిగి కారు ఎక్కడం, ఎట్లాగో ఒకట్ల సీట్లో కూలబడడం, తిరిగి 15 నిమిషాలలో ఈ కార్యక్రమమంతా పునరావృత్తం కావడం, నా శరీరం భరించలేకుండా ఉన్నది కాబట్టి నేను కూర్చున్న కారు సభా మధ్యానికి సరాసరి వెళ్ళేటట్లు చేయవలసిందని నా హెడ్ డ్రైవరుకు సూచించినాను అప్పుడు నేను కారు వెనక అంచుమీదకూర్చొని ఉపన్యసించేటట్లు ఏర్పాటుచేయమన్నాను ఆయన తక్షణం సరేనన్నారు ఈ ఉపాయంవల్ల కాలము, శక్తి, చోటు, డబ్బు అన్నీ కలసివచ్చినాయి వేదిక అక్కర్లేదు, కుర్చీ అక్కరలేదు, మనుష్యుల హృదయాలంకారాలు తప్ప వేరే అలంకారాలు అక్కరలేదు ఈ ఏర్పాటు అత్యద్భుతంగా సాగిపోయింది అనేక సమావేశాలలో కార్యకర్తలకు నేను ఇదే సూచించినాను. వారు ఇదే అనుసరించినారు

## ఖాదీ ధరించిన మంగలి

సాధారణంగా నా ఆయుష్కర్మ నేనేనిర్వర్తించుకొంటాను ఈ పర్యాయం నాకొక స్నేహితుడిచ్చిన ఆయుష్కర్మ పరికరాలను విసర్జించినాను మగన్ లాల్‌గాంధీ నాదగ్గర విడిచివెళ్ళిన పాత బిహారీ మంగలి కత్తిగి ఆయనకు తిరిగి ఇచ్చివేసినాను దానిని చక్కగా ఉంచుకొంటే మంచి సనిముక్తై రాతిమీద మంగలి కత్తికి పదునుపెట్టే నేర్పు నాకు లేదు మంగలివాళ్లు ఎంతో తేలికగా, నేర్పుగా కత్తిని తోలుపట్టాపైన నూరి దానికి పదును పెడతారు ఆ నేర్పరి తనంకూడా నాకు లేదు అందువల్ల నా పర్యటన ప్రారంభ దశలో ఖాదీ ధరించిన మంగలివాడు కావాలని కోరినాను ఆంధ్రలో ఖాదీ ధరించిన మంగలివానిని సంపాదించడం చాలా తేలిక అదే బొంబాయిలో అయితే చాలా కష్టము. అతనికి నాపరికరాలిచ్చినాను అతడు సుఖంగా పని చేసినాడు విదేశీవస్త్ర బహిష్కార సంఘాధ్యక్షునికి ఖాదీవస్త్రధారి అయిన మంగలి లభించడం ఖాదీ ప్రచారానికి దోహదం కాగలదని నేను తెలుసుకోగలిగినాను అందువలన సామాన్య జనంలో ప్రచారం చేయడానికి వీలుగల ఒక వర్గానికి 'దరిద్రనారాయణ' సందేశం అందజేసే అవకాశం నాకు లభించింది కాని నా పరికరాలను మంగలి ఉపయోగించకపోవడం కచ్చినందున నేనతనికి పూర్ణస్వదేశీ సందేశంగాని ఆరోగ్యనియమాలనుగాని ఆగురీతిని బోధించలేకపోయినానని గ్రహించినాను కాబట్టి ఆ తరవాత మంగలి చక్కగా కడిగి పరిశుభ్రంచేసిన తన సొంత పరికరాలనే వాడేటందుకంగీకరించినాను ఒకచోట పాశ్చాత్య దేశాలలో తయారయిన మంగలికత్తితో, పాశ్చాత్యదేశపు సబ్బుతో, పాశ్చాత్యదేశపు కుంచెతో, పాశ్చాత్యదేశపు అద్దంతో, పాశ్చాత్య దేశంలో తయారయిన పెట్టెలో చక్కగా అమర్చుకొని ఖాదీకట్టిన మంగలి తయారయినాడు అవన్నీ చూసిన వెంటనే ఇవి ఖాదీ ధరించిన మా గృహస్థు ఔదార్యంవల్ల ఆ మంగలికి లభించినవని నాకు అనుమానం కలిగింది ఆ కృత్రిమ పరిస్థితిని నేను గ్రహించగలిగినాను అప్పటినుంచి మంగలి తెచ్చిన పరికరాలు సాధ్యమయినంతవరకు స్వదేశీవీ అవునా, కాదా అని పరీక్షించడం పనిగా పెట్టుకొన్నాను

కార్యకర్తలకు మరొక సలహా తమతో నిత్యసంబంధంగల మంగళ్లకూ- చాకళ్లకూ స్వదేశీ సందేశం అందచేయవలెనని నా సలహా ఈ చదువు, సంధ్యలు లేని పనిబాగులవారు మన దృష్టిలో ఎందుకూ పనికిరానివారిగా కార్యకర్తలు భావించకూడదు జాతీయాభివృద్ధికి మనలోని అగ్రగణ్యులసేవ ఎంత అవసరమో పనిబాగులవారి సేవ కూడా అంత అవసరము కాబట్టి మనం వారిని మనతో సమాన ప్రతిపత్తిగల పౌరులవలె చూడవలసి ఉన్నది

ఈ మంగలి ఉదంతం నాకు మరొక గుణపాఠం నేర్పింది మనం ఖాదీని ధరించినంతమాత్రాన స్వదేశీవ్రతం పూర్తిగా అవలంబిస్తున్నట్లు భావిస్తాము ఇతర దేశాలనుంచి వచ్చే ప్రతివస్తువును ఉపయోగించడానికి, ప్యారిస్‌నుంచి వచ్చిన నూతన విలాస వస్తువులనుసైతం ఉపయోగించడానికీ మన ఖాదీధారణ

ఒక ప్రత్యేక హక్కును కల్పిస్తున్నట్లు భావిస్తున్నాము. ఇది స్వదేశీకి పరిమితార్థం చెప్పడం అంతేగాక, ఖాదీ సందేశం తృణీకరించడమవుతుంది. మన కందరికీ ఖాదీ ధరించటం ఎటువంటి కర్తవ్యమో, విదేశాలలో తయారయిన వస్తువులకంటె మన దేశంలో తయారయిన వస్తువులు తక్కువ నాణ్యంకలవయినప్పటికీ స్వదేశీ వస్తువులను ఉపయోగించటం కూడా అంతటి కర్తవ్యమే. మన అంగళ్లలో కావలసినన్ని స్వదేశీ వస్తువులున్నాయి. మనం వాటిని అభిమానించకపోవడంవల్ల అవి అదృశ్యమయ్యే ఆపదకూడా ఉన్నది. అవి మన అభిరుచికి తగినట్లుగా అందంగా లేకపోవచ్చు. నాణ్యంగా కూడా ఉండకపోవచ్చు. మనం వాటిని ఉపయోగించి వాటినెక్కువ నాణ్యంగా తయారు చేసేటట్లు పారిశ్రామికులకు సలహా ఇవ్వడం కూడా మన కర్తవ్యము. వస్తువు చాలా మంచిగా ఉండవలె, చాలా చౌకగా ఉండవలె అనే సిద్ధాంతం అన్నివేళలా అవలంబించ దగిందికాదు. మన దేశం విడిచి మన దేశంకంటె ఎక్కువ మంచి శీతోష్ణస్థితిగల దేశానికి ఎట్లా వెళ్ళమో అట్లాగే మన దేశంలో తయారయిన వస్తువును విడిచి అంతకంటె ఎక్కువ మంచి వస్తువులకోసం ఇతర దేశాల వంక చూడకూడదు. మనదేశంలో వస్తువులు ఎక్కువ బాగుండేటట్లు చూసుకోవలె. భర్త తన భార్యకంటె ఎక్కువ రూపవతి అయిన మరొక స్త్రీకోసం వెదకులాడటం తన అర్ధాంగిపట్ల ఎంత విశ్వాసఘాతుక కృత్యంగా పరిగణింపబడుతుందో, మన స్వదేశీ వస్తువులు బాగుండలేదని విదేశీ వస్తువులకోసం దేవులాడడంకూడా మనదేశం పట్ల అంత పితృద్రోహకరంగా భావింపబడుతుంది. ప్రతిదేశంలోని అభివృద్ధి ఆ దేశపు ప్రజలు తమ దేశంలో తయారయిన వస్తువులను అభిమానించడంపైన ఆధారపడి ఉంటుంది.

యంగ్ ఇండియా యం. కె. గాంధీ
30-5-1929

## స్వయం పరివర్తన కావలె

నా ఆంధ్రదేశ సంచారంలో నా చుట్టూ చేరిన కర్నూలు ఆహ్వాన సంఘంవారు ఆ సమయానికి తాత్కాలికంగా ఖద్దరు కట్టుకొని వచ్చినారనీ, వారు నిరంతరం విదేశబట్టలు ధరిస్తూ విదేశీ వేషాల పట్ల మోజుగలిగి ఉండే వారనీ దోషారోపణ చేస్తూ నా కొక సంతకంలేని ఉత్తరం వచ్చింది. సభలో కూడా విదేశవస్త్రాలు ధరించిన వారిని నేను చాలామందిని చూసినాను. అందువల్ల నేను ఆ ఉత్తరంలోని విషయాలను ఉదాహరిస్తూ తనపేరు దాచుకొని ఉత్తరం పంపిన వ్యక్తినికూడా విమర్శించినాను. సంతకంలేని ఆ ఉత్తరం పంపిన వ్యక్తి సభలో ఉండి నా ఉపన్యాసం వినినందువల్ల తన పేరు తెలియజేస్తూ వెంటనే నాకు వ్రాసినాడు. ఆ ఉత్తరం వ్రాసిన వ్యక్తికి గౌరవప్రదమయినందువల్ల ఒక విధంగా ఉపదేశపూర్వకమయినందువల్ల దానిని పూర్తిగా కింద ఉదాహరిస్తున్నాను.

'రహస్యం పాపము కాని కింద ఉదహరించిన కారణాలవల్లబట్టి నేను నిన్న మీకు పంపిన ఉత్తరంలో నా పేరు తెలపలేదు నేను ప్రభుత్వోద్యోగిని ప్రభుత్వోద్యోగినయిన నేను నా దేశంలోని నిజస్థితిని గురించిగానీ, దాని అవసరాలను గురించిగానీ నా మనసులో ఉన్న అభిప్రాయాలను వెలిబుచ్చ డానికి వీలులేదనే సంగతి మీకు పూర్తిగా తెలిసిన విషయమే అది రాజద్రోహ మవుతుంది అయినప్పటికీ నిన్న మీకు సన్నిహితంగా చేరిన అనేకమందిలో ప్రత్యక్షంగా కనబడుతున్న కపటవర్తన నేను సహించలేక పోయినాను అది చూసినప్పుడు నేను చాలా బాధపడినాను అవిద్యావంతులయిన మూక ప్రజా నీకాన్ని సరిఅయిన దారిలో పెట్టడం విద్యావంతుల కర్తవ్యము కపట వర్తనం వల్ల అవిద్యావంతులయిన మూకలను నమ్మింపజేయగలమని విద్యావంతులు భావించడం తీరని అపరాధము ప్రతి ఒక్కరూ తమ ఇంటిలోకూడా మీ సలహాను అనుసరించవలెనని హృదయపూర్వకంగా తలచుకొంటే భారతదేశం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో తలఎత్తుకొని తిరగగల రోజు త్వరలోనే రాగలదని నా అభిప్రాయము వట్టి బూటకాలను ప్రజలు నమ్మరు మన బూటకంవల్ల అపాయకరమయిన చెడ్డ ఉదాహరణ చూపెట్టడమే కాక ప్రపంచం మనలను హేళన చేయడానికి అవకాశం కల్పిస్తున్నాము ఈ అన్ని ఊహాలతో నాకు మనశ్శాంతి లేక నేను మీకు వ్రాసినాను నేను చాలా పేదవాడినైన ప్రభు త్వోద్యోగి నయినప్పటికీ నాకు మంచి జరిగినా కీడుజరిగినా లెక్కపెట్టక నేను తప్పుచేయడంలేదని తోచి మీకు నా పేరు తెలియజేస్తున్నాను నా పేరు మీకు తెలియపరిచినందువల్ల కేవలం నాకు జీవనాధారమయిన నా ప్రభుత్వోద్యోగానికి భంగం వచ్చినప్పటికీ నేనంతగా లెక్కపెట్టను "

ఈ రచయితగాని, ప్రతిష్ఠగల పత్రికలకు వ్రాసే ఇతర రచయితలుగాని సంపాదకుల సంతృప్తికోసం ఇచ్చే తమ పేర్లను బయటపెట్టకుండే బాధ్యత సంపాదకులకు కలదని తెలుసుకో కోరుతున్నాను కాబట్టి ఆయన పేరు ఎప్పటికీ వెల్లడింపబడదని ఆయన గట్టిగా విశ్వసించవచ్చు ఇంకా ఆయనకు సంతృప్తి కరంగా ఉండవలెనంటె నేనాయన ఉత్తరం పూర్తిగా చదవగానే ఆయన పేరు గల భాగం చించివేసినానని ఆయనకు తెలుపుతున్నాను ఇప్పుడు నేను ప్రయ త్నించి నప్పటికీ ఆయన పేరు జ్ఞాపకం చేసుకోలేననికూడా ఆయన విశ్వసించ వచ్చు

ఒకవేళ ఆయన తన పేరుతో ఆ ఉత్తరం ప్రకటించేటందుకు వ్రాసి నప్పటికీ అందువల్ల ఆయనకేమీ అపకారం కలగదని నా అభిప్రాయము ఆ ఉత్తరంలో ఏమీ తప్పులేదు అటువంటి ఉత్తరము వ్రాసిన ఏ ప్రభు త్వోద్యోగి శిక్షాపాత్రుడు కాడు అనవసరమయిన భయంవల్ల కొన్ని మంచి పనులు చేయటానికి మనం తరుచుగా సందేహిస్తూంటాము మనం మంచిపనిని ధైర్యంగా చేయడం నేర్చుకోవలె

కర్నూలు నాయకులకు ప్రతికూలంగా ఈ రచయిత చేసిన ప్రత్యేక

ఆరోపణలోని సత్యాసత్యాలు నాకు తెలియవు కాని ప్రజా జీవితంలో కపట వర్తన గురించి ఆయన వ్రాసిన వ్రాతలలో మాత్రం చాలా సత్యమున్నది నాయకులయినవారు తాము చెప్పినది చేస్తుండినట్లయితే ప్రజాసామాన్యంనుంచి తగినంత సహకారం పొందటంలో మనకేమీ కష్టముండదు కాబట్టి నాయక వర్గాలవారు ముందుగా మార్పుచెందవలె అది జరిగినప్పుడు తక్కినపని అంతా సులభమవుతుంది

యం కె గాంధీ

యంగ్ ఇండియా
6-6-1929

## ఆంధ్ర దేశము

ఈ నాటి నా ఆంధ్రదేశ సంచారంలో అనేక సంఘటనలు జరిగినాయి ఇంతకు పూర్వం గడచిన ఎనిమిది సంవత్సరాలలో నా పర్యటనల సందర్భంలో వెచ్చించిన సొమ్మును తనిఖీ చేయవలెననే ఉద్దేశంగానీ, అవకాశంగానీ నాకు కలగలేదు ఇంతకు పూర్వం సొమ్ము ఖర్చుపెట్టడంలో చాలా అశ్రద్ధ, వస్తువులను కొనడంలో చాలా దుబారా ఉన్నట్లు గమనించినాను ఇదంతా చాలా వరకు నా పైనగల వ్యక్తిగత ప్రేమవల్లనే జరిగింది కాని దరిద్రనారాయణ పేరుతో సేకరించబడిన సొమ్మునుంచి నాపై ప్రేమవల్ల ఎక్కువగా వెచ్చించడం కూడా ప్రశ్నించదగిన విషయమే అందువల్ల ఆంధ్రదేశంలో నా అంతట నేను పెత్తనం తీసుకొని వసూలయిన మొత్తంనుంచి రసీదులులేకుండా సొమ్ము ఖర్చుపెట్టకూడదని, ఆ ఖర్చులు నా ఆమోదం పొందవలసి ఉంటుందనీ గట్టిగా ఆదేశించినాను అంతేకాక నాతో వచ్చిన వారందరి రైలుఖర్చులు నేనే చెల్లిస్తానని, వాటిని వచ్చిన విరాళాలనుంచి వెచ్చించకూడదనీ కూడా గట్టిగా చెప్పినాను అంతటితో ఊరుకోక మా ప్రయాణంలో మా భోజనంఖర్చులు ఎవరయినా స్థానిక గృహస్థు భరించుకుంటే ఆ సొమ్ము నేనే చెల్లిస్తాననికూడా చెప్పినాను కాబట్టి నేను ఆమోదించిన ఖర్చులు వసూలయిన మొత్తంలో 5% కు మించిలేదు 319 గ్రామాలలో కలిగిన చైతన్యంబట్టి ఆలోచించినట్లయితే ఈ ఖర్చు న్యాయమయినదే అని తోచకమానదు ఈ విధంగా అయిన ఖర్చును నేను సమ్మతిస్తున్నప్పటికీ, వసూలుచేసిన మొత్తం పెద్దదయినప్పటికీ ఒక చోటినుంచి మరొక చోటికి మోటారులో పరుగెత్తుతూ ఎక్కువ సొమ్ము ఖర్చుపెట్టకూడదనే భావిస్తున్నాను నా సంచారం కొనసాగుతూండగా ఖర్చు అయిన మొత్తం గురించి వివరాలు ప్రకటించినాను అందువల్ల పాఠకులు నా ప్రకటనలోని సంపూర్ణభావం గ్రహించవలెనంటె ఆ వివరాలను జ్ఞప్తి చేసుకోవలె ఇంత చేసినా ఇంకా పొదుపుగా ఉండటానికి అవకాశం లేకపోలేదు నాకు తెలిసినంతవరకు నా అన్ని పర్యటనలలోకంటె ఈ పర్యటనలో అయిన ఖర్చు చాలా తక్కువయినప్పటికి నేనిట్లా వ్రాయడం కఠినంగా తోచవచ్చు

అయితే ఏపనిఅయినా పరమావధికి చేరితేనేకాని సంతృప్తి పడకూడదు తేలికగా సంతృప్తి పడడం మంచిదికాదు తేలికగా సంతృప్తి పడడం అంటే అభివృద్ధిని నిరోధించటం అందువల్ల పురోగమనం లేకపోవడం అట్లాఉండగా తుదకది తిరోగమనంగా కూడా పరిణమించవచ్చు పైకి ఎక్కడం కంటే దిగజారటం ఎన్నోరెట్లు తేలిక కాబట్టి ఆంధ్రదేశంలో అయిన ఖర్చులు కార్యకర్తలకు భవిష్యత్తులో మార్గదర్శకంగా ఉన్నప్పటికీ స్థల కాలానుగుణాలయిన మార్పులు లేకుండా కేవలం వాటిని అనుకరించడం మంచిదికాదు జాగ్రత్త గల గృహస్థు తమసొమ్మె నెంతపొదుపుగా ఎంత జాగ్రత్తగా ఉపయోగిస్తాడో ప్రతి కార్యకర్తా జాతీయ నిధులను అంత జాగ్రత్తతో వాడవలెనని గుర్తించవలె

యం కె గాంధీ

యంగ్ ఇండియా
6-6-1929

తిండి ఛాందసులు

నన్ను వట్టి ఛాందసుడనీ, పిచ్చివాడనీ అంటారు నిజంగా ఈ ప్రఖ్యాతికి నేను అర్హుడనే ఎందువల్లనంటారా నేనెక్కడికిపోయినా నాచుట్టూ చల చిత్తులు, ఛాందసులు, పిచ్చివాళ్లు చేరతారు ఆంధ్రలో కూడా ఇటువంటివారు కొంతమంది ఉన్నారు వాళ్లు తరచుగా సబర్మతి ఆశ్రమానికి కూడా వస్తూంటారు కాబట్టి నా ఆంధ్రా సంచారంలో ఇటువంటి రకాలు నాకు చాలామంది కనిపించడంలో ఆశ్చర్యమేమీలేదు అయితే వారిలో ఒక్కరిని మాత్రమే నేను పాఠకులకు పరిచయం చేయదలచుకొన్నాను ఆయనకి అందులో (ఆహార ప్రయోగాలలో) అపూర్వమయిన విశ్వాసమున్నది అందు వల్ల ఆయన నాకు శ్లాఘపాత్రుడయినాడు నన్ను కూడా అటువంటి ప్రయో గాలలో చేరేటట్లు ప్రోత్సహించినాడు నేను లండన్‌లో ఉండగా ఇరవై ఏండ్ల వయసులో ఆ ప్రయోగంచేసి పూర్తిగాకుండా మానేసినాను ఇప్పుడు ఆ ప్రయోగానికి ప్రోత్సహించినాయన రాజమండ్రి కాపురస్థుడు సుందర గోపాలరావు ఆయననిందుకు తయారుచేసిన వ్యక్తి విశాఖపట్టణంలోని ఒక సర్వే సూపరింటెండెంట్ ఆయనను కూడా నేను విశాఖపట్టణంలో కలుసు కొన్నాను ఆయన పూర్తిగా అపక్వాహారంమీదనే జీవిస్తూన్నట్లు నాతో అన్నాడు గోపాలరావుకు రాజమహేంద్రవరంలో ఒక ప్రకృతి చికిత్సాశాల ఉంది తన కాలమంతా దానికే వినియోగిస్తున్నారు "తొట్టి స్నానాలున్నూ వాటికి సంబంధించిన ఇతర చికిత్సలున్నూ కొంతవరకు ఉపయోగకరాలే కాని అవి కూడా కృత్రిమ చికిత్సలే రోగంలేకుండా బ్రతకవలెనంటే ఆహారం తయారుచేయటానికి అగ్ని పనికిరాదు జంతువులవలెనే ప్రతిపదార్థాన్ని దాని సహజస్థితిలోనే భుజించి జీవించవలె" అని చెప్పినాడాయన అయితే నన్నుకూడా

గుపశాంహారమే తీసుకోమంటావా అని అడిగినాను

'తప్పకుండా' అన్నాడు "నేను అనేకమంది వృద్ధులయిన పురుషుల, స్త్రీలకు కూడా దీర్ఘవ్యాధిగా పరిణమించిన అజీర్ణరోగాన్ని మొలకెత్తిన గింజలతోకూడిన సమీకృతాహారం ఇచ్చి నయంచేసినాను" అన్నాడు గోపాలరావు అయితే "దానికొక మధ్యంతరదశ ఉండవలెగదా' అని మందలించినాను నెమ్మదిగా

"అటువంటిదశ అనవసరం' అన్నాడు గోపాలరావు గట్టిగా వండని ఆహారం, వండనిపిండి కాచని పాలు వండని బటానీలు పప్పుగింజలు, గుడ్లు మొదలయినవిఅన్నీ ఉడికిన ఆహారంకంటె ఎక్కువ తొందరగా జీర్ణమవుతాయి ఇట్లాచేసి చూడండి మీరింకా ఎంతో బాగుంటారు" అన్నాడు

'నీవు నా ప్రాణానికి బాధ్యత వహిస్తావా ఆంధ్రదేశంలో నన్ను దహనం చేయవలసివస్తే నా దేహంతోపాటు నిన్నుకూడా దహనంచేస్తారు సుమా" అన్నాను

"ఆ బాధ్యత నేను వహిస్తాను" అన్నాడు గోపాలరావు అయితే "నీవు నానబెట్టిన గోధుమలు నాకు పంపు ఇవాళనుంచే ప్రారంభిస్తాను" అన్నాను నేను

పాపం గోపాలరావు నానబెట్టిన గోధుమలు పంపినాడు అవి నా కోసం పంపినట్లు తెలియక కస్తూరిబా వాటిని వలంటీర్లకు పంచిపెట్టింది అవి కాసినీ వాళ్ళు తినేసినారు కాబట్టి నేనీ ప్రయోగం మరునాటినుంచీ (9-5-29) ప్రారంభించినాను ఈ సంగతులు నేను వ్రాసేనాటికి ఇది ప్రారంభించి నెల రోజులయింది

ఈ ప్రయోగంవల్ల నాకేమీ కీడుకలుగలేదు అయితే తూకంలో ఐదు పౌనులు తగ్గినాను కాని నా శక్తి ఏమీ లోపించినట్లు లేదు గడచిన 8 రోజుల నుంచి తూకం హెచ్చడం ప్రారంభించింది నా సోదర ధాందసులకూకూడా నేనేమి చేస్తున్నానో తెలియచెప్పవలె నేను సామాన్యంగా

8 తులాల మొక్కమొలిచిన గోధుమలు

8 తులాల సీమ బాదంపప్పు ముద్ద

8 తులాల మెత్తగా నూరిన ఆకుకూరల ముద్ద

6 నిమ్మకాయలు

2 ఔన్సుల తేనె

వారంలో రెండు మూడుసార్లు మొక్కమొలిచిన గోధుమలకు బదులుగా మొక్కమొలిచిన పప్పు ధాన్యాలు తీసుకొంటున్నాను గోధుమకు బదులుగా పప్పుగింజలు తీసుకున్నప్పుడు సీమ బాదంపప్పుకు బదులుగా కొబ్బరిపాలు తీసుకొంటున్నాను ఈ ఆహారం రోజుకు రెండుసార్లుగా తీసుకొంటున్నాను. మొదటిసారి ఉదయం 11 గంటలకు రెండోసారి సాయంకాలం 6-15 లకు కాచిన పదార్థం నీరు తప్ప మరొకటి తీసుకోవడంలేదు ఉదయాన, మధ్యా

హ్నం కాచిన నీళ్ళతో నిమ్మరసము, తేనె తీసుకొంటున్నాను

గోధుమలు, పప్పుగింజలూ కూడా 36 గంటలలో మొలకెత్తుతాయి ధాన్యం 24 గంటలు నీళ్ళలో నానవేసి దానిని వడియగట్టి ఒక తడి ఖాదీ గుడ్డలో దానిని ఒకరాత్రి ఉంచివేసినట్లయితే అది తెల్లవారేసరికి మొలకెత్తి తినటానికి వీలుగా ఉంటుంది అయితే గట్టి పళ్లుగలవాళ్లు ఈ నానవేసిన ధాన్యాన్ని రుబ్బనక్కరలేదు కొబ్బరికాయలో నాలుగోవంతు కొబ్బరి తీసుకొని దానిని సన్నగాకోసి మంచి మందమయిన ఖాదీబట్టలో వడివేసి పిండితే కొబ్బరిపాలు వస్తాయి

ఇంక తక్కిన వివరాలు చెప్పడం అనవసరము ఈ భోజన సంస్కర్తలకు నేను చెప్పిన వివరాలు చాలు వారు సూచనలిచ్చి నాకీవిషయంలో సహాయం చేయకోరుతున్నాను నేను పచ్చికాయలు, పచ్చిపప్పులు చాలా ఏళ్లు తిని జీవించినాను కాని ఇంతకు పూర్వం ఎప్పుడూ వండని ఆహారధాన్యాలు, వండని పప్పుధాన్యాలు పదిహేనురోజులకంటె ఎక్కువతిని ఉండలేదు కాబట్టి వండని ఆహారాన్ని గురించి ఏదయినా కొంత తెలిసినవారు వారి అనుభవంతోపాటు అందుకు సంబంధించిన సాహిత్యం కూడా పంపి నాకు సహాయం చేయకోరు తున్నాను

ఈ ప్రయోగానికి నేను చాలా ప్రాముఖ్యమిస్తూన్నందుకు దీనికి సంబంధించిన విషయాలు ప్రచురిస్తున్నాను ఈ ప్రయోగం జయప్రదమయి నట్లయితే శ్రద్ధాళులయిన స్త్రీ పురుషులు వారి జీవిత విధానంలో విప్లవకరా లయిన మార్పులు చేసుకోగలరు ఇందువల్ల స్త్రీలకు అనవసరమయిన ప్రయాస ఉండదు వారు ప్రయాసపడి చేసేవంటలు సుఖప్రదాలు కాకపోగా రోగాలు కూడా తెచ్చిపెడుతున్నాయి వండని ఆహారంలోని నైతికవిలువలు నిరుప మానం ఆర్థికంగా ఆలోచిస్తే వండిన ఆహారంకంటె ఇది చౌకగా తయా రయ్యే ఆహారము ఆహార సంస్కరణలో ఆసక్తికలిగిన వైద్యశాస్త్రజ్ఞుల, తదితరుల సానుభూతి సహకారాలను నేనీసందర్భంలో అంగీకరిస్తున్నాను

అయితే ఈ ప్రయోగాలు ఎవ్వరూ గుడ్డిగా అనుసరించకూడదు ఇందులో గోపాలరావుకు ఉన్నంత విశ్వాసం నాకు లేదు ఇది జయప్రదమయి నట్లు నేనింకా అనుకోవడంలేదు ఈ విషయంలో నేను జాగ్రత్తగా ప్రవర్తిస్తు న్నాను నా సోదర ఆహార సంస్కర్తలతో నా అనుభవాలు పోల్చి చూసుకునే టందుకు ఈ విషయాలు నేను ప్రచురిస్తున్నాను

యంగ్ ఇండియా యం కె గాంధీ
13-6-1929

## ఆంధ్ర వీరుడు

ఇటీవలి నా ఆంధ్ర సంచారంలో గొప్ప దేశభక్తుడుగా పేర్కొనబడిన ఒక యువకుని చిత్రపటం నాకు బహూకరించడం జరిగింది శ్రీ అల్లూరి

సీతారామరాజు గురించి నాకేమీ తెలియదు కాని విచారించగా ఆయన వీరో చిత కృత్యాల గురించి అనేక కథలు నాకు వినవచ్చినాయి అవి భావస్ఫోరకాలుగానూ, ఉత్సాహజనకాలుగానూ కనిపించినాయి అవి ఎడతెగని ధైర్యానికి ప్రతీకకూ తార్కాణాలుగా ఉన్నాయి కానీ అవి తప్పుదారిని పట్టినవని నా అభిప్రాయము కనక నేను సరిఅయిన విషయాలు తెలుపవలసిందని కోరినాను "కాంగ్రెస్" అనే తెలుగు పత్రికకు సంపాదకుడయిన శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య దయతో నాకా చరిత్రను పంపినాడు దానిని నేను కొంత వరకు సంక్షిప్తం చేసినాను సాయుధ విప్లవంపైన నాకు సానుభూతిగానీ, అభిమానంగానీ లేవు రాజువంటి శీలవంతుడు, నిరాడంబరుడు, త్యాగి, ధైర్యవంతుడు ఉన్నతాశయుడు అయిన యువకుని నేను అభినందించక ఊరకుండజాలకపోయినాను అన్నపూర్ణయ్య సేకరించిన విషయాలు నిజమే అయివుండినట్లయితే ఆయన పితూరీదారు కాడు గొప్ప వీరుడు ఈ దేశంలో ఉన్న యువకులందరూ శ్రీ రామరాజుకున్న ధైర్య సాహసాలను, ఆయన దేశభక్తినీ, ఆయన చాకచక్యంనూ కలిగిఉండి వాటిని కేవలం అహింసాపద్ధతుల ద్వారా స్వరాజ్య సంపాదన కుపయోగించవలెనని కోరుతున్నాను తెలివితేటలుగల మధ్యతరగతులవారు తమ స్వార్థంకోసం ఇంతవరకూ అణిచిపెట్టి ఉంచిన కోట్లాది ప్రజలుగల జాతికి మరొక మార్గం అనవసరంకూడా

యం కె గాంధీ

యంగ్ ఇండియా
18-7-1929

"అల్లూరి శ్రీరామరాజు చిన్ననాటి జీవితం గురించి అంతగా తెలియదు ఆయన గోదావరి జిల్లాలోని మోగల్లు గ్రామంలో గౌరవంగల క్షత్రియ కుటుంబంలో జూలై 4వ తేదిన (సంవత్సరం) జన్మించినాడు మహా సామ్రాజ్యాన్ని స్థాపించినట్టి, వినాశనం చేసినట్టి మహాపురుషులవలెనే ఆయనకూడా విద్యావంతుడు కాడు ఆంధ్రదేశంలోని అనేకచోట్ల ఐదవఫారం వరకే చదువుకొన్నాడు పాఠశాలలో కూడా తెలివయినవాడుగా కనిపించలేదు కాని బాగా పాడేవాడు కవిత్వంలో అభిరుచిఉంది అప్పుడే ఆయనలో కొన్ని గొప్ప లక్షణాలు కనిపిస్తుండేవి వాటిని నేను అవివేక లక్షణాలుగాను, పిచ్చివాడి లక్షణాలుగానూ పొరపాటు పడినాను పాఠశాలలో అతడు చదువు నిర్లక్ష్యం చేయటం చూసి నేను గట్టిగా మందలించి నప్పుడు నిజమయిన విద్య అంటే ఏమిటో వివరిస్తూ గొప్పగా చర్చించేవాడు "విద్య" అనే పెద్దపేరుతో వ్యవహరించబడుతున్న ప్రస్తుత విద్యావిధానాల గురించి తీవ్రంగా విమర్శించేవాడు

"నేను సన్యాసి నవుతాను, నా దేశీయులను ఉద్ధరిస్తాను " అని నిత్యమూ నా చెవులు చిల్లులు పడేటట్టు చెబుతూండేవాడు, దురదృష్టవశాత్తు ఆ మాటల

అర్థం నాకప్పుడేమీ తెలియలేదు కవిత్వమంటేనే తెలియని అతడు చక్కగా పాడుతూఉండే తెలుగు పద్యాలు చెవిటివానిముందు శంఖూదినట్టు ఉండేవి

'తరవాత నరసాపురంలో కొంతకాలం చదివినాడు ఆ కాలంలో జ్యోతిషము, హస్తసాముద్రికము, గుఱ్ఱపుస్వారీ నేర్చుకొన్నాడు అతని బాల్య దశను గురించి ఇంతకంటె నాకేమీ తెలియదు

'అతడు నిజంగా ఎప్పుడు సన్యాసి అయినాడో నేను చెప్పలేను కాని అది 1917 మే నెలకు ముందు జరిగిఉంటుంది 1918లో అటవీ ప్రాంతాలకు పోయి శబరి గుట్టపయిన తపస్సు చేసినట్లు తెలిసింది తరవాత అతడు పాపి కొండలకుపోయి సాధు జీవితం అవలంబించినట్లు తెలుస్తున్నది ఆ కొండలపై ఉన్న కోయలు ఈ యువక సన్యాసి భక్తి ప్రభావానికి లోనై అతనిని పూజించడం ప్రారంభించినారు ఆయన ఆహారం పాలూ పండ్లు 1920 లో ఆయన కాలినడకను నాసిక యాత్రకు పోయినట్లు తెలుస్తున్నది

'సహాయ నిరాకరణోద్యమంలో ఆయనకు గొప్ప సానుభూతి ఉన్నట్లు తెలియదు తరవాత ఆయన మాటలనుబట్టి గానీ, ప్రవర్తననుబట్టిగాని ఆయన హింసావాది అని తెలుస్తూన్నది కాని సహాయనిరాకరణోద్యమ కార్యకలాపాలను సహనంతో గమనిస్తూ ఫలితాలకు వేచిఉన్నాడు గాంధీజీ కార్యక్రమ మంతటిలోను మద్యపాన నిషేధం కోర్టుల బహిష్కారము-ఈ రెండూ ఆయనకు నచ్చినాయి ఆయన గోదావరి, విశాఖపట్టణం ఏజన్సీ ప్రాంతాలలో తీవ్రమయిన ప్రచారం ప్రారంభించినాడు ఆయన పవిత్రత భక్తి మొదలయిన వాటి వలన జనులను ఎక్కువగా ఆకర్షించగలిగినాడు ఆ ఏజన్సీ ప్రజలకు ఆయన మాటే శాసనమయింది వారు అమాయక ప్రజలు ఆయన ఉపన్యాస ధోరణి వారి హృదయాలకు బాగా నాటింది కోర్టుల చుట్టూ తిరగకండి, తాగకండి అన్న ఈ రెండుమాటలే గ్రామస్థులకు ఆయన ఇచ్చినసందేశము అది ఆ ఆటవిక జనంలో దావానలంవలే వ్యాపించింది ఆయన శంఖారావము ఆలకించనివారు ఏజన్సీలో ఒక్కరుకూడా లేరు కల్లకపటాలు తెలియని ఆ ప్రజలలో ఒక నూతన చైతన్యం కలిగింది అనేకులు తాగుడు మానివేసినారు కోర్టులు మూలబడినాయి గ్రామాలలో పంచాయతీ కోర్టులు మొలకెత్తినాయి స్థానికంగానే న్యాయవిచారణలు జరిగినాయి రాజు నిత్యఖద్దరుధారి అని తెలియవచ్చింది ఆయన సైనికులకు ఖాదీ సైనిక దుస్తులను మాత్రమే సప్లయ్ చేసినట్లు కూడా పితూరీ విచారణలో బయలుపడిన సంగతులనుబట్టి తెలిసింగి తుని కాపురస్థుడు, సహాయ నిరాకరణవాది, ఖాదీ ఉత్పత్తిదారు అయిన రాళ్ళపల్లి కాశన్నను శ్రీరామరాజుకు కాకీ ఖాదీలో సైనిక దుస్తులు (Uniform) సప్లయ్ చేసినందుకు ప్రభుత్వం వారాయనపైన కేసుపెట్టి విచారించినారు రామరాజు నివాసస్థానం శ్రీరామదేవాలయము అక్కడ ఆయన తపస్సు చేసేవాడు ప్రతిరోజు అనేకమంది జనులు ఆయన దర్శనం చేసుకొని పోతుండేవారు ఆయన ప్రసంగాలు వింటూన్నప్పుడు ప్రజలు ఉప్పొంగి పోయే

వారని తెలిసింది ఆయన ప్రతిదినం ఆధ్యాత్మిక ప్రసంగాలు చేసేవారు కాని ఆ ఆధ్యాత్మిక తత్వంలో దేశభక్తి కూడా పాలలో పంచదారవలె మిళితమై ఉండేది ప్రజలు వారి ఆధ్యాత్మిక క్షీరం ఎంతో ఆసక్తితో త్రాగేవారు ఇరవై ఐదేండ్ల యువ సన్యాసి విద్యావిహీనులయిన కోయలకు విప్లవబోధ చేయడమే ఆ ప్రసంగాల సారాంశము కోయలు అసలు కదలరు కదిలితే వాళ్ళను ఆపడం కష్టం, సమీపించడం కష్టము ఈ సంగతి ప్రభుత్వంవారు అతుణం పసికట్టినారు 'ఇక్కడ విప్లవం ప్రారంభమవుతున్నది ఒక పెద్ద రాజద్రోహి తయారయినాడు సామ్రాజ్య విరోధి, వాని పనిపట్టవలె" అనే నినాదం లేవదీసినారు 1922 జనవరిలో రాజు తిరుగుబాటును లేవదీయ మన్నాడని ఒకవదంతి వ్యాపించింది రాజును సహాయనిరాకరణవాది అన్నారు తూర్పుగోదావరి జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ ఏజన్సీ ప్రాంతాలకు పరు గెత్తినాడు అక్కడ అతనికేమీ కనిపించలేదు రాజు తపస్సులో మునిగి ఉన్నాడు అతనిని విశాఖపట్నంలోని నర్సీపట్నానికి తీసుకపోయి తరవాత విడిచిపెట్టినారు కాని పోలీసులు అతనిని వెంటాడి పీడించడం మానలేదు రాజు పోలవరం డిప్యూటీ కలెక్టర్ ఫజులుల్లాకు తనను పోలీసులు వెంటాడి బాధించటం మాన్పించమని విజ్ఞప్తి చేసుకొన్నాడు ఆ ముస్లిం డిప్యూటీ కలెక్టర్ ఆయనను తరవాత కలుసుకొన్నట్లు తెలిసింది కాని వారేమి మాట్లాడుకొన్నారో ఎవరికి తెలియదు ఫలితమేమంటే రాజుకు 80 ఎకరాల భూమి వ్యవసాయం చేసుకొనేటందుకు తగిన సౌకర్యాలతో మంజూరు చేయ వలసిందని ప్రభుత్వంవారికి ఆ డిప్యూటీ కలెక్టర్ సిఫార్సు చేసినాడు ఆ ప్రకా రం మంజూరయింది కూడా ఈ విధంగా దేశభక్తుణ్ణి వ్యవసాయకునిగా మార్చవలెననే ప్రయత్నం జరిగింది

కాని ప్రయోజనం లేకపోయింది దేశభక్తుడు దేశభక్తుడుగానే ఉండి పోయినాడు ఆయన 80 ఎకరాలతో సంతృప్తిపడి ఊరుకుండే మనిషికాడు నిరంకుశ విదేశీప్రభుత్వపు చేతులనుంచి యావద్భారతదేశాన్ని విముక్తి చేయవలె నని ఆయన కోరిక అదే ఆయన జీవితాశయము ఆయన భగవద్గీత పఠించి స్వధర్మాన్ని గుర్తించినవాడు స్వతంత్ర భారత దృశ్యం ఆయన మనసుకు నాటింది ఇహ తన పని నెమ్మదిగా ప్రారంభించినాడు ఆ ఆటవిక ప్రదేశం లోని పరిస్థితి ఆయనకు చాలా సహకారి అయింది దానిని ఆయన తన మాతృదేశం కోసం ఉపయోగించుకొన్నాడు

ఆయన కార్యరంగం గూడెం తాలూకాలోని ఏజన్సీ ప్రాంతము అక్కడ ఇతర ప్రదేశాలలోని మామూలు చట్టం వర్తించదు అక్కడిది నిరంకుశ చట్టము దానినే నవాబ్ పరగణాలలో జబర్దస్తీ చట్టం అంటారు అక్కడ ఒక తహశీలుదారు ఉన్నాడు అతడు రోడ్డు కాంట్రాక్టరు కూడాను, ఆయన చాలా క్రూరుడని ప్రసిద్ధి క్రూరత్వంలో ఒక్క డయ్యారు తప్ప ఆయనను మించినవాడు మరొకడు లేడని ప్రతీతి దీనికితోడు ప్రభుత్వంవారి రిజర్వ్

ఫారెస్టుల విభాగం కూడా అక్కడ అమలులో ఉన్నది కోయలకు ప్రాథమిక హక్కులు కూడాలేవు అన్నం వండుకోవటానికి అడవిలోని కట్టెపుల్ల కొట్టు కొనే హక్కు కూడా కోయలకులేదు వాళ్ళ ఆవులు అడవులలో మేయటానికి ప్రాప్తిలేదు కొంతకాలం క్రితంవరకు ఈ హక్కు కోయలకుండేది వాటిని ప్రభుత్వంవారు తీసివేసినారు కాబట్టి ఏజన్సీ ప్రాంతమంతా అసంతృప్తితో అట్టుడికినట్టుడుకుతున్నది

ఈ కారణాలవల్ల రాజు కార్యరంగానికి మంచి అవకాశాలేర్పడినాయి కాని ఇంతమాత్రంతో ఆయన సంతృప్తిపడలేదు బలిష్ఠులయిన కార్యకర్తలను కూడగట్టుకొన్నాడు ప్రజలలో ప్రజ్వలించిన స్వరాజ్యవాంఛను ఈ స్థానిక బాధలు ద్విగుణీకృతంగా పెంపొందించినాయి ఏజన్సీలోని ఈ స్థానిక బాధలను స్వాతంత్ర్యపోరాటంకోసం రామరాజు సంపూర్ణంగా వినియోగించుకొన్నాడు ఏజన్సీ ప్రజలకు రామరాజుమీద అత్యంతమయిన ప్రేమ అందువల్ల వారిని ఎంత బాధించినా వారు రామరాజు జాడలు ఎంతమాత్రం బయటపెట్టలేదు ప్రభుత్వంవారు పెద్ద పెద్ద బహుమానాలు ఇస్తామని ఆశ పెట్టినప్పటికీ రాజును గురించిన ఆచూకీ ఎంతమాత్రం ఎవ్వరూ ఇవ్వలేదనీ మద్రాస్ పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఒప్పుకోక తప్పిందికాదు

రాజు ఆదర్శం స్వరాజ్యమనడానికి మరొక నిదర్శనము కూడా ఉన్నది పోలీసు సబ్‌ఇన్‌స్పెక్టర్ శ్రీ సి శ్రీనివాసరావు కోర్టులో సాక్ష్యమిస్తూ రాజు ఆదర్శం స్వరాజ్యమని చెప్పినాడు ఆయనకు తోడునీడలుగా ఉండిన ధీరులు గాం సోదరులకు ఆయన స్వరాజ్య సందేశం అందజేసినాడనీ మరికొంతమంది కూడా కోర్టులో సాక్ష్యమిచ్చినారు వీటన్నిటికీ మకుటాయమానంగా రాజు స్వంతంగా చెప్పిన మాటలవలననే మనమాయన ఆదర్శం గ్రహించవచ్చు తూర్పు గోదావరి జిల్లాలో అన్నవరమనే గ్రామం ఉన్నది అది పుణ్యక్షేత్రం కూడా అక్కడ రైల్వేస్టేషన్ ఉంది రాజు ఆ అన్నవరం పోలీసు స్టేషన్ లోకి పోయేటప్పటికి పోలీసువారు ప్రాణాలు గుప్పిటిలో పెట్టుకొని పరారయినారు ఆ సమయంలో ఆయన ఒక నాన్‌కో-ఆపరేటర్‌ను కలుసుకోవడం తటస్థించింది ఆయనకు రాజు తన కార్యక్రమమంతా వివరించి చెప్పినాడు ఆ సంభాషణ రాజు సొంత మాటలలోనే వ్రాయడం బాగుంటుంది

నాన్ కో-ఆపరేటర్ ఈ దండయాత్ర ఎందుకు చేస్తున్నారు?

రాజు మన మాతృదేశ స్వాతంత్ర్యంకోసం

యన్ సి ఓ ఏ పద్ధతులవల్ల ?

రాజు ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనం యుద్ధం చేస్తేనేగానీ మనకు స్వరాజ్యం రాదు,

యన్ సి ఓ ఈ విధంగా స్వరాజ్యం వస్తుందని మీరు నిజంగా నమ్ము తున్నారా ?

రాజు నిస్సంశయంగా రెండు సంవత్సరాలలో మేము స్వరాజ్యం సంపాదించి తీరుతాము

యస్ సి ఓ రెండు సంవత్సరాలలో మీరు స్వరాజ్యం సంపాదించగల రని ఎట్లా అనుకొంటున్నారు మీ ప్రస్తుత పద్ధతుల ద్వారా నేనా ?

రాజు అవును నిశ్చితంగా సంపాదించగలను నా వెంట చాలా బలగమున్నది నాకు మనుష్యుల లోటు లేదు కావలసింది యుద్ధసామగ్రి నేనా ప్రయత్నంలో ఉన్నాను

కాని ప్రభుత్వంవారు మాత్రం రాజు గూడెంలో ఒక చిన్న 'కెయిజర్' వలె అధికారం చలాయించ వలెననుకొంటున్నాడని ఆయనకు దురుద్దేశాలు ఆపాదించడంలో ఎంతమాత్రమూ సందేహించలేదు ఆ ఉత్తమ దేశభక్తుని గురించిన ఇటువంటి అపనిందలు ప్రజల అసహ్యానికి గురిఅయినాయి ఇరవై అయిదేండ్ల వయసుగల యువకుడు అత్యంత శక్తిమంతమయిన బ్రిటిష్ సామ్రాజ్యానికి ఎదురు నిలచి ముందుగా పోరాటానికి స్థలకాల నిర్ణయంచేసి బ్రిటిష్ సింహాన్ని ఆహ్వానించడం, అది తన గుహనుంచి బయటికి రాకపోవడం అత్యాశ్చర్యకరమయిన విషయము ఈ దేశభక్తుని ఆయుధాలు విల్లు, అంబులు అంతే ఆయన సైన్యం అతురాలురానికోయలు ఆయన యుద్ధరంగం కొండ, ఆయన నివాసస్థలం కొండగుహ ఆయనసైనికులకు ఆహారపదార్థాలు శత్రువుల నుంచి బలాత్కారంగా లాక్కున్నవి, ఆయన అనుచరులు గ్రామస్థులనుంచి అడిగి తెచ్చినవి అటువంటి మనిషిని అటువంటి స్థితిలో బలిష్ఠమయిన బ్రిటిష్ ప్రభుత్వం ఎదుర్కొన్నది కాని రాజుకు మాత్రం కొన్ని ప్రకృతి సిద్ధాలయిన సదుపాయాలు లభించినాయి కొండ అతనికి మంచి కీలకస్థానము మెలికలు తిరిగిన తోవలు, ఇతరులకు తెలియని కొండగుహలు ఆయనకు చక్కగా ఉపకరించినాయి అక్కడి శీతోష్ణస్థితికి శత్రువులు అలవాటు పడనందున వారు చలిజ్వరాలతో బాధపడవలసిన అవస్థపట్టింది అందువల్ల అది శత్రువులకు ప్రతికూలంగాను, రాజుకు అనుకూలంగాను పరిణమించింది శక్తిమంతమయిన శత్రువులతో పోరాడవలసిన అసమసంగ్రామంలో తెలివిగల సేనానాయకుడు తన యుద్ధరంగం జాగ్రత్తగా నిర్ణయించుకొని తనదిపై చేయి అయ్యేటట్లుగా చూసుకోవలసి ఉంటుంది, సరిగా రాజు చేసిన పని అదే

మొత్తం మీద ఉభయులు ఆరు పర్యాయాలు శత్రువులుగా తారసిల్లి నారు మొదటి ఐదు పర్యాయాలు రాజుకే సంపూర్ణ విజయం కలిగింది బ్రిటిష్ ప్రభుత్వంవారు మలబారునుంచి పోలీసువారిని, అస్సాంనుంచి సైనిక దళాలను రప్పించినారు సంకుల సమరం జరిగింది పెదవలస అనే గ్రామం దగ్గర స్కాట్ కవర్డ్, హైటర్ అనే ఇద్దరు యూరోపియన్ ఉద్యోగస్థులను రాజు సైనికులు కాల్చి చంపివేసినారు ఇంకా అనేకమందిని గాయపరిచినారు రాజు అనేక పోలీసు స్టేషన్లను స్వాధీనపరుచుకొని, తుపాకులను మందుగుండు సామానులను వశపరుచుకొన్నాడు ఒక పర్యాయం రాజూ ఆయన

పై సికులూ నిద్రిస్తుండగా పోలీసువారు అకస్మికంగా వారిని ముట్టడించినారు రాజు వీరోచితంగా పోరాడి ఎట్లాగో తప్పుకోగలిగినాడు తుదకు ఆకస్మిక పోరాటంలో రాజుపై నికులు అతిసాహసంగా పోరాడి అపజయం పొందటం తటస్థించింది అదే రాజు సాగించిన స్వాతంత్ర్యపోరాటానికి తుదిఘట్టము ప్రభుత్వంవారు ఏజన్సీ ప్రజలను పన్నులు వేసి, నిర్బంధంగా సప్లయ్‌లు తీసుకొని ఇంకా అనేక విధాల బాధపెట్టినందువల్ల వారి బాధలను చూసి ఓర్చుకోలేక రాజ నిస్పృహతో క్రుంగిపోవడంవలన ఆయన ఓడిపోయయినావుండవలె, లేక లొంగిపోయయినా ఉండవలె అనేకరకాల వదంతులు పుట్టినాయి ఏమయినప్పటికి దాదాపు రెండు సంవత్సరాలు (1922 ఆగస్టు నుంచి 1924 మే వరకూ) సాగిన స్వాతంత్ర్య మహా సంగ్రామం అంతటితో ముగిసింది ప్రభుత్వం వారికి ఈ పోరాటంవల్ల 15 లక్షలు ఖర్చయింది

అయితే రాజు ఏమయినాడు? పట్టుబడినాడా? తుపాకి గుండుకు ఎరయై చనిపోయినాడా? ఇంతకూ ఆయన ఇప్పుడు బ్రతికి ఉన్నాడా! చనిపోయినాడా? గవర్నమెంట్ వారి ప్రకటనలు అస్పష్టంగానూ, చీకాకుగానూ ఉన్నాయి ఆయన చనిపోయినాడన్న విషయం ఇప్పటికీ నిగూఢంగానే ఉన్నది

18-7-1929 యంగ్ ఇండియా

## ఆంధ్రలోని దృశ్యాలు

తూర్పు గోదావరిలో మా ఇటీవలి ఆరురోజుల సంచారంలో మాకు అనేక ఉత్తేజకరాలయిన అనుభవాలు కలిగినాయి. ఆంధ్రలో ఇంకెక్కడా అంత వివరంగా జ్ఞాపకముంచుకోదగిన అనుభవాలు కలగలేదు ఈ అనుభవాలు 1927లో గాంధీగారి తిరువాన్కూరు పర్యటనలోని అనుభవాలను స్మృతిపథానికి తెస్తూన్నాయి భారతదేశపు ఉద్యానవనము నే పేరు తిరువాన్కూరుకు చక్కగా వర్తిస్తుంది అక్కడి అద్భుతమయిన ప్రకృతి దృశ్యాలతో సరిపోతగినవి దాదాపు ఎక్కడా లేవని చెప్పవచ్చు ఆ తీగలు, ఆ సస్యశ్యామలాలయిన భూములు, ఆ టేకుచెట్లు, మధ్యాహ్నపు సూర్యకిరణాలుపై తంచొరని ఆ దట్టమయిన ఉద్యానవనాలు, ఆకాశంలో మనోహరమైన అపరంజి వెలుగులతో కనపడే సూర్యాస్తమయము, నిశ్చలమయిన వెన్నెలలో, నారికేళ వృక్షాల నీడలకింద ఉన్న సముద్రతీరపు ఇసకతిన్నెలూవంటి చిత్తాకర్షాలయిన దృశ్యాలను ఇంకొకచోట చూడగలగడం అసాధ్యం కాకపోయినా దుర్లభం మాత్రమవుతుంది అయితే, దోషైకదృక్కుగల విమర్శకుడు ఈ దృశ్యాలలోని రంగులు చిక్కగా ఉన్నాయని ఈ చిత్రపటంలో ఒకే పర్యాయం ఇన్ని దృశ్యాలను ప్రదర్శించడంవల్ల విసుగుబుట్టి మనస్సుకు, దృష్టికి కొంత విశ్రాంతి అవసరమవుతుందని కూడా అనవచ్చు తూర్పు గోదావరి డెల్టాలోని దృశ్యం ఈ తీరుగాగాక మరొకతీరుగా కనపడింది అది మన దృష్టిని మిరుమిట్లు గొలిపేదిగాగానీ, మనస్సును ఆలోచనా పరంపరలతో కల్లోలపరిచేదిగాగానీ

లేదు అక్కడి దృశ్యాలు మన జ్ఞానేంద్రియాలను సున్నితంగా స్పృశించి ప్రశాంతంగా జోకొట్టుతున్నట్లు ఉన్నాయి అక్కడి పచ్చని వరిపొలాలు, అక్కడక్కడా సౌందర్యంగా కనిపించే రైతుల కుటీరాలు, చల్లని నీడలిచ్చే కొబ్బరిచెట్లు, కదళీవృక్షాలు, నెమ్మదిగా హుందాగా రాయంచనడకలతో సముద్రంవైపుకు ప్రవహించే గోదావరి, దానిలో మెరుగుపెట్టిన వెండిపళ్ళాలలో పోసిన మరకతమణులవలె కనిపించే పచ్చనిచేలతో చిన్న చిన్న లంకలూగల తూర్పు గోదావరిలోని సర్వవ్యాపిత దృశ్యం తిరువాన్కూరు అసూయ పడేటంత మనోజ్ఞంగా ఉన్నాయి

ఈ సంచారం చాలా దీర్ఘమయినది, చిక్కులతోకూడినదిన్నీ తుని, పిఠాపురం, కాకినాడ, సామర్లకోట, వేలంగి, రామచంద్రపురం ఇంకా ఎన్నో చోట్లకు విద్యుద్వేగంతో పోవలసివచ్చింది మే 8 ఉదయం గౌతమీనది సముద్రపుపోటుతో పొంగిపొర్లుతున్న సమయంలో దానిని దాటి అమలాపురం తాలూకాలో ప్రవేశించినాము నాగారం లంకతోసహా అమలాపురం తాలూకాను గోదావరి సెంట్రల్ డెల్టా అంటారు సూర్యాస్తమయ సమయంలో ఆ నల్లని పటినీటి అలలలో అరుణకాంతులు ఉయ్యాలలూగుతుండగా వశిష్ఠనదిని దాటి రాజోలువైపుకు పోయినాము అమలాపురం రాజోలు మధ్య ఉన్న ప్రదేశమంతా మామిడితోటలతోను, అరటితోటలతోను, పోకచెట్లతోను, కొబ్బరిచెట్లతోనూ ఎడతెగని ఉద్యానవనంమాదిరి కనిపించింది సాయంకాలపు నీరుటెండలలో వొయ్యారంగా వంగిఉన్న పండ్లగెలలతో అరటిచెట్లనీడలు, ఆకాశానికి మిణుకుమిణుకుమంటూ పడకగది దీపాలవలె మందంగా వెలుగుతున్న తారాగణాలు మనసులో ఎన్నటికీ మరుపురాని మధుర దృశ్యాలుగా రూపొందించినాయి

ఇట్లాంటి అందచందాలుగల పరిసరాలతో ఆకర్షవంతంగా ఉన్న రాజోలుసైతం గాంధీజీని కొన్ని గంటలయినా నిలుపుకొనలేకపోయింది గోదావరినది శాఖపైన నిర్మించిన వంతెన (అక్విడక్ట్)మీదుగా మోటారులో నాగారం లంకకుపోయి గన్నవరందగ్గర ఉన్న వెడల్పయిన గోదావరిఒడ్డున ఆ రాత్రి గడిపినాము ఆ ఉదయం ధవళేశ్వరందగ్గర ఆనకట్ట బరాజ్ మీదుగా గోదావరి దాటి రాజమహేంద్రవరం చేరుకొన్నాము సీతానగరంలోని డాక్టర్ సుబ్రహ్మణ్యంగారి గౌతమీ ఆశ్రమమునూ, ఏజన్సీ ప్రాంతంలోని పోలవరమునూ చూసి తూర్పు గోదావరి పర్యటనను ముగించుకొన్నాము

చాలా త్వరితగతిని నడిచిన ఈ ప్రయాణంలోని కార్యక్రమం కూడా చాలా ఒత్తిడిగా ఉండటం తటస్థించింది అనేకచోట్ల ఆగవలసివచ్చింది చిన్న చిన్న సభలూ, పెద్ద పెద్ద సభలూ కూడా జరిగినాయి అందువల్ల అవన్నీ దారిలో తటస్థించిన అప్రధానవిషయాలుగా తయారయినాయి ఈ సందర్భంలో పిఠాపురం మహారాజాగారి ప్రజాహిత కార్యకలాపాలను గురించి కొంత చెప్పవలసి ఉన్నది. పిఠాపురం తాలూకా బోర్డు వారిచ్చిన సన్మానపత్రం బట్టి

మహారాజావారు మద్యనిషేధంలో పట్టుదల కలిగి ఉండటమేగాక తన జమీలోని తాడిచెట్లనుగానీ ఈతచెట్లనుగాని కల్లుగీతకు ఇవ్వడానికి నిరాకరించినారనీ, ఆయన మంచి సంఘసంస్కర్త అనీ, ఆదిమాంధ్రుల బిడ్డలకోసం పిఠాపురంలో శరణాలయం స్థాపించి వారికి ఉచిత భోజనము, ఉచిత విద్య ఏర్పాటు చేసినారనీ తెలియవచ్చింది చోడవరంలో మాకు ఆతిథ్యమిచ్చిన గృహస్థు శ్రీ బిక్కిన వెంకటరత్నంగారు నూలువడకటంలో నేర్పరి ఆయన శాసనసభా సభ్యుడు ఆయన వడకటమేగాక ఆయన కుటుంబంలోని వారందరూ నూలువడకటంలో శ్రద్ధకలవారు ఆయన మద్రాసు శాసన సభలో తెలుగులో మాట్లాడడం నియమంగా పాటించిన శాసన సభ్యుడు ఆయన నూలువడకటంలో ఎంతపట్టుదల కలిగిఉన్నారో, శాసన సభలో తెలుగులో మాట్లాడడంలో కూడా అంత పట్టుదల గలవారు చక్కగా తయారు కాని ఏకులతో సైతం ఆయన 80వ నెంబరు, అంతకంటే ఎక్కువ నెంబరుగల నూలును వడకగలరు

ప్రతిరోజూ ఈ మనోజ్ఞ దృశ్యాలను చూస్తూ పోతూన్నకొద్దీ ఆ ప్రకృతి సౌందర్యానికి వెనకదాగిఉన్న కార్మిక కర్షకుల సహజ జీవిత పరిస్థితులను కనుక్కోవలెననేవాంఛ గాంధీజీకి అంతకంతకు పెచ్చు పెరిగి "కేవలం నాతో ఉన్నందువల్ల నీకేం ప్రయోజనంలేదు గ్రామంలోకిపోయి అక్కడి విషయాలు నీవు స్వయంగా పరిశీలించడం మంచిది ఇంతవరకు మనం ఆపని చేయనందుకు మన సంచారంవలని సగం విలువ పోగొట్టుకొన్నాము" అన్నారు రేలంగిలో నాతో అందుకు నేను మనసారా ఇష్టపడినాను యావద్భారత దేశంలో నేతవారి చరిత్ర విషాదాంతంగా పరిణమించింది ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో అది మరింత దుర్భరంగా ఉన్నది వారు సంఘంలో నష్ట జీవులుగా ఉన్నారు చీరాల పేరాలలో ఒక నేత మేస్త్రీ గాంధీజీకి ఒక సున్నితమయిన సన్ననూలు ఖాదీ బట్టను బహూకరించినారు ఆ బట్ట కొన్ని తెలుగు, సంస్కృతపు పద్యాలు నేయబడిన అంచులతో ఉన్నది అది ఆ నేత మేస్త్రీ హస్తనైపుణ్యం చాటుతున్నది ఆయనకు అక్షరజ్ఞానంలేదు ఆయన తన పనితనంవల్ల "నెలకు 45 మొదలు 50 రూపాయలవరకు సంపాదిస్తాననీ, 20 మొదలు 25 రూపాయల వరకు తనకు అక్షరాలను చిత్రించే గుమస్తాకు ఇస్తాననీ" చెప్పినాడు ఆయన ఇటీవలనే ఖద్దరు నూలును నేయడం ప్రారంభించినాడు ఎందుకింత ఆలస్యంగా ప్రారంభించావని అడగగా, ఆపని కావలెనని కోరిన వారికోసం మాత్రమే చేస్తున్నాననని అన్నాడు మిల్లు నూలునుంచి వడుకునూలుకు తనపనిని మార్చుకొన్నప్పటికీ ఆయన ఆదాయం మామూలుగానే ఉన్నది "ఈ తాలూకాలో నీవంటి నేతపనివారు ఎంతమంది ఉన్నారు" అని నేను ఆయనను అడిగినాను "పదివేల మంది ఉన్నారు కాని నేనొక్కడనే వడుకునూలు నేత నేసేది" అన్నాడాయన. "వారంతా నీ వలెనే ఆర్థికంగా బాగున్నారా" అని మళ్ళీ ప్రశ్నించినాను. "లేరు, చాలామందికి చాలాకాలం పనిఉండదు వారిలో వారికి ఎక్కువ

పోటీ ఉండటంవల్ల అందరికి తగినంత పనిలేకుండా పోయింది" అన్నాడాయన వారు మిల్లు నూలుపైన ఆధారపడి ఉండటం మునగకొమ్మను పట్టుకొని వ్రేలాడడం వంటిదని, వారిలో కొందరు అభివృద్ధిలో ఉన్నప్పటికీ ఆ అభివృద్ధి తక్కినవారి కష్టనష్టాలపైన కలుగుతున్నదనీ, వారు మిల్లునూలు పోటీనుంచి తప్పించుకొని త్వరగా బయటపడి వడుకునూలుపైన ఆధారపడి ఉండటం మంచిదనీ లేనట్లయితే వారి వృత్తి పూర్తిగా నశిస్తుందనీ ఆయనకు నచ్చచెప్పడానికి ప్రయత్నించినాను కాని లాభంలేకపోయింది తగినంత మంది వతను దార్లు తనకు లభిస్తే తాను వడుకునూలు నేయడానికి ఇష్టంగానే ఉన్నాననీ, మిల్లులపోటీవల్ల తమవృత్తికి గొప్పగా నష్టంకలుగుతుందని తాను విశ్వసించడం లేదనీ అంటూ, మిల్లులకంటె తక్కువ ఖర్చుతో తమ పనిలో తామెక్కువ నైపుణ్యం చూపించగలమని కూడా ఆత్మవిశ్వాసంతో అన్నాడాయన కాని వేలంగిలో శాసనాలద్వారా నేతవారికి తటస్థించిన విషాద వృత్తంలోని తుది దృశ్యాన్ని చూసినాము అయితే ఆ విషయం గురించి చెప్పేముందు వేలంగి గ్రామం గురించి సంగ్రహంగా వివరించ దలచుకొన్నాను

వేలంగి మూడువేల జనాభాగల ఒక చిన్న గ్రామము అది ఆంధ్రలోని గ్రామాలకు ప్రతిబింబము రైల్వేస్టేషన్‌కు చాలా దూరంలో ఉన్నది పూర్వ కాలపు పరిస్థితి ఇంకా విలక్షణంగానే కనిపిస్తున్నదక్కడ అక్కడ మునిసిపాలిటీగానీ, జిల్లాబోర్డుగానీ కనీసం సహకార సంఘంగానీ లేదు మేమా ఊరు వెళ్ళేప్పటికి కాంగ్రెస్ కమిటీకూడా లేదు ఒక చిన్న బ్రాంచి పోస్టాఫీసు ఉంది టెలిగ్రాఫ్ ఆఫీసుగాని, ఆసుపత్రిగానీ, హైస్కూలుగాని లేదు దీనినిబట్టి ఆధునిక నాగరక ప్రభావాలు ఆ గ్రామంపైన చాలా వరకు ప్రసరించనట్లే కనిపిస్తున్నది పూర్వకాలపు గ్రామ ఆర్థికవిధానం దాదాపు అంత్యదశలో ఉంది కమ్మ భూస్వాములకు చెందిన పక్కా భవనాలు సుమారు 20 మాత్రం ఉన్నాయి తక్కినవన్నీ మామూలు సామాన్యమైన ఇండ్లు పంచముల ఇండ్లు 60, ఊరికి వెలుపల ఉన్నాయి ఊరికి దూరంగా ఉన్న వరిచేల మధ్య రైతుల చిన్నచిన్న కుటీరాలు చక్కగా నిర్మింపబడి ఉన్నాయి ఊరికి దగ్గరగా ఉన్న చెరువునుంచి గ్రామస్థులు మంచినీరు తెచ్చుకొంటారు ఆ నీరు అంత పరిశుభ్రంగా ఉన్నదని చెప్పటానికి వీలులేదు ఊరికి వెలుపల ఉన్న పొలాలే గ్రామస్థులు బయలుకుపోయే చోట్లు సహజంగా పాకీ పనికి ఉపయోగపడే పందులునైతం అక్కడలేవు ఇవియే ఆ గ్రామ ఆరోగ్యరక్షక పరిస్థితులు

మేమా గ్రామంలోని నేతపనివాళ్ళున్న ప్రదేశాలకు హఠాత్తుగా వెళ్ళినాము అక్కడ దాదాపు పంద్రెండుగురు నేతపనివారు వారి కుటుంబాలతో ఉన్నారు మేము వెళ్ళినతోడనే వారు మా చుట్టూ మూగి మా సంభాషణలో పాల్గొన్నారు వారి కథ యావత్తూ వారు సంగ్రహంగా చెప్పినారు 1921 పూర్వం వారంతా మిల్లునూలు నేస్తూ నెలకు పదిపదిహేను రూపాయలు సంపాదించుకొనేవారనీ, తరవాత వారివ్యాపారానికి క్షీణదశ ప్రారంభ

మయినదనీ చెప్పినారు తరవాత అసహాయోద్యమం వచ్చింది వారు వడుకు నూలునేత ప్రారంభించినారు ఆ నేత కొంచెం కష్టమయినదే కాని మజ్జూరి కొంచెం ఎక్కువగా ఉండి వారికి స్థిరమయిన పని కల్పించింది రెండు సంవత్సరాలపాటు నెలకు సుమారు 20 రూపాయలు సంపాదించుకొన్నారు తరవాత ఎందువల్లనో ఖాదీకొనడం తగ్గిపోయింది అందువల్ల తిరిగి మిల్లునూలు నేయటం ప్రారంభించినారు అప్పటినుంచి వారిస్థితి క్రమక్రమంగా క్షీణించింది మేము వారిని చూసినప్పుడు వారిలో చాలామందికి పనిలేకుండా పోయింది కొంత మంది మిల్లుబట్టలను అమ్ముకొంటూ బ్రతుకుతున్నారు చాలామంది సమీపంలో జరుగుతున్న రైల్వేనిర్మాణం పనిలో రోజువారీ కూలీలుగా చేరి బ్రతకడానికి ఆలోచిస్తున్నారు స్థలాభావంవల్ల వారి సంభాషణ వివరాలు ఇక్కడ వ్రాయడానికి వీలుపడలేదు

18-6-1929 యంగ్ ఇండియా

**చీరాల నేతకళా నైపుణ్యము**

పై 'యంగ్ ఇండియా' వ్యాసంలో చీరాల పేరాలలో ఒక మేస్త్రీ గాంధీజీకి ఒక సున్నితమయిన సన్ననూలు ఖాదీబట్టను బహూకరించినారు ఆ బట్ట కొన్ని తెలుగు, సంస్కృతపు పద్యాలు నేయబడిన అంచులతో ఉన్నది "అది ఆ నేత మేస్త్రీ హస్తనైపుణ్యం చాటుతూ ఉన్నది ఆయనకు అక్షరజ్ఞానం లేదు ఈ వస్త్రం బహూకరించినవారు (శ్రీ) పెండెం కేశవులు" ఆయన ఆ వస్త్రం బహూకరించగానే గాంధీజీ దానిని స్వీకరించి "చూడగానే చాలా సంతోషం కలిగించింది నూతనంగా కనిపెట్టబడింది ఎంతో బుద్ధి కుశలతతో తయారుచేసినారు ఈ పరిశ్రమ ఎక్కువ అభివృద్ధి చెందగలదు" అన్నారు దీనిమీద చిత్రించిన శ్లోకము "జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః" అనే సుప్రసిద్ధ శ్లోకము

**గాంధీజీకి సుబ్రహ్మణ్యంగారి లేఖ**

1929లో గాంధీజీ సీతానగర సత్యాగ్రహాశ్రమం సందర్శించిన తరవాత డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు సబర్మతీ ఆశ్రమంలో కొన్ని రోజులు గడపగలనని గాంధీజీకి వాగ్దానం చేసినారు కాని ఆయన ఆ వాగ్దానం కొన్ని కారణాలవల్ల నిర్వర్తించజాలక పోయినారు ఆ సందర్భంలో 10-7-29 న బెజవాడనుంచి గాంధీజీకి ఇట్లా వ్రాసినారు

బెజవాడ
10-7-29

మహాత్మాజీ !

ఇంతకాలం నేను మౌనం వహించినందుకు క్షమించ ప్రార్థన నేను సబర్మతిలో మీ సెలవు తీసుకొని వచ్చినప్పటినుంచి మూడు రోజుల కిందటి

వరకు ఆశ్రమానికి దానంచేసిన భూముల దానపత్రం రిజిష్టరు చేయించడంలో నిమగ్నుడనయి ఉన్నాను మా ఆశ్రమానికి మీ రాకఫలితంగా 11,000 రూపాయల విలువగల ముప్పై ఎకరాల భూమి లభించింది అందులో కొంత మెట్ట, కొంత మాగాణి ఈ సందర్భంలో మేము మీకు పంపిన వ్యవసాయ ప్రణాళికను గురించి జ్ఞాపకం చేయదలచుకొన్నాను ఆ ప్రణాళికను గురించి మాకు కొంత సహాయం చేయవలసిందని కోరుతున్నాను

మద్రాసులో జరిగిన రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సమావేశం నుంచి నేనిప్పుడే తిరిగి వచ్చినాను మా రాష్ట్రంలో విదేశవస్త్ర బహిష్కార ప్రచారం చేయవలెనని నన్ను ఆ కమిటీవారు కోరినారు రేపటినుంచి నేను డాక్టర్ పట్టాభితో కలసి 5 రోజులపాటు సంచారం చేయవలసిఉన్నది ఆగష్టు 15 నాటికి రాష్ట్రమంతా సంచారం చేయగలనని ఆశిస్తున్నాను

మీరు మా ఆశ్రమంలో విడిచిపెట్టిన పంచమ బాలుడు క్షేమంగా ఉన్నాడు అతడు హిందీ, తెలుగు నేర్చుకొంటున్నాడు ప్రతి దినము క్రమంగా నూలు వడుకుతున్నాడు అతడు నూతిని ఉపయోగించుకోవడం చుట్టుపట్ల గ్రామాలలో సంచలనం కలిగించింది అప్పుడు మేమొక క్లిష్టపరిస్థితిని గడచి బయటపడవలసినట్లు కనిపించింది మా ఆశ్రమంలోఉన్న నా సహచర కార్యకర్త లెవ్వరూ నన్ను విడిచిపెట్టి పోనందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది వారందరూ జరుగుతున్న సంఘటనలను జాగ్రత్తగా పరిశీలిస్తున్నారు మరి ఇద్దరు కొత్తసభ్యులు నా ఆశ్రమంలో చేరినారు మన ఉద్యమం న్యాయమయినది మీ ఆశీర్వాదంతో మేము పురోగమించ దలచుకొన్నాము

ఈ అన్ని కారణాలవల్ల ఇంతకుపూర్వం నేను వాగ్దానం చేసిన ప్రకారం మీ పాదాల సన్నిధిని కొన్నాళ్లు కాలం గడపడానికి నేను రాలేకపోయినాను ఆగష్టు 21 వ తేదీన జరగనున్న అఖిలభారత ఖాదీ కౌన్సిల్ సమావేశానికి నేను సబర్మతికి రాగలను

ఆగష్టు 1వ తేదీ నుంచి ఖద్దరును గురించిన అన్ని విషయాలను నేర్చుకొనేటందుకు మా ఖాదీ కార్యకర్తలలో ఒకరిని సబర్మతికి పంపవలెనని అనుకొంటున్నాను ఆశ్రమం వారు అతని ఉనికికి, భోజనానికి ఉచిత సౌకర్యాలను చేయగలరేమో తెలుపగోరుతాను ఆయన అక్కడ ఎన్ని నెలలు ఉండవలసి వస్తుంది ?

శ్రమకు క్షమించండి

సెలవు<br>
మీ విధేయుడు<br>
డా॥ బి సుబ్రహ్మణ్యం<br>
(సీతానగర ఆశ్రమం)

## దేవదాసి

అలసట అంటే ఏమో ఎరగని డాక్టర్ శ్రీమతి యస్. ముద్దులక్ష్మిరెడ్డి

ఇట్లా వ్రాస్తున్నారు

"హిందూ దేవాలయాలలోని దేవదాసీ విధానాలను మీరు బహిరంగంగా నిరసిస్తూన్నందున ఆ కీడును తొలగించే మహాత్కార్యంలో మీ సహాయం కోరుతూ నేను మీకి విజ్ఞప్తి చేసుకోడానికి సాహసిస్తున్నాను ఈ రాజధానిలో ఈ పని నాకు దుస్తరంగా కనబడుతూన్నది విద్యావంతులమనుకొనేవారు, ప్రముఖ కాంగ్రెస్‌వాదులలో అత్యధిక సంఖ్యాకులు ఈ నా సంస్కరణ కార్య కలాపాలకు ప్రతికూలంగా ఉండి లజ్జాకరమయిన ఆ విధానం సమర్థిస్తున్నారు

నా దేవదాసి బిల్లు ఇప్పటికి శాసనరూపం దాల్చింది కాని అది ఇనా ములుకల దేవదాసీలకు మాత్రమే వర్తిస్తుంది కాని ఆ సంఘంలో మరొక వర్గం కూడా ఉన్నది అది మతమనే ముసుగుకింద కొంతమంది స్త్రీలను దేవునికి అంకితంచేసి పడుపువృత్తితో జీవించే అవమానానికి వారిని బలిచేస్తున్నది దీనిని "బిడ్డల వ్యాపారము" అని చెప్పవచ్చు ఎందువల్ల అంటే బిడ్డలను కొని పెంచుకోవడం దేవదాసీలకు అలవాటు (దేవదాసీలకు హిందూ లా ప్రకారం బిడ్డలను పెంచుకునే హక్కున్నది) అట్లాకొన్న అఘం, శుభం తెలియని బిడ్డలను అత్యంత విషాదకరమయిన పడుపువృత్తికి దించటం జరుగుతూ ఉన్నది ఆ పిల్లలు పాపం ఆ చిన్నవయసులో ఆ స్థితిని తప్పించుకొని బయటపడ లేకుండా ఉన్నారు ఆ సంఘంలోని వివేకవంతులయిన అనేకమంది దగ్గరనుంచి నాకు విజ్ఞప్తులూ, వినతిపత్రాలూ వచ్చినాయి వారందరూ, ఆ పసిబిడ్డల ఆత్మలను, శరీరాలనూ విక్రయించి వ్యాపారంచేసే దుష్టులను శిక్షించేటందుకు చట్టం చేయించవలసిందని నన్ను కోరుతున్నారు

పీనల్ కోడ్‌లోని 372, 373 సెక్షన్‌లు ఈవిషయంలో ప్రయోజనకరంగా లేవు కాబట్టి నేను మరొక బిల్లును ప్రవేశపెట్టడానికి నోటీసిచ్చి ఉన్నాను అది జయప్రదంగా కొనసాగటానికి మీ ఆశీర్వాదాలను అభిలషిస్తున్నాను ఈ దురా చారం ప్రజలు గ్రహించనంతవరకు చట్టం చేసినందువల్ల ప్రయోజనంలేదని కొందరు భావించవచ్చు కాని ప్రజలలో కొంతమంది సజ్జనులు ఈ అన్యాయం గుర్తించినారని నా వాదము దుష్టులయిన తల్లిదండ్రుల దగ్గరనుంచి పిల్లలను తీసుకొని పోవడానికి నాకు శాసనబద్ధమయిన అధికారం ఉంటే నేను అనేక మంది బాలికలను రక్షించగలనని భావిస్తున్నాను

"దేవదాసీ సమాజంలోనే ఇప్పుడు గొప్ప చైతన్యం కలిగింది వారి విషయంలో పెద్దఎత్తున ప్రచారం చేస్తున్నారు కాని దేవదాసీ సంఘంవారి సంస్కరణ ప్రయత్నానికి ఉన్నత కులాలవారు సహాయం చేయనందుకు నేను చాలా విచారపడుతున్నాను అంతేగాక బిడ్డల సంరక్షణకు సంబంధించిన శాస నాలు ఇతర దేశాలలోగాని, కనీసం బొంబాయి, వంగ రాజధానులలోగాని ఉన్న శాసనాలతో పోల్చిచూస్తే మా రాష్ట్రంలో దాదాపు లేవనే చెప్పవచ్చు

అభివృద్ధి పొందిన దేశాలలో ఆరోగ్య, నైతిక సంస్కరణలు ప్రజాభి ప్రాయఇబట్టి రూపొందుతూ ఉండడం వెనెకుగుడును. కులంతోనూ, మతం

తోనూ నిమిత్తం లేకుండా అందరి పిల్లలను సానుభూతితో జాగ్రత్తగా పెంచ వలసిన అవసరం ఉందని గ్రహించనందుకుగానీ, పాపం పుణ్యం తెలియని బిడ్డలను లజ్జాకరమయిన భయంకర జీవితానికి పాల్పడ పేసినందుకుగానీ ఏ రాజధానిలోని ఉన్నత కులాలవారిని నిందించవలసినంతగా, ప్రభుత్వంవారిని నిందించవలసిన పనిలేదు కాబట్టి వారు కులమత భేదాలను గమనించక ఉదారంగా వ్యవహరించవలె "

ఈ రచయిత్రి ప్రతిపాదనను నేను హృదయ పూర్వకంగా ఆమోదిస్తున్నాను నిజానికి ఆమె ప్రతిపాదించబోయే శాసనం ప్రజాభిప్రాయంకన్న ముందుగా పురోగమిస్తున్నదని నేననుకోవడంలేదు చైతన్యవంతులై బహిరంగంగా తమ అభిప్రాయాలను చెప్పగలవారందరూ ఏ రూపంలోనయినాసరే ఈ విధానం ఉండటానికి ప్రతికూలురుగానే ఉన్నారు ప్రజాభిప్రాయం నల్లమందు వ్యాపారానికి వ్యతిరేకంగా ఉంటే, దానిని కొనసాగించ వలెననే నల్లమందు దొంగవ్యాపారస్థుల అభిప్రాయాలకెట్లా విలువలేదో అట్లాగే యీ అవినీతికర వ్యాపారంతో సంబంధంగలవారి అభిప్రాయాలకు కూడా విలువఉండదు ఈ దేవదాసీ విధానం చూసి మిన్నకుండే వారిది తప్పు ప్రజల అశ్రద్ధవల్ల కాకపోయినట్లయితే ఇది యింతకు పూర్వమే రూపుమాసి ఉండేది ఎందువల్లనోగాని ఈ దేశంలో ప్రజల చైతన్యం నివురుగప్పిన నిప్పువలె ఉంటుంది ఇది అన్ని తప్పులకంటె భయంకరమయిన తప్పు ఇందులో అలక్ష్యము, అలసతా కనిపిస్తుంది కాని డాక్టర్ రెడ్డివలె చురుకుగలవారు పూనుకొన్నట్లయితే ప్రజాచైతన్యం తన అలక్ష్యాన్ని, అలసతనూ విడనాడి ఆమెకు తోడ్పడడానికి తయారవుతుంది అందువల్ల నేను డాక్టర్ రెడ్డి ఈ ప్రతిపాదన చేయవలసిన సమయంకంటె ముందుగా చేయలేదని భావిస్తున్నాను ఇటువంటి చట్టం ఇంతకు పూర్వం ఎంతో ముందుగానే చేయవలసింది మతంలోనూ, సామాన్య సాంఘిక జీవితంలోనూ పవిత్రత ఉండవలెనని కోరేవారందరూ డాక్టర్ రెడ్డి ప్రతిపాదనను ఆమోదించి ఆమెతో సహకరించగలరని విశ్వసిస్తున్నాను

యంగ్ ఇండియా — యం కె గాంధీ

29-8-1929

## ఖాదీ కొనేవారికి

అఖిల భారత చర్ఖాసంఘ కార్యదర్శి ఇట్లా వ్రాస్తున్నాడు

'తునిలోని కొంతమంది వర్తకులు మిల్లు నూలుబట్టను స్వచ్ఛమయిన ఖాదీబట్టగా అమ్ముతున్నట్లు మాకు ఆరోపణలు చేరినాయి. దానిని గురించి మేము ఆంధ్ర శాఖకు వ్రాయగా వారు విచారణచేసి క్రింద ఉదహరించిన పేర్లుగలవారు మిల్లు నూలు బట్టను ఖాదీబట్టగా అమ్ముతున్నట్లు తెలుసుకొన్నారు

1. మామిడి వెంకటరమణ
2 అల్లాడ సోదరులు
3 గోవిందరాజులు
4 సి హెచ్ కామరాజు
5 సి హెచ్ సన్యాసి
6 సి హెచ్ బండెయ్య
7 ఆంధ్ర స్వదేశీ వస్త్రాలయం, 7/A పిఠాపురం
8 దాసరి బ్రహ్మయ్య

ఆంధ్రశాఖవారు పంపిన ఇన్‌స్పెక్టర్ ఈ విషయం గురించి విచారణచేసి ఈ వర్తకులు ఈ విధమయిన బట్టను దాదాపు రెండు లక్షల ఖరీదుగలది అమ్మినట్లు నివేదిక పంపినారు కాబట్టి ఖాదీ ధరించేవారికి ఖాదీ భాండారులకు వీరి దగ్గరనుంచి ఏమీ కొనవద్దని మండలింపు పంపడం మంచిది ఆ ఇన్‌స్పెక్టర్ ఆ వర్తకులకు ఆర్డర్లు పంపేవారి పేర్లనుకూడా మాకు తెలియజేసినారు ఈ విషయాలు తుని తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శివల్ల తెలిసినాయి వీరినుంచి కొన్నవారు ఆ వస్త్రాలను ఖాదీవస్త్రాలుగా అమ్ముతున్నారో లేదో తెలియదు కాబట్టి ఆ విషయం కూడా మేము విచారణ చేస్తున్నాము "

ఇది చాలా ప్రమాదకరమయిన విషయము ఖాదీ కొనేవారందరూ ఈ విషయంలో జాగ్రత్త వహించడం అవసరం ఇతర రాష్ట్రాలనుంచి వచ్చే సాధారణ ఖాదీతో సంతృప్తి పడేవారందరికి మొత్తంమీద ప్రమాదం లేదు కాని ఆంధ్రదేశంలోని సన్నని నాజూకు ఖద్దరుతప్ప తదితర ఖాదీ ధరించటానికి ఇష్టంలేని వారందరు తాము కొనేది నిజమయిన ఖాదీ అవునో, కాదో తెలుసుకొని కొనడం మంచిది అఖిలభారత చర్ఖాసంఘం వారు తమ అనుమతిపత్రం పొందని ఖాదీభాండారమునుండి ఖాదీకొనవలదని అనేకసార్లు ప్రజలకు తెలిపి ఉన్నారు అఖిలభారత చర్ఖాసంఘం వారి అనుమతిపొందిన ఖాదీభాండారాల జాబితా పత్రికలలో ఇదివరకే ప్రకటింపబడింది ఇప్పుడు కావలెనన్నట్లయితే ఒక అణా పోస్టుబిళ్ళపంపి ఆ సంఘ కార్యదర్శినుంచి ఆ జాబితాను తెప్పించుకో వచ్చు ఇది ప్రజలకు సంబంధించినంత వరకు ఇక అన్నాతురులైన కోట్లాది ప్రజల ప్రయోజనాల కోసం ప్రత్యేకముద్దేశింపబడిన జాతీయ మహోద్యమానికి కత్తిఖాదీ అమ్మి భంగం చేస్తూన్నవారినిగురించి ఏమనవలెనో తెలియడంలేదు కటికివానికి సైతం కొంత కనికరముంటుంది అట్లాగే ఈ వర్తకుల దురాశకు కూడా కొంత పరిమితి ఉండవలె వీరి మోసపు కార్యకలాపాలకు క్షుద్బాధా పీడితులైన కోట్లాది ప్రజలను బలి చేయకుందురుగాక ఈ నా వ్రాసినమాటలు ఆ తుని వర్తకుల దృష్టిని ఆకర్షించి వారు కత్తి ఖద్దరును అమ్మడం మాను కొన్నారని తెలిస్తే నేను చాలా సంతోషించగలను

యంగ్ ఇండియా — యం కె గాంధీ
22-11-1929

## మహాత్ముని షష్టిపూర్తి

1929 అక్టోబరు 2తో మహాత్మునకు 60 యేండ్లు నిండినాయి ఆ యేడు మహాత్ముడు ఆంధ్రదేశ సంచారం ముగించిన తరవాత ఆంధ్రదేశంలోని పట్టణాలలోనూ, పల్లెలలోనూ గాంధీమహాత్ముని షష్టిపూర్త్యుత్సవాలు అత్యుత్సాహంగా జరిగినాయి తెలుగుదేశంలోని ప్రముఖనాయకులు పత్రికలలో గాంధీజీనిగురించి ప్రశంసిస్తూ వ్యాసాలు వ్రాసినారు కవులు మనోహరాలయిన పద్యాలు వ్రాసి ప్రచురించినారు మహిళలు సభలుచేసి మంగళాశీర్వాదాలు పంపినారు ఖద్దరు ఉత్పత్తికై, మద్యపాన నిషేధానికి, అస్పృశ్యతా నివారణకు కాంగ్రెస్ కార్యకర్తలు నిరంతరాయంగా కృషిచేయడానికి బద్ధ కంకణులయినారు మహాత్ముడు ఆంధ్ర దేశంలో సంచారంచేసిన సంవత్సరమే ఆయన షష్టిపూర్తి సంవత్సర మయినందుకు ఆంధ్రప్రజానీకము మహద్భాగ్యంగా భావించింది

# 15
# గాంధీజీ - ఆంధ్రప్రదేశ్

## ఉప్పు సత్యాగ్రహము - తదితర రాజకీయ సంఘటనలు

1929 డిసెంబరులో జరిగిన లాహోరు కాంగ్రెస్‌లో అహింసాయుత సత్యాగ్రహం ద్వారా భారతదేశానికి పూర్ణ స్వరాజ్యం సంపాదించవలెనని తీర్మానించడం జరిగింది అందుకనుగుణంగా 1980 జనవరి 2వ తేదీన కాంగ్రెస్ కార్యవర్గంవారు సమావేశమయి శాసనసభలలోని కాంగ్రెసువారు అందరూ తమ సభ్యత్వాలకు రాజీనామా చేయవలెననీ, జనవరి 26వ తేదీని యావద్భారతదేశంలోని ప్రజలు స్వాతంత్ర్యదినంగా పరిగణించి ఆనాడు బహిరంగసభలలో స్వాతంత్ర్య ప్రమాణాలను తీసుకొనవలెననీ తీర్మానించినారు ఆ తీర్మానానంతరం స్వాతంత్ర్య ప్రమాణపత్రమొకదానిని కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గంవారు రూపొందించినారు.

లాహోరు కాంగ్రెస్ జరిగిన వెంటనే ఆంధ్ర ప్రతినిధులు కొండ వేంకటప్పయ్యగారి యాజమాన్యంలో గాంధీజీని కలుసుకొని ఆంధ్రదేశంలో అవలంబించవలసిన సత్యాగ్రహోద్యమ కార్యక్రమాలను గురించి ఆయన సలహాలను పొందినారు గాంధీజీ రానున్న సత్యాగ్రహోద్యమ విజయానికి ముఖ్యంగా గుజరాతు, బీహారు, ఆంధ్ర రాష్ట్రాలపైన తాము ఆధారపడి ఉన్నట్లు వారితోచెప్పి ఎట్లాంటి పరిస్థితుల్లోను ప్రజలు అహింసాపథంనుంచి అడుగు దాటకుండేటట్లు చూడవలెనని వారిని ఆదేశించినారు అందువల్ల ఆంధ్ర నాయకుల బాధ్యత ద్విగుణీకృతమయినది

తరవాత కాకినాడలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశం జరిగింది వారు సత్యాగ్రహోద్యమం ప్రారంభించటానికి దృఢమయిన స్వచ్ఛంద సైనికదళం నిర్మించవలెనని తీర్మానించినారు స్వాతంత్ర్య ప్రమాణపత్రం తెలుగులోకి అనువాదంచేసి దాని నకలును అన్ని కాంగ్రెస్ సంఘాలకు పంపి స్వాతంత్ర్య దినంరోజున సభలలో చదివి ప్రజలందరూ ఆ ప్రమాణం తీసుకునే ఏర్పాటు చేయవలెనని ఆదేశించినారు

ఆ ప్రకారం ఆంధ్రదేశమంతటా ప్రజలు స్వాతంత్ర్య దినోత్సవంచేసి సభలలో ఆ పత్రం చదివి ఐకకంఠంతో ప్రమాణం చేసినారు శాసనసభలలోని కాంగ్రెస్ సభ్యులందరూ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆదేశానుసారం రాజీనామాలిచ్చి సత్యాగ్రహోద్యమంలో పాల్గొనడానికి బయటకు వచ్చినారు

తరవాత కాంగ్రెస్ కార్యవర్గం ఫిబ్రవరి 14, 16 తేదీలలో సబర్మతిలో సమావేశమయి శాసనోల్లంఘన ప్రారంభించేటందుకు గాంధీజీకి అధికారమిస్తూ తీర్మానించింది గాంధీజీ అప్పటికప్పుడే ఉప్పుచట్టం ఉల్లంఘించడంతో సత్యాగ్రహ దండయాత్ర ప్రారంభం కావలెనని నిర్ణయించుకొన్నారు ఉప్పుపైన పన్ను వేయడంకంటె అన్యాయం మరొకటిలేదని, అది అట్టడుగు మనిషికి సైతం అపకారిగా పరిణమిస్తున్నదనీ అందువల్ల అది అమానుషమయిన తలపన్ను వంటిదనీ ఆయన అభిప్రాయపడినారు అటువంటి చట్టాన్ని ధిక్కరించడంలో సామాన్య ప్రజల సంపూర్ణ సహకారం లభిస్తుందని కూడా ఆయన నిశ్చయించుకొన్నారు

ఆ నిర్ణయానుసారం ఆంధ్ర నాయకులు కోస్తా జిల్లాలలో స్వచ్ఛంద సైనికులను సమకూర్చుకొని విరాళాలు సేకరించడం మొదలుపెట్టినారు అనేక మంది యువకులు స్వచ్ఛంద సైనికులుగా చేరినారు

తాను ఉప్పుచట్టం ఉల్లంఘించనిదే దేశంలో మరెవ్వరూ ఏవిధమయిన శాసనోల్లంఘన ప్రారంభించకూడదని గాంధీజీ ఆదేశించి ఉండటంచేత ఆంధ్ర దేశంలోనే కాక యావద్భారత దేశంలోని కాంగ్రెస్ నాయకులందరు గాంధీజీ ఉప్పుచట్టం ఉల్లంఘించే రోజుకోసం ఆతురతతో నిరీక్షిస్తున్నారు

గాంధీజీ 1930 మార్చి 12న ఉప్పు చట్టం ఉల్లంఘించేటందుకు డెబ్బై ఎనిమిది మంది అనుచరులతో జగద్విఖ్యాతమయిన దండియాత్ర ప్రారంభించినారు వారిలో మన ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు కూడా ఉన్నారు ఉప్పు చట్టం ఉల్లంఘించడం శాసనోల్లంఘనలోని ప్రథమ దశగా గాంధీజీ నిశ్చయించినారు ఇతర విధాలైన శాసనోల్లంఘనము ఉప్పుసత్యాగ్రహం తరవాత జరగవలెనని ఆయన కాంగ్రెస్ కమిటీలను ఆదేశించినారు ఆంధ్రనాయకులు గాంధీజీ సాగించిన దండి యాత్రలో జంబుసారు దగ్గర ఆయనను దర్శించి ఆయన నుంచి సత్యాగ్రహోద్యమ వివరాలను తెలుసుకొన్న తరవాత దేశభక్త వేంకటప్పయ్య గారు, గాంధీజీ ఆజ్ఞ ఇచ్చిన వెంటనేగాని లేదా ఆయన నిర్బంధింపబడిన తక్షణంగానీ ఆంధ్రదేశంలోని అన్ని ప్రాంతాలఉప్పుశాసనోల్లంఘనకుఉపక్రమించవలసి ఉంటుందని, బహుశా ఆ ఉద్యమం ఏప్రిల్ మొదటివారంలో ప్రారంభం కావచ్చునని, కాబట్టి అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ స్వచ్ఛంద సేవకదళ నిర్మాణాలతోసహా వెంటనే జరగవలసి ఉంటుందనీ ఆంధ్రలోని జిల్లా కాంగ్రెస్ కమిటీలన్నిటికి తంతివార్తలు పంపినారు

ఆంధ్రదేశంలో సత్యాగ్రహోద్యమ నియంతగా కొండ వేంకటప్పయ్య పంతులుగారిని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం నియమించింది అదే విధంగా ఆయా జిల్లా కమిటీలు ఒక నియంతను, ఒక సంగ్రామ సలహాసంఘం నియమించుకొన్నాయి ప్రతి జిల్లాలోను ఒక శిబిరం ఏర్పాటు చేయడం జరిగింది అది స్వచ్ఛంద సైనికుల శిక్షణకోసం ఉద్దేశింపబడింది అందులో సత్యాగ్రహ స్వభావము, స్వరాజ్య నిర్వచనము, నిర్మాణకార్యక్రమ ప్రాముఖ్యాలను

గురించి స్వచ్ఛంద సైనికులకు బోధించినారు నెల్లూరు జిల్లా శిబిరం పల్లెపాడు ఆశ్రమంలోను, గుంటూరు జిల్లా శిబిరము గుంటూరులోను, బెజవాడలో పశ్చిమ కృష్ణా జిల్లా శిబిరము, మచిలీపట్నంలో తూర్పు కృష్ణా జిల్లా శిబిరము, ఏలూరు జాతీయ కళాశాలలో పశ్చిమ గోదావరి శిబిరము, తూర్పు గోదావరి శిబిరం సీతానగరాశ్రమంలోను, విశాఖపట్నం జిల్లా శిబిరం విజయనగరంలోను ఏర్పాటు చేయడం జరిగింది

మార్చి 29న గుంటూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘంవారు సత్యాగ్రహ సమరం ఒకేసారి ఒకేసమయంలో వివిధ ప్రదేశాలలో జరగవలెనని తీర్మానించినారు అందువల్ల ప్రభుత్వంవారు తమ సాయుధ భటులను వివిధ ప్రదేశాలలో విభజించటం తప్పనిసరవుతుందనీ ఏ ఒక్కచోటా వాటిని కేంద్రీకరించడం ప్రభుత్వానికి సాధ్యంకాదని, కాబట్టి సత్యాగ్రహోద్యమ విజృంభణకు ఎక్కువ అవకాశముంటుందని వారభిప్రాయపడినారు ఈ ఉప్పు శాసనోల్లంఘనకు నెల్లూరు జిల్లాకు మైపాడు, తూర్పు పశ్చిమ కృష్ణాజిల్లాలకు చిన్నాపురము, పశ్చిమ గోదావరి జిల్లాకు మట్లపాలెము, తూర్పు గోదావరి జిల్లాకు కాకినాడకు దగ్గరగా ఉన్న చొల్లంగి, విశాఖపట్నం జిల్లాకు విశాఖ పట్టణ పురమందిరాని కెదురుగాఉన్న సముద్రతీరం కేంద్రాలుగా నిర్ణయించి నారు

గాంధీజీ ఆయన అనుచరవర్గము ఏప్రిల్ 5వ తేది ఉదయం దండి చేరుకొన్నారు ఏప్రిల్ 6 ఉదయం ప్రార్థనానంతరం గాంధీజీ సముద్రతీరాన ఉన్న ఉప్పు చేతితో తీసుకొని ఉప్పు చట్టాన్ని లాంఛనప్రాయంగా ఉల్లంఘించి నారు. కాని ఆయనను అరెస్టు చేయలేదు ఆయన దర్శన, చరసాద ఉప్పు కొటార్లపైన దండయాత్ర చేయదలచుకున్నట్లు రాజప్రతినిధికి తెలియజేసిన తరవాత మే 5వ తేది ఉదయం ఎవ్వరికీ తెలియకుండా ప్రభుత్వం వారాయనను అరెస్టుచేసి యెరవాడజైలుకు పంపినారు గాంధీజీ, ఉప్పుచట్టాన్ని ఉల్లంఘించిన జాతీయవారంలో అంటే ఏప్రిల్ 13వ తేదివరకు యావద్భారత దేశంలోని అందరూ ఉప్పుచట్టాన్ని ఉల్లఘించ వలసిందని ఆయన ఆదేశించినారు అంతేకాక ఆ పవిత్ర శాసనోల్లంఘన కార్యక్రమంలో పాల్గొనజాలని వారందరూ విదేశ వస్త్ర బహిష్కారం గురించి ఖద్దరుధారణ గురించి ప్రచారం చేయవలసిందని ప్రబోధించినారు ఆనాటి ఉదయంనుంచి ఆంధ్రదేశంలోని పలు ప్రాంతాలలో ఉప్పు శాసనోల్లంఘనము ఉధృతంగాసాగింది కాంగ్రెస్ స్వచ్ఛంద సైనికులు సముద్ర తీరానఉన్న ఉప్పుతీసుకొని రావటమేగాక, సముద్రపు నీటిని కాచి స్వయంగా ఉప్పు తయారుచేసి బహిరంగ వీధులలో ప్రజలకు ఉప్పు పంచి పెట్టడం ప్రారంభించినారు కాంగ్రెస్‌వాదుల శాసనోల్లంఘనంతోపాటు ప్రభుత్వ నిర్బంధవిధానంకూడా నిరాటంకంగా కొనసాగింది ఆంధ్రా కాంగ్రెస్ నాయకులనేకమంది నిర్బంధితులైనారు ఆ నిర్బంధాలవల్ల ప్రజలలో నిరుత్సాహం కలగలేదు సరిగదా, ఉత్సాహము మరింత ఇనుమడించింది కాంగ్రెస్ స్వచ్ఛంద

సేవకులు గ్రామాలలో జాతీయ జండాలతో జాతీయగీతాలు పాడుకొంటూ సభలు, ఊరేగింపులు చేసినారు అంతటితో ఆగక గంజాం, విశాఖపట్నం, గుంటూరు మొదలయిన కొన్ని జిల్లాలలో ప్రభుత్వపు ఉప్పుకొటార్లపై న దాడులు చేయడం ప్రారంభించినారు పోలీసులు, దాడిచేసిన స్వచ్ఛంద సేవకులను లారీలతో కొట్టి తీవ్రంగా గాయపరిచినారు ఈ ఉప్పుకొటార్ల దండయాత్రలన్నీ మే నెలలో జరిగినాయి జూన్ 9వ తేదిని అనేక మంది స్త్రీలు సైతం గుంటూరు జిల్లా దేవరంపాడు శిబిరంనుంచి ఇటువంటి దండయాత్ర చేయడానికి ఉద్యుక్తులయినారు కాని పోలీసువారు వారినందరిని అరెస్టుచేసి ఎక్కడికో దూర ప్రదేశాలకు లారీలలో తీసుకొని వెళ్ళినారు జూన్ 10వ తేదిన ఉప్పు కొటార్ల దండయాత్రలు విరమించవలసిందని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం తీర్మానించింది

ఈ ఉద్యమ సందర్భంలో పోలీసు వారు కాంగ్రెస్ శిబిరాలను ముట్టడించడమేకాక వాటిని స్వాధీనపరచుకొని శిబిరాలలోని స్వచ్ఛంద సైనికులను లారీలతో మోదడం, వారి ఇండ్లను సోదాచేయడం మొదలుపెట్టినారు ప్రభుత్వంవారు ఆంధ్రదేశంలోని పలుప్రాంతాలలో సి పి సి 144 కింద సభలను, ఊరేగింపులను నిషేధించినారు క్రిమినల్ లా ఎమెండ్మెంట్ చట్టంకింద సత్యాగ్రహ శిబిరాలు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘము, జిల్లా కాంగ్రెస్ కమిటీలను అక్రమ సంఘాలుగా ప్రకటించడం జరిగింది

పోలీసుల దృష్టిలో ఖద్దరు ధరించటం, గాంధీటోపీ పెట్టుకోవడం గొప్ప నేరంగా పరిణమించింది అటువంటి వారందరినీ పోలీసువారు లారీలతో మోదడం ప్రారంభించినారు జాతీయ జండాలను తగులబెట్టడం, ఖద్దరు షాపులలోను, గ్రంథాలయాలలోను ప్రవేశించి అక్కడి వస్తువులను విశృంఖలంగా విసిరిపారేయడం పోలీసువారి నిత్యకృత్యంగా పరిణమించింది ఎవ్వరూ గాంధీటోపీలను ధరించరాదని గుంటూరు జిల్లా కలెక్టరు నిషేధపు ఉత్తరువులు జారీ చేసినారు ప్రభుత్వ నిరంకుశత్వం ఇంత స్వేచ్ఛగా కొనసాగుతూన్నప్పటికి ఆంధ్రదేశంలోని వివిధప్రదేశాలలో శాసనోల్లంఘనం ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే వచ్చింది

ఒక్క ఆంధ్రదేశంలోనే గాక యావద్భారత దేశంలో విజృంభించిన సత్యాగ్రహ సమరాన్ని పోలీసుల లారీలుగానీ, తుపాకులుగానీ అణచజాలక పోయినవన్న విషయం ప్రభుత్వాధికారులకు క్రమక్రమంగా తెలియవచ్చింది భారతదేశంలోని అధికారేతర యూరోపియన్లు మరింత ఎక్కువగా నిర్బంధ విధానం కొనసాగించవలెనని ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయడం ప్రారంభించినారు. అందుకు ప్రత్యుత్తరంగా డిసెంబర్లో కలకత్తాలో జరిగిన యూరోపియన్ సంఘ సమావేశంలో రాజప్రతినిధి ఉపన్యసిస్తూ "శాసనోల్లంఘనను మనమెంత కఠినంగా నిరసించినప్పటికి భారత జాతీయోద్యమంలోని శక్తిని మనం గ్రహింపజాలనంత వరకు ప్రభుత్వంవారి కఠినచర్యలు దానినెంత మాత్రం నిరోధింప

జాలవని స్పష్టంగా తెలుసుకోవలసి ఉన్నద" న్నారు అప్పటినుంచి ప్రభుత్వ విధానంలో కొంత మార్పు వచ్చింది

1930 నవంబరు నెలలో లండన్‌లో ప్రారంభమయిన రౌండ్ టేబుల్ మహాసభ 1931 జనవరి వరకు కొనసాగింది ఆ సభలో కాంగ్రెస్‌వంటి అత్యంత శక్తిమంతమయిన రాజకీయ సంస్థ పాల్గొననంతవరకు అక్కడి చర్చలు కృత్రిమ వాతావరణంలో జరుగుతున్నట్లు బ్రిటిష్ కార్మిక ప్రభుత్వం భావించింది అందువల్ల వారు కాంగ్రెస్ నేదోవిధంగా సమాధానపరిచి 1931 చివరిభాగంలో జరుగనున్న రెండో రౌండుటేబుల్ మహాసభలో కాంగ్రెస్ పాల్గొనేటట్లు చేయవలెనని ఆతురపడినారు

ప్రభుత్వ వైఖరిలో కల్గిన ఈ మార్పువల్ల గాంధీజీ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులందరు 1931 జనవరి 26 న-అంటే ప్రప్రథమ స్వాతంత్ర్య వార్షికోత్సవ దినం-కారాగారాల నుంచి విడుదల చేయబడినారు కాని కాంగ్రెస్ ప్రతినిధి అయిన గాంధీజీకి, రాజప్రతినిధి అయిన ఇర్విన్ ప్రభువుకు మధ్య రాయబారాలు నడవడానికి కొంతకాలం పట్టింది వారి సంభాషణలు ఫిబ్రవరి 15 మొదలు మార్చి 5 వరకు కొనసాగినాయి మార్చి 5 న వారిద్దరిమధ్య ఒక ఒడంబడిక కుదిరింది దానికే "గాంధీ ఇర్విన్ ఒడంబడిక" అని పేరు ఆ ఒడంబడిక ననుసరించి కాంగ్రెస్ ప్రారంభించిన సత్యాగ్రహోద్యమాన్ని విరమించడం జరిగింది భారత రాజ్యాంగ సంస్కరణలను గురించి ముందు జరగబోయే రౌండుటేబుల్ మహాసభ చర్చలలో కాంగ్రెస్ పాల్గొనడానికి అంగీకరించింది ప్రభుత్వంవారు తమ ఆర్డినెన్స్‌లను, క్రిమినల్ లా అమెండ్‌మెంట్ చట్టం కింద ఉత్తరువులనూ ఉపసంహరించుకొనేటందుకూ, శాసనోల్లంఘనోద్యమంలో శిక్షింపబడిన ఖైదీలను (దౌర్జన్యంలో పాల్గొన్నవారిని తప్ప) విడిచిపెట్టేటందుకూ విచారణలోఉన్న కేసులను ఉపసంహరించుకునేటందుకు అంగీకరించినారు అంతేగాక విదేశబట్టల అంగళ్ళ దగ్గర కల్లు సారా దుకాణాల దగ్గర కాంగ్రెస్ స్వచ్ఛంద సైనికులు శాంతంగా పికెటింగ్ చేసేటందుకు కూడా ప్రభుత్వంవా రంగీకరించినారు ఉప్పు చట్టాన్ని పూర్తిగా రద్దుచేయడానికి ప్రభుత్వం వారొప్పుకోక పోయినప్పటికీ సముద్రానికి దగ్గరగాఉన్న గ్రామస్థులు ఉప్పును వర్తకానికిగాక సొంత ఉపయోగానికి తయారుచేసుకోవచ్చునని ప్రభుత్వంవా రామోదించినారు రాజీనామాలిచ్చిన ప్రభుత్వోద్యోగులను తిరిగి వారి స్థానాలలో ఉంచడానికి, వసూలుకాని జరిమానాను రద్దుచేయటానికి, తాము స్వాధీనపరుచుకొన్న ఆస్తులను తిరిగి వాటి యజమానుల కిచ్చివేయటానికి కూడా ప్రభుత్వంవా రొప్పుకొన్నారు

గాంధీ - ఇర్విన్ ఒడంబడికవల్ల కాంగ్రెస్‌వాదులు తమకొక విజయం లభించినట్లూ ప్రభుత్వంవారు కాంగ్రెస్ శక్తిని గ్రహించినట్లూ భావించినారు ఆ ఒడంబడిక ద్వారా తమకు సంక్రమించిన అధికారాలను పూర్తిగా చలాయించటం మొదలుపెట్టినారు. ఆంధ్రదేశంలోని దాదాపు అన్ని పట్టణాలలోను

విదేశీబట్టల అంగళ్ళముందు, కల్లుసారా దుకాణాల దగ్గర పికెటింగ్ నిర్విరామంగా కొనసాగింది కోస్తా గ్రామాలలోని ప్రజలు స్వేచ్ఛగా ఉప్పు యేరి తెచ్చుకోవటం మొదలుపెట్టినారు కాంగ్రెస్ కార్యాలయాలపైన స్వేచ్ఛగా జాతీయ పతాకా లెగురసాగినాయి సభలు, ఊరేగింపులు నిరభ్యంతరంగా జరుగుతూ వచ్చినాయి ప్రభుత్వోద్యోగులు జరిపే ఆబ్కారి వేలం పాటలదగ్గర కూడా కాంగ్రెస్‌వాదులు పికెటింగ్ చేయడంవల్ల చాలాచోట్ల ఆ పాటలు పడిపోయినాయి బెజవాడ, ఏలూరు మొదలయిన పట్టణాలలోని బట్టల వర్తకులు తమ విదేశీబట్టల బేళ్ళకు సీల్లువేసి స్వదేశీవస్త్రాలను మాత్రమే విక్రయించవలెనని నిశ్చయించుకొన్నారు కాంగ్రెస్‌వారి ఈ స్వేచ్ఛానువర్తనం ప్రభుత్వోద్యోగులకు కన్ను కుట్టింది అందువల్ల వారు గాంధీ – ఇర్విన్ ఒడంబడిక అమలుజరగడానికి అనేక అభ్యంతరాలను కల్పించడం మొదలుపెట్టినారు ఆంధ్రదేశంలోకంటె బొంబాయి, ఉత్తరప్రదేశ్, బెంగాల్‌వంటి మరికొన్ని రాష్ట్రాలలో ప్రభుత్వంవారి ఈ చర్య మరింత మితిమీరిపోయింది

ముఖ్యంగా ఈ ఒడంబడిక ప్రకారం ఉత్తరప్రదేశ్ బార్డోలి రైతులకు ఇవ్వవలసిన పరిహారాలు ప్రభుత్వంవారు నిరాకరించడంచేత గాంధీజీకి చాలా మనస్తాపం కలిగింది గాంధీ ఇర్విన్ ఒడంబడికను ప్రభుత్వంవారుల్లంఘించినట్లుగా భావించి తాను రౌండ్‌టేబుల్ మహాసభకు కాంగ్రెస్ ప్రతినిధిగా రాబోవడంలేదని ఆగస్టు 13న గాంధీజీ రాజప్రతినిధికొక లేఖ వ్రాసినారు కాని తరవాత రాజప్రతినిధిని గాంధీజీ కలుసుకొని పునరాలోచనమీదట రౌండ్‌టేబుల్ మహాసభలో పాల్గొనడానికి ఆగస్టు 29న లండన్‌కు ప్రయాణమయినారు ఆయన లండన్‌లో ఉండగా భారతదేశ రాజకీయాలు మరింత విషమ పరిస్థితికి వచ్చినాయి

గాంధీజీ లండన్‌కు ప్రయాణమయ్యేముందు బార్డోలిలో భూమిశిస్తు వసూలుచేసే సందర్భంలో పోలీసువారు చేసిన అత్యాచారాలను గురించి సాధికారవిచారణ జరిపించగలమని ప్రభుత్వంవారు గాంధీజీని నమ్మించినారు కాని ఆ విచారణ చాలా అస్తవ్యస్తంగా ఉండటంచేత ఆ విచారణ సంఘం ఎదుట కాంగ్రెస్ ప్రతినిధులుగా హాజరు కావటానికి వల్లభభాయిపటేల్, భూలాభాయిదేశాయ్‌గార్లు నిరాకరించినారు ఉత్తరప్రదేశ్‌లో భూమిశిస్తు భారాన్ని భరించలేక రైతులు గోలపెట్టడం ప్రారంభించినారు కాంగ్రెస్ నాయకులు వారికి సహాయం చేయవలెనని ఎంత ప్రయత్నించినప్పటికీ ప్రయోజనం లేకపోయింది అందువల్ల వారు పన్నుల నివారణ ప్రారంభించక తప్పింది కాదు ఆపైన గవర్న్మెంట్‌వారు ఆర్డినెన్స్‌ను జారీచేయవలసి వచ్చింది దాని ఫలితంగా 1931 డిసెంబరు 28వ తేదీన రౌండ్‌టేబుల్ మహాసభనుంచి బొంబాయికి చేరనున్న గాంధీజీని కలుసుకొనేటందుకుపోతూన్న జవహర్‌లాల్ నెహ్రూను తోవలో డిసెంబరు 26వ తేదీన ప్రభుత్వంవారు అరెస్టు చేసినారు వాయవ్య సరిహద్దు రాష్ట్రంలో అబ్దుల్ గఫార్‌ఖాన్ నాయకత్వంకింద

నడుస్తూండిన "రెడ్‌షర్ట్" (ఖుదాయి ఖిద్‌మత్‌గార్) ఉద్యమాన్ని అణిచివేయడానికి ప్రభుత్వంవారు కొత్త ఆర్డినెన్స్‌ను జారీచేసినారు గాంధీజీ లండన్‌నుంచి బొంబాయి చేరడానికి నాలుగురోజుల ముందుగా అబ్దుల్ గఫార్‌ఖాన్‌ను ఆ ఆర్డినెన్స్‌లకింద అరెస్టు చేసినారు బెంగాల్‌లో టెర్రరిస్ట్ (హింసావాదుల) ఉద్యమం తలెత్తింది అందువల్ల ప్రభుత్వంవారు కొత్త ఆర్డినెన్స్‌ల ద్వారా తీవ్ర నిర్బంధ విధానం సాగించినారు ఈ విధంగా ప్రభుత్వ నిర్బంధ విధానం పైన ప్రతిరాష్ట్రంలోను అసంతృప్తి హెచ్చిపోయింది

గాంధీజీ 1931 డిసెంబరు 28వ తేదీన బొంబాయిలో ఓడ దిగినారు ఆయా రాష్ట్రాలలోని కాంగ్రెస్ నాయకులందరూ ప్రభుత్వంవారి నిర్బంధ విధానం గురించి పూసగుచ్చినట్లు ఆయనకు వివరించి చెప్పినారు ఆ తరవాత నాలుగు రోజులవరకు రాజప్రతినిధి గాంధీజీల మధ్య లెక్కలేనన్ని తంతి వార్తలు నడిచినాయి వాటివల్ల ఇండియా ప్రభుత్వంవారు గాంధీ ఇర్విన్ ఒడంబడికలోని షరతులను అమలుపరచదలుచుకోలేదని స్పష్టంగా అర్థమయింది కాబట్టి కాంగ్రెస్ కార్య నిర్వాహకవర్గంవారు తిరిగి శాసనోల్లంఘన ప్రారంభించవలెనని తీర్మానించక తప్పిందికాదు ఆ తీర్మానానుసారం 1932 జనవరి 4న సత్యాగ్రహ సంగ్రామంలో రెండో ఘట్టం ప్రారంభమయింది

## గాంధీ-సీతారామశాస్త్రి ఉత్తరప్రత్యుత్తరాలు

### చీరాల పికెటింగ్

1931లో గాంధీ ఇర్విన్ ఒడంబడిక ప్రకారం కాంగ్రెస్ కార్యకర్తలకు విదేశీబట్టల విక్రయశాలల దగ్గర పికెటింగ్ చేసుకొనే హక్కు ఏర్పడింది ఆ సందర్భంలో చీరాల విదేశీబట్టల వర్తకులు పికెటింగ్ చేస్తూండిన కాంగ్రెస్ కార్యకర్తల దృష్టిపథంనుంచి తప్పించుకొని తమ వ్యాపారాన్ని సాగిస్తూన్నందువల్ల పికెటింగ్ జయప్రదంగా జరగడానికి ఏమి చర్యలు తీసుకోవలెనో సలహా అడుగుతూ శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు గాంధీజీకి దిగువ లేఖను వ్రాసినారు

పూజ్యులు, ప్రేమాస్పదులు అయిన మహాత్మాజీకి !

చీరాలలో పికెటింగ్ సందర్భంలో మీరిచ్చిన ఆదేశాలను అనుసరించటానికి కొన్ని చిక్కులు ఏర్పడినాయి అందువల్ల చీరాల వర్తక విధానం గురించి మీకు సంగ్రహంగా తెలియచేస్తూ మీ సలహా తీసుకోదలచుకొన్నాను

చీరాల ఆంధ్రదేశంలో ఒక ముఖ్యమయిన వర్తక కేంద్రం అక్కడి వర్తకులు విదేశాలనుంచి దేశీయ మిల్లులనుంచి కూడా నూలును, బట్టలను దిగుమతి చేసుకొంటారు విదేశీ వ్యాపారంలో జపానుది ప్రముఖస్థానము దిగుమతయిన బట్టలలో చాలావరకు రంగులు అద్దకం పనులు చీరాలలోనే జరుగుతాయి దిగుమతి అయిన నూలులో కొంతభాగం చీరాలలోను, పరిసర గ్రామాలలోను గల నేతపనివారు నేస్తారు ఎగుమతి వ్యాపారంతో పోల్చి చూస్తే చీరాలలో జరిగే చిల్లరవర్తకం చాలా తక్కువ స్థానికంగా నేసి

రంగులు వేసిన బట్టలుగానీ, అద్దకంచేసిన బట్టలుగానీ ఆంధ్రరాష్ట్రంలోని అనేక జిల్లాలకు, నిజాం రాష్ట్రానికి, మద్రాసు నగరానికి కూడా ఎగుమతి చేస్తూంటారు

టోకు వ్యాపారస్థుడు పోస్టుద్వారా తన వ్యాపారం సాగిస్తున్నాడిప్పుడు ఎవరయినా ప్రత్యక్షంగా రంగంమీద కనిపించినప్పుడు తాను ఆ అంగడిలోకి లెక్కలు సరిచూసుకోడానికి వెళ్ళినట్టుగా నటిస్తాడు నిజానికి ఆయన కావలసిన వస్తువులకు ఆర్డర్ ఇచ్చి ఏమీ ఎరుగనట్టు బయటికి వచ్చి చేతులతో వస్తాడు అమ్మిన వర్తకుడు సామానంతా చక్కగాకట్టి రైలులోనో, రెండెడ్ల బండిలోనో పంపవలసిన చోటికి పంపిస్తాడు సరుకు అమ్మిన అంగడినుంచి రైలుస్టేషన్‌కుగానీ మరొకచోటికిగాని సరుకును కూలి మనిషో, రెండెడ్లబండి మనిషో చేర వేస్తాడు రంగులు వేసేవారు, అద్దేవారుకూడా ఇట్లాగే చేస్తున్నారు

నిషేధపు సరుకులతో వ్యాపారంచేసే వర్తకుడు గానీ రంగులువేసే మనిషిగానీ, అద్దెమనిషిగానీ కాంగ్రెస్‌తో ఒడంబడికకు రావటానికి ఇష్టపడటం లేదు చీరాలలో 20-4-31 తేదీన పికెటింగ్ ప్రారంభమయింది ఈనాటి వరకూ కొనసాగుతున్నది ఇంకా కొంతకాలం కొనసాగించవలెననే ఆలోచన కూడా ఉన్నది సరుకులను టోకుగాకొనే వర్తకుడు అంగడిదగ్గర కనిపించటం లేదు ఆయన ఎక్కడ ఉంటాడో కూడా తెలియదు ఆయన ఈ జిల్లాకు సబంధించిన వాడు కావచ్చు, కాకపోవచ్చు, ఆయనను వ్యాపారస్థలంలో కలుసుకోవడం అసంభవమయిపోయింది ఆయన పక్షాన కనిపించే వాళ్లు కూలీలు, బండ్లవాళ్లు కూలీజోలికీ, బండివాని జోలికి పోకూడదన్నట్లయితే ఈ రకం వ్యాపారాన్ని ఎట్లా అరికట్టాలో మాకు తోచటంలేదు ధోబీని కూలీని, బండివానిని వారి ఇండ్లలో కలుసుకొని ఈ నిషేధపు సరుకుజోలికి పోకుండేటట్లు ప్రబోధించ వచ్చునా? సరుకులను తీసుకొని వెళ్ళేటప్పుడు వాళ్ళ జోలికి పోకూడదని కలెక్టర్ అభిప్రాయము నిషేధపు సరుకును తీసుకొని పోతూవుండిన వారితో ఏ సందర్భాలలో మేము జోక్యం కల్పించుకో వచ్చునో దయచేసి మీరు సలహా ఇవ్వగోరుతున్నాను

సరుకులను కొనేవారు అంగడిలోకి పోకమునుపు, పికెటింగ్ చేసేవారు బహిష్కరించబడిన సరుకులను కొనవద్దని బోధచేస్తున్నారు ఒకప్పుడు సరుకులనుకొన్న తరవాత బోధచేయటం ఎల్లప్పుడూ అభ్యంతరకరమేనా? లేదా ఏవయినా మినహాయింపు లున్నవా?

సరుకు కొన్నవారుగానీ, కూలీగానీ, బండిమనిషిగానీ సరుకులను తీసుకొని పోయేటప్పుడు కూడా మన వలంటీర్ల ప్రార్థనలను ఆమోదించడం జరుగుతున్నది

పికెటింగ్ ఉదయం 6 మొదలు రాత్రి 9 గంటలవరకు మాత్రమే జరగవలెనని కలెక్టరుచేసిన నిబంధనకు నేనంగీకరించినాను కాని వర్తకులు ఈ కాల పరిమితిని ఆధారంగా చేసుకొని సరుకులను అర్ధరాత్రివేళ బయటకు చేరవేస్తున్నారు రాత్రి కూడా పికెటింగ్ చేయవచ్చునా? చేయవలసి ఉంటే ఏ పరి

స్థితులలో చేయవలె ఇంత దీర్ఘమయిన ఉత్తరం వ్రాసినందుకు క్షమించండి

మీ అత్యంత విధేయ సేవకుడు
జి సీతారామ శాస్త్రి
(గొల్లపూడి సీతారామశాస్త్రి)

రేపల్లె
తేది 28-7-31

ఇందుకు జవాబుగా గాంధీజీ ఇట్లా వ్రాసినారు

అహమదాబాదు,
1931 ఆగస్టు 20,

ప్రియమయిన సీతారామశాస్త్రి !

మీరు జూలై 28వ తేదీన వ్రాసిన ఉత్తరం చేరినట్లు వ్రాయడానికి కూడా అనుకోకుండా ఇంత ఆలస్య మయినందుకు మీరు నన్ను క్షమిస్తారని నాకు తెలుసు నిజానికి నాకు వ్యవధి ఎంతమాత్రం లేదు

మీ ప్రశ్నకు జవాబు సంగ్రహంగా వ్రాస్తున్నాను ధోబీగానీ ఇతర పనివాండ్లుగానీ విదేశీబట్టనో, విదేశీనూలునో తీసుకొని వెడుతూన్నప్పుడు వాళ్ళ జోలికి పోకూడదు కాని వారి ఇండ్లకు పోయి విదేశీనూలునుగానీ, బట్ట లనుగానీ తెలుపుచేసి, రంగువేయడం మొదలయిన పనులు నిర్వర్తించకూడదని వారికి చెప్పవచ్చు వర్తకులు రాత్రిపూట కూడా వ్యాపారం చేస్తున్నారని మనకు తెలిసినప్పుడు రాత్రి కావలాలు ఉంచటానికి నాకేమీ అభ్యంతరం కనిపించటం లేదు ఎక్కువ పట్టుదలగా ఉన్న సందర్భాలలో వర్తకుని అంగడి దగ్గర కాపలావేయడంకంటె ఆయన ఇంటికిపోయి ఆయనను ఒప్పించటానికి ప్రయత్నించడం శ్రేయస్కరము ఇంతా అయితే పికెటింగ్ కేవలం ఒక నైతిక శక్తిగా మాత్రమే ప్రయోగింప దలుచుకొన్నాము సమాజంపైన దాని నైతిక ప్రభావం విస్తరింపచేయటమే మన అభిప్రాయము అంతేగాని ప్రజలను చీకాకు పరచడానికిగానీ, వారిపైన అనవసరమయిన పెత్తనం వహించడానికి గానీ కాదు

సరుకు కొన్న తరవాత కొన్నవారితో వాదించడం తగదు అది ఒక విధమయిన పెత్తంధారీతనాన్ని సూచిస్తుంది సరుకు కొనేసిన తరవాత కొన్న వానిని చీకాకు పెట్టినందువల్ల కలిగే ప్రయోజనమేముంటుంది?

మీరడిగిన ప్రశ్నలన్నిటికీ జవాబులు వచ్చిన వనుకొంటున్నాను ఇంత కాలం అయిన తరవాత ఈ ఉత్తరం మీకెంత ప్రయోజనకారి కాగలదో నేను ఊహించజాలకున్నాను

మీ విశ్వాసపాత్రుడు
యం. కె. గాంధీ

# 16
# 1932 ఉదంతాలు

1932 జనవరి 4వ రాజప్రతినిధి నాలుగు కొత్త ఆర్డినెన్స్‌లను జారీ చేసినారు ఆ ఆర్డినెన్స్‌ల ప్రకారం ఏ వ్యక్తినయినా అరెస్టు చేయవచ్చు, ఒక చోటునుంచి మరొకచోటికి పోకుండా నిర్బంధించవచ్చు, ప్రభుత్వంవారు ఆస్తులను స్వాధీనపరచుకోవచ్చు, రవాణా సౌకర్యాలను నిలిపి వేయవచ్చు, ఉత్తరాలు, టెలిగ్రామ్‌లు మొదలయినవి పోకుండా ఆపివేయవచ్చు, ఇంకా అనేకాలయిన నిర్బంధాలను పెట్టవచ్చు

ఆ ఆర్డినెన్స్‌లలో ఒకటయిన అక్రమ సంఘాల ఆర్డినెన్స్ కింద ఏ సంస్థ నయినా అక్రమ సంఘంగా ప్రకటించి ప్రభుత్వంవారు ఆ సంఘానికి చెందిన స్థిర చరాస్తుల నన్నిటినీ స్వాధీనపరచుకోవచ్చు, ఆ సంఘం తాలూకు నిధులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవచ్చు, తమ ఇష్టంలేకుండా ఆ నిధులకు యాజమాన్యం వహించేవారు వాటిని ఏవిధంగాను ఉపయోగించకూడదని ప్రభుత్వాధికారులు ఆజ్ఞాపించవచ్చు, ఈ ఆర్డినెన్స్‌ల కింద ఇటువంటి నిర్బంధాలు అసంఖ్యాకాలుగా ఉన్నాయి

ఈ ఆర్డినెన్స్‌లు జారీ అయిన తక్షణం ప్రభుత్వంవారి నిర్బంధవిధానం ప్రారంభమయింది 1932 జనవరి 4వ తేదీన కాంగ్రెస్ ప్రెసిడెంట్ వల్లభభాయి పటేల్, మహాత్మాగాంధీగార్లు అరెస్ట్ చేయబడినారు ఈ ఆర్డినెన్స్‌లన్నీ ఆనాడే భారతదేశంలోని అన్ని రాష్ట్రాలకు వర్తింపచేసినారు దేశంలోని రాష్ట్ర కాంగ్రెస్ సంఘాలు వాటి అనుబంధ సంఘాలు, ఆశ్రమాలు, జాతీయ పాఠశాలలు, తదితర జాతీయ సంస్థలన్నీ అక్రమ సంస్థలుగా ప్రకటింపబడినాయి ఆ సంస్థలకు సంబంధించిన ఇండ్లు, నిధులు తదితర పరికరాలు ఇతర చరాస్తులు అన్నీ ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకొన్నారు భారతదేశంలోని కాంగ్రెస్ నాయకులు దాదాపు అందరూ జైళ్లలో నిర్బంధింపబడినారు, అందువల్ల కాంగ్రెస్ సంస్థకు నాయకులుగానీ, నిధులుగానీ, నిలువ నీడగానీ లేకుండా పోయింది కాని ప్రభుత్వంవారు ఆకస్మికంగా ఒక్కసారిగా కాంగ్రెస్‌ను తుడిచి పెట్టవలెనని చేసిన ప్రయత్నంవల్ల కాంగ్రెస్‌వాదులు నిరుత్సాహపడి ఊరుకోలేదు, అఖిలభారత కాంగ్రెస్ సంఘంనుంచి గ్రామ కాంగ్రెస్ వరకూగల కాంగ్రెస్ కమిటీల అధ్యక్షులందరూ తాము నిర్బంధింపబడినప్పుడు తమ స్థానంలో ఎవ్వరు శాసనోల్లంఘన కార్యక్రమం సాగించవలెనో ముందే నిర్ణ

యించడం జరిగింది అందువల్ల కాంగ్రెస్ సంఘాలు అక్రమ సంఘాలుగా ప్రకటింపబడినప్పటికి, కాంగ్రెస్ నాయకులు మూకుమ్మడిగా నిర్బంధింప బడినప్పటికి కొంతమంది వ్యక్తులే సత్యాగ్రహోద్యమాన్ని సక్రమంగా నడపటం ప్రారంభించినారు వారికి నియంతలని పేరు వచ్చింది ఉల్లంఘించవలసిన శాసనాలను ఆయా రాష్ట్రాల పరిస్థితులను బట్టి అక్కడి కాంగ్రెస్ 'దులు నిర్ణ యించుకొన్నారు అయితే కల్లు సారా దుకాణాలదగ్గర, విదేశీ బట్టల అంగళ్ల దగ్గర, బ్రిటిషు వస్తువుల వ్యాపార స్థలాలలో పికెటింగ్ చేయటం అన్ని రాష్ట్రాల లోను శాసనోల్లంఘనకు సామాన్య విషయాలుగా పరిణమించినాయి

కాంగ్రెస్ సత్యాగ్రహ ప్రచారం అరికట్టడానికి ప్రభుత్వంవారు ప్రెస్సులపైన తమ ఆర్డినెన్స్ అధికారాలను పూర్తిగా అమలుపరిచినారు కాని అందువల్ల కాంగ్రెస్ ప్రచారం ఆగిపోలేదు సరికదా సైక్లోస్టైల్‌లో, టైపులో, వ్రాతలో, అచ్చులో కూడా సత్యాగ్రహోద్యమానికి సంబంధించిన కాంగ్రెస్ వారి కరపత్రాలు, బులిటిన్లు, పత్రికలు వీధులలో విచ్చలవిడిగా వీరవిహారం చేయసాగినాయి అచ్చయిన కాగితాలపైన ఒకప్పుడు ప్రెస్ పేరు ఉండక పోవడం, మరొకప్పుడు ఎక్కడాలేని ప్రెస్ పేరు ఉండటం జరిగింది అందువల్ల పోలీసు అధికారులకు ఆ కాగితాలు అచ్చవుతున్న చోట్లను గాని, అచ్చు వేస్తున్న వ్యక్తులను గాని కనిపెట్టడం దాదాపు సాధ్యం కాకుండాపోయింది

ఈ కారణంతో ప్రభుత్వంవారు గ్రామాలపైన అపరాధపు పన్నులు వేయడం, సమష్టి జరిమానాలు విధించి వసూలు చేయడం ప్రారంభించినారు ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొన్న ఆశ్రమాలలోను, కాంగ్రెస్ కార్యాల యాలలోను ఉన్న వస్తువులన, సామగ్రినీ పోలిస్‌వారు ధ్వంసం చేయడం జరి గింది ఆంధ్రదేశంలో పోలీసువారి విధ్వంసక చర్యలకు గురైన సంస్థలలో సీతా నగర సత్యాగ్రహ ఆశ్రమమొకటి

ఆంధ్రదేశమంతటా పోలీసువారి నిర్బంధ విధానంతోపాటు సత్యా గ్రహోద్యమం కూడా వివిధ రూపాలలో విశృంఖలంగా విజృంభించింది ఆంధ్ర దేశంలోనే కాక భారతదేశంలోని అనేకచోట్ల సభలపైన పోలీసువారి లాఠీ చార్జీలు, తుపాకి కాల్పులు అసంఖ్యాకంగా జరిగినాయి

**పూనా ఒడంబడిక**

భారత దేశంలో సత్యాగ్రహోద్యమం ఇట్లా జరుగుతూ వుండగానే మరువ రాని మరొక సంఘటన జరిగింది రెండో రౌండు టేబుల్ మహాసభ జరుగుతూ ఉండగా బ్రిటిష్ ప్రభుత్వంవారు "అస్పృశ్యులు" అనబడే వారిని హిందూ సంఘం నుంచి వేరుచేయడానికి పన్నిన పన్నాగం తన ప్రాణంతో ఎదిరించ గలనని గాంధీజీ చెప్పిన మాటలను మనం ఈ సందర్భంలో జ్ఞాపకం చేసుకోవలసి ఉన్నది ఆయన ఆ మాటలన్నప్పుడు అస్పృశ్యులను హిందూ సంఘంనుంచి వేరు చేయకూడదనే ఆయన పట్టుదలను మాత్రమే తెలియచేస్తున్నట్లు చాలా

మంది భావించినారు అంతేగాని సమయం వచ్చినప్పుడు ఆయన ఆ మాటను అక్షరాలా అమలు జరుపగలరని ఎవరూ అనుకొని ఉండలేదు

1982 ఆగస్టు 17వ తేదిని బ్రిటిష్ ప్రధాని 'మ్యాక్డోనాల్డ్' రానున్న రాజ్యాంగ చట్టంలో నిమ్నజాతుల స్థానం గురించి ఒక ప్రకటన చేసినాడు దాని ప్రకారం వారికి ప్రత్యేక నియోజక వర్గాలు వాటిలో వోటింగధికార ముండడమేగాక సామాన్య నియోజకవర్గాలలోని స్థానాలకు కూడా వారికి వోటింగధికారము, పోటీచేసే అధికారం కూడా ఇవ్వబడింది బ్రిటిష్ ప్రధాని చేసిన ఈ ప్రకటన గాంధీజీ నిమ్నజాతులకు ప్రతికూలుడని వారికి అభిప్రాయం కలగడాని కుద్దేశింపబడింది ఆ విషయం ఆయన గాంధీతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల తెలియగలదు

అస్పృశ్యులనబడే నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవర్గాలను కల్పించి వారిని హిందూ సంఘంనుంచి విడదీసే బ్రిటిష్‌వారి ప్రయత్నం తన ప్రాణంతో నిరోధించగలనని రెండో రౌండు టేబుల్ కాన్ఫరెన్స్‌లో చెప్పిన మాటలను గాంధీజీ ఆచరణలో పెట్టదలచుకొని తాను 1982 సెప్టెంబర్ 20 మధ్యాహ్నం నుంచి ఆమరణాంత నిరాహార దీక్షకు పూనుకొన్నట్లు బ్రిటిష్ ప్రధానికి ఆగస్టు 18న ఒక లేఖ వ్రాసినారు ఆయన తాపీగా సెప్టెంబరు 8వ తేదిని గాంధీజీకి ప్రత్యుత్తరం వ్రాస్తూ దానిలో గాంధీ నిమ్నజాతులపట్ల శత్రుభావం వహిస్తున్నట్లు కూడా సూచించినారు గాంధీజీకి మ్యాక్డోనాల్డ్‌కు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు సెప్టెంబరు 12న పత్రికలలో ప్రకటించ బడినాయి

గాంధీజీ ఉపవాసం ప్రారంభించనున్నరోజు సెప్టెంబరు 20, గాంధీ మ్యాక్డోనాల్డ్‌ల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రచురించ బడిన రోజుకు ఆయన ఉపవాసం ప్రారంభించనున్న రోజుకు మధ్యనున్న వారం దినాల వ్యవధిలో ప్రపంచ మంతటా గొప్ప సంచలనం కలిగింది ప్రజలు, సంస్థలు, జాతులుకూడా తమ చేతనయిన రీతిని ఈ మహోపద్రవం రాకుండా ఉండటానికి ప్రయత్నించినారు ప్రపంచంలోని నలుమూలలనుంచి గాంధీజీని ఉపవాసం చేయవద్దని ప్రార్థిస్తూ కేబుల్‌గ్రాములు వచ్చినాయి గాంధీజీని ఉపవాస దీక్ష నుంచి విరమింప జేయవలెనని అనేకులు ఆయనను ప్రార్థించినారు కాని ఆయన బ్రిటిష్ ప్రధాని చేసిన ఆ నిర్ణయం రద్దుకానిది ఉపవాసం విరమించటానికి ఇష్టపడలేదు యం సి రాజా వంటివారు ప్రత్యేక నియోజకవర్గాలను నిరసించి నారు సర్ తేజ్‌బహద్దూర్ సప్రూ, గాంధీజీని విడుదల చేయమన్నారు పండిత మదన మోహన మాలవ్యా నాయకుల సమావేశం ఏర్పాటుచేసి ఈ క్లిష్ట సమస్యను పరిష్కరించవలెనని తలపెట్టినారు ఇంగ్లాండ్‌లో ఆండ్రూస్, పోలక్, లాన్స్‌బరీవంటి భారత మిత్రులు గాంధీజీ ఉపవాస దీక్షను ప్రారంభిస్తే రానున్న విపత్తును గురించి బ్రిటిష్ ప్రజానీకానికి వ్యక్తం చేసినారు భారత దేశంలో సెప్టెంబరు 20 వ తేది యావత్ప్రజానీకము ఉపవాసంచేసి దైవప్రార్థన చేయవలెనని నిర్ణయించుకొన్నారు రవీంద్రుని శాంతినికేతనంలోనివారు కూడా

ఆ కార్యక్రమంలో పాల్గొన్నారు

గాంధీజీ ఉపవాసం ప్రారంభించటంతో జైలునుంచి విడుదల కావచ్చునని చాలామంది ఆశించినారు కాని ప్రభుత్వంవారు ఆయనను కొన్ని షరతులతో ఒక ప్రత్యేక గృహాస్థనింట్లో ఉంచడానికి నిశ్చయించినారు కాని గాంధీ ఆ షరతులకంగీకరించలేదు అందువల్ల ఆయన విడుదల కాలేదు

నిమ్నజాతుల నియోజక వర్గాల సమస్య పరిష్కారానికి మాలవ్యాజీ ఉద్దేశించిన రాజకీయ నాయకుల సభ మొట్టమొదట బొంబాయిలో సమావేశమయి తరవాత పూనాకు మారింది డాక్టర్ అంబేద్కర్ కూడా ఆ చర్చలలోను, రాయబారాలలోను పాల్గొనడం జరిగింది శ్రీయుతులు అమృతలాల్ ఠక్కర్, రాజగోపాలాచారి, చున్నిలాల్ మెహతా, పండిత మదన్ మోహన్ మాలవ్యా, ఘనశ్యామదాసు బిర్లా, సర్దార్ పటేల్, సరోజినీదేవి, జయకర్, డాక్టర్ అంబేద్కర్ యం సి రాజా, రాజేంద్రప్రసాదు, హృదయనాథ్ కుంజ్రు వంటి ప్రముఖుల సలహా సంప్రదింపులతో అన్ని పక్షాలు వారికి అంగీకారమయిన ఒక ప్రణాళిక గాంధీజీ ఉపవాసం ప్రారంభించిన అయిదో రోజుకు తయారయింది నిమ్నజాతులవారు ప్రత్యేక నియోజక వర్గాల విడనాడి తక్కిన హిందువులతో పాటు సాధారణ నియోజకవర్గాలలో వోటర్లుగా ఉండి పోటీ చేయడానికి అంగీకరించినారు కులీనులయిన హిందువులు నిమ్నజాతుల అభ్యున్నతికి కొన్ని రక్షణలు కల్పించడానికి కూడా ఏర్పాటు జరిగింది ఈ ఒడంబడికకే పూనా ఒడంబడికని పేరు దీని ప్రకారం వివిధ శాసన సభలలో సామాన్య నియోజక వర్గాల నుంచి ఎన్నుకొనబడేటందుకు నిమ్నజాతులకు కొన్ని స్థానాలు ప్రత్యేకింపబడినాయి సాధారణ ఎన్నికలు జరిగేముందు నిమ్నజాతులకు ప్రత్యేకింపబడిన సామాన్య నియోజక వర్గాలలోని నిమ్నజాతులవారు తమలో నుంచి నలుగురను ముందు ఎన్నిక చేసుకోవలె తరవాత వారు సాధారణ ఎన్నికలలో సామాన్య నియోజకవర్గాలనుంచి తమకు ప్రత్యేకింప బడిన స్థానాలకు ఎన్నిక కావలె నిమ్నజాతులకు సంబంధించిన ఈ ప్రాథమిక ఎన్నికల విధానం ఎంత కాలంవరకు కొనసాగవలెననే విషయం ఉభయుల పరస్పరాంగీకారం పైన ఆధారపడి ఉండవలెనని కూడా నిర్ణయింపబడినది.

ఈ ఒడంబడిక బ్రిటిష్ ప్రధాని అంగీకరించిన తరవాత గాంధీజీ సెప్టెంబరు 26 సాయంకాలం 5-15 గంటలకు ప్రార్థన జరిపి ఉపవాసం విరమించినారు

మాలవ్యాజీ అధ్యక్షతకింద 1932 సెప్టెంబరు 25వ తేదీన బొంబాయిలో జరిగిన నాయకుల సమావేశంలో ఈ దిగువ తీర్మానం చేసినారు

"ఇప్పటినుంచి హిందువులలో ఎవ్వరిని పుట్టుకవల్ల అస్పృశ్యులుగా భావించకూడదు ఇంతవరకు అస్పృశ్యులుగా భావింపబడుతున్నవారికి ప్రజా సముదాయం ఉపయోగించుకొనే నూతులను, పాఠశాలలను, రోడ్లను తదితర ప్రజాసంస్థలను తక్కిన హిందువులతోపాటు ఉపయోగించుకొనే హక్కు ఉంటుంది ఈ హక్కు సాధ్యమయినంత త్వరలో శాసనంగా రూపొందవలె.

స్వరాజ్య పార్లమెంటు స్థాపించబడేలోగా ఇది శాసనంగా రూపొందనట్లయితే స్వరాజ్య పార్లమెంట్ కిది ప్రథమ కర్తవ్యమవుతుంది

అస్పృశ్యులుగా భావింపబడే వర్గాలపైన ఆచార పరంపరంగా వస్తూండిన సాంఘిక నిర్బంధ, నిరోధాలను దేవాలయ ప్రవేశ నిషేధంతోసహా శాంత ధర్మసమ్మతమూ అయిన పద్ధతుల ద్వారా తొలగించడం అనుకర్తవ్యంగా హిందూ నాయకులు భావించవలె"

ఈ తీర్మానమే హరిజన సేవక సంఘ సంస్థాపనకు పునాది అయినది దేశంలో అస్పృశ్యతా నివారణకు విస్తృతమయిన ప్రచారం సాగింది సత్యాగ్రహోద్యమంలో పాల్గొనజాలనివారు చాలామంది ఈ ఉద్యమంలో పాల్గొన్నారు అఖిల భారత హరిజన సేవక సంఘం అధ్యక్ష, కార్యదర్శులు ఘనశ్యామదాసుబిర్లా, అమృతలాల్ ఠక్కరుగార్లు కాంగ్రెసేతర కార్యకర్తల నుంచి అస్పృశ్యతా నివారణ కార్యకర్తలను ఎన్నుకొని పనిసాగించినారు అస్పృశ్యులకు గాంధీజీ హరిజనులని నామకరణం చేసినారు గాంధీజీ ఆదేశాను సారం భారతదేశంలోని స్త్రీ పురుషులనేకమంది అస్పృశ్యతా నివారణోద్య మంలో పాల్గొని హరిజన దేవాలయ ప్రవేశానికిసైతం దోహదం చేసినారు

తరవాత గాంధీజీ, హరిజన ఉద్యమం మరింత శ్రద్ధగానూ, జాగ్రత్తగానూ జరిగేటందుకు తన, తనతోడివారి ఆత్మ పరిశుద్ధత కోసం 1933 మే 8న ఇరవైయొక్క దినాలు ఉపవసించవలెనని నిర్ణయించుకొన్నారు ప్రభుత్వంవారు గాంధీజీ ఆశయం, ఆయన మానసిక ప్రవృత్తిని అర్థం చేసుకొని ఆయనను ఆ రోజుననే జైలునుంచి విడుదల చేసి నారు గాంధీజీ తత్క్షణం శాసనోల్లంఘనను ఆరు వారాలవరకు ఆపివేయవలెనని ప్రకటించినారు కాని ప్రభుత్వంవారు కాంగ్రెస్‌తో రాయబారాలు జరప డానికిగాని తక్కిన శాసనోల్లంఘన ఖైదీలను విడుదల చేయడానికిగానీ అంగీక రించలేదు అందువల్ల విఠల్‌భాయిపటేల్, సుభాష్‌చంద్రబోసులవంటి కాంగ్రెస్ నాయకులకు గాంధీజీ శాసనోల్లంఘన విరమించినందుకు అసంతృప్తి కలిగింది తదితర కాంగ్రెస్ వర్గాలలో చాలామంది గాంధీజీ విడుదలను అవ కాశంగా తీసుకొని దేశ పరిస్థితులను సాకల్యంగా సమీక్ష చేయడం సముచితమని భావించినారు అయితే గాంధీజీ ఉపవాస వ్రతం శుభాంతంగా పరిణమించి ఆయన శారీరకంగా పాల్గొనడానికి వీలున్నప్పుడే కాంగ్రెస్‌వాదుల సమా వేశం జరపడానికి నిశ్చయించుకొని తాత్కాలిక కాంగ్రెస్ అధ్యక్షుడు మరొక ఆరు వారాల వరకు శాసనోల్లంఘన విరమణను పొడిగించినాడు

గాంధీజీ తన ఉపవాస వ్రతం జయప్రదంగా ముగించి తేరుకొన్న తరవాత వారు 1933 జులై 12వ తేదీన పూనాలో భారత రాజకీయ పరిస్థితులను సమీక్షించడానికి సమావేశమయినారు గాంధీజీ తన అభిప్రాయాలను ఆ సమావేశంలో సంగ్రహంగా వివరించినారు. సభలో విపులంగా చర్చ జరిగింది తేమరతుగా శాసనోల్లంఘన ఉపసంహరించ వలెననే తీర్మానంతోపాటు వ్యక్తి

శాసనోల్లంఘన ప్రారంభించవలెననే తీర్మానం కూడా తోసివేసినారు కాని గౌరవనీయమయిన సమాధాన ప్రయత్నం కోసం గాంధీజీ రాజప్రతినిధిని చూచి మాట్లాడవలెనని సభవారు గాంధీజీని కోరినారు ఆ సందర్భంలో రాజ ప్రతినిధికి గాంధీజీ తంతి పంపగా, శాసనోల్లంఘన పూర్తిగా ముందు విరమిస్తేనే గాని తనను కలుసుకొన్నందువల్ల ప్రయోజనం ఉండదని రాజప్రతినిధి గాంధీజీకి ప్రత్యుత్తర మిచ్చినాడు అంతటితో గత్యంతరంలేక జాతీయ గౌరవం కాపాడే నిమిత్తం తిరిగి శాసనోల్లంఘన కొనసాగించవలెనని గాంధీజీ నిర్ణయించినారు కాని సమష్టి శాసనోల్లంఘన తాత్కాలికంగా విరమించి వ్యక్తి శాసనోల్లంఘన ప్రారంభించడానికి గాంధీజీ నిర్ణయించినారు ఆయన వ్యక్తి శాసనోల్లంఘన ప్రారంభిస్తూ సమష్టి సత్యాగ్రహోద్యమంలో గ్రామస్థులు కావించిన అపూర్వ త్యాగాలలో తాను కూడా భాగస్వామి అయ్యేటందుకు తన సబర్మతి ఆశ్రమం రద్దుచేసి, అందులోని చరాస్తులను కొన్ని ప్రజాసంస్థలకు సంక్రమింపజేసి, ఆశ్రమంను హరిజనోద్యమానికి ఇచ్చివేసి ఆశ్రమ వాసులందరినీ వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన వలసిందిగా ఆదేశించినారు

1933 ఆగస్టు 1వ తేదిని గాంధీజీ వ్యక్తి సత్యాగ్రహానికి 'రాస్' గ్రామానికి వెళ్లవలెనని నిర్ణయించినారు కాని ఆ కిందటి అర్ధరాత్రివేళ ఆయననూ,ముప్పయినాలుగుమంది ఆశ్రమవాసులను ప్రభుత్వంవారు అరెస్టుచేసి జైలుకు పంపించినారు కాని ఆగస్టు 4వ తేది ఉదయం గాంధీజీని విడుదలచేసి యెరవాడ సరిహద్దులను విడిచి పూనాలో ఉండిపోవలసిందని ప్రభుత్వంవారు ఆయనకు క్రొత్త ఉత్తర్వు జారీచేసినారు ఆయన ఆ ఉత్తరువులను ఉల్లంఘించి నందున ఒక్క అరగంటలో మళ్లా అరెస్టు కావడం ఒక సంవత్సరం కారాగార శిక్షకు పాత్రుడు కావడం జరిగింది

అంతటితో దేశమంతటా వ్యక్తి సత్యాగ్రహోద్యమం చెలరేగింది 1933 ఆగస్టు మొదలుకొని 1934 మార్చివరకు యావద్భారత దేశంలో వ్యక్తి సత్యాగ్రహం నిరంతరాయంగా కొనసాగింది ప్రతిరాష్ట్రంలోను వేలకొద్దీ సత్యాగ్రహులు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు

1933 మే నెలలో గాంధీజీ జైలునుంచి విడుదల కాకముందు ఆయన హరిజనోద్యమం గురించి వెలుపలివారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొనే టందుకు, పత్రికలకు వ్యాసాలు వ్రాసేటందుకు ప్రభుత్వంవారు సౌకర్యాలు కలగజేసినారు కాని ఈ పర్యాయం వారాసౌకర్యాలను నిరాకరించినందువల్ల గాంధీజీ కొద్ది రోజులలోనే ఆ సౌకర్యాలకోసం తిరిగి ఉపవాసదీక్ష ప్రారంభించి నారు ప్రభుత్వంవారీ పర్యాయం మంకుపట్టుబట్టి గాంధీజీ కాసౌకర్యాలను కలగజేయడాని కంగీకరించలేదు ఉపవాసం ప్రారంభించిన అయిదోనాటికి గాంధీజీ ఆరోగ్యము అతిక్లిష్టస్థితికి వచ్చింది అప్పుడు ఆగస్టు 20న ఆయనను శాసూను ఆసుపత్రికి బదిలీ చేసినారు ఆగస్టు 23నాటికి ఆయనకు ప్రాణా పాయం కలగవచ్చునని భయపడి ప్రభుత్వంవారానాడు ఆయనను బేషరతుగా

విడుదల చేసినారు తాను విడుదల చేయబడిన పరిస్థితులనుబట్టి తాను సంపూర్ణమయిన స్వేచ్ఛను పొందనట్లుగా భావించి తన శిక్షాకాలం పూర్తయేటంతవరకు అంటే 1934 అగస్టు 3వ తేదివరకు తాను తిరిగి శాసనోల్లంఘనంచేసి జైలుకు పోకూడదని నిర్ణయించుకోవడమేగాక ఆ కాలం హరిజనోద్యమ వ్యాప్తికి వినియోగించవలెనని కూడా నిశ్చయించుకొన్నారు. ఆ నిశ్చయం ప్రకారం 1933 నవంబరునుంచి భారతదేశంలో ఆయన హరిజన యాత్ర ప్రారంభమయింది

## శ్రీ కౌతా సూర్యనారాయణరావు - గాంధీజీ

శ్రీ కౌతా సూర్యనారాయణగారు రాజమహేంద్రవరం మకాంనుంచి 17-12-32 న గాంధీజీ కొక ఉత్తరం వ్రాస్తూ అందులో అస్పృశ్యతా నివారణ గురించి హరిజన దేవాలయ ప్రవేశం గురించి సనాతన ధర్మపరులకూ, సంస్కరణ వాదులకూ మధ్య ఒక శాశ్వతమయిన ఒడంబడిక కుదుర్చడానికి డిసెంబరు చివరి వారంలో స్వధర్మ స్వరాజ్య సంఘం వారి యాజమాన్యం కింద ఒక సమావేశం ఏర్పాటు చేయబోతున్నామని ఉదాహరించినారు సంస్కరణ వాదులకు, సనాతనులకు సమాధానం కుదుర్చడమే ఆ సభ ఆశయమని, అందువల్ల హిందూ సంఘంలో శాంతి, సామరస్యం స్థిరపడగలవని కూడా ఆయన ఆ ఉత్తరంలో పేర్కొన్నారు సనాతన ధర్మ ప్రకారం శౌచమును రక్షించడానికే అస్పృశ్యత ఏర్పడినదని అస్పృశ్యులను అనవసరంగా పీడించడానికది ఏర్పడలేదని అన్నారు

బ్రాహ్మణ ధర్మం అంతకంతకూ పతన స్థితికి వచ్చి బ్రాహ్మణులనే వారు ఈ అస్పృశ్యతా సిద్ధాంతం తమ గొప్పతనంకోసం, తమ ప్రతిష్ఠకోసం ఉపయోగించుకొంటూండడంవల్ల ఉన్నత కులాలవారు నిమ్నజాతుల క్షేమం నిర్లక్ష్యం చేయడం జరిగిందని, అందువల్ల మనం వారికి న్యాయం చేయవలసి ఉన్నదని, కాని అస్పృశ్యతా నివారణపేరుతో పోవలసిన దానికంటె ఎక్కువ దూరం పోవడం సముచితం కాదని కూడా ఆయన తన ఉత్తరంలో వ్రాసినారు

ఇక గాంధీజీ గురువయ్యూరు దేవాలయ సందర్భంలో అవలంబించనున్న ఉపవాసం గురించి కూడా ఆయన ఇట్లా వ్రాసినారు "నాకు మీపట్ల చాలా ప్రేమాభిమానాలున్నాయి మీరన్యథా తలస్తే నాకు మీరు చాలా అన్యాయం చేసిన వారవుతారు ఉపవాసం ఒక ఆధ్యాత్మిక క్రియ అది మూడు తరహాలు అదర్శాలెంత గొప్పవైనప్పటికీ లౌకిక వ్యవహారాలకోసం వాటిని ఉపయోగించకూడదని గీతలో ఉన్నది. 'గీత' మీ జీవితానికి ప్రమాణం గదా! మీకే

కాదు ప్రపంచ ప్రజాసీకమంతటికి అది ప్రమాణంగానే ఉండవలె దయచేసి గీతలోని 17వ అధ్యాయంలోని 5, 6 శ్లోకాలు చదవండి నేను మీ ముందు చాలా అల్పుడననే మాట నాకు తెలుసు అయినప్పటికీ మీ జీవితంపైన, మీ జీవిత విధానంపైన నాకెంతో అభిమానం ఉన్నది అందువల్ల నేను మీ అధికృతను గమనించకుండా మీరు ప్రారంభింప నుద్దేశించిన ఉపవాసం వాయిదా వేయవలెననిగానీ, పూర్తిగా మానివేయవలెననిగానీ ధైర్యంగా ప్రార్థిస్తున్నాను ప్రేమ ఉన్నచోట్ల భయానికి తావులేదు మీ కష్టాలనుంచి మా ప్రియదేవత మిమ్ములను రక్షించవలెనని ప్రార్థిస్తున్నాను "

గౌరవాభివందనాలతో

కౌతా సూర్యనారాయణరావు

జవాబుకు చిరునామా
కౌతా సూర్యనారాయణరావు
95 బ్రాడ్‌వే, మద్రాసు

ఈ ఉత్తరానికి జవాబుగా గాంధీజీ ఇట్లా వ్రాసినారు

యరవాడ సెంట్రల్ జైల్,
22 డిసెంబరు 1932

ప్రియమిత్రమా !

మీ ఉత్తరానికి నేను కృతజ్ఞుణ్ణి మీ ఉత్తరంలోని విషయం మీరు వివరించిన పద్ధతినిబట్టి నేను అంగీకరింపజాలనిది బహుస్వల్పము ఒక విధమయిన అస్పృశ్యత మన శాస్త్రాలలోనే కాక విశ్వవ్యాప్తంగా పాటింపబడుతూ ఉన్నది కాని ఆ అస్పృశ్యతల పుట్టుకకు సంబంధించినదికాదు వృత్తికీ, పనికీ సంబంధించినది అటువంటి అస్పృశ్యత తాత్కాలికమయినది దానిని ఎప్పుడయినా తేలికగా మాన్పవచ్చు ఈ అభిప్రాయాన్ని ఇతర సనాతన మిత్రులు కూడా అవలంబించేటట్లుచేసి, వారు ఆచరణలో శాస్త్రాలకంటె కూడా మించిపోయి అస్పృశ్యతను పాటిస్తూ వున్నట్లు అట్లా పాటించడంలో మన మతం పట్ల, అస్పృశ్యులని పిలవబడే వారిపట్ల మానవత్వంపట్ల గొప్ప పాపం చేస్తూ వున్నట్లునూ అంగీకరింపచేసేట్లయితే హరిజన దేవాలయ ప్రవేశ విషయంలో ఏ విధమయిన కష్టం లేకుండా ఒక మధ్యేమార్గం కనుక్కొనడానికి వీలు కావచ్చునని నా అభిప్రాయము సనాతన ధర్మపరుల అంతరాత్మలకు చీకాకు కల్పించవలెననే అభిప్రాయం నాకెంతమాత్రం లేదు ఇక నేను చేయదలుచుకొన్న ఉపవాసాలను గురించి, ధార్మిక దృష్టితోచేసే ఉపవాసం ఆధ్యాత్మిక చర్య అవుతుంది దానిని లౌకిక వ్యవహారాలకుగానీ, స్వార్థప్రయోజనాలకు

# 17
# ఆంధ్రలో మహాత్ముని ఉపవాసాల ప్రభావము (1933)

బ్రిటిష్ ప్రభుత్వంవారు హరిజనులను హిందూ సంఘంనుంచి విడదీయటానికి పన్నిన పన్నాగాలకు ప్రతిగా ఆయన యెరవాడ జైలులో చేసిన ప్రాయోపవేశ ఫలితంగానూ తరవాత హరిజనుల అస్పృశ్యతా నివారణకు ఆత్మ పరిశుద్ధతకోసం ప్రాయశ్చిత్త కర్మగా చేసిన మూడు వారాల ఉపవాస దీక్ష వల్లనూ ఆంధ్ర దేశంలో అపూర్వ సంచలనం కలిగింది హరిజనుల అస్పృశ్యతా నివారణకై అనేక మంది కృషి చేయడం ప్రారంభించినారు గాంధీజీ కారాగారంలో ఉండగానే హరిజన సేవక్ సంఘాలు ఏర్పాటు గావడం, హరిజన దేవాలయ ప్రవేశం జరగడం కూడా తటస్థించింది

గంజాం హరిజన సేవక సంఘ కార్యదర్శి న్యాయవతి నారాయణమూర్తి గారు బరంపురంలోని శ్రీ రఘునాథస్వామి దేవాలయంలో హరిజన ప్రవేశం జరిగిందని గాంధీజీకి తెలియపరచగా ఆయన "బరంపురంలో శ్రీ రఘునాథస్వామి దేవాలయంలోకి హరిజనులను రానిస్తూన్నందుకు చాలా సంతోషము మీరు హరిజనులకు పారిశుద్ధ్యం గురించి బోధించవలె వారు గోమాంసం వర్జించవలె ప్రతిదినం స్నానం చేయవలె, పరిశుభ్రమయిన బట్టలను కట్టుకోవలె" అని తంతి వార్త పంపినారు

### ఆచార్య రంగా ప్రకటన

గాంధీజీ ఆత్మ పరిశుద్ధతకోసం, హరిజన సేవలో జరుగుతున్న లోపాలను తొలగించడంకోసం కారాగారంలో ఉపవాస దీక్ష పూనినప్పుడు ఆచార్యరంగా, "భగవంతుని వలె మనలను రక్షిస్తూ ఒక కంటితో జైలు నుంచికూడా మనము సన్మార్గవర్తనులమై సాంఘిక సేవచేసేటట్లు కనిపెడుతూండిన మహాత్ముడు ఈ పెద్ద పిడుగును మనపై విసురుతారని ఎట్లనుకొనగలము కాని ఎక్కడైన హరిజన సేవకులు తమ స్వధర్మం యేమరిచి ఉన్నట్లయితే వారందరూ తమ లోపాలను సరిదిద్దుకోవలె భారతీయులందరూ స్వధర్మ నిర్వాణోత్సాహులై హరిజనోద్ధరణ కార్యక్రమంలో నిమగ్నులై ఉంటే భగవంతుని దయ తనపై పూర్తిగా ప్రసరించి తాను ఈ గండంనుంచి బయటపడి జీవించగలనని

మహాత్ముడు విశ్వసిస్తున్నాడు కాబట్టి అందరూ 'దేవాలయాలను హరిజనులకు తెరుద్దాం' 'సర్వజనోపయోగానికి ఏర్పరచబడిన సర్వసంస్థలలోకి హరిజనులకు ప్రవేశమిద్దాం' అని ఏకగ్రీవంగా ప్రకటించవలె"నని ఆయన ప్రబోధించినారు

**కొణకంచి శివారు బండిపాలెంలో**

ఈ గ్రామంలో ఏప్రిల్ 30 వ తేది హరిజన దినం జరిగింది హరిజన సేవక సంఘ కార్యకర్త రేపాల బుచ్చి రామశేషయ్య శ్రేష్ఠి హరిజనులలో బీద లయిన వారికి వస్త్ర దానం చేసినారు అస్పృశ్యతను పాటించక అన్ని కులాల వారు గాంధీజీని చిరాయుష్మంతునిగా చేయవలసిందని భగవంతుని ప్రార్థించి నారు

**గుంటూరు జిల్లాలో**

నిడుబ్రోలు సభా తీర్మానం అనుసరించి గుంటూరు మండల హరిజన సేవక సంఘాధ్యక్షులు ఆచార్య రంగాగారు, సంయుక్త కార్యదర్శులు శ్రీ రావర్ల శివరామ కృష్ణయ్య, శ్రీ వి ప్రసాదరావుగార్లు, శ్రీ శరణు రామస్వామి చౌదరిగారితో కలసి మోపర్రు, పెదపూడి, మూల్పూరు, కూచి పూడి మొదలయిన గ్రామాలకు వెళ్ళి అక్కడ నాయకులతో కలసి అస్పృ శ్యతా నివారణ ప్రబోధానికి పూనుకొన్నారు తెనాలిలో శ్రీ కల్లూరి చంద్ర మౌళి, నందివెలుగులో శ్రీ కన్నెగంటి సూర్యనారాయణ జంపని, అనంత వరం గ్రామాలకు పోయి అక్కడ మొవ్వ ఆది నారాయణ, నాగళ్ల కృష్ణయ్య గార్లతో కలిసి హరిజన సేవా దళాలను నిర్మించడానికి తగిన ఏర్పాట్లు చేసినారు

శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రి, మద్ది వెంకటరంగయ్యగార్లు చీరాల, బాపట్ల, భట్టిప్రోలు గ్రామాలకు పోయి అక్కడ స్థానిక నాయకులతో కలసి అస్పృశ్యతా నివారణ కార్యక్రమం నిర్ణయించుకొన్నారు రేపల్లె, తెనాలి, బాపట్ల తాలూకాలలోని హరిజన సేవా దళాలవారు ఏప్రిల్ 11 నుంచి గ్రామా లలో పర్యటించి అస్పృశ్యతా నివారణ గురించి మహాత్ముని ఆశయాలను విరి విగా ప్రచారం చేసినారు ఏప్రిల్ 9 వ తేదిని కావూరులో బుద్ధ జయంతి సందర్భంలో హరిజన సేవా వ్రతుల సభలు జరిగినాయి అప్పుడు హరిజన సేవకుల ప్రచార కార్యక్రమం నిర్ణయించబడింది

బాపట్ల తాలూకా వచ్చలతాడిపర్రులో మహాత్మాగాంధీగారి ఉపవాస వ్రత దినము జరిగింది గ్రామపంచాయతి బోర్డు ప్రెసిడెంట్ దాసరి చిన బాపయ్యచౌదరి, సింగంపల్లి వెంకటసుబ్బారావు మొదలయిన పుర ప్రముఖులు ఆ గ్రామంలోని హరిజనవాడకు పోయి అక్కడ గాంధీజీ ఉపవాస దీక్షకుగల కారణాలను వివరంగా బోధించి, అక్కడ బాలబాలికలతో కలసి గాంధీజీని భగవంతుడు చిరాయుష్మంతునిగా చేయవలెనని ప్రార్థించినారు హిందూ దేవాలయాలలో హరిజనులు ప్రవేశించడానికి హక్కు ఉన్నదని, వారు

దేవాలయాలలోకి రావచ్చునని, వారిని ఆహ్వానించినారు

తరవాత హరిజనులతో కూడ అన్ని కులాలవారు నగర సంకీర్తనంతో దేవాలయ ప్రవేశం చేసినారు దేవాలయంలో పలువురు హిందువులు, క్రైస్తవులు కూడా తమ తమ మతానుసారంగా గాంధీజీ ఉపవాస దీక్ష నిరపాయంగా ముగించవలెనని ప్రార్థనలు చేసినారు బాపయ్యచౌదరిగారు వారి బావిలో పంచములను నీరుతోడుకోవటానికంగీకరించి ఒక పంచమ బాలునితో నీరు తోడించి ఆ నీరు మహా తీర్థమని, అందులో అప్రతిహతమయిన ఆధ్యాత్మిక శక్తి కలదని ఆ శక్తియే ఎల్లరను ఏకీభవింప చేయగలదని చెబుతూ ఆ తీర్థం పుచ్చుకొన్నారు

తరవాత ఆ గ్రామ పంచాయతీ పరిధిలోని అన్ని నూతులలోను పంచములు నిరాటంకంగా నీళ్లు తోడుకొనేటట్లుచేసి గ్రామస్థుల అందరి కృతజ్ఞతకు పాత్రులయినారు

మే 6 వ తేదీన మహాత్ముని ఉపవాస వ్రత ప్రారంభ దినం రేపల్లె తాలూకా కావూరులో స్థానిక హరిజనసేవా సమితివారి యాజమాన్యంలో జరిగింది ఆ ఉదయాన గ్రంథాలయ భవనంలోని కుటీరంలో శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారి యాజమాన్యంలో గ్రామస్థులు సమావేశమై మహాత్ముని ఆరోగ్యాభివృద్ధికి ప్రార్థనలు చేసినారు తరవాత శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాదరావు, తుమ్మల బసవయ్య మొదలయిన వారందరూ కలసి నగర సంకీర్తనం చేసినారు

వీరందరూ హరిజన వాడలో సభచేసి గాంధీజీ ఉపవాసం చేయవలసి వచ్చిన కారణాలను వారికి తెలియ జెప్పినారు

సాయంకాలం గాంధీ శిలా స్థంభం దగ్గర గొల్లపూడి సీతారామశాస్త్రి గారి అధ్యక్షతన సభ జరిగింది భ్రమరాంబగారు ప్రార్థన చేసినారు మహాత్ముని పవిత్ర జీవితోద్దేశాలను గురించి వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాదుగారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు ప్రసంగించినారు

మే 8 సాయంత్రం రేపల్లెలో శ్రీమతి పత్తిపాటి సీతమ్మగారి నాయకత్వంలో నగర సంకీర్తనం జరిగింది తరవాత అంకమ్మ చెట్టుకింద శ్రీ రావు వెంకట్రాయనిగారి అధ్యక్షతన బహిరంగ సభ కూడా జరిగింది ఆ సభలో తూములూరి వెంకటేశ్వరశాస్త్రిగారు అస్పృశ్యతా నివారణగురించి, మహాత్ముని ఉపవాస దీక్షను గురించి ఉపన్యసించినారు

మే 8 సాయంకాలం 6 గంటలకు మద్దుల వెంకటగిరిరావు, మద్దుల రామాయమ్మ, ఎల్లాప్రగడ ఇందుమతీదేవి, పాతూరి పట్టాభి రామయ్య, రూపాకుల కామేశ్వరరావు, గుడ్డంటి సూర్యనారాయణ, గరికపాటి అంజయ్య, లక్కరాజు కృష్ణారావుగార్లు అస్పృశ్యతా నివారణ గురించి మహాత్ముని ఉపవాస దీక్షను గురించి ఉపన్యసించినారు. సభాంతంలో శ్రీ గిరిరావుగారు నలభై రూపాయల విలువగల వస్త్రాలను హరిజన బాల బాలికలకు పంచి పెట్టినారు

ఓలేరులో శ్రీ వలివేటి నాగేశ్వరరావు, బేతపూడిలో శ్రీ కొత్తపల్లి

శ్రీరాములు, పెదపులివర్రులో గుంటూరి సుబ్బారావుగార్లు మహాత్ముని నిరశన వ్రత ప్రారంభ దినం జరిపినారు. కొల్లిపర, మున్నంగివారి పాలెం గ్రామాలలోనూ సభలు జరిగినాయి.

ఆచార్య రంగా, ముక్తేశ్వర ప్రసాదరావుగారు మే 12వ తేదీ నుంచి ఒంగోలు తాలూకాలోని హరిజన సేవా దళాల సహాయంతో అస్పృశ్యతా నివారణ ప్రచారం ప్రారంభించినారు. ఆ రాత్రి టంగుటూరులో శ్రీ పోతుల బుచ్చినాయుడుగారు ఏర్పాటుచేసిన బహిరంగ సభలో వారుపన్యసించి మహాత్ముని ఆరోగ్యంకోసం ప్రార్థనలు జరిపినారు. ఆ విధంగా వల్లూరు, సూరారెడ్డి పాలెం గ్రామాలలోకూడా అస్పృశ్యతా నివారణ గురించి సభలు జరిపినారు. ఒంగోలులో 12వ తేది 6 గంటలకు బహిరంగ సభను శ్రీ ధారా గోపాలశాస్త్రి, చెరువు సుబ్రహ్మణ్యం, నేతి సుబ్రహ్మణ్యంగార్లు ఏర్పాటు చేసినారు. త్రోవగుంట జానకిరామయ్యగారు అధ్యక్షత వహించినారు. ఆచార్య రంగా, ముక్తేశ్వర ప్రసాదరావుగార్లు ఉపన్యసించినారు. అంటరానితనం నిర్మూలించడానికి అందరూ హృదయపూర్వకంగా ప్రయత్నించవలెనని తీర్మానించుకొన్నారు.

పైన పేర్కొన్న నాయకులు నూతలపాడు, చీమకుర్తి గ్రామాలలో హరిజన సేవాదళాలను నిర్మించినారు.

పల్నాడు తాలూకాలోని దాచేపల్లి గ్రామంలో కూడా బహిరంగ సభలు జరిగినాయి. మహాత్ముని ఆరోగ్య రక్షణార్థమై అన్ని మతాలవారు ప్రార్థనలు చేసినారు. గురజాలలో కాసావజ్జల శేషయ్యగారి సహాయంతో సాయంత్రం 5 గంటలకు బహిరంగసభ జరిగింది. మహాత్ముని ఆరోగ్యాభివృద్ధికి ప్రార్థనలు చేసినారు. శేషయ్యగారు మహాత్ముని సందేశం చదివి వినిపించినారు.

రెంటచింతలలో 19వ తేది ఉదయం నాలుగుం మట్టపల్లి, శ్రీ తిరునగరి వెంకటనరసింహ సూరిగారు తమ జాతీయ విద్యార్థులతో నగర సంకీర్తనం చేసినారు. తరవాత బహిరంగసభలో ఆచార్య రంగా, శ్రీ సూరిగార్లు అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు. శ్రీ సూరిగారు రచించిన గాంధీ గీతాలను జాతీయ విద్యార్థులు మధురంగా గానం చేసినారు.

మాచర్లలో కూడా గాంధీజీ ఉపవాస వ్రతదినం జరిగింది. జమ్మలమడకలో ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘ అధ్యక్షుల ఆధ్వర్యాన గాంధీ ప్రబోధ వాక్య ప్రకటనా పత్రాలను హరిజన సేవాదళంవారు విరివిగా పంచిపెట్టినారు. ఈ తాలూకాలో అస్పృశ్యతా నివారణ ప్రచారం విస్తృతంగా జరిగింది.

## తెనాలిలో హరిజనులకు బావి

తెనాలిలో నాజరుపేట దూరురోడ్డు మునిసిపల్ టోల్‌గేటువద్ద ఉన్న హరిజనవాడలో నీటివసతి లేనందువల్ల శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు

మే 13 వ తేది గడ్డతీసి నుయ్యి తవ్వడానికి ప్రారంభోత్సవం చేసినారు ఆ నూయి శ్రీమతి మద్ది అన్నపూర్ణమ్మగారి విరాళంవల్లనూ, తెనాలి మహిళా సమాజంవారి కృషి ఫలితంగానూ పూర్తిఅయింది మే 21 సాయంత్రం 5-30 గంటలకు ఓంకారాశ్రమ నివాసిని అయిన శ్రీమతి అన్నపూర్ణమ్మగారు ప్రారంభోత్సవం చేసినారు ఆ నూతిదగ్గర జరిగిన సమావేశానికి తెనాలిలోని మహిళా సమాజ సభ్యురాండ్రు ఊరేగింపుతో చేరినారు ఆ సమూహంలో అన్ని కులాలవారు అస్పృశ్యులతోసహా కలసి కూర్చున్నారు

శ్రీ తత్వానందస్వామి, సాయం వరదదాసు, మద్ది వెంకటరంగయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, కోటంరాజు రామేశ్వరరావుగార్లు పాల్గొన్నారు

చిరంజీవి కొల్లా సతీతులసి ప్రార్థన చేసిన తరవాత సమాజ కార్యదర్శిని కొనకళ్ల కనకమ్మగారు అధ్యక్షత వహించినారు అధ్యక్షురాలి కోరికపై టి అన్నపూర్ణమ్మగారు బావిలోనుంచి నీరుతోడి తాను తాగి మిగిలినవారికి తాగేటందుకిచ్చినారు అస్పృశ్యతా నివారణకు మహాత్ముడు సాగించిన ఉపవాసదీక్ష జయప్రదంగా పూర్తికావలెనని ఉపన్యసిస్తూ అందరూ అస్పృశ్యతా నివారణకు బద్ధకంకణులు కావలెనని ప్రార్థించినారు శ్రీమతి కొల్లా తాయారమ్మగారు తమ సమాజం తరపున ఆ నెలలో జరిగిన హరిజన సేవను గురించి నివేదిక చదివి వినిపించినారు

తరవాత కోటంరాజు రామేశ్వరరావుగారు, మద్ది వెంకటరంగయ్యగారు పురుషులకంటె స్త్రీలు ముందంజవేసి హరిజనులకు అత్యవసరమయిన సహాయం చేయడం, ముఖ్యంగా మహాత్ముని ఉపవాస సమయంలో ఇటువంటి ప్రత్యక్షోపయుక్తాలయిన పనులు చేయడం ఎంతో ప్రశంసనీయమన్నారు తరవాత తత్వానందస్వామి, సాయం వరదదాసు, వావిలాల గోపాలకృష్ణయ్య అస్పృశ్యతా నివారణ గురించి సభ్యులకు నచ్చేటట్లు ఉపన్యసించినారు

ఆచార్య రంగా, ముక్తేశ్వర ప్రసాదరావుగార్లు పల్నాటి తాలూకాలోని గురజాల, కారంపూడి, మాచెర్ల గ్రామాలలో అస్పృశ్యతా నివారణ ప్రచారంచేసి మే 20కి పెదకంచర్లలో బహిరంగసభ చేసినారు ఆ ఊళ్లో ఒక హరిజన కుటుంబంలో పెండ్లి జరిగింది ఆ పెండ్లి ఊరేగింపు స్వేచ్ఛగా గ్రామ వీధులలో మేళతాళాలతో జరగడం చూసి గ్రామస్థులు ఆనందించినారు

వినుకొండలో అవుటపల్లి వెంకటరావుగారి సహాయంతో పెద్ద బహిరంగ సభ జరిగింది అస్పృశ్యతా నివారణ గురించి నాయకులు ఉపన్యసించినారు

మే 15 సాయంత్రం రేపల్లెలో వత్తిపాటి సీతమ్మగారి అధ్యక్షతకింద అస్పృశ్యతా నివారణసభ జరిగింది గొల్లపూడి సీతారామశాస్త్రి, శ్రీ చెరుకువాడ వెంకటనరసింహంగార్లు అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు సభలో సనాతనులు వేసిన ప్రశ్నలకు సరిఅయిన సమాధానాలిచ్చి వారి సంశయాలను తొలగించినారు ఆ గ్రామ పెద్దలు కొందరు తమ బావులను హరిజనులు ఉపయోగించుకోవటానికి అంగీకరించి అస్పృశ్యతా నివారణను

ఆచరణలో పెట్టినారు

తూర్పు పాలెంలో శ్రీ పాలాటి వెంకయ్యగారి నాయకత్వం కింద ఆ గ్రామంలోని నూతులన్నిట్లోను స్వేచ్ఛగా హరిజనులు నీళ్లు తోడుకొనే అవకాశం కల్పించినారు

పెదపులివర్రులో అస్పృశ్యతా నివారణ గురించి కరపత్రాలు విరివిగా పంచి పెట్టబడినాయి ఆ ఊరి గ్రంథాలయంలో అస్పృశ్యతా నివారణ గురించి బహిరంగ సభ జరుగుతూండగా గ్రంథాలయంలో సభ జరగ కూడదని కొందరు అడ్డుపెట్టగా ఆ సభ ఆగి పోయింది

భట్టిప్రోలులో మే 19 వ తేదీ సాయంకాలం హరిజన సేవా సంఘం వారు నగర సంకీర్తనంతో ఊరేగి ఆ ఊరి లైబ్రరీ వద్ద భట్టిప్రోలు హనుమంతరావు గారి అధ్యక్షతను బహిరంగ సభ జరిపినారు శ్రీ మంతెన వెంకటరాజు, పాతూరి పట్టాభిరామయ్య మొదలయినవారు అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు మద్దుల గిరిరావుగారు హరిజనుల దేవాలయ ప్రవేశం అవసరమని చెప్పినారు

గూడవల్లిలో మంతెన వెంకటరాజు, గుత్తికొండ లక్ష్మీనారాయణ, మంగళగిరి పరవస్తుదాసు గార్లు అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు

అల్లమూడిలో హరిజన సేవక సంఘం పక్షాన గొల్లపూడి సీతారామశాస్త్రి గారు అస్పృశ్యతా నివారణ గురించి మహాత్ముని సందేశం వినిపించినారు

చేబ్రోలులో శ్రీ నరసింహస్వామి దేవాలయంలో శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి అధ్యక్షత కింద మహిళామండలి సమావేశం జరిగింది సాయం వరదదాసుగారు గాంధీ మహాత్ముని ఉపవాస వ్రతం గురించి అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు ఆ గ్రామంలోని బావులను హరిజనులు స్వేచ్ఛగా ఉపయోగించుకోవటానికి గ్రామస్థులు హృదయపూర్వకంగా అంగీకరించినారు

నరసారావుపేటలో గుంటూరు జిల్లా హరిజన సేవక సంఘం కోశాధిపతి మద్ది వెంకట రంగయ్యగారు, ప్రసాదరావుగారు హరిజన సేవానిధికి విరాళాలు వసూలు చేసినారు సాయంత్రం 5 గంటలకు నగర సంకీర్తనలతో శ్రీ కన్యకా పరమేశ్వరి గ్రంథాలయం దగ్గరికి పోయి అక్కడ బహిరంగ సభలో అస్పృశ్యతా నివారణావశ్యకతను గురించి ఉపన్యసించినారు

చిలకలూరుపేటలో హరిజన సేవక్ సంఘ నాయకులు మే 25 వ తేదిన హరిజనవాడకు వెళ్లి అక్కడి స్త్రీ పురుషులను రామమందిరం వద్ద చేర్చి మద్యపానాన్ని చనిపోయిన గొడ్డు మాంస భక్షణమును వర్జించ వలసిందని ప్రబోధించినారు తరవాత బజారులో బహిరంగ సభ జరిపి అస్పృశ్యతా నివారణ గురించి ప్రచారం చేసినారు

శ్రీ కల్లూరి చంద్రమౌళి, శరణు రామస్వామి చౌదరి, చింతమనేని బాపయ్య, మహమ్మదు ఇస్మాయిల్ సాహెబుగార్లు అనంతవరం, కొల్లూరు,

రావికంపాడు మొదలైన గ్రామాలలో తీవ్రంగా అస్పృశ్యతా నివారణ ప్రచారం చేసినారు కొన్ని గ్రామాలలో హరిజనులను ఊరి బావులలో నీళ్లు తోడుకోనివ్వడానికి గ్రామస్థులందరూ అంగీకరించినారు

**గుంటూరులో హరిజన విద్యార్థి వసతి గృహము**

గుంటూరు మున్సిపల్ కౌన్సిలు వారు హరిజన విద్యార్థి వసతి గృహ నిర్మాణానికి విరాళంగా 100 రూపాయలను, దాని నిర్వహణకు సాలీనా 500 రూపాయలను మంజూరు చేసినారు ఆ భవనానికి మహాత్ముని కరోరోపవాసోప సంహార దినాన (1933 మే 29) ప్రారంభోత్సవం జరిగింది ఆ ఉత్సవానికి నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావు, గుళ్లపల్లి పున్నయ్య శాస్త్రి, గోగులపాటి వెంకయ్య, తెలికిచర్ల సూర్య ప్రకాశరావు, మిట్టపల్లి ఆదినారాయణ, మద్ది వెంకట రంగయ్య, వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాదరావు, వావిలాల గోపాల కృష్ణయ్య, ఉప్పుటూరి వెంకట పున్నారావు, డాక్టర్ బ్రహ్మయ్య, శిష్ట్లా వెంకట కృష్ణయ్య మొదలయిన ప్రముఖులు హాజరయినారు

ప్రథమంలో చట్టి నరసింహారావుగారు భగవత్ప్రార్థన చేసినారు మునిసిపల్ చైర్మన్ నడింపల్లి వెంకట లక్ష్మి నరసింహారావు, పండిత పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి, స్థానిక హరిజన సేవక సంఘ సంయుక్త కార్యదర్శి శ్రీ తల్లావజ్ఝల శివ శంకర శాస్త్రి, దేశభక్త వెంకటప్పయ్య పంతులు, తెలికిచర్ల సూర్యప్రకాశరావుగార్లు మహాత్ముని ఉపవాస దీక్షను గురించి, ఆయన ప్రారంభించిన అస్పృశ్యతా నివారణ మహోద్యమం గురించి గంభీరోపన్యాసాలు చేసినారు మునిసిపల్ కౌన్సిల్ వారి తీర్మానానుసారం శ్రీ ఎన్ వి యల్ నరసింహారావు గారి ఆధిపత్యంలో గాంధీజీ ఉపవాస దీక్షను విరమించిన నాటి సాయంకాలం 6 గంటలకు మున్సిపల్ ఆఫీసు ఆవరణలో సుమారు మూడు వేల మంది బీదలకు మృష్టాన్న భోజనంతో విందు చేయడం జరిగింది అందులో హరిజనులు అత్యధిక సంఖ్యాకులుగా పాల్గొన్నారు

ఆనాడే గుంటూరులోని పలూరు బజారు వర్తక ప్రముఖులు పెనుగొండ మల్లయ్య మొదలయినవారు మహాత్ముడు ఉపవాస దీక్షను జయప్రదంగా కొనసాగించ గలిగినందుకు సుమారు వేయిమంది పేదలకు మృష్టాన్నంతో విందు చేసినారు

గుంటూరు జిల్లా మంతెనవారి పాలెంలో గాంధీ మహాత్ముని శిలావిగ్రహ శిలా స్తంభాలు దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారిచే శాస్త్రోక్తంగా ప్రతిష్ఠింపబడినాయి ఆ మహోత్సవంలో తెలికిచర్ల సూర్యప్రకాశరావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, వావిలాల గోపాలకృష్ణయ్య, గొల్లపూడి సీతారామ శాస్త్రి, రావు రాయన్నగార్లు పాల్గొన్నారు శ్రీయుతులు చావలి బాలసుందర రావు, వేదాంతం శంభుశాస్త్రులుగార్లు ఆగమ శాస్త్ర విధుల ననుసరించి ఆ కార్యక్రమం నిర్వహించినారు ఆ ఊరిలో శ్రీ రామలింగేశ్వర స్వామివారి

## కృష్ణాజిల్లా

మే 21వ తేది సాయంకాలం బందరు లోని తిలక్ చౌక్‌లో అస్పృశ్యతా నివారణ గురించిన బహిరంగ సభ జరిగింది. పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి, తంగిరాల వీరరాఘవరావు, పత్తిపాటి లక్ష్మయ్యగార్లు అస్పృశ్యతా నివారణ గురించి గాంధీ మహాత్ముడు ఉపవాస వ్రతం అవలంబించినారని, అస్పృశ్యులకు హిందూ దేవాలయాలలోను, ప్రజలందరితో పాటు చెరువులు, బావులు, పాఠశాలలు మొదలయిన అన్ని ప్రజా సంస్థలలోను నిరభ్యంతరంగా ప్రవేశం కల్పించవలెనని ప్రబోధించినారు

కృష్ణాజిల్లా తేలప్రోలులో మే 18వ తేదిని హరిజన సేవక సంఘ యాజమాన్యంలో బహిరంగ సభ జరిగింది. సభకు హరిజనులు సవర్ణులు అనేక మంది వచ్చినారు కాశేశ్వరరావుగారు సభకు అధ్యక్షత వహించి సవర్ణులు అస్పృశ్యతను పాటించడం మహాపాపమని ఉపన్యసించినారు గాంధీజీ అస్పృశ్యతా నివారణకోసం కారాగారంలో ఉండి కూడా ఉపవాస దీక్ష పూనడం గురించి ప్రసంగిస్తూ హిందువులందరూ అంటరానితనం నిర్మూలించ వలెనని కోరినారు డాక్టర్ ఘంటశాల సీతారామశర్మ, మరంబాల సుబ్రహ్మణ్యం గుప్తగార్లు కూడా అదే ధోరణిలో అస్పృశ్యతను పాటించరాదని ప్రసంగించినారు సుంద్రు వెంకట్రామయ్యగారు హరిజనుడు అయన "భగవంతుడు భక్తజనాల దీనుల పాలివాడు అని పెద్దలు వర్ణించినారు దీనులంటె ప్రస్తుతం మాల మాదిగలే హిందూ కులీనులు వీరిని జంతువులకంటే హీనంగా చూడటం అన్యాయము మమ్ములను మీరు మానవులుగా చూసి అంటరానితనం రూపుమాపితే అంతేచాలు" అన్నారు

మే 26వ తేదిని ఆచార్య రంగా, కాట్రగడ్డ మధుసూదనరావుగార్లు జగ్గయ్యపేటలో శ్రీ జయంతిపురం రాజాగారి తోడ్పాటుతో అస్పృశ్యతా నివారణ సభ జరప నిశ్చయించుకొంటే పోలీసువారు సభను ఆపడానికి ప్రయత్నించినారు కాని రాజాగారు, రంగాగారు సభోద్దేశాలను వారికి తెలియజెప్పిన తరవాత సభ జరపటానికి అంగీకరించినారు సభలో రాజాగారు, రంగాగారు, మధుసూదనరావుగారు అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు

బండిపాలెం, కొణకంచి గ్రామాలలో ఆచార్య రంగా, జయంతిపురం రాజా, బుచ్చిరామ శేషయ్యశ్రేష్టి అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు శ్రీ అనుముల రామగోవిందశర్మగారు, కొణకంచిలోని కొందరు యువకులు కొంతకాలం కిందట కొన్ని బావులను, శ్రీరామ మందిరం అందులోని గ్రంథాలయం ఉపయోగించుకొనేటందుకు హరిజనులకు అవకాశమిచ్చినారు అందుకు కులీనులు కొందరు వారిని వెలివేయటానికి ప్రయత్నించినారు. ఈ విషయం గాంధీ మహాత్మునికి వారు వ్రాయగా ఆయన వారికి ప్రేమ

సుహృద్భావ గర్భితమయిన ఒక లేఖను వ్రాసినారు అది సభలో చదివి వినిపించినారు సభ్యులపైన అది మంచి ప్రభావం ప్రసరింపజేసింది

నందిగామ తాలూకా వీరులపాడులో వాసిరెడ్డి వరప్రసాదరావు, జయంతి పురం రాజా, కాట్రగడ్డ మధుసూదనరావు, ఆచార్య రంగాగార్లు హరిజనులను దేవాలయంలోకి రానియక పోవడం దైవంపట్ల అపరాధం చేయడమన్నారు

శ్రీ అన్నె అంజయ్యగారి నాయకత్వంకింద పనిచేస్తూన్న హరిజన సేవాదళంవారు మే నెల 12వ తేదినుంచి 24వ తేదివరకు బోళ్లపాడు, కాటూరు, కలువపాముల, నందమూరు, మానికొండ, పొారెడుమాక, తెన్నేరు, తరిగొప్పల, వేంపాడు, మంతెన, కేసరిపల్లి, గన్నవరం, దావాజి గూడెం, పెదఅవటపల్లి, ఆత్కూరు, పొట్టిపాడు, తేలప్రోలు, అంపాపురం, పెదవీరపల్లి, కానుమోలు, కాకులపాడు, వోగిరాల, ఆరుగొలను, తిప్పన గుంట, చిరివాడ, గారపాడు, పొనుకుమాడ, ఉంగుటూరు, ఇరుకుపాడు, వెల్లిపాడు, ఇందుపల్లి, కడంపాడు, కుందేరు, నెప్పల్లి, పెదవోగిరాల, ఆకు నూరు, చినవోగిరాల, గండిగుంట, ఉయ్యూరు, కొమ్మూమనూరులలో నగర సంకీర్తనలతో హరిజన సేవాప్రచారాలు చేసినారు

మే 29 న గాంధీజీ ప్రాయోపవేశదీక్షను సుఖప్రదంగా ముగించగలిగి నందుకు బెజవాడ పట్టణంలో ఆంధ్ర మహిళా సంఘంవారు మే 30వ తేదీన కార్మికపురంలోని హరిజన బాల బాలికలకు తలంట్లుపోసి భోజనాలు పెట్టి నారు శ్రీమతి పాదుర్తి సుందరమ్మ, కొల్లా కనకవల్లి తాయారమ్మగార్లును మరికొంత మందిన్ని నైజామ్స్ గూడ్సుషెడ్డువద్దఉన్న హరిజన గుడిసెలకు పోయి ఆ పిల్లలకు తలంట్లకు కావలసిన నూనె వగైరా సామాగ్రిని ఇచ్చి వారికి ఫలహారాలు పంచిపెట్టినారు అందుకైన ఖర్చు బెజవాడ పౌరులు, వర్తక సంఘంవారూ భరించినారు సాయంకాలం 6 గంటలకు బహిరంగ సభకు అయ్యదేవర కాళేశ్వరరావు అధ్యక్షత వహించి అస్పృశ్యతా నివా రణకు గాంధీజీ అవలంబించిన ఉపవాస దీక్షను గురించి విపులంగా ఉపన్యసించి నారు

శ్రీ కాకుమాను లక్ష్మయ్యచౌదరి, ఆచార్య రంగా, నూకల వీరరాఘ వయ్యగార్లు అంటరానితనం నిర్మూలించడానికి అందరూ బద్ధకంకణులు కావలెనని గంభీరోపన్యాసం చేసినారు

తెనాలిలో మహిళా సంఘంవారి యాజమాన్యంలో హరిజనుల ఉప యోగంకోసం ఒక వరలుబావిని తవ్వినారు దాని ఖర్చు మద్ది అన్నపూర్ణమ్మ గారు భరించినారు హరిజనపిల్లల ఉపయోగార్థం ఒక పాఠశాల కూడా ఏర్పాటు చేసినారు సుందరరామా కంపెనీవారు హరిజన బాల బాలికలకు పుస్తకాలు, పలకలు, బలపాలు వగైరాలు ఉచితంగా ఇచ్చినారు.

## నెల్లూరు జిల్లా

మహాత్ముని ఉపవాస దీక్షను గురించి నెల్లూరులో పౌరులు సభ చేసి ఆయనకు భగవంతుడు చిరాయురారోగ్యాలను ప్రసాదించును గాక అని తీర్మానిస్తూ అస్పృశ్యతా నివారణకు తగిన కృషి చేయవలెనని నిర్ణయించుకొన్నారు

గాంధీ మహాత్ముడు ఉపవాస దీక్ష ప్రారంభించిన సందర్భంలో వెంకటగిరిలో మే 8 వ తేదీన సవర్ణులు, హరిజనులు కలసి భజనలతోనూ, సంకీర్తనలతోనూ "అంటరానితనం రూపుమాపుడు" అనే అక్షరాలు వ్రాసిన బోర్డులు పుచ్చుకొని ఊరేగుతూ గ్రామమంతా తిరిగి విద్యార్థి సంఘ నాటకశాల వద్ద బహిరంగ సభ చేసినారు శ్రీ కటికినేని వెంకట రామారావు గారు గాంధీజీ ఉపవాస దీక్షా ప్రాముఖ్యం తెలియజేస్తూ ప్రసంగించినారు సభ్యులందరూ అస్పృశ్యతను రూపు మాపవలెనని ప్రతిజ్ఞ తీసుకొన్నారు

సంగం గ్రామంలో మహాత్ముని ఉపవాస దీక్ష జయప్రదంగా కొనసాగినందుకు 30 వ తేదీ అభినందన సభ జరిగింది

## పశ్చిమ గోదావరి జిల్లా

తాడేపల్లి గూడెంలో దామోజిపురపు నరసింహారావు పంతులు, డాక్టర్ తేతల సత్యనారాయణ రావు గార్లు హరిజనుల కుటీర ప్రాంతాలలో నూతులు తవ్వించి వారికెంతో సహాయం చేసినారు గాంధీజీ ఉపవాస వ్రత ఫలితంగా నరసింహ స్వామి దేవాలయంలోకూడా హరిజనులు ప్రవేశించినార అందుకు శ్రీ చెరుకువాడ వెంకట నరసింహం, మాగంటి బాపినీడు, కన్నెపల్లి సత్యనారాయణ, మంగిపూడి పురుషోత్తమ శర్మగార్లు ఎక్కువగా తోడ్పడినారు

## తూర్పు గోదావరి జిల్లా

మే 11 సాయంకాలం కాకినాడలో టాజుమహల్‌లో బహిరంగ సభ జరిగింది మోతే నారాయణరావు గారు అధ్యక్షత వహించినారు గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు ప్రార్థన చేసినారు మోతే నారాయణ రావు, మొసలికంటి తిరుమలరావు, శరగోపాచార్యులు గారు అస్పృశ్యతా నివారణ గురించి గాంధీజీ ఉపవాస దీక్షకు పూనుకొన్నారని, అందరూ నేటినుంచి అంటరానితనం అడుగంట జేయడానికి మనస్ఫూర్తిగా పని చేయవలెనని ఉపన్యసించినారు

మహాత్ముని ఉపవాస దినాలలో అనేక చోట్ల అనేక మంది వ్యక్తులు కూడా ఓపిన కొద్దీ ఒకటి రెండు రోజులు ఉపవాసం చేసి అస్పృశ్యతా నివారణోద్యమంలో తమ ఆసక్తిని వెల్లడించడమేగాక మహాత్ముని వ్రత దీక్ష జయప్రదం గావలెనని భగవత్ప్రార్థనలు కూడా చేసినారు.

మే 8 వ తేదీన ఉరవకొండలో బహిరంగ సభ జరిగింది అందులో గాంధీజీ ప్రారంభించిన ప్రాయోపవేశ దీక్షకు కారణాలను వెల్లడిస్తూ

అస్పృశ్యతా నివారణకు అందరూ పూనుకోవలెనని చాలా మంది ప్రముఖులు ఉపన్యసించినారు

హరిజనవాడలో ఒక రాత్రి పాంశాల ఏర్పాటు చేయబడింది హరి జనోద్ధరణ సంఘంవారు ప్రతి రోజు హరిజనుల వీధులు, వారి ఇండ్లూ శుభ్రంగా ఉండేటట్లు శ్రద్ధ తీసుకొంటున్నారు హరిజనులు చచ్చిన గొడ్డు మాంసాలను తినడం పూర్తిగా మానుకొన్నారు

కాతేరులో హరిజనుల సమావేశం జరిగింది బేతిని వీరన్నగారు అధ్యక్షత వహించినారు ఆ సభలో ఆనాటి నుంచి మద్యపానం మానుకొంటామని అనేక మంది హరిజనులు వాగ్దానం చేసినారు

మద్రాసు

గాంధీజీ ఉపవాస దీక్షా సందర్భంలో అస్పృశ్యతా నివారణను గురించి మే 4 వ తేదిన వాడియా పార్కులో బహిరంగ సభ జరిగింది డాక్టర్ పి వరదరాజులు నాయుడు అధ్యక్షతన శివరావు, చెల్వపతి శెట్టి, టి జి లక్ష్మణ స్వామి, అణ్ణామలై పిళ్లే, టి యస్ నటరాజ పిళ్లే, ఎ ఆర్ వి ఆచారిగార్లు ఉపన్యసించినారు వారందరూ గాంధీజీని ఉపవాసం మానవలెనని ప్రార్థిస్తూ ప్రజలు అస్పృశ్యతా నివారణకు పూనుకోవలెనని అభ్యర్థించినారు

మే 14 సాయంకాలం మద్రాసులోని తిరువళిక్కేణి సముద్రతీరంలో పౌర సభ జరిగింది ఆచంట రుక్మిణమ్మగారు అధ్యక్షత వహించినారు గాంధీజీ ఉపవాస దీక్షను గురించి, అంటరానితనం నిర్మూలించడం గురించి శ్రీమతి దర్శి సుభద్రమ్మ యం యస్ సుబ్రహ్మణ్యయ్యర్ మొదలయినవారు ఉపన్యసించినారు గద్దె రంగయ్య నాయుడు, బచ్చు జగన్నాథ దాసు గార్లు కూడా ఆ సభలో పాల్గొన్నారు.

మహాత్ముని నిరశన వ్రతము 21 దినాలు విజయవంతంగా కొనసాగి నందుకు భగవత్ప్రార్థన చేయటానికి చెన్న నగరంలోని వివిధ మతస్థులవారు తిలక్ ఘట్టంలో మే 30 వ తేదిన బహిరంగ సభలో సమావేశమయి నారు సభకు శ్రీ ముత్తురంగ మొదలియార్ అధ్యక్షత వహించినారు ప్రార్థనలు ముగిసిన తరవాత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు హరిజన బాల బాలికలకు బహుమతులిచ్చినారు అస్పృశ్యతను నిర్మూలించడానికి మన మందరమూ కృషిచేస్తే గాంధీమహాత్ముని ఆత్మ సంతృప్తి చెందుతుందని నాగేశ్వరరావుపంతులుగారన్నారు

మనమందరమూ నిష్కళంకంగా పరిశుద్ధాత్ములతో హరిజనాభ్యుద యానికి తోడ్పడవలెనని గాంధీజీ ఉపవసించినారు కనక మనం గాంధీజీ ఆశయం నెరవేర్చవలెనని అంటూ భగవంతుడు గాంధీజీని చిరాయుష్మంతునిగా చేయవలెనని మౌలానా యాకూబ్ హుస్సేనుగారు ప్రసంగించినారు

క్రైస్తవ సంఘ నాయకుడు శ్రీ చక్రయ చెట్టిగారు మాట్లాడుతూ

మహాత్ముడికు సంపూర్ణారోగ్యాలను కలగజేసి మానవసేవకు వారిని బహుకాలం మనజేయవలసిందిగా దైవాన్ని ప్రార్థించినారు

తరవాత అడయారు దివ్యజ్ఞాన సమాజంవారు నిర్వహిస్తూ ఉండిన కోడంబాకం, అడయారు పాఠశాలలలోని పంచమ బాల బాలికలు పాటలు, నాటకాలు, వ్యాయామాలు మొదలయినవాటిని ప్రదర్శించినారు

మదనపల్లి దివ్యజ్ఞాన పాఠశాల విద్యార్థిని హేమలత హరిజన బాల బాలికల నాటక ప్రదర్శనలో మనోహరంగా పాటలు పాడి సభ్యులను ఆనందింప జేసింది

యస్ యస్ వరదాచారి, బచ్చు జగన్నాథదాసు, దర్శి చెంచయ్య, మోటూరి సత్యనారాయణ, దర్శి సుభద్రమ్మ మొదలయినవారు సభలో పాల్గొన్నారు

## విజయనగరము

మే 11వ తేది మధ్యాహ్నం విశాఖ జిల్లా అస్పృశ్యతా నివారణ సంఘ కార్యదర్శి శ్రీ పేకుమళ్ళ సీతారామస్వామి, తాలూకా కార్యదర్శి శ్రీ కరుణాకరం సుబ్బారావుగార్లు అస్పృశ్యతా నివారణ ప్రచారంకోసం ధనం వసూలు చేయడం ప్రారంభించినారు

12వ తేదీ ఉదయంనుంచి విజయనగరంలోని హరిజనవాడల వీధులను పరిశుభ్రంచేసే కార్యక్రమంలో నిమగ్నులయినారు హరిజనులు నగర సంకీర్తనతో పార్కు మైదానానికిచేరి మహాత్ముని ఆయురారోగ్యాభివృద్ధికి భజనలతో దైవప్రార్థన చేసినారు బేతనభట్ల వెంకటరమణయ్య (హరిదాసు) గారి ప్రార్థనలతో బహిరంగ సభ ప్రారంభమయింది బుఱ్ఱా శేషగిరిరావు అధ్యక్షత వహించినారు కే సి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు, బి సూర్యనారాయణ గారు అస్పృశ్యతా నివారణావశ్యకతను గురించి విపులంగా ఉపన్యసించినారు

మే 28 వ తేదిన జిల్లా అస్పృశ్యతా నివారణ సంఘం వారు విజయనగరంలో సమావేశమై హరిజనాభ్యుదయానికి ఒక కార్యక్రమం నిర్ణయించినారు

ఈ విధంగా ఆంధ్ర దేశమంతటా మారుమూలనున్న గ్రామాలలో నైతం గాంధీజీ ఉపవాస దీక్ష కాలంలోను, ఆ తరవాత హరిజన సేవక సంఘం వారు తదితరులు కూడా సభలూ, సమావేశాలూ జరిపి అస్పృశ్యతా నివారణకు హరిజనాభ్యుదయానికి నిర్వర్తించవలసిన కార్యక్రమం నిర్ణయించుకొన్నారు

ఘంటశాలలో సుబ్రహ్మణ్యేశ్వర స్వామివారి ఆలయం [illegible] పూర్వమే హరిజనులకు తెరవబడింది ఈ మే నెలలో శ్రీ విశ్వేశ్వర స్వామి [illegible] ఆలయాలను కూడా హరిజనులకు తెరవడం జరిగింది [illegible]

**గాంధీజీ హరిజన యాత్రకు**
**సన్నాహాలు (1933)**

ఈ సంపుటిలోని మొదటి రెండు ప్రకరణాలలో గాంధీజీ యావద్భారత దేశంలో హరిజన యాత్ర చేయవలసి వచ్చిన పూర్వగాథను సంగ్రహంగా వివరించి ఉన్నాము ఇందుకు సంబంధించిన ఆయన ఆంధ్ర దేశ పర్యటన 1933 డిసెంబరు 16 వ తేది ఉదయం ప్రారంభమై 29 వ తేదితో పూర్తి అయింది

తన హరిజన యాత్రను భారతదేశంలో ప్రారంభించటానికి ముందు గాంధీజీ ఇట్లా ప్రకటించినారు

'నేను పుట్టుకవల్ల సవర్ణ హిందువుడనయినా నా బుద్ధి పూర్వకంగా హరిజనులలో కలిసి పోయినాను హరిజనుని అస్పృశ్యునిగా భావిస్తున్నంత వరకు నేనుకూడా అస్పృశ్యుడనే హరిజనునకు ప్రవేశంలేని దేవాలయంలో నాకు తావు లేదు హరిజనులకు నేను చేసే సేవ ఈశ్వర సేవయే అనుకొంటున్నాను నేనీ పనిని రాజకీయోద్దేశంతోగాని, రాజకీయ ప్రయోజనాల కోసం గాని చేయడం లేదు ఇది అత్యుత్తమమయిన మానవ సేవ అని నా తలంపు ఇది హిందూ మతానికి సంబంధించిన అంతరంగిక సంస్కరణ హిందువులమయిన మనం ఇంత కాలం ఎవరిని సంఘ బాహ్యులనుగా చేసి ఎవరి పట్ల చెప్పరాని అపచారాలను చేసినామో వారికి క్షమాపణ పూర్వకంగా హరిజన సేవ అనే ఈ ప్రాయశ్చిత్త కర్మ ఉద్దిష్టమైంది

ఈ ప్రకటన వల్ల గాంధీజీ హరిజన యాత్రలోని ప్రధానోద్దేశం తేటతెల్లం కాగలదు

మహాత్ముని ఆంధ్రదేశ సంచారం గురించి ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘ ప్రధాన కార్యదర్శి (శ్రీ) మాగంటి బాపినీడు గారు, ఆయా జిల్లాల హరిజన సేవక సంఘ కార్యదర్శులు చక్కని ఏర్పాట్లు చేసినారు ఈ సందర్భంలో ప్రజలు నిర్వర్తించవలసిన విధులను గురించి (శ్రీ) బాపినీడు ఇట్లా వ్రాసినారు

"మహాత్ముని హరిజన సేవా నిధికి సన్మాన సంఘం ఏర్పరిచి వివిధ సంఘాల పక్షాన విరాళాలు వచ్చేటట్లు విశ్వ ప్రయత్నాలు చేయవలె జిల్లాలలో ఇక ముందు హరిజన సేవా కార్యక్రమాన్ని సాగించటానికి ఈ నిధియే మూలాధారము జిల్లాలో సేకరించిన నిధిలో ముప్పాతిక ఎంతు జిల్లాకే ఇస్తానని గాంధీజీ ప్రకటించినారు కాబట్టి ఎవరెంత తక్కువ మొత్తం ఇచ్చినప్పటికీ విడువకుండా వసూలు చేయవలె గాంధీజీ సభకు రావడానికి ముందే సేకరించిన మొత్తం లెక్కపెట్టి ఎవరెంత ఇచ్చింది వివరంగా వ్రాసి ఉంచవలె

**సభలు-మార్గమధ్యన ఏర్పాట్లు**

ఒక నిర్ణీత స్థలంనుంచి ఇంకొక స్థలానికి పోయేటప్పుడు మార్గ మధ్యంలో మహాత్ముని కారుకు అడ్డంవచ్చి నిర్ణీత కార్యక్రమానికి ఆలస్యమూ ఆటంకమూ కలగచేయకుండా ఆయా గ్రామాలలోని ప్రజలకు ముందుగా

నచ్చచెప్పి తగిన ఏర్పాట్లు చేయవలె మార్గ మధ్యంలో గాని, సభలో గాని మహాత్ముని మీద పూలదండలు, పూలగుత్తులు విసిరివేయకూడదు మహాత్ముడు కారు దిగినప్పుడు ఎవరూ ఆయన కాళ్లు పట్టుకోకూడదు మహాత్ముని కారు కెవ్వరూ అడ్డం పడుకోకూడదు మార్గమధ్యాన గాంధీజీ ప్రయాణం చేసే గ్రామాలలోను, ఆయన ఆగేచోట్లను సుశిక్షితులయిన స్వచ్ఛంద సైనికులు ఉండి తగిన ఏర్పాట్లు చేయవలె రైలుస్టేషన్‌వద్దనుంచి సభలోకి వచ్చే టప్పుడు తోవలో వలంటీర్లు రోడ్డుకిరుపక్కలను నిలబడి మోటారు ఆలస్యం లేకుండా వెళ్ళేటట్లు చూడవలె

## బహిరంగసభల ఏర్పాట్లు

హరిజన సమస్యకై చరిత్రాత్మక ప్రాయోపవేశం చేసి, ఇంకొక ఒక్క దినం ఉపవాసం చేసి మృత్యుముఖమునుంచి వెలువడిన గాంధీమహాత్ముని దర్శన భాగ్యంకోసం అనేకమంది నిరీక్షిస్తూ ఉంటారు అందువల్ల నిశ్శబ్దసభలు ఏర్పాటు చేస్తేనేగాని అనుకొన్న ప్రయోజనం కలగదు సభ ఎంత చప్పుడు లేకుండా జరిగితే మహాత్మునికంత సంతోషము సభలోకి మహాత్ముడు వచ్చి సభను విడిచి వెళ్లేవరకు ఏవిధమయిన సందడి జరగకుండేటట్లు వలంటీర్లు జాగ్రత్త తీసుకోవలె. మహాత్ముని సందేశం ప్రజలందరికి చక్కగా వినిపించడానికి దూర శ్రవణ యంత్రానికి కేంద్ర హరిజన సేవక సంఘంవారునూ, రాష్ట్ర సంఘం వారునూ ప్రయత్నం చేస్తున్నారు మహాత్ముడుపోయే వీధులను విదేశీ కాగి తాలతో కాక పచ్చని ఆకు తోరణాలు మొదలయినవానితో చక్కగా అలంక రించవలె

ఈ విధంగా ఆంధ్రదేశంలో మహాత్ముని హరిజన పర్యటన జయప్రదం చేయడానికి మీ అందరి సహకారం అభిలషిస్తున్నాను "

ఈ ప్రకటననుబట్టి ఇంతకుపూర్వం గాంధీజీ ఆంధ్రదేశ పర్యటనలలో జరిగిన కొన్ని లోపాలు ఈ పర్యాయం పునరావృత్తం కాకుండడానికి ఉద్దే శింపబడిందని తెలియగలదు

ఇందుకనుగుణంగా గాంధీజీ పర్యటించనున్న ఆయాచోట్ల సభలను ఏర్పాటు చేయడానికి, సన్మానపత్రాలను సమర్పించటానికి, నిధులను సేక రించటానికి, గాంధీజీకి ఆయన బృందానికి తగిన వసతుల సౌకర్యాలు చేకూర్చేటందుకు ముందుగానే అన్ని సన్నాహాలు చేయడం జరిగింది

## గుంటూరుకు ఆహ్వానము

హరిజన యాత్ర సందర్భంలో గాంధీజీని గుంటూరుకు ఆహ్వానించడానికి తిలక్‌పేటలోని హరిజన హాస్టల్‌లో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి అధ్య క్షతన పౌరమహాసభ జరిగింది గాంధీజీ హరిజన యాత్రా కార్యక్రమంలో గుంటూరును చేర్చవలసిందని ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘంవారిని

కోరుతూ తీర్మానించినారు అందుకు తగిన ఏర్పాట్లు చేయడానికి గుంటూరు హరిజన సేవక సంఘం పూనుకొన్నది ఆ సమావేశంలో దేశభక్త కొండ వేంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రిగార్లు కూడా పాల్గొన్నారు

ఇదే సందర్భంలో గుంటూరు జిల్లా హరిజన సేవక సంఘం దేశభక్త కొండ వేంకటప్పయ్యగారి భవనంలో నవంబరు 28వ తేదీన 3 గంటలకు సమావేశమయింది ఆచార్య యన్ జి రంగా అధ్యక్షత వహించినారు

గుంటూరు జిల్లాలో గాంధీజీ పర్యటనకు ఒకే ఒక్క రోజు నిర్ణయింపబడడంచేత ఆ రోజుననే సాధ్యమయినన్ని ఎక్కువ గ్రామాలలో ఆయన పర్యటన సాగించవలెననే ఉద్దేశంతో గుంటూరులో ఆయన ఉదయాన్నే బయలుదేరి, నిడుబ్రోలు, ఇంటూరు, కావూరు, రేపల్లె, గోవాడ, అమృతలూరు, తెనాలి, వల్లమూడి మొదలయిన గ్రామాలను ఆయన చూడవలెననీ, అప్పుడు ఆయన 110 మైళ్లు ప్రయాణంచేసి గుంటూరు, తెనాలి, బాపట్ల తాలూకాలను సందర్శించినట్లవుతుందని తీర్మానించినారు ఈ సందర్భంలో స్పష్టమయిన కార్యక్రమం తయారుచేయడానికి కొండ వేంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, (కల్లూరి) సి చంద్రమౌళి, యన్ జి రంగా, వి యన్ ప్రసాదరావు, మద్ది వెంకట రంగయ్యగార్లు ఉపసంఘంగా నియమితులైనారు

శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు గాంధీజీ గుంటూరు జిల్లాలో హరిజన యాత్రకు వచ్చినప్పుడు వారి సన్మానపత్రాలలో తెలుపవలసిన విషయాలను గురించి పత్రికలలో వివరంగా ఒక ప్రకటన చేసినారు

గుంటూరు నగరంలో గాంధీజీని ఆహ్వానించడానికి డిసెంబరు 5 సాయంకాలం గుంటూరు నగర హరిజన సేవక సంఘంవారి యాజమాన్యంలో పురపాలక సంఘ గ్రంథాలయావరణలో కొండ వేంకటప్పయ్య పంతులుగారి అధ్యక్షతన "గాంధీజీ సన్మాన సంఘ సభ్యులు" సమావేశమయినారు ఆహ్వాన సంఘ అధ్యక్షుడుగా మద్ది వెంకటసుబ్బయ్యగారు ఎన్నుకోబడినారు

శ్రీ దేశిరాజు హనుమంతరావు, రాయసం వెంకటశివుడు, శిరం వెంకటసుబ్బారావుగార్లు, మరి ముగ్గురు ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడినారు

శ్రీ కొల్లి సత్యనారాయణ చౌదరి, మిట్టపల్లి ఆదినారాయణ గుప్తగార్లు సంయుక్త కార్యదర్శులుగాను, వంగూరి సుబ్బారావుగారు ప్రధాన కార్యదర్శిగాను ఎన్నుకోబడినారు

ఉప్పుటూరి వెంకట పున్నారావుగారు కోశాధికారిగా ఉన్నారు వీరు, గాంధీజీ గుంటూరు వచ్చినప్పుడు ఆయనకు సన్మాన పత్రం, హరిజన నిధిని సమర్పించడానికి తగిన సన్నాహాలు చేయవలెనని నిర్ణయించడం జరిగింది ఈ సందర్భంలో కృషి చేయటానికి వర్తకుల సంఘం, మహిళా సంఘం, డాక్టర్ల సంఘాలవారు తమలో నుంచి ఉపసంఘాలను ఏర్పరచుకొన్నారు

గుంటూరు మండలం ఆదిమాంధ్రులు, గాంధీజీ ఆయా గ్రామాలకు వచ్చినప్పుడు హరిజనుల స్థితి గతులను, వారి కష్ట సుఖాలనూ వివరంగా తెలిపే

పత్రాలను తయారుచేసి గాంధీజీకి సమర్పించవలెనని వారి ప్రధాన కార్యదర్శి మంగళగిరి పరవస్తుదాసుగారు ప్రకటించారు

## మద్రాసులో సన్మానాలు

1933 నవంబరు 29న గాంధీజీ హరిజన యాత్రనుగురించి తగినసన్మానాలు చేయడానికి అస్పృశ్యతా నివారణ సంఘంవారి యాజమాన్యంలో చూలై లోని గాంధీ వనంలో శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి అధ్యక్షత కింద బహిరంగ సభ జరిగింది

అస్పృశ్యతా నివారణ సంఘాధ్యక్షుడు దివాన్ బహద్దురు వి భాష్యమయ్యంగారు గాంధీజీ హరిజనయాత్రా సందర్భంలో మద్రాసు వచ్చినప్పుడు ఆయనకు ఇరవై ఐదువేల రూపాయల నిధిని సమర్పించవలసిందని చేసిన పత్రికా ప్రకటన సభ్యులకు అధ్యక్షురాలు చదివి వినిపిస్తూ ఆ నిధిని సేకరించడం ప్రతి వొక్కరి నైతిక, ఆధ్యాత్మిక కర్తవ్యమని ఉద్ఘాటించినారు హరిజనుల ఆర్థిక సాంఘికాభ్యున్నతికి తోడ్పడంలో రాజకీయ విభేదాలను పరిగణించరాదని, ఇప్పటినుంచి 'అస్పృశ్యత' అనే పదం నిఘంటువుల నుంచి తొలగించవలెనని, అది మానవ జాతిపట్ల మహాపరాధమని కూడా ఆమె అన్నారు గాంధీజీ హరిజన యాత్ర భారత దేశంలో అంటరానితనం నిర్మూలించడానికే ఉద్దేశింప బడిందని ఆమె సభ్యులకు నచ్చచెప్పినారు శ్రీమతి రుక్మిణమ్మగారు అరవంలో మాట్లాడినారు.

తరవాత శ్రీపాద శంకర్ ఏ ఆర్ వి ఆచార్, టి జి లక్ష్మణస్వామి మొదలియార్, టి యస్ నటరాజాపిళ్లై, జయసింగ్ భాటియా, సేలం సుబ్రహ్మణ్యం, శ్రీమతి కమలాదేవి ఆర్యగార్లు ప్రసంగిస్తూ గాంధీజీని సముచితంగా సన్మానించి ఆయన సలహాను మనం త్రికరణశుద్ధిగా ఆచరించవలెనని అన్నారు హరిజన నిధికి హుండీ వసూళ్లు ఉండవని, 'రూపాయ రసీదులు' అచ్చొత్తించి ఇవ్వడం జరుగుతుందని, వసూలయిన మొత్తాలు స్థానిక పత్రికలలో ప్రకటించడం జరుగుతుందని కూడా సభలో వెల్లడించినారు మద్రాసు కార్పొరేషన్‌వారు డిసెంబరు 5న సమావేశమై గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించడానికి ఏకగ్రీవంగా తీర్మానించినారు స్వాగత పత్రాలు వ్రాయడానికి సత్యమూర్తి, యం ఏ ముత్తయ్యచెట్టి, డాక్టర్ యు కృష్ణారావు, సి. నటేష్ మొదలియార్, టి యస్ రామస్వామయ్యర్, మేయర్, గద్దె రంగయ్యనాయుడుగార్లు ఒక ఉప సంఘంగా ఏర్పడినారు

## రాజమహేంద్రవరంలో ఏర్పాట్లు

తూర్పు గోదావరిజిల్లా అస్పృశ్యతా నివారణ సంఘ యాజమాన్యంతో రాజమహేంద్రవరంలో నవంబరు 30 సాయంకాలం హిందూ సమాజ భవనంలో మహాత్మా గాంధీ ఆ నగరానికి వచ్చినప్పుడు చేయవలసిన సన్మానపు ఏర్పాట్లు గురించి బహిరంగ సభ జరిగింది. శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షత వహించినారు ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యదర్శి

గాంధీజీని రాజలాంఛనాలతో ఆహ్వానించినారని చెప్పినారు గాంధీజీ, ఆంధ్రుల పెద్ద పెద్ద విశాఖశాలతోపాటు త్రికరణ శుద్ధిగా పనిచేసే త్యాగమూర్తులయిన కార్యకర్తలు కూడా తనకు కావలెనన్నారని, కాపినీడుగారు తన ప్రసంగంలో తెలుగు వారికి తెలియచెప్పినారు డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యం, దువ్వూరు సుబ్బమ్మగార్లు కూడా హరిజన దేవాలయ ప్రవేశం అత్యవసరమని ఉపన్యసించినారు

అరవ ఆదినారాయణమూర్తి అధ్యక్షుడుగాను, డాక్టర్ కె ఎల్ నరసింహారావు, డాక్టర్ ఎ బి నాగేశ్వరరావు, శ్రీ ఆకాల సుబ్బారావు, శ్రీ డి సీతారామమూర్తి సంయుక్త కార్యదర్శులుగాను ఒక సన్మాన సంఘం ఏర్పాటు చేయడం జరిగింది

డిసెంబరు 13వ తేదీని రాజమహేంద్రవరం మునిసిపల్ కౌన్సిల్ ప్రత్యేక సమావేశం పి గోవిందరావునాయుడుగారి అధ్యక్షత కింద జరిగింది గాంధీజీ ఆ నగరానికొచ్చినప్పుడు ఆయనకు మున్సిపల్ కౌన్సిల్ వక్షాన ఆహ్వానపత్రం పమర్పించవలెనని గౌగేటి నారాయణస్వామిగారు ప్రతిపాదించగా వైస్‌చేర్మన్ సప్పా అప్పలస్వామిగారు ఆమోదించినారు తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించడం జరిగింది

## పశ్చిమ గోదావరి జిల్లా

పశ్చిమ గోదావరి జిల్లాలో గాంధీజీ పర్యటన గురించి పశ్చిమ గోదావరి జిల్లా హరిజన సేవక సంఘ కార్యదర్శి చెంగల్వల చిట్టిపంతులుగారు అన్ని ఏర్పాట్లు చేసినారు

## హిందూపురం

శ్రీ కల్లూరి సుబ్బారావుగారి ప్రోత్సాహంతో డిసెంబరు 2న పుర జనులు సమావేశమై గాంధీజీ ఆ పురానికొచ్చినప్పుడు హరిజననిధికి వెయ్యి నూటపదహార్లు సమర్పించడానికి తీర్మానించుకొన్నారు

## చిత్తూరు జిల్లా

చిత్తూరు జిల్లా హరిజన సేవక సంఘ కార్య నిర్వాహకసభ డిసెంబరు 3న సమావేశమయింది బొల్లిని మునుస్వామినాయుడుగారు అధ్యక్షత వహించి నారు, ఆ సభకు కుప్పంనుంచి శ్రీ యల్, సుందరరాజయ్యంగార్, తిరుపతి నుంచి యం శ్రీనివాసాచార్యులుగారు కూడా వచ్చినారు యం అనంత శయనం అయ్యంగార్ (చిత్తూరు జిల్లా హరిజన సేవక సంఘ కార్యదర్శి), రాష్ట్ర సంఘ కార్యదర్శి కాపినీడుగారు వ్రాసిన ఉత్తరం సభ్యులకు చదివి వినిపించి నారు గాంధీజీ తిరుపతికి వచ్చినప్పుడు హరిజననిధికి వెయ్యి రూపాయలు సమ ర్పించడానికి ఆ సభలో తీర్మానించినారు

## పశ్చిమ కృష్ణా జిల్లా

డిసెంబరు 1 సాయంకాలం బెజవాడ దుర్గావిలాసంలో డాక్టర్ శివలెంక మల్లికార్జునరావు అధ్యక్షతకింద పశ్చిమ కృష్ణా జిల్లా అస్పృశ్యతా నివారణ సంఘ సమావేశం జరిగింది. గాంధీజీ విజయవాడ రాక సందర్భంలో ఆహ్వాన సంఘం ఏర్పాటు చేసినారు. కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు దానికి అధ్యక్షులుగాను, మరం బాలసుబ్రహ్మణ్యగుప్త, బాలచంద్రఆప్టేగార్లు వలంటీర్ల కార్యదర్శులుగాను, కాట్రగడ్డ మధుసూదనరావుగారు సమావేశాలు అలంకారాల కార్యదర్శిగాను, కానూరు లక్ష్మయ్యచౌదరి, అడ్డేపల్లి వెంకట గురునాథరామశేషయ్యగార్లు ధనసేకరణ కార్యదర్శులుగాను, ఎర్నేని లక్ష్మీ నారాయణగారు కోశాధికారిగాను ఏర్పాటయినారు

## వెంకటగిరి

డిసెంబరు 2వ తేది రాత్రి వెంకటగిరి పౌరులు గాంధీజీ తమ గ్రామానికి రానున్న సందర్భంలో సన్మాన సంఘం ఏర్పాటు చేసినారు. దానికి కనుపర్తి నారాయణరావుగారు అధ్యక్షులుగాను, పునుగోటి చెంగల్వరాయ నాయుడుగారు కార్యదర్శులుగా ఎన్నుకోబడినారు

## సూళూరుపేట

సూళూరుపేట తాలూకా బోర్డువారు నవంబరు 30వ తేదిన కోట పోలూరులో బద్దిపూడి వెంకటనారాయణరెడ్డిగారి అధ్యక్షతకింద సమావేశమై హరిజన ప్రచారనిమిత్తం వస్తూన్న గాంధీమహాత్మునికి సూళూరుపేట రైల్వే ప్లాట్‌ఫారంమీద సన్మానపత్రం, కొంత హరిజననిధిని సమర్పించడానికి తీర్మానించినారు

## రేపల్లె

గాంధీజీ రేపల్లెకు వచ్చినప్పుడు ఆయన సన్మానానికి, హరిజననిధి సమర్పణకు ఏర్పాట్లు చేయడానికి రేపల్లె ప్రాంతీయులందరూ ఆ గ్రామంలోని అఖిల భారత చర్ఖా సంఘంలో రావు వెంకట్రాయణింగారి అధ్యక్షతకింద సమావేశమయినారు

శ్రీ రావు వెంకట్రాయణింగారు, పాతూరి సుబ్బయ్య, తటవర్తి రామ మోహనరావు, దేవభక్తుని రామచంద్రయ్య, శ్రీమతి పత్తిపాటి సీతమ్మ, మద్దుల వెంకటగిరిరావు మొదలయినవారితో ఆహ్వాన సంఘం ఏర్పాటయింది దానికి అధ్యక్షుడుగా శ్రీ తటవర్తి రామమోహనరావు, కార్యదర్శిగా శ్రీయుతులు గొల్లపూడి సుబ్రహ్మణ్యం ఎన్నుకోబడినారు. దేవభక్తుని రామ చంద్రయ్యగారు శాంతి సైనికుల ఏర్పాటుకు నియమితులయినారు.

**ఆలమూరు**

తూర్పు గోదావరి జిల్లా అస్పృశ్యతా నివారణ సంఘ కార్యదర్శి శ్రీ వెన్నేటి సత్యనారాయణగారు గాంధీజీ ఆలమూరుకు రానున్న సందర్భంలో అక్కడ ఒక సన్మాన సంఘం ఏర్పాటు చేసినారు దానికి శ్రీ నరసింహదేవర సత్యనారాయణ అధ్యక్షులుగాను, శ్రీ ఉప్పులూరు రామమూర్తి గారు కార్యదర్శిగాను ఎన్నుకోబడినారు ఫిర్కా ప్రజల తరఫున గాంధీజీకి సన్మానపత్రాన్ని హరిజననిధిని సమర్పించేటందుకు తీర్మానించడం జరిగింది

**ఏలూరు**

ఏలూరులో డిసెంబరు ౪వ తేదిన గాంధీ సన్మాన సంఘం ఏర్పాటయినది శ్రీ చిట్టూరి ఇంద్రయ్యచౌదరి దానికి అధ్యక్షుడు, ఉపాధ్యక్షులు దండు నారాయణరాజు, నరహరిశెట్టి దేవేంద్రుడుగార్లు, కార్యదర్శులు మాగంటి సీతారామదాసు, జవ్వాజీ అప్పారావుగుప్తగార్లు కార్యస్థానం డాక్టర్ ఉప్పులూరి పట్టాభిరామయ్యగారి ఇంటివద్ద ఏర్పాటయింది కార్యనిర్వాహక సభ్యులలో శ్రీమతులు మూల్పూరి రామసుందరమ్మ, కలగర పిచ్చమ్మ, సత్తిరాజు శ్యామలాంబగార్లు కూడా ఉన్నారు

**కడప**

కడపలో మహాత్ముని ఆహ్వానించటానికి ఒక ఆహ్వాన సంఘం ఏర్పాటు చేయబడింది

తణుకు తాలూకా బోర్డువారు డిసెంబరు 1౪వ సమావేశమై మహాత్మునికి సన్మానపత్రం సమర్పించటానికి తీర్మానించినారు

**ఆంధ్రోత్కళుల వివాదము**

గాంధీజీ ఆంధ్రదేశ పర్యటన కార్యక్రమంలో మొట్టమొదట గంజాం జిల్లా చేర్చబడి తరవాత తొలగించబడింది "గంజాం జిల్లా ఉత్కళులదని, ఆంధ్రులది కాదని, అందువల్ల గాంధీజీ ఆంధ్రదేశ పర్యటనలో గంజాం జిల్లాను చేర్చకూడదనీ" ఉత్కళ నాయకులు గాంధీకి తంతి వార్త వంపినందున ఆ మార్పు చేయడం జరిగిందని, గంజాం జిల్లా హరిజన సేవక సంఘ నాయకులు న్యాయపతి నారాయణమూర్తి, యెల్లాయి సన్నయ్యగార్లు అభిప్రాయపడి మాగంటి బాపినీడుగారిని (ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యదర్శి) బరంపురం రైల్వేస్టేషన్ ప్లాటుఫారంపైన కలుసుకొని ఆ సంగతి ఆయనకు వివరంగా చెప్పినారు

బాపినీడుగారు గాంధీజీ అనుకూలంబట్టి ఆ మార్పు చేయబడింది కాని మరొక కారణం కాదని వారికి సమాధానం చెప్పినారు తరవాత ఆంధ్ర గంజాం జిల్లా హరిజన సేవక సంఘంవారి తీర్మానం అనుసరించి గాంధీజీ ఉత్కళ గంజాం జిల్లా పర్యటనకు ముందుగానే ఆంధ్ర గంజాం జిల్లాలో పర్యా

టిస్టారని ఆంధ్ర రాష్ట్ర హరిజన సంఘ కార్యాలయ కార్యదర్శి, ఆంధ్ర గంజాం జిల్లా హరిజన సేవక సంఘ కార్యదర్శి సన్నయ్యగారికి తెలియపరచినారు ఆ తరువాత ఆంధ్ర గంజాం హరిజన సేవక సంఘం బరంపురంలో ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజ మందిరంలో డిసెంబరు 11న సమావేశమై వరాహగిరి వెంకటజోగయ్యపంతులుగారు అధ్యక్షులుగా గాంధీ సన్మాన సంఘం ఏర్పాటు చేసినారు

## పెద్దాపురం

గాంధీజీ రాక సందర్భంలో పెద్దాపురంలో తాలూకా హరిజన సేవక సంఘ యాజమాన్యంలో సన్మాన సంఘం ఏర్పాటు చేసినారు దాని అధ్యక్షులు కేశవరపు రామరాజుపంతులు, కార్యదర్శులు గరిమెళ్ళ సుబ్బారావు, నోరి బాలకృష్ణమూర్తిగార్లు, కరపాటి సత్యనారాయణమూర్తి కోశాధిపతి

## నెల్లూరు

గాంధీజీ హరిజన యాత్ర సందర్భంలో నెల్లూరులో ఆహ్వాన సంఘం ఏర్పాటు చేసినారు శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు ఆహ్వాన సంఘాధ్యక్షుడుగాను, శ్రీయుత కమతం షణ్ముఖం, శ్రీమతి పొణకా కనకమ్మగార్లు ఉపాధ్యక్షులుగను, శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డి బొమ్మా శేషరెడ్డి, కటికనేని కళ్యాణరావుగారు కార్యదర్శులుగాను ఎన్నుకోబడినారు

## రామచంద్రపురం

రామచంద్రపురం తాలూకా బోర్డువారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించడానికి తీర్మానించినారు గాంధీజీ రామచంద్రపురంలో ఉన్నప్పుడు రామచంద్రపురం తాలూకా బోర్డుతోపాటు తూర్పు గోదావరి జిల్లా బోర్డువారు, రామచంద్రపురం తాలూకా హరిజన సంఘంవారు, రామచంద్రపురం వాల్మీకి ఆశ్రమంవారు గాంధీజీకి సన్మానపత్రం, విరాళం సమర్పించడానికి నిశ్చయించుకొన్నారు

## తెనాలి

తెనాలి తాలూకా బోర్డువారు డిసెంబరు 21న కె నాగభూషణంగారి అధ్యక్షతను సమావేశమై మహాత్మాగాంధీకి సన్మానపత్రం సమర్పించడానికి తీర్మానించినారు

## తిరుపతి

డిసెంబరు 19వ తేదీన తిరుపతి మునిసిపల్ కౌన్సిల్ చేర్మన్ శ్రీ పి సుబ్బరామరెడ్డిగారి అధ్యక్షతకింద సమావేశమై గాంధీజీకి తిరుపతిలో సన్మాన

పత్రం సమర్పించడానికి ఏకగ్రీవంగా తీర్మానించినారు సన్మానపత్రం తయారు చేసేటందుకు ఒక ఉపసంఘం కూడా ఏర్పడింది

## బెజవాడ తోవలో డోర్నకల్

గాంధీజీ ఆంధ్రదేశ సంచారానికి బెజవాడపోయే తోవలో డోర్నకల్ స్టేషన్ ప్లాటుఫారంపైకి 15-12-1933 రాత్రి రైలురాగానే ఆంధ్ర రాష్ట్రీ హరిజన సేవక సఘం కార్యదర్శి మాగంటి బాపినీడుగారు, శ్రీ ఉన్నవ రాజ గోపాలకృష్ణయ్యగారిని పంపగా ఆయన గాంధీజీని ఆయన బృందంను కలుసు కొన్నారు అప్పుడు రాత్రి 12 గంటలయింది స్టేషన్‌లో జనం క్రిక్కిరిసి పోయినారు నిజాం రాజ్యంలోని సిరిపురం మొదలయిన నాలుగు గ్రామాలలోని నలుగురు పెద్దమనుష్యులు శ్రీ రాజగోపాలకృష్ణయ్యగారి ద్వారా ఒక స్వాగతపత్రం, 200 రూపాయల నగదు గాంధీజీకి సమర్పించినారు

గాంధీజీ ఆ అర్ధరాత్రివేళనే లేచికూర్చొని హరిజననిధికి చిన్న చిన్న మొత్తాలను వసూలు చేయటం ప్రారంభించినారు ఆయన బెజవాడకుపోయి జనం వొత్తిడిలో దుర్గావిలాసం చేరేసరికి ఒక అరగంట కాలం పట్టింది చాలా డస్సిపోయినారు

గాంధీజీ, నాగేశ్వరరావుపంతులు, వేంకటప్పయ్యగారు మొదలయిన నాయకులతో ఇష్టాగోష్ఠి జరుపుతున్న సమయంలో శ్రీ సాంబమూర్తిగారు కల్పించుకొని "ఇక్కడ ఇంత ప్రయాసయిందిగానీ మా జిల్లాలో చక్కగా శాంతంగా సభలు జరుగుతాయి" అన్నారు "అవును అక్కడ సాంబమూర్తి పరిపాలన, ఇక్కడ విరిగిన ఎముకలకు అమృతాంజనం ఉండనే ఉన్నది. ఇక్కడ మాత్రం ఏంతక్కువ" అన్నారు గాంధీజీ

డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారిని పోలీసులు లాఠీచార్జి చేసి నప్పటినుంచి ఆయన ఎముక విరిగి అస్వస్థతగా ఉంటున్నారనివిని గాంధీజీ విచారపడినారు ఇంతలో మరొకరు "సాంబమూర్తిగారికి కూడా దెబ్బలు తగిలాయండి" అన్నారు

"సాంబమూర్తికేంతే! ఎన్ని దెబ్బలయినా తినగలడు" అని గాంధీజీ వక వకా నవ్వారు

# 18
# ఆంధ్రకు గాంధీజీ రాక (1933)

డిసెంబరు 16 ఉదయం మహాత్మాగాంధీ గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీనుంచి బెజవాడ చేరినారు బెజవాడ రైల్వేస్టేషన్ ప్లాటుఫారం ఆవరణ యావత్తు వేలకొద్దీ జనంతో క్రిక్కిరిసి పోయింది స్టేషన్ చుట్టు జన సమూహం గుమిగూడి ఉన్నారు జనులను సరైన అదుపులో ఉంచడానికి రైల్వే పోలీసు వారు రైల్వేస్టేషన్ అధికారులు, సన్మానసంఘంవారు అద్భుతమయిన ఏర్పాట్లు చేసినారు కాని గాంధీజీ ఆ రైలులో వచ్చినారని తెలియగానే తుదిక్షణంలో ప్రజలు అత్యుత్సాహంతో గాంధీజీ ఉన్న రైలు పెట్టె ముందు వెర్రిగా విరగబడినారు పోలీసువారు, స్టేషన్ సిబ్బంది, కాంగ్రెస్ వలంటీర్లు, ప్రజలను సర్దటానికి ఒక్క అరగంటసేపు ప్రయత్నించినారు కాని వారికది దుర్ఘటమయింది అందువల్ల గాంధీజీ ఉన్న రైలు పెట్టెను దాదాపు యాభై గజాలు వెనక్కు నెట్టి, చుట్టూ వలంటీర్లు నిలుచుని ఆయన దిగేటందుకు వీలు చేసినారు

గుంపులు గాంధీజీ పైన ఖద్దరు దండలను పుష్పమాలికలను వర్షింపచేసినారు గాంధీజీ రైలు దిగి గుంపును దాటిపోయేముందు జనులత్యుత్సాహంతో నినాదాలుచేస్తూ ఆయన చుట్టూ మూగినారు రైల్వే పోలీసులు ఆయనను గుంపుల నుంచి తప్పించి రైల్వే బ్రిడ్జిని దాటించి ఆయన కోసం ఆయన బృందం కోసం వేచిఉన్న కారుల దగ్గరకి తీసుకొని పోవడం కృత్యాద్యవస్థ అయింది గాంధీజీ జనం గుంపులోనుంచి రైలు వంతెన దాటడానికి ఇరవై నిమిషాలు పట్టింది ఆయన పూర్తిగా అలసి పోయినందుకు ఆయనను వలంటీర్లు చేతులమీద ఎక్కించుకొని తీసుకొనిపోయి కారులో కూర్చోపెట్టవలసి వచ్చింది

రైలు స్టేషన్ వంతెనపైన జనం క్రిక్కిరిసి ఉండటంచేత ఆ వత్తిడిలో కొంతమంది స్మృతి తప్పిపోయినారు ఒక మధ్య వయస్సుగల మనిషి, మరొక మైనర్ పిల్లవాడు ఆ వత్తిడిలో పడిపోవటంతో కొందరు వారిని బయటకు మోసుకొని వెళ్ళినారు

గాంధీజీని ఆహ్వానించడానికి శ్రీ కొండ వెంకటప్పయ్య, కాశీనాథుని నాగేశ్వరరావు, బులుసు సాంబమూర్తి, మాగంటి బాపినీడు, పండిత హరిహర శర్మ, పండిత మోటూరి సత్యనారాయణ, దండు నారాయణరాజు, ఆచార్య రంగా, శ్రీమతి దుర్గాబాయి మొదలయిన వారుకాక ఇంకా అనేకమంది కాంగ్రెస్ కార్యకర్తలు, హరిజన సేవక సంఘ కార్యకర్తలు రైల్వే ప్లాట్‌ఫారం

మీద ఉన్నారు

రైల్వే స్టేషన్ కడ అనుభవంతో గాంధీజీ చాలా అలసిపోయి సందువల్ల ఆయన కారు సరాసరి దుర్గా విలాసానికి చేరింది అక్కడ ఆయన కొన్ని నిమిషాలు విశ్రాంతి తీసుకొన్నారు ఆంధ్ర మహిళా సంఘంవారు, కృష్ణాజిల్లా హరిజన సేవక సంఘంవారు, ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతా నివారణ సంఘంవారు హిందీ ప్రచారక సంఘంవారు, గాంధీజీని పుష్పమాలాలంకృతుని చేసి ఆయనకు హిందీలో సన్మాన పత్రాలను సమర్పించినారు

## గాంధీజీ సమీప గ్రామాలకు పోవటం

తరవాత కార్యక్రమంలో గాంధీజీ కొన్ని సమీప గ్రామాలను, హరిజన వాడలను చూడవలసి ఉన్నది కాని ఉదయం కలిగిన అనుభవం వల్లనూ ఆకాశం మేఘావృతమై వాన తుంపురులు పడుతూ ఉండడంవల్లనూ ఆ కార్యక్రమం విరమించడం మంచిదని కొంద రాయనకు సలహా ఇచ్చినారు అందుకాయన అంగీకరించలేదు నిర్ణీత కార్యక్రమం ప్రకారం కాశీనాథుని నాగేశ్వరరావు, మాగంటి బాపినీడు, మోటూరు సత్యనారాయణలతో కలసి కొన్ని గ్రామాలు చూడడానికి రానూపోనూ ముప్పై మైళ్లు ప్రయాణం చేసినారు బెజవాడకు పండెండు మైళ్ళ దూరంలో ఉన్న ఈడుపుగల్లు గ్రామానికి ఆయన ప్రథమ దర్శన భాగ్యం లభించింది ఈడుపుగల్లులో కొంతకాలం నుంచి హరిజనాభ్యుదయ కార్యక్రమం నిరంతరాయంగా కొనసాగుతూ ఉంది

## ఈడుపుగల్లు

బెజవాడకు పండెండు మైళ్ల దూరాన ఉన్న ఈడుపుగల్లు గ్రామానికి గాంధీజీ ఆయన బృందము డిసెంబరు 16 ఉదయం వెళ్ళినారు, గ్రామస్థులు ఆయనను అత్యుత్సాహంతో ఆహ్వానించినారు ఆయన సన్మానానికి ఏర్పాటు చేసిన పందిరిని పచ్చని తోరణాలతో అలంకరించడం జరిగింది గ్రామస్థులు గాంధీజీకి ఖాదీ దండలను, పుష్ప మాలలను వేసిన తరవాత 150 రూపాయల నగదుతో పాటు ఒక సన్మాన పత్రం సమర్పించినారు

సన్మాన పత్రానికి సమాధానం చెబుతూ "హిందూ మతం నుంచి అస్పృశ్యతా కళంకం తుడిచి వేయడానికి నేను యావద్భారత దేశంలో పర్యటిస్తున్న విషయం మీ కందరికీ తెలిసిందే అస్పృశ్యత మహా పాతకము మన మందరం ఒక్కటయినప్పుడు మనలో ఎక్కువ తక్కువ లంటూ ఉండరాదు మీ సొంత సోదరుడయిన హిందువును అస్పృశ్యుడుగా మీరు పరిగణించకూడదు నేను వెళ్లిన చోటులన్నిటిలో అస్పృశ్యతా నిర్మూలనం కోసం తామియ గలిగిందేదో ఇవ్వండని నా సోదరీమణులను నేనడుగుతున్నాను వారీయ గలిగినంత నగదునూ, నగలనూ ఇస్తున్నారు అట్లాగే ఇక్కడ కూడా మిమ్ములనూ నా సోదరులను అడుగుతున్నాను" అన్నారు గాంధీజీ

వెంటనే చాలా మంది ఉంగరాలను, నగలనూ సమర్పించినారు నాలుగేండ్ల వయసుగల బాలిక సరాసరి గాంధీజీ దగ్గరికి పోయి తన లోలకులను ఆయన చేతిలో ఉంచింది గాంధీజీ చాలా సంతోషంతో ఆ బిడ్డ వీపు మీద తట్టి ఆశీర్వదించినారు ఒక హరిజన బాలిక బంగారం పొదిగిన ఇత్తడి బులాకీని మహాత్మునకు సమర్పించగా ఆయన ఆమెను దీవించినారు

అక్కడ నుంచి ఆయన పటమట, మొగల్‌రాజపురం, పడమటిలంక గ్రామాలకు పోగా గ్రామస్థులు పూల హారాలతో విరాళాలు సమర్పించినారు 'దుర్గా విలాసు'కు అనుకొన్న కాలానికి 2 గంటలు ఆలస్యంగా చేరినారు అంతవరకు హరిజన నిధికి 1600 రూపాయలు నగదు, కొన్ని నగలు వసూలయినాయి

## విజయవాడ మహిళలు

ఈనాడు 'దుర్గావిలాసం' విజయవాడ పట్టణానికి యాత్రా స్థలంగా మారిపోయింది డిసెంబరు 16 మధ్యాహ్నం 'దుర్గావిలాసం'లో విజయవాడ మహిళలు సుమారు వెయ్యిమంది గాంధీజీని సన్మానించి ఆయన సందేశం వినడానికి సమావేశమయినారు వారు 120 రూపాయల నగదుతో గాంధీజీకి హిందీలో సన్మాన పత్రం సమర్పించినారు గాంధీజీ హిందీలో సమాధానం చెప్పినారు శ్రీమతి దుర్గాబాయి గాంధీజీ ఉపన్యాసం అనువాదం చేసినారు స్త్రీలు తమకు సమర్పించిన విరాళానికి కృతజ్ఞత తెలుపుతూ తోడి హిందువులను అస్పృశ్యులుగా భావించ వద్దని గాంధీజీ ప్రబోధించినారు "ఎవ్వరినీ అస్పృశ్యులుగా భావించ కూడదు దేవుని దృష్టిలో అందరూ ఒక్కటే, అందరూ సమానులే ఆయన దృష్టిలో హెచ్చు తగ్గులు లేవు తోడి హిందువులను అంటరానివారుగా పరిగణించి సవర్ణ హిందువులు చేసిన పాపానికి వారిప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకో వలసి ఉన్నది ఇప్పుడు నేను సేకరిస్తున్న ద్రవ్యంలో చాలా వరకు హరిజనాభ్యుదయానికి వెచ్చించడం జరుగుతుంది కాబట్టి మీరియ గలిగినంత ధనం ఈయగోరుతున్నాను కేవలం నగదే అక్కరలేదు నగలయినా సరే" అని గాంధీజీ చెప్పిన తరవాత స్వచ్ఛంద సేవకులు సభా మధ్యానికి పోగా కొంత పైకం, కొన్ని వెండినగలు చేకూరినాయి

మహిళా సభానంతరం గాంధీజీ "దుర్గా కళామందిరం" కు వెళ్ళినారు అక్కడ స్థానిక హరిజన కార్యకర్తలు, ఆంధ్ర రాష్ట్ర అస్పృశ్యతా నివారణ సంఘ కార్యవర్గ సభ్యులు, హరిజన సంఘంలోని రచయితలు, కవులు, గ్రంథ కర్తలు సమావేశ మయినారు ఆ సభ గాంధీజీ దేశానికి చేసిన సేవను గురించి నుతిస్తూ వ్రాసిన హరిజన కవుల గేయాలతో ప్రారంభమయింది

అటు తరవాత గాంధీజీ ఉపన్యసిస్తూ ఇట్లా అన్నారు "నేను మిమ్ము లందరినీ కలుసుకొని మీ సాహితీ శక్తి సామర్థ్యాలను ప్రత్యక్షంగా చూడ గలిగి నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది. ఆంధ్రదేశంలోని ప్రజలు

పద్యాలు అల్లడంలో, వాటిని మధురంగా చదవడంలో ప్రసిద్ధులని నాకు బాగా తెలిసిన సంగతే అందువల్ల మీరు ఈ రోజున చేసిన ప్రదర్శన కొంత వరకు అనవసరమని నా అభిప్రాయము కవిత్వంగానీ, కళగానీ, సత్యం నిరూపించేవిగా ఉండవలె అంతేగాని వాటిని పొగడ్తకు ఉపయోగించ కూడదు కవిత్వాన్ని అందుకు ఉపయోగించినందువల్ల కళ క్షీణించటమేగాక సత్యభంగం కూడా కలుగుతుంది ఇప్పుడు మనమంతా హిందూ మతం పునీతం చేయడానికి పూనుకొన్నాము కాబట్టి ప్రతివారు సత్యమార్గానుగాములై ఉండవలె ఆంధ్ర దేశం గురించి నాకు మహత్తరాలయిన ఆశలున్నాయి వాటికి తగినట్టుగా ఆంధ్రదేశం ప్రవర్తించ గలదని నే నెరుగుదును నేటి హరిజనోద్యమం కేవలం సత్యం పైననే ఆధారపడి ఉన్నది అందులో అసత్యానికిగానీ, స్వార్థానికిగానీ, ఆడంబరానికిగానీ అవకాశం లేదు ఇదొక ధార్మికోద్యమం, ఈ ఆశయమెంత పవిత్రమయినదో అంత పవిత్ర వంతంగా ఈ ఉద్యమం నడవవలె కాబట్టి ఈ పనిలో నిమగ్నులయిన సవర్ణులు, అవర్ణులు అందరూ ఆత్మ పరిశుద్ధతలోని ప్రాముఖ్యం పూర్తిగా గ్రహించి ఈ ఉద్యమం "శుద్ధి యజ్ఞంగా" భావించ వలెనని ప్రార్థిస్తున్నాను "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ సభ్యులను ప్రశ్నలువేయమని కోరినారు సభను ఏర్పాటు చేసినవారు సనాతన సంస్థలకు చెందినవారిని, తదితర వ్యక్తులను ఇష్టముంటే కొన్ని ప్రశ్నలు వేయమని కోరినారు కాని వారిలో ఎవ్వరూ ఏ ప్రశ్నలు వేయలేదు

స్థానిక హరిజనాభ్యుదయ కార్యకర్త శ్రీ వేదాంతం శంభుశాస్త్రిగారు తన సందేహాలను కొన్నిటిని నివృత్తి చేయవలెనని కోరుతూ "మీరు వేదాలను ప్రమాణంగా అంగీకరిస్తారా?" అని గాంధీజీని ప్రశ్నించినారు

'పూర్తిగా!' అన్నారు గాంధీజీ

"మీరు వాటిని గౌరవించి, వాటి ప్రకారం కట్టుబడి ఉంటారా!' అని మరొక ప్రశ్న వేసినారు శంభుశాస్త్రిగారు

"నిశ్చయంగా!" అన్నారు గాంధీజీ

"హరిజనులను దేవాలయాలలోకి ప్రవేశింప నిస్తే వారు ఆగమ శాస్త్ర విధులకు కట్టుబడి ఉండవలెనంటారా లేదా?" అని మరొక ప్రశ్న వచ్చింది

సవర్ణులకు వర్తించే అన్ని శాస్త్ర నిబంధనలను హరిజనులుకూడా అనుసరించినప్పుడే వారు దేవాలయ ప్రవేశానికి అర్హులవుతారు" అన్నారు గాంధీజీ

తరవాత మరే ప్రశ్నలు రాలేదు.

గాంధీజీ మళ్ళా ప్రసంగిస్తూ "నేడు నేను నిర్వహిస్తున్న ఈ పనిలో వేదాలు ప్రతిపాదించిన ధర్మం అతిక్రమించడం లేదని నేను గట్టిగా నమ్ముతున్నాను పై పెచ్చు వేదాలు చెప్పినట్లుగానే నడుచుకొంటున్నాని కూడా నా నమ్మకము. ఈ సమస్యను గురించి రెండు భిన్నాభిప్రాయాలున్నాయి ఒకటి అస్పృశ్యత శాస్త్ర సమ్మతమేనని, రెండోది అస్పృశ్యత ఎంత మాత్రం శాస్త్ర

సమ్మతంగాని, వేద సమ్మతింగానీ కాదని, అయితే హరిజనాభ్యుదయ కార్య క్రమంలో నిమగ్నులయినవారు భిన్నాభిప్రాయం కలవారి మనసులను నొప్పించ కూడదు వారిని శత్రువులుగా చూడకూడదు వారిని ప్రేమిస్తూ తమ పని తాము చేసుకొని పోతూ ఉండవలె అట్లా చేసినట్లయితే హరిజన కార్యకర్త లతో భిన్నాభిప్రాయం కలవారుకూడా వారికి తోడ్పడగలరు ఈ విషయం గురించి కొంచెం ముచ్చటించటానికి వీలు కలిగినందుకు నాకు చాలా సంతో షంగా ఉంది" అన్నారు గాంధీజీ

## బహిరంగ సభ

గాంధీజీ అక్కడి నుంచి గవర్నరు పేట మైదానంలోని బహిరంగసభకు వెళ్ళినారు ఆ సభ అంతకు పూర్వం బెజవాడలో జరిగిన గొప్ప సభలన్నిట్లోకి ఒక పెద్ద సభ పైన ఒక చాందినీతో ఎత్తయిన వేదిక ఏర్పాటు చేయబడింది కలకత్తానుంచి తెచ్చిన దూరశ్రవణ యంత్రంకూడా అమర్చడం జరిగింది కాని అది మార్గ మధ్యంలో చెడిపోవడం చేతనో ఎందువల్లనో సమయానికి పనిచేయ లేదు

గాంధీజీ సాయంకాలం సుమారు 4-30 గంటలకు సభా స్థలానికి చేరు కొన్నారు ఆయనకు సన్మాన పత్రాలు, విరాళాలు సమర్పించడానికి ఇరవై నిమిషాలు పట్టింది అందరికీ వినబడేటట్లు తాను మాట్లాడ జాలనందుకు సభ్యు లకు క్షమాపణ చెప్పుతూ తనకు సమర్పించిన సన్మాన పత్రాలకు, విరాళాలకు గాంధీజీ కృతజ్ఞత తెలిపినారు. "మీ విరాళాలన్నీ కలిపి ఒక మొత్తంగా ఇచ్చి ఉంటే బాగుండేది అందువల్ల విలువగల అనేక నిమిషాల కాలం కలిసి వచ్చేది దురదృష్ట వశాత్తు అట్లా జరగలేదు మన మందరమూ ఒకే దేశీయులమై, ఒకే స్థితిలో ఉన్నప్పటికీ ప్రతి ఒక్కరమూ వేరువేరుగా విరాళాలను, సన్మానాలను సమర్పింప వలెననే కోరికతో ఉంటాము" అని మందలించినారు గాంధీజీ

గాంధీజీ ఇంకా ఇట్లా అన్నారు "ఇంతవరకు బెజవాడవారు రూ 3982-8-0లు నగదు ఇచ్చినారు నేను ఈ పట్టణం విడిచివెళ్ళేలోగా అది ఐదువేల రూపాయలు కావలె బెజవాడకదేమీ కష్టమయిన పనికాదు ఈ సంద ర్భంలో కాశేశ్వరరావు, పట్టాభి సీతారామయ్యగార్లు ఇక్కడ లేనందుకు నేను విచారపడుతున్నాను అయినప్పటికీ మీరందరూ హరిజనోద్యమంలో మీ ధర్మం మీరు నిర్వహించి తీరవలె ఇప్పుడది మన కార్యక్రమంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నది అస్పృశ్యతా దోషం నిర్మూలించకపోయినట్లయితే హిందూ మతం నశిస్తుందని నా భయం తోడివారిని అస్పృశ్యులుగా భావించడం ధర్మం కాదు సవర్ణులకున్న అన్ని హక్కులు హరిజనులకు కూడా ఉండితీరవలె ఇన్ని యుగాలనుంచి హరిజనులకు ఆ హక్కులను లేకుండా చేయడంవల్ల హిందువులు గొప్ప పాపం చేసినారు కాబట్టి సవర్ణులు ప్రాయశ్చిత్తం చేసుకొని పాప విముక్తులు కావలె నేను పోయినచోటులన్నిటిలో జనులు అసంఖ్యాకులుగా

సమావేశమవుతున్నారు అది నేను చేస్తూన్న పనిని వాటామోదించటానికి గుర్తుగా భావిస్తున్నాను ఈ "శుద్ధియజ్ఞం"లో హరిజనులు ద్రవ్యరూపంలో సహాయం చేయనక్కరలేదు కాని వారు శారీరికంగానూ, మానసికంగానూ పరిశుద్ధులయి ఉండవలె అంతరంగిక పరిశుద్ధత "రామనామం"వంటి దైవారాధనవల్ల కలుగుతుంది బాహ్యాపరిశుద్ధత స్నానము, పవిత్రజీవనంవల్ల కలుగుతుంది మద్యపానానికి, చచ్చిన గొడ్డుమాంసానికి, గోమాంసానికి అలవాటుపడిన హరిజనులు ఆ అలవాటు మానవలెనని కోరుతున్నాను వీటికి అలవాటుపడినవారు హిందువుగా పరిగణింపబడరు వారిని దేవాలయాలలో ప్రవేశింపనీయకూడదు తాగుడు నీచాతినీచమయిన పాపం తాగిన వ్యక్తికి తల్లికి భార్యకూ భేదం తెలియదు

ఆంధ్ర హిందీ ప్రచారక సంఘంవారిచ్చిన సన్మానపత్రం గురించి ఒక్కమాట చెప్పవలసి ఉంది వారు దక్షిణ భారతదేశంలో హిందీ ప్రచారానికి చేసిన కృషి నాకు చాలా సంతృప్తికరంగా ఉన్నది ఈ విషయంలో తక్కిన దక్షిణ భారతం అంతటిలోకి ఆంధ్ర ముందంజవేస్తున్నందుకు చాలా సంతోషం మన దేశాన్ని మన జాతిని సేవించడానికి హిందీ పటిష్ఠమయిన పరికరం కనక దాని ప్రచారానికి మీరందరూ కృషి చేయవలెనని కోరుతున్నాను "

ఈ ఉపన్యాసానంతరం తన సన్మానపత్రాలను గాంధీజీ వేలం వేసినారు నందిగామ తాలూకా బోర్డువారి సన్మానపత్రానికి 5 రూపాయలు వచ్చినాయి వర్తకులిచ్చిన సన్మానపత్రానికి రు 5-4-0లు వచ్చింది వ్యవధి లేనందువల్ల ఇతర సన్మానపత్రాలను అక్కడ వేలం పెట్టలేదు గాంధీజీ ఆ తరవాత తన తాత్కాలిక వసతిగృహానికి వెళ్ళినారు

గాంధీజీకి ఆనాడు వచ్చిన విరాళాలలో ఒకటి మొగల్‌రాజపురం వాస్తవ్యురాలు రామశేషమ్మగారు ఇచ్చిన నూటపదహారు రూపాయలు ఆమె వయసు 60 ఆమె అప్పటికి కొద్దికాలం కిందటనే శాసనోల్లంఘనోద్యమంలో ఖైదుకుపోయి విడుదలయివచ్చింది ఆమె ఇవ్వవలసిన జరిమానాకింద ప్రభుత్వం వారు ఆమె ఇంట్లోని వస్తువులను వేలంవేసి జరిమానాను మినహాయించుకొని మిగిలినవి 80 రూపాయలు ఆమెకు తిరిగి ఇచ్చినారు ఆ 80 రూపాయలతో పాటు మరి 36 రూపాయలు చేర్చి మొత్తం 116 రూపాయలు ఆమె హరిజన నిధికి సమర్పించింది

**విజయవాడ మహిళా సంఘంవారి సన్మానపత్రము**

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే"

అనే ప్రమాణం ననుసరించి లోకంలోని దురాచారాల తొలగించడానికి

నవతరించిన పుణ్యమూర్తి! స్వాగతము!

లోకంలో దుర్భరమయిన ఆచారాలలోకెల్ల అగ్రగణ్యమనదగు స్త్రీ సహగమనం మాన్ప నవతరించిన శ్రీ రాజా రామ మోహనరాయలవారి అనంతరం లోకంలోని దీన జనుల మొరలాలకించేవారు లేని తరుణంలో దీన జనావనంకోసం అవతరించిన పతిత పావన మూర్తి! స్వాగతము!

బాపూజీ! భారత దేశంలో జన్మించి, భారత ధర్మాలను నమ్మి ఎన్ని ఇక్కట్లనైనను సహించి హిందూ మతం విడువ జాలకున్న ఏడుకోట్ల జనుల దురవస్థను కనులారచూసి సహించలేక ఆ దీన జనుల దురవస్థకు కారణమయిన అస్పృశ్యతా దోషం బాపడానికి నడుంకట్టిన పుణ్యమూర్తి! స్వాగతము!

హిందూ మతమని బింకం ఆడటమే కాని మతం అంటే ఎరుగని మానవులకు మతమున్నదనే ఉత్కృష్టతను తెలుప నెంచి హిందూ మతోద్ధరణకై ప్రాణాలొడ్డిన త్యాగమూర్తి! వందనాలు

పతిత పావన మూర్తీ! లోకంలో స్త్రీలంటే పురుషుల భోగ్యవస్తువులుగా ఎంచబడి అతి హీనంగా, మృగ తుల్యలుగా చూడబడుతున్నారు

పూజనీయా! సత్య స్వరూపులగు శ్రీమన్నారాయణమూర్తి దరిద్ర నారాయణుడవయిన నీకు ఆయురారోగ్యాల నిచ్చి ప్రోచుగాక "

విజయవాడ మహిళా సంఘము

డిసెంబరు 17 వ తేదీ ఉదయం 7 గంటలకు గాంధీజీ, ఆయన బృందం బెజవాడ నుంచి బయలు దేరినారు బడలికతో గాంధీజీ కారులో నిద్రపోతు న్నారు పునాదిపాడు, కోమటిగుంట, కలువపాముల మొదలయిన గ్రామాల వారు ఆయనకు నిద్రాభంగం చేయటానికి ఇష్టపడక హరిజన నిధికి కానుకలను మాత్రం సమర్పించినారు పునాదిపాడు హరిజననిధికి 116 రూపాయ లిచ్చినారు ముదునూరులో రెండు దేవాలయ ప్రవేశ మహోత్స వాలను గాంధీజీ జరిపినారు ఇంకా చాలా గ్రామాలు చూడవలసి ఉండటంచేత వ్యవధి లేనందువల్ల ఆయన దేవాలయాలలోనికి పోవడానికి వీలు లేక పోయింది "అంత మాత్రాన పరమేశ్వరుని ఆలయంలోకి ప్రవేశించ డం నా కిష్టం లేదని మీరనుకోకూడదు నేను చేసే ప్రతిపని ఆయనదే" అని చెప్పి అర్చకులిచ్చిన ప్రసాదం స్వీకరించి ఆయన అక్కడినుంచి బయలుదేరినారు

ముదునూరు బహిరంగ సభలో పౌరులు 408 రూపాయలున్నూ, కె రాజమ్మగారు రూ 28-14-6 లు, మరికొంత మంది స్త్రీలు మరికొన్ని ఆభర ణాలు హరిజన నిధికి సమర్పించినారు హరిజనులు కొంతమంది వచ్చి గాంధీజీకి పోరతులిచ్చి నారికేళ ఫలాలు సమర్పించినారు

## గుడివాడలో

డిసెంబరు 17 ఉదయం 9-15 నిమిషాలకు గుడివాడలోని సభా మంట పానికి గాంధీజీ ఆయన పరివారం ప్రొఫెసర్ మలాన్కాని, రామ్‌నారాయణ్,

కుమారి ఉమా బజాజ్, మీరా బేన్, శుక్లాగార్లు చేరినారు వేదిక ముందు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, మాగంటి బాపినీడు, మోటూరి సత్యనారాయణ మొదలయినవారు, స్థానిక ప్రముఖులగు అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య, వారి నీడు, హనుమారు అప్పయ్య, కోగంటి వెంకట్రామయ్య, కేతవరపు లక్ష్మీనర సింహారావు, యెర్నేని సుబ్రహ్మణ్యం మొదలయినవారు ఉన్నారు సభా స్థలం యావత్తు పచ్చని తోరణాలతోను, అస్పృశ్యతా నిర్మూలనం బోధించే ఫలకాల తోను మనోహరంగా అలంకరింపబడి ఉన్నది మహాత్ముని ఉపన్యాస వేదిక ఎత్తుగా ఉండి ఖద్దరు వస్త్రాలతో సింగారింప బడిఉంది స్వచ్ఛంద సేవకులు ప్రజలను ఉచిత స్థానాలలో కూర్చోబెట్టినారు సభ జరుగుతూండిన గాంధీ చౌకునకు సమీపంలోగల గృహసౌధోపరి భాగాలు ప్రేక్షకులతో నిండిపోయి నాయి సభా ప్రదేశం, రోడ్లు జనంతో క్రిక్కిరిసి పోయినాయి

గుడివాడ ఆహ్వాన సంఘము, హరిజన సేవక సంఘం, గుడివాడ విద్యార్థి బృందంవారు మహాత్మునకు స్వాగత పత్రాలు సమర్పించినారు ఆహ్వాన సంఘంవారి స్వాగత పత్రం హిందీ భాషలో ఉన్నది తరవాత గుడివాడ ఆహ్వాన సంఘంవారు, నందివాడ, దొండపాడు, బొన్నపాడు, దండిగానపూడి, విరివాడ గ్రామస్థులు మహాత్మునకు దాదాపు 1000 రూపాయల వరకు కానుకలు సమర్పించినారు కొందరు స్త్రీలు తమచేతి బంగారు గాజులు, ఉంగరాలు, బంగారు తీగగల పగడపు తావళాలు సమర్పించినారు పూనూరి వెంకారెడ్డిగారి చిరుత ప్రాయపు కుమార్తె వేదికపైకి వచ్చి తన బంగారు గాజులను గాంధీజీకి సమర్పించింది ఆమె త్యాగానికి మహాత్ముడు హర్షించి ఆమెను తన సహజ మందహాసంతో దీవించినారు సభ నిశ్శబ్దంగా ఉండనందువల్ల మహాత్ముడు సంగ్రహంగా హిందీలో ఉపన్యసించినారు దానిని మోటూరి సత్యనారాయణగారు తెలుగులోకి అనువదించి చెప్పినారు

తరవాత మహాత్ముడు స్వాగత పత్రానికి కృతజ్ఞత తెలుపుతూ అస్పృశ్యత హిందూ సంఘానికి కళంకమని, దానిని నివారించకుంటే భారత జాతి నశిస్తుందని, దానిని సంపూర్ణంగా కడిగివైచి హిందూ సంఘాన్ని సంస్కరించ వలెనని ఉద్బోధించినారు తరవాత మహాత్ముడు, వారి పరివారం సిద్ధాంతమనే గ్రామానికి బయలుదేరి వెళ్ళినారు

దారిలో మహాత్ముడు కొంచెంసేపు బొమ్మలూరు గ్రామంలో ఆగి అక్కడ దేవాలయం హరిజనుల ప్రవేశానికి తెరిచినారు

తరవాత రంగాపురం ఎస్టేట్ జమిందారు శ్రీ అడుసుమిల్లి గోపాల కృష్ణయ్యగారి స్వగ్రామం అయిన సిద్ధాంతానికిచేరి అక్కడ శ్రీ సంతాన వేణుగోపాలస్వామి, శ్రీ దుర్గా నాగేశ్వరస్వామివారల ఆలయాలలో హరి జనులను ప్రవేశింప జేసినారు మహాత్ముడు కొంచెంసేపు ఉపన్యసించినారు ఈ ఆలయాలకు ధర్మకర్త అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యగారే! గాంధీజీ గుడి వాడలో గోపాలకృష్ణయ్యగారి గృహంలో విడిది చేసినారు.

గుడివాడ పంచాయతి బోర్డువారి సన్మానపత్రము

గాంధీమహాత్మా !

మానవోత్తములు, అహింసావ్రత నిరతులును, లోకపూజ్యులు అయిన తమ దర్శనభాగ్యం అయిదు సంవత్సరాలకు తిరిగి మా గ్రామవాసులకు లభించింది ధన్యులమయినాము మీకు మా హృదయపూర్వక స్వాగతము

హరిజనులు జంతువులకంటె హీనంగా చూడబడుతుండటం శోచనీయము, దేశారిష్టము అట్లాంటి కళంకం బాపడానికి ప్రపంచ విఖ్యాతిని, సర్వజనాదరణను పొందినను తాము పూనటం హరిజనుల అదృష్టము, దేశ సౌభాగ్యము

మానవ సేవకై జన్మించిన తమకు భగవంతుడు ఆయురారోగ్యాలు కలగజేసి తమ ఆదర్శసిద్ధిని ప్రసాదించును గాక

గుడివాడ పంచాయతి బోర్డు సభ్యులు

ఖద్దరు వ్యాప్తి

గుడివాడ తాలూకాలో గాంధీజీ చూసిన ఖద్దరు బాహుళ్యానికి విస్మయం చెంది తమ బార్డోలి తాలూకాలోనైతం ఖద్దరు ఇంత విస్తృతంగా ఇంత వ్యాప్తి కాలేదని తమ ఆనందం వెల్లడించినారు

సాయంకాలం 2-15 గంటలకు గాంధీజీని సిద్ధాంతంలో స్త్రీలు ప్రత్యేకంగా దర్శించినారు అప్పుడు చవటపల్లి గ్రామస్థులు 116రూపాయలు బొన్నపాడువారు 30 రూపాయలు, గొల్వేపల్లివారు రూ 48-6-0లు, పెదముద్దాలివారు 15 రూపాయలు హరిజననిధికి కానుకలు సమర్పించినారు స్త్రీలు దాదాపు 500 రూపాయల విలువగల వస్తువులను సమర్పించినారు

చలసాని చంద్రమ్మ నల్లపూసల గొలుసు, బొప్పని సౌభాగ్యమ్మ బోగులజత, యలమంచిలి శశిరేఖమ్మ తోడా, చాపరాల సౌభాగ్యమ్మ బంగారు ఉంగరం, వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ బంగారు గాజు, అట్లూరి వీరమ్మ గాజు, కొల్లి నాగరత్నమ్మ వెండి గొలుసులజత, ఘంటా మల్లికాంబ మిక్కిలినేని సీతారామమ్మలు మట్టెల జతలు, సూరపనేని వెంకటసీతమ్మ కాళ్ళ గొలుసుల జత, కొడాలి అంజమ్మ మట్టెల జత, కొమ్మారెడ్డి శేషమ్మ గాజు, చెరుకూరి సత్యవతమ్మ, పొట్లూరి విమలావతి, ఆచంట శ్రీరామమ్మ, అడుసుమిల్లి పిచ్చమ్మ వీరందరూ తలా ఒక ఉంగరము, పర్వతనేని శ్రీరామమ్మ మూడు గాజులు, ఒక ధోవతి జత, త్రిపిరనేని అన్నపూర్ణమ్మ వెండి గొలుసులు రెండు, కొండపల్లి కోటిరెడ్డి ఉంగరం, మంగపాటి లక్ష్మీనరసమ్మ ఉంగరం, రామిరెడ్డి వెంకయ్య ఉంగరం, ఇంకా కొంతమంది మరికొన్ని నగలను ఇచ్చినారు

తరవాత గాంధీజీ సపరివారంగా అంగలూరుకు వెళ్ళినారు అంగలూరులో శ్రీ పర్వతనేని భూషయ్యగారు 116 రూపాయలు అంగలూరు పౌరులు 60 రూపాయలు, కమలమ్మగారు బంగారు ఉంగరము, లీలావతి

బంగారు నల్ల పూసలు, అమృతం చెవి పోగులు, గాంధీజీకి సమర్పించినారు సవర్ణులు, అవర్ణులు కలిసి కూర్చున్నందుకు గాంధీజీ సంతోషించినారు

సిద్ధాంతము నుంచి అంగలూరులో, కౌతవరంలో, పెడనలో ఆగుతూ గాంధీజీ, వారి పరివారం మచిలీపట్టణం చేరేసరికి సాయంకాలం సుమారు 4-30 గంటలయింది ఆంధ్ర జాతీయ కళాశాలలో సాయంకాలం 6 గంటలకు బహిరంగ సభ జరిగింది కృష్ణాజిల్లా బోర్డు, మచిలీపట్నం మునిసిపాలిటీ, హిందీ ప్రేమీమండలి, తూర్పు కృష్ణా హిందూ సేవాసంఘము, తూర్పు కృష్ణా ప్రజా సంఘము, స్త్రీ సంఘము, మచిలీ పట్టణపు విద్యార్థి సంఘము, కృష్ణాజిల్లా ఆది మాంధ్రుల సంఘాలవారు గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు మచిలీ పట్టణం మున్సిపల్ సన్మాన పత్రం శ్రీ శీలం జగన్నాధరావు నాయుడుగారు చదివినారు అఖిలభారత చర్మాసంఘం, ఆంధ్ర శాఖవారు, హరిజనులు తయారు చేసిన ఖద్దరు వస్త్రాలును, సన్న ఖద్దరును, మేలురకపు తివాచీని, చిత్రాసనమును గాంధీకి కానుకగా సమర్పించినారు

తరవాత మహాత్మాజీ ఉపన్యసిస్తూ "నేడు మనతో బాటు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ఇక్కడ లేనందుకు నేను చాలా విచారపడుతున్నాను డాక్టర్ పట్టాభి బాహ్యా శరీరం మనకు దూరమై ఉన్నప్పటికీ వారి ఆత్మ సదా మనతో సంచరిస్తూనే ఉంటుందని నేను విశ్వసిస్తున్నాను శ్రీ కోపల్లె హనుమంతరావు త్యాగంచే పునీతమయిన ఈ స్థలానికి పండెండేళ్ల తరవాత తిరిగి నేను రాగలగడం నా అదృష్టము

హరిజనులను ఉద్ధరించి సవర్ణులతో పాటు సరిసమాన హక్కులతో దేవాలయ ప్రవేశం కలిగి స్తేనేగాని మనకు మనశ్శాంతి ఉండదు హెచ్చు తగ్గులను మన మనసులనుంచి పారదోలవలె అస్పృశ్యత శాస్త్ర సమ్మతంగాదు ఖద్దరు భాండారం నా ఎదుటనే కనిపిస్తున్నది నేనిప్పుడు అక్కడకుపోయి వ్యాపారం చేస్తాను

హరిజనులపట్ల మనం చాలా అక్రమం చేసినాము ఆ పాప పరిహారార్థం హరిజనాభ్యుదయానికి ధన సహాయంచేసి తీరవలె నారీ రత్నాలు తమ ఆభరణాలివ్వవలె అన్నారు.

వెంటనే సభలో విరివిగా హరిజననిధికి ద్రవ్యం, ఆభరణాలు సమర్పించడం జరిగింది

గాంధీగారు పరివారంతో సహా చల్లపల్లి వెళ్ళి రాత్రి 9 గంటలకు బందరు చేరుకొన్నారు మహాత్మునికి జాతీయ కళాశాలలో బస ఏర్పాటు చేసినారు. వారి వసతి భోజన సదుపాయాల విషయమై శ్రీ ముట్నూరి కృష్ణారావు గారు శ్రద్ధ తీసుకొన్నారు.

## కృష్ణా జిల్లా బోర్డు సన్మానపత్రము

మహాత్మాజీ!

హరిజనోద్ధరణకోసం తాము ఆంధ్ర దేశంలో ప్రప్రథమంలో పర్యటన ప్రారంభ గౌరవం మా కృష్ణా మండలానికి ఇవ్వడంవల్ల మేమెంతో సంతసిస్తున్నాము

భారతదేశ ప్రజల కోసం తాము చేస్తున్న సేవ అప్రతిమానము అంటరానితనం బాపి సర్వమానవ సౌభ్రాత్రమును పౌర జీవనానికి సమాన గౌరవ సభ్యాలను కలిగించటంకోసం తాము సూచించిన కార్యవిధానం ఆచరణయందుంచడానికి మేముసర్వవిధాల ప్రయత్నిస్తున్నామని తమకిక్కడ మనవిచేస్తున్నాము అధికారానికి వచ్చిన కొద్ది కాలంలో మా బోర్డు కింద ఉన్న అన్ని పాఠశాలలలో హరిజనులకు ఉచిత విద్యా సౌకర్యాలొనగూర్చినాము హరిజనవాడలలో కూడా ప్రత్యేక పారిశుద్ధ్య వైద్య సౌకర్యాలు కలిగించి కారతమ్యాలు రూపుమాపుటయే మా ఆశయంగా ఉంచుకొన్నాము

భగవంతుడు తమకు ఆయురారోగ్య శక్తుల నొసంగుగాక అని ప్రార్థిస్తున్నాము

కృష్ణామండల బోర్డు సభ్యులు
బందరు

ఈ సన్మానపత్రాన్ని కృష్ణా జిల్లా బోర్డు అధ్యక్షులు శ్రీ చల్లపల్లి రాజాగారు చదివినారు

## బందరు శ్రీ సంఘంవారి సన్మానపత్రము

బాపూజీ!

అఖిల భారతీయ సంతానానికి పితృసమానులయిన మీ శుభాగమనంతో మా ఆత్మలు పల్లవించినాయి మీకు మావట్ల ఇట్లాంటి వాత్సల్యమే నిరంతరం వర్ధిల్లుగాక తరాలనుంచి హిందూమతాన్ని అంటుకొని ఉన్న ఈ అంటరానితనం అవల ద్రోలనేతెంచిన మంత్ర సిద్ధుడవుగదా నీవు! మీ దర్శన మాత్రాన ఈ అస్పృశ్యతా పంకం క్షాళితమవునుగాక

మహాత్మా!

బుద్ధ భగవానుడు ప్రారంభించిన సాంఘికోద్ధరణ మీ ఈ హస్తాల సంపూర్ణత్వం పడయనోచింది మీ ఈ సత్కృతి ఆచంద్రార్కము మాకు ఆదర్శమగుగాక

పతిత పావనా!

మేమందరం మీ ఆజ్ఞావిధేయులము మాకు మా ఆత్మలకు ఏది భద్రమో దానిని ఉపదేశించి మమ్ము తరింపజేయండి

లోకోద్ధారకా!

'తమ ఇష్టదైవమయిన "రఘుపతిరాఘవ రాజారాం" తమకు, కస్తూరి

బాయి తల్లికి సంపూర్ణ ఆయురారోగ్యాల నిచ్చుగాక

బృందావనపుర స్త్రీ సంఘం
బందరు

## బందరులో హరిజననిధి

బందరులో గాంధీ సన్మాన సంఘంవారు సమర్పించిన హరిజననిధి వివరాలు

| | |
|---|---|
| ఆంధ్ర ఇన్సూరెన్స్ కంపెనీవారు, వారి సిబ్బంది | 200-0-0 |
| స్త్రీలు | 116-8-0 |
| కృష్ణా అర్బన్ బాంక్ | 25-0-0 |
| హిందూ కాలేజి సిబ్బంది, విద్యార్థులు | 28-13-0 |
| నోబుల్ కాలేజి సిబ్బంది | 39-0-0 |
| ,, ,, విద్యార్థులు | 65-4-0 |
| చిల్లర | 21-15-0 |
| టికెట్లు | 420-0-0 |
| శ్రీ గొల్లపల్లి రాజాగారు | 116-0-0 |
| | 102-8-0 |

## బందరులో సనాతనులు

మచిలీపట్నంలోని స్థానిక సనాతన ధర్మ నిష్ఠావరులు గాంధీజీ రాకుక ఒక వారం రోజుల ముందునుంచి అస్పృశ్యతా నివారణకు, హరిజనుల దేవాలయ ప్రవేశాలకు ప్రతికూలంగా పట్టణంలోఉపన్యాసాలు చేయడం, సభలుచేసి చర్చించడం ప్రారంభించినారు గాంధీజీ మచిలీపట్నం వచ్చినప్పుడు వారిని దర్శించి వారితో హరిజన దేవాలయ ప్రవేశం గురించిన విషయం చర్చించవలెనని కూడా మొట్టమొదట సంకల్పించినారు కాని వారిలో కొంతమంది తమకు అంతరాత్మ సంబంధమయిన అభ్యంతరాలున్నవని చెప్పినందువల్ల ఆ కార్యక్రమం విరమించుకొన్నారు కాని డిసెంబరు 16వ తేదీన సనాతన ధర్మసంస్థవారు మహాత్ముడు, ఆయన అనుచరులు ప్రారంభించిన సనాతన ధర్మవిరుద్ధ కార్యక్రమమయిన అస్పృశ్యతా నివారణ ప్రచారంలో ఏ విధమయిన జోక్యం కలిగించుకోకూడదని కరపత్రాలు వేసి పంచిపెట్టినారు

అంతటితో ఆగక అస్పృశ్యతా నివారణ గురించి తమ అసమ్మతిని తెలుపుతూ వారు డిసెంబరు 17న గాంధీజీకి ఒక లేఖ వ్రాసినారు

## దేవాలయ అర్చకుల విజ్ఞప్తి

ఆంధ్ర జాతీయ కళాశాల తోటలో డిసెంబరు 19 సాయంకాలం ఆంధ్ర రాష్ట్ర దేవాలయ అర్చకుల సంఘంవారు హరిజన దేవాలయ ప్రవేశం గురించి సనాతనవాదులతో గౌరవనీయమయిన ఒక ఒడంబడికను సూచిస్తూ గాంధీజీకి ఒక విజ్ఞప్తిని అందజేసినారు వారు గాంధీజీ ప్రారంభించిన హరి జనాభ్యుదయ సిద్ధాంతంతో ఏకీభవిస్తూ కార్య విధానంలో మాత్రం భేదిస్తూన్నట్లు వ్రాసినారు సనాతనవాదులకు అస్పృశ్యతా నివారణ సంఘం వారికి రాజీగా కాశీ కృష్ణాచార్యులుగారి పథకం ప్రకారం, హరిజనులకు శైవ వైష్ణవ మతాలను ఇప్పించిన, వారికి దేవాలయ ప్రవేశార్హత కలగచేయ వచ్చునని అందుకు ఉభయవర్గాలవారు ఒక ఉమ్మడి సమావేశం జరుపుకోవడం సముచితంగా ఉంటుందని కూడా అర్చక సంఘంవారు సూచించినారు

## గాంధీజీ ప్రత్యుత్తరము

ఇందుకు గాంధీజీ ఆంధ్ర రాష్ట్ర అర్చక సంఘంవారికి వ్రాసిన జవాబు డిసెంబరు 22న చేరింది దేవాలయ ప్రవేశం గురించి క్లిష్టసమస్యను పరిష్క రించడంలో సంప్రదించడానికి, వారిసమావేశంలో పాల్గొనడానికి సంతోషంగా ఇష్టపడుతూన్నట్లు గాంధీజీ ప్రత్యుత్తరంలో ఉంది అర్చకసంఘ కార్యదర్శి మహాత్మాజీ ప్రత్యుత్తరం చూసుకొని, సనాతనుల సంస్కరణవాదుల ఉమ్మడి సమావేశం ఏర్పాటు చేయడానికి మహాత్మాజీ సలహాను తీసుకొనేటందుకు సాధ్యమయినంత త్వరలో తమకు అవకాశమివ్వవలెనని గాంధీజీకి ఒక లేఖ వ్రాసినారు పండిత కాశీ కృష్ణాచార్యులవారికి కూడా గాంధీజీ వ్రాసిన జవా బును పంపి ఉమ్మడిసభకు కావలసిన ఏర్పాట్లకు వారి సహకారం కూడా పొంద గలమని గాంధీజీకి అర్చకసంఘ కార్యదర్శి తెలియపరిచినారు

## చల్లపల్లిలో

మహాత్మాగాంధీ ఆయన బృందం డిసెంబరు 17 రాత్రి 7-45కు మచిలీ పట్నంనుంచి చల్లపల్లి చేరినారు చల్లపల్లిగారి ఉన్నత పాఠశాల ఆవరణలో సమావేశం ఏర్పాటు చేయడం జరిగింది ఆయన సభాస్థలానికి చేరగానే ప్రజలు అత్యుత్సాహంతో ఆహ్వానించినారు గ్రామమంతా ఏమూల చూసినా జన సమూహంతో నిండిపోయింది ఉపన్యాసవేదిక తోరణాలతోను, ఆర్చీలతోను కలకలలాడుతూ అలంకరింపబడింది శ్రీ చల్లపల్లి రాజాగారు అతిక్రమించ రాని కొన్ని అవాంతర కారణాలవల్ల సభకు రాజాలకపోయినారు కాని వారి దివాను శ్రీ జంపాల వెంకటేశంచౌదరిగారు చల్లపల్లిలోని ప్రముఖ పౌరులు మహాత్మాజీని ఉచిత గౌరవాలతో ఆహ్వానించి సత్కరించినారు

గాంధీజీ మోటారు దిగగానే ప్రజల కరతాళధ్వనులు, జయధ్వానాలు మిన్నుముట్టినాయి హరిజననిధికి బంగారపు ఉంగరాలు, గొలుసులు, నగలు సమర్పించినారు వడుకునూలు బంతులు, పండ్లు, ఖద్దరు వస్త్రాలు వేదికకు

అన్ని వైపులనుంచి వర్షించినాయి గాంధీజీ వాటినన్నిటినీ స్వీకరించినారు

తరవాత మహాత్మాజీ హిందీలో ప్రసంగిస్తూ హిందూమతంనుంచి అస్పృశ్యతా కళంకం తొలగించవలెనన్నారు తాము 4 గంటలకే చల్లపల్లి రావలెనని నిర్ణయించుకొన్నప్పటికి ఐందరు వచ్చేసరికే 4-15 అయినందున తాము సకాలంలో రాలేకపోయినందుకు మన్నించవలెనని సభ్యులను కోరినారు తనమీద ఆ ప్రజలకున్న ప్రేమయే తననా గ్రామానికి ఆకర్షించిందని, ఖద్దరు కార్యక్రమంలో ఆ ప్రాంతాలలోని గ్రామస్థులు చాలా ఉత్సాహం చూపుతున్నందుకు తనకు సంతృప్తికరంగా ఉన్నదని కూడా అన్నారు

ఘంటశాలలో ఇటీవలనే మూడు దేవాలయాలలో హరిజనులకు ప్రవేశార్హత కలిగించినందుకు తనకు సంతోషంగా ఉన్నదని, అందుకు ఆ గ్రామస్థులను తాను హృదయపూర్వకంగా అభినందిస్తున్నానని వారి ఆదర్శాన్ని ఇతరులు కూడా అందుకొని అట్లా ప్రవర్తించవలెనని కోరుతున్నానని తమ ప్రసంగంలో గాంధీజీ విశదీకరించినారు హరిజనులను దేవాలయంలో ప్రవేశించనీయడం ఘంటశాల గ్రామస్థుల న్యాయబుద్ధిని తెలియచేస్తుందని కూడా అన్నారు

హరిజనులు పరిశుభ్రమయిన పవిత్ర జీవితాలను గడపవలెనని మద్యపానం, మృతజంతు మాంసం తినడం మానవలెనని కోరినారు తన సలహాను గ్రహించి హరిజనులు తమ అభ్యున్నతికి తాము సహకరించగలరని ఆశిస్తున్నానని చెప్పి గాంధీజీ తన ఉపన్యాసం ముగించినారు

రాత్రి 8-30 గంటలకు జయనినాదాలతో సభ ముగిసింది గాంధీజీ ఆయన బృందం తిరిగి మచిలీపట్టణానికి వెళ్ళినారు

డిసెంబరు 17వ తేదీన గాంధీజీకి చల్లపల్లిలో హరిజన నిధికోసం సమర్పింపబడిన విరాళాల వివరాలు

## హరిజన సేవక నిధికి విరాళాలు

| | | |
|---|---|---|
| చల్లపల్లి గ్రామవాసులు | | 150-0-0 |
| ఘంటశాల | | 116-0-0 |
| పురిటిగడ్డ ఖాదీ సంస్థ | | 116-0-0 |
| నాగాయతిప్ప గ్రామస్థులు | | 27-8-0 |
| కాదేవల్లి | ,, | 20-0-0 |
| నర్సింపాలెం | ,, | 20-0-0 |
| పెదప్రోలు | | 10-0-0 |
| కాజ | ,, | 16-0-0 |

| | |
|---|---|
| దాలిప్రరు .. | 15-0-0 |
| ఇతర వసూళ్ల మొత్తం | 400-0-0 |
| ఎథలో వసూలయింది | 40-0-0 |
| వసూలయిన నూలువిలువ సుమారు | 100-0-0 |
| వస్త్రాలు సుమారు విలువ | 50-0-0 |
| నాదెళ్ల రంగనాయకమ్మగారు | 12-4-0 |

కావూరు కోదండరామయ్యగారు

ఒక గడియారం, వెండి గొలుసుతో

కొత్రపాటి వెంకటశివరామకృష్ణప్రసాద్

(అంకమ్మగారి కుమారుడు)

హరిజనుల నివాసానికి అర ఎకరం స్థలము

| | |
|---|---|
| అంకమ్మగారి కుమార్తె భ్రమరాంబగారు | బంగారు గాజుల జత |
| గొట్టిపాటి సరస్వతమ్మగారు | బంగారు గాజుల జత |
| దేవాభక్తుని బసవనాగమ్మగారు | బంగారు గాజుల జత |
| కొత్రపాటి లక్ష్మమ్మగారు | .. |
| నాదెళ్ల భాస్కరహృదయాలయ | .. |
| గుత్తికొండ అచ్చయ్యగారు | బంగారు ఉంగరం |
| చంద్ర శ్రీనివాసరావుగారు | .. |
| కిలారి వెంకటత్రిపురాంబగారు | |
| కొత్రపాటి రాజారాం మోహనరావుగారు | .. |
| చంద్ర దుర్గాఅన్నపూర్ణమ్మగారు | బంగారు ఉంగరం |

**మచిలీపట్టణము**

గాంధీజీ మచిలీపట్నంలో ఉన్న రెండోరోజున విశ్రాంతి తీసుకొని 'హరిజన్' పత్రికకు వ్యాసాలు వ్రాయడంలోను, స్థానిక నాయకులతో సంభాషించడంలోను కాలం గడిపినారు ఆయన మౌనవ్రతదినం గడిచిన తరవాత డాక్టర్ పట్టాభిగారి గృహిణి శ్రీమతి రాజశ్వేరమ్మగారు, వారి కుటుంబ సభ్యులు ఆయనను దర్శించినారు కొండ వేంకటప్పయ్యపంతులుగారు తనతో మాట్లాడడానికి వచ్చినప్పుడు ఆంధ్రదేశపు భీష్మాచార్యులు వచ్చినారని గాంధీజీ

ఆయనను ఆహ్వానించినారు

రామయోగిని అని పిలువబడే పిచ్చమ్మ అనే హరిజన భక్తురాలు కూడా గాంధీజీని దర్శించింది వారు బందరునుంచి బెజవాడకు పోయేముందు మినర్వా సినిమాహాలులో స్థానిక నటకులు ప్రదర్శించిన "నందనారు" అనే తెలుగు నాటకాన్ని చూసినారు ఆ నాటకశాల యజమానులు గాంధీజీకి ఒక వెండి పళ్లెమును, వెండి చట్రంలో ఉంచిన గాంధీజీ ఛాయాపటాన్ని మహాత్మునికి బహూకరించినారు "నందనారు" నాటకం ఏర్పాటు చేసినవారు దానికి వసూలయిన 400 రూపాయలను హరిజననిధికి విరాళంగా ఇచ్చినారు గాంధీజీ దానిని తీసుకొని వారికి కృతజ్ఞత తెలిపినారు తరవాత బెజవాడకుపోతూ తోవలో పామర్రు, కంకిపాడు గ్రామాలలో కొన్ని నిమిషాలు ఆగి హరిజన నిధికి ఆ రెండు గ్రామాలవారు ఇచ్చిన మొత్తం 250 రూపాయలను స్వీకరించినారు

కృష్ణా జిల్లాలో సుమారు 10,000 రూపాయలవరకు హరిజననిధి వసూలయింది

## హరిజన నాయకుల విజ్ఞాపన పత్రము

గాంధీజీ విజయవాడలో ఉండగా ఆంధ్ర దేశంలోని వివిధ జిల్లాల హరిజన నాయకులు ఆంధ్రరాష్ట్ర అస్పృశ్యతా నివారణ సంఘ కార్యవర్గ సభ్యుడు కుసుమ వెంకట్రామయ్యగారి అధ్యక్షత కింద సమావేశమై గాంధీజీకి ఒక విజ్ఞప్తిని తయారుచేసి సమర్పించినారు ఆ సమావేశంలో గుంటూరు జిల్లా నుంచి డాక్టర్ టి జియ్యర్ దాసు, నెల్లూరి నుంచి కమతం షణ్ముఖం, రాజమహేంద్రవరం నుంచి హరిజన కవీంద్ర వైద్యవిద్వాన్ కుసుమ ధర్మన్న మొదలయినవారు పాల్గొన్నారు

ఆ విజ్ఞాపనపత్రంలో వారు హరిజన సేవక సంఘ నిర్మాణం గురించి దాని కార్యక్రమం గురించి కొన్ని సూచనలు చేసినారు అప్పటి ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యవర్గంలో 2/3 వంతు ఆయా జిల్లాలనుంచి బాధ్యత గల హరిజన నాయకులను నియమించవలెననీ అధ్యక్షు, కార్యదర్శులుగా హరిజనులే ఉండవలెనని, కార్యవర్గంలోని మూడో వంతు సభ్యులు రాజకీయాలతో సంబంధంలేని సవర్ణులు ఉండవలెననీ వారు సూచించినారు అంతే గాక రెండు ఉపసంఘాలను కూడా నియమించవలెనని, అందులో ఒకటి హరిజన నాయకులతోను, రెండోది సవర్ణులతోను ఏర్పాటు కావలెనని, ఈ రెండు ఉపసంఘాలలో మొదటిది హరిజన వాడలలోను, రెండోది గ్రామాలలోను తిరిగి హరిజనాభ్యుదయానికి, అస్పృశ్యతా నివారణకు ప్రచారం చేయవలెనని కూడా వారు సూచించినారు విద్యార్థి వేతనాల పంపిణీల విషయం హరిజన నాయకులు సంప్రదింపులతో జరగవలెనని, రాష్ట్ర, జిల్లా, తాలూకా హరిజన సేవక సంఘాలకు వేతనంతో కార్యదర్శులు నియమింపబడేటట్లయితే వారు హరిజనులు

గానే ఉండవలెనని కూడా విజ్ఞప్తి చేసినారు

తూర్పు గోదావరిలోని పొన్నమండ హరిజన ఆశ్రమ సంస్థాపకుడు శ్రీ ఉండ్రు సుబ్బారావు గాంధీజీ పర్యటన కార్యక్రమంలో తన ఆశ్రమం దర్శించవలెనని కూడా వారు ప్రార్థించినారు. గాంధీజీ ఆంధ్రదేశ సంచారంలో ఆయాజిల్లాలకు సంబంధించిన హరిజన నాయకుని ఒకరిని ఆయన వెంటఉంచుకో వలెనని కూడా వారు గాంధీజీని ఆ విజ్ఞాన పత్రంలో కోరినారు

ఉండ్రు సుబ్బారావుగారు మహాత్మాజీ కోరికపైన కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారి తంతివార్త ననుసరించి తన ఉపవాసం విరమించినారు

## సూలూరు పేట-మహాత్మునకు సన్మానము

గాంధీజీ బెజవాడ నుంచి రైలులో మద్రాసు వెళ్ళుతున్నారని తెలిసి సూలూరుపేట రైలు స్టేషన్‌వద్ద ఆయన రాకకు ఎదురు చూస్తూ చుట్టుపట్ల గ్రామస్థులు సుమారు ఐదువేల మందికి పైగా చేరినారు గాంధీజీ రైలులో నుంచి దిగలేక పోయినారు అప్పుడక్కడ మూగిన జనమంతా ప్లాట్ ఫారం మీదికి ఆయన దర్శనంకోసం తోసుకొని వచ్చినారు గాంధీజీ రైలుపెట్టె ద్వారంలో నిలబడి అక్కడ చేరిన ప్రజలకు కనిపించినారు సూలూరుపేట తాలూకా బోర్డువారు గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు

## సన్మాన పత్రము

ఆర్యవర్యా!

హరిజనోద్ధరణార్థమై మీరు చేస్తున్న పర్యటన జయప్రదమవుతున్నందుకు మిమ్మభినందిస్తున్నాను రాట్నం పునరుద్ధరించి దేశంలోని నిరుపేదలకు మీరు అన్న వస్త్రాలను కల్పిస్తున్నారు

నిమ్న జాతుల నుద్ధరించటానికి మీరు హరిజనోద్యమం ప్రారంభించినారు అగ్ర వర్ణాలవారు అస్పృశ్యులపట్ల చేసిన పాపానికి పరిహారాన్ని మీరు చూపి హిందూ సంఘాన్ని ఉద్ధరించ బూని ఉన్నారు దేశమంతా మేల్కొన్నది

హరిజనోద్ధరణార్థం మా తాలూకా బోర్డువారు చెప్పదగిన కృషి ఏమీ చేయలేదు మీరు చేపట్టిన ఉద్యమానికి 116 రూపాయలను కానుకగా ఉడుతా భక్తిగా సమర్పించు కొంటున్నాము

సూలూరుపేట తాలూకాబోర్డు
అధ్యక్షుడు, సభ్యులు

ఈ సన్మాన పత్రం వేలం వేయగా 5 రూపాయలు చిల్లర వచ్చింది కొందరు స్త్రీలు గుంపు మధ్యనుంచి కష్టపడి మహాత్ముని సన్నిధికి తోసుకొని వచ్చి కొన్ని నగలనూ, కొంత నగదునూ సమర్పించుకొని వెళ్ళినారు

సూలూరుపేటలో మహాత్ముని దర్శించ లేనివారు రైలెక్కి పొన్నేరు వరకు వెళ్ళినారు

పొన్నేరువద్ద

పొన్నేరు రైలు స్టేషన్‌లో మహాత్ముని దర్శనం కోసం వేలకొద్దీ జనం చేరినారు మహాత్ముడు హరిజన నిధికి ద్రవ్యం ఇస్తేనే తప్ప వారికి కనిపించ నన్నారు వెంటనే వలంటీర్లు టోపీలు చేతపట్టుకొని వసూళ్లు మొదలెట్టినారు కొంత సొమ్ము వసూలయింది

ఇంతలో ఒక స్త్రీ, రైలుపెట్టె ద్వారం దగ్గర నిల్చొని "డబ్బీయండి" అని చేయి జాచి ఉంచిన మహాత్ముని వద్దకు పోయి ఒక ఉంగరం, కొన్ని రూపాయలను ఆయన చేతిలో పెట్టి రసీదు ఇవ్వమని అడిగింది మహాత్ముడు చిరునవ్వుతో "రసీదు కావలెనా" అని హిందీలో చేవ్రాలు చేసిఇచ్చినారు ఆమె ఇంగ్లీషులో కూడా చేవ్రాలు కావలెనన్నది

"నీవు కావలెనని కోరితే అరవంలో నా చేవ్రాలు ఇస్తాను కాని ఇంగ్లీషులో ఇవ్వను" అని అరవంలో చేవ్రాలు చేసి ఇస్తూ ఆ చేవ్రాలుకు ఆమెను బంగారు గాజుల జత ఇవ్వమని కోరినారు ఆమె చేతనున్న గాజులు తీసి సమర్పించు కొన్నది

ఆమె పేరడగగా ఎవరికీ చెప్పలేదు చివరకు రుక్మిణి అని చెప్పింది కాని ఆమె ఎవ్వరో ఎవరికీ తెలియదు

మద్రాసు

విజయవాడ నుంచి గాంధీజీ మద్రాస్‌కు డిసెంబరు 20 ఉదయం కలకత్తా మెయిల్‌లో వచ్చినారు మెయిలు 40 నిమిషాలు ఆలస్యంగా వచ్చింది గాంధీజీ ఆహ్వాన సంఘం వారితో రైల్వే ఉద్యోగులు చక్కగా సహకరించడంచేత ఆయన ప్లాట్‌ఫారంమీదదిగి స్టేషన్ వెలుపలకు తేలికగా వెళ్లడానికి వీలయింది స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఆయనను ఆహ్వానించేటందుకు కొంతమంది ప్రముఖు లకు మాత్రమే రైల్వే అధికారులు అవకాశం కల్పించినారు

గాంధీజీ ఉన్న మూడో తరగతి బండి బేసిన్ బ్రిడ్జ్ స్టేషన్ దగ్గరే వేరు చేయబడి సెంట్రల్ స్టేషన్‌కు చేరింది గాంధీజీని రైలు ప్లాటుఫారం మీద చూసిన వెంటనే "మహాత్మాగాంధీకి జై" అనే నివాదాలు మిన్నుముట్టినాయి స్టేషన్ వెలుపల ఉన్న జనసమూహం సైతం ఈ నినాదాల నందుకొని హర్ష ధ్వానాలు చేసినారు

గాంధీజీకి ప్లాట్‌ఫారంపైన కె భాష్యం పూలదండ వేసినారు స్టేషన్ వెలుపల ఉన్న కారులో గాంధీజీ ప్రవేశించగానే అనేక మంది ఆయనను పూల దండలువేసి సత్కరించినారు

మద్రాసు హరిజన సేవక సంఘ అధ్యక్షులు శ్రీ వి భాష్యమయ్యం గారిని శ్రీ కె భాష్యంగారు గాంధీజీకి పరిచయం చేయగా ఆయన వారితో సంగ్రహంగా ముచ్చటించినారు అప్పుడు శ్రీమతి మార్గరెట్ కజిన్స్ గాంధీజీకి

దండ వేసింది "హరిజన్" సంపాదకుడు శ్రీ ఆర్ వి శాస్త్రిగారి భార్య గాంధీజీకి నమస్కరించి ఆయనపట్ల తన గౌరవం వెల్లడించింది

రైల్వే ప్లాట్‌ఫారం మీద గాంధీజీని ఆహ్వానించిన వారిలో శ్రీయుతులు కాశీనాథుని నాగేశ్వరరావు, మౌలానా యాకూబ్ హుస్సేన్, డాక్టర్ వరద రాజుల నాయుడు, రామనాథ గోయెంక, ఆర్ వి శాస్త్రి, వి వెంకట సుబ్బయ్య, వి యల్ శాస్త్రి, గద్దె రంగయనాయుడు, శ్రీపాద శంకర్, సి వెంకటరంగం నాయుడు, యం భక్తవత్సలం, హరిహరశర్మ మొదలయిన వారేకాక కొంత మంది గుజరాతీలు, పార్సీలుకూడా ఉన్నారు వీరితోపాటు శ్రీమతి వి భాష్యమయ్యంగారు, శ్రీమతి కె. భాష్యం, శ్రీమతి అమ్ముస్వామి నాథన్, శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి, శ్రీమతి అంబుజమ్మాళ్, శ్రీమతి కోడయ్ నాయకి అమ్మాళ్ కూడా ఉన్నారు

గాంధీజీ కారు జనసమూహంలో నుంచి రిప్పన్ భవనానికి పోవడానికి చాలా కష్టమయింది మొత్తం మీద గుంపులు చాలా ప్రశాంతంగానూ, క్రమ బద్ధంగానూ ప్రవర్తించినారు

## కార్పొరేషన్‌కు గాంధీజీ రాక

మహాత్మాజీ రైలు స్టేషన్ నుంచి కార్పొరేషన్ భవనానికి రావడంలో రోడ్లు క్రిక్కిరిసి ఉండటంచేత ఆయన కారు బహు నెమ్మదిగా నడువ వలసి వచ్చింది అంతకు పూర్వమే కార్పొరేషన్ భవన ఆవరణం అంతా ప్రజలతో క్రిక్కిరిసి పోయింది మహాత్ముని దర్శించటానికి వీలుగా ప్రజలు కొన్ని ఎత్తయిన ప్రదేశాలలో ఎక్కి నిలబడినారు కౌన్సిల్ హాలు భారతీయ, యూరోపియన్ స్త్రీ పురుషులతో నిండి పోయింది.

గాంధీజీ రాగానే మేయరు, కార్పొరేషను కమిషనర్ ఆయనను ఆహ్వా నుంచి వేదిక దగ్గరికి తీసుకొనివెళ్ళినారు

యూరోపియన్ సభ్యులతో సహా నలభై మంది కార్పొరేషన్ సభ్యులు ఆ సభకు హాజరయినారు మేయరు వారందరిని గాంధీజీకి పరిచయం చేసిన తరవాత తమ సన్మాన పత్రం చదివినారు

## సన్మాన పత్రము

అయ్యా!

"చిరకాలం తరవాత రాష్ట్రానికి ప్రధాన నగరమయిన మద్రాస్‌కు మిమ్ములను ఆహ్వానించే భాగ్యం కలిగి నందుకు ఈ కార్పొరేషన్ మేయరు సభ్యుల మయిన మేము ఎంతో ఆనందిస్తున్నాము

ముఖ్యంగా పేదవారి అభ్యున్నతిలోను పౌర సమస్యలలోను అత్యాసక్తి గల మిమ్ములను ఆహ్వానించటం మాకు చాలా ఆనందంగా ఉంది

ఈ నగరంలోని గృహ సమస్యను పరిష్కారం చేయటంలో మా

కౌన్సిల్ ఇప్పుడు శ్రద్ధ తీసుకొంటున్నదని మీకు మేము తెలుప గలుగుతున్నందుకు మాకు చాలా సంతోషంగా ఉన్నది

ఈ సమస్యను పరిష్కరించడంలో మీ సలహా, సహాకారాలను మేము కోరుతున్నాము

మీ పట్ల మాకుగల గౌరవానురాగాలను గురించి మీకు వేరుగా మనవి చేయనక్కర లేదు

మీరు భారత దేశాన్ని మానవ జాతిని సేవించడానికి చిరాయుష్మంతులు కాగలరని విశ్వసిస్తున్నాము "

ఈ సన్మానపత్రం సుందరమయిన రజత పేటికలో ఉంచి గాంధీజీకి సమర్పించడం జరిగింది

**మహాత్ముని ప్రత్యుత్తరము**

"మేయర్ గారూ ! కార్పొరేషన్ సభ్యులారా ! స్నేహితులారా !

మీరు ఈ నగరంలో రెండోసారి ఈ సనానపత్రం నాకు సమర్పించి నన్ను గౌరవించినందుకు నేను చాలా కృతజ్ఞుణ్ణి నాకు దక్షిణ భారతానికి రావడం ఎల్లప్పుడూ ఆనందదాయకంగానే ఉంటుంది నేను చిరకాలంనుంచి దక్షిణ దేశంతో సంబంధం కలిగి ఉన్నానన్న విషయం మీకందరికీ బాగా తెలిసిందే నేటాల్ కు వలసపోయిన భారతీయ కూలిజనంతో నాకు 1893 నాటికే సన్నిహిత సంబంధం కలిగింది అక్కడ ముఖ్యంగా దక్షిణ ఇండియావారితోను, అందులో మరీ తమిళులతోను నాకెక్కువ సంబంధం కలిగింది ఒక తమిళుని కష్టదశలో పని చేయగలిగిన అదృష్టం నాకు నేటాల్ లో మొట్టమొదట కలిగింది ఆనాటినుంచి నాకు దక్షిణ భారతదేశంతో కలిగిన సంబంధంకంటె సన్నిహితమయిన సంబంధం భారతదేశంలోని ఏ ఇతర ప్రాంతంతో కలగలేదు

నేను గణనీయమయిన ఈ కార్పొరేషన్నుంచి ప్రప్రథమ సన్మానపత్రం స్వీకరించిననాడు నా అంతట నేను నైపుణ్యంగల పాకీ వాడనని నామకరణం చేసుకొన్నాను అది మీలో చాలామందికి తెలియకపోవచ్చు కనీసం కొంతమంది పౌరులకు కొంతమంది కౌన్సిలర్లకైన తెలిసి ఉంటుంది ఆనాడు మీ వీధులు ఎంత దుస్థితిలో ఉన్నవో, అపరిశుభ్రమయిన పనులకు వినియోగింపబడుతున్నవో చెప్పి ఉన్నాను బాగా తెలిసినవారు కూడా వీధులను దుర్వినియోగం చేస్తున్నారు ఇప్పుడు ఆ పరిస్థితి చాలా వరకు మెరుగయినదని భావిస్తున్నాను ఈనాడు నేను పూనిన పాకీపని ఒక ప్రత్యేక స్వభావం కలది అది చాలా గంభీరమయినది అది కేవలం మతానికి సంబంధించినది ఇక్కడ మతమనే మాటను దురదృష్టవశాత్తు నేడు మనముందరమూ అనుకొనే సంకుచితార్థంలో కాక విశాల దృష్టితో ఆలోచించవలె

నేనీనాడు ఉద్దేశించిన సంస్కరణ హిందూ సమాజంలోని పాకీ సంఘానికి చెందినది విశాలదృష్టితో చూస్తే అది మతానికి సంబంధించినదే ఇది కేవలం

మానవత్వానికి సంబంధించిన ఉద్యమము అందువల్ల నేను ఈ దేశంలో హిందువులు కాని వారి సహకారం కూడా అపేక్షించడానికి వెనుతీయడం లేదు ఈ విషయం నేను జబల్పూరులోని క్రైస్తవ మిషనరీల ఎదుట కూడా పేర్కొని ఉన్నాను

రోజులు గడచినకొద్దీ ఈ పాకీపని ఉద్యమం గురించి మీరింకా ఎక్కువగా తెలుసుకోగలరు అస్పృశ్యత మానవులలో ఎక్కువ తక్కువలనే భేదానికి ఒక తార్కాణము ఆ విచక్షణను తొలగించేటందుకు నేను పూనుకొన్నాను సమాజానికి చాలా ఉపయోగకరమయిన సేవచేస్తూ వారిపట్ల హిందూ సంఘం నిర్వర్తించవలసిన కర్తవ్యం గురించి నా అభిప్రాయాలను తమిళనాడలో ప్రవేశించగానే విస్తరించి చెప్పనక్కరలేదని భావిస్తున్నాను దీనిని గురించి మరొకప్పుడు ప్రస్తావించగలను

ఇప్పటికీ కార్పొరేషన్ మేయరు, కౌన్సిలర్లు దయతో నాకీ సన్మాన పత్రాలను ఇచ్చినందుకు కృతజ్ఞత మాత్రం చెప్పదలచుకొన్నాను నేను ప్రారంభించిన ఈ ఉద్యమం జయప్రదం కావలెనని మీరు హృదయపూర్వకంగా చేసిన ప్రార్థనలు ఈ నా పర్యటనలో నాకెంతో ఉత్సాహకరంగా ఉన్నాయి

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ మేయరు గదిలోకిపోయి కొన్ని నిమిషాలు ఆయనతో ముచ్చటించి అఖిలభారత స్వదేశీ ప్రదర్శనమైదానం ప్రారంభించేటందుకు కాంగ్రెస్ మందిరానికి వెళ్ళినారు

డిసెంబరు 19వ తేదీన మద్రాసు నగర కార్పొరేషన్ సభవారు ఏకగ్రీవంగా చేసిన తీర్మానం ప్రకారం గాంధీజీ మద్రాస్ వచ్చినరోజున ఆయన గౌరవార్థం కార్పొరేషన్ కార్యాలయాలు, పాఠశాలలు అన్నీ మూయబడినాయి

## అఖిల భారత ఖాదీ ప్రదర్శనము

రాయపేటలోని కాంగ్రెస్ మండిర ఆవరణలో మద్రాసు మహాజన సభవారిచే ఏర్పాటు చేసిన రెండో అఖిల భారత స్వదేశీ ప్రదర్శనకు డిసెంబరు 20 తేది ఉదయం మహాత్మాగాంధీ ప్రారంభోత్సవం చేసినారు ఆ సభకు నగరంలోని సుప్రసిద్ధులయిన స్త్రీ పురుషులనేకమంది హాజరయినారు కొంతమంది యూరోపియన్‌లు కూడా సభలో ఉన్నారు

ఆ ప్రదర్శనలో ముఖ్యమయినది ఖాదీ మ్యూజియమ్ అందులో ఖాదీ నేత వారి సున్నితమయిన వనితనానికి నైపుణ్యాన్ని నిరూపించే వస్తువులు అనేకాలు ఉన్నాయి సుందరమయిన ఢకాకా మజ్లిన్ నమూనాలు, చక్కని శాలువలు, మరుల, తుని అద్దకాలు గల వస్త్రాలు ప్రదర్శితమయినాయి. అవన్నీ సన్నని అందమయిన బట్టలను తయారు చేయడంతో భారతదేశం గడించిన పూర్వపు ప్రతిష్ఠకు నిదర్శనాలుగా ఉన్నాయి భారతదేశం ఇంకా ఆ కళానైపుణ్యం కోల్పోలేదని నిరూపిస్తున్నాయి ఖాదీ విభాగంలో గంటకు వేయి

గజాల నూలు వడకటానికి వీలయిన ఒక మంచి రాట్నం ప్రదర్శింప బడింది ఇంకా అనేక శాలలలో వివిధ రకాలయిన చక్కని వస్తువులు ఆగ్రా, ఆల్మోరా, ఢిల్లీ, తిరువాన్కూరు, మైసూరులవంటి అనేక ప్రదేశాల నుంచి వచ్చినవి ప్రదర్శితమయినాయి

మద్రాసు మహాజనసభాధ్యక్షుడు శ్రీపాద శంకర్ ఆ స్వదేశీ ప్రదర్శన ఆవిష్కరించ వలసిందిగా గాంధీజీని కోరుతూ అక్కడ చేరిన అతిథులందరికీ హృదయ పూర్వక స్వాగతం చెప్పినారు 'మద్రాసు మహాజన సభవారు తదితర కార్యకలాపాలతోపాటు నగరంలో స్వదేశీ ఉద్యమాభివృద్ధి కోసం ప్రదర్శనలను, సంతలను, సమావేశాలను కూడా ఏర్పాటు చేస్తున్నారు ప్రథమ అఖిలభారత స్వదేశీ ప్రదర్శనం ఈ సభవారిచే 1931లో ఏర్పాటు చేయబడింది అది సర్వతోముఖ విజయం పొందింది దానివల్ల ప్రజలకు ఉత్సాహం కలగడమేగాక మన దేశంలోని స్వదేశీ పరిశ్రమల అభివృద్ధిని గురించి ఒక సమగ్రమయిన అభిప్రాయం కూడా కలిగింది' అని మహాజనసభ అధ్యక్షుడు శ్రీ శంకర్ ఉపన్యసించినారు

## దక్షిణ భారత వాణిజ్య సంఘంవారి ఆహ్వానము

అఖిలభారత స్వదేశీ ప్రదర్శన జరిగిన ఆవరణలోకి గాంధీజీ ప్రవేశించగానే నాదస్వర సంగీతంతో ఆహ్వానించి దక్షిణ భారత వాణిజ్య సమాజంవారు ఆయన మెడలో దండ వేసినారు ప్రారంభోత్సవం జరిగిన మిడ్ ల్యాండ్ థియేటర్ లోనికి ఆయన చేరగానే సభ్యులందరూ ''గాంధీజీకి జై' అనే నినాదాలతో హర్ష ధ్వానాలు చేసినారు గాంధీజీ వేదికపైన ఆసీనులు కాగానే బచ్చు జగన్నాథ దాసుగారు దక్షిణ ఇండియా వాణిజ్య సంఘంవారి పక్షాన ఆహ్వాన పత్రం చదవ వలసిందిగా శ్రీ జమాల్ మహమద్‌ను కోరినారు

వాణిజ్య మండలి వారి ఆహ్వాన పత్రంలో ''దేశంలోని అన్ని వర్గాల, అన్ని సంఘాల సమానాభివృద్ధి పైనను, వివిధ వర్గాల వారి పరస్పర సమష్టి ప్రయోజనాలపైన సమగ్రమయిన దేశాభ్యున్నతి ఆధారపడి ఉన్నదని మా అభిప్రాయము అందువల్ల ఏడాది పొడుగునా పేదరికంతో కుంగి పోతూన్న అధిక సంఖ్యాకులయిన అట్టడుగు ప్రజానీకం ఆర్థికాభివృద్ధిని గురించి ఆలోచించటం కంటె అత్యవసర విషయం మరొకటిలేదు ప్రతి దేశంలోను సమాజం లోని ఆర్థిక భేదాలే వర్గ భేదాలకు కారణాలు కాబట్టి జనుల భౌతిక పరిస్థితులను పెంపొందించటానికి పనిచేసే సంస్థ ప్రజల సాంఘిక రాజకీయ అభివృద్ధికి కూడా దోహదం చేయగలదు అందువల్ల దక్షిణ భారత వాణిజ్య సంఘంవారు ప్రజా నాయకులను, ప్రజా సంస్థలను ముఖ్యంగా ప్రజల ఆర్థికాభివృద్ధి కార్యక్రమాన్ని చేపట్టవలసిందని కోరుతున్నారు అందు కనుగుణంగా స్వదేశీ పరిశ్రమల అభివృద్ధి, జాతీయ కరెన్సీ మారకాల నిబంధనలు, వర్తకానికి, పరిశ్రమలకు, వ్యవసాయానికి కావలసిన పెట్టుబడిని సప్లయ్ చేయటానికి జాతీయ పరమితి సంస్థల

నిర్మాణము, రవాణా ఏర్పాట్లు ప్రజలు వస్తువులను భరించ గలిగిన శక్తికి అనుగుణంగా పరిపాలనా వ్యయాన్ని సర్దుబాటు చేయడం మొదలయిన సమస్యలను ప్రయోజనకరంగా పరిష్కరించవలసి ఉన్నది అదే సాంఘిక, రాజకీయాభ్యుదయానికి దారి తీయగలదు దేశంలోని ప్రసిద్ధ సంస్థలు వాటి నాయకులు ఇతోధికంగా ఆర్థిక సమస్యల పరిష్కార విషయంలో శ్రద్ధ తీసుకోవలెనని సవినయంగా ప్రార్థిస్తున్నాము ప్రజల ఆర్థికాభివృద్ధి, అభ్యున్నతుల పైననే వారి ఇతర విధాలయిన అభివృద్ధి సైతం ఆధారపడి ఉంటుందని మా మనవి" అని ఉదాహరించడం జరిగింది

ఈ ఆహ్వాన పత్ర సమర్పణానంతరం శ్రీ జమాల్ మహమద్ ఆ సభకు హాజరయిన శ్రీ వేమవరపు రామదాసుపంతులు, సి యం కోరారి, మహమద్ ఇస్మాయిల్ సేట్, కే ఆళవందార్ నాయుడు, వి సుందరశాస్త్రుం, పి కె శ్రీనివాసన్, శ్రీ సి గోపాల మీనన్‌లను గాంధీజీకి పరిచయం చేసినారు

## గాంధీజీ ఉపన్యాసము

గాంధీజీ స్వదేశీ ప్రదర్శన ప్రారంభిస్తూ ఇట్లా ఉపన్యసించినారు

"అధ్యక్షా! స్నేహితులారా!

నేను మద్రాస్‌కుసంతోషకరమయిన సుముహూర్తంలో బయలుదేరినాను నాకు మద్రాసు కార్పొరేషన్‌వారి సన్మానపత్రం స్వీకరించే భాగ్యం కలిగింది ఇప్పుడు దక్షిణ భారత వాణిజ్య సంఘంవారి సన్మాన పత్రం శ్రీ జమాల్ సాహెబు చేతుల నుంచి గ్రహించే గౌరవం కూడా దక్కింది దాదాపు 18 మాసాల కిందట లండన్‌లో జమాల్ సాహెబుగారితో చాలాసేపు నేను సంభాషించిన సంతోషకరమైనసంగతి స్ఫురణకు వస్తున్నది ఆనాడు యావద్భారత దేశానికి సంబంధించిన విషయం గురించి మేమిద్దరము చర్చించుకొన్నాము ఈనాడు తిరిగి వారిని మన మధ్యలో చూడగలిగినాను స్నేహితులారా! మీ ఆశీర్వాద బలంవల్ల మద్రాసులోను, తమిళనాడులోను నేను ప్రారంభించిన ఉద్యమం సఫలం కాగలదని ఆశిస్తున్నాను

మీరీనాడు నన్ను స్వదేశీ ప్రదర్శనాన్ని బహిరంగపరచవలెనని కోరినారు నేను ఆలోచించి వస్తువులను ఎన్నుకొంటానన్న సంగతి మీలో చాలా మందికి తెలియకపోవచ్చు నేను స్వదేశీ విషయాలలో ఒకవిధంగా అనుభవజ్ఞుడనని నా అభిప్రాయము భారతదేశంలో ఇటువంటి అనేక ప్రదర్శనలను ఏర్పాటు చేయడానికి నేను కారణం కూడా భారతదేశంలో తయారుచేసినవి గాని పెంపొందినటువంటివిగాని ప్రతివస్తువును ప్రదర్శించడం మంచిదికాదు ఇటువంటి ప్రదర్శనవల్ల ప్రజలకు విజ్ఞానం కలగవలెనంటే మీరు సహజంగా ప్రత్యేకం కొన్ని వస్తువులను ఎన్నిక చేయవలసి ఉంటుంది, ఉదాహరణకు ఇండియాలో పచ్చికవలె పెరిగే ప్రతిఓషధి గింజలను మీరు ప్రదర్శించరుగదా? మీరు ప్రజలలో వ్యాపింపచేయవలెనని కోరే ధాన్యాలను విత్తనాలను మాత్రమే

ప్రదర్శనకు ఎన్నిక చేయవలసి ఉంటుంది నాకిప్పుడు స్ఫురిస్తున్న అనేక ఉదాహరణలలో మీకు ఒక్క ఉదాహరణ మాత్రమే ఇచ్చినాను చాలా సున్నితా లయిన విషయాలను మీకు చెప్ప నుద్దేశించి మీకా ఉదాహరణ ఇచ్చినాను

ప్రతి స్వదేశీ ప్రదర్శన ప్రారంభించేటందుకు నేను అంగీకరించను ఇండియాలో ఉత్పత్తి అయిన సున్నితాలయిన పరికరాలు కూడా ఇక్కడ ప్రదర్శింపబడిన విషయం నేను తెలుసుకోగోరుతున్నాను అవి ప్రదర్శితమై ఉన్నట్లయితే సహజంగా నేను వాటిని నిషేధించేటంత ఛాందసుణ్ణి అప్పుడు నేను 'ఇవి మెరిసిపోయే వస్తువులు కావచ్చు, కాని ఇవి మనదేశంలోని ఆర్థిక, నైతిక సంక్షేమానికి హానికరాలయినవి కాబట్టి నేనీ ప్రదర్శనను ప్రారంభించ జాలను క్షమించండి' అని చెప్పివేస్తాను కేవలం ఈ పద్ధతిలోనే కాకపోయినా మరొక పద్ధతిలోనయినా నేనట్లా చెప్పేమాట మాత్రం వాస్తవము నూటికి నూరుపాళ్లు స్వదేశీ అయినప్పటికీ మిల్లుబట్టలుగల ప్రదర్శనలను కూడా నేను తెరవడానికి అంగీకరించను అందువల్ల చక్కని హానికరాలయిన వస్తువులవలె మిల్లు బట్టలునైతం హానికరాలని నేను చెప్పడం లేదు కాని భారత దేశపు కుటీరాలలో తయారయిన వస్తువులేగాక మిల్లులలో తయారయిన బట్టల ప్రదర్శనే ప్రారంభించమని నన్ను కోరితే అది అపూర్వమయిన ప్రదర్శనమని నేనంటాను మిల్లుబట్టకు ప్రతికూలంగా ప్రచారం చేయటం నా ఉద్దేశంకాదు కాని భారత దేశంలోని మిల్లుపరిశ్రమ చరిత్రను మీరు గమనిస్తే మిల్లుబట్టల వ్యాప్తికి స్వదేశీ ప్రదర్శన ఏర్పాటు చేయవలసిన అవసరంలేదని మాత్రమే నేను మీకు చెప్పదలుచుకొన్నాను మిల్లులు తమకు తామే స్వదేశీ ప్రదర్శనలుగా నిలబడగలవు అందుకు తగిన అన్ని సౌకర్యాలు మిల్లులకు ఉండనే ఉన్నాయి మరి ఖాదీ గతి ఏమిటి?

"వివిధ రకాల వస్తువులుగల స్వదేశీ ప్రదర్శన నేను ప్రారంభించినానని చెప్పుకోవటం నాకిష్టంలేదు ఇటువంటి ప్రదర్శనను మీ మానసికాభ్యున్నతికే కాక ఇతరులకు ఉపయోగకరమైన సందేశంగా కూడా ఉండవలె నేనింతకు పూర్వం అనేకచోట్ల అనేక ప్రదర్శనలను తెరిచినాను ఈనాడు మద్రాసువంటి పెద్ద నగరంలో ఈ స్వదేశీ ప్రదర్శన తెరవవలసిందని మీరు నన్ను కోరినారు కనక ముందు జాగ్రత్తకోసం నేను మీకీమాటలు చెప్పవలసి వచ్చింది హరిజనుల అవసరం మీరు గుర్తించినారో లేదో నాకు తెలియదు ఇంకా ఏడు, ఎనిమిది మాసాలవరకు హరిజనాభ్యుదయంకోసం ప్రచారం చేసేవని నా అంతట నేను నాపైన పెట్టుకొన్నాను ఎక్కువ హరిజనోద్యమానికి పని చేయటమే నా విధిగా పెట్టుకొన్నాను అనేకమందితో అనేక విషయాలు మాట్లాడవచ్చు నాకు ఆసక్తి ఉన్న విషయాలకు అంతులేదు కాని ప్రస్తుతం హరిజనోద్యమానికి సంబంధించిన కొద్ది విషయాలను గురించి మాత్రమే నేను పనిచేయదలచుకొన్నాను

అయితే ఈ స్వదేశీప్రదర్శనకు, హరిజనోద్యమానికి సంబంధమేమిటని

మీరడగవచ్చు హరిజనోద్యమంతో ఖాదీకి అత్యంతమయిన సంబంధమున్నది ఎందువల్లనంటే నూలువడకటం, బట్టలునేయటంవంటి పనులు దారిద్ర్యాంధకారంలో నిమగ్నాలయిన వేలాది హరిజన కుటీరాలలోకి ఆశాకిరణాలను ప్రసరింపజేస్తున్నాయి, ఈ నా కొద్దిరోజుల పర్యటనలో అనేక హరిజన కుటీరాలను చూడగలిగే భాగ్యం నాకు కలిగింది ఖాదీలోని శక్తిని నేను కనుక్కోగలిగినాను ఖాదీ హరిజనులకు ఎంత మహోపకారిగా పరిణమించిందో నాకప్పుడు తెలిసింది హరిజనులు తయారుచేసిన వస్తువులు పూర్తిగా కాకపోయినా చాలావరకు ఇక్కడ ప్రదర్శింపబడినవని ఆశిస్తున్నాను ఒక తోలు పరిశ్రమను గురించి ఆలోచించండి, ముందుగా హరిజనులు దానిలో పనిచేయకుంటే హిందూ దేశంలో ఆ పరిశ్రమ మచ్చుకైనా కనపడి ఉండేదికాదు దాని చరిత్రను గురించి చెప్పేవారు మీకు లభించడం దుర్లభము మా మిత్రుడు జమాల్ సాహెబు దానిని గురించి కూలకషంగా మీకు చెప్పగలడు కాని నేను దాని చరిత్రను రూపాయి, అణాలు, పైసలలో మాత్రమే చెప్పగలను 9 కోట్ల రూపాయలకంటె కూడా ఎక్కువ విలువగల తోళ్లు భారతదేశంనుంచి విదేశాలకు పోతున్నాయి మనము హరిజనులపట్ల గౌరవంగా వ్యవహరిస్తే అవన్నీ ఇండియాలోనే ఉపయోగపడగలిగి ఉండేవి కనీసం ముడిసరుకుగా విదేశాలకుపోయి ఉండేదికాదు ఇటువంటి ఉదాహరణలు మీకు ఎన్నయినా చెప్పగలను కాని మీకు, నాకూ కూడా ప్రస్తుతం వ్యవధిలేదు

ఈ ప్రదర్శన తెరిచినట్లు నేను సంతోష పూర్వకంగా ప్రకటిస్తున్నాను ఈ ప్రదర్శనవల్ల మీరు ప్రయోజనం పొంది ఈ ప్రదర్శన శాలలోని వస్తువులను మీరు ఆసక్తితో చూసి వాటి తయారీ గురించిన చరిత్రను ఆమూలాగ్రంగా తెలుసుకొంటె ప్రపంచ మంతటిలో ఎంతో పేద స్థితిలో ఉన్న ఈ దేశంలోని ప్రజల శక్తి సామర్థ్యాలను మీరు ఆశ్చర్యంతో కొనియాడ గలరు ఇటువంటి ప్రదర్శనలను మనం తెలివి తేటలు కలిగి భారత దేశంలోని లక్షలాది అట్టడుగు ప్రజల సహాకారంతో నిర్వహించవలసి ఉంటుంది మీరు, హరిజనులు మహర్లు మొదలయిన దళిత జాతుల నెత్తిపై నెక్కి కూర్చోవడం మాని వారందరూ మనవంటి వారేనని, మనకున్న హక్కులు వారికి కూడా ఉన్నాయని భావించి వారిని సమాన ప్రతిపత్తితో స్నేహితులుగా చూస్తే అన్ని అడ్డంకులను తోసిపుచ్చి ఈ దేశం ఇప్పటివలె దరిద్ర భూమిగా గాక అష్టైశ్వర్యాలతో విరాజిల్లగలదు

ఈ ప్రదర్శన ప్రారంభించడానికి నన్ను మీరు ఆహ్వానించినందుకు నేను మీకు కృతజ్ఞుణ్ణి ప్రజలు దీనిని ఉదారంగా ఆదరించగలరని ఆశిస్తున్నాను ”

## గాంధీజీ ప్రదర్శనశాలలను దర్శించటం

గాంధీజీ మిడ్‌ల్యాండ్ థియేటర్ నుంచి ప్రదర్శన శాలలను చూడడాని

వెళ్ళారు అక్కడ కొంతసేపు ఉండి మోటారులో మైలాపూర్‌లోని "శ్రీబాగ్"కు వెళ్ళినారు

మిడ్‌ల్యాండ్ థియేటర్ ఆవరణలో వేలకొలది జనం గాంధీజీ దర్శనం క్రిక్కిరిసి ఉన్నారు వారిని థియేటరులో ప్రవేశించకుండా అదుపులో ఉంచడం వలంటీర్లకు చాలా కష్టమయిపోయింది అయినప్పటికి ఆ పనిని వారు చక్కగా నిర్వహించినారు

స్వదేశీ ప్రదర్శన ప్రారంభోత్సవానికి అల్లాడ కృష్ణస్వామిఅయ్యర్, దివాన్ బహద్దూర్ వి భాష్యం అయ్యంగార్, ఏ రంగస్వామయ్యంగార్, సి వి కృష్ణస్వామి అయ్యర్, ఎస్ సత్యమూర్తి, సి యస్ ముత్తురంగ మొదలియార్, టి వెంకోబారావు, పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరి సి ఆర్ శ్రీనివాసన్, డాక్టర్ వరదరాజులునాయుడు, శ్రీమతి ముత్తు లక్ష్మిరెడ్డి, శ్రీమతి అమ్ము స్వామినాథన్, శ్రీమతి మార్గరేట్‌కజిన్స్, శ్రీమతి రుక్మిణీ లక్ష్మిపతి, శ్రీమతి అంబుజమ్మాళ్ మొదలయినవారు ఉన్నారు

## స్త్రీల సన్మానము

మద్రాసు మహిళలు డిసెంబరు 20 సాయంకాలం గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు భారత మహిళా సమాజం వారి యాజమాన్యంలో ఎగ్మూర్‌లోని పాంతియాన్ గార్డెన్స్‌లో (Panthon gardens) సన్మానసభ ఏర్పాటు చేయబడింది గాంధీజీ రాకకు ముందే సాయంకాలం 3-30 గంటల నుంచి ఆయన దర్శనంకోసం ఆసక్తితో గుంపులు గుంపులుగా స్త్రీలు సమావేశ స్థలానికి చేరుకొన్నారు సభ స్త్రీలతో నిండి పోయింది

గాంధీజీ రాగానే భారత మహిళా సమాజ సభ్యురాండ్రు డాక్టర్ ముత్తు లక్ష్మిరెడ్డి, శ్రీమతి మార్గరేట్ కజిన్స్ శ్రీమతి రాధాబాయి ఆయనకు యెదురేగి ఆహ్వానించినారు గాంధీజీ దివాన్ బహద్దూర్ వి భాష్యం అయ్యంగార్, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగార్లతో కలసి వచ్చినారు మహిళామణుల ఆహ్వానంపైన గాంధీజీ వేదికపైన ఆసీనులయిన తరవాత డాక్టర్ ముత్తు లక్ష్మిరెడ్డి ఆయనకు హిందీలో సన్మాన పత్రం సమర్పించినారు ఆ సన్మాన పత్రం తమిళంలో, హిందీలో, ఇంగ్లీషులో కూడా ముద్రిత మయింది

## సన్మాన పత్రము

ప్రియమైన మహాత్మాజీ !

భారత మహిళా సమాజం వారు కుల, మత, లింగ భేదాలతో నిమిత్తం లేకుండా అందరికీ సమానమయిన అవకాశాలు, హక్కులు ఉండవలెననే ఆదర్శంతో నిత్యము వ్యవహరిస్తున్నారు కాబట్టి తమరు మన సమాజం నుంచి అస్పృశ్యత అనే మహాదోషాన్ని తొలగించడానికి పూనుకొన్నందుకు ఈ సందర్భంలో మేము మా సంతోషం వెల్లడిస్తున్నాము. మీరు నిర్వహించడానికి

పూనుకొన్న ఈ ధర్మ ప్రచారోద్యానికి స్త్రీల సహాయ సానుభూతులు ఉండ గలవు సత్యము, ప్రేమ మానవసేవా కార్యకలాపాలలో మీకుండిన అచంచల విశ్వాసం, శ్రద్ధను మీ జీవితంలో పూర్తిగా ఉదాహరణ పూర్వకంగా నిరూ పించి ఉన్నారు మీ విశ్వాసాలకు, మీ అహింసా తత్వానికి అనుగుణంగా మీరు ధైర్యంతో నిలబడి అమోఘమయిన త్యాగాలను చేసినందుకు మీరు మాకే కాక ప్రపంచ మంతటికి ప్రేమాస్పదులయినారు ప్రపంచంలో ఉత్తమము, ఉదారములు అయిన మహాత్కార్యాలకు మీ పేరు పర్యాయపదంగా పరిణమిం చింది మీ చిరాయురారోగ్యాలకు మేము ప్రార్థిస్తున్నాము

## గాంధీజీ ఉపన్యాసము

ఈ సన్మాన పత్రానికి సమావేశ కర్తల కోరికపైన గాంధీజీ ఇంగ్లీషులో ఇట్లా ప్రత్యుత్తర మిచ్చినారు

' సోదరీమణులారా ! మరొకసారి మీ పరిచయం నాకు లభించి నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది మద్రాస్‌లోని మహిళల సమావేశంలో ఉపన్యసించడం నాకిది మొదటిసారికాదు ఈ 40 నిమిషాలలో నేను ఎంతో పెద్ద కార్యక్రమం నిర్వర్తించవలసి ఉన్నది కాబట్టి నేను సంగ్రహంగా మాట్లాడ దలుచుకొన్నందుకు నన్ను మీరు మన్నించవలె

నేను మిమ్ముల్లను ఒకే ఒక పని నిర్వహించవలెనని కోరుతున్నాను కొంత మంది యెక్కువ, మరికొంత మంది తక్కువ అనేమాట మీరు పూర్తిగా మరచిపోవలె కొంతమంది స్పృశ్యులు మరికొందరు అస్పృశ్యులు అనే మాట కూడా సంపూర్ణంగా విస్మరించవలె మీ రందరు నా వలెనే దేవునిలో విశ్వాసం కలవారని నాకు తెలుసు దేవుడు ఒక మనిషి ఎక్కువ అని గానీ, మరొకరు తక్కువని గానీ, ఒక స్త్రీ మిన్న అని గానీ, మరొక స్త్రీ నిమ్న అని గానీ భేదాలను సృష్టించేటంత క్రూరుడుకాడు, అన్యాయపరుడుకాడు ఈ అస్పృ శ్యత హిందూ మతానికి గొప్ప కళంకము అస్పృశ్యత కొనసాగితే హిందూ మతం అంతరిస్తుందని చెప్పటానికి నేనెంత మాత్రం సందేహించను మనుషుల భాషలో దేవుడు చాలా ఓర్పుగల వాడంటారు కాని కొంత కాలానికి ఆయన ఓర్పుకూడా అంతరిస్తుందనడంలో నాకెంతమాత్రం సందేహంలేదు అస్పృశ్యత అనే పేరుతో హిందూ ఇండియాలో మానవుడు చేస్తున్న ఈ అత్యాచారాన్ని దేవుడిక ఎంత మాత్రం సహించడు "

ఇంతలో గాంధీజీ కొంచెం సేపు ఆగి "ఇంతకూ మీరేమీ నాకు సొమ్ము ముట్టజెప్పలేదే" అన్నారు

వెంటనే డాక్టర్ ముత్తు లక్ష్మిరెడ్డి డబ్బు పంచీని ఆయన చేతిలో ఉంచి అందులో 480 రూపాయల నగదు ఉన్నదని చెప్పినారు "మీరు ఇచ్చిన ఈ సంచీ తేలికగా ఉన్నది పోనీలే తేలికగా ఉండనీ, బరువుగా ఉండనీ ఇది హరి జన సేవకోసం ఉద్దేశింప బడింది" అన్నారు గాంధీజీ

డాక్టర్ ముత్తు లక్ష్మిరెడ్డి అందులోని తమలో చాలా మంది తిలక్ ఘాట్ వద్ద బహిరంగ సభలో గాంధీజీకి ఇవ్వనున్న విరాళానికి ఉదారంగా చందాలు వేసినట్లు గాంధీజీకి విన్నవించినారు

"మీరదొక కారణంగా చెబుతున్నారా అయితే సరే మీరందరూ పురుషులతో సమాన హక్కులు కావాలంటారు కాదూ" అని ఇంకా ఇట్లా ప్రసంగించినారు

"మీరిచ్చిన ఈ విరాళం మీరు మతం పేరుతో హానిపొందినవారి మేలను కోరుతున్నందుకు చిహ్నంగా దీనిని నేను గ్రహిస్తున్నాను

మంచిది ఎట్లాగయినా స్త్రీలు హృదయపూర్వకంగా తమ నగలను ఇచ్చినారు కొందరు ఉంగరాలు, మరికొందరు గాజులు, మరి కొందరు కంఠహారాలనుకూడా సమర్పించినారు మిమ్ములనుకూడా అట్లా ఇవ్వమని కోరుతున్నాను అయితే మీరొక సంగతి జ్ఞాపకం పెట్టుకోవలె మీరిప్పుడు నాకిచ్చే నగలవంటి నగలను మళ్ళీ తిరిగి చేయించుకోకూడదు హరిజనోద్యమానికి మీ నగలను సమర్పించడం ఒక ప్రత్యేక హక్కుగా మీరు భావించవలె దేవుడు ఈ మన ఉద్యమాన్ని ఆశీర్వదించవలెనని మీరందరూ స్పృశ్యులకు, అస్పృశ్యులకూ గల భేదం విస్మరించేటట్లు మీ హృదయాలను ఆయన మార్చవలెనని ప్రార్థిస్తూ నా ఉపన్యాసం ముగిస్తున్నాను " అన్నారు గాంధీజీ

అప్పుడు సమీపాన ఉన్న ఒక మహిళ హిందీని గురించి ఒక మాట చెప్పండి అన్నది

వెంటనే గాంధీజీ "ఒక సోదరి హిందీని గురించి ఒకమాట చెప్పమని నన్ను కోరుతున్నది చాలా సంతోషము మీలో కొందరు ఉత్తర హిందుస్థానంలోకూడా సేవ చేయవలెనని కోరేవారు ఉండవచ్చు మీకు హిందీ భాష తెలిస్తేనేగాని ఉత్తర దేశంలోని ప్రజాసామాన్యంతో కలసి మెలసి ఉండటం సాధ్యంకాదు భారతీయులలో 22 కోట్ల మంది హిందీ తెలిసిన వారే వివేకవంతులయిన దక్షిణ భారత మహిళలు 22 కోట్ల ప్రజలు మాట్లాడే హిందీభాషను అభ్యసించక అలక్ష్యం చేయడం మంచిదికాదు " అంటూ "ఇక నా ఉపన్యాసం ముగిసింది స్త్రీ లందరూ వారి నగలను నాకు సమర్పించ వచ్చు" అని హెచ్చరించినారు

హరిజన నిధికి వెంటనే రు 450 నగదుతోపాటు ఒక బంగారపు ఉంగరం ఒక బంగారపుగాజు, ఒక పద్మరాగపు టుంగరం, ఒక వెండి గిన్నె సమర్పించడం జరిగింది

గాంధీజీ సభాస్థలం విడిచిపోయేముందు ఒక రెండేళ్ళ బాలిక ఆయనకు దండ వేసింది

## మద్రాసు విద్యార్థులు-గాంధీజీకి సన్మానము

చెన్నపురి విద్యార్థులు డిసెంబరు 20 సాయంకాలం మిడ్ ల్యాండ్

థియేటర్‌లో మహాత్మునికి అత్యుత్సాహపూరితమయిన స్వాగతపత్రంతోపాటు 1,025 రూపాయలు హరిజననిధికి కానుక సమర్పించినారు గాంధీజీ వచ్చేసరికి సభాస్థలం విద్యార్థినీ, విద్యార్థులతో క్రిక్కిరిసిపోయింది విద్యార్థులపక్షాన శ్రీ శర్మగారు గాంధీజీని పుష్పమాలాలంకృతునిచేసి స్వాగతపత్రం చదివి నారు విద్యార్థులు తమ సన్మానపత్రంలో

"గాంధీజీ సత్యము, న్యాయము, ఓర్పు అనే మూడు గుణాలతో ప్రస్ఫురిగొనిన ఒక అద్భుత శక్తి ఆయన అందువల్లనే యుగయుగాలనుంచి పాదుకొనిపోయిన పూర్వాచార పరాయణత్వంనుంచి ప్రజలను మేల్కొల్పి వారు తమ సోదరులను అస్పృశ్యత అనే పంకిలంనుంచి లేవనెత్తి వారికి తిరిగి న్యాయం చేకూర్చేటందుకు సంసిద్ధులయ్యేటట్లు చేయగలిగినారు" అని ఉదాహ రిస్తూ ఇంకా ఇట్లా అన్నారు "గాంధీజీ! మేము మీకింత స్వల్పవిరామం ఇచ్చి నందుకు క్షమించవలెనని కోరుతున్నాము ఈనాటి యువజనులు స్వార్థపరులని చెప్పడం మా కెంతమాత్రం ఇష్టంలేదు జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లుగా విద్యార్థుల మనసులు నిస్సారాలయినవని కూడా మేము నమ్మటంలేదు పూర్వ సంప్రదాయానికి మేమెంత కట్టుబడి ఉన్నప్పటికీ యువకులు ఒక్కరే సమా జాన్ని బంధిస్తూన్న నిగళాలను తెంపివేయగల నిరంతర శక్తిమంతులని మా అభిప్రాయము మేమింతకాలంనుంచి కోరుతూన్నది మేము మా ఆదర్శం అందుకొనేటట్లు చేయగలమీ నిర్భీతికర నాయకత్వము ఆ కోరిక నేటికి చాలా వరకు ఫలించింది సనాతన ధర్మము, పూర్వాచార పరాయణత్వం అనే పేర్లతో ద్వేషము, ఉద్రేకము పెచ్చుపెరిగిన ఈ రోజులలో ఆ అడ్డంకులన్నిటినీ తోసిపుచ్చి అస్పృశ్యత అనే ఈ పెనుభూతంతో మీరు ధైర్యంగా పోరాడి సంపూర్ణ విజయం పొందవలెనని ప్రార్థిస్తూ ఈ సన్మానపత్రం ముగించదలచు కొన్నాము మా హరిజన సోదరులకు ఇంత కాలంనుంచి జరిగిన అన్యాయం త్వరలోనే మీద్వారా తొలగింపబడగలదని పూర్తిగా విశ్వసిస్తున్నాము ఈ దేశంలోని యువకులు తమ యావచ్ఛక్తిని వినియోగించి ఇండియాను ఒక జాతిగా రూపొందించగలరోజు చాలా సన్నిహితంగానే ఉందని మేము విశ్వ సిస్తున్నాము"

ఈ సన్మానపత్ర సమర్పణానంతరం గాంధీజీ విద్యార్థులను ఉద్దేశించి ఇట్లా ఉపన్యసించినారు

"విద్యార్థులారా! మిత్రులారా!

మీరు నాకు, నేను మీకు క్రొత్తకాదు 1896 నుంచి మద్రాసు విద్యార్థు లతో నాకు పరిచయమున్నది అప్పుడు మీలో చాలామంది పుట్టలేదు నన్ను మీరుగానీ, మరెవ్వరుగానీ ఎరుగని రోజులలో నేను మీతో పరియం చేసు కొన్నాను తమిళనాడునుంచి దక్షిణ ఆఫ్రికాకు వచ్చిన కూలీలు తప్ప ఇతరు లెవ్వరూ నన్నెరుగరు కాని అప్పుడు కూడా మీ విద్యార్థులు నాకు హృదయ పూర్వక స్వాగతమిచ్చినారు

మీరీనాడు నాకిచ్చిన విరాళానికి, సన్మానపత్రానికి కృతజ్ఞుణ్ణి అస్పృశ్యత హిందూమతంలో సహింపరాని కళంకమని మీకు నచ్చజెప్పడానికి నేనెక్కువ ప్రయాసపడనక్కరలేదు మనిషికీ, మనిషికీ మధ్య హెచ్చుతగ్గు లున్నవని మీరు నమ్మితే మీ విద్యవట్టి నిరర్థకము మీ సన్మానపత్రంలో సూచించినట్లు అస్పృశ్యతా దురాచారం తొలగించవలెనని మీరు నమ్మితే మీరందరూ హరిజన సేవకు పూనుకోవలెనని నేను కోరుతున్నాను మీ సన్మాన పత్రంలో మీరు చేస్తున్న హరిజన సేవను గురించి ప్రస్తావిస్తారని నేను భావించి నాను ఢిల్లీ విద్యార్థులు తమ సన్మానపత్రంలో ఢిల్లీ నగరంలోను, పరిసర గ్రామాలలోను తాము హరిజనులకు చేస్తూన్న సేవగురించి వివరించినారు మీరు కూడా అట్లా వివరించి ఉండవలసింది ఢిల్లీ విద్యార్థులు తామేదో బ్రహ్మాండ మయిన పనిచేసినట్లుగా నటించలేదు, వారు కొంత కాలం క్రితం కొద్దిగా ఆ పని ప్రారంభించినారు మీరు కూడా అట్లా ప్రారంభించినారేమో నాకు తెలియదు హరిజనులస్థితిని మెరుగుపరచడానికి, ఈ అస్పృశ్యతాకళంకంనుంచి మన సమాజం రక్షించడానికి మీరు నిరాడంబరంగా ఏమి సేవ చేయగలరో కూడా నాకు తెలియదు అస్పృశ్యతమతంలో ఒక భాగంకాదనీ, అది ఒక భయంకర మయిన పాపమనీ సమాజాన్ని ఒప్పించటానికి ముందు మీరు సుశీల సంపన్నులు కావలె కొందరు స్పృశ్యులనీ, కొందరు అస్పృశ్యులనీ నమ్మడం సరికాదని, అది మతంకాదని, మతానికి విరుద్ధమని ఇతరులను మీ ప్రవర్తన ద్వారా ఒప్పించగలిగి ఉండవలె అట్లా కానిపక్షంలో ప్రజలు మిమ్మలను విశ్వసించరు మీరు ప్రజలను మేల్కొల్పగలిగి ఉండవలె వారి హృదయాలు మార్చగలిగి ఉండవలె మతగ్రంథాలను ఆమూలాగ్రంగా చదివినామని చెప్పే పూర్వాచార పరాయణుల మాటలను మీరు లక్ష్యపెట్టనక్కరలేదు వారు ప్రజలకు ప్రాతి నిధ్యం వహించటంలేదు సరికదా వారు తమ మతగ్రంథాలకు సరియైన వ్యాఖ్యానం చేయటంలేదని కూడా నా అభిప్రాయము నేను పొరపడి ఉండవచ్చు ఏమయినప్పటికీ ప్రజానీకానికి ప్రతికూలంగా అటువంటివారు కొద్ది మందే ఉన్నారు ప్రజలలో కలసిమెలసి పనిచేసేవారి మాటే చివరికి చలామణీ అవుతుందని నేను మీకు వాగ్దానం చేస్తున్నాను ప్రజలు వాదించరు చిరకాలం నుంచి మనం విశ్వసిస్తూన్న అస్పృశ్యత ఒక కళంకమని తమదగ్గర ప్రబో ధిస్తూన్న పెద్దమనుషులెవరా అని మాత్రమే వారు ఆలోచిస్తారు తమదగ్గరకు వచ్చి అస్పృశ్యత పాపమని చెప్పేవారు అందుకు అర్హులయి ఉంటేనే వారి మాటలను ప్రజలు వింటారు అర్హులు కానివారు చెప్పే మాటలను ప్రజలు నమ్మరు ఇది విశ్వసించడానికి వీలులేనంత చాలా చిన్న విషయము దీనిలోని నిజం మీరు స్వయంగా పరీక్షించి చూస్తేనికాని తెలియదు.

**విద్యార్థులు హరిజనాభ్యుదయానికి చేయగలపని**

మీ మధ్య ఉన్న ఈ జనానికి మీరేమి సేవ చేయగలరు. నేను ఉద్బో

ధించిన అనేకమంది విద్యార్థులకు హరిజనులకు సేవ చేయగలతీరును నిరూపించి ఉన్నాను మీరు ఒక బొక్కెనా చీపురూ పట్టుకోండి, తమాషాకోసం పట్టుకోవడంకాదు, ప్రత్యక్షంగా, హృదయపూర్వకంగా ఆ రెంటినీ తీసుకొని వాటితో మద్రాసులో ఉన్న మురికిప్రదేశాలను పరిశుభ్రం చేయండి, హరిజనుల మధ్యకు వెళ్ళండి వారిని తాగుడునుంచి తప్పించండి వారికి ప్రాథమిక సూత్రాలను బోధించి పరిశుభ్రతను నేర్పండి వారికి ఆ విషయాలు చాలా కొత్త అందుకు మనం సిగ్గుపడవలసి ఉంది వారిని మనం గమనించవలసిన అవసరం లేదనీ, వారీ ప్రపంచంలోకెల్ల నీచాతినీచులయిన మనుష్యులని, అంటరానివారని, చేరరానివారనీ, చూడరానివారనీ ఇంకా ఏమేమో వారిని గురించి అనుకొని వారి ప్రసక్తి మనకక్కరలేనట్లు, వారేంచేస్తున్నా మనకేం సంబంధం లేనట్లు మనం భావించినాము. పాపం! వాళ్లుకూడా మన మాటలు నమ్మి వారు మనుష్యులు కానట్లు, జంతువులకన్న హీనమయినట్లు భావించి వారిని వారే నిర్లక్ష్యం చేసుకొన్నారు వారు దుర్భరమయిన జీవితం గడుపుతున్నారు. అటువంటి మనుష్యుల మధ్యకు, మీరువెళ్ళి వారి మనసులలో ఆశారేఖను ప్రసరింపచేయాలి మీరందరూ వారున్నచోట్లకుపోయి నడుములువంచి పనిచేస్తారని, ఏవిధమయిన నీచోద్దేశం లేకుండా పవిత్ర భావాలతో వారికి శాంతి, ప్రేమ సందేశాలను అందిస్తారని ఆశిస్తున్నాను మీరీపని చేయగలిగిన తక్షణం మీ జీవితాలలోను, వారి జీవితాలలోనూ కూడా ఒక గొప్ప మార్పు వస్తుంది మీరు మీ చదువులకు వినియోగించవలసిన కాలంలో ఒక్క క్షణం కూడా మిమ్మల్ని ఈ పనికి వినియోగించవలసిందని నేను కోరడంలేదు మీరు వ్యర్థంచేసే కాలాన్ని ఈ పనులకు వినియోగించవలె మీలో ప్రతిఒక్కరు ఆత్మపరీక్ష చేసుకొన్నట్లయితే ప్రతిరోజూ మీరెంతో కాలం వ్యర్థం చేస్తున్నట్లు మీకు తెలియగలదు మీరు వ్యర్థంచేసే కాలమంతా కూడా ఈ పనికి వినియోగించవలసిందని నేను కోరడంలేదు కాని మీరందరూ కలసి మద్రాసులోని హరిజనులకు సేవ చేయగలిగినట్లయితే వారి జీవితాలలోనేకాక మీ జీవితంలో కూడా గొప్ప పరివర్తన కలుగుతుంది దీనిని మీరు గ్రహించగల శక్తిని భగవంతుడు మీకు ప్రసాదించు గాక! ఈ సందేశాన్ని మీరనుసరించగల ధైర్యసాహసాలను కూడా దేవుడు మీకిచ్చు గాక!

మరొక సంగతి కూడా నేను మీకు చెప్పదలుచుకొన్నాను మీరు కేవలం మద్రాసుకే కాక భారతదేశాని కంతటికి చెందినవారమని అనుకొంటున్నప్పటికీ 22 కోట్లమంది భారతీయుల భాష అయిన హిందీని మీరు నిర్లక్ష్యం చేస్తున్నందుకు నేను మీపైన నేరారోపణ చేస్తున్నాను ఈ విషయం ప్రత్యేకం నా సోదరీమణులకు చెబుతున్నాను మీరు హిందీ నేర్చుకోవడానికి కావలసిన అన్ని సౌకర్యాలను చేకూర్చటందుకు ఈ మద్రాసులోనే మీకు హిందీప్రచారసభ ఉన్నది. చాలామంది విద్యార్థులు ఆ అవకాశం ఉపయోగించుకొంటున్నారని నాకు తెలియకపోలేదు. కాని అంతమాత్రం చాలదు ఈ పర్యాయం నేనిక్క

డికి వచ్చినప్పుడు మీ సన్మానపత్రం హిందీలో ఉండగలదని నన్ను మీరందరూ హిందీలోనే మాట్లాడవలెనని కోరగలరనీ ఆశిస్తున్నాను కాని ఆ విషయాన్ని నేనిప్పుడు ఎక్కువగా చెప్పదలుచుకోలేదు నేనిక్కడికి ఒకే ఒక పనిమీద వచ్చినాను కాబట్టి హిందీనిగురించి చర్చించడంలో నేనెక్కువ కాలం తీసుకొన దలచుకోలేదు నేను వచ్చిన ఆశయం మొదటగానే చెప్పి నా మనసులోనిభారం వదల్చుకొన్నాను మీరు ఈ దేశం బాధ్యతను వహించే పక్షంలో మీరు హిందీని గాని హిందుస్థానీనిగాని నేర్చుకోకుండా ఉంటే అది మీకు చాలా ఆటంకంగా ఉండక తప్పదు మరొకసారి మీ కందరికీ నా కృతజ్ఞతాభివందనలు

ఈ సన్మాన పత్ర భారం నుంచి నన్ను మీరు తప్పించ వలెనని కోరుతు న్నాను అందువల్ల దీనినిప్పుడే వేలం పెట్టదలుచు కొన్నాను " అని వేలం వేయగా వేలం పాట పాడేవారు ఎవరూ ముందుకు రాలేదు "స్త్రీలు కూడా ముందుకు వచ్చి వేలంపాడి నగలీయవచ్చు" అని గాంధీజీ అన్నారు అంతటితో ఊరుకోక "ఒక బంగారు గాజుల జతకుగానీ, ఒక ఉంగరానికి గానీ ఈ సన్మాన పత్రం ఇచ్చివేస్తాను" అన్నారు గాంధీజీ

అంతట ఇద్దరు మహిళలు చెరిఒక గాజు పంపినారు కుమారి స్వామి నాథన్ రెండు గాజులు ఇచ్చి సన్మాన పత్రం తీసుకొన్నది గాంధీజీ హర్షధ్వా నాల మధ్య సభా స్థలం విడిచి వెళ్ళినాడు

**తల్లుల సమావేశము**

డిసెంబరు 20 సాయంకాలం తల్లుల సమాజంవారు, నగరంలోని హరిజన స్త్రీలు, భారత సేవా సంఘం వారి ఆవరణలో సమావేశమై మహాత్మా గాంధీకి సన్మాన పత్రం, హరిజన నిధికి రు 160/ల విరాళం సమర్పించినారు గాంధీజీ సభాస్థలికి రాగానే శ్రీమతి సుభద్రమ్మగారు ఆయనకు ఖద్దరు దండ వేసినారు కొందరు బాలికలు కొన్ని పాటలు పాడినారు సభానంతరం ఒక చిన్న బాలుడు మరొక 5 రూపాయలు గాంధీజీకి సమర్పించినారు

**తల్లుల సన్మాన పత్రము**

ప్రియమయిన మహాత్మాజీ !

తల్లుల సంఘ సభ్యులమయిన మేమిచ్చే ఈ స్వల్ప విరాళం స్వీకరించ ప్రార్థన

మేమిక్కడ కొద్ది మందిమే సమావేశమయినప్పటికీ మాలో హరిజనులు కూడా ఉన్నారని, మాలో కొందరం పూర్వాచార పరాయణుల మయిన బ్రాహ్మణుల మయినప్పటికీ మేము నిరంతరం హరిజన స్త్రీలతో స్వేచ్ఛగా కలసి మెలసి ఉంటున్నామని మీకు మేము తెలిపి నప్పుడు మీ కది సంతోష దాయకంగా ఉండగలదు మీరు హిందూ సమాజాని కిచ్చిన ఆదేశ ప్రభావం మా పైన ఎక్కువగా ప్రసరించిందని చెప్పడానికి మేము చాలా సంతోషిస్తు

న్నాము

భగవంతుడు మిమ్ము చిరాయు రారోగ్యవంతులిగా చేయవలెనని మా ప్రార్థన

**హరిజన స్త్రీల సన్మాన పత్రము**

ప్రియమయిన మహాత్మాజీ !

ఈ నగరానికి ఈ రాష్ట్రానికి చెందిన లక్షలాది హరిజన స్త్రీల పక్షాన మిమ్ముల నిక్కడకు ఆహ్వానిస్తున్నాము మీరు మా సంఘంపట్ల చూపుతున్న నిరంతర సానుభూతికి, ప్రేమకు మేము చాలా కృతజ్ఞులము హిందూ సమాజంలో మాకొక గౌరవ స్థానం కల్పించటానికి కృషిచేస్తున్న పుణ్య పురుషులు మీరు ముఖ్యంగా మా క్షేమం కోసం ఈ దేశంలో మీరెంతో కృషిచేసి పర్యటిస్తున్నందుకు మేము మిమ్ములను వేనోళ్ళ నుతించవలసి ఉన్నది

సర్వ శక్తిమంతుడైన భగవంతుడు మీకు చిరాయురారోగ్య శక్తిసామర్థ్యాలు ప్రసాదించుగాక

**మహాత్ముని ప్రత్యుత్తరము**

ప్రియమయిన సోదరీమణులారా !

హరిజన సేవా సంఘ సన్మాన సంఘం వారు నాకు చాలా కొద్ది నిమిషాలు మాత్రమే వ్యవధి ఇచ్చినారు ఈ కొద్ది కాలంలోనే మీతో ఇంకా ఎక్కువ పరిచయం కలిగించుకోవలెననే కోరిక నాకున్నప్పటికీ ప్రస్తుతం నేనా ప్రయత్నం విరమించుకొని మీకు కొద్దిమాటలు చెప్పి మరొక చోటకు నేను త్వరగా వెళ్ళవలసిఉన్నది మీలో చాలామంది హరిజన సోదరీమణులని తెలుసుకొన్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది మీరా సంగతి చెప్పనట్లయితే మీలో హరిజనులెవరో, హరిజనులు కానివారెవరో నేను తెలుసుకోగలిగి ఉండేవాణ్ణిగాను ఈ ఒక్క విషయమే అస్పృశ్యత దేవుడు నియమించిన సంస్థ కాదని అర్థమవుతుంది ఇది కేవలం మానవుని కుహానా నిర్మితము ఈ అస్పృశ్యతను నిర్మూలించటానికి సవర్ణ హిందూ స్త్రీ పురుషులు తిరుగుబాటు చేయడం వారి విధి కనక ఈ తల్లుల సమాజంవారు నాకిచ్చిన ఈ స్వల్ప విరాళానికి నేనానందిస్తున్నాను

ఇక హరిజనసోదరీమణులకు కూడా నేనొక మాట చెప్పవలసి ఉంది ఈ సందర్భంలో హరిజన పురుషులుకూడా తమ విధిని నిర్వర్తించవలసి ఉన్నది ముఖ్యంగా మూడు, నాలుగు విషయాలు నేను వారి దృష్టికి తెస్తున్నాను వారు ప్రాథమిక ఆరోగ్య రక్షణ సూత్రాలను గమనించవలె ముఖ్యంగా వారి శరీరాలను పరిశుభ్రంగా ఉంచుకోవలె చచ్చిన జంతువుల మాంసము, గోమాంసము తినడం వంటి దురభ్యాసాలను వారు మానవలె తాగుడు అలవాటు కేవలం హరిజనులలోనేగాక ఉన్నత వర్గాల వారమని చెప్పుకుంటూన్న

హిందువులలోకూడా ఉన్నది హిందువులలో ఉన్నత కులాలవారు ఆ తాగుడును మానినా మానకపోయినా మీరుమాత్రం మీ పురుషులతో దానిని మానేటట్లు చేయవలె మీకుకూడా అలవాటు ఉన్నట్లయితే మీరుకూడా మానివేయవలె! గడచిన యాభై సంవత్సరాల నుంచి నేను పేద ప్రజానీకంతో కలిసి పని చేసినాను అందువల్ల నేనిప్పుడు మీకేం చెబుతున్నానో దానిని గురించి నాకు బాగా తెలుసు దక్షిణాఫ్రికాలోని నేటాల్‌లో స్త్రీలు మురుగు గుంటలలో తప్పతాగి దొర్లడం నేను చూసినాను తప్ప తాగిన మనుషులకు మంచి చెడ్డల విచక్షణ జ్ఞానం ఉండదు యావద్భారత దేశంలో నేనివ్వదలచుకొన్న ఈ సందేశం అనుసరించడానికి తగిన శక్తి సామర్థ్యాలను భారతీయులందరికీ హరిజనులకు ఇతరులకు కూడా భగవంతుడు ప్రసాదించు గాక"

ఈ ఉపన్యాసానంతరం "మహాత్మా గాంధీకి జై" అనే నినాదాలు మిన్నుముట్టినాయి

### తిలక్‌ఘాట్‌లో గొప్ప బహిరంగసభ

డిసెంబరు 20 సాయంకాలం మద్రాసు అహ్వాన సంఘంవారు తిలక్ ఘాట్‌లో బహిరంగ సభ ఏర్పాటు చేసినారు ఆ సభకు దాదాపు రెండు లక్షల మంది ప్రజలు వచ్చినారు 1919-20 నాటి సత్యాగ్రహోద్యమ దినాల తరవాత ఎన్నడూ అంత మంది జనం మద్రాసులో ఏ బహిరంగ సభకు వచ్చి ఉండలేదు ఆ జన సమూహాన్ని సర్దుబాటు చేయడానికి స్వచ్ఛంద సైనికులకు సాధ్యం కాలేదు

మొట్ట మొదట స్త్రీల సమూహంలో ప్రారంభమయిన సందడి పెద్ద గలభాగా తయారయి ఒత్తిడివల్ల జనులు ఊపిరి తీసుకోవడం కూడా కష్టమయిపోయింది స్త్రీలు భయపడి గుంపులో నుంచి బయట పడడానికి ప్రయత్నించినారు సాయంకాలం 6 గంటలకు జరుగనున్న సభకు కొన్ని గంటలకు ముందే గాంధీజీని దర్శించవలెననే కుతూహలంతో లక్షలాది ప్రజలు తిలక్‌ఘాట్‌లో చేరడంవల్ల ఈ పరిస్థితి తటస్థించింది

సభకు వచ్చిన ప్రజలు కూర్చోవటానికి తగిన ఏర్పాట్లు చేయడం జరిగింది స్త్రీలకు ప్రత్యేక స్థలంకూడా ఆహ్వాన సంఘంవారు ఏర్పాటు చేసినారు ఎత్తయిన ఉపన్యాస వేదిక ఆ ప్రజా సముద్రంలో ఒక చిన్న లంకవలే కనపడింది

గాంధీజీ ఉపన్యాసం ప్రజలకు చక్కగా వినబడేటందుకు తగిన ఏర్పాట్లు చేసినారు కాని రోడ్డు పక్కల దూరంగాఉన్న వారికి స్పష్టంగా వినిపించినాయి కాని వేదికకు దగ్గరగా ఉన్నవారికి ఒక శబ్దం కూడా వినిపించలేదు ఇది వేదిక చుట్టూ కొంత కల్లోలానికి కారణమయింది

గాంధీజీ సభకు 6 గంటలకు 5 నిమిషాల ముందుగా వచ్చినారు ఈ 5 నిమిషాలలో తాము సుకరంగా వేదిక దగ్గరకు పోవచ్చునని ఆయన భావించి ఉంటారు: కాని ఆయన రాగానే ఆయన దర్శనంకోసం జనం ఒక్కుమ్మడిగా

మూగడంతో స్వచ్ఛంద సేవకుల ప్రయత్నాలన్నీ నిష్ఫలమయిపోయినాయి. చుట్టూకట్టిన చిన్న చిన్న దడులు, అడ్డాలు అన్నీ ఎక్కడివక్కడ పడిపోయి నాయి కాని గాంధీజీని తీసుకొని వచ్చినవారు ఎంతో కష్టంమీద ఆయనను వేదికపైకిచేర్చి కూర్చోబెట్టగలిగినారు

మహాత్మాజీ రొప్పుతూ, రోజుతూ చెమటలు కార్చుకొంటూ ఉన్నారు ఒక చేతితో తననుదుట ఉన్న చెమట తుడుచుకొంటూ మరొకచేతితో ప్రజలను నిశ్శబ్దంగా ఉండమని సైగ చేసినారు గాంధీజీ సందడి చేయవద్దని ఎంత చెప్పినా ప్రయోజనం లేకపోయింది ఆయన ప్రసంగించడం ప్రారంభించే టప్పటికి జనం వేదికవైపు తోసుకొని రావటం మొదలు పెట్టినారు వేదిక గజ గజలాడింది కాని ఎట్లాగో అదృష్టవశాత్తు ఆ ఒత్తిడికి తట్టుకొన్నది

స్త్రీలు భయభ్రాంతులై ఏడుస్తూన్న తమ బిడ్డలను వేదికపైన ఉన్న వారికి అందించినారు అందులో ఒక పసిబిడ్డ కూడా ఉన్నది వేదికపైన అప్పుడొక జాలికరమైన దృశ్యం కనబడింది భయంతో వణికిపోతూన్న బిడ్డలు గాంధీజీ చేతులను పట్టుకొని "తాతా, తాతా" అని ఏడవడం ప్రారంభించి నారు గాంధీజీ వారిని తన వడిలోకి తీసుకొని ఓదార్చడానికి ప్రయత్నించి నారు

అప్పుడు వేదికమీద ఉన్న ఒక నాలుగేండ్ల బిడ్డనుచూసి 'వీరెవరో నీవు ఎరుగుదువా" అని అడిగినారు "నేనెరక్కేం, ఈయన గాంధీ" అన్నాడు కన్నీళ్లతో ఆ బాలుడు

సుమారు ఒక అరగంటకు కొంత గలభా తగ్గింది తాత్కాలికమయిన ఆ అవకాశం తీసుకొని గాంధీజీ తన ఉపన్యాసం మొదలుబెట్టినారు అప్పుడు ఉపన్యాసానంతరం గాంధీజీని సురక్షితంగా ఆ గుంపులోనుంచి తప్పించుకొని బయటకు తీసుకొనిపోయేటందుకు తగిన సహాయం తెచ్చుకొనడానికి వేదికను వీడి ఖచ్చు జగన్నాథదాసు మరికొందరు వెలుపలకు వెళ్ళినారు

తన ఉపన్యాసాన్ని గాంధీజీ 7 నిమిషాలలో ముగించినారు

## గాంధీజీ ఉపన్యాసము

"మీరు మీ హృదయాలనుంచి అస్పృశ్యతను తొలగించుకోవలసిందని" ప్రబోధిస్తూ గాంధీజీ ఇంకా ఇట్లా అన్నారు

'మీరు నావట్లగల ప్రేమను అత్యద్భుతంగా ప్రదర్శించినారు దేవుని పేరుతో దేవునికోసం నేను ఎవరిని హరిజనులుగా భావిస్తున్నానో ఆ దిక్కులేని దేవుని బిడ్డలకోసం నేను ప్రారంభించిన ఈ ఉద్యమంలోని ఆంతర్యం, విస్తృతిని మీతో ప్రతిఒక్కరూ గ్రహించి ఉంటారని భావిస్తున్నాను

దేవుని దృష్టిలో మనిషికి మనిషికీ మధ్యగానీ, జంతువుకు జంతువుకూ మధ్యగానీ భేదంలేదు మనుషులలో కొందరు మరికొందరికంటె తక్కువవారిగా దేవుడు సృష్టిస్తే వారి శరీరాలపైన ఆయన ప్రత్యేకంగా అందరికి తెలిసేటట్లు

రెవరూ పొరపడక ఉండేటట్లు అందరికీ కనబడేటట్లు ఒక గుర్తుపెట్టి ఉండే వాడు మీరు భారతదేశంలో ఒక కొననుంచి మరొక కొనకు పోయినప్పటికి కులీనులమనుకునే హిందువులకు ఉన్నత కులాల హిందువులు, "అంటరాని వారని" "చూడరానివారని" ఇంకా ఏమేమో అని పిలచే కులాలవారికీ మధ్య నేను సూచించిన గుర్తులెక్కడా మీరు చూడలేరు నేను చూసి ఉండలేదు

మరొక విషయం కూడా తీవ్రంగానూ, అత్యవసరంగానూ మీరు ఆలోచించవలసి ఉన్నది మనం మన హృదయాల నుంచి అస్పృశ్యతను తుడిచి వేయక పోయినట్లయితే మన జాతి నశిస్తుంది అనేక ఇతర మతాల వలెనే హిందూ మతం కూడా నిర్మూల మవుతుంది అప్పుడా అపకీర్తి మనలందరినీ చుట్టుకొంటుంది ఈ విషయం నేను వేలకొద్దీ వేదికలమీద చెప్పి ఉన్నాను ఇప్పుడు మళ్లీ ఇక్కడ చెబుతున్నాను

ఇంత గందర గోళంలో ఈ మహోద్యమంలోని అంతరార్థాలు మీకు చెప్పకుండా ఉన్నాను మన మనసులలోనుంచి అస్పృశ్యతా కళంకం తొలగింప బడిన వెంటనే హరిజనుల హృదయాలలో స్వాతంత్ర్య కిరణాలు ప్రసరింపగలవు అప్పుడు మనం వారిని మనతో సమానంగా గౌరవిస్తూ మనకున్న హక్కులు వారికి కూడా ఉన్నవనీ, సవర్ణ హిందువుల క్రమశిక్షణవంటి క్రమశిక్షణలోనే వారు కూడా మెలగగలరనీ తెలుసుకోగలము దేవుని దయవల్ల ఈ సందేశం మీ మనసుకు నాటితే మనం హెచ్చు తగ్గులనే వ్యత్యాసాలను మరచి పోగలము

ఈసభ ముగిసింది మీరందరూ నిశ్శబ్దంగా, సురక్షితంగా ఈ సభను విడిచి మీ ఇండ్లకు వెళ్లండి నేను కూడా క్షేమంగా నా కారు దగ్గరికి పోగలను" అని సభ ముగించినారు

వెంటనే బమ్మ జగన్నాథదాసుగారు మరికొందరు, కొంత మంది కాన్‌స్టేబుల్స్‌తోను, వలంటీర్లతోను వచ్చి గాంధీజీ వేదిక దిగగానే ఆయనను తమ మధ్య ఉంచుకొని ఆయనకోసం వేచి ఉన్న కారు దగ్గరకు సురక్షితంగా తీసు కొని వెళ్ళినారు

తిలక్ ఘాట్ దగ్గర జరిగిన ఈమహాసభలో మద్రాసు మహాజన సభవారు, మద్రాసు పౌరులు, హరిజన దివ్యప్రబంధ సభవారు, తిరువళిక్కేణి వర్తకులు గాంధీజీకి సన్మాన పత్రాలు సమర్పించినారు అవన్నీ ఆ సభలో చదివినట్లుగానే భావించినారు కొంత నగదు, కొన్ని వెండి గిన్నెలు, కొన్ని వెండి గ్లాసులు కూడా గాంధీజీకి బహూకరించినారు

## ఖాదీ భాండారము

డిసెంబరు 20 సాయంకాలం మహాత్మాగాంధీజీ ట్రిప్లికేన్‌లోని ఖాదీ భాండారుకు వెళ్ళినారు అక్కడ శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారు ఆయనను ఆహ్వానించి కొంత విరాళం సమర్పించినారు

## గాంధీజీ హరిజనవాడలను దర్శించడం

గాంధీజీకి డిసెంబరు 21 కార్యక్రమంవల్ల క్షణం తీరిక లేకుండా పోయింది ఆయన కార్యక్రమం ప్రకారం అన్ని చోట్లకు వెళ్లి అన్ని పనులను సక్రమంగా నిర్వర్తించినారు

ఆనాడు ఆయన పది హరిజనవాడలను దర్శించినారు ప్రతి చోటా 10 నిమిషాలకు తక్కువ లేకుండా ఉన్నారు ఆయన చూసిన చోట్లన్నిట్లో హరిజన స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూ ఆయన చుట్టు కూడి దాదాపు ఆయనకు ఊపిరాడకుండా చేసినారు

ఈ కార్యక్రమం డిసెంబర్ 21 ఉదయం ప్రారంభమయింది ఆయనతో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దివాన్ బహద్దూర్ వి భాష్యం అయ్యం గారు, వి వెంకట సుబ్బయ్య, రావు సాహెబు వి ధర్మలింగం పిళ్లె, పండిత హరిహర శర్మ గార్లు ఉన్నారు వీరందరూ గాంధీజీ బస చేసిన "శ్రీబాగ్" నుంచి కారులో బయలు దేరి వస్తూండగా ఒక సాహసుడయిన యువకుడు జేబులో నుంచి నోటు బుక్కు తీసి దానిలో గాంధీజీని సంతకం చేయమని కోరినాడు

"నేను సంతకం చేస్తాను కాని దాని ఖరీదు 100 రూపాయలు" అన్నారు గాంధీజీ నవ్వుతూ

"మీ సంతకం తీసుకోనిది నేనిక్కడనుంచి కదలను నాదగ్గర అంత డబ్బు లేదు " అన్నాడు ఆ యువకుడు జాలిగా

'పోనీ ఇప్పుడు నీవేమిస్తావో చెప్పు" అన్నారు మహాత్మాజీ

"5 రూపాయలు" అన్నాడా యువకుడు

"అయితే ఇట్లాతే" అన్నారు గాంధీజీ

ఆ యువకుడు విద్యార్థివలె కనిపించినాడు అతని జేబంతా, దులిపి 5 రూపాయలు చేతిలో పుచ్చుకొన్నాడు గాంధీజీ ఎడం చేతితో ఆ పైకం తీసుకొని కుడిచేతితో తనపేరు వ్రాసి ఇచ్చినాడు ఆ యువకుని ముఖం వికసించింది

'నీవు చాలా అదృష్టవంతుడివి 5 రూపాయలకు నా సంతకం తీసుకో గలిగినావు ఇక్కడ అట్లా తీసుకో గలిగిన వారిలో నీవు మొదటి వాడివి ఇతరచోట్ల ఒక్క సంతకానికి 100 రూపాయలకి తక్కువ తీసుకోలేదు " అని మళ్లీ నవ్వుతూ అన్నారు గాంధీజీ

ఇంతలో నే గాంధీజీకారు బంగళానుంచి కదిలింది ఖద్దరు దుస్తులు ధరించిన స్వచ్ఛంద సైనికులతో ఒక బస్సు ఆ కారు వెంట వెళ్ళింది

గాంధీజీ మొట్టమొదట చూసిన హరిజనవాడ ఎగ్మూర్ లోని వరదరాజ పురము గాంధీజీ స్థానిక వరనమందిరానికి ఎదురుగా ఉన్న రోడ్డుపైన కొంచెం సేపు ఆగినారు. అక్కడకు చాలా మంది హరిజనులు వచ్చి ఆయనను అభినందించి నారు. హరిజనులలో ఒక వయోవృద్ధుడు గాంధీజీ మెడలో దండ వేసినాడు

గాంధీజీ కారు ఆ వాడలోకి పోగానే దాని చుట్టు స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూ చేరినారు గాంధీజీ వారిని ఒకటి రెండు కుశల ప్రశ్నలు అడిగిన తరవాత ఆ ప్రజల 'జయజయ ధ్వానాలు' మిన్ను ముట్టినాయి తరవాత ఆయన పెరియమెట్టుకు వెళ్ళినారు

**పెరియమెట్టులో**

గాంధీజీ రాక నుద్దేశించి ఆయనను సత్కరించడానికి పెరియమెట్టు వాస్తవ్యులు అంతకు పూర్వం వారం రోజులనుంచి సన్నాహాలు చేసినారు ఆయన పోయే వీధులు పరిశుభ్రంచేసి అలంకరించినారు యెల్లమ్మన్ కోవెల దగ్గర కొంత మంది కులీన హిందువులు, హరిజనులు ఆయన రాకకు ఎదురు చూస్తూ నిలిచి ఉన్నారు మహాత్మాజీ ఆ కోవెల ముందు కొన్ని నిమిషాలాగి నారు ఆయన రాగానే అక్కడ ఆయన రాకను నిరీక్షిస్తూండిన సి వెంకట రంగంనాయుడుగారు మహాత్మాజీ రాకను గురించి అక్కడివారి ఆనందాన్ని తెలియ జేసినారు

''ఈ కోవెలలో ఆది ద్రావిడులకు ప్రవేశముందా'' అని గాంధీజీ అడిగి నారు

"ఇందులో చాలా కాలంనుంచి ఆది ద్రావిడులకు ప్రవేశమున్నది మరొక గొప్ప విషయమేమంటే ఈ దేవాలయ ట్రస్టీలలో కొందరు ఆది ద్రావిడులే" అని జవాబు చెప్పినారు నాయుడుగారు

గాంధీజీ వేసిన మరొక ప్రశ్నకు 'కులీనులు హరిజనులు కూడా ఈ దేవాలయంలోకి పోతూ ఉంటారు" అన్నాడు శ్రీ నాయుడు

"పూజారి ఎవరూ?" అని ప్రశ్నించినాడు గాంధీజీ

"ఒక పండారం" అన్నాడు వెంకటరంగంనాయుడు

వి భాష్యం అయ్యంగారు పూజారి కులీన హిందువని చెప్పినారు

అప్పుడా పూజారి గాంధీ దగ్గరకు పరుగెత్తుకొని వచ్చి ఆయనకు దండ వేసి దేవాలయ మర్యాదలతో సత్కరించినారు

యెల్లమ్మన్ కోయల వీధి గుండా కడప రంగయ్య చెట్టి వీధికి గాంధీజీ కారు పోతూండగా వీధులపక్క జనం బారులుతీర్చి నిలబడి ఆయనను అభినందించినారు రంగయ్యచెట్టి వీధిలో రామకృష్ణ భక్తజన సభవారు గాంధీజీని ఆహ్వానించి సత్కరించినారు ఆ వీధి అంతా మనోహరంగా అలంకరింపబడి ఉన్నది వీధి మధ్యనున్న పందిరిలోకి గాంధీజీ కారు చేరగానే ఆ వీధిలోని ఖద్దరు దుస్తులు ధరించిన ప్రముఖులు కొందరు ఆయనకు సన్మాన పత్రంతోపాటు స్థానికంగా సేకరించిన కొంత విరాళం కూడా సమర్పించినారు ఆ సన్మాన పత్రం ఇంగ్లీష్‌లో ఉన్నది దానిని శ్రీ సారంగపాణి చదివినారు

"ఈ మా చిన్న విరాళాన్ని మీరు తలపెట్టిన ఉదార హరిజనోద్యమానికి క్షేమము అత్యంత గౌరవంతో ఈనాడు మీ పవిత్ర పాదాల ముందు సమర్పించు

కొంటున్నాము" అని ఉన్న సన్మాన పత్రానికి బదులుగా గాంధీజీ "దేవుడు మిమ్ము ఆశీర్వదించుగాక" అని "మీరందరూ ఐకమత్యంగా ఉండండి" అని సందేశ మిచ్చినారు

ఆ సమయంలోనే ఒక ఎనభై యేండ్ల వయసుగల నాయుడు స్త్రీ హారాత్తుగా ముందుకువచ్చి ఆ వీధిలోని స్త్రీలకు మహాత్మునిపట్లగల ప్రేమకు గౌరవానికి చిహ్నంగా కొంత విరాళం సమర్పించింది

గాంధీజీ దానిని సంతోషంతో స్వీకరించినారు

తరవాత మహాత్మాజీ నౌకా ఆసుపత్రిపోడ్డుకు దగ్గరగా ఉన్న ఒక చేరికి వెళ్ళినారు ఆ చేరి(గూడెం) చక్కని తోరణాలతోను, ఆర్చీలతోను అలంకరింపబడి ఉన్నది ఆయన అక్కడి హరిజనులను కలుసుకొని కొంతసేపు సంభాషించినారు భాష్యం అయ్యంగారు గాంధీజీకి, హరిజనులకు మధ్య దుబాషీగా వ్యవహరించినారు కొంతమంది హరిజనులు ఆయనకు పూలదండ ఇవ్వగా ఆయన సంతోషంతో స్వీకరించినారు మహాత్మాజీ ఆ ప్రదేశం దర్శించినందుకు ఆయన గౌరవార్థం ఐదువందలమంది పేదవారికి ఆ రోజున స్థానిక పౌరులు భోజనం పెట్టినారు

పెరంబూరునుంచి గాంధీజీ మైలాపూరుకుపోయి పల్లక్కుమణ్యంచేరికి వెళ్ళినారు అక్కడ రామకృష్ణమిషన్‌కు సంబంధించిన స్వామీరుద్రనాథ్, తొండారు సంఘంవారి సహకారంతో సాంఘికసేవచేస్తున్నారు స్వామీరుద్రనాథ్ గాంధీజీని ఆహ్వానించి సన్మానపత్రం సమర్పించినారు అక్కడ బాలబాలికలందరూ ఖాదీ దుస్తులు ధరించి గాంధీజీ గౌరవార్థం పాటలు పాడినారు గాంధీజీ వారిని ఆశీర్వదించి నిమ్నజాతుల సేవ చేస్తున్న కార్యకర్తలకు విజయం కలగవలెనని కోరినారు

తరవాత ఆయన అడయారులోని దామోదరపురంలో శ్రీమతి హోల్డావుడ్ నడుపుతూండిన కిండర్‌గార్డెన్ పాఠశాలకు వెళ్ళినారు ఆ విద్యార్థులలో ఎక్కువమంది హరిజనులు వారు గాంధీజీని హృదయపూర్వకంగా ఆహ్వానించినారు గాంధీజీ వారితో కొన్ని మాటలు మాట్లాడి వారిని పరిశుభ్రంగా జీవించవలెనని సలహా ఇచ్చినారు ఆ వాడలో అంతకు పూర్వం కొద్దిదినాల కిందటనే తెరిచిన ఒక దేవాలయం గాంధీజీ దర్శించినారు ఆ దేవాలయంలోకి తదితర హిందువులతోపాటు హరిజనులు కూడా స్వేచ్ఛగా వెళ్ళగలుగుతున్నారని తెలుసుకొని ఆయన ఆ కార్యకర్తలను అభినందిస్తూ హరిజనాభ్యుదయానికి వారు చేసేపని అంతకంటే ఎక్కువ జయప్రదంగా జరగవలెనని ఆశీర్వదించినారు

గాంధీజీ కిల్‌పాక్‌కు వెళ్ళినప్పుడు అక్కడి హరిజనులు అనేకమంది ఆయనను ప్రత్యేకంగా నిర్మించిన ఒక పందిరిలోకి ఆహ్వానించి సన్మానించినారు హరిజనబిడ్డలకు ఖాదీబట్టలు పంచిపెట్టినారు గాంధీజీ వారిచ్చిన సన్మానపత్రం స్వీకరించి హరిజనులు దురభ్యాసాలను మానవలెనని సలహా ఇచ్చినారు

**అరుంధతీపురము**

పెరంబూరులో హరిజనులు నివసించే అరుంధతీపురానికి గాంధీజీ డిసెంబరు 21 ఉదయం వెళ్లినారు అక్కడ హరిజనాభ్యుదయ కార్యక్రమం క్రమాభివృద్ధి పొందుతూన్నది ఒక రాత్రి పాఠశాల ఒక హాస్టల్ అక్కడ ఉన్నవి గాంధీజీ రాకను గురించి ఆ పల్లెయావత్తు మనోహరంగా అలంకరింప బడింది అనేకమంది హరిజన బాలురు బాలికలు గాంధీజీని ఆహ్వానించటానికి రోడ్డుపక్క నిలబడి ఉన్నారు వి భాష్యం అయ్యంగార్, కాశీనాథుని నాగేశ్వరరావు, వెంకట సుబ్బయ్యగార్లు గాంధీజీ వెంట ఉన్నారు గాంధీజీ అక్కడికి వెళ్ళగానే ఆయనకు పూలదండవేసి అక్కడివారు "గాంధీజీకి జై" అని నినాదాలు చేసినారు హాస్టల్ వార్డన్ పి ఆర్ రామచంద్రయ్యగారిని గాంధీజీకి పరిచయం చేసిన తరవాత ఆయనను అక్కడి పనిని గురించి గాంధీజీ కొన్ని ప్రశ్నలు వేసినారు హాస్టల్‌లో 22 మంది విద్యార్థులున్నారని, హరిజన కార్యకర్తలే హాస్టలును నడుపుతున్నారని రామచంద్రయ్యగారు చెప్పినారు హాస్టల్‌లోని పిల్లలు ఒక పాట పాడుతూ గాంధీజీని ఆహ్వానించినారు గాంధీజీ చిరునవ్వుతో దానిని అమోదిస్తూ అక్కడినుంచి సెలవు తీసుకొన్నారు

గాంధీజీ అక్కడికి వచ్చినందుకు ఆయన గౌరవార్థం స్థానికులయిన 400 మంది బాల బాలికలకు ఖద్దరుబట్టలు పంచిపెట్టడం జరిగింది

**భారతసభ సన్మానము**

డిసెంబరు 21 ఉదయం గాంధీజీకి తేనంపేటలోని వెల్లాలలో భారతసభ వారు, రాయపేట కౌరులు సన్మానపత్రాలను సమర్పించినారు గాంధీజీ దర్శనార్థం అక్కడ చాలామంది సమావేశమయినారు

భారత సభవారి సన్మానపత్రం టి యస్ స్వామినాథన్‌గారు చదివినారు దేశంలోని అట్టడుగు ప్రజలతో కలసి ఉండడం, దేవునితో కలసిమెలసి ఉండడం వంటిదేనని గాంధీజీ తమకు చేసిన బోధ తాము విస్మరింపజాలమని ఆయన అన్నారు హరిజనులకోసం గాంధీజీ చేస్తున్న పనిద్వారా హిందూ మతంలోని ప్రధాన సత్యం ఆయన అనేకమంది పండితులు చేసిన ప్రబోధాల కంటె కూడా ఎక్కువ ప్రబలంగా నిరూపించగలుగుతున్నారని ఆ సన్మాన పత్రంలో పేర్కొవడం జరిగింది భారత సభవారు హరిజనులకోసం ఒక రాత్రి పాఠశాల, ఒక పఠనమందిరం, ఒక మతబోధ తరగతిని నడిపి వారిపట్ల తమ కర్తవ్యం నిర్వర్తింప కోరుతున్నట్లు కూడా ఈ నివేదికలో ఉదాహరించినారు

ఆ తరవాత మహాత్మాజీకి వారు కొంత విరాళం సమర్పించినారు ఒక స్త్రీ ఒక ఉంగరమిచ్చింది తరవాత భారత సభవారి సన్మానపత్రపు నకళ్లను రెంటిని వేలం వేయగా ఒకటి ఆరు రూపాయలకు, రెండోది మూడు రూపాయలకు అమ్ముడు పోయింది రాయపేట వారిచ్చిన తమిళ సన్మాన పత్రం వేలం పెట్టగా రెండు రూపాయలు వచ్చింది తరవాత గాంధీజీ పిల్లలను సం

బోధిస్తూ "ఈ పరిశుద్ధోద్యమంలో పిల్లలు కూడా పాల్గొనటానికి అవకాశ మున్నదని జ్ఞాపకం పెట్టుకోండి! మీరు ఎప్పుడూ మంచిగా ఉండండి! కష్టా లన్నిటిలో దేవుణ్ణి స్మరిస్తుండండి" అని వారికి సలహా ఇచ్చి గాంధీజీ అక్కడి నుంచి "మహాత్మాగాంధీకి జై" అనే నినాదాల మధ్య మరొక చోటికి వెళ్ళి నారు

## గాంధీజీకి గుజరాతీల ఆహ్వానము

డిసెంబరు 22 ఉదయం 9-30 గంటలకు టంకశాల వీధిలోని "జైన మందిరం"లో మద్రాసు నగరంలోని గుజరాతీలు, సింధీలు, మార్వారీలు గాంధీజీని ఆహ్వానించి సన్మానించినారు గాంధీజీ అక్కడకు పోయే తోవలో జనం క్రిక్కిరిసి ఉండడమేగాక మేడల మీద డాబాల మీదా ఇంకా ఇతర ఎత్తయిన ప్రదేశాలలో కూడా ప్రజలు నిలబడి ఉత్సాహంతో ఆయనను దర్శించి నారు గాంధీజీ సభా స్థలానికి ఒక గంట ఆలస్యంగా చేరుకొన్నారు

శ్రీ రామనాథ గోయెంకా కొంతమంది స్వచ్ఛంద సైనికుల సహాయంతో సభా స్థలంలోను సభా మందిరానికి ఎదురుగాను, ప్రజలు సందడి చేయకుండా సర్దడానికి చక్కని ఏర్పాట్లు చేసినారు

గాంధీజీ సభా స్థలికి రాగానే ప్రముఖులయిన గుజరాతీలు, మార్వారీలు ఆయనకు దండలు వేసి ఆయా సంఘాల పక్షాన సన్మాన పత్రాలను విరాళా లను సమర్పించినారు మార్వారీలు, గుజరాతీలు కలిసి 2,750 రూపాయలను సింధీలు 1,001 రూపాయలును హరిజన నిధికి ఇచ్చినారు దంతపు నగిషీతో ఉన్న కోవిదారు (మద్ది) చెక్కపెట్టె, వెండి చక్రంలో అమర్చిన గాంధీజీ నడుంవరకు ఉన్న బొమ్మ, వెండి నబ్బు పెట్టె, నారింజపండ్లతో ఉన్న మరొక వెండి పెట్టె గాంధీజీకి బహూకరించినారు

గాంధీజీ మొట్ట మొదట నారింజ పండ్లను తీసుకొని వేదికకు దగ్గరగా ఉన్న ఇద్దరి పిల్లలకు ఇచ్చి వేసినారు

"ఇక నేను నా వ్యాపారం సాగిస్తాను" అన్నారు తీరిగ్గా కూర్చొని గాంధీజీ

"మీరందరూ దూర దేశాలకు పోయి ప్రజలనుంచి డబ్బు లాగి ధనం కూడ బెట్టినారు ఇప్పుడు నేను మీదగ్గర నుంచి డబ్బు గుంజుకో దలుచు కొన్నాను" అన్నారు నవ్వుతూ

ఆ హాస్యానికి సభ్యులు నవ్వి కరతాళ ధ్వనులు చేసినారు దంతపు నగిషీ పెట్టెను పైకెత్తి "మీరు దీనికి ఏమిస్తారో ఇవ్వండి" అన్నారు గాంధీజీ వెంట వెంటనే వేలం పాట పెరిగిపోవడం ప్రారంభించింది పాటదారులను ప్రోత్స హించడంలో గాంధీలో మంచి చురుకుదనం కనిపించింది మొట్ట మొదటి పాటదారు సుమారుగా దాని ఖరీదుకు సరిపోయేటట్లు 15 రూపాయలకి పాడి నాడు, రామనాథ గోయెంకా 101 రూపాయలు అన్నాడు. "రండి, రండి

ఇక్కడున్న గుజరాతీలకు 101 రూపాయలు ఒక లెక్కకాదు' అని హెచ్చరించినారు గాంధీజీ

మరొక పాటదారుడు "201" అన్నాడు

"పాట కొట్టేయనా'' అన్నారు గాంధీజీ అటూ, ఇటూ చూసి

"ఒకసారి, ... రెండుసార్లు ... ఇంకా నేను మూడోసారి అనలేదు ఇంకా అవకాశం ఉంది చూసుకోండి" అన్నారు గాంధీజీ కాని ఎవ్వరూ మొగ్గేటట్లు కనిపించలేదు

"201 కి మూడుసార్లు" అంటూ గాంధీజీ సురాజ్ మల్ అండ్ కంపెనీకి చెందిన జయ్ సింగ్ లాల్ మెహతాకు ఆ పెట్టెను ఇచ్చి వేసినారు

నాగ్ జీ పురుషోత్తం కంపెనీ వారి సిబ్బంది ఇచ్చిన వెండి చట్రంలోని గాంధీజీ బొమ్మను వేలం పెట్టగా తిరిగి ఆదికూడా జయ్ సింగ్ లాల్ మెహతా పేరున కొట్టి వేయబడింది ఆ బొమ్మను ఇచ్చేటప్పుడు దాని కింద గాంధీజీ తన సంతకం చేసి ఇచ్చినారు

మార్వాడీ సంఘంవారు వెండి చట్రంలో బిగించి ఇచ్చిన సన్మాన పత్రం, వెండి సబ్బు పెట్టెనూ వేలం పెట్టగా వాటి రెంటిని 61 రూపాయలకు మళ్లీ వెనకటి వారే కొన్నారు

వీర వచన లైబ్రరీవారు బహూకరించిన వెండి పెట్టెను వేలం పెట్టినారు దాని ఖరీదు సుమారు 35 రూపాయలుంటుంది కాని జయసింగ్ లాల్ మెహతాతో పోటీపడి కైతియవార్ సైకిల్ అండ్ మోటారుకారు కంపెనీకి చెందిన గులాబ్ దాస్ 525 రూపాయలకు పాడి తనపేర కొట్టేయించు కొన్నాడు

ఇందువల్ల గాంధీజీ తనకు బహూకరింపబడిన వస్తువులను వేలం పెట్టి డబ్బు సంపాదించడంలో సిద్ధహస్తుడని తేలింది

గాంధీజీ ఆ తీవ్రమయిన పోటీకి చాలా సంతోషిస్తూ ''గుజరాతీల, సింధీల దగ్గర నుంచి నేనెంతో సొమ్ము వస్తుందనుకొన్నాను ఈ కొద్ది వందలు మీకొక లెక్కకాదు" అన్నారు

మద్రాసులోని కేవల్ రాం కంపెనీ మేనేజరు శ్రీ నారాయణదాసు వారి యజమానుల తంతి ప్రకారం గాంధీజీని మైలాపురంలో కలుసుకొని డిసెంబరు 21న 501 రూపాయలు హరిజన నిధికి విరాళంగా ఇచ్చినారు

**గాంధీజీ ఉపన్యాసము**

గాంధీజీ గుజరాతీల సభలో ఉపన్యసిస్తూ ''నేను ఒక సంస్కరణోద్యమ ప్రచారానికి వచ్చిన సంగతి మీకు తెలుసు అది ఒక సత్య ప్రతిపాదనోద్యమమని నా అభిప్రాయము దానికి మీరందరూ తోడ్పడవలెనని కోరుతున్నాను మీరిచ్చిన విరాళం మీరివ్వ గలిగిన దానికంటె చాలా తక్కువ

నేను పూనుకొన్న ఈ హరిజనాభ్యుదయ కార్యక్రమం చాలా పవిత్రమయినది నేను తెలుసుకో గలిగి నంతవరకు వేదాలలో ఎక్కువ తక్కువలనే వ్యాఖ్యానంగానీ అస్పృశ్యులు, స్పృశ్యులు అనే వ్యాఖ్యానంగానీ ఉన్నట్లు

వాకు తోచటంలేదు నిజమయిన "అద్వైత" సిద్ధాంతం ప్రకారం దేవుని దృష్టిలో మానవులందరూ సమానులే మనిషికీ, మనిషికీ మధ్య వ్యత్యాసం చూడడం "మాయా" ప్రభావం కాబట్టి మనతోటివారిని అంటరానివారని, చూడరానివారని మనం భావించకూడదు తలగానీ, కన్నుగానీ, చెవిగానీ మన చేతుల కంటెనో పాదాల కంటెనో శరీరంలోని మరే ఇతర అంగం కంటెనో గొప్పవని చెప్పగలమా అన్ని అంగాలు సమానంగా ప్రాముఖ్యమయి నవే అదే విధంగా సమాజంలోని ప్రతి వర్గమూ తక్కిన అన్ని వర్గాలవలె ప్రధానమైనవే అందువల్ల మనం మానవులందరినీ సమానంగా చూడవలె ఈ సిద్ధాంతం ఎంత మాత్రం ధర్మ శాస్త్ర విరుద్ధంకాదు నేను చేస్తున్న ఈ పని దైవకార్యము అది సత్యమార్గము' అని ఉపన్యసిస్తూ గాంధీజీ వారిని దీవించినారు

తరవాత గాంధీజీ జైనమందిరపు మేడ మీదకుపోయి అక్కడ చేరిన గుజరాతీ స్త్రీలను తదితర స్త్రీలను సంబోధిస్తూ అస్పృశ్యతను పాటించ వద్దని ఉపదేశించినారు

తరవాత ఆ స్త్రీలను నగలీయవలసిందని కోరినారు చాలా మంది ఇచ్చినారు

గాంధీజీ తరవాత మరొక చోటుకు వెళ్ళినారు

## దక్షిణ ఇండియా వైశ్య సమాజంవారి సన్మానము

డిసెంబరు 22 ఉదయం దక్షిణ ఇండియా వైశ్య సమాజంవారు మద్రాసు గోవిందప్పన్‌నాయకు వీధిలోని యస్ కె పి డి సత్రంలో గాంధీజీకి సన్మాన పత్రం హరిజన నిధికి విరాళం సమర్పించినారు స్వామీ వెంకటాచలంచెట్టి సన్మాన పత్రం చదివినారు "హరిజనులకు, తదితర హిందువులకూ ఉన్న భేదం కులీనుల ప్రాతికూల్యంవల్లగానీ, కాఠిన్యంవల్లగానీ, స్వార్థపరత్వంవల్లగానీ కలిగిందికాదు కాని అది కుటుంబాలలోని ఆచార సంప్రదాయాలవల్ల ఏర్పడింది అనాలోచితమయిన ఈ భేదం ఆంతరంగిక విప్లవంవలన అంత రిస్తుందా, బాహ్యవిప్లవంవలన నిర్మూలింపబడుతుందా అనేది ఒక పెద్ద సమస్య ఈ సంఘ సభ్యులు మహాత్ముని ఉదారమయిన ఉద్బోధలవల్లనూ, ఉత్తేజకరమయిన వారి ఉదాహరణవల్లనూ ప్రభావితులై తమ శక్తివంచన లేకుండా ఈ ఉద్యమానికి కృషి చేస్తున్నారు" అని వారి సన్మానపత్రంలో ఉదాహరించినారు

సమాజం వారు 340 రూపాయలు హరిజన నిధికి విరాళం ఇచ్చినారు పి యస్. భాష్యం చెట్టిగారు 71 రూపాయలిచ్చినారు ఒక వెండి పళ్ళెమును, ఒక వెండి గిన్నెను, ఒక వెండి సబ్బు పెట్టెను, ఒక చేత గడియారమును, గాజులును, ఉంగరాలును, ఒక ఫౌంటెన్ కలమును కూడా కొంత మంది వ్యక్తులు గాంధీజీకి సమర్పించినారు.

మహాత్మాజీ పీటలో కొన్ని వస్తువులను వేలం పెట్టినాయి ఫౌంటెన్ కలంపైన గాంధీజీ పేరుతో సహా "హెచ్చు తగ్గు అనే భేదాలు పాటించకండి" అని ఇంగ్లీషులో వ్రాయబడి ఉన్నది దానిని వేలం పెట్టగా 250 రూపాయలు వచ్చినాయి వెండి గిన్నెకు 25 రూపాయలు, సన్మాన పత్రానికి 20 రూపాయలు, వెండి సబ్బు పెట్టెకు 30 రూపాయలు, వెండి పళ్లానికి 25 రూపాయలు, గడియారానికి 10 రూపాయలు వచ్చినాయి

## గాంధీజీ ఉపన్యాసము

తరవాత మహాత్మాగాంధీ హిందీలో ఉపన్యసించినారు నాగేశ్వరరావు పంతులుగారు దానిని తెలుగులోకి అనువదించి చెప్పినారు "మీరు నాకు ధనాన్ని, వస్తువులను ఇచ్చినందుకు పశ్చాత్తాప పడకూడదు నేనొక న్యాయమయిన ఉద్యమం కోసం వచ్చినాను మీరు కూడా న్యాయమయిన ఉద్యమం కోసం ధనమిచ్చినట్లు భావించవలె 'హెచ్చు తగ్గుల వ్యత్యాసం తొలగించండి' అని ఈ కలంపైన వ్రాసిన ఉద్యమంకోసమే నేను వచ్చినాను ఈ హెచ్చు తగ్గుల వ్యత్యాసం తొలగించే ప్రయత్నం నేను క్రొత్తగా కనిపెట్టింది కాదు ఇది బహు పురాతన మయినది దేవుడి దృష్టిలో బ్రాహ్మణుడు, బ్రాహ్మణేతరుడు, భంగి, చీమా అందరూ సమానులేనని శాస్త్రాలు ఘోషించినాయి కొంత మంది ఆ శాస్త్రాలు పండితులకోసం ఉద్దేశింపబడినవి కాని మామూలు మనుష్యులకోసం కాదని అంటారు అట్లా చెప్పటం పొరపాటు పండితులు ఆచరించే పనిని మామూలు మనుషులు అనుసరించవలెనని శాస్త్రాలు చెప్పినాయి పండితులకు ఒక సత్యము,సాదా జనానికి మరొక సత్యము అనేది ఉండదు ఒకరు హెచ్చు ఒకరు తగ్గు అనే వ్యత్యాసం మరచిపోవడమనేది ప్రజలందరికీ సంబంధించిన విషయము ఇంకా అనేక ఇతర దుఃఖాలకు ఈ వ్యత్యాసమే మూలకారణము కాబట్టి ఈ వ్యత్యాసాలన్నిటినీ మరచిపోయి మీరందరూ పవిత్ర హృదయులుగా ఉండవలెనని కోరుతున్నాను న్యాయ ప్రవర్తనులుగా ఉండేటందుకు తగిన శక్తిని మీకు భగవంతుడు ప్రసాదించు గాక "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ గోదాం వీధిలో ఉన్న ఆంధ్ర మహాసభ కార్యాలయానికి శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి చిత్రపటం ఆవిష్కరించటానికి వెళ్ళినారు గాంధీజీతో శుక్ల, మలాన్కాని, నాగేశ్వరరావు పంతులు, మాగంటి బాపినీడు, హరిహర శర్మగార్లు ఉన్నారు

## దేశోద్ధారకుని చిత్రపటావిష్కరణ

చెన్నపురి ఆంధ్ర మహాసభవారు ఏర్పాటు చేసిన సభకు గాంధీజీ వారి బృందం రాగానే నాగేశ్వరరావు పంతులుగారు తామక్కడ ఉండవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను అన్నారు అప్పుడు మహాత్ముడు "మిమ్ములను సిలువ వేయదలుచుకొన్నాను'' అన్నారు ఛలోక్తిగా

తరవాత మహాత్మునకు చెన్నపురి ఆంధ్ర మహా సభ సభ్యులు సన్మాన పత్రం సమర్పించినారు వారి సన్మాన పత్రంలో "ఈ సభ స్థాపింపబడినది మొదలు అవిచ్ఛిన్నంగా కార్యదర్శిగా నుండి పలువిధాల సభాభ్యుదయానికి తోడ్పడు తూన్న విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి రూపపటం మా సభలో తమ పావన హస్తాలతో ప్రతిష్ఠించే భాగ్యం మాకు కలిగినందుకు మేమెంతో ధన్యులము" అని వ్రాసినారు

ఈ సన్మాన పత్ర సమర్పణకు ముందే శ్రీ జలగం సుబ్రహ్మణ్యం నాయుడు గారు 30 రూపాయలను, నీలంరాజు వెంకటశేషయ్య కుమారుడు లక్ష్మీ ప్రసాదు బంగారు ఉంగరం, పీతాంబర దేశాయ్‌గారు 100 రూపాయ లను హరిజన నిధికి గాను గాంధీజీకి సమర్పించినారు

## గాంధీజీ ఉపన్యాసము

దేశోద్ధారకుని చిత్రపటావిష్కరణానంతరం గాంధీజీ ఇట్లా ఉపన్యసించి నారు

"మీరు నాకీనాడు ఒక సత్కార్యంచేసే అవకాశం కల్పించినారు మీ సమక్షమందు ఇద్దరు నాగేశ్వరరావులున్నారు ఒకరు సజీవులు వారు వినమ్రులై నేలపై కూర్చుండినారు రెండవ నాగేశ్వరరావుగారు కాగితంపై ఉన్నారు సజీవచిత్రం బహిర్గత మొనరించే శక్తి నాకులేదు 'తన్నుతా తెలుసుకొన్నవాడే ఉత్తముడని జ్ఞానులుచెప్పినారు' అంటూ ఇంతవరకు గాంధీజీ హిందీలో మాట్లాడినారు అది తెలుగులోకి సరిగా అనువాదం కానందున గాంధీజీ ఇంగ్లీషులో ప్రసంగిస్తూ ఇట్లా అన్నారు

సాత్త్వికమగు పురుషుని నిజస్వరూపం పరులెవ్వరునూ సరిగా గ్రహింప జాలరు అట్లాంటి పురుషుడు కూడా తన ఆత్మ యథార్థ స్వరూపం సంపూర్ణంగా గ్రహింపజాలడు

సత్యాన్వేషకుడయిన ఒక మహాజ్ఞాని 'తన్నుతాను తెలుసుకోవడం కంటె మానవుని జీవిత మందు ఉత్కృష్టమయిన కార్యం మరొకటి లేదు నిన్ను నీవు తెలుసుకో' అని చెప్పినాడు ఇది జ్ఞాని అయిన ఒక ఆంగ్ల పండితుని వాక్యము సంస్కృతంలో దీనికి సామ్యమయినది మరొకటి ఉన్నది 'ఆత్మ దర్శనమంటే పరమ పురుషార్థము' కోటి కొక్కరయినా అటువంటి స్థితిని పొందలేరు శ్రీ నాగేశ్వరరావు గారు అట్లాంటి ఉచ్చస్థితిని ఇప్పుడు అందివున్నా లేదా ఇది వరకే అందినా ఉండి వారి అంతఃస్వరూపమును బాహాటంగా వ్యక్తీకరింప జాలి ఉందుము మన మీ చిత్రం ఎట్లాచూసి వారి మూర్తిని తెలుసు కొంటున్నామో వారి అంతరమూర్తిని కూడా మనమిప్పుడు ప్రత్యక్షం చేసుకోగలిగి ఉండేవాళ్ళము చిత్రగతమయిన నాగేశ్వరరావు వేరు, చైతన్య స్వరూపులయిన నాగేశ్వరరావు వేరు చైతన్య రూపంలో వారు అనుదినాభ్యుదయం అందుతూండవచ్చు లేదా క్రమశః పతనం పొందుతూ

వుండ వచ్చు చిత్రంలోని నాగేశ్వర రావు ఎదుగు బొదుగులు లేక నిశ్చలంగా ఉండేవారు ఈ మూర్తిగల మహాపురుషునిలో మనము కొన్ని సద్గుణాలను ఉపలక్షిస్తూన్నందున వారి మూర్తిని ప్రదర్శించే చిత్రంపై కూడా మన ఆదరాభిమానాలను ప్రసరింపజేస్తున్నాము నేను నాగేశ్వరరావు పంతులు గారిని ఎరిగి ఉన్నప్పటి నుంచి ఆయనలో ఒక ప్రత్యేక లక్షణం గమనిస్తున్నాను అవసరమయినప్పుడు సహాయం అపేక్షించేవారికి ఆత్మ సమర్పణ చేయడమే ఆయన ఆదర్శము, అదే ఆయన ప్రత్యేకత నేనొక మారు వారితో ఛలోక్తిగా "అమృతాంజనం పేరుతో ప్రజలను మీరు వంచిస్తున్నారు గదా" అన్నాను 'నిజమే నేను మీ మాట కాదనను, అది వంచన అయినా నిరుపద్రవమైన వంచన అది ఎవరికీ మేలు చేయకపోయినా కీడు మాత్రం చేయదు అమృతాంజనం వాడే వారు దాని నివారణ శక్తిలో విశ్వాసముండే కొంటున్నారు ఆ నమ్మకంవల్లనే వారికి గుణం ఇస్తున్నది ఆ నమ్మకమే నా వ్యాపారానికి ఆధారము కాని నేనొక మాట మాత్రం నిశ్చయంగా చెప్పగలను అమృతాంజనం వల్ల నాకు వచ్చే లాభంలో ఎక్కువ భాగం ఆర్తుల కష్ట నివారణకు వినియోగింపబడుతూన్నది ఈ వ్యాపారానికిదే పరమ ప్రయోజనము" అన్నారు నాగేశ్వర రావుగారు,

ఆ సమాధానం విన్నంతనే ఇతడే నాకు నచ్చిన మనిషనిపించింది ఆయన ప్రత్యుత్తరంలో త్రికరణ శుద్ధి, వినమ్రత, సత్య సంధత ప్రతిబింబించినాయి ఆయన ప్రజలను వంచిస్తుంటే అంతకంటె ఎక్కువగా వారిచే వంచింపబడటానికి ఆయన తయారుగా ఉన్నట్లు తోచింది యాచకులెవరయినా కన్నీరు పెట్టి "దేహీ" అంటే "నాస్తి" అనే మాట ఆయన నాలుకకు రాదు విద్యార్థులు నాకీ విషయం రుజువు చేసినారు వృద్ధ జనులకు వారి ఈవినొసగుతూనేఉన్నది నావంటి వారు కూడా వారినే ఆశ్రయించి రిక్తహస్తాలతో తిరిగి రాలేదు 'నాగేశ్వరరావు గారి మేడలు ఒక వంక మహారాజులకు, మరొక వంక నావంటి రిక్తులకును ఆశ్రయ మిస్తూన్నవ'ని ఒక స్నేహితుడు నాతో అన్నారు

చాలా కాలం నాగేశ్వరరావు గారు ఆంధ్రులని నాకు తెలియదు మద్రాసులో వారిని కలుసుకొన్నప్పుడు వారు తమిళులనే అనుకొంటూ వచ్చినారు సంపూర్ణ వ్యక్తిత్వంగల ఒక ఆంధ్ర ప్రముఖుడు తమిళ మనిషిగా భావింపబడటం ఒక విశేషమే నేనెంత కార్యభారంతో కుంగి పోతూన్నప్పటికీ వారి చిత్ర పటావిష్కరణకు ఎందుకు ఒప్పుకొన్నానో మీకిప్పుడు తెలిసి ఉంటుంది ఇక్కడ చిత్రగతులయివ నాగేశ్వరరావు, అంచంచలుడైనా సజీవ మూర్తి అయిన నాగేశ్వరరావు తన దగ్గరికి ఆర్తుడయి వచ్చిన ప్రతి వ్యక్తినీ ఓదార్చగల శక్తి సంపన్నుడు కావలెనని కోరుతున్నాను మీరందరూ ఈ చిత్ర పటం ఆవిష్కరింప చేసినంత మాత్రాన సంతృప్తి పడకండి! ఆయనలో మీరు చూసిన సద్గుణాలను, ఆయనలో కలవని మీరు భావించిన ఉదారాశయాలను మీ జీవితాలలో మీరు ఆచరణలో పెట్ట గలిగి నప్పుడే ఈ చిత్రపటా

విష్కరణలోని సంపూర్ణ ఫలితం మీరు పొందగలరు ''

ఈ ఉపన్యాసానంతర గాంధీజీ తనకు బహూకరించిన వస్తువులను వేలం పెట్టినారు ఆంధ్ర మహాసభ వారిచ్చిన 11 రూపాయలు, ఖద్దరు వస్త్రాలకు ఖద్దరు మాలకు 12 రూపాయలున్నూ, ఫౌంటెన్ కలానికి 10 రూపాయలున్నూ, దండలకు 8 రూపాయలున్నూ వచ్చినాయి ఖద్దరు వస్త్రాలను, ఖద్దరు మాలను కొన్నవారు శ్రీ వల్లమన్నాటి వెంకట నారాయణరావు గారు, కొందరు స్త్రీలు బంగారు నగలిచ్చినారు

నాగేశ్వరరావు పంతులు గారి చిత్రపటం వ్రాసిన శ్రీ గోవింద రాజులు నాయుడు గారికి ఆంధ్ర మహాసభ వారి బంగారు పతకం గాంధీజీచే బహూకరింపబడింది

## హరిజన కుటీరం దర్శించడం

మహాత్మాజీ గోదాం వీధి నుంచి తిరువళిక్కేణికి వెళ్ళినారు తిరువళిక్కేణి హై రోడ్డు మీద కృష్ణంపేట కల్యాణ మండపం దగ్గర అది ఆంధ్ర యువజన సంఘ సభ్యులు గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు అది ఆంధ్ర పంచాయతీ సభ్యులను వారు మహాత్మాజీకి పరిచయం చేసినారు స్థానిక ఆదిమాంధ్రుల బాలురు గాంధీజీని ఆహ్వానిస్తూ ఒక పాట పాడినారు వారి సన్మాన పత్రంలో అక్కడి ప్రజల అభివృద్ధికోసం వారు చేస్తున్న సేవను గురించి వివరిస్తూ మహాత్మాజీ రాకవల్ల తాము ఇతోధికంగా ఆ ప్రజలను సేవించడానికి ప్రోత్సాహం కలిగిందని విన్నవించుకొన్నారు

## గోకులం దర్శించడం

తరవాత గాంధీజీ గోకులము వెళ్ళినారు, అక్కడ శ్రీ పి శంకర నారాయణ అయ్యర్, శ్రీమతి విశాలాక్షమ్మ కొన్ని సంవత్సరాల నుంచి సాంఘిక సేవా కార్యక్రమం నిర్వర్తిస్తున్నారు ఉదయం 9 గంటల నుంచి కులీన హిందువులయిన స్త్రీపురుషులు చాలామంది గాంధీజీ రాకకోసం అక్కడ వేచి ఉన్నారు ఆ ప్రదేశమంతా పరిశుభ్రంగా ఉంది గాంధీజీని ఉత్సాహాకరంగా ఆహ్వానించడానికి బాలబాలికలు నిరీక్షిస్తూ నిలబడి ఉన్నారు గాంధీజీ అక్కడకు పోయే సరికి మధ్యాహ్నమయింది కాని అక్కడ సమావేశమయిన వారు పవానం ఎంత మాత్రము కోల్పోక ఆసక్తితో ఆయన కోసం ఎదురు చూస్తున్నారు గాంధీజీకి ఆ వాడలో తయారయిన ఒక తేనె సీసాను కానుకగా ఇచ్చినారు మహాత్మాజీ రాకకు చిహ్నంగా అక్కడ ఒక కొబ్బరి మొక్కను నాటినారు గాంధీజీ అక్కడ జరుగుతూండిన పనిని కొనియాడి జయజయ నినాదాల మధ్య ఆ ప్రదేశంనుంచి మరొక చోటికి వెళ్ళినారు

## పెరంబూరు యం యస్ యం రైల్వే ఉద్యోగుల సన్మానము

డిసెంబరు 21వ తేది సాయంకాలం పెరంబూరులోని యూనిట్ హౌస్‌లో యం యస్ యం రైల్వే ఉద్యోగుల సన్మానపత్రాన్ని మద్రాసు లోని పెరంబూరు డివిజన్ వాస్తవ్యుల సన్మానపత్రాన్ని చెంగల్పట్ జిల్లాలోని సింబియన్ యూనియన్‌వారి సన్మానపత్రాన్ని పెరంబూరులోని లేక్ మైదానంలో స్వీకరించినారు లేక్ మైదానంలో అనేకమంది స్త్రీలతోసహా పదివేల మంది జనం సమావేశమయినారు గాంధీజీకి 801 రూపాయల విరాళం సమర్పించడం జరిగింది స్థానిక కాపురస్తుడయిన శ్రీ యేకాంబర మొదలియార్ తన భార్య పేరుమీద గాంధీజీకి ఒక వెండిగిన్నె బహూకరించినారు గాంధీజీ దానిని వేలం వేసినారు శ్రీ మొదలియార్ అంగీకారంతో జమాల్ మహమద్ సాహెబు దానిని 45 రూపాయలిచ్చి తీసుకొన్నారు

గాంధీజీకి యం యస్ యం రైల్వే సంఘంవారు "యూనిట్ హౌస్"లో సమర్పించిన సన్మానపత్రంలో ఇతర విషయాలతోపాటు ఈ ముఖ్య విషయం కూడా ఉదాహరించినారు

"1927లో మా యూనియన్‌కు మీరు పునాదిరాయి వేసిననాడు మీరిచ్చిన సందేశం, మాకెంతో స్ఫూర్తిని కలిగించి మా యజమానులనుంచి న్యాయమయిన మా హక్కులను పొందేటందుకు మేము జరిపిన అనేక అసమపోరాటాలలో మాకు ఎంతో మార్గదర్శకంగా తోడ్పడినాయి మేము సొంతంగా ఒక ముద్రాశాలను కూడా సంపాదించుకోగలిగినాము "

ఈ సన్మానపత్ర సమర్పణానంతరం గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"సోదర కార్మికులారా ! మీరు నాకిచ్చిన సన్మానపత్రానికి కృతజ్ఞుణ్ణి ఇండియాలోని కార్మిక వర్గమంతటితో ఈ ఉద్యమం సమీకరింపగోరితే మీరు హిందూస్థానీ భాషను గ్రహించగలిగి ఉండవలె ఆ పని మీరు చేయగలిగేటంతవరకు ఉత్తరాదికి దక్షిణాదికి కలయిక ఏర్పడదు కాని ఈరాత్రి నేను వచ్చిన పని అదికాదు కనీసం కార్మికవర్గంలోనయినా ఒకరు ఎక్కువ-ఒకరు తగ్గు ఉండకూడదని చెప్పదలచుకొన్నాను

కడచిన 40 సంవత్సరాలనుంచి నేను దాదాపు కార్మికవర్గంలోనే జీవించినాను కార్మికవర్గాలలో కూడా హెచ్చుతగ్గుల వ్యత్యాసం ఉన్నదని తెలుసుకోవలసి వచ్చినందుకు నేను చాలా విచారపడుతున్నాను కార్మికులలో కూడా హరిజన కార్మికులు, హరిజనేతర కార్మికులు అనే వ్యత్యాసం కనబడుతూంది హరిజనేతర కార్మికులలో కూడా వ్యత్యాసాలున్నాయి మీకీ వ్యత్యాసాలను మరచిపోవలె హరిజన కార్మికులు హరిజనేతర కార్మికులు అందరూ ఒకటే మీలో హిందువులమనుకొనేవారు ఈనాడు మనం పాటిస్తున్న అస్పృశ్యతవంటి అస్పృశ్యతను హిందూమతం బోధించడంలేదని తెలుసుకోవలసి ఉన్నది

మతం పేరుతో ఈనాడు మనం పాటిస్తూన్న వ్యత్యాసాలను న్యాయ

మూర్తి అయిన దేవుడు ఏర్పాటుచేసి ఉన్నాడనడం అసందర్భము మాంస భక్షణకు, గోమాంసభక్షణకు అలవాటుపడినవారు దానిని మానవలెనని, కార్మికులు తాగుపడవలెనంటే తాగుడు, జూదము మొదలయిన దుర్వృత్తులనుంచి బయటపడవలెనని కోరుతున్నాను ఈ రెండు దురభ్యాసాలు కార్మికులను నీచ స్థితికి తెచ్చి వారి కుటుంబాలను విధ్వంసం చేసినాయి కాబట్టి దురభ్యాసాలను మీరు మానవలెనని మరొకసారి హెచ్చరిస్తున్నాను అస్పృశ్యత, తాగుడు, జూదము మొదలయిన దురభ్యాసాలను మానేటందుకు తగిన శక్తి సామర్థ్యాలను భగవంతుడు మీకు ప్రసాదించు గాక"

## పెరంబూరు పౌరుల సన్మానము

పెరంబూరు, సెంబియాం పౌరులు గాంధీజీకి సమర్పించిన సన్మాన పత్రము

"మిమ్ములను గొప్ప సత్యద్రష్టగా మేము పేర్కొనడం లాంఛనప్రాయమయిన శుష్కప్రలాపంకాదు మీరు ప్రజలకు సత్యం బోధించడమేగాక మీరు దానిని నిత్యము మీ జీవితంలో అనుష్ఠిస్తున్నారు మహమ్మద్‌లోని ధైర్యమూ, బుద్ధునిలోని హృదయమూ, జొరోస్టర్‌లోని పవిత్రత, జీసస్‌లోని క్షమ, వివేకానందునిలోని దూరదృష్టి, దయానందునిలోని భక్తి, రామ్‌మోహన్‌రాయ్‌లోని సమైక్యభావము, రామకృష్ణునిలోని మతసామరస్యమూ, సిద్ధి నీలో ఉన్నాయి అన్ని మతాలలోని ఉత్తమ లక్షణాలు నీలో సూక్ష్మరూపంలో మూర్తీభవించినాయి నీజీవితం స్ఫూర్తికి, ఉత్సాహానికీ, ఉత్తేజానికి కార్యాకరణము జాతి, మత, రంగు భేదాలతో నిమిత్తం లేకుండా మానవకోటి మంచికోసం సత్యం అనుష్ఠిస్తూ, అందరినీ ఎక్కువగా ప్రేమిస్తూ, అంతకంటె ఎక్కువగా ప్రేమించబడుతూ జీవిస్తున్న లోకోత్తర పురుషులలో మీరొకరు అందువల్ల నేడు మీరు హరిజనాభ్యుదయంకోసం మీయావత్తు కాలాన్ని, శక్తినీ వినియోగించడంలో ఎంతమాత్రం ఆశ్చర్యంలేదు మీ అమూల్యమయిన జీవితం ఈ ఉద్యమంకోసం ధారబోయటానికి కూడా మీరు వెనుదీయటంలేదు

చరిత్ర ప్రసిద్ధమయిన మీ ప్రాయోపవేశంవలన ఈ ప్రదేశంలోని సుందర వినాయగర్ దేవాలయ ద్వారాలు తక్కిన హిందువులతోపాటు హరిజనులకు కూడా తెరవబడినవని మా ఈ సన్మానపత్రంలో మేము విన్నవించుకొంటున్నాము ఈ సందర్భంలో మరొకసారి ఆ దేవాలయ పాలకవర్గంవారికి మా కృతజ్ఞతను తెలుపుకొంటున్నాము

ఈచోట సివిల్ అండ్ సోషల్ లీగ్, స్వదేశీలీగ్, గాంధీక్లబ్బు, చాతుర్వర్ణ్య సంఘ్, గాంధీ స్వదేశీస్టోర్స్ మొదలయిన సంస్థలను మేము స్థాపించుకొని పని చేయడానికి స్ఫూర్తి కలిగించినది మీ ఆత్మోన్నతియే అని విన్నవించుకొంటున్నాము. ఈ సంస్థల ఆశయాలలో అస్పృశ్యతా నివారణ, నిమ్నజాతులనబడే వారి అభ్యున్నతి, స్వదేశీ తత్వప్రచార కార్యకలాపాలు కూడా ఇమిడి

ఉన్నాయి

మేమీ సన్మానపత్రం ముగించేముందు ఈ ప్రదేశంలోని అన్ని వర్గాల వారు అప్పటికప్పుడు ఇచ్చిన 801 రూపాయల మొత్తం హరిజననిధికి సమర్పించుకొంటున్నాము మీకు ఉచితమని తోచినరీతిని దానిని వెచ్చించవచ్చు ఇక్కడ హరిజనుల నిష్పత్తి ఇతర వర్గాలవారి నిష్పత్తితో పోల్చిచూస్తే ఎంత మాత్రం తక్కువ కాదు"

ఈ సన్మానపత్రం, విరాళమును గాంధీజీ చిరునవ్వుతో స్వీకరించి తన కృతజ్ఞతను వెల్లడించినారు కాని గాంధీజీ బహిరంగసభోపన్యాసంవంటిదేమి చేయకపోవడంవల్ల సభను ఏర్పాటు చేసినవారికి, సభ్యులకు కొంత ఆశాభంగం కలిగింది

గాంధీజీ పెరంబూరుకు పోయినప్పుడు హరిజనులకు తెరచిన సుందర వినాయకస్వామి దేవాలయం చూసినారు హరిజనులతోసహా అందరికీ ఉచిత వైద్యసహాయం చేయడానికి బాలగురుస్వామివారు నడుపుతున్న మఠం కూడా గాంధీజీ దర్శించినారు

## మద్రాసు కార్మిక సంఘంవారి సన్మానము

మద్రాస్ కార్మిక సంఘం (Labour Union) వారు డాక్టర్ బెసెంట్ చిత్రపటం ఆవిష్కరించి కొన్ని మాటలు చెప్పవలసిందని గాంధీజీని ఆహ్వానించినారు అందుకోసం సాయంకాలం 6 30 గంటలకు (డిసెంబరు21) ఆయన వాడియా పార్కుకు రావలసి ఉంది కాని అంతకు పూర్వం కొన్ని గంటలనుంచి ఆయన దర్శనంకోసం వివిధ మతాలవారు కులాలవారు వేలకొద్దీ అక్కడ చేరినారు స్త్రీలకు ప్రత్యేకంగా చుట్టూ తడకలతో ఒక స్థలం ఏర్పాటు చేసినారు ఆ ఆవరణలో స్త్రీలు సుఖంగాకూర్చొనేటందుకు స్వచ్ఛందసైనికులు మంచి ఏర్పాటు చేసినారు మరి కొందరు స్త్రీలు పక్కఇండ్ల డాబాలపైన చేరినారు గాంధీజీ కోసం నిర్మించిన వేదికకు చుట్టూ మనుషులు తోసుకొని రాకుండా వలంటీర్లు బందోబస్తు చేసినారు

కాని గాంధీజీ అనుకొన్న సమయానికి రాలేదు అంతటితో జనంలో కొంత అశాంతి బయలుదేరింది ఇంతలో గాంధీజీ సభాస్థలానికివచ్చినారన్నే నీలివార్త ఒకటి ఏ మూలనుండో వెలువడింది అంతటితో ఆ అడ్డంకులన్నీ ఎక్కడి వక్కడ ప్రజల తోపిడిలో పడిపోయినాయి ఎంతో కష్టం మీద వలంటీర్లు సర్దుబాటు చేయగలిగినారు

రాత్రి 8 గంటల తరవాత గాంధీజీ వాడియా పార్కుకు చేరినారు కాని ఆయనకారు సభా స్థలానికి చేర్చేటందుకు చోటుచేయడానికి పోలీసు అసిస్టెంట్ కమీషనర్, పోలీస్ ఇన్‌స్పెక్టర్, అనేకమంది స్వచ్ఛంద సైనికులు చాలా శ్రమ చేసినారు ప్రజలు సహనం కోల్పోయి చుట్టూ ఉన్న తడికలను, దడులను విధ్వంసం చేసినారు వేదిక కూడా పడిపోయే అపాయకరస్థితిలో

ఉండగా డాక్టర్ బెసెంట్ చిత్రపటం ఆవిష్కరించడానికి గాంధీజీ కారు దగ్గరకే తీసుకొని వెళ్ళవలసి వచ్చింది గాంధీజీ తన కారులోనే కూర్చొని ఆ చిత్రపటం ఆవిష్కరించినారు

గాంధీజీ కారులో నిల్చొని రెండువాక్యాలు చెప్పి ఉపన్యాసం ముగించినారు

చిత్రపటావిష్కరణకు ముందు గుంపుల ప్రవర్తనకు గాంధీజీ వారిని గట్టిగా మందలించినారు చిత్రపటం ఆవిష్కరిస్తూ డాక్టర్ బెసెంట్ భారత దేశాభ్యున్నతికి అత్యంత అద్భుతమయిన కృషి చేసినారని ఆమె పేరు విస్మరించ రానిదనీ అన్నారు

గాంధీజీకి ఆ సభలో 120 రూపాయలున్నూ, చూలైలో శ్రీరాజ మాణిక్యం వసూలుచేసిన మొత్తం 181-4-0లకు ఒక చెక్కున్నూ సమర్పించడం జరిగింది

గాంధీజీ అక్కడినుంచి కారులో స్ట్రాహమ్స్ రోడ్డుకు వెళ్ళేటందుకు ప్రజల వత్తిడివల్ల 15 నిమిషాలు పట్టింది గాంధీజీ తరవాత చూలైలోని గాంధీ వనానికి వెళ్ళినారు అక్కడికి ఆయన సాయంకాలం రావలసిఉంది కాని ఆయన 9 గంటలకు వెళ్ళగలిగినారు అక్కడ కూడా స్త్రీలు సావకాశంగా కూర్చునే టందుకు మంచి ఏర్పాట్లు చేసినారు పురుషులు రోడ్డు పక్క నిలబడినారు గాంధీజీకొక సన్మాన పత్రము, 251 రూపాయల నగదు సమర్పించినారు గాంధీజీ దర్శనం కోసం చాలా సేపటినుంచి వేచిఉన్న జనసమూహానికి కనిపించేటందుకు ఆయన వేదికపైన కొన్ని నిమిషాలు నిలబడినారు గాంధీజీ ఆ సభను విడిచి తన వసతి గృహానికి చేరేసరికి రాత్రి 9 గంటలయింది

## గాంధీజీని చూడవచ్చినవారు

డిసెంబరు 21న గాంధీజీని రైట్ ఆనరబుల్ వి యస్ శ్రీనివాసశాస్త్రి, టి ఆర్ వెంకట్రామశాస్త్రి, దివాన్‌బహద్దూర్ వి భాష్యం అయ్యంగార్, డాక్టర్ ఆచంట లక్ష్మీపతి, శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ, శ్రీమతి కృష్ణాబాయి నింబుకార్ లు దర్శించినారు

## రాబిన్‌సన్ పార్కు సభ

డిసెంబరు 21 సాయంకాలం రాయపురంలోని రాబిన్‌సన్ పార్కుదగ్గర బహిరంగ సభ జరిగింది స్త్రీలు అనుకోనంత ఎక్కువ మంది వచ్చినారు సమావేశ కర్తలు వారి సౌకర్యానికి ప్రత్యేక స్థలం ఏర్పాటు చేసినారు గాంధీజీ సభాస్థలికి రాగానే ప్రజలు యథా ప్రకారం వేదికపైకి తోసుకొని వచ్చినారు వలంటీర్లు వారిని ఆపడానికి ప్రయత్నించినారు గాంధీజీ వేదిక ఎక్కి గుంపుల అభినందన స్వీకరించినారు సమావేశకర్తలు గాంధీజీకి సన్మానాలను, విరాళాలను సమర్పించినారు తరవాత గాంధీజీ సభ్యులను ఉద్దేశించి కొన్ని మాటలు చెప్పి

నారు. శ్రీ టి. ఆదికేశవులు నాయకర్ గాంధీజీ ప్రసంగం తమిళంలోకి అనువదించినారు

## గాంధీజీ ఉపన్యాసము

'మీరు నాకు సమర్పించిన సన్మానపత్రానికి, విరాళానికి, బహూకరణలకు చాలా కృతజ్ఞుణ్ణి ఈ సొమ్ము యావత్తు హరిజనుల అభివృద్ధికి ఉపయోగించ గలను మహత్తరమయిన ఈ ఆత్మ పరిశుద్ధోద్యమంలో స్త్రీ పురుషులందరూ పాల్గొన వలెనని నా కోరిక మన మందరము మనలోని దురభ్యాసాలను, దురాచారాలను మానివేయవలె మనలను పవిత్ర హృదయులుగా చేయగలందులకు భగవంతుని ప్రార్థిస్తాము మీలో ఎవరికైనా చచ్చిన జంతు మాంసం తినే అలవాటుంటే దానిని వెంటనే మానివేయవలె ఆరోగ్య రక్షణకు ఆరోగ్య పోషణకు అవసరమయిన నియమాలను పాటించవలె మీ బిడ్డలను చదివించవలె మీకు సారాతాగే అలవాటుంటే దానిని వెంటనే మానివేయవలె మానవ జాతికి తాగుడు ప్రబలతమమైన శత్రువులలో ఒకటి చాలా మంది సవర్ణ హిందువులు మద్యపానానికి అలవాటుపడినారు కనక హరిజనులు కూడా తాగడం తప్పుకాదని భావించ కూడదు తాగుడు మానవులకు పిచ్చెక్కిస్తుంది తాగినవాండ్లకు భార్య, తల్లి, సోదరి అనే విచక్షణ ఉండదు భగవంతుడు మీరు పవిత్రాత్ములుగా రూపొందేటందుకు మీకు తగిన శక్తిని ప్రసాదించుగాక మరి కొంతసేపు నేనిక్కడ ఉండజాలనందుకు నన్ను మీరు క్షమించండి! నాకింకా పెద్ద కార్యక్రమమున్నది సందడి చేయకుండా నేను స్వేచ్ఛగా బయటకు పోవడానికి దారి ఇవ్వండి! మీరు నాపట్ల చూపిన గౌరవానికి ప్రేమకు నేను చాలా కృతజ్ఞుణ్ణి ఈ పవిత్రోద్యమంలో మీరు చూపుతున్న ఉత్సాహానికి దేవుడు మిమ్ములను ఆశీర్వదించును గాక !"

గాంధీజీ ఈ ఉపన్యాసం ముగించిన తక్షణం మళ్లీ జనం తొక్కిసలాడుతూ గాంధీజీ చుట్టూ మూగినారు గాంధీజీ చాలా కష్టం మీద కారు దగ్గరికి చేరుకోగలిగినారు.

## దక్షిణ భారత హిందీప్రచారసభ పట్టప్రదానోత్సవము

డిసెంబరు 21 సాయంకాలం గోక్లే హాల్‌లో దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి మూడవ పట్టప్రదానోత్సవం జరిగింది దానికి గాంధీజీ అధ్యక్షత వహించినారు పండిత్ రామ్‌నరేష్ త్రిపాఠి పట్టప్రదానోపన్యాసం చేసినారు

ఆ సభ 3 30 కు ప్రారంభం కావలసి ఉంది గాని 4 15కు ప్రారంభ మయింది గాంధీజీ దర్శనం కోసం సాయంకాలం 2 గంటలనుంచి హిందీ ప్రచార సభవారి భవనం చుట్టూ జనంచేరి క్రిక్కిరిసి ఉన్నారు, కాని పోలీసు వారు, వలంటీర్లు చేసిన కృషివల్ల సభలోను సభ వెలుపలకూడా ప్రజలు ప్రశాంతంగా ఉన్నారు.

గాంధీజీ, హిందీ ప్రచార సభ ఉపాధ్యక్షుడు కాశీనాథుని నాగేశ్వరరావు గారు, పండిత హరి హరశర్మ, పండిత మోటూరి సత్యనారాయణ, పండిత త్రిపాఠి మొదలయిన వారితో సభకు వచ్చి వేదికపైన ఆసీనులైనారు కొత్తగా పట్టభద్రులయినవారికి, హిందీ ప్రచార సభ అధ్యక్షునికి, కార్యనిర్వాహక సభ్యులకు శాలువలు బహూకరించినారు గాంధీజీ తనకు సమర్పించిన "గౌను" స్వీకరిస్తూ "మీరు నన్ను దీనితో అలంకరింప దలుచుకొన్నారు ఒక్క సంగతి మాత్రం జ్ఞాపకముంచుకోండి, సభానంతరం దీనిని వేలం వేడతాను" అన్నారు హాస్యంగా

నూతన పట్టభద్రులకు, ప్రచారకులకు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాషా పరీక్షలలో ఉత్తీర్ణులయినవారికీ డిప్లొమాలు, సర్టిఫికెట్లు ఇవ్వడం జరిగింది

అస్పృశ్యతా నివారణ గురించి వ్రాసిన ఉత్తమ వ్యాసకర్తకు 10 రూపాయలు బహుమతి ఇవ్వబడుతుందని కూడా సభలో ప్రకటించడం జరిగింది

## గాంధీజీ ఉపన్యాసము

తాను పట్టభద్రులకు, ప్రచారకులకు స్వయంగా పట్టప్రదానం చేయటానికి వ్యవధి లేనందుకు క్షమించమని సభవారిని కోరుతూ వారికి తన ఆశీర్వాదాలను అభినందనలను సమర్పించినారు త్రిపాఠి చెప్పిన దానికంటె తానెక్కువ చెప్పదగినదేమీ లేదని ఆయన సలహానే పాటించవలసిందని గాంధీజీ అన్నారు ఆంధ్రదేశంలో హిందీ ప్రచార సభవారు అభివృద్ధికరమయిన పనిచేస్తూన్న మాట వాస్తవమయినప్పటికీ తనను ఇంగ్లీషులో మాట్లడమని ఏ ఒక్కరూ కోరకుండే టంతవరకు హిందీ ప్రచారం సాగితేనే గాని తనకు సంతృప్తి ఉండదని గాంధీజీ ఉద్ఘాటించినారు హిందీ ప్రచార సభవారు తమ పనిని చక్కగానే ప్రారంభించినారని దానిని ఇతోధికంగా ధైర్యంతో కృతనిశ్చయులై కొనసాగించవలెనని కోరినారు గాంధీజీ ఇంకా ఇట్లా అన్నారు

"భారత దేశంలోని కొన్ని ఇతర ప్రదేశాలలోని ప్రజలకు హిందీ భాష నేర్చుకోవడం కష్టమని కొంతమంది అంటున్నారు ఇది కొంతవరకు నిజం కావచ్చు కాని భారతీయ భాష ఏదీ కూడా భారతీయుడయిన వానికెవ్వనికీ నేర్చుకోవడం అంతకష్టంకాదని నా అభిప్రాయము. అన్ని భారతీయ భాషలలోను కొంతవరకు సంస్కృత మిశ్రమం ఉంటుందని నా భావం అందువల్ల ప్రతి భారతీయ భాషలోను ప్రతి భారతీయుడు పనిజరగడానికి తగిన జ్ఞానం సంపాదించ వచ్చునని నా ఇంగ్లీషువంటి విదేశ భాషను, తమిళంవంటి కఠినమయిన భాషను నేర్చుకోవడం సాధ్యమయినప్పుడు హిందీని నేర్చుకోవడం ఎందుకు సాధ్యం కాదు? 31కోట్ల మంది భారతీయులలో 22 కోట్లమంది హిందీ భాషను మాట్లాడే వారే అందువలన అది భారత దేశంలో సామాన్య భాషగా కనుకొక్క బడింది

కొంత మంది ముస్లింలకు హిందీ తెలియదని ఉర్దూ ఒకటే తెలుసునని

భేదం కనిపించదు

హిందీ ప్రచార సభవారు దక్షిణ భారత దేశంలో పదిహేనేండ్ల నుంచి పనిచేస్తున్నారు కాని భారత జాతీయైక్యం కోసం హిందీ భాషను నేర్చుకొనడానికి ప్రజలు వారి సేవలను ఎంతవరకుపయోగించుకొన్నారు? గుఱ్ఱపు పందేలకు, సినీమాలకు, విలాసాలకు, వినోదాలకు ఎంతకాలమో, ఎంత సొమ్మో వెచ్చిస్తున్నారుగదా! హిందీని నేర్వడానికి వాటిలో కొంత ఎందుకు వినియోగించకూడదు హిందీ ప్రచార కార్యాలయానికి తగిన స్థలము, భవనాలు లేవనీ, ధనలోపంచేత వాటిని సంపాదించుకోలేకుండా ఉన్నామనీ సభవారంటున్నారు హిందీ నేర్చుకోడానికి వచ్చిన ప్రతి ఒక్కరూ సభవారు చేస్తున్న సేవను గుర్తించి ఏకొద్ది మొత్తం ఇచ్చినప్పటికీ వాటికి కావలసిన సొమ్ము తేలికగా చేకూరుతుంది అప్పుడు ఉత్తర భారతీయుల సహాయం మీద ఆధారపడి ఉండవలసిన అవసరంలేదు హిందీ ప్రచార సభను తన కాళ్ళమీద తాను నిలవగలిగేటట్లు చేయడం దక్షిణ భారత దేశంవారి కర్తవ్యం కాబట్టి దక్షిణాదివారు యావన్మంది ఈ సభవారి సేవలను ఉపయోగించుకొని ఈ జాతీయ కార్యక్రమానికి తోడ్పడవలసిందని పునరుద్ఘాటిస్తున్నాను "

ఈ ఉపన్యాసానంతరం శ్రీ రామనాథ గోయెంకా మహాత్మాజీకి, పండిత రామ్‌నరేష్ త్రిపాఠీకి కృతజ్ఞతాభివందనాలు సమర్పించినారు

ఈ పట్ట ప్రదానోత్సవసభను ముగించేముందు గాంధీజీ తన భుజాలమీద ఉన్న గౌనుతీసి మనోహరంగా ముద్రించబడిన దాని అంచులను చూపుతూ "దీనిని కొనేవారెవరో ముందుకు రండి" అన్నారు హిందీలో

అప్పుడు సభలోనుంచి ఒకరు ఈ మొత్తం హరిజనుల అభివృద్ధికి ఉపయోగించవలెనని కోరుతూ 150 రూపాయలు గాంధీజీ చేతిలో పెట్టినారు ఆయన తన పేరు చెప్పలేదు

"గాంధీజీ ఉద్యమానికి జయం కలుగుగాక" అనే గేయంతో ఆ పట్టప్రదానోత్సవం ముగిసింది

## గాంధీజీ ఆరోగ్యము

డాక్టర్ సి ముత్తు డిసెంబరు 21 మధ్యాహ్నం గాంధీజీ ఆరోగ్యంగురించి పరీక్షచేసి నేనీనాడు గాంధీజీని పరీక్ష చేసినాను ఆయన చాలా ఆరోగ్యంగా ఉన్నారు రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్ కాలంలో నేనాయనను లండన్‌లో పరీక్షించినాను అప్పటికంటె కూడా ఇప్పుడెక్కువ ఆరోగ్యంగా ఉన్నారు

ఆయన కార్యక్రమం ఏర్పాటు చేసేవారు రోజులో కొంతకాలం విశ్రాంతి, వినోదాలకు అవకాశమీయడం మంచిది ఆయనకు రాత్రి ప్రయాణాలు పెట్టకూడదు. మహాత్మాజీవలె ఎడతెగకుండా ఎక్కువ పనిచేసే మనిషి ఉక్కువంటి శరీరం కలవాడయినా కష్టానికి ఓర్చుకోలేడు" అని ప్రకటించినారు.

**మద్రాసులో తుదిరోజు**

గాంధీజీ మద్రాసులో ఉన్న చివరిరోజు డిసెంబరు 28వ తేదీన ఆయనకు కొత్తిగా విశ్రాంతి లేకుండా పోయింది

ఉదయాననే డాక్టర్ యస్ రంగాచారి వచ్చి ఆయన ఆరోగ్యం పరీక్ష చేసి వెళ్ళినారు తరవాత యస్ సత్యమూర్తి వచ్చి ఆయనను కలుసుకొన్నారు

తరవాత నాగేశ్వరరావుగారి అతిథిగా ఆయన నివసిస్తున్న "శ్రీబాగ్" నుంచి బయలుదేరి అనేక చోట్లకు వెళ్ళినారు, 'జార్జి టౌన్' లోనే ఆయన 2 గంటలు గడిపినారు ఆయన వెళ్ళిన చోట్లన్నిట్లో ప్రజలు గుంపులు గుంపులుగా చేరి ఆయనను అభినందించినారు

డిసెంబరు 28న ఉదయం గాంధీజీ జార్జి టౌన్, జనియల్ వీధిలోని సినిమా సెంట్రల్‌కు మొట్టమొదట వెళ్ళినారు అస్పృశ్యుల సేవాసంఘం స్థానిక శాఖ వారు ఆయనకు సన్మాన పత్రం సమర్పించి విరాళాలిచ్చినారు అక్కడ ఇతర వర్గాలవారు కూడా కొన్ని విరాళాలు సమర్పించినారు.

సినిమా సెంట్రల్ హాల్‌లో ప్రవేశానికి టికెట్లు పెట్టినప్పటికి హాలంతా స్థానిక ప్రముఖులతోను, అనేకమంది వర్తకులతోను, హరిజనులతోను నిండి పోయింది స్త్రీల కోసం ప్రత్యేకించిన విశాలమయిన స్థలం కూడా క్రిక్కిరిసి పోయింది వేదికపైన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, డాక్టర్ పి వరరాజులు నాయుడు, శ్రీ వి చక్రయచెట్టి, శ్రీ గద్దె రంగయ్యనాయుడు, శ్రీ కె యస్ కోటేశ్వరంగార్లు ఉన్నారు

గాంధీజీ రావడంతోనే గద్దెరంగయ్యనాయుడుగారి నాయకత్వం కింద అస్పృశ్యుల సేవాసంఘంవారి కార్య నిర్వాహకులు ఆయన కెదురేగి ఆహ్వానించినారు స్థానికులైన కొంతమంది బ్రాహ్మణ పౌరోహితులు గాంధీజీకి "పూర్ణ కుంభం" సమర్పించినారు గాంధీజీ వేదిక దగ్గరకు పోతూండగా ఆ మహా సభవారు ఐక్యకంఠంతో జయధ్వానాలు చేసినారు గాంధీజీ మామూలు ప్రకారం ఆ ఎత్తయిన వేదిక ఎక్కి సభలో అందిరికీ కనబడేటట్లు నిలబడి సభ్యులను అభినందించినారు వేదిక దగ్గరికి అనేక మంది దండలు పట్టుకొని వచ్చినారు కొందరు భక్తిపరులు గాంధీజీ పాదాలను స్పృశించినారు మరికొందరు పాదాక్రాంతులయినారు సరస్వతిఅమ్మ అనే ఆమె చేతులలో పసిబిడ్డ నెత్తుకొని గాంధీజీ దగ్గరికి త్వరం త్వరగాపోయి ఆ బిడ్డను ఆమె కుడిప్రక్క మంచుకొని ఆయనకు దండ వేసింది ఆమె సత్యాగ్రహి అనీ శాసనోల్లంఘనోద్యమంలో రెండు పర్యాయాలు తన భర్తతోసహా కారాగార శిక్ష అనుభవించిందనీ సమావేశకర్తలామెను గాంధీజీకి పరిచయం చేసినారు.

**అస్పృశ్యుల సేవా సంఘంవారి సన్మాన పత్రము**

**జార్జి టౌన్‌లోని అస్పృశ్యుల సేవాసంఘంపక్షాన గద్దె రంగయ్యనాయుడు**

గారు గాంధీజీకి దిగువ సన్మాన పత్రం సమర్పించినారు

"అస్పృశ్యతా నివారణ గురించి మీరు సూచించిన పద్ధతుల మీద మాకు ఎన్ని అడ్డంకులు వచ్చినప్పటికీ మేము శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నాము వయోజన విద్యా ప్రణాళిక కింద ఒక ఉచిత పఠన మందిరం భక్తి సంబంధాలయిన తరగతులను ఒక ఉచిత రాత్రి పాఠశాలను నడుపుతూ మా చేతనయిన స్వల్పసేవను చేస్తున్నాము మా కృషి జయప్రద మయ్యేటందుకు భగవంతుని దయను మీ ఆశీర్వాదాలను అభిలషిస్తున్నాము

అస్పృశ్యుల పట్ల మీకున్న అత్యంతమయిన ప్రేమకొద్దీ మీరు వారికి చేసిన "హరిజను"లనే నామకరణం ఈ నగరంలో అస్పృశ్యులుగా పేర్కొనబడే వారిలో అధిక సంఖ్యాకులకు ఇష్టంగా లేదని మీకీ సందర్భంలో తెలుపవలసి వచ్చినందుకు మేము చాలా విచార పడుతున్నాము "

ఈ సన్మాన పత్రం తమిళానువాదం యస్ కోటేశ్వరన్‌గారు చదివినారు హిందీ అనువాదం వ్యవధి లేనందుకు చదివినట్లుగానే భావింపబడింది

అస్పృశ్యుల సేవాసంఘంవారి పక్షాన రూ 866-10-9ల విరాళం హరిజన నిధికి సమర్పించినారు

సినిమా సెంట్రల్ సిబ్బంది పక్షాన 65 రూపాయలు శ్రీ యం పి రాజన్‌గారు ఇచ్చినారు

పచ్చయప్ప హైస్కూల్ ఉపాధ్యాయులు, విద్యార్థులు కలసి 80 రూ సమర్పించినారు జార్జిటౌన్ హిందీ విద్యాలయంవారు కూడా ఒక చిన్న మొత్తం ఇచ్చినారు శ్రీ కే వి సుబ్బారావుగారు ఒక రాటము, మింట్ స్ట్రీట్ షరాబులు ఒక బంగారపు తకిలీ, శ్రీ వి యన్ రాము చిట్టి ఒక వెండి తకిలీ, 1930లోని గాంధీ జన్మ దినోత్సవ ఛాయా పటము, శ్రీమతి శేషమ్మ ఒక వెండి పొడరుపెట్టె గాంధీజీకి సమర్పించినారు ఇవిగాక వేరొకనగ కాయలతో ఒక వెండిగిన్నె కూడా గాంధీజీకి చేరింది

శ్రీ గద్దె రంగయ్యనాయుడుగారు తనవేలి వజ్రపు టుంగరం గాంధీజీకి బహూకరించినారు

తరవాత గాంధీజీ "మిత్రులారా ఇంతవరకు మన మేమి పని చేయలేదు! మన అధీనంలో ఉన్న విలువగల ఈ కొద్ది నిమిషాలు సన్మాన పత్రాలు చదవడంలో గడిచి పోయినాయి కాబట్టి నేను ఏదో కొంత వ్యాపారంచేసి మీ దగ్గర మాట్లాడే హక్కును సంపాదించుకోవాలె మీరు నన్ను గురించి వ్రాసిన స్తుతివాక్యాలన్నిటినీ మీరు తీసుకొని నికారస్ అయిన బంగారంలోకి మార్చవలసిందని నా కోరిక నేను ఈ వజ్రపు టుంగరాన్ని దొంగిలించిన నేరానికి పాత్రుడను కాకూడదు, అది కూడా మీకిప్పుడే ఇచ్చివేస్తాను

ఇప్పుడే ఈ సభలో నాకిచ్చిన బహూకరణల నన్నిటిని ఒకదాని తరవాత నొకటి వేలంపెట్టి వ్యాపారం ప్రారంభిస్తాను " అంటూ గాంధీజీ అనుభవం గల వేలం పాటకునివలె పాటలను పెంచడానికి పాటదారుల హృదయాలను ఆకర్షించ

డం మొదలుపెట్టినారు

ఆయన ఒక చేతితో చర్ఖాను పట్టుకొని "రండి! ముందుకురండి! పాట పాడే వారెవరో రండి!" అని కేక వేసినారు

"ఇది చాలా చక్కని చర్ఖా! శిల్పకళా పాఠశాల విద్యార్థి తయారు చేసిన చర్ఖా! మంచి వ్యాపారం స్త్రీలు రావచ్చు, పాటపాడి గాజులీయవచ్చు! రండి రండి!" అని ప్రోత్సహించినారు

30 రూపాయిల వరకు పాట పెరిగింది గాంధీజీ తిరిగి మళ్లా "సీకిరం, సీకిరం, శీఘ్రం శీఘ్రం' అన్నారు "ఇది చక్కని చర్ఖా! ఇది తీసుకున్న వారికి, ఇచ్చినవారికి కూడా మేలు చేస్తుంది రండి! త్వరగా రండి! పాటదారులలో అదృష్టవంతులెవరో" అన్నారు తిరిగి గాంధీజీ అప్పుడు సంతోష ధ్వానాల మధ్య కినీమా సెంట్రల్ ప్రొప్రయిటరు 40 రూపాయలకు పాడినారు "అరువులేదు! అంతా రొక్కం" అన్నారు గాంధీజీ వెంటనే రొక్కం చేతిలో పడింది "ఈ చర్ఖా నిన్ను ఐశ్వర్యవంతునిగా చేయుగాక! అని ఆశీర్వదించి గాంధీజీ దానిని రాజన్ చేతిలో పెట్టినారు

తరవాత ఆయన వజ్రపు టుంగరం తీసుకొని "దీనిని నేను ప్రయత్నించి చూస్తాను దీనికి పెద్దపోటీ ఉంటుందను కొంటాను కాని ఇదేమి పెద్ద రొమ్మ కాదు" అని ఆయనే 75 రూపాయలతో పాట ప్రారంభించినారు ఆయనెంత ప్రోత్సహించినప్పటికీ ఒక్క నిమిషం వరకు పాటదారులెవరూ ముందుకు రాలేదు "నాకు చాలా పనుంది సుమండీ నేనీ ఉంగరం తీసుకుపోయి మరొకచోట అమ్మవలెనని మీరు కోరరు గదా! ఈ ఉంగరం హరిజనులకు ఒక బస్తా బియ్యం తెచ్చి పెట్టదా! స్త్రీలకు ఇష్టముంటే గాజులిచ్చి తీసుకోవచ్చు" అన్నారు గాంధీజీ అప్పటికీ ఎవరూ పాటదారులు రాలేదు, అప్పుడు గాంధీజీ దానిని పక్కన పెట్టి ఇతర వస్తువులు వేలం పెట్టడం ప్రారంభించినారు శ్రీ చక్రయ చెట్టి గాంధీజీ "కోతికాయలు' అనిపిలిచే వేరుశనగకాయలతో ఉన్న వెండి గిన్నెను కొన్నారు శ్రీ పార్థసారథి మొదలియార్‌గారు సిల్వర్‌పౌడరు పెట్టెను, టి జి లక్ష్మణస్వామి (వలంటీరు) గాంధీజీ సన్మాన పత్రం కొన్నారు. గాంధీజీ బల్లపైన పరచబడిన ఖద్దరు వస్త్రము, ఖద్దరు దండలు కూడా వేలంలో అమ్మివేసినారు

ఆ తరవాత అనేకమంది స్త్రీలు నగలను సమర్పించడం మొదలు పెట్టినారు స్త్రీలు నగలు సమర్పించినంత త్వరగా లెక్కలు వ్రాయడం గాంధీజీ ప్రయివేట్ కార్యదర్శికి దుస్తరమయిపోయింది రంగయ్యనాయుడుగారి చిన్ని అమ్మాయి గాంధీజీకి నగలు సమర్పించింది గాంధీజీ వాటిని తీసుకొని హాస్యం చేస్తూ బంగారపు గొలుసు కూడా అడిగినారు ఆ అమ్మాయి తండ్రిగారి మౌనాంగీకారం కనిపెట్టి గొలుసు సంతోషంగా ఇచ్చివేసింది ఈ దృశ్యం ఆసక్తితో చూస్తున్న ప్రజలు ఆనందంతో కరతాళధ్వనులు చేసినారు

గాంధీజీ తిరిగి వజ్రపు టుంగరం చేతితో తీసుకొని "దీని కెవరయినా

వస్తారా నన్ను దీనిని తీసుకొని పోనివ్వరని ఆశిస్తున్నాను" అన్నారు అప్పటికీ ఎవరూ రాలేదు ఆయన వెనకఉన్న పిల్లవానికి పోయిందది

తరవాత గాంధీజీ హిందీలో ప్రసంగిస్తూ విరాళాలు సమర్పించినవారిని, వేలంలో వస్తువులు కొన్నవారిని, హరిజనోద్యమంకోసం వారు చేసిన సహాయానికి కృతజ్ఞత తెలిపినారు ఇది ఒక పుణ్యకార్యముని ఇటువంటి సేవాకార్యాలకు సహాకరించినవారు గర్వపడవలసి ఉంటుందని అన్నారు పుట్టుకవల్ల హెచ్చుతగ్గులు ఏర్పాటుకాగలవనే భావం ప్రజలు తమ హృదయంనుంచి తొలగించుకోవలెనని, అస్పృశ్యత పాపమని, తమ సోదరులలో కొందరిని అస్పృశ్యులుగా భావించడం తప్పని, అటువంటి భావన లేనివారే ఉత్తములని ఉద్బోధించినారు తరవాత ఆయన అస్పృశ్యులకు హరిజనులని తానెందుకు నామకరణం చేసినారో వివరించినారు. "దిక్కులేనివారికి దైవమే దిక్కు" అని తమిళంలో ఒక సామెత ఉందని, అందువల్లనే తాను ఆ దురదృష్టవంతులయిన జనానికి "హరిజనుల"ని పేరుపెట్టినట్లు తెలియజెప్పినారు నిజానికి ఆ పేరు కూడా తాను కల్పించింది కాదని ఒక అస్పృశ్యుడే ఆ పేరు పెట్టమని తనను ప్రోత్సహించినాడని అన్నారు అస్పృశ్యత అనే కళంకాన్ని తొలగించి హిందూమతాన్ని పునీతం చేయవలసిందని కోరినాడు "ఇది ఒక మహాయజ్ఞం ఇందులో మీరందరూ పాల్గొనేటందుకు మీకు భగవంతుడు వివేకం ప్రసాదించుగాక" అని తన సందేశం ముగించినారు

తరవాత గాంధీజీ జాతీయ నినాదాలమధ్య సభను విడిచి వెళ్ళినారు

## గాంధీజీ మద్రాసు రాక - ఫిలిమ్ ప్రదర్శనము

డిసెంబరు 20వ తేదిని మహాత్మాగాంధీ మద్రాసు సెంట్రల్ స్టేషన్‌కు వచ్చినప్పుడు, తరవాత డిసెంబరు 21 న పేరగాన్ టాకీసులో ఖద్దరు ప్రదర్శన బహిరంగపరిచినపుడు 'నేషనల్ మూవీటోన్' వారు ఒక చిత్రం (ఫిలిమ్) తీసినారు మద్రాసు బోర్డు చిత్రపరిశీలకులు అది ప్రజలకు చూపతగినదని ఆమోదించినారు అది డిసెంబరు 21 వ తేదినుంచి ప్రదర్శింపబడింది

## మద్రాసు పర్యటన - మహాత్ముని అభిప్రాయము

మద్రాసులో గాంధీజీని "హిందు" పత్రికా ప్రతినిధి డిసెంబరు 22 న ప్రత్యేకం కలుసుకొనగా ఆయన ఇట్లా చెప్పినారు

"నేను వెళ్ళిన ప్రతిచోటా ప్రజలు నన్ను అత్యంతాదరంతో ఆహ్వానించినారు కాని మద్రాసు సముద్రతీరాన అనేక కార్మిక ప్రదేశాలలోను అంత ఎక్కువమంది జనం వచ్చి సభలలో పాల్గొంటారని నేను అనుకోలేదు ఈ పర్యాయం ఆ చోట్లకు వచ్చినంతమంది జనులు ఇంతకు ముందెన్నడూ రాలేదు అటువంటి ప్రదర్శనలుకూడా ఎప్పుడూ జరగలేదు ప్రజలకు నాయందున్న ప్రేమాతిశయమే అందుకు కారణాలనటానికి ఎంతమాత్రం

సందేహంలేదు ఆ అంతులేని సమూహం నన్ను అంటిపెట్టుకొని ఉన్నట్లుగా కనిపించింది నేనెందుకు వచ్చినానో నా ఆశయమేమిటో వారు పూర్తిగా గ్రహించి ఆమోదించినట్లు కూడా నేనభిప్రాయపడినాను అస్పృశ్యతకు ప్రతికూలంగా నేను చేస్తూండిన పని వారి మతవిశ్వాసానికి విరుద్ధంగా ఉండినట్లయితే నావట్ల వారి ప్రేమ అంత ఎక్కువగా ప్రదర్శితమై ఉండేదికాదు ప్రజల చూపులనుబట్టి, వారి హావభావవిలాసాలనుబట్టి ప్రజల అభిప్రాయాన్ని కనుక్కోగల శక్తి నాకు ఉన్నది అస్పృశ్యతను గురించి నేను చేస్తూన్న పనిపట్ల అనంగీకార చిహ్నాలు ప్రజల వైఖరిలో ఎక్కడా కనిపించలేదు నేను అడగగానే ప్రజలు విరాళం సమర్పించిన తీరునుబట్టి కూడా నా అభిప్రాయం మరింత ధ్రువపడుతున్నది కాబట్టి భవిష్యత్తు నాకు ఆశాజనకంగానే ఉన్నది

## సనాతనవాదులకు ఒక మనవి

దక్షిణదేశంలో సైతం అస్పృశ్యత కూకటివ్రేళ్ళతో కదలిందని నా అభిప్రాయము సనాతనవాదులయిన మిత్రుల మనసులకు నొప్పి కలిగించవలెననే అభిప్రాయం నాకెంతమాత్రం లేదు మేముభయులము అంగీకరించగల విషయాలకోసం నేనెదురు చూస్తున్నాను అటువంటివి చాలా ఉన్నాయి మాకు ఏకీభావంలేని విషయాలు చాలా తక్కువ ప్రస్తుతం నా పద్ధతి వారికి ఆమోదకరంగా ఉండకపోతే కొద్దికాలంలో వారు ఆమోదించగలరని నేను భావిస్తున్నాను

## పోలీసులకు కృతజ్ఞత

పోలీసువారి ప్రవర్తనను గురించి కూడా ఒకమాట చెప్పవలసి ఉంది నేనీ రోజున జార్జిటౌన్‌లోని వాణిజ్య ప్రదేశానికి పోనున్నాను పోలీసువారికది పరీక్షాసమయం కావచ్చు వారి ప్రవర్తన సహాయకారిగాను సామరస్యంగాను ఉన్నది వారు ప్రజలలో కలసిపోయి ప్రజలను మర్యాదగా సర్దుబాటు చేసినారు ఇంత వాత్సల్యం ప్రకటించినందుకు నేను వారిపట్ల చాలా కృతజ్ఞుణ్ణి'

ఆ తరవాత మద్రాసు నిమ్నజాతుల సంఘం (మద్రాసు డిప్రెస్డ్ క్లాసెస్ ఫెడరేషన్) వారు కొన్ని ముఖ్య విషయాలు గాంధీజీ దృష్టికి తేవలెననే ఉద్దేశంతో ఆయన దగ్గరికి రాయబారం వెళ్ళినారు ఆ రాయబారవర్గంలో రావుబహద్దూరు ఆర్ శ్రీనివాసన్‌తోపాటు ఇంకా కొంతమంది హరిజన నాయకులు కార్యకర్తలు కూడా ఉన్నారు

గాంధీజీ ఆ సాయంకాలపు భోజనం ముగించుకొన్న తరవాత రాయబార వర్గంవారిని లోనికి పిలిచినారు

రావుబహద్దూర్ శ్రీనివాసన్‌ను చూసిన వెంటనే "రావుబహద్దూర్ లోపలికి రండి నేను మీకు కుర్చీ తెప్పించనా" అన్నారు గాంధీజీ కాని ఆయన తివాచీమీదనే కూర్చుండడానికి ఇష్టపడినారు.

స్వామి సహజానంద్, శ్రీ పుష్పరాజ్‌గార్లు గాంధీజీకి పాదాక్రాంతు లయినారు కొంతమంది కార్యకర్తలు ఆయన పాదాలను స్పృశించినారు గాంధీపట్ల నిమ్న జాతుల నాయకులకు కార్యకర్తలకు గల ప్రేమాభిమానాలను సూచించే ఆ దృశ్యం హృదయాకర్షకంగా ఉంది తరవాత గాంధీజీ 'మీ ఉత్తరం వచ్చింది మన కార్యక్రమం దానితో ప్రారంభిద్దామా లేదా ఏమి చేద్దాం మీరే నిర్ణయించండి" అన్నారు "దయచేసి దానిని చదవడానికి అనుజ్ఞనివ్వండి" అన్నాడు శ్రీనివాసన్ "అట్లాగే కానీయండి" అన్నాడు గాంధీజీ దానిని చదవడానికి పుష్పరాజ్ ముందుకు రాగానే ఆయనను వి భాష్యమయ్యంగారు ప్రాక్టీసుచేస్తున్న అడ్వకేటుగా పరిచయంచేస్తూ అస్పృశ్యుల సేవాసంఘం పక్షాన ఒక కరపత్రంకూడా వారిటీవల ప్రచురించి నట్లు చెప్పినారు

భాష్యమయ్యంగారు ఆ చదవవలసిన ఉత్తరం టైపులో ఆరు పుటలున్న దని సూచన చేసినారు

"అదంతా శ్రీనివాసన్ ఇష్టము ఆయన ఇక్కడ అగ్రాసనాధిపతి నాకు సంబంధించినంతవరకు నేనా ఉత్తరం మొదటినుంచి చివరివరకు చదివినాను" అన్నారు గాంధీజీ

అప్పుడు శ్రీనివాసన్ 'ఈ ఉత్తరం నా సహచరులకు ఇంతకు పూర్వం పంపించడానికి అవకాశం లేకపోయింది వారికోసమయినా ఈ ఉత్తరం చదవ నీయండి'' అన్నారు

అప్పుడు పుష్పరాజును చూసి "అయితే కానీ" అన్నారు గాంధీజీ పుష్పరాజు కొన్ని వాక్యాలు చదివినాడు

"మీరు చదివేది సరిగా ఆలకించనందుకు నన్ను క్షమించండి నేనిదివరకే దాదాపు కంఠస్థం చేసినాను ఈలోగా నేను నా కాగితాలు సర్దుకొంటుం టాను" అన్నారు గాంధీజీ

తరవాత ఆయన ఆ ఉత్తరం చదివినారు గాంధీజీ దానికి జవాబిచ్చి నారు

రావుబహద్దూర్ శ్రీనివాసన్ గాంధీజీకి వ్రాసిన ఉత్తరంలో "ఎన్నిక లలో హరిజనులు ఇష్టంవచ్చిన వారిని ఎన్నుకోటానికి చాలా తక్కువ అవకాశ ముంటుందని, అక్షరజ్ఞానంలేని వ్యవసాయ కార్మికులను తెలివితేటలు గలిగిన రాజకీయ నాయకుల ఏజంట్లు ఒక దొడ్డిలో మందవేసి ఫలానా వారికి ఓటివ్వ వలసిందని బలవంతపెట్టడం ప్రతి ఎన్నికలలోను జరిగే సాధారణ విషయమని, అందువల్ల వారిని విద్యావంతులుగా చేయటం అవసరమని, అప్పుడు వారి అజ్ఞానం తొలగి తాము తక్కిన వారికంటె తక్కువవారమనే భావం పోయి కులీన హిందువులతో సమాన ప్రతిపత్తిని పొంది అస్పృశ్యతను పోగొట్టుకో గలరని" ఉదాహరింపబడింది ఆ ఉత్తరంలో "బొంబాయిలోని హిందువులు ఇటీవల సమావేశమయి పబ్లిక్ పాఠశాలలను, పబ్లిక్ రోడ్డులను, ఇతర ప్రజా

సంస్థల నన్నిటినీ కులీన హిందువులతోపాటు స్వేచ్ఛగా ఉపయోగించుకొనే హక్కు హరిజనులకు కూడా ఉన్నగని, ఆ హక్కును సాధ్యమయినంత త్వరలో శాసనబద్ధం చేయవలసిందని, ఇప్పుడది శాసనంకాని పక్షంలో స్వరాజ్య ప్రభుత్వం రాగానే అటువంటి శాసనం చేయడం జరుగుతుందని తీర్మానించినందుకు 'హరిజన్' పత్రికలో వారిని అభినందిస్తూ గాంధీజీ వ్రాసిన వ్యాసాన్ని పురస్కరించుకొని అంతమాత్రంలో ప్రయోజనం లేదనీ, మద్రాసు రాజధానిలో హరిజనుల కటువంటి హక్కులను ప్రసాదిస్తూ ప్రభుత్వంవారు చట్టం చేసినప్పటికీ కులీనుల ప్రాతికూల్యంవల్ల ఆ చట్టం ఎంతమాత్రం అమలుజరగడంలేదనీ" కూడా ఉన్నది

'అస్పృశ్యతా నివారణసంఘంవారు హరిజనులను విద్యావంతులుగా చేయడం, వారి ఆర్థికాభివృద్ధికి తోడ్పడడం వారికి దేవాలయ ప్రవేశాలు కలిగించటం కంటె ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుందనీ కూడా శ్రీనివాసన్ తన ఉత్తరంలో పేర్కొన్నారు

ఈ సందేహాలన్నిటికీ గాంధీజీ సముచితాలయిన సమాధానాలు చెప్పటంతో నిమ్నజాతుల ఫెడరేషన్ నాయకులు సంతృప్తిపడి గాంధీజీని అభినందించి సెలవు తీసుకొన్నారు

## మద్రాసునుంచి గాంధీజీ వీడ్కోలు

డిసెంబరు 28 రాత్రి గాంధీజీ కలకత్తా మెయిలులో తిరిగి ఆంధ్ర ప్రాంతంలో పర్యటించడానికి వెళ్ళినారు

గాంధీజీ తప్ప ఆయన బృందంలోని తక్కిన వారందరు మీరాబేన్, కుమారి ఉమాబజాజ్, కృష్ణాబాయి, ప్రొఫెసర్ మల్కానీతో సహా మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లోనే రైలెక్కినారు

మహాత్మాజీ మాత్రం గుంపుల భయంవల్ల మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌కు పోలేదు ఎన్నూరువరకు మోటారులో పోయి అక్కడ రైలెక్కినారు ఈ విషయం రహస్యంగా ఉంచడంచేత మద్రాస్‌లో ఆయన బయల్దేరడంగానీ, ఎన్నూరులో ఆయన రైలెక్కడంగానీ తేలికగా జరిగింది ఎన్నూరు రైల్వే స్టేషన్‌లో గాంధీజీ హరిజననిధికి కొంత సొమ్ము సేకరించగలిగినారు తాము జనసమూహంలో నలిగిపోకుండా సుఖంగా రైలెక్కడం ఇది నాలుగో పర్యాయమని కూడా ఆయన అన్నారు

## చీరాల రైలుస్టేషన్‌లో

గాంధీజీ డిసెంబరు 28 తెల్లవారుజామున మెయిలులో మద్రాసునుంచి గుంటూరుకు పోతుండగా రైలు చీరాల స్టేషన్‌లో ఆగగానే ఆంధ్రపత్రిక ఏజంటు శ్రీ పెనుగొండ సుబ్రహ్మణ్యం తన వేలి బంగారపు ఉంగరమును ఆయనకు సమర్పించినారు రైలుస్టేషన్‌లోని జనం తమ శక్తికొద్దీ హరిజన నిధికి

గుప్తదానం చేసినారు చీరాల పురపాలకాధ్యక్షుడు జనాబ్ మహమద్ గౌస్ బేగ్ సాహెబు గాంధీజీ గుంటూరు జిల్లాలో సంచారం చేసినంతకాలం వారి పక్కనుండి ప్రజల వొత్తిడినుంచి వారిని తప్పిస్తూ ప్రముఖ స్వచ్ఛంద సైనికుడిగా పనిచేసి గుంటూరుజిల్లా ఆహ్వానసంఘంవారి ప్రశంసకు పాత్రుడయినాడు

## మహాత్ముని గుంటూరురాక

డిసెంబరు 28 ఉదయం గాంధీజీ గుంటూరు రాగలరని ముందుగానే తెలిసి నందువల్ల గడచిన రాత్రి 2 గంటల నుంచి కూడా గుంటూరులోని ప్రజలు స్వరాజ్య మైదానంలో చేరడం ప్రారంభించినారు తెల్లవారు జామున 4 గంటలకు అక్కడికి సుమారు 30వేల మంది జనం చేరినారు.

గాంధీజీ ఆయన బృందము తెనాలి-గుంటూరు డూప్లికేట్ రైలులో మంగళగిరి లెవెల్ క్రాసింగ్ వరకు కలసి ప్రయాణం చేసినారు గుంపులను తప్పించుకోవడానికి గాంధీజీ మంగళగిరి లెవెల్ క్రాసింగ్ దగ్గర రైలు దిగి మోటారు కారులో శ్రీ మద్ది వెంకటసుబ్బయ్య గారింటికి వెళ్ళినారు తక్కిన వారు గుంటూరుకు రైలులో ప్రయాణం చేసినారు మద్ది వెంకటసుబ్బయ్య గారి ఇల్లూ, ఇంటిచుట్టు ఉన్న ప్రదేశమంతా జనంతో క్రిక్కిరిసి పోయింది గాంధీజీకారు ఆ ఇంటి సమీపానికి రాగానే "మహాత్మా గాంధీకి జై " అనే కేకలు మిన్నుముట్టినాయి అక్కడ చేరిన గుంపులనుంచి గాంధీజీని వెంకట సుబ్బయ్యగారింటిలోకి తీసుకొని వెళ్ళటం దుస్తరమయి పోయింది

కొంత సేపు వెంకటసుబ్బయ్యగారి ఇంటిలో ఆగి కొంతకాలం నుంచి రోగగ్రస్థురాలయిన శ్రీ వేంకటప్పయ్యపంతులుగారి గృహిణిని చూసేటందుకు గాంధీజీ కారులో వారి ఇంటికి వెళ్ళి కుశల ప్రశ్నలతో త్వరలో ఆమెకు ఆరోగ్యం కలుగుగాక అని ఆశీర్వదించి స్వరాజ్ మైదానానికి ప్రయాణమయినారు తోవలో తిలక్ పేటలోని శివాలయం దర్శించటానికి శ్రీ ఉప్పుటూరి పున్నారావుగారు మరికొందరు గాంధీజీని తీసుకొని వెళ్ళినారు ఆ ఆలయంలోని దేవునికి 'గురునాథేశ్వరుడని' ఇంతకు పూర్వం నామకరణం చేయడం జరిగింది ఆ పేరు, ఆ దేవాలయం నిర్మించిన వారి పేరే కావడంచేత అదొక వివాదగ్రస్తంగా పరిణమించింది ముఖ్యంగా బ్రాహ్మణ సంఘంవారు ఆ వివాదం రేకెత్తించినారు అందువల్ల ఆ దేవాలయాన్ని ప్రజలు బహిష్కరించడం జరిగింది ఈ విషయం గాంధీజీకి ఆ దేవాలయ ట్రస్టీ శ్రీ ఉప్పుటూరి పున్నారావు బెజవాడలో విన్నవించినారు ఆయన, విరాళమిచ్చిన దాత పేరు మీద దేవుని పేరు ఉండటం సమంజసంగా లేదనీ, దేవుని పేరు మారిస్తే ఆ దేవాలయం ప్రజలు బహిష్కరించటం మానివేస్తారో ఏమో ప్రయత్నించి చూడ వలసిందనీ పున్నారావుకు సలహా ఇచ్చినారు ఆ తరవాత ఆ దేవాలయంలో హరిజన ప్రవేశం గురించి ఆలోచించ వచ్చునని కూడా గాంధీజీ పున్నారావుతో

అన్నారు

ఆ ప్రకారం 'గురునాథేశ్వర' అనే ఆ దేవుని పేరు 'గౌరీవిశ్వేశ్వరు'డుగా మార్చటం జరిగింది అట్లా మార్పు జరిగిన దస్తావేజుపైన డిసెంబరు 28న గాంధీజీ సంతకం చేసినారు

## బహిరంగ సభ

తరవాత గాంధీజీ స్వరాజ్ మైదానానికి వెళ్ళినారు ఉపన్యాస వేదిక ఎత్తుగా నిర్మించడం జరిగింది ప్రజలు కూర్చుండేటందుకు సమావేశకర్తలు చక్కని ఏర్పాట్లు చేసినారు సుమారు ముప్పైవేల మంది ప్రజలు బహిరంగ సభకు హాజరయినారు వారిలో నాలుగు ఐదువేల మంది స్త్రీలు కూడా ఉన్నారు సభ నిశ్శబ్దంగా జరగటానికి శ్రీ సంపత్ కుమార్, చావలి సూర్య నారాయణ, గద్దె వీరరాఘవులుగారు జాగ్రత్త తీసుకొన్నారు

గాంధీజీ కారు కనబడగానే ప్రజలు జయధ్వానాలు చేసినారు గాంధీజీకి గుంటూరు మునిసిపల్ కౌన్సిల్, సత్తెనపల్లి తాలూకా బోర్డు, గుంటూరుజిల్లా హరిజన సేవక సంఘం మొదలయిన సంస్థల వారు సమర్పించిన సన్మాన పత్రాలు కాలవ్యవధి లేనందువల్ల చదివినట్లుగానే పరిగణించడం జరిగింది

పట్టణ హరిజన సేవా సమితివారు కార్యకలాపాల గురించి ఒక నివేదిక చదివినారు జిల్లా హరిజన సేవక సంఘం స్థాపించడం జరిగిన 1932 అక్టోబరు 6 నుంచి తాము చేసిన పనులను వివరిస్తూ తమ ఆర్థిక స్థితులను గురించిన ఆదాయ వ్యయ పట్టికను తాము సమర్పించిన సన్మానపత్రంలో తెలియపరచినారు

## గాంధీజీ ప్రత్యుత్తరము

సన్మాన పత్రాలకు గాంధీజీ హిందీలో ప్రత్యుత్తర మిచ్చినారు దానిని వాక్యం తరవాత వాక్యం శ్రీ దేశభక్త వేంకటప్పయ్యగారు తెలుగులోకి అనువదించినారు మొదటినుంచి చివరి వరకు చీమ చిటుక్కు మనకుండ సభ నిశ్శబ్దంగా జరిగింది

గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"సోదరీ సోదరులారా!

గుంటూరు నాకు క్రొత్తకాదు మీరు నాకు సమర్పించిన సన్మాన పత్రాలకు, నిధికి కృతజ్ఞుణ్ణి గుంటూరు లాయర్లు 145 రూపాయలు హరిజన నిధికి విరాళమిచ్చినారు నేను కూడా ఒకప్పుడు లాయరునే లాయర్ల దగ్గర నుంచి అంతచిన్న మొత్తం నేను అంగీకరించ దలచుకోలేదు వారేమీ అంత పేదవారుకాదు దీనిని బట్టి గుంటూరు లాయర్లకు హరిజనోద్యమంలో ఆసక్తి లేదని భావిస్తున్నాను 145 రూపాయలు ఒక్క లాయరే ఇవ్వగలడు గుంటూరు లాయర్లను నేనెరుగుదును అందువల్లనే వారిని గురించి నేనింత దూరం

మాట్లాడ వలసి వచ్చింది కిందటి పర్యాయం నేనిక్కడికి వచ్చినప్పుడు వారు నాకొక సంచీ రూపాయలిచ్చినారు అయితే అన్నిరోజులు ఒకటిగా ఉండక పోవచ్చు అవి చాలా డబ్బుండిన రోజులు ఇప్పుడు కొంచెం డబ్బుకు పెటపెట గానే ఉన్నది " అని ఇంకా ఇట్లా ప్రసంగించినారు

"నేనిప్పుడే తిలక్ పేటలోని పున్నారావుగారి 'గురునాథేశ్వర' దేవాలయం చూసివచ్చినాను పున్నారావుగారి పెద తండ్రిపేరు ఆ దేవునికి పెట్టడంచేత ఆ దేవాలయం ప్రజలకు ఇష్టం లేకుండా పోయింది నిజానికి 'గురునాథేశ్వర' అనే పేరులో తప్పులేదు 'గురునాథ' తప్పుకావచ్చు ఒక మానవుని పేరు చిరస్మరణీయంగా ఉండటానికి దేవుని కాయన పేరు పెట్టడం సమంజసంగాదని నా అభిప్రాయము దాత పేరుతో దానముండడం మంచిది కాదు అది నా వ్యక్తిగతాభిప్రాయము నిజానికి దేవునికే పేరయినా పరవా లేదు గురునాథరావు సోదరుని కుమారుడు పున్నారావు ఇప్పుడే దేవుని పేరు మార్చడానికి తనకేమీ అభ్యంతరం లేదని నాతో చెప్పినాడు కాబట్టి ఆ దేవునకు ఇప్పుడు "గౌరీవిశ్వేశ్వర్" అని నామకరణం చేస్తున్నాను ఈ నామకరణ కాగితంపైన ఇప్పుడే నా సంతకం పెట్టినాను

శ్రీ పున్నారావు ఆ దేవాలయంలో హరిజనులకు ప్రవేశ మీయదలుచు కున్నాడు కాని దేవుని పేరు మార్చడం ఆ దేవాలయంలోకి హరిజనులకు ప్రవేశం కల్పించడం ప్రస్తుత పరిస్థితులను బట్టి ఒకేసారి జరగటం వాంఛనీయం కాదని నేనాయనకు సలహా ఇచ్చినాను ఏ దేవాలయంలో అయినప్పటికీ హరిజనులకు ప్రవేశం కల్పించటానికి నేను ప్రతికూలుణ్ణి కాదు అయితేఆ పని నిర్బంధం వల్ల జరగకూడదు దేవాలయానికి పోయే భక్తులు, ట్రస్టీలఇష్టం మీద దేవాలయ హరిజన ప్రవేశం జరగడం మంచిది ఇప్పుడు దేవుని పేరు మార్పుచేయడం జరిగింది ఈ దేవాలయ ట్రస్టీలు, మేమూకూడా మీలో ఎందరు ఆ దేవాలయానికి పోవడానికి కుతూహలంగా ఉన్నారో అత్యాతురతతో చూడదలచుకొన్నాము ఈనాటి నుంచి మూడు నెలలలో అంటే రానున్న మార్చి 28 నాటికి ఈ దేవాలయంలో హరిజనులు ప్రవేశించగలరు. ప్రజాభిప్రాయం అందుకనుకూలంగా ఉంటేనేకాని ఈ పని జరగదు ఈ మూడు నెలలలో ఈ దేవాలయ బహిష్కరణకు సంబంధించిన సమస్య పరిష్కారం కాగలదని నా ఆశ మీరీనాటినుంచి ఈ దేవాలయానికి పోతూ రానున్న మార్చి 28 నాటికి హరిజన ప్రవేశానికి అవకాశం కల్పించగలరని ఆశిస్తున్నాను "

"సవర్ణులిప్పుడు హరిజనులకు న్యాయం కలగజేయకపోతే హిందూ మతం నశించే మాట వాస్తవం ఏ మతం గూడా బాహ్యకారణాలచేత నశించిపోలేదు అట్లా చేయటం ఎవరిచేతా కాదు ఏ మతమయిన దానిని అనుసరించేవారి అధర్మ ప్రవర్తన వల్ల మాత్రమే నశిస్తుంది "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీకి బహూకరించిన వస్తువులను ఆయన వేలం పెట్టినారు శ్రీమతి కాశంగి శేషమాంబగారు తయారుచేసిన ఆశ్రమ

శిల్పకళా వస్తువునూ, మొగుడ కామేశ్వరరావు వేలి గోరుతో వ్రాసిన గాంధీజీ చిత్రపటాన్ని, ఒక బంగారపు తకిలీని వాటిలో ముఖ్యంగా పేర్కొన్నారు ఎక్కువ పాట పాడినవారా వస్తువులను పొందగలిగినారు తరవాత గాంధీజీ తనకు సమర్పించిన సన్మాన పత్రాలను మరికొన్ని వస్తువులను ఊకఉమ్మడిగా వేలం పెట్టి "వీటన్నిటినీ సహకార పద్ధతి మీద మొత్తంగా పాట పాడండి" అన్నారు చిరునవ్వుతో వాటన్నిటికీ 80 రూపాయలు చేకూరినాయి

గుంటూరు నగరంలో ఈనాటికి (డిసెంబరు 28) గాంధీజీకి సమర్పించిన విరాళాల మొత్తం 8,500 రూపాయలకు మించి ఉన్నది

తరవాత గాంధీజీ పొగాకు వర్తకుల బజారుకు వెళ్ళినారు ఆ వర్తకులు 500 రూపాయల నగదుతోపాటు ఒక సన్మాన పత్రం కూడా సమర్పించినారు

## గుంటూరు జిల్లా గ్రామాలు

గాంధీజీ, కొండ వేంకటప్పయ్య ఆచార్య రంగాగార్లతో కలసి కారులో గుంటూరు, బాపట్ల రోడ్డుమీదనున్న చేబ్రోలు, మునిపల్లె, మంచాల, వెల్లటూరు, పొన్నూరు, నిడుబ్రోలు గ్రామాలకు వెళ్ళినారు ఈ అన్ని గ్రామాలలో సన్మాన పత్రాలు విరాళాలు సమర్పించినారు పొన్నూరు, నిడుబ్రోలు మధ్యనున్న విశాలమయిన ఖాళీ స్థలంలో ఒక బహిరంగ సభ ఏర్పాటు చేయడం జరిగింది సభలో ఐదు వందలమంది ఉన్నారు ఆయా గ్రామస్థులు హరిజన నిధికి 900 రూపాయలు విరాళమిచ్చినందుకు గాంధీజీ వారి నభినందించినారు హరిజనుల ఉపయోగం నిమిత్తం ఒక చావడి కట్టించ డానికి 100 గజాల ఇండ్ల స్థలమిచ్చిన ఒక దాతను ఆయన పేర్కొన్నారు వయోజన విద్యా సంస్థ నొకదానిని ఆయన బహిరంగపరిచినారు హరిజనులతో సహా ప్రజలందరూ ఉపయోగించుకొనేటందుకు ఆచార్య రంగా గ్రంథాలయం కూడా ఆయన ఆవిష్కరించినారు ఎక్కువ తక్కువలనే భేదాలను తమ హృదయాలనుంచి తోసివేసి అస్పృశ్యతను నిర్మూలించవలెనని ఆయన ఆ ప్రజలకుదోబోధించినారు

మునిపల్లెలో 200 రూ పొన్నూరులో 116 రూ నిడుబ్రోలులో 850 రూ కాట్రగడ్డ కనకాంబ, గోవాడ చినరాఘవమ్మగార్లు 116 రూ ఇంటూరులో 200 రూ విద్యార్థులు 25 రూ స్త్రీలు నగలు ఇచ్చినారు నిడుబ్రోలు స్త్రీల సంఘం 180 రూపాయలు, సి. యస్ ఆర్ ఆంజనేయులుగారు 116 రూపాయలు, ఆర్యవైశ్య యువజన సంఘం (పొన్నూరు) 40 రూపాయలు, కలప అడితీల సంఘం 20 రూపాయలు కాక మూడు ఉంగరాలు, ఆరు జతల గోట్లు, గాజులు మొదలయినవి సుమారు 100 రూపాయల విలువగలవి హరిజన నిధికి చేకూరినాయి

గాంధీజీ కాలి నడక (తాళ్ళపాలెం)

తరవాత గాంధీజీ, ఆయన బృందము తాళ్ళపాలెం వైపుకు వెళ్ళినారు డిసెంబరు 28వ తేది ఉదయం సకాలానికే గుంటూరునుంచి తాళ్ళపాలానికి బయలుదేరినారు నిడుబ్రోలు తాళ్ళపాలానికి పోయే తోవలో ఉన్నది వారు గుంటూరుకు 18 మైళ్ల దూరంలో ఉన్న నిడుబ్రోలు చేరేసరికే ఉదయం 11 గంటలయింది మధ్యనున్న గ్రామస్థులు గాంధీజీ కారును ప్రతిచోట ఆపి హరిజన నిధికి కానుకలర్పించడంవలన కొంత ఆలస్యం కాక తప్పలేదు

గాంధీజీ చేరనున్న తాళ్ళపాలెంలోని శ్రీరామాశ్రమం నిడుబ్రోలుకు 2 మైళ్ల దూరంలో ఉన్నది గాంధీజీ ఉదయం 11 గంటలకు భోజనం చేసి కొంతసేపు విశ్రాంతి తీసుకోవలెనని డాక్టర్ల సలహా కాని ఆ సమయానికే హరిజన ఆయుర్వేద వైద్యుల ఆహ్వానంపైన ఆయన తాళ్లపాలానికి పోవలసి ఉన్నది అందువల్ల ఆయన భోజన విశ్రాంతి కాలాలను వినియోగించుకోక శ్రీరామాశ్రమానికే పోవడానికి నిశ్చయించుకొన్నారు హరిజన ఆయుర్వేద వైద్యుల చేతినుంచి తీసుకొన్న ఔషధాలను అనేక గ్రామాలలోని సవర్ణులు లోపలికి మింగుతూన్నట్లు వినినందువల్ల ఆయన తాళ్లపాలానికి తప్పక పోయి తీరవలెననుకొన్నారు తాళ్లపాలానికి రోడ్డు లేదు సరికదా తిన్నని డొంక కూడా లేదు హరిజన ఆయుర్వేద వైద్యుడు డాక్టర్ టి జియ్యర్‌దాసు గాంధీజీ కారు నడవడానికి వీలుగా గ్రామస్తుల ఇళ్ల ముందుగా బాట చేసి ఉంచినారు ఆ బాటను చూపటానికి శ్రీ సన్నిధి రాఘవదాసు మహాత్ముడున్న కారు డ్రయివరు ప్రక్కనే కూర్చొని నిడుబ్రోలు రైలు గేటు దాటేవరకు తోవ చూపిస్తూ వచ్చినాడు అక్కడినుంచి ఆచార్య రంగా సారథ్యం నెరపడానికుపక్రమించినారు అక్కడే కారు వెళ్ళవలసిన మార్గం దుర్గమంగా ఉన్నది కారు టాపు తీసి ఉన్నది మహాత్ముని ముఖానికి ఒక తుమ్మ మండ తగిలింది వెంటనే ఆయన 'రంగాజీ మనం నడిచి పోదాం" అని తన చేతి కర్ర పూనికతో సుమారు ఆ రెండు మైళ్ల మట్టి డొంకలో నడిచి తాళ్లపాలెం వెళ్ళి నారు నన్ను ఉదయం కొంత దూరం నడవవలసిందని డాక్టర్లు నాకు సలహా ఇచ్చినారు అది మరచిపోయినాను గుంటూరు జిల్లాలో మిట్టమధ్యాహ్నం నడుస్తు న్నాను అది మా డాక్టర్లకు చెప్పవలె' అన్నారు గాంధీజీ నడుస్తూ

అదే సమయంలో దురదృష్టవశాత్తు వాన తుంపరులు సాగినాయి నడిచి నందువల్ల గాంధీజీ శరీరము నుంచి చెమట బొట్లు పడుతూన్నాయి ఇంతలో ఒక ఖద్దరు తాడు '(శ్రీ)రామ ఆశ్రమం' ద్వారం కడ గాంధీజీని ఆపింది "ఏమిటి దని గాంధీజీ జియ్యర్‌దాసును ప్రశ్నించినారు "ఇది హరిజన ఆయు ర్వేద కుటీరము ఈ దారం కత్తిరించి దీనికి మీరు ప్రారంభోత్సవం చేస్తున్నా రన్నమాట ' అని ప్రత్యుత్తరం రాగానే ఆయన మహానందంతో హరిజన ఆయు ర్వేద కుటీర ప్రారంభోత్సవం చేసినారు

'శ్రీరామాశ్రమం'లో గుంటూరుజిల్లా ఆదిమాంధ్ర సంఘ కార్యదర్శులు

గాంధీజీకి తాము చేసిన పనిని గురించిన నివేదిక రూపంలో సన్మాన పత్రం సమర్పిస్తూ 50 రూపాయల నగదు కూడా ఇచ్చి దానిని 'శ్రీరామాశ్రమ' పోషణ నిమిత్తం నియోగించవలెనని కోరినారు గాంధీజీ రెండు మైళ్లు నడచి వచ్చినందుకు శ్రమ పడినప్పటికీ తాళ్ళపాలెం హరిజనుల నుద్బోధిస్తూ ఆయన చేసిన ప్రసంగం ఎంతో మనోరంజకంగా ఉన్నది ఆయన ఇంగ్లీషులో ఇట్లా ప్రసంగించినారు

"నేనిక్కడకు రాగలిగి నందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది అంతేకాదు నాకెక్కువ శ్రమ కలిగిందని కూడా చెప్పక తప్పదు నేను కోరినంత బాగా కారు నడపలేదు కాబట్టి చాలా దూరం నేను నడవ వలసి వచ్చింది నడవడమేమంత కష్టమయినపని కాదు కాని తగినంత వ్యవధిలేకపోవటం నా వాగ్దానం ప్రకారం నేనిక్కడికి రాక తప్పక పోవడంవల్ల నాకీ శ్రమ కలిగింది ఈ ఖద్దరు దారం కత్తిరించి 'హరిజన ఆయుర్వేదకుటీర' ప్రారంభోత్సవం జరిపినాను ఇది ఈ పరిసర స్థలాలలోని జనం జబ్బులను కుదిర్చేటందుకు సరియైన సంస్థ అని నేను భావిస్తున్నాను మీ సన్మాన పత్రం, మీరిప్పుడు చేస్తున్న పనుల గురంచి, మీ భవిష్యత్తు వాంఛలను గురించి వెల్లడిస్తున్న నివేదిక, మీ భవిష్యదాశయాలు నెరవేర వలెనని నేను వాంఛిస్తున్నాను కాని ఏబది ఏండ్ల అనుభవం గల కార్యకర్తగా జాగరూకత కోసం మీకు నేనొక ఉపదేశం చేయవలసి ఉన్నది మీ కార్యక్రమం పెద్ద పెద్ద కోరికలతో నిండి ఉన్నది మీ కార్యక్రమం నిర్వహించే పరిపాలకులుగాని, ట్రస్టీలుగాని జాగరూకులై కష్టించి పనిచేసే వారై నిజాయతీపరులై నిష్కలంక సౌశీల్యవంతులై ఉంటేనే తప్ప మీరనుకొన్న పని నెరవేరజాలదు జాగరూకత, పరిశీలన, భద్రత, నిజాయితీ, సామర్థ్యాలు మీ కార్య నిర్వాహకులలో లేనట్లయితే మీరనుకొన్న పని చిన్నమెత్తుకూడా జరుగజాలదు మీరు ఆచరణ యోగ్యమయిన ప్రణాళికను తయారుచేసి శీలవంతులయిన కార్యకర్తలను ఏర్పాటు చేసుకొని ఆ విషయంలో హరిజన సేవాసంఘాన్ని సంతృప్తి పరచగలిగేట్లయితే, మీ జమాఖర్చు లెక్కలను హరిజన సేవాసంఘంవారి పరిశీలనకు మీరు ఒప్పుకొంటే హరిజన సేవకసంఘం మీకు ఆర్థిక సహాయం చేయగలదు నేనీ విషయంలో హరిజన సేవకసంఘాన్ని ప్రార్థించగలను కాబట్టి మీరు హరిజన సేవకసంఘంవారి సహాయం పొందజాలకపోతే మిమ్ముల్ను మీరే నిందించుకోవలె హరిజన సేవకసంఘంను మాత్రంకాదు ఇప్పుడు నేను మీకు సూచించిన షరతులను మీరు సంతృప్తికరంగా పరిపూర్తి చేయగలిగితే హరిజన సేవకసంఘంవారి సహాయం మీకు తప్పక లభిస్తుంది హరిజన సేవకసంఘంవారి పూర్వ చరిత్రను బట్టి నాకు తెలిసినంతవరకు తాము చేసిన వాగ్దానం వారెన్నడూ మన్నించక పోలేదు.

మీ అవసరాలు తీర్చేటంత సొమ్ము వారి దగ్గరున్నది ఇక్కడ స్థాపించే సంస్థలన్నిటికీ మీకు సాధ్యమయినంతవరకు న్యాయంగా చేయవలసిన సహాయ

మంతా చేయవలసిందని ఇక్కడ సమావేశమయిన మీ అందరికి మనవి జేస్తు న్నాను ఇక్కడనే గాక అన్ని చోట్ల హరిజన సంస్థలు స్థాపింపబడవలెనని నేను ఆశిస్తున్నాను హరిజన సేవకసంఘంవారి ఉద్దేశం మీ శ్రమకు తోడ్పడడం అంతేకాని మీకు శ్రమ లేకుండా చేయడం కాదు హరిజనులకు సరియైన సేవ చేయగలిగినట్లయితే హరిజన సేవకసంఘం ఉనికికి మంచి ఫలితం కలిగినట్లే దీనిని బట్టి హరిజన సేవకసంఘం ప్రతిష్ఠ కేవలం మీ అమోదంపైన, మీ కృషిపైన ఆధారపడి ఉన్నదని తెలుసుకోవలె

## హరిజనుల కర్తవ్యము

నేను మీకు మరొక మాట చెప్పవలసిఉంది అది ప్రతి చోటా పదేపదే చెబుతూన్నదే ఈపవిత్రీకరణోద్యమంలో హరిజనులు ప్రయోజనకరము, గౌరవ ప్రదమయిన పాత్ర వహించవలె ఆరోగ్య రక్షణకు పరిశుభ్రతకు ఏర్పడిన నియ మాలను మీరింతకు పూర్వం పాటించకుంటే ఇప్పుడయినా పాటించవలెనని నా కోరిక ఈ మాటలవల్ల సవర్ణ హిందువులందరు పరిశుభ్రతను పాటిస్తున్నారని భావం కాదు నేను ఇచ్ఛాపూర్వకంగా హరిజనుణ్ణి సవర్ణ హిందువు పరిశుభ్ర తను పాటించినా పాటించకపోయినా మీరు గమనించవలదని, మీ అంతట మీరు పరిశుభ్రంగా ఉండవలెనని నేను మిమ్ములను ఆదేశిస్తున్నాను అదే విధంగా మీ హరిజనులలో ఎవరయినా మృతజంతు మాంసానికిగానీ, గో మాంసానికిగానీ అలవాటుపడితే వాటిని వెంటనే మానవలెనని కోరుతున్నాను ఆ రెండు దుర భ్యాసాలు లేనివారు వాటికి ప్రతికూలంగా పని కట్టుకొని ప్రచారం చేయ వలెనని కోరుతున్నాను మీలో ఎవరయినా తాగుడుకు అలవాటు పడితే దానిని వెంటనే మానవలె తాగుడు ఒక విధమయిన విషము సవర్ణ హిందువులు కొందరు తాగుడుకు అలవాటుపడినంత మాత్రంతో మీరుకూడాదానికి అలవాటు పడకూడదు మీరు వారితోపాటు సమానం కావలెననుకొంటే అందుకు తగిన శక్తిసామర్థ్యాలు సంపాదించుకోవలె కొద్ది కాలంలోనే సవర్ణ హిందువులు చిక్కుకొన్న ఊబిలోనుంచి వారిని హరిజనులు లేవనెత్తవలసిన సమయం వస్తుంది కాబట్టి ప్రతి హరిజనుడు సంపూర్ణ విశ్వాసంతో కృషి చేయవలెనని కోరుతు న్నాను

సవర్ణహిందువుల కొకమాట చెప్పదలచుకొన్నాను మీరు ఒకరు హెచ్చు, ఒకరు తగ్గు అను భేదాలను విస్మరించకపోతే, అస్పృశ్యత అనే మీ మనసులనుంచి తుడిచివేయకపోతే మీరు, నేను, హిందూ జాతి, అందరమూ నశిస్తాము ఇందుకు భిన్నంగా వేయిమంది వేయి మాటలు చెప్పినప్పటికీ ఈ నా మాటను పూర్తిగా నమ్మండి నేనిది చాలా అనుభవంతో చెబుతూన్న మాట " ఈ ఉపన్యాసాన్ని (శ్రీ) మాగంటి బాపినీడుగారు తెలుగులోకి అను వాదం చేసినారు

ఈ ఉపన్యాసానంతరం ఒక వెండిగిన్నెను, బంగారు నీరు ఊదిన ఒక

తకిలిని వేలం వేయగా డాక్టర్ టి జియ్యర్ దాసు 6 రూపాయలకు కొన్నారు ఆయన హరిజనుడు, ఆయుర్వేద వైద్యుడు అని శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుగారు మహాత్మునకు పరిచయం చేయగా, "వత్స" అని జియ్యర్ దాసును పిలిచి భుజంపై ఆశీర్వాదపూర్వకంగా చరిచి తన కారులో ఎక్కించుకొని హరిజన దేవాలయ ప్రవేశానికి కావూరుకు తీసుకొని వెళ్ళినారు

గాంధీజీ 'శ్రీరామాశ్రమం' తెరచిన వెంటనే "ఇక్కడ నేనెంతసేపుండ వలె" అని ప్రశ్నించినారు 'పది నిమిషాలు చాలు" అన్నారు జియ్యర్ దాసు 'కాదు, నేను ఇక్కడ ఎక్కువ కాలం గడుపదలచుకున్నాను" అన్నారు గాంధీజీ సరిగా అట్లాగే జరిగింది

## వినయాశ్రమ ప్రారంభోత్సవము

గాంధీజీ ఆయన బృందము తాళ్ళపాలెంనుంచి నిడుబ్రోలు, ఇంటూరు గ్రామాల మీదుగా కావూరుకు వెళ్ళినారు గాంధీజీ రాకకు ఎదురుచూస్తూ కావూరులో ఇరవై వేలమంది సమావేశమయినారు శ్రీ తుమ్మల బసవయ్య చౌదరిగారు, శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు స్థాపించిన "వినయాశ్ర మా"నికి ఆనాడు (25-12-1933) గాంధీజీ ప్రారంభోత్సవం జరపవలసి ఉన్నది గాంధీజీ సాయంకాలం 3 గంటలకు "వినయాశ్రమ" ప్రారంభోత్సవానికి ఏర్పాటయిన వేదికదగ్గరికి వచ్చినారు ఆశ్రమ పక్షాన తామ్రఫలకంమీద వ్రాసిన స్వాగతపత్రం గాంధీజీకి ఆశ్రమ సంస్థాపకులు సమర్పించినారు హరిజన నిధికి శ్రీమతి సుఖవాసి అమ్మాళ్ళమ్మగారు 116 రూపాయలు సమర్పించి నారు కొంతమంది స్త్రీలు మరికొంత పైకము, కొన్ని నగలు కూడా ఇచ్చి నారు

గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు
"సోదరి సోదరులారా!

నాకు 5 నిమిషాలు మాత్రమే అవకాశమున్నది నాకున్న ఈ అవకా శంలో ఇక్కడినుంచి ఆశ్రమం తెరుస్తున్నాను ఒక చెరువు తవ్వటానికి గడ్డ ఎత్తటం కూడా ఇక్కడనుంచే జరుపుతున్నాను "ఆత్మోల్లాస" భవనంకూడా ఇక్కడనుంచే తెరుస్తున్నాను జాతీయధ్వజంగూడా ఇక్కడినుంచే ఎగుర వేస్తున్నాను వటవృక్షం, అశ్వత్థవృక్షము, శమీవృక్షాలను నేను ఇక్కడనుంచే నాటుతున్నాను" అని చెప్పి ఆశ్రమానికి ఇచ్చిన దానాలను, దాతలపేర్లను కూడా ఇట్లా ప్రకటించినారు

| | |
|---|---|
| శ్రీ తుమ్మల బసవయ్యగారు | 15 ఎకరాల భూమి |
| శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు | 1 ఎకరం మాగాణి, 25 ఎకరముల మక్తాభూమి |
| తుమ్మల శ్రీరామమ్మ | 1 ఎకరం రొట్ట |
| సుఖవాసి తాతయ్య (మరికొందరు) | 1 ఎకరం భూమి |

| | |
|---|---|
| తుమ్మల అంజయ్య | 1 ఎకరం 50 సెంట్లు భూమి |
| తుమ్మల రామయ్య | 1 ఎకరం |
| మన్నపనేని సూరయ్య | 1 ఎకరం |
| ఎలవర్రు గ్రామస్థులు | 445 రూపాయలు |
| శ్రీమతి తుమ్మల దుర్గాంబ | 350 రూపాయలు |

ఈ ప్రకటనానంతరం సభ ముగించి గాంధీజీ కావూరులోని రామలింగేశ్వర" దేవాలయానికి వెళ్ళి దానిని హరిజనులకు తెరచినారు అక్కడనుంచి భట్టిప్రోలుకు వెళ్ళినారు భట్టిప్రోలులో శ్రీ మద్దుల గిరిరావుగారు హరిజన నిధికి 300 రూపాయలు సమర్పించినారు భట్టిప్రోలునుంచి ప్రత్యేకపు రైలులో రేపల్లె వెళ్ళినారు రేపల్లెలో ఇరవై వేలమంది గాంధీజీ రాకకోసం నిరీక్షిస్తున్నారు గాంధీజీ రేపల్లె చేరేసరికి చీకటిపడింది లైట్లు లేవు గాంధీజీని సరిగా చూడజాలనందువల్ల ప్రజలలో అలజడి హెచ్చింది అక్కడ హరిజన నిధికి 1000 రూపాయలు గాంధీజీకి సమర్పించినారు రేపల్లెనుంచి గాంధీజీ రైలులో తెనాలి వెళ్ళినారు రేపల్లెలో తటవర్తి రామమోహన్‌రావుగారి కుటుంబంవారు కొన్ని గాజులను, బంగారు ఉంగరాలను గాంధీజీకిచ్చినారు

తెనాలి రైలుస్టేషన్‌కు పడమరఉన్న మైదానంలో బహిరంగసభ జరిగింది ప్రజలు హరిజననిధికి 116 రూపాయలు సమర్పించినారు అక్కడనుంచి గాంధీజీ ఆయన బృందము ఐతానగరపుపాడు వెళ్ళినారు అక్కడ ఒక గొప్ప సభ జరిగింది ఏర్పాట్లు చక్కగా ఉన్నవి ఆ గ్రామస్థులు గాంధీజీకి విరివిగా ఖద్దరు నూలుదారలు, వెండిగిన్నెలు సమర్పించినారు హరిజనులకు తెరవబడిన శ్రీరామాలయం ధర్మకర్తలు శ్రీ ఆలపాటి పిచ్చయ్య, పాపయ్యగార్లు, తెనాలి పట్టణ హరిజన సేవాసమితి, తెనాలి తాలూకా బోర్డువారు గాంధీజీకి స్వాగత పత్రాలు సమర్పించినారు సభలోని వారందరూ కలసి హరిజననిధికి 700 రూపాయలు ఇచ్చినారు సన్మానపత్రాలను వెండి సామానులను గాంధీజీ వేలం వేసినారు

రేపల్లె తాలూకా హరిజన సేవకసంఘంవారు, రేపల్లె ప్రాంతీయులు గాంధీజీకి వినతి పత్రం సమర్పించినారు అహ్వాన సంఘంవారు గాంధీజీకి సమర్పించిన ఖద్దరు వస్త్రాలను, నూలును హరిజనులకు పంచిపెట్టవలెనని ఆదేశించినారు ఆ సభలో తుమ్మపూడి బసవమ్మగారు ఒక వీరరాఘవుల కడియమును, పెదపులివర్రు కాపురస్థులగు కొసరాజు సుందరమ్మ, కొసరాజు సత్యజ్ఞాన ప్రసూనాంబ, కొసరాజు రాఘవమ్మగార్లు బంగారు గాజులను, గద్దె రత్తమ్మగారు బంగారపు ఉంగరం, వేజెండ్ల చుక్కమ్మ మొదలయిన ఇతర గ్రామాలవారు పదహారు మంది బంగారు తీగలు గల రాగి గోట్లను హరిజన నిధికి ఇచ్చినారు మరి ఇద్దరు పేరు చెప్పని స్త్రీలు కూడా హరిజన నిధికి బంగారు గాజులిచ్చినారు

మహాత్ముడు తెనాలికి వచ్చినప్పుడు తెనాలి పట్టణ హరిజన సేవా సమితి

వారునూ, శ్రద్ధానంద హరిజన పాఠశాలవారూ, తెనాలి పట్టణ కళావంతుల సంస్కరణ సభవారునూ స్వాగత పత్రాలు సమర్పించినారు మరికొందరు స్త్రీ పురుషులు బంగారు గాజులు, ఉంగరాలు, వెండి గిన్నెలు, తకిలీలు హరిజన నిధికి ఇచ్చినారు స్వాగత పత్రాలను మరికొన్ని వస్తువులను గాంధీజీ అక్కడనే వేలం వేసినారు మహాత్ముడు వేదికపై నుంచినే ఒక ఇటుక రాతిపై ఉంచిన సున్నం వెండి తాపీతో సరిచేసి ఆ రాతిని 'శ్రద్ధానంద పాఠశాలా భవనం' శంకుస్థాపన చిహ్నంగా ఉంచమని కోరినారు

తరవాత హరిజనోద్ధరణ కోసమే తాము వచ్చినామని, సవర్ణులు హరిజనులకు సర్వవిధాల తోడ్పడవలెనని, హరిజనులు ఇదితర కులాలతో వంతు పెట్టుకోక మద్య మాంసాలను మాని సదాచారవంతులై సర్వతోముఖాభివృద్ధి పొందవలెనని హెచ్చరించినారు తరవాత తాలూకా బోర్డువారు 182 రూపాయలు, పురపాలక సంఘంవారు 101 రూపాయలు, ఖద్దరుకొట్టు యజమానులు మహమద్ ఇస్మాయిల్, వేల్పుల గంగయ్యగార్లు 116 రూపాయలను, ప్రభుత్వోద్యోగులు కాని డాక్టర్ల సంఘంవారు ఒక వెండి పళ్లెంను మూడు గిన్నెలను, న్యాయవాద సంఘంవారు 25 రూ, ఐతానగరపు పాడు హిందీ పాఠశాలవారు 80 రూ, ఆంధ్ర కళాపరిషత్తువారు 25 రూ వేణుగోపాల స్వదేశీ స్టోర్స్‌వారు 25 రూ గాంధీ చౌకు యువకులు 11 రూ, సిటీ ఫ్రేమింగ్ వర్క్సువారు కీ శే విఠల్‌భాయి పటేలుగారి పటము (వేలం వేయగా 10 రూపాయలు వచ్చినాయి), కొల్లూరు బసవయ్యగారు కడచిన సత్యాగ్రహ సమరంలో ఒక సంవత్సరం శిక్షకు గురై తిరుచునాపల్లి జైలులో మరణించిన తమ మేనల్లుని ఛాయాచిత్రం (వేలంలో 80 రూపాయలు వచ్చినాయి) హరిజన నిధికి సమర్పించినారు స్త్రీలు బంగారు గాజులు, రొక్కము, నూలు వారలు ఇచ్చినారు

గాంధీజీ అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు హరిజనులకు గాంధీగారిచే తెరవబడిన శ్రీరామాలయ ధర్మకర్తలు పావయ్యచౌదరిగారు ఆ రాత్రి మహాత్మునికి ఆతిథ్యమిచ్చి 116 రూపాయలు సమర్పించినారు ఆ వేకువజామున బయలుదేరి కాకినాడకు పోదలచి మెయిలుకు పోతూ ఆ గ్రామ సన్మాన సంఘాధ్యక్షుడయిన శ్రీ కన్నెగంటి వెంకట్రావు చౌదరిగారి గృహం వద్ద ఆగి వారిదగ్గరనుంచి 116 రూపాయలు హరిజన నిధికి స్వీకరించినారు

గుంటూరు జిల్లాలోని ఏర్పాట్లను గురించి గాంధీజీ చాలా సంతోషించినారు ముఖ్యంగా గుంటూరులోని ఏర్పాట్లు మరీ బాగున్నవన్నారు అక్కడి ఆహ్వాన సంఘాధ్యక్షుడు చాలా సమర్థుడని కొనియాడినారు తాను ప్రయాణం చేసిన శ్రీ మద్ది వెంకటసుబ్బయ్యగారి కారు తనకు సుఖప్రదంగా ఉన్నదనీ, దానిని వారి మనుమడు శ్రీ పువ్వాడ మృత్యుంజయరావు చక్కగా నడిపినారనీ చెప్పి వారికి తమ శుభాకాంక్షలను తెలిపినారు శ్రీ మృత్యుంజయరావు జాగ్రత్తగా కారు నడిపినందుకు గాంధీజీ వ్రాతపూర్వకంగా వారి నభినందించినారు

గాంధీజీ గుంటూరులో ఉన్నపుడు రెంటచింతలలో స్త్రీజనాభ్యుదయానికి కృషిచేస్తున్న అమెరికన్ మిషన్‌లోని మిస్ లూమాన్ (Luman) ఆయనను దర్శించి తాను చేస్తున్న పనిని వివరించింది గాంధీజీకి బహూకరింపబడిన వస్తువులను కొన్నిటిని వేలంలో కొన్నది

## తూర్పుగోదావరిజిల్లా పర్యటన

మహాత్మాగాంధీ ఆయన బృందం కలకత్తా మెయిలులో సామర్లకోట ప్లాటుఫారంమీద డిసెంబరు 24 ఉదయం 11 గంటలకు దిగినారు శ్రీ బులుసు సాంబమూర్తిగారు, తదితర నాయకులు స్వాగతం చెప్పినారు జనులు గుంపులు గుంపులుగా స్టేషన్‌వద్ద చేరినారు అక్కడినుంచి మోటారుపై పెద్దాపురం వెళ్ళినారు పెద్దాపురంలో బహిరంగసభ జరిగింది సుమారు పదిహేను వేలమంది జనసమూహాన్ని ఉద్దేశించి ఉపన్యసించినారు పెద్దాపురం మునిసిపాలిటీపక్షాన చేర్మన్ నిరోగి సుబ్బారావు ఒక స్వాగతపత్రమును, పౌరులు మరొక సన్మానపత్రం చదివినారు హరిజన నిధికి రూ 500-1-0 సమర్పించబడింది

### స్వాగతపత్రము

మహాత్మాజీ !

పెద్దాపుర పురపాలక సంఘు పక్షాన మేము మనఃపూర్వకంగా స్వాగతమిస్తున్నాము హరిజనోద్ధరణకు తాము చేస్తూన్న పనిని ఎంతో శ్రద్ధతో గమనిస్తున్నాము హిందూదేశంలోని హరిజనుల కష్టాలు తమకు తెలియనివి లేవు అందువల్ల తాము హరిజనోద్ధారకులనడంలో అతిశయోక్తి లేదు

తమకు భాగ్యవంతుడు, పేదవాడు, గొప్పవాడు, కొద్దివాడు అనే భేదం లేదు సోదర మానవకోటి నుద్ధరించడంకోసం తాము కడచిన 40 సంవత్సరాల నుంచి స్వార్థత్యాగంతో పడుతూన్న కష్టాలు అందరికీ తెలిసినవే భారతదేశంలో అంటరానితనమనే దోషాన్ని తొలగించడానికి తమరు చేస్తూన్న ప్రయత్నాలు జయమగుగాక అని భగవంతుని ప్రార్థిస్తున్నాము

హరిజనోద్ధరణకు, అంటరానితనం తొలగించేటందుకు శక్తివంచన లేకుండా మేముకూడ సహకారం చేయగలము తమకు చిరాయురారోగ్యాలను భగవంతుడు ప్రసాదించుగాక

పెద్దాపురం పురపాలకసంఘము
అధ్యక్షుడు, సభ్యులు

పెద్దాపురం తాలూకా అస్పృశ్యతా నివారణసంఘంవారు కూడా ఒక సన్మానపత్రం గాంధీజీకి సమర్పించినారు

గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

గాంధీజీ ప్రత్యుత్తరము

స్నేహితులారా !

"సభాస్థలానికి సరాసరి వచ్చేటందుకు మీరు చేసిన ఏర్పాట్లు చాలా శ్లాఘనీయంగా ఉన్నాయి క్రిక్కిరిసి ఉన్న జనసమూహాంలోనుంచి తోవ చేసుకొని రావడానికి నాకెంత కష్టంగా ఉంటుందో మీరూహించుకొనవచ్చు జనుల గుంపుల్లోనుంచి తోసుకొని రావలసిన అవసరం లేకుండా మీరు చేసిన ఏర్పాట్లు నాకెంతో హాయిగా ఉన్నాయి మీరు సమర్పించిన సన్మానపత్రాలకు, విరాళాలకు నేను చాలా కృతజ్ఞుణ్ణి సన్మానపత్రాలను చదువకుండడానికి మీరు చూపిన నిగ్రహానికి కూడా నా అభినందనలు

నేను వచ్చిన పని మీకు తెలుసు అస్పృశ్యతా దోషం నిర్మూలించడానికి నేను చేసే ప్రయత్నంలో మీరు కూడా కలసిరావలె ప్రస్తుతం మనం ఆచరిస్తున్న అస్పృశ్యతకు మన మతం అంగీకరించడంలేదని మీరు హృదయ పూర్వకంగా నమ్మి నాతో కలిసి పనిచేయవలె ఒక మనిషి అస్పృశ్యుడుగా పుట్టినట్లు భావించడమే చాలా నీచమయిన విషయము అస్పృశ్యత అనే ఈ మహాపాప భారంకింద హిందూమతం విచ్ఛిన్నమయ్యే సూచనలను మనము మన తరంలోనే చూడగలుగుతున్నాము అస్పృశ్యత నిర్మూలనం కాకుంటేనే హిందూమతం నశిస్తుందని నేననేక వేదికలమీద చెప్పిన మాటలనే మళ్ళీ ఇక్కడ ఉద్ఘాటిస్తున్నాను ఈ సభలో ఇంతమంది సమావేశమై హరిజన నిధికి డబ్బు సమర్పించడం నాకు ఆహ్లాదకరంగా ఉన్నది ఈ అస్పృశ్యతా సమస్యను గురించి చర్చిస్తూ చిరకాలం ఇక్కడ మిమ్మలను నిలపడం నాకిష్టంలేదు

ఈ రోజున నేను నిర్వర్తించవలసిన కార్యక్రమం ఇంకా చాలా ఉన్నది మీరు శ్లాఘనీయమయిన ఏర్పాట్లును చేసి సన్మాన పత్రాలను, విరాళాలను సమర్పించినందుకు మరొకసారి నా కృతజ్ఞతను తెలుపుతూ ఈ పవిత్రోద్యమంలో పాల్గొడానికి మీకు భగవంతుడు శక్తిసామర్థ్యాలను ఇచ్చుగాక అని ప్రార్థిస్తున్నాను"

"ఈ సన్మాన పత్రాలను వేలం పెట్టడానికి, సోదరీమణులు తమ విలువగల ఆభరణాలను సమర్పించేటందుకు మరికొన్ని నిమిషాలు నేనిక్కడ వెచ్చింపదలచుకొన్నాను ఈ వ్యవధిలో ఇదివరకు హరిజన నిధికి విరాళాలివ్వనివారు ఇవ్వవచ్చు చట్రంలో బిగించిన ఈ సన్మానపత్రాలఅద్దాలు పగిలినాయి దీనిని బట్టి సన్మాన పత్రాలకు చట్రాలు కూడదని మీరు గుణపాఠం నేర్చుకోండి భారతదేశంలో ఆంధ్ర రాష్ట్రము కళానైపుణ్యానికి పన్నెకెక్కినదని నాకు తెలుసు కాబట్టి ఇక మీరు ఆడంబరంలేని కళానైపుణ్యంతో సన్మాన పత్రాలను రూపొందించవలెనని కోరుతున్నాను"

సన్మాన పత్రాలు వేలం పెట్టగా కేశవరపు కామరాజుగారు 10 రూపాయలకు కొన్నారు

గాంధీజీ సామర్లకోటకు పోతున్నప్పుడు తోవలో గోదావరి రాజ

మహేంద్రవరం రైల్వే స్టేషన్‌లలో డిసెంబరు 24 ఉదయం ఆయనకోసం వేల కొలది ప్రజలు వేచి ఉన్నారు ఆయన కిటికిలోనుంచి చేయి చాచి హరిజన నిధికి విరాళమియ్యమనగానే చేయలకు రూపాయల వర్షం కురిసింది కొందరు నగలుకూడా ఇచ్చినారు గుంపులోనుంచి ఎవరో ఒకరు వచ్చి గాంధీజీకి ఖద్దరు ధోవతి, ఖద్దరు నూలు గల ఒక సంచీని బహూకరించినాడు

**కాకినాడ**

మహాత్మాజీ పెద్దాపురంనుంచి పగ్గాహ్నం 12 గంటలకు కాకినాడ చేరి శ్రీ పైడా వెంకటనారాయణగారింట్లో విడిది చేసినారు కాకినాడలో గాంధీజీ వచ్చే తోవలో జనం వేలకొద్దీ చేరి 'గాంధీజీకి జై" అని నినాదాలు చేసినారు

గాంధీజీకి వెంకటనారాయణగారి గుమ్మందగ్గర స్త్రీలు హారతి ఇచ్చి లోనికి ఆహ్వానించినారు

ప్రొఫెసర్ మల్కానీ ఆ ఏర్పాట్లు చూసి ఇంత చక్కని ఏర్పాట్లు ఇంతవరకెక్కడా జరగలేదని సంతోషించినారు

మహాత్మాజీ లోనికి ప్రవేశించగానే వైణిక భూషణ శ్రీ ఈమని అచ్యుత రామయ్యగారు వీణా గానంతో మహాత్ముని ఆనందింపజేసినారు

పైడా వెంకటనారాయణగారింటిలోనే అనేకమంది నాయకులు గాంధీజీని దర్శించి హరిజనోద్యమం గురించి చర్చించినారు

కాకినాడ అన్నదాన సమాజం ఆవరణలో గాంధీజీ స్త్రీలనుద్దేశించిఉపన్యసించినారు వారు హరిజన నిధికి 250 రూపాయలు సమర్పించినారు ఇంతలో బ్రహ్మాండమయిన వర్షం కురిసింది

ఆ తరవాత గాంధీజీ మునిసిపల్ కార్యాలయానికి వెళ్ళినారు వర్షం కురుస్తున్నప్పటికీ ప్రజలు ఆయన రాకకు నిరీక్షిస్తూ నిలిచి ఉన్నారు జిల్లాబోర్డు, మునిసిపాలిటీవారు ఆయనకు సన్మాన పత్రాలను సమర్పించినారు వర్షం కురుస్తూన్నందువల్ల గాంధీజీ ఉపన్యాసం చేయలేదు ఆయన అక్కడినుంచి గొల్లపాలెం మీదుగా రామచంద్రపురానికి సాయంకాలం 3 గంటలకు చేరినారు

గాంధీజీ శ్రీ బులుసు సాంబమూర్తిగారితో కలసి రామచంద్రపురం పోతూండగా తోవలో ఆర్యవటు, గొల్లపాలెం మధ్య ఉన్న ఒక తోటలో వర్షం కురుస్తూన్నప్పటికీ మహాత్మాజీ దర్శనంకోసం అయిదు వేలమంది ప్రజలు వేచి ఉండి 600 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు గాంధీజీ, వారి ఓర్పుకు, ఔదార్యానికి ఆనందించి కృతజ్ఞత తెలుపుతూ అస్పృశ్యతను రూపుమాపవలసిందని ఉద్బోధించినారు వారు రామచంద్రపురం చేరేసరికి సాయంకాలం (డిసెంబరు 24) 4 30 గంటలయింది

**ద్వారపూడి**

మహాత్ముడు మెయిలులో కాకినాడకు వచ్చి అక్కడినుంచి రామచంద్ర

పురం వెళ్ళుతున్నారని తెలిసి 24 డిసెంబరు ఉదయం 6 గంటలనుంచి ద్వార పూడి ప్లాటుఫారం జనంతో నిండిపోయింది ద్వారపూడిలోని 'హిందీసీతా కుటీరు' ఉపాధ్యాయులు శ్రీ వి నరసింహారావుగారు కొంతమంది విద్యార్థులను, విద్యార్థినులను గాంధీజీ దర్శనార్థం రైలు దగ్గరికి తీసుకొని వచ్చినారు

రైలు ప్లాట్‌ఫారం మీదికి రాగానే శ్రీ నరసింహారావు మహాత్ముని సన్మానించి తన దగ్గర చదువుకుంటూన్న 7 ఏళ్ళ బాలిక రామామణిని తన చేతులతో ఎత్తి గాంధీజీకి చూపించి "ఈ బాలికను రామచంద్రపురంలో మీకు హిందీ స్వాగత పత్రం చదివించడానికి తీసుకొని వెళ్ళుతున్నాము" అని హిందీలో చెప్పినారు

గాంధీజీ ఆశ్చర్యంతో చూసి '' అమ్మాయి నాకు స్వాగతం చదువు తుంది!" అని ఆనందం పట్టజాలక ముద్దుపెట్టుకొని "ఆ స్వాగతం ఇక్కడనే ఎందుకు చదివించ కూడదు" అన్నారు వెంటనే రామచంద్రపురంలో చదవ వలసిన హిందీ ప్రేమీ మండలి స్వాగత పత్రం ఆ అమ్మాయి చేత అక్కడే చదివించినారు శ్రీ నరసింహారావుగారు స్వాగత పత్రంలోని "హే దరిద్ర నారాయణ్" అనేమాట ఆ చిన్న పిల్ల నోటి నుంచి రాగానే మహాత్ముడు పక పకా నవ్వి ఆ అమ్మాయి వంక చూసి "నీవేమి నగలు పెట్టుకొని రాలేదే ఆ ముక్కుపుడక ఇలా ఇవ్వమ"న్నారు ఆ అమ్మాయి ముక్కు దగ్గర చేయి పెట్టుకోవడంతోనే రైలు కూత వేసింది "సరే తరవాత" అని గాంధీజీ ఆ బాలికను ఆశీర్వదించి ఆమెకొక పండు ఇచ్చినారు

రైలు దగ్గరకు వచ్చిన ప్రజలు హరిజన నిధికి డబ్బు గాంధీజీ చేతులలో పెట్టి నమస్కరించినారు

## రామచంద్రపురంలో

రామచంద్రపురంలోని తిలక్ టౌన్‌హాల్ ఆవరణలో బహిరంగ సభకు ఏర్పాట్లు చేయడం జరిగింది మధ్యాహ్నం 2½ గంటలనుంచి వర్షం కురవడం చేత ఈ ఏర్పాట్లకు కొంత అంతరాయం కలిగింది కాని 3 గంటలకు వర్షం వెలిసి 4 గంటలకు సూర్యుడు కనిపించినాడు రామచంద్రపురం తాలూకా బోర్డువారు గాంధీజీకి స్వాగతపత్రం సమర్పించినారు గాంధీజీ బహిరంగ సభకు పోయేముందు వాల్మీకాశ్రమానికి వెళ్ళినారు, స్థానికోన్నత పాఠశాలలో చదువుతున్న హరిజన బాలురకు ఉచిత భోజన వసతి సౌకర్యాలు ఆ ఆశ్రమంలో ఉన్నాయి ఆ బాలుర వసతి గృహం అఖిల భారత అస్పృశ్యతా నివారణ సంఘం వారి ఆంధ్రశాఖ నడుపుతూన్నది అందులో 20 మంది బాలురకు భోజన వసతులు ఉన్నాయి గాంధీజీ, ఆంధ్రదేశపు అస్పృశ్యతా నివారణ సంఘ కార్యదర్శి మాగంటి బాపినీడు, తూర్పుగోదావరి జిల్లా కార్యదర్శి వెన్నేటి సత్యనారాయణ, బులుసు సాంబమూర్తి, ప్రొఫెసర్ మల్కానీ మొదలయిన వారితో కలసి ఆశ్రమానికి వెళ్ళినప్పుడు ఆ హాస్టల్ సూపరింటెండెంట్

శ్రీ (తోలేటి) టి కనకరాజును వెన్నేటి సత్యనారాయణగారు గాంధీజీకి పరిచయం చేసినారు ఆశ్రమ వాసులు గాంధీజీకి హారతి పట్టినారు తరవాత వారు హాస్టల్ భవనాన్ని పరిసర ప్రదేశాలను గాంధీజీకి చూపించినారు గాంధీజీ హాస్టల్ పిల్లల భోజన సదుపాయాలను గురించి డాక్టర్ కనకరాజును ప్రశ్నించి వివరాలు తెలుసుకొన్నారు ప్రతి పిల్లవానికి బట్టలతో సహా సగటున నెలకు 10 రూపాయలు వెచ్చింప బడుతూన్నదని కనకరాజుగారు గాంధీజీకి తెలిపినారు తరవాత డాక్టర్ కనకరాజు పెదపూళ్ల నుంచి వచ్చిన పాటి బుక్కన సుబ్బారావును గాంధీజీకి పరిచయం చేసినారు ఆయన తాను నడుపుతున్న ఆశ్రమం నుంచి 60 మంది బాల బాలికలను గాంధీజీ దర్శనం కోసం తీసుకొని వచ్చినారు

హాస్టలులోనివారు గాంధీజీకి స్వాగత పత్రం సమర్పించినారు గాంధీజీ ఆ హాస్టలును దర్శించడం తనకు ఆనందకరంగా ఉందని అన్నారు మధురమయిన సంగీతంతో ఆశ్రమంలోని బాలురు భజన కీర్తనలు పాడినందుకు వారిని అభినందించినారు ఆశ్రమ పరిపాలకులు, దానిలోని పిల్లలు శీల సంపన్నులై ఉంటే ఆ సంస్థ ఆదర్శప్రాయంగా వర్ధిల్ల గలదని గాంధీజీ ఆశీర్వదించి తిలక్ టౌన్ హాల్‌లోని బహిరంగ సభకు వెళ్ళినారు

### బహిరంగ సభ

గాంధీజీ ఆయన బృందము తిలక్ టౌన్ హాల్‌కు రాగానే ప్రజ లాయనను అత్యుత్సాహంతో ఆహ్వానించినారు శ్రీ బిక్కిని వెంకటరత్నం, నరసింహ దేవర సత్యనారాయణ ఇంకా మరికొంత మంది గాంధీజీకి ఎదురేగి ఆయనను వేదికపైకి తెచ్చి ఆసీనులను చేసినారు గాంధీజీ వేదికపైన కూర్చుండడం తడవుగా ప్రజలు ఆయనను పూలదండలతో ముంచి వేసినారు రామచంద్రపురం తాలూకా బోర్డువారు, హిందీ ప్రేమీ మండలివారు ఆయనకు స్వాగత పత్రాలను సమర్పించినారు తాలూకా ప్రజల పక్షాన 812 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు

రామచంద్రపురం తాలూకా బోర్డువారి స్వాగత పత్రంలో "దేశాభ్యుదయానికి, హిందూమత ప్రయోజనంకోసం అస్పృశ్యతా నివారణ అత్యవసరము ఈ ఆశయాల కోసం మీరు ప్రారంభించిన హరిజనోద్ధరణకు మేము మా శక్తి కొద్దీ కృషి చేయగలము మీరు ప్రారంభించిన ఈ ఉద్యమం జయప్రదం కావలెనని మీ ఈ కృషి ఫలప్రదం కావడానికి దేవుడు మిమ్మల్నలను చిరాయుష్మంతులుగా చేయవలెనని ప్రార్థిస్తూ మేమీ సన్మాన పత్రం సమర్పిస్తున్నాము" అని ఉన్నది

ఈ సన్మాన పత్రానికి సంగ్రహంగా జవాబిస్తూ గాంధీజీ "మీరు నాకు సమర్పించిన స్వాగత పత్రానికి హరిజన నిధి విరాళానికి కృతజ్ఞుణ్ణి కాని మీరిచ్చిన విరాళం సంతృప్తిగాలేదు ఇంకా ఎక్కువ రావలె. ఇప్పుడు నాకిచ్చిన రెండు సన్మాన పత్రాలను నేను వేలం వేస్తున్నాను" అని గాంధీజీ తాలూకా

బోర్డువారి స్వాగత పత్రం వేలం పెట్టగా నరసింహదేవర సత్యనారాయణగారు దానిని 116 రూపాయలకు కొన్నారు హిందీ ప్రేమీ మండలివారి స్వాగత పత్రానికి రూ 8-8-0లు వచ్చినాయి

గాంధీజీ మళ్ళీ ఇంగ్లీషులో "ఈ సభ జరిపే టందుకు మీరు చేసిన ఏర్పాట్లు చాలా బాగున్నాయి అందుకు నేను మిమ్మల్ని అభినందిస్తున్నాను ఈ ప్రదేశం చాలా సహజమయిన ప్రకృతి సౌందర్యంతో ఎంతో మనోహరంగా ఉంది దేవుని దయవల్ల సహజమయిన ఈ ప్రకృతి సౌందర్యం మీరు చెరప కుండా ఉంచడం కూడా చాలా సంతోషము ఈ ప్రాంతంలో వాల్మీకి ఆశ్రమం అనే ఒక సంస్థ ఉందని మీకందరికి తెలుసు నేనిప్పుడే ఆ సంస్థను చూసి వచ్చినాను అది హరిజన బాలురకు ఆశ్రయం ఇస్తూన్నది ఆ బాలురు పాడిన భజన కీర్తనలను నేను ఆనందంగా విన్నాను అవి నన్ను బాగా ఆకర్షించినాయి వారు నాకు చక్కని స్వాగత పత్రం సమర్పించినారు వారి ఆశ్రమం మీ అందరి సహాయం అపేక్షిస్తున్నది మీ తాలూకా ప్రజలందరు దానికి చేయగలిగినంత సహాయం చేయవలెనని నాకోరిక ప్రకృతికి మానవులందరూ సమానమే కాని మానవుడు అహంకారంతోనూ, అసూయా ద్వేషాలతోనూ సమాజంలో హెచ్చు తగ్గులను సృష్టించుకొన్నాడు దేవుడు ఈ వ్యత్యాసాలను ఎంత మాత్రం గుర్తించడు ప్రకృతిలో ఎక్కడయినా దేనినైనా చూడండి- మనుషులు సృష్టించుకొన్న అసమానత్వం వంటి దెక్కడా కనిపించ లేదు మీరీ అస్పృశ్యతా దోషం నిర్మూలిస్తేనేగాని ప్రకృతి సిద్ధమయిన సమానత్వం స్థాపించుకోలేరు ఈ అస్పృశ్యతా దోషాన్ని కూకటి వ్రేళ్లతో పెకలించగల ధైర్యసాహసాలను మీకు భగవంతుడు ప్రసాదించవలెనని నేను ప్రార్థిస్తున్నాను నా ఈ ప్రార్థనలో మీరందరూ కలవండి మిమ్ములను ఇంకా ఇక్కడ నిలబెట్టడం నాకిష్టంలేదు స్త్రీలలో మీరేదయినా ఎక్కువ మొత్తం వసూలుచేసి ఉన్నట్లయితే దయచేసి దానిని వెంటనే నాకు ఇవ్వండి" అని ఉపన్యసించినారు ఈ ఉపన్యాసం సాంబమూర్తిగారు తెలుగులోకి అనువదించినారు

అనంతరం గాంధీజీ వేదికనుంచి దిగగానే ఒక కమ్మ కులస్థురాలు రెండు బంగారు గాజులను గాంధీజీకి సమర్పించింది తరవాత గాంధీజీ టి రామచంద్ర రావుగారి (గజవల్లి) ఇంటికి వెళ్ళినారు అక్కడ ఆయన బసచేసి భోజనానంతరం కొంత తడవు విశ్రాంతి తీసుకొన్నారు రామచంద్రరావుగారు ఆయనకు హరిజన నిధి నిమిత్తం 116 రూపాయలు సమర్పించినారు

గాంధీజీ కాకినాడ నుంచి రామచంద్రపురానికి వచ్చేటప్పుడు తోవలో వేలంగి గ్రామస్థులు ఆపి 40 రూపాయలిచ్చినారు రామచంద్రపురంలో హరిజన నిధికి 1050 రూపాయల వరకు వసూలయినాయి

గాంధీజీ రామచంద్రపురం నుంచి రాజమహేంద్రవరం వెళ్ళినారు తోవలో కూడా కొంత సొమ్ము హరిజన నిధికి వసూలయింది

రాజమహేంద్రవరము

గాంధీజీ రాకను గురించి రాజమహేంద్రవరం పౌరులు విస్తృతమైన ఏర్పాట్లు చేసినారు సన్మాన సంఘంవారు ఆయనను ఆహ్వానించడానికి పాల్ చౌక్‌లో బహిరంగసభ ఏర్పాటు చేసినారు మహాత్మాజీ ఆయన బృందం ఆసీను లయ్యేటందుకు శ్రీ జగంటి శ్రీరామమూర్తిగారు ప్రత్యేక వేదికను ఏర్పాటు చేసినారు నాళం రాజారావుగారు విద్యుద్దీపాల ఏర్పాటు చేసినారు రాజమహేంద్రవరం ఎలక్ట్రిక్ కార్పొరేషన్ కంపెనీవారు నామమాత్రపు ఖరీదుకు కరంట్ సప్లయ్ చేసినారు

గాంధీజీ మాగంటి బాపినీడు, వెన్నేటి సత్యనారాయణగార్లతో కలసి రాజమహేంద్రవరంలోని బహిరంగసభకు రాత్రి 7 30 కు (డిసెంబరు 25) వచ్చి నారు సన్మాన సంఘాధ్యక్షుడు శ్రీ అరవ ఆదినారాయణమూర్తి వారి కెదు రేగి వేదిక దగ్గరికి ఆహ్వానించి తీసుకొని వచ్చినారు సభాస్థలంలో దాదాపు ముప్పైవేలమంది ఉన్నారు వారిలో ఒక వెయ్యిమంది స్త్రీలు కూడా ఉన్నారు "మహాత్మాగాంధీజీకి జై" అనే నినాదాలు సభలో మిన్ను ముట్టి నాయి

రాజమహేంద్రవరం మునిసిపాలిటి, జాతీయ పాఠశాల పాలకవర్గము, హిందూ సమాజము, స్త్రీ సనాతన విద్యాలయము, ఆల్ ఇండియా లీగ్ ఆహ్వాన సంఘాలవారు గాంధీజీకి సన్మాన పత్రాలను సమర్పించినారు. మునిసిపల్ చేర్మన్ రావు బహద్దూర్ పి గోవిందరావు నాయుడుగారు మునిసిపాలిటీ పక్షాన సన్మానపత్రం చదివినారు స్థానిక సన్మాన సంఘంవారు 1300 రూపాయలు, జాతీయ పాఠశాల పాలకవర్గం 250 రూపాయలు, గుజరాతీలు 261 రూపాయలు, రాజమహేంద్రవరం మహిళలు 150 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు

గాంధీజీ ఉపన్యాసము

గాంధీజీ "మీరు దయ ఉంచి కొన్ని క్షణాలు నా మాటలు వినండి ఈ సన్మాన పత్రాలకు, విరాళాలకు నేను కృతజ్ఞుణ్ణి రాజమహేంద్రవరంతోను, పట్టణ పౌరులతోను మరొకసారి నా పరిచయం పునరుద్ధరించుకొంటూన్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది మీ పూర్వ చరిత్ర మీ దగ్గరనుంచి చాలా గొప్ప విషయాలను ఆశించవచ్చునని నాకు బోధించింది కాబట్టి మీరందరూ ఈ హరిజనోద్యమానికి తోడ్పడి నా ఆశలను సఫలం చేయగలరని విశ్వసిస్తున్నాను.

హిందూ సమాజంవారి సన్మానపత్రం నేను చూసినాను వారు పంపిన కార్యక్రమం కూడా ఆమూలాగ్రంగా చదివినాను వారి కార్యక్రమం గొప్ప ఆశయాలతో ఉన్నది ఆశయాలు గొప్పవయినా, చిన్నవయినా లక్షలాది సవర్ణ హిందువులలో హృదయ పరివర్తనం కలగంది అవి ఎంతమాత్రం నెరవేరవు హిందూ సంఘాన్ని క్రమక్రమంగా నశింపచేయగలిగినటువంటిది అస్పృశ్యత

అంతకంతకు క్షీణిస్తున్న శరీరాన్ని ప్రాణంతో ఎట్లా నిలబెట్టుకోలేమో అట్లాగే అస్పృశ్యతను నిర్మూలించకపోతే క్రమక్రమంగా హీనదశకు వస్తూన్న హిందూ మతాన్ని కూడా నిలబెట్టుకోజాలము ' అన్నారు

అప్పుడు సభలో కొంత అలజడి జరిగింది గాంధీజీ అంతట ' మీరు నిశ్శబ్దంగా ఉంటేనేకాని నా ఉపన్యాసం కొనసాగించడానికి వీలు లేదు ఈలోగా నేను మరొక పని చేయదలచుకొన్నాను " అని మునిసిపల్ సన్మాన పత్రాన్ని వేలం పెట్టినారు శ్రీ జి వరదారావు దానిని 30 రూపాయలకు కొన్నారు డాక్టర్ కె యల్ నరసింహారావు మహాత్మాజీ చిత్రపటాలు రెంటిని 70 రూపాయలకు కొన్నారు తాపేశ్వరంలో మహాత్మాజీకి బహూకరించిన ఖద్దరు శాలువను వేలం పెట్టగా శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు 30 రూపాయలకు కొన్నారు ఇతర సన్మానపత్రాలకు, కానుకలకు 41 రూపాయలు వచ్చినాయి

తన సహజ మందహాసంతో గాంధీజీ వేదికపైనున్న శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారిని ఆలింగనం చేసుకొని ఆయన వేలంలో కొన్న శాలువను ఆయనకు కప్పినారు

**స్త్రీల బహూకరణలు**

రాజమహేంద్రవరం మహిళలు ఖద్దరు నిధికి 310 రూపాయలు ఇచ్చినారు కుమారి జి సరస్వతి తన చెవి పోగులను సమర్పించింది శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయి అప్పటికప్పుడు స్త్రీలనుంచి 90 రూపాయలు వసూలుచేసి ఇచ్చింది

## హరిజన నాయకుల రాయబారము

తరవాత మహాత్మాజీ ఆయన బృందం శ్రీ దేవత శ్రీరామమూర్తి భవనానికి వెళ్ళినారు అక్కడ పి రామమూర్తి యాజమాన్యం కింద తూర్పుగోదావరి హరిజన నాయకులు కొందరు గాంధీజీ దగ్గరికి రాయబారం వచ్చినారు వారు డిసెంబరు 16 వ తేదీని తెలుగు జిల్లాలలోని హరిజన నాయకులు బెజవాడలో సమర్పించిన విజ్ఞాపన పత్రంలోని విషయాలను సాధ్యమయినంత త్వరలో అమలుపరచవలసిందని గాంధీజీని కోరినారు తూర్పుగోదావరి జిల్లా హరిజనులలో చాలామంది సమర్థులయిన విద్యావంతులు ఉన్నారని, జిల్లా అస్పృశ్యతా నివారణ సంఘ పరిపాలనను వారికి అప్పచెపితే వారు చక్కగా నిర్వహించగలరని అన్నారు అందువల్ల ఆ సంఘంలో సవర్ణులు ఉండకూడదని తమ అభిప్రాయం కాదనీ, అస్పృశ్యుల పట్ల సానుభూతిగల సవర్ణులు తమకు మార్గదర్శకులుగా ఉండవచ్చునని కూడా వారన్నారు అస్పృశ్యతా నివారణ సంఘానికి కార్యనిర్వాహకులుగా హరిజనులే ఉండవలెనని, సవర్ణుల చేతులలో ఆ సంఘం ఉంటే హరిజనాభ్యుదయానికి అవసరమయిన సంస్కరణలు జరగడం సాధ్యం కాదనీ కూడా వారు గాంధీజీకి మనవి చేసినారు తూర్పుగోదావరి

జిల్లాలో గాంధీజీ కార్యక్రమం ఏర్పాటు చేసినవారు గాంధీజీతో హరిజనుల రాయబారం గురించిన విషయం చేర్చలేదనికూడా వారు గాంధీజీకి నివేదించి నారు

## గాంధీజీ ప్రత్యుత్తరము

హరిజనుల రాయబారం తన కార్యక్రమంలో చేర్చకపోవడానికి కారణం హరిజన సేవకసంఘం వారికి తన ఆరోగ్యం గురించిన ఆందోళన, జిల్లాలో పర్యటనకు తగినంత వ్యవధి లేకపోవడం అని గాంధీజీ హరిజన నాయకులకు నచ్చచెప్పినారు

జిల్లా అస్పృశ్యతా నివారణ సంఘ పరిపాలన గురించి గాంధీజీ సవర్ణులు హరిజనులకు ఋణగ్రస్తులనీ ఆ ఋణాన్ని పూర్తిగా తీర్చుకొనేటందుకు ఋణ దాతలు ఋణస్తులకు సాధ్యమయినంత ఎక్కువ అవకాశమివ్వవలెననీ అన్నారు అస్పృశ్యతా నివారణ సంఘ పరిపాలన సవర్ణుల చేతుల్లోనే ఉండవలెనని, హరి జనులు వారికి మార్గదర్శకులుగా ఉండి వారి పనిని తనిఖీ చేస్తుండడం తన అభి ప్రాయమని అన్నారు ఇంక తదితర ప్రశ్నలకు తాను సావధానంగా జవాబు చెప్పగలనని అందుకోసం ఒకరిద్దరు హరిజన నాయకులను తనతో పంపవలెనని రాయబార వర్గంవారిని గాంధీజీ కోరినారు హరిజన నాయకులు ఆ ప్రత్యుత్త రంతో సంతృప్తిపడి గాంధీజీ దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయినారు

తరవాత దేవత శ్రీరామమూర్తిగారు,ఆయన కుమార్తె లీలావతి గాంధీ జీకి ప్రణమిల్లి 800 రూపాయల విలువగల బంగారు ఉంగరాలను, మరికొన్ని నగలను సమర్పించినారు మరికొంతమంది స్త్రీలు 200 రూపాయల విలువగల ఆభరణాలను హరిజన నిధికి ఇచ్చినారు

రాజమహేంద్రవరంలో దాదాపు 2,700 రూపాయలు వసూలయినాయి

మహాత్మాజీ ఆయన బృందము డిసెంబరు 25 ఉదయం ప్రార్థనానంతరం 5 గంటలకు రాజమహేంద్రవరంనుంచి బయలుదేరి ప్రభాకర్ లాంచిలో సీతా నగరం వెళ్ళినారు

## సీతానగరం

డిశంబరు 25 గాంధీజీకి మౌనవ్రతము అందువల్ల ఆయన ఆనాడు సీతా నగర సత్యాగ్రహ ఆశ్రమంలో విశ్రాంతి తీసుకొన్నారు డిసెంబరు 26న సీతా నగరం ఫిర్కాలో మూడు దేవాలయాలను హరిజనులకు తెరిచినారు డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు స్థాపించిన హరిజన సేవాశ్రమానికి కూడా ఆనాడే గాంధీజీ ప్రారంభోత్సవం చేసినారు హరిజన ఆశ్రమంలో గ్రామస్తుల పక్షాన డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు హరిజన నిధికి 700 రూపాయలు ఇచ్చినారు

ఆంధ్రరాష్ట్రంలోని ఖాదీ కార్యకర్తలు గాంధీజీకి సన్మానపత్రం సమ ర్పించి తమ కష్టాలను వివరిస్తూ ఒక విజ్ఞాపనపత్రం కూడా ఇచ్చినారు వారితో

గాంధీజీ 40 నిమిషాలు ముచ్చటించినారు

అంతకు పూర్వం ఉదయం సత్యాగ్రహ ఆశ్రమ సభ్యులు తాము 1929 నుంచి 1933 వరకు చేసిన పనిని గురించి ఒక నివేదికను మహాత్మాజీ చేతుల్లో ఉంచినారు మధ్యాహ్న భోజనానంతరం బులుసు సాంబమూర్తిగారు సీతానగర ఆశ్రమంలోని సభ్యులందరిని మహాత్మాజీకి పరిచయం చేసినారు మీరాబెన్ 100 ఖద్దరు ఫ్రాక్‌లను హరిజన పిల్లలకు పంచిపెట్టినారు

## సీతానగరం ఆశ్రమ నివేదిక

భారత జాతీయ కాంగ్రెస్ నిర్ణయించిన నిర్మాణ కార్యక్రమం నిర్వహించేటందుకు 1924 లో సీతానగరం ఆశ్రమాన్ని డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారు స్థాపించినారు అది అఖండ గౌతమీ ఎడమగట్టు పక్కను గోదావరికి ఒక మైలుదూరాన ఉన్నది 14 ఎకరాల భాశీస్థలంలో భవనాలు నిర్మించడం జరిగింది ప్రస్తుతం 17 భవనాలున్నవి అందులో 10 మంది సభ్యుల నివాసగృహాలు, ఒకటి ఆసుపత్రి, రెండు రోగుల వార్డులు, కార్యాలయాలకు, కార్ఖానాలకు సంబంధించినవి, 4 హాలులు 1925 సెప్టెంబరు 1 న ఆశ్రమం పని ప్రారంభమయింది ఖద్దరు పరిశ్రమ, ఉచిత వైద్య సహాయము, హిందీప్రచారం అస్పృశ్యతా నివారణ,నిమ్నజాత్యుద్ధరణ "కాంగ్రెసు" అనే తెలుగు పత్రికా ప్రచురణ సాధారణ కాంగ్రెస్ ప్రచారము— ఇవి ఆశ్రమ కార్యకలాపాలు గాంధీజీ 1929 మేలో ఆంధ్రదేశానికి వచ్చినప్పుడు ఈ ఆశ్రమాన్ని దర్శించినారు అటు తరవాత జరిగిన ఈ ఆశ్రమ కార్యకలాపాలను గురించి వారి నివేదికలో ఇట్లా ఉన్నది

"అఖిలభారత చర్ఖాసంఘంవారు ఖద్దరు పని నిమిత్తం దయతో 20 వేల రూపాయలు తాత్కాలిక ఋణం ఇచ్చినారు అది ఖద్దరు ఉత్పత్తికి అమ్మకానికి కూడా మంచి ప్రోత్సాహం కలిగించింది మా పిఠాపురం కేంద్రం చాలా అభివృద్ధిలోకి వచ్చింది 1926 మొదలు 1928 వరకు అక్కడ రూ 41,199-4-8 ల విలువగల ఖద్దరుఉత్పత్తి జరిగింది 1929, 30, 31 సంవత్సరాలలో ఆ కేంద్రంలోని మా ఖద్దరుఉత్పత్తి రూ 1,63,024-5-6 లకు పెరిగింది మా కోరాబట్టను ప్రజలు చాలా అభిమానిస్తున్నారు దానికి ప్రతిచోటా చాలా గిరాకి ఉంది మా ఖద్దరు పట్టంచు, జరీఅంచు చీరలు ధోవతులు ఆంధ్రదేశంలో ప్రశస్తంగా అమ్ముడుపోతూన్నాయి ఆశ్రమ సభ్యులందరూ 1930 సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నప్పటికీ ఖాదీపని మాత్రం సాగుతూనే ఉన్నది

## వైద్యసహాయం

గోదావరికి రెండువైపులను గల 50, 60 గ్రామాలలోని ప్రజలలో మా ఆసుపత్రి మా ఔషధాలయం ఎంతో ప్రజానురంజకాలుగా ఉన్నవి 1928 మధ్యవరకు డాక్టర్ సుబ్రహ్మణ్యంగారే మరొక డాక్టర్ సహాయంతో హాస్పి

టల్ పని చూస్తూండేవారు ఆసుపత్రి పని అంతకంతకు పెరిగిపోవడంతో డాక్టర్ సుబ్రహ్మణ్యంగారికి మరొక పని చూడడానికి తీరిక లేకపోయింది రాజమండ్రిలో డాక్టర్‌గా ఉన్న వి వి ఆర్ దీక్షితులుగారు నిష్కళంకమయిన కాంగ్రెస్ వాది ఆయన 1929 చివరిభాగంలో మా సంస్థలో చేరి ఆసుపత్రిపని, ఔషధాలయం పనిచూడడం ప్రారంభించినారు సగటున ప్రతిదినం 90 మొదలు 100 మంది వరకు మా ఆసుపత్రికి వస్తుంటారు

**హిందీ ప్రచారము**

1930 మార్చి నెలాఖరువరకు పండిత పీసపాటి వెంకటసుబ్బారావుగారు హిందీ ప్రచారం కొనసాగించినారు దక్షిణ భారత హిందీ ప్రచారసభ పరీక్షలకు కూర్చున్నవారిలో చాలా ఎక్కువమంది ఆయన కృషివల్ల ఉత్తీర్ణులయినవారే

**అస్పృశ్యతా నివారణ**

సీతానగరం ఫిర్కాలో అస్పృశ్యతా నివారణ ప్రచారం చాలావరకు జయప్రదమయింది మహాత్మాజీ క్రితం పర్యాయం ఈ ఆశ్రమం దర్శించినప్పుడు ఒక హరిజన పిల్లవానిని ఈ ఆశ్రమ రక్షణకింద ఉంచి వెళ్ళినారు ఆయనకు కొంత చదువుచెప్పి ఆశ్రమ డాక్టర్లు ఆయనను కాంపౌండరుగా తయారు చేసినారు వ్యక్తిగత పరిశుభ్రత, ఆరోగ్యరక్షణలను గురించి హరిజనులలో మంచి ప్రచారం జరిగింది 1928 నుంచి 1932 జనవరి 3వ వారంవరకు ఆశ్రమానికి సంబంధించిన "కాంగ్రెస్" వారపత్రిక అనేక అవస్థాంతరాలకు లోనైనిది 1932జనవరిమూడోవారంలో ప్రభుత్వంవారు ఆశ్రమాన్ని అక్రమసంఘంగా ప్రకటించి కాంగ్రెస్ ముద్రణాయంత్రాన్ని స్వాధీనపరచుకొని అమ్మివేసినారు ఆశ్రమవాసులు ఫిర్కాలోని వివిధ గ్రామాలలో సభలుచేసి నిరంతరాయంగా కాంగ్రెస్ ప్రచారం సాగించినారు

సత్యాగ్రహోద్యమంలో ఆశ్రమవాసులు అనేకమంది కారాగారశిక్షలకు గురైనారు గాంధీ ఇర్విన్ ఒడంబడిక కాలంలో ఆశ్రమ సభ్యులు విదేశీబట్టల దుకాణాలదగ్గర, కల్లుసారా అంగళ్లదగ్గర జయప్రదంగా పికెటింగ్ చేసినారు కడచిన అక్టోబరు 9వ డాక్టర్ సుబ్రహ్మణ్యంగారికి తిరిగి ప్రభుత్వంవారు ఆశ్రమం స్వాధీనం చేసినారు

ప్రజల ఉదారమయిన సానుభూతి సహాకారాలతో మేమీ ఆశ్రమాన్ని నివాసయోగ్యంగా చేసుకోగలిగినాము సాధ్యమయినంత త్వరలో తిరిగి మామూలు నిర్మాణ కార్యక్రమం కొనసాగించుకోగలమని ఆశిస్తున్నాము. పిఠాపురం కేంద్రంలోని మా ఖాదీఉత్పత్తి ఎక్కువయ్యేందుకు తగిన ఏర్పాట్లు చేసుకున్నాము బెజవాడ రాజమండ్రి నగరాలలో విక్రయశాలలను ఏర్పరచుకొన్నాము, సీతానగరం, రాజుపాలెం, వంగలపూడి మొదలయిన ఫిర్కా గ్రామాలలోని పబ్లిక్ బావులలో నిరభ్యంతరంగా హరిజనులు నీళ్లు తోడుకో

వచ్చు ఇది మా ఆశ్రమ కృషి ఫలితము సీతానగరం వంగలపూడిలోని దేవా లయాలు హరిజనులకు తెరిచేటందుకు ప్రయత్నాలు చేస్తున్నాము "

ఇది సీతానగర ఆశ్రమవాసులు గాంధీజీకి సమర్పించిన నివేదిక

## సీతానగరం ఆశ్రమంలో

గాంధీజీ, ఆయన బృందము బులుసు సాంబమూర్తిగారితో కలిసి డిసెంబరు 25 రాత్రి 8 గంటలకు సీతానగరం చేరుకొన్నారు ఆయనకు గోదావరి నది ఒడ్డున గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమ సంస్థాపకులు డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారున్ను, శ్రీ సిరుకొండ వెంకటరత్నం మొదలయిన గ్రామస్థులున్నూ ఎదురేగి ఆయనకోసం ప్రత్యేకం నిర్మించిన కుటీరంలోకి ఆయనను ఆహ్వానించి తీసుకొని వచ్చినారు ఆశ్రమంలోని బహిరంగ ప్రదేశంలో మీరా బేన్ ప్రార్థనా కార్యక్రమం నిర్వహించింది మహాత్మాజీ ఆయన బృందం ఇంకా అనేకమంది దానిలో పాల్గొన్నారు గొల్లపూడి సీతారామశాస్త్రి, శ్రీ యన్ హాలశ్యామ అయ్యర్ అఖిల భారత చర్ఖాసంఘానికి చెందిన శ్రీ కె సుబ్రహ్మణ్యం మొదలయిన కాంగ్రెస్ ప్రముఖు లనేకమంది ఆ ఆశ్రమానికి ఆనాడు వచ్చినారు 26 ఉదయం 4-20 నిమిషాలకు ఆశ్రమ మైదానంలో గాంధీజీ ప్రార్థనలు చేసినారు

డిసెంబరు 25 సాయంకాలం తాడేపల్లిగూడెం కాపురస్థుడు శ్రీ డి నరసింహారావు సత్యాగ్రహ ఆశ్రమం ఆవరణలో నందనారు జీవితం గురించి హరికథా కాలక్షేపం చేసినారు ఆ మరునాడు రాజోలు కాపురస్థుడు డాక్టర్ మల్లాది రామమూర్తిశాస్త్రిగారు రామాయణం హరికథ చెప్పినారు

ఇంతకు పూర్వం డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు స్థాపించిన హరిజన సేవా ఆశ్రమానికి గాంధీజీ ప్రారంభోత్సవం జరిపి ఉన్నట్లు చెప్పి ఉన్నాము ఆ సందర్భంలో ఆయన ఇట్లా ఉపన్యసించినారు

"ఈ సంస్థను ప్రారంభించడం ఒక పవిత్రమయిన ధర్మంగా నేను భావిస్తున్నాను ఇది హరిజన సేవకు చాలా ప్రయోజనకరంగా ఉంటుందని భావిస్తున్నాను అస్పృశ్యతా కళంకం నిర్మూలించే పనిలో ఈ ఆశ్రమవాసులు సర్వ సంగ పరిత్యాగం చేయగలరని భావిస్తున్నాను "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ హరిజన ఆశ్రమంలోని బాలురకు పండ్లు పంచిపెట్టినారు

శ్రీమతి చిరవూరు చినవెంకమ్మగారు ఆశ్రమానికి రెండు ఎకరాల భూమినిచ్చినారు డాక్టర్ సుబ్రహ్మణ్యం రెండు పాకలు వేయించినారు ఆశ్రమంలో అప్పటికి ఎనిమిది మంది ఉన్నారు

బులుసు సాంబమూర్తిగారు గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమ సభ్యులను పరిచయం చేస్తూ వెల్లూరు సెంట్రల్ జైలులో నాలుగేండ్లు కఠిన జైదు అనుభవిస్తూండిన శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారి వృద్ధురాలయిన తల్లిని, ఆయన

చిన్ని కుమార్తెను కూడా గాంధీజీకి పరిచయం చేసినారు

మద్రాసునుంచి బచ్చు జగన్నాథదాసుగారు, రాజమండ్రినుంచి బి సుందరగోపాలరావుగారు డిసెంబరు 26 వ ఆశ్రమంలో గాంధీజీని కలుసుకొన్నారు

సాయంకాలం గాంధీజీ ఆయన బృందం పెద్ద జనసమూహం వెంటరాగా తణుకుకు ప్రయాణమై వెళ్ళినారు పశ్చిమ గోదావరి జిల్లానుంచి శ్రీ దండు నారాయణరాజుగారు మొదలయిన నాయకులు ఆయనను ఆహ్వానించి తీసుకొని వెళ్ళినారు

### పశ్చిమ గోదావరి జిల్లా-తణుకు

* గాంధీజీ ఆయన బృందం సీతానగరం ఆశ్రమంనుంచి డిసెంబరు 26 సాయంకాలం 6½ కు స్టీం లాంచీలో గోదావరి దాటుతూండగా ఒకలాంచి ఒక ఇసుక తిప్పను ఆనినందువల్ల నది దాటటం ఆలశ్యమయింది ఆ లాంచి లోని సామాను చిన్నపడవలోకి చేర్చి గాంధీజీబృందంవారు తణుకు చేరేసరికి తెల్లవారుజాము 4 గంటలయింది గాంధీజీ మాత్రం రాత్రి 11 గంటలకే తణుకు చేరి యెర్రమిల్లి రామనాథంగారి మేడమీదకు తన పక్క-చుట్టను తీసుకొని వెళ్ళినారు గాంధీజీ దర్శనంకోసం ఆ మేడచుట్టూ చేరిన ప్రజల గుంపులు ఎవరెంత చెప్పినా కదలిపోలేదు అప్పుడు గాంధీజీ తన గదినుంచి బయటకు వచ్చి వరండాలో నిలబడి ముక్కుమీద వేలువేసుకొని సందడి చేయవద్దని అలసి ఉన్నానని ప్రశాంతంగా వెళ్ళిపోవలసిందని హిందీలో చెప్పిన తరవాత ప్రజలందరూ ఎక్కడివారక్కడ వెళ్ళిపోయినారు

### స్వాగత పత్రాలు

మరునాడు ఉదయం గాంధీగారి ప్రార్థనలో అనేకమంది కాంగ్రెస్ కార్యకర్తలు, హరిజన కార్యకర్తలు పాల్గొన్నారు ఆనాడు వైకుంఠ ఏకాదశి కావడంచేత తెల్లవారుజామున 3 గంటలనుంచి భజన సంకీర్తనలతో పట్టణం మేల్కొన్నది సీతాకాలపు చలిని సైతం లెక్క-పెట్టక పరిసర గ్రామాలనుంచి బహిరంగసభ జరగనున్న బోర్డు హైస్కూలు మైదానంలో పదివేలమంది జనం చేరినారు సరిగా 7 15కు గాంధీజీ సభాస్థలానికి వచ్చి ప్రత్యేకం నిర్మింపబడిన వేదికపైన ఆసీనులయినారు తణుకు తాలూకా బోర్డు, పంచాయతి బోర్డు, హరిజన సేవాసంఘాల వారాయనకు స్వాగతపత్రాలు సమర్పించినారు శ్రీమతి మాగంటి మాణిక్యాంబగారు ఖద్దరుగుడ్డమీద చేతితో కుట్టి తయారుచేసిన స్వాగతం గాంధీజీ చేతులలో ఉంచినారు తరవాత ఆహ్వానసంఘంవారు సుమారు 400 రూపాయలు విరాళమును, ముళ్లపూడి వెంకటరాయుడుగారు 100 రూపాయలను హరిజన నిధికి సమర్పించినారు

తరవాత గాంధీజీ స్వాగతపత్రాలను, ధనము, నగలు సమర్పించిన వారికి

కృతజ్ఞత తెలిపినారు ఈలోగా ఎవరో కొన్ని ప్రశ్నలు పంపించినందువల్ల గాంధీజీ వాటికి సమాధానంగా, ఆ ప్రశ్నలు పంపినవారు 'హరిజన' పత్రికను చదివి ఉన్నట్లయితే వాటిని పంపి ఉండరని, ఆయనకు 'హరిజన' పత్రిక చదవ వలసిందని సలహా ఇస్తూ, అప్పటికీ ఆయనకు సందేహాలు తీరకుంటే వాటిని తాను తీర్చగలనని అన్నారు ఆ తరవాత తనకు సమర్పించిన వస్తువులను ఆయన వేలం పెట్టినారు యూనియన్ బోర్డువారి స్వాగతపత్రానికి 4 రూపాయలు, తాలూకా బోర్డు స్వాగతపత్రానికి 4 రూపాయలు, హరిజన సమస్య అనే గ్రంథానికి మరి 2 రూపాయలు లభించినాయి ఈలోగా వలంటీర్లు 100 రూపాయలు వసూలుచేసి హరిజన నిధికి సమర్పించినారు గాంధీజీ హిందీ ఉపన్యాసం దండు నారాయణరాజుగారు తెలుగులోకి అనువాదం చేసినారు శ్రీమతి కొవ్వలి కనకమ్మగారు పౌరుల పక్షాన గాంధీజీకి విరాళం సమర్పిస్తూండగా గాంధీజీ ఆమె తలమీద ఉన్న నాగరం కావలెనని కోరినారు వెంటనే ఆమె దానిని ఆయనకు ఇచ్చివేసింది ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారి తల్లిగారు, మరి కొందరు స్త్రీలు బంగారునగలు సమర్పించినారు నగలుకాక తణుకులో వచ్చినవి 700 రూపాయలు

## పాలకొల్లు

గాంధీజీ తణుకునుంచి కారులో పాలకొల్లు వెళ్ళినారు పాలకొల్లు పౌరులు వారిని సన్మానించడానికి కొత్తగా స్థాపించబోయే శ్రీ జనకాశ్రమంలో బహిరంగసభ ఏర్పాటు చేసినారు సభలో సుమారు పదివేలమంది స్త్రీ పురుషులున్నారు సభావేదిక ఎత్తుగా రమణీయంగా అలంకరించబడింది గాంధీజీ సభాస్థలానికి రాగానే డాక్టర్ చొప్పెల్ల సత్యనారాయణమూర్తిగారు వారి కెదురేగి ఆహ్వానించి వేదికపైకి తీసుకొని వెళ్ళినారు

పాలకొల్లు పౌరుల పక్షాన డాక్టర్ సత్యనారాయణగారూ, నరసాపురం తాలూకా బోర్డు పక్షాన బోర్డు అధ్యక్షులు శ్రీ గ్రంధి వెంకటరెడ్డినాయుడు గారూ, నరసాపురం తాలూకా స్త్రీల పక్షాన శ్రీ దిగుమర్తి రామలక్ష్మమ్మ గారూ, తాలూకా హరిజనుల పక్షాన శ్రీ దాసరి వెంకట్రావుగారూ గాంధీజీకి సన్మానపత్రాలను, హరిజననిధికి విరాళాలను సమర్పించినారు కళావంతుల సంఘంవారు సన్మానపత్రంతోపాటు ఒక రజితపాత్రను కూడా గాంధీజీ చేతుల్లో ఉంచినారు తరవాత పాలకొల్లు యువజన అస్పృశ్యతా నివారణసంఘంవారి పక్షాన డాక్టర్ అచంట పెదగోపాలంగారు ఖద్దరు దుస్తులను మహాత్ముని చేతులతో స్పృశింపజేసి రెండువందలమంది హరిజన బాలబాలికలకు పంచిపెట్టినారు

శ్రీ అద్దేపల్లి సత్యనారాయణ దంపతులు శ్రీ సలాది మామిళ్ళయ్య గార్లుకూడా హరిజననిధికి కొంత విరాళం ఇచ్చినారు మరికొందరు ఖద్దరు వస్త్రాలను కానుకగా సమర్పించినారు

అనంతరం డాక్టర్ చొప్పెళ్ళ సత్యనారాయణమూర్తిగారు శ్రీ జనకా

శ్రమ శంకుస్థాపనకు బంగారు తాపీని మహాత్ముని చేతులలో ఉంచగా ఆయన దానితో పాలరాయిని స్పృశించి శ్రీ జనకాశ్రమ శంకుస్థాపన జరిగిందని ప్రకటించినారు

తరవాత గాంధీజీ ఆ బంగారు తాపీని వేలం పెట్టినారు అడ్డేపల్లి సత్యనారాయణమూర్తిగారు దానిని 100 రూపాయలకు, కళావంతుల రజిత పాత్రను చోళ నరసింహామూర్తిగారు 80 రూపాయలకు, స్వాగతపత్రాలను బొండాడ వెంకటరత్నంగారు 15 రూపాయలకు కొన్నారు

పాలకొల్లు కానుకలు మొత్తం సుమారు 1600 రూపాయలు సభ ప్రశాంతంగా జరిగింది

గాంధీజీ శంకుస్థాపన చేసిన హరిజనాశ్రమం, హరిజనులకు నిజమైన ఆశ్రయంగా ఉండవలెనని గాంధీజీ అన్నారు హిందూమతానికి కళంకదాయకంగా పరిణమించిన అస్పృశ్యత అనే అమానుషాచారాన్ని నిర్మూలించవలెనని సభ్యులను ఉద్బోధించినారు

గాంధీజీ పాలకొల్లునుంచి భీమవరం వెళ్ళినారు

**భీమవరము**

భీమవరంలోని గాంధీ చౌక్‌లో బహిరంగ సభ ఏర్పాటు చేయడం జరిగింది భీమవరం యూనియన్ బోర్డువారు మరికొన్ని సంస్థలవారు గాంధీజీకి సన్మాన పత్రాలను సమర్పించినారు భీమవరం తాలూకా బోర్డువారు సన్మాన పత్రంతో సహా 116 రూపాయలిచ్చినారు స్త్రీలు అనేక ఆభరణాలతో పాటు ఫ్రాంకులు, నవరసులు ఇస్తూ 200 రూపాయల నగదు కూడా సమర్పించినారు భీమవరంలో కూడా సభ ప్రశాంతంగా జరిగింది గాంధీజీ కారు రాకపోకలకు అభ్యంతరం కలిగించకుండా ప్రజలు సరళంగా ప్రవర్తించినారు అక్కడ నగలతో సహా 1200 రూపాయల పైచిలుకు హరిజన నిధికి లభించింది

గాంధీజీ భీమవరం నుంచి తాడేపల్లిగూడెం వెళ్ళినారు

**తాడేపల్లిగూడెం**

మహాత్మాజీ డిసెంబరు 27వ తేది ఉదయం తణుకులో బయలుదేరి 11 గంటలకు తాడేపల్లిగూడెం వెళ్ళినారు అక్కడ పెద్ద బహిరంగ సభను ఏర్పాటు చేసినారు

తణుకు నుంచి తాడేపల్లిగూడెం పోయే తోవలో కోడూరు గ్రామస్థులు 300 రూపాయలను, బల్లిపాడు గ్రామస్థులు 50 రూపాయలను హరిజన నిధికి సమర్పించినారు

తాడేపల్లి గూడెం బహిరంగ సభలో గాంధీజీ ఆసీనులయ్యేటందుకు ఎత్తయిన వేదిక ఏర్పాటు చేయబడింది మహాత్మాజీ వేదిక దగ్గరికి వచ్చేసరికి 'గాంధీకీజై " అనే నినాదాలు మిన్ను ముట్టినాయి. తాడేపల్లి గూడెం తాలూకా బోర్డువారు వెండి పళ్ళెంలో గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు. తాలూకా

హరిజన సేవక సంఘం ఎట్టణ హరిజన సంఘము, గ్రామపంచాయతి సంఘం వేరువేరుగా విరాళాలతో సన్మాన పత్రాలు సమర్పించినాయి

హరిజనాభ్యుదయానికి గాంధీజీ చేస్తూన్న పనికి ఎక్కువ సొమ్ము ఈయడానికి తీర్మానించకూడదని ప్రభుత్వంవారు ఉత్తరువులు చేసినట్టు తమ సన్మాన పత్రంలో తాలూకాబోర్డువారు పేర్కొన్నారు డాక్టరు తేతల సత్యనారాయణ, కలిదిండి గంగరాజు, పుట్లా సుబ్బారావుగార్లు, సతీహిత సమితి పక్షాన దామోజీపురపు లక్ష్మీనరసమ్మ హద్దనూరి సీతారామమ్మగారు హరిజన నిధికి సొమ్ము వసూలు చేసినారు

**విరాళాల వివరాలు**

| | | |
|---|---|---|
| తాడేపల్లిగూడెం హరిజన సేవా సంఘం | 100 రూపాయలు |
| ,, తాలూకా హరిజన సేవాక సంఘం | 220 రూ | , |
| ,, తాలూకా పంచాయతి సంఘం | 65 రూ | ,, |
| ,, సతీహిత సమితి | 116 రూ | , |
| మొత్తం | 615 రూపాయలు | |

తాలూకా బోర్డువారు సన్మాన పత్రంతో ఇచ్చిన వెండి పళ్లెం వేలం వేయగా 10 రూపాయలకు వారే కొన్నారు

సభలో స్త్రీలు నగలను, ధనాన్ని 200 రూపాయలవరకు ఇచ్చినారు సభానంతరం బైరాజు రామరాజు గారింటిలో గాంధీజీ విశ్రాంతి తీసుకొన్నారు అక్కడ స్త్రీలు నగలతో సహా 1000 రూపాయలు విరాళం హరిజన నిధికి ఇచ్చినారు

మధ్యాహ్నం 2½ గంటలకు మహాత్మాజీ బసనుంచి ఏలూరు వెళ్ళేటందుకు తాడేపల్లిగూడెం రైలు స్టేషన్‌కు ప్రయాణమయినారు స్టేషన్‌కు పోయే త్రోవలో సతీహితసమితి సభ్యురాండ్రు 200 మంది దామోజీపురపు వెంకటనరసింహారావు ఇంటిదగ్గరం మహాత్ముని కారు ఆపించి సన్మాన పత్రమిచ్చి 116 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు సమితి కార్యదర్శిని దామోజీపురపు లక్ష్మీనరసమ్మగారు ఒక బంగారు గాజు ఇచ్చినారు వారు మహాత్ముడు తమకు ప్రత్యేకంగా దర్శన మిచ్చినందుకు చాలా ఆనందించినారు

## తాడేపల్లిగూడెం సభలో రెండు విశేషాలు

గాంధీజీ సన్మాన పత్రాలను, విరాళాలను స్వీకరించిన తరవాత సభలోని స్త్రీలను నగలీయమని కోరినారు తక్షణం కొంత మంది స్త్రీలు ఒకరి తరవాత ఒకరు వేదికపై ఎక్కి గాంధీజీ చేతులలో నగలు ఉంచడం ప్రారంభించినారు స్త్రీలు వేదికపైకి వచ్చి నగలను సమర్పించడంకంటె స్త్రీలున్న చోటనుంచే నగలు సేకరించడం మంచిదని శ్రీ ఆత్మకూరి గోవిందాచారిగారు సూచించినారు మనం అస్పృశ్యతను నివారించ పూనుకొన్నప్పుడు సొమ్ముకు మరొక

అస్పృశ్యతను సృజించడం మంచిది కాదన్నారు గాంధీజీ

మూడేండ్ల వయసుగల ఒక హరిజన పిల్లవాడు వేదిక దగ్గరికి పోయి గాంధీజీకి ఒక రూపాయి ఇవ్వగానే "గాంధీజీ ఈ పిల్లవాడు హరిజనుడయినా భాగ్యవంతుడు ఇతడు మంచి పిల్లవాడవుతాడు " అన్నారు

**ఏలూరు**

గాంధీజీ, తాడేపల్లిగూడెంనుంచి రైలులో పోతూండగా పూళ్ల, దెందులూరు, కైకరం, భీమడోలు రైల్వేస్టేషన్‌లలో పరిసర గ్రామస్థులు ఆయనకు హరిజన నిధికై విరాళాలు సేకరించి ఇచ్చినారు

మహాత్మాజీ ఏలూరు రైల్వేస్టేషన్‌లో దిగగానే పౌరులు ఆయనకు పూలదండలు వేసి సత్కరించినారు తరవాత డాక్టర్ అనంతశాస్త్రిగారి సతి సత్యవతీ జయదేవిగారు 116 రూపాయలు విలువగల తన బంగారు గొలుసును, బంగారు కుంకుమ భరిణెను సమర్పించినారు స్టేషన్ దగ్గరినుంచి ఆహ్వాన సంఘంవారు చేసిన ఏర్పాట్ల ప్రకారం గాంధీజీ ఆయన బృందం మునిసిపల్ కార్యాలయానికి చేరినారు అక్కడ మునిసిపల్ అధ్యక్షుడు మోతే నరసింహారావుగారు సన్మాన పత్రంతోపాటు 116 రూపాయల హరిజన నిధికి గాంధీజీకి సమర్పించినారు పశ్చిమగోదావరిజిల్లా బోర్డు ప్రెసిడెంట్ రావుసాహెబు బడేటి వెంకట్రామయ్య నాయుడుగారు తమ సన్మానపత్రంతోపాటు 116 రూపాయలు వెండి పళ్లెం హరిజన నిధికి విరాళమిచ్చినారు ఏలూరు వాటర్ వర్క్సుకు దగ్గరగా ఉన్న మైదానంలో బహిరంగసభ ఏర్పాటు చేసినారు ఏలూరు రైల్వేస్టేషన్‌నుంచి మైదానంవరకు ఏలూరులోని పడమర వీధి వ్యాయామ సంఘంవారు, స్థానిక స్కౌట్లు, కాంగ్రెస్ స్వచ్ఛంద సైనికులు, అక్కడక్కడ కొద్ది దూరాలలో నిలబడి గాంధీజీగారు సరాసరి నిరాటంకంగా సభాస్థలికి చేరేటట్లు ఏర్పాటు చేసినారు సభాస్థలంలో గాంధీజీ ఆసీనులయ్యేటందుకు ఎత్తయిన వేదికను ప్రజలకాయన మాటలు వినబడేటందుకు దూరశ్రవణ యంత్రాలను ఏర్పాటు చేసినారు మహాత్ముడు రాకముందే సభాస్థలం ప్రజాసమూహంతో నిండిపోయింది సభకు సుమారు 30 వేలమంది హాజరయినారు

ఆ బహిరంగ సభలో ఏలూరు తాలూకా బోర్డువారు సన్మానపత్రంతో పాటు 116 రూపాయలు హరిజన నిధికి ఇచ్చినారు ఇంకా అనేక సంస్థలు కూడా గాంధీజీకి సన్మానపత్రాలు సమర్పించినాయి గాంధీ ఆహ్వాన సంఘం వారు మోటమర్రి మల్లికార్జునుడుగారు స్వయంగా సమర్పించిన 58 రూపాయలతో సహా 1116 రూపాయలు సమర్పించినారు. తరవాత పోలిశెట్టి రంగనాయకులుగారు 116 రూపాయలు, ఏలూరు తాలూకా బోర్డు ప్రెసిడెంట్‌గారు 116 రూపాయలు, పెదపాడు గ్రామవాసు లిద్దరు చెరి 116 రూపాయలు హరిజన నిధికి ఇచ్చినారు, శ్రీరామ భుజంగరావు యం రంగారావుగార్లు గాంధీజీ బొమ్మలను వ్రాసి ఇచ్చినారు స్త్రీలు చాలామంది తమ ఆభరణాలను

స్వయంగా గాంధీజీకి సమర్పించినారు

తరవాత గాంధీజీ సభ్యులను నిశ్శబ్దంగా ఉండమని కోరి 20 నిమిషాలు ఉపన్యసించినారు దూరశ్రవణ యంత్రాలున్నందువల్ల ఆయన ఉపన్యాసం సభ్యులందరికీ స్పష్టంగా వినబడింది

హిందీ పరీక్షలలో ప్రముఖులుగా ఉత్తీర్ణులయినవారికి ఆ సభలో పతకాలను గాంధీజీ బహూకరించగలరని అంతకు పూర్వం ప్రకటింపబడింది కాని గాంధీజీ ఆ పతకాలను తాను బస చేసిన గాంధీ జాతీయ పాఠశాలలో ఇవ్వగలనని ప్రకటించినారు తరవాత లాలాలజపతిరాయ్ విగ్రహం ఆవిష్కరిస్తూ "లజపతిరాయ్‌గారు అస్పృశ్యుల పట్ల సవర్ణుల బాధ్యతను తెలియజేసినారు అస్పృశ్యత హిందూ మతానికి కళంకమని ఆయన అనేక పర్యాయాలు చాటి చెప్పినారు అస్పృశ్యతా నివారణకు ఆయన చేసిన పోరాటం హిందువులయినవారు విస్మరించరానిది ఆయన దేశ సేవా తత్పరతను శూరత్వాన్ని నిర్భీకత్వమును కాదనజాలువారు లేరు ఆయనకు "పంజాబు కేసరి" అనేపేరు ఉబుసుపోకకు పెట్టిందికాదు" అన్నారు గాంధీజీ శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారు వేలూరు జైలునుంచి హరిజన నిధికి బంగారు ఉంగరం పంపినందుకు గాంధీజీ ఆమెను కొనియాడినారు

బహిరంగసభలో 57 బంగారు ఉంగరాలు, 26 గాజులు, ఒక బంగారు గొలుసు, బంగారు నాగరం, వజ్రం పొదిగిన చేమంతి పువ్వు, కొన్ని నవరసులు కొన్ని ఫ్రాంకులు ఇతర విరాళాలతోపాటు హరిజన నిధికి సమర్పించడం జరిగింది గాంధీజీ హరిజనులకోసం చారిత్రాత్మకమయిన ఉపవాసం చేసినంతకాలం ఆయన ఉద్యమం పట్ల సానుభూతితో ఉపవసించిన శ్రీ చెన్నాబత్తుల వీరాచారి గాంధీజీకి ఒక వెండి పళ్లెము, ఒక వెండి గిన్నె, ఒక వెండి గోవును సమర్పించినారు

గాంధీజీ సాయంకాలం 6 గంటలకు ముందే సమావేశం ముగించి గాంధీ జాతీయ పాఠశాలకు పోయి ఆహారం తీసుకొన్నారు

భోజనానంతరం హరిజనవాడలను చూడటానికి మోటారులో వెన్నెవల్లివారి పేట వెళ్ళినారు

## గాంధీజీ హరిజనవాడలను చూడటం

వెన్నెవల్లివారి పేటలోని వారు గాంధీజీని మంగళ వాయిద్యాలతో హరిజన స్వచ్ఛంద సేవకులతో ఎదురేగి ఆహ్వానించి సభావేదికకు తీసుకొని వెళ్ళినారు మహాత్ముడు వేదికపైన ఆసీనుడు కాగానే జె శకుంతల ప్రార్థన చేసింది తరవాత గాంధీజీ కొంతసేపు ఇష్టాగోష్ఠి సంభాషణ చేసినారు శ్రీ వెల్లంకి కృష్ణమూర్తి, రాయుడు గంగయ్య మొదలయిన గ్రామ పెద్దలను గాంధీజీకి పరిచయం చేసినారు అప్పుడొక విద్యార్థి "ఈ హరిజన నిధినుంచి కొంత సొమ్మును హరిజన విద్యార్థులకు ఇక్కడి ఉన్నత విద్యకు విదేశాలలో

ఉన్నత విద్యలో ఉత్తీర్ణులయి రావడానికి వినియోగించవలసిందని" కోరగా' ఆయన విదేశాలకు వెళ్లి ఉన్నత విద్య నభ్యసించినంతమాత్రాన దేశానికి సంఘానికి మేలు కలగదని స్వదేశీ పరిశ్రమలను అభివృద్ధి పరిచే విద్యయందే నేటి యువకులు ఉత్తీర్ణులు కావలసి ఉందనీ, అందుకు ప్రయత్నించవలసిందనీ వారికి ఈ నిధిద్వారా సహాయం జరుగుతుందని చెప్పి హరిజనులు పరిశుభ్రంగా ఉండవలెనని, తాగుడు మొదలయిన దురభ్యాసాలను మానవలెనని ప్రబోధించినారు

తరవాత ఆయన జాతీయ పాఠశాలకు వెళ్ళి రాత్రి ప్రార్థన జరిపినారు

ప్రార్థన ముగిసిన వెంటనే శ్రీమతి జవ్వాజి రాజరత్నం, దాసరి కృష్ణమ్మగార్లు స్త్రీలవద్ద నుంచి తెచ్చిన కానుకలను గాంధీజీకి సమర్పించినారు రాత్రి 9 గంటలకు ఆయన పడుకోనటానికి వెళ్ళినారు

సత్యాగ్రహం జరుగుతూన్న రోజులలో 'గాంధీ జాతీయ పాఠశాల' కాంగ్రెస్ శిబిరంగా ఉన్నందువల్ల ప్రభుత్వంవారు దానిని స్వాధీన పరచుకొన్నారు అప్పటి నుంచీ అది వెలవెల పోతూన్నది నేడు దానిలో గాంధీజీ బసచేసిన తరవాత మళ్ళీ నూతన కళతో విరాజిల్లింది గాంధీజీ ఆ పాఠశాలలో రాత్రి విశ్రాంతి తీసుకొంటూండగా స్వచ్ఛంద సైనికులు ఆ రాత్రంతా మేలుకొని జాగరూకతతో ఉన్నారు

తెల్లవారు జామున 4 గంటలకు గాంధీజీ ప్రార్థనా సమావేశంలో అనేక మంది కార్యకర్తలు పాల్గొన్నారు ఆయన భగవద్గీతలోని 18వ అధ్యాయం పారాయణం చేసినారు

తరవాత ఆహ్వాన సంఘ కార్యదర్శిని శ్రీమతి మద్దుల దమయంతిదేవి, యన్ సి హెచ్ రంగనాయకిదేవి, యం స్వరాజ్యలక్ష్మి, శ్రీయుతులు బులుసు నరసింహం పంతులు (వకీలు) స్థానిక హిందూ కళాశాలలోని ఏ చక్రధరరావులు దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి హిందీ పరీక్షలలో ప్రముఖులుగా ఉత్తీర్ణులయి నందుకు గాంధీజీ వారికి వెండి పతకాలను బహూకరించినారు

తరవాత శ్రీ తులాబందుల సుబ్బారావు తన భార్యతోను, తన చిన్న కుమారునితోను వచ్చి 116 రూపాయలునూ్న, దామరాజు లక్ష్మమ్మగారు మరొక 116 రూపాయిలునూ్న గాంధీజీకి హరిజన నిధికి సమర్పించినారు

తరవాత గాంధీజీ జాతీయ పాఠశాలనుంచి రైలు స్టేషన్‌కు వెళ్ళినారు ప్లాటుఫారం మీద వేలకొద్దీ జనం ఆయనకు వీడ్కోలు చెప్పినారు

సౌకట్‌లు రైలు కదిలేముందు సందేశం కోరగా "ముందు మీ ఆత్మలను హృదయాలను సరిదిద్దుకోండి. అది అంత తేలికయిన పనికాదు" అన్నారు గాంధీజీ

పశ్చిమ గోదావరి జిల్లాలో సభలు ప్రశాంతంగా జరిగినందుకు, హరిజన నిధికి 10,000 రూపాయలు వసూలయినందుకు గాంధీజీ చాలా సంతోషించినారు

**ఏలూరులో రెండు సంఘటనలు**

పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరులో తొంబై ఏండ్ల వయసుగల ఒక వృద్ధ పండితుడు గాంధీజీని కలుసుకొన్నాడు అయన నడవలేని స్థితిలో ఉన్నందున ఆయనను గాంధీజీ గదిలోకి మోసుకొని రావలసి వచ్చింది ఆయన గాంధీజీని దర్శించి కొన్ని సంస్కృత శ్లోకాలు చదివి గాంధీజీ ప్రారంభించిన అస్పృశ్యతా నివారణోద్యమం దైవ ప్రేరితమని ఆయనను హృదయ పూర్వకంగా ఆశీర్వదించి వెళ్ళినారు

తరవాత ఒక వృద్ధ స్త్రీ కూడా గాంధీజీని దర్శించింది ఆమె తన కుటుంబంలో అయిదో తరం వారిని చూడగలిగింది ఆ వయసులో కూడా ఆమె నూలు స్వయంగా వడికి తన మనుమలకు మునిమనుమలకు, మునిమనుమల బిడ్డలకు కూడా ఖద్దరు బట్టలు సరఫరా చేస్తూన్నది ఆమెకూడా గాంధీజీ అంటరానితనం తుడిచి పెట్టడానికి చేసే కృషిని ఆశీర్వదించి వెళ్ళింది గాంధీజీ ఈ ఇద్దరు వృద్ధమూర్తుల ఆశీర్వాదాలను అందుకో గలిగినందుకు చాలా ఆనందించినారు ప్రజాహృదయం మొత్తం మీద నిష్కళంకంగా ఉన్నదని నిర్ణయించడానికి ఈ రెండు ఉదంతాలు ప్రత్యక్ష తార్కాణాలు

ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవక సంఘంవారి వార్షిక నివేదికలో "బరంపురం, విజయనగరం, పర్లాకిమిడి, పట్టణాలలో ఐట్కా తోలేవారిలో ఎక్కువ మంది హరిజనులు, గంజాం, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలలో పండ్లు కూరగాయలు అమ్మే వారిలో చాలా మంది పాకీవారు ముఖ్యంగా మొదట పేర్కొన్న రెండు జిల్లాలలో పండ్ల వర్తకానికి పాకీవారే గుత్త వ్యాపారులు పశ్చిమ గోదావరిజిల్లా ఉప్పలూరి గ్రామంలోని దేవాలయ పూజారులు హరిజనులే అనంతపురం జిల్లాలోని కదిరి దేవాలయంలోకి హరిజనులు స్వేచ్ఛగా ప్రవేశించవచ్చు" అని ఉన్నది ఉదాహరణలను బట్టి అస్పృశ్యతా దురాచారాన్ని నిర్మూలించడానికి పూర్వ సంస్కర్తల కృషి ఫలితాల, చిహ్నాలు అక్కడక్కడ ఇంకా నిలచి ఉన్నవని చెప్పవచ్చు

**విశాఖపట్టణం జిల్లా**

డిసెంబరు 28 మధ్యాహ్నం మెయిల్ లో గాంధీజీ ఏలూరునుంచి విశాఖపట్టణం చేరినారు రైల్వే ప్లాటుఫారం పైన విశాఖపట్నం మునిసిపల్ చేర్మెన్ ఖానోజీరావు, వైస్ చేర్మన్ పంగ్రంగి నరసింగరావు, బి వెంకటపతిరాజు, దిగుమర్తి రామస్వామి, తెన్నేటి విశ్వనాథం మొదలయినవారు ఆయనకు స్వాగతమిచ్చి గాంధీజీ ఉన్న రైలుపెట్టె ద్వారం దగ్గరికి రోల్స్‌రాయ్స్ కారును తెచ్చి దానిలో ఆయనను ఎక్కించుకొని ఆ[illegible]నికి (తెన్నేటి విశ్వనాథంగారి ఇల్లు) తీసుకొని వెళ్ళినారు [illegible] తీయటి [illegible] సేపు విశ్రాంతి తీసుకొన్నారు.

మధ్యాహ్నం 3 గంటలకు మహాత్ముడు హరి[illegible]వాడకు [illegible]నారు.

అక్కడ శ్రీ కె రామబ్రహ్మంగారు హరిజనులు సవర్ణులు ఉభయుల నిమిత్తం ప్రత్యేకం కట్టించి ఇచ్చిన రామమందిరానికి మహాత్ముడు ప్రారంభోత్సవం చేసినారు ఆంధ్రదేశంలోని ఆచారం ప్రకారం మహాత్ముడు పకపకా నవ్వుతూ మూల విరాట్ విగ్రహం ముందు టెంకాయ కొట్టి కర్పూర హారతి ఇచ్చినారు

తరవాత చాచాపు 2,300 మంది హరిజనులకు భోజనం పెట్టడం జరిగింది వారు భోజనం చేస్తూండగా మహాత్ముడు ఆ దారిన వెళ్ళుతూ ఆ దృశ్యం చూసినారు

హరిజన వాడలో స్థానిక ఆదిఆంధ్ర సంఘంవారు గాంధీజీకొక సన్మాన పత్రం సమర్పించినారు దానిని మునిసిపల్ కౌన్సిలర్ ఐ శ్రీరాములు చదివినారు "ఈ సంఘంలోని వారందరూ హరిజనులే, వారే దీనిని నడుపుతున్నారు అస్పృశ్యతను నిర్మూలించేటందుకు మీరు ప్రారంభించిన ఈ జాతీయ తైర్థ యాత్ర విజయవంతంగా కొనసాగడానికి మేము పూనిన ఈ స్వయం సహాయ కార్యాలయానికి మీ ఆశీర్వాద భాగ్యం మాకు లభించింది మేము కృతార్థుల మయినాము మా సంఘం ఉనికిని మా జీవితాన్ని అత్యంత ప్రాముఖ్యమయిన జాతీయ సమస్యగా రూపొందించి ఆ ఉద్యమం జయప్రదంగా నడుపుతున్నందుకు మా కృతజ్ఞతను తెలియజేయడానికిగాని, మిమ్ములను అభినందించడానికి గానీ మా భాష చాలదు మీరు సవర్ణహిందువులకు, జాతీయైక్యము, మత సామరస్యాలను గురించి చేసిన బోధ ఒక్క త్రుటిలో వారిని అత్యుత్సాహవంతులనుగా చేయగలిగింది అందువల్ల సవర్ణులకు హరిజనులకు గల భేదం అనతి కాలంలోనే అదృశ్యం కాగలదనీ ఐక్య భారత దేశం తన భవితవ్యం తాను రూపొందించుకోగలదనీ ఆశిస్తున్నాము "

## గాంధీజీకి స్త్రీల సన్మానపత్రము

విశాఖపట్నం పురమందిరంలో 1500 మంది స్త్రీలు సమావేశమై గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు దానిలో ప్రతి మతస్థులు తమ మతంలోని అందరు పక్షులకు మతానికి సంబంధించినంతవరకు సమానమయిన ఆదర్శము, సమానమయిన హక్కులు ఉండడం అవసరము. హరిజనులు హిందూ సమాజానికి చెందినవారే కనక వారికి తక్కిన హిందువులతోపాటు సమాన హక్కులుండవలె మనిషికీ, మనిషికీ బాహ్యంగా కనిపించే భేదాలేమయినప్పటికీ వారి ధార్మికాదర్శం ఒకటేనని గుర్తించవలె అందుకనుగుణంగా దేవాలయాలలో దేవుని సమ్ముఖమున వారు ఏకత్వం అమోదించి తీరవలె" అని ఉదాహరింపబడింది

ఈ సన్మానానంతరం స్త్రీలు గాంధీజీకి కొన్ని నగలు, 600 రూపాయల నగదు ఇచ్చినారు తరవాత గాంధీజీ స్త్రీలకు హితోపదేశం చేసినారు.

బహిరంగసభ

విశాఖపట్టణ పురమందిరానికి ఎదుట బహిరంగసభలో గాంధీజీ ప్రసంగించినారు. సభలో సుమారు ఆరువేలమంది ఉన్నారు. గాంధీజీ సహజ మందహాసంతో వేదికపైన ఆసీనులు కాగానే శ్రీ పలూరు మూర్తిరాజు భాగవతార్ మనోహరంగా జాతీయ గీతాలను పాడినాడు. ఫరీదుల్ జమాల్ ఉర్దూ గీతం పాడినారు. మూర్తిరాజుగారు 'అంటరానివాడు' అనే పద్యం చదివినారు.

తరవాత పురిపండ అప్పలస్వామిగారి 'గుడిలోని దైవమా" అనే గేయం దాని ఆంగ్లానువాదాన్ని శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు మహాత్మునకు సమర్పించి అప్పలస్వామిగారిని ఆయనకు పరిచయం చేసినారు.

తరవాత దంతపు పెట్టెలలో పురపాలక సంఘంవారు, యువజన సమితి, హిందీ విద్యార్థులు, అస్పృశ్యతా నివారణ విద్యార్థి సంఘము, విశాఖపట్టణ విద్యార్థులు సన్మానపత్రాలను సమర్పించినారు. విశాఖపట్టణం పౌరుల పక్షాన శ్రీ వెంకటపతి రాజుగారు రూ 1116 లు హరిజన నిధికి ఇచ్చినారు.

విశాఖపట్టణ యువజన సమితివారు సాంఘిక సేవా కార్యాలలోను, సాంస్కృతిక విషయాలలోను తమ శక్తికొద్దీ కృషిచేస్తున్నామని వివరించినారు. తాము నాలుగేళ్ళ కిందట ప్రథమ స్వదేశీ ఖాదీ ప్రదర్శన విశాఖపట్నంలో ఏర్పాటుచేసినామని ఆనాటినుంచి విశాఖపట్నంలో ఏటేటా జరుగుతూండిన ప్రదర్శనాలలో తాము పాల్గొంటున్నామని కూడా తమ సన్మానపత్రంలో వ్రాసినారు.

నగర యువజన పక్షాన వారు గాంధీజీని అభినందిస్తూ, ఆయన నాయకత్వంలో తమ సంపూర్ణ విశ్వాసం పునరుద్ఘాటించినారు.

విశాఖపట్నంలోని వివిధ పాఠశాలలు, కళాశాలలోని విద్యార్థులు గాంధీజీ నడుపుతూండిన హరిజనాభ్యుదయ సాంఘికసేవలో తామింతవరకు ఎక్కువ కృషిచేయజాలనందుకు తమ విచారం వెలిబుచ్చి గాంధీజీ నాయకత్వం కింద ఇకముందు తామా విషయంలో శక్తివంచన లేకుండా పనిచేయగలమని వాగ్దానం చేసినారు.

## గాంధీజీ ఉపన్యాసము

"ఈ మనోహరమైన సముద్రతీరాన మిమ్ములను కలుసుకొనగలిగినందుకు సంతోషంగా ఉన్నది. నేను చెప్పదలచింది చెప్పడానికి ముందుగా నా మనసులోని దుఃఖం నేను మీకు వెల్లడించదలుచుకున్నాను. నేనీనాడు పబ్లిక్‌రోడ్డుపైన హరిజనులకు భోజనం పెడుతూన్న దృశ్యాన్ని కారులో పోతూ చూసినాను. ఆ దృశ్యాన్ని చూసినప్పుడు నేను సిగ్గుతో తలవంచుకొనవలసి వచ్చింది. వారు మన సోదరులు, ఇంత హీనంగా వారికి అన్నం వేయడం భరించరాని విషయం, హరిజనుల మొగాన ఇంత అన్నం పారవేయమని నేను సవర్ణులను కోరడంలేదు. సవర్ణులు తమ విశాల హృదయాలలో వారికి ఆశ్రయం కల్పించ

వలెనని నా అభిప్రాయము మనం భోజనం చేస్తూన్నప్పుడు మనమధ్యనుంచి మోటార్లు పోతూండినట్లయితే మనకెట్లా ఉంటుందో ఆలోచించండి! ఈనాటి దృశ్యంబట్టి పూర్వపు ధర్మకర్తలు తాము గొప్పవారమనుకొని జాలితో హరిజనులకు కొన్ని ఎంగిలి మెతుకులు పారవేయడం జ్ఞాపకం వస్తూన్నది వారు రోడ్డుపై భోజనాలు చేస్తూన్నప్పుడు నా ఒక్క కారే కాదు నా వెనక మరి కొన్ని కార్లుకూడా వారి మధ్యనుంచి వచ్చినాయి పాపం! ఆ నిరుపేదలు వారి అన్నంలో పడుతూన్న దుమ్మును తప్పించుకోలేక దీనంగా చూస్తున్నారు అందువల్ల నాకు చాలా దుఃఖం కలిగింది వారికి అన్నం పెట్టిన దాత హృదయంలో మాయమర్మాలున్నాయని నా అభిప్రాయం కాదు హరిజనులకు అన్నం పెట్టినందువల్ల నేను సంతోషిస్తానని ఆయన అనుకొని ఉంటారు శాస్త్ర సమ్మతమయిన మన జీవయాత్ర కత్తిమీద సామువంటిది ఆత్మ పారిశుద్ధ్యానికి సంబంధించిన ఈ పవిత్రోద్యమంలో ఏ మాత్రం పొరపాటు కలిగినా దారుణ పరిణామాలు తటస్థించగలవు ఈనాడు నేను చూసిన దృశ్యం ఇంతగా వివరించి చెప్పడంవలన హరిజనోద్యమ ప్రచారకులెవరూ మళ్ళా ఇటువంటి అవమానకరమైన పనిని చేయరని భావిస్తున్నాను

హిందూమతానికి అస్పృశ్యత తీరని కళంకమనడంలో నా కెంతమాత్రం సందేహంలేదు మన మతగ్రంథాలు దేవుని ఆశయాలను, కోరికలను ప్రతిబింబింప చేసేవే అయితే వాటిలో అస్పృశ్యతకు స్థానం లేదు అస్పృశ్యతను అసలే తప్పుగా భావిస్తున్నప్పుడు దానిని మతానికి ఆరోపించడం మరింత తప్పు

హిందువుకిలది పరీక్షా సమయము మనకు ఇష్టమున్నా లేకపోయినా అస్పృశ్యత నిర్మూలమయ్యేమాట నిజము ఈ పరీక్షా కాలంలో మనం మన పాపాలకు పశ్చాత్తాపపడి మన మనసులను మనం పరిశుభ్రం చేసుకొని మనలను మనం సంస్కరించుకొనేట్లయితే చరిత్ర మన పవిత్రీకరణోద్యమాన్ని ఎంతో గొప్పగా శ్లాఘించి తీరుతుంది అట్లాకాక కాలప్రభావానుగుణంగా సవర్ణుల ఇష్టానికి ప్రతికూలంగా అస్పృశ్యులనబడేవారు తమ హక్కులను తామే సంపాదించుకోగలిగినట్లయితే అది హిందువులకుగానీ హిందూ మతానికిగానీ కీర్తిదాయకం కాజాలదు పరీక్షా సమయాన్ని మనం జయప్రదంగా గడపజాలనట్లయితే హిందూమతంగానీ, హిందువులుగాని ఉండరని నా అభిప్రాయం"

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ మళ్ళా ప్రజల నుద్దేశించి "మీ మనసు హరిజనుల పట్ల ఎట్లా ఉన్నదో ఈ వస్తువులు వేలం పెట్టి మీ త్యాగబుద్ధిని చూస్తాను" అంటూ దంతపు పెట్టెలను, వెండి పళ్ళేలను, సన్మానపత్రాల చట్రాలను వేలం పెట్టినారు

పురపాలక సంఘం వారిచ్చిన దంతపు పెట్టెను తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు వేలంలో 80 రూపాయలకు కొన్నారు యువజన సమితి వారిచ్చిన దంతపు పెట్టెను శ్రీ ప్రభల లక్ష్మీనరసింహం 25 రూపాయలకు కొన్నారు తరవాత మహాత్ముని చిత్రాలను, సన్మానపత్రం చట్రాలను కలిపి వేలం వేయగా

గ్రంథి పద్మరాజుగారు 20 రూపాయలకు కొన్నారు పిటిని మహాత్ముడు దమ్మిడీతో పాట ప్రారంభించినారు

తరవాత తెన్నేటి విశ్వనాథంగారిచ్చిన వెండి పళ్లెమును వేలం వేస్తూ "ఇది పాతిక రూపాయలకు తక్కువ ఈయనని" గాంధీజీ అన్నారు అంతట కందాళ సర్వేశ్వరశాస్త్రిగారు 26 రూపాయలకు కొన్నారు వేలంపాటల మధ్య గాంధీజీ అప్పుడప్పుడు "చలియే చలియే" అనీ "కమ్ ఎలాంగ్" అనీ అంటూ వచ్చినారు

సరిగా 4-30 గంటలకు సభ ముగిసింది జయజయ ధ్వానాల మధ్య గాంధీజీ తాను విడిది చేసిన శ్రీ విశ్వనాథంగారి ఇంటికి చేరుకున్నారు తోవలో గాంధీజీ ఖాదీ స్వదేశీ భాండారం తెరిచినారు

గాంధీజీ విడిదిలో కొంతసేపు విశ్రాంతి తీసుకొని తన బృందంతో సహా భీమునిపట్నానికి ప్రయాణమై వెళ్ళినారు

## విశాఖపట్టణంలో కొన్ని విశేషాలు

గాంధీజీ వాల్తేరు రైల్వేస్టేషన్‌నుంచి అలీపూర్ మెయిన్ రోడ్డు మీదుగా విశాఖపట్నానికి వెళ్ళినారు అలీపూర్ మెయిన్ రోడ్డంతా తోరణాలతోను ఆర్చిలతోను చక్కగా అలంకరించి ఉంది అలీపూర్ పౌరులు గాంధీజీకి రూ 116 లు సమర్పించినారు

మహాత్ముడు తనకు సమర్పించిన వస్తువులను వేలంపాట పెట్టినప్పుడు ఒక పాటదారు 'నగదు ఇవ్వకుండా అరువుకు పాట పాడవచ్చునా" అని అడిగినాడు "నా బేరం ఎప్పుడూ రొక్కంతప్ప అరువు లేదు" అన్నారు గాంధీజీ

యువజన సమితి వారిచ్చిన పెట్టె 25 రూపాయలకు వేలంలో కొట్టివేసిన తరవాత ఒక పెద్ద మనిషి లేచి 26 రూపాయలన్నాడు గాంధీజీ నవ్వుతూ "బేరం పైసలా అయిపోయింది, ఇక తిరుగులేదు హరిజనోద్యమంలో నిజాయితీ అనేది ఉన్నది సుమా" అన్నారు

విశాఖపట్నం మహిళా సభలో హిందూ బాలికా పాఠశాల సూపరెంటెండెంట్ శ్రీమతి పి వెంకటరమణమ్మగారు ఉపాధ్యాయినులనుంచి విద్యార్థినుల నుంచి సేకరించిన హరిజన నిధితోపాటు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించింది

స్త్రీల సభలో ఒక మహిళ వజ్రాలతో పొదిగిన తన కర్ణాభరణాల జతను గాంధీజీ కోరిన తక్షణం ఆయనకు సమర్పించింది ఆ తరవాత స్త్రీలు ఒకరి తరవాత ఒకరు బంగారు గొలుసులను, గాజులను, ఉంగరాలను హరిజన నిధికి కుమ్మరించినారు

శ్రీ కె యస్ గుప్తగారి కుమార్తె సరోజిని తన చేతులలో ఉన్న రెండు బంగారు గాజులను లాగి గాంధీజీకి సమర్పించినప్పుడు ఆయన "మీ తండ్రిగారి అనుజ్ఞతోనే యిస్తున్నావా" అని అడిగినారు అప్పుడామె వెంటనే "మీరడిగిన వస్తువులు ఇవ్వడానికి నాకు మా తండ్రిగారి ఆజ్ఞ అక్కరలేదు"

అన్నది

శ్రీ కె యస్ గుప్త గాంధీ పేరుతో ఉన్న తన పిల్లవాణ్ని మహాత్మా జీకి చూపెట్టినారు "ఈ అబ్బాయి నాకేమిస్తాడు" అన్నారు గాంధీజీ "ఇతడు మీకివ్వడానికి రాలేదు, మీ ఆదేశాలను తీసుకోవడానికి వచ్చినాడు" అన్నాడు శ్రీ గుప్త గాంధీజీ నవ్వుతూ "అట్లయితే మాత్రం ఈ అబ్బాయి నాకక్కర లేదు" అన్నారు

దిగుమర్తి వెంకటరామస్వామిగారు ఆయన భార్య శ్రీమతి జానకీ బాయి, మాయా అనే పేరుగల వారి కుమార్తెను చూపి ఆ బిడ్డ శాసనోల్లంఘ నోద్యమంలో తల్లి జైలులో ఉండగా పుట్టి కొన్ని నెలలు అక్కడ పెరిగినదని చెప్పగా గాంధీజీ ఆ బిడ్డను చేతులలోకి తీసుకొని నెమ్మదిగా వీపు చరిచి ఆమెను ఆశీర్వదించినారు

భీమునిపట్నం

మహాత్మాగాంధీ ఆయన సహచర వర్గం విశాఖపట్నం నుంచి డిసెంబరు 28 సాయంకాలం భీముని పట్నం చేరినారు భీముని పట్నం రోడ్లమీద జనం ఆయన దర్శనంకోసం బారులు తీర్చి వేచిఉన్నారు తోవలో కోటవారి శ్రీరామ మందిరంలో ఆయనకు పువ్వులు ప్రసాదాలు అర్పించడం జరిగింది తరవాత ఆయనహరిజన వాడకు వెళ్ళినారు హరిజనులు ఆయనను పుష్పమాలాలంకృతుని చేసినారు అక్కడి నుంచి ఆయన క్లాక్ టవర్ కు వెళ్ళినారు దానికి తూర్పుగా బహిరంగసభకోసం వేదిక ఏర్పాటు చేయపడింది దంతపు పెట్టెలో శ్రీరామ మందిర దేవాలయ కమిటీవారును, పౌర సన్మాన సంఘంవారును గాంధీజీకి సన్మానపత్రాలు సమర్పించినారు సుమారు నాలుగు, ఐదువేలమంది జనం అత్యుత్సాహంతో జయజయ ధ్వానాల మధ్య ఆయనను వేదిక మీదకు ఆహ్వా నించినారు అభినందన పూర్వకాలయిన పాటలతో పాఠశాల విద్యార్థినులు ఆయనకు కర్పూర హారతి ఇచ్చినారు

'కోటవారి శ్రీరామమందిర' పాలక వర్గంవారి సన్మానపత్రంలో మరి కొన్ని విషయాలతోపాటు "హిందూ ధర్మం గురించి అప్రతిహతమయిన మీ సమర్థమును, మానవ శ్రేయస్సు కోసం మీరు నడుపుతూండిన ఉద్యమాన్ని తెలుసుకొన్న తరవాత మేము మూవంటివారు మరికొందరున్నూ 20-9-32 న ఈ దేవాలయాన్ని హరిజనులకు తెరిచి మన జీవిత చరిత్రను కళంకితం చేసిన అస్పృశ్యతను తొలగించడానికి పూనుకొన్నాము ఈ దేవాలయం 90 సంవత్స రాల కిందట కోట నారాయణస్వామి, రామస్వామి అనే ధార్మిక బుద్ధిగల సోదరులు కట్టించినది" అని ఉదాహరించినారు

భీమునిపట్నం పౌరులు మహాత్మునకు స్వాగత పత్రం సమర్పించినారు హరిజన నిధికి 200 రూపాయల విరాళం కూడా ఇచ్చినారు అది తీసుకొని గాంధీజీ "ఈ ప్రాంతంలోని ఆచారం ప్రకారం రెండునూ్నట పదహార్లుండ

వలె కనక మిగిలిన 32 రూపాయలు తెండి" అన్నారు

ఆ సభలోనే ఒకరు ఒక చేతి కర్రను గాంధీజీకి ఇచ్చినారు 'ఇది నా దగ్గర ఉంటే అందరు నేను హింసాపరుణ్ణి అనుకుంటారు కాబట్టి దీనిని వెంటనే అమ్మివేస్తాను" అని దానిని వేలంపెట్టగా 4 రూపాయలు వచ్చినాయి దంతపు పెట్టెను వేలంపెట్టగా 20 రూపాయలు వచ్చినాయి చేమంతిపూవుల నగిషీతోఉన్న ఒక అందమయిన బరిణెను వేలంవేయగా 6 రూపాయలు వచ్చినాయి

తరవాత గాంధీజీ సన్మానపత్రాలకు సమష్టిగా సమాధానమిస్తూ మనమంద రము భారత మాత బిడ్డలమనీ అందువలన మనలో అసూయాద్వేషాలతో కూడిన విభేదాలు ఉండకూడదని అన్నారు ప్రజలందరూ ప్రతి ఉదయాన దేవుణ్ని మన దేశము సుఖితంగా ఉండేటట్లు ఆశీర్వదించమని ప్రార్థించవలెనని, మన తప్పులను మన్నించమని కోరవలెనని సలహా ఇచ్చినారు మనలో ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనే విభేదాలను పూర్తిగా మరచిపోయి అందరము ఒక కుటుంబంలోనివారివలె సంతోషంగా జీవించవలెనని కూడా ఆయన ఆదే శించినారు

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ ఆయన అనుచర వర్గము రాత్రి 7 30 కు విజయనగరానికి ప్రయాణమై వెళ్ళినారు

**విజయనగరము**

గాంధీజీ ఆయన పరివారం డిసెంబరు 28 రాత్రి విజయనగరం చేరి కంటోన్మెంట్ బంగాళాలో విశ్రాంతి తీసుకొన్నారు డిసెంబరు 29 ఉదయం కొన్ని హరిజన వాడలను చూసినారు

డిసెంబరు 29 ఉదయం 7 30 గంటలకు మునిసిపల్ పార్కులో బహి రంగ సభ ఏర్పాటు చేయబడింది సభా ప్రారంభానికి కొన్ని గంటల ముందే పార్కులోకి జనం గుంపులు గుంపులు రావడం మొదలుపెట్టినారు రమ్యంగా అలంకరించిన సభావేదికపైన జయజయ ధ్వానాల మధ్య గాంధీజీ ఆసీనులయి నారు సభలోని వారు చాలామంది బంగారు, వెండి నగలను, బంగారు గాజు లను, వెండి పళ్లాలను, కొన్ని వినోద వస్తువులను గాంధీజీకి సమర్పించినారు వాటిని వేలంవేయగా మూడు, నాలుగు వందల రూపాయలు వచ్చినాయి హరిజన నిధికి 1500 రూపాయలు సమర్పించడం జరిగింది మరింగంటి గోపా లమ్మ అనే ఆయిదేండ్ల బాలిక తన బంగారు గాజులను గాంధీజీకి సమర్పించగా ఆయన తన పైనున్న కర్పూర దండను ఆమె మెడలో వేసినారు అంధవరపు లక్ష్మణమూర్తిగారి భార్య వెంకటరమణమ్మగారు బంగారు గాజుల జత సమర్పిం చింది

## మునిసిపల్ సన్మానపత్రము

గాంధీజీకి స్త్రీలు మంగళ హారతి పట్టిన తరవాత పురపాలక సంఘ

అధ్యక్షులు కిళాంబి రంగాచార్యులుగారు వెండి పళ్లెరంతో సన్మానపత్రం సమర్పించినారు దానిలో

"మానవ సేవను గురించి మీరు ప్రబోధించే ఉత్తమాదర్శాలను మీరు అమితోత్సాహంతో ఆచరణలో పెట్టడంవల్ల ప్రపంచ గురు పీఠాధిపతులుగా ప్రతిష్ఠ పొందినారు స్వతస్సిద్ధమయిన మీ అంతర్దృష్టితో పౌర జీవితంలో దోషభూయిష్టాలుగా ఉన్న పూరి గుడిసెలు ఇకముందుండకూడదని మునిసిపల్ పరిపాలనాధికారుల దృష్టికి తెచ్చినందుకు మేము కృతజ్ఞులము మీ జీవితంలోని పవిత్రత, మీ బోధనలలోని ఔదార్యము, మీ ఆదర్శంలోని ఉత్తేజము, మీ నిరాడంబర జీవితంలోని మాధుర్యము మిమ్ములను అట్టడుగు ప్రజల సేవా తత్పరత్వానికి ప్రవక్తగా చేయగలిగినాయి" అని ఉదాహరించడం జరిగింది

ఈ సన్మానపత్రానికి తరవాత గాంధీజీ ఇట్లా సమాధానం చెప్పినారు

'నేనీ పట్టణానికిగానీ, ఇక్కడున్న సభ్యులకుగానీ కొత్తవాణ్ణి కాను నేనిక్కడకు రావటం ఇది మూడో పర్యాయము నేనిదివరకు ఇక్కడకు వచ్చిన రెండు పర్యాయాలలోని విషయాలు నాకిప్పుడు జ్ఞాపకం వస్తూన్నందున సంతోషం కలుగుతున్నది నేను హరిజననిధికోసం వచ్చినాను ఆ పని మీరు పూర్తిచేయవలె ఆ విషయంలో ఇంతవరకు వచ్చిన సొమ్ము నాకు సంతృప్తికరంగా లేదు" అని చెప్పి, గాంధీజీ స్త్రీలవైపుకు తిరిగి "హరిజనాభ్యుదయంవంటి మహోదారమయిన సత్కార్యానికి మీరు మీ స్త్రీధనం సమర్పింపకోరుతున్నాను హరిజనులు మన సోదరులు ఇప్పుడు హరిజనులున్న స్థలాలకంటె ఎత్తయిన స్థలంలో వారికి మంచి కుటీరాలు నిర్మించడానికి, విద్యాసౌకర్యాలు కలిగించడానికి పురపాలకసంఘంవారు ఏర్పాటుచేయవలె

విద్యావంతులయిన సవర్ణులు హరిజనులను మంచి తోవలో పెట్టవలె లంకపట్నంలోని హరిజనుల ప్రదేశం పాకీవారు నివసిస్తున్న ప్రదేశం కంటె పరిశుభ్రంగా ఉన్నది పాకీవారి కుటీరాలను పల్లపు ప్రదేశాలనుంచి మరొక మంచి ప్రదేశానికి మునిసిపాలిటీవారు మార్చవలసి ఉంటుంది ఇవి చాలా చిన్న విషయాలే కావచ్చు కాని ప్రతివారు ఈ విషయాలలో జాగ్రత్త తీసుకొనవలసి ఉన్నది ప్రతివారు హరిజనులను తమ సన్నిహిత బంధువులతో సమానమయిన ప్రేమతోను, సానుభూతితోను చూడవలసి ఉన్నది. అప్పుడే ఈ క్లిష్టమయిన హరిజన సమస్య సంతృప్తికరంగా పరిష్కారం కాగలదు ఇంతమంది ఈ సభకు రావడం హరిజనాభ్యుదయంపట్ల ప్రజల సహకారాన్ని సానుభూతిని తెలియజేస్తున్నది యుగయుగాలనుంచి వస్తున్న ఈ అనాగరకపు సంఘ విద్వేషాలను మనసులనుంచి తొలగించుకోవలెనని కోరుతున్నాను. ఈ అస్పృశ్యతా కళంకం రూపుమాసినవేగాని ఈ దేశంలో శాంతి సౌహార్ద్రభావాలు వర్ధిల్లవు అందుకు అవసరమయిన మానసికశక్తిని, ధైర్యాన్ని మీకు భగవంతుడు ప్రసాదించుగాక " హిందీలోని ఈ ఉపన్యాసం తెన్నేటి విశ్వనాథంగారు తెలుగులోకి అనువదించినారు

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ అఖిలభారత వస్తుప్రదర్శనశాలకు వెళ్ళి మోటరులో కూర్చొనే దానికి ప్రారంభోత్సవం జరిపినట్లు ప్రకటించినారు

మునిసిపల్ సన్మానపత్రం చదివిన వెంటనే స్థానిక విద్యార్థులు కూడా సన్మానపత్రం చదివి హరిజన నిధికి 116 రూపాయలు సమర్పించినారు

గాంధీజీ అఖిలభారత వస్తుప్రదర్శనకు ప్రారంభోత్సవం జరిపిన తరవాత వివిధ ఖాదీ విక్రయశాలలను చూసి, మిస్ షోలింగర్, డాక్టర్ లక్ష్మణరావు గార్లను కుశలప్రశ్నలతో పలకరించినారు షోలింగర్‌తో "మీరు పూర్వంవలె తరచుగా కనిపించడంలేదు మీ ఖాదీ పరిశోధనలు పూర్తికాలేదా" అన్నారు గాంధీజీ "ఇంకా కాలేదు కొంత దారిలో ఉన్నాయి' అన్నది ఆమె "పరిశోధనల ఫలితం మన ఉభయులకు సంతృప్తికరంగా ఉండవలె సుమా" అన్నారు గాంధీజీ

ఆ తరవాత గాంధీజీ విజయనగరం కోఆపరేటివ్ ఖద్దరు, స్పిన్నింగ్ అండ్ వీవింగ్ సొసైటివారి విక్రయశాలకు వెళ్ళినారు అక్కడ మొసలికంటి హనుమంతరావుగారు కుట్టులేని ఖద్దరు కుడుతాను మహాత్మునకు కానుకగా ఇచ్చినారు గాంధీజీ "నేను దీనికోసమే చూస్తున్నాను" అన్నారు హనుమంతరావుగారు వస్తుప్రదర్శనం ముగిసిన తరవాత దానిని పంపుతామని చెప్పగా, మహాత్మాజీ దానిని వేలంవేసి సొమ్ము పంపమన్నారు కాని హనుమంతరావు గారు గాంధీజీ సొంతంగా వాడుకొంటే పంపుతామన్నారు.

బహిరంగసభలో పువ్వాడ సత్యనారాయణగారి తల్లి వెండిపళ్లెంలో 116 రూపాయలు మహాత్మునకు బహూకరించింది పూసపాటి లక్ష్మీనరసింహరాజు గారు చేతిగడియార మిచ్చినారు ఇంకా కొందరు అనేక ఉంగరాలు చేతితో చేసిన చక్కని వస్తువులు చేతిరుమాళ్లు కానుకగా ఇచ్చినారు నాలుగువందల జతల బట్టలు ప్రజలపక్షాన గాంధీజీకి సమర్పించడం జరిగింది అవి హరిజనులకు పంచిపెట్టడానికి గాంధీజీ ఏర్పాటు చేసినారు విద్యార్థుల సన్మానపత్రాన్ని వేలంవేయగా పి యల్ యన్ రాజుగారు 5 రూపాయలకు కొన్నారు చేతి గడియారానికి 32 రూపాయలు, వెండి పుష్పానికి 5 రూపాయలు, వెండి పూవుల పళ్ళానికి 25 రూపాయలు, వెండి పళ్ళానికి 35 రూపాయలు, మీరాబేన్ కిచ్చిన చేతిరుమాలుకు 10 రూపాయలు, మరొక చేతిరుమాలుకు 5 రూపాయలు, ఫౌంటెన్ కలానికి 5 రూపాయలు వేలంలో లభించినాయి

ఉదయం 8-30 గంటలకు గాంధీజీ ఆయన పరివారం విజయనగరంనుంచి విజయనగరం మహారాజావారి రోల్స్‌రాయ్స్ కారులో అనకాపల్లి వెళ్ళినారు తోవలో ప్రతి గ్రామంలోను జనసమూహాలు ఆయన దర్శనానికి వేచిఉన్నాయి సౌత్యంవద్ద గాంధీజీ కారు దిగి కొంతదూరం నడిచినారు పెందుర్తివద్ద గాంధీజీ రాక తెలుసుకొని జనం గుంపులుగా రోడ్డుపైన నిలబడి ఉన్నారు వారి మధ్య నుంచి గాంధీజీ కారు పోవడం చాలా కష్టమయింది గాంధీజీ నడుస్తూన్న కారులో నిలబడి ప్రజలకు కనిపించి వారి ప్రణామాలను అందుకొన్నారు మరి

రెండుచోట్ల గాంధీజీ రోల్స్‌రాయ్స్ కారును గాంధీజీ కారు ?) తోవచూపించే కారుగా భ్రమపడి ప్రజలు దానిని అడ్డులేకుండా పోనిచ్చినారు గాంధీజీ అప్పుడు కారులో నిద్రపోతున్నారు తరవాత వెనకవచ్చే కారుకు అడ్డంనిలిచి గాంధీజీ దర్శనం ఇప్పించవలెనని కోరినారు అది పోలీసు కారయినందువల్ల అక్కడి గుంపులకు ఆశాభంగం కలిగింది

గాంధీజీ అనకాపల్లికి (డిసెంబరు 29) ఉదయం 10-30 గంటలకు చేరి గ్రంధి హనుమంతరావుగారి బంగాళాలో మధ్యాహ్నం 2 గంటలవరకు విశ్రాంతి తీసుకొన్నారు

సరిగా 2½ గంటలకు పెద్దమార్కెట్ స్క్వేర్‌లో ఏర్పాటుచేసిన బహిరంగసభకు వెళ్ళినారు ఆ సభకు పరిసర గ్రామాలనుంచి వచ్చిన జనంతో సహా 20 వేల మంది హాజరయినారు

మార్కెట్ ద్వారం వద్ద మునిసిపల్ చేర్మన్ టి గంగరాజు, డాక్టర్ నారాయణమూర్తి, శ్రీ కె లింగమూర్తి ఆయన కెదురేగి ఆయనను స్క్వేర్ మధ్య నిర్మింపబడిన ఉన్నత వేదికపైన ఆసీనుని చేసినారు

సభా ప్రారంభ సమయంలో గాంధీజీకి ప్రీతి కరమయిన "వైష్ణవ జనతో" కీర్తనను ఒక బాలిక పాడింది గాంధీజీ ఆ బాలిక వంక తిరిగి "ఈ పాట కంటె ఒక నగ ఇస్తే సంతోషిస్తా" నన్నారు వెంటనే ఆమె తన చేతినున్న ఉంగరం తీసి గాంధీజీ చేతులలో ఉంచింది

ఆ తరవాత మునిసిపల్ చేర్మన్ గంగరాజుగారు గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు హిందీ ప్రేమీ మండలి, శ్రీహరినాథాశ్రమం, సుజన సమాజము, హరిజన సంఘాల పక్షాన కూడా సన్మాన పత్రాలు సమర్పింప బడినాయి అనకాపల్లి పౌరులు 516 రూపాయలున్నూ, చోడవరంవారు 58 రూపాయలున్నూ హరిజన నిధికి ఇచ్చినారు

ఒకరు తమకు మగ పిల్లవాడు పుడితే మహాత్ముని పేరు పెట్టు కొంటా మని ముడుపు గట్టుకొన్నారు ఆ ప్రకారం జరిగినందువల్ల ముడుపు గాంధీజీకి చెల్లించినారు

ఒక బాలిక ఏదోకొద్దిగా ఇవ్వగా "నీవు లుబ్ధురాలివలె ఉన్నావు నీకింత బంగారం ఎందుకు" అన్నారు గాంధీజీ వెంటనే ఆమె చేతనున్న ఉంగరం తీసియిచ్చింది

స్వచ్ఛంద సైనికులు సభ చుట్టూ తిరిగి డబ్బు వసూలు చేస్తూండగా గాంధీజీ తనకు బహూకరించిన వస్తువులను వేలంపెట్టినారు ఆయన ఒక వెండి గిన్నెను 'ఇది అదృష్టపు గిన్నె' అని పాట పెట్టినారు అది 2 రూపాయల నుంచి 13 రూపాయల వరకు పెరిగింది "పదమూడు మంచి అంకెకాదు దుర దృష్టపు అంకె పైపాట పెట్టండి" అన్నారు గాంధీజీ ఎవరూ పైన పాడలేదు ఆ అదృష్టపు గిన్నె దురదృష్ట పదమూడుకే పోయింది సన్మాన పత్రానికి 9 రూపాయలు వచ్చినాయి గాంధీజీ తనకు బహూకరింపబడిన చిత్ర పటాన్ని

వేలం పెట్టగా 7 రూపాయలు వచ్చినాయి

తరవాత ఒక ఫౌంటెన్ కలాన్ని వేలం పెట్టగా ఒక పైసానుంచి పాట పెరిగి 8 రూపాయలు వచ్చింది

ఆ తరవాత గాంధీజీ 'స్నేహితులారా! విశాఖపట్నం జిల్లాకు ఆఖరున ఈ గ్రామంలో 500 రూపాయలు ఇవ్వడం నాకు చాలా ఆశాభంగంగా ఉంది ఈ గ్రామం డబ్బు సంపాదనలోను, వాణిజ్యంలోను చాలా గొప్పదని విన్నాను ఇప్పటికయినా మిగిలిన డబ్బు పూర్తి చేయండి" అంటూ "సవర్ణులు అస్పృశ్యతను నిర్మూలించనట్లయితే దేవుడు హిందూ మతంను శపించే మాట వాస్తవమని" ఉపన్యాసం ముగించినారు

అప్పుడు సభలో అన్ని వైపులనుంచి సందడి ప్రారంభమయింది సభను శాంతంగా ఉంచడానికి కార్యకర్తలు ప్రయత్నం చేసినారు ఇంతలో అక్కడ ఉండవలసిన సమయం మించిపోయినందువల్ల గాంధీజీ ఆ సభను విడిచి నెల్లూరు పోయే మెయిలు నందుకొనేటందుకు రైలుస్టేషన్‌కు వెళ్ళినారు

ఎలమంచిలి రైల్వే స్టేషన్‌లో సర్వసిద్ధి తాలూకా వాస్తవ్యులు వై నారాయణరావు, యం వి వి సత్యనారాయణగార్ల నాయకత్వం కింద గాంధీజీకి 200 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు

మొత్తం మీద విశాఖపట్నం జిల్లాలలో హరిజన నిధికి అనుకొన్న దానికన్న ఎక్కువ మొత్తమే వచ్చింది దాదాపు 8,000 రూపాయల నగదు, పరిగణింప దగినన్ని ఆభరణాలు లభించినాయి

## అనకాపల్లి-నెల్లూరు తోవలో

డిసెంబరు 29 సాయంకాలం గాంధీజీ సపరివారంగా విశాఖపట్నం నుంచి మెయిలులో నెల్లూరుకు పోతూండగా తుని రైల్వే ప్లాటుఫారం మీద సుమారు వేయిమంది ప్రజలు ఆయనను దర్శించినారు మహాత్మాజీని ఆహ్వానించడానికి తుని రైల్వే స్టేషన్ ప్లాటుఫారం మీద బులుసు సాంబమూర్తిగారు తయారుగా ఉన్నారు మహాత్మాజీకి తునిలో 200 రూపాయలు విరాళం సమర్పించ బడింది అట్లాగే పిఠాపురం స్టేషన్‌లో కూడా అనేక మంది ప్రజలు ఆయనను సందర్శించి హరిజన నిధికి 200 రూపాయలు సమర్పించినారు

సామర్లకోట స్టేషన్ దగ్గర గాంధీజీ దర్శనం కోసం దాదాపు నాలుగైదు వందల మంది వేచిఉన్నారు శ్రీమతి దుర్గాబాయి, శ్రీమతి భద్రమ్మ (సాంబమూర్తిగారి గృహిణి), పాపాయమ్మ మొదలయిన అనేక మంది స్త్రీలు కూడా అక్కడ ఉన్నారు శ్రీ బులుసు సాంబమూర్తిగారి కోరిక పయిన ఒక ఆరుగురు వేదపండితులు సామర్లకోట స్టేషన్‌కు వచ్చి గాంధీజీ ముందు వేదపు పనసలు పదినిమిషాలపాటు పారాయణం చేసినారు వారు "ఘన" పఠిస్తూన్నప్పుడు గాంధీజీ, ఆంధ్రుల వేద పారాయణం కనులు మూసుకొని భక్తి ప్రపత్తులతో ఆలకించినారు

అక్కడ 100 రూపాయల విలువగల నగలు హరిజన నిధికి సమర్పించి నారు 'గాంధీజీకి జై" అనే నినాదాల మధ్య రైలు కూతవేసింది సాంబమూర్తి గారు, ఆయనతో వచ్చినవారు అక్కడ నుంచి కాకినాడకు వెళ్ళిపోయినారు తూర్పుగోదావరిలో దాదాపు 6,500 రూపాయలు వసూలయినాయి

నెల్లూరుజిల్లా

గాంధీజీ కలకత్తా మెయిల్‌నుంచి బిట్రగుంట స్టేషన్‌లో డిసెంబరు 30 ఉదయం దిగినప్పుడు "మహాత్మా గాంధీకి జై" అనే నినాదాలు నలుదిక్కులా మారు మ్రోగింది అక్కడ శ్రీ తిక్కవరపు రామిరెడ్డి, శ్రీమతి పొణకా కనకమ్మ, నాగసూరి వీరరాఘవులుశెట్టిగార్లు మహాత్మునకు స్వాగతం చెప్పి పుష్పమాలాలంకృతుని చేసినారు తరవాత వారు మోటారు కారులో కావలికి వెళ్ళినారు మధ్య వవ్వేరులో హరిజన నిధికి 116 రూపాయలున్నూ, గాంధీజీకి సన్మాన పత్రం గ్రామస్థులు సమర్పించినారు

కావలి చేరేసరికి ఉదయం 8 గంటలయింది కావలిలోని జిల్లా బోర్డు స్కూలు ఆవరణలో సూర్యోదయమయిన తరవాత ఒక గంటకు బహిరంగ సభ ఏర్పాటు చేయబడింది కావలి తాలూకా బోర్డువారు గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు

దానికి సమాధానం ఇస్తూ గాంధీజీ 'మీ సన్మాన పత్రం నేను ఆమూలాగ్రంగా చదివినాను అందులో హరిజన నిధికి వసూలయిన సొమ్మును వెచ్చించేవని ప్రతి తాలూకాలోను రాజకీయం సంబంధంలేని సంస్థకు అప్పగించ వలెనని ఉంది హరిజన సేవా సంఘంవారి నిధులను రాజకీయేతర సంస్థలే పరిపాలించవలెనని నియమమున్నది ఆ నిధులతో రాజకీయ సంస్థల కేమీ సంబంధముండకూడదు కాని రాజకీయాలతో సంబంధంలేని సాంఘిక కార్య కర్తలే హరిజన నిధులకు పాలకులుగా ఉండవలెనని మీ అభిప్రాయమయినట్ల యితే అది చాలా కష్టమయిన విషయము ఎందువల్లనంటే సాంఘిక కార్య కర్తలుగా ఉండేవారే రాజకీయ కార్యనిర్వాహకులుగా కూడా ఉన్నారు రాజకీయాభిప్రాయాలున్న వారిని కూడా హరిజనోద్యమానికి ఉపయోగించుకో వచ్చు అయితే ఆ ఉద్యమంలో ఆసక్తి ఉండవలె ఉదాహరణానికి ఒక డాక్టర్ ఉన్నాడనుకోండి! ఆయనకు కొన్ని రాజకీయాభిప్రాయా లుండవచ్చు కాని ఆయన దగ్గరకు ఎవరయినా రోగి వచ్చినప్పుడు ఆ రోగి మితవాదియా అతి వాదియా అని ఆయన ఆలోచించడు తన రాజకీయాభిప్రాయాలను దూరంగా ఉంచి చికిత్స చేస్తాడు అదేవిధంగా హరిజనోద్యమంలో పని చేసే కార్యకర్తలు తమ రాజకీయాభిప్రాయాలను దూరంగా ఉంచి హరిజన నిధులను సవ్యంగా ఉపయోగించవచ్చు" అని ఉపన్యసించినారు

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీకి తాలూకా బోర్డువారు, హరిజన సేవక సంఘంవారు సమర్పించిన సన్మానపత్రాలను వేలం పెట్టినారు ఒక ఖద్దరు

శాలువాను కూడా వేలం పెట్టగా పది నిమిషాలలో పాట 10 రూపాయలకు పెరిగింది గాంధీజీ సహజ మందహాసంతో "నూరు చేయండి" అన్నారు తరవాత "యాభై" అన్నారు ఒకరు కొండప్పనాయుడు "యాభై ఐదు" అని తన పేర కొట్టివేయించుకొన్నాడు

కావలిలో వసూలయిన విరాళాల మొత్తం 477 రూపాయలు బ్రాహ్మణకోడూరు ఖాదీ ఉత్పత్తి కేంద్రానికి చెందిన ఈశ్వరయ్య సుబ్రహ్మణ్యం గార్లు హరిజన పిల్లలకోసం 150 ఖద్దరు ఫ్రాకులను బహూకరించినారు

ఈ సభానంతరం గాంధీజీ ఆయన అనుచర వర్గము నిర్ణీత కార్యక్రమం ప్రకారం అల్లూరు వెళ్ళినారు వాతావరణం మనోరంజకంగాను, ఉత్సాహకరంగాను ఉన్నది మహాత్మాజీ కారు పోతూండగా తోవలోని గ్రామస్థులు ఉత్సాహకరంగా జయధ్వానాలు చేసినారు కడచిన రాత్రి రైలు ప్రయాణంలో నిద్రాభంగంవల్ల అలసట చెంది ఉండటంచేత గాంధీజీ కారులోనే ప్రశాంతంగా నిద్రపోయినారు గాంధీజీ కారు వెనకనుంచి వస్తూన్న ప్రతి కారును గ్రామస్థులు ఆయన దర్శనంకోసం ఎదురు చూసి ఆయన కారు అంతకు ముందుగానే సాగిపోవడంచేత ఆశాభంగం చెందినారు

అల్లూరు గ్రామం గాంధీజీని ఆహ్వానించడానికి శోభస్కరంగా అలంకరించబడింది పరిసర గ్రామస్థు లనేకమంది సభ జరగనున్న చెరువు కట్టపయిన గాంధీజీ రాకకు ముందే వేచి ఉన్నారు గాంధీజీకి హరిజన నిధికోసం 700 రూపాయల విరాళం సమర్పించినారు

గాంధీజీ వారి విరాళానికి కృతజ్ఞత తెలుపుతూ సంగ్రహంగా ఇట్లా ఉపన్యసించినారు 'సోదరీ సోదరులారా! నేనీ సొమ్ముతో ఏం చేయబోతున్నానో మీ అందరికి తెలిసిందే, హరిజనులను మీతో సమానంగా చూడండి! అస్పృశ్యతను మీ హృదయాలనుంచి తొలగించండి! ప్రతిరోజు ఉదయం మన హృదయాలను నిష్కల్మంగా చేయవలసిందని ఆ భగవంతుని ప్రార్థించండి! కావలిలో ఒక ఖద్దరు శాలువకు 55 రూపాయలు వచ్చినాయి ఈ ఉదయం నాకు మీరు బహూకరించిన వస్తువులన్నిటినీ ఇక్కడ వేలం పెడుతున్నాము మీరు నాకెంత ఇస్తారో చూస్తాను" అని ఆ వస్తువులను వేలంపెట్టి అక్కడినుంచి 8 15 కు గండవరం బయలుదేరి వెళ్ళినారు

గండవరం పోయే తోవలో మహాత్ముడు కారు దిగి 20 నిమిషాలు త్వరత్వరగా నడవడం ప్రారంభించినారు ఆయన ముందున్న రెండు కారుల లోనివారు కూడా దిగి ఆయనతో కలసి నడిచినారు అది చూడదగిన దృశ్యము

## గండవరంలో

మహాత్మాజీ, గండవరంలో నూతనంగా కట్టిన కృష్ణదేవాలయాన్ని హరిజనులతోపాటు అందరి హిందువులకోసం తెరిచినారు ఆ ప్రారంభోత్సవ సమయంలో బ్రాహ్మణులు వేదపారాయణం చేసినారు, భజంత్రీలు మేళం చేసి

నారు మహాత్మాజీ గర్భగుడిలోకి పోయి దేవుని పూజించి ప్రసాదం స్వీకరించినారు తరవాత "దేవాలయంలో ప్రవేశించే హరిజనులేరి' అని ఆందోళనతో ప్రశ్నించినారు ఒకేఒక దుర్బల శరీరుడయిన హరిజనుడు పరిశుభ్రమయిన వస్త్రాలతో కనిపించినాడు హరిజనులు ఆనాడు ఎక్కువమంది రాకపోవడానికి కారణం ఆ కిందటి రోజున హరిజన దేవాలయ ప్రవేశం గురించి గోడలపై అంటించిన కాగితాలను పోలీసులు చింపివేసి మాల గూడెంలోని హరిజనులను మరువాడు జగగబోయే దేవాలయ ప్రవేశంలో జోక్యం కల్పించుకోకూడదని భయపెట్టినందువల్ల అని తెలిసింది

ఆ దేవాలయ ప్రవేశానంతరం అక్కడ చేరిన జనసమూహానికి గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు "హరిజనులు దేవాలయంలో ప్రవేశిస్తే వారు కొన్ని ముఖ్య నియమాలను పాటించవలసి ఉంటుంది వారు కల్లు సారాలను తాగకూడదు చచ్చిన జంతువుల మాంసం తినకూడదు పరిశుభ్రంగాను, పవిత్రంగాను జీవించవలె ఈ నియమాలు పాటించి తీరవలె ఇవి సవర్ణులకుకూడా వర్తిస్తాయి వారుకూడా ఈ నియమాలను అనుసరించగలరని ఆశిస్తున్నాను"

## బుచ్చిరెడ్డిపాలెం

మహాత్మాజీ తన సహచర వర్గంతో డిసెంబరు 30, ఉదయం 10 గంటలకు బుచ్చిరెడ్డిపాలెం వెళ్ళి స్త్రీల సభలో పాల్గొన్నారు స్త్రీలు హరిజన నిధికి 1500 రూపాయల నగదు సమర్పించినారు గాంధీజీ "ఇది చాలదు మీరు నగలు ఇవ్వవలె" అన్నారు ఒక మహిళ ఆయన నుదుట కుంకుమ ఉంచి జాతీయ గీతం పాడింది గాంధీజీ ఇంతకూ ఈమె తన గాజులు ఇవ్వలేదు, తన బిడ్డ గాజులిచ్చింది" అన్నారు ఆ మాట అన్న తరవాత ఐదు నిమిషాలలో ఐదు జతల బంగారు గాజులు ఆయనకు లభించినాయి 80 సంవత్సరాల వయసుగల ఒక వృద్ధ స్త్రీ గాంధీజీ సన్నిధికి వచ్చి భక్తిపూర్వకంగా తన సన్నని బంగారు గాజులను సమర్పించింది 'మీరు నాకంటె చాలా పెద్దవారు, చాలా మంచి పని చేస్తున్నారు" అన్నారు గాంధీజీ.

స్త్రీల సభ ముగియగానే శ్రీమతి దొడ్ల రుక్మిణమ్మ గాంధీజీని వీడ్కోలు సందేశ మీయమని కోరి దానిని తాము చిరస్థాయిగా ఉంచుకొనగలమని చెప్పుతూ ఒక బంగారు గొలుసును సమర్పించింది

గాంధీజీ సంతోషంతో ఒక కాగితంముక్కను ఆమె దగ్గరనుంచి తీసుకొని హిందీలో స్త్రీలందరూ ఔదార్యంతో నిరాడంబర జీవితం గడపవలసిందనీ, రాట్నం వడికి, ఖద్దరు ధరించి, హిందీ నేర్చి, తాము తమ సోదరిసోదరులను చూసినట్లుగానే హరిజనులను చూడవలసిందనీ సలహా ఇచ్చినారు

ఆయన ఆ సభలో గడిపిన కొద్ది నిమిషాలు ఎప్పటికీ మరువదగినవి కావు పిల్లలతో పరిహాసమాడుతూ, కేరింతలాడుతూ, ఆడుతూ తాతగారివలె కాలం గడిపినారు

గాంధీజీ స్త్రీల నుద్దేశించి ప్రసంగిస్తూ "స్త్రీల సౌందర్యం ఆభరణాలలో లేదు సీతా దమయంతులు ఈనాటివరకు పూజింపబడటం వారి భాగ్యాలవల్ల కానీ, ఆభరణాలవల్ల కానీ కాదు వారి ఉత్తమ సౌశీల్యసంపదవల్లనూ, వారి నిరాడంబర జీవితాలవల్లనూ మాత్రమే వారికా గౌరవం లభించింది స్త్రీలు గాజులతో ఇతరులకు భోజనం పెట్టరాదని శాస్త్రాలు బోధిస్తున్నాయి మీ నగలను నా కిచ్చినందువల్ల పేదరికంతో బాధపడుతున్న అనేకమందికి మీకు సహాయంచేసిన వారవుతారు"

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ బుచ్చిరెడ్డిపాలెం గ్రామమైదానంలోని బహిరంగసభకు వెళ్ళినారు అక్కడ ఆరువేలమంది సమావేశమై ఉన్నారు వారిలో దాదాపు వెయ్యిమంది స్త్రీలే ఉన్నారు ఆ సభలో ప్రప్రథమంగా బెజవాడ సుందరరామిరెడ్డి, బెజవాడ చంద్రశేఖరరెడ్డి మేనకూరి సీతారాం రెడ్డిగార్లు హరిజననిధికి 2,000 రూపాయ లిచ్చినారు ఆ రెండువేలలో 670 రూపాయలు సుందరరామిరెడ్డిగారిదే హరిజన నిధికి ప్రత్యేకించబడింది చిల్లర మొత్తాలు మరొక రూ 500 వసూలయినాయి

మహాత్మాజీ ఆ సభను ఉద్దేశించి అక్కడ ఉన్నవారిలో ఇంకా అనేక మంది విరాళాలీయగల వారున్నారనీ, వారా విరాళాలు స్వచ్ఛంద సైనికుల కీయవలసిందనీ చెప్పినారు తాను కనీసం మూడువేల రూపాయలు రావచ్చు ననుకొంటున్నాననీ, ఆ మొత్తం రాకుంటే తనకు ఆశాభంగం కలుగుతుందని కూడా ఆయన అన్నారు

తరవాత కొవ్వూరు తాలూకా బోర్డువారు, వవ్వేరు గ్రామస్థులు, బుచ్చిరెడ్డిపాలెం పంచాయతీ బోర్డు వారు, బుచ్చిరెడ్డిపాలెం గ్రామస్థులు తనకు సమర్పించిన స్వాగతపత్రాలను, తనకు బహూకరించిన రెండు తకిలీలను, ఖద్దరు నూలును గాంధీజీ వేలంపెట్టగా హరిజననిధికి 70 రూపాయలు వచ్చినాయి

తరవాత గాంధీజీ ఉపన్యసించి సభ ముగించేసరికి 11 గంటలయింది అప్పుడాయన సన్మానసంఘ కార్యదర్శి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి ఇంటికి వెళ్ళి విశ్రాంతి తీసుకొన్నారు. మధ్యాహ్నం 2½ గంటలకు ఆయన మాల గూడానికి పోగా అక్కడ హరిజనులు ఆయనకు 5 రూపాయలు ఇచ్చు కొన్నారు గాంధీజీ దానిని ఆనందంతో స్వీకరించినారు

## నెల్లూరులో

గాంధీజీ సపరివారంగా బుచ్చిరెడ్డిపాలెంనుంచి నెల్లూరు చేరేసరికి సాయం కాలం 8½ గంటలయింది పెన్నానది ఒడ్డునుంచి ఆయన కారు నెల్లూరులో తిరిగిన ప్రతిచోటా ప్రతి వీధీ ఆయన దర్శనంకోసం ఆసక్తితో నిరీక్షిస్తున్న జనంతో క్రిక్కిరిసిపోయింది ఆ జనసమూహంలోనుంచి ఆయన కారు నడవడం చాలా కష్టమయిపోయింది ఆయన మొట్టమొదట ముత్యాల పాలానికి పోయి హరిజన పఠనమందిరం తెరిచినారు తరవాత చిన్న బజారులో సింహపురి హింది

మండలివారి యాజమాన్యంలో స్థాపితమైన దిగుమర్తి హనుమంతరావు హింది విద్యాలయానికి ప్రారంభోత్సవం చేసినారు మండలివారు ఆయనకు ఒక రజిత పేటికను బహూకరించినారు

ఆ తరవాత ఆయన పురమందిరానికి పోయి ఆయన దర్శనంకోసం అక్కడ వేచిఉన్న స్త్రీల నుద్దేశించి హరిజననిధికి ఉదారంగా విరాళ మీయవలె నని కోరుతూ అది నగలరూపంలో ఉంటే మరీ మంచిదన్నారు ఆయన కోరి నంతనే స్త్రీలు ఒక్క పావుగంటలో బంగారు గాజులను, గొలుసులను ఉంగ రాలను, దండలను నగదుతోపాటు సమర్పించినారు నగల ఖరీదు దాదాపు 1200 రూపాయలు ఇంత ఉదారంగా స్త్రీలు ప్రవర్తించినందుకు సంతోషంతో గాంధీజీ ఇట్లా అన్నారు

"మీరీ నగలు యిచ్చినందుకు మిమ్ముల్నందరినీ ఆశీర్వదిస్తున్నాను కాని మీరీ వస్తువులను విరాళంగా ఇచ్చినందుకు విచారపడకూడదు దరిద్రంతో బాధ పడుతున్నవారికి సహాయం చేయడం మన ధర్మము దానమీయగలవారు ఇయ్య కుండా ఉండటం న్యాయం కాదు త్యాగం చేయనివారు దొంగతనం చేసినట్లే నని భగవద్గీత ఘోషిస్తున్నది "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ స్త్రీలును, కస్తూరిదేవి పాఠశాలా బాలి కలు సమర్పించిన సన్మానపత్రాలను తనకు బహూకరించిన ఇతర చిన్న వస్తు వులను వేలం వేసి అక్కడనుంచి వి ఆర్ కళాశాల ఆటస్థలానికి వెళ్ళినారు అక్కడ బహిరంగసభ జరిగింది సభలో 15 వేలమంది ఉన్నారు జయజయ ధ్వానాల మధ్య గాంధీజీ వేదికనెక్కి నిలబడినారు, మునిసిపల్ చేర్మన్ ఖాన్ బహద్దూర్ యాహ్యాలీసాహెబు (యం యల్ సి ) గారు అందమయిన రజిత పేటికలో మున్సిపల్ సన్మానపత్రం, జిల్లాబోర్డు వైస్‌ప్రెసిడెంట్ పొణకా గోవిందరెడ్డి (యం ఎల్ ఏ ) గారు జిల్లాబోర్డు పక్షాన ఇంకొక సన్మానపత్రం, బార్ అసోసియేషన్ పక్షాన ఏనుగు రాఘవరెడ్డిగారు మరొక సన్మానపత్రం సమర్పించినారు బార్ అసోసియేషన్‌వారు 371 రూపాయలు హరిజననిధికి విరాళాలు ఇస్తే ఇది చాలా చిన్నమొత్తం" అన్నారు గాంధీజీ

తరవాత పట్టణవాసులిచ్చిన వ్యక్తిగత విరాళాలను స్వీకరించి గాంధీజీ ఆ మహాసభలో ఇట్లా ఉపన్యసించినారు

"సోదరీ సోదరులారా! మీ ఔదార్యానికి నేను కృతజ్ఞుణ్ణి నెల్లూరుతో నా పరిచయం కొత్తది కాదు శ్రీ ఆర్ రామచంద్రరావుగారు ఇక్కడ జిల్లా కలెక్టర్‌గా ఉన్నప్పటినుంచి నాకు నెల్లూరుతో పరిచయం ఉన్నది ఇటీవల నేను మద్రాసు వెళ్ళినప్పుడు ఆయన జబ్బుగా ఉన్నట్లు విని విచారపడినాను ఆయన ఆతిథ్యాన్ని నేనెన్నడూ మరవజాలను నాకు అత్యుత్తమ స్నేహితుడు సహ చరుడు అయిన శ్రీ దిగుమర్తి హనుమంతరావు మాతో కలసి కొంతకాలం పని చేసినారు కాబట్టి నా కోరికను మీరు మన్నించిన విధానం నాకు వింతగా తోచటంలేదు, మీరు నా కోరికను మన్నించకపోయినట్లయితే నాకాశ్చర్యంగా

ఉండేది నా పనిలో ఇప్పుడు సవర్ణుల సహాయం అపేక్షిస్తున్నాను నెల్లూరు పౌరులు నాకు సహాయం చేయగలరని ఆశిస్తున్నాను వారు ఇట్లా చేయకపోయి నట్లయితే నేను చాలా విచారపడతాను మీరీనాడు నాకిచ్చిన విరాళమే మీరు నాకు చేయనున్న సహాయానికి చిహ్నము '

"ఛార్ అసోసియేషన్ వారు నాకిచ్చిన స్వాగతపత్రం నేనిప్పుడే చదివి నాను భారతీయులలో నేడు త్రివిధాలయిన అభిప్రాయాలు కలవని వారు చెప్పిన దానితో నేనంగీకరిస్తున్నాను ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతులను కొత్త విలువల దృష్టితో యోచించవలెననే వారభిప్రాయంతోనైతం నేనేకీభవి స్తున్నాను హిందూ ధర్మానికి ఇది పరీక్షా సమయం ఈ పరీక్షలో సనాతన పక్షం వారొక పక్కనున్నారు మనలో సనాతన ధర్మాన్ని చులకనగా చూసేవారె వ్వరూ లేరని నిశ్చయంగా చెప్పగలను సనాతన పక్షంవారు చెబుతూన్న విషయా లను సగౌరవంగా ఓర్పుతో విని వివిధ దృక్పథాలనుంచి విషయాలను ఆలోచనతో చర్చించి మనం సరియైన నిర్ణయానికి రావలె "

"ఆ స్వాగత పత్రంలోని మరొక విషయంగూడా నేను పేర్కొనవలసి ఉన్నది ఈ పవిత్రయజ్ఞంలో ఎవ్వరూ ఎవ్వరినీ ఏ విధంగాను ఎంతమాత్రం నిర్బంధించవలసిన అవసరం లేదు మనం శాసనాధికారం ద్వారా నిర్బంధం చేయకూడదు ఈ యజ్ఞంలో ఎవ్వరికి ఏ విధమయిన బాధ కలిగించటానికి నేను ఒప్పుకోను ఈ విషయంలో సత్యం, ప్రేమ, ధర్మాహింసల ఆదేశాలను ఉల్లం ఘించడంలేదని మనస్ఫూర్తిగా చెప్పగలను ఒకవేళ పొరపాటున ఏదయిన తప్పు చేసి ఉన్నట్లయితే భగవంతుడు నన్ను క్షమించగలడు నేను తీసుకొనే చర్య లలో ఏదయినా తప్పున్నట్లయితే వాటిని సరిచేసుకోవడానికి సంసిద్ధంగా ఉన్నాను "

"కాలప్రభావం అంటే ఏమిటో మీ అందరికీ తెలుసు కాలప్రవాహం ఆపేటందుకు ఎవరూ శక్తిమంతులు కారు ఈ మహోత్కృష్ట విషయం గమ నించి ఆ ఫలితాలను తొందరగా పొందేటందుకు కృషి చేయటం మన కర్తవ్యము దేవాలయ ధర్మాధికారులు అంగీకరించినప్పటికి హరిజన దేవాలయ ప్రవేశానికి కొన్ని అడ్డంకులు రావడంచేత వాటిని తొలగించుకొనేటందుకు ఇప్పుడు శాసనం చేయడం అవసరమయినది " ఈ ఉపన్యాసానంతరం మహాత్మాజీ తనకు బహూకరించిన వస్తువుల వేలంపాటతో "మామూలు వ్యాపారం" మొదలు పెట్టినారు రజిత పేటికను, సన్మానపత్రాన్ని, వడుకునూలును వేలం పెట్టగా 200 రూపాయలు వచ్చినాయి ఇంతవరకు హరిజననిధికి బంగారు నగలుగాక 8,000 రూపాయలు లభించినాయి

మహాత్మాజీ ఆ సభనుంచి కబడిపాలెంలోని హరిజన హాస్టల్‌కు పోయి అక్కడనుంచి రామకృష్ణ పరనమందిరానికి వెళ్ళి తరవాత రేబాల పట్టాభిరామి రెడ్డిగారింట్లో ఒక గంట విశ్రాంతి తీసుకొని గూడూరు మీదుగా వెంకటగిరికి రాత్రి 7½కు చేరినారు

**గాంధీజీకి వీడ్కోలు**

మహాత్మాగాంధీ నెల్లూరునుంచి వెంకటగిరి పోయె సమయంలో నెల్లూరు ట్రంకురోడ్డుపై సుమారు పదివేలమంది లాతీచౌక్ వద్ద (తిప్పరాజువారి సత్రం) గుమిగూడి గాంధీజీకి వీడ్కోలు చెబుతూ 116 రూపాయలు హరిజననిధికి సమర్పించి గాంధీజీ కారుపైన జయజయ నినాదాలతో పువ్వుల వాన కురిపించి నారు ఆయన దర్శనానికి తనివితీరక కారుకు అడ్డంగా నిలచిఉన్న పౌరులను దారి ఈయమని గాంధీజీ సైగచేయగా జనసమూహం వైదొలగి దారి ఇచ్చి నారు అంతట గాంధీజీ కారు నిరాటంకంగా వెంకటగిరి వెళ్ళిపోయింది

**వెంకటగిరిలో**

మహాత్మాగాంధీ తన పరివారంతో డిసెంబరు 30 రాత్రి 9 గంటలకు వెంకటగిరి చేరి కటికనేని సోదరుల గృహంలో బస చేసినారు వెంకటగిరి గ్రామం మామిడాకుల తోరణాలతోను, చలువపందిళ్లతోను, జాతీయ నాయకుల పటాలతోను రమ్యంగా అలంకరింపబడింది గాంధీజీ కారువెళ్ళే త్రోవలో ప్రజలనేకులు ఆయన దర్శనంకోసం మార్గానికి ఇరుపక్కల బారులు తీరి వేచి ఉన్నారు

డిసెంబరు 31వ తేది ఉదయం 6½ గంటలకు గాంధీజీ హరిజనపాఠశాలనికి వెళ్ళి అక్కడ హరిజన పఠనాలయానికి శంకుస్థాపన చేసినారు అక్కడి ప్రదేశమూ, ప్రజలూ పరిశుభ్రంగా ఉన్నందుకు గాంధీజీ సంతోషించినారు తరవాత రాండు బంగాళాకు వెళ్ళి ఫతేమైదానంలోని బహిరంగసభకు చేరినారు

అక్కడ గాంధీజీ వేదికపైన కూర్చున్న తరవాత పౌరుల పక్షాన శ్రీ కనుపర్తి నారాయణరావుగారు, తాలూకాబోర్డు పక్షాన శ్రీ కటికనేని కల్యాణ రావుగారు, జమీను రైతు పక్షాన శ్రీ పెట్టూరు గోవిందరెడ్డిగారు హరిజన సేవకసంఘం పక్షాన శ్రీ కటికనేని వెంకట్రామారావుగారు, యూనియన్ పంచాయతిబోర్డు పక్షాన శ్రీ మంగపతి వెంకటసుబ్బయ్యగారు స్వాగతపత్రాలను సమర్పించినారు

గాంధీజీ, హరిజనోద్యమం గురించి విపులంగా ఉపన్యసించినారు బహిరంగసభలో సుమారు 15 వేలమంది ఉన్నారు

**గాంధీజీ ఉపన్యాసము**

హరిజనోద్యమంలో అందరూ సంపూర్ణసహాయం చేయవలెనని గాంధీజీ కోరినారు తమలో తమకుగల విభేదాలను హరిజనులు విస్మరించవలెనని గాంధీజీ వారికి సలహా ఇచ్చినారు మాలలకు మాదిగలకు ఒకరిపొడ ఒకరికి గిట్టదని ఒకరి నూతిలో నీరు ఒకరు తాగరని వినవలసివచ్చినందుకు గాంధీజీ తన విచారం వెలిబుచ్చి తమలో తమకుగల అంటరానితనం మాన్పుకోవలెనని హరిజనులను మందలించినారు.

ఈ ఉపన్యాసం మద్రాస్ హిందీ ప్రచార సభకు చెందిన శ్రీ మోటూరి సత్యనారాయణ తెలుగులోకి అనువదించినారు సభలో హరిజననిధికి 500 రూపాయలు సమర్పించడం జరిగింది తాలూకాబోర్డు, పంచాయతీబోర్డు, జమీనురైతు సంఘాలవారు సమర్పించిన చిన్నచిన్న వస్తువులను సన్మానపత్రాలను వేలంవేయగా 100 రూపాయలు వచ్చినాయి

తరవాత మహాత్మాజీ ఆయన బృందం కాట్పాడి ప్యాసెంజరులో తిరుపతికి వెళ్ళినారు

నెల్లూరు జిల్లాలో 10,000 రూపాయల పైచిలుకు నగదు 14,000 రూపాయల విలువగల నగలు హరిజననిధికి చేకూరినాయి

**తిరుపతి తోవలో**

గాంధీజీ తిరుపతికి వెళ్ళే తోవలో అక్కుర్తి స్టేషన్‌లో కొంతమంది గ్రామస్థులు ఆయనను దర్శించి విరాళాలు సమర్పించినారు కాళహస్తి స్టేషన్‌లో కూడా రైలు ప్లాటుఫారంమీద ప్లాటుఫారంకు వెలుపల జనం గుమిగూడి ఉండి గాంధీజీని దర్శించినారు శ్రీ శేషయ్యచెట్టిగారు గాంధీజీకి పూలదండతో పాటు హరిజననిధికోసం కొంత విరాళం సమర్పించినారు

రేణిగుంట జంక్షన్‌లో గాంధీజీ ఆయనబృందం రైలునుంచి ప్లాటుఫారం మీద దిగగానే మద్రాస్ మాజీ ముఖ్యమంత్రి, చిత్తూరుజిల్లా హరిజన సేవక సంఘం అధ్యక్షుడు అయిన దివాన్‌బహద్దూర్ బొల్లిని మునుస్వామినాయుడు గారు సి దొరస్వామయ్యంగారు ఆయనను సత్కరించి దండలు వేసినారు

రేణిగుంట పౌరుల పక్షాన పి అప్పాదురై అయ్యర్‌గారు గాంధీజీ గౌరవార్థ మేర్పాటుచేసిన సన్మానసభలో ఆయనను పుష్పమాలాలంకృతుని చేసి హరిజననిధికి రూ 168-4-0 లు విరాళమిచ్చినారు రేణిగుంటలో సమావేశమయిన విద్యార్థులుసైతం గాంధీజీకి హరిజనాభ్యుదయానికి కొద్ది నిధిని ఇచ్చినారు

గాంధీజీ అక్కడ చేరిన వారందరికీ హరిజనోద్యమానికి తోడ్పడవలసిందని ఒక్క మాట చెప్పి తిరుపతికి మోటారులో వెళ్ళిపోయినారు

**తిరుపతిలో**

గాంధీజీ సపరివారంగా డిసెంబరు 31 ఉదయం 11 గంటలకు రేణిగుంట నుంచి కారులో తిరుపతి చేరినారు

తిరుపతిలోని వీధులన్నీ శోభాయమానంగా అలంకరించబడినాయి ముఖ్యవీధులన్నిట్లోను బాండుతో, సంకీర్తనలతో, ఇరవై భజన సంఘాలు ఊరేగుతూ బహిరంగసభ జరుగఉన్న పాఠశాలావరణకు చేరినాయి అక్కడ వేలకొద్దీ జనం క్రిక్కిరిసిపోయినారు గాంధీజీ సి దొరస్వామయ్యంగార్, దివాన్‌బహద్దూర్ మునుస్వామినాయుడుగార్లతో కలిసి సుమారు 11 గంటలకు సభాస్థల

మును చేరుకొన్నారు

అక్కడ తిరుపతి మున్సిపాలిటీవారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు 1016 రూపాయలు హరిజననిధికి విరాళం లభించింది శ్రీ సి వి రంగం చెట్టిగారు అతిథులకు అవసరమయిన భోజనాది వసతులను ఉచితం సౌకర్యాలను ఏర్పాటు చేసినారు

చిత్తూరు కే ఆర్ టాయిలెట్ కంపెనీలో పని చేస్తున్న ఇద్దరు హరిజన యువకులు సభలో జాతీయ గీతాలు పాడి గాంధీజీకి తమ ఫ్యాక్టరీలో తయారయిన రెండు టాయిలెట్ పాకెట్లను బహూకరించినారు గాంధీజీ వారిని ఆశీర్వదించి వారికి పండ్లు పూవులు ఇచ్చినారు యం శ్రీనివాసాచార్యులుగారు గాంధీజీకి ఖద్దరు నూలుదండ వేసి ఆయనకు సాష్టాంగ ప్రణామాలు చేసినారు శ్రీ కె ఆదిమూర్తిఆచారిగారు గాంధీజీకి పూలదండ వేసి తాను తయారుచేసిన చందనపు కర్రను కానుకగా ఇచ్చినారు ఆ కర్ర వెండి పిడిమీద గాంధీజీ పేరు రెండురాట్నాలు చెక్కబడి ఉన్నాయి అక్కడివారు ఆ విషయం గాంధీజీకి తెలిపినారు

మున్సిపల్ సన్మానపత్రం చదివినట్లుగానే భావించవలెనని చేర్మన్‌గారిని గాంధీజీ కోరినారు కాని చెర్మన్ సుబ్బారెడ్డిగారు రెండు నిమిషాలలో ముగిస్తానని అనుజ్ఞ నీయవలసిందని గాంధీజీని ప్రార్థించినారు అందుకాయన సమ్మతించి చేర్మన్‌గారు సన్మానపత్రం చదువుతూన్నంతవరకు చేతిలో గడియారం ఉంచుకొని దానివంక చూస్తూనే ఉన్నారు చేర్మన్ సరిగా రెండు నిమిషాలలో సన్మానపత్రం చదవడం ముగించినందుకు గాంధీజీ చిరునవ్వుతో ఆయనను అభినందించినారు

సి ఏ రహీమ్ అనే మహమ్మదీయ యువకుడు చేతిగోటితో తెల్లని కాగితం మీద గీసిన మహాత్ముని చిత్ర పటాన్ని గాంధీజీకి సమర్పించినారు అపరోక్షం శ్రీనివాసాచారిగారు తాను తయారుచేసిన వెండి తకిలీని, ఖద్దరు దండను గాంధీజీకి బహూకరించినారు

## గాంధీజీ ఉపన్యాసము

గాంధీజీ సన్మాన పత్రానికి జవాబుగా హిందీలో ఉపన్యసించినారు మోటూరి సత్యనారాయణగారు తెలుగులోకి అనువదించినారు

"నేను పవిత్ర స్థలానికి రావటం ఇది మొదటిసారికాదు మొట్ట మొదట నేనిక్కడకు వచ్చినప్పుడు నాకు కలిగిన మధుర స్మృతులను నేను మరువజాలను మీ సన్మాన పత్రానికి, విరాళానికి కృతజ్ఞుణ్ణి ఇక్కడ వేనకు వేలుగా సమావేశమయి ఉన్నవారు హరిజనోద్యమానికి తగినంత విరాళం ఇచ్చి ఉండలేదు ఇప్పుడు మీరిచ్చిన సొమ్ము అందరూ కలసిఇచ్చి ఉన్నట్లయితే అది చాలా తక్కువనే చెప్పవలె మీరిచ్చే వస్తువుల ద్వారా తక్కువ బడిన మొత్తం పూర్తి చేయగలరని ఆశిస్తున్నాను. ఇక్కడున్న సోదరీమణుల దగ్గరకు

స్వచ్ఛంద సేవకులు వెళ్ళినప్పుడు వారికి తమనగలను ఇవ్వవలెనని కోరుతున్నాను మీరు నాకిచ్చిన విరాళం బట్టి మీరు అస్పృశ్యతా నివారణోద్యమంలో పాల్గొంటున్నారని నా విశ్వాసము ఒకరు తక్కువ అనే భేదం లేకపోవడం ఆత్మ పరిశుద్ధతకు తార్కాణము ఇంతకంటె ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదు ఇప్పటికే చాలా ఆలస్యమయింది ఎక్కువకాలం మిమ్ములను నిలపడం నాకిష్టం లేదు" అని ఆయనకు బహూకరించిన వస్తువులను వేలం పెట్టినారు మున్సిపల్ సన్మాన పత్రానికి 15 రూపాయలు వచ్చింది హరిజన సంఘంవారు సమర్పించిన సన్మాన పత్రానికి 5 రూపాయలు వచ్చింది గంధపు కట్టను గాంధీజీ చేత పుచ్చుకొని 'ఇది ఇతరులను హింస పెట్టని లాఠీ తొందర్లు కలగజేయని లాఠీ' అని వేలం పెట్టగా సి దొరస్వామయ్యంగార్ 35 రూపాయలకు కొన్నారు వస్తువులను వేలం వేయగా వచ్చిన మొత్తం రూ 99-8-0 సభలో యం కృష్ణాచార్యులుగారు మరొక రూ 26-4-0లు విరాళ మిచ్చినారు

తరవాత గాంధీజీ తాను బసచేసిన దేవస్థాన సత్రానికి వెళ్ళినారు భోజనానంతరం కొందరు ప్రముఖులతో గాంధీజీ ఇష్టాగోష్ఠి సభ జరిపినారు తిరుపతి దేవస్థానం కమిటీ సభ్యుడు టి ఎ రామలింగంచెట్టి, తిరుపతి దేవస్థాన కమిషనర్ రావుబహద్దూర్ కె సీతారామిరెడ్డి, ఆచార్య పురుషులు టి కె నరసింహాచారి, టి కె అలసింగేశ వర్ధతాతాచారి, దివాన్ బహద్దూర్ బి మునుస్వామినాయుడు, సి దొరస్వామయ్యంగార్, యం అనంత శయన మయ్యంగార్, యం కృష్ణమాచారి, యం సింగరాచారి మొదలయిన వారున్నారు

హరిజనులు తిరుపతి దేవాలయంలో ప్రవేశించే సమస్యను గురించి చర్చ జరిగింది హరిజనులకు అటువంటి అనుమతి ఇవ్వడంవల్ల ఆచరణలో కొన్ని చిక్కులున్నాయని గాంధీజీతో కొందరన్నారు 'యూరోపియన్‌లు కొండ ఎక్కుతున్నప్పుడు హరిజనులు ఎందుకెక్కకూడదు" అని గాంధీజీ నేరుగా అక్కడున్నవారిని ప్రశ్నించినారు ఇంతవరకు హరిజనులెవ్వరూ కొండ ఎక్కటందుకు అనుమతిని కోరలేదని కమిషనర్ అన్నారు హరిజనులు స్వేచ్ఛగా కొండ ఎక్కటందుకు మొట్టమొదట అనుమతిస్తూ తరవాత దేవాలయం కూడా దర్శించేటందుకు అవకాశం కల్పించవలెనని గాంధీజీ దేవాలయ పరిపాలకులను కోరగా దేవాలయ కమిషనర్ అంగీకరించినట్లు 1934 జనవరి 2 "హిందూ" పత్రికలలో ప్రచురించడం జరిగింది

కాని జనవరి 5వ తేది "హిందూ" పత్రికలో తిరుపతి దేవస్థాన కమిషనర్ ఆ వార్తను ఖండిస్తూ "గాంధీజీ, యూరోపియన్‌లు కొండ ఎక్కుతూండగా హరిజనులు ఎందుకు ఎక్కగూడదని నన్ను ప్రశ్నించినప్పుడు ఆదిద్రావిడులు కొండ ఎక్కకూడదనే నిషేధం ఆచారంగా వస్తున్నదని, ఆ ఆచార ప్రకారం వారు అలిపిరి (Alipiri) వరకే ఎక్కవచ్చును గాని పైకి ఎక్కకూడదని, అన్నాను అంతేగాక అధికార రీత్యా వచ్చే యూరోపియన్‌లు కాక తక్కిన యూరోపియన్ లందరూ కొండ ఎక్కే ముందు దేవస్థానాధికారుల అనుమతిని

పొందవలసి ఉంటుందని కూడా చెప్పినాను. తిరుమల తిరుపతిదేవస్థానాల చట్టంలో సువ్యవస్థితాలయిన దేవాలయ ఆచారాలకు భిన్నమయిన పనులు జరగ కూడదని ప్రత్యేకం ఒక నిబంధన ఉన్నదని కూడా నేను మహాత్మాజీకి మనవి చేసినాను '

దేవస్థాన సభలో జరిగిన ఇష్టాగోష్ఠి అనంతరం పుల్లయ్యచెట్టి గాంధీజీకి ఒక వెండి గిన్నెను బహూకరించినారు దానిని ఆయన అప్పుడే వేలం పెట్టగా కమీషనర్ సీతారామిరెడ్డి 14 రూపాయలకు కొనేసినారు

మహాత్మాజీ తిరుపతి నుంచి బయలుదేర బోతూండగా నలుగురు ఆయన చేవ్రాలును తీసుకొని 20 రూపాయలిచ్చినారు బెంగుళూర్ సెంట్రల్ కాలేజీ ప్రొఫెసర్ రామస్వామయ్యంగారు, ఆయన భార్య గాంధీజీని దర్శించి ఆయనను అభినందించినారు

చిత్తూరు జిల్లాలో వసూలయిన మొత్తం రూ 1424-10-2 లు

గాంధీజీ చిత్తూరుజిల్లా పర్యటన ముగించుకొని కడపకు పోవలెనని తిరుపతి నుంచి రేణిగుంట స్టేషన్‌కు శ్రీ మునుస్వామినాయుడు, దొరస్వామయ్యంగార్, అనంతశయనమయ్యంగార్, కె రాజగోపాలాచారిగార్లతో కలసి రేణిగుంట స్టేషన్‌కు వెళ్ళినారు

# 19
# కడపజిల్లాలో-1934

గాంధీజీ, ఆయన పరివారం తిరుపతి నుంచి రేణిగుంట మీదుగా రైలులో కడపకు వెళ్ళుతూండగా సెట్టిగుంట రైలు స్టేషన్‌లో జిల్లా కాంగ్రెస్ కమిటీ వైస్ ప్రెసిడెంట్ వెంకోబారావుగారు ఆయనను కలుసుకొన్నారు ప్రతి రైల్వే స్టేషన్‌లోను ప్రజలత్యుత్సాహంతో ఆయనను ఆహ్వానించినారు

రాజంపేట రైల్వే స్టేషన్‌లో ఆ పట్టణ వాసులందరూ గాంధీ దర్శనం కోసం వేచి ఉన్నారు రాజంపేట యూనియన్ బోర్డువారు ఆయనకు పూల దండలువేసి స్వాగత పత్రం, హరిజన నిధికి విరాళం సమర్పించినారు స్వాగత పత్రం యూనియన్ బోర్డు ఉపాధ్యక్షుడు సుబ్బరాయచెట్టి చదివినారు

గాంధీజీ స్వాగత పత్రానికి సమాధానమిస్తూ హరిజన నిధికి విరాళ మిచ్చినందుకు కృతజ్ఞత తెలిపి, హిందువులలో నుంచి అస్పృశ్యతను నిర్మూలించవలెనని కోరినారు హిందూ మతానికి కళంకంగా ఉన్న అస్పృశ్యతను నాశనం చేయడం హిందువుల కర్తవ్య మన్నారు

ఆ తరవాత "గాంధీకీ జై" అనే నినాదాల మధ్య రైలు కూత వేసింది

**కడపలో**

1933 డిసెంబరు 31 రాత్రి 7-40 కి గాంధీజీ సపరివారంగా కడప చేరినారు జిల్లాహరిజనసేవాసంఘ అధ్యక్షుడు వకీలుసంజీవరెడ్డి గాంధీకి పూవులదండ వేసినారు కడప రైల్వేప్లాటుఫారం నిండా క్రిక్కిరిసిపోయినజనం గాంధీజీని జయ ధ్వానాలతో ఆహ్వానించినారు గాంధీజీ రైలుస్టేషన్ నుంచి త్రివర్ణ పతాకాలతోనూ, తోరణాలతోనూ రమ్యంగా అలంకరించిన మోటారు కారులో పోతూ ప్రజల అభినందనలను తన సహజ మందహాసంతో అందుకొని శాంతినికేతనానికి పోయి అక్కడ బస చేసినారు

శ్రీ డి వెంకటగిరిరెడ్డి మహాత్మాజీకి 116 రూపాయల విరాళం సమర్పించినారు 1934 జనవరి 2 సాయంకాలం వరకు ఆయన విశ్రాంతి తీసుకొన్నారు జనవరి 1, 2 తేదీలు ఆయన ఉత్తరాలు, హరిజన వ్యాసాలు వ్రాసుకొనేటందుకు ఉపయోగించుకొన్నారు

అస్పృశ్యతా నివారణలోని అంతర్యం

కడపలో గాంధీజీ విశ్రాంతి తీసుకొంటున్న రోజున వివిధ విధాలయిన అంతరాలతో ఉన్న ప్రస్తుత వర్ణ వ్యవస్థను సహించలేని కొందరు హరిజనులు ఆయనను కలుసుకొని నేటి వర్ణవ్యవస్థ ఉండవలెనని మీ అభిప్రాయమా? పోవలెనని అభిప్రాయమా? అని అడిగినారు

గాంధీజీ - హరిజనోద్యమం వర్ణ వ్యవస్థలోని అట్టడుగున ఉన్న చెడును పెకలించడానికి ప్రయత్నిస్తూన్నది అస్పృశ్యత పోయినట్లయితే ఈనాడు మనం చూస్తూన్న కులాలు కూడా పోగలవు

హరిజన మిత్రులు - అది ఎంతమాత్రం జరగదు

గాంధీజీ - నేను అంతిమస్థాయి నందుకొన్న అస్పృశ్యులను గురించి మాట్లాడుతున్నాను అస్పృశ్యత అనే చెడుగు ఏదో ఒక రూపంలో హిందూ సాంఘిక వ్యవస్థ అంతటిలోను వ్యాపించి హిందూ సంఘానికి అపచారం చేస్తున్నది అస్పృశ్యతకు మూలం ఎక్కువ తక్కువల నేభావమే అంతిమ స్థాయి నందుకొన్న అస్పృశ్యత పోయినట్లయితే తక్కినది పోయి తీరుతుంది అట్లా పోకపోయినట్లయితే, మన ఉద్యమమంతా ఒట్టి మాయ హెచ్చుతగ్గులనే వ్యత్యాసం పోనంతవరకు అస్పృశ్యత పోయిందని చెప్పడానికి వీలేలేదు

హరిజన మిత్రులు - ఇక మీరు సమర్థిస్తూన్న వర్ణాలమాటేమిటి?

గాంధీజీ - నిజమే! నేను వర్ణాలను సమర్థిస్తున్నాను వర్ణ వ్యవస్థను గురించిన నా వ్యాఖ్యానం మీరు తెలుసుకోవలె ప్రస్తుత కులవ్యవస్థకు, వర్ణ వ్యవస్థకు ఇత్తడికీ పుత్తడికీ ఉన్నంత భేదం ఉన్నది వర్ణమనేది ఆర్థిక సూత్రానికి సంబంధించినది అని నా అర్థము దానిని మనం అట్లా గ్రహించి ఉండవచ్చు గ్రహించకపోవచ్చు వర్ణ వ్యవస్థను పాటిస్తే మానవజాతి సుఖంగా ఉంటుంది దానిని పాటించనందున సంఘం విచ్ఛిన్నమవుతుంది అదే ఇప్పుడు ప్రపంచంలో జరుగుతున్న పని బలం గలవానిదే న్యాయం (హక్కు) అనే సిద్ధాంతానికి వర్ణ వ్యవస్థ పూర్తిగా వ్యతిరేకము అది గొప్పవాళ్లు తక్కువవాళ్లు అనే వ్యత్యాసాల నన్నిటిని రూపు మాపుతుంది

హరి - అయితే వర్ణానికి మీరు చెప్పే అర్థం మరెవరూ చెప్పటంలేదే!

గాంధీజీ - కావచ్చు మానవుని భావ పరిణామంతో పాటు మాటల అర్థాలు కూడా మారుతుంటాయి వర్ణవ్యవస్థను సిద్ధాంతీకరించిన మూల మంత్రంలో గానీ, వర్ణాలను గురించి చెప్పిన గీతలోగానీ నే చెప్పినఅర్థం స్పష్టంగా కనిపిస్తుంది సహ భోజన వివాహాలకు సంబంధించిన నియమాలకు వర్ణ వ్యవస్థతో ప్రత్యక్ష సంబంధంలేదు వర్ణవ్యవస్థలోని ప్రత్యేక లక్షణం వృత్తి

హరి - ప్రతివాడు తండ్రివృత్తినే అవలంబించేటట్లు నిర్బంధిస్తారా మీరు ?

గాంధీజీ - నేనుగానీ మరెవ్వరుగాని ఎవ్వరినీ అట్లా నిర్బంధించలేదు. నిర్బంధించడానికి గానీ, నిర్బంధించకపోవడానికి గానీ వర్ణ ధర్మం మానవ నిర్మితమైనది కాదు. మానవుని పునరుద్ధరణకు అది అత్యవసరము. అతడు దానిని పాటించకుంటే దాని ఫలితాన్ని అనుభవించగలడు. వర్ణాశ్రమ నియమాలను పాటించడానికీ, ఉల్లంఘించడానికీ అతనికి స్వేచ్ఛ ఉన్నది. ఆ వ్యవస్థను భారతదేశం కనిపెట్టింది. శతాబ్దాలకొద్దీ దానిని భారతీయులు తెలిసిఉండి విశ్వసనీయంగా అనుసరించినారు. నేడుకూడా అజ్ఞానంతోనో తప్పనిసరిగానో భారతీయులలో ఎక్కువమంది దానిని అనుసరిస్తూనే ఉన్నారు. ఆ సిద్ధాంతం ప్రకారం బ్రాహ్మణుడు భంగి ఇద్దరూ ఒకే స్థాయిలో ఉంటారు. తన విధిని తాను హృదయపూర్వకంగా విశ్వాసంతో నిర్వర్తించే భంగీ దేవుని కృపకు పాత్రుడవుతాడు. బ్రాహ్మణుడు ఎంత పండితుడయి నప్పటికీ తన ధర్మం సరిగా నిర్వర్తించకుంటే దేవుని కోపానికి గురిఅవుతాడు. వర్ణవ్యవస్థ అధికారాలను, హక్కులను ప్రసాదించటంలేదు. ధర్మం ప్రతిపాదిస్తున్నది. ధర్మశాస్త్రాన్నిగురించి దానికి విధేయులంగా ఉండటంవల్లనే నిజమయిన ప్రజాస్వామ్యం రూపొందుతుంది. అందువల్ల వర్ణవ్యవస్థలో దోషంలేదని నా అభిప్రాయము. ఒక వర్ణం గొప్పదీ మరొకటి తక్కువదీ అనే భావంలోనే దోషమున్నది.

హరి - మీరు వర్ణించిన వర్ణవ్యవస్థ కేవలం మీ ఊహలోమాత్రమే ఉన్నది. మా చుట్టూ గట్టిగా కరుడు కట్టిన కులాలు కనిపిస్తున్నాయి. వారంతా ఒకరికన్న ఒకరు మిన్న అనుకొంటున్నారు.

గాంధీజీ - అదే దురదృష్టం, నేను కేవలం కులవ్యవస్థకు, వర్ణవ్యవస్థకు ఉన్న ప్రధాన భేదం మీ ప్రశ్నకు సమాధానంగా చెప్పినాను. కులాలు మానవ నిర్మితాలు. అవి రోజురోజుకూ క్షీణిస్తున్నాయి. అవి పోయి తీరవలె. నేను వివరించిన వర్ణవ్యవస్థ నా ఊహలోనే ఉండిపోవచ్చు. కాని నేను వివరించిన వ్యాఖ్యానం మాత్రం ఊహాజన్యం కాదు. అది స్వతస్సిద్ధంగా మంత్రంలో ఉన్నది. భగవద్గీతలో వివరంగా చెప్పబడి ఉన్నది.

ఈ విధంగా ప్రతి సమావేశంలోను అస్పృశ్యతా నివారణోద్యమంలోని విశాలభావాన్ని గాంధీజీ వివరిస్తూనే ఉన్నారు.

ఒక సభలో గాంధీజీ "హరిజనులకు మంచి ఇండ్లు, ప్రత్యేకం మంచి నూతులు, పాఠశాలలు నిర్మించినంతమాత్రంతో మన కర్తవ్యం పూర్తయి నట్లుగా భావించకూడదు. మనమివన్నీ వారికిచ్చి వారిని అస్పృశ్యులుగానే ఉంచిన పక్షంలో ఇనుప గొలుసులకు బదులు బంగారు గొలుసులతో బంధించినప్పటికీ బానిస బానిసగానే ఉంటాడు. వారికి మనతోపాటు అన్ని సౌకర్యాలు కలుగజేయవలె. అంతేగాదు వారిని మనలో లీనం చేసుకోవలె. వారికీ మనకూ ఉన్న అంతరానికి సేతువు నిర్మించుకోవలె. ఈ వ్యత్యాసం మన మనసులనుంచి

తుడిచిపెట్టుకొంటేనేగానీ మనం ప్రారంభించిన పవిత్రీకరణోద్యమం పూర్తయి నట్లు కాదు ఇది జరగనిది మనం సంతృప్తిపడి మిన్నకుండరాదు "

## గాంధీజీ స్వదేశీ ఎంపోరియం తెరవడం

1934 జనవరి 2న సాయంకాలం 6 గంటలకు గాంధీజీ కడప స్వదేశీ ఎంపోరియంకు ప్రారంభోత్సవం జరిపినారు ఆ చుట్టుపట్ల ప్రదేశాలనుంచి జనం ఆయన దర్శనార్థం రస్తాలలోను, ఇరుగుపొరుగు ఇండ్లమీదా నిలబడి ఉన్నారు బారిష్టర్ కృష్ణస్వామి గాంధీజీకి పూలదండ వేసినారు గాంధీజీ ఎంపోరియం తలుపులను తెరిచి అది శీఘ్రంగా వర్ధిల్లవలెనని ఆశీర్వదిస్తూ అక్కడ చేరిన వారందరినీ ఖద్దరు ధరించటం వారి ప్రథమ కర్తవ్యంగా భావించ వలెనని ఉద్బోధించినారు

అటుతరవాత ఆయన మునిసిపల్ పాకీవారి వాడకు వెళ్ళినారు అక్కడ కడప పురపాలక సంఘాధ్యక్షులు బి సయ్యద్‌సాహెబు, ఉపాధ్యక్షుడు యస్ కృష్ణస్వామి బార్‌ఎట్‌లా గాంధీజీకి స్వాగతం చెప్పి ఆయనకు ఆ వాడంతా చూపించినారు పాకీవారి వాడ అభివృద్ధిని చూసి గాంధీజీ సంతోషించినారు

తరవాత గాంధీజీ మున్సిపల్ హైస్కూల్‌లోని బహిరంగసభా సమావేశా నికి వెళ్ళినారు కడప మున్సిపాలిటీ పక్షాన చేర్మన్ శ్రీ సయ్యద్‌సాహెబు, జిల్లాబోర్డు పక్షాన డి రామసుబ్బారెడ్డి, రాయలసీమ నిమ్నజాతుల సంఘం పక్షాన డాక్టర్ గంగాధరశివగారు గాంధీజీకి స్వాగతపత్రాలు సమర్పించినారు జిల్లా ప్రజల పక్షాన జిల్లాబోర్డు ప్రెసిడెంట్ 1120 రూపాయలు హరిజననిధికి విరాళంగా ఇచ్చినారు

గాంధీజీ సన్మానపత్రానికి జవాబిస్తూ హరిజననిధికి సమర్పించిన విరాళా నికి కృతజ్ఞత తెలిపినారు కడప మునిసిపాలిటీవారు పాకీవారికి చక్కని ఇండ్లను కట్టించినందుకు వారిని అభినందించినారు ఆ హరిజన వాడ చక్కగా పరి శుభ్రంగా ఉన్నదని, దానిలో ఒక సహకార సంఘము, ఒక దేవ లయము, మంచినీటి సౌకర్యాలు ఉన్నాయని చెప్పి గాంధీజీ తమ సంతృప్తిని వెలిబుచ్చి నారు

సరిగా ఈ సమయంలో జనం ఒత్తిడి ఎక్కువ కావటంవల్ల సభలో అలజడి జరిగింది వెంటనే గాంధీజీ సన్మానపత్రాన్ని వేలంవేసి సభా కార్యక్రమం ముగించినారు

కడపలో ప్రొఫెసర్ మల్కానీ మొదలయిన వారితోపాటు గాంధీజీతో బెజవాడ గోపాలరెడ్డి, బొమ్మా శేషరెడ్డి, మేనకూరి సీతారామిరెడ్డి, లేబూరు సుబ్బరామిరెడ్డిగార్లు కూడా ఉన్నారు

కడపలో గాంధీమహాత్ముని మౌనవ్రతంరోజున ప్రొఫెసర్ మల్కానీ, బెజవాడ గోపాలరెడ్డి, బొమ్మా శేషురెడ్డిగార్లు అస్పృశ్యతా నివారణ గురించి ఉపన్యసించినారు.

కడపనుంచి గాంధీజీ, ఆయన బృందము జనవరి 2వ తేది రాత్రి 8-25 గంటలకు రాయచూర్ ప్యాసింజర్ మూడో తరగతి బండిలో గుత్తికి బయలు దేరి వెళ్ళినారు

## గుత్తి తోవలో

కడపనుంచి గుత్తికి పోయే తోవలో గంగాయపల్లె స్టేషన్ వద్ద రాత్రి 8 గంటలవేళ ప్రజలనేకులు మహాత్ముని దర్శనానికి వేచిఉన్నారు గాంధీజీ నిద్రలో ఉండటంచేత ప్రజలాయనను దర్శించటానికి వీలు లేకపోయింది

వల్లూరు గ్రామంలోని శ్రీరామకృష్ణశారదా పఠనమందిరం, శ్రీ సీతా రామచంద్ర గ్రంథాలయంవారి పక్షాన శ్రీయుతులు పోలేపల్లి వెంకట సుబ్బయ్య శ్రేష్ఠిగారు మహాత్మునికి స్వాగతపత్రాన్ని కానుకలను మహాత్ముని కార్యదర్శిగారికి సమర్పించినారు మహాత్ముడు విశ్రమించినందున అక్కడి ప్రజలుకూడా ఆయనను దర్శించలేకపోయినారు

గాంధీజీ జనవరి 3వ తేది ఉదయం 3 15 నిమిషాలకు గుత్తి రైలు స్టేషన్‌కు చేరినారు శ్రీయుతులు కల్లూరి సుబ్బారావు, రాజా వెంకట్రామయ్య ఆయనను స్టేషన్‌లో కలుసుకొని అక్కడనుంచి పెద్ద వడుగూరుకు కారులో తీసుకొని వెళ్ళినారు అప్పుడు ఉదయం 4½ అయింది వేలకొద్దీ గ్రామస్థులు ఆయన దర్శనంకోసం వేచిఉన్నారు పరిసరాలలో ఉన్న గ్రామస్థుల పక్షాన చిన్ననారపరెడ్డి ఒక సన్మానపత్రంతోపాటు రూ 1116లు విరాళం సమర్పించి నారు

మహాత్మాజీ తనకు సన్మానం, విరాళం సమర్పించినవారికి కృతజ్ఞత తెలుపుతూ, ఆ విరాళం కీ శే కేశవపిళ్ళెగారి స్మృతి చిహ్నముగా హరిజనుల నిమిత్తం నిర్మింపబడిన కేశవ విద్యానిలయానికి ప్రత్యేకించి ఇవ్వడానికి తనకేమీ అభ్యంతరం లేదన్నారు అయితే ఆ పాఠశాలకు సంబంధించిన ప్రణాళిక ఆచరణయోగ్యంగా ఉండి దానిని నడపడానికి తగిన కార్యకర్తలు కూడా లభించవలెనన్నారు ఆ సొమ్మును హరిజనుల విద్యాభివృద్ధికి వారి అభ్యుదయా నికి అవసరమయిన ఇతర సౌకర్యాలకు కూడా ఉపయోగిస్తామని చెబుతూ ఇంకా ఇట్లా అన్నారు "సవర్ణులింతకుపూర్వం హరిజనులపట్ల చూపిన నిర్ల క్ష్యానికి వారిపట్లచేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా నడపబడుతున్న ఈ పవిత్రీ కరణోద్యమం శారీరకమయిన అంటరానితనం పోగొట్టినంత మాత్రాన కానీ, వారికి కొంత సొమ్ము ఇచ్చినంత మాత్రానకానీ పరిపూర్తి కా నేరదు ముఖ్యంగా హెచ్చుతగ్గులనే భావము, స్పృశ్యులు, అస్పృశ్యులు అనే భేదం మన మనసులలోనుంచి పారదోలవలసి ఉంది ప్రజలకు మానసిక నిగ్రహం ఉంటే ఇది చాలా తేలికయిన పనే కాని సాధారణంగా ఉండదు అందువల్లనే మనకీ చిక్కులు వస్తున్నాయి అస్పృశ్యత కొనసాగితే హిందూమతం అదృశ్య మవుతుంది హరిజనోద్యమంలో అందరూ పాల్గొనేటందుకు తగిన ఉత్సాహం,

ధైర్యం భగవంతుడు ప్రసాదించుగాక "

ఈ ఉపన్యాసానంతరం కర్నూలు జిల్లా నల్లమేకలపల్లి గ్రామమునుంచి పెద్దవడుగూరు వరకు నడిచి వచ్చిన ఒక యువకుడు గాంధీజీకి హరిజన నిధికై 80 రూపాయలు సమర్పించగా ఆయన తన సంతోషం వెల్లడించినారు

సన్మాన పత్రం, వ్యాసపీఠమును (Book stand) వేలం వేయగా శ్రీ రామిరెడ్డి గారు వాటిని కొన్నారు తాడిపత్రి మున్సిపల్ హైస్కూలు డ్రాయింగ్ మాస్టర్ శ్రీ శ్రీనివాసన్ ఒక బియ్యపుగింజపైన గాంధీజీ బొమ్మను చెక్కి ఆయనకు సమర్పించగా ఆయన దానిని స్వీకరించి మరొకచోట వేలం వెడతానన్నారు

## గుత్తిలో

గుత్తి హైస్కూల్ మైదానంలో ఏర్పాటయిన బహిరంగసభకు గాంధీజీ చేరగానే ప్రజలత్యుత్సాహంతో ఆయనకు స్వాగతం చెప్పినారు కొంతమంది హరిజన బాలురు తెలుగు పద్యాలు చదవగా గాంధీజీ చాలా ఆనందించినారు హరిజన సేవకసంఘంవారు, గుత్తి పౌరులు హరిజననిధికి చెరి 116 రూపాయలు సమర్పించి స్వాగత పత్రం చదివినారు గాంధీజీ వారికి కృతజ్ఞత చెబుతూ హిందూ మతాన్ని పీల్చి పిప్పిచేస్తూన్న అస్పృశ్యతా కళంకాన్ని తుడిచిపెట్ట వలెనని, అందుకోసం సవర్ణులలో నిజమయిన హృదయ పరివర్తనం కలగవలె నని అన్నారు

తరవాత ప్రజల పక్షాన శ్రీ సేతురావు సమర్పించిన స్వాగతపత్రం వేలంపెట్టగా దానిని శ్రీ సేతురావుగారే 10 రూపాయలకు కొన్నారు కడప నుంచి వచ్చే త్రోవలో గాంధీజీకి బహూకరించిన ఒక ఖద్దరు తువ్వాలను వేలం పెట్టగా 7 రూపాయలు వచ్చినాయి

గుత్తినుంచి గాంధీజీ సపరివారంగా బయలుదేరి గుంటకల్లుకు వెళ్ళినారు త్రోవలో తిమ్మనచెర్ల తోళ్ల పరిశ్రమ కర్మాగారమున్న హరిజనవాడకు చేరే సరికి 9-15 నిమిషాలయింది ఆ తోళ్ళ పరిశ్రమ యజమాని మనుమడు ఎ ఆర్ మహాదేవ అను ఏడేండ్ల బాలుడు గాంధీజీ మెడలో పూలదండ వేసినాడు మహాత్మాజీ చిరునవ్వుతో ఆ పిల్లవానితో 5 నిమిషాలు ముచ్చటించి తనకు కానుక ఏమి యీయగలవని అడిగినారు. వెంటనే ఆ బాలుడు తన బంగారు ఉంగరం మహాత్మునకు సమర్పించినాడు

## హరిజననిధి విరాళాలు

| | |
|---|---|
| తోళ్ళ పరిశ్రమ యజమానులు | రూ 116-0-0 లు |
| పరిశ్రమలో పనిచేసే హరిజనులు | రూ 50-0-0 లు |

ఆరికేరి బసమ్మ దాదాపు 150 రూ. విలువగల బంగారు నాను, రాళ్ళ పతకంతోసహా, శారదాబాయి 50 రూపాయల విలువగల రాళ్లుపొదిగిన చెవుల

కమ్మలు, నేనే చంద్రమ్మ 40 రూపాయల విలువగల చెవుల రాళ్ళ కమ్మలు, బడి లక్ష్మమ్మ 15 రూపాయల విలువగల జత బెండుకమ్మలు హరిజన నిధికి విరాళాలుగా సమర్పించినారు

శ్రీ వాగ్లదిన్నె నరసాచారి స్వాగత పత్రం సమర్పిస్తూ అస్పృశ్యతా నివారణోద్యమం గురించి కీర్తనను చదివినారు తరవాత గాంధీజీ 10 నిమిషాలు మాట్లాడి పరిశ్రమాలయంలోకి వెళ్ళి పనులు జరుగుతున్న విధానం పరిశీలన చేసి వివరాలు వినగోరగా ఆరికేరి రాయప్పగారు ఆ విషయాలు చెప్పి గాంధీజీని ఆనందింప చేసినారు

## గుంటకల్లులో

గుంటకల్లు పౌరులు బహిరంగసభలో హరిజన నిధికి 467 రూపాయలు సమర్పిస్తూ ఒక సన్మానపత్రం కూడా చదివినారు మహాత్మాజీ వారికి కృతజ్ఞత చెప్పి ఇతర జిల్లాలలోవలెనే స్త్రీలు ఆ జిల్లాలో కూడా హరిజన నిధికి నగలు సమర్పించవలెనని కోరినారు ఒక చిన్న బిడ్డ ఆయనకు 5 రూపాయలిచ్చింది అది తీసుకొని ఆశీర్వదిస్తూ ఆయన ఆమె చేతిలో ఒక నారింజపండు పెట్టినాడు

తరవాత ఆయన సన్మాన పత్రాలను తనకు వచ్చిన ఒక ఖద్దరు బట్టను వేలం వేయగా 18 రూపాయలు వచ్చినాయి

తరవాత గాంధీజీ సపరివారంగా ఉరవకొండకు బయలుదేరి వెళ్ళినారు, తోవలో కోనల కొండలో 118 రూపాయలున్నూ, వజ్రకరూరులో సన్మాన పత్రంతో సహా 90 రూపాయలు, హరిజన నిధికి లభించినాయి ఉరవ కొండలో పౌరులు, నేతవారు, కేశన్నగార్లుకలసి హరిజననిధికి 560 రూపాయల పైచిలుకు మొత్తం గాంధీజీకి సమర్పించినారు ఆయన అది స్వీకరించి "భవిష్యత్తులో మీరు చేయవలసిన పనికి ఇవి పరిగణించరాని చిహ్నాలు మాత్రమే మీ హృదయ పరివర్తనమే నిజంగా కావలసిన పని అందరూ సమానులనే భావం మీకు కలిగినప్పుడు అది ఎంతో తేలికవుతుంది' అని ఉపన్యసించినారు అప్పుడు అంతకంతకు జనం ఒత్తిడి ఎక్కువై అలజడి కలిగినందువల్ల గాంధీజీ తన ఉపన్యాసం ముగించి తన దగ్గరున్న వస్తువులను వేలం పెట్టగా 80 రూపాయలు చేకూరినాయి

తరవాత ఆయన హైస్కూలుకు పోయి విశ్రాంతి తీసుకొన్నారు అనంతపురం జిల్లాలో ఆయనకు లభించిన మొత్తం చిల్లర వసూళ్లతో సహా 8,000 రూపాయలు

### హరిజన యాత్ర-అనంతపురంజిల్లా

### శ్రీ కల్లూరి సుబ్బారావుగారి అనుభవాలు

అనంతపురంజిల్లాలో గాంధీజీ హరిజన యాత్రను గురించి శ్రీ కల్లూరి సుబ్బారావు గారు ఇట్లా వ్రాసినారు

"గాంధీజీ హరిజన యాత్ర సందర్భంలో అనంతపురం వచ్చినప్పుడు (శ్రీ) గెలెటీ జిల్లా కలక్టర్‌గా ఉన్నారు ఆయనకు గాంధీపట్ల భక్తి, ఆయన నిర్మాణ కార్యక్రమంలో ప్రీతి ఉన్నది గాంధీజీని తన అతిథిగా ఉంచుకో వలెననే కోరికతో నన్ను పిలిచి గాంధీజీకి ఆ విషయం వ్రాసి వారి అనుమతి పొందండి అని చెప్పినారు నేనా విషయం గాంధీజీకి వ్రాయగా ఆయన సమ్మ తించినారు అది నేను గెలెటీ గారికి చెప్పినాను గెలెటీగారు గాంధీజీని తనకు అతిథిగా ఉంచుకుంటానని ప్రభుత్వం వారికి వ్రాసినారు ప్రభుత్వంవారు గాంధీజీ బ్రిటిషు ప్రభుత్వానికి విరోధి కాబట్టి ఆయనను అతిథిగా ఉంచుకొంటే కలిగే కష్టనష్టాలకు తాను బాధ్యుడు కావలసి వస్తుందని గెలెటీకి వ్రాసినారు ఆ తరవాత కలెక్టర్ నన్ను పిలిచి జరిగిన సంగతి చెప్పినారు నేనా విషయం గాంధీగారికి కడపలో చెప్పి తగిన ఏర్పాట్లు చేస్తానని గెలెటీగారితో అన్నాను అనంతపురంలో కలెక్టర్ ఆఫీసుకు ఎదురుగా ఉన్న జిల్లా బోర్డు హైస్కూలులో గాంధీజీకి విడిది ఏర్పాటు చేసినారు జిల్లాబోర్డు హైస్కూలుకు అదే ప్రథమ గృహప్రవేశం కావడం చేత జిల్లా బోర్డువారు, ప్రజలు కూడా చాలా సంతోషించినారు

గాంధీజీకి గెలెటీ వ్రాసిన ఉత్తరంలో ఆయనకు ఎట్లాగయినా సరే తమ ఇంటికి దయచేయ వలసిందిగా కోరినారు గెలెటి దంపతులు వచ్చి తనను ఆహ్వానించినట్లయితే తాను వారి ఇంటికి పోవడానికి గాంధీజీ అంగీకరించినారు ఈ విషయం మళ్ళీ గెలెటీ గారికి తెలియ జేసినాను ఆయన సంతోషంతో డి యస్ పిని పిలిచి గాంధీజీ పర్యటన సందర్భంలో కల్లూరి సుబ్బారావుగారిచ్చిన కార్యక్రమం ప్రకారం సర్వ విధాల సహకరించవలసిందని చెప్పినారు కాని డి యస్ పి, ఆయన కింది ఉద్యోగులు పెద్దవడుగూరులో (శ్రీ) చిన్నారెడ్డి గారి ఇంటికి గాంధీజీని తీసుకొని వెళ్ళితే అతని ప్రతిష్ఠ పెరుగుతుందని అందువల్ల ఆయనను అతని ఇంటికి తీసుకొని వెళ్ళవద్దనీ నాతో చెప్పినారు అంతటితో ఆగక గుంటకల్లు నుంచి ఉరవకొండకు పోయే తోవలో గాంధీజీని వజ్రకరూరులో ఆపకూడదని కూడా చెప్పినారు నేనందుకు అంగీకరించక 'గాంధీజీని పెద్దవడుగూరుకు తీసుకొనిపోక తప్పదనీ, చిన్నారెడ్డి వంటివారిని ధర్మ వరులుగా మార్చడానికి గాంధీజీని అక్కడకు తీసుకొని పోతున్నాననీ, ఈ పని గాంధీజీకి తెలిపే చేస్తున్నాననీ కలెక్టర్‌తో స్పష్టంగా చెప్పినాను కలెక్టర్ గెలెటీ నాతో ఏకీభవించి 'సుబ్బారావు చెప్పినట్లు చేయవలసిందని' డి యస్ పికి ఉత్తరువు చేసినారు. ఆనాడు వజ్రకరూరులో రెండుబలవత్తర మయిన పార్టీ లున్నాయి కొన్ని దోపిడీలు, కూనీలు కూడా జరిగినాయి ఆ రెండు కక్షల వారు ఒకే ఆవరణలో చేరినట్లయితే కల్లోలం కలగవచ్చుననే భయం కూడా ఉన్నది గాంధీగారి రాకను గురించి నేనా రెండు పక్షాల వారికి ముందుగా వెళ్ళి చెప్పినాను లోకోత్తర పురుషుడయిన గాంధీజీ రాక సందర్భంలో ఉభయ పక్షాలవారు ప్రశాంతంగా ఉండగలమని హామీ ఇచ్చినారు వారి హామీని నేను

కలెక్టర్‌కు తెలియచేయగా వారు సంతోషించినారు

కడప నుంచి వచ్చే రైలు రాత్రి 12 గంటలకు తాడిపత్రి చేరుతుంది నేను తాడిపత్రిలో గాంధీగారున్న మూడవ తరగతి రైలుపెట్టె తలుపును తెరవడానికి ప్రయత్నించినాను గాంధీజీ, ఆయన బృందం లోపల నిద్రపోతు న్నారు మలాన్కీనీగారు మేల్కొని నేనెవరో తెలియక తలుపు తెరవకూడదని నన్నడ్డగించినారు ఆ చప్పుడు విని గాంధీజీ లేచి 'వారు మనవారే ఈ జిల్లావారు మనకోసమే వచ్చినారు లోపలకు రానీయండి' అని చెప్పినారు. వారితోపాటు నేను రైలులో ఎక్కి గుత్తి స్టేషన్‌లో దిగి గుత్తి నుంచి అనంత పురానికి గాంధీజీని సపరివారంగా తీసుకొని పోయేటందుకు కావలసిన మోటారు కార్లను సేకరించుకొని అనంతపురం నుంచి మళ్ళా గుత్తి స్టేషన్‌కు పోయినాను అప్పటికి రాత్రి ఒంటిగంటయింది అప్పుడే అందరమూ కలసి కారులో పెద్ద వడుగూరు వెళ్ళినాము

పెద్ద వడుగూరులో చిన్నారపరెడ్డి పలుకుబడిగల పెద్ద భూస్వామి, గాంధీ భక్తుడు గాంధీజీకి ఆయన పరివారానికి కావలసిన వసతులన్నీ ఆయన చక్కగా ఏర్పాటు చేసినారు ఆ రాత్రికే సుమారు 25 వేలమంది గాంధీజీ దర్శనం కోసం పెద్దవడుగూరు చేరినారు గాంధీ మహాత్మునితో సహా మేమందరం తెల్లవారుజామున 3 గంటలకు ఆవూరు చేరినాము గాంధీజీ చిన్నారపరెడ్డి మిల్లులోని ఇంట్లో బసచేసినారు తెల్లవారుజామున 4 గంటలకు ప్రార్థన జరిగింది బహిరంగ సభ ఉదయం 6 గంటలకే ఏర్పాటు చేయబడింది సభ సరిగా సూర్యోదయానికి ప్రారంభమయింది సభావేదిక ఒక పడవ ఆకారంలో ఉన్నది శ్రీ చిన్నారపరెడ్డి అనంతపురం జిల్లాలో ప్రఖ్యాతి గడించిన శ్రీ పట్టు కేశవ పిళ్లేగారి శిష్యుడు శ్రీ కేశవపిళ్లే కాంగ్రెస్ సంస్థాపననాటి కార్యదర్శులలో ఒకరు వారు మహాత్మా గాంధీపట్ల గాంధీగారి హరిజన సేవా కార్యక్రమంపట్ల అప్రతిమాన విశ్వాసం కలవారు వారు హరిజన సేవా సంఘానికి అధ్యక్షులుగా ఉండి ఆ విషయమై అందరికి జాబులు వ్రాస్తూ ఆకస్మికంగా స్వర్గస్థులయినారు గాంధీజీ రాక అవకాశం తీసుకొని కేశవపిళ్లే పేర కేశవ విద్యానిలయం అని హరిజన విద్యార్థి వసతి గృహం స్థాపించడానికి ఆ సభలో గ్రామస్థులు గాంధీజీకి రూ 1116 లు సమర్పించినారు (గాంధీజీ, దాతలిచ్చిన ధనాన్ని ప్రత్యేక కార్యాలకు వినియోగించ వచ్చునని సలహా ఇచ్చి ఆ సొమ్ము నా పరం జేసినారు ఈసొమ్ము వినియోగించడానికి గాంధీజీ చెప్పిన షరతులను ఇంతకు పూర్వం మరొకచోట ఉదాహరించినాము ) దానితోనే అనంతపురంలో హరిజన విద్యార్థి వసతి గృహం "కేశవ విద్యానిలయము" నే పేరుతో కేశవపిళ్లేగారి పేర స్థాపింప బడింది శ్రీ దామోదరం సంజీవయ్యగారు ఆ విద్యాలయంలో చదువు కొన్న విద్యార్థులలో ఒకరు

పెద్దవడుగూరులో సభ ముగించిన తరవాత గాంధీజీతో కలసి గుత్తికి వెళ్ళినాము. అక్కడ గాంధీజీ ఉపన్యసించిన తరవాత శ్రీ మాగంటి బాపినీడు

గారి భార్య శకుంతలమ్మగారు మద్రాస్‌నుంచి గుత్తికి గాంధీజీ దర్శనార్థం వచ్చి నారు ఆమె తన బంగారు ఆభరణాలన్నిటినీ గాంధీజీకి సమర్పించి ఇంటికి తులసి పూసలతో వెళ్లిన పుణ్యవతి

గుత్తినుంచి గుంటకల్లుకు వెళ్ళినాము గుంతకల్లు పంచాయతీ ప్రెసి డెంట్ తిమ్మారెడ్డిగారు, రాయప్పగారు, ఖద్దరు కృష్ణారావుగారు మొదలైన ప్రముఖులు గాంధీజీని ఊరిలోకి తీసుకొని పోయినారు ఆ ఊరిలో మొదటి సభ రాయప్పగారి తోళ్ల పరిశ్రమాలయంలో జరిగింది రాయప్పగారి చెల్లెలు ఆమె నగలన్నీ గాక కుమారుని ఉంగరం సైతం గాంధీజీకి సమర్పించింది

గుంటకల్లు, తిమ్మనచర్ల, గ్రామాల మధ్యనున్న ఆవరణలో బహి రంగ సభ జరిగింది పంచాయతీ బోర్డు ప్రెసిడెంట్ శ్రీ తిమ్మారెడ్డి గ్రామస్థుల నుంచి పత్తి విరాళంగా తీసుకొని తయారు చేయించిన యాభై ఖద్దరు తాను లను గాంధీజీకి సమర్పించినారు ఆ ఖద్దరును గాంధీజీ హిందూపురంలో వేలం పెట్టి అమ్మి వేసినారు తరువాత కొనగొండ్ల వెళ్ళినాము ఆ గ్రామంలో బలవత్తరమయిన రెండు కక్షలున్నాయి డి యస్ పి గారు మమ్మల్లను వెళ్ళ గూడదన్న ప్రదేశమదే ఉభయ కక్షలవారు వేరు వేరుగా గాంధీజీకి కానుకలు సమర్పించినారు ఉభయులు ఐక్యమత్యంతో ఉండి గ్రామాభివృద్ధికి పాటుపడ వలసిందని గాంధీజీ వారికి హితోపదేశం చేసినారు

తరవాత వజ్రకరూరు, ఉరవకొండ చూసుకొని అనంతపురం వెళ్ళి నాము అనంతపురం వీధులలోనే కొంత మంది గాంధీజీకి విరాళాలు సమర్పించి నారు గాంధీజీ జిల్లా బోర్డు హైస్కూలు భవనంలో విడిది చేసినారు కలెక్టర్ దంపతులు వచ్చి గాంధీజీ దర్శనం చేసుకొని తమ ఇంటికి రావలసిందని గాంధీ జీని ఆహ్వానించగా అనంతపురంనుంచి వెళ్ళేలోగా కలెక్టర్ గారి ఇంటికి రాగల నని గాంధీజీ అన్నారు కలెక్టర్ గారు హరిజన నిధికి ఎంత నిధి సమర్పించబోతు న్నారని నన్నడిగినారు నేనొక కార్డు మీద మహాత్ముని బొమ్మవేసి దానిపైన

"ఇంటికొక పువ్వను
ఈశ్వరుని కొక మాల
మనిషి కొక రూపాయి
మహాత్మునికొక భిక్ష"

అని వ్రాసి చూపించి కనీసం రూ 1116 లయినా ఈయగలనని చెప్పినాను ఆ దంపతులు చెరి ఒక రూపాయి ఇచ్చినారు ఆ ఉదయం 4 గంటలకు ప్రార్థన జరిగింది అనేక మంది కాంగ్రెస్ కార్యకర్తలు పాల్గొన్నారు సూర్యోదయం వేళ బహిరంగ సభ జరిగింది మహాత్ముని ఉపన్యాసం ప్రజలు నిశ్శబ్దంగా విన్నారు హరిజన నిధికి విరాళం రూ 1116 లకు పైచిలుకు వచ్చింది, గాం ధీజీ తన దగ్గరఉన్న వస్తువులను వేలం పెట్టగా ఆ సభలో ఉన్న నీలం సంజీవ రెడ్డిగారు కొన్నిటిని పోటీపడి కొన్నారు అప్పటి నుంచి ఆయన గాంధీజీ ఉద్యమంలో పాల్గొంటూ వచ్చినారు

తరవాత హరిజనవాడకు పోయి హరిజనుల మంచి నీటి సౌకర్యంకోసం నిర్మింప బడిన గాంధీ కొళాయికి ప్రారంభోత్సవం చేసినారు ఆ తరవాత గాంధీజీ తన బసకుపోయి విశ్రాంతి తీసుకొని రైలుకు పోయే ముందు కలెక్టర్ గారి ఇంటికి వెళ్ళినారు అక్కడ పది నిమిషాలు ఆలస్యమయినందువల్ల రైలు వెళ్ళిపోయి ఉంటుందని ఆయన అనుకొన్నారు నేను 15 నిమిషాలు ఆపవలసిందని కబురు పంపినానని గాంధీజీతో చెప్పినాను కలెక్టర్ దంపతులు సాగనంపగా గాంధీజీ రైలు స్టేషన్‌కు చేరినారు ప్రజలు ఆయన దర్శనంకోసం వేచి ఉన్నారు గాంధీజీలో రైలు కూర్చొని స్టేషన్ మాస్టర్‌ను పిలిచి ఆలస్యమయినందుకు మన్నించమని చెప్పినారు నేను గాంధీజీతో హిందూపురం వెళ్ళినాను

రైలు హిందూపురం 2½ గంటలకు చేరింది ప్రజలు రైలు స్టేషన్‌లో గాంధీజీకి ఘనమయిన స్వాగత మిచ్చినారు గాంధీజీతో సహా మేమందరము జయకీర్తిగారి ఇంట్లో విడిది చేసినాము తెల్లవారు జామున సరిగా 4½ గంటలకు ప్రార్థన జరిగింది ఉదయం 7 గంటలకు హైస్కూలు ఆవరణలో బహిరంగ సభ జరిగింది గాంధీజీ ఉపన్యాసమయిన తరవాత గుంతకల్లు నుంచి తెచ్చిన బట్టలు వేలం వేసినారు ప్రజలు ఉత్సాహంగా ఖద్దరు తానులు కొన్నారు హరిజన నిధికి అక్కడ రూ. 2,000 లభించినాయి సమావేశానంతరం గాంధీజీ ఐదు లాంతర్ల స్తంభానికి పోయి జ్యోతిని వెలిగించినారు

గాంధీజీ విడిదికి మైసూరు ప్రభుత్వాధికారి వచ్చి, ఆహ్వాన పత్రం సమర్పించి మైసూరు సంస్థానానికి రమ్మని కోరినారు

ఆ తరవాత గాంధీజీ, వారి బృందము మైసూరుకు వెళ్ళినారు

## గాంధీజీ హరిజన యాత్ర-కొన్ని ఉపాఖ్యానాలు (ANECDOTES)

రాజమహేంద్రవరంలో జరిగిన బహిరంగ సభానంతరం గాంధీజీ గోదావరి స్టీం లాంచ్‌లో కూర్చున్న తరవాత ఒక యువకుడు వచ్చి గాంధీజీని తెలుగులో సంతకంచేయమని కోరినాడు గాంధీజీ సాంబమూర్తిగారి వంకచూసినారు సాంబమూర్తిగారు "గాంధీ" అనే అక్షరాలు వ్రాసి ఇచ్చినారు గాంధీజీ దానిని దిద్ది యువకునికి ఇస్తూ "నా తెలుగు సంతకం బాగుందా" అన్నారు యువకుడు "చాలా బాగుంది" అన్నాడు గాంధీజీ నవ్వుతూ "బాగుండకేం జేస్తుంది" అన్నారు అంతట ఆ యువకుడు గాంధీజీకి చదరంగపు పెట్టె ఇవ్వబోయినాడు "చదరంగపు ఆట ఎవరికి తెలుసు" అన్నారు గాంధీజీ "నాకు తెలుసు" అన్నారు బులుసువారు "అయితే మీకు నేను భయపడవలసే ఉంటుంది" అన్నారు గాంధీజీ నవ్వుతూ సాంబమూర్తిగారు అప్పుడు చదరంగపు డబ్బీ విప్పి అందులోని బలాలను గాంధీజీకి తెలియ చెప్పినారు

* * *

రాజమండ్రి స్టేషన్‌లో రైలులోనుంచి చేయి చాచగానే ఒకాయన

చేతిలో నారింజపండు పెట్టగా "పైసాకి కాక్ హై అవుర్ దూస్ రేకి కాక్ నహీ" అన్నారు గాంధీ మరొకరు కొబ్బరి పెంకు ఉంగరమీయగా గాంధీజీ దానిని తన వేలి చివర ఉంచుకొని అందరికీ చూపుతూ "ఇది బంగారు ఉంగరం కంటె మంచిది" అని పైసాతో వేలం పాట ప్రారంభించగా తుదకు 2 50 రూపాయలకు అమ్ముడు పోయింది

* * *

మరొకరు గాంధీజీకి బంగారు ఉంగరం ఇవ్వగా దానిని చూసి "ఇది చాలా బాగున్నది దీనిని నా వేలికి పెట్టుకోవడం నాకిష్టంలేదు నేను నా వేలికి పెట్టుకొంటె యరవాడ జైలులో ఉన్న ముసలిది ఏమనుకొంటుందో" అంటూ ఆయన నవ్వు ఆపుకోజాలక పోయినారు

* * *

విశాఖపట్నం స్త్రీల సభలో ఒక బాలిక వచ్చి గాంధీజీకి ఖద్దరు మాల వేసి పోతూండగా గాంధీజీ ఆమె చేయి పట్టుకొని గాజులివ్వమన్నారు ఆమె మాట్లాడకుండా వెళ్ళిపోయింది ఆమె తండ్రి వచ్చి "మీరే తీసుకోండి" అన్నారు అప్పుడు అన్ని గాజులు నాకేనన్నారు గాంధీ 'ఒక్కటే' అన్నారు తండ్రి చుట్టూ ఉన్నవారు నవ్వినారు గాంధీగారు ఒకటే గాజు తీసుకొన్నారు

* * *

సాయంకాలం విశాఖపట్నం సముద్రతీరంలో జరిగిన బహిరంగసభలో ఒక విద్యార్థి తాను వ్రాసిన గాంధీజీ చిత్రపటం మహాత్మునికి సమర్పించగా ఆయన దానిని చూసి "ఇప్పుడు నేనిట్లా లేనే" అన్నారు

* * *

బుచ్చిరెడ్డిపాలెంలో కరెన్సీ నోట్లు చేతపట్టుకొని ఒక రెడ్డిగారు నిలిచి ఉండటం చూసి గాంధీజీ "ఆ నోట్లు నావి కాని నీవికావు" అన్నారు ఆయన తమకోసమే తెచ్చినానని గాంధీజీకి సమర్పించినారు

* * *

సామర్లకోట స్టేషన్ వద్ద గాంధీ మెడలో ఒక స్త్రీ పూలదండ వేయబోగా దానిని ఆయన చేతితో అందుకొని గాజులిమ్మని హిందీలో అన్నారు సాంబమూర్తిగారు ఆ విషయం ఆమెకు తెలుగులో చెప్పగా ఆమె చేతి గాజులు తీసి ఇచ్చింది

* * *

90 ఏళ్ళ వృద్ధురాలొకరు కండ్లు బాగా కనబడకపోయినా నడవలేక మహాత్ముని వద్దకు వచ్చి ఒక గాజుల జత సమర్పించి నమస్కరించింది "నీవు నాకంటె పెద్దదానవు ఈ ద్రవ్యం హరిజనోద్ధరణకు ఉపయోగపడుతుంది కాబట్టి మంచి పనే చేసినావు" అన్నారు గాంధీ మళ్ళా ఆమె గాంధీజీని ఒక సందేశ మివ్వవలెనని కోరింది గాంధీజీ డబ్బు కావలెనని కోరినారు వెంటనే ఆమె మెడలో ఉన్న గొలుసు తీసి దానిలోని తాళంచెవిని తీసుకొని గొలుసు మహాత్మునికి ఇచ్చివేసింది దానిని మెడలో వేసుకొని గాంధీజీ హిందీలో ఒక సందేశం వ్రాసి ఇచ్చినారు

* * *

బుచ్చిరెడ్డిపాలెంలో శకుంతల అనే ఒక బాలిక గాంధీజీ నగలు అడగగానే ఆయనకు తన గాజులిచ్చింది గాంధీ ఆమెను చేరదీసి "చూసినారా ఈ బాలిక తన నగలిస్తూన్నది" అన్నారు అనేకమంది స్త్రీలు నోట్లు ఇస్తూండగా 'నగలేవి' అని గాంధీగారనడం చూసి శకుంతల రెండవసారి గాంధీవద్దకు వచ్చి మరో రూ 116 లు ఇచ్చింది అట్లాగే మూడోసారి కూడా మళ్ళీ కొంత సొమ్ము ఇస్తూ గాంధీజీకి పూలదండ వేయబోగా ఆయన దానిని ఆమె మెడలోనే పడేటట్లు చేసినారు ఆ బాలిక తెల్లబోయి ఆ దండను మళ్ళీ గాంధీగారి చేతిలో పెట్టి వెళ్ళిపోయింది అందరూ నవ్వినారు

* * *

సామర్లకోటలో బ్రాహ్మణుల వేదపారాయణం ముగిసిన తరవాత అక్కడున్న ఒక స్త్రీని గాంధీజీ చూసి గాజు లివ్వమని కోరినారు దుర్గాబాయి గారు ఆ గాజులను తీయ ప్రయత్నించి "రావు"అన్నారు "అయినా ప్రయత్నించి చూడు" అన్నారు గాంధీజీ అప్పుడు ఆమె ఎట్లానో కష్టం మీద గాంధీజీకి ఆ గాజులు తీసి ఇచ్చింది ఆ స్త్రీ సాంబమూర్తిగారి గృహిణి సాంబమూర్తిగారు ఆ సమయంలో అక్కడ లేరు తరవాత కొద్ది క్షణాలలో వచ్చి జరిగిన సంగతి విని గాంధీజీతో "తిరిగి ధరింప వలదని చెప్పండి" అన్నారు గాంధీ "ఆ షరతు ఎప్పుడు ఉండనే ఉన్నది" అన్నారు సాంబమూర్తిగారు "ఆమె వద్ద ఉన్న ఆఖరు నగలివే తక్కినవన్నీ ఇదివరకే అమ్మివేసినా"నన్నారు గాంధీజీ తరచు తెలుగులో "డబ్బు" "నగలు" అని మందహాసం చేస్తుంటే స్త్రీల నగలు కుప్పలు కుప్పలుగా పడుతుండేవి

* * *

30-12-33 సాయంత్రం గాంధీజీ నెల్లూరులోని రేబాల సోదరుల ఇంటిలో బసచేసి 7 30 గంటలకు గుంటూరుకు బయలుదేరేముందు వారి అమ్మమ్మ గారిని చూడటానికి వెళ్ళి ఆమెతో "అమ్మా! నన్ను పెంచుకొనరాదా" అన్నారు. "అందుకు ఆక్షేపణేమిటి" అన్నారు ఆమె! "నా పొట్ట చాలా

పెద్దది! నాకు ఆకలి ఎక్కువ, నేను అన్నం తినను బంగారమూ, నగలూ తిని జీర్ణం చేసుకొన్న వాణ్ణి నాకు అహార్నిశలు నగలు కావలె" అన్నారు గాంధీజీ వెంటనే ఆమె పట్టాభిరామరెడ్డిగారి పత్నివంక చూసినారు అప్పుడు శ్రీమతి సుజాతమ్మగారు తన మెడలోని హారం గాంధీగారికి సమర్పించినారు

ఆ రాత్రి గూడూరు బహిరంగసభలో శ్రీ గోగినేని పిచ్చాయ్యనాయుడు గారు గాంధీజీకి రూ 116లు ఇచ్చినారు అప్పుడు శ్రీ గోపాలరెడ్డిగారు, నాయుడు గారిని గొప్ప అభ్రకపు వ్యాపారి అనీ, అభ్రకపు గనులలో ఆయనకు చాలా లాభం వస్తున్నదని గాంధీజీకి పరిచయం చేసినారు గాంధీజీ "అట్లా అయితే ఆ లాభంలో నాకు భాగం రావలెనే! లాభం వచ్చే ప్రతి కంపెనీలోను నేను భాగస్తుణ్ణి నేనెక్కడ ఉన్నా ఆ లాభంలో భాగం నాకు పంపుతుండండి సుమా' అని నాయుడుగారి వంక చూసినారు ఆ సభలోనే గాంధీజీకి ఒకరు ఫౌంటెన్ పెన్నును బహూకరించినారు గాంధీజీ దానిని వేలం పెట్టినారు పాట రూ 2కి వరకు పెరిగింది అప్పుడు గాంధీజీ "ఏం పెన్ను ఇది" అన్నారు పెన్ను ఇచ్చిన పెద్దమనిషి "ఏన్‌జిల్" (దేవదూత) అన్నాడు అంతట గాంధీజీ "ఏన్‌జిల్స్ (దేవదూతలు) అంత చౌకా ఇక్కడ, ఏన్‌జిల్స్‌ను చౌకగా పోనిచ్చి వాళ్ళను అవమానపరచకూడదు' అన్నారు పాట 5 రూపాయల వరకు పెరిగింది "సరే! 5 రూపాయలకి ఏన్‌జిల్ తీసుకో రొక్కపు బేరం సుమా" అని గాంధీజీ చేయి చాపినారు

* * *

30-12-33 మధ్యాహ్నం బుచ్చిరెడ్డిపాలెంలో సభ జరుగుతూ ఉండగా బెజవాడ రామిరెడ్డిగారు 230 రూపాయల నోట్లను చేతిలో పెట్టుకొని గోపాల రెడ్డితో మాట్లాడి అవి గాంధీగారి వసూళ్ళకు సంబంధించినవి కావని తెలుసుకొని జేబులో పెట్టుకొన బోతూండగా గాంధీజీ దూరంనుంచి చూసి "నాకివ్వడానికి తెచ్చిన పైకం మళ్ళీ జేబులో పెట్టుకొని పోతున్నారా ఆ నోట్లు నావి తెండి, హరిజనుల ఋణం తీర్చుకోవడానికి సందేహం ఎందుకు" అన్నారు వెంటనే రామిరెడ్డిగారు వేదికపైకి ఎక్కి ఆ నోట్లను గాంధీజీకి సమర్పించుకొన్నారు

బుచ్చిరెడ్డిపాలెం స్త్రీల సభలో శ్రీమతి దొడ్ల చినరుక్మిణమ్మగారు తన బంగారు కంఠహారం తీసి మహాత్ముని మెడలో వేయగా ఆయన "ఈ కంఠ హారంతో నేను చాలా అందంగా కనిపిస్తున్నానేమో" అని పకపకా నవ్వి నారు

* * *

**గాంధీజీ సమయపాలనము**

గాంధీజీ రాజమహేంద్రవరం వచ్చినప్పుడు కీ శే దిగుమర్తి హనుమంత రావుగారి భార్య బుచ్చికృష్ణమ్మగారి ఇంటికి ఒకరోజు ఉదయం 6 గంటలకు

వెళ్ళి చూడవలెనని కార్యక్రమం నిర్ణయించుకొన్నారు గాంధీజీ అప్పుడు బుచ్చి కృష్ణమ్మగారి ఇంటికి ఒక ఫర్లాంగ్ దూరంలోఉన్న దామెర్ల హౌస్‌లో విడిది చేసిఉన్నారు 6 గంటలకు కొన్ని నిమిషాల ముందు ఆయన ప్రయాణమయి బయటకు వచ్చేసరికి కారు తయారుగా అక్కడ లేకపోయింది దామెర్ల హౌస్ నుంచి బుచ్చి కృష్ణమ్మగారి ఇంటికి తోవ తెలుసుకొని సరిగా 6 గంటలకు అక్కడకు చేరినారు అక్కడ నిర్ణీత కార్యక్రమం ప్రకారం 10 నిమిషాలు గడిపిన తరవాత రాజమహేంద్రవరానికి 14 మైళ్ళ దూరంలో ఉన్న సీతానగరంలోని గౌతమీ సత్యాగ్రహాశ్రమం వైపునకు బయలుదేరినారు గాంధీజీ ఒక మైలు నడిచేటంతవరకు కూడా కారు రాలేదు గాంధీజీ ప్రయాణ కార్యక్రమం ఏర్పాటుచేసిన కార్యకర్తలు చాలా చికాకు పడినారు గాంధీజీ మాత్రం కార్యకర్తల మీదగానీ, డ్రయివరు మీదగానీ యేమాత్రం కోపం కనపరచలేదు పైపెచ్చు డ్రయివరు భోజనానికి వెళ్ళివచ్చినందున గాంధీజీ ఆయన పట్ల సానుభూతి కనబరిచినాడు ఈ ఉదంతంవలన గాంధీజీ సమయాన్ని పాటించటంలో ఎంత శ్రద్ధగా ఉంటారో తెలిసి వచ్చింది

## గాంధీ- ప్రకృతి చికిత్స

*పశ్చిమ గోదావరిజిల్లా భీమవరంలో కీ శే వేగిరాజు కృష్ణంరాజుగారు ప్రకృతి ఆశ్రమం స్థాపించినారు ఆ ఆశ్రమానికి 80 ఎకరాల భూమి, 50 కుటీరాలు ఉన్నవి కృష్ణంరాజుగారు తన జీవిత సర్వస్వం ఆశ్రమానికి అంకితం చేసినారు 1940 ప్రాంతాలలో ఆయన గాంధీజీని దర్శించటానికి ఆయన ఆశ్రమానికి వెళ్ళినారు మామూలుగా ఉదయపు వేళల గాంధీజీ వాహ్యాళికి వెళ్ళేటప్పుడు కొంత మంది ఆయనను అనుగమించేవారు కాని చాలా మంది గాంధీజీ నడిచినంత వడిగా నడవలేక వెనకబడి పోయేవారు కృష్ణంరాజు మాత్రం గాంధీజీతో సమానంగా నడిచేవారు వారుభయులు పరస్పరం మాట్లాడుకొంటూ నడుస్తూవుండేవారు ఒక రోజున కృష్ణం రాజు తన ఆశ్రమంలో ప్రకృతి చికిత్స ఎటువంటి అద్భుతాలకు కారణమయిందో వివరిస్తూ పది, పండెండు ఉదాహరణ లిచ్చినారు మహాత్మాజీ చాలా ఆసక్తితోనూ, ఓరిమితోనూ విని తన ప్రక్కనే కూర్చున్న డాక్టర్ సుశీలనయ్యర్ వంక చూసి "దీనిని గురించి మీరేం చెబుతారు అన్నారు ఆమె కొంచెం చిన్నబోయి "ఇదంతా నిజం కావచ్చు, కాని శాస్త్రీయం మాత్రం కాదు" అన్నారు అందుకు గాంధీజీ "రోగాన్ని కుదుర్చింది శాస్త్రీయము, కుదుర్చలేనిది అశాస్త్రీయము అంటేకదా?" అన్నారు

*ఈ విషయాన్ని ఓరుగంటి వెంకట సుబ్బయ్యగారు మాకు వ్రాస్తూ పది సంవత్సరాల వయస్సుగల తమ మనుమనికి మూర్ఛల వ్యాధి (Epilepsy) భీమవరం ఆశ్రమంలోని ప్రకృతి చికిత్సవల్ల ఒక మాసంలో పూర్తిగా నయమయిందనీ, తరవాత ఆయన M A ,L I M అయి ఇప్పుడు ఒంగోలు మెడికల్

ఆఫీసర్‌గా ఉన్నారని, ఆయన పేరు డాక్టర్ టి శేషగిరిరావు అని తెలియపరిచినాము (సం)

### డాక్టర్‌కు సలహా

తెనాలి వాస్తవ్యులు డాక్టర్ వెంపటి సూర్య నారాయణగారు గాంధీజీని అడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా "మీరు చికిత్సచేసే రోగులనుంచి ఒక మితమయిన రుసుము వసూలు చేయటానికి మీకు హక్కు ఉన్నది కాని మీరు కోరినంత రుసుము కానీ, అసలు ఏ విధమయిన రుసుము కానీ ఇవ్వలేని నిరుపేద అయిన రోగికి చికిత్స చేయక పోవడం మంచిది కాదు" అన్నారు గాంధీజీ ఈ నియమం సూర్య నారాయణగారి జీవితంలో సేవా తత్పరతను పురికొల్పింది

### తప్పులను ఒప్పుకోవటం

గాంధీజీ హరిజన్‌పత్రికలో ఒకానొకప్పుడు "మీరు మీతప్పులనుఒప్పుకొనే ధైర్యం కలిగి ఉండవలె" అని ఒక వాక్యం వ్రాసినారు ముఖ్యంగా ఆ వాక్యం డాక్టర్లకు సంబంధించింది డాక్టర్ వెంపటి సూర్య నారాయణ గారు దానిని చదివిన తరవాత తానొక రోగి విషయంలో చేసిన చిన్న తప్పిదం ఒప్పుకొని ఆయనకు 8 రూపాయలు మనియార్డర్ ద్వారా పంపినారు కాని ఆ రోగి డాక్టర్ గారికి తిరిగి గౌరవ పూర్వకంగా ఆ మనియార్డర్ తిప్పి పంపినారు

ఈ విషయం డాక్టర్ గారు గాంధీజీకి తెలియపరిచినారు గాంధీజీ "మీరు మీ తప్పును రోగి దగ్గర ఒప్పుకున్నందుకు చాలా సంతోషం మీ 8 రూపాయలు చేరగానే ఆ మొత్తం అఖిల భారత కుటీర పరిశ్రమల సంఘానికి చెల్లించబడుతుంది" అని వ్రాసినారు

### ఆవు పాలు

మానవులకు జంతువుల పాలు అవసరం కాదనే ఉద్దేశంతోనూ, ఒక యంత్రంతో ఆవు పాలు తీస్తూన్నందువల్ల, పొదుగు నుంచి రక్తం పడటం చూసినందునా గాంధీజీ ఆవు పాలుగానీ గేదె పాలుగానీ తాగనని ఒట్టు పెట్టుకొన్నారు కాని కొంత కాలానికి మనుషుల ఆరోగ్యానికి జంతువుల పాలు అవసరమని డాక్టర్లు సలహా ఇచ్చినందువల్ల స్వానుభవంవల్ల రాజీగా మేక పాలు తాగడానికి అంగీకరించినారు ఈ సందర్భంలో గో సేవా సంఘం స్థాపనకు కూడా గాంధీజీ సహాయపడుతూ వచ్చినారు

జంతువుల పాలు తాగడానికి అంగీకరించిన గాంధీజీ "మేక పాలకు బదులు ఆవు పాలే ఎందుకు తాగకూడదు" అని డాక్టర్ సూర్య నారాయణ గారికి తోచింది వెంటనే ఆ సంగతి గాంధీజీకి వ్రాసినారు ఆయన గాంధీజీకి 'క్విట్ ఇండియా' ఉద్యమంలో ఊపిరి తిరగని రోజులవి కాని ఆయన ఏప్రిల్

18 న డాక్టరు గారికి ఇట్లా వ్రాసినారు

ప్రియమయిన సూర్య నారాయణ!

ఆవు పాలు తీసుకోవలెననే ప్రేరణ నాకు కలగటం లేదు నేను ఆవు పాలు తీసుకోనందువల్ల నా గో సేవకు ఏ మాత్రం కొరత రాదు బహుశా అది ఎక్కువ స్వార్థరహితంగా కూడా ఉంటుంది

మీ విశ్వాస పాత్రుడు
బాపు

## గాంధీజీ దాక్షిణ్యము

1988 వ సంవత్సరంలో హరిజన నిధి పర్యటన సందర్భంలో గాంధీజీ తెనాలిలో ఉండగా ఒక ఉదయాన ఆచార్య రంగా ఆయన దగ్గరికివచ్చి "ఒకరిద్దరు పెద్ద మనుషులు, మీరు వారి ఇంటికి వచ్చే పక్షంలో చెరి 116 రూపాయలు ఇస్తామని వాగ్దానం చేసినారు" అని చెప్పారు "అట్లాగా" అని గాంధీజీ వెంటనే వారి కోరికను మన్నించి హరిజని నిధికి రెండు రూ 116 లు తీసుకొని తక్షణం రైలు స్టేషనుకు వెళ్ళినారు

## గాంధీజీ బరువుకు వెండి

గాంధీజీ 1929 లో ఖాదీ నిధికొరకు ఆంధ్రదేశంలో పర్యటన చేస్తూండగా గుంటూరు జిల్లాలోని పెదనందిపాడు గ్రామస్థులు ఆయన తూకానికి సరిపోయే వెండి ఖాదీ నిధికి సమర్పిస్తామని వాగ్దానం చేసినారు గాంధీజీ త్రాసులో కూర్చునడానికి ఇష్టపడక తన తూకం 92 పౌనులని చెప్పి అందుకు తగిన వెండి ఇవ్వమని కోరినారు ఒక్క రూపాయిలో పది అణాలు విలువగల వెండి ఉంటుందని విలువకట్టి ఆ లెక్క ప్రకారం 92 పౌనుల తూకానికి తగిన వెండిగల 8,800 రూపాయలను ఆ గ్రామస్థులు ఖద్దరు నిధికి సమర్పించినారు

## గాంధీజీ జ్ఞాపక శక్తి

1929 ఏప్రిల్ లో గాంధీజీ ఆంధ్రదేశంలో ఖాదీ నిధికి పర్యటన చేసినప్పుడు (శ్రీ) దేశభక్త కొండ వెంకటప్పయ్యగారి ఆదేశానుసారం ఆనాడు అఖిల భారత ఖాదీ బోర్డుకు ఆడిటర్ గా ఉన్న (శ్రీ) వేమూరి నారాయణమూర్తి గారు గాంధీజీతో ఉండి ఆయా ప్రాంతాలలో వసూలయిన నగదును, నగలను జాగ్రత్త పరిచి గాంధీజీకి ఎప్పటికప్పుడు లెక్కచెప్పడానికి అంగీకరించినారు అందుకు ఆయన ఒక ప్రణాళికను కూడా తయారు చేసినారు ఆ ప్రణాళిక గాంధీజీ ఆమోదం పొందింది

నారాయణమూర్తిగారు గాంధీజీ బృందంతో ప్రతిరోజు ఉదయం 5 గంటలకు బయలుదేరేవారు వారు బయల్దేరేముందు ఆ కిందటి రోజు వసూలయిన మొత్తాన్ని గాంధీజీకి నారాయణమూర్తిగారు చెప్పేవారు నాలుగైదు

రోజులయిన తరవాత ఆ రోజులలో వచ్చిన మొత్తం ఎంతని గాంధీగారు అడిగే వారు నారాయణమూర్తిగారు ప్రతిరోజూ ఇచ్చిన అంకెలను తన జ్ఞాపక శక్తిని బట్టి లెక్కవేసుకొని సరిపోయిందో లేదో చూసుకొనేవారు గాంధీజీ

ఒకనాడు తెనాలిలో ఉండగా నారాయణమూర్తిగారు గాంధీజీ దగ్గరకు పోవడం ఆలస్యమయింది నారాయణమూర్తిగారితో ఉన్న ఒక వకీలు "లెక్కలలో ఏవోకొన్ని అణాలు భేదం వచ్చిందని ఆ అణాలకోసం ఇంత ఆలస్యం చేశారియన చూసినారా!" అన్నారు గాంధీజీతో వెంటనే గాంధీజీ "ఇది పేదవాళ్ళ డబ్బు, అందువల్లనే అణాలకోసం ఆయనంత జాగ్రత్త తీసుకొంటున్నారు" అన్నారు

మరొక గ్రామంలో నారాయణమూర్తిగారు అర్ధరాత్రి వరకూ కూడా మేల్కొని ఉండటం గాంధీగారు గమనించి మేడ దిగివచ్చి "ఇంకా ఎందుకు మేలుకున్నారు చిల్లర డబ్బుల చప్పుడు వినిపిస్తూంది నాకు" అన్నారు "రేపు ఉదయం మీరు ప్రయాణమయ్యేముందు ఈనాడు వసూలయిన మొత్తం తెల్పి చెప్పవలసి ఉందిగదా ' అన్నారు నారాయణమూర్తిగారు గాంధీజీ చిరునవ్వుతో మళ్ళీ మేడ మీదకు వెళ్ళిపోయినారు

## గాంధీజీ వీడ్కోలు సందేశము

తన ఆంధ్రదేశ హరిజన యాత్రను ముగిస్తూ హిందూపురంలో గాంధీజీ ఆంధ్రదేశానికే వీడ్కోలు సందేశమిచ్చినారు

' సోదరీ సోదరులారా!

నేటితో నా ఆంధ్రదేశ పర్యటన ముగిసింది గంజాం, కర్నూలు జిల్లాలలో తప్ప తక్కిన జిల్లాలన్నిట్లో పర్యటించినాను బహుశా గంజాం, కూడా పోగలనని భావిస్తున్నాను ఈ యాత్రలో నేను హరిజన నిధికి సుమారు 60,000 రూపాయలు సేకరించ గలిగినాను మానవునకు భవిష్యద్విషయమేమీ తెలియదు భవిష్యత్తు భగవంతుని ఆధీనంలో ఉన్నది అందువల్లనే మన ఋషులు ప్రస్తుత కర్తవ్యం నిర్వర్తించవలెననీ, భవిష్యత్తును గురించి తరవాత ఆలోచించ వచ్చుననీ అన్నారు నేడు చేసిన పని ఫలితాలనే మనిషి భవిష్యత్తులో పొందటానికి అర్హుడని వారి ఆదేశము అందువల్లనే ఈ అస్పృశ్యతా భూతాన్ని నేడే నిర్మూలించవలెనని నేను ఘోషిస్తున్నాను రేపటి సంగతి మనకు తెలియదు. నేను ఆంధ్ర దేశంలో లక్షలకొలది ప్రజలను చూసినాను అస్పృశ్యతా భూతము మరణశయ్యలో మూల్గుతున్నదని నాకుగట్టినమ్మకం కలిగింది నా అభిప్రాయం నిజమో కాదో తెలపవలసిన భారం మీపై ఉన్నది మీరందరూ ఈ అస్పృశ్యతా విష వృక్షాన్ని మీ హృదయక్షేత్రాల నుంచి పెకలింపి వేయగలరని విశ్వసిస్తు న్నాను ఈశ్వర సృష్టి విచిత్రమయినది. కాని ఆ సృష్టిలో ఉచ్చ నీచభావాలు కలవని భావించకూడదు భగవత్సృష్టిలో వృక్షాలకు అసంఖ్యాకాలయిన ఆకు లున్నవిగదా! అందొక ఆకు గొప్పది మరొక ఆకు తక్కువది అని ఎవరయినా

చెప్పగలరా? భగవంతుడు మానవులందరినీ సమానంగా సృష్టించినాడు వారిలో ఎక్కువ తక్కువలు మానవులు నిర్మించుకొన్నవే తాను సర్వోత్తముడని గర్వపడే మనిషి అధఃపతితుడు కాగలడు తాను రేణువు కంటే అల్పుడనని అనుకొనే వాడు సర్వోత్తముడుగా పరిగణింప బడవచ్చు అది అనుభవం వలన తెలుసుకో దగిన విషయం మానవుడెప్పుడూ అభివృద్ధిని కోరుతూ ఉంటాడు మనమందరమూ సులభంగా హరిజనులం కాగలము అంటే హరికి చెందిన మనుషులం కాగలము మనం మన భేద భావాలను విస్మరించినట్లయితే అంతఃకలహాలు నశించగలవు హరిజనుల పట్ల మన భేద భావం రూపుమాపుకొంటే హిందూ సంఘంలోనేగాక ముసల్మాన్ క్రైస్తవుల పట్ల కూడా మన భేదభావాలను నశింప జేసుకొన్నవారం కాగలము దేశంలో ఈ అస్పృశ్యతా భూతాన్ని పారదోల నంతవరకు నా మనసుకు శాంతి లేదు అందుచేతనే దేశమంతటా తిరిగి, నా సందేశం వినిపిస్తున్నాను నేనీ ఆంధ్రరాష్ట్రం విడిచిపోయే ముందు కష్టాల కోర్చి నాతో తిరిగిన అనుచరులనూ, స్వయం సేవకులనూ అభినందిస్తున్నాను " మీరు నాపై చూపిన ప్రేమకు కృతజ్ఞత తెలిపేముందు మీ లోటు పాటులను చెప్పకపోవడం సరికాదు స్వయం సేవకులు కార్యకర్తలు కష్టపడి పనిచేసిన మాట వాస్తవంకాని ఇన్నాళ్ల అనుభవం తరవాత కూడా తమ కర్తవ్యం గురించిన సంపూర్ణ జ్ఞానం వారికి కలగలేదని చెప్పవలసి వచ్చినందుకు విచారపడుతున్నాను సమావేశాలను ఏర్పాటుచేసినప్పుడు వారు చిన్న చిన్న విషయాలలో కూడా శ్రద్ధ తీసుకోవలసి ఉంటుంది ప్రతి విషయాన్ని బాగా పరిశీలించి ఏర్పాటు చేయవలె అది మన దూరదృష్టికి, ఆలోచనా శక్తికి తార్కాణము, ఆంధ్రదేశంలోని స్వయం సేవకులు దూరాలోచనతో పని చేసినట్లయితే వారు అద్భుతమయిన కార్యాలను నిర్వర్తించగలరు ఆంధ్రదేశంలో అత్యధికమయిన భావోద్రేకము, శ్రద్ధా భక్తులు ఉన్నాయి ఆ శ్రద్ధా భక్తులతో పాటు విమర్శనా జ్ఞానం అలవర్చుకొన వలెనని వారిని కోరుతున్నాను

సహచరులను పొగడడం మిత్రధర్మం కాదు తమ మిత్రులలో లేని గుణాలను వారికి ఆపాదించి మోపగించడం మంచి పనికాదు అందువల్ల నాకు ప్రత్యక్షంగా కనిపించిన లోటుపాటులను మీకు తెలపవలసి వచ్చింది నేనట్లా చేయకుంటే మీ సుహృద్భావానికి నేను కృతజ్ఞుణ్ణి కాకపోగా కృతఘ్నతా దోషానికి పాల్పడిన వాణ్ణి కాగలను కనక నా ఈ హెచ్చరికను గమనించి మీ లోటుపాటులను దిద్దుకొన గలరని ఆశిస్తున్నాను

హరిజన సేవకులు విశుద్ధవర్తనులుగా ఉండవలె వారి దృష్టి కలుషం కాకూడదు వారి స్పర్శ నిష్కల్మషంగా ఉండవలె వారి వాక్కు పవిత్రంగా ఉండవలె, వారికి నింద పనికిరాదు శత్రు మిత్రులందరినీ ప్రేమతో చూడవలె ఈ శుద్ధి యజ్ఞంలో అపవిత్రులయిన సేవకులు ఉండకూడదు హరిజన సేవలో పాల్గొనే మనమందరం ముందు మన అంతరాత్మలను పరిశుద్ధం చేసుకోవలె ఈ సుందర సుప్రభాతం సూర్యభగవానుని సాక్షిగా అస్పృశ్యతా

కళంకాన్ని మనదేశంనుంచి తుడిచివేయగల శక్తినీ సద్బుద్ధినీ మనకు భగవంతుడు ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాను "

**బాపినీడుగారి ప్రకటన**

"గాంధీజీ హరిజన యాత్రా సందర్భంలో ఆంధ్రదేశంలో 16 రోజు లున్నారు 9 రోజులు మాత్రమే పనిచేసిన రోజులు 6 దినాలు విశ్రాంతి దినాలు విశాఖపట్నం వెళ్ళిరావడానికి ఒక రోజు రైల్లో గడిచిపోయింది వారు మొత్తం పది జిల్లాలు చూసినారు 1024 మైళ్లు రైలుపైన, 667 మైళ్లు మోటారుపైన, 45 మైళ్లు మోటారు లాంచిపైన మొత్తం 1708 మైళ్లు ప్రయాణం చేసినారు 76 గ్రామాలు చూసినారు 60 సభలలో ఉపన్యసించినారు సుమారు 6,20,000 ప్రజలు వారి ఉపన్యాసం విన్నారు అంతకు రెట్టింపు ప్రజలువారిని దర్శించినారు హరిజన నిధికి ఆయా జిల్లాలలోవసూలయిన సొమ్ము వివరాలు

| జిల్లా | నగదు | నగలు | మొత్తం |
|---|---|---|---|
| నెల్లూరు | 10527-10-6 | 1576-5-9 | 12104-0-3 |
| పశ్చిమ గోదావరి | 37870-0-0 | 2315-7-9 | 10185-7-9 |
| విశాఖపట్నం | 7014-0-10 | 838-11-6 | 7852-11-10 |
| పశ్చిమ కృష్ణా | 5958-10-6 | 1887-7-4 | 7846-1-10 |
| తూర్పు కృష్ణా | 4280-8-8 | - | 4280-8-8 |
| గుంటూరు | 6144-12-0 | 941-13-6 | 7086-9-6 |
| తూర్పు గోదావరి | 6352-10-10 | 463-3-3 | 6815-14-1 |
| అనంతపురం | 5818-15-8 | నగల | 5818-15-8 |
| కడప | 1428-2-2 | విలువ | 1428-2-2 |
| చిత్తూరు | 1808-15-2 | కట్టలేదు | 1808-15-2 |
| | | మొత్తం | 69,247-13-4 |

ఇది ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యదర్శి బాపినీడుగారు గాంధీజీ ఆంధ్రదేశంలో హరిజన యాత్రను ముగించిన తరవాత చేసిన ప్రకటన

**గాంధీజీ హరిజనవ్యాసము- సనాతనులకు ప్రత్యుత్తరము**

"నేను మద్రాసులో ఉన్న కొద్దికాలంలో కొంతమంది పెద్దమనుష్యుల సంతకాలతో పత్రికలలో ప్రచురింపబడిన నన్ను గురించిన ఒక బహిరంగ లేఖను చదివినాను దానిలో వారు అస్పృశ్యతా నివారణ గురించి బహిరంగ చర్చ ఒకటి ఏర్పాటు చేయవలెనని నన్ను కోరినారు తరవాత వారు పత్రికలలో వ్రాసిన లేఖను అచ్చువేసి నాకు పంపినారు అందులో మొదటి వాక్యాలివి "చాలా ఎక్కువ తెలిసిన మనిషివలె నటిస్తున్న మీరు దయచేసి బహిరంగ చర్చకు దిగండి చూద్దాము వ్యవధి లేదు, వ్యవధి లేదనేకంటే అసలు మీ ఉనికిని గురించి మేము ప్రశ్నిస్తూన్నప్పుడు మీరట్లా అనడం సిగ్గుచేటు ప్రపంచం మిమ్మ్ము చూసి నవ్వుతుంది, హేళన చేస్తూంది"

తరవాత నేను నెల్లూరు జిల్లాలో పర్యటిస్తూన్నప్పుడు కూడా ఇటువంటిదే ఒక తంతి వార్త వచ్చింది అందులో "హిందూ ధర్మం మీరవగాహన చేసు కొన్నట్లు కనిపించడంలేదు హిందువులను నైతిక, ధార్మిక జీవితంనుంచి మీరు పెడతోవను పట్టిస్తున్నారు" అని ఉంది వీటికి జవాబు నేను అప్పటికప్పుడే పంపించ లేకపోయినాను ఆ మరునాడు నేను తిరుపతి వెళ్ళవలసి ఉన్నది నాకు ఉత్తరాలు వ్రాసిన వారి సూచన ప్రకారం చర్చలు జరపవలసిన చోటుకూడా అక్కడికి సమీపమే కాబట్టి తిరుపతిలోని నా గృహస్థుద్వారా వారికి వర్తమానం మాత్రం పంపి సంతృప్తి పడవలసి వచ్చింది

మొదటి ఆహ్వానానికి, ఎవరితోనయినా స్నేహపూర్వకమయిన చర్చలు జరపడానికి నేను సంసిద్ధంగా ఉన్నాననీ నేను తప్పు చేస్తున్నానని నాకెవరయినా నచ్చచెప్ప గలిగినట్లయితే దానిని నేను సరిచేసుకో గలనని వ్రాసినాను అంతేగాక నాకు వ్యవధి చాలా తక్కువుంటుదని, ఎవరయినా నాతో చర్చించ దలచుకొన్నట్లయితే నేను నిర్ణయించిన ప్రదేశంలో ఆ చర్చ జరగవలసి ఉంటుందనీ కూడా వ్రాసినాను అనేక పర్యాయాలు నా పరిమిత జ్ఞానం గురించి ఈ పత్రికలో వ్రాసే ఉన్నాను నేను సంస్కృత పండితుణ్ణికాను. కాని సంస్కృత శ్లోకాల అనువాదాలలో తప్పులు కనుక్కో గలిగినంత జ్ఞానం నాకున్నది శాస్త్రాలను నేను సంతృప్తికరంగానే చదివినానని నా అభిప్రాయము శాస్త్రాలలోని ప్రధానోపదేశాలను నా యవ్వన దశ నుంచి నేను ఆచరణలో పెట్టడానికే ప్రయత్నిస్తున్నాని చెప్పగలను కనక హిందూ మతంలోని ప్రధాన సిద్ధాంతాలకు సంబధించి నంతవరకు నా నిర్ణయాలు సరియైనవే నని సంపూర్ణ విశ్వాసంతో ప్రజలకు నిస్సందేహంగా నచ్చచెప్పగలను ఈనాడు ఆచరణలో ఉన్న అస్పృశ్యత వంటిది శాస్త్రాలలో ఉండటానికి అవకాశం లేదని నా నిశ్చితాభిప్రాయము ఈ నా నిర్ణయం కాదని ప్రశ్నించే వారి కంటె ఎక్కువ చదువుకొన్న పండితులే దానిని అంగీకరిస్తున్నారు. నన్ను కాదనేవారు ఎంత సనాతనులో నా నిర్ణయం సరిఅయినదనే వారు కూడా అంత సనాతన ధర్మపరులే అయితే ప్రత్యర్థులను గౌరవంతో చూడడంలోను

వారు చెప్పింది జాగ్రత్తగా వినడంలోను నేనెక్కువ విశ్వాసం గలవాణ్ణి

ప్రతికూలురతో నేననేకసార్లు చర్చించినాను వారితో చర్చించిన కొద్దీ నా అభిప్రాయం మరింత బలపడింది కాబట్టి అటువంటి చర్చలవల్ల నా అభిప్రాయం చలించదని నేననుకొంటున్నప్పటికి నా దినచర్యకు అనుకూలంగా నాతో చర్చించ పూనుకొన్న వారితో ప్రసంగించడానికి నాకేమీ అభ్యంతరం లేదు నా పర్యటన కాలంలో నేను సనాతనులతో అనేక పర్యాయాలు చర్చించి ఉన్నాను నాకు ప్రత్యక్షంగా గానీ పరోక్షం పత్రికల ద్వారాగానీ వ్రాయదలచు కొన్నవారు మామూలు మర్యాదలను పాటించినట్లయితే, కలసి పని చేయటానికి తగిన ప్రాతిపదికను కనుక్కోవలెననే కోరిక ఉన్నట్లయితే హరిజన దేవాలయ ప్రవేశను, అందుకు సూచించిన శాసనంతో సహా పరస్పరం అంగీకరించతగిన విషయాలు అనేకం ఉన్నాయి పరస్పర సుహృద్భావంతో చర్చలు జరిగితే దురభిప్రాయాలు చాలా వరకు తొలగి పోగలవు నాకు ప్రతికూలంగా ఉండి అనేక విధాల నన్ను దూషిస్తూండిన సనాతనులట్లా ఉండగా నా సందేశంలోని ప్రధానాశయం గ్రహించిన వారనేకమంది నన్ను సమర్థించడం ప్రారంభించినారు ప్రజల మనసులకు సహేతుకంగా నచ్చ చెప్పటం కంటె మరొక ఆధారమేమీ నా దగ్గరలేదు లక్షలాది హిందువుల హృదయ పరివర్తనం వల్ల మాత్రమే నేను ప్రారంభించిన ఈ ఉద్యమం జయప్రదం కాగలదు కాబట్టి నా ఉద్యమ ప్రయోజనం కోసమే నాకు సాధ్యమయినంత వరకు నా ప్రత్యర్థులను కలుసుకొని చర్చించే అవకాశం నేను జారవిడవడం లేదు"

'హరిజన్' యం కె గాంధీ

12 జనవరి 1934

## గాంధీజీ హరిజన యాత్ర

## హైదరాబాదు సంస్థానాధికారుల ఆందోళన (1934)

హరిజన యాత్రా సందర్భంలో గాంధీజీ హైదరాబాద్ వస్తారని ఒక వదంతి బయలు దేరింది అందువల్ల హైదరాబాదు సంస్థానాధికారులలో ఒక పెద్ద అలజడి పుట్టింది విచక్షణాజ్ఞానం గల హైదరాబాదు సంస్థాన కార్య నిర్వాహక వర్గంలోని సభ్యులు గాంధీజీని హైదరాబాదుకు రానీయడమా? లేదా? అనే విషయం గురించి, రానిచ్చినట్లయితే ఆయనపైన ఏమయినా షరతులు విధించవలెనా, లేదా ఆయన కార్యక్రమాన్ని స్వేచ్ఛగా సాగించ నీయవలెనా అనే విషయాలను గురించి తమలో తాము చర్చించుకోవడం ప్రారంభించినారు

దీనిని గురించి ఎక్కువ ఆందోళన పడినవారు రాజకీయ మెంబరే (Political Member) మెహదియార్ జంగ్, పోలీసు మెంబరు పర్ గ్రెంచి, వీరిద్దరూ ఈ విషయంలో భేదాభిప్రాయాలు వెల్లడించినారు.

మెహదియార్ జంగ్ తనకు, సర్ గ్రెంచికి మధ్య ఉన్న భేదాభిప్రాయా లను సరిచేసుకొని ఒక ఒడంబడికకు రావలెననే ఆతురతతో 1934 ఫిబ్రవరి 6 వ తేదిన సర్ గ్రెంచికి ఇట్లా వ్రాసినారు

"ఈ విషయం గురించి నేనాలోచించిన కొద్దీ గాంధీజీని నిమ్నజాత్యు ద్ధరణ గురించిన ఉపన్యాసం ఇవ్వడానికి అంగీకరించడమేగాక అయన ఊరేగింపును కూడా సాగనీయడం మంచిదనీ, మర్యాదఅనీ నాకు నమ్మకం కలుగుతూన్నది అట్లాచేసి నందువల్ల మన నిమ్నజాతుల పట్ల మనకు గల ఆసక్తి కూడా వ్యక్తమవుతుంది ఆయన ఉపన్యాసం వల్ల మనం భయపడ వలసిన అవసరమున్నదని కూడా నేననుకోవడం లేదు ఊరేగింపు వల్ల వాళ్ల ఉద్రేకం కొంత వెలికి వచ్చి చల్లారి పోవడానికి కూడా వీలున్నది

గాంధీజీ ఇక్కడకు వచ్చిన తరవాత కూడా ప్రజలత్యుత్సాహవంతు లుగా ఉండేమాట నిజము కాని మన మటువంటి ఉద్రేక పరిస్థితులలో ఊరే గింపులను, ఉపన్యాసాలను నిషేధిస్తే ప్రజల అసంతృప్తి మేరమీరిపోయే అవకాశం ఉన్నది అటువంటి సమయాలలో జరిగే సంఘటనల పైన చెలరేగే ఆందోళన ఎక్కువ భయంకరంగా ఉంటుంది అది ప్రజల స్వానుభవం పైన ఆధార పడి భావోద్రేకాలతో కూడి ఉండటం చేత దానిని అణిచి వేయటం కూడా చాలా కష్టమే ఆయన ప్రారంభించిన ఉద్యమం కనీసం మన ఆశయాలకు అనుకూలంగా ఉన్నట్లు కనిపించడం చేత అయన పట్ల మనం తగుమర్యాదగా ప్రవర్తించి అందుకనుగుణమయిన స్వాతంత్ర్యం ఆయనకు ఈయజాలక పోవడం కంటె మనము ఆయన రాకను నిషేధించడమే ఎక్కువ మంచిది ఒక్క మాటలో చెప్పవలె నంటే సగం సగం చర్యలు ఎవీ పనికి రావని నా అభిప్రాయము"

"ఈ ఉత్తరం కౌన్సిల్ తీర్మానం పైన నేను ఉర్దూలో వ్రాసినభిన్నాభి ప్రాయాలను కొత్వాలు చూడడం మంచిది అయన అభిప్రాయాలు ఆదరణీ యాలు, విలువగలవి"

## మెహదియార్ జంగ్ ఉర్దూలో వ్రాసిన విషయము

"గాంధీజీ హైదరాబాదును దర్శిస్తే ప్రజల హృదయాలు ఉత్సాహంతో ఉప్పొంగి పోయే మాట నిజం వారికి ఆయనను ఊరేగింపులో తీసుకొని పోవలెననే ఆసక్తి కూడా కలుగుతుంది ఆయనను ఊరేగింపులో తీసుకొని వెళ్ళవలెనని అత్యుత్సాహంతో ఉన్న ప్రజలకు ఆశాభంగం కలిగించి ఆయనను బహిరంగ సభలో ఉపన్యసించకుండా చేసినందువల్ల ఇక్కడి ప్రజలు స్వతంత్ర పౌరులకు గల హక్కులను అనుభవించడం లేదనడానికి ప్రత్యక్ష తార్కాణం కాగలదు మన ప్రత్యర్థులు ఆ పరిస్థితిని మంచి అవకాశంగా తీసుకొని ఆందో ళన చేయడానికి వీలవుతుంది గాంధీజీ ఊరేగింపు వల్ల గానీ బహిరంగోపన్యా సాల వల్లగానీ- అపాయం కలుగుతుందని మనం భయపడ నవసరం లేదు

మన ప్రజలు స్వతంత్ర పౌరుల కుండ వలసిన ప్రాథమిక హక్కులను అనుభ వించడం లేదనే దురభిప్రాయం వారి మనసులలో నుంచి తొలగించటమే మనకు కావలసిన ముఖ్య విషయము మనం గాంధీజీ స్వేచ్ఛగా తిరగడానికి, ఉపన్యాసాలు చేయడానికి అభ్యంతరంగా కొన్ని నిర్బంధాలను ఏర్పాటు చేస్తే నైజాం ప్రభుత్వం ప్రజల సానుభూతిని కోల్పోవడమే కాక వారిని దూరం చేసుకొంటుంది రాజకీయాందోళకులు ప్రభుత్వానికి ప్రతికూలంగా ప్రజల మనస్సుల్లో అసంతృప్తిని రేకెత్తించి నిజాం ప్రభుత్వం మానవ హక్కులను భంగపరుస్తున్నదని ప్రజలకు నచ్చచెప్పగలరు ఈ కారణాలతోనే హైదరా బాదుకు గాంధీజీ రాకను అంగీకరించే విషయంలో నా భిన్నాభిప్రాయాలు తెలియ చేసినాను గాంధీజీ హైదరాబాదు రావడానికి కొన్ని నిర్బంధాలతో అంగీకరించడం వలన కలిగే ప్రమాదం పూర్తిగా ఆయన రాకను నిషేధిం చటం వల్ల కలగదని నా అభిప్రాయము ప్రజలు కళ్ళారా చూసి అనుభవించిన దాని వల్ల వారి మానసిక ప్రవృత్తి మారినంతగా, ప్రత్యక్షంగా చూడక ఊహా జన్యాలయిన వృత్తాంతాల వలన మారదు నా భిన్నాభిప్రాయాలకు గల కారణాలు కౌన్సిల్ కిప్పుడు విస్పష్టంగా వెల్లడించ గలిగినానని భావిస్తు న్నాను "

మెహదియార్ జంగ్ గాంధీజీ రాకను గురించి తన వైఖరిని సర్ అక్బర్ హైదరీకి కూడా ప్రయివేటు నోట్‌లో తెలియపరచినారు అంతేగాక తనకూ, పోలీసు మెంబర్ సర్ ట్రెంచికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల నకళ్లు కూడా ఆయనకు పంపినారు

అయినప్పటికీ సర్ ట్రెంచ్ దిగువ తీర్మానం కౌన్సిల్‌లో చర్చించడానికి ప్రవేశపెట్టినారు

"నవాబు సాహెబు వ్రాసిన విషయాలు నాకు చాలా నచ్చినాయి అందు వల్ల నిన్న నేను చేసిన సూచనలను కొంతవరకు మార్చి గాంధీజీ ఇక్కడకు రావటానికి అనుమతించే విషయంలో ఇప్పుడే దిగువ షరతులను సూచిస్తున్నాను

(౧) ఒక్క బహిరంగ సభకు మాత్రమే అంగీకరించవలె అదికూడా వివేక వర్ధనీ థియేటరులో జరగకూడదు లింగంపల్లి గార్డెన్‌లో జరగవలె ఆ బహిరంగసభలో గాంధీజీ ఉపన్యాసం రాజకీయాలకు సంబంధించి ఉండ కూడదు హరిజనోద్యమానికి మాత్రమే సంబంధించి ఉండవలె ఆయనకు స్వాగతపత్రం సమర్పించటానికి అనుమతి ఇవ్వవచ్చు కాని అది రాజ కీయాలకు ఏమాత్రం సంబంధించి ఉండకూడదు అది సభ జరిగే రోజుకు కనీసం వారంరోజులు ముందుగానే ప్రభుత్వంవారి ఆమోదం నిమిత్తం వారికి చేరవలె గాంధీజీ హరిజన సేవక సంఘానికి ప్రారంభోత్సవం చేయడానికి మనం అంగీకరించగలము కనక ఆయన అందుకోసం లింగం పల్లి గార్డెన్‌కు పోవలసి ఉంటుంది కనక బహిరంగసభ జరపడానికికూడా అదే సరియయిన స్థలము

(బి) పత్తర్‌గట్టి బజారులోగానీ, మరొకచోటగానీ ఖద్దరు అంగళ్ళు తెరవడానికి గాంధీకి అనుమతి నివ్వకూడదు

(సి) ఊరేగింపుకు అనుజ్ఞనివ్వకూడదు ఊరేగింపు జరుగకుండా చేయడానికి జాగ్రత్తలను తీసుకోనేటందుకు తగిన సూచనలను పంపవలసిందిగా కొత్వాలుకు ఉత్తరువులు జారీచేయడమయినది

కొత్వాలు మార్పు చేయబడిన ఈ షరతులకు అంగీకరిస్తున్నాడు గాంధీజీ హైదరాబాదుకు రావడానికి అంగీకరించే పక్షంలో రాజకీయ సభ్యుడు (Political Member) పోయినంత దూరం నేను పోలేకపోయినానని మీరు అర్థం చేసుకోగలరు కాబట్టి ఈ విషయం రాబోయే కౌన్సిల్ మీటింగ్‌లో చర్చకు పెట్టవలెనని మీ ఆమోదానికి లోబడి నేను సూచిస్తున్నాను గాంధీజీ హైదరాబాదుకు చేరే తేది 1934 మార్చి 9కి మార్చబడినందువల్ల ఈ విషయంలో అంత ఎక్కువ తొందరపడవలసిన అవసరం లేదు "

సర్ ట్రెంచ్ వ్రాసిన ఈ చిత్తు తీర్మానపు నకలును చూసుకొన్న తరవాత సర్ అక్బర్, మెహదియార్ జంగ్ కిట్లా వ్రాసినారు

'ఈ కాగితాలను నేను చూడడానికి వీలు కలిగించినందుకు చాలా కృతజ్ఞుణ్ణి మీరు రెవెన్యూ మెంబర్ (పోలీసు మెంబర్) వైఖరిలో మార్పు కలిగించినందులకు చాలా సంతోషము ఈ మార్పు చేసిన సూచనను మీ రంగీకరించగలరని నా అభిప్రాయము అప్పుడు మన తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించినట్లవుతుంది "

ఆ తరవాత గాంధీజీ మార్చి 9న హరిజనయాత్ర సందర్భంలో హైదరాబాద్, సికిందరాబాద్ నగరాలకు వచ్చి అస్పృశ్యతా నివారణావసరం ప్రజలకు నచ్చచెప్పినారు

కాచిగూడలోని ' చెప్పల్ బస్తీ"కి "హరిజనబస్తీ" అని నామకరణం చేయబడింది కాని ఆ పేరుకు పోలీసువారు అభ్యంతర పెట్టినట్లు తెలుస్తున్నది

మార్వాడీ విద్యాలయంవారు స్థాపించిన "హిందీ పరచాలయా"నికి గాంధీగీని ఆహ్వానించినారు కాని ఆయన వ్యవధి లేనందున అక్కడకు పోజాలనందుకు తన విచారం తెలియజేస్తూ పాట్నానుంచి 1934 మార్చి 27న ఆ విద్యాలయాధికారులకు లేఖ ఒకటి వ్రాసినారు

హరిజనయాత్ర సందర్భంలో గాంధీజీ హైదరాబాదు, సికిందరాబాదు నగరాలను దర్శించిన నాటి ఉదంతాలను విపులంగా వివరిస్తున్నాము

## గాంధీజీ - హైదరాబాదు సంస్థానము (1934)

1934 మార్చి 9వ తేదీన గాంధీజీ హరిజన యాత్రాసందర్భంలో హైదరాబాదు రాగలరని స్థానిక హరిజన సేవక సంఘం కార్యదర్శి ప్రకటించినారు అందువల్ల నాంపల్లి స్టేషన్ దగ్గర జనం ఆయన రాకను ఎదురుచూస్తూ ఉన్నారు

గాంధీజీ రాకకు మూడురోజులు ముందుగానే ఆయనకు కావలసిన సౌక

ర్యాలను ఏర్పాటు చేయడానికి శ్రీమతి సరోజినీదేవి హైదరాబాదుకు చేరు కొన్నారు మార్చి 7 వ తేదిని గాంధీజీని కలుసుకొని తీసుకొని వచ్చేటందుకు హరిజన సేవక సంఘ ప్రధాన కార్యదర్శి రావి నారాయణరెడ్డిగారు, యల్ ఆర్ దాచాగారు, జస్వంతరావుగారు, కుమారి పద్మజా నాయుడుగారు వాడీ స్టేషన్‌కు ప్రయాణమై వెళ్ళినారు కాని వారు మధ్యలో వికారాబాద్ స్టేషన్ లోనే గాంధీజీని కలుసుకో గలిగినారు

గాంధీజీ జనం వొత్తిడిని తప్పించుకొనేటందుకు హైదరాబాదుకు 15 మైళ్ల దూరంలో ఉన్న లింగంపల్లి స్టేషన్‌లో దిగినారు ఆ సంగతి ముందుగానే సరోజినీదేవికి తంతిద్వార తెలిసినందున ఆమె కుమారి లీలామణి, మేజర్ యం జి నాయుడు, వామన్ నాయక్, సిరాజుల్ హసన్ తిర్మిజి, వినాయక్ రావు విద్యాలంకార్ (బార్ ఎట్ లా), కే తాతాచారి, రామకృష్ణధూత్‌గార్లు మహాత్ముని ఎదురేగి తీసుకొనిరావడానికి లింగంపల్లికి వెళ్ళినారు గాంధీ మహా త్ముడు లింగంపల్లి స్టేషన్‌లో దిగుతారనేవార్త ముందుగా తెలియక పోవడం చేత అక్కడ జన సమ్మర్ధం ఎక్కువగా లేదు మహాత్ముడు ఉదయం 8 గంట లకు లింగంపల్లి స్టేషన్‌లో దిగగానే సరోజినీదేవి ఆయనకు ఖద్దరు మాల వేసి హైద్రాబాదు స్టేషన్‌లో "మీ దర్శనంకోసం వేలకొద్దీ జనం వేచి ఉన్నారు కాబట్టి మిమ్ములను ఆ తోవనే తీసుకొని పోతాను" అన్నారు సరోజినీదేవిగారు గాంధీజీ "సరే" అన్నారు సరోజినీదేవి కారులో గాంధీజీ 'గోల్డన్ త్రెషోల్డ్'కు చేరినారు గాంధీజీ పరివారమంతా నాంపల్లి స్టేషన్‌లోదిగినారు. వారిలో మీరా బేన్ కూడా ఉన్నది

గాంధీజీ లింగంపల్లి స్టేషన్ లో మోటారుకారు ఎక్కబోయే సమయంలో చినిగిన బట్టలతో ఉన్న ఒక పల్లెటూరు ముసలమ్మ ఆయన కారు వద్దకు పరుగెత్తుకొనివచ్చి రెండు అణాలు సమర్పించింది మహాత్ముడు ఆ కానుకను చిరునవ్వుతో స్వీకరించినారు రోడ్డు పక్కనున్న మరొక స్త్రీ గాంధీజీని "లోకరతకా" అని సంబోధించి ఒక్కరూపాయి యిచ్చింది మహాత్ముడు ఆమెను అభినందించినారు

గాంధీజీ, సరోజినీదేవిగారి భవనము "గోల్డెన్ త్రెషోల్డ్"కు చేరగానే అక్కడచేరి ఉండిన ప్రజలు 'గాంధీకి జై' అని నినాదాలు చేసినారు రాజ బహద్దూర్ వెంకట్రామరెడ్డి (పోలీసుకమిషనర్) యాజమాన్యం క్రింద పోలీసు అధికారులు, స్వయం సేవకులు గుంపులను సర్దుబాటు చేసినారు

మహాత్ముడు సరోజినీదేవి భవనంలో కొంత సేపు విశ్రాంతి తీసుకొని అక్కడకు మూడు మైళ్ల దూరంలో ఉన్న లాల్ దర్వాజాకు బయలుదేరి వెళ్ళి నారు తోవలో జనం ఆయన దర్శనం కోసం బారులు తీర్చి నిలబడి ఉన్నారు లాల్ దర్వాజా దగ్గర జనం వేలకొద్దీ చేరి ఉన్నారు అక్కడ జండాలతోనూ, తోరణాలతోనూ అలంకరింపబడిన ఆది హిందూ మహా విద్యాలయం కూడా గాంధీజీ చూసినారు

శాంతి భవనము, మార్వాడీ విద్యాలయము, కాచిగూడా హరిజన హాస్టల్ మొదలయినవి గాంధీజీ కార్యక్రమంలో ఉన్నాయి అందువల్ల ఆయా ప్రదేశాలలో గాంధీజీ రాకకోసం వేలకొద్దీ ప్రజలు వేచి ఉన్నారు కాని గాంధీజీ ఆయా ప్రదేశాలకు పోయే తన కార్యక్రమం విరమించుకొని తన వసతి గృహానికి పోయినందుకు ఆయా ప్రదేశాలలోని జనం ఆశాభంగం చెందినారు

గాంధీజీ మార్చి 9 ఉదయం 8 46 నిమిషాలకు ఖాదీ వస్త్రాలయం చూసినారు ఆ ఉదయం సంస్థాన ప్రభుత్వం చేసిన ఉత్తరువులవల్ల అక్కడి కార్యక్రమం సాగలేదు ఆ ఉదయం జరగవలసిన మరి మూడు సభలు కూడా జరగలేదు కాని అందువల్ల మరొక ప్రయోజనం కలిగింది గాంధీజీకి అనుకొన్న దానికంటె ఎక్కువ విశ్రాంతి లభించింది సాయంకాలం 2, 8 గంటల మధ్య ఆయన హరిజన నాయకులతోను, కార్యకర్తలతోను హరిజనులకు సంబంధించిన అనేక సమస్యలను గురించి చర్చించినారు వివేకవర్ధనీ పాఠశాలలో ఆ మధ్యాహ్నం రెండు సభలు ఏర్పాటు చేయబడినాయి సమావేశ కాలానికి చాలా ముందుగానే వివిధ మతాలకు, కులాలకు చెందిన వేలాది స్త్రీ పురుషులు సమావేశ స్థలానికి చేరుకొన్నారు సమావేశకర్తలు గోషా స్త్రీలకు చక్కని పర్దా ఏర్పాట్లు చేసినారు చాలా సొమ్ము కూడా వసూలయింది స్త్రీల సభలో ఒక స్త్రీ మహాత్మునికి 5 రూపాయలు సమర్పించి ఆయన చేవ్రాలు తీసుకొన్నది ఆ సభలో గాంధీజీతో మీరాబేన్, సరోజనీదేవిగార్లు ఉన్నారు మీరాబేన్ స్త్రీల నుంచి హరిజన నిధికి సొమ్ము వసూలు చేసింది 600 రూపాయల విలువగల నగలు వచ్చినాయి

## పురుషుల సభ

పురుషుల సభ వివేకవర్ధనీ పాఠశాల ఆవరణలో జరిగింది సభా సదుల సౌకర్యంకోసం సమావేశకర్తలు దూరశ్రవణ యంత్రాలను ఏర్పాటు చేసినారు శ్రీ ఆర్ యస్ నాయక్ గాంధీజీ సందేశం అందరికీ వినబడడానికి వీలుగా నిశ్శబ్దంగా ఉండవలసిందని సభలోని వారిని కోరుతూ ఉపన్యసించినారు గాంధీజీ మీరాబేన్, సరోజనీనాయుడు, ఠక్కర్ బాబా, మేజర్ యం జి నాయుడు మొదలయిన వారితోకలసి 3 45 గంటలకు సభాస్థలానికి చేరినారు స్థానిక హరిజన సేవక సంఘాధ్యక్షుడు శ్రీవామన్‌నాయక్ స్వాగత పత్రం చదివి గాంధీజీని పుష్పమాలాలంకృతిని చేసినారు

## స్వాగత పత్రము

వామన్ నాయక్‌గారు స్వాగత పత్రం ఉర్దూలో చదివినారు

'భారత సంస్థానాలలో అగ్రస్థానం వహిస్తున్న నిజాం సంస్థాన ప్రధాన నగరమయిన హైదరాబాదుకు మీరు వచ్చినందున ఈ నగరానికి ఎంతో గౌరవమూ, ఆనందమూ కలిగినాయి హైదరాబాదు పౌరుల పక్షాన మిమ్ము

మేము ప్రేమ పూర్వకంగానూ, సగౌరవంగానూ ఆహ్వానిస్తూన్నాము మరి కొంత కాలము మీ సాహచర్యం మాకు కలిగినట్లయితే మేము నిమ్న జాత్యుద్ధరణ గురించి మీ సందేశాలను గ్రహించి సంతృప్తి పడగలమని మేము ఆశిస్తున్నాము కాని కొద్ది కాలమయినా మీతో కలసి ఉన్నందుకు మేము అదృష్ట వంతులమని భావిస్తున్నాము ఆర్తులయిన వారిని ఉద్ధరించడానికి మీరు కడచిన 40 సంవత్సరములనుంచి కృషిచేస్తున్నారు అస్పృశ్యతా నివారణ సమస్య ఇంతవరకూ పరిష్కారం కాలేదు కాని మీ ఔత్సుక్యంవలన పరిస్థితి కొంతవరకు బాగుపడుతుంది మన ఆశయం జయం పొందటానికి ఇంక ఎంతో కాలం పట్టదు హిందూ సమాజంలో ఉన్నత వర్గాలు, అధోవర్గాలు అనే భేద భావము శాఖోప శాఖలుగా వ్యాపించి ఉన్నది మీ వంటి వారే దానిని తొలగించగల సమర్థులు శతాబ్దాల నుంచి పరిష్కారం కాని అస్పృశ్యతా సమస్యను మీరు పరిష్కారం చేయపూనుకొన్నారు మీకు భగవంతుడు దీర్ఘాయురారోగ్యాలను ప్రసాదించ వలెనని హైదరాబాదు ప్రజలు ప్రార్థిస్తున్నారు

ఈ స్వాగత పత్రానంతరం గాంధీజీకి హరిజన సేవక సంఘంవారు 1680 రూపాయలు, లాల్ దర్వాజా పౌరులు 75 రూపాయలు, మార్వాడీ విద్యా లయంవారు 100 రూపాయలు, ఆర్యసమాజంవారు 150 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు గాంధీజీ హిందిలో 30 నిముషాలు ఉపన్యసించినారు

### గాంధీజీ ఉపన్యాసము

ప్రజలు తన పట్ల చూపిన గౌరవానికి గాంధీజీ కృతజ్ఞత వెలిబుచ్చినారు హిందీ ఉర్దూభాషలు ఒకటేననే అభిప్రాయంతో ఆయన రెండు భాషలలోను మాట్లాడినారు అయన ఉపన్యాసంలో జనులలో ఎక్కువ, తక్కువలనే భేదాలు ఉండకూడదు దేశంలోని ప్రజలందరూ సమానమే ననే విషయం గురించి 50 సంవత్సరాల నుంచి ఆలోచిస్తున్నాను హరిజనులకు ఇతరులకు ఏమీ భేదం లేదని నాకు నమ్మకం కలిగింది హిందువులు, మహమ్మదీయుల మధ్య కూడా యేమీ భేదం ఉండకూడదు వారందరూ చేతికిగల అయిదు వేళ్లవలె కలసి ఉండవలె ప్రజలందరూ పరస్పరం సోదరులవలె మెలగవలె మనం ఆ సర్వాధికారి అయిన దేవుణ్ణి "అల్లా" అనవచ్చు, లేదా "ఈశ్వరు'డనవచ్చు ఏ పేరున పిలిచినా ఒకటే మన మందరం ఆయన సేవకులము హిందువులు అస్పృశ్యతా కళం కాన్ని నిర్మూలించవలె నాకు అమెరికా, ఇంగ్లాండ్, జపాన్ మొదలయిన దేశముల నుంచి ఉత్తరాలు వస్తున్నాయి వారందరూ తమదేశాలలో అటువంటి భేదాలు లేవని వ్రాస్తున్నారు హిందూ మతాన్ని నాశనం చేయ ప్రయత్ని స్తున్నానని నన్ను కొందరు విమర్శిస్తున్నారు అది ఎంత మాత్రం నిజంకాదు నేను దానిని నాశనంచేయ ప్రయత్నించకపోగా పై పెచ్చు దానిలోని కళం కాన్ని తుడిచివేయడానికి ప్రయత్నిస్తున్నాను కాబట్టి మీరందరూ నా ఈ హరి జనోద్యమానికి తోడ్పడ వలెనని ప్రార్థిస్తున్నాను "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ చిత్రపటాలను, ఆయనకు సమర్పించిన సన్మాన పత్రాలను వేలంవేస్తే గాంధీజీ చిత్రపటాలలో ఒక దానిని బంకట్ లాల్ గారు 110 రూపాయలకు కొన్నారు

సాయంకాలం 5 గంటలకు కొంత సేపు మహాత్ముడు విశ్రమించి సికిందరాబాదు కర్బలా మైదానంలోని బహిరంగ సభకు వెళ్ళినారు

**సికిందరాబాదు**

మార్చి 9 సాయంకాలం సికిందరాబాదులోని కర్బలా మైదానం జన సమూహంతో క్రిక్కిరిసి పోయింది శ్రీ కె తాతాచారి బహిరంగ సభలోని ప్రజలసౌకర్యం కోసం విస్తృతమయిన ఏర్పాట్లు చేసినారు బేగంపేట కన్యా గురుకుల్ లోని బాలికల వందేమాతరం గీతంతో సభా కార్యక్రమం ప్రారంభ మయింది గాంధీజీ సభాస్థలానికి రాగానే ప్రజలుత్సాహంతో ఆయనను అభినందించినారు సికిందరాబాదు పౌరుల పక్షాన శ్రీ బాజీ కృష్ణారావు స్వాగత పత్రం చదివి 1,000 రూపాయల నిధిని సమర్పించినారు గుజరాతీ సమాజంవారు హిందీలో మరొక సన్మాన పత్రం చదివి 1100 రూపాయలు హరిజన నిధికి ఇచ్చినారు ముగ్గురు హరిజన బాలికలు వేదంలోని ఒక పనసను పఠించినారు గాంధీజీ సన్మాన పత్రాలను విరాళాలను సమర్పించిన వారికి కృతజ్ఞత తెలుపుతూ, వేదపనసను పఠించిన బాలికలు హరిజన బాలికలని తాననుకో లేదన్నారు దగ్గరగా కూర్చుండడం పాపమని సనాతన వాదులంటున్నప్పటికీ ఉన్నత కులీనుల నుంచి వారిని ప్రత్యేకం ఆనహాలు పట్టడానికి తగిన ఆధారం లేదన్నారు ఆయన ఇంకా ఇట్లా అన్నారు "అస్పృశ్యతా కళంకం నిర్మూలించ డానికి నేను హైదరాబాదు వచ్చినాను ఈ నా పనిలో మీరందరూ సహాయం చేయ కోరుతున్నాను ప్రజలీయదలుచుకొన్న విరాళాలు నాకివ్వవచ్చు అయితే ఆ సొమ్ము ప్రత్యేకం హరిజనోద్యమానికే వెచ్చింపబడుతుందని గ్రహించవలసి ఉంటుంది అదృష్టవశాత్తు అస్పృశ్యత అంతకంతకు అదృశ్యమవుతున్నది అయితే ఆత్మ పరిశుద్ధతకోసం నేనీ పని సాగిస్తున్నాను ఈ ఉద్యమంలో అసూయాస్వార్థాలకు ఎంతమాత్రం తావులేదు మంచినీటి సౌకర్యాలు, పాఠశాలలు మొదలయినవి లేనందున హరిజనులు పడుతూన్న ఇబ్బందులను తొలగించడానికి సనాతనులు నాకు తోడ్పడవలె జంతువులు తాగే జలాశయాల నుంచి హరిజనులను నీళ్లు తెచ్చుకోమనడం కేవలం అమానుషము హిందూ సమాజంలోని ఉన్నత కులాలకు చెందిన డాక్టరు హరిజన రోగికి చికిత్స చేయ డానికి కూడా అంగీకరించకపోవచ్చునని నా మిత్రుడు డాక్టర్ లతీఫ్ సయీద్ అభిప్రాయము నేను ఇటువంటి విషయాలను చర్చించ పూనుకొన్నట్లయితే లజ్జింపతగిన ఈ విషాద గాథకు అంతు ఉండదు హరిజనులకు సేవచేయడం హిందువులకు తీరని కర్తవ్యము "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ, వస్తువులను వేలం పెట్టడంలో సిద్ధహస్తు

డని శ్రీ ఆర్ యస్ నాయక్‌ను ప్రశంసిస్తూ, తనకు బహూకరించిన వస్తువు లను వేలంవేయడానికి ఆయనను ఆహ్వానించినారు సన్మానపత్రాలు, ఫోటో గ్రాపులు, ఒక బాలిక యిచ్చిన వెండి అందెలు ఆయన వేలంవేయగా గాంధీజీ ప్రోత్సాహంతో వేలంపాట త్వరత్వరగా పెరిగింది

తరవాత సభనుంచి జనుల వొత్తిడివల్ల గాంధీజీని కారు దగ్గరకు తీసుకొని పోవడానికి 15 నిమిషాలు పట్టింది

గాంధీజీ జేమ్స్ వీధిలోని ఖాదీవస్త్రాలయాన్ని, గాస్‌మండిలోని హరిజన వాడను దర్శించగలరని జనులు అక్కడ వేచిఉన్నారు కాని వ్యవధి లేనందువల్ల వారు సికిందరాబాదు స్టేషన్‌కు వెళ్ళిపోయినారు

సికిందరాబాద్ స్టేషన్‌లో ఆయన ఉన్న కొద్ది నిమిషాలలో 225 రూపా యలు హరిజననిధికి వసూలయింది శ్రీమతి సరోజనీనాయుడు, కుమారి పద్మజా నాయుడు, శ్రీ కే తాతాచారి, శ్రీ వామన్‌నాయక్, మేజర్ యం జీ నాయుడు మొదలయిన ప్రముఖులు సికిందరాబాద్ స్టేషన్‌లో గాంధీజీకి పూల దండలు వేసి వీడ్కోలు చెప్పినారు

గాంధీజీ, ఆయన బృందము బీహార్ భూకంపంవల్ల బాధపడినవారి సహాయార్థం సికిందరాబాదునుంచి పాట్నాకు వెళ్ళినారు

తోవలో కాజీపేట స్టేషన్‌లో హరిజననిధికి చిల్లరగా 160 రూపాయలు చేకూరింది శ్రీ రావి నారాయణరెడ్డిగారు 1900 హాలీరూపాయలు గాంధీజీకి సమర్పించినారు

హైదరాబాద్, సికిందరాబాద్ నగరాలలో మొత్తం 10,000 రూపా యలు వసూలయింది

హైదరాబాదులో మార్చి 9 ఉదయాన గాంధీజీ కార్యక్రమం కొంత వరకు ఆపివేయవలసివచ్చినందుకు కారణం ప్రభుత్వాధికారుల ఆదేశాలవలన కాదని హైదరాబాదునుంచి అసోసియేటెడ్ ప్రెస్ పంపిన తంతీవార్తవల్ల తెలియవచ్చింది మార్చి 9 మధ్యాహ్నానికి ముందుగా పోలీసు కమిషనర్ రాజా బహద్దూర్ వెంకట్రామరెడ్డి, శ్రీమతి సరోజనీనాయుడు గృహంలో గాంధీజీని దర్శించి వచ్చినారు పోలీసు రిపోర్టులనుబట్టి ప్రభుత్వాధికారుల ఉత్తరువులవల్లనే గాంధీజీ నిర్ణీత కార్యక్రమ ప్రకారం కొన్ని స్థలాలను చూడజాలకపోయినట్లు తెలిసింది

## గాంధీజీ - మామిడి మొక్క

శ్రీమతి సరోజనీనాయుడు గృహమునుంచి పాట్నాకు పోవలెననే ఉద్దేశంతో సికిందరాబాదు స్టేషన్‌కు బయలుదేరే ముందు గాంధీజీ "గోల్డెన్ త్రెషోల్డ్" (సరోజనీదేవి గృహము) ఆవరణలో ఒక మామిడి మొక్కను నాటి నారు ఈ మొక్క యరవాడ జైలులో గాంధీజీ చేసిన చరిత్ర ప్రసిద్ధ ప్రాయోప వేశాన్ని స్ఫురణకు తెచ్చింది గాంధీజీ తన ప్రాయోపవేశ దినాలను

ఏమామిడిచెట్టు నీడకింద గడిపినారో దాని గింజతో ఈ మొక్క మొలిచింది గాంధీజీ యరవాడ జైలునుంచి విడుదలయినప్పుడు అది ఆయనతో వచ్చింది కడచిన 18 మాసాలనుంచి దానిని చాలా శ్రద్ధాభక్తులతో పెంచడం జరిగింది ఈ మొక్కను గాంధీజీ నాటేటప్పుడు ప్రేక్షకులు అత్యుత్సాహంతో తమ ఆనందం వెలిబుచ్చినారు గాంధీజీ మొక్కను కుదురులో పెట్టి చుట్టూ మట్టివేసి నీళ్ళుపోసి అనుభవంగల తోటమాలివలె మొక్కలు నాటడంలోని తన ఆసక్తిని కనబరిచినారు

## గాంధీజీ ప్రకటన

గాంధీజీ హైదరాబాదునుంచి పాట్నాకు పోయేముందు 'అసోసియేటెడ్ ప్రెస్' ప్రతినిధి ఆయనను మార్చి 9 రాత్రి దర్శించి ఆయన ముందు కార్యక్రమం గురించి ప్రశ్నించగా ఆయన ఇట్లా అన్నారు

"ఇతరులవలె నాకు భవిష్యత్తును గురించి చెప్పగల శక్తి లేదు సరికదా మూడు నెలల తరవాత ఏం జరుగుతుందో అనలే చెప్పలేను నా అంతట నేను నాపై పెట్టుకొన్న నిర్బంధం 31వ జూలైతో అంతమవుతుంది అందువలన నేనప్పుడేమి చేయవలెనో ఆలోచించుకొనేటందుకు కావలసినంత వ్యవధి ఉన్నది ఈలోగా నాకు అస్పృశ్యతా నివారణోద్యమంలోను బీహార్‌లోను, చేతినిండా పని ఉన్నది "

అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధి "మీరు బీహార్‌లో ఎన్నాళ్ళుంటార"ని ప్రశ్నించగా ఆ విషయం రాజేంద్రప్రసాద్ చేతుల్లో ఉన్నదనీ బీహార్ అవకాశం తీసుకొని తాను ఒరిస్సా, అస్సాం రాష్ట్రాలలో కూడా అస్పృశ్యతా నివారణ ప్రచారం చేయగలననికూడా అన్నారు హైదరాబాదుతో తన హరిజనాభ్యుదయ పర్యటన పూర్తి అయినట్లు భావించడం పొరపాటని ఖచ్చితంగా చెప్పినారు బీహార్‌లోని అత్యవసర పరిస్థితులను బట్టి తాత్కాలికంగా హరిజనోద్యమ కార్యక్రమం ఆపివేయవలసి వచ్చిందన్నారు కడచిన కొద్ది మాసాలలో అస్పృశ్యతా నివారణ విషయంలో చాలా పని జరిగినప్పటికీ ఇంకా చాలా ఎక్కువ పని జరగవలసిందన్నారు

దక్షిణ భారతదేశంలోని తమ పర్యటన ఫలితాలను గురించి చెప్పగలరా అని అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధి మళ్ళా ప్రశ్నించినారు

అప్పుడు గాంధీజీ ఇట్లా అన్నారు "నా దక్షిణ భారత పర్యటన అపూర్వ విజయం సాధించింది అస్పృశ్యతా నివారణకు తోడ్పడడంలో భారతదేశంలోని ఇతర ప్రాంతాల వారివలె దక్షిణ భారతీయులు ఉత్సాహం చూపించరన్న సూచనలు సత్యదూరాలని స్పష్టంగా తేలింది పై పెచ్చు అన్నిచోటులలోవలెనే దక్షిణ భారత దేశంలో కూడా దేవాలయాలలో హరిజనులను ప్రవేశ పెట్టడంలోను, అస్పృశ్యతా నివారణోద్యమానికి నిధులు సమర్పించడంలోను ప్రజలు ఎంతో ఉత్సాహం కనబరిచినారు దక్షిణాదివారి విషయంలో తక్కిన వారికి

తీసిపోరని తేలింది గురువాయూరు విషయంలో కొంత మినహాయింపుఉంది అక్కడకూడా ప్రజాభిప్రాయం గెలుపొందగలదని నా విశ్వాసము "

**గాంధీజీ పరివారము, వారి పరిచయము**

గాంధీజీ ఆంధ్రదేశ హరిజనయాత్రలో ఆయనవెంట వచ్చిన వారు

1 ప్రొఫెసర్ మల్కానీ
2 మీరాబెన్
3 కార్యదర్శి చంద్రశంకర్ శుక్ల
4 శ్రీమతి ఉమాబజాజ్
5 శ్రీమతి కృష్ణాబెన్
6 విశ్వనాథ పాండ్య
7 దామోదరదాసు
8 రామనారాయణ్ చౌదరి
9 శర్మ

ప్రొఫెసర్ మల్కానీ ఈయన మీరట్ కళాశాలలో పండితులుగా ఉండి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్న త్యాగి అఖిలభారత చర్ఖా సంఘంలో కొంతకాలం పనిచేసి గాంధీజీ హరిజనయాత్రలో కార్య క్రమం నడిపేటందుకు బాధ్యత వహించిన కార్యదర్శి

మీరాబెన్ ఆంగ్లదేశపు ఓడల అధికారి కమాండర్ స్లేడుగారి కూతురు ఈమె పాశ్చాత్య నాగరికతవల్ల ఆత్మకు శాంతిలేక రోమాన్‌రోలాగారి సలహాచే భారతదేశానికి వచ్చి గాంధీగారి శిష్యురాలయి భారతదేశ సేవలోనే జీవితం గడుపుతూన్నది గాంధీగారిని కనురెప్పవలె కాపాడేది ఆయన కమోడ్‌సైతము పరిశుభ్రం చేసే భక్తురాలు మహాత్ముని భోజ నము, వసతి, నిద్ర అన్నీ ఆమె ఏర్పాటు చేస్తూండేది రైళ్లలో కింద పడుకొనేది గాంధీజీ వసతులలో అవసరమయితే పాకీదొడ్లుసైతం పరిశుభ్రం చేసేది

చంద్రశంకరశుక్లా మహాత్ముని కార్యదర్శి మహాదేవదేశాయ్ జైలులో ఉన్న కారణాన ఆయన స్థానంలో ఈయన ఉన్నారు గుజరాతి 'హరిజన్' సంపాదకులుగా ఉన్నారు 'హరిజన్' పత్రికకు గాంధీగారి ఉపన్యాసాలు సంభాషణలు అన్నీ వ్రాసి జాగ్రత్త చేస్తూండేవారు గాంధీజీకి ఆంత రంగిక కార్యదర్శి

శ్రీమతి ఉమాబజాజ్ జమన్‌లాల్ బజాజ్‌గారి రెండవ కుమార్తె గాంధీగారి సౌకర్యాల విషయంలో మీరాబెన్‌గారికి సహాయపడుతుండేది స్త్రీల సభ లలో వస్తువులు విరాళాలు వసూలు చేయడం కూడా ఈవిడ పని ఈవిడ తెలుగు మాటలు చాలా నేర్చుకొన్నది

శ్రీమతి కృష్ణాబెన్ ఈమె కర్ణాటక యువతి. స్త్రీల సేవాదళానికి కెప్టెన్‌గా

ఉన్నది గాంధీగారి ఉత్తరాలు చదవడంలోను ఆహార పదార్థాలు తయారు చేయడంలోను మీరాబేన్‌గారికి సహాయపడుతుండేది స్త్రీల సభలో వస్తువులు విరాళాలు వసూలు చేయడానికి ఉమాబజాజ్‌కు తోడుగా ఉండేది

విశ్వనాథపాండ్య, దామోదర్ దాసు వీరిద్దరూ సభలలో వచ్చే విరాళాలు వస్తువుల లెక్కలు వ్రాసుకొంటూ హరిజననిధి జమాఖర్చులు తయారు చేసే కోశాధిపతులు విశ్వనాధపాండ్య అఖిలభారత హరిజనసేవక సంఘంలో ఉద్యోగి

రామనారాయణ్ చౌదరి ఈయన రాజపుతానా హరిజన సేవక సంఘ కార్యదర్శి గాంధీగారి హరిజన సేవనుగురించి హిందీ పత్రికకు వ్రాస్తుండేవారు ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయడంలో గాంధీజీకి తోడ్పడుతుండేవారు

శర్మ గాంధీగారి పరివారపు సామానులు ఓపికతో జాగ్రత్తపెట్టడం ఈయన పని

వీరందరూ అంధ్రదేశ సంచారానికి ఆనందించి ఆంధ్రుల ఉదారాతిథ్యాలకు వందనాలర్పించినారు

## మహాత్ముని హరిజన యాత్ర ముగింపు

హరిజన యాత్రా సందర్భంలో మహాత్ముని సంచారము నిర్విఘ్నంగా కొనసాగింది అంధ్రదేశంలోనేగాక దక్షిణ భారత దేశమంతటిలోను అస్పృశ్యతా నివారణోద్యమంలో ప్రజలు చూపిన ఉత్సాహం, వారు సమర్పించిన విరాళాలును ముఖ్యంగా స్త్రీలు చేయి చాచినంతనే తమ ఆభరణాలను ఒలిచి ఇచ్చిన దృశ్యాలను చూసి గాంధీజీ దక్షిణ భారత దేశంలో అస్పృశ్యత మరణశయ్యయందున్నదని వీడ్కోలు సందర్భంలో విశ్వసనీయంగా చెప్పినారు దక్షిణ భారతంలో సనాతనులకు అస్పృశ్యతా నివారణలో భేదాభి ప్రాయము ఉన్నప్పటికీ వారా ఉద్యమంపట్ల దౌర్జన్యయుతంగా ప్రవర్తించలేదు సంస్కరణ వాదులు సైతం సనాతనుల పట్ల అగౌరవం చూపలేదు కాని గాంధీజీ బీహార్ రాష్ట్రంలో సంచారం చేసేటప్పుడు జాసిడ్‌లోను, బక్సారులోను సనాతనులు, సనాతన ధర్మంకే అవమానకరమయ్యేట్లు ప్రవర్తించినారు బక్సారులో అస్పృశ్యతా నివారణ కార్యకర్తల పైన కొందరు సనాతనులు దౌర్జన్యం చేయడం చేత ముగ్గురు కార్యకర్తలకు నెత్తిమీద, చేతుల మీద బలమయిన గాయాలు తగిలినాయి జాసిడ్‌లో సనాతనుల దౌర్జన్యంవల్ల సుమారు ఇరువై ఐదు మంది అస్పృశ్యతా కార్యకర్తలకు దెబ్బలు తగిలినాయి మహాత్ముని మోటారుపై రాళ్లు రువ్వడంతో కారు అద్దం బద్దలయినది కాని వారికి దెబ్బలు తగలలేదు

ఈ దుస్సంఘటనలు 1934 ఏప్రిల్ నెలలో జరిగినాయి

1934 జులై నెలలో మరొక దురంతరం జరిగింది. అజ్మీరులో మహాత్మునకు

స్వాగత మీయడానికి పెక్కు వేలమంది పౌరులు సమావేశమయినప్పుడు లాలానాథ్ మొదలయిన సనాతనులు హరిజనోద్యమ పట్ల తమ అసమ్మతిని వెల్లడించేటందుకు నల్లజండాలతో ఊరేగినారు అప్పుడు వారికీ పౌరులకు మధ్య కొట్లాట జరిగింది లాలానాథ్‌కు దెబ్బలు తగిలినాయి ఈసంగతి విని గాంధీజీ శ్రీ లాలానాథ్‌ను వేదికపైకి రావించి ఆయనకు తన మనఃపూర్వక పశ్చాత్తాపం వెల్లడించినారు ఆయనను కొట్టిన వారెవరో తెలియక పోయినప్పటికీ హరిజనోద్యమ కార్యకర్తలే అయ్యుంటారని భావించి అందుకు పరిహారంగా తాను ప్రాయశ్చిత్తం చేసుకోవలసి ఉంటుదని గాంధీజీ ఆ సభలోనే వెల్లడించినారు

తరవాత ఆగస్టు నెల 7వ తేది మంగళవారం మధ్యాహ్నం నుంచి ఏడు రోజులు వార్ధా ఆశ్రమంలో నిరశన దీక్షను పూనటానికి గాంధీజీ కరాచిలో నిశ్చయించినారు

కరాచీలో 1934 జులై 10వ తేదీన వర్తక సంఘ భవనానికి శంకుస్థాపన చేస్తూ "నేను ఉత్కళ దేశంలో పాదచారినై సంచారం చేయడంవల్ల నాకు చాలా అలసటగా ఉన్నది జులై నెలాఖరుతో హరిజన యాత్ర ముగించి విశ్రాంతి తీసుకో దలచు కొన్నాను ఈ నెల ఎప్పుడు పూర్తవుతుందా అని నిరీక్షిస్తున్నాను" అన్నారు ఆ ప్రకారం జులై నెల ఆఖరుతో ఆయన హరిజన యాత్ర ముగిసింది

## హైదరాబాదులో సభ

జులై 31 తో గాంధీజీ హరిజనోద్యమ ప్రచారం జయప్రదంగా సమాప్తి అయినందున హైదరాబాదు హరిజనసేవక సంఘంవారు గొప్ప ఉత్సవం చేసినారు ఉదయం సంఘ సభ్యులు హరిజనుల వీధులకు పోయి స్నానపానాదులైన తరవాత శుచిత్వం విద్యావశ్యకతను బోధించినారు సాయంత్రం వివేక వర్ధనీ థియేటర్‌లో బహిరంగసభ జరిగింది శ్రీ బన్సీలాల్ వ్యాస్‌గారి జాతీయ గీతాలతో సభా కార్యక్రమం ప్రారంభమయింది హరిజన సేవక సంఘ మాజీ అధ్యక్షుడు శ్రీ వామన్‌నాయక్‌గారు ఆ సభకు అధ్యక్షులుగా ఉన్నారు శ్రీ ఆర్ యస్ నాయక్ (బారిష్టర్) హరిజనోద్ధరణకోసం గాంధీజీ చేసిన సేవకు కృతజ్ఞతా తీర్మానం ప్రతిపాదిస్తూ అమెరికా ఖండంలో బానిసత్వం నివారించడానికి శాసనం చేసిన దినం ఎంత ముఖ్యతమమో గాంధీజీ హరిజన యాత్ర పరిసమాప్తి దినం కూడా ప్రపంచ చరిత్రలో అంత ముఖ్యతమమనీ అన్నారు తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరింపబడింది.

పుట్టుకవల్లనే అంటరానితనమెవ్వరికీ రాజాలదని పాఠశాలలు, బావులు మొదలయిన సర్వబహిరంగ ప్రజాసంస్థలను ఇతరులవలెనే హరిజనులు కూడా ఉపయోగించుకోవచ్చునని ప్రకటిస్తూ ఒక తీర్మానం పండిత్ నరేంద్రజీ ప్రతిపాదించగా శ్రీమతి నళినీగారు బలపరిచినారు తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరింపబడింది.

హైదరాబాదు పురపాలకసంఘంలో ఒక హరిజనుని చేర్చుకోడానికి అంగీకరించినందుకు (శ్రీ) నిజాం ప్రభుత్వంవారికి కృతజ్ఞతలు తెలుపుతూ అధ్యక్షుడు తీర్మానం ప్రతిపాదించినారు అందరూ అంగీకరించినారు "గాంధీజీకి జై" అనే నినాదాలతో సభ ముగిసింది

**మహాత్ముని ఉపవాసము**

అజ్మీరులో లాలానాథ్‌పైన జరిగిన దౌర్జన్యానికి ప్రాయశ్చిత్త సూచకంగా మహాత్ముడు 1934 ఆగస్టు 7 వ తేదినుంచి 15 వ తేదివరకు ఉపవాసవ్రతం అవలంబించినారు ఆ వారంరోజులు మహాత్ముని ఆరోగ్యానికి అందరునూ భగవత్ప్రార్థన చేయవలెనని కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రకటించినారు ఆ ఆదేశ ప్రకారం ఆంధ్రదేశంలో పలుచోట్ల సభలు సమావేశాలు జరిగినవి గాంధీజీ ఉపవాసదీక్షను జయప్రదంగా ముగించి నిరాయురారోగ్యాలతో వర్ధిల్లవలెనని వివిధ మతాలకు చెందిన ప్రజలు దైవప్రార్థనలు చేసినారు గాంధీజీ తన ఉపవాస వ్రతం జయప్రదంగా ముగించినారు

**నిర్మాణ కార్యక్రమ సంస్థలు**

1934 సెప్టెంబరునుండి గాంధీజీ కాంగ్రెస్‌నుంచి విరమించగలడనే ప్రవాదాలు పుట్టినాయి ఇందుకు కారణం కాంగ్రెస్ నాయకులలో అనేకమంది గాంధీజీ కార్యక్రమంతో విసిగి వేసారిపోయినట్లును కేవలం ఆయన వ్యక్తిత్వంపట్లగల గౌరవభావంవల్లనే ఆయనను అనుసరిస్తున్నట్లున్నూ గాంధీజీ పసికట్టినారు దానికితోడు చాలామంది పార్లమెంటరీ కార్యక్రమంపట్ల అభిమానం కలిగి ఉన్నట్లుకూడా ఆయనకు తెలిసింది కాంగ్రెస్‌లోనే సోషలిస్టు వర్గమొకటి ఏర్పాటయింది వారి అభిప్రాయాలతో గాంధీజీ చాలా విషయాలలో ఏకీభవించలేకపోయినారు సంస్థానాలపట్ల కాంగ్రెస్ ప్రవర్తించవలసిన విధానంపట్ల కూడా గాంధీజీతో అనేకమంది కాంగ్రెస్ నాయకులకు భేదాభిప్రాయాలు కలిగినాయి

అస్పృశ్యతా నివారణోద్యమం తాను ప్రారంభించిన సమయము, పద్ధతి గురించి కూడా కొంతమంది కాంగ్రెస్ నాయకులకు భిన్నాభిప్రాయాలున్నట్లు గాంధీజీ గ్రహించినారు

వీటన్నిటినీ మించి అహింస తనకు ప్రధాన సిద్ధాంతం కాగా చాలామంది కాంగ్రెస్ వాదులు దానినొక రాజకీయ విధానంగా మాత్రమే భావిస్తున్నట్లు ఆయన తెలుసుకొన్నారు ఈ అన్ని కారణాలను బట్టి ఆయన తన వ్యక్తిగతమయిన పలుకుబడివల్ల కాంగ్రెస్‌లో అధిక సంఖ్యాకులకు ఇష్టమున్నా లేకపోయినా తన విధానం కార్యక్రమం కాంగ్రెస్‌చేత అంగీకరింపచేయడం కాంగ్రెస్‌కు, దేశానికి కూడా శ్రేయస్కరం కాదని భావించి 1934 అక్టోబరు మాసాంతంలో జరిగిన బొంబాయి కాంగ్రెస్ అనంతరం ఆయన

కాంగ్రెస్‌తో తన భౌతిక వ్యవస్థా సంబంధం వదులుకొన్నారు

గాంధీజీ దృష్టిలో వ్యవసాయం దానితోపాటు చర్ఖా ఈ రెండూ భారత జాతికి ఊపిరితిత్తులవంటివి రాట్నం విడిచి వేయటంతో భారత జాతి ఒక ఊపిరితిత్తితోనే బ్రతుకుతూన్నదనీ అది చాలా అపాయకరమయిన స్థితి అనీ ఆయన దృఢవిశ్వాసము అందువల్ల ఆయన అఖిలభారత చర్ఖా సంఘం నిర్మించినారు

గ్రామీణ ప్రజల జీవనాధారానికి తగినవృత్తులు కల్పించటానికి అఖిల భారత గ్రామ పరిశ్రమల సంఘం, అస్పృశ్యతా నివారణకు హరిజనోద్ధరణకు అఖిలభారత హరిజన సేవక సంఘం గాంధీజీ ఏర్పాటు చేసినారు

ఈ మూడు స్వతంత్ర సంస్థలు ఈ సంస్థలపైన కాంగ్రెస్ కేమీ అధికారం లేదు ఆంధ్రదేశంలో కూడా ఈ మూడు సంస్థలకు శాఖలు నిర్మింపబడినాయి

## మహాత్ముని పర్యటన ప్రభావము-జయంత్యుత్సవాలు (1934)

గాంధీజీ అరవై ఐదవ జయంత్యుత్సవాలు (1934) మద్రాసులో జన్మదినోత్సవం మద్రాస్‌లో హైకోర్టు బీచిలో ఆంధ్ర కాంగ్రెస్‌వారు జరిపినారు సభకు వేమవరపు రామదాసు పంతులుగారు అధ్యక్షుడుగా ఉండ గాంధీజీ భారత దేశానికి చేసిన సేవలను ప్రశంసించినారు శ్రీ గద్దె రంగయ్యనాయుడు, ఆర్ శ్రీనివాసరావుగార్లు కూడా గాంధీజీ కాంగ్రెస్‌ను, జన సామాన్యం అంతటికీ సంబంధించిన సంస్థగా చేసి స్వరాజ్య సాధనకు దానిని పటిష్ఠమయిన పటకరంగా చేయగలిగినందుకాయనను అభినందించినారు

### తిలక్ ఘాట్‌లో

మద్రాస్‌లోని తిరువళ్ళిక్కేణి సముద్ర తీరంలో గాంధీ జన్మదినోత్సవ సందర్భంలో మద్రాసు తమిళ మండల కాంగ్రెసు సంఘంవారు మరొక బహిరంగసభ ఏర్పాటు చేసినారు యస్ సత్యమూర్తిగారు సభకు అధ్యక్షత వహించినారు అధ్యక్షుడు ఉపన్యసిస్తూ మహాత్ముడు త్రికరణ శుద్ధిగల వ్యక్తి ఆయన వ్యాసాలు పటిష్టాలు, అప్రతిహతాలు అయినప్పటికి అందరికీ బోధ పడగలవు ఆయన శైలి నిర్దుష్టము ఆయన వ్రాతలలోను, మాటలలోను ఎక్కడా అసత్యము కాపట్యము ఉండవు మనుష్యుని వెంట నీడవలె మహాత్ముని భావాల వెంట ఆయన వాక్యాలు పరుగెత్తుతూంటాయి భారత దేశీయుల మనసులను ఆయన పూర్తిగా వశపరచుకొన్నారు స్వరాజ్య సంపాదన కోసం మహాత్ముడు మళ్ళీ నాయకత్వం వహించవలెనని మనమందరమూ కోరవలె" అన్నారు

తరవాత యం. యస్ సుబ్రహ్మణ్యయర్, కె సంతానం, దివాన్ బహద్దూర్ భాష్యమయ్యంగార్లు ప్రసంగించినారు

హిందూ మహమ్మదీయ మైత్రికి గాంధీజీ చేసిన కృషి మరెవ్వరూ చేయ లేదనీ కనక మహమ్మదీయులందరూ కాంగ్రెస్‌లో చేరవలెనని "ఇస్లాం" పత్రికా

సంపాదకుడు జనాబ్ దావూద్ సాహెబు ఉద్బోధించినారు

### మద్రాసు కార్పొరేషన్ - మహాత్ముని అభినందించడం

మద్రాసు కార్పొరేషన్‌వారు గాంధీ మహాత్ముని జన్మదినోత్సవ సందర్భంలో తమ మనఃపూర్వకాభినందనలను మహాత్మునకు అందజేస్తూ "భగవంతుడు మహాత్మునకు దీర్ఘాయురారోగ్యాలను ప్రసాదించుగాక" అనే తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించినారు

### వైశ్యవిద్యార్థి వసతిగృహము

మద్రాస్ కీల్పాక్‌లోని వైశ్యవిద్యార్థి వసతిగృహంలోనివారు ప్రాతఃకాలముననే లేచి సుస్నాతులై గాంధీజీకి భగవంతుడు చిరాయురారోగ్యైశ్వర్యాలు ప్రసాదించుగాక అని ప్రార్థనలు చేసినారు

తరవాత మధ్యాహ్నం 12 గంటలకు 300 మంది బీదలకు అన్నదానం చేసి వారికి గాంధీజీ ఉపదేశాలను చదివి వినిపించినారు

### రాయపురంలో

ఊరేగింపులు ఉత్సవాలు జరిగినాయి వర్తకులు బీదలకు అన్నప్రదానం చేసినారు సాయంకాలం 6 గంటలకు రాయపురం కాంగ్రెస్ సభవారు గాంధీజీ పటం అలంకరించి మేళతాళాలతో ఊరేగించినారు పిల్లలకు మిఠాయీలు పంచిపెట్టినారు

### మదరాసు - భారత కన్యావిద్యాలయము

గాంధీ జన్మదినోత్సవ సందర్భంలో భారత కన్యావిద్యాలయానికి విద్యాలయాధికారులు సెలవిచ్చినారు ఉదయం 7 మొదలు 9 వరకు బాలికలు మహాత్ముని పటం ముందుంచుకొని జాతీయ గీతాలు పాడినారు సాయంత్రం 3 గంటలకు గాంధీ మహాత్ముని ఆయురభివృద్ధికోసం భజనలతో భక్తిగీతాలను విద్యాలయోపాధ్యాయినులు బాలికలు కలసి పాడినారు విద్యాలయ సంస్థాపకురాలు శ్రీమతి యామినీపూర్ణ తిలకమ్మ మహాత్ముని జీవితచరిత్రను బాలికలకు సంగ్రహంగా బోధించినారు ఉత్సవం చూడవచ్చిన జనులకు ఫలహారాలు పంచిపెట్టడంజరిగింది

### కాకినాడలో

కాకినాడలోని గోపాలస్వామివారి ఆలయంలో స్త్రీల సభ జరిగింది పి లక్ష్మీనరసమాంబగారు అధ్యక్షత వహించినారు శ్రీమతులు వేదాంతం కమలాదేవి, వేమురగంటి పాపాయమ్మగార్లూ మరికొందరు గాంధీమహాత్ముని జీవితాశయాలను గురించి ఉపన్యసించినారు

రామారావు పేటలో మరొక బహిరంగసభ జరిగింది. సభకు శ్రీ

కొమాండూరి శఠగోపాచార్యులవారు అధ్యక్షత వహించినారు బులుసు సుబ్బారావు, పాగుపూడి సత్యనారాయణ మహాత్ముని అహింసాతత్వం గురించి బోధించినార

**జమ్మలమడుగు**

జమ్మలమడుగు తాలూకా కాంగ్రెస్ సంఘంవారు గాంధీగారి జన్మ దినోత్సవ సందర్భంలో అక్టోబరు 2 మధ్యాహ్నం సుమారు 300 మంది బీదవారికి అన్నదానం చేసినారు రాత్రి కాంగ్రెస్ భవనం దగ్గర బహిరంగసభ జరిగింది శ్రీ కల్లూరి సుబ్బారావుగారు గాంధీమహాత్ముని జీవితము, వారి సందేశం గురించి గంభీరోపన్యాసం చేసినారు

**మంగళగిరి**

మంగళగిరి పట్టణ కాంగ్రెస్‌వారి యాజమాన్యంలో మహాత్ముని పటం మంగళ వాద్యాలతో ఊరేగించినారు తరవాత గాంధీ చౌక్‌లో బహిరంగసభ జరిగింది కాళంగి వేంకటరత్నంగారు అధ్యక్షత వహించినారు శ్రీయుతులు వాసిరెడ్డి బుచ్చినాయుడు, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగార్లు మహాత్ముని జీవితం గురించి విపులంగా ఉపన్యసించినారు.

**ఏలూరు**

గాంధీజయంతి జాతీయ పతాకోత్సవంతో ప్రారంభమయినది శ్రీయుతులు డాక్టర్ మూల్పూరు రంగయ్య, డాక్టరు ఉప్పులూరి పట్టాభిరామయ్య, రెబ్బాప్రగడ మందేశ్వర శర్మ, బలభద్రరామకృష్ణయ్య మొదలయినవారు ఉపన్యసించినారు శ్రీమతి మూల్పూరి చుక్కమ్మగారు పతాకోత్సవం చేసినారు. గాంధీజీ పటం పూలమాలికలతో జాతీయ పతాకాలతో అలంకరించి పౌరులు ఊరేగించినారు సాయంకాలం పురమందిరంలో బహిరంగసభ జరిగింది మూల్పూరి రంగయ్యగారు అధ్యక్షత వహించినారు. శ్రీమతులు శృంగారకవి లక్ష్మీనరసమ్మ, మూల్పూరి చుక్కమ్మ, దామరాజు లక్ష్మమ్మగార్లు సభా ప్రారంభంలో ప్రార్థనలు చేసినారు మానేపల్లి మల్లికార్జునగుప్త, తల్లాప్రగడ చలపతిరావు, మహమ్మద్ ఉమర్ అలిషాకవి, కారుమంచి రామమూర్తిగార్లు మహాత్ముని జీవిత చరిత్ర గురించి ఉపన్యసించినారు.

**అమృతలూరు**

అక్టోబరు 2 సాయంకాలం 2 గంటలకు గ్రంథాలయం నుంచి మహాత్మాజీ ఛాయా పటంతో నగర సంకీర్తనము, ఊరేగింపు జరిగింది తరవాత బహిరంగ సభలో చేకూరి వెంకటపిచ్చయ్య చౌదరిగారి అధ్యక్షత కింద శ్రీ శరణు రామస్వామి చౌదరిగారు మహాత్ముని ఆధ్యాత్మిక, నైతిక రాజకీయ చరిత్రను

గురించి ఉపన్యసించినారు గుంటూరు జిల్లా హరిజన సేవక సంఘంవారు ఇచ్చిన ఖద్దరు వస్త్రాలను హరిజన విద్యార్థినీ, విద్యార్థులకు సభలో పంచిపెట్టినారు

ఈ గ్రామంనుంచి అఖిలభారత చర్ఖాసంఘంవారి కేంద్రస్థానము, గుంటూరు జిల్లా కేంద్రస్థానాలు మహాత్మాజీ జన్మదినోత్సవాలలో పరిసర గ్రామాలకు వెళ్ళి విరివిగా ఖద్దరు ప్రచారం చేసినారు

## ఖద్దరు-గాంధీ సందేశము

"తినుటకు ఒక పూటకు మాత్రమే ఉండి, రెండోపూట లేక మలమల మాడుతూన్న కర్షకులకు ఆశాజ్యోతి ఖద్దరే హిందూదేశపు మిల్లు వస్త్రాల్ని సైతం విడనాడి ప్రతివారు ఖద్దరును గురించి యోచించవలె మన సాంఘిక జీవితమంతటికీ ఖద్దరే పునాది ఖద్దరువల్లనే అగ్ర-నిమ్నజాతులకు అవినాభావ సంబంధం పర్పడుతున్నది ఖద్దరు దీనజన చకోర చంద్రోదయము రాట్నం ఆడిన శాంతి సౌహార్ద్రతంతువులు నినదింపగలవు రాట్నం చేపడితే ఇంటింటా తిరిగే భిచ్చగాండ్రు ఆత్మగౌరవంగల పనివాండ్రు కాగలరు అతురాస్యులను, నిరక్షరకుక్షులను, పేదలను, ధనికులను ఏకోన్ముఖులుగా చేయగలిగింది ఖద్దరే ఖద్దరు మానవజాతిలో అయిదోవంతు ఆహారసమస్యను పరిష్కరించగలదు"

## *ఖద్దరు - సరోజినీదేవి

అదిగో వినబడుతున్నది మహాత్ముని సువార్త! చేతితో వడికి నేసిన దూది, ఉన్ని, పట్టువస్త్రాల రూపంలో ఉన్న ఖద్దరును ధరించవలెనను సువార్త! మహారాజులు కూడ ధరించదగినవని అనుపమ లోకప్రఖ్యాతిగాంచిన వస్త్రాల కళాసౌందర్యవిశేషాలను వెల్లడించు సువార్త! స్వశక్తిపై ఆధారపడి ఆత్మ గౌరవం కాపాడుకొంటూ ఆర్థికదుస్థితినుంచి విముక్తికండను సువార్త!

ఈ శుభోదంతం ఆలకించి హృద్గతం చేసుకొని ప్రతి భారతీయుడు ఖద్దరు మూర్తియా అన్నట్లు కన్పించడం కర్తవ్యమై ఉన్నది

## ఖద్దరు-డాక్టర్ పట్టాభి

మనకిప్పుడు స్వరాజ్యం రాకపోవచ్చు కాని స్వరాజ్యం వచ్చినప్పుడు దానిని నిలుపుకోడానికి సాధనాలు మూడు అస్పృశ్యతా నివారణము, ఖద్దరు నిర్మాణము, మద్యపాన నిషేధము

## నూజివీడు

నూజివీడులో అక్టోబరు 2, సాయంకాలం 6 గంటలకు నూజివీడు యువజన సమితివారి పఠనమందిరంలో మహాత్ముని జన్మదినోత్సవ సభ జరిగింది దేశో

*ఇది ఆంధ్రపత్రిక అనువాదము

ద్ధారక ని గేశ్వరరావు పంతులుగారు అధ్యక్షత వహించినారు అయ్యదేవర కాళేశ్వరరావు, చెరుకువాడ వెంకట నరసింహం, కళా వెంకటరావుగార్లు మహాత్ముని గురించి మహోపన్యాసాలు చేసినారు

**అ భా చ సంఘం**

మచిలీపట్నంలోని అఖిల భారత చరఖా సంఘ ఆంధ్రశాఖ కార్యాలయం వారు ఖద్దరును ప్రోత్సహించడానికి గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో రూపాయికి ఒక అణా చొప్పున ఖద్దరు వెలను తగ్గిస్తూ ప్రకటన చేసినారు

**బెజవాడ**

బెజవాడలో గాంధీజీ జన్మదినోత్సవ సందర్భంలో జరిగిన బహిరంగ సభలో డాక్టర్ పట్టాభిగారు, పూర్వకాలంలో మనదేశంలో చేతితో వడికిన నూలుతో చేతితో నేసిన బట్టల పరిశ్రమ ఎంత అత్యున్నత స్థితిలో ఉన్నదో వివరించి ఈస్టిండియా కంపెనీవారు దాని నెట్లా నాశనం చేసినారో తెలియ చెప్పినారు. రాట్నం మూలబడటంవల్లనే మన సంపద సన్నగిల్లినదనీ, రాట్నం పునరుద్ధరింపబడితే మన దేశసౌభాగ్యం వర్ధిల్లగలదనీ కూడా అన్నారు గాంధీ తత్వం చిరస్థాయిగా ఉండగలదనీ ఖద్దరే మనకు స్వరాజ్యం ప్రసాదించగలదనీ చెప్పి తమ ఉపన్యాసం ముగించినారు

అక్టోబరు 2 సాయంకాలం గాంధీ జయంత్యుత్సవసందర్భంలో గాంధీ పార్కులో జరిగిన సభకు డాక్టర్ గోవిందరాజులనాయుడుగారు అధ్యక్షత వహించినారు అయ్యదేవర కాళేశ్వరరావు, మంచాల సుబ్బారావు, చెరుకువాడ వెంకట నరసింహంగార్లు మహాత్మా గాంధీ భారత దేశానికి చేసిన పలు విధాలయిన సేవా కార్యాలను గురించి విపులంగా ఉపన్యసించినారు

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో బెజవాడలోని రామమోహన్ గ్రంథాలయంలో అక్టోబరు 2 సాయంకాలం జరిగిన సభకు డాక్టర్ ధన్వాడ రామచంద్రరావుగారు అధ్యక్షత వహించినారు శ్రీ సి రాజగోపాలాచారి, డాక్టరు పట్టాభి సీతారామయ్యగార్లు గాంధీగారి జీవితం గురించి, ఖద్దరు, అస్పృశ్యతా నివారణ కార్యక్రమం ప్రాముఖ్యం గూర్చి వస్తు వినిమయ విధానం గురించి విపులంగా ఉపన్యసించినారు

**కాకినాడ**

గాంధీ జయంతి సందర్భంలో కాకినాడ పట్టణ కాంగ్రెస్ యాజమాన్యంలో శ్రీ పైడా వెంకట చలపతి టౌన్ హాల్‌లో ఉప్పులూరి గోపాలకృష్ణయ్యగారి అధ్యక్షత క్రింద సభ జరిగింది గాంధీగారి ఆశయాలు, కార్యక్రమం గురించి శ్రీ చావలి రామ సోమయాజులు, డాక్టర్ చెలికాని రామారావు, డాక్టర్ వేదాంతం వెంకట కృష్ణయ్య, శ్రీమతి వేదాంతం కమలాదేవి, శ్రీ లక్క

రాజు సుబ్బారావు, వి పి రాజు నాయుడు, పారుపూడి సత్యనారాయణ, పులవర్తి భీమలింగమూర్తిగార్లు ఉపన్యసించినారు

**అనకాపల్లి**

అనకాపల్లిలో సోదర సమితివారి యాజమాన్యంలో గాంధీ జన్మదినోత్సవం జయప్రదంగా జరిగింది డాక్టర్ గుళ్ళపల్లి నారాయణ మూర్తిగారి ఇంట్లో మంగళ వాద్యాలతో భరతమాత పూజచేసి ఉపాహారములను పంచిపెట్టినారు ఆ రోజుననే ఉచిత హిందీ పాఠశాల డాక్టర్ గారి ఇంట్లోనే ప్రారంభమయింది సాయంకాలం బహిరంగ సభకు కోరుకొండ బుచ్చిరాజుగారు అధ్యక్షత వహించినారు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు గాంధీజీ జీవితాన్ని గురించి చక్కటి ఉపన్యాసం చేసినారు

యం రంగనాయకపాత్రులుగారు సుమారు 100 మంది హరిజనులకు సంతర్పణ చేసినారు

**విశాఖపట్నము**

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో అక్టోబరు 2 ఉదయం నగర సంకీర్తనతో ఊరేగింపు ప్రార్థనలు, ఖద్దరు హాకింగ్‌లు (ఇంటింటికిపోయి ఖద్దరు అమ్మడము) జరిగినాయి మధ్యాహ్నం హరిజనులతో కూడిన ఊరేగింపు పట్టణవీధుల్లో జరిగింది సాయంకాలం సముద్రతీరంలో బహిరంగ సభకు దంతులూరి లక్ష్మీనరసింహరాజుగారు అధ్యక్షత వహించినారు డాక్టర్ లంక సుందరం, యస్ చంద్రశేఖర శాస్త్రి, కందాళం సర్వేశ్వర శాస్త్రిగార్లు గాంధీజీ జీవితం గురించి ఉపన్యసించినారు

దిగుమర్తి గోపాలస్వామి, శ్రీమతి జానకీబాయి మొదలయిన వారు వీధులలో తిరిగి ఖద్దరు విక్రయించినారు

**కర్నూలు**

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో కర్నూలు వీధులన్నీ తోరణాలతో అలంకరింపబడినాయి ఖద్దరు వస్త్రాలయం నుంచి మేళతాళాలతోను, ప్రార్థనా గీతాలతోను గాంధీ చిత్ర పటాన్ని ఊరేగిస్తూ పౌరులు వీధులవెంట తిరిగినారు మధ్యాహ్నం హరిజనపేటలో 150 మందికి పైగా భోజనాలు పెట్టినారు మహాత్ముని చిరాయుష్మంతునిగా చేయవలెనని దైవాన్ని ప్రార్థించినారు

సాయంత్రం యువజన సంఘం వారి యాజమాన్యంలో బహిరంగ సభ జరిగింది శ్రీ స్వామీ నారాయణానందగారు మహాత్ముని జీవితం గురించి విపులంగా ఉపన్యసించినారు

**మండపేట**

రామచంద్రపురం తాలూకా మండపేటలోని హిందీ మహావిద్యాల

యంలో గుత్తి సుబ్బరాజుగారి అధ్యక్షత క్రింద గాంధీ జయంత్యుత్సవ సభ జరిగింది తటవర్తి చిన వెంకటరావు మానాప్రగడ కృష్ణారావు, నండూరి శోభనాద్రి, ఆచార్యగార్లు హిందీలో ఉపన్యసించినారు

తరవాత సభ్యులకు ఫలహారాలు పంచిపెట్టినారు

**మచిలీపట్నము**

అక్టోబరు 1వ తేది సాయంకాలం శ్రీ రామలింగేశ్వరస్వామి ఆలయము ఎదుట కాంగ్రెస్ కమిటీ యాజమాన్యంలో "మహాత్మా గాంధీ కాంగ్రెస్‌ను ఎందుకు వదలవలసి వచ్చినది" అనే విషయం గురించి డాక్టర్ పట్టాభిగారు అనర్గళంగా రెండు గంటలసేపు ఉపన్యసించినారు

2వ తారీఖు ఉదయం 8 గంటలకు గాంధీగారి ఛాయాపటం డాక్టర్ పట్టాభిగారి ఇంటిదగ్గరినుంచి జాతీయ పతాకాలతో, మేళతాళ వాద్యాలతో పురవీధుల ద్వారా ఊరేగించినారు తరవాత అ భా చ సంఘ ఆవరణలో శ్రీయుత వేమూరి నారాయణమూర్తిగారు జాతీయ పతాకం ఆరోహించినారు మధ్యాహ్నం 3 గంటల నుంచి 4 గంటల వరకు ఆంధ్ర జాతీయ కళాశాల ఆవరణలో వడుకు నూలు పోటీ పరీక్ష జరిగింది

తూర్పు కృష్ణాజిల్లా హరిజన సేవక సంఘ యాజమాన్యం కింద హరిజనులు భజనలతో గాంధీజీ చిత్ర పటాన్ని ఉదయం ఊరేగించినారు సాయంత్రం 6½ గంటలకు డాక్టర్ వేమూరి రామకృష్ణారావుగారు మహాత్మాగాంధీగారి సాధన గురించి ఉపన్యసించినారు ఉపన్యాసానికి ముందు వేద పఠనము జరిగింది చల్లపల్లి అప్పారావుగారు గాంధీజీని గురించి పద్యాలు చదివినారు

**కుప్పం**

కుప్పంలో కాంగ్రెస్ వాదులు, తదితర ప్రజలు ఆబాల గోపాలం గాంధీజీ జన్మదినోత్సవం అత్యుత్సాహంతో జరిపినారు మహాత్మా గాంధీగారి ఛాయా పటం బాండు వాద్యాలతో ఊరేగించినారు కజిన్స్ సతిగారు కూడా ఆ ఊరేగింపులో పాల్గొన్నారు సాయంకాలం సంతపేట మైదానంలో సభ జరిగింది శ్రీమతి కజిన్స్ సతి ఇంగ్లీషులో ఉపన్యసిస్తూ గాంధీగారి జీవితచరిత్రను వివరంగా చెప్పి ఆయన ప్రారంభించిన స్వరాజ్య కార్యక్రమమునకు అందరూ తోడ్పడవలెనని ఉద్బోధించినారు ఆమె ఉపన్యాసమును శ్రీ సుందరరాజయ్యంగారు తెలుగులోకి అనువదించినారు

బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభ పార్లమెంటరీ కార్యక్రమం అంగీకరించినందున, గాంధీజీ దానిని ఆశీర్వదించినందున గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో కాంగ్రెసు అభ్యర్థులకే ఓటు చేయవలసిందని కూడా శ్రీ గుండు రావుగారు ప్రజలను హెచ్చరించినారు

**నారాయణవరం**

అక్టోబరు 2న పీకలగు 100 మంది హరిజనులకు నారాయణవరం పౌరులు మధుర పదార్థాలతో మృష్టాన్న భోజనం పెట్టినారు సాయంకాలం శ్రీ ఆంజనేయస్వామి వారి దేవాలయం దీపాలతో దేదీప్యమానంగా అలంకరింపబడిన తరవాత మహాత్ముని ఆయురారోగ్యాభివృద్ధికి సహస్రనామార్చన జరిగింది తరవాత అందరికీ దైవ ప్రసాదం పంచిపెట్టబడింది

**నిడదవోలు**

నిడదవోలులో అక్టోబరు 2 సాయంకాలం గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో బహిరంగ సభ జరిగింది శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు అధ్యక్షత వహించినారు శ్రీ మంగిపూడి పురుషోత్తమ శర్మ, తాడిమేటి కుటుంబశాస్త్రి, తల్లాప్రగడ నారాయణమూర్తి, సూరికుచ్చి సూర్యనారాయణగార్లు మహాత్ముని జీవితం గురించి, ఆయన దివ్య సందేశాలను గురించి ఉపన్యసించినారు

తల్లాప్రగడ ప్రకాశరాయుడు, నారాయణమూర్తి, సూరికుచ్చి సూర్యనారాయణ, పెద్దాడ రామచంద్రరావుగార్లు ఇంటింటికి వెళ్ళి ఖద్దరు బట్టలు అమ్మినారు

**నంద్యాల**

అక్టోబరు 1న నంద్యాల కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు అల్వకొండ రామసుబ్బయ్యగారి నాయికత్వంలో కొందరు ఇంటింటికి పోయి ఖద్దరు బట్టలు అమ్మినారు 2వ తేది ఉదయం గాంధీజీ పటంతో ఊరేగింపు జరిగింది తరవాత హరిజనపేటలో హరిజనుల ఉపయోగం నిమిత్తం ఉచిత ఆయుర్వేద వైద్యశాలను డాక్టర్ శ్రీనివాసాచార్యులు ప్రారంభించినారు 8 మంది సభ్యులతో అఖిల భారత చరఖా సంఘ శాఖ స్థాపించబడింది హిందీ తరగతులు నడపడానికి తగిన ఏర్పాట్లు జరిగినాయి సాయంకాలం బహిరంగ సభ జరిగింది గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షత వహించినారు శ్రీ రాజా పెద్ద సుబ్బారాయుడు శ్రేష్ఠి గాంధీగారి సాంఘిక ధార్మిక జీవితం గురించి గంభీరోపన్యాసం చేసినారు అధ్యక్షులు సభను ముగిస్తూ అన్ని దేశాల వారు తమ తమ దేశాలలో ఉత్పత్తి అయిన వస్తువులను వినియోగించుకొని సంతృప్తిగా బ్రతకవలెననే దృష్టి ప్రబలడం గాంధీజీ కృషి ఫలితమే కనక మనము ఆయన నాయకత్వం శిరసావహించవలసి ఉంటుందని అన్నారు.

శ్రీ మహానందీశ్వరి దేవాలయంలో గాంధీజీ ఆయురారోగ్యాభివృద్ధికిగాను అర్చనలు జరిగినాయి ఆయన చిరాయుష్మంతుడు కావలెననే ప్రార్థనలతో నాటి కార్యక్రమం ముగిసింది

**బాపట్ల**

బాపట్లలోని స్త్రీ హితైషిణీ మండలివారి యాజమాన్యంలో మహాత్మా గాంధీగారి జయంతి అత్యంత వైభవంగా జరిగింది అక్టోబరు 2 సాయంకాలం 8 గంటలకు దైవప్రార్థనలు జరిగినాయి శ్రీమతి వెన్నా అనంతరామమ్మగారు మొట్టమొదట గాంధీ ప్రశంసా పద్యరత్నాలు చదివి, అనంతరము 'మహాత్ముడు-వర్ణవ్యవస్థ' అనే విషయంపై చక్కని ఉపన్యాసం చేసినారు తరవాత గండవరపు సావిత్రమ్మ, కనుపర్తి వరలక్ష్మమ్మగార్లు మహాత్ముని జీవిత శయాలను గురించి అనేక ఉదాహరణలతో దీర్ఘోపన్యాసం చేసినారు తరవాత శ్రీమతి అలూరి రామాయమ్మగారు, మందాకిని చారుమతి, సావిత్రి, స్వరాజ్యము, సీతారామ్, జయలక్ష్మి మొదలయిన బాలికలును జాతీయ గీతాలను దేశభక్తి గేయాలను మనోహరంగా చదివి సభ్యురాండ్రను ఆనందింపజేసినారు చివరికి మంగళగీతాలతో సభ సమాప్తి అయినది

ప్రతి సంవత్సరంవలెనే ఈ సంవత్సరంకూడా పాలపర్తి హనుమాయమ్మ గారు గాంధీ జయంతికైన ఖర్చులను భరించి సభ్యురాండ్రకు కజ్జాయము, వడపప్పు వగైరాలు పంచిపెట్టినారు

**మదనపల్లి**

అక్టోబరు 2 సాయంకాలం మహాత్ముని పటంతో పురవీధులలో ఊరేగింపు జరిగింది వెంకటరమణస్వామి దేవాలయంవద్ద బహిరంగసభ జరిగింది డాక్టర్ కుమారప్ప అధ్యక్షత వహించినారు శ్రీ జె రామచంద్రరావుగారు మహాత్మునిపై వ్రాసిన పద్యాలను శ్రావ్యంగా చదివినారు ఇ యస్ సుబ్రహ్మణ్యం, ఏ నరసింహారావు, పి రామయ్యచౌదరిగార్లు మహాత్ముని జీవితం గురించి, వారి త్యాగం గురించి సంగ్రహంగా ఉపన్యసించినారు మంగళహారతులతోను 'గాంధీజీకి జై' అను నినాదాలతోను సభ జయప్రదంగా ముగిసింది

**గుంటూరు**

గుంటూరు పట్టణ కాంగ్రెస్ యాజమాన్యంలో పురపాలక గ్రంథాలయంలో అక్టోబరు 2 సాయంకాలం బహిరంగసభ జరిగింది హనుమదోవ్యాగ వ్యాయామమండలి సభ్యులు పట్టణంలోని ప్రధాన వీధులను తోరణాలతో అలంకరించినారు దేశభక్త కొండ వెంకటప్పయ్యపంతులుగారు బహిరంగసభకు అధ్యక్షత వహించి, మహాత్ముని జీవితం ఆదర్శాలను గురించి మనోహరంగా ఉపన్యసించినారు తరవాత శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, రాయసం వెంకటశివుడు మాడభూషి వేదాంతం నరసింహాచార్యులు, ఏటుకూరి జోగిరాజు, మద్ది వెంకటరంగయ్యగారు గాంధీజీ నిర్మాణ కార్యక్రమం గురించి గంభీరంగా ఉపన్యసించినారు గాంధీజీకి భగవంతుడు సంపూర్ణ ఆయురారోగ్యాలను ప్రసా

దించుగాక అనే ప్రార్థనతో సభ ముగిసింది

### ఖద్దరు అమ్మకము

గాంధీజీ జన్మదినోత్సవ సందర్భంలో అక్టోబరు 1 వ తేదినుంచి గుంటూరులో శ్రీ మద్ది వెంకటరంగయ్యగారి నాయకత్వంలో శ్రీ హనుమద్యోగ వ్యాయామమండలి సభ్యులు గారపాటి శివరామ సుబ్రహ్మణ్యశాస్త్రి, అధరాపురపు ఉడిపి కృష్ణారావు, దుర్భా రామమూర్తి, మాచర్ల పున్నయ్య, బి రామోజీ, పి వెంకటేశ్వర్లుగార్లు ఇంటింటికీ తిరిగి ఖద్దరు బట్టలను విక్రయించినారు స్త్రీలు పురుషులు అత్యుత్సాహంతో ఖద్దరు కొన్నారు ఆనాడు సుమారు 1000 రూపాయల విలువగల ఖద్దరు అమ్మకమయింది

### తిరుత్తని

గాంధీమహాత్ముని జయంత్యుత్సవం శ్రీ వి దొరస్వామిచెట్టి, యం కుప్పుస్వామిగార్ల యాజమాన్యంలో అత్యంత వైభవంగా జరిగింది సాయంకాలం బహిరంగసభలో బి యస్ శర్మ (చెన్నపురి), వి కె శరగోపాలాచార్యులు, కలకటూరి నారాయణస్వామి గాంధీగారి జీవితం గురించి ఉపన్యసించినారు

ఈ ఉత్సవ సందర్భంలో హనుమాన్ జ్యోతిషాలయ అధికారులు శ్రీమాన్ వి కే శరగోపాలాచార్యులుగారును, ఉత్సవ కార్యనిర్వాహకులును వేరువేరుగా బీదలకు అన్నప్రదానం చేసినారు అక్టోబరు 12 వ తారీఖువరకు బీదల అన్నప్రదానానికి ఏర్పాట్లు చేసినారు

### రాజమహేంద్రవరము

గాంధీమహాత్ముని జన్మదినోత్సవ సందర్భంలో అక్టోబరు 1 వ తేదినుంచి శ్రీ అరవ ఆదినారాయణమూర్తి, శ్రీ క్రొవ్విడి లింగరాజు, శ్రీమతి మద్దూరి వెంకటరమణమ్మ, పాలకోడేటి శ్యామలాంబగార్లు స్థానిక అఖిలభారత చరఖా సంఘంవారు, ఇంకా మరికొందరు ఖద్దరు బట్టలను ఇంటింటికీ తీసుకొనిపోయి చౌకగా అమ్మినారు స్థానిక బై ఇండియన్‌లీగ్ వారు స్వదేశీ వస్తువులను ఇంటింటా తగ్గుధరలకు అమ్మినారు అక్టోబరు 2 సాయంకాలం పాల్ చౌక్‌లో జాతీయపతాక వందనం జరిగింది చెన్నూరి కృష్ణవేణమ్మగారు జాతీయ కీర్తనలు పాడినారు సాయంకాలం 5 గంటలకు పాల్ చౌక్‌నుంచి సన్నాయిమేళంతో పుష్పమాలాలంకృతమయిన మహాత్ముని పటం పురవీధులద్వారా ఊరేగిస్తూ కాంగ్రెస్ కార్యకర్తలు వీరేశలింగం పురమందిరానికి తీసుకొని వెళ్ళినారు అక్కడ బహిరంగసభ జరిగింది డాక్టర్ సి యమ్ రామారావుగారు అధ్యక్షత వహించినారు. జాతీయగీతాలతో సభ ప్రారంభమయింది బారిష్టర్ కందుల వీరరాఘవస్వామిగారు, ఖద్దరు, హరిజన సమస్యలను గురించి ఉపన్యసించినారు.

పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు, సత్యాగ్రహ తత్వం గురించి మాట్లాడి నారు శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు నిర్మాణ కార్యక్రమం గురించి ముచ్చ టించినారు మొసలికంటి తిరుమలరావుగారు గాంధీజీ ఈ మధ్య ప్రకటించిన స్టేట్ మెంట్ లో కాంగ్రెస్ ప్రచారకులు చాలామంది అంగీకరింప జాలరన్నారు కాంగ్రెస్ సంస్థకు ఎన్నికలకు ఏమీ సంబంధం ఉండరాదని దేవులపల్లి సూర్య నారాయణ, వాద్రేవు జగ్గరాజుగార్లు చెప్పినారు గాడేపల్లి సూర్యనారాయణ శర్మ అహింసా సిద్ధాంతం గురించి విపులీకరించినారు చివరికి అరవ ఆదినారా యణమూర్తిగారు 'జై గాంధీబాబా' అను కీర్తన పాడిన తరవాత వందనాలతో సభ ముగిసింది

## సీతానగరము

అక్టోబరు 2న సీతానగరం ఫిర్కా కాంగ్రెస్ కమిటీవారి యాజ మాన్యంలో గాంధీ జన్మదినోత్సవం జరిగింది ఉదయం 8 గంటల నుంచి మధ్యాహ్నం 2 గంటల వరకు సీతానగరంలోని చతుష్పథం వద్ద పిన్నలూ, పెద్దలూ కలసి రాట్నాలపై నూలు తీసినారు సాయంత్రం 3 గంటలనుంచి 6 గంటలవరకు పుష్పమాలాలంకృతమయిన మహాత్ముని పటం జాతీయ పతా కాలతోను, మేళతాళాలతోను వంగలపూడి, సంగవరం, సీతానగర గ్రామము లలో ఊరేగించినారు,

ఉదయం 9 గంటలనుంచి 6 గంటలవరకు సీతానగరంలో ఖద్దరును,స్వదేశీ వస్తువులను విక్రయించినారు సాయంకాలం చతుష్పథం వద్ద చంద్రుపట్ల హనుమంతరావుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది పలువురు గాంధీజీ నిర్మాణ కార్యక్రమం గురించి ఉపన్యసించినారు

## వినయాశ్రమము - ప్రథమ వార్షికోత్సవము

హరిజన యాత్రా సందర్భంలో గాంధీజీ ఆంధ్రదేశంలో పర్యటించి నప్పుడు రేపల్లె తాలూకా కళ్యాణపూరులో శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు స్థాపించిన వినయాశ్రమమానికి మహాత్మాజీ ప్రారంభోత్సవం చేసినారు దాని ప్రథమ వార్షికోత్సవం డిసెంబరు 28 వ తారీకున జరిగింది ఆ ఉత్సవానికి గుజరాత్ విద్యాపీఠం ప్రిన్సిపాల్ కాకా కలేల్ కర్, డాక్టర్ మూల్పూరి రంగయ్య, చుక్కమ్మగార్లు, చింతమనేని భావయ్యచౌదరి, కొల్లా కాశీ విశ్వనాథం, కనకవల్లి తాయారమ్మగార్లు, హిందీ ప్రచారకులు, పత్రికా రచయితలు హాజరయినారు

సాయంకాలం 3 గంటలకు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు జాతీయ పతాకోత్సవం చేసినారు బహిరంగ సభకు కొండ వేంకటప్పయ్యగారు అధ్యక్షత వహించి, ఆశ్రమోద్దేశాలను అక్కడ జరుగుతున్న వివిధ కార్యకలా పాలను ప్రశంసిస్తూ ఉపన్యసించినారు ఆ సందర్భంలో గాంధీజీ హార్దానురచి

ఈ దిగువ సందేశం పంపినారు

"ప్రియమైన శాస్త్రి !

జయంత్యుత్సవం జయప్రదంగా జరగగలదని, తత్ఫలితంగా ప్రజలు మీ కృషిని వెనకటికంటె ఎక్కువగా గుర్తించగలరని ఆశిస్తున్నాను "

ఈ సందేశం దేశభక్త వేంకటప్పయ్య పంతులుగారు సభ్యులకు చదివి వినిపించినారు సభకు వచ్చిన అనేకులు వినయాశ్రమం చిరస్థాయిగా వర్ధిల్లవలెనని కోరుతూ ప్రసంగించినారు సభ జయప్రదంగా జరిగినది

## 20
# అఖిల భారత చరఖా సంఘము (1935)

### ఆంధ్ర శాఖ

**మహాత్ముని సూచనలు**

ఆంధ్ర దేశంలో ఖద్దరభివృద్ధి మార్గాలను గురించి గాంధీజీతో చర్చించ డానికి డాక్టర్ పట్టాభి సీతారామయ్య, దండు నారాయణరాజుగార్లు మొదలైన ప్రముఖులు 1936 జనవరిలో వార్ధాకుపోయి ఖద్దరుకు సంబంధించిన అనేక విషయాలను వారు మహాత్మునితో కూలంకషంగా చర్చించినారు ఖద్దరు వ్యాపారంలో ప్రజాస్వామ్యం నెలకొల్పడం, ఖద్దరుత్పత్తిలో వ్యాపార దృష్టి ఉండటం, చరఖాశాస్త్రానికి సంబంధించిన ఆర్థిక విషయాలను తెలుసుకోవడం మొదలయిన వాటిని గురించి సంప్రదింపులు జరిగినాయి గాంధీజీ కొన్ని సూచనలు చేసినారు ఖద్దరు సంస్థలో ప్రజాస్వామ్యానికి తావులేదని గాంధీజీ అభిప్రాయపడినారు ఒక విధంగా ఖద్దరు సంస్థను వ్యాపారసరళిగా నిర్వహించ వలసిందేగాని అధికార ధూర్వహత్వానికి, వ్యక్తిగత భిన్నాభిప్రాయాలకు, పరస్పర సంఘర్షణలకు తావిచ్చే ప్రజాస్వామ్య పద్ధతి ఖద్దరు సంస్థలకు వర్తింప చేయకూడదు ప్రజాస్వామ్య ప్రభుత్వాలలో ఇవన్నీ తప్పనిసరి వ్యవహార పద్ధతిలో అట్లాంటి వైరుధ్యాలకు తావుండకూడదు ఒక వాణిజ్య మండలిలో కక్షలు, ముఠాలు తలచూపితే ఆ వ్యాపారం భగ్నమయ్యే మాట వాస్తవము మన ఖద్దరు సంస్థలకు వ్యాపారమే పరమావధి కాదు వాటిలో వ్యాపార సరళి నతిక్రమించిన అనన్యసామాన్య లక్షణాలున్నాయి అవి ప్రజాసేవ కుద్దేశింపబడిన ధర్మసంస్థలు కాబట్టి ప్రజల ఊహాపోహాలకు, ఆగ్రహానుగ్రహాలకు లోబడి ఉండజాలవు. కనక అటువంటి సంస్థలలో ప్రజాపాలనకు స్థానం లేదు ప్రజాస్వామ్య పద్ధతిలో ఒక పైసా పన్ను ఇచ్చేవానికి, లక్షలకొద్దీ రూపాయల పన్ను ఇచ్చే వానికి సమానమయిన ఓటింగ్ అధికార మున్నది నిరంతరాందోళన, పరస్పర సంఘర్షణ స్పర్ధ, అహంకారం ఇవి ప్రకృత ప్రజాస్వామ్య లక్షణాలు ప్రజలు తమకోసం తామే పరిపాలనాధికారం వహించడం ప్రజాస్వామ్య విధానానికి లక్ష్యము కాని ఇది దోషభూయిష్టంగా ఉన్నది పేరుకు ప్రజాస్వామ్యమే కాని తాను అగ్రస్థానం అలంకరించవలెననే అధికార కాంక్ష ప్రతివానికి కలగడం, అందుకోసం అతడు ఇతరులతో పెనగు లాడటం ప్రజాస్వామ్య విధానంలో తప్పడం లేదు ప్రజల పేరుతో రాష్ట్ర నౌకను నడిపే కర్ణధారి ఒక్కడే అతని

యందే రాష్ట్రం మూర్తీభవిస్తున్నది కాబట్టి ప్రజలను ఒక్కడు పరిపాలించినా పలువురు పరిపాలించినా పాలక, పాలితుల ధర్మాలు యథావిధిగా ఉండవలె "రాజునకు ప్రజ శరీరము, రాజు ప్రజకు ఆత్మ" అనే ఆదర్శంతో పాలకులు పాలితులపట్ల ప్రవర్తిస్తూ ధర్మం యథాక్రమంగాను, ప్రజానురంజకంగాను, స్వార్థ రహితంగాను నిర్వహించడమే ప్రజాస్వామ్యము ఇందులో స్వాభిమానానికి స్వార్థపరత్వానికి అవకాశం లేదు స్వార్థరహిత ప్రజాసేవయే దీనిలక్షణ లక్ష్యాలు, సాధన సాధ్యాలు ధర్మసంస్థ లన్నిటి పరిపాలన ఈ పద్ధతిలోనే జరగవలసి ఉన్నది

ప్రజలను ఉద్ధరించేదే ధర్మము "ధారణాద్ధర్మమిత్యాహుః, ధర్మోధారయతి ప్రజాం" అని స్మృతి వాక్యము నానాత్వానికి ఏకత్వం చేకూర్చేటందుకు విధి నిషేధాత్మకమై వెలసేదే ధర్మము ధర్మము దేశకాల పరిచ్ఛేదాలకు అతీతమైనది దానికి వేర్పాటు భావం లేదు వ్యష్టి జీవనం సమష్టి జీవనంలో లీనం చేసుకొనగలదది నదులు సాగరంలోచేరి సాగరత్వం పొందినట్లు సకల వైరుధ్యాలకు ధర్మంలో సమన్వయం కలుగుతున్నది ఏకత్ర సమత, సమరూపతా సత్య నిరూపణ, అసత్య నిర్మూలన ఇవి ముఖ్యమయిన ధర్మ లక్షణాలని స్థూలారుంధతీ న్యాయంగా చెప్పవచ్చు ఇటువంటి ధర్మ లక్షణాలను ఆదర్శంగా ఉంచుకొని నిర్వహించ బడుతున్న సంస్థలే ధర్మ సంస్థలు పటుత్వానికి భంగము లేనంత వరకు అట్లాంటి సంస్థలను ఒకడే పరిపాలించ వచ్చు లేదా మర్యాద నతిక్రమించకుండ అనేకులు పరిపాలించవచ్చు ఏకచ్ఛత్రాధిపత్యమా, ప్రజాస్వామ్యమా అనేది మనకు ప్రధాన విషయంకాదు ధర్మ పరిపాలనే మనకు కావలసినది ఉత్తర హిందూస్థానంలో దయాల్‌బాగ్‌లో ఈ సిద్ధాంతంపైన నడుస్తూన్న ఒక పరిశ్రమాలయ మున్నది

మన ఖద్దరు సంస్థలో కొంతవరకు ప్రజాస్వామ్య పద్ధతి ఉన్నది, అదిచాలు ఒకప్పుడు నూలువడికేవారి సంఖ్యా ఖద్దరభిమానుల సంఖ్యా అధికం కావచ్చు అప్పుడు అపాయమున్నది కాబట్టి అటువంటి సంస్థలలో ప్రజాపాలన విధానం ఎంతవరకుండ తగునో అంతవరకే ఉండవలె ఇప్పటి ప్రజాస్వామ్యాలు బహుజనాభిప్రాయం బట్టి నడుస్తూన్నవి బహుజనులు వోటుచేసి ఖద్దరును రూపుమాపవచ్చు కాబట్టి ఇట్లాంటి సంస్థలో ప్రజాస్వామ్యం పనికిరాదని మహాత్ముడు ఘంటాపథంగా చెప్పినారు

మనం ఖద్దరు ఉత్పత్తిని పునరుద్ధరించటానికి పూనుకొన్నాము ఖద్దరు కార్యక్రమం వ్యాపార సరళికి విరుద్ధ మయినది

అదొక ధర్మసంస్థ అది గడియారంవలె సక్రమంగా నడప బడుతున్నది దాని కార్యనిర్వాహకు డొక్కడే, ఆయనా, ఆయనఅనుచరులూ ఒకేఒక లక్ష్యంతో నడుచుకొంటున్నారు. ఆ సంస్థకు ధనమున్నది దానికి సంబంధించిన వ్యవహారమంతా వారే నిర్వహిస్తూంటారు కాని నీటిలో ఉన్న తామరాకు చందాన వారికాధనంపై ఎటువంటి హక్కులేదు కాబట్టి ఒక్కరే వ్యవహర్తగా ఉండే

కార్యనిర్వాహకత్వం సంభావ్యమే అని విదిత మవుతున్నది

ఇట్లాంటి సంస్థలను నడపటానికి మంచి వ్యవహార దక్షత ఉండవలె వాటిలో ముఖ్యమయినది మానవాంశము ఈ మానవాంశమే ఖద్దరు నిర్మాణానికి ప్రాణము నిర్జీవాలైన యంత్రంలో తయారయిన వస్త్రాలలో జీవ కళ కని పించదు వాటిలో మానవ స్వార్థపరత్వం స్పష్టంగా కనిపిస్తుంది

నాణ్యంను చెడగొట్టడం, కల్తీచేయడం మానవుని నీచాభిరుచులకు ప్రోద్బల మీయడం - ఇవి వ్యాపారం కోసం చేసే ఉత్పత్తికి లక్షణాలు తక్కువ మజ్జూరీలు, ఎక్కువ లాభాలనే సూత్రం ఖద్దరుకు వర్తించదు వాస్తవంగా విచారిస్తే ఖద్దరులో లాభానికి అవకాశంలేదు నష్టం రాకూడదు ఖద్దరు ధరలో ఎక్కువ భాగం నూలువడికే వారికే లభిస్తుంది మిగిలిన వారికి మజ్జూరీలు మాత్రమే గిట్టుబాటవుతాయి

ఖద్దరుత్పత్తికి ఒక ప్రమాణం నిర్ణయించే విషయం కూడా ఆలోచిద్దాము ఏదో ఒకే మాదిరిగా ఖద్దరుత్పత్తి చేయడం సాధ్యం కానిపని ఎప్పుడూ ఒకే విధంగా నూలు వడకటం సాధ్యంకాదని రాజగోపాలాచారిగారొకప్పుడు చెప్పిన మాటలో ఎంతో నిజమున్నది

నూలు వడికే మనిషి ఒక యంత్రంకాదు ఒక రోజున ఆమెను జబ్బుగా ఉండవచ్చు అప్పుడామె మనసు సరిగా ఉండదు ఆమె పట్ల ఆమె బిడ్డలపట్ల నీకు నిజమయిన క్షేమ ఉంటే ఆమె ఎల్లప్పుడూ సన్నని సాఫీ నూలే ఇవ్వవలెనని పట్టు పట్ట కూడదు ఆమె స్థితిగతులను బట్టి సంతోష పూర్వకంగా ఆమెతెచ్చిన నూలును తీసుకోవలె చేతితో వడికిన నూలులో హస్తనైపుణ్యం కనిపిస్తుంది యంత్రంలో తయారయిన నూలులో అది ఉండదు ఖద్దరుత్పత్తికి ఖర్చులెక్కువయ్యేమాట వాస్తవము ప్రజల మోజులను మనం పెంచరాదు కోరా ఖద్దరునంటే వారికి అభిరుచి కలిగించటానికి మనం ప్రయత్నించవలె మామూలు ఉతుకుల్లో ఖద్దరు బాగా తెల్ల బడటమేకాక దానికొక విధమయిన మృదుత్వం కూడా కలుగుతుంది చలువ చేయడంలో ఆ మృదుత్వం సన్నగిల్లు తుంది ఖద్దరు ఖర్చులను తగ్గించటానికి అందరూ తమతమ శక్తికొద్దీ ప్రయత్నించడం మంచిది

## నూలువడికే వారిలో భావ పరివర్తనము

మనమిప్పుడు ఖద్దరును వ్యాపార దృష్టితోకాక కడుపునిండా కూడులేక మలమలా మాడుతున్న దరిద్ర నారాయణులకు జీవనాధార వస్తువుగా భావి స్తున్నాము అట్లాంటిస్థితిలో నూలు వడికేవారు చాలామంది దానిని అమ్ముకోన డానికే వడుకుతున్నారు ఇప్పుడా దృష్టి మారవలసి ఉంది వారు స్వయంగా వడుకుకొన్న నూలుతో నేసిన వస్త్రాలనే వారు ధరించేటట్లు వారికి కావలసిన నూలు పోను మిగిలినదానినే ఇతరులకు అమ్ముకోనేటట్లు ప్రోత్సహించవలసి ఉంది దానివల్ల ఉత్పత్తి ఖర్చులు వెంటనే తగ్గటమేకాక తయారయిన వస్తు

వులు ఎక్కడి వక్కడే విడుదల కాగలవు నగరవాసుల ఉత్పత్తి మొట్టమొదట స్వల్పంగా ప్రారంభమయి ఇప్పుడు లక్షలకొద్దీ సరుకు తయారవుతున్నది ఇది మహాత్మునకు తృప్తికరంగా లేదు ఇంతకంటె శ్రేష్ఠతరమైన ఆదర్శాలతో ఖద్దరుద్యమం ప్రారంభమయినది

గ్రామస్థులు తమకు కావలసిన ఖద్దరును తాముంచుకొని మిగిలిన దానిని పట్నాలకు పంపుతూంటేనేగాని ఇది సాధ్యంకాదు ఉత్పత్తి అయిన చోటనే అమ్మడు పోవడం ఉత్పత్తిదారులే తయారయిన సరుకును ఉపయోగించుకొని మిగిలిన దాని నితరులకీయడమే ఖద్దరులోని పరమ రహస్యము ఉత్పత్తిదారులలో ఈ నూతన భావోదయం కలిగితేనే గాని ఖద్దరుద్యమం సాధ్యంకాదు

## ఒక క్లిష్ట సమస్య
(హరిజన్ నుంచి)

రాయలసీమలోని ఒక అనర్స్ పట్ట భద్రుడు గాంధీకి తన ప్రాంతీయ సమస్యలను గురించిన వ్రాసినలేఖకు జవాబుగా పై శీర్షికతో ఆయన హరిజన్‌లో వ్రాసిన వ్యాసము

అనర్స్ పట్టభద్రుడు ఇట్లా వ్రాసినాడు

"ఇప్పుడు కరువుతో బాధపడుతున్న రాయలసీమ వాస్తవ్యుడను నేను భారతదేశంలోని యావత్ప్రజల హృదయాలను చలింపజేసే ఈ విషాదకర పరిస్థితులకు కారణాలివి

1 వానలులేని మా మెట్ట ప్రదేశంలో నిత్యం వాడుకు నేటందుకూ సాగుబడి పనులకూ అవసరమయిన నీటి సదుపాయాలకు మైనర్ ఇరిగేషన్ పనులను (చెరువులు, నూతులు) పూర్తిగా నిర్లక్ష్యం చేయడం

2 నూలు వడకటం, బట్టలు నేయటం వంటి గృహ పరిశ్రమలను కూడా పూర్తిగా నిర్లక్ష్యం చేయడం దేశంలోని ఇతర ప్రాంతాలలో మీ వల్ల నేత పరిశ్రమ పునరుజ్జీవితమైనదికాని మా ప్రాంతంలో మాత్రం అది జరగలేదు

3 పురాతన విద్యగానీ, ఆధునికవిద్యగానీ లేక ప్రజలు చెప్పరానంత అజ్ఞానంలో మునిగిపోవడం, పీటికితోడు కక్షలు, పోరాటాలు, క్రిమినల్ తగాదాలు మొదలయిన వాటితో వారు నిరంతరం కాలక్షేపం చేయడం కాబట్టి క్షామ నివారణ కార్యక్రమాలకంటె క్షామం అరికట్టే కార్యక్రమం ఎక్కువ అవసరము అప్పుడే ఈ ప్రాంతంలోని ప్రజల జీవితం సుఖప్రదంగా ఉండగలదు "

దీనికి ప్రత్యుత్తరంగా గాంధీజీ ఇట్లా వ్రాసినారు "ఈ ఉత్తరంలోని మూడోది కారణంకాదు పై రెండు కారణాల వల్ల కలిగిన ఫలితం ప్రధానమయిన మొదటి కారణం తొలగించ లేకపోయినట్లయితే ఆ నిర్జల ప్రదేశంలో దురదృష్టవంతులయిన ప్రజలు ఆకలితో చావనైనా చావాలి, లేదా అక్కడి నుంచి మరొక చోటికి పోనైనా పోవాలి, కాని అక్కడి పరిస్థితి ఈ

విలేఖకుడు వ్రాసినంత నిరాశా పూరితంగా ఉండక పోవచ్చు ఏమయినప్పటికి నీటి సరఫరాను అభివృద్ధి చేయటం కార్యకర్తల వ్యక్తిగత శక్తికి మించిన పని కాని అక్కడి జీవిత పరిస్థితులు సహించడానికి వీలుగా ఉన్నట్లయితే ప్రజలకు వృత్తులను కల్పించడం ద్వారా శ్రద్ధాభక్తులుగల కార్యకర్తలు చాలా ఉపయోగకరమయిన పనిని చేయగలరనే మాట నిస్సంశయము దేశంలో కావలసినంత భౌతిక సంపద మానవ శ్రమ వృథా అయిపోతూన్నది వీటి రెంటినీ సవ్యంగా ఉపయోగించుకోగలిగి నట్లయితే ఎవ్వరూ వస్తులు పడుకోవలసిన అవసరం లేదు క్షామ పరిహార కార్యక్రమంతోపాటు క్షామ నివారణ కార్యక్రమాన్ని నిర్వర్తించ నట్లయితే ప్రయోజనం లేకపోగా అపకారంగాకూడా పరిణమిస్తుంది అందువల్ల ప్రజలకు పనిచేసే అలవాటు తప్పిపోయి నిరంతరాయంగా పేదరికంతో బాధపడతారు క్షామ పరిహార కార్యక్రమాలే క్షామ నివారణ కార్యక్రమాలుగా కూడా ఉండవచ్చు కాబట్టి క్షామపీడితులయిన వారికి తాత్కాలిక సహాయంగా కొన్ని పైసలో, కొన్ని నూకలో ఇవ్వడం కంటె కార్యకర్తలు స్థానిక పరిశ్రమను స్థాపించి వారికి అందులో పని కల్పించవచ్చు పనిచేయలేని వట్టి అశక్తులకు తప్ప తక్కిన వారెవరికీ తమ వంతు పనిచేయనిదే భోజనం పెట్టకూడదు ఆకలితో అల్లాడుతూన్న లక్షలకొద్దీ ప్రజలుగల ఈ దేశంలో ప్రస్తుతం తెలివిగల శరీర పరిశ్రమయే ప్రాథమిక విద్య, వయోజన విద్య అని నా అభిప్రాయము లక్షలాది ప్రజలకు ఈ విద్య తరవాత అక్షరాలకు సంబంధించిన విద్య నేర్పవలసి ఉంటుంది చేతితో నేర్చిన విద్య ఒక వరప్రసాదం వంటిది అది మానవునికి, పశువుకు ఉన్న వ్యత్యాసాన్ని ప్రత్యక్షంగా ప్రదర్శించ గలదు వ్రాయడం, చదవడం అనే కళ తెలియనట్లయితే మనిషికి సంపూర్ణాభివృద్ధి కలగదని అనుకోవడం వట్టి మూఢ విశ్వాసము అయితే చదవడం, వ్రాయడం తెలిసి ఉంటే జీవితానికి ఒక లావణ్యం చేకూరేమాట నిజమే కాని అవి రెండూ మానవుని భౌతిక, శారీరక, నైతికాభివృద్ధులకు తప్పనిసరికావు కాబట్టి పట్టభద్రుడయిన ఈ విలేఖకుడున్నూ, మనము సేకరించగలిగిన ఇతర కార్యకర్తలున్నూ బాధలు పడుతూన్న ప్రజల మధ్య ఉండి ఆ ప్రదేశానికి అవసరమయిన నిర్మాణ కార్యకలాపాలలో పాల్గొని నిజాయితీగా కష్టపడి జీవించడంలో గౌరవం కలదనే విషయం తమ ప్రవర్తన ద్వారా అక్కడి ప్రజలకు ప్రదర్శింప గలరని ఆశిస్తున్నాము"

యం కె గాంధీ
8-3-1935

## కార్యకర్తల తీర్థయాత్ర
(హరిజన్ నుంచి)

శ్రీ సీతారామ శాస్త్రిగారు కార్యకర్తల యాత్రలను ఏర్పాటు చేస్తున్నారు వారు పరిసర గ్రామాలలోని ప్రజలకు సేవా సందేశం అందిస్తున్నారు సీతారామ శాస్త్రిగారు కార్యకర్తల రెండవ యాత్ర గురించి నాకొక సంక్షిప

నివేదికను పంపినారు దానిలో నుంచి కింది భాగం ఉదహరిస్తున్నాను

"రెండో యాత్ర ఫిబ్రవరి 17 వ ప్రారంభమై మార్చి 4 సాయంకాలంతో ముగిసింది ఈ యాత్రలో ఎనిమిది మంది ఉన్నారు వారికి నాయకులు నేతి వెంకటా చలపతి, గామినేని అప్పయ్యగార్లు వీరిలో ఇద్దరు నాలుగు రోజులు పనిచేసినారు ఒకరు పదకొండు రోజులుపనిచేసినారు అయిదుగురు అన్ని రోజులూ నిరంతరాయంగా పనిచేసినారు

వారు బాపట్ల తాలూకాలో పదమూడు గ్రామాలు, తెనాలి, రేపల్లె తాలూకాలలో చెరి ఒక గ్రామం మొత్తం పదిహేను గ్రామాలు చూసినారు వారు రైలులోను, మోటారులోను, బండ్లలోను కాలి నడకనుకూడా మొత్తం 75 మైళ్లు ప్రయాణం చేసినారు

వారు నాలుగు గ్రామాలలో మాజిక్ లాంతర్ సహాయంతో ఉపన్యాసాలిచ్చినారు అయిదు గ్రామాలలో గ్రామ్‌ఫోన్ పాటలు వినిపించి నారు వారు ఆయా గ్రామాలలో దిగువ వివరించిన విలువగల సరుకులను విక్రయించినారు

| | | |
|---|---|---|
| 1 | ఖాదీ | 1,080-10-6 |
| 2 | స్వదేశీ వస్తువులు | 185-15-9 |
| 3 | కుండలు | 3-7-0 |
| 4 | తకిలీలు (2) | 0-8-0 |
| 5 | మంగలికత్తులు (5) | 2-13-0 |
| 6 | భృంగామలక తైలము (తలనూనె) | 4-6-0 |
| 7 | చెప్పులు, పాదుకలు (42 జతలు) | 34-14-0 |
| | | 1212-5-3 |

మంగలికత్తులు ఒంగోలుతాలూకా చెరకుపాలెంలోను, తైలము, చెప్పులు, పాదుకలు వినయాశ్రమంలోను తయారయినవి మొదటి యాత్రలో కంటె రెండవ యాత్రలో ఎక్కువ సరుకులు అమ్ముడు పోయినాయి ఈ యాత్రలో అయిన ఖర్చులు రూ. 36-3-3 "

ఇది సరియైన పద్ధతికి ప్రాతిపదిక ఈ యాత్రికులు రైలులోగానీ, మోటారులోగానీ, బండ్లల్లోగానీ ప్రయాణం చేయడం మానవలెనని నాసూచన వారు నా సలహాను అంగీకరిస్తే వారిపని ఇంతకంటె ఎక్కువ ప్రయోజనకరంగా ఉంటుంది దాదాపు ఏమీ వ్యయం ఉండదు ఈ యాత్రిక బృందంలో ఇద్దరు, ముగ్గురుకంటె ఎక్కువ ఉండకూడదు గ్రామస్థులు వీరిని ఆదరించి భోజనం

పెడతారని నా నమ్మకం చిన్న చిన్న బృందాలు వెళ్ళినందువల్ల గ్రామస్థులకు ఎక్కువ భారంగా ఉండదు పెద్ద పెద్ద బృందాలు వెళ్ళితే వారికి కష్టంగా ఉండవచ్చు

ఈ యాత్రిక బృందంవారి పని ఎక్కువగా గ్రామస్థుల ఆరోగ్య రక్షణకూ, గ్రామ పరిస్థితుల పరిశీలనకూ, ఎక్కువ పెట్టుబడితో అవసరం లేకుండా వారి ఆరోగ్యం, ఆర్థిక స్థితిని అభివృద్ధిపరచుకొనే సలహాలకు సంబంధించి ఉండవలె గ్రామాలను సాధ్యమయినంతవరకు స్వయం సంపూర్ణంగా చేయదలుచుకొంటే ఈ యాత్రికులు దర్శించిన గ్రామాలలో ఇతర గ్రామాలవారు చేసిన వస్తువులను అమ్మే అవకాశం ఉండదు అయితే వాళ్ళ సొంత గ్రామాలలో ఆ వస్తువులను వారు తయారు చేయకుంటే చేసుకోజాలకుంటే ఇతర గ్రామస్థులు చేసిన వస్తువులను అక్కడ విక్రయించడానికి వీలుంటుంది అఖిల భారత గ్రామ పరిశ్రమల సంఘంవారు ఉద్దేశించిన గ్రామసేవలో ఒక విలక్షణమయిన భావ మున్నది పట్నాల నుంచి పోయే యాత్రికులు గ్రామాలలో పరిశుద్ధతను ప్రబోధించి అక్కడి వస్తువులను కొనవలె గ్రామాల నుంచి కూడా కొంతమంది యాత్రికులను పట్నాలకు పంపవచ్చు వారు తాము తయారుచేసిన వస్తువుల ఉపయోగం పట్టణ వాసులకు ప్రదర్శించి వాటిని అక్కడ విక్రయించవలె

ఈ గ్రామీణ ఉద్యమం వికేంద్రీకరణతోపాటు గ్రామస్థుల హస్తకళా నైపుణ్యం, సౌఖ్యం, ఆరోగ్యం అభివృద్ధి చేయడానికి ఉద్దేశింప బడినది

'హరిజన్' యం కె గాంధీ
22-8-1935

గాంధీమహాత్ముడు-అహింస

"భారత దేశంలో జరుగుతున్న హిందూ మహమ్మదీయ కలహాలలో హిందువులు దౌర్జన్యానికి దిగక ఓపికపట్టి ఉన్నప్పటికి, మహమ్మదీయులు దౌర్జన్యం చేస్తున్నారు దీనికి గత్యంతరమేమి?" అని బెజవాడనుంచి ఒకరు గాంధీమహాత్మునికి వ్రాస్తే ఆయన ఇట్లా జవాబు వ్రాసినారు

"ప్రియమిత్రమా! మీరు వర్ణించిన పరిస్థితులు చాలా విచారకరము ప్రజలు తమ మహమ్మదీయ సోదరులను చూసి భయపడితే బలముపయోగించి తమ్ముతాము రక్షించుకొనే హక్కున్నది అట్లా చేయకపోవడం పిరికితన మనిపించుకొంటుంది పిరికితనం అహింసగా చెప్పకూడదు పిరికితనాన్ని అశక్త దుర్జనత్వమని చెప్పవచ్చు అది సాయుధ దౌర్జన్యంకంటె నీచమయినది"

వార్తా
7-6-1935

ఇట్లు
మీ ప్రియతముడు
యం కె. గాంధీ

**పశువధకు ప్రతికూలంగా ఉపవాసము**

వసంతవాడ గ్రామంలో అమ్మవారి జాతరలో జరగబోయే పశువధను ఆపేటందుకు శ్రీ పరిశ సుబ్బారావుగారు పూనుకొని జాతర యజమానులతో విన్నవించగా వారందుకు తగిన అవకాశాలను కల్పించలేదు ఆ సందర్భంలో సుబ్బారావుగారు వారి మనసు మారేటంత వరకు ఉపవాసవ్రతం పూన సంకల్పించి మహాత్ముని సలహా నిమిత్తం జాబు వ్రాసినారు మహాత్ముడు దానికిట్లా జవాబు వ్రాసినారు

"మీ 15వ తేది (15-8-1935) లేఖ అందింది మీరు ఉపవాసం చేయవద్దు. మీరు, అటువంటి క్రూరమయిన పని చేయడానికి బాధ్యులయిన వారి దగ్గరికి అహింసా వాదులతో కూడా వెళ్ళి చర్చించి దానిని విరమింప జేయడానికి ప్రయత్నించవలె"

వార్ధా యం కె గాంధీ
19-8-1935

**గాంధీజయంత్యుత్సవాలు**

1932 సెప్టెంబరు 24 వ తేదిన పూనా ఒడంబడిక జరిగిన నాటినుంచి గాంధీజీ జన్మించిన అక్టోబరు 2 వ తేదీవరకు గాంధీజయంత్యుత్సవ దినాలుగా పరిగణిస్తూ ఆకాలం హరిజనాభ్యుదయానికి వినియోగించవలెనని అఖిలభారత హరిజన సేవక సంఘంవారు నిర్ణయించినారు అప్పటి నుంచి గాంధీజయంత్యుత్సవాలు హరిజన కార్యకలాపాలతో కలసి మెలసి జరుగుతున్నవి ఆ సందర్భంలో వక్తలు అనేకమంది గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలోని ప్రధాన విషయాలయిన ఖద్దరు, అస్పృశ్యతా నివారణము, గృహపరిశ్రమలు మొదలయిన విషయాలను గురించి ప్రజలను చైతన్యవంతులుగా చేయటం పరిపాటయింది

**బెజవాడలో**

బెజవాడలో అక్టోబరు 3 సాయంకాలం 'గాంధీపార్కు'లో గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో శ్రీ కాకుమాను లక్ష్మయ్యచౌదరిగారి అధ్యక్షతన పట్టాభి సీతారామయ్యగారు ఖద్దరు, గృహపరిశ్రమల ప్రాముఖ్యం గురించి మహోపన్యాసం చేస్తూ, "మీరే వస్తువయినా కొనేటప్పుడు మూడుముఖ్యమయిన సంగతులు ఆలోచించండి మొదటిది అది ముఖ్యంగా అవసరమా అని, రెండోది అది స్వదేశీ వస్తువేనా అని మూడోది అది గ్రామంలో తయారయిన వస్తువేనా అని ఇట్లా ఆలోచించకుండా కొనవద్దు" అన్నారు అక్టోబరు 2న శంకర వెంకట రామయ్యగారి అధ్యక్షత కింద సభలో పొణుగుపాటి నాగభూషణం, ఇంటూరి వెంకటేశ్వరరావు కడపలో మాట్లాడినారు

కడపలో అక్టోబరు 2 వ తేది సాయంకాలం మహాత్ముని ఛాయాపటం చందన వెంకోబారావుగారి యాజమాన్యంలో మంగళవాయిద్యాలతో జాతీయ పతాకాలతో ఊరేగించటం జరిగింది. శ్రీమతి చందన పద్మావతిబాయి జాతీయ

పతాక వందనోత్సవం జరిపినారు సాయంకాలం హరిజన మైదానంలో సభ జరిగింది గాంధీజీ జీవితం గురించి అస్పృశ్యతా నివారణ గురించి శ్రీ వెంకోబా రావు, యం వెంకట సుబ్బయ్య గార్లు ఉపన్యసించినారు

**కుప్పంలో**

అక్టోబరు 2 సాయంకాలం 4 గంటలకు గాంధీజీ పటంతో ఊరేగింపు జరిగింది సాయంకాలం 6 గంటలకు తిరుపతి గంగమాంబ దేవస్థాన మైదానంలో ప్రాణకా పట్టాభి రామరెడ్డిగారి అధ్యక్షత కింద బహిరంగ సభ జరిగింది మహాత్మాజీ జీవిత చరిత్ర గురించి, అస్పృశ్యతా నివారణ గురించి అధ్యక్షులు యల్ సుందర రాజయ్యంగార్, శ్రీ సి గుండురావు గార్లు విపులంగా ఉపన్యసించినారు

**రాజ పద్మాపురంలో**

మనూర్ ఫిర్కా కాంగ్రెస్ యాజమాన్యంలో అక్టోబరు 2 రాత్రి పెంచెల్నేని రాఘవులు నాయుడుగారి నూతన సౌధంలో గాంధీ జయంత్యుత్సవం జరిగింది గాంధీ, తిలక్ మహాశయుల పటాలతో సవర్ణులు, హరిజనులు కలిసి భజనలు చేసుకుంటూ ఊరేగింపు చేసినారు పెంచెల్నేని రాఘవులు నాయుడుగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది బొమ్మినేని నారాయణస్వామి నాయుడు మొదలయిన వారు మహాత్ముని జీవిత చరిత్రను గురించి ఉపన్యసించినారు

**నంద్యాలలో**

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో శ్రీయుతులు కైప సుబ్రహ్మణ్య శర్మ, ఎలకూరి యెల్లయ్యచెట్టి, కోడి నరసింహం గార్లు ఖద్దరు అమ్మకం చాలా ప్రశంసనీయంగా నిర్వహించినారు 300 రూపాయల ఖద్దరు అమ్మకమయింది మహానందీశ్వర దేవాలయంలో మహాత్ముని ఆయురారోగ్యాలకోసం ప్రార్థనలు జరిగినాయి అక్కడనే శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు అధ్యక్షత కింద ఒక సభ జరిగింది వారు తమ సహజ వక్తృత్వ ధోరణిలో మహాత్ముని జీవిత రహస్యాలను గురించి ఉపన్యసించినారు

**బళ్ళారిలో**

అక్టోబరు 2 సాయంకాలము శ్రీ కె గురు రాజారావుగారి అధ్యక్షతన ఆగడవారి సత్రంలో గాంధీగారి జన్మదినోత్సవ సభ జరిగింది. ఆ సభలో గాంధీజీకి భగవంతుడు దీర్ఘాయురారోగ్యాలు ప్రసాదింపవలెనని, ప్రజలందరూ హరిజనాభ్యుదయానికి, ఖాదీ అభివృద్ధికి తోడ్పడవలెనని తీర్మానాలు జరిగినాయి. వందేమాతర గీతంతో సభ ముగిసింది.

**కుసుదవల్లిలో**

శ్రీ వీరేశలింగ కవి సమాజంవారి యాజమాన్యంలో అక్టోబరు 2 ఉదయం నగర సంకీర్తన జరిగింది 11 గంటలకు శ్రీ రాజా కే ఆర్ వి కృష్ణారావు మందిరంలో సాగి సుబ్బరాజుగారి అధ్యక్షతన సభ జరిగింది గాంధీజీ జీవితం గురించి, ఆయన నిర్మాణ కార్యక్రమం గురించి అధ్యక్షుడు, సాగి నారాయణరాజు, షేక్ లాల్‌సాహెబు, భూపతిరాజు తిరుపతిరాజు గార్లు ఉపన్యసించినారు శ్రీ నడింపల్లి సుబ్బరాజుగారు మహాత్ముని ఛాయాపటం ఆవిష్కరించినారు మహాత్ముని గురించి కొన్ని పద్యాలు చదివినారు మంగళ గీతాలతోను, మధురాహారాలతో సభ ముగిసింది

**భీమునిపట్టణం**

భీముని పట్నంలోని కాంగ్రెస్ నాయకులు హరిజన నాయకులు కలసి అక్టోబరు 2 మధ్యాహ్నం గాంధీజీ పటానికి పూజచేసి ప్రసాదాలు పంచిపెట్టినారు సాయంకాలం మహాత్ముని పటం పూలదండలతో అలంకరించి వలంటీర్ల జాతీయ గీతాలతోను, బాండు మేళాలతోను ఊరేగించినారు విశాఖపట్నం జిల్లాలో మొట్టమొదట హరిజనులను ప్రవేశ పెట్టిన శ్రీ కోటవారి శ్రీరామ మందిరంలో మహాత్ముని పటానికి హారతి ఇచ్చినారు

ఆ రాత్రి పులవర్తి సీతారామయ్యగారి అధ్యక్షత కింద శ్రీ కన్యకా పరమేశ్వరి ఆలయంలో గాంధీజీ జీవితం గురించి ఉపన్యాసాలు జరిగినాయి శ్రీ రొంపిచెర్ల సింగరాచార్యులు, సత్తరువు నారాయణరావుగార్లు ఉపన్యసించినారు

**తాడేపల్లిగూడెంలో**

అక్టోబరు 2 న తాడేపల్లిగూడెంలోని సతీహిత సమితివారి యాజమాన్యాన శ్రీయుత దామోజిపురపు నరసింహారావుగారి నూతనభవనంలో సాయంత్రం 4 గంటలకు స్త్రీలసభ జరిగింది దామోజిపురపు వెంకట రమణమ్మగారు అధ్యక్షత వహించినారు ప్రథమంగా బాలికలు తమ కోమల కంఠాలతో దైవ ప్రార్థన చేసినారు అధ్యక్షురాలు మహాత్ముని జీవితం వలన మానవులు నేర్చుకోవలసిన విషయాలను గురించి చక్కటి ఉపన్యాసం వ్రాసుకొనివచ్చి చదివినారు తరవాత విరాల వీరభద్రరావుగారు, సతీహిత సమితి కార్యదర్శిని శ్రీమతి దామోజిపురపు లక్ష్మీనరసమ్మగారు గాంధీజీ జీవితం గురించి సంగ్రహంగా ఉపన్యసించినారు

**రాజమహేంద్రవరము**

సెప్టెంబరు 24 వ తేదీ నుంచి అక్టోబరు 2 వరకు గాంధీజయంత్యుత్సవాలు జరిగినాయి ఆవారంలో 1000 రూపాయలకు పైగా ఖద్దరు అమ్మకమయింది

హిందీ, హరిజన వారోత్సవాలు కూడా అప్పుడే జరిగినవి హిందీ, నూలు వడికే పోటీ పరీక్షలు ఏర్పాటు చేయడం జరిగింది అక్టోబరు 2 వ తేదీన పాఠశాలకు నుంచి గాంధీ పటాన్ని ఊరేగిస్తూ పౌరులు ముఖ్యవీధుల ద్వారా వీరేశలింగ పురమందిరానికి వెళ్ళినారు అక్కడ బహిరంగ సభకు మద్దూరి అన్నపూర్ణయ్యగారు అధ్యక్షత వహించినారు హిందీ, నూలుపోటీ పరీక్షలలోను, హరిజన దినోత్సవం ఆట పోటీలలోను గెలిచిన వారికి శ్రీమతి పుష్పాగారు బహుమతులు పంచిపెట్టినారు నూలుపోటీ పరీక్షలో గెలిచిన మొదటి ఇద్దరికి సీతానగరం ఖద్దరుస్టోర్సువారు, అరవ ఆదినారాయణమూర్తిగారును, హిందీపోటీ పరీక్షలో గెలిచిన మొదటి ముగ్గురికి సి యం రామారావుగారును, హరిజన దినోత్సవ సందర్భంలో ఆటలలో పాల్గొని గెలిచిన వారందరకీ డాక్టర్ పాలకోడేటి గురుమూర్తిగారు బహుమతులను కొని ఇచ్చినారు

శ్రీయుతులు వాసా సూర్యనారాయణశాస్త్రి, అరవ ఆదినారాయణ మూర్తి, జయంతి వెంకటనారాయణ, మున్నంగి లక్ష్మీనరసింహశర్మ, శ్రీమతులు గుమ్మడిదల దుర్గాబాయి, సత్తిరాజు శ్యామలాంబ, బత్తుల కామాక్షమ్మగార్లు ఆనాటి సభలో మాట్లాడినారు

శ్రీ నాళం కృష్ణారావుగారు మహాత్ముని గురించి కొన్ని పద్యాలు చదివినారు వందనాలతో సభ ముగిసింది

**బొబ్బిలి**

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో గోన సీతారామస్వామి అధ్యక్షత కింద సభ జరిగింది రాచిరాజు పంతులుగారు, గాంధీజీ ధర్మ సంస్థాపనా చార్యుడని, హరిజనకులోద్ధారకుడని, రాట్నతత్వ ప్రతిపాదకుడని, గ్రామ పరిశ్రమాభివృద్ధి కారకుడనీ ఉపన్యసించినారు శ్రీ ఊటుకూరి నరసింహారావుగారు హిందీ భాషావశ్యకతను గురించి ప్రబోధించినారు

**కొణకంచి**

కొణకంచిలో గాంధీజయంత్యుత్సవ సందర్భంలో అక్టోబరు 2 సాయంకాలం 4 గంటలకు బహిరంగ సభ జరిగింది శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఆ సభలో పాల్గొన్నారు పరిసర గ్రామాల నుంచి అనేక మంది రైతులు సభకు వచ్చినారు శ్రీ కాకుమాను లక్ష్మయ్యచౌదరిగారు సభకు అధ్యక్షత వహించినారు రాట్నపు పోటీ పరీక్షలలో గెలుపొందిన వారికి బహుమతులీయ బడినవి అయ్యదేవర కాళేశ్వరరావుగారు ప్రారంభోపన్యాసం చేసినారు తరవాత శ్రీ జయంతిపురం రాజాగారు, కొణకంచి చక్రధరరావుగారు, బతరాజు జీడికంటి రామారావు, అనుముల రామగోవిందశర్మగార్లు మహాత్ముని ఆదర్శాల పట్ల ప్రజల విధులను గురించి విపులంగా ఉపన్యసించినారు

ఐండిపాలెం

శ్రీ ఐతరాజు జీడికంటి రామారావుగారి అధ్యక్షతన బహిరంగ సభలో శ్రీ శ్రీ జయంతిపురం రాజాగారు ప్రారంభోపన్యాసంచేస్తూ మహాత్ముని జీవితము, వారి ఆదర్శము, వారి త్యాగము, వారి గ్రామోద్ధరణ కార్యకలాపాలను గురించి విపులంగా ఉపన్యసించినారు అగ్రాసనాధిపతి మహాత్ముని అహింసా ధర్మాన్ని గురించి ముచ్చటిస్తూ ఆయనను సర్వతోముఖ సంస్కారి అని ప్రశంసించినారు శ్రీయుత రేపాల బుచ్చిరామ శేషయ్యశ్రేష్ఠిగారి అల్పాహార విందుతో సభ ముగిసింది

కాకినాడ

గాంధీ జయంత్యుత్సవ సందర్భంతో కాకినాడలో అక్టోబరు 2 ఉదయం నగర సంకీర్తన జరిగింది సాయంకాలం టౌన్‌హాల్‌లో బహిరంగసభ వేదాంతం వెంకటకృష్ణయ్యగారి ప్రార్థనతో ప్రారంభమయింది సభకు డాక్టర్ జె బి మెక్లారిన్ అధ్యక్షులుగా ఉండి, "గాంధీ మహాత్ముని ఈ శతాబ్దంలో ప్రజా క్షేమం కోసం పరమేశ్వరుడు ఈ లోకానికి పంపినట్లు మేము నమ్ముతున్నాము ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క మహాత్ముని భగవంతుడు ప్రపంచానికి పంపుతూంటాడని నమ్మకంగల క్రైస్తవులలో నేనొకణ్ణి కనక ఆయన చిరాయురారోగ్యవంతుడుగా ఉండవలెనని మనమీరోజున భగవంతుని ప్రార్థింతము" అని అన్నారు

తరవాత శ్రీ చావలి రామసోమయాజులు, శ్రీ వి పి రాజు, శ్రీమతి కమలాదేవి, శ్రీ బులుసు వెంకటేశ్వర్లు, మొసలికంటి తిరుమలరావు, మండపాక రంగయ్యనాయుడు మొదలయిన వారు గాంధీ మహాత్ముని జీవితాశయాలను గురించి విపులంగా ఉపన్యసించినారు సభాధ్యక్షుడు సభను ముగిస్తూ "దేవునికి ఆత్మ సమర్పణ గావించినవారికి ఆయన ఆదేశం వినిపిస్తుంది అటువంటివారే లోకహితులు మహాత్ములు అవుతారు అట్లాంటివారు గాంధీగారు ఆయన దైవ ప్రేరణ ననుసరించి నడుచుకొంటారు ఆయన ఆదేశాలను అనుసరించడం అత్యవసరము" అని అన్నారు

త్రాప

త్రాపలో శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారి ఆధిపత్యం కింద గాంధీ జయంత్యుత్సవం జరిగింది అక్టోబరు 2, 10 గంటలవరకు ఖద్దరు విక్రయం జరిగింది సాయంత్రం 3 గంటలకు 10 ఏళ్ళలోపు బాలికలలో నూలువడుకు పోటీ పరీక్షలు జరిగినాయి వారిలో ముగ్గురు పిల్లలకు బహుమతులు లభించినాయి సాయంకాలం 4 గంటలకు స్త్రీలసభలో రాట్నం ప్రాముఖ్యం గురించి శ్రీ సీతా రామశాస్త్రిగారు విపులంగా ఉపన్యసించినారు సాయంత్రం 5 గంటలకు బహిరంగ సభలో కుప్పా గోపాలకృష్ణయ్యగారు, శాస్త్రిగారు గాంధీ జీవితా

శయం గురించి ఉపన్యసించినారు

## చిత్తూరు

చిత్తూరులో గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో అక్టోబరు 2 మధ్యాహ్నం బీదలకు అన్నదానం జరిగింది సాయంకాలం 6 గంటలకు శ్రీ రామవిలాస్ నాటకశాలలో శ్రీ దొరస్వామయ్యంగారి అధ్యక్షత కింద బహిరంగసభ జరిగింది మాడభూషి అనంతశయనం అయ్యంగార్, శ్రీ సి ఆర్ రెడ్డి, శ్రీ రంగంచెట్టి మొదలయినవారు గాంధీజీ నిర్మాణ కార్యక్రమం గురించి ఆయన మహదాశయాలను గురించి ఉపన్యసించినారు రాత్రి 8 గంటలకు కోదండ రాములవారి ఆలయంలో గాంధీజీ చిరాయురారోగ్యవంతుడుగా ఉండవలెనని కోరుతూ అర్చనలు జరిగినాయి

## సీతానగరం

అక్టోబరు 2 ఉదయం 8 గంటలకు గాంధీజీ పటంను సీతానగరం ఫిర్కా కాంగ్రెస్ కమిటీ వారు పూలతో అలంకరించి జాతీయ పతాకాలతో, బాండు మేళాలతో ఊరేగించినారు. సాయంకాలం 6 గంటలకు సీతానగరం చతుష్పథంలో శ్రీ నీరుకొండ వెంకటరత్నంగారి అధ్యక్షత కింద బహిరంగసభ జరిగింది డాక్టర్ బ్రహ్మజోశ్యుల సుబ్రహ్మణ్యంగారు గాంధీజీ జీవితం, సత్యాహింసలు, నిర్మాణ కార్యక్రమము, అస్పృశ్యతా నివారణ మొదలయిన విషయాలను గురించి తేటతెల్లంగా ఉపన్యసించి ప్రజలు గాంధీజీకి చేదోడువాదోడుగా ఉండవలెనని ఉద్బోధించినారు

సీతానగరం ఫిర్కాలో గాంధిజయంతి వారంలో ఖద్దరు విశేషంగా అమ్మకమయింది సీతానగరం హరిజన పల్లిలో శ్రీయుతులు చట్టి కృష్ణారావు, కొత్త సీతారామస్వామిగార్లు గాంధీజీ జీవితాన్ని గురించి హరిజనులకు చెప్పినారు

## గురువారెడ్డిపాలెం

గాంధీజయంత్యుత్సవ సందర్భంలో అక్టోబరు 2వ తేది 12 గంటలకు నూలువడుకు పోటీ జరిగింది ముప్పై పడుగురు స్త్రీలు, ఒక బాలుడు పోటీ చేసినారు గ్రామస్థులు జాతీయ గీతాలతో గాంధీ మహాత్ముని పటం వీధులలో ఊరేగించినారు సాయంత్రం 5 గంటలకు అ భా చ సంఘం ఆవరణలో నేలటూరి వెంకట్రావుగారి అధ్యక్షతకింద బహిరంగ సభ జరిగింది శ్రీ మంతెన వెంకట్రాజు గారు ప్రాచీన నేతపరిశ్రమ, దానివినాశనం, పునరుద్ధరణ మొదలయిన విషయాలను గురించి ప్రజలకు విపులంగా ఉపన్యసించినారు రాట్నపు పోటీలో గెలిచిన ఎనిమిది మంది స్త్రీలకు చీరెలు రవికగుడ్డలు పంచిపెట్టినారు కాటంగడ్డ పాపయ్య

గారు హరిజన బాలురకు భగవద్గీత, రైతు భజనావళి మొదలయిన పుస్తకాలను బహూకరించినారు

**ఆలపాడు**

అక్టోబరు 2 ఉదయం 7 గంటలకు గ్రామస్థులు రాధాకృష్ణ గ్రంథాలయ ఆవరణలో దైవ ప్రార్థన, పతాక వందనం జరిపినారు శ్రీ ఉండూరు వెంకయ్య గారు జాతీయ పతాకం ప్రతిష్ఠించినారు సాయంకాలం జరిగిన బహిరంగ సభలో బూర్గుల రామకోటిశాస్త్రిగారు మహాత్ముని జీవితం, ఆయన నిర్మాణ కార్యక్రమాలను గురించి విపులంగా ఉపన్యసించినారు

**ప్రొద్దుటూరు**

అక్టోబరు సాయంకాలం 5 గంటలకు గాంధీజీ చిత్రపటాన్ని గ్రామస్థులు శ్రీ చెన్నకేశవస్వామి ఆలయం నుంచి మంగళ వాద్యాలతో ఊరేగించినారు ఉత్సవము వీధుల ద్వారా పోతూండగా ప్రజలు నమస్కరించి గాంధీజీ చిత్ర పటానికి కర్పూర హారతులు సమర్పించినారు గాంధీజీ చిరాయుష్మంతుడు కావలెనని శ్రీ కేశవస్వామివారికి అర్చనలు చేసినారు

**తణుకు**

తణుకులోని శ్రీ బాల సరస్వతీ సమాజంవారి యాజమాన్యంలో హిందీ బాలికా పాఠశాల పక్షాన మహాత్మాగాంధీగారి 66 వ జన్మదినోత్సవం జరిగింది అక్టోబరు 2 ఉదయాన బాలికలు ప్రార్థనలు చేశారు మధ్యాహ్నం 2 గంటలకు స్త్రీల సభ జరిగింది ఒక అరగంట భజన చేసిన తరవాత శ్రీమతి మోగంటి మాణిక్యాంబగారు హిందీలో మహాత్ముని గురించి చక్కని పాట పాడినారు తరవాత శ్రీ దేవులపల్లి సత్యవతమ్మగారు బాపూజీ జీవితాశయ కార్యదీక్షలను గురించి మనోరంజకంగా ఉపన్యసించినారు

**విశాఖపట్టణము**

అక్టోబరు 2 ప్రాతఃకాలాన జాతీయ గీతాలతో ప్రభాతఫేరి జరిగింది సముద్రతీరంలో జండావందనం జరిగింది ఆలయాలలో అభిషేకాలు జరిగినాయి కొల్లూరి సూర్యనారాయణగుప్త, శ్రీ తెన్నేటి విశ్వనాథంగార్లు గాంధీ జయంతి వారంలో ఖద్దరు విక్రయించినారు అక్టోబరు 2 సాయంకాలం మహాత్ముని చిత్రపటం టర్నర్ సత్రంనుంచి ఊరేగిస్తూ తెన్నేటి విశ్వనాథం, కె యస్ గుప్త మొదలయిన కాంగ్రెస్ నాయకులుసముద్రతీరానికిచేరినారు అక్కడ బహిరంగ సభలో శ్రీ తెన్నేటి విశ్వనాథం, కొల్లూరి సూర్యనారాయణ గుప్త, చిన్నకోట జగన్నాథ గుప్త, మారేపల్లి రామచంద్రశాస్త్రిగార్లు మహాత్ముని మనుగడ, ఆదర్శాలు, ఉపదేశాలను గురించి ఉపన్యసించినారు

అక్టోబరు 8 వ తేదీని 1000 మంది పేదలకు సంతర్పణ జరిగింది
వినయాశ్రమము - కళ్యాణ కావూరు

గాంధీ మహాత్ముని జయంత్యుత్సవ సందర్భంలో వినయాశ్రమవాసులు సెప్టెంబరు 24 (1935) మొదలు అక్టోబరు 2 వరకు ప్రతి ఉదయం సంకీర్తనలతో హరిజన వాడలను సందర్శించి గాంధీజీ ఆశయాలను గురించి హరిజనులకు ఉద్బోధించినారు ప్రతి దినం హరిజన వాడలకు ఔషధాలను తీసుకొని పోయి వ్యాధి పీడితులకు సేవ చేసినారు హరిజనవాడలలోని అపరిశుభ్ర ప్రదేశాలను, పెంట కుప్పలను బాగు చేసినారు ప్రతి దినం ఆశ్రమానికి తిరిగి వచ్చేటప్పుడు హరిజన బాలురను, వృద్ధులను వెంటబెట్టుకొని వచ్చి వారికి తలంట్లు పోయించి, కుంకుమ బొట్లు బెట్టి, పిండి వంటలతో క్షీరాన్నాలతో భోజనాలు పెట్టి పంపుతూ వచ్చినారు ఆ గాంధీ జయంతి వారంలో వారు కావూరు, ఈమని వారిపాలెం, చెరుకుపల్లి, గుళ్లపల్లి, ఇంటూరు, పిట్టలవానిపాలెం, చందూరు, దండువారిపాలెం, రాంభొట్లపాలెం, ఆరుంబాక, పిట్టకోటిరెడ్డిపాలెం మొదలయిన పది హరిజనవాడలను దర్శించినారు కావూరులో శ్రీ మృత్యుంజయరావు అధివత్యంలో జరిగిన సభలో పలువురు గాంధీజీని గురించి ముచ్చటించినారు ఫలహారాలతో ఆ సభ ముగిసింది

మచిలీపట్నము

సెప్టెంబరు 24 నుంచి అక్టోబరు 2 వరకు మహాత్ముని జన్మదినోత్సవ కార్యకలాపాలు జరిగినాయి

సెప్టెంబరు 24 న ఆంధ్ర జాతీయ కళాశాలలో జాతీయ పతాకవందనోత్సవంతోను, రాట్న తకిలీ పూజలతోను గాంధీ జయంత్యుత్సవ కార్యక్రమము ప్రారంభమయినది ప్రతిరోజు సాయంకాలం 5 గంటలకు జాతీయ కళాశాల నుంచి నగర సంకీర్తనంతో కళాశాల విద్యార్థులు పురమందిరానికివచ్చి బహిరంగ సభలో పాల్గొని పురప్రముఖుల ఉపన్యాసాలను విన్నారు ఆదివారం నాడు జాతీయ కళాశాలలో హరిజన బాలబాలికల వ్యాయామ పోటీ ప్రదర్శనలు జరిగినాయి.

అక్టోబరు 2 ఉదయం జాతీయ కళాశాలలో జాతీయ పతాక వందనోత్సవం జరిగింది 10 గంటలకు సుమారు 2000 మంది బీదలకు అన్నదానం జరిగింది

మధ్యాహ్నం 1 గంటకు కళాశాలలోనే రాట్నం తకిలీ పోటీ పరీక్షలు జరిగినాయి. సుమారు 40 మంది పోటీలో పాల్గొన్నారు సాయంకాలం 4 గంటలకు జాతీయ కళాశాల నుంచి మహాత్మాగాంధీ మొదలగు జాతీయ నాయకుల పటాలతో అలంకరించిన బండి వెంట మేళతాళాలతో జాతీయ కళాశాలా విద్యార్థులు జాతీయ పతాకాలు పట్టుకొని, జాతీయ గీతాలు పాడుకొంటూ తిలక్ చౌక్‌కు 6 గంటలకు చేరినారు అక్కడ డాక్టర్ పట్టాభిగారి అధ్యక్షతన

బహిరంగ సభ జరిగింది వలువురు ప్రముఖులు మహాత్ముని జీవితం గురించి వారి రాజకీయ ఆధ్యాత్మిక సాధనాలను గురించి ఉపన్యసించినారు రాట్నం, తకిలీ పోటీ పరీక్షలలో ప్రథమ శ్రేణిలో గెలుపొందిన శ్రీ కోగంటి వెంకటకృష్ణయ్య, రాయప్రోలు సీతారామాంజనేయులుగారలకు వెండి తకిలీలు, మహాత్ముని చిత్ర పటాలు బహూకరించినారు రెండో వారుగా గెలుపొందిన కాజ లక్ష్మీనారాయణ, పి చెన్నయ్యగార్లకు మహాత్ముని ఆత్మకథలు లభించినాయి హరిజన బాలబాలికల వ్యాయామ పోటీలో గెలుపొందిన వారికి ఖద్దరు బట్టలు బహూకరించడం జరిగింది (శ్రీ) కాటూరు వెంకటేశ్వరరావుగారు గాంధీ జయంతిని గురించి చక్కని ద్విపద వ్రాసి ఇచ్చినారు ఈ సందర్భంలో జాతీయ కళాశాల విద్యార్థులు ప్రశంసనీయంగా పనిచేసినారు

గుంటూరు

గుంటూరు నగర కాంగ్రెస్ సంఘం వారి యాజమాన్యమున అ భా చ సంఘం వారి ఆంధ్ర శాఖముందు దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారు స్వరాజ్య పతాకారోహణ చేసి జాతీయ జండా ప్రాముఖ్యం గురించి వివరించి వారు సాయంకాలం 6 గంటలకు అ భా చ సంఘం వారి ఆంధ్రా ఖాదీ భాండరానికి ముందు ఉన్న ప్రదేశంలో బహిరంగ సభ జరిగింది మద్ది వెంకట సుబ్బయ్యగారు అగ్రాసనాధిపత్యం వహించినారు జాతీయ గీతాలతో సభ ప్రారంభమయింది శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గాంధీగారి అహింసా సిద్ధాంతాన్ని గురించి, నాడు దేశంలో జరుగుతూండిన గ్రామ సౌభాగ్య సంఘ ప్రచారాన్ని గురించి విపులంగా ప్రసంగించినారు

సెప్టెంబరు 29 వ నగర కాంగ్రెస్ సంఘంవారు ఏర్పాటు చేసిన తకిలీ వడుకు నూలు పోటీలలో గెలుపొందిన దూదికుంట్ల రామకృష్ణమూర్తి, దాసు మన్మథరావుగార్లకు సభాధ్యక్షుడు బహుమతులిచ్చినారు

గుంటూరు మునిసిపాలిటీవారు పురపాలక సంఘ భవనం విద్యుద్దీపంతో అలంకరించి 'మహాత్మా గాంధీకి జై' అనే అక్షరాలు విద్యుద్దీపాల తోరణాలతో ప్రజ్వలింపజేసినారు

పూళ్ళ

పూళ్లలో గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో హరిజన సేవా సంఘం వారు హరిజన బాలురకు ఖద్దరు వస్త్రాలు పంచి పెట్టినారు కళ్లి వెంకట్రామయ్యగారు హరిజన బాలురకు అరటి పండ్లు పంచి పెట్టినారు సాయంకాలం సభలో చాలామంది స్త్రీలు కూడా పాల్గొన్నారు.

**బాపట్ల**

బాపట్ల పౌరులు గాంధీగారి చిత్రపటం అక్టోబరు 2 ఉదయాన ఊరే గించినారు సాయంకాలం పురమందిరంలో మల్లాది యజ్ఞ నారాయణగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది శ్రీయుతులు మాధవపెద్ది కాశిదాసు, కొమరవోలు శేషగిరిరావు, పాతూరి లక్ష్మినారాయణగార్లు శ్రీ గాంధీ జీవితం గురించి ఉపన్యాసం చేసినారు

# 21
# గాంధీజీ విగ్రహ ప్రతిష్ఠ (1936)

**కాకినాడ**

1928 డిసెంబరులో కాకినాడ పట్టణంలో కాంగ్రెస్ జరిగినప్పుడు ఆహ్వాన సంఘంవారు గాంధీజీ విగ్రహ ప్రతిష్ఠాపనకోసం 2000 రూపాయలు విరాళమిచ్చినారు తరవాత 1929 లోనో 30 లోనో శ్రీ బులుసు సాంబమూర్తిగారి కోరికపైన, గాంధీజీ బొంబాయిలోని శిల్పకారుడు వి వి లాగ్ గారి ఎదుట స్వరూప చిత్రనిర్మాణంకోసం యంగ్ ఇండియా పత్రిక వ్యాసాలు వ్రాసుకొంటూ కూర్చోడానికి అంగీకరించి 15 నిమిషాలు ఆ ప్రకారం కూర్చున్నారు కాని రెండోమారుకూడా గాంధీజీ శిల్పకారుని ఎదట కూర్చుండవలసి వచ్చింది 1934 లో విగ్రహం పూర్తయి వచ్చింది ఇంతకుపూర్వం (1936) బాబు రాజేంద్రప్రసాద్ గారు కాకినాడకు వచ్చినప్పుడు ఆయనచేత ఆ విగ్రహం ఆవిష్కరింపచేయటానికి తగిన సన్నాహాలు జరగలేదు

అందువల్ల 1936 ఫిబ్రవరి 10వ తేదిన 8 గంటలకు కాకినాడలోని పైడా వెంకటచలపతి టౌన్‌హాల్ ఎదట మహాత్ముని ఊర్ధ్వకాయం మాత్రమే ప్రదర్శించే ఆ స్ఫటిక శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడింది కాకినాడ మునిసిపల్ చెర్మన్ శ్రీ లక్కరాజు సుబ్బారావుగారి కోరికపైన మార్గరేట్ కజిన్స్‌గారు దానిని ఆవిష్కరించినారు ఆ సభకు అనేకమంది స్త్రీ పురుషులు, ఆంధ్రదేశ ప్రముఖులు వచ్చినారు వారిలో న్యాపతి సుబ్బారావు పంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, టంగుటూరి ప్రకాశం, పైడా వెంకటనారాయణ జమీందార్, బులుసు సాంబమూర్తి, డాక్టరు పట్టాభి సీతారామయ్యగార్లు ఉన్నారు

విగ్రహం ఆవిష్కరిస్తూ కజిన్స్ సతి ఇట్లా ప్రసంగించినారు

భారతదేశంలోనేగాక యావత్ప్రపంచంలోను పురుషోత్తముడని పూజింపబడుతున్న గాంధీమహాత్ముని విగ్రహం నేడు నేనిక్కడ ఆవిష్కరించే భాగ్యం కలిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉన్నది మహాత్ముని విగ్రహ సందర్శనంవల్ల పౌరులకు వారి సద్గుణ శీలాలు నిత్యం ప్రత్యక్ష గోచరాలు కాగలవు ఈ మహాత్ముని హృదయమెంత నిష్కళంకమయినదో ఈ స్ఫటిక శిలకూడా అంత విశుద్ధమయినదే మహాత్ముని గౌరవ ప్రతిష్ఠలుకూడా శిలా శాసనంవలె శాశ్వతాలైనవి మహాత్ముని ఆత్మతేజం సర్వాంతర్యామియై హరిజనునియందూ, చక్రవర్తియందుకూడా సరిసమానంగా ప్రసరించి అందరినీ ఆకర్షించగలుగుతూన్నది ఆయన ఆకర్షణ ప్రభావమే ఐకమత్యానికి ఆధారభూతము, భారతీయులలో భారతీయులకు మాత్రమేగాక ప్రపంచంలోని వివిధ

జాతులవారిని పుంజీభవింపచేయగల మహత్తు ఆయనలో ఉన్నది దౌర్జన్యబలాన్ని సాత్త్వికమయిన అహింసా తేజంలోకి మార్చిన మహాసియుడతడు ఈ దేశ ప్రజలకు ఆయన సాత్త్విక నిరోధం బోధించినారు ఈ దేశంలో ఈ స్థలమందే దేశ స్వాతంత్ర్యంకోసం రక్తం ప్రవహించినది అది ప్రజలలో ప్రజలు కొట్టు కొనటంవల్ల కాదు విదేశీయులు ప్రజలను కొట్టించడంవల్ల రక్తం ప్రవహించి నది మహాత్ముని అహింసామార్గము కాలక్రమేణా జయప్రదం కాగలదు

ఈ దేశంనుంచి వలందులు (డచ్చివారు) వెళ్ళినారు బుడతకీచులు (పోర్చుగీసువారు) వెళ్ళిపోయినారు పరాసు (ఫ్రెంచ్‌వారు) వారు వెళ్ళి పోయినారు ఇంగ్లీషువారు కూడా వెళ్ళిపోతారు నా ఐర్లండ్ దేశంనుంచి ఇంగ్లీషువారు వెళ్ళిపోయినారు అదే విధంగా భారతదేశానికి కూడా స్వాతం త్ర్యం లభించగలదు కారణమేమంటే ఈ మహాత్ముని ఆత్మ ప్రభావంలో భారత జాతి అంతా ఏకమయి స్వాతంత్ర్యం సాధించగలదు స్వాతంత్ర్య పొందిన రాజ్యాలు సుఖితంగా సర్వ సమృద్ధాలై లోకశాంతి స్థాపనకు తోడ్పడగలవు

భారతదేశ స్వాతంత్ర్య సంపాదనకు మహాత్మునికి భగవంతుడు చిరాయు రారోగ్యం ప్రసాదించుగాక"

కజిన్స్ సతిగారి ఇంగ్లీషు ఉపన్యాసాన్ని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారు తెలుగులోకి అనువదించి చెప్పినారు

శ్రీ బులుసు సాంబమూర్తిగారు కజిన్స్ సతిగా కి కృతజ్ఞతాభివందనలు సమర్పిస్తూ కాకినాడలోని గాంధీనగర పార్కులో మరొక గాంధీ విగ్రహం ప్రతిష్ఠింపబడుతుందని చెప్పినారు ఉదయం 9 గంటలకు సభ ముగిసింది

**ఒక పరివర్తన కథనము**

దేశ భక్త కొండ వేంకటప్పయ్య పంతులుగారు అస్పృశ్యతా నివారణకు చాలాకాలం అంగీకరించలేదు కాని తరవాత ఆయనకు కలిగిన హృదయ పరివర్తన గురించి ఈ పై శీర్షికతో మహదేవదేశాయ్ 22-2-1936 'హరిజన్'లో వ్రాసిన వ్యాసమిది

కాంగ్రెస్ స్వర్ణోత్సవ సమయంలో శ్రీ రాజగోపాలాచార్యులవారు ఈ పత్రికలో ఒక వ్యాసాన్ని వ్రాస్తూ హరిజనోద్యమానికి సంబంధించినంతవరకు కావలసిన మార్పు జరిగినదన్నారు కడచిన 20 సంవత్సరాలలో అధికసంఖ్యాక ప్రజానీకంలోని మానసిక ప్రవృత్తిలో గొప్ప మార్పు కలిగిందని ఆయనకు సహజమయిన సంక్షిప్త భాషలో చెప్పినారు ఆ వ్యాసం చాలా క్లుప్తంగా సంగ్రహంగా ఉన్నది ఆ వ్యాసం గురించి కొన్ని విమర్శలను నేను విన్నాను హరిజనులపైన ప్రతిదినం అనేక అత్యాచారాలు జరుగుతూ ఉండగా రాజ గోపాలాచారిగారి వ్యాసం ఆయన ఆత్మసంతృప్తిని మాత్రమే ప్రతిబింబిస్తున్న దని ఆ విమర్శల తాత్పర్యము భారతదేశంలోని ఇతర రాష్ట్రాలలో అనేక దేవాలయాలు హరిజనులకు తెరువబడగా దక్షిణ భారతదేశంలో మాత్రం హరి

జనులకు ఆ దేవాలయ ద్వారాలింకా మూతబడి ఉన్నవని విమర్శకుల ఆక్షేపణ ఈ విమర్శ అసలు విషయం తెలియనందుకు నిర్దాక్షిణ్యంగా చేయబడింది శ్రీ రాజగోపాలాచార్యులవారు తమ యావత్కాలాన్ని హరిజనాభ్యుదయానికి వినియోగిస్తున్నారు ఆయన ఆశ్రమం హరిజనుల మధ్య నిర్మించుకొన్నారు ఆయనకు సంబంధించినంతవరకు ఆయన వ్రాసిన మాటలు ఆత్మసంతృప్తికోసమని చెప్పటానికి లేదు మనం హరిజనులకు చేయవలసినంత సేవలో అల్పాంశం కూడా చేసినట్లు ఆయన విశ్వసించడంలేదు అనేక రూపాలలో వివిధ పద్ధతులలో ప్రత్యక్షమవుతున్న అస్పృశ్యత కూకటివ్రేళ్లతో పెకలింపబడేవరకు ఆయనకు విశ్రాంతి ఉండదు మన మనసులలో అస్పృశ్యతను తొలగించే విషయంలో మార్పు కలిగిందని, ఇంతకాలమూ మనం అస్పృశ్యతను పాటిస్తున్నందుకు ప్రాయశ్చిత్తంగా అస్పృశ్యతా నిర్మూలనకు పాటుపడవలెననీ,సమాజంలో ఆలోచనాపరులైన వారందరూ అంగీకరిస్తున్నారనీ ఆయన అభిప్రాయము సంఘంలో నాయకులుగా ఉండేవారు అస్పృశ్యత అనే జుగుప్సాకరమయిన రోగంనుంచి విముక్తులయినారని కూడా ఆయన విశ్వాసము

ఒకప్పుడు తాము అణగదొక్కిన ప్రజలతో సమాన స్థితికి తమంతట తాము దిగిపోయేటందుకు అంగీకరించినవారు ప్రపంచ చరిత్రలో ఇంకెక్కడయినా ఉన్నారా ? రాజా రామమోహనరాయ్ కాలానికి తరవాత హిందూ దేశంలో అస్పృశ్యత ఒక కళంకమని భావించి దానికి ప్రతికూలంగా గొంతెత్తి మాట్లాడినవారు లేరు కొద్ది సంవత్సరాల క్రితం వరకు నిమ్నజాతులను పైకి తీసుకరావలెనని మాత్రం మాట్లాడుతూ వచ్చినారు కడచిన 16 సంవత్సరాల నుంచి మాత్రమే అస్పృశ్యతను ఒక పాపంగ భావించి అందుకు తగిన ప్రాయశ్చిత్త విధిని నిర్వర్తించుకోవలెనని నిర్ణయించుకొన్నాము అప్పటినుంచి మనలో ఉత్తమోత్తములయినవారు తామిదివరకు అణగదొక్కిన ప్రజల స్థితికి దిగిపోవడానికి నిశ్చయించుకొన్నారు ఇప్పుడు మన సోదరులను (హరిజనులను) పాపులుగా భావించడం లేదు మనమే పాపులమని తెలుసుకోగలిగినాము ఇంతకు పూర్వం మనం పాపులుగా భావించిన వారితో కలసి జీవించడానికి బుద్ధిపూర్వకంగా పూనుకొన్నాము ఇందుకు తార్కాణంగా వినోబావంటి బ్రాహ్మణులు వలంజాకర్ వంటి సహకార్యకర్తలు హరిజనులమధ్య నివసిస్తూ సమాజంలో అందరిలోకి తక్కువవారుగా భావింపబడేవారి పనులను నిర్వర్తిస్తున్నారు చిత్పావన్ బ్రాహ్మణ వంశానికి చెందిన శ్రీయుత అప్పా పట్వర్ధన్ వంటి వారు జైళ్లలో, హరిజనులతో సైతం చివర శ్రేణిలో ఉన్న ఖైదీలు చేసే పనిని తాము చేయడానికి అనుమతించవలెనని జైలు అధికారులను కోరుతూ నిరసన వ్రతం అవలంబించవలసిరావడమేకాక వారు విడుదలయిన తరవాత పాకీ పని చేసి జీవించగలమని ప్రమాణం చేయడం మరో ఉదాహరణ ఇటువంటి ఉదాహరణాలనేకం నేను పేర్కొనగలను అజ్ఞానులయిన గ్రామీణులుకూడా అనేక మంది తమ జీవితాలలో అస్పృశ్యతను పాటించటం మానివేసినారు

ఈ సందర్భంలో సుప్రసిద్ధ ఆంధ్రనాయకుడు దేశభక్త కొండ వెంకటప్పయ్య గారు ఇటీవలనే సబర్మతీ హరిజన ఆశ్రమంలో చేసిన ప్రకటను ఉదాహరించవలసి రావటం నాకు చాలా ఆనంద దాయకంగా ఉన్నది శ్రీ వెంకటప్పయ్యగారు వైష్ణవులలో ఉత్తమ వైష్ణవుడు పదిహేను సంవత్సరాల క్రితం-అంటే ఆయన సత్యాగ్రహోద్యమంలో చేరడానికి పూర్వం - అస్పృశ్యతన ఆయన అంటిపెట్టుకొని ఉండకపోయినప్పటికి విడనాడలేదు దానిలోని క్రూరమయిన అన్యాయం ఆయన తెలుసుకొని అనేక వేదికలపైన దానిని ఖండించి కూడా ఉండవచ్చు కాని ఆయనలో అస్పృశ్యతను గురించి మార్పు కొన్నిరోజుల కిందటి వరకు కూడా రాలేదు ఆయన సప్తతి జన్మదినంలో తమ ఇంటినుంచి బయలుదేరి రైలులో మూడో తరగతి బండిలో ప్రయాణం చేస్తూండగా టికెట్ కలెక్టర్ ఆయనను టికెట్ అడిగినారు ఆయన టికెట్ మరొక పెట్టెలో ఉన్న ఒక స్నేహితుని దగ్గర ఉన్నది ఆ సంగతి ఆయన టికెట్ కలెక్టర్‌కు చెప్పినారు కాని ఏ విధమయిన ఆడంబరంలేని సాధువువలె ఉన్న వెంకటప్పయ్యగారి మాట టికెట్ కలెక్టర్ విశ్వసించలేదు అందువల్ల ఆయన తన స్నేహితుని దగ్గరఉన్న టికెట్ తీసుకోడానికి రైలుదిగినారు ఆయన స్నేహితుని దగ్గరకు పోయేలోగా రైలు కూతవేసి పరుగెత్తింది వెంకటప్పయ్యగారు చేతిలో పైసాగానీ, పక్కచుట్టగానీ, తినడానికి తిండిగానీ లేకుండ రైలుప్లాటుఫారం మీద చలితో వణుకుతూ ఆ రాత్రంతా ఉండిపోవలసి వచ్చింది మరునాడు సాయంకాలానికి ఆయన హరిజన ఆశ్రమానికి చేరుకొన్నారు హరిజన ఆశ్రమంలో ప్రార్థన సమయంలో ఆయన ఇట్లా చెప్పినారు

"ఈనాడు హరిజన బాలికలు వండిన ఆహారం, నేను వారితో కలసి కూర్చుని భుజించటం జరిగింది ఇది నా అదృష్టమని భావిస్తున్నాను నా జీవితంలో ఇంతవరకు బుద్ధిపూర్వకంగా హరిజనల పక్కన కూర్చుండి భుజించలేదు నేనట్లా చేయటం ఇదే మొదటిసారి ఇంతకు పూర్వం నాకు తెలియకుండా నేను వారి పక్కన కూర్చుండి భుజించి ఉండవచ్చు కాని నేనెప్పుడో నిర్వర్తించవలసిన కర్తవ్యం ఈనాడు బుద్ధిపూర్వకంగా నిర్వర్తించడం జరిగింది దీనిని నేను నాలో పవిత్రమయిన మార్పు కలిగినట్లు సగర్వంగా భావిస్తున్నాను నేను నా సప్తతి జన్మదినంనాడు ఇంటిదగ్గర నుంచి బయలుదేరినాను నా అనారోగ్యం వల్ల నేనెంతోకాలం బ్రతక గలననే విశ్వాసం లేదు నా మృత్యువుకు పూర్వం నాలో ఈ అవసరమయిన మార్పు కలిగినందుకు నాకు సంతోషంగా ఉన్నది

హరిజనుల మాట అట్లా ఉండగా శూద్రుల చేతులలోనుంచి కూడా నేను నీరు తాగని రోజులున్నాయి నేనటువంటి సనాతన వైష్ణవుణ్ణి పది సంవత్సరాల క్రితం అస్పృశ్యతా నివారణ గురించిన సంభాషణలో నేను హరిజనులతో కలసి భోజనం చేయటానికి సంసిద్ధంగా లేనని గాంధీజీతో అన్నాను నా వంటి దక్షిణ భారత నాయకులు అట్లా అనే పక్షంలో మన జీవితంలో మనం స్వరాజ్యం పొందగలమనుకొనేటందుకు అవకాశం లేదని అన్నారాయన.

ఉత్తరాదివారే దక్షిణాదివారికి కూడా స్వరాజ్యం తెచ్చిపెడతారు అన్నాను నేను 'అట్లాకాదు ప్రతిరాష్ట్రం తన మోక్షాన్ని తాను సాధించుకోవలసి ఉంటుంది' అన్నారు గాంధీజీ ఈ సంభాషణమంతా విని శ్రీ శే విఠల్‌భాయి పటేలుగారు 'పూర్వాచార సంప్రదాయాలతో కరుడుగట్టిన ఈ ముసలివాళ్లతో వాదించి ఎందుకు కాలయాపన చేస్తారు' అన్నారు గాంధీజీతో 'నేను ఈయనను ఇంతమాత్రంతో విడిచిపెట్టదలచుకోలేదు నేను బతికి ఉండగానే ఈయనను మార్చగలనని ఆశిస్తున్నాను' అన్నారు గాంధీజీ మంచిదే ఈనాడు ఆయన ఆశించినట్లు జరిగింది మానసికంగా నేనీ సంస్కరణను పూర్తిగా విశ్వసిస్తూండిన వాణ్ణే కాని నా జీవితంలో ఎన్నడూ ఆచరణలో పెట్టలేదు

బహుశా పవిత్రమయిన ఈ పరివర్తనకు దేవుడు నన్ను సంసిద్ధం చేయవలెనని భావించి ఉండవచ్చు ఇక్కడికి నేను చేరుకొనేటంతవరకు పరిస్థితులను బట్టి ఉపవాసం కూడా చేయవలసి వచ్చింది పవిత్రీకరణకు ముందు ఉపవాసం చేయకుంటే అది సఫలం కానేరదు కనక అందుకనుగుణంగా ఉపవాసం చేయడం కూడా జరిగింది ఈనాడు నా సంతోషానికి మేరలేదు ఈనాటి ఉదంతం, మీరు నాపై వర్షింపజేసిన ప్రేమామృతం నే నెన్నటికీ విస్మరింపజాలను '

మేము దేశభక్త కొండ వేంకటప్పయ్యగారిలో కలిగిన మార్పునకు ఆయనను అభినందిస్తూ ఆయన వ్యక్తిగత జీవితంలో ఇది సుస్థిరంగా ఉండగలదని ఆశిస్తున్నాము ఆయన హరిజన సేవలో నిమగ్నులై భారతదేశంలో అస్పృశ్యత సంపూర్ణంగా మాసిపోయేటంతవరకు మనగలరని మనసారా కోరుకొంటున్నాము

మహాదేవదేశాయ్

## ఆంధ్ర నివేదిక

ఈ శీర్షిక కింద హరిజనాభ్యుదయం గురించి ఆంధ్రలో జరిగిన పని వివరింపబడింది

### విద్య

*విద్యార్థి వసతిగృహాలు, పాఠశాలలు* - హరిజన సేవాసంఘం ఇరవై రెండు విద్యార్థి వసతి గృహాలను నడుపుతున్నది వాటిలో రెండు బాలికలవి ఈ వసతి గృహాలలో 314 మంది హరిజన బాలురకు 38 మంది బాలికలకు ఉచిత భోజన వసతులు కల్పించబడినాయి ఈ నివేదికా సంవత్సరంలో ఈ వసతిగృహాలకు 9479 రూపాయలను సంఘంవారు వెచ్చించినారు

ఈ సంఘం ఎనిమిది పగటి పాఠశాలలను, పద్దెనిమిది రాత్రి పాఠశాలలను నడుపుతున్నది వీటికి 714 మంది బాలబాలికలు హాజరవుతున్నారు డబ్బు లేనందువల్లకానీ, సరిగా పని జరగనందువల్లకానీ పదమూడు రాత్రి పాఠశాలలు మూతపడినాయి పెదకొత్తపల్లి, గుంటూరు వసతి గృహాలకు పారిశ్రామిక విభాగాలు ఏర్పాటు అయినాయి. వాటిలో నలుగురు హరిజన బాలురు కుట్టుపనినీ,

మరి నలుగురు నేత పనినీ నేర్చుకొంటున్నారు ఈ పాఠశాలల కోసం సంఘం 3,516 రూపాయలు వెచ్చించింది దీనికి తోడు మరి నాలుగు ఇతర సంస్థలకు కూడా ఈ సంఘం విరాళమిచ్చింది

*విద్యార్థి వేతనాలు* - ఈ నివేదికా సంవత్సరంలో ఈ సంఘం 153 విద్యార్థి వేతనాలను నూతనంగా ఇచ్చింది వాటిలో రెండు ప్రాథమిక విద్యకు, నూట ఇరవై మూడు సెకండరీ విద్యకు, మూడు కళాశాల విద్యకు, ఇరవై రెండు సాంకేతిక విద్యకు, (ఇంజనీరింగ్, కుట్టుపని, వైద్యం, తోళ్లు పూనడం మొదలగువాటికి), మూడు మంత్రసానుల శిక్షణకు వీటన్నిటికీ విద్యార్థి వేతనాల కింద 3,050 రూపాయలు ఖర్చయింది అవకాశమున్నంతవరకు సాంకేతిక విద్యపట్ల ప్రత్యేకాభిమానం చూపబడుతూన్నది స్థానిక సంస్థల కింద జిల్లా బోర్డుల కింద ఉన్న పాఠశాలలలోని హరిజన విద్యార్థులు జీతాలు చెల్లించవలసిన అవసరం లేకుండడానికి ప్రయత్నాలు జరిగినాయి నెల్లూరు, విశాఖపట్నం, ఒంగోలు, గుంటూరు జిల్లా బోర్డులలోను, భీమునిపట్నం, బరహంపురం మునిసిపాలిటీలలోను హరిజన విద్యార్థులు జీతాలు చెల్లించవలసిన అవసరం లేకుండా చేయడం జరిగింది 1636 రూపాయల విలువగల పుస్తకాలను పలకలను ఈ సంఘం హరిజన విద్యార్థులకు సప్లయ్ చేసింది

*ఇతరాలు* - ఈ సంఘం మూడు సహకార పరపతి సంఘాలను, చెప్పులు కుట్టి అమ్మే ఒక చిన్న తరగతి సహకార సంఘాన్ని, రెండు చిల్లర వస్తువుల దుకాణాలను నడుపుతున్నది ఈ దుకాణాలలో హరిజనులకు చౌకగా సరుకులు లభించగలవు అగ్ని ప్రమాదంవల్ల నష్టపడినవారికి 189 రూపాయల నగదు ఈ సంఘం విరాళంగా ఇచ్చింది హరిజనులకు 588 రూపాయల విలువగల బట్టలు, సబ్బులు మొదలయిన వస్తువులను పంచిపెట్టింది

హరిజనవాడలలోని నాలుగు నూతులను మరమ్మతు చేయడమేగాక మరి నాలుగు నూతులను కొత్తగా కట్టించింది

ఈ సంవత్సరంలో విరాళాల ద్వారా సంఘానికి లభించిన మొత్తం 6,108 రూపాయలు కేంద్ర సంస్థనుంచి వచ్చిన గ్రాంటు 15,229 రూపాయలు హరిజన సంక్షేమ కార్యకలాపాలకు 20,470 రూపాయలు, ప్రచారానికి 335 రూపాయలు, పరిపాలనా వ్యవహారాలకు 2,425 రూపాయలు వ్యయమయినాయి. ఇవి గాక 1216 రూపాయలు నూతులకు ఖర్చయినాయి

*విద్యార్థి వేతనాలవారి జాబితా*

ఉన్నత విద్యకుగాను గాంధీజీ విద్యార్థి వేతనాలు

ఇంతకు పూర్వం ఇస్తూన్న నెలవారి వేతనాల 663 రూపాయల పునరుద్ధరించటంతోపాటు కొత్తగా 1936-37 కు (1 జూలై 1936 మొదలు 1937 జూన్ 30 వరకు) హరిజన విద్యార్థులకు హరిజన సేవక్ సంఘంవారు నెలకు 307 రూపాయలు విద్యార్థి వేతనాలను మంజూరు చేసినారు

| పేరు | చదివే పరీక్ష | నెల ఒక్కొంటికి రూపాయలు |
|---|---|---|
| వడ్డాది వీరరాజు | I A | 10 |
| జె మోహన్ రావు | M A & Law | 15 |
| పి వెంకటస్వామి | I A | 10 |
| ఆర్ భీమన్న | M A & Law | 15 |

1936 లో అఖిలభారత గ్రామోద్యోగ సంఘంవారి అనుమతి పొందిన వర్తకులు

| పేరు, చిరునామా | అనుమతి పత్రమును పొందిన వస్తువు |
|---|---|
| 1 గుంటూరు జిల్లా దంపుడు బియ్యపు సంఘం గుంటూరు, గుంటూరు జిల్లా | ముడిబియ్యము (Unpolished Rice) |
| 2. గుంటూరుజిల్లా గ్రామసౌభాగ్య సంఘం, గుంటూరు | సహజంగా చనిపోయిన జంతువుల చర్మంతో చేసిన చెప్పులు, గానుగ ఆడిన నూనె, చెరుకు బెల్లం, దంపుడు ముడిబియ్యం, ఈత బెల్లం పటిక బెల్లం, చేయి తిరుగలితో విసిరిన పిండి, బిస్కెట్లు, చేతితో తయారుచేసిన గుండీలు, కల్తీలేని ఆవు నెయ్యి |

'హరిజన్'

## గాంధీజీకి స్వాగతము - నిడుబ్రోలు స్టేషన్

1936 మే 9 ఉదయం 9 గంటలకు గాంధీమహాత్ముని దర్శనార్థమై నిడుబ్రోలు స్టేషన్‌లో వందలకొద్దీ ప్రజలు వేచి ఉన్నారు గాంధీజీ ప్రయాణం చేస్తూన్న ఎక్స్‌ప్రెస్ బండి కంటబడిన దగ్గర నుంచి ప్రజల ఉత్సాహానికి మేరలేక పోయింది. మహాత్మాగాంధీకిజై అనే కేకలు మిన్నుముట్టినాయి బండి స్టేషన్‌లో ఆగగానే ప్రజలు గాంధీజీ ఉన్నచోటికి వెళ్ళి మూగినారు గాంధీజీ కిటికీనుంచి తొంగిచూస్తూ విరాళాలర్పించ వలసిందని కోరగా అనేకమంది ఆయనకు ధనం సమర్పించినారు ఆచార్య రంగా బెజవాడనుంచి గాంధీజీతో కలసి వచ్చినారు నిడుబ్రోలు స్టేషన్‌లో శ్రీరంగా గాంధీజీకి రైతాంగ విద్యాలయ నివేదికను సమర్పించినారు గాంధీజీ ఆ విద్యాలయాన్ని ఆశీర్వదించినారు గాంధీజీకి అక్కడ స్వాగత మిచ్చిన వారిలో శ్రీమతి భారతీదేవిరంగా, గోగినేని లక్ష్మినారాయణ, పొటిబండ్ల రంగనాయకులు, లావు అంకమ్మగార్లు ఉన్నారు జయ జయ

ధ్వానాల మధ్య రైలు కదిలింది

మద్రాసుకు గాంధీజీ రాక

1936 జూన్ 19వ, తేది ఉదయం గాంధీజీ బెంగుళూరు నుంచి వార్ధాకు పోతూ రైలులో మద్రాసు చేరినారు వారితో కస్తూరిబా గాంధీ, త్రిజీలాల్ నెహ్రూసతి, మహాదేవదేశాయ్ మొదలయిన వారున్నారు జనసమ్మర్దంనుంచి తప్పించుకోనేటందుకు బేసిన్ బ్రిడ్జిలో దిగినారు అక్కడకూడా అనేకమంది కాంగ్రెస్ వాదులు వారికి స్వాగతం చెప్పినారు వెంటనే గాంధీజీ మోటారులో మాంబళం పోయి అక్కడ తయారవుతున్న హిందీ ప్రచారభవనం దర్శించినారు అటుతరువాత తిరువళిక్కేణి హైరోడ్డులోని కళ్యాణమండపానికిపోయి అక్కడనుంచి శ్రీ యస్ శ్రీనివాసయ్యంగారి ఇంటికి వెళ్ళి వారితో 10 నిమిషాల సేపు మాట్లాడి తిరిగి వార్ధాకు వెళ్ళడానికి బేసిన్ బ్రిడ్జ్ స్టేషన్‌కు వెళ్ళినారు అక్కడ ఒక అరగంటసేపు రాజగోపాలాచారితో ఏకాంతంగా మాట్లాడినారు పత్రికా ప్రతినిధులతో సంభాషించడానికి ఆయన నిరాకరించినారు గాంధీజీ ఆరోగ్యం అభివృద్ధి అయినట్లు, నందిపర్వతాలలోను, బెంగుళూరులోను సుఖంగా కాలక్షేపం చేసినట్లు అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధికి చెప్పినారు

శ్రీ రాజగోపాలాచారిగారు బెంగుళూరునుంచి మద్రాసుకు గాంధీజీతో కలిసి వచ్చినారు

## మహాత్ముని రాక

### బెజవాడ

1936 జూన్ 18 సాయంకాలం మహాత్మాగాంధి మద్రాసునుంచి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో వార్ధా వెడతారని తెలిసి బెజవాడ రైల్వేస్టేషన్‌లో ఆ సాయంకాలం 3 గంటలనుంచి జనం వేచి ఉన్నారు సాయంకాలం 5 గంటలకు రావలసిన రైలు 6 గంటలకు వచ్చింది రైలు ప్లాటుఫారమంతా జనంతో క్రిక్కిరిసి పోయింది గాంధిమహాత్మునితో మాతా కస్తూరిబాయి, త్రిజీలాల్ నెహ్రూ సతి, మహాదేవదేశాయ్, కన్యాలాల్ గాంధీ, మిస్ మీరాబేన్ గారలున్నారు.

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, గొల్లపూడి సీతారామశాస్త్రి, వేముల కూర్మయ్యగార్లు కూడా ఆ రైలులో ఉన్నారు బెజవాడ స్టేషన్‌కు రాగానే రైలుపెట్టె గేటులో నిలబడి "డబ్బు ఇవ్వండి" అని తెలుగులో అడిగినారు. ఎవరికి తోచింది వారివ్వగా సుమారు 100 రూపాయలయింది.

గోష్ఠి పత్రికా కార్యాలయంవారు గోష్ఠి పత్రికలు రెండు ఇంగ్లీష్ ప్రతులను, కీ శే ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి ఫోటోలు రెండు మహాత్మునికి సమర్పించినారు గోపాలకృష్ణయ్యగారి ఫోటో ఒకటి గాంధీజీ

వేలం వేస్తుండగా శ్రీ గొల్లపూడి సూర్యప్రకాశరావుగారు ఆ పటం మీద మహాత్ముడు సంతకంచేసి ఇస్తే 5 రూపాయలిస్తానన్నారు

"నా సంతకానికి నేను 5 రూపాయలు పుచ్చుకొంటాను ఫోటో కేమిస్తా"వని గాంధిజీ అన్నారు

"తమచిత్తం" అన్నారు ప్రకాశరావుగారు

అంతట 6 రూపాయలు తీసుకొని తన సంతకంచేసి గోపాలకృష్ణయ్య గారి ఫోటోను గాంధీజీ సూర్యప్రకాశరావుగారికి ఇచ్చినారు

తరవాత ప్రజల కోరికపైన గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"మీరు స్వరాజ్యం రావలెనని ఉన్నట్లయితే మొదట అంటుదోషాన్ని నివారించవలె ఖద్దరు ఉత్పత్తిచేసి విధిగా దానిని ధరించవలె తాగుడు మాని వేయవలె ఇవి జరిగితేనేగాని మనకు దౌర్జన్య రహితమయిన స్వరాజ్యంరాదు ఇవి లేకుండావచ్చే స్వరాజ్యం దౌర్జన్య సహితమయినది, అది నిలువనేరదు హిందీని నేర్చవలసిన ఆవశ్యకత ఉన్నది హిందూ మహ్మదీయులు సఖ్యంగా మెలగవలె ఈ విషయాలే ఈ బెజవాడలోనే 1921లో కాంగ్రెస్ వారు నిర్ణయించినవి ఇవి పాతపడినందుకు నిరుపయోగం కాలేదు అనుభవంవల్ల ఈ కార్యక్రమానికి బలం చేకూరింది' అనిచెప్పి తరవాత తెలుగులో "డబ్బు తెండి" అని అడిగినారు హరిజన నిధికి చాలా మంది విరాళాలిచ్చినారు తరవాత మహాత్ముడు "గారు" అంటే ఏమిటి, 'గాడు' అంటే ఏమిటి? ఇక్కడ హరిజనులను ఇతరులు ఎట్లా పిలుస్తారు?" అని శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారిని అడిగినారు ఆయన 'గారు' గౌరవ పదమని హిందీలో 'జీ' అనే పదానికి సమాన మయినదనీ, 'గాడు' నీచవాచకమని, మాల మాదిగల విషయంలో ఇతరులు ఆ పదాన్ని వినియోగిస్తారనీ చెప్పినారు

ఇంతలో రైలు కదిలి వెళ్ళిపోయింది గాంధీజీ ఉపన్యాసం శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు తెలుగులోకి అనువదించినారు

**చీరాల**

జూన్ 12న గాంధీజీ, ఆయన బృందం గ్రాండ్ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాస్‌నుంచి వార్ధా పోతున్నారని తెలిసి చీరాల రైల్వే స్టేషన్ ప్లాటుఫారం మీద జనం గుమిగూడినారు రైలు ఒక గంట ఆలస్యంగా వచ్చింది గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ చీరాల ప్లాట్‌ఫారం పైకి రాగానే 'గాంధీజీకిజై' అనే నినాదాలు మిన్ను ముట్టినాయి, గాంధీజీ హరిజన నిధికి విరాళాలీయమని చేయి చాపగానే అనేకమంది ఆయనకు కానుకలు సమర్పించినారు కొంత మందికి గాంధీ దర్శనం కానేలేదు వారికి ఆశాభంగం కలిగింది

**బాపట్ల**

గాంధీజీ ఉన్న గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ బాపట్లలో ఆగగానే ప్లాట్

ఫారం మీద క్రిక్కిరిసి చేరిన జనం ఆయన దర్శనం చేసుకొన్నారు ప్లాట్ ఫారం పైన సేవాసమితి కార్యదర్శి భట్టిప్రోలు మాణిక్యాలరావుగారు మరికొంతమంది సేవాసమితి సభ్యులు, శ్రీ మల్లాది యజ్ఞ నారాయణగారు, మాధవపెద్ది కాళిదాసుగారు, బాపట్ల మునిసిపల్ చేర్మెన్ రామారావుగారు ఉన్నారు

మల్లాది యజ్ఞనారాయణగారు మహాత్మునకు ఖద్దరు దండవేసి అప్పటి కప్పుడు వసూలయిన పైకం విరాళంగా ఇచ్చినారు రైలు కదలిపోయింది

**హరిజనులు - ఎన్నికలు**

శ్రీ వేముల కూర్మయ్యగారు ఎన్నికలను గురించి ప్రస్తావిస్తూ గాంధీజీని "మేమందరం ఐకమత్యంతో ఒక పక్షంగా లేనప్పుడు ఇతరుల సహాయం లేకుండా వ్యక్తులుగాగానీ, వర్గాలుగాగానీ స్వతంత్రించి వ్యవహరించజాలనప్పుడు మేమేమి చేయవలసి ఉంటుంది?" అని ప్రశ్నించినారు

"అట్లా అయితే ఏ పక్షంలో ఉంటే మీకెక్కువ లాభదాయక మవుతుందో ఆ పక్షంలో మీరు చేరవచ్చు అటువంటి పక్షం కాంగ్రెస్ పక్షమే అని నా అభిప్రాయము అస్పృశ్యతను మొదలంట పెరికివేయడానికి కాంగ్రెస్ పూనుకొన్నది అస్పృశ్యతా నివారణ కార్యంలో కాంగ్రెస్ వారెందరో పనిచేస్తున్నారు కాంగ్రెస్ స్పష్టంగా నిర్వచించిన సంపూర్ణ స్వాతంత్ర్య గమ్యస్థానం చేరుకొనేటందుకు శాసనోల్లంఘన తప్పనిసరైతే మీరు శాసనసభా బహిష్కారానికి గానీ, శాసనోల్లంఘనకు గానీ పూనుకోనక్కరలేదు హరిజనులు విస్తారంగా ఈ సంరంభంలో పాల్గొజాలనందునే నేనీ సలహానిస్తున్నా కొందరు సనాతన హిందూ మతమనే పేరుతో మీకు సమాన ప్రతిపత్తిని నిరాకరిస్తున్నారు ఆ సమాన ప్రతిపత్తికోసమే మీరి ఉత్తరక్షణం కృషి చేయవలసి ఉన్నది

అదే మీ ప్రస్తుత గమ్యస్థానము మీ కొక్కరికే ఈ కష్టం ఉన్నట్లు మాట్లాడుతున్నారు హరిజనులందరూ మీవలె లేరు విద్యావిషయంలో, గ్రహణ శక్తిలో మీకు వారికి హస్తిమశకాంతరమున్నది నేను మాట్లాడవలసి వస్తే శాసనసభలలో హరిజన సభ్యులు మాట్లాడే రీతిని విద్యాగంధంలేని హరిజన సామాన్యం పురస్కరించుకొని మాట్లాడవలసి ఉంటుంది నేను మొట్ట మొదట శాసనోల్లంఘనం ప్రారంభించినప్పుడు కూడా హరిజనులకు నే నిచ్చిన సలహా ఇదియే ఆశ్రమవాసులు, హరిజనులు ఆశ్రమం వీడి పోకూడదని సలహా ఇచ్చినాను" అని గాంధీజీ కూర్మయ్యగారికి జవాబు చెప్పినారు

హరిజన్
4-7-1936

**మహాత్ముని 67 వ జన్మదినోత్సవాలు**

అఖిలభారత జాతీయ మహాసభాధ్యక్షుని ఆదేశానుసారం ఆంధ్రదేశంలో

1936 అక్టోబరు 2వ తేదిన గాంధీమహాత్ముని 67 వ జన్మదినోత్సవాలు అనేక చోట్ల జరిగినాయి

ఆంధ్రరాష్ట్ర మహిళా సంఘ కార్యదర్శిని శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీ బాయమ్మగారు 1936 సెప్టెంబరు 24 నుంచి అక్టోబరు 2వ తేదివరకు హరిజన దినోత్సవాలను, గాంధీ జయంత్యుత్సవాలను జరపవలసిందనీ, ఆ రోజులలో ఖద్దరు ఉత్పత్తి విక్రయాలను అభివృద్ధి చేయవలెననీ ఆంధ్రదేశ స్త్రీలకు విజ్ఞప్తి చేసినారు

## మద్రాస్ లో

1936 అక్టోబరు 2న గాంధీ మహాత్ముని 67వ జయంత్యుత్సవం మద్రాస్ లోని అన్ని డివిజన్ లలోను అతివైభవంగా జరిగింది మసీదుల్లోను, ఆలయాల్లోను ప్రార్థనలు జరిగినాయి చింతాద్రిపేట అరుణాచలనాయకన్ వీధిలో "కాంగ్రెస్ విల్లా" భవనంనుంచి వందలకొద్దీ ప్రజలు నగర సంకీర్తన చేసినారు కోన్ పేట వెంకటాద్రి నాయకర్ వీధిలోను, ముత్యాలపేటలోను బీదలకు అన్నదానం జరిగింది

హిందీ ప్రచారక సభవారి యాజమాన్యంలో మహాత్ముని జయంత్యుత్సవం శోభాయమానంగా జరిగింది రాయపేటలోని కాంగ్రెస్ భవనంలో జరిగిన సభలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు సంజీవకామత్ గారు గాంధీ మహాత్ముని సేవా త్యాగాలను గురించి ఉపన్యసించినారు సాధుపుర మహాజన సంఘంవారు పాఠశాల బాలురకు మిఠాయి పంచిపెట్టినారు సాయంత్రం బీద లకు అన్నదానం జరిగింది చాకలిపేట కాంగ్రెస్ సభవారి యాజమాన్యంలో సంజీవరాయని కోవెల వీధిలో ఉన్న ఆలయంలో గాంధీ మహాత్ముని ఆయు రారోగ్యాలకు ప్రార్థనలు జరిగినాయి

పెరంబూరులోని అరుంధతీయ పురంలో హరిజన సేవక్ సంఘంవారి యాజమాన్యంలో నిర్వహించబడుతూన్న బాలికల హాస్టల్ లో భజనలు జరిగి నాయి హరిజన సేవక్ సంఘ కార్యదర్శి గాంధీ మహాత్ముని పవిత్ర చరిత్ర గురించి గంభీరోపన్యాసము చేసినారు అనేకమంది స్త్రీలు కూడా సభకు హాజ రయినారు మహాత్ముడు హరిజనులకు చేసిన సేవను గురించి వెంకటసుబ్బయ్య గారు విపులంగా తెలియజెప్పినారు

వినాయక ఆలయంవద్ద సభలోకూడా వెంకటసుబ్బయ్యగారు గాంధీ మహాత్ముని నిర్మాణ కార్యక్రమం గురించి అస్పృశ్యతా నివారణోద్యమం గురించి ఉపన్యసించినారు తరవాత జి చెల్వపతిచెట్టిగారు ఉపన్యసిస్తూ తాము ఐరోపా ఖండానికి పోయినప్పుడు అక్కడివారు గాంధీ మహాత్ముని ఆరోగ్యం గురించి కుశల ప్రశ్నలు అడిగినారనీ, జనీవాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సభా ప్రతినిధులు కూడా అట్లాగే గాంధీజీని గురించి అనేక విషయాలు అడిగి తెలుసుకొన్నారనీ చెప్పినారు

కోడంబాకం హరిజన పారిశ్రామిక పాఠశాలలో జరిగిన జయంత్యుత్సవ సందర్భంలో భజనలతో కార్యక్రమం ప్రారంభమయింది భజనలో గోకులం కాలనీ (కృష్ణాపురం మైలాపూర్) హరిజనులు, శంకర్ నారాయణ అయ్యర్, శ్రీమతులు అమ్ముజమ్మాళ్, జ్ఞానమ్మాళ్, మందాకినీబాయి మొదలయిన వాళ్లు పాల్గొన్నారు వారు పాఠశాలకు చేరువగాఉన్న ఏగద రాజంపేట పులిమూరు నందున్న హరిజన నివాస గృహాలను సందర్శించి ఆయా ప్రాంతాలు పరిశుభ్రంగా ఉండేట్లు శ్రద్ధ తీసుకొన్నారు ఆరోగ్య నియమాలను గురించి అక్కడివారికి నచ్చచెప్పినారు

ఉదయం 8½ గంటలకు కె యస్ వెంకటరమణిగారు జాతీయ పతాకారోహణ చేసి దాని ప్రాముఖ్యం గురించి విపులంగా ఉపన్యసించినారు పారిశ్రామిక పాఠశాలలోని బాలబాలికలకు 300 మందికి పాఠశాలాధికారులు అభ్యంగనస్నానాలు చేయించినారు హరిజన బాలురు పెద్దలు మొత్తం 800 మందికి భోజనాలు ఏర్పాట్లు కూడా చేసినారు

సాయంకాలం హరిజన బాలబాలికలచేత ఆటబాడించి గెలుపొందినవారికి ప్రొఫెసర్ యస్ కె యజ్ఞనారాయణ అయ్యర్ (పచ్చయప్ప కళాశాల) గారిచే బహుమతులు పంచిపెట్టించినారు తరవాత బహిరంగసభ జరిగింది అందులో కె యస్ వెంకటరమణిగారు వట్టి మాటలతో ప్రయోజనంలేదనీ అందుకు తగిన కృషి చేసినప్పుడే ఫలితం కలుగుతుందని ప్రబోధించినారు, మానవుడు ప్రయత్నం చేసినప్పుడే దైవంకూడ తోడ్పడగలడని హరిజన బాలబాలికలకు నచ్చచెప్పి హరిజనులు కూడా సవర్ణులతోపాటు సమాన ప్రతిపత్తిని పొందవలెనంటే వారు తమ స్వశక్తిపైన ఆధారపడటం నేర్చుకోవలెనని నటరాజమూర్తిగారు కొన్ని ఉదాహరణలను చూపుతూ ఉపన్యసించినారు

హిందీ ప్రచార వారోత్సవాల సందర్భంలో అక్టోబరు 2న కాంగ్రెస్ భవనంలో జరిగిన సభకు శ్రీ కా నాగేశ్వరరావు పంతులుగారు అధ్యక్షత వహించి గాంధీమహాత్ముడు కర్మయోగి అనీ, లోకకళ్యాణంకోసం జన్మించిన పుణ్యపురుషుడని అంటూ, హిందీ ప్రచారం పట్ల గాంధీజీ కృషిని విశదీకరించినారు ఆ సభలో భాష్యంగారు, ఆర్ చిన్నస్వామయ్యర్, కర్ణాటక రాష్ట్ర హిందీ ప్రచార కార్యదర్శి సిద్ధాంత పంతులుగారలు ఉపన్యసించినారు

## రేపల్లె

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో అక్టోబరు 2 న శ్రీ తటవర్తి రామమోహన్‌రావుగారు 300 మంది బీదలకు అన్నదానం చేసినారు

మామిళ్లపల్లిలో గాంధీమహాత్ముని పటానికి మేళతాళాలతో ఊరేగింపు జరిగింది,

**కానుమోలు**

శ్రీ వేలూరి యజ్ఞనారాయణ, నూకల రామస్వామి, నండూరి తిరు వెంగళాచార్యులు, అద్దంకి శ్రీరంగాచార్యులు, అన్నాకూరి వేంకట కృష్ణమా చార్యులు, తరపల్లి సుబ్బయ్య మొదలయిన పెద్దలు జాతీయ గీతాలతో, గాంధీ మహాత్ముని చిత్రపటం గ్రామమంతా ఊరేగించినారు అక్టోబరు 2 నుంచి వారం రోజులు పీరవల్లి, తేలప్రోలు, ఆత్కూరు, అవటపల్లి గ్రామాదులలో తిరిగి ఖద్దరు విక్రయించినారు

**కుప్పం**

అక్టోబరు 2 ఉదయం ఫిర్కా కాంగ్రెస్, హిందీ ప్రచార సంఘాలవారు శ్రీ తిరుపతి గంగమాంబ దేవాలయ ఆవరణలో సమావేశమయినారు హిందీ విద్యార్థులు దైవప్రార్థన చేసినారు శ్రీ నట్లపల్లి మునుస్వామి చెట్టిగారు జాతీయ పతాకారోహణ చేసినారు ఫిర్కా కాంగ్రెస్ సంఘ కార్యదర్శి డి రామబ్రహ్మంగారు జాతీయ పతాక ప్రాముఖ్యం వివరించి చెప్పినారు తరవాత సోమేశ్వర ఆలయంలోని నూతన పుష్పక విమానంలో గాంధీజీ ఛాయా పటం ఉంచి పుర వీధులద్వారా మంగళవాద్యాలతో, హిందీ జాతీయ గీతా లతో ఊరేగింపు చేసినారు పురస్త్రీలు ఫలపుష్పాలతో "గాంధీజీకి" కర్పూర హారతులు సమర్పించినారు

సాయంకాలం బహిరంగసభలో గుండురావుగారు అధ్యక్షత వహించి గాంధీగారి దేశసేవను గురించి ఉపన్యసించినారు గాంధీజీ హిందీ భాషాభ్యున్నతికి చేసిన కృషిని గురించి రామశేషయ్యర్‌గారు, డి. రామబ్రహ్మంగారు ఉపన్య సించినారు

**తెనాలి**

అక్టోబరు 2 సాయంకాలం శ్రీ శరణు రామస్వామి గారి అధ్యక్షత కింద బహిరంగ సభ జరిగింది శ్రీ చింతంనేని భావయ్య చౌదరి, మహమ్మద్ ఇస్మా యిల్ సాహెబ్, బెజవాడ హరిజన కార్యదర్శి నక్కా వెంకయ్య, పండిత వ్రజనందన శర్మ, వేదాంతం లక్ష్మీకాంత కవి, ముత్తేవి మాధవాచార్యులు, రాచకూళ్ల చెంచయ్యగార్లు గాంధీ మహాత్ముని నిర్మాణ కార్యక్రమం, అస్పృ శ్యతా నివారణ, హిందీ భాషా ప్రచారాలను గురించి విపులంగా ఉపన్యసించి నారు

**తిరుమల**

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో తిరుమల కాంగ్రెస్ ఆఫీస్ వద్ద నూరు మంది పేదలకు బియ్యం పంచిపెట్టడం జరిగింది సాయంకాలం గాంధీజీ పటంతో ఊరేగింపు అయిన తరవాత, జరిగిన బహిరంగ సభలో చిత్తూరు రాంసింగ్,

వి యస్ కందస్వామి మొదలియార్, హెచ్ నరసింహం, ఏ రంగన్నగార్లు గాంధీమహాత్ముని జీవితం గురించి ఉపన్యసించినారు

**కొణకంచి**

కొణకంచి, బండిపాలెం గ్రామాలలో గాంధీ జన్మదినోత్సవం ఆనంద దాయకంగా జరిగింది అక్టోబరు 2 ఉదయం బండిపాలెం గ్రామస్థులు గాంధీ మహాత్ముని చిత్ర పటం ఊరేగించినారు బహిరంగ సభలో అనుముల రామ గోవింద శర్మగారు మహాత్ముని జీవితం గురించి ఉపన్యసించిన తరవాత ఫల హారాలు పంచిపెట్టబడినాయి సాయంత్రం కొణకంచి గ్రామంలో బహిరంగసభ జరిగింది బుచ్చిరామ శేషయ్య శ్రేష్ఠిగారు అధ్యక్షత వహించినారు అనుముల రామగోవిందశర్మగారు, కొణకంచి చక్రధరరావుగారు గాంధీజీ నిర్మాణ కార్య క్రమం గురించి విపులంగా ఉపన్యసించినారు

**మంగళగిరి**

అ భా చ సంఘ ఖాదీ భాండారు వారు, మంగళగిరి పట్టణ కాంగ్రెస్ వారు గాంధీజీ, భారతమాత, జాతీయ నాయకుల పటాలను ఊరేగించి సాయం కాలం 8 గంటలకు ప్రగడ బాలనాగుగారి అధ్యక్షత కింద బహిరంగ సభ చేసి నారు శ్రీ వూరే సుబ్బారావుగారు మహాత్ముని జీవితం గురించి ఉపన్యసించి నారు మధ్యాహ్నం హరిజనులకు అన్నదానం జరిగింది ఆటల పోటీ పందెంలో గెలిచిన హరిజన బాలురకు ధర్మవరంనుంచి వచ్చిన శ్రీ హట్టి శంకరరావుగారు బహుమతులు పంచి పెట్టినారు

**పలమనేరు (చిత్తూరుజిల్లా)**

బ్యాండు మేళాలతో గాంధీమహాత్ముని ఛాయపటాన్ని ఊరేగింపు చేసినారు చిత్తూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ సహాయకార్యదర్శి డి శ్రీనివాసయ్యం గారి యాజమాన్యంలో బహిరంగసభ జరిగింది అక్టోబరు 8న బీదలకు అన్నదానం జరిగింది

**బెజవాడ**

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో బెజవాడ నగర కాంగ్రెస్ సంఘం వారి యాజమాన్యంలో అక్టోబరు 2 ఉదయం ఆంధ్రరత్న భవనం పైన శ్రీ కాకుమాను లక్ష్మయ్య చౌదరిగారు జాతీయపతాకారోహణం చేసినారు. మధ్యాహ్నం 3 గంటలకు మేళతాళాలతో మహాత్ముని చిత్రపటం మోటారు కారులో ఊరేగించినారు పురస్త్రీలు గాంధీజీ చిత్రపటానికి హారతులు సమర్పించినారు మనికొండ వెంకటనరసింహంగారు మహాత్ముని పటానికి ఖద్దరు బట్టలు బహూకరించినారు.

సాయంకాలం 6 గంటలకుగాంధీపార్కులో శ్రీ గంపలగూడెం కుమారరాజా శ్రీ కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దుర్ గారి అధ్యక్షత కింద బహిరంగసభ జరిగింది శ్రీ బాలచంద్రభట్టే గారు దైవప్రార్థన చేసినారు శ్రీకొప్పరపు సోదరకవులు మహాత్మగాంధీగారి జీవితంను గురించి ఆశువుగా పద్యాలుచెప్పినారు శ్రీయుతులు వి ఎల్ శాస్త్రి, వడ్లపాలెం నరసింహారావు, వేదాంతం పూర్ణానందం, ఇంటూరి వెంకటేశ్వరరావు, వంకా సూరిశాస్త్రి, కొన్నవిస్సుల కుటుంబ సుబ్బారావు, వేముల కూర్మయ్యగార్లు మహాత్ముని జీవితం గురించి విపులంగ ఉపన్యసించినారు చివరికి గాదిరాజు వెంకటేశ్వరరావుగారి వందనాలతో సభముగిసింది

## కుముదవల్లి

(శ్రీ) వీరేశలింగం కవి సమాజంవారు అక్టోబరు 2 ఉదయం మహాత్ముని చిత్రపటాన్ని జాతీయ గీతాలతో, నగర సంకీర్తనలతో ఊరేగించినారు సాయంత్రం జరిగిన బహిరంగ సభలో భాగవతుల నరసింహశాస్త్రి గాంధీ మహాత్ముని గురించి ఉపన్యసించినారు భూపతిరాజు రామమూర్తిరాజు, తిరుపతి రాజుగార్లు గాంధీమహాత్ముని ఆత్మకథలోని ముఖ్యవిషయం గురించి ముచ్చటించినారు మురళీగానాలతో, మధురాహారాలతో సభ ముగిసింది

## సీతానగరం ఫిర్కా

అక్టోబరు 6 సాయంకాలం 7 గంటలకు సీతానగరం చతుష్పథంనుంచి గాంధీ పటము ఊరేగింపు బయలుదేరి సీతానగరం, కొండేపూడి గ్రామాలనుంచి రాజుపాలెం తూర్పు వీధిలోని రామమందిరానికి చేరింది అక్కడ సుమారు వేయిమంది గ్రామస్థులు సమావేశమయి ఉన్నారు ఆ సభకు వడ్లమూడి చిన సుబ్బరాజుగారు అధ్యక్షత వహించినారు గాదేపల్లి సూర్యనారాయణ, తేజోమూర్తుల వెంకట్రావుగార్లు గాంధీజీని గురించి ఉపన్యసించినారు అక్టోబరు 6న సీతానగరంలో జరిగిన నూలు వడుకు పోటీలో గెలిచిన వారికి ఈ సభలో ఖద్దరు కండువాలు బహూకరించడం జరిగింది

## ఏలూరు

మహాత్మా గాంధీ జన్మదినోత్సవం ఏలూరు పట్టణ కాంగ్రెస్, హిందీ ప్రేమీ మండలుల పక్షాన అతివైభవంగా జరిగింది

గాంధీ జాతీయ విద్యాలయంలో విద్యాలయ ప్రధానాచార్యులు (శ్రీ) వేమూరి రామకృష్ణారావుగారు జాతీయ పతాకాన్ని ఆరోహణగావించి దాని ప్రాముఖ్యం గురించి ప్రసంగించినారు. సాయంత్రం చిత్రపటం ఏలూరు పట్టణంలో ఊరేగించిన తరవాత గాంధీ విద్యాలయంలో శ్రీ [illegible] కజిన్సనతి [illegible] అధ్యక్షత కింద గొప్ప బహిరంగ సభ జరిగింది. కజిన్సనతిగా[illegible] ఇట్లా [illegible]

నారు "నేను మీలో ఒకతెనై ఉన్నాను అందువల్ల నేను ఇతర జాతికి చెంది ఉన్నప్పటికీ నేను నా మాతృదేశంలో ఉన్నట్లే భావిస్తున్నాను మానవుడు అనేక జన్మలెత్తుతూండడం మీకు తెలిసిన విషయమే కాని అతడెంతో పుణ్య పురుషుడయితేనే తప్ప, బుద్ధుడు, క్రీస్తు, రామానుజుడు, గాంధీజీ మొదలయిన మహాపురుషుల అవతార సమయంలో తాను కూడా ఈ లోకంలో జీవించి ఉండటం తటస్థించింది గాంధీజీ వంటి లోకోత్తర పురుషులు కొన్ని వేల ఏళ్ళ కొకసారి జన్మిస్తుంటారు మనమందరం వెనక ఏదో పుణ్యకర్మచేసి నందువల్లనే మహాత్ముని జీవిత సమయంలో మన మిక్కడ జన్మించి ఉన్నాము గాంధీజీ అందరినీ సర్వసమాన భావంతో చూడగలరు పేదు వారొక రాజప్రతినిధికి ప్రియమిత్రుడా అని సంబోధించి పోస్ట్ కార్డు వ్రాయగలరు ఆ మరుదినంలోనే దీనుడయిన హరిజన సోదరుని ఆలింగనం చేసుకోగలరు వారి దృష్టిలో ఎక్కువ తక్కువలు, ధనవంతులు నిరుపేదలు అనే భేదాలు గానీ, జాతిమత కులవర్ణ వివక్షతలుగానీ ఏవీ లేవు ఈ ప్రపంచంలోని అన్ని ప్రాణులు ఆయన ప్రేమకు సమానార్హాలే మనం కూడా ఆ ఉత్కృష్ట స్థితిని పొంద ప్రయత్నించి ఆయనకు తగిన అనుచరుల మనిపించుకొందంగాక" అని ఉపన్యసించి ఆమె ఇంకా ఇట్లా అన్నది 'మహాత్ముడు రౌండు టేబుల్ సమావేశానికి ఇంగ్లాండ్ వెళ్ళినప్పుడు నేను అమెరికాలో ఉన్నాను అప్పుడు మహాత్ముడు రేడియోలో చేసిన ప్రసంగం ప్రపంచ ప్రజలందరూ విన్నారు నాలుగు వేల మైళ్ల దూరంలో ఉన్న అమెరికాలో వారి దివ్య సందేశం లక్షలకొద్దీ అమెరికన్‌లు తన్మయులై తదేక దీక్షతో ఆలకించినారు ఆ ఉపన్యాసం బట్టి మహాత్ముడు ఎంతటి మహా పురుషుడో అమెరికన్‌లకు అప్పుడు అర్థమయింది తమ ఉపన్యాసంలో పశుబలాన్ని ఆత్మబలంతో ఎట్లా ఎదుర్కొనవలెనో సత్యం ఎప్పుడు ఎట్లా జయమును పొంద గలదో విస్పష్టంగా వెల్లడించినారు మహాత్ముని కంఠనాదం వినిపించగానే ఈ దేశమందు లక్షలాది స్త్రీ పురుషులు మహత్తరత్యాగాలను చేసినారు మీ పుర మందే 130 మంది కారాగార శిక్షలకు గురైనారు గాంధీజీ ప్రస్తుతము రాజ కీయంనుంచి విరమించినా మన జాతీయ జీవితం నుంచి విరమించలేదు. వారి మూర్తి మన అందరి హృదయాలలోను ప్రతిబింబిస్తూనే ఉన్నది" అని ఉపన్య సించి రానున్న రాష్ట్రీయ శాసన సభ ఎన్నికలలో దేశం మొత్తం పైన 50 మంది స్త్రీలను శాసన సభకు ఎన్నుకోవలసి ఉన్నది కాంగ్రెస్ పక్షంలో నిల చిన స్త్రీల నందరినీ తప్పక ఎన్నుకోవలెనని తానావని మీదనే ఏలూరు వచ్చి నాని చెప్పి తన ప్రసంగం ముగించినది

## నెల్లూరు

గాంధీమహాత్ముని జన్మ దినోత్సవ సందర్భంలో నెల్లూరు కాంగ్రెస్ కమిటీవారు అనేక మంది పేదలకు మృష్టాన్న భోజనం పెట్టినారు. ఆ సం దర్భంలో వారు 800 రూపాయలు వెచ్చించినారు.

### తిరుత్తని

తిరుత్తనిలో గాంధీమహాత్ముని 67 వ జన్మ దినోత్సవము హనుమాన్ జ్యోతిషాశ్రమమున వైభవోపేతంగా జరిగింది జ్యోతిషాశ్రమాధిపతి శ్రీమాన్ శరగోపాలాచార్యులవారు నాటి మధ్యాహ్నము 500 మంది పేదలకు సంతర్పణ చేసినారు

### బాపట్ల

1936 అక్టోబరు 2 ఉదయం భావనారాయణ స్వామి కోవెల నుంచి గాంధీమహాత్ముని పటంతో ఊరేగింపు జరిగింది సాయంత్రం అక్కడనుంచి సన్నాయిమేళంతో మరొక ఊరేగింపు జరిగింది మల్లాది యజ్ఞనారాయణగారు జాతీయ పతాకం ఎగరవేసి దాని పవిత్రతను గురించి ఉపన్యసించినారు

### పెంటపాడు

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో మాగంటి బాపినీడు, కొవ్వలి గోపాలరావుల నాయకత్వంలో మహాత్ముని చిత్రపటం ఊరేగింపు జరిగింది

### విశాఖపట్నము

విశాఖపట్నం సముద్ర తీరంలో నగర కాంగ్రెస్ సంఘంవారు జరిపిన బహిరంగ సభకు దర్శి చెంచయ్యగారు అధ్యక్షత వహించినారు శ్రీమతి దర్శి సుభద్రమ్మ, మల్లిమడుగుల జగన్నాథరావు, మల్లవరపు వెంకటకృష్ణారావు గార్లు మహాత్ముని జీవితం గురించి ఉపన్యసించినారు

మహాత్మాగాంధీ జన్మదినోత్సవ సందర్భంలో అక్టోబరు 2వ తేదీని గుంటూరులోని హిందూ కళాశాల హైస్కూలుకు సెలవిచ్చినారు

### మచిలీపట్టణము

మచిలీపట్నంలోని తిలక్ చౌక్ లో మహాత్ముని జన్మదినోత్సవ సందర్భంలో మానికొండ సత్యనారాయణశాస్త్రిగారి అధ్యక్షతన బహిరంగ సభ జరిగింది శ్రీ తంగిరాల రాఘవరావు, సుసర్ల బ్రహ్మదేవశాస్త్రిగార్లు మహాత్ముని జీవితం ఆదర్శాలను గురించి ఉపన్యసించినారు

### ద్రాక్షారామము

ద్రాక్షారామంలోని శ్రీ భీమేశ్వరస్వామి ఆలయంలో అక్టోబరు 2వ తేది ఉదయం మహాత్ముని ఆయురారోగ్యాభివృద్ధికి అభిషేకాలు జరిగినాయి రాత్రి శ్రీ నంబూరి శ్రీనివాసరావుగారు భక్తనందనారు కథను హరికథగా చెప్పినారు హరికథానంతరం అస్పృశ్యతా నివారణ గురించి సాక్షి సత్యనారాయణగారు ఉపన్యసించినారు.

**నరసారావుపేట**

గాంధీ జయంతి సందర్భంలో కాంగ్రెస్ కార్యకర్తలు వీధుల వెంట తిరిగి ఖద్దరు అమ్మినారు సాయంత్రం బహిరంగ సభలో మహాత్మాజీ జీవితంలోని ముఖ్యాంశాలను గొల్లపూడి సీతారామశాస్త్రిగారు విపులంగా తెలియచెప్పినారు

మహాత్ముని జయంత్యుత్సవం పులివెందల మొదలయిన అనేక గ్రామాలలో జరిగింది

## 22

# మహాత్ముని ఆంధ్రదేశ సంచారము (1937)

గాంధీమహాత్ముడు తిరువనంతపురానికి పోతూ 1937 జనవరి 11 వ తేది సాయంకాలం ౫-౩౫ నిమిషాలకు మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లో దిగినారు శ్రీ సి రాజగోపాలాచార్యులుగారు తదితర కాంగ్రెస్ ప్రముఖులు ఆయనకు స్వాగతం చెప్పినారు స్టేషన్ ప్లాట్‌ఫారంమీద వేలకొద్దీ జనులు సమావేశమై మహాత్మా 'గాంధీకి జై' అని నినాదాలు చేసినారు గాంధీజీ మోటారు బండిలో హిందీప్రచార కార్యాలయానికి వెళ్ళి అక్కడ స్నానాదికాలు నెరవేర్చుకొని సాయంకాలం సరిగా ౮ గంటలకు తన మౌనవ్రత దీక్షను ముగించుకొన్నారు

హిందీ ప్రచారసభ పక్షాన మహాత్మునికి స్వాగతపత్రం సమర్పించినారు ఆ తరవాత గాంధీజీ తిరువేంద్రం ఎక్స్‌ప్రెస్‌ను అందుకొనేటందుకు మోటారులో తాంబరంస్టేషన్‌కు వెళ్ళినారు

బొంబాయి ఎక్స్‌ప్రెస్‌లో గాంధీజీ మద్రాస్‌కు వస్తున్నారని తెలిసి రాజంపేట, రేణిగుంట, తిరుపతి, పూండు, పుత్తూరు, నారాయణవనం, నగరి, తిరుత్తని పట్నాలలోని ప్రజలు రైలు నిల్చిన స్టేషన్‌లో గుంపులుగుంపులుగా ప్లాటుఫారాలపై చేరి గాంధీజీకి పూల దండలను, ఖద్దరు మాలలను సమర్పించినారు

రాజంపేటలో మహాత్ముని రాకను గురించి టి సత్యనారాయణగారు దండోరా వేయించినందున ప్లాటుఫారంపైన ప్రజలు అధికంగా చేరినారు మద్రాస్‌లోని మైలాపూరు వర్తకుడు ద్రోణాచలం స్టేషన్‌లో గాంధీజీని దర్శించి హరిజననిధికి ఒక వెండిగిన్నెను బహూకరించినారు రేణిగుంట స్టేషన్‌లో తిరుపతి కాపురస్తుడు యం శ్రీనివాసాచార్యులుగారూ, రేణిగుంట అప్పాదురై అయ్యర్‌గారునూ గాంధీజీకి ఖద్దరు మాలలను పండ్లను సమర్పించినారు

పుత్తూరులో ఇంద్రం పట్టాభిరామిచెట్టి, కృష్ణస్వామి మొదలియార్ గారు తదితరులు తెచ్చిన దండలను, పండ్లను గాంధీజీ స్వీకరించినారు ఈ స్టేషన్ ప్లాటుఫారం పాఠశాలకు ఎదురుగా ఉండటంచేత బాలురు, విద్యార్థులు విశేషంగా చేరి గాంధీజీకి జేజేలు పెట్టినారు గాంధీజీ వారికి తన పెట్టెలో ఉన్న పండ్లను పంచిపెట్టినారు ఇంతలో రైలు కదిలింది పిల్లలకు తిన్నగా, నెమ్మదిగా పళ్ళు ఎగురవేసినారు పిల్లలు వాటిని ఒకరివెంట ఒకరు పరుగెత్తుతూ పరితెచ్చుకొన్నారు.

నగరి స్టేషన్‌లో డివైన్ సంఘంవారు రూ 6-11-0 గాంధీజీకి హరిజన

నిధికోసం కానుకగా సమర్పించినారు తిరుత్తని స్టేషన్‌లో జాతీయజండాలతో తిరుత్తని నాయకులు శ్రీయుతులు శరగోపాలాచార్యులు, దొరస్వామిచెట్టిగార్లు గాంధీజీకి పూలదండలు, ఖద్దరు మాలలు సమర్పించి మద్రాస్ వరకు గాంధీజీతో ప్రయాణం చేసినారు ప్రతి స్టేషన్‌లోను హరిజన నిధికి సొమ్ము వసూలయింది

**గాంధీజీ-మద్రాస్‌కు పునరాగమనము**

మహాత్మాగాంధీ తిరువాన్కూరు పర్యటన ముగించుకొని జనవరి 8 ఉదయం తిరువేంద్రం ఎక్స్‌ప్రెస్‌లో కోడంబాకం వచ్చి హరిజన పారిశ్రామిక పాఠశాలలో మకాం చేసినారు

**గాంధీజీ నాగేశ్వరరావుపంతులుగారిని చూడటం**

గాంధీజీ తిరువేంద్రం ఎక్స్‌ప్రెస్‌లో తాంబ్రంలో దిగి కోడంబాకానికి మోటారులో పోతూ త్రోవలో పల్లవరంలో నాగేశ్వరరావు పంతులుగారిని చూడడానికి ఆగినారు పంతులుగారు అప్పటికి నాలుగు రోజుల క్రితం నుంచి ఆరోగ్యాభివృద్ధికోసం పల్లవరంలో మకాంచేసి ఉన్నారు గాంధీజీ పంతులుగారి ఆరోగ్యం గురించి కుశల ప్రశ్నలడిగి తెలుసుకొన్నారు పంతులుగారు మహాత్మునకు పండ్లు,పూలు సమర్పించినారు "పూవులెందుకు డబ్బులు కావలె" అన్నారుచతురోక్తిగా సిమ్లాసేషను(కేంద్ర శాసన సభ)కు పోయివచ్చినప్పటినుంచి తమ ఆరోగ్యం బాగుండలేదని పంతులుగారు అంటే 'సిమ్లా శీతోష్ణస్థితి మీకు పడలేదా? లేక అసెంబ్లీయే మీ వంటికి సరిపడలేదా?" అన్నారు గాంధీజీ గాంధీజీ అక్కడున్న 5 నిమిషాలు ఆనందంగా గడిచింది గాంధీజీ వెంట బచ్చు జగన్నాథదాసుగారు, సత్యమూర్తిగారు ఉన్నారు

పంతులుగారు అసెంబ్లీ సమావేశానికి పోయి వచ్చేటప్పుడు సేవాగ్రామంలో గాంధీజీని దర్శించ గలనని చెప్పిన తరవాత మహాత్ముడు మోటారులో కోడంబాకం హరిజన పారిశ్రామిక పాఠశాలకు వెళ్ళినారు

**మహాత్ముడు-గుంటూరుజిల్లా సంచారము**
(తుఫాన్ బాధితుల సహాయార్థం)

1937 జనవరి 24 వ తేది ఉదయం 3-16 నిమిషాలకు మద్రాస్‌నుంచి కలకత్తా మెయిల్‌లో మహాత్మాగాంధీ, మహదేవ దేశాయ్, ప్యారేలాల్, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగార్లతో కలసి నిడుబ్రోలు స్టేషన్‌లో దిగినారు స్టేషన్ ప్లాట్‌ఫారంపైన దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారు, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఆచార్య రంగా, ఉప్పుటూరు పున్నారావుగార్లు మొదలయిన వారు మహాత్మునకు స్వాగతం చెప్పినారు అంతచీకటి వేళకూడా జనం క్రిక్కిరిసి మహాత్ముని దర్శనానికి వేచి ఉన్నారు.

సుమారు ఉదయం 4 గంటలకు మహాత్ముడు వినయాశ్రమానికి చేరినారు ఆశ్రమ వాసులు ఆశ్రమ ప్రదేశమంతా తోరణాలతో అలంకరించి ముగ్గులు పెట్టి శోభాయమానంగా చేసినారు ఆశ్రమంలోని ప్రతి కుటీరంలోను తోవ

లోను గ్యాస్ లైట్లు ఉంచినారు ఒక మూల నుండిన కుటీరంలో ఆశ్రమంలో తయారయిన వస్తువుల ప్రదర్శనము చేసినారు కొయ్యతో చేసిన గుండీలు, చెంచాలు, పిడాలు, బిస్కెట్లు, మాల్టులు, తాటి ఆకులతో చక్కగా అల్లిన వస్తువులు మనోహరంగా అమర్చినారు ప్రదర్శనశాలకు పక్కగా ఏకులు చేస్తున్న పద్ధతిని రెంట్రేని సుబ్రహ్మణ్యంగారు, ఉప్పులూరి రామశాస్త్రిగారు పరిశీలిస్తున్నారు ఆశ్రమమంతా పరిసర ప్రాంతంనుంచి వచ్చిన స్త్రీ పురుషులతో కలకలలాడుతున్నది

ఆశ్రమ వాసులు మహాత్ముని ఆహ్వానించి సన్మానించిన అనంతరం గాంధీజీ ప్రదర్శనశాలను సందర్శించినారు ఏకులు తయారు చేయడం చూసి వారు కొన్ని సూచనలు చేసినారు గాంధీజీ కొంతసేపు రాట్నంపై నూలు తీసి నియమిత కాలానికి ఆశ్రమ వాసులతోను, ఇతరులతో కలసి ప్రార్థన చేసినారు ప్రార్థనానంతరం కొండ వేంకటప్పయ్యగారితోను, గొల్లపూడి సీతారామశాస్త్రిగారితోను తుఫాన్ నష్టం గురించి అనాటి, కార్యక్రమం గురించి గాంధీజీ చర్చించినారు వేంకటప్పయ్యపంతులుగారు తుఫాన్ నిధి ఆదాయ వ్యయాల పట్టికను, నివేదికను తదితర సంబంధ కాగితాలను మహాదేవదేశాయ్ గారికి, గాంధీజీకి ఇచ్చి వివరాలను తెలియజేసినారు సీతారామశాస్త్రిగారు ఆశ్రమ వాసుల పక్షాన గాంధీజీకి సన్మాన పత్రం సమర్పించినారు

తరవాత అనేక ప్రదేశాల నుంచి వచ్చి వేచి ఉన్న ప్రజలకు దర్శనమిచ్చి "మీలో తుఫాన్‌వల్ల నష్టపడినవారు ఎంత మంది ఉన్నారని" ప్రశ్నించగా అందుకు సమాధానంగా కొద్దిమంది మాత్రమే చేతులెత్తినారు "దీనిని బట్టి మీలో కొద్దిమంది మాత్రమే నష్టపడినట్లు, ఆ నష్టపడిన వారికి కొద్దిమంది మాత్రమే సహాయపడినట్లు తెలుస్తున్నది కాబట్టి తక్కిన వారందరూ తమ తమ శక్తి కొద్దీ సహాయం చేయవలసిన బాధ్యత ఉన్నది మీరట్లా చేయగలరని భావిస్తున్నాను మీ వద్ద ప్రస్తుతం డబ్బు లేకుంటే మీ మనస్సులో మీరు ఈ నిధికి సహాయం చేయవలెనని అనుకొని తరవాత మీరా సొమ్ము ఇవ్వవచ్చు మీలో ప్రతివారు ఏదో కొంత ఇవ్వనిది ఇక్కడ నుంచి వెళ్ళకూడదు" అని గాంధీజీ చెప్పగానే సభలోనివారు కొందరు కొంత డబ్బిచ్చినారు అప్పుడు గాంధీజీ "ప్రొద్దున నే మంచి బోణీ అయింది" అన్నారు చలోక్తిగా

అటు తరవాత 6 24కు గాంధీజీ ఆశ్రమం నుంచి బయలుదేరి చందోలు దగ్గర కాలువను బల్లకట్టు మీదుగా దాటి కారు మీద ప్రయాణం సాగించినారు గాంధీజీతో వేంకటప్పయ్యపంతులుగారు, గొల్లపూడి సీతారామశాస్త్రి, పాతూరి సుబ్బయ్యచౌదరి, మల్లాది యజ్ఞనారాయణ, రెంట్రేని సుబ్రహ్మణ్యం, మాడభూషి వేదాంతం నరసింహాచార్యులుగార్లు మరికొంత మంది మిత్రులు బయలుదేరి వెళ్ళినారు

## వినయాశ్రమవాసుల సన్మాన పత్రము

మోహన్‌దాస్ కరంచంద్ గాంధీగారికి!

పురుషోత్తమా!

మున్పైపైయేడు మాసాల క్రిందట మాకు మాననీయులయిన మహాత్ములు మీరని మేము మీ కిక్కడ స్వాగత మిచ్చినాము సరిగా తిరిగి 28వ తేదీన నేడు మిమ్ములను మా అనుంగు బాపూజీ అని సానురాగంగా అభినందిస్తున్నాము

మా లోపాలు, మా పరాజయాలు పెక్కులుగా ఉన్నవి మా ఆదర్శాలు మాకు చాలా దూరంలో ఉన్నవి శుచి పారిశుద్ధ్యాలకై సామాన్య ప్రచారకులు నిర్వర్తించవలసిన విధ్యుక్త ధర్మాల విషయంలోను, ఖద్దరు వస్త్ర స్వావలంబన విషయంలోను గ్రామసేవా, ఆహార పద్ధతుల సంస్కరణ విషయంలోను మేము గడించవలసిన సామర్థ్యం ఇంకా గడించలేదు మీరిస్తున్న ప్రోత్సాహానికి తద్వారా లభిస్తున్న లోకాదరణకు మేము మీకు ఎంతో కృతజ్ఞులము

కడచిన కాలావధిలో క్రింది వ్యవహారాలు సాగింపబడినవి-చిల్లర దుకాణము, ఆయుర్వేదవైద్యశాల, ధాన్యము విసరటం, తపాలాఫీసు, యాత్రలు, మ్యాజిక్ లాంతర్ ద్వారా ప్రచారము, హార్లిక్స్ వంటి మొలకపిండి, బిస్కెట్లు, బొత్తాములు, నవారు, కాటాకు సరుకులు, తాటిబెల్లం వగైరా చేతిపనులు, ఇవన్నీ ఇంతవరకును పరిశోధన దశలోనే ఉన్నాయి ఆశ్రమ భూములను సాగు చేయటంవల్లనూ లోకుల దాన ధర్మాలవల్లనూ మాకు కావలసిన ద్రవ్యం వస్తు సామగ్రి లభిస్తున్నవి

మాలోపాలను మీరు క్షమించవలెననీ మా దుష్ప్రవర్తనలను మీరు సరిదిద్దవలెనని ప్రార్థిస్తున్నాము సేవ చేయడం మాకు నేర్పవలె యోగ్యతార్హతలను పొందడం ఎట్లాగో మాకు మీరు ఉపదేశించవలె మా అర్హతలకు మించిన ఆశలు మాకు లేకుండునట్లుగా మీరు శిక్షించవలె వ్యష్టిగా గానీ, సమష్టిగా గానీ మేము చెప్పేమాటలు చేసే చేష్టలు మీ మహోపదేశాలకు కార్యాకారాలై సర్వమంగళప్రదుడయిన సృష్టికర్తకు కైంకర్యాలై వెలసినట్లుగా మమ్ములను ఆశీర్వదించ వేడెదము

ఇట్లు

వినయాశ్రమము
28-1-37

మీకు వినయ విధేయులైన
మీ బిడ్డలు
వినయాశ్రమ వాసులు

### బాపట్ల

గాంధీజీ తన సహచరులతో బాపట్ల చేరేసరికి ఉదయం 7 గంటలయింది పోతుల బుచ్చప్పనాయుడు, మల్లాది యజ్ఞనారాయణ, మాధవపెద్ది కాశీదాసు, బూదరాజు లక్ష్మీనారాయణ, రామారావుగార్లు తదితర కాంగ్రెస్ ప్రముఖులు గాంధీజీని ఆహ్వానించి ఆయనను పుష్పమాలాలంకృతుని చేసినారు. అక్కడ పెద్ద సభ జరిగింది. బాపట్ల యూనియన్ బోర్డువారు గాంధీజీకొక

సన్మానపత్రం సమర్పించినారు అందుకు ప్రత్యుత్తరంగా ఆయన కొద్ది నిమిషాలు ఇట్లా ఉపన్యసించినారు

'మిమ్ములను నిశ్శబ్దంగా ఉండవలెనని కోరుతున్నాను నేను వెళ్ళవలసిన ప్రదేశాలు ఇంకా చాలా ఉన్నవి మీతో హాస్యప్రసంగాలు చేయటానికి గానీ, మీ సన్మానపత్రాలను అందుకొనేటందుకుగానీ నేను రాలేదు నేను కొంత పని చేయవలెనని వచ్చినాను తుఫాన్‌వల్ల నష్టపడిన ప్రదేశాలు చూసి ఆ ప్రజలకు నేను చేయగలిగిన సహాయం చేయవలెనని వచ్చినాను ఈ పని నేడు వినయాశ్రమంలోనే ప్రారంభమయినది అదేపనిని ఇక్కడకూడా కొనసాగిస్తాను మీలో ఎంతమంది నష్టపడినారో, మీలో ఎందరు నష్టపడినవారికి సహాయం చేసినారో చేతులెత్తటంద్వారా తెలపవలసిందని కోరుతున్నాను "

ఈ మాటలను విని కొద్దిమంది మాత్రమే చేతులెత్తినారు అంతట గాంధీజీ మళ్ళా ఇట్లా ప్రసంగించినారు "నేను ఇటువంటి దురవస్థలు సంభవించిన అనేక ప్రదేశాలలో పనిచేసి ఉన్నాను బీహార్‌లో భూకంపం వచ్చినప్పుడు అక్కడ పనిచేసి ఉన్నాను అక్కడ కూడా లక్షలకొద్దీ నష్టపడినప్పటికీ కనీసం వందల మందైనా తప్పించుకొన్నారు అట్లాగే మీ ప్రదేశాలలో అంత ఘోరవిపత్తు సంభవించకపోయినప్పటికీ కొంతమంది నష్టపడి ఉంటారు నష్టపడినవారు ఈ సభకు రారు అది నాకు తెలుసు వారివద్దకే మనం వెళ్ళవలసి ఉంటుంది కాబట్టి నష్టపడని మీరందరూ వారికి సహాయం చేయవలసి ఉంటుంది వినయాశ్రమంలో కూడా నేను ఈ విధంగానే కోరినాను ఇక్కడ చేరిన వారంతా కొంచమో, గొప్పో ఇస్తే నేనిక్కడ కొంతసేపు ఉంటాను లేకపోతే మరొక చోటకు పోతాను నాకు కాలవ్యవధి లేదు నేనిప్పుడు చేయదలచుకొన్న పని ఇదొక్కటే " అని చెప్పిన అనంతరం అనేకమంది గాంధీజీ తుఫాన్‌నిధికి విరాళాలు సమర్పించినారు

## చీరాల - వేటపాలెం

బాపట్లనుంచి గాంధీజీ చీరాలకు వెళ్ళినారు చీరాలలో పెద్ద సభ జరిగింది సన్మానపత్రాలు సమర్పింపబడినాయి మహాత్ముడు కారులోఉండి సభలోని ప్రజలందరకూ దర్శనమిచ్చి "ఒకచోటనుంచి మరొక చోటికి పోయే త్రోవలో కనబడుతున్న నష్టాన్ని చూసినాను నష్టపడినవారికి కొంత సేవ చేయదలచినాను. తుఫాన్‌వల్ల నష్టపడినవారి సహాయార్థం మీరందరూ మీకు తోచిన ద్రవ్యం ఇవ్వవలసి ఉన్నది" అని చెప్పినంతనే అనేకమంది విరాళాలు సమర్పించినారు స్త్రీ పురుషులనేకులు గుంపులుగుంపులుగా ఇండ్లమీద చేరి గాంధీజీని దర్శించినారు చీరాలనుంచి వేటపాలెం వెళ్ళినారు తోవలో వేలకొద్దీ ప్రజలు ఆయనను దర్శించినారు. వేటపాలెంలో సభ జరిగింది గ్రామస్థులు సన్మానపత్రాలు సమర్పించినారు, కొంత డబ్బు కూడా వసూలయింది

**గొల్లపాలెము - తిమ్మసముద్రము**

గాంధీజీ వేటపాలెం నుంచి తిమ్మసముద్రం వెళ్ళినారు. ఇక్కడ తుఫాన్ వల్ల విపరీతమయిన నష్టం కలిగింది. సుమారు 30 మందికి పైగా మనుషులు చనిపోయినారు. వందల కొద్దీ గొడ్లు, వేలకొద్దీ గొర్రెలు, మేకలు కొన్ని బండ్ల పశులుచనిపోయినాయి. పూరిండ్లుకప్పులు ఎగిరిపోయినాయి. పెంకుటిళ్లుచాలా వరకు శిథిలమయినవి. మేడలు కూడా పూర్తిగా నష్టమయినవి. గోరంట్ల వెంకన్నగారు ఇండ్లులేని బీద హరిజనుల సహాయార్థం ఆరు ఎకరాల భూమి దానం చేసి అక్కడ ఒక హరిజన పల్లెను నిర్మించడానికి ఏర్పాటు చేసినారు.

గాంధీజీ ఆ ప్రదేశం చూసి గొల్లపాలానికి చేరినారు. ఆ గ్రామం కూడా ఎక్కువ నష్టపడిన ప్రదేశాలలో ఒకటి. పాడయిన ఇళ్లు అప్పటికి మూడు మాసాలు గడిచినప్పటికీ అట్లాగే ఉన్నవి. పెద్ద మానులు పడిపోయినాయి. సుమారు 20 మంది జనులు చనిపోయినారు. అరవై డెబ్బై పశువులు కూడా చచ్చినాయి. పంటలు యావత్తు చెడిపోయినాయి. ఆ ఊళ్లో నష్టపడని ఇల్లు లేనే లేదు. గాంధీజీ కాలినడకను నడచి ఆ ఊరంతా చూసినారు. ఇక్కడ మహాత్ముడు గంభీరోపన్యాసం చేసినారు.

**మహాత్ముని ఉపన్యాసము**

"ఈ రోజు ఉదయం 6½ గంటలనుంచి తుఫాన్‌వల్ల నష్టపడిన ప్రదేశాలలో తిరుగుతున్నాను. అయినప్పటికీ యావత్తు ప్రదేశం కాకపోయినా అందులో కొంత భాగమయినా చూసినానని చెప్పడానికి వీలులేదు. నిజంగా నేను చాలా భాగం చూడవలెనంటే, ఇట్లు దొరవలె మోటారు కారులో వెళ్ళితే చూడజాలను. నడిచి వెళ్ళవలసి ఉంటుంది. అట్లా నడచివెళ్ళి చూడడానికి తగిన వ్యవధిలేదు. ఈ విధంగా మోటారులో త్వరగా ప్రయాణం చేయడం నష్టపడిన ప్రదేశాలను పరీక్ష చేయడమే అవుతుంది కాని ప్రజలతో పరిచయం కలిగించుకోవటం కాదు. ఈ ప్రదేశాలకు నేను వచ్చినందుకు మీకొక ఓదార్పు మాట చెప్పటమే నేను చేయగల పని. అంతకు మించి నేనేమీ చేయజాలను. నామొర ప్రభుత్వం వారికి గానీ, వారి అధికారులకు గానీ చెవుల కెక్కదని నాకు తెలుసు. వారిలో నా కెక్కువ పలుకుబడి లేదు. నష్టపడి దిక్కులేని వారందరినీ ప్రతివారు నిర్లక్ష్యంగా చూసినప్పటికీ దేవుడట్లా చేయడు. నేను అరవం చదువుతున్నప్పుడు 'దిక్కులేని వానికి దేవుడే దిక్కు' అనే ఒక అరవసామెత నేర్చుకొన్నాను. సామెతను ఊరికే జపిస్తున్నంత మాత్రాన లాభంలేదు. మనకు దేవుడు చేతులు, కాళ్లు ఇచ్చినాడు. ఆ చేతులు కాళ్ళతో మనం పనిచేసినట్లయితే మన పొట్టకు తిండి, వంటికి గుడ్డా లభిస్తుంది. ఈ విషయం మనకు తెలిస్తే ఎన్ని తుఫానులు వచ్చినా మనలను బాధించనేరవు. నేను మిమ్ములను చూసి జాలిపడడానికి రాలేదు. ఈ కష్టసమయంలో మిమ్ములను నవ్వించడానికి వచ్చినాను. నవ్వుతుండే వారే ఎప్పుడు తమ కోసం గాక ఇతరులకోసం కూడా పాటు పడే

వారు విపరీతంగా నష్టపడిన ఈ ప్రదేశంలో కూడా నష్టపడని వారు కొంద రయినా ఉండవచ్చు వారు నష్టపడిన వారికి ధన సహాయం చేయవలె ప్రభుత్వం వారు మీ కష్టాలను గుర్తించి సహాయం చేస్తే వారికి మనం కృతజ్ఞులము లేకుంటే అంతటితో నిరుత్సాహం, నిస్పృహ చెంది ఆత్మహత్య చేసుకోకోము ప్రతివారూ తామెంతవరకు ఈ దుస్థితిలో సహాయ పడగలరో గుర్తిస్తే దుఃఖపడే వారు ఉండజాలరు మీలో భాగ్యవంతులుంటే ముందంజవేసి నష్టపడిన వారికి సహాయం చేయవలె తిమ్మసముద్రంలో ఒకరు ఆరు ఎకరాల భూమిని దానం చేసినారు వారి ఔదార్యం ఆదర్శంగా తీసుకొని కష్టంలో ఉన్నవారికి సహాయపడవలెనని కోరుతున్నాను "

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ గొల్లపాలెం నుంచి బయలుదేరి ఇంకొల్లు చేరినారు

## ఇంకొల్లు

ఇంకొల్లులో మహాత్ముడు వచ్చే తోవ సభా మంటపాలు చక్కగా అలంకరింపబడి ఉన్నవి సభలో స్త్రీలు సగానికి పైగా ఉన్నారు. సభలో అందరూ నిశ్శబ్దంగా కూర్చొని మహాత్ముని దర్శనానికి వేచి ఉన్నారు శ్రీ ఓగేటి సూర్యనారాయణగారు మహాత్మునకు కొంత ధనం సమర్పించినారు, అది తీసుకొని మహాత్ముడు, "నేనిక్కడకు ఉపన్యాసం చేయడానికి గానీ, మీ సన్మాన పత్రాలను అందుకోడానికి గానీ రాలేదు తుఫానువల్ల నష్టపడిన ప్రదే శాలను చూసి నా చేతనయిన సహాయం చేయడానికి వచ్చినాను నేనిక్కడ ఉండే కొద్ది వ్యవధిలో మీరెవరెవరెంత ఇవ్వగలరో అది ఇవ్వవచ్చు " అనిచెప్పిన మీదట కొంతమంది కానుకల నిచ్చినారు ఒక స్వాగత పత్రం ఇంకొల్లు పరిసర గ్రామాల పక్షాన శ్రీ వివేకానంద యువజన సంఘంవారు సమర్పించినారు

## స్వాగత పత్రము

మహాత్మాజీ !

నవీన భారతంలో సాంఘిక, నైతిక, రాజకీయాలు తమ మూర్తిత్వ ప్రభావంలో పరిణతి చెందు ఇక్కాలంలో మిమ్ము మామధ్య కన్నులార చూడ గలిగిన భాగ్యానికి గర్వమొందుతున్నాము

బాపూజీ !

మేము అక్టోబరు 28 వ తేదిన తుఫాన్ బాధకు లోనై పడిన ఇక్కట్లు నాయకులగు తమతో చెప్పుకొనే భాగ్యం కలిగింది. ఈ చుట్టు పక్కల ఇరవై గ్రామాలకు ఈ గ్రామం కూడలి ఈ గ్రామంలో నలభై వేల జనాభా, ఏడు వేలగృహాలున్నాయి ఈ గృహాలలో నాలుగోవంతు పెంకుటిండ్లు పూరి పెంకుటి భేదం లేకుండా అందరమూ అల్లాడినాము నష్టాలింతంతలుకావు 200 పెంకు టిండ్లు, 200 కొట్టాలు నేలమట్టమయినాయి ఎండకుఆధారాలేగానీ, ఇండ్లపై

కష్టాలకు మెంకులేక బాధపడుతున్నాము ఇక పూరిండ్ల లెక్క చెప్పనేల వందలకొద్దీ జనులు గోడల కింద పడి మరణించినారు వేయి పశువులు, నూరు దుక్కిటెడ్లు నశించినాయి కొందరు పిల్లలు గాలి కెగిరిపోయి కనిపించలేదు ఇంకొల్లు గ్రామంలో రెండు ఇండ్లు కొంతవరకు కాలిపోయినాయి

ఆపద్బాంధవ

ఇట్టి బాధలు పడే మాకు గవర్నమెంట్ సహాయం రాలేదని చెప్పవలె తిను బండారాల ధరలు పెరిగి మాకు కూటికి కరువు కాకుండా నివారణ సంఘంవారు రక్షించినారని మనవి చేసుకొంటున్నాము వారు ఇంతవరకు 1200 బస్తాల బియ్యము, 400 బస్తాల జొన్నలు, 50 బస్తాల విత్తనాలు వగైరాలు తెచ్చి బహు నరసంగా అమ్మి మాకు అండ అయినారు నివారణ సంఘంవారు రెండు లారీల మేతను పంపితే ఏ మూలకు చాలక, గాలివానలో మిగిలిన పశువుల బాధ చూడలేక కడుపు తరుక్కొని పోతున్నది మొత్తం మీద 80 లక్షల రూపాయలు నష్టం కలిగినది అందు తాము దర్శించిన గొల్లపాలెం ఎక్కువ ఆపదలకు లోనైనదని విన్నవిస్తున్నాము ఇప్పటికీ ఆ గ్రామస్థులు భయకంపితులై ఏమీ తోచక బీభత్సంలో పడి విరాగులై ఉన్నారు వారు ఇళ్ళు కట్టుకొని ఎన్ని వత్సరాలకు పూర్వస్థితికి రాగలరో తెలియదు నివారణ సంఘంవారు 4000 బొంగులు, 12000 తాటాకు పంపినారు ఇంకా ఆకును పంపుతామంటున్నారు వీటితో 200 గుడిసెలు వేయిస్తున్నాము. ఇంకనూ 200 గుడిసెలు వేయించవలసిన అవసరమున్నది కనీసం 2000 రూపాయలు కావలె అప్పులతో బాధ పడుతూ ఇండ్లులేక తిండి చాలక వ్యవసాయ ఖర్చు లెక్కువయి పైరు పండునను ఆశపోయి ఉన్న పేదసాదల గతి వేరు చెప్పనక్కర లేదు ఏ రకమయిన సహాయం ఎవరూ చేసేవారు లేక, గవర్నమెంట్ పన్ను ఇంకను తీసివేయనందున చెల్లించి సంసారం ఈ సంవత్సరం ఎట్లా గడుపుదామా అని వారు నిరాశచెంది ఉన్నారు

మా వివేకానంద యువజన సంఘం ఏడు నెలల కూన అయినా తుఫాను నష్టనివారణ సంఘంవారి శిక్షణ కింద ఈ రెండు నెలలు సేవచేసే భాగ్యమబ్బటం, తమకు ఈ స్వాగతం ఇవ్వడానికి నోచుకోవడానికి పరమేశ్వరుని ప్రేమయే కారణము

దరిద్ర నారాయణా !

వ్యయ ప్రయాసల కోర్చి ఇంతదూరం వచ్చి మా కష్టాల నెరిగి మమ్మాదరించే మా ఆపద్బాంధవులయిన తమకు మా కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు

వివేకానంద యువజన సంఘం
ఇంకొల్లు పరిసర గ్రామాల తరఫున

**పోతినవారిపాలెము**

గాంధీజీ ఇంకొల్లు నుంచి దగ్గుపాడు మీదుగా పోతినవారి పాలెం చేరినారు ఆయన ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి పోతున్న కొద్దీ ఒక ఊరు విడలి మరొక ఊరుకు పోతున్నట్లు కనిపించింది మహాత్ముని దర్శనం కోసం స్త్రీ పురుషులు గుంపులు గుంపులుగా పొలాలకు అడ్డంగానూ, రోడ్ల వెంబడినీ, పరుగులు పెట్టినారు గాంధీజీ పోతున్న తోవ యావత్తు మానవ తరంగాలతో ఉప్పొంగుతూన్న సాగరంవలె కనిపించింది అనేక మైళ్ల నుంచి స్త్రీలు, పురుషులు, బాలురు మహాత్ముని దర్శనానికి రోడ్డు దగ్గరకు రొజుతూ రొప్పుతూ, చెమటలు కార్చుకొంటు పరుగెత్తుకొని వచ్చి మహాత్ముని కారు అంతకు ముందే పోయినందున ఆయనను చూడ జాలక ఆశాభంగం చెందినారు అప్పుడు వారిని చూసిన ప్రతివారికి జాలికలిగింది అనేక చోట్ల మహాత్ముని కారును ఆపి ప్రజలు ఆయన దర్శనం చేసుకొన్నారు

**నూతలపాడు**

నూతలపాడు గ్రామ ప్రజలు గాంధీజీ తమ ఊరిలోకి రాడని తలచి రోడ్డు మీదనే ఒక సభా మంటపం అడ్డంగా అమర్చి రెండు నిమిషాలు నిలచి దర్శనమీయవలసినదని గాంధీజీని కోరినారు మహాత్ముడు ప్రజలందరికీ కనిపించే టట్లు వేదికపై కెక్కి తుఫాన్ బాధితులకు సహాయం చేయమనికోరినారు సభలో సుమారు నాలుగు వేలకుపైగా ప్రజలు చేరినారు

గ్రామస్థులు ఒక సన్మాన పత్రం, 116 రూపాయలను గాంధీజీకి సమర్పించి నారు సన్మాన పత్రం వేలం వేయగా 200 రూపాయలు వచ్చినాయి ఇదిగాక సభలో రమారమి 100 రూపాయలు వసూలయింది సన్మాన పత్రం కొరకి లక్ష్మినారాయణ ప్రభృతులు సమర్పించినారు గాంధీజీ "మీలో తుఫానువల్ల నష్టపడినవారు, నష్టపడనివారు కూడా ఉండవచ్చు కాని ఏ మాత్రం శక్తిగల వారయినప్పటికీ కొంత సహాయం చేస్తే బాధితులగు పేదవారికది మహోప కారంగా పరిణమించగలదు" అన్నారు

**స్వాగత పత్రము**

గాంధీమహాత్మా స్వాగతము! సుస్వాగతము!

ప్రకృతిదేవి ప్రళయతాండవం జరిపిన మా ప్రాంతం దర్శించి మమ్మాదరింప వచ్చిన కరుణార్ద్ర హృదయులయిన మీకు సుస్వాగతము హరిజన బాంధవులై అస్పృశ్యతా పిశాచాన్ని పారదోలి నేడు విజయ దుందుభిని ప్రమోగించి తిరువాన్కూరునుంచి తిరిగి వస్తున్న మీకు మా స్వాగతము

దీనబాంధవా !

మా సీమకు రాకరాక వచ్చిన మీ రాక మాకు శుభోదర్కముగుగాక కష్టకాలమందు వెన్ను తరిచి ఆదరించవచ్చిన ఆప్తబంధువులయిన మీ ఎదట మా

ఎదలోని సొదలు వెళ్ళబోసుకోకుండా ఉండజాలము మాది కుగ్రామము మా కర్షక కార్మిక జనము ఆకలిచిచ్చుతో అలమటిస్తున్నారు నిలువనీడలేక అల్లాడు తున్నారు చేతినిండ పనిలేదు కడుపార తిండిలేదు ఋణాలు పెచ్చు పెరిగి నాయి పన్నులు భారమయినాయి పంటలు మంటగలిసినాయి పరిశ్రమలు పాడు పడినాయి అజ్ఞానం అవతరించింది, ఆత్మగౌరవం అణగారింది, పరదాస్యం పైకొ న్నది, స్వాతంత్ర్యం నమసిపోయినది, సామ్రాజ్యతత్వంచే పీడింపబడినాము చిర కాల దాస్య భారాన చితికినాము దౌర్భాగ్య దారిద్ర్యంచే తరమబడినాము, అయినా ఎట్లో నిలిచి ఉన్నాము- పులిమీద పుట్రవలె ప్రకృతిమాత కంటగించి కన్నెఱ్ఱజేసినది సర్వవిధాల కుంగదీసినది ఆర్తుల మయినాము మా గోడు ఆలకించండి

దేశబాంధవా !

మీసేవలు ఉగ్గడించటానికి, మిమ్ములను కొనియాడటానికి మాకుమాటలు చాలవు కొండంత దేవునికి కొండంత పత్రి ఎక్కడనుంచి తేగలం! మీ చరిత్ర చిరస్మరణీయము మీ దేశసేవ అపారము మాపై మీ ప్రేమ వాత్సల్యాలు అనంతాలు, మీరు ఖద్దరు దీక్షాబద్ధ కంకణులై దరిద్ర నారాయణుల నుద్ధరింప నడుముకట్టినారు పదు లక్షల గ్రామాలను ఉద్ధరించటానికి నేడు పూనినారు నాడు దేశ మోక్షంకోసం నిరాకరణాస్త్రం ప్రయోగించినారు సత్యాగ్రహం సాధించి నారు శాసనోల్లంఘన సాగించినారు దేశాలను పునరుజ్జీవింపజేసినారు దేశ విముక్తికోసం మీ సర్వస్వం అర్పించినారు మతానికి నమ్మత మార్గం చూపి నారు బ్రహ్మచర్యానికి జీవం పోసినారు సత్యం అన్వేషించినారు అహింసను ఆత్మీకరించుకొన్నారు విశ్వానికి వెలుగు నిచ్చినారు ప్రవక్తలయి మహర్షులై ఉత్తమ బ్రాహ్మణోత్తములై వేదు మనుగడ గడుపుతున్నారు ఇట్లాంటి మీకు ఎన్నో ఏళ్ళ ఆరోగ్యతేజఃపుంజాల నిచ్చి విశ్వమాత ఓముగాక

నూతలపాడు గ్రామ పౌరులు

నూతలపాడు<br>(బాపట్ల తాలూకా)<br>23-1-1937

పరుచూరు

1937 జనవరి 23 న సరిగా 11 15 గంటలకు గాంధీజీ పరుచూరు చేరి నారు అక్కడ గొప్ప సభ జరిగింది సభలో తుఫాన్ నష్ట నివారణార్థం ప్రతి వారు సహాయం చేయవలసిందని గాంధీజీ కోరినారు స్త్రీలలో కొంతమంది తమ ఆభరణాలను ఇవ్వనున్నారని తెలుపగా మహాత్ముడు "నేను ఈ విద్యలో ప్రవీ ణుణ్ణి ఈ పని చేయడంలో నాకు అపరిమితమగు ఓర్పుకూడా ఉన్నది వీటిని నగదుగా మార్చి తుఫాన్ నిధికి చేర్చగలను" అన్నారు హాస్యంగా అక్కడ వందలకొద్దీ స్త్రీలు ఉన్నారు. వారు ఒకరివెంట ఒకరు సభావేదిక పైకెక్కి మహాత్మునికి నమస్కరించి తమ నగలనో ధనాన్నో ఇవ్వడం చూసి గాంధీజీ

"ఈ గ్రామంలోని పురుషులు గంజాయి త్రాగి నిద్రించే మందమతులనీ, స్త్రీలు ఉత్సాహవంతులనీ అనుకొంటున్నాను పురుషులు వారి పరువు నిలబెట్టుకోవడానికైనా ఎవరికి తోచినది వారు ఇవ్వవలె స్త్రీలు తేనెటీగలవంటివారు వారు కూడబెట్టిన తేనెను దొంగలవలె అపహరించేవాళ్ళు పురుషులుగా ఉన్నారు ఈ గ్రామంలో స్త్రీలే డబ్బు పెత్తనదార్లని తోస్తున్నది" అంటూ పత్రికా విలేఖరులవైపు చూసి, ఇక్కడ పెన్సిళ్లు కలాలతో వ్రాసేవారుకూడా కొంత ఇవ్వవలె" అని అన్నారు

తిరునాళ్ళవలె పరిసర గ్రామాలనుంచి ప్రజలు బళ్ళు కట్టుకొని మహాత్ముని దర్శనార్థమై పరుచూరుకు వచ్చినారు మంచాళ సీతారామయ్యగారు మహాత్మాజీకి వారి వెంట వచ్చిన వారికిని ఆతిథ్య మిచ్చినారు సభలో గాంధీజీ దర్శన మొందనివారు కొన్ని వేలమంది సీతారామయ్యగారి ఇంటిచుట్టూ మూగి మధ్యాహ్నపు మండుటెండలో ఆయన దర్శనంకోసం వేచిఉన్నారు

**గుంటూరు**

పరుచూరునుంచి సరిగా 1¹ గంటలకు గాంధీజీ గుంటూరుకు ప్రయాణమయినారు తోవలో నిమ్మరాజుపాలెంలో, పసుమర్తిలో ప్రజలనేకమంది రోడ్డు కడ్డంగా నిలిచి గాంధీజీ దర్శన మపేక్షించినారు కాని కాలవ్యవధి చాటిపోయి అప్పటికే కార్యక్రమములో అరగంట ఆలస్యమయినందున వారి కోరిక ప్రకారం ఆగక పోవలసి వచ్చినది చిలకలూరిపేట, కార్యక్రమంలో ఉన్నప్పటికీ అప్పటికే ఆలస్యమయినందున గాంధీజీ ఆ ఊరిలో ఆగక సరాసరి వెళ్ళిపోయినందున పరిసర గ్రామాలనుంచి అక్కడ చేరిన వేలకొద్దీ ప్రజలకు తీరని ఆశాభంగం కలిగినది అయినా ఆ ఊరివారు తుఫాన్ నివారణనిధికి రూ 116 లు సమర్పించినట్లు తెలిసినది

చిలకలూరుపేట దాటిన తరవాత గుంటూరు చేరేవరకు రోడ్డు చాలా బాగా ఉండటంచేత అంతకు పూర్వం అరగంట ఆలస్యమయినప్పటికీ గుంటూరుకు మాత్రం కార్యక్రమానికి రెండు నిమిషాలు ముందుగానే గాంధీజీ చేరగలిగినారు స్వరాజ్య మైదానంలో గొప్ప బహిరంగసభ జరిగింది సుమారు ఇరవై వేల పైచిలుకు ప్రజలున్నారు ఏర్పాట్లు చక్కగా ఉన్నాయి సభావేదికను చక్కగా అలంకరించినారు దూరశ్రవణ యంత్రాలు లేనందున అంత బ్రహ్మాండమయిన సభలో గాంధీమహాత్ముని మాట ఎవ్వరికీ వినిపించలేదు ఆయన దర్శనం లభించినందుకే ప్రజలు సంతృప్తిపడినారు గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షులు పాతూరి సుబ్బయ్యగారు గాంధీజీకి సన్మానపత్రం సమర్పించినారు

**గుంటూరు జిల్లా బోర్డు సన్మానపత్రము**

మహాత్మాజీ !

మా మండలానికి మీ ఆగమన సమయంలో మా జిల్లా బోర్డు తరఫున

మనఃపూర్వక మయిన స్వాగతం ఇస్తున్నాము

భయంకరమగు గాలివానచే పీడింపబడి ప్రియపుత్రులను, పశువులను, పంటలను, ఇండ్లను కోల్పోయి పలుబాములకు పాల్పడిన మా మండల సరోజానికి మీ ఆగమనం లోకబాంధవుని ఆగమనం పోలిఉన్నది ఇండ్లను తిరిగి కట్టించుకోవడానికి పశువులను కొనుక్కోవడానికి ప్రజలు పలుబాములు పడుతున్నారు

బీదల పాలిట కల్పతరువగు మీ సాయంతో ఈ దరిద్ర నారాయణుల బాధలు తొలుగుతాయని ఆశిస్తున్నాము హరిజనుల నుద్ధరించి హిందూమతం లోని కళంకంను బాపవలెననే మీ అమోఘ సంకల్పము, తిరువాన్కూరు మహారాజావారి ధర్మశాసనంవల్ల సఫలత గాంచినది

సృష్ట్యాదినుంచీ ఈ భరత ఖండంలో ఇంతటి పవిత్ర శాసనం మరొకటి చేయలేదు ఆసేతు హిమాచలంలోగల దేశీయ ప్రభువులు బ్రిటిష్ ప్రభుత్వం వారు, మహాజనులు మహారాజావారి మార్గం అనుసరించి అస్పృశ్యతా కళంకం రూపుమాపి దేశంకోసం కీర్తి తేగలరని విశ్వసిస్తున్నాము

దేశంలో నూతన శాసన సభలకు ఎన్నికలు జరుగుతున్నాయి కాంగ్రెస్ మహాసభ తమ ఆశీస్సుల బలంచే ఎన్నికలు జయప్రదంగా జరిగి వ్యక్తుల, ప్రత్యేక సంఘాల అల్పస్వలాభాలకు గాక దేశ స్వాతంత్ర్య సంపాదనకు తోడ్పడుగాక అని కోరుతున్నాము

దేశాభ్యుదయం ముఖ్యంగా గ్రామవాసులపై ఆధారపడి ఉన్నది మహాజనులకు కానటువంటి శ్రేయస్సుకాదు మీరు సంకల్పించిన గ్రామ సౌభాగ్యపు టుద్యమం విస్తరించి దేశ భాగ్యానికి తోడ్పడుగాక

దేశంలో స్వాతంత్ర్యోద్యమం వికావికలై తెన్నుగానకున్నది. ఉద్యమం పునరుద్ధరించి విజయ యాత్రను తిరిగి సాగించడానికి పూనవలెనని సవినయంగా విన్నవించుకొంటున్నాము

దేశ కళ్యాణానికి లోక శ్రేయస్సుకు బద్ధకంకణులైన మీకు భగవానుడు ఆయురారోగ్యాల నిచ్చి మీ సదుద్యమ నిర్వహణకు తోడ్పడుగాక అని ప్రార్థిస్తున్నాము

ఇట్లు
విన్నవించే
గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షుడు, సభ్యులు

**గాంధీజీ ఉపన్యాసము**

"నేను ఇక్కడకు వచ్చిన ఉద్దేశం మీ అందరికి తెలిసినదే గుంటూరు జిల్లాలో తుఫాన్‌వల్ల విపరీతంగా నష్టపడిన ప్రదేశాలను కొన్నిటిని చూసినాను. ఒక ఊరినుంచి మరొక ఊరికి కారుమీద ఎగిరిపోతూ నేను ప్రజలకు కలిగిన నష్టం పూర్తిగా చూసి తెలుసుకొన్నానని చెప్పజాలను. కాని చాలా ఇండ్లు

బాగా నష్టపడినవని మాత్రం చెప్పగలను  వందలాది గృహాల పైకప్పులెగిరి పోయినాయి ఇళ్లు శిథిలాలయిపోయినాయి ప్రజలు కూడా చనిపోయినారు పశువులు వందలకొద్దీ చచ్చిపోయినాయి పెద్దపెద్ద చెట్లు మానులతో సహా కూలి పోయినాయి వాటి సంఖ్యకు లెక్కలేదు ఇప్పటికి మూడు మాసాలయినప్పటికీ కొన్ని ఇళ్లు ఇంకా పాడుపడే ఉన్నాయి పైరులకు కూడా నష్టం విపరీతంగా కలిగింది గుంటూరుజిల్లా తుఫాన్ నష్ట నివారణ కేంద్ర సంఘంవారి రిపోర్టులను చదివినాను కాని ఇప్పటి ప్రభుత్వంవారి వల్లనేమి, ఇతరులవల్లనేమి నష్టానికి తగిన సహాయం జరగలేదు కలిగిన నష్టంను చూస్తే జరిగిన సహాయం బహు స్వల్పమని చెప్పవచ్చు నాకీ ప్రభుత్వంలో పలుకుబడి లేదు నేను వారికి విన్నవించుకోగలను కాని నా మాట వారి చెవుల కెక్కదు మీలో అనేక మందికి నష్టం సంభవించలేదు కాబట్టి మీరందరూ నష్టపడిన వారికి సహాయం చేయవలె నేనీనాటి ఉదయం 6[1] నుంచి ఈ యాచనావృత్తి నారంభించినాను ప్రథమంలో ప్రాతఃకాలమందే వినయాశ్రమములో ప్రారంభించినాను వినయాశ్రమం తుఫాన్‌వల్ల నష్టపడిన ప్రదేశాలలో ఒకటి కాకపోయినా నా విన్నపం ప్రజలు ఆలకించినారు అక్కడి సభకు వచ్చిన వారిలో ఏదో కొంత ఇవ్వకుండా వెళ్ళిన వారు లేరు అదే విధంగా నేను దర్శించిన ప్రదేశాలన్నిటిలోను ఇదే పని చేసి ఉన్నాను

పరుచూరు గ్రామంలో అనేకమంది సోదరీమణులు తమ ఆభరణాలను కూడ ఇచ్చినారు ఇక ఇక్కడ నేనుండే కొద్ది నిమిషాలలో మీదగ్గర నుంచి సొమ్ము వసూలు చేస్తాను "

ఈ ఉపన్యాసానంతరం అనేకమంది తుఫాన్ నిధికి విరాళాలు సమర్పించినారు

జయ జయ నినాదాల మధ్య గాంధీజీ గుంటూరునుంచి బెజవాడకు ప్రయాణమయినారు తోవలో మంగళగిరి వాస్తవ్యులు ఆయనను దర్శించగలిగినారు గాంధీజీ కారుమీద కృష్ణానదిని ఆనకట్ట మీదుగా దాటి బెజవాడకు చేరినారు

తుఫాన్ నిధికి మహాత్ముడు చేసిన వసూళ్లు నగదు రూ॥ 890-9-8 లు, నగదు విలువ 102 రూపాయలు, చిల్లర సుమారు 252 రూపాయలు

## విజయవాడ

గాంధీజీ గుంటూరు నుంచి బెజవాడకు వస్తున్నారని నగర కాంగ్రెస్ వారి ప్రకటన ననుసరించి వేలకు వేలు ప్రజలు, తమ వ్యాపారాలను కట్టిపెట్టి ఆంధ్ర జింఖానా ఆవరణలో ఏర్పాటు చేసిన సభకు హాజరయినారు గాంధీజీ వారి సహచరులు సరిగా సాయంకాలం 4-50 నిమిషాలకు సమావేశ స్థలానికి చేరినారు అక్కడ బెజవాడ మున్సిపల్ చేర్మన్ కాకరపర్తి భావనారాయణ శ్రేష్ఠిగారు, నగర కాంగ్రెస్ సంఘాధ్యక్షులు శివలెంక మల్లికార్జునరావుగారు,

జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి పెదర్ల వెంకట సుబ్బయ్యగారు, అంజనాదేవి ఆశ్రమాధ్యక్షులు వేముల కూర్మయ్యగారు తమతమ సంఘాల పక్షాన గాంధీజీకి వినతి పత్రాలు సమర్పించినారు తరవాత గాంధీగారి ఇంగ్లీష్ ఉపన్యాసం అయ్యదేవర కాళేశ్వరరావుగారు తెలుగులోకి అనువదించి చెప్పినారు గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"నేను గుంటూరుజిల్లాలో తుఫాన్‌వల్ల నష్టపడిన ప్రదేశాలను చూడడానికి వచ్చినాను అక్కడ నేను చూసిన అనుభవాలను గురించి చెప్పడానికి తగినంత వ్యవధిలేదు గుంటూరుజిల్లాలో కొంతభాగమే తుఫాన్‌వల్ల నష్టపడింది ఆంధ్రదేశమంతా తుఫాన్‌వల్ల నష్టపడిపోయిందని ఇతర రాష్ట్రాలవారు అనుకొంటున్నారు ఈ తుఫాన్ బాధితులకు ఆంధ్రులు సరియైన సహాయం చేసి ఉండలేదు వినయాశ్రమంలో కూడా ఈ తుఫాన్‌వల్ల నష్టపడిన ప్రదేశాలకు డబ్బు వసూలు చేసినాను భగవంతుని దయవల్ల కొంతమంది నష్టపోకుండా ఉన్నారు నన్ను చూడడానికి ఇతర చోట్లనుంచి వచ్చిన కొంతమంది వద్ద కూడా డబ్బు వసూలు చేసినాను నేను తొందర తొందరగా రావడంవల్ల ఎంత మొత్తం వసూలయిందీ చెప్పలేను కొంతమంది స్త్రీలు నగలు కూడా ఇచ్చినారు నాకు వ్యవధి ఉంటే ఇంకా ఎక్కువ సొమ్ము వసూలు చేసి ఉండేవాణ్ణి తుఫాన్‌వచ్చి చాలా కాలం గడిచింది కదా అని ఉపేక్ష చేయరాదు అక్కడ అన్ని చిన్న చిన్న గుడిసెలుగా ఉన్నవి కొన్నిటికి గోడలు లేవు, కొన్నిటికి పైకప్పులు లేవు ధన సహాయం ఉంటే వీటన్నిటినీ బాగు చేయవచ్చు ఈ సభలోని వారందరూ ఎవరికి తోచిన డబ్బు వారు ఇప్పుడిచ్చి తరవాత చందాలు పోగుచేసి వారికి పంపవలె హిందూ దేశంలో ఎక్కడ ఏది జరిగినా బొంబాయివారు సహాయం చేయగలరని అనుకోవడం చాలా పొరపాటు వారి విషయం తెలుసుకొనేటందుకు వ్యవధి చాలదు ఇక్కడి విషయం మీకు బాగా తెలుసు పంటలు పోయి, పశువులు పోయి, ఇండ్లు పోయి, సంసారాలు పోయి ఉన్న మీ ఆంధ్ర సోదరుల కష్టాలను నివారించడం మీ విధి" అని చెప్పి, విరాళాలీయవలసిందని కోరినారు అంతట ఎవరికి తోచింది వారు ఇవ్వగా సుమారు 500 రూపాయలు వసూలయింది మరికొందరు బంగారు ఉంగరాలు మొదలుగాగల వస్తువులు కూడా ఇచ్చినారు

తరవాత గాంధీజీ రైలు స్టేషన్‌కు వెళ్ళి గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో వార్ధాకు వెళ్ళినారు

అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు గాంధీ బృందం వారికి భోజనాలు తెప్పించి రైలులో అందించినారు శివలెంక మల్లికార్జునరావుగారు గాంధీజీకి మేకపాలు తెప్పించి ఇచ్చినారు 'మహాత్మా గాంధీకి జై' అనే జయ జయ ధ్వానాల మధ్య రైలు కదలి వెళ్ళిపోయింది

## ఆంధ్రదేశంలో ఖాదీ

(యం కె గాంధీ)

1937 జనవరి 28వ తేదీన నేను గుంటూరు సభలో ఉపన్యసిస్తూండగా డాక్టర్ పట్టాభి సీతారామయ్య వ్రాసిన దిగువ ఉత్తరం నాకు చేరింది

"ఆంధ్రదేశంలో మీ కార్యక్రమం చాలా అవ్యవధిగా ఉండటమేకాక చాలా ఒత్తిడిగా కూడా ఉన్నది అందువల్ల ఇతరుల అవకాశాలకు భంగం కలిగించి, నేను మీకు హఠాత్తుగా కనిపించడం న్యాయం కాదని భావిస్తున్నాను అఖిలభారత చర్ఖా సంఘంవారి సర్టిఫికేట్లను పొందిన కొంతమంది ఖాదీ ఉత్పత్తిదారులు ఖాదీ ఖరీదు పెంపుదలను స్వప్రయోజనాలకోసం వినియోగించుకొంటున్నారు వారు ఖాదీ ధర పెంచటానికి గల ఇతర షరతులను ఆచరణలో పెట్టకుండా ఖాదీ ధరను మాత్రం పెంచివేస్తున్నారు ఈ విషయాన్ని మీరు వీలయితే మీ బెజవాడ ఉపన్యాసంలోనైనా స్పష్టంగా ఉదాహరించి చెప్పవలసిందని నేను మిమ్ములను కోరుతున్నాను ఇదిట్లా ఉండగా చరఖా సంఘంవారి సర్టిఫికేట్లు పొందని ఉత్పత్తిదారులు స్వచ్ఛమయిన ఖాదీ అమ్ముతున్నారనుకొన్నప్పటికి వారి పోటీకి సర్టిఫికేట్లు పొందిన ఖాదీ ఉత్పత్తిదారుల అమ్మకాలు, చర్ఖా సంఘంవారి అమ్మకాలు కూడా పడిపోయినాయి ఆంధ్రదేశంలోని వివిధాభిప్రాయాలుగల మిత్రుల సంతకాలతో ఒక ప్రకటన పత్రం తయారుచేసి దాని నకలును దీనితో మీకు పంపుతున్నాను ఒక్క మాటలో చెప్పవలసివస్తే సర్టిఫికేట్లు పొందిన షాపుల్లో అమ్మకాలు చాలావరకు పడిపోయినాయి కాబట్టి మీరు సర్టిఫికేట్లు పొందని ఖద్దరు వస్త్రాలను కొనరాదని ప్రజలను మందలించవలెనని కోరుతున్నాను అంతేగాక 'ఖద్దర్' అనే మాటను 'మజ్దూరీల పెంపుదలమీద చేతితో వడికి చేతితో నేసిన వస్త్రానికి మాత్రమే వర్తించగలద'ని వ్యాఖ్యానించ కోరుతున్నాను ఈ వ్యాఖ్యానం విరివిగా ప్రకటించవలె సర్టిఫికేట్ పొందిన వర్తకులు చేసిన కొన్నిలోపాలవల్ల వారిసర్టిఫికేట్లను రద్దుచేయడంజరిగింది ఇంకా కొంతమంది తమంతట తామే తమ సర్టిఫికేట్లను రద్దుచేసుకొన్నారు ప్రస్తుత పరిస్థితులలో వారికది లాభదాయకంగా ఉన్నది సర్టిఫికేట్లను రద్దు చేసుకొన్నందువల్ల వారి అమ్మకాలు పడిపోకపోగా పైపెచ్చు ప్రస్తుతం పెరగడానికి వీలున్నందువల్లనే వారట్లా చేసినారు కాబట్టి ఈ విషయంలో సరియైన నిర్ణయం తీసుకోవలసినవారు ప్రజలే "

ఈ విషయం గురించి ఆ సభలో మాట్లాడటానికి అవకాశం లేకపోయింది తుఫాన్ బాధా నివారణ నిధులకోసం అర్థించే కార్యక్రమం ఖాదీ పనితో కలగాపులగం చేయడం నాకిష్టం లేకపోయింది, అందువల్ల తరవాత నా బెజవాడ ఉపన్యాసంలో కూడా నేను దానిని గురించి ఎత్తుకోలేదు కాని ఆ ఉత్తరంలోని విషయం చాలా ప్రాముఖ్యమయినది ఖాదీ విషయంలో ఇతర రాష్ట్రాలకు లేని అవకాశాలు ఆంధ్రకు చాలా ఉన్నవి ఇతర రాష్ట్రాలకు లేని నేర్పరితనం ఆంధ్రకు సహజంగా ఉన్నది. కాని ఇతర చోట్లవలెనే ఆంధ్రలో కూడా కొంత

మంది వర్తకులు ఏవో కొన్ని పైసలు సంపాదించుకొనేటందుకు లోభిస్తారు అందువల్ల వారు చేతంతువులకు సన్నిహిత మిత్రంగాను, దరిద్ర నారాయణులకు ఊతకఱ్ఱగాను, గ్రామస్థులకు జీవనాధారంగానూ ఉండే ఖాదీ ఉద్యమానికి సైతం హానిచేయటానికి జంకరు అగ్రగాములయిన ఖాదీ కార్యకర్తలలో సైతం పరస్పర సహకారం లేకుండటం మరింత విచారకరమయిన విషయము ఖాదీ విషయంలో ఆంధ్రదేశ పతనం గురించి వినయాశ్రమంలో నాకు కనువిప్పయింది అది చాలా విచారకరము ఆంధ్రదేశంలో సీతారామశాస్త్రి పట్ల నాకుగల అభిమానం గురించి, దేశభక్త వేంకటప్పయ్య పట్ల నాకున్న గౌరవం గురించి తెలియనివారు లేరు మొదటివారు రెండోవారి అంతేవాసి దేశభక్తుని మాట సీతారామశాస్త్రికి శాసనము ఆంధ్రుల ప్రత్యేక లక్షణమయిన ఉద్రేకం ఈ ఇద్దరిలోను ప్రతిబింబిస్తుంది శ్రీ వేంకటప్పయ్య దుర్బలుడయిన గురుపు, క్షమించరాని విషయాలను కూడా క్షమించగల ఉదారులు సీతారామశాస్త్రి పట్ల నాకున్న అభిమానంవలన ఆయన లోపాలను నేను తెలుసుకోలేకపోయి నాను అఖిలభారత చర్ఖాసంఘ ప్రతినిధిగానూ, ఖాదీ ప్రేమియుడుగానూ నేనట్లా ప్రవర్తించడం క్షమార్హ్యంకాని లోపము నేను జనవరి 23 తెల్లవారు జామున వినయాశ్రమానికి వెళ్ళినప్పుడు ఒక రాట్నం కావలెనని కోరినాను కాని ఆశ్రమంలో ఉన్న పందొమ్మిది రాట్నాలలో ఒక్క రాట్నం కూడా పనిచేసే స్థితిలో లేదు వారు ఎరవాడ చర్ఖాను ఒకదానిని తీసుకొని వచ్చినారు అది పూర్తిగా చెడిపోలేదు కాని పని చేయడానికి తగిన స్థితిలో లేదు దూది ఏకే కమాన్ కూడా లేదు వినయాశ్రమంలో ఒక్కరికి కూడా దూది ఏకడం చేతకాదని తెలుసుకొన్నప్పుడు నాకు చాల విచారం వేసింది. నూలు వడికే వారందరూ అంగడిలో కొన్న ఏకులతో వడుకుతున్నట్లు తెలిసింది అంతటితో నా మనసు కుంగిపోయింది నా విచారం, నాకు కలిగిన ఆశాభంగం వెల్లడించి నాను "ఉప్పే తన రుచిని పోగొట్టుకొన్నప్పుడు ఇక దానికి ఉప్పుదనం కల్పించేదెట్లా" అని కఠినంగా అన్నాను పాపం! సీతారామశాస్త్రి మాట్లాడలేక పోయినాడు వేంకటప్పయ్య చెక్కిళ్లనుంచి కన్నీళ్లురాలినాయి తరవాత మేము మోటారులో పరుగెత్తుతుండగా ఈ తప్పును రెండునెలలలో సరిదిద్దగలనని వేంకటప్పయ్య వాగ్దానం చేసినారు 'శాస్త్రి, నా అభిప్రాయాల కనుగుణంగా తయారై వినయాశ్రమం చర్ఖా ఏకుల కమానుల మంజుల స్వనాలతో ప్రతిసినదింపచేయగలడ'ని ఆయన విశ్వాస పూరితములయిన వాక్కులలో వివరించి చెప్పినారు సీతారామశాస్త్రి అప్పుడక్కడే ఉండి తన నాయకుని వాగ్దానం చెల్లించగలనని ప్రమాణం చేసినారు

ప్రమాదకరమయిన తప్పు చేయటం కూడా మానవ లక్షణమే కాని ఆ తప్పును దిద్దుకొని తిరిగి దానిని చేయకుండవలెనని నిశ్చయించుకొంటేనే అది మానవ లక్షణ మవుతుంది చేసిన వాగ్దానం పూర్తిగా చెల్లిస్తే ఆ తప్పును విస్మరించవచ్చు ఆ ఇద్దరు మిత్రులను నేను బాగా ఎరుగుదును. తాము చేసిన

వాగ్దానం చెల్లించరనే భయం నాకు లేదు

ఖద్దరు అభివృద్ధి కావలసినంత కాకపోవడానికి కారణం పాఠకులిప్పుడు గ్రహించి ఉంటారు ఖద్దరులోని సహజ లక్షణం వల్లనే అది ఈనాడు గణనీయ మయిన అభివృద్ధి పొందగలిగింది కాని అఖిల భారత చర్ఖా సంఘంవారి ఏజంట్లనుంచి ఆశించదగిన పనులు వారు చేయగలిగితేనేగాని ప్రతి గ్రామంలోను అది వ్యాపించడానికి సాధ్యం కాదు వారు నేనింతకు పూర్వం ప్రచురించిన ఖాదీ శాస్త్రంలోని ప్రాథమిక సూత్రాలనైనా తెలుసుకొని తీరవలె ఖాదీ శాస్త్రంలో ప్రవీణులయినవారు ఇంకా అనేక పరిశోధక విషయాలను తెలుసుకో వలసి ఉంటుంది

డాక్టర్ పట్టాభి వ్రాసిన ఉత్తరంలోని సామాన్య విషయాలను విడిచిపెట్టి ఇతర విషయాలను ఎత్తుకొని వ్రాసినట్లుగా పాఠకులు భావించకుందురుగాక ఆయన సూచించింది కేవలం రోగ లక్షణం నేను ఆ రోగానికి మూల కారణం బయట పెట్టడానికి సాహసించినాను

హరిజన్
6-2-1937

## హిందీ పట్ట ప్రదానోత్సవము-మద్రాస్‌కు గాంధీజీ రాక

1937 మార్చి 28 సాయంకాలం మద్రాస్ త్యాగరాయ నగరంలో ఉన్న దక్షిణ భారత హిందీ ప్రచార భవనాలలో జరగ నున్న హిందీ పట్టభద్రుల పట్ట ప్రదానోత్సవానికి గాంధీజీ అధ్యక్షత వహించడానికి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాస్‌కు వచ్చినారు మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లో దిగిన జనుల వత్తిడి ఎక్కువగా ఉంటుందనే భయంచేత ఆయన పొన్నేరి స్టేషన్ లోనే రైలు దిగి మోటారు కారులో సరాసరి హిందీ ప్రచార భవనానికి చేరుకొన్నారు శ్రీ రాజగోపాలాచారిగారు పొన్నేరి స్టేషన్‌లోనే గాంధీజీని కలుసుకొని చెన్న నగరానికి తీసుకొని వచ్చినారు గాంధీజీతో వచ్చిన శ్రీమతి కస్తూరిబాయి, జమన్‌లాల్ బజాజ్‌గార్లు మాత్రం పొన్నేరినుంచి రైలులోనే మద్రాస్‌కు చేరినారు

గాంధీజీ మద్రాస్ సెంట్రల్ స్టేషన్‌లో దిగుతారనే అభిప్రాయంతో వారి దర్శనం కోసం వేలకొద్దీ ప్రజలు స్టేషన్ ప్లాటుఫారం మీద, స్టేషన్ ఆవరణలో, వీధులలో ఇసక వేసిన రాలనంత వత్తిడిగా క్రిక్కిరిసి పోయినారు మద్రాస్ మేయర్ కె శ్రీరాములునాయర్, భక్తవత్సలం, మోటూరి సత్యనారాయణ, టి. ఆర్. వెంకట్రామశాస్త్రి, కాకా కలేల్‌కర్, శ్రీమతి అంబుజమ్మాళ్, రామన్ సతిగార్లు గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో వస్తూన్న శ్రీమతి కస్తూరిబాయి, జమన్‌లాల్ బజాజ్‌గార్లకు సెంట్రల్ స్టేషన్‌లో స్వాగతం చెప్పి వారిని మోటారులో హిందీ ప్రచార భవనానికి తీసుకొని వెళ్ళినారు

హిందీ ప్రచార కార్యాలయావరణలో మనోహరంగా నిర్మింపబడిన

విశాలమయిన పందిరిలో పట్ట ప్రదానోత్సవం జరిగింది స్నాతకులేగాక వందల కొద్దీ పుర ప్రముఖులు కూడా ఆ సభకు వచ్చినారు శ్రీ టంగుటూరి ప్రకాశం, శ్రీ బులుసు సాంబమూర్తి, శ్రీ ముళ్ళపూడి పల్లంరాజు, శ్రీ దండు నారాయణ రాజు, సర్ అల్లాడి కృష్ణస్వామి, డాక్టర్ పండాసై, శ్రీ యాకూబ్ హుసేన్, శ్రీ మాగంటి బాపినీడు, శ్రీ బచ్చు జగన్నాథదాసు, శ్రీ వెంకటస్వామి నాయుడు, శ్రీ యు రామారావు, శ్రీ ఏ నటేషన్ మొదలయిన ప్రముఖులు వేదికపై ఆసీనులై ఉన్నారు

గాంధీ మహాత్ముడు సాయంకాలం 6½ గంటలకు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుగారు, పురుషోత్తమదాస్ టాండన్, జమన్‌లాల్ బజాజ్, మహదేవ దేశాయ్, కస్తూరిబా గాంధీగార్లతో జయజయధ్వనుల మధ్య సభలో ప్రవేశించి వేదికపైన ఆసీనులయినారు

గాంధీజీ వేదికపై కూర్చుని అటూ ఇటూ పరికించి నాగేశ్వరరావుగారు వేదికపై ఒక మూల కూర్చుండటం చూసి,నవ్వుతూ దగ్గరకు పిలచి, "మీరట్లా దూరముగా కూర్చొనడానికి వీలులేదు " రండని పిలిచి చేయిపట్టుకొని అధ్యక్ష వేదికలో తమ పక్కన కూర్చోబెట్టుకొని సభాకార్యక్రమ పత్రికను చేతికిచ్చి దానిని నిర్వహించడంలో తమకు తోడ్పడుతూ ఉండవలెనని కోరినారు సభా కార్యక్రమం ప్రార్థనలతో ప్రారంభమయినది

మహాత్ముడు అధ్యక్షత వహించి పట్ట ప్రదానోత్సవం ప్రారంభించినారు ఆయన హిందీలో ఉపన్యసిస్తూ సభ్యులలో ఎక్కువ మందికి తన ప్రసంగం తెలియని పక్షంలో అది నిరుపయోగమవుతుందనీ, అట్లాకావడం తనకిష్టంలేదనీ తన ప్రసంగానికి తానే అనందిస్తూ కూర్చోవడం బొత్తిగా ఇష్టంలేదనీ అంటూ ఆ సభలో హిందీ ఉపన్యాసాన్ని బాగా అర్థం చేసుకోగలవారిని చేతులెత్త వలసిందని కోరినారు చాలా మంది చేతులెత్తినారు తరవాత హిందీ భాష అర్థంకాని వారిని చేతులెత్తమని కోరితే కొంతమంది చేతులెత్తినారు వారిలో జి ఏ నటేశన్, అల్లాడి కృష్ణసామయ్యంగార్లున్నారు హిందీ తెలియదనే వారు చేతులెత్తినప్పుడు కొందరు 'సిగ్గు సిగ్గు' అని కేకలు పెట్టినారు మహాత్ముడా విషయం పురస్కరించుకొని ప్రసంగిస్తూ హిందీరాదని చేతులెత్తిన వారిలో చాలా మంది వయోధికులుగా కనిపించినప్పటికీ వారిలో ఎక్కువ మంది సుప్రసిద్ధులయిన న్యాయవాదులు, ప్రచురణకర్తలు కూడా ఉన్నారనీ, హిందీ నభ్యసించడం వారికే మాత్రం కష్టసాధ్యం కాదనీ అన్నారు తరవాత వారింకా ఇట్లా ఉపన్యసించినారు

"అభిలాష ఉంటే చాలా మంది హిందీని తేలికగా నేర్చుకోగలరు, రోజుకొక అరగంట కాలంలోనే వారు హిందీ భాషలో చక్కని జ్ఞానం సంపాదించ గలరు

హిందీ భాషను జాతీయ భాషగా నేర్వడం తప్పుగాను, ఆ భాషలో పాండిత్యం సంపాదించడానికి ప్రయత్నించడం మరింత తప్పుగానూ భావించే

వారు కొందరున్న మాట నిజమే కాని అటువంటి ప్రతికూలాభిప్రాయంవల్ల మాతృభాషకు భంగం కలుగుతుందనే భయానికి ఎటువంటి అవకాశంలేదు ప్రాంతీయ భాషకు రాష్ట్ర భాషకు ఏ విధమయిన వైరుధ్యంలేదు ప్రాంతీయ భాషలు పరిపూర్ణంగా అభివృద్ధిపొంది పుష్టివంతాలై వికసించినప్పుడే రాష్ట్ర భాషకు కూడా మంత పుష్టి వికాసాలు కలగ గలవు ప్రాంతీయ భాషలు దుర్బలా లయితే రాష్ట్ర భాషకూడా బలహీన మవుతుంది కనక హిందీని జాతీయ భాషగా అభ్యసించడంవల్ల ప్రాంతీయ మాతృ భాషలకు భంగం కలుగు తుందని భావించడం కేవలం నిరాధారము భారతీయ భాషలలో హిందీని రాష్ట్ర భాషగా అంగీకరించవలెనని నేను సూచించడానికి ముందు గుజరాతీ, మరాఠీ, బెంగాలీ మొదలయిన ఇతర భాషలను గురించి కూడా దీర్ఘంగా ఆలోచించినాను తెలుగు తమిళభాషలను నేర్చుకొనేటందుకు నేను స్వయంగా ప్రయత్నించినాను కాని ఆ ప్రాంతీయ భాషలలో వేటికీ జాతీయ భాష అయ్యేటందుకు హిందీ భాషకున్న లక్షణాలు లేకపోవడంచేత వాటిని నేను వదలి వేయవలసి వచ్చింది కనక ప్రతి భారతీయుడు హిందీ భాషనభ్యసించి భారత జాతీయతను బలపరచవలె భారతీయులందరికీ ఒకేభాష లేకుంటే వారిలో జాతీయత బలపడదు

ఇతర భాషలకంటె హిందీ భాషాభ్యాసం దక్షిణ భారతీయులకు కూడా చాలా సులభము తమిళదేశం నుంచి వచ్చిన మా కోడలు (సి రాజగోపాలా చారిగారి కుమార్తె) గుజరాతీ భాషలో కంటె హిందీ భాషలోనే మంచి పరి చయం సంపాదించ గలిగినది హిందీ ప్రచారక సమితివారు దక్షిణహిందూ దేశంలో హిందీ భాషను చాలా వరకు వ్యాపింపచేసిన మాట నిజమే కాని అంత మాత్రాన నేను సంతృప్తిపడజాలను విద్యార్థికులు, స్త్రీలు హిందీ భాషాభ్యాసానికి ఇప్పటికంటె అధికంగా పూనుకోవలె"

గాంధీజీ చేసిన ఈ ఉపన్యాసానంతరం శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ హిందీ భాషా ప్రాముఖ్యం గురించి, అది జాతీయ భాషగా ఉండవలసిన అవసరం గురించి విపులంగా ఉపన్యసిస్తూ పట్టభద్రులకు హితోపదేశం చేసినారు

గాంధీజీ స్నాతకోత్సవం ముగిస్తూ పట్టభద్రులు తమ ప్రమాణం ఏమరక అనుష్ఠిస్తూండ వలెనని కోరినారు

నాగేశ్వరరావుగారి కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది

## గాంధీమహాత్మునిలో ఆంధ్రుల విశ్వాసము

నంద్యాలలో జరిగిన 16 వ ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభలో 1937 జూన్ 22 వ తేదీన గాంధీజీ నాయకత్వం గురించి తీవ్ర వాదోపవాదాలతో, పరస్పర నిందారోపణలతో రెండు గంటలసేపు చర్చ జరిగింది సోషలిస్టులు వక్తలను తరచుగా హేళన చేసివారు.

టంగుటూరు ప్రకాశంగారు మహాత్మాగాంధీలోనూ, కాంగ్రెస్ కార్య

నిర్వాహక వర్గంలోనూ సభవారి విశ్వాసం ప్రకటిస్తూ, మంత్రివర్గ నిర్మాణ విషయంలో ఏర్పడిన ప్రతిష్టంభనను గురించి ప్రభుత్వానికి, కాంగ్రెస్‌కు తృప్తికరమయిన ఒడంబడిక కుదరకుంటే గాంధీజీ నాయకత్వంకింద కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారి ఆజ్ఞలను శిరసావహించగలమని మహాసభలో ఒక తీర్మానం ప్రతిపాదించినారు

ఈ తీర్మానానికి సోషలిస్టులు గాంధీజీ నాయకత్వానికి సంబంధించిన మాటలను తొలగిస్తూ ఒక సవరణ ప్రతిపాదించినారు ఆ సవరణ ఇది అఖిల భారత కాంగ్రెస్ సంఘంవారు కోరిన షరతును అంగీకరించకుంటే కాంగ్రెస్ మంత్రిత్వం స్వీకరించకూడదనీ, సంతృప్తికరమయిన ఒడంబడిక కుదరకుంటే ఈ రాష్ట్రిం కాంగ్రెస్ ఆజ్ఞలను శిరసావహించి నిర్వర్తించడానికి సంసిద్ధంగా ఉన్నదనీ ఈ సభవారు అభిప్రాయపడుతున్నారు "

ప్రకాశం పంతులుగారు తన తీర్మానం ప్రతిపాదిస్తూ, గాంధీజీ నాయకత్వంకింద కాంగ్రెస్‌లో ఐకమత్యం చేకూరి, కాంగ్రెస్‌వాదులలో భేదాభిప్రాయాలు కలిగినవనే అపోహ శత్రువుల మనసులనుంచి తొలగిపోవలెనని మాట్లాడినారు.

చాలామంది ఈ తీర్మానంపై మాట్లాడిన తరవాత, మద్దూరి అన్నపూర్ణయ్యగారు ఈ తీర్మానం ఎదిరిస్తూ "గాంధీజీ ఎప్పుడూ లొంగిపోవడమే గాని జయించినది లేదు ఆయన స్వాతంత్ర్య పతాకాన్ని కిందికి లాగినారు" అన్నారు తీవ్రంగా సభలో "కాదు కాదు" అనే కేకలు వినిపించినాయి అయినప్పటికీ ఆయన తన ఉపన్యాసాన్ని సాగిస్తూ, "శత్రువును ప్రేమతో జయించవలెననే గాంధీజీ రాజకీయ సిద్ధాంతానికి మేమెంతమాత్రం తలవొగ్గజాలము, మేము కాంగ్రెస్‌కు విధేయులుగా ఉంటాము గాంధీజీ కాంగ్రెస్‌కంటె గొప్పవారు కారు" అన్నారు

తరవాత బులుసు సాంబమూర్తిగారు చర్చకు సమాధానమిస్తూ, "పారతంత్ర్య జాతికి స్వాతంత్ర్యాన్ని సంపాదించేటంతవరకు శాంతి ఉండదు గాంధీజీ భారతజాతికి ప్రాతినిధ్యం వహిస్తున్నాడు ధర్మము, సత్యము అనే ఉన్నతాశయాలు ఆయనలో మూర్తీభవించినవి" అన్నారు

తరవాత సోషలిస్టుల సవరణ వోటుకు పెట్టగా నలభై మంది అనుకూలంగానూ, తొంభై మంది ప్రతికూలంగానూ వోటు చేసినారు

గాంధీజీలో విశ్వాసం ప్రకటిస్తూ ప్రకాశం పంతులుగారు ప్రతిపాదించిన అసలు తీర్మానం అంగీకరింపబడింది

## నిజమయితే లజ్జాకరమే
(యం. కె గాంధీ)

ఇటీవల ఠక్కర్ బాబా నిజాం రాష్ట్రంలో సంచారం చేసినప్పుడు ఆయనకు తెలిసిన కింది సమాచారం నాకు పంపినాడు.

"ఆరు నెలల క్రితం నిజాం రాష్ట్రంలోని వరంగల్లు జిల్లాలోని కాశేపల్లి గ్రామంలో జరిగిన ఒక ఉదంతం - హిందువులను, ముఖ్యంగా హరిజనులను క్రైస్తవ మత ప్రచారకులు తమ మతంలో కలుపుకొనేటందుకు అవలంబించిన విధానాలను తెలియజేస్తున్నది నిర్ణీత దినానికి-కొన్ని రోజులు ముందుగా గ్రామాలలోని ఉపాధ్యాయులు పరిసర గ్రామాలకుపోయి జరగనున్న ఉదంతాన్ని గురించి వార్తలు పంపి హిందువులలోని అన్ని కులాలవారు - ముఖ్యంగా హరిజనులు - ఎక్కువ మంది సమయానికి హాజరయ్యేటట్లు ఏర్పాటు చేసినారు తరవాత ఆ ప్రదేశానికి పాస్టర్ పండ్రెండేళ్ల వయసుగల ఒక బాలికను తీసుకొని వచ్చి ఆమె అక్కడ హాజరయిన వారి రోగాల నన్నిటినీ నివారణ చేయగలదని, దైవ సన్నిధానానికి చేరేటందుకు సరయైన మార్గం చూపించ గలదని కూడా చెప్పినారు

పాస్టరు నిలబడి అక్కడ ఉన్నవారిని సంబోధిస్తూ ఇట్లా అన్నారు 'మీరు ఎప్పుడో మృతి చెంది అదృశ్యులయిన దేవుళ్లను నమ్ముకొంటున్నారు మీ రాముడు పుట్టి మామూలు మనిషిలాగా జీవించి చనిపోయినాడు కృష్ణుడు కూడా అంతే కాకపోతే ఆయనకు చాలా మంది భార్యలున్నారు అదే ఆయన గొప్పతనము మీ ముందు క్రీస్తు అపరావతారం ప్రత్యక్షంగా ఉన్నది ఈమెలో క్రీస్తు ఉన్నాడు ఆమె చేతులను మీరు తాకినంతనే మీ రోగాలన్నీ నివారణ అయిపోతాయి దానినిబట్టి నే చెప్పిన విషయాలు పరీక్షించవచ్చు ఎప్పుడో వెళ్ళిపోయిన ప్రయోజనం లేని దేవుళ్లను మీరు నమ్ముతారు మేరీ కన్యకు పుట్టిన యేసుక్రీస్తు మోక్షమార్గం చూపిస్తూ ప్రబోధించినారు ఆయన బాహ్య దృష్టిలో మరణించినప్పటికీ మూడో రోజు ప్రపంచంలోని లక్షలాది ప్రజల పాపాలను తుడిచివేయడానికి మళ్ళా లేచి వచ్చినారు కాబట్టి మీరందరూ ఆయనను విశ్వసించి ఆయన అడుగుజాడలలో నడవవలె" ఈ ఉపన్యాసానంతరం ప్రతి మనిషీ ఒక అణా చందా ఇవ్వవలెననీ, లోహపు క్రాస్‌కు రెండు అణాలు ఇవ్వవలెనని నిర్ణయించినారు అంతేగాక నిరంతరం ఆ క్రాసు వేసుకొని క్రైస్తవ మతంలోని గొప్పతనం, సత్యం నమ్ముకొనట్లయితే రోగులకు జబ్బులు నయము కావని కూడా ప్రబోధం జరిగింది

ఇట్లా రెండు పర్యాయాలు జరిగింది మూడో పర్యాయం జిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి, కొందరు స్నేహితులునూ క్రైస్తవ మత ప్రచారకుల దగ్గరకు పోయి, 'మీరు మీ మతం మీ ఇష్టం వచ్చినట్లు ప్రచారం చేసుకోవచ్చు. కాని అసహ్యాకరాలయిన అసత్యాలను పదేపదే చెప్పి ప్రజల మనసులను చీకాకు పరచవద్దని' కోరినారు స్థానిక పోలీసువారు నెమ్మదికి భంగం కలుగుతుందనే భయంతో తరవాత కార్యక్రమం నిలిపివేసినారు."

ఇది నిజమయితే దానంతటదే నిరసించతగినది దీనికి సంబంధించిన మత ప్రచార సంస్థ ఈ ఆరోపణను విచారించి పర్యవసానం తెలుపగోరుతున్నాము

## గాంధీజీ విద్యార్థి వేతనాలు

1937 జూలై మొదలు 1938 జూన్ అంతంవరకు ఆంధ్రదేశంలోని హరిజన బాలురకు ఉన్నత విద్యకోసం లభించిన గాంధీజీ విద్యార్థి వేతనాలు

ఆంధ్ర

| | పేరు | స్టడి ఆఫ్ కోర్స్ | రూ |
|---|---|---|---|
| 1 | డి వెంకన్న | I A Sr | 5 |
| 2 | పి వెంకటస్వామి | B A (Hons ) | 15 |
| 3 | పి జే మనోహరమ్ | వెటర్నరీ | 15 |
| 4 | సి నారాయణ | B A (Hons ) | 15 |
| 5 | వి లక్ష్మయ్య | L I M | 10 |
| 6 | యం రామానుజదాసు | L I M | 10 |
| 7 | బి భీమన్న | B Ed | 15 |
| 8 | బి గోపాలస్వామి | I A | 10 |

నిజాం రాష్ట్రము

| | పేరు | స్టడి ఆఫ్ కోర్స్ | రూ |
|---|---|---|---|
| 89 | యం హరిదాసు వజీర్ గ్వమ్కర్ | I A Jr | 5 |
| 90 | శ్రీమతి ఏ లలితాదేవి | B A Jr | 10 |
| 91 | బి యస్ రాజరత్నం | L A Sr | 10 |
| 92 | యం బాబయ్య | B A Sr | 10 |

'హరిజన్'
5-6-37

## తాటిపండ్లు - గింజలు

(యం కె గాంధీ)

ఆంధ్ర కార్యకర్త ఒకరు ఇట్లా వ్రాస్తున్నారు "ఆంధ్రదేశంలో బాగా పండిన తాటిపండ్లను సేకరించి గ్రామస్థులు అనేక విధాలుగా ఉపయోగించు కొంటారు తాటిపండ్ల గుజ్జు పాడిపశువులకు కుడితితో పెడతారు. ఒక్కొక్క ప్పుడు ధాన్యపు పిండిలో కలిపి రొట్టెగా కూడా తయారుచేస్తారు తాటి గింజలను ఇండ్లకు వెనక దొడ్లలో గోతిలో పాతి, పైన మట్టివేసి దాదాపు నాలుగు నెలలు ఉంచుతారు ఆ పైన తవ్వగా అవి తేగలుగా తయారవు

తాయి వాటిని కాల్చి తింటారు ఆంధ్రదేశంలో చాలా గ్రామాలలో వ్యవసాయపు పనులు లేని తరుణంలో పేదలకిది కొంతవరకు ఆహారంగా కూడా ఉపయోగపడుతుంది '

గుజరాతులో కూడా ఈ పండ్లు తింటారన్న సంగతి నాకు తెలుసు కాని తేగల ఉపయోగం నాకు తెలియదు దానిని ప్రతిచోటా ప్రవేశపెట్టవచ్చు

మాతో కొంత కాలంనుంచి ఉంటున్న ఒక జర్మన్ స్నేహితునితో నేనిటీవల మాట్లాడడం తటస్థించింది అప్పుడు నేను కండ పుష్టికోసం రష్యన్‌లు పొద్దుతిరుగుడు పూవు నూనె పైన ఆధారపడి ఉంటారని 'లో' రచించిన రష్యన్ పుస్తకాలలోనుంచి ఈ దిగువ పేరా చదివి వినిపించినాను

"మేము ఎకరాలకొద్దీ పొద్దుతిరుగుడు పూవుల చెట్లను పెంచుతాము అది తేలికగా పెరుగుతుంది వాటి గింజల నూనెలో గ్రీసు నాగరికతకు పునాదియైన ఆలీవ్ నూనెలో ఉన్నటువంటి పుష్టికరమయిన పదార్థమున్నది "

ఇది విని ఆ జర్మన్ స్నేహితుడు 'ఇది నాకు కొత్తకాదు జర్మనీలో ఈ నూనె ఎక్కువగా వాడుకలోనే ఉన్నది చాలా రుచిగా కూడా ఉంటుంది మేము తోటలలో ఈ మొక్కలను అందంకోసం పెంచుకొంటాము గింజ పట్టడం తోటే దానిని తవ్వి వేస్తుంటాము' అని, ఈ సంవత్సరం పొద్దుతిరుగుడు పూవు గింజలనుంచి రుచికరమయిన నూనెను తయారుచేస్తానని ఆ జర్మన్ మిత్రుడు వాగ్దానం చేసినాడు

ఈ విషయం తెలిసిన వారందరూ తమతమ అనుభవాలను నాకు తెలుపగోరుతున్నాను

'హరిజన్'
5-6-1937

## మద్రాస్‌లో కాంగ్రెస్ ప్రభుత్వ నిర్మాణము

1935 నూతన రాజ్యాంగ చట్టం కింద మద్రాసు రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో కాంగ్రెస్ సభ్యులు అధిక సంఖ్యాకులుగా గెలుపొందినారు కాని వారు మంత్రివర్గంలో చేరేటందుకు బ్రిటిష్ ప్రభుత్వంవారిని కొన్ని షరతులు కోరినారు కాంగ్రెస్ మంత్రులు రాజ్యాంగ చట్టానికి లోబడి వ్యవహరిస్తూన్నంతవరకు గవర్నర్లు తమ ప్రత్యేకాధికారాలను చలాయించి మంత్రుల పరిపాలనలో జోక్యం కలిగించుకోకూడదనేది వాటిలో ప్రధానమయిన షరతు దానిని బ్రిటిష్ ప్రభుత్వంవారు అంగీకరించనందున గాంధీజీ ప్రభుత్వ పద్ధతిని నిరసిస్తూ 1937 మార్చి 30 వ తేదీన ఒక ప్రకటన చేసినారు తరవాత మద్రాస్ గవర్నర్ 1937 ఏప్రిల్‌లో మద్రాస్‌లో ఒక తాత్కాలిక మంత్రివర్గాన్ని ఏర్పాటు చేసినారు 1937 ఏప్రిల్ 1 వ తేదీన రాజ్యాంగ చట్ట ప్రతికూల దినం జరపడం జరిగింది గవర్నర్ నిర్మించిన తాత్కాలిక మంత్రి వర్గం 1937 ఏప్రిల్ నుంచి 1937 జూలై

14 వరకు కొనసాగింది జూలై 14 వ తేదీన మొత్తంమీద కాంగ్రెస్ కోరిన ప్రధానమయిన షరతులను గవర్న రంగీకరించినందున మద్రాస్‌లో సి రాజ గోపాలాచారి ప్రధానమంత్రిగాను, ప్రకాశం, గిరి, గోపాలరెడ్డి మొదలయినవారు మంత్రులుగా కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పాటయినది

**శ్లాఘనీయమైన కార్యాచరణము**
(మహాదేవదేశాయి)

అస్పృశ్యతా కళంకాన్ని తుడిచివేయడంలో అధికారులు అశ్రద్ధగా కానీ, అనిశ్చయంగా కాని లేరనడానికి తార్కాణంగా ఆంధ్ర హరిజన సేవకసంఘ కార్యదర్శి మాకీ కింది ఉదంతం తెలియజేసినారు

"సంస్కృత పాఠశాలలో తమ చదువులను పూర్తిచేసుకొన్న నలుగురు హరిజన విద్యార్థులలో ఒకరు ఉన్నత సంస్కృత విద్యకోసం విజయనగర మహారాజాగారి సంస్కృత కళాశాలకు పోదలచుకొన్నారు విజయనగరంలోని మహారాజాగారి సంస్కృత కళాశాల ఆంధ్రదేశంలో సంస్కృత భాషాభ్యాసానికి ప్రసిద్ధికెక్కి చాలా సంవత్సరాలనుంచి పని చేస్తూన్నది ఆ కళాశాలకు విద్యార్థి వసతి గృహమున్నది అందులో విద్యార్థులు ఉండేటందుకు, భోజనాది సౌకర్యాలకూ కూడా ఏర్పాట్లు ఉన్నాయి

ఈ హరిజన విద్యార్థి తనంతట తాను కళాశాలలో చేరేటందుకు దరఖాస్తు పెట్టుకొంటే బహుశా కొన్ని అభ్యంతరాలు కలగవచ్చునని భయపడినందున హరిజన సేవక సంఘం ద్వారా తన దరఖాస్తును కళాశాలాధికారులకు పంపినాడు ఆంధ్రరాష్ట్ర హరిజన సేవకసంఘ సాధారణ గౌరవ కార్యదర్శి శ్రీ మాగంటి బాపినీడు యం యల్ ఏ, గారు ఆ విద్యార్థికి కళాశాలలోను, కళాశాలకు సంబంధించిన హాస్టల్‌లోను ప్రవేశ మీయవలెనని సిఫార్సు చేస్తూ ఆ దరఖాస్తును కళాశాలాధికారులకు పంపినారు.

"ఆ హరిజన విద్యార్థిని కళాశాలలో చేర్చుకోగలనని, హాస్టల్‌లో చేర్చుకొనే విషయం ఆలోచించవలసి ఉంటుంద"ని కాలేజి ప్రిన్సిపాల్ ప్రత్యుత్తరం వ్రాసినారు

కొన్ని రోజుల క్రితం ఆ విద్యార్థి విజయనగరం కళాశాలలోను, హాస్టల్‌లోనుకూడా చేరడానికి వెళ్ళినాడు ప్రిన్సిపాల్ కొంతసేపు సందేహించి కాలేజిలో చేర్చుకొనేటందుకు అంగీకరించినారు కాని హాస్టల్‌లో చేరడానికి వీలులేదని చెప్పి ఆయన వానికి సంబంధించిన రికార్డును ఎస్టేట్ కలెక్టర్ అభిప్రాయంకోసం పంపినారు (విజయనగరం ఎస్టేట్ అప్పుడు కోర్టు ఆఫ్ వార్డ్స్ ఆధీనంలో ఉన్నది ఎస్టేట్ కలెక్టర్ శ్రీ ఆర్. యస్ సత్యనాథన్ ఐ.సి యస్ దానికి మేనేజర్‌గా ఉన్నాడు) ఆ హరిజన విద్యార్థిని కళాశాలలో చేర్చుకోవలెనని ఎస్టేట్ కలెక్టర్ ఉత్తరువులు జారీచేసినారు ఆ ప్రకారం ఆ విద్యార్థి కళాశాలలో చేరినాడు "

కళాశాలలోని చాలామంది విద్యార్థులు ఇందుకు అభ్యంతరపెట్టి వారం దరూ ఒక సంఘంగా పోయి హరిజన విద్యార్థి కళాశాలలో ఉంటే తామంతా దానిని విడిచివేయవలసి వస్తుందని ఎస్టేట్ కలెక్టర్‌కు విన్నవించుకొన్నారు ఎస్టేట్ కలెక్టర్, హరిజన విద్యార్థిని కళాశాలలో చేర్చుకోకపోవడం జరుగనేర దనీ, అతనికి ప్రవేశ మిచ్చి తీరవలెననీ అన్నారు

ఆ తరవాత చాలామంది విద్యార్థులు దాదాపు 70 మంది వరకు కళా శాలను విడిచి ఇంటికి వెళ్ళిపోయినారు 1937 జూలై 23 వ తేదిని 16 మంది విద్యార్థులు మాత్రమే కళాశాలకు హాజరయినారు విద్యార్థుల ఆ చర్యను ప్రోత్సహించిన ఉపాధ్యాయులు ఉద్యోగాలనుంచి తొలగింపబడగలరనీ, ఒక నిర్ణీతమయిన తేదీనాటికి తిరిగి ఈ విద్యార్థులు కళాశాలకు హాజరు కాకపోయి నట్లయితే వారినిక ఎన్నటికీ కళాశాలలో చేర్చుకోవడం జరగదనీ ఎస్టేట్ కలెక్టర్ తెలియపరచినారు

"కాలేజి విడిచి వెళ్ళిన విద్యార్థులందరికీ విద్యార్థి ఉచిత భోజన వసతి గృహంలో స్థానముండద'ని ఎస్టేట్ కలెక్టర్ జూలై 26 న ఉత్తరువు జారీ చేసినాడు ఆ తరవాత చాలామంది విద్యార్థులు క్షమాపణ ఉత్తరాలు పంపు కొంటున్నారు తిరిగి చాలామంది త్వరలోనే కళాశాలలో చేరవచ్చుననే సూచ నలు కనిపిస్తూన్నాయి"

ప్రస్తుత కాంగ్రెస్ మంత్రుల హయాంలో ఇటువంటి ఉదంతాలకు తావుండదని ఆశించవచ్చు

హరిజన్ మహాదేవదేశాయ్

14-8-37

## కాంగ్రెస్ మంత్రులు - హరిజనులు

కాంగ్రెస్ మంత్రివర్గాలు గల రాష్ట్రాలలో హరిజనుల స్థితి ఎట్లా ఉంటుం దనే విషయం గురించి మహాదేవదేశాయ్ 'హరిజన' పత్రికలో కాంగ్రెస్ మంత్రుల ఉపన్యాసాలనుంచి కొన్ని భాగాలను ఉదాహరించినారు

మద్రాస్‌లోని నిమ్నజాతి సేవాదళంవారి యాజమాన్యం కింద జరిగిన సభలో ప్రసంగిస్తూ మద్రాస్ కార్మిక మంత్రి (శ్రీ) వి వి గిరిగారు ఇట్లా అన్నారు "మీలో చాలామందివలెనే నేనుకూడా సామాన్య కార్యకర్తను నా ప్రజా జీవితంలో ఇంతవరకు కార్మికులకు వేతనంలేని సేవకుణ్ణి నేనీనాడు మీ వేతనం పుచ్చుకొంటున్న సేవకుణ్ణి అందువల్ల పూర్వంకంటె నేను ఇంకా ఎక్కువ సేవ చేయవలసి ఉన్నది ప్రభుత్వంవారి ఆదాయానికి లోబడి మీకు నేను చేయగలిగినంత ఉపకారం చేయగలను మీరు కోరినంత మీకు నేను చేయక పోతే అది నా తప్పు కాదు మంత్రివర్గంవారి తప్పిదమూ కాదు. ప్రభుత్వ విధానంలో ఉన్న తప్పు హరిజనాభ్యుదయ మంత్రిగా నా మంత్రిత్వానికి సంబంధించిన హద్దులకు లోబడి హరిజనుల కష్టాలను బాధలను గురించి సమ

క్రమంగా పరిశీలిస్తున్నాను హరిజనోద్ధరణకు కావలసిన ప్రణాళికను కార్యక్రమాన్ని రూపొందించగలనని మీకు హామీ ఇస్తున్నాను నేను ప్రతిరోజు హరిజన వాడలను, పల్లెలను చూడడానికి కొంత కాలం వినియోగిస్తున్నాను విశాల హృదయమూ, అంతశ్శుద్ధి కల ప్రధానమంత్రితోను, యాకూబ్ హుస్సేన్ వంటి గౌరవనీయులయిన మహానాయకులతోను సంప్రదించి మీ సమస్యలను నా చేత నయినంతవరకు పరిశీలిస్తున్నాను మాకున్న అధికారాల పరిధిలో మీకు చేయగలిగినంతవరకు ఏ విధమయిన అభ్యంతరం లేకుండా చేయగలనని హామీ ఇస్తున్నాను

ఈ ఉపన్యాసం తరవాత మంత్రి యాకూబ్ హుస్సేనుకూడా ఇట్లా ప్రసంగిస్తూ హరిజనాభ్యుదయ కార్యక్రమంలో నాకెప్పుడూ ఆసక్తి ఉన్నది మహాత్మాగాంధీ ప్రారంభించిన ఉద్యమాలన్నిట్లోకి అస్పృశ్యతా నివారణోద్యమం అత్యుత్కృష్టమయినదని నా అభిప్రాయము సామాన్య మానవుని పరిస్థితినిబట్టి జాతి అభివృద్ధి నిర్ణయించవలసి ఉంటుంది హరిజన సంఘం సాంఘికంగానూ, ఆర్థికంగానూ పొందిన అభివృద్ధినిబట్టి భారతదేశం పొందిన అభివృద్ధి అంచనా వేయడంజరుగుతుంది ఈ దేశంలోని రాష్ట్రప్రభుత్వాలచరిత్రలో హరిజన, కార్మిక సంక్షేమానికి ప్రత్యేకం ఒక శాఖ నిర్మింపబడటం, అందుకు ఒక మంత్రి ఏర్పాటు కావడం ఇదే మొదటి పర్యాయము మన కార్మిక మంత్రి కార్మిక సంక్షేమం తన జీవిత కర్తవ్యంగా భావించి అందుకు మహాత్యాగాలు చేసినవారు" అన్నారు

'హరిజన్' మహదేవదేశాయ్
14-8-37

## గాంధీజీ జన్మ దినోత్సవాలు (1937)

అఖిల భారత కాంగ్రెస్ సంఘ అధ్యక్షులు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘ కార్యదర్శి పత్రికలలో చేసిన ప్రకటన ననుసరించి గాంధీజీ 68వ జన్మ దినోత్సవాలు ఆంధ్రదేశంలో పలుచోట్లజరిగినాయి అన్ని ప్రదేశాలలోను గాంధీజీ నిర్మాణ కార్యక్రమము, అస్పృశ్యతా నివారణము, గ్రామపరిశ్రమలు మొదలయిన విషయాలను గురించి కాంగ్రెస్ కార్యకర్తలు ప్రజలలో ఎక్కువగా ప్రబోధం చేసినారు

1937 సెప్టెంబర్ 24వ తేదీన రెండో హరిజన వార్షికోత్సవము కృష్ణం పేట హరిజన గోకులాశ్రమంలో జరిగింది సెప్టెంబరు 24 నుంచి అక్టోబరు 2 వరకు గాంధీ జన్మదినోత్సవాలు, హరిజన దినోత్సవాలు ఒకేసారి జరుగుతూండడం సంప్రదాయ సిద్ధంగా వస్తూన్నది గోకులాశ్రమంలోని హరిజన దినోత్సవం ఆంధ్ర సంఘంవారి యాజమాన్యంలో జరిగింది మద్రాస్ కార్మికమంత్రి, హరిజనాభ్యుదయమంత్రి అయిన వి వి గిరిగారు హరిజన దినోత్సవ సభకు అధ్యక్షత వహించి, గాంధీమహాత్ముని చిత్రపటం ఆవిష్కరిస్తూ, "హరిజనాభివృద్ధి

కూడ నా విధులలో ఒకటి అందువల్ల హరిజనులకు నేను చేయగలిగిన సహాయ మంతా చేయగలను గాంధీమహాత్ముని చిత్రపటం ఆవిష్కరించడం నాకు చాలా సంతోషకరంగా ఉన్నది గాంధీజీ హరిజనులకు మహోత్కృష్టమయిన సేవ చేసినారు కాంగ్రెస్ వారు మంత్రివర్గం స్వీకరించడానికి కారకులు గాంధీ గారే మీలో మీరు మీ తగవులను పరిష్కరించుకోడానికి ఒక పంచాయతీ నేర్పరుచుకొన్నందుకు చాలా సంతోషము హరిజనులలో విద్యను పెంపొందించ టానికి, పల్లెటూళ్ళలో బావులు మొదలయిన వాటిని నిర్మించి హరిజనులకు ఎక్కువ సౌకర్యాలు కలిగించడానికి ప్రభుత్వంవారు కృషిచేయగలరు" ఈ ఉపన్యాసానంతరం మాగంటి బాపినీడుగారు ఉపన్యసిస్తూ "పూనా ఒడంబడిక జరిగిన సెప్టెంబరు 24వ తేది భారత దేశ చరిత్రలో ఒక ముఖ్యమయిన రోజుగా పరిగణింప బడుతున్నది ఆ ఒడంబడిక మూలాననే నేడు ఎందరో హరిజనులు శాసన సభ్యులుగాను, మంత్రులుగాను ఉండ గలుగుతున్నారు

తిరువాన్కూరు మహారాజు హరిజనులకు దేవాలయ ప్రవేశార్హత కలిగించటం కూడా అందువల్లనే" అన్నారు

తరవాత బయ్యా సూర్యనారాయణమూర్తిగారు మాట్లాడుతూ 'ఎందరో కులీనులయిన ప్రముఖులు హరిజనాభ్యుదయం కోసం స్వార్థత్యాగులై పనిచేస్తున్నారు హరిజనులు కూడ తమ బాధ్యతను గుర్తించి తమ అభివృద్ధి కోసం స్వయం కృషి చేసుకోవలసి ఉన్నది అసెంబ్లీలోని ముప్పైమంది హరిజన సభ్యులు తమ తమ జిల్లాలలో హరిజనాభివృద్ధి కోసం పనిచేస్తే హరిజనుల కెంతో మేలు చేకూరగలదు" అన్నారు

తరవాత కృతజ్ఞతాభివందనలతో సభ ముగిసింది

## మద్రాసు

మద్రాస్‌లోని కోడంబాకం హరిజన పారిశ్రామిక పాఠశాల ఆవరణలో సెప్టెంబరు 24వ తేదిన 88వ గాంధీ జయంతి ప్రారంభోత్సవం జరిగింది మద్రాస్ రాష్ట్ర పారిశ్రామిక కార్మికమంత్రి శ్రీ వి వి గిరి అధ్యక్షత వహించినారు అనేకమంది వక్తలు మహాత్ముని ఉదార గుణాలను ప్రశంసిస్తూ ఆయనను చిరాయురారోగ్యవంతునిగా చేయవలెనని భగవంతుని ప్రార్థిస్తూ ఉపన్యసించి నారు

వి వి గిరిగారు మాట్లాడుతూ, "నిమ్న జాతులుగా పేర్కొనబడేవారి కష్టాలను నివారించేటందుకు గాంధీజీ నిరంతరకృషి చేసి ఉండనట్లయితే ఈనాడీ హరిజనోద్యమం ఇంతగా విస్తరించి ఉండేదికాదు నిమ్న జాతులవారికి గాంధీజీ హరిజనులనే పేరు పెట్టిన సమయం నాకు బాగా జ్ఞాపకమున్నది అందుకు దేశంలో చాలామంది ప్రతికూలభావం వెల్లడించినారు ఆయన ఆనాడు 'హరి జన్' అనే పేరు పెట్టి ఉండకపోయినట్లయితే ఆ మాటకు అంత ప్రసిద్ధి వచ్చి ఉండేదికాదు. గాంధీజీ హరిజనుడై ఉన్నట్లయితే ఆయన ఇప్పుడు హరిజనులకు

చేసినంత పనిని చేయగలిగి ఉండేవారు" అని చెప్పి ఆయన ఇంకా ఇట్లా అన్నారు "హరిజన దేవాలయ ప్రవేశ విషయం గురించి శ్రీ యం సి రాజా, ప్రభుత్వానికి, హరిజన సేవక సంఘానికి ప్రతికూలంగా కఠినమయిన విమర్శ చేస్తున్నారు శ్రీ రాజా తన కోపాన్ని పురస్కరించుకొని హరిజనులకు సాధ్యమయినంత సేవ చేయవలెనని ప్రయత్నిస్తూన్నవారికి దురుద్దేశాలను ఆపాదించడం మంచిది కాదు శ్రీ రాజా ప్రశాంతంగా ఆలోచించగలిగిన సహాయాలతో ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వం హరిజనుల పక్షాన నిలిచి హరిజనులకు, హరిజనేతరులకు మధ్యఉన్న వ్యత్యాసం త్వరలోనే తొలగించడానికి నిర్ణయించుకొన్నట్లు గ్రహించగలరు ప్రథమంగా మేము మలబారులో హరిజన దేవాలయ ప్రవేశం ఆచరణలోకి తేగలమని సద్భావంతో వాగ్దానం చేస్తున్నాను రాష్ట్రంలో హరిజన సలహా సంఘాల నియామకం గురించి శ్రీ రాజాకు ఇంతవరకు ఉన్న అభిప్రాయాలను కూడా మార్చుకొనవలెనని కోరుతున్నాను ఆ సలహా సంఘాలు చాలా ప్రయోజనకరమయిన పనులను నిర్వర్తించగలవు

హరిజనులు సత్యాగ్రహించల ద్వారా కులీన హిందువుల అభిమానం సంపాదించవలె హరిజన హరిజనేతరుల సమస్యా పరిష్కారం ఎంతో చేరువలో ఉన్నది హరిజన, హరిజనేతర కార్యకర్తలు పూర్వంకంటె ఎక్కువ సన్నిహితంగా పని చేయడం అవసరము "

ఈ ఉపన్యాసానంతరం శ్రీయుతులు ఆర్ కృష్ణమూర్తి, సంపత్ అయ్యంగార్, యం యస్ సుబ్రహ్మణ్యఅయ్యర్, ఆరోగ్యస్వామి, భాష్యం, సిస్టర్ విశాలాక్షి మొదలైనవారు గాంధీజయంతి ప్రాముఖ్యం గురించి ఉపన్యసించినారు కృతజ్ఞతాభివందనలతో సభ ముగిసింది

## ఎలమంచిలి

ఎలమంచిలి బోర్డు హైస్కూల్ విద్యార్థులు అక్టోబరు 2న గాంధీ జయంతి ఉత్సవం జరిపినారు పంచాయతీబోర్డు ప్రెసిడెంట్ యన్ సత్యనారాయణ పంతులుగారు అధ్యక్షత వహించినారు అనేక మంది వక్తలు గాంధీజీ జీవితాశయాలను గురించి ఉపన్యసించినారు

స్థానిక హరిజన సేవకసంఘ యాజమాన్యమున హరిజన వాడలో మరొక బహిరంగ సభ జరిగింది తాలూకా హరిజన సేవక సంఘం అధ్యక్షుడు శ్రీ జి శ్రీహరి అగ్రాసనాధిపత్యం వహించినారు మహాత్ముని సేవా త్యాగాలు గురించి, హరిజనోద్ధరణకు ఆయన చేసిన సేవను గురించి పలువురు వక్తలు ప్రసంగించినారు

## హైదరాబాదు

భారత దేశంలోని కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వం స్థాపించడంతో ఒక నూతన యుగం ప్రారంభమయింది. హైదరాబాదు సంస్థాన

ప్రభుత్వంవారు అది గ్రహించి తమ రాజకీయ విధానంలో కొంత ఔదార్యాన్ని ప్రదర్శించినారు మహాత్మాగాంధీ జన్మదినోత్సవాల బహిరంగ సభలను జరిపేటందుకు ఔరంగాబాదు జిల్లాలోని పైఠన్ విద్యార్థి సంఘాధ్యక్షుడు విశ్వనాథ తుల్జాపూర్కర్ పైనున్న నిషేధం తొలగించటమే అందుకు తార్కాణము

హైదరాబాదు సంస్థానంలోకి రాకూడదని తనపైనున్న నిషేధపు టుత్తరువులను తుల్జాపూర్కర్ ఉల్లంఘించినందుకు సంస్థాన ప్రభుత్వంవారు ఆయనను రెండు రోజులు పోలీసు నిఘా కింద ఉంచి తరవాత ఆయనపై ఉన్న నిషేధాన్ని తొలగించినారు. ఇందువల్ల ఎనిమిది సంవత్సరాల తరవాత గాంధీజీ జన్మదినోత్సవం హైదరాబాదులో బహిరంగంగా జరపడానికి వీలు కలిగింది తుల్జాపూర్కర్పై నిషేధం తొలగించటంలో సంస్థానాధికారులు చాలా ధైర్యం చేసినారని చెప్పవచ్చు దీనిని బట్టి సంస్థాన ప్రజలకు తమ పౌరస్వత్వాలు పునరుద్ధరింప బడగలవని పుట్టెడాశ కలిగింది

హైదరాబాదు కాంగ్రెస్ కమిటీ యాజమాన్యం కింద గౌలిగూడలోని వివేకవర్ధనీ ఆవరణలో 1937 అక్టోబరు 2 వ తేదీన గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో బహిరంగసభ జరిగింది 8 సంవత్సరాల తరవాత గాంధీ జయంత్యుత్సవాలకు బహిరంగసభ జరపడం అదే మొదటిసారి వాన చినుకులు పడుతూ ఉన్నప్పటికీ సభకు రెండువేలమంది ప్రజలు హాజరయినారు హైదరాబాదు కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి శ్రీ ఆర్ వి అంతూ ప్రతిపాదనపైన శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు అగ్రాసనాధిపత్యం వహించి గాంధీ జయంత్యుత్సవం జరపడం భారతీయులకు ఒక అపూర్వమయిన అదృష్టం అన్నారు "గాంధీ పేరు భారతదేశంలోనేగాక సముద్రాలకు అవతల యూరోపు, అమెరికా ఖండంలో కూడా ప్రతి కుటుంబంలోను ప్రసిద్ధికెక్కినది ఇది యావత్ప్రపంచం ఆనందంతో ఓలలాడవలసిన రోజు గాంధీజీ గొప్ప రాజకీయ వేత్త ఆయన భారతదేశ సార్వతంత్ర్యంకోసం తన జీవిత సర్వస్వము సమర్పించిన మహాపురుషుడు ఆయన దేశభక్తి భారతదేశ పరిధులు దాటిపోయినది ఆయన ప్రపంచమంతటికీ సంబంధించిన మనిషిగా భావింపబడుతున్నారు భారతీయులను ఒక జాతిగా తయారుచేయగలిగిన వ్యక్తి గాంధీజీయే" అని అధ్యక్షులు ఉపన్యసించిన తరవాత హైదరాబాద్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు శ్రీ సిరాజుల్ హసన్ తిర్మిజీ గాంధీజీ జన్మదినోత్సవ సందర్భంలో ఆయనను అభినందిస్తూ, మాతృదేశ సేవకోసం ఆయన చిరాయురారోగ్యవంతుడుగా వర్ధిల్లవలెనని తీర్మానం ప్రతిపాదించినారు గాంధీ గుణగుణాలను గురించి తిర్మిజీ గంభీరోపన్యాసం చేస్తూ ఆయన సిద్ధాంతాలను ఎక్కువగా వ్యాపింపచేయవలెనని అన్నారు, గాంధీజీ హిందూ ముస్లిమ్ ఐకమత్యంలో ఎక్కువ విశ్వాసం కలవారని, అది లేకపోతే స్వరాజ్య సంపాదన సాధ్యం కాదనీ, భారతీయులందరూ తమ కులమత వర్గ భేధాలను విస్మరించి ఏక జాతిగా భావింపవలెనని కూడా తిర్మిజీ తన ఉపన్యాసంలో విశదీకరించినారు.

తరవాత బూర్గుల రామకృష్ణారావుగారు తీర్మానం బలపరుస్తూ, గాంధీ సిద్ధాంతాలను గురించి దీర్ఘంగా ప్రసంగించినారు ఆయన బహిరంగసభలలో గాంధీ జయంతిని జరిపినా జరపకపోయినా ప్రతి భారతీయుడు కులమత భేదాలను విస్మరించి గాంధీ జయంతిని తన హృదయంలో సహజంగా జరుపుకొంటూనే ఉన్నాడు గాంధీజీ రాజకీయరంగంలో ప్రవేశించక ముందు యుద్ధభయము, దౌర్జన్య సిద్ధాంతము, ప్రపంచాన్ని సంచలింపజేసినాయి గాంధీ సిద్ధాంతంవల్ల యువకులకు యుద్ధంమీద వ్యామోహం పోయింది ఒకప్పుడు యుద్ధంపట్లనే ఆసక్తి కలిగినటువంటి దేశాలవారు కూడా నేడు శాంతిని ఎక్కువగా వాంఛిస్తున్నారు గాంధీ సిద్ధాంతం దాదాపు ప్రపంచ స్వరూపాన్నే మార్చివైచింది ప్రపంచ రాజకీయాలు ప్రపంచ ఆర్థిక విధానాలు కూడా భవిష్యత్తులో మారితీరవలె" అన్నారు

తరవాత (శ్రీ) వినాయకరావు విద్యాలంకార్ మాట్లాడుతూ ఆరు సంవత్సరాల క్రితం గాంధీ జయంత్యుత్సవం చివరి నిమిషంలో ప్రభుత్వంవారి ఉత్తరువు వల్ల ఎట్లా ఆపివేయవలసివచ్చినదో జ్ఞాపకం చేసినారు అప్పుడుకూడా ఆ ప్రదేశంలోనే సభ ఏర్పాటు చేయబడిందనీ అప్పటినుంచి కాంగ్రెస్ కమిటీవారు బహిరంగసభకు ప్రభుత్వంవారి అనుమతిని కోరడంగానీ, దానిని పొందడంగానీ జరగలేదనీ ఆనాటికీ, ఈనాటికీ గాంధీజీ కృషివల్ల ఎంతో మార్పు వచ్చిందనీ అన్నారు

తరవాత (శ్రీ) వినాయకరావు గాంధీజీ వ్యక్తిగత శీలం గురించి స్వార్థత్యాగాల గురించి తదితర సద్గుణాలను గురించి ప్రసంగించి,అవన్నీ హైదరాబాదు ప్రజల జీవితాలలో ఆదర్శప్రాయులుగా ఉండవలెనని అన్నారు ఆయన ఇంకా ఇట్లా అన్నారు "అహింసా ఉద్యమంలో పనిచేయడానికి గొప్ప ధైర్యం ఉండవలె సత్య సంరక్షణార్థం పోలీసుల లాఠీలకు, బెట్టులకు భయపడకూడదు సత్యం కోసం సర్వం సమర్పించడానికి సంసిద్ధంగా ఉండవలె సంస్థలలో క్రమశిక్షణకోసం వ్యక్తుల స్వీయాభిప్రాయాలకు ప్రాముఖ్య మీయకూడదు సంస్థలలో సభ్యులుగా ఉన్నవారు సంస్థల అభిప్రాయాలనే ప్రకటించవలె కాని తమ వ్యక్తిగతాభిప్రాయాలను వెల్లడించరాదు పండిత జవహర్ లాల్ నెహ్రూ తన వ్యక్తిగతాభిప్రాయాలకు భిన్నంగా ఉన్నప్పటికీ సంస్థలోని అధికసంఖ్యాకుల అభిప్రాయం అనుసరిస్తూండడం మనం గమనించవలసిన విషయము హైదరాబాదులోని కార్యకర్తల సంఘాలతో నాకున్న అనుభవం ఉత్సాహకరంగా లేదు వారు మాటలకోసం విశేషణాలకోసం తగవులాడుకొంటారు వ్యక్తిగతాభిప్రాయాలకోసం పట్టుబట్టడం ఐకమత్యానికి అనర్థదాయకము మనము గాంధీ జయంతిని వాస్తవంగా జరుపుకోదలచిన ఈ విషయాలన్నిటినీ మననం చేసుకొని ఆచరించవలసి ఉన్నది "

ఈ ఉపన్యాసానంతరం ఖాజా మొహిద్దీన్‌సాహెబు మాట్లాడుతూ హిందూ ముస్లిమ్ ఐకమత్యావసరం గురించి ప్రసంగించినారు పోలీసుల బయోనెట్ పోటులకు సంసిద్ధులయిన వారే తమను గురించిన విమర్శలను వినజాలక తగవు

లాడడం ఆశ్చర్యంగా ఉంటుందని కూడా ఆయన అన్నారు

తరవాత తీర్మానం 'గాంధీకీజై' అనే నినాదాలతో ఏకగ్రీవంగా అంగీకరింప బడింది

తమ ఉపన్యాసాలను ముగిస్తూ అగ్రాసనాధిపతిన్నీ, కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడున్నూ అక్కడ హాజరయిన వారందరినీ స్థానిక కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా చేరవలెనని కోరినారు శ్రీ హెచ్ రామకృష్ణభూత్ గాంధీజయంతి వారంలో అందరూ ఖాదీని కొని ప్రోత్సహించవలెనన్నారు సభలో గోవర్ధన లాల్ పిట్టి, డా లతీఫ్‌సయీద్, బి జి శపర్ధి, కె యస్ వైద్య, కె వి రంగా రెడ్డిగార్లు ఉన్నారు

**తిరుపతి**

తిరుపతి కో ఆపరేటివ్ బాంకు భవనంలో శ్రీ టి కె దొరస్వామి అయ్యంగారి అధ్యక్షత కింద గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో బహిరంగ సభ జరిగింది పలువురు వక్తలు ప్రసంగించినారు

**రాజమండ్రి**

మహాత్మాగాంధీ 68వ జన్మదినోత్సవ సందర్భంలో రాజమహేంద్రవరం కాంగ్రెస్ భవనంలో శ్రీ అరవ ఆదినారాయణమూర్తిగారు జాతీయ పతాకం ఆరోణగావించినారు సాయంకాలం బహిరంగ సభ జరిగింది. కందుల రాఘవ స్వామిగారు అధ్యక్షత వహించినారు డాక్టర్ పాలకోడేటి గురుమూర్తి, వి యస్ కోటీశ్వరరావు, అరవ ఆదినారాయణమూర్తి, కె హనుమంతరావు, జి యస్ శర్మగార్లు గాంధీజీ జీవితం గురించి ఉపన్యాసాలు చేసినారు

**అనంతపురము**

అనంతపురం పట్టణ కాంగ్రెస్ సంఘంవారి యాజమాన్యం కింద అక్టోబరు 2 సాయంకాలం పెద్ద ఊరేగింపు జరిగింది తరవాత గాంధీ చౌక్‌లో బహిరంగ సభ జరిగింది శ్రీ కె యస్. రాఘవాచారి, కల్లూరి సుబ్బారావు మొదలయిన వారు గాంధీజీ జీవితం గురించి, ఆయన నిర్మాణ కార్యక్రమం గురించి ఉపన్యసించినారు

**ఖాదీకి భూరి విరాళము**

అనంతపురం జిల్లాలోని తాడిపత్రి కాపురస్థుడు మూలా లక్ష్మీనారాయణ స్వామిగారు ఆ జిల్లాలో ఖాదీ పనిని కొనసాగించడానికి 5,000 రూపాయలు విరాళంగా ఇచ్చి సంవత్సరానికి నూటికి 3 రూపాయల వడ్డీతో 45,000 రూపాయలు అప్పుగా ఇవ్వడానికి వాగ్దానం చేసినట్టు డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు మహాత్మాగాంధీకి తంతి పంపగా, ఆయన 1937 అక్టోబరు 16వ

తేది 'హరిజన్' పత్రికలో ఇట్లా వ్రాసినారు

'ఖాదీకి అప్పు, విరాళం ఇచ్చిన ఆ దాతకు నా అభివందనములు ఆయన ధనం ఇంతకంటె మంచి కార్యానికి వినియోగించ జాలరనడంలో ఏ మాత్రం సందేహంలేదు ఈ విరాళంవల్ల, అప్పువల్ల, ఆ జిల్లా సంపూర్ణ ప్రయోజనం పొందగలదని ఆశిస్తున్నాను ఈ పని స్థానిక కార్యకర్తలపైనా, స్థానిక ఖాదీ అభిమానులపైనా ఎక్కువగా ఆధారపడి ఉన్నది'

## వినయాశ్రమంలో

గుంటూరు జిల్లాలోని వినయాశ్రమంలో 1987 సెప్టెంబరు 27 ఉదయం 6 గంటలకు గాంధీ జయంత్యుత్సవాలు ప్రారంభమై అక్టోబరు 5 ఉదయంతో పూర్తయినాయి పండ్రెండుగురు పురుషులు,పదిమంది స్త్రీలు నిరవధికంగా నూలు వడకడంలో పాల్గొన్నారు నలుగురు పూర్తిగా ఎనిమిది రోజులున్నూ తక్కిన వారు కొన్ని తక్కువ రోజులున్నూ పాల్గొన్నారు, అందరూ కలసి రోజుకు 2 గంటల చొప్పున మొత్తం నూరు రోజుల పని చేసినట్లయింది మొత్తం నలభై రెండువేల గజాల నూలు తీసినారు సగటు 13 వ నంబరుకు తేలింది ఇందులో 16407 గజాల నూలు స్త్రీలు తీసిందే ఆ నూలు నలభైవ నంబరుకు తేలింది సగటున గంటకు 211 గజాలు నూలు తీయడంజరిగింది తయారయిన నూలు వద వారు చదరపు గజాల బట్టకు సరిపోతుంది నూలు మంచి పురికలదిగానూ ఒకే తీరుగానూ ఉన్నది చర్ఖాలకు ఒక వేగచక్రం కూడా ఉన్నది చర్ఖాలకు వేగ చక్రం ఉన్నప్పుడు వాటిమీద ఒక గంటలో తీసిన నూలునుబట్టిచూసినట్లయితే వడికేవారు తగినంత వేగంగా నూలు తీయజాలకపోయివారని నాఅభిప్రాయము అయితే ఆ ఆశ్రమవాసులు కొద్ది మాసాల క్రితమే ప్రతిరోజూ క్రమంగా నూలు వడకడం ప్రారంభించిన విషయం కూడా మనం గమనించవలసి ఉన్నది

హరిజన్

28-10-1987

## ప్రశంసనీయమైన విరాళము

డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు ఇంతకు పూర్వం అనంతపురంజిల్లా తాడిపత్రి కాపురస్థుడు శ్రీ మూలా నారాయణస్వామిగారు అనంతపురం జిల్లాలో ఖద్దరు వ్యాప్తికోసం ఇచ్చిన విరాళము, ఋణాన్ని గురించి గాంధీజీకి తంతివార్త పంపిన విషయాన్ని, దానిపైన ఆయన 'హరిజన్'లో వ్రాసిన అభిప్రాయం వెనకటి పుటలలో ఉదాహరించి ఉన్నాము

ఇప్పుడీ శీర్షిక కింద డాక్టర్ పట్టాభిగారి ఉత్తరము, దానిపై గాంధీజీ వ్యాఖ్యానాన్ని 'హరిజన్' పత్రిక నుంచి ఉదాహరిస్తున్నాము.

## డాక్టర్ పట్టాభి ఉత్తరము

తాడిపత్రి కాపురస్థుడు మూలా నారాయణస్వామి ఖాదీ వ్యాప్తికోసం

ఇచ్చిన 5 000 రూపాయల విరాళమూ, వాగ్దానంచేసిన 45,000 రూపాయల ఋణము సంతృప్తికరంగా ఫలప్రదాలయినాయి నేను, శ్రీ వేమూరి నారాయణ మూర్తితో కలసి తాడిపత్రికి వెళ్ళినాను మేమిద్దరం కలసి 8 వ తేదిని ఆ మొత్తానికి ఒక ధర్మకర్తృత్వపత్రము (ట్రస్ట్ డీడ్)ను తయారుచేసి ఆమోదం పొందిన తరువాత దానిని రిజిష్టర్ చేయించినాము 6 వ తేదిని ఇట్లా చేయగల మని బహిరంగసభలో ప్రకటించి ఉన్నాము ఆ ట్రస్ట్‌పత్రం ప్రకారం విరాళ మిచ్చిన దాత జీవితాంతంవరకు ఒక ట్రస్టీగా ఉంటాడు ఆయన తరవాత మరొకరనిట్రస్టీగా నియమించేఅధికారం ఆయనకుంటుంది అట్లా నియమితులైన వారికి తన తరవాత మరొకరిని నియమించే అధికారం ఉంటుంది విరాళ మిచ్చిన దాత గాక మరొకరిని కూడా ఆయన ట్రస్టీగా నియమించుకోవచ్చు అట్లాగే తరవాత ట్రస్టీలుకూడా నియమించుకోవచ్చు ఈ ఇద్దరు ట్రస్టీలకు తోడు మరి ముగ్గురు స్నేహితుల సలహాతో ట్రస్టీలుగా నియమింపబడినారు వారు నిజాయతీగల పెద్ద మనుషులు రెండో తరగతిగా ఉదాహరింపబడిన ట్రస్టీ లలో ఏదయినా ఖాళీవచ్చినప్పుడు పైన ఉదాహరించిన పద్ధతి ప్రకారం ఆ ఖాళీని పూర్తిచేసుకోవలె ట్రస్ట్ దస్తావేజు వెంటనే రిజిష్టరయింది 5,000 రూపాయల విరాళం అనంతపురంలో సి అనంతపురంజిల్లా కోఆపరేటివ్ బాంకులో జమకట్టడం జరిగింది విరాళమిచ్చిన దాత మూలా నారాయణస్వామితోపాటు మరొకరికికూడా బాంకు అకౌంట్ వ్యవహార నిర్వహణకు అధికార మిచ్చినారు. ఈ అన్నిటినీ మించి ఈ విరాళమిచ్చిన దాత తన జిల్లాలోను తన పరిసర జిల్లాలలోను ఖాదీ ఉత్పత్తిపట్ల చూపిన ఉత్సాహం, సంతోషకరమయిన వైఖరీ ఎంతో సంతృప్తికరంగా ఉన్నాయి

ఈ సందర్భంలో మరో ముఖ్య విషయం కూడా చెప్పవలసి ఉన్నది అది చాలామందికి తెలియదు ఈ దాత ఒక సారా పరిశ్రమాలయానికి యజమాని దానిమీద ఆదాయం ఏడాదికి 50,000 రూపాయలు వస్తుంది రాబోయే సంవ త్సరంలో మద్యనిషేధశాసనం అనంతపురం జిల్లాకు వర్తింపజేయడంజరుగుతుందనీ అందువల్ల తనకు దానివల్ల వచ్చే ఆదాయమంతా పోతుందనీ ఆయనకు తెలుసు అయినప్పటికీ ఆయన ఈ విరాళ మివ్వటానికి చాలా ఉత్సాహం చూపించి నాడు. ఆయన సారా పరిశ్రమాలయం పెట్టిన చోటనే ఖాదీ కేంద్రం స్థాపించ వలెనని ఆయన ఆసక్తితో ఉన్నట్లు కనబడుతున్నది సారా పరిశ్రమాలయంవల్ల ఆయన యాభై వేల రూపాయలు గడించగలడు ఖాదీకి పెడుతున్న యాభై వేల పెట్టుబడిమీద లాభం వచ్చే అవకాశంగానీ, ఆశగానీ లేదు ఇక అప్పుగా ఇచ్చిన మూడు శాతం వడ్డీని గురించి ఆలోచిస్తే అంతమాత్రంగానీ, ఇంకా కొంచెం ఎక్కువ వడ్డీగానీ ఇవ్వడానికి ఎవరూ సందేహించవలసిన పనిలేదని, ఒక వేళ ఖాదీ సంస్థ ఆమాత్రం వడ్డీ ఈయగలిగిన లాభమైనా సంపాదించని పక్షంలో ఇంత విరాళం ఇచ్చిన ఈ దాత తాను పెట్టిన పెట్టుబడిపైన ఆ వడ్డీ భాగానికి ఆలోచించడనీ, అదికూడా విరాళంగానే భావిస్తాడనీ నేను సభవారికి

వివరించి చెప్పినాను ఈ వివరణ తమాషాగా తోచవచ్చు కానీ అక్కడ చేరిన సభ్యులు దీనిలోని సత్యం గుర్తించగలిగినారు.

అప్పు తిరిగి చెల్లించవలసిన వాయిదాను గురించి దాత ఏ విధమయిన షరతు పెట్టలేదు ఆ సంస్థ ధర్మకర్తలు అసలు మొత్తం తమ ఇష్టం వచ్చినప్పుడు తిరిగి చెల్లించవచ్చు దాతనుంచి ట్రస్టీలు అవసరమయినప్పుడు సొమ్ము తీసుకొంటూండగలరు ఈ సంస్థ ప్రత్యేక సర్టిఫికెట్ పొందిన సంస్థగా గుర్తింపబడుతుంది ఈ ధర్మసంస్థ ఆశయాలు సరిగా నిర్వర్తింపబడనట్లయితే అఖిల భారత చర్ఖాసంఘంవారు దీనిని స్వాధీనం చేసుకోవచ్చు

తాడిపత్రి పట్నంలోని ఖాదీ ఉత్పత్తిదారులలో ఒకరయిన శ్రీయుత పీరభద్రప్పగారు 16 సంవత్సరాలనుంచి అత్యంత ధైర్యసాహసాలతో ఎడతెగకుండా ఖాదీ ఉత్పత్తి చేస్తున్నారు ఆయన వయసు ఇప్పుడు 60 సంవత్సరాలు ఆయనకు కుటుంబంలో మరెవరూ సహాయం చేసేవారు లేరు అందువలన ఆయన తన ఖాదీ ఉత్పత్తి సంస్థలన్నిటినీ ఈ సంస్థలో లీనం చేయడానికి పరస్పరం అంగీకారాలయిన పద్ధతులమీద ఒప్పుకున్నారు ఇది ఈ ప్రణాళికకు మరింత ఎక్కువగా దోహదం చేసింది ఖాదీవంటి నిర్మాణ కార్యక్రమానికి పరస్పర సహకార సద్భావాలు అవసరమనే విషయం ఇక్కడి వారందరూ బాగా గుర్తించగలిగినారు "

ఈ ఉత్తరం గురించి గాంధీజీ 'హరిజన్'లో ఇట్లా వ్రాసినారు

"శ్రీయుత మూలా లక్ష్మీనారాయణగారిచ్చిన విరాళానికి, ఖాదీ ఉత్పత్తికి ఎంతో దూరదృష్టిగల షరతులతో ఆయన నిర్మించిన ధర్మ సంస్థకు నా అభివందనలు ఆ ధర్మసంస్థకు సంబంధించిన వివరాలు అత్యుత్సాహకరాలుగా ఉన్నాయి డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు మూడు శాతం వడ్డీని గురించి ఇచ్చిన వివరణకూడా చాలా సమంజసంగా ఉన్నది ఆ దాత సారా పరిశ్రమపైన యాభై వేల రూపాయలు సంపాదిస్తూన్నారనీ, దానినే ఖాదీసంస్థకు పెట్టుబడిగా ఇచ్చినారనీ భావించడం వట్టి భ్రమ అంటే ఎంతో బాగా ఉంటుంది ఆయనకు సారా పరిశ్రమవల్ల వచ్చే యాభై వేల రూపాయల లాభం అనేకమందికి ఆర్థికంగా ఎన్నో లక్షలు నష్టం కాగా నైతిక పతనంగా కూడా పరిణమించిందనే విషయం గమనించవలసి ఉంటుంది కనక ఆయన ఆ సారా పరిశ్రమను మూసివేసినందువల్ల ఆ వినాశకర పద్ధతికి స్వస్తి చెప్పినట్లయినది అంతేకాదు, ఆయన దానిని ఖాదీ కేంద్రంగా మార్చినందువల్ల ఆకలితో అల్లాడుతూన్న వేలాది ప్రజలకు ఆహార మిచ్చినవారై వారి ఆశీర్వాదాలను పొందగలడు "

హరిజన్ యం కె గాంధీ
27-11-37

## విశ్వదాత నాగేశ్వరరావు

తక్కిన వారందరికంటె నాగేశ్వరరావుగారి దాతృత్వం గురించి

ఎక్కువగా ఎరిగిన ఆంధ్రులు ఆయన కిచ్చిన గౌరవ నామ మిది వారు ఈనాడు ఆయన మరణం గురించి దుఃఖిస్తున్నారు నిజానికి ఆయన దాతృత్వం గురించి ఆంధ్రులకు మాత్రం ఏమి తెలుసు! ఆయన కుడిచేయి ఇచ్చినది ఎడమ చేతికి తెలియదు అనేకమంది నిరుపేదలకు, విద్యార్థులకు ఆయన ఎన్నో దానాలు రహస్యంగా చేసినారు ఆయన దగ్గరనుంచి ఏదో కొంత సహాయం పొందిన ప్రతివారు ఆయనను నిరంతరం స్మరించుకొంటూనే ఉంటారు ఆయనకు కాంగ్రెస్, హరిజనోద్యమాలు రెండూ ప్రియమయినవే ఈ రెంటికీ ఆయన ఉదారంగా ద్రవ్య సహాయం చేసినారు ఆంధ్ర హరిజన సేవక సంఘానికి చాలా సంవత్సరాలు అధ్యక్షులుగా ఉన్నారు ఆయన జమీందారీలో హరిజనుల కోసం అనేక నివేశన స్థలాలు ప్రత్యేకించి హద్దులు పెట్టినారు ఏమీ ఖర్చు లేకుండా ఏవో మందుల పేరుతో అనేక మంది వేలకొద్దీ డబ్బు సంపాదించిన వారున్నారు నాగేశ్వరరావుపంతులుగారు మాత్రం తన అమృతాంజనానికి అయ్యే వ్యయం అత్యల్పమనే విషయం రహస్యంగా ఉంచలేదు కాని ఆయనకు దాని మీద వచ్చిన ఆదాయం యావత్తు దరిద్రనారాయణుల పాదకమలాలకు సమర్పించినారు ఆయన మంచి వ్యాపార సరళిగల వ్యక్తి నిజమయిన దేశభక్తుడు కూడా తన 68వ ఏట, తరవాత రెండు పర్యాయాలు ఆయన కారాగార శిక్ష ననుభవించినారు ఆయనకు ఆంధ్రులన్నా, ఆంధ్రభాష అన్నా అత్యంతమయిన ఆసక్తి ఆయన ఆంధ్రుల పక్షమున 'ఆంధ్రపత్రిక'ను స్థాపించి మహారాష్ట్ర 'కేసరి' పత్రిక మహారాష్ట్రులకు చేసినట్లు ఆయన ఆంధ్రులను చైతన్యవంతులుగా చేసినాడు

హరిజన్ మహాదేవదేశాయ్

**గాంధీజీ విద్యార్థి వేతనాలు**

ఉన్నత విద్యకు

(1938 జూలై నుంచి 1939 జూన్ అంతంవరకు)

| | పేరు | స్టడీఆఫ్ కోర్స్ | నెల 1 కి రూ |
|---|---|---|---|
| 1 | రామానుజదాసు | L I M | 10 |
| 2 | శివనారాయణ | B A (Hons ) | 15 |
| 3 | లక్ష్మయ్య | L I M (Indian Medicine) | 10 |
| 4 | బుల్లయ్య | I A Jr | 5 |
| 5 | బల అప్పారావు | I A Sr | 7-8 |
| 6 | వి బిక్షులు | I A Jr | 5 |

నిజాం రాష్ట్రంలో

| | | |
|---|---|---|
| పి ఆర్. వెంకటస్వామి | Law | 15 |

అఖిల భారత గ్రామ సంఘంవారి సర్టిఫికెట్లు పొందిన అంగళ్లు

| పేరు, చిరునామా | సర్టిఫికెటు పొందిన సరుకు |
| --- | --- |
| 1 గుంటూరు జిల్లా దంపుడు బియ్యపు సంఘం, గుంటూరు | దంపుడు బియ్యం |
| 2 గుంటూరు జిల్లా గ్రామ సౌభాగ్య సంఘం లిమిటెడ్, గుంటూరు | దంపుడు బియ్యం, బిస్కెట్లు, గానుగనూనె బెల్లం, మాల్ట్, చేతితో చెసిన |

హరిజన్, గుండీలు, తోళ్లు,

## స్పీకర్లు - రాజకీయాలు

కాంగ్రెస్ వాదులు రాష్ట్రాలలో మంత్రిత్వం స్థాపించిన తరవాత శాసన సభ స్పీకర్లు రాజకీయాలలో పాల్గొనవచ్చునా లేదా ? అనే విషయం గురించి వాద ప్రతివాదాలు చెలరేగినాయి అప్పుడు గాంధీజీ పై శీర్షిక కింద 'హరిజన్' పత్రికలో ఇట్లా వ్రాసినారు

"వివిధ రాష్ట్రాలలోని శాసనసభల స్పీకర్లు రాజకీయాలలో తీవ్రంగా జోక్యం కల్పించుకోవడంలోని ఔచిత్యం గురించి వాద ప్రతివాదాలు చెలరేగి నాయి యు పి అసెంబ్లీలో ఈ విషయంగురించి పూర్తిగా చర్చించిన తరవాత స్పీకర్ తన ఉద్యోగ ధర్మం నిర్వర్తిస్తూనే రాజకీయాలలో తీవ్రంగా జోక్యం కల్పించుకోవచ్చునని స్పీకర్ రూలింగీయడం జరిగింది శ్రీ సాంబమూర్తి నా దగ్గర కొన్నాళ్లుండి ఈ విషయం గురించి సంపూర్ణంగా చర్చించినారు ప్రపంచ పార్లమెంట్లన్నిటినుంచి స్పీకర్ల ధర్మాలను గురించి నిబంధనలను అనేకం ఆయన నాకు చదివి వినిపించినారు శ్రీ యస్ సత్యమూర్తి హరి జన్‌లో వ్రాసిన వ్యాసం కూడా చదివినారు శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ ఇటీవల వార్ధాకు వచ్చి ఈ విషయం గురించి నాతో సుదీర్ఘంగా చర్చించినారు

ఈ చర్చలన్నీ విని నేనా విషయాన్ని సొంతంగా పరిశీలించిన తరవాత నేను చదివినదానికి, విన్నదానికి భిన్నమయిన అభిప్రాయం నాకు కలిగింది కాంగ్రెస్‌వారు ఉద్యోగ స్వీకారం చేసిన ఉద్దేశాలకు అనుగుణంగా నేనొక అభిప్రాయానికి వచ్చినాను ఉద్యోగ స్వీకారానికి అనుమతి ఇవ్వవలసిందని నేను వర్కింగ్ కమిటీకి సలహా ఇవ్వడంలో ఇండియా గవర్నమెంట్ వారి నిబంధనల లోని అక్షరాలను అతిక్రమించవలెనని నా అభిప్రాయం కాదు కాని ప్రజల స్వాతంత్ర్యాన్ని విస్తరింపజేయడానికి కాంగ్రెస్‌ను పటిష్ఠం చేయడానికి ఎంత వరకు వీలుంటుందో అంతదూరం వరకూ ఆ నిబంధనలను వ్యాఖ్యానించవలసి ఉంటుందని నా ఉద్దేశము అటువంటి భావంగల నాకు బ్రిటిష్‌వారి తదితర విదే శీయుల ఉదాహరణలు నిష్ప్రయోజనాలు అదీగాక మనకందరికీ తెలిసిన మరొక చిన్న కారణంవల్ల కూడా వారి ఉదాహరణలు మనకు వర్తించవు. ప్రపంచం లోని ఇతర పార్లమెంట్ల రాజ్యాంగ చట్టాలు ప్రజలు నిర్మించుకొన్నవి గాని మన రాజ్యాంగ చట్టం వలె పై వారెవరో ప్రజలమీద రుద్దినవి కావు.

అసెంబ్లీ సభ్యుడయిన ప్రతి కాంగ్రెస్ వాది అయన ఏ పదవిలో ఉన్నప్పటికీ కాంగ్రెస్ క్రమశిక్షణకు లోబడి ఉండి దాని ఆదేశం ఎప్పటికప్పుడు నిర్వర్తిస్తుండవలసిందే కాబట్టి గవర్నమెంటువారు నిషేధించనంతవరకు కాంగ్రెస్‌కు అవసరమని తోస్తే కాంగ్రెస్ రాష్ట్రాలలోని స్పీకర్లను దేశంలోని రాజకీయాలలో చురుకుగా జోక్యం కలిగించుకోవలెనని ఆదేశించవచ్చు

కాని నాకు తెలిసినంతవరకు కాంగ్రెస్ ఈ విషయం గురించి ఆలోచించలేదు అసెంబ్లీలలో కాంగ్రెస్ వాదులు కేవలం సభ్యులుగాగాని, మంత్రులుగా గాని స్పీకర్లుగా గానీ ఉంటే వారు కాంగ్రెస్ సిద్ధాంతానుగుణంగా సత్యాహింసలకు కట్టుబడి ప్రతి పనినీ నిర్వర్తించవలసి ఉంటుంది కాబట్టి అసెంబ్లీలలోని కాంగ్రెస్ వాదులందరూ చాలా నిజాయితీపరులుగానూ, ప్రతిపక్షులపట్ల మర్యాదగానూ ప్రవర్తించవలసి ఉంటుంది వారు కపట రాజకీయాలకు లోను కాకూడదు ప్రతిపక్షులపట్ల నిర్దాక్షిణ్యంగా ఉండకూడదు వారు ఇతరుల బలహీనతలను ఆధారంగా తీసుకొని ప్రయోజనం పొందటానికి ప్రయత్నించకూడదు అసెంబ్లీలో కాంగ్రెస్ వాది ఆరోహించిన పదవిని బట్టి అతని బాధ్యతలు కూడా అంత ఎక్కువగా ఉంటాయి అసెంబ్లీ సభ్యుడు తన నియోజక వర్గానికి, తన పక్షానికి ప్రాతినిధ్యం వహించడమేగాక రాష్ట్రమంతటికీ ప్రాతినిధ్యం వహిస్తున్నాడు మంత్రి తన పక్ష ప్రాబల్యానికి ప్రయత్నించవచ్చు కాని జాతికి నష్టదాయకంగా మాత్రం ఆ పనిచేయరాదు జాతి అభివృద్ధిలోనే కాంగ్రెస్ అభివృద్ధి కూడా ఇమిడి ఉన్నది విదేశీ పరిపాలకునితో పోరాడటానికి ఆయుధం లేనప్పుడు స్వజాతిలోని శత్రువుతో పోరాడేటందుకు కూడా ఆయుధం లేదని అతడు అర్థం చేసుకోవలె కాబట్టి ఇష్టమున్నా లేకపోయినా అసెంబ్లీలలో ఇతరులతో కలిసి వ్యవహరించవలసి ఉంటుంది ప్రతిపక్షం వారిని తన వైపుకు తిప్పుకొని తన కార్యక్రమం నిరభ్యంతరంగా సాగించుకొనేటందుకు అధికారం పొందవలసిన స్థలం అసెంబ్లీయే వివిధ మతస్థుల ప్రతినిధులతో కూడిన భారత జాతికి సంపూర్ణాధికారాలుంటే భారత రాజకీయాలకు సంబంధించిన అన్ని సమస్యలను సాంఘిక ఐకమత్యంతో సహా భారత రాజ్యాంగ చట్టాన్ని వినియోగించుకొని పరిష్కారం చేసుకోవచ్చు భారత జాతీయాభ్యుదయానికి సంబంధించిన అనేక సమస్యలు పరిష్కరించుకొనేటందుకు అసెంబ్లీలను ఉపయోగించుకోడానికి భారత రాజ్యాంగ చట్టమెంత మాత్రం ఆటంకం కాదు

ఈ సందర్భాలన్నీ ఆలోచించినప్పుడు స్పీకర్ పదవి *ప్రధానమంత్రిపదవి కంటె కూడా ఎక్కువ ప్రాముఖ్యం వహిస్తున్నదని తెలియగలదు స్పీకర్ ఆ పదవిలో కూర్చున్నప్పుడు న్యాయమూర్తి నిర్వహించవలసిన పనులను నిర్వ

---

*ఇప్పుడు రాష్ట్రాలలోని ముఖ్యమంత్రి పదవి అప్పుడు ప్రధానమంత్రి పదవిగా వ్యవహరింపబడినది

హించవలసి ఉంటుంది ఆయన రూలింగ్‌లు నిష్పక్షపాతంగా, న్యాయంగా ఉండవలె మెంబర్లపట్ల మర్యాద, గౌరవం పాటించవలె కల్లోల పరిస్థితులలో ప్రశాంతంగా ఉండవలె ప్రతి పక్షాలను తన వైపుకు తిప్పుకోనేటందుకు ఇతర సభ్యులకు లేని అవకాశాలెన్నో ఆయనకుంటాయి

స్పీకర్ అసెంబ్లీకి వెలుపల పార్టీ వివాదాలలో మునిగి తేలుతూ నిష్పక్షపాతంగా ఉండజాలకుంటే సాధారణంగా ఆయనకు అసెంబ్లీలో ఉండవలసినంత విలువ ఉండదు ఆయన అసెంబ్లీ వెలుపల కూడా నిష్పక్షపాతంగానూ ప్రశాంతంగానూ ఉంటే అసెంబ్లీలో ఆయనకు ఎక్కువ విలువ ఉంటుంది అంతే కాక ఆయన కాంగ్రెస్ ప్రతిష్ఠను కూడా ఇనుమడింప చేయగలడు స్పీకర్‌గా హిందూ ముస్లిమ్ వివాదం పరిష్కారం చేయడానికి కూడా ఇతరులందరికంటె ఆయనకు అపూర్వమయిన అవకాశమున్నది కాబట్టి స్పీకర్ అసెంబ్లి భవనంలోనేగాక వెలుపల కూడా అగ్రశ్రేణికి చెందిన కాంగ్రెస్ వాదిగా ఉండవలెనని నా అభిప్రాయము వ్యక్తిగా ఆయన, ఎవ్వరూ తనపైన ఏ విధమయిన నేరం ఆపాదించడానికి అవకాశంలేని, శీలవంతుడుగా ఉండవలె సమర్థుడుగా ఉండవలె నిర్భీతిపరుడుగా ఉండవలె సహజంగా న్యాయస్థుడ గా ఉండవలె వీటన్నిటినీ మించి మనసా, వాచా, కర్మణా సత్యాహింసలను పాటించేవాడుగా ఉండవలె అప్పుడాయన ఏ వేదిక మీదనయినా నిలబడి మాట్లాడవచ్చు"

హరిజన్, యం కె గాంధీ

16-7-38

# 23
# 1937 - 38 లో కాంగ్రెస్ రాష్ట్రాలలోని కొన్ని ఘటనలు

1937 లో కాంగ్రెస్ సభ్యులు అధికసంఖ్యాకులుగా ఉన్న కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వాలు నిర్మింపబడినాయి అటువంటి రాష్ట్రాలలో ఆనాటి సంయుక్త మద్రాస్ రాష్ట్రమొకటి దానికి శ్రీమాన్ సి రాజగోపాలాచారి ప్రధానమంత్రిగా ఉన్నారు నేటి రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి ఆనాడు రాష్ట్ర ప్రధానమంత్రి పదవిగానే పేర్కొబడుతూండేది

బొంబాయి, సంయుక్త రాష్ట్రాలు (నేటి ఉత్తరప్రదేశ్), బీహారు, మధ్య రాష్ట్రాలు, ఒరిస్సాలలో కూడా కాంగ్రెస్ మంత్రివర్గాలనే ఆనాడు ఏర్పాటు చేయడంజరిగింది కాంగ్రెస్ పరిపాలనలో ఉండిన ఈ కొన్ని రాష్ట్రాలలో జరుగుతూండిన దౌర్జన్య చర్యలను, అసమంజస ప్రచారాలను నిరసిస్తూ గాంధీజీ 1938 సెప్టెంబరు 17 న హారిజన్‌లో "పెచ్చు పెరిగిపోతూన్న సాక్ష్యం' (Accumulating Evidence) అనే శీర్షిక కింద వ్రాసిన దిగువ వ్యాసం ముఖ్యంగా గమనించతగినది

'మనిషి నాటిన విత్తనాన్నిబట్టి ఫలం లభిస్తుంది ఇంతవరకూ దౌర్జన్యం గురించి వ్రాసినాను ఈ నా వ్రాతలకు అనుగుణంగా భారతదేశంలోని అన్ని భాగాలనుంచి తగినంత సాక్ష్యం లభిస్తూన్నది ఒకానొక జమీందారీలోని భూములను ఆక్రమించుకొనేటట్లు, ఆ జమీందారీలోని రైతులను ఒక కాంగ్రెస్ కమిటీ రెచ్చగొట్టడం నా దృష్టిలో అత్యంత విషాదకరమైన దుస్సంఘటన ఈ దురాక్రమణ కాంగ్రెస్‌వాదులు కావించిన దౌర్జన్య పూరితాలయిన తీవ్ర ప్రసంగాల తరవాత జరిగింది *ఇందుకు సంబంధించినకాగితాలను విచారణ నిమిత్తం నేను డాక్టర్ పట్టాభి సీతారామయ్యకు పంపినాను నా విలేఖకుడు వ్రాసిన అన్ని ఆరోపణలు దర్యాప్తుమీద సరియైనవేనని ఆయన వ్రాస్తున్నారు జరిగిన తప్పును, జిల్లా కమిటీగాని, రాష్ట్ర కమిటీగాని సరిదిద్దగలదని నేను ఆశిస్తున్నాను అట్లా జరగకపోయినట్లయితే రాజాజీ ప్రభుత్వం తప్పక దీనిని సరి

---

* ఆంధ్రదేశంలోని పశ్చిమగోదావరి జిల్లాలో కాశీపట్నం జమీందారీలోని భూములను ఆక్రమించుకోవలసినదని నరసాపురం తాలూకా కాంగ్రెస్ నాయకులు చేసిన హెచ్చరికకు సంబంధించిన వృత్తమిది

చేయవలసి ఉంటుంది ఇట్లు నేను చెప్పడంలో భూమిమీద పనిచేసే కర్షకునికి ఆ భూమి చెందదని సూచించడం నా అభిప్రాయం కాదు సోషలిస్టు సిద్ధాంతానికి సంబంధించిన హక్కును నేనూ అంగీకరిస్తాను కాని నాకు తెలిసినంతవరకు ప సోషలిస్టూ కూడా ఆంధ్రలో అవలంబించిన దురాక్రమణను సమర్థించలేదు భారతదేశంలోని యావత్తు భూమీ కర్షకులకు మాత్రమే చెంది వారి హక్కు భుక్తాలలో ఉండవలెనంటే ఆ పని రక్తపాతంతో కూడిన విప్లవం వల్లగానీ లేక ఒక న్యాయబద్ధమయిన శాసనంవల్లగానీ జరగవలసి ఉంటుంది దురాపహరణం కొనసాగదనే సంగతి బుద్ధిమంతుడయిన ప్రతి వ్యక్తీ స్పష్టంగా గ్రహించవలసి ఉంది కాంగ్రెస్ ప్రభుత్వమే కాకపోయినట్లయితే ఈ దురాక్రమణ ఎన్నడూ జరిగి ఉండేదికాదు న్యాయమయిన హక్కుదారుకు ఆ భూమిని తిరిగి ఈయజాలనట్లయితే కాంగ్రెస్ ప్రభుత్వం తన గోయి తాను తవ్వుకోవడమే అవుతుంది ఈ సందర్భంలో మరొక సంగతి కూడా చెప్పవలె దురాక్రమణకు గురియైన ఆ జమీందారు, కాంగ్రెస్ దృక్పథం కలిగి వినయసంపన్నుడుగా పేరెన్నిక గన్నవారు

మరొక సాక్ష్యమేమంటే, సంయుక్తరాష్ట్రాలు, మధ్య రాష్ట్రం, బొంబాయి వార్తా పత్రికలనుంచి ఏరి తీసిన ముక్కలు గద్యపద్యాలలో దౌర్జన్యాన్ని రెచ్చగొట్టడం ఉత్తరప్రదేశ్ పత్రికల ముక్కలలో కనబడుతూన్న ప్రత్యేకత ఒక రచయిత్రి జమీందారుల దుండగాలను గురించి కిసానులకు జరుగుతూ ఉండిన అన్యాయాలను గురించి కోపోద్వేగంతో వ్రాసింది కలవారి ఐశ్వర్యానికీ లేనివారి దారిద్ర్యానికీ మధ్యఉన్న తారతమ్యాన్ని ఆమె భయంకరంగా చిత్రించింది ఆ చిత్రణ ననుసరించి రానున్న మహాసంక్షోభంలో ఉత్సాహంతో పాల్గొవలసిందని ఆమె కిసానులను ఇట్లా ఆహ్వానిస్తూన్నది

"మీ చేతికి చిక్కిన ఆయుధం తీసుకోండి, కొట్టండి, గట్టిగా కొట్టండి! పిరికిపందలు కాకండి! అది అంతా మీదే! దానిని మీ శక్తిమంతాలయిన ఆయుధాలతో లాక్కోవలె" ఆ మహిళ పేరు రచయిత్రిగా మిట్టిమూస్తూ నాకు ప్రత్యక్షం కాకుండినట్లయితే భారతదేశపు పుత్రిక ఇంత నిర్దయాపూర్వకమయిన దౌర్జన్యాన్ని ప్రేరేపించి ఉండగలదని నేను ఊహించి ఉండేవాణ్ణి కాదు ఎంత గట్టిగా ప్రయత్నించినప్పటికీ ఆమె వ్రాసిన మూడు కాలాల దుర్భాషలను నేను పూర్తిగా నాపలేకపోయినానని ఒప్పుకొని తీరవలె నిజానికి ఈ వ్రాతవల్ల తల తిరుగనివాడెవడయినా ఉంటే అది ఆమె తప్పుకాదు అదృష్టవశాత్తు ఇది ఎవరి నుద్దేశించి వ్రాయబడిందో ఆ లక్షలాది ప్రజలకు చదవడం రాదు

మధ్యరాష్ట్రం బొంబాయి రాష్ట్రాల వార్తాపత్రికలలోని ముక్కలు ఊహించరాని అబద్ధాలతో నిండి ఉన్నాయి ఆ వ్రాతకు నిగ్రహమనేది లేదు. వ్యక్తుల శీలం కళంకితం చేయడానికి ఎంత చెడుభాషయైనా చాలడంలేదు. వాటిలో పేర్కొన్న అనేక విషయాలు అభూతకల్పనలు ఆ వ్రాతలు

తేలికగా అపనిందారోపణల చట్టం కిందకు వస్తాయి అయితే ఆ చట్టం క్రింద చర్య తీసుకొంటే ఏమి జరుగుతుంది? ఆ పత్రికలకు ప్రకటన లభిస్తుంది ఇక ప్రతివాదం ఆ కల్పనకు అదనపు అవకాశం కలిగిస్తుంది పరోక్షంగా రెచ్చగొట్టడం కూడా ఉంది ఆ వ్రాతలలో రెచ్చగొట్టడం లేకపోయినా అత్యంత కళంకితులుగా చిత్రింపబడిన వ్యక్తుల చిత్రణలను గురించి చదివిన యువకులు ఆ పరమ దౌర్భాగ్యులను హతమార్చవలెనని ఎందుకు తలంచరు? చాలా మందికి వారి వార్తాపత్రికలే వారి వేదగ్రంథాలు వాటిలో వారికి మంచి నమ్మకము ఆ పత్రికలలో కొన్ని కాంగ్రెస్ విధానాన్ని ప్రతిబింబింపచేస్తాయనే భావం కూడా ఉంది కాంగ్రెస్ పరిపాలనలో ఈచెడుగు ఇంకా ఎక్కువయింది ఇంత వరకూ గూఢంగా ఉన్నది ఇప్పుడు వెలికిరావడం మంచిదే! అయితే ఇది పౌర స్వాతంత్ర్యం మాత్రం కాదు దుష్టస్వైర విహారం (Criminal licence) అబద్ధాలతో, దౌర్జన్యంతో స్వరాజ్యం లభించదు మనమీ పనులన్నీ సత్యాహింసల పేరుమీద చేస్తూన్నట్లయితే మన తప్పు రెట్టింపు అవుతుంది కాంగ్రెస్‌కూ కాంగ్రెస్‌వాదులకూ ఇచ్చిన సలహాపట్ల నేను ఆసక్తితో ఉంటాను

# 24

# హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పుట్టుక (1938)

బ్రిటిష్ ఇండియాలో జరుగుతున్న స్వాతంత్ర్య సమర ప్రభావం హైదరాబాదు సంస్థానం పైన ప్రసరించకతప్పలేదు హైదరాబాదు సంస్థాన రాజకీయ మహాసభ 1931 లో రామచంద్ర నాయక్ అధ్యక్షత కింద బీరారులోని అకోలా నగరంలో జరిగింది నిజాం ప్రభువు, ఆయన పరిపాలకులు బీరారు హైదరాబాదు సంస్థానంలో చేరవలెనని ఎంతో కాలంనుంచి కోరుతూ ఉండడంచేత బీరారులోని అకోలా నగరంలో హైదరాబాదు సంస్థాన ప్రజల రాజకీయ మహాసభ జరగడం వారికి మనసులలో కొంతవరకు సంతోషంగానే ఉన్నది ఆ సభలో మహా ఘనత వహించిన నిజాం ప్రభువు యాజమాన్యం కింద హైదరాబాదు సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం స్థాపించబడవలెనవే తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరింపబడింది కాని హైదరాబాదు ప్రభుత్వంవారు మాత్రం ఆ తీర్మానం పట్ల కించిత్తయినా ఆసక్తి కనబరచలేదు హైదరాబాదు సంస్థాన రాజకీయ మహాసభా స్థాయీ సంఘంవారు, నిజాం ప్రభువు రజతోత్సవ సందర్భంలో తమ కోరికలను, ఆశయాలను వివరిస్తూ నిజాం ప్రభువుకు ఒక విజ్ఞాపన పత్రం అందజేసినారు దానిలో లెజిస్లేటివ్ కౌన్సిల్‌ను ప్రజాస్వామ్య పద్ధతుల పైన విస్తృతం చేస్తూ రాజకీయ సంస్కరణాలను తక్షణం ప్రవేశ పెట్టవలెనని విన్నవించినారు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యుడుగా కొత్తగా నియమింపబడిన శ్రీ కాశీనాథరావు వైద్య ఆనాటి లెజిస్లేటివ్ కౌన్సిల్ నియమావళిని సవరించడానికి ఒక బిల్లును ప్రవేశ పెట్టేటందుకు ప్రభుత్వంవారి అనుమతిని కోరినారు

1931-32 సంవత్సరాలలో బ్రిటిష్ ఇండియాలో స్వాతంత్ర్యోద్యమము తీవ్రంగా సాగుతున్నప్పుడు ప్రభుత్వ నిర్బంధ విధానం హద్దులు దాటిపోయింది గాంధీజీ నాయకత్వం క్రింద వేలకొలది యువతీ యువకులు ఆ పోరాటంలో పాల్గొన్నారు హైదరాబాదు సంస్థానంలో కూడా గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఆసక్తి కలిగింది హైదరాబాదులో ఖద్దరు, విదేశీ వస్తు బహిష్కారం మద్యనిషేధం మొదలయిన విషయాలను గురించి తీవ్రంగా ప్రచారం జరిగింది సద్వేశీ లీగు కార్యదర్శి ఫజలుర్రహమాన్ హైదరాబాదు సిటీ కాలేజీలోని తన ప్రొఫెసర్ పదవికి రాజీనామా ఇచ్చినారు భారత జాతీయ కాంగ్రెస్‌కు అనుబంధ సంస్థగా ఉన్న హైదరాబాదు జిల్లా కాంగ్రెస్ కమిటీవారు ప్రభుత్వంవారి ఆగ్రహం లెక్కచేయక మోతీలాల్ దినం జరిపినారు జాతీయ పతాకావి

వందనలు ప్రతివారం జరుగుతూండడం ఆచారంగా పరిణమించింది నవజీవన్ సభవారు పండిత మోతీలాల్ నెహ్రూ సంవత్సరీకసందర్భంలో 144వ సెక్షన్‌ను ధిక్కరించి మోతీలాలుకు జోహార్లు సమర్పించినారు ఆ రోజులలో హైదరాబాదు ప్రభుత్వ కార్య నిర్వాహక సభకు అధ్యక్షుడుగా ఉన్న సర్ అక్బర్ హైదరీ ప్రత్యేక లెజిస్లేటివ్ కౌన్సిలు సమావేశం పిలిచి, దానిలో సంస్థాన పరిస్థితులను పరిశీలించి సంస్థానంలోను శాసనసభలోను సముచితాలయిన రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టేటందుకు తగిన సూచనలు చేయటానికి దివాన్ బహాద్దూర్ అరవముదయ్యంగారి అగ్రాసనాధిపత్యం కింద ఒక ప్రత్యేక కమిటీ నియమింపబడినట్లు ఘనత వహించిన నిజాం ప్రభువుగారి సందేశం ప్రకటించినారు ఈ ప్రకటన సంస్థానంలో రాజకీయ చైతన్యం కలిగిన ప్రజలకు సంతృప్తికరంగా లేకపోయింది అందువల్ల వారు ఆ కమిటీ విచారించవలసిన విషయాలను కమిటీలోని సభ్యుల నియామకాన్ని కూడా నిరసించినారు

కమిటీ నిర్వర్తించవలసిన ఆశయాలు చాలా సందిగ్ధంగా ఉన్నందుననూ బాధ్యతాయుత ప్రభుత్వ సంస్థాపనకు సంబంధించిన ఉద్దేశంగానీ, సూచనగానీ వాటిలో ఎంత మాత్రం కనపడనందువల్ల ప్రజలకు ఆశాభంగం కలిగింది అయినప్పటికి జూబిలీ సంవత్సరాంతానికి ముందే రాజ్యాంగ సంస్కరణలు ప్రవేశ పెట్టబడతాయని ఫర్మానులో ఒక షరతున్నది కాని తరవాత ఈ వ్యవధి పొడిగింప బడినది అందువల్ల కూడా ప్రజల అసంతృప్తి మరింత హెచ్చు పెరిగింది

1938 జనవరిలో శ్రీ మాడపాటి హనుమంతరావు అధ్యక్షత కింద హైదరాబాదు ప్రజా పరిషత్తు (Hyderabad People's Convention) జరిగింది దానిలో అన్ని వర్గాల ప్రతినిధులు సమావేశమయినారు బాధ్యతాయుత ప్రభుత్వం త్వరలో ప్రవేశ పెట్టవలసిన అవసరం గురించి సభ్యులు తీర్మానించినారు శ్రీ కాశీనాథరావు వైద్య ప్రకటించిన ప్రతికూల భావంవల్ల అయ్యంగారి కమిటీని గురించి ఉన్న మోజు తగ్గిపోయింది పరిషత్తు కమిటీ అధ్యక్షుడు 1938 జూలై 3వ తేదిన ప్రభుత్వంవారికొక ఉత్తరం వ్రాస్తూ, బాధ్యతాయుత ప్రభుత్వం త్వరలో ప్రవేశ పెట్టవలసిన అవసరం గురించి వారి దృష్టికి తీసుకొని వచ్చినారు కొచ్చిన్ వంటి చిన్న సంస్థానం బాధ్యతాయుత ప్రభుత్వం అనుభవిస్తూండగా హైదరాబాదు వంటి ప్రముఖ సంస్థానం వెనకబడి ఉండటం బాగా లేదన్నారు ఇది ఇట్లా ఉండగా 53వ నెంబరు గస్తీని ప్రభుత్వంవారు రద్దుచేసి అంతకంటే ఇకరినతరమయిన నిబంధనలను తయారుచేసి బహిరంగ సభలను నిరోధించేటందుకు పోలీసు వారికి మరికొన్ని విస్తృతాధికారాలు ఇవ్వడంవల్ల ప్రజలకు మరింత అసంతృప్తి, ఆశాభంగం కలిగింది

1938లో హరిపురాలో జరిగిన భారత జాతీయ కాంగ్రెస్‌కు హైదరాబాదు సంస్థానం నుంచి 500 మంది ప్రజలు హాజరయినారు ఆ కాంగ్రెస్‌లో అంగీకరింపబడిన కొన్ని తీర్మానాలు యువకులను ఉత్సాహవంతులుగానూ, ఉత్తేజితులు

గానూ చేసినాయి హైదరాబాదులోకూడా ఒక రాజకీయ సంస్థను స్థాపించడం తప్పనిసరని తోచింది వారికి సంస్థానంలో రాజకీయ చైతన్యవంతులయిన యువకుల మనసులను సరియైన తోవలో పెట్టకుంటే వారు మత తత్వవాదులై పెడ తోవలు పట్టవచ్చుననే అభిప్రాయంతో ఆలోచనాపరులైన పెద్దలనేక మంది హైదరాబాదులో ఒక రాజకీయ సంస్థను నిర్మించడం అత్యావసరమని భావించినారు మత విద్వేషాలను నిర్మూలించి దేశభక్తియుతమయిన ఒక జాతీయ సంస్థను స్థాపించడానికి అన్ని వర్గాలవారు ఆసక్తి కనబరిచినారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌ను స్థాపించడానికి అనేక ఇష్టాగోష్ఠి సభలు జరిగినాయి 1938 జూలై మధ్యలో తాత్కాలిక కమిటీ ఒకటి ఏర్పాటయింది ఒక నెల రోజులలోనే హైదరాబాదు సికిందరాబాదు జంట నగరాలలోనే గాక బయటి జిల్లాలలో కూడా 1200 మంది ప్రాథమిక సభ్యులు చేరినారు 1938 సెప్టెంబర్ 9 ప్రాంతంలో కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకొనేటందుకు, నిబంధనావళిని అంగీకరించే నిమిత్తం సాధారణ సభ్యుల సమావేశం జరపవలెనని నిర్ణయించడం జరిగింది

1938 ఆగస్టు రెండవ వారంలో తాత్కాలిక కమిటీవారు ఒక ప్రకటన చేసినారు దాని సారాంశమిది

"హైదరాబాదు సంస్థాన ప్రజలు కుల, మత, శాఖా, వర్గ భేదాలతో నిమిత్తం లేకుండా హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌లో చేరి బాధ్యతాయుత ప్రభుత్వ సంపాదనోద్యమం బలపరచ వలసిందని హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ తాత్కాలిక కమిటీవారు కోరుతున్నారు

ప్రభుత్వంవారు త్వరలోనే ముఖ్యమయిన రాజకీయ సంస్కరణలను ప్రవేశ పెట్టేటందుకు ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణాలకు అవసరాలయిన వివిధ ప్రణాళికలను తయారు చేసే నిమిత్తం ఆలోచిస్తున్న ఈ తరుణంలో కేవలం జాతీయ పద్ధతులమీద సరియైన ఉద్యమం ప్రారంభించడం అత్యావసరమని గ్రహించి 'హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్' అనే పేరుతో ఒక సంస్థ స్థాపించ బడింది ఆ సంస్థ ఆశయాలివి

"ఆసఫ్ జాహి వంశానికి చెందిన మహా ఘనత వహించిన నిజాం ప్రభువు వారి ఛత్రఛాయన బాధ్యతాయుత ప్రభుత్వం పొందడం హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఆశయము దేశములోని వైజ్ఞానిక, నైతిక, ఆర్థిక, పారిశ్రామిక సంపదలను సక్రమంగా నిర్మించుకొని, అభివృద్ధి చేసుకొని ప్రజలలో ఐకమత్యం పెంపొందించడం ద్వారా శాంతము, సక్రమము అయిన పద్ధతులతో ఈ ఆశయాలను సాధించవలసి ఉన్నది"........ అని హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఆశయాలను ఇంకా విస్తృతంగానూ, వివరంగానూ స్టేట్ కాంగ్రెస్ తాత్కాలిక కమిటీవారు ప్రకటించినారు

ఇటువంటి సదాశయాలతో స్థాపించబడిన హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌ను సైతము నిజాం ప్రభుత్వంవారు ప్రత్యేక గెజెట్ ద్వారా 1938 సెప్టెంబర్

8 వ తేదీన నిషేధిస్తూ ఉత్తరువులను జారీచేసినారు

"గవర్నమెంట్‌వారు సొంతంగా చేసిన విచారణవల్ల, రానున్న హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌తో సంబంధంగల ప్రముఖ వ్యక్తుల చరిత్రలను బట్టి హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఆశయాలను గురించి ఎవరేమి చెబుతున్నప్పటికీ అది మత ప్రాతిపదికపై నిర్మింపబడి, మత విద్వేషాలకు, విధ్వంసక చర్యలకు దారితీయగలదని ప్రభుత్వం వారు విశ్వసిస్తున్నారు కాబట్టి హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పేరుతో సంస్థను స్థాపించకూడదని ప్రభుత్వం వారు నిషేధిస్తున్నారు ఒకవేళ అది స్థాపించి ఉన్నట్లయితే ప్రజారక్షణ చట్టం కింద అది అక్రమ సంఘంగా ప్రకటింపబడుతున్నది" అని ప్రభుత్వపు నిషేధపుటుత్తరువులలో ఉంది

తాత్కాలిక కమిటీవారు నిజాం ప్రభువు నలభయ్యో జన్మదినోత్సవ సందర్భంలో సమావేశమయి ఆయనను అభినందిస్తూ ఒక టెలిగ్రాం పంపించినారు అదే సమయంలో స్టేట్ కాంగ్రెస్ కులమత తత్వాలకు అతీతమయిందని దాని ఆశయాలను గురించి విస్పష్టంగా మరొక విపులమయిన ప్రకటన కూడా చేసినారు

సెప్టెంబర్ 6 వ తేదీన సర్ అక్బర్ హైదరీ వివిధ వర్గాల వారికి ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రజా నాయకులను పిలిచి వారికి తన మనసులోని అభిప్రాయాలను కొద్దిగా సూచించినారు తాత్కాలిక కమిటీ సభ్యుడుగా ఉన్న యం రామాచారి అట్లా పిలువబడిన వారిలో ఒకరు సర్ అక్బర్ హైదరీతో ప్రజా నాయకుల సంభాషణలు జరుగుతూండగానే స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధపుటుత్తరువులు ముద్రణాలయంలో అచ్చవుతున్నాయి

స్టేట్ కమిటీపైన నిషేధపుటుత్తరువులు జారీ అయిననాడే శ్రీ రామాచారిని కొత్వాలు సాహెబ్ పిలచి 1938 సెప్టెంబర్ 9 వ తేదీన ఏర్పాటు చేసిన స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశం ఆయన ఇంట్లో జరగరాదనీ, అట్లా జరిగితే ఆ ఇంటిని ప్రభుత్వంవారు స్వాధీనపరుచుకొంటారనీ తెలియచెప్పినారు తాత్కాలిక కమిటీ ఆ సాయంకాలమే సమావేశమయి సాధారణ సమావేశం నిరవధికంగా వాయిదా వేసింది

తరవాత తాత్కాలిక కమిటీవారు, ప్రభుత్వంవారు తమపైన ఆరోపించిన నేరాలను ప్రతిఘటిస్తూ ఒక ప్రకటన చేసినారు. ఈలోగా శ్రీ మందుముల నరసింగరావుగారు తన వ్యక్తిగత హోదాలో నవాబు బహద్దూర్ యార్ జంగ్‌ను కలుసుకొన్నారు వారిద్దరు హైదరాబాదు సంస్థాన రాజకీయ, సాంఘిక విషయాలను గురించి మూడు పర్యాయాలు పరస్పరం నిష్కపటంగా చర్చించుకొన్నారు తరవాత వారుభయులు ఆయా సంఘాలకు చెందిన ప్రముఖ నాయకుల అంగీకారంతో సంభాషణలు కొనసాగించవలెనని ఏకాభిప్రాయానికి వచ్చినారు.

సెప్టెంబరు 18వ తేదీన నరసింగరావుగారికి నవాబుసాహెబు నుంచి ఒక

ఉత్తరం వచ్చింది అందులో ఆయన ఇరవై మంది హిందూ నాయకుల పేర్లు సూచిస్తూ వారందరితో సంప్రదించి వారి ఆదేశం పొంది తనతో మాట్లాడ రావలెనని వ్రాసినారు నవాబు సాహెబ్ సూచించిన పేర్లలో తాత్కాలిక కమిటీకి చెందిన 1 బి రామాచారి, 2 పి వి కోషి, 3 బూర్గుల రామకృష్ణ రావు, 4 జనార్ధనరావుదేశాయ్, 5 యస్ వి నాయక్, 6 రామ గ్రిష్ణధూత్ గార్ల పేర్లు కూడా ఉన్నవి నవాబు సాహెబు పేర్కొన్న తక్కిన 14 మందిలో ఒకరిద్దరు తప్ప తక్కిన వారందరూ హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సాధారణ సభ్యులు

భావినిర్ణయాలకు సంబంధించిన ఈ ముఖ్యమయిన సంభాషణలు జరుగుతుండగా ప్రభుత్వ వ్యతిరేక ప్రచారంగానీ, ఎవ్వరూ అరెస్టులకు తయారు కావడంగానీ జరగకూడదనీ, అందువల్ల ప్రశాంత వాతావరణంలో సంభాషణలు జయప్రదం కావడానికి వీలుంటుందనీ అంజుమనె ఇత్తెహాదుల్ ముసల్మీన్ (ముస్లిం ఐక్యతా సంఘం) అధ్యక్షుడు బహద్దూర్ యార్ జంగ్ నరసింగరావు గారికి వ్రాసినారు

సెప్టెంబరు 22న నరసింగరావుగారు తన వ్యక్తిగత హోదాలో నవాబు అలీయావర్ జంగ్‌ను (ప్రభుత్వ కార్యదర్శి) కలుసుకొని ఈ విషయాలన్నీ ఆయనకు చెప్పి నవాబు బహద్దూర్ యార్ జంగ్‌తో తాను సంభాషణలు జరుపుతున్నప్పుడు ప్రశాంత వాతావరణం ఏర్పడేటందుకు వీలుగా హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పైన ఉన్న నిషేధాలను తొలగించడానికి ప్రయత్నించ వలసిందని కోరినారు. ఈ సంభాషణలు పూర్తి అయ్యేటంతవరకు తాత్కాలిక కమిటీవారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశం నిలుపుదల చేసేటందుకు సైతం తాను వారిని ప్రోత్సహించగలనని కూడా ఆయన వాగ్దానం చేసినారు నవాబు అలీయావర్ జంగ్ ఇందుకు అంగీకరించి శ్రీ నరసింగరావును సర్ అక్బర్ నివాసానికి తీసుకొని వెళ్ళినారు సర్ అక్బర్ తో నరసింగరావు సమావేశం ఒక అరగంట జరిగింది నరసింగరావుగారు అన్ని విషయాలను సమగ్రంగా సర్ అక్బర్‌కు చెప్పి, స్టేట్ కాంగ్రెస్‌పైన నిషేధం తొలగించ వలెనని కోరినారు సర్ అక్బర్ అంతకు పూర్వమే ఈ విషయాలన్నీ సంగ్రహంగా తెలుసుకొని ఉన్నందువల్ల, శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, కాశీనాథరావు వైద్య, రామాచారి, వినాయకరావు కొరట్కార్, బి రామ కృష్ణరావు, జనార్దనరావు దేశాయ్‌గార్లు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశాన్ని నిలుపుదల చేయగలమని వాగ్దానం చేస్తూ ఒక విజ్ఞాపన పత్రం పంపిస్తే, షేధపుటుత్తరువులను తొలగించడానికి ఆయన అంగీకరించినారు

నాయకులీ విషయం తమలో తాము చర్చించుకొన్న తరవాత నరసింగ రావుగారు కొంత మంది నాయకులతో కలసి ప్రభుత్వ రాజ్యాంగ కార్యదర్శి నవాబు అలీయావర్ జంగ్‌ను దర్శించినారు వారి సంభాషణలు మూడు గంటలు

జరిగినాయి అనేకవిషయాలు పరస్పరం చర్చించుకొన్నారు తాత్కాలిక కమిటీ పక్షాన మాట్లాడేటందుకు అధికారం పొందిన శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారు తమ సంస్థ మత సంబంధమయినది కాదని, ముస్లిమ్ నాయకులు ఆ సంస్థలో చేరటానికి సందేహాస్పదమైనంత మాత్రంతో దానిని మత పరమయిన సంస్థగా ఎంత మాత్రం ఊహించడానికి కూడా అవకాశం లేదని రాజ్యాంగ కార్యదర్శి సంప్రదింపులు చెప్పటానికి ప్రయత్నించినారు స్టేట్ కాంగ్రెస్ సంస్థానికి వెలుపలనున్న సంస్థకు అనుబంధ సంస్థగా ఉన్నదా? అనే విషయం కూడా చర్చకు వచ్చింది స్టేట్ కాంగ్రెస్ సంస్థానానికి వెలుపల ఉన్న సంస్థకు అనుబంధ సంస్థగా లేదని రామకృష్ణరావుగారు ఖచ్చితంగా చెప్పినారు కాని సంస్థలోని సభ్యులు వ్యక్తులుగా వెలపల ఉన్న రాజకీయ వేత్తల సలహాను పొందకుండా చేయడంగానీ, వారితో పరస్పరం చర్చించకుండా చేయడంగానీ సాధ్యం కాని పని అన్నారు

అంతట నవాబు అలీయావర్ జంగ్ అంతకు పూర్వం ఎన్నడూ పేర్కొనని రెండు కొత్త షరతులను వారి ముందు పెట్టినారు అవి ఏవంటే

1 హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పేరులోని 'కాంగ్రెస్' అనే మాటను రాజకీయకారణాలను బట్టి తొలగించవలె ఈ మాటను తొలగించటానికి కౌన్సిల్ పట్టు బట్టే మాట నిజము

2 నిషేధం తొలగించవలెనని కోరే విజ్ఞాపనలో సంతకాలు చేసినవారు, నరసింగరావుకూ, నవాబు బహద్దూర్ యార్ జంగ్‌కూ జరిగిన సంభాషణలలోని విషయాలను ఉదాహరిస్తూ వాటిలో ఏ విషయాలను అంగీకరించడం జరిగిందో, ఏ విషయాలలో ఎంతవరకు భేదాభిప్రాయం ఉందో వివరించవలె అందువలన విజ్ఞాపన పత్రం చూడగానే ప్రభుత్వంవారు కనీసం సంభాషణలు జయప్రదం కావడానికి అవకాశము ఉందనుకొనేటందుకు వీలు కలుగుతుంది అప్పుడు నిషేధాన్ని తొలగించడానికి వారిని ప్రోత్సహించవచ్చు ఇంతేగాక వారి విజ్ఞాపన పత్రంలో స్టేట్ కాంగ్రెస్‌ను ఒక ప్రత్యేక సంఘానికి సంబంధించిన సంస్థ అనే కళంకం ఆపాదించి నిషేధించడం న్యాయం కాదనీ, ఐక్య సంభాషణలు జయప్రదమయ్యేటందుకు తాము తోడ్పడగలమనీ కూడా వ్రాయవలె

ఇందుకు సమాధానంగా స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశంలో చర్చిస్తేనే కాని స్టేట్ కాంగ్రెస్ పేరును మార్చడానికి వీలుకాదని చెప్పడం జరిగింది తాత్కాలిక కమిటీ వారి అధికారం పొందితేనేగాని కమిటీలోని సభ్యులు వ్యక్తులుగా ప్రభుత్వాధికారులను దర్శించకూడదని తీర్మానించడం జరిగింది

శ్రీ యం. నరసింగరావుగారు నవాబు అలీయావర్ జంగ్‌ను దర్శించినప్పుడు, ప్రభుత్వంవారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పేరు మార్చడం గురించి పట్టుదల చూపరనీ, ఐక్య సంభాషణలు పూర్తి అయ్యేటంత వరకు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశం నిలుపుదల చేసేటందుకు తాత్కాలిక కమిటీవారు హామీ ఇవ్వవలెనని మాత్రం కోరగలరనీ చెప్పినారు

ఇందుకు జవాబుగా, ప్రభుత్వంవారు ఐక్య సంభాషణలు జయప్రద మయ్యేటందుకు నిషేధం తొలగించే పక్షంలో తాత్కాలిక కమిటీవారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశం వాయిదా వేయడానికి అంగీకరిస్తూ మత సామరస్యం అవసరం గురించి తమ తీర్మానంలో పునరుద్ఘాటించినారు ఈ తీర్మానం నకలును వారు శ్రీ నరసింగరావుగారికి పంపించినారు

శ్రీ మాడపాటి హనుమంతరావు, కాశీనాథరావు వైద్య, మందుముల నరసింగరావుగార్లు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగించవలెనని కోరుతూ వ్రాసిన దరఖాస్తు ముసాయిదాను అలీయావర్ జంగ్‌కు చూపి ఆయన ఆమోదం అపేక్షించినారు ఆ ముసాయిదాలో ఐకమత్య సంభాషణలు అనుకూల వాతావరణంలో ప్రారంభమయినవనీ, అవి జయప్రదం కావడానికి తగిన అవకాశాలు ఎక్కువగా ఉన్నవనీ హామీ ఇచ్చినారు అంతేగాక చర్చించవలసిన ముఖ్య విషయాలను గురించి కూడా దానిలో వ్రాసినారు శ్రీ హనుమంతరావు, కాశీనాథరావు వైద్య గార్లు ఆ హామీ దరఖాస్తు పైన తాము సంతకాలు చేయడానికీ, తాత్కాలిక కమిటీలో సభ్యులుకాని హిందూ నాయకుల సంతకాలను సేకరించడానికికూడా బాధ్యత వహించినారు అంతట నవాబు అలీయావర్ జంగ్ ఆ హామీ తనకు అంగీకారంగా లేదనీ, అది అంతకంటె వివరంగా ఉండవలెననీ తాత్కాలిక కమిటీలో సభ్యులుగాఉన్న రామకృష్ణారావు, రామాచారి, జనార్దనరావు దేశాయ్‌ల సంతకాలుకూడా అందులో ఉండవలెనని అన్నారు

అంతట నరసింగరావుగారు తాత్కాలిక కమిటీ స్థితిని వివరించి చెప్పి ఐకమత్య సంభాషణలో తాత్కాలిక కమిటీవారు పాల్గొనకపోయి నప్పటికీ అవి సుముఖంగా జయప్రదం కావడానికి వారు సహాయం చేయగలరని అన్నారు నవాబు అలీయావర్ జంగ్ దానికికూడా సంతృప్తి పడక చర్చించ వలసిన విషయాల పూర్తి వివరాల నిచ్చి, ఒడంబడిక కుదరడానికి ఉన్న అవకాశాలను స్పష్టంగా సూచిస్తూ ఆ దరఖాస్తు పైన తాను పేర్కొన్న ముగ్గురి సంతకాలు ఉండి తీరవలెనని పట్టు పట్టినారు అట్లా కానట్లయితే గవర్నమెంట్‌వారు స్టేట్ కాంగ్రెస్ పైన నిషేధాన్ని తొలగించే విషయం ఆలోచించడానికి వీలులేదని అన్నారు. అంతటితో గవర్నమెంట్‌వారితో రాయబారాలు విచ్ఛిన్నమయి 26 వ సెప్టెంబర్ నాటికి పరిస్థితులు విషమించి తీవ్రరూపం దాల్చినాయి. ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గంవారు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌పైన నిషేధం తొలగించరాదని అనాడే ఒక నిర్ణయానికి వచ్చినారు

కాని 1938 సెప్టెంబరు 28 వ తేదీన జరిగిన విషయమంతా తాత్కాలిక కమిటీకి వ్రాస్తూ నవాబు బహద్దూర్ యార్‌జంగ్‌తో ఐకమత్య సంభాషణలు జయప్రద మయ్యేటందుకు వీలుగా ప్రశాంత వాతావరణం కల్పించేటందుకు హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సాధారణ సమావేశం మరొక 15 రోజులు

వాయిదా వేయవలసిందని నరసింగరావుగారు కోరినారు

తాత్కాలిక కమిటీవారు నరసింగరావుగారి సలహా ప్రకారం సాధారణ సమావేశం వాయిదావేసి, 15 రోజుల వరకు వేచి ఉన్నారు కాని ఏమీప్రయోజనం లేకపోయింది

గత్యంతరం లేక సత్యాగ్రహం ప్రారంభించ వలెనని తాత్కాలిక కమిటీ వారు నిర్ణయించినారు అందుకనుగుణంగా తాత్కాలిక కమిటీని రద్దుచేసి దాని స్థానే "కార్యాచరణ సమితి" (Action Council) ని ఏర్పాటు చేసినారు

## సత్యాగ్రహము

1938 అక్టోబరు 24 న సత్యాగ్రహం ప్రారంభమయింది. సత్యాగ్రహో ద్దేశాన్ని అనుసరించి నిషేధం ధిక్కరిస్తూ "కార్యాచరణ సమితి" స్టేట్ కాంగ్రెస్‌ను స్థాపించి, దానికి కార్యనిర్వాహక సంఘంగా రూపొందింది. ఈ రాజకీయ సంస్థ పత్రికల ద్వారాను, రాయబారాలద్వారాను తన ఆశయాలకు, అదర్శాలకు మత విద్వేషాలతో ఎంత మాత్రం సంబంధం లేదని పదే పదే ప్రకటించింది

గాంధీజీ 1938 సెప్టెంబరు 17 వ తేదీన 'హరిజన్' సంపాదకీయంలో 'సంస్థానము-బాధ్యత' అనే శీర్షిక కింద ఒక వ్యాసం వ్రాసినారు అందులోని కొన్ని భాగాలివి

"హైదరాబాదు ఫర్మానులు నాకు విషాదకరమయిన ఆశ్చర్యం కలిగించినాయి సర్ అక్బర్ గొప్పవిద్యావేత్త ఆయన తత్వశాస్త్రజ్ఞుడు. ఇటీవల ఆయన ధాకా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భంలో ఇచ్చిన ఉపన్యాసం చదవడానికి ఎంతో ఆనందంగా ఉన్నది ఒక సంస్థ పని ప్రారంభించకముందే దానిని నిషేధిస్తూ ఆయన అభివృద్ధి నిరోధక ప్రకటనలు చేయడానికి తోడ్పడడం ఆశ్చర్యంగా ఉన్నది అత్యధిక సంఖ్యాకులు ఒకే ఒక మతం వారున్న సంస్థానంలో మతతత్వం గురించిన ప్రసక్తి లేవడంలో అర్థంలేదు అల్పసంఖ్యాక సిద్ధాంతాన్ని ఎంత దూరమయినా లాగడానికి మంచి అవకాశమున్నది అయితే ఆ అల్ప సంఖ్యాక వర్గం కనీసం కొంతవరకైనా పరిగణింపదగిన సంఖ్యలో ఉండవలె అల్పసంఖ్యాక వర్గానికి చెందిన వ్యక్తి ఒక్కడయినా అతనికి సంపూర్ణ న్యాయం కలగజేయవలసిందే కాని రాజకీయరంగంలో అటువంటి అత్యల్పవర్గానికి స్థానం లేదు... .. మత వర్గమనే మాటకు భారతదేశంలో గల అర్థాన్నిబట్టి ఆలోచిస్తే హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఎంతమాత్రం మత సంస్థ కానేరదు వాయవ్య సరిహద్దు రాష్ట్రంలోని ఒక సంస్థలో హిందూ సభ్యుడు లేనంతమాత్రాన దానిని మతసంస్థ అనడం సరికాదు .. . స్టేట్ కాంగ్రెస్ మతతత్వ సంస్థ అనే సూచనను పూర్తిగా నిరాకరిస్తూ వారు ఒక ప్రకటన కూడా చేసినారు."

స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహ ప్రకటన చేసిన తంవాత ప్రభుత్వం వారు దానిని అణచివేయడానికి అన్ని శక్తులను వినియోగించడం ప్రారంభించినారు సత్యాగ్రహులయిన వారి పూర్వోత్తర సందర్భాలను తెలుసుకొనేటందుకు పోలీసు వారికి ఉత్తరువులు జారీచేయడం జరిగింది స్టేట్ కాంగ్రెస్ ఉద్యమానికి ధన సహాయం చేస్తూన్నట్లు నిందలు మోపి ధనవంతులయినవారిని ప్రభుత్వాధికార్లు బెదరించడం మొదలుపెట్టినారు

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ వారు తమ ఆశయాలను, ఉద్దేశాలను గురించి తాము సత్యాగ్రహం చేయవలసివచ్చిన పరిస్థితులను గురించి వివరంగా ఒక ప్రకటన చేసినారు 'కార్యాచరణ సమితి' (Committee of Action) హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పైన ఉన్న నిషేధాలను ధిక్కరిస్తూ స్టేట్ కాంగ్రెస్ నియమావళిని ఆమోదించి కార్యనిర్వాహక సభ్యులను ఎన్నుకొన్నది గవర్నమెంట్ వారి నిషేధపు టుత్తరువుల దృష్ట్యా ప్రాథమిక సభ్యుల సభ్యత్వం రద్దుచేసి వారిని సత్యాగ్రహ బాధ్యతలనుంచి తొలగించింది

ప్రభుత్వంవారి నిషేధపు టుత్తరువులను ధిక్కరించినందువల్ల హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ మొదటి కార్యనిర్వాహక వర్గంవారు నిర్బంధితులు కావటానికి ముందు వారు తమకున్న సర్వాధికారాలతో స్వామీ రామానంద తీర్థను ప్రప్రథమ సత్యాగ్రహ నియంతగా నియమించినారు.

1938 అక్టోబరు 24 న హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ వారు ప్రారంభించిన సత్యాగ్రహోద్యమాన్ని, ప్రధానంగా గాంధీజీ సంహామీగ సత్యాగ్రహోద్యమ పద్దెనిమిదో నియంత శ్రీ కాశీనాథరావు వైద్య 1938 డిసెంబర్ 24 న తాత్కాలికంగా నిలిపివేసినారు

ఆటుతరవాత హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమ సందర్భంలో గాంధీజీకి,సర్ అక్బర్ హైదరికి అనేక ఉత్తరప్రత్యుత్తరాలు జరిగినాయి

## గాంధీమహాత్ముని జన్మదినోత్సవాలు (1938)

### సికిందరాబాదు

మహాత్మా గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో సికిందరాబాదులోని మహంకాళీ దేవాలయంలో 2-10-38వ తేదిన సభ జరిగి ది ప్రథమంలో శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు వేదపఠం చేసిన తరవాత మహాత్ముని జీవితంలో నేర్చుకోవలసిన ముఖ్య విషయాలను గురించి ఉపన్యసించినారు మహాత్ముడుపదేశించిన ఖద్దరు ధారణం, సత్యాహింసలను అందరూ అవలంబించవలెనని చెప్పినారు తరవాత ఈశ్వర ప్రార్థనలతోను, మంగళ హారతులతోను సభ ముగిసింది

### కడప

మద్రాస్ ప్రధానమంత్రి శ్రీ సి రాజగోపాలాచార్యులవారు 1938

అక్టోబర్ 1వ తేదీన కడపలో మద్య నిషేధం ప్రవేశపెడుతూ ఇట్లా ఉపన్యసించినారు,

"ఈనాడు మహాత్మాగాంధీ 70వ జన్మదినము కల్లు సారా దుకాణాలను మూసివేయడం ద్వారా కడప, చిత్తూరుజిల్లాలలో మనం ఆయన జన్మదినోత్సవం జరుపుకొంటున్నాము ఆయన జన్మదినోత్సవం జరపటానికి ఇది అత్యుత్తమమైన పద్ధతి నిరుడు సేలం జిల్లాలో కల్లు సారా దుకాణాలను మూయడం ద్వారా మనము ఆయన జన్మదినోత్సవానికి అభినందనలు పంపుకొన్నాము ఈ సంవత్సరం కడప, చిత్తూరు జిల్లాలలో మద్య నిషేధం ప్రవేశపెట్టి ఆయనకు మన అభినందనలను తెలుపుకొంటున్నాము ఈ విధంగా ఇంకా ఆయన జన్మదినోత్సవాలను అనేకం జరుపుకోవలెనని మన రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో మద్యనిషేధం అమలులోకి వచ్చేవరకు ఆయన జీవించవలెనని మనం కోరుకొంటున్నాము "

ఈ ఉపన్యాసం కడపలోని పోస్టాఫీస్ దగ్గర ఉన్న మైదానంలో బహిరంగసభలో మద్యనిషేధ ప్రారంభోత్సవ సమయంలో చేయడం జరిగింది

రాయచోటి

కడపనుంచి ప్రధానమంత్రి రాజగోపాలాచారి, పార్లమెంటరీ సెక్రటరీలు బి యస్ మూర్తి, యస్ యస్ వరదాచారిగార్లతో కలసి రాయచోటికి వెళ్ళినారు అక్కడి యం యల్ ఏ కడప కోటిరెడ్డిగారు కడప జిల్లాలో మద్యనిషేధం జయప్రదం కావడానికి ఏమీ సందేహం లేదని చెప్పినారు

ప్రధానమంత్రి మాట్లాడుతూ "నిరుడు అక్టోబర్ 1 వ తేదీన ఇక్కడి ప్రజలు కల్లు కానలకు దండలు వేసి కల్లు దుకాణాలను అలంకరించడం చూసి ఉంటారు ఈ దుకాణాల ఇజారాదారు తన వ్యాపారం అభివృద్ధి కావాలని దేవుని ప్రార్థించి ఉంటాడు కాని ఈ రోజున కల్లు సారా దుకాణాలు జిల్లా అంతటా పరిశుభ్రంగా ఖాళీ అయి తాళాలు వేసి ఉండటం చూసి ఉంటారు సేలంలో కంటెకూడా మద్యనిషేధం ఇక్కడ ఎక్కువ జయప్రదం కాగలదని నాకు తోస్తున్నది ఇక్కడ అన్ని కల్లు దుకాణాలు మూసివేయవలసిందని ఉత్తరువులు జారీ చేయవలసిన అవసరం కూడా లేకపోయింది ఇక్కడ నేను ధైర్యంగా చేయవలసిన పనికూడా కనిపించలేదు కాని హిందువులు, మహమ్మదీయులు కూడా తాగుడు దురభ్యాసానికి ప్రతికూలురని మాత్రం ఈ ప్రజలందరికి తెలియచెప్పవలసి ఉంది లైసన్సు తీసుకొని వీధులలో బహిరంగంగా కల్లు సారాలను అమ్మడం ప్రతివాడికి లజ్జాకరంగా తోచే ఈ దేశంలో మద్యనిషేధం గురించి ఎక్కువగా చెప్పనక్కరలేదు కొంతమంది మద్యపానం నియమబద్ధం చేయవలెనని వాదించవచ్చు కాని ప్రజల అవమానాలకు, దారిద్ర్యానికి, వినాశనానికి దారితీసే పద్ధతుల వైపుకు ఏ ప్రభుత్వమూ ప్రజలను ఆకర్షించగూడదు"

మద్యనిషేధం నెమ్మది నెమ్మదిగా ప్రవేశపెట్టవలసిందని ఇంతకు పూర్వ

ప్రభుత్వం ప్రస్తుత మంత్రివర్గాలను బలవంతపెట్టడం పాపకార్యం ఏది ఎట్లా ఉన్నప్పటికి మద్యనిషేధం అమలు చేయడమనే విధానం స్థిరపడిపోయింది

ఇతర జిల్లాలు అన్నిటికంటె ముందుగా కడపజిల్లాలో మద్యనిషేధం అమలులోకి రావడం ఈ జిల్లా గొప్ప అదృష్టము ఇతర జిల్లాలవారు తమ జిల్లా లలో మద్యనిషేధం ప్రవేశపెడితే తాము కొత్త పన్నుల నిచ్చుకోడానికి కూడా సిద్ధంగా ఉన్నామన్నారు మద్యనిషేధంవల్ల నేరాలు తగ్గిపోతాయని వారికి తెలుసు నేను విన్నదానినిబట్టి చూస్తే, దానినిబట్టి కడప ప్రజలు మద్యనిషేధ విషయంలో తమ కర్తవ్యం గుర్తించినట్లు నాకు గట్టి నమ్మకం కలిగింది కేవలం ప్రచారం పరిపోదు తాగుబోతును బిడ్డలు, భార్య ఒకవైపుకు లాగితే తాగుడు మరొకవైపుకు లాగుతుంది దుకాణాలు తీసివేయడంతో ప్రభుత్వంవారు తమ కర్తవ్య భాగాన్ని నిర్వర్తించివారు తాగుబోతులకు సాయంకాలం ముఖ్యంగా 5-7 గంటల మధ్య ఆటలు, భజనలు మొదలయినవి ఏర్పాటుచేయడం ద్వారా వారి దృష్టిని మరల్చడం అవసరము గాంధీజీ పుట్టిన ఈ రోజున మనమందరమూ కలసి సర్వమానవ సంక్షేమంకోసం కృషి చేయడం అవసరము అట్లా చేసిన ట్లయితే మీకు ఉజ్జ్వల భవిష్యత్తు ఉంటుందని నిశ్చయంగా చెప్పగలను

ఈ ఉపన్యాసానంతరం సభ ముగిసింది.

**చిత్తూరు**

మద్రాస్ పబ్లిక్ వర్క్స్ మంత్రి శ్రీ యాకూబ్ హుస్సేన్ అక్టోబర్ 1 వ తేది ఉదయం చిత్తూరులో మద్యనిషేధం ప్రారంభోత్సవం చేసినారు గాంధీ జన్మదినోత్సవం రోజున ఈ పుణ్యకార్యం జరిగినందువల్ల పాఠశాలలోని బాలబాలికలు, భజన సమాజాలవారు చిత్తూరులో పెద్ద ఊరేగింపు చేసినారు

తరవాత మంత్రి యాకూబ్ హుస్సేన్, శ్రీయుతులు సి ఆర్ పార్థ సారథి అయ్యంగార్, జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి ఆర్ వెంకటరెడ్డి, ఆంధ్ర మద్యనిషేధ సమితి కార్యదర్శి యల్ సౌందరరాజయ్యంగార్లతో కలసి చిత్తూరు నగరంలోని అనేక ప్రదేశాలను చూసినారు మురుకల్పంభట్, కలవ కుంట, పెనుమూరు, కొత్తపేట, పూతలపట్టి, వెంగానపల్లి మొదలయిన గ్రామాలు చూసి అక్కడి కల్లు సారా దుకాణాలను ఖాళీ చేయించి ఆ వ్యాపా రపు చిన్నెలు సైతం లేకుండా జాగ్రత్త తీసుకొన్నారు

తరవాత మధ్యాహ్నానికి ప్రధానమంత్రి కూడా కడపనుంచి చిత్తూరుకు వచ్చినారు

ప్రధానమంత్రి, మంత్రులు యాకూబ్ హుస్సేన్, మునుస్వామిపిళ్లే, యస్ రామనాథంగార్లు చిత్తూరు పట్టణమంతా తిరిగి కిందటి రోజువరకు కల్లు సారాలను అమ్ముతున్న ప్రదేశాలను స్వయంగా చూసి అవి ఖాళీ చేయబడినట్లు గుర్తించి రాత్రి 8 గంటలకు జిల్లా పోలీస్ కార్యాలయం ఎదుట సభలో గాంధీ జన్మ దినోత్సవ సందర్భంలో మద్య నిషేధం గురించి ఉపన్యసించినారు

# 25

# గాంధీ-హైదరీ ఉత్తర ప్రత్యుత్తరాలు (1939)

గాంధీజీ, స్టేట్ కాంగ్రెస్‌వారు సత్యాగ్రహాన్ని విరమించడానికి కారణం తానేనని 1938 డిసెంబర్ 26 న సర్ అక్బర్ హైదరీకి ఒక ఉత్తరం వ్రాస్తూ దానిలో హైదరాబాదు ప్రభుత్వంవారు సత్యాగ్రహోద్యమ విరమణకు తగినట్లు ఉదారంగా ప్రవర్తించగలరని ఆశిస్తున్నా నన్నారు సర్ అక్బర్ అందుకు ప్రత్యుత్తరంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని వందే మాతరం ఆందోళనను గురించికూడా ఉదాహరించినారు వైద్యా చేసిన ప్రకటనలో ఒక విధమయిన బెదరింపు ఇమిడి ఉండటంచేత అది వినాశకరమయిన మానసిక ప్రవృత్తికి దారి తీసిందని స్పష్టమయిన ఆరోపణ చేసినారు సత్యాగ్రహులతో పాటు కొంతమందికి కూలి ఇచ్చి సత్యాగ్రహం చేయించినట్లుకూడా సర్ అక్బర్ గాంధీజీ దృష్టికి తెచ్చినారు

కొంతమంది సత్యాగ్రహ ఖైదీలను విడుదలచేసినందుకు 1939 జనవరి 9 వ తేదీన సర్ అక్బర్‌కు కృతజ్ఞత తెలుపుతూ గాంధీజీ తంతి ఇచ్చినారు 1939 జనవరి 5వ సర్ అక్బర్ వ్రాసిన ఉత్తరానికి జవాబుగా 1939 జనవరి 20 న గాంధీజీ బార్డోలీనుంచి తన మనసులోని అభిప్రాయాలను వెల్లడిస్తూ ఒక ఉత్తరం వ్రాసినారు అందులో సర్ అక్బర్ ఉత్తరంలోని మిత్ర భావానికి ఆయన కృతజ్ఞత తెలుపుతూ ఆయన ఉత్తరం మరొక విధంగా ఉంటుందని తానను కో లేదన్నారు సత్యాగ్రహోద్యమంలో అరెస్టు చేయబడిన వారందరినీ విడుదలచేయవలెనని కోరినారు వైద్య చేసిన ప్రకటనను ఆయన సమర్థించినారు స్టేట్ కాంగ్రెస్‌వారు చేసిన ప్రకటన వైద్యకు తెలియకుండ వచ్చునని అట్లా కానట్లయితే ఆయన అరెస్టుకు ఉద్యుక్తుడై ఉండేవాడు కాడని అన్నారు. వైద్య ప్రకటన మృదువుగానే ఉన్నదనీ, అందులో బెదరింపు లేదనికూడా అన్నారు స్టేట్ కాంగ్రెస్ సభ్యులను శాసనోల్లంఘనము విరమించ వలసిందనికూడా వైద్యఉద్బోధించినట్లు వ్రాసినారు ఆర్యన్‌లీగ్‌వారిని స్టేట్ కాంగ్రెస్‌వారుగా పొరపడవద్దని గాంధీజీ స్పష్టీకరించినారు షోలాపూర్‌లోని ఆర్య మహాసభవారికి అభినందనలు పంపడంలో సర్దార్ పటేల్, భూలాభాయిల ఉద్దేశమేమో వారి నడిగి తెలుసుకుంటానన్నారు గాంధీజీ

ఐకమత్య సంభాషణలను భగ్నం చేయవలసిందిగా తాను సలహా ఇచ్చినట్లు సర్ అక్బర్ హైదరీ మనసులోఉన్న అభిప్రాయాన్ని సర్ అక్బర్

మార్చుకొన్నందుకు గాంధీజీ ఆయనకు ప్రత్యేకం కృతజ్ఞత తెలిపినారు

జయసూర్య, నరసింగరావును తన దగ్గరకు తీసుకొని వచ్చినప్పుడు మౌలానా అబుల్ కలామ్ అజాద్, సర్ అక్బర్ హైదరీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నారని, వాటి ఫలితం తేలేవరకు వేచి ఉండవలసిందని, బహద్దూర్ యార్ జగ్ కూడా ముందు చర్య తెలపనే తీసుకోదలచుకోలేదని తాను నరసింగరావుకు చెప్పినట్లు గాంధీజీ వ్రాసినారు వందే మాతరమ్ మత సంబంధమయిన ప్రార్థన కాదని గాంధీజీ అంగీకరించినారు హిందూ విద్యార్థులు తమ గదులలో గానీ, ప్రార్థన గదిలోగానీ దానిని ఆలాపన చేసే హక్కు ఉన్నది ఈ సందర్భంలో ఉస్మానియా యూనివర్సిటీ వారిచ్చిన సంజాయిషీలు సంతృప్తికరం గాలేవనీ, తనకు తెలిసిన ఇతర విషయాలను బట్టి వారు వాటిని సరిదిద్దుకోవలసి ఉన్నదనీ వ్రాస్తూ గాంధీజీ విద్యార్థులు తన చెప్పుచేతల్లో లేరన్నారు

తాగుబోతులు, మొదలయినవారు సత్యాగ్రహానికి ఉద్యమించినారనే ఆరోపణకు ప్రత్యుత్తరంగా సత్యాగ్రహ నియంతల ప్రసక్తి లేకుండ వారంతట వారే చేసి ఉంటారని వ్రాసినారు గాంధీజీ

గాంధీజీ తన ఉత్తరం ముగిస్తూ స్టేట్ కాంగ్రెస్ ఖైదీల నందరినీ విడుదల చేయడమేగాక స్టేట్ కాంగ్రెస్ వారు చట్టబద్ధంగా రాజకీయ కార్యక్రమాన్ని గానీ, తదితర కార్యక్రమాలనుగానీ నడుపుకొనేటందుకు అనుమతించవలెనని పునరద్ఘిస్తున్నానన్నారు

1939 ఫిబ్రవరి 16 న సర్ అక్బర్ గాంధీజీకి రెండుసుదీర్ఘాలయిన ఉత్తరాలను వ్రాసినారు

వైద్యా ప్రకటనను గురించి వ్రాస్తూ, తన వ్యాఖ్యానమును గాంధీజీ చేత అంగీకరింప చేయగలననే భావం తనకు లేదనీ, అందువలన దానిని గురించి చర్చిస్తూ కాలయాపన చేయడం తన కిష్టం లేదనీ హైదరీ వ్రాసినారు స్టేట్ కాంగ్రెస్ పైన నిషేధపు టుత్తరువులు జారీచేయబడిన మూల కారణాలకు ప్రతికూలంగా ఇంతవరకేమీ జరగనందున వాటిని రద్దు చేయడం సాధ్యంకాదన్నారు అరెస్టయిన సత్యాగ్రహుల సంఖ్యను గురించి వైద్యాచేసిన ప్రకటనను బట్టియే పౌరసత్వాల సత్యాగ్రహులతో ఆర్యన్ రక్షక సమితి (Aryan Defence League) సత్యాగ్రహులుకూడా చేరి ఉన్నట్లు వెల్లడవుతున్నది కాంగ్రెస్ దళాలు పరిశుద్ధంగా ఉండవలెననే సలహా ఎన్నడూ పాటించడంజరగలేదనీ, అది ఎంతో దురదృష్టకరమనీ సర్ అక్బర్ హైదరీ అన్నారు

తాగుబోతు సత్యాగ్రహులను గురించి గాంధీజీ తెలిపిన సమాచారం సరియైనది కాదనికూడా సర్ అక్బర్ వ్రాసినారు సర్ అక్బర్ ఉత్తరంలోని చివరి భాగంలో ఒక విధమయిన ఆశాభంగంకూడా కనిపించింది తాను గాంధీ వంటి పుణ్యపురుషుల వట్ల గౌరవం కలవాడననీ, గడచిన 40 సంవత్సరాల నుంచి నిజమయిన జాతీయతకు మార్గదర్శకంగా ఉండే ఐకమత్యంకోసం మాతృదేశంలో తాను కృషి చేస్తున్నాననీ కాని తన జీవితావసాన కాలంలో జాతీ

యిత అనే ముసుగు కింద ప్రతికూల శక్తులు స్వేచ్ఛగా విహరిస్తూ మత విద్వేషాలను ప్రేరేపించి జాతీయ భావాల పెంపుదలకు భంగం కావిస్తున్నందుకు తనకు విచారం కలుగుతున్నదనీ వ్రాసినారు

అదే రోజున సర్ అక్బర్, సంస్థానంలోని జైళ్ల పరిస్థితిని వివరిస్తూ గాంధీజీకి మరొక ఉత్తరం వ్రాసినారు అందులో ఖైదీలు చేయవలసిన పనిని గురించి, భోజనానికీ, చదువుకొనేటందుకు, మత సంబంధమయిన ఆరాధనలు చేసుకొనేటందుకు ఖైదీలకు కల్పించిన సౌకర్యాలను గురించి వ్రాసినారు ఖైదీలకు నిత్యావసరాలయిన భోజన పదార్థాలేకాక భోజనంలో నెయ్యివంటి భోగపదార్థాలు సైతం ఇస్తున్నామని, జైళ్ల డైరెక్టర్ జనరల్ (శ్రీ) హాలిన్స్ ఆహారం రుచి చూసి బాగున్నదన్నారనీ కూడా వ్రాసినారు ఖైదీలకు పత్రికలు కూడా ఇస్తున్నామన్నారు జైళ్లలో గ్రంథాలయాలు లేవనీ, జైళ్లలోని గదులన్నీ నిండిపోవడంవల్ల అన్నిటినీ ఖైదీలకోసమే వినియోగించవలసి వచ్చిందని కూడా వ్రాసినారు ఖైదీల స్నానానికి, వారు తాగేటందుకు నీటి కుళాయీలుకూడా పెట్టించినామన్నారు "నరసింగరావు,జనార్దనరావుగార్లు జైళ్లలో ఉన్న వారి బంధువులను చూడడానికి వెళ్ళినారు ఏ మాత్రం ఆలస్యం లేకుండా చూడగలిగినారు ఇదంతా హైదరాబాదులో సంగతి ఖైదీలు తమ ఇష్టం వచ్చినప్పుడు స్నానం చేసేటందుకు కూడా వీలు కల్పించబడింది" అని కూడా హైదరీ ఆ ఉత్తరంలో వ్రాసినారు

గాంధీజీ 1939 ఫిబ్రవరి 21వ తేదీని మహాత్మా నారాయణస్వామి పరిస్థితిని గురించి హైదరీకి ఒక తంతి ఇచ్చినారు ఆ రోజునే హైదరీ గాంధీజీకి ఒక ఉత్తరం వ్రాస్తూ నారాయణస్వామి సొంతంగా యిచ్చిన ప్రకటన నకలును(Facsimile) జతచేసి పంపినారు నారాయణస్వామి, జైలధికారులు తన పట్ల ప్రవర్తిస్తూన్న విధం గురించి ఏ విధమయిన ఆపాదనా చేయలేదని హైదరాబాదులోని ఆర్య సమాజం వారి పద్ధతులు కుయుక్తులు కొన్ని ఇందువల్ల తెలియవస్తున్నవనీ కూడా హైదరీ వ్రాసినారు

1939 ఫిబ్రవరి 26న వార్ధాలోని సేవా గ్రామం నుంచి, స్టేట్ కాంగ్రెస్ వారు తన సలహాను అనుసరించి సత్యాగ్రహాన్ని ఆపి వేసినందున సర్ అక్బర్ వారి నందరినీ విడిచి ఉండవలసిందని గాంధీజీ వ్రాసినారు

స్టేట్ కాంగ్రెస్ తన దైనందిన కార్యక్రమం నిర్వర్తించుకొనేటందుకు అవకాశం కలిగించాలనీ వ్రాస్తూ, నారాయణస్వామిని గురించి సర్ అక్బర్‌కు గాంధీజీ తన కృతజ్ఞత తెలిపినారు నెయ్యి ఒక భోగపదార్థం కాదని కూడా సర్ అక్బర్‌కు వ్రాసినారు ప్రభుత్వంవారు సూచించిన సంస్కరణలు చాలాను గుణంగా ఉండగలవనీ, అవి త్వరలోనే ఆచరణలోకి రాగలవనీ కూడా ఆశిస్తున్నామన్నారు

మార్చి 27న సర్ అక్బర్ గాంధీజీకి వ్రాసిన ఉత్తరంలో ఖైదీలను, సత్యాగ్రహులను అవమానిస్తున్నారన్న విషయం అబద్ధమని వ్రాస్తూ అందుకు

తార్కాణంగా నారాయణస్వామి విషయము, ఔరంగాబాద్ సత్యాగ్రహుల విషయాన్ని పేర్కొన్నారు

హైదరాబాదులో బాంబులు పేలడం గురించి, ఆర్య సమాజ సత్యాగ్రహ బృందాలు మత విద్వేష పూరితాలయిన సాహిత్యం సంస్థానంలోకి కంపరంపరలుగా ప్రవహించడానికి వారే కారణమని కూడా వ్రాసినారు హైదరాబాదు దినం జరుపుతూ 'నిజాం ముర్దాబాద్' అనే నినాదం చేయడం గురించి కూడా ఆయన ఉదాహరించినారు సత్యాగ్రహులలో ముల్కీలు కానివారు 1 కి 5 నిష్పత్తిలో ఉన్నారని కూడా ఆయన వ్రాసినారు అన్ని వర్గాల వారికి, అన్ని రంగాలవారికి సంతృప్తికరమయిన సమగ్ర స్వభావంగల సంస్కరణలను జాగ్రత్తగా విచారించడం అవసరమని కూడా సర్ అక్బర్ గాంధీజీకి తెలియ జేసినారు

రాజప్రతినిధి జోక్యం కల్పించుకోవడంతో రాజకోటలో గాంధీజీ ఉపవాసం ముగించినందుకు సర్ అక్బర్ తన ఆనందాన్ని వెలిబుచ్చినారు

1939 మార్చి 30న సర్ అక్బర్‌కు గాంధీజీ జవాబు వ్రాస్తూ ఆయనకు తెలియచేయకుండా తానేమీ పత్రికలలో ప్రకటించ దలచుకోలేదని వాగ్దానం చేసినారు

"నేను మీ కడనుంచి చాలా గొప్ప విషయాలు ఆశిస్తున్నాను రెండు సంఘాల మధ్య శాంతిని చేకూర్చేటందుకు సమష్టి ప్రయత్నాలు చేయవలెనని అనుకొన్నాను కాని అది సాగలేదు దేవుడు అన్యథా తలంచినాడు మీ ఆద ర్శాలను ఆచరణలో పెట్టడానికి మీకు చాలా అవకాశాలున్నాయి అందుకు మిమ్ములను అభినందిస్తున్నాను అటువంటి అవకాశాలు నాకు లేవు హైదరా బాదులో రాజకీయ సంస్కరణలు వెంటనే ప్రవేశపెట్టవలెనని కోరుతున్నాను సత్యాగ్రహులను బేషరతుగా విడుదల చేసినారనే సంగతి వినవలెనని నా కోరిక స్టేట్ కాంగ్రెస్‌వారు సత్యాగ్రహం తిరిగి ప్రారంభించకుండా నేను ఆపివేసి నాను మీరు స్టేట్ కాంగ్రెస్‌వారి పట్ల సానుభూతి కనబరిచితే వారు నూతన శక ప్రారంభానికి మీతో సహకరించగలరు" అని హైదరీకి గాంధీజీ 1939 మార్చి 30 వ వ్రాసిన ఉత్తరంలో ఉన్నది

1939 ఏప్రిల్ 2 న న్యూఢిల్లీనుంచి గాంధీజీ సర్ అక్బర్‌కు ఒక ఉత్తరం వ్రాసినారు దానిలో ఆర్యసమాజంవారితో తాను సంప్రదిస్తున్నాననీ, వారి కోరికలు చాలా సామాన్యమయినవనీ వాటిని మన్నించడానికి వీలు ఉందనీ కూడా విశదీకరించినారు

1939 ఏప్రిల్ 10 వ తేదీన గాంధీజీ రాజకోటలోని శ్రీ రాష్ట్రీయశాల నుంచి మరొక సుదీర్ఘమయిన ఉత్తరం సర్ హైదరీకి వ్రాసినారు అందులో "ఆర్యసమాజ సత్యాగ్రహుల పట్ల ప్రభుత్వంవారు అవలంబించిన విధానం ఒకే తీరుగా లేక మారుతూ వస్తున్నది గుల్బర్గా జైలు సూపరింటెంట్ శ్రీ హాలిన్స్, గుల్బర్గా సుబేదార్, తాలుక్దారు గుల్బర్గా జైలులో ఆర్యసమాజ

సార్వదేశిక సభకు అధికార ప్రతినిధులయిన మహాత్మా నారాయణస్వామి, కుశాల్ చందులవంటి మధ్యవర్తుల ద్వారా ఆర్యసత్యాగ్రహులతో సంభాషణలు జరిపినారు కాని హఠాత్తుగా హైదరాబాదు ప్రభుత్వంవారు ఒక ఆశ్చర్యకర మయిన ప్రకటన చేసినారు ఆ ప్రకటనలో నిజాం ప్రభుత్వంవారు అంతర్జాతీయ ఆర్యసమాజం వారితో ఏదో ఒక విధమయిన రాజీకి రావడానికి రాయబారాలు నడుపుతున్నారని కొన్ని పత్రికలలో ప్రచురింపబడిన వార్త ఎంతమాత్రం సత్యం కాదని తెలియజేసినారు

ఒక వేళ హాలిన్స్, ఇతర ఉద్యోగులు అత్యుత్సాహంతో తమ అధికారాన్ని మించి వ్యవహరించినప్పటికీ తన మంచి పేరును నిలబెట్టుకోవడానికైనా నిజాం ప్రభుత్వంవారీ చర్యను ఆమోదించవలసి ఉంటుంది ఘనత వహించిన నిజాం ప్రభుత్వంవారి మాటలలో ప్రజలు విశ్వాసం కోల్పోకూడదు వెంటనే మీ దగ్గరనుంచి జవాబు ఆశిస్తున్నాను" అని ఉన్నది

1939 ఏప్రిల్ 11 వ తేదిన గాంధీజీకి, ఆయన వ్రాసిన రెండు ఉత్తరాలు చేరినట్లు తెలియపరుస్తూ సర్ అక్బర్ ఇట్లా వ్రాసినారు

"మీరు వ్రాసినట్లు ఆర్యసమాజంవారితో సమాధాన పడటం అంత కష్ట మయిన పనికాదు కాని వారుమాత్రం తమ దుడుకుతనం విరమించుకొనే టట్లు కనిపించలేదు ఇస్లాం మతంపైన ఇతర మతాలపైన వారు సాగిస్తున్న దండయాత్ర సమర్థించతగింది కాదు హైదరాబాదు సంస్థానం సంప్రదాయ సిద్ధంగా పరస్పర మత సహనానికి తావలమయినది ఆర్యసమాజం వారివల్ల అది ధ్వంసం చేయబడుతూన్నది బీహార్‌లోని అర్రాహ్‌లో ఆర్యసమాజం వారు నిజాం బొమ్మను తయారుచేసి తగలబెట్టినారు సరిగ్గా ఆ సమయంలోనే నూతన రాజ్యాంగ చట్టం నిర్మించేటందుకు ప్రయత్నాలుజరుగుతున్నాయి ఆర్యసమాజం వారి ఆ దుండగంవల్ల ఆ ప్రయత్నాలకిప్పుడు భంగం కలిగింది ఆర్యసమాజం వారికి నిజాం ప్రభుత్వం వారికి మధ్య ఉండిన భేదాభిప్రాయాలు బ్రిటిష్ ఇండియాలోని ఆర్యసమాజ నాయకులతో రాయబారాలు నడిపినందువల్ల పరి ష్కారం కావని తేలిపోయింది అందువల్ల ఆ రాయబారాల ప్రసక్తిని విరమించడం జరిగింది గవర్నమెంట్ వారిపక్షాన ఆ రాయబారాలు నడపడంలేదని ప్రకటించ వలసిన అవసరం ప్రభుత్వానికి కలిగింది ఆర్యసమాజంవారు తమ కోరికలన్నీ ప్రభుత్వంవారు అంగీకరించవలె, లేదా అసలే అక్కర లేదు అంటున్నారు

అయ్యంగారి కమిటీ నివేదికను ప్రచురించడం జరిగింది. నూతన సంస్కరణ లను ప్రవేశ పెట్టడం జరుగుతుంది కార్మికశాఖకు అనుబంధంగా ఒక సలహా సంఘం కూడా నియమించ బడింది

బాధ్యత కలిగిన కాంగ్రెస్ నాయకులు వైద్యా ప్రకటనలో ఉన్న బెదరింపులను కాదనిన తరవాత హైదరాబాదు ప్రభుత్వంవారు స్టేట్ కాంగ్రెస్ ఖైదీలను విడుదల చేసినారు"

ఇదిగాక సర్ అక్బర్ 1939 జూలై 20వ తేదిన గాంధీజీకి మరొక

ఉత్తరం కూడా వ్రాసినారు ఆ ఉత్తరంలో ప్రభుత్వంవారి ప్రకటనను సమర్థిస్తూ శ్రీ హాలిన్స్ తన వ్యక్తిగత హోదాలో రాయబారాలు నడిపినారని సర్ అక్బర్ హైదరీ వ్రాసినారు జైలులోని నాయకుల సంభాషణలు రికార్డు చేయబడినవో లేదో తమకు తెలియదన్నారు శ్రీయుతులు గుప్తా, సుధాకరులు జైలులో ఆర్య సమాజ నాయకులతో మాట్లాడడానికి కూడా తాలుద్దారూ, హాలిన్స్ సమ్మతించినారనీ, ఆవిషయాలు గవర్నమెంట్ వారిని ఆలోచించ వలసిందిగా హాలిన్స్ గవర్నమెంట్‌కు సిఫార్స్ చేయలేదనీ కూడా ఉదాహరించినారు కాని ఆర్య సమాజ పత్రికలు ఈ విషయాలను పత్రికలలో ప్రచురించడం చేత అవి అనుకోని ఫలితాలకు దారితీసిన వన్నారు సంస్కరణలు ప్రవేశ పెట్టనున్నట్లు కూడా మరొకసారి హైదరీ వాగ్దానం చేసినారు

1939 మే 16వ తేదీన రాజకోటలోని ఆనందభవనం నుంచి సర్ అక్బర్‌కు గాంధీజీ మరొక ఉత్తరం వ్రాస్తూ సర్ అక్బర్ 11, 26 తేదీలలో వ్రాసిన రెండు ఉత్తరాలు అందినట్లు తెలియ జేసినారు హైదరాబాదు ప్రభుత్వంవారికీ, ఆర్య సమాజం వారికీ మధ్య జరిగిన ప్రతి విషయం తాను విస్మరించ దలచు కొన్నట్లు కూడా అందులో ఉదాహరించినారు కాని ఆర్య సమాజంవారు కోరిన ఈ రెండు కోరికలను మన్నించవలెనన్నారు 1 ఇతర మతస్థుల మనసులకు నొప్పికలగకుండా ఉండే రీతిని వేద ధర్మం ప్రచారం చేయడానికి, ఆచరించటానికి వారికి సంపూర్ణమయిన స్వేచ్ఛ ఉండవలె

2 కొత్త ఆర్య సమాజాలను స్థాపించడానికి, ఆర్య సమాజ మంది రాలను, యజ్ఞశాలలను, హావన కుండాలను నిర్మించుకొనేటందుకూ, పాతవాటిని మరమ్మత్తు చేసుకొనేటందుకూ ధార్మికశాఖవారి అనుమతిగానీ, ప్రభుత్వంవారి ఏ ఇతర శాఖవారి అనుమతిగానీ పొందవలసిన అవసరం లేకుండా వారికి సంపూర్ణమయిన స్వేచ్ఛ ఉండవలె

ఈ కోరికలను మన్నించడానికి సర్ అక్బర్ సంసిద్ధంగా ఉన్నట్లు కూడా ఆయన ఉత్తరాన్ని తానర్థం చేసుకొన్నట్లు గాంధీజీ వ్రాసినారు

ఈ పనులు చేయటానికి సర్ అక్బర్ సంస్కరణల కోసం వేచి ఉండ అక్కర్లేదని, ఇందువల్ల శాంతిస్థాపన జరిగి ఆర్యసమాజంవారి శాసనోల్లంఘనం తక్షణం ఆగిపోతుందనీ కూడా గాంధీజీ వ్రాసినారు

ఇందుకు ప్రత్యుత్తరంగా 1939 మే 30వ తేదీన సర్ అక్బర్ గాంధీజీకి ఒక గట్టి ఉత్తరం వ్రాసినారు

దానిలో ఆర్య సమాజంవారి రెండవ కోరికను అంటే, హావనకుండాలను, యజ్ఞశాలలను ప్రభుత్వంవారి అనుమతి లేకుండా నిర్మించుకొనే స్వేచ్ఛ ఉండాలనే దానిని గాంధీజీ ఎట్లా అంగీకరించినారో తనకు ఆశ్చర్యంగా ఉందనీ, ఈ కోరికను అంగీకరిస్తే పోరాటం నిరంతరం రాజుతూనే ఉంటుందనీ అన్నారు

తన వాదానికి తార్కాణంగా నాందేడు జిల్లా సూపరింటెండెంట్ పంపిన నివేదికను పేర్కొన్నారు. హిందూ, రెడ్డి అయిన ఆ సూపరింటెండెంట్

వ్రాసిన నివేదికలో ఆర్య సమాజ మందిరమున్న ఒకచోట మతోద్రేకాలు చెల రేగినట్లు వ్రాసిన విషయం గాంధీజీకి తెలియ జేసినారు వాక్స్వాతంత్ర్య మత స్వాతంత్ర్యాలు ప్రజాశాంతిక్రమాలకు భంగకరాలుగా ఉండరాదని ఆర్చి బిషప్ ఆఫ్ యార్క్ చేసిన ప్రకటనను సర్ అక్బర్ హైదరీ గాంధీజీకి గుర్తు చేసి నారు మత విషయికాలయిన కార్యాల కోసం భవనాలను నిర్మించుకోదలిచిన వారు ప్రభుత్వం వారి అనుమతిని పొంగి తీరవలెననీ, ప్రభుత్వం ఎన్నటికీ ఆ హక్కును విడనాడ జాలదనీ ఖచ్చితంగా వ్రాసి ఆర్య సమాజ వ్యవహారాలు చాలావరకు గర్హించ తగిన వన్నారు

ఆర్యసమాజంవారి పద్ధతులు పరులకు ప్రతిబంధకంగా ఉంటాయనీ, దానికి తోడు మత ప్రసక్తితో సంబంధంకల సావర్కార్ ఉద్యమంతో వీరికి సంబంధ మున్నదనీ సర్ అక్బర్ తన అభిప్రాయం వెల్లడించినారు "ఆర్య సమాజంవారి జత్థాలు (దళాలు) వారి ప్రచార విధానాలు, శాంతి క్రమాలకు భంగం కలిగిం చేవిగా ఉన్నాయి నిజమయిన సత్యాగ్రహ తత్వం గౌరవించ వలసిందే కాని దాని ఉపయోగం దుందుడుకుతనంవల్ల, జండాలు మొదలయిన పరంజామావల్ల, నియంతలు, సంగ్రామ సలహా సంఘాలు, దళాలు మొదలయిన పారిభాషిక పదాల వలన పెడ తోవలను పడుతున్నాయి

"ఆర్యసమాజంవారు ప్రజాక్షేమంకోసం కలసి పనిచేసే మనస్తత్వం కన బరిచినట్లయితే వారే మతం అవలంబించి ప్రచారం చేసుకొన్నప్పటికి ఎప్పుడూ ఏమీ అభ్యంతరము ఉండదు "

ఈ ఉత్తరం తరవాత 1939 జూన్ 5 వ తేదీని బొంబాయిలోని బిర్లా మందిరంనుంచి గాంధీజీ మరొక ఉత్తరం వ్రాసినారు ఆర్యసమాజంవారిని శాస నోల్లంఘన మానివేయవలసిందనీ, సర్ అక్బర్‌కు, వారి కనీసపు కోర్కెలను మన్నించవలసిందనీ వ్రాస్తూ హాలిన్స్‌తో జరిగిన సంభాషణలు జయప్రదం కానం దుకు తన విచారం వెలిబుచ్చినారు సర్ అక్బర్ తక్షణం సంస్థానంలోని అల జడిని తొలగించి సంస్కరణలను సాధారణ పరిస్థితులలో ప్రవేశపెట్టవలెనని కోరి నారు

1940 మార్చి 21 వ తేదీన గాంధీజీ సర్ అక్బర్ హైదరీకి మరొక ఉత్తరం వ్రాస్తూ తాను స్టేట్ కాంగ్రెస్‌ను బేషరతుగా క్షమాపణ చెప్పవలసిందని కోరినాననీ, కనీసం అప్పటికైనా స్టేట్ కాంగ్రెస్‌కు న్యాయం కలగగలదని భావించినాననీ అన్నారు

ఆ ఉత్తరానికి సర్ అక్బర్ 1940 ఏప్రిల్ 4 న జవాబు వ్రాస్తూ "హైదరాబాదులో మతోద్రేకం అత్యంత ప్రధానమయిన సమస్య, అది తొలగి పోతేనేగాని ఏమీ చేయడానికి వీలులేదు కాబట్టి కక్షిదారు లందరినీ ఒక చోటకు పిలచి అందరికీ సమన్వయం కుదర్చడం ప్రస్తుతం చేయవలసిన పని" అని ముగించి నారు ఇందుకు జవాబుగా 1940 ఏప్రిల్ 14 వ తేదీని గాంధీజీ సర్ అక్బర్‌కు ఇట్లా వ్రాసినారు

"ప్రియమయిన సర్ అక్బర్,

నేను మిమ్ములను అన్నం కావలెనని అడిగితే సున్నం పెడుతున్నారు ఒక వాగ్దానం చెల్లించుకోవలసిన చిన్న విషయానికి సాంఘిక సామరస్యంవంటి పెద్ద సమస్యకు నాకు కించిత్తుకూడా సంబంధం కనబడటం లేదు పత్రికలలోని వార్తలు నమ్మినట్లయితే బీదర్ ఉదంతాల తరవాత సామరస్యమెట్లా కుదురు తుంది ? హైదరాబాదు విషయంలో మాట్లాడకూడదని నా అంతట నేనే ఒక నిషేధం పెట్టుకొన్నాను కాని ఇప్పుడు హైదరాబాదు ప్రజల పట్ల నా కర్తవ్యం నిర్వర్తించవలసి ఉన్నట్లయితే నాకా నిషేధం ఉండకూడదని అను కొంటున్నాను స్టేట్ కాంగ్రెస్ పట్ల హైదరాబాదు ప్రభుత్వ ప్రవర్తన బీదర్ ఉదంతాలను విన్న తరవాత నా మనసులో చాలా సంశయాలు కలుగు తున్నాయి "

ఈ ఉత్తరానికి జవాబుగా 1940 మే 2 న సర్ అక్బర్ మరొక ఉత్తరం వ్రాసినారు

"ప్రియమయిన గాంధీజీ,

మీ వలెనే నాకు కూడా ఆశాభంగం కలిగింది మత సామరస్యంవంటి పెద్ద సమస్యమీద తక్కిన చిన్న వ్యవహారాలు ఆధారపడి ఉంటాయి ఆ సమస్య విషయంలో కొంత అభివృద్ధి కనపడేటంతవరకు తక్కిన సమస్యలన్నీ ఆపివేయ వలసి ఉంటుంది అట్లాకాని పక్షంలో మత సంబంధమయిన ప్రదర్శనలు జరుగు తూనే ఉంటాయి విచారకరమయిన బీదర్ సందర్భంలో చాలామంది ముద్దాయి లను గురించి కోర్టులలో విచారణ జరుగుతూన్నది నిరుడు బీహారులో జరిగిన ఉదంతాలను అవి జ్ఞాపకం చేస్తూన్నవి కొన్ని సమస్యలను గురించి ముందుగానే ప్రతికూలంగా ప్రకటనలు జరుగుతున్నందుకు నా ఆశ్చర్యం వెల్లడించక తప్పదు పంజాబ్‌లోని కొన్ని సాంఘిక సంఘటనలను గురించి పంజాబు శాసనసభలో వచ్చిన కొన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా ఇటీవల పంజాబ్ ప్రధాని చేసిన ప్రక టనలు నేను చూసినాను అదే రీతిగా ఉభయ కక్షులవారు కడచిన ఉదంతాలను స్థానికంగా ఆలోచించడం మంచిది అప్పుడే ఈ విషచక్రంనుంచి మన కోరిక ప్రకారం బయట పడటానికి వీలుంటుంది. గౌరవాభివందనలతో"

మీ విశ్వసనీయుడు

సం॥ ఏ. హైదరీ

గాంధీజీ అందుకు జవాబుగా 1940 మే 9 వ తేదీన దిగున ఉత్తరం వ్రాసినారు

సేవాగ్రామ్
వార్ధా,
9 మే 1940

"ప్రియమయిన హైదరీ,

మీ ఉత్తరం నాకు ఆశ్చర్యం కలిగించింది. మత సామరస్యం సాధారణ

ప్రసంగాలవల్లగానీ, తీవ్రంగా జరిగిన కల్లోలాలను కప్పిపుచ్చడంవల్లగానీ పరిష్కారమయ్యే సమస్యకాదు మీరు ఉదాహరించిన బీహారు ఉదంతాలను గురించి నాకు తెలియదు ఒకవేళ బీహారులో అన్యాయం జరిగినట్లయితే ఇంకొక చోట మరొక అన్యాయం జరగడానికి అది ప్రాతిపదికగా ఉండకూడదు

ఏది ఎట్లా ఉన్నప్పటికీ ఒక గొప్ప కల్లోలం గురించిన బహిరంగ విమర్శ వ్యక్తులపైన కోర్టులో జరిగే న్యాయ విచారణకు భంగం కలిగిస్తుందని నేననుకోను "

మీ విశ్వసనీయుడు
యం కె గాంధీ,

సర్ అక్బర్ హైదరీ గాంధీజీకి మళ్ళా ఇట్లా వ్రాసినారు

"ప్రియమయిన గాంధీజీ,

మే 9 వ తేది ఉత్తరం చేరింది కిందటి ఉత్తరంలో నేను బీహారు ఉదంతాలను గురించి వ్రాసినాను ముజఫర్‌పూర్ జిల్లాలో కొంతమంది పెడదారి పట్టిన హిందువులు దౌర్జన్యాలకు, గృహదహనాలకు పాల్పడినారు బీదర్‌లో జరిగిన దురంతాలకంటె కూడా అక్కడ ఎక్కువ దురంతాలు జరిగినాయి ఆ విషయం కాంగ్రెస్ అధ్యక్షుని దృష్టికి వచ్చింది బీహార్‌లో జరిగిన దురంతం అనుకరించడం మంచిదని నేను నా ఉత్తరంలో ఉద్దేశించలేదు బీహారు ఉదంతాన్ని మీ దృష్టికి రాక మీ సానుభూతికి పాత్రం కాకపోవడం, హైదరాబాదు ప్రజల పట్ల మీ కర్తవ్యం నిర్వర్తించవలెననే తీవ్రమయిన భావం మీకు కలగడం గురించి మాత్రమే మీకు తెలియజేయవలెనని నా అభిప్రాయము "

26 మే 1940

మీ విశ్వాసపాత్రుడు
సం॥ ఏ హైదరీ

ఇందుకు ప్రత్యుత్తరంగా గాంధీజీ 1940 జూన్ 7 వ తేదీన మరొక ఉత్తరం వ్రాసినారు

"మీరు 26 వ తేదీన వ్రాసిన ఉత్తరానికి ఇన్నాళ్ళనుంచి జవాబు వ్రాయకుండా ఆలస్యం చేసినాను నన్ను మీరు పరాయివాడుగా భావిస్తున్నట్లు తోచింది హిందువులు ముజఫర్‌పూర్‌లో చేసిన దౌర్జన్యం గురించి నాకు బొత్తిగా తెలియదు మీరు నా మాట విశ్వసిస్తారని భావించినాను ఇప్పుడు నేను దానిని గురించి తెలుసుకోడానికి ప్రయత్నిస్తున్నాను ఇంకా చెప్పవలసి వస్తే బీదర్‌లోని ఉదంతం గురించి కూడా ఆయా పక్షాలవారు నాకు వ్రాసి, దానికి సంబంధించిన కాగితాలు పంపించేవరకు నాకు తెలియదు

అవసరం వచ్చినప్పుడంతా నేను హిందువులను ఎన్నడూ మన్నించలేదని, నన్ను గురించి మీకు బాగా తెలుసునని నేను ఆశించినాను హైదరాబాదుకు సంబంధించినంతవరకు నేను అతిజాగరూకతతో వ్యవహరించినాను బహిరంగంగా

చెప్పవలసిన అవసరం వచ్చినప్పుడు కూడా చెప్పకుండా మానివేసినాను నేను మౌనం వహించినందుకు మీరు నన్ను ప్రశంసిస్తారని భావించినాను అయినప్పటికీ హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కు (ఇప్పుడు పనిచేయడంలేదు) నిగ్రహం కలిగి ఉండవలెనని సలహా ఇస్తున్నాను ఇక నా విషయం, మీరు మీ ఉత్తరంలో నన్ను గురించి వ్రాసిన చివరి వాక్యం అంత నిర్దాక్షిణ్యంగా ఉన్నందుకు విచార పడుతున్నాను లేడీ హైదరీ ఆరోగ్యం క్రమక్రమంగా అభివృద్ధి అవుతున్నదను కొంటాను "

సర్ అక్బర్ 1940 జూన్ 12 వ తేదిన గాంధీజీకి ఇట్లా వ్రాసినారు

"మీరు 1940 జూన్ 7 వ తేదిన వ్రాసిన ఉత్తరానికి కృతజ్ఞతాభివంద నలు నా ఉత్తరంలో మీ పట్ల నిర్దాక్షిణ్యంగా ఉండవలెనని నేను ఉద్దేశించలేదు మీ కటువంటి అభిప్రాయం కలిగినందుకు నేను విచారపడుతున్నాను పైపెచ్చు మీరు 1940 మే 9 న వ్రాసిన ఉత్తరంలో నన్ను గురించి మీరంత నిర్దయగా భావించినందుకు నాకు బాధాకరంగా ఉన్నది బీదర్ ఉదంతాలను గురించి మీకు వచ్చిన వార్తలబట్టి నేనిక్కడ ఉన్న కాలంలో అవి జరిగి ఉంటాయని మీరనుమా నించడంవల్ల నా పరిపాలనను గురించి మీరింకా ఎక్కువగా తెలుసుకోవలసి ఉంటుందని భావిస్తున్నాను

నా భార్య ఆరోగ్యం గురించి దయతో మీరడిగిన కుశల ప్రశ్న నా కెంతో ఓదార్పు కలిగించింది జగద్గురు శంకరాచార్యులవారి దగ్గర ఆమె చికిత్స పొందుతున్నది ఈ విషయం మీకు చాలా ఆసక్తిదాయకంగా ఉంటుందను కొంటాను మీరు కులాసాగా ఉన్నారని భావిస్తున్నాను.

మరా ఈ ఉత్తరం నాకీ వియోగ దుఃఖం కలగక మునుపు వ్రాసినాను ఆ ఆందోళనకరమయిన రోజులలో మీకీ ఉత్తరం నేను పంపజాలక పోయినాను మీరు నన్ను ఓదారుస్తూ పంపిన తంతివార్త చేరినట్లు నేను మరొక తంతి పంపించి నాను నాకు కలిగిన ఈ వియోగ దుఃఖంలో మీరు ఎంతో దయతో చూపిన సానుభూతికి నా కృతజ్ఞతాభివందనాలు "

(లేడీ హైదరీ చనిపోయిన తరవాత సర్ హైదరీ వ్రాసిన మాటలివి)

మహాత్మాగాంధీ ప్రబల ప్రయత్నాలు చేసినప్పటికీ స్టేట్ కాంగ్రెస్ పైన ఉన్న నిషేధం తొలగింపబడలేదు హైదరాబాదు ప్రతిష్టంభన కొనసాగుతూనే ఉన్నది

**గాంధీజీ ఉపవాస వ్రతము**

ఆంధ్రదేశంలో సభలు

రాజకోట రాకూరు సాహెబ్ చర్యకు ప్రతికూలంగా గాంధీజీ నిరశన వ్రతం అవలంబించినప్పుడు ఆంధ్రదేశంలోని పలు ప్రాంతాలలో ఆయన ఉపవాసం జయప్రదం కావలెననీ, ఆయన చిరాయురారోగ్యవంతుడుగా వర్ధిల్లవలెననీ ప్రార్థిస్తూ సభలు జరిగినాయి

1939 మార్చి 5 వ తేదిని రాజకోటలో గాంధీ నిరశన వ్రత మవలంబించి నందుకు బెజవాడ వర్తకులు దుకాణాలను మూసి సాయంకాలం గాంధీ పార్కులో బహిరంగసభ చేసినారు సి రాజగోపాలాచారిగారు (బెజవాడ మునిసిపల్ చేర్మన్) అధ్యక్షత వహించినారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు, బెజవాడ గోపాలరెడ్డిగారు ఉపన్యసిస్తూ ఇండియా మంత్రి, రాజప్రతినిధిగార్లు రాజకోట వ్యవహారంలో జోక్యం కలిగించుకొని మహాత్ముని కోరికలు మన్నించ వలెనని అన్నారు

తెనాలి, భీమవరం, తిరుపతి, గూడూరు, కొనకొండ్ల, తిరువూరు, జయపురం, విజయనగరం, పెనుకొండ, పత్తికొండ, జమ్మలమడుగు, తోట్లవల్లూరు, భీమునిపట్నం, పాలమూరు, నర్సారావుపేట, నూజివీడు, మదనపల్లి, గుంటూరు, కొవ్వూరు, ద్రాక్షారామము, జగ్గంపేట, ఇందుకూరు మొదలయిన గ్రామాలలో గాంధీజీ రాజకోట నిరశన వ్రత సందర్భంలో బహిరంగసభలు జరిగినాయి పలువురు ప్రముఖులు పాల్గొన్నారు గాంధీజీ ఉద్యమం జయప్రదం కావలెనని ఆయనకు ఆయురారోగ్యాలు ప్రసాదించవలెనని భగవంతుని ప్రార్థించి నారు

## హైదరాబాదు
(యం కె గాంధీ)

హైదరాబాదు స్టేట్ సత్యాగ్రహాన్ని గాంధీజీ సలహా ప్రకారం నిలిపి వేసిన కొన్నాళ్ళకు హైదరాబాదునుంచి కొంతమంది కార్యకర్తలు గాంధీజీని దర్శించి హైదరాబాదులోని ఆనాటి పరిస్థితులను ఆయనకు విన్నవించిన తరవాత పై శీర్షికతో 'హరిజన్'లో ఈ దిగువ వ్యాసం వ్రాసినారు

"హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌వారు ఓర్మిని కోల్పోతున్నారు నా సలహామీద పని చేస్తూన్న వారిలో కొందరు నా వద్దకు వచ్చి "మీరున్నూ ఇతర నాయకులున్నూ కోరినందున మేము శాసనోల్లంఘనను తాత్కాలికంగా విరమించు కొన్నాము మేము శాసనోల్లంఘన విరమించుకొంటే ఖైదీల విడుదలకు, స్టేట్ కాంగ్రెస్‌ను గుర్తించడానికై చాలావరకు అవకాశం ఉండవచ్చునని మీరు మాకు ఆశ కల్పించినారు కాని ఈ రెండింటిలో ఏదీ జరగలేదు మా సహచరులు సంస్థానపు జైళ్ళలో మగ్గిపోతూండగా మే మెన్నాళ్ళు చేతులు ముడుచుకొని తిని కూర్చుండగలము సంస్థాన జైళ్ళ జీవితమంత తేలికయి ది కాదు" అన్నారు

ఈ స్నేహితులు అనేకమంది సహచరులతో వ్యవహరించవలసి ఉన్నది అందువల్ల వారికినే నిచ్చిన సలహా సంగ్రహంగా ప్రకటించడం మంచిదని భావి స్తున్నాను. నిచేట్లా అన్నాను

"మీ పట్ల నాకు సానుభూతి ఉన్నది మీ స్థితిలో నేను ఉంటే నేను కూడా మీ వలెనే భావిస్తాను కాని సత్యాగ్రహం అల్పవిషయం కాదు అది ఒక

జీవిత సంగ్రామము దానికి క్రమశిక్షణ కావలె అంతులేని ఓర్పు, అత్యంత మయిన బాధలను సహించగల శక్తి ఉండవలె శాసనోల్లంఘనము సత్యాగ్రహంలో ఒక దశ మాత్రమే సహకార్యకర్తలు ఖైదులో బాధపడుతూన్నప్పటికీ దానిని ఆపివేయవలసి ఉంటుంది కూడా ఇదంతా వారు సంతోషంగా సౌజన్యంతో తమ బాధలకు బాధ్యులయిన వారిపట్ల ద్వేషం లేకుండా నిర్వర్తించవలసిన పని ఖైదులలో ఉన్న సత్యాగ్రహులకంటె కూడా వెలుపల ఉన్న నిజమయిన సత్యాగ్రహి ఎక్కువ మానసిక బాధను అనుభవిస్తాంటాడనే విషయం జ్ఞాపకం పెట్టుకోండి ఖైదులో ఉన్న సత్యాగ్రహికి తన కర్తవ్యం తాను నిర్వర్తించగలిగినాననే సంతృప్తి ఉంటుంది అందువల్ల అతని మనసుకు దిగులు ఉండదు అతడు ఆదర్శప్రాయమయిన ఖైదీగా ఉండి జైలు బాధను సంతోషంగా అనుభవిస్తూ తన తక్షణ కర్తవ్యం నిర్వర్తించగలుగుతున్నాడు జైలుకు వెలుపల ఉన్న సత్యాగ్రహి సత్యాగ్రహ సమరం సాగించడానికి కావలసిన బాధ్యత వహించి ఆ కష్టాలన్నిటినీ అనుభవించవలసి ఉంటుంది దైనందిన కార్యక్రమం నిర్ణయించడం, దానిని నడిచేటట్లు చూడడం ఆయన పని

సత్యాగ్రహ విరమణ కొనసాగించవలెనని మిమ్ములను కోరుతున్నాను మీ ఉద్దేశాలకు పూర్తిగా భిన్నంగా మరి రెండు సంస్థలు సత్యాగ్రహం సాగిస్తున్నాయి వారి ఉద్దేశాలు కూడా ఎన్నతగినవి కావచ్చు నేను కేవలం ఆ కారణంచేతనే మిమ్ములను సత్యాగ్రహ విరమణ కొనసాగించవలెనని కోరుతున్నాను ఆర్యసమాజంవారి శాసనోల్లంఘన పూర్తిగా మత సంబంధమయినది వారి మత ప్రచారం కొనసాగించుకొనే హక్కుకోసం వారు సత్యాగ్రహం చేస్తున్నారు హిందూ మహాసభవారు, ఆర్యసమాజం వారిని బలపరుస్తున్నారని నేననుకొంటున్నాను కాబట్టి ఆ పోరాటం మత సంబంధంగా రూపొందింది మీరు శాసనోల్లంఘన తిరిగి ప్రారంభిస్తే మీ ఉద్యమంలోని జాతీయ స్వరూపం నిలబెట్టుకోవటం దుస్తరము అనవసరమయిన అనుమానాలకు మీరు లోనవుతారు మీ పద్ధతులు కూడా వారి పద్ధతులవంటివి కాకపోవచ్చు కాని మీరు మీ ఉద్యమానికి దోహదం చేయలేకపోగా ఒక విధమయిన క్లిష్టపరిస్థితిని కల్పించుకొన్నవారవుతారు

కాబట్టి సున్నితంగా వ్యవహరించవలసి ఉంటుందని నా విశ్వాసము మీ నిగ్రహంవల్ల చాలావరకు అనుమానాలకు తావుండదు ఆ మేరకు మీరు మీ ధ్యేయానికి పురోగమిస్తున్నట్లే స్పష్టంగా భావించవలసి ఉంటుంది ఈలోగా మిత్రులయిన అధికారులు ఏమి చేయగలరో అది చేసేటట్లుగా ప్రయత్నిస్తానని నేను మీకు వాగ్దానం చేస్తున్నాను. నా ఈ వాదం విన్న తరవాత మీకు ఉచితమని తోచిన పనిని మీరు చేయవచ్చు, మీ హృదయానికి బుద్ధికి నా సలహా మీకు నచ్చకుంటే మీరు దానిని తోసిపుచ్చవచ్చు నా సలహాను మీరు అంగీకరిస్తే

నేను వివరించిన ప్రకారం నిండు మనసుతో నిర్మాణ కార్యక్రమం కొనసాగించ వలెనని కోరుతున్నాను

సైగాన్
12-8-39

## సంస్థానాధిపతులకు

బ్రిటిష్ ఇండియాలో ప్రజలచే ఎన్నుకొన్న మంత్రివర్గాలు స్థాపించబడిన తరవాత హైదరాబాదు, తిరువాన్కూర్ మొదలయిన సంస్థానాలలో సైతం బాధ్యతాయుత ప్రభుత్వం కోసం ప్రజలు ఆందోళన సాగించినారు ఆ సందర్భంలో అనేక మంది సంస్థాన ప్రజానాయకులు గాంధీజీని దర్శించి ఆయన సలహాను పొందడం జరిగింది అందువల్ల ఆయన పై శీర్షికతో కింది వ్యాసం 'హరిజన్' లో వ్రాసినారు

"సంస్థాన వ్యవహారాలలో ఆసక్తిగల వారనేక మంది బ్రిటిష్ ఇండియాలోని రాజకీయ చైతన్యం కలవారితో సమానంగా తులతూగడానికి సంస్థానాలు కనీసం ఎట్లాంటి హామీలను ప్రజలకు ఇవ్వవలసి ఉంటుందో తెలపవలసిందని నన్ను కోరినారు కాంగ్రెస్ ఆ విషయంలో ఏమంటుందో నేను నిర్ణయించజాలను జరుగుతున్న ఆయా సంఘటనలను గురించి కాంగ్రెస్ తన అభిప్రాయము చెప్పవచ్చు భవిష్యత్తు గురించి చెప్పడం కాంగ్రెస్ ధర్మం కాదు ఇప్పుడు నేను చెప్పదలుచుకున్న అభిప్రాయము నా సొంతము దానికి నేను తప్ప మరెవ్వరూ బాధ్యత వహించ వలసిన అవసరం లేదు

పెద్ద చిన్న సంస్థానాలన్నీ చేయగలిగిన సంస్కరణలివి

1 ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ దౌర్జన్యమును ప్రోత్సహించనంతవరకు సంపూర్ణ పౌరస్వాతంత్ర్యము ఉండితీరవలె ముద్రణా స్వాతంత్ర్యము, దౌర్జన్యాన్ని ప్రోత్సహించని పత్రికలను తెప్పించుకొనే స్వాతంత్ర్యం కూడా పౌరతత్వాలలో ఇమిడి ఉన్నాయి

2 సంస్థాన ప్రజలకు సంఘం స్థాపించుకొనేటందుకు, తమ సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వ సంస్థాపనకు అనుకూలంగా ప్రజాభిప్రాయం రూపొందించటానికి స్వేచ్ఛ ఉండవలె

3 కొన్ని ప్రత్యేక సంస్థానాలకు వెలుపల ఉన్న భారతీయులు, వారి చర్యలు సంస్థానాల విధ్వంసనకు దారి తీయనంత వరకు వారు ఆయా సంస్థానాలలో ప్రవేశించడానికి స్వేచ్ఛ ఉండవలె

4 సంస్థానాల ఆదాయం 10,15 లక్షల వరకు ఉన్నప్పుడు దానిలో పదో వంతుకు మించకుండ రాజభరణాలకు పరిమితి ఏర్పాటు చేయవలె ఏ సందర్భంలోను సంవత్సరానికి 3 లక్షలు మించి ఉండకూడదు సంస్థానాధిపతుల కిచ్చే రాజభరణాలలో వారి వ్యక్తిగత వ్యయాలన్నీ కూడా ఇమిడి ఉండవలె (అంటే) రాజ ప్రుంధిరపు ఖర్చులు, మోటారుకార్లు, గుఱ్ఱపు శాలలు, సంస్థానాధి

పతుల అతిథులకయ్యే ఖర్చులు అన్నీ అందులో ఇమిడి ఉండవలె ప్రజాహిత కార్యాలకు చేయవలసిన ఖర్చులు ప్రత్యేకం వివరంగా ఉండవలె

6 న్యాయస్థానాలు స్వతంత్రంగానూ, శాశ్వతంగానూ ఉండవలె ఎవ్వరూ వాటిలో జోక్యం కల్పించుకో కూడదు న్యాయ విచారణ ఒకేతీరుగా ఉండేటందుకు, నిష్పక్షపాతంగా ఉండేటందుకు వీలుగా ఆ సంస్థానము ఏ రాష్ట్రంలో ఉన్నదో ఆ రాష్ట్రపు హైకోర్టుకు, అపీలు చేసుకొనే అధికారం సంస్థాన ప్రజకు ఉండవలె అపీలు హైకోర్టు పరిపాలనకు సంబంధించిన చట్టంలో మార్పు జరిగితేనేగాని ఇది సాధ్యంకాకపోవచ్చు సంస్థానాధిపతి అంగీకరించే ట్లయితే ఈ మార్పు తేలికగా జరగగలదని నా అభిప్రాయము

రాజకీయ సంస్కరణలను గురించిన ప్రసక్తిని నేను బుద్ధి పూర్వకంగా వదిలి వేసినాను ఇది ఆయాసంస్థానాలలోని పరిస్థితులపైన ఆధారపడిఉంటుంది స్థానిక ప్రజలు కోరితే సంస్థానాధిపతి ఆ కోరికను మన్నించి తీరవలెనని నా దృఢ విశ్వాసము

నేను ప్రతిపాదించిన వాటిలో చాలా వివాదగ్రస్తమయిన విషయం హైకోర్టులో అప్పీలు చేసుకొనే హక్కును సంస్థాన ప్రజలకు కలిగించడమునేది దీనికి ప్రతికూలంగా ఎవరేమి చెప్పినప్పటికీ అటువంటి ఏర్పాటు జరిగితేనే గాని సంస్థాన ప్రజకు పూర్తి న్యాయం చేకూరదు బ్రిటిష్‌వారు ఎంతో ఓర్పుతోను, జాగరూకతతోను ఈ సంస్థను నిర్మించినారు హైకోర్టు కార్య విధానం చాలా వ్యయంతో కూడి త్వరగా జరగని మాట వాస్తవమే అక్కడి కార్యవిధానం చిక్కుగా ఉంటుందన్న మాట కూడ నిజమే తరుచుగా అవినీతి పరులు గెలవటం కూడా ఉంది ఇన్ని లోపాలున్నప్పటికీ ఉన్నత రాజకీయాలకు సంబంధించి నప్పుడు తప్ప హైకోర్టుల తీర్పులు న్యాయంగానూ, నిర్భయంగానూ ఉంటాయి, సంస్థానాలలో ప్రభుత్వ కార్యనిర్వహణాధికారులకు కొన్నిసందర్భా లలో న్యాయస్థానాలు లోబడి ఉండటంవల్ల అన్యాయాలు జరుగుతున్నాయి వాటిని అరికట్టటానికి హైకోర్టుల కంటె తేలికయిన ఉపాయం నాకు కనిపించటం లేదు ఇది నా పరిష్కారము దీనితో సమాన పటుత్వం గల ఉపాయం ఎవరయినా సూచించ గలిగినట్లయితే అంగీకరించడానికి నాకేమీ అభ్యంతరంలేదు

ఒక్క విషయం మాత్రం నాకు స్పష్టంగా కనిపిస్తూన్నది సంస్థానాధి పతులు దౌర్జన్యంతో నిమిత్తం లేకుండా ప్రజలకు తమ అధికారాలను సంక్రమింపజేసే పక్షంలో, తాము సంస్థానాధిపతులుగా నిలువ దలుచు కొనే పక్షంలో మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తింపక తప్పదు సంస్థానాధిపతులు తమంతట తాము తమ అధికారాలను వదులుకొని ప్రజలకు వారు నిజమయిన ధర్మకర్తలు కావలెనని నా ప్రణాళిక ఇందులో చాలా మందికి నమ్మకం లేక పోవచ్చు ఇది మానవ స్వభావానికి వ్యతిరేకమనీ, ఊహా ప్రపంచంలోని విషయమనీ విమర్శకులు చెప్పవచ్చు ఆచరణ యోగ్యమని నేను విశ్వసిస్తూన్నంతవరకు దానిని నేను ప్రతిపాదించక తప్పదు ప్రపంచం

స్వీయ వినాశనానికి గానీ, లేదా నైతిక, సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్యల అహింసాయుత పరిష్కారానికి గానీ దారితీయక తప్పదు రానున్న మహా సంగ్రామ ప్రళయంలో ప్రపంచంలో పరిగణించదగిన కొంత భాగమయినా మిగిలి ఉంటే మనం వాంఛిస్తూన్న సమస్యా పరిష్కారానికి త్వరలోనే మనం చేరుకో గలము రానున్న దుర్దశ నుంచి తప్పించుకోడానికి అహింస ఒక్కటే పరిష్కార మని గుర్తించే వారందరూ తమ సొంతవ్యవహారంలో సైతం - అంటే కుటుంబ వ్యవహారంలోను, సాంఘిక వ్యవహారాలలోనూ, తదితర వ్యవహారాలలోను కూడా అహింసనే అవలంబించవలసి ఉంటుంది అహింస విశ్వమానవ ధర్మము, అన్ని పరిస్థితులలోను అవలంబించదగినది దానిని గుర్తించని పక్షంలో వినాశనము రాక తప్పదు కాని వెంటనే రాక పోవచ్చు. కాలక్రమేణా రాక తప్పదు

సంస్థానాధిపతులు, గిరాసియాలు, ముస్లిమ్‌లు, షెడ్యూల్డ్ తరగతులు, తమ నిరంకుశత్వంతో అణిచి పెట్టబడినవారు మొదలయిన వారి నందరినీ చేర్చి సంయుక్త సంఘటన ఏర్పాటు చేయడంవల్ల ఈ సమస్య పరిష్కారం కాజాలదు దాని బరువు వల్లనే అది కుప్ప గూలినట్లు కూలిపోయే మాట నిజము పైగా అది ఎప్పుడయినా భగ్గుమని మండటానికి వీలున్నది అయినా ఈ సంయుక్త సంఘటన ఎవరికి ప్రతికూలంగా? సంస్థానాధిపతులతో సహా అందరికి ప్రాతి నిధ్యం వహించిన కాంగ్రెస్‌కా? కాంగ్రెస దాని పేరుకు అనుగుణంగా జాతి కంతటికి ప్రాతినిధ్యం వహించనిపక్షంలో దానంతటదే స్వతస్సిద్ధంగా మరణిస్తుంది కడచిన యాభై సంవత్సరాల నుంచి దానికి ఎడతెగని జాతీయ సంప్రదాయం వస్తూనే ఉన్నది దానిలో ఏ మార్పు కలిగినప్పటికి బ్రిటిష్ సామ్రాజ్యా నంతరం అధికారానికి వచ్చే రాజ్యాంగ సంస్థ అదే బ్రిటిష్ సామ్రాజ్యం అంతరించే రోజులు సమీపించినాయి బ్రిటిష్ రాజనీతిజ్ఞులు దీనిని గుర్తించి వారు వారు దానిని నిరోధించ జాలరు దాని (సామ్రాజ్య) పరిణామంగానీ, వినాశనంగానీ నిరోధించేటందుకు ప్రయత్నించరు సామ్రాజ్యతత్వం ఎక్కువగా నిర్మాణయుతమయిన దౌర్జన్యం మీద ఆధారపడి ఉన్నది ఆ బరువుకది తట్టుకో లేకుండా ఉన్నది సంస్థానాధిపతులు కొంత కాలం వరకు కాంగ్రెస్‌ను నిర్లక్ష్యం చేయవచ్చు, కాని శాశ్వతంగా వారలా చేయజాలరు ఇంతా అయితే కాంగ్రెస్ కొంతమంది బనియాలగుంపనీ, పైన పేర్కొనబడిన సంయుక్త సంఘటన వారు రెండు దెబ్బలు గట్టిగా నెత్తిమీద మోదితేనే దాసోహం అంటారనీ కొంత మంది సంస్థానాధిపతులు అన్నట్లు విన్నాను వారనుకొన్నట్లు కాంగ్రెస్ ప్రేళ్ళ మీద లెక్కింప దగిన బనియాల గుంపు కాదని నేను వారికి సవినయంగా మనవి చేస్తున్నాను. శాసనోల్లంఘన పోరాటాలలో పాల్గొన్న లక్షలాది ప్రజలందరూ బనియాలు కారు ఇట్లా నేను అన్నందువల్ల వారందరూ దెబ్బకు దెబ్బ కొట్ట వలెననే కోరిక కలవారని భావించ కూడదు చాలా మంది కొట్టగలవారే కాని వారు దౌర్జన్యాన్ని విరమించుకొని సంస్థానాధిపతులు ఊహించిన దెబ్బల కంటే పెద్ద దెబ్బలతోనే అనేక మంది కాంగ్రెస్‌వాదుల తలలు పగిలినాయి. ఇదంతా

నేను చెప్పడం కాంగ్రెస్ బనియాల గుంపు కాదని నిరూపించడానికే అహింసా, పిరికితనం ఒక దానితో ఒకటి జతగా ఉండజాలవు అమూలాగ్రం సాయుధుడయిన మనిషి మనసులో పిరికితనం ఉండటం మాకు తెలుసు ఆయుధ ధారణలోనే పిరికితనం కాకపోయినా ఒక విధమయిన భయం ఇమిడి ఉన్నది కాని నిష్కళంకమయిన నిర్భీతి లేనట్లయితే నిజమయిన అహింసావలంబనం సాధ్యం కాదు

దేశంలో కాంగ్రెస్ శక్తిని తక్కువగా అంచనా వేయవలదని సంస్థానాధిపతులకు నా మనవి దాని విధానం ఇప్పటికీ అహింసయే అహింసకు అనుకూలంగానే అది శక్తివంచన లేకుండా కృషి చేస్తుంది తమకోసం, తాము జన్మించిన దేశంకోసం సంస్థానాధిపతులందరూ వారి పలుకుబడిని అహింసకు అనుకూలంగా వినియోగించవలెనని కోరుతున్నాను అహింస కాంగ్రెస్‌కు సంబంధించినంత వరకు ఉంటూ, పోతున్నది అది అంతకంతకు ఎక్కువ అహింసాయుతంగానూ రూపొందవచ్చు ప్రస్తుతం దౌర్జన్యయుతంగానూ మారవచ్చు తక్షణం దౌర్జన్య చర్యలకు దిగుతుందనడానికి అవకాశం లేదు అంతిమదశలో దౌర్జన్యయుతంగా పరిణమించడానికి తగిన సన్నాహాలు చేయవచ్చు కాని పిరికివాళ్ళకు మట్టుకు అందులో స్థానం లేదు అట్లా ఉన్నట్లయితే దానికిప్పుడున్న శక్తి నశించే మాట వాస్తవము కాబట్టి ప్రతి భారతీయుడు ఉన్నతుడుగానీ, అధముడుగానీ (కాంగ్రెస్‌కు సంబంధించినంతవరకు ఎక్కువ తక్కువలు లేవు) తన కర్తవ్యం తాను నిర్ణయించుకోవలె

అబోటాబాద్
8-2-1939

**ఆర్యసమాజము**

ఆర్య సత్యాగ్రహం శుభాంతంగా పరిణమించింది నేనింతవరకు దీనిని గురించి ఏమీ వ్రాయలేదు బహిరంగంగా చర్చించడానికిది అతిసున్నితమయిన విషయంగా తోచింది పబ్లిక్ విషయాల గురించిగానీ, ప్రయివేట్ విషయాల గురించిగానీ చర్చించడంలో నేనొక ప్రత్యేక విధానం అవలంబిస్తానని ప్రజలకు తెలుసు అందువల్ల నన్ను కొంతమంది ఊహా ప్రపంచంలో వ్యవహరించే వాడనని కూడా అంటారు కాబట్టి ఆర్య సత్యాగ్రహం గురించి ఇంతవరకు నేను మౌనం వహించడంవల్ల ఆ పోరాటంలో నాకు ఎక్కువ ఆసక్తి లేనట్లు ఎవ్వరూ భావించకూడదు హైదరాబాదు వ్యవహారాలతో సంబంధం కలిగినటువంటి ముస్లిమ్ మిత్రులు ఆర్యసమాజ్ నాయకులు కూడా నన్ను కలుసుకొంటున్నారు నేను మౌలానా అబుల్ కలామ్ అజాద్‌తో కలసి వ్యవహరిస్తున్నాను ఆర్యసమాజ వాంఛితాలకు సంబంధించినంతవరకు నా సానుభూతి వారి పట్ల ఉన్నది వారి కోర్కెలు చాలా చిన్నవి, ప్రాథమికమయినవి కాని నా దృక్పథం ప్రకారం వారి సత్యాగ్రహం నాకిష్టంలేదు, కాని వారు నేను నడిపిన

సత్యాగ్రహాంశం కలె తాము నడిపే సత్యాగ్రహం మిన్న అయింది కాకపోవచ్చు గానీ తక్కువది మాత్రం కాదని నాతో అన్నప్పుడు నేను వారికి జవాబు చెప్ప లేకపోయినాను

"మీ నూతన విధానమే మేము అనుసరించవలెనని తలచకండి" అని వార న్నప్పుడు వారితో సకారణంగా వాదించడంకంటె, వారిని బలవంతపెట్టే హక్కు నాకు లేదని తోచింది కాని నా చేతనయినంతవరకు నిజాం ప్రభుత్వం వారికి చీకాకు కలిగించకుండవలెననే ఆదుర్దామాత్రం లేకండా పోలేదు కనక ఆర్యసమాజ పోరాటం స్నేహభావంతో ముగిసినందుకు నాకు చాల సంతోషంగా ఉన్నది ఇందుకు నిజాం ప్రభుత్వంవారు ఆర్యసమాజంవారు కూడా అభినంద నీయులు శ్రీ ఘనశ్యామసింగ్ గుప్త చేసిన ప్రకటన హుందాగా ఉంది ఆర్య సమాజంవారు అందుకనుగుణంగా ప్రవర్తించగలరని భావిస్తున్నాను పోరా టంలో చాలా విద్వేషం పెరిగిన మాట వాస్తవమే ఆర్యసమాజంవారు శ్రీ గుప్తా చేసిన విజ్ఞప్తికి అనుగుణంగా ప్రవర్తిస్తే నిజాం ప్రభుత్వంవారు తమ ప్రకటనకు అనుగుణంగా వ్యవహరిస్తే ఈ విద్వేషం పూర్తిగా రూపు మాయగల దనీ ధార్మిక సాంస్కృతిక స్వాతంత్ర్యాలకు సంబంధించినంతవరకు తిరిగి ఈ పోరాటం ప్రారంభమయ్యే అవకాశం కలగకుండవలెననీ ఆశిస్తున్నాను

హరిజన్ యం కె గాంధీ
20-8-1939

## గాంధీ జయంత్యుత్సవాలు (1939)

మదరాసు

గాంధీమహాత్ముని 71 వ జన్మదినోత్సవ సందర్భంతో 1939 అక్టోబరు 2 వ తేదీన మద్రాస్‌లోని వివిధప్రదేశాలలో ఉత్సవాలు, ఊరేగింపులు జరిగినాయి కపాలేశ్వర కాంగ్రెస్ సభ, రాజాజీ వాలీబాల్ సంఘము, ఉత్తర మద్రాస్ స్త్రీల సంఘము, చిదంబరం పిళ్ళై జాతీయ యువజన సంఘము, మద్రాస్ దేశ సేవా సంఘం, మైలాపూర్ సంక్షేమ సంఘము, ఎగ్మూర్ కాంగ్రెస్ సభ, తిరువలేశ్వరం కాంగ్రెస్ సభలవారు గాంధీ జయంత్యుత్సవాలు జరిపినారు

వగడాల వర్తకుల వీధిలో అక్టోబరు 2 ఉదయం డాక్టర్ రాజన్ గాంధీ మహాత్ముని గురించి ఉపన్యసించినారు కాంగ్రెస్ భవనంలో శ్రీమతి రాధా బాయి సుబ్బరాయన్ జాతీయ పతాకారోహణం చేసినారు సత్యమూర్తిగారు గాంధీజీ ఏకైక నాయకత్వంకింద అందరూ పనిచేయవలెనని ప్రబోధించినారు 11 గంటలకు బీదవారికి అన్నప్రదానం జరిగింది

అక్టోబరు 2 సాయంకాలం మద్రాస్ జిల్లా తమిళ కాంగ్రెస్ వారి అధ్వర్యం కింద కాంగ్రెస్ భవనంలో బహిరంగసభ జరిగింది మహాత్ముని జీవితాశయాలను గురించి ఆదికేశవులు నాయకర్, గద్దె రంగయ్యనాయుడు, కె సంతానం, షాఫీ మహమ్మద్, జి. ఏ. నటేశన్, ముత్తురంగ మొదలియార్, రఘురాజు, భారతి,

చ గల్బిరాయుడు, సత్యమూర్తిగార్లు ప్రసంగించినారు

అక్టోబరు 1 వ తేదీన గాంధీ జన్మదినోత్సవాలు పురస్కరించుకొని హిందూస్థాన్ బాలభట సేవాదళంవారు ఒక ర్యాలీ ఏర్పాటు చేసి మహాత్మునికి అభినందన సందేశం పంపించినారు

దక్షిణభారత హిందీప్రచార సభలో అక్టోబరు 2 ఉదయం 8 గంటలకు గాంధీమహాత్ముని జన్మదినోత్సవ సభ జరిగింది శ్రీ కె సంజీవకామత్ అధ్యక్షుడుగా ఉన్నారు సభ కోశాధికారి బచ్చు జగన్నాథదాసు, మోటూరి సత్యనారాయణ, జయప్రకాశ్ నారాయణ్‌గార్లు సభా కార్యక్రమంలో పాల్గొన్నారు

జయప్రకాశ్ నారాయణ్ మాట్లాడుతూ మహాత్ముడు సాధించిన ఘన కార్యాలను వివరించి చెప్పడానికి భాష చాలదన్నారు మహాత్ముని నిర్మాణ కార్యక్రమంలో ప్రధాన భాగమయిన హిందీ ప్రచారం మద్రాస్‌లో సుస్థిరంగా జరుగుతూన్నందుకు తను సంతృప్తిని వెల్లడించినారు హిందీ ప్రచార సభలోని పనివాగులవాండ్లకు ఖద్దరు దుస్తులు దానంచేసినారు పలువురు మహాత్ముని జీవితం గురించి ప్రసంగించిన తరవాత వారి ఆయురారోగ్యాభివృద్ధికోసం దైవ ప్రార్థనలతో సభ ముగిసింది

మద్రాస్ బేసిక్ స్కూలు యాజమాన్యంలో గాంధీమహాత్ముని జన్మదినోత్సవం పరమానందదాసు, చోటాదాసు సత్రంలో జరిగింది శ్రీ వి యల్ శాస్త్రిగారు అధ్యక్షులుగా ఉన్నారు

**హరిజనవాసరోత్సవము**

పూనా ఒడంబడిక జరిగిన సెప్టెంబర్ 29 వ తేది హరిజనవాసరంగా 1933 నుంచి పరిగణింపబడుతూ వచ్చింది 1939 సెప్టెంబర్ 29 వ తేదీ సాయంత్రం హరిజన సేవకసంఘం యాజమాన్యంలో హరిజనవాసర ప్రారంభోత్సవం జరిగింది శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు అధ్యక్షత వహించినారు హరిజన బాలబాలికలు జాతీయ గీతాలతో కోలాటాలు వగైరా ప్రదర్శనం చేసినారు

సీతారామశాస్త్రి మాట్లాడుతూ, గాంధీజీ అస్పృశ్యతా నివారణ గురించి చేసిన కృషిని వివరించి చెప్పినారు. హరిజన బాలబాలికలు సాధారణ సాహిత్య విద్యతోపాటు ఖద్దరు ఉద్యమం కూడా జతచేసి మహాత్ముని ఆశయం పూర్తి చేయవలెనని కూడా సీతారామశాస్త్రిగారు ప్రబోధం చేసినారు దివాన్‌బహద్దూర్ కె యస్ రామస్వామిశాస్త్రి, దివాన్‌బహద్దూర్ భాష్యమయ్యంగార్ హరిజనోద్ధరణ గురించి అందుకు మహాత్ముడు చేసిన కృషిని గురించి వివరించిన తరవాత శ్రీ ఇ. వెంకటసుబ్బయ్యగారి వందనలతో సభ ముగిసింది,

శృంగారపురము (తెనాలి తాలూకా)

గుంటూరుజిల్లా, తెనాలి తాలూకా శృంగారపురంలో మహాత్ముని 71 వ జన్మదినోత్సవ సందర్భంలో 1939 అక్టోబర్ 8 వ తేదిని శ్రీ గొల్లపూడి సీతా రామశాస్త్రిగారు మహాత్ముని శిలావిగ్రహం ప్రతిష్ఠించినారు శిలావిగ్రహం పక్కనే జాతీయపతాకారోహణం జరిగింది ఈ కార్యక్రమ నిర్వహణ కాలంలో నిరంతరాయంగా సూత్రయజ్ఞం కూడా జరిగింది సీతారామశాస్త్రిగారు గాంధీజీ జీవితాశయాలను అభివర్ణించి గ్రామస్థులను ఉత్తేజితులనుగా చేసినారు

కోపూరు, అవనిగడ్డ, చేకూరు, జయపురం, పెనుమంట్ర, కురుచేడు, తిప్పరాజుపాలెం, వినయాశ్రమం, ప్రత్తిపాడు, కోట కందుకూరు, భీమవరం తాలూకా పలూరుపాడు, కవిటము, నేలపోగుల, కానూరగ్రహారం, వడిపూడి, కాళహస్తి, విజయనగరం, పెనుగొండ, ఇరగవరం, రావులపాడు గ్రామాలలో గాంధీ జయంత్యుత్సవాలు జయప్రదంగా జరిగినాయి

ఏలూరు

ఏలూరు గాంధీ విద్యాలయంలో గాంధీ సప్తాహమునకు శ్రీ మాగంటి బాపినీడుగారు ప్రారంభోత్సవం చేస్తూ కాంగ్రెస్ పలుకుబడి తగ్గిందని సర్ కె వి రెడ్డి నాయుడుగారు చేసిన ప్రసంగం పురస్కరించుకొని అది నిజం కాదనడానికి ఇటీవ జరిగిన స్థానిక సంఘాల ఎన్నికల ఫలితమే తార్కాణమన్నారు

తుని

పట్టణ కాంగ్రెస్ పక్షాన గాంధీ జయంతి ఉత్సవాల గురించి, హిందీ ప్రచారం గురించి పురమందిరంలో కోమండూరి శఠకోపాచార్యులవారి యాజమాన్యంలో సభ జరిగింది శ్రీ యన్ వీరభద్రస్వామి, మల్లంపల్లి శివప్రసాద రావు, వేలం వెంకటరమణయ్య, రంగనాథాచార్యులుగార్లు మహాత్ముని జీవిత సందేశం గురించి ఉపన్యసించినారు

తిరుపూరు

తిరుపూరులో 9 జతల ఎడ్లను గట్టి ఒక పెద్ద బండిపైన మహాత్ముని పటం పౌరులు ఊరేగించినారు చాలామంది హరిజనులు ఆ ఉత్సవంలో పాల్గొన్నారు మహాత్ముని ఆయురారోగ్యాలకోసం ప్రార్థనలు జరిగినాయి

దర్శి

అక్టోబర్ 8 వ తేదిన శ్రీ బత్తిని పెరుమాళ్ళునాయుడుగారి అధ్యక్షత కింద మహాత్ముని 71 వ జన్మదినోత్సవం జరిగింది ఎనమంద్ర వెంకటప్పయ్య, చింతమనేని భావయ్యచౌదరిగార్లు మహాత్ముని సందేశాన్ని గురించి ప్రజలకు వివరించి చెప్పినారు

ఎలమంచిలి

స్థానిక హిందీ ప్రేమీమండలి యాజమాన్యంలో ఇండియన్ క్లబ్‌లో శ్రీ గుంటూరి శ్రీవారి అధ్యక్షతకింద గాంధీ జన్మదినోత్సవ సభ జరిగింది హిందీ భాషావశ్యకతను గురించి, నాగేశ్వరరాయ స్మారకనిధి వసూళ్ళను గురించి పలువురు ముచ్చటించినారు

ఆముదాలవలస

అన్నదాన భక్తిసమాజంవారి యాజమాన్యంలో అక్టోబర్ 8 న ఆముదాల వలసలో గాంధీ జన్మదినోత్సవం వైభవంగా జరిగింది అన్నదాన సమాజం వారు గాంధీ పటం ఊరేగించి పేదలకు అన్నదానం చేసినారు బేతనభట్ల నరసింహంపంతులుగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది గేదెల చంద్రయ్యనాయుడు, గరిమెళ్ల కుమారస్వామి, ఆర్ వి గోపాలరావుగార్లు మహాత్ముని జీవితం గురించి, ఆయన నిర్మాణ కార్యక్రమం గురించి గంభీరోపన్యాసాలు చేసినారు

వెల్లటూరు

రేపల్లె తాలూకా వెల్లటూరు గ్రామంలో అక్టోబర్ 2 న గాంధీ జయంత్యుత్సవం అత్యుత్సాహంగా జరిగింది రెండెడ్లబండ్లమీద రాట్నముంచుకొని బాలికలు నూలు వడుకుతూవుండగా బాలురు జాతీయ పతాకాలతో జాతీయ గీతాలు పాడుకొంటూ పెద్ద ఊరేగింపును బయలుదేరదీసినారు దేశోద్ధారక విశ్వదాతచౌక్ వద్ద రేపల్లె తాలూకా ప్రధాన కార్యదర్శి శ్రీ కాండూరి సీతారామయ్యగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది ఆ సభలో శ్రీ యార్లగడ్డ శేషయ్య, మద్దుల వెంకటగిరిరావు, యల్లాప్రగడ సత్యనారాయణ, చెరుకూరి సుబ్బారావుగార్లు గాంధీమహాత్ముని జీవితాశయాలను గురించి విపులంగా ఉపన్యసించిన తరవాత సభ ముగిసింది

మచిలీపట్టణము

మచిలీపట్టణంలో హరిజన సేవకసంఘం, పట్టణ కాంగ్రెస్ సంయుక్త సంఘాల యాజమాన్యంకింద అక్టోబర్ 2 న ప్రారంభమయిన గాంధీ జయంత్యుత్సవాలు అక్టోబర్ 12 వరకు జరిగినాయి ఈ ఉత్సవాలకు ఏర్పాటు చేయబడిన ప్రత్యేక పందిరిలో హరిజన సమస్య, వార్ధా విద్యావిధానము, హిందూ ముస్లిమ్ ఐకమత్యం, మహాత్ముని ఆదర్శాలు, హిందీ మాతృభాషకు నష్టదాయకమా? అనే విషయాలపై ఉపన్యాసాలు జరిగినాయి ఇవిగాక హరికథా కాలక్షేపాలు, సంగీత కచేరీలు కూడా జరిగినాయి అక్టోబర్ 10 ఉదయం ఐదు డివిజన్‌లలో శ్రీ దాడి గోవిందరాజులనాయుడుగారు జాతీయపతాకోత్సవాలు జరిపినార్రు,

భద్రాచలము

అక్టోబర్ 2 ఉదయాన భద్రాచలంలోని శ్రీరామాలయంలో మహాత్ముని ఆయురారోగ్యాభివృద్ధికి పూజలూ ప్రార్థనలూ జరిగినాయి సాయంకాలం బ్యాండు మేళాలతో తాలూకా కాంగ్రెస్ కమిటీవారు మహాత్ముని పటం ఊరేగించినారు కమిటీ ప్రెసిడెంటు శ్రీ కురిచేటి శ్రీరామమూర్తిగారు స్వరాజ్య ధ్వజారోహణం చేస్తూ ఆ త్రివర్ణ పతాక గౌరవం కాపాడడం ప్రతి భారతీయుని ముఖ్యధర్మమని ఉపన్యసించినారు

అక్టోబర్ 6 సాయంకాలం గోదావరి ఒడ్డున బహిరంగసభ జరిగింది పి యస్ ఆర్ ఆచార్యులుగారు అధ్యక్షత వహించినారు కురిచేటి శ్రీరామమూర్తిగారు మహాత్ముని గుణగుణాలను గురించి దీర్ఘోపన్యాసం చేసినారు సభ జయజయ ధ్వానాలతో ముగిసింది

## హైదరాబాదు - గాంధీ జయంత్యుత్సవాలు (1939)

ఖాదీ సమితి

ఖాదీ సమితి కార్యదర్శి శ్రీ రామకృష్ణధూత్ గాంధీ జయంత్యుత్సవాలను హైదరాబాదు రాష్ట్రి మంతటిలో జరప నిర్ణయించుకొన్నట్లు ఒక దీర్ఘమయిన ప్రకటన చేసినారు ఆ ప్రకటనలో అక్టోబర్ 2 కానీ, అక్టోబర్ 10 కానీ గాంధీజీ జన్మదినోత్సవాలను జరపవచ్చునని ఖాదీ కార్యకర్తలను ఆదేశించినారు బహిరంగసభలలో హరిజనాభ్యుదయం గురించి ఖాదీ కార్యక్రమం గురించి ఉపన్యాసాలు చేయవలెనని కోరినారు అక్టోబర్ 2 మొదలు 10 వరకు ఖాదీ బట్టలను వీధులలో తిరిగి అమ్మవలెనని, ఖాదీ ప్రదర్శనలు జరపవలెనని, చేతితో తయారుచేసిన కాగితాలను విక్రయించవలెనని, హరిజన పత్రికకు చందాదారులను చేకూర్చవలెనని, గాంధీ సాహిత్యం సమకూర్చి ప్రదర్శించవలెననీ, చర్కా సప్తాహం ఏర్పాటు చేయవలెనని, ఆ వారంలో ఏదో ఒక రోజున 24 గంటలు చర్కా తిరిగేటట్టు చూడవలెనని ఖాదీ కార్యకర్తలను ఆయన ఆదేశించినారు

## గాంధీ జయంతి

మిర్యాలగూడెం

వైశ్య యువజన సంఘంవారి యాజమాన్యంలో కే రామలక్ష్మయ్య గారి ఇంట్లో గాంధీగారి 71 వ జన్మదినోత్సవం అక్టోబర్ 10 న జరిగింది పలువురు ప్రముఖులు ఉపన్యసించినారు మహాత్ముని జీవిత విశేషాలను గురించి మారేమళ్ల వెంకటేశ్వర్లుగుప్త, శ్రీ జె ఆదినారాయణగుప్త, కే. రామకృష్ణయ్యగారలు ప్రసంగించిన తరవాత సభ ముగిసింది.

**కరీంనగరము**

అక్టోబర్ 4 ఉదయం శ్రీ బి ఎల్లారెడ్డి, ఏ ప్రభాకరరావు, ఇ యస్ రాజుగార్లు ఇల్లిల్లూ తిరిగి ఖద్దరు విక్రయించినారు సాయంకాలం 4 గంటలకు ఉస్మానియా ఆంధ్ర భాషా నిలయంలో బహిరంగసభ,ఖాదీ ప్రదర్శన జరిగింది మహమ్మదీయులు, సిక్కులు, పోలీసు ఉద్యోగులు కూడా వచ్చినారు పెద్ద లెవరూ అధ్యక్ష పీఠంపై ఆసీనులు కావటానికి అంగీకరించనందున యువకు లయిన బద్దం ఎల్లారెడ్డిగారు ఆ స్థానం అలంకరించవలసి వచ్చింది

పోల్కంపల్లి వెంకట్రామారావుగారు ఉర్దూలో మహాత్ముని జీవితాశయాలను గురించి ఉపన్యసించినారు వీరి తరవాత నరసింహంగారు తెలుగులో ఉపన్యసించినారు సభా ప్రారంభంలో శ్రీ ఇ యస్ రాజుగారు మహాత్ముని గురించి హిందీలో చక్కని గీతం పాడినారు మహాత్ముని ఆయురారోగ్యాభి వృద్ధులను కోరుతూ తీర్మానించిన తరవాత జయధ్వానాలతో సభ ముగిసింది

**కొలనుపాక**

అక్టోబర్ 10 సాయంకాలం స్థానిక గ్రంథాలయ యాజమాన్యంలో గాంధీ జయంత్యుత్సవం జరిగింది గంగరాజు రఘునాథరాజుగారు అధ్యక్షత వహించి నారు ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, రామచంద్రారెడ్డి మొదలయినవారు గాంధీ మహాత్ముని జీవిత విశేషాలనూ, ఆయన నిర్మాణ కార్యక్రమం గురించి ఉపన్య సించిన తరవాత గాంధీమహాత్మునికి జై అనే నినాదాల మధ్య సభ ముగిసింది

**జనగామ**

జనగామలో ప్రభుత్వాధికారుల అనుమతి లభించనందున గాంధీ జన్మ దినోత్సవాలు జరపడానికి వీలుకలగలేదు కాని అక్కడ ఖాదీ భాండారం మాత్రం ప్రారంభించబడింది

**సికిందరాబాదు**

సికిందరాబాదు లాలాగూడ దేవాలయంలో వకీలు రంగాచారి అధ్యక్షత కింద సభ జరిగింది జి లక్ష్మీనర్సుగారు ఖాదీ ప్రచారం గురించి మాట్లాడినారు. నిజాం ప్రభుత్వంవారు అన్ని శాఖలలో ఖాదీకి ప్రాధాన్యం ఇవ్వలేదని తీర్మానం చేసినారు

**బొల్లారం**

బొల్లారంలో అక్టోబర్ 2 ఉదయం 9 గంటలనుంచి సాయంకాలం 6 గంటల వరకు బీదలకు అన్నదానం జరిగింది సాయంకాలం 6½ గంటలకు ఒక విశాలమైన తోటలో బహిరంగ సభ జరిగింది జాతీయ గీతానంతరం శ్రీదయాళ్

సింగ్, డా॥ రామకృష్ణారెడ్డిగార్లు మహాత్ముని జీవిత విశేషాల గురించి ఉపన్య సించినారు అంతటితో సభ ముగిసింది

**మహబూబ్‌నగర్**

1929 అక్టోబర్ 1 సాయంత్రం మహబూబునగరంలో పాత పాలమూరు ఆంజనేయ దేవాలయంలో మహాత్ముని 71వ జన్మదినోత్సవం జరిగింది సత్యా గ్రహసమరంలో పాల్గొని కారాగార వాస శిక్షను పొందిన శ్రీ యేగూరి చెన్నప్ప అధ్యక్షత వహించినారు వకీలు నందగిరి వెంకాలురావు, వకీలు శ్రీ నల్లెల్ల హనుమంతరావుగార్లు గాంధీజీ జీవిత చరిత్రను గురించి సమగ్రంగా ఉపన్యసించి నారు. గాంధీజీకి ఆయురారోగ్యాలు ప్రసాదించ వలెనని భగవంతుని ప్రార్థిస్తూ సభ ముగించినారు

**తోటపల్లి విద్యాభివర్ధనీ గ్రంథాలయము**

4-10-39 సాయంకాలం 5 గంటలకు తోటపల్లి గ్రంథాలయంలో గాంధిజయంత్యుత్సవ సందర్భంలో సభ జరిగింది సంతపురి రామకృష్ణారావు గారు, బి వెంకటరామారావుగారు గాంధీమహాత్ముని జీవిత విశేషాలను గురించి ప్రసంగించినారు

## హైదరాబాదు

**రెడ్డిహాస్టల్**

అక్టోబర్ 3వ తేదీన రెడ్డిహాస్టల్‌లో శ్రీమతి సరోజినీదేవి అధ్యక్షత కింద గాంధిజయంత్యుత్సవ సభ జరిగింది హరిజన సేవక సంఘంవారు, ఖాదీ సమితి వారు గాంధీని అభినందిస్తూ తీర్మానం చేసినారు డాక్టర్ లతీఫ్‌సయ్యద్, స్వామీ రామానంద తీర్థ, జాఫర్ హుస్సేను, గోవిందరావు నావల్, సిరాజుల్ హసన్ తిర్మిజీగార్లు గాంధీ జీవితం గురించి ఉపన్యసించినారు తరవాత సరోజినీదేవి గాంధీజీకి ప్రియతమములయిన ఖద్దరు, అస్పృశ్యతా నివారణము, మద్యపాన నిషేధము, హిందూ ముస్లిము ఐక్యం గురించి గంభీరంగా ఉపన్యసించినారు

**సర్ అక్బర్ హైదరీ విరాళము**

గాంధీజయంతి సందర్భంలో హరిజన సేవక సంఘాధ్యక్షులయిన రాజా బహద్దూర్ వెంకటరామరెడ్డిగారికి రైట్ ఆనరబుల్ సర్ అక్బర్ హైదరీ గారు 500 రూపాయల విరాళం సమర్పించినారు. పన్నాలాల్ పిట్టిగారు హరిజన నిధికి 25 రూపాయల విరాళం ఇచ్చినారు

**అభినందన సంచిక**

సర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గాంధీజీ 71 వ జన్మదిన సందర్భంలో ఒక అభినందన సంచికను ప్రకటించినారు అందుకు గాంధీజీ 'కృతజ్ఞతాభివం

దనాలు' అనే శీర్షిక కింద 31-12-39 హరిజన్‌లో ఇట్లా వ్రాసినారు

"సర్ సర్వేపల్లి రాధాకృష్ణ నా 51 వ జన్మదినం ఎంతో అతిశయింప జేసినారు నాకు తెలిసిన స్నేహితులనుంచి, తెలియనివారి నుంచి కూడా ప్రశంసల నందుకొని ఆయన రచించిన గ్రంథాన్ని నాకు పంపినారు దానితో పాటు మరికొంత శ్లాఘాపూర్వకంగా ఒక ఉత్తరము కూడా వ్రాసి పంపి నారు ఈ సంపుటంలో సేకరించిన ప్రశంసా వాక్యాల నన్నిటినీ చదవ డానికి నాకు వ్యవధి ఎప్పుడు లభిస్తుందో కూడా తోచటం లేదు నన్ను గురించి ప్రశంసా వాక్యాలు వ్రాసిన వారి భావాలకు అనుగుణంగా జీవించ గల శక్తి సామర్థ్యాలను ప్రసాదించవలెనని మాత్రం నేను భగవంతుని ప్రార్థిం చగలను నాకు అభినందనలను, ఆశీర్వాదాలను పంపిన అందరికీ, సర్ సర్వే పల్లికిన్నీ నా కృతజ్ఞతాభివందనాలు ప్రతి ఒక్కరికీ ప్రత్యేకంగా కృతజ్ఞ తలు తెలపడం నాకు సాధ్యం కాని పని

నన్ను సంస్తుతించే వారికి ఒక్క విషయం చెప్పవలసి ఉన్నది కొంత మంది బహిరంగ స్థలాలలో నా విగ్రహం ప్రతిష్ఠించవలెననీ, మరికొంత మంది నా చిత్రపటాలను ఆవిష్కరించవలెననీ ఇంకా కొంత మంది నేను పుట్టిన రోజు సెలవు దినంగా ప్రకటించవలెననీ కోరుతున్నారు సి రాజగోపాలాచారి నన్ను బాగా ఎరుగుదురు కనకనే నేను పుట్టిన రోజు సెలవుగా ప్రకటించ డానికి ఆయన దూరదృష్టితో నిరాకరించినారు ఈ రోజులు వివాదాలు, విభే దాలతో కూడిన రోజులు ఏ విధంగా నయినా అది నా పేరు మీద మరింత పెచ్చు పెరిగినట్లయితే నేను చాలా చిన్న బుచ్చుకోవలసి వస్తుంది అటువంటి అవకాశం కలగకుండా చేయడమే దేశానికి, నాకూ కూడా ఉపకారం చేసి నట్లు భావిస్తాను శిలా విగ్రహాలు, చిత్రపటాలవంటి వాటికి ఈ రోజులలో స్థానం లేదు నేను ఏ పనులకోసం నా జీవితం అంకితం చేసినానో వాటి నభివృద్ధి చేయడమే నన్ను ప్రశంసించడంగా భావించి నా మనసులో వాటిని చిరస్మర ణీయాలుగా ఉంచుకొంటాను జాతీయ సమైక్యంకోసం కానీ, అస్పృశ్యతా నివారణకోసం కానీ, గ్రామాభివృద్ధి నిమిత్తంకానీ ఎవరు ఏ చిన్న పని చేసి నప్పటికీ అది నాకు నిజమయిన శాంతి, సంతోషం చేకూర్చగలదు అనేక ఖాదీ భాండాగారాలలో నిలవ ఉండి పోయిన ఖాదీ విక్రయించడానికి ఈ రోజులలో కార్యకర్తలు తమ యావచ్ఛక్తిని వినియోగిస్తున్నారు ఈ ఖాదీ వారంలో గానీ, ఖాదీ పక్షంలోగానీ మిగిలిపోయిన ఖాదీ యావత్తు విక్రయించినారని తెలుసుకోవడం కంటె మరి దేనిని నేను నిజమయిన ఆశీర్వాదంగా గానీ, అభి నందనగా గానీ భావించను నేను నా కార్యక్రమానికి వేరు కాదు, నాకు నా కార్యక్రమంతో అవినాభావ సంబంధమున్నది"

హరిజన్
31-12-39

యం. కె. గాంధీ

## దక్షిణభారత హిందీప్రచారము

"రానున్న పరివర్తనము" అనే పేరుతో మహాదేవదేశాయ్ 'హరిజన్' పత్రికలో దక్షిణ ఇండియాలో జరిగిన హిందీ ప్రచారం గురించి ఇట్లా వ్రాస్తున్నారు

"ఇటీవలి సంవత్సరాలలో తమిళ, ఆంధ్ర, కన్నడ, కేరళ రాష్ట్రాలలో జరిగిన హిందీ ప్రచారాభివృద్ధిని గురించి ఆలోచిస్తే నెమ్మదిగానూ, తప్పని సరిగా ఒక గొప్ప పరివర్తనం రానున్నట్లు కనబడుతూన్నది 1917లో అప్పటికి బాల్యావస్థ దాటని తన కనిష్ఠ కుమారుడు దేవదాసును గాంధీజీ దక్షిణ భారత దేశంలో హిందీ ప్రచార బీజం నాటేటందుకు పంపించినారు ఆ చిన్న ప్రయత్నం గట్టిగా వేరు నాటుకొని 20 సంవత్సరాలలో మహావృక్షంగా వర్ధిల్లి అనేక భయంకరాలయిన తుఫానులను తట్టుకొగలిగి ఉంటుందని ఆనాడు ఆయన ఊహించి ఉంటారని కూడా నేననుకోను ఈనాడు 8 లక్షల మంది పై చిలుకు జనానికి హిందీ తెలుసు దాదాపు ఒక లక్షమంది హిందీ నేర్చుకొంటున్నారు దాదాపు నలభై లేదా యాభై వేలమంది బాలబాలికలు పాఠశాలలో రాజాజీ పట్టుదలవల్ల నేర్చుకొంటున్నారు ఈ ఉద్యమానికి ప్రాథమిక దశలలో ఇతర రాష్ట్రాలవారు ఆర్థిక సహాయం చేసినారు గాని ఇప్పుడు వెలుపలి వారి సహాయంతో నిమిత్తం లేకుండా దక్షిణ భారత దేశమే ఆర్థికంగా తోడ్పడు తూన్నది జీతం మీద గానీ, స్వచ్ఛందంగా గానీ ఒక పూట పనిచేసే వారుగానీ మొత్తం 1200 మంది కార్యకర్తలు ఈ కార్యక్రమంలో నిమగ్నులయి ఉన్నారు ఇందులో కొంతమంది ముస్లిమ్‌లు కూడా ఉన్నారు నిరుడు 17155 మంది దక్షిణ భారత హిందీ ప్రచార సభవారి వివిధ పరీక్షలకు హాజరయినారు ఈ సంవత్సరం ఆ సంఖ్య 19347కు పెరిగింది ఈ సభ వారికొక ముద్రాశాల కూడా ఉన్నది దానిలో దక్షిణ భారత భాషల ప్రచురణలే కాక హిందీ, ఇంగ్లీష్ ప్రచురణలు కూడా ప్రకటింప బడుతూవున్నవి కొన్ని గ్రంథాలు 20 పర్యాయాల కంటె కూడా ఎక్కువ ముద్రింపబడినవి ఉన్నాయి

మద్రాస్‌లో హిందీ ప్రచారక సమ్మేళన అధ్యక్షునిగా రెండు రోజులు ఉండే భాగ్యం నాకు కలిగింది ఆ రెండు నాళ్లలో మత, రాజకీయ, భాషా విషయిక వివాద రహితమయిన స్వేచ్ఛా వాతావరణం అనుభవిస్తూన్నట్లు నాకు తోచింది హిందీ, హిందుస్థానీని గురించి వివాదంగానీ, ప్రాంతీయ భాషలు ప్రమాదంలో పడినవనే నినాదంగానీ నాకు వినిపించలేదు హిందీ ప్రచార సభ తమ కార్యకలాపాలవల్ల పేరు ప్రతిష్ఠలను సంపాదించు కొన్నది హిందీ తెలియక పోవడం విద్యాభ్యాసంలో ఒక లోపమనీ, తెలుసుకొని ఉండటం గౌరవమనీ ప్రజలు భావించేటట్లు సభవారు చేసినారు వేల కొలది జనం వినోద

కార్యక్రమాలకు హాజరై ప్రతి విషయాన్నీ తెలివిగా గ్రహించి ఆనందించి నారు హిందీ నాటక ప్రదర్శనలు జరిగినాయి ఆ ప్రదర్శనలలో పాల్గొన్నవారు అరితేరిన హిందీ ప్రచారకులే కాక ఇటీవల హిందీ భాష నేర్చుకొన్న వ్యక్తులు కూడా ఉన్నారు వారు ఆంధ్రదేశం నుంచి వచ్చినారు ఆంధ్రదేశం నాటక కళా కౌశలంలో ప్రసిద్ధి వహించినది"

హరిజన్ మహాదేవ దేశాయ్

# 26
# 1940 రాజకీయ వాతావరణము

1939 సెప్టెంబర్ 3 వ తేదీన బ్రిటన్ జర్మనీపైన యుద్ధం ప్రకటించి నట్లుగా బ్రిటిష్ ప్రధాని చేంబర్లేన్ ప్రపంచానికి వెల్లడి చేసినారు అనాడే మహా ఘనత వహించిన చక్రవర్తిగారు తన సామ్రాజ్యంలోని దేశాలన్నిటికి ఒక సందేశాన్ని రేడియోద్వారా ప్రసారం చేసినారు అందులో అంతర్జాతీయ సంధులను, వాగ్దానాలను అన్నిటినీ ధిక్కరించి ఇతర రాజ్యాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను భగ్నపరిచే బలప్రదర్శనంతో భయపెడుతూగానీ, నిజంగా బల ప్రయోగం చేస్తూగానీ ఉన్న ఒకానొక దేశం స్వార్థపరత్వాన్ని నిర సించినాడాయన బలంగలవాడిదే న్యాయం అనే సిద్ధాంతంపైన ఆధారపడి ఉన్న ఆ విధానం ప్రపంచంలో ఒక్కసారి స్థాపించబడితే అది బ్రిటన్, బ్రిటిష్ కామన్‌వెల్త్‌ల స్వాతంత్ర్యానికి హాని కలిగిస్తుందని తన ఆదుర్దాను వెల్లడిం చినాడు అంతటితో ఊరుకోక "ఇంతకంటె కూడా ఎక్కువ అపాయం మరొ కటి ఉన్నది. యావత్ప్రపంచ ప్రజానీకమూ భయ భ్రాంతమై, పరాధీనమవు తుంది ప్రపంచంలో న్యాయధర్మాలు, శాంతి భద్రతలు, స్వేచ్ఛా స్వాతం త్ర్యాలు అనే మాటలకు తిలోదకాలీయవలసి వస్తుంద'న్నారు,

తరవాత రాజ ప్రతినిధి చేసిన ప్రకటనలో ప్రపంచానికి వచ్చిన విప త్తును వెల్లడిస్తూ బలప్రయోగంవల్ల సాగించే పరిపాలనకు ప్రతికూలంగా ఇం డియా మానవ స్వాతంత్ర్య రక్షణకు పోరాడ గలదని తన విశ్వాసాన్ని ఉద్ఘా టించినాడు "బలవంతంగా దౌర్జన్యంతో చేసే పరిపాలనకు ప్రతికూలంగా ఇండియా మానవ స్వాతంత్ర్యంకోసం పోరాడ గలదనీ ప్రపంచ నాగరక చరిత్రలో ఉత్కృష్ట స్థానంగల జాతులలో తన గౌరవానికి తగినట్లు ఇండియా తన పాత్రను నిర్వహిస్తుందనీ విశ్వసిస్తున్నాను" అన్నాడు వైస్రాయ్

ఈ ప్రకటనానంతరం రాజప్రతినిధి మొట్ట మొదట చేసిన పని గాంధీజీని సిమ్లాకు ఆహ్వానించడం, వారిద్దరు మాట్లాడుకొన్న తరవాత గాంధీజీ ఇట్లా ప్రకటించినారు

"ఈ విషయంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు నన్ను ఫలానా విధంగా ప్రవర్తించమని చెప్పలేదని నాకు తెలుసు తంతి ద్వారా వచ్చిన ఆహ్వానాన్ని అంగీకరించి నా కందిన మొదటి రైలులో ప్రయాణం చేసినాను అణచుకొందమన్నా అణిగి పోక ఆపాద మస్తకమూ వ్యాపించిన నా అహింసతో నేను జాతీయ హృదయాన్ని సరిగా ప్రతిబింబింప చేయలేనని కూడా నేనెరు గుదును ఒకవేళ నేనందుకు ప్రయత్నించినా నవ్వులాట్లు కావడమే గాని

లాభంలేదు ఈ సంగతి నేను రాజ ప్రతినిధికి మనవి చేసినాను కాబట్టి నాతో రాయబారం నడపడం, రాజీ చేసుకోవడమనే మాట ఊహించడానికి వీలులేనిది ఆయన నాతో రాయబారం చేయడానికి రమ్మన్నట్లు కూడా నేనర్థం చేసుకోలేదు నేను వైస్రాయి భవనం నుంచి వట్టి చేతులతో వచ్చినాను రహస్యంగా గానీ, బహిరంగంగా గానీ నా మధ్య ఆయన మధ్య ఏ విధమయిన రాజీ జరగలేదు ఏదయిన రాజీ జరగడమే ఉంటే ఆ రాజీ ప్రభుత్వం మధ్యా కాంగ్రెస్ మధ్యా జరగవలె

"నా స్థితి, కాంగ్రెస్ స్థితి స్పష్టంగా వైస్రాయ్‌కి తెలియ చెప్పిన తరవాత కేవలం మానవ హితైషిగా నా సానుభూతి ఇంగ్లాండ్, ఫ్రాన్స్‌దేశాల మీదనే ఉన్నదని రాజప్రతినిధికి స్పష్టీకరించినాను" అన్నారు

గాంధీజీ ఏ విధమయిన షరతులు పెట్టకుండా అప్పటికప్పుడు తన సహజ ప్రకృతి కనుగుణంగా హృదయపూర్వక నైతిక సహాయం చేస్తాననన్నాడు

1939 సెప్టెంబర్ 14 వ తేదీని పరిస్థితులను సమగ్రంగా సమాలోచన చేయడానికి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమయింది "ఇంగ్లాండ్, ఫ్రాన్స్ దేశాలు చేస్తూవున్న యుద్ధము సామ్రాజ్యవాద శక్తులకు, ఫాసిస్టు ప్రభుత్వాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామ్య రక్షణకోసం చేస్తూన్న యుద్ధమని అంగీకరించినప్పటికీ, పోలాండ్ పక్షాన ఏ ప్రజాస్వామ్యం రక్షించడానికి ఇంగ్లాండ్ కంకణం కట్టుకొని పోరాడుతున్నదో ఆ ప్రజాస్వామ్యం తమ భారత దేశానికి నిరాకరింపబడడంమూలాన బ్రిటిష్ సామ్రాజ్య వాదానికది బలి అవుతూవున్నట్లుకూడా వర్కింగ్ కమిటీ అభిప్రాయపడింది అంతేకాక అధినివేశ రాజ్యాలు ఈ యుద్ధంలో పాల్గొనవలెనా లేదా అనే విషయం ఆయా దేశాల పార్లమెంట్‌లలో చర్చించుకొంటూ ఉండగా ఇండియా యుద్ధంలో పాల్గొనడం ఖాయమయినట్లేనని బ్రిటిష్‌వారు నిర్ణయించడం వర్కింగ్ కమిటీవారు ఆశ్చర్య విషాదాలతో గమనించినారు అంటే ఇండియాకు ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ యుద్ధంతో సంబంధం లేకపోయినప్పటికీ ఇంగ్లాండ్ తన యుద్ధాన్ని ఇండియామీద బలవంతంగా రుద్దినట్లు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అర్థం చేసుకొన్నది

రాష్ట్రాలలో స్థాపించిన బాధ్యతాయుత ప్రభుత్వాలు యుద్ధ వ్యవహారాలలో బాధ్యతా రహితమయిన కేంద్రప్రభుత్వంవారి అదుపాజ్ఞలలో మెలగవలసి రావడం చూసి నైర్యంతో నోరు మూసుకొని ఉండటానికి సాధ్యంకాని పరిస్థితులు కూడా కాంగ్రెస్‌కు తటస్థించినాయి అందువల్ల రాష్ట్రప్రభుత్వాలకు ఇండియా ప్రభుత్వానికి గల సంబంధ బాంధవ్యాలను విస్పష్టం చేయవలసిందని కూడా బ్రిటిష్‌ప్రభుత్వాన్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ కోరింది

లోగడ అనుభవాలనుబట్టి, గత యుద్ధంలో ముఖ్యంగా కలిగిన అనుభవాలనుబట్టి బ్రిటిష్‌ప్రభుత్వంవారుగానీ, ఇండియాప్రభుత్వంవారుగానీ యుద్ధ సమయంలో చేసే ప్రకటనలలో మనం విశ్వాసముంచకూడదని తేలింది, కాబట్టి

భావిభారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వాని కుండబోయే సంబంధ బాంధవ్యాలను వివరిస్తూ అందుకనుగుణంగా ఆ సిద్ధాంతాలను వెంటనే ఆచరణలోకి తేవలెనని బ్రిటిష్ ప్రభుత్వంవారిని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు కోరుతూ ఈ విషయంలో స్పష్టమయిన ప్రకటన చేస్తేనేగానీ భారతదేశ ప్రజలను సంపూర్ణ సహకారం చేయవలసిందని తాము కోరజాలమని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు ప్రకటించినారు

కాంగ్రెస్ కోరిక ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వంవారు భారతదేశ భవిష్యత్తును గురించి గానీ, యుద్ధాశయాలను గురించి గానీ, స్పష్టమయిన ప్రకటనలు చేయనందుకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ రాష్ట్ర ప్రభుత్వాలను రాజీనామా పెట్టవలసిందని కోరింది 1939 అక్టోబర్ 31 వ తేదీనాటికి కాంగ్రెస్ మంత్రులందరూ రాజీనామాలను సమర్పించినారు

బ్రిటిష్ ప్రభుత్వంవారు కాంగ్రెస్ కోరికలను మన్నించనందుకు ప్రతిఘటనగా అక్టోబర్ 17 వ తేదీన కాంగ్రెస్ వ్యక్తి సత్యాగ్రహాన్ని ప్రారంభించింది మొట్టమొదటి సత్యాగ్రహి వినోభాభావే ఆయన 1940 అక్టోబర్ 21 వ తేదీని అరెస్టయినారు

వ్యక్తి సత్యాగ్రహి "బ్రిటిష్‌వారి ఈ యుద్ధ ప్రయత్నాలకు మనుష్యులను, డబ్బును సహాయం చేయడం తప్పు అన్ని యుద్ధాలను అహింసాయుతంగా నిరోధించటం మాత్రమే యుద్ధానికి తగిన ప్రతిక్రియ" అని ప్రమాణం చేయవలె ఈ ప్రమాణంతోపాటు ఆయన నిర్వర్తించవలసిన నిర్మాణ కార్యక్రమం కూడా నిర్దేశింపబడింది ముఖ్యంగా సొంతంగా నూలు వడకడం ప్రతి సత్యాగ్రహి నిర్వర్తించవలసిన ప్రధాన నిర్మాణ కార్యక్రమం ఈ సత్యాగ్రహ ప్రమాణాన్ని బహిరంగసభలలో చదివినందుకు యావద్భారతదేశంతోపాటు ఆంధ్రలోకూడా వేలకొద్దీ సత్యాగ్రహులు కారాగార శిక్షలకు గురియయినారు ఈ వ్యక్తి సత్యాగ్రహంలో శాసనసభలకు, స్థానిక సంస్థలకు, కాంగ్రెస్ కమిటీలకు ఎన్నుకోబడిన వారంతా పాల్గొన్నారు ఇది 1940, నాటి రాజకీయ పరిస్థితి

## గాంధీ విద్యార్థి వేతనాలు

| | | |
|---|---|---|
| శ్రీ డి వెంకన్న | B A Jr | 5 |
| ,, కె వెంకటేశ్వరం | L I M IIyr | 10 |
| ,, ఏ. హనుమంతు | L I M Sr | 5 |
| ,, బి సి వెంకయ్య | Veternari | 7 |
| ,, జి ఆనందయ్య | I A, Sr | 5 |
| ,, ఎల్. బుల్లయ్య | B A, Jr | 5 |

| | | |
|---|---|---|
| శ్రీ యు రామారావు | B Sc Agri | 10 |
| ,, యం రామానుజదాస్ | L I M | 10 |

నిజాం రాష్ట్రంలో

| | | |
|---|---|---|
| శ్రీ కె వీరాస్వామి | I A Sr | 5 |
| ,, బి యస్ రాజరత్నం | B A Sr | 5 |
| ,, బి పాన్టియా | M B B S | 10 |
| ,, టి హనుమానయ్య | I A Sr | 5 |

## గాంధీ జన్మదినోత్సవాలు (1940)

### హైదరాబాదు

మహాత్మాగాంధీ 72 వ జన్మదినోత్సవ సందర్భంలో హైదరాబాదు నగరం లోని ఖాదీ ప్రచారక సంఘంవారు ఖద్దరు ప్రదర్శనను ఏర్పాటు చేసినారు హైదరాబాదు ప్రభుత్వంలో న్యాయశాఖా సభ్యుడుగా ఉన్న సయ్యద్ అబ్దుల్ అజీజ్ అక్టోబర్ 10 సాయంకాలం ఖద్దరు ప్రదర్శన తెరిచి శ్రీమతి సరోజినీ దేవి వార్ధానుంచి పంపిన తంతివార్తను సభలో చదివినారు అజీజ్‌గారిట్లా ప్రసం గించినారు

"ఇప్పుడు కాంగ్రెస్ పార్టీవారు తమ నిర్మాణ కార్యక్రమంలో ఖద్దరుకు అగ్రస్థాన మిచ్చినారు కాని దానిని కాంగ్రెస్‌వారు క్రొత్తగా కనిపెట్టలేదు అనేక శతాబ్దాలకు పూర్వంనుంచి ఇండియాలో ఖద్దరు పరిశ్రమ చాలా విస్తా రంగా జరుగుతూనే ఉంది దీనివల్ల దేశంలో కోట్ల కొద్ది సామాన్య ప్రజకు జీవ నాధారం ఏర్పడుతుంది కాబట్టి దేశంలో అన్ని మతాలవారు, అన్ని రాజకీయ పక్షాలవారు కూడా నిరంతరం ఖద్దరు బట్టలనే కట్టవలె అట్లా జరిగితే ఖద్దరు బట్టల అమ్మకం చాలా అధికమవుతుంది ఎక్కువమంది ఏకులు చేయడం, నూలు వడకడం, బట్టలు నేయడం మొదలయిన పనులనుచేయ గలుగుతారు అందువల్ల వారికి కొంత ఆదాయం కలుగుతుంది, సామాన్య ప్రజలలో నిరుద్యోగం తగ్గి పోతుంది దానివల్ల దారిద్ర్యం కూడా తగ్గిపోతుంది

హైదరాబాదు సంస్థాన ప్రభుత్వంవారు ఖద్దరు పరిశ్రమాభివృద్ధి విషయంలో చాలా శ్రద్ధగా పనిచేస్తున్నారు ప్రజలందరూ గృహపరిశ్రమలకు ప్రోత్సాహమివ్వడంలో శ్రద్ధ తీసుకోవలె' అని అన్నారు

ఈ ఉపన్యాసానంతరం కృతజ్ఞతాభివందనాలతో సభ ముగిసింది.

### శ్రీకాకుళము

శ్రీకాకుళం మునిసిపల్ హైస్కూల్‌లో పట్టణ కాంగ్రెస్ సంఘంవారి యాజమాన్యంలో గాంధీజయంత్యుత్సవ సందర్భంలో 1940 అక్టోబరు 8వ తేది

సాయంకాలం 6 గంటల నుంచి 9 వ తేది సాయంకాలంవరకు నిరంతరాయంగా రకరకాల రాట్నాలు పదింటిపైన నూలు తీయడం జరిగింది ఈ రాట్నయజ్ఞంలో ఉద్యోగులు, ఉపాధ్యాయులు ఉల్లాసంగా పాల్గొన్నారు దీనిని ఇవటూరి సన్యాసిరాజుగారు, పరాంకుశం బలరాంగార్లు ఏర్పాటు చేసినారు అక్టోబర్ 9వ తేది సాయంకాలం మహాత్ముని పటాన్ని జాతీయ గీతాలతో కాంగ్రెస్ కార్యకర్తలు ఊరేగించినారు

తరవాత గాంధీ హాలులో జరిగిన సభకు శ్రీమతి దిగుమర్తి సువర్ణబాయి గారు అధ్యక్షత వహించినారు మల్లిమడుగుల కోదండరామయ్యగారు మహాత్ముని జీవితం గురించి వివరించినారు

## పెనుగంచిప్రోలు

పశ్చిమ కృష్ణా సంఘంవారి ఆదేశానుసారం కాంగ్రెస్ కార్యకర్తలు పెనుగంచిప్రోలులో మహాత్ముని జన్మదినోత్సవాలను జరిపినారు గ్రామంలో ఉన్న ఇరు పక్షాలవారు ఒకరి కన్న ఒకరు మిన్నగా జరిపినారు బ్యాండు సన్నాయి మేళాలతో ఉత్సవాలు జరిపినారు ఒకరు ముత్యాల రథం కట్టి దానిలో గాంధీగారి చిత్రపటం పెట్టి దానిని 72 ఎడ్లతో లాగించి ఉత్సవం చేసినారు రెండో వారు అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుల 52 చిత్ర పటాలను పెట్టి ఊరేగించినారు అయ్యదేవర కాళేశ్వరరావుగారు మహాత్ముని జీవితం గురించి, రెండో ఐరోపా సంగ్రామ సందర్భంలో గాంధీ వైస్రాయిల మధ్య జరుగుతున్న పరస్పర సంభాషణలను గురించి విపులంగా ప్రజలకు తెలియ చేసినారు కొమ్మరాజు లక్ష్మణరాయ గ్రంథాలయానికి కాళేశ్వరరావుగారు ప్రారంభోత్సవం చేసినారు రేపాల బుచ్చిరామ శేషయ్యశ్రేష్ఠిగారు, అనుముల రామగోవిందశర్మగారు గాంధీజీ జీవితాశయాల గురించి ఉపన్యసించినారు

పెనుగంచిప్రోలు ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్యగారి జన్మభూమి కొమ్మ రాజు లక్ష్మణరావుగారి నివాసస్థలము

## పత్తికొండ

గాంధీజయంత్యుత్సవ సందర్భంలో పత్తికొండలో వినయాశ్రమంలో తయారయిన ఖద్దరు, కర్నూలు జిల్లా ఖాదీ భాండారంలో తయారయిన ఖద్దరు సుమారు 250 రూపాయల వరకు అమ్మకమయింది. తొమ్మండు లక్ష్మినరి సింహాయ్యగారు మిత్రులను పిలిపించి ప్రోత్సాహ పరచి ఖద్దరును ధరింప జేసినారు

## నందిగామ

అక్టోబరు 10న శ్రీ గరికపాటి కృష్ణమూర్తిగారు నందిగామ సోషల్ క్లబ్‌లో గాంధీ జీవితం గురించి ఉపన్యసించినారు. చందర్లపాడు, గౌరవరం,

కోనాయపాలెం, చెరుపుకొమ్ము పాలెం, మళ్లపాడు గ్రామంలో శ్రీ రేపాల బుచ్చిరామ శేషయ్య శ్రేష్ఠి, అనుముల రామగోవిందశర్మగార్లు గాంధీ జయంత్యుత్సవాలు జరిపినారు,

**ఇతరచోట్లలో**

తునిలో గాంధిజయంతి సందర్భంలో బీద బాలురకు 73 ఖద్దరు బనియన్లు పంచిపెట్టడంజరిగింది

కోరుకొండలో ఆత్మకూరు గోవిందాచార్యులవారు గాంధీ జీవితాశయాలు గురించి ఉపన్యసించినారు సభకు పున్నమరాజు రాధాకృష్ణమూర్తి గారు అధ్యక్షత వహించినారు

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరులో హిందీ బాలికా పారశాలవారి యాజమాన్యంలో బహిరంగసభలు, నాటక ప్రదర్శనలు జరిగినాయి

తొగరంలో సభారంభంలో బాలికలు పాటలు పాడుతూ రాట్నంపై నూలు తీసినారు కె జగన్నాథాచార్యులుగారు ఉపన్యసించినారు

కృష్ణాజిల్లా దివితాలూకా మంత్రిపాలెంలో, నెల్లూరుజిల్లా కదిరి తాలూకా కొండకోమర్లలో, పశ్చిమ గోదావరిజిల్లా కైకవరంలో, జమ్మలమడుగు వద్ద ఉన్న పాలివారి ఉప్పలపాడులో, గుంటకల్లు దగ్గరున్న తిమ్మంచెర్లలో, తణుకు తాలూకా సిద్ధాంతంలో గాంధీ జయంత్యుత్సవాలు జరిపినారు సిద్ధాంతంలో 1,82,280 గజాల నూలును నిర్మాణకార్యకర్తలు గాంధీ సప్తాహంలో వడికి ఆంధ్ర చర్కా సంఘం వారికి పంపినారు బీదలకు అన్నదానం జరిగింది కృష్ణాజిల్లా నందిగామ తాలూకా కోనాయపాలెంలో 86 జతల ఎడ్లు లాగిన రథంలో గాంధీపటం ఊరేగించినారు నందిగామ తాలూకా చందర్లపాడులోను, తెనాలి తాలూకా ఆలపాడులోను, కృష్ణాజిల్లాలోని చోడవరం, మద్దూరు, రొయ్యూరు గ్రామాలలోను 880 రూపాయల వెలగల ఖద్దరు అమ్మకమయింది

నాయుడు పేటలో, పుదూరగ్రహారంలో, తాడేపల్లిగూడెం తాలూకా దేవర గోపవరంలో, బెజవాడ తాలూకా మద్దూరులో గాంధీ జయంత్యుత్సవాలు జరిగినాయి

**"హైదరాబాదు"**

ఈ శీర్షిక కింద గాంధీజీ 1940 అక్టోబర్ 2 వ వారపు 'హరిజన్' పత్రికలో ఇట్లా వ్రాసినారు 'పదో ఒక సాకున ఇంగ్లీష్‌వారు హైదరాబాదు సంస్థానం నుంచి తీసుకొన్న బెరారు, దత్త మండలాలు, కర్ణాటక ప్రాంతాలను తిరిగి పొందేటందుకు హైదరాబాదు సంస్థానానికిగల హక్కు గురించి కొందరు నా అభిప్రాయం అడుగుతున్నారు ఇందుకు ప్రత్యుత్తర మివ్వడం అవసరము ఈ ప్రాంతాలు ఇంగ్లీష్‌వారు తీసుకొన్నారు కనక అటువంటి హక్కు ఇంగ్లీష్ వారిపైననే ఉన్నది ధర్మమేమిటి? అని నన్నడిగితే ఎవరి పరిపాలన

కింద ఉండడం ఆయా ప్రజల కిష్టమో కనుక్కోవలసి ఉంటుందంటాను నేను నాకు తెలిసిన ధర్మమిదే

"స్వాతంత్ర్యం వస్తే ఏమవుతుంది?" అని మరొక ప్రశ్న దినిని గురించిన చర్చబడి పిల్లల చర్చవంటిది నైసర్గికంగా ఒక్కటే అయిన భారత దేశానికి స్వాతంత్ర్యం లభిస్తే దానిలో చేరి ఉన్న ప్రతి భాగానికి స్వాతంత్ర్యం లభించగలదు. స్వాతంత్ర్యం దౌర్జన్య విరహితంగా లభించిన పక్షంలో దేశంలో ఉన్న వివిధ రాష్ట్రాలు ప్రజాస్వామ్య స్వభావంగల కేంద్ర ప్రభుత్వం కింద చక్కగా పని చేయగలవు వివిధ రాష్ట్రాల విశ్వాసంపై కేంద్ర ప్రభుత్వం ఆధారపడి ఉంటుంది స్వాతంత్ర్యం ఆయుధ బలంచే లభించినట్లయితే అప్పుడం దరి కంటె బలవంతుడగు వాడు యావద్భారత దేశాన్ని పాలించగలడు హైదరాబాదే అట్లాంటి స్థితికి రావచ్చు చిన్న సంస్థానాలు, పెద్ద సంస్థానాలు కూడా తమకు ఇష్టమున్నా లేకపోయినా బ్రిటిష్ వారి పట్టు నుంచి తొలగిపో గలవు సంస్థానాధిపతులు తమస్థితికోసం పోరాడి భారత దేశమంతటికీ చక్రవర్తి కాగల బలశాలికి అనుగతి కాగలవు సాయుధ రాజ్యాల కూటమికి నిరాయుధు లయిన లక్షలాది ప్రజలు పాదాక్రాంతులు కాగలరనే భావనపై ఈ ఊహ ఆధారపడి ఉన్నది ఇంకా వివిధ విధాలుగా ఊహించ వచ్చు బ్రిటిష్ సైన్యం లోని భారతీయులకు స్వాతంత్ర్యం లభించవచ్చు తాము బలవంతులమనే అభి ప్రాయంకూడా వారికి కలగవచ్చు మహమ్మదీయ పటాలాలు, ఘూర్కా పటాలాలు, రాజపుత్ర పటాలాలు ఎన్నెని పటాలాలుండవచ్చు అవి తమలో తాము పోరాడవచ్చు, లేదా ఏదయిన ఒక జాతీయ పార్టీ వారితో చేరి సంస్థాన ప్రభువులను ప్రతిఘటింపవచ్చు దేశాన్ని జయించడానికి గానీ, కొల్ల గొట్టడానికి గానీ సరిహద్దు క్షాత్ర జాతులవారు భారత దేశానికి రావచ్చు

కాంగ్రెస్‌కు దౌర్జన్య రహిత బుద్ధి కొంచమయినా మిగిలి ఉంటే భారత దేశంలో శాంతి స్థాపన ప్రయత్నంలో అది నాశనమవుతుంది ఒక కేంద్ర ప్రభుత్వ నైతికాధికారానికి హృదయపూర్వకంగా లోబడి ఉండటమే తమకనేకవిధాల లాభకరమని పరస్పర కలహాలకు లోనయిన వారందరూ భావించడం కూడా అసంభవం కాదు ఇందువల్ల మత కలహాలు మొదలయినవి శాశ్వతంగా సమసి పోవచ్చు కూడా కాని ప్రస్తుత స్థితిగతులు ఆ ఆశకు తావివ్వడం లేదు అరాచకమే ఏర్పడితే ఆ అరాచక జ్వాలను చల్లార్చే ప్రయ త్నంలో నేను మరణించగలను కాని దేశంలో అరాచకమేర్పడడం మీకు ఇష్టమా? విదేశ పరిపాలన మీకిష్టమా? అని నన్నడిగితే అరాచకమే మంచిదని నేను నిస్సంశయంగా చెప్పగలను

విదేశ పరిపాలన కంటె కూడా నిజాం ప్రభువు అతని సామంతుల సహాయంతో గానీ, మహమ్మదీయ జాతుల సహాయంతో గానీ రాజ్యం చేయ డమే నాకు ఎక్కువ ఇష్టము ఇటువంటి పరిపాలన నూటికి నూరువంతులు అంటే సంపూర్ణంగా దేశీయ పరిపాలనమేనని నా అభిప్రాయము. ఇది

స్వరాజ్యానికి చాలా దూరమయినప్పటికి హోం రూల్ మాత్రం అవుతుంది వాదంకోసం నేనిట్లా వ్రాస్తూన్నప్పటికి సమయం వచ్చినప్పుడు ప్రజల కోసం ప్రజా పరిపాలన ఏర్పరచడానికి ప్రయత్నిస్తాను దీనికి కత్తిలేని దౌర్జన్య రాహిత్య మవసరము. కనక నా దౌర్జన్య రాహిత్యము ఏకుకంటె మృదువయినది ఉక్కు కంటె కఠినమయినది అని మీరు ముందు ముందు గ్రహించగలరు దాని కదియే ఉపమానము

## సంస్థానాల స్థానము

నా ప్రణాళికలో సంస్థానాధిపతుల స్థానం ఏమిటి అని మీరు ప్రశ్నించడం సహజము దౌర్జన్య రాహిత్యంలోని అర్థాన్ని మీరు పూర్తిగా గ్రహించి ఉంటె ఈ ప్రశ్న కవకాశమే లేదు ఆయుధ బలంపై ఆధారపడని కేంద్ర సంస్థ నైతికాధికారానికి లోబడే సంస్థానాధిపతులు, ప్రజల సేవకులుగా గౌరవ నీయమయిన స్థానం ఆక్రమించగలరు తమ విధులను ఐచ్ఛికంగా నెరవేర్చడం వల్ల కలిగిన హక్కులే వారి కుండగలవు ఈ విధంగా మహోన్నత వహించిన నిజాం ప్రభువు ప్రజలకు నచ్చిన సేవకుడుగా ఉండగలడు అప్పుడతని ప్రజలు తన సంస్థాన సరిహద్దులలో ఉన్నవారు మాత్రమే కాక భారత దేశ ప్రజలందరూ అతని ప్రజలుగానే ఉండవచ్చు ఇది నెరవేరని కోర్కె అని మీరనరాదు నేను కార్యానక్తుడను కాంగ్రెస్ వారు తమ విధానం అమలు పరిస్తే నేడు భ్రమగా కనపడేవి రేపు నిజంగా రూపొందగలవు."

హరిజన్ యం. కె. గాంధీ

# 27
# ఆంధ్రలో వ్యక్తి సత్యాగ్రహము (1941)

కాంగ్రెస్ ఆదేశానుసారం గాంధీజీ నాయకత్వంకింద ప్రారంభమయిన వ్యక్తి సత్యాగ్రహంలో ఆంధ్రదేశంలో అనేకమంది పాల్గొన్నారు గాంధీజీ అనుమతి పొందినవారే వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొనవలెనని నిర్ణయింపబడి నది ఆ ప్రకారం ఆయా జిల్లాలలో, వివిధ ఘట్టాలలో సత్యాగ్రహం చేసి అంచెలవారీగా ప్రముఖ నాయకులతోపాటు గ్రామామూలు ఎలంటీర్లుసైతం నిర్బంధింపబడి కారాగార శిక్షలకు, జరిమానాలకు గురైనారు

ఆంధ్రదేశ సత్యాగ్రహ మూడో జాబితాలో 1589 మంది సత్యాగ్రహులకు గాంధీజీ అనుమతి ఇచ్చినారు వారందరూ ఏఏ తేదీలలో ఎక్కడ సత్యాగ్రహం చేయవలసింది నిర్ణయించడం జరిగింది

ఆంధ్రదేశంలో సత్యాగ్రహోద్యమం కొనసాగుతున్న విధానం చాలా సంతృప్తికరంగా ఉందనీ, ఆంధ్రరాష్ట్రమే అన్ని రాష్ట్రాలలోకి అగ్రస్థానం వహిస్తున్నదనీ గాంధీజీ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావు గారికి తన సంతృప్తిని వెల్లడించినారు

**సర్ అక్బర్ హైదరీ**

హైదరాబాదు ప్రభుత్వ కార్యనిర్వాహక శాఖాధ్యక్షుడు సర్ అక్బర్ హైదరీ మరణానంతరం గాంధీజీ ఆయనను గురించి 'హరిజన్'లో ఇట్లా వ్రాసినారు

"కీ శే సర్ అక్బర్ హైదరీలో చాలా సుగుణాలున్నాయి అట్లా ఉండటం చాలా దుర్లభము ఆయన చాలా గొప్పపండితుడు, తత్వశాస్త్రవేత్త, సంస్కరణవాది, భక్తిపరుడయిన మహమ్మదీయుడు కాని ఆయనకు హిందూ మతంలో మహమ్మదీయ మతానికి విరుద్ధమేమీ కనపడదు ఆయన వివిధ మతాలలోని విషయాలను గ్రహించ నిచ్ఛగలిగిన పరిశీలకుడు అన్ని మతాల వారిలోను ఆయనకు స్నేహితులు ఉన్నారు. రెండో రౌండ్‌టేబుల్ మహాసభనుంచి తిరిగి వచ్చేటప్పుడు మేమిద్దరం కలసి ఒకే నావలో ప్రయాణం చేయడం జరిగింది నేను అందులో ప్రతిరోజు సాయంకాలం చేసే ప్రార్థనలో ఆయన తప్పకుండా హాజరవుతుండేవారు. గీతా శ్లోకాలలోను, మేము చేసే భజన కీర్తనలలోను ఆయనకు చాలా ఆసక్తి కలిగింది వాటి నన్నిటినీ మహాదేవదేశాయ్‌చేత ఆయన అనువాదం చేయించుకొన్నాడు భారతదేశంలోని మత సమైక్యంకోసం మే

మిద్దరము కలసి దేశమంతటా పర్యటన చేసేటందుకు ఆయన నాచేత వాగ్దానం చేయించుకొన్నాడు కాని దేవుడు అన్యథా తలంచినాడు పైగా కీ శే లార్డ్ వెల్లింగ్‌డన్ వాకు మరొక కార్యక్రమం ఏర్పాటు చేసి పెట్టినాడు నేను శాసనోల్లంఘన సంగ్రామంలో నిమగ్నుణ్ణి కావలసి వచ్చింది సర్ అక్బర్ నేనూ మా కార్యక్రమం ఎన్నడూ నిర్వర్తించలేకపోయినాము ఆయన, శ్రీ అరవింద్ ఘోష్ ప్రతిభా, ప్రభావాలకు లోనైనాడు పుదుచ్చేరి మహర్షి ప్రతి మూడు నెలలకు తన భక్తులకు దర్శన మిస్తూండేవారు ఆ రోజున సర్ అక్బర్ హైదరీ అక్కడకు తప్పకుండా హాజరయ్యేవాడు సర్ అక్బర్ మరణం దేశానికి చాలా నష్టము ఆయన మరణంవల్ల దుఃఖిస్తున్న కుటుంబానికి నా ఓదార్పులు

హరిజన్
14-1-1942

## హైదరాబాదు సంస్థానము

ప్రభుత్వ నిషేధం కింద ఉన్న హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కు చెందిన స్వామిరామానంద తీర్థ వివేకశీలమయిన ఈ దిగువ ప్రకటన చేసినారు

"1940 మార్చి 2 వ తేదిన నిషేధింపబడిన హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కు చెందిన కార్యకర్తలు కొందరు 1940 సెప్టెంబర్ 2 వ తేదిన గాంధీజీ నాయకత్వం కింద వ్యక్తిగత సత్యాగ్రహం చేసినారు నిజాం ప్రభుత్వంవారు అరెస్టయిన ఆ సత్యాగ్రహుల నందరినీ 1941 డిసెంబరు 16 వ తేదిన బేషరతుగా విడుదలచేసినారు

ప్రభుత్వంవారు మమ్ములనందరనీ విడుదల చేసినప్పటికి స్టేట్ కాంగ్రెస్ పై ఉన్న నిషేధం మాత్రం తొలగించలేదని మేము విడుదలయిన తక్షణం నేనొక ప్రకటన చేసినాను కాబట్టి ప్రభుత్వంవారు నిషేధం తొలగించేటంత వరకు సత్యాగ్రహం కొనసాగించటం మా కర్తవ్యంగా భావించి, మహాత్మాజీకి హైదరాబాదు స్టేట్‌లోని ప్రస్తుత పరిస్థితులను వివరిస్తూ మా దృక్పథంకూడా తెలియ పరిచినాము మహా సంగ్రామక్లిష్ట పరిస్థితులను గుర్తించి ఆయన ప్రస్తుతం తిరిగి సత్యాగ్రహం చేయవద్దని సలహా ఇస్తూ మా యావచ్ఛక్తిని నిర్మాణ కార్యక్రమంలో వినియోగించవలెనని నిర్దేశించినారు కనక మేము గాంధీజీ సలహాను 'తు' 'చ' తప్పకుండా అనుసరించదలచుకొన్నాము మేమంతకంతకు నిర్మాణ కార్యక్రమంలోని ప్రాముఖ్యం, దానిలోని శక్తి సామర్థ్యాలను ఎక్కువగా గ్రహించగలుగుతున్నాము ప్రజలు కార్యకర్తలుకూడా వారి సర్వ శక్తులను నిర్మాణ కార్యక్రమంలో వినియోగించవలసిందిగా ప్రార్థిస్తున్నాము. సందిగ్ధ సమయంలో మహా ఘనత వహించిన నిజాం ప్రభుత్వంవారికి సైతం మనమే విధమయిన చీకాకును కల్పించకూడదు అయినప్పటికి ఈ సత్యాగ్రహ తాత్కాలిక విరమణవల్ల అసఫ్‌జాహీ వంశంవారి ఘనత వహించిన నిజాం ప్రభువుగారి ఛత్రం కింద బాధ్యతాయుత ప్రభుత్వం

పొందటం అనే ఆశయంలో మాత్రం మార్పు వచ్చినట్లు భావించకూడదు "

స్వామీ రామానందతీర్థ చేసిన ఈ ప్రకటనను బలపరుస్తూ గాంధీజీ ఇట్లా వ్రాసినారు "ప్రభుత్వంవారు నిషేధం తొలగించగలరని నేను ఆశిస్తున్నాను వారు ఘనత వహించిన నిజాం ప్రభుత్వం వారి ఛత్రచ్ఛాయన బాధ్యతాయుత ప్రభుత్వానికి అనుకూలంగా శాసన బద్ధమయిన ఉద్యమాన్ని కొనసాగించ టానికి అభ్యంతరం తలపెట్టకూడదు స్టేట్ కాంగ్రెస్‌పై ఉన్న నిషేధం తొల గించకుంటే ఇటీవల సత్యాగ్రహులను విడుదల చేసిన ప్రయోజనం సైతం భగ్నంకాక తప్పదు "

సేవాగ్రామ్, యం కె గాంధీ
8-2-1942

## ఆంధ్రులు (ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము)
(యం కె గాంధీ)

విజయనగరం మహారాజ్‌కుమార్ విజయానంద నాకీ దిగువ ఉత్తరం పంపినారు

"మీరు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి దాని సుస్థిరత్వానికి వ్యతి రేకులనీ, మేమంటే (ఆంధ్రులు) మీకిష్టం లేదనీ ఆంధ్రులలో గట్టి అభిప్రాయ మున్నది ఆంధ్రదేశంలోని అత్యధిక సంఖ్యాకులు కాంగ్రెస్ వాదులయినప్పటికీ మీ ఆశీర్వాదాలను అది ఎన్నడూ పొందలేకపోయినది ప్రత్యేక రాష్ట్రానికి కోట్లాది ఆంధ్రుల హృదయాలు పరితపిస్తూఉన్నాయి తిలక్ మహారాజు ఒకానొకప్పుడు చెప్పినట్లు ఆంధ్రులకు ఆ పాపం కట్టుకొనే హక్కును మీరెందుకు అంగీకరించ కూడదు మా రాష్ట్రీయులు మీకు ఆంధ్రుల పట్ల బాగా అయిష్టమున్నదని అభిప్రాయ పడుతున్నారు మీరు ఇటీవల వారణాసికి రావడం కూడా ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఆందోళన నుంచి నన్ను విరమింప జేయటానికని కూడా వారారో పిస్తున్నారు ఆంధ్రులను గురించి తమిళనాడుకు మీ రేమయినా సలహాఇచ్చినారా అనీ, కడచిన మంత్రివర్గాల కాలంలో ఆంధ్రరాష్ట్ర సమస్యను గురించి మీ సలహాను వారు కోరి ఉన్నారా అనీ, కోరి ఉన్నట్లయితే మీరేమి సలహాఇచ్చినా రని మీ నుంచి తెలుసుకోవలెనని ఆంధ్రులు కుతూహలంగా ఉన్నారు ప్రత్యేక రాష్ట్రాలుగా ఉండేటందుకు తగిన ఆదాయాలు లేని కర్ణాటక, కేరళ రాష్ట్రాలతో పాటు ఆంధ్రదేశ సమస్యను కూడా మీరు చేర్చినారా? ఆంధ్రదేశం స్వయం పోషకంగా ఉండగలదనే విషయం గురించి మీ అభిప్రాయమేమిటో దయచేసి చెప్పండి కాంగ్రెస్ ఉద్యమానికి నిరంతరం కట్టుబడి ఉండటం చేతనే గదా, ఒరిస్సాకు వచ్చిన ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తి ఆంధ్రదేశానికి లభించకపోవడం, సైమన్ కమిషన్ భారత దేశానికి వచ్చినప్పుడు ఆంధ్రులు మరొక తోవ తొక్కి ఉన్నట్లయితే వారి కోరిక ఫలించి ఉండేదని ఆంధ్రులు భావిస్తున్నారు "

ఇందుకు జవాబుగా గాంధీజీ ఇట్లా వ్రాసినారు

"మహారాజ కుమార్ అయోగ్యుల చేతులలో చిక్కుకొన్నాడని మాత్రం నేను చెప్పగలను ప్రజాసామాన్యంతో ఈయనకు సంబంధం చాలా తక్కువగా ఉండడం చేత తనకి సమాచారం తెలిపినవారి అర్హతలను తెలుసుకొనేటందుకు ఈయన ప్రయత్నమయినా చేయలేదని స్పష్టమవుతున్నది ఆయన నాకు పంప నిశ్చయించుకొన్న ఈ సమాచారం ఆయనకు అందజేసిన ఆంధ్రులెవరో తెలుసుకోవలెనని నా కోరిక నేను ఆంధ్రులకు క్రొత్తకాదు దేశభక్త కొండ వెంకటప్పయ్య, శ్రీ ప్రకాశం, డాక్టర్ పట్టాభిసీతారామయ్య, శ్రీ కాశేశ్వరరావు, శ్రీ సీతా రామశాస్త్రిగార్లను సందర్శించి శ్రీ మహారాజకుమార్ విషయాలను తెలుసుకోవడం మంచిది కాంగ్రెస్ కార్య నిర్వహణకోసం భాషల ప్రాతిపదికపైన రాష్ట్రాల పునర్విభజన కాంగ్రెస్ మహాసభ చేత గుర్తించేటట్లు చేయడానికి నేను ప్రధానకారకుడననే విషయం వారు సర్ మహారాజ కుమార్ కు తెలుపగలరు భాషా రాష్ట్ర విభజన ఇండియా ప్రభుత్వంవారు అంగీకరించవలెనని నేనెప్పుడూ ఆందోళన చేస్తూనే ఉన్నాను ఆంధ్రుల కోరికను నిరోధించ వలదని అవసరమయినప్పుడు తమిళనాడుకు సలహా ఇచ్చి ఉన్నాను కూడా శ్రీ రాజగోపాలాచారి నాయకత్వం కింద ఉన్న కాంగ్రెస్ మంత్రివర్గం ఆంధ్ర దేశం ప్రత్యేక రాష్ట్రంగా గుర్తింపబడడానికి శక్తి కొద్దీ ప్రయత్నం చేసిందని నాకు తెలుసు కాని ఆంధ్ర దేశం ఇంత వరకు అట్లా గుర్తింపబడక పోయినందుకు మంత్రివర్గంవారి తప్పిదమెంత మాత్రమూ కాదు కాంగ్రెస్ మహాసభ ప్రత్యేక రాష్ట్రంగా గుర్తించిన ఏ రాష్ట్రంగానీ, కర్ణాటక, కేరళ, రాష్ట్రాలతో సహా ప్రత్యేక విచక్షణ జ్ఞానంతో నేను గుర్తించని మాట వాస్తవము ప్రత్యేక రాష్ట్రంగా గుర్తించబడిన తరవాత ఏది స్వయం పోషకంగా ఉంటుందో నేను చెప్పజాలను అందుకు తగిన సాధన సామగ్రి నా దగ్గర లేదు నేను వారణాసి వచ్చిన పని అందరికీ బాగా తెలిసిన విషయమే కనక దానిని గురించి నేను ప్రత్యేకం చెప్ప తగిందేమీ లేదు మహారాజ కుమార్ క్రీడారంగంలో ప్రవీణుడు అందువల్ల ఇతరులు తనను గురించి నిష్కారణంగా చేసే ఆరోపణలకు ఆయన బాధపడనవసరం లేదు మహాత్ముని వంటివారు చెప్పినప్పటికీ తాము నిర్వహించ దలచుకొన్న పనిని విరమించడం నాయక లక్షణం కాదు నాకీ ప్రశ్నలను పంపడంలో ఆయనను మోసగించినవారు సంతృప్తి పడక పోయినప్పటికీ మహారాజ కుమార్ మాత్రం నా ఈ జవాబుతో సంతృప్తిపడగలరని భావిస్తున్నాను"

సేవాగ్రామ్
20-9-42

ఈ ప్రత్యుత్తరానికి తరవాత ప్రత్యేకాంధ్ర రాష్ట్రం గురించి పంపిన

దిగువ ప్రశ్నకు గాంధీజీ సైతం ఇట్లా జవాబిచ్చినారు

ప్రశ్న - ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం గురించి సర్ విజయా ఉత్తరంలోని ఒక భాగం మీరవహేళన చేయడంవల్ల ఆంధ్ర దేశంలో ఆయన పలుకుబడి కొంత వరకు తగ్గించినట్లయినది అది మీ ఉద్దేశం కాకపోవచ్చు ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణం పాకిస్తాన్ నిర్మాణంతో సమానంగా మీరు భావిస్తున్నట్లు ఆంధ్రులు భయపడుతున్నారు ఇది నిజమేనా?

జవాబు - సర్ విజయా ఉత్తరాన్ని నేను అవహేళన చేసినానన్న మాట నిజమే ఆయన మీద నాకా స్వాతంత్ర్యం ఉంది కాని ఆయనను ఏ విధంగానూ అపకీర్తి పాలు చేయ వలెననే భావం నాకు ఉందనడం కంటె సత్యదూరమయిన విషయం మరొకటుండదు నా ఆరోపణ ఆయనకు సమాచారం అందజేసిన వారిపైన మాత్రమే ఆయన ఉత్తరంలో ఆయనకు సమాచారం అందజేసిన వారి భావాలను ప్రతిబింబింప జేసినారు మన వార్తాహారుల వల్ల మనలో ప్రతి ఒక్కరూ చెడ తోవలను బట్టే అవకాశం ఉంది ప్రజోద్యమాలలో పాల్గొంటూవున్న చాలా కొద్ది మంది జమీందారులలో ఆయన ఒకరు నేనాయనకు వ్రాసిన ఉత్తరానికి అపార్థం కల్పించి ఆయన సహాకారం పొందజాలకుంటే అది ఆంధ్రుల దురదృష్టమనుకోవలె

ఇక రెండో ప్రశ్నను గురించి ప్రత్యేకాంధ్ర రాష్ట్రానికి పాకిస్తానుకు ఎక్కడా ఏమీ పోలిక లేదు ప్రత్యేకాంధ్రరాష్ట్రం భాషా ప్రాతిపదికపైన రాష్ట్రాల పునర్విభజన గురించినది ఆంధ్రులు భారతదేశంతో ఏమీ సంబంధంలేని ప్రత్యేక జాతిగా ఎన్నడూ భావించడంలేదు పాకిస్థాన్, ఇండియానుంచి విడిపోయి ప్రత్యేకం సంపూర్ణ స్వతంత్ర దేశంగా రూపొందవలెనని కోరుతున్నది. కాబట్టి ఈ రెంటి మధ్య ఏమీ పోలిక లేదు

సేవాగ్రామ్ యం కె గాంధీ
5-7-42

# 28
# కస్తూరిబా మరణము - సరోజినీదేవి లేఖ

1942 లో భారతదేశంలో విస్మరింపరాని సంఘటనలనేకం జరిగినాయి అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు ఆగస్ట్ 8 వ తేదీని క్విట్టిండియా తీర్మానం అంగీకరించిన తరవాత వెంటనే గాంధీజీని, వర్కింగ్ కమిటీ సభ్యులందరిని ప్రభుత్వంవారు నిర్బంధించినారు గాంధీజీని ఆగాఖాన్ మందిరంలోను, వర్కింగ్ కమిటీ సభ్యులను అహమద్‌నగర్ కోటలోను ఉంచినారు తరవాత వారం రోజులకు గాంధీజీ అంతరంగిక కార్యదర్శి మహాదేవదేశాయి జైలులో మరణించినారు మహాత్మాగాంధీ, కస్తూరిబా గాంధీలు జైలులో ఉండగానే కస్తూరిబా 1944 ఫిబ్రవరి 22 వ తేదీన స్వర్గస్థురాలయినది ఆమె అవసాన కాలంలో ఉండగా శ్రీమతి సరోజినీదేవి శ్రీ దేవదాస్ గాంధీజీకి హృదయ విచారకరమయిన దిగువ ఉత్తరం వ్రాసింది

"ఈ సమయంలో ఎవరేమి చెప్పగలరు ?

తన జీవితానుభవాలన్నిటిలోకి హృదయ విచారకరమయిన దృశ్యం చూసి ఓర్చుకొంటూ ఏకాంత మందున్న ఆ వామనమూర్తిని గురించియే భారత జాతి అంతా ఆలోచిస్తూ ప్రార్థిస్తూ ఉంటుంది "బా" అంటే నాకెంత ఆపేక్షో నీకు తెలుసు శౌర్యవంతము బాధపడుతూన్న ఆమె ఆత్మ, మృత్యు వేదన బారినుంచి త్వరలో విముక్తి చెంది భారత వీరనారీమణుల అనంత పథ లో కెగిసి సముచిత స్థానం ఆక్రమించగలదని ప్రార్థిస్తున్నాను ఈ జన్మలోనూ, జన్మజన్మాంతరాలలోను నేనామెను ప్రేమిస్తూనే ఉంటాను "

# 29
# గాంధీజీ విడుదల

1944 ఫిబ్రవరి 10వ తేది నుంచి తాను ఉపవాసం చేయదలచుకొన్నట్లుగా గాంధీజీ తన నిర్బంధ నివాసమయిన అగాఖాన్ ప్యాలెస్ నుంచి రాజప్రతినిధికి లేఖ వ్రాసినాడు ఇది అమరణాంతుపవాసం కాదనీ, తానీ అగ్నిపరీక్ష నుంచి బయటపడటానికే కోరుకొంటున్నానని కూడా ఆ లేఖలో స్పష్టంచేసినారు.

గాంధీజీ ఇటువంటి నిశ్చయానికి వచ్చినందుకు ప్రభుత్వంవారు తమ విచారం వెలిబుచ్చినారు రాజకీయ సమస్యల పరిష్కారం కోసం ప్రాయోపవేశమనే ఆయుధం ఉపయోగించడం ఉచితం కాదనీ, ఆ విషయం గాంధీజీయే ఒకప్పుడు ఒప్పుకొని ఉన్నారని, ఒకవేళ గాంధీజీ ఉపవాసం ప్రారంభించినప్పటికీ ఆయన, కాంగ్రెస్ పార్టీలోని ఆయన సహచరులు ప్రారంభించిన ఉద్యమ ఫలితంగా ప్రభుత్వంవారు అవలంబించవలసి వచ్చిన విధానం వారు మార్చుకోవడం లేదని ఇండియా ప్రభుత్వం నుంచి ఒక స్పష్టమయిన ప్రకటన వెలువడింది

"అయితే ప్రభుత్వంవారు గాంధీజీని ఉపవాసం చేయకుండా ఆపలేరు కాని ఆయన ఉపవాసం చేయ నిశ్చయించుకొన్నట్లయితే స్వతంత్ర వ్యక్తిగా చేయవచ్చు. అందువల్ల ఆయన ఉపవాసం ద్వారా కలిగే ఫలితాలకు బాధ్యత పూర్తిగా ఆయనపైనే ఉంటుంది అనీ ఆయన ఉపవాసం చేసేటంతకాలం ఆయనను విడుదల చేయగలమనీ ఆయనతోపాటు ఆయనతో ఉండే వారిని కూడా విడుదల చేయగలమని ప్రభుత్వంవారు గాంధీజీకి తెలియపరిచినారు

అందుకు ప్రత్యుత్తరంగా, తనను విడుదలచేస్తే ఉపవాసం చేసే ఉద్దేశాన్ని విరమించుకొంటాననీ, అట్లా కాకుంటే డిటెన్షన్‌లోనే ఉపవాసం చేస్తానని గాంధీజీ అన్నారు

తరవాత గాంధీజీ ఉపవాసం ప్రారంభించినారు ఆయన ఆరోగ్య స్థితి అంతకంతకు క్షీణిస్తున్నట్లు వైద్యులు ప్రకటించడం చేత ఇండియా ప్రభుత్వం వారు ఆయనను విడుదల చేస్తూ ఇట్లా ప్రకటించినారు

గాంధీజీ ఆరోగ్యం గురించిన వైద్యనివేదిక దృష్ట్యా ఆయనను 1944 మే 6 వ తేదీన ఉదయం 8 గంటలకు ఇండియా ప్రభుత్వంవారు డిటెన్షన్ నుంచి విడుదల చేసినారు.

ఆయనతోపాటు డాక్టర్ సుశీలానయ్యర్‌ను, డాక్టర్ గిల్డర్‌ను, ప్యారే

లాల్ ను, కుమారి మీరాబేన్‌ను ప్రభుత్వంవారు విడుదల చేసినారు వారందరూ పూనాలోని "పర్ణకుటి" (లేడీ థాకర్ సే బంగాళా)కి చేరుకొన్నారు

తరవాత కొంతకాలానికి గాంధీజీకి, ఇండియా ప్రభుత్వంవారికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాల ఫలితంగా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులందరూ 16 జూన్ 1945 న బేషరతుగా అహమద్‌నగరు కోటనుంచి విడుదల అయినారు

# * ఆంధ్రా సర్క్యులర్

1942 "క్విట్ ఇండియా" ఉద్యమ సందర్భంలో నిర్వహించవలసిన కార్యక్రమాన్ని వివరిస్తూ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం వారొక సర్క్యులర్ జారీ చేసినారు అది ఆంధ్రా సర్క్యులర్ అనే పేర ప్రసిద్ధి కెక్కింది అందులోని కార్యక్రమం పూర్తిగా హింసాపూరితమైనదని, విధ్వంసక చర్యలను ప్రోత్సహిస్తున్నదని ప్రభుత్వంవారి ఆరోపణ

1942-44 సంవత్సరాలలో గాంధీజీకి ప్రభుత్వంవారికి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ ఆంధ్రా సర్క్యులర్‌ను గురించి గాంధీజీ ఇట్లా వ్రాసినారు

"ఇక ఆంధ్రా సర్క్యులర్‌ను గురించి నా అరెస్టుకు పూర్వం దానిని గురించి నాకేమీ తెలియదు కనక దాని జోలికి పోకూడదని నా అభిప్రాయము అయినా కొంత నిగ్రహంతో మాత్రమే దానిని గురించి సమీక్షించగలను ఈ జాగ్రత్తకు లోబడి మొత్తంమీద ఆ సర్క్యులర్ నిరపాయకరమైనదనే నేను భావిస్తున్నాను దానిలోని ప్రధాన సూత్రమిది

"ఈ ఉద్యమం యావత్తూ అహింసమీద ఆధారపడి ఉంది ఈ ఆదేశాలకు భిన్నంగా ఏ చర్యా జరపకూడదు (ఉల్లంఘనకు సంబంధించిన అన్ని చర్యలూ బహిరంగంగా ఉండవలె కాని దాపరికంగా ఉండరాదు)

ఈ ఖండలీకరణంలో ఉన్న వాక్యాలు మూలంలోనే ఉన్నవి ఆసర్క్యులర్‌లోనే ఈ దిగువ మందలింపు కూడా ఉన్నది

"నూటికి 99 పాళ్లు గాంధీజీ - త్వరలోనే - బహుశా బొంబాయిలో మున్ముందు జరుగనున్న అఖిలభారత కాంగ్రెస్ సమావేశానంతరం కొన్ని గంటలలోనే ఈ ఉద్యమాన్ని ప్రారంభించవచ్చు జిల్లా కాంగ్రెస్ కమిటీలు తగు జాగ్రత్తలో ఉండి తక్షణం చర్య తీసుకోవలె

దయచేసి మరొక సంగతి కూడా మరిచిపోకండి! మహాత్మాజీ నిర్ణయించే వరకూ ఏ ఉద్యమమూ ప్రారంభించకూడదు-ఏ ప్రత్యక్ష చర్యకూ

---

*అహమ్మదాబాదులో నవజీవన్ పబ్లిషింగ్ హౌస్‌వారు ప్రకటించిన "Gandhiji's Correspondence with the Government 1942-44" అనే గ్రంథంలోని 178 పుటనుంచి గ్రహింపబడింది.

దిగకూడదు ఇంతా అయితే ఆయన వేరే విధంగా నిర్ణయించ వచ్చును అప్పుడు మీరు అనవసర ప్రమాదకర చర్యకు బాధ్యులు కాగలరు. సంసిద్ధంగా ఉండండి! తక్షణం తగిన ఏర్పాట్లు చేయండి! జాగ్రత్తగా మెలగండి! కాని ఎంత మాత్రమూ చర్యకు దిగకండి!"

సర్క్యులర్ లో ఉన్న కొన్ని విషయాలకు నేను బాధ్యత వహించజాలను ఆ సర్క్యులర్ నిజమైనదేనని భావించినప్పటికీ, కమిటీవారు దాని గురించి ఏమి చెబుతారో తెలియనప్పుడూ-ముఖ్యంగా నేను సరిగ్గిద్దలేని విషయాలను గురించి నేను తీర్పు చెప్పకూడదు రైలు పట్టాల తొలగింపుపైన నిషేధం "తొలగిస్తూ" వ్రాయబడిన దన్న "మార్పును" గురించిన అభియోగానికి మూలం నాకు కనబడడంలేదు"

## గాంధీ జన్మదినోత్సవాలు (1944)

1944 నాటి గాంధీ జన్మదినోత్సవ కార్యకలాపాలకు ఒక ప్రత్యేక విశిష్టత ఏర్పడింది గాంధీజీతోపాటు భారతమాత పాదకమలాలలో తన సర్వస్వం సమర్పించి కారాగార శిక్షలకు, ఇంకా అనేక బాధలకు లోనయిన శ్రీమతి కస్తూరిబాగాంధీ జైలులో స్వర్గస్థురాయినందువల్ల భారత ప్రజానీకము-భారత నారీమణుల సంక్షేమ కార్యకలాపాల కోసం కస్తూరిబాగాంధీ స్మారకనిధి అనే పేరుతో 75 లక్షల రూపాయలను సేకరించి గాంధీజీ 75వ జన్మదినోత్సవం నాడు ఆయనకు సమర్పించ దలచుకొన్నది కస్తూరిబా మరణించినందువల్ల విషాద భరితమయి ఉన్న భారత ప్రజా హృదయాలకు గాంధీజీ నిర్బంధం నుంచి బేషరతుగా విడుదలయి నందుకు కొంత ఓదార్పు కలిగింది.

ఈ పరిస్థితులలో గాంధీజీ 75వ జన్మదినోత్సవ సందర్భంలో ప్రపంచంలోని విశ్వవిఖ్యాత పురుషులనేకమంది గాంధీజీని అభినందిస్తూ సందేశాలు పంపినారు భారత దేశంలో పలుచోట్ల గాంధీ జయంత్యుత్సవాలలో కస్తూరిబా నిధికి ధనము సేకరించడం జరిగింది ఆంధ్రప్రముఖులనేకమంది గాంధీజీని గురించి పత్రికలలో ఉత్తేజకరాలయిన వ్యాసాలు వ్రాసినారు వాటిలో కొన్నిటిని దిగువ ఉదాహరించడం సందర్భోచితంగా ఉంటుందని భావిస్తున్నాము

## గాంధీ ప్రార్థనా ప్రభావము

(శ్రీ కోటంరాజు రామారావు)

"ఈ ప్రపంచంలో ఇంత అసత్యం ఎందుకు ఉండవలె? నేనింతకు ముందు చెప్పినట్లుగా అవాఙ్మానస గోచరమయిన ఈ వేదాంత విషమవాద తర్కాలతో దారి తెలియకుండా కొట్టుకొని పోవడం నాకు నచ్చదు కాని భక్తి మార్గంవల్ల ఒక విధమయిన పాప భీతియు, నీతిమార్గ నిరతియు ఏర్పడగలదు. ఈ విషయం మాత్రం మనం మరవడానికి వీలులేదు" అన్నారు గాంధీజీ ఒకప్పుడు గాంధీజీ విషయంలో భగవత్ప్రార్థన

అంటే భగవంతుని సేవచేయటం అంటే జీవిత ధర్మాలను నిర్వర్తించడం గాంధీజీ శుద్ధ వైష్ణవుడు, జాజ్వల్యమానమయిన చక్రం ధరించినవాడు ఆ చక్రాయుధమే సత్యాగ్రహం అది పట్టి సాత్విక నిరోధం కంటె ఎక్కువ ప్రభావం కలది ఆయన చేపట్టిన సత్యాగ్రహమే మన రాజకీయ వ్యవహార లక్ష్య లక్షణాలన్నిటినీ తారుమారుచేసి కొత్త పంథాలోకి తీసుకొని వచ్చి అభ్యుదయగమన వేగం హెచ్చించినది కాబట్టి అవి గాంధీజీ ఆరాధించే భగవత్స్వరూపమయి ఉన్నది కాని క్రైస్తవ మందిరాలలో దీపప్పులు, అర్చి దీపప్పులు ఆరాధించే భగవత్తత్వంకంటె గాంధీజీ భగవత్తత్వం ఎక్కువ తీవ్ర ప్రభావం కలది కూల్‌రిడ్జ్ మహాకవి వలెనే గాంధీజీకి కూడా ఒక్కటే స్థిర విశ్వాసమున్నది పక్షిని, పశువును, సాటి మానవుని ఎక్కువ ప్రేమతో ఎవడు చూస్తాడో వాడే నిజమయిన దైవభక్తుడు ఎవ్వడు జీవజాలాలను ప్రేమించి వాటి శ్రేయస్సుకు నిరంతర సేవ చేస్తాడో వాడే పరమోత్తముడయిన ఈశ్వరోపా సకుడు చైతన్య మతాన్ని, వివేకానందతత్వాన్ని గాంధీజీ మరొక మెట్టు పైకి తీసుకొని వచ్చినారు ఆయన గీతోపాసకుడయిన కర్మవీరుడు వర్తమాన ప్రపంచంలో నిర్వర్తించ వలసిన తన జీవిత విధులను నిర్వర్తిస్తూ ఉత్కృష్ట లక్ష్యాలయిన జీవిత పరమార్థాలను సాధించడం కోసం కర్మయోగ సాధనచేస్తూ ఉంటారు నేడు మన జాతీయ దాస్య విముక్తికై మన రాజకీయ రంగంలోకి ఆయన అవతరించగానే, ఆయనతోపాటు ఆయన ఉపాసన చేసే భగవత్తత్వం కూడా వచ్చింది అయన నీతి నియమ సూత్రాలన్నీ మూర్తీభవించినాయి ఆయన విద్యుద్వేగ రాజకీయ సాధన విధానాలన్నీ దిగుమతి అయినాయి

**విశ్వమానవ సమత్వభావము**

ఉత్తమ ప్రజానాయకుడయిన గాంధీజీ తన ప్రార్థనా విధానంలో కూడా స్వీయ స్వతంత్ర ఫణితి కొంత అవలంబించినారు సాముదాయకంగా ఆరాధన చేయడం హిందువులకు తెలియని విషయంకాదు కాని సాముదాయకంగా ప్రార్థనలు చేయడంలో మహమ్మదీయుల ఆరాధన విధానాలే ఎక్కువ నిరా డంబరంగా, నిర్మలంగా హృదయ పావనకరంగా ఉంటాయి హిందూ ఆరాధన పద్ధతి బ్రహ్మాండమయిన గర్భగుడులలో విగ్రహాలు, పూజాలంకారాలు, నైవేద్యాలతో కూడి ఉంటుంది మహమ్మదీయుల పర్వదినాలలో దైవ భక్తు లందరూ ప్రార్థనకై సమావేశమయినప్పుడు ఇస్లామ్ మతంలోని సర్వమానవ సౌభ్రాత్ర సమత్వాలను, సంప్రదాయానుసారంగా కొంతవరకు అనుసరిస్తూ ఉన్నట్లు ఉంటుంది అదిగాక ఆ ప్రార్థన కాలంలో వారు పఠించే వాక్యాలు కూడా విశ్వమానవ సమత్వభావాన్నే మరింత స్ఫురింపజేస్తూ ఉంటాయి.

**అన్ని మతాలకు సమాన గౌరవ ప్రతిపత్తి**

బౌద్ధమతానుసారమయిన ప్రార్థనతో గాంధీజీ ప్రార్థన సమావేశం

ప్రారంభమవుతుంది అది చాల తేట మాటలతో సులభంగా, క్లుప్తంగా ఉంటుంది అందులో గ్రాప్యమయిన స్వరాలు కొన్ని వినబడుతూంటాయి కాని ఎక్కువ ఎదరచన ఏమీ కనిపించదు బౌద్ధ ప్రార్థనలతో ప్రారంభించడం ఉచితంగానే ఉన్నది ఎందువల్లనంటే గాంధీజీ అహింసా తత్వోపదేశకుడయిన బుద్ధభగవానునితో నే పోల్చదగి ఉన్నాడు ఆ బౌద్ధప్రార్థన ఈగానే రెండు నిమిషాలకాలం నిశ్చలంగా ఉంటుంది ఆ సమయంలో గాంధిమహాత్ముడు యోగసమాధి నిమగ్నుడై ఉండటం చూడతగిన దృశ్యము తరవాత సంస్కృతంలో ఒక ప్రార్థన గీతం వినగలము అది వేద ప్రోక్తమయినదే కావచ్చు విశాల విశ్వవ్యాపిగమయిన భావాలు దానిలో కనిపిస్తాయి తరవాత భగవద్గీతలోని శ్లోక మేదయినా చదవవచ్చు ఆ శ్లోకంలో శాశ్వతమయి నిర్వికారమయిన పరతత్వ స్వరూపం ప్రస్తుతింప బడుతుంది ఆ తరవాత అరబ్బీభాష అరబ్బీభాషలో హృదయాన్ని స్పందింప జేసే ప్రార్థనా గీతం తయాబ్జీసతి పాడుతుంది ఆ గేయం విన్నప్పుడు భగవంతునికి ఆత్మార్పణచేసి శరణాగతులము కావలెనని మనలను ఆహ్వానించినట్లుగా ఓంటుంది "రఘుపతిరాఘవ రాజారాం" అనే సంకీర్తన స్వచ్ఛమయిన రామనామ స్మరణ ఈ విధంగా ఆ ప్రార్థనా కార్యకలాపాలవల్ల అనేక విధాలయిన అంతరాత్మలు సమ్మేళన మవుతున్నవి అన్నిమతాలకు సమాన గౌరవ ప్రతిపత్తి ఏర్పడుతుంది

## వేదాంతము - రాజ్యాంగము

కడర గాంధీజీ ప్రార్థన సమావేశాలలో అనేక మతాల పౌరులు, అనేక రకాలవారు పాల్గొంటూ ఉండడంలో వింత విశేషాలేమీ లేవు ఈ సమావేశాలలో స్త్రీలు, పిల్లలు ఎక్కువగా ఉంటారు మన హిందూ పంచాంగం ప్రకారం గాంధీజీ జన్మదినం గత సెప్టెంబర్ 14న అయింది ఆ వాడు మహాత్ముని ప్రార్థనా సమావేశానికి విపరీతంగా జనం వచ్చినారు ఆ నాటి ప్రార్థనా క్రమం కూడా ఎంతో హృదయోత్తేజకరంగా ఉన్నది ఆ నాడు గాంధీజీకి సమర్పించిన కానుకలుకూడా చాలాఎక్కువగానే ఉన్నాయి గాంధీజీ విషయంలో ప్రజలు ప్రస్తుతం ఎక్కువ శ్రద్ధానక్తులు చూపించడంలో కొంత అంతరార్థమున్నది అందులో సందేహంలేదు మత విషయాలలోను, రాజకీయ విషయాలలో కూడా ఆయన మన జాతీయ నాయకుడే మన భారత జాతీయ వ్యవహార రంగంలో ప్రస్తుతం క్లిష్టమయిన విషమస్థితిపర్పడింది ఈ విషమావస్థలో ఆయన నాయకత్వంలో ప్రతిదినమూ ప్రజా విశ్వాసము ప్రత్యక్షంగా ప్రకటిత మవుతున్నది చాలా కాలము నుంచి నిలిచిపోయిన రాజకీయ సభా సమావేశాలకు మారుగా ప్రార్థనా సమావేశాలు ఇప్పుడు జరుగుతూన్నాయి "వేదాంతచర్చ, రాజ్యాంగ చర్చలే మానవకోటి శ్రద్ధ వహించే విషయాలని" [illegible] కాలం క్రితం జార్జి ఇలియట్ అన్నాడు ఈ రెంటిలోను గాంధీజీ సమానంగా, సమృద్ధిగా కార్యకలాపాలను నడిపిస్తున్నారు. కాని రెంటినీ వేరు వేరుగా నడిపిసు

న్నారు. సర్వాన్ని మించిన హార్దిక భక్తి శ్రద్ధలు పెంచుకున్న తెలుసుకోవచ్చు
జిన్నా [illegible] సాంప్రదాయిక వ్యవహార అంటుడదని అభిప్రాయం చాలామందికి
ఉన్నది. అటువంటివాడు కూడా ఇటీవల మతసంబంధ కాండలను శ్రద్ధగా అను
సరిస్తున్నాడని వింటున్నాము. రంజాన్ ఉపవాసాలు, ఈద్ పర్వదిన ప్రార్థనలు
శ్రద్ధగా ఆచరిస్తున్నారట. చంద్ర దర్శనం చేయడం, నెలవంక లేదీ చూడటం
జిన్నాగారి కొత్త భక్తి శ్రద్ధలను సూచిస్తున్నాయి. అటువంటి సందర్భంలో 75
ఏండ్ల వయసు వచ్చిన గాంధీజీ విషయంలో నుచ చెప్పవలె! ఆయన విష
యంలో భగవంతుడు కళ్ళ ఎదుట కనిపించే ఒక మూర్తిగా ఉన్నాడు. భగ
వంతుని విస్మరించి ఆయన ఎప్పుడూ ఉండలేదు. నేడు ఆయనతోటి కాంగ్రెస్
నాయకులు సహాయకులు తనతో లేకపోయినప్పటికీ వారి సహాయం లేకుం
డానే స్వదేశ స్వాతంత్ర్యం కోసం అసహాయ శూరుడుగా పోరాడు
తున్నాడు. అందువల్ల భగవంతుని సాన్నిధ్యం, సన్నిహితత్వం, సహాయం
గాంధీ మహాత్మునకు అత్యంతావశ్యకాలుగా ఉన్నవి. భగవంతుడు ప్రసాదించే
జ్ఞాన తేజం ఆయన కిప్పుడు మరింత ఎక్కువగా కావలె. ఇంత గాఢమయిన
భక్తి ప్రవృత్తితో ఇంతటి భగవ దర్పిత హృదయంతో గాంధీజీ ఉండగా ఇది
వరకెన్నడూ చూడలేదు. అగాధమయిన ఆయన అంతరాత్మ అనంతమయిన
ఈశ్వర సహాయం ఇంత గాఢంగా, ఇంత తీవ్రంగా ఇదివరకెన్నడూ ప్రార్థించ
లేదు. రక్త ప్రవాహాలలో వోలలాడే ఘోర సంగ్రామం కట్టకడపటి ఘట్టం
లోకి రావలె. యుద్ధాలుగానీ, యుద్ధ భయాలుగానీ తిరిగి రాకుండా ప్రపంచం
బాగుపడవలె.

ఈ సందర్భంలో గాంధీజీ తన ఊహాపోహాల కనుగుణంగా దౌర్జన్యరహిత
పద్ధతులను అనుసరించే రాజ్యాంగ పద్ధతిని నిరూపింప ప్రయత్నిస్తున్నారు.
అట్లాంటి రాజ్యాంగ నిర్మాణము సులభమయిన కట్టుబాట్లతో ఉంటుంది. పరస్పర
ప్రజాపీడనం అందులో ఉండకూడదు. ప్రజలందరూ పరస్పర సహకారపద్ధతిలో
పాటుపడి జీవించవలె. జన సామాన్యమే ఆద్యంతం అధికార చక్రం త్రిప్పుతుండ
వలె. ధనాధికులకు, విదేశీ పరిపాలకులకు ఇదంతా ప్రమాదకరమయిన వెర్రి
వేషంగా తోచవచ్చు. గాంధీజీ జరిపే ఈ ప్రార్థనా సమావేశాలుకూడా ప్రభు
త్వాధికారులకు కంటకంగానే ఉంటున్నాయి. అయినప్పటికీ ఏసుక్రీస్తు
మహోపదేశాల ప్రభావం రాజ్యాంగ చక్రాన్ని ప్రభావితం చేస్తూనే ఉన్నది.

***దివ్యాత్మ మహాత్మాజీ**

(శ్రీ బెజవాడ గోపాలరెడ్డి)

గాంధీజీకి 75 సంవత్సరాలు నిండుతూ ఉన్నాయి. మనదేశంలో ఆయన
అంత పెద్ద వయసు వచ్చేవరకు జీవించి మానసిక శక్తులను అకుంఠితంగా ఉంచు

---

* ఆంధ్ర పత్రిక, తేది 1-10-1944

గాని, దేశ నాయకత్వం పూని, యథా క్రమంగా నడిపిస్తూ ఉండడం భారతీయుల అదృష్టమని చెప్పవలె. దేశభక్తి అవతారంగా దరిద్ర నారాయణుడుగా సత్యమూర్తిగా ప్రత్యక్షమయి మనకు ఆశాజ్యోతిగా దేశాలనిస్తూ ఆయన మన మధ్య ఉండటం మన భావి భాగ్య సూచకమనుకోవలె. వారు తపిస్తున్న ప్రజా రాజ్యము స్థాపింపబడి, ప్రపంచ విఖ్యాతిని గడించేటందుకు ఆయనకు చిరాయురారోగ్యాలను ప్రసాదించవలెనని మన మందరమూ భగవంతుని ప్రార్థించవలె

## సందేశ సత్యము

మహాత్ముల జీవితాలను అంచనా వేయడం మామూలు ప్రకారం చేస్తే అది అపరాధ మవుతుంది. సాధించినదేమిటి? స్థాపించని దేమిటి? అని ప్రశ్నించుకొని విమర్శకు పూనిగట్లయితే అది తేలికగా తేలే విషయం కాదు. క్రీస్తు సాధించిన దేమిటి, బుద్ధ భగవానుడు నెరవేర్చినదేమిటి, శంకరుడు నెలకొల్పినదేమిటి అని అడిగితే ఒక రకంగా ఏమీ ఉండదు. గుళ్లు, మఠాలు తప్ప ఇంకేవీ వారు నిలిపి పోయినవి లేవని చెప్పవలె. దైవ రాజ్యాన్ని భూలోకంలో నెలకొల్పి మానవులను ఉత్కృష్టులుగా చేయగలిగినారా? స్వార్థం విడనాడి త్యాగబీజాలను వెదజల్లి, యుద్ధాలను రూపుమాపి, మానవులను శాంత మూర్తులుగా రూపొందింప గలిగినారా? "అహం బ్రహ్మ" అనే ఆత్మజ్ఞానంలో ఆనందాబ్ధిని ఓలలాడ గలిగినారా? అని ప్రశ్నిస్తే అన్నిటికీ లేదు, లేదు అని ఎలుగెత్తి చెప్పవలసి వస్తుంది. కాని వారు దేశకాలాలకు కాలదన్నిన యుగపురుషులు కారని అనగలమా? వారు సాధింప యత్నించినదేమి? ఎట్లాంటి విశ్వాసంతో, ఎట్లాంటి త్యాగంతో, ఎటువంటి అంతశ్శుద్ధితో వారు కార్యరంగంలో ప్రవేశించినారు. వారి సందేశంలోని యథార్థ సత్యమేమిటి అని మాత్రమే మనము పరిశీలించవలసి ఉన్నది. గాంధీజీని అట్లాంటి దృష్టితో నే చూడవలె. స్థూలంగా చూస్తే గాంధీజీ అపజయాలు దైవకృతాలనో, అసాధ్య కార్యనిర్వహణకు పూనుకోవడంవల్ల కలిగినవనో అనుకోవలసి ఉన్నది. వారు అనుకొన్న ఏ పని జయప్రదమయినదని అడిగితే సమాధానం కష్టమే. రాట్నాలు సాగి మిల్లులను పడగొట్టెనా, అంటరానితనం పోయి అందరూ ఏకమయినారా, హిందూ ముస్లిమ్‌లు తమ తగాదాలను విస్మరించి ఒకే మాటవయిన న్యాయ ధర్మాలను తప్పకుండా నడుచుకొంటున్నారా, జీర్ణ గృహ పరిశ్రమలు ఉద్ధరింపబడినవా, పల్లెటూళ్లు బాగుపడినవా, మానవుల అంతఃకరణలు ఔన్నత్యాలుపొందినవా, వారి అహింసా ధర్మమున యుద్ధాలు సమసి పోయినవా అని ప్రశ్నించేవారు ఎట్లాంటి విమర్శకులుగా భావించవలెనో తెలియకున్నది

ఇది ఇట్లా ఉండగా మరికొందరు తీవ్ర విమర్శకులు, "ఖద్దరు అనుకొన్నంత ముందుకు రాలేదు, మిల్లులే ఎక్కువవుతూ ఉన్నవి. అస్పృశ్యులు తమ నాయకుడయిన అంబేద్కర్ ద్వారా తమ విరుద్ధ భావాన్ని ప్రకటిస్తున్నారే గాని దగ్గరకు వచ్చే సూచనలు కనిపించడంలేదు. గాంధీ మహాత్ముని నాయ

కత్వ కాలంలో జరిగినన్ని హిందూ ముస్లిమ్ తగాదాలు మరెప్పుడూ జరగ లేదు లీగ్‌కు ఇప్పుడున్న ప్రచారం పలుకుబడి ఇంతకుముందు ఉండేదా? అహింస, అహింస అని పత్రికలలో వ్రాయవలసినదే కాని వారి కళ్ళ ముందే రెండుసార్లు ప్రపంచము కనీ, వినీ ఎరుగనంతటి రక్తపాతము, ప్రాణనష్టము కలగలేదా చివరికి వారి శిష్యులే, జాతీయ ప్రభుత్వమిస్తే అస్త్ర శస్త్రాలతో యుద్ధంలో పాల్గొని నరహత్యకు పూనుకొంటామని చెప్పలేదా? వారి అహింసా ప్రభావ మేమయినది" అని యుక్తిగా అంటారు ఆ విమర్శకుల దృష్టి మంద గించినదని మనం జాలిపడవలసి ఉంటుంది

## సరిఅయిన మార్గము - సరిఅయిన సందేశము

ఎన్ని శతాబ్దాల అభివృద్ధిని ఈ స్వల్పకాలంలో పొందగలిగినాము! రాజ కీయంగా ఎన్ని ముందంజలు నిర్భయంగా వేయగలిగినాము! ఎట్లాంటి త్యాగానికైనా వెనుదీయక ప్రభుత్వాధికారం, గౌరవం ఎంతగా ధిక్కరించినాము! స్వరాజ్యం కొందరికి ఇచ్ఛామాత్రం కావచ్చును గాని జనసముదాయం దానిని ఎంతగానో అభిలషిస్తున్నది ప్రపంచ ఆదేశం కూడా అయినది ఏ దేశము, ఏ కాలంలో చూపని త్యాగం అహింసావ్రతావలంబులయిన మన స్త్రీ పురుషులు, యువకులు ప్రత్యక్షంగా ప్రదర్శించినారు దీనిని కళ్లార చూసికూడా చూడ నట్లే నటిస్తున్నారు ఒక మహాత్కార్యమును విశాల హృదయంతో విశిష్ట సాధనలతో నిర్వహింప పూనుకొన్న మహాత్ముడు కీర్తి ప్రతిష్ఠలను గడించి లోక శ్రేష్ఠుడనిపించుకొంటున్నాడు పవిత్ర చిత్తంతో ధర్మం కోసం చెప్పరాని కష్టాలకు గురైనాడు కష్టాలకు దేశంను గురి చేసికూడా వగవలేదు దుఃఖాలనను భవించి సుఖాలనే పునాదులతో కళ్యాణానికి దారి చూపుతున్నాడు సరియైన ఆదర్శము, సరియైన సందేశము, సరియైనమార్గం వారిదై యుండగా వారి నాయ కత్వానికి లోటేమి? కర్మ యోగానికి సుఖసోపానాలు లేవు కష్ట పరంపరలు, త్యాగాలు ఉన్నవి వాటిని మంచి దీక్షతో, ఆసక్తితో అనుసరించ వలెనని స్పష్టంచేసినారు

అనాథులను, శక్తిహీనులను, పతితులను ముందుకు తెచ్చి గౌరవ స్థాన మిచ్చి వారి ఉద్ధరణకు, ఆదరణకు తోవ చూపినారు మహాత్మాజీ ఒక అపూర్వమైన దివ్యాత్మ వారికి జన్మసహస్రాభివాదాలు అర్పిస్తున్నాము.

## *గాంధీమహాత్ముడు

(శ్రీ దేశభక్త కొండ వేంకటప్పయ్య)

శ్రీ మహాత్మా గాంధీ 75వ జన్మదినోత్సవము భారత దేశంలో భక్తి విశ్వాసాలతో జరపబడుతుంది కాని ఆయన అర్ధాంగ లక్ష్మి అయిన శ్రీమతి

* ఆంధ్రపత్రిక . తేది 1-10-1944

కస్తూరిబా గాంధీ దివంగతులు కావడం శోచనీయము. ఆమె స్మారకనిధిగా 75 లక్షల రూపాయలు ఈ జన్మదినోత్సవం నాడు శ్రీ గాంధీగారికి కానుకగా భారతీయులు సమర్పించి తమ కృతజ్ఞతను ప్రకటించనుండటం ఎంతో సంతృప్తి కరమయిన విషయము

గాంధీ మహాత్ముడు లోకంలోని మహాపురుషులలో అగ్రశ్రేణికి చేరిన వారవటంవల్ల భారత జాతికి సైతం లోకంలో నూతన గౌరవం లభించినది గాంధీజీ ఇప్పటికి రమారమి యాభై సంవత్సరాలనుంచి మానవసేవలో నిమగ్నులై సంపూర్ణ త్యాగమూర్తులై ఏకైక దీక్షతో కృషి చేస్తున్నారు ఇట్లా కాల క్రమేణా వారి జీవితమొక మహాసముద్రంవలె విస్తృతము, ఊర్జితము అయిన గంభీరతను వహిస్తున్నది వారికి అహర్నిశలు ఏదోఒక పని చేతినిండా ఉంటుంది వారి జీవితంలోకి ప్రతి గడియ చరిత్రాత్మకమై కాల గర్భంలో ప్రవేశిస్తుంది ఇట్లాంటి కార్య భారం వహించిన వారికే కదా కాలం విలువ తెలుస్తుంది వారిది చాలా నిరాడంబరమయిన జీవితము వారు నిత్య సంతృప్తులు, నిష్పరిగ్రహులు, ఆహారము మితము, సాత్వికము, అపక్వము, నివాసమొక చిన్న పల్లెలో, ఒక అతి సామాన్యమయిన చిన్న ఇల్లు, దానిలో ఒక తడికల గదిలో వారి ఉనికి కూర్చోవడానికి మీద పరచిన ఒక చాపమీది మెత్త అలసినపుడు పడుకోవడానికి అదే ఆనుకోవడానికి ఒక కొయ్యపలక కట్టుకోవడానికి మొలకు మాత్రం తగినంత ఖద్దరు అంగ వస్త్రము పైన వేసుకోవడానికి ఒక ఖద్దరు దుప్పటి హృదయము ప్రేమ పూరితము బీదల బాధలాయనకు చాలా దుస్సహాలు హరిజనులు ఆత్మబంధువులు లోకులు తోడి కుటుంబంవారే జ్ఞానోపార్జనంచే విశాలమై, సుతీక్ష్ణమై లోకానుభవంతో నిండిన బుద్ధి, భాషా జ్ఞానము, వాగ్విభవము, వాక్చమత్కృతి, రచనా సామర్థ్యం ఇవన్నీ ఆయనలో మూర్తీ భవించినవి

ఆయన జీవితాదర్శాలు ఈశ్వరేచ్ఛానుసారాలు ప్రయత్నాలు పర మేశ్వర ప్రయత్నాలు ఫలాలు పరమేశ్వరాధీనాలే కాబట్టి వాటిని గురించిన చింత ఆయనకు లేదు ఆశయానికి అపజయమనే అవకాశంలేదు. నిరంతర సత్కార్యాచరణమే తన బాధ్యత మానవ మాత్రునకెవరికీ వెరవటం లేదు భవిష్యత్ అంటే భయంలేదు. దేనియందూ దురభిమానంలేదు ఎవ్వరిని గురించి మొగమాటంలేదు ఎప్పుడూ మోమున చిరునగవు మొలకెత్తుతుంది సందర్భాను సారంగా నవ్విన పెద్ద నవ్వు అప్రతిమానమయిన ఆనందం కల్పిస్తుంది. మనసు ప్రశాంతము, కోపము కానరాదు, తొందరలేదు, తొట్రుపాటులేదు, మాటలు మన్ననమర్యాదతో కూడి మృదువుగా ఉంటాయి ఆయనతోడి సంభాషణలలో సామాన్యంగా ఇతరులు ఆయనకు వశవర్తులవుతారు వారికి కేవలం రాజకీయాల లోనేగాక భారత దేశానికి సంబంధించిన సాంఘిక, ఆర్థిక, నైతికాది సమస్త విషయాలలోకూడా ఐక్యం ఉంది. మాతృదేశము సత్వరంగా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొంది సర్వతోముఖమయిన అభివృద్ధిగాంచి ప్రపంచ దేశా

లన్నిటికీ నైతిక ధార్మిక ఆధ్యాత్మిక విషయాలలో మార్గదర్శకులై ప్రపంచ శాంతికి, లోక కళ్యాణానికి కృషి చేయవలెనని వారి మహదాశయము ఇట్లాంటి మహత్కార్యము భారతీయులకే సాధ్యమనిగాఢంగా వారి విశ్వాసము ఈ సత్సంకల్పం నెరవేర్చవలెననియే ఇప్పటికి 25 సంవత్సరాల నుంచి నిరంతరం పాటుబడుతున్నారు

స్వాతంత్ర్యం కోల్పోయి పరాధీనులై భారతీయులు సర్వ విషయాలలో వెనకబడి ఉండటంచేత అన్నిటికంటె ముందుగా భారత స్వాతంత్ర్యసముపార్జనమే పరమావధిగా పెట్టుకొని కృషి చేస్తున్నారు

మిక్కిలి బలిష్ఠము, అజేయము అయిన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదిర్చి ఒడబరచుకోవడానికి అనన్యమూ, అపూర్వమూ అహింసాత్మకమూ అయిన అసహాయోద్యమము శాసనోల్లంఘనము మొదలయిన సాధనాలను ప్రయోగించినారు ప్రజలలో గాఢమయిన స్వాతంత్ర్యాభిలాష పురికొల్పినందున వేలకొద్దీ దేశభక్తులు నిరుపమానమయిన త్యాగాలు చేసి పడరాని కష్టాలుపడి కొందరు ప్రాణాలు సైతం కోల్పోయినారు

ఈ అసహాయోద్యమము మొదలయినవి 'సత్యాగ్రహము' అనే ఒక ధార్మిక సిద్ధాంతంపై ఆధారపడి ఉన్నాయి సత్యాగ్రహము తాత్వికము అందు అహింస సత్యనిరతి, త్యాగము, నిర్భయత్వము, శాంతము, ఆత్మశోధన, పరమ కారుణికత్వం మొదలయిన ఆధ్యాత్మిక ధర్మాలు ప్రధానాలు ఇట్లాంటి అపూర్వ సిద్ధాంతాన్ని రాజకీయాలలో ప్రవేశపెట్టడం గాంధీమహాత్ముని కార్యక్రమంలో ప్రధానమయిన ఒక విలక్షణ ధర్మంగా పరిణమించినది అనేక రాజకీయవేత్తల దృష్టిలో సామాన్య నైతిక ధర్మాలకు దృఢమయిన స్థానంలేదు సందర్భానుసారంగా వాటి ఉల్లంఘన అవసర ధర్మంగా సైతం వారంగీకరిస్తారు

కాంగ్రెస్ మహాసభవారు సత్యాగ్రహాన్ని తాత్కాలిక నైతిక ధర్మంగా మాత్రమే గ్రహించటంవల్లనే గాంధీమహాత్ముడు చివరకు కాంగ్రెస్ సభా సభ్యత్వం విడనాడి వెలుపల నుంచి సలహా సహకారాలు చేయవలసి వచ్చినది కాని వారు లేనిదే కాంగ్రెస్ కార్యాలేవీ సాగడానికి వీలులేని పరిస్థితి ఉన్నది ఇప్పటికీ కాంగ్రెస్‌కు జీవం గాంధీ మహాత్ముడని చెప్పక తీరదు ఇన్ని సంవత్సరాలుగా చేసిన కృషి ఇంతవరకు సఫలం కాలేదు ఎట్లా అయినా ప్రభుత్వం వారితో సమాధానం కుదుర్చుకోవలెనని రాజకీయ సంస్కరణ విధానాలలో పూర్వపు గట్టి పట్టును వదలి ప్రయత్నాలు సాగించినారు. యుద్ధము అమానుషకృత్యము, మృగమాత్సర్యరూపము దానిని మానవ సంఘానికి నిషిద్ధంగా అంగీకరించవలెనని గాంధీగారి ధర్మసిద్ధాంతము కాని అట్లాంటి ఉత్తమ ధర్మాన్ని అవలంబించగలవారు భారత దేశంలో ఇప్పుడు లేకుండటంవల్ల ప్రజలు సదా లాభాలు ఆశించటంవల్ల ఆ ధర్మము తనకు మాత్రం వ్యక్తిగతంగా వర్తింప గలదని సమాధాన పరచుకొని ప్రకృత యుద్ధంలో మిత్రమండలికి తోడ్పడడానికి కాంగ్రెస్ సిద్ధంగా ఉన్నదని

రాజ్యాంగ సంస్కరణ విధాన సందర్భంలో ప్రకటించినారు పరమోత్కృష్ట మని తాను నమ్మిన ధర్మంలో సైతము కొరంతలను అంగీకరించడంవల్ల మహాత్ముని గాఢ దేశాభిమానం వ్యక్తమవుతున్నది ఇట్లా యుద్ధ విషయాలనే కాక మరి ఇతర విధాలుగా ప్రస్తుత సందర్భం బట్టి స్వాతంత్ర్య లక్ష్యాలను సంకుచిత పరిచి రాజ్యాంగ విధానం సూచించినా, బ్రిటిష్‌వారు దానిని పనికి రాదని తోసివేయడం ఎంతో శోచనీయము ఇందువల్ల వారింత వరకు చేసిన వాగ్దానాలలో విలువలేదనటం స్పష్టము కాని మహాత్ముడిప్పుడు మహత్తరమయిన కృషి చేస్తున్నాడు మహమ్మదీయులతో సఖ్యము ఏర్పరుచుకొని భారత స్వాతంత్ర్యం కొరకు మహమ్మదీయులతో కూడా ఏకోన్ముఖమయిన వహి ప్రయత్నం చేయవలెనని సంకల్పించి ఉన్నారు కాబట్టి జిన్నా సంభాషణలు జయప్రదమగుగాక అని కోరడం భారతీయుల కర్తవ్యము

* పూర్ణ పురుషుడు
(డాక్టర్ పట్టాభి సీతారామయ్య)

గాంధీ విజయానికి కారణం ఆయన నమ్రగుణము, ఆయన నిరహంకృతి, ఆయన సహనము, అసాధారణ కష్ట సహిష్ణుత, నిస్తంద్రత, 'సత్యము ఎన్నటి కయినా జయించ గలదు నేడుగాకున్న రేపయినా జయించగలదు తొందర ఎందుకు అంతవరకు వేచి ఉండగలను' అనే ఓర్పు, ప్రతివారిని తన వైపునకు తిప్పుకో గలననే అకుంఠిత విశ్వాసము, ఇవి ఆయన విజయాలకు కారణాలు

"నేను రైతును, నేత వాణ్ణి' అని ఒకచోట చెప్పుకున్నాడు ఆయన రైతు, నేతవాడు మాత్రమే కాదు, ఋషి, సైనికుడూకూడా ఋషిగా ఉండి ఋక్కులను, ఉపనిషత్సూక్తులను ఉద్ఘాటించినారు సైనికుడుగా ఉండి తన జీవితాన్ని ఏ క్షణమందయినా సరే లోక రక్షణకు బలి ఇవ్వడానికి కంకణం కట్టుకొన్నాడు

"ఇవ్వాళ ప్రొద్దున బయలుదేరడానికి రెండు నిమిషాలు ఎందుకు ఆలస్య మయింది" అన్నారు గాంధీజీ వెనక ఆంధ్ర దేశ సంచారానికి వచ్చినప్పుడు ఒకరోజు ఉదయం కొంచెం భయపడుతూ, భయపడుతూ 'ఫలానావారి చేతి సంచి పోయింది, అందుచేత ఆలస్యమయినది" అని ఎవరో సమాధానం చెప్పి నారు "ఓ అట్లాగా, కొందరికి తలకాయలే పోతాయి, చేతి సంచులేకాదు" అన్నారు గాంధీజీ ఈ మాట వినడంతోనే ఎదుటి వారి భయమంతా పోయి వారుకూడా హాస్యానికి దిగటానికి బలే హుషారుగా ఉంటారు

"చెడుగును మంచితో జయింపుము" "విశ్వాసము కొండలను కదల్చును" "దెబ్బకు దెబ్బ కొట్టకుము" "అపకారికి ఉపకారము చేయుము" ఈ ధర్మ వాక్యాలన్నీ మనం రోజూ వింటూనే ఉన్నాము. ఇవే సత్యాగ్రహోద్యమానికి

*ఆంధ్రపత్రిక

పునాదులు గాంధీ తత్వ రహస్యం తెలుసుకోడానికి కీలకాలు అగ్ని వర్ష ములో ముందు తాను నిలబడి "రండి" అని గాంధీ తన అనుచరులను ఆహ్వా నిస్తాడు అంతేగాని అగ్ని వర్షానికి వెనుక పదిమైళ్ళ దూరంలో దాగి ఉండి "పొండి" అని టెలిఫోనుద్వారా ఉత్తరువులు జారీ చేయడు గాంధీగారికి ఇతర నాయకులకు గల తేడా ఇదే గాంధీ గారితో కలసి పదేండ్లు పనిచేయండి పదేండ్లు వద్దు, ఒక్క సంవత్సరం, ఒక్క రోజు పని చేయండి ఆయనపట్ల మీకున్న గౌరవ భావము అంతలో పూజ్యభావంగా మారి అప్పటినుంచి వెంటనే మిమ్ము భక్తి పారవశ్యంలో ముంచివేయగలదు అబ్బ ! అదేమోగాని ఆయన సత్య సంధత, ఋజు వర్తన సాంక్రామిక వ్యాధివలె మిమ్మంటుకొంటుంది

ఈ ప్రపంచంలో దాదాభాయి నౌరోజీగారికి తెలియని విషయాలుతేవని ప్రతీతి అట్లాంటి విజ్ఞాన సర్వస్వం గాంధీజీకి లేదనుకొన్నారా? గోఖలే గారికి అపార మేధాశక్తి కలదని ప్రతీతి అట్లాంటి మేధాశక్తి గాంధీజీకి లేదనుకొంటు న్నారా? లోకమాన్య తిలక్ గారికి గల బుద్ధి చతురత గాంధీజీకి లేదనుకొ న్నారా? సురేంద్రనాథ్ బెనర్జీ గారికి ఉన్న వాగ్ధాటి గాంధీజీకి లేదనుకొ న్నారా? సర్ ఫిరోజిషా మెహతా ఊహ, రచనా పటుత్వమూ గాంధీజీకి లేవ నుకొన్నారా? ఇవన్నీ ఆయనలో మూర్తీభవించి ఉన్నవి లేవనుకోవడం పొర పాటు గాంధీజీ ప్రపంచ మంతా తిరిగినారు ఆ అనుభవం వీరి నాయకత్వాని కెంతో సహకారిగా ఉన్నది వీరి మేధాశక్తి ఎవ్వరి మేధాశక్తికి తీసిపోదు. వీరి వాగ్ధాటి సత్యదేవత పలికించు వాగ్ధాటి, నిర్మల హృదయాంతరాళంనుంచి వెలువడు అనర్గళగంగాలహరి. గాంధీజీ బుద్ధి చాతుర్యము వర్తకుని బుద్ధి చాతు ర్యము, లాయరుది కాదు

ఈయన ముందుగా వ్యూహము పన్నినట్లయితే అది చక్కగా టంకం వేసి అతికినట్లు అతుకుతుంది ఆయన దానిని అతి నిశితమయిన దృష్టితో పన్నుతాడు ఈ గుణాలనూ, ఈలక్షణాలనూ అన్నిటినీ కలిపి ముద్దచేసి దానికి పవి త్రత అనే మెరుగు పెడితే లోక నియంత అయిన గాంధీజీ విగ్రహం తయారవు తుంది

## గాంధీ జయంతి - కస్తూరిబా నిధి

**చిత్తూరు**

మహాత్మా గాంధీ 75వ జయంతి సందర్భంలో ఆంధ్రదేశంలోని వివిధ పట్టణాలలో సభలు సమావేశాలు జరిగినాయి కస్తూరిబా నిధికి విరాళాలు విరివిగా లభించినాయి. చిత్తూరు తాలూకాలోని బంగారుపాలెం జమీందారు శ్రీయం వి శేషాచలపతి నాయనివారు కస్తూరిబా స్మారక నిధికి శ్రీ పొలకల రామచంద్రారెడ్డి గారికి 1500 రూపాయలు విరాళమిచ్చినారు చిత్తూరు జిల్లావారు 5000 రూపాయలు కస్తూరిబా నిధికి సమర్పించ వలెనని నిర్ణయించడం జరిగింది. ఆంధ్రమహాసభ కార్యనిర్వాహక సభ్యులు శ్రీ పి.యస్.

గురువారెడ్డిగారు కస్తూరిబా నిధికి 116 రూపాయలు విరాళమిచ్చినారు

**గూడూరు**

బెజవాడ గోపాలరెడ్డి, పంగల్లు కోదండరామిరెడ్డి, రేబాల పట్టాభిరామ రెడ్డి, అనెం చెంచు సుబ్బారెడ్డిగార్లు కస్తూరిబా నిధికి గూడూరులో దిగువ విరాళాలను సేకరించినారు

శ్రీ సన్నపురెడ్డి నారాయణరెడ్డిగారు, శ్రీ పోనులూరు వీరరాఘవరెడ్డి గారు, శ్రీ ఏనుగు వెంకట నర్సారెడ్డిగార్లు ఒక్కొక్కరు ఒక వెయ్యి రూపాయలు విరాళమిచ్చినారు గోగినేని వెంకట సుబ్బారెడ్డిగారు 250 రూపాయలు, శ్రీ వసుపులేటి సిద్దయ్య నాయుడుగారు, శ్రీ సెలబళ్ళ సుందర రామరెడ్డి గారు, శ్రీ రేబాల శంకర రెడ్డిగారు, శ్రీ పెల్లకూరు దశరథరామరెడ్డిగారు ఒక్కొక్కరు ఒక్కొక్క 116 రూపాయలు ఇచ్చినారు

## గ్రామాలలో గాంధిజయంతి

మద్ది గ్రామంలో అక్టోబర్ 2వ తేదిని పుర ప్రముఖులు నాగేశ్వరాలయంలో సమావేశమయినారు జాతీయ గీతాలతో సభ ప్రారంభమయింది పైడి లక్ష్మీనరసయ్యగారు గాంధీజీని గురించి సంగ్రహంగా ఉపన్యసించినారు

రాజంపేటలో శ్రీ బొగ్గవరపు వెంకట సుబ్బయ్యగారి అధ్యక్షతను, నేమికల్లులో శ్రీ వీరభద్రారెడ్డిగారి ఆధ్వర్యాన, కైకలూరులో ఉప్పలూరి ముత్తంరాజుగారి అధ్యక్షతను, విజయ నగరంలో కళాశాల విద్యార్థుల యాజమాన్యంలో, చేబ్రోలులో శ్రీ పాటిబండ్ల కోదండ రామయ్యగారి భవనంలోను, కళ్యాణ కావూరులో మల్లెమడుగుల కోదండ రామయ్యగారి అధ్యక్షతను, భీమవరంలో శ్రీ ఏ ఆదినారాయణగారి భవనంలోను, ఉయ్యూరులో ఏ వి ఆర్ చౌదరిగారి అధ్యక్షతను, కళ్యాణ దుర్గంలో శ్రీ జి చలమప్ప గారి అధ్యక్షతను, అనంతపురంలో శ్రీ మూలా నారాయణస్వామిగారి అధ్యక్షతను, ఆదవానిలో జే యల్. యస్ సోమయాజులవారి ఆధ్వర్యంలోను, తిరుత్తనిలో డి మునిరత్నం నాయుడుగారి అధ్వర్యంలో, బళ్ళారిలో శ్రీ బి వెంకోబారావుగారి ఆధ్వర్యంలో గాంధీ జయంతి సభలు, ఉత్సవాలు అత్యుత్సాహకరంగా జరిగినాయి

## ప్రభుత్వ నిర్బంధాలు

పెనుగొండలో గాంధీ జయంతి సందర్భంలో అక్టోబరు 2వ తేదిన అంగళ్లు మూసినందుకు పోలీసు సబిన్‌స్పెక్టర్‌గారు ముగ్గురు అంగడి యజమానులను అరెస్టుచేసి వారిపై ఇండియా రక్షణ చట్టంకింద నరసాపురం జాయింట్ మాజిస్ట్రేట్ వద్ద కేసు దాఖల్ చేసినారు

పిఠాపురం సబ్‌మాజిస్ట్రేట్ గాంధీ జయంతి సభలను, ఊరేగింపులను 7 రోజుల వరకు జరపకూడదని గొల్లప్రోలులో నిషేధపు ఉత్తరువులను జారీ

చేసినారు చల్లపల్లిలోకూడ సభలు నిషేధింప బడినవి రాజమహేంద్రవరము లోని స్థానిక మాజిస్ట్రేట్ ఊరేగింపులను, సభలను నిషేధిస్తూ ఉత్తరువులు జారీ చేసినారు

ఇక్కడ స్థితి ఇట్లా ఉండగా ప్రపంచంలో వివిధ విషయాలలో ప్రఖ్యాతి వహించిన మహాపురుషు లనేకమంది గాంధీజీకి శుభాభివందనాలను సమర్పిస్తూ తంతులు, కేబిలులు, ఉత్తరాలు పంపినారు

# 30
# గాంధీ జయంత్యుత్సవాలు (1945)

మద్రాస్‌లో జరిగిన బహిరంగసభలో 1945 అక్టోబర్ 2వ తేదీన రైట్ ఆనరబుల్ వి యస్ శ్రీనివాస శాస్త్రిగారు గాంధీమహాత్ముని గురించి ఇట్లా ఉపన్యసించినారు

"ఈ అక్టోబర్ 2 నాటికి మన మహాత్మునికి 76 యేండ్లు నిండినాయి గాంధీజీకి ఈ అక్టోబర్ 2 తిరిగి ఎన్నో పర్యాయాలు రావలెనని ప్రార్థిస్తున్నాను ఈ ప్రార్థన పైకిగానీ, లోపలగానీ ఈ దేశంలోను, ప్రపంచ దేశాలలోను ఈనాడు కోట్లాది ప్రజలు చేయడం పరిపాటి అయినది ఆయనతో పోల్చ తగిన మనిషి మరొకరు లేరు. ఇంతవరకు మానవ చరిత్రలో వ్రాసినంత వరకు ఆయనతో పోల్చతగిన వారు చాలా తక్కువమంది ఉన్నారు ఈ మహాపురుషులలో ఎక్కువ మందికి వారి మరణానంతరమే విజయంగానీ, కీర్తిగానీ లభించింది గాంధీజీ, తన జీవితంలోనే తన కీర్తి ప్రతిష్ఠలు సువర్ణాక్షరాలలో ప్రపంచమంతా ప్రకాశించడం చూడగలిగినారు ప్రపంచ వ్యవహారాలలో ఒక నూతన సందేశాన్ని అందించి ఒక తర [illegible] విశ్వవ్యాప్తంగా చేయగలిగిన మహాపురుషుడెవరు ? విసిగి వేసారిపోయిన ప్రపంచ జాతులు కొంచెం ఓదార్పుకోసం వివేక కిరణ ప్రసారం కోసం సేవా గ్రామంలో చిక్కి చివికి పోయిన ఆ మహాపురుషుని వంకగాక మరింకెవరికోసం నిరీక్షించగలరు! విషాదకర దైవఘటనవల్ల తటస్థించిన క్రోధద్వేషపూరితమయిన భేరీనినాదాలలో ఆయన కేక తాత్కాలికంగా వినబడకపోయి ఉండవచ్చు ఈ ప్రపంచంలోని ఎక్కువ భాగాలలో వివిధ సంఘాలు యుద్ధాలకు దిగుతూన్నవి మన ప్రధాన నగరంలో కూడా సోదరులు, సోదరులపైన విద్వేషంతో కత్తులు దూస్తున్నారు" అని ఉపన్యసిస్తూ, గాంధీజీ ఎదురుగా ఉన్నట్లుగా భావించి ఆయన ఇంకా ఇట్లా అన్నారు "అటువంటి క్లిష్ట పరిస్థితులలో మీరు ధైర్యం కోల్పోకూడదు మీరు నిశ్చల చిత్తంగల ఆశా సందేశహరులు మీ భాషలో పరాజయమునేది లేదని మీరు మా కెన్నిసార్లో చెప్పియున్నారు మీకుగల ఆ అచంచల విశ్వాసం చూసినప్పుడు మావంటి వారెందరో నమ్మకంలేక నవ్వుకొని ఉన్న సందర్భాలుకూడా ఉన్నాయి. మా వంటి అహంకార పూరితులైన అల్పజ్ఞులను మీరు లక్ష్యపెట్టకండి అలసట ఎరుగని మీ ఆశఅనే రెక్కలతో ఆకాశం వరకు ఎగిరి ఇంతకంటె ధైర్యవంతము, పవిత్రవంతము అయిన మరొక ప్రపంచం మీరు కనుక్కొన్న

సంగతి మాకు వినిపించండి మా హృదయాంతరాళంనుంచి మరొక మాట చెప్పదలచుకొన్నాను మీ జీవితం వ్యర్థమయిందని గానీ, మీ బోధలు తృణీకరింపబడినవనిగానీ మరెన్నడూ భావించకండి, మీ ఆదర్శం గొప్పది ఇండియాను గురించి, ప్రపంచాన్ని గురించి మీరు వాంఛిస్తున్న ఆశయం ఉత్కృష్టమయినది ఈ ఆశయం, ఈ వాంఛా ఒకరి జీవితకాలంలో పొంద డానికి వీలులేనిది మీ మరణానంతరం ప్రపంచమింకా కొనసాగుతూనే ఉంటుందనీ, కాలం నిరవధిక మయినదనీ మీకు తెలియనిది కాదు ఆ భావం మీకు ఇతోధిక శక్తి సామర్థ్యాల నీయగలదు ఎన్నో తరాలనుంచి ఎందరో మహాపురుషులు చేయిలేని పనిని మీ రొక్కరు చేయగలిగినారు మిమ్మల్నలను గురించి చెడుగా చెప్పుకోవటం విన్నాను మిమ్ముల్నలను గురించే కాదు సీతారాములను గురించి కూడా అట్లాగే చెప్పుకొన్నారు ద్వేషాసూయలతో నిజం చూడలేని మనుష్యులు ఇదివరకూ ఉన్నారు, ఇక ముందుకూడా ఎప్పుడూ ఉంటారు కాని వారిలో నుంచి ఏ ఒక్కరు సహజంగా పుట్టుకవల్లగానీ, ఐశ్వ ర్యంవలనగానీ, అంతవంతాలవల్లగానీ గొప్పవాడు కాని వ్యక్తి మానవజాతి హృదయాలలో సింహాసనాధిష్టుడు కాలేదు అహింసను స్వర్గమునుంచి భూలో కానికి దింపి మానవుల దైనందిన చర్యలలో ఆచరింపచేయలేదు ప్రత్యక్షం కాని ఆల్మకొక నూతన రూపం కల్పించి దాని విజృంభణకు మార్గదర్శి కాలేదు మీకు 125 సంవత్సరాలు జీవించవలెననే కోరిక ఉందని అనేకసార్లు హాస్యంగా అంటూ వచ్చినారు మీరు ఇండియాకోసం ప్రపంచంకోసం కూడా మీ శారీరక దౌర్బల్యం లక్ష్యపెట్టకుండ సేవ చేయగలరని నా భావము మీ జీవిత కాలంలోనే బ్రిటన్ ఇండియాను విడిచిపెట్టి పోవడం మీరు చూడగలరు మలబారువంటి ప్రదేశంనుంచి కూడా అస్పృశ్యత దాదాపు నిర్మూలం కావడం మీరు కళ్ళారా చూడగలరు హిందువులు, మహమ్మదీయులు స్వతంత్ర పౌర సత్వాలను సమానంగా ఆనందంతో అనుభవించ గలగడంకూడా మీరు చూడ గలరు మన దేశంనుంచి నికృష్టమయిన దరిద్రం, నిరక్షరాస్యత నిర్మూలింప బడటం కూడా బహుశా మీరు చూడగలరు భారతదేశం శక్తిమంతంగానూ, ఐశ్వర్యవంతంగానూ ఉండి ఆసియా ఖండ జాతులలో అగ్రస్థానం వహించడం కూడా మీరు కళ్ళారా చూడగలరు మీరు జీవించి చూడగలిగిన మహో త్కృష్ట విషయా లనేకాలున్నవి కాని మీ ఆశకు అంతులేదు మీరు అత్యం తం వాంఛించే విషయాలు కొన్ని మీరు చూడకపోవచ్చు. ఆ అపజయాలకు మీరు దుఃఖిస్తే దుఃఖించండి! కాని మీకు సానుభూతిగా మాలో చాలామంది కన్నులనుంచి ఒక్కకన్నీటి చుక్కకూడా వెలువడదు పరిశ్రమలు అభివృద్ధి పొంది తీరుతాయి, యంత్రాలయాలు రాత్రింబవళ్ళు ఘోషిస్తూ పనిచేస్తాయి సైన్యము, నావికాదళము, వాయు విమానదళము చక్కగా పోషింపబడతాయి తెంగుతూరు రెండో తరగతి అణుబాంబు (Atomic Bomb) తయారు చేయ డానికి ప్రయత్నిస్తూంది. విద్యాసంస్థలు శాఖోపశాఖలుగా విజృంభించి ఇంకా

డబ్బు కావలె, కావలెనని గోల పెడుతూనే ఉంటాయి అప్పుడే వివాహం చేసు కొన్న యువతీయువకులు సోదరీసోదరులవలె మెలగడానికి ఇష్టపడరు గ్రామాలు నూలు తీయడంతోను, ప్రార్థనలతోను సంతృప్తిపడి ఉండవు అవి విద్యుచ్ఛక్తి కోసం, చక్కగా సంస్థాపింపబడిన వినోద మందిరాలకోసం, ప్రయాణ సౌకర్యా లకు రైళ్ళు, మోటార్లు, విమానాలకోసం ఆందోళన చేస్తాయి మానవుల పర స్పర సంబంధాలు శాసనాలద్వారా నిర్దేశింపబడగలవు నాగరికత ముందుకు పరుగెత్తుతుంది, వెనకకు నడవదు ఏమయినప్పటికి మీరు అపజయం పొందలేదు నా మాట నమ్మండి మానవుని మొరటుతనంపైన అతని పశుత్వంపైన మీరు అద్భుతమయిన విజయం సాధించినారు సత్యంలోని సౌందర్యం వీక్షించే టందుకు మీరతని కన్నులను తెరిచినారు అతడు భ్రాతృప్రేమలోని మార్దవం గ్రహించగలిగేటట్లు చేసినారు "

## రాయపేటలో

గాంధీ జయంత్యుత్సవ సందర్భంలో రాయపేట కాంగ్రెస్ మైదానంలో 1945 అక్టోబర్ 2 ఉదయం త్రివర్ణ జాతీయ పతాకారోహణ ఉత్సవం జరిగింది శ్రీమతి కొత్తనాయకి అమ్మాళ్ మహాత్మాగాంధీ భారతదేశానికి చేసిన సేవలను గురించి ప్రశంసిస్తూ పాటలు పాడింది శివజ్ఞాన గ్రామణి మాట్లాడుతూ భారత దేశానికి గాంధీజీ నాయకత్వం అత్యావసరమని అన్నారు ప్రపంచంలోని స్వతంత్ర వాంఛాపరులు అందరి పక్షాన దళితజాతుల సేవకోసం గాంధీజీకి దీర్ఘాయురారో గ్యాలను ప్రసాదించవలెనని ఆయన భగవంతుని ప్రార్థించినారు * రాజాజీ తిరిగి కాంగ్రెస్‌లో ప్రవేశించడం గాంధీ జయంత్యుత్సవ ప్రారంభానికి శుభసూచ కమని అన్నామలై పిళ్ళై అన్నారు కాంగ్రెస్‌లోని అంతఃకలహాలకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్య సమరాన్ని సమర్థవంతంగా కొనసాగించవలెనని కూడా ఆయన కాంగ్రెస్ కార్యకర్తలను కోరినాడు సరిగా సమావేశం ముగింప బడుతూన్న సమయంలో సి రాజగోపాలాచారి వచ్చి పతాకాభివందనం చేసినారు

## నెల్లూరులో

గాంధీమహాత్ముని 76వ జయంత్యుత్సవ సందర్భంలో మహాత్మాగాంధీ విగ్రహం, చక్కగా అలంకరింపబడిన రథంలో 76 జతల ఎడ్లతో లాగిస్తూ నెల్లూరు పౌరులు నగరమంతా ఊరేగించినారు. ఆనాడు నెల్లూరులోని అంగళ్ళను, విద్యాసంస్థలను మూసివేసినారు

---

* రాజాజీ "క్విట్ ఇండియా" ఉద్యమానికి ప్రతికూలంగా కాంగ్రెస్ నుంచి రాజీనామా ఇచ్చినారు

**పలమనేరులో**

చిత్తూరు జిల్లా పలమనేరులో శ్రీ అనంతశయనం అయ్యంగార్ అధ్యక్షత కింద మహాత్మాగాంధీ జయంత్యుత్సవ మహాసభ జరిగింది ఆ సందర్భంలో బీదలకు సంతర్పణ కూడా జరిగింది

**మదనపల్లిలో**

మదనపల్లి తాలూకా పట్టణ కాంగ్రెస్ సంఘ యాజమాన్యంకింద అక్టోబరు 2న మహాత్మాగాంధీ 76 వ జన్మదినోత్సవ సందర్భంలో వి పాపన్న గుప్త అధ్యక్షత కింద బహిరంగ సభ జరిగింది శ్రీయుతులు వెంకటరెడ్డి, నారాయణ, రామయ్య, రాధాకృష్ణయ్య, కాళహస్తి వాస్తవ్యులు శ్రీమతి రామరత్నమ్మ మొదలయినవారు గాంధీజీ మహాదాశయాలను గురించి ఉపన్యసించినారు గొప్ప ఊరేగింపు కూడా జరిగింది

**అనంతపురంలో**

అక్టోబర్ 2 ఉదయాన కాంగ్రెస్ కార్యకర్తలు ఇంటింటికి తిరిగి ఖాదీ అమ్మటంతో గాంధీజయంత్యుత్సవం ప్రారంభమయింది గాంధీభవనంలో ప్రత్యేక ప్రార్థనలు జరిగినాయి మహాత్మాగాంధీ చిరాయుష్మంతుడుగా ఉండవలెనని దేవాలయాలన్నిటిలో పూజలు జరిగినాయి

# 31
# మహాత్ముని ఆంధ్రదేశ సంచారము (1946)

మహాత్మాగాంధీ ప్రత్యేక రైలులో 1946 జనవరి 20 ఉదయం సరిగా 11 05 నిమిషాలకు వాల్తేరు స్టేషన్‌కు చేరినారు గాంధీజీ రైలు దిగగానే విద్యార్థి కాంగ్రెస్‌కు చెందిన విద్యార్థిని శ్రీమతి అన్నపూర్ణాదేవి ఆయన పాదాలనుకడిగి హారతి ఇచ్చింది ఆయన కోసం రైల్వే ప్లాట్‌ఫారం దగ్గర ఒకకారు సంసిద్ధంగా ఉన్నది కాని ఆయన సమావేశం ఏర్పాటు చేయబడిన మైదానానికి నడిచిపోవడానికి నిశ్చయించుకొన్నారు గాంధీజీ ప్లాటుఫారం విడిచి పోతూ ప్రత్యేక రైలు డ్రయివర్‌తోను గార్డుతోను ఇతర బి యన్ ఉద్యోగులతోను కరచాలనం చేసినారు వారి పని గాంధీజీని వాల్తేరు ప్లాటుఫారం మీద దించడంతో ముగిసినది శ్రీ కళా వెంకట్రావు, తెన్నేటి విశ్వనాథం, ముళ్ళపూడి పళ్ళంరాజు, కొల్లూరి వీరభద్రరావు మొదలయిన వారితో మహాత్మాజీ బి యన్ ఆర్ మైదానంలోని బ్రహ్మాండమయిన బహిరంగ సభకు కాలి నడకను వెళ్ళినారు

సభలో దూరశ్రవణ యంత్రాలు ఏర్పాటు చేయబడినవి అందువల్ల ఆయన మాట్లాడిన ప్రతిమాట సభలోని వారందరికి స్పష్టంగా వినపడింది మహాత్ముడు "రఘుపతి రాఘవ రాజారాం" అనే ప్రార్థనగీతం పాడుతుండగా ప్రజలందరూ ఆయనతో కలసి పాడినారు అనేక వేలమంది స్త్రీ పురుషులు సభలో కూర్చొని ఉన్నారు మహాత్ముడు ఖద్దరు దీక్షను గురించి ఉత్సాహంతో ప్రసంగించడం మొదలు పెట్టినారు ఇంతలో కొంచెం శబ్దం వినబడడం జరిగింది అప్పుడాయన "నేను డబ్బుకోసం రాలేదు స్వరాజ్య సాధనకు కావలసిన క్రమశిక్షణ మీలో ఉందో, లేదో చూడటానికి వచ్చినాను ఈ మాత్రం క్రమశిక్షణ లేకుంటే, సభలో నిశ్శబ్దంగా ఉండలేకపోతే స్వరాజ్యం ఎట్లా సంపాదించుకోగలం సంపాదించినా ఎట్లా నిలబెట్టుకోగలం?" అని మందలించే సరికి సభ అంతా నిశ్శబ్దంగా ఉండిపోయింది

చాలా మంది డబ్బు, కానుకలు సమర్పించినారు

తరవాత గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు

"1920 నుంచి శాంతి అహింసలనే స్వరాజ్య లక్ష్యానికి సాధనలుగా పెట్టుకొన్నాము మనము ఆ దీక్షను నిలబెట్టుకోవలె దానిని విడిచి పెడితే ప్రపంచాన్ని మోసంచేసిన వాళ్ళ మవుతాము. శాంతివల్లనే స్వరాజ్యం

సంపాదించవలె "శ్రమ పడకుండా స్వరాజ్యం సంపాదించి నప్పటికీ దానిని నిలబెట్టుకోలేము త్యాగంచేసి సంపాదించిన స్వరాజ్యం నిలబెట్టుకోగలము హిందూస్థానంలో నివసిస్తున్న మన మందరమూ ఒకే నీరు తాగుతున్నాము, ఒకే గాలి పీలుస్తున్నాము కాబట్టి స్వరాజ్యం హిందువులది, మహమ్మదీయులది, జైనులది, ఇండియాలో నివసించే అందరిది

స్వరాజ్య సంపాదనకు మనం తగి ఉన్నామా? లేదా? అనడానికి మూడు ముఖ్య విషయాలను గురించి ఆలోచించుకోవలె 1 మనము అస్పృశ్య తను నిర్మూలించుకో గలిగినామా? 2 సాంఘిక ఐకమత్యం సాధించ గలిగి నామా? 3 ఆదిమవాసులు (అన్యజాతులు) స్వరాజ్యంలో భాగస్వాములని గుర్తించినామా? ఈ మూడు ప్రశ్నలను గురించి మనకు మనం సంతృప్తికరమైన సమాధానాలు తోచినప్పుడు మనం స్వరాజ్యానికి అర్హులమని భావించ వలసి ఉంటుంది" అన్నారు గాంధీజీ

తరవాత ఆయన ఇంకా ఇట్లా ప్రసంగించినారు "నేనిప్పుడు దక్షిణ భారత హిందీ ప్రచార సభకు అధ్యక్షత వహించ పోతున్నానన్న విషయం మీ కందరికీ తెలిసిందే నాతో ఒకరిద్దరు ఆంధ్ర మహిళలు ప్రయాణం చేస్తున్నారు నేను వారితో హిందూస్థానీలో మాట్లాడినప్పుడు వారు దానిని అర్థం చేసుకోలేక పోయినారు కాబట్టి అందరూ హిందూస్థాని నేర్చుకోవలె మీరు భారతదేశంలోని అన్ని రాష్ట్రాలకు సామాన్య భాషగా ఉండే హిందూస్థానీ నేర్చుకో గోరు తున్నారా? లేక ఇంగ్లీషే కావలెనంటారా? నేను నా సేవా కార్యక్రమాలను భారత దేశంలోని యావత్ప్రజానీకం కోసం సాగిస్తున్నాను అటువంటి సమయంలో నేను భారతదేశంలోని అన్ని భాషలను నేర్చుకోవడం మంచిదా? లేక నా సలహాను అనుసరించేటందుకు హిందూస్థానీ తెలియని ఏ కొద్ది మందో ఆ భాషను నేర్చుకోవడం మంచిదా? అనే విషయం గురించి మీరు ఆలోచించు కోవలె భారత దేశంలోని 33 కోట్ల మంది ప్రజలకు మాతృభాషగా పెంపొందిన హిందూస్థానీ భాషను నేర్చుకోవడం తేలిక కాబట్టి మీరందరూ ఆ భాషను నేర్చు కోవడంలో శ్రద్ధ వహిస్తారని నా విశ్వాసము

స్వరాజ్యం అప్రయత్నంగా ఏదో గారడీతో లభించి ఉండినట్లయితే అది నిలవనే నిలవదు 25 సంవత్సరాలనుంచి మనము సత్యాహింసల ద్వారా స్వాతంత్ర్యం సంపాదించగలమని ప్రపంచానికి చాటి ఉన్నాము అందువల్ల ప్రపంచమంతా మనలను గొప్పగా చూస్తున్నది 1920 లో మనము హింసా యుత మార్గాల ద్వారా స్వరాజ్యం సంపాదించడానికి పూనుకొన్నామని ప్రక టించి అట్లా సంపాదించగలిగి ఉండినట్లయితే ఆ స్వరాజ్యం ఈ పాటికి కోల్పోయి ఉండేవారమే కాబట్టి మీరందరూ సత్యాహింసలద్వారా స్వరాజ్యం సంపాదించగలమని ప్రమాణం చేయగోరుతున్నాను."

ఈ ఉపన్యాసానంతరం సభ నిశ్శబ్దంగా ఉన్నందుకు గాంధీజీ తన సంతోషం వెలిబుచ్చినారు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు నెల్లిమర్లలో నడుస్తూన్న రైలులో ఎట్లాగో ఎక్కి గాంధీజీతో కలిసి ప్రయాణం చేసినారు

## ఉత్తర విశాఖ-క్షామపరిస్థితి

పలాస రైల్వేస్టేషన్ సమీపంలోని బహిరంగసభలో గాంధీజీకి పౌరులోక విజ్ఞాపనపత్రం సమర్పించినారు దానిలో ఉత్తర విశాఖ జిల్లాలోని నిరంతర క్షామపరిస్థితులను గురించి ఆయనకు విన్నవించినారు బర్మానుంచి వచ్చిన అనేక మంది శరణార్థుల సమస్యను గురించి పేర్కొన్నారు నిరంతర క్షామపరిస్థితులకు పరిహారంగా అఖిలభారత గ్రామ పరిశ్రమల యాజమాన్యంకింద గ్రామ పరిశ్రమల సంఘం ఒకదానిని స్థాపించవలసిందిగా మహాత్మాగాంధీని వారు కోరినారు

గాంధీజీకి వ్యవధి లేనందున ఈ విషయాలను గురించి ఆయన తన ఉపన్యాసంలో ముచ్చటించనేలేదు ఆయన ఉపన్యాసంలో ప్రజలు అహింసాయుతంగా క్రమశిక్షణతో ప్రవర్తించవలెనని మాత్రమే ఉద్ఘాటించినారు ఉత్తర విశాఖజిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి శ్రీ గౌతు లచ్చన్నగారు మహాత్మాగాంధీతో ఇచ్ఛాపురంనుంచి ప్రయాణం చేసినారు

దూసి రైల్వేస్టేషన్‌లో కాంగ్రెస్ కార్యకర్తలు ఇంగ్లీషులో ఆయనకు సన్మానపత్రం సమర్పించబోగా ఆయన వారిని గట్టిగా మందలిస్తూ "మీరు ఇంగ్లీష్‌ను మానవలసిన అవసరంలేదు హిందూస్థానీ నేర్చుకోండి మీరేదయినా నాతో మాట్లాడదలచుకొంటె దానిని నాకు తెలుగులోగానీ, హిందూస్థానీలోగానీ చెప్పండి మీరు ఇంగ్లీష్ నేర్చుకోవచ్చు కాని దానిని ఉపయోగించవలసిన అవసరం లేదు" అన్నారు

## రాజమహేంద్రవరం

గాంధీమహాత్ముని రాకను గురించి రాజమహేంద్రవరం రైల్వేస్టేషన్ ఎదట ఉన్న విశాలమయిన మైదానం జనవరి 20 తేది (1946) నుంచి శోభాయమానంగా రూపొందింది మధ్యాహ్నం 3 గంటలనుంచి గాంధీజీ దర్శనార్థమై జనులు గుంపులుగుంపులుగా వచ్చి మైదానంలో సమావేశమయినారు 6 గంటలయ్యేసరికి ఒక లక్షమంది ప్రజలు అక్కడ చేరినారు మైదానంలో సభ జయప్రదంగా జరగడానికి రాజమహేంద్రవర కాంగ్రెస్ సంఘంవారు, మునిసిపల్ అధికారులు, రాజమహేంద్రవరంలోని ఎలక్ట్రిసిటీ కార్పొరేషన్‌వారు, పోలీసువారు, ప్రజలూ కూడా చాలా శ్రద్ధ వహించినారు

గాంధీజీ, ఆయన పరివారం ప్రత్యేక రైలులో సరిగా 7 50 గంటలకు ఆ మైదానానికి వచ్చినారు సమావేశమయి వారందరూ అద్భుతమైన క్రమశిక్షణ ప్రదర్శించినారు, ఎక్కడా ఒక నినాదం కూడా వినబడలేదు రాజమహేంద్రవర హిందీ ప్రచార మండలివారు 500 రూపాయలు సమర్పించినారు, కలప ఖమీ

షన్‌వారు, రాజమండ్రి అల్యూమినియమ్ సామానుల వర్తక సంఘంవారు చెరి 116 రూపాయలు ఇచ్చినారు ఆంధ్ర పేపర్ మిల్లులవారు, మాడరన్ హిందూ హోటల్‌వారు చెరి 100 రూపాయలు ఇచ్చినారు విద్యార్థి కాంగ్రెస్ వారు ఇచ్చిన 84 రూపాయల విరాళము కాక ఇంకా మరికొన్ని చిల్లర్లు కూడా వసూలయినవి మొత్తం 2,200 రూపాయలు గాంధీజీకి సమర్పించడంజరిగింది శ్రీమతి యస్ భోలానాథ్ వ్రాసిన మహాత్మాజీ, శ్రీమతి కస్తూరిబాయి చిత్రపటం గాంధీజీకి సమర్పింపబడినది గాంధీజీ హిందీ సందేశం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు చదివినారు తాను ఆంధ్ర దేశంలో కొంతకాలం ఉండజాలనందుకు విచారిస్తూ ప్రజల దృష్టి నిర్మాణ కార్యక్రమంపై కేంద్రీకరింపవలెనని గాంధీజీ ఉద్బోధించినారు

సామర్లకోట

గాంధీజీ ప్రత్యేక రైలు వాల్తేరునుంచి జనవరి 20 వ తేది సాయంకాలం 3 గంటలకు రాజమహేంద్రవరంవైపుకు బయలుదేరింది అనకాపల్లి స్టేషన్‌కు వచ్చే సరికి గాంధీజీ మౌనవ్రతం అవలంబించినారు అనకాపల్లి సామర్లకోట స్టేషన్లలో గాంధీజీ ప్రజలకు దర్శన మిచ్చినారు జనవరి 20 సాయంత్రం 6 గ॥లకు గాంధీజీ ఉన్నరైలు సామర్లకోట స్టేషన్‌కు వచ్చింది రైలుస్టేషన్‌కడ సుమారురెండువేల మంది స్త్రీలతో సహా ఇరవైఐదువేలమంది ప్రజలు గుమిగూడినారు గాంధీజీ మౌనవ్రతం పాటిస్తూన్నందున వారి సందేశాన్ని కళా వెంకట్రావుగారు చదివి వినిపించినారు "ఇప్పటి సంచారంలో సోమవారం మధ్య వచ్చింది నేను మామూలు మౌనం పాటించవలె ఆంధ్రదేశ సంచారమంటే నాకు సంతోషమే కాని వార్థక్యంవల్ల కొన్నాళ్లయినా ఇక్కడ గడపలేనందుకు చింతిస్తున్నాను మన్నించండి నన్ను చూసేబదులు నిర్మాణ కార్యక్రమం నిర్వర్తించండి" అని గాంధీజీ సందేశము

గాంధీజీ రైలుపెట్టె గుమ్మంవద్దనే నిలుచున్నారు కొంచెంసేపు మాత్రం దిగివచ్చి వేదిక ఏర్పరచిన బల్లవద్దకు నడిచి వచ్చినారు అందువల్ల ప్రజలు యావన్మందికి చూసే వీలు కలిగింది సభ ప్రశాంతంగా జరిగింది గాంధీజీ చాలా సంతోషించినారు

సామర్లకోట స్టేషన్‌లో తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెస్ సంఘా ధ్యక్షుడు శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు గాంధీజీకి స్వాగతాభివాదాలు చెప్పినారు కాకినాడ పఠాన వారు గాంధీజీకి 850 రూపాయల నిధి సమర్పించి నారు ఆయన ప్రోత్సాహంవలన రైల్వేవారు కాకినాడకు సామర్లకోటకు మధ్య ప్రత్యేక రైలు వేసి వేలకొద్దీ ప్రజలు గాంధీజీని దర్శించడానికి అవకాశం కల్పించినారు

సామర్లకోటలో జిల్లా కాంగ్రెస్ సంఘంవారి సహాయంతో స్థానిక కాంగ్రెస్ సంఘంవారు దుద్దుంపూడి సత్యనారాయణగారి నాయకత్వంలో సభ సక్రమంగా జరిగేటందుకు చక్కని ఏర్పాట్లు చేసినారు. సభాస్థలిని కన్నుల

పండువుగా తోరణాలతోను, కాంగ్రెస్ జండాలతోను అలంకరించినారు విద్యుద్దీపాలు, పెట్రోమాక్స్ దీపాలు, దూరశ్రవణ యంత్రాలు అమర్చినారు

కాకినాడనుంచి వచ్చిన వైశ్యయువకుడు యం మాణిక్యం ఒక 116 రూపాయలున్నూ, చిక్కవోలునుంచి వచ్చిన అత్యం పెదసత్తిరాజు ఒక 100 రూపాయలు సమర్పించినారు

వి తిరుపతిరాజు, లక్కరాజు సుబ్బారావుగారలు చెరి యాభై రూపాయలు ఇచ్చినారు పెద్దాపురం కాంగ్రెస్ సంఘం వసూళ్ళు, స్త్రీ వలంటీర్ల వసూళ్ళు చేరి మొత్తం రూ 208-6-2 లు హరిజననిధికి సమర్పించబడినది వేట్లపాలెంవారు ఆజాద్ హిందూఫౌజు నిధికి రూ 116-10-0 లు, హిందీ ప్రచార నిధికి 134 రూపాయలు సమర్పించినారు ఇవికాక ఒక బంగారు ఉంగరము, కొన్ని వెండి గాజులు చాలా నూలు దండలు నూలు పిడులు గాంధీజీకి సమర్పించినారు

**అనకాపల్లి**

గాంధీగారి ప్రత్యేక రైలుబండి అనకాపల్లి స్టేషన్‌కు వచ్చేసరికి సాయంకాలం 3 45 గంటలయింది సుమారు మూడువేలమంది ప్రజలు అనకాపల్లి స్టేషన్‌లో ఆయన దర్శనంకోసం వేచి ఉన్నారు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ టంగుటూరి ప్రకాశంగారు గాంధీజీ ఉన్న పెట్టెలోకి ఎక్కేసరికి ఆయనను గాంధీజీ సాదరపూర్వకంగా ఆలింగనం చేసుకొన్నారు

రైల్వే ప్లాటుఫారంపైననే నిర్మించిన వేదికపైన గాంధీజీ ఆసీనులయిన తరవాత శ్రీ యం జి కన్నయ్యపంతులు ఆయనకు 1,000 రూపాయలు విరాళం సమర్పించినారు శ్రీమతి జి కన్యానమ్మ నూలు దండలను బహూకరించినది గాంధీజీ సభలో హిందీలో మాట్లాడడం ప్రారంభించినారు అప్పుడు చాలా సందడి గందరగోళం జరిగింది. గాంధీజీ మందలించినప్పటికీ ప్రయోజనం లేకపోయింది శ్రీరాంగాంధీ 'రఘుపతిరాఘవ రాజారాం' పాటను పాడినారు సభలో కొందరు దానిని అందుకొన్నారుగాని సందడి మాత్రం తగ్గలేదు ఎంత ప్రయత్నించినప్పటికీ సభ ప్రశాంత స్థితికి రాలేదు అప్పుడు గాంధీజీ తానున్న రైలుపెట్టెలోనికి తిరిగి వెళ్ళిపోయినారు ప్రకాశంగారు దూరశ్రవణ యంత్రాల ద్వారా ప్రజాసమూహాన్ని గట్టిగా మందలించినారు.

స్వచ్ఛంద సైనికులు సభలో సొమ్ము సేకరించి గాంధీజీకి సమర్పించినారు ప్రత్యేక రైలు బండి అనకాపల్లి నుంచి సాయంకాలం 4 గంటలకు బయలుదేరింది గాంధీజీ అనకాపల్లిలోనే మౌనవ్రతం ప్రారంభించినారు. గాంధీజీ మౌనవ్రతం ప్రారంభించక పూర్వం ప్రకాశంగారు మాట్లాడుతూ కొండ వెంకటప్పయ్యపంతులుగారు గాంధీజీని బెజవాడలో కలుసుకొని తెనాలి వరకు ఆయనతో ప్రయాణం చేయనున్నారనిచెప్పినారు. "ఆయన నాకన్న పెద్దవారు,

ఎందుకు ఈశ్రమ అయనకు" అన్నారు గాంధీజీ డాక్టర్ పట్టాభిగారు అస్వస్థతవల్ల రాలేక పోయినారని ప్రకాశంగారు గాంధీజీకి చెప్పగా ఆయన తనవిచారాన్ని, సానుభూతినీ వెల్లడించినారు పట్టాభిగారు గాంధీజీకి ఒకఉత్తరంకూడా వ్రాసినారు

తుని రైలు స్టేషన్‌లో సుమారు పదివేల మంది ప్రజలు గాంధీజీని అత్యుత్సాహంతో ఆహ్వానించినారు సభలో వసూలు చేసిన 1000 రూపాయలపై చిలుకు సొమ్ము గాంధీజీకి సమర్పించడం జరిగింది 15 నిమిషాల తరవాత రైలు తుని నుంచి సామర్లకోటకు వెళ్ళింది

**ఏలూరు**

గాంధీజీ ప్రత్యేక రైలు ఆగే స్టేషన్ల జాబితాలో ఏలూరు చేరి ఉండక పోయినప్పటికీ జనవరి 20వ తేది సాయంకాలం 3 గంటలకు గాంధీజీ ప్రత్యేక రైలు ఏలూరు స్టేషన్‌లో ఆగుతుందనే వార్త ప్రజలకు తెలియవచ్చింది వ్యవధి తక్కువై నప్పటికీ రాత్రి 7 30 గంటలయ్యేసరికి ఏలూరు రైల్వే ప్లాటుఫారం మీద గాంధీజీ దర్శనం కోసం 15వేల మంది ప్రజలు గుమిగూడినారు వారిలో 1000 మంది స్త్రీలు కూడా ఉన్నారు చలిగాలి వేస్తూన్నప్పటికీ ప్రజలు రాత్రి 10 30 గంటలవరకు అట్లాగే ఓర్పుతో గాంధీజీ రాకకోసం కాచుకొని ఉన్నారు అ వచ్చిన గుంపులకు ప్లాటుఫారం పట్టనందువల్ల రైల్వే లైనుకు అవలి పక్క వేలకొద్దీ ప్రజలు నిలబడి ఉండవలసి వచ్చింది 12 మంది ఒక్కొక్కరు 116 రూపాయలవంతున గాంధీజీకి విరాళం సమర్పించినారు చిల్లరగా 300 రూపాయలు వసూలయినవి చాలా మంది స్త్రీలు బంగారు గాజులను, ఉంగరాలను, ముక్కెర్లను సమర్పించినారు ఒక మహిళామణి తొమ్మిది నవరసుల తూకంగల ఒక బంగారు గొలుసు సమర్పించింది మొత్తం 2,500 రూపాయల నగదు, 2,500 రూపాయల విలువగల నగలు వసూలయినాయి రాత్రి 10 15 నిమిషాలకు గాంధీజీ రైలు ఏలూరు స్టేషన్ నుంచి కదిలిపోయింది ప్రజలందరూ ఏ విధమయిన నినాదాలు చేయకుండా ప్రశాంతంగా కూర్చొన్నారు జిల్లా కాంగ్రెస్ అధ్యక్ష కార్యదర్శులు మాగంటి బాపినీడు, సత్తిరాజు రామమూర్తి,వీరమాచనేని వెంకటనారాయణ, కొమ్మారెడ్డిసూర్యనారాయణ, మాగంటి సీతారామదాసు, డా॥ రంగయ్య, చుక్కమ్మగార్లతోబాటు కాంగ్రెస్ కార్యకర్తలు అనేకమంది గాంధీజీకి స్వాగతం చెప్పినారు

గాంధీజీ ప్లాటుఫారానికి అవల నిలబడి ఉన్న ప్రజలకు ముందుగా దర్శనమిచ్చి తరువాత తాను కూర్చున్న పెట్టె ద్వారానికి ముందు ఏర్పాటు చేసిన మేజాపై కెక్కి తక్కిన వారందరికి కనిపించినారు ప్లాటుఫారానికి ఒక మూల గాంధీజీ దర్శనంకోసం ఆతుర పడుతూండిన జనమునుంచి కొంత సందడి వినవడగానే గాంధీజీ తన చేయెత్తి నిశ్శబ్దంగా ఉండండని సైగ చేసినారు అంతటితో సభలో ప్రశాంత స్థితి ఏర్పడింది గాంధీజీ 15 నిమిషాలు నిలబడి విరాళాలను స్వీకరించినారు ఒక స్త్రీ తాను వడికిన నూలుతో గాంధీజీకి

ఖాదీ ధోవతిని బహూకరించింది ఉత్తర హిందూస్థానంనుంచి వచ్చిన ఒక పేద స్వచ్ఛంద సైనికుడు తన గ్రామంలో గ్రామస్థులు వడికిన నూలుతో నేసిన ఉన్ని కంబళిని గాంధీజీకి బహూకరించినారు గాంధీజీ మౌనవ్రతంలో ఉండటం చేత ఆయన ఆంధ్రులకిచ్చిన సందేశం శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు చదివి వినిపించినారు గాంధీజీ తన బండిలోకి ఎక్కిన తరవాత ఆయనతో వచ్చిన రామకృష్ణబజాజ్, కనూగాంధీ మొదలైన వారిని మాగంటి బాపినీడు గారు ప్రజలకు పరిచయం చేసినారు

స్పెషల్ రైలు ఏలూరుకు చేరే తోవలో నిడదవోలు ప్రాంతంలో రెండుచోట్ల ఆగింది ఇది అనుకోకుండ జరిగినా వందలకొద్దీ జనం మహాత్ముని దర్శనం చేసుకొన్నారు హరిజన నాయకుడు గొట్టుముక్కల వెంకన్నగారు మహాత్మునికి హరిజననిధి సమర్పించినారు

### బెజవాడ

గాంధీజీ ప్రత్యేక రైలు బెజవాడకు 1946 జనవరి 21 ఉదయం 6 20 నిమిషాలకు చేరింది ఒక లక్షమంది జనులు ఆయన దర్శనంకోసం సమావేశమయి ఉన్నారు ఆయన మౌనంలో ఉన్నందున ఏమి మాట్లాడలేదు ఆయన రైలు పెట్టె ద్వారం ముందు ప్రజాసమూహామునకు నమస్కరిస్తూ నిలబడినారు రైలు ఒక అరగంటసేపు ఆగింది అనేకమంది ప్రజలిచ్చిన కానుకలను స్వీక రించినారు ఇద్దరు స్త్రీలు ఆయనకు బంగారు గాజులను సమర్పించినారు జన సమూహంలోనుంచి ఎవరో ఒకరు ఒక అర్ధరూపాయి నాణెం విసిరివేయగా అది ఆయన నుదుటికి తగిలింది

అనేకమంది 5 రూపాయలు రుసుము చెల్లించి గాంధీజీ సంతకం తీసు కొన్నారు ఒక పెద్దమనిషి 5 రూపాయల రుసుము చెల్లించి 2 రూపాయల నోటుపైన గాంధీజీ సంతకం తీసుకొన్నారు

### గాంధీజీకి విశ్రాంతి

బెజవాడకు సుమారు 29 మైళ్ళ దూరంలో ఉన్న అంపాపురం స్టేషన్‌లో 20 వ తేది రాత్రి రైలు ఆగింది గాంధీగారి ప్రత్యేక రైలు అక్కడ ఆగు తుందన్న విషయాన్ని చాలా రహస్యంగా ఉంచడంచేత అక్కడికి గుంపులు చేరలేదు ఆయన రాత్రి 10 గంటలకు సుఖంగా నిద్రపోయినారు 21 ఉదయం 6 గంటలకు గుణదల స్టేషన్‌లో 15 నిమిషాలాగింది బెజవాడలో విడిపోవలసిన ఇంజన్ డ్రయివరు, గార్డు, ఇతర రైల్వే సిబ్బంది గాంధీజీకి గౌరవాభివంద నాలు సమర్పించి సెలవు తీసుకొన్నారు వారిలో కొందరు గాంధీజీకి కొంత నిధికూడా ఇచ్చినారు రాత్రి అంపాపురంలో గాంధీజీ రైలుపెట్టెవద్ద శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావు, మరిద్దరు వలంటీర్లు గస్తీ ఉన్నారు.

బెజవాడ స్టేషన్‌లో కొండ వెంకటప్పయ్యపంతులు, వేములకూ ర్మయ్య,

అయ్యదేవర కాళేశ్వరరావు, మరుపిళ్ళచిట్టి, పిడికిటి రామకోటయ్య, పేట బాపయ్య, టి వి యస్ చలపతిరావుగార్లు మొదలైనవారు గాంధీజీని కలుసుకొన్నారు కాళేశ్వరరావుగారు బెజవాడలోనే ఉండిపోయినారు దేశ భక్తుడు మహాత్మునితో వేదాంత చర్చచేస్తూ ఒంగోలుదాకా వచ్చి ఆ ప్రాంతంలో దిగిపోయినారు

## తెనాలి

గాంధీజీ తెనాలి స్టేషన్‌లో స్నానం చేసినారు ప్రకాశంగారు, వెంకటప్పయ్యగారు కలసి మహాత్మునకు గౌరవాభివందనలు సమర్పించినారు

ఎడ్లపల్లిదగ్గర లక్షన్నర జనం కదచిన రాత్రంతా వేచిఉన్నారు గుంటూరుజిల్లా కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు మంతెన వెంకట్రాజుగారు మంచి ఏర్పాట్లు చేసినారు వివిధ గ్రామాలనుంచి సుమారు ఇరవై వేలమంది స్త్రీలు వచ్చినారు (శ్రీ) కల్లూరి చంద్రమౌళి, శరణు రామస్వామిచౌదరి, కాసు బ్రహ్మానందరెడ్డి, నన్నపనేని వెంకట్రావు, మహమ్మద్ ఇస్మాయిల్‌సాహెబ్ మొదలైనవారు గాంధీజీని సత్కరించి సన్మానపత్రం ఇచ్చినారు

కొందరు నిధిని సమర్పించినారు ఉంగరాలు, గడియారం, ముక్కెర్లు సమర్పించినారు దంతంతో చెక్కిన గాంధీజీ విగ్రహాన్ని ఒకరిచ్చినారు ఆ విగ్రహాన్ని చూసి మహాత్ముడు, ఆయన పరివారం ఆనందించినారు స్త్రీలు చాలామంది అనేక కానుకలిచ్చినారు బెజవాడనుంచి ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు వచ్చి మద్రాస్‌వరకూ గాంధీజీతో ప్రయాణం చేసినారు

తెనాలిలో రామకృష్ణబజాజ్, కనూగాంధీగార్లు 'రఘుపతిరాఘవ రాజారాం' భజన చేసిన తరవాత గాంధీజీ ప్రజలకు కనిపించి రైలులోకి వెళ్ళిపోయినారు

## బాపట్ల

బాపట్లలో ఎనిమిదివేలమంది ప్రజలు మహాత్మునకు స్వాగతం చెప్పినారు ఆయన రైలు 15 నిమిషాలాగింది ఆయన ప్రజల సత్కారాలు, కానుకలు, నిధులు స్వీకరించినారు

## చీరాల

చీరాలలో మూడువేలమంది గాంధీ దర్శనం చేసుకొని నిధులు సమర్పించినారు జన సమర్దంలో ఒకరు కింద పడిపోయినారు వారిని ప్రజలు జాగ్రత్తగా లేవదీసినారు

## చినగంజాం

చినగంజాందగ్గర జనం కాంగ్రెస్ జండాలతో రైలును ఆపివేసి గాంధీజీకి కానుకలు సమర్పించినారు.

ఒంగోలు

ఒంగోలులో పదహేనువేలమంది గాంధీజీ దర్శనం చేసుకొని కానుకలు సమర్పించినారు ప్రజల ఒత్తిడిలో ఒకరు కింద పడిపోగా వారిని లేవదీసి మజ్జిగ తాగించినాక స్మారకం వచ్చింది వాటర్ టాంక్ పైన, చెట్లపైనా కూడా జనం నిలిచి మహాత్ముని దర్శించినారు

టంగుటూరు

టంగుటూరులో అవుటర్ సిగ్నల్ వద్ద జండాలు పెట్టి రైలు కడ్డంగా నిలచి ప్రజలు గాంధీజీని దర్శించి ఆయనకు కానుకలు సమర్పించి వెళ్ళిపోయినారు

బిట్రగుంట

బిట్రగుంటలో రైల్వే కార్మిక సంఘంవారు గాంధీజీకి సన్మానపత్రం· కానుకలూ సమర్పించినారు స్టేషన్ కప్పుపైన, చెట్లపైన జనం నిలబడి గాంధీజీని దర్శించినారు ఒక ఆంగ్లో ఇండియన్ స్త్రీ, ఇతర స్త్రీలు చాలామంది గాంధీజీకి కానుకలు సమర్పించినారు కొందరు ప్రభుత్వోద్యోగులు కూడా హరిజననిధికి విరాళమిచ్చినారు కమ్యూనిస్టులు కాంగ్రెస్ లీగు సఖ్యతను గురించి విజ్ఞాపనపత్రం సమర్పించినారు

నెల్లూరు

గాంధీగారి ప్రత్యేక రైలుబండి అంతకు పూర్వం నిర్ణయించిన ప్రకారం నెల్లూరుదగ్గర ఆగింది సుమారు లక్షమంది జనం సమావేశమయినారు సభాస్థలం దూరమయినందున చాలామంది బళ్ళమీద, కార్లమీద, రిక్షాలమీద రావలసి వచ్చింది ఇరవై వేలమంది స్త్రీలే వచ్చినారు కస్తూరికా విద్యాలయం వారు గాంధీజీకి స్వాగతపత్రం సమర్పించినారు జిల్లా కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు శ్రీ పెరుమాళ్ళ నాయుడుగారు హిందీ ప్రచారానికి గాను రూ 116 లున్నూ, ఆజాద్ హిందు ఫౌజు (Indian National Army) కు గాను రూ 8,116 లు గాంధీజీకి సమర్పించినారు ఒక స్త్రీ రెండు బంగారు గాజులను సమర్పించింది చిల్లరగా కొంత సొమ్ము వసూలయింది శ్రీ బెజవాడ గోపాల రెడ్డి, బొమ్మాల శేషురెడ్డి, వెన్నెలగంటి రాఘవయ్య, ఏ సి సుబ్బారెడ్డి, 'జమీను రైతు' సంపాదకులు వెంకట్రామానాయుడు, వంగల కోదండరామిరెడ్డి మొదలయిన ప్రముఖులు గాంధీజీకి గౌరవాభివందనాలు సమర్పించినారు

కళా వెంకట్రావుగారు "భక్తి శ్రద్ధలతో ప్రజలు కాంగ్రెస్ కార్యక్రమం నిర్వర్తించవలెన"ని గాంధీజీ హిందీ సందేశం తెలుగులో చదివి ప్రజలకు వినిపించినారు

గూడూరు

వెంకటగిరి, నాయుడుపేట మొదలైన ప్రాంతాల జనులు చాలామంది గూడూరుకు వచ్చి గాంధీజీ దర్శనం చేసుకొని కానుకలు సమర్పించినారు

సూళ్లూరుపేట

సూళ్లూరుపేటలో స్థానిక కాంగ్రెస్ సంఘంవారు గాంధీజీకి స్వాగత పత్రం ఇచ్చినారు ప్రజలు ఆయనకు నిధులూ, కానుకలూ సమర్పించినారు

పొన్నేరి

పొన్నేరిలో చెంగల్పట్టు జిల్లా కాంగ్రెస్ సంఘాధ్యక్షుడు గాంధీజీని పూలమాలతో సత్కరించి 1116 రూపాయలు సమర్పించినారు సుబ్రహ్మణ్య రెడ్డి మొదలయినవారు ఆయన వెంట మద్రాస్‌కు వెళ్ళినారు

మహాత్ముడు అంబత్తూరులో 4 15 నిమిషాలకు సరిగా రైలు దిగి బసకు చేరుకొన్నారు ప్రకాశం, వెంకట్రావు, గాంధీ పరివారము తమ తమ నిర్దేశ స్థలాలకు రాయపురంనుంచి వెళ్ళినారు

మద్రాసు

గాంధీజీ ప్రత్యేక రైలుబండి అంబత్తూరు స్టేషన్‌కు పోయి అగుతుందనీ, గాంధీజీ అక్కడ దిగుతారనీ రైల్వే అధికారులు ఎవ్వరికీ తెలియకుండ చేసినారు గుంపుల గందరగోళంనుంచి గాంధీజీకి, ఆయన పరివారానికి అనవసర శ్రమ కలగకుండేటందుకు వాహా ఏర్పాటు చేసినారు హిందీ ప్రచార సభ ప్రధానమంత్రి (శ్రీ) మోటూరి సత్యనారాయణకుగానీ రజతోత్సవ సంఘాధ్యక్షుడు (శ్రీ) యస్. గోపాలస్వామయ్యంగారికిగానీ, తుదకు (శ్రీ) సి రాజగోపాలాచారిగారికి కూడా తెలియదు ఈ రహస్యపు ఏర్పాటు చేసిన రైల్వే డిస్ట్రిక్ట్ పోలీస్ సూపరింటెండెంట్ (శ్రీ) సిరాజుద్దీన్ ఈ పైన ఉదాహరించిన నాయకుల నివాస స్థలాలకు మోటారుకారు తీసుకొనివెళ్ళి వారందరినీ అంబత్తూరు స్టేషన్‌లో గాంధీజీ ప్రత్యేక రైలు ఆగే సమయానికి ముందుగా తీసుకొని వచ్చినారు

డాక్టర్ పి సుబ్బరాయన్, (శ్రీ) శివలెంక శంభుప్రసాద్, డాక్టరు పి అన్నంగరాచారి, (శ్రీ) అన్నామలై పిళ్ళై ఈ సంగతి ఎట్లాగో తెలుసుకొని సరియైన సమయానికి అంబత్తూరు స్టేషన్‌కు రాగలిగినారు

(శ్రీ) బి యస్ మూర్తి, (శ్రీ) కె వెంకటస్వామినాయుడు మరికొంత మంది ప్రయత్నించి కూడా సమయానికి వెళ్ళలేక ఆశాభంగం చెందినారు

అంబత్తూరు స్టేషన్‌లో గాంధీజీని తీసుకొని పోయేటందుకు ప్రత్యేకం ఒక మోటారుకారు తయారుగా ఉంది గాంధీజీ ఆ స్టేషన్‌లో చాలా సుఖంగా దిగినారు.

ఆయన మూడో క్లాసు పెట్టెనుంచి వికసిత ముఖంతో, చిరునవ్వులతో మౌనంగా ఉన్నారు అది ఆయన మౌనవ్రతపు రోజు

సి రాజగోపాలాచారి మొదలయిన ప్రముఖ నాయకులు ఆయనకు సాదరపూర్వక స్వాగతం చెప్పినారు అందరికంటె ముందు సి రాజగోపాలాచారి ఆయనను కలుసుకొని శ్రీ యన్ గోపాలస్వామయ్యంగార్, మోటూరి సత్యనారాయణ, కమల్ నయన్ బజాజ్‌గార్లను గాంధీజీకి పరిచయం చేసినారు తరవాత డాక్టర్ సుబ్బరాయన్ గాంధీజీకి గౌరవాభివందనలు సమర్పించినారు

గాంధీజీ మామూలు ప్రకారం రెండు చేతులు జోడించి నమస్కరించినారు నడుమునుంచి వ్రేలాడుతున్న ఆయన గడియారం 4 15 నిమిషాలు చూపెట్టింది

తమిళనాడు కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు గాంధీజీ మెడలో పూవుల దండ వేసినారు

శ్రీ రాజగోపాలాచారి, శ్రీ యన్ గోపాలస్వామయ్యంగార్ తనకు రెండు పక్కలా నడుస్తూండగా గాంధీజీ రైలు ప్లాటుఫారం దాటి బయటకు వెళ్ళి వారిద్దరితో కలసి మోటారుకారులో 10 మైళ్ళ దూరంలో ఉన్న మద్రాస్‌కు వెళ్ళినారు

గాంధీ కార్యదర్శి ప్యారేలాల్, కమల్ నయన్ బజాజ్ మరొక కారులో వెళ్ళినారు

గాంధీజీ కారు మద్రాస్ నగరంలోని హిందూస్థానీనగరంలో, జనసమ్మర్దం తప్పించుకొనే ఉద్దేశంతో చుట్టు తిరిగి వెళ్ళింది

గాంధీజీ రాకకై సెంట్రల్ స్టేషన్‌లోనూ, ఇంకా ఇతర స్టేషన్‌లలోనూ వేచిఉన్న ప్రజలు ఆశాభంగం చెంది వెళ్ళిపోయినారు

## హిందీ ప్రచార భవనము

శ్రీ సి రాజగోపాలచారి, శ్రీ యన్ గోపాలస్వామయ్యంగార్, శ్రీ సత్యనారాయణ, శ్రీ కమల్ నయన్ బజాజ్‌గార్లతో కలసి గాంధీజీ సరిగా సాయంకాలం 4 50 నిమిషాలకు హిందీ ప్రచార భవనానికి చేరుకొన్నారు

ఆయన రాగానే శ్రీ కె. సంజీవకామత్, శ్రీ కె బాలసుబ్రహ్మణ్య అయ్యర్, హిందీ ప్రచార సభకు సంబంధించిన శ్రీ రఘువీరదయాళ్ మిశ్రా ఆయనకు ఎదురేగి ఆహ్వానించి ఆయనను ఖాదీ దండలతో సత్కరించినారు

హిందీ ప్రచార భవనానికి పోయేరోడ్డు కిరుపైపులా సాయంకాలం 2 గంటలనుంచి ప్రజలు బారులు తీరి గాంధీజీ రాకకై వేచి ఉన్నారు కారులు పోవడానికి తగినచోటు వదలి ప్రజలు ఎంతో ప్రశాంతంగా ఉన్నారు గాంధీజీ రాకకు పూర్వమే హిందీప్రచార కార్యకర్తలు దూరశ్రవణ యంత్రాలద్వారా ప్రజలను నిశ్శబ్దంగా ఉండవలసిందని ప్రబోధించినందున ఆ సత్ఫలితం కలిగింది

గాంధీజీ కారు దిగగానే రోడ్డు కిరుపక్కలా ఉన్న జన సమూహం

మౌనంగా చేతులు జోడించి నమస్కరించినారు గాంధీజీ నలువైపులా చూసినారు ప్రజల ప్రశంసనీయమయిన ప్రవర్తన గాంధీజీని ఆకర్షించింది ఆయన ముఖం వికసించింది ఆయన పెదవులపైన చిరునవ్వు చిందులాడింది ప్రజలకు ఆయన చేతులు జోడించి వారి గౌరవాభివందనాలు స్వీకరించినారు సరిగా అప్పుడే యెవరో ఒక్కరు 'మహాత్మాగాంధీకిజై' అన్నారు గాంధీజీ తన తర్జనితో మందలించినారు జనం ఆయన ఆదేశానికి విధేయులై మారు పలుకక నిశ్శబ్దంగా ఉన్నారు

తరవాత గాంధీజీని, రాజగోపాలాచారి, మోటూరి సత్యనారాయణగార్లు తోడ్కొనిపోగా ఆయన మెల్లగా తోటదోవన తన బసకు చేరుకొన్నారు ఇంతకు పూర్వం ఆయన వచ్చినప్పుడు కూడా ఆ బంగళాలోనే ఉన్నారు! దానికి హిందిసాహిత్య సభవారు "గాంధీనివాస్" అని నామకరణం చేసినారు దానిలో ఆయన 10 నిమిషాలు ఉన్నారు అప్పుడు హిందీప్రచార సభ కార్యకర్తల కుటుంబ సభ్యులు, స్త్రీలు చాలా మంది ఆయనకు స్వాగతం చెప్పినారు శ్రీమతి సత్యనారాయణ, శ్రీమతి మోహన్‌లాల్ మెహతాలు గాంధీజీ నుదుట కుంకుమ ఉంచి హారతి సమర్పించినారు తరవాత చాలా మంది స్త్రీలు ఒకరి తరవాత ఒకరు వచ్చి గాంధీజీ పాదాలను పూజ్యభావంతో స్పృశించినారు గాంధీజీ వారితో కొన్ని నిమిషాలు సంతోషంగా ముచ్చటించినారు తరవాత స్త్రీలలో ఒకరు-బహుశా తమిళ మహిళ అయి ఉండవచ్చు-గాంధీజీని తమిళంలో కొన్ని మాటలు చెప్పమని కోరింది గాంధీజీ నవ్వి, తమిళంలో "ఎన్నా, తమిళ తిరియుమే" అన్నారు వెంటనే ఒక ఆంధ్ర స్త్రీ గాంధీజీని తెలుగులో మాట్లాడ మని కోరింది గాంధీజీ హిందూస్థానిలో తెలుగు తనకు తెలుసు అని అంటూ వారందరూ హిందూస్థానీ నేర్చుకోవాలని కోరినారు 'గాంధీనివాస్'లోని దృశ్యాలన్నీ హృదయాకర్షకాలుగా ఉన్నవి

తరవాత పక్కనున్న తన తాత్కాలిక వసతికి గాంధీజీ మెల్లిగా నడిచి వెళ్ళినారు ఆయన తన వసతి గృహంలో ప్రవేశించే ముందు ఆయన దర్శనం కోసం ఆవరణలోకి తోసుకొని వస్తూన్న జనం దగ్గర నుంచి సెలవు తీసుకొన్నారు స్వచ్ఛంద సేవకులు గాంధీజీ పోయే తోవలో జనాన్ని చక్కగా సర్దుబాటు చేసినారు

## హిందీప్రచార సభలో గాంధీజీ ఉపన్యాసము

హిందీ ప్రచార సభకు పక్కన ఉన్న బంగళాలో గాంధీజీ ప్రవేశించిన తరవాత ఆయన దర్శనం కోసం అంతకంతకూ జనసమూహం కొన్ని వేల సంఖ్య వరకూ పెచ్చుపెరిగి పోయింది శ్రీ మోటూరి సత్యనారాయణ, కె భాష్యం గార్లు జనాన్ని వెళ్ళిపొమ్మని శాఖాలలో బిగ్గరగా చెప్పినప్పటికి గాంధీజీ దర్శనం చేయనిది తాము పోదలచుకొనలేదని చెబుతూ అందరూ నేలమీద అక్కడే కూర్చుండి ఉన్నారు

ఈ ధ్వని గాంధీజీకి వినిపించింది ఈలోగా ప్రజలు గాంధీజీ దర్శనం కోసం పట్టుదలగా ఉన్నారనే వార్త మహాత్మునకు చేరింది చివరకు గాంధీజీ ప్రజల కోరికకు లొంగిపోక తప్పిందికాదు ఈ శుభవార్త ప్రజా సమూహానికి చేరగానే చెవులు గింగురు మనేటట్లు జనుల కరతాళ ధ్వనులు మిన్ను ముట్టినాయి

గాంధీగారి కార్యదర్శి ప్యారేలాల్ అక్కడ సమావేశమయిన వారిని హిందీలో ఉద్బోధిస్తూ వారు గాంధీజీ దర్శనం కోరితే అందరూ నిశ్శబ్దంగా ఉండవలెనని కోరినారు

గాంధీజీ సమావేశానికి వచ్చేలోగా ప్రజల దృష్టిని ఆకర్షించి వారిని నిశ్శబ్దంగా ఉంచేటందుకు ఒక వలంటీరు కొన్ని జాతీయ గీతాలను మధురంగా పాడినారు

గాంధీజీ, శ్రీ రఘువీరదయాళ్ మిశ్రా కుమార్తె భుజాలపైన అనుకొని సభాస్థలానికి వచ్చేసరికి దాదాపు రాత్రి 7 గంటలయింది డాక్టర్ పి. బి అన్నంగరాచారి గాంధీజీని చేయి పట్టుకొని మేజామీద ఎక్కించినారు అంతట మహాత్ముడు తనకు ఎదురుగా ఆవరణ వెలుపల ఉన్న ప్రజా సమూహాన్ని చూసినారు

ఆయనను చూసినందున ఆనందం పట్టజాలక 'గాంధీకిజై' అని కేకలు పెట్టినారు గాంధీజీ తన తర్జనితో వారించగా యావత్ప్రజానీకం మంత్ర ముగ్ధమయినట్లు నిశ్శబ్దంగా ఉండిపోయింది

గాంధీజీ హిందూస్థానీలో మాట్లాడుతూ ప్రజలను నిశ్శబ్దంగానూ క్రమ బద్ధంగానూ ఉండవలెనని కోరినారు ప్రతి ఒక్కరూ నిశ్శబ్దంగా ఉంటేనే కాని ఆ మహాజన సమూహంలో తన మాట ప్రతి ఒక్కరికీ వినిపించదని, ప్రతి ఒక్కరికీ తన మాట వినిపించవలెనని తాను వాంఛిస్తున్నాననీ అన్నారు

గాంధీగారి ప్రసంగం శ్రీ భాష్యంగారు తమిళంలోకి అనువదించినారు కాని జనులు మళ్ళా 'మహాత్మాగాంధీకి జై' అని అరిచినారు అప్పుడు "మద్రాస్ పౌరులు ఇంత క్రమశిక్షణా రహితంగా ప్రవర్తిస్తారని నేననుకోలేదు మీరు క్రమశిక్షణతో ప్రవర్తించకుంటే తిరిగి మీ వద్దకు నేనెట్లా రాగలను" అని గట్టిగా మందలించినారు

తరవాత గాంధీజీ రామ్‌ధున్ పాడమన్నారు ప్యారేలాల్ 'రఘుపతి రాఘవ రాజారాం' కీర్తన పాడినారు గాంధీజీ వ్రేళ్ళను ఆడిస్తూ తాళంవేస్తూ కాలక్షేపం చేసినారు ఆ జన సమూహం కూడా నిగ్రహంతో లయబద్ధంగా తాళం వేయడం ప్రారంభించినారు ఆ భజనకనుగుణంగా గుంపులు ప్రవర్తించ డం చూసి గాంధీజీ ఎంతో ముచ్చట పడినట్లు కనిపించింది జనమంతా కలసి కన్నులు మూసుకొని పాడుతూండడం గాంధీజీ గమనించినారు ఆ పాట పాడి నంత కాలము గాంధీజీ ధ్యాన నిమగ్నులయి ఉన్నారు 5 నిమిషాలకు రామధున్ ముగిసింది గాంధీజీ ప్రజలను ఉద్దేశించి "ఇప్పుడు మీరు నన్ను

చూసినారు కదా! ఇక మీరందరూ మీ ఇండ్లకుపోండి నాపని నేను ప్రశాంతంగా చూసుకొంటాను" అన్నారు కాని జనులు సంతృప్తి పడలేదు అంతవరకు జరిగిన కార్యక్రమమంతా దీపాలు లేకుండా జరిగింది ప్రజలు "దీపాలు! దీపాలు! మేము గాంధీజీని చూడవలె" అని కేకలు పెట్టినారు

విద్యుచ్ఛాఖా సిబ్బందివారు వెంటనే ఒక విద్యుత్ కాంతిని గాంధీజీపై ప్రసరింపజేసి ప్రజలకాయన స్పష్టంగా కనబడేటట్లు చేసినారు ఆ విద్యుత్ప్రసారంలో కుంకుమ తిలకంతో, సహజ మందహాసంతో, ముకుళిత హస్తాలతో నిలబడి గాంధీజీ స్పష్టంగా ప్రజలకు ప్రత్యక్షమయినారు అట్లా ఒక్క నిమిషం నిలిచిన తరవాత గాంధీజీ ప్రజలను వెళ్ళిపొమ్మని కోరినారు "నేను చాలా దూరంనుంచి ప్రయాణం చేసి వస్తున్నాను నేనింతవరకు స్నానమూ, భోజనమూ కూడా చేయలేదు నాకు ఇంకా ఎంతో పని ఉంది ఈ రాత్రంతా మీతో ఉండి నేను కాలక్షేపం చేయవలెనని కోరికయా" అన్నారు

ఇందుకు జనసమూహం ఒక్కుమ్మడిగా "వద్దు, వద్దు, ఇంక మిమ్ము ఆగమని అనం" అన్నారు "అయితే నన్ను పోనివ్వండి నాకన్నా ముందుగా మీరందరూ నెమ్మదిగా ఇండ్లకు వెళ్ళిపోవలె ఇది నా ప్రార్థన మీరందరూ అట్లా వెళ్ళడానికి సంసిద్ధంగా ఉన్నారా" అన్నారు గాంధీజీ "అవును" అని అందరూ ఏకగ్రీవంగా "పోకిరాం" అని అరిచినారు తమిళులు

"ఇక నేను వెళ్ళడానికి మీరు సెలవిస్తున్నారన్నమాట" అన్నారు గాంధీజీ. జనం అందుకు ప్రతిగా "అవును" అన్నారు గాంధీజీ నెమ్మదిగా బల్ల నుంచి దిగి తన బసకు వెళ్ళిపోయినారు గాంధీజీ దర్శనం లభించినందుకు చాలా సంతోషిస్తూ జనులు ఎక్కడివారక్కడ వెళ్ళిపోయినారు

### గాంధీజీకి విశ్రాంతి

గాంధీజీ కలకత్తానుంచి మద్రాస్‌కు దీర్ఘప్రయాణం చేసి ఉండటంచేత 1946 జనవరి 22 వ తేదిని గాంధీజీ విశ్రాంతి తీసుకొన్నారు ఆ రోజు శ్రీమతి కస్తూరిబా స్మారకపు రోజుగా గాంధీజీ ప్రార్థనలోనూ, నూలు వడకడంలోనూ కాలం గడిపినారు

జనవరి 23 ఉదయం 4 గంటలకు ఆయన మేల్కొన్నారు ఆయనతో పాటు ఆయన పరివారంలోని సభ్యులందరూ మేల్కొని ఉదయ ప్రార్థనలో పాల్గొన్నారు గాంధీజీ ఉదయ ప్రార్థనలో పాల్గొనటానికి కొంతమంది ఇతరులు కూడా వచ్చినారు

ఉదయమున స్నానాది నిత్యకృత్యాలను తీర్చుకొన్న తరవాత చాలా మంది మిత్రులు, తన ఆశ్రమంలో కొంతకాలం ఉండి వెళ్ళిన అనుచరులు అనేక మంది గాంధీజీని దర్శించడానికి వచ్చినారు

గాంధీజీని దర్శించిన వారిలో హరిజన నాయకుడు జె శివషణ్ముగంపిళ్ళై ఒకరు. సాయంకాలం పిఠాపురం మహారాజాయువరాజాగార్లు తదితరులతో పాటు

ఆయన దర్శనార్థం వచ్చినారు

28 సాయంకాలం సరిగా 5½ గంటలకు గాంధీజీ ఆయన బృందము మిస్ అగతాహారిసన్‌తో కలసి ప్రార్థనా సమావేశానికి వెళ్ళినారు ప్రార్థన తక్షణం ప్రారంభమయింది అంతమంది ప్రజలు ప్రార్థనా సమావేశానికి వచ్చినందుకు గాంధీజీ మహదానందభరితుడై హిందూస్థానీలో దాదాపు 20 నిమిషాలు మాట్లాడినారు

గాంధీజీ ఉపన్యాసం అరవంలోకి అనువాదం చేసినారు అంతకు పూర్వం తెలుగులో కూడా అనువాదం జరుగుతుందని ప్రకటింపబడడంచేత అది జరగనందుకు కొందరు లేచి తెలుగులో కూడా చెప్పించవలసిందని గాంధీజీని కోరినారు అప్పుడు గాంధీజీ ప్రశాంతంగా ఉండమని హిందూస్థానీలో చెప్పగా మోటూరి సత్యనారాయణగారు దానిని తెలుగులో వినిపించినారు ఇంతలో గాంధీజీ ధ్యాననిమగ్నులయినారు ప్రార్థన యథావిధిగా జరిగింది డాక్టర్ టి సీతాపతయ్యర్ గారి కుమార్తె 'ముమ్మూర్తులా' అనే త్యాగరాజు కృతిని శ్రావ్యంగా పాడింది ప్రార్థనానంతరం మహాత్ముడు కొంచెం దీర్ఘంగా ప్రవచనం చేసినారు భాషాభేదాలు స్వరాజ్య సమరానికి అంతరాయమని చెప్పినారు గాంధీజీ ఉపన్యసిస్తుండగా రెండు మూడు వాక్యాలు ఒక్కసారిగా హిందీ పండితు డొకాయన అరవంలోకి అనువాదం చేసి చెప్పినారు చివరకు గాంధీగారు 10, 15 నిముషాల తడవు అనర్గళంగా ఉపన్యసించినారు అది అరవంలోకి తర్జుమా అయింది అరవ అనువాదకుడు మహాత్ముని మాటలు తీరుపోకుండా స్ఫూర్తిమంతంగా చెప్పినారు. ఆయన చెప్పినంత సేపు జనం ఆయన మాటలను పరమశాంతంగా విన్నారు

గాంధీజీ ప్రార్థనోపన్యాసం ఒక్క అరవంలోనే అనువదింపబడి తెలుగు, కన్నడ, మలయాళ భాషలలో అనువాదం జరగకపోవడంవల్ల పలు ప్రాంతాల నుంచి గాంధీజీ దర్శనం చేసుకొని, వారి ఉపన్యాసం వినవలెననే కోరికతో మద్రాసుకు వచ్చిన అసంఖ్యాకులయిన జనం ఆశాభంగం పొందినారు

గాంధీజీ వారి ఆశాభంగం గమనించి వారందరూ ప్రస్తుతం తమకు హిందూస్థానీ తెలియనందుకు సిగ్గుపడవలసిన అవసరం లేదనీ, ఇకముందయినా హిందూస్థానీ నేర్చుకోవలసిందనీ ప్రబోధించినారు

తన మద్రాస్ రాకను గురించి ప్రసంగిస్తూ తాను మద్రాస్ ప్రస్తుతం రాదలుచుకోలేదనీ, అసలు సేవాగ్రామమే విడిచిపెట్టదలుచుకోనలేదనీ, సేవాగ్రామమునుంచి బెంగాలుకు వెళ్ళిన తరవాత బెంగాల్ నుంచి సరాసరి తిరిగి సేవాగ్రామానికే పోదలుచుకొన్నాననీ, కాని కేవలం దైవఘటనవల్ల మద్రాస్‌కు వచ్చినానని, అందువల్ల తనరాక జయప్రదం కాగలదని ఆశిస్తున్నాననీ అన్నారు

ఈ ఉపన్యాసానంతరం గాంధీజీ సభ్యులకు నమస్కరించి సెలవు తీసుకొన్నారు.

శ్రీ శ్రీనివాసశాస్త్రి

1948 జనవరి 23 రాత్రి మద్రాస్ జనరల్ హాస్పిటల్‌లో చికిత్స పొందుతూండిన రైట్ ఆనరబుల్ శ్రీనివాస శాస్త్రిగారిని గాంధీజీ కలుసుకొన్నారు వారితో ఒక అరగంటసేపు కాలక్షేపం చేసినారు

ఆసుపత్రి నుంచి తిరిగి వచ్చేటప్పుడు గాంధీజీ ఒకవార్డ్‌లోకి పోయి అక్కడ చికిత్స పొందుతున్న రోగులను చూసి వారి యోగక్షేమాలను అడిగి తెలుసుకొన్నారు

బ్రిటిష్ పార్లమెంటరీ ప్రతినిధులు

జనవరి 23 రాత్రి బ్రిటిష్ పార్లమెంటరీ ప్రతినిధులు గాంధీజీని హిందూస్థానీ నగర్‌లోని ఆయన బసలో కలుసుకొన్నారు వారు రెండు గంటలసేపు భారత దేశ వ్యవహారాలను గురించి గాంధీజీతో చర్చించినారు

తదనంతరం గాంధీజీ భోజనంచేసి ప్రార్థనా సమావేశానికి వెళ్ళినారు. ప్రార్థన ప్రదేశమంతా జనసమూహంతో మహాసముద్రంవలె క్రిక్కిరిసి పోయింది సుమారు యాభై వేలమంది హాజరయినారు

గాంధీజీ సరిగా 5-30 నిమిషాలకు ప్రార్థనా సమావేశానికి వచ్చినారు సభ చాలా సందడిగా ఉంది మామూలు అలవాటుకు భిన్నంగా ప్రార్థన జరిగినంతసేపు ఆయన నిలబడే ఉన్నారు

సభలో సందడి జరగడం గమనించి, "ఆహారం సరిగా జీర్ణం చేసుకోలేని రోగులకు ఎంతమంచి ఆహార మిచ్చినప్పటికీ అది విషంగా పరిణమిస్తుంది, అట్లాగే ప్రజలలో క్రమశిక్షణ లేని పక్షంలో స్వాతంత్ర్యంగానీ, స్వరాజ్యంగానీ శుభావహంగా పరిణమిస్తుందని చెప్పటానికి వీలు లేదు" అన్నారు గాంధీజీ

కార్మిక మహాసభ

మద్రాస్ రాజధానిలోని పలుప్రాంతాలనుంచి రెండువేలమంది కార్మికులు సమావేశమయినారు వారిలో అనేకమంది స్త్రీ కార్మికులు కూడా ఉన్నారు

గాంధీజీ ఆ కార్మిక సభకు ప్రారంభోత్సవం చేస్తూ 15 నిమిషాలు హిందూస్థానీలో మాట్లాడినారు

జనవరి 24 వ తేదీ మధ్యాహ్నం నిర్మాణ కార్యకర్తల రెండో రోజు సమావేశంలో గాంధీజీ కార్యకర్తలు వేసిన అనేక ప్రశ్నలకు సమాధానమిచ్చినారు వారి సమాధానాలలో చాలా హాస్యంకూడా ఇమిడి ఉన్నది ప్రశ్నలూ సమాధానాలు కలసి దాదాపు 45 నిమిషాలు పట్టింది. గాంధీజీ హిందూస్థానీలోనే మాట్లాడినారు.

## జనవరి 26

1946 జనవరి 26 వ తేది స్వాతంత్ర్యదినం సాయంకాలం గాంధీజీ ప్రార్థనా సమావేశంలో ప్రసంగిస్తూ రాబోయే సంవత్సరంలో మనమీ స్వాతంత్ర్య ప్రమాణపత్రాన్ని పునరుద్ఘాటించవలసిన అవసరం ఉండదనీ, అంతకు పూర్వమే మనం స్వాతంత్ర్యం పొందగలమని ఆశిస్తున్నానని అన్నారు

ఆనాడు మామూలు ప్రకారం జరిగే గీతోపనిషత్ శ్లోకపఠనాలు జరగలేదు తక్కిన ప్రార్థనలు జరిగినాయి

గాంధీజీ ఆ సమావేశంలో మాట్లాడుతూ ఆ కిందటిరోజు జరిగిన ఒక ఉదంతం గురించి ప్రసంగించినారు ఆ కిందటి రోజు ప్రార్థనా సమావేశంలో గాంధీజీ ప్రసంగానికి తెలుగు అనువాదం చెప్పవలసిందని సభలో ఒకరు లేచి గట్టిగా పట్టుబట్టి అడిగినారు ఆ ఉదంతం ఆయనకు చాలా బాధ కలిగించింది కాని ఒక సిద్ధంగా ఓదార్పు కూడా కలిగించింది ఎవరో ఒకరంత పిచ్చి పట్టు పట్టినప్పటికీ ఆయన చుట్టూ ఉన్న వారందరూ ఆ గొడవలో పాల్గొనక ప్రశాంతంగా ఉన్నందున ఆయనకు మనస్సంతృప్తి కలిగింది చక్కగా జరిగే సమావేశాలలోని ప్రజలు అట్లా ప్రవర్తించవలె

కిందటి రోజు సమావేశంలో చేసిన ప్రకటన ప్రకారం జనవరి 26 సాయంకాలం జరుగుతున్న ప్రార్థన సమావేశంలో ప్రార్థనానంతరం తాను చెప్పే మాటలు తెలుగులోకిగానీ, తమిళంలోకిగానీ, అనువాదం చేయడం జరగదని గాంధీజీ అన్నారు ప్రార్థనా గీతంకూడా హిందూస్థానీలోనే ఉన్నది ప్రార్థనా గీతంలోని భాష వివాదగ్రస్తం కాకూడదని గాంధీజీ అభిప్రాయము. తాను దక్షిణాదికి వచ్చినప్పుడంతా ఆంధ్రుల మధ్య, అరవల మధ్య పరస్పర స్పర్ధలనూ, నిందారోపణలనూ గమనిస్తున్నానని, అది చాలా అవాంఛనీయమని గాంధీజీ ఉభయులను గట్టిగా మందలించినారు తమిళులు, ఆంధ్రులు, కన్నడులు, మళయాళీలు, ప్రత్యేక భాషలకు చెందినవారు కావచ్చు కాని వారు ఒకరి కొకరు ప్రత్యర్థులుకారు వారు ఒకే మహావృక్షంలోని శాఖలవంటివారు వారి భిన్నత్వంలో అంతర్లీనంగా ఉన్న ప్రధానమయిన ఏకత్వం వారు గ్రహించి తీరవలె అప్పుడే వారు స్వాతంత్ర్యానికి అర్హులవుతారు

### హరిజనుల భాసానాకం

ఆంధ్రరాష్ట్ర ఆదిమాంధ్ర సంఘంవారు తమ అధ్యక్షుడు రాయుడు గంగయ్య యాజమాన్యంకింద గాంధీజీని కలుసుకొని వారి కష్టాలనూ, కోరికలనూ వివరిస్తూ ఆయనకొక విజ్ఞాపనపత్రం సమర్పించినారు. ఆ రాయబార వర్గంలో శ్రీ వి యస్. మూర్తి, వేముల కూర్మయ్య, యస్ నాగప్ప, పి సుబ్బయ్య, కే. షణ్ముఖం, డి. గోవిందదాసు, శ్రీమతులు వి. కె రుక్మిణమ్మ, శ్యామలాదేవి, సునందాదేవిగార్లు ఉన్నారు గాంధీజీ దగ్గరికి ఈ రాయబార వర్గం వచ్చినప్పుడు శ్రీ ఏ వి. ఠక్కర్ కూడా ఉన్నారు.

గాంధీజీ విజ్ఞాపనపత్రం చూసి వాటిలోని విషయం జాగ్రత్తగా పరిశీలించగలనని రాయబార వర్గానికి చెప్పినారు

## గౌతమీ విద్యాపీఠంలోని పండితులు

జనవరి 26 సాయంకాలం శ్రీ కె. వి. గోపాలరావుగారి నాయకత్వంలో రాజమహేంద్రవరంలోని గౌతమీ విద్యాపీఠంలోని పండిత బృందంవారు గాంధీజీని కలుసుకొన్నారు వారు 25 రూపాయల విరాళం కూడా గాంధీజీకి సమర్పించినారు ప్రాచ్య సంస్కృతిని ఆ సంస్థ ఎట్లా పెంపొందిస్తున్నదో కొన్ని వివరాలు తెలియజేసినారు గాంధీజీ ఆ సంస్థను కార్యకర్తలను ఆశీర్వదించినారు

## ఆదిమాంధ్ర యువజన సంఘము

మద్రాస్‌నందలి కృష్ణంపేటలోని ఆదిమాంధ్ర యువజన సంఘంవారు నడుపుతూన్న కస్తూరిబా పఠనమందిర గ్రంథాలయ నూతన భవన నిర్మాణానికి గాంధీజీ శంకుస్థాపన చేసినారు ఆ కార్యక్రమం అత్యుత్సాహంగా జరిగింది

## గాంధీజీ-ప్రకాశంగారు

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ టంగుటూరి ప్రకాశంగారు, కళా వెంకటరావు, నీలం సంజీవరెడ్డి మొదలైన ప్రముఖులు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారి ఆదేశానుసారం వారి పక్షాన గాంధీజీని దర్శించి ఏలూరు సమీపంలో ఉన్న కోగన్నపాలెంలోను, విజయవాడకు సమీపంలో ఉన్న గుణదలలోను జరుగుతూండిన కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంలోని ముఖ్య విషయాలను గురించి ముచ్చటించినారు

ప్రకాశంగారు కడచిన శుక్రవారం (25-1-1946) నాటి ప్రార్థన సమావేశంలో జరిగిన అంతరాయం గురించి ప్రస్తావిస్తూ గాంధీజీకి విచారం వెలిబుచ్చి క్షమాపణ చెప్పినారు

ఆంధ్రులను బాగా అర్థం చేసుకొనేటందుకు ప్రతి సంవత్సరం రెండు మాసాలయినా ఆంధ్రదేశంలో నివసించవలసిందని ప్రకాశం పంతులుగారు గాంధీజీని అర్థించినారు ఆంధ్రదేశంలో అగ్రశ్రేణికి చెందిన ప్రకృతి చికిత్సాలయాలు ఉన్నాయని గాంధీజీ కోసం కృష్ణానదీతీరానగానీ, గోదావరి ఒడ్డునగాని ఒక ఆశ్రమం కూడా ఆంధ్రులు నిర్మించగలరని ప్రకాశంగారు గాంధీజీకి విన్నవించినారు

మద్రాస్‌నుంచి తిరిగి పోయేటప్పుడు ఆంధ్రదేశంలో కనీసం కొన్నిచోట్లలోనయినా దిగవలసిందని ప్రకాశంగారు గాంధీజీని ఆహ్వానించినారు. గాంధీజీ, ప్రస్తుతం వారికోరికను మన్నింపజాలననీ, తగిన అవకాశం వచ్చినప్పుడు తప్పకుండా ఆలోచించగలననీ అన్నారు.

## జాతీయ ముస్లిమ్‌లు

జనవరి 26 సాయంకాలం ప్రార్థన ముగిసిన తరవాత గాంధీజీ మంగళ్ భవనానికి వెళ్ళినారు అక్కడనే శ్రీమతి యం యస్ సుబ్బలక్ష్మి ఆయన దర్శనానికి వచ్చినారు ఆమెను రాజగోపాలాచారిగారు గాంధీజీకి పరిచయం చేసినారు గాంధీజీ కోరిక పైన ఆమె కొన్ని భజన పాటలు పాడినారు

ఆ తరవాత జాతీయ ముస్లిమ్‌లు గాంధీజీదగ్గరకు సాయంకాలం వచ్చినారు తమ ఇరుగుపొరుగు వారిపట్ల సహృదాభావాన్ని, అనురాగాన్ని పూర్తిగా పెంపొందించుకోవలెనని, తమ కార్యక్రమం ధైర్యంతో కొనసాగించవలెనని గాంధీజీ వారికి సలహా ఇచ్చినారు

## గాంధీజీ సంతకాలు

గాంధీజీ సంతకాలను కోరిన వారందరూ ఒక్కొక్కరు 5 రూపాయలు రుసుము చెల్లించినందున దాదాపు 700 రూపాయలు హరిజననిధికి లభించింది

జనవరి 27వ తేది మధ్యాహ్నం నిర్మాణకార్యకర్తల సభ నాలుగోరోజున తిరిగి సమావేశమయింది కార్యకర్తలడిగిన ప్రశ్నలకు ప్రత్యుత్తరమిస్తూ గాంధీజీ నిర్మాణకార్యక్రమం గురించి, నయీతాలీమును గురించి 15నిముషాలు ఉపన్యసించినారు

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ పట్టప్రదానోత్సవం

దక్షిణభారత హిందీ ప్రచారసభ పట్టప్రదానోత్సవ సమయంలో గాంధీజీ, నూతనంగా హిందీ సనదులను పొందుతున్న వారినుద్దేశించి "మీరు తీసుకొన్న ప్రమాణం ప్రకారం హిందూస్థానీ ప్రచారం ద్వారా భారతదేశ ఐక్యానికి దోహదం చేస్తూ భారతప్రజను సేవించ గోరుతున్నాను" అని ఉపన్యసించినారు.

తరవాత వారికి డిగ్రీలు, పతకాలు బహూకరింపబడినాయి సనదులను పంచిపెట్టటానికి 45 నిముషాలు పట్టింది

సనదులను స్వీకరించేవారు చాలామంది గాంధీజీమెడలో దండలు వేయటానికి ప్రయత్నించినారు కాని ఆయన, తనమెడలో దండలు వేయటానికి వారికి అవకాశం లేకుండాచేసి తానే చేయిచాచి వాటిని స్వీకరించడం ప్రారంభించినారు కాని వారిలో ఒకరు గాంధీజీదృష్టి మరొకవైపుకు మరలిఉండటం కనిపెట్టి ఒక్కక్షణంలో ఒక ఖాదీదండను ఆయన మెడలో వేసినారు అప్పుడు సభలో కరతాళధ్వనులు మిన్నుముట్టినాయి. "ఈ పట్టభద్రుడు నామీద ఒక పందెం గెలిచినాడు" అని గాంధీజీ పకపకా నవ్వినారు.

మరొక పట్టభద్రుడు కూడా గాంధీజీపైన అదేయుక్తి ప్రయోగించవలెనని చూసినాడు, కాని గాంధీజీ ఈపర్యాయం ఆ ఆట సాగనివ్వలేదు.

## గాంధీజీ మౌనవ్రతదినము

జనవరి 28 వ తేదీ సోమవారం గాంధీజీకి మౌనవ్రతపురోజు అరోజున ఆయన హిందూస్థానీనగరంలోని అన్నిశిబిరాలను పూరాత్తుగా తిరిగి పరిశీలించడం ప్రారంభించినారు ఆయన ఉదయ వాహ్యాళిలో హిందూస్థానీ నగరంలోని ఏర్పాట్లన్నీ పరిశీలించినారు ఆయన ఆనాడు అట్లాచేస్తారని ఎవ్వరూ అనుకోనందున ఆయనతో ఉన్నవారికేగాక ఆయా శిబిరాలలో నివసించేవారికి కూడా ఆశ్చర్యం కలిగింది ఆనాటి కార్యక్రమం ప్రకారం ఆయన చూడవలసింది ఒక్క సేవాగ్రామ ప్రదర్శనశాలను మాత్రమే కాని ఆయన అక్కడి ప్రతివిషయం చుట్టూఉన్న ప్రజలను గమనించకుండానే సులువుగా పరిశీలించ గలిగినారు

## మరొక ఆకస్మిక సంఘటన

వెంకటనారాయణ రోడ్డు, మౌంట్ రోడ్డు జంక్షన్‌లో కొన్ని బస్సులు మోటారు లారీలు నిలచి ఉన్నవి అక్కడ కొంతమంది వ్యక్తులు గాంధీజీని ఆయన బృందాన్ని పరికిస్తూ గుంపుగా నిలబడి ఉన్నారు

గాంధీజీ వారిని సమీపించగానే గాంధీజీకి వారు ప్రణామం చేసినారు గాంధీజీ దానిని మౌనంగా స్వీకరించినారు తరవాత గాంధీజీ ఖాళీగా ఉన్న ఒక బస్సును చూసి "ఇటు రమ్మన్నట్లుగా" వ రాత్తుగా చేయి సైగచేసినారు డ్రైవరు ఆశ్చర్యంతో తెల్లబోయి చూస్తూ నిలబడి ఉన్నాడు కాని గాంధీ తిరిగి బస్సును తెమ్మన్నట్లుగా చేయి సైగచేసినారు డ్రైవర్ వెంటనే బస్సును గాంధీజీ దగ్గరకు తీసుకొని వచ్చినాడు అందరూ నివ్వెరపడి చూస్తూండగా గాంధీజీ బస్సులో ఎక్కినారు తక్షణం ఆయనతో ఉన్నవారు కూడా ఎక్కినారు గాంధీజీ కోరిక ప్రకారం డ్రయివరు మౌంటు రోడ్డు గుండా నారాయణ రోడ్డు వైపు బస్సును తిప్పినాడు. గాంధీజీ కస్తూరిబా గేటు, బజాజ్ గేటులను దర్శించినారు. అక్కడ ఆ బస్సు ఆగింది గాంధీజీ ఆయన పరివారం దానిలో నుంచి దిగినారు

తరవాత గాంధీజీ హరిజన్ పారిశ్రామిక పాఠశాల, ప్రదర్శనశాలలను చూసినారు

## డాక్టర్ల విరాళము

డాక్టర్ కె యస్ కృష్ణన్ గాంధీజీని మెడికల్ యూనిట్ మందిరానికి ఆహ్వానించి డాక్టర్ల పక్షాన 101 రూపాయల విరాళం సమర్పించినారు

మహాత్మాగాంధీ హిందీ ప్రచార సభా భవనాలను కూడా సందర్శించినారు

తాను చూడదలుచుకొన్న ప్రదేశాల నన్నిటినీ చూసి గాంధీజీ తన బంగళావైపుకు తిరిగి ప్రయాణమయినారు ఆయన వెలుపలికి వెళ్ళిన వార్త తెలియరావటంచేత ఆయన తిరిగి బంగళాకు వచ్చే సమయంలో ఆయన దర్శనం

చేయవచ్చునన్న ఉత్సాహంతో జనులు ఆ బంగళా సమీపంలో క్రిక్కిరిసిపోయి నారు గాంధీజీ చాలా కష్టంమీద ఆ గుంపులోనుంచి బంగళాకు చేరగలిగినారు

## శ్రీ గోలి వెంకటరామమూర్తి

జనవరి 28 రాత్రి ప్రార్థనానంతరం గాంధీజీ మంగళ భవనానికి చేరు కొన్న తరవాత గవర్నర్ సలహాదారు శ్రీ యస్ వి రామమూర్తిగారు సకుటుంబంగా గాంధీజీని దర్శించినారు వారు గాంధీజీతో కొన్ని నిమిషాలు గడిపినారు

## నిర్మాణ కార్యకర్తల అంతిమ సమావేశము

జనవరి 29 వ తేది ఉదయం నిర్మాణ కార్యకర్తల అంతిమ సమావేశంలో గాంధీజీ 25 నిమిషాలు మాట్లాడినారు కార్యకర్తలడిగిన ప్రశ్నలకు వివరంగా సమాధానాలు చెప్పినారు

ఆనాటి సభా ప్రారంభ సమయంలో నిర్మాణ కార్యకర్తలలో "ఎంత మందికి హిందూస్థానీ తెలుసునా?" అని గాంధీజీ ప్రశ్నించినారు చాలామందికి తెలుసునని చేతులెత్తినారు.

## సింధీ పత్రకులతో సంభాషణ

జనవరి 29 సాయంకాలం ప్రార్థనానంతరం మద్రాస్ నగరంలోని సింధీ వర్తకులు 25 మంది గాంధీజీని కలుసుకొన్నారు శ్రీ కేవల్‌రాం చెల్లారాం గారికి నాయకత్వం వహించినారు వారు గాంధీజీకి పదివేలరూపాయల విరాళం సమర్పించినారు కాని గాంధీజీ "ఇంతేనా ఇది చాలాతక్కువ నేనెక్కడికిపోయి చూసినా మీలో చాలామంది మంచి వ్యాపారం చేస్తున్నారు ఈ మొత్తం ఇంకా ఎక్కువ కావలె" అన్నారు

అప్పుడు వారిలో ఒకరు "ఇదివరకే మేము సింధ్‌లో పండిట్ నెహ్రూగారు యాభై వేల రూపాయలు ఇచ్చినాము" మన్నారు

"అట్లాగా, అట్లాఅయితే అంతమొత్తం మీరిప్పుడు నాకివ్వతీరవలె" అన్నారు గాంధీజీ

"మీరు సింధుకు దయచేసినప్పుడు అట్లాగే చేస్తాంలెండి" అన్నారు వర్తకులు అంతటితో ఆసంభాషణ ముగిసింది

## కాంగ్రెస్ కార్యకర్తల సమావేశము

జనవరి 29 సాయంకాలం 7½ గంటలకు నిర్మాణ కార్యకర్తల సభా స్థలంలో 1500 మంది కాంగ్రెస్ కార్యకర్తలను ఉద్దేశించి గాంధీజీ ఉపన్యసించి నారు. ఆయన సభా స్థలానికి రాగానే కరతాళధ్వనులు చెలరేగినాయి విద్యు ద్దీపాలతో అలంకరించిన చక్కటి సభామందిరంలో ఒకమూల తిరుగు

తూండడం గాంధీజీ కొంతకాలం ఆసక్తితో చూసినారు గాంధీజీ ఉపన్యాసం ఒక అరగంట జరిగింది

జనవరి 29 ఉదయం అంతా గాంధీజీని చూడడానికి వచ్చిన వారితో మాట్లాడడంలోనూ, మైసూరు రాజ్యం కెంగేరిలోని కస్తూరిబా స్మారక శిబిరంలో శిక్షణ పొందుతూన్నవారి రాయబార వర్గంతో ముచ్చటించటం లోనూ గడచిపోయింది

## భారతీయ కమిషన్డ్ ఉద్యోగులు

కెప్టెన్ సింగు మరికొంతమంది భారతీయ కమిషన్డ్ ఉద్యోగులు జనవరి 29 మధ్యాహ్నం గాంధీజీని కలుసుకొని గౌరవాభివందనలతో హరిజన నిధికి కొంత విరాళం సమర్పించినారు

## కార్మిక సమావేశము

1946 జనవరి 31, సాయంకాలం మద్రాస్ నగరంలోని వివిధ ప్రాంతాల నుంచి, నగరానికి పరిసరంలోఉన్న పేటలనుంచి అనేకమంది కార్మికులు హిందీ ప్రచార సభకు దక్షిణ భాగానఉన్న ఖాళీప్రదేశంలో సమావేశ మయినారు ఆ సభలో దాదాపు ముప్పైవేలమంది కార్మికులున్నారు గాంధీజీ ఆసభలో ఉపన్యసిస్తూ కార్మికుల పనిచేయగల శక్తి నిక్షిప్తమయిన మూలధనం వంటి దన్నారు.

జనవరి 31 సాయంకాలం 4-15 నిముషాలకు సభ ప్రారంభం కావలసి ఉన్నది కాని మధ్యాహ్నం రెండుగంటలనుంచి గాంధీజీ దర్శనంకోసం అనేక మంది కార్మికులు స్త్రీలతోసహా వేచి ఉన్నారు

రాయపురంలోని దక్షిణామూర్తి దేవాలయంనుంచి 16 కార్మిక సంఘాల వారు ఊరేగింపుతో బయలుదేరినారు పీపుల్స్‌పార్కు దగ్గర మరి నాలుగు కార్మిక సంఘాలవారు వారితో చేరినారు సాంబియంనుంచి మరిరెండు యూనియన్‌ల కార్మికులు, వేదరకూళ గ్రామాలనుంచి మరిరెండు కార్మిక సంఘాలవారు కూడా కార్మికసమ్మేళనంలో కలుసుకొన్నారు కీల్పాక్‌గుండా పొన్నేరితాలూకా వ్యవసాయకూలీలు వచ్చినారు ఊరేగింపులతో వచ్చిన ఈ కార్మికులందరూ హిందీప్రచార సభామైదానంలో చేరినారు.

కార్మిక నాయకుడు పి ఆర్ కె శర్మ జోక్యం కల్పించుకొన్నందువల్ల ప్రభుత్వ పరిశ్రమాలయాలలోని కార్మికులకు, ప్రయివేటు సంస్థలలోని కార్మికు లకూ కూడా ఆనాడు జీతంతో సెలవు మంజూరు చేయడం జరిగింది.

గాంధీజీరాక సమీపిస్తూన్నదనగా ఆ జనసమూహం పట్టరానిఉత్సాహంతో దిక్కు తెలియకుండా ఉన్నారు గాంధీజీకి సన్నిహితంగా ఉండి దర్శించవలెననే ఆసక్తితో కొంతమంది హిందీ ప్రచారసభా ఆవరణంలోకి తోసుకొని వెళ్ళ టానికి ప్రయత్నించినారు. సరిగా అదే సమయానికి రాజగోపాలాచారివచ్చి

అట్లా ప్రజలను తోసుకొనివచ్చి సందడిచేసినందువల్ల ప్రయోజనంలేదనీ, అది ఎంతమాత్రం మంచిదికాదనీ వారిని మందలించినారు. వారందరిని కూర్చోమనిచెప్పి నిశ్శబ్దంగా ఉండమన్నారు. అట్లా ఉండకపోతే గాంధీజీవచ్చి ఉపన్యసించటానికి ఇష్టపడరన్నారు.

ఈ లోగా శ్రీ గణేశన్, కె యస్ గోపాలకృష్ణన్, ఎ ఆర్ వి ఆచార్ జాతీయ గీతాలనుపాడి ప్రజలను నిశ్శబ్దంగా ఉండేటట్లు చేసినారు. గాంధీజీ, ప్యారేలాల్, డాక్టర్ సుశీలానయ్యర్ మొదలయిన అనుబృందం వారితోకలసి కొన్నినిముషాలు ఆలస్యంగా సభకు వచ్చినారు.

గాంధీజీని దగ్గరగా దర్శించవలెననే కోరికతో కొంచెం ముందుకు తోసుకొనిరావడం మొదలుపెట్టినారు. కొంచెం సందడిజరిగింది. అప్పుడు గాంధీజీ వేదికపైకి ఎక్కి- "మీరంతా ప్రశాంతంగా ఉంటేనే తప్ప నేను మాట్లాడటానికి వీలులేదు. లేనిపక్షంలో నేను తిరిగివెళ్ళిపోవలసి వస్తుంది," అని మందలించినారు. వెంటనే సభ నిశ్శబ్దంగా ఉండిపోయింది. అప్పుడు గాంధీజీ ఇట్లా ప్రసంగించినారు.

"ఈ దేశమంతా ఒక్కటి. కార్మికులంతా ఒకే వర్గంవారు. వారిలో ఒకరు నిశ్చయంగా కాంగ్రెస్ ప్రసిడెంట్ కావచ్చు. మజ్దూరులకు, కిసానులకు ఉన్న భేదం ఒక్కటే. కిసాన్, పనిఉన్నచోటనే ఉండిపోతాడు. కార్మికులను పరిశ్రమల యజమానులు తమ కార్ఖానాలకు తీసుకొని వెడతారు.

నిజానికి మిల్లు ప్రొప్రయిటర్ దాని యజమానికాదు. పనిచేసేవారు నిజమయిన ప్రొప్రయిటర్లు. నేను కార్మికుడిగా మాట్లాడుతున్నాను. కొంత కాలం క్రిందట నా ఆస్తి యాజమాన్యం నేను వదలుకొన్నాను. నా దగ్గర ఇప్పుడున్న లక్షలు నావికావు, అవి విరాళాలుగా ఇవ్వబడినవి. పనులకోసం వాటిని వినియోగించవలసిఉంటుంది. హరిజనుల కోసమిచ్చిన విరాళాలు హరిజనులకోసమే వినియోగించడం జరుగుతుంది.

నేను దక్షిణాఫ్రికా నుంచి ఇండియాకు వచ్చిందిమొదలు కార్మికులను సేవిస్తూనే ఉన్నాను. నేను స్థాపించిన అహమదాబాదు కార్మికసంఘం ఇతర సంఘాలకు నమూనాగా ఉండతగింది. కాని అక్కడ కూడా కార్మికులు యజమానులు కాలేదు. కార్మికులు ఎక్కువ క్రమశిక్షణతోను, వివేకంతోను మెలగగలిగే పక్షంలో మిల్లులకు, ఫాక్టరీలకు వారే యజమానులు కాగలరు.

మీ కార్మికులలో ఒకరు ఎప్పుడో ఒకప్పుడు భారతజాతీయ కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా ఎన్నుకోబడవలెనని నేను కాంక్షిస్తూన్నట్లు ఇంతకుపూర్వం చెప్పినాను. దీనిలో ఏమీ అతిశయోక్తిలేదు. కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉండటానికి ఇంగ్లీష్ రావలసిన అవసరం లేదు. మనకాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా అబుల్ కలామ్ ఆజాద్‌కు ఇంగ్లీష్ తెలుసు. కాని ఆయన ఎవ్వరితోను ఇంగ్లీష్ మాట్లాడడు. రాజప్రతినిధి దగ్గరకుపోయినప్పుడు కూడా ఇంగ్లీష్ మాట్లాడడు. ఆయన ఎప్పుడూ భారతీయ భాషనే మాట్లాడతాడు. ఆయన మీద ప్రజలకు చాలా గౌరవము.

మీలో చాలామందికి హిందూస్థానీ తెలియకపోయినప్పటికి మీరు నా ఉపన్యాసాన్ని ఇంత ప్రశాంతంగా విన్నందుకు చాలా కృతజ్ఞుణ్ణి మీతో తెలుగులోగాని, తమిళంలోగాని మాట్లాడవలెనని కుతూహలం ఉన్నది కాని నేను ఉపన్యసించ గలిగినంతగా ఆ భాషలు నాకు రాకపోవడం చాలా విచారకరమయిన విషయము "

ఈ ఉపన్యాసానంతరం శ్రీ టి యస్ రామానుజం బిన్నీకో లేబర్ యూనియన్ పక్షాన 101 రూపాయలు, మద్రాస్ మెటార్స్ యూనియన్ పక్షాన 44 రూపాయలు విరాళం సమర్పించినారు

సైదాపేట జవహర్ యువజన సంఘం పక్షాన చేతితో తయారయిన కాగితంపైన అరవంలో వ్రాసిన ఒక సన్మానపత్రాన్ని గాంధీజీకి సమర్పింపబడినది ఆ సంఘం అధ్యక్షుడు శ్రీ కే వి ముత్తుస్వామి నాయకర్ సీతారాముల పట్టాభిషేకమును చిత్రించి ఆ చిత్రం గాంధీజీకి బహూకరించినారు

కార్మిక సమావేశ ప్రారంభానికి ముందు అల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ జనరల్ కౌన్సిల్ సభ్యులు శ్రీ టి యస్ రామానుజమ్ మద్రాస్ నగరంలోని ఇరవై పైచిలుకు ట్రేడ్ యూనియన్ల పక్షాన గాంధీజీ కొక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించినారు

## ఆంధ్ర మహిళాసభ నూతన భవనానికి పునాదులు

జనవరి 31 వ తేదీ సాయంకాలం త్యాగరాయనగర్ హిందీ ప్రచార సభామందిరంలో ఆనందదాయకమయిన ఉత్సవమొకటిజరిగింది చర్చి రోడ్డులోని లజ్‌లో ఆంధ్ర మహిళా సభావారు కట్ట నుద్యమించిన మూడు నూతన భవనాల కుద్దేశింపబడిన మూడు శిలా ఫలకాలకు గాంధీజీ ఆశీర్వాదభాగ్యం లభించింది

గాంధీజీ కార్యాంతర నిమగ్నుడయి ఉండటం చేత ఆ కార్యక్రమ నిర్వహణకు కొన్ని నిమిషాలు ఆలస్యంగా రావడం జరిగింది అందుకాయన తన విచారం ప్రకటించినారు గాంధీజీ ఆసీనులయిన తరవాత శ్రీ యస్ కె సుబ్రహ్మణ్యం ఆయనకొక గులాబి పూల దండను, మరొక పుష్పగుచ్ఛాన్ని సమర్పించినారు ఆంధ్ర మహిళా సభ పక్షాన రూ 1116 లతో నగిషీ చెక్కిన ఒక దారు పేటిక గాంధీజీకి బహూకరించడం జరిగింది

## సర్ సి పి

తిరువాన్కూరు సంస్థాన దివాన్ సర్ సి పి రామస్వామయ్యర్ జనవరి 31 మధ్యాహ్నం గాంధీజీని దర్శించి ఆయనతో 30 నిమిషాలు ముచ్చటించినారు

## కస్తూరిబా నిధి కార్యకర్తలు

ఆంధ్ర దేశంలో కస్తూరిబా గాంధీ స్మారక నిధి వసూళ్ళలో నిమగ్నులై

ఉన్న కార్యకర్తలు జనవరి 31 మధ్యాహ్నము హిందీ ప్రచార సభలో మహాత్మా గాంధిని కలుసుకొన్నారు

శ్రీమతి దుర్గాబాయి, శ్రీ బులుసు సాంబమూర్తిగారి సహకారంతో 6 లక్షలకు పైగా కస్తూరిబా స్మారక నిధికి వసూలు చేయగలిగినామని ప్రకటించింది పిఠాపురం మహారాజా, బొబ్బిలిరాజా, చల్లపల్లి రాజాగార్లు, శ్రీ యం నారాయణ స్వామి మొదలయిన వారు కస్తూరిబా స్మారక నిధికి ఔదార్యంగా విరాళాలిచ్చినందుకు ఆంధ్ర మహిళా సభ పక్షాన ఆమె వారికి కృతజ్ఞతలు తెలిపింది

మహాత్మా గాంధీ ఉపన్యసిస్తూ మద్రాసుకు వచ్చే తోవలో తాను ఆంధ్రదేశం నుంచి వచ్చినానని, ఆంధ్రదేశంలో కస్తూరిబా నిధి వసూళ్ళను, జరుగుతూన్న పనిని గురించి తెలుసుకొన్నాననీ అన్నారు, ఈ నిధి వసూళ్ళలో సాంబమూర్తి చేసిన కృషి తనకు తెలుసునని, ఇప్పుడీ నివేదికలో కూడా ఆ విషయం ఇంకా విపులంగా తెలుసుకొన్నానని అన్నారు ఈ సందర్భంలో సీతానగర సత్యాగ్రహాశ్రమ సంస్థాపకుడు శ్రీ డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు స్మరణకు వస్తున్నారనీ, ఆయన ఆంధ్ర దేశంలో మంచి కార్య నిర్వాహకుడనీ అన్నారు

భారత స్వాతంత్ర్య సమరంలో స్త్రీలు వహించిన పాత్ర తమ కందరికీ తెలిసిందేనని కస్తూరిబా నిధికి సంబంధించిన పనికి ఒక విశిష్ట లక్షణము ఉందనీ అన్నారు

గాంధీజీ సభా వేశం విడిచిపోయే ముందు అరచేతులలో ఇద్దరు పసి పాపలను తల్లులు ఆయనదగ్గరకు తీసుకొని వచ్చినారు గాంధీజీ వారిని మృదువుగా స్పృశించి ఆశీర్వదించినారు

## హరిజన నిధి విరాళాలు

శ్రీ అలగప్ప చెట్టియార్ రూ 1001, శ్రీ ఆర్ యమ్ కపూర్ రూ. 1100, అలగప్ప చెట్టియార్ కుటుంబంలోని సభ్యులందరు చేరి 101 రూపాయల చొప్పున హరిజన నిధికి మొత్తం 1500 రూపాయలు విరాళం సమర్పించినారు

## హరిజన పారిశ్రామిక పాఠశాల

1946 ఫిబ్రవరి 1 వ, తేది ఉదయం త్యాగరాయనగరంలోని మౌంట్ రోడ్డు వెంకటనారాయణ రోడ్డు జంక్షన్ దగ్గర హరిజన పారిశ్రామిక పాఠశాలాధికారులు కొత్తగా సంపాదించుకొన్న స్థలంలో పాఠశాలా భవనానికి గాంధీజీ పునాదిరాయి వేసినారు.

త్యాగరాయ నగరంలోని హరిజన పారిశ్రామిక పాఠశాలకు పునాది రాయి వేస్తూ గాంధీజీ ఆసంస్థ భారత దేశంలోని విద్యార్థులందరికీ ఆదర్శ

సంస్థగా ఉండవలెనని కోరినారు ఆ పాఠశాలకు ఠక్కర్ బాపా పేరు పెట్ట వలెనన్నారు అప్పటికప్పుడు ఆ పాఠశాలా సంస్థాపనకోసం 1½ లక్షల రూ విరాళాలు ప్రకటించడం జరిగింది చాలా మంది స్త్రీలు, పురుషులు ఆ సభకు హాజరయినారు

భాష్యమయ్యంగారు సభ్యులను ఆహ్వానిస్తూ - అనేక విధాలుగా హరి జన సేవక సంఘం చేస్తున్న కార్యకలాపాలను వివరించినారు ప్రజా సేవా తత్పరులయినవారి సహాయ సహకారాలను ఆయన ఆకాంక్షించినారు ఆసంస్థకు ప్రభుత్వ కార్మికశాఖవారు చేసిన సహాయానికి కృతజ్ఞత తెలిపినారు

తరవాత శ్రీ ఎ వి ఠక్కర్ పారిశ్రామిక పాఠశాల కార్యకలాపా లను గురించి నివేదికను చదివినారు ప్రస్తుతం అక్కడ 60 మంది బాలురు శిక్షణ పొందుతున్నారని, మరి 15 మంది కాగితి పరిశ్రమలో శిక్షణ పొంద మన్నారని ఆయన అన్నారు ఠక్కర్ బాబా ఇంకా ఇట్లా అన్నారు 'పాఠ శాలకు సంవత్సరానికి 1500 రూపాయలు వ్యయమవుతుంది శిక్షణ పొందే బాలుర సంఖ్యకు 800 వరకు పెంచదలుచుకొన్నాము అప్పుడు సంవత్సరానికి 90,000 రూపాయల ఖర్చవుతుంది ప్రస్తుతం వడ్రంగం, కమ్మరం, తగరపు పని, కొడవళ్ళు, కత్తులు తయారు చేసే పని, చేము పని, సిట్టరు పని, కాగి తపు పరిశ్రమ మొదలయిన వాటిలో శిక్షణ జరుగుతూన్నది ప్రస్తుతం ప్రభుత్వం వారు కొంత గ్రాంట్ ఇస్తున్నారు ఢిల్లీలోని కేంద్ర హరిజన నిధినుంచి కొంత గ్రాంటువస్తూన్నది తక్కినది స్థానిక విరాళాలద్వారా సరిపెట్టుకొంటున్నాము ఇప్పుడున్న ఈ కొద్ది సదుపాయాలతో ఇంకా ఎక్కువ మంది విద్యార్థులను తీసుకొనే అవకాశం లేదు అయినప్పటికీ ఇప్పటి నుంచి ప్రజా సహకారం ఎక్కువగా ఉంటుందని నేను ఆశిస్తున్నాను "

ఈ ప్రసంగానంతరం డా॥ సర్ అలగప్ప చెట్టియార్ మాట్లాడుతూ "మహాత్మా గాంధీ ఈ పాఠశాలకు పునాది రాయి వేయటానికి అంగీకరించి నందుకు మనమందరమూ వారికి కృతజ్ఞులమయి ఉండవలె ఈరోజు నాజీవితంలో ఒక మహోత్కృష్టమయిన పుణ్యదినంగా భావిస్తున్నాను ఈ పాఠశాలా భవన నిర్మాణం పూర్తయిన తరవాత దీనిని ప్రారంభించడానికి గాంధీజీ అంగీకరించే రోజు కూడా రాగలదని నేను ఆశిస్తున్నాను గాంధీజీ హరిజనాభ్యుదయానికి చేసినకృషి మనకందరికీ తెలిసిందే. ఇండియాలో అనేక పక్షాలున్నప్పటికీ గాంధీజీ అన్ని పక్షాలకు అతీతుడు ఆయనలో భారత జాతి మూర్తి భవించింది. భారత జాతీయాభ్యుదయానికి ఆయన నిరంతర కృషి చేసినారు" అన్నారు.

తరవాత మహాత్మాజీ చాలా సంతోషంతో పునాది రాయి వేయడానికి ఉద్యమించినారు ప్రజల సంతోషధ్వానాల మధ్య ఆయన వెండి తాపీని తీసుకొని మూడు ఇటుకలకు చక్కగా మంచి నైపుణ్యంతో సిమెంట్ వేసి, సున్నం అతికి రాళ్ళను పునాది రాయిపైన ఎంతో నైపుణ్యంతో సరియైన స్థితిలో ఉంచినారు. ఆ పని నిరంతరం వృత్తిగా చేసే తాపీ పనివాడు చూసి సిగ్గుపడే

టంత చక్కగా ఉన్నది గాంధీజీ ఈ పని చేస్తూన్నంత సేపు పకపకా నవ్వు తూనే ఉన్నారు దానిపైన పసిడి గోరంట్ల పూవులు చల్లినారు ఆ పునాది రాయికి సాంబ్రాణి ధూపం వేసి, హారతి పట్టినారు

గాంధీజీ ఆ తరవాత వేదిక వద్దకువచ్చి సభ సదుల నుద్దేశించి ఇట్లా ప్రసంగించినారు

"ఈ పాఠశాలయు ప్రారంభించవలెనని ఉద్దేశం చాలా కాలం కిందటనే కలిగింది నేను జయి లునుంచి బయటకు రాగానే శ్రీమతి బచ్చు జగన్నాథదాసు, శ్రీ వి భాష్యమయ్యంగార్లు పాఠశాల కోసం స్థలం సంపాదించినామని, పని ప్రారంభం కాగలదని చెప్పినారు కాని నేనింతకంటె ముందుగా రాజాలక పోయినాను కార్పొరేషన్ నుంచి ఈ స్థలం సంపాదించడంలో కొంచెం కష్ట మయినది కాని చివరకు మామూలు ఖరీదుకు ఇవ్వడానికి కార్పొరేషన్ వారు అంగీకరించినారు కార్పొరేషన్ వారు ఈ స్థలం ఉచితంగా ఇవ్వగలిగి ఉండవలసింది కాని వారట్లా చేయలేదు అయితేనేమి కార్పొరేషన్ చేసిన సహాయానికి పాఠశాలా సంస్థాపకులు కృతజ్ఞులయి ఉండవలె

డాక్టర్ అలగప్ప పెనదాత ఆయన ఈ సంస్థకుగొప్ప విరాళం ఇచ్చినారు కానిచాలినంత ఇచ్చినాడని నేను అనుకోవటంలేదు హిందూధర్మానికి కళంకంగా ఉన్న అస్పృశ్యతను నిర్మూలించడానికి ప్రతివారు శక్తివంచన లేకుండా కృషి చేయవలె అప్పుడే వారు ఆ సంఘానికి ప్రతికూలంగా తాము పూర్వం చేసిన పాపాలకు సరయైన ప్రాయశ్చిత్తం చేసుకొన్నవారు కాగలరు

హరిజనులు పతితులుకారు, మనం పతితులం వారినేదో మనం ఆదరి స్తూన్నట్లుగా ధ్వనింపచేయడం కూడనిపని అటువంటి భావాలు మన మనసులలో నుంచి మాయమయి పోవలె,

విరాళాలిచ్చిన వారికి మనం కృతజ్ఞత చూపించ వలసిన అవసరంలేదు వారు ప్రశంసాపాత్రమయిన పవిత్రకార్య మొకటి నిర్వహించినారు అది వారి కర్తవ్యము. ఇంతకు పూర్వం హిందువులు తమ సోదరులయిన ఒక వర్గం వారిని అస్పృశ్యులుగా భావించడం దురదృష్టకరమయిన విషయము. ఇంతకన్న అన్యాయము, పాపభూయిష్టమయిన విషయము మరొకటుండదు అది హిందూ ధర్మానికే కళంకము ఈ విభేదాలను సృష్టించిన వారే నిజమయిన "పతితులు" డాక్టర్ అలగప్ప మూడులక్షల రూపాయలిచ్చినారు. అదేమీ గొప్ప విషయం కాదు ఆయనకు మీరు కృతజ్ఞత చూపెట్టేట్లయితే 5 రూపాయలీయ గలిగిన మనిషి 10 రూపాయలిచ్చి నందుకు మీరు కృతజ్ఞులుగా ఉండవలె. ఈ విరాళా లిచ్చిన వారంతా తమ ధర్మం నిర్వర్తిస్తున్నారు ఋణస్తుడు తన ఋణం తీర్చినందుకు కృతజ్ఞత చూపనక్కరలేదు. ఈ ప్రణాళికకు కావలసిన సొమ్మంతా డాక్టర్ అలగప్ప ఇవ్వవలెనని కోరుతున్నాను

ఈ పాఠశాలలో శిక్షణపొందేవారి సంఖ్య 800లకు పెంచవలెననే కోరిక ఉందని ఠక్కర్ బాబా అన్నారు. అది చాలదనుకొంటాను ఈ సంస్థ ఆదర్శ

ప్రాయంగా ఉండవలెననీ యావద్భారత దేశంనుంచి విద్యార్థులువచ్చి దీనిలో శిక్షణ పొందవలెననీ నా కోరిక

మీరు మీపని సక్రమంగా నిర్వహించే పక్షంలో, మీకు దేవునిలో నమ్మకమున్న పక్షంలో మీకు డబ్బుకు కొదవఉండదని నా అభిప్రాయము నేను ప్రారంభం నుంచి పైసాదగ్గరనుంచి కూడా వసూలు చేస్తున్నాను కష్టపడి పనిచేయటమంటే నా కిష్టం కాబట్టి మీరందరూ మీశక్తివంచనలేకుండా దమ్మిడీ దగ్గరనుంచి సాయం చేయండి

భాష్యమయ్యంగారు తమిళంలో చేసిన ఉపన్యాసం శ్లాఘనీయంగాఉన్నది నాకు తమిళం తెలుసు దేవుని దయవల్ల నేనింకా కొన్నాళ్ళు బ్రతికిఉంటే రాష్ట్రీయ భాషలన్నిటినీ నేర్చుకోగలనని నా నమ్మకము ఈ కార్యక్రమం ఇంగ్లీష్‌లో ముద్రింపబడి ఉండటం నాకు చాలా బాధగావుంది దీనిని తమిళంలో ముద్రించి హిందూస్థానీ నకలును నాకిచ్చి ఉండినట్లయితే నేనెంతో సంతోషించి ఉండేవాణ్ణి

జన సంఖ్యలో మనదేశం చైనా తరవాతది మనం 40 కోట్ల మందిమి ఉన్నాము అందుకు మనం సంతోషించవలె మనజాతినిగురించి, మన సభ్యతా సంస్కృతులను గురించి, మన భాషలను గురించి మనం గర్వపడవలె మనకు భాష లేకపోయినట్లయితే మనం మనుష్యులవలే కాక జంతువుల వలె జీవించవలసి ఉండేది. మన రాష్ట్రీయ భాషలకుతోడు ఒకజాతీయ భాషకూడ ఉండి తీరవలె

## పొగడ్తకూడదు

శ్రీ సత్యనారాయణ నాకు పరిచయం చేయడానికి చాలా గొప్ప వాళ్ళ పేర్ల జాబితా ఒకటి ఇచ్చినాడు వారి దగ్గరనుంచి డబ్బు తీసుకొనే టందుకు వారిని మీరు పొగడవలెనని మీకు తెలిసి ఉంటుంది వారిని స్తుతించవలె, శ్లాఘించవలె డిన్నర్లు కూడా ఇవ్వవలె కాని వాళ్ళు చాలా తెలివి గలవాళ్ళు తేలికగా డిన్నర్లకు లొంగేవారు కారు మీ విశ్వాసానికి అనుగుణంగా హృదయ పూర్వకంగా మీరు మీ కర్తవ్యం నిర్వర్తించేట్లయితే మీరు వారిని పొగడవలసిన అవసరంగానీ, శ్లాఘించవలసిన అవసరంగానీ ఉండదు దేవుడు మీకు తోడ్పడ గలడు అప్పటికీ మీకు సహాయం రాకపోతే మీరు యాచించగలరు. యాచిస్తే కూడా మీకు సహాయం రానిపక్షంలో మీరు చావడమే కర్తవ్యము. మానవునికి జీవితంనుంచి మోక్షము చావుకంటే మరేమున్నది! కాబట్టి మీ అందరినీ నేను ప్రార్థించేదేమంటే ఎవ్వరినీ పొగడవద్దు, స్తుతించవద్దు. దేవుని నమ్మి మీ కర్తవ్యం మీరు నిర్వహించండి

## జాతీయ భాష

మన దేశంలో ఇంగ్లీష్ మాట్లాడగలవారు బహు తక్కువ మంది ఉన్నారు ఇంగ్లీషు తెలియని కోట్లాది జనుల సంగతి ఏమిటి? కాబట్టి నేను,

ఇండియా కొరకు జాతీయ భాష కావలెనని కోరుతున్నాను ఈ దేశంలో విద్య మీద అధికారం వహించేవారు మొదట మాతృ భాషకు, తరవాత జాతీయ భాషకు, ఆ తరువాత ఇతర భాషకు ప్రాముఖ్య మియవలెనని కోరుతున్నాను

ఈ పాఠశాలకు ఠక్కర్ బాబా పేరు పెట్టవలెనని నా సూచన ఆయన జీవితమంతా హరిజనాభ్యుదయానికి ధారపోసినారు ఈ పాఠశాలకు ఠక్కర్ బాబా విద్యాలయమని గానీ, లేదా సంగ్రహంగా ఉండవలెనంటే బాబా విశ్వ విద్యాలయమని గాని పేరు పెట్టడడం మంచిది

ఈ సంస్థకు శంకుస్థాపన చాలా జాగరూకతతో చేసినాను మీరందరూ మెచ్చేటట్లు చేసినాను. ఈ భవనం అద్భుతంగా పైకి లేస్తుందని నా విశ్వాసము ఈ సంస్థ దేశంలోని పారిశ్రామికాభివృద్ధికి అత్యంతం తోడ్పడవలెనని నా ఆకాంక్ష ముఖ్యంగా గ్రామాల అభివృద్ధికి తోడ్పడవలెనని నా కోరిక ఈ సంస్థలో నేర్పే విద్య భారతదేశ గ్రామాల పునరుజ్జీవనానికి దోహదం చేయగలిగేగా ఉండవలె ఇక్కడి విద్యార్థులు తాము గ్రామాల అభివృద్ధికి తోడ్పడడమే గాక అస్పృశ్యతా నివారణానికి, భారత జాతీయాభ్యుదయానికి కూడా తోడ్పడవలసిన బాధ్యత తమ పైన ఉన్నట్లు భావించవలె"

ఈ ఉపన్యాసానంతరం చందాలు వేయడం జరిగింది

విరాళాలు

శ్రీ హెచ్ డి. రాజా, ఆయనూ తన స్నేహితులు కలిసి ఒక లక్ష రూపాయలు వసూలు చేయడానికి వాగ్దానం చేసినారు యన్.సి వసంత కోకిలం 50,000 రూపాయలు వసూలు చేయడానికి వాగ్దానం చేసింది

సర్ అల్లాడి కృష్ణస్వామయ్యర్ రూ 1116 లు ఇచ్చి, ఇంకా మరికొంత ఇస్తానన్నాడు స్వామి సత్యానందస్వామి 100 రూపాయలు, శ్రీమతి పార్వతి 100 రూపాయలు, యం డి శర్మ రూ 1001, ఖాదర్ మల్ సాహుకారు రూ. 1001, శ్రీమతి కొత్తనాయకి అమ్మాళ్ 250 రూపాయలు, కె బాల సుబ్రహ్మణ్య అయ్యర్ 500 రూపాయలు, డాక్టర్ పి రాఘవా చారి 101 రూపాయలు, శ్రీ జయంతి చోప్రా 101 రూపాయలు, జిప్ అండ్ కో వారు 111 రూపాయలు, యన్.వి ఆర్ నాగప్ప చెట్టి 125 రూపాయలు మాడరన్ కేఫ్ పనివాళ్లు 100 రూపాయలు, సరస్వతి పాలయకాట్ కంపెనీ 101 రూపాయలు విరాళాలు సమర్పించినారు

ఇంకా అనేక మంది విరాళాలు సమర్పించడానికి వస్తూండగా, గాంధీజీ మరికొన్ని కార్యక్రమాలను నిర్వర్తించేటందుకు బసకు వెళ్ళవలసిన అవసరం ఉన్నందువల్ల వారందరూ తమ విరాళాలను గాంధీజీ బసలో ఇవ్వవలసిందని కార్యకర్తలు కోరినారు

వెండి తాపీ వేలం

గాంధీజీ పునాది రాయి వేసిన తాపీని వేలం పెట్టగా దానిని 2001

రూపాయలకు రామస్వామి నాయుడుగారు కొన్నారు

"జన గణ మన..." గేయం పాడడంతో సభ ముగిసింది

**కొడంబాకం హరిజన పారిశ్రామిక పాఠశాల**

కొడంబాకం హరిజన పారిశ్రామిక పాఠశాలను గాంధీజీ ఫిబ్రవరి 1 మధ్యాహ్నం దర్శించినారు ఆ పాఠశాలావరణలో ఒక పందిరికింద అనేక మంది స్త్రీలు, పురుషులు సమావేశమయి ఉన్నారు

మద్రాస్ నగరంలోని 18 హరిజన సంక్షేమ సంఘాలవారు గాంధీజీకి స్వాగత పత్రాలను సమర్పించినారు వారి స్వాగత పత్రానికి సమాధానంగా విద్యార్థులను ఉద్దేశించి గాంధీజీ ఇట్లా ఉపన్యసించినారు

"నే నిక్కడికి చాలా కాలమయిన తరవాత వచ్చినాను ఇప్పుడు ఇక్కడ ఉన్నందుకు చాలా సంతోషంగా ఉంది హరిజన విద్యార్థులకు నేర్పుతున్న విషయాలన్నిటినీ నేను సమగ్రంగా చూసినాను ఇక్కడ విద్యాభ్యాసం చేస్తూన్న వారందరి భావి జీవితము జయప్రదంగా ఉండగలదని ఆశిస్తున్నాను అయితే ఈ విషయంలో ఒకచిక్కు మాత్రం ఉన్నది దానిని పరిష్కరించుకోవడం చాలా కష్టమయినపని ఈ విద్యార్థులు గ్రామాలకుపోయి గ్రామ ప్రజలకు దీనిని నేర్పవలెనని మన ఆశయము కాని ఆ పని ప్రస్తుతం ఏమీ జరగటం లేదని నాకు విచారంగా ఉన్నది ఈ సమస్య యావద్భారత దేశంలో ప్రతి హరిజన సంస్థను ఎదుర్కొంటూన్నదే

ఈ విద్యార్థులు గ్రామాలకు పోయి వారికి తాము నేర్చిన విద్యను బోధించటమేకాక వారు గ్రామాలలో గ్రామస్థుల మధ్య ఉండిపోయి వారి జీవితాలు గడుపుకొనేటట్లు వారికి తెలియచెప్పవలె ఇది ఆచరణలో చాలా కష్టమయిన విషయమే సందేహం లేదు కాని హరిజనుల ఈ విద్యావిధానానికి యాజమాన్యం వహించే ప్రతిఒక్కరూ దీనిని ఆచరణ యోగ్యంగా చేయవలెనని నా కోరిక

ప్రజలు ఈ సంస్థకు సహాకారం చేయవలెననటానికి మరొక కారణం కూడా ఉన్నది ఈ బాలుర హృదయాలలో నుంచి తాము అస్పృశ్యులమనే అభిప్రాయము తొలగిపోవలె అందువల్ల ఈ బాలురిక్కడ విద్యాభ్యాసం చేస్తున్నంత వరకు ప్రజలకు వారితో సన్నిహిత సంబంధం ఉండవలె.

యావద్భారత దేశంలోని హరిజనులు పరస్పరం అర్థం చేసుకొనేటందుకు వీలుగా ఈ విద్యార్థులకు హిందూస్థానీని కూడా నేర్పవలె. ఈ విద్యార్థులు పూర్తిగా పరస్పరం హిందూస్థానీలో సంభాషించుకో గలిగినట్లయితే నాకు చాలా సంతోషంగా ఉంటుంది

ఈ పాఠశాల నిధికి ప్రజలు ఉదారంగా ధనం ఇవ్వవలె హరిజనుల పట్ల తాముచేసిన పాపం తొలగించుకొనేటందుకు అదిఒక్కటే పరిహారము.

విద్యార్థులు ఈ విద్యవల్ల తమకు జీవనోపాధి కలగడమే ఆదర్శంగా

పెట్టుకోకూడదు. ఎవరూ అస్పృశ్యులని పిలవటానికి అవకాశంలేని విధాన తాము జీవించగలిగి ఉండవలెనని ఆదర్శంగా పెట్టుకోవలె.

రామకృష్ణపరమహంసకు అంతేవాసి అయిన స్వామి వివేకానందుని గురించి మీరు వినే ఉంటారు. ఆయన ఎన్నడూ కులభేదాలను పాటించలేదు. పైపెచ్చు అందరూ సంస్కృతం నేర్చుకోవలెననీ, అందువల్ల వారి సంస్కృతి అభివృద్ధి పొందుతుందనీ వారికి ప్రబోధించినారు.

ఇది చాలా మంచిసలహా అని నా అభిప్రాయము. సంస్కృతభాషను మాట్లాడడంవల్ల, సంస్కృత మాటలను ఉచ్చరించడంవల్ల మానవసంస్కృతి ఉచ్చస్థాయిని అందుకుంటుందనే విషయం నిర్వివాదము. కాబట్టి మీరందరూ సంస్కృతం నేర్చుకోండి! అదికూడా చాలా కష్టమయిన విషయమే. అందుకు చాలా అవకాశాలు కావలె. మీకు సంస్కృతం నేర్చుకోనేటందుకు సమయం కూడా చాలదు. కాబట్టి సంస్కృత జన్యమయిన హిందూస్థానీ భాషను నేర్చుకోండి! ఇది ఒక కులానికీ, మరొక కులానికి ఉన్న భేదాలను నిర్మూలిస్తుంది.

మీ పనిని మీరు చక్కగా నిర్వహించండి. మృదువుగా మంచి భాష మాట్లాడండి. స్వచ్ఛమయిన జీవితం గడపండి. అప్పుడు మిమ్ముల్ని ఎవరూ అస్పృశ్యులనలేరు."

ఈ ఉపన్యాసాన్ని తమిళనాడు హరిజన సేవకసంఘ కార్యదర్శి అరవం లోకి అనువాదం చేసినారు.

తరవాత గాంధీజీ హరిజన పాఠశాలావరణకు బయట సమావేశమయిఉన్న కొంతమంది హరిజనులను కలుసుకొని, "మీరు తాగుడుకు అలవాటు పడినారా?" అని అడిగినారు. అవునన్నారు వాళ్ళు. అప్పుడు గాంధీజీ ఆ క్రితంరోజున కార్మిక సమావేశంలో తన ప్రసంగం గురించి వారికి తెలియచెబుతూ "కార్మికుల వలెనే మీరందరూ చక్కగా కట్టుబాటులో ఉండటం నేర్చుకోవలె. మీరు తాగుడు మానివేయవలె. అప్పుడు కట్టుబాటులో ఉన్న కార్మికుని జీవితంవలె మీ జీవితం కూడా బాగుపడుతుంది. మీకు తినడానికి తగినంత ఆహారం, కట్టుకోడానికి తగినంత బట్ట లభిస్తుంది" అన్నారు.

## గాంధీజీని దర్శించినవారు

ఫిబ్రవరి 1వ తేదీ ఉదయం మామూలు ప్రకారం గాంధీజీ వాహ్యాళికి పోయివచ్చిన తరవాత ప్రార్థనలుజరిగినాయి. ప్రార్థన సమయంలో మైసూరునుంచి వచ్చిన వారొకరు "కృష్ణా నీ బేగానే బారో" అనే కన్నడపాటను, 'రఘుపతి రాఘవ రాజారాం'ను పాడినారు. గాంధీజీ ఈ పాటలు పాడిన విధానం మెచ్చుకొని ఆయనను హిందూస్థానీ నేర్చుకోమని సలహా ఇచ్చినారు.

హరిజన పారిశ్రామిక పాఠశాలకు పునాదిరాయి వేసినతరవాత గాంధీజీని చాలామంది దర్శించినారు. అందులో రాధాబాయి సుబ్బరాయన్ ఒకరు.

మద్రాస్ రాష్ట్ర జాతీయ ముస్లిమ్ మజ్లిస్ అధ్యక్షుడు శ్రీ అల్లాపిచ్చాయ్ కొంతమంది జాతీయ మహమ్మదీయులతో కలసి గాంధీజీని దర్శించినారు ఆయన గాంధీజీని గురించి మాట్లాడుతూ, "గాంధీజీ మహమ్మదీయులకు పరమోత్తము డయిన స్నేహితుడు, ఆయన కొరాన్ చదివి జీర్ణించుకొన్నారు ఆయనకు ఇస్లామ్ మతంపైన ఎంతో గౌరవమూ, అభిమానమూ ఉన్నవి మహమ్మదీయుల పైన ఆయనకేమీ ద్వేషం లేదు" అని అన్నారు

ఇండియన్ క్రిస్టియన్ ఫెడరేషన్ అధ్యక్షుడు డాక్టర్ వి కె జాన్ మహాత్మాగాంధీని రెండుపర్యాయాలు కలుసుకొన్నారు ముఖ్యంగా తిరువాన్కూరు ప్రభుత్వంవారి విద్యావిధానం గురించి వారుభయులు సంభాషించుకొన్నారు గాంధీజీ ఆ విషయంలో ఒక విజ్ఞాపన పత్రం సమర్పించ వలసిందని కోరినారు వారుభయులు మాట్లాడుకొనేటప్పుడు రాజకుమారి అమృతకౌర్ కూడా ఉన్నారు

సి పి. సుబ్బయ్య గాంధీజీని దర్శించినారు శ్రీమతి వసంత కోకిలం (సినీతార) గాంధీజీకి 501 రూపాయలు హరిజన నిధికి సమర్పించింది శ్రీమతి హెచ్ డి రాజా 1001 రూపాయలు హరిజన నిధికి విరాళం ఇచ్చినారు

క్షయ ఆసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ వాసుదేవరావుగారు కూడా గాంధీజీని దర్శించిన వారిలో ఒకరు

దక్షిణ భారత విశ్వకర్మ మహాసభ కేంద్ర సంఘం అధ్యక్షుడు శ్రీ టి యన్ దేవ శిఖామణి కీలక గృహపరిశ్రమల అభివృద్ధి అవసరాలను గురించి గాంధీజీ కొక విజ్ఞాపన పత్రం సమర్పించినారు

## గాంధీ తిరుగు ప్రయాణము

గాంధీజీ, ఆయన బృందము తిరిగి వార్ధాకు పోయేటందుకు అంబత్తూరు నుంచి ప్రత్యేక రైలులో ప్రయాణం సాగించినారు.

## బెజవాడ

గాంధీజీ, ఆయన బృందం మద్రాసు నుంచి వార్ధాకు పోయే ప్రత్యేక బండి 1946 ఫిబ్రవరి 5 ఉదయం బెజవాడ స్టేషన్ వద్ద నైజాం స్టేట్స్ రైల్వే లైన్‌కు ఉత్తరపు వైపు అవుటర్ సిగ్నల్ వద్ద ఆగింది. మద్రాస్ నుంచి దక్షిణ భారత హిందీ ప్రచార సభ కార్యదర్శి శ్రీ మోటూరు సత్యనారాయణ, ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘ ఉపాధ్యక్షుడు శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రిగార్లు గాంధీజీతో కలసి వచ్చినారు

బెజవాడలోని హిందూస్థానీ ప్రచార సంఘ కార్యదర్శి ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారు గాంధీజీకి స్వాగతం చెప్పి దండ వేసినారు. మహాత్మాజీ దర్శనం కోసం యాభై వేల మంది ప్రజలు నిశ్శబ్దంగా వేచి ఉన్నారు గాంధీజీ రైలు దిగి వెళ్లి సమీపంలో ప్రత్యేకం ఏర్పాటు చేసిన సభా

వేదికపై ఆసీనులయినారు సభలో అయిదు వేల మంది స్త్రీలు కూడా ఉన్నారు కనూ గాంధీ, డాక్టర్ సుశీలానయ్యర్, రామకృష్ణ బజాజ్‌గార్లు రామనామ సంకీర్తన చేస్తుండగా గాంధీజీ ముకుళిత హస్తాలతో నిలబడినారు సభ్యులలో ఒక వైపు వారు రామనామ సంకీర్తనలో పాల్గొనడం లేదని గ్రహించి గాంధీజీ చిరునవ్వుతో ఆ వైపుకు తన చేయి చూపించినారు. వెంటనే వారు కూడా రామ భజనలో పాల్గొన్నారు ప్రార్థనానంతరం హిందూస్థానీ భవనపు పునాది రాయికి గాంధీజీ పూజ చేసి దానిని ప్రతిష్ఠించడానికి ఆశీర్వదించినారు

ఈ సమయంలోనే స్థానిక కాంగ్రెస్‌వాది అయిన శ్రీ యెర్నేని సుబ్రహ్మణ్యంగారు గాంధీజీ కొక ఉత్తరం అందచేసినారు ఆ ఉత్తరంలో సి రాజగోపాలాచారిగారిని మద్రాస్ రాష్ట్రానికి ప్రధాన మంత్రిగా చేయవలెననే ఉద్దేశంతో గాంధీజీ మద్రాస్ వచ్చినట్లు ఆంధ్రులు అభిప్రాయపడుతున్నారని ఉదాహరించడం జరిగింది మహాత్ముడు ప్రథమంగా ఆ ఉత్తరం గురించి ప్రసంగిస్తూ ఇట్లా అన్నారు

"నేను దక్షిణ భారత హిందీ ప్రచార సభకు అధ్యక్షుణ్ణి కేవలం నేను దక్షిణ భారత హిందీ ప్రచార సభ రజతోత్సవాలలో పాల్గొనవలెననే ఉద్దేశంతో మద్రాస్‌కు వచ్చినాను. రాజ గోపాలాచారిని ప్రధానిగా చేయడానికి నా పలుకుబడిని వినియోగించవలెననే అభిప్రాయం నాకు కలలో కూడా లేదు రాజ గోపాలాచారి నాకు పాత మిత్రుడు ఆయన మంచి సమర్థుడయిన రాజనీతిజ్ఞుడు, పరిపాలనా దురంధరుడు నాయన ప్రధానిని చేసే అధికారమే ఉండినట్లయితే నేనాయనను సరాసరి మద్రాస్ ప్రధానిగా చేసి ఉండేవాణ్ణి అది నా పని కాదు. ఆ విషయం గురించి ఆలోచించటానికి కాంగ్రెస్ కమిటీలున్నాయి నేను కాంగ్రెస్‌లో పావలా సభ్యుణ్ణికూడా కాను తమిళ స్నేహితులు చాలా మంది రాజగోపాలాచారికి అనుకూలంగా ఒక మాట చెప్పమని నాకు ఉత్తరాలు వ్రాసినారు. వారికి నేను జవాబు వ్రాయలేదు. నేను రాజగోపాలాచారిని మద్రాస్ ప్రధానిగా చేయదలచుకొన్నట్లయితే నేనింత దూరం మద్రాస్ వరకు రానక్కర లేదు. నేనున్న చోట నుంచి ఆ పని చేయగలను.

నా మద్రాస్ రాకను గురించి కాంగ్రెస్‌వాదులలో ఇటువంటి అపోహ కలిగినందుకు నాకు చాలా విచారంగా ఉన్నది నేను ప్రత్యేకం రాజగోపాలాచారిని ప్రధానిగా చేయడానికి మద్రాస్ వచ్చినట్లు తెలుగు పత్రికలు కూడా వ్రాసినాయి. ఆ విషయం నేను కలలో కూడా తలపెట్టలేదు. నేను జైలునుంచి విడుదలయినప్పటినుంచి హిందూస్థానీ ప్రచార నిమిత్తం మద్రాస్ రావలెనని ఆలోచిస్తూనే ఉన్నాను రాజగోపాలాచారిని ప్రధానిగా చేసే విషయంగానీ, నామట్టుకు నేను ప్రధానినయ్యే విషయంగానీ నా చేతులలో లేదు. ఆ పని రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలది, అఖిల భారత కాంగ్రెస్ కమిటీది.

వాటికే ఆ పని చేయడానికి తగిన అర్హత ఉన్నది

## ఎన్నికలలో ఆసక్తి లేదు

నాకు ఎన్నికలలో గానీ శాసన సభా కార్యక్రమాలలోగానీ ఆసక్తి లేదు నేనీ రోజు వరకూ ఏ పని రహస్యంగా చేయలేదు ఇక ముందు చేయ దలచుకోలేదు నేను బెజవాడకు వచ్చిన తరవాతనే ఆంధ్ర దేశంలో ఇటువంటి అపోహ ఉందని తెలిసింది అందువల్ల ఇంతకు పూర్వం దానిని గురించి ఆలో చించవలసిన అవసరమే కలగలేదు ఏమయినప్పటికీ ఈ విషయం గురించి నేనేమీ జోక్యం కల్పించుకోను" మౌనంగా ఉంటాను

## హిందూస్థానీ నేర్చుకోండి

ఇక హిందూస్థానీ ప్రచారం గురించి నేను చెప్పిన విషయాలను మరిచి పోకండి! గడచిన అనేక సంవత్సరాల నుంచి ఆంధ్ర దేశంలో హిందూస్థానీ ప్రచారక సంఘం పని చేస్తూన్నది అయినప్పటికీ అత్యధిక సంఖ్యాకులు హిందూస్థానీ రాకపోవడం నాకు చాలా విచారంగా ఉంది ఈనాడు నేను బెజవాడలో నిర్మించనున్న హిందూస్థానీ భవనానికి శంకుస్థాపన చేసినాను మీలో ప్రతివారు ఈ అవకాశం తీసుకొని హిందూస్థానీని నేర్చుకోవలెనని కోరు తున్నాను హిందూస్థానీ అర్థంకాదని ఇక ముందు ఎవరూ అనకూడదు అప్పుడే నాకు సంతృప్తి కలుగుతుంది ఇందువల్ల మీ మాతృ భాష అయిన తెలుగును నిర్లక్ష్యం చేయవలెనని నా ఉద్దేశం కాదు తెలుగు, తమిళం, మళ యాళం మొదలైన భాషలలో ఏ ఒక్కటీ ఎన్నటికీ అఖిల భారత భాష కాజాలదు కాబట్టి అన్ని భాషలవారు హిందూస్థానీ నేర్చుకొని తీరవలె

భారత దేశంలో సామాన్య భాషగా ఇంగ్లీష్ ఉండవలెనా, హిందీ ఉండ వలెనా అనే వివాదం చెలరేగింది ఇంగ్లీష్ ఎక్కువ ప్రచారంలో ఉండటంవల్ల భారతీయ భాషలన్నీ మరుగుపడిపోయినాయి. అందువల్లనే హిందూస్థానీ ప్రచా రావశ్యకతను గురించి నేనింత గట్టిగా చెప్పవలసిన అవసరం కలిగింది.

మీరు తెలుగు, తమిళం, మళయాళం మొదలయిన భేదాలతో కాల యాపన చేయకండి మిమ్ముల్లను భగవంతుడు రక్షించుగాక "

ఈ ఉపన్యాసానికి పూర్వం మధుర మీనాక్షి, పళనీ దేవాలయాలను తాము ఆనందంగా దర్శించిన విషయం గురించి ప్రసంగించినారు. గాంధీజీ ఉపన్యాసం ఉన్నవ రాజ గోపాల కృష్ణయ్యగారు తెలుగులోకి అనువదించి నారు గాంధీజీ, ఆయనబృందం ఫిబ్రవరి 5 ఉదయం 6-15 నిముషాలకు బెజవాడ నుంచి వార్ధాకు తిరిగి ప్రయాణం సాగించినారు.

## అంధుర్శీలకు గాంధీజీ సందేశము

బెజవాడలోని హిందీ ప్రచార సంఘ కార్యదర్శి శ్రీ ఉన్నవ

ఆ 3 గోపాల కృష్ణయ్యగారు గాంధీజీతో బెజవాడ నుంచి కాజీపేట వరకు ప్రయాణం చేసినారు

గాంధీజీ ఆయన ద్వారా ఆంధ్రులకు దిగువ సందేశం పంపినారు

"ఆంధ్ర దేశం నుంచి నేను చాలా ఆశిస్తున్నాను ఆంధ్రులు నా ఆశలను పరిపూర్తి చేయగలరని విశ్వసిస్తున్నాను ఇది నా కోరిక అస్పృశ్యతను పూర్తిగా రూపుమాపండి హరిజనులకు దేవాలయ ద్వారాలన్నీ తెరవండి! సాంఘిక సమైక్యానికి కృషి చేయండి! ఖాదీధరించి దాని వ్యాపకానికి పని చేయండి! మీ మాతృభాషను నేర్చుకోండి దేవనాగరి, ఉర్దూ లిపులలో హిందూస్తానీ భాషను నేర్చుకొని తీరండి"

## పిఠాపురం మహారాజావారి విరాళం

పిఠాపురం మహారాజాగారు ఆంధ్రదేశంలో హరిజనసేవకోసం ఇచ్చిన 10,000 రూపాయలను శ్రీ బులుసు సాంబమూర్తిగారు ఫిబ్రవరి 4వ తేది సాయంకాలం గాంధీగారికి స్వయంగా అందజేసినారు

## గాంధీజీ–తెలంగాణ పర్యటన (1946)

### మధిర

గాంధీజీ, ఆయన సిబ్బంది స్పెషల్ రైలులో వార్ధాకు పోయేటప్పుడు వ ధ్యలో నిజాం రాష్ట్రంలోని స్టేషన్లలో ప్రజలు ఆయనకు స్వాగతం చెప్పి ఆయనసందేశాలను విన్నారు

ప్రత్యేక రైలు మధిర స్టేషన్కు వచ్చేసరికి ఆ రైలులో గాంధీజీ సిబ్బందితోపాటు ఆంధ్ర జాతీయపక్ష వరంగల్ కార్యదర్శి శ్రీ యం.ఎస్ రాజలింగం గారుకూడా ఉన్నారు

మధిరలో ఐదు వేలమంది గుమికూడినారు అందులో చాలామంది స్త్రీలు కూడా ఉన్నారు. సభనిశ్శబ్దంగా ఉంది ప్రత్యేకంగా నిర్మించిన పందిరిలోని వేదికపై కి గాంధీజీ వచ్చినిలబడి 10 నిముషాలు ఉపన్యసించినారు. గాంధీగారి రైలు కదులుతుండగా ఒక స్త్రీ తనచేతి ఉంగరము తీసి గాంధీగారికి ఈయబోయింది కాని ఆవిడ దానిని గాంధీజీకి అందించలేకపోయింది అప్పుడు శ్రీ యం.యస్. రాజలింగంగారు తీసుకొని గాంధీజీకిచ్చినారు

### ఖమ్మంలో

(శ్రీ కోదాటి నారాయణరావు)

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్పై నైజాం ప్రభుత్వం 1938 లో పెట్టిన నిషేధాన్ని అప్పటికింకా తొలగించలేదు. తెలంగాణా ప్రాంతంలో నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ ప్రధాన సంస్థగా పనిచేస్తూండేది. 1938 నుంచి క్రమేణా

అది రాజకీయ వేదికగా రూపొందసాగింది ఆంధ్ర మహాసభ మొదటినుంచి మిత వాద పద్ధతిలో పనిచేస్తూండేది 1940 తరువాత క్రమేణాకొందరు కమ్యూనిస్టులు తెలంగాణాలో అజ్ఞాతంగాఉండి ఇక్కడ కమ్యూనిస్టు సిద్ధాంతాలను వ్యాపింప జేయడానికి ప్రయత్నం చేసినారు వారందరి ప్రయత్నంవల్ల 1940-41 సంవత్స రాలలో చాలామంది యువకులు (శ్రీ) రావి నారాయణరెడ్డిగారి నాయకత్వంలో కమ్యూనిస్టు పార్టీలో చేరినారు ఒకవంక మితవాద రాజకీయనాయకుల నాయ కత్వం, వీరికనుచరులుగా కమ్యూనిస్టుకార్యకర్తలు,నిజమయిన జాతీయభావాలు గల కార్యకర్తలు చాలా కొద్దిమంది ఉండేవారు వీరిని ప్రజలు అర్థం చేసుకోవడం కూడా చాలాకష్టంగా ఉండేది

1942లో జరిగిన ధర్మవరం ఆంధ్రమహాసభలో మితవాద రాజకీయ నాయకులు నైజాం ప్రభుత్వం ప్రవేశపెట్టిన రాజ్యాంగసంస్కరణలను అంగీకరించి అమలులో పెట్టవలెనన్నారు అప్పటివరకు జాతీయవాదులతో కలసి రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించ వలెననే కమ్యూనిస్టులు ఆ రాత్రికిరాత్రే ప్రజా యుద్ధపు నినాదాన్ని (శ్రీ) మందుముల నరసింగరావుగారు(మితవాదనాయకుడు) కమ్యూనిస్టులకు వివరించి ఆ నినాదఫలితంగా రాజ్యాంగ సంస్కరణలు అంగీక రించవలెనని చెప్పినారు వారి బోధనల ఫలితంగా కమ్యూనిస్టులే మితవాదుల తీర్మానాన్ని బలపరచినారు జాతీయవాదుల సంఖ్య స్వల్పంగా ఉండడంవల్ల రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించ వలెననే ప్రతిపాదన వీగిపోయింది దాని ఫలితంగా జాతీయవాదులు తమకొక ప్రత్యేకమయిననుసంఘటిత సంస్థ ఉంటేనే తప్ప ప్రజలు తమవాదాన్ని అర్థంచేసుకో జాలరని గ్రహించినారు. అందువల్ల 1943లో ఆంధ్ర జాతీయపక్షం అనే ఒకపార్టీ ఏర్పడింది ఈ పార్టీ కార్యకర్తలు సుశిక్షితులుగాఉండి నిర్మాణ కార్యక్రమం ద్వారా కాంగ్రెస్ సందేశాన్ని వ్యాపింప జేసినారు స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధం తొలగినతరవాత ఈ పక్షాన్ని రద్దు చేసినారు

1946 జనవరి ఆఖరివారంలో గాంధీమహాత్ముడు దక్షిణభారత హిందీ ప్రచారసభ రజతోత్సవాలకు మద్రాస్ రానున్నారని తెలియగానే వారు తిరిగి వార్ధా వెళ్ళేటప్పుడు కాజీపేట ద్వారా వెళ్ళేటట్లయితే దారిలో తెలంగాణా ప్రాంతంలో ముఖ్యంగా ఆంధ్రజాతీయపక్ష కేంద్రాలయిన ఖమ్మం,వరంగల్లులలో నిలుపుచేయించి, వారి దర్శనభాగ్యం ప్రజలకు కలగజేయాలనీ, అందువల్ల కాంగ్రెస్ సందేశం బాగా పుంజుకొని జాతీయోద్యమానికి దోహదకారి అవు తుందనీ ఆంధ్ర జాతీయపక్ష కార్యవర్గం తీర్మానించింది అందుకై ప్రయత్నాలు జరపడానికి కార్యదర్శిగాఉన్న నన్ను ((శ్రీ) కోదాటి నారాయణరావు), గాంధీ ఆశ్రమంలో గాంధీమహాత్మునితో సన్నిహితులుగాఉన్న (శ్రీ) ఎం యస్. రాజలింగంగారిని కోరినారు అప్పటినుంచి మద్రాస్ దక్షిణభారత హిందీప్రచార సభవారితోనూ ఆహ్వాన సంఘంవారితోనూ ఉత్తరప్రత్యుత్తరాలు జరిపినాము, అగడానికి వీలులేదని నిరాశాపూరితమయిన జవాబులు వచ్చినాయి. గాంధీ

మహాత్ముడు మద్రాస్ వచ్చిన తరవాత వారి కార్యదర్శి ప్యారేలాల్ గారికి కూడా వ్రాసినాము వారివద్దనుంచి కూడా నిరాశా జనకమయిన ప్రత్యుత్తరమే వచ్చింది చివరకు స్వయంగా వెళ్ళి ప్రయత్నం చేయవలసిందిగా శ్రీ యం యస్ రాజలింగంగారిని పంపించినాము ఆయన స్వర్గీయులయిన శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామి సీతారాం) గారి ద్వారా గాంధీ మహాత్మునకు తెలంగాణాలో ఆగవలసిన అవసరం గురించి చెప్పించినారు కనీసం ఖమ్మం, వరంగల్లులలోనయినా ఆగవలసిందిగా ప్రార్థించగా గాంధీమహాత్ముడు తెలంగాణాలో ఆగవలసిన అవసరాన్ని గుర్తించి ఖమ్మం, వరంగల్లులలోనే కాకుండా అన్ని చోట్ల ఆగడానికి అంగీకరించినారు గాంధీగారికోసం ప్రత్యేకరైలు ఏర్పాటు చేయబడినది అది వారి ఇష్టాయిష్టాల ప్రకారం ఆగేఏర్పాటు ఉన్నది

గాంధీమహాత్ముని అంగీకారం తీసుకొని రాజలింగంగారు మాకు టెలిగ్రామ్ ఇచ్చినారు అప్పటికి గాంధీజీరాకకు రెండు, మూడురోజులే విరామం ఉండినది అందువల్ల ఏర్పాట్లు చాలా త్వరత్వరగా చేయవలసివచ్చింది ఆంధ్రోద్యమ నాయకులయిన శ్రీ మందుముల నరసింగరావుగారిని ఆహ్వానించడానికి ప్రత్యేకం మనుషులను పంపినాము స్వామి రామానందతీర్థ అప్పుడు నగరంలో లేరు మిగతా ఆంధ్రనాయకులను కూడా ఆహ్వానించినాము హైదరాబాదునుంచి అచ్యుత రావుదేశపాండే అనే మాతోటి కార్యకర్తతప్ప మరెవ్వరూ రాలేదు మధిర, మహబూబాబాదు, డోర్నకల్లులలో మహాత్ముడు ఆగునని తోటికార్యకర్తలకు కబురు చేసినాము వేలకొద్ది కరపత్రాలు అచ్చువేయించి కార్యకర్తలద్వారా పరిసరప్రాంతాలయిన వరంగల్లు, (ఖమ్మంజిల్లా అప్పుడు లేదు) నల్లగొండజిల్లాలలో పంచిపెట్టించినాము వరంగల్, కాజీపేట, మంచిర్యాలలో ఆగేఏర్పాట్లు జరిగినాయి. మహాత్ముని రైలులోవచ్చి మధిర, ఖమ్మం, డోర్నకల్లు, మానుకోట (మహబూబాబాదు) వరంగల్లు, కాజీపేట, మంచిర్యాలలో ఆపించవలసిందిగా రాజలింగంగారికి టెలిగ్రాం పంపినాము. వారు మహాత్మునితోనే వచ్చినారు.

ఆంధ్ర జాతీయపక్ష కార్యకర్తలు ముందుగా వెళ్ళి గ్రామాలలో తెలియ చేసినారు.

ఖమ్మంలో ఏర్పాట్లకు ఆంధ్రజాతీయ యువజనసంఘ అధ్యక్షుడు శ్రీ యల్లాప్రగడ కృష్ణమూర్తిగారు, కార్యదర్శి కోనా పట్టాభిరామయ్యగారు, మిగతాసభ్యులు మైమరచి పనిచేసినారు. ఆంధ్ర జాతీయపక్ష పట్టణసమితి అధ్యక్షుడు శ్రీ గెల్లా కేశవరావుగారు, వర్తకసంఘం అధ్యక్షులు శ్రీ నుగ్గుల అక్షయలింగంగుప్త గార్ల తోడ్పాటుతో నిధి సమీకరణ ప్రారంభించినాము సుమారు రూ. 2000 పైగా వసూలయింది. అప్పుడు లౌడుస్పీకర్లు, ఫోటో గ్రాఫులు ప్రచారంలో లేవు. హైదరాబాదునుంచి ప్రత్యేకం లౌడుస్పీకర్ తెప్పించినాము. విజయవాడనుంచి వీరన్న అనే ప్రసిద్ధివహించిన ఫోటోగ్రాఫర్‌ను పిలిపించినాము. గాంధీమహాత్మునికి సమర్పించేటందుకు రూ.1116లు ప్రత్యేకంగా తీసిపెట్టి మిగతామొత్తాన్ని ఏర్పాట్లకు, ప్రచారానికి ఖర్చుచేసినాము. ఖమ్మంలో

వెంకటగిరి లెవెల్ క్రాసింగ్ గేటువద్ద విశాలమైన మైదానంలో గాంధీమహాత్ముని ఆపడానికి ఏర్పాటుచేసినాము. మైదానమేకాకుండా, దానిని ఆనుకొని ఉన్న చిన్నచిన్న గుట్టల మీదకూడా ప్రజలు కూర్చుండేటందుకువీలు చేసినాము. లౌడుస్పీకర్ లు చక్కగాఉండి గాంధిమహాత్ముని వాక్కులు జనసమూహానికంతటికీ వినిపించినవి. కలవలడిబీలనుంచి వాసాలుతెచ్చి గదులను రోడ్లను ఏర్పాటు చేసినాము. ఆంధ్రజాతీయ యువజనసంఘం సభ్యులందరూ సేవాదళంగా ఏర్పడి పనిచేయటమేకాక ప్రజలను నిశ్శబ్దంగా ఉంచడానికి చాలాకృషి చేసినారు. శ్రీ కొలిపాక వెంకటకిషన్‌రావు, దావలి వెంకటకోటయ్య గారు కూడా చాలా తోడ్పడినారు. స్వర్గీయ జమలాపురం కేశవరావుగారు వాళ్లలో ఒకరుగాఉండి చాలా సహాయపడినారు.

రైల్వే స్టేషన్ నుంచి సుమారు ఒక ఫర్లాంగ్ దూరంలో వేదిక నిర్మించినాము. వేదిక సుమారు 15 అడుగుల ఎత్తు ఉంది. రైల్వే వద్ద నుంచి వేదిక వరకూ బల్లెపీటలతో సుమారు 1 అడుగు ఎత్తున మెట్లు మెట్లుగా ఉండేటట్లు చేసి వేదిక కూడా బల్లెపీటలతోనే నిర్మించినాము. రైలు దిగిన తరువాత గాంధి మహాత్ముడు నేలపై అడుగు పెట్టకుండా వేదిక వరకూ బల్లెపీటలపైననే నడిచి వచ్చేటట్లు జరిగిన ఈ ఏర్పాటు చాలామందికి ఆశ్చర్యం గొలిపింది. వెనకవైపు నుంచి జనం నెట్టుకు రాకుండా కర్రలతోనూ, తాళ్ళతోనూ గట్టిగా కట్టి విశాలమయిన రోడ్డువలె ఏర్పరిచి, వాలంటీర్లను నిలబెట్టి గట్టి బందోబస్తు చేసినాము.

తెల్లవారితే గాంధీజీ వస్తారనగా ఆ రాత్రి 8 గంటల నుంచే జనం రావడం ఆరంభమయింది. ఎవరెవరిని ఏ ఏ గదులలో కూర్చోబెట్టాలో ఆ ఏర్పాట్ల చొప్పున వాలంటీర్లు కూర్చోబెట్టినారు. గాంధీ మహాత్మునికు అందరికీ కనపడతాడని, గాంధీ మహాత్ముని మాటలు అందరికీ వినబడతాయని, గాంధీ మహాత్ముని పట్ల భక్తి అనుకొని లేచి నిలబడవద్దని, ఏ మాత్రం శబ్దమయినా గాంధీ మహాత్మునికి కోపం వస్తుందని, అది పట్టణానికి అప్రతిష్ఠ కలిగిస్తుందని పదే పదే లౌడ్ స్పీకర్ల ద్వారా చెప్పి రాత్రంతా శిక్షణ ఇచ్చినాము. తెల్లవారు జామున నాలుగు తరవాత వచ్చిన వారికి మైదానాన్ని అనుకొని ఉన్న గుట్టలపై కూర్చునే ఏర్పాటు చేసినాము. దాదాపు 75, 80 వేలజనం గుమికూడి ఉన్నప్పటికీ క్రమ శిక్షణాబద్ధులై చాలా చక్కగా ప్రవర్తించినారు. ఖమ్మంలోని నిశ్శబ్దతకు, క్రమశిక్షణకు మహాత్ముడు తన హర్షాన్ని వ్యక్తం చేసినారు. ఖమ్మంలోని గాంధి మహాత్ముని ఫోటో చాలా అపురూపంగా ఉందని సేవాగ్రాంలో ప్రశంసలు పొందింది. రాత్రంతా వాలంటీర్లు డబ్బాలతో ప్రజల దగ్గర వసూలు చేసిన చిల్లర డబ్బులను ఒక బస్తాలో పోసి ఆయనకు సమర్పించిన నిధి కాక బస్తాను కూడా రైలు డబ్బాలో చేర్చినాము. అవన్నీ లెక్క పెట్టించి 1500 రూపాయలయినవని మాకు కబురు పంపినారు.

ఈ సందర్భంలో రెండు పన్ని వేశాలు పేర్కొనదగినవాయి. గాంధీజీ దర్శనార్థమై ఏర్పాటు చేసిన ఆవరణలోకి పోలీసులనెవ్వరినీ రానీయ లేదు. పోలీ

మేము శాంతి భద్రతల బాధ్యులమై తాము లోపలికి వచ్చి తగిన బందోబస్తు చేస్తామని, తమకు ప్రత్యేకపటి బాధ్యతలు ఉన్నాయనీ ఎంత చెప్పినప్పటికి వారిని మేము లోపలికి రానివ్వలేదు వారు మొండిగా మమ్ములను కాదని లోపలికివస్తే గాంధీ మహాత్ముడు ఆగకుండా చేస్తామని చెప్పినాము దానితో వారు తమ పట్టుదలను విడనాడి లోపలికి రాలేదు పోలీసు అధికారులు గాంధీ మహాత్ముని దర్శనానికి అవకాశం ఇప్పించవలసిందని కోరినారు వారు పోలీస్ డ్రెస్‌లో కాకుండా సామాన్య ప్రజలవలె వస్తే అవకాశం కలిగిస్తామని చెప్పగా వారట్లాగే వచ్చి నారు గాంధీ మహాత్ముని దర్శనం బాగా కలిగే రీతిగా కూర్చుండబెట్టినాము

ఖమ్మంలో అప్పుడు అత్యున్నతాధికారి డిప్యూటి కలెక్టరు అయనకు దగ్గర నుంచి గాంధీ మహాత్ముని దర్శనం చేసుకోవలెనని అభిలాష కలిగింది అధికార రీత్యా ముందున్న గదులలోకి ఆయన ప్రయత్నం చేసినారు ఆ గదులు కార్యకర్తలకు కొన్ని, విరాళాలిచ్చిన దాతలకు కొన్ని ప్రత్యేకింపబడి నాయి ఆయన ఆ గదులలోకి వెళ్ళవలెనని ఎంత ప్రయత్నించినా ప్రవేశం కలగలేదు చివరకు ఎక్కడో ఉన్న నా దగ్గరికి వచ్చి బ్రతిమాల సాగినాడు చివరికి మే మొక రాజీకి వచ్చినాము ఆయన శక్తి కొద్దీ ఐచ్ఛికంగా విరాళం ఇవ్వమన్నాను 15 రూపాయలు కాబోలు ఇచ్చినట్టున్నాడు నేను ఆయనను 50 రూపాయల విరాళం ఇచ్చిన వారి గదిలో కూర్చుండబెట్టినాను అందు కాయన ఎంతో తృప్తి పడినారు

తెల్లవారు జామున 4 గంటల నుంచి జనాన్ని కదలవద్దనీ, గాంధీ మహాత్ముడు వస్తున్నాడనీ చెప్పడం ప్రారంభించినాము రైల్వే స్టేషన్ నుంచి ఎప్పుడు ఎక్కడికి మహాత్ముని రైలు వచ్చింది వర్తమానం తెలుసుకొంటూ జనానికి చెప్పసాగినాము మధిర వచ్చే వరకు దాదాపు ఉదయం 7 గంట లయింది అప్పటి నుంచి మరీ కఠినంగా క్రమశిక్షణ అమలులో పెట్టినాము సుమారు ఉదయం 8-30 గంటలకు గాంధీ మహాత్ముని రైలు మైదానం వద్ద ఆగింది. మేము ఎవ్వరమూ ఎదురుగా కూడా స్వాగతమివ్వడానికి వెళ్ళలేదు, వారికి ఏదయినా కష్టం కలుగుతుందనే దృష్టితో మైదానమంతా అలంకరింప బడి ఉండటంవల్ల, ముందే రైల్వే అధికారులు రైలును స్టేషన్‌లో కాక ఫలానా చోట ఆపవలసిందని చెప్పటంవల్ల, రైలు జండాలు మైదానంవద్ద నుంచి చూపడం వల్ల రైలు మైదానంవద్ద ఆపు చేయబడింది. గాంధీగారు చకచకా వేదికపైకి వచ్చినారు. వారితోపాటు కనూగాంధీ, రామకృష్ణబజాజ్, ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య, యం యస్. రాజలింగం మొదలయిన వారు వేదికపైకి వచ్చినారు గాంధీ మహాత్మునికి ఖద్దరు గుడ్డపై హిందీలో వ్రాయించిన స్వాగత పత్రం సమర్పించినాము. సమయం వ్యర్థమవుతుందని దానిని చదవలేదు. ఆ సన్మాన పత్రం తెలుగులో ముద్రించిచి హిందీ అను వాదం ఖద్దరు గుడ్డపై వ్రాసి సమర్పించినాము. రూ 1116 లు ఆయనకు వెండి పళ్ళెంలో పోసి సమర్పించినాము. "ఈ పళ్ళెంకూడా నాదే కదా" అన్నారు

ముసి ముసి నవ్వు నవ్వుతూ నేను "ఈ పళ్ళెం యజమానులు వేరే ఉన్నారు వారు రూపాయలు పోసి సమర్పించమని మాత్రమే ఇచ్చినారు వారి అనుమతి తెప్పించి సమర్పించు కొంటాను" అన్నాను

"అయితే అక్కర్లేదులే" అన్నారు తరవాత ప్రసన్న వదనంతో సభ నంతా కలయ జూచి ఎట్లాంటి నినాదాలు లేకుండా నిశ్శబ్దంగా ఉండటం చూసి హర్షించినారు మహాజనానికి అంజలి ఘటిస్తూ క్రమశిక్షణకు ప్రశంసా వాక్యాలు పలికి అందరూ కలసి మెలసి ఉండండని, కుల మత ద్వేషాలకు తావీయవద్దని, అస్పృశ్యతను పాటించవద్దని, అంతా ఖద్దరు కట్టండని, రాట్నం వడకండని, త్వరలో రానున్న స్వరాజ్యానికి అర్హత సంపాదించుకోండనీ సుమారు 3, 4 నిమిషాలు మాట్లాడినారు మరొక్కసారి సభనంతా కలయజూచి నమస్కరించి వెనుదిరిగినారు వారితోపాటు సాగనంపడానికి కొందరం రైలు వద్దకు వెళ్ళినాము గాంధీగారు ఎంత వేగంగా నడుస్తారో అప్పుడర్థమయింది వారు నడుస్తూంటే నేను పరుగెత్తినాను వారు రైలులో ప్రవేశించగానే బండికదిలింది. మేము చూస్తుండగానే రైలు కనుచూపు మేర దాటింది.

తిరిగి వచ్చి మేము ప్రజలందరూ చూపించిన క్రమశిక్షణను, నిశ్శబ్దతను ప్రశంసించినాము మహా జనమంతా పది నిమిషాలలో మైదానం విడిచి వెళ్ళి నారు గాంధీ మహాత్ముడు కూర్చున్న ఖద్దరు శాలువాను వేలం వేస్తే 80 రూపాయలు వచ్చినాయి.

ఆనాడు గాంధీ మహాత్ముని దర్శనార్థం వచ్చిన ప్రజలు సుమారు 80 వేలు ఉన్నారు ఇంత మంది ఖమ్మంమెట్టుకు ఎప్పుడు రాలేదు చాలా దూర ప్రాంతాల నుంచి వచ్చినారు వారు తరవాత చాలా ఇబ్బంది పడినారు పాల వారు, హోటళ్లలో పని చేసే వారు అందరూ మహాత్ముని దర్శనార్థం రావడం వల్ల ఆనాడు హోటళ్లలో కాఫీ, ఫలహారం, భోజనం ఏదీ దొరకలేదు వెళ్ళ డానికి బస్సులలోనూ, రైళ్ళలోనూ స్థలం దొరకడం కష్టమయి పోయింది బస్సులలో వెళ్ళేవారికి మరీ కష్టమయింది ఈ ఇబ్బందులను చూసి లారీ యజ మానుల వద్దకు వెళ్ళి చెప్పగా నలుగురు నాలుగు లారీలిచ్చినారు వాటిపై ప్రజలను ఎక్కించి సూర్యాపేట, కోదాడుల వరకూ ఎవరెక్కడ దిగితే వారి నక్కడ దింపమనీ పంపినాము ఈ విధంగా నాలుగైదు పర్యాయాలు లారీ లను పంపి సాయంత్రంలోగా జనాన్ని పంపించినాము

## డోర్నకల్

డోర్నకల్‌లో సుమారు పదువేల మంది ప్రజలు వచ్చినారు 400 రూపా యలు హరిజన నిధికి సమర్పించినారు

## హరిజనులకు సందేశం - గుండ్రాతి మడుగు

గుండ్రాతి మడుగు పక్కనున్న హరిజనులు సుమారు 400 మంది గాంధీ

జీని దర్శించి 200 రూపాయల నిధి సమర్పించినారు వారితో గాంధీజీ పావు గంట సేపు సంభాషించినారు

## మానుకోట

మానుకోట స్టేషన్‌లో దాదాపు 800 మంది చేరినారు సుమారు 700 రూపాయలు హరిజన నిధికి సమర్పించినారు

## వరంగల్

గాంధీజీ రాక గురించి వరంగల్‌లోను చుట్టు పక్క గ్రామాలలోను భండారు నాగభూషణరావు, సుదర్శన్, యం సత్యనారాయణ, దుగ్గిశెట్టి వెంకటయ్య మొదలయిన వలంటీరు దళాధిపతులు వారివారి దళాలతో ప్రచారం చేసినారు రంగాశాయిపేట, వరంగల్లు, హనుమకొండ విద్యార్థి సంఘాల వలంటీర్లు, దళాధిపతులు 800 మంది 'స్వతంత్ర భారత్‌కీ జై' అనే నినాదాలతో 1946 ఫిబ్రవరి 6వ తేది తెల్లవారేసరికి వరంగల్లు చేరుకొన్నారు. జైహింద్ తోరణాలతో గొప్పవేదిక నిర్మింపబడింది వరంగల్లు స్టేషన్‌కు తూర్పువ గూడ్స్ స్టేషన్ ప్రక్కన బాపూజీ సందేశమివ్వటానికి ఏర్పాటు చేసిన స్థలంలో ఉదయం 7 గంటల నుంచి ప్రజాసమూహం పొంగి పొరలెత్తింది

గాంధీగారి ప్రత్యేక రైలు తలవని తలంపుగా బెజవాడ, వరంగల్లు మధ్యనున్న ప్రతిరైల్వే స్టేషన్‌లోను ఆగుతూ రావటంచేత వరంగల్లుకు 9½ గంటలకు రావలసినరైలు దాదాపు మధ్యాహ్నం 12½కు చేరింది సుమారు లక్షాయాభై వేల మంది ప్రజలు మహాత్మజీ దర్శనం కోసం ఉదయం నుంచి మండుటెండలో వేచి ఉన్నారు

గాంధీజీ రైలురాగానే ప్రజలు ముందుకు తోసుకొనిరాగా వలంటీర్లు వారిని ఆపి శాంతి చేకూర్చినారు స్వచ్ఛంద సేవకులు అక్కడి ప్రజల నర్థించి వేయి రూపాయలకు పైగా నిధిని సేకరించినారు అందులో స్త్రీలు ఇచ్చిన మొత్తం ఎక్కువ.

జాతీయ పక్షం, జాతీయ ఆంధ్ర మహాసభ, హిందూస్థానీ ప్రచారక సంఘం, జాతీయ యువజన సంఘంవారు అందరూ కలసి మొత్తం పదివేల రూపాయల నిధిని ప్రోగుచేసినారు. కొందరు స్త్రీలు బంగారు వస్తువులు, హారాలు ఇచ్చినారు.

గాంధీజీకి, శ్రీ యం. యస్. రాజలింగం, శ్రీ హాయగ్రీవాచారి, శ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావు మొదలైనవారు స్వాగతం చెప్పి 15,000 రూపాయల విరాళం హరిజన నిధికి సమర్పించినారు అనేకమంది నూలు దండలు కూడా ఇచ్చినారు. శ్రీ చందా కాంతయ్యగారు ఒకహారాన్ని, 5,000 రూపాయల నగదును సమర్పించినారు.

మిల్లు బట్టలు కట్టుకొన్న ఒక గుజరాతీ స్త్రీ బాపూజీకి ఖాదీ నూలు

సమర్పించగా ఆయన "నీవు మిల్లు బట్టకట్టుకొని నాకు ఖద్దరు నూలు ఇస్తున్నావా" అన్నారు పాపం ఆమె వెంటనే ఖాదీ కట్టుకుంటానని వాగ్దానం చేసింది తిరిగి జనం తోసుకొని రావటం మొదలు పెట్టినారు రామకృష్ణబజాజ్, 'రఘుపతి రాఘవ రాజారాం' అని సంకీర్తనం చేసినారు కాని ఎందుకో ఆగలేదు వెంటనే గాంధీజీ వెనక్కు తిరిగినారు శ్రీ కొండపల్లి ఆంజనేయశాస్త్రి, కనూగాంధీ, యం యస్ రాజలింగం మొదలైనవారు గాంధీజీకి అంగరక్షకులుగా ఉండి ఆయనను రైలులో ఎక్కించినారు

గాంధీజీ ప్రత్యేకరైలు బండి వచ్చేవరకు వేచిఉన్న జనాన్ని ప్రశాంతంగా ఉంచేటందుకు కొంతమంది మనోరంజకంగా జాతీయగీతాలు పాడినారు ముఖ్యంగా సేర్ మౌజీభాయి భార్య శ్రీమతి మోంగిబాయ్ "జయ్‌భారతమాతా హమారీ......ప్యారీ ప్యారీ" అనే పాట పాడినప్పుడు దూరశ్రవణ యంత్రాల ద్వారా విన్న ప్రజాసమూహం సమ్మోహిత మయినది "చలో ఢిల్లీ" అనేపాట, ఆజాద్ హిందూఫౌజ్‌వారి కదనప్రస్థానగేయాలు ప్రజలను బాగా ఆకర్షించినాయి ఉదయం 10 గంటలకు అజంజాహీ మిల్లు కార్మికులందరూ సభా ఆవరణము లోకి వచ్చినారు

ఒక హరిజన బాలిక గాంధీజీ నుదుట తిలకం దిద్దబోగా ఆయన మంద హాసంతో అందుకు అంగీకరించినారు

## గాంధీజీ వరంగల్ యాత్ర

(భండారు చంద్రమౌళీశ్వరరావు)

దక్షిణభారత హిందీప్రచారసభ రజతోత్సవ సందర్భంలో మహాత్మాగాంధీ 1946 జనవరి చివరివారంలో మద్రాస్ వచ్చినారు వరంగల్ హిందీ ప్రేమి మండలి కార్యదర్శిహోదాలో నేనిక్కడఉండి దక్షిణభారత హిందీప్రచార సభ వారి పరీక్షలను నిర్వర్తిస్తూండినాను నేనా రజత జయంత్యుత్సవాలకు సౌరాష్ట్ర ప్రతినిధిగా హాజరయినాను గాంధీజీ కార్యదర్శి ప్యారేలాల్ ద్వారా గాంధీ గారి ప్రత్యేకపు రైలుబండి వరంగల్లులో ఒకఅరగంట సేపు ఆగేటట్లు ఏర్పాటు చేసినాను గాంధీజీ వరంగల్ పట్టణంలోకిరారని వీలయితే రైలు పెట్టెద్వారం నుంచిగానీ, లేదా రైలుమార్గం పక్కగా అమర్చబడిన ప్రత్యేకవేదిక నుంచిగానీ ఆయన ఉపన్యసించగలరని ముందుగానే నాకు ప్యారేలాల్ జీ చెప్పినారు.

నేను 1946 ఫిబ్రవరి 1వ తేదికి వరంగల్‌కు వచ్చేసినాను గాంధీగారి ప్రత్యేకరైలుబండి నిర్ణీత కార్యక్రమం ప్రకారం ఫిబ్రవరి 6 ఉదయం 9½ కు వరంగల్‌కు చేరవలసిఉంది. నేను, నాకుపెద్దలయిన సహచరులు శ్రీ యం.యస్. రాజలింగం, శ్రీ టి. హయగ్రీవాచారిగార్లు, శ్రీ యస్. శ్రీరాములు నాయుడు, శ్రీ యస్ చంద్రమౌళి, శ్రీ బి రంగనాయకులుగార్లు. కలిసి గాంధీజీని ఆహ్వానించడానికి, ఆయనకు విరాళం సమర్పించడానికి ఒక సన్మాన సంఘంగా ఏర్పడినాము.

మేము దాదాపు 12,000 రూపాయల విరాళం వసూలు చేసినాము. గాంధీగారి ప్రత్యేక రైలుబండి [illegible] మధ్యలో ప్రతి ముఖ్యస్టేషన్‌లోను ఆగడంవల్ల వరంగల్ చేరేసరికి మధ్యాహ్నం 12-30 గంటలయింది. ఆ మిట్టమధ్యాహ్నవేళ దాదాపు ఒకటిన్నర లక్షల జనం గాంధీజీ దర్శనం కోసం ఉదయంనుంచి వేచిఉన్నారు. అది చూడదగిన దృశ్యము. గాంధీజీ రైలునుంచి వెలుపలికివచ్చి చేతిలో గొడుగుతో వేదికపైన నిలబడినారు. ఆయన కొన్ని నిముషాలు మాట్లాడినారు. ఇంతలో యాంత్రిక ధ్వనియంత్రాలు మూగపోయినాయి. ప్రజలలో కల్లోలం ప్రారంభమయినది. చాలా కష్టంమీద గాంధీజీని ఎట్లాగో అట్లా తిరిగి రైలులో చేర్చగలిగాము. మహాత్ముని పాదస్పర్శచేత వరంగల్ నేల పవిత్రమయింది. పదినిముషాలలో 15,000 రూపాయల నగదు 8,000 రూపాయల నగలు ఆయనకు సమర్పించడం జరిగింది. మాలో కొందరం గాంధీజీతో కాజీపేటవరకు పోయి తిరిగి వచ్చినాము.

## గాంధీజీ సందేశము

**కాజీపేటలో**

గాంధీజీ ప్రత్యేకరైలు ఆంధ్రదేశ సరిహద్దులను దాటిపోయేముందు కాజీపేటలో గాంధీజీ ఆంధ్రులకు స్వదస్తూరిలో హిందీలో ఈ దిగువసందేశం వ్రాసి ఇచ్చినారు. దాని తెలుగు అనువాదమిది -

"ఆంధ్రదేశం పైన నాకు చాలా ఆశ ఉన్నది. ఆంధ్రదేశం నా ఆశయాలను పూర్తిగా నెరవేరుస్తుందని నా నమ్మకం. అవి ఏవంటే అస్పృశ్యతను పూర్తిగా తొలగించవలె, అస్పృశ్యులకు దేవాలయాలన్నీ తెరువవలె. అందరూ ఖద్దరునే ధరించవలె. జాతీయఐకమత్యం కలిగిఉండవలె. మాతృభాషతోపాటు జాతీయభాష అయిన హిందూస్థానీని నాగరి, ఉర్దూ లిపులలో నేర్చుకోవలె."

కాజీపేట, (సం) యం. కె. గాంధీ

5-2-1946

***ఆశ్చర్యకరము**

(ఎం కె గాంధీ)

పళనినుంచి నేను మద్రాసుకు తిరిగి వస్తుండగా మా రైలుఆగిన ఒకచోట రాజాజీని, గోపాలస్వామిని నిందిస్తూ ఒకఉత్తరం నాకెవరో అందించినారు. ఆ ఉత్తరంలో వారిద్దరు తమకు ప్రతికూలంగా ఉన్నవారి నెవ్వరినీ నా దగ్గరకు చేరనివ్వరనిఉంది. కాని నాకు తెలిసిన విషయమందుకు భిన్నంగాఉన్నది. నాతో మాట్లాడదగిన విషయంఉండి మాట్లాడగోరేవారు నన్నుచూడటానికిగానీ, నాకు వ్రాయడానికిగానీ ఎవ్వరూ ఏమీ అభ్యంతరం పెట్టడానికి వీలులేదు. ఈ ఉత్తరం

---

* 1946 మద్రాస్ శాసనసభ ఎన్నికల తరవాత మంత్రి వర్గ నిర్మాణం గురించిన వివాదాల సందర్భంలో గాంధీజీ వ్రాసిన వ్యాసము.

నాకుచేరడమే అందుకు నిదర్శనము. మా ప్రత్యేక రైలు బండిలోనే శ్రీ కామరాజ్‌నాడార్ కూడా ఉన్నారు ఆయన పలనికొండపైన, గుడిలోకూడా నాతోనేఉన్నారు అయితే నా ప్రయాణంలో రాజాజీ, గోపాలస్వామిగార్లు నాకు అత్యంత సన్నిహితులుగా ఉంటుండినమాట కూడా వాస్తవమే వారే నాకీ ప్రయాణం ఏర్పాట్లు చేసినారు రాజాజీ నాకు చాలా పాత మిత్రులలో ఒకరు ఆయన నా ఆశయాలను మాటలలోనూ చేతలలోనూ కూడా చక్కగా ద్యోతకం చేయగల సమర్థుడు 1942లో ఆయన నాతో ఏకీభవించలేదని నాకు తెలుసు తన భేదాభిప్రాయం ధైర్యంగా ప్రకటించ గలిగినందుకు ఆయనను గౌరవించవలసిఉంది ఆయన గొప్ప సంఘసంస్కర్త తాను నమ్మిన దానిని ఆచరించేటందుకు ఎన్నడూ భయపడిన మనిషికాడు ఆయన రాజకీయ వివేకం గానీ నిజాయితీగానీ ఎవ్వరూ ప్రశ్నించడానికి వీలులేదు అందువల్ల ఆయనకు ప్రతికూలంగా ఒక గూడుపురాణీవర్గం ఉండటం నాకు విచారంగా ఉన్నది మద్రాస్‌లో అధికారంలోఉన్న కాంగ్రెస్‌లో ఆవర్గం పరిగణింప దగినదే కాని సామాన్యప్రజలు రాజాజీపట్ల విశ్వాసంగా ఉన్నారు తమిళనాడు ప్రజాసామాన్యంలో రాజాజీకి పలుకుబడి లేనిపక్షంలో నా యాత్రా మార్గంలో ప్రజలు గుంపులు గుంపులుగావచ్చి గొప్ప ప్రదర్శనలు జరిపిఉంటారని నేనను కోను నేనట్లా అనుకొనేటంత అవివేకినిగానీ అహంకారినిగానీ కాను

దక్షిణ దేశంలోని కాంగ్రెస్‌వాదులు వారికేది మంచిగా తోస్తే అది చేయవచ్చు ప్రస్తుత సమయంలో రాజాజీ వహించవలసిన బాధ్యతను మరెవ్వరూ వహించలేరనీ, దేశానికి ఆయన చేయనున్న విలువగల సేవలను పోగొట్టుకో కూడదనీ వారినిప్పుడు నేను మందలించక పోయినప్పటికీ వారు కాంగ్రెస్ సంస్థకు మాత్రం విశ్వాస పాత్రులుగా ఉండవలెనని ఆశీర్వదిస్తున్నాను

వార్ధాకు పోయేమార్గంలో,
బెజవాడకు చేరేముందు
5-2-1946.

బెజవాడలో శ్రీ యెర్నేని సుబ్రహ్మణ్యం హిందూస్థానీలో ఒక చీటీ అందజేసినారు దాని సారాంశమిది

'మీరు రాజాజీని ప్రధానిగా చేయవలెననే ఉద్దేశంతో మద్రాస్‌కు వచ్చినట్లు ఆంధ్రదేశంలో ప్రబలమయిన నమ్మకమున్నది. చాలా మంది కాంగ్రెస్‌వాదులు అటువంటి ప్రచారం చేస్తున్నారు ఈ వార్తను ఆధారంగా చేసుకొని కొన్ని తెలుగు వార్తా పత్రికలు హిందూస్థానీకి వ్యతిరేకంగా కూడా వ్రాస్తున్నాయి. దయచేసి ఈ విషయంలో మీ అభిప్రాయం ఇవ్వండి "

ఇందుకు ప్రత్యుత్తరంగా హరిజన్‌లో గాంధీజీ ఇట్లా వ్రాసినారు:

"దీనికి జవాబు ఇవ్వవలసిన బాధ్యత నాకు ఉంది కేవలం దక్షిణ భారత హిందీ ప్రచార సభ రజతోత్సవాల నిర్వహణకు నా మద్రాస్ ప్రయాణం ఉద్దేశింప బడినదని నేను చెప్పినాను దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఇప్పుడు

హిందూస్థానీ ప్రచార సభగా పరిణామం పొందింది అయితే నేను మద్రాస్ నుంచి ఆగంతుకంగా మధుర, పళని దేవాలయాలనుకూడా దర్శించి వచ్చినాను అనుకొన్న కాలం కంటె ముందుగా జైలు నుంచి విడుదలయినప్పుడే నేను మద్రాస్ ప్రయాణం తలపెట్టినాను అప్పటికింకా కాంగ్రెస్ శాసన సభా కార్యక్రమం తిరిగి ప్రారంభించే ఉద్దేశం కూడా లేదు కాబట్టి నా మద్రాస్ పోకకు, రాజాజీ ప్రధాని పదవికి ఏమీ సంబంధం లేదు నా జీవితంలో రహస్యానికి స్థానం లేదు నేనేదయినా అభిప్రాయం చెప్పదలుచుకొంటె బహిరంగంగా చెప్పి వేయడమే నా అలవాటు. తమకు సలహా ఇవ్వవలసిందని స్నేహితులు కోరినప్పుడు కూడా నేను దానిని నిరాకరించినాను నాకు ఎన్నికలలోనూ పదవులలోనూ ఆసక్తి లేకపోవడమే అందుకు కారణము కాని నన్ను ప్రశ్నిస్తున్నారు కనక దక్షిణ రాజధానిలో ప్రధాన పదవిని పొందడానికి రాజాజీయే ఉత్తముడని చెప్పడానికి నేనెంత మాత్రం సందేహించను నా చేతులలోనే అధికారం ఉంటే ఆ పదవి నేను స్వీకరించక పోయినట్లయితే దానిని నేను రాజాజీకే ఇచ్చే వాణ్ణి కాని ఆ అధికారం రాష్ట్ర కాంగ్రెస్ సంఘం చేతులలోను చివరకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చేతులలోను ఉన్నది నా అభిప్రాయం ఒక వ్యక్తి అభిప్రాయం మాత్రమే దానికి నా వ్యక్తిగతాభిప్రాయానికి ఉండవలసిన విలువే ఉంటుంది"

బెజవాడ తరవాత
వార్ధా తోవలో,
5-2-1946

## 1946 రాజకీయపరిస్థితి

రాష్ట్రీయ శాసనసభల ఎన్నికలు 1946 ఫిబ్రవరికి పూర్వమే జరిగినాయి దాదాపు అన్ని రాష్ట్రాలలోనూ కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పాటయినాయి రాష్ట్రీయ శాసన సభల నుంచి రాజ్యాంగ పరిషత్తుకు ప్రతినిధులను ఎన్నుకొనే పని 1946 జూలై మాసాంతంతో ముగిసింది 1946 సెప్టెంబర్ 2వ తేదిని కేంద్రంలో తాత్కాలిక ప్రభుత్వ నిర్మాణం జరిగింది 1946 నవంబర్ 28న జరిగిన మీరట్ కాంగ్రెస్ మహాసభ కేంద్రంలో ఏర్పాటయిన తాత్కాలిక ప్రభుత్వం ఆమోదిస్తూ తీర్మానించింది

## కృష్ణాజిల్లాలో హరిజనసేవ (యం కె గాంధీ)

శ్రీ టి. రామచంద్రరావుగారు తన హరిజన కార్యకలాపాల గురించి ఇట్లా వ్రాస్తున్నారు

"ప్రజలందరూ ఉపయోగించే బావులను హరిజనులు కూడా ఉపయోగించు కొనే అవకాశం కల్పించటానికి పూనుకొన్నాము 1920 నాటి మద్రాస్ లోకల్ బోర్డ్స్ చట్టంలోని 126A సెక్షన్ ప్రకారం పంచాయతీవారు నిర్మించి పోషిస్తూన్న బావులు, చెరువులు, రిజర్వాయర్లు మొదలయిన వాటి నన్నిటినీ

జాతి, మత, కుల భేదాలతో నిమిత్తం లేకుండా అందరూ ఉపయోగించుకో వచ్చునని ఉన్నది ఎవరయినా అందుకు అభ్యంతర పెట్టినట్లయితే వారు 100 రూపాయల జరిమానాకు పాత్రులవుతారు కాని ఈ చట్టం హరిజనులకు సంబంధించి నంతవరకూ ఆచరణలో లేదు చాలామంది హరిజనులు ప్రజలందరికీ సంబంధించిన నూతి నుంచి నీరు తోడుకోనేటందుకు అవకాశం లేక వరసగా కుండలతో నిలబడి ఎవరో ఒక ఔదార్యంగల కులీనుడు వారి కుండలను నింపేటంత వరకు వారట్లాగే వేచి ఉండవలసి వస్తున్నది అది చాలా జాలి కరమయిన దృశ్యము మేమీ సందర్భంలో హరిజనులు పబ్లిక్ బావులలో నీరు తోడుకొనే అవకాశం కల్పించటానికి ముందుగా కంకిపాడు గ్రామాన్ని ఎన్ను కొన్నాము ఆ ఊరిలోని పబ్లిక్ నూయి స్థానిక పంచాయతీ యాజమాన్యం కింద ఉన్నది వారికి మేము చట్టంలోని విషయాలను,వారి నైతిక బాధ్యతలను కూడా తెలియ చెప్పినాము ఆ విధంగా మూడు వారాలు ప్రచారం చేసిన తరవాత మా కృషికి తగిన ఫలితం కలిగింది మేమొక బహిరంగ సభ ఏర్పాటు చేసినాము అందులో అత్యధిక సంఖ్యాకులు, హరిజనులు ఇక ముందు నుంచి ఏ విధమయిన అభ్యంతరం లేకుండా ఆ నూతిలో నుంచి నీరు తోడుకోవచ్చునని అంగీకరించి నారు

మరునాడు ఉదయం ఈ నిర్ణయం ఆచరణలో పెట్టడానికి హరిజనులే చాలా బాధపడినారు ఇది చాలా విచారకరమయిన విషయము వారిని నూతి దగ్గరికి తీసుకొని రావడానికే చాలా కష్టపడి పనిచేయవలసి వచ్చింది హరిజనులు నూతిలో నీళ్ళు తోడుకోవడం ప్రారంభించిన తరవాత కులీన హిందువులలో మరొక మార్పు కలిగింది వారిలో అత్యధిక సంఖ్యాకులు వ్యక్తిగతంగా ఇబ్బంది పడుతూ కూడా ఆ నూతికి రావడం మానివేసినారు కొంత మంది మాత్రం తమ నిర్ణయానికి గట్టిగా కట్టుబడి ఉన్నారు క్రమ క్రమంగా ప్రాతి కూల్యము తగ్గిపోయింది నేను 126A సెక్షన్‌లోని భావం ప్రజలకు పూర్తిగా తెలియచెప్పవలసిందని లోకల్ బోర్డు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్‌ను కోరినాను

మా ఈ అనుభవంవల్ల ఇతర గ్రామాలలో కూడా ఇటువంటి పని కొన సాగించవలెననే ప్రోత్సాహం కలిగింది హరిజనులలో ఈ కష్టాలను తొలగించ డానికి నైతిక ప్రబోధము, శాసనమూ కూడా అవసరమని నా అభిప్రాయము. ఇందులో ఏది కొరవడినా ప్రయోజనంలేదు సాంఘిక దౌర్బల్యాలకు సంబంధించిన ప్రభుత్వచట్టాలు అస్పష్టంగానూ బలహీనంగానూ ఉన్నవి. ఈ లోపం సవరించ వలసి ఉంది. మద్రాస్ ప్రభుత్వంవారు హరిజన కార్యకలాపాలకు కేటాయించిన కోటి రూపాయలలో కొంతసొమ్ము సాంఘిక శాసనంలోని విషయాలను ప్రజలకు తెలియ చేప్పేటందుకు ఉపయోగించటం మంచిది చట్టం చేయడం ఎంత ముఖ్యమో దానిని అమలుపరచడం కూడా అంతముఖ్యము "

అణచివేయబడిన హరిజనుల పక్షాన పట్టుదలతో నిరంతరం కృషిచేస్తూండిన శ్రీరావుకు నా హృదయ పూర్వకాభివందనాలు. ఆయన ప్రయత్నానికి

ప్రజల సహాకారం లభించుగాక

న్యూఢిల్లీ, యం. కె. గాంధీ
7-9-1946

## * గాంధీజయంతి (1946)

యథాప్రకారం గాంధీజయంతి భారతదేశమంతటా జరిగింది 1946లో కాంగ్రెస్ శాసన సభా కార్యక్రమం తిరిగి అవలంబించినది చాలా రాష్ట్రాలలో కాంగ్రెస్ ప్రభుత్వనిర్మాణాలు జరిగినాయి మద్రాస్ రాష్ట్ర ప్రభుత్వంవారు ఖాదీ ప్రణాళికను ఒక దానిని తయారుచేసి దానిని గాంధీ జన్మదినోత్సవం నాడు ఆచరణలోకి తెచ్చినారు ఆ సందర్భంలో మద్రాస్ ప్రధాని ప్రకాశం పంతులుగారు పత్రికలకొక ప్రకటన విడుదల చేసినారు అందులో మద్రాస్ ప్రభుత్వ విధానం ప్రకారం కొత్త బట్టల మిల్లులు ఇక స్థాపించబడకూడదన్నారు ఇంకా ఇట్లా అన్నారు "తమిళనాడు, ఆంధ్రదేశం, మలబారు కలసి అరవై వేల చర్ఖాలను నడిపించే ఏర్పాటు జరుగుతూన్నది ఇదివరకే ఇరవై వేల చర్ఖాలు అమలులో ఉన్నాయి. ప్రతి చరఖా కనీసం 100 గజాల బట్ట తయారయ్యేటందుకు తగినంత నూలు ఉత్పత్తి చేయవలె ప్రభుత్వం ద్వారా పత్తిని. వడికే వాని దగ్గర నూలును కొని బట్టనేయించి అక్కడనే అమ్మించే ఏర్పాట్లు జరగగలవు"

## గాంధీ జయంత్యుత్సవాలు (1946) మద్యనిషేధము

1946 అక్టోబర్ 2న ప్రారంభం కానున్న గాంధీజయంత్యుత్సవ సందర్భంలో మద్రాస్ రాజధానిలోని కాంగ్రెస్ ప్రభుత్వం ఎనిమిది జిల్లాలలో మద్యనిషేధ శాసనం ప్రవేశపెట్ట నిశ్చయించుకొన్నందువల్ల, మద్యనిషేధ శాఖామాత్యుడు శ్రీ కడప కోటిరెడ్డిగారు సెప్టెంబర్ 30వ తేది రాత్రి మద్రాస్‌లోని ఆల్ ఇండియా రేడియో కేంద్రం నుంచి మద్య నిషేధం పూర్తిగా జయప్రదమయ్యేటట్టు ప్రభుత్వంతో సహకరించ వలెనని ప్రజల నుద్బోధించినారు

కోటిరెడ్డిగారు తన ప్రసంగంలో పురాతన కాలంలోను, ఆధునిక కాలంలోను కూడా తాగుబోతు తనంను మాన్పడానికి జరిగిన ప్రయత్నాలను గురించి వివరించినారు. అమెరికాలో అది ఎట్లా అపజయం పొందిందో చెప్పినారు

1937లో కాంగ్రెస్ ప్రభుత్వం స్థాపించబడినప్పుడు భారతదేశంలోని వివిధ రాష్ట్రాలలో మద్య నిషేధ శాసనం ప్రవేశ పెట్టబడిన విషయం జ్ఞాపకం చేసినారు. కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమ ప్రణాళికలో మద్య నిషేధం ఒక ప్రధాన విషయమని దాని విజయం ఉద్యోగ, ఉద్యోగేతర్ల సహాకారంపైన ఆధారపడి ఉంటుందన్నారు మద్యనిషేధం అమలు పరచడంవల్ల తనకు వచ్చే ఆదాయంలో ప్రభుత్వం మూడవ వంతు కోల్పోతున్నదని, ప్రభుత్వం వారి ఈ

* గోలకొండ పత్రిక నుంచి, తేది 10-10-46

త్యాగానికి అనుగుణంగా ప్రజలు సహకరిస్తేనే తప్ప ప్రయోజనము ఉండదని కోటిరెడ్డిగారు తమ ప్రసంగంలో స్పష్టీకరించినారు

భారత దేశంలోని అన్ని మతాలవారు తాగుడు దురాచారంను ఏకగ్రీవంగా నిరసిస్తూన్నారు అమెరికాలో అపజయం పొందిన మద్యనిషేధ శాసనం ఇండియాలో జయప్రదమవుతుందా అని సందేహించే వారికి జవాబుగా ఇండియా పరిస్థితులకు అమెరికా పరిస్థితులకు చాలా భేదం ఉందన్నారు కోటిరెడ్డిగారు ఇండియాలో తాగే వారి సంఖ్య అత్యల్పమనీ, అమెరికాలోను, తదితర పాశ్చాత్య దేశాలలోను తాగుబోతుల సంఖ్య అత్యధికమనీ కూడా అన్నారాయన

ఈ శాసనం అమలుపరచడంవల్ల సంప్రదాయ సిద్ధంగా ఈ వృత్తిని అవలంబిస్తూన్న కొంతమంది నిరుద్యోగులయ్యే మాట వాస్తవమనీ, కానీ వారికి మరొక వృత్తి చూపించటం కూడా కష్టం కాదనీ అన్నారు మంత్రిగారు తాగుడు దురభ్యాసానికి లోనయిన దురదృష్టవంతులు తాగుడు మాని సందున మిగిలిన సొమ్మును జాగ్రత్తగా కూడబెట్టుకొని మంచి ఇళ్లుకట్టుకొనేటందుకు సదుపాయాలు చేయగలమని కూడా అన్నారు

ఈ విషయంలో ఇండియా ప్రపంచానికి ఒరవడిగా ఉండదలుచుకొన్నది. ఇతరులు అపజయం పొందిన సత్కార్యంలో ఇండియా విజయం పొందటానికి తగిన మహదావకాశం ప్రజలు ఉపయోగించుకొందురు గాక ఈ విషయంలో ఇండియా విజయం పొందితే ప్రపంచానికి మనదేశం అగ్రగామిగా ఉండగలదు" అని తన ప్రసంగం ముగించినారు.

## శ్రీ పొట్టి శ్రీరాములు ఉపవాసము

### గాంధీజీ ప్రకటన

శ్రీ పొట్టి శ్రీరాములుగారు అస్పృశ్యతా నివారణ గురించి అత్యంత కృషి చేసిన వారు. ఆయన ఒకానొక దేవాలయంలో హరిజనులను ప్రవేశింప జేయవలెనని ఆ దేవాలయ ట్రస్టీల అనుమతిని కోరినారు. కాని వారందుకు అంగీకరించనందువల్ల ప్రజాభిప్రాయం హరిజన దేవాలయప్రవేశానికి అనుగుణంగా సమీకరించడానికి ఆయన ఉపవాస వ్రతం అవలంబించినారు ఆ సందర్భంలో గాంధీజీ దిగువ పత్రికా ప్రకటన చేసినారు

శ్రీ శ్రీరాములు అజ్ఞాతుడు, నిరుపేద అయిన కాంగ్రెస్ కార్యకర్త. ఆయన నెల్లూరులో మానవ సేవలోనే నిమగ్నుడయి ఉంటాడు. హరిజనుల కోసం ఆయన ఒక్కడే అక్కడ ఏకాకిగా పనిచేస్తున్నాడు. నెల్లూరులో అస్పృశ్యతా నివారణ గురించి తదితర సాంఘిక కార్యకలాపాలను గురించి ఆయన చాలా ఆశలు పెట్టుకొన్నాడు. నెల్లూరు దగ్గర ఒక ఆశ్రమం కూడా నిర్మింప బడింది. కాని అనేక కారణాలవల్ల అక్కడి పని వెనకబడి పోయింది దేశభక్త కొండ వెంకటప్పయ్యగారు చాలా వృద్ధులయినప్పటికీ ఇప్పుడు

కూడా ఆ సంస్కరణ ప్రాంతాలలో ఎక్కువగా ఔత్సుక్యం కల్పించుకొంటూనే ఉన్నారు అంటరానితనాన్ని నిర్మూలనం చేయవలెనన్న గట్టి పట్టుదలతో శ్రీరాములు నిరాడంబరంగా పనిచేస్తున్నాడు హరిజనులకోసం దేవాలయం తెరిపించవలెనని ఆయన ప్రయత్నిస్తున్నాడు ఇంతకు పూర్వం ఒకప్పుడు ఆయన ఆ పనిలో అన్ని ప్రయత్నాలూ అపజయం పొందినప్పుడు, ప్రజా హృదయం చైతన్య వంతంగా చేయడానికి తాను ఉపవాసం అవలంబించ వచ్చునా అని నా సలహా కోరినాడు నేను అందుకు అంగీకరించినాను. ఇప్పుడు ఆ ప్రదేశంలో సంచలనం కలిగింది హరిజన దేవాలయ ప్రవేశ సందర్భంలో చట్టసంబంధమయిన చిక్కులు కొన్ని ఉన్నవనీ, వాటిని తొలగించుకొనేటంతవరకు శ్రీరాములును తాత్కాలి కంగా ఉపవాసం మానవలసిందిగా సలహా ఇవ్వవలసిందనీ కొందరు నన్ను కోరు తున్నారు. కాని ఆ శాసన సంబంధమయిన చిక్కులేవో నాకు తెలియవు కాబట్టి నేను అటువంటి సలహా ఇవ్వలేకపోయినాను ప్రకటనకోసం పాకులాడని శ్రీరాములువంటి మనిషి ప్రజలకు తెలియకపోవడంవల్లనూ వారి సహకారం లేకపోవడంవల్లనూ మరణించకూడదని నేను చాలా ఆందోళన పడుతున్నాను అందువల్ల ఈ విషయంలో నిజం తెలుసుకొనేటందుకు పత్రికా విలేఖకులకు ఆసక్తి కల్పించ కోరుతున్నాను నేను చెప్పిన సంగతులు యథార్థాలయి నట్లయితే ప్రజలు సరియైన మార్గం అవలంబించి విలువగల శ్రీరాములు జీవితాన్ని రక్షించేటట్లు చేయవలెనని కోరుతున్నాను "

"ఈ పై ప్రకటన (జనవరి) 16 న జరిగింది ఈనాడు (10-2-46) ప్రజల ఒత్తిడికి తాను లొంగిపోయి ఉపవాసం విరమించినట్లుగా నాకు తంతి వచ్చింది ఏ విధమయిన ఆలస్యమూ లేకుండా దేవాలయం హరిజనులకు తెరిచే టందుకు బాధ్యత వహించినందున శ్రీరాములు ఉపవాసం విరమించి ఉండి నట్లయితే నేను సంతోషించవలసిందే. దేవాలయం తెరవడంలో నిజంగానే చట్ట బద్ధమయిన చిక్కు ఉన్నదనీ దేవాలయ ప్రధాన ట్రస్టీ లాంఛనప్రాయ మయిన ఆ చిక్కును తొలగించుకొంటే వెంటనే దేవాలయం హరిజనులకు తెరవగలవని వాగ్దానం చేసినట్లు శ్రీ రామచంద్రరావుగారు నాకోసం ఉత్తరం వ్రాసినారు. దేవాలయానికి పోయే ప్రజల హృదయపూర్వకమయిన అంగీ కారంతో హరిజనులకు ఆ దేవాలయం తెరవగలరని ఆశిస్తున్నాను ఈ ఉప వాసము అందరి సానుభూతిని సంపాదించిందని చెప్పడానికి అదొక్కటే నిదర్శనము."

యం కె గాంధీ

## గాంధీతో గోరా

గోరా (గోపరాజు రామచంద్రరావు) నాస్తికుడు. నాస్తిక మతంపైన అచంచల విశ్వాసంగల పెద్దమనిషి. దేవునిపైనున్న భక్తి విశ్వాసాలచేత ప్రజలు తమ ఆత్మవిశ్వాసం కోల్పోతున్నారని కూడా ఆయన నమ్మకం. ప్రతి

మతమూ తలోక దేవుణ్ని ఊహించి పుంగించడంతో ప్రపంచంలో మత కల హాలు చెలరేగుతూన్నవనీ, దేవుని ప్రసక్తే లేనట్లయితే సర్వమానవ సౌభ్రాత్రం ఏర్పడి ఉండేదనీ అందువల్ల దేవుడనే భావాన్ని ప్రజల మనస్సులలోనుంచి తొలగించడం సంఘసేవకుల ప్రధాన కర్తవ్యంగా ఉండవలెనని ఆయన ప్రచారము ఇటువంటి ప్రచారం కూడదని ఆయన అధ్యాపకుడుగా పని చేస్తూండిన బందరు హిందూకళాశాల పాలకవర్గంవారు నిషేధించడంచేత 1940 లో ఆయన ఆ పదవికి రాజీనామా ఇచ్చిననాటినుంచి స్వేచ్ఛగా ద్విగుణీకృతోత్సాహంతో నాస్తిక ప్రచారాన్ని కొనసాగించడం మొదలుపెట్టినారు

గాంధీజీ నిరంతరం స్మరిస్తూండిన దేవుడెటువంటివాడో, ఆయన పుట్టు పూర్వోత్తరాలు పూర్తిగా తెలుసుకోవలెననే కోరిక గోరాకు 1930 లోనే కలి గింది ఆయన గాంధీజీకి ఇట్లా వ్రాసినారు

"మీరు దేవుడనే మాట వాడుతూంటారు! దాని అర్థమేమిటో, ఆ అర్థం జీవితంలో ఎంతవరకు ఆచరణయోగ్యంగా ఉంటుందో నాకు తెలపగలరా?"

గాంధీజీ దానికి జవాబుగా "దేవుడు మానవ బుద్ధికి అతీతుడు" అని వ్రాసినారు గోరాకు సంతృప్తి కలగ లేదు అయితేనేమి? గోరాకు గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో, ముఖ్యంగా అస్పృశ్యతా నివారణోద్యమంలో గట్టి నమ్మకం ఉంది అయితే ఆయన ఆ ఉద్యమాన్ని నాస్తిక దృక్పథంతో చేపట్టి, వయోజన విద్యతో జోడించి తన అధ్యాపక పదవీ విరమణానంతరం ఒక సంవత్సరంపాటు నడిపిన తరవాత తన పని వివరాలనూ కలిగిన ఫలితాలనూ తెలుపుతూ గాంధీజీకి 1941 లో మరొక లేఖ వ్రాసినారు. ఆ లేఖలో ఆయన గాంధీజీతో ప్రత్యక్షంగా మాట్లాడవలెననే కోరిక ఉన్నట్లు కూడా తెలియజేసి నారు

దానికి గాంధీజీ "నాస్తిక్యం ఆత్మనిరసనం దాని ప్రచారంలో ఎవ్వడూ విజయం సాధించలేదు మీకు కలిగిన విజయానికి కారణం మీ చుట్టూ ఉన్న ప్రజలలో మీ పని పట్ల మీరు కనబరిచిన శ్రద్ధయే మిమ్మిలను నేనిక్కడకు ఆహ్వానింపజాలనందుకు చింతిస్తున్నాను మీతో మాట్లాడడానికి నాకు తగినంత వ్యవధి లేదు" అని బదులు వ్రాసినారు నాస్తిక్యమును గురించి ప్రబలి ఉన్న ఈ "దురభిప్రాయానికి" గోరా, ఆయన సహచరులూ విచారపడుతూ దానిని తొలగించడానికి ఇతోధికంగా కృషి చేయవలెనని నిశ్చయించుకొన్నారు.

కాని అంతలోనే 1942 "క్విట్ ఇండియా" ఉద్యమం ప్రారంభం కావడం అందులో గోరా, ఆయన సహచరులూ పాల్గొనడం, ఆ కారణంగా వారందరూ అనేక పర్యాయాలు కారాగారశిక్షలకు గురికావడం జరిగింది 1942 కు పూర్వం సేవాగ్రాం ఆశ్రమంలో ఉండిన డి. రామస్వామి అనే యువకుడు కూడా ఆ తరవాత 1944 వరకూ గోరాతో కలసి పనిచేయడం తటస్థించింది. 1944 లో గాంధీజీ విడుదల అనంతరం రామస్వామి మళ్ళా సేవాగ్రాం ఆశ్ర మంలో చేరినారు. మాటల సందర్భంలో ఆయన గాంధీజీకి, అస్పృశ్యతా నివార

ణోద్యమానికి నాస్తిక దృక్పథంతో చేసిన కృషిని గురించి వివరించి చెప్పడం మొదలుపెట్టినాడు ఆ సంభాషణలో ఆయన గోరాను గురించిన ప్రసక్తి అనేక పర్యాయాలు తేవడంతో గాంధీజీకి గోరాను చూడవలెననే ఆసక్తి కలిగింది గోరా 1944 నవంబర్ చివరి వారంలో సేవాగ్రాం ఆశ్రమానికి వెళ్ళినారు గాంధీజీని సందర్శించి సంభాషించవలెనని 1930 లో గోరాకు కలిగిన కోర్కె పదునాలుగు సంవత్సరాలకు ఫలించింది ఆ తరవాత కూడా ఆయన రెండు మూడు పర్యాయాలు గాంధీజీని దర్శించి ఆయనతో దీర్ఘంగా నాస్తిక్యమును గురించి చర్చించినారు వారుభయులూ పరస్పరం ఏకీభవించకపోయినప్పటికి ఒకరినొకరు అర్థం చేసుకోవలెననే సుహృద్భావంతో మాట్లాడుకొన్నారు కాని "మీరు నాస్తిక్యమును చాలా కాలం ప్రయత్నించి చూసినారు ఇక మీరు 'నాస్తిక్యము' అనే మాటను మానివేయండి మీ పనికది దోహదం చేయదు " అని ఒకసారి గాంధీజీ అన్న మాటలు గోరాను ఆశ్చర్యచకితునిగా చేసినాయి

## వర్ణాంతర వివాహాలు

1946 చివరలో మరొకసారి గోరా గాంధీజీని దర్శించినారు గాంధీజీ అప్పుడు ఢిల్లీలో భంగీ కాలనీలో ఉన్నారు అస్పృశ్యతా నివారణకు మీ కార్యక్రమమేమిటని గాంధీజీ గోరాను ప్రశ్నించినారు.

గోరా 1920 లో జరిగిన విదేశీ వస్త్ర దహనాలవలె పెద్దఎత్తున కులమత విచక్షణ లేని సమష్టిభోజనాలను విరివిగా ఏర్పాటు చేయడం

గాంధీ కేవలం సమష్టిభోజనాలు ప్రజల భావాలను ఆకర్షించగలవా ?

గోరా. అప్పుడు అంతర్వివాహాలు ఆరంభించవచ్చు నేటి తాత్కాలిక ప్రభుత్వంలో జాతీయవాదులూ కాంగ్రెస్‌వాదులూ ఉన్నారు గదా! ప్రతి అంతర్వివాహం గురించి ప్రభుత్వం ప్రకటించి ప్రచారం చేయవచ్చు అంతేకాదు, ప్రతి అంతర్వివాహానికి ప్రభుత్వంవారు రు 500/లు బహుమతిగా ఈయవచ్చు. ఆ దంపతులకు కలిగే మూడో బిడ్డవరకూ ప్రతి బిడ్డకూ రెండు సంవత్సరాలపాటు ప్రతి మూడు నెలలకు రు. 50/ల వంతున ప్రభుత్వంవారు సహాయంగా కూడా ఈయవచ్చు

గాంధీ ధనరూపంలో సహాయం మాట ఎందుకు సూచిస్తారు మీరు? వట్టి ప్రకటన చాలదూ?

గోరా. ప్రస్తుతం వర్ణాంతర వివాహాలను గురించిన బహిష్కారం సమాజంలో ఆర్థికపరమైన నిర్బంధాలకు కూడా తరచు దారి తీయవచ్చు. వర్ణాంతర వివాహాలను సిద్ధాంతరీత్యా ఆమోదించేవారుకూడా, ఆ తరవాత తటస్థించే ఆర్థికపరమైన ఒత్తిడికి భయపడి, వాటిని ఆచరణలోకి తీసుకురాలేకుండా ఉన్నారు. నేటి ఆర్థికవ్యవస్థ కొనసాగుతున్నంత కాలం అటువంటి నిర్బంధాలను తట్టుకోవడం కష్టము కాబట్టి ప్రభుత్వ శాసనమూ

ప్రకటనలు ఆ దంపతులకు సాంఘిక దౌర్జన్యాలనుంచి రక్షణ కల్పించ డంతోపాటు, వారు ఆర్థిక నిర్బంధాలను తట్టుకొనేటందుకు తగిన ధన సహాయం కూడా అవసరమవుతుంది. అయితే ప్రభుత్వంవారి ఈ విధానం అయిదు లేక పది సంవత్సరాలవరకూ మాత్రమే అవసరం కావచ్చు ఆలోగా ఈ ఉద్యమం దేశంలో పునాదు లేర్పరచుకొని ప్రజానురంజకం కావచ్చుకూడా

గాంధీ బాగానే ఉంది! కాని ఇది వివాహ పవిత్రతను కాపాడదు. డబ్బు ఆశతో జరిగిన వివాహ సంబంధం పడుపువృత్తిగా దిగజారిపోతుంది

గోరా ఈనాడు వివాహాలు కుల మర్యాదలకు కట్టుబడి జరుగుతూన్నవి కట్నాల అభ్యాసం కూడా ఇంతకంటె మెరుగుకాదు వర్ణాంతర వివాహాలకు ప్రభుత్వం వారిచ్చే ధన సహాయంవలన నేటి ఆర్థికవ్యవస్థలో డబ్బు ఆశకు సంబంధించిన కొన్ని చెడుగులు ఉన్నప్పటికీ కనీసం యిప్పటి సమాజంలోని భేదాలు తొలగిపోవడానికి వీలుంది. ప్రస్తుత ఆర్థికవ్యవస్థలో మార్పు కలగనంతవరకూ డబ్బును గురించి ఆలోచనను తొలగించడం సాధ్యంకాదు ఈనాటి వివాహ సంబంధాలను మనం సాంఘిక దృక్పథంతో ఆలోచించవలె ప్రతిపక్షాలు లేని రాజ్యాలు (Totalitarian states) పెద్దపెద్ద కుటుంబాలకు ధనసహాయం చేయ డమేగాక, బ్రహ్మచారిణులుగా ఉండదలచిన మఠవాసినులను (nuns) సైతం ఆయా దేశాల జనసంఖ్య అభివృద్ధికోసం పెండ్లి చేసుకోవలసిందని నిర్బంధించి ఉండలేదా? ఆ రాజ్యాలు యుద్ధసన్నాహాలలో ఒక భాగంగా వివాహాలకు ధనసహాయం చేసినాయి అట్లాగే మనం సాంఘిక విభేదాలను తొలగించడానికి వర్ణాంతర వివాహాలకు ధనసహాయం చేయవలె సాంఘిక సంక్షేమానికి దోహదం చేయడంలోనే వివాహ పవిత్రత ఇమిడి ఉంది

అది విని "మీరు నాస్తికులు" అన్నారు గాంధీజీ గోరాను, భావగర్భితంగా

## హైదరాబాదు సంస్థానము

### రాజకీయ సంస్కరణలు

1937 వ సంవత్సరంలో బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రాలలో ప్రజలు ఎన్నుకొన్న మంత్రివర్గాల పరిపాలన ఏర్పడిన తరవాత హైదరాబాదు సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వ సంస్థాపన గురించి అలజడి ప్రారంభమయినది. అందుకోసం హైద్రాబాదు స్టేట్ కాంగ్రెస్ ఏర్పాటుకావడం, వెంటనే ప్రభుత్వంవారు దానిని నిషేధించటం, స్టేట్ కాంగ్రెస్ వారు ఆ నిషేధపుటుత్తరవులకు ప్రతికూలంగా సత్యాగ్రహం సాగించడం, అనేక కారణాలవల్ల గాంధీజీ సలహాతో సత్యాగ్రహోద్యమం స్టేట్ కాంగ్రెస్ వారు విరమించుకోవడం,, మొదట

లయిన విషయాలను గురించి ఇంతకుపూర్వం ఉదాహరించి ఉన్నాము స్టేట్ కాంగ్రెస్‌పై నిషేధపుటుత్తరువులను తొలగించే విషయంలో సర్ అక్బర్ హైదరీకి, గాంధీజీకి జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలుకూడా ఇంతకుపూర్వమే ఉదాహరించడం జరిగింది

తరవాత భారతదేశచరిత్రలో చాలాసంఘటనలు జరిగినాయి 1940 లో ఆయా రాష్ట్రాల కాంగ్రెసు మంత్రులు రాజీనామాలీయడం, కాంగ్రెస్ వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించటం జరిగింది 1942 "క్విట్ ఇండియా" ఉద్యమంలో ఆసేతు హిమాచలం లక్షలాది ప్రజలుపాల్గొని కారాగారాలకు, లాఠీప్రహారాలకు, తుపాకిగుండ్లకు గురైనారు గాంధీజీ, ఇతరకాంగ్రెస్ నాయకులు కారాగార బంధితులయినారు. తరవాత మహాత్మాగాంధీ తలవనితలంపుగా విడుదల కావడం, ఆ తరవాత కొంతకాలానికి కాంగ్రెస్ నాయకులు విడుదల కావడం, శాసనసభలకు క్రొత్తఎన్నికలు జరగడం, ఆయారాష్ట్రాల సభ్యులు స్వతంత్రభారత రాజ్యాంగ నిర్మాణానికి రాజ్యాంగపరిషత్తుకు సభ్యులను ఎన్నుకోవడం కూడా జరిగింది

ఈ పరిస్థితులలో 1946 ఆగస్టు మొదటివారంలో హైదరాబాదు సంస్థానానికి ఘనతవెంటిన నిజాం ప్రభువు సర్ మీర్జా ఇస్మాయిల్‌ను ప్రధానమంత్రిగా నియమించుకొన్నారు

హైదరాబాదు సంస్థానంవారు 1939 జూలై 17వ తేదీన సంస్కరణల పేరుతో ఒక ప్రకటన చేసినారు. సంస్థాన ప్రజానాయకులలో అధికసంఖ్యాకులు తమ కోరికలకవి ఎంతమాత్రం సన్నిహితంగా లేనందున అశాభంగం చెందినారు. అధికారంలో ఉన్న అల్పసంఖ్యాక వర్గంవారు, అధిక సంఖ్యాకులపైన తామిది వరకు చలాయిస్తూన్న పెత్తందారీతనానికి ఈ సంస్కరణవల్ల భంగంరావచ్చునని భయపడినారు.

సర్ మీర్జా ఇస్మాయిల్ హైదరాబాదు సంస్థానానికి ప్రధానమంత్రి కావడం తడవుగా గాంధీజీ ఆయనకొక లేఖ వ్రాసినారు దానిలోని పర్యవసానమిది

"హైదరాబాదు ప్రతినిధులు శ్రీ కాశీనాథరావువైద్య, శ్రీ స్వామీ రామానంద తీర్థగార్లు నన్ను కలుసుకొన్నారు హైదరాబాదు సంస్థానంలో రాజకీయ సంస్కరణలనే పేరిట చేయనున్న మార్పులను గురించి వారు నాతో చర్చించినారు పత్రికలలో కనిపించినంత వరకూ నేనుకూడా వాటిని పరిశీలించినాను. అవి పేరుకుమాత్రమే సంస్కరణలు అవి పురోగమనానికి కాక తిరోగమనానికి దారితీస్తూన్నట్లు కనబడుతూ ఉన్నది వాటిని మీరు మార్పు చేయగలరో లేదో నాకు తెలియదు. వాటిని పూర్తిగా ఎందుకు రద్దు చేయకూడదో నాకు తోచటంలేదు. ప్రస్తుత పరిస్థితులలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షుడుగా ఉన్న సంస్థానప్రజా మహాసభా ప్రభావమునూ, హోదానూ గుర్తించడమే సంస్థానాధిపతులు కనీసం చేయతగినపని. ప్రజాభీష్టకరాలయిన చర్యలను తీసుకొనే

ముందు సంస్థానప్రజల మహాసభవారి ఆమోదం పొందడం మంచిది అందువల్ల ఏ మార్పులకైనా మార్గం సుకరం కాగలదు

హైదరాబాదు సంస్థానంలోని కొన్ని గ్రామాలలో జరుగుతుండిన కొన్ని రాజకీయ అత్యాచారాలను గురించి కుమారి పద్మజానాయుడు ప్రచురించిన కరపత్రాన్ని రాజకుమారి అమృతకౌర్ ఇదివరకే మీదృష్టికి తెచ్చింది ఈ రెండు విషయాలను గురించి నాకు వివరంగా తెలుప కోరుతాను

మీరీ పదవికి క్రొత్తగా అరుదెంచినదే తడవుగా మిమ్ములను నేను విసిగించ వలసి వచ్చినందుకు విచారిస్తున్నాను

ఈ లేఖకు జవాబుగా సర్ మీర్జా, గాంధీజీకి ఉన్న పరిస్థితులను వివరంగా వ్రాస్తూ తనకున్న చిక్కులనుకూడా తెలియచేసినారు రాజ్యాంగ శాసనంలో తగినమార్పులను చేయగలననీ, విద్యా, పరిశ్రమలు, ప్రజారోగ్య రంగాలలో నూతన చైతన్యాన్ని కలిగిస్తాననీ ఆయన వ్రాసినారు ఆయన ఇంకాఇట్లా వ్రాసినారు

"కేవలం ప్రజాస్వామ్య ప్రతికూలమయిన ఈ తరుణంలో ప్రజాస్వామ్యం ఆచరణలో పెట్టడానికి వేనెల్లప్పుడూ ప్రయత్నం చేయగలనని, మీరు నిశ్చయంగా నమ్మవచ్చు అంతేకాదు, ప్రజల ప్రయోజనాలను గుర్తించి రాజ్యాంగ బద్ధమయిన ప్రభుత్వం ఈ సంస్థానంలో స్థాపించటానికి కూడా శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తాను ప్రస్తుత పరిస్థితులలో మన ఉభయుల ఆదర్శం అందు కొనేటందుకు సాధ్యమయిన అన్నిచర్యలనూ తీసుకోగలను ఈ వాగ్దానంతో మీరు సంతృప్తి పడగలరనీ,నన్ను మీరుపూర్తిగా విశ్వసించగలరనీ ఆశిస్తున్నాను"

ఈ సమాధానానికి తరవాత హైదరాబాదు సంస్థానంలోని అభివృద్ధి నిరోధకులు ఆయనకు ప్రతికూలంగా చేసిన ఆందోళనతో విసిగివేసారి 1947 మే 15వ తేదిన ఘనతచెందిన నిజాం ప్రభువుకు తన రాజీనామాలేఖను పంపినారు.

# 32

# హైదరాబాదు సంస్థానము - స్వతంత్ర భారత ప్రభావము (1946-47)

1946 జూలైలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పైన ఉన్న నిషేధపుటుత్తరువులను సంస్థాన ప్రభుత్వం వారు తొలగించినారు ఎనిమిది సంవత్సరాల క్రితం జారీ చేసిన నిషేధపుటుత్తరువులు 1946 లో రద్దు చేయబడటంతో హైదరాబాదు స్వాతంత్ర్య పోరాటానికి ప్రథమ విజయం లభించింది స్వామి రామానంద తీర్థ స్టేట్ కాంగ్రెస్ పైన నిషేధపుటుత్తరువులు రద్దు కావడం తడవుగా ప్రజలను స్వాతంత్ర్య పోరాటానికి సన్నద్ధులనుగా చేయటానికి పూనుకొన్నారు పురోగాములయిన రాజకీయ కార్యకర్తలు, విద్యార్థులు, యువజనులు ఆయన నాయకత్వం కింద చేరినారు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక మహాసభలు తక్షణం స్టేట్ కాంగ్రెస్‌లో లీనమయిపోయేటందుకు తీర్మానాలు చేసుకొన్నాయి స్టేట్ కాంగ్రెస్‌లో సభ్యులను చేర్చే పని ప్రారంభమయింది హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ మొదటి సభకు స్వామీజీని అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు ఆయన అధ్యక్షోపన్యాసంలో హైదరాబాదు ప్రజలు ఇండియన్ యూనియన్‌లో ఐక్యం కావడానికి నిశ్చయించుకొన్నట్లుస్నూ, సంస్థానాధిపతులు రాజ్యాంగ పరిషత్తు ద్వారా ఇండియన్ యూనియన్‌లో కలసిపోవలెననీ అన్నారు హైదరాబాదు సంస్థానం స్వతంత్రంగా ఉండే సమస్యను గురించి కూడా సంయుక్తంగానూ, సహేతుకంగానూ, సమగ్రంగానూ చర్చించి, ఆర్థిక సుస్థిరత దృష్టితోనూ, దేశ రక్షణ దృష్టితోనూ ఆలోచించినట్లయితే హైదరాబాదు స్వతంత్ర సంస్థానంగా ఉండటం అసంభవమని నిర్ణయించినారు హైదరాబాదు ప్రభుత్వం తక్షణం స్వతంత్ర భారత దేశంలో చేరి రాజ్యాంగ పరిషత్తులో పాల్గొవలెనని, సంస్థానంలో సంపూర్ణ పౌరస్వత్వాలతో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పాటు చేయవలెనని కూడా ఆయన తన ఉపన్యాసంలో విశదీకరించినారు

స్వామీజీ ఉపన్యాసానికి అనుగుణంగా స్టేట్ కాంగ్రెస్ మహాసభ తీర్మానం చేసింది ఆ తీర్మానం అమలు పరిచేటందుకు తగిన ఉద్యమ నిర్వహణకు స్టేట్ కాంగ్రెస్ మహాసభవారు కార్యవర్గానికి అధికార మిచ్చినారు.

స్టేట్ కాంగ్రెస్ జరపనున్న పోరాటానికి ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర కాంగ్రెస్ కమిటీల వారు సంపూర్ణంగా సహాయం చేయడానికి అంగీకరించినారు.

1947 జూలై మొదటి వారం నుంచి హైదరాబాదు, సికిందరాబాదులోని అనేక ప్రదేశాలలో స్టేట్ కాంగ్రెస్ కార్యకర్తలు కొంతమంది కలసి భావి కార్యక్రమం గురించి నిర్ణయించుకొంటూ వచ్చినారు స్వామి రామానంద తీర్థ, డాక్టరు మేల్కోటేగార్లు విద్యార్థుల సభలలో హైదరాబాదు సంస్థాన భవిష్యత్తును గురించి ఉపన్యాసాలు చేసినారు ప్రభుత్వంవారు కొంతమంది నాయకులను నిర్బంధించినారు అందువల్ల ప్రజలలో అసంతృప్తి పెరిగింది విద్యార్థుల ఊరేగింపులో పోలీసులు లాఠీ చార్జి చేసినారు

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ కార్యవర్గం వారు ఆగస్ట్ 7 వ తేదిన "ఇండియన్ యూనియన్‌లో కలవండి" (Join in Indian Union) అనే రోజును హైదరాబాదు సంస్థానమంతటా జరపవలసిందిగా తీర్మానించినారు రెండో పక్షాన హైదరాబాదు ప్రభుత్వంవారు, జరుగుతున్న సంఘటనలను జాగ్రత్తగా పరిశీలించి ఒక వంక ఇండియా ప్రభుత్వంతో హైదరాబాదు సంస్థానం స్వతంత్ర రాజ్యంగా ఉండేటందుకు రాయబారాలు నడుపుతూ, మరొక వంక, బ్రిటిష్ సార్వభౌమత్వం శాసన రీత్యా రద్దయి హైదరాబాదు సంస్థానం చట్టబద్ధంగా, స్వతంత్ర రాజ్యమయ్యే రోజుకోసం ఎదురు చూస్తున్నారు

స్టేట్ కాంగ్రెస్‌వారు "జాయిన్ ఇన్ ఇండియన్ యూనియన్ డే"ను జరపడానికి విస్తృతమయిన కార్యక్రమం నిర్ణయించినారు ప్రభుత్వంవారు సమావేశాలను నిషేధించే శాసనాలన్నిటినీ ధిక్కరించవలెనని ప్రజలనుద్బోధించినారు ఆ సందర్భంలో స్వామీజీ ఇట్లా ప్రకటించినారు

"హైదరాబాదు ఇండియన్ యూనియన్‌లో కలిసే విషయాన్ని జనవాక్యము (రెఫరెండం) ద్వారా నిర్ణయించవలసిందని నేను చివరకు ప్రభుత్వాన్ని కోరినాను కాని దానిని గురించి ఆలోచించడానికి కూడా ప్రభుత్వం వారు ఇష్టపడలేదు కాబట్టి మనం మన కార్యక్రమంతో పురోగమించి తీరవలె ప్రభుత్వంవారి విధానంతో మనకు సంబంధంలేదని ప్రకటిస్తూ మనం మన కోరికను అహింసాపద్ధతిద్వారా సాధించితీరవలె కాబట్టి 1947 ఆగస్టు 7 ను "జాయిన్ ఇన్ ఇండియన్ యూనియన్" రోజుగా హైదరాబాదు ప్రజలందరూ గమనించవలె ఆరోజున ప్రశాంతంగా హరతాళం జరగవలె. ఫ్యాక్టరీలలోని కార్మికులు పనిమాని వేయవలె విద్యార్థులు పాఠశాలలకు, కళాశాలలకు పోకూడదు".

ఈ ప్రకటన ప్రకారం ఆగస్టు కార్యక్రమం అనేకచోట్ల అమోఘంగా జయప్రదమయింది స్టేట్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ స్వామీ రామానందతీర్థ, వర్కింగ్ కమిటీసభ్యుడు శ్రీ కృష్ణాచారిజోషి శాసనాలను ధిక్కరించినందుకు అరెస్టయినారు ప్రభుత్వంవారు తరవాత వారిని విడిచిపెట్టినారు ఆగస్టు 7 న మధిరలో బహిరంగసభలో నిషేధాజ్ఞలను ఉల్లంఘించినందున హైదరాబాదు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు జమలాపురం కేశవరావుగారిని ప్రభుత్వం అరెస్టుచేసింది. అట్లే ఖమ్మం, వరంగల్లు మొదలయిన ముఖ్యపట్టణాలలో కాలా-

మంది యువకులు నిషేధాజ్ఞలను ఉల్లంఘించి బహిరంగ సభలలో ఉపన్యసించి అరెస్టయినారు

ఈ ఉద్యమంలో అనేకమంది విద్యార్థులు పాల్గొన్నారు గౌలిగూడాలో వందలకొద్దీ విద్యార్థులు అరెస్టయినారు వెంటనే వారిలో ఒక్కొక్కరికి నెలా పదిహేను రోజులు కారాగారశిక్ష విధించడం జరిగింది

ఇండియాకు స్వతంత్రం వచ్చే సమయం (1947 ఆగస్టు 15) చేరువవుతున్న కొద్దీ హైదరాబాదు ప్రజలలో ఉద్రేకం పెచ్చు పెరిగిపోయింది ఆ ఆగస్టు 15 నాటికే హైదరాబాదు రాజ్యం ఇండియాలో విలీనం కావలెనని ప్రజలు అత్యాతురతతో ఉన్నారు ప్రజలు అన్ని నిషేధపుటుత్తరువులను ఉల్లంఘించవలెననీ, నిరంతరాయంగా ఆందోళన సాగించవలెననీ స్వామీ రామానందతీర్థ ఆదేశించినారు 1947 ఆగస్టు 15వ తేది స్వాతంత్ర్యదినంగా పరిగణించవలెననీ, ఆ నాడు భారతజాతీయ పతాకం ఆరోహించ వలసిందనీ కూడా ఆయన ప్రజలకు ఉద్బోధించినారు దాని సారాంశమిది

"స్వాతంత్ర్య దినోత్సవం జరపండి మన సోదరులైన భారత ప్రజా స్వామ్య స్వతంత్ర పౌరులతోబాటు వారి ఆనందంలో హైదరాబాదు పౌరుల మయిన మనం పాల్గొలేకుండా ఉన్నాము మనమింకా నిరంకుశ ప్రభుత్వం కిందనే బాధలు పడుతున్నాము అయినప్పటికి భారత స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో తక్కిన భారతీయుల భావపరంపరలతో మనం భాగస్వాములుగా ఉండ దలచినాము ఈ మన భావం ప్రకటించడానికే పెద్దపెద్ద సమావేశాలలోను, వ్యక్తులుగాను కూడా భారత జాతీయ పతాకారోహణ చేయదలచుకొన్నాము ఆ పతాకానికి మనము సగౌరవంతో విధేయత చూపదలచుకొన్నాము ఇక మనము బానిసలుగా ఉండజాలము హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ మనకిప్పుడు ఆదేశమిచ్చింది ఆ ఆదేశం అనుసరించడమే స్టేట్ కాంగ్రెస్ అనుబంధ సంస్థల అన్నిటి కర్తవ్యము ఒక కోటి అరవై మూడు లక్షల ప్రజల భవితవ్యం అనిర్దిష్టంగా ఉన్న క్లిష్టసమయంలో దేశభక్తియుతులైన స్త్రీ పురుషులందరూ వారి శక్తివంచన లేకుండా కృషి చేయవలెనని ప్రార్థిస్తున్నాను మనమిక నిరంకుశ పరిపాలనకు లోబడి ఉండకూడదు హైదరాబాదులో బాధ్యతాయుత ప్రభుత్వం స్థాపింపబడి అది ఇండియన్ యూనియన్‌లో విలీనం కావడం అనేది మన ధ్యేయంగా ఉండవలె"

స్వామీజీచేసిన ఈ ప్రబోధం ఫలితంగా ఆగస్ట్ 14, 15 తేదీలలో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పోరాటం పతాకస్థాయి నందుకొన్నది. హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావలెనని కోరే వారినందరినీ హైదరాబాదు ప్రభుత్వం అణచివేయడానికి నిశ్చయించుకొన్నది భారత జాతీయ పతాకారోహణోత్సవం హైదరాబాదులో జరపకూడదని హైదరాబాదు ప్రభుత్వం నిషేధపు టుత్తరువులు జారీ చేసింది. దానిని నిరసిస్తూ స్టేట్ కాంగ్రెస్‌వారు ఇట్లా ప్రకటన చేసినారు.

'నిజాం బ్రిటిష్ సార్వభౌమత్వమునుంచి విముక్తయి తన స్వాతంత్ర్యాన్ని ప్రకటించినారు యూనియన్ జండా ఆరోహణం జరగకూడదని ఆగస్ట్ 13 నవే నిషేధపు టుత్తరువులు జారీచేసినాడు ఇది హైదరాబాదు ప్రజలకూ, మన జాతీయ గౌరవానికి ఒక సవాలు "

ఈ ప్రకటనానంతరం స్వామీ రామానంద తీర్థ నిజాం ఉత్తరువులను నిరశిస్తూ నిజాం చేసిన సవాలును ప్రజలు దృఢచిత్తంతో ఎదుర్కొనవలసిందని ఉత్తేజకరమయిన ప్రకటన చేసినారు

దాని ఫలితంగా ఆగస్ట్ 15 వ తారీకున బ్రహ్మాండమయిన ప్రదర్శనలు జరిగినాయి భారత జాతీయ పతాకము బహిరంగ ప్రదేశాలలో విద్యుక్తంగా ఆరోహింపబడింది ఆనాడు ఉత్సవాలు సమావేశాలు కూడా బహిరంగంగా జరిగినాయి. పోలీసువారి నిరోధం ప్రజలు లక్ష్యపెట్టలేదు పైపెచ్చు సభలలో వారి చర్యలను గట్టిగా నిరసించినారు అనేకచోట్ల పోలీసులు లాఠీలనూ, తుపాకులనూ ప్రయోగించినారు ప్రజలను గుంపులుగుంపులుగా అరెస్టు చేసినారు స్టేట్ కాంగ్రెస్ ప్రెసిడెంట్ స్వామీ రామానందతీర్థ, డాక్టర్ మేల్కోటే మొదలయినవారిని పోలీసువారు అరెస్టు చేసినారు

ప్రజలీ ఉద్యమంలో అమోఘంగా పాల్గొన్నారు అక్షరజ్ఞానం లేని కిసానులెందరో జాతీయ పతాకాభివందనం చేసి నిర్బంధాలకూ, కఠినశిక్షలకూ గురైనారు ఇందులో స్త్రీలుకూడా ప్రముఖ పాత్ర వహించినారు భారత జాతీయ పతాకం ఎగురవేసినందుకు శ్రీమతి యశోదాబాయి, బ్రిజిరాణీలు అరెస్టయినారు ఆ తరవాత కొంతమంది స్త్రీలు మూడు నాలుగు బృందాలుగా నిషేధపు టుత్తరువులను ఉల్లంఘించినారు శ్రీమతి విమలాబాయి మేల్కోటే, శ్రీమతి జ్ఞానకుమారీహెడా, ఉషాపాంగ్రేకర్, అహల్యాబాయి మొదలయినవారు కర్ఫ్యూ ఉత్తరువులను ధిక్కరించి లాఠీ ప్రహారాలకు, బాష్పవాయు ప్రసారమునకు గురియైనారు ఈ పోరాటం 1947 నవంబర్ 29 న హైదరాబాదు ప్రభుత్వం "యథాతథ"పు ("స్టాండ్‌స్టిల్") ఒడంబడిక పైన సంతకం చేసి, నవంబర్ 30 వ తేదీన ప్రముఖ నాయకులను విడుదల చేసేటంతవరకూ జరిగింది

అప్పటికీ హైదరాబాదు ప్రజలు స్వతంత్రులు కాలేదు. వారు మరొక సంవత్సరం పోరాటం సాగించక తప్పిందికాదు ఆ తరవాత ఒక సంవత్సరానికి ఇండియా ప్రభుత్వంవారి పోలీసు చర్యతో హైదరాబాదు భారత యూనియన్‌లో లీనమయి భారతదేశంలోని తక్కిన రాష్ట్రాలతోపాటు ప్రజా పరిపాలిత రాజ్యంగా రూపొందింది

## రెడ్డియార్ మంత్రివర్గము-ఖాదీ

మద్రాస్‌లో 1946 లో ప్రకాశంపంతులుగారి ప్రధాన మంత్రిత్వంకింద కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పాటయినది. తరవాత కొంత కాలానికి కాంగ్రెస్

కొంసగా పడుంవారు శ్రీ ఒ. పి. రామస్వామిరెడ్డియార్‌ను కాంగ్రెస్ పక్ష నాయకుడుగా ఎన్నుకొన్నారు అందువల్ల ఆయన మద్రాసు రాష్ట్రప్రభుత్వానికి ప్రధానమంత్రి అయినారు

ఈ పై శీర్షికతో 'హరిజన్'లో వ్రాసిన కింది వ్యాసం రెడ్డియార్ ప్రభుత్వం ఖాదీ విషయంలో చేసిన కృషిని గురించినది

"ఇటీవల మద్రాస్‌నుంచి వచ్చిన పత్రికా వార్తలనుబట్టి రెడ్డియార్ ప్రభుత్వము ఖాదీ అభివృద్ధికోసం కొంత సొమ్మును ప్రత్యేకించినట్లు తెలుస్తూన్నది ఈ ప్రకటన ఎంతమాత్రం ప్రోత్సాహకరంగా లేదని స్పష్టంగా చెప్పక తప్పదు ప్రకాశం ప్రభుత్వ విధానంలో ఏ ఇతర లోపమున్నప్పటికీ గాంధీ సిద్ధాంతాల కనుగుణమయిన ఆర్థిక ప్రణాళికకు సంబంధించినంతవరకు అది ఎంతో ధైర్యమయిన చర్య తీసుకొన్నదని స్పష్టంగా ఒప్పుకోక తప్పదు ప్రకాశంగారి వస్త్రోత్పత్తి విధానంలో మరికొన్ని లోపాలు కూడా ఉండిఉండవచ్చు కాని ఆయనకు ఖాదీలోని శక్తిసామర్థ్యాలలో అచంచలమయిన విశ్వాసం ఉన్నది అంతేకాదు, ఖాదీ చిహ్నంగాగల సాంఘిక, ఆర్థిక నిర్మాణంలో కూడా ఆయనకు సంపూర్ణ విశ్వాసం ఉన్నది పెట్టుబడిదారుల యాజమాన్యంకింద నడుస్తూండిన పత్రికలన్నీ ఆయన వస్త్రోత్పత్తి విధానాన్ని నిరంతరం దుమ్మెత్తిపోయడం ప్రారంభించినాయి కాని ప్రకాశంగారు కొండవలె చలించకుండా నిలబడినారు మద్రాస్ మంత్రివర్గంలోని క్లిష్టపరిస్థితికి కారణమయిన రాజకీయ దృక్పథంతో నాకేమీ సంబంధం లేదు దక్షిణాదినుంచి వచ్చిన చాలామంది స్నేహితులు మద్రాస్‌లో అంత రాజకీయదుమారం రేగటానికి కారణం ప్రకాశంగారి ఖాదీ ప్రణాళికేనని నాతో అన్నారు ఏమయినప్పటికీ ప్రకాశం మంత్రివర్గం పోవడానికి కారణం ఆయన వస్త్రోత్పత్తి విధానం అయి ఉండకూడదని ఆశిస్తున్నాను అది అట్లా ఉండగా స్వప్రయోజనపరుల ఒత్తిడివల్ల శ్రీ రెడ్డియార్ ఖాదీకి ద్రోహం చేయరని భావిస్తున్నాను ఖాదీకి దాని అభివృద్ధికి ప్రత్యేక నిధులు కేటాయించే రోజులు, బహుమానాలిచ్చే రోజులు వెళ్ళిపోయినవి. రెడ్డియార్ మంత్రివర్గానికి ఖాదీలోను, వికేంద్రీకరణ ఆర్థికాభివృద్ధి విధానంలోను నిజమయిన విశ్వాసమున్నట్లయితే వారు గ్రామీణ పారిశ్రామిక విధానం ధైర్యంగా అవలంబించవలసి ఉంటుంది అట్లా కాక ఈ కొత్త మంత్రివర్గానికి గాంధీ ఆర్థిక విధానంలో నమ్మకం లేనట్లయితే చర్ఖాపైన వారొక్క దమ్మిడీకూడా వ్యర్థం చేయకూడదు గాంధీజీని సంతోషపెట్టటానికి ఖాదీని వట్టిమాటలతో ప్రోత్సహించే పద్ధతి నిజానికి ప్రజలను మోసం చేయడంకిందికే వస్తుంది.

ఈ సందర్భంలో కేంద్రంలోని తాత్కాలిక ప్రభుత్వ వైఖరి కూడా ఎంతమాత్రం సహాయకారిగా లేకపోవడమేగాక పైపెచ్చు ఎక్కువ బాధాకరంగా కూడా ఉన్నది. కేంద్రప్రభుత్వంవారు రాష్ట్ర ప్రభుత్వాల వంతుకు కేటాయించిన కదుళ్ళను నిరాకరించవలసిందని గాంధీగారు రాష్ట్రప్రభుత్వాలకు

గట్టిగా సలహా ఇచ్చినారు కాని తమ రాష్ట్రం వెంతుకు కేటాయించిన ఓదుళ్ళను నిరాకరించడానికి మద్రాస్ ప్రభుత్వానికి అధికారం లేదని తాత్కాలిక కేంద్ర ప్రభుత్వంవారు నిరాకరించినారు ఈ విషయంలో చట్ట సంబంధమయిన చిక్కులు ఏమి ఉన్నప్పటికీ తాత్కాలిక ప్రభుత్వంవారి నిరంకుశాధికారులు మద్రాస్ వస్త్రోత్పత్తి విధానం గురించి పంపిన జవాబులు మాత్రం ఆశ్చర్యకరంగానూ, ఘోరంగానూ ఉన్నవి జాతీయ ప్రణాళికను గురించి కాంగ్రెస్ ఇక సందిగ్ధ విధానం అవలంబించజాలదు అది భారతదేశ ఆర్థికాభివృద్ధిని గురించి తన విధానం స్పష్టంగా ప్రకటించి తీరవలె కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు రాష్ట్రాలలోని కాంగ్రెస్ మంత్రులకు స్పష్టమయిన కార్యక్రమం రూపొందించి ఇవ్వవలె పారిశ్రామికాభివృద్ధిపైన యాజమాన్యం వహించే మంత్రులు ప్రతి రాష్ట్రంలోను ఎవరిష్టంవచ్చినట్లు వారు స్వేచ్ఛగా వ్యవహరించడానికి అవకాశం లేకుండా చేయవలె

గాంధీజీ భారీపరిశ్రమలకు ప్రతికూలుడు కాదనే విషయం నేను మరొక సారి చెప్పదలచుకొన్నాను భారీపరిశ్రమలుగానీ, కీలకపరిశ్రమలుగానీ జాతీయం చేయబడవలెనని ఆయన కోరిక ప్రజల నిత్యావసర వస్తువులకు సంబంధించిన పరిశ్రమలు విస్తృతంగా వికేంద్రీకరణం కావాలని ఆయన అభిప్రాయము పాశ్చాత్య పద్ధతి ప్రకారం ఎక్కడో ఒకచోట బ్రహ్మాండమయిన ఉత్పత్తి జరగటంకంటె లక్షలాది కుటీరాలలో ఆరోగ్యకరమయిన పరిసరాలలో ప్రజలు వాటిని ఉత్పత్తి చేసుకోవలెనని ఆయన ఆశయము ఈ సందర్భంలో నేను ఇంకా వివరాలలోకి పోనవసరం లేదు ఎవరికయినా తెలుసుకోవలెననే కుతూహలం ఉంటే ఆర్థికాభివృద్ధిని గురించిన గాంధీ ప్రణాళిక అనే పేరుతో నేను వ్రాసిన కరపత్రం చదువుకోవచ్చు ఆర్థికాభ్యున్నతిని గురించిన ప్రణాళికలకు తుది రూపం ఇచ్చేముందు గాంధీ ఆర్థిక సిద్ధాంతాలకు తగిన అవకాశమిచ్చి పరిశీలించి చూడవలెనని జాతీయ నాయకులను నేను హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను కీలకపరిశ్రమలను జాతీయం చేయడంవల్లనూ ప్రజల నిత్యావసర వస్తువుల పరిశ్రమను వికేంద్రీకరణం చేయడంవల్లనూ, ఆధునిక ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న మహామారి వ్యాధి నశించగలదని నా నిశ్చితాభిప్రాయం ."

యస్ యన్ అగర్వాల్
5-6-1947 (శ్రీమన్నారాయణ్ అగర్వాల్)

## సంస్థానాల స్థితి ఏమిటి ?

1947 జూన్ 13, 14 తేదీలలో ప్రార్థనానంతరం గాంధీజీ చేసిన ప్రసంగాలయొక్క అ భా కాం. కమిటీ సమావేశంలో సంస్థానాల కర్తవ్యం గురించి ఆయన చెప్పిన మాటల సంక్షిప్త స్వరూపమే కింది వ్యాసము.

బ్రిటిష్ ప్రభుత్వంవారు 1947 ఆగస్ట్ 15 న అధికారం భారతీయుల చేతులలో ఉంచి పోతూండిన సమయంలో తిరువాన్కూర్ స్టేట్ పీపుల్స

కాంగ్రెస్‌వారు బహిరంగ సమావేశాలను చేయకూడదని తిరువాన్కూర్ దివాన్ సర్ సి పి రామస్వామయ్యర్ నిషేధపు ఉత్తరువులు జారీచేసిన విషాదపు వార్తలు విని గాంధీజీ తన విచారం వెల్లడిస్తూ జూన్ 13 వ తేదీన ఇట్లా ఉపన్యసించినారు "సర్ సి పి రామస్వామయ్యర్ విద్వాంసుడు, సమర్థుడయిన పరిపాలకుడు, గొప్ప రచయిత బ్రిటిష్‌వారు ఇండియాను వదలగానే తిరువాన్కూర్ సంస్థానం స్వతంత్ర రాజ్యంగా ప్రకటన చేస్తుందని కూడా ఆయన అన్నారు దీనినిబట్టి బ్రిటిష్‌రాజు ఇండియాకు చక్రవర్తిగా ఉన్నంత కాలము తిరువాన్కూర్ ఇండియాలో ఉండటానికి సర్ సి పి సంతృప్తికరంగా అంగీకరించినట్లు, అధికారం భారతీయుల చేతులలోకి వచ్చిన తక్షణం తిరువాన్కూర్ ఇండియన్ యూనియన్‌తో చేరటానికి ఆయన అయిష్టంగా ఉన్నట్లు తేలుతున్నది ఇది చాలా ఆశ్చర్యకరమయిన పరిస్థితి ఏ సంస్థానానికి ఇది గౌరవనీయమయిన పని కాదు ఈ స్థితికి బ్రిటిష్ ప్రభుత్వంవారి ప్రవర్తన దోహదం చేస్తూఉండినట్లయితే ఇది వారు చిరకాలం సిగ్గుపడవలసిన విషయము హైదరాబాదు సంస్థానంవారు సైతం సరియైనపంథా నవలంబిస్తారని భావిస్తున్నాను పత్రికలలోని వార్తలు నమ్మదగినవయితే నిజాం జారీచేసిన ఫర్మానూ పూర్తిగా తప్పు హైదరాబాదు సంస్థాన జనసంఖ్యలో 90 శాతం మహమ్మదీయేతరులు సంస్థానాధిపతులు ప్రజలకు ధర్మకర్తలుగానూ, సేవకులుగానూ ఉన్నంతవరకే సంస్థానాలపైన వారి యాజమాన్యం ఉంటుంది కాల పరిస్థితులు మారిపోయినాయి ఆ సంగతి వారు గ్రహించి కాలానుగుణంగా ప్రవర్తించని పక్షంలో వారి పదవులను కోల్పోయేమాట వాస్తవము కాంగ్రెస్ ప్రారంభమునుంచి సంస్థానాలకు మిత్రంగా ప్రవర్తించింది అందుకు తార్కాణంగా దాదాపు ఈ కాలంలో మైసూరు రాజ్య పరిస్థితి పేర్కొనవచ్చు కాంగ్రెస్ కాశ్మీరం బరోడా మొదలైన సంస్థానాలకు ఎంతో సేవ చేసినది. సంస్థానాలను నిర్మూలం చేయవలెననే కోరిక కాంగ్రెస్‌కు లేదు కాంగ్రెస్ మహాసంస్థ, సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్యం వహించడమేగాక సంస్థానాధిపతులకు సైతం ప్రాతినిధ్యం వహించవలెనని కోరుతూన్నది అటువంటి మహాసంస్థను సంస్థానాధిపతులు అలక్ష్యం చేయడానికి వీలులేదు నా మట్టుకు నేను ఎప్పుడూ సంస్థానాధిపతులకు స్నేహితునిగానే ఉన్నాను అంతేకాదు, ఈ ప్రపంచంలోని ఆస్తిపరులందరికీ స్నేహితునిగానే ఉన్నాను వారితో నా స్నేహం ద్వారా వారిని దిక్కులేని దరిద్రులకు సన్నిహితంగా తీసుకొని రావటానికి నేను ప్రయత్నిస్తున్నాను. నేను భంగీలలో ఒకడను. కలవారినందరినీ భంగీలకు సన్నిహితంగా తీసుకొనిరావటానికి ప్రయత్నిస్తున్నాను సంస్థానాధిపతులందరూ రాజ్యాంగపరిషత్తులో చేరవలెనని ఖచ్చితంగా కోరుతున్నాను అది ఏదో అనేది అనవసరము. దురదృష్టవశాత్తు హిందూ ముస్లిమ్ వివాదం మూలమున ఇండియా విభజింపబడనున్నది సంస్థానాధిపతులు ఇంకనూ మరికొన్ని చీలికలను సృజించడానికి ప్రయత్నించకుందురుగాక. భగవంతుడు సంస్థానాధిపతులకే కాక

లార్డ్ మౌంట్ బాటన్‌కు కూడా తగినంత వివేకం ప్రసాదించుగాక బ్రిటన్‌ను అంతిమ విజయంగా దేశాన్ని అనవసర కల్లోలంలోకి దింపి విడిచిపెట్టి పోకూడదు "

జూన్ 14వ తేదిని సర్ సి పి రామస్వామయ్యర్ వద్ద నుంచి గాంధీజీకి ఒక తంతి చేరింది అందులో ఐక్యభారత రాజ్యాంగ పరిషత్తులో తిరువాన్కూర్ చేరటానికి ఇచ్చగిస్తూన్నదనీ, రెండు స్వతంత్ర భారతదేశాలు ఉండే ఎడలో తిరువాన్కూర్ ఎప్పుడూ ఎవరిచేతా జయింపబడలేదు కనక దాని స్వతంత్ర ప్రతిపత్తిని అది పోషించుకొంటూ తక్కిన భారతదేశంతో సన్నిహితంగా సహాకరిస్తూ సమష్టి వ్యవహారాలకు సంబంధించినంతవరకు, అవసరమయిన సంధులనూ, ఒడంబడికలనూ చేసుకోగలదనీ ఉదాహరింపబడింది తిరువాన్కూర్‌లోని అధిక సంఖ్యాక ప్రజలు తిరువాన్కూర్ స్వతంత్ర సంస్థానంగా ఉండవలెనని కోరుతూన్నట్లుకూడా దివాన్‌గారి తంతిలో ఉన్నది ఈ తంతిని గురించి గాంధీజీ ప్రసంగిస్తూ ముఖ్య విషయాన్ని గురించి అందులో ఏమీ లేనందుకు తన విచారం వెల్లడించినారు "ఇంతకూ స్టేట్ పీపుల్స్ కాంగ్రెస్‌పైన నిషేధం ఉందా? లేదా?? అనేవిషయం తేలలేదు ఉంటే అది ఎందుకుఉంది?"అని ప్రశ్నించినారు

"సర్ సి పి తంతినిబట్టి భారతదేశ విభజన లేకుండా ఉండినట్లయితే తిరువాన్కూర్ ఇండియన్ యూనియన్‌లో చేరి ఉండేదని భావించవలె ఇంకా స్పష్టంగా చెప్పవలసివస్తే యూనియన్‌లో చీలిక ఉండకూడదని అర్థము. నిజమే ఒక చీలిక కలగడాన్ని ఆధారంగా తీసుకొని ఇండియాను బాల్కన్ రాజ్యాల వలె ఛిన్నాభిన్నం చేయడానికి తిరువాన్కూర్ సంస్థానం పూనుకోకూడదు రాజకీయ ఐక్యాన్ని పొందని భారతదేశంలో తిరువాన్కూర్ స్వతంత్రంగా ఉండినది కేవలం మత కారణాలవల్ల ఇండియాకు ఇప్పుడు చీలిక వచ్చింది. అఖిలభారత ముస్లిమ్ లీగ్‌వారు పెట్టిన దురదృష్టకరమయిన ఒరవడిని ఆధారంగా తీసుకొని వ్యవహరించకూడదని తిరువాన్కూర్ మహారాజాకు సర్ సి పి రామస్వామయ్యర్ వంటి పెద్దమనిషి సలహా ఇచ్చి ఉండవలసింది

తిరువాన్కూర్ జనవాక్యం (రెఫరెండం) తీసుకొనినట్లయితే క్రిస్టియన్‌లు, హిందువులు, అస్పృశ్యులూకూడా, బ్రిటిష్‌వారి సార్వభౌమత్వాన్ని అంటిపెట్టుకొనిఉండి భారతప్రజల సార్వభౌమత్వాన్ని తృణీకరించి తిరువాన్కూర్ స్వతంత్ర రాజ్యం కావలెననే సర్ సి పి విచిత్ర సిద్ధాంతానికి వ్యతిరేకంగా వోటు చేస్తారనటంలో ఏమాత్రం సందేహించవలసిన అవసరం లేదు దురదృష్టవశాత్తు ఈ నా వాదనను ప్రార్థనను, సర్ సి పి. సరిగా గ్రహించజాలక పోయినప్పటికీ తదితర సంస్థానాధిపతులందరూ భారత ప్రజానీకంతో చేతులు కలపడంలోగల వివేకం గుర్తించగలరని నా విశ్వాసము సంస్థానాధిపతులనే నా మాటలో సంస్థాన ప్రజలుకూడా ఇమిడి ఉన్నారని అర్థం చేసుకోవలె. దీనిని ప్రతిఘటించగలవారు కూడా లేరని నాకు తెలుసు "

అ.భా.కాం. సంఘంలో మాట్లాడుతూ గాంధీజీ ఇట్లా అన్నారు: "సంస్థా

నాలను వాటి గతికి నాటిని వదిలి వేయండి", అని నేను ప్రతి ఒక్కరికీ చెప్పిన కాలంకూడా ఉన్నది మనమొక మూడో శక్తితో (ప్రభుత్వంతో) తీవ్రంగా పోరాడుతూండిన కాలమది ఇప్పుడా కాలం మారిపోయింది ఇండియా ఇప్పుడు స్వాతంత్ర్య సింహద్వారం దగ్గర ఉన్నది హైదరాబాదు, తిరువాన్కూర్ సంస్థానాలు స్వతంత్ర రాజ్యాలు కావలెనని ప్రసంగిస్తున్నాయి అది వట్టి వ్యర్థ ప్రసంగము రాజ్యాంగ పరిషత్తులో చేరడానికి నిర్ణయించుకొన్న అధికసంఖ్యాక సంస్థానాలను నేను అభినందిస్తున్నాను అవి హృదయ పూర్వకంగా చేరినట్లయితే సంస్థానాధీశులు ప్రజల ధర్మకర్తలుగానూ, సేవకులుగానూ ఎంతో సురక్షితంగా ఉండగలరు కాలానుగుణంగా కదం తొక్కవలసిన రోజులివి

బ్రిటిష్ ప్రభుత్వంవారికి కేవలం బానిసలుగా వర్తించిన సంస్థానాధిపతులు ఇండియన్ యూనియన్‌లో గౌరవస్థానం పొందేటందుకు తృణీకరించి స్వతంత్రులు కావలెనని కోరడం అత్యాశ్చర్యకరమయిన విషయము ఇండియన్ యూనియన్ సంస్థానాధిపతులకు విరోధికాదు కాని ఈనాడు ప్రభుత్వాధికారం ప్రజల చేతులలోకి వచ్చినప్పుడు వారు యావద్భారత దేశంలోని ప్రజలక్షేమం అసక్తితో కాపాడవలసి ఉన్నది సంస్థాన ప్రజలు మాతో ఉన్నారు సంస్థానాధిపతులు స్వతంత్రులు కావడమంటే సంస్థాన ప్రజలు స్వాతంత్ర్యం కోల్పోవడం నాకు తెలిసినంతవరకు ఇండియాలో అటువంటి స్థితిని ఎవ్వరూ సహించరు సంస్థానాధిపతులు తమ భవితవ్యం స్పష్టంగా తెలుసుకోవలె

హరిజన్,
22-6-47

## ద్రవిడ స్థానమా ?

ఇండియా రెండు భాగాలుగా విభజింపబడి భారత్,పాకిస్థాన్‌లు రెండూ స్వతంత్ర దేశాలుగా రూపొందనున్న తరుణంలో తమిళనాడులోని ద్రవిడకజగం వారు తెలుగు, తమిళ, కర్ణాటక, మళయాళ భాషలవారితో ద్రవిడస్థానము ఏర్పాటు కావలెననే ఉద్యమం లేవదీసినారు దానిని గురించి గాంధీ అభిప్రాయాలు పై శీర్షిక కింద 'హరిజన్'లో ఇట్లా ఉదాహరించడం జరిగింది

"దక్షిణ ఇండియాలో ద్రావిడ భాషలను అంటే తెలుగు, తమిళం, మళయాళం, కన్నడభాషలు మాట్లాడే వారందరితో ద్రవిడస్థానం ఏర్పాటు కావలెననే ఉద్యమమొకటి బయలుదేరింది ఈ నాలుగు భాషలు మాట్లాడే వారి ప్రదేశం తక్కిన ఇండియానుంచి ఎందుకు విడిపోవలె? ఈ నాలుగు భాషలు ప్రశస్తమయిన భాషలే. వాటికా ప్రాశస్త్యం సంస్కృత భాషనుంచి చేకూరింది. నేను ఈ నాలుగు రాష్ట్రాలలోను పర్యటన చేసినాను. తక్కిన రాష్ట్రాలవారికి ఈ రాష్ట్రాలవారికి నాకేమి భేదం కనిపించలేదు వింధ్య పర్వతాలకు దక్షిణాన నివసించే వారందరూ అనార్యులనీ, ఉత్తరాన ఉండేవారంతా ఆర్యులనీ భావించడం పట్టి అబోహా. ఒక కాలంలో వారెట్లా ఉన్నప్పటికీ ఇప్పుడు కాశ్మీరు

మొదలు కన్యాకుమారి అగ్రం వరకూ ఉండిన ప్రజలందరూ పరస్పరం కలిసి పోయినారు ఇండియా ఈనాడు రెండుగా విభజింపబడినప్పటికీ వారందరూ ఒకే ప్రజగా వర్ధిల్లినారు. ఇండియాను ఇంకా విభజించటం ప్రమాదకరము ఇండియా విభజన ఇంతటితో ఆగని పక్షంలో ఇండియాలో అంతులేనన్ని స్వ స్వతంత్ర రాజ్యాలు వెలయగలవు అది ఇండియాకుగానీ, ప్రపంచానికిగానీ శ్రేయస్కరం కాదు భారత ప్రజలు భారత రాజ్యాంగ విధానంకింద ఐక్యంగా ఉండగలరే గానీ, స్వతంత్ర పౌరులుగా ఆటవిక జాతులవలె ఒకరితో ఒకరికి పొత్తులేకుండా ఏ వర్గానికి ఆ వర్గం చీలిపోతారనే అపఖ్యాతికి గురికాకుందురుగాక లేదా తమందరినీ ఒక తాడి కిందరు తీసుకొని వచ్చేటందుకు గొప్ప సైన్యాంగల నిరంకుశ ప్రభుత్వమయినా ఉండవలె అనే అభిప్రాయం వారు ప్రపంచానికి కలిగించకుందురుగాక

ఇంగ్లీష్ పట్ల గల వ్యామోహము విడిచిపెట్టవలసిందని కూడా దక్షిణ హిందూస్థాన ప్రజలను నేను కోరుతున్నాను రాజనైతిక వ్యవహారాలకు, అంతర్జాతీయ వాణిజ్యానికి ఇంగ్లీష్ ఉపకరించే మాట నిజమే కాని అది ఎన్నటికీ భారతదేశంలోని కోట్లాది ప్రజల భాష కానేరదు బ్రిటిష్ వారు ఒక శతాబ్దం పైగా రాజ్యం చేసినప్పటికీ కొన్ని లక్షలకంటె ఎక్కువమంది చేతకూడా ఇంగ్లీష్ భాషలో ప్రసంగింప చేయలేకపోయినారు మన జనాభా లెక్కలను పరిశీలించినట్లయితే మహాసముద్రంవంటి భారత ప్రజానీకంలో కొన్ని కోట్లమంది హిందీ, ఉర్దూ మిశ్రమమయిన హిందూస్థానీ భాషను మాట్లాడేవారని తెలుస్తుంది పార్శీ భాషతో మిశ్రమమయిన ఉర్దూ మాట్లాడేవారు ఇప్పటికీ చాలా తక్కువమంది ఉన్నారు హిందూస్థానీ భాషను ఆయా రాష్ట్రభాషల లిపులలో నేర్చుకోవచ్చునా అని నన్ను కొందరు ప్రశ్నిస్తున్నారు నాకేమీ అభ్యంతరం లేదు నిజానికి హిందూస్థానీ ప్రచార సభవారు దక్షిణ భారతంలోని బాలురను వారి రాష్ట్రీయ భాషాలిపిలో హిందూస్థానీ నేర్చుకొనేటందుకు అంగీకరించినారు. తరవాత ఆ పిల్లలు రెండు లిపులనూ నేర్చుకొన్నారు అందువల్ల వారికి ఉత్తర దేశ సాహిత్యంతో తేలికగా పరిచయం కలిగింది దేశభక్తి వారినందుకు పురికొల్పింది వారు అతిసంకుచితమయిన రాష్ట్రీయ తత్వానికి గురిఅయ్యే మహా ప్రమాదం కూడా ఉన్నది అందరూ అటువంటి సంకుచితభావం కలవారే అయినట్లయితే వారు ప్రేమిస్తూండిన ఇండియా ఎక్కడ ఉంటుంది? దక్షిణాది వారు హిందూస్థానీ నేర్చుకోకపోవడం ఎంత తప్పో ఉత్తరాదివారు ప్రశస్తమయిన సాహిత్యాంగల దక్షిణాది భాషలలో కనీసం ఒక్కదానినైనా నేర్చుకోకపోవడం అంతే తప్పు భారతీయులు శ్రోతలుగా ఉన్న సభలలో ఇంగ్లీష్‌లో మాట్లాడవలసిందని ఎవ్వరినీ ఎప్పుడూ దక్షిణాదివారు కోరకుండడానికి నిశ్చయించుకోవలె అప్పుడు వారు తప్పకుండా హిందూస్థానీ నేర్చుకోగలరు. స్వతంత్ర భారతదేశం నైతిక ప్రభుత్వాన్ని అంగీకరించినప్పుడే అది ఐక్యంగా ఉండగలుగుతుంది. పరాధీనానికి ప్రతికూలంగా పోరాడిన కాంగ్రెస్ నైతిక శక్తి

వల్లనే [illegible] ఉండగలిగింది [illegible] దాదాపు రాజకీయ స్వాతంత్ర్యం పొంది నప్పుడు [illegible] గా ఉండగలరా?"

న్యూఢిల్లీ హరిజన్
17-7-47

ఆయనకు జీవనసమాధి జరిగిందా?

దక్కన్ హైదరాబాదు నుంచి ఈ శీర్షిక కింద ఒకరిట్లా వ్రాసినారు

"గాంధీజీ ఆశయాలు [illegible], [illegible] ఆచరణలో పెట్టడంవల్లనూ ఇండియా [illegible] ఎత్తుగా ఎక్కిన నిచ్చెన [illegible] అనిపించింది ఈనాడు హిందూముస్లిమ్ ఐకమత్యము, హిందూస్థానీ, ఖాదీ, గ్రామ పరిశ్రమలు ఇవన్నీ ఎక్కడ ఉన్నవి వాటిని గురించి మాట్లాడుతూ ఉండడం నట్టి బూటకం కాదా?"

ఈ విమర్శకు ప్రత్యుత్తరంగా గాంధీజీ రైలులో పూనాకు పోతూ ఇట్లా వ్రాసినారు

"ఈ తీక్షణమయిన విమర్శలో సత్యమున్నది కాని నేను ఇంతవరకూ సజీవసమాధి కాలేదనే విశ్వాసంతో ఉన్నాను అందుకు కారణం సామాన్య ప్రజలు నా ఆదర్శాలలో విశ్వాసం కోల్పోలేదనే నమ్మకం నాకు ఉండటమే వారికా నమ్మకం పోయింది [illegible] రోజున నాకు బతికి ఉండగానే సమాధి నిర్మింపబడినట్లు భావించవచ్చు నాలో ఆ ఆదర్శాల పట్ల విశ్వాసం ప్రజ్వరిల్లు [illegible] నేను ఒంటరిగానయినా వాటిని ఆచరణలో పెట్ట డానికి ప్రయత్నించగలను. అంతేకాదు, సమాధిలో కూడా నేను ప్రాణంతో ఉండి మాట్లాడగలను ఈ విమర్శకుడు అస్పృశ్యతా మద్యనిషేధాలను గురించి మరచి పోతున్నాడు అస్పృశ్యత అతి త్వరగా అదృశ్యమవుతూన్నది మద్య నిషేధం అమలులోకి వస్తున్నది 1920 లో కాంగ్రెస్ అవలంబించిన ఆదర్శాలను అది విడనాడినట్లయితే దానికి ఆత్మహత్య తప్పదు"

రైలులో పూనాకు పోతూ
7-8-1947 హరిజన్

గాంధీజీ నిర్యాణము

1947 ఆగస్టు 15 న భారతదేశం సంపూర్ణ స్వతంత్ర దేశంగా రూపొందింది భారతదేశం రెండుగా విభజితమయ్యే సందర్భంలో అనేకచోట్ల మత కలహాలు చెలరేగినాయి అనేక మంది హిందువులు, మహమ్మదీయులు పరస్పర కలహాలతో హత్యలకు గురియైనారు మత కల్లోలాలు పెచ్చుపెరిగిన నవఖాళీకి పోయి అక్కడ శాంతిని చేకూర్చడానికి గాంధీజీ తన శక్తినంతను వినియోగించినారు కాని ఆయనకేమో ఒక మతోన్మాది అయిన ఒక హిందువు చేతిలో ప్రాణాలు విడవవలసివస్తుందని ఎవ్వరూ, ఎన్నడూ తలంచలేదు.

1948 జనవరి 30 వ తేదీ సాయంకాలం ఢిల్లీలోని బిర్లా గృహంలో 5 05 నిమిషాలకు ఇరువైపుల ఉన్న మనుమరాళ్ళ భుజాలపైన చేతులు వేసుకొని గాంధీజీ సాయం ప్రార్థన సభకు వెళ్ళుతూ ఆ ప్రాంగణంలోనే మైదానంలో ఉన్న ప్రార్థనా వేదికను సమీపిస్తూండగా సభకు వచ్చిన ప్రజలు ఆయనకు దారి చేయడానికి ఇరువైపులా వరసగా నిలబడినారు ఆ సమయంలో ఖాకీ చొక్కా, లాగు తొడుక్కొని ఉన్న దాదాపు 30,35 ఏళ్ళ వయసు గల ఒక వ్యక్తి వంగి మహాత్మునికి పాదాభివందనం చేసినట్లే చేసి నాలుగుసార్లు రివాల్వర్ కాల్పులు కాల్చాడు హంతకుడు గాంధీజీకి రెండుబారల దూరంలోనే ఉన్నాడు గాంధీజీ "హేరామ్ హేరామ్" అంటూ కింద పడిపోతూండగా ఆయనను నడిపించి తీసుకువస్తూన్న మనుమరాండ్రు, అభాగాంధీ, మనూగాంధీలు గాంధీజీని పలుపుతూ అవురుమన్నారు అంతా క్షణంలో జరిగింది ప్రజలకు ఏమి జరిగిందో కూడా తెలియదు చుట్టూ ఉన్న ప్రజలు అమాంతం హంతకునిపైబడి పట్టుకొన్నారు అప్పటికే రక్తం వరదలై ప్రవహిస్తూన్నది గాంధీజీని బిర్లా భవనానికి తీసుకొనిపోయినారు, వైద్యులను పిలువనంపినారు, సరిగా 5 40 గంటలకు గాంధీజీ మరణించినట్లు ఆయన ఆశ్రమవాసి బిర్లా భవనం వద్ద జేరిన ప్రజలకు తెలియజేసినారు

గాంధీ మరణానికి భారతదేశమేగాక యావత్ప్రపంచం దుఃఖించింది ప్రపంచంలోని రాజ్యాధినేతలందరూ గాంధీజీ మరణానికి దుఃఖం వెల్లడిస్తూ భారత ప్రజానీకానికి తమ ఓదార్పు సందేశాలను అందజేసినారు గాంధీజీ మరణ వార్త వినగానే ఆసేతు హిమాచలం అంధకారబంధురమయినట్లు తోచింది భారతదేశంలోని అన్ని పుణ్యనదులలోను ఆయన అస్థినిమజ్జనం జరిగింది

ప్రపంచంలోని మహాపురుషులనేకులు దేశాలలోని పత్రికలలో మహాత్ముని దివ్యసందేశం ప్రశంసిస్తూ వ్యాసాలు వ్రాసినారు ఈ సందర్భంలో డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు "గాంధీజమా? సోషలిజమా?" అనే గ్రంథంలో 'గాంధీ పోవచ్చు గాంధీజం మాత్రం చిరస్థాయిగా ఉంటుంది' అనే శీర్షిక కింద వ్రాసిన వ్యాసం ఇక్కడ ఉదహరించడం సమంజసంగా ఉంటుందని భావిస్తున్నాము

"ఒకొక్క మహాపురుషుడు ఏ యుగంలో ఎప్పుడు అవతరిస్తాడో చెప్పలేము మహాపురుషుడు అవతరించినందువల్లనే ఒక యుగానికి ప్రాధాన్యం వస్తుందో లేక ఆ యుగమే ఒక మహాపురుషుణ్ని ఉద్భవింపజేస్తుందో చెప్పలేము బహుశా పురుషునివల్ల యుగం, యుగంవలన పురుషుడు ఉభయత్రా రాణించడం జరుగుతుందేమో!

అన్యుల విషయంలో ఎట్లాగయినప్పటికీ గాంధీ విషయంలో మాత్రం ఇదే కనిపిస్తుంది

గాంధీ అవతరణ కారణంగా భారత సమాజము, భారత సమాజస్థితి కారణంగా గాంధీ, పరస్పరం ఉత్తేజితులయినారని అనుకోవచ్చు, భారత సమాజాన్ని

స్థితి గాంధీ ఆత్మనూ, ఉత్సాహాన్ని ఉత్తేజితం చేసింది తన మూర్తిప్రభావం వలన గాంధీ శాంత సమాజాన్ని తేజోవంతం చేసినారు

చతుర్విధ వర్ణ ధర్మాలను, చతుర్విధ ఆశ్రమాలను మేళవించి గాంధీ నూతన ధర్మాన్ని ప్రతిపాదించినారు

తన ఒక్క మూర్తిలోనే భారత కర్షకుడు, కార్మికుడు, నేతమనిషి, వ్యాపారస్థుడు, యోధుడు, ప్రజాసేవకుడు అందరూ ఉన్నట్లు గాంధీ లోకానికి ప్రత్యక్షమయినాడు

కేవలం తన ప్రజాసేవ తత్పరతవల్ల, ప్రేమభావంవల్ల గాంధీ స్మృతి కర్తగా ఉన్నత స్థాయిని అలంకరిస్తున్నాడు ఇంతే కాక బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమనే నాలుగు ఆశ్రమాలు కూడా ఆయనలో మూర్తీభవించినాయి

మహోత్కృష్టమయిన మానవ జీవితాశయాలన్నీ ఆయనలో పెనవేసుకొని సర్వసమగ్రంగా ఏకోన్ముఖంగా రూపొందినాయి

నేటి ప్రపంచంలో చాతుర్వర్ణాలు లేవని ఆయన గమనించినారు అందువల్ల చాతుర్వర్ణాలలో విశ్వాసం ఉన్నవారు, పవిత్రత ఆత్మనిగ్రహము అనే ప్రధాన నియమాలను పాటించి వాటిని కొత్తపద్ధతిలో పునరుద్ధరించడం అవసరమని ఆయన ప్రవచనం చేసినారు

హిందూ సమాజంలోఉన్న కళంకాన్ని తొలగించి దానిని పునీతం చేయడానికి, పునర్నిర్మించడానికి గాంధీజీ పూనుకొన్నారు

"స్వదేశజనాస్సుఖినోభవంతు" అనే మహామంత్రాన్ని రోజుకు మూడు సార్లు ఉచ్చరించడమేగాని దాని అంతరార్థాన్ని అవగాహన చేసుకొని మన ప్రజలకు దాని అంతర్యాన్ని మహాత్ముడు ప్రబోధించినాడు స్వరాజ్య పథాన్ని ఈ పద్ధతిలోనే సమన్వయించినారు.

స్వరాజ్య ప్రయోజనం అధికార స్థాపన, బలప్రయోగం కాదని ఉగ్గడిస్తూ ప్రేమతత్వం, ప్రజాసేవాభిలాషను ప్రబోధించి తద్వారా ప్రజానీకానికంతకూ తిండి, బట్ట ఇవ్వడమే స్వరాజ్య లక్ష్యమని ఉద్ఘాటించినారు. అన్నవస్త్రాలు రెండు ఆకాశంనుంచి ఊడిపడేవి కావు వీటికోసం కృషి, పరిశ్రమ అవసరము ఇందుకు గాంధీ కాయకష్ట సూత్రాన్ని ఉపదేశించినారు. ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ ప్రతి బాలుడు ప్రతి బాలిక నూలు వడకడం నిత్యమూ చేయదగిన పవిత్ర ధర్మంగా భావించవలెననే ధర్మ సూత్రాన్ని ప్రబోధించినారు

జనసంఖ్యలో ప్రాచీనమైన మన భారతదేశం ది జనసంఖ్యలో రెండో స్థానము, చైనాది మొదటి స్థానము.

ఇంత అపారమయిన భారత ప్రజా బాహుళ్యం ద్వారా మిగతా ప్రపంచానికి అలభ్యమయిన అద్భుత శక్తిసామర్థ్యాలతో సహజ సంపదను ఉద్భవింపచేయవచ్చునని గాంధీజీ గమనించినారు. ఈ సంపదకు వ్యాపార నైపుణ్యంకాని

పెద్ద పెద్ద అంగళ్ళు కానీ సామ్రాజ్య సైనిక విస్తారాలు కాని, ఓ రెన్సీమారకం గాని, ఇన్ఫ్లేషన్, డిఫ్లేషన్‌లుగాని శాస్త్ర పరిశోధనలుగాని, ఎటువంటి యంత్ర బలంగానీ అవసరంలేదు నిష్కళంకమయిన జీవితము, ఉదాత్తమయిన భావనా పటిమ, విశాల దృక్పథము, కాయకష్టము, నిటాయతిగా ధనార్జన - ఇవే గాంధీ విధానంలోని ప్రధాన లక్ష్యాలు

ఉన్నతాధికారాలకుగానీ, పై పోటీలకుగాని ఎంగిలి పిఏదము యియం గాంధీ సిద్ధాంతంలో లేదు విదేశాలనుంచి వచ్చే దిగుమతులు అరిపిలువయినవే కావచ్చు కాని మాతృదేశం ఎంత పేద సామగ్రిని తయారుచేసినప్పటికీ అవి మనకు మన మాతృభూమి ప్రేమాంతఃకరణాలతో ఇచ్చినవవడంచేత విదేశ వస్తువుల పోటీ వాటిని ఏమీ చేయలేదు చౌకగా వస్తువులను తయారు చేసి అమ్మడంలో ఉన్న రహస్యాన్ని గాంధీ వెల్లడించినారు

అన్నవస్త్రాలు మానవునికి ప్రధానావసరాలు వాటి విషయంలో స్వయం సంపూర్ణత అవసరమని గాంధీజీ మతము ప్రతి మానవుడు వాటి విషయంలో స్వయం సమృద్ధిగా ఉంటే ప్రతి గ్రామం, ప్రతి పట్టణం, ప్రతి నగరం తద్వారా యావద్భారత దేశం స్వయం సంపూర్ణం కాగలదని ఆయన పరమ విశ్వాసము

ఈ స్వయం సంపూర్ణతను, బలప్రయోగంవల్లనూ, రక్తపాతంవల్లనూ సాధించకూడదు నిర్బంధ కార్మిక సేవకు బదులు ఐచ్ఛిక సేవ ద్వారా, బల ప్రయోగానికి బదులు విశ్వమానవ ప్రేమద్వారా, అత్యాశకు బదులు సంతృప్తి ద్వారా, జీవన ప్రమాణాన్ని పెంచటానికి బదులు అదుపులో ఉంచటం ద్వారా ఇంద్రియ లౌల్యానికి బదులు ఆత్మనిగ్రహం ద్వారా, రాజకీయ కుతంత్రానికి బదులు సత్యాన్వేషణ ద్వారా దీనిని సాధించాలని గాంధీజీ ప్రబోధము

మానవులందరికీ జీవితంలో సమానావకాశాలీయడమే సామ్యవాద లక్ష్య మయితే ప్రతి వ్యక్తి తన అవకాశాలనూ, శక్తిసామర్థ్యాలనూ ఉన్నత లక్ష్య సాధనకు వినియోగించాలన్నదే గాంధీ తత్వము సర్వకాల సర్వావస్థలలోను మన జాతి ఐశ్వర్యాన్ని ఆరాధించలేదు ప్రభుత్వం పోకర్యం కల్పించుకొని ప్రతి కార్యాన్ని సాగించవలెనని సోషలిస్టు సూత్రము. గాంధీజం, సునిశిత మయిన మానవుని అంతరాత్మపైన, పౌరుని విజ్ఞానాభివృద్ధిపైన ఆధారపడి ఉన్నది ప్రజా హృదయనాళాలలోకి గాంధీజం పాకినంతగా సోషలిజం పాక లేదు సోషలిజం అనుష్ఠానకర్తలు నిరంకుశులుగా, నియంతలుగా తయారయి నారు అందువల్ల సోషలిజం విషాద పరిస్థితులలో పడింది స్వార్థరాహిత్యమే గాంధీజంలోని ముఖ్యాంశము

ఇతరులు ఏమి చేయవలసింది సోషలిజం ఉపదేశిస్తుంది ప్రతి వ్యక్తి తనకు తాను ఏమి చేయవలసింది గాంధీజం ప్రబోధిస్తుంది

వర్గ విద్వేష విభేదాల ద్వారా మానవకోటికి శ్రేయస్సు చేకూర్చాలని సోషలిజం ప్రయత్నిస్తుంది. దేశంలోని ప్రజలు తమ అన్నవస్త్రాల్ని తాము తయారుచేసుకోవలెనని గాంధీజం ఉద్బోధిస్తుంది.

అతను ప్రతిపాదిస్తున్న ఆర్థిక విధానాన్ని గురించి గాంధీ ఒకప్పుడు "ఈ గాంధీ మరణించవచ్చు, గాంధీజం మాత్రం చిరస్థాయిగా నిలుస్తుంది" అన్నారు

## నేటి ప్రజాకాంక్ష

గాంధీజీ మరణించి నేటికి ముప్ఫయి ఐదు వత్సరాలు దాటిపోయినాయి నేటి భారతదేశ పరిస్థితులు ఆయన ఆశయాలకు, ఆయన ఆదేశానుసారం భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొని ఎనలేని త్యాగాలు చేసిన భారత జాతీయ మహా నాయకుల ఆశయాలకు భిన్నంగా నడుస్తున్నవి

అందువల్ల గాంధీజీ నుద్దేశించి

'నీ కారుణ్య మహింస ధైర్యగుణమున్ నీ నిత్యసత్యవ్రత
ప్రాకారంబుస్త్రల మధ్య భారత ప్రజారాజ్యము వర్ధిల్లి లో
కైక ఖ్యాతి గడింప కోర్కెగల దెంతే మాకు నీ శిష్య పు
ణ్యాకారమ్ము మరొక్క మారయిన ప్రత్యక్షమ్ము గావింపవే"

అని భారత ప్రజానీకంతో శ్రుతికల్పి ఆంధ్ర ప్రజా హృదయం ఆకాంక్షిస్తూన్నది.

